## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజి


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస


అమ్మ శారదా దేవి


గురు వివేకానంద


గురు సాయిబాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళ స్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..








"ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్" ద్వారా విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందించే సేవా కార్యక్రమంలో బాగంగా ఈ పుస్తకాన్ని భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా) నుంచి సేకరించి అందిస్తున్నాము. ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము.

సాయి రామ్ వారి సేవల విస్తరణలో బాగంగా ఈ ఫౌండేషన్ స్థాపించబడినది. ఈ స్వచ్చంద సంస్థ ద్వారానే అన్ని సేవలు అందించబడును. ఇటువంటి పుస్తకాలు మీరు వ్రాసినట్లయితే (లేక) సేకరిస్తే మాకు తెలియచేయండి. మేము ప్రతి విద్యార్థికి ఉచితంగా అందేలా చేస్తాము, తద్వారా ఉన్నత విలువలు, నైపుణ్యాలు కలిగిన విద్యార్థులను మన దేశానికి అందించవచ్చు. మాతో కలిసి నవ భారత నిర్మాణ కార్యక్రమంలో పనిచేయుటకు, భాగస్వామ్యం అగుటకు ఆసక్తి ఉంటే సంప్రదించగలరు.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in
2) ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ వెబ్ సైట్ : www.freegurukul.org
3) సాయి రామ్ వెబ్ సైట్ : https://sites.google.com/site/sairealattitudemanagement
4) మొబైల్ ఆప్: Free Gurukul

గమనిక: భక్తి,జ్ఞాన,ధర్మ ప్రచారార్ధం ఉచితంగా eBook రూపంలో భారత ప్రభుత్వపు డిజిటల్ లైబ్రరీ సహాయంతో ఇవ్వడం జరిగింది. ఇది లాభార్జన దృష్టిలేని ఉచిత సేవ. ఈ సేవలో అంతర్జాలంలోని(ఇంటర్నెట్) లైసెన్సు / కాపీరైటు అభ్యంతరాలు లేనివి అనుకొన్న పుస్తకాలను గ్రహించటం జరిగినది. అనుకోకుండా ఏవైనా అభ్యంతరకరమైనవి ఉన్నచో మాకు తెలుప మనవి, వాటిని తొలగించగలము అని మనవి చేసుకొంటున్నాము.

Website: www.freegurukul.org Mobile App: Free Gurukul email: support@freegurukul.org
Facebook: www.facebook.com/freegurukul Help Line / WhatsApp: 904 202 0123

" మన లక్ష్యం: విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య అనేది ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందరికి అందించబడాలి "

ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ – Free Gurukul Education Foundation

సర్వం పరమాత్మ పాద సమర్పణమస్తు

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# SRI DEVI BHAGAVATAM
## (Telugu Prose)

By

PROF. B. RAMA BRAHMAM, M.A., Ph.D.

SCHOOL OF LITERATURE
P.S. Telugu University,
BOMMURU - 533124 – A.P.
Phone : 0883 - 77372



వెల : 300-00

ప్రతులకు :

**వి.జి.యస్. పబ్లిషర్స్**
11-63-6, బ్రాహ్మణవీధి,
విజయవాడ - 520 001.
ఫోన్ : 0866 - 425885, 423440

మరియు

**శ్రీ రాజేశ్వరి బుక్ స్టాల్**
15-1-66, సిద్ధియంబర్ బజార్,
హైద్రాబాద్ - 500 012.
ఫోన్ : 040 - 592570, 4731972

*టైటిల్ రూపకల్పన*

**దేవి ప్రసాద్**
గుంటూరు. ఫోన్ : 0863 - 355 680







శ్రీ శ్రీ శ్రీ గణపతి సచ్చిదానంద స్వామి



శ్రీ శ్రీ శ్రీ లక్ష్మణ యతీంద్రులు

## అంకితం



జన్మనిచ్చిన తల్లిదండ్రులకూ

పునర్జన్మనిచ్చిన గురుదేవులకూ

- బేతవోలు రామబ్రహ్మం



# శ్రీ గణేశాయ నమః

సృష్టౌ యా సర్గరూపా జగదవనవిధౌ పాలనీ యా చ రౌద్రీ
సంహారే చాపి యస్యా జగదిదమఖిలం క్రీడనం యా పరాఖ్యా।
పశ్యంతీ మధ్యమాఽథో తదను భగవతీ వైఖరీ వర్ణరూపా
సాస్మద్వాచం ప్రసన్నా విధి హరి గిరిశారాధితాలంకరోతు ॥

ఏ జన్మంబున నే సుమంబులను నీ దేవి నర్చించెనో
యీ జన్మంబున రెండు ముక్కలవి యబ్బెన్ గాన నో తల్లి! నే
నోజన్ నీ మహిమావళుల్ పలికెదన్ వ్యోమాపగాతుల్యవాక్
శ్రీజాతమ్ము ననుగ్రహింపగదవే శ్రీరాజరాజేశ్వరీ !

నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమమ్ ।
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయముదీరయేత్ ॥



# ముందుమాట

సచ్చిదానందరూపాం తాం గాయత్రీప్రతిపాదితామ్ ।
నమామి హ్రీమ్మయీం దేవీం ధియో నః ప్రచోదయాత్ ॥ (12 - 14 - 27)

ఇది భాగవతం. దేవీభాగవతం. శ్రీమద్దేవీభాగవతం. మహాపురాణం. పరమపావన గ్రంథం. వ్యాసుడి కంఠంనుంచీ గంటంనుంచీ జాలువారిన దేవీభక్తిరసామృతం. సాహితీమకరందం. సూతుడు చెప్పినట్టు పన్నెండు స్కంధాలలో (పద్దెనిమిదివేల శ్లోకాలలో) అందించాడు ఆ మహానుభావుడు. ఇందులో సాక్షాత్తు జగన్మాత ప్రధానపాత్ర. జగన్నాయిక ఇందులో నాయిక. ఇదీ దీని విశిష్టత. అందుకే దీన్ని పురాణరాజమన్నారు. భుక్తిముక్తిదాయకమన్నారు. ఇందులో ధర్మార్థకామమోక్ష ప్రతిపాదకాలైన మనోహర కథలతో పాటు యోగ తంత్ర మంత్రాది శాస్త్రాలు అనేకం ప్రసక్తమయ్యాయి. గ్రంథానికి ఉదాత్తతను సంతరించాయి.

దీని చారిత్రికత గురించి ఎవరు ఏమి చెప్పినప్పటికీ దేవీభాగవతం మన తెలుగు ప్రాంతంలో చాలాకాలంనుంచీ ప్రచారంలోనూ ప్రసిద్ధిలోనూ ఉన్న పురాణం. పారాయణగ్రంథం. ములుగు పాపయారాధ్యులవారూ, దాసు శ్రీరాములుగారూ, త్రిపురాన తమ్మనదొరగారూ, తిరుపతి వేంకటకవులూ, నోరి నరసింహ శాస్త్రిగారూ (కొంత) ఈ సంస్కృత పురాణాన్ని తెలుగు పద్యకావ్యాలుగా తమతమ శైలులలో మలిచారు. వీటిలో దాసు శ్రీరాములుగారిది అత్యంతమూ మూలవిధేయమైన రచన. సరిపెల్ల విశ్వనాథశాస్త్రిగారూ, యామిజాల పద్మనాభస్వామిగారూ ఇంకా మరికొందరూ దీన్ని తెలుగువచనంలోకి తర్జుమా చేశారు. వీరిలో, తెలుగు పద్యాల్లో ఉన్న దేవీభాగవతాన్ని వచనంలోకి మార్చినవారు కొందరైతే, సంస్కృత మూలగ్రంథాన్ని సంక్షేపించి వచనం చేసినవారు మరికొందరు. ఏమైనప్పటికీ ఇవన్నీ తెలుగునాట దేవీభాగవతానికున్న ప్రాచుర్యానికీ ప్రసిద్ధికీ ఆదరణకూ నిదర్శనాలు. తెలుగుదేశం నట్టింట విజయవాడ ఇంద్రకీలాద్రిపై కొలువుతీరిన కనకదుర్గమ్మ తెలుగువారికందరికీ ఇలువేలుపేనాయె. అదీకాక మన ప్రాంతంలో తాంత్రికమార్గానుయాయులసంఖ్య తక్కువేమీ కాదు. ఇప్పటికే

గణనీయంగానే ఉండటం విశేషం. అందుచేత చాలా ప్రాచీనకాలంనుంచీ ఇక్కడ దేవీభాగవతం ప్రసిద్ధిలో ఉన్న గ్రంథమే.

ఈనాటి పాఠకులకు అనువైన శైలిలో సంస్కృత దేవీ భాగవతాన్ని యథామూలంగా తెలుగువచనం చెయ్యాలి అనే దృఢ సంకల్పం **వి.జి.యస్. పబ్లిషర్స్** అధిపతులైన కీ.శే. **శిరం సూర్యనారాయణ మూర్తి**గారికి ఏనాడో కలిగింది. ఆయన ఆజ్ఞను అనుసరించి వారి కుమారుడు శ్రీ **శిరం రామారావు** గారు దీన్ని కార్యరూపంలో పెట్టడానికి ఉద్యుక్తులై ఆ కార్యభారం నాకు అప్పగించారు. ఇది నా అదృష్టంగా, పురాకృత పుణ్యఫలంగా భావించాను. నాకు కూడా చాలా కాలంగా దేవీభాగవతాన్ని వచన రూపంలో రాయాలనే కోరిక ఉంది. ఆ కోరిక ఫలించే రోజు సమీపించినందుకు ఆనందపరవశుడనై ఆ జగన్మాత అనుగ్రహంతో గ్రంథ రచనకు పూనుకున్నాను. అమ్మవారి దయవల్ల ఈ గ్రంథం ఇప్పుడు ఇలా మీ కరకమలాలను అలంకరించింది. కేవలం ఏడాది కాలంలో ఈ రచనను పూర్తిచేయించింది జగన్మాత. వెదురుపాక శ్రీవిజయదుర్గ పీఠాధిపతులు ఆశీర్వదించి-తాంబూలమిచ్చి పెట్టిన సుముహూర్తంలో 15-6-97 తేదీన ప్రారంభిస్తే 20-7-98 తేదీకి ముగిసింది. నేను నిమిత్తమాత్రుణ్ణి. లేకపోతే ఇది నావల్ల అయ్యేపని కాదు. నాకు అంత శక్తి లేదు. తలుచుకుంటే ఆశ్చర్యం వేస్తోంది. శక్తిమాట అలా ఉంచండి. అసలు అంత కుదురూ నియమనిష్ఠలూ బ్రహ్మచర్యం ఎలా అమిరాయా అని. అంతా ఆ తల్లి దయ. వీణ్ణి ఇలా చరితార్థుణ్ణి చేద్దాం అనుకుంది, చేసింది. ''కానిమ్మని నా కీ పుణ్యము గట్టినది''. అంతే.

కథాభాగాలు చురుగ్గానే సాగేవిగానీ తాత్త్వికాదివిషయాలు వచ్చినప్పుడు ఒక్కొక్క శ్లోకం గొంతు పట్టుకునేది. అలాంటి సందర్భాల్లో పద్యకృతులో నీలకంఠులవారి తిలకవ్యాఖ్యానమో (క్రీ.శ. 18) దారి చూపించాయి. బ్రహ్మశ్రీ విశ్వనాథ గోపాలకృష్ణగారి సౌభ్రాత్రం సహకరించింది. వీరికి కృతజ్ఞుణ్ణి అనడం చాలా చిన్నమాట.

తాంత్రిక-ఉపాసనావిధుల విషయంలో సాధకులను సంప్రదించాను. అభిప్రాయ సంప్రదాయ భేదాలు నన్ను మరింత అయోమయంలో పడవేశాయి. సంశయాన్ని జటిలం చేశాయి. అలాంటిచోట్ల మధ్యేమార్గమే శరణ్యమయ్యింది. ఇంకా ఒకటి రెండు అలాగే

ఉండిపోయాయి. ఏదో నిజాయితీకోసం చెప్పడమేగానీ వీటి సంఖ్య చాలా తక్కువ. వేళ్ళమీద లెక్కపెట్టవచ్చు. కాకపోతే పాఠకులక్షేమం కోరి వ్యాసుడే గుట్టుగా ఉంచినవాటినీ, గురువును ఆశ్రయించవలసినవాటినీ వివరించే ప్రమేయం పెట్టుకోలేదు, ఇది వ్యాఖ్యానం కాదు కనక. కొండొకచో నా తెలియనితనానికి ఇదొక వరమయ్యిందంటే నమ్మండి !

స్తుతులూ తీర్థక్షేత్రదైవతవర్ణనలూ వచ్చేసరికి వ్యాసుడి వాణి ఆనందలాస్యాలు చేస్తుంది. బాణీలో చాలా మార్పువస్తుంది. దీన్ని వచనంలోకూడా పట్టుకోడానికి యథాశక్తి ప్రయత్నం చేశాను. ధ్వనిసంపుటీకరణలవల్ల వ్యాసుడు ఉద్దేశించిన ప్రయోజనాన్ని యథాతథంగా అందించడానికే కట్టుపడ్డాను. తెలుగుపాఠకులకు దాన్ని దూరంచెయ్యలేదనే విశ్వసిస్తున్నాను. ప్రధానంగా స్తోత్రాలలో దీన్ని గుర్తించవచ్చు.

సంస్కృతభాషా పరిజ్ఞానం తగినంతగా లేని తెలుగు పాఠకులు - దేవీభక్తులు - ఈపుస్తకాన్ని పారాయణ గ్రంథంగా స్వీకరించవచ్చు అనే అభిప్రాయం ఏదో తొలినుంచీ మనస్సులో కదిలి, పారాయణఫలం పరిపూర్ణంగా దక్కడానికి ఆయువుపట్టులు అనదగిన అన్ని శ్లోకాలనూ ఆయా తావుల్లో ఉట్టంకించాను. వీటితోపాటు - మూలంలో నిజంగా ఇలాగే ఉన్నదా అనే సంశయం వస్తుందనిపించిన తావుల్లోకూడా శ్లోకాలను చూపించాను. కవితా సౌరభాలను గుబాళించే శ్లోకాలనూ యథామతి ఉదాహరించాను. ఇవి ఈ తెనుగుసేతకు అదనపు విలువలు అవుతాయని ఆశిస్తున్నాను. సాంకేతిక పదాలకూ అప్రసిద్ధపదాలకూ చాలామటుకు అర్థాలను కుండలీకరణంలో ఇచ్చి, అటుపైని వాటి వాడుకను సాగించాను. కొత్తపదాలతో పరిచయభాగ్యాన్ని పెంచుకోవాలి అనుకునేవారికి ఇది గోరంతైనా ఉపకరిస్తుందని కొండంత ఆశ.

కాలమాన పరిస్థితులను బట్టి వాడుక తెలుగులో సులభశైలినే స్వీకరించినా వస్తువుకు సంబంధించిన ఉదాత్తతను భంగపరచలేదు. చిక్కదనం సడలనివ్వలేదు. నీళ్లకుం బల్చనై అనిపించేట్టు ఎక్కడా చెయ్యలేదు. మూలంలోని ఏ అందాలనూ తెలిసి చెదిరిపోనివ్వలేదు. అలాగని తెలుగువచనానికి ఉన్న ఒడుపునూ ఒయ్యారాన్నీ త్యాగం చెయ్యలేదు. ఈ శైలీరామణీయకంకోసం కారకాన్ని మార్చుకోవడం, ఒకటి రెండు పదాలను అక్కడక్కడా అదనంగా జతపరచడం మినహా సారాంశంగా - మూలంలో లేనిది ఏదీ చేర్చలేదు, ఉన్నది ఏదీ జార్చలేదు. సరే, వృథాహంకారాల కేమిగానీ -

నన్నొక ప్రాయసకాణ్ణి చేసుకుని తన పావన చరితను ఇలా మీకు అందిస్తున్న ఆ పరాశక్తి, పారాయణ ఫలాన్ని కూడా మీకు అందిస్తుందనడంలో నాకైతే సందేహం లేదు. కన్నతల్లి కదా కనకదుర్గమ్మ. కరుణామృతవర్షిణి.

ముందుగా చెప్పవలసిందే అయినా చివరలో చెబుతున్నాను. ఈ గ్రంథాన్ని ఇంత అందంగా, పెద్దవయసువారుసైతం సులువుగా చదువుకోడానికి వీలుగా ముద్రించి ఇస్తున్న వి.జి.యస్. ప్రచురణ సంస్థ అధిపతులకూ వారి సిబ్బందికీ ధన్యవాదాలు చెప్పడం నా పవిత్ర కర్తవ్యం. అలాగే ప్రూఫులు దిద్దడంలో సహపారాయణ జరిపిన నా శ్రీమతికీ, సహకరించిన మిత్రుడు డా॥ జి.యస్. భాస్కరరావుగారికీ ఆశీస్సులు. (అధ్యాయ - శ్లోక సంఖ్యలకు ఢిల్లీ నాగ్ పబ్లిషర్స్ వారి 1986 ముద్రణ ఆధారం.)

యద్యచ్చరితం శ్రీదేవ్యాస్తత్సర్వం లోకహేతవే ।
నిర్వ్యాజయా కరుణయా పుత్రే మాతుర్యథా తథా ॥ (10 - 13 - 36)

జయోఽస్తు !

భవదీయుడు
**బేతవోలు రామబ్రహ్మం.**

బొమ్మూరు - 533 124
శ్రీ బహుధాన్య, విజయదశమి.

# విషయానుక్రమణిక



# శ్రీమద్దేవీభాగవత మాహాత్మ్యం

ఈ చరాచర జగత్తు అంతా ఆ పరాశక్తికి ఒక క్రీడావిలాసం. జగత్సృష్టివేళ సృజనస్వరూప, రక్షణవేళ పాలనస్వరూప, సంహారవేళ రౌద్రస్వరూప. పరా - పశ్యంతీ - మధ్యమా - వైఖరీ భేదాలతో ఉన్న వాక్కు ఆ తల్లి స్వరూపమే. కనక త్రిమూర్తిసంపూజిత ఆ జగన్మాత ప్రసన్నురాలై మనకు అందరికీ అమోఘమైన వాక్శక్తిని అనుగ్రహించుగాక! ముందుగా శ్రీమన్మహాదేవికి నమస్కరించి, నరనారాయణులకు శిరసువంచి, సరస్వతీదేవినీ వ్యాసమహర్షినీ అభినుతించి పురాణం ప్రారంభించాలి.

నైమిశారణ్యంలో సమావిష్టులైన ఋషులందరూ సూతుణ్ణి సవినయంగా అభ్యర్థించారు. సూతమహర్షీ! నువ్వు వందల సంవత్సరాలు జీవించు. వ్యాస శిష్యుడివి. మహామతివి. ఎన్నెన్నో పుణ్యకథలు మాకు వినిపిస్తున్నావు. ఎంతో మనోహరంగా చెబుతున్నావు. విష్ణుకథలు చెప్పావు. అవతారగాథలు వర్ణించావు. శివుడి చరిత్రలు వినిపించావు. భస్మరుద్రాక్షల మహిమలు వివరించావు. అన్నీ భక్తిశ్రద్ధలతో విన్నాం. నీ పుణ్యమా అని జ్ఞాన - ఆనందాలను పొందాము. ఇంక ఇప్పుడు పావనాలలోకెల్లా పావనమూ అనాయాసంగా భుక్తిముక్తిప్రదమూ అయిన మహాపురాణాన్ని నీ ముఖతః వినాలి అనుకుంటున్నాం. దయచేసి అటువంటిది అనుగ్రహించు.

శౌనకాది మహామునీశ్వరులారా ! అడగవలసింది అడిగారు. లోకహితం కోరి అడిగారు. కనక సర్వశాస్త్రసారమూ పరమపావనమూ దేవీభాగవతం వినిపిస్తాను. శ్రద్ధగా ఆలకించండి. ఇది చెవిని పడనంతవరకే మిగతా పురాణాలూ తీర్థాలూ వ్రతాలూ మిడిసిపడేది. ఈ దేవీభాగవతం పాపారణ్యాలకు గండ్రగొడ్డలి. గాఢ కిల్బిషతమస్సులకు పొద్దుపొడుపు. వినిపిస్తాను.

సూతమహర్షీ ! తప్పకుండా వినిపించు. భక్తి శ్రద్ధలతో వింటాం. విని తరిస్తాం. ఆ పురాణం ఏమిటి? దాన్ని వినడానికి నియమాలు ఏమన్నా ఉన్నాయా ? ఎన్ని రోజుల్లో వినాలి ? ఏ పూజలు చెయ్యాలి? లోగడ ఎవరెవరు విన్నారు ? ఏమేమి ఫలాలు పొందారు ? ఎవరు వినిపించారు ?

మునీశ్వరులారా ! విష్ణుమూర్తి అంశతో పరాశరాత్మజుడుగా వ్యాసుడు జన్మించిన సంగతి మీకు తెలుసుగదా ! వేదాలను నాలుగుగా విభజించి శిష్యులకు నేర్పాడు. వేదాధికారం లేనివారికి ధర్మజ్ఞానం ఎలా కలుగుతుందా అని ఆలోచన చేసి పురాణ సంహితలు రచించాడు. శిష్యులద్వారా ప్రచారంలోకి తెచ్చాడు. అష్టాదశ పురాణాలు రచించాడు. మహాభారతం రచించాడు. ఇవన్నీ నాకు వినిపించాడు. చదివించాడు. వాటిలో దేవీభాగవతం - ఉత్తమోత్తమ పురాణం. భుక్తిముక్తిప్రదం. దీన్ని స్వయంగా వ్యాసుడే జనమేజయుడికి వినిపించాడు.

ఈ జనమేజయుడి తండ్రి పరీక్షిన్మహారాజు. ఒక మునిశాపం కారణంగా తక్షకసర్పదష్టుడై దుర్మరణం చెందాడు. అతడి సంశుద్ధిని ఆకాంక్షించి జనమేజయుడు ఈ దేవీభాగవతమహాపురాణం శ్రద్ధగా విన్నాడు. తొమ్మిదిరోజులు దీక్షగా జరిగింది ఈ పురాణశ్రవణం. అటుపైని దేవీయజ్ఞం నిర్వహించి జనమేజయుడుకూడా తరించాడు. దివ్యరూపధరుడై దేవీసాలోక్యం పొందాడు. తండ్రికి ఉత్తమగతులను కల్పించిన తనయుడయ్యాడు. వ్యాసుణ్ణి అర్చించి ఆనందాన్నీ అపూర్వమైన సంతృప్తినీ పొందాడు.

ధర్మార్థకామమోక్షాలనే చతుర్విధపురుషార్థాలనూ తేలికగా ప్రసాదించే పురాణరాజం దేవీభాగవతం. ఈ దేవీగాథను భక్తితో విన్నవారికి సకలసిద్ధులూ కరతలామలకాలు. అందుచేత మానవులంతా తప్పనిసరిగా వినాలి. ఒకరోజు విన్నా, ఒకపూట విన్నా, ఒక ముహూర్తంసేపు విన్నా, క్షణకాలం విన్నా భక్తితో వింటే చాలు, వారికి ఇంక ఏ దుర్గతీ దరిదాపులకైనా రాదు. సర్వయజ్ఞ - సర్వతీర్థ - సర్వదాన ఫలాలు సకలం ఈ పురాణశ్రవణంతో చేతికి అందుతాయి. కృతయుగంలో మానవులకు ఆచరించవలసిన ధర్మాలు చాలా ఉండేవి. కలియుగంలోమాత్రం పురాణశ్రవణమొక్కటే ధర్మం. దీన్ని ఆచరిస్తే చాలు అన్ని ధర్మాలూ ఆచరించినట్టే. కలియుగంలో ప్రజలు ధర్మాచారవిహీనులవుతారనీ, అల్పాయుష్కులనీ గ్రహించిన వ్యాసభగవానుడు లోకుల హితం కోరి ఈ పురాణ సుధారసాన్ని అందించాడు. దీన్ని రవ్వంత గ్రోలితే చాలు అందరూ తరతరాలకు అజరామరులు అవుతారు. వంశాలు అజరామరం అవుతాయి.

ఈ మహాపురాణాన్ని ఏ నెలల్లో వినాలి, ఏ రోజుల్లో వినాలి, ఏ సమయాల్లో వినాలి, ఎవరు వినాలి - ఇలాంటి నియమాలు ఏమీ లేవు. అన్ని వేళల్లోనూ వినవచ్చు. మానవులైతే చాలు అందరూ వినవచ్చు.

**మాసానాం నియమో నాత్ర దినానాం నియమోఽపి వా ।**

**సదా సేవ్యం సదా సేవ్యం దేవీభాగవతం నరైః ॥ (దే. భా. మా. 1-30)**

దేవీ నవరాత్రాలలో నవాహయజ్ఞంగా వింటే విశేషంగా పుణ్యఫలప్రదం అవుతుంది. ఇలా విన్నవారు, గడిచిన జీవితంలోనూ గడిచిన జన్మల్లోనూ చేసిన మహాపాపాలన్నీ తొలగిపోయి పరమపవిత్రులవుతారు. ఉగ్రతపస్సులతోగానీ, తీర్థసేవలతోగానీ, రకరకాల దానాలతోగానీ, యజ్ఞయాగాదులతోగానీ లభించని పుణ్యఫలం ఈ నవాహదీక్షతో లభిస్తుంది. గంగ - గయ - కాశి - నైమిశం - మథుర - పుష్కరం - బదరికాశ్రమం - ఇవి ఏవీ ఇవ్వలేనంత పుణ్యాన్ని ఈ నవాహభాగవత శ్రవణమహాయజ్ఞం ఇస్తుంది. అందుకనే దీన్ని దేవీమఖం - దేవీయజ్ఞం అన్నారు.

ఆశ్వయుజమాసంలో శుక్లపక్షాన సూర్యుడు కన్యారాశిలో ఉన్నప్పుడు అష్టమినాడు శ్రీమన్మహాదేవిని హేమసింహాసనంమీద అర్చించి యోగ్యుడైన ఒక సద్బ్రాహ్మణుడికి ఈ దేవీభాగవతగ్రంథాన్ని బహూకరిస్తే ఆ పుణ్యఫలం ఇంతాఅంతా కాదు. ఆ దాత సాక్షాత్తు దేవీసాలోక్యం పొందుతాడు.

దేవీభాగవతంనుంచి కనీసం ఒక శ్లోకాన్నిగానీ, శ్లోకభాగాన్నిగానీ, ఒక పుటనుగానీ, పుటలో కొంతభాగాన్నిగానీ నిత్యమూ భక్తితో పఠించగలిగితే చాలు అమ్మవారి అనుగ్రహానికి పాత్రులు అవుతారు. అటువంటిది మొత్తం పురాణాన్ని చదివినా విన్నా ఇంటిలో ఉంచుకున్నా లభించే పుణ్యం వర్ణనాతీతం. దుశ్శకునభయం, దుస్స్వప్నభయం, మహామారీభయం, మరణభయం - సమస్తమూ తొలగిపోతాయి. బాలగ్రహ - భూతప్రేత పీడలన్నీ దేవీభాగవతం పేరు చెబితే చాలు దిగ్దిగంతాలకు పారిపోతాయి. చతుర్విధ పురుషార్థాలతో విజయపరంపరలతో ఆ గృహమూ ఆ గృహస్థుడూ, ఆ వంశమూ ఆ వంశస్థులూ తరతరాలకూ విరాజిల్లుతారు.

శ్యమంతకమణిని అపహరించాడు అనే అపవాదును తొలగించుకోవడం కోసం అలనాడు శ్రీకృష్ణుడు ప్రసేనుడిని వెదుకుతూ అడవిలోకి వెళ్ళాడు. ఎన్ని రోజులకూ తిరిగి రాలేదు. ఏమైపోయాడో తెలియక అటమటించిన వసుదేవుడు దేవీభాగవతాన్ని నవాహదీక్షగా ఆలకించాడు. అది ముగిసే సరికి శ్రీకృష్ణుడు విజయలక్ష్మీసనాథుడై తిరిగివచ్చాడు. ఇంతటి మహిమాన్వితం ఈ పురాణశ్రవణం. అపుత్రకులకు పుత్రులు కలుగుతారు. నిర్ధనులకు సంపదలు లభిస్తాయి. రోగిష్ఠులకు ఆరోగ్యం చేకూరుతుంది. ఇది భాగవతామృతం. గొడ్రాళ్ళు సంతానవతులవుతారు. దీర్ఘాయుష్మంతులను పొందుతారు. ఈ పుస్తకం ఏ ఇంటిలో ఉంటే ఆ ఇల్లే ఒక తీర్థం. ఆ ఇంటిలోనివారంతా పరమపావనులు. వారికి ఏ కష్టమూ ఏ దుఃఖమూ ఎప్పుడూ రాదు. అపజయమనేదే ఉండదు. అష్టమి - నవమి - చతుర్దశి తిథుల్లో దీన్ని పఠించినవారు మహాదేవికి అత్యంతప్రియులూ ఆప్తులూ అవుతారు. ఇలా పఠించిన బ్రాహ్మణుడు వేదవేత్తలలో అగ్రగణ్యుడవుతాడు. క్షత్రియుడు ధరణీపతి అవుతాడు. వైశ్యుడు అనంతసంపదలతో కుబేరుడవుతాడు. శూద్రుడు సంఘంలో ఉత్తమోత్తముడూ పరమపూజ్యుడూ అవుతాడు.

**(శ్రీ స్కాందపురాణం - మానసఖండం - శ్రీదేవీభాగవత మాహాత్మ్యం. అధ్యాయం - 1 , శ్లోకాలు - 50).**

సూతుడు ఇలా చెప్పేసరికి శౌనకాదిమహర్షులు మరొక ప్రశ్నవేశారు. సూతర్షీ! శ్యమంతకమణి అన్నావు, ప్రసేనుడన్నావు, శ్రీకృష్ణుడన్నావు, అపవాదు అన్నావు ఆ కథ ఏమిటో వివరంగా చెప్పు. వసుదేవుడు ఏ నియమనిష్ఠలతో ఈ దేవీభాగవతం విన్నాడో, ఎవరు వినిపించారో తెలియజెయ్యి - అని అభ్యర్థించారు. సూతుడు సరే అని వివరించాడు -

మహర్షులారా ! భోజవంశంలో పుట్టిన సత్రాజిత్తు ద్వారవతిలో ఉంటూ సూర్యుణ్ణి ఆరాధించి సూర్యలోకం దర్శించి వచ్చాడు. అతడిచ్చిన శ్యమంతకమణిని సగర్వంగా ధరించి మరో భాస్కరుడిలాగా వెలిగిపోతున్నాడు. ఒక రోజున శ్రీకృష్ణుడు సత్రాజిత్తును ఆహ్వానించి తన సుధర్మసభలో అందరి ఎదుటా అతిథిమర్యాదలు జరిపి సమ్మానించాడు. ఆ సందర్భంలో అతడు తన శ్యమంతకమణిని గురించి అందరికీ వివరించాడు. దాన్ని సూర్యుడు బహూకరించాడనీ, రోజుకి ఎనిమిదిబారువుల బంగారం ప్రసవిస్తుందనీ, రోగపీడలను తొలగిస్తుందనీ చెప్పాడు. అందరూ విని ఆనందించి అభినందించి పంపించారు.

సత్రాజిత్తు సోదరుడు ప్రసేనుడు ఒకనాడు ఆ మణిని తాను ధరించి అడవిలోకి వేటకు వెళ్ళాడు. అక్కడొక సింహం ఆ మణిని మాంసంముద్ద అనుకుని ప్రసేనుణ్ణి సంహరించి అపహరించింది. ఆ సింహాన్ని భల్లూకరాజు జాంబవంతుడు మట్టుబెట్టి మణిని తీసుకుని గుహలోకి ప్రవేశించాడు. అక్కడ తన బాలుడికి క్రీడావస్తువుగా ఇచ్చాడు.

వేటకు వెళ్లిన ప్రసేనుడు తిరిగి రాకపోవడంతో సత్రాజిత్తు ఎంతగానో దుఃఖించాడు. మణికోసం ఆశపడి ఎవరో సంహరించారని విలపించాడు. అది ఆనోటా ఆనోటా పాకి కృష్ణుడే సంహరించాడనే అపవాదుగా రూపుదాల్చింది. ఈ అపవాదు తొలగించుకోవాలని శ్రీకృష్ణుడు పౌరులతో కలిసి అడవికి వెళ్ళి ప్రసేనుడిని అన్వేషించాడు. మృతదేహం కనిపించింది. దాని ప్రక్కనే సింహం అడుగుజాడలు కనిపించాయి. అటుపైని భల్లూకం అడుగుజాడలు కనిపించాయి. ఎండిపోయిన రక్తబిందువులతో వాటిని పోల్చుకుంటూ గుహదగ్గరికి చేరుకున్నారు. పౌరుల నందరినీ అక్కడే ఆగిపొమ్మని శ్రీకృష్ణుడు ఒక్కడూ గుహలోకి ప్రవేశించాడు. మణితో క్రీడిస్తున్న బాలుణ్ణి చూశాడు. ఆ మణిని అందుకోబోయాడు. దాది చూసింది. భయపడి అరిచింది. జాంబవంతుడు గుహలోపలి నుంచి ఒక్కదూకున వచ్చి కృష్ణుడితో కలియబడ్డాడు. మూడు నవరాత్రుల కాలం ఘోరయుద్ధం సాగింది.

గుహ వెలుపల నిరీక్షిస్తున్న పౌరులు పన్నెండురోజులపాటు వేచి వేచి విసుగెత్తి ద్వారకకు వెళ్ళిపోయారు. జరిగినదంతా అందరికీ చెప్పారు. పౌరులు తలకొకరకంగా భావించారు. సత్రాజిత్తును తిట్టిపోశారు. శ్రీకృష్ణుణ్ణి పోగొట్టుకున్నామని విలపించారు.

వసుదేవుడికి ఈ వృత్తాంతం తెలిసింది. ఎంతగానో దుఃఖించాడు. బంధువులందరూ శోకసాగరంలో మునిగిపోయారు. ఈ దుఃఖంనుంచి కోలుకోవడం ఎలాగ ? మళ్ళీ మామూలు మనిషిని కాగలనా ? అని వసుదేవుడు పరితపిస్తున్నాడు. సరిగ్గా అదే సమయానికి బ్రహ్మలోకం నుంచి నారదమహర్షి వచ్చాడు. వసుదేవుడు ఎదురువెళ్ళి నమస్కరించి తెచ్చి అతిథిమర్యాదలు జరిపాడు. నారదుడు కుశలప్రశ్నలు వేసి, ఏమిటి కారణం అదోలా ఉన్నావు, చింతావ్యాకులితంగా కనపడుతున్నావు చెప్పమన్నాడు. వసుదేవుడు జరిగినదంతా చెప్పాడు. శ్రీకృష్ణుడు - నా ప్రియపుత్రుడు ఏమైపోయాడో తెలియక దిగులుపడుతున్నాను. చాలా రోజులు గడిచిపోయాయి. మావాడి జాడ తెలియడం లేదు. దీనికి ఏదైనా ఉపాయం చెప్పు మహానుభావా ! - అని వసుదేవుడు ప్రార్థించాడు.

వసుదేవా ! దిగులుపడకు. జగదంబికను ఆరాధించు. వెంటనే నీకు శ్రేయస్సు కలుగుతుంది.

మహర్షీ ! ఎవరు ఈ జగదంబిక ? ఆవిడ ప్రభావం ఏమిటి ? ఎలా ఆరాధించాలి ? నువ్వు కృపామూర్తివి. వివరంగా చెప్పి నన్ను ఈ శోకసముద్రం నుంచి ఉద్ధరించు.

వసుదేవా ! క్లుప్తంగా చెబుతాను, ఆలకించు. దేవీమహిమ అనంతం. ఎవరూ వివరించి చెప్పలేరు. ఆ తల్లి సచ్చిదానందరూపిణి. నిత్య. సత్య. పరాత్పర. ఈ జగత్తులో అంతటా వ్యాపించి ఉంది. మా తండ్రి బ్రహ్మదేవుడు ఆ మహాదేవిని ఆరాధించడంవల్లనే జగత్తులు సృష్టించగలుగుతున్నాడు. మధుకైటభుల బారినుంచి తప్పించుకోగలిగాడు. విష్ణుమూర్తి లోకాలను పాలిస్తున్నాడన్నా, రుద్రుడు కల్పాంతంలో సంహరిస్తున్నాడన్నా అంతా ఆ తల్లి కరుణాకటాక్షమహిమయే. ఈ సంసార బంధానికీ బంధవిముక్తికీ కారణం ఆదిశక్తియే. ఆవిడ సర్వేశ్వరి. పరవిద్యాస్వరూపిణి. నవరాత్ర విధానంలో అర్చించు. నవాహదీక్షతో దేవీభాగవతం పురాణశ్రవణం చెయ్యి. అది ముగిసేలోగా నీ పుత్రుడు నీముందు ఉంటాడు. ఇది నిశ్చయం. ఆ పురాణ మహిమ అంతటిది. అది చదివినవారికీ విన్నవారికీ ముక్తి అనేది తంగేటి జున్ను.

నారదా ! నీ మాటలు వింటూంటే జ్ఞాపకం వచ్చింది. అవును. నాకు తెలిసిన ఒక దేవీమహిమ చెబుతాను, విను. దేవకీదేవికి ఎనిమిదవ సంతానంగా జన్మించినవాడి చేతిలో కంసుడు మరణిస్తాడు అని అలనాడు అశరీరవాణి చెప్పింది. అది విన్న కంసుడు నన్నూ దేవకినీ కారాగారంలో బంధించి పుట్టిన శిశువును పుట్టినట్టు ఆరుగురిని పొట్టన పెట్టుకున్నాడు. దేవకీదేవి గర్భశోకానికి అంతం లేదు. రేయింబవళ్ళు విలపించింది.

అప్పు డొకరోజున నేను మా కులగురువు గర్గుడితో రహస్యంగా సంప్రదించాను. ఒక్క పుత్రుడినైనా దక్కించుకునే ఉపాయం చెప్పమన్నాను. దుర్గాదేవిని ఆరాధించు, అదే తరణోపాయం, ఆ తల్లి అనుగ్రహిస్తే నీ కోరిక నెరవేరుతుంది అన్నాడు. నేను కారాగారంలో ఉన్నాను, ఎలా ఆరాధించను? అందుకని నా పక్షాన నువ్వే ఆ తల్లిని ఆరాధించి ప్రసన్నురాలిని చెయ్యి అని అభ్యర్థించాను. గర్గుడు సమ్మతించి వింధ్యాద్రికి వెళ్ళి దుర్గాదేవిని నియమనిష్ఠలతో ఆరాధించాడు. జగన్మాత ప్రత్యక్షమయ్యింది. భూభారాన్ని తొలగించడం కోసం శ్రీమహావిష్ణువు దేవకీవసుదేవులకు అష్టమగర్భంగా జన్మిస్తాడు. పుట్టినవెంటనే ఆ శిశువును తీసుకువెళ్ళి యశోదకు అప్పగించాలి, అక్కడ పుట్టిన ఆడపిల్లను తెచ్చి దేవకి పొత్తిలిలో పరుండబెట్టాలి. ఈ పని చెయ్యవలసింది మీ ఆనకదుందుభియే (వసుదేవుడే). కంసుడు ఆడ శిశువును నేలకు విసురుతాడు. అప్పుడు అది ఆకాశానికి ఎగిరి నా అంశగా వచ్చి ఈ వింధ్యాద్రిలో కొలువు తీరుతుంది. గర్గా ! ఇక నువ్వు వెళ్ళు. ఇది దేవకార్యం. దీనికి తిరుగులేదు - అని దుర్గాదేవి ప్రసన్నచిత్తంతో పలికిందిట. గర్గుడు మథురకు వచ్చి ఇదంతా నాకు విన్నవించాడు. మా దంపతులం ఎంతో సంతోషించాం. ఆ తరవాత అన్నీ ఆ తల్లి చెప్పినట్టే జరిగాయి. నారదా ! అప్పటికిప్పుడు మళ్ళీ దేవీమహిమనుగురించి వింటున్నాను. అందుచేత, దయచేసి నువ్వే ఆ దేవీభాగవతం వినిపించి మళ్ళీ నా పుత్రుణ్ణి నాకు చేర్చు. నువ్వు దయానిధివి. నా అదృష్టంకొద్దీ ఈ రోజు ఇలా దయచేశావు. శ్రమ అనుకోక పురాణశ్రవణం చేయించు.

వసుదేవుడి అభ్యర్థనను నారదుడు కాదనలేకపోయాడు. ఒక మంచిరోజున మంచిముహూర్తాన దేవీభాగవత పురాణప్రవచనం ఆరంభించాడు. నిర్విఘ్న పరిసమాప్తికోసం బ్రాహ్మణులు వినాయక పూజలు చేసి నవాక్షరమహాదేవీ మంత్రాన్ని జపించారు. మార్కండేయ పురాణంలో చెప్పిన దేవీ స్తోత్రాలు పఠించారు. ప్రథమ స్కంధంతో ఆరంభించి నవాహదీక్షతో పన్నెండు స్కంధాలూ ప్రవచనం పూర్తిచేశాడు నారదుడు. వసుదేవుడు భక్తిశ్రద్ధలతో భాగవతామృతాన్ని ఆస్వాదించాడు. తొమ్మిదవరోజున పురాణం పూర్తికాగానే ప్రసన్నచిత్తంతో నారదుడికి పూజాసత్కారాలు జరిపాడు.

గుహాబిలంలో శ్రీకృష్ణుడి ముష్టిఘాతాలకి జాంబవంతుడి శరీరం పులిసిపోయింది. విశ్లథాంగుడై నీరసపడ్డాడు. అప్పటికి శ్రీకృష్ణుడిని భగవంతుడుగా గుర్తించగలిగాడు. భక్తితో శిరసువంచి నమస్కరించాడు. అపరాధం క్షమించమని కాళ్ళమీద పడ్డాడు.

మహానుభావా ! గుర్తించాను. నువ్వు భగవంతుడివి. నా రాముడివి. సముద్రానికి సేతువు నిర్మించి లంకా పట్టణాన్ని ధ్వంసం చేయించి రావణాసురుణ్ణి సంహరించిన నీ రోషం గుర్తుకు వచ్చింది. ఆ రోషమే సంకేతంగా నిన్ను గుర్తించాను. నువ్వు నా రాముడివే. శ్రీరామచంద్రుడివి. కృష్ణావతారంలో వచ్చావు. ఎంత అపచారం చేశాను. క్షమించు. మనసారా క్షమించు. నేను నీ భృత్యుణ్ణి. ఏమి ఆజ్ఞాపిస్తావో ఆజ్ఞాపించు.

ఋక్షరాజా ! శ్యమంతకమణికోసం నేను ఈ బిలంలోకి వచ్చాను - అన్నాడు ముక్తసరిగా శ్రీకృష్ణుడు. అనడమేమిటి జాంబవంతుడు మణితోపాటు తన కన్యామణి జాంబవతినికూడా కృష్ణుడికి కానుకగా సమర్పించాడు. అర్ఘ్యపాద్యాదులతో అర్చించాడు. రెండింటినీ స్వీకరించి శ్రీకృష్ణుడు సంతోషంగా ద్వారవతికి చేరుకున్నాడు.

దేవీభాగవత శ్రవణం పూర్తిచేసి నారదుణ్ణి సత్కరించి నిలబడ్డ వసుదేవుడి కళ్ళకి గుమ్మంలో శ్రీకృష్ణుడు శ్యమంతకమణితో కన్యామణితో కనిపించి కనువిందు చేశాడు. వసుదేవుడికి తనువు పులకించింది. కన్నుల్లో ఆనందబాష్పాలు. శ్రీకృష్ణుడి రాకతో నారదుడూ సంతోషించి, అందరినీ ఆశీర్వదించి సెలవు తీసుకున్నాడు. బ్రహ్మసభకు వెళ్ళిపోయాడు.

శౌనకాది మహామునులారా ! ఇది హరిచరిత. దీన్ని చదివినవారికీ విన్నవారికీ అపవాదులూ అపయశస్సులూ తొలగి సుఖసంతోషాలు పుష్కలంగా లభిస్తాయి. కోరికలన్నీ తీరతాయి. జన్మాంతంలో ముక్తి లభిస్తుంది.

**(శ్రీస్కాందపురాణం - మానసఖండం - శ్రీదేవీభాగవత మాహాత్మ్యం. అధ్యాయం - 2, శ్లోకాలు - 82)**

దేవీ భాగవత మాహాత్మ్యాన్ని తెలియజెప్పే మరొక ఇతిహాసం ఉంది. అదికూడా వినిపిస్తాను శ్రద్ధగా వినండి అంటూ సూతమహర్షి కొనసాగించాడు.

పూర్వకాలంలో ఒకప్పుడు అగస్త్యుడు లోపాముద్రతో కలిసి కైలాసానికి వెళ్ళి కుమారస్వామిని అభ్యర్థించి కథలూ గాథలూ అనేకం తెలుసుకున్నాడు. తీర్థ - దాన - వ్రతమాహాత్మ్యాలు ఎన్నో షణ్ముఖుడు చెప్పగా విని ఆ వృద్ధదంపతులు ఎంతగానో ఆనందించారు. అయినా తృప్తి కలగలేదు. లోకహితం కోరి దేవీభాగవతంగురించీ దాని మహిమగురించీ చెప్పమని అడిగారు. త్రిలోకజనని ఆ పురాణంలో కీర్తింపబడిందిటగదా, మాకు తెలియజెప్పవా అని అభ్యర్థించారు. స్కందుడు ఆరంభించాడు.

కుంభసంభవా ! భాగవతమాహాత్మ్యాన్ని విస్తరించి చెప్పాలంటే ఎవరివల్లా అయ్యేపనికాదు. నువ్వు అడిగావు కనక క్లుప్తంగా చెబుతాను. సచ్చిదానందరూపిణి జగదంబిక భుక్తిముక్తిప్రదాయినిగా సాక్షాత్కరించేది దేవీభాగవతంలోనే. అంచేత దేవీభాగవతం అంటే దేవీవాఙ్మయరూపం. దీని పఠనశ్రవణాలకు దుర్లభమైనది ఏదీ ఈ సృష్టిలో లేదు.

వెనకటికి వివస్వంతుని కొడుకు శ్రాద్ధదేవుడని ఒక మహారాజు ఉన్నాడు. అతడికి ఎంతకాలానికీ పిల్లలు కలగలేదు. మగబిడ్డ కలగాలని ఆకాంక్షించి వసిష్ఠులవారి అనుమతితో ఒక ఇష్టిని (పుత్రకామేష్టి) నిర్వహించాడు. అతడి భార్య శ్రద్ధాదేవి, తనకు ఆడపిల్ల కావాలనీ ఆ విధంగా హోమం నిర్వహించమనీ అభ్యర్థించింది. హోత అలాగే హోమం చేశాడు. ఇష్టి పూర్తి అయ్యింది - కొంతకాలానికి శ్రద్ధాదేవి గర్భం ధరించింది. ఆడపిల్లను ప్రసవించింది. ఇలాదేవి అని పేరు పెట్టారు. కానీ మహారాజు మనస్సు కలుక్కుమంది. మగపిల్లవాడు కావాలని సంకల్పించి ఇష్టిని నిర్వహిస్తే ఆడపిల్ల పుట్టిందేమిటి ? గురూత్తమా ! ఈ సంకల్పవైషమ్యం ఎలా జరిగింది ? అని వసిష్ఠులవారిని అడిగాడు. వ్యతిక్రమం ఎందుకు జరిగిందో ఎలా జరిగిందో చెప్పి, ఇలాదేవి మగవాడుగా మారాలంటే ఈశ్వరుణ్ణి ప్రార్థించమని సలహాచెప్పాడు వసిష్ఠుడు. శ్రాద్ధదేవుడు శివుణ్ణి ప్రార్థించాడు. శివానుగ్రహమూ గురువు అనుగ్రహమూ కలిసి ఇలాదేవి పురుషుడుగా మారిపోయింది. సుద్యుమ్నుడు అని అప్పుడు మళ్ళీ నామకరణం చేశారు. ఆ రాకుమారుడు సకలవిద్యలకూ సముద్రుడయ్యాడు. యౌవనంలోకి అడుగుపెట్టాడు. ఒకనాడు వేటకోసం ఒక మహావనంలోకి అడుగుపెట్టాడు. పరివారంతో కలిసి రథారూఢుడై అడవినుంచి అడవికి పయనిస్తున్నాడు. మేరుపర్వతానికి చేరువలో ఉన్న ఒక వనం చేరుకున్నాడు.

ఆ వనానికి ఒక చరిత్ర ఉంది. ఒకప్పుడు శివపార్వతులు అక్కడ క్రీడిస్తూండగా శివదర్శనలాలసులైన మునులు తెలియక హఠాత్తుగా ప్రవేశించారు. పార్వతి సిగ్గుపడింది. అది గ్రహించిన మునులు వెంటనే వెళ్ళిపోయి శ్రీహరిని శరణు వేడుకున్నారు. కానీ పార్వతిని సముదాయించడంకోసం శివుడు ఆ వనానికి ఒక శాపం ఇచ్చాడు. ఈ రోజునుంచీ ఈ వనంలోకి ప్రవేశించిన పురుషులెవరైనాసరే స్త్రీలుగా మారిపోతారు అని కట్టడి చేశాడు. ఈ వృత్తాంతం తెలిసిన పురుషులెవరూ ఆ వనం దరిదాపులకైనా వెళ్ళరు.

మన సుద్యుమ్నుడికి ఈ విషయం తెలియక ప్రవేశించాడు. ప్రవేశించడమేమిటి చూస్తూ తన తోటివారూ అందరూ స్త్రీలుగా మారిపోయారు. మగ గుర్రాలుకూడా ఆడ గుర్రాలైపోయాయి. కారణం తెలియక నివ్వెరపోయారు. చేసేదిలేక అలాగే ఆ అరణ్యాల్లో సంచరించారు. సంచరిస్తూ సంచరిస్తూ బుధుడి ఆశ్రమం చేరుకున్నారు. ఈ సుందరాంగిని చూసి బుధుడు మరులుకొన్నాడు. ఎవరీ అందగత్తె ? ఉన్నతపయోధరాలు. దొండపండుల్లాంటి పెదవులు. మల్లెమొగ్గల్లాంటి పలువరుస. చంద్రబింబంలాంటి వదనం. పద్మాల్లాంటి కన్నులు. బుధుడికి మనసయ్యింది. ఆ సుందరాంగికూడా బుధుణ్ణి చూసి అలాగే మన్మథభావాలకు లోనయ్యింది. చంద్రుడిలా ఉన్నాడు ఎవరబ్బా ఈ అందగాడు అనుకొంటి. చూపులు కలిశాయి. మనసులు కలిశాయి. తనువులూ కలిశాయి. ఆ సోమనందనుడి ఆశ్రమంలో కామసుఖాలు అనుభవిస్తూ చాలాకాలం ఉండిపోయింది. గర్భవతి అయ్యింది. పురూరవసుడికి జన్మనిచ్చింది. కొంతకాలం గడిచింది. ఒకనాడు తన పూర్వరూపం, తన రాజ్యం తల్లిదండ్రులు అన్నీ జ్ఞాపకం వచ్చి దుఃఖించి దుఃఖించి, ఇంక ఆ ఆశ్రమంలో ఉండలేక వెళ్ళిపోయింది. వెతుక్కుంటూ వెళ్ళి వసిష్ఠుడి ఆశ్రమం చేరుకుంది. తమ కులగురువును చూడటంతోనే దుఃఖం పొంగి వచ్చింది. కాళ్ళమీద పడి వలవలా విలపించింది. మళ్ళీ పురుషత్వం వచ్చేట్టు అనుగ్రహించమని ప్రార్థించింది.

వసిష్ఠుడు మంత్రశక్తితో జరిగిన వృత్తాంతమంతా తెలుసుకున్నాడు. కైలాసానికి వెళ్ళాడు. శివుణ్ణి అర్చించి ప్రసన్నుణ్ణి చేసుకున్నాడు. ఉబ్బులింగడుగదా అని భక్తిభావంతో స్తుతించాడు.

**నమో నమః శివాయాస్తు శంకరాయ కపర్దినే ।**
**గిరిజార్ధాంగదేహాయ నమస్తే చంద్రమౌళయే ॥ (దే. భా. మా. 3 - 33)**

మృడా ! కైలాసవాసీ ! నీలకంఠా ! భుక్తిముక్తిప్రదాయకా ! శివరూపా ! శివా ! ప్రపన్నభయహారీ ! వృషభవాహనా ! శరణ్యా ! పరమాత్మా ! త్రిమూర్తిస్వరూపా ! దేవాధిదేవా ! వరదా ! పురారీ! యజ్ఞరూపా! యజ్ఞఫలదా ! గంగాధరా ! సూర్యేందువహ్నిలోచనా ! నమో నమః. నమో నమః.

బోళాశంకరుడు ప్రత్యక్షమయ్యాడు. వృషభవాహనంమీద పార్వతీసమేతుడై దర్శనం అనుగ్రహించాడు. వరం కోరుకోమన్నాడు. ఆడపిల్లగా జన్మించి మగపిల్లవాడుగా మారి, ఇప్పుడు మళ్ళీ స్త్రీత్వం పొందిన ఇలాదేవికి (సుద్యుమ్నుడు) తిరిగి పురుషత్వం ప్రసాదించమని వసిష్ఠుడు అభ్యర్థించాడు. శివుడు ఆమోదించాడు. ఒకనెల పురుషుడుగా ఒక నెల స్త్రీగా ఉంటుందని అభ్యనుజ్ఞ ఇచ్చి శివుడు అంతర్ధానం చెందాడు. వసిష్ఠుడు అంతటితో సంతృప్తి చెందక జగదీశ్వరిని స్తుతించాడు.

**జయ దేవి మహాదేవి భక్తానుగ్రహకారిణి ।**
**జయ సర్వసురారాధ్యే జయానంతగుణాలయే ॥ (దే. భా. మా. 3 - 44)**

శరణాగతవత్సలా ! దుర్గా ! దేవేశీ ! దుఃఖహంత్రీ ! దుష్టదైత్యనిషూదినీ ! భక్తిగమ్యా ! మహామాయా! జగదంబికా ! సంసారసాగరోత్తారపోతీభూతపదాంబుజా ! త్రిమూర్తి సంసేవితా ! చతుర్వర్గ ప్రదాయినీ ! నిన్ను స్తుతించాలంటే సమర్థుడెవడు ? కేవలం భక్తితో నమస్కరించడం తప్ప.

వసిష్ఠుడి స్తోత్రానికి జగదీశ్వరి ప్రసన్నురాలయ్యింది. సుద్యుమ్నుడి మందిరానికి వెళ్ళి భక్తితో నన్ను అర్చించు. నాకు అత్యంతప్రీతిపాత్రమైన దేవీభాగవతాన్ని నవాహోనియమంతో అతడికి వినిపించు. అది ముగిసేసరికి తిరిగి పుంస్త్వం పొందుతాడు - అని ఆజ్ఞాపించింది.

వసిష్ఠుడు సంబరపడ్డాడు. ఆశ్రమానికి తిరిగి వచ్చాడు. దేవి ఆజ్ఞను వివరించాడు. ఆశ్వయుజ శుక్ల పక్షంలో దేవిని ఆరాధింపజేసి భాగవతం తానే పురాణశ్రవణం చేయించాడు. సుద్యుమ్నుడు భక్తిగా విన్నాడు. వినిపించిన వసిష్ఠుడిని అర్చించాడు. వెంటనే పురుషత్వం పొందాడు. రాజ్యానికి పట్టాభిషిక్తుడయ్యాడు. ప్రజారంజకంగా పరిపాలన సాగించాడు. భూరిదక్షిణలతో దేవీయజ్ఞాలు అనేకం నిర్వహించాడు. పుత్రుల్ని పొందాడు. వారికి రాజ్యం అప్పగించి తాను తపస్సులు చేసుకుని దేవీసాలోక్యం చెందాడు.

అగస్త్యా ! దేవీభాగవతమహిమ అంతటిది. చదివినవారికీ విన్నవారికీ సకలవాంఛాప్రదం. ఇహపరాలకు సాధకం - అనిచెప్పి కుమారస్వామి ఇతిహాసాన్ని ముగించాడు.

**(శ్రీస్కాందపురాణం- మానసఖండం - అధ్యాయం - 3, శ్లోకాలు - 58)**

అగస్త్యుడు సంతృప్తి చెందలేదు. ఇంకా ఇలాంటి విచిత్రమైన కథలు - దేవీభాగవత మహిమను చెప్పే ఇతిహాసాలు ఏమైనా ఉంటే వినిపించమని ప్రార్థించాడు. స్కందుడు కొనసాగించాడు.

అగస్త్యా ! భగవత్యాః ఇదం భాగవతమ్ అని దీని వ్యుత్పత్తి. గాయత్రీ మహిమ విస్తారంగా వర్ణింపబడింది. అందుకనికూడా దీనికి భాగవతమని పేరు. బ్రహ్మవిష్ణుశివారాధ్య ఆ భగవతి. ఈ తల్లి మహిమను తెలియజెప్పే మరొక విచిత్రగాథ ఉంది. చెబుతున్నాను. వినండి.

ఋతవాక్కు అని ఒక మహర్షి ఉండేవాడు. అతడికి ధర్మపత్ని వల్ల ఒక కుమారుడు జన్మించాడు. రేవతీనక్షత్రయుక్తమైన గండాంతకాలంలో జన్మించాడు. ఋషిదంపతులు సంతోషించి జాతకర్మాదులన్నీ యథావిధిగా జరిపించారు. కానీ కొడుకు పుట్టినప్పటినుంచీ ఆ తల్లిదండ్రులు ఆధివ్యాధి పీడితులయ్యారు. మంచం పట్టారు. కారణం తెలియలేదు. ఒకవేళ ఈ పుత్రుడు పూర్వజన్మలో మహాపాపాలు చేశాడేమో ? ఋషి పత్నులను శీలభంగాదులు చేశాడేమో ? ఆ మహాపాతకాలు మనల్ని రోగాలుగా పట్టిపీడిస్తున్నాయేమో - అని ఎంతగానో దిగులు పడ్డారు. అనుకున్నట్టుగానే కొడుకు ఎదిగి అలాగే తయారయ్యాడు. ఋషి దంపతుల దుఃఖానికి అంతులేకపోయింది. కుపుత్రుడు కలిగే కంటే అపుత్రులుగా ఉండిపోవడమే మంచిది. స్వర్గానికి వెళ్ళే తల్లిదండ్రుల్ని నరకానికి పడదోస్తారు కుపుత్రులు.

దుఃఖదాయకులు. వీరివల్ల అయినవారికి ఉపకారమూ లేదు, కానివారికి అపకారమూ లేదు. ఇలాంటి కుపుత్రులు పుట్టకండా ఉండటమే మంచిది. ఇల్లు సుపుత్రుడితో కళకళలాడటం ఎంతటి అదృష్టవంతులకోకదా! కుపుత్రుడివల్ల వంశం, కుభార్యవల్ల జీవితం, కుభోజనంవల్ల దివసం, కుమిత్రుడివల్ల సుఖం - నశిస్తాయన్నారు పెద్దలు.

**కుపుత్రేణాన్వయో నష్టో జన్మ నష్టం కుభార్యయా ।**
**కుభోజనేన దివసః కుమిత్రేణ సుఖం కుతః ॥ (దే. భా. పు. 4 - 17)**

ఇలా దుఃఖిస్తూనే ఉన్నారు ఆ దంపతులు. ఒకనాడు గర్గమహర్షి అక్కడికి వస్తే తమ గోడు వెళ్ళబోసుకున్నారు. మేము ధర్మబద్ధంగానే జీవితాలు గడిపాం. గురుశుశ్రూషలు చేశాం. వేదాధ్యయనం నియమనిష్ఠలతో చేశాను. బ్రహ్మచర్యం గడిపి గృహస్థాశ్రమంలో ప్రవేశించాను. ధర్మబద్ధంగా సంసారసుఖాలు అనుభవించాం. రోజూ పంచయజ్ఞాలు చేస్తున్నాం. పున్నామనరకంనుంచి కాపాడతాడని ఆశించి పుత్రుణ్ణి పొందామే తప్ప కామవాంఛతో కానే కాదు. కానీ వీడు పుట్టినప్పటినుంచీ మేమిద్దరం ఇలా అయిపోయాం. ఇది నా తప్పా ? దీని తప్పా ? వీడి తప్పా ? నువ్వు జ్యోతిశ్శాస్త్రంలో పారంగతుడివి. కనక ఆలోచించి చెప్పు. ఈ కుపుత్రుడు మాకు ఎలా జన్మించాడు ? దీనికి శాంతి ఏమిటి ? - అని అడిగాడు ఋతవాక్కు.

గర్గాచార్యుడు లెక్కలు వేసి తీవ్రంగా విచారణచేశాడు. ఋతవాఙ్మునీ ! ఇందులో మీ దంపతుల దోషం ఏమీ లేదు. కాకపోతే మీ పుత్రుడు దుర్ముహూర్తంలో జన్మించాడు. రేవతీగండాంతకాలంలో పుట్టాడు. అంచేత దుశ్శీలుడు అయ్యాడు. అదే మీ ఆధివ్యాధులకు కారణం. అంతకన్నా ఏమీ లేదు. ఈ దుఃఖం ఉపశమించాలంటే దుర్గతినాశిని దుర్గాదేవిని ఉపాసించండి. అది అన్ని దోషాలకూ మహాశాంతి - అని చెప్పి గర్గుడు సెలవు తీసుకున్నాడు.

ఋతవాఙ్మహర్షికి రేవతీనక్షత్రంమీద పట్టరానంతకోపం వచ్చింది. నేలకు రాలిపొమ్మని శపించాడు. వెంటనే ఆ నక్షత్రం భగభగలాడుతూ కుముదాద్రిమీదకు రాలిపడింది. అప్పటినుంచీ ఆ పర్వతం రైవతకాద్రి అయ్యింది. దాని సౌందర్యం రెండింతలు పెరిగింది. అటుపైని గర్గుడు చెప్పినట్టు ఆ ఋషిదంపతులు జగదంబికను ఆరాధించి సుఖశాంతులు పొందారు. కుపుత్రుడు సుపుత్రుడుగా మారి అందరి ప్రశంసలూ అందుకున్నాడు.

ఆ రేవతీనక్షత్ర తేజస్సునుంచి ఒక కన్యకామణి ఆవిర్భవించింది. రూపంలో కాంతిలో మరొక లక్ష్మీదేవిలా భాసించింది. ఆమెను చూసిన ప్రముచమహర్షి ఆశ్చర్యచకితుడై తన ఆశ్రమానికి తీసుకువెళ్ళి రేవతి అని నామకరణం చేసి కన్నకూతురులా పెంచుకున్నాడు. రేవతి ఎదిగి ఈడేరిన తరవాత వరాన్వేషణ ప్రారంభించాడు. అనురూపవరుడు ఎక్కడా దొరకలేదు. దిగులు చెందాడు. తన హోమశాలలో ప్రవేశించి అగ్ని దేవుణ్ణి స్తుతించాడు. పావకుడు సుప్రీతుడయ్యాడు. మీ అమ్మాయికి దుర్గముడనే మహారాజు తగిన

వరుడు. అతడు ధర్మిష్ఠుడు. బలపరాక్రమశాలి. మహావీరుడు. మేధావి. అందగాడు - అని అగ్నిదేవుడు తెలియపరిచాడు. ప్రముచుడు సంబరపడ్డాడు.

దైవవశాత్తు అదే సమయానికి దుర్దముడు వేటకోసమని అడవికి వచ్చినవాడు ప్రముచుడి ఆశ్రమాన్ని సందర్శించాడు. ఈ దుర్దముడు ప్రియవ్రత కులోద్భవుడు. కాళిందీవిక్రమశీలుల తనయుడు. ఇతడు వచ్చిన ఆ సమయానికి ప్రముచుడు ఆశ్రమంలో లేడు. హోమశాలలో ఉన్నాడు. పర్ణశాలలో రేవతి మాత్రమే ఉంది. దుర్దముడు చూశాడు.

ప్రియా ! ప్రముచులవారు ఆశ్రమంలో లేరా ? వారిని దర్శించి పాదాభివందనం చేసి ఆశీస్సులు పొంది వెడదామని వచ్చాను.

హోమశాలలో ఉన్నారు - అంది రేవతి. దుర్దముడు హోమశాలకు వెళ్ళాడు. ద్వారంలో నిలబడ్డాడు. ప్రముచుడు తలెత్తి చూశాడు. రాజ లక్షణాలతో వినయవిధేయతలతో విరాజిల్లుతున్న దుర్దముణ్ణి చూసి ప్రముచుడు ఆప్యాయనంగా ఆహ్వానించాడు. రాజు వచ్చి పాదాభివందనం చేసి నిలబడ్డాడు. ప్రముచుడు గౌతముణ్ణి (శిష్యుడు) పిలిచి అర్ఘ్యపాద్యాలు తెమ్మన్నాడు. చాలాకాలానికి వచ్చాడు - మన మహారాజు. పైగా కాబోయే అల్లుడు అంటూ అతిథిసత్కారాలు జరిపాడు. సముచితాసనం చూపించి కూర్చోమన్నాడు. కుశలప్రశ్నలు వేశాడు.

మహారాజా ! నీ సైన్యమూ కోశమూ మిత్రబృందమూ కుశలమేనా ? భృత్యులూ అమాత్యులూ క్షేమమా ? దేశమూ రాజధానీ సుభిక్షంగా సమృద్ధంగా ఉన్నాయా ? నీకు అనామయమే కదా ! నీ భార్య క్షేమం గురించి అడగను. ఎందుకంటే ఆ అమ్మాయి ఇక్కడే ఉంది కనక. తక్కినవారి క్షేమసమాచారాలు ఏమిటో చెప్పు.

ప్రముచమహర్షీ ! అన్నీ కుశలమే. అందరం క్షేమమే. నా భార్య ఇక్కడే ఉంది అంటున్నావు. ఎవరావిడ ? ఇది చాలా కుతూహలం కలిగిస్తోంది. చెప్పవూ ?

చిరంజీవీ ! దుర్దమా ! రేవతి అని ఆ అమ్మాయి పేరు. నీ భార్య. రూపంలో గుణంలో సాటిలేని మహిళ. నీ భార్యనే నువ్వెరగవా ?

మహర్షీ ! నా అంతఃపురంలో సుభద్రాప్రభృతులు చాలామంది ఉన్నారు భార్యలు. కానీ వారిలో రేవతి ఎవరూ లేరే ! ?

రాజా ! ఇక్కడికి రాబోయే ముందు పర్ణశాలలో ఒక అమ్మాయిని చూసి ప్రియా అని సంబోధించావు కదా ! అప్పుడే మరిచిపోయావా ?

మహర్షీ ! నువ్వన్నది నిజమే. అక్కడ ఒక అమ్మాయిని చూశాను. ప్రియా అని సంబోధించాను. కానీ నాకు ఏ దుష్టభావమూ లేదు. కోపించకు. ఏదో మాటవరసకు అలా పిలిచానంతే.

రాజా ! నాకు తెలుసు. నీ మనస్సులో ఏ దుష్టభావమూ లేదు. అయినా అగ్నిదేవుడి ప్రేరణతో నీ నోటినుంచి అలా ఆ సంబోధన వెలువడింది. ఇప్పుడే నేను వహ్నిదేవుణ్ణి అడిగాను రేవతికి తగిన వరుడు ఎవరు అని. దుర్దముడు భర్త అవుతాడు అని చెప్పాడు. సరిగ్గా అదే సమయానికి నువ్వు పర్ణశాలకు వచ్చి రేవతిని ప్రియా అని పిలిచావు. ఇక్కడికి వచ్చావు. ఇది దైవ నిర్ణయం. కనక మా అమ్మాయిని స్వీకరించు. ప్రియా అని ఎలాగూ పిలిచావు కనక ఇక విచారించవలసింది లేదు.

దుర్దముడు ఆలోచనలో పడ్డాడు. ప్రముచుడు వివాహయత్నాలు ప్రారంభించాడు. రేవతికి విషయం తెలిసింది. రేవతీ నక్షత్రంలోనే వివాహం జరిపించమని కోరింది. ఇంకా మంచి నక్షత్రాలు చాలా ఉన్నాయి కదా నీకు ఈ పట్టుదల ఎందుకు ? పైగా ఋతవాగ్మని శపించాడాయె. ఇప్పుడు ఆ నక్షత్రం ఆకాశంలో లేనే లేదు. నేలకు రాలిపోయింది. ఎలా జరిపించమంటావ్ ? - అన్నాడు ప్రముచుడు. ఒక్క ఋతవాక్కేనా సమర్థుడు ? నువ్వూ అంతటి తపస్వివే. నేనెరుగుదును. తలుచుకుంటే ముల్లోకాలనూ సృష్టించగలవు. కనక నా విన్నపం మన్నించు. రేవతీనక్షత్రంలోనే వివాహం జరిపించు - అని పట్టుబట్టింది రేవతీదేవి. ప్రముచుడు సరే అన్నాడు. తన తపశ్శక్తితో నక్షత్రవీథిలో మరో రేవతిని సృష్టించాడు. అదే ముహూర్తంలో రేవతీదుర్దముల వివాహం సలక్షణంగా జరిపించాడు. సంబరపడ్డాడు. ఏమి కావాలో కోరుకొమ్మని అల్లుణ్ణి అడిగాడు.

ప్రముచమహర్షీ ! నేను స్వాయంభువమనువంశంలో పుట్టినవాణ్ణి. కనక నాకు మన్వంతరానికి అధిపతి అయ్యే తనయుడు కలిగేట్టు వరం ఇయ్యి - అని అభ్యర్థించాడు దుర్దముడు. అయితే, దుర్దమా! మహాదేవిని ఉపాసించు. నీ కోరిక నెరవేరుతుంది. దేవీభాగవతమని ఒక మహాపురాణం ఉంది. అది అయిదవ పురాణం. దాన్ని శ్రద్ధాసక్తులతో అయిదుమార్లు చదివించుకుని విను. ఈ రేవతికీ నీకూ జన్మించబోయే కుమారుడు అయిదవ మన్వంతరానికి అధిపతి అవుతాడు - అని ప్రముచుడు ఆశీర్వదించాడు. దుర్దముడు సంతోషించాడు. రేవతిని తీసుకుని రాజధాని చేరుకున్నాడు. ధర్మబద్ధంగా ప్రజలను సొంత కొడుకుల్లాగా చూసుకుంటూ పరిపాలన సాగించాడు.

ఒకనాడు లోమశమహర్షి దుర్దముడి రాజధానికి వచ్చాడు. మహారాజు ఎదురువెళ్ళి సాష్టాంగనమస్కారం చేసి అంతఃపురంలోకి తోడ్కొనివచ్చి అతిథిమర్యాదలు జరిపాడు. మహర్షీ ! దేవీభాగవతం వినాలని ఉంది. తమరు వినిపించండి అని అభ్యర్థించాడు. లోమశుడు సంబరపడ్డాడు. మహారాజా ! నీకూ జగదంబికపట్ల భక్తి అంకురించింది. ఇది చాలా శుభంకరం. భక్తి కలిగితే చాలు ఆ తల్లి అనుగ్రహానికి పాత్రులైనట్టే. కార్యసిద్ధి కలుగుతుంది. తప్పకుండా దేవీభాగవతం వినిపిస్తాను అని చెప్పి, ఒక శుభముహూర్తాన ప్రారంభించి అయిదు ఆవృత్తులుగా పురాణశ్రవణం చేయించాడు లోమశుడు. రేవతీసహితుడై దుర్దముడు భక్తిశ్రద్ధలతో ఆలకించాడు. ముగింపురోజున మహర్షినీ వేదపండితులనూ ఆ

పండితుల ధర్మపత్నులనూ సువర్ణాంబరాలతో సత్కరించాడు. నవాక్షరమంత్రంతో హోమాలు చేసి కుమారీపూజలు నిర్వహించి పెద్ద ఎత్తున సంతర్పణ జరిపాడు.

రేవతీదేవి గర్భం ధరించింది. శుభముహూర్తాన లోకకల్యాణకారకుడైన పుత్రుణ్ణి ప్రసవించింది. జాతకర్మాదిక్రియలన్నీ ఉత్సవాలుగా జరిపించాడు మహారాజు. భూరి దక్షిణలతో విప్రుల్ని సంతోషపరిచాడు. రైవతుడు దినదిన ప్రవర్ధమానుడయ్యాడు. ఉపనయనం అయ్యింది. గురుకులంలో వేదశాస్త్రాలు అన్నీ సమగ్రంగా అధ్యయనం చేశాడు. ధనుర్విద్యాపారంగతుడు అయ్యాడు. ధర్మశాస్త్రానికి వక్తా కర్తా అయ్యాడు. బ్రహ్మదేవుడు రైవతుడి యోగ్యతలు గుర్తించి మన్వంతరాధిపతిని చేశాడు.

కుంభసంభవా ! అగస్త్యా ! ఇంతటిది సుమా దేవీభాగవత శ్రవణమాహాత్మ్యం. క్లుప్తంగా చెప్పాను. పరిపూర్ణంగా చెప్పడం ఎవరితరమూ కాదు - అని కుమారస్వామి ముగించాడు. లోపాముద్రాగస్త్యులు అప్పటికి సంతృప్తిపడి తమ ఆశ్రమానికి వెళ్ళిపోయారు. కనక శౌనకాది మహామునులారా ! ఈ పురాణాన్ని వినడంవల్ల కలిగే పుణ్యఫలం అనంతమన్నాడు సూతుడు.

**(శ్రీస్కాందం - మానసఖండం- దేవీభాగవత మాహాత్మ్యం. అధ్యాయం - 4, శ్లోకాలు - 91).**

సూతమహర్షీ! దేవీభాగవత మాహాత్మ్యం అద్భుతంగా వివరించావు. చాలా ఆనందం కలిగించావు. అయితే ఆ పురాణం వినడానికి ఏవైనా నియమాలు ఉన్నాయా ? ఎప్పుడు మొదలు పెట్టాలి ? ఎక్కడ మొదలు పెట్టాలి ? ఎలా వినాలి ? ఈ సందేహాలు తెమిల్చి అటుపైని పురాణం వినిపించు - అని అభ్యర్థించారు శౌనకాదులు.

మహర్షులారా ! ఈ పురాణ శ్రవణానికి సాధారణ నియమాలు కొన్ని ఉన్నాయి. వాటిని పాటించి వింటే శ్రవణఫలం సమగ్రంగా దక్కుతుంది. సకలవాంఛలూ నెరవేరతాయి. ముందుగా దైవజ్ఞులను సంప్రదించి పురాణశ్రవణారంభానికి ముహూర్తం పెట్టించుకోవాలి. శుచిమాసంతో ఆరంభించి (జ్యేష్ఠంగానీ ఆషాఢంగానీ) ఆరునెలలు శుభావహాలు. హస్త - అశ్విని - మూల - పుష్యమి నక్షత్రాలు మంచివి. తిథివారాలు మంచివి చూసుకుని ఆరంభించాలి. ఏ కోరికతో ఈ పురాణశ్రవణం చేస్తున్నామో దానికి తగినట్టు ముహూర్తం నిశ్చయించుకోవడం మంచిది. ధర్మప్రాప్తి, లక్ష్మీప్రాప్తి, సుఖప్రాప్తి, పీడానివారణ, రాజభయనివారణ, జ్ఞానప్రాప్తి - ఇలా ఏవేవో వాంఛితాలు ఉంటాయి గదా ! వాటినిబట్టి అనుకూలమైన ముహూర్తం నిశ్చయించుకోవాలి. పుష్యమి మొదలుకొని (గురుభం) ఇరవైయేడు నక్షత్రాలనూ ఏడు రాసులు చేసి పారాయణ ఫలాలను చెప్పారు. వాటిని చూసుకోవాలి (5 - 5, 6). అలాకాక కేవలం దేవీప్రీతికోసమే దేవీభాగవతం వింటున్నాను లేదా పఠిస్తున్నాను అనేట్టయితే దీనికి దేవీనవరాత్రచతుష్టయం ఉత్తమోత్తమం. (దేవీనవరాత్రాల్లో నాలుగురోజులు). మిగతా నెలల్లో కూడా చెయ్యవచ్చు. తిథివారనక్షత్రాలు మంచివిగా చూసుకుంటే చాలు. ఇది నిష్కామం కనక అన్ని నెలలూ యోగ్యాలే.

ఒక వివాహానికి ఎలా సంబారాలు సమకూర్చుకుంటామో అలాగే ఈ పురాణ శ్రవణ యజ్ఞానికీ సమకూర్చుకోవాలి. ఇది తొమ్మిదిరోజులపాటు సాగే యజ్ఞం. నవాహయజ్ఞం. దేవీభాగవత పురాణ శ్రవణ యజ్ఞం. దేనికీ లోభించకూడదు. పదిమంది సహాయమూ తీసుకోవాలి. వీరంతా దేవీభక్తిపరులై ఉండాలి. వదాన్యులై ఉండాలి. పనులు చెయ్యడంలో చతురులై ఉండాలి. చుట్టుపక్కల గ్రామాలకూ నగరాలకూ ఈ పురాణ శ్రవణ వార్తను తెలియపరచాలి. తప్పకుండా రండి అని అందరినీ పిలవాలి. సౌర గాణపత్య శైవ శాక్త వైష్ణవాది మతానుయాయులు అందరూ దీన్ని వినవచ్చు. పఠించవచ్చు. దేవీభాగవత పీయూషం పంచుతున్నాం, రండి, వచ్చి భక్తిశ్రద్ధలతో ఆస్వాదించండి అని అందరినీ ఆహ్వానించాలి. చతుర్వర్ణాలవారూ స్త్రీలూ పురుషులూ అన్ని ఆశ్రమాలవారూ సకాములూ నిష్కాములూ అందరూ ప్రేమతో ఈ అమృతాన్ని చెవులారా గ్రోలవచ్చు. తొమ్మిదిరోజులూ ఉండి విని వెళ్ళండి అని ఆప్యాయంగా సవినయంగా పిలవాలి. కుదరనివారు వీలైనన్ని రోజులూ ఉండి విని వెళ్ళవచ్చు. మధ్యలో వచ్చి వినవచ్చు. వచ్చినవారందరికీ బస - వసతులు ఏర్పాటు చెయ్యాలి.

విశాలమైన పందిరివేసి చాందినీలు కట్టి అరటి బోదెలతో కొబ్బరిఆకులతో మామిడితోరణాలతో అలంకరణ చెయ్యాలి. మనోహరంగా వేదిక నిర్మించాలి. దాన్ని గోమయంతో అలికి ముగ్గులు పెట్టాలి. పందిరి అంతటా ఈ అలంకరణ చెయ్యాలి. జెండాలు కట్టాలి. ఆ వేదిక మీద పౌరాణికుడు కూర్చునేందుకు వీలుగా సుఖాసనం ఏర్పాటు చెయ్యాలి. ఆయన తూర్పుముఖంగా గానీ, ఉత్తరముఖంగా గానీ కూర్చునేందుకు వీలుగా ఉండాలి. శ్రోతలకుకూడా యథోచితంగా యథావకాశంగా ఆసనాలు వెయ్యాలి. ఆడవారికి వేరుగా మగవారికి వేరుగా కూర్చునే ఏర్పాటు ఉండాలి.

పౌరాణికుడు మంచి మాటకారి అయ్యుండాలి - నిగ్రహం కలవాడై ఉండాలి. దేవీ ఆరాధన తత్పరుడూ వివిధ పురాణ శాస్త్రాలు తెలిసినవాడూ, మంచి కంఠం కలవాడూ, దయాళుడూ, నిస్పృహుడూ, దక్షుడూ, ధీరుడూ అయ్యుండాలి. ఇన్ని లక్షణాలూ ఉంటే అతడు ఉత్తమోత్తమ పౌరాణికుడు. శ్రోతలుకూడా బ్రహ్మణ్యులూ దేవతాభక్తులూ కథారస పరాయణులూ ఉదారులూ అలోలుపులూ నమ్రులూ హింసాది దుర్గుణ వివర్జితులూ అయ్యుండాలి. పాషండులూ, లుబ్ధులూ, నాస్తికులూ, దుశ్శీలురూ, దుర్గుణులూ, నిష్ఠురులూ, క్రోధనులూ, శివకేశవులకు భేదం పాటించేవారూ ఈ పురాణం చెప్పడానికిగానీ వినడానికిగానీ పనికిరారు. ఇది దేవీయజ్ఞం. ఈ మాట మరిచిపోకూడదు.

పురాణశ్రవణం జరుగుతున్నప్పుడు లేదా పఠిస్తున్నప్పుడు అనేక సందేహాలూ సంశయాలూ వస్తూ ఉంటాయి. వాటిని తీర్చడానికి వీలుగా సమర్థుడైన పండితుణ్ణి (ఒకరిద్దరినిగానీ) ఆహ్వానించి పౌరాణికుని సన్నిధిలో కూర్చుండబెట్టాలి. ఈయన సహాయకుడుగా వ్యవహరిస్తూ సందేహాలు తీర్చాలి.

ప్రారంభముహూర్తానికి ముందురోజునే వక్త శ్రోతలు క్షురకర్మాదులు చేయించుకోవాలి. అందరూ పురాణ శ్రవణ దీక్షను స్వీకరించాలి. తెల్లవారుజామునే లేచి కాల్యాలు తీర్చుకుని స్నాన

సంధ్యాదులు ముగించి వినడానికి కూర్చోవాలి. ఈ తొమ్మిది రోజులూ వీటిని క్లుప్తంగా ముగించుకోవచ్చు. కథా శ్రవణ యోగ్యత్వ సిద్ధికోసం యథాశక్తిగా గోదానాదులు చెయ్యడం మంచిది.

నిర్విఘ్నపరిసమాప్తిని కాంక్షిస్తూ ముందుగా గణపతిని పూజించాలి. కలశస్థాపన చేసి అర్చించడం, వటుక - క్షేత్రపాల - యోగినీ - మాతృకా - తులసీ - గ్రహ - హరి - హరాదులను పూజించడం యథావిధిగా చేస్తే విశేష ఫలితాలు ఉంటాయి. నవాక్షరమంత్రంతో జగదంబికను అర్చించాలి. శ్రీమద్దేవీభాగవత పుస్తకాన్ని సకలోపచారాలతోనూ పూజించాలి. ఇది ఆ పరాశక్తికి వాఙ్మయమూర్తి. శోభనాక్షరవిరాజితం. కనక గ్రంథపూజ చెయ్యాలి. విఘ్నోపశాంతికోసం అయిదుగురు బ్రాహ్మణులను నియమించి తొమ్మిదిరోజులపాటూ నిత్యం నవాక్షరమంత్రజపం చేయించాలి. సప్తశతీస్తవం పారాయణ చేయించాలి. ఏ రోజుకారోజు పురాణ శ్రవణానికి ఆరంభంలోనూ ముగింపులోనూ ప్రదక్షిణ నమస్కారాలు చేసి జగదంబికను స్తుతించాలి.

కాత్యాయని మహామాయే భవాని భువనేశ్వరి ।
సంసారసాగరే మగ్నం మాముద్ధర కృపామయే ॥
బ్రహ్మవిష్ణు శివారాధ్యే ప్రసాదం జగదంబికే ।
మనోఽభిలషితం దేవి వరం దేహి నమోఽస్తు తే ॥ (5 - 32)

పౌరాణికుడంటే సాక్షాత్తు వ్యాసుడు. కనక వ్యాసబుద్ధితో అతడిని సత్కరించాలి. పుష్పమాలి కాలంకారవస్త్రాదులు సమర్పించి - సర్వశాస్త్ర ఇతిహాసజ్ఞా ! వ్యాసరూపా ! కథా చంద్రోదయంతో మా అంతరంగాల్లో ఉన్న చీకటిని తొలగించు - అని ప్రార్థిస్తూ నమస్కరించాలి.

సర్వశాస్త్రేతిహాసజ్ఞ వ్యాసరూప నమోఽస్తు తే ।
కథాచంద్రోదయేనాంతస్తమస్తోభం నిరాకురు ॥ (5 -35)

ఇలా నిత్యమూ ప్రార్థిస్తూ తొమ్మిదిరోజులపాటూ ఏకాగ్రచిత్తంతో నియతాత్ములై - ఇల్లూ-వాకిలీ వ్యాపారాలూ - బాదరబందీలన్నీ మరిచిపోయి శ్రద్ధగా పురాణ శ్రవణం చెయ్యాలి. చతుర్విధ పురుషార్థాలూ సిద్ధిస్తాయి. సూర్యోదయంతో ప్రారంభించి సూర్యాస్తమయానికి కొంచెం ముందు వరకూ పురాణ శ్రవణం జరగాలి. మధ్యాహ్నం కాసేపు విశ్రాంతి తీసుకోవచ్చు. ఈ తొమ్మిది రోజులూ కేవలం సాత్త్వికాహారం అదీ మితంగా లఘువుగా తీసుకోవాలి. లేకపోతే మధ్యమధ్యలో లేచి వెళ్ళిరావడంలాంటి ఇబ్బందులు కలుగుతాయి. ఒంటిపూట భోజనం ఉత్తమం. హవిష్యాన్నమే తినడం ఉత్తమోత్తమం. లేదంటే పాలూ పళ్ళూ నేతివంటలూ ఇంకా మంచిది. ఏమైనా, కథావిఘ్నం జరగకుండా విచక్షణులై ఏది తీసుకోవాలో ఎంత తీసుకోవాలో ఎవరికి వారే నిర్ణయించుకోవడం సమంజసం.

మలమూత్రజయార్థమేషాం లఘు భోజనమిష్యతే ।
హవిష్యాన్నం వరం భోజ్యం సకృదేవ కథార్థినా ॥
అథవా స్యాత్ఫలాహారీ పయోభుగ్వా ఘృతాశనః ।
యథా స్యాన్న కథావిఘ్నస్తథా కార్యం విచక్షణైః ॥ ( 5 - 40 )

తొమ్మిదిరోజులూ బ్రహ్మచర్యం పాటిస్తూ నేలపైనే పరుంటూ ఆకులలో తింటూ సత్యవాగ్నియమంతో ఇంద్రియ నిగ్రహంతో కథా శ్రవణం చెయ్యాలి.

ఆరోగ్యం దృష్టితోనూ ఇంద్రియ నిగ్రహం దృష్టితోనూ ఈ రోజుల్లో తినకూడని పదార్థాలూ కాయగూరలూ కొన్ని ఉన్నాయి. వాటిని తెలుసుకుని పరిహరించాలి. చద్దినిగానీ భావదుష్టమైనదానినిగానీ తినకూడదు. మద్యమాంసాలు పూర్తిగా పరిత్యాజ్యాలు. అరిషడ్వర్గాలకూ దుష్టులకూ దూరంగా ఉండాలి. అయోగ్యులతో సంభాషించకూడదు. యోగ్యులను నిందించకూడదు. సాధ్యమైనంతవరకూ ఈ తొమ్మిదినాళ్ళూ మౌనం పాటించడం మంచిది. వినయమూ ఋజువర్తనమూ శౌచమూ దయాగుణమూ మితభాషణమూ ఔదార్యమూ పాటించాలి.

రోగులూ భయార్తులూ ధనార్థులూ పుత్రార్థులూ ఇంకా అధిక భక్తితో వినాలి. పిల్లలు కలగనివారూ, కలిగిన శిశువులు మరణించేవారూ, గర్భస్రావాలు జరిగేవారూ ఈ కథా శ్రవణవ్రతం చేపట్టి వింటే సత్ఫలితాలు ఉంటాయి. వీరు తప్పకుండా వినాలి. ఆయా ఆశ్రమాలను స్వీకరించకుండా ఆయా యాతనలు పడకుండా ధర్మార్థకామమోక్షాలు సమకూరాలి అనుకునేవారికి ఈ భాగవతశ్రవణం కల్పవృక్షంలాంటిది. ఈ తొమ్మిది రోజులూ తొమ్మిది యజ్ఞదినాలతో సమానం. ఈ రోజుల్లో చేసే దానాలూ హోమాలూ జపాలూ అనంతంగా ఫలప్రదాలు అవుతాయి.

తొమ్మిదిరోజులూ అయ్యాక ఉద్యాపన చెయ్యాలి. మహాష్టమీ వ్రతానికి ఎలా చేస్తారో అలాగ. ఇది ఫలంకోరేవారు చెయ్యవలసిన పని. కోరిన ఫలం దక్కుతుంది. నిష్కామంగా విన్నవారికి ముక్తి లభిస్తుంది. అందుకనే భగవతిని భోగమోక్షప్రద అనడం. నిత్యమూ వక్తకూ పుస్తకానికీ పూజలు చెయ్యాలి. వక్త ఇచ్చే ప్రసాదాన్ని భక్తితో స్వీకరించాలి. కుమారీ -సువాసినీ -బ్రాహ్మణ -బ్రహ్మచారి పూజలూ సంతర్పణలూ నిత్యమూ జరగాలి. గాయత్రీనామ సహస్రం పఠించాలి. ఇవి తొమ్మిదినాళ్ళూ చెయ్యలేకపోతే కనీసం ముగింపునాడైనా చెయ్యాలి. సర్వదోష నివారకంగా విష్ణుసహస్రనామం పఠించాలి. విష్ణుమూర్తిని స్మరిస్తే, తపస్సులలో యజ్ఞాదుల్లో తెలసీ తెలియకా జరిగే లోటులూ దోషాలూ తొలగిపోయి సమస్తమూ సంపూర్ణమవుతుంది.

యస్య స్మృత్యా చ నామోక్త్యా తపోయజ్ఞక్రియాదిషు ।
న్యూనం సంపూర్ణతాం యాతి తస్మాద్విష్ణుం చ కీర్తయేత్ ॥ (5 -60)

ముగింపు రోజున దేవీసప్తశతీమంత్రాలతో హోమం చెయ్యాలి. నవాక్షర మంత్రంతోనూ చెయ్యాలి. పాయసంతోనో నెయ్యితోనో గాయిత్రీ హోమం జరిపించాలి. దేవీభాగవతమంటే గాయిత్రీమయం. ఇవన్నీ తజ్ఞులైన విప్రుల సూచనలమేరకు జరిపించాలి.

యథాశక్తిగా భూ సువర్ణ వస్త్ర భూషణ ధనాదులతో పౌరాణికుణ్ణి సంతృప్తి పరచాలి. ఆయన ప్రసన్నుడైతే దేవతలందరూ ప్రసన్నులైనట్టే. అలాగే సహాయకులుగా ఉండే పండితులనూ నామజపాలూ హోమాలూ చేసే విప్రులనూ సంతృప్తిపరచాలి కుమారీ సువాసినీ పూజలు అందుకున్న వారినీ దక్షిణలతో సంతృప్తిపరచాలి. సంతర్పణ జరపాలి. వీరందరూ సంతృప్తి చెందితే దేవి సంతృప్తి చెందినట్టే. కోరికలన్నీ తీరతాయి.

దేవీనవరాత్రాలలో అష్టమినాడుగానీ నవమినాడుగానీ దేవీభాగవతగ్రంథాన్ని పట్టువస్త్రంతో కప్పి అర్చించి పౌరాణికులకూ విప్రులకూ దానం చెయ్యాలి. ఇలా చేసిన పుస్తకదానం సకలపాపాలనూ హరిస్తుంది. ఇహ లోకంలో సకలభోగాలనూ కలిగించి పరలోకంలో ముక్తిని ప్రసాదిస్తుంది. పౌరాణికుడు దుర్బలుడా బాలుడా యువకుడా వృద్ధుడా-అనే విచారణతో పనిలేదు.అందరికీ పూజ్యుడు. అందరికీ వంద్యుడు. వ్యాసుడితో సమానుడు. లోకంలో చాలామందికి చాలారకాల గురువులు ఉంటారు. కానీ అందరిలోకీ ఉత్తమోత్తమ గురువు పౌరాణికుడే.

**సంతి లోకస్య బహవః గురవో గుణజన్మతః ।**
**సర్వేషామపి తేషాం చ పురాణజ్ఞః పరో గురుః ॥** ( 5 -70 )

వ్యాసపీఠంముందు కూర్చుని పురాణం చెబుతున్నంతసేపూ అతడు వ్యాసుడే. ఆ సమయంలో అతడికి ఎవరూ నమస్కరించకూడదు. ప్రసంగం ముగిశాకనే నమస్కరించాలి.

**పౌరాణికో బ్రాహ్మణస్తు వ్యాసాసన సమాశ్రితః ।**
**అసమాప్తే ప్రసంగే తు నమస్కుర్యాన్న కస్యచిత్ ॥** ( 5 - 71)

మహర్షులారా !ఈ నియమావళి పాటిస్తూ వినాలి. అప్పుడే ఫలితం దక్కుతుంది. పౌరాణికుడికన్నా ఉన్నతమైన ఆసనం మీద కూర్చుని డాంబికంగా వినకూడదు. అలా చేస్తే మరుసటి జన్మలో కాకిగా పుడతాడు. సాధ్యమైనంతవరకూ తొమ్మిదిరోజులూ ఉండి వినివెళ్ళడం మంచిది. మధ్యలో వితండవాదాలు చేసేవారు గాడిదలై పుడతారు. నిందించే వారు శునక జన్మలెత్తుతారు. పౌరాణికుడితో సమానమైన ఆసనంలోనూ కూర్చోకూడదు. నమస్కరించకుండా వచ్చి కూర్చున్నా, పడుకుని విన్నా, విఘ్నాలు కల్పించినా, శ్రద్ధగా వినకపోయినా మహాపాపం చుట్టుకుంటుంది. నరకయాతనలూ నీచజన్మలూ తప్పవు. అందుకని పురాణాన్నీ పౌరాణికుణ్ణీ గౌరవిస్తూ భక్తిశ్రద్ధలతో వినాలి. పురాణప్రవక్తకు యథాశక్తిగా పండో ఫలమో ధనమో వస్త్రమో ఇవ్వాలి. అలా ఇచ్చినవారికి వైకుంఠం దక్కుతుంది. సకల పురాణాలనూ వింటే దక్కే ఫలంకన్నా ఈ దేవీభాగవతం వింటే లభించే పుణ్యఫలం నూరురెట్లు

అధికం. ఈ పుస్తకానికి అట్టవేసినా, నూతనవస్త్రం చుట్టినా దారం సమకూర్చినా అది అత్యంత పుణ్యప్రదం. నదులలో గంగ, దేవుళ్ళలో శివుడు, కావ్యాలలో రామాయణం, గ్రహాలలో సూర్యుడు, తారకలలో చంద్రుడు, ధనాలలో కీర్తి ధనం, క్షమాగుణ సంపన్నులలో భూమి, గాంభీర్యంలో సముద్రుడు, మంత్రాలలో గాయత్రి, పాపనాశకులలో శ్రీహరి-ఎలా ఉత్తమోత్తమమో అలా పురాణాలలో దేవీభాగవతమే ఉత్తమోత్తమం.

ఎలాగోలాగా శ్రమపడి తొమ్మిది రోజులూ వింటే (తొమ్మిది పర్యాయాలు వింటే) ఆ ఫలితం వర్ణనాతీతం. అతడు జీవన్ముక్తుడే. రాజభయం, శత్రుభయం, మహామారీభయం, దుర్భిక్ష భయం, రాష్ట్ర భంగభయం - ఇలాంటివి వచ్చిపడ్డప్పుడు ఈ భాగవతాన్ని చదవడం వినడం చాలా మంచిది. అన్ని భయాలూ తొలగిపోతాయి. భూతప్రేతవినాశం కోసం, రాజ్యలాభం కోసం, సంతానప్రాప్తికోసం దీన్ని తప్పక వినాలి లేదా పారాయణ చెయ్యాలి. దీనిలో కనీసం ఒక్క శ్లోకాన్నో శ్లోకభాగాన్నో విన్నా చదివినా దాని సత్ఫలితం తప్పక కనిపిస్తుంది. ఉత్తమగతి లభిస్తుంది.

**శ్రీ మద్భాగవతం యస్తు పఠేద్వా శృణుయాదపి ।**
**శ్లోకార్థం శ్లోకపాదం వా స యాతి పరమాం గతిమ్ ॥ ( 15 - 92)**

ఆదిలో మహాదేవి ఈ పురాణాన్ని అర్ధశ్లోకంతో చెప్పింది. అదే శిష్యప్రశిష్యుల ద్వారా ఇంత గ్రంథంగా విపులీకరించబడింది. గాయత్రికి సాటివచ్చే మంత్రంగానీ దేవతగానీ తపస్సుగానీ లేవంటారు. అలాంటి ఆ గాయత్రి ఈ గ్రంథంలో సరహస్యంగా ప్రతిపాదింపబడింది. ప్రతిష్ఠింపబడింది. అందుకనే మరింక ఏ మహాపురాణాలూ దేవీభాగవతంలో పదహారవకళకైనా సాటిరావనడం. ఇందులోఉన్న ధర్మప్రబోధం, మణిద్వీపవర్ణన, దేవీగీత మరింకెక్కడా లభించవు. అందుచేత దేవీభాగవతాన్ని పఠించడం వినడం అత్యంత పుణ్యప్రదాలు. భుక్తిముక్తిదాయకాలు. దీని ప్రభావాన్ని త్రిమూర్తులుకూడా పూర్తిగా వివరించి చెప్పలేరంటే అతిశయోక్తి కాదు. ఆ తల్లి పాదపద్మాల నుంచి రాలిపడిన ఒక రేణువును శిరసావహించి ఆ త్రిమూర్తులూ తమ తమ విధులను నిర్వర్తించగలుగుతున్నారు. జగదారాధ్యులు అవుతున్నారు. ఇంతకన్నా మహాదేవి మహిమకు నిదర్శనం ఏం కావాలి ! ఆ జగదంబికకు నమస్కరిస్తున్నాను. ఆ తల్లి - సుధా సముద్రంలో మణిద్వీపంలో చింతామణి గృహంలో విరాజిల్లుతూ ఉంటుంది. చిరునవ్వులు చిందిస్తూ ఉంటుంది. సన్నిధిలోనిలిచి బ్రహ్మాశాచ్యుత శక్రాది దేవతలూ సకల ఋషులూ ఉపాసిస్తూ ఉంటారు. ఆ తల్లి ఈ జగత్తుకి సమస్త శ్రేయస్సులూ కలిగించుగాక ! **(స్కాందం - మానసఖండం - అధ్యాయం - 5, శ్లోకాలు - 102)**

**బ్రహ్మేశాచ్యుత శక్రాద్యైర్మహర్షిభిరుపాసితా ।**
**జగతాం శ్రేయసే సాస్తు మణిద్వీపాధిదేవతా ॥ ( 5 - 102 )**

శౌనకాది మహామునులారా ! ఇంతటి మహిమాన్వితమైన శ్రీమద్దేవీభాగవతాన్ని వినాలి అనే కోరిక మీకు కలగడం, వినిపించే అవకాశం నాకు కలగడం - నిజంగా ఇదంతా దేవి అనుగ్రహమే. కనక ముందుగా ఆ జగన్మాతకు నమస్కరించి ఆరంభిస్తున్నాను - శ్రద్ధాభక్తులతో ఆలకించండి.

***





# ప్రథమ స్కంధము

శౌనకాది మహామునులు కలికాలదోషాలకు భయపడి బ్రహ్మదేవుని ఆజ్ఞమేరకు నైమిశారణ్యంలో తలదాచుకున్నారు. నిరంతరం యజ్ఞయాగాది క్రతువులు విధివిధానంగా నిర్వహిస్తున్నారు. మధ్యమధ్య విరామసమయాల్లో కాలక్షేపంకోసం పురాణ శ్రవణం చేస్తున్నారు. అష్టాదశపురాణాలూ రచించిన వ్యాస భగవానుడికి సాక్షాత్తు శిష్యుడైన సూతుడు ఒక్కటొక్కటిగా పురాణాలు వినిపిస్తున్నాడు. అందరూ శ్రద్ధాసక్తులతో వింటున్నారు. ఒకరోజున శౌనకుడు -

మహానుభావా ! సూతమహర్షీ ! అష్టాదశపురాణాలనూ సమగ్రంగా అధ్యయనం చేశావు. నువ్వు ధన్యుడివి. మీ గురువుగారి అనుగ్రహం వల్ల నీకు పురాణ (పంచ) లక్షణాలూ పురాణ రహస్యాలూ అన్నీ పూర్తిగా అవగతమయ్యాయి. దీనికితోడు, శ్రోతలకు తనువు పులకించేట్టు - రోమ హర్షణంగా కథ చెప్పే నేర్పు నీకు పుట్టుకతోనే లభించింది. మా అదృష్టం బాగుండి నువ్వు ఈ పుణ్యక్షేత్రానికి ఇలా దయచేశావు. మేమంతా ధన్యులం.

చెవులుండీ, పురాణాలు విననివాళ్ళు నిజంగా విధివంచితులు. షడ్రసోపేతమైన విందుతో నాలుక సంతృప్తి చెందినట్టు, నీవంటి పండితుల వాక్కుతో చెవులకు పండుగ అవుతుంది. చెవులు లేని పాములు సయితం శబ్దానికి సంబరపడతాయి. అటువంటిది చెవులుండీ పురాణాలు వినకపోతే అవి చెవులే కావు. అందుచేత మేమంతా వినాలనే కోరికతో నీ చుట్టూ చేరాము.

ఎప్పటికైనా, ఎలాగోలాగా కాలం గడపాలిగదా ! వ్యసనాలతో మూర్ఖులు కాలక్షేపం చేస్తే, శాస్త్ర చింతనలతో పండితులు కాలం గడుపుతారు.

యేన కేనాప్యుపాయేన కాలాతివాహనం స్మృతం ।
వ్యసనైరిహ మూర్ఖాణాం బుధానాం శాస్త్రచింతనైః ॥ (1-12)

శాస్త్రాలు కూడా చాలా విచిత్రంగా ఉంటాయి. వాటిలో జల్ప వితండవాదాలు అనేకం. అవి కొన్ని కొందరికి గర్వాన్ని కలిగిస్తాయి. వేదాంతశాస్త్రమైతే సాత్త్వికమే కానీ, మీమాంసాశాస్త్రం మాత్రం రాజసం. హేతువాదాలతో నిండిన న్యాయశాస్త్రం పూర్తిగా తామసం. అలాగే పురాణాలు కూడా త్రిగుణాత్మకాలని విన్నాను. వాటిలో సర్వలక్షణ సమన్వితమైన దేవీభాగవతం పంచమవేదమనీ, పుణ్యప్రదమనీ భుక్తిముక్తిదాయకమనీ నీమాటలవల్లనే తెలిసింది. ఆ పురాణాన్ని దయచేసి సవిస్తరంగా చెప్పు. నీనోట వినాలని మాకందరికీ ఎంతో కుతూహలంగా ఉంది.



ఇప్పటికి చాలా పురాణాలు చెప్పావు. విన్నాం. అయినా మాకెవ్వరికీ తృప్తి తీరలేదు. సురులు అమృతం సేవించారు. తృప్తి పొందారా ! ఇంతకీ ఏమిటట ఆ అమృతం గొప్ప ! ఎంత సేవిస్తేమాత్రం ముక్తినిస్తుందా ! అదే భాగవతామృతమైతే వెంటనే సంకటాలు తొలగిపోయి, ముక్తి లభిస్తుంది. సుధాపానంకోసమని మేమంతా ఎన్నెన్నో యజ్ఞాలు చేశాం. అయినా శాంతి లేదు. యజ్ఞఫలం స్వర్గప్రాప్తి. కొంతకాలానికి ఆ స్వర్గం నుంచి పతనం కావడం, సంసార చక్రంలో పడటం. ఇలా నిరంతరం పరిభ్రమించడమే కదా !

త్రిగుణాత్మకమైన ఈ కాలచక్రంలో పడి తిరుగుతున్న మానవులకు మోక్షం లేదు. జ్ఞాన మొక్కటే ముక్తి మార్గం. అందుచేత పరమపావనమూ, అతిగుహ్యమూ, ముక్తిదాయకమూ, ముముక్షువులకు అత్యంత ప్రియమూ అయిన దేవీభాగవతాన్ని సవిస్తరంగా మాకు వినిపించు ***(అధ్యాయం - 1, శ్లోకాలు-25)***

ఈ అభ్యర్థనకు సూతుడు ఎంతగానో సంతోషించాడు. శౌనకాది మహామునులారా ! నేను ధన్యుణ్ణి. నా భాగ్యమే భాగ్యం. వేద సమ్మితమైన భాగవతం చెప్పమని మీరు అడిగారంటే నేను పవిత్రుణ్ణి అయ్యాను. తప్పకుండా చెబుతాను. సర్వవేదాలకూ సర్వశాస్త్రాలకూ సర్వ ఆగమాలకూ సారభూతమైన దేవీ భాగవతం అతిరహస్యం, అతిగుహ్యం. అయినా మీవంటి యోగ్యులు అడిగారు కనక వివరంగా చెబుతాను. యోగులకు ముక్తిప్రదమై, బ్రహ్మాదిదేవతలకు సేవ్యమై, మునీంద్రులకు ధ్యేయమైన ఆ తల్లి పాదపద్మాల జంటకు నమస్కరించి ఇప్పుడే మొదలుపెడుతున్నాను. శ్రద్ధగా ఆలకించండి.

ఇది పురాణోత్తమం. సర్వరసాలయం. భగవతి అనే పేరుతో ప్రసిద్ధం. శక్తిః, విద్యా, పరా, సర్వజ్ఞా, భవబంధ విచ్ఛేదనిపుణా - మొదలైన నామధేయాలతో స్తుతింపబడుతూ మహామునీంద్రులకు ధ్యానంలో మాత్రమే దర్శనమిచ్చే భగవతి ఈ పురాణంలో ప్రత్యక్షంగా కనిపిస్తుంది. సకల సిద్ధులూ కలిగిస్తుంది.

సదసత్స్వరూపమైన ఈ అఖిల జగత్తునూ త్రిగుణాత్మకమైన స్వీయశక్తితో తానే సృష్టించి, రక్షించి కల్పాంతంలో ఉపసంహరించి ఒంటరిగా వినోదించే ఆ విశ్వజననిని, ఆ లోకమాతను మరొక్కసారి మనసులో స్మరిస్తున్నాను.

వేదవేత్తలైన పౌరాణికులు - బ్రహ్మదేవుడు సృష్టికర్త అనికదా చెబుతారు. ఆ బ్రహ్మదేవుడు, శేషశయ్యపై విశ్రమించే విష్ణుమూర్తికి నాభికమలం నుంచి జన్మించాడనీ, అతడి సృష్టి స్వతంత్రం కాదనీ జీవుల కర్మానుసారం జరుగుతుందనీ వారే అన్నారు. ఇంతకీ ఆ విష్ణుమూర్తికి ఆధారం ఆదిశేషుడు. ఆదిశేషుడికి ఆధారం మహాసముద్రం. అది సలిలం. రస స్వరూపం. పాత్రలేకుండా జలం నిలబడుతుందా ఎక్కడైనా ? ఆ పాత్రయే, ఆ ఆధారమే జగజ్జనని. ఆ సర్వశక్తి స్వరూపిణి పాదపద్మాలను శరణువేడుతున్నాను.



యోగనిద్రా మీలితాక్షం విష్ణుం దృష్ట్వాంబుజే స్థితః ।
అజస్తుష్టావ యాం దేవీం తా మహం శరణం వ్రజే ॥ (2-10)

విష్ణుమూర్తి యోగనిద్రలో ఉన్నప్పుడు, నాభికమలంలోని బ్రహ్మదేవుడు ఆ జగన్మాతను స్తుతించాడు. సగుణరూపిణి, నిర్గుణ రూపిణి, మాయా స్వరూపిణి, ముక్తి ప్రదాయిని ఆ తల్లిని ధ్యానించి దేవీ భాగవతం సవిస్తరంగా చెబుతున్నాను, మునులారా ! వినండి.

## ◆ పురాణ ప్రపంచం ◆

ఇది మహాపురాణం. ఉత్తమోత్తమం. మొత్తం పద్దెనిమిదివేల శ్లోకాలు. పన్నెండు స్కంధాలు. మూడు వందల పద్దెనిమిది అధ్యాయాలు. ప్రథమ స్కంధంలో ఇరవై, ద్వితీయ స్కంధంలో పన్నెండు, తృతీయ స్కంధంలో ముప్పయి, చతుర్థ స్కంధంలో ఇరవై అయిదు, పంచమ స్కంధంలో ముప్పయి అయిదు, షష్ఠ స్కంధంలో ముప్పయి ఒకటి, సప్తమ స్కంధంలో నలభై, అష్టమ స్కంధంలో ఇరవై నాలుగు, నవమ స్కంధంలో యాభై, దశమ స్కంధంలో పదమూడు, ఏకాదశ స్కంధంలో ఇరవై నాలుగు, ద్వాదశ స్కంధంలో పధ్నాలుగు అధ్యాయాలు ఉంటాయని ప్రణాళిక అంతా గ్రంథారంభంలోనే తెలియజేశాడు వ్యాసభగవానుడు.

సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణి చ ।
వంశానుచరితం చైవ పురాణం పంచలక్షణమ్ ॥ (2-18)

పురాణానికి అయిదు ప్రధాన లక్షణాలు ఉన్నాయి. సర్గం, ప్రతిసర్గం, వంశం, మన్వంతరాలు, వంశానుచరితం అనేవి పురాణంలో ఉండాలి. నిర్గుణ స్వరూపిణియైన లోకమాత జగత్సృష్టికోసం మూడు రూపాలు ధరించింది. సాత్త్వికశక్తి మహాలక్ష్మీరూపంగానూ, రాజసశక్తి మహాసరస్వతీ రూపంగానూ, తామస శక్తి మహాకాళీరూపంగానూ ఆవిర్భవించింది. కాబట్టి దీనిని సర్గము అంటారు శాస్త్రవేత్తలు. అటుపైని త్రిమూర్తుల ఉత్పత్తి జరిగింది. పాలనకోసం హరి, ఉత్పత్తికోసం బ్రహ్మ, నాశంకోసం రుద్రుడు. దీనిని ప్రతి సర్గము అంటారు. రాజులకు సంబంధించి సూర్య - చంద్రవంశాలనూ, రాక్షసులకు సంబంధించి హిరణ్యకశిపు ప్రభృతుల వంశాలనూ వివరించడమే వంశం. స్వాయంభువుడు మొదలుకొని ఆయా మనువులనూ వారి కాలాలనూ వర్ణించి చెప్పడమే మన్వంతరాలంటే. వారి వంశాల అనుక్రమాన్ని తెలియజెప్పడమే వంశానుచరితం. ఇలా పురాణాలన్నీ పంచలక్షణ యుక్తాలు. ఇవికాక వ్యాసభగవానుడు లక్షాపాతికవేల శ్లోకాలతో (సవాలక్ష) భారతం రచించాడు. దాన్ని ఇతిహాసం అంటారు. అది పంచమ వేదం.



ఇంతవరకూ చెప్పి ఎందుకనో సూతుడు ఒక్క నిమిషం ఆగాడు. అప్పుడు శౌనకుడు మళ్ళీ ఇలా ప్రశ్నించాడు -

సూతమహర్షీ ! నువ్వు సర్వజ్ఞుడివి. అందుచేత ఆ పురాణాలు ఎన్ని, ఏమేమిటి సవిస్తరంగా తెలియజెయ్యి. మేమేమో కలికాలానికి భయపడి ఈ నైమిశారణ్యంలో నివసిస్తున్నాం. కలిదోషం కలికానికైనా కనిపించని ప్రదేశం మాకు చూపించు మహానుభావా అని మేమంతా ప్రార్థిస్తే అలనాడు బ్రహ్మదేవుడు ఒక మనోమయ చక్రాన్ని సృష్టించి మాకిచ్చాడు. దొర్లించుకుంటూ దీని వెంట వెళ్ళండి. దీని నేమి ఎక్కడ శిథిలం అవుతుందో ఆ ప్రదేశం పరమపావనమని గ్రహించండి. అక్కడికి కలి ఎప్పుడూ ప్రవేశించడు. ప్రవేశించలేడు. అక్కడ మీరంతా మళ్ళీ సత్యయుగం వచ్చేంత వరకూ హాయిగా నివసించండి అని ఆజ్ఞాపించాడు.

ఆయన మాటమీద చక్రాన్ని దొర్లించుకుంటూ బయలుదేరాం. ఇక్కడికి వచ్చేసరికి దాని నేమి శీర్ణమయ్యింది. అందుకే ఇది నైమిశక్షేత్రం అయ్యింది. ఈ ప్రదేశం పరమపావనం. కలికి ప్రవేశం లేదు. అందుకని దీన్ని నివాసంగా చేసుకున్నాం. కలిభీతులైన ఈ సిద్ధులూ ఈ మునులూ అందరం కలసి ఇక్కడే ఉంటూ, పశుహింస లేని యజ్ఞాలను కేవలం పురోడాశాదులతో చేస్తూ కాలం గడుపుతున్నాం. మళ్ళీ సత్యయుగం వచ్చేంతవరకూ కాలక్షేపం చెయ్యాలిగదా ! ఇంతలోకీ మా భాగ్యంగా నువ్వు ఇక్కడికి వచ్చావు. బ్రహ్మసమ్మితమైన ఆ పురాణాన్ని సవిస్తరంగా చెప్పు. మాకు వేరే మరొక పని ఏమీ లేదు. ఏకాగ్రచిత్తంతో వింటాం. కథామాత్రంగా చెప్పేస్తే మాకు తృప్తి కలగదు. ధర్మార్థకామమోక్షాలను చాలా అందంగా వర్ణించాడుకదా వ్యాసుడు. దేవీభాగవతమంటే అది సకల గుణగణాలకూ నిలయం. జగన్మాత నాట్యంలాగా అది చిత్రవిచిత్రం. సమస్త దోష వినాశకం. అఖిలవాంఛా ప్రదాయకం. దయచేసి వివరంగా చెప్పు. ***(అధ్యాయం - 2, శ్లోకాలు - 40)***

శౌనకుడు మళ్ళీ ఇలా అభ్యర్థించేసరికి సూతుడు ఇంకా సంబరపడ్డాడు. ప్రవచనం కొనసాగించాడు.

మహామునులారా ! పురాణాలు ఎన్ని, అవి ఏవి అనికదా అడిగారు. వ్యాసుడు రచించిన మహాపురాణాలు పద్దెనిమిది. వాటిపేర్ల మొదటి అక్షరాలను గుచ్చెత్తి గుర్తుపెట్టుకోడానికి వీలుగా ఒక శ్లోకం ఉంది. మనవి చేస్తున్నాను -

మద్వయం భద్వయం చైవ బ్రత్రయం వచతుష్టయమ్ ।
అ - నా - ప - లిం - గ - కూ - స్కాని పురాణాని పృథక్ పృథక్ ॥ (3-2)



వీటిలో మత్స్యపురాణం మొదటిది - పధ్నాలుగువేల శ్లోకాలు. రెండవది మార్కండేయం - తొమ్మిదివేల శ్లోకాలు. ఇవి మద్వయం. భవిష్యపురాణం - పధ్నాలుగువేల అయిదు వందల శ్లోకాలు. భాగవతం - పద్దెనిమిదివేల శ్లోకాలు. ఇవి భద్వయం. బ్రహ్మపురాణం - పదివేల శ్లోకాలు. బ్రహ్మాండపురాణం - పన్నెండువేల ఒక్కవంద శ్లోకాలు. బ్రహ్మ వైవర్తపురాణమేమో పద్దెనిమిదివేలు. ఇవి బ్రత్రయం. వామన పురాణం - పదివేల శ్లోకాల గ్రంథం. వాయుపురాణం - ఇరవైనాలుగువేల ఆరువందల శ్లోకాలు. విష్ణుపురా ణంలో ఇరవైమూడువేల శ్లోకాలుంటాయి. వరాహపురాణం ఇరవైనాలుగువేల శ్లోకాల గ్రంథం. ఇవి వచతుష్టయం. ఇంక అగ్నిపురాణంలో పదహారువేలు, నారదపురాణంలో ఇరవై అయిదువేలు, పద్మ పురాణంలో యాభై అయిదువేలు, లింగపురాణంలో పదకొండువేలు, గరుడపురాణంలో పందొమ్మిదివేలు, కూర్మపురాణంలో పదిహేడువేలు, స్కాందపురాణంలో ఎనభైయొక్కవేలు శ్లోకాలు ఉంటాయి. ఇవే అ-నా-ప-లిం-గ-కూ-స్కాలు. ఇవి పద్దెనిమిదీ మహాపురాణాలు. వీటి పేర్లే కాకుండా వీటిలో ఉండే శ్లోకాల సంఖ్య కూడా తెలియజేశాను. విన్నారు కదా ! మరో పద్దెనిమిది ఉపపురాణాలు ఉన్నాయి. అవీ చెబుతాను, వినండి.

సనత్కుమార-నారసింహ- నారదీయ - శివ - దౌర్వాస - కాపిల - మానవ - ఔశనస - వారుణ - కాళికా - సాంబ - నంది (కృత) - సౌర - పారాశర - ఆదిత్య - మాహేశ్వర - భాగవత - వాసిష్ఠ పురాణాలను ఉపపురాణాలు అంటారు. ఇన్నీ వ్రాసి ఇంకా మహాభారతం రచించాడు వ్యాసుడు.

## ◆ వ్యాసులు ◆

మన్వంతరాలన్నింటా ద్వాపరయుగం ఉంటుంది. ప్రతిద్వాపరంలోనూ విష్ణువే వ్యాసుడుగా జన్మించి ధర్మచింతనతో యథావిధిగా పురాణాలు రచిస్తాడు. అఖండంగా ఉన్న వేదాన్ని బహుధా (నాలుగుగా) విభజిస్తాడు. ఇది లోకహితంకోరి చేసే పని. కలియుగంలో విప్రులు అల్పాయుష్కులుగా స్వల్ప బుద్ధులుగా ఉంటారని తెలిసే కలియుగం వచ్చినప్పుడల్లా పుణ్యప్రదమైన పురాణ సంహితను అందిస్తుంటాడు వ్యాసుడు. వేదశ్రవణాధికారం కొందరికి లేదు. కాబట్టి వారి హితంకోరి ఇలా పురాణాలను రచించాడు.

మహామునులారా ! ఏడవ వైవస్వతమన్వంతరంలో ఇప్పుడు ఇది ఇరవైయెన్మిదవ ద్వాపరం నడుస్తోంది. అందుకని సత్యవతీ సుతుడుగా వ్యాసుడు జన్మించాడు. ఈ ఇరవైయెనిమిదవ వ్యాసుడే నా గురువు. మహానుభావుడు. లోకైకహితుడు. ధర్మవేత్తలలో అగ్రగణ్యుడు. రేపు ఇరవై తొమ్మిదవ ద్వాపరం వస్తే ద్రౌణి - వ్యాసుడవుతాడు. ఇప్పటికి ఇరవైయేడుగురు వ్యాసులు గడిచిపోయారు. వారంతా పురాణ సంహితలు రచించినవారే.

ఈ మాటలకు మునీశ్వరులు కొందరు ఆశ్చర్యచకితులయ్యారు. గడిచిన ద్వాపరయుగాలలో పురాణకర్తలైన ఆ వ్యాసుల్ని గురించి క్లుప్తంగానైనా చెప్పమని అడిగారు.



మునిసత్తములారా ! మొదటి ద్వాపరంలో స్వయంభువుడే స్వయంగా వేదవిభజన చేశాడు. రెండవ ద్వాపరంలో ప్రజాపతి వ్యాసుడయ్యాడు. మూడవ ద్వాపరంలో ఉశనసుడు, నాల్గవ ద్వాపరంలో బృహస్పతి, అయిదులో సవిత (సూర్యుడు), ఆరులో మృత్యువు, ఏడులో మఘవుడు, ఎనిమిదిలో వసిష్ఠుడు, తొమ్మిదిలో సారస్వతుడు, పదిలో త్రిధాముడు, పదకొండులో త్రివృషుడు, పన్నెండులో భరద్వాజుడు, పదమూడులో అంతరిక్షుడు, పధ్నాలుగులో ధర్ముడు, పదిహేనులో త్రయ్యారుణి, పదహారులో ధనంజయుడు, పదిహేడులో మేధాతిథి, పద్దెనిమిదిలో వ్రతి, పంథొమ్మిదిలో అత్రి, ఇరవైలో గౌతముడు, ఇరవైయొకటిలో ఉత్తముడు - వ్యాసులయ్యారు. అటుపైన వరసగా వేనుడు, సోముడు, తృణబిందువు, బార్గవుడు, శక్తి, జాతుకర్ణ్యుడు వ్యాసులుగా కర్తవ్యం నిర్వహించారు. ఇప్పటి ఇరవైయెనిమిదవ ద్వాపరానికి కృష్ణద్వైపాయనుడు వ్యాసుడు. ఈయన చెప్పిన పురాణాలనే నేను విన్నాను.

ఈ కృష్ణద్వైపాయనుడికి శుకుడు అనే కుమారుడు ఉన్నాడు. అరణి సంభవుడు. (అరణి – యాగాగ్నిని మధించే కొయ్య పాత్ర) గొప్ప వైరాగ్యభావ సంపన్నుడు. వ్యాసుడు దేవీభాగవతం వచించి కొడుకుతో చదివించాడు. అప్పుడే వ్యాసుడి ముఖతః నేను దీన్ని విని యథాతథంగా గ్రహించాను.

కరుణాసముద్రులు మా గురువుగారు. శుకుడి సందేహాలకు సమాధానాలుగా ఈ దేవీభాగవత రహస్యాలన్నీ విడమర్చి చెప్పారు. అయోనిజుడైన ఆ బుద్ధిమంతుడితోపాటు నేనూ విని ఆయా విశేషాలు కొంత తెలుసుకోగలిగాను.

మునిపుంగవులారా ! ఈ దేవీభాగవతం ఒక కల్పవృక్షం. దీని ఫలాలను ఆస్వాదించాలనే కోరికతో, సంసార మహాసముద్రాన్ని తరించాలనే వాంఛతో ఈ ఆఖ్యానరసాలయాన్ని ప్రేమగా, శ్రద్ధగా శుకు డంతటివాడు ఆలకించాడు. అద్భుతమైన ఈ పురాణాన్ని వింటే భూలోకంలో ఎవరికైనా ఇంక కలిభయమంటూ ఏదీ ఉండదుగాక ఉండదు.

భగవతీనామాంకితమైన ఈ మనోహరపురాణాన్ని నిజంగా వినాలనే కోరికతో కాకపోయినా ఏదో ఒక వంకతో విన్నప్పటికీ చాలు ఎంతటి పాపాత్ముడైనా ఆచారదూరుడైనా పుణ్యాత్ముడవుతాడు. ఇహలోకంలో సకల భోగాలూ పొంది, పరలోకంలో యోగీశ్వరులకు మాత్రమే దక్కే సుస్థిర స్థానాన్ని గెలుచుకుంటాడు. ఇక నిరంతరం శ్రద్ధగా వినేవారి హృదయకుహరంలో ఆ నిర్గుణ స్వరూపిణి స్వయంగా తానే నిత్యనివాసం చేస్తుంది. భవసాగరాన్ని తరించడానికి నావగా వాగ్రూపంలో అందివచ్చిన ఈ పురాణాన్ని, మానవుడుగా పుట్టి వినకపోతే అంతకంటే మూఢుడు ఉంటాడా ! చెవులున్నాయికదా అని ఎప్పుడూ పరాపవాదాలనే ఇష్టంగా వింటూ, ఇలాంటి పురాణ నాదాలను పొరపాటునైనా వినకపోతే ఎవరికిట నష్టం ! అంతకంటే మందబుద్ధులుంటారా !

*( అధ్యాయం -3, శ్లోకాలు -43)*



యః ప్రాప్య కర్ణయుగలం పటు మానుషత్వే
రాగీ శృణోతి సతతం చ పరాపవాదాన్ ।
సర్వార్థదం రసనిధిం విమలం పురాణం
నష్టః కుతో న శృణుతే భువి మందబుద్ధిః ॥ (3 - 43)

## ◆ వ్యాసుడి పుత్రకాంక్ష ◆

శ్రద్ధగా ఆలకిస్తున్న శౌనకాదులకు ఒక చిన్న సందేహం కలిగింది. దాపరికం లేకుండా అడిగారు. సూతమహర్షీ! వ్యాసుడికి శుకుడనే కుమారుడు ఉన్నాడన్నావు. అతడు ఎలా జన్మించాడు ? తల్లి ఎవరు? ఎటువంటివాడు ? ఈ సంహితను ఎలా పఠించాడు ? శుకుడు అయోనిజుడు (గర్భవాసం లేకుండా జన్మించిన వాడు) అరణి సంభవుడు అనికదా అన్నావు. అది ఎలా జరిగింది ? శుకుడు మహాతపస్వి అనీ, పుట్టుకతోనే మహాయోగి అనీ విన్నాం. అతడు ఈ విపుల పురాణాన్ని ఎలా ఏ విధాన చదివాడు అనేది మా అందరి సందేహమూను. నువ్వు సౌమ్యుడవు కనక అడిగాము. దయచేసి వివరించవూ! అని అభ్యర్థించారు. అప్పుడు సూతుడు -

మునులారా ! పూర్వకాలాన వ్యాసుడు సరస్వతీ నదీతీరాన ఆశ్రమం నిర్మించుకుని తపస్సు చేసుకుంటున్నాడు. అప్పట్లో పిచ్చుకల జంట ఒకటి వ్యాసుడికి రోజూ కనిపించేది. వాటి పరస్పరానురాగం ఆశ్చర్యపరిచేది. వాటి గూడు, ఆ గూటిలో అప్పుడే గ్రుడ్డువిచ్చి జన్మించిన పిచుక పిల్ల, వ్యాసుడి మనస్సును ఆకట్టుకున్నాయి. ఇంకా తోకమొలవని పిచుక పిల్ల, దాని ఎర్రని నోరు, దానికి ఏదో తెచ్చి తినిపించాలని శ్రమపడుతున్న ఆ పిచుక దంపతులు, అది నోరు తెరిస్తే తినుబండారాన్ని నోటితో నోటికి అందిస్తున్న దృశ్యం, తమ రెక్కలతో దాన్ని సుతారంగా పొదువుతూ ముద్దులలో ముంచెత్తుతూ పులకించిపోతున్న ఆ మాతాపితల ప్రేమ చూసి వ్యాసుడు చాలా ముచ్చట పడ్డాడు.

సంతానమంటే పక్షులకే ఇంత ప్రేమ ఉంటే ఇంక మనుష్యుల సంగతి చెప్పాలా ! వివాహం చేసుకుని ఒకరినొకరు చూసుకుని సంతృప్తి చెందే దంపతులు వార్ధక్యంలో పరిచర్యకోసమైనా పుత్రుణ్ణి కోరుకుంటారు. సంపాదించి సుఖపెడతాడని ఆశిస్తారు. ఏది చేసినా చెయ్యకపోయినా చితికి నిప్పు అంటించి ఉత్తర క్రియాలన్నా చేస్తాడు గదా ! పోనీ గయలో శ్రాద్ధం పెడతాడు గదా ! సంసారంలో ఎన్ని సుఖాలు ఉన్నా కన్న కొడుకుని తనివితీరా కౌగిలించుకోవడం, లాలించడం అనేవి ఉత్తమోత్తమ సుఖాలు.

అపుత్రస్య గతిర్నాస్తి అన్నారు. ఉత్తమలోకాలను సాధించిపెట్టేది పుత్రుడే. పుత్రవంతుడికే స్వర్గమని శాస్త్రాలు చెబుతున్నాయి. అది ప్రత్యక్ష విషయమే. కొడుకులు లేనివాడు మరణకాలంలో మరీ విచారిస్తాడు. ఇల్లూ వాకిలీ నగానట్రా ఇంత సంపాదించాను, ఇదంతా ఎవడు తన్నుకుపోతాడో గదా అని మరింత దిగులు పడతాడు. దుఃఖిస్తాడు. మనశ్శాంతిని కోల్పోతాడు. భగవన్నామం జపిస్తూ హాయిగా ప్రాణాలు వదలలేడు. అందుచేత అతడికి దుర్గతులే తప్ప ఉత్తమగతులు ఉండవు.



ఈ ఆలోచనలతో వ్యాసుడి మనస్సు వికలమయ్యింది. వేడిగా నిట్టూర్చాడు. కాసేపటికి తేరుకుని ఒక నిశ్చయానికి వచ్చాడు. పుత్రప్రాప్తికోసం తపస్సు చెయ్యాలని గట్టిగా సంకల్పించుకున్నాడు. ఆశ్రమం వదిలి మేరుపర్వతం చేరుకున్నాడు.

ఏ దేవుడు నాకోరిక తీరుస్తాడు ? విష్ణువా ? రుద్రుడా ? ఇంద్రుడా ? బ్రహ్మదేవుడా ? సూర్యుడా ? వినాయకుడా ? కార్తికేయుడా ? దిక్పాలకులా ? ఎవరు ? - వ్యాసుడు నిశ్చయించుకోలేకపోతున్నాడు. అంతలోకీ - అనుకోకుండా నారదమహర్షి అటువైపు వచ్చాడు. వీణ మీటుకుంటూ వచ్చాడు. వ్యాసుడు భక్తితో అతిథి మర్యాదలు చేశాడు. కుశల ప్రశ్నలు అయ్యాయి. వ్యాసుడి ముఖంలో కనిపిస్తున్న ఆందోళనను నారదుడు గమనించాడు. కారణమేమిటని అడిగాడు. వ్యాసుడు తన మనస్సులో ఉన్నది చెప్పాడు. ఏ దేవుణ్ణి ప్రార్థించాలో తేల్చుకోలేకుండా ఉన్నాను, సలహా చెప్పమన్నాడు.

వ్యాసమహర్షీ ! వెనకటికి ఒకనాడు ఇదే ప్రశ్నను మా తండ్రి (బ్రహ్మదేవుడు) విష్ణుమూర్తిని అడిగాడుట. విష్ణుమూర్తి ఎప్పుడూ ధ్యానంలోనే ఉండటాన్ని చూసి బ్రహ్మదేవుడు ఆశ్చర్యపోయి ఇలా అడిగాడు -

దేవదేవా ! జగత్పతీ ! త్రికాలజ్ఞా ! నువ్వు దేనిని ధ్యానిస్తున్నావు ? ఈ తపస్సు ఎందుకోసం ? సర్వజగత్పతివికదా ! నువ్వు తపస్సు చెయ్యడమేమిటి ! చాలా ఆశ్చర్యంగా ఉంది. నీ నాభికమలం నుంచి పుట్టిన నేను సృష్టికర్తనయ్యానే. నీకంటే అధికుడెవడు ? నువ్వే కర్తవు, నువ్వే హర్తవు. నువ్వే కారణం, నువ్వే కార్యం. నీ ఇచ్ఛామాత్రంచేత ఈ జగత్తును నేను సృష్టిస్తున్నాను. కాలాంతరంలో నీ ఆజ్ఞమేరకు శివుడు సంహరిస్తున్నాడు. సూర్యచంద్రులూ అష్టదిక్పాలకులూ నీమాట ప్రకారం విధులు నిర్వహిస్తున్నారు. అటువంటి నువ్వు ఏ దేవుణ్ణి ధ్యానిస్తున్నావు ? ఇది నాకు తెమలని సందేహంగా ఉంది. పుత్రుణ్ణి మాత్రమే కాదు నీకు భక్తుణ్ణి నేను. దయచేసి సమాధానం చెప్పు. మహాత్ములకు గోప్యం ఉండదంటారు గదా ! (మహతాం నైవ గోప్యం హి ప్రాయః కించిదితి స్మృతిః - 43)

సృష్టికర్త సందేహాన్ని తీర్చడం తన కర్తవ్యం అనుకున్నాడు విష్ణుమూర్తి. చిద్విలాసంగా చిరునవ్వులు చిందిస్తూ కొడుకుకి సమాధానం చెప్పాడు.

నాయనా, విరించీ ! శ్రద్ధగా విను. నా మనస్సులో ఉన్నది చెబుతున్నాను. నువ్వూ నేనూ శివుడూ సృష్టి - స్థితి - లయ కారకులమని ప్రపంచమంతా అనుకుంటోంది. కానీ ఈ విధులను మనతో నిర్వర్తింపజేస్తున్నది (ఆదిపరా) శక్తి అని వేదవేత్తలకు మాత్రమే తెలుసు. నీలో ఉన్నది రాజసశక్తి. అదే నీతో



జగత్సృష్టి చేయిస్తోంది. నాలో ఉన్నది సాత్త్విక శక్తి. జగత్పాలన చేయిస్తోంది. రుద్రుడిలో ఉన్నది తామసశక్తి. సంహారం చేయిస్తోంది. అది లేనివేళ నువ్వు సృష్టించలేవు, నేను పాలించలేను, శివుడు సంహరించలేడు. మనం ముగ్గురమూ శక్తి అధీనంలోనే ఉన్నాం. నేను పరతంత్రుణ్ణి. ఈ శేషశయ్యపై నిద్రిస్తూంటాను. సమయం వచ్చినప్పుడు లేస్తూంటాను. తపస్సు చేస్తూంటాను. అంతా శక్తి అభీష్టం. ఒకప్పుడు లక్ష్మీదేవితో సుఖంగా విహరిస్తూ ఉంటాను. మరొకప్పుడు రాక్షసులతో ఘోరంగా యుద్ధం చేస్తూ ఉంటాను. సర్వలోక భయంకరమైన ఆ యుద్ధాలు కొన్ని దారుణాలు సుమా ! నీకు గుర్తుందా ? ప్రళయ మహాసముద్రంలో అయిదువేల సంవత్సరాలపాటు మధుకైటభులతో బాహాబాహి పోరాడాను. ఆ యుద్ధం నీ కళ్ళ ఎదుట జరిగిందే కదా ! మహాదేవి అనుగ్రహంవల్ల వాళ్లను సంహరించగలిగాను. ఇప్పుడు ఇలా నన్ను అడుగుతున్నావంటే, అప్పుడు తెలుసుకోలేకపోయావన్నమాట. పరాత్పరమైన కారణం ఆ శక్తి స్వరూపమే. నా అవతారాలకన్నింటికీ అదే కారణం. నా ప్రమేయం ఏమీ లేదు. పశుజాతిలో జన్మించాలని ఎవడైనా కోరుకుంటాడా చెప్పు ! మత్స్యవరాహాదిరూపాల్లో నేను జన్మించలేదూ ! లక్ష్మీదేవితో విహారాన్ని వదులుకోలేదూ! చల్లని మెత్తని శేషశయ్యను వదులుకొని పక్షిమూపున కూర్చుని యుద్ధాలు చేశాను.

చతుర్ముఖా ! మరిచిపోయావా ! ఒకప్పుడు వింటినారికి తెగి నా శిరస్సు ఎటో ఎగిరిపడింది. అప్పుడు నువ్వే కదా గుర్రపు తల తెచ్చి శిల్పివరుడితో కలిసి అతికించావు. అందరూ హయగ్రీవు డన్నారు.

భేషజాలెందుకు. నన్ను నేను ఎరుగుదునుగదా ! స్వతంత్రుణ్ణి కాదు. శక్తి పరాధీనుణ్ణి. ఆ శక్తినే నిరంతరం ధ్యానిస్తూ ఉంటాను. ఇంతకన్నా నాకు తెలిసింది లేదు - అని విష్ణుమూర్తి సమాధానం ముగించాడుట.

వ్యాసమహర్షీ! మా తండ్రి బ్రహ్మదేవుడు ఈ విషయాన్ని ఇలా నాకు తెలియజేశాడు. అందుచేత నువ్వుకూడా నీ హృదయపద్మంలో ఆ దేవీ పాదపద్మాలను ధ్యానించు. నీ కోరిక నెరవేరుతుంది - అని నారదుడు సలహా చెప్పేసరికి వ్యాసుడు కుదుటపడ్డాడు. మేరుపర్వత శిఖరంమీద నిశ్చలంగా తపస్సుకి కూర్చున్నాడు. ***(అధ్యాయం - 4, శ్లోకాలు - 65)***

సూతుడు చెప్పిన ఈ వ్యాస - నారద సంభాషణను శ్రద్ధగా విన్న మునులకు మరో సందేహం వచ్చింది. సర్వ కారణకారణుడూ జగన్నాథుడూ అయిన విష్ణుమూర్తికి శిరస్సు తెగిపడటం ఏమిటి, గుర్రపు తలను తెచ్చి అతకడం ఏమిటి, హయగ్రీవుడు కావడం ఏమిటి - ఇదంతా చాలా విడ్డూరంగా ఉంది, వివరంగా చెప్పమని ప్రార్థించారు. సూతుడు అందుకున్నాడు -



## ◆ హయగ్రీవ వృత్తాంతం ◆

మహామునులారా ! సావధానంగా వినండి. పరమతేజస్వి, దేవదేవుడు అయిన విష్ణుమూర్తి జీవితంలో జరిగిన ఒక అపూర్వ సంఘటన చెబుతున్నాను. ఒకానొకప్పుడు జనార్దనుడు పదివేల సంవత్సరాలపాటు రాక్షసులతో భయంకరంగా మహాయుద్ధం చేసిచేసి బాగా అలసిపోయాడు. ఎక్కు పెట్టి ఉన్న ధనుస్సును అలాగే ఒక సమతల ప్రదేశంలో నేలకు ఆన్చి, పైకొనకు గడ్డం ఆన్చి, శరీరభారమంతా ధనుస్సుపై మోపి, అలా నిలబడే విశ్రమించాడు. అలసటో దైవయోగమో చటుక్కున నిద్ర పట్టేసింది. గాఢనిద్ర. చాలాకాలం గడిచింది.

అంతలోకీ - ఏదో యజ్ఞం చెయ్యాలని తలపెట్టిన దేవతలు బ్రహ్మయూ శివుడూ ఇంద్రుడూ విష్ణులోకానికి వెళ్ళారు. యజ్ఞప్రభువుకదా విష్ణుమూర్తి, ఇది దేవకార్యార్థం చేస్తున్న యజ్ఞమాయె. అందుచేత జగన్నాథుడి అనుమతి తీసుకుని ప్రారంభిద్దాం అని వారి ఆకాంక్ష. తీరా వెడితే, విష్ణులోకంలో విష్ణుమూర్తి కనపడలేదు. దివ్యదృష్టితో చూశారు. యుద్ధం ముగిసి నిశ్శబ్దంగా ఉన్న రణరంగంలో ధనుస్సు మీద నిలబడి నిద్రపోతున్న కేశవుడు కనిపించాడు. అంతే, అందరూ ఒక్క ఉదుటున అక్కడికి చేరుకున్నారు. అలికిడి అయినా స్వామి లేవలేదు. నిద్రలేపడం ఎలాగ, ఉపాయం ఆలోచించండి అన్నాడు దేవేంద్రుడు. నిద్రాభంగం చెయ్యకూడదు. మహాపాపం. అలాగని ఈ యజ్ఞాన్ని ఆపనూలేము - అంటూ సంశయంలో పడ్డాడు శంకరుడు.

బ్రహ్మదేవుడికి ఒక ఉపాయం తట్టింది. ఒక వమ్రిని (చెద పురుగు) సృష్టించాడు. వింటినారిని భక్షించమన్నాడు. అప్పుడు ధనుస్సు జారిపడుతుంది, దేవదేవుడు నిద్ర లేస్తాడు, దేవకార్యం నెరవేరుతుంది అని పథకం చెప్పాడు. అందరూ అంగీకరించారు. కానీ ఆ వమ్రి ఒక (ధర్మ) సందేహం వెలిబుచ్చింది.

కమలసంభవా ! జగద్గురువైన రమాపతికి నిద్రాభంగం చెయ్యమంటావా ? ఎలా చెయ్యను! నిద్రాభంగం, కథాభంగం, దాంపత్యభేదనం, శిశుమాతృవిభేదనం (తల్లీబిడ్డలను విడదీయడం) ఇవి బ్రహ్మహత్యతో సమానమైన మహాపాపాలు గదా ! పోనీ, ఇంత పాపానికీ ఒడిగడితే నాకు ఒరిగేది ఏమిటి? వింటినారిని తింటే నాకు దక్కే ఫలం ఏమిటి ? సర్వపాపాలకూ స్వార్థమే కదా మూలం. భక్షణం నా స్వార్థమే. ఫలం మాట ఏమిటి ?

వమ్రి ప్రశ్నకు బ్రహ్మదేవుడే సమాధానం చెప్పాడు. వమ్రీ ! నీకు యజ్ఞంలో భాగం కల్పిస్తాము. హోమకుండాలలో హవిస్సులు వేస్తేటప్పుడు అటూఇటూ చెదిరిపడే భాగాలు ఇకనుంచీ నీవే. పద త్వరగా విష్ణుమూర్తిని నిద్రలేపు. దేవకార్యం నెరవేర్చు - అని ఒప్పించాడు.



ప్రమి వెళ్ళింది. నేలపై ఆని ఉన్న ధనురగ్రం దగ్గర నారిని చటుక్కున కొరికింది. ఒక్కపెట్టున ధనుస్సు ఎగిసిపడింది. భీకరశబ్దం భూ నభోంతరాళాలలో ప్రతిధ్వనించింది. దేవతలంతా భయపడ్డారు. బ్రహ్మాండం సంక్షోభించింది. భూమి కంపించింది. సముద్రాలు ఘూర్ణిల్లాయి. తిమితిమింగిలాలకు వణుకు పుట్టింది. ఝంఝూ మారుతాలు వీచాయి. పర్వతాలు క్రక్కదిలాయి. అమంగళసూచకంగా ఉల్కాపాతాలూ మహోత్పాతాలూ జరిగాయి. హఠాత్తుగా సూర్యుడు అస్తమించాడు. చీకట్లు దట్టంగా వ్యాపించాయి. ఏమి జరుగుతోందో, ఏమి జరుగుతుందో తెలియక దేవతలంతా కళవళపడుతున్నారు.

తాపసులారా ! ధనుస్సు పైకొనకు ఆన్చి ఉన్న శిరస్సు, దేవదేవుడి శిరస్సు, కుండలమండితమైన శిరస్సు - త్రుటిలో తెగి, ఎటో ఎగిరి, ఎక్కడో పడింది.

కొంతసేపటికి చీకట్లు విడిపోయాయి. బీభత్సం శాంతించింది. శిరస్సు లేని మొండెం కనిపించింది. దేవతలు బావురుమన్నారు. భయపడ్డారు. నిశ్చేష్టులయ్యారు.

జగన్నాయకా ! నువ్వు దేవాదిదేవుడవు. సనాతనుడవు. ఏమిటి ఈ దారుణం ? ఏమిటి ఈ మాయ ? నీ శిరస్సుని ఎవరు ఖండించారు ? ఏమైపోయింది. నువ్వు అచ్ఛేద్యుడవే, అభేద్యుడవే, అదాహ్యుడవే (అగ్నికి కాలనివాడవు), నువ్వే ఇలా అయిపోతే మరింక దేవతలలో మిగిలేది ఎవడు ! అంతా మరణిస్తారు. నీపట్ల మాకున్న ప్రేమ, గౌరవం, ఆదరం ఏమయిపోయాయో, స్వార్థం ఆవరించి నిన్ను పోగొట్టుకున్నాము. ఏడుస్తున్నాం. మేము తలపెట్టిన యజ్ఞానికి ఇది యక్షులో రాక్షసులో కల్పించిన విఘ్నం కానేకాదు. మాకు మేమే చేసుకున్నాం. స్వయంకృతం. ఎవరిని నిందిస్తాం ! అందరం పరాధీనులమే. ఏమి చేస్తాం ? ఎక్కడికి పోతాం ? ఎంత మూఢులం ! మాకు ఇంక రక్షకుడెవరు ?

ఇది సాత్త్వికమాయ అందామా ? రాజసమో తామసమో అందామా ? అన్ని మాయలకూ అధిపతివి. జగద్గురువువి. నీ శిరస్సే ఎగిరిపోయింది అంటే ఏమనాలి !

ఇలా దిక్కుతోచక డీలాపడి విలపిస్తున్నారు బ్రహ్మ శివుడు మొదలైన దేవతలంతా. పరిస్థితి గమనించాడు బృహస్పతి. దేవగురువు కదా ! పైగా వేదాంతం వంటబట్టినవాడు. నెమ్మదిగా దేవతలను ఓదారుస్తూ ప్రసంగించాడు -

మహానుభావులారా ! ధైర్యం తెచ్చుకోండి. ఎంత దుఃఖించి ఏమి లాభం ? రవ్వంత తేరుకోండి. దేవతలే ఇంత బేంబేలుపడిపోతే ఎలాగ ! ఉపాయం ఆలోచించండి. బుద్ధికి పని చెప్పండి. దైవ బలమూ పురుషకారమూ రెండూ సమానమే. ఇప్పటి కర్తవ్యం ఉపాయమే. ఒక్కొక్కప్పుడు కాదు, అన్ని వేళలా అన్ని విధాలా దైవం కంటే అదే (పురుషకారమే, ఉపాయమే) ఫలిస్తుంది.



దైవం పురుషకారశ్చ దేవేశ సదృశావుభౌ !
ఉపాయశ్చ విధాతవ్యో దైవాత్ఫలతి సర్వధా ॥ (5 - 41)

బృహస్పతి ఇలా అనేసరికి ఇంద్రుడికి ఉక్రోషం వచ్చింది. దేవగురూ ! ఎందుకు పచ్చిస పౌరుషమయ్యా ? అది వట్టి అనర్థకం. దైవమే గొప్పది. దాని శక్తికి తిరుగులేదు. లేకపోతే ఏమిటి ఈ దారుణం. దేవతలూ దేవతానాయకులూ అందరం కళ్ళు అప్పగించి చూస్తూనే ఉన్నాం, విష్ణుమూర్తి శిరస్సు ఎగిరిపోయింది.

అప్పటికి బ్రహ్మదేవుడు తేరుకున్నాడు. వేదాంత ధోరణిలో ప్రసంగించాడు. దేవేంద్రా ! శుభం కానీ అశుభంకానీ కాలం తెచ్చిపెట్టిన దాన్ని అనుభవించవలసిందే. దైవఘటనను తప్పించుకోవడం ఎవరివల్లా కాదు. దేహం ధరించాక సుఖదుఃఖాలు తప్పవు. నా సంగతే చూడు. ఒకప్పుడు ఈ శివుడు నా శిరస్సును ఖండించాడు గదా ! ఈ శివుడికి శాపవశంవల్ల లింగపాతం జరిగింది కదా ! అలాగే ఇప్పుడు హరిశిరస్సు ఏ సముద్రంలోనో పడిపోయింది. అంతా కాలమహిమ. నీ విషయమూ ఇంతేగా. సాక్షాత్తు దేవేంద్రుడివి. శచీపతివి. మరి నీకు శరీరమంతటా పొడలు రాలేదూ ! స్వర్ణ సింహాసనంనుంచి ఎన్నిసార్లు భ్రష్టుడివి కాలేదు ! అక్కడా ఇక్కడా తలదాచుకున్నావు కాదూ ! ఎంతటివాడికైనా కష్టాలు రాకతప్పదు, అనుభవించకా తప్పదు, ఎవ్వడూ తప్పించుకోలేడు. అందుచేత అతిగా దుఃఖించక ఉపాయం ఆలోచించండి. సనాతని అయిన ఆ మహామాయను, మహావిద్యను, మహాదేవిని ధ్యానించండి. ఆ పరాశక్తి ఆ నిర్గుణ ఆ ప్రకృతి మనకు దారి చూపుతుంది. ఆవిడ బ్రహ్మవిద్య. జగద్ధాత్రి (పోషకురాలు, దాది). సర్వలోకజనని. ఈ ముల్లోకాలలో చరాచరజగత్తు అంతటా ఆమె వ్యాపించి ఉంది.

చింతయంతు మహామాయాం విద్యాం దేవీం సనాతనీమ్ ।
సా విధాస్యతి నః కార్యం నిర్గుణ ప్రకృతిః పరా ॥ (5-48)

బ్రహ్మవిద్యాం జగద్ధాత్రీం సర్వేషాం జననీం తథా ।
యయా సర్వమిదం వ్యాప్తం త్రైలోక్యం సచరాచరమ్ ॥ (5-49)

ఈ ఉపదేశానికి దేవతలంతా సమ్మతించారు. దేవీస్తవం ఆరంభించారు. బ్రహ్మదేవుడి నాలుగు ముఖాలనుంచీ వేదాలు మాతృసూక్తం ఆలపించాయి.

నమో దేవి మహామాయే విశ్వోత్పత్తికరే శివే ।
నిర్గుణే సర్వభూతేశి మాతః శంకరకామదే ॥ (5-53)



హే దేవీ ! మహామాయా ! నమోనమః. నువ్వు విశ్వోత్పత్తి కారణానివి. శుభప్రదవు. నిర్గుణవు. సర్వభూతేశ్వరివి. జగన్మాతవు. శంకరు డంతటివాడికి కోరికలు తీర్చినదానవు. ప్రాణికోటికంతటికీ ప్రాణం నువ్వే. జీవకోటికంతటికీ ఆధారభూమివి నువ్వే. తెలివి, కలిమి, వెలుగు, ఓరిమి, శాంతి, శ్రద్ధ, మేధ, ధైర్యమూ, స్మృతి - అన్నీ నువ్వే. ఉద్గీథంలో అర్ధమాత్రవు - నువ్వే. గాయత్రివి నువ్వే. జయ, విజయ, ధాత్రి, లజ్జ, కీర్తి, స్పృహ, దయ - అన్నీ నువ్వే. ముల్లోకాలనూ సంవిధానపరచగల్గిన దయామయివి. సర్వజననివి. లోకహితకారిణివి. వరేణ్యవు. వాగ్బీజవు. భవబంధవినాశినివి. నమోస్తు దేవీ ! నమోనమః. త్రిమూర్తులూ అష్టదిక్పాలకులూ - అందరూ నీ సృష్టి. స్థావర జంగమ జగత్తులో నువ్వే ముఖ్యాతిముఖ్యవు. సకల భువనాలనూ తయారు చెయ్యాలి అని నీకు అనిపించినపుడు త్రిమూర్తులనూ సృష్టిస్తూ ఉంటావు. వారితో సృష్టి స్థితి లయాలను జరిపిస్తూ ఉంటావు. నీకుమాత్రం ఈ సంసార స్పర్శ రవ్వంతయినా ఉండదు. నీ రూపవిభవాన్నిగానీ నీ నామ సంఖ్యనుగానీ తెలుసుకున్నవాడూ, తెలియజెప్పగలవాడూ ఈ ముల్లోకాలలో ఒక్కడూ లేడు. మామూలుగా చిన్న నీటి గుంటనే దాటలేనివాడు. మహాసముద్రాన్ని (పారావారాన్ని) ఈదుతాడా !

**న తే రూపం వేత్తుం సకలభువనే కోఽపి నిపుణః**
**న నామ్నాం సంఖ్యా తే కథితుమిహ యోగ్యోఽస్తి పురుషః ।**
**యదల్పం కీలాలం కలయితు మశక్తః స తు నరః**
**కథం పారావారాకలనచతురః స్యాద్భృతమతిః ॥ (5-59)**

హే ! జగజ్జననీ ! మానవులలోనే కాదు దేవతల్లో కూడా నీ అనంతవిభవం తెలిసినవారు ఒక్కరూ లేరు. నువ్వు అద్వితీయవు. ఒంటిచేతితో ఈ సకల మిథ్యా విశ్వాన్నీ సృష్టిస్తున్నావు. దీనికి వేదవాక్కులే ప్రమాణం. ఇంత సృష్టి చేసి, నువ్వు నిరీహంగా ఉంటావు. నీ చరిత్ర - చిత్రవిచిత్రం.

అమ్మా ! విష్ణుమూర్తి శిరస్సు తెగిపడిందని నీకు తెలియదా ? తెలిసీ ఈ తాత్సారం ఏమిటి తల్లీ! అతడు నీ పాదసేవకుడు గదా. మహాపాపం ఏమైనా చేశాడా ? అది నీ పాదసేవకంటే బలీయం అయ్యిందా! లేకపోతే, కన్న తల్లివి ఇంత ఉపేక్షిస్తావా ! దేవతలకు ఎంత విషమ పరిస్థితి దాపురించింది. విష్ణుమూర్తి శిరస్సు ఎగిరిపోవడం ఏమిటి ! ఎంత ఆశ్చర్యం ! బహుశ సకలదేవతలూ చేసిన దోషాలు విష్ణుమూర్తిని కొట్టి ఉంటాయి. అందరి పాపాలనూ అతడి నెత్తిన పెట్టిఉంటావు. లేదా మధుకైటభులతో వేల సంవత్సరాలు సాగిన యుద్ధంలో నా అంతట నేనే జయించానని విష్ణుమూర్తి ఏమైనా గర్వించాడేమో! అందుకు శిక్ష విధించావా జననీ ! నీ భావం ఏమిటో అంతుపట్టడంలేదు. ఒకవేళ సమరంలో ఓడిపోయిన (మధుకైటభ) రాక్షసులు తీవ్రంగా తపస్సు చేసి నిన్ను మెప్పించి ఇటువంటి వరమేదైనా కోరారా ?



అదీకాకపోతే, క్షీర సముద్రరాజ తనయ లక్ష్మీదేవిమీద నీకు కోపం వచ్చిందా ? భర్తృహీనను చేసి వినోదిస్తున్నావా ? అమ్మా ! నీ అంశతో జన్మించాడు విష్ణుమూర్తి. అతడు ఏవైనా అపరాధాలు చేసి ఉంటే క్షమించడమే సమంజసం. అతణ్ణి త్వరగా జీవింపజెయ్యి. మమ్మల్ని ఆనందింపజెయ్యి.

ఈ దేవతలంతా నిరంతరం నీకు మ్రొక్కుతూనే ఉన్నారు. నీకు పరమభక్తులు. నీ ఆజ్ఞలనూ పనులనూ నెరవేర్చడంలో అతిముఖ్యులు. సమర్థులు. ఇప్పుడు ఇలా శోకార్ణవంలో మునిగిపోయారు. త్వరగా వీళ్ళని తరింపజెయ్యి. విష్ణుమూర్తిని బ్రతికించు. అతడి శిరస్సు ఎక్కడ పడుందో తెలీదు. నీవు తప్ప మరొక దిక్కు లేదు. మరొక ఉపాయం లేదు. అమృతంలాగా జగత్తుకి నీవే జీవనప్రదాత్రివి.

వేదాలు స్వయంగా చేసిన ఈ ప్రస్తుతికి మహేశ్వరి ప్రసన్నురాలు అయ్యిందట. కనిపించకుండా ఆకాశవాణిని వినిపించింది. చెవులకు ఇంపైన శబ్దాలతో ఆనందకరంగా శుభప్రదంగా మాట్లాడిందట.

దేవతలారా ! చింతించకండి. వేదస్తుతులతో నేను సంతుష్టి చెందాను. సంతోషపడ్డాను. ఈ స్తుతిని ఇటుపైని ఎవరు చేసినా చదివినా విన్నా వారి కోరికలన్నీ తీరతాయి. వేదాలు చేసిన స్తోత్రమంటే వేదతుల్యమే కదా ! సరే. విష్ణుమూర్తి శిరస్సు అలా అయిపోడానికి కారణం ఉంది. ఈ ప్రపంచంలో అకారణంగా ఏ పనీ జరగదు.

ఈ విష్ణుమూర్తి ఒకరోజున తన ప్రియభార్య లక్ష్మీదేవి సుందరవదనాన్ని చూసి అదోలా నవ్వాడు. ఎందుకబ్బా అనుకొంది లక్ష్మీదేవి. నా ముఖం వికృతంగా కనిపించిందా ? లేకపోతే ఉత్తినే ఎందుకిలా నవ్వుతాడు. కాదులే, ఎవతెనో నాకు సవతిని చేసి ఉంటాడు. అందుకే ఈ వంకరనవ్వు అని ఆమె ఒక నిర్ణయానికి వచ్చేసింది. మనసులో కోపం భగ్గుమంది. తామసీశక్తి ఆమెలో ప్రవేశించింది. ఇది భవిష్యత్తులో దేవకార్యంకోసమే. పట్టరాని ఆ కోపంలో భర్తను శపించింది. నీ శిరస్సు తెగిపడిపోవుగాక అనేసింది. ఆ క్షణాన కాలయోగం అటువంటిది. తన సుఖాన్నే మరిచిపోయింది. వైధవ్యం కన్నా సపత్నీదుఃఖం ఎక్కువ అనుకొంది. స్త్రీ స్వభావం అలాంటిది గదా ! ఆ శాపం ఇప్పుడు కార్యరూపం ధరించింది. శిరస్సువెళ్ళి ఉప్పు సముద్రంలో పడిపోయింది. అయినా ఫరవాలేదు. ఇప్పుడే శౌరిని బ్రతికిస్తాను.

సురసత్తములారా ! మీరు తలపెట్టిన మహాకార్యం నెరవేరుతుంది. సందేహం లేదు. ఈ సంఘటనకు మరొక చిన్న కారణం కూడా ఉంది. అదీ చెబుతాను. వినండి. ఒకప్పుడు హయగ్రీవుడనే రాక్షసమహావీరుడు సరస్వతీనదీ తీరంలో పరమదారుణంగా తపస్సు చేశాడు. మాయాబీజాత్మకమైన ఏకాక్షరమైన (హ్రీం) నా మంత్రాన్ని ఘోరనిష్ఠతో జపించాడు. అప్పుడు తామసరూపంతో దర్శనం అనుగ్రహించాను. ఏ రూపాన్ని ధ్యానించాడో అదే రూపంలో సింహవాహనంపై కనిపించాను. వరం కోరుకోమన్నాను. నా రూపాన్ని చూసి అతడి కన్నులు ప్రేమతో విప్పారాయి. నమస్కరించి ప్రదక్షిణం చేశాడు. ఆనంద బాష్పాలలో దొప్పదోగుతూ అద్భుతంగా స్తుతించాడు.



నమో దేవ్యై మహామాయే సృష్టిస్థిత్యంతకారిణి ।
భక్తానుగ్రహచతురే కామదే మోక్షదే శివే ॥ (5-94)

హే జగదీశ్వరీ ! పంచభూతాలూ నువ్వే. జ్ఞానేంద్రియాలూ కర్మేంద్రియాలూ అన్నీ నువ్వే - అంటూ స్తుతించాడు. నాకు మరీ సంతోషం కలిగింది. హయగ్రీవా! నీ తపస్సుకీ నీ స్తోత్రానికీ సంతసించాను. నీ కోరిక ఏమిటో చెప్పు - అన్నాను.

మాతా ! నాకు మరణం లేకుండా వరం ప్రసాదించు. నేను యోగిగా సురాసురులకు అజేయుడుగా అమరుడుగా ఉండిపోవాలి అనుగ్రహించు.

హయవదనా ! ఇది అసంభవం. పుట్టినవాడు గిట్టక తప్పదు. గిట్టినవాడు తిరిగి పుట్టకా తప్పదు. ఇది లోకంలో స్థిరపడిన మర్యాద. దీనికి భిన్నంగా నువ్వు అమరుడవు ఎలా అవుతావు. కుదరదు.

జాతస్యహి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మ మృతస్య చ ।
మర్యాదా చేదృశీ లోకే భవేశ్చ కథమన్యథా ॥ (5 - 98)

కాబట్టి, రాక్షసోత్తమా ! మరణం తప్పదు అనే మాటను నిశ్చయంగా మనసులో పెట్టుకుని, బాగా ఆలోచించి, నీ ఇష్టం, ఏ వరమైనా కోరుకో.

సరే అయితే, జగదంబికా ! హయగ్రీవుడి చేతిలో తప్ప మరింక ఎవ్వరిచేతిలోనూ నాకు మృత్యువు ఉండకూడదు. ఈ వరం ప్రసాదించు.

రాక్షస మహావీరా ! తథాస్తు. ఇంక ఇంటికి వెళ్ళు. సుఖంగా రాజ్యం పరిపాలించుకో. హయగ్రీవుడి చేతిలో తప్ప మరింక ఎవ్వరిచేతిలోనూ నీకు చావులేదు.

ఇలా వరం ఇచ్చిన నేను అంతర్ధానం చెందాను. ఆ హయవదన రాక్షసుడు పట్టరాని ఆనందంతో ఇంటికి వెళ్ళి, ఇక అక్కడినుంచి వేదాలనూ వేదవిదులనూ మునులనూ దారుణంగా హింసించడం మొదలుపెట్టాడు. ఆ దుష్టుణ్ణి సంహరించగలవాడు ఈ భువనత్రయంలో లేడు.

అందుచేత, ఓ దేవతలారా ! ఒక అందమైన గుర్రపు తలను తీసుకురండి. దాన్ని విష్ణుమూర్తి మొండేనికి దేవశిల్పి ( త్వష్ట) నేర్పుగా అతుకుతాడు. అప్పుడు ఈ హయగ్రీవ భగవంతుడు ఆ రాక్షసుణ్ణి సంహరిస్తాడు. ఇది దేవకార్యం.



అశరీరవాణిగా జగన్మాతచేసిన ఈ ఉపదేశాన్ని దేవతలంతా విన్నారు. తేరుకున్నారు. దేవశిల్పిని వేడుకున్నారు. అతడు దగ్గరలో ఉన్న గుర్రపు తలను వెంటనే ఖడ్గంతో ఖండించాడు. ఆలస్యం లేకుండా విష్ణుమూర్తి శరీరానికి కలిపాడు. హయగ్రీవ భగవంతుడు ఆవిర్భవించాడు. ఇది మహామాయా ప్రసాదం. అటుపైని కొంతకాలానికి ఆ రాక్షసుణ్ణి మట్టుపెట్టాడు. *(అధ్యాయం - 5, శ్లోకాలు - 112)*

సూతుడు చెప్పిన ఈ హయగ్రీవ వృత్తాంతాన్ని శ్రద్ధగా విన్న శౌనకాది మహామునులకు కుతూహలం మరింత పెరిగింది. మహాసముద్రంలో మధుకైటభులతో శౌరి జరిపిన అయిదువేల సంవత్సరాల యుద్ధాన్ని గురించి తెలుసుకోవాలనుకున్నారు. సవినయంగా అడిగారు. అసలు ఆ దానవులిద్దరూ ప్రళయ సముద్రంలో ఎందుకు జన్మించారు ? దేవతలకు కూడా దుర్జయులు అన్నారు. వారిని విష్ణుమూర్తి ఎలా సంహరించాడు ? ఈ అద్భుతగాథను సవిస్తరంగా వినాలి అనుకుంటున్నాం. నువ్వు బహు శ్రుతుడివి. మంచి వక్తవు. కాబట్టి దయచేసి వివరంగా చెప్పు. దైవికంగా నువ్వు మాకు కలిశావు. మూర్ఖుడితో సంయోగం విషంకంటే భయంకరం. నీవంటి విజ్ఞుడితో కలయిక అమృతంతో సమానం.

మూర్ఖేణ సహ సంయోగో విషాదపి సుదుర్జరః ।
విజ్ఞేన సహ సంయోగః సుధారససమః స్మృతః ॥ (6 - 5)

నీవంటివారు చెప్పే విలువైన విషయాలను వినడమే ఒక గొప్ప వరం. అదే మానవుడి విశిష్టత. పశువులు చూడు - తింటున్నాయి, తిరుగుతున్నాయి, శారీరకంగా సుఖం అనుభవిస్తున్నాయి. వాటికి సదసద్ జ్ఞానం లేదు. వివేకం లేదు. మోక్షాసక్తి లేదు. పురాణశ్రవణం లేకపోతే, నీవంటివాళ్ళను వినకపోతే మనిషికూడా వీటితో సమానం అయిపోతాడు. జంతువుల్లో కూడా లేడి జింక మొదలైన వాటికి వినడం తెలుసు. సంగీతానికి పరవశించిపోతాయి. పాముల సంగతి తెలిసిందే కదా ! మనకున్న జ్ఞానేంద్రియాలైదింటా చెవి-కన్ను శుభప్రదమైనవి. వినడంవల్ల వస్తు విజ్ఞానం కలుగుతుంది. చూడటం వల్ల మనస్సు రంజిల్లుతుంది.

ఈ వినికిడి కూడా సాత్త్విక - తామస-రాజస భేదాలతో మూడు విధాలని పెద్దలు చెబుతున్నారు. వేద శాస్త్రాదులను వినడం సాత్త్విక శ్రవణం. (స్త్రీ పురుష సంబంధాత్మకమైన) సాహిత్యాన్ని వినడం రాజసం. యుద్ధ వార్తలూ ఇతరుల దోషాలూ వినడం తామసం.

సాత్త్వికం వేదశాస్త్రాది సాహిత్యం చైవ రాజసమ్ ।
తామసం యుద్ధ వార్తా చ పరదోషప్రకాశనమ్ ॥ (6 - 11)



అంతేకాదు, మిత్రమా ! ఈ సాత్త్విక శ్రవణంలో ఉత్తమ - మధ్యమ - అధమ భేదాలున్నాయి. మోక్షఫలాన్ని అందించే విషయాలను వినడం ఉత్తమం. స్వర్గాన్ని ఇచ్చే వాటిని వినడం మధ్యమం. భోగఫలాన్ని సమకూర్చే అంశాలను చెవిని పెట్టడం అధమం. అలాగే సాహిత్యమూ (కలయిక) మూడు విధాలు. ధర్మపత్నీ వృత్తాంతరూపమైన సాహిత్యాన్ని (భార్యాభర్తల కథలు) వినడం ఉత్తమం. వేశ్యా వృత్తాంతాలను చెవి కెక్కించుకోవడం మధ్యమం. అక్రమ సంబంధాల కథలు ఆలకించడం అధమం. తామస శ్రవణంలోనూ ఈ భేదాలు ఉన్నాయి. ధర్మ సంస్థాపనకోసం దుష్టులనూ పాపాత్ములనూ సంహరించే యుద్ధగాథలు వినడం ఉత్తమం. కౌరవ పాండువుల్లాగా ఏదో ఒక విద్వేషంతో ఒకరిని ఒకరు చంపుకునే చరితలను చెవిని పెట్టడం మధ్యమం. అకారణ కలహాలకూ నిర్నిమిత్త వివాదాలకూ చెవులప్పగించడం అధమం.

కాబట్టి, ఓ మహామతీ ! సూతమహర్షీ ! పాపాలను పోగొట్టి, పుణ్యాలను సమకూర్చి శ్రోతలను బుద్ధిమంతులుగా చేసేది పురాణ శ్రవణమే. వ్యాస మహర్షినుంచి నువ్వు తెలుసుకున్న ఈ మధుకైటభ వృత్తాంతాన్ని మాకూ వినిపించు. దుష్టశిక్షణకోసం జరిగిన యుద్ధం కనుక దీన్ని వినడం ఉత్తమమే.

శౌనకుడు ఇలా అడిగేసరికి సూతుడికి తనువంతా పులకించింది. ఆనందంతో కన్నులు చెమర్చాయి. శౌనకమహామునీ ! ఇంకా వినాలి, అనుకుంటున్నారు కనుక మీరంతా ధన్యులు. ఇంకా చెప్పాలి, ఇంకా చెప్పాలి అనుకుంటున్నాను కనుక నేనూ ధన్యుణ్ణే. సరే, మధుకైటభుల కథ చెబుతున్నాను. ఏకాగ్రచిత్తంతో ఆలకించండి.

## ◆ మధుకైటభ వృత్తాంతం ◆

పూర్వకాలంలో మహాప్రళయం సంభవించి ముల్లోకాలూ సముద్రంలో మునిగిపోయాయి. దేవదేవుడు జనార్దనుడు ఒక్కడూ మిగిలి శేషపర్యంకం మీద నిద్రిస్తున్నాడు. అతడి చెవులలోనుంచి గులుగు జారిపడింది. ఆ గుమిలి ఉండలనుంచి మధుడూ కైటభుడూ జన్మించారు. సముద్రజలాల్లో దినదిన ప్రవర్ధమానులయ్యారు. మహాబలిష్ఠులయ్యారు. ఇద్దరూ కలిసి అన్నదమ్ముల్లాగా ఇటూ అటూ ఈదుతూ ఆడుకుంటున్నారు. ఒకరోజున వాళ్ళకి ఒక సందేహం వచ్చింది.

కారణం లేకుండా కార్యం ఉండదంటారు. ఆధారం లేకుండా ఆధేయం ఉండదంటారు. ఈ నీరంతా ఎలా నిలబడి ఉంది ? దీని ఆధారం ఏమిటి ? ఎవరు సృష్టించారు ? ఎలా సృష్టించారు ? ఈ నీళ్ళల్లో ఆడుకుంటున్న మనమిద్దరం ఎలా జన్మించాం ? జన్మ కారకులు ఎవరు ? మన తల్లిదండ్రులెవరో మనకు తెలియకపోయె, ఎంత ఆశ్చర్యం !



ఇద్దరూ ఇలా చాలాసేపు చర్చించుకున్నారే గానీ ఎంతకూ ఒక నిశ్చయానికి రాలేకపోయారు. అప్పుడు కైటభుడన్నాడు గదా - మధూ ! మనం ఇలా నీళ్ళల్లో ఉండటానికి కారణం మహాశక్తి. ఆవిడే మనలను సృష్టించింది. ఈ నీళ్ళను సృష్టించినదీ ఆ శక్తియే. వీటికి ఆధారం కూడా ఆమెయే. నా బుద్ధికి తోచిన సంగతి చెప్పాను - అన్నాడు.

సరిగ్గా అదే సమయానికి ఆకాశం నుంచి ఒక మనోహరమైన శబ్దం వినిపించింది. ఆ వాగ్బీజాన్ని ఇద్దరూ విన్నారు. పదేపదే మననం చేసుకున్నారు. అంతలోకీ శుభసూచకంగా ఆకాశంలో ఒక పెద్ద మెరుపు మెరిసింది. మనకు వినిపించిన వాగ్బీజం నిస్సంశయంగా ఒక మంత్రం అని ఆ ఇద్దరూ గ్రహించారు. అదే జపించారు. నిరాహారులై జితేంద్రియులై ఏకాగ్రచిత్తంతో వెయ్యి సంవత్సరాలపాటు ఆ మంత్రాన్ని జపిస్తూ మహాతపస్సు చేశారు. మహాశక్తి ప్రసన్నురాలయ్యింది. దర్శనమిచ్చింది. వరం కోరుకొమ్మంది. స్వేచ్ఛా మరణం అనుగ్రహించమని ఇద్దరూ ముక్తకంఠంతో అభ్యర్థించారు. అమ్మవారు తథాస్తు అంది.

దేవదానవులకు అజేయులం. మన చావు మన అధీనం. మధుకైటభులకు మదం ఎక్కింది. ఇష్టం వచ్చినట్టు ఆ మహాసముద్రంలో క్రీడిస్తున్నారు. స్వేచ్ఛగా సంచరిస్తున్నారు. ఉన్నట్టుండి ఒకరోజున బ్రహ్మదేవుడు వాళ్ళ కంటబడ్డాడు. పద్మాసనంమీద కూర్చుని నిర్మలంగా జపం చేసుకుంటున్నాడు. అతణ్ణి సమీపించి ఇద్దరూ, మాతో యుద్ధం చెయ్యమని అడిగారు. లేదంటే పద్మాసనం వదిలేసి వెంటనే వెళ్ళిపొమ్మన్నారు. దుర్బలుడికి ఇంతటి శుభాసనం మీద కూర్చునే యోగ్యత లేదన్నారు. ఇది వీరభోగ్యం. నువ్వు పిరికివాడివి దిగు. ఫో - అన్నారు.

పాపం. ప్రజాపతి చింతాకులుడయ్యాడు. ఏమి చెయ్యడానికీ తోచలేదు. కాలూ చెయ్యీ ఆడలేదు. ఇద్దరూ బలవంతులు. కొయ్యబారి అలా ఉండిపోయాడు. ***(అధ్యాయం - 6, శ్లోకాలు - 44)***

బాగా ఆలోచించాడు. సామదానభేద దండోపాయాలను బేరీజు వేశాడు. వీళ్ళ బలం ఎంతటిదో తెలీదు. అంచేత యుద్ధానికి దిగడం (దండోపాయం) మంచిది కాదు. మదమత్తులైన ఈ దుష్టుల్ని పోనీ పొగిడి మంచి చేసుకుందామా అంటే, నా నిర్బలత్వం వీళ్ళకు తెలిసిపోతుంది. స్వయంగా ప్రకటించుకున్నవాణ్ణి అవుతాను. అప్పుడు ఇద్దరిలో ఎవడో ఒకడు నన్ను సంహరించవచ్చు. కాబట్టి సామోపాయం పనికిరాదు. ఇలా మీదకి వచ్చాక దానమూ ఫలించదు. ఇక మిగిలింది భేదం. అది ఎలా సాధ్యమో ఆలోచించాలి.

ఆదిశేషుడిమీద పడుకుని హాయిగా నిద్రపోతున్న విష్ణుమూర్తిని లేపుతాను. అతడు చతుర్భుజుడు. మహాబలశాలి. ఈ కష్టం నుంచి కడతేరుస్తాడు - ఇలా నిశ్చయించుకుని బ్రహ్మదేవుడు విష్ణుమూర్తిని స్తుతించాడు.



హే దీననాథ ! హరే ! విష్ణో ! వామన ! మాధవా !! నిద్రలే,నిద్రలే. భక్తార్తిహారకా ! హృషీకేశా ! సర్వావాసా ! జగత్పతీ ! ఉత్తిష్ఠ ! ఉత్తిష్ఠ ! అంతర్యామిన్ ! అమేయాత్మన్ ! హే వాసుదేవ ! హే జగత్పతే! దుష్టశత్రు వినాశక ! చక్రగదాధరా ! సర్వజ్ఞ ! సర్వలోకేశ ! సర్వశక్తి సమన్వితా ! పాహి మామ్. పాహి మామ్. విశ్వంభరా ! విశాలాక్షా ! పుణ్య శ్రవణ కీర్తనా ! జగద్యోనే ! నిరాకార ! సర్గస్థిత్యంతకారకా ! ఇదిగో, ఇద్దరు రాక్షసులు నన్ను చంపడానికి వచ్చారు. కష్టాల్లో ఉన్నాను. గమనించలేదా ? శరణు శరణు. ఉపేక్షించకు. నీ జగత్పాలకత్వం నిరాధారం అయిపోతుంది. రక్షించు, రక్షించు.

బ్రహ్మదేవుడు ఎంతసేపు స్తుతించినా శ్రీహరి నిద్రలేవలేదు. అది యోగనిద్ర. ఆ శక్తికి వివశుడై నిద్రపోతున్నాడు. ఇప్పుడు ఏమి చెయ్యాలో విరించికి పాలుపోలేదు. ఈ మదమత్తులిద్దరూ చంపడానికి సిద్ధంగా ఉన్నారు. ఏమి చెయ్యను, ఎక్కడికిపోను, ఎవరిని శరణు వేడను ! - ఇలా దిగులు పడుతూండగా మెరుపులా ఒక ఆలోచన వచ్చింది. ఆ యోగనిద్రనే స్తుతిద్దాం అనుకున్నాడు. ఆ శక్తి నన్ను రక్షిస్తుందనుకున్నాడు.

విష్ణుమూర్తినే నిశ్చేతనుణ్ణి చేసిందంటే ఆ శక్తి సామాన్యమైనది కాదు. ఎంత స్తుతించినా ఇతడికి ఏమీ వినపడటం లేదు. కదలిక లేదు. అంటే నిద్ర ఇతడికి వశంలో లేదు. ఇతడే నిద్రకు వశీకృతుడు అయ్యాడు. వశుడయ్యాడంటే కింకరుడితో సమానమే కదా ! అంటే ఇప్పుడు విష్ణుమూర్తికి స్వామిని (అధికారిణి) ఈ యోగనిద్ర అన్నమాట. లక్ష్మీదేవి సన్నిధిలోనే ఇతడు ఈ నిద్రకు ఇలా లొంగిపోయాడంటే ఇక జగత్తు అంతా ఆ శక్తికి అధీనంలో ఉన్నట్టే కదా ! జగత్తేమిటి, నేనూ సరస్వతి, శివుడూ పార్వతి అందరం శక్తి అధీనంలో ఉన్నట్టే. సందేహం లేదు. ఒక సామాన్య మానవుడి కన్నా అన్యాయంగా విష్ణుమూర్తి వివశుడైపోయాడు. తక్కిన మహాత్ముల్ని గురించి చెప్పాలా ! అందుచేత ఆ యోగనిద్రనే స్తుతిస్తాను. ప్రసన్నురాలిని చేసుకుంటాను. విష్ణుమూర్తిని వదిలిపెట్టమని ప్రార్థిస్తాను. అప్పుడితడు నిద్రలేచి యుద్ధం చేసి ఈ రాక్షసుల్ని సంహరిస్తాడు.

## ◆ బ్రహ్మకృత యోగనిద్రాస్తుతి ◆

ఇలా నిర్ణయించుకుని చతుర్ముఖుడు యోగనిద్రను అనేక విధాల స్తుతించాడు. దేవీ ! సకల జగత్తుకీ నువ్వే కారణమని నా ముఖతః వేదాలు చెబుతూంటే, ఆ సంగతి నాకు ఇప్పటికి తెలిసింది. గ్రహించగలిగాను. అఖిలలోకానికీ వివేకాన్ని ప్రసాదించే పురుషోత్తముణ్ణి నిద్రావశుణ్ణి చేశావు. నీ మోహ విలాసలీలలు తెలియతరమా తల్లీ ! నేనెంత మూఢుణ్ణి, ఇంతవరకూ తెలుసుకోలేకపోయాను. నేనేకాదు, విబుధకోటిలో నిన్ను తెలుసుకున్నవాడు ఎవడూ లేడు. జగత్కర్తృత్వం నీదే. నువ్వే ప్రకృతీ-పురుషుడూ. సర్వ చైతన్య శక్తివి నువ్వే. నిర్గుణ స్వరూపిణివి. నువ్వే వివిధ రూపాలు ధరించి నటిస్తూ ఉంటావు. నీ



పనులూ నీ విధానాలూ ఎవరికీ అంతుపట్టవు. నీకు నామరూపాలు కల్పించి మునీశ్వరులు త్రికాలాల్లోనూ నిన్ను సంధ్యగా ధ్యానిస్తూంటారు. మేల్కొల్పే బుద్ధివి నువ్వు. సంపదవు నువ్వు. కీర్తి, మతి, ధృతి, శ్రద్ధ అన్నీ నువ్వే. విష్ణుమూర్తి నీకు వివశుడై నా కళ్ళ ఎదుట కనపడుతూంటే ఇంక వేరే ప్రమాణం కావాలా !

వేదవేత్తలే కాదు వేదాలు కూడా నిన్ను పూర్తిగా అర్థం చేసుకోలేకపోయాయి. అంతటి దుర్విజ్ఞేయవు. ఇక మేమనగా ఎంత ! యజ్ఞ యాగాలలో ఋత్విజులు స్వాహా శబ్దంతో నీ నామధేయాన్ని ఉచ్చరించకపోతే ఆయా దేవతలకు పురోడాశభాగాలు అందవు. దేవతలకు భుక్తిదాయినివి నువ్వు.

యజ్ఞేషు దేవి యది నామ న తే వదంతి
స్వాహేతి వేదవిదుషో హవనే కృతేఽపి ।
న ప్రాప్నువంతి సతతం మఖభాగధేయం
దేవాస్త్వమేవ విబుధేష్వపి వృత్తిదాఽసి ॥ (7-35)

అమ్మా, వరప్రదాయినీ ! భయభీతుణ్ణి, నిన్ను శరణు వేడుతున్నాను. ఇదిగో మధుకైటభులు, ఘోరరూప రాక్షసులు. నన్ను సంహరించడానికి కత్తులు నూరుతున్నారు. విష్ణుమూర్తికి ఈ సంగతి తెలుసునని నాకు అనిపించడం లేదు. నీకు వివశుడై నిద్రలో ఉన్నాడు. అతణ్ణి విడిచిపెట్టు. లేదా ఈ రాక్షసులు ఇద్దరినీ నువ్వే మట్టుపెట్టు. నీ ఇష్టం తల్లీ ! నీకు ఏది నచ్చితే అదే చెయ్యి.

హే మహామాయే ! హరిహరుల కోసం తపస్సు చేసేవాళ్ళు ఎంత అమాయకులో కదా ! పాపం నీ ప్రభావం వాళ్ళకు తెలీదు. నాకయినా ఇప్పటికిగదా తెలిసింది. ఈ విష్ణుమూర్తిని నిద్రలేపాలంటే లక్ష్మీదేవికి కూడా అయ్యేటట్టు లేదు. ఆవిడకూడా నీకు వివశురాలై నిద్రపోతోంది. నువ్వు జగజ్జననివనీ కామధేనువువనీ నిజంగా తెలుసుకుని నీ పాదపద్మాలను అర్చించేవాళ్ళూ అనన్యభక్తితో సేవించేవాళ్ళూ ధన్యాతిధన్యులు. బుద్ధి, తేజస్సు, కీర్తి, శుభప్రవృత్తి మొదలైనవి శౌరిగుణాలు. అవన్నీ ఎటుపోయాయో. నీ అమేయశక్తి కారణంగా నిద్రకు బందీ అయ్యాడు.

సకల జగత్తుకీ నువ్వే ఆదిశక్తివి. ఇదంతా భావమాత్రంగా నువ్వు చేసిన నిర్మాణమే. నువ్వు నిర్మించిన ఈ మోహజాలంలో నువ్వే క్రీడిస్తున్నావు - నటుడు తన నాట్యంలో తానూ విహరిస్తున్నట్టు.

యుగాదిలో మొదటిసారిగా విష్ణుమూర్తిని నువ్వే ప్రకటించావు. వెలుగులోకి తెచ్చావు. పరిపాలనాశక్తిని ఇచ్చావు. ఇప్పుడేమో ఇలా నిద్రపుచ్చావు. అంబా ! నువ్వు సర్వతంత్ర స్వతంత్రురాలివి. ఏది ఎప్పుడు ఎలా చెయ్యాలనిపిస్తే అలా చేస్తావు. నన్ను సృష్టించింది ఇలా నశింపజెయ్యడానికే



అయినట్లయితే, నీ ఇష్టం. దయ చూపించకు. ఇలాగే మౌనంగా ఉండిపో. భగవతీ ! నన్ను పరిహసించడానికే కాకపోతే ఈ కాలరూప రాక్షసుల్ని నువ్వసలు ఎందుకు సృష్టించావుట ! తెలిసింది తల్లీ! తెలిసింది. ఇదంతా నీ అద్భుతవిచేష్టితం. స్వతంత్రంగా సృష్టిస్తావు, వినోదిస్తావు, ఉపసంహరిస్తావు. ఇప్పుడు నన్ను ఉపసంహరించాలి అనుకున్నావు. అవును. ఇందులో విచిత్రం ఏముంది ! మాతా ! నీ ఇష్టం. అలాగే కానీ. నన్ను సంహరించు. నాకు దుఃఖం లేదు. నేనేమీ బాధపడటం లేదు; కానీ హే జగదంబికే! నువ్వు సృష్టించిన నన్ను ఈ రాక్షసుడు చంపడం నీకు పెద్ద అపకీర్తి అవుతుంది. అందుకని, దేవీ ! లే. అద్భుతరూపం ధరించు. నన్నో ఈ రాక్షసులనో సంహరించు. లేదంటే, హరిని నిద్రలేపు. ఈ రాక్షసుల్ని సంహరిస్తాడు. ఏదయినా అంతా నీ చేతిలో ఉంది.

ఇలా కమలసంభవుడు భక్త్యావేశంతో నిలదీశాడు. ఎట్టకేలకు ఆ తామసీశక్తి శౌరి శరీరాన్ని వదలి పెట్టింది. జనార్దనుడిలో కదలిక వచ్చింది. విరించి ముఖాలలో ఆనందం వెల్లివిరిసింది.

***(అధ్యాయం - 7, శ్లోకాలు - 50)***

సూతుడు ఇలా కథ చెబుతుండగా శౌనకాదిమహామునులలో ఒకరికి-మరొక సందేహం వచ్చింది. బ్రహ్మ విష్ణు మహేశ్వరులు త్రిమూర్తులనీ, సనాతనులనీ, బ్రహ్మాండంలో వీరికంటే అధికులు (పరతరం) లేరనీ, సృష్టిస్థితిలయాలను వీరే నిర్వహిస్తుంటారనీ పెద్దలు చెప్పగా విన్నాం. అందులో విష్ణుమూర్తి మహాతేజస్వి అనీ సర్వసమర్థుడనీ చెబుతారు గదా ! అంతటి స్వామి యోగమాయకు వశుడై నిద్రపోయాడా ? అతడి వివేకం ఏమైపోయింది ? బ్రతికుండీ నిశ్చేష్టుడు ఎలా అయ్యాడు ? ఇది నా సందేహం. విష్ణుమూర్తినే లొంగదీసుకున్న ఆ శక్తి ఎవరు ? దాని పేరు ఏమిటి ? ఎక్కడ ఎలా పుట్టింది? అంతటి సమర్థురాలు ఎలా కాగలిగింది ? పరాత్పరుడు నిద్రాపరతంత్రుడయ్యాడంటే ఆశ్చర్యంగా ఉంది. ఓ మహామతీ ! వ్యాస శిష్యా ! నీ జ్ఞానఖడ్గంతో నా సందేహ లతలను ఖండించి సత్యప్రకటనం చెయ్యి - అని ఆ మహాముని అభ్యర్థించాడు. సూతుడు రవ్వంత ఇరుకునపడ్డాడు. అయినా సమాధానం చెప్పాడు.

మహామునులారా ! ముల్లోకాలలోనూ ఈ సందేహాన్ని తీర్చగలవాడు లేడని నా అభిప్రాయం. బ్రహ్మపుత్రులూ సనాతనులూ అయిన నారద కపిలాది మహామునులు సయితం దీనికి సమాధానం చెప్పలేరేమో. అంతటి దుర్ఘటమైన ప్రశ్న ఇది. ఇక నేననగా ఏమిటి ! ఏమి చెప్పను ? కానీ ఒక్క విషయం గమనించండి.



## ◆ సూతకృత శక్తి స్తవం ◆

వేదాలు విష్ణుమూర్తిని సర్వపాలకుడుగా కీర్తిస్తున్నాయి. అతడు విరాట్ స్వరూపుడు. చరాచరప్రాణికోటి అంతా ఆ స్వరూపంనుంచే ఆవిర్భవిస్తోంది. నారాయణుడూ హృషీకేశుడూ వాసుదేవుడూ జనార్దనుడూ అనే పేర్లతో అందరూ అతడిని స్తుతించి ఉపాసిస్తున్నారు. మరికొందరు శివుణ్ణి అలా ఉపాసిస్తున్నారు. శంకరుడు, చంద్రశేఖరుడు, త్రినేత్రుడు, పంచవక్త్రుడు, శూలపాణి, వృషధ్వజుడు - మొదలైన నామధేయాలతో వేదం త్రియంబకుణ్ణి గానం చేస్తోంది. అర్ధనారీశ్వరుడుగా కైలాసనివాసిగా సర్వశక్తి సమన్వితుడుగా భూతనాథుడుగా దక్షయజ్ఞ వినాశకుడుగా - భక్తులు కీర్తిస్తున్నారు.

మరికొందరు వేదవిదులు ముప్పొద్దులా సూర్యుణ్ణి ఉపాసిస్తున్నారు. సూర్యోపాసనమే ఉత్తమోత్తమమనీ అతడు పరమాత్మ అనీ వేదాలు కూడా చెబుతున్నాయి. అలాగే అగ్నినీ ఇంద్రుణ్ణీ వరుణుణ్ణీ పరమాత్మలుగా చెప్పే వేదభాగాలు ఉన్నాయి. వీరిని పరమాత్మలుగా ఉపాసించే వేదపండితులూ ఉన్నారు. ప్రవాహాలు ఎన్నయినా గంగ ఒక్కటే అన్నట్టు వీరందరిలోనూ విష్ణువే ఉన్నాడు అన్న మహర్షులూ ఉన్నారు.

ఏ విషయంలోనైనా ఒక నిశ్చయానికి రావాలంటే ప్రధానంగా మూడు ప్రమాణాలను చెబుతారు పండితులు. ప్రత్యక్షం, అనుమానం, శాబ్దం అని. మరికొందరు ఉపమానాన్ని చేర్చి మొత్తం నాలుగన్నారు. అర్థాపత్తితో కలిపి అయిదు అనేవారూ ఉన్నారు. పౌరాణికుల మార్గంలో అనుభవదృష్టాంతాలతో కలిసి ప్రమాణాలు ఆరున్నొకటి. ఇంతకీ పరబ్రహ్మ స్వరూపం ఈ ప్రమాణాలకు వేటికీ అందనిదే. అందుకే అది పరమమైన బ్రహ్మ. కాబట్టి బాగా ఆలోచించి ఒక నిశ్చయానికి రావాలి.

త్రిమూర్తులలో సృజన పాలన సంహరణ శక్తులు ఉన్నాయి. సూర్యుడిలో ప్రకాశకశక్తి ఉంది. శేష-కూర్మాలకు భూభరణశక్తి ఉంది. అగ్నిలో దహనశక్తి ఉంది. వాయువులో ప్రేరణశక్తి ఉంది. ఈ శక్తులు లేకపోతే వీరంతా ఏమవుతారు ? అసమర్థులవుతారు. వేరే చెప్పాలా ?

> శివోఽపి శవతాం యాతి కుండలిన్యా వివర్జితః।
> శక్తిహీనస్తు యః కశ్చిత్ అసమర్థః స్మృతో బుధైః ॥ (8 - 31)

ఓ మహాతపస్వులారా ! బ్రహ్మ మొదలుకొని స్తంభపర్యంతం ఉన్న ఈ బ్రహ్మాండంలో శక్తిహీనం పరమనింద్యం. శివుడు శవమయినట్టే. కాబట్టి శత్రు విజయంలో గమనంలో భోజనంలో సర్వత్ర నిండి ఉన్న ఆ శక్తినే పరబ్రహ్మం అని బుద్ధిమంతులు నిర్ధారించారు. ఉపాసించారు. అదే విష్ణుమూర్తిలో



సాత్త్వికశక్తి. అది లేనివేళ అతడు నిశ్చేష్టుడు. చతుర్ముఖునిలో అదే రాజసశక్తి. అది లేనినాడు అతడు ఏ సృష్టీ చెయ్యలేడు. అదే శివుడిలో తామసశక్తి. అది ఉంటేనే అతడు సంహారకారకుడు. అందుచేత ఈ బ్రహ్మాండ సృష్టికీ స్థితికీ వినాశానికీ శక్తియే కారణం. అదే లేకపోతే త్రిమూర్తులే కాదు ఇంద్రుడూ, సూర్యుడూ, అగ్ని, వరుణుడు - ఎవ్వరూ తామిప్పుడు చేస్తున్న పనుల్ని చెయ్యలేరు.

ఆ శక్తి - సగుణ అనీ నిర్గుణ అనీ రెండు రకాలు. నిర్గుణ శక్తిని విరాగులు ఉపాసిస్తారు. సగుణరూపాన్ని కోరికలున్నవారు (రాగి) ఉపాసిస్తారు. అది నిష్కామోపాసన. ఇది సకామోపాసన.

సగుణా నిర్గుణా సా తు ద్విధా ప్రోక్తా మనీషిభిః ।
సగుణా రాగిభిస్సేవ్యా నిర్గుణా తు విరాగిభిః ॥ (8 - 40)

ధర్మార్థకామమోక్షాలకు స్వామిని ఆ శక్తియే. విధి విధానంగా పూజిస్తే అన్ని కోరికలూ తీరుస్తుంది. ఇది తెలుసుకోలేని మూఢులు కొందరైతే, తాము తెలుసుకొని ఇతరులను మోసం చేసేవారు మరికొందరు. పొట్టపోసుకోవడంకోసం కొందరు పండితులు కలిప్రేరితులై రకరకాల పాషండధర్మాలను ప్రచారం చేస్తున్నారు. మరే యుగంలోనూ వేదబాహ్యమైన ధర్మాలు ఇంతగా విజృంభించడం కనపడదు.

మహానుభావులారా ! త్రిమూర్తులూ నిత్యమూ ధ్యానించేది ఈ శక్తినే. వేల సంవత్సరాలు తపస్సు చేసేదీ ఈమె అనుగ్రహం కోసమే. యజ్ఞాలు చేసేదీ ఇందుకోసమే. బ్రహ్మాఖ్యయైన ఆ పరాశక్తి సనాతని. అందరికీ ఉపాస్యదేవత. ఇది సర్వశాస్త్రాలూ అంగీకరించి చేసిన నిర్ణయం అని మా గురువుగారు (వ్యాసుడు) చెప్పారు. ఆయనకు నారదుడు చెప్పాడట. నారదుడికి వాళ్ళ నాన్నగారు బ్రహ్మదేవుడు చెప్పాడట. బ్రహ్మదేవుడికి విష్ణుమూర్తి చెప్పాడట. కాబట్టి ఇంక ఇతరుల మాటలు ఏవీ మీరు వినక్కరలేదు. పట్టించుకోనక్కర లేదు. శక్తి మాత్రమే ఆరాధనీయ. అశక్తుడు ఎలా ఉంటాడో ప్రత్యక్షంగా గ్రహించారు గదా ! సర్వ ప్రకృతిలోనూ శక్తినే దర్శించండి. ఉపాసించండి. ***(అధ్యాయం - 8, శ్లోకాలు - 51)***

మహామునులారా ! మీ సందేహం తీరింది గదా ! ఇంక కథలోకి వద్దాం - అంటూ సూతుడు కొనసాగించాడు.

జగద్గురువైన విష్ణుమూర్తి శరీరంనుంచి నిద్రాదేవి బయటకు వచ్చింది. నేత్ర - ఆస్య - నాసికా - బాహు - హృదయ - వక్షః స్థలాలనుంచి వెలువడింది. ఆకాశంలో నిలబడింది. జగన్నాథుడు ఆవులింతలతో లేచాడు. భయంభయంగా నిలబడ్డ ప్రజాపతిని చూశాడు. మేఘగంభీర కంఠస్వరంతో పలకరించాడు.



పద్మజా ! తపస్సు వదిలేసి ఇలా వచ్చా వెందుకని ? విచారంగా కనపడుతున్నావు. కారణం ఏమిటి ?

తండ్రీ ! వాసుదేవా ! నీ చెవిగులుగునుంచి పుట్టిన మధుకైటభరాక్షసులు నన్ను చంపడానికి వచ్చారు. భయపడి నీ సన్నిధికి వచ్చాను. శరణు, శరణు. త్రాహి మామ్, త్రాహి మామ్.

అలాగా, చతుర్ముఖా ! భయపడకు. వాళ్ళను నేను సంహరిస్తాను. ఆయువు మూడింది వాళ్ళకి. వస్తారు, నా మీదకే వస్తారు. చస్తారు.

విష్ణుమూర్తి ఇలా అంటూండగానే వాళ్ళు వచ్చారు. మదగర్వితులై వచ్చారు. ఆ నీళ్ళల్లో నిరాధారులై నిలబడి - ఓయీ నలువా ! పారిపోయి ఇక్కడికి వచ్చావా ? రా. యుద్ధం చెయ్యి. ఈయన కళ్ళముందే ఇక్కడే నిన్ను సంహరిస్తాం. తరువాత ఈయన పనిపడతాం. మహాసర్పం మీద కులుకుతున్నాడు గదా ! ముందు నువ్వు రా యుద్ధం చెయ్యి. లేదా దాసుణ్ణి అని ఒప్పుకో - అని గద్దించారు. విష్ణుమూర్తి కల్పించుకుని -

దానవులారా ! రండి, నాతో యుద్ధం చెయ్యండి. మీ మదం వదిలిస్తాను.

ఈ ఆహ్వానానికి మధుకైటభులు ఆగ్రహోదగ్రులయ్యారు. ముందుగా మధుడు కలబడ్డాడు. కైటభుడు నిలబడ్డాడు. మల్ల యుద్ధం జరుగుతోంది. మధుడు అలిసిపోతుంటే కైటభుడు అందుకున్నాడు. అతడు అలిసిపోతే మళ్ళీ మధుడు. ఇలా ఇద్దరూ మారిమారి శౌరితో పోరుతున్నారు. సన్నిధిలో బ్రహ్మదేవుడూ, ఆకాశంలో (నిద్రా) దేవి ప్రేక్షకపాత్ర వహిస్తున్నారు.

విష్ణుమూర్తి అలిసిపోతున్నాడే తప్ప వాళ్ళిద్దరిలోనూ ఎక్కడా అలసటే లేదు. అయిదువేల సంవత్సరాలు గడిచాయి. కారణం ఏమిటి చెప్మా అని హరి ఆలోచించాడు. నేను ఎందుకు అలిసిపోతున్నాను? నా శక్తి ఏమయ్యింది ? వీళ్ళు అస్సలు అలిసిపోవడం లేదేమిటి ? వీళ్ళకి ఈ శక్తి ఎక్కడినుంచి వచ్చింది? ఈ ఆలోచనలతో ఒక్క నిమిషం ఆగాడు. మధుకైటభులు విజయగర్వంతో సంబరపడ్డారు. గంభీరంగా అరిచి పలికారు.

హే విష్ణో ! అలిసిపోయావా ? యుద్ధం చేసే ఓపిక లేదా ? అయితే మాకు తలవంచి నమస్కరించు. దాసుణ్ణి అని ప్రకటించు. కాదంటావా, సమర్థుడవై యుద్ధం చెయ్యి. నిన్ను చంపి, ఈ నాలుగు ముఖాలవాణ్ణి కూడా చంపుతాం.

ఆ ప్రళయ మహాసముద్ర ఘోషను అధఃకరిస్తూ వాళ్ళిద్దరూ ముక్తకంఠంతో పలికిన ఈ మాటలు చెవులారా విన్నాడు శౌరి. ప్రశాంతంగా సామోపాయంగా ప్రసంగించాడు.



మధుకైటభులారా ! మీరేమో ఇద్దరు, నేనో ఒక్కణ్ణే. మీరు ఒకరి తరువాత ఒకరుగా నాతో తలపడుతున్నారు. ఒకరు యుద్ధం చేస్తోంటే మరొకరు విశ్రాంతి తీసుకుంటున్నారు. నాకు ఆ అవకాశం లేదు. అయిదువేల సంవత్సరాలపాటు పోరాడాను. అలిసిపోయాను. సహజం గదా ! ధర్మయుద్ధంలో మహావీరులు పాటించే నియమాలు మీకు తెలియనివి కావు. అలిసిపోయినవాడితో భయపడినవాడితో ఆయుధం వదిలేసినవాడితో పడిపోయినవాడితో బాలకుడితో మీవంటి మహావీరులు యుద్ధం చెయ్యరు. ఇది సనాతన ధర్మం.

శ్రాంతే భీతే త్యక్తశస్త్రే పతితే బాలకే తథా ।
ప్రహరంతి న వీరాస్తే ధర్మ ఏష సనాతనః ॥ (9-26)

అందుచేత కొంచెంసేపు నేనూ విశ్రాంతి తీసుకుని మళ్ళీ యుద్ధం చేస్తాను. సంశయించకండి. న్యాయం తప్పను.

ఈ ప్రతిపాదనకు వాళ్ళు సమ్మతించారు. అల్లంత దూరం తొలగి నిలబడ్డారు. వాసుదేవుడు ఆలోచించాడు. అసలు కారణం తెలిసింది. వాళ్ళది స్వేచ్ఛా మరణమనీ, దేవి ఆ వరం ఇచ్చిందనీ గ్రహించాడు. అయ్యో ! వృథాగా యుద్ధం చేశానే. ఇంత శ్రమా వ్యర్థం అయ్యిందే. విషయం తెలిసి ఇంక యుద్ధం చేసి ఏమి లాభం ! పోనీ మానేద్దామంటే వీళ్ళు మరణించేదెలాగ! వరదర్పితులై విరించిపైకీ నాపైకీ దండెత్తారు. చంపక తప్పదు. వరం ఇచ్చిన తల్లి తానై ఆ పని చెయ్యదు. ఎంత దుఃఖితుడైనా రోగగ్రస్తుడైనా దీనుడైనా తనంతతాను మరణం కోరుకోడు. మరణించాలి అనుకోడు. అందుచేత, సర్వకామద అయిన ఆ పరాశక్తినే శరణువేడతాను. ఆవిడ అనుగ్రహం లేనిదే ఎవ్వరికీ ఏవీ సిద్ధించవు.

ఇలా నిశ్చయించుకున్న లక్ష్మీపతి తలఎత్తి ఆకాశంవైపు చూశాడు. నిలబడి ఉన్న యోగనిద్రామహాశక్తి కనిపించింది. వెంటనే నమస్కరించాడు. యోగవిద్య తెలుసు కనక ఆ మార్గంలో స్తోత్రపాఠం చేశాడు.

నమో దేవి మహామాయే సృష్టిసంహారకారిణి ।
అనాదినిధనే చండి భుక్తిముక్తిప్రదే శివే ॥ (9 - 40)

దేవీ ! మహామాయా ! నీ రూపం సగుణమో నిర్గుణమో ఎరగను. అసంఖ్యాకమైన నీ దివ్య చరిత్రలు ఎరగను. కానీ, నీ అతిదుర్ఘటమైన ప్రభావం మాత్రం అనుభవంలోకి వచ్చింది. చేష్టలు ఉడిగి నిద్రలో మునిగిపోయాను గదా ! ఈ బ్రహ్మదేవుడు ఎంతసేపు లేపినా మెలకువే రాలేదు. ఇంద్రియజ్ఞానం



కోల్పోయి అచేతనుణ్ణి అయిపోయాను. అంబికా! నీ ప్రభావం ఏమిటో తెలిసింది. నువ్వు వదిలావు, మేల్కొన్నాను. వెంటనే వీళ్ళతో యుద్ధానికి దిగాను. వీళ్ళు బ్రహ్మ దేవుణ్ణి చంపడానికి వచ్చారు. నాతో ద్వంద్వ యుద్ధానికి తలపడ్డారు. నీ వరం వీళ్ళను మదమత్తుల్ని చేసింది. దుర్జయుల్ని చేసింది. అయిదువేల సంవత్సరాలు పోరాడి అలిసిపోయాను. చూశావు గదా ! విషయం తెలిసి నిన్నే శరణు వేడుతున్నాను. దయచేసి, తల్లీ ! సహాయం చెయ్యి. నేను ఖిన్నుణ్ణి. వాళ్ళు గర్వితులు. నువ్వు దేవార్తి హారిణివి. వీళ్ళు నన్నూ చంపుతామంటున్నారు. ఏం చెయ్యాలి ? ఎక్కడికి పోవాలి ? చెప్పు - మాతా !

దీనుడై అభ్యర్థిస్తూ శిరసువంచి నమస్కరిస్తున్న వాసుదేవుణ్ణి చూసి పరాశక్తి ప్రసన్నురాలు అయ్యింది. చిన్నగా నవ్వుతూ ఇలా అంది -

హరీ ! మళ్ళీ యుద్ధం చెయ్యి. ఈ రాక్షసుల్ని మోసగించి సంహరించాలి. మరో దారి లేదు. నేను వంకర చూపులతో వీళ్ళను సమ్మోహపరుస్తాను. ఆ మాయలో ఉండగా నువ్వు సంహరించు.

విష్ణుమూర్తికి ధైర్యం వచ్చింది. రణరంగానికి వెళ్ళాడు. మధుకైటభులు హర్షించారు. చతుర్భుజా! భయపడకు. ధైర్యంగా యుద్ధం చెయ్యి. జయాపజయాలు దైవాధీనాలు. బలవంతుడే జయించాలనిలేదు. దైవయోగం ఉంటే దుర్బలుడే జయించవచ్చు. అందుచేత ఆనందించవలసిందీ లేదు. దుఃఖించవలసిందీ లేదు. ఇంతకుముందు నువ్వు ఎందరో రాక్షసుల్ని జయించావు. దానవవైరి అనిపించుకున్నావు. ఇప్పుడు మా చేతిలో ఓడిపోతున్నావు. అంతే.

ఈ గర్వోక్తులకు మండిపడ్డాడు శౌరి. బలంగా ఇద్దరికీ చెరొక ముష్టిఘాతమూ ఇచ్చాడు. వాళ్ళు చెక్కుచెదరకపోగా రెండు పిడిగ్రుద్దులు దక్కాయి శ్రీహరికి. యుద్ధం రాజుకొంది. ఘోరంగా పరిణమించింది. శ్రీనాథుడు దీనంగా అమ్మవారివైపు చూశాడు.

విష్ణుమూర్తి అవస్థను గ్రహించింది పరమేశ్వరి. కరుణామయి అయ్యింది. ఎరుపెక్కిన కన్నులతో మధుకైటభులను చూస్తూ పెద్దగా నవ్వింది. మన్మథబాణాలవంటి చూపులు. కామప్రేమ భావాలను మందస్మితంతో రంగరించిన చూపులు ఇద్దరినీ హింసించాయి. ఆ పాపాత్ములు ఆ వక్రవిలోకనాలకు మురిసిపోయారు. కామభావ పీడితులయ్యారు. ఇది విశేషమనుకున్నారు. కన్నులప్పగించి దేవిని చూస్తూ అలాగే నిలబడిపోయారు. శ్రీహరి గమనించాడు. మోహితులు అయ్యారని గుర్తించాడు. చిరునవ్వులు చిందించాడు. గంభీరంగా పలికాడు.

మధుకైటభులారా ! మీ యుద్ధానికి సంతోషించాను. ఎందరో రాక్షసుల్ని చూశాను, యుద్ధాలు చేశాను. కానీ మీతో సాటివచ్చేవాళ్ళను కనలేదు, వినలేదు. మీ బాహుబలానికి సంతుష్టి చెందాను. వరం ఇస్తున్నాను. మీ ఇష్టం. కావలసింది కోరుకోండి.



దానవ సోదరులకు అభిమానం పొడుచుకువచ్చింది. మన్మథార్తులై జగదానందకారిణి అయిన ఆ మహా మాయను తదేక దీక్షతో చూస్తూ కన్ను తిప్పకుండా హరికి సమాధానం చెప్పారు.

హరీ ! మేము యాచకులం కాము. అయినా నువ్వు మాకు ఏమి ఇస్తావు ? మేమే ఇస్తాం. కోరుకో. మేము దాతలమే కానీ చెయ్యి చాపేవాళ్ళం కాదు. ఏం కావాలో అభ్యర్థించు. నీ యుద్ధానికి మేమూ సంతోషించాం. నీ ఇష్టం, కోరుకో.

అయితే, దానవులారా ! మీరిద్దరూ ఇప్పుడు నాచేతిలో మరణించాలి. వధ్యులు కావాలి.

రమాపతి ఇలా కోరేసరికి మధుకైటభులు ఆశ్చర్యపోయారు. వంచితులమయ్యామని గ్రహించారు. గొల్లుమన్నారు. వెంటనే తేరుకుని ఆలోచించారు. జగత్తు అంతా జలమయంగా ఉండటం గమనించి ఒక ఎత్తుగడ వేశారు.

జనార్దనా ! ఇంతకుముందు నువ్వు మాకొక వరం ఇస్తానన్నావు గుర్తిందిగా. మాటమార్చకు. నీకు మేము వధ్యులం అవుతాం. కాకపోతే, నిర్జలమైన విశాలప్రదేశంలో సంహరించాలి. అదీ నీనుంచి మేము కోరుకునే వరం. సత్యవాదివి కదా ! నెరవేర్చు.

ఈ నియమానికి విష్ణుమూర్తి నవ్వుకున్నాడు. సుదర్శన చక్రాన్ని స్మరించాడు. నిర్జలమైన విపుల ప్రదేశంలో కదా మిమ్మల్ని సంహరించాలి అంటూ తన తొడలను విశాలంగా విస్తరించాడు. నీళ్ళమీద నిర్జలమైన విశాల ప్రదేశం సిద్ధించింది. దానవులారా ! ఈ తొడలమీద నీళ్ళు లేవు. మీ శిరస్సులు ఖండించి మాట నిలబెట్టుకుంటాను. రండి - అని పిలిచాడు.

రాక్షసులకు మతిపోయింది. ఏమి చెయ్యాలో తోచలేదు. హఠాత్తుగా తమ శరీరాలను వెయ్యి యోజనాలకు పెంచారు. విష్ణుమూర్తి తన జఘనభాగాన్ని రెండువేల యోజనాలకు విస్తరించాడు. చక్రంతో ఇద్దరి శిరస్సులూ ఖండించాడు. తలలూ మొండేలూ తొడలమీద రాలిపడ్డాయి. మధుకైటభులు నిహతులయ్యారు. వారి కళేబరాల నుంచి క్రొవ్వు (మేదస్సు) ప్రవహించి సాగరమంతటా వ్యాపించింది. అదే తరువాత కాలంలో మేదిని (భూమి) అయ్యింది. అందుకనే మృత్తిక (మట్టి) తినరానిదయ్యింది.

శౌనకాదిమహామునులారా ! మీ రడిగిన మధుకైటభ వృత్తాంతం చెప్పాను. మహావిద్య, మహామాయ సర్వదా మనకు సేవనీయ. సురాసురులకు ఆరాధ్య. ముల్లోకాలలోనూ పరాశక్తికి మించిన దైవం లేదు. ముమ్మాటికీ ఇది సత్యం. వేదశాస్త్రాల నిర్ణయం. నిర్గుణగానో సగుణగానో నిత్యం పరాశక్తినే పూజించాలి.

***(అధ్యాయం - 9. శ్లోకాలు - 87)***

సూతుడి ప్రబోధానికి మునులంతా సంతోషించారు. ఆమోదం తెలియజేశారు. అటుపైని యథావిధిగా ప్రశ్నించారు.



సూతమహర్షీ ! ఇంతకుముందు అన్నావు, వ్యాసుడు ఈ పురాణమంతా రచించి శుకుడితో చదివించాడని. గొప్ప తపస్సు చేసి శుకుణ్ణి పుత్రుడుగా పొందాడు అని. అందులోంచి ఇంకో కథలోకి వెళ్ళిపోయాం. ఇప్పుడు ఆ సంగతులు తెలియజెయ్యి.

మునీశ్వరులారా! తప్పకుండా, వ్యాసుడికి శుకుడు జన్మించిన వృత్తాంతం సవిస్తరంగా చెబుతాను. శుకుడు సాక్షాత్తు యోగీశ్వరుడు.

## ◆ శుకమహర్షి జన్మ వృత్తాంతం ◆

మేరుపర్వత శిఖరం మీద వ్యాసుడు తపస్సుకి కూర్చున్నాడని చెప్పాను కదూ ! పుత్రుడు కావాలని కోరుతూ ఘోర తపస్సు చేశాడు. నారదుడు ఉపదేశించిన ఏకాక్షర వాగ్బీజమంత్రాన్ని జపిస్తూ, మహాదేవినీ, మహాదేవుణ్ణీ ధ్యానిస్తూ తపస్సు సాగించాడు. తేజస్సులో - అగ్ని భూమి వాయువు అంతరిక్షాలతో సాటివచ్చే పుత్రుడు కావాలని అతడి ఆకాంక్ష. మేరుశిఖరం మీద, అద్భుతమైన కర్ణికారవనంలో దేవతలూ మునులూ విహరించేచోట, బ్రహ్మవిదులు సంచరించే పవిత్ర ప్రదేశంలో, మనోహర సుకుమారసంగీత ధ్వనుల మధ్య - వ్యాసుడి తపస్సు నిరాటంకంగా మహోగ్రంగా సాగింది. ఆ తేజస్సు విశ్వమంతటా వ్యాపించింది. వ్యాసుడి జటలు రాగిరంగులోకి మారిపోయాయి.

ఇంద్రుడికి భయం పట్టుకుంది. అది గమనించిన రుద్రుడు మేలమాడాడు. ఇంద్రా ! తపస్వులపట్ల ఈర్ష్య పనికిరాదు. నన్ను శక్తి సంయుతుడిగా ఎరిగినవారు నా అనుగ్రహం కోసం ఇలా తపస్సు చేస్తారు. వీరు ఎవరికీ ఏ అహితాన్నీ కోరరు.

అమర్షో నైవ కర్తవ్యస్తాపసేషు కదాచన ।
తపశ్చరంతి మునయః జ్ఞాత్వా మాం శక్తిసంయుతమ్ ॥ (10-15)

రుద్రుడి మాటలతో దేవేంద్రుడు కుదుటపడ్డాడు. అయితే వ్యాసుడు ఎందుకు తపస్సు చేస్తున్నట్టో అన్నాడు. పుత్రార్థియై తపస్సు చేస్తున్నాడు. నూరేళ్ళు పూర్తి అయ్యింది. అతడికి శుభప్రదుడైన పుత్రుణ్ణి ఇవ్వబోతున్నాను - అంటూనే శివుడు వ్యాసుడి ముందు ప్రత్యక్షమయ్యాడు.

వ్యాసమహర్షీ ! ఉత్తిష్ఠ, ఉత్తిష్ఠ. నీకు పుత్రుడు కలుగుతాడు. అతడు తేజస్వి జ్ఞాని కీర్తికరుడు అఖిలజనప్రియుడు అవుతాడు. సాత్త్విక గుణ సంపన్నుడై అందరి మన్ననలూ పొందుతాడు.

మహాదేవుడిచ్చిన వరానికి వ్యాసుడు సంతృప్తి చెందాడు. తపస్సు ముగించి ఆశ్రమం చేరుకున్నాడు. ఒకవైపు శ్రమ, మరొకవైపు ఆశ్రమంలో యాగాగ్నిని సిద్ధం చేసుకోవాలనే కంగారు. మథించి అగ్నిని



రగుల్కొల్పాలి. అందుకని ఎక్కడో దాచిపెట్టిన అరణిని బయటికి తీశాడు. కాష్ఠంతో మథిస్తున్నాడు. చిత్తంలో పుత్రవాంఛ మెదులుతోంది. మంథాన అరణి సంయోగంతో, మంథనంతో అగ్ని పుడుతోంది. మరి ఇలా నాకు పుత్రుడు ఎలా జన్మిస్తాడు ? పుత్రారణి అనిపించుకునే స్త్రీ నాకు లేదు గదా ! పోనీ అంటే, రూపయౌవన సంపన్నను తరుణిని తెచ్చిపెట్టుకుని పాదాలకు సంకెళ్ళు వేసుకోనా ! వంశాన్ని నిలబెడుతుంది, సౌఖ్యాన్ని అందిస్తుంది, సేవలు చేస్తుంది - ఇవన్నీ నిజమే కానీ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు మాత్రం తరుణీమణి ప్రతిబంధకమే.

**పతివ్రతాపి దక్షాపి రూపవత్యపి కామినీ ।**
**సదా బంధనరూపా చ స్వేచ్ఛా సుఖవిఘాతినీ ॥ (10-28)**

శివుడంతటివాడికే తప్పలేదు. నిరంతరం కామినీపాశ బద్ధుడు. నేననగా ఎంత ! అయినా, ఇప్పటికిప్పుడు గృహస్థాశ్రమమంటే ఎలా వస్తుంది నాకు ?

అరణిముందు కూర్చుని మంథానంతో మథిస్తూ వ్యాసుడు ఇలా దిగులు పడుతున్నాడు. సరిగ్గా అదే సమయానికి ఘృతాచి అనే అప్సరస ఎవరో పంపినట్టు ఆశ్రమం వైపు వచ్చింది. కదలిక మరిచిపోయిన మెరుపుతీగలా ఆకాశంలో దగ్గరగా నిలిచింది. విలాసంగా క్రీగంటి చూపులతో గిలిగింతలు పెట్టింది. వ్యాసుడి మనస్సులో కదలికలు మొదలయ్యాయి.

పెద్ద సంకటం వచ్చిపడిందే. ఏం చెయ్యను. ఒకవైపు ఆశ్రమధర్మం. మరొకవైపు మన్మథభావ విజృంభణ. నన్ను పల్టీకొట్టించడానికే ఇది ఇటు వచ్చింది. అంగీకరించనా ? పూర్తిగా నూరేళ్ళూ కఠిన నియమాలతో ఘోర తపస్సు చేసి చివరికి ఇలా లొంగిపోయాడని మహాతాపసులు పరిహసించరూ ! అంతటి మహాతపస్వి ఒక అప్సరసను చూసి చటుక్కున ఎలా వివశుడైపోయాడని కళ్ళు చిట్లించరూ !

పోనీ, నింద వస్తే వచ్చింది. గృహస్థాశ్రమసుఖం ముందు అది ఏపాటిది కనక. వ్రతం చెడినా ఫలం దక్కాలి అన్నారు. నా పుత్ర వాంఛ తీరడం ముఖ్యం. అది స్వర్గాన్ని ఇస్తుందనీ మోక్షాన్ని ఇస్తుందనీ జ్ఞానులు చెప్పారుగదా! అయితే ఈ అప్సరసవల్ల అది నెరవేరుతుందా? ఏమో, నాకయితే సందేహమే. వెనకటికి నారదుడు చెప్పిన కథలోలాగా అవుతుందేమో. ఆ ఊర్వశి పురూరవుణ్ణి దగాచేసినట్టు ఇది చెయ్యదని నమ్మకం ఏమిటి? ***(అధ్యాయం - 10, శ్లోకాలు - 36)***

ఇలా రకరకాల సందేహాలతో సంకల్పవికల్పాలతో వ్యాసుడిలో అంతర్మథనం సాగుతోంది - అనిచెప్పి సూతుడు గుక్కతిప్పుకోవడం కోసం ఆగాడు. అంతే, మరొక మహాముని అడ్డుతగిలాడు.



సూతమహర్షీ! ఈ పురూరవమహారాజు ఎవరు? ఊర్వశి అన్నావు. ఆవిడ ఎవరు? ఏమి చేసింది? రాజుకి వచ్చిన కష్టం ఏమిటి? ఇదేదో చాలా ఆసక్తికరంగా ఉంది. ఆ కథానకాన్ని పూర్తిగా రసవత్తరంగా చెప్పు. నువ్వు అసలే రోమహర్షణుడి కొడుకువాయె. మా తనువులు పులకించేట్టు రక్తికట్టించు. మహానుభావా! మాటల్లో అమృతాన్ని మించిన రుచి ఉంది. అసలైన అమృతాన్ని అమరులు సేవించి తృప్తి చెందారు గానీ నీ వాగమృతాన్ని ఎంతసేవించినా మాకు మాత్రం తనివితీరడం లేదు.

అమృతాదపి మృష్టా తే వాణీ సూత! రసాత్మికా ।
న తృప్యామో వయం సర్వే సుధయా చ యథామరాః ॥ (11 - 6)

ఈ మాటలతో ముందుగా సూతుడికి తనువు పులకించింది. ఉత్సాహం ఉరకలు వేసింది. రసవత్తరంగా చెబుతాను విని ఆనందించండి అంటూ ప్రారంభించాడు.

## ◆ తారా శశాంక వృత్తాంతం ◆

మునులారా! బృహస్పతికి తార అని ఒక ప్రియ భార్య ఉంది. ఆవిడ చాలా ప్రసిద్ధురాలు. వినే ఉంటారు. మంచి రూపవతి. యౌవనవతి. నిరంతరం మదవిహ్వలాంగి. ఆవిడ ఒకనాడు, ఏదో యజ్ఞం చేస్తున్నాడంటే చూడటానికని చంద్రుడి ఇంటికి వెళ్ళింది. అక్కడ చూశాడు ఈ చంద్రముఖిని ఆ చంద్రుడు. చూస్తూనే కామాతురుడయ్యాడు. చంద్రుణ్ణి చూసి ఆవిడకూడా అంతకన్నా మదన పీడితురాలయ్యింది. పరస్పరం ప్రేమ అంకురించి కళవళపడ్డారు. తార తన ఇల్లు మరిచిపోయింది. అక్కడే ఉండిపోయింది. ఇద్దరూ మన్మథక్రీడలలో మునిగి తేలుతున్నారు. రోజులు క్షణాల్లా గడిచిపోతున్నాయి.

బృహస్పతి దుఃఖానికి అంతులేదు. తారను ఇంటికి తెచ్చుకోవడం ఎలాగో తెలియక చాలాకాలం మథనపడ్డాడు. ఒకరోజున తన శిష్యులలో ఒకణ్ణి చంద్రుడి ఇంటికి పంపించాడు తారను తీసుకురమ్మని. కానీ ఆవిడ రాను పొమ్మంది. మళ్ళీ మరొక శిష్యుణ్ణి పంపాడు. ఇలా వెళ్ళినవాళ్ళల్లా తిరిగివచ్చారు. ఇక వెళ్ళం అన్నారు. బృహస్పతి క్రుద్ధుడయ్యాడు. అయితే నేనే వెడతానంటూ స్వయంగా వెళ్ళాడు. మదమత్తుడైన చంద్రుడు అదోలా నవ్వాడు. బృహస్పతికి మరీ వళ్ళుమండింది.

శశీ! ఏమిటి నువ్వు చేసిన పని? ధర్మమేనా? నా భార్యను ఎందుకు అట్టేపెట్టేసుకున్నావ్? నేను దేవతలకు గురువును. నువ్వో యజమానుడవు. మూఢుడా! గురుభార్యను ఇలా ఉంచుకోవచ్చునా, అనుభవించవచ్చునా? బ్రాహ్మణుణ్ణి చంపడం, బంగారాన్ని అపహరించడం, సురాపానం చెయ్యడం, గురువుగారి భార్యను అనుభవించడం ఇవ్వి మహాపాతకాలు. ఇటువంటివి చేసిన వాళ్ళతో స్నేహం చేసేవాడు అయిదవ మహాపాతకి. తెలుసుగదా!



బ్రహ్మహా హేమహారీ చ సురాపో గురుతల్పగః ।
మహాపాతకినో హ్యేతే తత్సంసర్గీ చ పంచమః ॥ (11 - 15)

నువ్వు మహాపాతకివి. దురాచారుడివి. దేవలోకంలో ఉండే అర్హత లేదు నీకు. తారను విడిచిపెట్టు. ఇంటికి తీసుకుపోతాను. లేదంటే, దుష్టుడా! గురుభార్యా పహర్తవని లోకమంతా ప్రచారం చేస్తాను.

భార్యా విరహదుఃఖితుడై బృహస్పతి ఇలా మండిపడుతోంటే రోహిణీపతి చిద్విలాసంగా బదులు పలికాడు. గురూత్తమా! బ్రాహ్మణులకు క్రోధం పనికిరాదు. అక్రోధనులుగా ఉంటేనే వారు పూజార్హులు. అన్యథా, వర్జనీయులు సుమా! క్రోధం విడిచిపెట్టండి. నేను చెప్పేది ప్రశాంతంగా ఆలకించండి. తార తప్పకుండా మీ ఇంటికి వస్తుంది. ప్రస్తుతం ఇక్కడే ఉంది. తానై కోరి ఉంది. గమనించండి. సుఖపడుతోంది. కొంతకాలం ఉండనివ్వండి. మీకేమిటిట లోటు! తరవాత తానే వస్తుంది మీ ఇంటికి. వెనకటికి, ధర్మశాస్త్ర విషయం ఒకటి మీరే చెప్పారుగదా! న స్త్రీ దుష్యతి చారేణ న విప్రో వేదకర్మణా (11 - 22). విప్రుడు చేసిన పాపం వేదవిహిత ప్రాయశ్చిత్తంతో పోతుందనీ, స్త్రీకి పరపురుషసంగమ దోషం ఋతుస్రావంతో (చారేణ = రజస్స్రవేణ) అంతరిస్తుందనీను.

ఊహించని జవాబుకి బృహస్పతి తల తిరిగింది. గిరుక్కున వెనుదిరిగాడు. దుఃఖిస్తూ ఇల్లు చేరాడు. కొన్ని రోజులు గడిచాయి. ఊరుకోవడానికి మనసు ఒప్పలేదు. మళ్ళీ వెళ్ళాడు. ఈసారి ద్వారపాలకులు అడ్డుకున్నారు. లోపలికి వెళ్ళనివ్వలేదు. బృహస్పతి అక్కడే అలాగే చాలాసేపు నిలబడ్డాడు. చంద్రుడు బయటకు రాలేదు. (దుష్టుడి గుమ్మం తొక్కకూడదని వాకిటనే నిలిచాడు బృహస్పతి అని కొన్ని ప్రతులలో పాఠం).

బృహస్పతి కోపం వశం తప్పింది. వీడు నాకు శిష్యుడు. నా భార్య వీడికి తల్లితో సమానం. ఇంత అధర్మానికి ఒడిగట్టినవీణ్ణి శిక్షించి తీరాలి - అనుకున్నాడు. వాకిట్లోనే నిలబడి అరుపులు లంకించుకున్నాడు.

బుద్ధిహీనుడా! పాపాత్ముడా! సురాధమా ! ఏమీ ఎరగనట్టు కొంపలో పడుకొని హాయిగా నిద్రపోతున్నావా? రా, బయటికి రా. మర్యాదగా నా భార్యను నాకు వెంటనే అప్పగించు. లేదో, నిన్ను శపిస్తాను. భస్మం చేసేస్తాను.

దేహి మే కామినీం శీఘ్రం నోచేచ్ఛాపం దదామ్యహమ్ ।
కరోమి భస్మసాన్నూనం న దదాసి ప్రియాం మమ ॥ (11 - 28)



అంటూ పెడబొబ్బలు పెట్టాడు. ఇంకా ఇలాంటివే క్రూరంగా దుర్భాషలాడాడు. లోపల ఎక్కడో ఉన్న చంద్రుడికి వినిపించాయి. గబగబా ఇవతలికి వచ్చాడు. అదే నవ్వు, అదే వరస.

బృహస్పతీ! ఏమిటి ఎక్కువగా మాటాడుతున్నావ్? సర్వ లక్షణ సంయుత, అందాల బరిణ - తార నీకు భార్య ఏమిటి? నీకు తగిన ఒక కురూపిని ఎవతెనైనా ఏర్పాటు చేసుకో. నీలాంటి బిచ్చగాడి ఇంటిలో ఇలాంటి సుందరీమణి ఉండదగదు. ఉండకూడదు. అందగత్తెకు అందగాడిమీద రతి (మోజు, అభిలాష, కోరిక) ఉంటుంది తప్ప నీలాంటి కురూపిమీద ఉండదని కామశాస్త్రం కూడా చెబుతోంది. మూర్ఖుడా! తెలుసుకో. నీకు దిక్కున్న చోట చెప్పుకో. ఈ కామినీమణిని మాత్రం ఇవ్వనుగాక ఇవ్వను.

కామార్తుడివై నువ్వు ఇచ్చే శాపం నన్ను ఏమీ చెయ్యలేదు. పో! నీ ఇష్టం వచ్చింది చేసుకో.

**యథేష్టం గచ్ఛ దుర్బుద్ధే నాహం దాస్యామి కామినీమ్ ।**
**యచ్ఛక్యం కురు తత్కామం న దేయా వరవర్ణినీ ॥ (11 - 33)**

చంద్రుడు ఇలా తిరగబడే సరికి బృహస్పతి అవాక్కు అయ్యాడు. రుసరుసా నడుచుకుంటూ ఇంద్రుడి ఇంటికి వెళ్ళాడు. గురువుగారి వాలకం చూస్తూనే ఏదో జరిగిందని శచీపతి గ్రహించాడు. అర్ఘ్యపాద్యాదులతో యథావిధిగా మర్యాదలన్నీ జరిపాడు. కుశలప్రశ్నలు వేశాడు.

గురూత్తమా! దుఃఖితులై కనపడుతున్నారు. కారణం ఏమిటి? ఎవరైనా అవమానించారా? నా రాజ్యంలో నా గురువుకు అవమానం చేసేటంతటివాడు ఎవడుంటాడు! దిక్పాలకులతో సహా నా సైన్యమంతా మీ చెప్పుచేతలలో ఉండేదేగదా! త్రిమూర్తులు కూడా మీవెంట ఉండేవారే. మీకు సహాయకులే. చెప్పండి, మీకు వచ్చిన కష్టం ఏమిటో. ఇబ్బంది ఏమిటో తెలియజెయ్యండి.

దేవేంద్రా! నా భార్య తారను చంద్రుడు అపహరించాడు. ఎన్నిసార్లు అడిగినా ఎంత బతిమాలినా ఆ దుష్టుడు ఇవ్వడం లేదు. ఏం చెయ్యను? అవమానమూ దుఃఖమూ భరించలేక నిన్నిలా శరణువేడుతున్నాను. దయచేసి కల్పించుకో. సహాయం చెయ్యి.

గురువర్యా! మీరు ధర్మజ్ఞులు, సువ్రతులు. దుఃఖించకండి. నేను మీ దాసుణ్ణి. సహాయం చెయ్యడం నా విధి. మీ భార్యను మీకు అప్పజెప్పిస్తాను. ఇపుడే చంద్రుడి దగ్గరకు దూతను పంపుతాను. అప్పటికీ ఇవ్వనంటే ససైన్యంగా వెళ్ళి యుద్ధం ప్రకటిస్తాను. నామాట నమ్మండి. కాసింత ఊరడిల్లండి.

బృహస్పతిని ఓదార్చి దేవేంద్రుడు ఆ క్షణంలోనే ఒక సమర్థుడూ విచక్షణుడూ అయిన దూతను పిలిచి చంద్రుడి దగ్గరికి పంపించాడు. అతడు వెళ్ళి చంద్రుడితో దేవేంద్రుడి మాటగా ఇలా చెప్పాడు -



చంద్రా! నన్ను ఇంద్రుడు పంపించాడు. ఆయన నీకు చెప్పిరమ్మన్నది చెబుతున్నాను. విను. నువ్వు ధర్మం తెలిసినవాడివి. నీతి నియమాలు ఎరిగినవాడివి. నీ తండ్రి అత్రి ధర్మాత్ముడు. నువ్వు నింద్యమైన పనులు చెయ్యకూడదు. ఎవరి భార్యను వారు కాపాడుకోవడం లోక రీతి. కర్తవ్యం. రీతిని తప్పితే కలహం తప్పదు. నీ భార్యను కాపాడుకోవడంలో నువ్వు ఎలా శ్రద్ధ వహిస్తావో, యత్నపరుడివై ఉంటావో బృహస్పతీ అలాగే. 'ఆత్మవత్ సర్వభూతాని' అనే మాటను గుర్తుచేసుకో. ఒక్కసారి ప్రశాంతంగా ఆలోచించు. దక్షప్రజాపతి కూతుళ్ళు ఇరవై ఎనిమిదిమంది నీకు భార్యలుగా ఉన్నారు. చాలలేదా? గురుపత్ని కావలసివచ్చిందా? అంతగా కావలసివస్తే అందచందాలకూ శృంగార విలాసాలకూ పెట్టింది పేరైన మేనకాది అప్సరసలు ఉన్నారు. స్వేచ్ఛగా అనుభవించు. గురుపత్నిని విడిచిపెట్టు. నీవంటి వివేకవంతులూ అధికారులూ అహంకరించి ఇలా జుగుప్సితమైన పనులు చేస్తే అజ్ఞులకు అది ఆదర్శమై అనుకరించరూ! అప్పుడు సమాజం ఏమైపోవాలి ? ధర్మం మంటగలిసిపోదూ! అందుచేత, చంద్రమా! గురుపత్నిని వెంటనే విడిచిపెట్టు. నీకారణంగా దేవతలలో దేవతలకు కలహం జరక్కుండా చూడు.

దూత చెప్పిన ఇంద్రసందేశాన్ని సోముడు శ్రద్ధగానే ఆలకించాడు. కానీ పెడచెవిని పెట్టాడు. కొంచెం కోపావిష్టుడయ్యాడు. ప్రతిసందేశం పంపించాడు.

దేవేంద్రా! నువ్వు సర్వధర్మజ్ఞుడివి. దేవతలకు స్వయంగా అధిపతివి. నీ పురోహితుడుకూడా అంతటివాడే. మీ ఇద్దరి మతీ ఒక్కలాగానే ఉంది. ఎదుటివారికి నీతులు చెప్పడంలో అందరూ ఘనపాటులే. తమదాకా వస్తేమాత్రం అందరికందరే. చెప్పింది చేసేవాడు కలికానికైనా కనపడడు.

**పరోపదేశే కుశలా భవంతి బహవో జనాః ।**
**దుర్లభస్తు స్వయం కర్తా ప్రాప్తే కర్మణి సర్వదా ॥** **(11 - 56)**

శతక్రతూ! బార్హస్పత్యుడు రచించిన ధర్మశాస్త్రం ఒకటి ఉంది. ఒకసారి దాన్ని పరిశీలించు. నేను చేసినపనిలో తప్పు ఏముంది? నన్ను కామించిన స్త్రీని నేను అనుభవిస్తున్నాను. పైగా, బలవంతులకి ఏదైనా స్వకీయమే. దుర్బలులకి ఏదీ స్వకీయం కాదు, కానేరదు. స్వీయ - పరకీయ అంటూ గీతలు గీసుకోవడం బుద్ధిహీనులు పెట్టుకునే వట్టిభ్రమలు. తార పూర్తిగా నాపట్ల అనురక్త. అంతేకాదు గురుడిపట్ల అంతగానూ విరక్త. ధర్మం అనీ న్యాయం అనీ, అనురక్తను ఎలా విడిచిపెట్టమంటావ్? రక్తి ఉన్నచోట కలయిక తప్పదు, విరక్తి ఉన్నచోట విడిపోక తప్పదు. (రక్తురాలితోనే కదా కలయిక. విరక్తురాలితో కుదురుతుందా?) ఈ వరారోహను విడిచిపెట్టను. బృహస్పతికి అప్పగించను. సహస్రాక్షా! నువ్వు అధీశ్వరుడివి. నీ ఇష్టం. ఏది చెయ్యాలనుకుంటే అది చెయ్యి. దూతా! వెళ్ళు. ఇలాగని చెప్పు.



చంద్రుడు పంపిన ప్రతిసందేశాన్ని దూత వచ్చి యథాతథంగా వినిపించాడు. ఇంద్రుడు క్రుద్ధుడయ్యాడు. వెంటనే సైన్యాన్ని సమాయత్తపరిచాడు.

ఈ వార్త రాక్షసగురువు శుక్రాచార్యుడికి తెలిసింది. అతడికి బృహస్పతిపై అనాదిగా ద్వేషం. చంద్రుడి దగ్గరికి పరుగెత్తాడు. ఎట్టి పరిస్థితులలోనూ తారను విడిచిపెట్టవద్దు, ఒకవేళ యుద్ధమే వస్తే నా మంత్రశక్తితో (మంత్రాంగం) నీకు సహాయపడతానని మద్దతు ప్రకటించాడు. (విషయం శంకరుడికీ తెలిసింది. చంద్రుడికి బాసటగా నిలుస్తానన్నాడు). కట్టకడపటికి అది దేవదానవ సంగ్రామంగా రూపుదాల్చింది. యుద్ధం ప్రారంభమయ్యింది. తారకాసురయుద్ధంలాగా సంవత్సరాలు సాగింది.

బ్రహ్మదేవుడు పరిస్థితి గమనించాడు. ఇరుపక్షాలవారినీ శాంతింపచెయ్యాలనుకున్నాడు. హంసారూఢుడై ఆకాశమార్గాన వచ్చి రణస్థలిపై నిలిచాడు.

చంద్రా ! గురుపత్నిని విడిచిపెట్టు. లేదంటే, విష్ణుమూర్తిని పిలిచి నిన్ను మసిచేయిస్తాను. క్షయింపజేస్తాను. శుక్రాచార్యా! ఏమిటి ఈ అన్యాయం. సావాసదోషం సంక్రమించినట్టుందే నీకు?

బ్రహ్మదేవుడి గద్దింపు వినగానే శుక్రుడు పరుగుపరుగున చంద్రుణ్ణి సమీపించాడు. బాబూ! చంద్రా! తారను బృహస్పతికి అప్పగించేసెయ్యమని మీ తండ్రి అత్రి అభిప్రాయంకూడా. ఇప్పుడే నాకు కబురు పంపించాడు. అప్పగించేసెయ్యి అన్నాడు. సరే అన్నాడు శశి. అప్పటికే గర్భవతిగా ఉన్న తారను తీసుకువచ్చి బృహస్పతికి అప్పగించాడు. అతడు సంతోషంగా స్వీకరించి ఇంటికి తీసుకువెళ్ళాడు. యుద్ధం ముగిసింది. దేవదానవులు ఎవరి ఇళ్ళకు వాళ్ళు వెళ్ళిపోయారు. (విరించి బ్రహ్మలోకానికీ శంకరుడు కైలాసానికీ నిష్క్రమించారు).

కాలం గడిచింది. నెలలు నిండాయి. ఒక మంచి రోజున ఒక మంచి ముహూర్తాన తార ప్రసవించింది. చందమామలాంటి మగబిడ్డ జన్మించాడు. బృహస్పతి సంబరపడ్డాడు. నిస్సంకోచంగా - యథావిధిగా జాతకర్మలు జరిపించాడు.

పుత్రుడు పుట్టాడని చంద్రుడికి తెలిసింది. దూతతో వర్తమానం పంపించాడు. బృహస్పతీ! వీడు నీ కొడుకు కాదు. నాకు పుట్టినవాడు. జాతకర్మలను నువ్వు ఎలా చేస్తావు? శాస్త్రప్రకారం నేను చెయ్యాలి.

దూత చెప్పిన ఈ మాటలకు బృహస్పతి కణకణలాడాడు. మతిలేకపోతేసరి, వీడు నా కొడుకు. నా పోలికలే కనపడుతున్నాయి. సందేహం లేదు. పొమ్మన్నాడు. వివాదం చెలరేగింది. గాలివాన అయ్యింది. దేవదానవులు మళ్ళీ మోహరించారు. శాంతికాముకుడై చతుర్వదనుడు స్వయంగా మళ్ళీ వచ్చాడు. ఇరువాగులనూ వారించాడు. తారను పిలిచి అడిగాడు. నిజం నీకు తెలుసుగదా! వీడు ఎవరి



కొడుకో చెప్పమన్నాడు. తార సిగ్గుపడింది. తల దించుకుంది. క్రీగంట నేలచూపులు చూస్తూ సన్నగొంతుతో మెల్లగా చెప్పింది. చంద్రుడి కొడుకేనంది. చందమామ ఎగిరి గంతువేశాడు. పుత్రుణ్ణి చంకనబెట్టుకుని వెళ్ళిపోయాడు. బుధుడు అని ముద్దుగా పేరుపెట్టుకున్నాడు.

ఇదీ బుధోత్పత్తి కథ. గురుక్షేత్రంలో సోముడి వల్ల జన్మించాడు.

*(అధ్యాయం - 11, శ్లోకాలు - 86)*

## ◆ ఊర్వశీ పురూరవ వృత్తాంతం ◆

శౌనకాది మహామునులారా! ఈ బుధుడికి ఇళ అనే స్త్రీతో సంగమం వల్ల, మన ప్రస్తావనకు వచ్చిన పురూరవుడు జన్మించాడు. అతడు మహాదాత, యజ్ఞవిధాత. ఆ వృత్తాంతం చెబుతాను. అద్భుతావహంగా ఉంటుంది. వినండి.

అనగాఅనగా ఒక రాజు. అతడిపేరు సుద్యుమ్నుడు. అతడు ఒక రోజు గుర్రం ఎక్కి వేటకు వెళ్ళాడు. మందీమార్బలం వెంటవెళ్ళింది. రకరకాల మృగాలను చంపుతూ అరణ్యమంతా అతలా కుతలం చేశాడు. బాగా అలిసిపోయాడు. అంతలోకీ – ఆ మేరుపర్వత సమీపంలో ఒక అందమైన ఉద్యానవనం కనిపించింది. మందార తరువులు. అశోకవృక్షాలు. సాల-తాల-తమాల-చంపక-పనస-ఆమ్ర-నీప-మధూక-భూజాలు. మాధవీలతామండపాలు. దాడిమ-నారికేళ-కదళీ-ఫలభరిత భూమిజాతాలు. యూథికా-మాలతీ-కుందపుష్పవల్లీ పరిమళాలు. తుమ్మెదల ఝుంకారాలు. హంస-కారండవ-కోకిల-శుక-శారికా కలకూజితాలు. కీచక ధ్వనులు (వెదురు పొదల్లో గాలి సవ్వడి). ఎవరో తీర్చి దిద్దినట్టున్న ఉద్యానవనం. సుద్యుమ్నుడు పరవశించిపోయాడు. సేవకులతోసహా ప్రవేశించాడు.

ప్రవేశించడమే తడవుగా అందరూ ఆడవాళ్ళు అయిపోయారు. గుర్రం కూడా ఆడగుర్రం అయిపోయింది. ఇదేమిటి భగవంతుడా అని లబోదిబోమన్నారు. ఆశ్చర్యపోయారు. కారణం ఏమిటో ఎవ్వరికీ ఏమీ తెలియలేదు.

సుద్యుమ్నుడికి దుఃఖంతోపాటు సిగ్గు ముంచుకు వచ్చింది. ఏమి చెయ్యను? ఇంటికి ఎలా వెళ్ళేది? రాజ్యం ఎలా పరిపాలించడం? ప్రజలు ఏమనుకుంటారు? ఎవరు నన్ను మోసగించినట్టు? ఇలా అన్నీ ప్రశ్నలే. దేనికీ సమాధానం లేదు. మథనపడిపోయాడు.



సూతుడు చెబుతూంటే వింటున్న శౌనకాదులకూ అబ్బురమయ్యింది. అదేమిటి! పురుషుడు స్త్రీగా మారిపోవడమా? మగగుర్రం ఆడగుర్రం (బడబ) అయిపోవడమా! చాలా వింతగా ఉందే. సూతమహర్షీ! ఇది ఆ ఉద్యానవన మాహాత్మ్యమంటావా? అందులోకి ప్రవేశించి ఆ మహారాజు అసలు ఏం చేశాడు? వివరంగా చెప్పు మహానుభావా! - అన్నారు.

మునిపుంగవులారా ! మీ ఊహ నిజమే. అదంతా ఆ ఉద్యానవన మాహాత్మ్యమే. అది చెబుతున్నాను. తెలుసుకోండి.

ఒకప్పుడు పరమేశ్వరుణ్ణి దర్శించడానికి సనకసనందనాది మహామునులు ఆ ఉద్యానవనానికి వచ్చారు. వారి దివ్యతేజస్సుతో చీకట్లు పటాపంచలైపోతున్నాయి. ఆ సమయంలో శంకరుడు పార్వతితో ఏకాంతం అనుభవిస్తున్నాడు. కామక్రీడా పరాయణులై ఉన్నారు. పార్వతి వంటిమీద నూలుపోగు లేదు. శివుడి ఒడిలో కూర్చుని పరవశిస్తోంది. సనకాదులను చూసి సిగ్గుతో వొణికిపోయింది. దిగ్గునలేచి చీర చుట్టుకుంది. వొణుకు తగ్గలేదు. స్థాణువై నిలబడిపోయింది.

ఋషులు పొరపాటు గ్రహించారు. వెంటనే నిష్క్రమించారు. నరనారాయణాశ్రమానికి పరుగుతీశారు. శివుడు పార్వతిని ఎంతగానో సముదాయించాడు. ఈరోజునుంచి ఏ పురుషుడైనా ఈ వనంలోకి ప్రవేశిస్తే స్త్రీగా మారిపోతాడని శాపం పెట్టాడు. అప్పటినుంచీ, తెలిసినవాళ్ళెవరూ ఆ వనంలోకి వెళ్ళరు. సుద్యుమ్నుడు ఇది తెలియక వెళ్ళాడు. స్త్రీగా మారిపోయాడు. అనుచరుల గతీ అంతే అయ్యింది.

స్త్రీగా మారిపోయిన సుద్యుమ్నుడు ఆ వనం విడిచి ఇవతలికి వచ్చి అరణ్యంలోనే ఉండిపోయాడు. రాజ్యానికి వెళ్ళేందుకు మనసు ఒప్పలేదు. ఇళ అనేపేరుతో అడవిలోనే అలా అలా తిరుగుతున్నాడు. పరివారం చెలికత్తెలై సేవలు చేస్తున్నారు.

ఇలా ఉండగా ఒకరోజున - సోముడి కొడుకు బుధుడు యౌవనవంతుడై ఆ అడవికి వేటకు వచ్చాడు. ఇళను చూశాడు. కన్ను చెదిరింది. మోహితుడయ్యాడు. హావభావాలు ఆకర్షించాయి. ఇళకూడా అలాగే స్పందించింది. బుధుణ్ణి పతిగా వరించింది. గాంధర్వరీతిని వివాహం చేసుకున్నారు. పుత్రుడు కలిగాడు. పురూరవసుడని నామకరణం చేశారు.

ఇళకు (సుద్యుమ్నుడికి) మళ్ళీ దుఃఖం ముంచుకు వచ్చింది. ఏమిటి నా బతుకు ఇలా అయిపోయింది అనిపించింది. తమ కులగురువు వసిష్ఠుణ్ణి స్మరించింది. ఆయన వచ్చాడు. దుర్దశకు జాలిపడ్డాడు. శంకరుణ్ణి ప్రార్థించాడు. సుద్యుమ్నుడి స్త్రీత్వాన్ని తొలగించమని అభ్యర్థించాడు. పూర్వం తాను పెట్టిన శాపానికి భంగం కలగకుండా మధ్యేమార్గంగా శివుడు వరం ప్రసాదించాడు. ఈ సుద్యుమ్నుడు ఇకనుంచి ఒకనెల పురుషుడుగా, ఒకనెల స్త్రీగా ఉంటాడన్నాడు.



ఈ మాత్రానికే సంబరపడ్డ సుద్యుమ్నుడు పురుషుడిగా మారి రాజ్యానికి వెళ్ళాడు. వసిష్ఠుడి అనుగ్రహంతో పరిపాలన సాగిస్తున్నాడు. స్త్రీరూపాన్ని పొందిన నెలనాళ్ళూ రాజమందిరం విడిచి బయటికి రావడంలేదు. పురుషరూపం నెల్లాళ్ళూ పరిపాలన చేస్తున్నాడు. నెలపాటు దర్శనం, నెలపాటు అదర్శనం. ప్రజలకు ఇది నచ్చలేదు. అయినా, కాలం గడుస్తోంది. అది ఆగదుగదా! పురూరవుడు యౌవనంలోకి అడుగుపెట్టాడు. వెంటనే (ఇళ) సుద్యుమ్నుడు రాజ్యం అతడికి అప్పగించేసి అడవులకు వెళ్ళిపోయాడు.

నారదుడు ఉపదేశించిన నవాక్షర - దేవీమహామంత్రాన్ని జపిస్తూ తీవ్రంగా తపస్సు చేశాడు. భవసాగరతారిణి శివాదేవికి అనుగ్రహం కలిగింది. సగుణాకారంలో సింహారూఢయై ప్రత్యక్షం అయ్యింది. వారుణీపానమదమత్తగా ఘూర్ణమానయనాలతో దివ్యరూపంలో భయద మనోహరంగా ఉంది.

సింహారూఢా స్థితా చాగ్రే దివ్యరూపా మనోరమా ।
వారుణీపాన సమ్మత్తా మదాఘూర్ణితలోచనా ॥ (12 - 39)

## ◆ ఇళాకృత దేవీస్తుతి ◆

ఇళాదేవి (సుద్యుమ్నుడు) భక్తిప్రపత్తులతో నమస్కరించి జగదంబికను స్తుతించింది.

దివ్యం చ తే భగవతి ప్రథితం స్వరూపమ్
దృష్టం మయా సకలలోక హితానురూపమ్ ।
వందే త్వదంఘ్రికమలం సురసంఘసేవ్యమ్
కామప్రదం జనని చాపి విముక్తిదం చ ॥ (12 - 41)

జగన్మాతా! త్రిమూర్తులూ, దిక్పాలకులూ, దేవతలూ మహర్షులూ మునీశ్వరులే నిన్ను తెలుసుకోలేక మోహవిభ్రాంతిలో పడిపోతూంటే ఇక మానవమాత్రులమాట చెప్పాలా! సృష్టిలో కనిపించే ఐశ్వర్యం అంతా నువ్వే.

లక్ష్మీదేవిగా విష్ణుమూర్తికి నీ సాత్త్వికరూపం మాత్రమే తెలుసు. సరస్వతీదేవిగా బ్రహ్మకు నీ రాజసరూపం మాత్రమే తెలుసు. పార్వతీదేవిగా శివుడికి నీ తామసీరూపం మాత్రమే తెలుసు. కానీ నిర్గుణతత్త్వం ఎవరికీ తెలియదు.

జానాతి విష్ణురమితద్యుతిరంబ సాక్షాత్
త్వాం సాత్త్వికీముదధిజాం సకలార్థదాం చ ।



కో రాజసీం, హర ఉమాం కిల తామసీం త్వామ్
వేదాంబికే! న తు పునః ఖలు నిర్గుణాం తామ్ ॥ (12 - 44)

అమ్మా! ఇంత మందమతిని నేనెక్కడ, నీ అమేయ ప్రభావం ఎక్కడ! కరుణామయివి కనక ఈ సేవకుణ్ణి ఇలా అనుగ్రహించావు.

లక్ష్మీదేవితో కలిసి మధుసూదనుడు నీ పాదకమలాలను అర్చిస్తుంటాడు. అశోకవృక్షంలా ఆ పురాణపురుషుడు నీ పాదతాడనంతో పులకించి పుష్పించాలని కోరుకుంటూంటాడు. సకలదేవనుతుడైన నీ భర్త కామార్తుడై నీపాదాలపైపడి నమస్కరిస్తే నువ్వు కోపంతో త్వంకారం చేస్తుంటావు (తిరస్కరిస్తుంటావు. నువ్వు నువ్వు అని ఏకవచనంతో మాట్లాడుతుంటావనిగానీ).

వాంఛత్యహో హరిరశోక ఇవాతికామం
పాదాహతిం ప్రముదితః పురుషః పురాణః ।
తం త్వంకరోషి రుషితా ప్రణతం చ పాదే
దృష్ట్వా పతిం సకలదేవనుతం స్మరార్తమ్ ॥ (12 - 47)

నువ్వు ఎప్పుడూ మేఘంలో మెరుపులా ఆ నీలమేఘశ్యాముని వక్షః స్థలంమీదనే కాపురం ఉంటావు. అది నీకు విశాలమైన పర్యంకం. ఇందులో వింత ఏముంది? జగదీశ్వరుడే నీకు వాహనమాయె! నువ్వు కనక కోపించి మధువైరిని పరిత్యజిస్తే ఆ శక్తిహీనుడికి నమస్కారం పెట్టేవాడు ఎవ్వడూ ఉండడు. లక్ష్మి వైదొలగితే ఏ పురుషుడి పనైనా ఇంతేకదా! లోకంలో చూడటంలేదూ! స్వజనమే విడిచిపెట్టేస్తారు. నిజానికి ఈ బ్రహ్మాదులు పురుషులు కారు. నీ పాదాలకు నమస్కరించే యువతులు. నువ్వే వాళ్ళను మగవాళ్ళను చేశావు. నువ్వు అనంతశక్తివి. ఏమని వర్ణించను, ఎలా వర్ణించను? నువ్వు పురుషుడివా, స్త్రీవా? సగుణవా, నిర్గుణవా? ఏమైనా కానీ, నేను మాత్రం నిరంతరం నీపట్ల భక్తినే కోరుకొంటున్నాను. శరణు వేడుకొంటున్నాను.

ఈ స్తోత్రానికి జగదంబిక సంతుష్ట అయ్యింది. సుద్యుమ్నుడికి సాయుజ్యం అనుగ్రహించింది. మునీశ్వరులకు కూడా దుర్లభమైన ఆ సుస్థిర పరమపదాన్ని ప్రసాదించింది.

*(అధ్యాయం - 12, శ్లోకాలు - 53)*

శౌనకాది మునీంద్రులారా! సుద్యుమ్నుడు దివంగతుడయ్యాక పురూరవుడు ప్రజానురంజకంగా రాజ్యం చేశాడు. అతడు అందగాడే కాదు మంచి గుణవంతుడు కూడా. సర్వధర్మాలూ తెలిసి, అందరూ



మెచ్చుకునేట్టు, ప్రతిష్ఠానం రాజధానిగా పరిపాలన సాగించాడు. అతడి మంత్రశక్తి, ప్రభుశక్తి, ఉత్సాహశక్తి అమోఘం. ఉత్తమోత్తమం. చతురుపాయాలూ అతడికి అధీనాలు. వర్ణాశ్రమధర్మాలను కాపాడుతూ భూరిదక్షిణలతో యజ్ఞాలు చేస్తూ, అర్థులను సంతృప్తిపరుస్తూ సమర్థుడైన పాలకుడుగా పరాక్రమశాలిగా ముల్లోకాలలోనూ ప్రఖ్యాతి గడించాడు.

ఇతగాడి విశేషాలు ఆనోటా ఆనోటా ఊర్వశికి తెలిశాయి. మనసు ముచ్చటపడింది. బ్రహ్మదేవుని శాపం కారణంగా భూలోకానికి వచ్చి నివసిస్తున్న ఆ ఊర్వశి పురూరవుణ్ణి వరించింది. అతడూ ఆమె రూప యౌవన సౌందర్యాదులకు ముచ్చటపడ్డాడు. పరస్పరం ముచ్చటించుకున్నారు.

ఊర్వశి మూడు నియమాలు పెట్టింది. ఒకటి - నేను నెయ్యి మాత్రమే భక్షిస్తాను. అది తప్ప మరొకటి నాకు పెట్టకూడదు. రెండు - సంభోగసమయంలో తప్ప నువ్వు నాకెప్పుడూ దిగంబరంగా కనపడకూడదు. మూడు - నాకు రెండు పెంపుడు పొట్టేలు పిల్లలు (ఉరణకాలు) ఉన్నాయి. వాటిని నువ్వు సంరక్షించాలి. అవి నాకు ప్రాణం. మాట ఇమ్మంది. తప్పావో నేను వెళ్ళిపోయానన్నమాటే అంది. పురూరవుడు అంగీకరించాడు.

పురారవసుడు తన రాజధర్మ - యజ్ఞ కర్మలను అన్నింటినీ వదిలేశాడు. పూర్తిగా ఊర్వశికి వివశుడైపోయాడు. ఈ సృష్టిలో ఊర్వశి తప్ప అతడికి మరింకేమీ లేదు. ఆమెను విడిచి క్షణమైనా ఉండలేకపోతున్నాడు. సంవత్సరాలు నెలలుగా, నెలలు రోజులుగా, రోజులు పూటలుగా, పూటలు గంటలుగా, గంటలు నిమిషాలుగా, నిమిషాలు క్షణాలుగా గడిచిపోతున్నాయి.

ఉన్నట్టుండి ఒకరోజున దేవేంద్రుడికి ఊర్వశి జ్ఞాపకం వచ్చింది. ఆమె లేనిస్వర్గం బోసిపోయినట్టనిపించింది. గంధర్వులను పిలిచి పురమాయించాడు. వెళ్ళి గొర్రెపిల్లలను అపహరించి తెండి. పురూరవుడు మాట తప్పినవాడు అవుతాడు కనక ఊర్వశి వదిలేసి వస్తుంది - త్వరగా వెళ్ళిరండి అని పంపించాడు.

బాగా చీకటిపడ్డాక గంధర్వులు అలాగే వెళ్ళి గొర్రెలను దొంగిలిస్తూంటే అవి కుయ్యిపెట్టాయి. వాటి అరుపులు ఊర్వశీ పురూరవులకు వినిపించాయి. తన రక్తం పంచుకుపుట్టిన పసికందుల ఆక్రందనంలా వినిపించింది ఊర్వశికి. ఉలిక్కిపడింది. రాజా! అదిగో నా గొర్రెపిల్లలను ఎవరో అపహరించుకుపోతున్నారు. అవ్వి నాకు ప్రాణాలతో సమానమనీ, కన్న బిడ్డలకంటే ఎక్కువ అనీ చెప్పానా? నువ్వే సంరక్షించాలి అన్నానా? వెళ్ళు వాటిని కాపాడు. ఆడదానిలాగా ఇంకా ఇలా చూస్తూ కూచున్నావేమిటి? మగాడివేనా? అయ్యో నారాత! నపుంసకుడు దొరికాడు నాకు - అంటూ దుయ్యబట్టింది, విలపించింది.



పురూరవుడు ఉన్నపళాన అలా నగ్నంగానే ఆ కారుచీకటిలో బయలుదేరాడు. వెంటనే గంధర్వులు రెండుమెరుపులు మెరిపించారు. అతడు నగ్నంగా కనిపించాడు. ఊర్వశి చూసింది. గంధర్వులు ఆ గొర్రెపిల్లలను అల్లంత దూరాన వదిలి వెళ్ళిపోయారు. పురూరవుడు వాటిని తీసుకుని శయన మందిరానికి తిరిగి వచ్చాడు. ఊర్వశి లేదు. సమయభంగం (ఒడంబడిక తప్పడం) అయ్యింది కనక వెళ్ళిపోయింది.

పురూరవుడు ఎంతగానో విలపించాడు. అంతటా అన్వేషించాడు. కామమోహితుడై దేశదేశాలూ తిరిగాడు. భూగోళం గాలించాడు. ఎట్టకేలకు కురుక్షేత్రంలో ఊర్వశి కనిపించింది. ముఖం విప్పారింది. కన్నులు మెరిశాయి.

ప్రియా, ప్రియా! ఆగు ఆగు. నన్ను విడిచిపోవడం దారుణం. ఏమి అపరాధం చేశానని. తనువూ మనసూ అన్నీ నీకే, నీ ఒక్కతెకే సమర్పించానే. నీకే దాసుడుగా మెలిగానే. ఇంతదూరం తీసుకువచ్చావు. ఇటు చూడు. దయచేసి అనుగ్రహించు. నువ్వు కాదంటే ఈ శరీరాన్ని ఇక్కడే వదిలేస్తాను. కాకులూ కుక్కలూ పొడుచుకుతింటే తిననీ.

మతి చలించినవాడిలా పురూరవుడు విలపిస్తున్నాడు. దయనీయంగా రోదిస్తున్నాడు. ఊర్వశి వెనుదిరిగి చూసింది. బాగా అలిసిపోయాడు. నీరసంగా ఉన్నాడు.

నృపశార్దూలా! ఎంత అమాయకుడివయ్యా! లోకజ్ఞానం బొత్తిగా లేదనుకుంటాను! ఏమయిపోయాయి నీ తెలివితేటలన్నీ? స్త్రీలకు ఎవరితోనైనా నిజమైన సఖ్యం ఉంటుందా! తోడేళ్ళు. దొంగలు. నీలాంటి ప్రభువులు మాలాంటి స్త్రీలను మరీ ఇంతగా విశ్వసించకూడదు. వెళ్ళు. ఇంటికి వెళ్ళు. హాయిగా రాజ్యం ఏలుకో. సుఖాలు అనుభవించు. నీ విషాదం ఇప్పుడే ఇక్కడే వదిలెయ్.

ఊర్వశి చాలా స్పష్టంగా తత్త్వోపదేశం చేసింది. అయినా పురూరవుడికి కనువిప్పు కలగలేదు. మోహం వదలలేదు. ఒక స్వైరిణి (స్వేచ్ఛగా తిరిగేది) స్నేహాన్ని నిజమని నమ్మి దుఃఖం కొనితెచ్చుకున్నాడు. అలా విలపిస్తూనే ఉన్నాడు.

మహామునులారా! ఇదీ ఊర్వశీ పురూరవులగాథ. వేదంలో మరింత విపులంగా ఉంది. నేను సంక్షేపంగా చెప్పాను.

***(అధ్యాయం - 13, శ్లోకాలు - 34)***

తన సమీపానికి వచ్చిన ఘృతాచిని చూసి వ్యాసుడు ఈ ఊర్వశి కథను తలుచుకున్నాడు. ఏమి చెయ్యాలో తోచలేదు. ఈ అప్సరసకు లొంగకూడదని మాత్రం అనుకున్నాడు.



ఘృతాచికూడా ఇంకొంచెం చనువు తీసుకోడానికి జంకింది. శపిస్తాడేమోనని భయపడింది. చిలకరూపం ధరించింది. అటూ ఇటూ గెంతింది. మరింత అద్భుతంగా కనిపించింది. వ్యాసుడు మరింతగా కలవరపడ్డాడు. తనువంతా మన్మథవివశం అయ్యింది. సర్వాంగాలూ స్వాధీనం తప్పి తిరుగుబాటు చేస్తున్నట్టు అనిపించింది. అయినా గొప్ప ధైర్యంతో మనస్సును చిక్కబట్టుకున్నాడు. నిలువరించుకోలేకపోతున్నాడు. గుండె జారిపోతోంది. ఘృతాచి ఘృతాచి అంటోంది. అరణిలో అగ్నిమథనం జరుగుతోంది. వేగం పెరిగింది. వీర్యస్ఖలనమయ్యింది. అరణిలో పడింది. చిలకడం కొనసాగింది.

అరణినుంచి పుత్రుడు జన్మించాడు. మూర్తీభవించిన ఘనుడు వ్యాసుడే. హవ్యంతో భగ్గుమన్న యాగాగ్నిలాగా ఉన్నాడు. వ్యాసుడు నివ్వెరపోయాడు. ఏమిటిది అని క్షణకాలం ఆలోచించాడు. శివుడిచ్చిన వరం జ్ఞాపకం వచ్చింది. అరణీగర్భ సంభూతుడు, తేజోరూపి పుత్రుడు జన్మించాడని సంబరపడ్డాడు. మరొక అగ్నిలా ఉన్నాడని మురిసిపోయాడు. గంగా జలంతో స్నానం చేయించాడు. జాతకర్మలు నిర్వహించాడు. ఆకాశంనుంచి పుష్పవృష్టి కురిసింది. దేవదుందుభులు మ్రోగాయి. గంధర్వులు గానం చేశారు. అప్సరసలు నృత్యం చేశారు. విద్యాధర నారద తుంబురులు తండ్రీకొడుకులను స్తుతించారు. అతడి కోసం కృష్ణాజినమూ దండకమండలువులూ ఆకాశం నుంచి ఆవిర్భవించాయి.

అంతరిక్షాత్పపాతోర్వ్యాం దండః కృష్ణాజినం శుభమ్ ।
కమండలుస్తథా దివ్యః శుకస్యార్థే ద్విజోత్తమాః ॥ (14 - 17)

వెంటవెంటనే ఆ బాలుడు మహాతేజస్విగా ఎదిగాడు. స్త్రీయంగా ఉపనయనం జరిగింది. తండ్రికిలాగానే ఇతడికీ పుట్టుకతోనే వేదాలన్నీ బుద్ధిస్థం అయ్యాయి.

శుకీరూపం ధరించిన ఘృతాచిని చూడటంవల్ల జన్మించాడు కనక సుతుడికి శుకుడు అని నామకరణం చేశాడు వ్యాసుడు. బృహస్పతిని గురువుగా వరించి బ్రహ్మచర్య దీక్ష ఇప్పించాడు. సకలవేదాలనూ వేదాంగాలనూ ధర్మశాస్త్రాలనూ సమగ్రంగా బృహస్పతి ఆశ్రమంలో గురుకుల పద్ధతిలో అభ్యసించాడు శుకుడు. చదువు పూర్తి అయ్యింది. గురుదక్షిణ చెల్లించి తిరిగి వ్యాసాశ్రమానికి వచ్చాడు. సంబరపడుతూ తండ్రి ఎదురువెళ్ళి ప్రేమగా కౌగిలించుకుని శిరస్సు మూర్కొన్నాడు. కుశలం అడిగి చదువు సంధ్యల విషయం అడిగి మురిసిపోయాడు. అందమైన ఒక ముని కన్యను చూసి శుకుడికి వివాహం చెయ్యాలనుకొన్నాడు.



## ◆ శుక వ్యాస సంవాదం ◆

నాయనా! చదువులన్నీ పూర్తి చేశావు. చాలా ఆనందంగా ఉంది. ఇక గృహస్థాశ్రమం స్వీకరించు. దేవతలనూ పితృదేవతలనూ అర్చించు. మనుమణ్ణి బహూకరించి నన్ను ఋణవిముక్తుణ్ణి చెయ్యి. అపుత్రస్య గతిర్నాస్తి అన్నారు. నా కోరిక తీర్చు. ఎంతో తపస్సు చేస్తే అయోనిజుడుగా నువ్వు నాకు జన్మించావు.

వ్యాసుడు ఇలా తనలోతానుగా మాట్లాడేస్తున్నాడు. శుకుడు కల్పించుకుని అడ్డుకట్ట వేశాడు. తండ్రీ! మీరేమంటున్నారో నాకు తెలియడం లేదు. మీరు ధర్మజ్ఞులు. తత్త్వం తెలిసినవారు. నేను మీకు శిష్యుణ్ణి. ఆజ్ఞాపించండి. చేస్తాను - అన్నాడు.

తనయా! నీకోసమని నూరేళ్ళు తపస్సు చేశాను. ఎంతో శ్రమపడ్డాను. శివానుగ్రహంవల్ల నువ్వు జన్మించావు. ఏ మహారాజునో అడిగి నీకు పుష్కలంగా ధనం సమకూరుస్తాను. యౌవనంలో ఉన్నావు. సుఖాలు అనుభవించు.

తండ్రీ! అసలు ఈ మానవలోకంలో ఆరోగ్యకరమైన సుఖం అంటూ ఏదయినా ఉన్నదా? ప్రతిసుఖంలోనూ దుఃఖస్పర్శ తప్పదుగదా! మరి నీవంటి ప్రాజ్ఞులు వాటిని నిజంగా సుఖాలు అంటారా? అనరుగా !

కిం సుఖం మానుషే లోకే బ్రూహి తాత నిరామయమ్ ।
దుఃఖవిద్ధం సుఖం ప్రాజ్ఞ న వదంతి సుఖం కిల ॥ (14 - 36)

పోనీ, నువ్వన్నట్టు వివాహం చేసుకుంటానే అనుకో. ఆవిడకి వశవర్తిని కావలసిందేగా! పరతంత్రుడికి అందునా స్త్రీవిజితుడికి సుఖం ఏమిటి? ఇనుప సంకెళ్ళలోనో, కొయ్య బోనుల్లోనో తగుల్కొన్నవాడికి ఒకప్పటికి కాకపోతే ఒకప్పటికైనా మోక్షం ఉంటుందేమో గానీ దారపుత్రరూపమైన సంసారబంధంలో ఇరుక్కొన్నవాడు ఎప్పటికీ బయటపడలేడు. మలమూత్ర సంభూతమై మలమూత్ర భరితమైన ఈ దేహం మీద జ్ఞానులకు కోరిక ఉండదు. పైగా నేను అయోనిజుణ్ణి. (గర్భవాసం, మలమూత్రస్పర్శ లేకుండా అరణినుంచి పుట్టినవాడు). నాకు యోని విషయకమైన కోరికలు ఎలా ఉంటాయి? ఎందుకు ఉంటాయి? అంతే కాదు తండ్రీ! నాకు మరో జన్మ అంటూ ఉంటే, అప్పుడు కూడా అయోనిజుడుగానే పుట్టాలనుకుంటున్నాను. అద్భుతమైన ఆత్మానందాన్ని విడిచిపెట్టి ఈ మలమూత్ర సుఖాలు నాకెందుకు!



వ్యాసమహర్షీ ! వేదాలు అధ్యయనం చేశాను. అవి కర్మ మార్గాన్ని ఉపదేశిస్తాయి. ఆ మార్గం హింసామయం. ఇదొక వైరుధ్యం. మరొకటి - బృహస్పతి కదా నాకు గురువు. ఆయన స్వయంగా సంసారసముద్రంలో మునిగినవాడు. ఆయన హృదయాన్ని అవిద్య (మాయ) ఆవరించింది. నన్నెలా తరింపజేస్తాడు చెప్పు. రోగగ్రస్తుడైన వైద్యుడు మరొక రోగికి వైద్యం చేసినట్టు, మోక్షార్థినైన నాకు అటువంటి బృహస్పతి గురువుగా ఉండటం వట్టి విడంబన. నటన. అందుకే ఆ గురువుకి నమస్కారం పెట్టి నీ దగ్గరికే వచ్చాను.

సంసారసర్పమంటే నాకు చచ్చే భయం. తత్త్వబోధ చేసి నువ్వే నన్ను కాపాడాలి. ఘోరమైన ఈ సంసారంలో పడి కొట్టుకోవడం మొదలుపెడితే ఇక దానికి అంతమంటూ ఉండదు. రేయింబవళ్ళు సూర్యుడిలా అవిశ్రాంతంగా పరిభ్రమించవలసిందే. ఆలోచించి చూస్తే ఈ సంసారంలో ఏ సుఖమూ లేదు. కానీ మూఢులు పేడలో పురుగుల్లాగా అదే సుఖం అనుకుంటూ ఉంటారు. వేదశాస్త్రాలు చదివినవారు సంసారలంపటులయ్యారంటే వారికన్నా మూర్ఖులుండరు. వాళ్ళకన్నా కుక్కలూ, గుర్రాలూ, పందులూ నయం. దుర్లభమైన మానవజన్మ ఎత్తి అత్యుత్తమ విద్యలైన వేదశాస్త్రాలను అధ్యయనం చేసి, వచ్చివచ్చీ సంసారంలో పడ్డాడంటే వాణ్ణి ఎవడు రక్షిస్తాడు? వాడికింక ముక్తి ఉంటుందా? అటువంటివాణ్ణి పండితుడు అని కీర్తించడం కన్నా అన్యాయమూ ఆశ్చర్యమూ ఉందా ? నా దృష్టిలో, ఈ సంసారబంధంలో ఇరుక్కోనివాడే అసలైన పండితుడు, మేధావి, శాస్త్రపారంగతుడు. భవబంధాలను విడిపించుకోడానికి పనికిరాని చదువు చదువేకాదు. దానికోసం శ్రమపడటం వృథా.

గృహస్థాశ్రమం గృహస్థాశ్రమం అంటున్నారే ఈ గృహశబ్దానికి అర్థం ఏమిటి? గృహ్ణాతి ఇతి గృహమ్. పురుషుణ్ణి పట్టి బంధిస్తుంది కనక గృహం. అదొక చెరసాల. అందులో సుఖం ఏమిటి? తండ్రీ! అదంటేనే నాకు భయం.

**గృహ్ణాతి పురుషం యస్మాత్ గృహం తేన ప్రకీర్తితమ్ ।**
**క్వ సుఖం బంధనాగారే తేన భీతోఽస్మ్యహం పితః ॥ (14 - 53)**

పూర్వజన్మలో పండితులై పుణ్యం చేసుకుని ఇప్పుడు మానవజన్మ ఎత్తి మళ్ళీ బంధనాల్లో తెలిసి తెలిసి తగుల్కొంటున్నారంటే వాళ్ళు ఎంత విధివంచితులో కదా! ఎంత మందమతులోకదా!

శుకుడి ప్రసంగం ప్రవాహంలా సాగుతోంది. ఈసారి అడ్డుకట్ట వెయ్యడం వ్యాసుడివంతు అయ్యింది. గంభీరంగా బదులు పలికాడు.

పుత్రకా! గృహం బంధనాగారం కాదయ్యా. అది బంధన కారణం కూడా కాదు. మనస్సు అన్నింటికీ కారణం. అది గనక బంధరహితంగా ఉంటే గృహస్థాశ్రమంలో ఉండీ మోక్షాన్ని పొందవచ్చు.



న గృహం బంధనాగారం బంధనే న చ కారణమ్ ।
మనసా యో వినిర్ముక్తో గృహస్థోఽపి విముచ్యతే ॥ (14 - 55)

న్యాయబద్ధంగా ధనం ఆర్జించి, వేదోక్తవిధులను ఆచరిస్తూ సత్యవాగ్నియమం పాటిస్తూ శుచిగా జీవించేట్టయితే గృహస్థుడికి కూడా మోక్షం లభిస్తుంది. అతడు సంసారంలో ఉన్నప్పటికీ ముక్తుడే. బ్రహ్మచారి, వానప్రస్థుడు, సన్యాసి - మూడు ఆశ్రమాలవారూ మధ్యాహ్నం అయ్యేసరికి గృహస్థుణ్ణే ఆశ్రయిస్తారు. సత్యవాదులై శుచిగా శ్రద్ధగా అన్నదానాదికం చేస్తూ గృహమేధులు తక్కిన ఆశ్రమాలవారికి మహోపకారం చేస్తున్నారు. గృహస్థాశ్రమం అన్నింటిలోకీ ఉత్తమోత్తమం. అంతకుమించిన ధర్మంలేదు. అందుకే వసిష్ఠుడు మొదలైన జ్ఞానులు ఎందరెందరో గృహమేధులయ్యారు. వేదమార్గంలో పయనించే గృహస్థులకు స్వర్గమూ మోక్షమూ ఉత్తమజన్మ - ఏది కోరుకొంటే అది లభిస్తుంది.

బిడ్డా! ధర్మవేత్తలు ఒకమాట చెప్పారు. ఒక ఆశ్రమం నుంచి ఒక ఆశ్రమానికి అధిరోహించాలి అని. నువ్వు బ్రహ్మచర్యాశ్రమంలో ఉన్నావు. ఇప్పుడు గృహస్థాశ్రమంలోకి ప్రవేశించాలి. అటుపైని వానప్రస్థసన్యాసాదులు. అంతేగానీ దుముకుళ్ళు చెల్లవు. అందుచేత గార్హపత్యాగ్నిని సముపాసించు. దేవతలనూ పితృదేవతలనూ మనుష్యులనూ ఆరాధనలతో సంతృప్తిపరచు. పుత్రుణ్ణి పొంది అతణ్ణి గృహస్థును చేసి వానప్రస్థం స్వీకరించు. అది పూర్తిచేసి సన్యాసాశ్రమంలో ప్రవేశించు.

ఇంద్రియాలున్నాయే ఇవ్వి అవ్వడానికి అయిదేకానీ గొప్ప మాదకద్రవ్యాలు. అందులోనూ అవివాహితుణ్ణి మరీ ఇబ్బందిపెడతాయి.

ఇంద్రియాణి మహాభాగ మాదకాని సునిశ్చితమ్ ।
అదారస్య దురంతాని పంచైవ మనసా సహ ॥ (14 - 64)

అందుచేత వివాహం చేసుకో. ఇంద్రియజయంకోసం తపస్సు చెయ్యి. విశ్వామిత్రుడు చూడు, మూడువేల సంవత్సరాలపాటు నిరాహారుడై తపస్సుచేసి ఇంద్రియాలను జయించాడు. అయినా మేనకను చూసి మోహితుడయ్యాడు. శకుంతల జన్మించింది. నా తండ్రి పరాశరుడు నావమీద నదిని దాటుతూ దాశరాజు కూతుర్ని చేపలకంపు కొడుతూ నల్లగా ఉండే సత్యవతిని చూసి మదన బాణ పీడితుడయ్యాడు. వెంటనే చేపట్టాడు. బ్రహ్మదేవుడు కూడా సొంత కూతురునే చూసి మోహపడ్డాడు. రుద్రుడు వారించాడనుకో. కాబట్టి నువ్వుకూడా వివాహం చేసుకో. కులమూ రూపమూ ఉన్న కన్యను పెళ్ళాడు. వేదమార్గంలో పయనించు.

*(అధ్యాయం - 14, శ్లోకాలు - 70)*



వ్యాసుడు ఇంత విపులంగా ఉపదేశం చేసినా శుకుడిలో మార్పు రాలేదు. అతడి నిర్ణయం మారలేదు. ఖండితంగా చెప్పాడు -

తండ్రీ! నువ్వు వెయ్యి చెప్పు, లక్ష చెప్పు. నేనుమాత్రం గృహస్థాశ్రమం స్వీకరించనుగాక స్వీకరించను. అది దుఃఖకరం. వలలాంటిది. నిత్యబంధనం. అందులో పడితే ధనచింత తప్ప మరొకటి ఉండదు. పోనీ అని ధన సంపాదన చెయ్యకపోతే (నిర్ధనుడుగా ఉండిపోతే) తనవాళ్ళే తనను హింసిస్తారు, పీడిస్తారు. ఇంద్రుడంతటివాడికే సుఖం లేదంటే ఒక ఇతరుల సంగతి చెప్పాలా? ఇంద్రుడు అన్నివిధాలా సంపన్నుడే. త్రిలోకాధిపతి. ఆ పీఠాన్నీ ఆ సంపదనూ కాపాడుకోడానికి అతడు పడే పాట్లు ఇన్నీ అన్నీనా! ఎవరు తపస్సు చేసుకుంటున్నా అతడికి దుఃఖమే. ఎన్ని విఘ్నాలు కల్పిస్తాడో.

సాక్షాత్తు లక్ష్మీదేవికి మగడై విష్ణుమూర్తి సుఖపడుతున్నాడంటావా? ఎప్పుడూ దానవులతో జగడాలూ యుద్ధాలూను. బ్రహ్మదేవుడి పరిస్థితీ ఇంతేనాయె. తపస్వులైన రాక్షసులకి వరాలు ఇస్తే ఒకతంటా, ఇవ్వకపోతే ఒక తంటా. పార్వతీపతి అవస్థ ఇంతకన్నా మెరుగేమీ కాదు. అందుకే ఈ ముగ్గురూ ఎప్పుడూ తపస్సులు చేసుకుంటూనే ఉంటారు. ఇంతటి ధనవంతులే సుఖనిద్రకు నోచుకోలేదంటే నిర్ధనులైన మామూలు మనుషుల సంగతి చెప్పాలా?

**కదాచిన్న సుఖీ శేతే ధనవానపి లోలుపః ।**
**నిర్ధనస్తు కథం తాత సుఖం ప్రాప్నోతి మానవః ॥** **(15 - 8)**

అన్నీ తెలిసీ ఓ మహర్షీ ! నన్ను - నీ కుమారుణ్ణి - ఈ సంసారకూపంలోకి దింపాలని చూస్తున్నావా? నీకిది భావ్యమా? సంసారంలో సుఖాలు లేకపోగా అన్నీ దుఃఖాలేనాయె. జన్మ దుఃఖం, జరా దుఃఖం, మరణ దుఃఖం. మలమూత్రాలు నిండిన గర్భవాసం చెయ్యడం పునర్దుఃఖం.

వీటన్నిటికన్నా మించిన దుఃఖం మరొకటి ఉంది. అది తృష్ణాలోభదుఃఖం. సంసారపోషణకోసం ధనసహాయం కోరి పరులదగ్గర చెయ్యిచాచడం మరణాన్ని మించిన దుఃఖం. ఇలా సంపాదించి జీవించే విప్రులు బుద్ధిబలం బొత్తిగా లేనివారు. వారి బతుకు దినదిన మరణం- రోజూ చావే. ఇన్ని శాస్త్రాలూ చదివి మహా విద్వాంసులై వెళ్ళి ధనవంతుల గుమ్మాల్లో నిలబడి వారిని స్తుతించడం. ఇది ఎంత చావు! ఇదంతా ఎందుకుట? సంసార పోషణకోసం. సంసారమే లేకపోతే ఒక్క పొట్ట నింపుకోడానికి ఇన్ని దైన్యాలు అవసరం లేదు గదా! హాయిగా అడవుల్లో పళ్ళూ నీళ్ళతో పొట్ట నింపుకోవచ్చుగా. అందుచేత మరొకసారి మనవిచేస్తున్నాను. సంసారానికి నేను సర్వాత్మనా విముఖుణ్ణి.



యోగశాస్త్రం నేర్పు. జ్ఞానశాస్త్రం సుఖప్రదం. కర్మకాండ అంటేమాత్రం నాకు సుతరామూ గిట్టదు. జన్మదాతా! దయచేసి కర్మక్షయోపాయం ఉపదేశించు. వర్తమాన ప్రారబ్ధ సంచితకర్మలు మూడూ నశించే మార్గం తెలియజెయ్యి. అంతేగానీ నారీబాహుబంధాల్లోకి నన్ను నెట్టకు. జలజాక్షి అంటే అచ్చం జలగే. తెలియకుండా రక్తం పీల్చేస్తుంది. హావభావ చేష్టలకు మూర్ఛితుడై మగాడు కానుకోలేడు. భోగాలపేర ధనాన్నీ, శక్తినీ, కుటిల సంభాషణలతో మనస్సునీ, క్రమంగా సర్వస్వమూ హరిస్తుంది కాంతామణి. అంతకు మించిన దొంగను సృష్టిలో మరిచూడలేం. నిద్రాసుఖాన్ని వదులుకోదలిస్తే వివాహం చేసుకోవాలి. బ్రహ్మదేవుడు ఈ వంకతో పురుషుల్ని వంచిస్తున్నాడు. మూర్ఖులు ఆ ఉచ్చులో పడిపోతున్నారు.

భోగైర్వీర్యం ధనం పూర్ణం మనః కుటిలభాషణైః ।
కాంతా హరతి సర్వస్వం కః స్తేనస్తాదృశోఽపరః ॥ (15 - 19)

శుకుడు ఇంత వైరాగ్యంతో మాట్లాడుతూంటే వ్యాసుడు చాలా దిగులు పడ్డాడు. ఏమి చెయ్యాలో తోచలేదు. ఎలా ఒప్పించాలో అర్థం కాలేదు. కళ్ళవెంట నీళ్ళు బొటబొటా కారాయి. మనస్సు బడలిపోయింది. శరీరంలో వణుకు మొదలయ్యింది. శుకుడు ఆశ్చర్యపోయాడు. కళ్ళు విప్పార్చి చూశాడు. ఆలోచనలో పడ్డాడు.

అహో! మాయాబలం ఎంతటిది! విష్ణ్వంశసంభూతుడై వేదాలను విభజించి పురాణాలు రచించి భారతం లిఖించిన మహాజ్ఞాని వ్యాసుణ్ణికూడా మోహపరుస్తోందంటే దాని శక్తి అమేయం, అజేయం. ఇంతకీ ఆ మాయ ఏమిటో అర్థం కావడం లేదు. త్రిమూర్తులనే మోహపరుస్తున్న ఆ మాయాశక్తిని శరణు వేడతాను. ప్రస్తుతం నా తండ్రి మహాసముద్రంలో నావపగిలిన బేహారిలా ఉన్నాడు. పామరుడిలా దుఃఖిస్తున్నాడు. నిజానికి ఇతడెవరు? నేనెవరు? ఎలా ఇక్కడికి వచ్చాను? ఈ భ్రాంతి ఏమిటి? పంచభూతాలతో నిర్మితమైన శరీరాలకు పితాపుత్రవాసన (బంధం) ఏమిటి? మాయావులను కూడా మాయచేసే మహామాయ ఇది. వ్యాసుడే ఇలా రోదిస్తున్నాడంటే దీనికి తిరుగులేదన్నమాటే.

ఇలా ఒక నిశ్చయానికి వచ్చిన శుకుడు మనస్సులో ఒక్కసారి మాయాదేవికి నమస్కరించాడు. దీనుడై శోకార్ణవంలో మునుగుతున్న వ్యాసుడికి మరింత చేరువయ్యాడు.

పరాశరాత్మజా! మహానుభావా! అందరికీ జ్ఞానోపదేశం చేసి నువ్విలా పామరుడవై శోకిస్తున్నావేమిటి? ఆశ్చర్యంగా ఉంది. సరే ఇవ్వేళ నీకు నేను పుత్రుణ్ణి. పూర్వజన్మల్లో నేనెవడిని? నువ్వు ఎవరు? ఈ భ్రాంతి ఏమిటి? ధైర్యం తెచ్చుకో. బుద్ధిని మేల్కొల్పు. మనస్సును విషాదంలోకి జారిపోనివ్వకు. ఇదంతా ఒక మోహజాలం అనుకుంటే దుఃఖం తనంతతానే తొలగిపోతుంది.



ఆకలివేస్తే తినుబండారంతో తీరుతుందేకానీ పుత్రదర్శనంతో తీరుతుందా? దాహంవేస్తే జలపానం చెయ్యాలి. అందగాడుగదా అని కొడుకును చూస్తూ కూర్చుంటే దప్పిక తీరుతుందా? ఘ్రాణసుఖం కావాలంటే సుగంధం ఉండాలి. శ్రవణానందం పొందాలంటే సంగీతం ఉండాలి. స్త్రీసుఖం కావాలంటే స్త్రీయే అవసరం. అన్ని సుఖాలూ పుత్రుడితోనే లభిస్తాయనుకోవడం భ్రమకాదూ! నిజానికి నేను అందించగలిగిన సుఖం, ఆనందం ఏమీలేదు. అజీగర్తుడు హరిశ్చంద్రుడికి యజ్ఞపశువుగా సొంత కొడుకునే సమర్పించాడు. తెలుసుగా!

సుఃఖపడాలి అనే లోభమే నీకుంటే పుష్కలంగా ధనం సంపాదించు. సర్వసుఖాలకూ సాధనం ధనమే. కొడుకు చేసేది ఏమీలేదు. నువ్వు దైవజ్ఞుడివి. మహామతివి. నన్ను ప్రబోధించు. నాకున్న గర్భవాసభయం తొలగించు. సంసార వాసనాజాలంలో బద్ధుడనయ్యాను అనే ఆలోచన నన్ను విడిచిపెట్టడం లేదు. ఈ బుద్ధిని మరల్చు. ఇది వృద్ధగామిని. నీవంటివారు చెబితే వింటుంది.

వ్యాసుడు రవ్వంత తేరుకున్నాడు. సన్యాసం వైపు మొగ్గు చూపుతున్న తనయుణ్ణి పరిశీలనగా చూశాడు. మెల్లగా బదులుపలికాడు.

అరణీగర్భసంభవా! నేను దేవీభాగవతం రచించాను. అది ఒకసారి చూడు. పెద్ద గ్రంథమేమీ కాదు. కేవలం పన్నెండు స్కంధాలు. కానీ అన్ని పురాణాలకూ అది తలమానికం. దాన్ని వింటే చాలు సదసద్వివేకం కలుగుతుంది.

వటపత్రం మీద పసిబాలుడై పడుకున్న విష్ణుమూర్తికి నన్ను ఎవరు ఇలా చేశారు, ఎందుకు చేశారు, దేనితో చేశారు అనే సందేహాలు వచ్చాయి. వీటిని ఎవరు తీరుస్తారా అని ఎదురు చూస్తుండగా జగజ్జనని - ఆది పరాశక్తి శ్లోకంలో సగభాగంతో సమాధానం చెప్పింది. ఇదంతా నేనే. నాకన్నా సనాతనం లేదు - అంది.

**శ్లోకార్ధేన తయా ప్రోక్తం భగవత్యాఖిలార్థదం ।**
**సర్వం ఖల్విదమేవాహం నాన్యదస్తి సనాతనమ్ ॥ (15 - 52)**

ఈ మాట ఇంతకు ముందు విన్నదే. విష్ణుమూర్తి మనస్సుకు తెలుసు. అయితే ఇప్పుడు ఈ సత్యవాక్కును ఎవరు పలికారు? గ్రహించలేకపోయాడు. వక్త ఎవరు? స్త్రీయా, పురుషుడా, నపుంసకుడా? అని ఆలోచనలోపడ్డాడు. అదే వాక్యాన్ని మళ్ళీ మళ్ళీ మననం చేస్తున్నాడు వటపత్రశాయి. అప్పుడు మహాదేవి శాంతస్వరూపంతో ప్రత్యక్షమయ్యింది. నాల్గు చేతులలో శంఖ - చక్ర-గదా-పద్మాలు వహించి, దివ్యాంబరాలూ దివ్యభూషణాలూ ధరించి, మందహాసం చిందిస్తూ మహాలక్ష్మి చిన్నారి విష్ణుమూర్తికి



కనువిందు చేసింది. ఆమె చుట్టూ ఆమె అంశతో ఆమెలాగే ఉన్న చెలికత్తెలు ఉన్నారు. రతి-భూతి-బుద్ధి-మతి-కీర్తి-స్మృతి-ధృతి-శ్రద్ధా-మేధా-స్వధా-స్వాహా-క్షుధా-నిద్రా-దయా-గతి-తుష్టి-పుష్టి-క్షమా-లజ్జా-జృంభా-తంద్రాశక్తులు విడివిడిగా ఆమెను పరివేష్టించి ఉన్నారు. అందరూ ఆయుధాలు ధరించారు. సువర్ణభూషణాలు ధగధగలాడుతున్నాయి. మెడలలో ముత్యాల దండలూ మందారమాలికలూ ప్రకాశిస్తున్నాయి.

బాలముకుందుడు అందరినీ చూశాడు. ఆశ్చర్యపోయాడు. వీరంతా ఎవరు? ఎక్కడినుంచి వచ్చారు? నేను ఈ వటపత్రం మీదకి ఎలా వచ్చాను? ఎవరు తెచ్చారు? శిశువును చేసింది ఎవరు? అసలు ఈ మర్రి ఆకు (వటపత్రం) ఎక్కడనుంచి వచ్చింది? ఈవిడ నా జననియా? లేదా మరేదయినా మాయయా? ఇప్పుడు దర్శనం ఎందుకిచ్చినట్టు? నేనిక్కడ ఉండవచ్చునా, ఎటయినా వైదొలగాలా? ఏమి మాట్లాడాలి? బాలుణ్ణి కనక మౌనంగా ఉండిపోనా? సందేహాలు ముసురుకున్నాయి

*(అధ్యాయం - 15, శ్లోకాలు - 67)*

మహాదేవి గమనించింది. సన్నగా నవ్వుతూ పలకరించింది. విష్ణూ! ఏమిటలా విస్తుపోతున్నావు! ఇది ప్రతిప్రళయంలోనూ జరిగేదే. కాకపోతే మహాశక్తి మహిమవల్ల నన్ను మరిచిపోతూ ఉంటావు. ఆ పరాశక్తి నిర్గుణ (నిరాకార). నువ్వూ నేనూ సాకారులం. నేను సాత్త్వికశక్తిని. గుర్తు తెచ్చుకో. నీ నాభికమలం నుంచి ప్రజాపతి(బ్రహ్మ) జన్మిస్తాడు. తపస్సుచేసి రాజసశక్తిని పొందుతాడు. రక్తవర్ణంతో ముల్లోకాలనూ సృష్టిస్తాడు. నువ్వు వాటిని రక్షిస్తావు. కోపించిన ఆ ప్రజాపతి నొసటినుంచి రుద్రుడు ఉద్భవిస్తాడు. తామసీశక్తి యుక్తుడై కల్పాంతంలో జగత్సంహారం చేస్తాడు. అందుకని నేను నీ దగ్గరికి వచ్చాను. గుర్తించు. నీ సాత్త్విక శక్తిని. లక్ష్మిని. నీ వక్షఃస్థలం మీద నిత్యానపాయినిగా నివసిస్తాను. మధుసూదనా! స్వీకరించు - అంది.

శౌరి సంతోషించాడు. కానీ, దేవీ! ఒక సందేహం. ఇందాక స్ఫుటాక్షరంగా ఒక శ్లోకార్థభాగం వినిపించింది. అది రహస్యం, అది పరమం, అది శివం. ఆ వాక్యాన్ని ఉచ్చరించింది ఎవరు? దరిద్రుడికి ధనస్పృహలాగా నేను దాన్నే స్మరిస్తున్నాను. ఉచ్చరించింది ఎవరో నీకు తెలిస్తే చెప్పు - అని అడిగాడు. మహాలక్ష్మి నవ్వుతూ ఇలా సమాధానం చెప్పింది.

పుండరీకాక్షా! అది ఉచ్చరించింది ఆదిపరాశక్తి. నువ్వు సాకారంగా ఉన్న నన్ను ఎరుగుదువు. నిరాకారయైన పరాశక్తిని ఎరగవు. అందుకని పరమగుహ్యమైన ఆ మహావాక్యాన్ని నీమీద ప్రేమతో నీకోసం నీ హితం కోరి పరాశక్తి స్వయంగా ఉచ్చరించింది. అది వేదసారం. సూక్ష్మరూపంలో దేవీభాగవతం. సకల శుభావహం. సర్వశాస్త్రసారం. మహావిద్యాప్రకాశకం. దానికన్నా తెలుసుకోదగింది ముల్లోకాలలోనూ లేదు. నువ్వు మహాదేవికి ఇష్టుడివి కనక నీకు ఉపదేశించింది. మరిచిపోక ఎప్పుడూ మననం చేసుకుంటూ ఉండు.



సుపుత్రా! శుకా! అప్పటినుంచీ చతుర్భుజుడు ఆ మహావాక్యాన్ని మంత్రంలా జపిస్తున్నాడు. కొంతకాలానికి నాభికమలం నుంచి చతుర్ముఖుడు జన్మించాడు. అతడికి ఒకప్పుడు రాక్షసభయం వచ్చిపడింది. హరిని శరణువేడాడు. అతడు యుద్ధం చేసి ఆ రాక్షసులు మధుకైటభులను ఇద్దరినీ సంహరించి, మళ్ళీ మునుపటిలాగానే ఆ శ్లోకార్ధభాగాన్ని జపిస్తూ కూర్చున్నాడు. బ్రహ్మకు సందేహం వచ్చి, ఏమిటి జపిస్తున్నావు- నువ్వే అందరికంటే అధికుడివిగదా అని ప్రశ్నించాడు. విష్ణుమూర్తి - త్రిమూర్తులకూ మూలకారణమైన పరాశక్తి తత్త్వాన్ని తెలియజెప్పి, ఆవిడ శ్లోకార్ధభాగంలో స్వయంగా ఉపదేశించిన మహావాక్యాన్ని జపిస్తున్నానన్నాడు. ఈ మంత్రమే దేవీభాగవతం. ద్వాపరయుగంలో దీనికి విపులీకరణ గ్రంథరూపంలో జరుగుతుంది. నువ్వుకూడా జపించమని ఉపదేశించాడు. అటుతర్వాత బ్రహ్మదేవుడు నారదుడికి ఉపదేశించాడు. నారదుడు నాకు ఉపదేశించాడు. నేను దాన్ని పన్నెండు స్కంధాల గ్రంథంగా విపులీకరించాను.

పుత్రకా! వేదసమ్మితమైన ఈ భాగవతపురాణమంతా దేవీ చరిత్ర. ఇది తత్త్వశాస్త్రం. ఇది ధర్మశాస్త్రం. బ్రహ్మవిద్యానిధానం. సంసారార్ణవతారకం. అజ్ఞాననాశకం. జ్ఞానప్రకాశకం. శాంతి సుఖదాయకం. దీర్ఘాయుష్యకరం. చదివేవారికీ వినేవారికీ శుభప్రదం. ఇదిగో స్వీకరించు. ఒకసారి శ్రద్ధగా చదువు. నీ యోగ్యత చూసి ఇస్తున్నాను. నీతోపాటు నా శిష్యుడు సూతుడు కూడా (రోమహర్షణ సుతుడు) దీన్ని చదువుతాడు. కలిసి చదవండి. పద్ధెనిమిదివేల శ్లోకాల గ్రంథం - అని చెప్పి వ్యాసుడు తన దేవీభాగవతాన్ని శుకుడికి అందించాడు.

శౌనకాది మహామునులారా! ఆ విధంగా గురుపుత్రుడు శుకుడితో కలిసి నేను ఈ దేవీభాగవతం చదివాను. సరే అది అలా ఉంచండి. శుకుడికి అప్పటికీ మనశ్శాంతి లభించలేదు. మరింత వికలమనస్కుడు అయ్యాడు. అందరినీ తప్పించుకుని ఎప్పుడూ ఏకాంతంగా గడుపుతున్నాడు. ఏభావమూలేని చూపులతో దిక్కులు చూస్తున్నాడు. అటు భోజనాలూకాదు ఇటు ఉపవాసాలూకాదు. దేనిమీదా అతడికి ఆసక్తి నిలవడంలేదు. ఏదో బెంగపెట్టుకున్నట్టు అయిపోయాడు. వ్యాసుడు గమనించాడు. ఒకరోజున పిలిచి విషయం కనుక్కున్నాడు.

నాయనా! ఏమిటి ఇది? ఇలా అయిపోతున్నావ్? ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూ కూర్చుంటున్నావ్. డబ్బు పోగొట్టుకున్నవాడిలాగా ఏదో ధ్యాసలో ఉంటున్నావ్. నీ బాధ ఏమిటో చెప్పు. నేనున్నానుగా, కన్నతండ్రిని. తీరుస్తాను. మనస్సులో ఏదో పెట్టుకున్నట్టున్నావ్. తొలగించుకో. సుఖపడు. దుఃఖాన్ని వదిలించుకో. శాస్త్రోక్తమైన జ్ఞానాన్ని స్మరించు. విజ్ఞానానికి బుర్రలో తలుపులు తెరు. నా మాటలతో నా ఉపదేశాలతో అంతగా నీకు శాంతి లభించకపోతే - బయలుదేరు. మిథిలానగరానికి వెళ్ళు. అక్కడ



జనకమహారాజుగారు ఉన్నారు. నీ మోహాన్నీ నీ సందేహాల్నీ తొలగిస్తాడు. సమర్థుడు. సత్యసాగరుడు. బ్రహ్మజ్ఞాని. జీవన్ముక్తుడు. అతిశాంత స్వభావుడు. స్వయంగా మహాయోగి. యోగప్రియుడు. వెళ్ళి నీ సందేహాలు తీర్చుకో. వర్ణాశ్రమధర్మాలూ వగైరా అన్నీ నిస్సంకోచంగా అడిగి తెలుసుకో. అతడు చెబుతాడు.

వ్యాసుడిమాట పూర్తి అయ్యిందోలేదో తరుము కూతలాగా శుకుడు అందుకున్నాడు. మహాత్మా! నువ్వు చెప్పేది అంతా పెద్ద అబద్ధం అనిపిస్తోంది. మిథిలాధిపతి జీవన్ముక్తుడు అంటున్నావు. బ్రహ్మజ్ఞాని అంటున్నావు. మళ్ళీ, హాయిగా రాజ్యం ఏలుకుంటున్నాడు అంటున్నావు. ఇది ఎలా కుదురుతుంది? అసంభవం. గొడ్రాలికి కొడుకు పుట్టాడు అన్నట్టుంది. అయినా నువ్వు చెబుతున్నావు కనక సమ్ముతున్నాను. ఆ విడ్డూరం ఏదో చూసి రావలసిందే. మిథిలకు వెడతాను. సంసారంలో తామరాకు మీద నీటిబొట్టులా ఎలా ఉండగలుగుతున్నాడో తెలుసుకుంటాను. మోక్షం అంటే ఏమిటి, భుక్తం అభుక్తం ఎలా అవుతుంది. కృతం అకృతం ఎలా అవుతుంది. ఇంద్రియాల వ్యవహారాన్ని ఎలా వదిలించుకోవాలి, తల్లి - తండ్రి, భార్య - సోదరి-వేశ్య ఈ భేదాభేదాలు ఎలా నశిస్తాయి. వీటినుంచి విడుమర (విముక్తి) ఎలాగ, రకరకాల రుచులూ శీతోష్ణాలూ సుఖదుఃఖాలూ వీటి పరిజ్ఞానం ఎలా కలుగుతోంది, ముక్తత్వలక్షణం ఏమిటి, రాజ్యవ్యవహారాలన్నీ చేస్తూ శత్రుమిత్ర భావాలకు అతీతంగా ఎలా ఉంటున్నాడు, ఒక దొంగనూ ఒక తాపసినీ సమానంగా ఎలా చూడగలుగుతున్నాడు, అసమబుద్ధి ఉంటే మరి ముక్తత్వం ఎలాగ - ఇవన్నీ తీర్చుకోవలసిన సందేహాలు. జీవన్ముక్తుణ్ణి నేనింతవరకూ కనీవినీ ఎరగను. సంసారంలో ఉండి ముక్తుడుగా గడపడం - ఇప్పటికీ నాకు అనుమానమే. కుతూహలం పెరుగుతోంది. కనీసం ఈ సందేహ నివృత్తికోసమైనా మిథిలకు వెడతాను.

***(అధ్యాయం - 16, శ్లోకాలు - 61)***

## ◆ శుకమహర్షి మిథిలాయాత్ర ◆

శౌనకాది మహామునులారా! ప్రయాణానికి నిశ్చయించుకొని శుకుడు తండ్రి పాదాలకు సాగిలపడ్డాడు. లేచి దోయిలించి నిలబడ్డాడు. మహానుభావా! అనుమతించు. నీమాట నాకు శిరోధార్యం. జనకుడు పాలించే విదేహదేశాలకు వెడుతున్నాను. దండం లేకుండా (శిక్షలు) రాజ్యం ఎలా ఏలుతున్నాడో! దండనలు లేకుండా లోకులు ధర్మమార్గంలో ఎలా నడుస్తున్నారో! నా తల్లి గొడ్రాలు అన్నంత విచిత్రంగా ఉంది ఈ వ్యవహారం. వెళ్ళి చూసిరావలసిందే! బయలుదేరుతున్నాను. అనుమతించు - అని అభ్యర్థించాడు.

ఆ నిస్పృహుణ్ణి ఆ జ్ఞానిని వ్యాసుడు గట్టిగా కౌగిలించుకున్నాడు. పుత్రకా! బయలుదేరు. నీకు శుభమగుగాక! దీర్ఘాయుష్యమస్తు. కానీ నాకొక మాట ఇచ్చి మరీ బయలుదేరు. నువ్వు తిరిగి ఇక్కడికే నా ఆశ్రమానికే రావాలి. మరెక్కడికీ వెళ్ళకూడదు. నిన్ను చూస్తూ నేను సుఖంగా బతకాలి. నువ్వే నా



పంచప్రాణాలూను. కనపడకపోతే బతకలేను సుమా. జనకుణ్ణి దర్శించి సందేహాలన్నీ తీర్చుకుని సుఖంగా తిరిగివచ్చి అధ్యయన తత్పరుడవై నా కళ్ళముందు హాయిగా కాలక్షేపం చెయ్యి.

శుకుడు మరోసారి పాదాభివందనం చేసి, ప్రదక్షిణం చేసి, విల్లు విడిచిన బాణంలా మిథిలవైపు దూసుకుపోయాడు. దేశాలను చూస్తూ, రకరకాల ధర్మాలనూ మనుషులనూ గమనిస్తూ, చెట్టూచేమా తిలకిస్తూ, తాపస-యాజక-యోగి-వానప్రస్థులను దర్శిస్తూ, అడవులు దాటి, నదులు దాటి, పుణ్య క్షేత్రాలను సేవించి, శైవ-పాశుపత-సౌర - శాక్త-వైష్ణవ సంప్రదాయాలను గుర్తించి రెండేళ్ళకు మేరువును దాటి, ఏడాదికి హిమాచలం దాటి మిథిలకు చేరుకున్నాడు. అక్కడి ప్రజల జీవన విధానానికి ఆశ్చర్యపోయాడు. అందరూ ధనవంతులే. సదాచారసంపన్నులే. సుఖమయంగా ధార్మికంగా జీవనం సాగిస్తున్నారు. అలా సంచరిస్తూంటే ఒక నగరద్వారం దగ్గర ద్వారపాలకుడు అటకాయించాడు. ఎవరు నువ్వు? నీకు పనేమిటి? - ప్రశ్నించాడు. శుకుడు నివ్వెరపోయి నిలబడ్డాడు. స్థాణువులా నిలబడ్డాడు. విరగబడి నవ్వుతున్నాడే తప్ప పలుకూ ఉలుకూ లేదు. దౌవారికుడికి ఏమీ అర్థం కాలేదు.

విప్రుడా! చెప్పు. మాటాడవేం? మూగవాడివా? ఏ పనిమీద ఇటువచ్చావు? ఉలుకూ పలుకూ లేకపోతే పని జరగదు. రాజాజ్ఞలేకుండా ఈ నగరంలోకి పరులెవ్వరూ ప్రవేశించకూడదు. కులశీలాలు ఎటువంటివో తెలియని వ్యక్తికి అసలు ప్రవేశం లేదు. నీ తేజస్సు చూస్తోంటే వేదవేత్తవుగా బ్రాహ్మణుడివిగా కనపడుతున్నావ్. నీ ఊరూ పేరూ భోగట్టా అంతా చెప్పి, ఏ పనిమీద వచ్చావో తెలిపి - అప్పుడు నీ ఇష్టం హాయిగా సంచరించు.

దౌవారికా! నేను వచ్చిన పని నీమాటలతోనే అయిపోయింది. మిథిలానగరం చూడటానికి ప్రవేశం దుర్లభమని తేలిపోయింది. మూర్ఖుణ్ణి, ఎంత మోహపడి వచ్చాను! రెండు పర్వతాలు దాటి వచ్చాను. మూడేళ్ళు నడిచీ నడిచీ వచ్చాను. నా కన్న తండ్రే నన్ను మోసగించాడు. ఎవరిని అనుకుని ఏమి లాభం? లేదా ఇదొక కర్మఫలం. అనుభవించాను.

సాధారణంగా ధనాశ ఉన్నవాళ్ళు ఇలా రాజదర్శనాలకోసం తిరుగుతారు. కానీ నాకు అలాంటి ఆశ ఏదీ లేదు. కేవలం భ్రమపడి వచ్చాను. ఆశలు లేనివాడికి అంతా సుఖమే. అయినా మోహసాగరంలో మునిగాను. ఎక్కడి మేరువు, ఎక్కడి మిథిల? కాలినడకను వచ్చానా! ఇంతకీ ఫలితం ఏమిటి? హుఁ! విధివంచితుణ్ణి. ప్రారబ్ధం అనుభవించక తప్పుతుందా! మన ప్రయత్నాలన్నీ దాన్నిబట్టే సాగుతాయి.

ప్రారబ్ధం కిల భోక్తవ్యం శుభం వాప్యథవాఽశుభమ్ ।
ఉద్యమస్తద్వశే నిత్యం కారయత్యేవ సర్వథా ॥ **(17 - 28)**



మిథిల మిథిల అంటూ ఎగురుకుంటూ వచ్చాను. ఇక్కడ ఒక తీర్థమా, ఒక వేదమా? విదేహుడు రాజు! పట్టణంలోకి ప్రవేశం లేదు!!

శుకుడు ఇలా తనలో తానే కొంచెంసేపు మాట్లాడేసుకుని విరమించాడు. ఆ మాటలు అన్నీ విన్న ద్వారపాలకుడికి విషయం అర్థమయ్యింది. ఈయన ఎవరో బ్రాహ్మణోత్తముడనీ జ్ఞాని అనీ తెలుసుకున్నాడు. చేతులు జోడించాడు. సంభాషణకు దిగాడు.

ద్విజోత్తమా! క్షమించు. నిన్ను నివారించాను. అపరాధం మన్నించు. నీ ఇష్టం. వెళ్ళు. లోపలికి వెళ్ళు. ఎక్కడికి వెళ్ళాలంటే అక్కడికి వెళ్ళు. నీవంటి విముక్తులకు ఓర్పే కదా బలం! (విముక్తానాం క్షమా బలమ్ 17-32)

ద్వారపాలకా! నువ్వు పరతంత్రుడివి. ఇందులో నీ తప్పు ఏముంది ? ప్రభువు ఏది ఆజ్ఞాపిస్తే అది చెయ్యడమే కదా సేవకుల కర్తవ్యం. నిజానికి ఇందులో నీ ప్రభువు తప్పూ లేదు. వచ్చినవాడు చోరుడో శత్రువో తెలుసుకోవాలిగదా! తప్పంతా నాదే. నేను ఇక్కడికి రావడమే తప్పు. పరుల ఇళ్ళకు వెళ్ళడం ఎవరికైనా ఎప్పుడైనా చిన్నతనమే.

బ్రాహ్మణ సత్తమా! నువ్వు మహాజ్ఞానిలాగా కనపడుతున్నావు. నేను ప్రతీహారిని. అజ్ఞానిని. ఈ లోకంలో ఏది సుఖం, ఏది దుఃఖం? ఏది శుభం, ఏది అశుభం? ఎవడు శత్రువు, ఎవడు మిత్రుడు? ఈ సందేహాలు నన్ను పట్టిపీడిస్తున్నాయి. దయచేసి జ్ఞానోపదేశం చేసి వెళ్ళు.

దౌవారికా! లోకంలో రెండురకాల మనుషులు ఉంటారు. రాగులూ విరాగులూ. వారి మనః ప్రవృత్తులు కూడా అలాగే ఉంటాయి. విరాగులలో మళ్ళీ మూడు రకాల వారుంటారు. పూర్తిగా తెలిసి విరక్తులైనవారూ, ఏమీ తెలియక అజ్ఞానంతో విరాగులైనవారూ, అటూ ఇటూ ఊగిసలాటతో విరాగులయ్యేవారూను. రక్తులు రెండు రకాలే. మూర్ఖులూ చతురులూను. ఈ చతురుల చాతుర్యం శాస్త్రజన్యమూ (మతి) బుద్ధి జన్యమూ అని రెండు విధాలుగా ఉంటుంది. మతి - యుక్తమూ అయుక్తమూ అని రెండు రకాలు.

విప్రవర్యా ! నువ్వేదో చెబుతున్నావు. నాకేమీ అర్థం కావడంలేదు. కొంచెం విపులీకరించి అర్థమయ్యేట్టు చెప్పు.

ప్రతీహారీ! సంసారంపట్ల ఎవడికి అనురక్తి ఉంటుందో అతడిని రాగి అంటారు. అతడికి సుఖాలూ దుఃఖాలూకూడా పలువిధాలు. ధనం సంపాదించగలిగితే భార్యాపుత్రులూ జయాలూ సమ్మానాలూ



- ఇవన్నీ సుఖాలే. ఆ ధనమే సంపాదించలేకపోతే ఇవన్నీ దుఃఖాలే. ప్రతిక్షణమూ అశాంతి. అంచేత అతడికి సుఖసంపాదకమైన ధనార్జనమే కర్తవ్యం. అతడి సుఖాలకు ఎవడు అడ్డువస్తే వాడల్లా అతడికి శత్రువే. ఎవడు సహకరిస్తే వాడల్లా మిత్రుడే. చతురుడైన రాగి ఎప్పుడూ దేనికీ మోహపడడు. మూర్ఖుడైన రాగి అన్నింటికీ మోహపడతాడు. అదీ తేడా.

ఇక విరక్తులున్నారే - వారికి ఏకాంతమే సుఖం. వేదాంత చింతన - ఆత్మానుచింతనలు వారికి కర్తవ్యాలు. సంసార ప్రసక్తి వారికి దుఃఖహేతువు. కామక్రోధప్రమాదాదులు అనేకం శత్రువులు. సంతోషం ఒక్కటే వారికి మిత్రుడు.

ఈ సంభాషణతో ప్రతీహారి సంబరపడ్డాడు. శుకుణ్ణి జ్ఞానిగా గుర్తించాడు. లోపలి కక్ష్యలోకి ప్రవేశపెట్టాడు. అది అతి విశాలంగా అతిమనోహరంగా ఉంది. నగర సౌందర్యం కనువిందు చేస్తోంది. రకరకాల విపణివీథులు (బజారులు). క్రయవిక్రయాలు జోరుగా సాగుతున్నాయి. కోలాహలంగా ఉంది. ఎటుచూసినా జనసమ్మర్దం. కొనేవాళ్ళూ అమ్మేవాళ్ళూ. రాగద్వేషాలు, కామక్రోధలోభమోహాలు. వాదవివాదాలు. అంతా డబ్బూ, డబ్బూ. శుకుడు అన్నీ చూస్తూ నడిచి వెడుతున్నాడు. మహాతేజస్వి, ఇతడు మరొక భాస్కరుడా అనుకుంటున్నారు చూసినవాళ్ళు. అలా వెళ్ళీ వెళ్ళీ రాజమందిరం చేరుకున్నాడు. అక్కడ మరో ద్వారపాలకుడు ఉన్నాడు. కర్రలా అడ్డుపడ్డాడు. శుకుడు ఠక్కున నిలిచిపోయాడు. మౌనంగా తన ధ్యానంలో తానుండి అలా నిలబడ్డాడు. ఎండా నీడా రెండూ ఒకటే తనకి. స్థాణువులా నిలుచున్నాడు.

అంతలోకీ ఒక మంత్రిగారు వచ్చి శుకుడికి నమస్కరించాడు. సాదరంగా లోపలికి తీసుకువెళ్ళాడు. అది రెండవ కక్ష్య. పూలతోటలతో ప్రశాంతంగా ఉంది. నిలువునా పుష్పించిన ఒక దివ్య వృక్షం శుకుడి మనస్సును ఆనందింపజేసింది. అమాత్యులవారు అతిథి సత్క్రియలు జరిపారు. ఒక దివ్యభవనంలో విడిది చేయించారు. కామశాస్త్ర విశారదలైన వారవనితలను ఆడి పాడి అలరింపజెయ్యగల అందగత్తెలను - అతడి సేవకోసం నియమించి మంత్రిగారు సెలవుతీసుకున్నారు.

వారవనితలు భక్తి శ్రద్ధలతో శుకుడికి సమర్చనలు జరిపారు. దేశకాలోచితమైన తినుబండారాలను అందించారు. అంతఃపుర - ఉద్యానవనానికి తీసుకువెళ్ళారు. యువకుడు, అందగాడు, మృదుభాషి, తేజస్వి - శుకుణ్ణి చూసి వారంతా కామమోహితలు అయ్యారు. కానీ, జితేంద్రియుడైన మునీశ్వరుడు గదా అని కేవలభక్తితో పరిచర్యలు మాత్రం చేశారు. అరణీగర్భ సంభూతుడైన శుకుడి మనస్సు నిశ్చలంగానే ఉంది. నిర్మలంగానే ఉంది. వారిపట్ల మాతృభావన చేశాడు. వారిలో కొందరు నిలువరించుకోలేక కామవికారాలను ప్రదర్శించినా అతడిలో ఏ కదలికా కలగలేదు. హర్షించనూ లేదు ధర్షించనూ లేదు. (కసురుకోవడం).



ఆత్మారామో జితక్రోధో న హృష్యతి న తప్యతి ।
పశ్యంస్తాసాం వికారాంస్తు స్వస్థ ఏవ స తస్థివాన్ ॥ (17 - 62)

ఆ భవనంలో అతడికోసం రమ్యమైన శయ్యను ఏర్పాటు చేశారు. అది సర్వాలంకార శోభితం. విలువైన దుప్పటి పరిచారు. రకరకాల సౌఖ్యాలకు అనువైన అమరికలు దానికి ఉన్నాయి.

శుకుడు శుచియై జాగరూకుడై దర్భలు చేతితో పట్టుకుని సాయం సంధ్యను ఉపాసించాడు. ఒక జాము సేపు ధ్యానం చేసుకుని అటుపైని రెండుజాములు హాయిగా నిద్రపోయాడు. నాల్గవ జాములో లేచి కాసేపు ధ్యానంచేసి స్నానాదికం ముగించి ప్రాతస్సంధ్యను అర్చించి, సమాహితచిత్తంతో మళ్ళీ ధ్యానంలోకి జారిపోయాడు. *(అధ్యాయం - 17, శ్లోకాలు - 66)*

అప్పుడు మంత్రిపురోహిత సహితుడై జనకమహారాజు గురుపుత్రుణ్ణి దర్శించడంకోసం ఆ భవనానికి వచ్చాడు. అతిథిపూజలు జరిపి, ఒక పాడి ఆవును కాన్కగా సమర్పించాడు. ఉభయకుశల ప్రసంగోపరి-

## ◆ శుక జనక సంవాదం ◆

శుకమహర్షీ! నీవంటి విరాగికి నా పట్ల ఇంతటి అనురాగం కలగడం, ఇలా దయచెయ్యడం - ఆనందంగానూ ఆశ్చర్యంగానూ ఉంది. కారణం తెలుసుకుని ఇంకా సంబరపడదామని నా ఆశ - అన్నాడు జనకుడు.

మహారాజా! నా తండ్రి వ్యాసుడు నన్ను గృహస్థాశ్రమం స్వీకరించమంటున్నాడు. ఆశ్రమాలలోకెల్లా అదే ఉత్తమోత్తమం అంటున్నాడు. నేనేమో - అది తండ్రిమాటయే అయినా - అంగీకరించలేక పోతున్నాను. అది బంధనం అంటాను నేను, కాదంటాడు ఆయన. వాదించుకున్నాం. ఆ సందర్భంలో నీ ప్రస్తావన వచ్చింది.

మిథిలానగరంలో జనకుడనే మహారాజు ఉన్నాడు. ఆయన జీవన్ముక్తుడు. విదేహరాజ్యాన్ని అకంటకంగా పరిపాలిస్తున్నాడు. అయినా మాయాపాశాలలో చిక్కుకోలేదు. రాజ్యపాలన బంధనం అనుకోలేదు. నువ్వేమిటో గృహస్థాశ్రమానికే భయపడుతున్నావు? ఒకసారి వెళ్ళి ఆ భూపాలుణ్ణి చూసిరా. నీ సందేహాలన్నీ తీరుస్తాడు. మళ్ళీ తిరిగి నువ్వు ఇక్కడికే రావాలిసుమా! లేదంటే ఇప్పుడే నేను చెప్పినట్టు విని వివాహం చేసుకో - అని మా తండ్రిగారు చెప్పినమీదట మహారాజా! నేను నీదర్శనానికి వచ్చాను. దయచేసి నా సందేహం తీర్చు. నేను మోక్షకామిని. తపస్సులూ తీర్థాలూ వ్రతాలూ యజ్ఞాలూ స్వాధ్యాయాలూ ఇవ్వి మోక్షాన్ని ఇస్తాయా? లేక జ్ఞానమే మోక్షకారణమా?



జనకమహారాజు ప్రశాంతంగా విన్నాడు. సమాధానం చెప్పాడు. వ్యాసతనయా! విను. మోక్షం కావాలి అనుకునే విప్రుడికి కర్తవ్యం ఏమిటంటే - ఉపనయనం చేసుకుని వెళ్ళి గురుసన్నిధిలో వేదాధ్యయనం చెయ్యాలి. వేదవేదాంతాల అధ్యయనం ముగియగానే గురుదక్షిణ సమర్పించి ఇంటికి తిరిగి రావాలి. గుణవంతురాలైన కన్యను వివాహం చేసుకుని గృహస్థుడు కావాలి. అగ్నిహోత్రాదికర్మలు నిర్వహిస్తూ సత్యవాగ్నియమంతో శుచిగా సంతోషంగా జీవయాత్ర సాగించాలి. దురాశ ఉండకూడదు. దుష్కర్మలు చెయ్యకూడదు. కొడుకునూ మనుమణ్ణీ ఎత్తి (ఏకవచనం) వానప్రస్థం స్వీకరించాలి. తపస్సు చెయ్యాలి. అంతశ్శత్రువులను ఆరుగురినీ జయించాలి. భార్యను కొడుకు బాధ్యతకు అప్పగించాలి. అన్ని అగ్నులనూ తనలోనే (ఆత్మలో) ఆరోపించుకుని శాంతచిత్తుడై శుద్ధ వైరాగ్యభావంతో తురీయాశ్రమంలో (నాల్గవది-సన్యాసం) ప్రవేశించాలి. విరక్తుడికే సన్యాసం తీసుకునే అధికారం. మరెవ్వరికీ లేదు. మరో మార్గమూ లేదు. ఇది వేదవాక్యం. దీనికి తిరుగులేదు.

**పుత్రం పౌత్రం సమాసాద్య వానప్రస్థాశ్రమే వసేత్ ।**
**తపసా షడ్రిపూన్ జిత్వా భార్యాం పుత్రే నివేశ్య చ ॥ (18 - 18)**

శుకర్షీ ! మానవుడికి నలభైయెనిమిది సంస్కారాలను చెబుతోంది వేదం. అందులో నలభై సంస్కారాలు గృహస్థుడికే. శమదమాదులు ఎనిమిది మాత్రమే సన్యాసికి. ఆశ్రమం నుంచి ఆశ్రమానికి క్రమంగా వెళ్ళాలని శిష్టుల అనుశాసనం.

ఇక్కడ శుకుడు కల్పించుకున్నాడు. జనకమహారాజా! జ్ఞాన విజ్ఞానాలవల్ల హృదయంలో వైరాగ్యభావం వెల్లివిరిస్తే స్థిరపడితే, అప్పుడుకూడా మొదటి మూడు ఆశ్రమాలూ తప్పవా? అని ప్రశ్నించాడు.

గురుపుత్రా! ఇంద్రియాలు చాలా బలిష్ఠాలు. అవి అంతంత మాత్రాన ఆజ్ఞలకు లొంగవు. పరిపక్వ స్థితికి చేరుకోని అపరిణతులను అవ్వి మరీ ఆటపట్టిస్తాయి. రకరకాల వికారాలను పుట్టిస్తాయి.

**ఇంద్రియాణి బలిష్ఠాని న నియుక్తాని మానద ।**
**అపక్వస్య ప్రకుర్వంతి వికారాంస్తాననేకశః ॥ (18 - 24)**

అవి కలిగించే వికారాలు ఎటువంటివంటే - భోజనేచ్ఛ, సుఖేచ్ఛ, శయ్యేచ్ఛ, పుత్రేచ్ఛ వంటివి. యతీశ్వరుడికి ఇవ్వి కలిగితే తీరేదెట్లాగ? తీరకపోతే, ఈ వాసనలు వదలకపోతే దారుణమైన అశాంతి. అంతరంగంలో అలజడి. అది అసలు చెలరేగనే కూడదన్నా అణగిపోవాలన్నా క్రమక్రమంగా వదిలించుకోవడం ఒక్కటే మార్గం. పైకెక్కి పడుకున్న వాడికి పతనం తప్పదు. నేలమీద పడుకున్న వాడికి బెంగలేదు. సన్యసించీ భ్రష్టుడైతే మరతడికి దారిలేదు, దిక్కులేదు.



ఊర్ధ్వం సుప్తః పతత్యేవ న శయానః పతత్యధః ।
పరివ్రజ్య పరిభ్రష్టో న మార్గం లభతే పునః ॥ (18 - 27)

పిపీలిక చూడు చెట్టుమొదలు నుంచి పాకుతూ పై పైకి వెడుతుంది. అలిసిపోకుండా హాయిగా భద్రంగా మెల్లమెల్లగా ప్రయాణం సాగించి ఫలాన్ని అందుకుంటుంది. అదే పక్షి అయితే, ఫలాన్ని ఎవరో తన్నుకుపోతారన్నట్టు వేగంగా ఎగురుకుంటూ వెడుతుంది. అలిసిపోతుంది. మనస్సు "బహు గట్టి పిండం". తగినంత అభ్యాసం లేనివారికి (అకృతాత్ములకు) అది బొత్తిగా అజేయం. అందుచేత ఆశ్రమాను క్రమంలో దాన్ని జయించాలి.

మనస్తు ప్రబలం కామమజేయ మకృతాత్మభిః ।
అతః క్రమేణ జేతవ్య మాశ్రమానుక్రమేణ చ ॥ (18 - 30)

గృహస్థాశ్రమంలో ఉన్నప్పటికీ అతడు సుమతీ, శాంతుడూ, ఆత్మజ్ఞానం కలవాడూ అయినట్టయితే లాభాలకు పొంగడు. నష్టాలకు కుంగడు. రెండింటా సమదృష్టితోనే ఉండగలుగుతాడు. వేదవిహిత కర్మలను ఆచరిస్తూ దుష్కర్మలను పరిహరిస్తూ యథాలాభసంతుష్టుడై జీవయాత్ర సాగించే వాడు నిస్సంశయంగా ముక్తుడవుతాడు. నన్ను చూడు. రాజ్యపాలనలో ఉండీ జీవన్ముక్తుణ్ణి కాగలిగాను. యథేచ్ఛగా సంచరిస్తున్నాను. అయినా నాకేమీ అవ్వడం లేదు. వివిధ భోగాలను అనుభవిస్తున్నాను. అనేక కార్యాలనూ చేస్తున్నాను. అయినప్పటికీ ముక్తుణ్ణి కాగలుగుతున్నాను. అలాగే నువ్వూ అవ్వాలి. కాగలవు. ప్రయత్నించు.

విప్రకుమారా! మరొక రహస్యం విను. కనపడేదాన్ని కష్టపడి ఎలాగోలా బంధించవచ్చు. కనపడనిదాన్ని ఎలా బంధిస్తావు? పంచభూతాలూ వాటిగుణాలూ ప్రత్యక్షాలు (అనుభవంలోకి వచ్చేవి). వీటిని జయించవచ్చు (బంధించవచ్చు). ఆత్మ ఏనాడూ ఎవరికీ ప్రత్యక్షవిషయంకాదు. అనుమానగమ్యమే. నిరంజనమూ నిర్వికారమూ అయిన ఆత్మను బంధించడం ఎలాగ?

బధ్యతే ఖలు యద్దృశ్య మదృశ్యం బధ్యతే కుతః ।
దృశ్యాని పంచభూతాని గుణాస్తేషాం తథా పునః ॥
ఆత్మా గమ్యోఽనుమానేన ప్రత్యక్షో న కదాచన ।
స కథం బధ్యతే బ్రహ్మన్ ! నిర్వికారో నిరంజనః ॥ (18 - 35, 36)



సుఖదుఃఖాలకు మనస్సే ముఖ్య కారణం. అది నిర్మలంగా ఉంటే సమస్తమూ నిర్మలంగానే ఉంటుంది. అది నిర్మలం (దోషరహితం) కాకపోతే ఎన్ని పుణ్యనదీతీర్థాలలో ఎన్నిసార్లు మునిగినా నిరర్థకం.

**భ్రమన్ సర్వతీర్థేషు స్నాత్వా స్నాత్వా పునఃపునః ।**
**నిర్మలం న మనోయావత్ తావత్సర్వం నిరర్థకమ్ ॥**
**న దేహో న చ జీవాత్మా నేంద్రియాణి పరంతప ।**
**మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః ॥ (18-38, 39 )**

మానవుల బంధమోక్షాలకు దేహమూ ఇంద్రియాలూ జీవాత్మ ఇవేవీ కారణాలు కాదు. కేవలం మనస్సొక్కటే కారణం. పరిశుద్ధాత్మ ఎప్పుడూ విముక్తమే. అది బంధింపబడదు. బంధనమూ కాదు. బంధమోక్షాలు మనస్సంస్థితాలు. మనస్సు శాంతిస్తే అన్నీ ఉపశమిస్తాయి. అంతా ప్రశాంతియే. శత్రువు-మిత్రుడు ఉదాసీనుడు - ఈ భేదాలు మనఃకల్పితాలు. కనిపించని ఏకాత్మకు ఇటువంటి భేదాలు అసంభవాలు.

ఋషితనయా! జీవుడు ఎప్పుడూ బ్రహ్మమే. అది ఏకైకం. సందేహం లేదు. కానీ లోకంలో అనేకత్వం (భిన్నత్వం) కనిపిస్తుంది. అది అవిద్యా కల్పితం. విద్యతో దాన్ని తొలగించుకోవాలి. ఆలోచనాపరులు నిరంతరం జాగరూకులై విద్యా-అవిద్యలను తెలుసుకుంటూ ఉండాలి. ఎండలేనిదే నీడ సుఖం తెలియనట్టు ఈ అవిద్యలేనిదే విద్య అవగతం కాదు.

**వినాతపం హి చ్ఛాయాయా జ్ఞాయతే చ కథం సుఖమ్ ।**
**అవిద్యయా వినా తద్వత్ కథం విద్యాం చ వేత్తి వై ॥ ( 18 - 44)**

గుణాలు గుణాల౽ ఉంటాయి. ఇంద్రియాలు ఇంద్రియార్థాలలోనే ప్రవర్తిస్తాయి. కనక అక్కడ ఆత్మకు ఏ దోషమూ లే౽ . ఇంతకూ వైయాసకీ! (వ్యాసపుత్రుడా) వేదాలు ఏర్పరిచిన ఈ మర్యాద (కట్టుబాటు) అంతా ధర్మరక్షణకోసమే. లేకపోతే సౌగతులకు లాగా (బౌద్ధులు) ధర్మ వినాశనం మనకూ తప్పదు. ధర్మనాశం జరిగితే వర్ణాచారాలు నశిస్తాయి. అందుచేత వేదోక్తమార్గంలో ప్రయాణించడమే అందరికీ అన్నివేళలా శుభప్రదం.

జనకుడు చెబుతున్నదంతా ఏకాగ్రచిత్తంతో వింటున్నాడు శుకుడు. ఈ చివరిమాట ఎందుకో రుచించలేదు. ప్రశ్నించాడు.



మహారాజా! నువ్వు చెప్పినది అంతా విన్నాను. ఒక్క సందేహం మిగిలిపోయింది. వేదం చెప్పే ధర్మాలలో కొన్ని హింసాబహుళాలు కదా! అటువంటప్పుడు వేదధర్మం ముక్తిప్రదం ఎలా అవుతుంది? ఉదాహరణకు సురాపానం పశుహింస మాంసభక్షణం ఇత్యాదులు అధర్మాలేకదా ! సౌత్రామణి వంటి కొన్ని క్రతువులలో సురాపానం చెప్పింది వేదం. అలాగే ద్యూతక్రీడ. ఇలాంటి దోషాలున్న వ్రతాలూ చాలానే ఉన్నాయి. వెనకటికి వందలాదిగా యజ్ఞాలు చేసిన శశబిందుమహారాజు కథ తెలిసిందేకదా ! ఆ యజ్ఞాలలో బలి చేసిన పశువుల చర్మాలు వింధ్యపర్వతమంత గుట్ట అయ్యాయిట. రక్తమూ కొవ్వూ ప్రవాహాలు కట్టి ఏకంగా చర్మణ్వతి అనే నది ఏర్పడిందిట. అయినా ఆ రాజు స్వర్గాన్ని పొందాడుట. ఇలాగని అతని కీర్తి ఇప్పటికీ నిలిచిపోయింది.

ఇటువంటి హింసాత్మక ధర్మాలను ప్రబోధించే వేదాలపట్ల నాకు గురి కుదరడం లేదు. పురుషుడు స్త్రీ సంగమం వల్ల సుఖపడతాడు. అది దొరకకపోతే దుఃఖిస్తాడు. మరి సంసారి జీవన్ముక్తుడు ఎలా అవుతాడు? మహారాజా! ఇవీ నాకు ఇప్పటికి మిగిలిన సందేహాలు. దయచేసి వివరించమన్నాడు శుకుడు. జనకుడు ఉపక్రమించాడు.

విప్రోత్తమా! యజ్ఞాలలో ప్రత్యక్షంగా కనిపించే హింస నిజానికి హింసకాదు. అది అహింస. ఉపాధియోగాన్నిబట్టి కదా హింస - అహింసల నిర్ణయం. అగ్నిలో ఇంధనం వేస్తే (పుల్లలు) పొగవస్తుంది. వెయ్యనప్పుడు (కాలిపోయినప్పుడు) ఏమీ ఉండదు. అలాగే ఇదీను. విరాగికి ఇది అహింస. అనురక్తుడికి (రాగి) హింస. రాగం లేకుండా (కర్తృత్వ) అహంకారం లేకుండా (కేవలం విధిగా త్యాగంగా) చేసే ఏ పనినైనా "అకృతం" అంటారు వేదవేత్తలు. ఆత్మను జయించిన ముముక్షువుల దృష్టిలో అది అహింస. గృహస్థులకేమో హింసగానే అనిపిస్తుంది. ***(అధ్యాయం - 18, శ్లోకాలు - 62)***

ఇలా చెప్పి జనకుడు ముగిస్తే, కాబోలనుకున్నాడు శుకుడు. అక్కడితో హింసాహింసల గొడవ వదిలిపెట్టేశాడు. మరిన్ని మౌలికమైన సందేహాలు లేవనెత్తాడు.

రాజోత్తమా! మాయావృతుడై మాయామధ్యంలో ఉంటూ మనిషి నిస్పృహుడూ విరాగీ ఎలా కాగలుగుతాడు? శాస్త్రజ్ఞానంతో నిత్యానిత్య వివేకాన్ని పొందినా మనస్సు మోహాన్ని విడిచిపెట్టలేక పోతోంది. మరి నరుడు ముక్తుడయ్యేది ఎలాగ? అంతర్గతమైన చీకటిని (తమస్సు) పోగొట్టడానికి శాస్త్రబోధకుడు (బోధనం) సరిపోతాడనుకోను. వెలిగించకుండా - దీపం, దీపం అన్నంతమాత్రాన చీకట్లు తొలగిపోతాయా? (శాస్త్రజ్ఞానం ఆచరణలోకి రావాలి, మోహవిభ్రాంతి తొలగితే ఆచరణలోకి వచ్చినట్టు లెక్క అని.)



అంతర్గతం తమశ్ఛేత్తుం శాస్త్రోద్బోధీ హి న క్షమః ।
యథా న నశ్యతి తమః కృతయా దీపవార్తయా ॥ (19 - 3)

మహారాజా ! మరొక సంగతి. ఏ ప్రాణికీ హాని చెయ్యకూడదు. ద్రోహబుద్ధి ఉండకూడదు. ఎప్పుడూ పండితులు చెప్పేది ఇదేకదా! గృహస్థుకి ఇది ఆచరణసాధ్యమా? నీ మాటే తీసుకుందాం. విత్తేషణ రాజ్యసుఖేషణ సంగ్రామ జయేషణ (ఈషణ = వాంఛ) - రాజుగా ఇవన్నీ నీకు ఉన్నాయి. మరి నువ్వు జీవన్ముక్తుడివి ఎలా అవుతావు? చోరుల్ని చోరులుగానే చూస్తున్నావు. సాధువుల్ని సాధువులుగానే చూస్తున్నావు. స్వపరత్వం నీకూ ఉంది. "విదేహుడివి" ఎలా అవుతావు? పులుపు చేదు కారం ఉప్పు - రుచులన్నీ ఎరుగుదువు. నచ్చినవి (శుభాలు) ఆస్వాదిస్తోంది నీ చిత్తం. నచ్చనివీ (అశుభాలు) రుచించనివీ అలా ఆస్వాదించలేకపోతోంది. కాలోచితంగా జాగ్రత్ స్వప్న సుషుప్తి అవస్థలు నీకు నడుస్తూనే ఉన్నాయి. మరి తురీయాశ్రమంలో (సన్యాసం - జీవన్ముక్తి) ఉన్నానంటే ఎలాగ? రథ-గజ-అశ్వ-పదాతిబలాలు నీ వశంలో ఉంటాయి. వీటన్నింటికీ నేనే ప్రభువును అధిపతిని అని అనుకుంటూ ఉంటావా, ఉండవా? రుచికరమైనదీ నచ్చినదీ తింటున్నావ్, ఆనందిస్తున్నావ్. ఇంక విమనస్కత్వం ఏమిటి? పూలదండ - నాగుబాముల పట్ల సమదృష్టి కలవాడు ఎవడు ? ఎక్కడున్నాడు? హేరాజన్! మట్టిచెక్కనూ బంగారు ముక్కనూ ఒకేలా పరిగణిస్తూ సర్వత్రా ఏకత్వబుద్ధి కలిగి, సర్వప్రాణికోటికీ హితం చేస్తున్నట్టయితే అతడుగదా విముక్తుడంటేను.

విముక్తస్తు భవేద్రాజన్! సమలోష్టాశ్మకాంచనః ।
ఏకాత్మబుద్ధి స్సర్వత్ర హితకృత్సర్వజంతుషు ॥ (19 - 11)

రాజేంద్రా! నిజం చెబుతున్నాను. నా మనస్సిప్పుడు ఇంటిగుమ్మాలవైపు పోవడం లేదు. అత్యంత విరాగిని. ఏకాకిగా సంచరించాలని ఉంది. కందమూలఫలాలు తింటూ నిస్సంగంగా నిర్మమంగా శాంతంగా ఒక అడవి జంతువు. గా నిర్ద్వంద్వుణ్ణై నిష్పరిగ్రహుణ్ణై (చేయిచాపనివాడు) కాలం గడపాలని ఉంది. విరాగిని. గుణాతీతుణ్ణి ్కు ఇల్లు ఎందుకు, ఇల్లాలెందుకు, డబ్బు ఎందుకు?

మరి నువ్వో రాగసమాకులుడివి. నీ వైరాగ్యం వట్టి నటన. దంభం. కాసేపు శత్రు చింతన, కాసేపు కోశ (ధన) చింతన, కాసేపు సైన్య చింతన. నీకింక నిశ్చింతత ఎప్పుడు? నీ వంశీయులకు విదేహులు అనే పేరు పెద్ద అసత్యం. మోసం. మితాహారులైన వైఖానసమునులు కూడా అసత్యమని ఎరిగీ సంసారాల్లో పడిపోతున్నారు. మోహులవుతున్నారు. ఇక మీరనగా యెంత? మిమ్మల్ని "విదేహులు" అనడం - మూర్ఖుణ్ణి విద్యాధరుడు అనడం, పుట్టుగుడ్డిని దివాకరుడు అనడం, దరిద్రుణ్ణి లక్ష్మీధరుడు అనడం. పేరుకే విదేహులు. కర్మాచరణకు కాదు.



విద్యాధరో యథా మూర్ఖో జన్మాంధస్తు దివాకరః ।
లక్ష్మీధరో దరిద్రశ్చ నామ తేషాం నిరర్థకమ్ ॥ (19 - 19)

అసలు కథ చెప్పనా జనకమహారాజా ! మీ వంశానికి మూలపురుషుడు నిమి ఒకప్పుడు యజ్ఞ నిర్వహణకోసం వసిష్ఠుణ్ణి ఆహ్వానించాడు. అతడు వచ్చాడు. దేవేంద్రుడు ఒక యజ్ఞం తలపెట్టాడు, అది పూర్తి చేయించి వెంటనే వచ్చి నీ యజ్ఞం నిర్వహిస్తాను, ఈలోగా నెమ్మదిగా సంబారాలు సమకూర్చుకో - అని చెప్పి వసిష్ఠుడు వెళ్ళిపోయాడు. మరొకరిని అధ్వర్యుడుగా నియమించి నిమి తన యజ్ఞం జరిపించుకున్నాడు. అది తెలిసి వసిష్ఠుడు అలిగి నిమి (శరీరం) దేహం పతనమైపోగాక అని శపించాడు. నిమి అల్లాగే మారుశాపం ఇచ్చాడు - వసిష్ఠుడి శరీరం పడిపోవుగాక అని. ఇద్దరూ అన్యోన్యశాపాలతో పడిపోయారుట. అప్పటినుంచీ మీ వంశీయులు విదేహులు అయ్యారే తప్ప దేహాభిమానం లేనంతటి విరక్తులైనందువల్ల మాత్రం కాదు. అదిసరే - విదేహుడు గురువును శపించడం ఏమిటి ? ఇదంతా వినోదంలా అనిపిస్తుంది నాకు. రాజా ! నువ్వేమంటావో ?

శుకుడు కొంచెం ఘాటుగానే మాట్లాడాడు. అయినా జనకుడు జితేంద్రియుడూ జీవన్ముక్తుడూ కదా! నిండుకుండ. వివరణ ఇచ్చాడు.

విప్రేంద్రా! నువ్వన్నది నిజమే. అసత్యం ఏమీలేదు. అలాగే జరిగి ఉంటుందని నా అభిప్రాయం కూడా. సరే దానికేమి! వంశ చరిత్ర. కాసేపు అలా ఉంచుదాం. నువ్వు గురుపుత్రుడివి. గురువు నాకు పరమపూజ్యుడు. పితృబంధాన్ని విడిచిపెట్టేసి నువ్వేమో అరణ్యాలకు పోవాలి అనుకుంటున్నావు. వెడతావు. వెళ్ళాక నీకు అక్కడ మృగాలతో అనుబంధం ఏర్పడుతుంది. ఏర్పడదా? సృష్టి అంతటా ప్రాణికోటి ఉంది. మరి నిస్సంగత్వం నీకు (మనిషికి) ఎలా సాధ్యపడుతుంది? ఆహారం కోసం - అది ఆకో అలమో ఏదైనాకాని దానికోసం చింత తప్పదుగదా! మరి నిశ్చింతుడివి ఎలా కాగలుగుతావ్? వనాల్లో ఉన్నా దండాజినాల చింత ఎటూ తప్పదు. అలాగే, ఆలోచించినా ఆలోచించకపోయినా నాకు రాజ్యచింత తప్పదు. మోక్షానికి వికల్పాలు (ప్రతిబంధకాలు) వస్తాయని ఊహించి నువ్వు దూరదేశాలకు పోవాలనుకుంటున్నావు. నాకు అలాంటి వికల్పసందేహం లేదు. సర్వథా నిర్వికల్పుణ్ణి. హాయిగా తింటాను. సుఖంగా నిద్రపోతాను. నేను బద్ధుణ్ణి కాను అనే జ్ఞానం ఉంది కనక నాకెప్పుడూ సుఖమే. నీకెప్పుడూ దుఃఖమే - బద్ధుణ్ణి బద్ధుణ్ణి అనుకుంటున్నావు కనక. అందుచేత ముందు ఆ శంకను ఛేదించుకో. సుఖపడతావు.

ఈ దేహం నాదికాదు. ఈ బంధం నాదికాదు (అని గ్రహించడమే) ముక్తత్వం అంటేను. అలాగే ఈ ధనం ఈ గృహం ఈ రాజ్యం ఇవి ఏవీ నావి కానేకావు.



దేహోఽయం మమ బంధోఽయం న మమేతి చ ముక్తతా ।
తథా ధనం గృహం రాజ్యం న మమేతి నిశ్చయః ॥ (19 - 35)

అని జనకుడు ముగించాడు. శౌనకాది మహామునులారా! అప్పటికి శుకుడికి సంతృప్తి కలిగింది. వీడ్కోలు తీసుకుని వెంటనే వ్యాసాశ్రమం చేరుకున్నాడు. తిరిగి వస్తున్న కొడుకును చూసి వ్యాసుడు సంతోషించాడు. కౌగిలించుకుని శిరస్సు మూర్కొని స్వాగతం పలికాడు. కుశలప్రశ్నలు అయ్యాయి. వేదవిదుడూ సర్వశాస్త్రపారంగతుడూ అయిన శుకుడు సమాహిత చిత్తంతో ఆ రమ్యమైన ఆశ్రమంలో ఉండిపోయాడు. రాజ్యం ఏలుతున్న జనకుడు సుఖంగా ఎలా ఉన్నాడో గ్రహించాక శుకుడికి పరనిర్వృతి కలిగింది. యోగమార్గం ఆశ్రయించాడు. అనక కొంతకాలానికి పీవరి అనే సుందరిని వివాహం చేసుకున్నాడు. నలుగురు కొడుకులూ ఒక కూతురూ కలిగారు. కృష్ణ - గౌరప్రభ - భూరి- దేవశ్రుతులు కొడుకులు. కూతురు పేరు కీర్తి. ఈమెను విభ్రాజుడి కొడుకు అణుహుడికి ఇచ్చి వివాహం చేశాడు. ఆ దంపతులకు బ్రహ్మదత్తుడనే పుత్రుడు జన్మించాడు. అతడు పృథివీ పాలకుడయ్యాడు. చాలాకాలం రాజ్యం చేసి, నారదోపదేశంతో బ్రహ్మజ్ఞానిగా మారి, కొడుకుకి రాజ్యం అప్పగించి బ్రహ్మదత్తుడు బదరికాశ్రమం చేరుకున్నాడు. యోగ మార్గం అవలంబించాడు.

శుకమహర్షి కూడా నారదుడి అనుగ్రహం వల్ల సద్యోముక్తి మార్గాన్ని గ్రహించి, పితృబంధం తెగతెంపులు చేసుకుని కైలాస శిఖరానికి వెళ్ళిపోయాడు. సర్వసంగపరాఙ్ముఖుడై ధ్యానంలో మునిగిపోయాడు. అటుపైని ఒకనాడు యోగబలంతో ఆ గిరిశిఖరం నుంచి పైకెగిరి సిద్ధిపొందాడు. ఆకాశంలో సూర్యుడిలా వెలుగొందాడు. శరీరం గిరిశిఖరం మీద రాలిపడింది.

ఉత్పపాత గిరేః శృంగాత్ సిద్ధిం చ పరమాం గతః ।
ఆకాశగో మహాతేజా విరరాజ యథా రవిః ॥ (19 - 48)

వ్యాసుడికి విషయం తెలిసింది. పుత్రశోకం పట్టలేకపోయాడు. కొడుకా కొడుకా అని విలపిస్తూ ఆ కైలాస గిరిశిఖరం చేరుకున్నాడు. శుకుడు తపస్సు చేసిన చోట పరిభ్రమించాడు. అలిసిపోయాడు. అతడి శోకాలాపాలను కొండగుహలు ప్రతిధ్వనించాయి. (ఇప్పటికీ అక్కడ ఆ ప్రతిధ్వనులు వినపడుతూనే ఉంటాయి ! ?).

పుత్రా పుత్రా అంటూ విలపిస్తున్న వ్యాసుణ్ణి చూసి శివుడికి జాలి కలిగింది. స్వయంగా వచ్చి ఓదార్చాడు. వ్యాసా! ఏమిటి ఈ వెర్రి? దుఃఖించకు. నీ పుత్రుడు మహాయోగి. అకృతాత్ములకు దుర్లభమైన పరమ గతిని పొందాడు. అతడికోసం విలపించకూడదు. తప్పు. పైగా నీకు శోకరహితస్థితి తెలుసునాయె. నువ్వు శోకించడమేమిటి? ఆ కొడుకువల్ల నీకు ఎంత కీర్తి వచ్చిందో గ్రహించావా నువ్వసలు? ఊరుకో. ఊరుకో.



శివుడి ప్రబోధం పనిచెయ్యలేదు. మహాదేవా! జగత్పతీ! ఏంచెయ్యను, నా దుఃఖం ఉపశమించడం లేదు. కొడుకును చూడాలని తహతహలాడుతున్నాయి నా కళ్ళు - అన్నాడు వ్యాసుడు. శివుడికి మరింత దయ కలిగింది. అయితే సరే, సత్యవతీ పుత్రా! నీ పుత్రుడి నీడ నీ ప్రక్కనే ఉంటుంది. దాన్ని చూసి సంతృప్తి చెందు. శోకం విడిచిపెట్టు - అని వరం ప్రసాదించి శివుడు మాయమయ్యాడు. వ్యాసుడికి కొడుకు నీడ కనిపించింది. చూసి సంతృప్తి చెందాడు. ఏడుపు ఆపేసి తన ఆశ్రమానికి వెళ్ళిపోయాడు.

***(అధ్యాయం - 19, శ్లోకాలు - 60)***

తన ఆశ్రమానికి వెళ్ళి వ్యాసుడు ఏమి చేశాడు, ఎలా కాలం గడిపాడు అని శౌనకాది మహామునులు సూతుణ్ణి అడిగారు. అనంతర కథను అతడు క్లుప్తంగా చెప్పాడు.

## ◆ ధృతరాష్ట్రాది జననం ◆

తన దగ్గర వేద శాస్త్ర పురాణాలను అభ్యసించిన శిష్యులు అసిత -దేవల-వైశంపాయన - జైమిని - సుమంతులను అయిదుగురినీ అంతకు ముందే లోకసంచారం కోసం పంపించే ఉన్నాడు వ్యాసుడు. ఇప్పుడు ఆశ్రమంలో తానొక్కడే. ఇది మరింత దిగులయ్యింది. తానూ వెళ్ళిపోవాలి అనుకున్నాడు. పుట్టినచోటూ కన్న తల్లీ గుర్తుకు వచ్చాయి. గంగ ఒడ్డున కృష్ణద్వీపంలో అలనాడు తనను ప్రసవించి విడిచి కడివెడు దుఃఖంతో వెళ్ళిన తల్లి, దాశరాజు కూతురు సత్యవతీ దేవి జ్ఞాపకం వచ్చింది. వెంటనే కృష్ణ ద్వీపం చేరుకున్నాడు. తల్లి కనిపించలేదు. ఏమయ్యిందని పల్లెవారిని అడిగాడు. దాశరాజు సత్యవతిని శంతను మహారాజుకిచ్చి వివాహం చేశాడని చెప్పారు. దాశరాజును కలుసుకున్నాడు. కుశల వార్తలు అడిగి బయలు దేరాడు. సరస్వతీ నదీతీరంలో ఆశ్రమం నిర్మించుకుని తపస్సుకు ఉపక్రమించాడు.

సత్యవతీ శంతనులకు ఇద్దరు కొడుకులు పుట్టారనే శుభవార్త తెలిసింది. సోదరులు జన్మించారని సంతోషించాడు. చిత్రాంగదుడు మొదటివాడు. విచిత్రవీర్యుడు రెండవవాడు. ఇద్దరూ గుణవంతులు, రూపవంతులు, పరాక్రమవంతులూను. శంతను మహారాజుకి మరో పెద్ద కొడుకు ఉన్నాడు. గంగాదేవి వల్ల జన్మించాడు. అతడే గాంగేయుడు. మహావీరుడు. ఈ ముగ్గురినీ చూసుకుని శంతనుడు గర్వపడేవాడు. దేవతలకు కూడా అజేయుణ్ణి అని మురిసిపోయేవాడు. కొంతకాలానికి శంతనుడు కాలంచేశాడు. చిరిగిన వస్త్రంలా శరీరాన్ని విడిచి పెట్టేశాడు. ఆచారం ప్రకారం పెద్దకొడుకు భీష్ముడు తండ్రికి ఉత్తరక్రియలు నిర్వహించాడు. చింత్రాంగదుణ్ణి పట్టాభిషిక్తుణ్ణి చేశాడు. సమర్థుడయ్యుండీ తాను రాజ్యం వదిలేశాడు కనక అప్పటి నుంచీ గాంగేయుడు దేవవ్రతుడయ్యాడు.



కాలం గడుస్తోంది. ఒకరోజున చిత్రాంగదుడు వేటకు వెళ్ళాడు. ఆ గాఢారణ్యంలో అతణ్ణి మరో చిత్రాంగదుడనే గంధర్వుడు చూశాడు. బలపరాక్రమాలకు మెచ్చి విమానం దిగి వచ్చాడు. వీరోచితంగా ద్వంద్వ యుద్ధం జరిగింది. కురుక్షేత్రం అనే పేరుతో వ్యవహరింపబడే ఆ అరణ్య ప్రదేశంలో చెలరేగిన ఆ యుద్ధం మూడేళ్ళు సాగింది. గంధర్వుడు జయించాడు. చిత్రాంగదుడు మరణించాడు. భీష్ముడు అంత్యక్రియలు జరిపించాడు. చిట్టి తమ్ముడు విచిత్రవీర్యుడికి పట్టం కట్టాడు. తాను సంరక్షకుడుగా నిలిచాడు. సత్యవతీదేవి మంత్రి గురు ప్రబోధాలతో పుత్రశోకం నుంచి తేరుకుంది. వ్యాసుడు కూడా చిత్రాంగదమృతికి విచారించినా విచిత్రవీర్య పట్టాభిషేకానికి సంతోషించాడు.

క్రమక్రమంగా విచిత్రవీర్యుడు యౌవనంలో అడుగుపెట్టాడు. అతడికి వివాహం చెయ్యాలని గాంగేయుడు భావించాడు. సరిగ్గా అదే సమయానికి కాశీరాజు తన కూతుళ్ళు ముగ్గురికీ స్వయంవరం ప్రకటించాడు. దేశదేశాలనుంచీ మహారాజులెంతమందో వచ్చారు. గాంగేయుడు (భీష్ముడు) ఒంటరిగా వెళ్ళి వారందరినీ చీల్చిచెండాడి రాచకన్నెలను ముగ్గురినీ అపహరించి తెచ్చాడు. ముగ్గురినీ తల్లి సోదరి కూతురులాగా మన్నించాడు. సోదరుడికిచ్చి వివాహం జరిపిస్తానని తన తల్లి సత్యవతికి నివేదించాడు. బ్రాహ్మణులను పిలిచి ముహూర్తం పెట్టించాడు.

అంతలో ఒకరోజున, ఆ ముగ్గురిలోనూ పెద్దమ్మాయి భీష్ముడి దగ్గరికి వచ్చి సిగ్గుపడుతూ ఒక విషయం చెప్పింది. తాను అంతకుముందే శాల్వమహారాజును వరించాననీ, మా ఇద్దరికీ మానసికంగా వివాహం అయ్యిందనీ, అటుపైని నీ ఇష్టం అనీ తెలియపరిచింది. భీష్ముడు ధర్మ సంకటంలో పడ్డాడు. పెద్దలనూ మంత్రులనూ తల్లినీ సంప్రదించాడు. వారి సూచనప్రకారం ఆ అమ్మాయిని పంపించేశాడు.

ఆ కన్యక సరాసరి శాల్వపతి ఇంటికి వెళ్ళింది. జరిగింది జరిగినట్టు చెప్పింది. పరస్పరం ప్రేమించుకున్నాం కనక ధర్మపత్నిగా స్వీకరించమంది. శాల్వుడు అంగీకరించలేదు. నా కళ్ళముందే భీష్ముడు నీ చెయ్యిపట్టుకుని రథం ఎక్కించుకున్నాడు. ఇక నేను నీ పాణిగ్రహణం చెయ్యను. అతడు తల్లిలా భావించి నిన్ను పంపించినా నా దృష్టిలో నువ్వు పరోచ్ఛిష్టానివి. వెళ్ళిపొమ్మన్నాడు.

ఏడుస్తూ భీష్ముడి దగ్గరికి వచ్చింది. జరిగింది చెప్పింది. అపహరించి తెచ్చావు కాబట్టి న్యాయతః నువ్వే నన్ను పెళ్ళాడాలి అంది. లేకపోతే మరణిస్తానంది. భీష్ముడు ఒప్పుకోలేదు. మరొకరికి మనసిచ్చినదానవు, నిన్నెలా మనువాడతాను, పుట్టింటికి పొమ్మన్నాడు. ఆ కన్యకామణి అవమానం భరించలేక అడవులకు పోయింది. తపస్సుకి ఉపక్రమించింది.

తక్కిన ఇద్దరు కన్యకలు అంబికా అంబాలికలను విచిత్రవీర్యుడు వివాహమాడాడు. తొమ్మిది సంవత్సరాలు రేయింబవళ్ళు వారితో క్రీడించి సంసార సుఖాలు అనుభవించాడు. రాజయక్ష్మ వచ్చి (క్షయ) హఠాత్తుగా మరణించాడు. సత్యవతీదేవి దారుణంగా విలపించింది. ప్రేతకార్యాలు మంత్రులతో జరిపించింది.



ఒకరోజున ఏకాంతంగా భీష్ముడితో సంభాషించింది. శంతనుమహారాజుకి పెద్దకొడుకువు కాబట్టి రాజ్యం పాలించమంది. సోదరుడి భార్యను స్వీకరించి వంశం నిలబెట్టమంది. ఈ యయాతివంశం అంతరించిపోకుండా చూడమంది.

**భీష్మమాహ తదైకాంతే వచనం చాతిదుఃఖితా ।**
**రాజ్యం కురు మహాభాగ పితుస్తే శంతనోస్సుత ॥**
**భ్రాతుర్భార్యాం గృహాణ త్వం వంశం చ పరిరక్షయ ।**
**యథా న నాశమాయాతి యయాతేర్వంశ ఇత్యుత ॥** **(20 - 55, 56)**

భీష్ముడు అంగీకరించలేదు. తండ్రికోసం అలనాడు ప్రతిజ్ఞ చేశాను కనక రాజ్యమూ చెయ్యను, వివాహమూ చేసుకోను అని మరోసారి భీష్మించాడు.

వంశం ఎలా నిలబడుతుందా అని సత్యవతికి దిగులుపట్టుకుంది. దానికితోడు అరాజకం వచ్చిపడిందే అని మరొక భయం. అప్పుడు ధర్మశాస్త్రవేత్త భీష్ముడు ఒక సలహా చెప్పాడు. సద్బ్రాహ్మణుణ్ణి పిలిపించి కోడలితో నియోగించమన్నాడు. ఆ పుట్టేవాడు విచిత్రవీర్యుడికి క్షేత్రజుడు అవుతాడు కనక, కులరక్షణకోసం ఈపాటిది తప్పుకాదన్నాడు. అప్పుడు ఆ మనుమడికి ఈ రాజ్యం అప్పగిద్దువుగాని, నేను అతడి ఆజ్ఞలు శిరసావహిస్తాను అని కూడా మాట ఇచ్చాడు.

సత్యవతి సరేనని సమ్మతించింది. తాను కన్యగా ఉన్నప్పుడు పరాశరుడివల్ల జన్మించిన వ్యాసుణ్ణి (కానీనుడు = కన్యకు పుట్టినవాడు) స్మరించింది. తలచినంతనే ప్రత్యక్షమయ్యాడు వ్యాసుడు. తల్లికి నమస్కరించి నిలబడ్డాడు. భీష్ముడు వచ్చి పొగలేని అగ్నిలా ఉన్న అన్నగారికి సపర్యలు చేశాడు. సత్యవతీదేవి మెల్లగా తన మనసులో ఉన్న మాట బయటపెట్టింది. వంశం నిలబెట్టమంది. వ్యాసుడు ఆప్తవాక్యంగా స్వీకరించాడు. అంగీకరించాడు (ఓమ్ అన్నాడు). ఋతుకాలాన్ని ప్రతీక్షిస్తూ అక్కడే ఉండిపోయాడు. అంబిక ఋతుస్నానం చేసింది. వ్యాసుడు కలిశాడు. గర్భవతి అయ్యింది. గుడ్డివాడు పుట్టాడు. సత్యవతి దుఃఖించింది. రెండవ కోడలు అంబాలికను నియోగించింది. ఆవిడకు ఒక పాండురోగి జన్మించాడు. వాడూ రాజ్యానికి పనికిరాడే ఎలాగా అని సత్యవతి బాధపడింది. ఏడాది గడిచాక మరొక్కసారి వ్యాసుణ్ణి స్మరించి రప్పించింది. కోడలిని పిలిచి (అంబాలికనే)మరొక్కసారి ప్రయత్నించమంది. ఈసారి అంబాలిక తనబదులు దాసీని నియమించింది. వ్యాసుడు కలిశాడు. ధర్మాంశంతో విదురుడు జన్మించాడు.

ఇలా వ్యాసుడు ధృతరాష్ట్ర-పాండు-విదురులకు జన్మకారకుడై యయాతివంశాన్ని నిలబెట్టి భ్రాతృధర్మం నెరవేర్చాడు. ***(అధ్యాయం - 20, శ్లోకాలు - 74)***

---

**ప్రథమ స్కంధం - 1184 శ్లోకాలు - తెలుగుసేత : బేతవోలు రామబ్రహ్మం**

---





# ద్వితీయ స్కంధము

సూతమహర్షీ! నువ్వుచెప్పిన ఈ కథలో గర్భధారణ చాలా ఆశ్చర్యకరంగా ఉంది. సరే, అది అలా ఉండనీ. ముందసలు ఈ సంగతి చెప్పు. సత్యవతీదేవి వ్యాసుడికి తల్లి అన్నావుగదా! ఆవిడ శంతను మహారాజును వివాహం చేసుకుంది అన్నావు. కన్యగానే వ్యాసుడికి జన్మనిచ్చింది అన్నావు. అదేమిటి! పోనీ అంటే, అలాంటి అమ్మాయిని శంతనుడు ఎలా వివాహం చేసుకున్నాడూ, ఇద్దరు పుత్రుల్ని ఎలా కన్నాడు? ఇవన్నీ మా సందేహాలు. సత్యవతి పుట్టుక, వేదవ్యాసుడి పుట్టుక సవిస్తరంగా వినాలని పరమకుతూహలంగా ఉంది. దయచేసి వివరించునాయనా - అని శౌనకాది మహామునులు అభ్యర్థించారు. సూతుడు ప్రారంభించాడు.

మునివర్యులారా! చతుర్వర్గ ప్రదాయిని ఆదిశక్తిని మనసారా మరొక్కసారి నమస్కరించి మీరడగిన పురాణగాథను వివరిస్తాను. ఏవంకతోనైనాసరే ఆ పరాశక్తి పేరును ఉచ్చరిస్తే చాలు వాక్ శక్తి సిద్ధిస్తుంది. ఆ దేవి వాంచితార్థప్రదాయిని. కోరికలు తీరాలంటే అన్నివేళలా అన్నివిధాలా ఆ శక్తిని ధ్యానించవలసిందే.

## ◆ వ్యాస జననం ◆

పూర్వకాలంలో ఉపరిచరవసువు అని ఒక రాజు ఉండేవాడు. పరమధార్మికుడు. సత్యసంగరుడు. చేదిదేశాన్ని పాలిస్తూండేవాడు. అతడి తపస్సుకు మెచ్చి ఇంద్రుడు స్ఫాటిక సుందరమైన విమానాన్ని బహూకరించాడు. ఆ దివ్యవిమానం అధిరోహించి అతడు ఆకాశంలో (ఉపరి) సంచరిస్తూండేవాడు. అందుకని అతడికి ఉపరిచరవసువు అనే పేరు స్థిరపడింది. అతడి భార్యపేరు గిరిక. చాలా అందగత్తె. వారికి అయిదుగురు కుమారులు. ఎవరి రాజ్యాలను వారు ఏలుకుంటున్నారు.

ఒకనాడు ఋతుస్నాతయైన గిరికాదేవి తన వాంఛను భర్తకు విన్నవించింది. సరిగ్గా అదే సమయానికి వసురాజుగారి తండ్రివచ్చి - పితృకార్యానికి అవసరమయ్యాయి, అడవికి వెళ్ళి మృగాలను వేటాడి తీసుకురమ్మని ఆజ్ఞాపించాడు. భార్యమాటకన్నా తండ్రిమాట శిరోధార్యమని భావించి, తక్షణావసరాన్ని గుర్తించి అతడు వేటకు బయలుదేరాడు. మనస్సంతా గిరికా సంగమం మీదనే ఉంది. చటుక్కున రేతస్ఖలనం అయ్యింది. వృథా పోనివ్వకూడదని మర్రిఆకులోకి పట్టాడు. ఋతుకాలం దాటిపోకుండా దీన్ని భార్యకు చేర్చాలనుకున్నాడు. పెంపుడు డేగకు విషయం చెప్పి ఆకును పొట్లం కట్టి పంపించాడు. ఎక్కడా



ఆగకుండా వేగంగా వెళ్ళి గిరికకు ఇచ్చిరమ్మన్నాడు. అది పొట్లాన్ని ముక్కున కరుచుకుని ఆకాశంలోకి బాణంలా దూసుకుపోయింది. ఎదురుగా వస్తున్న మరో డేగ ఈ పొట్లాన్ని చూసి మాంసం ముక్క అనుకొంది. వెంటబడింది. ముక్కుతో పొడిచింది. కాళ్ళతో తన్నింది. గోళ్ళతో రక్కింది. రెండింటికీ పెద్ద యుద్ధం జరిగింది. ఆ సంరంభంలో పొట్లం కాస్తా జారి యమునా నదిలో పడింది. డేగలు రెండూ ఎటువి అటు వెళ్ళిపోయాయి.

ఆ సమయానికి ఒక బ్రాహ్మణుడు యమునానదిలో మొలలోతు నీటిలో నిలిచి సంధ్యావందనం చేసుకుంటున్నాడు. అద్రిక అనే ఒక అప్సరస జలకేళి ఆడుతూ ఈ బ్రాహ్మణ యువకుణ్ణి చూసింది. ఆట పట్టిద్దామనిపించి మునుగు ఈతతో వచ్చి కాళ్ళు పట్టుకులాగింది. బ్రాహ్మణ యువకుడికి కోపం వచ్చింది. నా ధ్యానాన్ని భంగపరుస్తావా, హొత్తెరి, నువ్వు చేపవైపో అని శపించాడు. అద్రిక ఆడచేపగా మారిపోయింది. నీటిమీద తేలుతున్న ఆకుపొట్లం కంటబడింది. ఒక్కఉదుటున వెళ్ళి అందులో ఉన్న వసువీర్యాన్ని మింగేసింది. గర్భవతి అయ్యింది. నెలలు నిండాయి. పదవ నెలలో ఒక మత్స్యకారుడికి వలలో చిక్కింది. వాడు దాన్ని తీసుకువెళ్ళి పొట్ట చీల్చాడు. ఇద్దరు బిడ్డలు బయటపడ్డారు. ఒక ఆడ, ఒక మగ. ధీవరుడు (పల్లెవాడు) బిత్తరపోయాడు. పరుగుపరుగున వెళ్ళి తమ ప్రభువు దాశరాజుకు విన్నవించాడు. అతడూ అబ్బురపడ్డాడు. ఇద్దరు బిడ్డలనూ బాధ్యతగా తానే స్వీకరించాడు. అబ్బాయికి మత్స్యరాజు అనీ అమ్మాయికి కాళి అనీ నామకరణం చేశాడు. ఇద్దరూ పెరిగి పెద్దవాళ్ళు అవుతున్నారు. మత్స్యరాజు తండ్రికి తగిన పరాక్రమశాలి అయ్యాడు. అమ్మాయి (కాళి) రంగుకి నలుపే కానీ అందంలో అప్సరస. మత్స్యగర్భం నుంచి పుట్టింది కనక మత్స్యోదరీ అనీ, వొళ్ళంతా చేపలకంపు కనక మత్స్యగంధ - మత్స్యగంధి అనీ ఇరుగుపొరుగు అమ్మలక్కలు పిలవడంతో ఆ పేర్లు కూడా ఆమెకు స్థిరపడ్డాయి. అల్లారుముద్దుగా పెరుగుతున్నారు. ఇంతదాకా చెప్పి సూతుడు కాస్త ఊపిరి తీసుకోవడంకోసం ఆగాడు. అంతే ఒక మహాముని ఠక్కున అందుకున్నాడు.

సూతమహర్షీ ! అడ్డం తగిలానని ఏమీ అనుకోకు. వీళ్ళ కథ - తరవాత చూద్దాం. అద్రికమాట ఏమిటి? మళ్ళీ మర్చిపోతాం. అందుకని అడుగుతున్నాను. శాపవిముక్తి అయ్యిందా? అయితే ఎలా అయ్యింది? ఆ సంగతి ముందు చెప్పు - అన్నాడు. సూతుడు అలాగే అని ఉపక్రమించాడు.

మహర్షీ! నువ్వన్నమాట నిజమే. మళ్ళీ మర్చిపోతాం. టూకీగా చెప్పేస్తాను. వినెయ్యండి. ఆ బ్రాహ్మణుడు అలా శాపం ఇచ్చాడుగదా! అద్రిక దీనురాలై కాళ్ళావేళ్ళా పడింది. బతిమాలింది. శాపవిమోచనం చెప్పమంది. విప్రుడు కరిగిపోయాడు. కరుణించాడు. కల్యాణీ ! నీ కడుపున ఇద్దరు మానవ శిశువులు జన్మిస్తారు. దానితో నీకు శాపమోక్షం. మళ్ళీ నీ దివ్యసుందర రూపం నీకు వస్తుంది. నీ లోకానికి నువ్వు వెడతావు అన్నాడు. ఆ ప్రకారమే చేపగామారి ఇద్దరు బిడ్డలనూ ప్రసవించింది- శాపవిమోచనం అయ్యింది. స్వర్గానికి వెళ్ళిపోయింది.

***(అధ్యాయం - 1, శ్లోకాలు - 48)***



మహర్షులారా! మళ్ళీ మన ప్రధాన కథలోకి వద్దాం. మత్స్యగంధి దాశరాజుగారి ఇంట ఎదుగుతోంది. రూపయౌవనవతి అయ్యింది. ఒకరోజున మధ్యాహ్నం ఆ యమునానది ఒడ్డున తండ్రికి భోజనం వడ్డిస్తోంది. అదే సమయానికి వచ్చాడు పరాశరమహర్షి. అతడు తీర్థయాత్రలు చేస్తూ అక్కడికి చేరుకున్నాడు. నావలో నదిని దాటించమని దాశరాజును అడిగాడు. అత్యవసరంగా వెళ్ళాలని త్వరపెట్టాడు. భోజనం చేస్తున్న దాశరాజు మధ్యలో లేవడం ఆచారం కాదుకనక మత్స్యగంధిని పురమాయించాడు. అమ్మాయీ ! ఆవలి ఒడ్డుకు చేర్చిరా. వెళ్ళాలని తొందరపడుతున్నాడు. పైగా తపస్వి - అన్నాడు. సరేనంది మత్స్యగంధి.

పరాశరుడు నావ ఎక్కి కూర్చున్నాడు. మత్స్యగంధి గెడవేసి నడుపుతోంది. ఆమె నవయౌవనం పరాశరుణ్ణి ఆకర్షించింది. చిరునవ్వులూ వాలుచూపులూ గెడవేసే సోయగం మునీశ్వరుణ్ణి ఉక్కిరిబిక్కిరి చేశాయి. దైవయోగం అలా ఉంది. కామాతురుడై కుడిచేతితో ఆమె కుడిచెయ్యిని సుకుమారంగా స్పృశించాడు. అభిప్రాయం గ్రహించింది. చిరునవ్వులు చిందిస్తూ ఒయ్యారంగా పలికింది.

మునీశ్వరా! ఏమిటి ఇది? నీకు ధర్మమేనా? వసిష్ఠుడి వంశంలో పుట్టావు. చదువుకున్నావు. తపస్సులు చేశావు. నీకుకూడా మన్మథవికారాలా? మానవజన్మ దుర్లభం. అందులోనూ బ్రాహ్మణజన్మ మరీ దుర్లభమంటారు. నీకు ఈ (అనాగరక) అనార్య చేష్టలు తగునా? పైగా నాలో నీవంటి విప్రోత్తముడు మెచ్చదగిన శుభలక్షణం ఏముంది కనక? మత్స్యగంధిని. ఒళ్ళంతా చేపలకంపు. నీకిది తగదుసుమా! అని వారిస్తూనే ఉంది. పరాశరుడికి ఇవేవీ వినిపించడంలేదు. ఇంకా ఇంకా చేరువకు వస్తున్నాడు. మత్స్యగంధి కంగారుపడింది. పరిస్థితి గ్రహించింది. ఇతణ్ణి వారించడం అసంభవం అనుకొంది. నా చెయ్యి పట్టుకొని (నావ పల్టీకొట్టి) నదిలో పడిపోతాడు, ఖాయం అనుకొంది. మహామునీ! కొంచెం సేపు మనస్సు చిక్కబట్టుకో. ఆవలి ఒడ్డుకు చేరనీ. దగ్గరకు వచ్చేశాం - అంది. సంబరపడ్డాడు. చెయ్యివదిలి దూరం జరిగి బుద్ధిగా కూర్చున్నాడు. నావ క్షేమంగా ఆవలితీరం చేరింది. దిగుతూనే మత్స్యగంధి చెయ్యి పట్టుకున్నాడు. ఆ కన్యక నిలువునా వొణికిపోతోంది.

పరాశరమహర్షీ! ఇది నీకు తగునా? నా శరీరం చేపల కంపు. నీకు అసహ్యం వెయ్యడం లేదూ! సమానరూపులకు కామసంయోగం సుఖావహంగా ఉంటుంది. ఇదేమిటి చెప్పు. ఇలా .......

అంటూండగానే పరాశరుడు ఆమెను (తన తపశ్శక్తితో) యోజనగంధిని చేశాడు. తనువంతా కస్తూరి పరిమళం. యోజనదూరం ఘుమఘుమలాడింది. కామాతురుడై కుడిచెయ్యి పట్టుకున్నాడు. సిగ్గులు మొగ్గతొడిగాయి. పరిసరాలు పరికించింది. ఆవలి ఒడ్డుకు చూపు సారించింది.

పరాశరా! లోకం చూస్తోంది. ఆవలి ఒడ్డున మా తండ్రి ఉన్నాడు. పశుధర్మం దారుణం. నాకు ఇష్టం లేదు. చీకటి పడేవరకూ ఆగు. పశువులకు పగలు, మనుషులకు రాత్రి అనిగదా ఏర్పాటు.



పశుధర్మో న మే ప్రీతిం జనయత్యతిదారుణః ।
ప్రతీక్షస్వ మునిశ్రేష్ఠ యావద్భవతి యామినీ ॥ (2 - 21)

వెంటనే పరాశరుడు ఆకాశంలో మంచుతెరలు సృష్టించాడు. దట్టంగా పొగమంచు వ్యాపించి చుట్టూ చీకటిపడ్డట్టయ్యింది. ఇంకేమిటి ఆలస్యం అన్నట్టు చూశాడు. సన్నని గొంతుతో కువకువలాడింది యోజనగంధి.

స్వామీ ! నేను కన్యను. కాసేపటి తరవాత మీ దారిన మీరు వెళ్ళిపోతారు. పైగా మీ తేజస్సు తిరుగులేనిది. ఆనక తల్లిదండ్రులకు నేనేమి చెప్పుకోను. శరీరంలో మార్పులు వస్తే ?

ఓసి బేలా ! నీ కన్యాత్వం చెడదు. ఇది నేనిస్తున్న వరం. భయపడకు. నువ్వుకోరుకునేది ఇంకేమైనా ఉంటే చెప్పు.

మహాతపస్వీ ! మా తల్లిదండ్రులకు గానీ లోకానికి గానీ ఈ సంగతి తెలియకూడదు. నా కన్యాత్వం చెడకూడదు. అన్నివిధాలా నీవంటి పుత్రుడు నాకు కావాలి. ఈ యౌవనం ఈ పరిమళం శాశ్వతంగా ఉండిపోవాలి.

సుందరీ! తథాస్తు. విష్ణ్వంశతో కొడుకు పుడతాడు. ముల్లోకాలలోనూ ప్రసిద్ధుడవుతాడు. ఇదేమిటో నాకే వింతగా ఉంది. ఎందరెందరో అప్సరసల ఒయ్యారాలను చూశాను. ఎప్పుడూ నా మనస్సు చలించలేదు. దుర్గంధం ఉన్నా నల్లగా ఉన్నా నిన్ను చూసి మనసుపడ్డాను. వింతకాదూ! ఇదేదో దైవనియోగం. అది దురతిక్రమం. (దైవం హి దురతిక్రమమ్. 2 - 33) అందుకే ఇంతగా కామవివశుణ్ణి అయ్యాను. సరే. మహాతేజస్వి నీకు బిడ్డడవుతాడు. వేదాలను విభజించి పురాణాలు రచించి కీర్తి గడిస్తాడు.

యోజనగంధి భయాలు తొలగిపోయాయి. వరాలు మురిపించాయి. మౌనంగా మునీశ్వరుడి కౌగిట్లో కరిగిపోయింది.

ఆనందపారవశ్యంలో ఉన్న యోజనగంధికి వీడ్కోలు పలికి పరాశరుడు వెళ్ళిపోయాడు. సద్యోగర్భం. పుత్రజననం. రంగుకి నలుపే అయినా ముమ్మూర్తులా మునితేజస్సు. విష్ణ్వంశ సంభవుడు కనక పుడుతూనే పెద్దవాడు అయ్యాడు. తల్లికి నమస్కరించాడు.

అమ్మా! తపస్సుకి వెడుతున్నాను. నువ్వు ఇంటికి వెళ్ళు. ఏదైనా పనిపడ్డప్పుడు నన్ను స్మరించు. వచ్చి వాల్తాను. చింతించకు. శుభమ్ - అంటూనే వెనుదిరిగి చకచకా నడిచి వెళ్ళిపోయాడు. మంచుతెరలు తొలగిపోయాయి. నావనడుపుకుంటూ యోజనగంధి ఈవలిగట్టుకు వచ్చింది. తండ్రిని చేరుకుంది.



ద్వీపంలో పుట్టాడు కనక ద్వైపాయనుడు. నల్లగా ఉంటాడు కనక కృష్ణుడు. తీర్థాలూ క్షేత్రాలూ సేవించాడు. గాఢారణ్యాలలో తపస్సులు చేశాడు. జ్ఞాని అయ్యాడు. కలియుగం రాబోతోందని గ్రహించి వేదాన్ని నాలుగు భాగాలుగా విభజించాడు. అప్పటినుంచీ వేదవ్యాసుడయ్యాడు. పురాణోపపురాణాలూ మహాభారతం రచించాడు. అయిదుగురు శిష్యులకూ, తనయుడు శుకుడికీ అన్నీ నేర్పాడు. సుమంతు-జైమిని-పైల-వైశంపాయన-అసిత-దేవలులు వ్యాస శిష్యులు. వీరు లోకమంతటా ధర్మప్రచారం చేశారు.

శౌనకాది మహామునులారా! మీరడిగిన సత్యవతీకథ (యోజన గంధి) వ్యాస వృత్తాంతమూ చెప్పాను. విన్నారుగా. ఇందులో మీకు చాలా సంశయాలు రావచ్చు. ధర్మ సందేహాలు కలగవచ్చు. మహాత్ముల చరిత్రల్లో మనం గుణాలనే గ్రహించాలి. మహతాం చరితే చైవ గుణా గ్రాహ్యాః - అన్నారు. సత్యవతిది కారణజన్మ. అందుకే చేపకడుపు నుంచి జన్మించింది. పరాశరుడితో కలయిక, అటుపైని శంతనుణ్ణి వివాహమాడటమూ అటువంటివే. అధర్మమూ అనార్యమూ అయితే మునీశ్వరులు చేస్తారా? వీరంతా కారణజన్ములు. వీరి చర్యలు సాధారణ ధర్మాలకు అతీతం. వాటితో తూచకూడదు. మన దృష్టికి విడ్డూరంగానే ఉంటాయి. ఇది చాలా పుణ్యప్రదమైన ఆఖ్యానం. విన్నవాళ్ళూ, చదివినవాళ్ళూ సకలశుభాలనూ పొందుతారు. ***(అధ్యాయం - 2, శ్లోకాలు - 52)***

సూతుడు ఇలా హెచ్చరించేసరికి శౌనకాదుల ధర్మసందేహాలు మనస్సుల్లోనే ఉండిపోయాయి. విశేషధర్మాలు వింతగానే ఉంటాయి. ధర్మ సూక్ష్మాలు విడ్డూరంగానే ఉంటాయి, సహజం అనుకొన్నారు కాబోలు. కానీ, కథాపరంగా మరికొన్ని సందేహాలను వెలిబుచ్చారు.

రోమహర్షణీ! శంతనుమహారాజు సత్యవతిని ఎలా వివాహం చేసుకున్నాడు ? అతడు క్షత్రియుడు. గొప్ప వంశం - పురువంశం. ఈవిడ నిషాదపుత్రి. అదికాక, భీష్ముడు శంతనుడి కుమారుడన్నావు. గాంగేయుడన్నావు. అంటే శంతనుడి మొదటి భార్య ఎవరు? ఆ కథా కమామీషూ ఏమిటి? భీష్ముడేమో తాను పెద్దకొడుకు అయ్యుండీ అన్ని అర్హతలూ యోగ్యతలూ ఉండీ రాజ్యం ఏలకుండా చిత్రాంగదుణ్ణీ విచిత్రవీర్యుణ్ణీ రాజుల్ని చెయ్యడం ఏమిటి? సత్యవతీదేవి గోలకులను (వితంతు పుత్రులు) జన్మింపజెయ్యడం ఏమిటి? అరాజకం వస్తుందనుకుంటే భీష్ముడికి పట్టాభిషేకం జరిపించవచ్చు, వంశం నశిస్తుందనుకుంటే అతడికే వివాహం జరిపించవచ్చు. భీష్ముడు పెళ్ళి ఎందుకు చేసుకోలేదుట? భర్తృహీనలకు సంతానం కలిగించడమా? అధర్మం కాదూ ! పైగా ఇంతటి అధర్మానికి వ్యాసుడంతటివాడు పాల్పడటమా! ధర్మాలన్నీ తెలిసినవాడు, పురాణాలు రచించినవాడు, వేదాలు విభజించినవాడు - అంతటి వ్యాసుడు పరభార్యలతో అందునా సొంతసోదరుల భార్యలను కలవడమా? ఇంతకన్నా జుగుప్సితం ఉంటుందా? ఎలా చెయ్యగలిగాడు?



శౌనకాదులు తీవ్రంగా స్పందించారు. ప్రశ్నల వర్షం కురిపించారు. పైగా - ఇది నైమిశారణ్యం, పరమపవిత్రమైన ప్రదేశం. నువ్వేమో వ్యాసశిష్యుడివి. మహామేధావివి. సందేహాలు తీర్చాల్సిందే అన్నారు. వీరి ధర్మదృష్టికీ పట్టుదలకూ శుశ్రూషకూ (వినాలనే కోరిక) సూతుడు ఉప్పొంగిపోయాడు. దూకుడుగా అందుకున్నాడు.

## ◆ గంగాశంతను వృత్తాంతం ◆

ఇక్ష్వాకువంశంలో మహాభిషుడు అనే చక్రవర్తి ఉండేవాడు. ధర్మశీలుడు. సత్యసంధుడు. వెయ్యి అశ్వమేధాలూ వంద వాజపేయాలూ చేశాడు. ఇంద్రుణ్ణి సంతోషపెట్టాడు. స్వర్గంలో నివాసం పొందాడు. ఒకరోజున ఈ మహాభిషుడు బ్రహ్మదేవుడి కొలువుకి (సత్యలోకం) వెళ్ళాడు. ప్రజాపతిని సేవించుకోవడం కోసం దేవతలు అందరూ వచ్చారు. మహానది గంగాదేవి కూడా వచ్చింది. ఆ సంరంభంలో గాలితాకిడికి ఆవిడ పైట జారింది. గమనించినట్టు లేదు. చూడటం తప్పు అని దేవతలంతా (అసలే అనిమిషులు) చూపులు మరల్చుకున్నారు. ముఖాలు దించుకున్నారు. మహాభిషుడు మాత్రం నిస్సంకోచంగా తదేకదీక్షగా చూస్తూ నిలబడ్డాడు. అతడి చూపుల్లో అనురక్తిని గుర్తించింది గంగాదేవి. తానూ అనురక్త అయ్యింది. ప్రేమ అంకురించి కామమోహిత అయ్యింది. సిగ్గుకి సిగ్గువచ్చి పారిపోయింది. ఇద్దరూ పరిసరాలు మర్చిపోయారు. ఒకరినొకరు చూసుకుంటూ మైమరిచి అలా నిలిచిపోయారు. బ్రహ్మదేవుడికి కోపం వచ్చింది. మర్త్యలోకంలో జన్మించండని ఇద్దరినీ శపించాడు. అప్పటికి ఒళ్ళు తెలిసి ఇద్దరూ కొలువు వదిలి వచ్చేశారు.

మహాభిషుడు భూలోకంలో ధర్మతత్పరులను వెదికివెదికి పురువంశంలో ప్రతీపమహారాజుకు పుత్రుడుగా జన్మించాడు.

ఆ కాలంలో - అష్ట వసువులు తమ భార్యలతో కలిసి ఆకాశంలో స్వేచ్ఛగా విహరిస్తూ వసిష్ఠుడి ఆశ్రమ ప్రాంతానికి వచ్చారు. అందులో ఒక వసువుపేరు "ద్యు' (ద్యోః - ద్యువు). అతడి భార్య వసిష్ఠాశ్రమంలో నందినీ ధేనువును చూసింది. ఇది ఎవరి ఆవు? - అని ప్రశ్నించింది. వసిష్ఠులవారిది అనిచెప్పి ఊరుకోకుండా ద్యువు దాని విశిష్టతలుకూడా చెప్పాడు. ఇది దివ్యధేనువు, దీనిపాలు త్రాగినవారికి దీర్ఘాయువూ (అయుత సంవత్సరాలు) నిత్యయౌవనమూ సిద్ధిస్తాయన్నాడు. అయితే, ప్రియా! నా ఇష్టసఖి ఉశీనర (రాజర్షి) పుత్రి మృత్యులోకంలో ఉంది, ఆమెకోసం దూడతోసహా ఈ గోవును తీసుకుపోదాం, దీనిపాలు త్రాగి, జరారోగపీడలు వదిలించుకుని నా స్నేహితురాలు మళ్ళీ మనలో ఒకతె అవుతుంది, నిత్యయౌవనంతో క్రీడిస్తుంది, తీసుకుపోదాం పట్టు అంది. ఆ సమయంలో వసిష్ఠుడు



ఆశ్రమంలో లేడు. ఫలపుష్పాదులకోసం అడవిలోకి వెళ్ళాడు. ఇదే అదను అనుకొని ఆ వసువులు ఎనమండుగురూ కలిసి ఆశ్రమంలో దిగారు. ద్యువు ప్రోత్సాహంతో నందినీ ధేనువును అపహరించి తీసుకుపోయారు.

కాసేపటికి వసిష్ఠుడు వచ్చాడు. నందిని కనిపించలేదు. అంతటా వెతికాడు. కొండలూ కోనలూ గాలించాడు. ఎక్కడా కనిపించలేదు. కోపం వచ్చింది. ధ్యానంలో కూర్చుని దివ్యదృష్టి సారించి చూశాడు. విషయం తెలిసింది. ఎనమండుగురినీ భూలోకంలో మానవులుగా జన్మించమని శపించాడు. ఈ దుర్వార్త వసువులకు చేరింది. ఆగమేఘాల మీద వచ్చి వసిష్ఠులవారి కాళ్ళు పట్టుకున్నారు. పొరపాటు చేశాం క్షమించమని బతిమిలాడుకున్నారు. బ్రహ్మర్షి శాంతించాడు. శాపతీవ్రత తగ్గించాడు. ఏడాదికి ఒకరుచొప్పున శాపవిముక్తి పొందుతారు, అపహరణలో ప్రధానపాత్ర ద్యువుది కనక అతడు మాత్రం దీర్ఘకాలం మానవశరీరంలో ఉండక తప్పదు పొండి అన్నాడు.

అనుసంవత్సరం సర్వే శాపమోక్షమవాప్స్యథ ।
యేనేయం విహృతా ధేనుర్నందినీ మమ వత్సలా ॥
తస్మాత్ ద్యౌర్మానుషే దేహే దీర్ఘకాలం వసిష్యతి । (3 - 39, 40)

మానవగర్భంలో జన్మించడమూ సంవత్సరంపాటు నివసించడమూ - ఎలాగరా భగవంతుడా అని బాధపడుతూ తిరిగివెడుతున్న అష్టవసువులకు, బ్రహ్మలోకం నుంచి భూలోకానికి వస్తున్న గంగాదేవి కనిపించింది. అందరూ ఆవిడను శరణువేడారు. అమృతం తినే దేవతలం, మానవగర్భవాసం ఎలా చెయ్యగలం, అంచేత తల్లీ ! దయచేసి నువ్వు మానవరూపం ధరించి మమ్మల్ని ఉద్ధరించు. రాజర్షి శంతనుడికి భార్యవై పన్నెండు నెలలు మోసి మమ్మల్ని ప్రసవించి పుట్టినవాణ్ని పుట్టినట్టు నీ పవిత్ర జలాల్లో కలిపెయ్. ఇలాగయితే నీ శాపంతో మా శాపానికి అనుకూలించి మాకు ముక్తి ప్రసాదించినదానవు అవుతావు. అంగీకరించు నదీమతల్లీ! అని అభ్యర్థించారు. గంగమ్మ సరే అంది. వసువులు సంతృప్తి చెంది తమ లోకానికి వెళ్ళిపోయారు.

ప్రతీపమహారాజుకు సంతానం లేదు. పుత్రార్థియై గంగాతీరాన సూర్యోపాసనకు కూర్చున్నాడు. తీవ్రంగా తపస్సు చేస్తున్నాడు. ఒకనాడు హఠాత్తుగా ఆ నీటినుంచి ఒక సుందరాంగి లేచివచ్చి ప్రతీపుడి కుడితొడపై కూర్చుంది. కళ్ళు తెరిచి చూశాడు. రూపయౌవనశాలిని. శుభాంగీ! ఎవరివి నువ్వు? నా అనుమతిలేకుండా వచ్చి నా తొడమీద కూర్చున్నావెందుకని? ప్రతీపుడు సౌమ్యంగా ప్రశ్నించాడు. కామించి వచ్చాను, స్వీకరించు అంది సుందరాంగి.



వరవర్ణినీ! నేను పరస్త్రీపరాగ్ముఖుణ్ణి. పైగా నువ్వు నా కుడితొడపై కూర్చున్నావు. అది కొడుకో కూతురో కోడలో కూర్చోదగిన చోటు.

స్థితా దక్షిణమూరుం మే సమాశ్లిష్య చ భామిని ।
అపత్యానాం స్నుషాణాం చ స్థానం విద్ధి శుచిస్మితే ॥ (3 - 51)

అందుచేత కొడుకుపుడితే నువ్వు నాకు కోడలివి అవుదువుగాని. నీ పుణ్యాన అయినా నాకు కొడుకు పుడతాడు. సంశయం లేదు - అన్నాడు ప్రతీపుడు. సుందరాంగి సరే అంది. వెళ్ళిపోయింది. ప్రతీపుడు తపస్సు చాలించి నగరానికి చేరుకున్నాడు. ఆ సుందరాంగిని గురించే ఆలోచిస్తున్నాడు.

కొంతకాలానికి ప్రతీపుడి అంతఃపురం కళకళలాడింది. కొడుకు పుట్టాడు. అల్లారుముద్దుగా పెరిగి పెద్దవాడయ్యాడు. అతడే శంతనుడు. రాజ్యం అతడికి అప్పగించి వానప్రస్థానికి పోదామని ప్రతీపుడు నిర్ణయించుకున్నాడు. కొడుకుని పిలిచి అలనాటి సుందరాంగి వృత్తాంతం చెప్పాడు. నువ్వు ఏ వేటకోసమో ఏ అడవులకో వెళ్ళినప్పుడు ఆ సుహాసిని నీ దగ్గరికి వస్తుంది. కామార్తను అంటుంది. తిరస్కరించకు. ఎవరివి నువ్వు అని ప్రశ్నించకు. ధర్మపత్నిగా స్వీకరించు. సుఖించు. ఇది నా ఆజ్ఞ - అని చెప్పేసి ప్రతీపుడు శంతనుడికి రాజ్యం అప్పగించి అడవులకు వెళ్ళిపోయాడు. ఆదిశక్తిని పరాంబికను ఉపాసించి మోక్షం పొందాడు. ***(అధ్యాయం - 3, శ్లోకాలు - 60)***

శౌనకాది మహామునులారా! శ్రద్ధగా వింటున్నారా అని ఒక హెచ్చరిక విసిరి సూతుడు ప్రవచనం కొనసాగించాడు.

శంతనుడు ధర్మతత్పరుడై రాజ్యం చేస్తున్నాడు. అతడికి మృగయావినోదంపట్ల (వేట) ఆసక్తి మెండు. క్రూరమృగాలను వేటాడి చంపడంలో దిట్ట. గంగాతీరాన ఒక ఘోరారణ్యంలో వేటాడుతుండగా సుందరాంగి కనిపించింది. రూపయౌవనశాలిని. చారుహాసిని. వరవర్ణిని. శంతనుడికి తండ్రిమాటలు జ్ఞాపకం వచ్చాయి. ఆవిడే ఈవిడ, సందేహం లేదు అనుకొన్నాడు. సౌందర్యమధురామృతాన్ని కన్నులారా గ్రోలుతున్నాడు. రెప్పవెయ్యకుండా చూస్తున్నాడు. తనివి తీరడంలేదు. తనువు పులకించింది. అణువణువునా రోమకూపాలు ఉలికి-బిగిసి నిలుచున్నాయి. నిస్సంకోచంగా తదేకదీక్షగా చూస్తూ నిలబడ్డాడు. అతడి చూపుల్లో అనురక్తిని గుర్తించింది సుందరాంగి.

అవే కన్నులు. అవే చూపులు. అదే అనురక్తి. మహాభిషుడుగా గుర్తించింది సుందరాంగి. శంతనుడు మాత్రం గంగాదేవిగా గుర్తించలేకపోయాడు. కానీ మధురంగా సాంత్వనంగా పలకరించాడు.



సుందరాంగీ! దేవకాంతవా, మానవకాంతవా? నాగ యక్ష గంధర్వాప్సరసలలో ఏ జాతి నీది? ఎవరైతే నాకేమిలే. ఇదే చిరునవ్వుతో ఇదే అనురాగంతో ఇలాగే ఇప్పుడే నాకు ధర్మపత్నివి కా!

ఇతడు నన్ను గుర్తించలేదని గ్రహించింది గంగాదేవి. చెదరని చిరునవ్వుతో బదులు పలికింది. నృపోత్తమా! నిన్ను నేను ఎరుగుదును. ప్రతీప మహారాజుగారి పుత్రరత్నానివి. నీవంటివాణ్ణి పతిగా పొందాలని ఏ సతి మాత్రం కోరుకోదు! అలాగే. నీ మాట జవదాటను. అయితే, నాదొక నియమం. నువ్వు పాటిస్తానని మాట ఇవ్వాలి. నేను ఏంచేసినా - అది శుభంకానీ, అశుభంకానీ - నువ్వు ప్రశ్నించకూడదు. అడ్డు చెప్పకూడదు. నిందించకూడదు. నిషేధించినా నిందించినా నిన్ను విడిచి వెళ్ళిపోతాను. ఇది నా నియమం. అంగీకారమేనా?

**యచ్చ కుర్యామహం కార్యం శుభం వా యది వాఽశుభమ్ ।**
**న నిషేధ్యా త్వయా రాజన్ న వక్తవ్యం తథాఽప్రియమ్ ॥ (4 - 13)**

మహాభిషుడి ప్రేమను తలుచుకొని ఒప్పుకొన్నా, అష్టవసువుల అభ్యర్థనను మనసులో పెట్టుకుని ఇలా సమయం చేసింది గంగాదేవి. శంతనుడు అంగీకరించాడు. సుందరాంగితో రాజధానికి చేరుకున్నాడు. ధర్మపత్నిని చేసుకున్నాడు. నిత్యోత్సవంగా నిత్య వసంతంగా నిత్యనూతనంగా రోజులు పరుగిడుతున్నాయి. అతడి అంతరంగాన్ని గుర్తించి అలరిస్తోంది గంగాదేవి. శచీపురందరుల్లా, లక్ష్మీనారాయణుల్లా క్రీడిస్తున్నారు. సంవత్సరాలు అజలేకుండా దొర్లిపోతున్నాయి.

గంగాదేవికి నెల మసలింది. పుత్రుణ్ణి ప్రసవించింది. నెత్తు గుడ్డును పొత్తి గుడ్డలతో తీసుకువెళ్ళి నిర్దాక్షిణ్యంగా నదిలో వదిలేసింది. రెండూ మూడూ నాలుగూ - గురినీ అంతే చేసింది. మనసులోనే బాధపడ్డాడు తప్ప శంతనుడు కిమ్మనలేదు. ఎనిమిదవసారి గర్భవతి అయ్యింది. రాజు ఆలోచనలో పడ్డాడు.

నా వంశం నిలబ దా? ఏడుగురిని గంగపాలు చేసింది. ఇది ఎనిమిదవ గర్భం. వారించకపోతే ఈ పుట్టబోయే అంతే చేస్తుందేమో! వారిస్తే విడిచి వెళ్ళిపోతుంది. ఏం చెయ్యను? తొమ్మిదవ గర్భం వస్తుందో రాదో. వస్తే మాత్రం ఈ పాపాత్మురాలు నిలవనిస్తుందనీ బిడ్డను బతకనిస్తుందనీ హామీ ఏమిటి? ఎలాగైనా సరే వంశం నిలబెట్టుకోవాలి. ఇప్పుడే ప్రయత్నించాలి. బిడ్డపుట్టగానే అడ్డుపడాలి. గంగలో కలపనివ్వకూడదు - అని శంతనుడు ఒక నిర్ణయానికి వచ్చాడు.

ఎనిమిదవ శిశువుగా ద్యువు (అష్టమవసువు) జన్మించాడు. ఇతడు దీర్ఘకాలం మానవుడుగా ఉండిపోవాలని వసిష్ఠుడి శాపం.



యథావిధిగా గంగాదేవి పసిబిడ్డను తీసుకుని నదికి బయలుదేరింది. శంతనుడు చూశాడు. పరుగుపరుగున వచ్చి కాళ్ళపై పడ్డాడు. ఈ ఒక్కపుత్రుణ్ణీ ప్రాణాలతో వదిలిపెట్టు, పెంచుకుంటాను. ఏడుగురిని నీళ్ళల్లో వదిలేశావు. నీకిచ్చిన మాటకు కట్టుబడి అడ్డు చెప్పలేదు. ఈ పుత్రశోకం భరించలేకపోతున్నాను. నా గుండెలు పగిలిపోయేట్టు ఉన్నాయి. దయచూడు. కరుణించు. వీణ్ణి ఒక్కణ్ణీ దక్కించు. నా వంశం నిలబడుతుంది. ఈ ఒక్క ఉపకారమూ చెయ్యి. చాలు. అపుత్రస్య గతిర్నాస్తి అన్నారు. అందుకని ఇంతగా కాళ్ళా వేళ్ళా పడి బతిమాలుకుంటున్నాను. సుందరాంగీ! అనుగ్రహించు.

గంగాదేవి వినిపించుకోలేదు. ముందుకే అడుగువేసింది. శంతనుడి దుఃఖం క్రోధంగా మారిపోయింది. ఉగ్రుడయ్యాడు. నిప్పులు చెరిగాడు.

కఠినాత్మురాలా! నరకానికైనా వెరవని పాపాత్మురాలా! ఏ పాపిష్ఠివంశంలో పుట్టావ్? కన్న బిడ్డల్ని కడతేర్చుకుంటున్నావ్. మానవుల్లోనేకాదు ఏ జాతుల్లోనూ ఉండదే! నువ్వసలు ఆడదానివేనా? తల్లిపేగు ఉందా? ఎలా తెంచుకోగలుగుతున్నావే రాక్షసీ! ఉంటే ఉండు, పోతే పో, వంశ వినాశనానికి దాపురించావ్. పిల్లవాణ్ణి మాత్రం తీసుకువెళ్ళడానికి వీల్లేదు.

అయినా గంగాదేవి ఆగలేదు. రుసరుసా చూసింది. ఒక్క నవ్వు అదోలా నవ్వింది. నడుస్తూనే బదులు పలికింది.

శంతనూ! ఈ బిడ్డ నాకు కావాలి. నీకు ఇవ్వను. అడవుల్లో పెంచుతాను. నువ్వు మాటతప్పావు. నాకు అడ్డు చెప్పావ్, నిందించావ్. అందుచేత నిన్ను విడిచి ఇదిగో ఇప్పుడే వెళ్ళిపోతున్నాను. వెళ్ళే ముందు నాదొక మాట. జాగ్రత్తగా విను. నేను గంగాదేవిని. పూర్వజన్మలో నువ్వు మహాభిషుడివి. మన అనురాగబంధం అడవిలో కాదు, అలనాడు సత్యలోకంలో. నువ్వు గుర్తించలేకపోయావ్. సరే ఆ సంగతి అలా ఉంచు.

అష్టవసువులు వసిష్ఠశాపానికి గురియై నన్ను తల్లిగా అభ్యర్థించారు. ఆ దేవకార్యంకోసం నేను నీకు ధర్మపత్నిని అయ్యాను. ఏడుగుర్నీ శాపవిముక్తుల్ని చేశాను. ఈ బిడ్డడు అష్టమవసువు. వీడు దీర్ఘాయువు. తల్లిలేని బిడ్డడు బతకడు. బతికినా ఆరోగ్యంగా ఉండడు. అందుచేత నేనే తీసుకువెళ్ళి పెంచుతాను. యువకుడయ్యాక నీకు అప్పగిస్తాను.

**దాస్యామి యౌవనప్రాప్తం పాలయిత్వా మహీపతే ।**
**న మాతృరహితః పుత్రో జీవేన్న చ సుఖీ భవేత్ ॥** (4 - 44)

ఇతడు అష్టమవసువు. గంగాపుత్రుడు. గాంగేయుడు. బలాధికుడూ మహావీరుడూ అవుతాడు. అంచేత దుఃఖించకు. మనం కలుసుకున్న అడవిలోకే ఆ చోటికే తీసుకువెడుతున్నాను.



ఈ మాటలు చెప్పి శంతునుడికి కాసింత ఉపశమనం కలిగించి గంగాదేవి అదృశ్య అయ్యింది. భార్యావిరహం పుత్రవిరహం బాధిస్తున్నా నేను నిమిత్తమాత్రుణ్ణి అనుకున్నాడు శంతనుడు. ధైర్యం చెప్పుకున్నాడు. రాజ్యపాలనలో మునిగిపోయాడు. కాలం గడుస్తోంది.

ఒకనాడు - వినోదంకోసం వేటకు బయలుదేరాడు. తిరిగి తిరిగీ గంగాతీరం చేరుకున్నాడు. అదే అడవి. అదే చోటు. ఒక యువకుడు, స్ఫురద్రూపి, ఆజానుబాహువు విలువిద్యను అభ్యసిస్తూ కనిపించాడు. శంతనుడు గుర్తించలేకపోయాడు. పాతసంగతులు ఏవీ అతడికి స్ఫురణలో లేవు. అన్నీ మరిచిపోయాడు.

వయసులో ఉన్నప్పటి మన్మథుణ్ణి తలపిస్తున్నాడు ఆ యువకుడు. అతడి ధనుర్విద్యా కౌశలం బాణప్రయోగ లాఘవం - మానవ మహావీరులకే కాదు, దేవ ధానుష్కులకు కూడా అసంభవం - శంతనుడు ఇలా ఆశ్చర్యపోతూ నిలబడి తదేకదీక్షగా చూస్తున్నాడు. ఆనందిస్తున్నాడు. చాలాసేపటికి ఆ యువకుడు తన అభ్యాసం ఆ పూటకు ముగించాడు. శంతనుడు స్పృహలోకి వచ్చి, యువకుణ్ణి సమీపించి, ఆర్ద్రంగా ఆప్యాయంగా పలకరించాడు.

నాయనా! ఎవరి అబ్బాయివి అని అడిగాడు. ఆ యువకుడు జవాబు చెప్పకుండా అటూ ఇటూ బాణాలు వేసుకుంటూ మాయమయ్యాడు. శంతనుడికి దిగులు పట్టుకుంది. ఎవరో ఏమిటో తెలుసుకోవాలనే కుతూహలం పెరిగింది. గంగాదేవిని స్మరించాడు. స్తుతించాడు. ప్రత్యక్షమయ్యింది. మితంగా శుచిస్మితంగా పలికింది.

రాజేంద్రా! వీడు నీ కుమారుడే. అష్టమవసువు. గాంగేయుడు. వసిష్ఠులవారి దగ్గర వేదశాస్త్రాలు అభ్యసించాడు. ధనుర్వేదంలో మరీ ప్రవీణుడు అయ్యాడు. పరశురాముడికి ఎంత విద్య వచ్చునో ఇతడికీ అంతా వచ్చు. ఇప్పుడింక నీ పుత్రుణ్ణి నీవు తీసుకువెళ్ళవచ్చు. నీ వంశానికి కీర్తికారకుడు అవుతాడు. మంచిబాలుడు అనిపించుకుంటాడు. నిన్ను ఆనందింపజేస్తాడు. అనిచెప్పి గాంగేయుణ్ణి పిలిచి తండ్రికి అప్పగించి గంగమ్మ అదృశ్య అయ్యింది.

శంతనుడు మురిసిపోతూ కొడుకుని కౌగిలించుకుని శిరస్సు మూర్కొని, రథం ఎక్కించుకుని రాజధానికి తిరిగివచ్చాడు. గజోత్సవం జరిపించాడు. మంచిరోజు చూసి మంత్రి పురోహిత సామంత దండనాయక పౌర జానపదులను అందరినీ ఆహ్వానించి కొడుకును పరిచయం చేసి యౌవరాజ్య పట్టాభిషిక్తుణ్ణి చేశాడు. పుత్రుడి గుణగణాలనూ శౌర్య పరాక్రమాలనూ ప్రత్యక్షంగా పరోక్షంగా తెలుసుకుంటూ సంబరపడిపోతున్నాడు. ఇక జాహ్నవిని (గంగాదేవిని) తలవనైనా తలవడం లేదు.

***(అధ్యాయం - 4, శ్లోకాలు - 69)***



శౌనకాది మహామునులారా! గాంగేయుడి జననం విన్నారుగదా! ఇంక మహారాజు శంతనుడు దాశపుత్రి మత్స్యగంధిని ఎప్పుడు వివాహం చేసుకున్నాడు ? ఎలా చేసుకున్నాడు ? ఈ సందేహాలకు సమాధానం మిగిలిపోయింది. చెప్పేస్తాను, వినెయ్యండి.

## ◆ యోజనగంధి శంతను వృత్తాంతం ◆

శంతనుడికి వేట పిచ్చి ఉందిగదా! గాంగేయుడితో కలిసి గాఢారణ్యాలకు బయలుదేరాడు. క్రూరమృగాలను వెదికి వెదికి సంహరిస్తూ అరణ్యం నుంచి అరణ్యానికి వెడుతూ - నాలుగేళ్ళపాటు సాగింది వారి వేట. కట్టకడపట కాళిందీ తీరానికి చేరుకున్నారు. ససైన్యంగా విడిది చేశారు. శంతనుడు తన గుడారంలో విశ్రాంతి తీసుకుంటున్నాడు.

ఎచట నుండి వీచెనో - ఒక సుగంధ పరిమళ వీచిక అతడి ముకుపుటాలకు గిలిగింతలు పెట్టింది. తనువుకు పులకింతలు పెట్టింది. గుడారం వెలుపలకు వచ్చాడు. ఇది మందార సుమగంధం కాదు, కస్తూరి పరిమళం కాదు, చంపక సువాసనకాదు, మాలతీకేతకీ సురభిళ వాయు తరంగం కాదు. ఏమిటి అయ్యుంటుంది చెప్మా అనుకుంటూ ఆ పరిమళం ఆస్వాదిస్తూ అది వస్తున్న వైపు చకచకా అడుగులు వేశాడు.

కనిపించింది. శృంగారవతి కనిపించింది. కాళిందీ నదీతీరాన కూర్చుని ఉంది. మలినాంబరాలలో ఉన్నా నల్లగా ఉన్నా చూపులకు ఇంపుగా కనిపిస్తోంది. ఈ పరిమళం ఆవిడ శరీరంనుంచే అని రాజు గ్రహించాడు. ఆశ్చర్యపోయాడు. పరిమళమే అద్భుతమనుకుంటే సోయగం మరింత అద్భుతంగా ఉంది. నిండు జవ్వనం - పెట్టనిసొమ్ముగా ఉంది. ఎవరు ఈ అమ్మాయి? ఇక్కడ ఎందుకు ఉంది? దేవ నాగ మానవ గంధర్వ కన్యలలో ఎవరై ఉంటుంది? ఎవరైనా కానీ ఈ ఘుమఘుమలు ఏమిటి? ఒకప్పుడు గంగాదేవి ఇలాగే నది ఒడ్డునే దర్శనమిచ్చింది - అనుకునేసరికి శంతనుడు కామవివశుడయ్యాడు. మాట కలిపాడు -

ప్రియా! ఎవరు నువ్వు? ఎవరి అమ్మాయివి? ఇక్కడ ఎందుకున్నావ్? ఇది విజనారణ్యంకదా! చారునేత్రీ! ఒంటరిగా ఇక్కడ ఏమిటి చేస్తున్నావ్? ఎవరికోసం ప్రతీక్షిస్తున్నావ్? వివాహితవా, అవివాహితవా? నీలినీలి గిరజాల ముంగురులదానా! దయచేసి నీ వివరాలన్నీ చెప్పు. నీ సౌందర్యం నా మనస్సును పరవశింపజేస్తోంది.

ఈ పలకరింపులకి యోజనగంధి రవ్వంత తత్తరపడింది. శంతునుణ్ణి చూసి కన్నులు పద్మాల్లా వికసించాయి. నేను దాశరాజు కూతురును. తండ్రి చాటు కన్యను. ఇదిగో ఈ నావ నడుపుతుంటాను.



ఉచితంగా యాత్రికుల్ని నది దాటించి అటూఇటూ చేరుస్తుంటాను. నీకు అబద్ధం చెప్పడమెందుకు ? ఇవ్వేళ మానాన్నగారు వేరే పని ఉండి ఇంటిదగ్గరే ఉండిపోయారు.

అంబుజేక్షణా! నేను కురువంశ మహారాజును. నాకు భార్యలేదు. నిన్ను ధర్మపత్నిని చేసుకుంటాను. అంగీకరించు. యౌవనం ఎందుకు వృథా చేసుకుంటావ్! నిన్ను చూసినప్పటినుంచీ మన్మథుడు నాపై దాడిచేస్తున్నాడు. నీ రూపయౌవనవిలాసాలకూ నీకూ దాసుణ్ణి. అనుగ్రహించు. ఒకప్పుడు నాకు భార్య ఉండేది. నన్ను వదిలేసి వెళ్ళిపోయింది. మరొకతెను ఇంతవరకూ చేసుకోలేదు. ప్రస్తుతానికి విధురుణ్ణి (భార్యావిహీనుడు). సర్వాంగసుందరివి నిన్ను చూడగానే మనసయ్యింది.

యోజనగంధి చెవులకు ఈ పలుకులు అమృతపు చినుకులయ్యాయి. ధైర్యం కూడగట్టుకుని సన్నని గొంతుతో సాత్త్వికంగా పలికింది.

మహారాజా! నీమాటలు నిజమేనని నమ్ముతున్నాను. కానీ నేను స్వతంత్రురాలిని కాదు. తండ్రి ఒద్దికలో ఉన్నదానిని. దాత అతడే కాబట్టి నువ్వు ఆలస్యం చెయ్యకుండా వెళ్ళి మా తండ్రిని అర్థించు. దాశపుత్రినైనంతమాత్రాన స్వైరిణిని కాదు. (స్వైరిణి = స్వేచ్ఛావిహారశీల). తండ్రి చెప్పుచేతలలో మెలిగే దానిని. ఒకవేళ నువ్వు అభ్యర్థించినా మా తండ్రి అంగీకరించి ఇవ్వకపోతే అప్పుడు నువ్వే స్వయంగా నా పాణిగ్రహణం చెయ్యి. అది నాకు సమ్మతమే. మన్మథుడు నిన్ను ఎలా హింసిస్తున్నాడో నవయౌవనంలో ఉన్న నన్నూ అలాగే హింసిస్తున్నాడు. (నిన్నే హింసించినవాడు వయసులో ఉన్న నన్ను హింసించడా ?). అయినా పరంపరగా వస్తున్న కులాచారాలపట్ల నిబ్బరంగా ఉండాలిగదా నేను.

**మనోభవస్త్వాం నృప కిం దునోతి యథా పునర్మాం నవయౌవనాం చ ।**
**దునోతి తత్రాపి హి రక్షణీయా ధృతిః కులాచార పరంపరాసు ॥ (5 - 26)**

శౌనకాది మహామునులారా! యోజనగంధి ధైర్యంగా చెప్పిన మాటలు వింటూనే శంతనుడు దాశరాజును కలుసుకోడానికి బయలుదేరాడు. అల్లంత దూరాన చూసి దాశరాజు ఆశ్చర్యపోయాడు. వంగి వంగి దండాలు పెడుతూ ఎదురు వచ్చాడు.

మహారాజా! నీ దాసుణ్ణి ఇలా అనుగ్రహించారా ? ధన్యుణ్ణి. పని ఏమిటో ఆజ్ఞాపించండి.

దాశా! నువ్వు అంగీకరించి ఇచ్చేట్టయితే నీ కూతుర్ని ధర్మపత్నిని చేసుకోవాలని అనుకుంటున్నాను.

భూపాలా! కన్యారత్నం నాదయితే అడుగుతున్నవాడవు నువ్వయితే - ఇవ్వదగినది ఎప్పుడూ ఇస్తాను. ఇవ్వరానిది ఎప్పుడూ ఇవ్వను. అయితే, మహారాజా! ఇక్కడొక చిన్న నియమం. మా అమ్మాయికి పుట్టే కొడుకు నీ తరవాత పట్టాభిషిక్తుడు కావాలి. నీ పుత్రుడే అయినా మరొకడెవడూ రాజు కాకూడదు.



శంతనుడు అవుననలేదు, కాదనలేదు. ఆలోచనలో పడ్డాడు. గాంగేయుడు తన మనసులో ఉన్నాడు. కనక మారుమాట్లాడకుండా వెనుదిరిగి వెళ్ళిపోయాడు. వెళ్ళాడే కానీ మనసు మనసులో లేదు. స్నానం చెయ్యలేదు, భోజనం చెయ్యలేదు. పోనీ అంటే కునుకు తియ్యలేదు. అదే ఆలోచన. అటు యోజనగంధి - ఇటు పట్టాభిషేకం. చింతాకులుడై దిగులుగా కూర్చున్నాడు. గాంగేయుడు గమనించాడు.

తండ్రీ ఏమిటి మీ దిగులు ? అజయ్యుడైన శత్రువు ఉన్నాడా ? చెప్పండి. వాడి వంశం మొత్తం నాశనం చేసి వస్తాను. తండ్రి దుఃఖాన్ని తెలుసుకోలేకపోయాక తొలగించలేకపోయాక కొడుకు ఉండి ఏం లాభం ? ఋణం తీర్చుకోవడం కోసమే మీకు కొడుకుగా పుట్టాను. విచారించకండి, విషయం చెప్పండి. తండ్రి ఆజ్ఞాపిస్తే రాజ్యం వదిలేసి అడవులకు వెళ్ళాడు రాముడు. హరిశ్చంద్రుడి కొడుకు రోహితుడు - తండ్రి అమ్మేస్తే ఒక విప్రుడి ఇంటి దాసుడయ్యాడు. అజీగర్తుడి కొడుకు శునశ్శేపుడు ఇలాగే బలి అవ్వడానికి సిద్ధపడి యూపస్తంభం ఎక్కాడు. అతణ్ణి విశ్వామిత్రుడు రక్షించాడనుకో. తండ్రి ఆనతిమీద పరశురాముడు (జామదగ్న్యుడు) తల్లి శిరస్సు ఖండించాడు. అకార్యమైనా చేశాడు. తండ్రి ఆజ్ఞకు తిరుగులేదని భావించాడు. మహారాజా! ఈ శరీరం మీది. ఏమి చెయ్యాలో చెప్పండి. చేస్తాను. సాధ్యాసాధ్యాలను గురించి ఆలోచించకండి. నేను ఉన్నాను, ధనుస్సు ఉంది. నా పుట్టుకైనా చరితార్థమవ్వాలి మీ కోరికైనా తీరాలి. చెప్పండి. చేస్తాను. సమర్థుడయ్యుండీ తండ్రికోరిక తీర్చలేనివాడు కొడుకే కాడు. వాడి జన్మ వ్యర్థం.

దేవవ్రతుడు (గాంగేయుడు) ఇంతగా అడిగి నిర్బంధించేసరికి శంతనుడు కొంచెం కదిలాడు. అయినా మనసులో మాట చెప్పడానికి సిగ్గుగా ఉంది. చెప్పక తప్పని పరిస్థితి. క్లుప్తంగా వేగంగా చెప్పి ముగించాడు -

కుమారా! నిజమే. దిగులుగానే ఉంది. నువ్వు ఒకడివేగా నాకు పుత్రుడివి. వీరుడివి, శూరుడివి, సంగ్రామ కోవిదుడివీను. ఏకపుత్రుడు ఇంచుమించు అపుత్రుడని పెద్దలు అంటారు. పైగా ఏ యుద్ధంలోనైనా నీకు ఏదైనా జరగకూడనిది జరిగితే నేను నిరాశ్రయుణ్ణి అయిపోనూ. ఇదే నా బాధ. మరింకేమీ లేదు. నిజం.

తండ్రి అసలు సంగతి చెప్పడం లేదని గాంగేయుడికి అర్థమయ్యింది. సిగ్గుపడుతున్నట్టు గ్రహించాడు. మౌనంగా వచ్చేశాడు. మంత్రుల్నీ పెద్దల్నీ పిలిచాడు. నిజం కనుక్కుని నాకు చెప్పండి అన్నాడు. వారు వెళ్ళి సంగతి తెలుసుకుని వచ్చి దేవవ్రతుడుకి విన్నవించారు. అతడు తక్షణం బయలుదేరి దాశరాజును కలుసుకున్నాడు. ప్రేమగా వినయంగా సంభాషించాడు.



## ◆ భీష్మప్రతిజ్ఞ ◆

దాశరాజా! మీ అమ్మాయి నాకు తల్లి అగుగాక. నేను దాసుణ్ణి అవుతాను. మా నాన్నగారికోసం అభ్యర్థిస్తున్నాను.

గాంగేయా! శంతను మహారాజుకు పెద్దకొడుకువు నువ్వు ఉన్నావు. మా అమ్మాయిని మీ తండ్రిగారు చేసుకుంటే, పుట్టబోయే నా దౌహిత్రుడు రాజు కాలేడు. అంచేత నువ్వే చేసుకో.

త్వం గృహాణ మహాభాగ పత్నీం కురు నృపాత్మజ
పుత్రోఽస్యా న భవేద్రాజా వర్తమానే త్వయీతి వై॥ (5 - 54)

దాశా ! కుదరదు. మీ అమ్మాయి నాకు తల్లి కావలసిందే. నేను రాజ్యం చెయ్యను. పుట్టబోయే తమ్ముడికే పట్టాభిషేకం జరిపిస్తాను. అతడే రాజ్యం ఏలుకుంటాడు. నన్ను విశ్వసించు.

దేవవ్రతా! నిజమే. నిన్ను విశ్వసిస్తాను. నీ మాట నమ్ముతాను. కానీ, రేపు నీకు పుట్టబోయే బిడ్డ బలవంతుడై నా మనుమడినుంచి రాజ్యం లాక్కుంటే ? లాక్కుంటే ఏమిటి, లాక్కుంటాడు. అప్పుడు ఏమిటి గతి ?

అయితే, దాశరాజా! విను. మీరంతా వినండి. నేనసలు వివాహమే చేసుకోను. బ్రహ్మచారిగా ఉండిపోతాను. ఇది సత్యం. ఇది నా ప్రతిజ్ఞ. భీష్మవ్రతం.

ధీవరప్రభువు అంగీకరించాడు. సత్యవతిని శంతనుడికి ఇచ్చి వివాహం జరిపించాడు. ఇలా జరిగింది ఆ వివాహం. శంతనుడికి తెలీదు - సత్యవతి అప్పటికే ఒక కొడుకుకు (వ్యాసుడు) జన్మనిచ్చినట్టు. ***(అధ్యాయం - 5, శ్లోకాలు - 59)***

శౌనకాది మహామునులారా ! సత్యవతీ శంతనుల వివాహ కథ చెప్పాను కదా! భీష్ముడు పట్టాభిషేకం ఎందుకు జరిపించుకోలేదో, సత్యవతి ఎందుకు రాజ్యం అతడికి అప్పగించలేదో, అతడు బ్రహ్మచారిగానే ఎందుకు ఉండిపోయాడో - అన్నీ తెలిశాయి గదా !

సత్యవతీ శంతనులకు ఇద్దరు కొడుకులు పుట్టి కాలవశాన దివంగతులైన సంగతి విన్నారు. దేవర న్యాయంతో వ్యాసుడివల్ల అంబికకు (చిత్రాంగదుడి వితంతువు) పుట్టిన కొడుకు - పుట్టుగుడ్డి. ఎందుకంటే వ్యాసుడు కలిసే సమయంలో అతడి రూపాన్ని చూసి అంబిక కళ్ళు మూసుకుంది. అందుకని బిడ్డ జనుషాంధుడయ్యాడు. అంబాలికకు (విచిత్రవీర్యుడి వితంతువు) పుట్టిన కొడుకు - పాలిపోయిన రంగు. ఎందుకంటే - ఆ సమయంలో వ్యాస రూపానికీ కోపానికీ అంబాలిక భయపడింది. అందుకని పాండురోగిలా శ్వేతవర్ణంలో కొడుకు పుట్టాడు. అంబికాసుతుడు ధృతరాష్ట్రుడు, అంబాలికా తనయుడు పాండురాజు.



రెండవసారి కోడలుపిల్ల తన బదులు దాసీని నియోగించింది. అది కామకళా చతుర. ధైర్యంగా కళ్ళు తెరిచి వ్యాసుడితో ఆనందించి తృప్తి పరిచింది. సర్వలక్షణ సంపన్నుడై సాత్త్వికుడూ మేధావీ ధర్మాంశతో విదురుడు జన్మించాడు.

పెద్దవాడైనా గుడ్డివాడు కనుక ధృతరాష్ట్రుడు రాజు కాలేకపోయాడు. మంత్రి పురోహితాదులంతా కలిసి పాండురాజుకే పట్టాభిషేకం జరిపించారు. భీష్మడి అనుమతీ ఉంది. విదురుడు దాసీపుత్రుడు కనక రాజ్యం పొందలేకపోయినా మేధావి కనక మంత్రిగా నియుక్తుడయ్యాడు.

ధృతరాష్ట్రుడికి ఇద్దరు భార్యలు. సౌబల రాజకుమారి గాంధారి, వైశ్య. పాండురాజుకీ ఇద్దరు. శూరసేన రాజకుమారి - కుంతి, మద్రదేశ రాజపుత్రి - మాద్రి. గాంధారికి నూరుగురు కొడుకులు. వైశ్యకి ఒకడే కొడుకు. అతడి పేరు యుయుత్సుడు.

గాంధారీ సుషువే పుత్రశతం పరమశోభనమ్ ।
వైశ్యాప్యేకం సుతం కాంతం యుయుత్సుం సుషువే ప్రియమ్ ॥ (6-9)

కుంతి వివాహం కాకముందు కన్యగా ఉండగానే సూర్యుడివల్ల కర్ణుడికి జన్మ ఇచ్చింది. తరవాత పాండురాజును ఉద్వాహమాడింది.

సూతుడు ఈ మాట చెప్పేసరికి శౌనకాదులు అదేమిటని ఆశ్చర్యంగా ప్రశ్నించారు. నింగిలో సూర్యుడు నేలమీద కుంతిని ఎలా కలిశాడు, బిడ్డడెలా పుట్టాడు? సవిస్తరంగా చెప్పమన్నారు. సూతుడు ఉపక్రమించాడు -

## ◆ కర్ణ జననం ◆

మహామునులారా! శూరసేనుడి కూతురు కుంతి. ఆవిడ బాల్యమంతా కుంతిభోజుడి ఇంటిలో ఆటపాటలతో గడిచింది. అక్కడికి వచ్చే మునులకు అతిథులకూ ఉత్సాహంగా సపర్యలు చేస్తూ ఆ బాలిక అందరి ఆశీస్సులూ పొందుతోంది. ఒకప్పుడు దుర్వాసుడు అక్కడికి వచ్చి చాతుర్మాస్య దీక్ష జరుపుకున్నాడు. నాలుగు నెలలూ సేవలు చేసింది ఈ చిన్నారి. ముని సంతోషించాడు. వెడుతూ వెడుతూ ఒక మంత్రం ఉపదేశించాడు. దీన్ని జపించి నువ్వు ఏ దేవతను స్మరిస్తే అతడు ప్రత్యక్షమై నీ కోరిక తీరుస్తాడు అని చెప్పాడు. ముని వెళ్ళగానే ఆ పసికూన తన గదిలో కూర్చుని మంత్రశక్తిని పరీక్షించడంకోసం ఏ దేవతను పిలుద్దామా అని ఆలోచించింది. అప్పుడే సూర్యుడు ఉదయిస్తూ కనిపించాడు. అతడినే పిలుద్దాం అనుకుంది. మంత్రం జపించి స్మరించింది. సూర్యమండలం నుంచి మానవరూపం కుంతి ముందు



ప్రత్యక్షమయ్యింది. కాంతిమంతంగానూ ఉన్నాడు, మృదువుగానూ ఉన్నాడు. చూడటానికి హాయిగానే ఉన్నాడు కుంతికి ఆశ్చర్యమూ ఆందోళనా కలిగాయి. సూర్యుడేమిటి ఇలా వచ్చెయ్యడమేమిటి ? భయంతో గడగడలాడింది. ఆ క్షణంలో (ప్రథమ) రజస్వల అయ్యింది.

తేరుకోడానికి కొన్ని నిముషాలు పట్టింది. సూర్యుడికి నమస్కరించింది. తేజస్వీ! నీ దర్శనంతో సంప్రీతి చెందాను. ఇక చాలు. నీ మండలానికి వెళ్ళిపో - అంది.

కన్యకా ! ఈమాత్రానికి అంతటి మంత్రశక్తితో నన్నసలు ఎందుకు పిలిచినట్టు ? పిలిచి నన్ను సేవించనంటే ఎలాగ ? కాటుక కన్నుల చిన్నదానా ? నీపట్ల నాకు ప్రేమభావం అంకురించింది. కామార్తుణ్ణి అయ్యాను. సేవించుకో. మంత్రాధీనుణ్ణి అయి వచ్చాను. సన్నిధిలో నిలిచాను.

సర్వసాక్షీ ! నేను కన్యకను. నీకు ధర్మాలు తెలుసు. దండం పెడతాను. దయచేసి వెళ్ళిపో. ఉన్నత కులంలో పుట్టాను. అపవాదు తేవద్దు.

కుంతీ ! నా పరిస్థితి ఆలోచించు. వృథాగా వెళ్ళిపోతే సిగ్గు, సిగ్గు. సకల దేవతలూ గేలి చేస్తారు. అది నేను భరించలేను. నా కోరిక తీర్చు. లేదంటే నిన్నూ, నీకు మంత్రం ఇచ్చిన ఆ బ్రాహ్మణుణ్ణీ - ఇద్దరినీ శపిస్తాను. భయపడకు. నీ కన్యాధర్మం చెడదు. ఇక్కడ ఈ నాలుగు గోడల మధ్యా జరిగిన సంగతి లోకులకు తెలియదు. అచ్చం నాలాటి కొడుకు పుడతాడు.

ఇలా ఒడబరచి సూర్యభగవానుడు ఆ సిగ్గుల మొగ్గను తనివితీరా ఆఘ్రాణించి వెళ్ళిపోయాడు. కుంతి గర్భవతి అయ్యింది. దాదికి తెలిసింది. తల్లిదండ్రులకు తెలియనివ్వకుండా కాపాడింది. నెలలు నిండాయి. కవచకుండలాలతో మహాతేజస్వి - కొడుకు పుట్టాడు. రెండవ సూర్యుడిలాగా మెరిసిపోతున్నాడు. దాది ధైర్యం చెప్పింది. పెట్టెలో పెట్టి రహస్యంగా తీసుకుపోయి ఎక్కడో వదిలేసి వస్తానంది. పసిబిడ్డను మంజూషికలో ఉంచుతూ కుంతీకుమారి భోరున విలపించింది. ఏమి చెయ్యనురా నాయనా ! కన్నబిడ్డను వదులుకుంటున్న మందభాగ్యను. ఆ జగదంబిక సర్వేశ్వరి నిన్ను పాలించుగాక ! ఆ విశ్వజనని ఆ కాత్యాయని నిన్ను సాకుగాక ! రవి కుమారా ! నిర్లజ్జగా దుష్ట జారిణిగా నిన్ను అడవులపాలు చేస్తున్నాను. కన్నా ! మళ్ళీ ఎప్పటికి చూస్తానో ! తెలిసి తెలిసి చేస్తున్న ఈ మహాపాతకం జ్ఞాపకానికి వచ్చినప్పుడల్లా ఎంత గుండెకోతగా ఉంటుందో ! పూర్వజన్మలో ఏ మహాపాపం చేశానో. జగదీశ్వరిని ఒక్కసారైనా అర్చించ లేదేమో ! అందుకే నాకీ శిక్ష. పండంటి బిడ్డను కనీ, పెంచుకోలేని దుస్థితి. చేజేతులా వదులుకునే దురవస్థ.

ఎవరైనా చూస్తారు, ఊరుకోమంటూ కుంతిని పక్కకు లాగి దాది - పెట్టె మూసేసింది. గుట్టుగా వెళ్ళిపోయింది. గుండెలు చిక్కబట్టుకుని కుంతి కొయ్యబారి చూస్తూ అలాగే ఉండిపోయింది. నెమ్మదిగా కదిలి వెళ్ళి స్నానం చేసింది.



దాదికి ఒక రథచోదకుడు (సూతుడు) ఎదురయ్యాడు. అతడి భార్య రాధ పూర్వ పరిచయంతో దాదిని పలకరించింది. పెట్టె ఏమిటని అడిగింది. ఎక్కడివాడో ఎవరివాడో మగబిడ్డ అని ఊరుకుంది దాది. మాకు సంతానం లేదు, పెంచుకుంటాం ఇచ్చెయ్యమని రాధ బలవంతం చేసి తీసేసుకుంది. సూతుడింటిలో బిడ్డడు కర్ణుడయ్యాడు.

## ◆ పాండవ వృత్తాంతం ◆

అటుపైని కొంత కాలానికి పాండురాజు స్వయంవరంలో కుంతిని చెట్టపట్టాడు. మాద్రినీ చేసుకున్నాడు.

ఒకరోజు పాండురాజు వేటలో మృగం అనుకొని ఒక మునిని బాణంతో కొట్టాడు. కొన ఊపిరితో ముని శపించాడు. స్త్రీ సంగమం చేశావో భస్మావు పొమ్మన్నాడు. శపించి మరీ ప్రాణం వదిలాడు.

ఈ శాపానికి పాండురాజు విలవిలలాడాడు. రాజ్యం వదిలేసి శాశ్వతంగా అడవులకు వచ్చేశాడు. సేవలు చేస్తామంటూ భార్యలిద్దరూ వెంట వచ్చారు. గంగా తీరంలో మునుల ఆశ్రమాల్లో శాస్త్రపురాణ చర్చలతో కాలం గడుపుతూ, స్త్రీ సుఖానికి నోచుకోక, తపస్సు చేస్తున్నాడు.

పురాణ శ్రవణంలో ఒక సందర్భాన - అపుత్రస్య గతిర్నాస్తి స్వర్గే గంతుం పరంతప । యేన కేనాప్యుపాయేన పుత్రస్య జననం చరేత్ ॥ (6 - 46) అనే శ్లోకం చెవిని పడింది. పురాణం చెబుతున్న ముని ఆ శ్లోకాన్ని మరింత వివరించాడు.

అంశజుడు (ఔరసుడు, ఆత్మజుడు) దౌహిత్రుడు (కూతురి కొడుకు) క్షేత్రజుడు (నిజభార్యకు పరపురుషుడివల్ల పుట్టినవాడు) గోళకుడు (వితంతు పుత్రుడు) కుండుడు (ఉపభర్తకు పుట్టినవాడు) సహోఢుడు (వివాహ సమయానికే గర్భస్థుడై ఉన్నవాడు) కానీనుడు (కన్యా పుత్రుడు) క్రీతుడు (కొనుక్కున్న కొడుకు) వనప్రాప్తుడు (దొరికినవాడు) దత్తుడు (దత్తతగా తీసుకున్న కొడుకు) అని పుత్రులు పది రకాలు. వీరిలో ఉత్తరోత్తరులు అధములు.

ఇది విన్నాక పాండురాజుకి మరి నిద్రపట్టలేదు. ఒకనాడు కుంతిని పిలిచి ఏకాంతంగా చెప్పాడు. ఏ తపస్వినో ఆశ్రయించి కడుపు పండించుకోమన్నాడు. నా ఆజ్ఞగా చేస్తున్నావు కాబట్టి దోషం లేదన్నాడు. పూర్వకాలంలో ఇటువంటివి జరిగాయని విన్నాం. సౌదాసుడు వసిష్ఠుడివల్ల ఇలా పుత్రుణ్ణి పొందాడుట. కాబట్టి నువ్వూ ప్రయత్నించు. నాకొక పుత్రుణ్ణి త్వరగా అందించు - అన్నాడు.

అప్పుడు కుంతి తన దగ్గరున్న దూర్వాస మంత్రం సంగతి చెప్పింది, అనుమతి పొందింది. మొదట యముణ్ణి స్మరించి యుధిష్ఠిరుణ్ణి ప్రసవించింది. వాయుదేవుడివల్ల వృకోదరుణ్ణి, ఇంద్రుడివల్ల అర్జునుణ్ణి - ఏడాదికి ఒకరు చొప్పున ముగ్గురు మగ పిల్లలను కన్నది.



మాద్రికి అసంతృప్తి. నాకూ బిడ్డను ప్రసాదించమని పాండురాజును అభ్యర్థించింది. పాండురాజు కుంతిని అభ్యర్థించి ఆ మంత్రం మాద్రికీ ఇప్పించాడు. ఒకసారి మాత్రమే ఉపయోగించాలని కట్టడి చేశాడు. అందుకని మాద్రి జంటదేవతలు అశ్వినులను స్మరించింది. నకులసహదేవులు జన్మించారు. ఇలా పంచపాండవులు క్షేత్రజులుగా ఆవిర్భవించారు.

ఒక వసంతంలో ఒక మధురక్షణాన మాద్రిని చూసి పాండురాజు సమ్మోహితుడయ్యాడు. నిలువరించుకోలేకపోయాడు. వద్దు వద్దు వద్దు వద్దని ఎంతగా వారిస్తున్నా వినకుండా కలియబడి మాద్రిని కౌగిలించుకున్నాడు. అంతే - నేలకు ఒరిగిపోయాడు. చెట్టు కూలిన తీగలా మాద్రి అతడిపై పడి రోదించింది. కుంతి వచ్చి దుఃఖించింది. బాలపాండవులు పలవించారు. చుట్టుపక్కల ఆశ్రమాలవారంతా పోగయ్యారు. గగ్గోలు గగ్గోలుగా ఉంది వాతావరణం.

మునులంతా కలిసి గంగా తీరంలోనే ఉత్తర క్రియలు నిర్వహించారు. నకులసహదేవులను కుంతికి అప్పగించి అయిదుగురి సంరక్షణకూ ఆమెను ఆగమని, మాద్రి సతీ సహగమనం చేసింది. ఊర్ధ్వ దైహిక క్రియలు అయ్యాక మునీశ్వరులు కుంతినీ పాండుపుత్రులనూ హస్తినాపురం చేర్చారు.

భీష్ముడూ విదురుడూ ధృతరాష్ట్రుడూ ఇంకా పెద్దలూ పౌరులూ సమావేశం అయ్యారు. పాండురాజుకు ఉన్న శాపం తెలుసు కనక ఈ బిడ్డలు ఎవరని కుంతిని నిలదీశారు. కుంతి సిగ్గుపడింది. లోలోపల దుఃఖించింది. అపవాదు వస్తే ఎంత ప్రమాదమో ఎరిగినదే కనక ధైర్యంగా జవాబు చెప్పింది. ఈ అయిదుగురూ దేవతల బిడ్డలు అంది. నమ్మేది ఎలాగ అన్నారు ప్రజలు. యమ వాయు మహేంద్రాశ్వినులను స్మరించింది కుంతి. వారు ప్రత్యక్షమై ఆకాశంలో నిలిచి - వీరు మా బిడ్డలే అని అందరికీ వినిపించేట్టు చెప్పి అదృశ్యమయ్యారు. భీష్ముడు ఆమోదముద్ర వేశాడు. అందరూ అంగీకరించారు. తల్లీ బిడ్డలను అంతఃపురంలోకి పంపిచారు. ***(అధ్యాయం - 6, శ్లోకాలు - 71)***

పంచపాండవుల ధర్మపత్ని ద్రౌపది అయిదుగురికీ అయిదుగురు బిడ్డలను ప్రసవించింది. అర్జునుడికి సుభద్ర అని మరొక భార్య ఉంది. కృష్ణుడి సోదరి. అతడి ప్రోత్సాహంతోనే అర్జునుడు సుభద్రను అపహరించి తెచ్చి వివాహం చేసుకున్నాడు. సుభద్రార్జునుల కొడుకు మహావీరుడు అభిమన్యుడు.

ఈ ఉపపాండవులు ఆరుగురూ కురుక్షేత్ర మహాసంగ్రామంలో వీరమరణం పొందారు. అప్పటికి అభిమన్యుడి భార్య ఉత్తర (విరాటరాజు కూతురు) గర్భవతి. బాణాగ్నికి ఆ శిశువు గర్భంలోనే మరణించాడు. మృతశిశువును ప్రసవించింది. శ్రీకృష్ణుడు ప్రాణంపోసి బతికించాడు. అశ్వత్థామ ప్రతాపానికి వంశమంతా పరిక్షీణం అయిపోతే, బతికి బట్టకట్టినవాడు కనక ఆ శిశువుకు పరీక్షిత్తుడని పేరు పెట్టారు.



నూర్గురు కొడుకులూ నిహతులుకాగా గుడ్డిరాజు ధృతరాష్ట్రుడు పాండవుల పంచను తలదాచుకున్నాడు. భీముడి సూటిపోటి మాటలను భరిస్తూ శేషజీవితం గడుపుతున్నాడు. గాంధారికూడా అలాగే గడుపుతోంది. ధర్మరాజు మాత్రం ఈ ఇద్దరికీ శ్రద్ధగా సేవలు చేస్తున్నాడు. విదురుడు కూడా అన్నగారు ధృతరాష్ట్రుడితోనే ఉంటున్నాడు.

భీముడుమాత్రం అందరి సమక్షంలోనూ ధృతరాష్ట్రుడికి వినిపించేట్టు కసిగా వాగ్బాణాలు వదులుతూనే ఉన్నాడు. ఈ గుడ్డిరాజుగారి కొడుకుల్ని అందరినీ నేనే చావగొట్టి చెవులు మూశాను. దుశ్శాసనుడి గుండెలు చీల్చి వేడి వేడి నెత్తురు కడుపారా సేవించాను. భలే రుచిగా ఉందిలే. ఇప్పుడీ పుట్టుగుడ్డి, నేను దయతలచి ఇంత పిండం పడేస్తే సిగ్గులేకుండా మెక్కుతున్నాడు. కాకిలాగా కుక్కలాగా బతుకుతున్నాడు. ఎందుకొచ్చిన జీవితం ?

ఇలా భీముడు కుళ్ళబొడుస్తూంటే, మరోవైపు ధర్మరాజు వాడు మూర్ఖుడు, వాడి మాటలు పట్టించుకోవద్దు అని ఓదారుస్తున్నాడు. పద్దెనిమిది సంవత్సరాలు గడిచాయి. ధృతరాష్ట్రుడు విసిగిపోయాడు. అడవులకు పోతాను వానప్రస్థం స్వీకరిస్తాను పంపించమని ధర్మజుణ్ణి అడిగాడు. కొడుకులకు తర్పణాలు వదిలిపెట్టి తపస్సు చేసుకుంటాను అన్నాడు.

ధర్మరాజు విదురుడితో ఆలోచించాడు. అతడి సలహా మేరకు ధృతరాష్ట్రుడికి పుష్కలంగా ధనమిచ్చి పంపించాలనుకున్నాడు. సోదరులను పిలిచి సంప్రదించాడు. భీముడు అడ్డం తిరిగాడు.

దుర్యోధనుడి తండ్రికి, ఈ గుడ్డివాడికి ఇంకా ఇప్పుడు ధనం ఇస్తావా ? ఇంతకన్నా మూర్ఖత్వం ఉందా ? అసలు నీ మంత్రాంగం అంతా ఇలాంటిదే. ద్రౌపదితో సహా అందరం అడవులపాలు అయ్యాం. మహావీరులమయ్యుండీ విరాటరాజు కొలువులో తలదాచుకున్నాం. దాస దాసీ జనంగా బతుకులు గడిపాం. నువ్వు జూదం ఆడబట్టే ఇన్ని అనర్థాలు దాపురించాయి. లేకపోతే నేను గరిటె తిప్పుకుంటూ వంటవాణ్ణి అయ్యేవాణ్ణా ?, అర్జునుడు చేతులు తిప్పుకుంటూ ఆడవాళ్ళకి భరతం నేర్పుతూ బృహన్నల అయ్యేవాడా ? గాండీవం ధరించిన చేతులు గాజులు తొడుక్కున్నాయి. మనిషికి ఇంతకన్నా అవమానమూ దుఃఖమూ ఉంటుందా ? కాగలకార్యం గంధర్వులే తీర్చారన్నట్టు అలనాడు గంధర్వుడు దుర్యోధనుణ్ణి బంధిస్తే - నీ మూర్ఖత్వం మండిపోనూ - నాతోనే విడిపింపజేశావు. ఇప్పుడు అలాంటి దుర్యోధనుడి హితంకోరి వాడి తండ్రికి ధనం ఇస్తానంటున్నావు. నేను ససేమిరా ఒప్పుకోను. ఇవ్వడానికి వీలులేదు - భీముడు తెగేసి చెప్పాడు. సుడిగాలిలా నిర్గమించాడు.

మిగిలిన ముగ్గురితోనూ కలిసి ధర్మజుడు ధృతరాష్ట్రుడికి పుష్కలంగా ధనం ఇచ్చాడు. దానితో ధృతరాష్ట్రుడు దానధర్మాలు నిర్వహించాడు. పుత్రులకు తర్పణాలు ఇచ్చాడు. సంజయుడికి తెలియజేసి,



గాంధారితోకలిసి వానప్రస్థానికి బయలుదేరాడు. విదురుడు నేనూ వస్తానని వెంట నడిచాడు. కుంతీదేవి బయలుదేరింది. కొడుకులూ కోడళ్ళూ ఎంతగా బతిమాలినా వినలేదు. తెగతెంపులు చేసుకుని బయలుదేరింది. ధర్మజాదులు గంగా తీరంవరకూ సాగనంపి తిరిగి వచ్చారు.

గాంధారీ ధృతరాష్ట్ర కుంతీ విదురులు నలుగురూ జాహ్నవీతీరంలో శతయూపాశ్రమం చేరుకున్నారు. రెల్లు గడ్డితో కుటీరం నిర్మించుకున్నారు. ఏకాగ్రచిత్తులై తపస్సు చేసుకుంటున్నారు. ఆరేళ్ళు ఇట్టే గడిచాయి.

యుధిష్ఠిరుడికి గాలి మళ్ళింది. తల్లినీ పెదతండ్రినీ ఒకసారి చూసిరావాలనిపించింది. మనేదగా ఉన్నాడు. ఆ రాత్రి ఒక కల వచ్చింది. తల్లి కనిపించింది. సన్నగా, చిక్కిపోయి బలహీనంగా ఉంది. అంతలో మెలకువ వచ్చేసింది. తమ్ముళ్ళను పిలిచి - మీరు సమ్మతించి నాతో వచ్చేట్టయితే అందరం కలసి వెళ్ళి చూసి వద్దాం అన్నాడు. అందరూ అంగీకరించారు. సుభద్ర ద్రౌపది ఉత్తర - ఇంకా పౌరులూ బయలుదేరారు. (సంజయుడూ వెళ్ళాడు.) శతయూపాశ్రమం చేరుకున్నారు. అక్కడ కుంతి గాంధారి ధృతరాష్ట్రుడు మాత్రమే కనిపించారు. ఎంత పరకాయించి చూసినా విదురుడు కనపడలేదు. ధర్మజుడు కంగారు పడ్డాడు. పెదతండ్రిని అడిగాడు. విరక్తుడై నిరీహుడై నిరాహారుడై ఎక్కడో ఏకాంతంలో తపస్సు చేసుకుంటున్నాడని ధృతరాష్ట్రుడు ముక్తసరిగా చెప్పాడు. మర్నాడు గంగాతీరంలో మరోచోట విదురుడు కనిపించాడు. పాలిపోయి ఉన్నాడు. వట్టి ఎముకల గూడు. తపోనియమాలతో అలా అయిపోయాడు. గట్టిగా గాలివేస్తే ఎగిరిపోయేట్టున్నాడు. దగ్గరకు వెళ్ళి "వందే అహం త్వాం యుధిష్ఠిరః" అన్నాడు. విదురుడిలో కదలిక లేదు. ధ్యానంలో కూర్చున్నవాడు కూర్చున్నట్టే ఉన్నాడు. ధర్మజుడు కళ్ళు ఆర్పకుండా విదురుడి ముఖంలోకి చూస్తున్నాడు. హఠాత్తుగా అద్భుతావహమైన ఒక తేజస్సు విదురుడి ముఖంనుంచి చర్రున వచ్చి ధర్మజుడిలో ప్రవేశించింది. యమధర్మరాజాంశలే ఇద్దరూ. విదుర తేజస్సు ధర్మజుడిలో లీనమయ్యింది. వెంటనే విదురుడి శరీరం నేలకు ఒరిగిపోయింది. విదురుడు మరింక లేడు. ధర్మజుడు భోరుమన్నాడు. కాసేపటికి తేరుకున్నాడు. సోదరులను పిలిచాడు. అగ్ని సంస్కారం జరపడానికి ప్రయత్నాలు చెయ్యబోయాడు. అశరీరవాణి వినిపించింది. ఇతడు విరక్తుడు. సన్యాసికి అగ్ని సంస్కారం జరపకూడదు. అలా వదిలి వెళ్ళిపొండి - అంది. అందరూ గంగలో మునిగి శతయూపానికి తిరిగి వచ్చారు. ధృతరాష్ట్రుడికి విషయం చెప్పారు. అతడు క్షణకాలం అయ్యో అని తపస్సులో మునిగిపోయాడు. రోజులు గడిచాయి.

వ్యాసుడూ నారదుడూ మరికొందరు మహర్షులూ అటువైపు వచ్చారు. కుశల ప్రశ్నలూ అతిథి మర్యాదలూ అయ్యాయి. కుంతీదేవి వ్యాసుణ్ణి అడిగింది. దివ్యతపోవిభాసా, వ్యాసా! కర్ణుడు జ్ఞాపకం వచ్చినప్పుడల్లా నా మనస్సు కుమిలిపోతోంది. వాడికి తీరని ద్రోహం చేశాను. ఒకసారి వాడి ముఖం కళ్ళారా



చూడాలని ఉంది. నువ్వు మహాతపస్వివి. శక్తి సంపన్నుడివి. ఒకసారి చూపించవూ అని ప్రాధేయపడింది. వెంటనే గాంధారి అందుకుని దుర్యోధనుణ్ణి చూపించమంది. ఆశీర్వదించమంటూ వచ్చి ఆవేళ యుద్ధానికి వెళ్ళాడు, మరి తిరిగిరాలేదంటూ కంటతడిపెట్టింది. నూర్గురు కొడుకుల్నీ ఒకసారి చూడాలని ఉంది, చూపించవా అని అభ్యర్థించింది. సుభద్ర అభిమన్యుణ్ణి చూపించమంది. తల్లిపేగు అంటే ఏమిటో తెలిసింది వ్యాసుడికి. జాలిపడ్డాడు. అది సాయంకాలం సంధ్యాసమయం. గంగలో వార్చి ప్రాణాయామం చేసి ఆదిపరాశక్తిని ధ్యానించాడు. మణిద్వీపాధివాసినిని స్తుతించాడు.

**యదా న వేధా న చ విష్ణురీశ్వరో న వాసవో నైవ జలాధిపస్తథా ।**
**న విత్తపో నైవ యమశ్చ పావకస్తదా ఽసి దేవి త్వమహం నమామి తామ్ ॥(7-61)**

తల్లీ! త్రిమూర్తులూ అష్టదిక్పాలకులూ లేనప్పుడు కూడా నువ్వు ఉన్నావు. పంచభూతాలూ ఇంద్రియాలూ బుద్ధీ మనస్సూ వాటి గుణాలూ సూర్యచంద్రులూ ఇవి యేవీ లేనప్పుడు కూడా నువ్వు ఉన్నావు. సంకల్పం మాత్రంచేత సృష్టించి సర్వతంత్ర స్వతంత్రురాలివై నడిపిస్తున్నావు. నిన్ను తెలుసుకున్న వేత్త లేడు. అమ్మా! ఈ దీనురాండ్రు - చనిపోయిన తమ పుత్రులను చూపించమని బతిమాలుతున్నారు. నా కంతటి శక్తి లేదు. నువ్వే చూపించు తల్లీ !

శ్రీ భువనేశ్వరి కరుణించింది. వారందరినీ స్వర్గం నుంచి ఆహ్వానించి తెచ్చి చూపించింది. కుంతి గాంధారి సుభద్ర ఉత్తర పాండవులు - వారిని చూశారు. మూర్ఛపోయారు. కర్ణ దుర్యోధనాదులు అంతర్ధానం చెందారు. మహామాయ కల్పించిన మహేంద్రజాలం. అందరూ మళ్ళీ స్పృహలోకి వచ్చారు.

వీడ్కోలు తీసుకుని మహర్షులు శతయూపాశ్రమంనుంచి నిష్క్రమించారు. తరువాత పాండవులూ బయలుదేరారు. దారి పొడవునా వ్యాసుడి ఘనతను కథలు కథలుగా చెప్పుకుంటూ గజపురం (హస్తినాపురం) చేరుకున్నారు. ***(అధ్యాయం - 7, శ్లోకాలు - 68)***

వీళ్ళు వచ్చిన తరవాత మూడోనాడు శతయూపాశ్రమ ప్రాంతంలో పెద్ద దవానలం (కార్చిచ్చు) వ్యాపించింది. కుంతి గాంధారి ధృతరాష్ట్రుడు ముగ్గురూ అగ్నికి ఆహుతి అయ్యారు. సంజయుడు - రాజును వదిలేసి తీర్థయాత్రలకు వెళ్ళినవాడు - ఇంతే సంగతులు. నారదుడివల్ల ఈ సమాచారం తెలిసి ధర్మరాజు చాలా దుఃఖించాడు.

కురుక్షేత్ర సంగ్రామం ముగిసిన ముప్పయ్యారేళ్ళకు విప్రశాపం కారణంగా ప్రభాసతీర్థంలో యాదవులు ముసలం పుట్టి నశించారు. మదిరాపానం విపరీతంగా చేసి ఒళ్ళు తెలియక పరస్పరం కలహించుకుని అందరూ మరణించారు. బలరాముడూ పంచత్వం పొందాడు. బోయవాడి బాణం



దెబ్బకు శ్రీకృష్ణుడు కూడా అవతారం చాలించాడు. ఇదీ శాపవశంగానే జరిగింది. ఈ వార్త తెలిసి వసుదేవుడు యోగపద్ధతిలో - శ్రీభువనేశ్వరిని ధ్యానిస్తూ సిద్ధిపొందాడు. అర్జునుడు ప్రభాసానికి వెళ్ళి యాదవులకందరికీ యథాయోగ్యంగా అగ్ని సంస్కారాలు జరిపాడు. అష్ట మహిషులతో పాటు శ్రీకృష్ణుడికి చితిపేర్చి ఉత్తర క్రియలు నిర్వర్తించాడు. రేవతితో కలిపి బలరాముడి పార్థివ శరీరాన్ని అగ్నికి ఆహుతి చేశాడు. ద్వారకకు తిరిగివచ్చి అక్కడ మిగిలి ఉన్నవారిని ఖాళీచేయించాడు. జలప్లావం సంభవించి ద్వారకానగరం సముద్రంలో కలిసిపోయింది.

ద్వారకలో మిగిలిన జనులనూ కృష్ణపత్నులైన గోపికలనూ హస్తినాపురికి తరలిస్తూంటే మార్గ మధ్యంలో దొంగలు దోచుకున్నారు. మహావీరుడు అర్జునుడు ఏమీ చెయ్యలేని నిస్తేజుడు అయిపోయాడు. వజ్రుడు అనే పేరుగల అనిరుద్ధసుతుణ్ణి యాదవరాజధాని ఇంద్రప్రస్థానికి రాజుగా నియమించి హస్తినకు నడక సాగించాడు.

రాబోయే యుగంలో శ్రీకృష్ణుడు మళ్ళీ అవతారం ధరించినప్పుడు నీ తేజస్సు నీకు తిరిగి వస్తుందని చెప్పి వ్యాసుడు కన్పించి పార్థుణ్ణి ఓదార్చాడు. అర్జునాదులు హస్తినకు చేరుకున్నారు. ధర్మజాదులకు దుఃఖవార్తలు అందించాడు. శ్రీకృష్ణుడి దేహత్యాగం, యాదవుల అస్తమయం విన్నాక వారందరినీ వైరాగ్యం ఆవరించింది. హిమాచలానికి వెళ్ళిపోదామని నిశ్చయించుకున్నారు. ముప్పయ్యారేళ్ళ పరిపాలనకు భరతవాక్యం పలికి, అంతే వయసున్న పరీక్షిత్తును హస్తినకు పట్టాభిషిక్తుణ్ణి చేసి పాండవులు ద్రౌపదితో ఆరుగురూ హిమాలయాలకు ప్రయాణమయ్యారు. అక్కడ తనువులు చాలించారు.

## ◆ పరీక్షిత్తు వృత్తాంతం ◆

పరీక్షితుడు జాగరూకుడై ధర్మబద్ధంగా అరవై సంవత్సరాలు పరిపాలన సాగించాడు. ఒకనాడు మృగయా వినోదం కోసం అడవికి వెళ్ళాడు. బాణం దెబ్బ తిని తప్పించుకు పారిపోతున్న ఒక మృగాన్ని పట్టుకోడానికి స్వయంగా వెంబడించి వెంబడించి బాగా అలిసిపోయాడు. ఎండకు గొంతు ఆర్చుకుపోయి దాహంతో పరితపిస్తూ చెట్టు నీడకు చేరుకున్నాడు. అక్కడ తపస్సు చేసుకుంటున్న ఒక మునీంద్రుణ్ణి చూసి మంచినీళ్ళు అడిగాడు. మునీంద్రుడు ఉలకలేదు, పలకలేదు. ధ్యానసమాధిలో ఉన్నాడు. పరీక్షిత్తుకు కోపం వచ్చింది. పక్కనే చచ్చిపడిఉన్న సర్పాన్ని ధనురగ్రంతో ఎత్తి తెచ్చి ఆ మునీంద్రుడి మెడలో వేశాడు. అయినా అతడిలో చలనం లేదు. ధ్యానంలోనే ఉన్నాడు. రాజు వెనుదిరిగి హస్తినకు వచ్చేశాడు.

ముని బాలకులు కొందరు క్రీడిస్తూ ఆ ప్రాంతానికి వచ్చి మెడలో మృతసర్పంతో ఉన్న మునీంద్రుణ్ణి చూసి, పరుగు పరుగున వెళ్ళి ఆ మునీంద్రుడి కుమారుడికి విన్నవించారు. అతడు మహా



తపస్వి. క్రుద్ధుడై కమండలూదకం చేతిలో పోసుకుని శపించాడు - నా తండ్రి మెడలో మృతసర్పాన్ని వేసిన పాపాత్ముణ్ణి నేటికి ఏడవరాత్రి (సప్తరాత్రేణ) తక్షకుడు కాటువేయుగాక !

ఈ శాపవార్త మరొక మునిబాలకుడి ద్వారా పరీక్షిత్తుకు చేరింది. శాపం అనివార్యమని గ్రహించి రాజు పెద్దలనూ మంత్రులనూ సమావేశపరిచాడు. ఉపాయం చెప్పండని అభ్యర్థించాడు.

మృత్యువు అనివార్యమే అయినా సాధ్యమైనంతవరకూ తప్పించుకునే ప్రయత్నం చెయ్యాలని శాస్త్రాలు చెబుతున్నాయి. ప్రతిభావంతుల ఉపాయాలతోనే కదా ఎవరికైనా కార్యాలు సిద్ధించేది. మణిమంత్రౌషధాల ప్రభావం అపారం. వాటికి సాధ్యంకానిది లేదు. పాము కరిచి మరణించిన భార్యను ఒక ముని రక్షించుకుని తన ఆయుర్దాయంలో సగం ఇచ్చి బ్రతికించుకున్నాడని వెనకటికి ఒక కథ విన్నాను. అందుచేత రేపు ఏమి జరుగుతుంది అంటే చెప్పలేం. చనిపోతారనుకున్నవారు బతకవచ్చు. అంతమాత్రాన దైవం మీదనే భారంపెట్టి కూర్చోకూడదు. మన ప్రయత్నం మనం చెయ్యాలి. సర్వసంగ పరిత్యాగులమన్న యతీశ్వరులే భిక్షకోసం ఇల్లిల్లూ తిరుగుతున్నారు. ఏ ప్రయత్నమూ లేకుండా కూర్చోవడం లేదు. ఎవరైనా తమంత తాము పిలిచి భోజనం వడ్డించినా, మరో విధంగా పండో కాయో చేతికి వచ్చినా, నోటిలో వేసుకునేపాటి ప్రయత్నమన్నా చెయ్యాలిగదా! ఎవరైనా మనకోసం తినిపెడతారా లేక పదార్థం తనంతతానే పొట్టలోకి ప్రవేశిస్తుందా ? అందుచేత కార్యం సిద్ధించేవరకూ ప్రయత్నం చెయ్యవలసిందే. అప్పటికీ సిద్ధించకపోతే దైవం అనుకూలించలేదని మనస్సును ఊరడించుకోవాలి.

**ప్రయత్నశ్చోద్యమే కార్యే యదా సిద్ధిం న యాతి తత్ ।**
**తదా దైవం స్థితం చేతి చిత్తమాలంబయేత్ బుధః ॥ (8 - 39)**

ఈ ప్రసంగం విన్న మంత్రులు పరీక్షిత్తుకు ఉపాయమైతే చెప్పలేదు గానీ, అర్థాయుర్దాయమిచ్చి భార్యను రక్షించుకొన్న ముని కథ వివరించమని అడిగారు. రాజు వివరించాడు.

## ◆ ప్రమద్వరారురువుల కథ ◆

పులోమా భృగుమహర్షుల కొడుకు చ్యవనుడు. ఇతడు శర్యాతికూతురు సుకన్యను వివాహం చేసుకున్నాడు. వీరి కుమారుడు ప్రమతి. ఇతడు ప్రతాపి అనే కన్యను పెళ్ళాడాడు. వీరికి పుట్టిన కొడుకు పేరు రురుడు. ఇతడు గొప్ప తాపసి. ఇది ఇలా ఉండగా -

స్థూలకేశుడు అని మరొక మహర్షి ఉన్నాడు. గొప్ప తపస్వి. ధర్మాత్ముడు. సత్యసంధుడు. మేనక అనే అప్సరస విశ్వావసువువల్ల (గంధర్వుడు) గర్భవతియై ఆడపిల్లను ప్రసవించి ఈ స్థూలకేశుడి ఆశ్రమంలో వదిలిపెట్టి వెళ్ళిపోయింది. ఆ అనాథ శిశువును పెంచి పెద్దచేశాడు స్థూలకేశుడు. ప్రమద్వర



అని నామకరణం చేశాడు. త్రిలోకసుందరి అన్నారు చూసినవారంతా. రురుడు ఒక శుభముహూర్తాన ఈ అమ్మాయిని చూసి మనసు పోగొట్టుకున్నాడు. కామార్తుడయ్యాడు. ***(అధ్యాయం - 8, శ్లోకాలు - 49)***

రురుడికి మనస్సు మనస్సులో లేదు. కామార్తితో పరితపిస్తున్నాడు. ఆశ్రమంలో పడుకున్నాడు. తండ్రి గమనించి - ఏమిటిరా అబ్బాయి! కథ - అని కదిపాడు. రురుడు విషయం చెప్పాడు. ప్రమద్వరను చేపడతానన్నాడు. తండ్రి ప్రమతి స్వయంగా స్థూలకేశుడి దగ్గరికి వెళ్ళి సుముఖుణ్ణి చేసుకుని ప్రమద్వరను కోడలిగా అభ్యర్థించాడు. అతడు సరే అన్నాడు. మంచి ముహూర్తం చూసి వివాహం చేద్దాం, ఈలోగా సంబారాలు సమకూర్చుకుందాం అనుకున్నారు. వాటికోసం ఇద్దరూ కలిసి అడవిలోకి వెళ్ళారు.

ఆశ్రమంలో ఒంటరిగా క్రీడిస్తున్న ప్రమద్వర పరాకుగా ఒక పామును తొక్కింది. అది కాటు వేసింది. ఆ అమ్మాయి మరణించింది. ఆశ్రమం ఘొల్లుమంది. మునులూ మునిపత్నులూ మునిపుత్రులూ మునికన్యలూ విలపించారు. స్థూలకేశుడు దుఃఖం ఆపుకోలేకపోయాడు. కన్నతండ్రి కాకపోయినా పెంచిన ప్రేమ మరీ బాధించింది.

రురుడు బోరున విలపిస్తూ పరుగు పరుగున వచ్చాడు. నేలపై పడిఉన్న ప్రమద్వరను చూశాడు. ముఖంలో తగ్గని కళను చూసి బతికే ఉంది అనుకున్నాడు. మునులనూ స్థూలకేశుణ్ణీ మార్చి మార్చి చూశాడు. ఆశ్రమం ఇవతలికి వచ్చేశాడు.

ఒంటరిగా కూర్చుని దారుణంగా విలపించాడు. సర్పరూపంలో వచ్చి నా సుఖాన్ని కాజేశాడు పాడు దైవం అని నిందించాడు. ప్రమద్వర లేకుండా బతకలేననుకున్నాడు. ఒక్కసారైనా పలకరించలేదు. ఒక్కసారైనా స్పృశించలేదు, ఒక్కసారైనా చుంబించలేదు. మందభాగ్యుణ్ణి. పాణిగ్రహణం చెయ్యలేకపోయాను. ఈమెతో కలిసి లాజహోమం చెయ్యాలనుకున్నాను. అన్నీ మట్టిలో కలిసిపోయాయి. మానవ జన్మ - ఛీ ఛీ, ఎంత దారుణం! చద్దామంటే చావే రాదు. ఇంక సుఖాలా ? ఎలా వస్తాయి ? నూతిలో దూకడమో, నిప్పుల్లో ఉరకడమో, ఇంత విషం తాగడమో ఉరిపోసుకోవడమో - ఇదే మిగిలింది నాకు. ప్రాణవల్లభ ప్రమద్వర లేకుండా బతకలేనుగాక బతకలేను.

ఎంతసేపో విలపించాడు. ఏడ్చి ఏడ్చి ఎప్పటికో కాసింత తేరుకున్నాడు. ఆలోచించాడు. నేను మరణించి ఏమి సాధిస్తాను ? ఆత్మహత్యా మహాపాతకం తప్ప. నా తల్లిదండ్రుల దుఃఖానికి అంతు ఉంటుందా! పాపిష్ఠి దేవుడొక్కడు సంతోషించవచ్చు గాక. పరలోకంలో నా ప్రియురాలికి ఏదైనా మేలు జరుగుతుందా ? జరుగుతుందంటే మరణిస్తాను. జరగకపోగా కీడు జరుగుతుంది. నా మరణానికి కారణమై ఆత్మఘాతుకుడి ప్రియురాలుగా పరలోకానికి దూరమవుతుంది. అందుచేత ఆమెకోసం నేను మరణించకూడదు. బతికే ఉండి ఏమైనా చెయ్యాలి.



రురుడు ఇలా ఒక నిశ్చయానికి వచ్చి నదిలో స్నానం చేసి శుచిగా ఆచమించి చేతిలోకి ఇన్ని నీళ్ళు తీసుకున్నాడు. దైవాన్ని అర్చించడంలాంటి సుకృతాలు ఏ కొంచెమైనా నేను చేసి ఉంటే, గురువులను భక్తితో సేవించి ఉంటే, హోమాలు జపాలు తపాలు ఏవయినా చేసి ఉంటే, అఖిల వేదాలనూ చదివి ఉంటే, గాయత్రిని ఆరాధించి ఉంటే, సూర్యుణ్ణి ఏ పూటనైనా ఉపాసించి ఉంటే - నా ప్రియురాలు ప్రమద్వర జీవించుగాక, లేదంటే నా ప్రాణాలు పోవుగాక అంటూ చేతిలో నీళ్ళను నేలమీద విసిరాడు. ఆ క్షణంలో ఒక దేవదూత ఆకాశంలో ప్రత్యక్షమయ్యాడు.

రురూ! సాహసం చెయ్యకు. మరణించిన వ్యక్తి జీవించడమా ? ప్రకృతి విరుద్ధం. నువ్వు పరిణయమాడటానికి ఈ ప్రమద్వర ముని కన్యకాదు. గంధర్వాప్సరసల (విశ్వావసువు, మేనక) కూతురు. అందుకని మరొక అందమైన మునికన్యను చూసి పెళ్ళి చేసుకో. వివాహం కాకుండానే చనిపోయింది. ఏ అనుబంధం ఏర్పడిందని, ఇంతగా దుఃఖిస్తున్నావ్ ?

దేవదూతా! మరొకతెను నేను ఛస్తే వరించను. ఈమె బతకాలి. లేదంటే నేను చావాలి. అంతే - ఖండితంగా చెప్పాడు రురుడు. ఈ హఠానికి దేవదూత సంతోషించాడు. నీ ఆయుర్దాయంలో సగం ఇచ్చి బతికించుకోమనీ ఇది దేవతలకు సమ్మతమనీ ఉపాయం చెప్పాడు. వెంటనే రురుడు - ఇదిగో నా ఆయుష్షులో సగం ధారపోస్తున్నాను, ప్రమద్వర జీవించుగాక - అన్నాడు. అంతలోకీ -

పుత్రికా మరణవార్త తెలిసి విశ్వావసువు తమ గంధర్వలోకంనుంచి విమానంలో వచ్చాడు. దేవదూతను తీసుకుని యమధర్మరాజు దగ్గరికి వెళ్ళాడు. దేవదూత విషయమంతా చెప్పి, తన ఆయుష్షులోనే సగం ఇస్తానంటున్నాడు కనక, లేదంటే ఆ యువతపస్వి ప్రాణాలు వదులుతానంటున్నాడు కనక, ప్రమద్వరను బతికించవచ్చునని సిఫారసు చేశాడు. ఇంతగా చెబుతున్నావు కనక, విశ్వావసుడూ వచ్చాడు కనక, నీ యిష్టం, బతికించి రురుడికి అప్పగించి రమ్మన్నాడు యమధర్మరాజు.

మరుక్షణంలో దేవదూత ఆశ్రమానికి వచ్చాడు. ప్రమద్వరను బతికించాడు. రురుడికి అప్పగించాడు. అటుపైని ఒక శుభముహూర్తాన ఇద్దరికీ వివాహమయ్యింది.

పరీక్షిత్తు ఈ కథను చెప్పి, మంత్రులారా! మృతులను సయితం జీవింపజేసుకోవచ్చు. సరియైన ఉపాయం ఉండాలి అంతే. అటువంటి ఉపాయం ఏదైనా చెప్పండి దయచేసి - అన్నాడు. ఎవరికీ ఏమీ తోచింది కాదు. మౌనంగా ఉండిపోయారు.

ఉత్తరాతనయుడు తన ప్రయత్నాలు తాను చేసుకున్నాడు. విశ్వాసపాత్రులను రక్షకులుగా నియమించుకొన్నాడు. ఏడు అంతస్థుల ఒంటిగది మేడను వెంటనే నిర్మింపజేశాడు. అందులో కూర్చున్నాడు. మణిమంత్రౌషధధారులనూ మహావీరులనూ తన చుట్టూ అట్టేపెట్టుకున్నాడు. కింద గుమ్మం దగ్గర



మంత్రులు కాపలా. ఏనుగులు కాపలా. భవనం చుట్టూ సైనికులు కాపలా. అనుమతిలేనిదే గాలికైనా ప్రవేశం లేదు. విప్రులకు అసలే లేదు. వారం రోజులపాటు దర్శనాలు బంద్. పాము కాటుకు మంత్రం తెలిసిన వ్యక్తుల హడావిడీ పచార్లూ. రాజుగారికి అన్నీ ఆ గదిలోనే. పరిపాలన అక్కడినుంచే. శాపం ఇచ్చిన మునికుమారుడి దగ్గరికి రోజూ రాయబారాలు. రాజుగారు రోజులు లెక్కపెట్టుకుంటున్నారు.

ఈ సంగతి ఎక్కడో ఉన్న కశ్యపుడికి తెలిసింది. రాజును కాపాడితే పుష్కలంగా ధనం పొందవచ్చుగదా అని ఆశ కలిగింది. హస్తిపురానికి బయలుదేరాడు ***(అధ్యాయం - 9, శ్లోకాలు - 51)***

## ◆ తక్షక కశ్యప సంవాదం ◆

అది ఏడవరోజు. శాపానికి చివరిరోజు. రాజును కాటువెయ్యడానికి తక్షకుడు బయలుదేరాడు. దారిలో కశ్యపుడు తగిలాడు. బ్రాహ్మణోత్తమా! ఏమిటి హడావిడి ? అని పలకరించాడు. రాజును కాపాడేందుకు వెడుతున్నానన్నాడు. తక్షకుడే కాదు వాణ్ణిమించిన కాలనాగు కాటువేసినా విషం విరిచెయ్యగలిగిన మంత్రం నాదగ్గర ఉంది అన్నాడు. తక్షకుడు ఉడుక్కున్నాడు. నేనే తక్షకుణ్ణి, నా కాటుకు విరుగుడు నీ వల్లకాదు, వెనక్కి పొమ్మన్నాడు. మునీశ్వరుడి శాపం ఉన్నా, నువ్వు కాటువేసినా పరీక్షిత్తును కాపాడగలననీ కాపాడి తీరతాననీ కశ్యపుడు పంతానికి దిగాడు. అయితే నీ మంత్ర శక్తిని పరీక్షించవలసిందే, ఇదిగో ఈ మర్రిచెట్టును కాటు వేస్తాను, వెంటనే చస్తుంది, బతికించు చూద్దాం - అన్నాడు. కాటు వేశాడు. అంతటి మహా వటవృక్షమూ రెప్పపాటులో భగ్గునమండి బూడిదైపోయింది. కశ్యపుడు బూడిద అంతా దగ్గరకు పోగుచేశాడు. చేతిలోకి నీళ్ళు తీసుకుని మంత్రించి చిలకరించాడు. అంత వేగంగానూ న్యగ్రోథం లేచి నిలబడింది. మునుపటిలా కళకళలాడింది.

తక్షకుడు గతుక్కుమన్నాడు. కశ్యపుణ్ణి సామదానోపాయాలతో లోబరుచుకోవాలని అనుకున్నాడు. ప్రశంసించాడు. ధనం కోసమే కదా ఈ ప్రయాసం అంతాను, అదేదో నేను పుష్కలంగా ఇస్తాను, ఇంటికి వెళ్ళిపొమ్మన్నాడు. కశ్యపుడు ఆలోచనలో పడ్డాడు. ధర్మసందేహాలు అంకురించాయి.

ధనలోభానికి లొంగి ఇంటికి వెళ్ళిపోతే నాకు కీర్తి లభించదు. మహారాజును కాపాడితే ఎంత కీర్తి! పుణ్యం కూడాను. మంచివాడు అనిపించుకోకపోయాక ఎంత ధనం ఉండి ఏమి లాభం ? రఘు మహారాజు కీర్తికోసమని తన సర్వస్వమూ కౌత్సుడికి (వరతంతు శిష్యుడు) దానం చెయ్యలేదూ! ధనం కాదు ముఖ్యం, కీర్తి ప్రధానం. హరిశ్చంద్రుడూ కర్ణుడూ ఏమి నేర్చారు !

**రక్షణీయం యశః కామం ధిగ్ధనం యశసా వినా ।**
**సర్వస్వం రఘుణా పూర్వం దత్తం విప్రాయ కీర్తయే ॥ (10 - 21)**



అదీగాక, రాజుగారు విషాగ్నికి బలి అయిపోతుంటే, దక్షుడనైయ్యుండీ చూస్తూ ఎలా ఊరుకోను! తప్పుకాదూ. ప్రజల క్షేమం కోసమైనా ప్రభువును కాపాడాలి. అరాచకమైతే అంతా నాశనమేకదా! అపకీర్తితో పాటు ఈ మహాపాపం కూడా నాకు చుట్టుకుంటుంది. అందుచేత ధనలోభానికి లొంగకూడదు. పరీక్షిత్తును కాపాడవలసిందే - అని నిశ్చయించుకుని ఒక్క క్షణం ధ్యానంలోకి వెళ్ళాడు.

ఇంతకీ అసలు పరీక్షిత్తు భవిష్యత్తు ఎలా ఉందో చూద్దామనిపించి దివ్యదృష్టిని సారించాడు. పరిస్థితి అవగతమయ్యింది. రాజుకు నూకలు చెల్లిపోయాయి. ఆసన్నమరణం. ఎవ్వడూ చెయ్యగలిగింది ఏమీ లేదింక. విరమిస్తే తక్షకుడిచ్చే ధనమైనా దక్కుతుంది. దరిద్రం తీరుతుంది. అంతే, పుష్కలంగా ధనం పుచ్చుకుని ఇంటిముఖం పట్టాడు.

తక్షకుడు సంబరపడ్డాడు. విప్రశాపాన్ని చరితార్థం చెయ్యగలుగుతున్నందుకు సంతోషించాడు. త్వరత్వరగా హస్తినాపురం చేరుకున్నాడు. పరీక్షిత్తు మణిమంత్రౌషధాల రక్షణలో మేడమీద జాగరూకుడై ఉన్నాడని తెలుసుకున్నాడు. ఎలాగబ్బా లోపలికి వెళ్ళడం అనుకున్నాడు. అన్యాయంగా ఒక మునీశ్వరుణ్ణి అవమానించి ఇప్పటికే విప్రశాపోపహతుడైన ఈ మందభాగ్యుణ్ణి నేను కాటువేసి చంపడం కేవలం లాంఛనం. ఏదో ఒకటి చేస్తాను. దానికేమిగానీ, అంతటి పాండవుల వంశంలోపుట్టి ఇంతపాపం ఎలా చెయ్యగలిగాడు ఈ మూర్ఖుడు ? పైగా రక్షణవలయం ఏర్పరచుకుని మిద్దెమీద కూర్చుంటాడా ? మృత్యువునే మోసం చేద్దామనుకుంటున్నాడా ? మరణం అనివార్యమనీ విప్రశాపానికి తిరుగులేదనీ తెలుసుకోలేకపోతున్నాడు. రక్షకులున్నారుగదా అని కులుకుతున్నట్టున్నాడు. వెర్రివాడు. మృత్యువు రాసిపెట్టి ఉంటే తప్పించుకోవడం ఎవడివల్ల అవుతుంది ? తన వంశంలో వీరాధివీరులెందరో వెళ్ళిపోయారు. ఎరుగును. అయినా తానుమాత్రం మృత్యువును తప్పించుకుని ఉట్టికట్టుకు ఊరేగుదామను కుంటున్నాడన్నమాట. ఎంత మూఢుడు.

ఫలాని రోజున మరణం అని ముందుగా తెలియడం ఎంత మంచిది! వాయిదాలు మానేసి దానధర్మాలు చేసుకుని పుష్కలంగా పుణ్యం సంపాదించుకోవచ్చునే. ధర్మకార్యాలతో వ్యాధులు తగ్గుతాయనీ ఆయుష్షు పెరుగుతుందనీ పెద్దలు చెబుతారుగదా! అదైనా చేసుకున్నాడుకాదు. మరణం స్వర్గానికి హేతువయ్యేది. ఇప్పుడింక నరకమేగా! చుట్టూ ఉన్న బ్రాహ్మణులలో ఏ ఒక్కడైనా ఈపాటి సలహా చెప్పలేకపోయాడా ? దురదృష్టం. విధి బలీయం. సరే. ఒక ఎత్తు వేస్తాను. పరీక్షిత్తును చిత్తుచేస్తాను - ఆలోచన ముగించాడు.

తోటి పాములను కొన్నింటిని తాపసులుగా మార్చాడు. పళ్ళూ ఫలాలూ చేతుల్లో పెట్టాడు. పరీక్షిత్తు ఇంటికి పదండి అన్నాడు. తానొక చిన్న పురుగుగా మారి ఒక పండులో దూరి కూర్చున్నాడు.



ద్వారంలో కావలివారు అటకాయించారు. కురువంశంలో ఇటువంటిదెప్పుడూ లేదే, రాజును కాపాడటానికి వచ్చిన అధర్వణ మంత్రవేత్తలం, తాపసులం, మమ్మల్ని లోపలికి వెళ్ళనివ్వండి అభిషేకాలు చేసి ఇష్టఫలాలు ఇచ్చి బతికిస్తాం. లేదా రాజుకు తెలియపరచండి మా రాక - అన్నారు గంభీరంగా దొంగ తాపసులు. రాజుకు వర్తమానం వెళ్ళింది. అప్పటికి సూర్యుడు అస్తమించబోతున్నాడు.

తాపసులు తెచ్చిన కందమూల ఫలాలు లోపలికి పంపండి, వారి దర్శనం రేపు చేస్తానన్నానని చెప్పండి. నా నమస్కారాలు అందించండి - అన్నాడు పరీక్షిత్తు. ఫలాలు లోపలికి వెళ్ళాయి. తనచుట్టూ ఉన్న మంత్రులందరికీ తలా ఒకటి ఇచ్చి తానొకటి తీసుకుని ఒలిచాడు ఔత్తరేయుడు (ఉత్తర కొడుకు). అందులోనుంచి అణువంత పురుగు బయటకు వచ్చింది. మణిపూసలా మెరుస్తోంది. కళ్ళు నల్లగా ఉన్నాయి.

మంత్రులారా! ఇంచుమించు సూర్యుడు అస్తమించాడు. ఏడురోజుల గడువు తీరిపోయింది. నాకింక సర్పభయం లేదు. విషభయం అంతకన్నా లేదు. విప్రశాపం వీగిపోయింది. అయినా శాపాన్ని మన్నించడంకోసం అంగీకరిస్తున్నాను. మహాసర్పానికి బదులు ఈ చిన్న పురుగు నన్ను కాటువేయుగాక - అంటూ పరీక్షిత్తు ఆ పురుగును మెడమీద పెట్టుకున్నాడు. మెరుపులా మెరిసి అది మహాసర్పం అయ్యింది. రాజును చుట్టివేసింది. కాటు వేసింది. నిప్పులు కక్కుతూ నింగిలోకి ఎగిరిపోయాడు తక్షకుడు. మొదలు నరికిన చెట్టులా కూలిపోయాడు పరీక్షితుడు.

అంగరక్షకులూ మహామంత్రులూ కకావికలయ్యారు. హాహాకారాలు మిన్నుముట్టాయి. నింగిలో నిప్పుముద్దలా ఎగిరిపడుతున్న తక్షకుణ్ణి చూసి ప్రజలు భయభ్రాంతులయ్యారు. ప్రపంచమే తగులబడిపోతుందని భావించారు. ***(అధ్యాయం -10, శ్లోకాలు - 68)***

పరీక్షితుడి కుమారుడు మరీ పసిబాలుడు. అందుకని పురోహితులే వేదమంత్రాలతో యథావిధిగా మహారాజుకు ఉత్తరక్రియలు జరిపారు. దుర్మరణం పాలైన పరీక్షిత్తు దేహాన్ని గంధాగురుతరుకాష్ఠాలతో గంగాతీరంలో అగ్నికి ఆహుతి చేశారు. అన్న వస్త్ర గోసహస్ర దాన ధర్మాలు పుష్కలంగా జరిపించారు. రోజులు గడిచాయి.

ఒక సుముహూర్తాన ఆ పసిబాలుణ్ణి సింహాసనంమీద కూర్చోబెట్టారు మంత్రులు. ఆ బాలుడిపేరు జనమేజయుడు. ప్రజలంతా అతణ్ణి రాజుగా అంగీకరించారు. అతడు దిన దిన ప్రవర్ధమానుడై పదకొండేళ్ళ ప్రాయం వచ్చేసరికి కులపురోహితుల ద్వారా విద్యలన్నీ నేర్చుకున్నాడు. కృపాచార్యుడు ధనుర్వేదం మొత్తం నేర్పాడు. కర్ణార్జునులంతటివాడుగా తీర్చిదిద్దాడు. వేదాలు అభ్యసించాడు. ధర్మశాస్త్రాలు నేర్చుకున్నాడు. సత్యవాదిగా, జితేంద్రియుడిగా రాజ్యం పాలిస్తున్నాడు. అందరికీ ధర్మరాజే జ్ఞాపకం



వస్తున్నాడు. సువర్ణవర్మాక్షుడనే కాశీనరేశ్వరుడు వపుష్టమ అనే తన కూతురునిచ్చి వివాహం చేశాడు. ఇద్దరూ సుభద్రార్జునుల్లా, వనవిహారాలు చేస్తూ యౌవనసుఖాల అంచులు ముడుతున్నారు. శచీదేవేంద్రుల్లాగా మహా రాజభోగాలు అనుభవిస్తున్నారు. సమర్థులైన మంత్రులతో ప్రజాపాలన సుఖంగా నడుస్తోంది. అందరూ ఆనందిస్తున్నారు.

## ◆ ఉత్తంకోపాఖ్యానం ◆

ఒకనాడు ఉత్తంకుడనే మహర్షి జనమేజయుడి దర్శనానికి వచ్చాడు. ఇతడు తక్షకుడి చేతిలో మోసపోయినవాడు. ప్రతీకారం తీర్చుకోడానికి మార్గం అన్వేషిస్తూ జనమేజయుడి దగ్గరికి వచ్చాడు. వస్తూనే రెచ్చగొట్టే మాటలు పలికాడు.

జనమేజయా! నిన్ను చూస్తుంటే జాలివేస్తోంది. కార్యాకార్యాలు తెలుసుకోలేని పసిబాలుడిలా కనిపిస్తున్నావు. చెయ్యవలసిందేమో చెయ్యడం లేదు, చెయ్యకూడనివన్నీ చేస్తున్నావు. కసీ పౌరుషం లేని నీవంటి చప్పటి మనిషికి నేనేమి చెప్పి ఏమి ప్రయోజనం! తంత్రం తెలీదు, మంత్రం తెలీదు, ఎవరు శత్రువులో అంతకన్నా తెలీదు. అన్నీ బాలచేష్టలు, బాల చేష్టలు - అంటూ తలత్రిప్పి చీదరింపుగా గొణుక్కున్నాడు.

ఉత్తంకర్షీ! నీ మాటలు నాకేమీ అర్థం కావడం లేదు. నేను ఏ వైరాన్ని తెలుసుకోలేదు, ఏ ప్రతీకారం చెయ్యలేదు ? వివరంగా చెప్పు. అప్పుడు, ఏం చెయ్యాలో అది చేస్తాను.

రాజా! తెలీదన్నావు కాబట్టి చెబుతున్నాను. విను. మీ నాన్న ఎలా చనిపోయాడో తెలుసా ? సహజమరణం కాదు. దుర్మరణం. తక్షకుడనే సర్పదుష్టుడు పొట్టనపెట్టుకున్నాడు. కావలిస్తే - ఉన్నారుగా నీ వృద్ధమంత్రులు - వారిని అడుగు.

జనమేజయుడు వెంటనే మంత్రులను పిలిచి విషయం అడిగాడు. విప్రశాపం కారణంగా తక్షక సర్ప సందష్టుడై పరీక్షిత్తు దివంగతుడైన సంగతిని వారు వివరించి చెప్పారు. అవునుమరి, విప్రశాపం కారణం తప్ప తక్షకుడి తప్పు ఏముంది ? అని జనమేయుడు ఎదురుప్రశ్న వేశాడు.

ఆఁహాఁ! అలాగా నాయనా! పుష్కలంగా ధనం ఇచ్చి కశ్యపుణ్ణి వారించలేదా ఆ దుష్టుడు ? కాపాడగలిగినవాణ్ణి కొనేసి వెనక్కి దారిమళ్ళించినవాడు శత్రువుకాక, మిత్రుడవుతాడా ? నీకంటే - మునిబాలకుడైనా రురుడు నయం. వెనకటికి ఒక పాము, తాను వివాహమాడబోయిన ప్రమద్వరను కరిచి చంపిందని, ప్రతిజ్ఞచేసి సర్పసంహారం మొదలుపెట్టాడు. ఎప్పుడూ కర్రపుచ్చుకునే తిరుగుతూ, కనిపించిన పామునల్లా బాది చంపాడు. కొన్నింటిని వెదికి వెదికి మరీ చంపాడు.



అలా చంపుతూండగా ఒక వనంలో డుండుభం అనే ముసలిపాము కంటబడింది. చంపబోయాడు. అది - రురూ! నేను నీకు ఏ అపకారం చేశానని చంపుతావు ? అని ప్రశ్నించింది. రురుడు తన ప్రియురాలి మరణం తన ప్రతిజ్ఞాకరణం వివరించి, అందుకని చంపుతానన్నాడు.

రురూ ! నీ ప్రమద్వరను కరిచింది నేను కాదు. అసలు ఇంతవరకూ నేనెవరినీ కరవలేదు. మిగతాపాములు కరిస్తే కరవచ్చు. రూప సామ్యాన్నిబట్టి నన్ను చంపడం నీకు భావ్యంకాదు.

హేతుబద్ధమైన ఈ మానవ సంభాషణకు రురుడు ఆశ్చర్యపోయాడు. నువ్వు ఎవరివి ? సర్పరూపం ఎందుకు పొందావు ? - అని అడిగాడు.

రురూ ! చెబుతున్నాను, విను. నేను బ్రాహ్మణుణ్ణి. చిననాట నాకో మిత్రుడున్నాడు. అతడిపేరు ఖగముడు. మహాతపస్వి. వట్టి అమాయకుడు. ఒకరోజున అతడు ఏకాగ్రచిత్తంతో అగ్నిహోత్రం చేసుకుంటున్న సమయంలో నేను వెళ్ళాను. ఎండుగడ్డిని పెంటి చుట్టి (తార్ణక) పాముగా చేసి అతణ్ణి భయపెట్టాను. బాల్యచేష్ట. కానీ అతడు నిజంగా భయపడిపోయాడు. గజగజా వణికిపోయాడు. నేను కేరింతలు కొడుతూంటే, పట్టరానికోపంతో శపించాడు. పామువైపొమ్మన్నాడు. గబగబావెళ్ళి గడ్డితాడు చూపించాను. ఇది నిజంపాము కాదని వివరించాను. అప్పటికి భయం తీరి ఖగముడు కొంత శాంతించాడు.

మందబుద్ధీ! నన్ను భయపెట్టావు కాబట్టి శపించాను. నువ్వు పామువు కాక తప్పదు. అయితే, మళ్ళీ నువ్వే నా భయం తీర్చావు కాబట్టి శాపవిమోచనం చెబుతున్నాను విను. ప్రమతికుమారుడు రురుడు వచ్చి నీకు శాపవిముక్తి కలిగిస్తాడు - అని నన్ను ఓదార్చి ఖగముడు వెళ్ళిపోయాడు.

ఇదీ నా కథ. నువ్వు రురుడివి. నేను విప్రుణ్ణి. ఒక మంచిమాట చెబుతాను ఆలకించు. అర్థం చేసుకో. అహింస ఒక్కటే ఉత్తమోత్తమ ధర్మం. విప్రులకు మరీను. వాళ్ళు విద్యావివేక సంపన్నులు కనక సకలజీవరాశి పట్లా దయగా ఉండాలి. యజ్ఞాలలో మినహా మరెక్కడా ఏ హింసా చెయ్యకూడదు.

అహింసా పరమో ధర్మః విప్రాణాం నాత్ర సంశయః ।
దయా సర్వత్ర కర్తవ్యా బ్రాహ్మణేన విజానతా ॥
యజ్ఞాదన్యత్ర విప్రేంద్ర న హింసా యాజ్ఞికీ మతా । **(11 - 38, 39)**

ఈ ఉపదేశం చేసి డుండుభం తన సర్పరూపం విడిచిపెట్టి బ్రాహ్మణుడిగా మారి వెళ్ళిపోయాడు. అప్పటినుంచీ రురుడు హింసను విడిచిపెట్టాడు. తరవాత అర్థాయుర్దానంతో ప్రమద్వరను బతికించుకుని వివాహం చేసుకున్నాడనుకో, అది వేరే సంగతి.



ఇంతకీ జనమేజయా! బ్రాహ్మణుడైనా నీకన్నా ఆ రురుడే నయం. తనకు అపకారం చేసిన సర్పాలమీద కచ్చిపట్టి యుద్ధం ప్రకటించాడు. నువ్వు క్షత్రియుడివయ్యుండీ పాములను ఉపేక్షిస్తున్నావు. పితృఘాతకులను సుఖంగా బతకనిస్తున్నావు. అంతరిక్షంలో నీ తండ్రి ప్రతీకారేచ్ఛతో దహించుకుపోతున్నాడు. స్నానపానాదులు వదిలేసి కూర్చున్నాడు. ఈ దుర్గతి నుంచి ఉద్ధరించు. సర్పాలను సంహరించు. తండ్రికి ఉన్న వైరాన్ని తీర్చని కొడుకు బతికి ఉండీ మృతుడితో సమానం. లే. బతికే ఉన్నాననిపించుకో. పాపశంక పెట్టుకోకు. యజ్ఞం వంకతో ఎంత జీవహింస చేసినా తప్పు కాదు. సర్పయాగం ప్రారంభించు. ఇది అంబామఖం.

శౌనకాది మహామునులారా! ఉత్తంకుడి ఉపదేశంతో జనమేజయుడు రెచ్చిపోయాడు. కన్నీళ్ళు తుడుచుకున్నాడు. తండ్రికి ఉత్తమగతులు కలిగించలేకపోయినందుకు తనను తాను నిందించుకున్నాడు. ఈరోజే యాగం ప్రారంభించి పితృఋణం తీర్చుకుంటానన్నాడు. భగభగలాడుతున్న మంటలో సర్పాలను ఆహుతి చేసి ప్రతీకారాగ్నిని చల్లార్చుకుంటానన్నాడు. మంత్రులను అందరినీ పిలిచాడు. గంగాతీరంలో భూమి కొలిపించి చదును చేయించండి. నూరుస్తంభాలతో అందంగా మండపం కట్టించండి. యజ్ఞవేదిని నిర్మింపించండి. యజ్ఞసంబారాలు సమకూర్చండి. నేను సర్పయాగం చెయ్యాలి. యజ్ఞపశువు - తక్షకుడు. యజ్ఞహోత - ఉత్తంకుడు. వేదపండితులనందరినీ ఆహ్వానించండి. త్వరగా.

రాజాజ్ఞమేరకు అన్నీ ఏర్పాటయ్యాయి. సర్పహవనం మొదలయ్యింది. తక్షకుడు భయపడ్డాడు. ఇంద్రుడి సన్నిధికి పరుగెత్తాడు. అతడు ఓదార్చి అర్ధసింహాసనంలో కూర్చోబెట్టుకుని అభయం ఇచ్చాడు. ఉత్తంకుడు ఇది గ్రహించాడు. పట్టుదల పెరిగింది. సహేంద్రతక్షకాయస్వాహా అంటూ ఇంద్రుడితో సహా తక్షకుణ్ణి నిమంత్రించాడు. ఇద్దరూ వచ్చి యజ్ఞకుండంలో రాలిపడాలి.

అంతలోకీ తక్షకుడు ఆస్తీకుణ్ణి తలచుకొన్నాడు. అతడు యాయావరకులోద్భవుడు. ధర్మాత్ముడు. జరత్కారుని కొడుకు. ఆ మునిబాలుడు ఆస్తీకుడు జనమేజయుణ్ణి సమీపించి ప్రశంసావాక్యాలు పలికాడు. రాజు సంతోషించి ఆ బాలపండితుణ్ణి బహుధా అర్చించి సత్కరించాడు. ఏమి కావాలో కోరుకోమన్నాడు. అతడు వెంటనే ఈ యజ్ఞం ఆగిపోవాలి అని కోరుకున్నాడు. మాటకు నిలబడే మహారాజు కనక యజ్ఞాన్ని ఆపేశాడు. సర్పహోమం ఆగిపోయింది. ఆస్తీకుడు సంతోషించాడు. వైశంపాయనుణ్ణి పిలిచి జనమేజయుడికి వ్యాసభారతం వినిపించమన్నాడు. విన్నా రాజుకు మనశ్శాంతి లభించలేదు. సాక్షాత్తుగా వ్యాసుణ్ణే అడిగాడు.



హే భగవన్, వ్యాస! నా మనస్సు దహించుకుపోతోంది. అర్జునుడంతటివాడికి పౌత్రుడు మా తండ్రి. సంగ్రామంలో మరణిస్తే అది క్షత్రియులకు గౌరవప్రదం. ఇంటిలో మరణించినా కనీసం అది సహజమరణమైతే అదొక పద్ధతి. ఇదేమిటిది - దారుణం. మా తండ్రిగారిది దుర్మరణం. అంతరిక్షంలో దాహర్తుడై వేలాడుతున్నాడు. శాంతి ఉపాయం చెప్పు. వెంటనే మా తండ్రిగారు దుర్గతి తప్పి స్వర్గానికి వెళ్ళే ఉపాయం చెప్పు. నాకు మనశ్శాంతిని ప్రసాదించు - జనమేజయుడు అభ్యర్థించాడు.

*(అధ్యాయం - 11, శ్లోకాలు - 65)*

సత్యవతీసుతుడు సభామండపంలో కూర్చుని సమాధానం చెప్పాడు. చిరంజీవీ, జనమేజయా! అతిరహస్యమూ అత్యద్భుతమూ ఒక పురాణం చెబుతున్నాను. శ్రద్ధగా ఆలకించు. శుభప్రదమైన భాగవతం ఇది. ఇందులో ఎన్నో కథలూ ఉపకథలూ ఉంటాయి. ఒకప్పుడు నా కుమారుడు శుకుడికి వినిపించాను. ఇప్పుడు నీకు వినిపిస్తున్నాను. ఇది పరమగుహ్యం సుమా! విన్నంతమాత్రంచేతనే చతుర్విధ పురుషార్థాలూ సిద్ధిస్తాయి. ఆగమ రహస్యాలన్నీ తెలుస్తాయి.

ఉపోద్ఘాతం సాగుతుండగానే జనమేజయుడు అడ్డుతగిలాడు. ఈ ఆస్తీకుడు ఎవరు ? నా సర్పయాగం ఎందుకు ఆపాడు ? పాములను కాపాడవలసిన అవసరం అతనికి ఏమిటి ? - ఇదంతా సవిస్తరంగా చెప్పి అటుపైని పురాణం వివరించు- అన్నాడు. అలాగేనన్నాడు వ్యాసుడు.

## ◆ ఆస్తీక వృత్తాంతం ◆

జనమేజయా! జరత్కారుడు అని ఒక మునీశ్వరుడు ఉన్నాడు. శాంత స్వభావుడు. గృహస్థాశ్రమం స్వీకరించలేదు. అతడు ఒకరోజున ఒకానొక అడవిలో పెద్ద గోతిలో వేలాడుతున్న తన పూర్వీకులను చూశాడు. ఏమిటి ఈ దారుణమని ఆశ్చర్యపోయాడు. అప్పుడు ఆ పితలు అన్నారుగదా - నాయనా ! నువ్వు త్వరగా వివాహం చేసుకో. అప్పటిదాకా మాపని ఇంతే. ముక్తి లేదు. స్వర్గం లేదు. జరత్కారుడు సమాధానం చెప్పాడు. సనామధేయురాలూ నాకు అతి వివశురాలూ అయాచితంగా దొరికితే తప్పకుండా వివాహం చేసుకుంటాను అని మాట ఇచ్చి తీర్థయాత్రలకు బయలుదేరాడు. ఇది ఇలా ఉండగా -

కశ్యప ప్రజాపతి భార్యలు కద్రూ వినతలు ఓ సాయంకాలం వేళ సముద్రతీరంలో విహరిస్తూ అల్లంత దూరాన ఒక దివ్యాశ్వాన్ని చూశారు. దాని రంగు ఏమిటంటే ఏమిటి అనుకున్నారు. శ్వేతాశ్వమంది వినత. కృష్ణవర్ణమంది కద్రువ. వాదులాడుకున్నారు. పందెం వేసుకున్నారు. దాసీత్వం పణంగా పెట్టుకున్నారు. రేపు వచ్చి దగ్గరకు వెళ్ళి చూసి తేల్చుకుందాం అనుకున్నారు.



కద్రువ తన పిల్లలకు రహస్యంగా చెప్పింది. పిల్ల పాముల్లారా ! మీరు వెళ్ళి గుర్రానికి చుట్టుకుని నల్లగా కనిపించేట్టు చెయ్యండి అంది. దీనికి కొన్ని పాములు అంగీకరించలేదు. జనమేజయుడి యాగంలో అగ్నికి ఆహుతి కమ్మని వారిని శపించింది. తక్కిన పాములు వెళ్ళి గుర్రం తోకకు చుట్టుకుని దాన్నిమాత్రం నల్లగా కనిపించేట్టు చేశాయి. తోడికోడళ్ళు వెళ్ళి చూసేసరికి తోక నల్లగా కనిపించింది. కద్రువనెగ్గింది. వినత ఓడిపోయింది. కనక దాసీత్వం పట్టాలి.

దిగులుగా కూర్చున్న తల్లిని చూసి గరుత్మంతుడు వచ్చాడు. కారణం అడిగి తెలుసుకున్నాడు. నాయనా! నేను కద్రువకు దాసినయ్యాను. ఆవిడ ఏ పని చెబితే అది చెయ్యాలి. మొయ్యమంటే మొయ్యాలి. ఇంక ఈ బతుకు ఇంతేనంది.

నిజంగా మొయ్యమంటే నేనున్నానుగా. మోస్తానులే. ఎక్కడికి మొయ్యమంటే అక్కడికి మోస్తాను. నువ్వేమీ బాధపడకు. నిన్ను దాస్యంనుంచి విముక్తురాలిని చేయిస్తాను. రా - అంటూ కద్రువ దగ్గరికి తీసుకువెళ్ళాడు. పినతల్లిని సోదరులతో సహా బుజాన ఎక్కించుకుని సముద్రం ఆవలి తీరానికి మోసుకువెళ్ళాడు గరుడుడు. అక్కడ అడిగాడు. పినతల్లీ! నా కన్నతల్లికి ఈ దాస్యం ఎలా తొలగిపోతుందో చెప్పు అని అభ్యర్థించాడు. నువ్వు కనక దేవలోకానికి వెళ్ళి అమృతం తీసుకువచ్చి నా బిడ్డలకు ఇవ్వగలిగితే మీ అమ్మను విముక్తను చేస్తాను - అని చెప్పింది కద్రువ.

గరుత్మంతుడు ఒక్క ఉదుటున ఇంద్రలోకానికి ఎగిరాడు. దేవతలతో హోరాహోరీ యుద్ధం చేశాడు. ఎలాగైతేనేం అమృతభాండం చేజిక్కించుకున్నాడు. సరాసరి వచ్చి కద్రువకు అందించి, వినతాదేవికి దాస్యవిముక్తి కలిగించాడు.

పవిత్రంగా దర్భలు పరిచి అమృతభాండాన్ని దానిమీద ఉంచారు. స్నానాలు చేసి వచ్చి శుచిగా సేవిద్దామని సముద్రానికి వెళ్ళారు. ఇంతలోకీ ఇంద్రుడు సుధాభాండాన్ని అపహరించుకుపోయాడు. సుస్నాతులై వచ్చిన సర్పపుత్రులు ఆశగా ఆబగా దర్భలు నాకారు. నాలుకలు చీరుకు పోయాయి. అప్పటినుంచీ సర్పాలు ద్విజిహ్వాలు అయ్యాయి.

అగ్నికి ఆహుతి కమ్మని తల్లితో శాపం పొందిన సర్పకుమారులు వాసుకి ప్రముఖులు అందరూవెళ్ళి బ్రహ్మదేవుణ్ణి శరణు వేడారు. ఆయన ఒక ఉపాయం చెప్పాడు. జరత్కారుడనే ఒక మహాముని ఉన్నాడు. తీర్థయాత్రలు చేస్తున్నాడు. అతడికి వాసుకి సోదరి జరత్కారును ఇచ్చి వివాహం



చెయ్యండి. అతడు సనామధేయురాలినే వివాహం చేసుకుంటాడు. జరత్కారూ జరత్కారువులకు ఆస్తీకుడనే కొడుకు పుడతాడు. అతడు మిమ్మల్ని కాపాడతాడు. వెళ్ళండి అని బ్రహ్మదేవుడు చెప్పి పంపించాడు.

వెంటనే వాసుకి అరణ్యాలకు వెళ్ళి జరత్కారుణ్ణి వెదికి పట్టుకుని స్వయంగా తన చెల్లెలినిచ్చి వినయంగా వివాహం జరిపించాడు. నాకు అప్రియం చేసిందంటే చాలు వదిలేస్తానని నియమం పెట్టి జరత్కారుడు ఆమెను స్వీకరించాడు. పర్ణశాల కట్టుకుని కాపురం పెట్టాడు. సుఖంగా సంసారం సాగుతోంది.

ఒకరోజున సుష్ఠుగా మధ్యాహ్నభోజనం చేసి నడుం వాల్చాడు జరత్కారుడు. ఎట్టి పరిస్థితులలోనూ నన్ను నిద్రలేపకు అని భార్యకు ఆజ్ఞాపించి గుర్రుకొట్టాడు.

సూర్యాస్తమయం అయ్యింది. సంధ్యావందనానికి సమయం సమీపించింది. లేపితే అప్రియం కనక వదిలేస్తాడు. లేపకపోతే సంధ్యోపాసన చెయ్యని ధర్మలోపం చుట్టుకుంటుంది. ఏమి చెయ్యాలో తోచలేదు ఆ మునిపత్నికి. ఈ రెండింటిలో నరకానికి తీసుకుపోయే ధర్మహానికన్నా మొదటిదే మేలనుకుంది. అంతగా వదిలేస్తే మహా అయితే మరణిస్తాను, అంతేగదా. పరవాలేదు అనుకుని భర్తను నిద్రలేపింది. సాయం సంధ్యకు వేళ అయ్యింది, లేవండి లేవండి - అంది.

లేస్తూనే మండిపడ్డాడు జరత్కారుడు. నిద్రలేపి ఇంత అప్రియం చేస్తావా, నిన్ను వదిలేసి నేను పోతున్నాను, నువ్వు నీ సోదరుడి ఇంటికి పో - అన్నాడు. భయంతో వణికిపోతూ ఆమె అన్నదిగదా - మా అన్నగారు ఏ ఫలంకోరి నన్ను నీకిచ్చి వివాహం చేశాడో అది మరెలా నెరవేరుతుంది - అని రవ్వంత సిగ్గుపడుతూ నుంచుంది. చీకూ చింతా లేని జరత్కారుడు గుమ్మందాటబోతూ క్షణం ఆగి ఈ సందేహానికి సమాధానంగా "తదస్తి" అనేసి వెళ్ళిపోయాడు. (తత్ అస్తి = అది ఉంది).

మునికాంత - వాసుకి ఇంటికి వచ్చేసింది. ఏమిటి విషయమని అన్నగారు అడిగితే తదస్తి వరకూ చెప్పింది. వాసుకి సంతోషించాడు. జరత్కారుడు సత్యసంధుడుకనక అతడి మాటను విశ్వసించి సోదరిని లాలనగా చూసుకున్నాడు. తరవాత కొంతకాలానికి సోదరి ప్రసవించింది. మగబిడ్డ పుట్టాడు. అతడే ఆస్తీకుడు.



జనమేజయా! తల్లివైపు బంధువులను కాపాడుకోవడంకోసం ఆస్తీకుడు వచ్చి నీ సర్పయాగాన్ని ఆపించేశాడు. ఆ యాయావరకులీనుడూ వాసుకి మేనల్లుడూ అయిన ఆ మునిబాలుడి కోరికను మన్నించడం నువ్వు చేసిన గొప్ప పుణ్యకార్యం. సరే - నాయనా ! భారతం అంతా విన్నావు. అయినా మనశ్శాంతి కలగలేదు. నీ తండ్రికి దుర్గతి తొలగి స్వర్గతి లభించలేదు. అందుచేత - సువిశాలంగా సర్వాంగసుందరంగా భక్తి ప్రపత్తులతో దేవీ ఆలయం కట్టించు. నీ సకలవాంఛితాలూ సిద్ధిస్తాయి. భక్తితో కనక నిత్యం పూజిస్తే ఆ శివాని నీ వంశాన్ని వృద్ధి పొందిస్తుంది. నీ రాజ్యాన్ని స్థిరపరచి రక్షిస్తుంది. విధివిధానంగా దేవీయజ్ఞం చేసి శ్రద్ధగా దేవీభాగవతం విను. నవరసాలతో వినసొంపుగా ఉండే ఆ దివ్యపురాణాన్ని నీకు వినిపిస్తాను. తరిద్దువుగాని. ఇంతకన్నా వినదగిన పురాణం మరొకటి లేదు, ఇంతకన్నా ఆరాధించదగిన దేవత లేదు.

న శ్రోతవ్యం పరం చాస్మాత్పురాణా ద్విద్యతే భువి ।
నారాధ్యం విద్యతే రాజన్! దేవీ పాదాంబుజాదృతే ॥ (12 - 59)

జనమేజయా! ఎవరి హృదయంలో జగజ్జనని ఇష్టపడి ప్రేమతో నివసిస్తుందో నిజంగా వారి జన్మ ధన్యం. దేవిని ఆరాధించక పోవడంకన్నా ఈ ప్రపంచంలో దుఃఖం లేదు. ఆరాధించని వారంతా దుఃఖభాగులే. బ్రహ్మాదులే భక్తితో అర్చించే దేవీ పాదపద్మాలను ఆరాధించననే మనిషి ఉంటాడని నేను అనుకోను. శ్రీమద్దేవీభాగవతం శ్రద్ధగా విను. నీకు మనశ్శాంతి లభిస్తుంది. నీ పితృదేవతలు తరించి శాశ్వత పుణ్యలోకాలను పొందుతారు. ***(అధ్యాయం 12, శ్లోకాలు 64)***

## ద్వితీయ స్కంధం - 722 శ్లోకాలు - తెలుగుసేత : బేతవోలు రామబ్రహ్మం

# తృతీయ స్కంధము

జనమేజయుడి మనస్సుకి కాసింత ఉపశమనం కలిగింది. దేవీయజ్ఞం ఎలా చెయ్యాలో ఏమిటో వివరంగా తెలుసుకోవాలనుకున్నాడు. వ్యాసుణ్ణి అడిగాడు -

వ్యాసమహర్షీ! దేవీయజ్ఞం (అంబామఖం) అన్నావు. అది ఏమిటి, ఎలా చెయ్యాలి, నియమాలు ఏమిటి, ఫలం ఏమిటి? - ఇవన్నీ సవిస్తరంగా చెప్పు. నువ్వు సర్వజ్ఞుడివి. కనక నాకున్న మిగతా సందేహాలు కూడా నీ ముందు ఉంచుతున్నాను. పనిలోపనిగా వాటినికూడా తీర్చు. బ్రహ్మవిష్ణుమహేశ్వరులు త్రిమూర్తులనీ సృష్టిస్థితిలయ కారకులనీ విన్నాను. వారు సగుణులా నిర్గుణులా ? స్వతంత్రులా అస్వతంత్రులా ? ముసలితనమూ మరణమూ వంటి ప్రాణిధర్మాలూ త్రివిధదుఃఖాలూ వారికి ఉన్నాయా ? లేక సచ్చిదానందరూపులా ? వినాలి అని కుతూహలంగా ఉంది. అలాగే అష్ట దిక్పాలకులు ఇంద్రాదులున్నారని వింటున్నాం. వాళ్ళ కథ ఏమిటి ? పుట్టుక ఏమిటి ? కాలవశులా కాదా ? నిద్ర మెలకువ హర్షమూ శోకమూ వంటి లక్షణాలు వాళ్ళకున్నాయా ? మన శరీరాల్లాగానే వాళ్ళ దేహాలూ సప్త ధాతువులతో ఏర్పడ్డాయా, లేక వేరే ద్రవ్యాలతోనా ? వారి గుణాలూ వారి ఇంద్రియ శక్తులూ వారి భోగాలూ వారి ఆయుర్దాయాలూ, నివాస స్థానాలూ, వైభవాలూ (విభూతి = ఐశ్వర్యం) ఇవన్నీ తెలుసుకోవాలి అనుకుంటున్నాను. నా జిజ్ఞాస తీర్చు.

జనమేజయా ! చాలా గడ్డుప్రశ్నలు వేశావు. వీటికి సమాధానం చెప్పడం తేలిక ఏమీ కాదు. అయినా నాకు తెలిసినంతమేర చెబుతాను. ఆలకించు.

ఒకప్పుడు గంగాతీరంలో నారదమహర్షి దర్శనం అయ్యింది. సాష్టాంగ నమస్కారం చేశాను. ఆ మెత్తటి ఇసుకతిన్నెలపై నన్నూ తన సరసన కూర్చోబెట్టుకున్నాడు. కుశల ప్రశ్నలు అయ్యాక, నేనూ నీలాగే కొన్ని ప్రశ్నలు వేశాను. అతి విశాలంగా కనిపిస్తున్న ఈ బ్రహ్మాండానికి కర్త ఎవరు ? కారణం ఏమిటి ? అనిత్యమా, నిత్యమా ? కర్తలేకుండా కార్యోత్పత్తి జరగదు కనక కర్త ఉండే ఉండాలి. ఆ కర్త ఎవరు, ఒకరా, పలువురా? మహర్షీ ! ఈ సందేహ సందోహాలు తెమలక మునిగి ఉక్కిరిబిక్కిరి అవుతున్నాను. తీర్చి నన్ను ఉద్ధరించు. ఎవరిని అడిగినా ఒక్కొక్కరూ ఒక్కొక్క రకంగా చెబుతున్నారు. శివుడని ఒకరూ, విష్ణుమూర్తి అని ఒకరూ, బ్రహ్మదేవుడే అని ఒకరూ అంటున్నారు. వేదవేత్తలేమో సూర్యుడని చెప్పి ముప్పొద్దులా ఉపాసిస్తున్నారు. సరే - వరుణాది దిక్పాలకులను కర్తలుగా చెప్పేవారూ ఉన్నారు. వినాయకుడనేవారున్నారు.



వీరెవరూ కానేకాదు కర్తృత్వమంతా ఆదిశక్తిదే, సర్వభూతాలకూ సకల దేవతలకూ కన్నతల్లి ఆ ఆదిమాయనే అని నిర్ధారించి చెబుతున్న ఆచార్యులూ (గురువులు) ఉన్నారు.

భవానీం కేచనాచార్యాః ప్రవదంత్యఖిలార్థదామ్ ।
ఆదిమాయాం మహాశక్తిం ప్రకృతిం పురుషానుగామ్ ॥
బ్రహ్మైకతాసమాపన్నాం సృష్టిస్థిత్యంతకారిణీమ్ ।
మాతరం సర్వభూతానాం దేవతానాం తథైవ చ ॥
అనాదినిధనాం పూర్ణాం వ్యాపికాం సర్వజంతుషు ।
ఈశ్వరీం సర్వలోకానాం నిర్గుణాం సగుణాం శివామ్ ॥

**(1-31,32, 33)**

ఈ ఆదిపరాశక్తినే వైష్ణవి, శాంకరి, బ్రాహ్మి, వాసవి, వారుణి, వారాహి, నారసింహి, మహాలక్ష్మి నామధేయాలతో చెబుతున్నారు. ఇంకొందరు - బ్రహ్మపదార్థానిది కర్తృత్వమంటున్నారు. ఆకాశంనుంచి ఊడిపడింది, ఈ బ్రహ్మాండానికి కర్త లేడు, ఇది అనీశం, అకర్తృకం, స్వభావోత్థం, ప్రకృతిసిద్ధం - అని వాదానికి దిగుతున్న సాంఖ్యులు కనిపిస్తున్నారు. నేను ఎటూ తేల్చుకోలేకపోతున్నాను. సతమతమవుతున్నాను.

ఇదికాక, నారదా! ధర్మాధర్మ వివక్ష ఒకటి ఎంతకీ తేలడం లేదు. ఏది ధర్మమో, ఏది అధర్మమో గుర్తించలేకపోతున్నాను. సత్యధర్మరతులై సత్త్వగుణోపేతులైన దేవతలను, పాపాత్ములూ తామసులూ అయిన దానవులు నిత్యమూ పీడిస్తున్నారు. మా వంశంలోనే చూడు. పాండవులు ధర్మాత్ములు కదా! సదాచార పరాయణులు గదా ! ఎన్ని కష్టాలు పడ్డారో, ఎంతగా దుఃఖించారో అందరికీ తెలుసు. మరి ధర్మస్థితి ఏమిటి ?

ధర్మస్థితాస్సదాచారాః పాండవా మమ వంశజాః ।
దుఃఖం బహువిధం ప్రాప్తాస్తత్ర ధర్మస్య కా స్థితిః ॥ **(1 - 48)**

బ్రహ్మపుత్రా! నువ్వు సమర్థుడివి. మోహజలాలు నిండిన ఈ సంసార సముద్రంలో మునుగుతూ తేలుతున్న నన్ను, జ్ఞానం అనే నావతో దాటించు. రక్షించు. ***(అధ్యాయం - 1, శ్లోకాలు 50)***

జనమేజయా! నువ్వు నన్ను అడిగినట్టే నేనూ ఇలా నారదుణ్ణి ఇబ్బందిపెట్టాను. అయితేనేమి, ఆ దేవర్షి జ్ఞాని కనక ఓపికగా సమాధానాలు చెప్పాడు. అవన్నీ యథాతథంగా నీకు చెబుతాను, శ్రద్ధగా విని- గ్రహించు. నారదుడు నాతో అన్నాడుగదా -



వ్యాసమహర్షీ ! ఒకప్పుడు ఇవే ప్రశ్నలను నేను మా తండ్రిగారిని వేశాను. నేను ఎవరిని ఆరాధించాలో, సర్వోత్కృష్టుడు ఎవరో చెప్పమన్నాను. ఎన్ని తీర్థాలు సేవించినా ఎన్ని సాధనలు చేసినా మనస్సుకు శాంతి లభించడం లేదు. పరతత్త్వం తెలియనిదే శాంతి ఎక్కడిది ! సందేహాలతో వికీర్ణమైన చిత్తానికి స్థిరత్వం ఎక్కడిది !

**అవిజ్ఞాయ పరం తత్త్వం కుత: శాంతి: పరంతప ।**
**వికీర్ణం బహుధా చిత్తం న కుత్ర స్థిరతాం వ్రజేత్ ॥ (2 - 8)**

ఎవరిని స్మరించను, ఎవరిని యజించను, ఎవరిని స్తుతించను, ఎవరిని అర్చించను? - చెప్పు. సర్వేశ్వరుడెవరు ? - ఇలాంటి ప్రశ్నలన్నీ వేస్తే బ్రహ్మదేవుడు ఆశ్చర్యపోయి ఇలా అన్నాడు.

నాయనా ! నువ్వు అడిగిన ప్రశ్నలు ఉత్తమోత్తమాలే. కానీ సమాధానాలు దుర్బోధాలు. అవికూడా సంసారంపట్ల అనురక్తులకి తెలియవు. విరక్తులూ నిరీహులూ నిర్మత్సరులూ మాత్రమే జ్ఞాతలు. వారే సమాధాన ప్రదాతలు.

మహాప్రళయం సంభవించి స్థావర జంగమాలన్నీ నశించి, సృష్టి అంతా ఏకార్ణవమైపోయినప్పుడు- కమలం నుంచి నేను జన్మించాను. అప్పటికింకా సూర్యుడు లేడు. చంద్రుడు లేడు. వృక్షాలు లేవు. పర్వతాలు లేవు. తామరపువ్వు దుద్దులో కూర్చుని ఉన్నాను - ఒంటరిగా. ఆలోచించాను.

అంతా జలమయం అయిపోయిన ఈ సమయంలో నేను ఎలా ఎందుకు జన్మించాను ? నాకు రక్షకుడెవరు ? కర్త ఎవరు ? సంహర్త ఎవరు ? ఈ జలం అంతా దేనిమీద ఆధారపడి ఉంది ? భూమి అందామంటే, అది ఎక్కడా కనిపించడమే లేదు. పోనీ, నేను కూర్చున్న ఈ పంజకం సంగతి ఏమిటి ? యోగరూఢమైన పదంకదా (వ్యుత్పత్తి కుదిరి, ఒక అర్థంలో స్థిరపడిన పదం) మరి (పంకం) బురద ఏది? వెదుకుదాం, దీని మూలం పట్టుకుందాం అనిపించింది. బహుశ అక్కడ భూమికూడా కనిపించవచ్చు ననిపించింది. నీటిలోకి దిగాను. వెదికాను. వెదికాను, వెయ్యి సంవత్సరాలు వెదికాను, భూమీ లేదు, మొదలూ లేదు. ఏదీ కనిపించలేదు. కానీ ఆకాశం నుంచి "తపః తప" (తపస్సు చెయ్యి) అంటూ అశరీరవాణి ఒకటి వినిపించింది. అలాగేనని పద్మంలో కూర్చుని వెయ్యేళ్ళు తపస్సు చేశాను. అప్పుడు అశరీరవాణి మళ్ళీ వినిపించింది. "సృజ" (సృష్టించు) అంది. ఎవరిని సృష్టించనూ, ఏం చెయ్యనూ! అగమ్యగోచరంగా ఉంది. విమూఢుడనై కూర్చున్నాను.

అంతలోకే మధుకైటభులనే రాక్షసులు ఇద్దరు వచ్చారు. యుద్ధానికి రమ్మంటూ నన్ను భయపెట్టారు. అప్పుడు - తామరపువ్వు కాడలోనుంచి కిందికి నీటిలోకి దిగాను. చాలా లోతుకి దిగాను.



మా మాటలకు జగదంబిక చిన్నగా నవ్వింది. అంతలోకీ ఒక శుభ విమానం ఆకాశంనుంచి వేగంగా వచ్చి ఆగింది. త్రిమూర్తులారా! మీకో అద్భుతం చూపిస్తాను. రండి. విమానం ఎక్కండి - అని ఆజ్ఞాపించింది. ఓమ్ అని మేము ముగ్గురమూ అధిరోహించాం. (ఓమ్ అనేది అంగీకార సూచకం. "అలాగే" అనడానికి పర్యాయపదం). అది రత్నాలంకృతమైన దివ్యవిమానం. ముత్యాలదండలు వేలాడుతున్నాయి. దేవమందిరంలాగా ఉంది. చిరుగంటల చప్పుడు ఇంపుగా వినపడుతోంది. ముగ్గురం నిశ్శంకగా కూర్చున్నాం. జగన్మాత స్వశక్తితో మళ్ళీ ఆకాశంలోకి నడిపించింది.

*(అధ్యాయం - 2, శ్లోకాలు - 41)*

## ◆ త్రిమూర్తులు - సర్వలోక సందర్శన ◆

విమానం వేగంగా దూసుకుపోతోంది. ఒక ప్రదేశంలోకి వెళ్ళేసరికి ఆశ్చర్యం వేసింది. అక్కడ నీళ్ళు కనిపించలేదు. ఫలభరితాలైన వృక్షాలు. కోకిలకలకూజితాలు. రమణీయమైన ఉద్యానవనాలు. పర్వతాలు. పచ్చికనేల. నదులు. స్త్రీ పురుషులు. రకరకాల మృగాలు. వాపీకూపతటాకపల్వలాలు. సెలయేరులు. అన్నీ అద్భుతంగా కన్నులపండువుగా కనబడుతున్నాయి. విమానం వెడుతోంది. ఎట్టయెదుట సుందరనగరం. దివ్యప్రాకారం. బారులుతీర్చిన బంగారు లోగిళ్ళు. లోగిళ్ళలో యజ్ఞశాలలు. ఆ పట్టణాన్ని చూస్తూనే గుర్తించాం - అది స్వర్గమని. ఎవరు నిర్మించారోకదా ఇంత అబ్బురంగా-అనుకున్నాం. ఇంకొంచెం ముందుకు చూపు సారించాం. దివ్యతేజస్సంపన్నుడై వేటతో వినోదిస్తున్న ఒక భూపాలుడు కనిపించాడు.

మరుక్షణంలో విమానం మరొక దిశకు నడిచింది. అక్కడ నందనవనం కనిపించింది. అందులో ఘుమఘుమలాడుతోంది పారిజాతవృక్షం. దాని నీడలో నాలుగుదంతాల ఐరావతం. వనమంతటా అప్సరసలు గుంపులు గుంపులుగా క్రీడిస్తున్నారు. నృత్యసంగీతాలు కోలాహలంగా సాగుతున్నాయి. గంధర్వులు యక్షులు విద్యాధరులు - వందలు వందలు. ఆ మందారవనంలో ఆడుతున్నారు పాడుతున్నారు ఆనందిస్తున్నారు. పౌలోమీ (శచి) సహితుడై దేవేంద్రుడు అక్కడే వినోదిస్తున్నాడు. యమకుబేరవరుణాగ్ని సూర్య దేవతలు కనిపించారు. సంతోషించాం. త్రివిష్టపాన్ని చూసి త్రిమూర్తులం ఎంతగానో అబ్బురపడ్డాం.

విమానం ఇంకా పైపైకి ఎగిరింది. మునుముందుకు సాగింది. బ్రహ్మలోకం చేరుకుంది. అక్కడ మరొక బ్రహ్మను చూసి శివకేశవులు విస్తుపోయారు. బ్రహ్మ సభలో - సకల వేదాలూ సకల శాస్త్రాలూ (వేదాంగాలు) సాకారంగా దర్శనమిచ్చాయి. సాగర - నదీ - పర్వతాధిదేవతలు అక్కడే ఉన్నారు.



ఈ చతుర్ముఖుడు అచ్చం నీలాగే ఉన్నాడు, ఎవరయ్యా ఇతడని శివకేశవులు నన్ను అడిగారు. ఏమో, తెలియదన్నాను. నేనెవరినీ, ఈయన ఎవరూ నాకు ఈ భ్రమ ఏమిటీ - అంతా అగమ్యగోచరం.

మరుక్షణంలో విమానం కైలాస శిఖరంమీద ఉంది. అక్కడ అంతటా ప్రమథులూ, యక్షులూ కిటకిటలాడుతున్నారు. మందారవనాల్లో కీరకోకిల మంజునాదాలు మారుమ్రోగుతున్నాయి. వీణా మృదంగ నినాదాలు మిన్నుముడుతున్నాయి. అంతలోకీ - వృషభారూఢుడై త్రిలోచనుడు శంభుడు భవనం నుంచి ఈవలికి వచ్చాడు. అయిదు ముఖాలతో, పది చేతులతో, సిగలో నెలవంకతో, మొలకు పులితోలుతో, కండువాగా బుజాలపై ఏనుగు తోలుతో, గజానన షడాననులు అంగరక్షకులుగా విరాజమానుడై విచ్చేశాడు. నందీశ్వరుడు మొదలైన ప్రమథులు జయజయధ్వానాలతో వెంటనడుస్తున్నారు.

నిర్గతోఽభవత్ శంభుః వృషారూఢః త్రిలోచనః ।
పంచాననో దశభుజః కృతసోమార్ధశేఖరః ॥
వ్యాఘ్రచర్మపరీధానో గజచర్మోత్తరీయకః ।
పార్ష్ణిరక్షౌ మహావీరౌ గజానన షడాననౌ ॥
శివేన సహ పుత్రౌ ద్వౌ వ్రజమానౌ విరేజతుః ।
నంది ప్రభృతయస్సర్వే గణపాశ్చ వరాశ్చ తే ॥ (3 - 21, 22, 23)

నారదా! ఈ మరో శంకరుణ్ణి చూసి నేనూ మా తండ్రీ విస్మితులమయ్యాం. మరుక్షణంలో విమానం వాయువేగంతో కదిలి వైకుంఠం చేరుకుంది. ఊహకందని ఐశ్వర్యంతో వైకుంఠం వెలిగిపోతోంది. విష్ణుమూర్తి ఈసారి మరీ విస్మయం చెందాడు. ఆ వైకుంఠంలో అతసీకుసుమ సంకాశుడై పీతాంబరుడై చతుర్భుజుడు గరుత్మంతునిపై కనిపించాడు. లక్ష్మీదేవి వింజామరులు వీస్తోంది. గాలి తరంగాలకు చతుర్భుజుడి ఆభరణాలు మెల్లగా కదులుతున్నాయి. (అతసీకుసుమం = అవిసె పువ్వు)

అతసీకుసుమాభాసః పీతవాసాశ్చతుర్భుజః ।
ద్విజరాజాధిరూఢశ్చ దివ్యాభరణ భూషితః ॥
వీజ్యమానస్తదా లక్ష్మ్యా కామిన్యా చామరైః శుభైః ।
తం వీక్ష్య విస్మితాః సర్వే వయం విష్ణుం సనాతనమ్ ॥ (3 - 28, 29)

శివుడూ నేనూ చకితులమయ్యాం. ముగ్గురం ఒకరి ముఖాలు ఒకరు చూసుకుంటూ కూర్చున్నాం. విమానం వెడుతూనే ఉంది.



క్షీరసముద్రం వచ్చింది. తెల్లని కెరటాలు నురుగులు కక్కుతూ లేచిపడుతున్నాయి. హోరు చెవులకు సోకుతోంది. ఆ సముద్రమధ్యంలో ఒక ద్వీపం. మందార పారిజాతాది దివ్యవృక్షాలు దట్టంగా అలముకొని ఉన్నాయి. చిత్రవిచిత్రాలైన ఆస్తరణాలు (తివాసీలు) పరిచిఉన్నాయి. ముత్యాల దండలు వేలాడుతున్నాయి. పూలదండలకు లెక్కలేదు. అశోక - వకుళ వృక్షాలూ, మొగిలిపొదలూ సంపెంగ పొదలూ పరిమళాలను వెదజల్లుతున్నాయి. కోకిలల కూతలూ తుమ్మెదల ఝుంకారాలూ శ్రుతిపక్వంగా వినిపిస్తున్నాయి.

## ◆ దేవీ దర్శనం ◆

ఆ ద్వీపంలో ఒక పర్యంకం ఉంది. అది శివాకారంలో ఉంది. అంతటా రత్నాలు పొదిగి ఉన్నాయి. విమానం నుంచి చూస్తుంటే ఒక ఇంద్రచాపం అక్కడ విరిసినట్లు అనిపించింది. కానీ కాదు. ఆ పర్యంకానికే హరివిల్లు అలంకరింపబడి ఉంది. దానిమీద ఒక వరాంగన కూర్చుని ఉంది.

ఆ స్త్రీమూర్తి ఎర్రనివస్త్రాలు ధరించింది. ఎర్రని పూలమాలలు వేసుకొంది. ఎర్రచందనం పులుముకొంది. కన్నులు ఎర్రగా విశాలంగా ఉన్నాయి. పెదవులు ఎరుపు. కోటి మెరుపులు ఒకచోట గుమికూడి నిలిచినట్లు భాసిస్తోంది. మా కన్నులు మిరుమిట్లు గొలిపాయి. సూర్యబింబంలా ఉంది. వరదాభయహస్తాలు కాక తక్కినరెండింటా పాశాంకుశాలు ధరించింది. ఇంతకు ముందెప్పుడూ చూసి ఎరగం ఆ దివ్యసుందరమూర్తిని. చిరునవ్వులు చిందిస్తూ కూర్చుంది. హ్రీంకారాన్ని జపిస్తున్న పక్షిబృందాలు సేవిస్తున్నాయి. కరుణామూర్తి. నితాంతారుణ. నవయౌవన. కుమారి. శృంగారోచితమైన సింగారాలు. తామరమొగ్గలవంటి వక్షోజాలు. శ్రీచక్రతాటంకాలూ. తామరపువ్వులూ. మణిమయ భూషణాలు. కనకాంగదకేయూర కిరీట పరిశోభిత. హృల్లేఖా! భువనేశీ! అని నామజపం చేస్తూ సఖీబృందం స్తుతిస్తోంది. అనంగకుసుమాది దేవకన్యలు ఆమెను పరివేష్టించి ఉన్నారు. షట్కోణ యంత్రరాజం మీద కూర్చుని కనిపించింది.

రక్తమాల్యాంబరధరా రక్తగంధానులేపనా ।
సురక్తనయనా కాంతా విద్యుత్కోటి సమప్రభా ॥
సుచారువదనా రక్తదంతచ్ఛద విరాజితా ।
రమాకోట్యధికా కాంత్యా సూర్యబింబ నిభాఖిలా ॥
వరపాశాంకుశాభీష్టధరా శ్రీభువనేశ్వరీ ।
అదృష్టపూర్వా సా దృష్టా సుందరీ స్మితభూషణా ॥



హ్రీంకారజపనిష్ఠైస్తు పక్షిబృందైర్నిషేవితా ।
అరుణా - కరుణామూర్తిః కుమారీ నవయౌవనా ॥
సర్వశృంగారవేషాఢ్యా మందస్మితముఖాంబుజా ।
ఉద్యత్పీన కుచద్వంద్వ నిర్జితాంభోజకుట్మలా ॥
నానామణిగణాకీర్ణ భూషణైరుపశోభితా ।
కనకాంగదకేయూర కిరీట పరిశోభితా ॥
కనత్ శ్రీచక్రతాటంకవిటంకవదనాంబుజా ।
హృల్లేఖా భువనేశీతి నామజాపపరాయణైః ॥
సఖీబృందైః స్తుతా నిత్యం భువనేశీ మహేశ్వరీ ।
హృల్లేఖాద్యాభిరమరకన్యాభిః పరివేష్టితా ॥
అనంగకుసుమాద్యాభిర్దేవీభిః పరివేషితా ।
దేవీ షట్కోణమధ్యస్థ యంత్రరాజోపరిస్థితా ॥ (3 - 38 నుంచి 46)

మేము ముగ్గురమూ నివ్వెరపోయాం. బొమ్మల్లా నిలబడ్డాం. కన్నులప్పగించి చూస్తున్నాం.

అప్సరసా ? కాదు. గంధర్వాంగనా ? కాదు. దేవతా వనితా ? కాదు. కాదు. ఇంతకీ ఈ కాంత ఎవరు ? పేరు ఏమిటి ? ఇక్కడ ఎందుకు ఉంది ? - ఇవి అన్నీ మాలో రేగుతున్న సందేహాలు. సహస్రనయన. సహస్రకర. సహస్రవదన.

సహస్రనయనా రామా సహస్రకరసంయుతా ।
సహస్రవదనా రమ్యా భాతి దూరాదసంశయమ్ ॥ (3 - 48)

విష్ణుమూర్తి తనకున్న విజ్ఞానంతో ఒక నిశ్చయానికి వచ్చాడు. విమానంలో మాతోపాటున్న అంబతో అన్నాడు.

ఏషా భగవతీ దేవీ సర్వేషాం కారణం హి నః ।
మహావిద్యా మహామాయా పూర్ణా ప్రకృతి రవ్యయా ॥ (3 - 51)

ఈవిడ మాకందరికీ కారణభూతురాలైన మహాదేవి. మహావిద్య. మహామాయ. పూర్ణ. ప్రకృతి. అవ్యయ (నాశం లేనిది, తరగనిది, మార్పులేనిది). యోగగమ్య. అల్పబుద్ధులకు దుర్జ్ఞేయ. ఇచ్ఛారూపిణి.



నిత్యానిత్యస్వరూపిణి. అల్పభాగ్యులకు దురారాధ్య. దేవి. విశ్వేశ్వరి. శివ. వేదగర్భ. విశాలాక్షి. ఆదిమహేశ్వరి. ప్రళయకాలంలో సకల విశ్వాన్నీ - ఉపసంహరించి ఈమె ఒక్కతే ఒంటరిగా క్రీడిస్తుంది. సర్వజీవకోటి చిహ్నాలనూ తన శరీరంలో విలీనం చేసుకుంటుంది. తానై క్రీడిస్తుంది.

ఏషా సంహృత్య సకలం విశ్వం క్రీడతి సంక్షయే ।
లింగాని సర్వజీవానాం స్వశరీరే నివేశ్య చ ॥ (3 - 54)

సర్వబీజమయి. ఇరువైపులా కోటానుకోట్ల విభూతులు విరాజిల్లుతున్నాయి. సఖీబృందరూపంలో పరిచర్యలు చేస్తున్నాయి. బ్రహ్మా! శంకరా ! దర్శించండి. మనం ధన్యులం. మనం కృతకృత్యులం. సాక్షాత్తూ దర్శించగలుగుతున్నాం. వేల సంవత్సరాలుగా మనం చేస్తున్న తపస్సులకు ఫలం ఇది. లేకపోతే మనకు ఈ దేవీ దివ్యదర్శనం ఎలా సమకూరుతుంది ! అసంభవం. మహాదాతలకూ మహాతపస్వులకూ మహాయోగులకూ మహావిరక్తులకే తప్ప, సంసారానురక్తులకు దేవీదర్శనం లభించదు. ఈవిడ మూల ప్రకృతి. సదా - పురుషసంగత. పరమాత్మకు బ్రహ్మాండం చూపిస్తుంది. బ్రహ్మాండమూ దేవతలూ సమస్తమూ దృశ్యమైతే ఈవిడ ద్రష్ట. నేనుగానీ లక్ష్మిగానీ దేవతలుగానీ దేవతావనితలుగానీ ఈమెలో లక్షాంశానికి కూడా సాటిరాము.

విరించీ! ఆ వేళ ప్రళయసముద్రంలో నన్ను పసివాణ్ణి చేసి ఉయ్యాలలూపిన మహాదేవి - ఈమెయే. వటపత్రంలో శయనించి, కాలిబొటనవేలిని చీకుతూ బాల్యక్రీడలతో వినోదిస్తున్న నాకు జోలలు పాడి ఉయ్యాలలూపిన ఆదిపరాశక్తి నిశ్చయంగా ఈవిడే. దర్శనంతో జ్ఞానం కలిగింది. పూర్వానుభవంతో గుర్తు వచ్చింది. మన కన్నతల్లి ఈమెయే. ***(అధ్యాయం-3, శ్లోకాలు - 67)***

శయానం వటపత్రే చ పర్యంకే సుస్థిరే దృఢే ।
పదాంగుష్ఠం కరే కృత్వా నివేశ్య ముఖపంకజే ॥
లేలిహంతం చ క్రీడంత మనేకైర్బాలచేష్టితైః ।
రమమాణం కోమలాంగం వటపత్రపుటే స్థితమ్ ॥
గాయంతీ దోలయంతీ చ బాలభావాన్మయి స్థితే ।
సేయం సునిశ్చయం జ్ఞానం జాతం మే దర్శనాదిహ ॥
కామం నో జననీ సైషా శృణుతం ప్రవదామ్యహమ్ ।
అనుభూతే మయా పూర్వం ప్రత్యభిజ్ఞా సముత్థితా ॥

(3 - 64 నుంచి 67)



నారదా! మా అందరిలో విష్ణుమూర్తి ముందుగా జగన్మాతను గుర్తుపట్టాడు. నిర్భయంగా సన్నిధికి వెడదాం, సాష్టాంగ పడదాం, పదాల చెంత నిలిచి స్తుతిద్దాం. పరిచారికలు కనక మనల్ని లోపలికి వెళ్ళనివ్వకపోతే గుమ్మంలోనే నిలబడి స్తుతిద్దాం - నడవండి అన్నాడు. సరేనన్నాం. సంబరపడ్డాం. విమానం దిగి త్వరత్వరగా ద్వారం చేరుకున్నాం. జంకుతూ నిలబడ్డాం. మహాదేవి చూసింది. చిరునవ్వు విసిరింది. మేము ముగ్గురమూ స్త్రీలుగా మారిపోయాం. దివ్యసుందర రూపాలతో దివ్యాభరణభూషితలమైపోయాం. ఆశ్చర్యపడుతూనే సన్నిధికి చేరుకున్నాం. పాదాలచెంత నిలిచాం. ప్రేమ నిండిన చూపులను మాపై ప్రసరింపజేసింది. వినయంగా భక్తి ప్రపత్తులతో నమస్కరించాం. ఒకరినొకరు వింతగా చూసుకుంటూ నిలబడ్డాం. నానారత్న విభూషితమై కోటిసూర్య ప్రతీకాశమైన దేవీ పాదపీఠాన్ని తదేకదీక్షగా తిలకిస్తున్నాం.

అమ్మవారిని పరివేష్టించి ఉన్న సఖీజనంలో కొందరు రక్తాంబరధారిణులు. మరికొందరివి నీలాంబరాలు. ఇంకొందరివి పీతాంబరాలు. అందరూ సౌందర్యరాశులే. వారి వస్త్రాలూ విభూషణాలూ కట్టూ బొట్టూ అంతా విచిత్రంగా ఉంది. వినూతనంగా ఉంది. కొందరు పాడుతున్నారు. కొందరు ఆడుతున్నారు. కొందరు నాదస్వరం (వాయు వాద్యాలు) ఊదుతున్నారు. మరి కొందరు వీణలు పలికిస్తున్నారు. గాన మాధుర్యంలో పరవశిస్తున్నారు.

నారదా ! అక్కడ ఒక అత్యద్భుతం కనిపించింది. చెబుతున్నా, మనసుపెట్టి ఆలకించు. దేవీ పాదపీఠం తిలకిస్తూ నిలబడ్డాం కదా! మా చూపులు దేవీపాదపద్మాలపైకి ప్రసరించాయి. బొటనవేలి గోరు ఒక అద్దంలా తళతళలాడింది. చూద్దుముగదా - స్థావరజంగమాత్మకమైన బ్రహ్మాండం అంతా ఆ నఖదర్పణంలో కనిపించింది.

**నఖదర్పణమధ్యే వై దేవ్యాశ్చరణపంకజే ।**
**బ్రహ్మాండమఖిలం సర్వం తత్ర స్థావరజంగమమ్ ॥ (4 - 15)**

మేమూ అష్టదిక్పాలకులూ సూర్యచంద్రులూ నదులూ సముద్రాలూ పర్వతాలూ గంధర్వులూ అప్సరసలూ విశ్వావసు చిత్రకేతు శ్వేతకేతు చిత్రాంగదులూ నారదతుంబురులూ, హాహాహూహూవూ (గంధర్వ గాయకుడు), అశ్వినీదేవతలూ అష్టవసువులూ సిద్ధులూ సాధ్యులూ పితృదేవతలూ నాగకిన్నర కింపురుషయక్షరాక్షసులూ ఆదిశేషుడూ, వైకుంఠ కైలాస బ్రహ్మలోకాలూ - ఒకటేమిటి సమస్తమూ ఆ కాలిగోటిలో ప్రత్యక్షం అయ్యింది.



నా పుట్టిల్లు పద్మమూ దానిలో నేనూ, శేషశాయి, మధుకైటభులూ - అందరూ కనిపించారు. ముగ్గురం ఆశ్చర్యపోయాం. ఏమిటి ఈ వింత అనుకున్నాం. విశ్వమాతగా విశ్వసించాం. అలా చూస్తుండగానే ఒక వంద సంవత్సరాలు గడిచిపోయాయి. ఆ సుధామయద్వీపంలో దేవతాంగనలందరూ మమ్మల్ని తమ ఇష్టసఖులుగా పరిగణించారు. మా రూపం మా సౌందర్యం మాకే విమోహకంగా కనిపించింది. సంబరపడ్డాం. అందమైన భావనలు మా మనస్సులలో చిగురించాయి. యువతీరూపంలో ఉన్న విష్ణుమూర్తి ఒక రోజున అమ్మవారిని అద్భుతంగా స్తుతించాడు.

## ◆ త్రిమూర్తి కృత దేవీస్తుతి ◆

నమో దేవ్యై ప్రకృత్యై చ విధాత్ర్యై సతతం నమః ।
కల్యాణ్యై కామదాయై చ వృద్ధ్యై సిద్ధ్యై నమో నమః ॥ (4 - 27)

దేవికి నమస్కారం. ప్రకృతికి నమస్కారం. విధాత్రికి నమస్కారం. కల్యాణికి నమస్కారం. కామదకు నమస్కారం. వృద్ధికి నమస్కారం. సిద్ధికి నమస్కారం. సచ్చిదానంద రూపిణికి సంసారారణికి (అరణి) నమస్కారం.

పంచకృత్య విధాత్రికి భువనేశికి వందనం. సర్వాధిష్ఠాన రూపకు కూటస్థకు వందనం. అర్ధమాత్రార్థభూతకు హృల్లేఖకు వందనం.

అమ్మా ! అఖిలమూ నీలోనే సన్నివిష్టమై ఉందనీ నీనుంచే సంభవమూ లయమూ జరుగుతున్నాయనీ తెలుసుకున్నాను. శక్తిమంతురాలవనీ, నీ ప్రభావం అనంతమనీ, నువ్వు సకలలోకమయివనీ ఇప్పుడే గ్రహించాను. అఖిలాన్నీ విస్తరింపజేసి సదసద్వివేకాన్ని (వికారాన్ని) కలిగించి తగిన సమయంలో అవికలస్థితిని పురుషుడికి సందర్శింపజేస్తున్నావు. మమ్మల్ని వినోదింపజెయ్యడంకోసం ఇరవైమూడు తత్త్వాలతో ఇంద్రజాలంలా ప్రకాశిస్తున్నావు. నువ్వు లేకపోతే ఏ వస్తువైనా నిర్జీవమే. అన్ని వస్తువులలోనూ వ్యాపించి నువ్వు ఉన్నావు. నీ అంశ (శక్తి) లేనివాడు సర్వాత్మనా అశక్తుడు. నీ ప్రభావాలతో విశ్వాన్ని సంతృప్తి పరుస్తున్నావు. నీ తేజస్సులతో విశ్వాన్ని ప్రకటిస్తున్నావు. దేవీ! కల్పాంతంలో నీ వైభవాన్నీ నీ చరితనూ ఎరిగినవాడు ఎవ్వడూ లేడు. మధుకైటభులనుంచి మమ్మల్ని కాపాడిన జననీ ! నీ దర్శనంవల్ల ఆనందానుభవంలో పరకోటికి చేరుకున్నాం. నీ ప్రభావం రచించిన (సృష్టించిన) భువనాలు ఎన్ని ఉన్నాయో ఎవరికి తెలుసు! నీ చరిత్ర ఊహలకు కూడా అందదు. నేనేకాదు ఈ చతుర్ముఖుడూ ఈ శంకరుడూ కూడా తెలుసుకోలేరు. ఊహించలేరు. ఇంక ఇతరులమాట చెప్పాలా !



హే మహామాయే ! ఈ భువనంలో మరో ముగ్గురు త్రిమూర్తులున్నట్లు ఇప్పుడే చూశాం. తక్కిన భువనాలు ఎన్ని ఉన్నాయో త్రిమూర్తులు ఎందరున్నారో ఎవరికి తెలుసు? నీ ప్రభావం అమేయం.అచింత్యం. నీ పాదాలకు సాష్టాంగపడి నమస్కరించిమరీ యాచిస్తున్నాను - ఈ నీ దివ్యరూపం నా హృదయంలో ఈ నీ దివ్యనామం నా నాలుకపై నిరంతరం ఉండాలి, శాశ్వతంగా ఉండాలి. నీ పాదపద్మాలను నిత్యం సందర్శించే భాగ్యం అనుగ్రహించు.

యాచేఽమ్బ తేఽంఘ్రికమలం ప్రణిపత్య కామమ్ ।
చిత్తే సదా వసతు రూపమిదం తవైతత్।
నామాపి వక్త్రకుహరే సతతం తవైవ
సందర్శనం తవ పదాంబుజయోస్సదైవ ॥ (4 - 37)

వీడు నా భృత్యుడు అని నువ్వు నన్ను భావించు. నువ్వు నా అధికారిణివి. మన మధ్యనున్నది తల్లీబిడ్డల అనుబంధం. ఇది ఇలాగే కలకాలం కొనసాగేట్టు చూడు తల్లీ !

భృత్యోఽయమస్తి సతతం మయి భావనీయమ్
త్వాం స్వామినీతి మనసా నను చింతయామి ।
ఏషావయోరవిరతా కిల దేవి భూయాత్
వ్యాప్తిస్సదైవ జననీసుతయోరివార్యే ॥ (4 - 38)

ఈ సృష్టిలో నీకు తెలియనిది లేదు. సర్వజ్ఞతకు నువ్వు చివరి సరిహద్దువి. అలాంటి నీకు పామరుణ్ణి నేనేమి నివేదించుకోగలను? నీ ఇంగితాన్నిబట్టి నాకు ఏది యుక్తమో అది ప్రసాదించు. సృష్టి స్థితిలయకారకులు అని మా ముగ్గురికీ లోకంలో ప్రసిద్ధి. కానీ సత్యమేమిటంటే - నీ ఇచ్ఛవల్ల మేము ఆ విధులు నిర్వర్తించగలుగుతున్నాం. అంతమాత్రమే.

త్వం వేత్సి సర్వమఖిలం భువన ప్రపంచం
సర్వజ్ఞతా పరిసమాప్తి నితాంతభూమిః ।
కిం పామరేణ జగదంబ నివేదనీయం
యద్యుక్తమాచర భవాని తవేంగితం స్యాత్ ॥ (4 - 39)

కనిపించే ఈ జగత్తునంతటినీ భూమి మోస్తోంది అనడం అబద్ధం. నిజానికి ఆధారశక్తివి నువ్వే. సూర్యుడు వెలిగేదికూడా నీ ప్రభతోనే. నువ్వు విరజవు. నీ ప్రభావంతో జన్మించాం కనక మేము నిత్యులం



కాదు. ఇక దేవేంద్రాదులమాట చెప్పాలా ? నువ్వు మాత్రమే నిత్యవు. సనాతనవు. పురాణ ప్రకృతివి. ఇంతకాలమూ నేనే ప్రభుః అనాదిః అనీహః ఈశః విశ్వాత్మకః అనుకుంటున్నాను. ఇప్పుడు నీ సన్నిధిలో ఈ మహాపురుషుణ్ణి చూశాక కనువిప్పు కలిగింది. తామసిక ప్రవృత్తి వదిలింది. నువ్వు బుద్ధిమంతులకు బుద్ధివి (విద్య). శక్తిమంతులకు శక్తివి. కీర్తిమంతులకు కీర్తివి. కాంతిమంతులకు కాంతివి. నువ్వు గాయత్రివి. ప్రథమ వేదకళవు. స్వాహా - స్వధా - భగవతీ శబ్ద వాచ్యవు. సగుణవు. అర్థమాత్రవు. ఈ ప్రపంచాన్ని అంతటినీ మోక్షంకోసమే సృష్టించావు. సముద్రానికి తరంగాల్లాగా ఇవన్నీ నీకు అంశలు. నీలోనే పుడతాయి, నీలోనే భాసిస్తాయి, నీలోనే లీనమవుతాయి. ఈ రహస్యాన్ని జీవుడు తెలుసుకున్నప్పుడు మాయనంతటినీ నీవే ఉపసంహరిస్తావు. ప్రదర్శన ముగియగానే నటుడు తన ఆహార్యాన్ని తొలగించుకోడా మరి ! ఓ మహాదేవీ ! నువ్వే రక్షకురాలివి. ఈ మోహజలధినుంచి నన్ను ఉద్ధరించు. రాగాదిభావాలను తొలగించి, దుఃఖాలు ఉపశమింపజేసి, సత్యప్రకాశనం కలిగించు. ఓ మహావిద్యా ! ఓ దేవీ ! ఓ శివా ! ఓ సర్వార్థప్రదా ! నీ పాదాలకు నమస్కరిస్తున్నాను. జ్ఞాన ప్రకాశాన్ని ప్రసాదించు.

*( అధ్యాయం - 4, శ్లోకాలు-49 )*

**నమో దేవి మహావిద్యే నమామి చరణౌ తవ ।**
**సదా జ్ఞానప్రకాశం మే దేహి సర్వార్థదే శివే ॥ (4 - 49)**

నారదా ! విష్ణుమూర్తి అమ్మవారిని ఇలా స్తోత్రం చేసి విరమించిన తరువాత శివుడు భక్త్యావేశంతో స్తుతికి ఉపక్రమించాడు.

ఓ సకలలోక నిర్మాణ చతురా ! బ్రహ్మ విష్ణువులే నీ ప్రభావంవల్ల జన్మించారంటే నేనూ అంతేకదా! పంచభూతాలు నువ్వే. అవ్వే తిరిగి మరికొన్నింటికి కారణమవుతున్నాయి. బుద్ధి, మనస్సు, అహంకారమూ నువ్వే. త్రిమూర్తులనూ సృష్టికర్తలుగా చెప్పేవారికి నిజం తెలియదు. అసలు సిసలు సృష్టికర్తృత్వం నీది. త్రిమూర్తులూ నీ సృష్టియేకదా ! పంచభూతాలతో సృష్టి జరిగినా దానిలో నీ కళలేనిదే చైతన్యం రాదు. సృష్టిలో జీవకళవు నువ్వు. ప్రాణశక్తివి నువ్వు. అందుచేత నీ చిత్తం వచ్చినప్పుడు సృష్టించగలవు. ఆపెయ్యాలనుకున్నప్పుడు ఆపెయ్యగలవు. నీ పాదాంబుజరేణువుని నీ ఆజ్ఞగా స్వీకరించి మేము మా విధులను నిర్వహిస్తున్నాము.

**సకలలోక సిసృక్షురహం హరిః కమలభూశ్చ భవామ యదాంబికే ।**
**తవ పదాంబుజపాంశు పరిగ్రహం సమధిగమ్య తదా నను చక్రిమ ॥**
**(5 - 7)**



హే అంబికే ! నువ్వు ఎప్పుడూ దయామయివి కనుక మా ముగ్గురికీ మూడుగుణాలూ మూడు ప్రధాన బాధ్యతలూ అప్పగించావు. నీ సృష్టిలో ఎంత వైవిధ్యం ! సచివ - భూపతి - భృత్యభేదాలు. బహుధన - నిర్ధన వైషమ్యాలు. చిత్రవిచిత్రమైన సృష్టి.

అమ్మా ! ఈ శుభవిమానంలో వస్తున్నప్పుడు చాలా భువనాలు పరిచయమయ్యాయి. మరో త్రిమూర్తులూ దర్శనం ఇచ్చారు. ఇది కొత్త సృష్టియా ? పాతదేనా? తెలియజెప్పు తల్లీ ! నువ్వు ఎప్పుడు ఏది సృష్టించాలనుకుంటావో, ఎప్పుడు విరమించాలి అనుకుంటావో, ఎప్పుడు నశింపజెయ్యాలి అనుకుంటావో ఎవ్వరికీ తెలీదు. నీ భర్తృపురుషుణ్ణి మాత్రం ఎప్పుడూ ఆనందపరుస్తుంటావు.

మమ్మల్ని యువతులుగా మార్చివేశావు. అయితేనేమిలే. నీకు సన్నిహితంగా నిలిచి పాదపద్మాలను అర్చించుకునే అవకాశం లభింపజేశావు. అది చాలు. పురుషులుగా ఉంటే ఈ అదృష్టం ఈ ఆనందం లభించేదా ? నిజం చెబుతున్నాను తల్లీ! నీ పాదపద్మాలకు దూరమవ్వాల్సి వచ్చేట్టయితే నాకు త్రిభువనాధిపతిత్వమూ వద్దు, పురుషత్వమూ వద్దు. ఈ యువతిత్వం ఇలాగే ఉండనీ.

న రుచిరస్తి మమాంబ పదాంబుజం
తవ విహాయ శివే భువనేష్వలమ్ ।
నివసితుం నరదేహమవాప్య చ
త్రిభువనస్య పతిత్వమవాప్య వై ॥ (5 - 14)

శివుడు యువతిగా మారి ఆదిశక్తి పాదపద్మాలను సేవించాడు అనేది ముల్లోకాలలోనూ నాకు కీర్తి కారణం. నీ సాన్నిధ్యం లేని క్షణాలు నాకు యుగాలు. నీ పాదాలను ధ్యానించడం కాక వేరే వేరే తపస్సులు చేసేవారు నిజంగా విధివంచితులు. అగౌరవాన్ని గౌరవంగా భ్రమించి ఆత్మవంచన చేసుకుంటున్నారు. తపస్సులూ యోగాలూ యాగాలూ వీటివల్ల ముక్తి ఎప్పటికి లభిస్తుందో అసలు లభించదో చెప్పలేను. కానీ నీ పాదపద్మాల పుప్పొడి రేణువు సోకితే చాలు అదే ముక్తి. అదే మోక్షం.

అమ్మా ! నేను నిరంతరం జపించుకుని ఆనందించడానికి ఏదైనా ఒక దివ్యమంత్రం ఉపదేశించు తల్లీ ! క్రిందటి జన్మలో నవాక్షర తారకమంత్రం ఉపదేశించావు. అది ఇప్పుడు స్ఫురణలో లేదు. దయచేసి మళ్ళీ ప్రబోధించు. ఉపదేశించు.

శివుడి అభ్యర్థనకు జగదంబిక సంతోషించింది. నవాక్షర మహామంత్రం ఉపదేశించింది. శివుడు పరమానందం పొందాడు. పాదాలకు సాష్టాంగపడి అక్కడే నిలబడ్డాడు. బీజాక్షర సంశోభితమైన ఆ తారకమంత్రాన్ని, ఆ మోక్షద కామద మంత్రాన్ని జపిస్తూ పరవశించిపోతున్నాడు. అది చూసి నేనూ జగదీశ్వరిని స్తుతించాను.



ఓ సర్వజ్ఞురాలా ! ఇంత సన్నిహితంగా ఇంత స్పష్టంగా నీ దర్శనం కలిగించే శక్తి వేదాలకు కూడా లేదు. అవి ప్రతిపాదించే హోమాలన్నింటిలోనూ స్వాహాస్వరూపిణివి నువ్వే.

ఇంత అద్భుతమైన బ్రహ్మాండాన్ని సృష్టిస్తున్నాను నాకంటే సమర్థుడెవరు అని ఇంతకాలమూ భావించాను. ఆ అహంకారంతోనే భవసాగరంలో మునిగిపోయాను. నీ ఆజ్ఞను పాలించి సృష్టికర్తను కాగలగడం ఒక అదృష్టం, ఒక ధన్యత్వం అని ఇప్పుడు తెలుసుకోగలిగాను. కానీ, తల్లీ ! ఇప్పుడు నాకు ఒక కొత్త గర్వం పొడసూపుతోంది. నీ పాదపంకజ పరాగాన్ని స్వీకరించగలిగాను అనేది ఇప్పటి నా గర్వం. యథార్థం చెబుతున్నాను. కేవలం నీ దయవల్ల ధన్యుణ్ణి కాగలిగాను. నన్ను పట్టి బంధించిన మోహనిగళాలను పటాపంచలు చేసి నాలో నీపట్ల భక్తిని స్థిరపరుచు. సరోజంలో పుట్టాను. దానినుంచి ఎలా విముక్తుణ్ణి చేస్తావో, అంతా నీ దయ. నీ ఆజ్ఞను పాటించడం ఒక్కటే నాకు తెలిసిన విద్య. నీ కింకరుణ్ణి. నన్ను దయజూడు.

నిన్నూ నీ ప్రభావాన్నీ ఎరుగనివారు నన్ను ప్రభువు అంటున్నారు. స్వర్గంకోరి యజ్ఞయాగాలు చేసే వేదవేత్తలుకూడా ఇలాంటి భ్రమలోనే ఉండటం, నిన్ను తెలుసుకోలేకపోవడం చాలా విడ్డూరం కదూ! నువ్వు నన్ను సృష్టించావు. ఆది సృష్టిని చతుర్ధా విభాగించమని ఆజ్ఞాపించావు. ఇది ఇప్పటికి తెలుసుకున్నాను. ఇప్పటివరకూ ఉన్న నా అహంకారాన్ని క్షమించు.

అష్టవిధయోగమార్గాలలో అష్టకష్టాలూ పడే మూఢుల్ని చూస్తే జాలివేస్తుంది. ఉచ్చారణ మాత్రంచేతనే పవిత్ర చరితుల్ని చేసి మోక్షాన్ని ప్రసాదించే నీ నామమహిమ వారికి తెలీదు. ఏదో ఒక వంకతోనైనా ఉచ్చరించి సిద్ధిపొందరు, అదేమి చిత్రమో గదా !

ఆది సృష్టిని చతుర్ధా విభాగించడమనేది నీకొక పెద్ద పనేమీ కాదు. కేవలం చూపులతోనే చేసివెయ్యగలవు. అయినా విధి అంటూ నన్నొకణ్ణి కల్పించి ఆ పని అప్పగించడం నీ వినోదం.

నా తండ్రి విష్ణుమూర్తిని జగద్రక్షకుడు అనడం నన్ను సృష్టికర్త అనడంలాంటిదే. కాకపోతే, మధుకైటభులనుంచి నువ్వు రక్షించాల్సి వచ్చింది ఎందుకనిట ? నా నుదుటినుంచి పుట్టిన శివుణ్ణి సృష్టి సంహారకుడు అనిపిస్తున్నదీ నువ్వే.

నువ్వు ఎక్కడ జన్మించావో విన్నవాడు గానీ కన్నవాడుగానీ లేడు. ఎలా జన్మించావో తెలిసినవాడు లేడు. నువ్వు ఆదిశక్తివి. ఏకైకాద్వితీయశక్తివి. అందుచేత నీ తంత్రాలూ నీ మంత్రాలే తప్ప నిన్ను తెలుసుకోడానికి మరో మార్గం లేదు. మరో ఉపాయం లేదు. నువ్వు కేవలం స్వతంత్రురాలివి.



న తే జన్మ కుత్రాపి దృష్టం శ్రుతం వా
కుతస్సంభవస్తే న కోఽపీహ వేద ।
కిలాద్యాసి శక్తిస్త్వమేకా భవాని
స్వతంత్రైస్సమస్తైరతో బోధితాసి ॥ (5 - 37)

నువ్వు మాతో ఉంటేనే మా విధులు మేము నిర్వర్తించగలం. లేకపోతే లేదనేది సత్యం. కానీ కొందరు అల్పాశయులు ఈ విచిత్ర వినోదాన్ని అర్థం చేసుకోలేక వృథాగా వివాదాస్పదులు అవుతున్నారు. ఆద్యదేవుడైన ఈశ్వరుడు అకర్త, అనీహుడు, అనుపాధి, అకళశ్రీ. నీ వినోదం నీ వితీర్ణం (శక్తి ప్రదానం) చూస్తూ ఉంటాడని విధిజ్ఞులు అంటారు. ఈ దృష్టాదృష్ట విభేదంలో ఆ మహాపురుషుడు ఆద్యదేవేశ్వరుడు నీ విభుడు నీకంటే పూర్వుడు. మరింక మూడవ ప్రమేయం లేదు. (దృష్టం = ప్రకృతి, అదృష్టం = పురుషుడు).

అయితే, అమ్మా ! నాదొక చిన్న సందేహం. వేదవాక్యం మిథ్యకాదు కనక, కానివ్వకూడదు కనక అడుగుతున్నాను. విరోధాన్ని పరిహరించి మనశ్శాంతిని ప్రసాదించు. ఏకమేవాద్వితీయం బ్రహ్మ అనికదా వేదాలు చెబుతున్నాయి. అది నువ్వా, లేక నీ విభుడైన పరాత్పర మహాపురుషుడా ?

ఏకమేవాద్వితీయం యద్బ్రహ్మ వేదా వదంతి వై ।
సా కిం త్వం వాప్యసౌ వా కిం సందేహం వినివర్తయ ॥ (5 - 43)

ఈ ఏకత్వ - ద్విత్వ విచారణంలో మునిగిపోయి నా మనస్సు ఒక నిశ్చయానికి రాలేకపోతోంది. పుణ్య విశేషంవల్ల నీ పాదపద్మాలను సమాశ్రయించగలిగాను కాబట్టి నీ ముఖతః వినే అవకాశం లభించింది. నా సందేహం తీర్చు. నిజానికి నువ్వు పురుషుడివా ? స్త్రీవా ? అదికూడా తెలియజెప్పు. పరాశక్తిని తెలుసుకుని భవసాగరంనుంచి విముక్తుణ్ణి అవుతాను. ***(అధ్యాయం-5, శ్లోకాలు - 46)***

పుమానసి త్వం స్త్రీ వాసి వద విస్తరతో మమ ।
జ్ఞాత్వాహం పరమాం శక్తిం ముక్తః స్యాం భవసాగరాత్ ॥ (5 - 46)

నారదా ! వినయంగా కేవలజిజ్ఞాసతో అడిగిన నా ప్రశ్నకు మహాదేవి మృదువుగా క్లుప్తంగా సమాధానం చెప్పింది. సందేహం తీర్చింది. ఆ విషయం చెబుతాను, గ్రహించు.



## ◆ దేవీకృత తత్త్వోపదేశం - శక్తిప్రదానం ◆

చతుర్ముఖా ! నాకూ నా పురుషుడికీ భేదం లేదు. ఎప్పుడూ ఏకత్వమే. అతడే నేను, నేనే అతడు. భేదం మతివిభ్రమం.

సదైకత్వం న భేదోఽస్తి సర్వదైవ మమాస్య చ ।
యోఽసౌ సాఽహమహం యోఽసౌ భేదోఽస్తి మతివిభ్రమాత్ ॥

(6 - 2)

మా మధ్య ఉన్న సూక్ష్మమైన అంతరాన్ని తెలుసుకున్నవాడు నిస్సంశయంగా సంసారవిముక్తుడు. బ్రహ్మం ఎప్పుడూ ఏకమే, అద్వితీయమే. ఏకమేవాద్వితీయం బ్రహ్మ. సందేహం లేదు. కానీ సృజన సమయంలో ద్వైతభావాన్ని పొందుతుంది. ఒకటే దీపం ఉపాధియోగం వల్ల రెండు అయినట్టూ, నీడయే అద్దంలో పడి ప్రతిబింబమైనట్టూ మేము ద్విధాత్వం (ద్వైతభావం) పొందుతూంటాం.

యథా దీపస్తథోపాధేర్యోగాత్సంజాయతే ద్విధా ।
ఛాయే వాదర్శమధ్యే ప్రతిబింబం వా తథావయోః ॥ (6 - 5)

అజా ! ఉత్పత్తికాలంలో సృష్టికోసం (భేదం) భిన్నత్వం సంభవిస్తుంది. అలా ద్వైవిధ్యం ఉన్నప్పటికీ అది దృశ్యాదృశ్య విభేదమే. ఉపసంహార సమయంలో నేను స్త్రీనీ కాదు, పురుషుణ్ణీ కాదు, క్లీబాన్నీ కాదు. సర్గస్థితిలోనే ఈ విభేదం. అదికూడా బుద్ధికల్పితం. మరొక రహస్యం చెబుతున్నాను. ఈ సృష్టిలో నేను కానిది ఏమీ లేదు. బుద్ధి, శ్రీ, ధృతి, కీర్తి, స్మృతి, శ్రద్ధ, మేధ, దయ, లజ్జ, ఆకలి, కోరిక, ఓర్పు, కాంతి, శాంతి, దప్పిక, నిద్ర, మెలకువ, జర, యౌవనం, విద్య, అవిద్య, స్పృహ, వాంఛ, శక్తి, అశక్తి, వస, మజ్జ, చర్మం, వృష్టి, వాక్కు, అనృతం, ఋతం, పరామధ్యమాపశ్యంతీలు, వివిధ నాడీమండలం - అన్నీ నేనే. నేను కానిది ఏదైనా ఉందా ? ఆలోచించి చెప్పు. "సర్వమేవాహమ్" ఈ నిశ్చయం తెలుసుకో. అందుకే ఈ సృష్టిలో నాది వితత స్వరూపం.

దేవతలలో కూడా రకరకాల పేర్లతో నేనే ఉంటాను. శక్తి రూపంలో ఉంటాను. పరాక్రమం చూపిస్తాను. గౌరి, బ్రాహ్మి, రౌద్రి, వారాహి, వైష్ణవి, శివ, వారుణి, కౌబేరి, నారసింహి, వాసవి - అన్ని రూపాలూ అన్ని నామాలూ నావే. అందరిలోనూ నేనే ఉండి అందరినీ నిమిత్తమాత్రుల్ని చేసి ఆయా కార్యాలు నేనే నిర్వర్తిస్తూంటాను.



నీళ్ళలోని చల్లదనం, అగ్నిలోని వెచ్చదనం, సూర్యుడిలోని జ్యోతిస్సు, చంద్రుడిలోని మంచు - నేనే. అవసరాన్నిబట్టి ఏది కావాలంటే అది అవుతాను. నేను లేనిది - ఏదీ స్పందించదు. శంకరుడైనా సరే నేను వదిలేస్తే రాక్షసుల్ని సంహరించలేడు. దుర్బలుడైపోతాడు. లోకంలో దుర్బలుడికి పర్యాయపదం ఏమిటి ? శక్తిహీనుడు అనే కదా ! రుద్రహీనుడు, విష్ణుహీనుడు అని ఎవరైనా అంటారా ? శక్తిహీనుడు అని మాత్రమే అంటారు.

**అశక్తః శంకరో హంతుం దైత్యాన్ కిల మయోజ్ఝితః ।**
**శక్తిహీనం నరం బ్రూతే లోకశ్చైవాతిదుర్బలమ్ ॥**
**రుద్రహీనం విష్ణుహీనం న వదంతి జనాః కిల ।**
**శక్తిహీనం యథా సర్వే ప్రవదంతి నరాధమమ్ ॥ (6 - 18, 19)**

నువ్వైనా శక్తియుక్తుడవయినందువల్లనే జగత్సృష్టి చెయ్యగలుగుతున్నావు. విష్ణువూ అంతే. ఇంద్రాది దిక్పాలకులూ అంతే. పంచభూతాలూ సూర్యచంద్రులూ అంతే. ఈ భూమి - సమస్తాన్నీ మోస్తోందంటే శక్తియే కారణం. నేనే లేనినాడు అశక్తురాలవుతుంది. చిన్న పరమాణువును కూడా మొయ్యలేదు. ఆదిశేషుడూ అష్టదిగ్గజాలూ అంతే. నేను తలుచుకుంటే సృష్టిలో ఉన్న నీరంతా త్రాగెయ్యగలను. సూర్యుణ్ణి దాచెయ్యగలను. వాయువును స్తంభింపజెయ్యగలను.

కమలజా ! నా తత్త్వం విచిత్రంగా ఉంటుంది. ప్రాగభావప్రధ్వంసాభావాది స్థితులకు అతీతం. మృత్పిండ కపాలాదులలో ఘటాభావంలాగా జగదభావం ఉందిగానీ శక్త్యభావం లేదు, ఉండదు. ఇక్కడ అంతా జలమయం, పృధివి లేదు, సృష్టి ఎలా చెయ్యను అనికదా అడిగావు. స్థూలాకారంలో పృథివి లేదు అంటే పరమాణువు(లు)గా ఉందని తెలుసుకో. పృథివ్యభావం పరమాణ్వభావం కాదు.

శాశ్వతం క్షణికం శూన్యం నిత్యం అనిత్యం సకర్తృకం అహంకారం అని ఏడు విభేదాలు ఉన్నాయి. విరించీ ! నీకు మహత్తత్త్వం ఇస్తున్నాను స్వీకరించు. దానినుంచి అహంకారం ఉద్భవిస్తుంది. అహంకారం నుంచి యథాపూర్వంగా భూతసృష్టి కావించు.

**గృహాణాజ మహత్తత్త్వమహంకారస్తదుద్భవః ।**
**తతః సర్వాణి భూతాని రచయస్వ యథా పురా ॥ (6 - 30)**

పద్మసంభవా ! నీకొక శక్తిని ఇస్తున్నాను స్వీకరించు. ఇదిగో చూడు. అందాల రాసి. శ్వేతాంబరధారిణి. చారుహాసిని. దివ్యభూషణ భూషిత. పేరు మహాసరస్వతి. రజోగుణవతి. నీకు క్రీడార్థంగా నిత్యసహచారిణిగా ఉంటుంది. ఈమె నా విభూతి. ఎప్పుడూ అవమానించకు సుమా ! నీకు పూజ్యతమ. నీకు ఏకైక ప్రియ.



ఈమెతో కలిసి సత్యలోకానికి వెళ్ళు. బీజంనుంచి చతుర్విధ సృష్టినీ కావించు. కర్మలతో కలిసి జీవుల గుర్తులు (కోశంలో) కాలగర్భంలో ఉంటాయి. వాటిని అనుసరించి యథాపూర్వంగా సృష్టిని ఉత్పాదించు. కాలకర్మస్వభావాదులు కారణాలుగా చరాచరజగత్తు యథాపూర్వంగా ఉంటుంది.

నీకు విష్ణుమూర్తి ఎల్లప్పుడూ మాననీయుడు, పూజనీయుడు. సత్త్వగుణ ప్రధానుడు కనక మీ ఇద్దరికంటే అధికుడు. కష్టసాధ్యమైన పని చెయ్యవలసి వచ్చినప్పుడల్లా ఇతడు అవతారం ఎత్తి దానవ సంహారం చేసి మీకు సహకరిస్తూ ఉంటాడు. శివుడు కూడా నీకు సహాయకుడుగా ఉంటాడు. వెళ్ళు. సకల దేవతలనూ సృష్టించు. సకల మానవులనూ సృష్టించు. యజ్ఞయాగాలను వారు నిర్వహిస్తారు. దేవతలను సంతృప్తిపరుస్తారు. అన్నింటా నా నామధేయాన్ని ఉచ్చరిస్తే చాలు అందరికీ సంతృప్తి కలుగుతుంది. తమోగుణ విశిష్టుడుకదా అని శివుణ్ణి చిన్నచూపు చూడకు. అతడు మాననీయుడు. యజ్ఞాలలో ప్రత్యేకించి పూజనీయుడు.

దేవతలకు రాక్షసభయం పెచ్చుపెరిగినప్పుడు నా శక్తులు వారాహి, వైష్ణవి, నారసింహి మొదలైన రూపాలలో ఆవిర్భవించి రాక్షస సంహారం చేస్తాయి.

మంత్రాలలోకెల్లా ఉత్తమోత్తమం నవాక్షరమంత్రం. దాన్ని జపిస్తూ, నిరంతరం మనస్సులో ధ్యానిస్తూ నీ పనులను నువ్వు నిర్వర్తించు. నిర్విఘ్నంగా జరుగుతాయి. సకలవాంఛలూ తీరతాయి.

నారదా ! నాకు ఇలా ఉపదేశించి ఆ జగన్మాత విష్ణుమూర్తితో సంభాషించిం[illegible] మహాలక్ష్మిని బహూకరించింది. నిత్యానపాయినిగా వక్షఃస్థలం మీద ధరించి గౌరవించమం[illegible] నా శక్తి, క్రీడార్థంగా నీకు ఇస్తున్నాను. ఎప్పుడూ అవమానించకు అని హెచ్చరించింది. ఇది లక్ష్మీనారాయణ యోగం అని చెప్పింది.

మీ ముగ్గురూ మద్గుణసంభవులు. అందరికీ మాన్యులూ పూజ్యులూ అవుతారు. మీలో మీరు కలహించుకోకుండా అవిరోధంగా వర్తించండి. మూఢులు విభేదాలు కల్పిస్తారు. వాళ్ళే నరకానికి పోతారు. శివుడే విష్ణువు. విష్ణువే శివుడు. అలాగే విరించి. భేదం ఉంది అన్నవాడికి నరకమే గతి.

యో హరి స్స శివస్సాక్షాద్యః శివస్స స్వయం హరిః ।
ఏతయోర్భేదమాతిష్ఠన్నరకాయ భవేన్నరః ॥ (6 - 55)

విష్ణూ ! మరొక గుణభేదం ఉంది. విను. నీది అతిముఖ్యమైన సత్త్వగుణం. పరమాత్మ విచింతనకు అనుకూలిస్తుంది. రజస్తమోగుణాలు నీలో అసలు ఉండకపోవు. అప్రధానంగా ఉంటాయి. లక్ష్మీదేవితో విహారాలు చేసేటప్పుడు రజోగుణం ప్రధానమవుతుంది. వాగ్బీజమూ కామబీజమూ



మాయాబీజమూ (ఐం - హ్రీం - క్లీం) అయిన ఒక దివ్యమంత్రాన్ని నీకు ఉపదేశిస్తున్నాను. దీన్ని జపిస్తూ సుఖంగా జీవించు. నీకు మృత్యుభయం లేదు. నీమీద కాలం ఏ ప్రభావమూ చూపించదు. (ముసలితనం రాదని). నా విహారాన్ని ముగించి ఈ విశ్వాన్ని ఉపసంహరించేటప్పుడుమాత్రం మీరు ముగ్గురూ కూడా నాలో లీనమైపోతారు. నీకు ఉపదేశించిన మంత్రం ఉద్గీథసంయుక్తం. శుభప్రదం. మోక్షప్రదం. అనుక్షణం జపించు. వెళ్ళు. వైకుంఠం నిర్మించుకుని నివసించు. సనాతనినైన నన్ను ధ్యానిస్తూ స్వేచ్ఛగా విహరించు.

నారదా ! త్రిగుణాత్మక ప్రకృతి ఆ మహాదేవి విష్ణుమూర్తితో సంభాషించి శివుడివైపు తిరిగింది. అమృతోపమంగా మాట్లాడింది.

హరా ! ఇదిగో గౌరి. మనోహర. మహాకాళి. ఈమెను స్వీకరించు. కైలాస శిఖరం నివాసంగా చేసుకుని హాయిగా విహరించు. నీకు తమోగుణం ప్రధానంగా ఉంటుంది. సత్త్వరజోగుణాలు అప్రధానంగా ఉంటాయి. రాక్షస వినాశనం చేసేటప్పుడు తమోగుణ రజోగుణ ప్రధానుడవు అవుతావు. నన్ను ధ్యానిస్తూ యోగనిష్ఠలో కూర్చున్నప్పుడు సత్త్వగుణ ప్రధానుడవు అవుతావు. మొత్తంమీద మీ ముగ్గురివీ మూడుగుణాలు. సృష్టి స్థితి లయాలకు అవే కారణాలు. ఈ మూడుగుణాలకూ అతీతమైనది (వస్తువు) ఏదీ ఈ సృష్టిలో లేదు. కనిపించే ప్రతివస్తువులోనూ ఈ గుణత్రయం ఉండితీరుతుంది.

ఏభిర్విహీనం సంసారే వస్తు నైవాత్ర కుత్రచిత్ ।
వస్తుమాత్రం తు యద్దృశ్యం సంసారే త్రిగుణం హి తత్ ॥ (6 - 69)

నిర్గుణమైన వస్తువు సృష్టిలో కనపడదు. భూతకాలంలో లేదు. భవిష్యత్కాలంలో ఉండదు. కంటికి కనపడేది ఏదీ నిర్గుణం కాదు. పరమాత్మ ఒక్కడే నిర్గుణుడు. అతడు కంటికి కనపడడు.

దృశ్యంచ నిర్గుణం లోకే న భూతం నో భవిష్యతి ।
నిర్గుణః పరమాత్మాసౌ న తు దృశ్యః కదాచన ॥ (6 - 70)

శంకరా ! నేను మాత్రం సమయానుకూలంగా సగుణనూ నిర్గుణనూ అవుతూంటాను. ఎల్లవేళలా అహంకారంమాత్రం నేనే. ఎన్నడూ కార్యంమాత్రం కాను. కారణరూపంలో సగుణను. పురుష సన్నిధిలో నిర్గుణను.

అహంకారం మహత్తత్త్వం. శబ్దాదులు గుణాలు. కార్యకారణరూపంలో అహర్నిశమూ సంసారం (ప్రపంచం) సాగుతూ ఉంటుంది. అహంకారమే నేను కనక నేనే కారణం. అహంకారమే నాకు కార్యం. అది త్రిగుణాత్మకం. అది మహత్తత్త్వం. అది బుద్ధి. దానినుంచే తన్మాత్రలు ఉత్పన్నమవుతున్నాయి.



పంచభూతాది సర్వసృష్టి సముద్భవానికీ అవే కారణం. కర్మేంద్రియాలు అయిదు, జ్ఞానేంద్రియాలు అయిదు, మహాభూతాలు అయిదు (పంచభూతాలు), మనస్సు పదహారవది. ఈ పదహారూ కార్యకారణగణం. పరమాత్మ అనబడే ఆదిపురుషుడు కార్యమూ కాదు, కారణమూ కాదు.

శంభూ ! ఇదీ సృష్టిరహస్యం. మీ ముగ్గురికీ సంక్షేపంగా తెలియపరిచాను. ఇదిగో ఈ దివ్య విమానంలో బయలుదేరండి. మీ మీ కార్యాలు నిర్వహించండి. విషమ పరిస్థితి ఏదైనా ఎదురైనప్పుడు నన్ను స్మరించండి. స్మరణమాత్రంచేతనే నేను మీకు దర్శనం అనుగ్రహిస్తాను. అలాగే సనాతనుడైన పరమాత్మనుకూడా తలుచుకోండి. మా ఇద్దరినీ తలుచుకుంటే మీకు కార్యసిద్ధి నిస్సంశయంగా కలుగుతుంది.

నారదా ! ఆ జగదీశ్వరి ఇలా మా ముగ్గురికీ మూడు శక్తులను బహూకరించి (బ్రహ్మ విష్ణు మహేశ్వరులకు సరస్వతీ లక్ష్మీ మహాకాళీ శక్తులను) వీడ్కోలు పలికింది. అక్కడినుంచి కదిలి ఇవతలికి వచ్చేసరికి మళ్ళీ మాకు యథాపూర్వంగా పురుషరూపాలు వచ్చేశాయి. ఆశ్చర్యంగా తనువులు తడుముకొని చూసుకున్నాం. జగన్మాత ప్రభావాన్ని తలుచుకుంటూ దివ్యవిమానం అధిరోహించాం. మరింక ఆ సుధాసింధువుగానీ ఆ శ్వేతద్వీపంగానీ ఆ మహాదేవిగానీ కనిపించలేదు. దేవేరులతో కలిసి మేము ముగ్గురమూ ఉన్న విమానం బయలుదేరింది. వెనకటికి మధుకైటభులను విష్ణుమూర్తి సంహరించిన మహాజలనిధి దగ్గరికి వచ్చింది. నా పద్మాసనం సన్నిధిలో నిలిచింది. ***(అధ్యాయం-6, శ్లోకాలు-85)***

బ్రహ్మదేవుడు ప్రసంగం ముగించాడు. నారదుడికి చాలా సందేహాలు తొలగడంతోపాటు, కొత్త సందేహాలుకూడా చాలా పుట్టకువచ్చాయి. వినయంగా తండ్రిని ప్రశ్నించాడు.

పితామహా ! అవినాశి నిర్గుణుడు అచ్యుతుడు అవ్యయుడు అయిన ఆదిపురుషుణ్ణి గురించి మరిన్ని విశేషాలు తెలుసుకోవాలని ఉంది. దర్శనానుభవం పొందినవాడవు. వివరించి చెప్పు. త్రిగుణాత్మకమైన ఆదిపరాశక్తిని మీరు వీక్షించారు. నిర్గుణ స్వరూపిణి సగుణరూపంలో ఎలా ఉంటుంది ? ఆ పురుషుడు ఎలా ఉంటాడు ? శ్వేతద్వీపంలో నేననగా మిగతా మహర్షులనగా వేలసంవత్సరాలుగా మళ్ళీ మళ్ళీ తపస్సులు చేస్తూనే ఉన్నాం. కానీ ఇంతవరకూ పరమాత్మ దర్శనం మాకు లభించలేదు. మీకు సిద్ధించింది. ఎంతటి మహాభాగ్యమది ! పద్మసంభవా! దయచేసి నా సందేహం తీర్చు. నిర్గుణ - నిర్గుణుడు ఎలా ఉంటారో వివరించు.

చతుర్ముఖుడు నాలుగువైపులా చిరునవ్వులు చిందించాడు. వాత్సల్యం తొణికిసలాడే చూపులతో నారదుణ్ణి కౌగిలించుకున్నాడు. మృదువుగా బదులు పలికాడు.



## ◆ బ్రహ్మకృత గుణతత్త్వ నిరూపణం ◆

నారదమహర్షీ ! నిర్గుణ స్వరూపం కంటికి కనిపించదు. యద్దృశ్యం తన్నశ్యం - కనక అది అరూపం. అందుచేత నిర్గుణా - నిర్గుణులు కేవలం జ్ఞానగమ్యులు. మహామునీశ్వరులకు భావనీయులు. ప్రకృతి పురుషులు అనాదినిధనులని తెలుసుకో. (ఆదీ అంతమూ లేనివారు). విశ్వాసంతో అభిగమ్యులు. అవిశ్వాసంతో ఎవరికీ ఎప్పుడూ అందరు.

**అనాదినిధనౌ విద్ధి సదా ప్రకృతిపూరుషౌ ।**
**విశ్వాసేనాభిగమ్యౌ తౌ నావిశ్వాసేన కర్హిచిత్ ॥ (7 - 11)**

సర్వప్రాణికోటిలోనూ కనిపించే చైతన్యమే ఆదిశక్తి - ఆదిపురుషుల తత్త్వం. అది తేజస్సు. వివిధ రూపాలుగా సర్వత్ర వ్యాపిస్తుంది. అది నిత్యం. ఆ జంటలేని వస్తువు ఈ సంసారంలో లేదు. సర్వప్రాణికోటిలోనూ మిశ్రీభూతులై ఏకరూపులై అవ్యయులై నిర్గుణులై నిర్మలులై చిదాత్మలై ఉంటారు. పరాశక్తియే పరమాత్మ. పరమాత్మయే పరాశక్తి. ఏమీ భేదం లేదు. ఈ సూక్ష్మం ముందు తెలుసుకో.

**యా శక్తిః పరమాత్మాసౌ యోఽసౌ సా పరమా మతా ।**
**అంతరం నైతయోః కోఽపి సూక్ష్మం వేద చ నారద ॥ (7 - 15)**

సర్వశాస్త్రాలనూ అభ్యసించినా సాంగోపాంగంగా సర్వ వేదాలనూ అధ్యయనం చేసినా వైరాగ్యం (విరతి) లేనిదే ఈ సూక్ష్మం ఎవరికీ తెలీదు. ఈ స్థావరజంగమాత్మకమైన విశ్వమంతా అహంకారకృతమే కదా ! అంటే సగుణమే కదా ! మరి నిరహంకారమైన నిర్గుణ తత్త్వాన్ని ఈ సగుణులు కన్నులతో చూడగలగడం సాధ్యమయ్యే పనేనా ! వేల సంవత్సరాలు కాదు కల్పశతాలు ప్రయత్నించినా కుదురుతుందా ? పైత్య ప్రకోపంతో ఉన్న జిహ్వాకు రుచులు తెలిసేనా ! కళ్ళకలకవాడికి చూపు ఆనేనా ?

సగుణమైన చేతస్సు నిర్గుణాన్ని తెలుసుకోలేదు. చేతస్సు అహంకారసముద్భూతం. అది తనంతతాను నిరహంకారం కాజాలదు. ఈ గుణ సంబంధ విచ్ఛేదం జరగనంతవరకూ ఆ దివ్యదర్శనం లభించదు. చిత్తాన్ని నిరహంకారం చేసుకోగలిగినప్పుడు ఆ మహావిరాగులు ఆ దర్శనాన్ని పొందగలుగుతారు.

**యావన్న గుణవిచ్ఛేదస్తావత్తద్దర్శనం కుతః ।**
**తం పశ్యతి తదా చిత్తే యదాహంకార వర్జితః ॥ (7 - 21)**



పితామహా ! రెండు సందేహాలు తీరాయి ! అయితే ఆ నిరహంకార స్థితిని పొందడం ఎలాగ? అహంకారం త్రిగుణాత్మకమన్నావు. ఆ గుణాలు ఏమిటి ? ఒక్కటొక్కటిగా వాటి తత్త్వం తెలియజెప్పు. వాటిని తెగతెంపులు చేసుకోవడం ఎలాగ ? ఆ మార్గం ఉపదేశించు.

నారదా ! గడ్డు ప్రశ్న వేశావు. నీ జిజ్ఞాసకు మెచ్చి వివరిస్తున్నాను. ఆలకించు. సత్త్వరజస్తమోగుణాలు మూడింటికీ మూడు శక్తులున్నాయి. సాత్త్వికానిది జ్ఞానశక్తి. రాజసానిది క్రియాశక్తి. తామసానిది ద్రవ్య (అర్థ) శక్తి.

సాత్త్వికస్య జ్ఞానశక్తిః రాజసస్య క్రియాత్మికా ।
ద్రవ్యశక్తి స్తామసస్య తిస్రశ్చ కథితాస్తవ ॥ (7 - 26)

అవి చేసేపనులు ఏమిటో ఎలా ఉంటాయో తెలుసుకో. తామసమైన ద్రవ్యశక్తినుంచి శబ్దస్పర్శ రూపరసగంధాలు అనే పంచతన్మాత్రలు సముద్భవిస్తాయి. వీటిలో శబ్దగుణకం ఆకాశం. స్పర్శ గుణం వాయువుది. రూపం అగ్నిది. జలం రసగుణకం. పృథ్విది గంధగుణం. ద్రవ్యశక్తులు ఈ పదింటికీ తామససర్గమనిపేరు.

రాజసమైన క్రియాశక్తి నుంచి శ్రోత్రత్వగ్రసనాచక్షురాఘ్రాణాలు అయిదు ఇంద్రియాలు ఆవిర్భవిస్తాయి. ఇవి జ్ఞానేంద్రియాలు. కర్మేంద్రియాలు మరొక అయిదున్నాయి. వాక్పాణి పాదపాయుగుహ్యాలు. ఇవికాక ప్రాణాపానవ్యానసమానోదాన వాయువులు అయిదున్నాయి. ఈ పదిహేనింటికీ రాజససర్గమని పేరు. క్రియాశక్తిమయాలైన ఇవ్వి సాధనాలు. చిదనువృత్తి వీటికి ఉపాదానం. (చిత్ - జ్ఞానశక్తి)

సాత్త్వికమైన జ్ఞానశక్తినుంచి దిక్కులు వాయువు సూర్యుడు వరుణుడు అశ్వినులూ ఆవిర్భవించారు. వీరు జ్ఞానేంద్రియాలకు అధిష్ఠాన దేవతలు. బుద్ధి మొదలైన అంతఃకరణ చతుష్టయానికి చంద్రుడు, బ్రహ్మ, రుద్రుడు, క్షేత్రజ్ఞుడు అనే నలుగురూ అధిదేవతలు. వీరే కీలాధిష్ఠాతృదేవతలు. మనస్సుతో కలిపి ఇవి మొత్తం . దిహేను. ఇది సాత్త్వికసర్గం.

పరమాత్మకు స్థూలసూక్ష్మభేదాలు రెండు ఉన్నాయి. జ్ఞానరూపం మాత్రం నిరాకారమే. సాధకుడి ధ్యానాదులకు ఉపకరించేది స్థూలరూపం. లేదా ధ్యానాదులకు సాధకం స్థూలరూపం.

పైని పేర్కొన్న తామసరాజస సర్గాల సంసర్గంతో స్థూల శరీరం ఏర్పడుతుంది. అంటే పంచతన్మాత్రలూ దశేంద్రియాలూ (5 + 5) పంచప్రాణాల సంసర్గం. దీనినే పంచీకరణం అంటారు. అది తెలిస్తే భూతసముద్భవ తత్త్వమంతా నీకు బోధపడుతుంది.



శ్లిష్టమైయున్న పంచభూతాలనూ విడదీసి ముందుగా రసతన్మాత్రను స్వీకరించి అది జలం అయ్యేట్టు మనసులో (సం) కల్పించాలి. ప్రథమం రసతన్మాత్రాముపాదాయ మనస్యపి కల్పయేచ్చ తథాతద్వై యథా భవతి చోదకమ్( 7 - 44).

అందులో విడివిడిగా మిగతా భూతాల అంశాలను కలిపి (మనస్సునూ) చైతన్యాన్ని అమిరిస్తే - "నేను" అవుతాను. స్థూలశరీరం. భూత తన్మాత్రల యోగం వల్ల ఇలా బ్రహ్మాండం ఏర్పడింది. ఇందులో విశేషాదరం అభిమానం ఉండటం చేత ఆదినారాయణుడు భగవానుడయ్యాడు. భూతాంశలు అన్నీ ఇలా కలిసి ఘనీభవించి వాటి వాటి గుణాలతో దేనికదిగా వృద్ధిపొందుతాయి.

బిడ్డా! ఇంకా విశేషాలు చెబుతాను విను. ఆకాశం కేవల శబ్దగుణకం. వాయువుకి శబ్ద స్పర్శలు రెండూ ఉన్నాయి. అగ్నికి శబ్దస్పర్శరూపాలున్నాయి. జలానికి శబ్దస్పర్శరూపరసాలున్నాయి. పృథివికి ఇవి నాలుగూకాక గంధంతో కలిపి అయిదుగుణాలూ ఉన్నాయి. స్థూలరూపంగా (శరీర) బ్రహ్మాండోత్పత్తి వీటితో (ఈ అంశల కలయికతో) ఇలా జరుగుతుంది. అంశభేదాలు కారణంగా 84 లక్షల జీవ జాతులు ఏర్పడ్డాయి. దీనిని మొత్తం కలిపి 'సర్గము' అంటారు. ***(అధ్యాయం -7, శ్లోకాలు- 52)***

నారదా! నీ ప్రశ్నలలో చాలామటుకు సమాధానాలు చెప్పాను. సందేహాలు చాలావరకూ తీరి ఉండాలి. ఇంక గుణాల రూపసంస్థను వివరిస్తున్నాను. తెలుసుకో. సత్త్వమనేది ప్రీత్యాత్మకం. సుఖాలనుంచి ప్రీతి జనిస్తుంది. దీనిని (సత్త్వ) సాత్త్విక ప్రీతి అంటారు. ఋజుత్వం, సత్యం, శౌచం, శ్రద్ధ, క్షమ, ధృతి, దయ, లజ్జ, శాంతి, సంతోషం - వీటివల్ల సత్త్వప్రతీతి జరుగుతుంది. అది నిశ్చలంగా ఉంటుంది. ధర్మంపట్ల ప్రీతిని కలిగిస్తూ మంచిపట్ల శ్రద్ధను పెంపొందిస్తూ అశ్రద్ధను నిత్యమూ నివారిస్తూ ఉండటం సాత్త్వికశ్రద్ధ లక్షణం. దీని రంగు తెలుపు.

తత్త్వాన్ని తెలుసుకున్న మునులు శ్రద్ధనుకూడా మూడు రకాల విభజించారు. రాజసిక శ్రద్ధ రక్తవర్ణంలో (ఎరుపు) ఉంటుంది. ఇది అద్భుతావహం. అప్రీతికరం. అప్రీతి అనేది దుఃఖయోగంవల్ల జనిస్తుంది. ద్వేషం, ద్రోహం, మాత్సర్యం, స్తంభం (అలసత్వం), ఉత్కంఠ-నిద్ర - ఇత్యాదులవల్ల రాజస ప్రతీతి జరుగుతుంది. మానమూ మదమూ గర్వమూ ఇవన్నీ దాని లక్షణాలు.

రక్తవర్ణం రజః ప్రోక్తమప్రీతికరమద్భుతమ్ ।
అప్రీతిర్దుఃఖయోగత్వాద్భవత్యేవ సునిశ్చితా ॥ ( 8 - 6)

ఇంక మూడవది తామసిక శ్రద్ధ ఎలా ఉంటుందంటే - దానిరంగు నల్లటి నలుపు. మోహాన్నీ విషాదాన్నీ కలిగిస్తుంది. అలసత్వం, అజ్ఞానం, నిద్ర, దైన్యం, భయం, వివాదశీలం, కార్పణ్యం, కుటిలత్వం,



రోషం, వైషమ్యం, అతినాస్తిక్యం, పరదోషాను దర్శనం - వీటివల్ల తామస ప్రతీతి జరుగుతుంది. పరులకు తాపాన్ని కలిగించడం దీని ప్రధాన లక్షణం.

ఈ మూడింటిలో సత్త్వాన్ని ప్రకాశింపజెయ్యాలి. రజోగుణాన్ని నియంత్రించాలి. తమోగుణాన్ని సంహరించుకోవాలి. ఇది శుభంకోరుకునే వారు తప్పకుండా చెయ్యాలి.

సత్త్వం ప్రకాశితవ్యం నియంతవ్యం రజస్సదా !
సంహర్తవ్యం తమః కామం జనేన శుభమిచ్ఛతా ॥ (8 - 12)

## ◆ గుణత్రయ సాంగత్యం ◆

ఈ గుణాలు ఒకదానితో ఒకటి కలహిస్తూంటాయి. ఒకదానిని ఒకటి ఆశ్రయించి ఉంటాయి. ఇవి నిరాశ్రయాలు కావు. కేవల సత్త్వం, కేవల రజస్సు, కేవల తమస్సు ఎక్కడా ఉండవు. ఎప్పుడూ కలిసే ఉంటాయి. అందుకే అన్యోన్యాశ్రయాలు అనడం.

జ్ఞాతమైన పనిపట్ల శ్రద్ధ అనేది ఫలానుభూతి లభించేంతవరకూ ఉంటేనే అది పరిజ్ఞాతం అవుతుంది. లేకపోతే నిష్ఫలం. ఏదీ విన్నంతమాత్రాన చూసినంత మాత్రాన పరిజ్ఞాతం కాదు. అనుభూతం కావాలి. ఎలాగంటే - తీర్థక్షేత్రాల గురించి ఎవరో చెప్పగా విని రాజసమైన కోరికపుట్టి ఒకడు ఆ యా తీర్థాలను సందర్శించి స్నానాదులుచేసి అక్కడ మహాదానాలు ఆచరిస్తాడు. కొంతకాలం అక్కడే నివసిస్తాడు. అటుపైని తిరిగి ఇంటికి వస్తాడు. మళ్ళీ మామూలే. తన రాగద్వేషాలూ కామక్రోధాలూ యథాపూర్వంగా ప్రారంభం అవుతాయి. వట్టి శ్రమ మిగులుతుంది. ఇది రజోగుణ లక్షణం. ఇతడికి శ్రుతం (విన్నది) అనుభూతం కాలేదన్నమాట. తీర్థసేవనకు ఫలం నిష్కల్మషత్వం. అలాంటి ఫలం అతడికి దక్కలేదు. రాగద్వేషాదులను వదిలించుకోవాలి. అది జరగనంతకాలమూ ఎన్ని తీర్థాలు సేవించినా నిష్కల్మషత్వం రాదు. కర్షకుడు నేలదున్నడం దగ్గరనుంచి పంట పండేవరకూ అన్ని జాగ్రత్తలూ తీసుకుని హేమంతంలో కోతకు వచ్చే సమయానికి అశ్రద్ధ చేస్తే పంట అంతా క్రిమికీటక మృగ పక్షి జాతులకు స్వాహా అయిపోతుంది. రైతుకి ఫలం దక్కదు. పుట్టెడు దుఃఖం మిగులుతుంది. అలాగే అనుభూతి పర్యంతం శ్రద్ధ వహించకపోతే రాగద్వేషాలను ఎప్పటికప్పుడు జాగరూకుడై నిరోధించుకోలేకపోతే సాధకుడికి సత్త్వానుభూతి కలగదు.

శాస్త్రదర్శనాదులవల్ల సత్త్వగుణం వృద్ధిపొంది వైరాగ్య భావాన్ని (సత్త్వం) కలిగిస్తుంది. ఇది తమోరజోగుణాల సాంగత్యంవల్ల నిత్యమూ పరాభవాలు అనుభవిస్తూ ఉంటుంది. నిరంతరఘర్షణ. సత్త్వగుణాన్ని జాగ్రత్తగా కాపాడుకుంటూ ఉండాలి. అది సముత్కటంగా పెరిగినప్పుడు వైరాగ్యం



ఆవిర్భవిస్తుంది. బుద్ధి ధర్మమార్గాన్ని అనుసరిస్తుంది. తమోరజోగుణాలను జయించగలుగుతుంది. బాహ్యార్థాలను వాంఛించక యజ్ఞయాగాలపట్ల ఆసక్తమవుతుంది. యథాలాభ సంతుష్టి (అనాయాసంగా లభించిన దానితో తృప్తిపడటం) ఏర్పడుతుంది. సాత్త్వికభోగాలను మాత్రమే కోరుకొంటుంది. రాజసిక భోగాలను తిరస్కరిస్తుంది. తామసిక భోగాల సంగతి ఇక చెప్పాలా ?

ఇలా ముందుగా రజోగుణాన్ని నియంత్రించాలి. తరవాత తమోగుణాన్ని అంతమొందించాలి. అప్పుడు సత్త్వం నిలుస్తుంది. అలాకాక రజోగుణం పెరిగితే - అధర్మాలలో శ్రద్ధ కలుగుతుంది. సనాతన ధర్మాన్ని వదిలెయ్యడం సంభవిస్తుంది. తమోగుణం పెరిగితే - వేదశాస్త్రాలపట్ల విశ్వాసం నశిస్తుంది. దుష్కర్మలతో (అక్రమ పద్ధతులతో) ధనం సంపాదించాలనే ఆరాటం బయలుదేరుతుంది. శాంతి నశిస్తుంది. క్రమక్రమంగా సత్త్వరజోగుణాలు అడుగంటిపోతాయి. కామచోరభావాలు రాజ్యమేలతాయి.

ఈ గుణాలు ఒంటరిగా ఉండవనీ అన్యోన్యాశ్రితాలనీ చెప్పానుగా !ఇవి అన్యోన్య ప్రసవధర్ములు. ఒక్కొక్కప్పుడు సత్త్వగుణమే రజస్తమోగుణాలను పుట్టిస్తుంది. ఇంకొకప్పుడు రజోగుణం సత్త్వతమోగుణాలను కలిగిస్తుంది. అలాగే కొన్ని సందర్భాలలో తమోగుణం మిగతా రెండింటికీ జన్మనిస్తుంది. ఇలాగ ఇవి ఒకదానికొకటి కారణాలు అవుతుంటాయి. మట్టి అనేది కుండ తయారీకి కారణమైనట్టే ఇదీను. లోకంలో స్త్రీ పురుషులు ఎలాగ జంటలు కడుతున్నారో అలాగే బుద్ధిస్థాలైన ఈ గుణాలుకూడా మిథునాలు అవుతుంటాయి. సత్త్వగుణం రజోగుణంతోగానీ తమోగుణంతోగానీ చెయ్యికలపవచ్చు. అలాగే రజోగుణం మిగతా రెండింటిలో ఒకదానితో జంట కట్టవచ్చు. తమోగుణం కూడా అలాగే జతపడవచ్చు. జతపడినవి రెండూ మూడవదాన్ని మింగేసే ప్రయత్నం చేస్తాయి. పరస్పరం ప్రబోధించుకుంటూ ఉంటాయి.

***( అధ్యాయం -8, శ్లోకాలు -51 )***

నారదా ! ఈ గుణత్రయ సాంగత్యం చాలా విచిత్రంగా ఉంటుంది. నాకూ పూర్తిగా తెలియదుగానీ తెలిసినంతవరకూ చెబుతాను, ఆలకించు. కేవల సత్త్వగుణం తనంతతానుగా ఎక్కడా ఉండదు. రజస్తమో గుణాలకు ఊడిగం చెయ్యదు. పరమపతివ్రత సవతికి సేవ చేస్తుందా ? నిర్మలంగా ఉన్న నైజగుణాన్ని రజస్తమోగుణాలు మురికి చేస్తాయి. వాటి మురికిని ప్రయత్నపూర్వకంగా (సాధనతో) నైజగుణం కనక వదిలించుకోగలిగితే సత్త్వగుణం ప్రవేశిస్తుంది. అప్పుడు సవతులు ఏడ్చినట్టుగా రజస్తమోగుణాలు కుళ్ళుకుంటాయి. (అవకాశంకోసం పొంచి ఉంటాయి) ఇది సహజం. లోకంలో చూడు - భార్య సేవలకు భర్త సంతోషిస్తాడు. సవతులు దుఃఖిస్తారు. రాజభటుల్ని చూసి సజ్జనులు సంతోషిస్తే, దుర్జనులు బెంబేలెత్తుతారు. కుండపోతగా వానకురిసిందని రైతు సంబరపడుతుంటే, ఇంటి పైకప్పులేని పూరి గుడిసెవాడు తిట్టుకుంటాడు. స్వభావస్థమైన గుణాలు అవస్థాభేదాలను బట్టి ఇలా సుఖదుఃఖాలను కలిగిస్తూ ఉంటాయి.



నారదా ! ఈ యీ గుణాలను పోల్చుకోవడానికి గుర్తులు చెబుతాను. గమనించు. లఘుప్రకాశత్వం, నిర్మలత్వం, విశదత్వం - ఇవి సత్త్వగుణ సంకేతాలు. దేనినైనాసరే తేలిగ్గా చూడటం, తేలిగ్గా లేవడం, తేలిగ్గా పోవడం, మనసు ఎప్పుడూ నిర్మలంగా ఉండటం - సత్త్వగుణ సమృద్ధికి నిదర్శనాలు. అలా కాక శరీరంలో జృంభాస్తంభ తంద్రాచంచలత్వాలు కనిపిస్తే అవి రజోగుణానికి కొండగుర్తులు. కలిని వెతుక్కుంటూ వెళ్ళడం, చిత్తచాంచల్యం, దుష్టులతో స్నేహం, బరువుపెరగడం, వివాదాలకు కాలుదువ్వడం ఇవి తమోగుణానికి చిహ్నాలు. ఇంద్రియాలూ మనస్సూ శూన్యం అయిపోతాయి. నిద్రను కోరనే కోరడు.

బ్రహ్మదేవుడు ఇంతగా విడమరచి గుణాల లక్షణాలను విశదీకరిస్తే నారదుడు శ్రద్ధగా ఆలకించి లబ్ధిపొందాడు. మరొక సందేహం పొటమరించింది. వినయంగా ప్రశ్నించాడు.

పితామహా ! విభిన్న లక్షణాలు కలిగిన ఈ గుణాలు ఒకేచోట ఎలా నిలుస్తున్నాయి? శాశ్వతంగా కలిసి ఎలా పనిచేస్తున్నాయి? నిజానికి ఇవి పరస్పర శత్రువులు కదా !

పుత్రా ! ఈ గుణాలు దీపాలవంటివి. వత్తి - నూనె - మంట - ఇవి పరస్పర విరుద్ధాలే అయినా దీపం వస్తుదర్శనం చెయ్యడం లేదూ. తైలానికి వత్తితోనూ అగ్నితోనూ వైరుధ్యమే. అలాగే అగ్నికీ వత్తికీ మిగతా రెండూ శత్రువులే. అయినా కలిసి ఉంటున్నాయి, వెలుగుతున్నాయి. పదార్థాలను ప్రదర్శిస్తున్నాయి. ఇలాగే గుణాలూ వాటి కలయికా ప్రకృతి సిద్ధాలు - అని బ్రహ్మదేవుడు నారదుడికి చెప్పాడు. ఇదంతా జ్ఞాపకం ఉంచుకుని నారదుడు వ్యాసుడికి చెప్పాడు. ఇప్పుడు వ్యాసుడు జనమేజయుడికి చెబుతున్నాడు.

జనమేజయా ! ప్రకృతిసిద్ధమైన ఈ మూడు గుణాలే విశ్వప్రాదుర్భావానికి కారణాలు. నారదుడు తన తండ్రినుంచి తెలుసుకుని నాకు చెప్పిన సంగతి ఇది. సవిస్తరంగా యథాతథంగా నీకు తెలియపరిచాను. కనక గుణలక్షణ విభాగం తెలుసుకోవడం ముఖ్యం. దీనికంతటికీ కారణమై సర్వవ్యాపకతా లక్షణంతో విరాజిల్లే శక్తిని ఆరాధించడం అన్నిటికన్నా ముఖ్యం. సగుణ నిర్గుణ కార్యభేదాలన్నీ శక్తి ప్రభావ సంజాతాలే. నిరీహుడూ, పూర్ణుడూ, పరముడూ, అవ్యయుడూ అయిన పురుషుడు అకర్త. సదసదాత్మకమైన ఈ విశ్వాన్ని మహామాయయే సృష్టిస్తోంది.

> అకర్తా పురుషః పూర్ణో నిరీహః పరమోఽవ్యయః ।
> కరోత్యేషా మహామాయా విశ్వం సదసదాత్మకమ్ ॥ (9 - 35)

త్రిమూర్తులు కానీ, అష్టదిక్పాలకులు కానీ, అష్ట వసువులు కానీ, సూర్యచంద్రులు కానీ, అశ్వినీ దేవతలు కానీ, షడానన గజాననులు కానీ - శక్తి సంయుతులు అయినప్పుడే తమ తమ విధులను చెయ్యగలుగుతున్నారు. లేనప్పుడు కదలడానికి కూడా అశక్తులు.



సర్వే శక్తియుతాః శక్తాః కర్తుం కార్యాణి స్వాని చ ।
అన్యథా తేఽప్యశక్తా వై ప్రస్పందితు మనీశ్వరాః ।                (9 - 37)

మహారాజా ! జగత్కారణమైన పరమేశ్వరిని ఆరాధించు. దేవీయజ్ఞం నిర్వహించు. మహాకాళీ మహాలక్ష్మీ మహాసారస్వతీ రూపాల్లో జగత్కారణ కారణమైన ఆదిపరాశక్తి సర్వకామద. శాంత. సుఖసేవ్య. దయాన్విత. నామాన్ని జపిస్తే చాలు. వాంఛితార్థాలు సిద్ధింపజేస్తుంది. పూర్వకాలంలో త్రిమూర్తులే అర్చించారు. జితాత్ములైన తాపసులు మోక్షకాములై ఎప్పుడూ ఆరాధిస్తూ ఉంటారు. దేవీ నామ బీజాక్షరాలను అస్పష్టంగా అనుద్దిష్టంగా ఉచ్చరించినా చాలు ఫలితం ఉంటుంది. ఏ పులికో పుట్రకో భయపడి ఐఐ అన్నా అవి బిందురహిత బీజాక్షరాలై ఆ వ్యక్తికి అభీష్టం నెరవేరుస్తాయి. సత్యవ్రతుడే దీనికి ప్రత్యక్ష నిదర్శనం. మునీశ్వరుల గోష్ఠులలో ఇతడి ప్రస్తావన తరచుగా వస్తూంటుంది. అతడి వృత్తాంతం సవిస్తరంగా చెబుతాను. విను.

## ◆ సత్యవ్రత వృత్తాంతం ◆

వెనకటికి సత్యవ్రతుడని ఒక బ్రాహ్మణుడున్నాడు. వట్టి నిరక్షరకుక్షి. పొట్టచించి చూసినా అక్షరం ముక్కలేదు. పైగా పరమ మూర్ఖుడు. అతడు ఒకరోజున ఒక అక్షరం నేర్చుకున్నాడు. బాణం దెబ్బతిన్న పంది భీకరంగా ఐఐ అని అరుస్తోంటే విని ఆ ధ్వని సంపుటిని అభ్యసించాడు. ఇక నిరంతరం అదే ఉచ్చారణ. లక్షలూ కోటులూగా ఉచ్చారణ సాగింది. ఇది బిందురహితమైన బీజాక్షరం. దయామయి జగన్మాత సంతోషించింది. అతణ్ణి కవిరాజును చేసింది.                *(అధ్యాయం -9, శ్లోకాలు - 48)*

సత్యవ్రతుడి ప్రస్తావనతో జనమేజయుడిలో ఉత్కంఠ రేకెత్తింది. ఈ సత్యవ్రతుడు ఎవరు, ఏ దేశంవాడు, తల్లిదండ్రులెవరు, ఆ శబ్దం ఎలా విన్నాడు, ఎలా ఉచ్చరించాడు, ఎటువంటి సిద్ధి కలిగింది, అమ్మవారు ఎలా సంతోషించింది ? - ఈ మనోహరమైన కథను దయచేసి సవిస్తరంగా చెప్పమని వ్యాసుణ్ణి అభ్యర్థించాడు.

శౌనకాది మహామునులారా ! ఇప్పుడు మీరు నన్ను అడుగుతున్నట్టే, అప్పుడు జనమేజయుడు వ్యాస మహర్షిని అడిగాడు. మా గురువుగారు సవిస్తరంగా ఆ రసవద్గాథను అతడికి వివరించారు. మృదువుగా, జనమేజయా - అని ప్రారంభించారు.

ఒకప్పుడు నేను శుచిగా తీర్థయాత్రలు చేస్తూ, పరమపావనమైన నైమిశారణ్యం చేరుకున్నాను. అక్కడున్న మహా మునీశ్వరులను దర్శించాను. వారంతా జీవన్ముక్తులు. తపోవ్రత నియమాలతో దీక్షగా జీవితాలు గడుపుతున్నవారు. నా రాక వారికి ఎంతో ఆనందాన్ని కలిగించింది. కుశలప్రశ్నాదికం అయ్యాక



పారమార్థిక గోష్ఠి జరుగుతోంది. మహర్షి జమదగ్ని యథాలాపంగా ఒక సందేహం వెలిబుచ్చాడు. పెద్దలు మీరంతా ఉన్నారుగా, తీరుస్తారనీ అంటూ ప్రారంభించాడు -

మహర్షులారా ! త్రిమూర్తులూ అష్టదిక్పాలకులూ అశ్వినీదేవతలూ సూర్యచంద్రులూ షడానన గజాననులూ - ఇంకా చాలామంది దేవతలు ఉన్నారు గదా ! వీరిలో అత్యంతారాధనీయుడు ఎవరు ? సుఖంగా సేవించి వాంఛితార్థాలను పొందాలంటే, తేలికగా సంతోషించి (ఆశు సంతోష) అనుగ్రహించేవారు కావాలి కదా ! అతడెవరా అనేది నా సందేహం. మీరంతా ఆలోచించి నాకు విషయం తేల్చిచెప్పండి - అని కోరాడు. అప్పుడు లోమశుడు కల్పించుకొని సమాధానం చెప్పాడు.

జమదగ్నీ ! నీ ప్రశ్నకు సమాధానం నేను చెబుతాను. అదేమంత గడ్డు సమస్యకాదు. శుభాలు పొందాలని కోరుకునేవారందరికీ అత్యంతారాధనీయురాలు ఆదిపరాశక్తి మాత్రమే. ఆద్యపరాప్రకృతి. సర్వగ (అంతటా వ్యాపించేది), సర్వద. (అన్నీ ఇచ్చేది). శివ (శుభస్వరూపిణి).

**దేవానాం జననీ సైవ బ్రహ్మాదీనాం మహాత్మనామ్ ।**
**ఆది ప్రకృతిర్మూలం సా సంసారపాదపస్య వై ॥ (10 - 15)**

త్రిమూర్తులకే కాదు సకలదేవతలకూ కన్నతల్లి ఆదిపరాశక్తియే. సంసారవృక్షానికి (సంసారం = విశ్వం) ఆదిప్రకృతియే మూలం. ఆవిడ నువ్వన్నట్టు సుఖసేవ్య. ఆశు సంతోష. తలుచుకున్నా ఉచ్చరించినా చాలు వాంఛితార్థాలను వెంటనే అనుగ్రహిస్తుంది. దయార్ద్రచిత్తంతో, ఎప్పుడూ వరదానానికి సిద్ధమా అన్నట్టు ఉంటుంది. ఇది నేననడం కాదు. దీనికి సాక్ష్యం ఉంది. ప్రత్యక్షంగా జరిగిన సంఘటన (ఇతిహాసం) ఉంది. నామాక్షరాన్ని (పరాకుగా) ఉచ్చరించినంతమాత్రాననే వాంచితార్థ సిద్ధిని పొందిన ఒక ద్విజాడి వృత్తాంతం - నాకు తెలిసిందీ నేను ఎరిగిందీ, ప్రత్యక్షంగా జరిగిందీ - చెబుతున్నాను, వినండి.

కోసలదేశంలో దేవదత్తుడని ఒక విప్రుడున్నాడు. బహుశ్రుతుడు. వేదవేదాంతవేత్త. అయితే అతడికి సంతానం లేదు. అందుకోసమని విధిపూర్వకంగా ఒక ఇష్టిని (పుత్రకామేష్టి - యాగం) చేశాడు. తమసా నదీతీరంలో మండపం నిర్మించి యాజ్ఞికులను ఆహ్వానించి, అగ్నిని స్థాపించి, పుత్రకామేష్టిని యథావిధిగా శ్రద్ధాభక్తులతో నిర్వహించాడు. సుహోత్రుడు బ్రహ్మగా, యాజ్ఞవల్క్యుడు అధ్వర్యుడుగా, బృహస్పతి అనే మహర్షి హోతగా, పైలుడు ప్రస్తోతగా, గోభిలుడు ఉద్గాతగా తక్కిన మహామునులంతా సభ్యులుగా ఆ యజ్ఞం సాగింది. అందరికీ భూరి దక్షిణలు అందాయి. ఉద్గాతగా ఉన్న గోభిలుడు సామవేదంలో దిట్ట. యజ్ఞ పరిసమాప్తిలో సప్తస్వర సమన్వితంగా రథంతరాన్ని (సామవేదమంత్రం) గానం చేశాడు. ఆ సందర్భాన, మాటిమాటికీ శ్వాస ఎగబీల్చడంలో ఒకచోట పొరపాటున స్వరభంగం అయ్యింది. యజమానుడైన దేవదత్తుడికి కోపం వచ్చింది.



కామ్యకర్మగా పుత్రార్థినై యజ్ఞం చేస్తూంటే, మునిముఖ్యుడవయ్యుండీ స్వరభంగం చేశావు మూర్ఖుడా ! అని నిందించాడు. గోభిలుడికీ కోపం వచ్చింది. మాటలురాని మూర్ఖుడే పుడతాడు - పో (మూర్ఖస్తే భవితా పుత్రః శఠః శబ్ద వివర్జితః, 10 - 26) అని శపించాడు. శ్వాసను నియంత్రించడం, దీర్ఘంగా గుక్కపట్టడం, అన్నివేళలా అంత తేలికైన పనికాదు. ఈమాత్రం గ్రహించలేకపోయావు. తెలిసీ నిగ్రహించుకోలేకపోయావు. స్వరభంగం అయ్యిందీ అంటే, అది నేను కావాలని చేసిన పొరపాటా? కాదు. అనవసరంగా నిందించి ఆగ్రహం తెప్పించావు - అంటూ గోభిలుడు మధనపడ్డాడు.

శాపం విన్న దేవదత్తుడు గడగడలాడాడు. యజ్ఞమంతా నిష్ఫలమైపోయిందని గోడుగోడున విలపించాడు. గోభిలుడి కాళ్ళమీద పడ్డాడు.

విప్రేంద్రా ! ఇది అన్యాయం. నేను ఏ పాపం చేశానని ఇంత శాపం ఇచ్చావు? నీవంటి పెద్దలకూ మహర్షులకూ ఇంతటి క్రోధం తగునా ? కోపం పట్టలేక, యజ్ఞం నిష్ఫలమవుతుందేమోనన్న భయంతో మాట తూలానే అనుకో, ఆ చిన్న పొరపాటుకి శపించడం భావ్యమేనా ? కొడుకులు లేరే అని అసలే కుమిలిపోతున్న నాకు, మరింత దుఃఖాన్ని తెచ్చిపెట్టావు. మూర్ఖ పుత్రుడికంటే అపుత్రత్వం నయం అంటారు వేదవిదులు. అదీ కాక బ్రాహ్మణుడు మూర్ఖుడైతే అందరికీ నింద్యుడే. వాడి బతుకు పశువుకన్నా హీనం.

మూర్ఖపుత్రాదపుత్రత్వం వరం వేదవిదో విదుః ।
తథాపి బ్రాహ్మణో మూర్ఖః సర్వేషాం నింద్య ఏవ హి ॥ **(10 - 31)**

ద్విజోత్తమా ! మూర్ఖ పుత్రుడితో ఏం చేసుకోను ? పూజార్హుడు కాడు. దానార్హుడు కాడు. నిత్య నైమిత్తిక కర్మలు వేటికీ పనికిరాడు. వేదాధ్యయనానికి అసలే పనికిరాడు. మాటకూడా ఉండదన్నావుగా. వేదాధ్యయనానికి అర్హుడుకాని విప్రుడు దేశంలో ఉండటం రాజుకూ క్షేమం కాదు. దేవకార్యాలకూ పనికిరాడు. పితృకార్యాలకూ పనికిరాడు. ఏ కూలిపనో చేసుకోవాలి.

అపండితుడికి ఆకలి తీర్చడానికి మించి ఏ దానమూ చెయ్యకూడదనీ, చేస్తే దాత నరకానికి పోతాడనీ కొందరనగా విన్నాను. అటువంటి కొడుకు పుట్టి ఏమి లాభం? అపండితుల్ని పూజించే దేశం దేశమేనా, రాజు రాజేనా ! అలాంటి దేశంలో నిజమైన పండితుడు నివసించకూడదు, నివసించడు.

మూర్ఖా యత్ర సుగర్విష్ఠా దానమాన పరిగ్రహైః ।
తస్మిన్ దేశే న వస్తవ్యం పండితేన కథంచన ॥ **(10 - 41)**



గోభిలా ! మూర్ఖపుత్రవత్త్వం మరణంకంటే ఘోరం. రవ్వంత దయ చూపించు మహానుభావా! శాపాన్ని మళ్ళించి నన్ను ఉద్ధరించే శక్తి సామర్థ్యాలు నీకే ఉన్నాయి. ఇదిగో కాళ్ళు పట్టుకుంటున్నాను. మన్నించు. దయచూడు.

దేవదత్తుడు కన్నీరు పెట్టుకుంటూ దీనంగా ప్రార్థించేసరికి గోభిలుడు పూర్తిగా కరిగిపోయాడు. మహాత్ములు అంతేకదా, క్షణ కోపనులు. పాపాత్ములైతే దీర్ఘకోపనులు. (క్షణకోపాః మహాంతో వై పాపిష్ఠాః కల్పకోపనాః 10 - 47). స్వభావతః - నీళ్ళు చల్లగా ఉంటాయి. వేడి తగిలితే చాలు ఇట్టే వేడెక్కుతాయి. నిప్పుని తొలగిస్తే వెంటనే మళ్ళీ చల్లబడిపోతాయి. సహజగుణం పొందుతాయి.

**జలం స్వభావతః శీతం పావకాతపయోగతః ।**
**ఉష్ణం భవతి తచ్ఛీఘ్నం తద్వినా శిశిరం భవేత్ ॥** **(10 - 48)**

దేవదత్తా ! నీ కొడుకు మూర్ఖుడుగా జన్మించినా అటుపైని విద్వాంసుడవుతాడు. భయపడకు. దుఃఖించకు. నీకు ఆనందాన్ని కలిగిస్తాడు.

గోభిలుడు అనుగ్రహించాడు. ఇష్టి పరిసమాప్తమయ్యింది. బ్రాహ్మణులందరూ వీడ్కోలు తీసుకుని వెళ్ళిపోయారు. కొంత కాలానికి దేవదత్తుడి భార్య రోహిణీదేవి గర్భవతి అయ్యింది. గర్భాధాన పుంసవన సీమంతాదుల నన్నింటినీ శాస్త్రీయంగా జరిపించాడు. ఇష్టి సఫలమయ్యిందని సంతోషించి బ్రాహ్మణులకు భూరిదానాలు ఇచ్చాడు.

ఒక మంచిరోజున శుభముహూర్తంలో రోహిణీ నక్షత్రయుక్త శుభలగ్నంలో రోహిణీదేవి ప్రసవించింది. కుమారుడు జన్మించాడు. జాతకర్మలు నిర్వహించి కొడుకుకి ఉతథ్యుడు అని నామకరణం చేశాడు దేవదత్తుడు. ఎనిమిదవ ఏట ఉపనయనం జరిపించాడు. వేదం నేర్పుదామని ఆరంభించాడు. ఉతథ్యుడు అమాయకంగా తింగరముఖంతో కూర్చున్నాడే తప్ప అక్షరంకూడా పలకలేదు. దేవదత్తుడు చాలా రకాలుగా ప్రయత్నించాడు. కొడుకునోట పలుకులేదు. తండ్రి బహుథా దుఃఖించాడు. పట్టువదలకుండా వేదం వినిపిస్తూనే ఉన్నాడు. నేర్పుతూనే ఉన్నాడు. అబ్బాయికి పన్నెండవయేడు వచ్చింది. సంధ్యావందనమైనా రాలేదు. ఉతథ్యుడు మూర్ఖుడు అనేవార్త లోకమంతటా వ్యాపించింది. అతడు ఎక్కడకు వెడితే అక్కడ పరిహసించింది. కనిపించినప్పుడల్లా ఆట పట్టించింది. దేవదత్తుడి కొడుకు మూర్ఖుడంటూ విరగబడి నవ్వింది. రోహిణీ దేవదత్తులు ఉక్రోషం పట్టలేకపోయారు. కొడుకును తిట్టారు. కొట్టారు. కుంటో గ్రుడ్డో అయినా బాగుండును, మూర్ఖుడివి దాపురించావు మా ప్రాణానికి అని అనుక్షణం విసుక్కున్నారు. చీదరించారు.



బంధుమిత్రులు పరిహసించడమైతే ఎలాగో ఓర్చుకున్నాడు గానీ, ఉతథ్యుడు, తల్లిదండ్రులు కూడా ఆదరించకపోయే సరికి తట్టుకోలేకపోయాడు. ఒంటరివాణ్ణి అనిపించింది. అతడికే తెలియని ఒక వైరాగ్యభావం అలుముకుంది. ఇల్లు వదిలి అడవులకు వెళ్ళిపోయాడు.

నిందితోఽథ జనైః కామం పితృభ్యామథ బాంధవైః ।
వైరాగ్య మగమద్విప్రో జగామ వనమప్యసౌ ॥ (10 - 62)

గంగా తీరంలో ఒక అందమైన కాననం కనిపించింది. అక్కడ ఒక చిన్న పర్ణశాల నిర్మించుకున్నాడు. వన్యవృత్తిని సంకల్పించి స్వీకరించాడు. తమంతతాముగా లభించిన పండూ కాయా తింటూ జీవయాత్ర సాగిస్తున్నాడు. మాట లేకపోవడంతో సత్యవ్రతదీక్ష స్వీకరించినట్టయ్యింది. సడలని బ్రహ్మచర్యం ఉండనే ఉంది. ***(అధ్యాయం - 10, శ్లోకాలు - 65)***

శౌనకాది మహామునులారా! వ్యాసుడు శ్రద్ధగా ఆలకిస్తున్నాడు. లోమశుడు అనంతర కథ కొనసాగించాడు.

ఉతథ్యుడికి ఒక మంత్రం లేదు, ఒక జపం లేదు, గాయత్రి లేదు, సంధ్యావందనం లేదు, పద్మాసనం లేదు, ప్రాణాయామం లేదు, సమిధలు లేవు, హోమాలు లేవు. ఏమీ లేవు. ఉదయాన్నే లేస్తున్నాడు. దంతధావనం చేస్తున్నాడు. అమంత్రకంగా కాకి మునిగినట్టు గంగలో మునుగుతున్నాడు. ఆకలివేసినప్పుడు అప్రయత్నంగా అమిరింది తింటున్నాడు. పర్ణశాలలో కూర్చుంటున్నాడు. ఉలకడూ, పలకడు. పేరడిగితే చెప్పడు. (చెప్పలేడు). చూసినవారు ఇదేదో గొప్ప మౌనతపస్సు అనుకున్నారు. సత్యతపసుడు అని పేరుపెట్టారు. ఎవరికీ ఏ ఇబ్బందీ కలిగించడం లేదు. నిర్భయంగా సంచరిస్తున్నాడు, సుఖంగా నిద్రపోతున్నాడు. ఎప్పుడూ ఒకటే విచారం -

నాకు చావు ఎప్పుడో కదా ! మూర్ఖుడిగా జీవించడం కన్నా మరణమే మేలు. దేవుడే నాకు అన్యాయం చేశాడు. మూర్ఖుడిగా పుట్టించాడు. ఇందులో మరింక ఎవరి దోషమూ లేదు. ఉత్తమజన్మమే ఇచ్చాడు. కానీ నిష్ఫలం చేశాడు. గొడ్డుటావులాగా గొడ్రాలులాగా కాయని చెట్టులాగా నా బతుకు నిష్ప్రయోజనం అయిపోయింది. అయినా దేవుణ్ణి అనుకుని ఏం ప్రయోజనం? నా కర్మ ఇలా ఉంది. పూర్వజన్మలో ఎవరికీ ఒక పుస్తకం ఇచ్చి ఉండను. ఒక పాఠం చెప్పి ఉండను. అందుకనే ఈ జన్మలో ద్విజుడిగా పుట్టి మూర్ఖుణ్ణి అయ్యాను. తీర్థాలు దర్శించి ఉండను. తపస్సులు చేసి ఉండను. సాధువుల్ని సేవించి ఉండను. అందుకే నాకు ఈ శఠజన్మ, తెలివితక్కువవాడిగా పుట్టాను. నాతోటి మునిపుత్రులందరూ వేదశాస్త్ర పారంగతులయ్యారు. నేను ఇలాగే ఉండిపోయాను. ఎంతపాపం చేసుకున్నానో.

పోనీ తపస్సు చేసుకుందామంటే, ఒక మంత్రం రాదు, ఒక తంత్రం రాదు, ఎంత వ్యర్థం. నా బతుకు! ఒక ముక్క అబ్బిఉంటే ఏదైనా సాధించగలిగి ఉండేవాణ్ణి. ఇప్పుడు ఏది దారి ! ఏమి చెయ్యాలి!



ఆఁ అంతా నా భ్రమ గానీ, చదువుంటే మాత్రం అన్నీ సమకూరుతాయా ? దైవం అనుకూలించకపోతే పౌరుషం పనిచేస్తుందా ? శ్రమ ఫలిస్తుందా ? అనుకూలిస్తే పురుషకారంతో పని ఉందా ? దైవ బలమే - బలం. అది ఉంటే అన్నీ ఉన్నట్టే.

దైవమేవ పరం మన్యే ధిక్పౌరుషమనర్థకమ్ ।
వృథా శ్రమకృతం కార్యం దైవాద్భవతి సర్వథా ॥ (11 - 17)
బ్రహ్మా విష్ణుశ్చ రుద్రశ్చ శక్రాద్యాః కిల దేవతాః ।
కాలస్య వశగాస్సర్వే కాలో హి దురతిక్రమః ॥ (11 - 18)

బ్రహ్మ విష్ణుమహేశ్వరులూ ఇంద్రాది దేవతలూ అందరూ దైవస్వరూపమైన కాలానికి వశవర్తులే. కాలాన్ని ఎవ్వడూ తప్పించుకోలేడు. అది బలీయం, అది దురతిక్రమం.

పగలూ రేయీ, మెలకువగా ఉన్నంతసేపూ ఇలాగే రకరకాలుగా వితర్కించుకుంటూ విరక్తుడై శాంతుడై కాలం గడుపుతున్నాడు ఉతథ్యుడు - పావనగంగా తీరాన పర్ణశాలలో ఒంటరిగా. పధ్నాలుగు సంవత్సరాలు సుదీర్ఘంగా గడిచిపోయాయి.

ఒకరోజున ఒక నిషాదుడు క్రూరమృగాలను వేటాడుతూ పర్ణశాలవైపు వచ్చాడు. అతడి ఆకారం క్రూరంగా ఉంది. జంతువులను చంపడంలో మంచి నేర్పరిలాగా ఉన్నాడు. ఎక్కుపెట్టిన ధనుర్బాణాలతో వచ్చాడు. అడవి పందిని తరుముకుంటూ వచ్చాడు. ఒక్క ఉదుటున బాణం విడిచాడు. అది వెళ్ళి పందికి గాఢంగా గుచ్చుకుంది. దాని ప్రాణాలు విలవిలలాడాయి. భయపడిపోయింది. తప్పించుకుని పారిపోయే ప్రయత్నంలో అటూ ఇటూ పరుగులు తీసింది. నెత్తురు ఓడుకుంటూ పర్ణశాలాప్రాంగణంలోకి చొరబడింది. ఉతథ్యుడు చూశాడు ప్రాణాలు కడబట్టిన దాని దయనీయస్థితి. రక్షణకోసం దాని ఆరాటం - గమనించాడు. కరిగిపోయాడు. మనస్సు దయార్ద్రమయ్యింది. కళ్ళలో నీళ్ళు నిండాయి. రోమకూపాలు తనువంతా పొటమరించాయి. సర్వాంగాలలోనూ ఒక జ్వరతీవ్రత వ్యాపించింది. ఒక ఆవేశంలాగా ఒక ఉన్మాదంలాగా ఒక పూనకంలాగా గుండెల్లో దయారసం ఏకోన్ముఖంగా పొంగులువారింది. సారస్వత బీజాక్షరం ఒకటి (ఐ) అప్రయత్నంగా నోటినుంచి వెలువడింది. ఉతథ్యుడు ఆశ్చర్యపోయాడు. ఎప్పుడూ అనని వినని ధ్వని సంపుటి- మాటలేరాని తననోటినుంచే వెలువడటంతో సంభ్రమాశ్చర్యాలకు లోనయ్యాడు. అది ఆనందమో అది దుఃఖమో తెలియలేదు. ఉక్కిరిబిక్కిరి అయ్యాడు. దైవఘటన అనుకున్నాడు. అదే అదే మళ్ళీ మళ్ళీ ఉచ్చరించాడు. జపించాడు. అది సారస్వత బీజాక్షరమని అతనికి తెలియదు. ఒక శోక తన్మయావస్థలో మునిగిపోయాడు.



అజ్ఞాతపూర్వం చ తథా౽శ్రుతం చ దైవాన్ముఖే వై సముపాగతం చ ॥
న జ్ఞాతవాన్ బీజమసౌ విమూఢో మమజ్జ శోకే స మునిర్మహాత్మా ॥

(11 - 27)

ప్రాంగణంలో చొరబడిన పందికి, బయటకుపోయే దారి కనపడలేదు. దట్టంగా ఉన్న ఒక పొదలో దూరి దాక్కొంది. ప్రాణభయం. చప్పుడు చెయ్యకుండా ఊపిరి బిగబట్టి పడుకొంది.

మరుక్షణంలో నిషాదుడు ప్రత్యక్షమయ్యాడు. నల్లటి దేహం. ఎర్రటి కళ్ళు. యమకింకరుడిలా ఉన్నాడు. పందిని వెతుక్కుంటూ వచ్చాడు. మునికి (ఉతథ్యుడికి) నమస్కరించాడు. పంది ఎటుపోయిందో చెప్పమన్నాడు. నా కుటుంబం ఆకలి తీర్చాలి. పోషించాలి. బ్రహ్మదేవుడు నాకు ఈ వృత్తిని జీవనోపాధిగా విధించాడు. నిజం చెబుతున్నాను. నువ్వు కూడా నిజం చెప్పు. నా పంది ఎటుపోయింది ? ఇటే వచ్చింది. నువ్వు చూసే ఉంటావు. దానికి నా బాణం దిగబడింది.

ఉతథ్యుడు వితర్కంలో పడ్డాడు. వీడు ఆకలిమీద ఉన్నాడు. అడుగుతున్నాడు. పొదవైపు చూపించానంటే పందిని చంపేస్తాడు. చూపించకపోయినా తెలీదన్నా అసత్యమవుతుంది. ధర్మసంకటంలో పడ్డానే ఎలాగ అనుకున్నాడు. ఆలోచించాడు. పెద్దలమాటలు ఎప్పుడో విన్నవి జ్ఞాపకం వచ్చాయి. హింసకు దారితీసేట్టయితే అది సత్యమైనా సత్యం కాదు. దయాన్వితంగా అసత్యం చెప్పినా అది అసత్యం కాదు. సత్యమే అవుతుంది. నరులకు ఏది హితమో అదే సత్యం తప్ప మొరకటి కానేకాదు.

సత్యం న సత్యం ఖలు యత్ర హింసా
దయాన్వితం చానృతమేవ సత్యమ్ ।
హితం నరాణాం భవతీహ యేన
తదేవ సత్యం న తథాన్యథైవ ॥ (11 - 36)

కాబట్టి ఇద్దరికీ హితం అయ్యేట్టు అనృతం కానట్టు ఏమి చెప్పాలా, ఎలా చెప్పాలా అని ఉతథ్యుడు మథనపడుతున్నాడు.

నిజమంత్ర బీజాక్షరాన్ని అప్రయత్నంగా ఉచ్చరించడంతో ఆదిపరాశక్తి ఆనందించింది. ఉతథ్యుడిపట్ల అనుగ్రహం చూపించింది. అతడికి అఖిల విద్యలూ స్ఫురించేట్టు చేసింది. వాక్ శక్తిని అనుగ్రహించింది. ఉతథ్యుడు వాల్మీకిలా కవి అయ్యాడు. అతడి నోటినుంచి శ్లోకం వెలువడింది.

యా పశ్యతి న సా బ్రూతే యా బ్రూతే సా న పశ్యతి ।
అహో వ్యాధ స్వకార్యార్థిన్ కిం పృచ్ఛసి పునఃపునః ॥ (11 - 41)



అయ్యో, వ్యాధుడా! ఎందుకయ్యా ఇన్నిసార్లు అడుగుతావు. చూసేది (కన్ను) చెప్పదు. చెప్పేది (నోరు) చూడదు. నేనేం చెయ్యను చెప్పు. వెళ్ళు. వెళ్ళి ఇంకో ప్రయత్నం చేసుకో. ఆకలి తీర్చుకో. ఇంత అరణ్యం ఉంది - అన్నాడు. ఉతథ్యుడు చెప్పిన ఈ సమాధానానికి వ్యాధుడు మారుమాటాడకుండా నిరాశతో నిష్క్రమించాడు.

ఆనాటినుంచీ ఉతథ్యుడు ప్రాచేతసుడిలాగే (వాల్మీకి) మహాకవి అయ్యాడు. సత్యవ్రతుడు అనే పేరుతో జగత్ప్రసిద్ధిని పొందాడు. సారస్వత బీజాక్షరాన్ని నియమపూర్వకంగా జపిస్తూ పండితుడై పేరు పొంది భూమండలమంతటా సన్మానాలు అందుకున్నాడు. తండ్రి స్వయంగా వచ్చి కొడుకుని ఇంటికి తీసుకువెళ్ళాడు.

ప్రతి పర్వదినానా మేమంతా ఇతడి కథను తలచుకుంటూ ఉంటాం. అతడి గొప్పదనాన్ని చెప్పుకుంటూ ఉంటాం.

జనమేజయా ! ఇది ఆనాడు నైమిశంలో లోమశుడు చెప్పగా నేను విన్న ఉతథ్యుడి కథ. కాబట్టి ఆదిపరాశక్తి ఏకైకారాధనీయ. సుఖసేవ్య, ఆశు సంతోష. నామాక్షరాన్ని అనుద్దిష్టంగా ఉచ్చరించినా చాలు వరాలు కురిపిస్తుందంటే, ఇక నియమపూర్వకంగా జపించినవారికీ దేవీయజ్ఞం చేసినవారికీ సకలవాంఛలూ సిద్ధిస్తాయనడంలో ఆశ్చర్యమేముంది ! అనృతమేముంది ! అసలు అందుకేకదా అమ్మవారికి "కామద" (కోరికలను ఇచ్చేది) అనే ప్రసిద్ధి. ఒక్కమాటలో చెప్పాలంటే - ఇవ్వేళ లోకంలో వివిధ భోగాలు అనుభవిస్తూ సుఖపడుతున్న వారంతా దేవిని అర్చించినవారే. కష్టాలపాలై దుఃఖాలు అనుభవిస్తున్నవారంతా అర్చించనివారే. అందుచేత జనమేజయా ! భక్తితో దేవీయజ్ఞం ఆచరించు.

***(అధ్యాయం- 11, శ్లోకాలు - 58)***

## ◆ దేవీయజ్ఞ భేదాలు ◆

శౌనకాది మహామునులారా ! వ్యాసుడి ఉపదేశంతో జనమేజయుడు సంతృప్తి చెందాడు. దేవీయజ్ఞం ఎలా చెయ్యాలో మంత్రాలు ఏమిటో హోమద్రవ్యాలు ఏమిటో ఎందరు బ్రాహ్మణులు కావాలో ఏమి దక్షిణలు ఇవ్వాలో తెలియజెయ్యమనీ, యథాశక్తిగా భక్తి శ్రద్ధలతో చేస్తాననీ అన్నాడు. అప్పుడు వ్యాసుడు దేవీయజ్ఞ విధానం వివరించాడు.

జనమేజయా! దేవీయజ్ఞ విధానం చెబుతున్నాను. తెలుసుకో. సాత్త్విక రాజస తామస భేదాలతో ఈ యజ్ఞం మూడు విధాలు. మునులు సాత్త్వికయజ్ఞం చెయ్యాలి. నీవంటి రాజులు రాజస యజ్ఞం చెయ్యాలి. తామసం కేవలం రాక్షసులకే. జ్ఞానులకూ విముక్తులకూ ఇవియేవీ పట్టవు. సామగ్రీ సంబారాలతో ప్రమేయంలేని అంతర్యజ్ఞం వారిది.



దేశమూ కాలమూ ద్రవ్యమూ మంత్రమూ బ్రాహ్మణులూ శ్రద్ధ - ఇవన్నీ సాత్త్వికంగా ఉంటే దాన్ని సాత్త్వికయజ్ఞం అంటారు. ద్రవ్యశుద్ధి క్రియాశుద్ధి మంత్రశుద్ధి - ఇవి చాలా ముఖ్యం. పూర్ణఫలాన్ని ఇస్తాయి. లేకపోతే యజ్ఞం ఫలించదు. అన్యాయార్జితమైన ద్రవ్యం సుకృతానికి పనికిరాదు. దానివల్ల ఇహలోకంలో కీర్తి రాదు. పరలోకంలో ఫలం దక్కదు. అందుచేత న్యాయార్జితమైన ద్రవ్యాన్నే సుకృతాలకు ఉపయోగించాలి. అప్పుడే యజ్ఞం సర్వాత్మనా ఫలిస్తుంది. దీనికి నీ వంశంలోనే చక్కటి ఉదాహరణ ఉంది.

పాండవులు రాజసూయం చేశారు. సాక్షాత్తు శ్రీకృష్ణుడు స్వయంగా వచ్చి పూజలు అందుకున్నాడు. బ్రాహ్మణులంతా భూరి దక్షిణలతో సంతృప్తి చెందారు. కానీ యజ్ఞం పూర్తయి మూడు నెలలన్నా తిరక్కుండానే పాండవులు అడవులపాలయ్యారు. జూదంలో ఓడిపోయారు. పాండవ ధర్మపత్ని అవమానాలపాలయ్యింది. ఇన్ని కష్టాలు వచ్చాయి. అంటే యజ్ఞఫలం ఏమయినట్టు ? మహాత్ములయ్యిండీ విరాటరాజుకు దాసులయ్యారు. కీచకుడిచేతిలో ద్రౌపది పరాభవం చవిచూసింది. బ్రాహ్మణాశీర్వాదాలు ఏమయిపోయినట్టు ? వాసుదేవుడిపట్ల పాండవులకున్న అనన్య భక్తి ఎక్కడికి పోయింది ? సభలో జుట్టుపట్టుకుని ఈడుస్తోంటే ద్రుపద రాజకుమారిని కాపాడుకోలేకపోయారేమి ? ఈ ధర్మ విపర్యయానికి కారణం ఏమిటి ?

రాసిపెట్టి ఉంది అలా జరిగింది అన్నట్టయితే వేదమంత్రాలు వ్యర్థమైపోవా ? అవి వ్యర్థమైతే మొత్తం వ్యవస్థ అంతా వ్యర్థమవుతుంది. సర్వప్రమాణాలూ వ్యర్థమవుతాయి. సర్వ ఉపాయాలూ వ్యర్థమవుతాయి. అందుచేత జరగవలసింది జరుగుతుంది అనే ఆలోచన బుద్ధిలోకి రాకూడదు. దైవమూ ఉపాయమూ రెండింటినీ అంగీకరించి ఆలోచించాలి.

> **సర్వం ప్రమాణం వ్యర్థం స్యాత్ భవితవ్యే కృతే హృది !**
> **ఉభయం చాపి మంతవ్యం దైవం చోపాయ ఏవ చ ॥ (12 - 21)**
> **కృతే కర్మణి చేత్ప్రిద్ధిర్విపరీతా యదా భవేత్ ।**
> **వైగుణ్యం కల్పనీయం స్యాత్ ప్రాజ్ఞైః పండితమౌళిభిః ॥ (12 - 22)**

ఒక మంచి పని చేసినప్పుడు విపరీతఫలం వస్తే ఆ పనిలో ఎక్కడో ఏదో పొరపాటు జరిగిందని భావించాలి. దానికోసం శోధించాలి. కర్తృభేదమా ? ద్రవ్యభేదమా ? మంత్రభేదమా ? ఈ మూడింటిలో ఏదో ఒకటి జరిగి ఉంటుంది.



ఒకప్పుడు దేవేంద్రుడు రాక్షసవినాశం కోరి యజ్ఞం చేశాడు. దానికి విశ్వరూపుణ్ణి గురువుగా (బ్రహ్మ) వరించాడు. అతడు రాక్షస పక్షంవాడు. బుద్ధిపోనిచ్చుకుంటాడా ! దానవులకూ దేవతలకూ స్వస్తి అగుగాక అంటూ యజ్ఞం ముగించాడు. రాక్షసులంతా వినాశానికి బదులు తల్లి పజ్జన చేరి హాయిగా దినదినాభివృద్ధి చెందుతున్నారు. ఇదేమిటా అని ఇంద్రుడు ఆశ్చర్యపోయాడు. ఎక్కడ పొరపాటు జరిగిందో గ్రహించాడు. ఇది కర్తృభేద దోషం. విశ్వరూపుణ్ణి గురువుగా పెట్టుకోవడంతో యజ్ఞం విపరీతఫలాన్ని ఇచ్చింది. ఇంద్రుడు అలిగి వజ్రాయుధానికి పని చెప్పాడు. విశ్వరూపుడి శిరస్సులు తరిగేశాడు.

ద్రోణుణ్ణి సంహరించే పుత్రుడు కావాలంటూ ద్రుపదుడు యజ్ఞం చేశాడు. ఏ లోపమూ లేకుండా కర్తృద్రవ్యమంత్రశుద్ధితో నిర్వహించాడు. ధృష్టద్యుమ్నుడూ ద్రౌపదీ జన్మించారు. ద్రుపదుడి కోరిక నెరవేరింది. యజ్ఞం సఫలమయ్యింది. అలాగే దశరథమహారాజు పుత్రకామేష్టి నిర్వహించాడు. నలుగురి కొడుకులను పొందాడు. నిర్దుష్టంగా యుక్తియుక్తంగా నిర్వహిస్తే యజ్ఞాలు ఇలా సత్ఫలితాలను ఇస్తాయి. దోషజుష్టంగా చేస్తే విపరీత ఫలితాలను ఇస్తాయి. అందుచేత అత్యంత జాగరూకులై చెయ్యాలి.

పాండవుల యజ్ఞంలో కూడా ఒకపాటి వైగుణ్యం ఉంది. అందుకే విపరీతఫలం వచ్చి కష్టాల పాలయ్యారు. రాజసూయానికి వారు వినియోగించిన ద్రవ్యం న్యాయార్జితం కాదు. రాజుల్ని కొట్టి దోచి తెచ్చిన ధనం అందులో పడింది. అందుకని బెడిసికొట్టింది. లేదా సాభిమానులై (గర్విష్ఠులై) అధికార సంపత్ప్రదర్శనగా చేశారు కనుకనైనా విపరీతఫలం వచ్చి ఉండాలి.

సాత్త్వికయజ్ఞం అత్యంతదుర్లభం. ఇది వైఖానసమునీశ్వరులకు విహితమైన యజ్ఞం. వారు నిత్యమూ సాత్త్వికాహారమే తీసుకుంటుంటారు. నిరంతర తపస్వులు. న్యాయార్జితమూ అరణ్య లబ్ధమూ (వన్యం) అయిన ద్రవ్యాన్ని మాత్రమే ఉపయోగిస్తారు. లేదంటే సంస్కార సంపన్నమైన ఋషి ద్రవ్యం (ఋష్యం) వాడతారు. యూపస్తంభాలతో (పశుబలి) పనిలేకుండా కేవల పురోడాశాన్ని మంత్రపూర్వకంగా హోమం చేస్తారు. యజ్ఞం పట్లా మంత్రం పట్లా శ్రద్ధ ఇంతా అంతా కాదు. ఇలా చేస్తే అవీ - సాత్త్విక మఖాలు. ఉత్తమోత్తమాలు.

రాజసయజ్ఞాలలో ద్రవ్యబాహుళ్యం ఉంటుంది. యూపాలు ఉంటాయి. ఇవి క్షత్రియులకూ వైశ్యులకూ విహితాలు. దానవులకు చెప్పిన తామసమఖాలు సక్రోధాలూ సామర్షాలూను. అవి మదవర్ధకాలు. క్రూరయజ్ఞాలు.

మోక్షకాములైన మహాత్ములకూ మునులకూ విరక్తులకూ చెప్పింది మానసయజ్ఞం. ఇది పూర్ణయజ్ఞం. మిగతా యజ్ఞాలకు శ్రద్ధా ద్రవ్య క్రియా బ్రాహ్మణ దేశకాలాది లోపాలు ఉండవచ్చు. మానసయజ్ఞానికి వాటితో పనిలేదు.



మొట్టమొదట మనస్సును గుణవర్జితంగా (త్రిగుణాలు) శుద్ధి పరుచుకోవాలి. మనస్సు శుచిగా ఉంటే దేహమూ శుచిగా ఉన్నట్టే. ఇంద్రియార్థాలను విడిచిపెట్టడమే మనశ్శుద్ధి. అప్పుడు దానికి యజ్ఞం చేసే అధికారం సిద్ధిస్తుంది. విశాలమైన మంటపాన్ని యాజ్ఞియతరుస్తంభాలతో మనస్సులోనే కల్పించుకోవాలి. అందులో శాస్త్ర సమ్మతమైన కొలతలతో వేదిని నిర్మించుకోవాలి. ఋత్విగ్బ్రాహ్మణ వరణం సమర్చనం అన్నీ మనస్సులోనే, మనస్సుతోనే. ప్రాణాపాన వ్యానసమానోదానాగ్నులను అయిదింటినీ యజ్ఞవేదికలో తత్తన్మంత్రాలతో స్థాపించాలి. వీటిలో ప్రాణము - గార్హపత్యాగ్ని. అపానము - ఆహవనీయాగ్ని. వ్యానము - దక్షిణాగ్ని. సమానము - ఆవసథ్యాగ్ని. ఉదానము - సభ్యాగ్ని. ఇవి పరమోత్కృష్టమైన అగ్నులు.

త్రిగుణ వర్జితమూ శుచిమంతమూ అయిన ద్రవ్యాన్ని మనస్సుతోనే భావించాలి. మనస్సే హోత. మనస్సే యజమానుడు. నిర్గుణ సనాతన పరబ్రహ్మ ఈ యజ్ఞానికి అధిదేవత. బ్రహ్మ విద్యాస్వరూపిణి అఖిలాధార అయిన ఆదిపరాశక్తిని ఉద్దేశించి ఆ ద్రవ్యాన్ని ప్రాణాగ్నిలో హవనం చెయ్యాలి. తరువాత చిత్తాన్నీ ప్రాణాన్నీ నిరాలంబం చేసి కుండలీముఖమార్గంతో శాశ్వత పరబ్రహ్మాన్ని ఉద్దేశించి హవనం చెయ్యాలి. స్వాత్మరూపయైన మహేశ్వరిని స్వానుభూతితో యోగసమాధితో నిరాకులుడై ధ్యానించాలి. సర్వభూతాలలో తననూ, తనలో సర్వభూతాలనూ చూడగలిగితే మహేశ్వరిని చూడగల్గుతాడు.

**సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని ।**
**యదా పశ్యతి భూతాత్మా తదా పశ్యతి తాం శివామ్ ॥ (12 - 55)**

ఆ సచ్చిదానంద స్వరూపిణిని దర్శించినవాడు బ్రహ్మవేత్త అవుతాడు. అతడికి మాయాదికమంతా దగ్ధమై నశించిపోతుంది. ప్రారబ్ధకర్మ మాత్రం శరీరం ఉన్నంతవరకూ ఉంటుంది. అతడు జీవన్ముక్తుడు. పార్థివశరీరాన్ని విడిచిపెట్టిన తక్షణం మోక్షాన్ని పొందుతాడు. ఈ మానస యజ్ఞం ఇచ్చే ఫలం కేవలమోక్షం. అది శాశ్వతం. మిగతాయజ్ఞాలు ఇచ్చే లౌకికాలౌకిక ఫలాలు అశాశ్వతాలు.

అగ్నిష్టోమం అనే యజ్ఞం చేస్తే స్వర్గం వస్తుంది. కానీ పుణ్యం క్షీణించిపోగానే మళ్ళీ మానవలోకంలో జన్మించక తప్పదు.

**రాజన్నేవం కృతో యజ్ఞః మోక్షదో నాత్ర సంశయః ।**
**అన్యే యజ్ఞాస్సకామాస్తు ప్రభవంతి క్షయోన్ముఖాః ॥ (12 - 60)**

నాయనా, జనమేజయా ! జగదంబికను భజించినవాడు అన్నింటా కృతకృత్యుడు అవుతాడు. అందుచేత అన్ని ప్రయత్నాలతోనూ అన్ని విధాలుగానూ శ్రీభువనేశ్వరిని ధ్యానించాలి, వినాలి, జపించాలి. మానసయజ్ఞం రాజులకు కాదన్నానుగా. దాన్ని అలా ఉంచు. ఇప్పటికి నువ్వు తామసయజ్ఞం చేశావు.



సర్పయాగం. తక్షకుడితో పెట్టుకుని కోటానుకోటులుగా సర్పాలను యాగాగ్నికి ఆహుతిచేశావు. ఇప్పుడు దేవీయజ్ఞం చెయ్యి. సృష్ట్యాదిలో విష్ణుమూర్తి చేశాడు. అలా ఇప్పుడు నువ్వు చెయ్యి. ఎలా చెయ్యాలో నేను చెబుతాను. చేయించడానికి సమర్థులైన యాజ్ఞికులు ఉన్నారు.

యజమానుడవై ఈ యజ్ఞం చేసి యజ్ఞ ఫలాన్ని నీ తండ్రికి ధారపోసి అతడి దుర్గతిని తొలగించు. విప్రావమానపాపంవల్ల నరకం తప్పదు. దీనికితోడు శాపదోషం ఒకటి. దుర్మరణం ప్రాప్తించింది నీ తండ్రికి. ఆకాశంలో కాదు, భూమి మీదకాదు, దర్భలపైనా కాదు, సంగ్రామంలో కాదు, గంగలోకాదు, సౌధంలో స్నాన దానాదివిహీనమైన మరణం పొందాడు నీ తండ్రి పరీక్షిత్తు. ఇది చాలా రకాలుగా దుర్మరణం. చాలా రకాలుగా నరకకారణం.

జనమేజయా! కాలం ఆసన్నమయ్యిందని ముందుగా తెలవడం ఒక అదృష్టం. అలా తెలిసినప్పుడు ఏ సాధనా లేకపోయినా మనస్సు నిర్వేదాన్ని పొందాలి. వైరాగ్య భావన కలగాలి. ఇది పంచభూతాత్మక శరీరం. దీనితో నాకు ప్రమేయం ఏమిటి ? సుఖమేమిటి ? దుఃఖమేమిటి ? ఇది రాలిపోతే రాలిపోనీ. నేను నిర్గుణుడను, విముక్తుడను, నశించేవి నశిస్తాయి. అందులో బాధపడాల్సింది ఏముంది ! నేను బ్రహ్మను, సంసారిని కాను. సదా ముక్తుడను. సనాతనుడను. దేహంతో నాకు ఏ సంబంధమూ లేదు. కర్మానుబంధాలన్నీ - శుభాలు కానీ అశుభాలు కానీ - అన్నీ వదిలిపోయాయి. అదృష్టవశాత్తు ఈ అతిఘోరమైన సంసార సంకటంనుంచి త్వరగా విముక్తుణ్ణి అయ్యాను. ఇలాంటి వైరాగ్యభావం పరీక్షిత్తుకి కలిగి ఉండాల్సింది, కలగలేదు. కలిగి ఉంటే స్నానదానాదులు లేకపోయినా దుర్మరణం అయ్యేది కాదు. ముక్తికారకమే అయ్యేది. అయితే, నాయనా ! ఇలాంటి వైరాగ్య భావన కలగడం అంటే అది అంత తేలిక పనికాదు. మహా మహా యోగులే ఒక్కొక్కసారి తలకిందులవుతూ ఉంటారు. మీ తండ్రిమాట చెప్పాలా !

ఈ దేహాన్ని రక్షించుకోవడం ఎలాగ ? రాజ్యాన్ని శత్రువుల పాలు కాకుండా చూసుకోవడం ఎలాగ ? శాపం తప్పించి నన్ను బతికించేవాడెవడు ? మంత్రజ్ఞులా ? తంత్రజ్ఞులా ? మణులా ? మందులా? అందరినీ పిలిపించండి అంటూ సౌధాగ్రంలో కూచుని అన్ని రోజులూ ఆరాటపడ్డాడే తప్ప దేహ మమకారాన్ని వదిలించుకోలేకపోయాడు. ఆ ఆరాటంలో స్నానం సంధ్య, దానం ధర్మం అన్నీ మరిచిపోయాడు. దేవీ స్మరణం లేదు, భూమి శయనం లేదు. మోహార్ణవంలో మునిగిపోయి సౌధంలోనే మరణించాడు. ఇవన్నీ నరకహేతువులే. కాబట్టి మీ తండ్రిని నువ్వే ఉద్ధరించాలి. నరకకూపం నుంచి తప్పించి సద్గతిని కల్పించాలి.



శౌనకాదిమహామునులారా ! వ్యాసుడు ఇలా చెప్పేసరికి జనమేజయుడి అంతరంగంలో దుఃఖం సుళ్ళు తిరిగింది. తండ్రికి ఉత్తమ గతులు కల్పించకపోయాక, ఎందుకూ, నా బతుకు దండగ - అనుకున్నాడు. వ్యాసమహర్షీ ! నువ్వు చెప్పిన యజ్ఞాన్ని చెప్పినట్టు నిర్వహిస్తాను. మా తండ్రికి స్వర్గం లభించాలి - అని దృఢ నిశ్చయంతో అన్నాడు. అని, మరొక సమాచారం అడిగాడు.

*(అధ్యాయం - 12, శ్లోకాలు - 77)*

## ◆ విష్ణుకృత దేవీయజ్ఞం ◆

వ్యాసమహర్షీ! దేవీయజ్ఞాన్ని లోగడ సృష్టి ఆదిలో విష్ణుమూర్తి చేశాడు అన్నావు. సమర్థుడూ జగత్కారణుడూ అయిన విష్ణువు ఈ యజ్ఞం ఎందుకు చెయ్యవలసి వచ్చింది ? అప్పుడు అతనికి సహాయం చేసినవారెవరు ? బ్రాహ్మణులెవరు, ఎంతమంది ? వేదవిదులైన ఋత్విక్కులు ఎవరు ? ఈ వివరాలన్నీ తెలియజెప్పు. విష్ణుమూర్తి చేశాడంటే గొప్పమాట కదా ! ఇది విన్నాక యజ్ఞం ప్రారంభిద్దాం - అన్నాడు జనమేజయుడు. అలాగే చెబుతానంటూ వ్యాసుడు గొంతు సవరించాడు.

జనమేజయా ! శ్వేతద్వీపంలో త్రిమూర్తులు స్త్రీమూర్తులై జగదీశ్వరిని అర్చించారు. మళ్ళీ తమ పురుషరూపాలను తిరిగి పొందారు. మహా సరస్వతి, మహాలక్ష్మి, మహాకాళి శక్తులను పొందారు. దివ్య విమానంలో మహార్ణవానికి తిరిగి వచ్చారు. ధరామండలాన్ని సృష్టించారు. దానికి ఆధారంగా జగదీశ్వరీశక్తి నిలిచింది. అందుకే దీనికి 'ధర' అనే పేరు వచ్చింది. ఇందులో మధుకైటభుల మేదస్సు (కొవ్వు) కలిసింది. కనక 'మేదిని' అనే పేరు ఏర్పడింది. విశాలంగా విస్తృతంగా ఉంది కాబట్టి పృథ్వి అనే పేరు సిద్ధించింది. మహి అనే పేరుకూడా అందువల్లనే. దీన్ని శేషుడు తన మస్తకం మీద ధరించాడు. అటూ ఇటూ ఒరిగిపోకుండా నిలబెట్టడానికి ఇనపగుండుల్లా పర్వతాలు ఆవిర్భవించాయి. అందుకే వాటికి మహీధరాలు అని పేరు. మణిమయ రత్నశృంగాలతో బహుయోజన విస్తారంగా బంగారుకొండను కల్పించింది జగదంబిక. దాన్ని మేరుపర్వతం అంటారు.

మరీచి, నారదుడు, అత్రి, పులస్త్యుడు, పులహుడు, క్రతుడు, దక్షుడు, వశిష్ఠుడు అనేవారు బ్రహ్మదేవుడికి పుత్రులు. మరీచికి కశ్యపుడు అనే సుతుడు జన్మించాడు. దక్షుడికి పదమూడుమంది పుత్రికలు కలిగారు. వారికి బహువిధాలుగా దేవతలూ దైత్యులూ జన్మించారు. అతి విస్తృతమైన కాశ్యపీసృష్టి జరిగింది. అది మనుష్య పశు సర్పాదిభేదాలతో విస్తరిల్లింది.

బ్రహ్మదేవుడి శరీరంలో కుడి భాగంనుంచి స్వయంభూ మనువు ఆవిర్భవించాడు. వామ భాగం నుంచి శతరూప అనే స్త్రీ జన్మించింది. ఆవిడకు ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు అనే కొడుకులు కలిగారు. మరో ముగ్గురు అత్యంత సుందరాంగులు పుత్రికలుగా జన్మించారు.



ఇలా బ్రహ్మదేవుడు సృష్టిజరిపి తనకోసం మేరు శృంగంమీద అతి మనోహరమైన సత్యలోకాన్ని నిర్మించుకున్నాడు. లక్ష్మీదేవితో కలిసి నివసించడానికీ క్రీడించడానికీ అనువుగా విష్ణుమూర్తి అన్ని లోకాలకన్నా పైని వైకుంఠం నిర్మించుకున్నాడు. శివుడేమో కైలాసాన్ని ఏర్పరుచుకున్నాడు. భూతగణాన్ని సిద్ధం చేసుకుని పార్వతీ సహితుడై కైలాస పర్వత శిఖరంమీద విహరిస్తుంటాడు. త్రివిష్టపము అనే స్వర్గాన్ని మేరు శిఖరాలలో ఒకదానిపై నిర్మించి సురేంద్రుడికి నివాసంగా అందించారు. సముద్రమథనంలో పుట్టిన పారిజాతాన్నీ, కామధేనువునీ, నాలుగు దంతాల ఐరావతాన్నీ, ఉచ్చైఃశ్రవమనే గుర్రాన్నీ రంభాద్యప్సరసలనూ దేవేంద్రుడికి బహూకరించారు. ధన్వంతరి, చంద్రుడు కూడా క్షీరసముద్రంనుంచే ఆవిర్భవించారు. వీరు కూడా తమ తమ దేవగణాలతో కలిసి స్వర్గంలోనే నివాసం ఏర్పరచుకున్నారు. వీరంతా స్వర్గానికి ఆభరణాలు.

దేవ తిర్యక్ మనుష్యభేదాలతో ఇలా ఈ సృష్టి ముప్పేటగా సాగింది. అండజములు, స్వేదజములు, ఉద్భిజములు, జరాయుజములు అనే నాలుగుభేదాలతో జీవరాశి కర్మానుసారంగా సముత్పన్నమయ్యింది.

సృష్టిని ఇలా జరిపి త్రిమూర్తులూ తమతమ భార్యలతో తమతమ నెలవులలో సుఖసంతోషాలు అనుభవిస్తూ విహరిస్తున్నారు.

ఇలా ఉండగా, ఒకరోజున విష్ణుమూర్తికి శ్వేతద్వీపమూ మణిమండపమూ జ్ఞాపకం వచ్చాయి. ఆదిపరాశక్తిని దర్శించి, స్త్రీభావం పొంది, అర్చించి, స్తుతించి, దివ్యమంత్రోపదేశంతోపాటు లక్ష్మీదేవిని అందుకొన్న అలనాటి సంఘటన స్మృతిపథంలో మెరిసింది. మహాదేవీయజ్ఞం చెయ్యాలని కోరిక కలిగింది. బ్రహ్మ మహేశ్వరులనూ అష్టదిక్పాలకులనూ వశిష్ఠ కశ్యప దక్ష వామదేవ బృహస్పతులనూ ఆహ్వానించి తన సంకల్పం తెలియజేశాడు. యజ్ఞ సంబారాలను పుష్కలంగా కల్పించాడు. శిల్పులను పిలిపించి, మహావిభవం ఉట్టిపడేట్టు సుమనోహరంగా సాత్త్వికంగా విశాలంగా యజ్ఞ మండపం నిర్మింపజేశాడు. ఇరవైయేడుమంది వేదవిదులను ఋత్విక్కులుగా వరించాడు. వారు విస్తారమైన వేదికలలో (అగ్నికుండాలు) అగ్నులను రగిలించారు. దేవీ బీజసమన్వితాలైన మంత్రాలను పఠించారు, జపించారు. శాస్త్ర ప్రకారం హవిస్సుతో హోమాలు చేశారు. అప్పుడొక అశరీరవాణి మృదుమధురంగా వినిపించింది.

హే ! విష్ణో ! నువ్వు ఈ రోజునుంచీ దేవతలలోకెల్లా ఉత్తమోత్తముడవు అవుతున్నావు. బ్రహ్మాది సకల దేవతలూ నిన్ను అర్చిస్తారు. మానవులంతా నీ భక్తులు అవుతారు. వారికి నువ్వే వరదుడవు. సర్వయజ్ఞాలలోనూ నువ్వు ముఖ్యుడివి. యాజ్ఞికులు ప్రథమార్చన నీకే చేస్తారు. దానవపీడలు సంభవించినప్పుడు సకలదేవతలూ నిన్నే ఆశ్రయిస్తారు. వేదపురాణాలు అన్నింటా నువ్వు పురుషోత్తముడవుగా కీర్తింపబడతావు. భూలోకంలో ధర్మగ్లాని సంభవించినప్పుడల్లా నువ్వే అవతరించి ధర్మరక్షణ చెయ్యాలి.



యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భూతలే ।
తదాంశేనావతీర్యాశు కర్తవ్యం ధర్మరక్షణమ్ ॥ (13 - 42)

నీ అవతారాలకు భూలోకంలో విస్తృతమైన ప్రాచుర్యం లభిస్తుంది. అందరూ వాటిని అర్చిస్తారు. నీ అవతారాలన్నింటా నా అంశ నీకు సహచారిణిగా ఉంటుంది. వారాహీ నారసింహీ భేదాలతో నా శక్తి నీకు సర్వకార్య ప్రసాదిని అవుతుంది. ఆ శక్తి స్వరూపాలు సర్వాభరణభూషితలై సర్వాయుధధారిణులై నీకు సహకరిస్తాయి. నువ్వు గర్వపడి వారిని ఏనాడూ చిన్నచూపు చూడకూడదు సుమా ! వారంతా నీకు మాననీయలూ పూజనీయలూ. జాగ్రత్త వహించు. భరతఖండంలో సర్వార్థప్రదలైన శక్తి స్వరూపాలుగా వారు అందరి పూజలనూ అందుకుంటారు. వారికీ నీకూ అఖండకీర్తి లభిస్తుంది. సప్త ద్వీపాలలోనూ స్వర్గంలోనూ మీ కీర్తి వ్యాపిస్తుంది. కోరికలున్న మానవులు అవి సిద్ధించడం కోసం రకరకాల ఉపహారాలతో వేదమంత్రాలతో విభిన్న మార్గాలలో మిమ్మల్ని పూజిస్తుంటారు. సంపదభివృద్ధులను పొందుతుంటారు. మధుసూదనా ! నువ్వు నేటినుంచీ దేవాధిదేవుడవు.

ఈ అశరీరవాణి పలుకులకు విష్ణుమూర్తి సంతోషించాడు. దేవతలంతా అభినందించారు. యజ్ఞం పరిసమాప్తి చేసి ఋత్విక్కులు సెలవు తీసుకున్నారు. బ్రహ్మ మహేశ్వరులు తమ నెలవులకు వెళ్ళిపోయారు. విష్ణుమూర్తి గరుడుణ్ణి అధిరోహించి యజ్ఞశాలనుంచి తన మందిరానికి చేరుకున్నాడు. మళ్ళీ యథాపూర్వంగా అందరూ తమ విధులను తాము చేసుకుంటున్నారు.

మునుల ఆశ్రమాలలో ఈ వార్త చర్చనీయాంశమయ్యింది. అందరికీ ప్రకృతిపట్ల (శక్తి) భక్తిభావం పెంపొందింది. ఆగమోక్త ప్రకారంగా అందరూ శక్తిపూజలు ఆరంభించారు.

***(అధ్యాయం - 13, శ్లోకాలు - 59)***

జనమేజయుడికి గురి కుదిరింది. దేవీయజ్ఞం ఎలా చెయ్యాలో తెలిసింది. చెయ్యాలనే సంకల్పం బలపడింది. అయితే దేవీమహిమ తెలుసుకోవాలి అనుకున్నాడు. అది చెప్పి నా జన్మ పావనం చెయ్యి అని వ్యాసుణ్ణి అభ్యర్థించాడు. వ్యాసుడు అలాగే అని ప్రారంభించాడు.

## ◆ సుదర్శనుడి కథ ◆

ధ్రువసంధి అనే మహారాజు అయోధ్యరాజధానిగా కోసలదేశాలను పరిపాలిస్తున్నాడు. అతడు సూర్యవంశ సంభవుడు. పుష్యపుత్రుడు. ధర్మాత్ముడు. వర్ణాశ్రమ ధర్మాలను కాపాడుతున్నాడు. ప్రజలంతా ఎవరి వృత్తులను వారు సమర్థంగా నిర్వహించుకుంటున్నారు. ధనధాన్య సమృద్ధులతో తులతూగుతున్నారు. చోరులుకానీ, ధూర్తులుకానీ, లోభులుకానీ, మోసగాళ్ళుకానీ (దంభాః), కృతఘ్నులుకానీ, మూర్ఖులు కానీ అతడి రాజ్యంలో లేరు. అంజనం వేసినా కనిపించరు.



ధ్రువసంధికి ఇద్దరు భార్యలు. ఇద్దరూ అందగత్తెలే. ఇద్దరూ విచక్షణలే. మొదటి భార్య మనోరమ - ధర్మపత్ని, పట్టమహిషి. రెండవ భార్యపేరు లీలావతి. ఇద్దరితోనూ కలిసి భోగభాగ్యాలు అనుభవిస్తూ, సౌధాలలో ఉద్యానవనాలలో క్రీడాపర్వతాలలో సరోవరాలలో దిగుడుబావులలో విహరిస్తూ ఆనందం అంచులు చూస్తున్నాడు. మనోరమకు సకలరాజలక్షణాలతోనూ పుత్రుడు ఉదయించాడు. అతడికి సుదర్శనుడని నామకరణం చేశారు. మరో నెలకు లీలావతి ప్రసవించింది. మూర్తీభవించిన సౌందర్యంగా మగబిడ్డ జన్మించాడు. శత్రుజిత్ అని పేరుపెట్టారు. రాజుగారు ఇద్దరినీ సమానాదరంతో ప్రేమతో చూసుకుంటున్నారు. పిల్లలు ఆడుతూ పాడుతూ ఎదుగుతున్నారు. ఇద్దరికీ చూడాకర్మలు అయ్యాయి. విద్యాభ్యాసాలు సాగుతున్నాయి.

శత్రుజిత్తు మంచి మాటకారి. తన వాక్చాతుర్యంతో అందరినీ ఆకట్టుకుంటున్నాడు. మంత్రులూ దండనాయకులూ ప్రజలూ అందరూ ఆకర్షితులై ఆనందిస్తున్నారు. తండ్రికి మరీ ప్రీతిపాత్రుడయ్యాడు. దురదృష్టవశాత్తు సుదర్శనుడు అంత చురుకైనవాడు కాదు. శాంతస్వభావుడు.

ఒకరోజున ధ్రువసంధి వినోదంకోసం వేటకు వెళ్ళాడు. గాఢారణ్యంలో ప్రవేశించాడు. క్రూరమృగాలను ఎన్నింటినో సంహరించాడు. వేట రంజుగా సాగుతోంది. అంతలోకీ - ఒక వెదురుపొదనుంచి చండసింహం ఒకటి జూలు దులిపి ఆవులించింది. లేచి నిలబడింది. దిక్కులు పగిలిపోయేట్టు విరగబడి గర్జించింది. రాజుగారు బాణం వేశారు. ఆ దెబ్బకు అది మరీ రెచ్చిపోయింది. తోక రిక్కించి రాజుపైకి లంఘించింది.

రాజుగారు, చర్మనిర్మితమైన డాలువంటిది ఎడమచేతిలో పట్టుకుని, కుడిచేత కత్తిదూసి, మరొక సింహంలా నిలబడ్డాడు. కసెక్కిన సింహం బంతిలా గాలిలోకి ఎగిరి, పంజావిప్పి, నోరు భీకరంగా తెరిచి, భీషణంగా గర్జిస్తూ రాజుగారిమీద పడుతోంది. చుట్టూ సైనికులు వందలబాణాలు వేశారు. గుచ్చుకున్నవి గుచ్చుకున్నాయి, తప్పుకున్నవి తప్పుకున్నాయి. సింహంమాత్రం రాజుపైకి దూకుతోంది. దగ్గరకు రాగానే రాజు కత్తితో పొడిచాడు. అది పంజా విసిరింది. ఇద్దరూ ఒకేసారి నేలకు ఒరిగిపోయారు, ప్రాణాలు విడిచారు. సైనికుల హాహాకారాలు మిన్నుముట్టాయి.

క్షణాలమీద ఈ దుర్వార్త రాజధానికి చేరింది. అంతఃపురం బావురుమంది. మంత్రి పురోహితులు హుటాహుటిని అడవికి వచ్చారు. వసిష్ఠుడి ఆజ్ఞమేరకు అక్కడే అంత్యక్రియలు జరిపారు. దిగులుగా రాజధానికి చేరుకున్నారు. పెద్దకొడుకు ధర్మపత్నీ సుతుడూ శాంతస్వభావుడూ కదా అని సుదర్శనుణ్ణి రాజును చెయ్యడానికి సమాలోచనలు జరిపి ఒక నిర్ణయానికి వచ్చారు.



అల్లుని మరణవార్త తెలిసి లీలావతి తండ్రి యుధాజిత్తు ఉజ్జయినినుంచి సైన్యంతో అయోధ్యకు చేరుకున్నాడు. శత్రుజిత్తుకి బాసటగా నిలిచాడు. సుదర్శనుడికి అండగా నిలవడంకోసం మనోరమతండ్రి శూరసేనుడు కళింగదేశం నుంచి సైన్యంతో బయలుదేరి వచ్చాడు. ముఖ్యులైన మంత్రి పురోహితులను సమావేశపరిచి చర్చించారు.

జ్యేష్ఠుడూ ధర్మపత్నీ సుతుడూ కనక నా మనుమడు సుదర్శనుడికే పట్టాభిషేకం జరగాలి అన్నాడు శూరసేనుడు. గుణాలను బట్టీ సమర్థతనుబట్టీ అర్హత కనక నా మనుమడు శత్రుజిత్తుకే పట్టం కట్టాలి అన్నాడు మొండిగా అడ్డం తిరిగి యుధాజిత్తు. ఇలా వివాదం చెలరేగింది. తీర్చేవాడు లేడు. మంత్రులెవరూ మాట్లాడలేదు.

యుధాజిత్తు సహనం కోల్పోయాడు. మంత్రులనందరినీ తిట్టిపోశాడు. మీరంతా స్వార్థపరులు. చేతకాని సుదర్శనుణ్ణి రాజుగా కూచోబెట్టి ధనం భోంచేద్దామనుకుంటున్నారు. బలవంతుడూ సమర్థుడూ కనక శత్రుజిత్తు రాజు అయితే మీ ఆటలు సాగవని భయం. ఇదిగో మీ అందరికీ ఇదే నా హెచ్చరిక. అన్ని అర్హతలూ ఉన్న శత్రుజిత్తును కాదని, జ్యేష్ఠుడుకదా అని సుదర్శనుడికి కట్టం కట్టారో జాగ్రత్త. మహా సంగ్రామం జరుగుతుంది. ఖడ్గధారతో భూగోళాన్ని చీల్చి రెండు ముక్కలు చేస్తాను. మీకు దిక్కున్నచోట చెప్పుకుందురుగాని. మీరెంత, మీ బలమెంత?

**మానం యుద్ధం కరిష్యామి తస్మిన్ ఖడ్గస్య మేదినీ ।**
**ధారయా చ ద్విధా భూయాత్ యుష్మాకం తత్ర కా కథా ॥ (14 - 47)**

శూరసేనుడు వీరంగం వెయ్యలేదు. శాంతంగా నెమ్మదిగా మాట్లాడాడు. సుదర్శన శత్రుజిత్తులు ఇద్దరూ సమర్థులే. సమాన ప్రజ్ఞావంతులే. తేడా లేదు. కాకపోతే శాస్త్రప్రకారం ధర్మపత్నీ సుతుడు సింహాసనార్హుడు కనక సుదర్శనుడికి పట్టం కట్టమని కోరుతున్నాను - అన్నాడు.

వివాదం చెలరేగిన సంగతి తెలిసి ప్రజలూ ఋషులూ ఉద్విగ్నులయ్యారు. ఏమి అలజడులు జరుగుతాయో అని భయపడ్డారు.

పరస్పర యుద్ధకాంక్షతో ఎప్పుడూ తగవులాడుకునే సామంతులు అందరూ రాజధానికి చేరుకున్నారు. అరాజకం ఏర్పడితే రాజధానిని కొల్లగొడదామని శృంగబేరం నుంచి నిషాదులు వచ్చారు. చుట్టుపక్కల దేశాలనుంచి చోరులు గుంపులు గుంపులుగా వచ్చారు. అవకాశం దొరికితే అల్లర్లు సృష్టించి ప్రజలను దోచుకుందామని పొంచి చూస్తున్నారు. అయోధ్య అంతా, ఎవరో ఏమిటో తెలియని కొత్త ముఖాలతో కిటకిటలాడుతోంది. సమ్మర్దం ఇబ్బడి ముబ్బడిగా పెరిగింది.

*(అధ్యాయం -14 , శ్లోకాలు - 53)*



సేనలను మోహరించి యుధాజిత్తు ధనుర్ధారియై నిలబడ్డాడు. వీరసేనుడు క్షాత్రధర్మం పాటిస్తూ సేనా సమూహంతో యుద్ధానికి సిద్ధమయ్యాడు. పరస్పరం బాణవృష్టి కురిపించారు. రథగజ తురగ సైన్యాలు కలబడ్డాయి. ఘోర సంగ్రామం జరిగింది. సురముని సంఘాలు ప్రేక్షకపాత్ర వహిస్తున్నాయి. కాకులూ గ్రద్దలతో ఆకాశం నిండిపోయింది. తెగిపడిన తలలూ కాళ్ళూ చేతులూ మొండేలు గుర్రాలూ ఏనుగులతో నేల నిండిపోయింది. నదిలో కొట్టుకుపోతున్న సొరకాయబుర్రల్లా రణరంగమంతటా సైనికుల శిరస్సులు. వాటిని తన్నుకుపోవడానికి మూగుతున్న గ్రద్దలూ రాబందులూ.

శరీరం రాలిపోయినా, జీవుడు వీరావేశంతో ఆ తన శరీరంలో మళ్ళీ ప్రవేశించడానికి ఉవ్విళ్ళూరుతూ అక్కడే తచ్చాడుతున్నాడు. కొందరు వీరులు మరణించి దివ్య విమానాలను అధిరోహించి అందులో ఉన్న అప్సరసలకు, నేలపై పడి ఉన్న తమ కళేబరాల సొగసులను వర్ణించి చూపిస్తున్నారు. ఒక మహావీరుడు మరణించి అప్సరసను పొంది కామాగ్నిలో మళ్ళీ దగ్ధుడవుతున్నాడు. ఇద్దరు వీరులు ద్వంద్వ యుద్ధంలో ఒకేసారి మరణించి ఒకేసారి దివ్యవిమానం అధిరోహించి అప్సరసకోసం మళ్ళీ కత్తులు దూస్తున్నారు. మరొక యోధుడు మరణించి రూపవతి గుణవతి అయిన ఒక సురాంగనకు తన గుణగణాలను వివరించుకొంటూ ప్రేమభిక్ష అర్థిస్తున్నాడు. దివికేతెంచిన మరొక వీరుణ్ని చూసి మరొక దేవకాంత కన్నుకలిపి కౌగిలికి పిలిస్తే ఆ వీరుడు తిరస్కరిస్తున్నాడు. నాకు వ్రతభంగం అవుతుంది. రాజుగారికి అత్యంతమూ విశ్వాసపాత్రుణ్ణి అనుకూలుణ్ణి అనే నా బిరుదు మంటగలిసిపోతుంది అంటూ అతడు ఆమెను త్రోసిరాజంటున్నాడు.

రణరంగంలో లేచిన దుమ్ము ఆకాశమంతటా వ్యాపించి సూర్యుణ్ణి కప్పేసింది. హఠాత్తుగా చీకటులు వ్యాపించాయి. మరి కాసేపటికి అదే దుమ్ము మళ్ళీ నేలకు దిగి రక్తప్రవాహాలలో తడిసి ముద్దయి సూర్యమండలాన్ని రెట్టింపుగా ఎరుపెక్కించింది.

భౌమం రజోఽతివితతం దివి సంస్థితం చ
రాత్రిం చకార తరణిం చ సమావృణోద్యత్ ।
మగ్నం తదేవ రుధిరాంబునిధావకస్మాత్
ప్రాదుర్బభూవ రవిరప్యతికాంతియుక్తః ॥ (15 - 14)

శూరసేన యుధాజిత్తుల సంగ్రామం అరివీరభయంకరంగా సాగుతోంది. ఉన్నట్టుండి యుధాజిత్తు పదిబాణాలను ఒకేసారి సంధించి విడిచిపెట్టాడు. శూరసేనుడు దారుణంగా నిహతుడయ్యాడు. రథం నుంచి నేలకు ఒరిగి పోయాడు. అతడి సైన్యం కకావికలైపోయింది. ఎటువారటే పారిపోయారు.



వార్త తెలిసి మనోరమ వలవలా విలపించింది. క్షణంలో తేరుకుంది. ఏమిటి భవిష్యత్తు - ఆలోచించే సరికి భయం ఆవరించింది. రాజ్యలోభంతో యుధాజిత్తు తన తండ్రిని చంపినట్టే తన కొడుకు సుదర్శనుణ్ణీ పొట్టనపెట్టుకుంటాడు అనిపించింది. ఏమి చెయ్యాలి, ఎక్కడికి వెళ్ళాలి? భర్త మరణించాడు. తండ్రి మరణించాడు. కొడుకు పసిబాలుడు. ఏం చెయ్యడానికీ తోచలేదు. ఎంతటివారినైనా వశీకరించుకుంటుంది ఈ రాజ్యలోభం. ఎంత పాపిష్ఠిదో కదా! ఎన్ని దారుణాలైనా చేయిస్తుంది. ఎంతటి పాపానికైనా ఒడికట్టిస్తుంది. ఛీ ఛీ. తల్లి తండ్రి సోదరులు గురువులు స్వజనులు బంధువులు - ఎవరినైనా చంపిస్తుంది. అభక్ష్య భక్షణం అగమ్యగమనం - అన్నీ చేయిస్తుంది. ధర్మాన్ని తుంగలో తొక్కిస్తుంది.

> అభక్ష్యభక్షణం లోభాదగమ్యగమనం తథా ।
> కరోతి కిల తృష్ణార్తో ధర్మత్యాగం తథా పునః ॥ (15 - 23)

ఈ అయోధ్యాపట్టణంలో నాకు సహకరించేవారు ఎవ్వరూ లేరు. ఎవరిని నమ్మి ఎవరి పంచను చేరి సుతుణ్ణి కాపాడుకోవాలన్నా ప్రమాదమే. వీణ్ణి కాస్తా యుధాజిత్తు చంపేస్తే ఇక ఈ లోకంలోనే నాకు దిక్కు ఉండదు.

నా సోదరి (సవతి) లీలావతి ఇప్పటిదాకా స్నేహంగానే ఉంది. కానీ ఇప్పుడు ఆవిడకీ ఈ వైరవ్యాధి సోకి ఉంటుంది. నా పుత్రుడిపట్ల దయావతిగా ఉంటుందని నేను అనుకోను.

> సాపి వైరయుతా కామం సపత్నీ సర్వదా భవేత్ ।
> లీలావతి న మే పుత్రే భవిష్యతి దయావతీ ॥ (15 - 26)

యుధాజిత్తు రణరంగంనుంచి నగరానికి వచ్చాడంటే ఇక నేను పారిపోవడానికి కూడా ఉండదు. నన్నూ నా కొడుకునూ పట్టి బంధించి కారాగారంలో పడవేయిస్తాడు. చరిత్రలో ఇటువంటి కథలు ఎన్ని వినలేదు. ఇంద్రుడంతటివాడే లోభానికి లోనై మాతృగర్భంలో ప్రవేశించి, పుట్టబోయే సోదరుణ్ణి ముక్కలు ముక్కలుగా నరికివేశాడు.

ఈ ఇక్ష్వాకు వంశంలోనే వెనకటికి ఒకరాణి, తన సవతికి గర్భవిచ్ఛేదంకోరి విషం ఇచ్చింది. అదృష్టవశాత్తూ ఆవిడ బతికి బయటపడింది. పుట్టిన కొడుకు గరళం ముద్దతోసహా పుట్టాడు. సగరుడయ్యాడు. కైకేయి రాముణ్ణి అడవులకు పంపించింది. జ్యేష్ఠుడి విరహాన్ని భరించలేక దశరథుడు మరణించాడు.

కాబట్టి, యుధాజిత్తుగానీ లీలావతిగానీ నన్నూ నా కొడుకునూ క్షేమంగా చూస్తారనుకోవడం బతకనిస్తారనుకోవడం వట్టి వెర్రితనం. నా కుమారుడికి పట్టంకట్టాలని సమాలోచనలు జరిపిన మంత్రి పురోహితులైనా ఇప్పటి పరిస్థితులలో నా పక్షాన నిలుస్తారా ! అవశులు. ఈపాటికే యుధాజిత్తుకి వశులైపోయుంటారు.



మంత్రిణస్స్వవశాః కామం యే మే పుత్రం సుదర్శనమ్ ।
రాజానం కర్తుకామా వై యుధాజిద్వశగాశ్చ తే ॥ (15 - 33)

ఎంత దురదృష్టం నాది ! ఇటువంటి కష్టాలనుంచి గట్టెక్కించే సోదరుడు ఒక్కడయినా లేకపోయాడు నాకు. సరే, ఇలా దిగులుపడి ప్రయోజనం లేదు. మన ప్రయత్నం మనంచెయ్యాలి. సిద్ధించడం సిద్ధించకపోవడం అంతా దైవానుగ్రహం. త్వరగా కదలాలి. నన్నూ నా పుత్రుణ్ణీ రక్షించుకోవాలి.

మనోరమ ఇలా ఒక నిర్ణయానికి వచ్చి విదల్లుణ్ణి పిలిపించింది. అతడు కార్యసాధన నిపుణుడు. ఆత్మాభిమానం ఉన్నవాడు. బహు సుకుమారుడు (ఆడంగి). మనోరమకు అత్యంత విశ్వాసపాత్రుడైన మంత్రి. ఆ ఆత్మీయుణ్ణి పిలిచి ఏకాంతంలో బోరుమంది - ఇప్పటి పరిస్థితిలో ఏమి చెయ్యాలో సలహా చెప్పమంది.

పితా మే నిహతస్సంఖ్యే పుత్రోఽయం బాలకస్తథా ।
యుధాజిద్బలవాన్రాజా కిం విధేయం వదస్వ మే ॥ (15 - 38)

అవునమ్మా ! ఇప్పుడు నువ్వింక ఇక్కడ ఉండటం క్షేమంకాదు. పారిపోదాం పద. నేనూ వస్తాను నీతోపాటు. అడవుల్లోకి పోయి అక్కడినుంచి వారణాసి చేరుకుందాం. అక్కడ సుబాహుడని మా మేనమామ ఉన్నాడు. శ్రీమంతుడూ, బలవంతుడూను. అతడి రక్షణలో ఉందాం. మాయదారి యుధాజిత్తును దర్శించడానికి జనమంతా కోలాహలంగా ఉన్నారు కనక మనల్ని ఎవరూ పట్టించుకోరు. అదే వంకతో ఇదే అదునుగా మనమూ అంతఃపురంనుంచీ రాజప్రాసాదంనుంచీ బయటపడవచ్చు. అక్కడినుంచి రథం ఎక్కి వెళ్ళిపోవచ్చు.

ఈ ఆలోచనకు మహారాణి సమ్మతించింది. లీలావతి దగ్గరకు వెళ్ళింది. రణరంగంలో ప్రాణాలు కోల్పోయిన నా తండ్రిని ఒకసారి దర్శించాలి, వెడుతున్నానని చెప్పి, విదల్లుడూ సైరంధ్రీ వెంటరాగా, కొడుకుని తీసుకుని రథమెక్కి బయలుదేరింది.

రణరంగంలో తండ్రి కళేబరాన్ని చూసింది. ఓలు ఓలున విలపించింది. విదల్లుడూ సైరంధ్రీ ఓదార్చారు. తేరుకుంది. భయంతో వొణికిపోతూ తండ్రి శరీరానికి త్వరత్వరగా అగ్ని సంస్కారం జరిపింది. వెంటనే బయలుదేరారు. రెండురోజుల ప్రయాణం. గంగాతీరం చేరుకున్నారు.

సంస్కార్య చ త్వరా యుక్తా వేపమానా భయాకులా ।
దినద్వయేన సంప్రాప్తా రాజ్ఞీ భాగీరథీతటమ్ ॥ (16 - 45)



అక్కడ ఆటవికులు వీరిని అటకాయించారు. సొమ్ములన్నీ దోచుకున్నారు. రథం కూడా లాక్కున్నారు. పారిపోయారు. కొడుకును చంకనెత్తుకుని సైరంధ్రి చెయ్యి పట్టుకుని ఒక చిన్న తెప్ప ఎక్కి గంగానదిని దాటింది. ముగ్గురూ త్రికూటపర్వతం చేరుకున్నారు. అక్కడ భరద్వాజుడి ఆశ్రమం ఉందని తెలిసింది. త్వరత్వరగా ఆశ్రమానికి వెళ్ళారు. తాపసులను చూసేసరికి మనోరమకు ధైర్యం వచ్చింది. అందరికీ పాదాభివందనం చేసింది. భరద్వాజుడు అడిగాడు -

ఎవరమ్మా నువ్వు ? కష్టాలపాలై ఇటు వచ్చినట్టున్నావు. దేవతవా ? పసిబిడ్డతో వచ్చావు. రాజ్యం కోల్పోయిన ఏ మహారాజుకో ఇల్లాలివనిపిస్తున్నావు. ఏమిటి నీ వృత్తాంతం, చెప్పమ్మా !

ఈ పలకరింపుతో మనోరమ దుఃఖం కట్టలు తెంపుకుంది. వెక్కి వెక్కి ఏడ్చింది. కాసేపటికి ఊపిరి తిప్పుకుంది. విదల్లుడివైపు చూసింది. అతడు భరద్వాజుడికి విషయమంతా చెప్పాడు. మా అమ్మగారిని తమరే కాపాడాలి. ఆర్తులనూ భీతులనూ రక్షిస్తే యజ్ఞం చేసిన దానికంటే ఎక్కువ పుణ్యమని తమవంటి పెద్దలు చెప్పగా విన్నాను. మహర్షీ ! శరణు, శరణు అని కాళ్ళమీద పడ్డాడు.

ఆర్తస్య రక్షణే పుణ్యం యజ్ఞాధికముదాహృతమ్ ।
భయత్రస్తస్య దీనస్య విశేషఫలదం స్మృతమ్ ॥ (15 - 57)

చిట్టితల్లీ ! నిర్భయంగా ఉండు. ఇక్కడ నీకు ఏ ఇబ్బందీ కలగదు. ఏ దుఃఖమూ ఉండదు. కొడుకును శ్రద్ధగా పెంచి పెద్దవాణ్ణి చెయ్యి. తప్పకుండా మహారాజు అవుతాడు - అని భరద్వాజుడు అనుజ్ఞతోపాటు ఆశీస్సులూ అందించాడు. వారికోసం ఒక పర్ణశాలను చూపించాడు. ముగ్గురూ అందులో తలదాచుకుంటూ కాలక్షేపం చేస్తున్నారు. ***(అధ్యాయం - 15, శ్లోకాలు - 61)***

జనమేజయా ! యుధాజిత్తు రణరంగంనుంచి విజయగర్వంతో అయోధ్యాపుర ప్రవేశం చేశాడు. సుదర్శనుణ్ణికూడా చంపి తన మనుమడి పాలనను అకంటకం చెయ్యాలి అనుకున్నాడు. మనోరమకోసం అంతఃపురమంతా గాలించాడు. పరిచారికలను రొక్కించాడు. జాడ తెలియలేదు. నగరమంతటా అన్వేషించండి, ఎక్కడ ఉన్నా పట్టి తెండి అని భటులకు ఆజ్ఞాపించాడు.

ఒక శుభముహూర్తాన శత్రుజిత్తుకు పట్టాభిషేకం జరిపించాడు. రాజ్యమంతటా ఉత్సవం ప్రకటించాడు. అధికారులకూ అనధికారులకూ ప్రజలకూ - అందరికీ పెద్ద ఎత్తున కానుకలు పంచిపెట్టించాడు. అందరూ సంతోషించారు. కొత్తరాజు శత్రుజిత్తుకు జై అన్నారు. జై జై అన్నారు.

కొందరు సజ్జనులుమాత్రం ఇళ్ళల్లో నిశ్శబ్దంగా రోదించారు. యోగ్యుడు సుదర్శనుడు ఏమైపోయాడో. మహాసాధ్వి మనోరమ ఏమైపోయిందో. శూరసేనుణ్ణి అన్యాయంగా చంపేశాడు యుధాజిత్తు.



అక్రమంగా సింహాసనం దోచుకుని మనవడికి కట్టబెట్టాడు - అనుకుంటూ లోలోపల కుమిలిపోయారు. అశక్తతను నిందించుకున్నారు.

యుధాజిత్తు కొంతకాలంపాటు అయోధ్యలోనే ఉండి, మనవడి పరిపాలన సజావుగా సాగడానికి అవసరమైన ఏర్పాట్లు అన్నీచేసి, తన ఉజ్జయినికి చేరుకున్నాడు. మనోరమ సుదర్శనుడూ భరద్వాజుడి ఆశ్రమంలో ఉన్నారని చారులు సమాచారం అందించారు. ఆశ్రమంలోనే వారిని కడతేరుస్తానంటూ వెంటనే బయలుదేరాడు. శృంగబేరపురాధిపతి దుర్ధర్శుడు అనే కోయరాజును కలుసుకున్నాడు. భరద్వాజాశ్రమం ఈ శృంగబేరానికి దగ్గరలోనే ఉంది.

యుధాజిత్తు ససైన్యంగా వచ్చి శృంగబేరంలో విడిది చేశాడనే వార్త మునిబాలకుల ద్వారా మనోరమకు తెలిసింది. సుదర్శనుణ్ణి చంపడానికే వచ్చి ఉంటాడని గ్రహించింది. గజగజలాడింది. మహర్షి దగ్గరకు పరుగెత్తింది. ఇప్పుడు ఏమి చెయ్యను, ఎక్కడికి పోను ? యుధాజిత్తు వచ్చాడు. నా తండ్రిని సంహరించాడు. తన మనుమడిని రాజును చేశాడు. ఇప్పుడింక నా కొడుకును చంపడానికి వచ్చాడు. సందేహం లేదు. మహర్షీ ! గతకాలపు గాథలు చాలా జ్ఞాపకం వస్తున్నాయి. ఒకప్పుడు జయద్రథుడు ఇలాగే ఆశ్రమానికి వచ్చి, అక్కడ అరణ్యవాసంలో తలదాచుకుంటున్న ద్రౌపదిని ఒంటిపాటున అవమానించాడు. ఎవ్వరినీ నమ్మడానికి లేదు. నమ్మామో కన్నీట మునిగామన్నమాటే.

**కస్యచిన్నైవ విశ్వాసః కర్తవ్యస్సర్వథా బుధైః ।**
**కుర్వన్ దుఃఖమవాప్నోతి దృష్టాంతస్త్వత్ర వై బలిః ॥ (16 - 40)**

బలిచక్రవర్తి ఏమయ్యాడు ! ధర్మాత్ముడు, మహాదాత, తొంభైతొమ్మిది యజ్ఞాలు చేసినవాడు. ప్రహ్లాదుడికి సాక్షాత్తు పౌత్రుడు. అయితేనేమి మోసానికి గురి అయ్యాడు. మోసం చేసింది మాత్రం సామాన్యుడా ! సాక్షాత్తు విష్ణుమూర్తి. సత్యస్వరూపుడూ వేదగమ్యుడూ, యోగి సేవ్యుడూను. దేవకార్యసిద్ధికోసం కశ్యపుడికి వామనుడిగా పుట్టి, మూడడుగుల నేల ఇమ్మన్న వంకతో బలిని పాతాళానికి తొక్కేశాడు. ఇంద్రుడి ఇచ్చకం కోసం విష్ణుమూర్తియే ఇలా మోసం చేస్తే, ఇక సామాన్యమానవులమాట చెప్పాలా స్వామీ ! అందుచేత ఎవ్వరినీ ఎప్పుడూ నమ్మకూడదు. లోభం మనస్సులో ప్రవేశించిందంటే ఇంక వాడికి పాపభయం కానీ, పరలోకభయంకానీ ఏదీ ఏమాత్రమూ ఉండదు. త్రికరణశుద్ధిగా పరులసొమ్మును కాజేస్తాడు. ఎంతకైనా దిగజారతాడు.

**మనసా కర్మణా వాచా పరస్వాదాన హేతుతః ।**
**ప్రపతంతి నరాః సమ్యగ్లోభోపహతచేతసః ॥ (16 - 49)**



భరద్వాజా ! అసలు మనుషుల ఆలోచనల్లోనే ఏదో తేడా ఉందనుకుంటాను. ధనసమృద్ధి కలిగించమంటూ దేవతలను ఆరాధిస్తారు. దేవతలేమన్నా తమ చేతుల్లో ఉన్నదని సొమ్ము వెంట అందిస్తారా ? ఎవరి దగ్గరనుంచో తెచ్చి వీరికివ్వాలి. అంటే వ్యాపారమన్నా చెయ్యాలి, చౌర్యమన్నా చెయ్యాలి. ఎవరితోనో దానమన్నా ఇప్పించాలి. లేదంటే బలప్రయోగం చేసి ఎవడి బుర్రో బద్దలుకొట్టి పట్టుకువచ్చి వీరికి ఇవ్వాలి. అంతేకదా! అమ్మి డబ్బుచేసుకోవడం కోసం ధాన్యవస్త్రాదుల్ని ఉత్పత్తి దారులనుంచి అధికంగా చౌకగా స్వీకరించిన వైశ్యుడు నాకు ధనసమృద్ధి అత్యధికంగా కలగాలంటు దేవతల్ని అర్చిస్తున్నాడు. దీని అర్థం ఏమిటి ? తాను కొనేటప్పుడు బాగా తక్కువ ధర, అమ్మేటప్పుడు బాగా ఎక్కువ వెల రావాలనుకోవడం సబబేనా మరి ?

దేవానారాధ్య సతతం వాంఛంతి చ ధనం నరాః ।
న దేవాస్తత్కరే కృత్వా సమర్థా దాతుమంజసా ॥
అన్యస్మానీయ తే విత్తం ప్రయచ్ఛంతి మనీషితమ్ ।
వాణిజ్యేనాథ దానేన చౌర్యేణాపి బలేన వా ॥
విక్రయార్థం గృహీత్వా చ ధాన్యవస్త్రాదికం బహు ।
దేవానర్చయతే వైశ్యో మహర్ఘ్యం భవేదితి ॥
నాత్ర కిం పరివృత్తేచ్ఛా వాణిజ్యే పరంతప ।
గ్రహణకాలే తు సంప్రాప్తే మహర్ఘం చాపి కాంక్షతి ॥

**(16 - 50, 51, 52, 53)**

మహర్షీ ! ప్రాణులంతా పరాయి సొమ్ముకి ఆశపడేవారే. ఎవరిని నమ్మేది ? తీర్థయాత్రలూ దానధర్మాలూ చదువుసంధ్యలూ అన్నీ వ్యర్థం. లోభులకు ఎవరు ఏది చేసినా అది చెయ్యనట్టే. (లోభమోహావృతానాం వై కృతం తదకృతం భవేత్ - 55). అందుచేత ఓ మహానుభావా ! దయచేసి ఈ యుధాజిత్తు తక్షణం ఇక్కడనుంచి వెళ్ళిపోయేట్టు చూడు. నేను సీతాదేవిలాగా, నీ ఆశ్రమంలో కొడుకుని పెట్టుకుని క్షేమంగా ఉంటాను.

మనోరమ అభ్యర్థనకు భరద్వాజుడు సమ్మతించాడు. హుటాహుటిన యుధాజిత్తు దగ్గరికి వెళ్ళాడు. తక్షణం ఆ ప్రాంతం విడిచిపెట్టి ఇంటికి వెళ్ళిపొమ్మని ఆజ్ఞాపించాడు. యుధాజిత్తు బతిమాలుకుంటున్న ధోరణిలో మాట్లాడాడు.



భరద్వాజర్షీ ! ఇదేమి అన్యాయం. నేను మీ ఆశ్రమంలోకి రాలేదు. దుర్దర్శుడి నగరంలో ఉన్నాను. మీరింత హఠం చేస్తే ఎలాగ ! పోనీలెండి. మీరన్నట్టే వెళ్ళిపోతాను. మనోరమను విడిచిపెట్టండి. అందాకా నేను కదలను. బలవంతంగానైనా తీసుకుపోతాను. ఇదిమాత్రం నిజం - అన్నాడు యుధాజిత్తు.

ఓయీ ! క్షత్రియోత్తమా ! తీసుకువెళ్ళు నీకు చేతనైతే. విశ్వామిత్రుడు వసిష్ఠుడి ఆశ్రమంనుంచి నందినీ ధేనువును తీసుకువెళ్ళినట్టు, నువ్వూ నా ఆశ్రమంనుంచి మనోరమను బలాత్కారంగా తీసుకువెళ్ళు. అదీ చూస్తాను - అంటూ భరద్వాజుడు ఆశ్రమానికి తిరిగి వచ్చేశాడు. ***(అధ్యాయం - 16, శ్లోకాలు - 60)***

యుధాజిత్తు తన వృద్ధ మంత్రి సుబుద్ధితో సంప్రదించాడు. సుబుద్ధీ ! ఇప్పుడు ఏమి చెయ్యాలో బాగా ఆలోచించి చెప్పు. నాకయితే మనోరమను కొడుకుతో సహా బలవంతంగానైనా సరే లాక్కురావాలని ఉంది. శత్రువు చిన్నపిల్లవాడే కదా అని ఉపేక్షించడం శ్రేయస్కరం కాదు. అది క్షయలాగా పెరిగి చివరికి ప్రాణం తీస్తుంది. ఇక్కడ సైన్యం ఉన్నదా, యోధులున్నారా ? నన్ను అడ్డగించేవాళ్ళు ఎవరు ? సుదర్శనుణ్ణి ఒక్కవేటుకి చంపేస్తాను. మనవడి రాజ్యాన్ని అకంటకం చేస్తాను. ఇక నిశ్చింత. ఇక నిర్భయం.

ఈ సాహసోక్తులకు సుబుద్ధి ఆశ్చర్యపోయాడు. సాలోచనగా తన అభిప్రాయం చెప్పాడు. మహారాజా ! సాహసానికి ఇది చోటు కాదు. ముని మాటలు విన్నావుకదా ! విశ్వామిత్రుడి దృష్టాంతం చెప్పాడు. ఆ కథ నీకు తెలీదనుకుంటాను. టూకీగా మనవి చేస్తాను. విను.

వెనకటికి విశ్వామిత్రుడనే క్షత్రియు డొకడున్నాడు. గాధి పుత్రుడు. మహాపరాక్రమశాలి. శస్త్రాస్త్రకోవిదుడు. అపార సైన్యంతో ఒకసారి, అడవిలో తిరుగుతూ తిరుగుతూ వశిష్ఠాశ్రమానికి వెళ్ళాడు. పరస్పరం అతిథిమర్యాదలు అయ్యాయి. వశిష్ఠుడు సైన్యంతో సహా అందరికీ గొప్ప విందు ఇచ్చాడు. కామధేనువు సంతానమైన నందినీధేనువు అనుగ్రహంతో భక్ష్యభోజ్యాదులన్నీ అందరికీ పుష్కలంగా అందాయి.

విశ్వామిత్రుడి కళ్ళు నందినీధేనువు మీద పడ్డాయి. ఆ ధేనువును తనకు ఇమ్మని అడిగాడు. దానికి బదులుగా కోటిగోవులను ఇస్తానన్నాడు. అయినా వసిష్ఠుడు తిరస్కరించాడు. ఇది హోమధేనువు. దీనిని ఇవ్వనుగాక ఇవ్వను. కోటికాదు పదికోట్ల గోవులను ఇచ్చినాసరే దీనిని ఇచ్చేది లేదు - అని ఖండితంగా చెప్పాడు. అయితే బలాత్కారంగా తీసుకుపోతానన్నాడు విశ్వామిత్రుడు. నీ ఇష్టం, ప్రయత్నించు అన్నాడు వసిష్ఠుడు.

విశ్వామిత్రుడి ఆజ్ఞ మేరకు సైనికులు నందినీధేనువును కట్టువిప్పి లాక్కువచ్చారు. అది వసిష్ఠుడివైపు దీనంగా చూస్తూ - మహర్షీ ! నేనేమి తప్పుచేశాను ? నన్ను ఎందుకని వీళ్ళకి ఇచ్చేస్తున్నావు? అని అడిగింది. అమ్మా ! నేను ఇవ్వడం లేదు. వీళ్ళే బలవంతంగా లాక్కుపోతున్నారు. నేనేమి చేసేది ! అసహాయుణ్ణి. పైగా విశ్వామిత్రుడు ఇప్పుడు నాకు అతిథి - అన్నాడు వసిష్ఠుడు.



నందినీధేనువుకి తనువంతా క్రోధం ఆవేశించింది. క్రూరంగా భీకరంగా అంభారావం చేసింది. రెప్పపాటుకాలంలో ధేనువు రోమకూపాలనుంచి కోట్ల సంఖ్యలో సాయుధులూ సకవచులూ అయిన రాక్షసులు ఆవిర్భవించి విశ్వామిత్రుడి సైన్యాన్ని నిరవశేషంగా నాశనం చేశారు. దిక్కుతోచని విశ్వామిత్రుడు ఒక్కడూ ఒంటరిగా బతుకుజీవుడా అని బయటపడ్డాడు. తనను తాను నిందించుకున్నాడు. క్షాత్రబలం అసలు బలమేకాదు. బ్రహ్మబలమే బలం అని ఒక నిశ్చయానికి వచ్చి కారడవులలో ఘోరతపస్సులు చేశాడు. క్షాత్రాన్ని వదిలించుకుని కట్టకడపటికి బ్రహ్మర్షి అయ్యాడు.

ఇదీ విశ్వామిత్రుడి ఇతిహాసం. యుధాజిన్నరేంద్రా ! ఇతణ్ణి దృష్టాంతంగా చెప్పడంలో భరద్వాజుడి ఆంతర్యం ఏమిటో ఇప్పుడు తెలిసిందా ? అందుచేత సాహసం చెయ్యకు. క్షాత్రపౌరుషాలు మహర్షుల దగ్గర చెల్లవు. కాదని బలప్రదర్శన చేశావో వంశనాశనం అవుతుంది. త్వరగా బయలుదేరు. ముందు భరద్వాజుణ్ణి ప్రసన్నుణ్ణి చేసుకో, కిమ్మనకుండా మన దారిన మనం క్షేమంగా ఉజ్జయినికి చేరుకుందాం. సుదర్శనుణ్ణి ఇలాగే ఈ ఆశ్రమంలో ఉండనీ. బాలుడు. పైగా నిర్ధనుడు. ఇతడు నీకు చెయ్యగలిగిన అపకారం ఏముంది కనక ! అనాథ దుర్బల శిశువులపట్ల వైరం వహించడం శుద్ధ దండుగ. ఎవరైనా విన్నా హర్షించరు. రాజేంద్రా ! ఈ జగత్తు అంతా దైవాధీనం. మనం సర్వత్రా దయామయులమై ఉండాలి. ఈర్ష్యపడకు. పడీ, చెయ్యగలిగింది లేదు. ఏది జరగాలనుంటే అది జరుగుతుంది.

**దయా సర్వత్ర కర్తవ్యా దైవాధీన మిదం జగత్ ।**<br>
**ఈర్ష్యయా కిం నృపశ్రేష్ఠ! యద్భావ్యం తద్భవిష్యతి ॥**<br>
**వజ్రం తృణాయతే రాజన్! దైవయోగా న్న సంశయః ।**<br>
**తృణం వజ్రాయతే క్వాపి సమయే దైవయోగతః ॥**<br>
**శశకో హంతి శార్దూలం మశకో వై యథా గజమ్ ।**<br>
**సాహసం ముంచ మేధావిన్! కురు మే వచనం హితమ్ ॥**

**(17 - 28, 29, 30)**

దైవయోగం కలిసి రాకపోతే వజ్రాయుధం కూడా గడ్డిపరక అవుతుంది. కలిసివస్తే గడ్డిపరకయినా వజ్రాయుధమవుతుంది. కాలం కలిసివస్తే కుందేలు పిల్ల బెబ్బులిని చంపుతుంది. గడ్డిదోమ ఏనుగును చంపుతుంది. అందుచేత, ఓ మేధావీ! సాహసం చెయ్యకు. నామాట విను. హితం చెప్పాను.

జనమేజయా! సుబుద్ధి చేసిన ఈ ఉపదేశంతో యుధాజిత్తు కళ్ళు తెరిచాడు. బుద్ధిగా వెళ్ళి భరద్వాజుడికి సాష్టాంగ నమస్కారం చేసి, సెలవు తీసుకుని ఉజ్జయినికి తరలిపోయాడు. మనోరమ మనస్సు కుదటపడింది.



సుదర్శనుడు మునిబాలకులతో కలిసి నిర్భయంగా సంచరిస్తూ క్రీడిస్తూ విద్యలభ్యసిస్తూ దినదిన ప్రవర్ధమానుడవుతున్నాడు. ఒకరోజున ఒక మునిబాలకుడు ఆటల సందడిలో విదల్లుణ్ణి చూసి "క్లీబా"! అని (నపుంసకా) గట్టిగా అరిచి సంబోధించాడు. అతణ్ణి పిలవాలనిగానీ అవమానించాలనిగానీ ఏదో పని చెప్పాలని గానీ మునిబాలకుడి ఉద్దేశం కాదు. ఆటలో ఆటగా, మనిషి కనపడ్డాడు గదా అని అరిచాడంతే. విదల్లుడి కదలికల్లో కనిపించే సుకుమారత బహుశ మునిబాలకులకు ఈ చనువు ఇచ్చి ఉంటుంది.

సుదర్శనుడు ఈ పదం విన్నాడు (క్లీబ). అందులో మొదటి అక్షరాన్ని అనుస్వారం చేర్చి ధారణ చేశాడు. మళ్ళీ మళ్ళీ అదే అదే మనస్సులో జపించాడు. అది మంత్రబీజం. మహారాజకామరాజాఖ్య బీజాక్షరం. భావియోగమో బాల్యచాపల్యమో సుదర్శనుడు తదేకదీక్షగా జపించాడు. జపిస్తూనే క్రీడిస్తున్నాడు. జపిస్తూనే నిద్రిస్తున్నాడు. సర్వకాలసర్వావస్థలలోనూ క్లీం బీజాక్షర మహాజపం కొనసాగిస్తున్నాడు. అది మంత్రసారమనిగానీ బీజాక్షరమనిగానీ తెలీదు. మనసులో పడింది. ఎందుకు పడిందో. అలా జపిస్తున్నాడంతే. ఆ మంత్ర జపానికిఋషిలేడు, ఛందస్సు లేదు, ధ్యానం లేదు, న్యాసం లేదు. ఏమీ లేదు. అప్రయత్నంగా నిరంతరంగా జపం సాగిపోతోంది.

రాకుమారుడికి పదకొండేళ్ళ వయస్సు వచ్చింది. మునులు అందరూ కలిసి ఉపనయం జరిపించారు. వేదాభ్యాసం చేయించారు. ధనుర్వేదం నేర్పారు. నీతిశాస్త్రం నేర్పారు. ఇంకా చాలా శాస్త్రాలు చెప్పారు. అతడికి అన్నీ క్షణంలో కరతలామలకం అవుతున్నాయి. మంత్రాక్షరబలం అటువంటిది.

ఒకరోజున ఏకాంతంలో సుదర్శనుడికి దేవి ప్రత్యక్షమయ్యింది. రక్తాంబరధారిణి. రక్తవర్ణ. రక్తసర్వాంగభూషణ. గరుడవాహనం మీద వైష్ణవీశక్తిగా దర్శనం అనుగ్రహించింది. సుదర్శనుడు ప్రసన్నవదనుడయ్యాడు. పేరు సార్థకమయ్యింది.

**రక్తాంబరాం రక్తవర్ణాం రక్త సర్వాంగభూషణామ్।**
**గారుడే వాహనే సంస్థాం వైష్ణవీం శక్తిమద్భుతామ్ ॥ (17 - 43)**

యథావిధిగా మాతృసేవ చేసుకుంటూ సుదర్శనుడు ఆశ్రమప్రాంతాలలో త్రికూట గిరిశిఖరాలపై లోయలలో గుహలలో సెలయేరులలో నదీతీరంలో క్రీడిస్తూ సంచరిస్తున్నాడు.

ఆ సర్వవిద్యార్థ తత్త్వవేత్తకు ఒకరోజున నదిఒడ్డున ఒక దివ్య ధనుస్సు దొరికింది. రత్నాలలా మెరిసిపోతున్న ములుకులతో శిలాకఠినమైన బాణాలున్న తూణీరమూ (అంబులపొది) దొరికింది. వజ్రకవచమూ దొరికింది. ఇవన్నీ ఆ యువకుడికి దేవీప్రసాదాలు.



## ◆ శశికళా సుదర్శనుల పరిచయం ◆

కాశీనరేశ్వరుడికి శశికళ అనే అమ్మాయి ఉంది. రూప యౌవన సంపన్న. గుణవతి. శుచిస్మిత సుదర్శనుణ్ణి గురించి వందిజనులవల్ల కర్ణాకర్ణికగా వింది. మనస్సులో అనురాగం అంకురించింది పరిణయం ఆడాలని నిశ్చయించుకుంది. అదేరోజు రాత్రి, కలలో జగదంబ కనిపించింది. సుదర్శనుడు నా భక్తుడు. అతణ్ణి నువ్వు వరించడం సమంజసమే. వివాహం చేసుకో. నీకు సకల మనోభీష్టాలూ తీరతాయి. ఇది నా వరం - అని చెప్పి అదృశ్యమయ్యింది. శశికళ ఆనందానికి అవధులు లేవు. నిద్రలేచి గంతులు వేసింది. ఈ సంబడానికి కారణమేమిటని సఖీజనం అడిగినా కన్నతల్లి అడిగినా కిలా కిలా నవ్వింది తప్ప, సిగ్గుతో ముడుచుకొందే తప్ప ఎవ్వరికీ అసలు సంగతి చెప్పలేదు.

ఒకరోజున అత్యంతాప్తురాలైన ఇష్టసఖిని తీసుకుని వనవిహారానికి బయలుదేరింది. ఆ పువ్వులూ ఈ పువ్వులూ కోస్తూ మెల్లమెల్లగా స్వప్నవృత్తాంతం చెప్పింది. అంతలోకీ అటువైపు వస్తూ ఒక బ్రాహ్మణుడు కనిపించాడు. శశికళ ఎదురువెళ్ళి భక్తిప్రపత్తులతో పాదాభివందనం చేసింది. మధురంగా సంభాషించింది.

విప్రోత్తమా! ఎక్కడనుంచి రాక?

కల్యాణీ! భరద్వాజాశ్రమం నుంచి. ఏం అడుగుతున్నావు, నీకేం పని?

అహఁ! ఏమీ లేదు. ఊరికే తెలుసుకుందామని అడిగాను - అంతే.

అలాగా, అయితే నే వెళ్ళిరానా?

వెడుదురుగాని, ఒక్కనిమిషం. ఆశ్రమాలు చాలా అందంగా ఉంటాయంటారు కదా, మరిమీ భరద్వాజాశ్రమంలో వింతలూ విడ్డూరాలూ, లోకాతీతమైన విశేషాలూ చూసితీరవలసిన సుందర.......

ఉన్నాయి, ఉన్నాయి. బోలెడున్నాయి. ఏం వెళ్ళి చూస్తావా?

అహఁ! వెడదామనీ కాదు, చూద్దామనీ కాదు. ఊరికే తెలుసుకుందామని. బోలెడున్నా యన్నారుగదా! ఏదీ, ఒక్కటంటే ఒక్కటి, లోకాతీత విశేషం, చూసితీరవలసిన సుందర సన్నివేశం కాస్త వీనులవిందు చెయ్యండి.

ఓ దానికేమి! మా భరద్వాజాశ్రమంలో చూసితీరవలసిన సుందరాంగుడు ఒక్కడే ఒక్కడున్నాడు. పేరు సుదర్శనుడు. సార్థక నామధేయుడు. అయోధ్యాధీశ్వరులు ధ్రువసంధి నామధేయుల కుమారుడు. అతణ్ణి చూసితీరవలసిందే. చూడనివాళ్ళ కళ్ళు నిష్ఫలం. అన్ని సద్గుణాలనూ ఒక్కచోట రాసిపోసి చూడాలనుకున్నాడు కాబోలు సృష్టికర్త, అతణ్ణి సృష్టించి తృప్తిచెందాడు. అమ్మాయీ! మనసులో మాట



చెబుతున్నాను. మరోలా అనుకోకు. నీకు అన్ని విధాలా అతడు యోగ్యుడు. నువ్వూ అలాగే అతనికి తగుదువు. మీ ఇద్దరి వివాహమూ మణి కాంచన సంయోగంలా అందగిస్తుంది. శీఘ్రమేవ కల్యాణ ప్రాప్తిరస్తు, మనోవాంఛా ఫలసిద్ధిరస్తు - అంటూ ఆ బ్రాహ్మణుడు చకచకా వెళ్ళిపోయాడు.

*(అధ్యాయం-17, శ్లోకాలు - 62)*

జనమేజయా! బ్రాహ్మణవచనంతో శశికళ మనస్సులోని అనురాగం మారాకు తొడిగింది. అతణ్ణే తలుచుకుంటూ అంతఃపురం చేరుకుంది. మన్మథుడు విల్లంబులకు పనిచెప్పాడు. చెలికత్తెలు శీతలోపచారాలు చేశారు. కానీ అవి ఏవీ శశికళకు ఉపశమనాన్ని ఇవ్వలేకపోయాయి. విరహంలో వేగిపోతోంది.

చెలీ! ఇది చందనం కాదే, విషం తెచ్చి నాకు తనువంతా పులిమారు. ఇవి పూలదండలు కావే, పాములు తెచ్చి వేశారు. ఇది వెండివెన్నెలకాదే, మండుటగ్ని. సౌధంలో సుఖం లేదు. దిగుడు బావిలో చల్లదనం లేదు. ఉద్యానవనంలో ప్రశాంతి లేదు. పగలు గడవడం లేదు. రాత్రి నడవడం లేదు. పడకమీద కూర్చోలేకపోతున్నాను. నేలమీద నిలవలేకపోతున్నాను. తాంబూలం రుచించడంలేదు. సంగీతం వినాలనిపించడం లేదు. కళ్ళకు ఏదో అసంతృప్తి. అడవిలో ఆశ్రమానికి వెళ్ళాలి. ఆ మోసగాణ్ణి (శఠుణ్ణి) చూడాలి. వెడదామంటే, అస్వతంత్రురాలిని. తండ్రి ఒద్దికలో ఉన్నదానిని. కులాచారం అడ్డు వస్తోంది. సిగ్గేమో ముంచుకు వస్తోంది. పోనీ అంటే తండ్రి స్వయంవరం ప్రకటించడు. ఏం చెయ్యను? ఆ రాకుమారుడు సుదర్శనుడికి నన్ను నేను సమర్పించుకుంటాను. ఎంతమంది లేరు ఈ భూలోకంలో రాకుమారులు. వందలూ వేలూ ఉన్నారు. ఎంతెంతో సంపన్నులున్నారు. కానీ వాళ్ళెవరూ నాకు నచ్చరు. రాజ్యహీనుడైనా సుదర్శనుడికే నా మనస్సు అంకితం - ఇలా పరితపిస్తోంది శశికళ.

జనమేజయా! పరివారంలేక, సంపదలులేక, సైన్యంలేక, రాజ్యంలేక ఒంటరివాడై వనవాసం చేస్తూ, కందమూల ఫలాలు తింటున్న సుదర్శనుడు ఆ రాకుమారి మనస్సులో తిష్ఠవేశాడు. ఇదంతా బీజాక్షర జపఫలమే. అతడు మాత్రం జపాన్ని కొనసాగిస్తూనే ఉన్నాడు. ఆ విశ్వమాతను విష్ణుమాయా మండితను సర్వసంపత్కరను రోజూ స్వప్నంలో దర్శిస్తూనే ఉన్నాడు.

ఒకరోజున శృంగబేరపురాధిపతి నిషాదరాజు దుర్దర్శనుడు దర్శనానికి వచ్చి సర్వాలంకారశోభితమైన రథాన్ని- పతాకావరమండితమైన జైత్రరథాన్ని- చతురశ్వసమన్వితంగా బహూకరించాడు. మిత్రుడు ఇస్తున్నాడుకదా అని సుదర్శనుడు ప్రేమగా స్వీకరించాడు. కందమూలఫలాలతో ఆతిథ్యం ఇచ్చి పంపించాడు. ఆశ్రమంలో మునులంతా రథాన్ని చూసి సంబరపడ్డారు. రాకుమారా! నీకు రాజ్యం ప్రాప్తిస్తుంది. తప్పదు. అనతికాలంలోనే నువ్వు సింహాసనం అధిష్ఠిస్తావు. జగదంబిక ప్రసన్నురాలయ్యింది. వరాలు కురిపిస్తోంది. ఇక నిశ్చింతగా ఉండు - అంటూ ఆశీర్వదించారు. తల్లినీ అలాగే ఊరడించారు.



మనోరమ సంతోషించిందే కానీ మనస్సులో శంక ఉండిపోయింది. మహర్షులారా! మీమాట నిజమవ్వాలి. అంతకంటే కావలసింది ఏముంది! వీడు మీ దాసుడు. సజ్జనులను సేవించిన ఫలం ఊరికేపోతుందా? అమోఘాలు సృష్టిస్తుంది. ఆశ్చర్యమేముంది. కానీ, ఒక సైన్యం లేదు, మంత్రిలేడు, కోశం (ధనం) లేదు. సహాయకుడు లేడు. మరి ఏ యోగంతో నా కుమారుడు సింహాసనం అధిష్ఠిస్తాడో! కేవలం మీ ఆశీర్వాదాలవల్లనే ఇది జరగాలి. జరుగుతుంది. సందేహం లేదు. మీరంతా మంత్రవేత్తలు - అని నమస్కరించింది.

రథారూఢుడై సుదర్శనుడు ఎటువెళ్ళినా అక్షౌహిణీసేనా సమాయుక్తుడై ఉన్నట్టు వెలిగిపోతున్నాడు. ఇదంతా మంత్రబీజాక్షర ప్రతాపం. జనమేజయా! ఆ కామరాజ బీజాక్షరాన్ని శుచిగా శాంతచిత్తంతో ఎవరు జపించినా ఇలాగే ఉంటుంది. సకలవాంఛలూ నెరవేరతాయి. భూలోకంలో కానీ పైలోకాలలోకానీ అతడికి దుర్లభమనేది ఉండదు. అప్రాప్యమనేది ఉండదు. అంతా శక్తి అనుగ్రహం. అమ్మవారిపట్ల విశ్వాసంలేని మందభాగ్యులు అన్నింటా నష్టాలనూ కష్టాలనూ ఎదుర్కొంటారు. రోగపీడితులవుతారు. సర్వదేవతలకూ జననిగా ఆదిమాతగా కీర్తింపబడే పరాశక్తి దయచూస్తే బుద్ధి కీర్తి ధృతి లక్ష్మి శక్తి శ్రద్ధ మతి స్మృతి అన్నీ సమకూడుతాయి. అందరికీ ప్రత్యక్షదైవం ఆదిపరాశక్తి. మూఢులు మాయావృతులై ఈ రహస్యం తెలుసుకోలేరు. కుతర్కాలు చేస్తారు. బ్రహ్మవిష్ణుమహేశ్వరులూ అష్టదిక్పాలకులూ సూర్యచంద్రులూ అష్టవసువులూ విశ్వేదేవతలూ నిరంతరం సృష్టిస్థితిలయకారిణిని ధ్యానిస్తూనే ఉంటారు. అటువంటిది, తెలివైనవాణ్ణి అనుకుంటున్న మానవుడు ధ్యానించకపోతే అంతకన్నా దురదృష్టం ఏమైనా ఉందా! సుదర్శనుడు ఈ రహస్యం తెలుసుకున్నాడు. అర్చించాడు. సాక్షాత్పరబ్రహ్మ ఆ విద్యావిద్యా స్వరూపిణి, యోగగమ్య, ముముక్షువులకు దిక్కు.

అఖిలాత్ముడైన పరమాత్మకే ఈ త్రివిధసృష్టినీ చేసి చూపించే మహాదేవిని ధ్యానించుకుంటూ, రాజ్యలాభంకంటే మించిన ఆనందాన్ని అనుభవిస్తూ సుదర్శనుడు ఆశ్రమంలో హాయిగా సుఖంగా కాలం గడుపుతున్నాడు. శశికళ మాత్రం విరహంలో వేగిపోతోంది. ఎన్ని ఉపచారాలు చేసినా ఫలం కనిపించడం లేదు. దుఃఖిస్తోంది.

తండ్రి సుబాహుడికి (కాశీనరేశ్వరుడు) విషయం తెలిసింది. వెంటనే స్వయంవరం ప్రకటించాడు. రాజవంశాలకు మూడురకాల స్వయంవరాలను పెద్దలు చెప్పారు. ఒకటి ఇచ్ఛాస్వయంవరం. కోరినవాడిని స్వయంగా వరించి మెడలో దండ వెయ్యడం. రెండవది పణస్వయంవరం. శివధనుస్సును ఎక్కుపెట్టిన రాముణ్ణి సీత వరించడం. మూడవది శౌర్యశుల్క స్వయంవరం. ఇది కేవలం శూరులకే. వచ్చిన మహావీరులనందరినీ జయించి రాకుమారిని చేపట్టడం. వీటిలో సుబాహుడు ఇచ్ఛాస్వయంవరం ప్రకటించాడు.



శిల్పులు వచ్చి వివిధాకారాలలో సభ్యమండపాలను నిర్మించారు. అందంగా వేదికలను తీర్చిదిద్దారు. మిగతా ఏర్పాట్లు అన్నీ చురుకుగా సాగుతున్నాయి. రాజపుత్రులకు ఆహ్వానాలు వెడుతున్నాయి. శశికళ గ్రహించింది. మనసులోమాట తల్లిదండ్రులకు చెప్పవలసిన తరుణం ఇదే అనుకొంది. అంతరంగికురాలైన ఇష్టసఖిని పిలిచింది.

సఖీ! నువ్వువెళ్ళి మా అమ్మతో చెప్పవే. ఏకాంతంగా ఉన్నప్పుడు చెప్పు. నేను ధ్రువసంధి మహారాజుగారి అబ్బాయి సుదర్శనుడికి మనసు ఇచ్చాననీ, అతణ్ణి తప్ప మరెవ్వరినీ వరించననీ, ఇది ఆదిపరాశక్తి సంకల్పమనీ చెప్పిరా.

ఇష్టసఖి వెళ్ళి చెప్పింది. వైదర్భి (తల్లిపేరు) తన భర్తకు చెప్పింది. కాశీనరేశ్వరుడు సుబాహుడు పకపకా నవ్వాడు. రాజ్యహీనుడు, ఏకాకి, తల్లితో భరద్వాజాశ్రమంలో తలదాచుకుంటున్న నిర్ధనుడు ఆ సుదర్శనుడా మన అమ్మాయికి నచ్చినవాడు. వీలులేదు. నాకు అల్లుడు కావడానికి అతడికి ఏ యోగ్యతలూ లేవు. ఇది అప్రియమే కావచ్చు. కానీ ఏదో సమయంలో నువ్వు మీ అమ్మాయికి చెప్పు. ఆహ్వానాలందుకుని అప్పుడే రాకుమారులు - స్థితిమంతులు - స్వయంవరానికి వస్తున్నారు. తెలుసా?

***(అధ్యాయం - 18, శ్లోకాలు - 55)***

శౌనకాది మహామునులారా! శ్రద్ధగా వింటున్నారుగదా! కథ మంచి రసకందాయంలో పడింది. సుదర్శనుడే కావాలంటోంది అమ్మాయిగారు. కుదరదంటున్నారు తండ్రిగారు. వ్యాసుడు కథ కొనసాగించాడు. జనమేజయుడు ఆసక్తిగా వింటున్నాడు.

వైదర్భి తన కూతురిని పిలిపించింది. ఒడిలో కూర్చోబెట్టుకుంది. ప్రేమగా తలనిమురుతూ ఓదార్చింది. ఏమిటమ్మా! ఈ విరహాలూ తాపాలూను. ఎలా చిక్కిపోయావో చూడు. నువ్వు బాధపడుతున్నావు, నన్ను బాధపెడుతున్నావు. దయచేసి మీ నాన్నగారి మనస్సు నొప్పించకు. ఆ సుదర్శనుడు చాలా దురదృష్టవంతుడుట. అతడికి సైన్యం లేదు. కోశం లేదు. రాజ్యం లేదు. బంధుమిత్రులు అందరూ వదిలేశారుట. ఏకాకిట. కందమూలాలు తింటూ ఆశ్రమంలో తల్లీ తానూ తలదాచుకుంటున్నారుట. అతడు నీకు యోగ్యుడు ఎలా అవుతాడమ్మా? ప్రతిభావంతులూ రూపవంతులూ సంపన్నులూ - రాకుమారులు ఎంతోమంది ఉన్నారు. వారు నీకు యోగ్యులు. పోనీ - అంతగా అనుకుంటే, సుదర్శనుడి సోదరుడు ఉన్నాడుట. అయోధ్యాసింహాసనం అధిష్ఠించి రాజ్యం చేస్తున్నాడుట. శత్రుజిత్తు అని అతడిపేరుట. రూపయౌవన సంపన్నుడూ సర్వలక్షణ సంయుతుడూ అని అందరూ చెప్పుకుంటున్నారుట. అతడూ వస్తాడు స్వయంవరానికి. నచ్చుతాడేమో చూడు.



శశీ! మరొక ముఖ్య విషయం చెబుతాను విను. ఉజ్జయినీ పురాధీశ్వరుడు యుధాజిన్న రేంద్రుడున్నాడే బహుచండశాసనుడు. సుదర్శనుడి తాతగారు శూరసేనుణ్ణి చంపి తన మనుమడు శత్రుజిత్తుకు అయోధ్యా పట్టం కట్టబెట్టింది ఇతడే. ఇప్పుడేమో సుదర్శనుణ్ణి పరిమార్చడానికి కాపువేసి కూర్చున్నాడు. రవ్వంత అవకాశం దొరికితే చాలు వేసేస్తాడు. ఆ మధ్యన ఆశ్రమానికి కూడా వచ్చాడుట. భరద్వాజుడు తరిమేస్తే ఏ కళనున్నాడోగానీ కిమ్మనకుండా వెళ్ళిపోయాడుట. అందరూ ఆదమరిచిన వేళ అతడగాడు మళ్ళీ ఎప్పుడైనా రావచ్చు. సంకల్పం నెరవేర్చుకోవచ్చు. తన మనుమడికి శత్రుపీడ వదిలించాలని అతడి దీక్ష. ఎందుకమ్మా! కోరి కష్టాలు తెచ్చుకోవడం. నా మాట విను. మరింక ఏ రాకుమరుణ్ణైనా సరే వరించు. హాయిగా వివాహం జరిపిస్తాను.

మాతా! అడవులపాలైనా సరే సుదర్శనుడే నాకు ఇష్టం. అతడే నా వరుడు. సుకన్యా చ్యవనుల్లాగా కలిసిమెలిసి ఉంటాం. కష్టాలు రానీ కడగండ్లు రానీ. పతికి సేవ చెయ్యడాన్ని మించి సతికి ధర్మం లేదు. అదే స్వర్గప్రదం. అదే మోక్షప్రదం. పైగా ఇది దేవీ సంకల్పం. కలలో కనిపించి ఆదేశించింది. సుదర్శనుడు నా భక్తుడు, అతణ్ణి చేసుకో, సకలవాంఛలూ సిద్ధిస్తాయని జగదీశ్వరి ఆజ్ఞాపించింది. నా చిత్తభిత్తికమీద అతడి రూపాన్ని చిత్రించింది. అతడు తప్ప మరొకరిని భర్తగా అంగీకరించలేను. ఏ ఒత్తిడీ లేకుండా, ఏ లౌక్యమూ లేకుండా (అకైతవకృతం) ఇష్టపడి చేసుకున్నదే ఆనందదాయకం.

శశికళ ఇంత స్పష్టంగా కచ్చితంగా చెప్పింది. తన మందిరానికి వెళ్ళిపోయింది. వైదర్భీదేవి పూసగుచ్చినట్టు విషయమంతా భర్తకు నివేదించింది. ఏమి చెయ్యడమా అని ఆలోచనలో పడ్డాడు సుబాహుడు.

రేపు స్వయంవరమనగా, శశికళ ఒక వేదపండితుణ్ణి పిలిచి పాదపూజలు జరిపించింది. మహారాజుకు తెలియకుండా తమరు భరద్వాజాశ్రమానికి వెళ్ళిరావాలి అంది. అక్కడ సుదర్శనుడికి ఈ స్వయంవరం సంగతి చెప్పండి. రేపటికి బయలుదేరి రమ్మనండి. నేను అతణ్ణి తప్ప మరెవ్వరినీ వరించను. అతడికే మనస్సు మీదుకట్టాను. ఇది దేవీ సంకల్పం. స్వప్నంలో కనిపించి చెప్పింది. అప్పటినుంచీ అతడికోసం ఎదురుచూస్తున్నాను. అతడు రాకపోతే ఇంత విషం మింగి అగ్నిలో దూకుతాను. అంతే. ఆదిపరాశక్తి సంకల్పానికి తిరుగుండదు. ఆ దైవబలాన్నే నమ్ముకుని రేపు స్వయంవర సమయానికల్లా వేదికకు దయచెయ్యమని నా మాటగా చెప్పిరండి. ఇంకా ఏమేమి చెబుతారో, ఎలా చెబుతారో మీ ఇష్టం. రేపు అతడు రావాలి అంతే. క్షేమంగా వెళ్ళి లాభంగా రండి.

యదధీనం జగత్సర్వం వర్తతే పచరాచరమ్ ।
భగవత్యా యదాదిష్టం న తన్మిథ్యా భవిష్యతి । (19 - 22)

విప్రుడు వెళ్ళి చెప్పివచ్చాడు. సుదర్శనుడు స్వయంవరానికి వెళ్ళాలని నిర్ణయించుకున్నాడు. భరద్వాజుడు ఆమోదించి ఆశీర్వదించాడు. బయలుదేరుతున్న కొడుకుని చూసి మనోరమ కంగారుపడింది.



నాయనా సుదర్శనా! ఎక్కడికీ ప్రయాణం? రాజమండలిలోకా? అక్కడికి యుధాజిత్తుకూడా వస్తాడు. తెలుసా? ఏకాకిగా దొరుకుతావు. నీవెంట ఒక్కడంటే ఒక్కడు సహాయకుడు లేడు. వద్దు, నాయనా వద్దు. వెళ్ళకు. నన్ను దిక్కులేనిదాన్ని చెయ్యకు. నీమీదనే పంచప్రాణాలూ పెట్టుకుని ఉన్నాను. నువ్వే నాకు ఆధారం. నువ్వు పెరిగి పెద్దవాడవై కళ్ళయెదుట కదలాడుతూంటే - అంతేచాలు. దయచేసి నన్ను హతాశురాలిని చెయ్యకు. నా తండ్రిని చంపిన ఆ క్రూరుడి చేతికి నువ్వు చిక్కకు.

అమ్మా! భయపడకు. జరగవలసింది జరుగుతుంది. దానికి విచారమెందుకు? అదీకాక, జగన్మాత ఆదేశం మీద వెడుతున్నాను. అన్నీ ఆవిడే చూసుకుంటుంది. మనకేమీ భయం లేదు. క్షత్రియాంగనవైయుండి నువ్వు ఇలా బెంబేలు పడటం సముచితం కాదు.

సుదర్శనుడి కంఠంలో వినిపించిన విశ్వాసం మనోరమకు కొండంత ధైర్యాన్ని ఇచ్చింది. సరేనని ఆమోదించి ఆశీర్వదించింది. పుత్రకా! ముందుండి నిన్ను జగదంబిక రక్షించుగాక! వెనక నిలబడి పార్వతి కాపాడుగాక! కుడియెడమల శివుడు కాచుగాక! మార్గమధ్యంలో వారాహి, దుర్గమ దుర్గాలలో దుర్గమ్మ, కలహరంగంలో కాళిక, స్వయంవర మండపంలో సౌమ్యస్వరూప మాతంగి, రాజమండలిలో భవాని, గిరిదుర్గాలలో గిరిజ, చత్వరాలలో (కూడలిస్థలాలు) చాముండేశ్వరి, కాననాలలో కామేశ్వరి, వివాదాలలో వైష్ణవి, శత్రువ్యూహంలో భైరవి, సర్వప్రదేశాలలోనూ సర్వదా భువనేశ్వరి - నిన్ను కాపాడుదురుగాక!

**సర్వదా సర్వదేశేషు పాతు త్వాం భువనేశ్వరీ ।**
**మహామాయా జగద్ధాత్రీ సచ్చిదానందరూపిణీ ॥ (19 - 39)**

ధైర్యం కూడగట్టుకుని దీవించింది. తీరా రథం కదలబోయేసరికి మళ్ళీ బావురుమంది. కుమారా! సూర్యవంశోద్భవా! నేనుకూడా నీతో వస్తానయ్యా! తీసుకువెళ్ళు. ఇప్పటివరకూ నిన్ను విడిచి ఒక్కక్షణమైనా నేనున్నది లేదు. ఉండలేను. ఆగు. నిమిషంలో వస్తాను - అంటూ పర్ణకుటిలోకి వెళ్ళి ధాత్రితో సహా వచ్చి రథం ఎక్కింది. భరద్వాజాదులందరూ మనస్ఫూర్తిగా శుభం పలికారు. జయం పలికారు.

జైత్రరథం వారణాసి చేరుకుంది. కాశీనరేశ్వరుడు సుబాహుడు సాదరంగా స్వాగతం పలికాడు. రఘూద్వహుడిని విడిదిలో దింపాడు. పరిచర్యలకు సేవకులను నియోగించాడు.

వివిధ దేశాలనుంచి రాకుమారులు చాలామంది వచ్చారు. మనుమడు శత్రుజిత్తును వెంటబెట్టుకు యుధాజిత్తు వచ్చాడు. కురు మద్ర సింధు మాహిష్మతీ పాంచాల పర్వతీయ కామరూప కర్ణాట చోళ వైదర్భ దేశాల రాజపుత్రులు అక్షౌహిణీ సేనలతో తరలి వచ్చారు. నగరంలో ఎక్కడ చూసినా సైనికులే. విడిది



గృహాలన్నీ నిండిపోయాయి. స్వయం వరాన్ని చూడటానికి వచ్చిన దేశవిదేశాల ప్రేక్షకులకు అంతే లేదు. రాకుమారులు కలుసుకుని కాలక్షేపం కబుర్లు చెప్పుకుంటున్నారు.

కాకుత్స్థుడు సుదర్శనుడు వచ్చాడుట. ఏకాకిగా వచ్చాడుట. అమ్మను వెంటబెట్టుకు వచ్చాడుట. ఇంతమందిమి మహాసంపన్నులం ఉండగా మనల్ని అందరినీ వదిలేసి రాకుమారి శశికళ ఇతణ్ణి వరిస్తుంది కాబోలు. ఆశ పాపం! అని నవ్వుకున్నారు.

యుధాజిత్తు కల్పించుకుని - ఇవ్వేళ ఈ స్వయంవరంలో వీణ్ణి నేను చంపితీరతాను అన్నాడు. ఈ మాటకు నీతికోవిదుడైన కేరళాధిపతి అభ్యంతరం చెప్పాడు. ఇది ఇచ్ఛా స్వయంవరం. శుల్క స్వయంవరం కాదు. కాబట్టి బలప్రదర్శనాలూ యుద్ధాలూ ఉండవు. ఉండకూడదు. పెళ్ళికూతురు ఇష్టాన్ని బట్టి ఎవరినో ఒకరిని వరిస్తుంది. అంతే. వివాదానికి తావులేదు. అదీకాక ఇంతకుముందు నువ్వు ఈ సుదర్శనుణ్ణి అన్యాయంగా తరిమేశావు. రాజ్య హీనుణ్ణి చేశావు. బలం ఉంది అని రాజ్యం మనవడికి కట్టబెట్టావు. ఇప్పుడు ఒంటరిగా దొరికాడు కదా అని ఏ పాపమూ ఎరుగని రాకుమారుణ్ణి చంపుతానంటావా? పాపానికి ఫలం అనుభవిస్తావు. ఈ జగత్తుని శాసించడానికి ఒక జగత్పతి ఉన్నాడు. వాడూ అన్నీ గమనిస్తూ ఉంటాడు. సమయం వచ్చినప్పుడు తగిన శాస్తి చేస్తాడు. ఎప్పటికైనా సరే ధర్మమే జయిస్తుంది. అధర్మం జయించదు. సత్యమే గెలుస్తుంది. అసత్యం గెలవదు.

ధర్మో జయతి నాఽధర్మః సత్యం జయతి నానృతమ్ ।
మాఽనయం కురు రాజేంద్ర! త్యజ పాపమతిం కిల ॥ (19 -59)

అందుచేత ఓ యుధాజిన్నరేంద్రా! అన్యాయానికి పాల్పడకు. దుష్టాలోచనలూ పాపిష్టి బుద్ధులూ వదిలిపెట్టు. నీ మనుమడు శత్రుజిత్తు వచ్చాడుగదా! అతడు రూపయౌవన సంపన్నుడేగా. రాజ్యం ఉంది. సంపద ఉంది. ఏమో. శశికళ అతణ్ణే వరిస్తుందేమో! అప్పుడూ కలహం పెట్టుకుంటావా మరి? ఇంకా చాలామంది రాకుమారులున్నారు. ఒకరిని మించిన వారొకరు. ఎవరిని వరిస్తుందో. వరించనివ్వండి. స్వీకరించనివ్వండి. అంతా కన్యామణి ఇష్టం. ఇందులో వాదవివాదాలకి చోటులేదు. పరస్పర విరోధాలూ కలహాలూ ఇప్పుడు ఇక్కడ జరగటానికి వీలులేదు. నేను అంగీకరించను.

*(అధ్యాయం - 19, శ్లోకాలు- 62)*

కేరళాధిపతి మాటలకు యుధాజిత్తు క్రుద్ధుడయ్యాడు. నీతులు చెబుతున్నావు. బాగానే ఉంది. మాకెవ్వరికీ ఆమాత్రం తెలీదనుకోకు. యోగ్యులు ఇంతమంది ఉండగా అందరినీ కాదని ఆ కన్యామణి ఒక అయోగ్యుణ్ణి వరిస్తే చూస్తూ ఊరుకోమంటావా? అది న్యాయమేనా? నీకు రుచిస్తుందేమోకానీ,



మేము సహించం. సింహానికి దక్కవలసిన భాగాన్ని నక్క ఎత్తుకు పోడానికి వీల్లేదు. ఈ కన్యారత్నానికి సుదర్శనుడు అర్హుడు కాదు. విప్రులకు వేదం - బలం, క్షత్రియులకు ధనుర్నాదం - బలం ఇది నీతి. ఇందులో అన్యాయం ఏమీలేదు.

భాగం సింహస్య గోమాయుః భోక్తుమర్హతి వా కథమ్ ।
తథా సుదర్శనోఽయం వై కన్యారత్నం కిమర్హతి ॥ (20 - 4)
బలం వేదో హి విప్రాణాం భూభుజాం చాపజం బలమ్ ।
కిమన్యాయ్యం మహారాజ ! బ్రవీమ్యహమిహాధునా ॥ (20 - 5)

మరొక్కమాట చెబుతున్నాను. మీరంతా వినండి. క్షత్రియులకి బలమే శుల్కం కనక బలవంతుడే గ్రహించాలి గానీ, కన్యామణిని బలహీనుడు గ్రహించడానికి వీలులేదు. కాబట్టి సుబాహుడు పుత్రికారత్నాన్ని పణంగాపెట్టి స్వయంవరం జరపవలసిందే. మరోలా జరిగితే యుద్ధం తప్పదు.

ఈ గర్వోక్తులతో రాకుమారులలో కలకలం బయలుదేరింది. వాదవివాదాలు చెలరేగాయి. కత్తులు దూశారు. అంతలోనే శాంతించారు. కూడబలుక్కుని ఒక నిర్ణయానికి వచ్చారు. సభామధ్యంలోకి సుబాహుణ్ణి పిలిపించారు.

హేరాజన్! మేమంతా స్వయంవరానికని వచ్చాం. ఇచ్ఛాస్వయంవరమని ప్రకటించావు. నీతి తప్పడానికి వీలులేదు. నువ్వు అసలు ఏమి చెయ్యదలచుకున్నావో చెప్పు. సమాహిత చిత్తంతో స్పష్టంగా చెప్పు. దాపరికం వద్దు. మీ అమ్మాయిని ఎవరికి ఇవ్వదలుచుకున్నావు? నీ మనస్సుకి నచ్చినవాడెవడు? స్పష్టంగా చెప్పి మా కలహాన్ని వారించు.

ముక్త కంఠంగా రాకుమారులందరూ ఇలా అడిగేసరికి సుబాహుడు తన అభిప్రాయం ప్రకటించాడు. రాజపుత్రులారా! మా అమ్మాయి సుదర్శనుణ్ణి మనసా వరించింది. నేను ఎంతగానో వారించాను. ప్రయోజనం లేకపోయింది. నాకైనా ఈ విషయం స్వయంవరం ప్రకటించాక తెలిసింది. ప్రకటించాక జరిపించాలి కాబట్టి జరిపిస్తున్నాను. ఏం చెయ్యను. మా అమ్మాయి నామాట వినడం లేదు. సుదర్శనుడు ఏకాకిగా వచ్చాడు. చీకూ చింతా లేకుండా (నిరాకులుడై) విడిదిలో కూర్చున్నాడు. నేనై అతడికి ఆహ్వానం పంపలేదు. ఏదేశానికి రాజని పంపుతాను?

సుబాహుడి అభిప్రాయం విన్నాక రాకుమారులు మళ్ళీ సమాలోచనలు జరిపారు. ఈసారి సుదర్శనుణ్ణి పిలిపించారు. ఒంటరిగా వచ్చాడు. శాంతంగా సౌమ్యంగా వచ్చి కూర్చున్నాడు. రాకుమారులు ప్రశ్నించారు.



## ◆ సుదర్శన - రాజపుత్ర సంవాదం ◆

రాజపుత్రా! ఈ స్వయంవరానికి ఎవరు పిలిస్తే వచ్చావు? అదీ ఒంటరిగా ఎందుకు వచ్చావు నీకు సైన్యం లేదు, సచివులు లేరు, కోశం లేదు. బాహుబలం లేదు. ఏమి చేద్దామని వచ్చావు కన్యామణికోసం యుద్ధం జరగబోతోంది. మేమంతా సేనాసమేతులమై వచ్చాం. చూస్తున్నావుగా. మఽ నీమాట ఏమిటి? యుద్ధం చేస్తావా? నీ సోదరుడు శత్రుజిత్తు వచ్చాడు. మహాసైన్యంతో వచ్చాడు. అతడికి సహాయంగా తాతగారు యుధాజిత్తు చతురంగ బలాలతో వచ్చాడు. ఉన్న విషయం చెప్పాం. ఇందులో దాపరికం ఏమీ లేదు. తేల్చుకో. ఉంటావో వెడతావో నీ ఇష్టం. నీకా సైన్యం లేదు. ఒంటిగాడివి. ఆలోచించి ఒక నిర్ణయం తీసుకో. ఏం చేస్తావో చెయ్యి. అదేదో త్వరగా చెప్పు.

రాకుమారులారా! నిజమే. మీరన్నట్టు నేను ఒంటిగాడినే. నాకు సైన్యం లేదు. బలం లేదు. కోశం లేదు. మంత్రులు లేరు. సహాయకులు లేరు. ఏదీ లేదు, ఎవ్వరూ లేరు. స్వయంవరం విని చూసి పోదామని వచ్చాను. స్వప్నంలో ఆదిపరాశక్తి వైష్ణవీరూపంలో కనిపించి వెళ్ళిరమ్మంది, వచ్చాను. ఇంతకన్నా నాకు ఇక్కడ చెయ్యవలసిన పని ఏదీ జగదీశ్వరి చెప్పలేదు. ఆవిడ ఏమి సంకల్పించిందో అది జరుగుతుంది. జరిగితీరుతుంది. సందేహంలేదు. రాజపుత్రులారా! ఈ ప్రపంచంలో నాకు శత్రువు అనేవాడే లేడు. అంతటా జగదంబికనే చూస్తున్నాను. ఒకవేళ నాతో ఎవరైనా శత్రుత్వం పెట్టుకుంటే వారిని ఏమి చెయ్యాలో ఆ తల్లి చూసుకుంటుంది. నాకుమాత్రం శత్రుత్వం అంటే ఏమిటో కూడా తెలీదు.

యః కరిష్యతి శత్రుత్వం మయా సహ నృపాత్మజాః ।
శాస్తా తస్య మహావిద్యా నాహం జానామి శత్రుతామ్ ॥ (20 - 23)

ఏది జరగాలో అది జరుగుతుంది. నేను దైవాధీనుణ్ణి. నాకు చింత ఏమిటి! దేవతలకూ సమస్త ప్రాణికోటికీ శక్తియుక్తులను ప్రసాదించేది ఆ జగన్మాతయే. ఆవిడ రాజును చెయ్యదలుచుకుంటే ఎంతటి నిరుపేదనైనా నిర్ధనుడినైనా క్షణంలో అందలం ఎక్కిస్తుంది. దీనికి తిరుగులేదు. నాకు దిగులు ఎందుకు, చింత ఎందుకు! నేనేమీ అసత్యం చెప్పడం లేదు. బడాయికాదు. నిజంగా నేను విశ్వసించినది చెబుతున్నాను. హరిహరాదులైనా ఆ శక్తి అనుగ్రహం లేనిదే అడుగు కదపలేరు. నేను అశక్తుణ్ణో సశక్తుణ్ణో. ఏదయితే అది. దానికేమి గానీ, నేను ఈ స్వయంవరానికి రావడం మాత్రం కేవలం ఆ జగజ్జనని ఆజ్ఞవల్లనే. ఆవిడ ఏమి చెయ్యాలనుకుంటోందో అది చేస్తుంది. నాకైతే ఏ ఆలోచనా లేదు. ఏ బెంగా లేదు. ఏ ఆశా లేదు. జయపరాజయాలు రెండూ సమానమే. పొంగను. కుంగను. అణువంతైనా సిగ్గుపడను. మధ్యలో నాకెందుకు ఈ గోల! సిగ్గుపడాల్సివస్తే ఆవిడే పడుతుంది. నేనున్నది ఆవిడ అధీనంలోనే కదా మరి!



జయే పరాజయే లజ్జా న మేఽత్రాణ్యపి పార్థివా: ।
భగవత్యాస్తు లజ్జాస్తి తదధీనోఽస్మి సర్వదా ॥ ( 20 - 30)

ఈ ప్రసంగంతో రాకుమారుల మనస్సులలో ఒక పరివర్తన వచ్చింది. తమలో తాము వితర్కించుకున్నారు. కొంతసేపు చర్చించుకున్నారు. కడపటికి ఇలా అన్నారు.

సాధుపురుషా! నువ్వన్నది సత్యం. మేమంతా నీమాట నమ్ముతున్నాం. కానీ యుధాజిత్తు నిన్ను సంహరించాలి అనుకుంటున్నాడు. నీమీద సద్భావంతో ఈ మాట చెబుతున్నాం. అటుపైని నీ ఇష్టం. నీ మనస్సుకి ఏది తోస్తే అది చెయ్యి.

మిత్రులారా! నామీద దయతలచి నిజం చెప్పారు. సంతోషం. కానీ మృత్యువు అనేది ఎవరికిబడితే వారికి ఎప్పుడుబడితే అప్పుడు ఎవడుబడితే వాడు ఇవ్వగలిగిందీ ఇప్పించగలిగిందీ కాదు. ఈ జగత్తంతా దైవాధీనం. చావుపుట్టుకలు దైవాధీనాలు. ఏ జీవుడూ తనకుతాను నిర్ణేతకాడు. స్వతంత్రుణ్ణి అనడానికి ఎవరికీ వీలులేదు. కర్మానుసారంగా జీవితాలు నడుస్తుంటాయి. తత్త్వం తెలిసిన పండితులు కర్మను మూడువిధాలుగా విభజించారు. సంచితం, వర్తమానం, ప్రారబ్ధమని వాటిపేర్లు. జగత్తు అంతా కాలకర్మ వశంగా నడుస్తోంది. కాలం మూడనిదే దేవుడైనా మానవుణ్ణి చంపలేడు. హతుడూ హంతకుడూ నిమిత్త మాత్రులు. కాలం సనాతనం. అదే కర్త. మా తండ్రిగారిని అడవిలో సింహం చంపింది. అలాగే మా తాతగారిని (శూరసేనమహారాజు) యుధాజిత్తు సంహరించాడు. వీరిద్దరూ నిమిత్తమాత్రులు. కాలమే వారిద్దరినీ తీసుకుపోయింది. బతకాలని కోటి ప్రయత్నాలు చేసినా కాలయోగం కలసిరాకపోతే ఎవడూ బతకడు. కలిసివస్తే ఏ ప్రయత్నమూ లేకపోయినా ఎన్ని ఆపదలు ఎదురైనా వేల సంవత్సరాలు జీవిస్తాడు.

న దేవో మానుషం హంతుం శక్తః కాలాగమం వినా ।
హతం నిమిత్తమాత్రేణ హంతి కాలస్సనాతనః ॥
యత్నకోటిం ప్రకుర్వాణో హన్యతే దైవయోగతః ।
జీవేద్వర్ష సహస్రాణి రక్షణేన వినా నరః ॥ (20 - 38, 40)

కాబట్టి నేను యుధాజిత్తుకి భయపడేది లేదు. దైవమే పరతత్త్వమనీ సర్వోత్కృష్టమనీ దృఢంగా నమ్మి స్థిరంగా ఉన్నాను. స్తిమితంగా ఉన్నాను. దేవీనామస్మరణం నిత్యం చేసుకుంటున్నాను. నాకు ఏది శుభమో అది ఆవిడ కలిగిస్తుంది. ఏది అశుభమో అది తొలగిస్తుంది. సంచిత కర్మం (పూర్వార్జితం) ఏదయినా శుభం కానీ అశుభం కానీ అనుభవించాల్సిందేకదా! అది మనం చేసుకున్నదే. మనం చేసుకున్నదానికి మనం దుఃఖించడమేమిటి! ఒక్కసారి ఆలోచించండి. స్వకర్మఫలంగా దుఃఖాన్ని పొంది, పైకి కనిపించే నిమిత్త కారణంమీద వైరం పెట్టుకోవడం (శత్రుత్వం పెంచుకోవడం) తెలివితక్కువతనం కాదూ!



స్వకర్మ ఫలయోగేన ప్రాప్య దుఃఖమచేతనః ।
నిమిత్తకారణే వైరం కరోత్యల్పమతిః కిల ॥ (20 - 44)

అందుచేత, సవయస్కులారా! నాకు వైరమూ దుఃఖమూ భయమూ ఇలాంటివి తెలియవు అందుకే నిర్భయంగా నిశ్శంకంగా మీ మధ్యకు వచ్చాను. స్వయంవరం చూడటానికి ఒంటరిగా వచ్చాను చండికాదేవి ఆజ్ఞపై వచ్చాను. కానివ్వండి. జరగవలసింది జరుగుతుంది. నాకు ఆ దేవియే ప్రమాణం. మరొకటి ఏదీ నాకు తెలియదు. ఆవిడ సుఖాలు ఇస్తే సుఖాలు దుఃఖాలు ఇస్తే దుఃఖాలు అంతే. మరోలా జరగదు. యుధాజిత్తు సుఖాలు పొందితే పొందనివ్వండి. నాకు అతడితో వైరం లేదు. ఒక వేళ ఎవరైనా నాతో వైరం పెట్టుకుంటే దానికి తగ్గఫలం అనుభవిస్తాడు.

భగవత్యా ప్రమాణం మే నాన్యం జానామి సంయతః ।
తత్కృతం చ సుఖం దుఃఖం భవిష్యతి చ నాన్యథా ॥
యుధాజిత్సుఖమాప్నోతు న మే వైరం నృపోత్తమాః ।
యః కరిష్యతి మే వైరం స ప్రాప్స్యతి ఫలం తథా ॥ (20-47, 48)

జనమేజయా! సుదర్శనుడి ప్రసంగానికి రాకుమారులందరూ సంతృప్తి చెందారు. ఎవరి విడిది మందిరాలకు వారు వెళ్ళిపోయారు. మరునాడు శుభముహూర్తాన సుబాహుడు వీరందరినీ స్వయంవర మండపంలోకి ఆహ్వానించాడు. విశాలమైన సభాప్రాంగణం. సర్వాంగసుందరంగా అలంకరించారు. పైని చమ్కీల చాందినీలు. చుట్టూ రకరకాల పూలదండలు. అగరు ధూపాలు. నేల అంతటా విలువైన తివాసీలు. స్వయంవర సభామండపం సుగంధ పరిమళాలతో ఘుమఘుమలాడుతోంది. అటూ ఇటూ సూత్రపట్టినట్టు పరస్పరాభిముఖంగా సముచిత సువర్ణ సింహాసనాలు. వాటిపై మణిఖచిత మహాస్తరణాలు. బాలీసులు. పాదపీఠికలు. ఇరువైపులా రత్నాభరణాల మృదురవాలతో వింజామరలు వీస్తూ సుందరాంగులు. మధ్యలో కంబళీపరిచిన విశాలమైన నడవ. రాకుమారులు సర్వాభరణ భూషితులై ఒక్కరొక్కరే ఠీవిగా వస్తున్నారు. ముఖద్వారం దగ్గర చేటీగణపరివృతులై ఉన్నతాధికారులు స్వాగతం పలుకుతున్నారు. సాదరంగా తోడ్కొని వచ్చి నియతసింహాసనాలను అలంకరింపజేస్తున్నారు.

సింహాసనాలలో రాకుమారులు - దివ్యవిమానాలలో దేవతల్లా విరాజిల్లుతున్నారు. కన్యామణి ఎప్పుడు వస్తుందా, ఎవరిని వరిస్తుందా, భాగ్యశాలి ఎవరా అని ఆశగా ఆత్రంగా ఎదురుచూస్తున్నారు. సుదర్శనుడి మెడలోనే కనక దండవేస్తే వివాదం చెలరేగకామానదు, యుద్ధమూ తప్పదు అని మనస్సులలో మల్లగుల్లాలు పడుతున్నారు.



మంగళవాద్యఘోష ఒక్కసారిగా మిన్నుముట్టింది. సఖీజనం వెంటరాగా కాశీరాజపుత్రి శశికళ-శశికళలాగా వేదికపైకి వచ్చి తండ్రి సన్నిధిలో నిలబడింది. అభ్యంగనస్నానం చేసిన కురులు తుమ్మెదరెక్కల్లాగా కదలాడుతున్నాయి. సన్నని మేల్ముసుగులోంచి రత్నాభరణాలు మిలమిలలాడుతున్నాయి. క్షౌమవాసో విరాజిత శరదిందుచంద్రికలా ఉంది. మధూకమాలిక పట్టుకుని నిలబడింది. వివాహోచితమైన అలంకరణతో సాక్షాత్తు క్షీరసముద్రరాజతనయలా ఉంది. రవ్వంత చింతావ్యాకులితచిత్తయై కనిపిస్తోంది. సుబాహుడు మృదుగంభీరంగా పలికాడు.

సౌభాగ్యవతీ! శశికళా! మండపమధ్యభాగంలోకి పద. అటూ ఇటూ బారులుతీరి భూపతులు బంగరు గద్దెలపై విరాజమానులై ఉన్నారు. చూడు. మన ఆహ్వానం మన్నించి వివిధదేశాలనుంచి విచ్చేశారు. అందరూ గుణవంతులు. రూపవంతులు. ఉత్తమ క్షత్రియవంశాలలో పుట్టినవారు. వీరిలో నీ మనస్సుకి నచ్చిన రాకుమారుణ్ణి వరించు తల్లీ! నీ ఇష్టమే ఇష్టం. ఇది ఇచ్ఛా స్వయంవరం - అన్నాడు.

మితభాషిణియైన శశికళ తండ్రితో లలితంగా సంభాషించింది. తండ్రీ! ఈ రాకుమారుల దృష్టిపథంలోకి నేను వెళ్ళను. క్షమించు. అది వేశ్యలపని. కాముకులై వీరంతా నన్ను ఆబగా చూడటం నేను భరించలేను. వరుడు కాదగిన వ్యక్తి ఎవరో అతడు ఒక్కడే నన్ను చూడాలి. అందరూ చూసేట్టయితే నా సతీత్వం ఏమవ్వాలి? ఇది ధర్మశాస్త్ర విరుద్ధం కాదా? నన్ను చూసి వీరంతా మనస్సులలో ఏమి సంకల్పించుకుంటారో ఏమేమి ఊహించుకుంటారో మనం గ్రహించలేమా! దండపట్టుకుని స్వయంవర సభా మండపంలోకి కన్యకామణి వెళ్ళింది అంటే ఆ క్షణంలో కులట (వేశ్య) అయిపోయినట్టే.

**స్వయంవరే స్రజం ధృత్వా యదా గచ్ఛతి మండపే ।**
**సామాన్యా సా తదా జాతా కులటేవాపరా వధూః ॥ (20 -65)**

వారస్త్రీ విపణివీథికి వెళ్ళి అక్కడ వేచివున్న పురుషులను పరిశీలించి గుణాగుణాలను ఎలా తెలుసుకుంటుందో ఇదీ అంతే కదా! స్థిరచిత్తం లేని వేశ్య కాముకుల్ని చూసినట్టు నేను వీరందరినీ తిలకించనా? స్వయంవరం అంటూ ఏ పెద్దలు ఎప్పుడు ఈ ఆచారం పెట్టారోగానీ ఇదినాకు సుతరామూ ఇష్టం లేదు. నేను దీన్నిప్పుడు తిరస్కరిస్తున్నాను. నాకు కావలసింది వేశ్యాత్వం కాదు, పత్నీత్వం.

**వృద్ధైరేతైః కృతం ధర్మం న కరిష్యామి సాంప్రతమ్ ।**
**పత్నీవ్రతం తథా కామం చరిష్యేఽహం ధృతవ్రతా ॥ (20 - 68)**

తండ్రీ! నేను సుదర్శనుడికి మనసిచ్చాను. సర్వాత్మనా వరించాను. అతణ్ణి తప్ప మరెవ్వరినీ పరిణయమాడను. నా శుభం కోరేవాడవైతే మంచి ముహూర్తం పెట్టించి వివాహవిధిగా నన్ను అతడికి కన్యాదానం చెయ్యి.

*(అధ్యాయం - 20, శ్లోకాలు - 71)*



వివాహవిధినా దేహి కన్యాదానం శుభే దినే ।
సుదర్శనాయ నృపతే ! యదీచ్ఛసి శుభం మమ ॥ (20 - 71)

శశికళా ప్రసంగానికి సుబాహుడు మనస్సులో సంతోషించాడు. యుక్తియుక్తంగా ఉంది అనుకున్నాడు. కానీ, ఇప్పుడు ఏం చెయ్యాలి? రాకుమారులంతా వచ్చి కూర్చున్నారు. మా అమ్మాయి మీ మధ్యకురాదని ప్రకటిస్తే ఊరుకుంటారా? తిరగబడతారు. నన్ను చంపుతారు. అందరూ సేనాసమేతులై వచ్చారు. ఘోరయుద్ధం జరుగుతుంది. నాకా అంతటి సైన్యబలం కానీ దుర్గబలంకానీ లేదు. అందరినీ ఒక్కసారిగా ఎదిరించాలంటే అసంభవం. పోనీ సుదర్శనుడు సహాయపడతాడు అనుకుందామా అంటే అతడు ఒంటరివాడు. అసహాయుడు. నిర్ధనుడు. పైగా పిన్న వయస్సువాడు. ఇప్పుడు ఏం చెయ్యాలి? ఏది దారి? అయ్యో, కోరి కోరి దుఃఖసాగరంలో మునిగానే.

చాలాసేపు మథనపడి మథనపడి చివరికి ఒక నిర్ణయానికి వచ్చాడు. కానీ, ఏదయితే అది అవుతుంది అనుకున్నాడు. ధైర్యం కూడగట్టుకున్నాడు. గట్టిగా గుండెలనిండా గాలి పీల్చుకుని సభామండప మధ్యభాగంలోకి వెళ్ళాడు.

శశికళ ఎంతకీ వేదిక దిగిరాదేమిటా అని ఎదురుచూసి, తండ్రీకూతుళ్ళు చెవులు కొరుక్కుంటున్నదేమిటో (మంగళవాద్యఘోషలో వినపడక) అర్థంకాక, నిరీక్షణకు విసిగిపోయి కొందరు రాకుమారులు సహనం కోల్పోతున్నారు. మరికొందరు తమకు తాము సర్దిచెప్పుకుంటున్నారు. వేదిక దిగివచ్చే సుముహూర్తంకోసం వేచి ఉన్నారు కాబోలు అనుకుంటున్నారు.

రాజబృందం మధ్యలోకి వచ్చిన సుబాహుడు అన్నివైపులకూ తిరిగి అందరికీ సవినయంగా శిరసువంచి నమస్కరించాడు. రాకుమారులారా! ఏం చెయ్యను. సభామండపంలోకి మా అమ్మాయి రానంటోంది. ఎంతచెప్పినా వినడం లేదు. నేను చెప్పాను. తల్లి ఎంతగానో చెప్పింది. అయినాసరే ససేమిరా అంటోంది. క్షమించండి. మనసారా నన్ను క్షమించండి. మీకందరికీ పేరుపేరునా శిరసా పాదాభివందనాలు చేస్తున్నాను. మీ దాసుణ్ణి. దాసుడి తప్పులు దండంతో సరి. మదర్పిత చందనతాంబూలాది సత్కారాలు ప్రేమతో స్వీకరించి నన్ను కృతార్థుణ్ణి చెయ్యండి. రత్నాలూ ఏనుగులూ వస్త్రాలూ పుష్కలంగా సమర్పించుకుంటాను. సంతోషంగా స్వీకరించండి. మరొక్కసారి చేతులు జోడించి అభ్యర్థిస్తున్నాను. మనసారా మన్నించండి. నాకూతురు నామాట వినడం లేదు. కాదని గద్దించి బలవంతం చేస్తే ప్రాణాలు తీసుకుంటుందేమో! అప్పుడింక నా దుఃఖానికి అంతు ఉంటుందా? ఒక్కగానొక్క కూతురు. మీరంతా కరుణావరుణాలయులు. మహానుభావులు. దయచేసి నన్ను అర్థం చేసుకోండి. కన్నకూతురు ఇంత మొండికేస్తుందని నేననుకోలేదు. మందబుద్ధి. దీనితో ఏమిటిగానీ, మీరంతా పెద్దమనసుతో నన్ను క్షమించండి. మీపాద దాసుణ్ణి. నా కూతురిని మీ కూతురుగానే భావించండి. దీవించండి. మీ తిరుగుప్రయాణాలు సుఖంగా జరగాలని కోరుకుంటున్నాను.



సుబాహుడి అభ్యర్థనను భూపతులందరూ అంగీకరించారు. ఇంతకన్నా ఏమి చేస్తాడులే పాపం అనుకున్నారు. సింహాసనాలనుంచి లేచారు. ఒక్క యుధాజిత్తు మాత్రం క్రోధ తామ్రాక్షుడు అయ్యాడు. చెట్టంత ఎత్తు లేచాడు.

మూర్ఖుడా! ఇంత తప్పుచేసి ఇంకా మాట్లాడతావేమిటి? సంశయంగా ఉన్నప్పుడు అసలు స్వయంవరం ఎందుకు ప్రకటించావు? మమ్మల్ని అందరినీ ఎందుకు పిలిచావు? ఇప్పుడు మాదారిన మేము పోవాలా? ఇంతగా మమ్మల్ని అవమానించి నీ కూతుర్ని సుదర్శనుడికి కట్టబెడతావా? ఏ పనైనా చెయ్యబోయేముందు బాగా ఆలోచించుకోవద్దూ! బుడుగూ బుడుగూ పిలవగానే సరిపోయిందా? ఇప్పుడు మీ అమ్మాయిని సుదర్శనుడికి ఎలా ఇస్తావో చూస్తాను. పాపాత్ముడా! ముందు నిన్ను చంపి సుదర్శనుణ్ణి చంపుతాను. నీ కూతుర్ని నా మనమడు శత్రుజిత్తుకి ఇచ్చి ఇప్పుడే ఇక్కడే తాళికట్టిస్తాను. ఎవడు అడ్డంవస్తాడో చూస్తాను. ఆ పుడుంగిగాడు సుదర్శనుడు ఏపాటి? భరద్వాజాశ్రమంలోనే వీణ్ణి మట్టుపెట్టి ఉందును. ఆవేళ మహర్షి అడ్డంపడ్డాడు కనక బతికిపోయాడు. ఇవ్వేళ ఎలా తప్పించుకుంటాడో చూస్తాను.

నీకు అయిదు నిమిషాలు సమయం ఇస్తున్నాను. బాగా ఆలోచించుకో. నీ భార్యతో మంత్రులతో సంప్రదించు. శశికళను శత్రుజిత్తుకిచ్చి వివాహం జరిపాంచావో సంబంధీకుడవు అవుతావుగనక బతికిపోతావు. లేదంటే - ఇంతే సంగతులు. ఆలోచించుకో. శుభం కోరుకునేవాడెవడైనా తనకంటే గొప్పవారినీ ఉచ్చస్థితిలో ఉన్నవారినీ ఆశ్రయిస్తాడు. బంధుత్వం కలుపుకుంటాడు. అంతేగాని సుదర్శనుడిలాంటి దరిద్రుడికి నిర్ధనుడికి ఏకాకికి రాజ్యహీనుడికి పిల్లనిచ్చి పెళ్ళి చెయ్యడు. చేసి ఏమి బావుకుందా మనుకుంటున్నావు? పిల్ల సుఖపడుతుందా? నువ్వు బలపడతావా? రాజనీతి ఏం చెబుతోంది.? కులం చూడమంది. విత్తం చూడమంది. బలం చూడమంది. రూపం చూడమంది. రాజ్యం చూడమంది. దుర్గం చూడమంది. స్నేహితుల్ని చూడమంది. ఇవన్నీ చూసి పిల్లనివ్వమంది. లేకపోతే సుఖం ఉండదంది. ఆ శ్లోకం చెబుతాను విను - కులం విత్తం బలం రూపం రాజ్యం దుర్గం సుహృజ్జనం। దృష్ట్వా కన్యా ప్రదాతవ్యా నాన్యథా సుఖమృచ్ఛతి ॥ ఇది శాస్త్రం. నీతి శాస్త్రం. రాజనీతి శాస్త్రం. దీనికి తిరుగులేదు. ఆలోచించుకో. ఏది యోగ్యమో అది చెయ్యి. ఊరికే అనవసరంగా దిగులు పడకు. అధైర్యపడకు. మతిమంతుడివి, నాకు మిత్రుడివీ కనక ఇంతగా హితవు చెబుతున్నాను. కటువుగా మాట్లాడాననుకోకు. నీమేలు కోరినవాణ్ణి. వెళ్ళు. తీసుకురా మీ అమ్మాయిని. ఒక్క సుదర్శనుణ్ణి తప్ప ఎవరినైనా వరించమను. నాకు పేచీ లేదు. యుద్ధం లేదు. ఈ రాకుమారులంతా సామాన్యులా! కులీనులు. బలీయులు. అన్నింటా అందరికీ సమఉజ్జీలు. వాణ్ణి వరిస్తే వీరితో విరోధం ఎలా ఉంటుందో ఊహించుకో. మనకి విరోధం వద్దు. నేను చెప్పినట్టు చెయ్యి. లేదంటే శశికళను బలవంతంగా అపహరించి తీసుకుపోతాను. చూసుకో.



యుధాజిత్తు హెచ్చరికతో సుబాహుడికి చెమటలు పట్టాయి. ఒకవైపు అవమానం. మరొకవైపు బెదిరింపు. ఒకవైపు పుత్రికాప్రేమ. మరొకవైపు కిం కర్తవ్యత. మానసికంగా నలిగిపోతున్నాడు. దేశవిదేశాలనుంచి వచ్చిన రాకుమారులూ రాజబంధువులూ తన ప్రజలూ ప్రేక్షకులూ - ఇందరిఎదుట ఇదొక సన్నివేశం. గారాల కూతురి స్వయంవరం అల్లరి అవుతోంది. రేపు తల ఎత్తుకు తిరిగేది ఎలా? రేపటి సంగతి తరవాత చూద్దాం ఇప్పుడు ఈ మరుక్షణంలో ఏం జరుగుతుందో. ఎవరు ఏ సాహసానికి ఒడిగడతారో. యుద్ధమే చెలరేగుతుందేమో. యుధాజిత్తు అన్నంతా చేస్తాడేమో. సుబాహుడు బెంబేలు పడిపోతున్నాడు. ఏమీ తోచడం లేదు. కాలూ చెయ్యీ ఆడటం లేదు. ఎవరిని సలహా అడగడానికీ మనసొప్పడం లేదు. అయినా ఏమని అడుగుతాడు. ఎవరు మాత్రం ఏమని చెబుతారు. యుధాజిత్తు చివరికి రెండేరెండు దారులు తెరిచి ఉంచాడు. సుదర్శనుణ్ణి తప్ప ఎవరినో ఒకరిని వరించాలి. లేదంటే అహవమో, అపహరణమో. మొదటి ఎత్తుగడతో రాకుమారులంతా యుధాజిత్తు వైపు నిలుస్తారు. రెండవది ఏమవుతుందో, ఎటు దారితీస్తుందో. అమ్మాయి చూస్తే సుదర్శనుణ్ణి తప్ప మరెవరినీ వివాహమాడనని ఖండితంగా చెప్పింది. లేదంటే ప్రాణాలు వదిలేస్తానంటోంది. బలవంతం చేసి ఇష్టంలేని పెళ్ళి ఎలా చెయ్యను ? దారీ తెన్నూ తోచలేదు. ఇక ఆలోచించలేకపోయాడు.

పొంగివస్తున్న దుఃఖాన్ని నిలువరించుకుంటూ అంతఃపురానికి వెళ్ళాడు. భార్యను అభ్యర్థించాడు. యుద్ధం తప్పేటట్టు లేదు. నా ప్రాణాలకే ముప్పు వచ్చేట్టుంది. అమ్మాయిని ఒప్పించమన్నాడు. అంతా నీ చేతిలోనే ఉంది అన్నాడు. నీ దాసుణ్ని, గండం గట్టెక్కించు అన్నాడు.

## ◆ శశికళా - మాతాపితృ సంవాదం ◆

ఆమె కంగారుపడుతూ శశికళ దగ్గరకు వెళ్ళింది. పరిస్థితి వివరించింది. తండ్రి దీనావస్థను అర్థం చేసుకోమంది. నీకోసం యుద్ధం జరగడం మన కుటుంబానికీ మన దేశానికీ క్షేమం కాదు అంది. దయచేసి సుదర్శనుణ్ణి మరిచిపో. మరొక రాకుమారుణ్ణి ఎవరినైనా సరే వరించు. నీఇష్టం. కాదని మొండికేసి సుదర్శనుణ్ణే వరిస్తే యుధాజిత్తు ఇప్పుడే ఇక్కడే అతణ్ణి సంహరిస్తాడు. అప్పుడైనా నువ్వు మరొకరిని వరించక తప్పదు. అందుచేత అతణ్ణి వదిలేయ్. మరొకరిని వరించు. నామాట విను. నీ సుఖమూ మా సుఖమూ కోరి చెబుతున్నాను. మా తాపత్రయమంతా నీ సుఖం కోసమేకదా! ఒక్కగానొక్క కూతురివి. అల్లారుముద్దుగా పెంచుకున్నాం. గారాబంగా చూసుకున్నాం. నీ సుఖం కన్నా మేము కోరుకోవలసింది లేదు. ఆలోచించు. అన్నివేళలా హఠం పనికిరాదు. మనసు మార్చుకో. నువ్వు సుఖపడు. మమ్మల్ని సుఖపెట్టు.



తస్మాత్సుదర్శనం త్యక్త్వా వరయాన్యం నృపోత్తమమ్ ।
సుఖమిచ్ఛసి చేన్మహ్యం తుభ్యం వా మృగలోచనే ॥ (21 - 36)

తల్లి ఉపదేశించాక తండ్రికూడా ఇలాగే బోధించాడు. ప్రేమగా లాలనగా లాభనష్టాలు స్పష్టంగా బేరీజువేసి వివరించాడు. శశికళ చాలా ప్రశాంతంగా మౌనంగా వింది. దృఢ నిశ్చయంతో నిర్భయంగా బదులు పలికింది.

తండ్రీ! ఇవన్నీ నేనూ ఆలోచించాను. కానీ వీటి అన్నిటికన్నా నా వ్రతం నా దీక్ష నాకు ముఖ్యం. ఈ రాజులకు నువ్వు భయపడుతున్నావు. యుధాజిత్తు బెదిరింపులకు కంగారుపడుతున్నావు. అంతే తప్ప సుదర్శనుడు అయోగ్యుడని కాదు. ఆమేరకు సంతోషం. నా నిర్ణయంలో మార్పులేదు. ఉండబోదు. సుదర్శనుణ్ణి తప్ప మరెవ్వరినీ వరించను. నీకు అంతగా భయమైతే సుదర్శనుడికి నన్ను సమర్పించి నగరం నుంచి బయటికి పంపించు. బహిష్కారం విధించు. అతడు నన్ను రథంమీద కూర్చోబెట్టుకుని నగరం నుంచి నిర్గమిస్తాడు. తరవాత ఏం జరగాలో అది జరుగుతుంది. మీరేమీ చింతించకండి. మా అదృష్టం ఎలా ఉంటే అలా అవుతుంది.

నాత్ర చింతా త్వయా కార్యా భవితవ్యే నృపోత్తమ ।
యద్భావి తద్భవత్యేవ సర్వథాత్ర న సంశయః ॥ (21 - 40)

అమ్మా! నీ పట్టుదల నీదేనా. మా మాట వినవా? కన్న తల్లిదండ్రులం ఇంతగా బతిమాలుతోంటే ఏమిటమ్మా ఈ మొండిపట్టు. మరొక్కసారి జాగ్రత్తగా ఆలోచించు. సాహసం అన్నివేళలా పనికిరాదు. ఒకేసారి పలువురితో విరోధం పెట్టుకోవడం యుద్ధానికి దిగడం ఎంతటి వాడికైనా క్షేమం కాదు. అదీకాక - సుదర్శనుడి చేతిలో పెట్టి నీమానాన నిన్ను ఎలా వదిలిపెట్టను? వివాహం చెయ్యొద్దూ! కన్నతల్లిదండ్రులు ఎవరైనా అలా వదలిపెట్టగలరా? ఇంతమందీ ఒక్కసారిగా చుట్టముడితే మీరు ఏమైపోతారు? ఆలోచించావా? చిన్నపిల్లవు. సాహసం తప్ప మరింకేమీ కనిపించడం లేదు. పోనీలే, మరొక పని చేద్దాం. మధ్యేమార్గం చెబుతున్నాను. కనీసం దీనికైనా అంగీకరించు. దీన్ని పణస్వయంవరంగా ప్రకటిస్తాను. అలనాడు సీతామహాసాధ్వికి జనకుడు ప్రకటించినట్టు. శివధనుస్సును ఎక్కుపెట్టి రాముడు వరించినట్టుగా, నిన్ను సుదర్శనుడు వరించనీ. అతడు అశక్తుడైతే మరొకడు గెలుచుకుంటాడు. గెలుచుకోనీ. అప్పుడు ఎవరికీ ఏ వివాదమూ ఉండదు. అందరూ అంగీకరిస్తారు. నీ వివాహం సుఖంగా జరిపిస్తాను. ఇందులో అధర్మం ఏమీ లేదు. అన్యాయం అంతకన్నా లేదు. కనీసం దీనికైనా ఒప్పుకో తల్లీ!

తండ్రీ! వినడానికి నీ ఆలోచన బాగానే ఉంది. కానీ సందేహాలకూ సంశయాలకూ నేను తావు ఇవ్వను. సుదర్శనుడు నా మనస్సులో స్థిరపడ్డాడు. మరొకణ్ణి వరించడం అసంభవం. అది మహాపాపం. పుణ్యపాపాలకు ఆదికారణం మనస్సే కదా! కార్యరూపంగా ఆచరణలోకి వచ్చినా రాకపోయినా పుణ్యపాపచింతనలు మనస్సులో రేకెత్తితే చాలు వాటి ఫలితం వాటికి ఉంటుంది. నన్ను పణంగా



(పందెపుధనం) నువ్విప్పుడు స్వయంవరం ప్రకటిస్తే ఈ రాకుమారులందరికీ నేను వశమైనట్టేకదా! ఒకడె గెలిస్తే సరే, ఇద్దరో ముగ్గురో గెలిచారనుకుందాం. అప్పుడేమవుతుంది. మరొక కొత్త వివాదం చెలరేగదా? అదీకాక సంశయాస్పదమైన పనులు నాకు ఇష్టం ఉండదు. (సంశయాధిష్ఠితే కార్యే మతిం నాహం కరోమ్యతః 21 - 51). నువ్వు ఇంకేమీ ఆలోచించకు. దిగులు పడకు. నన్ను సుదర్శనుడికి సమర్పించు. వివాహం జరిపించు. మిగతా సంగతులు చండికాదేవి చూసుకుంటుంది. ఆ జగన్మాత నామధేయాన్ని ఉచ్చరిస్తే చాలు దుఃఖసముద్రాలు ఇంకిపోతాయి. పరాశక్తిని స్మరించుకుని ధైర్యం తెచ్చుకో. నా అభ్యర్థనను నెరవేర్చు. ఇందాకటిలాగానే రాజులందరికీ నమస్కరించి, స్వయంవరం రేపటికి వాయిదా వేస్తున్నానని ప్రకటించు. అందరినీ విడుదులకు పంపించెయ్యి. ఈ రాత్రికి వేదమంత్రాలతో క్లుప్తంగా మా వివాహం జరిపించు. నువ్వు ఇవ్వగలిగింది ఇచ్చి పంపించు. ధ్రువసంధి కుమారుడు నా సుదర్శనుడు నన్ను తీసుకువెడతాడు. ఒకవేళ నువ్వు శంకిస్తున్నట్టూ వాళ్ళు బెదిరిస్తున్నట్టూ యుద్ధమే జరిగితే అమ్మవారు మనకు సహాయం చేస్తుంది. సుదర్శనుడు నీ పక్షాన నిలబడి యుద్ధం చేస్తాడు. ఆయుద్ధంలో జరగకూడనిదే జరిగితే నేనూ నిశ్చింతగా ప్రాణాలు వదిలేస్తాను. మరేమీ బెంగలేదు. నన్ను సుదర్శనుడికి ఇచ్చి నువ్వు సేనాసమేతుడవై రాజధానిలోనే నిలిచిపో. నేను ఒక్కతెనూ అతడితో వెడతాను. యుద్ధమేమయినా జరిగితే అతడే చూసుకుంటాడు. నీకూ నీ రాజధానికీ హాని ఉండదు.

ఈ మాటలలో వినిపించిన ఆత్మవిశ్వాసం సుబాహుడిలోనూ కొంత ధైర్యాన్ని కలిగించింది. విశ్వాసం ఏర్పడింది. కూతురు చెప్పినట్టే చెయ్యడానికి నిశ్చయించుకున్నాడు.

***( అధ్యాయం - 21 , శ్లోకాలు -60)***

త్వరత్వరగా స్వయంవర సభా మండపానికి చేరుకున్నాడు. అందరికీ సవినయంగా నమస్కరించాడు. గుసగుసలూ కోలాహలం సద్దుమణిగాయి. గొంతు సవరించుకున్నాడు.

రాకుమారులారా! మీరంతా మా ఆతిథ్యాన్ని మరొకపూట అదనంగా స్వీకరించి నన్ను ధన్యుణ్ణి చెయ్యండి. స్వయంవరాన్ని రేపటికి వాయిదా వేస్తున్నాను. ప్రస్తుతం విడుదులలో మీకోసం రకరకాల విందులు ఎదురుచూస్తున్నాయి. వాటిని రవ్వంత రుచిచూడండి. రేపు సరిగ్గా ఇదే సమయానికి ఇక్కడే సమావేశం అవుదాం. ఇచ్ఛా స్వయంవరమా, పణ స్వయంవరమా అనేదికూడా ఆలోచించి రేపే ప్రకటిస్తాను. ఇవ్వేళ మా అమ్మాయి మండపంలోకి రానంటోంది. బహుశ రేపటికి ఒప్పించగలను. ఆ నమ్మకంతోనే వాయిదా వేస్తున్నాను. కొట్టీ తిట్టీ పిల్లల్ని ఒప్పించలేం కదా! అలా చెయ్యడం ఏమంత మంచిదికాదని కూడా నా అభిప్రాయం. అందుచేత సమగ్రంగా చర్చించి మా అమ్మాయిని ఒప్పించి రేపు ఇక్కడికి తీసుకువస్తాను. సెలవు.

సుబాహుడి ప్రకటనను రాకుమారులందరూ నిజమని నమ్మారు. విడుదులకు వెళ్ళిపోయారు. ఎవరి రక్షణను వారు ఏర్పాటు చేసుకుని విందులూ విలాసాలలో మునిగిపోయారు.



## ◆ శశికళా సుదర్శనుల వివాహం ◆

విశ్వాసపాత్రులైన వేదపండితులను రావించి ఆ రాత్రి శశికళా సుదర్శనుల వివాహం గుట్టుగా గృహంలో జరిపించేశాడు. నూతన వస్త్రద్వయం, కుండల ద్వయం, రెండువందల మదపుటేనుగులు, మాంఛి గుర్రాలు పూన్చిన రెండువందల రథాలు, రెండువందల ధనుస్సులు, బాణాలు నిండిన తూణీరాలూ, రెండుగోవులూ పారిబర్హంగా బహూకరించాడు. కోడల్ని చూసి మనోరమ మనస్సు శాంతించింది. ఒక నిధి దొరికినంతగా సంబరపడింది. సుబాహుడి భార్య సాలంకృతలైన దాసీజనాన్ని వెయ్యిమందిని కూతురికి బహుమతిగా ఇచ్చింది. నూరు ఆడ ఏనుగులను ఇచ్చింది. రత్నాభరణాలూ దివ్యవస్త్రాలూ లెక్కలేదు. సింధుదేశోద్భవాలైన ఉత్తమజాతి అశ్వాలను రెండువేలు బహూకరించి, ధాన్యమూ ఉప్పులూ పప్పులూ వంటపాత్రలతో నిండిన రెండువందల శకటాలను సమర్పించారు. మిగతా బహుమతులను మోసుకువెళ్ళడానికి మూడువందల ఒంటెలను (క్రమేళకములు) సిద్ధపరిచారు.

అంతా అయ్యాక సుబాహుడు మనోరమాదేవికి కొంచెం దగ్గరగా వెళ్ళి వినయంగా నమస్కరించాడు. ఉత్తమక్షత్రియ కులసంజాతా! నేను నీ దాసుణ్ణి. మనోగతం ఏదయినా ఉంటే తెలియజెయ్యి. నెరవేరుస్తాను అన్నాడు. మనోరమ కళ్ళల్లో ఆనందబాష్పాలు. పట్టరాని సంతోషంతో పరవశించిపోతోంది. ఒకవైపు ఆనందం, మరోవైపు కృతజ్ఞత. అభినందన పురస్సరంగా పలికింది.

మహారాజా! నీకూ నీవంశానికీ శుభమగుగాక. సకల సమృద్ధులూ సమకూరుగాక. మా అబ్బాయికి మీ కన్యారత్నాన్ని ఇచ్చారు. చాలు. అంతకుమించిన సమ్మానం నాకు మరొకటి ఉండదు. ఆనందాన్ని ప్రకటించడానికి నిజంగా మాటలు అందడం లేదు. నేను వంది పుత్రికనూ కాను, మాగధ పుత్రికనూ కానాయె. అయినా నావాళ్ళని నేను పొగడటమేమిటి? మీ సంబంధంవల్ల ఇవేళ మా అబ్బాయి సుమేరు సదృశుడయ్యాడు.

**న వందిపుత్రీ నృప మాగధీ వా ।**
**స్తౌమీహ కిం త్వాం స్వజనం మహత్తరమ్ ॥**
**సుమేరుతుల్యస్తు కృతస్సుతోఽద్య మే ।**
**సంబంధినా భూపతినోత్తమేన ॥** **(22 - 23)**

రాజ్యహీనుడికి ఉత్తమ కన్యను ఇచ్చారంటే మీ చరిత్ర మీ పవిత్రత ఎంతటివో అర్థం చేసుకోగలుగుతున్నాను. ఆనందంగానూ ఉంది, ఆశ్చర్యంగానూ ఉంది. తండ్రిని కోల్పోయి, రాజ్యం కోల్పోయి, నిర్ధనుడై, కందమూల ఫలాలు తింటూ అరణ్యవాసం చేస్తున్న ఒంటరివాడికి ఇంతమంది



రాకుమారులను కాదని కన్యనిచ్చారంటే ఇది సామాన్యవిషయమా! సమస్థాయిని చూసుకుంటారేగానీ ఇలాగ గుణవతి రూపవతి అయిన కన్యను ఎవ్వరూ మా అబ్బాయిలాంటివాడికి ఇవ్వరు. మీ సౌజన్యానికి చేతులు జోడించి నమస్కరిస్తున్నాను. కృతజ్ఞత ప్రకటిస్తున్నాను. పైగా ఇంతమంది బలవంతులైన భూపతులతో వైరానికి సిద్ధపడి ఈ పని చేశారంటే మీ ధైర్యానికి అభినందిస్తున్నాను.

మనోరమాదేవి మాటలకు సుబాహుడు ఎంతో సంతృప్తి చెందాడు. మళ్ళీ నమస్కరించాడు. సవినయంగా ఒక ప్రతిపాదన చేశాడు. రాజపుత్రీ! మీరు మరోలా అనుకోకపోతే - నాదొక మనవి. ఈ కాశీరాజ్యాన్ని మీరు స్వీకరించండి. నేను సేనాపతిగా ఉంటాను. లేదంటే అర్ధరాజ్యం స్వీకరించండి. వారణాసిని విడిచిపెట్టి మీరు ఆశ్రమంలోనో మరో నగరంలోనో ఉండటం నాకు సమ్మతం కాదు. పడినంతకాలం కష్టాలు పడ్డారు. ఇప్పుడన్నా రాజభోగాలు తిరిగి అనుభవించండి. ఇంక ఈ రాకుమారులంటారా, వారి సంగతి నేను చూసుకుంటాను. రెండే రెండుదారులు కనపడుతున్నాయి. స్వయంగా వెళ్ళి జరిగిన విషయం సవినయంగా మనవి చేస్తాను. సమ్మతించి వెళ్ళిపోయారో సరేసరి. కాదని కాలుదువ్వితే యుద్ధం చేస్తాను. తప్పదు గదా మరి. జయాపజయాలు దైవాధీనాలు. నేను చేసింది ధర్మమనుకుంటారో, అధర్మం అనుకుంటారో వారి ఇష్టం. వారి ఆలోచనలు ఎటు సాగుతాయో! కనీసం కొందరైనా సమ్మతించి వెళ్ళిపోతారు అనుకుంటున్నాను. చూద్దాం. ఏమి జరుగుతుందో.

ఈ మాటలకు మనోరమాదేవి మరింత ప్రసన్నురాలు అయ్యింది. ధైర్యం చెప్పింది. మహారాజా! అధైర్యపడకు. జగదంబికను ధ్యానించు. ఆదిపరాశక్తి భక్తులకు అపజయం ఉండదు. నీకూ నీ రాజ్యానికీ ఏ ప్రమాదమూ రాదు. అంతా సుఖాంతమే అవుతుంది. మా అబ్బాయి త్వరలోనే అయోధ్యా సింహాసనం అధిష్ఠిస్తాడు. నీ రాజ్యం నువ్వు హాయిగా పాలించుకో. ఆశ్రమవాసం మాకిక ఆట్టేకాలం ఉండదు. మారాజ్యం మాకు దక్కుతుంది. భోగభాగ్యాలు అనుభవిస్తాం. పరమాంబికను ధ్యానిస్తున్నాను. ఏ చింతా లేదు. మాకు సెలవియ్యి. మరి మేము బయలుదేరతాం - అంది.

విసర్జయాస్మాన్నిజసద్మ గంతుం
శివం భవానీ తవ సంవిధాస్యతి ।
న కాపి చింతా మమ భూప వర్తతే
సంచింతయంత్యాః పరమాంబికాం వై ॥ (22 - 34)

అంతలోకే తెల్లవారింది. ఎంత గుట్టుగా జరిపినా శశికళా సుదర్శనుల వివాహవార్త రాకుమారులకు తెలిసిపోయింది. అందరూ విడిది గృహాలు విడిచిపెట్టి కాశీనగర ముఖద్వారం దాటి వెలుపల మకాం



వేశారు. సుబాహుడు చేసినది సమంజసమే అనిపించినవారు కొందరు వెళ్ళిపోగా మిగిలినవారు అవమానంగా భావించి ప్రతీకారం ఎలా తీర్చుకుందామా అని చర్చించుకుంటున్నారు. సుబాహుణ్ణీ సుదర్శనుణ్ణీ సంహరించి శశికళను అపహరించుకుపోదామనే దురాలోచనల్లో ఉన్నారు. రాజధానిలో మంగళ తూర్యారావాలు మృదంగధ్వనులూ సన్నాయి మోతలూ మిన్నుముట్టాయి. యుధాజిత్ శత్రుజిత్ ప్రభృతులకు క్రోధం తారస్థాయికి చేరుకుంది.

సుబాహుడు సుహృజ్జనులతో కలిసి వీరి దగ్గరికి వచ్చాడు. రాజులు ముఖాలు బిగించుకుని మౌనంగా నిలబడ్డారు. అందరికీ నమస్కరించి సుబాహుడు - క్షత్రియవంశ్యులారా! సహృదయులారా! దయామయులారా! నగరంలోకి దయచెయ్యండి. హితమో అహితమో తెలీదుగానీ మా అమ్మాయి సుదర్శనుణ్ణి వివాహమాడింది. కోపించకండి. ఉపశమించండి. ఇచ్ఛా స్వయంవరం కదా! సుదర్శనుణ్ణి వరించాను, మరెవ్వరినీ వరించను అన్నప్పుడు అంగీకరించి వివాహం జరపడం నా ధర్మంకదా! జరిపించాను. మీరంతా వచ్చి పెళ్ళి భోజనం చేసి వెళ్ళండి - అన్నాడు.

సుబాహూ ! చాలా గొప్ప పనిచేశావు. సంతోషం. ఇక నువ్వు దయచెయ్యొచ్చు. చెయ్యవలసిన పెళ్ళిపనులు ఇంకా చాలా ఉండిఉంటాయి. చూసుకో. వెళ్ళు. మా నగరాలకు మేం పోతాం - అన్నారు ఆ రాకుమారులు. వీళ్ళ పన్నాగం ఏమిటో ఏమి చేస్తారో అని శంకిస్తూనే సుబాహుడు నగరంలోకి తిరిగి వచ్చేశాడు.

యుధాజిత్తు నాయకత్వంలో కూడబలుక్కుని సేనాసమేతులైన రాకుమారులు శశికళా సుదర్శనులు భరద్వాజాశ్రమానికి తిరిగివెళ్ళే దారిలో కాపలా వేశారు. సుదర్శనుణ్ణీ మనోరమనూ చంపాలి, శశికళను అపహరించాలి - ఇదీ వీరి లక్ష్యం. లేకపోతే వీడి కూతురి పెళ్ళి చూసివెళ్ళడానికని వచ్చామా, అలా వెడితే మన పరువేమి కానూ, సొంత రాజ్యంలో ఇక తల ఎత్తుకోగలమా - ఇవే వారి ఆలోచనలు.

***(అధ్యాయం - 22, శ్లోకాలు -48)***

ఆ ముచ్చటా ఈ ముచ్చటా పేరు చెప్పి ఆరు రోజులపాటు శశికళా సుదర్శనులను రాజధానిలోనే (కాశి) ఉంచేశాడు సుబాహుడు. అప్పటికి చారులద్వారా యుధాజిత్ప్రభృతుల పన్నుగడ తెలిసింది. చతురంగ బలాలను తోడు ఇచ్చి శశికళా సుదర్శనులనూ మనోరమాదేవినీ సాగనంపాడు. వెనకగా తానూ మరింత సైన్యంతో కదిలాడు.



## ◆ సుదర్శన - యుధాజిత్తుల యుద్ధం ◆

సుదర్శనుడి రథం వేగంగా పరుగులు తీస్తోంది. కొంతదూరం వెళ్ళేసరికి శత్రు సైన్యాలు అడ్డగించాయి. అర్ధవర్తులాకారంలో ఎదురునిలిచాయి. శత్రుజిత్తు ముందుగా సోదరుడిపైకి బాణాలు వేశాడు. సుదర్శనుడు వాటిని మధ్యలోనే ముక్కలు చేశాడు. యుధాజిత్తు విజృంభించాడు. ధనుస్సునుంచి పుంఖానుపుంఖంగా బాణాలు కురిపిస్తున్నాడు. సుదర్శనుడు తగిన రీతిలో సమ ఉజ్జీగా సమాధానం చెబుతున్నాడు.

అంతలోకీ కాశీనరేశ్వరుడు (సుబాహుడు) వచ్చి చేరుకున్నాడు. యుద్ధానికి దిగబోయాడు. సుదర్శనుడు వారించాడు. ప్రధానంగా యుద్ధం శత్రుజిద్యుధాజిత్తులకూ సుదర్శనుడికీ జరుగుతోంది. మిగతావారంతా ప్రేక్షకపాత్ర వహించారు. సంగ్రామం తీవ్రస్థాయికి చేరుకుంది. దారుణంగా జరుగుతోంది.

హఠాత్తుగా దేవి ప్రత్యక్షమయ్యింది. అల్లంత ఎత్తున ఆకాశంలో అందరికీ కనిపించింది. సింహవాహనసమారూఢ. వరాభూషణ భూషిత. నానాదివ్యాయుధధర. దివ్యాంబర పరీధాన. మందార సుమమాలికా విరాజమాన. రాజులంతా ఆశ్చర్యచకితులయ్యారు. సైనికులు నిశ్చేష్టులయ్యారు. ఎవరు ఈ సింహవాహన? కన్నదికాదు, విన్నదికాదు. ఏమిటి ఈ వింత అనుకున్నారు.

శశికళా సుదర్శనులూ మనోరమదేవికి భక్తిప్రపత్తులతో నమస్కరించారు. జగన్మాత అనుగ్రహించి ప్రత్యక్షమయ్యింది చూడమని సుబాహుడితో నమస్కరింపజేశారు. మహారాజా! నేను నిర్భయుణ్ణి. ఇప్పుడు ఇంకా నిర్భయుణ్ణి. జగదంబికా దివ్యదర్శనం లభించింది - అంటూ సుదర్శనుడు మరొకసారి ఆదిపరాశక్తికి శిరస్సువంచి నమస్కరించాడు. కామరాజ మహాబీజాక్షరాన్ని జపించాడు. అమ్మవారి సింహం ఒక్కసారి గర్జించింది. శత్రుసైన్యంలో ఏనుగులూ గుర్రాలూ కకావికలై పరుగులు తీశాయి. ఒక్కసారిగా ఝంఝూమారుతం వీచి శత్రు సైనికుల కళ్ళల్లో దుమ్ముకొట్టింది.

సుదర్శనుడు సేనాపతిని పిలిచి చెప్పాడు. జగన్మాత మనకు రక్షగా నిలిచింది. ఈ శత్రురాజులు అలా బొమ్మల్లా నిలబడి చూస్తూనే ఉంటారు. ఇదే మార్గాన నిర్భయంగా మన ప్రయాణం సాగించండి. నిరాటంకంగా గమ్యం చేరుకుందాం - అన్నాడు. యథావిధిగా రథాలు కదిలాయి.

యుధాజిత్తు అక్కసుతో మండిపడ్డాడు. తోటిరాజులను ఉసికొల్పాడు. ఏమిటిలా బొమ్మల్లా నిలబడి ఏదో వింత చూస్తున్నారు. చంపండి, నరకండి. సుదర్శనుణ్ణి నరికిపోగులు పెట్టండి. ఇంతమంది బలాఢ్యులను అవమానించి ఒక బలహీనుడు కన్యను తీసుకుపోతూంటే చూస్తూ ఊరుకుంటారేమిటి? సింహం మీద కూర్చున్నంతమాత్రాన ఒక ఆడదానికి భయపడుతున్నారా? (కిం భీతాః కామినీం వీక్ష్య సింహోపరిసుసంస్థితామ్ 23- 32) ఏమిటీ పిరికిదనం? ధైర్యసాహసాలే మన ఊపిరి. లేవండి. విజృంభించండి. ఉపేక్షించకండి. వీణ్ణి చంపి కన్యను అపహరించాలి. సింహానికి దక్కవలసింది నక్కకు చిక్కడానికి వీలులేదు.



ఇలా హెచ్చరిస్తూనే యుధాజిత్తు సుదర్శనుడిపై శరవృష్టి కురిపించాడు. సుదర్శనుడు తన ధనుర్విద్యా వైభవాన్ని ప్రదర్శిస్తూ అంతకు రెండింతలుగా బాణాలను ప్రయోగించాడు. ధనుస్సు నిరంతరం మండలాకారంలో కనిపిస్తోంది. బాణాలను ఎక్కుపెట్టి విడుస్తున్న కుడిచెయ్యి నిరంతరం కుడిచెవ్వి దగ్గరే కనిపిస్తోంది. అంబుల పొదినుంచి ఎప్పుడు బాణం తీస్తున్నాడో ఎప్పుడు తొడుగుతున్నాడో ఎప్పుడు లాగుతున్నాడో ఎప్పుడు వదులుతున్నాడో - ఇవి ఏవీ ఎవరికీ కనిపించడంలేదు. బాణాలు మాత్రం శరపరంపరగా వచ్చి పడుతున్నాయి. ఏదో ఒక కొత్త యంత్రంలోనుంచి వస్తున్నట్టుగా వచ్చిపడుతున్నాయి.

జగదంబిక చిద్విలాసం తిలకిస్తోంది. ఉన్నట్టుండి కేవలం రెండు బాణాలు విడిచిపెట్టింది. శత్రుజిద్యుధాజిత్తులు మరణించారు. రథాలనుంచి నేలకు ఒరిగిపోయారు. మహా మహా రాజులంతా ఆశ్చర్యపోయి చూస్తున్నారు. సైనికులయితే ఆయుధాలు చేజార్చి ఎక్కడివాళ్ళు అక్కడే బిగిసిపోయారు.

## ◆ సుబాహు, సుదర్శన కృత దేవీస్తుతి ◆

సుబాహుడు చాలా సంతోషించాడు. హే దుర్గతినాశిని దుర్గే అంటూ చేతులు జోడించాడు. జగన్మాతను స్తుతించాడు.

నమో దేవ్యై జగద్ధాత్ర్యై శివాయై సతతం నమః ।
దుర్గాయై భగవత్యై తే కామదాయై నమో నమః ॥
నమశ్శివాయై శాంత్యై తే విద్యాయై మోక్షదే నమః ।
విశ్వవ్యాప్త్యై జగన్మాతః జగద్ధాత్ర్యై నమశ్శివే ॥ (23 - 42, 43)

అమ్మా! నీవు నిర్గుణవు. నేను సగుణుడను. బుద్ధితో ఎంత ఆలోచించినా నిన్ను తెలుసుకోలేను. భక్తుల ఆర్తిని తొలగించే పరాశక్తివి నువ్వు. నీ ప్రభావం ఇంత స్పష్టంగా ప్రకటమవుతూంటే ఏమని స్తుతించను, ఎలా స్తుతించను! వాగ్దేవతవు నువ్వు. సర్వత్రా నువ్వే. బుద్ధి విద్య మతి గతి అన్నీ అందరికీ నువ్వే. ఆత్మరూపవు. సర్వమనోనియంత్రివి. నిన్ను స్తుతించడమైనా నీ అనుగ్రహం లేకుండా సాధ్యం కాదు. నీ గుణాలను బ్రహ్మాదిదేవతలు నిరంతరం స్తుతిస్తున్నారే కానీ ఇప్పటికీ పారం ముట్టలేకపోతున్నారు. ఇక నేననగా ఏపాటి! ఇంతకాలమూ సజ్జన సాంగత్యం లేక, చిత్తశుద్ధిలేక నిన్ను స్తుతించలేకపోయాను. ప్రాసంగికంగానైనా ప్రస్తావించలేకపోయాను. ఇప్పుడు సుదర్శనుడు అల్లుడు కావడంతో అద్భుతమైన నీ దివ్యరూప సందర్శన మహాభాగ్యం లభించింది. ధన్యుణ్ని దేవీ! ధన్యుణ్ణి. బ్రహ్మాది సకలదేవతలూ మహర్షులూ మహా యోగులూ నిరంతరం కాంక్షించే నీ దివ్యదర్శనం ఎవరికీ దక్కనిది నాకు శమదమాదులు ఏమీ లేకండా సులభంగా దక్కింది. ఇది కేవలం నీ దయ. నువ్వు నిజంగా భక్తానుకంపనపరాయణవు. ఇంతకన్నా నిదర్శనం ఏమి కావాలి?



కష్టాలలో ఉన్న సుదర్శనుణ్ణి రక్షించావు. అతడి శత్రువులను క్షణకాలంలో సంహరించావు. పరమపవిత్రమైన నీ భక్త రక్షణచరిత్రకు ఇదే ప్రత్యక్షనిదర్శనం. ఒక రకంగా చూస్తే ఇందులో ఆశ్చర్యం ఏమీ లేదు. నీ భక్తుణ్ని నీ సేవకుణ్ని నీవు కాపాడటం, అతడి యశస్సును దశదిశలకూ వ్యాపింపజెయ్యడం - ఇది నీకు సహజగుణం. జననమరణాది భయాలను తొలగించే దివ్యశక్తివి. చరాచరజగత్తుకి ప్రాణప్రదవు. పాప పుణ్యాలకు అతీతవు. ఒక జపం కానీ ఒక సేవకానీ ఏమీ తెలియని అజ్ఞానిని నన్ను కరుణించావు. దివ్యదర్శనం అనుగ్రహించావు. నేను సుకృతిని, నేను కృతార్థుణ్ణి. నా జన్మ ధన్యమయ్యింది. నీ శక్తీ నీ ప్రభావమూ నీ దయాగుణమూ అవగతమయ్యాయి.

త్వద్దర్శనాదహమహో సుకృతీ కృతార్థో
జాతోఽస్మి దేవి భువనేశ్వరి ధన్యజన్మా ।
బీజం న తే న భజనం కిల వేద్మి మాతః
జ్ఞాతస్త్వాద్య మహిమా ప్రకటప్రభావః ॥ (23 - 54)

కాశీనరేశ్వరుడు సుబాహుడు అచంచల భక్తివిశ్వాసాలతో తన్మయుడై స్తుతించేసరికి జగజ్జనని ప్రసన్నవదన అయ్యింది. కావలసిన వరం కోరుకోమంది. ***(అధ్యాయం - 23, శ్లోకాలు - 55)***

జగన్మాతా! ఏమి కోరుకోమంటావు ? దేవలోకంతోసహా సకల భూమండలాన్నీ ఒకవైపు ఉంచి నీ దివ్యదర్శనం మరొక వైపు ఉంచితే అవి రెండూ సమానం కావు. ముల్లోకాలలోనూ నీ దర్శనానికి సాటివచ్చేది లేదు. అలాంటి దర్శనాన్నే అనుగ్రహించి కృతార్థుణ్ణి చేశావు. ఇంతకన్నా వరం ఏమి కావాలి తల్లీ! అయినా కోరుకోమన్నాక కోరుకోవాలి కనక అభ్యర్థిస్తున్నాను. నీపట్ల నా భక్తి నిశ్చలంగా నిరంతరంగా ఉండేట్టు అనుగ్రహించు. మా నగరంలో నువ్వు ఎల్లప్పుడూ స్థిరనివాసం ఉండాలి. దుర్గాదేవి పేరుతోనిలిచి నన్నూ, నా వంశాన్నీ, నా ప్రజలనూ, నా రాజ్యాన్ని సర్వదా సర్వథా సుదర్శనుడిని రక్షించినట్టే రక్షిస్తూండు తల్లీ ! కాశీపట్టణం ఉన్నంతకాలమూ నీ రక్షణ ఉండాలి. నువ్వు కాపురం ఉండాలి. ఇంతకన్నా నేనేమీ కోరుకోను. సకల శుభాలనూ కలిగించు. శత్రువులను సంహరించు. అభద్రతలను తొలగించు.

జనమేజయా! సుబాహుడి అభ్యర్థనకు జగన్మాత సరే అంది. భూమండలం ఉన్నంతవరకూ ముక్తి పట్టణం కాశీలో తాను స్థిరనివాసం ఉంటానంది. అప్పుడు సుదర్శనుడు కూడా సింహవాహనకు సాష్టాంగ నమస్కారం చేసి భక్తితో స్తుతించాడు.

అమ్మా! నీ దయకు అవధులు లేవుకదా! భక్తులు కాని వారిని కూడా కాపాడే ఏకైకకృపానిధివి. భక్తులను అనుగ్రహించే దేవతలు చాలామంది ఉన్నారుకానీ భక్తులు కాని వారిని కాపాడే తల్లివి నువ్వు మాత్రమే. అది నీ వ్రతం. నీ దీక్ష.



అహో కృపా తే కథయామ్యహం కిం
త్రాతస్త్వయా యత్కిల భక్తిహీనః ।
భక్తానుకంపీ సకలో జనోఽస్తి
విముక్త భక్తేరవనం వ్రతం తే ॥ (24 - 13)

అటువంటిదానవు నన్ను కాపాడటంలో వింత ఏముంది తల్లీ! సకల ప్రపంచాన్నీ సృష్టిస్తున్నావు. పోషిస్తున్నావు. ప్రళయకాలంలో నువ్వే మళ్ళీ ఉపసంహరిస్తున్నావు. జగన్మాతా! ఇప్పుడు నేను ఏమి చెయ్యాలో చెప్పు. ఎక్కడికి వెళ్లమంటావు? నీ ఆజ్ఞ ఎలా ఉంటే అలా చేస్తాను. నీ అనుజ్ఞ లేకండా నేను అడుగు కదపలేను. కదపను - అనేసరికి జగదంబ ప్రసన్నచిత్తంతో పలికింది.

సుదర్శనా! అయోధ్యకు వెళ్ళు. సింహాసనం అధిష్ఠించు. నీ రాజ్యాన్ని నువ్వు పరిపాలించు. నా అర్చన స్మరణపూజనలు మర్చిపోకు. నీకూ నీ ప్రజలకూ సకలశుభాలూ కలిగిస్తాను. రక్షణగా నిలుస్తాను. అష్టమి నవమి చతుర్దశి తిథులలో నాకు విశేషార్చనలు బలిదాన విధానాలతో జరిపిస్తూండు. నీ నగరంలో ప్రజలంతా ముప్పొద్దులా నన్ను అర్చించాలి. శరత్కాలంలో నవరాత్ర దీక్షతో మహాపూజలు జరగాలి. చైత్ర ఆషాఢ ఆశ్వయుజ మాఘ మాసాలలో మహోత్సవాలు జరిపించు. ప్రతినెలా కృష్ణ చతుర్దశి నాకు చాలా ప్రీతిపాత్రమైన రోజు. ఆరోజు విశేషంగా అర్చనలు చేసినవారిని విశేషంగా అనుగ్రహిస్తాను.

## ◆ సుదర్శనుడు చెప్పిన దేవీమహిమ ◆

సుదర్శనుడు మళ్ళీ స్తుతించేలోగా దుర్గాదేవి అంతర్హిత అయ్యింది. రాకుమారులందరూ తేరుకొని బిలబిలా వచ్చి సుదర్శనుడికి పాదాభివందనాలు చేశారు. సుబాహుడు కూడా నమస్కరించాడు. దేవతల మొక్కులందుకొంటున్న దేవేంద్రుడిలా భాసించాడు ఆ క్షణాన సుదర్శనుడు.

అయోధ్యాధిపతీ! నీకు మేమంతా ఈ రోజు నుంచీ సామంతులం. సేవకులం. నువ్వు మాకు ప్రభువువి. శాసకుడివి. మమ్మల్ని పాలించు. నీ అనుగ్రహం వల్ల విశ్వేశ్వరీ దర్శనం లభించింది మాకు. ఆదిశక్తి. చతుర్వర్గ ఫలప్రద. నీతోపాటు మేమూ ధన్యులమయ్యాం. నీకోసం జగన్మాత అవతరించిందంటే ఈ భూలోకంలో నీ అంతటి పుణ్యాత్ముడు లేడు. ధన్యాత్ముడు లేడు. మాయామోహితులమై మేము తెలుసుకోలేకపోయాం. నువ్వు చెబుతూనే ఉన్నావు - ఆదిశక్తి ఆజ్ఞమేరకు స్వయంవరం చూసి వెళ్ళడానికి వచ్చాను అని. కానీ మేము మూఢులం. నీ ప్రభావాన్నీ జగదంబిక ప్రభావాన్నీ గ్రహించలేకపోయాం. మాకు ఎంతసేపూ సంసారచింతనలే. ధనమూ ధాన్యమూ భార్యలూ పిల్లలూ ఇవే చింతనలు. ఒకటే ధ్యాస. కామక్రోధాలనే తిమితిమింగలాలతో నిండిన ఘోరసంసార మహాసముద్రంలో నిండా మునిగిపోయి ఉన్నాం. మమ్మల్ని క్షమించు. మమ్మల్ని ఉద్ధరించు. నువ్వే మాకు నౌకవు. సర్వజ్ఞుడవు. దేవీ మాహాత్మ్యం తెలియజెప్పి మమ్మల్ని తరింపజెయ్యి. మా జీవనమార్గాలను సరిదిద్దు.



రాకుమారుల ఈ అభ్యర్థనకు సుదర్శనుడు సంతోషించాడు. మనసులో మరొక్కసారి జగదీశ్వరిని ధ్యానించాడు. భూపతులారా! నేనుమాత్రం ఆ దేవీ మాహాత్మ్యాన్ని చెప్పగలనా? హరిహరాదులకే సాధ్యంకాదు. అన్నింటికీ మూలమైన ఆదిపరాశక్తి, సాత్త్వికగుణప్రధానంగా మహాలక్ష్మీరూపాన్ని ధరించి ఈ జగత్తును పరిపాలిస్తుంటుంది. రజోగుణ ప్రధానంగా మహాసరస్వతీ రూపంలో జగత్తును సృష్టిస్తుంది. మహాకాళీ రూపంలో తమోగుణప్రధానంగా ప్రళయకాలంలో ఉపసంహరిస్తుంది. ఇవి త్రిగుణ స్వరూపాలు. ఆదిపరాశక్తి మాత్రం గుణాతీత. త్రిమూర్తులకూ మూలకారణం. ఆ శక్తిని తెలుసుకోవడం యోగీశ్వరులకైనా అసాధ్యం. సగుణరూపమే మనకు సుఖసేవ్యం. పరమ కారుణికురాలు. పరమదయామయి. నా ఉపాస్యదైవం - సాత్త్విక వైష్ణవీరూప.

సుదర్శనమహారాజా! నువ్వు బాలుడుగా ఉండగానే అడవులకు వచ్చేశావుకదా, పరాశక్తిని ఎలా తెలుసుకున్నావు? ఎలా ఉపాసించావు? ఎవరు ఉపదేశించారు? నీమీద ఆ తల్లికి ఎంత అనురాగం లేకపోతే ఇలా ప్రత్యక్షంగా వచ్చి సహాయపడుతుంది! ఆ విశేషాలన్నీ చెప్పు మిత్రమా! వినాలని చాలా కుతూహలంగా ఉంది.

నృపతులారా! బాల్యంలోనే నాకు మహాదేవీమంత్ర బీజాక్షరం లభించింది. అది కామబీజాక్షరమని నాకు తెలియదు. కానీ తదేక దీక్షతో నిరంతరం పదిపన్నెండు సంవత్సరాలపాటు జపించాను. ఎంతకాలం జపించానో ఎన్నికోట్లు జపించానో వాస్తవానికి నాకేమీ తెలియదు. భరద్వాజుని ఆశ్రమంలో ఋషీశ్వరులు చెప్పగా దేవీమాహాత్మ్యం కొంత తెలుసుకున్నాను. సహజంగా ఆ జగన్మాత వాత్సల్యగుణ సంపూర్ణ కనక కష్టాలలో కనికరించి ఆదుకుంది. ఇందులో నా గొప్పదనం ఏమీలేదు. ఇంతకన్నా నేను చెప్పగలిగిందీ లేదు - అని సుదర్శనుడు క్లుప్తంగా ముగించాడు.

రాకుమారులు సంతోషించి పరాశక్తి దివ్యదర్శనానుభవాన్ని పదేపదే నెమరువేసుకుంటూ తమతమ రాజ్యాలకు వెళ్ళిపోయారు. సుబాహుడు కాశీపట్టణం చేరుకున్నాడు. సుదర్శనుడు శశికళతో మాతృమూర్తి మనోరమతో అయోధ్యకు రథాలను నడిపించాడు. అప్పటికే శత్రుజిద్వధ - సుదర్శన విజయం కోసల ప్రజలకు తెలిసిపోయాయి. మంత్రులూ దండనాయకులూ సేనాపతులూ పౌరులూ కోలాహలంగా ఉపాయనాలతో (కానుకలు) ఎదురు వచ్చారు. సగౌరవంగా పురప్రవేశం చేయించారు. వందిమాగధులు స్తుతిస్తూండగా, మంత్రిసత్తములు నమస్కరిస్తూండగా, కన్యామణులు పువ్వులూ లాజలూ (పేలాలు) జల్లుతూండగా సుదర్శనుడు రాజప్రాసాదంలోకి అడుగుపెట్టాడు.

***(అధ్యాయం - 24, శ్లోకాలు - 50)***



## ◆ సుదర్శనుడు లీలావతి నోదార్చడం ◆

సరాసరి అంతఃపురంలోకి వెళ్ళి పినతల్లి లీలావతీదేవిని సందర్శించి నమస్కరించాడు. పుత్రుడు శత్రుజిత్తు మరణంతో శోకసాగరంలో మునిగిపోయింది. కంటికీ మంటికీ ఏకధారగా విలపిస్తోంది. ఎలా ఓదార్చాలో తోచక క్షణకాలం తటపటాయించాడు.

తల్లీ! నీ పుత్రుణ్ణి నేను చంపలేదు. మీ తండ్రిగారినీ నేను చంపలేదు. ఒట్టు. నీ పాదాలసాక్షిగా నిజం చెబుతున్నాను. దుర్గాదేవి చేతిలో ముక్తి పొందారు. ఇందులో నా అపరాధం ఏమీలేదు. నన్ను నమ్ము. అవశ్యంగా జరగవలసినవి కొన్ని అలా జరుగుతాయి. మన చేతుల్లో ఏమీలేదు. ప్రతీకార భావన అనేదే లేదు. జీవుడు కర్మానుసారంగా సుఖదుఃఖాలను అనుభవిస్తాడు. ఎవరుగానీ దుఃఖించవలసినది ఏమీ లేదు. నాకు నువ్వొకటీ మా అమ్మ ఒకటీ కాదు. ఇద్దరూ సమానమే. భేదభావం రవ్వంతయినా నా మనస్సులో లేదు. ఉండదు. నన్ను నమ్ము. చేసిన కర్మ శుభమో అశుభమో దాని ఫలితం అనుభవించక తప్పదు. సుఖాలకు పొంగిపోకూడదు, దుఃఖాలకు కుంగిపోకూడదు. అంతా దైవాధీనం. మన అధీనంలో ఏమీ లేదు. ఇది తెలుసుకున్న మనిషి ఎవరూ తనను తాను హింసించుకోడు. చెక్క బొమ్మ - ఆడించినట్టుగా ఎలా ఆడుతుందో అలాగే జీవుడూ చేసుకున్న కర్మనుబట్టి ఆడుతూ ఉంటాడు.

**యథా దారుమయీ యోషా నటాదీనాం ప్రచేష్టతే ।**
**తథా స్వకర్మవశగో దేహీ సర్వత్ర వర్తతే ॥ (25 - 9)**

నేను అడవుల పాలయ్యాను. కానీ దుఃఖించలేదు. ఇది ఏదో కర్మఫలం అనుకున్నాను, అనుభవించాను. నా మాతామహుడు ఇక్కడే దుర్మరణం చెందాడు. నా తల్లి ఏకాకి అయ్యింది. పసిబిడ్డను నన్ను తీసుకుని దుర్గమారణ్యాలకు భయార్తయై పారిపోయింది. దారిలో దొంగలు దోచుకున్నారు. కట్టుబట్టలతో మిగిలింది. అన్నం మెతుకైనా లేదు. చంకలో పసిబిడ్డ. ఎలాగో భరద్వాజాశ్రమానికి చేరుకుంది. విదల్లుడూ దాదీ మాత్రం విడిచిపెట్టలేక మా అమ్మ వెంట వచ్చారు. ఆశ్రమంలో మునులూ మునిపత్నులూ దయామయులు కనక మా ఆలనా పాలనా చూశారు. కందమూల ఫలాలతో కాలక్షేపం చేశాం. ఇదంతా ఎందుకు చెబుతున్నానంటే అప్పుడుకూడా ఏనాడూ నేను దుఃఖపడలేదు. ఇదిగో ఇప్పుడు రాజ్యం దక్కింది, భోగాలు వచ్చాయని నేను పొంగిపోవడం లేదు. నా హృదయంలో ఎవరిపట్లా వైరం లేదు. మాత్సర్యం లేదు. నన్నడిగితే ఈ రాజభోగాలకన్నా నీవారభక్షణమే (ఆశ్రమాలలో మునులు నివ్వరిధాన్యం పరిగ ఏరి తెచ్చుకుని దంచుకుని గుప్పెడేసి వండుకొని తింటారు) ఉత్తమోత్తమం. రాజభోగాలను అనుభవించినవాడు నరకానికి పోతాడు. నివ్వరిధాన్యం తిన్నవాడు స్వర్గానికి వెడతాడు.



దుఃఖం న మే తదాసీత్ సుఖం నాద్య ధనాగమే ।
న వైరం న చ మాత్సర్యం మమ చిత్తే తు కర్హిచిత్ ॥
నీవార భక్షణం శ్రేష్ఠం రాజభోగాత్పరంతపే ।
తదాశీ నరకం యాతి న నీవారాశనః క్వచిత్ ॥ (25 - 15, 16)

పిన్నీ! మానవుడెప్పుడూ తెలిసి ధర్మం ఆచరించాలి. ఇంద్రియాలను జయించాలి. లేకపోతే నరకం తప్పదు. మానవజన్మ దుర్లభం. అది పరమ పవిత్రమైన భరతఖండంలో లభించడం మరీ దుర్లభం అటువంటి జన్మను పొందినందుకు ధర్మసాధన చెయ్యాలి. స్వర్గ మోక్షదమైన ఈ ధర్మసాధన మిగతా పశుపక్ష్యాదిజాతులలో జన్మిస్తే కుదరదుగదా! అనుక్షణం మనం ఈ విషయాన్ని గుర్తుపెట్టుకోవాలి.

వయస్సులో చిన్నవాడైనా జ్ఞానంలో పెద్దవాడై సుదర్శనుడు చేసిన ఈ ధర్మ ప్రబోధంతో లీలావతి తేరుకుంది. పుత్రశోకాన్ని క్షణంలో వదిలేసింది. జరిగిన సంఘటనలను తలచుకొని సిగ్గుపడుతూ బదులు పలికింది.

నాయనా! మా తండ్రి చేసిన దుర్మార్గం వల్ల నేను అపరాధిని అయ్యాను. మీ తాతగారిని చంపడం, న్యాయంగా నీకు దక్కవలసిన రాజ్యాన్ని అపహరించి నా కొడుకుకు కట్టబెట్టడం - ఇవి క్షమించరాని నేరాలు. నిజంగా నేను సిగ్గు పడుతున్నాను. అప్పుడు నా తండ్రిని గానీ, నా కొడుకును గానీ వారించలేకపోయాను. నా కొడుకు చేసినది ఏమీ లేదు. తప్పు అంతా మా తండ్రిదే. అయితే తాతగారి చెప్పుచేతలలో ఉండిపోవడం, జరిగిన తప్పును ఖండించి సరిదిద్దకపోవడం - ఇవి నా కొడుకు చేసిన అపరాధాలు. సరే, వారి వారి కర్మలను బట్టి ఇద్దరూ గతించారు. వారికోసం నేను దుఃఖించను గానీ వారు చేసిన అపరాధాలకు మాత్రం బాధ పడుతున్నాను. ఈ క్షణం నుంచి నువ్వే నా పుత్రుడివి. నీ పట్ల నాకు క్రోధం లేదు. ఈర్ష్య లేదు. శోకం లేదు. హాయిగా రాజ్యపాలన సాగించు. ప్రజలను సుఖపెట్టు. దేవి అనుగ్రహంవల్ల అకంటకంగా నీ సామ్రాజ్యం నీకు లభించింది. ధర్మబద్ధంగా పరిపాలించు. మేమంతా చూసి సంతోషిస్తాం. ఆనందిస్తాం. ఆశీర్వదిస్తాం.

## ◆ కాశీ అయోధ్యలలో దేవీ మందిర నిర్మాణాలు ◆

సుదర్శనుడు పినతల్లికి మరోసారి నమస్కరించి సెలవు తీసుకున్నాడు. కన్నతల్లి మందిరానికి వెళ్లాడు. మంత్రి పురోహితులను ఆహ్వానించాడు. మంచిరోజు చూసి చెప్పమన్నాడు. ఒక బంగారు సింహాసనం తయారు చేయించమన్నాడు. అందులో జగదీశ్వరిని వైష్ణవీదేవిని ప్రతిష్ఠించి అటుపైని రాచకార్యాలు చేపడతానన్నాడు. రామాదులలాగా పరిపాలన సాగిస్తానన్నాడు.



స్థాపయిత్వాऽऽసనే దేవీం ధర్మార్థకామమోక్షదామ్ ।
రాజ్యం పశ్చాత్కరిష్యామి యథా రామాదిభిః కృతమ్ ॥ (25 - 29)

మన రాజ్యంలో అందరూ జగన్మాతను పూజించాలి. ఊరూరా ఇంటింటా తగిన వసతులు కల్పించండి. ఇది రాజశాసనం - అన్నాడు. మంత్రులను వీడ్కొలిపాడు.

రాజప్రాసాదంలో శరవేగంతో ఆలయనిర్మాణం జరిగింది. బంగారు సింహాసనం సిద్ధమయ్యింది. ఒక శుభముహూర్తాన దైవజ్ఞులైన వేదపండితులు దేవీ ప్రతిష్ఠ జరిపారు. హోమాలూ పూజలూ జపాలూ భక్తి శ్రద్ధలతో నియమనిష్ఠలతో యథాశాస్త్రంగా జరిపాడు సుదర్శనుడు. ఆరోజు రాజ్యమంతటా మహోత్సవం జరిగింది. వేదమంత్ర ధ్వనులు, మంగళవాద్యఘోషలు సంగీతనాట్యాల రవళులు మారుమ్రోగాయి. కోసలదేశంలో అంబికాదేవి ఆనాటినుంచీ అందరికీ ఇలువేల్పు అయ్యింది.

సుదర్శనుడు ధర్మబద్ధంగా పాలన సాగిస్తున్నాడు. దిలీపుడిలా రఘుమహారాజులా శ్రీరామ చంద్రుడిలా పాలిస్తున్నాడు. ప్రజలకు సుఖాలూ మర్యాదలూ యథావిధిగా దక్కుతున్నాయి. ఎవరికీ అధర్మచింతనలు ఊహకైనా రావడం లేదు. గ్రామగ్రామానా దేవీ ఆలయాలు విలసిల్లాయి. నిత్యపూజలు జరుగుతున్నాయి.

కాశీలో సుబాహుడుకూడా ఇలాగే తాను దర్శించిన దేవీ ప్రతిమను చేయించి ప్రాసాదం నిర్మించి విగ్రహ ప్రతిష్ఠ జరిపాడు. ఊరూరా దుర్గాదేవీమందిరాలు వెలిశాయి. ప్రజలంతా దేవీ ఉపాసకులు అయ్యారు. సామంతరాజ్యాలలో ఇరుగుపొరుగు దేశాలలో దుర్గాదేవి విఖ్యాతి పొందింది. ఇలా భారతదేశమంతటా దేవి ఆలయాలూ దేవి ఉపాసనలూ వర్ధిల్లాయి. నిత్యపూజలే కాక విశేష సమయాలలో విశేషార్చనలు సాగుతున్నాయి. నవరాత్రులలో అర్చన హవనయాగాదులు ఆగమోక్త ప్రకారంగా భక్తిశ్రద్ధలతో చేస్తున్నారు. అన్ని వర్ణాలవారూ తారతమ్యాలు లేకుండా భాగస్వాములు అవుతున్నారు.

*(అధ్యాయం - 25, శ్లోకాలు- 46)*

శౌనకాది మహామునులారా! వింటున్నారుగదా! వ్యాసుడు చెప్పిన ఈ దేవీ మాహాత్మ్యాన్ని జనమేజయుడు శ్రద్ధగా ఆలకించాడు. దేవీ యజ్ఞం చెయ్యడం దేవీ ఆలయం కట్టించడం దేవీమంత్రం జపించడం మొదలైన విశేషాలు అతడి మనస్సులో స్థిరపడ్డాయి. వాటి వాటి ఫలితాలు ఎలా ఉంటాయో ఆకళింపు చేసుకున్నాడు. శరత్కాలంలో నవరాత్రోత్సవాలు జరిపించమని దేవి సుదర్శనుణ్ణి ఆజ్ఞాపించింది కదా, అవి ఎలా చెయ్యాలి, చేస్తే ఏ ఫలాలు వస్తాయి అనే విశేషాలు తెలుసుకోవాలనిపించింది. వ్యాసుణ్ణి అడిగాడు. చెబుతాను వినమంటూ ఆ కృష్ణద్వైపాయనుడు ఆరంభించాడు.



## ◆ దేవీ నవరాత్రాలు ◆

జనమేజయా! ప్రజలకు వసంత ఋతువూ శరదృతువూ చాలా గడ్డుకాలం. అవి రెండూ యమదంష్ట్రలవంటివి. రోగపీడలు వ్యాపించే ఋతువులు. జననాశనమవుతుంది. అందుకని ఆ రెండు ఋతువులలోనూ దేవీ నవరాత్రాలు జరిపితే క్షేమదాయకంగా ఉంటుంది.

ద్వావృతూ యమదంష్ట్రాఖ్యే నూనం సర్వజనేషు వై ।
శరద్వసంతనామానౌ దుర్గమౌ ప్రాణినామిహ ॥ (26 - 5)
ద్వావేవ సుమహాఘోరౌ ఋతూ రోగకరౌ నృణామ్।
వసంత శరదావేవ జననాశకరావుభౌ ॥ (26 - 6)

చైత్రమాసం ప్రారంభదినాన గానీ ఆశ్వయుజమాసం ప్రారంభదినానగానీ నవరాత్రోత్సవాలను ఆరంభించాలి. ముందటి నెల అమావాస్య నాటికి సంబారాలన్నీ సమకూర్చుకోవాలి. హవిష్యమే అశనంగా (ప్రసాదం మాత్రమే స్వీకరిస్తూ) ఏకభుక్త వ్రతం చేపట్టాలి. (ఒంటిపూట భోజనం). ఎత్తుపల్లాలు లేని సమతలంలో మండపం ఏర్పరచాలి. ఎనిమిది బారల (షోడశహస్త ప్రమాణం) స్తంభధ్వజం స్థాపించాలి. మండపమంతటా ఎర్రమట్టితో కలిపిన పేడతో అలకాలి. దాని మధ్యలో సమకోణభుజంగా నలుచదరపు వేదిక అమర్చాలి. పొడుగు వెడల్పులు సమంగా (బారెడేసి గానీ) చేతిపొడుగున ఉండాలి. ఎత్తుకూడా అంతే. చెయ్యెత్తు ఉండాలి. దానిమీద అలంకృతపీఠం స్థాపించాలి. పందిరి (కాయమానం) వెయ్యాలి. తోరణాలు కట్టాలి. మంత్రతంత్రవేత్తలైన బ్రాహ్మణులనూ వేద పండితులనూ ఆహ్వానించాలి. పాడ్యమినాటి తెల్లవారు జాముననే లేచి స్నాన సంధ్యాదులు ముగించుకోవాలి. ఋత్విగ్వరణం చెయ్యాలి. అర్ఘ్యపాద్యాలు ఇవ్వాలి. నూతనవస్త్రాలు బహూకరించాలి. దేవీపూజలో పిసినారితనం పనికిరాదు. ఉన్న స్తోమతును దాచుకోకూడదు. అలా అని లేనిబడాయికి పోకూడదు. యథాశక్తిగా విత్తం ఖర్చుపెట్టాలి. తొమ్మిది మందితోగానీ అయిదుగురితో గానీ లేదా ఒక్కరితోగానీ దేవీజపం జరిపించాలి. ఒకరు దేవీ మంత్రపారాయణ చెయ్యాలి. శాంతస్వభావులూ వేదవేత్తలూ అయిన పండితులను ఈ పూజలకు నియోగించాలి. వేదమంత్రాలతో స్వస్తివచనాలతో సింహాసనం వేదికమీద పెట్టి తెల్లని నూతనవస్త్రం ఆస్తరణగా వెయ్యాలి. అందులో అమ్మవారిని కూర్చోబెట్టాలి. చతుర్భుజ, ముక్తాహారశోభిత, దివ్యాంబరధారిణి, శంఖచక్రగదా ద్యాయుధసమేత, సింహవాహనాధిష్ఠిత అయిన దేవీ ప్రతిమను ఆ సింహాసనంలో ఉంచాలి. కొందరు అష్టాదశ భుజాలతో ఒప్పారే మూర్తిని ప్రతిష్ఠిస్తారు. నవాక్షరమంత్రార్చన జరగాలి. కలశస్థాపన చెయ్యాలి. అందులో పంచపల్లవాలను ఉంచాలి. మంత్రపరిపూతమైన శుభ్రజలాన్ని నింపాలి. బంగారమూ మణులూ రత్నాలూ అందులో వెయ్యాలి. మిగతా పూజాద్రవ్యాలను వేదికపైని కలశానికి దగ్గరగా అందుబాటులో



ఉంచుకోవాలి. బాజా భజంత్రీలు ఉండాలి. ఇలా ప్రారంభించి తొమ్మిది రోజులపాటు ఉపవాస దీక్షతోగానీ నక్తాలతోగానీ (రాత్రిపూట మాత్రమే భుజించడం) ఏకభుక్తాలతోగానీ (ఏదో ఒకపూట - పగలు భోజనం చెయ్యడం) నిత్యార్చన జరపాలి. ఇలా భక్తిశ్రద్ధలతో నవరాత్రోత్సవం జరిపితే ఆ దేవి అనుగ్రహించి విశేషంగా వాంఛితార్థాలను ప్రసాదిస్తుంది. రోజూ వివిధ పుష్పాలతో అలంకరించాలి. పరిమళద్రవ్యాలను ఉపయోగించాలి. నారికేళకదళీనారంగాది ఫలాలను నివేదన చెయ్యాలి. ముగింపునాడు షడ్రసోపేతంగా సకల ప్రజానీకానికీ అన్న సంతర్పణ జరపాలి.

జనమేజయా! ఇందులో మరొక రహస్యం ఉంది. మాంస భోజనులు కనక ఈ ఉత్సవాలకు కంకణం కట్టుకుంటే అమ్మవారికి మాంసాలను నైవేద్యం పెట్టవచ్చు. ఇందుకోసం జరిగే మహిష-అజ-వరాహాల హింసను ధర్మశాస్త్రాలు హింసగా పరిగణించవు. జంతుబలి అంటారు. (అజము = గొర్రె) దేవతలకోసం జంతువులను బలిచేస్తే అది వాటికి స్వర్గప్రదమవుతుంది.

త్రికోణ కుండాన్నీ త్రికోణ స్థండిలాన్నీ ఏర్పాటు చేసుకొని నిత్యమూ మంత్రపూర్వకంగా హోమాలు చెయ్యాలి. త్రికాలపూజలు జరుపుతూ పరిమళ ద్రవ్యాలతో సుగంధ బంధురపుష్పసమూహాలతో అమ్మవారిని ముంచెత్తాలి. సంగీత సాహిత్య నృత్యాది కళలను అమ్మవారి కైంకర్యానికి వినోదంగా వినియోగించాలి. అలా తమ కళలను సార్థకం చేసుకున్నవారి జన్మలు ధన్యమవుతాయి. తరిస్తారు. దేవీ అనుగ్రహానికి విశేషంగా పాత్రులు అవుతారు.

యజమానుడు ఈ తొమ్మిదిరోజులపాటూ కఠోర బ్రహ్మచర్యాన్ని పాటించాలి. కటికి నేలమీద మాత్రమే పడుకోవాలి. అనారోగ్యాది కారణాలు ఉంటే తప్ప, లేకపోతే చన్నీటి స్నానమే చెయ్యాలి.

## ◆ కుమారీ పూజ ◆

ఇవికాక నిత్యమూ కన్యాపూజ చెయ్యాలి. శక్తిని బట్టి ఒకరినుంచి తొమ్మిది మందివరకూ కన్యలను ఆహ్వానించి వస్త్రాలంకారాదులు చేసి విధివిధానంగా మంత్రాలతో పూజించాలి. దీనినే కుమారీపూజ అంటారు. రెండు సంవత్సరాలనుంచి పది సంవత్సరాల వరకూ వయస్సున్నవారే దీనికి కన్యలుగా అర్హులు. ఏడాది పిల్ల పనికిరాదు. రెండేళ్ళపిల్లను కుమారి అంటారు. మూడేళ్ళ అమ్మాయిని త్రిమూర్తి అంటారు. నాలుగేళ్ళ పిల్లను కళ్యాణి అనీ, అయిదేళ్ళ కన్యను రోహిణి అనీ, ఆరేళ్ళ పిల్లను కాళిక అనీ, ఏడేళ్ళ అమ్మాయిని చండిక అనీ, ఎనిమిదేళ్ళ అమ్మాయిని శాంభవి అనీ, తొమ్మిదేళ్ళ కన్యను దుర్గ అనీ, పదేళ్ళ కన్యను సుభద్ర అనీ ఈ కుమారీ పూజలో వ్యవహరిస్తారు. పది సంవత్సరాలు దాటిన అమ్మాయి ఈ పూజకు అర్హురాలు కాదు. వీలయితే తొమ్మిది మందినీ ఒకేవయస్సువారిని ఏర్పాటు చేసుకోవచ్చును. వీటికి విశేష ఫలాలు ఉన్నాయి.



కుమారీ పూజవల్ల దారిద్ర్యదుఃఖాదులు నశిస్తాయి. దీర్ఘాయువు సిద్ధిస్తుంది. శత్రువులను జయిస్తారు. త్రిమూర్తిపూజ త్రివర్గ ఫలాలను ఇస్తుంది. ధనధాన్య పుత్రపౌత్రాభివృద్ధిని కలిగిస్తుంది. కల్యాణీపూజ విద్యాభివృద్ధిని కలిగిస్తుంది. రాజ్య లాభం చేకూరుస్తుంది. కాళికాపూజ శత్రునాశకం. చండికా పూజ ఐశ్వర్యప్రదం. శాంభవీపూజ నృపసమ్మోహకం. అధికారులను లొంగదీసుకోవడానికి ఇది దివ్యౌషధం. దుర్గాపూజ ఉగ్ర పద్ధతిలో అయితే సకలశత్రు వినాశకం, సౌమ్య పద్ధతిలో అయితే స్వర్గసుఖప్రదం. రోహిణీపూజ సకలరోగ నివారకం. దీర్ఘరోగాలు కూడా ఉపశమించి పరిపూర్ణంగా ఆరోగ్యం చేకూరుతుంది. సుభద్రాపూజవల్ల వాంఛితార్థాలు సిద్ధిస్తాయి. వీరిని అమ్మవారికి ప్రతిరూపాలుగా భావించాలి. శ్రీయుక్త నామ మంత్రాలతోగానీ బీజాక్షర సహితమైన నామ మంత్రాలతోగానీ (నామజపం) భక్తి శ్రద్ధలతో ఈ కుమారీపూజ జరపాలి. ఈ తొమ్మిదింటికీ తొమ్మిది ప్రత్యేక స్తోత్రశ్లోకాలు ఉన్నాయి. చెబుతాను ధారణ చెయ్యి.

కుమారస్య చ తత్త్వాని యా సృజత్యపి లీలయా ।
కాదీనపి చ దేవాన్ తాం కుమారీం పూజయామ్యహమ్ ॥
సత్త్వాదిభిస్త్రిమూర్తిర్యా తైర్హి నానాస్వరూపిణీ ।
త్రికాలవ్యాపినీ శక్తి స్త్రిమూర్తిం పూజయామ్యహమ్ ॥
కల్యాణకారిణీ నిత్యం భక్తానాం పూజితాఽనిశమ్ ।
పూజయామి చ తాం భక్త్యా కల్యాణీం సర్వకామదామ్॥
రోహయంతీ చ బీజాని ప్రాగ్జన్మ సంచితాని వై ।
యా దేవీ సర్వభూతానాం రోహిణీం పూజయామ్యహమ్ ॥
కాళీ కాళయతే సర్వం బ్రహ్మాండం సచరాచరమ్ ।
కల్పాంతసమయే యా తాం కాళికాం పూజయామ్యహమ్ ॥
చండికాం చండరూపాం చ చండముండ వినాశినీమ్ ।
తాం చండపాపహారిణీం చండికాం పూజయామ్యహమ్ ॥
అకారణా త్సముత్పత్తిః యన్మయైః పరికీర్తితా ।
యస్యాస్తాం సుఖదాం దేవీం శాంభవీం పూజయామ్యహమ్ ॥
దుర్గా త్రాయతి భక్తం యా సదా దుర్గతినాశినీ ।
దుర్జ్ఞేయా సర్వదేవానాం తాం దుర్గాం పూజయామ్యహమ్ ॥
సుభద్రాణి చ భక్తానాం కురుతే పూజితా సదా ।
అభద్రనాశినీం దేవీం సుభద్రాం పూజయామ్యహమ్ ॥

**(26 - 53 నుంచి 61)**



కన్యకలను నూతన వస్త్రాలతో పుష్పమాలికలతో పరిమళ ద్రవ్యాలతో సువర్ణాభరణాలతో అలంకరించి ఈ మంత్ర శ్లోకాలతో అర్చించాలి. *(అధ్యాయం - 26, శ్లోకాలు - 62)*

కురూపిణులూ, కులహీనలూ, గాయాలతో కురుపులతో (వ్రణాలు) ఉన్న వాళ్ళూ, రోగ వ్యాధి పీడితలూ, వికలాంగినులూ, అక్రమ సంజాతలూ ఈ పూజకు కన్యలుగా పనికిరారు. రూపవతి ఆరోగ్యవతి ఏకవంశసంజాత వ్రణవర్జిత మాత్రమే అర్హురాలు. బ్రాహ్మణ కన్యలను పూజిస్తే సర్వకార్యార్థ సిద్ధి కలుగుతుంది. జయార్థులు క్షత్రియకన్యలను పూజించాలి. లాభార్థులు వైశ్యకన్యలనూ శూద్రకన్యలనూ పూజించాలి. బ్రాహ్మణ క్షత్రియులు బ్రాహ్మణ కన్యలనూ, వైశ్యులు బ్రాహ్మణ క్షత్రియ వైశ్యకన్యలనూ, శూద్రులు నాలుగు వర్ణాల కన్యలనూ అర్చించవచ్చు.

తొమ్మిది రోజులపాటూ దేవీపూజలు చెయ్యలేని అశక్తులు ఎవరైనా ఉంటే వారు అష్టమిరోజున విశేషార్చనలు చేస్తే సరిపోతుంది. అది భద్రకాళికా జగన్మాత జన్మించిన రోజు. కోటానుకోట్ల యోగినులతో కలిసి జన్మించి దక్షాధ్వరధ్వంసం చేసింది భద్రకాళి. అందుకని అష్టమిపూజ విశేషం. గంధమాల్యాను లేపనాలతో ఫలపుష్పోపహారాలతో, హోమాలతో బ్రాహ్మణపూజలతో పాయసామిషాది నైవేద్యాలతో (అమిషం = మాంసం) జగదంబికను సంతోషపరచాలి. తొమ్మిదిరోజులపాటూ ఉపవాసాలు ఉండలేనివారు మూడురోజులు ఉపవాసం ఉన్నా సరిపోతుంది. సప్తమి అష్టమి నవమి ఈ మూడురోజులూ అతిముఖ్యాలు. అతి పవిత్రాలు. నిత్యపూజలూ హోమాలూ కుమారీపూజలూ బ్రాహ్మణభోజనాలూ వీటితో ఈ వ్రతం సంపూర్ణమవుతుంది. మిగతా వ్రతాలూ దానధర్మాలూ ఇవి ఏవీ దేవీనవరాత్రి వ్రతంతో సరికావు. సాటిరావు. ధనధాన్య-సుఖసంతోష - ఆయురారోగ్య ప్రదమైన వ్రతం ఇదొక్కటే. స్వర్గదాయకం. మోక్షదాయకం. విద్యార్థులూ ధనార్థులూ పుత్రార్థులూ ఈ వ్రతాన్ని చేస్తే నిస్సందేహంగా గొప్ప ఫలితాలు పొందుతారు. విద్యార్థికి సర్వవిద్యలూ కరతలామలకాలవుతాయి. రాజ్యభ్రష్టుడికి అనాయాసంగా సింహాసనం లభిస్తుంది.

పూర్వజన్మల్లో ఈ వ్రతం చెయ్యనివాళ్ళు ఈ జన్మలో వ్యాధి పీడితులుగా దరిద్రులుగా పుత్రహీనులుగా బాధపడుతూఉంటారు. గొడ్రాలు కనిపించినా వితంతువు కనిపించినా, గత జన్మలో దేవీపూజ చెయ్యని మనిషి అని గ్రహించు. ఇహంలోనూ పరంలోనూ దివ్యభోగాలు కావాలని కోరుకునేవారందరూ నవరాత్రి దీక్షతో దేవీవ్రతం చెయ్యాలి. చెయ్యకపోతే ఇహపరాలు రెండింటా కష్టాలు తప్పవు.

త్రిమూర్తులూ అష్టదిక్పాలకులూ సూర్యచంద్రులూ సకలదేవతలూ భక్తిశ్రద్ధలతో చండికాదేవిని అర్చిస్తున్నారంటే మానవమాత్రుడు అర్చించకపోతే ఎలాగ! స్వాహా స్వధా అనే దేవీనామాలతో యజ్ఞయాగాదులలో హోమాలు చేస్తుంటే దేవతలూ పితృదేవతలూ ఎంతగానో సంతోషిస్తారు.



బ్రహ్మదేవుడు లోకాలను సృష్టిస్తున్నాడన్నా, విష్ణుమూర్తి రక్షిస్తున్నాడన్నా, శివుడు కల్పాంతంలో హరిస్తున్నాడన్నా - అంతా శాంభవీమహిమ. ఈ సృష్టిలో దేవీ అంశలేని పదార్థం లేదు. ప్రాణి లేదు. అటువంటి చండికను నవరాత్ర దీక్షతో అర్చిస్తే మహాపాతకాలనుంచి కూడా విముక్తి లభిస్తుంది. సుఖసంతోషాలు వర్థిల్లుతాయి. ఇసుమంతైనా సందేహం లేదు.

## ◆ సుశీలుడి కథ ◆

పూర్వకాలంలో ఒకప్పుడు కోసలదేశంలో ఒక వైశ్యుడు ఉండేవాడు. సత్యసంధుడు. శాంతస్వభావుడు. దగాలూ మోసాలూ తెలియనివాడు. దానదయాధర్మశీలుడు. అసూయలేనివాడు. అందరూ ఇతడి గుణగణాలకు మెచ్చి సుశీలుడు అని పిలిచేవారు. గుణాలలో సంపన్నుడే కానీ ధనాలలో నిరుపేద. దానికి తోడు అధిక సంతానం. అడవికి వెళ్ళి కాయలూ పళ్ళూ ఏరి సాయంత్రానికి ఇంటికి తెచ్చేవాడు. అందరూ తలా ఒకటీ తిని ఇన్ని మంచినీళ్ళు తాగి పడుకునేవారు. పెద్దమ్మాయికి ఎలాగో కష్టపడి పెళ్ళి చేశాడేగానీ అల్లుడూ కూతురూ తన ఇంట్లోనే ఉంటున్నారు. వీరికితోడు మనుమడు ఒకడు. ఎప్పుడూ ఇల్లంతా కేగల్లోమంటూ ఉండేది. మనుమడు ఆకలివేసి ఏడిస్తే కోరింది తెచ్చి ఇవ్వలేక, ఊరుకోబెట్టలేక సతమతమయ్యేవాడు. ఒకరోజున ఉక్రోషం పట్టలేక పసిబిడ్డణ్ణి కొట్టి ఏకాంతంలో ఎంతగానో దుఃఖించాడు. ఆ పసిబాలుడు ఎటు వెళ్ళిపోయాడో ఆచూకీ లేదు.

ఇదిలా ఉండగా రెండవ ఆడపిల్ల పెళ్ళికి ఎదిగింది. పదకొండో ఏడు వచ్చేసింది. అది దాటేలోగా పెళ్ళి చెయ్యకపోతే కన్యాదాన ఫలం దక్కదని మరొక కొత్త దిగులు పట్టుకుంది - వైశ్యుడికి.

అతికష్టంగా ఈసురోమంటూ కాలం గడుస్తోంది. ఒకరోజున వీధివెంట వెడుతూ ఒక బ్రాహ్మణుడు కనిపించాడు. అతణ్ణి చూడగానే ఎందుకోమరి సుశీలుడికి తన గోడు వెళ్ళబోసుకోవాలి అనిపించింది. వెళ్ళి నమస్కరించి అంతా వివరంగా చెప్పుకున్నాడు.

మహానుభావా! నాకేమీ అత్యాశలు లేవు. కోటానుకోట్ల రూపాయలు నాకు వద్దు. రత్నరాశులూ బంగారు కాసులూ కోరను. నాకూ నా వాళ్ళకూ ఆకలిబాధ తీరితే చాలు. కనీసం రోజుకి ఒక పూట అయినా అయిదువేళ్ళు నోటిలోకి వెడితే చాలు. ఇంతకన్నా నేను కోరేది ఏమీలేదు. ఈ దారిద్ర్యం తీరే ఉపాయం ఏదయినా చెప్పు. మంత్రమో తంత్రమో జపమో తపమో నోమో వ్రతమో - ఏదో ఒకటి ఉపదేశించు. శక్తిమేరకు భక్తి శ్రద్ధలతో చేస్తాను. తమరు వేదవేదాంతవేత్తలు. మహాతపస్వులు. మీకు చాలా విద్యలు తెలుసు. దయచేసి ఏదైనా ఒక దారి చూపించండి. ఇదిగో సాష్టాంగ పడుతున్నాను.

సుశీలు డిలా ప్రార్థించేసరికి ఆ బ్రాహ్మణుడికి దయ కలిగింది. దేవీనవరాత్ర వ్రతం చెయ్యమని ఉపదేశించాడు. పూజన భోజన హవన పారాయణలతో శ్రద్ధగా చెయ్యమన్నాడు. వేదపండితులను



పిలవమన్నాడు. ఇంతకు మించిన వ్రతం భూగోళంలో లేదు, నీ దారిద్ర్యం తీరుతుంది. ఇది జ్ఞాన సుఖమోక్షప్రదమైన ఉత్తమ వ్రతం. తేలికగా చెయ్యవచ్చు. శత్రునాశకమూ మిత్రవర్ధకమూను. రాజ్యభ్రష్టుడై అడవులకు వచ్చిన రాముడు, సీతను రావణాసురుడు అపహరించుకుపోగా ప్రస్రవణాద్రిపై విరహవేదనతో వర్షర్తువును గడిపి శరదృతువురాగానే ఈ నవరాత్రవ్రతాన్ని శ్రద్ధగా చేశాడు. దాని ఫలితంగా సీతమ్మజాడ తెలిసింది, సేతువు నిర్మించాడు. రావణ కుంభకర్ణులను సంహరించి మళ్ళీ సీతాదేవినీ అయోధ్యా సామ్రాజ్యాన్నీ పొందగలిగాడు. ఇంత దివ్యశక్తి కలిగినది ఈ వ్రతం. కాబట్టి వణిగ్వరా ! నువ్వు కూడా చెయ్యి. నువ్వూ నీ కుటుంబమూ సుఖసంతోషాలను పొందుతారు - అని వ్రతమాహాత్మ్యాన్ని క్లుప్తంగా చెప్పాడు ఆ బ్రాహ్మణుడు.

అయితే మహానుభావా ! మీరే నా గురువులు. అంబికా దివ్యమంత్రం ఉపదేశించండి. నా శక్తి మేరకు నవరాత్రోత్సవాలు చేస్తాను - అని సుశీలుడు ప్రాధేయపడ్డాడు. బ్రాహ్మణుడు ఉపదేశించిన మాయా బీజాఖ్యమైన దివ్యమంత్రాన్ని స్వీకరించి తదేకదీక్షతో జపిస్తూ, శక్తివంచన లేకుండా యథావిధిగా నవరాత్రవ్రతం చేశాడు సుశీలుడు. క్రమం తప్పకుండా ఏటేటా చేస్తున్నాడు. తొమ్మిదవ సంవత్సరం నవరాత్రులు జరుపుతూండగా మహాష్టమినాటి అర్ధరాత్రి జగదీశ్వరి ఆ సుశీలుడికి స్వప్నంలో సాక్షాత్కరించింది. అనేకవరాలను ప్రసాదించి కృతకృత్యుణ్ణి చేసింది. ***(అధ్యాయం - 27, శ్లోకాలు - 57)***

వ్యాసమహర్షీ ! ఈ వ్రతాన్ని శ్రీరామచంద్రుడు చేశాడని ఆ విప్రుడు చెప్పాడు కదా ! ఏ విధానంగా చేశాడు ? ఎందుకు చేశాడు ? రాజ్యభ్రష్టుడయ్యాడనీ సీతను ఎవరో అపహరించారనీ అతడు అన్నాడు. ఆ విశేషాలన్నీ వినాలని ఉంది. శ్రమ అనుకోక క్లుప్తంగానైనా చెప్పి పుణ్యం కట్టుకోవా !

జనమేజయుడు ఇలా ప్రశ్నిస్తాడని వ్యాసుడు ఊహించినట్టున్నాడు. ఒక చిరునవ్వు విసిరి రామకథను అందుకున్నాడు. శౌనకాదిమహామునులారా ! వ్యాసుడు చెప్పిన రామకథ ఇది. శ్రద్ధగా ఆలకించండి.

## ◆ రామకథ ◆

దశరథుడనే మహారాజు అయోధ్యాపట్టణం రాజధానిగా ప్రజా పరిపాలన సాగిస్తున్నాడు. ఇతడు సూర్యవంశపు రాజు. యజ్ఞయాగాలు చేస్తూ ధర్మబద్ధంగా రాజ్యమేలుతున్నాడు. ఆయనకి రామ భరత లక్ష్మణ శత్రుఘ్నులు నలుగురు కుమారులు. కౌసల్యా సుతుడు రాముడు. కైకేయి కొడుకు భరతుడు. సుమిత్రకు కవల పిల్లలు - లక్ష్మణ - శత్రుఘ్నులు. ధనుర్విద్యతో సహా అన్ని విద్యలూ వీళ్ళు నేర్చుకున్నారు. ఒకరోజున విశ్వామిత్రుడు వచ్చి యాగసంరక్షణకోసం పదహారేళ్ళ పసిబాలుడు రాముణ్ణి



తనవెంట పంపమని అడిగాడు. దశరథుడు ముందు కొంత బెట్టుచేసినా తరవాత మెత్తబడి పంపించాడు. రామలక్ష్మణులు విశ్వామిత్రుడితో వెళ్ళారు. దారిలో రాముడు ఒకే ఒక్క బాణంతో తాటకను సంహరించాడు. సుబాహుణ్ణి సంహరించాడు. మారీచుణ్ణి ఎగరగొట్టాడు. యాగసంరక్షణ చేశాడు. అటునుంచి కౌశికుడితో కలిసి మిథిలానగరానికి వెళ్ళాడు. దారిలో అహల్యకు శాపవిమోచనం కలిగించాడు. శివధనుర్భంగం చేసి రాముడు సీతను వివాహం చేసుకున్నాడు. లక్ష్మణుడు ఊర్మిళను పరిణయమాడాడు. జనకుడి సోదరుడు కుశధ్వజుడు. ఆయన కూతుళ్ళను మాండవీశ్రుతకీర్తులను భరతశత్రుఘ్నులు చెట్టపట్టారు.

దశరథుడు శ్రీరాముడికి పట్టాభిషేకం చెయ్యాలనుకున్నాడు. ఏర్పాట్లు అన్నీ జరిగాయి. కానీ కైకేయి పాత వరాలను రెండింటిని అప్పుడు అడిగింది. భరతుడికి పట్టాభిషేం జరగాలి, రాముడు పధ్నాలుగేళ్ళు వనవాసం చెయ్యాలి. సీతా లక్ష్మణులతో కలిసి దండకారణ్యాలకు వెళ్ళాడు రాముడు. పుత్రవిరహం తాళలేక దశరథుడు అసువులు బాశాడు. భరతుడు పట్టాభిషేకం తిరస్కరించాడు.

పంచవటిలో రామలక్ష్మణులు శూర్పణఖకు ముక్కు చెవులు కోసేశారు. ఖరాది రాక్షసులు పధ్నాలుగువేలమంది దండెత్తి వస్తే రాముడొక్కడూ అనాయాసంగా సంహరించి జయలక్ష్మిని వరించాడు. రాక్షస సంహారానికి సంతోషించిన మునులంతా వీరిని దీవించారు.

శూర్పణఖ లంకకు వెళ్ళి తన సోదరుడు రావణుడికి విషయమంతా విన్నవించింది. సీతాపహరణానికి ప్రోత్సహించింది. దశకంఠుడు మారీచుడి ఆశ్రమానికి వచ్చి అతణ్ణి బంగారులేడిని చేసి రాముణ్ణి అడవిలోకి దూరం తీసుకుపోయేట్టు పథకం వేశాడు. బంగారు లేడిని చూసి సీతాదేవి ముచ్చటపడింది. తెమ్మని రాముణ్ణి కోరింది. రాముడు ఏమీ ఆలోచించకుండా దానివెంటపడ్డాడు. అది మాయలేడి. చిక్కలేదు. చివరికి రాముడు బాణం వేశాడు. ఆ మాయలేడి ప్రాణాలు వదులుతూ హా! లక్ష్మణా ! అని బిగ్గరగా రామకంఠంతో అరిచింది. అది విన్న జానకి సౌమిత్రిని సహాయంగా వెళ్ళమంది. నిన్ను ఒంటరిగా విడిచివెళ్ళను, రాముడికి ఏ ప్రమాదమూ జరగదు అని సౌమిత్రి చెప్పినా సీత వినిపించుకోలేదు. పైగా శంకించి తూలనాడింది. విధిలేక లక్ష్మణుడు సీతను ఒంటరిగా వదిలి వెళ్ళాడు.

రావణుడు భిక్షురూపంలో సీతాదేవిని సమీపించాడు. ఆమె కథ అంతా అడిగి తెలుసుకున్నాడు. నిజరూపం చూపించాడు.

> లంకేశోఽహం మరాళాక్షి శ్రీమాన్ మందోదరీపతిః ।
> త్వత్కృతే తు కృతం రూపం మయేత్థం శోభనాకృతే ॥ (28 - 62)

నీ స్వయంవరానికి మీ తండ్రి నన్ను కూడా పిలిచాడు. అయితే రుద్రచాపానికి భయపడి నేను రాలేదు. అప్పటినుంచీ నీ మీద నాకు మనసుంది. నన్ను చేపట్టు. ఈ కష్టాలు ఏమి పడతావు? నాతో వచ్చి



దివ్యభోగాలు అనుభవించు. నీకు తగినవి అవ్వే కానీ ఈ కష్టాలూ కడగండ్లూ కాదు. నువ్వు ఇలా వనవాసం చేస్తున్నావని తెలిసి, అలనాటి నా అనురాగాన్ని మళ్ళీ స్మరించుకుని నీకోసం వచ్చాను. నా శ్రమను సఫలం చెయ్యి. ***(అధ్యాయం- 28, శ్లోకాలు- 69)***

**వనేఽత్ర సంస్థితాం శ్రుత్వా పూర్వానురాగమోహితః ।**
**ఆగతోఽస్మ్యసితాపాంగి సఫలం కురు మే శ్రమమ్ ॥ (28 - 69)**

ఈ రూపానికీ ఈ ప్రసంగానికీ సీతాదేవి భయవిహ్వల అయ్యింది. ధైర్యం కూడదీసుకుని కఠినంగా బదులు చెప్పింది. పౌలస్త్య ! ఏమిటి నీకు ఈ దుర్బుద్ధి. నేనెవరనుకుంటున్నావు? జనకమహారాజుగారి కూతురిని. వేశ్యను కాదు. నా రాముడు వచ్చి నిన్ను చంపకముందే లంకకు పారిపో. నా కోసమని అనవసరంగా చచ్చిపోకు - అంటూ సీతాదేవి తన పర్ణశాలలోపలికి అగ్నిహోత్రం సన్నిధికి వెళ్ళిపోయింది. రావణుడు వెంబడించి బలాత్కారంగా పట్టుకుని రథంలో కూర్చోబెట్టుకున్నాడు. రామా! లక్ష్మణా! అంటూ సీతాదేవి దారుణంగా విలపించింది. రథం ఆకాశానికి లేచింది. లంకవైపు దూసుకువెడుతోంది. జటాయువు ఎదిరించి నిహతుడయ్యాడు. సీతను తీసుకువెళ్ళి రావణుడు లంకలో అశోకవనంలో కూర్చోబెట్టాడు. రాక్షసీ గణాన్ని కాపలా ఉంచాడు.

మాయలేడిని చంపి తిరిగివస్తున్న రాముడికి సౌమిత్రి ఎదురయ్యాడు. జరిగింది చెప్పాడు. ఇద్దరూ త్వరత్వరగా పర్ణశాలకు వచ్చారు. సీత కనిపించలేదు. అడవి అంతటా గాలించారు. బోరున విలపించారు. కొనప్రాణంతో ఉన్న జటాయువు జరిగిన సంగతి చెప్పాడు. ప్రాణాలు విడిచిపెట్టాడు. అతడికి అగ్ని సంస్కారం జరిపి రామలక్ష్మణులు దక్షిణదిశగా బయలుదేరారు.

కబంధుణ్ణి చంపి అతడికి శాపవిమోచనం కల్పించాడు రాముడు. అతడి సూచనపై ఋష్యమూకానికి వెళ్ళి సుగ్రీవుడితో అగ్నిసాక్షిగా స్నేహం చేశాడు. వాలిని సంహరించి సుగ్రీవుణ్ణి కిష్కింధకు రాజును చేశాడు. వర్షాకాలం గడిచేవరకూ ప్రస్రవణ పర్వతగుహలో తలదాచుకున్నారు ఆ సోదరులు. సీతా విరహం తట్టుకోలేక రాముడు పరిపరివిధాల పరితపించాడు.

లక్ష్మణా ! ఇప్పటికి కైకేయి కోరిక తీరిందయ్యా ! కళ్ళు చల్లబడి ఉంటాయి. జానకి జాడ తెలియకపోతే నేను జీవించను. సీత లేకుండా తిరిగి అయోధ్యకు వెళ్ళను. వెళ్ళలేను. చేతికి అందిన రాజ్యం జారిపోయింది. వనవాసం ప్రాప్తించింది. తండ్రి మరణించాడు. సీతాపహరణం జరిగింది. ఇన్ని చేసి ఇంతగా నన్ను ఏడిపించుకుతింటున్న ఆ దుష్టదైవం ఇకముందు ఇంకా ఏమేమి చేస్తాడో ! భవిష్యత్తు దుర్జ్ఞేయం కదా ! మనకు ఏ కష్టాలు రాసిపెట్టి ఉన్నాయో. సూర్యవంశంలో పుట్టి రాజపుత్రులమై యుండి ఇలా అడవుల్లో పడి ఏడుస్తున్నాం. రాజభోగాలు అన్నీ విడిచిపెట్టి నువ్వు నావెంటవచ్చావు. నీ తలరాత అలా ఉంది. ఏమి చేస్తాం ? అనుభవించు. దుఃఖాలు దిగమింగుకో.



త్యక్త్వా త్వమపి భోగాంస్తు మయా సహ వినిర్గతః ।
దైవయోగాచ్చ సౌమిత్రే భుంక్ష్వ దుఃఖం దురత్యయమ్ ॥ (29 - 25)

తమ్ముడూ ! మన వంశంలో అంతటి దురదృష్టవంతుడూ దుఃఖభాజనుడూ మరొకడు గతంలో లేడు. భవిష్యత్తులో ఉండడు. ఏమి చెయ్యడానికీ దారి కనపడటం లేదు. ఈ దుఃఖ సాగరం నుంచి బయట పడటానికి తరణోపాయం కనిపించడం లేదు. నువ్వు తప్ప నాకు మరో సహాయకుడన్నా లేడు. ఎవరిని ఏమని ఏమి ప్రయోజనం! నా తలరాత ఇలా ఉంది అంతే.

నన్ను వివాహం చేసుకుని వైదేహి కష్టాల పాలయ్యింది. లంకేశుడి ఇంటిలో ఎంతగా విలపిస్తోందో యేమో ! పరమపతివ్రత. సుశీల. రావణుడికి లొంగదు గాక లొంగదు. అతడు బలాత్కారం చేస్తే ప్రాణాలైనా వదిలేస్తుంది తప్ప స్వైరిణిలా ప్రవర్తించదు. అతడికి లొంగదు.

త్యజేత్ ప్రాణాన్నియంతృత్వే మైథిలీ భరతానుజ ।
న రావణస్య వశగా భవేదితి సునిశ్చితమ్ ॥ (29 - 33)

జానకి మరణిస్తే నేనూ మరణిస్తాను. ఈ ప్రాణాలతో ఈ శరీరంతో నాకు ఏమీ పనిలేదు - రాముడు ఇలా విలపిస్తూంటే లక్ష్మణుడికీ దుఃఖం ముంచుకు వచ్చింది. అయినా నిబ్బరించుకుని అన్నగారిని ఓదార్చాడు.

## ◆ సౌమిత్రి ఓదార్పు ◆

అగ్రజా ! ఏమిటి ఈ బేలతనం. నీవంటి మహావీరులు ఇలా నీరుగారిపోతే ఎలా ! ధైర్యం తెచ్చుకో. ఆ రాక్షసాధముడు రావణుణ్ణి సంహరించి సీతాదేవిని నేను తీసుకువస్తాను. అధైర్యపడకు. నీవంటి ధీరులు ఆపదల్లోనూ సంపదల్లోనూ ఒకే రీతిగా నిశ్చలంగా ఉండాలేకానీ సామాన్యుల్లాగా చలించిపోతే ఎలా ! సంయోగ వియోగాలు దైవాధీనాలు. జరుగుతూ ఉంటాయి. దుఃఖపడి ప్రయోజనం ఏమిటి ! ప్రస్తుతం మనకి రోజులు బాగోలేదు. అందుకని రాజ్యహాని, వనవాసం, సీతాపహరణాలతో కష్టాల పాలయ్యాము. మంచిరోజులు వస్తాయి. అప్పుడు అన్నీ మనకు అనుకూలంగా పరిణమిస్తాయి.

రాజ్యాద్యథా వనే వాసో వైదేహ్యా హరణం యథా ।
తథా కాలే సమీచీనే సంయోగోఽపి భవిష్యతి ॥ (29 - 39)

కష్టయోగం ఎలా తప్పించుకోలేకపోతున్నామో, అలాగే సుఖయోగమూ తప్పించుకోలేం. ఆ రోజులూ వస్తాయి. సీతాదేవి లభించి తీరుతుంది. దుఃఖపడకు. కొంచెం ఓపికపట్టు. సుగ్రీవుడి వానరసైన్యం



దశదిశలకూ వెడుతోంది. సీతమ్మ జాడ తెలుసుకువచ్చి మనకు చెబుతారు. అప్పుడు నేనే స్వయంగా వెళ్ళి ఆ రాక్షసుణ్ణి చంపి సీతాదేవిని తీసుకువస్తాను. లేదా భరతుణ్ణో జనకమహారాజునో ససైన్యంగా రమ్మని రావణుడి మీదకు దండెత్తి సంహరించి జానకీదేవిని తెస్తాం. మన వంశంలో రఘుమహారాజు కేవలం ఒకే ఒక్క రథంతో బయలుదేరి దశదిశలూ జయించాడు. అలాంటి వంశంలో జన్మించి నువ్వు ఏమిటి ఇలా డీలా పడిపోతున్నావు. నేను ఒక్కడినే సకల సురాసురులనూ జయించగలను. అటువంటిది ససహాయుడిగా ఉండి ఒక్క దుష్ట రావణుణ్ణి సంహరించలేనా ? రఘురామా ! సుఖం తరవాత దుఃఖం, దుఃఖం తరవాత సుఖం చక్రనేమి క్రమంలో వస్తూంటాయి. అంతేకానీ ఏ ఒక్కటో కలకాలం ఉండిపోదు. అయితే, కష్టాలో సుఖాలో వచ్చినప్పుడు మనోధైర్యాన్ని పోగొట్టుకుంటే ఇక ఆ మనిషి శోకసాగరంలో మునిగిపోతాడే తప్ప ఎప్పుడూ సుఖపడలేడు. ఈ మాట మర్చిపోకు.

సుఖస్యానంతరం దుఃఖం దుఃఖస్యానంతరం సుఖమ్ ।
చక్రనేమిరివైకం తన్న భవేద్రఘునందన ॥
మనోఽతికాతరం యస్య సుఖదుఃఖసముద్భవే ।
స శోకసాగరే మగ్నో న సుఖీ స్యాత్కదాచన ॥ (29 - 47, 48)

ఇంద్రుడంతటివాడికే సింహాసనం పోయింది. నహుషుడు అధిష్ఠించాడు. ఇంద్రుడు భయపడి పారిపోయి కొన్ని సంవత్సరాలపాటు అజ్ఞాతవాసం చేశాడు. నహుషుడేమో సుఖాలకు కన్నుగానక మహర్షులను అవమానించీ శచీదేవిని కాంక్షించీ సర్వభ్రష్టుడయ్యాడు. శాపాలకు గురి అయ్యాడు. అందుచేత కష్టాలకు దుఃఖపడకూడదు. గట్టెక్కే ఉద్యమం చెయ్యాలి. అన్నయ్యా! నువ్వు అన్నీ తెలిసినవాడవు. జగదేకవీరుడివి. నీకు నేను చెప్పాలా ? ఇలా దుఃఖించడం ఎంతమాత్రమూ సమంజసంగా లేదు. లే. ధైర్యం తెచ్చుకో. దుఃఖాన్నీ కాతరభావాన్నీ (పిరికితనం) మనస్సునుంచి దులిపేసుకో.

లక్ష్మణ ప్రబోధంతో రాముడు శోకం నుంచి తేరుకున్నాడు. ధైర్యం కూడగట్టుకున్నాడు. మామూలుమనిషి అయ్యాడు. ***(అధ్యాయం - 29, శ్లోకాలు - 55)***

## ◆ నారదాగమనం - దేవీవ్రతోపదేశం ◆

సరిగ్గా అదే సమయానికి నారదుడు తన మహతీవీణపై బృహద్రథసామను పలికించుకుంటూ ఆకాశంనుంచి దిగివచ్చాడు. రాముడు లేచి నిలబడి స్వాగతసత్కారాలు జరిపాడు. అర్ఘ్యపాద్యాలు ఇచ్చి పూజించాడు. శిలావేదికపై కూర్చోబెట్టాడు. చేతులు కట్టుకుని చెంత నిలబడ్డాడు. ఇద్దరినీ కూర్చోమన్నాడు నారదుడు. కుశలప్రశ్నలు వేశాడు.



రఘువరా ! సురలోకంలో విన్నాను. పరమసాధ్వి సీతాదేవిని రావణాసురుడు అపహరించుకుని వెళ్ళాడుటగదా ! మూర్ఖుడు. తనకు మరణమని తెలుసుకోలేక అపహరించాడు. రామా ! అసలు నువ్వు జన్మించిందే రావణ సంహారం కోసం. ఇందుకే సీతాపహరణం జరిగింది. పూర్వజన్మలో వైదేహి ఒక ముని కన్యక. గొప్ప తపస్విని. రావణుడు కామాంధుడై అప్పుడూ ఆమెను వాంఛించాడు. నాకు భార్యవు కమ్మని నిరోధించాడు. జుట్టుపట్టుకున్నాడు. తపస్వినికి కోపం వచ్చింది. రావణ స్పర్శతో కలుషితమైన శరీరాన్ని అగ్నికి ఆహుతి చెయ్యాలని నిశ్చయించుకుని రావణుణ్ణి శపించింది. దుర్మార్గుడా ! నీ నాశనంకోసం నేను మళ్ళీ పుడతాను. అయోనిజగా జన్మిస్తాను - అంటూ అగ్నిలో దూకేసింది. అదిగో ఆ తపస్విని సీతగా జన్మించింది. రమాంశ సంభూత. వొళ్ళు మరిచి సర్పాన్ని దండగా వేసుకున్నట్టు రావణుడు వంశనాశనంకోసం సీతాదేవిని అపహరించాడు. మరో రహస్యం విను. నువ్వు సాక్షాత్తు విష్ణుమూర్తివి. చావు పుట్టుకలు లేనివాడివి. అయితేనేమి, దేవతల ప్రార్థనను మన్నించి రావణ వధకోసం రఘురాముడిగా అవతరించావు. మానవ జన్మ ఎత్తేవు కాబట్టి మానవుడిగా విలపిస్తున్నావు. అంతే. ధైర్యం వహించు. అక్కడ లంకలో సీతాదేవి రేయింబవళ్ళు నిన్నే ధ్యానిస్తూ నీ రాకకోసం ఆశగా ఎదురుచూస్తోంది. ధర్మపరురాలై సాధ్వీనియమాలను పాటిస్తూ నీకోసం విలపిస్తోంది.

ఇది అంతా దేవతలకోసం జరుగుతోంది కనక దేవేంద్రుడు స్వయంగా కామధేనువు పాలను బంగారు గిన్నెలో సీతాదేవికి పంపించాడు. ఆ అమృతాన్ని జానకీమాత స్వీకరించింది. ఇక ఆకలి దప్పికల బాధ లేదు. నేను వెళ్ళి చూసిమరీ వచ్చాను.

అది అలా ఉంచు. రావణాసురుడు సామాన్యుడు కాడు. మహాబలశాలి. వరగర్వితుడు. అతణ్ణి సంహరించేందుకు నేనొక ఉపాయం చెబుతాను. ఆలకించు. ఇదిగో ఆశ్వయుజమాసం వచ్చింది. శరదృతుప్రారంభం. ఇప్పుడే ఆరంభించి దేవీ నవరాత్రవ్రతం శ్రద్ధగా చెయ్యి. ఉపవాసదీక్షతో నిర్వహించు. జపాలూ హోమాలూ జరిపించు. జగన్మాతకు జంతుబలి ఇయ్యి. ఇది కామ్యార్చన. కోరికలు సిద్ధిస్తాయి. దశాంశం హవనం చెయ్యి. ఈ వ్రతాన్ని పూర్వకాలంలో త్రిమూర్తులూ దేవేంద్రుడూ చేసి అమోఘవరాలను పొందారు. భృగు వసిష్ఠ బృహస్పతి విశ్వామిత్రాదులు అందరూ ఈ వ్రతం చేసినవారే. సిద్ధులు పొందినవారే. కష్టాలలో ఉన్నవారు తప్పనిసరిగా చెయ్యవలసిన వ్రతం ఇది. అందుచేత రావణవధకోసం నువ్వు ఈ వ్రతాన్ని చేసితీరాలి. వృత్రాసురుణ్ణి సంహరించడానికి వెడుతూ ఇంద్రుడు చేశాడు. త్రిపురాసురుణ్ణి సంహరించేవేళ శివుడు చేశాడు. మధుకైటభ సంహారం కోసం విష్ణువు చేశాడు. అందుచేత విధ్యుక్తంగా నువ్వూ చెయ్యి. తేలికగా విజయం పొందుతావు.

నారదా ! ఎవరు ఈ దేవి ? ఆవిడ ప్రభావం ఏమిటి ? ఆవిడ జన్మప్రకారం ఏమిటి ? ఈ వ్రతాన్ని ఎలా చెయ్యాలి ? పేరేమిటి ? - ఇవన్నీ సమగ్రంగా వివరించు దేవర్షీ !

రామా ! ఈ దేవి ఆదిపరాశక్తి. సనాతని. సర్వకామద. పూజించినవారి దుఃఖాలను చిటికెలో తొలగిస్తుంది. చరాచరజగత్తు అంతటికీ ఆదికారణం. త్రిమూర్తులకూ అధిదేవత. ఆమె అనుగ్రహం, ఆమె శక్తీ లేకుండా బ్రహ్మాది దేవతలు స్పందించనైనా స్పందించలేరు.



కారణం సర్వజంతూనాం బ్రహ్మాదీనాం రఘూద్వహ ।
తస్యాః శక్తిం వినా కోఽపి స్పందితుం న క్షమో భవేత్ ॥ (30 - 29)

విష్ణుమూర్తిలో పాలనాశక్తి ఆమె. మా తండ్రిలో సృజనశక్తి ఆమె. రుద్రుడిలో సంహారశక్తి ఆమె. ఈ సృష్టిలో ఏ చిన్న వస్తువైనా సరే అది ఆవిడ శక్తియే, ఆవిడ ఉత్పత్తియే.

ఈ త్రిమూర్తులూ ఈ సూర్యచంద్రులూ ఈ భూగోళం ఇవి ఏవీ లేనప్పుడు కూడా ఈ మహాదేవి పూర్ణప్రకృతిగా పరాత్పరుడితో కలిసి విహరిస్తూ ఉంది. నిర్గుణ స్వరూప తాను సగుణ స్వరూపగా మారి ముల్లోకాలనూ సృష్టిస్తోంది. బ్రహ్మాదులను సృష్టించి వారికి తన శక్తులను ప్రసాదించి లోకసృష్టిని నిర్వహింపజేస్తోంది. ఆ పరాశక్తిని తెలుసుకుంటే జన్మసంసారబంధాలనుంచి ముక్తి లభిస్తుంది. ఆవిడ పరా - విద్య. వేదాద్య. వేదకారిణి. బ్రహ్మాది దేవతలు ఆవిడ గుణాలనూ పనులనూ తెలుసుకొని అసంఖ్యాకంగా దివ్యనామాలను కల్పించారు. అకారం మొదలు క్షకారంవరకూ ఉన్న అచ్చులనూ హల్లులనూ గుణింతాలనూ కలుపుకుంటూ వెడితే ఎన్ని పదాలు తయారు అవుతాయో అన్ని నామధేయాలు ఉన్నాయి ఆవిడకి.

అకారాదిక్షకారాంతైః స్వరైర్వర్ణైస్తు యోజితైః ।
అసంఖ్యేయాని నామాని భవంతి రఘునందన ॥ (30 - 37)

రఘువరా ! క్లుప్తంగా పూజావిధానం చెబుతున్నాను. తెలుసుకో. సమతలంలో పీఠం వేసి జగదంబికను ప్రతిష్ఠించాలి. తొమ్మిది నాళ్ళూ ఉపవాసం ఉండాలి. నేనే పురోహితుడుగా దగ్గర ఉండి జరిపిస్తాను. దేవకార్యం కోసం ఈపాటి సాయం చెయ్యాలని ఉత్సాహంగా ఉంది.

ఆచార్యోఽహం భవిష్యామి కర్మణ్యస్మిన్ మహీపతే ।
దేవకార్య విధానార్థ ముత్సాహం ప్రకరోమ్యహమ్ ॥ (30 - 40)

## ◆ దాశరథికి దేవీ దర్శనం ◆

జనమేజయా ! నారదుడే పూనుకొన్నాక ఇక లోటేముంది ! రాముడు ఉత్సాహంగా నవరాత్ర వ్రతం చేశాడు. పీఠం పెట్టి జగన్మాతను ప్రతిష్ఠించాడు. హోమమూ మంత్రజపమూ బలిదానమూ జరిగాయి. ఉపవాసదీక్షతో భక్తి శ్రద్ధలతో నిత్యార్చనలు జరుపుతున్నాడు. అష్టమినాటి రాత్రి స్వప్నంలో జగదంబిక దర్శనం అనుగ్రహించింది. సింహారూఢయై గిరిశృంగంపై నిలబడి మేఘ గంభీర కంఠంతో జగదీశ్వరి పలికింది.



రామ రామ మహాబాహో ! తుష్టాస్మ్యద్య తుష్టాస్మ్యద్య వ్రతేన తే వ్రతేన తే।
ప్రార్థయస్వ వరం కామం యత్తే మనసి వర్తతే ॥ (30 - 46)

మహావీరా ! రఘురామా ! నీ భక్తిశ్రద్ధలకు మెచ్చాను. కావలసిన వరం కోరుకో. ఇస్తాను. నువ్వు నారాయణాంశ సంభూతుడివి. రావణవధకోసం దేవతలకోరిక మీద మానవుడుగా జన్మించావు. పూర్వకాలంలో మత్స్యాది అవతారాలు ధరించి దుష్టశిక్షణ చేశావు. శిష్టరక్షణ చేశావు. వేదాలను రక్షించింది నువ్వే. కచ్ఛప రూపం ధరించి మంధరపర్వతాన్ని ఎత్తేవు. వరాహరూపం ధరించి మేదినిని కోరపై నిలబెట్టావు. నరసింహావతారం ధరించి హిరణ్యకశిపుణ్ణి చీల్చి చెండాడావు. ప్రహ్లాదుణ్ణి కాపాడావు. వామనావతారంతో బలిచక్రవర్తిని కికురించి త్రివిక్రముడిగా విజృంభించావు. పరశురాముడిగా క్షత్రియులను జయించి భూమినంతటినీ కశ్యపుడికి ధారపోశావు. ఇప్పుడు దశరథరాముడిగా జన్మించావు. రావణ పీడితులైన దేవతలు నిన్ను ప్రార్థిస్తే ఈ అవతారం ధరించావు. దేవాంశ సంభూతులైన కపీశ్వరులు నీకు ఈ మహాకార్యంలో సహాయపడతారు. వారికి నా శక్త్యంశ ఉంటుంది. ఆదిశేషుడు లక్ష్మణుడుగా అవతరించాడు. అతడు ఇంద్రజిత్తుని సంహరించడంకోసమే జన్మించాడు. రామా ! నీకు జయం కలుగుతుంది. పాపిష్ఠి రావణుణ్ణి సంహరించి సుఖంగా రాజ్యపాలన సాగించు. పదకొండువేల సంవత్సరాలపాటు నీ పాలన నడుస్తుంది. అప్పుడు తిరిగి వైకుంఠానికి వెడుదువుగాని.

జనమేజయా ! ఈ మాటలు చెప్పి సింహవాహన అదృశ్యమయ్యింది. రాముడు సంతుష్టాంత రంగుడై వ్రతాన్ని దీక్షతో పూర్తిచేశాడు. దానాలూ అన్న సంతర్పణలూ యథాశక్తిగా నిర్వహించాడు. విజయదశమినాడు వానరసేనతో లంకాపట్టణంపైకి దండయాత్ర సాగించాడు. సేతుబంధనం చేసి లంకలో ప్రవేశించి రావణుణ్ణి సంహరించాడు. *(అధ్యాయం- 30, శ్లోకాలు- 63)*

లోకంలో ఎన్నో పురాణాలు ఉన్నాయి. అవి ఏవీ దేవీ భాగవతానికి సాటిరావు. ఇది శ్రోతలకు విశేష ఫలదం. భుక్తి ముక్తి ప్రదం.

సంత్యన్యాని పురాణాని విస్తరాణి బహూని చ ।
శ్రీమద్భాగవతస్యాస్య న తుల్యానీతి మే మతిః ॥ (30 - 63)

**తృతీయ స్కంధం - శ్లోకాలు 1746 - తెలుగుసేత : బేతవోలు రామబ్రహ్మం**





# చతుర్థ స్కంధము

శౌనకాది మహామునులారా ! సర్వజ్ఞుడైన వ్యాసుడు సన్నిధిలో దొరికేసరికి జనమేజయుడు తన సందేహాలను అన్నింటినీ తీర్చుకోవాలనుకున్నాడు. ఒక్కసారిగా చాలా ప్రశ్నలు గుప్పించాడు.

వ్యాసమహర్షీ ! నువ్వు సర్వజ్ఞుడివి. వంశ చరిత్రలు అన్నీ తెలిసినవాడివి. మా వంశాన్ని నిలబెట్టినవాడివి. కనుక అడుగుతున్నాను. దయచేసి నా సందేహాలు తీర్చు.

శూరసేనసుతుడైన వసుదేవుడికి శ్రీహరి పుత్రుడుగా జన్మించాడని కథ విన్నాను. దేవకీవసుదేవులను కంసుడు కారాగారంలో బంధించాడనీ, వారికి పుట్టిన ఆరుగురు బిడ్డలను సంహరించాడనీ, అష్టమగర్భంగా శ్రీహరి కారాగారంలోనే జన్మించాడనీ, అటుపైని గోకులానికి చేరాడనీ, అంతటి కుమారుడున్నా దేవకీవసుదేవులకు కారావాసం తప్పలేదనీ - విన్నాను. ఇలా ఎందుకు జరిగింది ? ఈ దంపతుల పూర్వజన్మ సుకృతమా, దుష్కృతమా ఇది ?

వీరికి ఒక ఆడపిల్ల పుట్టినదనీ, ఆ పసిబిడ్డను కంసుడు నేలకు విసిరికొడితే ఆకాశంలోకి ఎగిరి అష్టభుజగా మారిందనీ విన్నాను. నిజమేనా ? ఈ పసిబాల ఎవరు?

శ్రీకృష్ణుడి గృహస్థ జీవితం ఎలా సాగింది ? అతడికి చాలామంది భార్యలు ఉండేవారని తెలిసింది. అతడి దేహ త్యాగానికి సంబంధించి కొన్ని కింవదంతులు వ్యాప్తిలో ఉన్నట్టున్నాయి. వాటికేమిగానీ అసలు ఏమి జరిగిందో తెలిసినవాడవు నువ్వు. ఆ సత్యం నాకు ఎరుకపరచు.

బదరికాశ్రమంలో తపస్సు చేసుకునే నరనారాయణులే ఇంద్రోపేంద్రులనీ, వారే కృష్ణార్జునులనీ నారదాదిమహర్షులు చెబుతూంటారు. ఇది ఎలా సాధ్యమయ్యింది ? శాంతంగా తపస్సు చేసుకునే మహర్షులు క్షత్రియులుగా ఎందుకు జన్మించారు ? దీనికేదయినా శాపకారణం ఉందా ?

ఒక బ్రాహ్మణుడి శాపంవల్ల యాదవవంశం నశించిందనీ, గాంధారీశాపంవల్ల కృష్ణుడి వంశం అంతరించిందనీ అంటారు. నిజమేనా ?

జగద్రక్షకుడైన శ్రీకృష్ణుడికి పుత్రుడుగా జన్మించిన ప్రద్యుమ్నుణ్ణి ఒక శంబరుడు పురిటిగదినుంచి అపహరించాడటగదా ! ఇది ఎలా సాధ్యమయ్యింది ? వాసుదేవుడు దివ్యదృష్టితోనైనా గమనించ లేకపోయాడా ? అడ్డుకోలేకపోయాడా ?



అలాగే మరొక సందేహం మనస్సుని పట్టి పీడిస్తోంది. ఆందోళన కలిగిస్తోంది. భూభారాన్ని తొలగించడంకోసం విష్ణువే కదా కృష్ణుడుగా జన్మించాడు. అంతటివాడు తానే ఎవరికో భయపడి మధురా రాజ్యాన్ని వదిలేసి ద్వారవతికి పారిపోవలసిన అవసరం ఎందుకు వచ్చింది ?

చివరి రోజులలో శ్రీకృష్ణుడి భార్యలకు ఏ రక్షణమూ లేకపోయింది. దొంగలు దోచుకున్నారు. ఇదేమి దారుణం ? స్వామీ ! ఏమిటి దీనికి కారణం ?

పాండవులు దేవాంశసంభవులు కదా ! కృష్ణ భక్తులు కదా ! మహావీరులై అత్యద్భుతంగా రాజసూయయాగం చేశారుగదా ! అయినా అడవులపాలయ్యారు. ఎన్నో కష్టాలు పడ్డారు. వారు చేసిన పాపం ఏమిటి ? యజ్ఞఫలం ఏమైనట్టు ?

అగ్నిగుండం నుంచి లక్ష్మీదేవిలా జన్మించిన ద్రౌపదీసాధ్వికి జీవితమంతా దుఃఖమయంగానే సాగింది. ఒకటిగడిస్తే ఒకటిగా కడగండ్లు. నిండు సభలో దుశ్శాసనుడు జుట్టుపట్టుకుని ఈడ్చాడు. రజస్వలగా ఏకవస్త్రగా ఉన్నదానికి ఈ అవమానం జరిగింది. విరాటుడి కొలువులో సైరంధ్రిగా తలదాచుకుంది. కీచక జయద్రథులు చేసిన అవమానాలు భరించింది. వీటన్నిటికీ కారణం ఏమిటి ? ఏ జన్మలో చేసుకున్న పాపం ?

సదాచార సంపన్నులైన పాండవులు భీష్మద్రోణులను మోసంతో సంహరించారు. జగత్తు నశ్వరమని తెలియనివారా ! తెలుసు. అయినా రాజ్యలోభం వారిని దారితప్పించింది. దీనికి వాసుదేవుడి వత్తాసు మరీ విడ్డూరం. చివరికి వంశనాశనమయ్యింది. ఎవరు ఏమి బావుకున్నారు కనక ! రాజ్యలోభంతో యుద్ధాలు చేసి యోధులను చంపి ఆ నెత్తురుకూడు తింటూ అదే వైభోగం అనుకునేకన్నా, భిక్షాటనమో శిల్పాటనమో ఉత్తమోత్తమం.

వరం భిక్షాటనం పాథోర్నీవారైర్జీవనం వరమ్ ।
యోధాన్ వ హత్వా లోభేన శిల్పేన జీవనం వరమ్ ॥ (1 - 44)

వ్యాసర్షీ ! విచ్ఛిన్నం కాబోతున్న మా వంశాన్ని ఒకప్పుడు నువ్వు స్వయంగా కాపాడావు. దేవరన్యాయంగా గోళకులను పుట్టించావు. అచిరకాలంలోనే అది నీ కళ్ళ ఎదుటనే క్షీణించి ఈ దశకు వచ్చింది. ఒంటి ఊపిరితో మిగిలింది. నా తండ్రి పరీక్షిత్తు ఒక తపస్విని అవమానించడం అనేది చాలా అసహ్యమైన సంఘటన. ఏ క్షత్రియుడూ చెయ్యని ఈ ఘోరాన్ని మా తండ్రి ఎందుకు చేశాడు ? ఎలా చేశాడు ? నాకేమీ అర్థం కావడం లేదు. మహానుభావా ! ఇవీ ఇలాంటివీ సందేహాలు నన్ను తొలిచేస్తున్నాయి. వివరంగా చెప్పి నా మనస్సును కుదుటపరచు. *(అధ్యాయం-1 ,శ్లోకాలు - 48)*



## ◆ వ్యాసుడు చేసిన కర్మప్రబోధం ◆

జనమేజయా ! ఏమి చెప్పమంటావు ? అన్నింటికీ ఏకైక కారణం కర్మ. దాని గతి విలాసాలు తెలుసుకోవడం దేవతలకే సాధ్యం కాదు. ఇంక మానవుల సంగతి చెప్పాలా !

రాజన్ ! కిమేతద్వక్తవ్యం కర్మణాం గహనో గతిః ।
దుర్జ్ఞేయా కిల దేవానాం మానవానాం చ కా కథా ॥ (2 - 2)

ఈ త్రిగుణాత్మకమైన జగత్తులో దేని పుట్టుకైనా కర్మానుసారమే జరుగుతుంది అనడంలో సందేహం లేదు. జీవులు అనాది నిధనులు. కర్మబీజ సముద్భవులు. రకరకాల జన్మలు ఎత్తుతున్నారు. పుడుతున్నారు, గిడుతున్నారు. ఇదంతా కర్మానుసారమే జరుగుతోంది. కర్మ రహితంగా దేహసంయోగం ఉండదు. శుభ - అశుభ - శుభాశుభమిశ్రరూపంగా కర్మలు మూడు విధాలు. వీటినే పుణ్యకర్మలు పాపకర్మలు పాపపుణ్య సమ్మిశ్రితకర్మలు అని కూడా అంటారు.

జనమేజయా ! ప్రతిజీవికీ సంచితకర్మ (పూర్వ జన్మలలో సంపాదించుకున్నది), ప్రారబ్ధకర్మ (వర్తమానంలో సంపాదించుకున్నది), ఆగామికర్మ (రాబోయే కాలానికి చెందినది) - అని మూడు కర్మలు తప్పక ఉంటాయి. సుఖదుఃఖాలకు ఇవ్వే కారణం. ముసలితనం, శోకం, హర్షం, మృత్యువు కామక్రోధాది అరిషడ్వర్గమూ - ఇవన్నీ దేహగతగుణాలుగా కనపడతాయి గానీ వీటన్నింటికీ మూలం కర్మమే. ప్రాణికోటిలో చరాచర జగత్తులో ఏదైనా సరే పుట్టడం మొదలుకొని గిట్టడం వరకూ ప్రతి సంఘటనా ప్రతి ఆలోచనా ప్రతి కదలికా కర్మఫలమే. బ్రహ్మాది దేవతలూ సూర్యచంద్రులూ అంతా కర్మానుబద్ధులై సంచరించేవారే. కర్మ అనాది నిధనం (ఆదీ అంతమూ లేనిది). నిత్యం.

ఈ దృష్టితో జగత్తు నిత్యమా అనిత్యమా అనే చర్చ ప్రాచీనకాలంనుంచీ జరుగుతోంది. ఇప్పటికీ మునీశ్వరులు ఆ తర్కంలోనే మునిగి ఉన్నారు. మాయావరణంలో చిక్కుకుంటే జగత్తు నిత్యంగానే భాసిస్తుంది. కారణం ఉండగా కార్యాభావం (కార్యం జరగకపోవడం) ఎలా ఉంటుంది ? అన్నింటికీ అన్ని వేళలా మాయ అనేది నిత్యతాకారణం.

ఈ జగత్తు అంతా కర్మనియంత్రితమై తిరుగుతోంది. విష్ణుమూర్తి అంతటివాడు గర్భవాసాలు చేస్తున్నాడు. వైకుంఠ భోగాలను విడిచిపెట్టి మత్స్యాది క్షుద్రజంతువులుగా గర్భవాసదుఃఖం అనుభవించాడంటే కర్మ కాకపోతే ఏమిటి కారణం ? మలమూత్రాలతో నిండిన గర్భకోశంలో తొమ్మిది పది నెలల పాటు నివసించే నరకాన్ని ఎవడైనా కోరుకుంటాడా ? ఇదేమైనా వనవిహారమా ? జలకాలాటా? హంసతూలికా తల్పమా కోరుకోవడానికి ? కాళ్ళూ చేతులూ ముణగదీసుకుని అధోముఖంగా



పడుకునే అవస్థను తెలివున్నవాడెవడూ కోరుకోడు. అయినా విష్ణుమూర్తి మానవగర్భవాసాన్నే కాదు పశుపక్ష్యాదుల గర్భవాసాన్ని కూడా (అవతారాలలో) అనుభవిస్తున్నాడంటే అదొక కర్మ ! మహారాజా ! గర్భవాసాన్ని మించిన నరకం మరొకటి ఏదీ లేదు. ముల్లోకాలలోనూ లేదు. అందుకే, దానికి భయపడి తపస్వులు తీవ్రాతితీవ్రతపస్సులు చేస్తూంటారు. మనస్వులు రాజ్యాలనూ భోగభాగ్యాలనూ విడిచిపెట్టి వనవాసానికి పరుగులు తీస్తుంటారు.

గర్భవాసాత్పరో నాస్తి నరకో భువనత్రయే ।
తద్భీతాశ్చ ప్రకుర్వంతి మునయో దుస్తరం తపః ॥ (2 - 25)

మలమూత్రాలూ, క్రిమికీటకాలూ, జఠరాగ్ని, వపాదుర్గంధం - వీటితోనిండిన గర్భకోశంలో నివసించడంకన్నా సంకెళ్ళతో చెరలో నివసించడం సుఖం. క్షణకాలం ఉండాలంటేనే వొళ్ళు గరపాడుస్తుంది. పది నెలలు ఉండటం ఎంత దుఃఖమో ఆలోచించు. పోనీ ఎలాగో గడిచాయి అనుకుంటే దానినుంచి బయటపడటం మరీ దుఃఖం. అతిదారుణమైన యోని యంత్రంనుంచి నలిగిపోతూ బయటకు రావాలి. శైశవమూ బాల్యమూ ఇంకెంత దుఃఖకరాలో అందరికీ తెలిసిందే. మాటలు రాని మూగదనం. ఏమీ తెలియని అజ్ఞానం. ఆకలిదప్పికలకు ఏడవడం తప్ప ఏమీ చెయ్యలేని పరతంత్రత. తన మలమూత్రాలను తానే ఒళ్ళంతా పులుముకునే పిచ్చితనం. బిడ్డ ఎందుకు ఏడుస్తున్నాడో తెలీక తల్లి వేదనపడటం. శిశువు ఆరోగ్యంకోసం తాను మందులు వేసుకుంటూ పథ్యాలు చెయ్యడం - అబ్బో ! బాల్యంలో దుఃఖాలు ఇన్నీ అన్నీ కాదు. ఏ సుఖం ఉంది కనక గర్భవాసాన్ని కోరుకోవాలి ? విజ్ఞుడెవడూ కోరుకోడు.

అయినా సుఖాలూ దుఃఖాలూ మన చేతుల్లో ఉన్నాయి కనకనా కోరుకున్నప్పుడల్లా రావడానికీ పోవడానికీని. అంతా కర్మవిపాకంతో జరుగుతూంటుంది. "అవశ్యమేవ భోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్" అని పెద్దలమాట. దేవతలతో సహా సకల ప్రాణికోటికీ ఇది తప్పదు.

జనమేజయా ! తపస్సూ దానధర్మాలూ యజ్ఞయాగాలూ ఆచరించడం ద్వారా మానవుడు ఇంద్రపదవిని పొందుతాడు. ఆ పుణ్యం క్షీణించిపోతే ఇంద్రుడైనా స్వర్గంనుంచి పడిపోకతప్పదు.

విష్ణుమూర్తి రామావతారం ధరించినప్పుడు దేవతలు వానరులుగా అవతరించి సహకరించారు. కృష్ణావతారంలో యాదవులుగా జన్మించి అనుచరులయ్యారు. ఇలా ప్రతియుగంలోనూ విష్ణుమూర్తి అవతారాలు ధరిస్తూంటాడు, ధర్మసంరక్షణ చేస్తూంటాడు. ఇదొక ధర్మచక్రం. రాక్షసులను తానే స్వయంగా సంహరించడం విష్ణుమూర్తికి కర్తవ్యం. అందుకోసం ధరించినదే కృష్ణావతారం. ఆ కథ అడిగావు కదా, చెబుతున్నాను, ఆలకించు.

*(అధ్యాయం - 2, శ్లోకాలు - 60)*



## ◆ దేవకీ వసుదేవుల జన్మవృత్తాంతం ◆

ఒకప్పుడు కశ్యపుడు (బ్రహ్మదేవుడి మనుమడు) యజ్ఞం చేస్తూ వరుణుడి గోవును అపహరించి తెచ్చాడు. అతడు వచ్చి ఎంత బతిమాలినా తిరిగి ఇవ్వలేదు. దానితో వరుణుడికి కోపం వచ్చింది. మానవజన్మ ఎత్తి భూలోకంలో గోపాలుడుగా జీవించమని శపించాడు. నీ భార్యలిద్దరూ నీతోపాటే మానవజన్మలు ధరిస్తారు. ఆవుకి దూరమై మా దూడలు విలపిస్తున్నాయి. అలాగే నీ భార్యలూ పుత్రశోకంతో విలపిస్తారు అని వరుణుడు శపించి రుసరుసలాడుతూ వెళ్ళి విషయమంతా బ్రహ్మదేవుడికి విన్నవించాడు. బ్రహ్మదేవుడు కశ్యపుడిని (మనుమడిని) పిలిపించి, వరుణుడి గోవును అపహరించినందుకు నిందించి, పరమదారుణమూ సర్వపాప కారణమూ అయిన లోభగుణాన్ని వదులుకోమని హితవు చెప్పి, మర్యాదా రక్షణకోసం తానూ అలాగే శపించాడు. భార్యలిద్దరితోనూ భూలోకంలో అంశావతారంగా జన్మించి యదువంశంలో గోపాలుడిగా జీవించమన్నాడు. అలాగే - కశ్యపుడు వసుదేవుడుగా, అతడిభార్య అదితి - దేవకీదేవిగా, మరొక భార్య సురస - రోహిణీదేవిగా జన్మించారు.

కశ్యపుడి భార్యలలో దితి - అదితులిద్దరి మధ్యా సవతిపోరు ఎప్పుడూ సాగుతూ ఉండేది. ఒక సంఘటనతో మనసు కష్టపెట్టుకున్న దితి తన సవతి అదితికి (వీరిద్దరూ దక్షప్రజాపతి కూతుళ్ళు) శాపం ఇచ్చింది. నీకు పుట్టిన పుత్రులు ఏడుగురివరకూ పుట్టినవాడు పుట్టినట్టు చనిపోతాడు - అని శపించింది.

ఇలా శపించడానికి దారితీసిన సంఘటన ఏమిటా అని అడగబోతున్నావు కదూ. అదే చెబుతున్నాను. అది చాలా భయంకరమైన సంఘటన. ఈర్ష్యాసూయలు ఎంతటి పాపానికైనా ఒడికట్టిస్తాయనడానికి నిదర్శనం. విను.

దితికన్నా ముందే కడుపుపండి అదితికి ఒక మగబిడ్డ జన్మించాడు. అతడే ఇంద్రుడు. అమిత తేజోబలశాలి. సురనాయకుడు. దితికి కడుపుమండింది. భర్తను వేడుకొంది. ఇంద్రుడికి అన్ని విధాలా సాటివచ్చే కొడుకుని అనుగ్రహించమని అర్థించింది. కశ్యపుడు అంగీకరించాడు. వ్రతం ముగిసేసరికి ఇంద్రసమానుడైన కొడుకు జన్మిస్తాడని అభయం ఇచ్చాడు. ఆమె గర్భంలో తన వీర్యాన్ని నిషిక్తం చేశాడు. గర్భిణిగా ఉన్నప్పటికీ నేలమీద పడుకోవడం శుచిని పాటించడం మొదలైన వ్రతనియమాలను నిష్ఠతో ఆచరించింది దితి. నెలలు నిండుతున్న కొద్దీ ఆమెలో ఒక తేజస్సు అతిశయిస్తూ వచ్చింది.

ఇది గమనించిన అదితికి అసూయ కలిగింది. తన కొడుకుతో సాటివచ్చే కొడుకు, తన సవతికి జన్మించబోతున్నాడనే వాస్తవాన్ని జీర్ణించుకోలేకపోయింది. ఒకరోజున ఇంద్రుణ్ణి పిలిచి దుర్బోధ చేసింది. గర్భస్థ శిశువుగా ఉన్నప్పుడే శత్రువుని సంహరించి ఉత్పత్తినే అడ్డుకొని సుఖపడమని ఉపదేశించింది. పుట్టి పెరిగి బలపడ్డాక కష్టపడి సంహరించడంకన్నా ఇది తేలిక పనికదా, ఆలోచించమంది.



ఉపాయం కురు నాశాయ శత్రోరద్య విచింత్య చ ।
ఉత్పత్తిరేవ హంతవ్యా దిత్యా గర్భస్య శోభన ॥ (3 - 30)

శత్రువు అంకురించాడు అంటే క్షయరోగంలా వృద్ధి పొందుతాడు. వ్యాపిస్తాడు. తెలుసుకో. అప్పుడు అదుపు చెయ్యడం అసంభవం. కనక ఇప్పుడే మేలుకో. నా హృదయాన్ని ఇనపమేకులా హింసిస్తున్న దితిగర్భాన్ని ఏదో ఒక ఉపాయంతో వెంటనే ఛేదించు. నాకు మనశ్శాంతిని ప్రసాదించు.

కన్నతల్లి ప్రబోధాన్ని ఆలకించాడు ఇంద్రుడు. తన అవసరాన్నీ గుర్తించాడు. సరే అని బయలుదేరాడు. సవతితల్లి దగ్గరకు వెళ్ళాడు. సవినయంగా భక్తితో పాదాభివందనం చేశాడు.

అమ్మా ! ఎంత నీరసంగా ఉన్నావో చూడు. అసలే వట్టి మనిషివి కావు. పైగా ఈ వ్రతనియమాలు ఒకటి. చూస్తూ ఊరుకోలేక, నీకు ఏదైనా ఇంత సేవచేద్దామనిపించి ఇలా వచ్చాను. చెప్పమ్మా, ఏమి చెయ్యమంటావో. నువ్వు పరమ పతివ్రతవు. నీ పాదసేవచేస్తే నాకింత పుణ్యమూ పురుషార్థమూను. గురుశుశ్రూషవల్ల ఉత్తమగతులు లభిస్తాయంటారు. నిజం చెబుతున్నాను. నీకూ మా అమ్మకూ నా దృష్టిలో భేదం లేదు. ఒట్టు - అంటూ ప్రక్కనే కూర్చుని కాళ్ళు పిసకడం మొదలుపెట్టాడు.

గురుశుశ్రూషణాత్పుణ్యం లభతే గతిమక్షయామ్ ।
న మే కిమపి భేదోఽస్తి తథాదిత్యా శపే కిల ॥ (3 - 39)

ఆ పిచ్చితల్లి ఈ మాటలు విశ్వసించింది. బాగా నీరసపడి ఉందేమో, ఇంద్రుడు కాళ్ళు పడుతూంటే హాయిగా ఆదమరచి నిద్రపోయింది. ఇదే అదను అనుకొన్న ఆ ఇంద్రుడు యోగ విద్యాబలంతో సూక్ష్మరూపం ధరించి దితి గర్భంలోకి ప్రవేశించాడు. తన వజ్రాయుధంతో గర్భ శిశువును ఏడు ముక్కలుగా ఖండించాడు. శిశువు దారుణంగా విలపిస్తూంటే ఒకవైపు ఊరడిస్తూనే ఏడు ముక్కలనూ మళ్ళీ రెండేసి ముక్కలుగా తరిగిపోసి ఇవతలికి వచ్చాడు. (పధ్నాలుగు ముక్కలూ పధ్నాలుగుమంది మరుత్తులయ్యారు).

గర్భకోశంలో జరుగుతున్న గందరగోళానికి దితి మేల్కొంది. దారుణంగా విలపించింది. తల్లీ కొడుకులు చేసిన వయవంచనను గ్రహించింది. కోపావేశంతో ఇద్దరినీ శపించింది. ఇంద్రుడి త్రిలోకాధిపత్యం నశించుగాక. నా గర్భస్థ శిశువును ఏడు ముక్కలు చేయించింది కనక అదితి సంతానం పుట్టగానే ఏడుగురు నశింతురుగాక. కారాగారదుఃఖం అనుభవించుగాక, పుత్రశోకంతో కృశించుగాక - అని శపించింది.



అప్పటికి కశ్యపుడు అక్కడికి వచ్చి మరింక శాపాలు ఇవ్వకుండా అడ్డుకున్నాడు. ప్రేమగా లాలనగా ఓదార్చాడు. కళ్యాణీ ! చాలు ఇక శపించకు. కోపాన్ని నిలువరించుకో. నీ గర్భస్థ శిశువు పధ్నాలుగు ఖండాలు అయ్యాడు. కనక పధ్నాలుగుమంది మరుత్తులు అవుతారు. ఇంద్రుడితో సమస్కంధులు అవుతారు. అతడికి పరమమిత్రులుగా మెలగుతారు. ఇరవైయెనిమిదవ ద్వాపరంలో అంశావతారంగా మానవజన్మ ఎత్తి అదితి నీ శాపాన్ని అనుభవిస్తుంది. వరుణుడు కూడా మొన్న నా మీద అలిగి ఇలాంటి శాపమే ఇచ్చాడు. మీ ఇద్దరి శాపాలవల్లా మేమిద్దరమూ మానుషజన్మ ఎత్తుతాము.

ఈ ఓదార్పుమాటలకు దితి సంతృప్తి చెందింది. మరింకేమీ మాట్లాడకుండా దుఃఖాన్ని దిగమింగుకుంది. జనమేజయా ! శాపకారణం విన్నావుగా. కశ్యపుడు యదువంశంలో వసుదేవుడుగా జన్మించాడు. అదితి దేవకీదేవిగా జన్మించింది. ***(అధ్యాయం - 3, శ్లోకాలు - 55)***

## ◆ జనమేజయుడి ధర్మ సందేహాలు ◆

ఈ కథ విన్న జనమేజయుడికి మతిపోయింది. ఏది ధర్మం, ఏది అధర్మం ? ఎవరిని నమ్మాలి? ఎవరిని ఆదర్శంగా తీసుకోవాలి ? - అంతా అగమ్యగోచరంగా కనిపించింది.

మహానుభావా ! మహామతీ ! వ్యాసమహర్షీ ! చాలా ఆశ్చర్యంగా ఉంది నువ్వు చెప్పిన ఈ వృత్తాంతం. ఈ సంసారమంతా (సృష్టి) ఒక పెద్ద పాపకూపం. దీని బంధనాలనుంచి ఎవడూ తప్పించుకోలేడు. కశ్యపుడంతటివాడు దిక్పాలకుడి గోవును అపహరించాడు. త్రిలోకాలకూ అధిపతి అయ్యుండి అతడి కొడుకు దేవేంద్రుడు ఇంతటి జుగుప్సితం చేశాడు. గర్భంలో ప్రవేశించి పిండాన్ని ఖండఖండాలు చెయ్యడం పరమదారుణం కదూ ! పైగా, సేవకోసం వచ్చానని ఒట్టువేసి మరీ చెప్పి, నమ్మించి మోసం చెయ్యడం, గర్భశోకాన్ని కలిగించడం ఎంత దారుణం ! ధర్మానికి శాసకుడూ ముల్లోకాలకూ రక్షకుడూ అయిన ఇంద్రుడే ఇంతటి నీచానికి ఒడికట్టాడంటే ఇంక ఈ లోకంలో ఎవరు ఏది చేస్తేమాత్రం తప్పవుతుంది !

కురుక్షేత్ర మహాసంగ్రామంలో అందరూ దారి తప్పినవారే. భీష్ముడూ ద్రోణుడూ కృపుడూ కర్ణుడూ ధర్మరాజూ - అంతా, అందరూ ధర్మం తప్పారు. వీరందరికీ శ్రీకృష్ణుడు ప్రేరకుడు కావడం మరీ వింత. సంసారం నిస్సారమని తెలిసిన మహామేధావులే వీరంతా. దేవాంశ సంభూతులే వీరంతా. ధర్మతత్పరులే వీరంతా. అందుకేనా అంత నింద్యంగా ప్రవర్తించారు !

మహర్షీ ! వీరి కథలు విన్నాక ఇక ధర్మంపట్ల ఆస్థ ఎవరికి ఉంటుంది ! ధర్మానికి ప్రమాణం ఏమిటి? ఇది ధర్మము అని దేనిని ఎలా నిశ్చయించడం ? ఎవరిని అనుసరించడం ? మహాత్మా ! నాకు మతిపోతోంది.

ఆప్తవాక్యం ప్రమాణం అనేట్టయితే అసలు ఆప్తుడు ఎవరు ? దేహధారి ప్రతివాడూ విషయాసక్తుడే. రాగ సహితుడే.



ఆప్తవాక్యం ప్రమాణం చేదాప్తః కః పరదేహవాన్ ।
పురుషో విషయాసక్తో రాగీ భవతి సర్వథా ॥ (4 - 9)

రాగంవల్లనేకదా ద్వేషం పుట్టేది. ఒకరిపట్ల రాగం ఉంది అంటే, మరొకరిపట్ల ద్వేషం ఉన్నట్టే. తన ప్రయోజనం దెబ్బతింటే కొందరిపట్ల రాగమూ, కొందరిపట్ల ద్వేషమూ ఆవిర్భవిస్తాయి. ద్వేషంవల్ల అసత్యవచనం సంభవిస్తుంది. స్వార్థ సిద్ధికోసం (భయంతో) అబద్ధాలు ఆడటం తప్పనిసరి అవుతుంది. జరాసంధుణ్ణి చంపడం కోసం శ్రీమహావిష్ణువంతటివాడు బ్రాహ్మణరూపం ధరించాడు. అన్ని ధర్మాలూ తెలిసి మోసం చేశాడు. ఇక ఆప్తుడు ఎవరు ? ప్రమాణం ఏమిటి ? యజ్ఞ సందర్భంగా అర్జునుడూ ఇంతే చేశాడు. (బ్రాహ్మణరూపంలో వచ్చి మత్స్యయంత్రాన్ని ఛేదించడం). ఇక నా బొంద యజ్ఞమేమిటి ? శమదమాలు (ప్రాథమిక ధర్మాలు) లేకపోయాక ఎందుకు చేసినట్టు ? పరలోక పదార్థం కోసమా ? కీర్తికోసమా ? మరింక దేనికోసమైనానా ?

ధర్మానికి నాలుగు పాదాలని వేదం చెబుతోంది. వాటిలో సత్యం మొదటిది. శౌచం రెండవది. దయ మూడవది. దానం నాల్గవది. ఇవే లేకపోయాక ఇక ధర్మం ఎలా నిలుస్తుంది ? ధర్మం లేకపోయాక చేసిన పని ఆశించిన ఫలితాలను ఎలా ఇస్తుంది ? ఇంతటి ప్రధానమైన ధర్మంపట్ల ఎవడికీ ఒక పట్టుదల గానీ, ఒక ధ్యాసగానీ ఒక స్థిరమైన ఆసక్తిగానీ ఉన్నట్టు ఎక్కడా కనిపించడం లేదు.

ధర్మహీనం కృతం కర్మ కథం తత్ఫలదం భవేత్ ।
ధర్మే స్థిరా మతిః క్వాపి న కస్యాపి ప్రతీయతే ॥ (4 - 16)

మోసం చెయ్యడానికే (ఉద్దేశ పూర్వకంగా) విష్ణుమూర్తి వామనుడయ్యాడు. జగత్ప్రభువు. బలిచక్రవర్తిని మోసగించాడు. బలిచక్రవర్తి సామాన్యుడా ! నూరుయజ్ఞాలు చేశాడు. వేదాజ్ఞలను తూచా తప్పకుండా పాలించాడు. ఏనాడూ ధర్మం తప్పలేదు. దానం అతని శీలం. సత్యవాది. జితేంద్రియుడు. అంతటివాణ్ణి అకస్మాత్తుగా అధఃపాతాళానికి అణగదొక్కాడు శ్రీమన్నారాయణుడు. మహర్షీ ! (కృష్ణుడు = వ్యాసుడు) ఇంతకీ ఆ ఇద్దరిలో ఎవరు ఎవరిని జయించినట్టు ? బహుపురాణకర్తవు, నువ్వే చెప్పాలి మరి.

స్థానాత్ప్రభ్రంశితోఽకస్మాద్విష్ణునా ప్రభవిష్ణునా ।
జితం కేన తయోః కృష్ణ ! బలినా వామనేన వా ॥ (4 - 19)

## ◆ "అందరికందరే" - వ్యాసుడు ◆

జనమేజయా ! సందేహమేముంది. విజయం బలిచక్రవర్తిదే. యావద్భూగోళాన్నీ దానం చేసిన మహానుభావుడతడైతే, మాటవరసకు త్రివిక్రముడనిపించుకున్నా శ్రీమహావిష్ణువు మోసం కోసం వామనుడైపోయాడు.



జితం వై బలినా రాజన్ ! దత్తా యేన చ మేదినీ ॥
త్రివిక్రమోఽపి నామ్నా యః ప్రథితో వామనోఽభవత్ ।
ఛలనార్థమిదం రాజన్! వామనత్వం నరాధిప ॥ (4 - 21, 22)

అంతేకాదు, రాజేంద్రా ! విష్ణుమూర్తి బలిచక్రవర్తికి ద్వారపాలకుడు కూడా అయ్యాడు. నువ్వన్నట్టు సకల ధర్మాలకూ సత్యమే మూలం. అయితే దేహధారులకు అది దుస్సాధ్యం. మాయాశక్తి కడుంగడు బలీయసి. బహురూపిణి. దాని త్రిగుణాలతో ఈ విశ్వమంతా రంగులు పులుముకుంటుంది. శబలితమవుతుంది. సత్యమే మోసంగా, మోసమే సత్యంగా భాసిస్తుంటాయి. ఈ సమ్మిశ్రస్థితి సనాతనం. ఎక్కడో ఒక వైఖానసమహర్షులు - నిస్సంగులూ నిష్ప్రతిగ్రహులూ సత్యయుక్తులూ వీతరాగులూ గతతృష్ణులూ ఉన్నారంటారు. వారైనా దృష్టాంతంగా చూపించడంకోసమే నిర్మింపబడ్డారని నా అభిప్రాయం. (దృష్టాంత దర్శనార్థాయ నిర్మితాస్తే చ తాదృశాః 4 - 27). వీరుతప్ప మిగతా సృష్టి అంతా త్రిగుణ సమ్మిశ్రితమే.

పురాణాలూ వేదాలూ వేదాంగాలూ ధర్మశాస్త్రాలూ - అన్నీ సగుణుల రచనలే. సగుణంనుంచి సగుణమే ఆవిర్భవిస్తుంది తప్ప నిర్గుణం ఎలా వస్తుంది ? అందుకే వీటికి ఏకవాక్యత ఉండదు.

మానవదేహం ధరించి మాయామోహితుడైన వాడికి ధర్మంపట్ల స్థిరచిత్తం ఉండదు. మనస్సు ఇంద్రియాలవెంట ఆసక్తమై పరుగులు తీస్తుంది. కామక్రోధాది గుణాలతో ప్రేరితాలై రకరకాల స్పందనలు కలుగుతుంటాయి. బ్రహ్మాదిస్తంబ పర్యంతమూ సకల విశ్వమూ మాయామోహితమే. ఆ మాయ వీటితో క్రీడిస్తోంది.

ఇంద్రియాలు కోరుకున్నది లభించకపోతే మనిషి వెంటనే పాల్పడేది అసత్యానికే. దానికోసం వంకలు వెతుక్కుంటాడు. కామక్రోధాదులను మించిన శత్రువులు లేరు. ఇవన్నీ కలిసి మానవుణ్ణి పాపకూపంలోకి పడదోస్తాయి. వీటికి వశుడైన మనిషి మరింక మంచిచెడ్డలను గుర్తించలేడు. ఈ పని చెయ్యదగినది, ఈ పని చెయ్యకూడనిది అనే వివేకం కోల్పోతాడు.

ఐశ్వర్యం చేకూరింది అంటే అహంకారం బలపడిందన్నమాటే. అహంకారం నుంచి మోహమూ, మోహం వల్ల కట్టకడపటికి మరణమూ సంభవిస్తాయి. సంకల్ప వికల్పాలకు కేంద్రస్థానమైన మనస్సులో ఈర్ష్య, అసూయ, ద్వేషం, ఆశ, తృష్ణ, దైన్యం, దంభం, అధర్మం - ఇత్యాదులన్నీ ఆవిర్భవిస్తాయి. వీటికి అన్నింటికీ మూలం మోహమే.

ఐశ్వర్యవంతులు కొందరు అహంకారంతో ఆర్భాటంగా పెద్ద ప్రదర్శనగా యజ్ఞయాగాలు చేస్తుంటారు. దానధర్మాలు నిర్వహిస్తుంటారు. ఇవి అంతశ్శుద్ధి లేని కార్యాలు. నిష్ఫలాలు.



ఏ కార్యక్రమానికైనా ద్రవ్యశుద్ధి ప్రధానం. ముందు అది చూసుకోవాలి. ఎవరికీ ఏ ద్రోహమూ చెయ్యకుండా న్యాయంగా సంపాదించిన ధనం ఉత్తమోత్తమం. ధర్మకార్యాలకు దీనినే వినియోగించాలి. అక్రమార్జనలతో చేస్తే విపరీతఫలాలు వస్తాయి. పుణ్యం రాకపోగా పాపం చుట్టుకుంటుంది. అలాగే యజమానునికీ (కర్త) ఋత్విజుడికీ (కారయిత) మనస్సులు నిర్మలంగా ఉండాలి. అప్పుడే యజ్ఞఫలం పరిపూర్ణంగా దక్కుతుంది. దేశ - కాల - క్రియా - ద్రవ్య - కర్తృ - కారయితృ - మంత్రాల శుద్ధి ఉంటేనేగానీ యజ్ఞఫలం సంపూర్ణంగా లభించదు. వీటిలో ఏ శుద్ధి లోపించినా ఫలసిద్ధి వ్యతిరేకంగా ఉంటుంది. శత్రునాశమూ స్వీయవృద్ధీ కోరితే స్వీయనాశమూ శత్రువృద్ధీ జరుగుతాయి.

జనమేజయా ! మనిషి ఎప్పుడూ స్వార్థ పరాయణుడే. శుభాశుభాలను విచారించడు. ఎప్పుడూ పాపమే చేస్తాడు. ప్రజాపతులూ దేవతలూ రాక్షసులూ - వీరంతా స్వార్థనిరతులు. పరస్పర విరోధులు. వేదాల ప్రకారం దేవతలు సత్త్వగుణ సంభవులు. మానవులు రజోగుణ సంభవులు. రాక్షసులూ పశుపక్ష్యాదులూ తామసగుణ సంభవాలు. గుణాలకున్నట్టే వారికీ పరస్పరవైరం. అందుకే మానవుల తపస్సులను దేవతలు ఎప్పుడూ భంగపరుస్తుంటారు.

అసలు మౌలికంగా ఈ సంసారమే అహంకార సంభూతమైనప్పుడు - రాగద్వేషరహితుడు ఎక్కడ ఉంటాడు !

> **అహంకార సముద్భూతస్సంసారోఽయం యతో నృప ।**
> **రాగద్వేష విహీనస్తు స కథం జాయతే నృప ॥ (4 - 52)**

***(అధ్యాయం - 4, శ్లోకాలు - 52)***

అందుచేత,ఓ మహారాజా ! ద్రోహచింతలేని ధర్మాత్ముడు ఈ సృష్టిలో దొరకడు. సకలచరాచరజగత్తూ రాగద్వేషాలతో నిండినదే. ఈ కలియుగంలోనే కాదు ఆ తొలియుగంలో కూడా ఇదే పరిస్థితి. దేవతలు ఈర్ష్యాళువులు. ద్రోహచింతనులు. మోసగాళ్ళు. ఇక మానవులమాటా పశుపక్ష్యాదులమాటా చెప్పాలా!

ద్రోహం చేసినవాడికి ద్రోహం చెయ్యడం సమత. అద్రోహికీ అతిశాంతుడికీ ద్రోహం చెయ్యడం ఖలత (నీచత).

> **ద్రోహపరే ద్రోహపరో భవేదితి సమానతా ।**
> **అద్రోహిణి తథా శాంతే విద్వేషః ఖలతా స్మృతా ॥ (5 - 4)**

ఎవడో ఒక తపస్వి, శాంతచిత్తంతో జపధ్యాన పరాయణుడై ఎక్కడో ఏ అడవిలోనో ముక్కు మూసుకుని కాలం గడుపుతుంటాడు. దేవేంద్రుడు పనిబూని వాడి తపస్సును కాస్తా భంగపరుస్తాడు. దీన్ని ఏమనాలి ? వానోటితో ఎందుకులే చెప్పడం.



యః కశ్చిత్తాపసః శాంతో జపధ్యానపరాయణః ।
భవేత్తస్య జపే విఘ్నకర్తా వై మఘవా పరమ్ ॥ (5 - 5)

సజ్జనులకు ఎప్పుడూ ఎక్కడైనా సత్యయుగమే. అసజ్జనులకు ఎప్పుడూ కలియుగమే. మధ్యములకు - మధ్యయుగం. ఎప్పుడో ఎక్కడో యుగానికీ జగానికీ ఒక్కడు - సత్యధర్మానువర్తి ఆవిర్భవిస్తాడు. మిగతా యుగాలు అన్నింటా అందరూ ప్రధానంగా అధర్మపరాయణులే (అధర్మికులే).

## ◆ నరనారాయణుల తపస్సు ◆

ధర్మ సంస్థితికి పూర్వజన్మ వాసన ప్రధానకారణం. అది మలినమైతే ధర్మమూ మలినమవుతుంది. ఇక్కడొక వృత్తాంతం చెబుతాను. విను మరి.

పూర్వకాలంలో ధర్ముడు బ్రహ్మమానసపుత్రుడై జన్మించాడు. సత్యసంపన్నుడై వేదధర్మ నిరతుడై జీవిస్తున్నాడు. దక్షప్రజాపతి కూతుళ్ళను పదిమందిని వివాహం చేసుకున్నాడు. గృహస్థాశ్రమాన్ని స్వీకరించాడు. వారికి హరి కృష్ణుడు నరుడు నారాయణుడు అని నలుగురు కుమారులు జన్మించారు. వీరిలో హరికృష్ణులిద్దరూ నిత్యం యోగాభ్యాసపరాయణులై కాలం గడుపుతున్నారు. నరనారాయణులు తపః పరాయణులయ్యారు. హిమాలయాల్లో బదరికాశ్రమంలో తీవ్రంగా తపస్సు చేస్తున్నారు. వెయ్యేళ్ళకు పైగా గడిచింది. తపస్వులలో కెల్లా అగ్రగణ్యు లయ్యారు.

వీరి తపస్సుల తీవ్రత ముల్లోకాలకూ వ్యాపించింది. దేవేంద్రుడికి దడపుట్టింది. ఎలా భగ్నం చెయ్యడమా అని చాలా రోజులు తీవ్రంగా ఆలోచించాడు. కట్టకడపటికి తానే రంగంలోకి దిగాడు. అతిదారుణమైన కామక్రోధలోభమోహాదులను వెంటబెట్టుకుని (గంధమాదనంపై ఉన్న) ఐరావతం ఎక్కి బదరికాశ్రమం చేరుకున్నాడు. ప్రత్యక్షమైన బ్రహ్మ విష్ణువుల్లాగా, అప్పుడే ఉదయించిన సూర్యబింబాల్లాగా తపస్తేజస్సుతో విరాజిల్లుతున్న నరనారాయణులను చూశాడు. ఏమిటి వీళ్ళ పట్టుదల, తపస్సుతో ఏం చేద్దామనుకుంటున్నారు అని ఆలోచిస్తూ దగ్గరికి వెళ్ళాడు.

మహానుభావులారా ! ధర్మసుతులుకదా మీరు. చాలా తీవ్రంగా తపస్సు చేస్తున్నారు. ఏమిటి మీ ఉద్దేశం, ఏమిటి మీ ఆకాంక్ష ? ఉత్తమోత్తమమైన వరం ఇద్దామని వచ్చాను. ఇవ్వకూడనిదే అయినా ఇస్తాను. అంతగా సంతోషించాను మీ తపస్సుకి. కోరుకోండి - అన్నాడు. నరనారాయణులు ఉలకలేదు పలకలేదు. ఇంద్రుడు మళ్ళీ మళ్ళీ అదే ప్రకటించాడు. స్థిరచిత్తులై ధ్యానంలో మునిగిపోయిన ఆ జంటమునులలో చలనం లేదు.

ఇంద్రుడికి రోషం వచ్చింది. మాయామోహినిని సృష్టించాడు. వారిపైకి ఉసిగొల్పాడు. ప్రయోజనం లేకపోయింది. సింహాలూ పులులూ తోడేళ్ళను సృష్టించాడు. భయపెట్టాలని ప్రయత్నించాడు. ఫలితం లేకపోయింది. ఇక ఏమి చెయ్యడానికీ తోచలేదు. వరదానానికి లుబ్ధులు కాలేదు. సింహశార్దూలాలకి భీతులు కాలేదు. మాయామోహినికి మోహితులు కాలేదు. వీరి తపస్సుని భంగపరచడం ఎలాగ చెప్మా అనుకుంటూ తిరిగి తన మందిరానికి వెళ్ళిపోయాడు. బాగా యోచన చేశాడు.



జనమేజయా ! ఆదిశక్తి సనాతని సర్వలోకేశ్వరి పరాప్రకృతి అయిన మహావిద్యను నిష్ఠతో ఉపాసించేవారిని ఎవ్వరూ ఏమీ చెయ్యలేరు. దేవాసురుల మాయలన్నీ ఆ మహామాయముందు ఓడిపోవలసిందే. చినమాయలు పెదమాయను ఏం చేస్తాయి ! మహామాయను ఉపాసించే వారికి ఎవ్వరూ ఏ విఘ్నాలూ కల్పించలేరు. వాగ్బీజ కామబీజ మాయాబీజ మంత్రాలను జపించేవారిని ఎవ్వరూ బాధించలేరు.

**యస్మాలా పకలా మాయా దేవాసురకృతా: కిల ।**
**తే కథం బాధితుం శక్తా ధ్యాయంతి గతకల్మషా: ॥ (5 - 32)**

అయినా దేవేంద్రుడు మోహితుడై మరొక ప్రయత్నం చేశాడు. మన్మథుణ్ణీ వసంతుణ్ణీ పిలిపించాడు. రతిదేవితో అప్సరసలతో బదరికాశ్రమానికి వెళ్ళి నరనారాయణులను కామాతురులను చెయ్యండి అని ఆజ్ఞాపించాడు. సుగంధ పరిమళాలతో పూలబాణాలతో ఒంపుసొంపుల ఒయ్యారాలతో వారి మనస్సులను సమ్మోహితం చేసి లొంగదియ్యండి. ఇది దేవకార్యం. మన్మథా ! ఈ ప్రపంచంలో దేవదానవ మానవ జాతులలో నీ బాణాల తాకిడికి లొంగిరానివాడు ఎవడు ? నీ శక్తి అమోఘం. బ్రహ్మ విష్ణు మహేశ్వరులే కాదు నీ అందానికి సాటివచ్చే చంద్రుడు కూడా నీకూ నీ పూలబాణాలకూ ఓడిపోయినవాడే. ఇక ఈ నరనారాయణులు ఒక లెక్కా ? పైగా ఇంతమంది అప్సరసలు నీవెంట వస్తున్నారు. నిజానికి ఒక రంభ, ఒక తిలోత్తమ చాలు. అసలు నువ్వు ఒక్కడివే సరిపోతావు. అటువంటిది ఇంతమందితో కలిపి వెడుతున్నావంటే ఇక చెప్పేది ఏముంది ! జయం మనదే. వెళ్ళిరా. కార్యం నెరవేర్చు. నువ్వు కోరినదల్లా నీకు బహుమతిగా ఇస్తాను. నేను స్వయంగా వెళ్ళి ప్రయత్నం చేశాను. ఫలితం లేకపోయింది. శ్రమ మిగిలింది. అసలు మొదటే మిమ్మల్ని పంపించి ఉండాల్సింది. అయినా ఇప్పుడు మించిపోయింది ఏమీ లేదు. వెళ్ళండి - అని పంపించాడు. వెళ్ళబోతూ మన్మథుడు ఒకమాట చెప్పాడు.

దేవేంద్రా ! నీ ఆజ్ఞ ఇప్పుడే నెరవేరుస్తాను. ఆ నరనారాయణులు త్రిమూర్తులలో ఒకరినిగానీ ముగ్గురినీగానీ సూర్యుణ్ణిగానీ లేదా మరింక ఏ దేవతనైనాగానీ ధ్యానిస్తూ ఉంటే, చిటికెలో వారిని మోహపరచి తపోభంగం చేసివస్తాను. సందేహం లేదు. అలా కాక, వారు గనక దేవీభక్తులైతే మాత్రం నేను చెయ్యగలిగింది ఏమీ లేదు. కామరాజ మహాబీజమంత్రాన్ని జపించేవారిమీద నా బాణాలు పనిచెయ్యవు.

**దేవీభక్తం వశీకర్తుం వాహం శక్త: కథంచన ।**
**కామరాజం మహాబీజం చింతయంతం మనప్యలమ్ ॥ (5 - 48)**

మన్మథుడు ఇలా చెప్పినా దేవేంద్రుడు వినిపించుకోలేదు. వెళ్ళమని తరిమాడు. ఇది దుస్సాధ్యమైన కార్యం. నువ్వే సాధించాలి. నాకు హితం చెయ్యాలి అని పంపించాడు. సరే అని మన్మథుడు బయలుదేరాడు.

*(అధ్యాయం - 5, శ్లోకాలు - 51)*



## ◆ అప్సరసలకు గర్వభంగం ◆

జనమేజయా ! ముందుగా వసంతుడు బదరికాశ్రమంలోకి ప్రవేశించాడు. ఒక్కసారిగా పచ్చదనం వెల్లివిరిసింది. కొమ్మ కొమ్మా రెమ్మ రెమ్మా చిగురించింది. పుష్పించింది. తుమ్మెదలు గుంపులు గుంపులుగా ఆడుతూ పాడుతూ ఎగురుతున్నాయి. తరువు తరువునా చిగురుగుబురులు కోకిలలై యుగళగీతికలు ఆలపిస్తున్నాయి. పుష్పించిన లతలు అందుబాటులో ఉన్న తరువులను పెనవేసుకుంటున్నాయి.

**బభూవుః కోకిలాలాపా వృక్షాగ్రేషు మనోహరాః ।**
**వల్ల్యోఽపి పుష్పితాస్సర్వా ఆలిలింగుర్నగోత్తమాన్ ॥ (6 - 3)**

ఆశ్రమంలో ప్రతిజీవీ వయస్సుతో నిమిత్తం లేకుండా రాగరంజితమయ్యింది. తన సహచరిని కౌగిలించుకుంది. అది ఏదో తెలియని మత్తు ఆవరించి క్రీడాసక్తమయ్యింది.

పరిమళవాయు వీచికలు దక్షిణ దిశనుంచి వీతెంచి తనువులను పులకింపజేశాయి. మునీశ్వరులకు సయితం ఇంద్రియాలు అదుపుతప్పి ఉద్రేకాలు ఉరకలు వేశాయి.

రతీమన్మథులు రంగప్రవేశం చేశారు. అయిదు బాణాలనూ ఒకేసారి ఎక్కుపెట్టి గురిచూసి కొడుతూ విచ్చలవిడిగా ఆశ్రమమంతటా కలయదిరిగారు. అంతలోకీ రంభా తిలోత్తమాద్యప్సరసలు వచ్చారు. బృందాలు బృందాలుగా చెట్లనీడల్లో కూర్చుని స్వరతానసమన్వితంగా మధురగీతాలను ఆలపించారు. వీరి గీతాలూ కోకిలల కలకూజితాలూ తుమ్మెదల ఝుంకారాలూ - బదరికాశ్రమమంతా మారుమ్రోగింది.

నరనారాయణులకు ధ్యాననిష్ఠ చెదిరింది. చూపులను క్రమంగా బయటకు మళ్ళించారు. ఎటు చూసినా వసంతశోభ. అకాలంలో ఏమిటి ఈ వింత ? ప్రాణికోటి అంతా మన్మథవివశమై కనపడుతోంది. ఋతు ధర్మంలో క్రమంలో ఈ విపర్యాసం ఎలా వచ్చింది ? - అని నరుడు నారాయణుడిని అడిగాడు. ఆశ్చర్యంతో విప్పారిన కన్నులతో ప్రకృతిని తిలకిస్తున్న నారాయణుడు బదులు పలికాడు.

సోదరా ! చెట్లు చూశావా, నిలువునా పుష్పించాయి. కోకిలాలాపాలనూ భ్రమరనాదాలనూ వినిపిస్తున్నాయి. శిశిరం అనే భీతమాతంగాన్ని (భయపడిన ఏనుగుని) మోదుగుపువ్వుల వాడి గోళ్ళతో చీల్చి చెండాడి వసంతకేసరి (సింహం) ఆశ్రమంలోకి ప్రవేశించింది.

**శిశిరం భీతమాతంగం దారయన్ స్వఖరైర్నఖైః ।**
**వసంతకేసరీ ప్రాప్తః పలాశకుసుమైర్మునే ॥ (6 - 13)**



బ్రహ్మన్ ! మన బదరికాశ్రమంలోకి వసంతలక్ష్మి వచ్చిందయ్యా. అరుణాశోక హస్త. కింశుకపాద. నీలాశోకకచ. వికసిత కమలానన. నీలేందీవరనేత్ర. బిల్వఫలస్తని. కుందరదన. మంజరీకర్ణ. బంధుజీవాధర. సింధువారనఖ. పుంస్కోకిలస్వర. కదంబవసన. బర్హిబర్హకలాప. సారసస్వననూపుర. వాసంతీబద్ధరశన. మత్తమరాళగమన. పుత్రజీవాంశుకన్యస్త రోమరాజివిరాజిత. తమ్ముడూ ! అకాలంలో వచ్చింది ఈ వసంతలక్ష్మి. అంటే మన తపస్సుని భంగపరచడంకోసమే అని మనం గ్రహించాలి. అప్సరసల గానం వినపడుతోంది గదా ! మన ధ్యానాన్ని నాశనం చేసింది. ఇదంతా దేవేంద్రుడి పన్నాగం. లేకపోతే ఏమిటి ఈ ప్రకృతి వైపరీత్యం. మన తపస్సుకి భయపడి ఇంద్రుడు ఈ పని చేసిఉంటాడు. సందేహం లేదు. సుగంధ పరిమళాలను వెదజల్లుతూ సుఖస్పర్శంగా వీతెంచుతూ మలయానిలుడు తనువులను పులకింపజేస్తున్నాడు. గమనించావా ? ఇంకా సందేహమా ? ఇది నిశ్చయంగా శతక్రతుడి దుశ్చర్యయే.

**వాతాస్సుగంధాః శీతాశ్చ సమాయాంతి మనోహరాః ।**
**నాన్యత్కారణమస్తీహ శతక్రతుకృతిం వినా ॥ (6 - 22)**

నారాయణుడు ఇలా పలుకుతుండగా, బండారం బయటపడిందని గ్రహించిన మన్మథుడు ససైన్యంగా కన్నులకు కనిపించాడు. మేనక, రంభ, తిలోత్తమ, పుష్పగంధ, సుకేశి, మహాశ్వేత, మనోరమ, ప్రమద్వర, ఘృతాచి, గీతజ్ఞ, చారుహాసిని, చంద్రప్రభ, సోమ, విద్యున్మాల, అంబుజాక్షి, కాంచనమాల - ఇంకా అప్సరసలు మొత్తం పదహారువేలయాభైమంది కళకళలాడుతూ కిలకిలలాడుతూ కనిపించారు. అద్భుతమైన సంగీతంతో మానవలోకదుర్లభమైన ఆనందాన్ని పంచిపెట్టారు. నరనారాయణులు ఆశ్చర్యం నుంచి తేరుకోవడానికి అట్టే సమయం పట్టలేదు.

ఇంతటి సంగీతమాధుర్యాన్ని చవిచూపించిన మీకు అద్భుతమైన ఆతిథ్యం ఇచ్చి సముచితరీతిని సత్కరించడం మర్యాద. ఈ పూటకు మీరంతా దయచేసి ఇక్కడే ఉండండి. స్వర్గం నుంచి శ్రమపడి వచ్చారుగదా, కాసేపు విశ్రాంతి తీసుకున్నట్టూ ఉంటుంది. ఉండిపొండి - అన్నాడు నారాయణుడు. సరే అన్నారు వారందరూ.

నారాయణుడికి స్వాభిమానం పొంగిపొర్లింది. మా తపస్సులను భగ్నం చెయ్యమని పంపిన ఇంద్రుడికీ, చేద్దామని వచ్చిన వీరికీ తగిన గుణపాఠం నేర్పాలి, తపశ్శక్తి చూపించాలి అనుకున్నాడు. కూర్చున్నవాడు కూర్చున్నట్టే ఉండి తొడపై మెల్లగా చరుచుకున్నాడు. ఒక సర్వాంగసుందరి ఆవిర్భవించింది. రంభాదులను మించిన అందగత్తె. ఊరువునుంచి పుట్టింది కనక ఊర్వశి అన్నాడు నారాయణుడు. మన్మథుడే కాదు అప్సరసలందరూ ఆశ్చర్యచకితలై కళ్ళప్పగించి చూస్తున్నారు. ఒక్కొక్క అప్సరసకూ సేవ చెయ్యడానికి ఒక్కొక్క పరిచారికగా పదహారువేలయాభైమంది సుందరాంగులను క్షణంలో సృష్టించాడు.



వారంతా నవ్వుతూ ఆడుతూ పాడుతూ రకరకాల బహుమతులను అందిస్తూ అతిథులందరికీ అద్భుతమైన మర్యాదలు చేశారు. విందు ముగిసింది. నరనారాయణుల ముందు వినయంగా నమస్కరించి నిలబడ్డారు. మరింకేమిటి ఆజ్ఞ అన్నట్టు.

తమ కన్నులను తామే నమ్మలేక ఆశ్చర్యం నుంచి తేరుకోలేక ఉక్కిరిబిక్కిరి అవుతున్న రంభాద్యప్సరసలు నారాయణుడి తపశ్శక్తికి సమ్మోహితులు అయ్యారు. అందరి కన్నులలోనూ అనురాగం మిలమిలలాడింది. అందరి తనువులూ పులకితమయ్యాయి. ముక్తకంఠంగా పలికారు.

మహానుభావా! నీ తపశ్శక్తి అమోఘం. నీ ధైర్యం అనన్యసామాన్యం. ఏమని స్తుతించాలో ఎలా స్తుతించాలో తెలియడం లేదు. నిజానికి మా చూపులు విషం పులిమిన తూపులు. ఇవి సోకి ఇలా నీలా ధైర్యంగా నిలబడినవాడు ఈ సృష్టిలో ఇంతవరకూ ఎక్కడా ఎవరూ తారసపడలేదు. మీ ఇద్దరి మనస్సులనూ మాత్రం కదిలించలేకపోయాం. మీరు దేవాంశ సంభూతులు. అంతర్బహిరింద్రియ నిగ్రహానికి నిధులు. దేవేంద్రుడి ఆజ్ఞను కాదనలేక మీ తపస్సులను భగ్నం చెయ్యడానికి ఇటు వచ్చాం. ఇది మా తప్పే. కాని మా సౌందర్యగర్వం పటాపంచలయ్యింది. నీకు ఓడిపోయాం. అయితే అదే అదృష్టమై మాకు మీ దివ్య దర్శనం లభించింది. మీకు అపకారం తలపెట్టిన మమ్మల్ని క్షమించి మీరు సత్కరించారు. ఇది కేవలం మీ ఔదార్యం. నిజమే మీవంటి మహానుభావులు చిన్న చిన్న అపరాధాలకు అలిగి శాపాలు ఇచ్చి తపశ్శక్తిని వృథాగా వ్యయపరచుకోరు.

అప్సరసలు వినయవినమితగాత్రలై నమస్కరించి నిలబడి ఇలా పలుకుతూంటే నరనారయణులు చాలా సంతోషించారు. కామక్రోధాలను జయించిన ధర్మాత్ములు కనక ప్రసన్నవదనులు అయ్యారు.

సుందరాంగులారా! మీ వినయానికి మేము సంతృప్తి చెందాం. మీకేమి వరం కావాలో కోరుకోండి. అనుగ్రహిస్తాం. ఇదిగో ఈ ఊర్వశిని మీతోపాటు స్వర్గానికి తీసుకువెళ్ళండి. మా కానుకగా మీ దేవేంద్రుడికి సమర్పించండి. మీకూ మీ నాయకునికీ శుభమగుగాక! మీరింక బయలుదేరవచ్చు. ఇటుపైని ఇంకెప్పుడూ ఎవరికీ తపోభంగం చెయ్యకండి. న కస్యాపి తపో విఘ్నం ప్రకర్తవ్యమితఃపరమ్. వెళ్ళిరండి.

నరనారాయణుల పలుకులు రంభాద్యప్సరసలకు ములుకుల్లా సోకాయి. వారిని విడిచిపెట్టి వెళ్ళడానికి మనసొప్పలేదు. నారాయణమహర్షీ! ఎక్కడికి వెడతాం! నీ పాదపద్మాలు ఆశ్రయించాం. ఇక్కడే నీకు సేవలు చేసుకుంటూ ఇలా ఉండిపోతాం. కోరినవరం ఇస్తానన్నావుకదా! ఇదే మేము కోరుకునేవరం. అనుగ్రహించు. మాకందరికీ నువ్వే భర్తవు. స్వీకరించు. మా ఆతిథ్యంకోసం నువ్వు సృష్టించిన పదహారువేల యాభైమంది వరాంగనలతో కలిసి ఈ ఊర్వశి స్వర్గలోకానికి వెడుతుంది. మా బదులుగా అక్కడ



ఇంద్రుడికి సేవలు చేస్తుంది. లెక్కసరిపోతుంది. మేము ఇక్కడ నీ సేవలు చేసి తరిస్తాం. మాట తప్పకు. మాకు ఆశాభంగం కలిగించకు. అది స్త్రీలను మరీ హింసిస్తుంది. కామార్తలై వచ్చిన వారిని తిరస్కరించి హింసించడం నీవంటి ధర్మజ్ఞులు చెయ్యవలసిన పనికాదు. భాగ్యవశంవల్ల స్వర్గం నుంచి ఇక్కడికి వచ్చాం. మమ్మల్ని విడిచిపెట్టడం నీకు భావ్యం కాదు. నువ్వు సమర్థుడివి. తపశ్శక్తిసంపన్నుడివి. దయచేసి మా అభ్యర్థన అంగీకరించి, స్వీకరించు.

సుందరాంగులారా! వెయ్యేళ్ళకుపైగా తపస్సు చేస్తున్నాను. జితేంద్రియుడనయ్యాను. ఇప్పుడు నాకు నేనే తపోభంగం చేసుకోనా? ధర్మవినాశకాలైన తుచ్ఛసుఖాలమీద, కామోపభోగాల మీద నాకు ఇచ్ఛ లేదు. బుద్ధిమంతుడెవడూ పశుధర్మాన్ని కోరుకోడు.

నారాయణమహర్షీ! శబ్దస్పర్శరూపరసగంధాలు అయిదింటా స్పర్శసుఖమే ఉత్తమోత్తమమైనదని పెద్దలు చెబుతున్నారు. అది ఆనందరసమూలం. అంతకుమించిన సుఖం మరొకటి లేదు. కాబట్టి మాకు అదే ప్రసాదించు. వరం ఇస్తానన్నావు. మాట నిలబెట్టుకో. మాతో కలిసి నిర్భరసుఖాలను అనుభవిస్తూ ఈ గంధమాదనపర్వతం మీద స్వేచ్ఛగా విహరించు. ఒకవేళ తపస్సుతో స్వర్గలోకాన్ని పొందుదామనుకుంటున్నావేమో! అది ఈ గంధమాదనం కన్నా అందమైనదీ అధికసుఖదాయకమైనదీ కానేకాదు. అందరం కలిసి ఇక్కడే క్రీడిద్దాం. ***(అధ్యాయం - 6, శ్లోకాలు - 58)***

అప్సరసలు వేసిన ఈ మెలికకు నారాయణుడు ఉక్కిరి బిక్కిరి అయ్యాడు. ఏమిటి చెయ్యడమా అని ఆలోచనలో పడ్డాడు. వీరిని అంగీకరిస్తే తపస్సు అంతా గంగపాలవుతుంది. సాటి మునిబృందంలో అపహాస్యం ఎదురవుతుంది. ఇంద్రుడికీ వీళ్ళకీ బుద్ధి చెబుదామని అహంకరించి, వరం కోరుకోమని ఇలా కష్టాల్లో ఇరుక్కున్నాను. ధర్మవినాశనానికి అహంకారమే మొదటి కారణం. సంసారవృక్షానికి అదే మూలం. పెదవికదపకుండా అలా మౌనంగా ఉండిపోయినా బాగుండేది. పాడీ ఆడీ అలసిపోయి వీళ్ళదారిన వీళ్లు వెళ్ళిపోయుండేవారు. బోలెడు తపస్సు వ్యయపరచి వరాంగనలను సృష్టించాను. ఊర్వశిని సృష్టించాను. విందు జరిపించాను. ఇప్పుడు ఇదిగో ఇలా ఇరుక్కున్నాను. వీళ్ళంతా కామార్తలై నన్ను పెళ్ళాడమంటున్నారు. హతవిధీ! సాలెపురుగులా నా వలలో నేనే చిక్కుకున్నాను.

ఊర్ణవాభిరివాద్యాహం జాలేన స్వకృతేన వై ॥
బద్ధోఽస్మి మదృఢేనాత్ర కిం కర్తవ్యమితః పరమ్ । (7 - 5)

ఎలాగోలా వీరిని వదిలించుకోవాలి. తిరస్కరిస్తే అలిగి శపిస్తారు. పైగా మాట తప్పినవాడను అవుతాను. పోనీ క్రోధం వహిద్దామా అంటే అది కామంకంటే ప్రమాదకరం. లోభంకంటే దారుణం. క్రోధంవల్ల హింస జరుగుతుంది. అది సర్వప్రాణికోటినీ దుఃఖపెడుతుంది. క్రుద్ధుడు అవ్వడమంటే



నరకారామంలో (నరకంలోని ఉద్యానవనంలో) దిగుడుబావి తవ్వుకోవడం. కొమ్మల రాపిడితో పుట్టిన అగ్ని ముందుగా ఆ కొమ్మలనూ ఆచెట్టునూ దహించివేసినట్టుగా, క్రోధం మునుముందుగా క్రుద్ధుడినే నాశనం చేస్తుంది.

ఈ చిక్కునుంచి ఎలా బయటపడాలో తెలియక దీనుడై లోలోపల మల్లగుల్లాలు పడుతున్న అన్నగారి మానసికపరిస్థితిని గ్రహించాడు నరుడు. మెల్లగా ఆలోచనలో పాలుపంచుకున్నాడు.

అగ్రజా! నారాయణా! శాంతస్వభావుడివై ఆలోచించు. అహంకారం విడిచిపెట్టు. పూర్వం ఒకప్పుడు అహంకారం కారణంగానే మనం చాలా తపస్సును నష్టపోయాం. ప్రహ్లాదుడితో ఘోరసంగ్రామం జరిగిందికూడా. ఒకసారి గుర్తుతెచ్చుకో. అప్పుడు ఎంతగా దుఃఖించామో ఇంత తొందరగా మరిచిపోతే ఎలా? అందుచేత క్రోధం జోలికి పోవద్దు. శాంతచిత్తుడవై వీరికి సమాధానం చెప్పు. తపస్సులకు అన్నింటికీ శాంతస్వభావమే మూలమని మునీశ్వరులందరూ చెబుతున్నమాట. శాంతత్వం తపసో మూలం మునిభిః పరికీర్తితమ్.

జనమేజయా! నరుడు ఇలా ఉపదేశించే సరికి నారాయణుడు తేరుకున్నాడు. క్రోధం జోలికి పోకూడదంటే పోకూడదు అని నిశ్చయించుకున్నాడు.

## ◆ అహంకారం సృష్టిబీజం ◆

ఇక్కడ వ్యాసుడి ప్రసంగప్రవాహానికి జనమేజయుడు మళ్ళీ అడ్డుకట్ట వేశాడు. ప్రహ్లాదుడితో వీరికి యుద్ధం జరిగిందా? ఎప్పుడు జరిగింది, ఎందుకు జరిగింది? ముందుగా ఆ కథ చెప్పు. చాలా కుతూహలంగా ఉంది. నరనారాయణులు మహాతపస్వులు. శాంతచిత్తులు. ప్రహ్లాదుడేమో అతి ధర్మాత్ముడు. విష్ణుభక్తుడు. మహాజ్ఞాని. వీరికి పరస్పరం శత్రుత్వం ఎలా ఏర్పడింది? క్రోధమే వైరకారణమైతే ఇక జపాలేమిటి? తపాలేమిటి? శ్రమ ఏవ హి కేవలమ్! అహంకార సముద్భవమైన క్రోధాన్ని వారే జయించలేకపోతే ఇక మాబోంట్లమాట చెప్పేదేమిటి! అహంకారబీజం లేనిదే క్రోధమూ లేదు, మాత్సర్యమూ లేదు. అహంకారం అంకురించిందంటే, కోటి సంవత్సరాలు చేసినా తపస్సులన్నీ నిష్ఫలం. సూర్యుడు ఉదయిస్తే చీకటి నిలవనట్టే, అహంకారం అంకురిస్తే పుణ్యం నిలవదు. అవునుకదా! అసలు నాకు తెలియక అడుగుతాను మహర్షీ! ఈ ముల్లోకాలలోనూ ఏకాలంలోనైనా అహంకారాన్ని జయించినవాడు ఒక్కడంటే ఒక్కడు మచ్చుకైనా ఉన్నాడంటావా? పోనీ భవిష్యత్తులో ఉంటాడంటావా ? ఇనుపసంకెళ్ళను తెంపుకోవచ్చు, కొయ్య గుదిబండలను వదిలించుకోవచ్చు, అహంకార బంధనాన్ని మాత్రం ఎవడూ విడిపించుకోలేడు.



ముచ్యతే లోహనిగడైర్బద్ధః కాష్ఠమయైస్తథా ।
అహంకారనిబద్ధస్తు న కదాచిద్విముచ్యతే ॥ (7 - 30)

స్థావరజంగమాత్మకమైన ఈ జగత్తు అంతా అహంకారావృతమే. బ్రహ్మజ్ఞానికూడా మలమూత్ర పరిదూషితమైన ఈ సంసారంలో పరిభ్రమిస్తున్నాడంటే అహంకారమే కారణం అంటున్న మీమాంసకుల సిద్ధాంతం నిజమే అనిపిస్తోంది. సత్తెకాలంనాటి (సత్యయుగం) మహాత్ములు ప్రహ్లాద నరనారయణులే అహంకార కామక్రోధాదులకు లొంగిపోయారంటే, ఈ కలికాలంలో నావంటి సామాన్యుల సంగతి వేరే చెప్పాలా. మహానుభావా!

మహాంతోఽపి సదా యుక్తాః కామక్రోధాదిభిర్మునే।
మాదృశానాం కలావస్మిన్ కా కథా మునిసత్తమ॥ ( 7 - 34)

జనమేజయా! కారణంకంటే కార్యం భిన్నమెలా అవుతుంది? ఉంగరమైనా కడియమైనా బంగారంతో చేసింది బంగారమేకదా? ఈ సృష్టి అహంకారోద్భవం. అందుచేత అహంకారభిన్నం కానేరదు. దారపు పోగులతో నేస్తే ఏర్పడుతున్న వస్త్రం, పోగులు తీసేస్తే ఉంటుందా? సత్త్వరజస్తమో రూపమైన మాయా గుణాలు మూడింటితో నిర్మింపబడినది ఈ స్థావరజంగమాత్మకమైన విశ్వం. అందుకని, బ్రహ్మమొదలుకొని తృణస్తంబ పర్యంతమూ (గడ్డిపోచ) ఎక్కడ వెదికినా ఇవే కనపడతాయి. త్రిమూర్తులకే దిక్కులేదు. వారూ అహంకారమోహితులే. వసిష్ఠ నారదాది మహాజ్ఞానులున్నారు. వారూ ఈ అగాధమైన సంసారంలో పడి పరిభ్రమిస్తూనే ఉన్నారు. సందేహమెందుకు, దేహధారిగా జన్మించి ఈ మాయాగుణాలకు అతీతంగా శాంతుడై ఆత్మానందంలో స్థిరపడినవాడు ఒక్కడంటే ఒక్కడు ఈ ముల్లోకాలలోనూ లేడంటే లేడు.

న కోఽప్యస్తి నృపశ్రేష్ఠ త్రిషు లోకేషు దేహభృత్ ।
ఏభిర్మాయాగుణైర్ముక్తః శాంత ఆత్మసుఖే స్థితః ॥ (7 - 40)

అహంకారం నుంచి ఆవిర్భవించే కామక్రోధాలూ లోభమోహాలూ శరీరం ఉన్నంతవరకూ మానవుణ్ణి వదిలిపెట్టవు. వేదశాస్త్రాలు అభ్యసిస్తున్నాడు, పురాణాలు అవలోకనం చేస్తున్నాడు. తీర్థయాత్రలకు వెడుతున్నాడు. దానాలూ ధ్యానాలూ నిర్వహిస్తున్నాడు. ఇదంతా విషయాసక్తుడై చేస్తున్నాడు. దొంగలాగా చేస్తున్నాడు. కృత త్రేతా ద్వాపరయుగాలనాటికే పరిస్థితి ఇలా ఉంది. ఇంక ధర్మం బద్ధలైపోయిన ఈ కలియుగంలో కథ ఏమని చెప్పమంటావ్? స్పర్థ ద్రోహం లోభం అమర్ష (ఈర్ష్య) ఇవ్వే సర్వదా సర్వత్రా రాజ్యమేలుతున్నాయి. నిజమే, ప్రపంచం ఇలాగే ఉంది. అయినా విచారించవలసిన పని లేదు. క్రోధ మద మాత్సర్యాలను జయించిన సాధుసజ్జనులు చెదురుమదురుగానైనా ఒకరో ఇద్దరో ఈ భూగోళం మీద లేకపోలేదు. ఉన్నారు. దృష్టాంతంకోసం ఉన్నారు.



ఏవం విధోఽస్తి సంసారో నాత్ర కార్యా విచారణా ।
సాధవో విరళా లోకే భవంతి గతమత్సరాః ॥
జితక్రోధా జితామర్షా దృష్టాంతార్థం వ్యవస్థితాః ॥ (7 - 45, 46)

వ్యాసమహర్షీ! నిజంగా ఉన్నారంటావా? ఉంటే ముమ్మాటికీ వారు ధన్యులు. ముల్లోకాలూ వారికి దాసోహమంటాయి. మా తండ్రిగారు చేసిన మహాపాతకం ఇప్పటికీ నా మనస్సును కాల్చివేస్తోంది. అహంకరించి మృతసర్పాన్ని ఒక తపస్వి మెడలో వేశాడు. ఎంత ఘోరం! ఎంత పాపం! ప్రతిక్రియ ఏమిటో తెలియడంలేదు. నిజంగా బుద్ధి సమ్మోహం ఎంతటి అకృత్యాన్నైనా చేయిస్తుంది. తేనెకోసం ఆశపడి చిటారుకొమ్మకి ఎగబాకుతాడే తప్ప పడిపోతానన్న సంగతి గుర్తించడు. మహాపాపాలు చేస్తాడు, నరకం ఒకటి ఉందని భయపడడు. సరే. ఇంతకీ నరనారాయణులకు ప్రహ్లాదుడితో యుద్ధం ఎందుకు సంభవించింది? ఈ ప్రశ్న నన్ను దొలిచేస్తోంది. ఎక్కడో పాతాళలోకంలో ఉండే ప్రహ్లాదుడూ, సారస్వత తీర్థంలో పవిత్ర బదరికాశ్రమంలో ముక్కుమూసుకుని తావళం తిప్పుకునే నరనారాయణలూ - పరస్పరం ఎలా తారసపడ్డారు? వీరి వైరానికి కారణమేమిటి? కాంతాకనకాలు గదా వైరతరువుకి విత్తనాలు! ముగ్గురూ ఈషణారహితులే (కోరికలు లేనివారు). ధర్మాత్ములే. జ్ఞానులే. వీరికి యుద్ధమేమిటి? చాలా వింతగా ఉంది. ఈ ఉత్కంఠను తట్టుకోలేను. వెంటనే తెరతొలగించు మహర్షీ!, ఛేదించు. ***(అధ్యాయం - 7, శ్లోకాలు- 55)***

వైరం భవతి విత్తార్థం దారార్థం వా పరస్పరమ్ ।
ఈషణారహితౌ కస్మాత్ చక్రతుః ప్రధనం మహత్ ॥ ( 7 - 54)

శౌనకాదిమహామునులారా! గమనించారుగదా, జనమేజయుడి మనస్సు పరమనిర్వేదంతో పరితపిస్తోంది. తన తండ్రి పరీక్షిత్తు చేసిన మహాపాపం, దానికి ఫలితంగా స్నానదానాదిరహితమై పొందిన దుర్మరణం - ఇవి అనుక్షణమూ అతడిని వేధిస్తున్నాయి. పున్నామనరకంనుంచి తప్పించడమెలాగా అని మనసు కలతపడుతోంది. అందరూ అహంకృతులే అనుకోవడంలో ఒక ఊరట లభిస్తోంది. అంతలో పరితపిస్తోంది. భయవిహ్వలుడు అవుతున్నాడు. ఆ చిత్త సంక్షోభం నుంచి విడుమరగా కోరికోరి పుణ్యకథాశ్రవణం చేస్తున్నాడు. వ్యాసుడూ అందుకే వినిపిస్తున్నాడు. అనంతర కథ ఎలా నడిచిందంటే -

## ◆ ప్రహ్లాద చ్యవన సంవాదం ◆

జనమేజయా! హిరణ్యకశిపుడి తదనంతరం పాతాళరాజ్యానికి ప్రహ్లాదుడు పట్టాభిషిక్తుడయ్యాడు. నరసింహస్వామి స్వయంగా జరిపించాడు. జనరంజకంగా పరిపాలన సాగిస్తున్నాడు. భూలోకంలోనూ పాతాళలోకంలోనూ ధర్మం నాలుగుపాదాల నడుస్తోంది. యజ్ఞయాగాది క్రతువులు నిరంతరంగా నిరాటంకంగా సాగుతున్నాయి. ప్రజలంతా భోగభాగ్యాలతో సుఖసంతోషాలతో విరాజిల్లుతున్నారు. ఇలా ఉండగా ఒకనాడు -



భృగుపుత్రుడైన చ్యవన మహర్షి నర్మదానదిలో స్నానానికి దిగాడు. స్నానంచేసి గట్టుకి వస్తూండగా ఒక భయంకర విషసర్పం అతడి కాళ్ళను నోట గరచుకొని పాతాళానికి లాక్కుపోయింది. భయభీతుడైన మునిసత్తముడు విష్ణుమూర్తిని మనసా స్మరించాడు. సర్పం నిర్విషమైపోయింది. నీటిలో మునిగి పాతాళానికి పోతున్నా, చ్యవనుడికి చీమకుట్టినట్టయినా లేదు. అక్కడికి వెళ్ళాక సర్పం మునీశ్వరుణ్ణి విడిచిపెట్టింది. చెక్కుచెదరలేదే అని ఆశ్చర్యపోయింది. ఇతడెవరో మహాతపస్విలాగా ఉన్నాడు, శపిస్తాడేమో అని భయపడి, తన భార్యలతో పిల్లలతో కలిసి సకలోపచారాలూ చేశాడు ఆ సర్పవీరుడు. చ్యవనుడు ప్రసన్నుడయ్యాడు. శపించలేదు సరికదా, కొత్తలోకం కొత్త వాతావరణం ఆనందిస్తూ పాతాళంలో సంచరించాడు.

ప్రహ్లాదుడు చూశాడు. ధర్మవత్సలుడుగదా, చ్యవనుడిని ఆహ్వానించి అర్ఘ్యపాద్యాలతో అర్చించాడు. గౌరవంగా సముచిత సింహాసనం మీద కూర్చోబెట్టాడు.

చ్యవనమహర్షీ ! ఇలా అడుగుతున్నానని మీరు ఏమీ అనుకోవద్దు. మా పాతాళానికి రావడంలో కారణమేమిటి? దేవేంద్రుడు పంపితే వచ్చారా? నిజం చెప్పండి. ఇంద్రుడికి మా దైత్యులంటే తగని ద్వేషంకదా ! మా రాజ్యం ఎలా ఉందో చూసి వెడదామని వచ్చారా?

ప్రహ్లాదా! ఇంద్రుడితో నాకు పనిఏమిటి? అతడికి దూతగా రావలసిన అవసరం ఏమిటి? నేను భృగుపుత్రుణ్ణి. స్వనేత్రుణ్ణి. ధర్మ తత్పరుణ్ణి. అనవసరంగా నన్ను శంకించకు. నర్మదా పుణ్యతీర్థంలో స్నానం చేస్తుంటే ఒక విషసర్పం పట్టుకొని ఇటు లాక్కువచ్చింది. విష్ణుమూర్తిని స్మరించాను. విషసర్పవిముక్తుణ్ణి అయ్యాను. అంతలోకే నీ దర్శనమయ్యింది. నువ్వు విష్ణుభక్తుడివి. నేనూ విష్ణుభక్తుడిని.

ప్రహ్లాదుడు సంతోషించాడు. భూలోకంలో ఉన్న తీర్థాలను గురించి తెలియజెప్పమని అభ్యర్థించాడు. చ్యవనుడు అన్నాడుగదా -

హిరణ్యకసిపునందనా! మనోవాక్కాయాలను శుద్ధిగా ఉంచుకున్నవారికి అడుగడుగునా తీర్థాలే. మలిన మనస్కులకు గంగానది సైతం పాపపంకిలమే. మనస్సు పాపరహితంగా పరిశుద్ధంగా ఉంటేనే ఏ తీర్థాలైనా పావనాలయ్యేది. గంగానదికి ఇరువైపులా పొడుగునా ఎన్నెన్నో గ్రామాలు ఉన్నాయి. నగరాలు ఉన్నాయి. అడవుల్లో గిరిజనావాసాలు ఉన్నాయి. ఇన్ని జాతులవారూ రోజూ ఆ గంగలోనే ముప్పొద్దులా మునుగుతున్నారు. బ్రహ్మానమానమైన ఆ పవిత్రజలాన్నే గ్రోలుతున్నారు. అయితేనేమి ఒక్కడంటే ఒక్కడు ముక్తిపొందాడా? విషయలంపటులు వెళ్ళి ఎంతటి పవిత్ర తీర్థంలో మునిగినా ఫలితం శూన్యం. అన్నింటికీ మనస్సే ముఖ్యం. దాన్ని శుద్ధి చేసుకుంటే అన్నీ శుద్ధి పొందుతాయి.



కారణం మన ఏవాత్ర నాన్యద్రాజన్విచింతయ ।
మనః శుద్ధిః ప్రకర్తవ్యా సతతం శుద్ధిమిచ్ఛతా ॥ ( 8 - 34)

అలాకాకుండా తీర్థయాత్రలకు వెళ్ళి అక్కడ ఆత్మవంచన - పరవంచనలు చేస్తే ఆ చుట్టుకునే పాపానికి అంతు ఉండదు. ఇంద్రవారుణం (పెదపాపరకాయ) పక్వమైనా ఇష్టంకానట్టే దుష్టస్వభావుడు దివ్యతీర్థంలో కోటిసార్లు మునిగినా పవిత్రుడు కాలేడు. అందుచేత అన్నింటికంటే ముందు మనశ్శుద్ధి ఉండాలి. అది ఉంటేనే ద్రవ్యశుద్ధి సిద్ధిస్తుంది. అటుపైని ఆచారశుద్ధి. ఇవన్నీ ఉన్నవాడికే తీర్థం తీర్థమవుతుంది. లేకపోతే అదొక రేవు మాత్రమే. అక్కడ ఏవేవి ఎంతెంత చేసినా "శుద్ధ దండుగ". నిజానికి వీటన్నింటికన్నా భూతదయ చాలా గొప్పది. అయినా నువ్వు తీర్థాలను గురించి అడిగావు కనక వాటినే చెబుతాను - విను. భూలోకంలో లెక్కలేనన్ని తీర్థాలున్నాయి. వాటికేంగానీ ఉత్తమోత్తమమైన తీర్థరాజం ఒక్కటే ఒక్కటి - నైమిశంలో చక్రతీర్థం. దాన్నే పుష్కరతీర్థమనికూడా అంటారు. మిగతా తీర్థాలు ఎంతకంతే!

జనమేజయా! చ్యవనుడు ఇలా చెప్పేసరికి ప్రహ్లాదుడు సంబరపడ్డాడు. తన రాజ్యంలోని దైత్యప్రముఖులనందరినీ సమాయత్తం చేసి వెంటనే నైమిశానికి బయలుదేరాడు. పుండరీకాక్షుణ్ణి పీతాంబరుణ్ణి దర్శిద్దాం. తరిద్దాం రండి, రండి అంటూ ప్రయాణమయ్యాడు. నైమిశం చేరుకున్నాడు. చక్రతీర్థంలో చిత్తశుద్ధిగా స్నానం చేశాడు. విమలోదకాలతో విరాజిల్లుతున్న పుణ్యనదీమతల్లి సరస్వతిని సందర్శించాడు. ముమ్మారు మునిగాడు. మనస్సు ప్రసన్నమయ్యింది. యథావిధిగా అనేకదానాలు నిర్వహించాడు. *( అధ్యాయం- 8, శ్లోకాలు- 47)*

## ◆ ప్రహ్లాద - నరనారాయణ యుద్ధం ◆

ఆ నదీతీరంలో తండ్రికి తీర్థవిధులను నిర్వర్తించడానికి అనువైన చోటుకోసం అన్వేషించాడు. సమీపంలో ఒక పెద్ద మర్రిచెట్టు కనిపించింది. అక్కడికి చేరుకున్నాడు. కార్యక్రమం ముగించాడు. విశ్రాంతి తీసుకుంటూ పరిశీలనగా చూసేసరికి అక్కడ కొన్ని బాణాలు కనిపించాయి. అవి విభిన్నజాతులవి. అన్నింటికీ గ్రద్దఈకలు ఉన్నాయి. (బాణాలవేగం పెరగడంకోసమని పక్షి ఈకలు కడతారు). పదునుతో తెల్లగా తళతళలాడుతున్నాయి. ప్రహ్లాదుడు ఆశ్చర్యపోయాడు. ఇవి ఎవరి బాణాలు చెప్మా అనుకున్నాడు. ఇది పరమపావనమైన తీర్థం. పరమశాంతమైన ఆశ్రమం. ఇక్కడ ఈ క్రొవ్వాడి నారాచాలు ఏమిటి?

సాలోచనగా నలువైపులూ పరికిస్తున్న ప్రహ్లాదుడికి ఇద్దరు సవయస్కులైన మునీశ్వరులు ధ్యానమగ్నులై కనిపించారు. కృష్ణాజినధరులు. జటాభార సమున్నతులు. నరనారాయణులు. వారిముందు రెండు ధనుస్సులు ఉన్నాయి. నరుడిముందు అజగవమూ, నారాయణుడిముందు శార్ఙ్గమూ. వాటితో పాటే అక్షయతూణీరాలు (ఎప్పుడూ బాణాలు తరిగిపోని అమ్ములపొదులు). వాటిని అలా ఉంచి ఇద్దరూ నిశ్చలంగా ధ్యానం చేసుకుంటున్నారు. ప్రహ్లాదుడు చూశాడు. ఇది ధర్మవిరుద్ధంగా కనిపించింది. క్రుద్ధుడయ్యాడు.



మునీశ్వరులారా! ఏమిటి ఈ దొంగజపం? ఈ ధనుర్బాణాలు ఏమిటి ? ఈ ధ్యానాలు ఏమిటి? ఎవరిని మోసం చేద్దామని? మహావీరులు కాదలుచుకుంటే ధనుర్బాణాలు చేపట్టండి. మహాతపస్వులు కాదలిస్తే తావళాలు తిప్పండి. అంతేకానీ రెండూ నడిపిస్తామంటే కుదరదు. అది ధర్మ విరుద్ధం. సృష్టిలో కనీవినీ ఎరగని వింత. కృతయుగంలోనైనా కూడని పని. ఈ కలియుగంలో అసలు కుదరదు. మీరు బ్రాహ్మణులు. తపస్సులు చెసుకోవాలే తప్ప ధనుస్సులు చేపట్టకూడదు. జటలను ధరించాలే తప్ప అంబులపొదులను ధరించకూడదు. అయినా మీ ఇష్టం. ఏదో ఒకటి త్వరగా తేల్చుకోండి. రెండూ అంటే మాత్రం ఊరుకోను. ధర్మహాని జరగడానికి వీలులేదు.

ధర్మంపట్ల ఆగ్రహంతో (పట్టుదలతో) ప్రహ్లాదుడు ఇలా షరతుపెట్టాడు. నరనారాయణులకు నచ్చలేదు. నరుడు కల్పించుకున్నాడు.

దైత్యేంద్రా! ఇందులో నీకు వచ్చిన బాధ ఏమిటి? సామర్థ్యం ఉన్నవాడు ఏది చేసినా (ఎన్నిచేసినా) చెల్లుతుంది. మూఢుడా! మేము తపస్సుకీ ధనుస్సుకీ సమర్థులం. ఏదైనా చేపట్టగలం. చేపట్టాం. నువ్వు ఏమి చెయ్యగలవు మమ్మల్ని ? నీ దారిన నువ్వు పో. మర్యాద దక్కించుకో. అంతేకానీ అనవసరంగా మాజోలికి రాకు. బ్రహ్మతేజస్సు నీకేం తెలుసు? ప్రాణాలతో బతికి బట్టకట్టాలి అనుకునేవాడెవడూ బ్రహ్మతేజస్వులతో పెట్టుకోడు. వెళ్ళు, వెళ్ళు. నీ పని నువ్వు చూసుకో.

నరుడి వీరాలాపాలు ప్రహ్లాదుడి కోపానికి మరింత ఆజ్యం పోశాయి. భగ్గుమన్నాడు. మందబుద్ధులారా! గర్వమోహితులై ప్రగల్భాలు పలుకుతున్నారు. నేను దైత్యేంద్రుణ్ణి. ధర్మసేతు ప్రవర్తకుణ్ణి. నేనిక్కడ ఉండగా ఈ ఆశ్రమంలో ఈ దివ్యతీర్థంలో ఇంతటి అధర్మం జరగడానికి వీలులేదు. జరగనివ్వను. సమర్థులం సమర్థులం అంటున్నావు, ఏమిటి మీ సామర్థ్యం? ఏదీ చూపించండి మీ యుద్ధశక్తిని, ఒకసారి చూస్తాను.

ప్రహ్లాదా! అంతగా చూడాలని ఉంటే నువ్వే దిగు యుద్ధానికి. రాక్షసాధమా! ఇప్పుడే నీ బుర్ర పగలకొడతాను. క్షణం చాలు.

> యుధ్యస్వాద్య మయా సార్థం యది తే మతిరీదృశీ ।
> అద్య తే స్ఫోటయిష్యామి మూర్ధాన మసురాధమ ॥ (9 - 18)

ప్రహ్లాదుడు కోపావేశంతో ధనుష్టంకారం చేశాడు. దశదిశలూ దద్దరిల్లాయి. నరుడు ధనుస్సు ఎక్కుపెట్టి శరవర్షం కురిపించాడు. బంగారపు ములాం చేసిన తన బాణాలతో వాటిని అన్నింటినీ మధ్యలోనే ఖండించాడు దైత్యేంద్రుడు. ఇది అవమానంగా భావించిన నరుడు మరిన్ని బాణాలు వేశాడు.



వాటిగతీ అంతే అయ్యింది. ప్రహ్లాదుడు గురిచూసి నరుడి గుండెలపైకి బాణం వేశాడు. తట్టుకుని నిలబడ్డ నరుడు ప్రహ్లాదుడి బాహువులకు గురిపెట్టాడు. ద్వంద్వయుద్ధం తీవ్రస్థాయికి చేరుకుంది. ఇంద్రాదిదేవతలూ మహర్షులూ ఆకాశంలో నిలబడి వింత చూస్తున్నారు.

వర్షపాతంలా ప్రహ్లాదుడు బాణాలను కురిపిస్తూంటే తట్టుకోలేకపోతున్న నరుడికి బాసటగా నారాయణుడు విల్లు ఎక్కుపెట్టాడు. కుండపోత కురిపించాడు. ధనుర్విద్యాకౌశలంలో ఎవరికీ ఎవరూ తీసిపోవడం లేదు. దేవతలు సంతోషించి ముగ్గురిమీదా పుష్పవృష్టి కురిపించారు.

కాసేపటికి ఆకాశమంతటా బాణాలు ఆవరించాయి. సూర్యచంద్రులు కనుమరుగయ్యారు. పగలూ రాత్రీ తేడా తెలియడం లేదు. మెరుపుల్లాంటి బాణాల కాంతులు తప్ప అంతా కారుచీకటి.

**ఉభయోః శరవర్షేణ చ్ఛాదితే గగనే తదా ।**
**దివాపి రాత్రిసదృశం బభూవ తిమిరం మహత్ ॥ ( 9 - 32)**

ఆకాశం నుంచి తిలకిస్తున్న నారదపర్వతమహర్షులు ఒక వైపు దిగులుపడుతూనే ఒకవైపు వీరత్వానికి మురిసిపోతున్నారు. ఇటువంటి యుద్ధాన్ని కనీవినీ ఎరుగమని చరిత్రపుటలు తిరగవేస్తున్నారు. తారకాసురయుద్ధం వృత్రాసురయుద్ధం మధుకైటభయుద్ధం - ఇవి చరిత్రలో ఇప్పటికి మహాయుద్ధాలు. వాటిని మించిపోయింది ఈ సంగ్రామం. ఎందుకంటే ప్రహ్లాదుడు నారాయణుడికి సాటివచ్చే ప్రబలశూరుడు. సమయుద్ధం సాగుతోంది - అని చర్చించుకుంటున్నారు.

నారాయణుడు నేర్పుగా బాణంవేసి ప్రహ్లాదుడి ధనుస్సును ఛేదించాడు. అతడు మరొక విల్లును స్వీకరించాడు. దానినీ ఖండించి తన లాఘవం చూపించాడు నారాయణుడు. ఇలా చాలా ధనుస్సులు భగ్నమయ్యాయి. ప్రహ్లాదుడికి వొళ్ళు మండింది. పరిఘ అనే ఆయుధాన్ని విసిరాడు. అది సరాసరి వెళ్ళి గుండెలను తాకబోతోంది. తొమ్మిది బలమైన బాణాలను ఒకేసారి వేసి దాన్ని తుత్తునియలు చేసి పరిహసించాడు నారాయణుడు. రెప్పపాటు సమయమన్నా ఇవ్వకుండా మరో పది బాణాలను సంధించి ప్రహ్లాదుడి శరీరానికి తూట్లు పొడిచాడు. ఈసారి ప్రహ్లాదుడు దృఢమైన ఇనప గదను విసిరాడు. అది ఊహకందనంత వేగంగా వచ్చి నారాయణుడి తొడలను ఢీకొంది. అయినా అతడు చలించలేదు. ప్రహ్లాదుడికి ఇది అవమాన మనిపించింది. వెంటనే శక్తి ఆయుధం ప్రయోగించాడు. నారాయణుడు దాన్ని లీలగా ఒకేఒక్క బాణంతో ఏడుముక్కలు చేసి, ఏడింటినీ ఏడు బాణాలతో పధ్నాలుగు ముక్కలు చేశాడు.

జనమేజయా! ఇలా నరనారాయణులతో సమఉజ్జీగా నిలబడి ప్రహ్లాదుడు నూరేళ్ళు (దివ్య వర్షశతం) యుద్ధం చేశాడు. ఎవరికీ ఎవరూ తీసిపోలేదు. అలుపూ సొలుపూ లేదు. భీషణ సంగ్రామం సాగుతోంది. ఇరుపక్షాలవారికీ ఆశ్చర్యంగానే ఉంది.



శ్రీమహావిష్ణువు ప్రహ్లాదుడి ముందు ప్రత్యక్షమయ్యాడు. చతుర్భుజుడు. రమాకాంతుడు. చక్రధారి. హిరణ్యకశిపునందనుడు పరమానందం పొందాడు. పాదాభివందనం చేశాడు. మనసులో మాట అడిగాడు. వేలయుద్ధాలు చేశాను. ఇంతకాలంపాటు జయలక్ష్మి వరించకపోవడం ఎన్నడూ లేదు. ఈ ఇద్దరినీ నేనెందుకు జయించలేకపోతున్నాను? సందేహం తీర్చమని అడిగాడు.

నాయనా, ప్రహ్లాదా! వీరిద్దరూ నా అంశతో జన్మించిన మహర్షులు. జితేంద్రియులు. నరనారాయణులు. అందుచేత అపజయం అనుకోక, నీ రాజ్యానికి నువ్వు వెళ్ళు. ఇక ఎప్పుడూ వీరితోగానీ వీరివంటి తాపసులతోగానీ విరోధం పెట్టుకోకు. కలహించకు- అని విష్ణుమూర్తి చెప్పడమేమిటి, ప్రహ్లాదుడు రణరంగం విడిచిపెట్టి తనవారందరితోనూ కలిసి పాతాళానికి వెళ్ళిపోయాడు. నరనారాయణులు మళ్ళీ తమ తపస్సులు తాము కొనసాగించారు. ***(అధ్యాయం - 9, శ్లోకాలు - 56)***

శౌనకాది మహర్షులారా! వ్యాసుడు చెప్పగా ఈ కథవిన్న జనమేజయుడికి మౌలికంగా ఒక ధర్మ సందేహం వచ్చింది. సవినయంగా అడిగాడు.

వ్యాసమహర్షీ! నరనారాయణులు శాంతస్వభావులు. వైష్ణవాంశ సంభూతులు. తపోధనులు. చక్రతీర్థంలో నివసిస్తున్నవారు. సత్త్వగుణ సంపన్నులు. కందమూల ఫలాలే ఆహారంగా జీవిక సాగిస్తున్న వారు. ధర్మపుత్రులు. సత్యసంధులు. ఇన్ని ఉత్తమగుణాలూ ఉండి వీరు యుద్ధానికి ఎలా దిగారు? క్రోధ వివశులు ఎలా కాగలిగారు? పోనీ తాత్కాలికంగా ఆవేశపడ్డారేమో అనుకుందామంటే నూరేళ్ళు, అదీ దివ్య వర్షశతం అంటే వెయ్యేళ్ళకు పైగా యుద్ధం చేశారు. చాలా ఆశ్చర్యంగా ఉంది. అటు ప్రహ్లాదుడూ అంతే. విష్ణుభక్తుడు. మహాజ్ఞాని. జన్మతః దైత్యుడైనా స్వభావతః దేవత. తీర్థయాత్రకని వచ్చి యుద్ధయాత్రకు దిగాడు. శాంతి సుఖాలను పణంగా పెట్టాడు. మహర్షీ! నాకేమీ అర్థం కావడంలేదు. ఈ వైరుధ్యం ఎక్కడ ఉందో తెలియడం లేదు. కామినీ కనకం కార్యం కారణం విగ్రహస్య వై అన్నారు. వీరికో ఈ యుద్ధబుద్ధి ఎలా కలిగింది? నరనారాయణులు తపస్సు చేసేది ఎందుకోసం? మోహం కోసమా, సుఖభోగాలకోసమా, స్వర్గం కోసమా? శాంతచిత్తులై అంతటి తపస్సుచేసి వీళ్ళు పొందిన ఫలం ఏమిటి? తపోనియమాలతోనూ పునఃపునః సంగ్రామాలతోనూ శరీరాలను కృశింపజేసుకోవడమా? రాజ్యకాంక్ష అందామా, అది లేదు. ధనకాంక్ష లేదు. దారేషణ లేదు. గృహేషణ లేదు. అన్నీ పుష్కలంగా ఉన్న ప్రహ్లాదుడు మరింక దేనికోసం వారితో తలపడినట్టు? బుద్ధిమంతుడెవడైనా నిరీహుడై సుఖపడాలనుకుంటాడు. వీళ్ళేమిటి - నిరీహులై ఉండీ కష్టాలూ దుఃఖాలూ కొనితెచ్చుకున్నారు? సర్వజ్ఞులు చెయ్యవలసిన పనేనా ఇది? మూర్ఖులు తప్ప యుద్ధాన్ని ఎవరైనా కోరుకుంటారా?



సుబుద్ధిః సుఖదానీహ కర్మాణి కురుతే సదా ।
న దుఃఖదాని ధర్మజ్ఞ స్థితిరేషా సనాతనీ ॥ (10 - 12)

నాకు తెలిసినంతవరకూ యయాతి ఒకడు ఇలాగే అహంకరించి కష్టాలు కొనితెచ్చుకున్నాడు. యజ్ఞయాగాలూ దానధర్మాలూ అమితంగా చేసి సంపాదించుకున్న స్వర్గాన్ని చేజేతులా జారవిడుచుకున్నాడు. శబ్దోచ్చారణ మాత్రంచేత స్వర్గం నుంచి పతనమైపోయాడు. ఎదుగుదలతోపాటు ఒదుగుదల ఉండాలికదా! మరి వీరికి ఇంతలేసి అహంకారాలు ఎలా వచ్చాయి? తత్త్వం తెలిసినవాడవు నువ్వు. దయచేసి వివరించు.

జనమేజయా! ఇంతకు ముందే చెప్పాను. అది నీ మనస్సుకి పట్టినట్టులేదు. పోనీలే. మళ్ళీ చెబుతున్నాను. శ్రద్ధగా ఆలకించు. ఈ సృష్టికి మూలహేతువే అహంకారం. అది త్రిగుణాత్మకంగా ఉంటుంది. కారణం లేనిదే కార్యం లేదు. కారణగుణాలు కార్యానికి సంక్రమిస్తాయి. అందుచేత ఈ సృష్టిలో భాగమైన దేహధారికి - ఎంతటివాడికైనా అహంకారం తప్పదు. మహర్షులంటావేమిటి, త్రిమూర్తులకే ఇది తప్పదు.

అయితే, సాత్త్వికాహంకారంవల్ల తపస్సూ దానమూ ధర్మమూ యజ్ఞమూ యాగమూ - ఇటువంటివి సంభవిస్తాయి. రాజసాహంకారం వల్ల కూడా ఇవే ప్రభవిస్తాయి. ఫలితాలలో తేడా ఉంటుంది. దానికేమి, అది అలా ఉండనీ. తామసాహంకారంవల్ల కలహాలూ కయ్యాలూ ఆవిర్భవిస్తాయి. ఇంతకీ నువ్వు తెలుసుకోవలసింది ఏమిటంటే - ఏదోఒక అహంకారం లేకుండా ఏపనీ జరగదు. అది శుభమైనా అశుభమైనా అహంకారజన్యమే.

క్రియా స్వల్పాపి రాజేంద్ర నాహంకారం వినా క్వచిత్ ।
శుభా వాప్యశుభా వాపి ప్రభవత్యపి నిశ్చయః ॥ (10 - 21)

అహంకారాన్ని మించిన బంధకారణం మరొకటి లేదు ఈ సృష్టిలో. అది కారణంగా ఏర్పడిన విశ్వంలో అదిలేనిచోటు ఎక్కడ ఉంటుంది, ఎలా ఉంటుంది? దేవమానవ తిర్యగ్జాతులన్నింటి పుట్టుకా అహంకారంతోనే. మళ్ళీ పుట్టడం, మళ్ళీ గిట్టడం - ఇదొక కర్మబంధం. రథచక్రంలా తిరుగుతూ ఉంటుంది. విష్ణుమూర్తి ఎన్ని జన్మలు ఎత్తాడో ఏఏ జన్మలు ఎత్తేడో ఎవడైనా లెక్కపెట్టి చెప్పగలడా? వాటిలో జాతిరీత్యా ఏవి ఉత్తమాలో ఏవి నీచాలో గ్రహించగలమా? చేపజన్మ ఎత్తేడు. తాబేలు అయ్యాడు. పందిగా జన్మించాడు. నరసింహుడుగా అవస్థపడ్డాడు. వామనుడై చెయ్యి సాచాడు. యుగయుగాలుగా జగన్నాథుడి దురవస్థ ఇది. కర్మబంధంలో ఇరుక్కొని, భృగుమహర్షి శాపంవల్ల ఈ ఏడవ మన్వంతరంలో విష్ణుమూర్తి ఎత్తిన అవతారాలు అసంఖ్యాకం.

పరాశరాత్మజా! భృగుమహర్షి శపించడమేమిటి? విష్ణుమూర్తి ఏమి అపరాధం చేశాడు? భృగువుకి కోపం ఎందుకు వచ్చింది? ఏమని శపించాడు? ఇది చాలా విడ్డూరంగా ఉంది. తెలియజెప్పవా?



## ◆ శుక్రాచార్యుడి తపస్సు ◆

జనమేజయా! హిరణ్యకశిపుడు దేవలతో వైరంపెట్టుకుని వేలసంవత్సరాలు యుద్ధం చేసి కట్టకడపటికి ఓడిపోయాడు. అతనికొడుకు ప్రహ్లాదుడు అదే వైరాన్ని కొనసాగించి యుద్ధాలు చేశాడు. ఇంద్రుడిచేతిలో పరాజితుడై విరోచనసుతుడైన బలికి సింహాసనం అప్పగించి తాను తపస్సులకు వెళ్ళిపోయాడు. బలిచక్రవర్తికూడా తాతతండ్రుల మార్గంలోనే ప్రయాణించి దేవతలతో తలపడ్డాడు. విష్ణుమూర్తి సహాయకుడుగా ఇంద్రుడు జయకేతనం ఎగుర వేశాడు. హతశేషులైన దైత్యులు బ్రతుకుజీవుడా అని పారిపోయి భృగుపుత్రుడైన శుక్రాచార్యుణ్ణి శరణువేడారు. నువ్వు సహాయం చెయ్యకపోతే పాతాళానికి పారిపోవడం తప్ప మాకు గత్యంతరం లేదని ప్రాధేయపడ్డారు. శుక్రుడు అభయం ఇచ్చాడు. నా తపశ్శక్తితో నా మంత్రశక్తితో (బుద్ధిబలం) నా వైద్యవిద్యతో మీకు సహాయం చేస్తాను, భయపడకండి అన్నాడు. ఓషధీవైద్యం చేశాడు. అందరి గాయాలూ నయం అయ్యాయి. దైత్యులు స్థిమితపడ్డారు.

చారులవల్ల ఈ వార్త దేవతలకు తెలిసింది. నాయకులు అందరూ కలిసి చర్చించారు. భృగువంశసంభవుడైన శుక్రాచార్యుడు మంత్రాంగం పన్నకముందే మనం హఠాత్తుగా దాడిచేసి దైత్యులను సంహరిద్దామని నిర్ణయించుకున్నారు. ఇంద్రుడి నాయకత్వంలో బయలుదేరి వెళ్ళి మెరుపుదాడి చేశారు. రాక్షసులను ఊచకోత కోశారు. కకావికలై పరుగులు తీసినవారుతియ్యగా మిగిలినవారు శుక్రుడి కాళ్ళమీద పడ్డారు. రక్షించు మహాప్రభో - అన్నారు. భయపడకండి, నేను ఉన్నానుగా అంటూ అతడు వారిని ఓదార్చాడు. శుక్రాచార్యుణ్ణి చూసిన దేవతలు ఇక అక్కడికి ఊచకోత ఆపి స్వర్గలోకానికి తిరుగుముఖం పట్టారు. ***(అధ్యాయం - 10, శ్లోకాలు - 50)***

దేవతలు వెళ్ళిపోయాక, అటూ ఇటూ బెదిరి పారిపోయిన రాక్షసులనందరినీ ఆహ్వానించి భృగుపుత్రుడు శుక్రాచార్యుడు ఓదార్చాడు. ధైర్యవచనాలు పలికాడు. పూర్వం ఒకప్పుడు బ్రహ్మదేవుడు చెప్పిన సంగతి ఇప్పుడు మీకు తెలియజేస్తాను, వినండి అంటూ మొదలుపెట్టాడు.

విష్ణుమూర్తి రాక్షససంహారానికి కంకణం కట్టుకున్నాడు. వరాహరూపం ధరించి హిరణ్యాక్షుడినీ, నరసింహావతారం ధరించి హిరణ్యకశిపుడినీ సంహరించాడు. ఇంకా ఇలాగే క్రమక్రమంగా సర్వరాక్షససంహారం చేస్తాడు. ఇది అలనాడు బ్రహ్మదేవుడు నాకు చెప్పిన సంగతి. అయినా భయపడకండి. విష్ణుమూర్తిని జయించడానికి అనువైన ఉపాయం ఏదీ ప్రస్తుతం నాకు స్ఫురించడం లేదు. అందుకని శంకరుడి దగ్గరికి సలహాకోసం వెళ్ళి వస్తాను. నేను వచ్చేదాకా మీరంతా ఇక్కడే ఉండండి. త్వరలోనే వస్తాను.



శుక్రుడు కూడా వెళ్ళిపోతే మరీ ఒంటరివాళ్ళం అయిపోతాం ఎలాగా అని రాక్షసులు కంగారు పడ్డారు. ఆచార్యా! నువ్వు వచ్చేలోగా మా ఈ కొద్దిమందినీ దేవతలు మట్టుపెట్టేస్తారేమో! మహావీరులంతా ఇప్పటికే అయిపోయారు. విత్తనాల్లాగా మేము ఈ కొద్దిమందిమీ బతికి ఉన్నాం. ఎలాగ? అని దైత్యులు దీనంగా పలికారు.

దైత్యులారా! తప్పదు. నేను వెళ్ళి శంకరుడినుంచి మంత్ర విద్యను తెచ్చి మీకు ఉపదేశించేవరకూ. మీరంతా ఎక్కడో ఒకచోట, ఎలాగో ఒకలాగ తలదాచుకోండి. శమదమాదులు అలవరచుకుని తపస్సులు చెయ్యండి. మీజోలికి ఎవరూ రారు. సామదానాలు ఉపయోగించండి. సమయోచితంగా ప్రవర్తించండి. దేశకాలాలూ బలపౌరుషాలూ చూసుకోవాలిగదా! అవసరమైతే శత్రువులకు ఊడిగం చెయ్యాలి. శక్తి సమకూరాక సంహరించాలి. ఇది శుభప్రదమైన రాజనీతి.

సేవాథ సమయే కార్యా శత్రూణాం శుభకామ్యయా ।
స్వశక్త్యుపచయే కాలే హంతవ్యాస్తే మనీషిభిః ॥ (11 - 11)

అందుకని ప్రస్తుతానికి వినయగుణం నటిస్తూ సామోపాయంతో కాలం గడపండి. నేను వచ్చేవరకూ గుమ్మం కదలి వెళ్ళకండి. శివుణ్ణి మెప్పించి మహామంత్రాలు తెస్తాను. అప్పుడు చూపిద్దాం మన తడాఖా అనిచెప్పి దైత్యుల్ని ఒడబరిచి కావ్యుడు (శుక్రుడు) బయలుదేరాడు.

దానవులంతా కలిసి ప్రహ్లాదుణ్ణి - ఉభయులకూ విశ్వసనీయుడుకదా అని - దేవతల దగ్గరికి రాయబారం పంపారు. ఆయుధాలు విడిచిపెట్టేశాం. వల్కలాలు ధరించాం. కందమూలాలు తింటూ ముక్కుమూసుకుని తపస్సు చేసుకుంటున్నాం. కాబట్టి ఇక మా జోలికి రాకండి అని దైత్యుల సందేశాన్ని ప్రహ్లాదుడు వినిపించాడు. దేవతలు విశ్వసించారు. తామూ విసిగిపోయారేమో, యుద్ధ సన్నాహాలు విడిచిపెట్టి హాయిగా నిశ్చింతగా క్రీడాపరాయణులు అయ్యారు. దైత్యులు దంభతాపసులై కశ్యపప్రజాపతి ఆశ్రమంలో తలదాచుకుంటూ శుక్రాచార్యుడి రాకకోసం ప్రతీక్షిస్తున్నారు.

భృగుసంభవుడు శుక్రాచార్యుడు కైలాసానికి వెళ్ళి మహాదేవుడికి నమస్కరించాడు. బృహస్పతి దగ్గర లేని దివ్యమంత్రాలు నాకు కావాలి. దేవతలను ఓడించాలి. రాక్షసులను గెలిపించాలి. అలాంటి మహత్తరమైన మంత్రాలను ఉపదేశించు అని అభ్యర్థించాడు.

మంత్రానిచ్ఛామ్యహం దేవ యే న సంతి బృహస్పతౌ ।
పరాజయాయ దేవానా మసురాణాం జయాయ చ ॥ (11 - 22)



మహాదేవుడు సర్వజ్ఞుడు. శంకరుడు. ఆలోచించాడు. దేవతలకు ద్రోహం తలపెట్టి ఈ శుక్రాచార్యుడు ఇలా వచ్చాడు. ఇతడు రాక్షసులకు గురువు. వారి విజయం కోరుకుంటున్నాడు. సహజం. మరి నా కర్తవ్యం ఏమిటి? నేనూ నా దేవతలను రక్షించుకోవాలి. (రక్షణీయా మయా దేవా ఇతి సంచింత్య శంకరః) అని ఆలోచించి శుక్రుడితో ఇలా అన్నాడు.

కావ్యా! (శుక్రాచార్యా!) నీ కోరిక నెరవేరాలంటే ఒక దుష్కరమైన వ్రతం ఉంది. దుష్కరంలోనూ అతి దుష్కరం. అయినా చెబుతాను. చెయ్యగలిగితే చూడు. కిందనుంచి పొగపెట్టుకుని, తలకిందులుగా వేలాడుతూ ఆ పొగనే పీలుస్తూ పూర్తిగా వెయ్యేళ్ళపాటు తపస్సు చెయ్యాలి. చేస్తే నువ్వు కోరుకున్న మంత్రాలు అన్నీ లభిస్తాయి. ప్రయత్నించు. నీకు శుభమగుగాక!

పూర్ణం వర్షసహస్రం తు కణధూమమవాక్ఛిరాః ।
యది పాశ్యసి భద్రం తే తతో మంత్రానవాప్స్యసి ॥ (11 - 26)

శుక్రాచార్యుడు సరే అన్నాడు. మరోసారి నమస్కరించి సెలవు తీసుకున్నాడు. ఎక్కడో అడవిలో అనువైనచోటు చూసుకుని తపస్సు ప్రారంభించాడు. తల్లకిందుల తపస్సు. ధూమపాన తపస్సు.

## ◆ విష్ణుమూర్తికి భృగుశాపం ◆

ఈ సంగతి దేవతలకు తెలిసింది. అన్నన్నా! మోసం చేద్దామనుకున్నారా రాక్షసులు- అంటూ మండి పడ్డారు. సర్వసన్నద్ధులై విరుచుకుపడ్డారు. ఈ హఠాత్పరిణామానికి విస్తుపోయిన రాక్షసులు బతిమాలుకున్నారు.

దేవతలారా! ఇది మీకు భావ్యం కాదు. ధర్మమూ కాదు. మేము నిరాయుధులం. తపోవృత్తితో బతుకుతున్నాం. మీకు భయపడి ఈ ఆశ్రమంలో తలదాచుకున్నాం. ఇలాంటి మమ్మల్ని సంహరించడం పాడి కాదు. నిరాయుధుణ్ణీ, శరణన్నవాడినీ, భయభీతుడినీ, ఆచార్యుణ్ణీ, వ్రతాచరణలో ఉన్నవాడినీ చంపకూడదనికదా ధర్మశాస్త్రం. మీరే దాన్ని ఉల్లంఘిస్తే ఎలా?

దొంగసన్యాసుల్లారా ! మాకు, మీరు, ధర్మపన్నాలు చెబుతున్నారా? మీ గురుణ్ణి పంపించారుగా తపస్సుకి. వస్తాడు, దివ్యమంత్రాలు తెస్తాడు. మా మీద ప్రయోగిద్దురుగాని - అని ఎకసక్కెమాడుతూ దేవతలు భీకరమారణాయుధాలతో విజృంభించారు. రాక్షసులు పలాయనం చిత్తగించారు. వెళ్ళి వెళ్ళి శుక్రాచార్యుడి తల్లిని (భృగుమహర్షి భార్య) శరణు వేడారు. ఆవిడ అభయం ఇచ్చింది. భయపడకండి, భయపడకండి, నా సన్నిధిలో అసలు భయపడకండి - అంది. రాక్షసులు హమ్మయ్య అనుకున్నారు.



తరుముతూ వెన్నంటి వచ్చిన దేవతలు, అయ్యో, ఆశ్రమం అనైనా చూడకుండా చొరవగా ప్రవేశించి, కావ్యమాత భృగుపత్ని వారిస్తున్నా వినకుండా, రాక్షసులను చాలామందిని పట్టుకుని పొడిచి చంపారు. ఈ దారుణాన్ని ఎలా వారించడమా అని క్షణం ఆలోచించిన భృగుపత్ని తన తపశ్శక్తితో ఇంద్రుడితో సహా ఆ దేవతలనందరినీ నిద్రావివశుల్ని చేసింది. క్షణంలో అందరూ చేష్టలుడిగి నిద్రపోయారు.

ఇంద్రుడు కూడా దీనుడై నిద్రాధీనుడు కాబోతున్న తరుణంలో విష్ణుమూర్తి వచ్చి అతడిని తనలో ప్రవేశింపజేసుకుని రక్షించాడు. ఇది చూసి భృగుపత్నికి కోపం వచ్చింది. చూడండి నా తపశ్శక్తి అంటూ ఇద్దరినీ కలిపి నిద్రావశుల్ని చేసింది. ఇద్దరూ స్తబ్ధులయ్యారు. ఆకాశంలో నిలబడి అన్నీ చూస్తున్న మిగతా సకల దేవతలూ హాహాకారాలు చేశారు.

మహావిష్ణూ! ఏమిటి ఆలోచన? ఎందుకు ఇంకా ఆలస్యం? స్త్రీ అని శంకించకు. ఈ దురహంకారిణిని వెంటనే సంహరించు. లేదంటే మనలనే (భక్షిస్తుంది) సంహరిస్తుంది - అని దేవేంద్రుడు ప్రేరేపించాడు. విష్ణుమూర్తి చక్రాయుధాన్ని స్మరించాడు. ప్రయోగించాడు. భృగుపత్ని శిరస్సు తెగిపడింది. దేవతలు జయజయధ్వానాలు చేశారు. అందరూ నిద్రనుంచి విముక్తులయ్యారు. ఇంద్రావిష్ణువులకు సంబరంగానే ఉందికానీ, భృగుమహర్షి వచ్చి శపిస్తాడనే శంకకూడా మనస్సుని పట్టిపీడిస్తూనే ఉంది.

***(అధ్యాయం - 11, శ్లోకాలు - 57)***

భార్య మరణించిన వార్త భృగువుకి తెలిసింది. వలవలా ఏడ్చాడు. సత్త్వగుణ సంపన్నుడైన విష్ణుమూర్తి ఇంతటి తామసం, ఇంతటి అకృత్యం ఎలా చెయ్యగలిగాడా అని ఆశ్చర్యపోయాడు. స్త్రీ అని చూడకుండా, బ్రాహ్మణ వంశంలో పుట్టింది అని గమనించకుండా, నిరపరాధిని అని గ్రహించకుండా నా భార్యను సంహరించాడు కనక, నన్ను విధురుణ్ణి చేశాడు కనక విష్ణుమూర్తిని శపించాల్సిందే అనుకున్నాడు. ప్రేరేపణ ఇంద్రుడిదే అయినా పాపం చేసినవాడు విష్ణువే కనక అతడినే శపించాలి అని నిర్ణయించుకున్నాడు.

మధుసూదనా! నువ్వు మోసగాడివి. నిన్ను సాత్త్వికుడు అనుకుంటున్న వాళ్ళంతా వట్టి మూర్ఖులు. నీ తమోగుణం నాకు ప్రత్యక్షంగా తెలిసివచ్చింది. నా ఇల్లాలిని అకారణంగా సంహరించి నాకు గుండెలలో చిచ్చు రగిల్చావు కనక, నువ్వు మర్త్యలోకంలో పదే పదే జన్మిస్తూ, గర్భవాస దుఃఖాన్ని అనుభవింతువుగాక! - అని శపించాడు.

జనమేజయా! భృగువు ఇచ్చిన శాపం కారణంగా విష్ణుమూర్తి అనేకావతారాలు ఎత్తవలసి వచ్చింది. భూలోకంలో ధర్మగ్లాని సంభవించినప్పుడల్లా హరి అవతరించి అధర్మాన్ని తొలగించి ధర్మాన్ని పునఃప్రతిష్ఠితం చేస్తుంటాడు. దానికేమి, అది అలా ఉండనీ. జనమేజయా! ఇక్కడొక అత్యద్భుతమైన సన్నివేశం జరిగింది. విను.



భృగుమహర్షి విష్ణుమూర్తిని అలా శపించి తన భార్య శిరస్సును త్వరగా తెచ్చి మొండేనికి అతికించాడు. దేవీ! విష్ణువు నిన్ను సంహరిస్తే నేను బతికించుకుంటాను. ఇది నా ప్రతిజ్ఞ. నేను ధర్మం తప్పనివాడిని అయితే శీలసంపన్నుడనైతే ఆడితప్పనివాడినైతే నా భార్య జీవించుగాక! నా తేజశ్శక్తిని దేవతలంతా గ్రహింతురుగాక! - అంటూ శీతలోదకాలను చిలకరించాడు. మరుక్షణంలో ఆ తపస్విని లేచికూచుంది. నిద్రనించి లేచినట్టు చిరునవ్వులతో నిలబడింది. సృష్టి అంతా సంతోషించింది. సాధుసాధు నినాదాలతో దంపతులను అభినందించింది. భార్యపట్ల భృగుమహర్షికున్న ప్రేమకూ తపశ్శక్తికీ అందరూ ఆనందాశ్చర్యాలను ప్రకటించారు.

## ◆ శుక్రాచార్య తపోభంగానికి ఇంద్రుడి ఎత్తుగడ ◆

దేవతలూ విస్మయం చెందారు. ఇంద్రుడికైతే మరింత భయం పట్టుకుంది. కావ్యుడి తపస్సు ముగింపుకి వచ్చింది. మంత్రం సిద్ధిస్తుంది. దానితో ఏమి చేస్తాడో. తండ్రిని మించిన శక్తిశాలి అవుతాడు. ఎలాగబ్బా అని తలపట్టుకు కూర్చున్నాడు. విరుగుడు ఏమిటో, ఏమి చేస్తాడో తెలుసుకునే దారి ఏమిటో ఎంతకీ తోచలేదు. పాత ఉపాయమే కొత్త మనిషితో ప్రయోగిద్దాం అనుకున్నాడు. సొంతకూతురు జయంతిని (జయంతుడి సోదరి) పిలిచాడు. ముఖానికి నవ్వు పులుముకున్నాడు.

జయంతీ! నిన్ను నేను శుక్రాచార్యుడికి కన్యాదానం చేశాను. అతడిప్పుడు తీవ్రతపస్సులో ఉన్నాడు. నువ్వు వెళ్ళి పరిచర్యలు చెయ్యి. అతణ్ణి భర్తగా స్వీకరించు. ఆరాధించు. మనస్సు దోచుకో. నీకు వివశుణ్ని చేసుకో. ఇది నేను స్వప్రయోజనంకోసం చేస్తున్నపని. అందుచేత కాదనకుండా అంగీకరించి నా భయం తొలగించు.

తండ్రి ఆంతర్యాన్ని గ్రహించిన జయంతి సరే అని అంగీకరించింది. సరాసరి శుక్రాచార్యుడి సన్నిధికి వచ్చింది. పొగలో తలకిందులుగా వేలాడుతూ తపస్సు చేస్తున్నాడు. పొగజూరిపోయాడు. చెమటలు కక్కుతున్నాడు. అరటి ఆకులతో వింజామరలు వీచింది. శుభ్రమైన శీతలోదకాలను తెచ్చి త్రాగడానికి అందించింది. ఎండసోకకుండా పైటచెరగు అడ్డం పట్టింది.

ఛాయాం వస్త్రాతపత్రేణ భాస్కరే మధ్యగే సతి ।
రచయామాస తన్వంగీ స్వయం ధర్మే స్థితా సతీ ॥ (12 - 26)

మధుర ఫలాలను ఎంచి ఎంచి కోసి తెచ్చి భక్తితో ప్రేమతో అందించింది. నిత్యకర్మానుష్ఠానానికి కుశలూ కుసుమాలూ సమకూర్చింది. చిగురాకులతో మెత్తని శయనం ఏర్పరిచింది. ఆదరంతో సేవలు చేసిందే తప్ప ఏ వికారాలనూ ఏనాడూ ప్రదర్శించలేదు. శపిస్తాడని భయపడింది.



హావభావాదికం కించిద్వికారజననం చ తత్ ।
న చకార జయంతీ సా శాపభీతా మునేస్తథా ॥ (12 - 30)

అతడి మనస్సు రంజిల్లేట్టు స్తుతులు చేసింది. అనుక్షణం ప్రియంగా మాట్లాడింది. ఉదయమే అతడు లేచేసరికి ఆచమనోదకం సిద్ధంగా ఉంచడం మొదలుకొని సకలోపచారాలూ అతడి మనస్సుకు అనుకూలంగా చేస్తోంది. నిర్వికారచిత్తంతో బ్రహ్మచర్యదీక్షతో చేస్తోంది.

సంవత్సరాలు గడుస్తున్నాయి. ఇంద్రుడిలో ఆతురత పెరిగింది. జితాత్ముడైన శుక్రుడి ప్రవృత్తినీ మనస్సునూ తెలుసుకోవడం కోసం మరికొందరు సేవకులను నియోగించాడు.

కావ్యుడి వెయ్యేళ్ళ తపస్సు నిర్విఘ్నంగా పూర్తి అయ్యింది. మహేశ్వరుడు సంతోషించాడు. ప్రత్యక్షమయ్యాడు. దివ్యవరాలు ఇచ్చాడు. అవధ్యత్వం సర్వజ్ఞత్వం (మనస్సులలో ఉన్నది తెలుసుకోగలగడంతో సహా) అనుగ్రహించాడు. అంతర్ధానం చెందాడు.

యచ్చ కించిదపి బ్రహ్మన్! విద్యతే భృగునందన ।
ప్రతిపశ్యసి యత్సర్వం యచ్చ వాచ్యం న కస్యచిత్ ॥ (12 - 36)

శుక్రుడు సంతృప్తి చెందాడు. ప్రక్కనే నిలబడి ఉన్న జయంతిని చూశాడు. నువ్వు ఎవరి అమ్మాయివి? పేరేమిటి? ఎందుకని ఇక్కడికి వచ్చావు? పని ఏమిటి? అందమైన కన్నులున్న చిన్నదానా! నీ కోరిక ఏమిటో చెప్పు. ఎంత దుష్కరమైనా తీరుస్తాను. నీ సేవలకు సంతృప్తి చెందాను. వరం కోరుకో అన్నాడు.

జయంతి ముఖం ఆనందంతో కళకళలాడింది. రవ్వంత సిగ్గుపడుతూ బదులు పలికింది. భగవన్! నేను ఏ పనిమీద వచ్చానో నువ్వు తపశ్శక్తితో గ్రహించలేకనే అడుగుతున్నావా?

జయంతీ! ఎరుగుదును. అయినా నువ్వు చెబితే వినాలని ఉంది. నీ మనస్సులో ఉన్నదేమిటో నిస్సంకోచంగా చెప్పు. నీకు భద్రమగుగాక!

మహామునీ! నేను ఇంద్రుడి కూతురిని. మా తండ్రి నన్ను నీకు సమర్పించాడు. నా పేరు జయంతి అంటారు. జయంతుడి చెల్లెలిని. నాకు నీపై మనసయ్యింది. ధర్మబద్ధంగా నన్ను స్వీకరించి ప్రేమతో ఆనందించు, ఆనందింపజెయ్యి.

భామినీ! అలాగే. అంగీకరిస్తున్నాను. అయితే గడువు కేవలం పదేళ్ళు మాత్రమే. అదృశ్యరూపాలతో ఇక్కడే క్రీడిద్దాం.



ఈ నియమానికి జయంతి అంగీకరించింది. ఇంటికి తీసుకువెళ్ళి శుక్రుడు వివాహం చేసుకున్నాడు. తన మంత్రశక్తితో ఇద్దరూ అదృశ్యులై స్వేచ్ఛగా క్రీడిస్తున్నారు.

శుక్రాచార్యుడు కృతార్థుడై మంత్రశక్తితో ఇంటికి తిరిగి వచ్చాడనే వార్త తెలిసి దైత్యులంతా పరుగుపరుగున వచ్చారు. ఆశ్రమం అంతటా గాలించారు. గురుడు కనిపించలేదు. అదృశ్యరూపంలో ఉన్నాడని వారికి తెలీదు. ఆశగా మళ్ళీ మళ్ళీ వెదికారు. కనిపించలేదు. విమనస్కులై భగ్న మనోరథులై కాళ్ళీడ్చుకుంటూ స్వగృహాలకు తిరిగివెళ్ళారు.

## ◆ మాయా శుక్రాచార్యుడు ◆

దేవేంద్రుడు బృహస్పతితో మంతనాలు జరిపాడు. కావ్యుడు జయంతితో శృంగార భోగాలు అనుభవిస్తూ కాలం గడుపుతున్నాడు. పదేళ్ళ సమయం ఉంది. ఈలోగా మనం ఏదో ఒకటి చెయ్యాలి. ఆలోచించి మంచి ఉపాయం చెప్పమని అడిగాడు. మాయా విద్యతో దానవులను ప్రలోభపెట్టి దేవకార్యం నిర్వర్తించమన్నాడు. బృహస్పతి సరే అన్నాడు. శుక్రాచార్యుడుగా రూపం ధరించి రాక్షసులను సమీపించాడు. గురువుగారు వచ్చారని దైత్యులు సంబరపడ్డారు. పాదాభివందనాలు చేశారు. వారితో -

దైత్యులారా! స్వాగతం. మీక్షేమం కోరి వెయ్యేళ్ళు కఠిన నియమాలతో తీవ్ర తపస్సు చేసి శివుణ్ణి మెప్పించాను. దివ్యవరాలు పొందాను.

ఈ మాటలు వినగానే దైత్యులు ఆనందంతో చిందులు తొక్కారు. కరతాళధ్వనులతో కోలాహలం చేశారు. బాధలన్నీ అప్పుడే తీరిపోయినట్టు పొంగిపోయారు. పదే పదే సాష్టాంగపడ్డారు.

***(అధ్యాయం - 12, శ్లోకాలు - 59)***

జనమేజయుడికి మనస్సు కుతకుతలాడింది. ఈ మోసాలు ఏమిటి? దేవతలు కూడా ఇంతేనా అనుకున్నాడు. వ్యాసుణ్ణి అడిగాడు.

వ్యాసమహర్షీ ! శుక్రాచార్యుడి రూపంలో ఉన్న బృహస్పతి అటుపైని ఏమి చేశాడు? తెలుసుకోవాలని కుతూహలంగానే ఉంది. కానీ సాక్షాత్తు దేవతల గురువు, అంగిరసుడి తనయుడు, సకలధర్మశాస్త్రవేత్త- బృహస్పతి ఇలా నయవంచనకు దిగడమేమిటి ? దేవేంద్రుడు సరే, దేవగురువు ఇలా చెయ్యవచ్చునా? పదిమందికి చెప్పాల్సినవాడు తానే పాడిదప్పితే ఎలాగ? సర్వధర్మాలకూ మూలకారణం సత్యమనికదా శాస్త్రాలు ఘోషిస్తున్నాయి. పరమాత్మ సాక్షాత్కారానికి కూడా సత్యమే సాధకమని చెబుతున్నారు మునీశ్వరులు. అన్నీ తెలిసిన బృహస్పతి అసత్యానికి పాల్పడితే ఇక ఈ సృష్టిలో సత్యం పలికే సంసారి ఉంటాడా?



వాచస్పతిస్తథా మిథ్యావక్తా చేద్దానవాన్ప్రతి ।
కః సత్యవక్తా సంసారే భవిష్యతి గృహాశ్రమీ ॥ (13 - 4)

స్వార్థంకోం కుక్షింభరులై తపస్వులు కూడా అసత్యాలు పలకడమేనా? శిష్టులే లేకపోతే ఇక వేదప్రామాణ్యం ఏమైపోవాలి? ఇవేవీ అనిపించలేదా బృహస్పతికి? దేవతలు సాత్త్వికులనీ, మానవులు రాజసులనీ, తిర్యక్కులు (పశుపక్ష్యాదులు) తామసాలనీ మునులు విభజించారుకదా ! అటువంటిది దేవగురువు ఎంత సాత్త్వికంగా ఉండాలి. స్వయంగా మిథ్యావాది అయితే ఇక రాజసతామసులలో సత్యవాది ఎవడుంటాడు? ఎక్కడుంటాడు? మహర్షీ! అసలు ధర్మస్థితి ఏమిటి? నాకు ఇదొక పెద్ద సందేహం పట్టుకుంది. జగత్త్రయమూ మిథ్యాభిభూతమే అయితే ప్రాణికోటికి గతి ఏమిటి? విష్ణుమూర్తి, బ్రహ్మదేవుడు, ఇంద్రుడూ - ఇంకా సురనాయకులూ అందరూ ఎదుటివారిని మోసగించడంలో నేర్పరులే. కామక్రోధాలకూ లోభమోహాలకూ లొంగిపోయినవారే. తపోధనులైన మునులు వసిష్ఠ వామదేవ విశ్వామిత్ర బృహస్పతులే పాపాలకు పాల్పడ్డారంటే ఏమి చెప్పాలి? ధర్మానికి గతి ఏమిటి? ఇంద్రుడూ అగ్నీ చంద్రుడూ కడకు బ్రహ్మదేవుడూ పరకాంతావ్యామోహితులయ్యారు. అసలు, ఆర్యత్వం అనేది ఈ భువనత్రయంలో ఎక్కడైనా ఎప్పుడైనా ఉంది అంటావా? ఎవరిమాటను ఉపదేశంగా స్వీకరించాలి? ఎవరి జీవితాన్ని ఆదర్శంగా తీసుకోవాలి ? దేవతలూ మునులూ అందరికందరే అయితే ఇక చేసేది ఏమిటి?

వచనం కస్య మంతవ్యముపదేశధియానఘ ।
సర్వే లోభాభిభూతాస్తే దేవాశ్చ మునయస్తథా ॥ (13 - 14)

జనమేజయుడి ఆవేదనను వ్యాసమహర్షి అర్థం చేసుకున్నాడు. అతడి ప్రశ్నలకు అర్థం లేకపోలేదు. ఆధారాలు ఉన్నాయి. అందుకే ఓపికగా సమాధానం చెప్పాడు.

## ◆ అరిషడ్వర్గాలకు అతీతులు లేరు ◆

జనమేజయా! త్రిమూర్తులేమిటి, ఇంద్రబృహస్పతులేమిటి, దేహధారి అయితే చాలు ఎవరికైనా ఈ వికారాలు తప్పవు. విష్ణుమూర్తి రాగి. శివుడు రాగి. బ్రహ్మకూడా రాగసంయుతుడే. రాగవంతుడు చెయ్యని అకృత్యమంటూ ఏమి ఉంటుంది! కాకపోతే, చాతుర్యం ఉన్నవాడు పైకి విరాగిగా (జనకమహారాజులా) కనిపిస్తాడు. గొప్పగా నటిస్తాడు. అయితే ఇది అట్టేకాలం సాగదు. సంకట పరిస్థితి వచ్చినప్పుడు అసలు రంగు బయటపడుతుంది. స్వగుణం వెల్లడిఅవుతుంది. దాగదుకదా !



రాగవానపి చాతుర్యా ద్విదేహ ఇవ లక్ష్యతే ।
సంప్రాప్తే సంకటే సోఽపి గుణైస్సంబాధ్యతే కిల ॥ (13 - 17)

కారణరహితంగా కార్యం ఉండదనీ, కారణగుణాలు కార్యానికి సంక్రమిస్తాయనీ నీకు చాలాసార్లు చెప్పాను. మళ్ళీ చెబుతున్నాను. బ్రహ్మాదుల ఉత్పత్తికి కారణమైన గుణాలు వారి ప్రవృత్తులలోనూ ప్రతిఫలిస్తాయి. దేహం ఉన్నంతవరకూ ఇది తప్పదు. అయితే - పరోపదేశవేళలో విస్పష్టంగా అందరూ శిష్టులే. తమదాకా వచ్చేసరికిమాత్రం ప్రతిఒక్కరూ కచ్చితంగా జారిపోతారు.

పరోపదేశే విస్పష్టం శిష్టాస్సర్వే భవంతి చ ।
విప్లుతిః హ్యవిశేషేణ స్వకార్యే సముపస్థితే ॥ (13 - 19)

కామ క్రోధ లోభ ద్రోహ మాత్సర్యాహంకారాలను వదిలిపెట్టగలిగిన దేహధారి ఒక్కడూ నాకింతవరకూ కనిపించలేదు. ఈ సృష్టి, ఈ ప్రపంచం ఎప్పుడూ ఇలాగే ఉంది. మరోలా ఉండదు కూడా. అంతా శుభాశుభమయం కదా!

విష్ణుమూర్తినే చూడు. ఒక్కొక్కప్పుడు దారుణమైన తపస్సు చేస్తుంటాడు. మరొకప్పుడు వైకుంఠంలో లక్ష్మీదేవితో క్రీడిస్తుంటాడు. ఇంకొక్కప్పుడు రాక్షసులతో యుద్ధం చేస్తుంటాడు. కరుణాసింధువై లోకక్షేమంకోసం శరాఘాతాలూ తింటూ ఉంటాడు. జయాపజయాలు రుచిచూస్తుంటాడు. సుఖదుఃఖాలు అనుభవిస్తుంటాడు. ఒకప్పుడు శేషశయ్యపై హాయిగా నిద్రిస్తుంటాడు. సమయం వచ్చినప్పుడు తనంత తానే మేల్కొంటాడు.

ఇంద్రుడూ అంతే ఒకప్పుడు యజ్ఞాలు చేస్తూంటాడు. మరొకప్పుడు యుద్ధాలు చేస్తుంటాడు. శివుడూ బ్రహ్మ ఇంకా దేవతలూ మునులూ - వీరందరూ తమ తమ ఆయుర్దాయం మేరకు ఆయా వినిర్మాణాల్లో సంచరిస్తూంటారు. రాత్రి అయ్యేసరికి స్థావరజంగమాత్మకమైన ప్రపంచం చైతన్యాన్ని కోల్పోతుంది. సూర్యోదయంతో మేల్కొంటుంది. అల్లాగే బ్రహ్మాదులు కూడా తమ ఆయుష్షు తీరేసరికి నశిస్తారు. మళ్ళీ ప్రభవిస్తారు.

అందుచేత దేహధారులందరికీ కామాదిభావాలు సహజం. ఇందులో ఆశ్చర్యపడవలసింది ఏమీ లేదు. పరమార్థాన్ని తెలుసుకుని ఈ కామక్రోధాలనుంచి విముక్తిపొందిన పురుషుడు ఈ సంసారంలో ఎక్కడా కనపడడు. అది చాలా దుర్లభం. బృహస్పతి భార్యను చంద్రుడు స్వీకరించాడు. మళ్ళీ చంద్రుడినుంచి బృహస్పతి స్వీకరించాడు. ఇలాగే ఈ సంసారచక్రంలో లోభమోహాదులకు లొంగిపోయి మునుగుతూ తేలుతూ ఉంటారు అందరూ. గృహస్థాశ్రమంలో ఉండి సర్వసంగ పరిత్యాగిగా విముక్తుడై



స్వేచ్ఛగా సంచరించగలగడం అసంభవం. అందుచేత సకలప్రయత్నాలూ చేసి, సంసారం నిస్సారమని తెలుసుకుని, దాన్ని విడిచిపెట్టి, సచ్చిదానందరూపిణియైన జగజ్జననిని ఆరాధించడం ఉత్తమోత్తమం. ఈ జగత్తు అంతా ఆ మాయాశక్తితో ఆచ్ఛాదితమై ఉంది. ఉన్మత్తుడిలా మదిరాపానమత్తుడిలా నరుడు ఈ మాయలోపడి కొట్టుకుంటూ ఉంటాడు.

తన్మాయాగుణతశ్ఛన్నం జగదేతచ్చరాచరమ్ ।
భ్రమత్యున్మత్తవత్సర్వం మదిరామత్తవన్నృప ॥ (13 - 37)

ఈ మాయనుంచి బయటపడాలి అంటే ఆ మహామాయను ఆరాధించడమొక్కటే తరణోపాయం. మాయను సృష్టించినది ఆవిడే కనక దీని నుంచి విముక్తిని కలిగించవలసినదీ ఆవిడే. మరొక మార్గం లేదు. ఆవిడకు దయ కలిగేంతవరకూ మనం ఆరాధించవలసిందే. ఆవిడకన్నా దయామయులు లేరు. ఆ కరుణాసాగరాన్ని మాయామర్మంలేని భక్తితో ఆరాధిస్తే వెంటనే కరుణిస్తుంది. దుఃఖాలు తొలగి సుఖాలు కలుగుతాయి. జీవన్ముక్తి లభిస్తుంది. అతిదుర్లభమైన మానవజన్మను పొందీ జగదీశ్వరిని సేవించుకోలేనివారు నిచ్చెన పైకొసనుంచి నేలకు రాలిపడ్డవారితో సమానం.

మానుష్యం దుర్లభం ప్రాప్య సేవితాన మహేశ్వరీ ।
నిశ్రేణికాగ్రాత్పతితా అధ ఇత్యేవ విద్మహే ॥ (13 -40)

అహంకారావృతమై గుణత్రయసమన్వితమై అసత్య సంబద్ధమైన ఈ సంసారంనుంచి మరొక మార్గాన ముక్తి లభించడం కల్ల. అందుచేత అన్నింటినీ విడిచిపెట్టి అందరూ భువనేశ్వరిని అర్చించాలి.

వ్యాసుడు చేసిన ఈ ఉపదేశం జనమేజయుడికి నచ్చిందో లేదో కానీ మళ్ళీ కథలోకి వచ్చాడు. శుక్రాచార్యుడి రూపం ధరించి రాక్షసుల మధ్యకు వెళ్ళిన బృహస్పతి ఏం చేశాడు? శుక్రుడు ఎప్పుడు తిరిగివచ్చాడు? ఏమి జరిగింది? ఆ వివరాలు చెప్పమని అర్థించాడు. వ్యాసుడు వివరించాడు.

జనమేజయా! బృహస్పతి శుక్రాచార్యుడి రూపం ధరించి వెళ్ళాడుగదా! రాక్షసులంతా నిజంగా గురువే అనుకున్నారు. అతడినే నమ్మి మంత్రోపదేశం కోసం కాళ్ళుపట్టుకున్నారు. లోభగుణం ఎవరినైనా ఎంతకైనా సమ్మోహితుల్ని చేస్తుందికదా! దానితో మోసపోయారు. బృహస్పతి ఏ మంత్రోపదేశమూ చెయ్యలేదు. కాలం గడుస్తోంది.

జయంతితో సంసారం పదేళ్ళ గడువు ముగింపుకి వచ్చింది. శుక్రాచార్యుడికి శిష్యులు జ్ఞాపకం వచ్చారు. ఆశగా నా రాకకోసం ఎదురుతెన్నులు చూస్తూ ఉంటారుగదా అనుకున్నాడు. వెంటనే వెళ్ళి



వాళ్ళను చూడాలి. పాపం, భయాతురులై ఇంతకాలం ఎలా గడిపారో! వాళ్ళు నా భక్తులు. వాళ్ళకి దేవతలవల్ల భయమనేదే ఇక ఉండకూడదు - అనుకున్నాడు. కర్తవ్యం గుర్తుకి వచ్చింది. జయంతితో చెప్పాడు.

అందమైన కన్నులున్న ఓ చిన్నదానా! (చారులోచనే!) మన పదేళ్ళ గడువు పూర్తిఅయ్యింది. నేను బయలుదేరుతున్నా. నా శిష్యుల్ని చూడాలి. త్వరలోనే తిరిగివస్తా. నీ దగ్గరికే వస్తా.

జయంతి అంగీకరించింది. నీ ఇష్టం, వెళ్ళు అంది. ఇక్కడే నీకోసం ఎదురుచూస్తూ ఉంటా. ధర్మలోపం జరగనివ్వను. నిశ్శంకంగా వెళ్ళిరా.

జయంతి మాటలకు సంతోషించాడు శుక్రుడు. వెంటనే బయలుదేరాడు. హుటాహుటిని శిష్యుల్ని చేరుకున్నాడు. వారినీ వారి ప్రక్కన బృహస్పతినీ చూశాడు. తన రూపం ధరించి బృహస్పతి తన శిష్యులకు వేదనిందాపరాలైన జైనధర్మాలను ఉపదేశిస్తున్నాడు. రాక్షసులారా! మీకు నిజం చెబుతున్నాను. హితం చెబుతున్నాను. అహింసా పరమో ధర్మః. అందుకని ఎంతటి ఆతతాయిలనైనా సరే చంపకూడదు. యజ్ఞయాగాలలో పశుహింస చెయ్యవచ్చని వేదాలు చెప్పేమాట కేవలం భోగపరాయణులైన బ్రాహ్మణులు కల్పించినది. దాన్ని నమ్మకండి. అహింసయే ఉత్తమోత్తమ ధర్మం - ఇలాంటి సూక్తులను ప్రబోధిస్తున్నాడు శుక్రరూపధారి బృహస్పతి. ఆ రూపానికీ ఆ ఉపదేశానికీ ఆశ్చర్యపోయాడు (రాక్షసగురువు) ఆ భృగుపుత్రుడు.

వీడు దేవగురువు బృహస్పతి. నా ప్రథమ శత్రువు. నా రూపంలో వచ్చి నా శిష్యులను వంచించాడు. ఛీ ఛీ! లోభగుణం ఎంత చెడ్డది! ఎంతటి అకృత్యాన్నైనా చేయిస్తుంది. నిజానికి నరకద్వారం ఇదే. దీని ప్రేరణకు లొంగి గురువుకూడా పాపచింతాపరుడై అనృతాలు పలుకుతాడు.

> ధిగ్లోభం పాపబీజం వై నరకద్వారమూర్జితమ్ ।
> గురురప్యనృతం బ్రూతే ప్రేరితో యేన పాప్మనా ॥ (13 - 59)

దేవతలకు గురువై ధర్మశాస్త్ర ప్రవర్తకుడైన బృహస్పతి ఇలా పరరూపధారణ చేసి పరప్రతారణకు (పరవంచన) పూనుకున్నాడంటే, పాషండమతాన్ని ప్రబోధిస్తున్నాడంటే, లోభంతో మనస్సు కలుషితమైనవాడు ఎంతకైనా దిగజారతాడు, ఏమైనా చేస్తాడు అన్నమాటేకదా! (వేదప్రామాణ్యాన్ని అంగీకరించని మతాలను పాషండమతాలు అంటారు). శైలూషుడిలా (నటుడు) నా వేషం ధరించి నా శిష్యుల్నే నమ్మించి వంచించాడంటే నన్నూ వంచించినట్టే. ఔరా! ఎంతటి నేర్పరి! ***(అధ్యాయం - 13, శ్లోకాలు - 62)***



## ◆ రాక్షసులకు శుక్రాచార్యుడి శాపం ◆

బృహస్పతి పాట్లు చూస్తే శుక్రాచార్యుడికి నవ్వు వచ్చింది. నవ్వుతూ వారిముందు ప్రత్యక్షమయ్యాడు. దైత్యులారా! ఈ బృహస్పతిచేతిలో ఏమిటి మీరంతా ఇలా ఇంతతేలికగా ఎలా మోసపోయారు? నేను మీ గురువుని. శుక్రుణ్ని. ఇతడు దేవకార్యం చక్కబెట్టుకోడానికి వచ్చిన బృహస్పతి. మద్యపాన మత్తుల్లా మీరు పూర్తిగా మోసపోయారు. వీడినీ వీడిమాటలనూ నమ్మకండి. దొంగవేషం వేసి అచ్చు నా రూపంతో వచ్చాడు. రండి. వీడిని వదిలేసి ఇలా వచ్చెయ్యండి - అన్నాడు.

రాక్షసులకు ఉన్న మతికాస్తా పోయింది. ఇద్దరినీ మార్చిమార్చి చూశారు. ముమ్మూర్తులా ఒక్కలాగే ఉన్నారు. ఎవరు నిజమైన శుక్రుడో తేల్చుకోలేకపోయారు. కళవళపడ్డారు. ఇది గమనించిన బృహస్పతి -

ప్రియశిష్యులారా! నేనే మీ గురువును. వీడెవడో నా రూపం ధరించి వచ్చాడు. బహుశ బృహస్పతియే అయ్యుంటాడు. మిమ్మల్ని వంచించి దేవతలకు ప్రియం చేద్దామని వచ్చి ఉంటాడు. సందేహం లేదు. వీడి మాటలు నమ్మకండి. అటు వెళ్ళకండి. ఇక్కడే ఉండండి. శివుడు నేర్పిన దివ్యవిద్యను మీకు ఉపదేశిస్తాను. దేవతావిజయం సాధించిపెడతాను.

> ప్రాప్తా విద్యా మయా శంభోర్యుష్మానధ్యాపయామి తామ్ ।
> దేవేభ్యో విజయం నూనం కరిష్యామి న సంశయః ॥ (14 - 7)

(ఈ శ్లోకంలో ఒక చమత్కారం ఉంది. దేవేభ్యః విజయం కరోమి అన్నాడు. దేవేభ్యః = దేవతలనుంచి, విజయమ్ = విజయాన్ని, కరోమి = మీకు కలిగిస్తాను - అనేది శుక్రుడుగా రాక్షసులకు స్ఫురించాలని ఉద్దేశించిన అర్థం. దేవేభ్యః అనేది పంచమీవిభక్తే కాదు చతుర్థీబహువచనం కూడా కావచ్చు. అప్పుడు దేవతలకొరకు విజయం చేకూరుస్తాను అనే అర్థం వస్తుంది. ఇది బృహస్పతిగా దేవతలకూ తనకూ అభీష్టమైన అర్థం. తెలుగు వచనంలో వ్యస్తపదాలతో ఈ చమత్కారాన్ని స్ఫురింపజెయ్యడం కష్టం. దేవతావిజయం అని సమాసం చేసేస్తే దేవతలను జయించడం, దేవతలకు జయం కలిగించడం అనే రెండు అర్థాలూ తాత్పర్యంగా స్ఫురిస్తాయి.)

ఈ మాటలనే రాక్షసులు విశ్వసించారు. బృహస్పతినే శుక్రుడనుకున్నారు. గురువుగా అంగీకరించారు. అసలు శుక్రుణ్ణి నకిలీగా తిరస్కరించారు. ఎంతచెప్పినా వినిపించుకోలేదు. ఇతడే మా గురువు, మా హితుడు. ధర్మాత్ముడు. మాకోసం వెయ్యేళ్ళు ఘోరతపస్సు చేసిన దయాశాలి. మాకు



కనువిప్పు కలిగించి తెలివితేటలు ప్రసాదించిన గురూత్తముడు. గడిచిన పదేళ్ళనుంచీ విద్యాబుద్ధుల నేర్పుతున్నాడు. నువ్వు ఎవరివో. కుహనా శుక్రుడివి. మా గురుడవు కాదు. మర్యాదగా వచ్చినదారి దయచెయ్యి. లేదంటే తగిన శాస్తి చేస్తాం అని బెదిరించారు దైత్యులంతా ముక్తకంఠంతో.

శుక్రాచార్యుడికి వొళ్ళు మండింది. శపించాడు. మూఢులారా! నేనెంత చెప్పినా నిజం తెలుసుకోలేకపోతున్నారు. నామాట నమ్మడం లేదు. కనక ఊరూపేరూ లేనివారై పరాభవాల అనుభవింతురుగాక! నన్ను తిరస్కరించి, అవమానించిన దానికి ఫలం త్వరలోనే అనుభవిస్తారు. అప్పుడ తెలిసివస్తుంది మీకు ఈ బృహస్పతి చేసిన మోసం. చేసుకున్నవారికి చేసుకున్నంత మహాదేవా అన్నారు అనుభవించండి - అంటూ ఆ భృగుతనయుడు శుక్రాచార్యుడు రుసరుసలాడుతూ వెళ్ళిపోయాడు.

బృహస్పతికి ఆనందమే ఆనందం. అయితే అది పైకి కనిపించకుండా నిగ్రహించుకున్నాడు రాక్షసులను రాక్షసగురువే శపించాడు కనక ఇక తాను అక్కడ ఉండవలసిన అవసరం లేదనుకున్నాడు. శుక్రరూపం విడిచిపెట్టేసి స్వీయరూపం ధరించి ఇంద్రలోకానికి వెళ్ళిపోయాడు. దైత్యులు శాపదగ్ధులయ్యారు. ఇవ్వేళ నిరాధారులు, కాబట్టి వెంటనే దండెత్తమని ఇంద్రుడికి సలహా ఇచ్చాడు. ఇంద్రుడూ దేవతలూ ఆనందంతో గంతులువేశారు. అందరూ కలిసి ఆలోచించి దండయాత్రకు బయలుదేరారు.

## ◆ రాక్షసుల పశ్చాత్తాపం ◆

విషయాలన్నీ దైత్యులకు తెలిసాయి. నకిలీ గురువును నమ్మి అసలుగురువును అవమానించామే అని దిగులుపడ్డారు. బృహస్పతిని తిట్టుకున్నారు. పైకిమాత్రం శుచిగా ఉంటాడు లోపలంతా కుళ్ళే దుర్మార్గుడికి అనుకున్నారు. గురువుగారు కోప్పడి శపించిమరీ వెళ్ళి పోయారు. నిజమే. అంతగా అవమానించాం. కనక మనమే వెళ్ళి కాళ్ళమీదపడి బతిమాలుకుందాం, క్షమాపణలు చెప్పుకుందాం. ప్రసన్నుడు కాకపోడు. ఇంతకన్నా ఈ ఆపత్సమయంలో మరోదారిలేదు - అని దైత్యులందరూ ఒక నిర్ణయానికి వచ్చి పెద్దవాడుకదా అని ప్రహ్లాదుణ్ణి ముందుంచుకుని శుక్రాచార్యుణ్ణి చేరుకున్నారు. వెడుతూనే కాళ్ళమీద పడ్డారు. లెంపలు వేసుకున్నారు.

శుక్రాచార్యుడు మండిపడ్డాడు. క్రోధంతో కళ్ళు ఎర్రబడ్డాయి. మూఢులారా! నేను ఎంతచెప్పినా వినిపించుకున్నారు కాదు. బృహస్పతి మాయలో పడిపోయారు. హితం చెబితే చెవికెక్కిందికాదు. నన్ను అవహేళన చేశారు. అందుకు ఫలం వెంటనే లభించిందికదా! అనుభవించండి. ఇక్కడికి ఎందుకు వచ్చారు? వెళ్ళండి. ఆ కపటగురువు దగ్గరికే వెళ్లండి. ఆ వంచకుడినే శరణువేడండి. నాకు అలాంటి మాయలూ మంత్రాలూ తెలియవు. నేను అతడిలా వంచకుణ్ని కాను, కాలేను.



శుక్రాచార్యుడు తీవ్రస్థాయిలో దెప్పుతున్నాడు. మాటలు ఈటెల్లా తగులుతున్నాయి. రాక్షసులు మళ్ళీ మళ్ళీ పాదాభివందనాలు చేస్తున్నారే తప్ప ఏమి పలకడానికీ నోళ్ళు రావడంలేదు. ఒకప్రక్క సిగ్గు, ఒక ప్రక్కన అవమానం, ఒక ప్రక్కన భయం. ఉక్కిరిబిక్కిరి అవుతున్నారు. పరిస్థితిని అర్థం చేసుకున్న ప్రహ్లాదుడు రెండడుగులు ముందుకు వేసి గురుడిపాదాలకు సాగిలిమ్రొక్కాడు. వినయంగా అభ్యర్థించాడు-

భార్గవా! భయాతురులై వచ్చిన శిష్యులను ఇంతకన్నా నొప్పించడం భావ్యంకాదు. వీళ్ళు నీకు హితులు. కొడుకుల్లాంటివారు. చేసిన తప్పిదానికి వేసిన శిక్ష చాలు. దయచేసి కోపం ఉపసంహరించుకో. విడిచిపెట్టి వీళ్ళను దిక్కులేనివాళ్ళను చెయ్యకు. నువ్వు సర్వజ్ఞుడవు. నీకు నేను చెప్పదగినవాణ్ణి కాను. మంత్రసాధనకోసమని నువ్వు కైలాసానికి వెళ్ళాక ఒక దుష్టుడు, ఒక దుర్మార్గుడు, ఒక నటుడు నీ రూపంలో వచ్చి, అచ్చం నీలాగానే పలుకుతూ ఇచ్చకాలు చెప్పి మమ్మల్ని అందరినీ వంచించాడు. ఈ మహామోసాన్ని తెలుసుకోలేక నీపట్ల అనుచితంగా ప్రవర్తించాం. కించపరిచాం. ఇది తెలియకచేసిన అపరాధమే తప్ప తెలిసిచేసింది కాదు. ప్రమాదవశాత్తు జరిగే ఇటువంటి అపరాధాలకు నీవంటి శాంతస్వభావులు ఆగ్రహోదగ్రులు కావడం సమంజసమా చెప్పు?

మా మనస్సులలో ఉన్నది నువ్వే. అందుకే నీ రూపంలో వచ్చి వంచించాడు బృహస్పతి. వెయ్యేళ్ళ గడువు దాటిపోవడమూ అతడు నీ రూపంలో రావడమూ కారణంగా మేమంతా మోసపోయాం. లేకపోతే అంతతేలికగా బుట్టలో పడతామా? ఒక్కసారి ప్రశాంతంగా ఆలోచించు. పోనీ నా మాటలు నమ్మవద్దు. నీ తపశ్శక్తితో చూడు. మా అంతరంగాలు తెలుసుకో. నీవంటి సాధుపురుషులు క్షణకోపనులని పెద్దలు చెబుతున్నారు. నీరు సహజంగా చల్లగా ఉంటుంది. అగ్ని సంపర్కంతో వేడి ఎక్కుతుంది. దాన్ని తొలగిస్తే వెంటనే తిరిగి చల్లబడుతుంది. క్రోధాగ్నిని తొలగించు. సహజశీతలత్వాన్ని తిరిగి పొందు. సర్వానర్థాలకూ క్రోధమే కారణమని నీవంటి పండితులు చెప్పగా విన్నాను. దయచేసి క్రోధం విడిచిపెట్టు. దిక్కులేక కష్టాలపాలైన మమ్మల్ని చేపట్టు.

**జ్ఞాత్వా నస్తపసా భావం త్యజ కోపం మహామతే ।**
**బ్రువంతి మునయస్సర్వే క్షణకోపా హి సాధవః ॥**
**జలం స్వభావతః శీతం వహ్న్యాతపసమాగమాత్ ।**
**భవత్యుష్ణం వియోగాచ్చ శీతత్వమనుగచ్ఛతి ॥** **(14 - 35, 36)**

భేదోపాయం పన్ని నిన్ను మాకు దూరంచేసి దేవతలిప్పుడు దండెత్తి వస్తున్నారు. ఇది తెలిసీ నువ్వు రోషాన్ని వదిలిపెట్టకపోతే వారి పన్నాగాన్ని సాగనిచ్చినట్టు అవుతుంది. ఆలోచించు. మా అభ్యర్థన



మన్నించు. ఇప్పటికీ సమాధానపడక మమ్మల్ని ఇలాగే గాలికి వదిలేస్తే మేమంతా పాతాళానికి పారిపోవాల్సి వస్తుంది. లేదా వజ్రాయుధానికి ఎర కావాల్సి వస్తుంది. అప్పుడింక నీకు చెప్పుకోడానికి ఒక్కశిష్యుడైనా మిగలడు.

ప్రహ్లాదుడి ప్రసంగాన్ని అక్షరశః శ్రద్ధగా విన్నాడు శుక్రాచార్యుడు. జ్ఞానచక్షువుతో తిలకించాడు. ప్రసన్నుడయ్యాడు. ముఖంమీద చిరునవ్వులు చిందులు తొక్కాయి.

దానవులారా! భయపడవలసింది ఏమీ లేదు. రసాతలానికి పారిపోవలసిన అవసరం అంతకన్నా లేదు. మిమ్మల్ని నేను రక్షిస్తాను. అమోఘమైన దివ్యమంత్రాలు ఉన్నాయి. దానికేమి గానీ మీకొక సత్యం చెబుతాను. వినండి. ఒకప్పుడు బ్రహ్మదేవుడు చెప్పగా విన్నాను. జరగవలసిన శుభాశుభాలు ఎటుతిరిగీ జరుగుతాయి. దేవుడైనా వాటిని మార్చలేడు. అన్యథాకరించలేడు.

**అవశ్యంభావినో భావాః ప్రభవంతి శుభాశుభాః ।**
**దైవం వ చాన్యథా కర్తుం క్షమః కోఽపి ధరాతలే ॥ (14 - 42)**

శిష్యులారా! ప్రస్తుతం మీకు కాలయోగం బాగోలేదు. అందుకని అన్నివిధాలా బలహీనపడ్డారు. దేవతలచేతిలో మాటిమాటికీ ఓడిపోతున్నారు. ఇప్పుడిది దేవతల కాలం. ఒకప్పుడు ముల్లోకాలనూ సంపూర్ణ సమృద్ధులతో మీరు పరిపాలించారు. దేవతలను నెత్తిమీద తన్ని పదియుగాలపాటు సకలభోగాలూ అనుభవించారు. విష్ణుమూర్తి వామనరూపంలో వచ్చి మీ బలిచక్రవర్తిని పాతాళానికి తొక్కేశాడు. రాజ్యభ్రష్టుణ్ణి చేశాడు. అక్కడితో మీకు మంచిరోజులు అయిపోయాయి. ఆవేళ విష్ణుమూర్తి బలిచక్రవర్తికి ఒక వరం ఇచ్చాడు. సావర్ణిక మన్వంతరంలో మళ్ళీ రాజ్యం లభిస్తుంది అని మాటఇచ్చాడు. అప్పుడు బలి చక్రవర్తియే ఇంద్రుడు అవుతాడన్నాడు. కాబట్టి ప్రస్తుతం ఇవి దేవతల రోజులు. సావర్ణిక మన్వంతరందాకా మనం ఓపిక పట్టాలి.

ప్రహ్లాదా! నీ మనుమడు బలిచక్రవర్తి ఇప్పుడు భయభీతుడై అదృశ్యరూపంతో పాతాళంలో రహస్యంగా కాలం గడుపుతున్నాడు. గాడిదరూపం ధరించి ఒక శూన్యగృహంలో దాక్కొన్న బలిచక్రవర్తిని ఒకనాడు దేవేంద్రుడు కలుసుకున్నాడు. ముల్లోకాలనూ ఏలినవాడివి సకలదైత్యులకూ అధినాయకుడివి - ఏమిటి ఈ గార్దభావతారం? సిగ్గువెయ్యడం లేదూ? అని హేళన చేశాడు.

ఇంద్రా! ఇందులో సిగ్గుపడవలసింది ఏముంది, దుఃఖపడవలసింది ఏముంది? మహాతేజస్వి విష్ణుమూర్తి మత్స్యకూర్మవరాహాది రూపాలు ధరించలేదూ ? అలాగే నేనూ కాలయోగంవల్ల గాడిదరూపం



ధరించాను. ఒకప్పుడు నువ్వు బ్రహ్మహత్యామహాపాతకానికి లోనై కమలంలో దాక్కోలేదూ ? అలాగే ఇప్పుడు నేనూ గార్దభరూపంలో ఇరుక్కున్నాను. అందరం దైవాధీనులమే. దుఃఖమేమిటీ, సుఖమేమిటీ! అంతా కాలమహిమ. అది ఏమి చెయ్యాలనుకుంటే అది చేస్తుంది. దానికి తిరుగులేదు.

దైవాధీనస్య కిం దుఃఖం కిం సుఖం పాకశాసన ।
కాలం కరోతి వై నూనం యదిచ్ఛతి యథా తథా ॥ (14 - 56)

ఇలా ముచ్చటించుకున్న బలిదేవేంద్రులు తమతమ స్థితిగతులకు కాలమహిమను కారణంగా గుర్తించి స్వస్థచిత్తులై ఎవరి నెలవులకు వారు వెళ్ళిపోయారు.

అందుచేత ఓ రాక్షసవీరులారా ! ఈ దైవ దానవ మానవరూపజగత్తు అంతా దైవాధీనం. దైవమే అన్నింటికన్నా అన్నివేళలా బలిష్ఠం. ఇది బ్రహ్మదేవుడు చెప్పిన సత్యం. మనమంతా గ్రహించడం మంచిది.

*(అధ్యాయం - 14, శ్లోకాలు - 58)*

జనమేజయా ! వింటున్నావుకదా అని ఒకసారి హెచ్చరించి వ్యాసుడు కథనం కొనసాగించాడు. శౌనకాదిమహామునులారా ! వింటున్నారా అని సూతుడు చెప్పనారంభించాడు.

శుక్రాచార్యుడి మాటలకు ప్రహ్లాదుడు సంతృప్తి చెందాడు. దైవం అన్నిటికన్నా బలిష్ఠమన్న సంగతి నచ్చింది. రాక్షసులారా! ఒకవేళ మనం బాహుగర్వంతో దైవాన్ని కాదని యుద్ధానికి దిగితే పరాజయం తప్పదు. రోజులు బాగున్నాయి కనక దేవతలే జయిస్తారు - అన్నాడు.

మదగర్వితులైన దైత్యులకు ఈమాట నచ్చలేదు. సంగ్రామమే తక్షణ కర్తవ్యం అన్నారు. దైవం ఉన్నాడో లేడో ఎవరికెరుక ! బలహీనులూ భయభీతులూ నిరుద్యములూ దైవాన్ని ప్రధానంగా నమ్ముతారు. అతణ్ణి చూసినవాడెవడు ? ఎలా ఉంటాడు ? ఎక్కడ ఉంటాడు ? ఎవరికీ తెలీదు. అలాంటి దైవాన్ని నమ్ముకోవడం మనవంటి వీరులకు తగనిపని. బలం కూడగట్టుకుని యుద్ధమే చేద్దాం. విజయమో వీరస్వర్గమో ! మాలో అన్నివిధాలా నువ్వు పెద్దవాడివి కనక మమ్మల్ని నడిపించు - అన్నారు.

ప్రహ్లాదుడు ఏకగ్రీవంగా సేనాపతి అయ్యాడు. దేవతలను యుద్ధానికి ఆహ్వానించాడు. శంఖభేరీతూర్యారావాలతో యుద్ధం మొదలయ్యింది. ప్రహ్లాదుడికీ దేవేంద్రుడికీ మహాఘోరంగా ద్వంద్వయుద్ధం సాగింది. నిండా నూరేళ్ళు నడిచింది. మునులతో సహా అందరూ ఆశ్చర్యపోతున్నారు. శుక్రాచార్యుడి మంత్రశక్తి రాక్షసులకు క్రమక్రమంగా విజయం సమకూర్చిపెడుతోంది.



## ◆ ఇంద్రకృత దేవీస్తుతి ◆

దేవేంద్రుడు పరిస్థితిని సమీక్షించాడు. విజయలక్ష్మి చేజారిపోయేట్టు ఉంది. బృహస్పతిని సలహా అడిగాడు. అతడి సలహామేరకు పరాశక్తిని స్మరించాడు శచీపతి.

జయ దేవి మహామాయే శూలధారిణి చాంబికే ।
శంఖచక్రగదాపద్మ ఖడ్గ హస్తే ऽభయప్రదే ॥ (15 -11)

శూల - శంఖ - చక్ర - గదా - పద్మ - ఖడ్గాలను ధరించిన ఓ మహామాయా ! ఓ జగదంబికా! ఓ అభయప్రదా ! నీకు జయము జయము. ఓ భువనేశ్వరీ ! దశతత్త్వాత్మికా ! మహాబిందు స్వరూపిణీ ! మహాకుండలినీరూపా ! సచ్చిదానంద స్వరూపిణీ ! ప్రాణాగ్నిహోత్రవిద్యా ! దీపశిఖాత్మికా ! పంచకోశాంతర్నివాసినీ ! బ్రహ్మస్వరూపిణీ ! ఆనందకళికా ! సర్వోపనిషత్సమర్చితా ! ఓ జగన్మాతా ! నమోనమః, నమోనమః.

నమస్తే భువనేశాని శక్తి దర్శననాయికే ।
దశతత్త్వాత్మికే మాతర్మహాబిందుస్వరూపిణి ॥
మహాకుండలినీరూపే సచ్చిదానందరూపిణి ।
ప్రాణాగ్నిహోత్రవిద్యే తే నమో దీపశిఖాత్మికే ॥
పంచకోశాంతరగతే పుచ్ఛ బ్రహ్మస్వరూపిణి ।
ఆనందకలికే మాతః సర్వోపనిషదర్చితే ॥ (15 - 12, 13, 14)

అమ్మా ! ప్రసన్నురాలివై మమ్మల్ని కాపాడు. దైత్యుల చేతిలో ఓడిపోతున్నాం. రక్షించు. జయం కలిగించు. నువ్వే మాకు దిక్కు. మా దుఃఖాలను తొలగించే సామర్థ్యం నీకే ఉంది. నువ్వు సర్వశక్తి సంయుక్తవు. నిన్ను ధ్యానించేవారికి నిరంతరమూ సుఖాలే. ధ్యానించనివారికి నిరంతరమూ దుఃఖాలే. మోక్షార్థులు నిన్ను ధ్యానించి బంధవిముక్తులై సంసారసాగరాన్ని తేలికగా దాటుతున్నారు. భక్తులను సంరక్షిస్తావనేది నీకున్న ఏకైక కీర్తి. విశ్వ సంరక్షణకోసమే నీవున్నది. ఎంతటి ఆర్తినైనా చిటికెలో తొలగించగల ప్రతాపం నీది. కాలస్వరూపిణివై ఈ సమస్త సృష్టినీ నువ్వు క్షణంలో ఉపసంహరిస్తావు. నీ దివ్యచరితం తెలుసన్నవాడెవడూ లేడు. బ్రహ్మ విష్ణు మహేశ్వరులే కాదు, మా దిక్పాలకులే కాదు, మహానుభావులైన మహర్షులూ మహామునీశ్వరులకు కూడా నీ యథార్థతత్త్వం తెలియదు. నిగమాగమాలకే అందదు అంటే ఇక నాబోటి మందబుద్ధులమాట చెప్పాలా ?



ధన్యాస్త ఏవ తవ భక్తిపరా మహాంతః
సంసార దుఃఖరహితాః సుఖసింధుమగ్నాః ।
యే భక్తిభావరహితా న కదాపిదుఃఖాం
బోధిం జనిక్షయ తరంగ ముమే తరంతి ॥ (15 - 19)

అమ్మా ఉమాదేవీ ! నీ భక్తులు ధన్యులు. సంసార దుఃఖాలను తొలగించుకుని సుఖసముద్రాలలో ఓలలాడుతున్నారు. నీపట్ల భక్తిభావం లేనివారు జననమరణ తరంగాలతో ఎల్లప్పుడూ అల్లకల్లోలంగా ఉండే ఈ సంసార దుఃఖ మహాసముద్రాన్ని ఏనాటికీ ఈదలేకపోతున్నారు. జోడు వింజామరలతో పల్లకీలు ఎక్కి ఊరేగుతున్న భాగ్యశాలులు క్రిందటి జన్మలో నీకు చామరాలు వేసి ఉంటారు. ఉపహారాలు సమర్పించి ఉంటారు.

యే వీజ్యమానాః సితచామరైశ్చ
క్రీడంతి ధన్యాః శిబికాధిరూఢాః ।
తైః పూజితా త్వం కిల పూర్వదేహే
నానోపహారైరితి చింతయామి ॥ (15 - 20)

సామంతరాజులు సమర్పించిన విలాసినీ బృందాలతో సేవలు అందుకుంటూ అంబారీ ఏనుగులపై పురవీథులలో పయనించే మహారాజులు పూర్వజన్మలో నీకు అలాంటి పూజలు జరిపినవారై ఉంటారు.

యే పూజ్యమానా వరవారణస్థా
విలాసినీబృంద విలాసయుక్తాః ।
సామంతకైశ్చోపనతైర్వ్రజంతి
మన్యే హితైస్త్వం కిల పూజితాసి ॥ (15 - 21)

ఇలా దేవేంద్రుడు భక్తిప్రపత్తులతో స్తుతించాడు. జగన్మాత ఆనందించింది. సింహవాహనంపై కూర్చుని ప్రత్యక్షమయ్యింది. నాలుగు చేతులలో శంఖ చక్ర గదా పద్మాలు ధరించింది. కళ్ళలో ఒక అపూర్వమైన మెరుపు. ఎర్రని వస్త్రాలు ధరించింది. ఎర్రటి పువ్వులు అలంకరించుకుంది. దివ్యాభరణాలు విరాజిల్లుతున్నాయి.



ఏవం స్తుతా మఘవతా దేవీ విశ్వేశ్వరీ తదా ।
ప్రాదుర్బభూవ తరసా సింహారూఢా చతుర్భుజా ॥
శంఖచక్రగదాపద్మాన్ బిభ్రతీ చారులోచనా ।
రక్తాంబరధరా దేవీ దివ్యమాల్యవిభూషిణీ ॥ (15 - 22, 23)

భోదేవాః ! భయపడకండి. ఇదిగో ఇప్పుడే మీకు ఆనందం కలిగిస్తున్నాను - అంటూ ఆ విశ్వసుందరి దైత్యులవైపు తన సింహవాహనాన్ని నడిపించింది. ప్రహ్లాదాదులు చూసి భయపడ్డారు చండముండవినాశిని మహాదేవి మనలను అందరినీ నిశ్శేషంగా సంహరిస్తుంది. ఇది నిశ్చయం. పూర్వకాలంల వక్రదృష్టులు ప్రసరించి మధుకైటభులను మట్టుపెట్టింది. ఇప్పుడు మనగతీ అంతే అనుకున్నారు.

## ◆ ప్రహ్లాదకృత దేవీస్తుతి ◆

ప్రహ్లాదుడు తేరుకొని పారిపోదాం పదండి అన్నాడు. ఎక్కడికని పారిపోతాం ? ఎక్కడికి వెడితే అక్కడికే వచ్చి తరిగి పోగులుపెడుతుంది ఈ జగన్మాత. పారిపోవడం మరింత కోపకారణం అవుతుంది కాబట్టి జగదీశ్వరిని స్తుతించి ప్రసన్నురాలిని చేసుకుని అనుజ్ఞ తీసుకుని పాతాళానికిపోవడం క్షేమదాయకం - అన్నాడు నముచి. అందరికీ ఈ ఉపాయం నచ్చింది. విష్ణుభక్తుడూ పరమార్థవేత్త అయిన ప్రహ్లాదుడు అందరిపక్షానా ఆదిశక్తిని స్తుతించాడు.

మాలాసర్పవదాభాతి యస్యాం సర్వం చరాచరమ్ ।
సర్వాధిష్ఠాన రూపాయై తస్యై హ్రీమూర్తయే నమః ॥ (15 - 34)

జగద్ధాత్రీ ! ఈ చరాచరసృష్టి అంతా నీలో మాలాసర్పంలాగా (మిథ్య) భాసిస్తోంది. నువ్వు సర్వాధిష్ఠాన దేవతవు. హ్రీం బీజాక్షరరూపిణివి. నీకు ఇవే వందనాలు. స్థావరజంగమాత్మకమైన ఈ విశ్వం నీ వల్లనే ఏర్పడింది. మిగతా సృష్టికర్తలు నిమిత్తమాత్రులు. నువ్వు నిర్మించి నియమించినవారు. ఓ మహామాయా ! అందరికీ నువ్వే తల్లివి. అందరూ నీ సృష్టియే. దేవతలనీ దైత్యులనీ నీవారిలో నీకు భేదాలు ఏమి ఉంటాయి ! మంచివాళ్ళయినా చెడ్డవాళ్ళయినా తల్లికి బిడ్డలందరూ సమానమే. కాబట్టి దేవతలపట్లా మాపట్లా నీకు భేదభావం ఉండదని నమ్ముతున్నాను. దానవులు ఎటువంటివారైనా నీ బిడ్డలు నీ బిడ్డలే. నువ్వు విశ్వజననివని పురాణాలన్నీ కీర్తిస్తున్నాయి.

యాదృశాస్తాదృశా మాతస్సుతాస్తే దానవాః కిల ।
యతస్త్వం విశ్వజననీ పురాణేషు ప్రకీర్తితా ॥ (15 - 38)



పోనీ, దేవతలు సర్వాత్మనా మంచివారా అంటే అదీకాదు. వారి స్వార్థం వారికి ఉంది. మా స్వార్థం మాకూ ఉంది. ఇందులో దేవదానవులకు భేదంలేదు. తేడా ఉంది అనుకోవడం అదొకరకం మోహమే అవుతుంది. ధన దారాది లౌకికభోగాలలో మేమెంతగా సంసక్తులమై లంపటులమై రేయింబవళ్ళు క్రీడిస్తుంటామో అలాగే దేవతలు కూడా మాకంటే ఎక్కువగా భోగపరాయణులై వినోదిస్తూంటారు. ఇంక తేడా ఏమిటి ? మాకంటే వారు ఏ రకంగా గొప్పవారు ? అదీకాక మేమందరం ఒకే తండ్రి బిడ్డలం. కశ్యపుడి పుత్రులం. దితికి మేము జన్మిస్తే అదితికి వారు జన్మించారు. మరి వారిపట్ల నీకు ప్రేమ, మాపట్ల ఈ కోపం - ఇది నీకు జననీ ! ఎలా కలిగిందో తెలియడంలేదు. ఇద్దరినీ సమానంగా చూడవలసిన కన్నతల్లివి నువ్వు. నీకు ఈ భేదభావం తగునా అమ్మా ?

నీ సృష్టి త్రిగుణాత్మకంకదా ! గుణాలలో ఉన్న భేదం గుణులలోనూ ఉంటుందికదా ! ఇంతకుమించి సురాసురులకు భేదం ఏముంది ?

కామక్రోధాదులు దేహధారులందరికీ సమానం. కుతూహలంకొద్దీ సురాసురులకు విరోధం కల్పించి వినోదిస్తున్నావు. పరస్పరం కలహించుకుంటూంటే చూసి ఆనందిస్తున్నావు. నీకు ఇదొక క్రీడ. లేకపోతే అన్నదమ్ములకు తీరని ఈ వైరం ఏమిటి ?

అమ్మా ! ధర్మాధర్మాలు నాకూ తెలుసు. ఇంద్రుడు ఎటువంటివాడో బాగా ఎరుగుదును. భోగభాగ్యాలకోసమేకదా మా తగువులన్నీ. జగదీశ్వరీ ! ఈ ప్రపంచాన్ని శాసించే ఏకైకశక్తివి నువ్వు. నిన్ను కాదని ఎవడూ ఏమీ చెయ్యలేడు. అలనాడు క్షీరసముద్ర మథనసమయంలో అమృతాన్నీ మణిరత్నాలనూ పంచిపెడుతూ విష్ణుమూర్తి ఈ భేదభావబీజాలను నాటాడు. అతడు నీ సృష్టియే. ఈ ప్రపంచాన్ని పాలించమని బాధ్యత అప్పగించావు. స్వయంగా లోభపడి లక్ష్మీదేవిని గ్రహించాడు. లాభపడ్డాడు. ఐరావతం ఇంద్రుడికి సమర్పించాడు. కల్పవృక్షాన్నీ కామధేనువునూ ఉచ్చైఃశ్రవాన్నీ తనవారికే పంపకం పెట్టాడు. ఇంతగా అన్యాయం చేసే దేవతలే సజ్జనులయ్యారు. ఒక్కసారి నిష్పాక్షికంగా ధర్మం ఆలోచించు. దైత్యులకు ఎంత అన్యాయం జరిగిందో ఎంత అవమానం జరిగిందో నీకే తెలుస్తుంది. కన్న తల్లివి నువ్వే కాదంటే నేనింక ఎవరితో చెప్పుకోను ? ఎవరిముందు నాగోడు వెళ్ళబోసుకోను ? అమ్మా ! అసలు ధర్మం అనేది ఎక్కడైనా ఉంది అంటావా ? ఏది ధర్మం ? ఏది కార్యం ? ఎవడు సజ్జనుడు ? వీటి విషయంలో అందరికీ ఆమోదయోగ్యమైన నిర్ణయాలూ నిర్వచనాలూ ఏమైనా ఉన్నాయంటావా ?

తార్కికులు యుక్తివాదంమీద ఆధారపడతారు. వేదవిదులు విధివాదంమీద నిలబడతారు. ఈ విశ్వం సకర్తృకమనీ అకర్తృకమనీ పరస్పరం వాదించుకుంటూ ఉంటారు. కర్త ఉన్నట్టయితే ఈ విశాల ప్రపంచంలో ఇన్ని వైరుధ్యాలు ఏమిటి ? ఏకకర్తృకమైన ఏకకర్మలో భేదభావం పొసగదుగదా ! వేదాలలో



ఏకవాక్యతలేదు. వేదవిదులలో ఏకాభిప్రాయంలేదు. శాస్త్రాలలోలేదు, శాస్త్రవేత్తలలోనూలేదు. అంతటా స్వార్థపరత్వమే స్ఫుటంగా కనపడుతోంది. నాబోటివాడికి నిస్పృహ కాక మరింకేమి మిగులుతుంది ?

పోనీ వ్యక్తుల ప్రవర్తనను చూసి అది ఆదర్శంగా తీసుకుందామంటే అది ఇంకా ఘోరంగా ఉంది. గురుపత్ని అని తెలిసితెలిసీ చంద్రుడు బలవంతంగా అపహరించాడు. ధర్మాధర్మాలు తెలిసే ఇంద్రుడు గౌతముడి భార్యను ఆక్రమించాడు. బృహస్పతి తన సోదరుడి ఇల్లాలిని పూర్ణగర్భవతిని బలాత్కారంగా భోగించాడు.

ఇంక నా మనుమడు బలిచక్రవర్తికి జరిగిన అన్యాయం ఇంతా అంతా కాదు. సత్యవ్రతపరాయణుడై వందల యజ్ఞాలు చేశాడు. దానగుణానికి పెట్టిందిపేరు. శాంతస్వభావుడు. సర్వజ్ఞుడు. సర్వపూజితుడు. మహాశూరుడు. అలాంటి నా పౌత్రుణ్ణి విష్ణుమూర్తి వామనరూపంలో వచ్చి వంచించాడు. నిర్దాక్షిణ్యంగా రాజ్యమంతా అపహరించి అథఃపాతాళానికి తొక్కివేశాడు.

ఇన్ని అకృత్యాలూ అధర్మాలూ అన్యాయాలూ చేసినప్పటికీ లోకులు వారినే ధర్మపరులు అంటున్నారు. వందిమాగధులై కీర్తిస్తున్నారు. అమ్మా ! జగన్మాతవు కనక నీముందు నా ఆవేదన వెల్లడించుకున్నాను. ఇక నీ ఇష్టం. ఏమి చెయ్యాలనుకుంటే అది చెయ్యి. దానవులం మొత్తంగా నిన్ను శరణు అంటున్నాం. రక్షిస్తావో శిక్షిస్తావో నీ ఇష్టం.

**ఏవం జ్ఞాత్వా జగన్మాత: యథేచ్ఛసి తథా కురు ।**
**శరణా దానవాస్సర్వే జహి వా రక్ష వా పున: ॥ (15-65)**

ప్రహ్లాదుడి ఆక్రోశాన్ని జగదీశ్వరి అర్థంచేసుకుంది. కరుణామయి కనక ప్రసన్నురాలయ్యింది. ప్రహ్లాదా ! మీ దానవులంతా పాతాళానికి వెళ్ళిపొండి. అక్కడ స్వేచ్ఛగా నివసించండి. నిర్భయంగా జీవించండి. మంచిరోజులకోసం ప్రతీక్షించండి. అన్ని శుభాశుభాలకూ కారణం కాలమే కదా ! వైరాగ్యభావన ఉన్నవారికి ఎక్కడ ఉన్నా ఎప్పుడూ సుఖమే. లోభచిత్తులకు ముల్లోకాలూ చేతికి వచ్చినా సుఖం ఉండదు. ఏ ఫలాలూ సంతృప్తి నివ్వవు. అంచేత ఈ భూభాగాన్ని విడిచిపెట్టి రసాతలానికి వెళ్ళండి. ఇది నా ఆజ్ఞ. నిష్కల్మషంగా జీవయాత్ర సాగించండి.

దానవులు జగన్మాతకు శిరసువంచి నమస్కరించారు. పాతాళానికి పయనమయ్యారు. ఆది పరాశక్తి అంతర్ధానం చెందింది. దేవతలు తమలోకానికి వెళ్ళిపోయారు. అప్పటినుంచీ దేవదానవులు శత్రుత్వం విడిచిపెట్టి ఎవరి బతుకులు వారు బతుకుతున్నారు. ఈ కథను విన్నా చదివినా దుఃఖాలు తొలగిపోతాయి. ఉత్తమగతులు లభిస్తాయి. ***(అధ్యాయం - 15, శ్లోకాలు - 72)***



శౌనకాది మహామునులారా ! ఇప్పుడు మన జనమేజయుడికి మరొక కుతూహలం కలిగింది. భృగు మహర్షి శాపంవల్ల విష్ణుమూర్తి ఏయే అవతారాలు ధరించాడు, ఏ మన్వంతరంలో ఏ కథ జరిగింది తెలుసుకోవాలి అనిపించింది. సవిస్తరంగా చెప్పమని అభ్యర్థించాడు. మా గురువుగారు కథక చక్రవర్తి కదా! శ్రద్ధగా అడిగి వినేవాళ్ళు దొరకాలేగానీ ఎంత అందంగానైనా చెబుతారాయె. ఎంతసేపయినా చెబుతారాయె. ప్రారంభించారు.

జనమేజయా ! శ్రీమన్నారాయణుడు ఏ మన్వంతరంలో ఏ యుగంలో ఏ అవతారాన్ని ధరించాడో, ఏ ఘనకార్యం సాధించాడో సంక్షేపంగా చెబుతాను. శ్రద్ధగా విను. ఈ అవతారగాథలు పాపవినాశకాలు. సర్వశుభావహాలు.

చాక్షుషమన్వంతరంలో ధర్ముడిగా అవతరించాడు. నరనారాయణులు ధర్ముడి కుమారులు. వారి వృత్తాంతం ఇంతకుముందే చెప్పానుగదా ! రెండవదైన వైవస్వతమన్వంతరంలో అత్రిపుత్రుడై దత్తాత్రేయుడిగా అవతరించాడు. పతివ్రతామతల్లి అనసూయాదేవి అత్రిమహర్షికి ధర్మపత్ని. ఆవిడ ప్రార్థనమేరకు త్రిమూర్తులూ పుత్రులు అయ్యారు. బ్రహ్మదేవుడు చంద్రుడిగా వారికి జన్మించాడు. విష్ణుమూర్తి దత్తాత్రేయుడై ఆవిర్భవించాడు. రుద్రుడు దూర్వాసుడై ప్రభవించాడు.

నాల్గవ మన్వంతరంలో శ్రీహరి నరసింహరూపుడై అవతరించాడు. ఆ రూపం చూసి దేవతలు కూడా ఆశ్చర్యపోయారు. హిరణ్యకశిపుడిని సంహరించాడు. మధుసూదనుడు ఏ అవతారం ఎత్తినా దేవకార్యసిద్ధికోసమే. ఉత్తమోత్తమమైన త్రేతాయుగంలో కశ్యప ప్రజాపతికి వామనరూపంలో అవతరించి, చిరువంచనతో రాజ్యం అపహరించి, బలిచక్రవర్తిని పాతాళానికి పంపించాడు. పంధొమ్మిదవ త్రేతాయుగంలో జమదగ్నిసుతుడై పరశురాముడిగా అవతరించి క్షత్రియ సంహారం కావించాడు. సమస్త భూమినీ స్వాధీనపరచుకొని కశ్యపుడికి సమర్పించాడు. ఇదే యుగంలో రఘువంశాన దశరథాత్మజుడై రాముడిగా అవతరించాడు.

ఇరవైయెనిమిదవ ద్వాపరయుగంలో నరనారాయణులు అర్జున శ్రీకృష్ణులుగా ఆవిర్భవించారు. భూభారం తగ్గించడంకోసం కృష్ణార్జునులు అవతరించారు. కురుక్షేత్ర మహాసంగ్రామంలో భీషణ యుద్ధం చేశారు. ఇలా ప్రతి యుగంలోనూ శ్రీహరి ప్రకృతికి అనురూపంగా అవతారాలు ధరిస్తూనే ఉన్నాడు.

ఈ అఖిలజగత్తూ ప్రకృతికి వశంకదా ! ప్రకృతి కోరినట్టల్లా జగత్తు పరిణతి చెందుతూంటుంది. పురుష ప్రీతికోసం ఆ ప్రకృతి ఈ అఖిల జగత్తునూ నిర్మిస్తుంది. ఆ పరమ పురుషుడు దుర్జ్ఞేయుడు. నిరాలంబుడు. నిరాకారుడు. నిస్పృహుడు. పరాత్పరుడు. సర్వాది. సర్వగుడు. అవ్యయుడు. పరముడు. ఉపాధి సమాశ్రయణంతో (శరీర ధారణతో) మూడు మూర్తులుగా (బ్రహ్మ విష్ణు మహేశ్వరులు)



ప్రకాశిస్తున్నాడు. ఆ పరాప్రకృతి కూడా ఉత్పత్తి కాలయోగంతో మూడు రూపాలుగా భాసిస్తోంది. జగత్తును సృష్టిస్తోంది. పాలిస్తోంది. కల్పాంతంలో ఉపసంహరిస్తోంది. ఆ త్రిమూర్తులూ ఈ త్రిమూర్తులతో కలిసి ఈ మూడు పనులనూ నిర్వహిస్తున్నారు.

తయా యుక్తోఽసృజద్బ్రహ్మా విష్ణుః పాతి తయాన్వితః ।
రుద్రస్సంహరతే కామం తయా సంగళితశ్శివః ॥ (16-25)

జనమేజయా ! ఇది మూలతత్త్వం. ఇది విధితంత్రం. ఈ తంత్రంలో నియంత్రితులై ప్రాణులు ఈ సంసారంలో సుఖదుఃఖాలను అనుభవిస్తున్నారు. *(అధ్యాయం - 16, శ్లోకాలు - 27)*

## ◆ నరనారాయణులు అప్సరసలను అనుగ్రహించడం ◆

వ్యాసమహర్షీ ! బదరికాశ్రమంలో నరనారాయణులకు రంభాద్యప్సరసలతో సంభాషణ జరుగుతుండగా మనం వేరే కథలోకి వెళ్ళాం. ఆ అప్సరసలు నారాయణుడి దివ్యశక్తికి సమ్మోహితలై అతడిని వరించారుగదా ! వివాహమాడి తమతో క్రీడించమనీ, అతడు సృష్టించిన ఊర్వశినీ పదిహేను వేలమంది దివ్యకాంతలనూ ఇంద్రలోకానికి తమకు బదులుగా పంపించమనీ, అభ్యర్థించారుకదా ! దీనికి నారాయణుడు ఆలోచనలోపడ్డాడు అని చెప్పావు. ఆలోచించి ఆ నారాయణుడు వారికి ఏమి సమాధానం చెప్పాడు. ఎలా సమాధానపరిచాడు - ఆ కథాశేషం వినాలని కుతూహలంగా ఉంది. దయచేసి ఆ తరువాయి కథ వినిపించు - అని జనమేజయుడు గుర్తుచేసి అడిగాడు. వ్యాసమహర్షి అందుకున్నాడు.

వారిని శపిద్దామనుకున్న నారాయణుడిని నరుడు వారించాడు. కోపం చల్లార్చాడు. శాంతచిత్తుడై ఆ మహాతపస్వి నారాయణుడు చిరునవ్వులు చిందిస్తూ మధురంగా బదులు పలికాడు.

సుందరాంగులారా ! మేమిద్దరమూ తపస్సులు చేసుకొంటున్నాం. ఈ జన్మలో గృహస్థాశ్రమం స్వీకరించకూడదని సంకల్పించుకున్నాం. అందుచేత మీ కోరికను మన్నించలేను. నన్ను కరుణించి మీ లోకానికి మీరు వెళ్ళిపొండి. ధర్మం తెలిసినవారెవరూ ఇతరులకు వ్రతభంగం కలిగించరు. నియమాలను గౌరవిస్తారు.

తస్మాద్గచ్ఛంతు త్రిదివం కృపాం కృత్వా మమోపరి ।
ధర్మజ్ఞా న ప్రకుర్వంతి వ్రతభంగం పరస్య వై ॥ (17 - 10)



అదీకాక - శృంగారం రసస్థితికి చేరుకుని అనుభవంలోకి రావాలంటే రతి అనేది స్థాయిభావంగా ఉండాలి. అది నాకు ఇప్పుడు లేదు. అందుచేత నేను మీతో సంబంధం పెట్టుకోలేను, ఆనందం అనుభవించలేను. కారణం లేకుండా కార్యోత్పత్తి జరగదన్నట్టే, స్థాయిభావం లేకుండా రసోత్పత్తి జరగదు. ఇది కవులూ కావ్యశాస్త్రవేత్తలూ చెప్పినమాట. ఇంతటి సౌందర్యవతులకు మీకు అందరికీ నేను ఇంతగా అకృత్రిమంగా (సహజంగా) ప్రీతిపాత్రుణ్ణి అయ్యానూ అంటే నిజంగా నేనెంతటి అదృష్టవంతుణ్ణి ! నా రూపమూ నా జన్మా ధన్యమయ్యాయి. కాకపోతే ఈ జన్మలో మీ కోరికను ఆమోదించలేకపోతున్నాను. దయచేసి మీరుకూడా అర్థంచేసుకోండి. నా వ్రతనియమాలను గౌరవించండి. కాపాడండి. మరొక జన్మలో తప్పకుండా మీకు భర్తను అవుతాను.

విశాలనయనలారా ! ఇరవైయెనిమిదవ ద్వాపరంలో నేను దేవకార్యార్థమై భూలోకంలో జన్మిస్తాను. అప్పుడు మీరంతా వేరేవేరే రాజకన్యలుగా జన్మించి నాకు ఇల్లాండ్రు అవుదురుగాని. అందాకా మీరు మీ దేవలోకంలో వేచి ఉండండి.

ఇలా చెప్పి నారాయణుడు వారినందరినీ సమాధానపరిచాడు. వారింక కాదనలేక తమ మన్మథజ్వర తీవ్రతను ఉపశమింపజేసుకుని ఇంద్రలోకానికి తరలి వెళ్ళారు. జరిగినదంతా పూసగుచ్చినట్టు దేవేంద్రుడికి తెలియజేశారు. అతడూ నారాయణుడి మనో ధైర్యాన్నీ తపశ్శక్తినీ మెచ్చుకున్నాడు. తనకు బహూకరించిన ఊర్వశిని చూసి ఆశ్చర్యచకితుడయ్యాడు. ఏమిటి ఈ సౌందర్యం అనుకున్నాడు. అతడు సృష్టించి పంపిన పదిహేనువేలమంది వరాంగనలూ ఇలాగే ఉన్నారు. అప్సరసలను మించిన సౌందర్యం. ఇంద్రుడు మురిసిపోయాడు. నరనారాయణులపట్ల ప్రసన్నుడయ్యాడు.

జనమేజయా ! అటుపైని నరనారాయణుల తపస్సులకు ఇంద్రుడివల్లనే కాదు ఎవరివల్లా ఏ విఘ్నమూ ఏర్పడలేదు. నిశ్చింతగా నిర్విఘ్నంగా తపస్సు చేసుకున్నారు. అనంతరకాలంలో ఈ ఇద్దరే అలనాటి భృగుశాపం కారణంగా కృష్ణార్జునులై అవతరించారు. భూభారాన్ని తొలగించారు.

మహానుభావా ! వ్యాసమహర్షీ ! నువ్వు కృష్ణుడివి (నల్లనివాడు). నారాయణుడూ కృష్ణుడై అవతరించాడు. ఆ అవతార కథను పరిపూర్ణంగా నీ ముఖతః తెలుసుకోవాలని ఉంది. ఇందులో నాకు చాలా సందేహాలున్నాయి. ఆదిశేషుడూ ఆదినారాయణుడూ బలరామకృష్ణులై జన్మించారుకదా ! మరి వీరి తల్లిదండ్రులు దేవకీవసుదేవులు అన్ని కడగండ్లు అనుభవించారు ఎందుకని ? కాళ్ళకూ చేతులకూ ఇనుప సంకెళ్ళతో కంసుడి కారాగృహంలో అన్ని సంవత్సరాలపాటు బందీలై దుఃఖసముద్రానికి అవతలి ఒడ్డు చూసేశారు. ఇలా ఎందుకు జరిగింది ? కృష్ణుడు మధురలో పుట్టి గోకులంలో పెరగడమేమిటి ? కంసుణ్ణి ఎలా సంహరించాడు ? ద్వారకా వృత్తాంతం ఏమిటి ? తరతరాలుగా తాతతండ్రులకు నివాసమై సంపత్సమృద్ధమైన సొంత నగరాన్ని విడిచిపెట్టి శ్రీకృష్ణుడు మరోచోటికి పారిపోవడమేమిటి ? శ్రీ మహావిష్ణువు అవతరించిన వంశాన్ని ఒక బ్రాహ్మణుడు శపించడమేమిటి ? కృష్ణార్జునులు మహావీరులనెందరినో సంహరించి భూభారం తొలగించారుకదా ! శ్రీకృష్ణుడి భార్యలను దొంగలు



దోచుకుంటే అర్జునుడు ఏమీ చెయ్యలేకపోయాడు ఎందుకని ? అంతటి పతివ్రతలకు అలాంటి కష్టం రావచ్చునా ? వచ్చింది. ఎందుకు వచ్చిందిమరి ? అదిసరే ఇంతటి వాసుదేవుడూ పుత్రశోకం చవిచూశాడు. కడపటికి అపమృత్యువు కబళించింది. ఏమిటి ఈ అన్యాయం ? శ్రీమన్నారాయణుడికి కూడా జీవితం ఇంతేనా ? దుఃఖాలేనా ?

ద్రౌపది ? అయోనిజకదా ! యజ్ఞవేదిక నుంచి పుట్టింది కదా ! మహాసాధ్వికదా ! లక్ష్మీదేవి అంశకదా ! ఆవిడ ఎన్ని కష్టాలు పడింది ! నిండు కొలువులో అవమానాలు. దుశ్శాసనుడు జుట్టు పట్టుకొని లాగడాలు. వలువలు వలవడాలు. అడవిలో జయద్రథుడి దౌర్జన్యం. కొలువులో కీచకుడి దుర్మార్గం. చివరికి అశ్వత్థామ దురాగతంతో - తీరని పుత్రశోకం. అలాగే దేవకీదేవి ఆరుగురు పుత్రుల్ని కోల్పోయింది. సాక్షాత్తు దైవమయ్యుండీ సమర్థుడయ్యుండీ శ్రీకృష్ణుడు ఏమి చేసినట్టు ? ఈ పతివ్రతలకు ఇన్ని కష్టాలు రావడమేమిటి ? సరే - ఇవన్నీ కాసేపు అలా ఉంచుదాం. శ్రీహరి కాపాడలేకపోయాడు అనుకుందాం. కనీసం తనను తానైనా కాపాడుకోలేడా ? ఉగ్రసేనుడికి దాసుడై సేవలు చేశాడేమిటి ? ఇది మరీ విడ్డూరంగా ఉంది. రుక్మిణీదేవిని దొంగలాగా అపహరించుకుపోవడం, జరాసంధుడికి భయపడి పారిపోయి సముద్రంలో ద్వారకను నిర్మించుకోవడం - ఇవన్నీ వింతలే. అన్నీ సందేహాలే. నువ్వు సర్వజ్ఞుడివి. అంచేత నిన్నే అడుగుతున్నాను. సవిస్తరంగా సమాధానాలు చెప్పి నా సందేహాలు తీర్చు.

అన్నింటికన్నా మించి అతిరహస్యమైన సందేహం మరొకటి ఉంది. ఎంతకీ అది నన్ను విడిచిపెట్టడం లేదు. అలాగని సమాధానమూ దొరకడం లేదు. నీ చెవిని వేసేస్తాను. వీలువెంబడి జవాబు చెబుదువుగాని. అదే - ద్రౌపది విషయమే. లోకంలో ఎక్కడైనా ఉందా ? ఒక కులాంగనకు అయిదుగురు భర్తలా ? జుగుప్సితంగా లేదూ ? పశుధర్మం కాదూ ? సదాచారం ఒప్పుతుందా ?

**పాంచాల్యాః పంచభర్తృత్వం లోకే కిం న జుగుప్సితమ్ ।**
**పశుధర్మః కథం తైస్తు సమర్థైరపి సంశ్రితః ॥** (17 - 53)

ఇంకొక సంగతి - భీష్ముడు దేవాంశసంభూతుడుగదా ! వంశరక్షణ మిషతో అక్రమ సంతానానికి అనుమతిస్తాడా ? గోళకులను (రండా పుత్రులు) పాలకులుగా నిలబెడతాడా ? ఇంతకన్నా ధర్మహాని ఉందా ? వంశం అంతరించిపోవడం నయంకాదూ ! ఎలాగోలాగా పుత్రుణ్ణి పుట్టించుకోవాలి, వంశం నిలబెట్టుకోవాలి అంటూ మహర్షులు చేసిన ధర్మ నిర్ణయాన్నీ ధర్మ ప్రచారాన్నీ నేను అసహ్యించుకొంటున్నాను.

*(అధ్యాయం - 17, శ్లోకాలు - 55)*

**ధిగ్ధర్మనిర్ణయః కామం మునిభిః పరిదర్శితః ।**
**యేన కేనాప్యుపాయేన పుత్రోత్పాదనలక్షణః ॥** (17 - 55)



## ◆ భూదేవి మొర ◆

జనమేజయా ! అతిమహత్తరమైన కృష్ణచరిత్రను విశదీకరిస్తాను. తెలుసుకో. నీ సందేహాలకు అన్నింటికీ సమాధానాలు లభిస్తాయి. అదీకాక ఇది అద్భుతమైన దేవీచరిత్ర కూడా.

ఒకప్పుడు భూదేవి పాపభారాన్ని భరించలేక భయపడిపోయి దుఃఖిస్తూ, దీనురాలై, గోరూపం ధరించి త్రివిష్టపానికి (దేవలోకం) వెళ్ళింది. శక్రుడు ఈ దీనావస్థను గమనించి, ఏమిటమ్మా కారణం, ఎవరు నిన్ను హింసించారు, నీకు వచ్చిన భయమేమిటి, ఎందుకూ దుఃఖిస్తున్నావు ? అని ఆప్యాయంగా పలకరించాడు. దుఃఖం ఆపుకోలేక భూదేవి బావురుమంది.

శచీపతీ ! దుఃఖం ఎందుకని అడుగుతున్నావా ? తెలియకే అడుగుతున్నావా ? చూడు - నేనెంత భారాన్ని మోస్తున్నానో, నన్ను ఎవరెవరు ఏలుతున్నారో - గమనించు.

జరాసంధ, శిశుపాల, రుక్మి, కంస, నరక, శాల్వ, కేశి, ధేనుక - వత్సక ప్రభృతులు నాకు ఏలికలు. ముచ్చటగా చెప్పుకుందామంటే ఒక్కటంటే ఒక్కటి - సద్గుణం లేనివారు. సర్వధర్మ విహీనులు. సకల దుర్గుణ విరాజితులు. వీళ్ళు పరస్పర విరోధులు. మదోన్మత్తులు. కాలరూపులు. పాపాచారులు. నిరంతరం ఒకరితో ఒకరు కలహించుకుంటూ నన్ను దారుణంగా హింసిస్తున్నారు. ఈ పాపభారాన్ని నేను మొయ్యలేను. ఏమి చెయ్యాలో, ఎవరిని శరణువేడాలో తోచక ఆత్మీయుడవుకదా నీ దగ్గర మొర పెట్టుకుందాం ఏదైనా ఉపాయం చెబుతావని ఇలా వచ్చాను.

అలనాడు విష్ణుమూర్తి వరాహావతారం ధరించి నాకు చేసింది ఉపకారమే అనుకున్నాను. ఇప్పుడనిపిస్తోంది - అది ఉపకారంకాదు అపకారమే అని. చిన్న దుఃఖం నుంచి పెద్ద దుఃఖంలోకి తెచ్చిపడేసినట్టయ్యింది. కశ్యపాత్మజుడు దుష్టహిరణ్యాక్షుడు నన్ను లుంగజుట్టి మహాసముద్రంలోకి విసిరేస్తే శ్రీహరి వరాహరూపం ధరించి హిరణ్యాక్షుణ్ణి సంహరించి, తన బంగారు కోరమీద నన్ను తేల్చి తెచ్చి స్థిరంగా నిలబెట్టాడు కదా ! అప్పటినుంచి స్థిర అనే పేరు నాకు దక్కిందికదా ! ఇప్పటి పరిస్థితి చూస్తే అది అపకారమే అనిపిస్తోంది. అలా చేసిఉండకపోతే, పాతాళంలో సుఖంగా ఉండేదాన్ని. ఈ పాపాత్ముల చేతుల్లో పడి ఇంత పీడ అనుభవించాల్సిన దుర్దశ ఉండేది కాదు. ఇంద్రా ! ఈ దుష్టుల భారాన్ని నేనింక మొయ్యలేను. ఇరవైయెనిమిదవ కలియుగం రాబోతోంది. ఈ పాపభారం ఇంకా పెరిగిపోతుంది. అప్పుడెలాగూ రసాతలానికి పోకతప్పదు. ఈలోగా ఈ దుఃఖసముద్రం నుంచి నన్ను గట్టెక్కించు. భారం తొలగించు - నీ కాళ్ళు మొక్కుతాను.

**తస్మాత్త్వం దేవదేవేశ దుఃఖరూపార్ణవస్య చ ।**
**పారదో భవ భారం మే హర పాదౌ నమామి తే ॥ (18 - 14)**



ఇంత దయనీయంగా భూదేవి అభ్యర్థిస్తే ఇంద్రుడు చలించిపోయాడు. అమ్మా ! నేనేమి చెయ్యగలనూ ? నీ బాధ తీర్చలేను. ఆర్చలేను. బ్రహ్మదేవుడొక్కడే దీనికి సమర్థుడు. అతణ్ణి శరణువేడు. నేనూ తోడు వస్తాను. పద. ఇదే నేను చెయ్యగల ఉపకారం - అన్నాడు.

దేవతాపరివారంతో ఇంద్రుడు వెంటరాగా భూమాత సత్యలోకానికి వెళ్ళింది. చతుర్ముఖుడు స్వాగతం పలికి కుశల ప్రశ్నలు వేశాడు. పొంగివస్తున్న దుఃఖాన్ని నిబ్బరించుకుంటూ కడకొంగుతో కళ్లు ఒత్తుకుంటూ భూదేవి బదులు పలికింది.

సరస్వతీ వల్లభా ! కలికాలం రాబోతోంది. చాలా భయంగా ఉంది. ప్రజలంతా పాపాచారులైపోతారు. పాలకులు దుర్మార్గులవుతారు. పరస్పర విరోధులవుతారు. రాక్షసులుగా మారిపోతారు. అన్నీ దొంగ పనులే చేస్తారు. ఇప్పటికే ఈ లక్షణాలు ప్రస్ఫుటంగా కనపడుతున్నాయి. నాకు భారం పెరిగిపోయింది. మొయ్యలేకపోతున్నాను. ఒక్కొక్కరికీ ఎంతెంత సైన్యమని ! ఈ రాజులనూ సైన్యాలనూ సంహరించి నాకు భారం వదిలించు. ఇందుకోసమే కోరి నీ దర్శనానికి వచ్చాను.

భూదేవీ ! ఇది నావల్ల అయ్యే పనికాదు. జనార్దనుడే సమర్థుడు. పద. నేనూ వస్తాను. అతడిని అభ్యర్థించుదాం - అని బ్రహ్మదేవుడు హంస వాహనంపై బయలుదేరాడు. అందరూ విష్ణుసదనం చేరుకున్నారు. ముందుగా చతుర్ముఖుడు శ్రీమహావిష్ణువును స్తుతించాడు -

**సహస్రశీర్షా త్వమసి సహస్రాక్షః సహస్రపాత్ ।**
**త్వం వేదపురుషః పూర్వం దేవదేవః సనాతనః ॥ (18-26)**

మధుసూదనా ! నువ్వు సహస్రశీర్షుడవు. సహస్రాక్షుడవు. సహస్రపాదుడవు. వేదపురుషుడవు. దేవదేవుడవు. సనాతనుడవు. భూతభవిష్యద్వర్తమానాలన్నీ నీకు స్పష్టంగా తెలుసు. మాకందరికీ అమరత్వాన్ని ప్రసాదించింది నువ్వే. నువ్వు ఎంతటి మహిమాన్వితుడవో ఎవ్వరూ గ్రహించలేరు. జగత్కర్తవు నువ్వే. రక్షకుడవు నువ్వే. భక్షకుడవూ నువ్వే. సర్వజగత్తుకూ ప్రభువు-నువ్వు.

విరించి ఇలా స్తుతించితే విష్ణుమూర్తి ప్రసన్నుడయ్యాడు. అందరికీ దర్శనం అనుగ్రహించాడు. స్వాగతం పలికాడు. ఏ పనిమీద వచ్చారని ప్రశ్నించాడు.

భూదేవి పక్షాన బ్రహ్మదేవుడే పలికాడు. దయానిధీ ! కలియుగం రాబోతోంది. కనక ఈ ద్వాపరాంతంలో నువ్వు భూలోకాన అవతరించి దుష్టులను సంహరించి భూభారాన్ని తగ్గించు. భూదేవి ఆవేదనను తీర్చు - అని అభ్యర్థించాడు. అప్పుడు విష్ణుమూర్తి ఇలా పలికాడు.



## ◆ శ్రీహరి పరాధీనత ◆

భూదేవీ ! బ్రహ్మాదిదేవతలారా ! ఈ విషయంలో నేను స్వతంత్రుణ్ణి కాను. నేనే కాదు బ్రహ్మదేవుడూ శివుడూ ఇంద్రుడూ దిక్పాలకులూ చంద్రుడూ సూర్యుడూ అగ్ని - ఎవ్వరూ స్వతంత్రులు కారు. సృష్టి అంతా యోగమాయావశంవదం. బ్రహ్మాదిస్తంభపర్యంతమూ గుణసూత్రగ్రథితమై నడుస్తోంది. ఆ మహామాయ తన ఇచ్ఛ ప్రకారం ఏది ఎప్పుడు ఎలా చెయ్యాలనుకుంటే అలా చేస్తుంది. మనమందరం ఆ మాయాశక్తికి వశులమే. నేను స్వతంత్రుడినే అయితే ఎక్కడో సముద్రంలో ఒక చేపగానూ ఒక తాబేలుగానూ జన్మిస్తానా ? ఆలోచించండి. పశుజన్మలో భోగం ఉందా, కీర్తి ఉందా, సుఖం ఉందా ? పోనీ అంటే, క్షుద్రజంతువుగా అవతారం ధరించడంలో ఏమైనా మహాపుణ్యం ఉందంటారా ? వరాహం అయ్యాను, నరసింహం అయ్యాను, వామనుడిని అయ్యాను, పరశురాముణ్ణి అయ్యాను. ఎందుకయ్యానంటారు ? ఆ రూపాలు కానీ ఆ చేసిన పనులు కానీ - ఎవరైనా ఎన్నడైనా ఇష్టపతారా ? ఇరవైయొక్క సార్లు క్షత్రియ సంహారం చేసి పరశురాముడుగా నెత్తురుటేర్లు సృష్టించాను. ఇది ఎంత ఘోరం ! ఎంత నీచం ! గర్భస్థ శిశువులనుకూడా సంహరించాను. ఇదంతా ఇష్టపడే చేశానంటారా ? తరవాత దాశరథిగా అవతరించాను. దండకారణ్యాలలో నివసించాను. జటావల్కలాలు ధరించి మునివృత్తిని అవలంబించాను. భీషణ నిర్జనారణ్యాలలో ఒంటరిగా జీవించాను. వేటాడి సంపాదించుకున్న (పచ్చి) మాంసంతో కాలం గడిపాను. ఇది ఇష్టపడవలసిన విషయమా, సిగ్గు పడవలసిన విషయమా ? మీరే చెప్పండి.

బంగారులేడి కనపడితే అది రాక్షసుడని గ్రహించలేకపోయాను. దశకంఠుడి ప్రణాళిక అని గుర్తించలేకపోయాను. కుటీరంలో జానకిని ఒంటిరిగా వదిలేసి వెంటబడ్డాను. లక్ష్మణుడుకూడా సీతను అలాగే వదిలేసి వచ్చేశాడు. నామాట లక్ష్యపెట్టకుండా వచ్చేశాడు. ప్రాకృత పురుషులం అయిపోయాం. రావణుడు భిక్షురూపం ధరించి వచ్చి జానకిని అపహరించాడు. అప్పటి నా శోకం ఇప్పటికీ నన్ను భయపెడుతోంది. అడవులన్నీ మారుమ్రోగేట్టు విలపించాను. కార్యవశాత్తూ సుగ్రీవుడితో మైత్రి కుదుర్చుకుని ప్రతిజ్ఞచేసి వాలిని అన్యాయంగా సంహరించాను. శపించకుండా వారించాను. వానరుల సహాయంతో లంకను చేరుకున్నాను.

> అన్యాయేన హతో వాలీ శాపాచ్చైవ నివారితః ।
> సహాయాన్ వానరాన్ కృత్వా లంకాయాం చలితః పునః ॥ (18-47)

నేనూ నా సోదరుడూ నాగపాశబద్ధులమై మూర్ఛపోయాం. ఇదేమిటని అందరూ ఆశ్చర్య పోయినవారే. అప్పుడు గరుత్మంతుడు దయతలిచి వచ్చాడు కనక సరిపోయింది. నాగపాశ విముక్తులం అయ్యాము. అప్పుడు నేనెంత దిగులుపడ్డానో మీకు తెలుసా ! దైవం ఇంకా ఏమేమి కష్టాలు కలిగిస్తుందో



చూద్దాం అనిపించింది. రాజ్యం పోయింది. వనవాసం ప్రాప్తించింది. తండ్రి మరణించాడు. ప్రియ భార్య అపహరించబడింది. కష్టసాధ్యమైన యుద్ధం దాపురించింది. నిర్ధనుడనై అసహాయుడనై పాదచారినై భార్యతో కలిసి పద్నాలుగేళ్ళు గాఢారణ్యాలలో గడిపాను. క్షత్రియుడనై పుట్టి బోయవాడుగా జీవించాను.

దైవం అనుకూలించి జయించాను. రావణుడు మరణించాడు. సీతను తెచ్చుకున్నాను. అయోధ్యను తిరిగిపొందాను. ఆ భోగాలుమాత్రం ఎంతకాలం ! లోకాపవాదానికి భయపడి సీతను అడవుల్లో వదిలేశాను. మళ్ళీ నా దుఃఖం నాదే. భార్యా వియోగ దుఃఖం. వద్దు, పగవారికైనా వద్దు. కడపటికి భూమిని చీల్చుకుని నా సీత పాతాళానికి వెళ్ళిపోయింది.

రామావతారంలో ఇన్ని రకాలుగా ఇంతింత దుఃఖం అనుభవించానంటే నేను స్వతంత్రుడినో పరతంత్రుడినో మీరే ఊహించండి. చతుర్వదనా ! నీకు తెలుసును గదా ! నువ్వూ రుద్రుడూ ఇంద్రుడూ అందరూ పరతంత్రులే. అందరం ఆ మహామాయకు అధీనులమే. ***(అధ్యాయం - 18, శ్లోకాలు - 60)***

దేవతలారా ! మనమంతా మాయామోహితులమై ఈ తత్త్వాన్ని గ్రహించలేకపోతున్నాం. జగద్గురువును స్మరించలేకపోతున్నాం. సచ్చిదానందుడు, అవ్యయుడూ శాంతుడూ అయిన పరమపురుషుడిని మర్చిపోతున్నాం. నేను విష్ణువుని, నేను విరించిని, నేను శివుడను - అని అహంకరించి మోహితులమవుతున్నాం. అతి సనాతనమూ పరాత్పరమూ అయిన వస్తువును తెలుసుకోలేకపోతున్నాం. ఇంద్రజాలికుడి చేతిలో కొయ్యబొమ్మలాగా నేనూ ఇంతే. ఎప్పుడూ మాయామోహితుడినై ప్రవర్తిస్తూంటాను.

**యన్మాయామోహితశ్చాహం సదా వర్తే పరాత్మనః ।**
**పరవాన్దారు పాంచాలీ మాయికస్య యథా వశే ॥** **(19 - 4)**

పద్మసంభవా ! కల్పారంభంలో నువ్వూ నేనూ శివుడూ కలిసి వెళ్ళి క్షీరసముద్ర మధ్యభాగాన మణిద్వీపంలో మందార తరుచ్ఛాయలో రాసమండలంలో ఆ మహామాయను ఆదిపరాశక్తిని దర్శించాంకదా ! సర్వకామప్రద అయిన ఆ శక్తిని అందరూ కలిసి స్తుతించండి. మనస్సుల్లో స్మరించండి.

శ్రీమహావిష్ణువు ఇలా సలహా ఇవ్వగానే బ్రహ్మాది దేవతలందరూ సకలభువనేశ్వరిని మనసారా స్మరించారు. ఆదిపరాశక్తి దర్శనం అనుగ్రహించింది. దేవతలంతా ముక్తకంఠంతో స్తుతించారు.

**ఊర్ణనాభాద్యథా తంతుః విస్ఫులింగా విభావసోః ।**
**తథా జగద్యదేతస్యా నిర్గతం తాం నతా వయమ్ ॥** **(19 - 10)**



జగన్మాతా ! సాలీడునుంచి దారంలాగా, నిప్పు నుంచి రవ్వల్లాగా ఈ జగత్తు నీనుంచి ఆవిర్భవించింది. చరాచర జగత్తు అంతా నీ మాయాశక్తికి లోబడిఉంటుంది. ఓ భువనేశ్వరీ ! ఓ కరుణాసముద్రమా ! నీకివే వందనాలు. నిన్ను తెలుసుకోకపోతే భవబంధాలు ఏర్పడతాయి. నిన్ను తెలుసుకుంటే భవబంధాలు నశిస్తాయి. నువ్వు సంవిద్రూపవు (జ్ఞాన రూప). దేవీ ! మమ్మల్ని నడిపించు. ఓ మహాలక్ష్మీ ! ఓ మహాశక్తీ ! మమ్మ్ము నడిపించు.

యదజ్ఞానాద్భవోత్పత్తిః యద్ జ్ఞానాద్భవనాశనమ్ ।
సంవిద్రూపాం చ తాం దేవీం స్మరామః సా ప్రచోదయాత్ ॥
మహాలక్ష్మ్యై చ విద్మహే సర్వశక్త్యైచ ధీమహి ।
తన్నో దేవీ ప్రచోదయాత్ ॥ **(19 - 12, 13)**

ఓ భువనార్తి హారిణీ ! అనుగ్రహించు. మా కోరిక సఫలం చేసి దుఃఖాలను తొలగించి సుఖ సంతోషాలను ప్రసాదించు. రాక్షసులను మట్టుబెట్టి భూభారం తగ్గించు. దేవతలను రక్షించడం, దానవులను శిక్షించడం నా కర్తవ్యాలని నువ్వే ప్రకటించావుకదా ! కంస కేశి సాల్వ జయద్రథాదులు మదోన్మత్తులై భూగోళం మీద వీరవిహారం చేస్తున్నారు. వారినందరినీ సంహరించి భూదేవికి భారం వదిలించు. త్రిమూర్తులకుకూడా లొంగని మహామహాదానవులను నువ్వు ఒక కేళీవిలాసంగా అంతమొందించగలవు. నీ శక్తి లేనిదే ఈ త్రిమూర్తులు ఏమీ చెయ్యలేరుగదా ! అనంతుడు ఈ భూమిని ధరించలేడుగదా ! ఓ చంద్రకళావతంసా ! మా విన్నపం ఆలించి మా దైన్యం తొలగించు - అని బృందగానంగా అందరూ కలిసి స్తుతించారు. అభ్యర్థించారు.

జగన్నాయకీ ! సరస్వతి లేనిదే చతుర్ముఖుడు జగత్తును సృష్టించలేడు. లక్ష్మీదేవి లేనిదే విష్ణుమూర్తి రక్షించలేడు. పార్వతి లేనిదే శివుడు సంహరించలేడు. వారికి ఆ శక్తులను సమకూర్చినదానవు నువ్వేకదా - అని ఇంద్రుడు ప్రత్యేకంగా స్తుతించాడు.

ఓ త్రిలోకీ ! నీ కళావైభవాన్ని మాకు అందించావు కనక మేము త్రిమూర్తులమై పూజలు అందుకుంటున్నాం. ప్రభుత్వం చెలాయిస్తున్నాం. నిజానికి సమస్త విభవేశ్వరివి నువ్వే - అని విష్ణుమూర్తి కొసమెరుపుగా ఈ స్తోత్రపాఠానికి ముక్తాయింపు ఘటించాడు.

జగదీశ్వరి మనస్సు ఆనందంతో పులికించింది. దేవతలారా ! పని ఏమిటో చెప్పండి. ఆందోళన పడకండి. అది ఎంతటి అసాధ్యమైనా సురల కోరిక తీరుస్తాను. మీకుగానీ ఈ భూదేవికిగానీ వచ్చిన కష్టం ఏమిటో చెప్పండి - అని అడిగింది. అడిగిందే తడవుగా దేవతలు ఏకకంఠంతో విన్నవించారు.



భువనేశ్వరీ ! పాలకులందరూ దుష్టులై పీడిస్తూంటే భరించలేక ఈ భూదేవి శోకిస్తూ వణికిపోతూ మా దగ్గరికి వచ్చింది. భూభారం తగ్గించమని అభ్యర్థించింది. దీనికి సమర్థురాలవు నువ్వే అని నిన్ను ప్రార్థించాం. ఇది మా దేవతలందరి అభ్యర్థన. దయచేసి పూనుకొని భూభారం తగ్గించు. దుష్టులను వెంటనే సంహరించు. ఇదివరలో నువ్వు మహిషాసురుడిని సంహరించావు. వాడి సహాయకులను కోట్లాదిగా మట్టుబెట్టావు. శుంభ నిశుంభ రక్తబీజ చండముండ ధూమ్రలోచన దుర్ముఖ దుస్సహ కరాళాది మహాదైత్యవీరులను క్రూరాతిక్రూరులను అవలీలగా అంతమొందించావు. మళ్ళీ ఇప్పుడు అలాంటి అవసరం వచ్చింది. దేవతా శత్రువులైన దుష్టభూభుజులను వెంటనే సంహరించి భూదేవిని రక్షించు తల్లీ !

దేవతల ప్రార్థనను శ్రద్ధగా ఆలకించిన పరాశక్తి పెద్దపెట్టున నవ్వింది. కన్గొసలు ఎరుపెక్కాయి. మేఘగంభీర స్వనంతో పలికింది -

## ◆ దుష్టశిక్షణకు జగన్మాత వ్యూహం ◆

దేవతలారా! ఈ విషయమై నేను ఎప్పుడో ఆలోచించాను. దుష్టులను శిక్షించి భూదేవికి బరువు తగ్గించడానికి ప్రణాళిక రచించాను. మీరు అందరూ మీమీ అంశలతో భూలోకంలో జన్మించాలి. భూభారాన్ని తొలగించాలి. అవసరమైన శక్తిని నేను అనుగ్రహిస్తాను. కశ్యపుడు భార్యాసహితుడై యదువంశంలో ఆనకదుందుభిగా అందరికంటే ముందు అవతరిస్తాడు. భృగుశాపం ఉందికనక విష్ణుమూర్తి తన అంశతో వసుదేవుడికి పుత్రుడుగా అవతరిస్తాడు. నేను గోకులంలో యశోదకు కూతురుగా జన్మిస్తాను. కారాగారంలో ఉన్న విష్ణుమూర్తిని గోకులానికి చేరుస్తాను. దేవతాకార్యం సంపూర్ణంగా నిర్వహిస్తాను. ఆదిశేషుడు రోహిణీ గర్భసంజాతుడు అవుతాడు. ఈ ఇద్దరూ నా శక్తితో సర్వ దుష్టసంహారం చేస్తారు. ఇది ఈ ద్వాపరాంతంలోనే జరుగుతుంది. ఇంద్రాంశంతో అర్జునుడు జన్మించి దుష్టసైన్యాన్ని మొత్తంగా సంహరిస్తాడు. ధర్మాంశతో యుధిష్ఠిరుడు ఆవిర్భవించి పరిపాలకుడు అవుతాడు. వాయుదేవుని అంశతో భీముడూ, అశ్వినీదేవతల అంశలతో నకులసహదేవులూ, అష్టమవసువుగా (వసు అంశంతో) భీష్ముడూ జన్మించి శత్రుబలాలను క్షీణింపజేస్తారు. కాబట్టి ఇక మీరంతా నిశ్చింతగా వెళ్ళండి. ధరాదేవి స్థిరాదేవి అవుతుంది. భారం తొలగిపోతుంది. మీరంతా నిమిత్తమాత్రులు. స్వశక్తితో నేనే ఈ కార్యం నెరవేరుస్తాను. ఇది నిశ్చయం. కురుక్షేత్రంలో సర్వక్షత్రియ సంహారం జరుగుతుంది. అసూయ, ఈర్ష్య, తృష్ణ, మమత, జిగీష, మోహమూ, కామమూ మొదలైన దోషాలతోనూ, బ్రాహ్మణశాపం కారణంగానూ యాదవులు పూర్తిగా నశిస్తారు. శ్రీకృష్ణ భగవానుడుకూడా శాపకారణంగానే అవతారం చాలిస్తాడు. మీరంతా మీమీ అంశలతో మధురలో గోకులంలో అవతరించి అతడికి సహాయపడతారు.



అని చెప్పి ఓదార్చి యోగమాయ అంతర్ధానం చెందింది. భూదేవి తృప్తిగా నిట్టూర్చింది. దేవతలంతా ఊపిరి పీల్చుకున్నారు. అందరూ తమతమ నెలవులకు వెళ్ళిపోయారు.

*(అధ్యాయం - 19, శ్లోకాలు - 46)*

## ◆ వ్యాసకృత యోగమాయా ప్రశంస ◆

జనమేజయా! యోగమాయ చెప్పినట్టు ప్రభాసకురుక్షేత్రంలో ధరాభారావతరణం ఎలా జరిగిందో ఇక వినిపిస్తాను ఆలకించు. యదువంశంలో విష్ణుమూర్తి శ్రీకృష్ణుడుగా అవతరించడం కేవలం ఈ పనికోసమే. భూభారం తొలగించడమే ఆ అవతారానికి లక్ష్యం. ఇందులో ఆశ్చర్యం ఏమీలేదు. ఆదిపరాశక్తి త్రిమూర్తులనే ఆడిస్తుంది. ఇతరులమాట చెప్పాలా! గర్భవాసదుఃఖాన్ని విష్ణుమూర్తికి కల్పించడం ఆ జగన్మాతకు అదొక లీలావినోదం. రామావతారంలో అంతకుమించిన మోహపాశాలను కల్పించింది. దేవతలను వానరులుగా అవతరింపజేసింది. అందరినీ మమకార సమ్మోహితులను చేసింది. దుఃఖాలు చవిచూపించింది. ఎవరో మహాయోగులు మాత్రమే ఈ పాశాలను ఛేదించుకుని ముక్తసంగులై ముముక్షువులు అవుతారు. ఇది అందరికీ సాధ్యంకాదు. ఆ విశ్వేశ్వరీదేవిని ఉపాసించి ఆ భక్తిలో లేశలేశాంశలేశ లేశలవాంశకాన్ని పొందగలిగితే చాలు జీవుడు ముక్తుడవుతాడు. అలాంటి ఆదిపరాశక్తిని ఆరాధించని వ్యక్తి అంటూ ఎవడైనా ఉంటాడా? భువనేశీ! అంటే చాలు అన్నవాడికి ముల్లోకాలూ స్వాధీనపరుస్తుంది. మాం పాహి అనికూడా అంటే ఇంక ఆ భక్తుడికి ఇవ్వ గలిగింది లేకపోవడంతో జగన్మాత ఋణపడిపోతుంది.

> తామేవ సముపాసంతే దేవీం విశ్వేశ్వరీం శివామ్ ।
> యద్భక్తి లేశ లేశాంశలేశ లేశలవాంశకమ్ ॥
> లబ్ధ్వా ముక్తో భవేజ్జంతుస్తాం న సేవేత కో జనః ।
> భువనేశీత్యేవ వక్త్రే దదాతి భువనత్రయమ్ ॥
> మాం పాహీత్యస్య వచసో దేయాభావా దృణాన్వితా ।
> విద్యాऽవిద్యేతి తస్యా ద్వేరూపే జానీహి పార్థివ ॥ (20 - 8, 9, 10)

జనమేజయా! విద్య - అవిద్య అని ఆ మహాశక్తికి రెండురూపాలు. విద్యతో ముక్తుడవుతాడు. అవిద్యతో బద్ధుడవుతాడు. త్రిమూర్తులూ ఆమెకు వశవర్తులు. అవతారాల పగ్గాలన్నీ ఆవిడ చేతిలోనే ఉంటాయి. ఒకప్పుడు వైకుంఠంలో క్షీరసాగరంలో సుఖాలు అనుభవించే శ్రీహరి మరొక్కప్పుడు దానవులతో యుద్ధాలు చేస్తుంటాడు. మరొకప్పుడు విస్తృతంగా యజ్ఞాలు చేస్తుంటాడు. ఇంకోసారి తపస్సులు చేస్తూ తీర్థాలు సేవిస్తుంటాడు. ఇంకో సమయంలో ఆదిశేషుడిమీద పడుకుని యోగనిద్రపోతూ ఉంటాడు. ఏమైనా - ఇంతటి శ్రీమహావిష్ణువూ ఏనాడూ స్వతంత్రుడు కాడు. బ్రహ్మరుద్రేంద్రవరుణ



కుబేర యమాగ్ని రవీందు ప్రభృతి దేవతలూ దేవనాయకులూ ఎవ్వరూ స్వతంత్రులు కారు. సనకసనందనాది మునీశ్వరులూ వసిష్ఠాది మహర్షులూ అందరూ జగదంబకు వశంవదులే. ఆటబొమ్మలే. ముకుతాడువేస్తే పశువులు ఎలా చెప్పినమాట వింటాయో అలాగే దేవతలంతా కాలపాశనియంత్రితులై జగన్మాతకు వశవర్తులై ఉంటారు.

హర్షమూ, శోకమూ, నిద్ర, మెలకువ, అలసత మొదలైన భావాలూ అవస్థలూ సకలప్రాణికోటికీ (దేహధారులందరికీ) సమానం. దేవతలను అమరులు (మరణంలేనివారు) - నిర్జరులు (ముసలితనం లేనివారు) - అంటూ గ్రంథకర్తలు కీర్తించడం ఏదో మాటవరసకే తప్ప పరమార్థతః ఇది సత్యం కాదు. ఉత్పత్తి స్థితి వినాశాలూ దేవతలందరికీ ఉన్నాయి. ఇది సత్యం. మరింక అమరులు ఏమిటి, నిర్జరులేమిటి? పుడుతున్నారు, దుఃఖాలు అనుభవిస్తున్నారు, అటుపైని గిడుతున్నారు. వీరిని దేవ - దేవతా శబ్దాలతో వ్యవహరించడంకూడా సమంజసంకాదు. (దీవ్యంతి క్రీడంతి సుఖేషు ఇతి దేవాః = సుఖాలలో తేలియాడేవారు). దుఃఖాలలో ఎలా క్రీడించగలుగుతున్నారు మరి? క్షణంలో ఉత్పత్తినాశాలు కనిపిస్తున్నాయి కదా! ఆయుర్దాయం తీరగానే జలచర కీటక మశకాదుల్లాగా అంతరిస్తున్నారు. అంచేత వీరిని అమరులు (అమరాః) అనడానికి వీలులేదు. "మరాః" అనవలసిందే. కాకపోతే ఆయుర్దాయంలో ఉండే హెచ్చుతగ్గులనుబట్టి దేవతలనీ మానవులనీ భేదాలు ఏర్పడుతున్నాయి. దేవతలలోకూడా ఎక్కువ ఆయుర్దాయం కలవారు బ్రహ్మ రుద్ర విష్ణువులు. ఇదే క్రమంలో నశిస్తున్నారు. ఉత్తరోత్తరంగా అభివృద్ధి చెందుతున్నారు. దేహధారికి నాశం తప్పదు. మృతునికి పునర్జన్మ తప్పదు. అందరికీ ఇదొక చక్రం. అనివార్యం.

> మానవం దేహవతో నాశః మృతస్యోత్పత్తిరేవ చ ।
> చక్రవద్భ్రమణం రాజన్ సర్వేషాం నాత్ర సంశయః ॥ (20 - 26)

మోహజాలంలో చిక్కుకున్నవాడికి ముక్తిలేదు. మాయ ఉన్నంత కాలమూ మోహం నశించదు. సృష్టిసమయంలో అందరూ ఆవిర్భవిస్తారు. కల్పాంతంలో మళ్ళీ అందరూ నశిస్తారు. దేని నాశానికి దేన్ని నిమిత్తంగా బ్రహ్మ సృష్టిస్తాడో దానితోనే అది నశిస్తుంది. మరొక కారణం ఉండదు. జన్మమృత్యుజరావ్యాధి దుఃఖాలూ సుఖాలూ అన్నీ విధినిర్ణయం ప్రకారమే జరుగుతాయి. అందరికీ సుఖప్రదులైన ప్రత్యక్షదైవాలు సూర్యచంద్రులు. వారికీ శత్రుపీడలు ఉన్నాయి. దుఃఖాలు ఉన్నాయి. సూర్యుడి కొడుకు మందుడు (శనీశ్వరుడు). చంద్రుడు కళంకి. క్షయరోగ పీడితుడు (పదిహేనురోజులు క్షీణదశ). చూశావా జనమేజయా! ఎంతటివారికైనా విధిసూత్రం అనుల్లంఘ్యం.



వేదాలనునిర్మించి జగత్తును సృష్టించి అందరికీ బుద్ధులు గరపిన చతుర్ముఖుడు సొంతకూతురు సరస్వతిని చూసి మనస్సులో కలత చెందాడు. శివుడంతటివాడు భార్యావియోగాన్ని అనుభవించాడు. సతీదేవి అగ్నికి ఆహుతి అయినప్పుడు ఎంతగా దుఃఖించాడో. అందరకీ ఆర్తిహరుడైన హరుడికే ఆర్తి తప్పలేదు. భార్యావియోగంలో విరహాగ్నిని తట్టుకోలేక శివుడు కాళిందిలో (యమున) మునిగితే ఆ వేడికి అది నల్లబడిపోయింది. ఆ తాపంలో మతిచలించి తిరుగుతూ దిగంబరుడై శివుడు భృగుమహర్షి ఆశ్రమంలోకి ప్రవేశించాడు. అప్పుడు ఆ మహర్షి శపించాడుకూడా. సిగ్గులేనివాడా! నీ లింగం ఊడిపడిపోవుగాక - అన్నాడు. ఇవి శివుడి కష్టాలు. దేవేంద్రుడు వృషభావతారం ధరించి భూలోకంలో వాహనమయ్యాడు.

వివేకవంతుడూ సర్వజ్ఞుడూ అని పేరువడసిన విష్ణుమూర్తి బంగారులేడిని చూసి మోసపోయాడు. రాక్షసుడని తెలుసుకోలేకపోయాడు. భార్యావిరహంలో కామమోహితుడై మామూలు మనిషికన్నా దారుణంగా ఓలుఓలున విలపించాడు. మూఢుడై చెట్టునూ పుట్టనూ జానకి జాడ చెప్పమని బతిమాలాడు. లక్ష్మణా! విరహం తట్టుకోలేను మరణిస్తానన్నాడు. నేను మరణిస్తే నువ్వూ మరణిస్తావు. మన ఇద్దరి వార్త తెలిసి మన తల్లులూ సోదరులూ మరణిస్తారు. కైకేయి కోరిక తీరుతుంది - అంటూ రోదించాడు. జానకీ, జానకీ! కనిపించవా కనిపించవా - అంటూ అడవులలో పరుగులుపెట్టాడు. సర్వలోక శరణ్యుడైన రాముడు చివరికి వానరులను శరణుజొచ్చాడు. సరే, కడపటికి రావణాది రాక్షసులను సంహరించి సీతను తిరిగి పొందగలిగాడనుకో. అది వేరే సంగతి. యోగమాయ బలం ఎంతటిదో గ్రహించు. ఈ ప్రపంచాన్ని భ్రమింపజేసి పరిభ్రమింపజేస్తున్నది ఆ యోగమాయ. విష్ణువు తదధీనుడై కృష్ణుడుగా అవతరించిన కథ విందువుగాని, చెబుతాను.

## ◆ కంస దౌష్ట్యం ◆

యమునాతీరంలో అందమైన మధువనం ఉండేది. మధుపుత్రుడు లవణాసురుడు దానికి అధిపతి. వాడు వరదానగర్వితుడై శిష్టులను పలువిధాల హింసిస్తుంటే లక్ష్మణ సోదరుడు శత్రుఘ్నుడు తీవ్రయుద్ధం చేసి సంహరించాడు. అక్కడే మధురానగరాన్ని నిర్మించి తన పుత్రులు పుష్కరాక్షులనిద్దరినీ పరిపాలకులుగా నియమించాడు. కాలక్రమాన శత్రుఘ్నుడు స్వర్గస్థుడయ్యాడు. అటుపైని సూర్యవంశం నశించింది. యయాతి తనయులైన యాదవులు ఆ మధురను రాజధానిగా చేసుకున్నారు. శూరసేనుడు మొదటి అధిపతి అయ్యాడు. అతడికి వరుణదేవుడి శాపం కారణంగా కశ్యపుడు వసుదేవుడై జన్మించాడు. దశదిశలా ఖ్యాతిగడించాడు. అదేకారణంగా అదితి దేవకుడికి దేవకీదేవిగా జన్మించింది. ఉగ్రసేనుడికి కంసుడు జన్మించాడు. దేవకుడు దేవకీదేవిని వసుదేవుడికిచ్చి వివాహం చేశాడు. ఆ సందర్భంలో ఆకాశవాణి ఇలా పలికింది.

కంసా! దేవకీదేవికి అష్టమగర్భంలో జన్మించిన కుమారుడు నిన్ను సంహరిస్తాడు - తెలుసుకో.



ఇది విని కంసుడు ఆశ్చర్యపోయాడు. దేవవాక్యంకదా అసత్యంకాదు అనుకున్నాడు. దేవకీదేవిని సంహరించేస్తే ఇక తనకు ఈ మృత్యుభయం ఉండదు అనుకున్నాడు. పరమపూజ్యురాలైన మేనత్తను ఎలా చంపడమా అని రవ్వంత సంకోచించాడు. (ఇయం పితృష్వసా పూజ్యా కథం హన్మీత్యచింతయత్ 20 - 67) బాగా ఆలోచించాడు. సొంత ప్రాణాలను కాపాడుకోవడానికి ఎంతటి పాపమైనా చెయ్యవచ్చు అని ఒక నిశ్చయానికి వచ్చాడు. కొత్త పెళ్ళికూతురు దేవకీదేవి జుట్టుపట్టుకుని కత్తి దూశాడు. వసుదేవుడి అనుచరులూ పెళ్ళికివచ్చిన బంధువులూ అడ్డుపడ్డారు. కత్తులు దూశారు. కంసుడితో యుద్ధం చేశారు. వృద్ధయాదవులు కల్పించుకుని యుద్ధం విరమింపజేశారు.

కంసా! ఏమిటి ఈ మూర్ఖత్వం ? మేనత్త పరమపూజ్యురాలు. పైగా పెళ్ళికూతురు. ప్రాణాలు తీస్తావా? ఎంత అశుభం! ఎంత అమంగళం !

> **పితృష్వసేయం తే వీర**
> **పూజనీయా చ బాలిశ ।**
> **న హంతవ్యా త్వయా వీర**
> **వివాహోత్సవ సంగమే ॥** **(20 - 76)**

స్త్రీహత్యా దోషం మహాపాతకం. ఆకాశంలో ఎవరో ఏదో పలికితే నమ్మెయ్యడమేనా? ఏ శత్రువో అదృశ్యరూపంలో అలా పలికి ఉండవచ్చుగదా? నీ కీర్తిని నాశనం చెయ్యడానికీ వసుదేవుడి కుటుంబాన్ని ధ్వంసం చెయ్యడానికీ నీ శత్రువో అతడి శత్రువో ఈ కుట్రపన్ని ఉండవచ్చుగదా? ఈ మాత్రం వివేకం లేకపోతే ఎలా? మహావీరుడవయ్యుండీ భూతభాషితానికి (అశరీరవాణి) భయపడిపోతున్నావా? పెళ్ళిపీటలమీద సొంత మేనత్త ప్రాణాలు తీయడానికి సాహసిస్తున్నావా? అయ్యయ్యో ! పిచ్చివాడా! నువ్వు ఎంతగా ప్రయత్నం చేస్తేమాత్రం నీకు రాసిపెట్టి ఉన్నది తప్పుతుందా? ఎవరికైనా అలా తప్పిందా? (పితృష్వసా న హంతవ్యా వివాహసమయే పునః 20 - 81).

ఈ ప్రబోధంతో కంసుడు శాంతించాడు. అప్పుడు నీతిజ్ఞుడైన వసుదేవుడు ఉభయపక్షాలా బాగా ఆలోచించి ఒక ప్రతిపాదన చేశాడు.

కంసా! నేను సత్యాన్ని నమ్ముకున్నవాడిని. ఈ ముల్లోకాలకూ సత్యమే ఆధారమని విశ్వసించినవాడివి. నీకు మాట ఇస్తున్నాను. నన్ను నమ్ము. దేవకీ పుత్రులను పుట్టినవాడిని పుట్టినట్టు నీకు అర్పిస్తాను. నీ ఇష్టం వచ్చినట్టు చేసుకుందువుగాని. నేను మాట తప్పితే నా పూర్వీకులు అందరూ కుంభీపాక నరకానికి పోతారు.

ఈ ప్రతిపాదనకు సభ్యులందరూ హర్షించారు. వసుదేవుడు మాటకు కట్టుబడే మనిషి కనక విశ్వసించవచ్చునన్నారు. కంసుడు సరే అని దేవకీదేవి జుట్టు వదిలిపెట్టాడు. పెళ్ళి భజంత్రీలు మ్రోగాయి. దేవకీవసుదేవులు స్వజనంతో తమ మందిరానికి వెళ్ళారు. ***(అధ్యాయం - 20, శ్లోకాలు - 88)***



## ◆ దేవకీవసుదేవ సంవాదం ◆

అటుపైని కొంతకాలానికి దేవకీదేవి గర్భం ధరించింది. పదినెలలు మోసి మగబిడ్డను ప్రసవించింది. వసుదేవుడు తన శపథాన్నీ అలనాటి సంఘటననూ గుర్తుచేశాడు. బిడ్డను కంసుడికి అప్పగిస్తానన్నాడు. కర్మ పరిపాకం మనబోంట్లకు దుర్జ్ఞేయం. అందరూ కాలపాశానువర్తులే. శుభ-అశుభ కర్మఫలాలు అనుభవించక తప్పదు. ప్రతి జీవుడికీ ప్రారబ్ధం ఒకటి ఉంటుంది. అది విధినిర్మితం. అనుల్లంఘ్యం. దేవీ! ఇంతకన్నా నేను చెప్పగలిగింది లేదు - అన్నాడు. వసుదేవుడు అంతరంగంలో పడుతున్న ఆవేదన అర్థమయ్యింది. దేవకీదేవి అందికదా -

స్వామీ! ఎవరు చేసినకర్మ వారు అనుభవించక తప్పదంటున్నారు. నిజమే. కానీ తీర్థయాత్రలు చేయడంవల్లా, తపస్సులు చేయడంవల్లా, దానధర్మాలు చేయడంవల్లా దుష్కర్మల ఫలితాలను తప్పించుకోవచ్చునేమో! ధర్మశాస్త్రాలలో ప్రాయశ్చిత్తవిధులు ఇందుకేకదా చెప్పారు. బ్రహ్మహత్య, సువర్ణాపహరణం, సురాపానం, గురుపత్నీ గమనంవంటి పంచమహాపాతకాలకు ప్రాయశ్చిత్తంగా పన్నెండేళ్ళ వ్రతాన్ని మనుప్రభృతులు ధర్మశాస్త్రకర్తలు ఉపదేశించారు గదా ! వాటిని ఆచరించిన వారికి పాపాలు తొలగిపోవా మరి? తొలగిపోనట్టయితే తత్త్వదర్శులైన మహర్షులు వాటిని ఎందుకు చెప్పినట్టు? యాజ్ఞవల్క్యుడు మొదలైన ధర్మశాస్త్రకర్తల మాటలు నిరర్థకాలేనా? అదీకాక -

ప్రాణేశ్వరా! జరగవలసింది జరిగితీరుతుంది అనే మాటను అంగీకరిస్తే ఇక సకలశాస్త్రాలూ సకల ప్రయత్నాలూ వ్యర్థమేకదా! తగ్గవలసుంటే రోగం తగ్గుతుందన్నప్పుడు ఆయుర్వేదం ఎందుకు? రావలసుంటే స్వర్గం వస్తుందన్నప్పుడు అగ్నిష్టోమాది యజ్ఞాలు ఎందుకు? ప్రాణికోటి ప్రవృత్తిశీలమే నిరర్థకమవుతుందికదా! ప్రమాణాలన్నీ వ్యర్థమైపోతే ధర్మానికి మూలచ్ఛేదం జరిగిపోదూ! మరొక్కమాట-

నాథా! ప్రయత్నించి ఉద్యమించి కార్యాలను సాధించుకున్న వ్యక్తులు ఎంతోమంది మన కళ్ళ ఎదుట కనపడుతున్నారు. వారిని ఆదర్శంగా తీసుకోవడం మన కర్తవ్యం. మన బిడ్డను మనం దక్కించుకోవాలి. ఒక మంచికోసం ఒక శుభంకోసం మాట తప్పడం ఏరకంగానూ నింద్యం కాదని బుద్ధిమంతులు చెబుతున్నారు.

**మిథ్యా యది ప్రకర్తవ్యం వచనం శుభమిచ్ఛతా ।**
**న తత్ర దూషణం కించిత్ ప్రవదంతి మనీషిణః ॥ (21 - 18)**

దేవకీదేవి పలుకులు వసుదేవుడి సత్యనిష్ఠను కదిలించలేకపోయాయి. తాను నమ్మిన కర్మసిద్ధాంతాన్ని మరింత హేతుబద్ధంగా వివరించాడు.



ప్రాణేశ్వరీ! నిజమే, నువ్వన్నట్టు ప్రయత్నమూ ఉద్యమమూ చెయ్యవలసిందే. కానీ ఫలం ఎప్పుడూ దైవాధీనమే. అందరికీ అన్ని ప్రయత్నాలూ అన్నివేళలా ఫలించవు. అదీ మనం ప్రత్యక్షంగా చూస్తూనే ఉన్నాంకదా! అంచేత "ఉద్యమః ఖలు కర్తవ్యః ఫలం దైవవశానుగమ్". ఇది గుర్తుంచుకోవాలి మనం. అదీకాక -

ఈ సంసారంలో ప్రతిజీవికీ మూడురకాల కర్మలు ఉంటాయని వేదపురాణశాస్త్రాలు చెబుతున్నాయి. సంచితకర్మ - జీర్ణకర్మ - ప్రారబ్ధకర్మలు మూడూ బీజప్రాయాలుగా ఉండి శుభాశుభాలను కల్పిస్తూ ఉంటాయి. జన్మజన్మలకూ వెంటవస్తాయి. కర్మానుసారంగానే జీవుడు ఒక దేహాన్ని విడిచిపెట్టి మరొక దేహం పొందుతూ ఉంటాడు. దివ్యదేహంతో స్వర్గసుఖాలు అనుభవించడంగానీ, యాతనాదేహంతో నరకయాతనలు పడటంగానీ అంతా కర్మఫలంగానే జరుగుతూ ఉంటుంది. వర్తమానకర్మలు ప్రాయశ్చిత్తంతో నశిస్తాయి. సంచితకర్మలూ అంతే. ప్రారబ్ధ కర్మలనుమాత్రం యథాతథంగా అనుభవించక తప్పదు. అదొక్కటే వాటిని తొలగించుకునే మార్గం.

ప్రాయశ్చిత్తేన నశ్యంతి వర్తమానాని భామిని
సంచితాని తథైవాశు యథార్థం విహితేన చ
ప్రారబ్ధకర్మణాం భోగాత్ సంక్షయో నాన్యథా భవేత్ ॥ (21 - 28)

అందుచేత, ఓ ప్రియభామినీ! మన కుమారుణ్ణి కంసుడికి అప్పగించక తప్పదు. మాటతప్పి లోకనిందకు గురికావడం ఎవరికీ అభిలషణీయం కాదు. ఈ సంసారం అనిత్యం. అశాశ్వతం. జనన మరణాలు దైవాధీనాలు. అందుకని దేనికీ శోకించవలసిన పనిలేదు. ఆడి తప్పినవాడి జీవితం వ్యర్థం. ఇహలోకమే లేనివాడికి పరలోకం ఏమిటి? కనక, దేవీ! బిడ్డను ఇలా తే. కంసుడికి అప్పగించివస్తాను. సత్యాన్ని సేవించినవారికి భవిష్యత్తు శుభప్రదంగా ఉంటుంది. సుఖంకానీ, దుఃఖంకానీ సత్యమే సంసేవ్యం. సుకృతమే కర్తవ్యం. "సత్యసంరక్షణా ద్దేవి! శుభమేవ భవిష్యతి".

వసుదేవుడి సత్యనిష్ఠను కాదనలేకపోయింది దేవకీదేవి. అలాగని కన్నబిడ్డను అప్పగించనూ లేకపోయింది. తనలోతానే దారుణంగా విలపించింది. కట్టకడపటికి మనస్సు రాయిచేసుకుని వణికిపోతున్న చేతులతో బిడ్డను భర్తకు అందించి బావురుమంది. వసుదేవుడిలో చలనంలేదు. ధర్మనిష్ఠ - సత్యనిష్ఠలు మూర్తీభవించిన వ్యక్తిత్వం. పసిగుడ్డును పొత్తిలిలో పెట్టుకుని కంసుడి ఇంటికి బయలుదేరాడు. చూపరులు అభినందిచారు.

ప్రజలారా! చూడండి. వసుదేవుడు ఎంతటి సత్యసంధుడో. పసికందుని మృత్యువుకి అప్పగిస్తున్నాడు. అహా! ఏమి ధర్మనిష్ఠ. ఇతడి జీవితం ధన్యం - ప్రశంసించారు.



వసుదేవుడు నిబ్బరంగా నడిచివెళ్ళి నెత్తురుగుడ్డును కంసుడికి సమర్పించాడు. అతడి ధీరత్వానికి కంసుడే ఆశ్చర్యపోయాడు. బాలుణ్ణి తీసుకున్నాడు. చిరునవ్వులు చిందించాడు. వసుదేవా! నీ ధీరత్వాన్ని అభినందిస్తున్నాను. నీ సత్యనిష్ఠను ప్రశంసిస్తున్నాను. నిజంగా నువ్వు మాన్యుడివి. అసామాన్యుడివి. కానీ ఈ బిడ్డడు నా మృత్యువు కాదు. నువ్వు హాయిగా తీసుకుపోవచ్చు. ఎనిమిదవ కాన్పున పుట్టినవాడే నా పాలిటి యమధర్మరాజు అనికదా అశరీరవాణి చెప్పింది. కాబట్టి అష్టమగర్భ సంజాతుణ్ణి మాత్రం నాకు తెచ్చి అప్పగించు అని చెప్పి పంపించేశాడు. వసుదేవుడు పసికందుని తీసుకుని ఇంటికి తిరిగివచ్చేశాడు. కంసుడి నిర్ణయాన్ని అతడి మంత్రులందరూ హర్షించారు. శిశుహత్యా మహాపాతకానికి వృథాగా ఒడిగట్టకపోవడాన్ని అభినందిచారు. కొలువు చాలించి ఎవరి గృహాలకు వారు వెళ్ళిపోయారు.

కాసేపటికి నారదమహర్షి వచ్చాడు. అభ్యుత్థాన (ఎదురువెళ్ళడం) అర్ఘ్యపాద్యాదిసత్కారాలు యథావిధిగా నిర్వహించాడు ఉగ్రసేనసుతుడు. కుశలప్రశ్నలు అయ్యాయి. రాకకు కారణం ఏమిటో తెలుసుకోవచ్చునా మహర్షీ! - అన్నాడు వినయంగా కంసుడు.

కంసా! ఆ మధ్య నేనొక రోజున మేరుపర్వతానికి వెళ్ళాను. అప్పుడు అక్కడ బ్రహ్మాదిదేవతలు సమావేశమై తీవ్రంగా సమాలోచనలు జరుపుతున్నారు. మంత్రాంగం నిర్వహించారు. నిన్ను సంహరించడానికి విష్ణుమూర్తి దేవకీవసుదేవులకు పుత్రుడుగా జన్మిస్తాడుట. నువ్వేమో ఇప్పుడు చేతికి చిక్కిన శత్రువును సంహరించకుండా పంపించేశావు. ఎంత తెలివితక్కువ వాడవయ్యా! రాజనీతి తెలిసినవాడు ఎవడైనా ఇలా చేస్తాడా?

నారదా! అశరీరవాణి మాటప్రకారం అష్టమగర్భం నా శత్రువు. వాడిని చంపుతాను. వృథాగా ఈ శిశువులనందరినీ సంహరించి పాపం మూటగట్టుకోవడం ఎందుకు?

కంసా! ఇందుకే నిన్ను వెర్రివాడవంటున్నాను. దేవతల మాయాబలం నీకు తెలీదు. అల్పుడైనా శత్రువును ఉపేక్షించకూడదు అనేది అతిసామాన్యమైన రాజనీతి. ఇది నీకు తెలీదు. అష్టమగర్భం అష్టమగర్భం అంటున్నావు. ఏది అష్టమగర్భమో నువ్వు ఎలా లెక్కకడతావు? ఏది కలపాలో ఏది తీసివెయ్యాలో తెలుసా? నీ అంతటి మూర్ఖుణ్ణి నేనెక్కడా చూడలేదు. అయినా నాకెందుకులే - అని నారదుడు వెళ్ళిపోయాడు.

వెంటనే కంసుడు వసుదేవుడి ఇంటికి మనుషుల్ని పంపాడు. పసిబిడ్డను తెప్పించాడు. రాతిబండకు విసిరికొట్టాడు. మందబుద్ధి, సుఖంగా నిద్రపోయాడు. ***(అధ్యాయం - 21, శ్లోకాలు - 54)***

శౌనకాది మహామునులారా! శ్రీకృష్ణ జన్మవృత్తాంతం శ్రద్ధగా ఆలకిస్తున్నారుగదా- అని సూతుడు మధ్యలో ఒకసారి హెచ్చరిక చేశాడు. అనంతరకథ కొనసాగించాడు.



జనమేజయుడికి నారదుడి వ్యవహారం దారుణం అనిపించింది. వ్యాసమహర్షిని అడిగాడు.

మహర్షీ! ఆ పసిగుడ్డు ఏమి మహాపాపం చేశాడని? కంసుడు ఎందుకు చంపినట్టు? నారదుడు మహర్షి కదా! మహాజ్ఞాని కదా! ధర్మతత్పరుడంటారే అందరూ. బ్రహ్మవేత్త అయ్యుండీ ఇంతటి మహాపాపం చేయిస్తాడా? కర్త, కారయిత - ఇద్దరూ పాపపుణ్యాలకు సమభాగులేకదా! ఇంతటి నీచానికి ఎలా ప్రేరేపించాడు? ఏ కర్మవిపాకంవల్ల ఆ పసిబాలుడు అలాంటి దుర్మరణానికి గురిఅయ్యాడు? ఇవన్నీ సందేహాలే. పితామహా ! నువ్వే తీర్చాలి.

జనమేజయా! నారదుడు కలహప్రియుడు. ఆయనకి అన్నీ సరదాలే. కౌతుకప్రేక్షకుడు. దేవకార్యం చక్కబెట్టడానికి వచ్చి అలా చేయించాడు. అతడిది మిథ్యాశీలం కాదు. అసత్యభాషణుడు కాడు. దేవకార్యం నిర్వర్తించడమే అతడికి ఎల్లవేళలా కర్తవ్యం. ఆ విషయంలో అంతశ్శుచి బహిశ్శుచి ఉన్నవాడే.

న మిథ్యాభాషణే బుద్ధిర్మునేస్తస్య కదాచన ।
సత్యవక్తా సురాణాం స కర్తవ్యే నిరతశ్శుచిః ॥ (22 - 6)

నారదుడి ప్రేరణతో కంసుడు పుట్టినవారిని పుట్టినట్టు ఆరుగురు బాలకులను సంహరించాడు. వీరంతా శాపయోగంవల్ల గర్భవాసదుఃఖం అనుభవించి దేవకీసుతులుగా జన్మించి కంసుడి చేతిలో మరణించి ముక్తిపొందారు. ఆ శాపం ఏమిటో ఎలా దాపురించిందో చెబుతాను, విను. నీ ఆందోళన చల్లారుతుంది.

## ◆ షడ్గర్భుల వృత్తాంతం ◆

స్వాయంభువ మన్వంతరంలో ఊర్ణాదేవీ మరీచులకు ఆరుగురు పుత్రులు జన్మించారు. అందరూ మహాబలశాలులు. ధర్మతత్పరులు. బ్రహ్మదేవుడు కూతురుపట్ల కాముకుడు అవ్వడాన్ని గమనించి వీరు పరిహసించారు. దానికి అలిగిన బ్రహ్మదేవుడు రాక్షసులుగా జన్మించండి అని వీరిని శపించాడు. అనంతరం కొంతకాలానికి వీరు ఆరుగురూ కాలనేమికి సుతులై జన్మించారు. అటుపైని హిరణ్యకశిపుడికి పుత్రులయ్యారు. రాక్షస వంశంలో పుట్టినా సహజంగా జ్ఞానులు కనక శాంతచిత్తులై తపస్సు చేశారు. దానికి బ్రహ్మదేవుడు సంతోషించాడు.

బాలకులారా! పూర్వం ఒకప్పుడు క్రోధంతో మిమ్మల్ని శపించాను. ఇప్పుడు మీ తపస్సులకు సంతోషించాను. ఏదైనా వరం కోరుకోండి. ఇస్తాను - అన్నాడు.



బ్రహ్మదేవా! అయితే మాకు దేవ మానవ గంధర్వోరగ సిద్ధు లెవరివల్లా మరణంలేకుండా వరం అనుగ్రహించు - అని వారు వేడుకున్నారు. చతుర్ముఖుడు అంగీకరించాడు. అదృశ్యమయ్యాడు.

హిరణ్యకశిపుడికి ఈ వార్త తెలిసింది. అతిక్రుద్ధుడు అయ్యాడు. నన్ను వదిలేసి మీరు వరాలు పొంది కులుకుతారా అని మండిపడ్డాడు. నన్ను మీరు వదిలేశారు కాబట్టి నేనూ మిమ్మల్ని వదిలేస్తున్నాను పొండి - పాతాళానికి పొండి. అక్కడ నిద్రావశులై పడిఉండండి. ఎప్పటికో దేవకీ గర్భంలో ఏటేటా ఒక్కొక్కరుగా జన్మించండి. క్రిందటి జన్మలో మీ తండ్రి కాలనేమి అప్పుడు కంసుడుగా ప్రభవిస్తాడు. అతడిచేతిలో మీరు శిశువులుగానే మరణిస్తారు. ఇది నా శాపం. మీరు పొందిన వరాన్ని వృధాచేసే శాపం. పొండి పాతాళానికి పోయి నిద్రపోండి - అన్నాడు హిరణ్యకశిపుడు.

జనమేజయా! అలా శప్తులై జన్మించిన షడ్గర్భులను కంసుడు వధించి శాపవిముక్తి కలిగించాడు. దేవకీదేవికి సప్తమగర్భంగా ఆదిశేషుడి అంశం ప్రవేశించింది. అయిదవనెల నిండగానే యోగమాయ తన యోగశక్తితో ఈ గర్భాన్ని సంకర్షణచేసి తీసి రోహిణీదేవి గర్భంలో ప్రవేశపెట్టింది. దేవకీదేవికి గర్భ స్రావమయ్యిందని వార్త నగరమంతటా వ్యాపించింది. కంసుడు నిర్ధారించుకుని సంతోషించాడు.

**శేషాంశః సప్తమస్తత్ర దేవకీగర్భ సంస్థితః ।**
**విస్రంసితశ్చ గర్భోఽసౌ యోగేన యోగమాయయా ॥**
**నీతశ్చ రోహిణీగర్భే కృత్వా సంకర్షణం బలాత్ ।**
**పతితః పంచమే మాసి లోకఖ్యాతిం గతస్తదా ॥ (22 - 24, 25)**

భూభారాన్ని తొలగించడమనే దేవకార్యం కోసం శ్రీమన్నారాయణుడు దేవకీదేవికి అష్టమగర్భంలో ప్రవేశించాడు. గర్భవాస క్లేశాన్ని అనుభవిస్తున్నాడు.

"తాతా"! అన్నాడు జనమేజయుడు. ఏమిటి మనమడా! సందేహం? - అడిగాడు వ్యాసుడు.

వ్యాసర్షీ! కశ్యపాంశ వచ్చి వసుదేవుడయ్యాడన్నావు. శేషాంశ వచ్చి గర్భవినిమయంతో బలరాముడయ్యాడన్నావు. విష్ణుమూర్తి అంశ - అష్టమగర్భంలో శ్రీకృష్ణుడుగా ఉంది అన్నావు. బాగానే ఉంది. కానీ, మిగతా దేవతలనుకూడా తమ తమ అంశలతో యదువంశంలో ప్రభవించమని ఆదిలోనే వ్యూహరచనవేళ శ్రీహరి ఆజ్ఞాపించాడుగదా ఏయే దేవతలు ఏయే యాదవులుగా జన్మించారో ఏయే రాక్షసులు ఏయే రాజులుగా జన్మించారో తెలియజెప్పవా!



## ◆ దేవతా రాక్షసాంశల అవతరణ ◆

జనమేజయా! అందరిని గురించీ విస్తరంగా చెప్పడం సాధ్యంకాదు కనక క్లుప్తంగా చెబుతాను గ్రహించు. కశ్యపుడు వసుదేవుడుగా, అదితి దేవకీదేవిగా, ఆదిశేషుడు బలరాముడుగా, నారాయణుడు శ్రీకృష్ణుడుగా, నరుడు అర్జునుడుగా (క్రిందటి జన్మలో వీరిద్దరూ ధర్ముడి కుమారులు - నరనారాయణులు), ధర్మరాజు యుధిష్ఠిరుడుగా, వాయుదేవుడు భీముడుగా, అశ్వినీదేవతలు నకులసహదేవులుగా, సూర్యుడు కర్ణుడుగా, యముడు విదురుడుగా, బృహస్పతి ద్రోణుడుగా, శివుడు అశ్వత్థామగా, సముద్రుడు శంతనుడుగా, గంధర్వపతి దేవకుడుగా (దేవకీదేవి తండ్రి), వసువు భీష్ముడుగా, మరుత్తు విరాటుడుగా, అరిష్టసుతుడైన హంసుడు ధృతరాష్ట్రుడుగా, మరుద్గణంలోనే మరొక ఇద్దరు కృపాచార్య కృతవర్మలుగా, కలిపురుషుడు దుర్యోధనుడుగా, ద్వాపరుడు శకునిగా, బుధుడు సువర్చసుడుగా, చంద్రుడు రురువుగా, పావకుడు (అగ్ని) ధృష్టద్యుమ్నుడుగా, నిరృతి శిఖండిగా, సనత్కుమారుడు ప్రద్యుమ్నుడుగా, వరుణుడు ద్రుపదుడుగా, లక్ష్మీదేవి ద్రౌపదిగా, విశ్వేదేవతలు ద్రౌపదేయులుగా, సిద్ధి - కుంతిగా, ధృతి - మాద్రిగా, మతి - గాంధారిగా, అప్సరసలు కృష్ణ పత్నులుగా, ఇంద్రశత్రువులైన రాక్షసులు రాజులుగా, హిరణ్యకశిపుడు శిశుపాలుడుగా, విప్రజిత్తు జరాసంధుడుగా, ప్రహ్లాదుడు శల్యుడుగా, కాలనేమి కంసుడుగా, హయగ్రీవరాక్షసుడు కేశిగా, బలికుమారుడైన అరిష్టుడు కకుద్మిగా, అనుహ్లాదుడు ధృష్టకేతుడుగా, బాష్కలుడు భగదత్తుడుగా, లంబప్రలంబకులు ఖరధేనుకులుగా, వారాహకిశోరులు చాణూరముష్టికులుగా దితిపుత్రుడైన అరిష్టుడు కువలయనాగం (ఏనుగు)గా, బలిపుత్రిక బకిగా, దానితమ్ముడు బకాసురుడుగా - జన్మించారు.

జనమేజయా! ఇక్కడ మరొక విశేషం నువ్వు గ్రహించాలి. భూభారాన్ని తొలగించమని బ్రహ్మాదిదేవతలు ప్రార్థించిన రోజున విష్ణుమూర్తి రెండు శిరోజాలు తీసి వారికి ఇచ్చాడు. అందులో ఒకటి నల్లనిది. అది శ్రీకృష్ణుడు. రెండవది తెల్లనిది. అది బలరాముడు. ***(అధ్యాయం - 22, శ్లోకాలు - 52)***

> **యదా బ్రహ్మాదయో దేవాః ప్రార్థనార్థం హరిం గతాః ।**
> **హరిణా చ తదా దత్తౌ కేశౌ ఖలు సితాసితౌ ॥**
> **శ్యామవర్ణస్తతః కృష్ణః శ్వేతస్సంకర్షణ స్తథా ।**
> **భారావతరణార్థం తౌ జాతౌ దేవాంశసంభవౌ ॥** **(22 - 50, 51)**

ఉగ్రసేన సుతుడు కంసుడు దేవకీపుత్రులను ఆరుగురినీ సంహరించాడు. సప్తమగర్భం జారిపోయిందని సంతోషించాడు. అష్టమగర్భం ధరించిందని తెలిసినప్పటినుంచీ మృత్యుభయం పెరిగింది. స్వీయరక్షణకూ గర్భరక్షణకూ మరింతగా కట్టుదిట్టమైన చర్యలు తీసుకున్నాడు.



సరిగ్గా ఇదే సమయానికి గోకులంలో యోగమాయాదేవి యశోదాగర్భంలో ప్రవేశించింది. రోహిణీదేవి బలరాముణ్ణి సుఖంగా ప్రసవించింది.

కంసుడు దేవకీదేవిని తెచ్చి కారాగారంలో బంధించాడు. లోపలా బయటా సేవకులను కాపలా పెట్టాడు. వసుదేవుడు భార్యకు దూరంగా ఉండలేక, అందునా గర్భిణిని ఒంటరిగా వదలలేక తానూ వచ్చి కారాగారంలోనే ఉన్నాడు.

## ◆ కృష్ణ జననం ◆

దేవతాసంస్తుతులు నిరంతరంగా వింటూ దేవకీగర్భస్థ శిశువు దినదిన ప్రవర్ధమానుడయ్యాడు. పదినెలలూ నిండాయి. అది నీలమేఘాల శ్రావణమాసం. ఇంద్రనీలాల కృష్ణపక్షం. శితికంఠదేవతాకమైన అష్టమీతిథి. బ్రహ్మదేవతాకమైన రోహిణీ నక్షత్రం. సాయంకాలం. నీడలు మెల్లమెల్లగా కమ్ముకొంటున్నాయి.

కంసుడు హడావిడిగా కారాగారానికి వచ్చాడు. ఖడ్గధారులైన కావలివారిని హెచ్చరించాడు. జాగరూకులై ఉండండి. ఈ పుట్టబోయేవాడు నాపాలిట మృత్యువు. రాక్షసులారా! వాడిని చంపి సుఖంగా నిద్రపోతాను. చంపేవేళ మీరంతా ఆయుధాలు ఎక్కుపెట్టి సన్నద్ధంగా ఉండండి - అని హెచ్చరికలు చేసి అంతే హడావిడిగా తన మందిరానికి వెళ్ళిపోయాడు. మనిషి బాగా కృశించాడు. మృత్యుభయం క్రుంగదీసింది. పదినెలలకుపైగా మనస్సుకు సుఖంలేదు, కంటికి కునుకులేదు.

కమ్ముకొంటున్న నీడలు క్రమంగా చిక్కనవ్వుతున్నాయి. చీకట్లుగా మారుతున్నాయి. దేవకీదేవికి కంఠధ్వని నీరసించింది. మెల్లగా భర్తతో పలికింది.

ప్రాణవల్లభా! ఏమి చెయ్యమంటావు? ఇది ప్రసవవేళ. మరికాసేపట్లో ప్రసవం జరుగుతుంది. ఎటుచూసినా ఆయుధ పాణులై రక్షకభటులే కనిపిస్తున్నారు. ఏమి చెయ్యాలో తోచడం లేదు. నాథా! మన వివాహమైన కొత్తల్లో గోకులంలో నందుడి ఇల్లాలు యశోదా నేనూ ఒక ఒప్పందం చేసుకున్నాం. అష్టమగర్భంగా నాకు జన్మించిన బిడ్డను యశోదమ్మ ఇంటికి చేర్చాలి. యశోదమ్మ తన బిడ్డను కంసుడి నమ్మికకోసం మనకు ఇస్తుంది. ఇది మా ఒప్పందం. ఈ విషమపరిస్థితిలో ఏమి చెయ్యమంటావో సలహా చెప్పవూ. మన బిడ్డను అక్కడికీ, వారి బిడ్డను ఇక్కడికీ ఎలా మారుస్తావో ఆలోచించవూ. ఈ పని నువ్వే చెయ్యాలి. నాథా! ప్రసవం సమీపించింది. కొంచెం అసింటా వెళ్ళవూ! చచ్చేంత సిగ్గుగా ఉంది. ఇటు చూడకు. అటు తిరిగి నిలబడు. ఇంతకన్నా ఏమి చెయ్యడానికీ ఏ అవకాశమూ లేకపోయె!

దూరే తిష్ఠస్వ కాంతాద్య లజ్జా మేఽతి దురత్యయా ।
పరావృత్య ముఖం స్వామిన్ ! అన్యథా కిం కరోమ్యహమ్ ॥ (23 - 20)



ఆ నిశీథివేళ దేవకీదేవి మగబిడ్డను ప్రసవించింది. బిడ్డను చూసి ఆశ్చర్యచకితురాలయ్యింది. ఆనందంతో తనువంతా పులకించింది. భర్తను దగ్గరకు రమ్మని పిలిచింది. కంసుడు (భాతృజః 23 - 23) వచ్చి సంహరించకముందే కన్నకొడుకు ముఖాన్ని కళ్ళారా చూసి ఆనందించమంది. వసుదేవుడు ఆ పురిటికందును పొత్తిలిలోకి తీసుకున్నాడు. దగ్గరగా ముఖం చూశాడు. ఆ అందానికి ఆశ్చర్యపోయాడు. ఏమిటి చెయ్యడం? నావల్ల ఈ బిడ్డకు కష్టాలు రాకూడదు - వసుదేవుడు తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. అంతలోకే అశరీరవాణి వినిపించింది.

వసుదేవా ! ఈ బిడ్డను తీసుకుని గోకులానికి చేర్చు. వెంటనే బయలుదేరు. రక్షకభటుల్ని అందరినీ నిద్రావివశులను చేశాను. కారాగారం ఎనిమిది ద్వారాలూ తెరుచుకుంటాయి. నీ సంకెళ్ళు తెగిపోతాయి. బయలుదేరు. ఈ మగబిడ్డను నందగృహంలో యశోదకు అప్పగించి, అక్కడి యోగమాయను ఇక్కడికి తీసుకునిరా.

కారాగారం తలుపులు తెరుచుకోవడం, తన సంకెళ్ళు తెగిపోవడం గమనించాడు వసుదేవుడు. బిడ్డను గుండెలకు హత్తుకొని బయలుదేరాడు. యమునానదిని చేరుకున్నాడు. ఎలాగా దాటడం అనుకున్నాడు. దిగాడు. మొలలోతు దాటలేదు. యోగమాయా ప్రభావం అనుకున్నాడు. ఆ నిశీథిలో ఆ నిర్జన మార్గంలో గోకులం చేరుకున్నాడు. నందుడి ఇంటిముందు నిలబడ్డాడు. పాడిపంటల సమృద్ధితో కళకళలాడుతున్న గృహశోభను చూస్తూ ముఖద్వారం దగ్గర నిలబడ్డాడు.

కారాగారంలో దేవకీదేవి మగబిడ్డను ప్రసవించిన సమయానికే ఇక్కడ యశోదాదేవి ఆడపిల్లను ప్రసవించింది. త్రిగుణ స్వరూపిణి యోగమాయ జన్మించింది.

సైరంధ్రీరూపధారిణియై ఆదిపరాశక్తి ఆ ఆడపిల్లను తెచ్చి వసుదేవుడికి అందించింది. వసుదేవుడి చేతులనుంచి మగబిడ్డను తీసుకుని లోపలికి వెళ్ళి యశోదమ్మ పక్కలో పరుండబెట్టింది.

వసుదేవుడు త్వరత్వరగా కారాగారం చేరుకున్నాడు. అలికిడి కాకుండా పిల్లను దేవకీదేవి పక్కలో పరుండబెట్టాడు. క్షణకాలం నిశ్చేష్టుడై భయాతురుడై ఏమి జరిగిందో తెలియని అవస్థలో నిలబడ్డాడు.

ఆ క్షణంలో ఆ పసిబిడ్డ, ఇప్పుడే జన్మించానన్నట్లు పెద్దపెట్టున రోదించింది. రక్షకభటులు ఉలిక్కిపడి లేచారు. పరుగుపరుగున వెళ్ళి కంసుడికి సమాచారం అందించారు. మరుక్షణంలో కంసుడు అక్కడికి చేరుకున్నాడు.

వసుదేవా! కొడుకుని తీసుకురా. అష్టమగర్భ సంజాతుడుగదా! ఇతడే నా మృత్యువు. ఇప్పుడే సంహరిస్తాను - అని ఆజ్ఞాపించాడు.



వసుదేవుడు భయంతో వొణికిపోయాడు. కళ్ళల్లో నీళ్ళు కుక్కుకుంటూ పిల్లను తీసుకువెళ్ళి కంసుడికి అప్పగించాడు. ఆడపిల్లా? అని కంసుడు ఆశ్చర్యపోయాడు. అష్టమగర్భంలో మగపిల్లాడు పుడతాడని ఆకాశవాణి చెప్పినమాట, నారదుడు చేసిన హెచ్చరిక - అన్నీ వృథా అయ్యాయే! వసుదేవుడు మోసం చేసే అవకాశం లేదు. కారాగారంలో ఉన్నాడు. రక్షకభటులంతా సావధానులై కాపలా కాస్తూనే ఉన్నారు. మగప్లిలవాడే జన్మించి ఉంటే ఎక్కడికీ పోయే అవకాశం లేనేలేదు. ఆడపిల్లే పుట్టి ఉంటుంది. సందేహించవలసిన అవసరం లేదు. అసలే కాలగతి విషమంగా ఉంది - అని ఆలోచించి, వెంటనే పాషాణహృదయుడు కంసుడు ఆ బాలికను కాళ్ళు పట్టుకుని బండరాతి మీదకి విసిరాడు. చేతినుంచి జారిన ఆ బాలిక ఆకాశానికి ఎగిసింది. దివ్యరూపం ధరించింది. మృదుస్వరంతో పలికింది.

పాపాత్ముడా! నన్ను చంపి ఏమి ప్రయోజనం? బలవంతుడై నీ శత్రువు జన్మించనే జన్మించాడు. నిన్ను సంహరిస్తాడు - అని పలికి అదృశ్యమయ్యింది.

కంసుడు మరింతగా ఆశ్చర్యపోయాడు. తన మందిరానికి వెళ్ళాడు. బక - ధేనుక - వత్సాది దానవవీరులనందరినీ సమావేశపరిచాడు. లోపల భయం, పైకి క్రోధం. అరిచి చెప్పాడు -

దానవులారా! వెంటనే బయలుదేరి లోకంమీద పడండి. పుట్టిన ప్రతి మగబిడ్డనూ సంహరించండి. ఇది నా ఆజ్ఞ. పూతనా! పిల్లలను చంపడంలో నేర్పరివి. నువ్వు గోకులానికి వెళ్ళు. ప్రతిశిశువునూ సంహరించు. ధేనుకా! వత్సకా! కేశీ! ప్రలంబా! బకా! మీరుకూడా అక్కడికే వెళ్ళండి. సావధానులై నా ఆజ్ఞను నెరవేర్చండి - అని ఆజ్ఞ జారీచేసి తన శయనాగారంలోకి వెళ్ళిపోయాడు. అదే ఆలోచన. అదే కలత. నలిగిపోతున్నాడు. ***(అధ్యాయం - 23, శ్లోకాలు - 52)***

తెల్లవారింది. గోకులంలో నందుడి ఇంట మగబిడ్డ జన్మించాడనీ, ఉత్సవం జరుగుతోందనీ చారులు వర్తమానం తెచ్చారు. కంసుడి దృష్టి గోకులంమీద పడింది. అనుమానించాడు. నారదుడు లోగడ చెప్పనే చెప్పాడు - గోకులంలో దేవకీ వసుదేవులేకాదు నందయశోదాదులందరూ దేవాంశ సంభూతులనీ, నా శత్రువులనీ. ఈ మాట నిజమే అయ్యుంటుంది అనుకున్నాడు.

## ◆ కంస వధ ◆

రోజులు గడుస్తున్నాయి. శ్రీకృష్ణుడు పూతనను సంహరించాడు. బక-ధేనుక-వత్సక-ప్రలంబులు అయిపోయారు. గోవర్ధనపర్వతాన్ని ధరించిన వార్త కంసుడికి చేరింది. తనకు చావు మూడింది అనుకున్నాడు.

ప్రలంబో నిహతస్తేన తథా గోవర్ధనో ధృతః ।
శ్రుత్వైతత్కర్మ కంసస్తు మేనే మరణమాత్మనః ॥ (24 - 7)



శ్రీకృష్ణుడు మహాబలశాలియైన కేశిని మట్టుపెట్టాడనే దుర్వార్త తెలవడంతో కంసుడు కంగారుపడ్డాడు. ధనుర్యాగం వంకతో బలరామకృష్ణులను ఆహ్వానించి అంతమొందిద్దాం అనుకున్నాడు. అక్రూరుడితో ఆహ్వానం పంపించాడు. రథారూఢులై బలరామకృష్ణులు కంసుడి సన్నిధికి వచ్చారు. ధనుస్సును విరిచారు. రాజకమనే(?) ఏనుగును సంహరించారు. చాణూరముష్టికులను మర్దించారు. శల-తోశలులను మట్టికరిపించారు. చివరికి కంసుణ్ణి జుట్టుపట్టి ఈడ్చి శ్రీకృష్ణుడు సంహరించాడు. దేవకీ వసుదేవులను చెరవిడిపించాడు. ఉగ్రసేనుడికి రాజ్యం అప్పగించాడు.

వసుదేవుడు - బలరామకృష్ణులకు ఉపనయనం జరిపించి సందీపనుడి ఆశ్రమానికి విద్యాభ్యాసం కోసం పంపించాడు. అక్కడ వారిద్దరూ సకల విద్యలూ అభ్యసించి మధురకు తిరిగి వచ్చారు. అప్పటికి పన్నెండేళ్ళ వయస్సు

మగధాధీశుడైన జరాసంధుడు కంసుడికి మామగారు. సేనాసమేతుడై మధురపైకి దండెత్తాడు. మొత్తం పదిహేడుసార్లు దండెత్తాడు. విజయం సాధించలేకపోయాడు. చివరికి కాలయవనుడిని ప్రేరేపించి అఖండసైన్యంతో దండయాత్రకు పంపించాడు. యవనుడు తరలివస్తున్న వార్త తెలిసి శ్రీకృష్ణుడు యదువీరులతో సమాలోచనలు జరిపాడు.

మన మధురాపట్టణానికి ఎప్పుడూ శత్రుభయం వెన్నంటి ఉంటోంది. ఇప్పుడు యవనుడు దండెత్తి వస్తున్నాడు. ఏమి చేద్దామో చెప్పండి. ప్రాణాలను కాపాడుకోవడం అవశ్యకర్తవ్యంకదా ! సుఖంగా ఉండాలంటే పర్వతం దగ్గరో సముద్రం ఒడ్డునో నివసించాలన్నారు. శత్రుభయం ఉండనిచోటు వెదుక్కోమన్నారు - పండితులు. అందుకే విష్ణుమూర్తి సముద్రంలో మకాం పెట్టాడు. శేషశయ్యమీద హాయిగా నిద్రిస్తున్నాడు. శివుడేమో కైలాసం మీద నివసిస్తున్నాడు. అందుచేత మనం కూడా అటువంటి చోటు ఏదైనా చూసుకుందాం. శత్రు తాపితమైన ఈ మధురను వదిలేద్దాం. ద్వారవతికి తరలిపోదాం. అది చాలా అందంగా ఉంటుందనీ, రైవతకాద్రికి చేరువలో సముద్రం ఒడ్డున మనోహరంగా ఉంటుందనీ గరుత్మంతుడు చెప్పాడు.

శ్రీకృష్ణుడి సూచనను యాదవులందరూ అంగీకరించారు. సామానులు శకటాలపై సర్దుకుని ఊరుఖాళీచేసి వెళ్ళిపోయారు. రామకృష్ణులు ముందు నడవగా ప్రయాణం సాగుతోంది. కొన్నిరోజులకు ద్వారవతి చేరుకున్నారు. ఇళ్ళూ వాకిళ్ళూ శుభ్రం చేసుకుని అందరూ స్థిరపడ్డారు.

రామకృష్ణులిద్దరూ మధురకు తిరిగివచ్చారు. ఆ నిర్జన పట్టణంలో ఉంటున్నారు. ఒకరోజున కాలయవనుడు దండెత్తి వచ్చాడు. శ్రీకృష్ణుడు పాదచారియై పురద్వారం దాటి ఎదురువెళ్ళాడు. యవనుణ్ణి చూసి కిస్సరగా నవ్వి ముందుకి సాగిపోయాడు. యవనుడు పాదచారియై వెంటబడ్డాడు.



మధుసూదనుడు నడకలో వేగం పెంచాడు. మహాబలశాలీ రాజర్షి అయిన ముచుకుందుడు నిద్రపోతున్న చోటుకి చేరుకున్నాడు. యవనుడు వెంటరావడాన్ని గమనించి చటుక్కున తానక్కడ అదృశ్యమయ్యాడు. వాడు వచ్చి ముచుకుందుణ్ణే మధుసూదనుడనుకొని కాలితో బలంకొద్దీ తన్నాడు. రాజర్షికి మెలకువ వచ్చింది. క్రోధతామ్రాక్షుడై యవనుడిని క్షణంలో భస్మం చేశాడు. అప్పుడు కృష్ణుడు ప్రత్యక్షమయ్యాడు. ముచుకుందుడు నమస్కరించి అరణ్యాలలోకి వెళ్ళిపోయాడు. శ్రీకృష్ణుడు బలరాముణ్ణి కలుపుకుని ద్వారకకు చేరుకున్నాడు. ఉగ్రసేనుడు తమ రాజుగా యాదవులంతా సుఖంగా కాలం గడుపుతున్నారు.

## ◆ ప్రద్యుమ్నాపహరణం ◆

శ్రీకృష్ణుడు శిశుపాలుడి బారినుంచి తప్పించి రుక్మిణీ దేవిని అపహరించి తెచ్చి రాక్షసవివాహం చేసుకున్నాడు. అటుపైని క్రమక్రమంగా జాంబవతి, సత్యభామ, మిత్రవింద, కాళింది, లక్షణ, భద్ర, నాగ్నజితి - అనే కన్యలను పరిణయమాడాడు. అష్టమహిషులతో ఆనందాలు అనుభవించాడు. రుక్మిణీదేవికి ప్రద్యుమ్నుడు - అత్యంత సుందరాకారుడు జన్మించాడు. జాతకర్మాదులు అయ్యాయి. ఒకనాడు శంబరాసురుడు మాయారూపంలో వచ్చి పురిటింటి నుంచి బాల ప్రద్యుమ్నుడిని అపహరించి తీసుకుపోయాడు. తన పట్టణానికి ఎత్తుకుపోయి మాయావతికి సమర్పించాడు. వాసుదేవుడు పుత్రశోకంతో విలవిలలాడాడు. మనస్సులో జగన్మాతను శరణువేడుకున్నాడు. వృత్రాసురాది మహారాక్షసులను సంహరించిన యోగమాయను స్తుతించాడు.

పరాశక్తీ! పూర్వజన్మలో నా తపస్సులను నువ్వు మెచ్చుకున్నావు. నారాయణుడిగా (ధర్ముడి కుమారుడు) బదరికాశ్రమంలో వేలసంవత్సరాలు తపస్సు చేసి నీ అనుగ్రహం పొందాను. మరిచిపోయావా తల్లీ! ఇవ్వేళ పురిటింటినుంచి ఎవరో నా బిడ్డను అపహరించి తీసుకుపోయారు. దుర్బుద్ధితోనే తీసుకుపోయారో, వేళాకోళానికి తీసుకుపోయారో? నా అహంకారంమీదమాత్రం దెబ్బవేశారు. అమ్మా! నీ భక్తుడికి ఇలా అవమానం జరిగితే నీకు అప్రతిష్ఠకాదా? ఈ ద్వారకా పట్టణం ఒక మహాదుర్గం. కట్టుదిట్టమైన కాపలా ఉంది. ఇందులో నేనుంటున్న ఇల్లు మధ్యభాగంలో ఉంది. ఆ ఇంటిలో అంతఃపురం మరింత లోపలగా ఉంది. అందులో పురిటిగది ఇంకా దుష్ప్రవేశ్యం. అయినా ఎవడో ఎలాగో వచ్చి బాలుణ్ణి ఎత్తుకుపోయాడు. ఎంత దురదృష్టం! నేను నగరంలోనే ఉన్నాను. ఎక్కడికీ పోలేదు. యదువీరులు కాపలాకాస్తూనే ఉన్నారు. అయినా అపహరణం జరిగింది. ఈ మాయను ఛేదించగలిగిన శక్తి నీకు మాత్రమే ఉంది.

అమ్మా ! నీ చరితం దురవగాహం. అతినిగూఢం. అన్నీ తెలుసుననుకుంటున్న నాకే తెలీదు. ఇక సాధారణదేహధారుల సంగతి చెప్పాలా?



తల్లీ! నా బిడ్డడు ఏమైపోయాడు? ఎక్కడికి పోయాడు? ఇదంతా నువ్వు కల్పించిన మాయ తెర. దయచేసి తెర తొలగించు. నీ లీలలు చిత్రవిచిత్రంగా ఉంటాయి. దేవకీగర్భం నుంచి బలరాముణ్ణి హరించి రోహిణీ గర్భంలో ప్రవేశపెట్టావు. తల్లి ఒడినుంచి నన్ను అపహరించి యశోదమ్మ పొత్తిలిలో పడుకోబెట్టావు. జగన్మాతా! నీ మాయాశక్తి అపారం. త్రిగుణాత్మకంగా జగత్తును సృష్టిస్తున్నావు. పాలిస్తున్నావు. ఉపసంహరిస్తున్నావు. ఇది నీకొక నిత్యక్రీడ. సంసారులకు పుత్రోత్సవాన్ని కల్పిస్తున్నావు. పుత్రవిరహాన్ని రుచిచూపిస్తున్నావు. మా సుఖదుఃఖాలతో నువ్వు క్రీడిస్తున్నావు. వినోదిస్తున్నావు. ఇంతేకాకపోతే నాకు ఈ పుత్ర విరహం ఏమిటి!?

ఉత్పాద్య పుత్రజనన ప్రభవం ప్రమోదం
దత్వా పునర్విరహజం కిల దుఃఖభారమ్ ।
త్వం క్రీడసే సులలితైః ఖలు తైర్విహారైః
నో చేత్కథం మమ సుతాప్తిరతిర్వృథా స్యాత్ ॥ (24 - 55)

ప్రద్యుమ్నజనని (రుక్మిణి) వోలువోలున విలపిస్తోంది. నేను సన్నిధిలో ఉండీ ఓదార్చలేక పోతున్నాను. హే లలితే! మా దుఃఖాన్ని నువ్వు అర్థం చేసుకోలేకపోతున్నావు. దుఃఖితులకూ భవరోగపీడితులకూ నువ్వేకదా దిక్కు ! మా దుఃఖాన్ని కడతేర్చు. ఏ సంసారికైనా పుత్రోత్పత్తి అనేది సుఖాలకు పరసీమకదా! అలాంటి సుఖాన్ని నాకు అందించినట్టే అందించి ఎందుకు దూరం చేశావు? నా గుండె పగిలిపోయేట్టుంది. అమ్మా! దారి నువ్వే చూపించాలి. నీకు సంతృప్తికరంగా యజ్ఞం చేస్తాను. వ్రతం చేస్తాను. పూజలు జరుపుతాను. నా పుత్రుణ్ణి నాకు దక్కించు.

శ్రీకృష్ణుడి ప్రార్థనకు ఆదిపరాశక్తి ప్రత్యక్షమయ్యింది. ఓదార్చింది. జనార్దనా! దుఃఖించకు. ఒక పురాతనశాపం కారణంగా శంబరుడు తన యోగశక్తితో నీ పుత్రుణ్ణి అపహరించాడు. పదహారో ఏడు వచ్చేసరికి ప్రద్యుమ్నుడు తన బలంతో ఆ రాక్షసుణ్ణి సంహరించి నిన్ను కలుసుకుంటాడు. సందేహించకు. ఇది నా అనుగ్రహం - అని చెప్పి జగన్మాత అదృశ్యమయ్యింది. శ్రీకృష్ణుడూ రుక్మిణీప్రభృతులూ ఊరడిల్లారు.

***(అధ్యాయం - 24, శ్లోకాలు - 62)***

జనమేజయుడికి ఇక్కడ ఒక సందేహం కలిగింది. వ్యాసుణ్ణి అడిగాడు. మహర్షీ! వైష్ణవాంశ సంభూతుడైన శ్రీకృష్ణుడికి దుఃఖమేమిటి? సూతికాగృహం నుంచి బాలుణ్ణి ఎవడో అపహరించి తీసుకుపోతూంటే తెలుసుకోలేకపోవడమేమిటి? అడ్డుకోలేకపోవడమేమిటి? అంత రక్షణ ఉన్న సూతికాగృహం నుంచి ఆ శంబరుడు అసలు ఎలా అపహరించగలిగాడు? ఇదంతా ఆశ్చర్యంగా ఉంది. కొంచెం వివరించి నా సందేహాలు తీర్చు - అని అడిగాడు. వ్యాసుడు వివరించాడు.



## ◆ మానుష జన్మలో మానుష లక్షణాలే ◆

జనమేజయా! మాయాశక్తి చాలా బలవతి. మానవుల బుద్ధిని దారుణంగా మోహపరుస్తుంది. అది శాంభవీవిద్య. మానవజన్మ ఎత్తిన తరవాత ఎంతటి మధుసూదనుడికైనా మానవలక్షణాలు తప్పవు. పూర్వజన్మలో దేవతలా దానవులా అనేది అప్రధానం. మానుషజన్మ - మానుషలక్షణాలు తప్పదు.

> మానుషం జన్మ సంప్రాప్య గుణాస్సర్వేఽపి మానుషాః ।
> భవంతి దేహజాః కామం న దేవా నాసురాస్తదా ॥ (25 - 7)

ఆకలి, దప్పిక, నిద్ర, భయం, వ్యామోహం, శోకం, సంశయం, హర్షం, అభిమానం, వార్ధకం, మరణం, అజ్ఞానం, గ్లాని, అప్రీతి, ఈర్ష్య, అసూయ, మదం, శ్రమ - ఇవన్నీ మానవదేహం ధరించినవారికల్లా తప్పని గుణాలు. అందుకే రాముడు కూడా తన పట్టాభిషేకం భంగమవుతుందనిగానీ, కాంచనమృగం ఉండదనిగానీ, సీతాదేవి అపహరింపబడుతుందనిగానీ, జటాయువు మరణిస్తాడనిగానీ ముందుగా తెలుసుకోలేకపోయాడు. అలాగే దశరథమరణాన్నీ తెలుసుకోలేకపోయాడు. అజ్ఞుడిలా అడవి అడవీ తిరిగాడు. జానకీదేవి జాడ తెలుసుకోలేకపోయాడు. వానరుల సహాయం అపేక్షించాడు. వారే సీతమ్మ జాడ తెలుసుకుని వచ్చి చెప్పారు. సముద్రానికి సేతువు కట్టారు. రావణ సైన్యంతో ఘోరయుద్ధం చేశారు. ఆ యుద్ధంలో రాముడు నాగపాశబద్ధుడయ్యాడు తెలుసుగా! గరుత్మంతుడు వచ్చి విడిపించవలసి వచ్చింది. సరే - కట్టకడపటికి రావణుడిని సంహరించాడనుకో. అదికాదు, తాను జనార్దనుడైయుండీ సీతాదేవి సౌశీల్యాన్ని గ్రహించలేకపోయాడు. అగ్నిపరీక్ష పెట్టాడు. పోనీ అంటే - మరికొన్నాళ్ళకి లోకాపవాదానికి భయపడి పట్టమహిషిని - నిండు గర్భవతిని అడవులకు పంపించేశాడు. అక్కడ కుశలవులు జన్మించారు. అదీ తెలుసుకోలేకపోయాడు. వాల్మీకి తెలియజెప్పవలసివచ్చింది. చివరికి - సీతాదేవి పాతాళానికి వెళ్ళిపోవడం కూడా రాముడికి తెలియలేదు. ఒళ్ళు తెలియని ఆ కోపంలో సోదరులపై విరుచుకుపడ్డాడు. తనకు కాలం ఆసన్నమైన సంగతిని మాత్రం తెలుసుకోగలిగాడా? అదీ లేదు. మానుషదేహాన్ని ఆశ్రయించాడు కాబట్టి అన్నీ మానుషచేష్టలే ఆచరించాడు.

ఇప్పుడు ఈ శ్రీకృష్ణుడూ అంతే. కంసుడికి భయపడి గోకులం చేరుకున్నాడు. జరాసంధుడికి భయపడి ద్వారవతికి పారిపోయాడు. రుక్మిణీ హరణం ఒకరకంగా అధర్మమే. శిశుపాలుడికి ఇవ్వాలనికదా వారి పెద్దల నిర్ణయం. ప్రద్యుమ్నుడు జన్మించాడని ఆనందించాడు, శంబరుడు అపహరించాడని దుఃఖించాడు. సత్యభామ కోరిక తీర్చడంకోసం భార్యావిధేయుడై ఇంద్రుడిమీదకి దండెత్తి పారిజాతాన్ని అపహరించి తెచ్చాడు. పుణ్యకవ్రతం పేరుతో సత్యభామ ఈ శ్రీకృష్ణుణ్ణి చెట్టుకి కట్టేసి నారదుడికి దానంగా ధారపోసేసింది. బంగారం ఇచ్చి విడిపించుకుంది. ఎంతటి స్త్రీలోలుడో అనిపిస్తాడు.



## ◆ శ్రీకృష్ణుడి శివదీక్ష ◆

రుక్మిణీ ప్రభృతులకు ప్రద్యుమ్నాదులు జన్మించారుగానీ జాంబవతికి కడుపు పండలేదు. దీనురాలై యాచిస్తే కృష్ణుడు పుత్రకామియై ఆరునెలలు ఉగ్రతపస్సు చేశాడు. శివభక్తుడైన ఉపమన్యుడు అనే మునిని ఆశ్రయించి పాశుపతదీక్షను స్వీకరించాడు. ముండీ దండీ అయ్యాడు. (ముండి = బోడిగుండు, దండి = దండం ధరించినవాడు) మొదటి నెలరోజులూ కేవలం పళ్ళూ ఫలాలే భుజించి శివధ్యానపరుడై శివమంత్రాన్ని జపించాడు. రెండవనెలలో జలమే ఆహారంగా ఒంటికాలిమీద నిలిచి తపస్సు చేశాడు. మూడవనెలలో వాయుభక్షణమాత్రమే చేస్తూ కాలిబొటన వేలిమీద నిలబడి శివమంత్రం జపించాడు. చివరికి ఆరవనెలలో శివుడు అనుగ్రహించి ప్రత్యక్షమయ్యాడు. యదునందనా! కామపూరంలో నన్ను దర్శించిన భక్తుడికి కామశేషం ఉండటానికి వీలులేదు. ఏంకావాలో కోరుకో - అన్నాడు.

దదామి వాంఛితాన్ కామాన్ బ్రూహి యాదవనందన ।
మయి దృష్టే కామపూరే కామశేషో న సంభవేత్ ॥ (25 - 36)

శ్రీకృష్ణుడు శంకరుడి పాదాలకి సాష్టాంగపడ్డాడు. లేచినిలబడి మేఘగంభీరస్వరంతో స్తుతించాడు.

దేవదేవ జగన్నాథ సర్వభూతార్తినాశన ।
విశ్వయోనే సురారిఘ్న నమస్త్రైలోక్యకారక ॥ (25 - 39)

దేవదేవా ! జగన్నాథా ! సర్వప్రాణికోటికీ ఆర్తి తీర్చేవాడా! విశ్వకారణా! రాక్షససంహారకా! త్రైలోక్యకారకా! నమోనమః, నమోనమః. నీలకంఠా! త్రిశూలధారీ! పార్వతీవల్లభా! దక్షాధ్వరధ్వంసకా! నీ దర్శనంతో ధన్యుడిని అయ్యాను. నీ పాదాలకు నమస్కరించడంతో నా జన్మ సఫలం అయ్యింది. ఓ జగద్గురూ! నేను ఈ సంసారంలో బందీ అయ్యాను. శ్రీమయపాశాలతో బద్ధుడిని అయ్యాను. రక్షణకోరి నిన్ను శరణువేడుతున్నాను. ముక్కంటీ! ఈ మానుషజన్మ ఎత్తి ఎంతో ఖిన్నుడిని అయ్యాను. భవభీతుడిని అయ్యాను. నువ్వే దిక్కు. నువ్వే శరణు. త్రాహి మామ్ త్రాహి మామ్.

మన్మథాంతకా! గర్భవాసంలో మహాదుఃఖం అనుభవించాను. పుట్టిన వెంటనే కంసభయంతో గోకులానికి పారిపోయాను. అక్కడ గోధూళితో దుమ్ముకొట్టుకుపోయిన జుట్టూ నేనూ. అలా గడిచిపోయింది బాల్యం. ఒక మ్లేచ్ఛరాజుకి (యవనుడు) భయపడి ద్వారకకు చేరుకున్నాను. తాతతండ్రుల కాలంనాటి మధురా సుందరపట్టణాన్ని వదులుకున్నాను. యయాతి శాపానికి భయపడి ధర్మరక్షాపరుడనై రాజ్యాన్ని ఉగ్రసేనుడికి సమర్పించి నేను దాసుడినై కాలం గడుపుతున్నాను.



శంభో! సంసారం దుఃఖసాగరం. తెలిసీ అదే చేస్తున్నాను. స్త్రీవశుడినై పారతంత్ర్యం అనుభవిస్తున్నాను. మోక్షచింతన అనేదే కరువయ్యింది. ఇదిగో ఈ తపస్సుకికూడా సంసారమే కారణం. రుక్మిణికి ప్రద్యుమ్నుడు జన్మించాడని, జాంబవతి తనకూ కొడుకుకావలంటూ నన్ను తపస్సుకి ప్రేరేపించింది. పుత్రార్థినై సకామంగా తపస్సు చేశాను. దేవేశా! నిజం చెబుతున్నాను - ఇలా నిన్ను ప్రార్థించాలంటే సిగ్గుగా ఉంది. మోక్షప్రదుడవైన నిన్ను ఆరాధించి ప్రసన్నుడిని చేసుకుని ఒక తుచ్ఛమూ అశాశ్వతమూ అయిన వరాన్ని ఎవడైనా కోరతాడా? నేను కోరుతున్నాను. ఎంత మూర్ఖుడినో చూసుకో.

**కస్త్వామారాధ్య దేవేశం ముక్తిదం భక్తవత్సలమ్ ।**
**ప్రసన్నం యాచతే మూఢః ఫలం తుచ్ఛం వినాశి యత్ ॥ (25 - 52)**

ప్రభూ! మాయావిమూఢాత్ముడినై పుత్ర సుఖం యాచిస్తున్నాను. నిన్ను ముక్తి ఇమ్మని కోరాలి. కానీ కామినీప్రేరితుడినై ఇదే కోరుతున్నాను. సంసారం దుఃఖసాధనమని తెలుసు. అనిత్యమనీ ధర్మవినాశకమనీ తెలుసు. అయినా నాకు విరతి లేదు. విముక్తి లేదు. శాపం వల్ల ఈ భూలోకంలో ఇలా జన్మించాను. మాయాపాశబద్ధుడినై దుఃఖాలు అనుభవిస్తున్నాను. బహుశ ఇందుకే జన్మించాను కాబోలు!

**శాపాన్నారాయణాంశోఽహం జాతోఽస్మిన్ క్షితిమండలే ।**
**భోక్తుం బహుతరం దుఃఖం మాయాపాశేన యంత్రితః ॥ (25 - 56)**

గోవిందుడు తన వేదనను విన్నవించుకున్నాడు. మహేశుడు అనునయంగా బదులుపలికాడు. శ్రీకృష్ణా! నీకు చాలామంది పుత్రులు ఉదయిస్తారు. పదహారువేలయాభైమంది నీకు భార్యలవుతారు. వారిలో ఒక్కొక్కరికీ పదేసిమంది మహాబలశాలులు పుత్రులు జన్మిస్తారు - అన్నాడు. అప్పుడు పార్వతీదేవి కల్పించుకుని - జనార్దనా! నువ్వు ఈ లోకంలో ఈ గృహస్థాశ్రమంలో ఒక వంద సంవత్సరాలు ఉంటావు. అటుపైని బ్రాహ్మణ శాపంవల్లా, గాంధారీశాపంవల్లా నీ వంశం నశిస్తుంది. శాపమోహితులై నీ పుత్రులు పరస్పరం చంపుకుంటారు. నువ్వూ నీ సోదరుడూ మానవశరీరాలు విడిచిపెట్టి దేవలోకం చేరుకుంటారు. జరగవలసింది ఇది. జరుగుతుంది. ఇందులో దుఃఖించవలసింది ఏమీలేదు. అవశ్యభవితవ్యాలకు ప్రతిక్రియలు ఉండవు. నువ్వు అవతారం చాలించిన తరవాత నీ భార్యలు, అష్టావక్రుడి శాపం కారణంగా దొంగలదోపిడీకి గురిఅవుతారు. ఇదంతా జరగవలసిందే - అని చెప్పి పార్వతీపరమేశ్వరులు అంతర్ధానం చెందారు.

శ్రీకృష్ణుడు సంతృప్తి చెంది, ఉపమన్యుడికి కృతజ్ఞతా పూర్వకంగా నమస్కరించి, ద్వారవతి చేరుకున్నాడు.



అందుచేత, జనమేజయా! బ్రహ్మాదిదేవనాయకులుకూడా మాయాకల్లోలానికి అతీతులు కారు. మాయాశక్తి చేతిలో కీలుబొమ్మలు. పూర్వకర్మలనుబట్టి సకలజీవులనూ ఈ మాయాశక్తి ప్రేరేపిస్తూ ఉంటుంది. ఇది పరబ్రహ్మ స్వరూపిణి. ఒకరిపట్ల వైషమ్యంకానీ కాఠిన్యంగానీ ఉండవు. జీవమోక్షం కోసమే నిరంతరం యత్నిస్తూ ఉంటుంది. ఈ మాయాశక్తి లేకపోతే చరాచరజగత్తు లేదు. పట్టి జడంగా ఉండిపోయేది. అందుకే జగజ్జనని కరుణించి జీవకోటి నంతటినీ ఎల్లప్పుడూ ఇలా ప్రేరేపిస్తూ ఉంటుంది. అందుచేత అందరూ మోహవివశులు కావలసిందే. లేకపోతే చైతన్యమే లేదు. సురాసురులందరూ మాయకు లొంగినవారే. మాయాధీనులే. స్వతంత్రురాలు ఆ ఒక్క మాయాదేవిమాత్రమే. అందుకని సర్వాత్మనా ఆ జగదీశ్వరిని సమర్చించాలి. ఈ ముల్లోకాలలోనూ అంతకుమించిన శక్తి లేదు. ఆ పరాశక్తి పదాలను అర్చించడం స్మరించడం -జన్మకు సాఫల్యం. దేవీసమర్చన చెయ్యని వంశంలో జన్మించడం దురదృష్టం. అటువంటి జన్మ ఎవరికీ కలుగకుండుగాక! నేనే దేవిని, ఇతరుణ్ణికాను, నేనే బ్రహ్మను - అందుచేత నాకు దుఃఖం లేదు - అని అభేదభావంతో నిరంతరం జగదంబికను ధ్యానించాలి. గురుముఖతః ఈ వేదాంతభావనను నేర్చుకొని అలవరచుకొని ఏకాగ్రచిత్తంతో ఆత్మరూపిణిని ధ్యానించాలి. అప్పుడే కర్మవిముక్తి. శ్వేతాశ్వతరాది మహర్షులు నిర్మల హృదయులై ఆత్మస్వరూపిణిని తెలుసుకుని భవబంధ విముక్తులయ్యారు. భార్యాసమేతులై త్రిమూర్తులు ఎప్పుడూ ఈ సచ్చిదానందరూపిణిని సేవిస్తూ ఉంటారు.

జనమేజయా! నువ్వు అడిగిందల్లా చెప్పాను. బహుశ నీ వేదన - భవతాపం తీరిందనుకుంటాను. ఇంకా ఏమి వినాలనుకుంటున్నావో అడుగు చెబుతాను - అన్నాడు వ్యాసుడు.

శౌనకాది మహామునులారా! వ్యాసభగవానుడు జనమేజయుడికి చెప్పినదంతా మీకు వివరించాను. ఏమైనా సందేహాలుంటే అడగండి - అన్నాడు సూతుడు.

*(అధ్యాయం - 25, శ్లోకాలు - 83)*

**చతుర్థ స్కంధం - శ్లోకాలు 1418 - తెలుగుసేత : బేతవోలు రామబ్రహ్మం**





# పంచమ స్కంధము

సూతమహర్షీ ! దివ్యమూ సర్వపాపవినాశకమూ అయిన శ్రీకృష్ణ చరితను ఆలకించాం. చాలా ఆనందంగా ఉంది. అయితే, ఒక చిన్న సందేహం. నువ్వే వివరించాలి. శ్రీకృష్ణుడు విష్ణుమూర్తి అవతారంకదా! అతడు మరి శివుణ్ణి ఆరాధించడమేమిటి? పార్వతీదేవి వరమివ్వడమేమిటి? పార్వతీదేవి జగన్మాతకు అంశావతారం కదా! శివుడూ అంతేనాయె. మరి వీరిద్దరినీ శ్రీకృష్ణుడు ఉపాసించడం ఏమిటో అర్థం కావడం లేదు - అన్నారు శౌనకాది మహామునులు. సూతుడు వివరణ ఇచ్చాడు.

మహామునులారా! మీ సందేహానికి సమాధానం ఉంది. వ్యాసుడు చెప్పగా విన్నది చెబుతున్నాను. ఆలకించండి. జనమేజయుడికీ ఇలాంటి సందేహమే కలిగింది. మేధావి కదా! మా గురువుగారిని అడిగాడు. అది చెబితే మీ సందేహమూ తీరిపోతుంది.

వ్యాసమహర్షీ! కృష్ణుడు శివుడిని ఆరాధించడమేమిటి? చాలా ఆశ్చర్యంగా ఉందే! తాను స్వయంగా సర్వేశ్వరుడైయుండి, సర్వసిద్ధిప్రదుడై యుండి సాధారణమానవుడిలాగా మరొక దేవుణ్ణి ఉపాసించడమేమిటి? ఘోరనియమాలతో తపస్సు చేయడమేమిటి? వింతగా లేదూ - అన్నాడు జనమేజయుడు. వ్యాసుడు ఇలా సమాధానం చెప్పాడు.

జనమేజయా! నువ్వన్నది నిజమే. శ్రీకృష్ణుడు నిజంగా జనార్దనుడే. సర్వకార్యనిర్వహణ సమర్థుడే. కానీ మానుషరూపం ధరించాడుగదా! అందుకని వర్ణాశ్రమధర్మాలనుబట్టి మానుషభావాలను ఆచరించాడు. పెద్దలను గౌరవించడం, గురువులను పూజించడం, బ్రాహ్మణులను సత్కరించడం, దేవతలను ఆరాధించడం - ఇవి గృహస్థాశ్రమ ధర్మాలు. అలాగే దుఃఖపడవలసిన విషయాలలో దుఃఖపడటం, సంతోషించాల్సిన సంగతులలో సంతోషించడం, రకరకాల అపవాదాలకు తలఒగ్గి బాధపడటం, స్త్రీలతో కామోపభోగాలు అనుభవించడం, సమయానుకూలంగా విజృంభించే అరిషడ్వర్గాలకు లోనవ్వడం - ఇవన్నీ గృహస్థ గుణాలు. గుణమయ శరీరం ధరించి గుణాతీతంగా ఉండటం అసంభవం.

సౌబలి శాపంవల్ల యాదవ వినాశనం. బ్రాహ్మణశాపంవల్ల కృష్ణుడి అవతారసమాప్తి. తెలిసీ వీటిని తప్పించగలిగాడా? కృష్ణపత్నులను దొంగలు దోచుకున్నారు. అర్జునుడు సన్నిధిలోనే ఉన్నాడు. మహావీరుడుగదా ! బాణాలు వేసి సంహరించగలిగాడా? అలాగే ప్రద్యుమ్నాపహరణాన్ని కృష్ణుడు నిరోధించగలిగాడా? అసలు తెలుసుకోగలిగాడా? అంచేత మనం గ్రహించవలసింది ఏమిటంటే - మానుషదేహం ధరించినప్పుడు మానుషలక్షణాలు ఉంటాయి. అంతే. కాబట్టి నారాయణుడైనా నారాయణాంశజుడైనా మానవుడు మానవుడే. శివుణ్ణి ఆరాధించడంలో ఆశ్చర్యం లేదు.

ఆ శివుడు సర్వేశ్వరుడు. విష్ణుమూర్తికికూడా కారణభూతుడు. సుషుప్తస్థాననాథుడు. విష్ణువుకే పూజనీయుడైనప్పుడు విష్ణ్వంశజులైన కృష్ణాదులకు పూజనీయుడు కావడంలో వింత ఏముంది ?



## ◆ ఓంకారంలో మహేశ్వరి ◆

అకారం బ్రహ్మస్వరూపం. ఉకారం హరిస్వరూపం. మకారం రుద్రస్వరూపం. మహేశ్వరి అర్ధమాత్ర. ఇది ప్రణవం. వీటిలో ఉత్తరోత్తరం బలీయమని బుధులు నిర్ణయించారు. అంచేత ఆదిపరాశక్తి సర్వోత్కృష్ట. ఇది శాస్త్రనిష్కర్ష.

అకారో భగవాన్ బ్రహ్మాప్యుకారః స్యాద్ధరిః స్వయమ్ ।
మకారో భగవాన్ రుద్రోఽప్యర్ధమాత్రా మహేశ్వరీ ॥
ఉత్తరోత్తరభావేనాప్యుత్తమత్వం స్మృతం బుధైః ।
అతః సర్వేషు శాస్త్రేషు దేవీ సర్వోత్తమా స్మృతా ॥ (1 - 22, 23)

జగన్మాత అర్ధమాత్రగా అనుచ్చార్యగా ఉన్నప్పటికీ సర్వోత్కృష్టురాలు. తక్కిన త్రిమూర్తులలో బ్రహ్మకన్నా విష్ణువు, విష్ణువుకన్నా శివుడూ అధికులు. అందుచేత శ్రీకృష్ణుడు శివుణ్ణి అర్చించడంలో సంశయించవలసిందీ సందేహించవలసిందీ ఏమీ లేదు.

జనమేజయా! వరదానంకోసమని బ్రహ్మదేవుడి ముఖంనుంచి ఆవిర్భవించిన రుద్రుడు మరొకడున్నాడు. ఈ రెండవరుద్రుడు మూలరుద్రుడి అంశావతారమే. ఇతడే అందరికీ పూజ్యుడని పెద్దలు చెబుతూంటే ఇక మూలరుద్రుడిని పూజించడం గురించి వేరే చెప్పాలా? ఇంతకీ రుద్రుడికి ఈ ఉత్తమత్వం ఎలా వచ్చిందంటే - దేవీ సాన్నిధ్యంవల్ల. (దేవీతత్త్వస్య సాన్నిధ్యాదుత్తమత్వం స్మృతం శివే 1 - 27).

## ◆ అహంకారమే అసలైన బంధనం ◆

యోగమాయా ప్రభావంవల్ల శ్రీమహావిష్ణువు ప్రతియుగంలోనూ అవతారాలు ధరిస్తున్నాడు. ఇందులో విచారించవలసిన అంశం ఏమీ లేదు. ఆదిపరాశక్తి తన కనుబొమలను కదిలిస్తే చాలు విశ్వసృజన జరుగుతుంది, రక్షణ జరుగుతుంది, సంహరణమూ జరుగుతుంది. త్రిమూర్తులకు ఆయా అవతారాలను నియమించేదీ జగజ్జననియే. సూతికాగృహంగా మారిన కారాగారంనుంచి శ్రీకృష్ణుడిని తప్పించి గొల్లపల్లెకు చేర్చింది ఎవరు? ద్వారకానిర్మాణం చేయించింది ఎవరు? పదహారువేలయాభై యెనిమిదిమంది అందగత్తెలను తన కళాంశలతో సృష్టించి శ్రీకృష్ణుడితో పరిణయమాడించింది ఎవరు? వారి విలాసాలకు అతడిని దాసుణ్ణి చేసింది ఎవరు? అంతా ఆదిపరాశక్తియే. ఎంతటి పురుషుడినైనా లోహపాశాలతో బంధించడానికి ఒక్క విలాసవతి చాలు. ఈయనకి పదహారువేలయాభైయెనిమిది మంది. పంజరంలో చిలకలా బందీ అయిపోయాడు.



ఏకాపి బంధనవిధౌ యువతీ సమర్థా
పుంసో యథా సుదృఢలోహమయం తు దామ ।
కిం నామ షోడశ సహస్ర శతార్ధకాశ్చ
తం స్వీకృతం శుకమివాతినిబంధయంతి ॥ (1 - 32)

సత్యభామ కోరిక తీర్చడానికి పారిజాతం అపహరించి తెచ్చాడు. బలప్రదర్శనతో శిశుపాలాదులను తరిమికొట్టి రుక్మిణీదేవిని రాక్షసవివాహపద్ధతిలో చెట్టపట్టాడు. ఈ పనులకన్నింటికీ మూలకారణం అహంకారం. అదే శుభాశుభకర్మలను చేయిస్తూ ఉంటుంది. ఈ స్థావరజంగమాత్మక సృష్టికంతటికీ అహంకారమేగదా కారణం! బ్రహ్మదేవుడుగానీ విష్ణుమూర్తిగానీ ఈ అహంకారాన్ని విడిచిపెడితేనే విముక్తుడు అవుతాడు. లేదంటే సంసారకర్మలు చేస్తూనే ఉంటాడు. అహంకార విముక్తుడు - విముక్తుడు. అహంకారబద్ధుడు - బద్ధుడు. ధనమూ గృహమూ సంతానమూ సోదరులూ ఇల్లాలూ ఇవియేవీ నిజానికి పెద్ద బంధనాలు కావు. ప్రాణికోటికి అహంకారమొక్కటే అసలుసిసలైన బంధనం.

న నారీ న ధనం గేహం న పుత్రా న సహోదరాః ।
బంధనం ప్రాణినాం రాజన్! అహంకారస్తు బంధకః ॥ (1 - 38)

నేనే కర్తను, ఈ పనిని నేనే చేశాను, సమర్థుణ్ణి, ఇంకా ఇలా చేస్తాను అలా చేస్తాను, చేస్తున్నాను అంటూ మానవుడు తనను తాను బంధించుకుంటున్నాడు. కారణం లేకుండా కార్యం పుట్టదుగదా! అహంకారమే అన్నింటికీ ఆదికారణం. మట్టిముద్దలేనిదే కుండ తయారు కానట్టు అహంకారం లేనిదే ఏ కార్యమూ ఉత్పత్తికాదు. విష్ణుమూర్తి జగద్రక్షణ చేస్తున్నాడంటే అహంకారమే కారణం. లేకపోతే అంతగా చింతామగ్నుడు ఎందుకు అవుతాడు? అవతార ప్రవాహంలో ఎందుకు మునుగుతాడు? అహంకారం నుంచి మోహం పుడుతుంది. మోహంవల్ల సంసారం ఏర్పడుతుంది. అహంకారం లేకపోతే మోహమూలేదు, సంసారమూ లేదు.

మోహమూలమహంకారః సంసారస్తత్సముద్భవః ।
అహంకారవిహీనానాం న మోహో న చ సంసృతిః ॥ (1 - 44)

సత్త్వరజస్తమోగుణాలు ప్రధానంగా భాసించే విష్ణు విరించి మహేశ్వరులు కూడా అహంకారబద్ధులే. అస్వతంత్రులే. విష్ణుమూర్తి తన ఇచ్ఛానుసారం అవతారాలు ధరిస్తాడని భావించే మూఢులు చాలామందే ఉంటారు ఈ లోకంలో. ఎంతటి మందబుద్ధియైనా గర్భవాసక్లేశాన్ని కోరుకుంటాడా? విద్వాంసుడైనవాడు అసలు కోరుకోడుగదా! అటువంటిది వాసుదేవుడు అవతారాలను ఇచ్ఛాపూర్వకంగా ధరించడమేమిటి?



వైకుంఠవాసంకన్నా గర్భవాసం సుఖమా? కష్టాలూ క్లేశాలూ విచారాలూ దుఃఖాలూ అనుభవించడం ఆనందదాయకమా? కాదుగదా! అస్వతంత్రుడు కనక తప్పనిసరై అవతారాలు ధరిస్తున్నాడన్నమాట. స్వతంత్రుడే అయితే ధరించడుగాక దరించడు. మహారాజా! ఈ త్రిమూర్తులేకాదు జగత్తు అంతా యోగమాయావశం. బ్రహ్మాదిస్తంభపర్యంతమూ మాయాతంత్రీనిబద్ధమే. సాలెగూడులో సాలిపురుగులై పరిభ్రమిస్తున్నారు. *(అధ్యాయం - 1, శ్లోకాలు - 54)*

మాయాతంత్రీ నిబద్ధా యే బ్రహ్మవిష్ణుహరాదయః ।
భ్రమంతి బంధమాయాంతి లీలయా చోర్ణనాభవత్ ॥ ( 1 - 54)

వ్యాసమహర్షీ! యోగమాయ, యోగశక్తి అంటూ నీ ప్రసంగంలో చాలా పర్యాయాలు ప్రసక్తి వచ్చింది. ఆ యోగేశ్వరి ప్రభావం ఏమిటో తెలుసుకోవాలని ఉంది. చరాచరజగత్తు అంతా యోగేశ్వరీ సముత్పన్నమేనని చెబుతున్నావు. దయచేసి అదేమిటో వివరించు - అని జనమేజయుడు అడిగాడు. వ్యాసుడు సంబరపడ్డాడు.

జనమేజయా! శాంతుడూ శ్రద్ధావంతుడూ అయిన శ్రోతకు అడిగింది చెప్పనివాడు పరమమూఢుడు. అందుచేత నీకు సవిస్తరంగా చెబుతాను ఆలకించు.

## ◆ మహిషాసుర జన్మ వృత్తాంతం ◆

పూర్వకాలంలో మహిషుడనే దైత్యుడు మేరుపర్వత శిఖరంమీద వేలసంవత్సరాలు తపస్సు చేశాడు. బ్రహ్మదేవుడు ప్రత్యక్షమై వరం కోరుకోమన్నాడు. వాడు సంబరపడి అమరత్వం (మరణంలేని జీవితం) ప్రసాదించమని అడిగాడు. దానికి చతుర్ముఖుడు ఉలిక్కిపడి -

దైత్యవీరా! పుట్టినది ప్రతిదీ గిట్టక తప్పదు. గిట్టినది ప్రతిదీ పుట్టక తప్పదు. జననమరణాలు సకలప్రాణికోటికీ సహజధర్మాలు.

ఉత్పన్నస్య ధ్రువం మృత్యుః ధ్రువం జన్మ మృతస్య చ ।
సర్వథా మరణోత్పత్తీ సర్వేషాం ప్రాణినాం కిల ॥ (2 - 9)

మహాసముద్రాలకూ మహాపర్వతాలకూ సైతం ఎప్పటికో అప్పటికి వినాశం తప్పదు. అందుచేత నీ కోరిక ప్రకృతివిరుద్ధం. మరణానికి ఒక అవకాశం (ఒక స్థానం) విడిచిపెట్టి నీ ఇష్టం ఏదైనా కోరుకో. తీరుస్తాను - అన్నాడు.



అయితే, పితామహా! పురుషుడి చేతిలో నాకు మరణం లేకుండా వరం ఇయ్యి. ఆడది నన్నేమీ చెయ్యలేదు. అబల నన్ను చంపుతుందా! అసంభవం. అందుచేత అబలను నా మరణానికి ఒక అవకాశంగా, ఒక స్థానంగా విడిచిపెడుతున్నాను.

మహిషాసురా! ఎప్పటికో అప్పటికి ఆడదానిచేతిలోనే నువ్వు మరణిస్తావు. పురుషుడివల్ల నీకు మృత్యుభయం లేదు అని వరం ఇచ్చి పద్మసంభవుడు అంతర్ధానం చెందాడు. మహిషుడు సంబరపడిపోతూ తన రాజధానికి చేరుకున్నాడు.

జనమేజయా! ఈ మహిషుడు ఎవడు? మహిషరూపం ఎలా వచ్చింది? - ఇలాంటి సందేహాలు నిన్ను తొలిచేస్తూ ఉంటాయి. అవునా? విను - ఆ వివరాలు కూడా చెబుతాను -

దానవ వంశానికి మూలపురుషుడు దనువు. అతడికి ఇద్దరు కుమారులు. రంభుడు కరంభుడు అని వారి పేర్లు. ఇద్దరూ భూమండలంలో ఉత్తములుగా ఖ్యాతిగడించారు. కానీ ఆ ఇద్దరికీ సంతానం లేకపోయింది. ఆ దిగులుతో తపస్సు చేశారు. కరంభుడు పంచనదంలో మునిగి తపస్సు తీవ్రంగా చేశాడు. రంభుడు దగ్గరలోఉన్న సాలవృక్షం అధిరోహించి అగ్నిని ఉపాసించాడు. వీరి తపస్సులు ఇంద్రుణ్ణి భయపెట్టాయి. మొసలి రూపంలో వచ్చి కరంభుడి పాదాలు పట్టుకొని నీళ్ళలోకి లాగి సంహరించాడు. ఇది రంభుడికి తెలిసింది. క్రుద్ధుడయ్యాడు. తలను ఖండించుకుని అగ్నికి ఆహుతి చెయ్యాలని సంకల్పించుకున్నాడు. ఎడమచేతితో జుట్టుపట్టుకుని కుడిచేతితో తలను నరుక్కోబోయాడు. చటుక్కున అగ్నిదేవుడు వారించాడు.

రంభాసురా! ఎంత మూర్ఖత్వం! నీ తలను నువ్వే నరుక్కుంటావా? చచ్చి ఏమి సాధిస్తావు? ఆత్మహత్య - మహాపాతకం. పిచ్చివాడా! విరమించు. ఏం కావాలో వరం కోరుకో - అన్నాడు.

రంభాసురుడు జుట్టునూ ఖడ్గాన్నీ విడిచిపెట్టి అగ్నిదేవుడికి చేతులు జోడించాడు. అగ్నిదేవా! నా తపస్సుకి నువ్వు సంతుష్టుడివైనట్టయితే త్రిలోకవిజేతను పుత్రుడుగా అనుగ్రహించు. దేవదానవమానవులకు అజేయుడు, కామరూపధారి, మహాబలశాలి, సర్వలోకవందితుడూ అవ్వాలి. అలాంటి పుత్రుడు కలిగేట్టు వరం ప్రసాదించు - అని అభ్యర్థించాడు.

అగ్నిదేవుడు అంగీకరించాడు. నీ మనస్సు ఏ కామినిపై లగ్నమవుతుందో ఆమెవల్ల నీకు నువ్వు కోరుకున్న పుత్రుడు జన్మిస్తాడని చెప్పి అదృశ్యమయ్యాడు.

రంభాసురుడు అక్కడినుంచి బయలుదేరి ఇంటికి వస్తూ, దారిలో యక్షులు క్రీడిస్తున్న ఒక రమణీయ ప్రదేశాన్ని చూశాడు. అక్కడ ఒక గేదె (మహిషి) కనిపించింది. ఎదకు వచ్చి కామార్తయై విహరిస్తోంది. దాన్ని చూడగానే రంభుడి మనస్సు చలించింది. సంగమించాడు. అది గర్భవతి అయ్యింది.



దాన్ని తీసుకుని తన పాతాళనగరానికి వెళ్ళాడు. దున్నపోతులను కాపలా పెట్టాడు. ఒకరోజున ఒక దున్నపోతు కామార్తయై ఆ (రాజమహిషి) గేదె వెంటపడింది. రంభుడు స్వయంగా వచ్చి ఆ దున్నపోతును ఎదిరించాడు. ఇద్దరికీ యుద్ధం జరిగింది. రంభుడి పిడిగ్రుద్దులకు ఆ దున్నపోతు చలించిపోతూనే తల విసిరింది. బలమైన కొమ్ములలో గుండెల్లో పొడిచింది. వాడు నేలకు ఒరిగిపోయి గిలగిలా తన్నుకుంటూ ప్రాణాలు వదిలాడు.

తన భర్త రంభుడు మరణించడంతో ఆ చూడిగేదె దుఃఖాన్ని తట్టుకోలేక భయంతో పరుగులుతీసింది. యక్షులను శరణువేడింది. కామమోహితమైన ఆ దున్నపోతు వెంటబడి వచ్చింది. యక్షులు గమనించారు. గేదెను కాపాడాలి అనుకున్నారు. యుద్ధానికి దిగారు. ఘోర యుద్ధం జరిగింది. కట్టకడపటికి దున్నపోతు మరణించింది. యక్షులు ఊపిరి పీల్చుకున్నారు. గేదెను ఓదార్చి ధైర్యం చెప్పారు. రంభుడి మృతదేహానికి అగ్నికార్యంకోసం చితి పేర్చారు. కళేబరాన్ని తెచ్చి చితిపై పెట్టారు. నిప్పు ముట్టించారు. అల్లంత దూరం నుంచి చూస్తున్న చూడిగేదె దుఃఖావేశాన్ని తట్టుకోలేక పరుగుపరుగున వచ్చి చితిలో ప్రవేశించింది. సహగమనం చేసింది. యక్షులు ఆశ్చర్యపోయి నిశ్చేష్టులై చూస్తున్నారు. అంతలోకి చితిమంటలనుంచి మహిషుడు ఆవిర్భవించాడు. ఇతడే మన మహిషాసురుడు. రంభుడి కొడుకు. మహిష-రాక్షస రూపాల కలయిక. తండ్రి రాజ్యానికి వారసుడై పట్టాభిషిక్తుడయ్యాడు. రంభుడు కూడా పుత్రవాత్సల్యంతో మరొక దేహాన్ని పొంది రక్తబీజుడై మహిషుడికి అనుచరుడూ ఆంతరంగికుడూ అయ్యాడు. ఇదీ మహిషాసురుడి జన్మవృత్తాంతం. ***(అధ్యాయం - 2, శ్లోకాలు - 50)***

## ◆ మహిషాసురుడి యుద్ధసన్నాహం ◆

వరదర్పితుడైన మహిషాసురుడు జగత్తునంతటినీ వశం చేసుకున్నాడు. జగద్విజేత అనిపించుకున్నాడు. తన ఏలుబడిలోకి తెచ్చుకున్నాడు. నిరాటంకంగా ఏకచ్ఛత్రాధిపత్యంగా పరిపాలన సాగించాడు. చిక్షురుడు సేనాపతిగా, తామ్రుడు కోశాధిపతిగా, అసిలోమ-బిడాల-బాష్కల-త్రినేత్ర-కాలబంధకాదులు దండనాయకులుగా మహిషుడు విజృంభించి భూపాలురనందరినీ సామంతులుగా చేసుకొని కప్పాలు కట్టించుకొంటున్నాడు. క్షాత్రధర్మంతో ఎదిరించినవారిని నిర్దాక్షిణ్యంగా మట్టుబెడుతున్నాడు. బ్రాహ్మణులందరూ వశులైపోయారు. యజ్ఞయాగాలలో దేవతలతోపాటు సమానంగా భాగం సమర్పిస్తున్నారు. క్షితిమండలమంతా స్వాధీనం కావడంతో ఇప్పుడింక మహిషాసురుడి దృష్టి స్వర్గలోకంమీద పడింది. దాన్ని జయించాలని నిశ్చయించుకున్నాడు. ఇంద్రుడి దగ్గరికి దూతను పంపించాడు.



ఇంద్రా! స్వర్గాన్ని విడిచిపెట్టి ఎక్కడికైనా పో. లేదంటే మహిషాసురుడికి సేవలు చెయ్యి. అతడు నిన్ను రక్షిస్తాడు. ఇదీ కాదంటావా వజ్రాయుధం ధరించి యుద్ధం చెయ్యి. పూర్వకాలంలో మా దైత్యులు నిన్ను ఎన్నోసార్లు జయించారు. ఓ అహల్యాజారుడా! నీ శక్తి సామర్థ్యాలు మాకందరికీ తెలుసు. నీ ఇష్టం. నీ మనస్సుకి ఏది మంచిదనిపిస్తే అది చెయ్యి. స్వర్గం విడిచి పారిపోతావో, యుద్ధమే చేస్తావో, శరణువేడుకుంటావో - నీ ఇష్టం అని ఆ దూత మహిషాసురుడి సందేశం వినిపించాడు.

ఇంద్రుడికి పట్టరానంత కోపం వచ్చింది. నిగ్రహించుకున్నాడు. ముఖానికి చిరునవ్వు పులుముకున్నాడు. దూతా! మీ మహిషాసురుడి మదగర్వం ఎంతటిదో తెలుసుకున్నాను. రోగానికి చికిత్స చేస్తాను. వాడి వంశాన్ని సమూలంగా నిర్మూలిస్తాను. వెళ్ళు. వెళ్ళి నిర్భయంగా నామాట చెప్పు. దూతను చంపకూడదన్నారు కనక నిన్ను వదిలిపెడుతున్నాను. మీ ప్రభువును దండెత్తి రమ్మను. గడ్డితినే మూర్ఖుడికి (మహిషంకదా!) ఇంత కండకావరమా! వాడి - కొమ్ములు విరగ్గొట్టి బలమైన ధనుస్సు చేయించుకుంటాను. కొమ్ములు వచ్చాయనేకదా విర్రవీగుతున్నాడు. రమ్మను విరిచేస్తాను. శృంగభంగం చేస్తాను. ఇంటిలో కూర్చుని ఎగరడం కాదు. దేవేంద్రుడితో యుద్ధం. ఏమనుకుంటున్నాడో రమ్మను - అని ప్రతిసందేశం పంపించాడు.

హయారే! త్వద్బలం జ్ఞాతం తృణాదస్యం జడాకృతిః ।
శృంగయోస్తే కరిష్యామి సుదృఢం చ శరాసనమ్ ॥ (3 - 19)

ఆ దూత మహిషాసురుడి సన్నిధికి వెళ్ళి సారాంశంగా రెండుమాటలు చెప్పాడు. ప్రభూ! దేవేంద్రుడు నిన్ను బొత్తిగా లెక్కచెయ్యడంలేదు. తన బలమూ తన సైన్యమూ చాలా గొప్పవీ పరిపూర్ణమైనవీ అనుకొంటున్నాడు. ఆ మూర్ఖుడు అన్నమాటలన్నీ యథాతథంగా ఎలా చెప్పను ప్రభూ! భృత్యుడు తన ప్రభువు ఎదుట ఎప్పుడూ ప్రియమూ సత్యమూ పలకాలనికదా పెద్దలంటారు. ఇది నీతి. కేవలం ప్రియం చెప్పడంగానీ, పరుషం చెప్పడంగానీ సేవకుడికి శుభప్రదం కాదన్నారు. శత్రురాజు విషం కక్కితే భృత్యుడైన దూత ఆ మాటలను తెచ్చి యథాతథంగా తన ప్రభువు ఎదుట వినిపించగలడా! ఇంద్రు డన్నమాటలు అలాగే చెప్పడానికి నాకు నోరు రావడంలేదు. ధైర్యమూ చాలడంలేదు.

ప్రియం సత్యం చ వక్తవ్యం కదాచిచ్ఛుభమిచ్ఛునా ।
ఇతి నీతిర్మహారాజ జాగర్తి శుభకారిణీ ॥
కేవలం చేత్ప్రియం బ్రూయాన్న తే కార్యం భవిష్యతి ।
పరుషం చ న వక్తవ్యం కదాచిచ్ఛుభమిచ్ఛతా ॥ (3 - 22, 23)



హేతుబద్ధంగా దూతచెప్పిన ఈ మాటలకు మహిషాసురుడు మండిపడ్డాడు. దైత్యవీరులనందరినీ పిలిపించాడు. లోక పైకెత్తి మూత్ర విసర్జన చేశాడు. (లాంగూలం పృష్ఠదేశే చ కృత్వా మూత్రం పరిత్యజన్ - 30) అందరికీ వినిపించేట్టు అరిచాడు -

దైత్యవీరులారా! ఇంద్రుడు మనతో యుద్ధం కోరుకుంటున్నాడు. సన్నద్ధులు అవ్వండి. ఆ సురాధముణ్ణి జయించాలి. ఈ సృష్టిలో నన్ను ఎదిరించి నిలబడగలిగిన వీరుడెవ్వడు? వెయ్యిమంది ఇంద్రులైనా నాకు సాటిరారు. నిర్భయంగా ఒంటి చేత్తో సంహరిస్తాను. వీడు ఈ ఇంద్రుడు - ముక్కుమూసుకుని శాంతచిత్తులై తపస్సు చేసుకునే మునీశ్వరుల ఎదుట మహాశూరుడు. కుటిలుడు. లంపటుడు. పరదారాపహర్త. అప్సరసలే వీడి బలం, తపస్సులను ధ్వంసం చేయించడమే వీడి ప్రతాపం. బలుడు. అల్పాయుధుడు. నిత్యపాపి. విశ్వాసఘాతకుడు. సంధి చేసుకుని నమ్మించి నముచిదైత్యుణ్ణి మట్టుబెట్టాడు. మోసం చేసి పట్టనబెట్టుకున్నాడు. విష్ణుమూర్తి ఒకడు నిత్యకపటి. కుహకుడు. ఎన్నెన్ని వేషాలు వేస్తాడో, ఎన్నెన్ని రూపాలు ధరిస్తాడో. చివరికి పందిరూపానికైనా వెనుకాడడు. హిరణ్యాక్షుణ్ణి అలాగేకదా సంహరించాడు. నరసింహరూపం ధరించి హిరణ్యకశిపుణ్ణి చీల్చి వధించాడు. నేను దనుపుత్రుణ్ణి. వీళ్ళ కుత్సితాలకూ కుతంత్రాలకూ లొంగను. దేవతలను ఛస్తే నమ్మను. చూస్తా, ఇంద్రుడేమి చెయ్యగలడో, ఉపేంద్రుడేమి చెయ్యగలడో? రణరంగంలోకి దిగితే రుద్రుడైనా నన్ను ఏమీ చెయ్యలేడు. అష్టదిక్పాలకులనూ శచీపతినీ తరిమికొట్టి స్వర్గ సామ్రాజ్యం కైవసం చేసుకుంటాను. అటుపైని మనమే యజ్ఞహవిర్భోక్తలం. సోమపానం మనదే. స్వర్గలోకం మనదే. స్వేచ్ఛగా విహరిద్దాం. నాకున్న వరం మీకందరికీ తెలుసుగదా! దేవదానవులు నన్నేమీ చెయ్యలేరు. ఏ పురుషుడూ నన్ను సంహరించలేడు. ఇక ఆడది నన్ను ఏమి చెయ్యగలుగుతుంది? దైత్య వీరులారా! నిర్భయంగా ఉండండి. కయ్యానికి కాలుదువ్వండి. పాతాళం నుంచీ పర్వతాగ్రాల నుంచీ దానవవీరులను అందరినీ ఆహ్వానించండి. యుద్ధానికి తరలివెడదాం. నిజానికి నేను ఒక్కడినే సకలదేవతలనూ జయించగలను. కానీ, దానవులారా! శోభకోసమని మిమ్మల్ని అందరినీ పిలిచి తీసుకువెడుతున్నాను -

> ఏకోఽహం సర్వదేవేశాన్విజేతుం దానవాః క్షమః ।
> శోభార్థం వస్సమాహూయ వయామి సురసంగమే ॥ (3 - 44)

నాకేమీ భయంలేదు. ఈ కొమ్ములతో ఈ గిట్టలతో దేవతలను చీల్చి చెండాడతాను. వరం ఉందికదా! మనకు తిరుగులేదు. మరణం లేదు. అపజయం లేదు. అందరూ సన్నద్ధులు అవ్వండి. బయలుదేరండి. దేవలోకం జయిద్దాం. నందనంలో విహరిద్దాం. మందార కుసుమాలు అలంకరించు కుందాం. అప్సరసలతో క్రీడిద్దాం. కామధేనువు పాలు త్రాగుదాం. సుధాపానం చేద్దాం. గంధర్వగీతాలు



ఆలకిస్తూ నృత్యం చేద్దాం. రకరకాల మద్యాలూ ఆసవాలూ మనకు అందిస్తూ రంభ ఊర్వశి మేనక ఘృతాచి తిలోత్తమ మొదలైన అప్సరసలు నృత్యంచేస్తూ మనకు ఆనందం కలిగిస్తారు. రంజింపజేస్తారు. ఇవ్వేళనే స్వర్గానికి పోదాం. సిద్ధమవ్వండి. యుద్ధప్రయాణానికి మంగళాచరణ చెయ్యండి. మన గురువు శుక్రాచార్యుణ్ణి పిలవండి. అర్చించండి. జయప్రదమైన యజ్ఞంచేసి ఆశీర్వదించమనండి.

దైత్యనాయకులకు ఆ మహిషాసురుడు ఇలా ఆజ్ఞాపించి ఉత్సాహంతో ఉబ్బితబ్బిబ్బైపోతూ త్వరత్వరగా తన మందిరం చేరుకున్నాడు. ***(అధ్యాయం - 1, శ్లోకాలు- 53)***

## ◆ ఇంద్రుడి యుద్ధసన్నాహం ◆

దేవేంద్రుడు కూడా అష్టదిక్పాలకులను ఆహ్వానించి సమాలోచనలు జరిపాడు. రంభుడి కొడుకు మహిషాసురుడు వరదర్పితుడై స్వర్గలోకం మీదకి దండెత్తి రాబోతున్నాడు. ఇందాకనే అతడి దూత వచ్చాడు. దేవలోకాన్ని విడిచిపెట్టిపోతావా, యుద్ధానికి నిలబడతావా అంటూ సందేశం తెచ్చాడు. వాడికి మనం లొంగిపోయి సేవకులం అవ్వాలిట. అలా అయితే దయతలిచి మనల్ని బతకనిస్తాడుట. భృత్యులైనవారిమీద కోపగించడుట. లేదంటే యుద్ధానికి సిద్ధం కమ్మన్నాడు. దేవనాయకులారా! ఏం చేద్దామో చెప్పండి. దుర్బలుడైనా శత్రువును ఉపేక్షించకూడదు. అటువంటిది బలవంతుడూ వరదర్పితుడూ అయిన ఈ శత్రువును అసలు ఉపేక్షించకూడదు. బుద్ధిబలమూ బాహుబలమూ ఉపయోగించి వీడి పీడ వదిలించుకోవాలి. ఇటువంటి దుష్టులపట్ల సంధిమంత్రాలు పనికిరావు. మాటకు కట్టుబడిఉండే మంచివారితోగానీ ఇటువంటి నీచులతో సంధి కుదుర్చుకోవడం క్షేమమూ కాదు, గౌరవమూ కాదు.

పోనీ అంటే, యుద్ధానికి దండెత్తితే సాహసమవుతుందేమో అని శంకిస్తున్నాను. వాడు వరదానదర్పితుడు. దేవ దానవ మానవులవల్ల మరణం లేదుట. అదీగాక యుద్ధమనే సరికి గెలుపు ఓటములు దైవాధీనాలు. అందుచేత బాగా ఆలోచించి మనమొక నిర్ణయం తీసుకోవాలి. ముందుగా చారులను పంపించి పరిస్థితి తెలుసుకోవడం మంచిది అనిపిస్తోంది. ఇంగితజ్ఞులూ, నిస్సంగులూ, నిస్పృహులూ, సత్యవాదులూ అయిన చారులను పంపి వాడి సేనా సన్నద్ధతను గ్రహించడం అవసరం. వాడి బలాబలాలను క్షుణ్ణంగా తెలుసుకున్నాక యుద్ధభేరి మోగించడం జయప్రదంగా ఉంటుందని నా అభిప్రాయం. ఈలోగా మన స్వర్గలోకంలో దుర్గాలను పటిష్ఠపరుచుకోవాలి. సర్వసన్నాహాలూ చెయ్యాలి. జాగరూకులమై ఉండాలి. ఎప్పుడైనా ఏ పనినైనా బాగా ఆలోచించి చెయ్యాలి. అది బుద్ధిమంతుల లక్షణం. హడావిడిగా నిర్ణయాలు తీసుకుని కార్యాచరణకు దిగితే అది అనర్థదాయకమే అవుతుంది.

> విచార్యఖలు కర్తవ్యం కార్యం బుద్ధిమతా సదా ।
> సహసా విహితం కార్యం దుఃఖదం సర్వథా భవేత్ ॥ **(4 - 14)**



దానవులపట్ల భేదోపాయం పనిచేయదు. దేవతలతో శత్రుత్వమనే విషయంలో వారంతా ఎప్పుడూ ఏకాభిప్రాయులే. అందుచేత దూతలను పంపించి బలాబలాలు తెలుసుకుందాం. తరవాత ఒక నిర్ణయం తీసుకుందాం. సాహసం అన్నివేళలా పనికిరాదు. ఒక్కొక్కసారి విపరీతఫలాలను ఇస్తుంది. తెలియని మందు మింగితే ఏమవుతుంది! (సర్వథా తద్భవేన్మూన మజ్ఞాత మౌషధం యథా 4 - 18)

జనమేజయా! ఇంద్రాదులు ఇలా సమాలోచన జరిపి మహిషాసురుడి రాజధానికి (మాహిష్మతి) చారులను పంపించారు. వారు వెళ్ళివచ్చి వాస్తవ సమాచారం తెలియజేశారు. ఇంద్రుడు వెంటనే బృహస్పతితో చర్చించాడు.

## ◆ ఇంద్ర-బృహస్పతి సంవాదం ◆

మహామతీ! బృహస్పతీ!! నువ్వు దేవగురుడవు. రాజనీతి తెలిసినవాడవు. సర్వజ్ఞుడవు. మహిషాసురుడు మదమత్తుడై స్వర్గంమీదకి దండెత్తబోతున్నాడు. దానిని ఎదుర్కోవాలి. ప్రతిక్రియ చెయ్యాలి. ఏమి చెయ్యాలి, ఎలా చెయ్యాలి అనేది ఆలోచించి నువ్వే సలహా చెప్పాలి. విపత్కర పరిస్థితులలో నువ్వు తప్ప నాకు మరొక దిక్కులేదు. అటువైపు శుక్రాచార్యుడున్నాడని నీకు తెలుసుగదా!

ఇంద్రుడి మాటలు విన్నాడు. బృహస్పతి దీర్ఘంగా ఆలోచించాడు. మెల్లగా సాలోచనగా పలికాడు. ఇంద్రా! కంగారుపడకు. ధైర్యంగా ఉండు. కష్టాలు వచ్చినప్పుడే ధైర్యంగా ఉండాలి. జయాపజయాలు ఎప్పటికైనా దైవాధీనాలే. జరగవలసింది ఎలాగూ జరుగుతుంది. దాన్ని ఎవరూ తప్పించలేరు. అయినా మన ప్రయత్నం మనం ఎప్పుడూ చెయ్యాల్సిందే. పురుషకారం ఉండాలి. మహామునీశ్వరులైనా ముక్తికోసం ప్రయత్నం చెయ్యవలసిందే. రాసిపెట్టి ఉంటే అదే వస్తుంది అని ఊరుకుంటే ఎవరికీ ఏదీ రాదు. ముక్తి అనలేరాదు. అది పూర్తిగా దైవాధీనమే అయినా ధ్యానమూ తపస్సూ వంటి ప్రయత్నాలు ఉండాల్సిందే కదా ! సుఖమో దుఃఖమో పురుష ప్రయత్నం ఉండాలి. అది లేకుండా ఏదీ సిద్ధించదు. ప్రయత్నం చేసినా సిద్ధించకపోతే అది వేరే సంగతి. దైవం అనుకూలించలేదు మనకు అని ఉపశమనం పొందాలేతప్ప నిందలకు దిగకూడదు.

కృతే పురుషకారేఽపి యది సిద్ధిర్న జాయతే ।
న తత్ర దూషణం తస్య దైవాధీనే శరీరిణి ॥ (4 - 33)

యుద్ధాలలో ప్రధానంగా జయోపలబ్ధి అనేది మంత్రాంగంమీదనో సైన్యసమృద్ధి మీదనో ఆధారపడి ఉండదు. అది పూర్తిగా దైవాధీనం. బలవంతుడు ఓడిపోవచ్చు, బలహీనుడు గెలవవచ్చు. అలాగే ధీమంతుడు నష్టపోవచ్చు, బుద్ధిహీనుడు భోగాలను పొందవచ్చు. పిరికివాడికి జయం లభించవచ్చు,



మహాశూరుడు పారిపోవచ్చు. అంతా దైవాధీనం. విచారించి ప్రయోజనం లేదు. మన ప్రయత్నం మనం చెయ్యడమే. దుఃఖమే మిగులుతుందో సుఖమే కలుగుతుందో. దుఃఖాలలో ఉన్నప్పుడు దుఃఖాధికులను చూసి, సుఖాలలో ఉన్నప్పుడు సుఖాధికులను చూసి మనల్ని మనం ఓదార్చుకోవాలి, నిగ్రహించుకోవాలి. అంతేకానీ ఈ సుఖదుఃఖాలు అనే శత్రువులకు మనకు మనంగా బందీలం కాకూడదు.

దుఃఖే దుఃఖాధికాన్ పశ్యేత్ సుఖే పశ్యేత్సుఖాధికాన్ ।
ఆత్మానం హర్షశోకాభ్యాం శత్రుభ్యామివ నార్పయేత్ ॥ (4 - 38)

రెండు రకాల పరిస్థితులలోనూ ధైర్యం సడలనివ్వకపోవడమే బుద్ధిమంతుల కర్తవ్యం. అధైర్యంవల్ల కలిగే దుఃఖం అన్నింటికీ మించినది. ధైర్యమే సహనశక్తిని ఇస్తుంది. రెండింటినీ సమానంగా చూడగలిగితే సుఖాలకు పొంగిపోవడంగానీ దుఃఖాలకు క్రుంగిపోవడంగానీ జరగదు. నేను నిర్గుణుడను, నేను అవ్యయుడను అనే స్థితికి చేరుకుంటాడు.

ఇంద్రా! ప్రాణానికి క్షుత్పిపాసలూ, మనస్సుకి శోకమూర్ఛనలూ, శరీరానికి జరామృత్యువులూ - వెరసి వీటిని షడూర్ములు అంటారు. వీటికి అతీతుడుగా ఉండటమే శివత్వం. ఇవన్నీ శరీరానివి, నావికాదు, ఈ శరీరమూ నేనూ ఒకటి కాదు. నేను పూర్తిగా విభిన్నుడను అనుకోగలిగితే వాడు సదా సర్వదా సుఖి. నిత్యసంతోషి. నేను ప్రకృతి కాదు. నేను వికృతి కాదు. నాకు దుఃఖమేమిటి? - ఇలా ఆలోచించు. సురాధ్యక్షా! మానసికంగా నిర్మమత్వం అలవరచుకో. దుఃఖనాశనానికి ఇది మొదటి ఉపాయం. మమత (వాది నాది అనుకోవడం) అనేది పరమ దుఃఖం. నిర్మమత అనేది పరమసుఖం. సంతోషాన్ని మించిన సుఖం లేదు.

మమతా పరమం దుఃఖం నిర్మమత్వం పరం సుఖమ్ ।
సంతోషా దపరం నాస్తి సుఖస్థానం శచీపతే ॥ (4 - 45)

ఇలా మమకారాన్ని చంపుకోలేకపోతే పోనీ, భవితవ్యంమీద కచ్చితమైన వివేకమైనా ఉండాలి. ప్రారబ్ధకర్మలు అనుభవించాల్సిందే. అలా తప్ప అవి నశించవు. యద్భావి తద్భవత్యేవ. ఇంక సుఖదుఃఖాలకు చింతించవలసింది ఏముంది - అనే అవగాహనైనా ఉండాలి. నీ స్వబుద్ధితోకానీ దేవతల సహాయంతో గానీ కార్యం సాధించు. ఒకటిమాత్రం గుర్తుపెట్టుకో. సుఖాలు పుణ్యక్షయంకోసం. దుఃఖాలు పాపక్షయంకోసం. సంపాదించుకున్న పుణ్యాలు సుఖానుభవరూపంలో ఖర్చు అయిపోతాయి. సంచిత పాపాలు దుఃఖానుభవరూపంతో కరిగిపోతాయి. అందుచేత వివేకవంతుడు ఎప్పుడూ సుఖరహితస్థితినే హర్షిస్తాడు.



సుఖం క్షయాయ పుణ్యస్య దుఃఖం పాపస్య మారిష।
తస్మాత్సుఖక్షయే హర్షః కర్తవ్యస్సర్వథా బుధైః॥ (4 - 49)

సురాధిపా ! బాగా ఆలోచించి నీ ప్రయత్నం నువ్వు చెయ్యి యథావిధిగా. జరగవలసింది జరుగుతుంది - అని బృహస్పతి వేదాంతధోరణిలో సలహా చెప్పి నిర్ణయం అతడికే వదిలిపెట్టేశాడు.

*(అధ్యాయం - 4, శ్లోకాలు- 50)*

గురూత్తమా ! యుద్ధప్రయత్నమే చేస్తాను. మహిషుణ్ణి సంహరిస్తాను. ప్రయత్నం లేకుండా రాజ్యం కానీ యశస్సుకానీ సుఖాలుకానీ దక్కవుగదా ! ఏ ప్రయత్నమూ చెయ్యని వాడిని ఎవ్వరూ అభినందించరు. అందుచేత యుద్ధోద్యోగమే చేస్తాను. యతులకు జ్ఞానమే అలంకారం, ద్విజులకు సంతోషమే అలంకారం, ఐశ్వర్యకాంక్షులకు శత్రుసంహార ప్రయత్నమే అలంకారం.

యతీనాం భూషణం జ్ఞానం సంతోషో హి ద్విజన్మనామ్।
ఉద్యమః శత్రుహననం భూషణం భూతిమిచ్ఛతామ్॥ (5 - 3)

ఉద్యమం చేసి లోగడ నముచిబలాది రాక్షసులను సంహరించాను. అలాగే ఈ మహిషాసురుడినీ తుదముట్టిస్తాను. గురువర్యా ! నువ్వే నా బుద్ధిబలం. వజ్రాయుధమే బాహుబలం. హరిహరులు సహాయకులు. నా ప్రయత్నం నేను చేస్తాను. నువ్వు ఆశీర్వదించి, రాక్షస సంహారకాలైన మంత్రాలను జపించు.

ఈ మాటలకు బృహస్పతి చిన్నగా నవ్వాడు. శచీపతీ ! యుద్ధానికి దిగమని నిన్ను నేను ప్రేరేపించడం లేదు. అలాగని నివారించడమూ లేదు. యుద్ధాలలో జయాపజయాలు ఎప్పుడూ సందేహాస్పదాలే కదా ! జరగవలసింది జరుగుతుంది. ఇంతే నేను చెప్పగలిగింది. రేపు సుఖమే కలుగుతుందో దుఃఖమే ప్రాప్తిస్తుందో తెలుసుకోగలిగిన పరిజ్ఞానం నాకు లేదు. అదే ఉంటే నా దుఃఖాలను నేను తొలగించుకోగలిగి ఉండేవాణ్ణికదా ! చంద్రుడు శిష్యుడుగా ప్రవేశించి నా భార్యను అపహరించాడు. ఆ రోజుల్లో ఎంత దుఃఖాన్ని అనుభవించానో నీకు తెలుసు. ముల్లోకాలలోనూ నేను చాలా తెలివైనవాణ్ణి అని ప్రసిద్ధి. కానీ ఆ తెలివితేటలు ఏవీ ఆనాడు అక్కరకు రాలేదు. అందుచేత కార్యసిద్ధికోసం బుద్ధిమంతులు ఏదో ఒక ఉపాయాన్ని ఆలోచించి ప్రయత్నం చెయ్యాలి. కానీ సిద్ధి ఎప్పుడూ దైవాధీనమే. ఇది మరిచిపోకూడదు.

బృహస్పతి చేసిన ఈ ఉపదేశాన్ని గ్రహించి శచీపతి సవినయంగా నమస్కరించి సెలవు తీసుకున్నాడు. సరాసరి బ్రహ్మదేవుడి దగ్గరికి వెళ్ళాడు. మహిషాసురుడు దండెత్తిరానున్న విషయం చెప్పి



సహాయం అభ్యర్థించాడు.శంకరుణ్ణి వెంటదీసుకుని విష్ణుమూర్తి సన్నిధికి వెడదాం, బాగా ఆలోచించి ఒక నిర్ణయం తీసుకుందాం, బలాబలాలు అంచనా వేసుకోకుండా వివేకాన్ని విడిచిపెట్టి సాహసానికి దిగేవాడు పతనమైపోతాడు, కాబట్టి మనం అలా చెయ్యవద్దు, విష్ణుమూర్తితో ఆలోచిద్దాం - అని బ్రహ్మదేవుడు సలహా ఇచ్చాడు.

అష్టదిక్పాలకులూ ఇంద్రుడూ చతుర్ముఖుడూ శంకరుడూ అందరూ కలిసి విష్ణుమూర్తి సన్నిధికి వెళ్ళారు. యుద్ధమే కర్తవ్యమనీ, భయపడవలసినపని లేదనీ, మహిషాసురుణ్ణి సంహరిద్దామనీ మధుసూదనుడు ప్రకటించాడు. వెంటనే ఎవరి వాహనాలను వారు అధిరోహించి మహాసేనా సమేతులై కదనరంగానికి బయలుదేరారు.

## ◆ మహిషుడితో యుద్ధం - దేవతల పరాజయం ◆

దేవదానవసైన్యాలకు భీకర యుద్ధం జరిగింది. బాణ ఖడ్గ ప్రాస ముసల పరశ్వధ గదా పట్టిశ శూల చక్ర శక్తి తోమర ముద్గర భిందిపాల హలాది దారుణాయుధాలతో తీవ్రంగా తలపడ్డారు. రకరకాల అస్త్రాలతో పరస్పరం సంహరించుకుంటున్నారు.

మహిషాసురుడి సేనాని చిక్షురుడు గజారూఢుడై ఇంద్రుణ్ణి ఎదిరించి ఒకేసారి అయిదు బాణాలతో గాయపరిచాడు. ఇంద్రుడు తేరుకుని అర్ధచంద్రాకార బాణంతో వాడి గుండెను గాడిపరిచాడు. వాడు మూర్ఛపోయాడు. అదను గమనించి ఇంద్రుడు ఆ ఏనుగును సంహరించాడు.

ఇది చూసిన మహిషాసురుడు క్రుద్ధుడయ్యాడు. బిడాలుడు అనే దండనాయకుణ్ణి ఇంద్రుడిపైకి ఉసిగొల్పాడు. వాడు మరొక మదగజాన్ని ఆరోహించి వస్తూండగానే శచీపతి పదిబాణాలు వేశాడు. వాడు వాటిని తుత్తునియలు చేసి, పాతికబాణాలు ప్రయోగించాడు. ఇలా బాణాలతో యుద్ధం చాలాసేపు జరిగింది. ఇంద్రుడు గురిచూసి గదను విసిరి వాడి ఏనుగు తొండం విరిచేశాడు. అది ఘీంకరిస్తూ వెనుదిరిగి పరుగుతీసింది. రాక్షససైనికులు చాలామంది దాని పాదాలకింద పడి నలిగిపోయారు. బిడాలుడు ఆ ఏనుగును వదిలేసి రథం అధిరోహించి మళ్ళీ ఇంద్రుడితో తలపడ్డాడు. మళ్ళీ ధనుర్యుద్ధం సాగింది. ఇంద్రుడికి జయంతుడు తోడై (కొడుకు) ధనుర్విద్యాకౌశలం ప్రదర్శించాడు. ఒకేసారి తాచుపాముల్లాంటి అయిదు బాణాలు ప్రయోగించి బిడాలుడిని సంహరించాడు. దేవసైన్యం జయజయధ్వానాలు చేసింది. దుందుభులు మారుమోగాయి. ఇంద్రుణ్ణీ జయంతుణ్ణీ దేవతలంతా ప్రశంసించారు. అప్సరసలు అభినందించి నృత్యం చేశారు.



ఈ కోలాహలం విని మహిషాసురుడు మండిపడ్డాడు. వెంటనే తామ్రుణ్ణి పంపించాడు. వాడు రణరంగానికి వస్తూనే మహామేఘంలాగా దేవసైన్య సముద్రంమీద బాణవృష్టి కురిపించాడు. అతణ్ణి వరుణుడు ఎదిరించాడు. యముడు దండాయుధుడై సహకరించాడు. దండాయుధం దెబ్బకు చెక్కుచెదరకుండా నిలబడ్డ తామ్రుణ్ణి చూసి యముడు క్షణకాలం ఆశ్చర్యపోయాడు. తామ్రుడు వంద ధనుస్సులతో యుద్ధం చేస్తున్నాడా అన్నట్టు సకల దిక్పాలకులమీదా దేవసైనికులమీదా ఒకేసారి వందలవందల బాణాలు కురిపించాడు. అష్టదిక్పాలకులు అందరూ కలిసి ఒక్కసారిగా విజృంభించి తామ్రుణ్ణి తుదముట్టించారు. దానవసేనా శిబిరంలో హాహాకారాలు మిన్నుముట్టాయి. అంతా భయాతురులయ్యారు. *(అధ్యాయం - 5, శ్లోకాలు- 57)*

ఈసారి మహిషాసురుడు స్వయంగా రణరంగంలోకి దిగాడు. గదాయుధం ధరించి కదిలివచ్చాడు. ఈ రోజే దేవతలనందరినీ మట్టుపెడతానంటూ ప్రతిజ్ఞచేసి ఏనుగును ఎక్కి వచ్చాడు. వస్తూనే ఇంద్రుడి మీదకి గద విసిరాడు, శచీపతి వజ్రాయుధంతో దాన్ని భగ్నం చేశాడు. మహిషుడు కత్తి దూశాడు. ఇద్దరికీ ద్వంద్వయుద్ధం భీషణంగా భీకరంగా జరిగింది. రాక్షసేశ్వరుడు తన మాయలన్నీ ప్రదర్శిస్తూ, ఆశ్చర్యకరమైన ఆయుధాలను ప్రయోగిస్తూ దేవసైనికులను మట్టికరిపిస్తున్నాడు. సర్వలోకసంహారకమైన శాంబరీవిద్యను స్మరించాడు. అది మునులను కూడా మోహపరిచే విద్య. కోటానుకోట్ల మహిషాసురులు - అదే రూపం, అదే శక్తి, అదే ఆయుధం, అదే పరాక్రమం - ఆవిర్భవించారు. దేవవాహినిని చీల్చిచెండాడుతున్నారు.

> చకారాశు తదా దైత్యో మాయాం మోహకరీం కిల ।
> శాంబరీం సర్వలోకఘ్నీం మునీనామపి మోహినీమ్ ॥
> కోటిశో మహిషాస్తత్ర తద్రూపాస్తత్పరాక్రమాః
> దదృశుస్స్వాయుధా స్సర్వే విఘ్నంతో దేవవాహినీమ్ ॥ (6 - 7, 8)

వజ్రపాణికి మతిపోయింది. భయంతో వణికిపోతున్నాడు. యమవరుణాదులు ఏమి జరుగుతోందో తెలుసుకోలేకపోతున్నారు. కాలూ చెయ్యీ ఆడక నిశ్చేష్టులై నిలబడిపోయారు. ఇక దేవసేనల సంగతి చెప్పనే అక్కరలేదు. అందరినీ భయం ఆలముకుంది. పారిపోడానికైనా దిక్కుతోచడం లేదు. త్రిమూర్తులనూ తలుచుకుంటున్నారు. తలచుకున్న క్షణంలోనే త్రిమూర్తులు ప్రత్యక్షమయ్యారు. విష్ణుమూర్తి - ఇది శాంబరీవిద్య అని గ్రహించాడు. సుదర్శన చక్రాన్ని ప్రయోగించాడు. అది ఆ మాయాశక్తిని పటాపంచలు చేసింది. ఎవరా ఈ పని చేసిన వీరుడన్నట్టు మహిషాసురుడు తేరిపారజూశాడు. త్రిమూర్తులు తమతమ వాహనాలపై కనిపించారు. పరిఘ ఆయుధాన్ని చేపట్టి లంఘించాడు. అసిలోమ - త్రినేత్రక - బాష్కల - అంధక ప్రభృతి దండనాయకులు మహిషుడికి బాసటగా నిలిచారు. ధనుర్ధారులై రథారూఢులై త్రిమూర్తులవైపు దూసుకువచ్చారు. శరవృష్టి కురిపించారు.



బ్రహ్మ విష్ణు మహేశ్వరులు కనిపించడంతోనే దేవసేనకు ధైర్యం వచ్చింది. జూలు దులిపి సింహాల్లా విక్రమించారు. రాక్షససేనలను ఎదిరించారు.

అంధకుడు ధనుస్సును చెవిదాకా ఎక్కుపెట్టి విషసిక్త బాణాలను పరంపరగా ప్రయోగిస్తున్నాడు. వాసుదేవుడు ఆ బాణాలను అన్నింటినీ తన బాణాలతో ఖండిస్తున్నాడు. ఉన్నట్టుండి అంధకుడు శివుడిమీదకి దృష్టిసారించాడు. ద్వంద్వయుద్ధానికి తలపడ్డాడు. ముసల గదా శక్తి పరశ్వధాది భీషణా యుధాలతో విరుచుకుపడ్డాడు. పదిహేను రోజులపాటు వీరిద్దరికీ ఘోర సంగ్రామం జరిగింది.

త్రినేత్రుడు యముడితో, అసిలోముడు వరుణుడితో కలియబడ్డారు. హోరాహోరీ పోరాటం సాగుతోంది. ఎవరూ ఎవరికీ తీసిపోవడంలేదు.

మహిషుడు విసిరిన గద గరుత్మంతుడికి బలంగా తగిలింది. బాధ తట్టుకోలేక గట్టిగా మూలిగి నిట్టూర్చాడు. విష్ణువు తన కుడిచేతితో నిమిరి ఓదార్చాడు. గరుడుడు క్షణంలో తేరుకున్నాడు. శ్రీహరి తన శార్ఙ్గధనుస్సును అందుకుని దశదిశలకూ బాణాలను పిడుగుల్లా కురిపించాడు. ఇది చూసి అంధకుడు శివుణ్ణి వదిలేసి మళ్ళీ విష్ణుమూర్తివైపు దృష్టిసారించాడు. బాణాలకు బాణాలతో సమాధానం చెప్పాడు. శౌరికి కోపం తీవ్రమయ్యింది. చక్రాన్ని ప్రయోగించాడు. అంధకుడూ తన చక్రాయుధాన్ని ప్రయోగించి సుదర్శనాన్ని దారితప్పించాడు. విజయగర్వంతో వికటాట్టహాసం చేశాడు. సుదర్శనాయుధం గురితప్పి విఫలం కాడం కనీవినీ ఎరగని అంశం. శౌరి ఆశ్చర్యచకితుడయ్యాడు. దేవతలు హాహాకారాలు చేశారు. క్షణంలో తేరుకున్న శ్రీహరి తన కౌమోదకీగదను గురిచూసి విసిరాడు. అది సరాసరి వెళ్ళి వాడి తలకు ఢీకొంది. కళ్ళు బైర్లు కమ్మాయి. రథం నుంచి నేలకు దొర్లిపడ్డాడు.

మహిషాసురుడికి మతిపోయింది. పిచ్చికోపంతో వెర్రికేకవేశాడు. రంకెలు వేస్తూ రమానాధుడివైపు దూసుకువచ్చాడు. శ్రీహరి విశిఖవృష్టి కురిపించాడు. కానీ వాడు చెక్కుచెదరలేదు. దున్నపోతు మీద జడివాన అన్నట్టు అయ్యింది. ఈసారి విష్ణుమూర్తి కౌమోదకితో వాడి శిరస్సుమీద బలంగా మోదాడు. వాడు స్పృహకోల్పోయాడు. దేవతలు కేరింతలు కొట్టారు. దైత్యులు హాహాకారాలు చేశారు. కానీ మరుక్షణంలోనే మహిషుడు తేరుకున్నాడు. పరిఘను రివ్వురివ్వున తిప్పి విసిరాడు. అది సూటిగా వచ్చి శౌరి శిరస్సుకు తగిలింది. తగలడమేమిటి మూర్ఛపోయాడు. గరుత్మంతుడు పరిస్థితి గమనించి రణరంగం నుంచి తప్పించాడు. దేవతల హాహాకారాలు, రాక్షసుల ఓహోకారాలూ మిన్నుముట్టాయి. ఇంద్రాదులు భయంతో గడగడలాడారు. వలవలా విలపించారు. శంకరుడు ఓదార్చి ధైర్యం చెప్పాడు. త్రిశూలం ధరించి మహిషుణ్ణి ఎదిరించాడు. బలంకొద్దీ శిరస్సుమీద పొడిచాడు. వాడు తప్పించుకుని శక్తి ఆయుధం విసిరాడు. అది వచ్చి శివుడి వక్షఃస్థలాన్ని తాకింది. రాక్షసుడు విజయగర్వంతో వికటాట్టహాసం చేశాడు. కానీ శంకరుడు చలించలేదు. కోపంతో కళ్ళు ఎర్రబడ్డాయి. త్రిశూలంతో మళ్ళీ పొడిచాడు. వాడు మళ్ళీ తప్పించుకున్నాడు. అంతలోకీ - మూర్ఛ నుంచి తేరుకున్న విష్ణుమూర్తి రణరంగానికి వచ్చాడు.



హరిహరుల నిద్దరినీ చూడటంతో మహిషాసురుడికి యుద్ధోత్సాహం ఉరకలువేసింది. తన మహిషరూపాన్ని ధరించాడు. తోక ఝాడించాడు. దిక్కులు పగిలేటట్టు దేవతలు భయపడేటట్టు భైరవనాదం చేశాడు. ప్రళయకాల మేఘంలా నల్లనిరూపంతో ఆ మహాకాయుడు కొమ్ములు విసురుతూ పర్వతాలను పెళ్ళగిస్తూ హరిహరులమీదకి లంఘించాడు. విష్ణుమూర్తి ధనుస్సును మండలాకారంగా ఎక్కుపెట్టి బాణపరంపర కురిపించాడు. అవి అతడిని ఏమీ చెయ్యలేకపోయాయి. ఒక గిరిశిఖరాన్ని పడగొట్టి, తోకతో మెలిపెట్టి రివ్వున విసిరాడు. అది గిరగిరా తిరుగుతూ హరిహరులపైకి దూసుకువస్తోంది. విష్ణుమూర్తి ఒక్కసారిగా లక్షలసంఖ్యలో తీవ్రశరాలు ప్రయోగించి దాన్ని తుత్తునియలు చేశాడు. ఏమాత్రం వ్యవధి ఇవ్వకుండా సుదర్శనచక్రాన్ని ప్రయోగించాడు. అది సరాసరి వెళ్ళి మహిషాసురుడిని కొమ్ముల మధ్య తాకింది. వాడు మూర్ఛపోయాడు. కానీ అంతలోనే తేరుకున్నాడు. మానవరూపం ధరించి లేచి నిలబడ్డాడు. కొత్తగా పర్వతం ఏదో భూమిని చీల్చుకుని లేచింది అన్నట్టు అనిపించింది. చేతిలో ఒక మహాగద ఉంది. కారుమేఘంలా గర్జించాడు. దీనికి దీటుగా శ్రీహరి తన పాంచజన్యం పూరించాడు. ఆ ధ్వనికి రాక్షసులందరూ గడగడలాడారు. ఋషులూ దేవతలూ సంతోషించారు.

***(అధ్యాయం - 6, శ్లోకాలు- 56)***

పాంచజన్య శంఖధ్వనికి తన రాక్షససేనలు భయపడటం గమనించిన మహిషాసురుడు వారికి ధైర్యం కలిగించాలని క్షణకాలం ఆలోచించాడు. వెంటనే మానవరూపాన్ని విడిచిపెట్టి, సింహరూపం ధరించాడు. సింహగర్జన చేశాడు. జూలుదులిపి దేవసైన్యంమీదకు మెరుపుదాడి చేశాడు. దేవతలంతా కకావికలై పరుగులు తీశారు. అందినవారిని అందినట్టు దంతాలతో నఖాలతో చీల్చి చెండాడుతున్నాడు. ఆకాశంలోకి బంతిలా ఎగిరి గరుత్మంతుణ్ణి పంజావిసిరికొట్టాడు. గరుడుడు రక్తసిక్తుడయ్యాడు. గోళ్లు గీరుకొని శ్రీహరి చేతులకు గాయాలు అయ్యాయి. నెత్తురు ప్రవాహాలు కట్టింది. పరమక్రుద్ధుడై చక్రాయుధం విసిరేలోగా రాక్షసుడు మళ్ళీ మహిషమై కొమ్ములు విసిరాడు. అవి గుండెలకు పొడుచుకున్నాయి. విష్ణుమూర్తి విలవిలలాడాడు. గురుత్మంతుడు రివ్వున వెనుదిరిగి తన స్వామిని విష్ణులోకానికి తీసుకుపోయాడు. విష్ణుమూర్తి పలాయనం చిత్తగించేసరికి శంకరుడూ భయపడ్డాడు. వీడిని సంహరించడం మనవల్లకాదు అనుకున్నాడు. త్రిశూలం బుజానవేసుకుని కైలాసం చేరుకున్నాడు. బ్రహ్మదేవుడు హంసను తోలుకుంటూ తనలోకానికి వెళ్ళిపోయాడు. ఇంద్రుడొక్కడూ వజ్రాయుధం చేతబుచ్చుకుని రణరంగంలో నిలబడ్డాడు. వరుణుడు పాశహస్తుడై యముడు దండధారుడై, యక్ష పావక సూర్యచంద్రాదులతో కలిసి నిలబడ్డారు. రాక్షసుణ్ణి ఎదిరించాలి అనే దృఢసంకల్పంతో నిలబడ్డారు.



కానీ, త్రిమూర్తులూ పారిపోవడం రాక్షససేనలకు ఉత్సాహాన్ని అందించింది. వివిధాయుధాలతో వికటాట్టహాసాలతో విజృంభించారు. అయితే, అమరసైనికులు దీటుగా నిలిచి పోరాటం సాగించారు. ధనుష్టంకారాలూ ముష్టిఘాతాలూ ఖడ్గప్రహారాలూ గజఘీంకారాలూ - దిక్కులు పిక్కటిల్లాయి.

మహిషాసురుడు విజయమో వీరస్వర్గమో అన్నట్టు చెలరేగిపోయాడు. కొమ్ములతో పర్వతశిఖరాలు విరిచి, దేవతల మీద పడేట్టు కాళ్ళతో తన్నుతున్నాడు. తోకను రిక్కించి విష్ణుచక్రంలా తిప్పుతూంటే వందలూవేలూగా దేవతల శరీరాలు చీలుకుపోతున్నాయి. కాలి డెక్కలతో ఎంతమందిని మట్టగిస్తున్నాడో లెక్కలేదు. దేవగంధర్వవీరులు భయభ్రాంతులై కాలికి బుద్ధిచెబుతున్నారు. ఎటువారు అటే పారిపోతున్నారు. దేవేంద్రుడు కూడా ఇక వీడిని ఎదిరించడం నావల్లకాదు అనుకున్నాడు. రణరంగం విడిచిపెట్టి పలాయనం చిత్తగించాడు. నాయకుడే పారిపోతే మనం ఏమి చేస్తామంటూ యమవరుణకుబేరాదులందరూ బెదిరిపోయారు. త్వరత్వరగా చెదిరిపోయారు.

మహిషాసురుడు విజయగర్జన చేశాడు. పారిపోతూ శచీపతి వదిలిపెట్టిన ఐరావతాన్ని ఉచ్చైః శ్రవాన్నీ స్వాధీనపరచుకున్నాడు. మానుషరూపం ధరించి ఇంద్రగజాన్ని అధిరోహించి తన పట్టాణానికి వెళ్ళిపోయాడు. వెంటనే బయలుదేరి స్వర్గానికి వెళ్ళి ఇంద్రాసనంమీద కూర్చున్నాడు. సురరాజ్యాన్ని స్వాధీనం చేసుకున్నాడు. దేవతల పదవులలో తన దానవులను నియమించాడు. నూరేళ్ళు జరిగిన ఘోర సంగ్రామంలో విజయం సాధించి మహిషుడు ఎలాగైతేనేమి తన కోరిక తీర్చుకున్నాడు. ఇంద్రపదవి చేజిక్కించుకున్నాడు. దేవతలందరూ స్వర్గాన్ని విడిచిపెట్టి కాందిశీకులై ఎటెటో వెళ్ళిపోయారు. ప్రాణాలు దక్కించుకున్నారు. కొండలలో గుహలలో అడవులలో తలదాచుకుని కాలక్షేపం చేస్తున్నారు. ఏళ్ళు గడిచాయి.

## ◆ మహిషాసుర సంహారం - దేవతల వ్యూహరచన ◆

క్రమక్రమంగా దేవతలు ఒక్కరొక్కరే బ్రహ్మదేవుడి సన్నిధికి చేరుకున్నారు. చతుర్ముఖుణ్ణి పలువిధాల స్తుతించారు. ఇదేమి విడ్డూరమో విరించీ ! దేవతలపట్ల ఇంత నిర్దయగా ఎలా ఉండగలుగుతున్నావు ? మేమంతా కొండలూ కోనలూ పట్టి బతుకుజీవుడా అని కాలక్షేపం చేస్తూంటే నీకు చీమకుట్టినట్టయినా లేదా ? నువ్వు మాకు తండ్రివి. మేమంతా నీ బిడ్డలం. తప్పు చేసినా క్షమించి బిడ్డలను కాపాడటం జనకుడి విధి. అటువంటిది ఏ అపరాధమూ లేకుండా ఇలా అన్యాయమైపోయిన మమ్మల్ని ఆదుకోకుండా చూస్తూ ఊరుకోవటం నీకు భావ్యమా చెప్పు ? ఆ మహిషుడు స్వర్గం ఆక్రమించాడు. యజ్ఞాలలో హవిర్భాగాలను స్వాహాచేస్తున్నాడు. దిక్పాలకులుగా తనవారిని నియమించాడు. దేవతలు అంటే చాలు కనపడితే చావగొడుతున్నాడు. లేదా ఊడిగం చేయించుకుంటున్నాడు. పారిజాత కుసుమాలను



ముడుచుకుంటున్నాడు. కామధేనువు పాలను కడుపారా సేవిస్తున్నాడు. ఇవన్నీ నీకు తెలుసు. ఎందుకో మరి మౌనంగా ఊరుకున్నావు. ఇది న్యాయమా ? ఇది ధర్మమా ? నువ్వు తప్ప మాకు రక్షకులెవరు ? ఏదో ఒకటి చెయ్యి. మమ్మల్ని రక్షించు. లేదంటే నుయ్యో గొయ్యో చూసుకుంటాం. దావాగ్నిలో ప్రవేశించడమో, మహాసముద్రంలో దూకడమో తప్ప మాకు గత్యంతరం లేదు.

దీనవదనాలతో దేవతలు ఇలా ప్రార్థించేసరికి బ్రహ్మదేవుడి మనస్సు కరిగింది. మెల్లగా ఓదార్పుగా బదులుపలికాడు -

దేవతలారా ! నాకు అంతా తెలుసు. మీరు పడుతున్న బాధలు ఎరుగుదును. కానీ ఏమి చేస్తాం చెప్పండి. వాడేమో వరదర్పితుడు. పురుషుల చేతిలో వాడికి చావులేదు. స్త్రీవధ్యుడు. దీనికి ఏదైనా మరోదారి ఆలోచించాలి. నడవండి. అందరం కలిసి శంకరుడితో ఆలోచిద్దాం. అటుపైని విష్ణుమూర్తిని అడుగుదాం. బాగా ఆలోచించి పరిష్కారం కనుక్కొందాం - అని అందరినీ వెంటబెట్టుకుని కైలాసానికి నడిచాడు. శంకరుడు దివ్యదృష్టితో ఇది తెలుసుకుని ఎదురువచ్చి ఆహ్వానించాడు. పరస్పరకుశలాలు అయ్యాక, మహిషాసురుడి దురాగతాలను అడిగి తెలుసుకున్నాడు శంకరుడు.

శివా ! నువ్వే సమర్థుడివి. దేవతలను కాపాడాలి. ఈ భారం నీదే - అన్నాడు బ్రహ్మదేవుడు. శివుడు ఒక్కపెట్టున పకపకా నవ్వాడు. విరించీ ! మహిషుడికి ఆ వరం ఇచ్చింది నువ్వు. ఇంత అనర్థం తెచ్చిపెట్టింది నువ్వు. ఇప్పుడు కర్తవ్యం ఏమిటనీ ఎలా కాపాడతావనీ నన్ను అడుగుతున్నావు. బాగుంది. చాలా అద్భుతంగా ఉంది. నేను మాత్రం ఏం చెయ్యను ? వాడిని సంహరించగలిగిన స్త్రీ ఎక్కడుంది ? నీ ఇల్లాలూ నా ఇల్లాలూ రణరంగానికి దిగుతారా ? వాడితో యుద్ధం చేస్తారా ? శచీదేవికైనా అంతటి సామర్థ్యం ఉందని నేను అనుకోను. అందరం కలిసి విష్ణుమూర్తిని ప్రేరేపిద్దాం. అతడు బుద్ధిమంతులలోకెల్లా బుద్ధిమంతుడు. మహామేధావి. కార్యసాధకుడు. ఏదో ఒక ఉపాయం ఆలోచించి చెబుతాడు. నడవండి, ఇప్పుడే వెడదాం అన్నాడు. అందరూ కలిసి విష్ణుమూర్తి దగ్గరికి బయలుదేరారు. శుభశకునాలు కనిపించాయి. సుగంధపరిమళాలను వెదజల్లుతూ అనుకూల వాయువులు వీచాయి. పక్షులు కిలకిలారావాలు చేశాయి. ఆకాశం నిర్మలంగా ఉంది. దిక్కులన్నీ విశదంగా ఉన్నాయి. కార్యసిద్ధి అవుతుందని అందరి మనస్సులకూ అనిపించింది. ***(అధ్యాయం - 7, శ్లోకాలు- 59)***

అందరూ వైకుంఠం చేరుకున్నారు. దివ్యమంగళరూపంలో ఉన్న విష్ణుమూర్తిని దర్శించారు. వివిధ లతాతరుపుష్ప విరాజితమై వాపీకూపతటాకాది పరిశోభితమై చందనాగురుధూపపరిమళోజ్జ్వలితమై, కోకీకోకకోకిలారావ విగుర్వితమై హంససారసకారండవ చక్రవాకాది జలాండజగరుద్వ్యాధూత మరుజ్జల కణ శీతలీకృత పరిసరమై మల్లికావకుళకురవకాది బహుపుష్పవితానోపరి విక్రీడన పరాయణ



భ్రమరీభ్రమరనాదమనోహరమై విరాజిల్లుతున్న సుందరోద్యానవనంలో నందసునందనాది మహర్షుల స్తుతులను అందుకొంటూ, దేవగంధర్వుల గానాలను వింటూ, అప్సరసల నాట్యాలను కంటూ, రత్నఖచిత ప్రాసాదాలతో కాంచనమయకుడ్యాలతో అభ్రంలిహమైన (మిన్నుముట్టే) దివ్యభవనంలో విరాజమానుడైన విష్ణుమూర్తిని అల్లంతదూరం నుంచి దర్శించారు. సింహద్వారం సమీపించారు. అక్కడ జయవిజయులు బంగారు దండలను ధరించి కావలికాస్తున్నారు. బ్రహ్మాదిదేవతలను నిలువరించారు. వారిద్దరిలో ఒకడు లోపలికి వెళ్ళి శ్రీహరికి వీరి రాకను వినయంగా నివేదించాడు. అది వింటూనే మధుసూదనుడు స్వయంగా సింహద్వారానికి వచ్చాడు. ప్రయాణంతో అలసిపోయిన బ్రహ్మాదిదేవతలను అనురాగమయమైన చూపులతో తిలకించాడు. అంతమాత్రానికే దేవతలంతా సంతృప్తిచెంది భక్తిగా నమస్కరించారు. వేదమంత్రాలతో స్తుతించారు.

దేవదేవ జగన్నాథ సృష్టిస్థిత్యంతకారక ।
దయాసింధో మహారాజ త్రాహి నః శరణాగతాన్ ॥ (8 - 17)

దేవాధిదేవా ! జగన్నాయకా ! సృష్టిస్థితిలయ కారకా ! దయాసింధూ ! మహారాజా ! శరణాగతులం మమ్మల్ని రక్షించు అని ముక్తకంఠంతో అభ్యర్థించారు.

నిర్జరులారా ! రండి. లోపలికి రండి. యథోచితంగా ఆసనాలపై కూర్చోండి. మీ కుశల వార్తలు చెప్పండి. అందరూ కలిసి ఒకేసారి ఇలా వచ్చారంటే ఏదో పెద్దకారణమే ఉండి ఉంటుంది. విషణ్ణులుగా దీనులుగా చింతాతురులుగా కనపడుతున్నారు. కారణం ఏమిటో నేను చెయ్యవలసింది ఏమిటో నిర్భయంగా చెప్పండి - అని విష్ణుమూర్తి అనునయంగా పలికాడు.

జగన్నాథా ! మహిషాసురుడి బాధలు పడలేకపోతున్నాం. వాడు మహాపాపాత్ముడై మమ్మల్ని చిత్రవిచిత్రంగా హింసిస్తున్నాడు. వాడు అసాధ్యుడు. అతిదుష్టుడు. వరదర్పితుడు. యజ్ఞభాగాలను హరిస్తున్నాడు. దేవతలను అందరినీ పారద్రోలి స్వర్గరాజ్యాన్ని ఆక్రమించుకున్నాడు. ఇంద్రాసనం మీద తిష్ఠవేశాడు. మేమంతా వాడి ధాటికి తట్టుకోలేక ప్రాణాలు అరచేతిలో పట్టుకొని కొండలకూ కోనలకూ పారిపోయాం. అనుక్షణమూ భయంతో చస్తూ కాలం గడుపుతున్నాం. బ్రహ్మదేవుడిచ్చిన వరం ఇంత చేసింది. వాడికి పురుషుడి చేతిలో మరణం లేదు. ఏమి చెయ్యాలో తోచక నీ సన్నిధికి వచ్చాం. నువ్వే ఏదైనా ఉపాయం ఆలోచించి వాడి పీడ వదిలించాలి. నువ్వు దైత్యమాయా విశారదుడవు. దానవమర్దనుడవు. ఏడికన్నా గొప్ప రాక్షసులను సంహరించిన వాడవు. అన్నింటా సమర్థుడవు. నువ్వు కల్పించుకోకపోతే మాకు దిక్కులేదు. మహిషాసురుణ్ణి చంపగలిగిన స్త్రీ ఎవరా అని ఆలోచిస్తున్నాం. పార్వతియా, సరస్వతియా ? శచీదేవియా ? వీరికి అంతటి శక్తి ఉన్నాదా అని మరో సందేహం. ఏమైనా అంతా నువ్వే ఆలోచించి దేవకార్యాన్ని చక్కబెట్టాలి. నువ్వు సకల దేవతాధినాయకుడవు. భక్తవత్సలుడవు.



దేవతల మొర ఆలకించిన విష్ణుమూర్తి అమాయకంగా చిరునవ్వులు చిందించాడు. మెల్లగా ఎలుగెత్తి పలికాడు -

లోగడ మనమంతా కలిసి వాడితో యుద్ధం చేశాం. కానీ సంహరించలేకపోయాం. కాబట్టి ఇప్పుడు మరోదారి వెదకాలి. సకల దేవతాంశలనూ తేజశ్శక్తులనూ కలబోసుకుని ఒక స్త్రీమూర్తి ఆవిర్భవించినట్టయితే మహిషాసురుణ్ణి రణరంగంలో ఎదిరించి సంహరించగలదు. సర్వశక్త్యంశ సంపన్నురాలై ఆ మాయావిని మట్టుబెట్టగలదు. ఇదొక్కటే తరణోపాయం. కాబట్టి దేవతలారా ! ప్రార్థించండి. మీమీ తేజోంశలను స్త్రీమూర్తులుగా అభ్యర్థించండి. తేజోరాశి ఏర్పడుతుంది. ఆ శక్తి స్వరూపిణికి మన ఆయుధాలు అన్నీ సమర్పిద్దాం. త్రిశూలాది సకలాయుధాలూ ధరించి సర్వతేజస్సమన్విత యైన ఆ స్త్రీమూర్తి మదగర్వితుడైన పాపమహిషాసురుణ్ణి అవలీలగా సంహరిస్తుంది.

## ◆ సకల దేవతా తేజస్స్వరూపిణి ఆవిర్భావం ◆

విష్ణుమూర్తి చెప్పిన ఈ ఉపాయానికి అందరూ అంగీకరించారు. ఆ క్షణంలోనే బ్రహ్మదేవుడి వదనం నుంచి ఒక తేజోరాశి స్వయంగా అవతరించింది. అది అతిదుస్సహంగా వెలిగిపోతోంది. పద్మరాగమణిప్రభలు వెదజల్లుతోంది. సమశీతోష్ణకాంతులు ప్రసరిస్తున్నాయి. హరిహరులే ఆశ్చర్యపోయారు. అంతలోకీ శివుడి శరీరం నుంచి మరో తేజోరూపం ఆవిర్భవించింది. వెండిలా ధగధగలాడుతోంది. కళ్ళు మిరుమిట్లు గొలుపుతున్నాయి. చూడడానికి భీకరంగా ఉంది. పర్వతంలాగా ఉంది. రూపుదాల్చిన తమోగుణం అన్నట్టుంది. వేడిగా ఉంది. ఆ వెంటనే విష్ణుమూర్తి నుంచి నీలం రంగులో మూర్తీభవించిన సత్త్వగుణంలా చల్లని తేజస్సు వెలువడింది. ఇంద్రుడి శరీరం నుంచి విచిత్ర వర్ణంలో సర్వగుణాత్మకమైన తేజోరాశి ఉద్భవించింది. ఇలాగే యమాగ్ని కుబేరవరుణుల శరీరాల నుంచీ తేజస్సులు వెలువడ్డాయి. సకలదేవతల తేజస్సులూ విలీనమై ఒక మహాతేజోరాశి మూర్తికట్టింది. ఒక హిమాలయంలా దర్శనమిచ్చింది. అంతా ఆశ్చర్యచకితులై చూస్తూండగానే ఆ తేజోరాశి ఒక స్త్రీమూర్తిగా పరిణమించింది. సౌందర్యరాశి. త్రిగుణాత్మిక. సర్వదేవశరీరసముద్భూత. అష్టాదశభుజ. త్రివర్ణ. విశ్వమోహిని. తెల్లనిముఖం. నల్లని కన్నులు. ఎర్రని పెదవులు. చిగురాకుల వంటి అరచేతులు. శరీరమంతటా దివ్యాభరణాలు. పద్దెనిమిది బాహువులూ క్షణంలో వెయ్యిబాహువులు అయ్యాయి. ఇప్పుడు సహస్రభుజ. మహిషాసుర సంహారానికి ఆవిర్భవించిన మహాతేజస్విని.

> శ్వేతాననా కృష్ణనేత్రా సంరక్తాధరపల్లవా ।
> తామ్రపాణితలా కాంతా దివ్యభూషణభూషితా ॥



అష్టాదశభుజా దేవీ సహస్రభుజమండితా ।
సంభూతాసురనాశాయ తేజోరాశిసముద్భవా ॥ (8 - 45, 46)

వ్యాసభగవానుడు ఒక దీక్షగా కథ చెప్పుకు వెడుతూంటే సరిగ్గా ఇక్కడ జనమేజయుడు అంతరాయం కలిగించాడు. ఒక సందేహం వెలిబుచ్చాడు. వ్యాసమహర్షీ! దేవీ రూపం ఎలా ఆవిర్భవించిందో మరింత విస్తృతంగా వినాలని ఉంది. అందరి తేజస్సూ ఏకీభూతమయ్యింది అన్నావు. ఎలా కలిసింది ? ఎవరి తేజస్సు ఏ అవయవమయ్యింది ? ముఖనాసికాది శరీరభాగాలు ఎలా ఎలా ఏర్పడ్డాయి ? ఆయుధాలూ ఆభరణాలూ ఎవరెవరు ఏమేమి ఇచ్చారు ? నీ ముఖతః ఈ వివరాలన్నీ వినాలని కుతుహలంగా ఉంది. ఇది అమృతరసం. ఎంత త్రాగితేమాత్రం తృప్తి ఉంటుంది ! నీ ముఖపద్మం నుంచి జాలువారుతున్న మహాలక్ష్మీ చరితామృతమిది. సవిస్తరంగా చెప్పి తనివితీరా అందించు - అని అభ్యర్థించాడు.

శౌనకాదిమహామునులారా ! జనమేయుడు ఇలా అడిగేసరికి వ్యాసభగవానుడు అతణ్ణి తృప్తి పరచాలనే కోరికతో ఆ ఘట్టాన్ని మరింత మధురంగా మరింత విస్తరంగా వినిపించాడు.

జనమేజయా ! నీ కుతూహలాన్ని అర్థం చేసుకున్నాను. వివరంగానే చెబుతాను. శ్రద్ధగా విను. ఆ మహాలక్ష్మీ రూపాన్ని యథాతథంగా వర్ణించి చెప్పాలి అంటే బ్రహ్మవిష్ణుమహేశ్వరులకు కూడా సాధ్యం కాదు. మరి నేనా చెప్పగలవాణ్ణి ! ఉద్భవించింది అనిమాత్రం చెప్పగలను. ఆ చెప్పడం కూడా నిజానికి వాస్తవం కాదు. ఎందుచేతనంటే ఆ జగన్మాత నిత్యురాలు. ఎప్పుడూ ఉంటుంది. దేవకార్యసిద్ధికోసం ఇప్పుడు ఏకరూపత్వాన్ని పొందింది. విభిన్నరూపాలలో ఉండేది తానే. నటుడు లోకరంజనకోసం రంగస్థలంమీద విభిన్న పాత్రలూ రూపాలూ ధరిస్తాడు. కానీ తాను ఒక్కడే. అలాగే ఈ మహాలక్ష్మి ఈ సృష్టిలో సకలరూపాలలోనూ తానే ఉంటుంది. అవసరాన్ని బట్టి మళ్ళీ ఏకరూపత్వాన్ని పొందుతుంది. వాస్తవంగా చూస్తే ఈమెకు ఒక రూపమంటూ లేదు. కేవలం అరూప. అయినా లీలావిశేషంగా సకలరూపాలూ ధరిస్తుంది. నిర్గుణ అయినా సగుణ అవుతుంది. కార్యకర్మానుసారంగా రూపంతోపాటు నామధేయాలూ ఏర్పడుతూ ఉంటాయి. అయినా నువ్వు అడిగావు కనక నాశక్తి మేరకు, ఎవరి తేజస్సు ఏ అవయవంగా రూపొందిందో తెలియజేస్తాను, విను.

శంకరుడి తేజస్సు ముఖపద్మం అయ్యింది. అది శ్వేతవర్ణం. శుభాకారం. యముడి తేజస్సు ఆ దేవికి నల్లని పొడవైన కురులు అయ్యాయి. మేఘవర్ణంలో మనోహరమైన వంకీల జుట్టు. అగ్నిదేవుడి తేజస్సు కృష్ణశ్వేతరక్తవర్ణాలతో మూడుకన్నులు అయ్యాయి. ప్రాతస్సాయంసంధ్యా తేజస్సులు దట్టమైన కనుబొమ్మలయ్యాయి. మన్మథుడి ధనుస్సులా మెరిసిపోయే భ్రూలత. వాయుదేవుడి తేజస్సు చెవులు అయ్యాయి. అవి మన్మథుడి డోలికల్లా మనోహరంగా ఉన్నాయి. కుబేరుడి తేజస్సు ఆ మహాదేవికి నాసిక



అయ్యింది. నువ్వుపువ్వులాగా స్నిగ్ధంగా (నున్నగా) నిగనిగలాడుతోంది. ప్రాజాపత్యతేజస్సుతో ఆ తల్లికి దంతాలు ఏర్పడ్డాయి. కొనలు తేలి, దగ్గరదగ్గరాగా పేర్చిన మల్లెమొగ్గల్లా అవి ప్రకాశిస్తున్నాయి. అరుణ తేజస్సుతో దొండపండువంటి క్రిబెదవి (అధరోష్ఠం) ఏర్పడింది. కార్తికేయుడి తేజస్సుతో పై పెదవి ఏర్పడింది.

విష్ణుతేజస్సుతో అష్టాదశభుజాలు (18) ఏర్పడ్డాయి. వసువుల తేజస్సుతో చేతులకు వేళ్ళు ఏర్పడ్డాయి. అవి చిగురాకుల్లా ఎర్రగా పారదర్శకంగా భాసిస్తున్నాయి. చంద్రుడి తేజస్సు అమ్మవారికి వక్షోజద్వయమయ్యింది. ఇంద్రుడి తేజస్సుతో మధ్యభాగం ఏర్పడింది. త్రివళులు (పొట్టమీద మూడు మడతలు) గంభీరంగా మనోహరంగా ఉన్నాయి. వరుణుడి తేజస్సుతో కాళ్ళు ఏర్పడ్డాయి. పృథ్వీతేజస్సుతో విశాలమైన జఘనం (కటి, చట్ట) ఏర్పడింది. ఈ రకంగా శుభాకార, సురూప, సుస్వర అయిన స్త్రీ మూర్తి ఆవిర్భవించింది. ఆ సుదతిని ఆ చారులోచనను ఆ సర్వాంగ సౌష్ఠవ సంపన్నను చూసి దేవతలంతా సంబరపడ్డారు. మహిషాసురుడి పీడ ఆ క్షణంలోనే వదిలిపోయినంతగా సంతోషించారు.

అప్పుడు విష్ణుమూర్తి సకలదేవతలనూ హెచ్చరించాడు. మీమీ ఆయుధాలూ ఆభరణాలూ మహాదేవికి సమర్పించమన్నాడు. ***(అధ్యాయం - 8, శ్లోకాలు - 76)***

విష్ణుమూర్తి ఆజ్ఞను దేవతలంతా ఆనందంతో శిరసావహించారు. దివ్యభూషణాలనూ దివ్యవస్త్రాలనూ దివ్యాయుధాలనూ సమర్పించారు. క్షీరసముద్రుడు ఎరుపురంగులో ఉన్న సన్నని వినూతన దివ్యవస్త్రాలను మహాలక్ష్మికి సమర్పించాడు. వినిర్మలమైన హారాన్ని బహూకరించాడు. సూర్యకోటి సమప్రభమైన చూడామణినీ, అటువంటివే రత్నమయకుండలాలనూ కడియాలనూ అందించాడు. విశ్వకర్మ ప్రసన్నచిత్తుడై నానారత్నవిభూషితాలైన కేయూరకంకణాలను సమర్పించాడు. సుస్వరంగా సుమధురంగా ధ్వనిస్తూ అందరినీ ఆకర్షిస్తున్న నూపురాలను త్వష్ట సృష్టించి ఇచ్చాడు. అవి సూర్య మండలాల్లాగా ప్రకాశిస్తున్నాయి. మహాసముద్రుడు కంఠాభరణాన్నీ ఉంగరాలనూ కానుకపెట్టాడు. ఎన్నడూ వాడిపోని పద్మాలతో సుగంధాలను వెదజల్లుతూ తుమ్మెదలను ఆకర్షిస్తున్న దివ్యవైజయంతీమాలికను వరుణుడు ఉపదగా ఇచ్చాడు. హిమవంతుడు సంతుష్టుడై వివిధ రత్నాలతోపాటు, బంగారు కాంతులీనుతున్న సింహాన్ని వాహనంగా సమర్పించాడు. సర్వాలంకారశోభితమై ఆ దేవి ఆ సింహాన్ని అధిరోహించింది.

శ్రీహరి తన సుదర్శన చక్రం నుంచి అలాంటిదే మరొకటి సృష్టించి ఇచ్చాడు. అది వెయ్యి అంచులతో ఒకేసారి వెయ్యిమంది రాక్షసుల శిరస్సులను తేలికగా ఖండించేట్టు ఉంది. శంకరుడు త్రిశూలం నుంచి మరో త్రిశూలం తీసి ఇచ్చాడు. అది దేవతలకు అభయహస్తంలా భాసించింది. వరుణుడు (వెన్నముద్దలాంటి) శంఖం ఇచ్చాడు. అది శుభప్రదంగా జయప్రదంగా కనిపించింది.



అగ్నిదేవుడు శతఘ్నిని సృష్టించి ఇచ్చాడు. వాయుదేవుడు దివ్యధనుస్సునూ ఎప్పుడూ తరిగిపోని బాణాలతో విరాజిల్లే అంబులపొదినీ బహూకరించాడు. దేవేంద్రుడు వజ్రాయుధం నుంచి మరో వజ్రాయుధం సృష్టించి ఇచ్చాడు. ఐరావతానికి అలంకరించిన దివ్యఘంటను సమర్పించాడు. యముడు కాలదండంవంటి దండాన్ని కల్పించి ఇచ్చాడు. బ్రహ్మదేవుడు గంగాజలంతో నిండిన దివ్యకమండలువుని బహుమతిగా సమర్పించాడు. వరుణుడు తన పాశాయుధాన్ని కూడా ఇచ్చాడు. కాలుడు ఖడ్గాన్నీ చర్మంతో చేసిన డాలునూ అందించాడు. విశ్వకర్మ గండ్రగొడ్డలి సృష్టించి ఇచ్చాడు. కుబేరుడు సురాపూర్ణమైన సువర్ణపాత్రను సమర్పించాడు. చిరుగంటలు పొదిగిన కౌమోదకీ గదను త్వష్ట అందించాడు. అలాగే అనేక దివ్యాస్త్రాలనూ అభేద్యమైన కవచాన్నీ సమర్పించాడు. సూర్యుడు తన తేజస్సులను బహుమానంగా ఇచ్చాడు.

వివిధ భూషణాలతో వివిధాయుధాలతో కన్నులు చెదిరిపోయేట్టు కనిపిస్తున్న ఆ మహాదేవిని చూసి దేవతలు అందరూ విస్మయానందవిమోహితులై భక్తిపారవశ్యంతో స్తుతించారు.

నమః శివాయై కల్యాణ్యై శాంత్యై పుష్ట్యై నమోనమః ।
భగవత్యై నమో దేవ్యై రుద్రాణ్యై సతతం నమః ॥ (9 - 23)
కాళరాత్ర్యై తథాంబాయా ఇంద్రాణ్యై తే నమోనమః ।
సిద్ధ్యై బుద్ధ్యై తథా వృద్ధ్యై వైష్ణవ్యై తే నమోనమః ॥
పృథివ్యాం యా స్థితా పృథ్వ్యా న జ్ఞాతా పృథివీం చ యా ।
అంతః స్థితా యమయతి వందే తామీశ్వరీం పరామ్ ॥
మాయాయాం యా స్థితా జ్ఞాతా మాయయా న చ తామజామ్ ।
అంతఃస్థితా ప్రేరయతి ప్రేరయిత్రీం నమః శివామ్ ॥ (9 - 26)

సిద్ధి బుద్ధి వృద్ధి తుష్టి పుష్టి శాంతిప్రదమైన రుద్రాణికి ఇంద్రాణికి కళ్యాణికి వైష్ణవికి నమస్కారము. కాళరాత్రికి భగవతికి అభివందనం. పృథివికి తెలియకుండా పృథివిని తెలునుకోకుండా పృథివిపైనే ఉంటూ అంతరంగాలలో విరాజిల్లుతూ సకలప్రాణికోటినీ నియంత్రించే జగదీశ్వరికి ప్రణతులు. మాయ కారణంగానే (అవిద్య) అవిజ్ఞేయ అయిన మాయారూపిణికి వందనాలు. అంతశ్శక్తిగా అందరినీ నడిపించే ప్రేరయిత్రికి దండాలు.

ఓ జగన్మాతా ! శత్రుపీడితులమైన మాకు విజయం ప్రసాదించు. శుభపరంపరలు కల్పించు. మదగర్వితుడై వరదర్పితుడైన మహిషాసురుణ్ణి సంహరించు. వాడు మహామాయావి. ఖలుడు. స్త్రీ వధ్యుడు. నానారూపాలను ధరిస్తూ సకలదేవతలనూ హింసించడం వాడికొక క్రీడావినోదం. మా అందరికీ నువ్వే దిక్కు. కాపాడు తల్లీ ! కాపాడు.



దేవతల స్తోత్రపాఠాలకు జగన్మోహిని సంబరపడింది. చిరునవ్వులు చిందిస్తూ శుభాశీస్సులు పలికింది. దేవతలారా ! ఇక నిర్భయంగా ఉండండి. మహిషుణ్ణి సంహరిస్తాను. ఇప్పుడే సంహరిస్తాను - అంటూ మరొక్కసారి నవ్వింది. సురలారా ! ఈ సృష్టిలో ఇదొక విచిత్రమైన సంఘటన. బ్రహ్మేంద్ర విష్ణురుద్రులు కూడా మహిషాసురుడికి భయపడిపోయారంటే ఎంత ఆశ్చర్యం ! దైవబలం ఒక్కొక్కప్పుడు ఇలా ఘోరంగా దుర్జయంగా ఉంటుంది. సుఖదుఃఖాలకు కాలమే కర్త. సృష్టి పాలన సంహారాల నిర్వహణకు సమర్థులైన త్రిమూర్తులే మోహంలో మునిగిపోయి మహిషుడి పీడలకు లోనై క్లేశసంతప్త లయ్యారంటే కాలమహిమ ఎంతటిదో తెలుస్తూనే ఉందికదా ! - అని ఒక్కక్షణం ఆగింది. చిరునవ్వు క్రమక్రమంగా వికటాట్టహాసమయ్యింది. కన్నులు ఎరుపెక్కాయి. ముఖం గంభీరమయ్యింది. వికటాట్టహాస భీషణ ధ్వని దిగ్దిగంతాలకు వ్యాపించింది. భూమి కంపించింది. పర్వతాలు కదిలిపోయాయి. సముద్రాలు ఘూర్ణిల్లాయి. మేరుపర్వతం గడగడలాడింది. మహారాక్షసుల గుండెలు దడదడలాడాయి. దేవతలు జయజయధ్వనులు చేశారు. పాహి పాహి అన్నారు.

## ◆ మహిషుడి మరులు - మంత్రి రాయబారం ◆

మహిషాసురుడు ఈ ధ్వని వింటూనే క్రోధతామ్రాక్షుడయ్యాడు. ఏదో శంకించాడు. ఏమిటి ఈ ధ్వని అని గర్జించాడు. తెలుసుకు రండి అని దానవులకు ఆజ్ఞాపించాడు. చెవులు చిల్లులు పడిపోతున్న ఈ ధ్వని ఏమిటి ? ఎవరు కర్త ? వాడు దేవత అయినా దానవుడైనా ఆ దుష్టుణ్ణి పట్టి బంధించి నా దగ్గరికి తీసుకురండి. ఆ అహంకారిని ఆ దురాచారుణ్ణి ఇప్పుడే సంహరిస్తాను. ఓడిపోయిన దేవతలు భయాతురులై గర్జిస్తున్నారా ? ఇది దానవులపని అయ్యుండదు. అందరూ నాకు వశంవదులేకదా ! మరి ఈ పిచ్చి చేష్ట ఎవరు చేసి ఉంటారు ? త్వరగా తెలుసుకోండి. వాణ్ణి ఈడ్చుకురండి. లేదంటే నేనే వెళ్ళి సంహరిస్తాను అని మహిషాసురుడు గర్జించేసరికి దూతలు నలుదిక్కులకూ పరుగులు తీసి అన్వేషించారు. అష్టాదశభుజాలతో దివ్యభూషణాలతో దివ్యాభరణాలతో సర్వాంగసుందరిగా విరాజిల్లుతున్న సింహవాహనను చూశారు. సువర్ణపాత్రమ చేత ధరించి మధుపానం చేస్తూ వికటాట్టహాసం కొనసాగిస్తున్న మహాదేవిని చూడగానే ఆ దానవదూతల పైప్రాణాలు పైకే పోయాయి. పరుగు పరుగున తిరిగి వచ్చి మహిషుడికి విన్నవించారు.

దైత్యనాయకా ! ఒక ప్రౌఢాంగనను చూశాము. సర్వరత్నాభరణవిరాజిత. మానవకాంత కాదు. దానవకాంత కాదు. ఎవరో దివ్యరూప. అత్యంతమనోహర. సింహారూఢ. అష్టాదశభుజ. అష్టాదశ వరాయుధధర. ఆవిడ సురాపానం చేస్తూ వికటాట్టహాసం చేస్తోంది. అదిగో ఆ ధ్వని ఇలా దశదిశలా వ్యాపిస్తోంది. ఆవిడ ఎవరో, భర్త ఎవరో తెలీదు. నేలమీద నిలబడలేదు. అంతరిక్షంలో ఉంది.



దేవతలంతా స్తుతిస్తున్నారు. జయజయ అంటున్నారు. పాహి పాహి అంటున్నారు. శత్రువులను జహిజహి (సంహరించు) అంటున్నారు. ఆవిడ ఎందుకోసం వచ్చిందో, ఎక్కడినుంచి వచ్చిందో ఏమి చెయ్యాలని వచ్చిందో మాకైతే తెలీదు. ఆవిడ దివ్యతేజస్సు కళ్ళు మిరుమిట్లు గొలుపుతోంది. తేరిపార చూడలేకపోయాం. శృంగారవీర హాసాలూ రౌద్రాద్భుతరసాలూ మూర్తీభవించినట్టు ఉంది. అటువంటి రూపాన్ని ఇంతకు ముందెప్పుడూ చూసి ఎరగం. విని ఎరగం. మాట్లాడించడానికి భయంవేసి చప్పుడు చెయ్యకుండా తిరిగి వచ్చాం. చూసి రమ్మనిమాత్రమేకదా నీ ఆజ్ఞ. ఇప్పుడు ఏమి చెయ్యమంటావో ఆజ్ఞాపించు.

దూతలు చెప్పింది శ్రద్ధగా విని మహిషాసురుడు తేలికగా పరిహసించాడు. ఒక మహావీరుణ్ణి చూస్తూ - మంత్రివర్యా ! నువ్వు మహాసేనలతో తరలివెళ్ళి సామదానాది చతురుపాయాలనూ వినియోగించి ఆ వరారోహను నా దగ్గరకు తీసుకురా. రానంటే చంపకుండా బంధించి తీసుకురా. అంతటి సౌందర్యవతిని పట్టమహిషిని చేసుకుంటాను. సాధ్యమైనంతవరకూ ప్రీతితో వచ్చేట్టుచూడు. రసభంగం కాకుండా నా కోరిక తీరేట్టు చూడు. ఆవిడ రూపసౌందర్యాన్ని గురించి ఈ దూతలు చెప్పినది విన్నంత మాత్రం చేతనే నా మనస్సు సమ్మోహితమయ్యింది.

ప్రీతియుక్తా సమాయాతి యది సా మృగలోచనా ।
రసభంగో యథా న స్యాత్తథా కురు మమేప్సితమ్ ॥ (9 - 58)

జనమేజయా ! వింటున్నావుగా. మహిషాసురుడి మదమత్తత ఏ స్థాయిలో ఉందోచూడు. ఆ మహామంత్రి గజాశ్వరథసేనలతో బయలుదేరి వెళ్ళి మహాదేవికి చాలా దూరంగా నిలబడి వినయంగా నమస్కరించి మధురంగా సంభాషించాడు.

ఓ తీయనిపలుకుల సుందరాంగీ ! ఎవరు నువ్వు ? ఎక్కడినుంచి వచ్చావు ? మా ప్రభువు నా ముఖతః నిన్ను అడుగుతున్నాడు. అతడు విశ్వవిజేత. దేవమానవులకు అవధ్యుడు. బ్రహ్మదేవుడిచ్చిన వరం ఉంది. దైత్యనాయకుడు. మహాబలశాలి. కామరూపధారి. నువ్వు ఇలా వచ్చావని తెలిసి, నీ సౌందర్యాన్ని విని మా ప్రభువు మహిషాసురుడు నిన్ను చూడాలని కోరుతున్నాడు. మానవరూపం ధరించి నీ చేరికకు వస్తాడు. నీకు ఎలా రుచిస్తే అలా. ఓ మృగశాబాక్షీ ! నువ్వే అతడి సన్నిధికి వస్తే మరీమంచిది. లేదంటే అతడే వస్తాడు. భక్తితో వస్తాడు. నీ ఇష్టం. నువ్వు ఎలా చెయ్యమంటే అలా చేస్తాను. అతడు నీకు పూర్తిగా వశుడైపోయాడు. నీ సౌందర్యానికి దాసుడైపోయాడు. ఓ కరభోరూ ! చెప్పు, నేను చెయ్యవలసింది ఏమిటో ఆజ్ఞాపించు. *(అధ్యాయం - 9, శ్లోకాలు- 68).*

ఆ రాక్షసమంత్రి మాటలు వింటూనే మహాదేవి విరగబడి నవ్వింది. క్షణంలో గంభీరంగా మారింది. మేఘగర్జనలా ఉరిమి పలికింది.



మంత్రివర్యా ! నేను దేవతల కన్నతల్లిని. మహాలక్ష్మి అంటారు నన్ను. సర్వదైత్యులనూ సంహరించడం కోసం వచ్చాను. మహిషుణ్ణి మట్టుబెట్టమని ఈ దేవతలు ప్రార్థిస్తే వచ్చాను. యజ్ఞభాగాలను హరిస్తూ దేవతలనందరినీ నానాహింసలూ పెడుతున్నాడుగదా మీ ప్రభువు. అందుకని మీ నాయకుణ్ణి చంపడం కోసం ప్రయత్నపూర్వకంగా వచ్చాను. ఒంటరిగా వచ్చాను. నాకు సైన్యం లేదు. నువ్వు సామోపాయంగా స్వాగతం పలికావు. మధురంగా సంభాషించావు. అంచేత సంతోషించి క్షమిస్తున్నాను. లేదంటే ఈపాటికి నిన్ను చంపి ఉందును. నా చూపులు కాలాగ్ని వీచికలు. ఈ పాటికి నిన్ను దహించివేద్దును. మధురంగా మాట్లాడావు కనక బతికిపోయావు. మధుర వాక్కులు ఎవరినైనా ఆనందపరుస్తాయిగదా ! వెళ్ళు నీ ప్రభువుతో చెప్పు. నామాటగా చెప్పు. రాక్షసాధమా ! జీవితేచ్ఛ ఉంటే వెంటనే పాతాళానికి పారిపో. లేదంటే ప్రాణాలను కోలుపో. ఎన్నో పాపాలు చేశావు. అన్నింటికీ శిక్షగా నిన్ను సంహరిస్తాను. బాణాలతో నీ శరీరమంతా తూట్లుపొడుస్తాను. యమలోకానికి పంపిస్తాను. ఈపాటి నా దయాళుత్వాన్ని తెలుసుకుని వెంటనే పాతాళానికి పారిపో. ప్రాణాలు నిలుపుకో. నిన్ను చంపితే దేవతలకు స్వర్గ సామ్రాజ్యం లభిస్తుంది. ఈ స్వర్గాన్నీ ఈ భూమినీ ఈ సముద్రాన్నీ విడిచిపెట్టి పారిపో. పాతాళానికి పారిపో. యుద్ధం చెయ్యాలని కోరికగా ఉంటే వెంటనే బయలుదేరి రా. మహావీరులతో మహాబలాలతో తరలిరా. అందరినీ ఒకేసారి యమలోకానికి పంపిస్తాను. ప్రతియుగంలోనూ నీవంటి మహామూఢుల్ని ఎంతోమందిని సంహరించాను. ఆయుధాలు ధరించావు కనక యుద్ధం చేసి వాటికి సాఫల్యం చేకూర్చు. లేకపోతే ఉత్తినే బరువు మోసినట్టు అవుతుంది. నువ్వు ఇప్పుడు మన్మథపీడితుడవుకూడా అయ్యావు. కాబట్టి తప్పకుండా వచ్చి యుద్ధం చెయ్యి. బ్రహ్మదేవుడు వరాలు ఇచ్చాడు కదా అని విర్రవీగుతున్నట్టున్నావు. నీకు స్త్రీ చేతిలోనే మరణం రాసిపెట్టి ఉంది. ఆ మాట మరిచిపోవద్దు. బ్రహ్మదేవుడి మాటకు తిరుగులేదు. అందుకే నేను వచ్చాను. స్త్రీరూపం ధరించి వచ్చాను. నీ పాపం పండింది. చావు మూడింది. మరొక్కసారి తుది హెచ్చరికగా చెబుతున్నాను. జీవితేచ్ఛ ఉంటే ప్రాణాలు గుప్పిటపెట్టుకుని పాతాళానికి పారిపో.

మహాదేవి ఇచ్చిన ఈ సందేశాన్ని శ్రద్ధగా విన్న ఆ మంత్రివర్యుడు భయాన్ని దాచుకుంటూ మరింత వినయంగా సంభాషించాడు. దేవీ ! ఆడవారికి తగినట్టు మాట్లాడావు. కానీ ఒక్క విషయం ఆలోచించు. మా ప్రభువెక్కడ నువ్వెక్కడ ? ఇద్దరికీ యుద్ధం ఎలా ? నువ్వు ఒంటరివి. పైగా చిన్నదానివి. నూతనయౌవనంలో ఉన్నావు. సుకుమారివి. మరి అతడో మహిషుడు. మహాకాయుడు. కఠినుడు. అనంతసైన్య సమేతుడు. భీకర శస్త్రాస్త్రసమన్వితుడు. నిన్ను చాలా తేలికగా సంహరిస్తాడు. మదగజం ఒక మాలతీపుష్పాన్ని నలిపివేసినట్టు చిదిమేస్తాడు.

కః శ్రమః కరిరాజస్య మాలతీపుష్పమర్దనే ।
మారణే తవ వామోరు మహిషస్య తథా రణే ॥ (10 - 21)



ఇంతకన్నా పరుషంగా మాట్లాడదామంటే సంశయిస్తున్నాను. శృంగారానికి రసభంగమవుతుందని భయపడుతున్నాను. మా రాజు నీపట్ల భక్తితత్పరుడు. సామదానాలు రెండే ఉపయోగించమని ఆదేశించాడు. అందుకని ఆగుతున్నాను. లేదంటే ఇంత పరుషంగా మా స్వామిని నిందించిన నిన్ను ఈపాటికి ఒకే ఒక్క బాణంతో సంహరించి ఉండేవాణ్ణి. రూపయౌవనగర్వంతో మిథ్యాభిమానంతో మేరమీరి పలుకుతున్నావు. నీ అందాన్ని గురించి విని మోహితుడయ్యాడుగదా అని లోకువ కట్టినట్టున్నావు. అందుకనే నేనూ నిన్ను సంహరించకుండా ప్రియంగా మాట్లాడవలసివస్తోంది. సకలరాజ్యాన్నీ సకలకోశాన్నీ మా ప్రభువు నీకు సమర్పిస్తాడు. అనుకూలంగా అభిప్రాయం ఏర్పరుచుకో. రోషానికి పోయి మరణాన్ని కోరితెచ్చుకోకు. భామినీ ! ఆలోచించు. ఇంతగా కాళ్ళావేళ్ళా పడి బతిమాలుతున్నాను. భక్తితో నీ కాళ్ళకు మొక్కుతాను. మా ప్రభువును తిరస్కరించకు. వెంటనే మహారాజ్ఞిగా పట్టాభిషేకం జరిపించుకో. ఓ శుచిస్మితా ! ముల్లోకాలూ నీకు పాదాక్రాంతమవుతాయి. అతడితో సంసార సుఖాలను అనుభవించు.

ఈ మాటలకు మహాదేవి మరొక్కసారి నవ్వింది. సౌమ్యంగానే బదులుపలికింది. వినవయ్యా ! వెర్రివాడా ! నువ్వు మహిషుడికి అప్తుడివీ ముఖ్యుడివీ అనుకుంటా. అలాగే కనిపిస్తున్నావు. నీ పశుబుద్ధి ప్రతిమాటలోనూ తొణికిసలాడుతోంది. నీలాంటివాడు మంత్రిగా ఉన్నాడంటే ఇక అసలువాడు ఎంత బుద్ధిమంతుడో తెలుస్తూనే ఉంది. దొందుకు దొందే అన్నట్టు సరిపోయింది. విధి ఎంత చక్కగా కూర్చింది మిమ్మల్ని ఇద్దర్నీ ! నేను ఆడదాన్నే. పురుషుణ్ణి కాను. స్త్రీవేషం కూడా ధరించాను. నీ ప్రభువు ఆడదాని చేతిలో మరణం కావాలని బ్రహ్మదేవుణ్ణి యాచించాడుకదా ! ఎంతటి మూర్ఖుడో. అటువంటి చావు వీరోచితమే అనుకున్నాడు. అయినా అర్థించాడు కనక అదే జరుగుతుంది. అందుకే నేను వచ్చాను. నాకు ఏ సైన్యమూ అవసరం లేదు. ఏ ఆయుధమూ అవసరం లేదు. దైవం ప్రతికూలించిన వాణ్ణి చంపడానికి ఒక గడ్డిపరక చాలదూ ! అదే వజ్రాయుధమవుతుంది. దైవం అనుకూలించిన వాడికి వజ్రాయుధమైనా గడ్డిపరకంత కాదు.

**విపరీతం యదా దైవం తృణం వజ్రసమం భవేత్ ।**
**విధిశ్చేత్సుముఖః కామం కులిశం తూలవత్తదా ॥ (10 - 36)**

మరణం రాసిపెట్టి ఉన్నాక ఎంత సైన్యముండి ఏమి లాభం ? జీవుడికి దేహంతో సంబంధం కాలయోగాన్ని బట్టి ఏర్పడుతూ ఉంటుంది, విడిపోతూ ఉంటుంది. సుఖదుఃఖాలలాగానే మృతికూడా ముందే రాసిపెట్టి ఉంటుంది. అది ఎవడికి ఎలా ఉందో అలాగే జరుగుతుంది. మార్చడం ఎవరివల్లా కాదు. బ్రహ్మాదులకే తప్పనివి ఈ ఉత్పత్తి వినాశాలు. ఇక నీకూ నీ ప్రభువుకూనా ! మృత్యువును తప్పించుకోలేనివారు ముచ్చటపడి ఇచ్చిన వరదానాలతో, నీ ప్రభువులాంటి వారు 'మాకు మరణంలేదు' అని విర్రవీగితే దాన్ని ఏమనాలి ? ఇంతకన్నా మూర్ఖత్వం వేరే ఉంటుందా ?



యే మృత్యుధర్మిణస్తేషాం వరదానేన దర్పితాః ।
మరిష్యామో వ మన్యంతే తే మూఢా మందచేతసః ॥ (10 - 41)

అందుచేత ఓ మంత్రీ ! త్వరగా వెళ్ళు. మీ ప్రభువుకు చెప్పు. అతడు ఏది ఆజ్ఞాపిస్తే అది నువ్వు చెయ్యాలిగదా ! ఉద్యోగివి. అందుకని నిన్ను తప్పుపట్టడంలేదు. వెళ్ళు. నా మాటగా చెప్పు - ఇంద్రుడు రేపటినుంచీ స్వర్గాధిపతి అవుతాడనీ, దేవతలే హవిర్భోక్తలవుతారనీ. మీరంతా పాతాళానికైనా పారిపోండి లేదా ప్రాణాలనైనా కోల్పోండి. మొన్నటి యుద్ధంలో విష్ణుమూర్తితోసహా దేవతలందరినీ జయించాం కద అనుకుంటున్నాడేమో ! అలా గర్వపడవద్దని చెప్పు. అది నీ ప్రభువు శక్తి కాదు. బ్రహ్మ ఇచ్చిన వరం శక్తి తెలుసుకోమను. వెళ్ళు - అని కచ్చితంగా చెప్పింది.

అంతా విన్నాడు. మంత్రి ఆలోచనలో పడ్డాడు. ఇప్పుడు ఏం చెయ్యాలి ! ఈవిడతో యుద్ధం చెయ్యనా, తిరిగి వెళ్ళనా ? ప్రభువు కామాతురుడై సంబంధం చక్కబెట్టి రమ్మని పంపించాడు. నేను విరసం చేసి ఎలా వెళ్ళను ? అందుచేత యుద్ధానికి దిగడం సమంజసం కాదు. ఎలా వచ్చానో అలాగే వెళ్ళి జరిగింది జరిగినట్టు ప్రభువుకి విన్నవిస్తాను. తరవాత ఏం చెయ్యాలో ఆ బుద్ధిమంతుడే నిర్ణయించుకుంటాడు సచివులతో నిపుణులతో చర్చించి నిర్ణయం తీసుకుంటాడు. అంతే. నేను సాహసం చెయ్యకూడదు. నా జయమైనా పరాజయమైనా ప్రభువుకి అప్రియమే అవుతుంది. కోపం వస్తుంది. ప్రభువులుకదా ! కోపం ముందు పుట్టి, తరువాత వారు పుడతారు. అందుచేత బుద్ధిగా తిరిగివెళ్ళి ఈ సుందరాంగి మాటలు యథాతథంగా చెబుతాను. ఆ తరవాత ప్రభువు ఇష్టం - ఇలా ఒక నిశ్చయానికి వచ్చి ఆ మేధావి శీఘ్రంగా తిరిగి వెళ్ళాడు. మహిషుడికి నమస్కరించి నిలబడి ఇలా ఉపన్యసించాడు -

మహారాజా ! సింహవాహనంపై కూర్చున్న ఆ సుందరాంగిని చూశాము. పద్దెనిమిది బాహువులతో వరాయుధాలతో విరాజిల్లుతోంది. దేవీ ! మా మహిషమహారాజును వరించి పట్టమహిషివై ముల్లోకాలూ ఏలుకో. మా ప్రభువు నీకు దాసుడై నీ ఆజ్ఞలు నెరవేరుస్తూ నీకు ప్రియం కలిగిస్తాడు - అని వినయంగా మనవి చేశాను ప్రభూ ! నా మాటలకు ఆ భామిని చిరునవ్వులు చిందించింది. కళ్ళు పెద్దవిచేసి చూసింది. మంత్రీ ! ఎంత మూర్ఖుడివి. దున్నపోతు (మహిషః) అంటే పశువులలోకెల్లా అధమాధమం. దేవతాప్రీతికోసం దాన్ని బలిఇస్తారు. మీ మహిషుణ్ణి పెళ్ళి చేసుకోడానికి నేనేమైనా పశువునా ? మరొక మహిషిని చూసి పెళ్ళిచెయ్యి. కొమ్ములూ కొమ్ములూ రాసుకుంటూ తిరుగుతారు. అరుచుకుంటూ క్రీడిస్తారు. మూర్ఖుడా! వాణ్ణి పెళ్ళాడటంకాదు ప్రాణాలు తీస్తాను. పాతాళానికి పారిపొమ్మను. లేదా నా చేతిలో మరణం తప్పదని చెప్పు. ఫో - అని గద్దించింది ప్రభూ ! బాగా ఆలోచించి నేను ఇలా తిరిగి వచ్చాను. అసలు ఆ క్షణంలోనే ఆ సుందరిని సంహరిద్దాం అనుకున్నాను. రసభంగం అవుతుందేమో, నీ ఆజ్ఞ తీసుకోలేదుగదా అని ఆలోచించి చేతులు కట్టేసుకున్నాను. జరిగింది ఇది ప్రభూ ! ఇటుపైని ఏమి చెయ్యాలో దేవరవారి దివ్యచిత్తం. రణమా మరణమా, ప్రయాణమా పలాయనమా ఆలోచించి ఏది శ్రేయస్కరమో నిశ్చయించండి - అని విన్నవించాడు (అధ్యాయం - 10, శ్లోకాలు - 66)



## ◆ మంత్రులతో మహిషుడి మంతనాలు ◆

వెంటనే మహిషాసురుడు వృద్ధమంత్రులను సమావేశపరిచాడు. ఏమి చేద్దామో చెప్పండి. ఈమె ఎవరో శాంబరీమాయలాగా ఉంది. బాగా ఆలోచించండి. ఉపాయాలు అన్నీ చర్చించండి. కర్తవ్యం ఏమిటో తేల్చి చెప్పండి - అన్నాడు. మంత్రులంతా ఒకేలాగా స్పందించారు.

మహిషమహాసురా ! సత్యమే పలకాలి. ప్రియమే చెప్పాలి. హితమే ఉపదేశించాలి. ఇది పండితుల లక్షణం. ఒక్కొక్కప్పుడు హితమైనది అప్రియం కావచ్చు. ప్రియమైనది అహితం కావచ్చు. ఔషధం అప్రియంగానే ఉంటుంది. కానీ అదే హితం. కాబట్టి అన్నివేళలా సత్యానిదే అగ్రపీఠం. అయితే సత్యం చెప్పేవారుకానీ, వినేవారుకానీ అట్టేమంది ఉండరు. బహుదుర్లభులు. ప్రియాలు పలికేవారు చాలామంది ఉంటారు.

సత్యస్య శ్రోతా మంతా చ దుర్లభః పృథివీపతే ।
వక్తాపి దుర్లభః కామం బహవశ్చాటుభాషకాః ॥ (11 - 6)

అందుచేత, మహారాజా ! ఈ గహనవిషయంలో మేము చటుక్కున ఏ నిర్ణయమూ చేసి చెప్పలేం. అసలు ఎవరికి ఎప్పుడు ఏది శుభమో ఏది అశుభమో తెలిసి చెప్పగలిగినవాడు ఈ ముల్లోకాలలోనూ లేడు.

ఈ మంత్రుల మాటలు విన్న మహిషాసురుడు చిన్నగా నవ్వేడు. అయితే, అమాత్యులారా ! మీమీ అభిప్రాయాలను ఎవరిమటుకువారు చెప్పండి. అన్నీ విని నేనొక నిర్ణయం తీసుకుంటాను. ఇది ఉత్తమోత్తమమైన పద్ధతి అని అందరూ అంగీకరిస్తున్నారు గదా ! - అన్నాడు.

బహూనాం మతమాజ్ఞాయ విచార్య చ పునః పునః ।
యచ్ఛ్రేయస్తద్ధి కర్తవ్యం కార్యం కార్యవిచక్షణైః ॥ (11 - 9)

అప్పుడు ముందుగా విరూపాక్షుడు ప్రభువుగారి మనస్సును రంజింపజేస్తూ తన అభిప్రాయం చెప్పాడు. మహారాజా ! ఒక ఆడది మదమెక్కి మాట్లాడితే వాటిని ఇంతగా పట్టించుకోవడమేమిటి ! అవ్వి వట్టి బిభీషికలు (బెదిరింపు మాటలు) వాటికి బెదిరిపోతామా ? నీవంటి రణదుర్మదులు భయపడతారా? అసత్యమని తెలిసీ, సాహసమని తెలిసీ, స్త్రీ చేష్టితమని తెలిసీ త్రిలోకవిజేతవు నువ్వు బెదిరిపోవడమేమిటి? నీ వంటి మహావీరుడు ఇలా దీనుడు కావడమే పెద్ద అపకీర్తి. అంచేత, నీదాకా ఎందుకుగానీ, నేనొక్కడినే వెళ్ళి ఆ చండికను చీల్చిచెండాడి వస్తాను. నువ్వు నిర్భయంగా ఉండు. అంతగా అవసరమైతే కొంత సేనను తీసుకువెడతాను. సర్పపాశాలతో బంధించి ఆ ఆడదానిని తెచ్చి నీ పాదాలచెంత నిలుపుతాను. నీకు వశమయ్యేట్టు చేస్తాను. చూద్దువుగాని నా శక్తి సామర్థ్యాలు ఏమిటో !



విరూపాక్షుడి మాటలకు దుర్ధరుడు వంతపలికాడు. ఆలోచించగా ఆలోచించగా ఆ మదవతి కామాతుర అనిపిస్తోంది. రూపగర్వితలైన నాయికలు ఇలాగే ఉంటారు. భయపెట్టి నిన్ను వశం చేసుకోవాలనుకుంటోంది. కామినీమణుల హావభావాలను రసికులు మాత్రమే పసికట్టగలరు. ప్రియుడిపట్ల స్త్రీలు వక్రోక్తి పరాయణలు. అవి అందరికీ అర్థంకావు. కామశాస్త్రం తెలిసినవాడే అర్థం చేసుకోగలడు. రణరంగంలో నిన్ను బాణాలతో వధిస్తాను అంది కదూ ! అంటే అర్థమేమిటో ఆలోచించు. హేతుగర్భితమైన వాక్యాన్ని హేతుబద్ధంగానే చర్చించాలి. కామినీమణుల కడగంటి చూపులను బాణాలు అనడం లోకప్రసిద్ధం. ఆ బాణాలను ప్రయోగిస్తాను అంటోంది. మరొకరకం బాణాలను నీమీద ప్రయోగించే శక్తి బ్రహ్మ విష్ణు మహేశ్వరులకే లేదు. అటువంటిది ఒక ఆడది ప్రయోగిస్తుందా ? అసంభవం. కాబట్టి ఇవి చూపుల తూపులే. సందేహం లేదు. ఇది తెలియక నువ్వు పంపిన మంత్రి విపరీతార్థాలుతీసి చెప్పాడు. రణరంగంలో పడగొడతాను అంటే శయ్యమీద ఓడిస్తాను అని అర్థం. పురుషాయితక్రీడగా దీన్ని సంభావించాలి. ప్రాణాలుతీస్తాను అంటే - కంగారు పడవలసిన పనిలేదు. పురుషుడికి వీర్యమే ప్రాణం. ఇంతకన్నా వివరించడం మంచిది కాదనుకుంటాను. ఇంత వ్యంగ్యం ఉంది ఆవిడ మాటల్లో. గ్రహించడానికి రసవద్గ్రంథాలు చదివిన అనుభవం ఉండాలి. అదీకాక ఎవరైనా స్త్రీ మనమీద కోపించినా గర్వం ప్రదర్శించినా మనకు లొంగిపోవడానికి ఇష్టపడుతోందన్నమాట. అందుచేత అస్త్రాలూ వద్దు శస్త్రాలూ వద్దు. నన్ను పంపించు. మధురంగా మాట్లాడి ఆవిడను నీ చెంతకు తెస్తాను. నీకు సేవకురాలిని చేస్తాను.

దుర్ధరుడి అభిప్రాయంతో విభేదిస్తూ తామ్రుడు వీరావేశంతో గొంతు చించుకున్నాడు. మహారాజా! రసాలూ లేవు, వ్యంగ్యాలూ లేవు. కామాతురా కాదు అనురక్తా కాదు. ఆవిడ మాటల్ని కాసేపు పక్కనబెట్టి సందర్భాన్ని గురించి ఆలోచించండి. స్త్రీరూపంలో ఉంది. ఒంటరిగా వచ్చింది. నిరాలంబంగా నిలబడింది. పద్దెనిమిది బాహువులున్న నారీమణిని ఎక్కడా ఎప్పుడూ కనీవినీ ఎరగం. ఆవిడ ధరించిన ఆయుధాలు కూడా చాలా విచిత్రంగా ఉన్నాయి. ఇదేదో వైపరీత్యం అనిపిస్తోంది. కాలరూపిణియై వచ్చిందేమో ! ఇటీవల మన రాక్షసులందరికీ దుస్స్వప్నాలూ దుశ్శకునాలూ కనిపిస్తున్నాయి. ఈ రోజు తెల్లవారుజామున నాకొక స్వప్నం వచ్చింది. నల్లచీరలు ధరించిన నారీమణి ఇంటిముందు నిలబడి రోదిస్తూ కనపడింది. ఇంటింటా ఏవేవో పక్షులు వికృతంగా రోదించడం నగరమంతటా కనపడుతోంది. ఇలాంటివే ఉత్పాతాలు రోజూ ఏవో కొన్ని అందరికీ ఎదురవుతున్నాయి. ఈ నేపథ్యంలో ఆలోచించండి. ఒక బాలామణి నిర్భయంగా నిలబడి నిశ్చయంగా యుద్ధానికి పిలుస్తోంది. ఆవిడ మానవకాంత కాదు. రాక్షసి కాదు. గంధర్వాంగన కాదు. నిన్ను వ్యామోహపరచడానికి దేవతలు సృష్టించిన దివ్యనారీమణి అయ్యుంటుంది. నిన్ను భయపడమని నేను చెప్పడంలేదు. పిరికిపందవై పలకడంలేదు. పారిపోదాం అనడంలేదు. యుద్ధమే చేద్దాం. ఏది జరగవలసి ఉంటే అది జరుగుతుంది. దాన్ని ఎవరూ తప్పించలేడుగదా !



తామ్రుడిమాటలు మహిషాసురుడికి నచ్చాయి. వెంటనే ఆజ్ఞాపించాడు. తామ్రా ! యుద్ధానికి సర్వసన్నద్ధుడవై బయలుదేరి వెళ్ళు. ఆవిడను జయించు. సాధ్యమైనంతవరకూ ప్రయత్నించి ప్రాణాలతో బంధించి తీసుకురా. కాకపోతే సంహరించు. నువ్వు మహావీరుడివి. సర్వజ్ఞుడివి. కామశాస్త్ర పారంగతుడివి. కాబట్టి అక్కడికి వెళ్ళగానే అన్నీ అర్థం చేసుకోగలుగుతావు. ఆవిడ ఎవరు ? ఎందుకోసం వచ్చింది ? కామభావంతో వచ్చిందా, వైరభావంతో వచ్చిందా ? ఎవరి మాయాశక్తి ? ఇవన్నీ ముందుగానే గ్రహించి, ఏది చెయ్యాలో అది చెయ్యి. యుద్ధమే అవసరమనిపిస్తే రణభేరి మ్రోగించు. పిరికితనం పనికిరాదు. అలాగని నిర్భయత్వమూ పనికిరాదు. ఆవిడ మనస్సుని అర్థం చేసుకుని, దానికి తగినట్టు చెయ్యి.

కాతరత్వం న కర్తవ్యం నిర్దయత్వం తథా న చ ।
యాదృశం హి మనస్తస్యాః కర్తవ్యం తాదృశ్యం త్వయా ॥ (11 - 51)

ప్రభువు ఆజ్ఞను శిరసావహించి తామ్రుడు సవినయంగా నమస్కరించాడు. సేనాసమేతుడై తరలివెళ్ళాడు. మార్గమధ్యంలో ఎదురైన అపశకునాలకు భయపడ్డాడు .కాలం దాపురించింది అనుకున్నాడు. అయినా ముందుకే సాగిపోయాడు.

సింహవాహనంమీద స్థిరంగా కూర్చున్న మహాదేవిని చూశాడు. స్తుతిస్తున్న దేవతలను గమనించాడు. ఒంటరిగా ముందుకి నడిచి మహాదేవిని సమీపించాడు. వినయవినమితగాత్రుడై నమస్కరించాడు. మధురంగా ప్రియంగా అనునయకంఠంతో పలికాడు.

దేవీ ! దైత్యేశ్వరుడు మహిషాసురుడు నీ రూపగుణగణాలను విని అనురక్తుడయ్యాడు. నిన్ను చెట్టపట్టాలని కోరుకుంటున్నాడు. అమరదుర్జయుడైన మా ప్రభువుపట్ల మనసుపెట్టు. ఓ సుకుమారీ ! అతడిని భర్తగా పొంది నందనవనంలో హాయిగా విహరించు. ఇంతటి సుందరివైనందుకు తగిన సౌఖ్యాలను అనుభవించు. ఎవరికైనా సుఖాలు కోరుకోదగినవే కదా ! దుఃఖాలను కోరుకోకూడదుగానీ సుఖాలకేమి ! హాయిగా కోరుకోవచ్చు, పొందవచ్చు. నీకు ఈ భయంకరమైన ఆయుధాలు ఎందుకు ? నీ చేతులు పద్మాల్లా కోమలంగా ఉన్నాయి. పూబంతుల్ని పట్టుకోవాలితప్ప ఈ బరువైన బండ ఆయుధాలను ధరించడమా ! చాలుగానీ ఇక వదిలెయ్యి.

కరభోరు కిమర్థం తే గృహీతాన్యాయుధాన్యలమ్ ।
పుష్పకందుకయోగ్యాస్తే కరాః కమలకోమలాః ॥ (11 - 59)

కరభోరూ ! నీ కనుబొమలే ఒక ధనుస్సు. మరొక విల్లు ఎందుకింకా ? క్రీగంటి చూపులే బాణాలు. వేరే తూపులు ఎందుకింకా ? ఈ ప్రపంచంలో అత్యంత దుఃఖప్రదం ఏమిటంటే - యుద్ధమే.



విజ్ఞుడెవడూ కయ్యానికి కాలుదువ్వడు. ధనలోభమో రాజ్యలోభమో ఉన్నవాళ్ళు యుద్ధాలు చేసుకు చస్తారు. నీకెందుకు ఈ బాధ ? పువ్వులనైనా ఆయుధాలుగా వేసుకోకూడదు. అటువంటిది కత్తులతో కటారులతో శరీరాలకు గాయాలు చేసుకోవడం ఏమి ఆనందం ? ఎవరికి ఆనందం ? అందుచేత ఓ తన్వంగీ ! నువ్వు కూడా ఆలోచించు. ప్రసన్నురాలివికా. దేవదానవ పూజితుడైన మా ప్రభువును భర్తగా స్వీకరించు. నీ సకల మనోరథాలూ తీరుస్తాడు. పట్టమహిషివై ముల్లోకాలనూ శాసించు. నా మాట విని సుఖపడు. సంగ్రామమంటే మాటలు కాదు. జయం సందేహాస్పదం. కష్టాలుమాత్రం తథ్యం. రాజనీతి నీకు తెలియనిది కాదు. శాశ్వతంగా రాజ్యభోగాలు అనుభవించు. నీకు బంగారంలాంటి బిడ్డ పుడతాడు. నీఅంత అందంగా ఉంటాడు. అతడు రాజు అవుతాడు. యౌవనంలో క్రీడాసుఖాలు అనుభవిస్తాడు. వార్ధక్యంలో గౌరవమర్యాదలు పొందుతాడు. నా మాట విని, ఆలోచించి, మా మహారాజును వరించు.

*(అధ్యాయం - 11, శ్లోకాలు - 67)*

తామ్రుడి ప్రసంగాన్ని జగదంబిక పరిహసించింది. మేఘ గంభీర కంఠస్వరంతో బదులు పలికింది. తామ్రాసురా ! వెంటనే తిరిగి వెళ్ళు. నీ ప్రభువుకి చెప్పు. ఇంతటి బుద్ధిహీనుణ్ణి నేనెక్కడా చూడలేదు. అతి కామార్తుడై జ్ఞానం కోల్పోయినట్టున్నాడు. అతడికి చెప్పు. ఓరి మూర్ఖుడా ! నీకు జన్మనిచ్చిన తల్లిలాగా నేను గడ్డితినేదానిని కాను. నాకు కొమ్ములు లేవు. వేలాడే పొట్టలేదు. తోక లేదు. నేను బర్రెను కాదు అన్నానని చెప్పు. నేను ఇంద్రాదులనే వరించను. ఇక ఈ పశువును వరిస్తానా ? ఏ గుణం చూసి వరించాలి ? లోకనింద వస్తుందని వరించనా ? పైగా నేను పతింవరను (కన్య) కాను. నాకు భర్త ఉన్నాడు. అతడు సర్వకర్త. సర్వసాక్షి. అకర్త. స్థిరుడు. నిస్పృహుడు. నిర్గుణుడు. నిర్మముడు. నిరాలంబుడు. నిరాశ్రయుడు. అనంతుడు. సర్వజ్ఞుడు. పూర్ణుడు. పూర్ణాశయుడు. శుభప్రదుడు. శాంతుడు. సర్వదృక్కు. సర్వభావనుడు. సర్వపావనుడు. అటువంటి భర్తను విడిచిపెట్టి ఈ మూర్ఖమహిషుణ్ణి వరించమంటావా? సేవించమంటావా ?

మీ రాజుకి చెప్పు - కళ్ళు తెరిచి వొళ్ళు తెలిసి యుద్ధానికి రమ్మను. మహిషుడుకదా ! యముడికి వాహనమైనా చేస్తాను, లేదా మనుషులకి నీళ్ళయినా మోయిస్తాను.

ప్రబుద్ధ్య యుధ్యతాం కామం కరోమి యమవాహనమ్ ।
అథవా మనుజానాం వై కరిష్యే జలవాహకమ్ ॥ (12 - 9)

అలాకాక జీవించాలనే కోరిక ఉన్నట్టయితే పాతాళానికి పారిపొమ్మను. సదృశులకు వివాహం జరిపిస్తే సంసారం సుఖంగా ఉంటుంది. అలాకానివారికి అజ్ఞానంతో పెళ్ళి చేస్తే అది నరకమే. ఈమాత్రం



తెలియని మూర్ఖుడివి. మహిషుణ్ణి పతిగా వరించమని ప్రబోధిస్తున్నావు. నేనెక్కడ, వాడెక్కడ ? కొమ్ములున్న దున్నపోతుకి నాతో సంబంధమా ? ఫో. నువ్వుకూడా పోయి నీ ప్రభువుతో కలిసి యుద్ధానికిరా. సబంధుమిత్రపరివారంగా అందరినీ అంతమొందిస్తాను. లేదంటే దేవలోకాన్నీ యజ్ఞభాగాలనూ వదిలేసి పారిపొండి.

ఇలా హెచ్చరించి ఆ మహాదేవి భీషణంగా గర్జించింది. కల్పాంతంలో కాలమేఘాలు ఉరిమినట్లు ఆ ధ్వనితో దిక్కులు పిక్కటిల్లాయి. దైత్యులు గడగడలాడారు. భూగోళం కంపించింది. పర్వతాలు దొర్లిపడ్డాయి. రాక్షసాంగనలకు గర్భస్రావాలు జరిగాయి.

సమీపంలోనే ఉన్న తామ్రుడు భయంతో వణికిపోయాడు. నిశ్చేష్టుడై క్షణకాలం నిలబడి, వెంటనే పరుగు లంకించుకున్నాడు. సరాసరి మహిషుడి సన్నిధిలో ఆగాడు. నగరంలో ఉన్న దానవులకూ ఇదే పరిస్థితి. చెవిటివార్రై అటూఇటూ పరుగులు తీశారు.

అదే సమయంలో అమ్మవారి వాహనం - సింహగర్జన చేసింది. ఆ ధ్వనికి దానవులలో చాలామంది బిర్రబిగిసి ప్రాణాలు వదిలేశారు. మహిషుడు మళ్ళీ ఆలోచనలో పడ్డాడు. ఏమి చేద్దామని సన్నిహితులతో చర్చించాడు. దుర్గాలలో దాక్కోవడమా, దండువెడలి యుద్ధం చెయ్యడమా, పలాయనం చిత్తగించడమా - వీటిలో ఏది శ్రేయస్కరమో చెప్పండి. మీరంతా బుద్ధిమంతులు. శాస్త్రాలు చదివినవారు. కార్యం సిద్ధించాలంటే మంత్రాంగం గుట్టుగా మట్టుగా సాగాలి. రాజ్యసంరక్షణకు మంత్రాంగమేకదా మూలం! మంత్రభేదం జరిగితే అది రాజుకీ రాజ్యానికీ వినాశహేతువు అవుతుంది. అంచేత మంత్రాంగం - పైకి పొక్కకుండా జాగ్రత్తపడాలి. మంత్రులారా ! దేశకాలాలను పరిశీలించి బాగా ఆలోచించి హేతుబద్ధమైన నిర్ణయం చెయ్యండి. ఈ వచ్చిన ఆడది సాధారణ స్త్రీ కాదు. అబల కాదు - ప్రబల. మానవ నిర్మితకాదు - దేవ నిర్మిత. ఏకాకిని. నిరాలంబ. దీనికి కారణమేమిటో ఆలోచించండి. బాల అయ్యిండీ యుద్ధానికి రమ్మంటోంది. ఇంతకన్నా ఆశ్చర్యమేమిటి ? ఇది శ్రేయస్కరమో విపరీతమో (వినాశకమో) ఎవడికి తెలుసు ! ఎవరితోనైనా సరే యుద్ధానికంటూ దిగితే సంఖ్యాబలం ఉందికదా అని జయిస్తామనుకోడానికి వీలులేదు. ఒంటరికదా అని ఓడిపోతాడనుకోడానికీ లేదు. జయపరాజయాలు ఎప్పుడూ దైవాధీనాలే. ఆ దైవం కంటికి కనిపించదు కనక ఉపాయవాదులు అదృష్టమన్నారు. ఐతే అది అంతా దుర్బలులకూ పిరికిపందలకూ ఒక ఆశావలంబనం. సమర్థులకు ఈ దైవం ఎక్కడా కనపడదు. అదృష్టం అనే మాట వినపడదు. ఒకవేళ అది ఉన్నా మహాశూరులకు ఉద్యమమే అన్నీను. ఇవన్నీ బాగా ఆలోచించి కర్తవ్యాన్ని నిర్దేశించండి.



ఉపాయవాదినః ప్రాహుః దైవం కిం కేన వీక్షితమ్ ।
అదృష్టమితి యన్నామ ప్రవదంతి మనీషిణః ॥
తత్సత్త్వేఽపి ప్రమాణం కిం కాతరాశావలంబనమ్ ।
న సమర్థజనానాం హి దైవం కుత్రాపి లక్ష్యతే ॥
ఉద్యమో దైవమేతౌ హి శూరకాతరయోర్మతమ్ ।
విచింత్యాద్య ధియా సర్వం కర్తవ్యం కార్యమాదరాత్ ॥ (12 - 28, 29, 30

మహిషాసురుడి ప్రసంగం విని దైత్యనాయకులందరూ గంభీరముద్ర వహించారు. కొం సేపటికి ఆలోచన తెమిలి బిడాలుడనే మహాబలుడు నోరు విప్పాడు.

ప్రభూ ! అసలు ఈ విశాలాక్షి ఎవరో ముందు తెలుసుకోవాలి. ఆ ప్రయత్నం చెయ్యాలి ఎందుకోసం వచ్చింది ? ఎవరి ఇల్లాలు ? - ఇత్యాదులన్నీ ఆచూకీ తియ్యాలి. నీకు స్త్రీ చేతిలో మరణమని తెలిసి దేవతలంతా కలిసి తమతమ తేజస్సులతో ఈ పద్మపత్రాక్షిని సృష్టించి ఉంటారు. వాళ్ళ అందరూ ఆకాశంలో అదృశ్యులై నిలబడి యుద్ధాన్ని చూసి ఆనందిస్తారు. అవసరాన ఈవిడకి సహకరిస్తారు ఈ కామినిని అడ్డుపెట్టుకుని విష్ణురుద్రేంద్రాదులు రాక్షస సంహారం చేస్తారు. ఆవిడ నిన్ను తుదముట్టిస్తుంది ఇదీ వారి ప్రణాళిక. ఊహించి చెప్పడం కాదు. నాకు అందిన సమాచారం. అయితే, మహారాజా ! ఏమి జరుగుతుందో అది జరగనీ. ఇప్పుడు ఈమెతో యుద్ధానికి దిగవద్దు అనిమాత్రం నేను చెప్పను. ఇది దేవతలు పన్నిన వ్యూహం. అది గ్రహించమంటున్నాను. అంతే. నిర్ణయం నీ ఇష్టం. నీకోసం మేము మరణించడానికైనా సిద్ధంగా ఉన్నాం. నీవెంట నిలుస్తాం. ఇది అనుజీవులకు ధర్మం. ఆ విషయంలో నువ్వు ఏమీ శంకించవలసిన పనిలేదు. కాకపోతే ఆలోచించవలసింది ఏమిటంటే - ఒక ఆడది. ఒంటరిగా వచ్చి నిలబడి మహాసైన్య సమేతులమైన మనల్ని యుద్ధానికి రమ్మంటోందేమిటా అని. యుద్ధమే జరిగితే ఈసారి జయలక్ష్మి మనల్ని వరించదనడం ఖాయం. అయినా తప్పదు. సంగ్రామమే చెయ్యాలి. మహావీరలంకదా ! ఎలా పారిపోతాం. అప్రతిష్ఠకాదూ ! ఇంద్రాదులతో పోరాడినప్పుడే చెయ్యనిపనిని ఒక ఒంటరి ఆడదానితో తలపడినప్పుడు చేస్తామా ? అంచేత యుద్ధమే కర్తవ్యం. లయమే కానీ, జయమే రానీ. ఏది జరగాల్సుంటే అది జరుగుతుంది. జరగనీ. దానికి దిగులెందుకు ? మరణిస్తే కీర్తి దక్కుతుంది. జయిస్తే సుఖాలు దక్కుతాయి. రెండింటికీ సిద్ధపడి యుద్ధానికి దిగుదాం. మరణం ఎలాగూ తప్పదు. ఎప్పటికో అప్పటికి అందరూ మరణించవలసిందే. ఇప్పుడు పారిపోయి అపకీర్తిని మూటగట్టుకుని ఆయుర్దాయం క్షీణించాక చావడంకన్నా ఇలా చావడమే ఉత్తమం. అపకీర్తితో జీవించడానికీ మరణించడానికీ తేడా లేదు. అందుచేత మరణిస్తామేమో అని భయపడటం శోకించడం వృథా. వీరోచితంగా యుద్ధమే చేద్దాం - పద.



బిడాలుడి నిర్ణయం విన్నాక దుర్ముఖుడూ బాష్కలుడూ అదే ధోరణిలో ప్రసంగించారు. వీరరసానికి ఉత్సాహమే స్థాయిభావం. అది పుష్కలంగా ఉండాలి. లేకపోతే భయం ఆవరిస్తుంది. అది ఆవరించింది అంటే ఇక ఏ పనీచెయ్యలేం. అందుచేత భయాన్ని మన దరిదాపులకు రానివ్వవద్దు. నువ్వు అనుమతిస్తే నేను ఒక్కడినే వెళ్ళి ఆ చంచలాక్షిని హతమార్చివస్తాను. ఒంటరిగా ఉన్న ఆడదానిని ఎదిరించడానికి నీదాకా ఎందుకు ? నేను చాలు. ఆ చండికను ఇప్పుడే యమలోకానికి పంపిస్తాను. ఏనాడూ ఎవరికీ నేను భయపడలేదు. అష్టదిక్పాలకులనూ హరిహరులనూ ఎదిరించి పోరాడాను. తెలుసుగా నీకు. అందుచేత అనుమతించు. నువ్వు రణరంగానికి రానేరావద్దు.

బాష్కలుడి ప్రసంగం దుర్ధరుడిని ఉత్సాహపరిచింది. ముందుకు వచ్చి ప్రభువుకి శిరసువంచి నమస్కరించాడు. మహిషాసురా! నన్ను అనుమతించు. ఈ క్షణంలో వెళ్ళి ఆ చండికను సంహరించి మరు నిముషంలో నీముందు నిలుస్తాను. ఆవిడ ఎవరూ ఏమిటీ - ఇలాంటి ఆలోచనలన్నీ అనవసరం. ఎవరైనా కానీ - ఒంటరిగా ఉన్న ఆడది. దానిని కడతేర్చడానికి ఇన్ని సమాలోచనలూ ఇన్ని సమావేశాలూనా ? సిగ్గు, సిగ్గు. ఈపాటి పనికి వ్యూహరచన ఒకటా ? చిటికెలో చంపి వస్తాను. నువ్వు ఊఁ అను - చాలు. అష్టాదశ బాహువులుట, షోడశాయుధాలుట, సింహవాహనమట ! ఇదంతా వట్టి మాయ. నిన్ను భయపెట్టడానికి దేవతలు పన్నిన మాయ. ఈ సత్యం గ్రహించు. మనస్సులో చోటుచేసుకున్న భయాన్ని వెంటనే పారద్రోలు. మేమంతా నీ మంత్రులంకదా ! మా అందరి అభిప్రాయమూ ఒక్కటే. యుద్ధం, యుద్ధం, యుద్ధం. ముమ్మాటికీ యుద్ధమే కర్తవ్యం.

మహారాజా ! మంత్రులలోకూడా సాత్త్వికులూ రాజసులూ తామసులూ ఉంటారు. ఇది నువ్వు తెలుసుకోవాలి. సాత్త్వికులు నిరంతరం స్వామి కార్యపరాయణులు. శక్తివంచన లేకుండా ప్రభుకార్యాలను నిర్వహిస్తూ వాటికి ఇబ్బంది కలగనిరీతిలో స్వకార్యాలనూ నిర్వహించుకుంటారు. మంత్రశాస్త్ర విశారదులై ఏకాగ్రచిత్తంతో ధర్మపరులై ప్రవర్తిస్తూ ఉంటారు. ఇది సాత్త్విక మంత్రుల పద్ధతి. రాజసులు అభిప్రాయభేదాలకు పెట్టిందిపేరు. వీరు సర్వదా స్వకార్యనిరతులు. అప్పుడప్పుడూ యాదృచ్ఛికంగా స్వామికార్యాలనుకూడా చేస్తుంటారు. తామసులు లోభనిరతులు. కేవలం స్వకార్యపరాయణులు. స్వామికార్యాలను భంగపరిచి మరీ స్వకార్యాలను సాధించుకుంటారు. వీరు సమయం అనుకూలించినప్పుడు స్వామితో భేదించి శత్రువులతో చేతులు కలుపుతుంటారు. శత్రువులు పెట్టే ప్రలోభాలకు తేలికగా లొంగిపోతారు. వారికి అవసరమైన రహస్య సమాచారాన్ని ఎప్పటికప్పుడు అందిస్తుంటారు. వీరు పైకి కనిపించని అంతశ్శత్రువులు. ఒరలో దాగి పొంచి ఉన్న కత్తులు. యుద్ధం వస్తే ప్రభువును భయపెడుతూ ఉంటారు. వీరిని ఛస్తే నమ్మకూడదు. నమ్మితే ఇంతే సంగతులు. కార్యహాని, మంత్రహాని అన్నీ జరుగుతాయి. ఖలులకు చెయ్యరానిదంటూ ఏముంటుంది ? లంచాలకు (ప్రలోభాలకు) లొంగిపోయి ఏమైనా చేస్తారు. తామసులు పాపనిరతులు. బుద్ధిహీనులు. శఠులు.



ఇలాః కిం కిం న కుర్వంతి విశ్వస్తా లోభతత్పరాః ।
తామసాః పాపనిరతాః బుద్ధిహీనాః శఠాస్తథా ॥ (12 - 63)

అందుచేత, ఓ మహిష మహారాజా ! నన్ను ఆజ్ఞాపించు. ఇప్పుడే రణరంగానికి వెళ్ళి కార్యం చక్కబెట్టుకువస్తాను. నువ్వు ఏమీ దిగులుపడకు. నిశ్చింతగా ఉండు. సాధ్యమైనంతవరకూ ఆ దుర్మార్గురాలిని బంధించి తెస్తాను. లేదంటే సంహరించి వస్తాను. నా శౌర్యాన్నీ నా ధైర్యాన్నీ, నా బాహుశక్తినీ నా ప్రభుభక్తినీ ఈరోజే నువ్వు చూద్దువుగాని. *(అధ్యాయం - 12, శ్లోకాలు - 65)*

## ◆ బాష్కల దుర్ముఖ సంహారం ◆

ఈ ప్రసంగానికి మహిషాసురుడు ఔననలేదు, కాదనలేదు. అయినా బాష్కల దుర్ముఖులిద్దరూ ఆయుధాలు ధరించి సేనాసమేతులై బయలుదేరారు. దేవి ఉన్నచోటుకి చేరుకున్నారు. బొంగురు గొంతులతో బిగ్గరగా మాట్లాడారు. దేవీ ! సకలదేవతలనూ జయించిన మహిషాసురుడు మహానుభావుడు. సర్వదైత్యాధిపతి. అతడిని నువ్వు వరించు. సర్వలక్షణ సంపన్నమైన మానవరూపం ధరించి నిన్ను ఆనందింపజేస్తాడు. బంగారు ఆభరణాలు ధరించి విలువైన వస్త్రాలు కట్టుకుని రహస్యంగా నిన్ను సమీపిస్తాడు. ఓ శుచిస్మితా ! ముల్లోకాలకూ మహారాణివై భోగాలు అనుభవించు. సంసార సుఖాలు అనుభవించు. మీ ఆడవాళ్ళు కోరుకునేది అదేకదా ! అంటూ వంకరగా నవ్వేరు.

అమ్మవారికి ఈ బుద్ధిహీనులమీద జాలివేసింది. మెల్లగా బదులు పలికింది. మూర్ఖులారా ! ఎన్నిసార్లు చెప్పినా అర్థం చేసుకోరేమిటి ? మహిషాసురుడిని సంహరించడానికి వచ్చాను నేను. నేను వాడిని వరించడం ఏమిటి ? ఏ స్త్రీ అయినా తనకంటే గొప్పవాడిని పతిగా కోరుకుంటుంది. ఎంత కామాతురయైనా ఒక పశువును భర్తగా స్వీకరించదు. పశువులలోకెల్లా అధమాధమం - మహిషం. ఒక దేవరూపిణి ఒక దున్నపోతును వరించడమా ? ఫొండి. వెంటనే వెళ్ళి మీ ప్రభువుకి చెప్పండి. యుద్ధానికైనా రమ్మనండి, పాతాళానికైనా పొమ్మనండి. యుద్ధమే జరిగితే దేవేంద్రుడు లాభం పొందినట్టే. మహిషాసురుణ్ణి చంపిగానీ నేను తిరిగి వెళ్ళను. నానుంచి తప్పించుకునే మార్గమూ మీకు లేదు. భూలోకంలోగానీ, దేవలోకంలోగానీ మీకు వాలుగంగుళాల నేలయినా లేదు. ఎక్కడ తప్పించుకుంటారు ? ఎలా తప్పించుకుంటారు. పాతాళానికి పలాయనమా, యమలోకానికి ప్రయాణమా - నిర్ణయించుకోమని మీ మూర్ఖుడికి చెప్పండి. ఫొండి - అని గట్టిగా హుంకరించింది.

బాష్కల దుర్ముఖులు అదిరిపడ్డారు. అయినా గుండెలు చిక్కబట్టుకున్నారు. ధనుస్సులు ఎక్కుపెట్టారు. బాణవృష్టి కురిపించారు. మహాదేవి జవాబుగా శరవర్షం కురిపించింది. దేవకార్యసిద్ధికోసం



ఒక మధురధ్వని చేసి మొదటిబాణం వేసింది. బాష్కలుడు ముందుకువచ్చి యుద్ధం సాగించాడు. దుర్ముఖుడు ప్రేక్షకుడుగా నిలబడ్డాడు. అమ్మవారు ఒక మోస్తరుగా యుద్ధం చేస్తోంటే, ఓసి ఇంతేనా అన్నట్లు బాష్కలుడు పేట్రేగిపోయాడు. గదా ఖడ్గ పరిఘాది వివిధాయుధాలను పుంఖానుపుంఖంగా ప్రయోగించాడు. యుద్ధదుర్మదుడు వీడు అని మహాదేవి గ్రహించింది. క్రుద్ధురాలు అయ్యింది. అయిదు తీవ్రవిశిఖాలను ఒకేసారి సంధించి విడిచిపెట్టింది. వాడు పదిబాణాలతో వాటిని ఖండించి, మరో పది బాణాలు సింహవాహనమీదికి విడిచిపెట్టాడు. అమ్మవారు పదిబాణాలతో వాటిని ఖండించి, అర్థచంద్రాకార బాణంతో వాడి ధనుస్సును విరగగొట్టింది. వెంటనే బాష్కలుడు గదను ధరించి రివ్వురివ్వున తిప్పుతూ అమ్మవారివైపు లంఘించాడు. మహాదేవి తానుకూడా గదను చేపట్టి గురిచూసి విసిరింది. అది వాడి తలకు తగిలింది. మూర్ఛపోయి నేలమీద పడ్డాడు. క్షణంలో తేరుకుని గదను విసిరాడు. దానిని దారిలోనే తుత్తునియలు చేసి త్రిశూలంతో వాడి వక్షఃస్థలంమీద బలంగా పొడిచింది. వాడు గిల గిలా తన్నుకుంటూ ప్రాణాలు వదిలాడు. అది గమనించిన రాక్షస సేనలు కాళ్ళకు బుద్ధిచెప్పాయి. దేవతలు జయజయధ్వానాలు చేశారు.

మరుక్షణంలో దుర్ముఖుడు సిద్ధమయ్యాడు. వాడి కళ్ళు చింతనిప్పుల్లాగా ఎరుపెక్కాయి. "అబలా! ! నిలు, నిలు" అంటూ రథంమీద తరలివచ్చాడు. కవచం ధరించి వచ్చాడు. వాణ్ణి చూస్తూనే జగన్మాత శంఖం పూరించింది. దుర్ముఖుడి కోపాన్ని మరింత రెచ్చగొడుతూ ధనుష్టంకారం చేసింది. ఒకరిపై ఒకరు శరవర్షం కురిపించారు. ముసల తోమర శక్తి ప్రభృతి మహాయుధాలను ప్రయోగించారు. యుద్ధం తీవ్రరూపం ధరించింది. రాక్షసవీరుల రక్తం రణరంగంలో ప్రవాహాలు కట్టింది. శిరస్సులు ఆ రక్తనదులలో తేలి ఆడుతున్నాయి. అవి - యమకింకరులు తమ బిడ్డలకు ఈతనేర్పే తుంబీఫలాల్లాగా (ఆనపకాయ బుర్రలు) ఉన్నాయి.

**యథా సంతరణార్థాయ యమకింకరనాయకైః ।**
**తుంబీఫలాని నీతాని నవశిక్షాపరైర్ముదా ॥ (13 - 33)**

రణరంగం బీభత్సంగా మారిపోయింది. పరమ దుర్గమంగా ఉంది. మృతకళేబరాలు. వాటిని పీక్కుతింటున్న నక్కలూ తోడేళ్ళు. కుక్కలూ కాకులూ, గ్రద్దలూ డేగలూ, మాంసఖండాలను తన్నుకుపోతున్నాయి. భరింపరాని దుర్గంధం.

దుర్ముఖుడికి కాలం మూడింది. కత్తిదూసి నిలబడ్డాడు. అబలా ! చివరిసారిగా చెబుతున్నాను. ప్రాణాలు విడుస్తావో, మహిషుణ్ణి వరిస్తావో తేల్చుకో - అని అరిచాడు.



మూర్ఖుడా ! నీ పని అయిపోయింది. ఇవే చివరి క్షణాలు. ఇవే తుదిపలుకులు. బాష్కలుణ్ణి కలుసుకో - అంటూ మహాదేవి పాడవాటి కత్తితో వాడి తల తరిగేసింది. వాడి శరీరం నేలకు ఒరిగిపోయింది. బురదలోపడ్డ చప్పుడయ్యింది.

దేవతల జయజయధ్వానాలూ, రాక్షసుల హాహాకారాలూ మిన్నుముట్టాయి. ఆకాశంనుంచి పుష్పవృష్టి కురిసింది. ఋషులూ తపస్వులూ మహాదేవిని స్తుతించారు. ***(అధ్యాయం - 13, శ్లోకాలు - 50)***

మహిషాసురుడికి వర్తమానం అందింది. క్రోధమూర్ఛితుడయ్యాడు. ఏమయ్యింది, ఏమయ్యింది అంటూ అంగలార్చాడు. దానవులారా ! చూశారా ? ఒక ఆడది బాష్కలదుర్ముఖులను సంహరించింది. ఆశ్చర్యం, ఆశ్చర్యం. దైవచేష్టితాలు ఇలాగే ఉంటాయి. కాలమే బలీయం. సుఖదుఃఖాలకు అదే కర్త. జీవులు పరతంత్రులు. చేసుకున్న పుణ్యపాపాలనుబట్టి వాటిని అనుభవిస్తూ ఉంటారు.

**కాలో హి బలవాన్ కర్తా సతతం సుఖదుఃఖయోః ।**
**నరాణాం పరతంత్రాణాం పుణ్యపాపానుయోగతః ॥ (14 - 3)**

మహాబలవంతులూ మహాసాహసులూ - బాష్కలదుర్ముఖులు ఇక మనకు లేరు. ఇప్పుడు ఏమి చేద్దాం చెప్పండి. ఈ సంకటపరిస్థితిలో అంతా కలిసి ఆలోచించి చెప్పండి - అని మహిషుడు అభ్యర్థించాడు.

## ◆ తామ్ర చిక్షుర సంహారం ◆

సేనాధిపతి చిక్షురుడు ప్రభువుకు నమస్కరించి నిలబడ్డాడు. మహారాజా ! ఒక స్త్రీని చంపడానికి ఇంత ఆలోచన ఏమిటి ? నేను వెడుతున్నాను - అంటూ మహాసైన్య సమేతుడై బయలుదేరాడు.

అల్లంతదూరంలో చిక్షురుణ్ణి చూసిన మహాదేవి కోప సంరక్తలోచన అయ్యింది. శంఖం పూరించింది. ధనుష్టంకారం చేసింది. మంగళ సూచకంగా ఘంటానాదం చేసింది. మూడు రకాల ధ్వని సంపుటికి రాక్షసుల గుండెలు పగిలిపోయాయి. చాలామంది అసువులు బాశారు. కొందరు పలాయనం చిత్తగించారు.

పారిపోతున్న సైనికులను చూసి చిక్షురుడు మండిపడ్డాడు. పిరికిపందల్లారా ! పారిపోతారేమి? నిలవండి, నిలవండి. మీ భయాన్ని క్షణంలో పోగొడతాను. మదగర్వంతో విర్రవీగుతున్న ఈ బాలను ఇప్పుడే ఈ నిమిషంలోనే సంహరిస్తాను. మీరు చూస్తూ నిలబడండి చాలు. యుద్ధం చెయ్యనక్కరలేదు. నిలబడండి - అంటూ ఉత్సాహపరచి ధైర్యం చెప్పి నిలువరించాడు. తాళవృక్షంలాంటి ధనుస్సును ఎక్కుపెట్టి మహాదేవి ముందు నిలబడ్డాడు. సగర్వంగా, ధిక్కారంగా వీరాలాపాలు పలికాడు.



విశాలాక్షీ ! ఎందుకు ఊరికే గర్జిస్తున్నావు. నీ గర్జనలకి భయపడేందుకు మేమేమీ మానవులం కాదు. దానవులం. నేను అసలు భయపడను. దానవసేనాపతిని. నీ చేష్టలూ నీ మాటలూ అన్నీ తెలుసుకున్నాను. ఈపాటికే నిన్ను సంహరించి ఉందును. స్త్రీవధ - అపకీర్తి అనీ నింద్యమనీ ఆలోచించి రవ్వంత ఉపేక్షిస్తున్నాను. అదీకాక నీవంటి సుందరీమణులు కటాక్షాలతో యుద్ధం చెయ్యాలి, హావభావాలతో కలహించాలి అంతేకానీ, శస్త్రాస్త్రాలతోనా ? ఇదెక్కడా నేను ఎరగను. మాలతీసుమదళం సోకినా కందిపోతావనిపిస్తున్నావు. నీమీద పువ్వులే విసరకూడదంటే ఇక బాణాలు ఎలా వేసేది ! నువ్వయినా ఈ కఠినమైన బరువైన ఆయుధాలు అసలు ఎలా ధరిస్తున్నావు ? చాలా ఆశ్చర్యంగా ఉందే !

నువ్వేకాదు, మానవులందరూ ఇంతే. శరీరాన్ని ఎంతో ప్రేమగా చూసుకుంటారు. సుగంధ పరిమళాలతో తైలాభ్యంగనస్నానాలతో షడ్రసోపేత భోజనాలతో అందంగా పోషించుకుంటారు. చివరికి క్షాత్రధర్మం అంటూ రణరంగానికి దిగి శస్త్రాస్త్రాలకు ఎరచేసుకుంటారు. ఇదేమి అజ్ఞానమో ! శరీరాన్ని గాయపరుచుకుని రాజ్యం పొందుతారు. ఎందుకు ఆ రాజ్యసంపద ? ముందు దుఃఖాన్ని కలిగించి, తరవాత సుఖాలను పంచిపెడుతుందా ? ఎంత అజ్ఞానం ? శరీరం ముక్కలయ్యాక ఆ సుఖాలు ఏమి ఆనందాన్ని ఇస్తాయి ?

సుందరాంగీ ! నువ్వుకూడా అజ్ఞానంలోనే ఉన్నావు. అందుకే యుద్ధం కోరుకుంటున్నావు. సంభోగసుఖాలను విడిచిపెట్టి వచ్చావు, సంగ్రామంలో ఏమి ఆనందం ఉన్నదనో ! ఖడ్గప్రహారాలూ, గదాఘాతాలూ బాణక్షతాలూ. కడపటికి మరణం. అటుపైని కళేబరానికి సంస్కారం ఏమిటో తెలుసునా? - నక్కలు పీక్కుతినడం. దీనినే చాలా గొప్పగా ప్రశంసించి కీర్తిస్తారు మహాకవులు. వట్టి ధూర్తులు. రణ రంగంలో మడమ తిప్పకుండా పోరాడుతూ మరణిస్తేట స్వర్గం లభిస్తుందిట ! ఎంత తియ్యటి అబద్ధం!! రమణీమణీ ! నీకెందుకు వచ్చిన శ్రమకానీ రణరంగంనుచి తొలగిపో. నీ మనస్సు ఎక్కడ ఆనందిస్తుందో అక్కడ విహరించు. లేదా సురమర్దనుడైన మహావీరుడు మహిషాసురుడిని సేవించు.

ఈ ప్రసంగం జగదంబిక కోపానికి ఆజ్యం పోసింది. ఇక ఆపమన్నట్లు హుంకరించింది. ఓరీ చిక్షురా! మహాపండితుడిలాగా, బుద్ధిమంతుడిలాగా ప్రసంగం చేస్తున్నావే. అసత్యాలాపీ ! నీకో నీతిశాస్త్రం తెలుసా? తర్కం చదివావా ? పెద్దలను సేవించావా ? ధర్మంపట్ల గౌరవం ఉందా ? మూర్ఖులను మెచ్చుకుంటూ మూర్ఖులతో మెప్పులు పొందుతూ కాలం గడిపిన మహామూర్ఖుడివి నువ్వు. నీతులు మాట్లాడతావేమిటి? రాజధర్మం గురించి నీకు ఏమి తెలుసునని ? ఇక ఆపు. నీ ప్రసంగాలు వినడానికి మేము సిద్ధంగా లేము. నేను ఎందుకు వచ్చానో మరోసారి స్పష్టంగా చెబుతున్నాను ఆలకించు. రణరంగంలో మహిషాసురుణ్ణి సంహరించి, వాడి రక్తంతో నేలను పదునుచేసి యశఃస్తంభాన్ని స్థిరంగా పాటి సుఖంగా తిరిగివెడతాను.



సంగ్రామే మహిషం హత్వా కృత్వా రుధిరకర్దమమ్ ।
యశఃస్తంభం స్థిరం కృత్వా గమిష్యామి యథాసుఖమ్ ॥ (14 - 27)

దేవతలను పీడించిన ఆ మదగర్వితుడిని శిక్షించడమే నా కర్తవ్యం. అతడి అనుచరులైన మీకూ అదే గతి పట్టిస్తాను. అందరినీ పరిమారుస్తాను.

మహాదేవి ఇలా తన నిశ్చయాన్ని ప్రకటించేసరికి చిక్షురుడు క్రోధంతో హుంకరించాడు. శరవర్షం కురిపించాడు. వాడు వేసిన అన్ని బాణాలనూ జగన్మాత ఖండించింది. త్రాచుపాముల్లాంటి బాణాలను ప్రయోగించింది. వాడు చెక్కుచెదరలేదు. అమ్మవారు ఉగ్రరూపం ధరించింది. గదతో మోది రథంనుంచి పడగొట్టింది. అయినా వాడు తట్టుకున్నాడు. క్షణకాలం రథంలోనే మూర్ఛపోయాడు. ఒక పర్వతాన్ని రథంలో పెట్టి మోసి తెచ్చినట్టు కనిపించింది ఆ దృశ్యం.

సేనాపతి మూర్ఛిల్లడాన్ని గమనించిన తామ్రుడు చండికను ఎదిరించాడు. వాడిని అల్లంతదూరంలోనే గుర్తించిన అంబిక బిగ్గరగా పరిహసించింది.

రా రా ! తామ్రా ! త్వరగా రా ! యమలోకానికి పోదువుగాని. అయినా మిమ్మల్ని అందరినీ పంపుతాడేమిటి ? మీ మహారాజు ఏమయ్యాడు ? పిరికిపంద, ఇంటిలో దాక్కున్నాడా ? ప్రాణాలు దక్కించుకోడానికి ఏమైనా ప్రయత్నాలు చేస్తున్నాడా? మిమ్మల్ని చంపి ఏమి లాభం ? మీరంతా అల్పాయుష్కులూ, అల్ప శౌర్యులూను. నాకు శ్రమ దండుగ. మహిషుణ్ణి రమ్మనండి. మీరంతా ఇళ్ళకు పొండి. మీ ప్రభువును పంపండి. ఆ బుద్ధిహీనుడుకూడా ఒకసారి నన్ను చూస్తాడు. ఎలా ఉన్నానో ఏమిటో గ్రహిస్తాడు. పొండి. మీరు వెళ్ళి వాడిని పంపండి - అని గర్జిస్తూ దిక్కులు పగిలేలాగా పరిహసించింది.

తామ్రుడు క్రోధతామ్రుడయ్యాడు. కళ్ళేకాదు క్రోధంతో శరీరమంతా ఎర్రబడింది. ధనుష్టంకారం చేశాడు. తన ధనుర్విద్యా కౌశలం అంతా చూపించాడు. వందలూ వేలూగా బాణాలు కురిపించాడు. కానీ ఒక్కటంటే ఒక్కటి అమ్మవారి దరిదాపులకైనా చేరలేకపోయింది. అన్నింటినీ మధ్యలోనే అవలీలగా తుంచివేసింది.

ఇంతలోకీ చిక్షురుడు మూర్ఛతేరాడు. ధనుస్సు అందుకున్నాడు. ఇప్పుడు ఇద్దరు మహావీరులూ ఒకేసారి బాణాలు కురిపించారు. జగదంబికకు ఉత్సాహం మారాకు తొడిగింది. ఇద్దరి బాణాలకూ సమాధానం చెప్పడంతోపాటు రాక్షససైన్యాన్ని క్షణంలో తుడిచిపెట్టేసింది. తామ్రచిక్షుర శరీరాలనిండా బాణాలే. రక్తం ఓడుతున్నారు. పుష్పించిన కింశుకవృక్షాల్లా భాసించారు. దేవతలూ మహర్షులూ ఆశ్చర్యంగా నిలబడి చూస్తున్నారు.



తామ్రుడు ఓపిక అంతా కూడదీసుకుని తన మహాగదతో అమ్మవారి సింహాన్ని (వాహనం) శిరస్సు మీద కొట్టాడు. విజయగర్వంతో వికటాట్టహాసం చేసి గంతులు వేశాడు. సింహానికి కళ్ళు ఎర్రబడ్డాయి. బాధతో మూలిగింది. అమ్మవారికి పట్టరాని కోపం వచ్చింది. తళతళలాడుతున్న దీర్ఘాసిని దూసి రెప్పపాటుకాలంలో తామ్రుడి శిరస్సును నేలకూల్చింది. వాడి మొండెం క్షణకాలం అలాగే గంతులువేస్తూ బొంగరంలా గిరగిరా తిరిగి ఒక్కసారిగా ఎగిరిపడింది. దభీమన్న శబ్దం దిగ్దిగంతాలకు వ్యాపించింది. కొండలూ కోనలూ మారుమోగాయి.

చిక్షురుడు వొళ్ళు తెలియని ఆవేశంతో కేకలువేస్తూ కత్తిదూసి అమ్మవారివైపు పరుగు పరుగున వస్తున్నాడు. మహాదేవి ఒకేసారి అయిదుబాణాలు సంధించి విడిచిపెట్టింది. ఒకబాణం వెళ్ళి వాడి ఖడ్గాన్ని ఎగరేసుకుపోయింది. దాని వెనకనే మరో శరం వెళ్ళి చేతిని తన్నుకుపోయింది. తక్కిన మూడు బాణాలూ ఒకేసారిగా వాడి శిరస్సును తుంచుకుపోయాయి. శిరస్సు లేని మొండెం మరొక క్షణంపాటు పరుగు సాగించి ముందుకి ఒరిగిపోయింది.

అమరుల జయజయధ్వానాలు, మహర్షుల మంగళాశీస్సులు, గంధర్వుల జయగీతికలు - ఒక్కసారిగా దశదిశలకూ వ్యాపించాయి. హతశేషులైన రాక్షసవీరులు హాహాకారాలు చేస్తూ పరుగులు తీశారు. ***(అధ్యాయం - 14, శ్లోకాలు - 56)***

## ◆ బిడాల అసిలోమ సంహారం ◆

మహిషాసురుడు మండిపడ్డాడు. అసిలోమ బిడాలాఖ్యులనందరినీ ఒకేసారి దండెత్తి వెళ్ళమన్నాడు. మూలబలం తప్ప తక్కిన సైన్యాన్ని అంతటినీ తీసుకుని దండనాయకులందరూ ఒకేసారి బయలుదేరారు. సింహవాహనం మీద సిద్ధంగా కూర్చున్న మహాదేవిని చూశారు. ఖడ్గ ఖేటకాది శస్త్రాలను ధరించి అష్టాదశ భుజాలతో వెలిగిపోతోంది. అసిలోముడు ఒక్కడుగు ముందుకు వేసి చిరునవ్వులు చిందిస్తూ వినయంగా శాంతంగా అమ్మవారిని అడిగాడు.

సుందరీ ! నిజం చెప్పు. నువ్వు ఎవరివి ? ఎందుకు వచ్చావు ? మేము నీకు ఏమి అపరాధం చేశాం? ఎందుకని మమ్మల్ని సంహరిస్తున్నావు ? కారణం చెప్పు. మా పొరపాటు ఉంటే సరిదిద్దుకుంటాం. సంధి కుదుర్చుకుందాం. బంగారమూ మణులూ రత్నాలూ ఏవి ఎన్నెన్ని కావాలంటే అన్నీ ఇస్తాం. స్వీకరించి వెళ్ళిపో. ఈ పోరాటాలూ ఈ చంపుకోవడాలూ ఎందుకు చెప్పు. యుద్ధం సర్వసుఖాలనూ అపహరిస్తుందని పెద్దలు చెబుతున్నారు. అందునా నువ్వు పరమసుకుమారివి. పూలతాకిడినే తట్టుకోలేవు. శరాఘాతాలను ఎలా సహిస్తున్నావు ? చాలా ఆశ్చర్యంగా ఉంది సుమా !



యుద్ధం చేసే చాతుర్యం నీకు ఉంది. ఒప్పుకుంటున్నాను. కానీ మనకున్న చాతుర్యాలు శాంతికి సుఖాలకీ ఉపయోగపడాలి కానీ కయ్యాలకూ కడగండ్లకూ దారితియ్యకూడదు గదా !

చాతుర్యస్య ఫలం శాంతిః సతతం సుఖసేవనమ్ ।
తత్కిమర్థం దుఃఖహేతుం సంగ్రామం కర్తుమిచ్ఛసి ॥ (15 - 10)

ఈ ప్రపంచంలో ఎవరైనా సరే సుఖాలను వరిస్తారు, దుఃఖాలను తిరస్కరిస్తారు. నాకు తెలిసినంతవరకూ సుఖమనేది రెండు రకాలు. నిత్యమూ అనిత్యమూ. ఆత్మజ్ఞానం - నిత్యసుఖం. అది శాశ్వతం. భోగానుభవం అనిత్య సుఖం. ఇది వినాశోన్ముఖం. అందుచేత అనిత్యం, అశాశ్వతం. ఇటువంటి సుఖం పరిత్యాజ్యమని వేదశాస్త్రాలు ఘోషిస్తున్నాయి. అలాకాక సౌగతమతాన్ని (బౌద్ధం) కనక నువ్వు అంగీకరించినట్టయితే యౌవన భోగాలను యథేచ్ఛగా అనుభవించు. పరలోకం సందేహాస్పదం, ఉందో లేదో ఎవడికి తెలుసు అనుకుంటే నిరంతరం భోగపరాయణురాలవై భూలోకంలో సుఖపడు. తప్పులేదు. ఈ దేహానికి యౌవనం అనిత్యం. అది తెలుసుకోవడం అన్ని మతాలకూ అవసరం. కాబట్టి పరులను హింసించడం లేదా పీడించడం లాంటి పనులను విడిచిపెట్టు. వాటితో కాలాన్ని వృథాచేసుకోకు. చేతనైనంతమేర సుకృతాలను ఆచరించు. ధర్మార్థకామాలకు పరస్పరవిరోధం లేకుండా చూసుకో. ధర్మబద్ధంగా అర్థకామాలను సేవించు. కల్యాణీ ! ధర్మంపట్ల కాసింత మనస్సుపెట్టు. శ్రద్ధ వహించు. నీపట్ల ఏ విధమైన అపరాధాన్నీ ఎప్పుడూ చెయ్యని దైత్యులను దారుణంగా హింసించడం ఏ రకంగానైనా ధర్మమవుతుందా ? ఒక్కసారి ఆలోచించు. ధర్మానికి దయయే శరీరమనీ, సత్యమే ప్రాణమనీ పెద్దలు చెబుతున్నారు. అందుచేత దయనూ సత్యాన్నీ కాపాడటం అవశ్యకర్తవ్యం అంటున్నారు.

దయా ధర్మస్య దేహోఽస్తి సత్యం ప్రాణాః ప్రకీర్తితాః ।
తస్మాద్దయా తథా సత్యం రక్షణీయం సదా బుధైః ॥ (15 - 17)

ఇంతకీ నా ప్రశ్న ఏమిటంటే - దానవులను నువ్వు ఎందుకు సంహరిస్తున్నావో, కారణం చెప్పు. నీకేమి అపరాధం చేశాం ?

అసిలోముడి తర్కానికి అమ్మవారు స్పందించింది. చెదిరిపోని చిరునవ్వుతో బదులు పలికింది. అసిలోమా ! ఇప్పటికి మీవాళ్ళు అందరూ నన్ను ఈ ప్రశ్న వేశారు. చెబుతున్నాను - విను. ఎందుకు వచ్చానో ఎందుకు చంపుతున్నానో - విను. నేను సర్వకాలాలలోనూ సర్వలోకాలలోనూ సంచరిస్తూ ఉంటాను. ప్రాణికోటి చేసే న్యాయాన్యాయాలను సాక్షిమాత్రంగా చూస్తూ ఉంటాను. నాకు ఎప్పుడూ ఏ రకమైన భోగేచ్ఛా లేదు. లోభం కానీ ఒకరితో వైరంకానీ లేవు. ధర్మంకోసం సాధురక్షణకోసం ఈ



ప్రపంచంలో సంచరిస్తూ ఉంటాను. ఇది నా వ్రతం. దీన్ని నిరంతరం పాలిస్తూ ఉంటాను. వేదాలనూ సాధువులనూ రక్షించాలంటే అధర్మాలనూ అసాధువులనూ సంహరించాలి. ఇందుకోసం ఎన్నో అవతారాలు ధరించాలి. ప్రతియుగంలోనూ ధరిస్తూనే ఉన్నాను. మీ మహిషుడు దురాచారుడు. దేవతలను హింసించాడు. సంహరించాడు. ఇది తెలుసుకున్నాను. అతడిని సంహరించడంకోసం ఇప్పుడు ఈ అవతారం ధరించి వచ్చాను. ఆ దుష్టుణ్ణి సురశత్రువుని సంహరించితీరతాను. నిజం చెప్పాను. ఇక నీ ఇష్టం. నిలబడతావో, కలబడతావో, పరుగిడతావో - తేల్చుకో. నీ ప్రభువుకి చెప్పు - వాళ్ళనీ వీళ్ళనీ యుద్ధానికి పంపిస్తాడెందుకు? స్వయంగా రమ్మను.యుద్ధం చెయ్యమను. సంధి చేసుకోదలిస్తే దేవతలతో వైరం విడిచిపెట్టి మీరంతా శాశ్వతంగా పాతాళానికి తరలిపొండి. ఇంతవరకూ దేవతలను జయించి ఏయే ద్రవ్యాలను హరించారో అవన్నీ బుద్ధిగా తిరిగి ఇచ్చి మరీ పొండి. పాతాళంలో ప్రహ్లాదుడు ఉన్నాడుగా. అతడితో కలిసి సుఖంగా జీవించండి.

జగదంబిక చేసిన ఈ ప్రతిపాదనను అసిలోముడు శ్రద్ధగా వినయంగా ఆలకించాడు. తన సహచరుడు బిడాలుడితో చర్చించాడు. సంధి - విగ్రహాలలో (యుద్ధం) ఏది ఇప్పుడు మన కర్తవ్యం ? సలహా చెప్పు అన్నాడు. బిడాలుడు క్షణకాలం ఆలోచించి -

అసిలోమా ! మన ప్రభువుకి అభిమానం ఎక్కువ. ఈ యుద్ధంలో మరణిస్తానని అతడికి తెలుసు. అయినా సంధికి ఇష్టపడడు. చిక్షురుడితో సహా ఇంతమంది చనిపోయారు. మళ్ళీ మనల్ని యుద్ధానికి పంపించాడు. సంధిని కోరుకునేవాడే అయితే ఇలా చేస్తాడా ? దైవాన్ని ఎవడూ తప్పించుకోలేడు. అదీకాక, మనం సేవకులం. ప్రభువు ఏది ఆజ్ఞాపిస్తే అది చెయ్యడం మన ధర్మం. సొంత ఆలోచనలు కానీ, మానాభిమానాలు కానీ మనకు పనికిరావు. సూత్రధారుడు ఆడించినట్లల్లా తోలుబొమ్మలు ఆడవలసిందే కదా ! సేవావృత్తి కడుంగడు దుస్సాధ్యం సుమా !

దుస్సాధ్య ఏవాస్తీహ సేవకానాం
ధర్మస్సదా మాన వివర్జితానామ్ ।
ఆజ్ఞాపరాణాం వశవర్తికానామ్
పాంచాలికానామివ సూత్రభేదాత్ ॥ (15 - 30)

మహిషాసురుడి సన్నిధికి వెళ్ళి ఈ కఠోర విషయాన్ని నువ్వుగానీ నేనుగానీ చెప్పగలమా ? రత్నరాశులూ ధనరాశులూ దేవతలకు సమర్పించి పాతాళానికి పారిపొమ్మని మహాదేవి సంధి ఒడంబడిక చేసిందని ప్రభువుకి ఎల్లా చెప్పగలం ? సత్యమో అసత్యమో ప్రభువులకు ఎప్పుడూ ప్రియమే చెప్పాలి. హితం కలిగిస్తుందికదా అని అప్రియం చెబితే మన పని అయిపోయిందే. అప్రియమైన సత్యం చెప్పవలసి



వచ్చినప్పుడు మౌనంగా ఉండిపోవడం బుద్ధిమంతుల లక్షణం. రుచించని మాటలతో ప్రభువులను ప్రబోధించడం ఎంతటి వీరులకైనా శ్రేయస్కరం కాదని నీతిశాస్త్రం చెబుతోంది. హితం పలకడానికిగానీ, మీ నిర్ణయమేమిటని అడగడానికిగానీ మనంతట మనం ప్రభుసన్నిధికి వెళ్ళనేకూడదుట. పిలిస్తే వెళ్ళాలి. అడిగితే చెప్పాలి, చెబితే వినాలి. లేకపోతే ప్రభువులకు కోపం వస్తుంది.

న మాపం తత్ర గంతవ్యం హితం వా వక్తుమాదరాత్ ।
ప్రష్టుం వాపి గతే రాజా కోపయుక్తో భవిష్యతి ॥ (15 - 33)

ప్రాణాలను తృణప్రాయంగా భావించి మరణానికైనా సిద్ధపడి స్వామికార్యాన్ని నెరవేర్చడం ఒక్కటే సేవకుల కర్తవ్యం. రాజనీతి ఇంతే చెబుతోంది - అన్నాడు బిడాలుడు.

ఇద్దరూ ధనుర్బాణాలను ధరించి యుద్ధానికి సన్నద్ధమయ్యారు. ముందుగా బిడాలుడు ఏడు బాణాలను సంధించి మహాదేవి మీదకు విడిచిపెట్టాడు. అసిలోముడు దూరం తొలగి ప్రేక్షకపాత్ర వహించాడు. జగదంబిక ఆ బాణాలను తుత్తునియలు చేసి, వజ్రకఠోరాలైన మరో మూడు బాణాలతో బిడాలుడిని గాయపరిచింది. బాధ తట్టుకోలేక బిడాలుడు కళ్ళుతిరిగి మూర్ఛపోయాడు. మరింక మూర్ఛనుంచి తేరుకోలేదు. దైవయోగంవల్ల తేలికగా మరణించాడు.

అసిలోముడు ధనుష్టంకారం చేస్తూ రథంమీద దూసుకువచ్చాడు. స్థిరంగా నిలబడి కుడిచెయ్యి పైకెత్తి - దేవీ ! దానవులంతా నీ చేతిలో మరణిస్తారని నాకు తెలుసు. అయినా నేను యుద్ధమే చెయ్యాలి. పరాధీనుణ్ణి. మహిషానురుడు వట్టి మందబుద్ధి. హితాహితాలూ ప్రియాప్రియాలూ తెలుసుకోలేడు. అతడి ఎదుట అప్రియమైన హితాన్ని వేనై చెప్పలేను. చెప్పినా వినిపించుకుంటాడనే నమ్మకం నాకు లేదు. శుభమో అశుభమో వీరోచితంగా మరణించడమే నా ధర్మం. దైవం అన్నివేళలా అన్నింటికన్నా గొప్పది. పౌరుషం నిరర్థకం. కాబట్టి ఎంతటి మహావీరులైనా దానవులు నీ చేతిలో మరణిస్తారు - అంటూనే శరవృష్టిని కురిపించాడు. జగదీశ్వరి ముఖం కోపంతో ఎర్రబడింది. ఎర్ర కలువలాగా భాసించింది. దీటుగా తీవ్రాశుగాలు కురిపించింది. అసిలోముడి శరీరం క్షణంలో రక్తసిక్తమయ్యింది. పుష్పించిన కింశుకవృక్షం అయ్యాడు.

లోహమయమై వేయిమణుగుల బరువున్న మహాగదను చేతబట్టి అసిలోముడు అమ్మవారివైపు దూసుకువెళ్ళాడు. సింహ సిరస్సును బలంగా కొట్టాడు. అది చలించలేదు. భీకరంగా గర్జించి పంజా విసిరింది. రాక్షసుడి వక్షఃస్థలం చీరుకుపోయింది. చేతినుంచి గద జారిపోయింది. తూలిపడ్డవాడు గద ఆసరాగా నిలబడి బంతిలా లంఘించి సింహ శిరస్సుపై నిలబడ్డాడు. గదతో అమ్మవారిని కొట్టబోయాడు. అంతలోకే ఒక మెరుపులా ఖడ్గధార మెరిసింది. అసిలోముడి తల బంతిలా ఎగిరిపోయింది. సింహం తల విసిరింది. రాక్షసుడి కళేబరం అల్లంతదూరాన పడింది. కాసేపటికి దభేలుమన్న శబ్దం వినపడింది. అంతా రెప్పపాటు కాలంలో జరిగిపోయింది.



దేవతలు జయజయధ్వానాలు చేశారు. జగదంబికను స్తుతించారు. కిన్నరులు ఆనందనృత్యం చేశారు. దేవదుందుభులు మారుమ్రోగాయి.

చచ్చిన రాక్షసులు చావగా మిగిలినవారిని సింహం చీల్చిచెండాడి ఆకలి తీర్చుకుంది. రణరంగం నిశ్శేషమయ్యింది. ఎలాగో తప్పించుకు పారిపోయిన ఒకరిద్దరు విలపిస్తూ మహిషుడికి విషయమంతా వివరించారు. అసిలోమ బిడాలులు నిహతులయ్యారు. మిగిలినవారిని సింహం భక్షించేసింది. మహాప్రభూ ! మమ్మల్ని నువ్వే కాపాడాలి అంటూ బావురుమన్నారు.

మహిషాసురుడి మనస్సు కలత చెందింది. చింతాకులితుడయ్యాడు. దుఃఖం పెల్లుబికి వచ్చింది. అయినా నిగ్రహించుకున్నాడు. **(అధ్యాయం - 15, శ్లోకాలు - 57)**

దారుకుణ్ణి పిలిచాడు. సాంగ్రామిక రథం సన్నద్ధం చేసి తెమ్మన్నాడు. వెయ్యిగాడిదలు పూన్చిన రథమది. పతాకాధ్వజ విభూషితం. వివిధాయుధ పరిపూర్ణం. తళతళలాడుతున్న దృఢమైన చక్రాలు. సూతుడు రథం తెచ్చి గుమ్మం ముందు నిలిపాడు. సిద్ధమని విన్నవించాడు.

## ◆ మహిష - మహాలక్ష్మీ సంవాదం ◆

మహిషుడు బయలుదేరబోతూ క్షణకాలం ఆలోచించాడు. ఈ కొమ్ములూ ఈ ముఖంతో ఇలా వెడితే ఆ బాలామణి చూడగానే విమనస్క అవుతుంది. స్త్రీలను ముందుగా ఆకర్షించేది రూపం, అటుపైని చాతుర్యం. అంచేత సుందరమానవాకారంతో వెడతాను. చూడగానే ప్రేమిస్తుంది. నాకూ ఆ రూపమే సుఖంగా ఉంటుంది. ఇంక ఏ రూపమైనా ఏదో ఇరుకు ఇరుకుగా ఇబ్బందిగానే ఉంటుంది - అని ఆలోచించి సర్వాలంకారశోభితుడై సర్వాయుధధారియై దివ్యాంబరాలను ధరించి మరో మన్మథుడా అనిపించేలా రూపం మార్చుకుని బయలుదేరాడు. కేయూర రత్నహారాలను సవరించుకుంటూ రథం అధిరోహించి కూర్చున్నాడు. రాక్షససైన్యం మొత్తం మూలబలంతో సహా అతడి వెంట కదిలివెళ్ళింది.

మహాదేవి అల్లంతదూరంలో అతడిని చూసింది. మానవరూపంలో వచ్చిన దానవనాథుడుగా గుర్తించింది. దిక్కులు పిక్కటిల్లేలాగా శంఖం పూరించింది. ఆ ధ్వనికి దేవదానవ మానవాదులు అందరూ విస్మయం చెందారుగానీ, మహిషాసురుడు మాత్రం బెదరలేదు. నిబ్బరంగా రథం నడుపుకుంటూ దేవి సమీపానికి వచ్చాడు. నవ్వులు ఒలకబోస్తూ సంభాషణకు దిగాడు.

దేవీ ! ఈ సంసారచక్రంలో ఆడదిగానీ మగవాడుగానీ ఎప్పుడూ సుఖమే కోరుకుంటారు. సుఖమనేది కలయికలోనే కలుగుతుంది. ఒంటరిగా ఉంటే ఎవరికీ ఏ సుఖమూ లేదు. కలయికలు బహువిధాలు. వాటి గురించి నాకు తెలిసింది చెబుతాను ఆలకించు. స్వభావసిద్ధమైన సంయోగాలూ,



ప్రీతిహేతుకమైన సంయోగాలూ అని స్థూలంగా కలయికలు రెండు విధాలు. వీటిలో ముందుగా ప్రీతిహేతుకాలను చెబుతున్నాను. గ్రహించు. తల్లిదండ్రులకు బిడ్డలతో కలయిక ఉత్తమోత్తమం. అత్యంత ప్రీతిదాయకం. ఆనందదాయకం. తోబుట్టువులు కలుసుకోవడంలో ఉండే ఆనందం దాని తరవాతది కనక మధ్యమం. ఉత్తమ సుఖాన్ని ఇస్తుంది కనక ఉత్తమమనీ, తక్కువ ఆనందాన్ని ఇస్తుంది కనక మధ్యమమనీ విభాగం. విభిన్న మనస్తత్త్వాలు కలిగి విభిన్న వ్యావృత్తులు కలిగి ఏదో ఎక్కడో ప్రసంగవశాత్తు కలిసి విడిపోయేవారు పొందే ఆనందం కనిష్ఠం.

ఇక స్వాభావికసుఖాలలో అత్యుత్తమమైనది - సవయస్కులైన సుందరీసుందరుల సమాగమమే. ఇది అత్యుత్తమసుఖం ఇస్తుంది కనక దీన్ని అత్యుత్తమ సంయోగం అంటున్నాను. చాతుర్యం రూపం వేషం వయస్సు కులశీలాలు గుణాలు - ఇత్యాదులవల్ల స్త్రీ పురుషులకు పరస్పరం ఆనంద సముత్కర్ష కలుగుతుంది.

అందుచేత, ఓ చారులోచనా ! మహావీరుడనైన నన్ను వరించావంటే అత్యుత్తమ సౌఖ్యాలను పొందుతావు. ఆనందిస్తావు. నేను నానావిధరూపాలను స్వేచ్ఛగా ధరించగలను. ఇంద్రాది దేవతలను రణరంగంలో మట్టి కరిపించాను. నాకున్న ధనసంపదగానీ, రత్నరాశులు గానీ మరెక్కడా చూడలేవు. వాటినన్నింటినీ హాయిగా అనుభవించు. నీ ఇష్టం వచ్చినవారికి దానం చెయ్యి. సుందరీ ! నువ్వు నా పట్టమహిషివి. నేను నీ దాసుణ్ణి. ఈ క్షణం నుంచే నీ ఆజ్ఞలను శిరసావహిస్తాను. అవును, నువ్వు అన్నట్టు దేవతలతో శత్రుత్వం పూర్తిగా వదులుకుంటాను. సంశయించకు. నామాట నమ్ము. నీకు ఏది సుఖమో ఏది ఆనందదాయకమో అదే చేస్తాను. విశాలాక్షీ ! నీ కనుసన్నలలో మెలుగుతాను. నువ్వు చెప్పినట్టు చేస్తాను. ఓ కలభాషిణీ ! నీ సౌందర్యానికి సమ్మోహితుణ్ణి అయ్యాను. నా మనస్సు నీకు లొంగిపోయింది. ఆతురుడనై నిన్ను శరణువేడుతున్నాను. కామబాణపీడితుడనై ప్రపన్నుడిగా నీ సన్నిధికి వచ్చాను. రంభోరూ ! నన్ను దయజూడు. నన్ను కాపాడు. శరణాగత రక్షణం ధర్మాల్లోకెల్లా ఉత్తమోత్తమ ధర్మంకదా! ఓ కృశోదరీ ! ఓ అసితాపాంగీ ! (కాటుక చూపులు) నీవాణ్ణి. నీ సేవకుణ్ణి. నా ప్రాణాలమీద ఒట్టు. మాట తప్పను. ఆయుధాలు అన్నీ వదిలేసి నీ పాదాలకు మొక్కుతున్నాను. ఓ తన్వంగీ ! దయచూడు. మన్మథుడి బాణాల తాకిడికి తట్టుకోలేకపోతున్నాను. సౌందర్యవరమావధీ! నా జన్మలో ఇంతవరకూ దైన్యమంటే ఏమిటో ఎరగను. బ్రహ్మాదులనుకూడా నేను దేనికీ వేడుకోలేదు. నా చరిత్ర ఏమిటో, రణరంగంలో నా కథ ఏమిటో వారు ఎరుగుదురు. అలాంటినేను ఇప్పుడు నీకు దాసుణ్ణి అయ్యాను. కాళ్ళా వేళ్ళాపడి బతిమాలుతున్నాను. భామినీ ! ఒక్కసారి నా ముఖం చూడు. అనుగ్రహించు.

ఇలా మహిషాసురుడు ఏదో మైకం కమ్మినవాడిలా కామాతురుడై పలవరిస్తున్నాడు. మహాదేవి విన్నదిగా నవ్వింది. పరిహసిస్తూ బదులు పలికింది. అనునయంగా మాట్లాడింది.



దైత్యా ! పరమపురుషుణ్ణి తప్ప నేనెవరినీ వాంఛించను. అతడి ఇచ్ఛను నేను. సకల జగత్తునూ సృష్టిస్తూ ఉంటాను. ఆ విశ్వాత్మకుడు నన్ను సంరక్షిస్తూంటాడు. అతడు పురుషుడు. నేను ప్రకృతిని. అతడి సాన్నిధ్యంవల్లనే నాలో చైతన్యం శాశ్వతంగా నిలుస్తుంది. స్వతస్సిద్ధంగా నేను జడాన్ని. అయస్కాంతం ఇనుములో కదలిక తెచ్చినట్టు ఎప్పుడూ నన్ను చైతన్యపరిచేది అతడి సాన్నిధ్యమే. శరీర సుఖాలపట్ల నాకు ఏనాడూ కోరికలేదు. ఉండదు.

ప్రహస్య సస్మితం వాక్యమువాచ వరవర్ణినీ ।
నాహం పురుషమిచ్ఛామి పరమం పురుషం వినా ॥
తస్య చేచ్ఛాస్మ్యహం దైత్య సృజామి సకలం జగత్ ।
స మాం పశ్యతి విశ్వాత్మా తస్యాహం ప్రకృతిః శివా ॥
తత్సాన్నిధ్యవశాదేవ చైతన్యం మయి శాశ్వతమ్ ।
జడాహం తస్య సంయోగాత్ ప్రభవామి సచేతనా ॥
అయస్కాంతస్య సాన్నిధ్యాత్ అయసశ్చేతనా యథా ।
న గ్రామ్యసుఖవాంఛా మే కదాచిదపి జాయతే ॥ (16 - 35 నుంచి 38)

ఇవ్వి ఏమీ ఎరగని మహామూర్ఖుడివి నువ్వు. నన్నొక మామూలు మహిళగా భావించి సంగమం వాంఛిస్తున్నావు. వెర్రివాడా ! అసలు మహిళ అంటేనే పురుషుడికి శృంఖల. ఇనప సంకెళ్ళనైనా విడిపించుకోవచ్చుగానీ మహిళాబద్ధుడికి మాత్రం మోక్షం లేదు. అయినా, మూత్రాగారాన్ని సేవించడానికి ఎందుకు ఇంతగా వెంపరలాడుతున్నావో నాకు అర్థం కావడంలేదు. ఎంత మందమతివి ! శమం అలవరచుకో (శమం = ఇంద్రియ నిగ్రహం). శమంవల్లనే శాంతీ సుఖమూను. నారీసంగం సుఖప్రదం కాదు, మహాదుఃఖదాయకం. గుర్తించు. మోహం వదిలించుకో.

అసురా ! దేవతలతో వైరం విడిచిపెట్టి పాతాళానికి పారిపో. నీకు జీవించాలనే కోరిక ఉంటే ఇదొక్కటే మార్గం. లేదంటే ధనుస్సు ఎక్కుపెట్టు. నేను బలీయసిని. నిలిచి యుద్ధం చెయ్యి. దేవతలు అందరూ కలిసి నన్ను పంపించారు. కేవలం నిన్ను సంహరించడానికే వచ్చాను. ఇది సత్యం. నీ మాటల్లో కనిపించిన సౌహృదానికి సంతోషించి నీకు ఈ అవకాశం ఇస్తున్నాను. పాతాళానికి పోయి ప్రాణాలు దక్కించుకో. అక్కడ ప్రహ్లాదాదులతో కలిసి యథేచ్ఛగా జీవించు. ఏడు మాటలు పలికితే చాలు సజ్జనులు దాన్ని మైత్రిగా భావిస్తారుట. అందుకని నిన్ను విడిచిపెడుతున్నాను. బతకాలనుకుంటే పాతాళానికి పారిపో. చావాలనుకుంటే సుఖంగా యుద్ధం చెయ్యి. నిన్ను సంహరించి తీరతాను. ఇందులో ఏ సందేహమూ లేదు.



అమ్మవారు ఇంతగా చెప్పినా మహిషాసురుడిలో మార్పు లేదు. కామమోహితుడు. కన్ను గానక వాక్చాతుర్యం వెలగబెడుతున్నాడు.

పద్మముఖీ ! నవయౌవనంలో ఉన్నావు. సర్వాంగాలలోనూ సౌందర్యం ఉట్టిపడుతోంది. పువ్వు సోకినా కందిపోతావేమో అన్నంత కోమలంగా ఉన్నావు. నిన్ను సంహరించాలంటే నాకు చేతులు రావడం లేదు. ఏదో తెలియని భయంగా బెంగగా ఉంది. లోకపాలకులను జయించాను. ఇంద్రుణ్ణి జయించాను. హరిహరులను జయించాను. నాకు నీతో యుద్ధమా ? పద్మాక్షీ ! ఎందుకిలా నన్ను ఇబ్బందిపెడతావు ? వద్దుగానీ. నేను నచ్చితే వివాహం చేసుకో. లేదంటావా వెళ్ళిపో. ఎక్కడినుంచి వచ్చావో అక్కడికి వెళ్ళిపో. అంతే. నిన్ను నేను పరిమార్చలేను. పరిమార్చను. ఎందుకంటే - నీ మీద స్నేహం పెంచుకున్నాను కనక. హితం చెప్పాను. శుభం పలికాను. వెళ్ళిపో. హాయిగా వెళ్ళిపో. నీలాంటి అందగత్తెను సంహరిస్తే కడకు నాకు మిగిలేది ఏమిటి ? అదేమైనా కీర్తికరమా, శోభాకరమా ? మహిషాసురుడంతటి మహావీరుడు ఒక మహిళామణిని సంహరించాడు అనే అపకీర్తి నాకు వద్దు. పైగా స్త్రీహత్య, బాలహత్య, బ్రహ్మహత్యలు మహాపాతకాలు. ప్రాయశ్చిత్తం లేని మహాపాపాలు. నాకు వద్దు.

చంద్రాస్యా ! నిన్ను ఈ క్షణంలో ఇంటికి తీసుకుపోగలను. కానీ అలా చెయ్యడం నాకు ఇష్టం లేదు. బలాత్కారంలో సుఖం లేదు. అందుకనే ఇంతగా చెబుతున్నాను. వినయంగా పలుకుతున్నాను. ప్రాధేయపడుతున్నాను.

అళినీలాలకా ! స్త్రీ లేనిదే పురుషుడికి సుఖం లేదు. పురుషుడు లేనిదే స్త్రీకి సుఖం లేదు. ఇద్దరూ కలిస్తే సుఖానుభవం. విడిపోతే దుఃఖానుభవం. నువ్వు అందగత్తెవు. యౌవనంలో ఉన్నావు. సర్వాలంకారశోభితవై ఉన్నావు. అన్నీ బాగానే ఉన్నాయి. కానీ, ఒక్క చాతుర్యమే లేకపోయింది. అందుకే నన్ను వద్దంటున్నావు. భోగాలకు దూరంగా ఉండాలనీ, సుఖాలను అనుభవించకూడదనీ నీకు ఎవడు ఉపదేశించాడో కానీ గొప్పగా మోసం చేశాడు. వాడు నీ ప్రథమ శత్రువు. ఇప్పటికైనా తెలుసుకో. కళ్ళు తెరు. అనవసరమైన పట్టుదలలు విడిచిపెట్టి సుందరీ ! ఇకనైనా సుఖపడు. నన్ను వివాహం చేసుకో. అది నీకూ సుఖం, నాకూ సుఖం. విష్ణుమూర్తితో లక్ష్మీదేవి, చతుర్ముఖుడితో సరస్వతీదేవి, రుద్రుడితో పార్వతీదేవి, ఇంద్రుడితో శచీదేవి - ఎలా సుఖపడుతున్నారో చూడు. పతిలేనిదే ఏ పడతికీ సుఖం లేదు. ఈ మాత్రం తెలుసుకోలేకపోతున్నావు.

అవునూ, ఇంతకీ మన్మథుడు ఏమయినట్టు ? అయిదు బాణాలు ఉన్నాయి కదా వాడికి. వాటితో సున్నితంగానైనా కొట్టి నిన్ను బాధించడం లేదా ? మందమతి - మర్చిపోయాడు కాబోలు. లేదంటే నాలాగానే వాడూ నీపట్ల దయామయుడు అయ్యాడా ? అబలవు కదా అని నిన్ను విడిచిపెట్టి, నాతో గట్టిగా వైరం పెట్టుకుని ఆ దుష్టుడు అన్ని బాణాలూ నామీదకే వేస్తున్నట్టున్నాడు. అదీకాకపోతే, నా శత్రువులైన



దేవతలు అతణ్ణి నీమీద బాణాలు వెయ్యకుండా వారించారో ! ఇది నీకు ప్రస్తుతం బాగానే ఉంటుంది. ఆనక పశ్చాత్తాపపడతావు. దేవతలు సుఖవిధ్వంసులని త్వరలోనే గ్రహిస్తావు. అప్పుడు - అయ్యో ! మహిషాసురుణ్ణి తిరస్కరించానే అని బాధపడతావు. వెనకటికి మందోదరి ఇలాగే చేసింది. అనుకూలుడైన పతిని విడిచిపెట్టి, తరవాత ఒక శఠుణ్ణి పెళ్ళాడి, ఏ సుఖానికీ నోచుకోక, కామార్తయై పరితపించింది. తలోదరీ! నువ్వూ అలాగే అయిపోతావేమో అని నా భయం. ***(అధ్యాయం - 16, శ్లోకాలు - 65)***

## ◆ మహిషుడు చెప్పిన మందోదరీ వృత్తాంతం ◆

మహిషాసురుడి మాటలు అసహ్యంగా ఉన్నా జగదంబిక దయతలిచి వింటోంది. ఎక్కడో ఒకచోట ఆగుతాడు గదా, సమాధానం చెబుదామని ఎదురుచూస్తోంది. ఈ మందోదరీ ప్రస్తావనతో కుతూహలంగా ప్రశ్నించింది.

దానవా ! ఎవరీ మందోదరి ? ఏ రాజును విడిచిపెట్టింది ? ఏ శఠుణ్ణి వివాహమాడింది ? ఎలాంటి దుఃఖాలు పొందింది ? కొంచెం విస్తరంగా చెప్పు, విందాం - అంది.

మహిషాసురుడు ఉత్సాహంగా అందుకున్నాడు. తన్వీ ! ఈ భూగోళంమీద సింహళమనే దేశం ఒకటి ఉంది. చాలా ప్రసిద్ధం. పెద్ద పెద్ద చెట్లూ చేమలతో అందంగా ఉంటుంది. ధనధాన్య సమృద్ధి కలిగిన దేశం. చంద్రసేనుడని ఒక ధర్మపరాయణుడు దానికి ప్రభువు. న్యాయం తప్పకుండా పాలిస్తున్నాడు. శాంతచిత్తుడు. సత్యవాది. మృదుస్వభావుడు. మహాశూరుడు. నీతి సముద్రుడు. ఓరిమీ కూరిమీ కలవాడు. ధర్మశాస్త్రాలు అన్నీ చదివినవాడు. ధనుర్వేదంలో అంతటివాడు లేడంటే అతిశయోక్తి కాదు. అతడి భార్యపేరు గుణవతి. పేరుకు తగ్గ మనిషి. సౌందర్య సౌశీల్యాలకు నిధి. సదాచారపరాయణ. పతిభక్తికి పెట్టిందిపేరు. సర్వలక్షణ సంయుక్త. వీరికి ప్రథమ సంతానంగా ఆడపిల్ల జన్మించింది. ఇద్దరూ సంతోషించారు. మందోదరి అని పేరు పెట్టారు.

మందోదరి చంద్రకళలాగా దినదిన ప్రవర్ధమానయై పదోయేడు వచ్చేసరికి, అందరి మనస్సులనూ కలచివేసే సౌందర్యంతో కన్యకామణి అయ్యింది. తండ్రి చంద్రసేనుడు వరాన్వేషణ తత్పరుడు అయ్యాడు.

మద్రదేశాధిపతి సుధన్వుడి కొడుకు కంబుగ్రీవుడని నవయువకుడు ఉన్నాడు. అందంలో, తెలివితేటల్లో, బాహుబలంలో, పరాక్రమంలో, సంపదలో అన్నింటా సరితూగే సంబంధమని బ్రాహ్మణులు విన్నవించారు. మందోదరికి అన్ని విధాలా తగినవాడనీ, యోగ్యుడనీ మనవి చేశారు. చంద్రసేనుడు పట్టమహిషి గుణవతితో ఆలోచించాడు. కంబుగ్రీవుడికి ఇచ్చి మందోదరి వివాహం చేద్దామన్నాడు. ఒక్కసారి అమ్మాయి అభిప్రాయం కనుక్కుని వస్తాను, ఉండండి - అంటూ గుణవతి లోపలికి వెళ్ళింది. మందోదరికి విషయం చెప్పింది. తల్లిమాట వింటూనే కన్యామణి కస్సుమంది.



నేను ఎవడినీ పెళ్ళాడను. నాకు వివాహం వద్దు. దానిమీద నాకు ఇచ్ఛలేదు. కౌమారవ్రతం స్వీకరించి. ఇలా కన్యగానే కాలం గడిపేస్తాను. స్వతంత్రంగా జీవిస్తాను. తీవ్రంగా తపస్సు చేసుకుంటాను.

అమ్మా ! సంసారం ఒక మహాసాగరం. పరతంత్రపు బ్రదుకు. పరతంత్రతకు మించిన దుఃఖం లేదు. స్వతంత్రతకు మించిన సుఖం లేదు. నిజానికి స్వాతంత్ర్యమే మోక్షమని శాస్త్రకోవిదులు చెబుతున్నారు. అంచేత సంసారబంధాలలో తగుల్కోవడం నాకు సుతరామూ ఇష్టం లేదు. పెళ్ళీ వద్దు, గిళ్ళీ వద్దు. పతీ వద్దు గితీ వద్దు. నన్నిలా ఉండనివ్వండి. స్వతంత్రంగా బతకనివ్వండి.

వివాహసమయంలో అగ్ని సన్నిధిని ప్రమాణం చెయ్యాలి - భర్తకు అణిగి మణిగి ఉంటాననీ, అడుగుజాడల్లో నడుస్తాననీ, అత్తవారింట అందరికీ దాసినై సేవచేస్తాననీ మాట ఇవ్వాలి. ఇవి నాకు నచ్చవు. ఒకడి చెప్పుచేతలలో ఉండటం - అతడు మగడే కావచ్చుగాక - దుఃఖాలలోకెల్లా మహా దుఃఖం. కర్మకాలి ఆ మగడు ఎప్పుడైనా మరొకతెను తెచ్చిపెడితే, ఇక ఆ సవతిపోరు ఎంత దుఃఖమో వర్ణనాతీతం. ఈర్ష్యలూ అసూయలూ పుట్టుకు వస్తాయి. పరస్పరం అవిశ్వాసాలూ, అనుమానాలూ. అనుక్షణం చీదరింపులూ దెప్పిపొడుపులూ. అబ్బబ్బ, ఊహించడానికే భయంకరం. అది సంసారం కాదు. ఘోర నరకం. నరకమైనా కొంత నయమేనేమో ! ఇవ్వి పైకి కనిపించని కష్టాలు, వినిపించని దుఃఖాలు. అమ్మా! సంసారంలో సుఖం ఎక్కడ ? అందులో ఆడదానికి. స్త్రీలు స్వభావసిద్ధంగానే పరతంత్రలు. తియ్యటి కలలు కంటూ కూర్చోవడమే తప్ప స్వప్నంలాంటి సంసారంలో, విశేషించి మన ఆడవారికి సుఖం ఏమిటి? సౌఖ్యం ఏమిటి ?

సంసారే క్వ సుఖం మాతర్నారీణాం చ విశేషతః ।
స్వభావాత్పరతంత్రాణాం సంసారే స్వప్నధర్మిణి ॥ ( 17 - 22 )

జననీ ! పూర్వకాలంలో ఉత్తానపాదుడి కుమారుడు ధ్రువానుజుడనే రాజు సకల ధర్మజ్ఞుడైయుండీ, పతివ్రత పతిభక్తి పరాయణ అయిన భార్యను ఏ అపరాధమూ లేకుండానే విడిచిపెట్టేశాడు. ఇంకా ఇలాంటి వృత్తాంతాలు ఎన్నో ఉన్నాయి. పతిపరిత్యక్తకు జీవితం ఎంత దుర్భరమో ఆలోచించు.

కాలయోగం బాగోక, కట్టుకున్నవాడు కాస్తా హరీమంటే ఆడదాని బ్రతుకు ఏం కావాలి ? వైధవ్యాన్ని మించిన నరకం ఉంటుందా ? భర్త ఊళ్ళో లేకపోతేనే భార్యకు ఇంటిలో రోజు గడవదే, ఇక శాశ్వతంగా దూరమైతే చెప్పాలా ! మదనతాపమనీ పతిసమాగమంలో సుఖమనీ - ఏమిటో ఇవన్నీ నిజంగా సుఖాలేనంటావా ? నాకైతే ఇవన్నీ కలలూ కల్లలూ అనిపిస్తున్నాయి. అంచేత నేను ఎప్పటికీ వివాహం చేసుకోనుగాక చేసుకోను. ఇది నా నిశ్చయం.



మదనాగ్నివిదగ్ధాయాః కిం సుఖం పతిసంగజమ్ ।
తస్మాత్పతిర్న కర్తవ్యః సర్వథేతి మతిర్మమ ॥ (17 - 27)

మందోదరి మాటలువిన్న గుణవతి ఆశ్చర్యపోయింది. నా కన్నకూతురేనా ఈ మాట్లాడుతున్నది అని విస్తుపోయింది. అయినా వాదించలేక మౌనంగా వెళ్ళి భర్తకు తెలియజేసింది. అమ్మాయి వివాహం చేసుకోనంటోంది. కౌమారవ్రతం ఆచరిస్తానంటోంది. సంసారమంటే అసహ్యంట - అని సారాంశం చెప్పింది. చంద్రసేనుడు ఒక నిట్టూర్పు విడిచి, సరే అయితే అన్నాడు. వివాహ ప్రయత్నాలు విరమించుకున్నాడు.

మందోదరి కన్నవారి ఇంటిలోనే సురక్షితంగా కాలం గడుపుతోంది. కామోద్దీపకమైన యౌవనం ఆమె శరీరం మీదా మనస్సుమీదా దాడిచేస్తోంది. చెలికత్తెలు వివాహం చేసుకోమని పదే పదే ప్రోత్సహిస్తున్నారు. కానీ మందోదరి ససేమిరా అంటోంది. వేదాంతం చెబుతోంది. వాళ్ళ నోళ్ళు మూయిస్తోంది.

ఒకరోజున అందంగా అలంకరించుకుని చెలికత్తెలతో కలిసి వనవిహారానికి వెళ్ళింది. కుసుమించిన పొదరిళ్ళలో విహరిస్తూ తుమ్మెదల ఝుంకారాలూ కోకిలల కలకూజితాలూ వింటూ ప్రకృతి రామణీయకానికి పరవశించిపోతూ ఏరి ఏరి, ఎగిరి ఎగిరి అందమైన పువ్వులను కోస్తోంది. చెలికత్తెలతో ఆడుతూ పాడుతూ వినోదిస్తోంది.

దైవవశాత్తు - కోసలాధిపతి వీరసేనుడు అదే సమయానికి అటువైపు వచ్చాడు. ఒక్కడే వచ్చాడు. రథం మీద వచ్చాడు. కూడా సూతుడు కాక మరొక్క సేవకుడు మాత్రం ఉన్నాడు. మిగతా సేవకులూ సైనికులూ వెనకాల నెమ్మదిగా వస్తున్నట్టున్నారు. వీరసేనుడి రాకను అల్లంతదూరంలోనే గమనించిన చెలికత్తె పరుగు పరుగున మందోదరి దగ్గరకు వెళ్ళి విన్నవించింది.

రాకుమారీ ! ఎవరో రాకుమారుడు రథంమీద ఇటే వస్తున్నాడు. చాలా అందంగా ఉన్నాడు. మహా వీరుడిలా ఉన్నాడు. మరో మన్మథుడిలా ఉన్నాడు. నీ అదృష్టం బాగుండి ఇటే వస్తున్నాడు - అని ఆయాసపడుతూ గబగబా విన్నవించింది.

అంతలోకీ వీరసేనుడు అక్కడికి రానే వచ్చాడు. మందోదరిని చూసి ఆ సౌందర్యానికి ఆశ్చర్యపోయాడు. ముగ్ధుడయ్యాడు. రథం దిగాడు. పరిచారికను పిలిచి అడిగాడు -

బాలా ! ఈ విశాలాక్షి ఎవరు ? ఏ మహారాజు కూతురు ? వనవిహారానికి వచ్చారా ?

ప్రశ్నలు పరిచారికకు, చూపులు మందోదరికి. వీరసేనుడు అడిగాడు. పరిచారిక చిరునవ్వులు చిందిస్తూ పలికింది -

మహావీరా ! ముందు నువ్వు ఎవరో చెప్పు. ఇక్కడికి ఎందుకు వచ్చావో చెప్పు.



బాలామణీ ! ఈ భూగోళం మీద కోసలదేశమని ఒక సుందర సామ్రాజ్యం ఉంది. విన్నావా ఎప్పుడైనా? దాని పరిపాలకుణ్ణి నేను. వీరసేనుడు నా పేరు. చతుర్విధమహాసైన్యం వెనక్కాల వస్తోంది. ఈ మహారణ్యంలో దారితప్పి నేను ఇటు వచ్చాను.

వీరసేనమహారాజా ! ఈ సుందరాంగిపేరు మందోదరి. సింహళదేశాధీశుడు చంద్రసేన మహారాజుగారి ఏకైక పుత్రి. గారాలబిడ్డ. మేమంతా సైరంధ్రులం. వనవిహారానికి వచ్చాం.

సైరంధ్రీ ! నువ్వు మంచి నేర్పరిలా కనిపిస్తున్నావు. మాటకారివి. మీ రాకుమారితో చెప్పు - కకుత్స్థ వంశజుడూ కోసలాధీశుడూ అయిన ఈ వీరసేనుణ్ణి గాంధర్వ పద్ధతిలో పరిణయమాడి పతిగా స్వీకరించమని. నాకింతవరకూ వివాహం కాలేదు. భార్య అంటూ ఎవరూ లేరు. ఉత్తమవంశంలో పుట్టిన అందగత్తెకోసం ఎదురుచూస్తున్నాను. మీ రాకుమారి నా మనస్సుకు నచ్చింది. బహుశ నేనూ మందోదరికి నచ్చే ఉంటాను. గాంధర్వవివాహం ఇష్టం లేకపోతే, చంద్రసేన మహారాజునే అడుగుతాను. కన్యాదానం చేస్తాడు. ఏదైనా ఒకటిమాత్రం నిజం - నేను మీ రాకుమారికి అన్నివిధాలా అనుకూల భర్తను అవుతాను. ఇది నిస్సంశయం.

వీరసేనుడి మాటలకు సైరంధ్రి చిన్నగా నవ్వింది. రాకుమారివైపు రెండడుగులు వేసి - మందోదరీ! సూర్యవంశపు రాకుమారుడు వచ్చాడు. నిజంగా మన్మథుడిలా ఉన్నాడు. మహాబలశాలి. కోసలదేశానికి ప్రభువు. వయస్సులో నీకు ఈడైనవాడు. నీపట్ల అనురక్తుడయ్యాడు - అంటూ మరింత చేరువకు వచ్చి మెల్లగా పలికింది. రాకుమారీ ! చంద్రసేన మహారాజు ఎంతగా బాధపడుతున్నాడో మాకు తెలుసు. నీకా యుక్తవయస్సు వచ్చింది. వివాహం చెయ్యాలని మహారాజుగారి ఆలోచన. నువ్వేమో కన్యగానే ఉండిపోతానంటున్నావు. ఏమీ చెయ్యలేక తన ఆవేదనను మీ తండ్రి మా దగ్గర వెళ్ళబోసుకున్నాడు. నీకు సేవలు చేస్తూ నీ మనస్సును మళ్ళించి వివాహానికి ఒప్పించమని మమ్మల్ని ఎన్నోసార్లు కోరాడు. అయితే, నీ హఠం మాకు తెలుసు కనక నీతో ఆ ప్రసంగం చెయ్యడానికే జంకి ఇంతకాలమూ ఊరుకున్నాం. భర్తలకు సేవ చెయ్యడం నీచకార్యమేమీ కాదు. స్త్రీలకు అది ఉత్తమోత్తమ ధర్మమని మనువు చెప్పాడు. పతిసేవాపరాయణురాలికి నేరుగా స్వర్గం లభిస్తుందిట. నరకమనుకుంటే ఎలాగ ? సృష్టి ఆదినుంచీ ఎంతమంది వివాహం చేసుకోలేదు, సుఖపడలేదు. మొగుడికీ పిల్లలకీ సేవచేయడం అవమానమనుకుంటే ఎలాగ ? సంసారమన్నాక సుఖాలూ ఉంటాయి, కష్టాలూ ఉంటాయి. అంతమాత్రాన అందరూ నీలాగే భీష్మిస్తున్నారా ? చూడు, లోకంలో ఎంతమంది హాయిగా సంసారాలు చేసుకుంటున్నారో. నరకం అనేదానివి నువ్వు ఒక్కత్తెవే కనిపించావు. పిచ్చిపిల్లా ! అలాంటి భయాలు ఏమీ పెట్టుకోకు. ఇతడెవరో యోగ్యుడిలా ఉన్నాడు. స్వయంగా వచ్చి వరించాడు. నీకే సేవలు చేస్తానంటున్నాడు. నామాట విను. ఇతణ్ణి వివాహం చేసుకో. మీ తండ్రి సంతోషిస్తాడు. మేమూ ఆనందిస్తాం. హాయిగా సుఖపడుదువుగాని - అంటూ ప్రబోధించింది.



సైరంధ్రీ ! నేను వివాహం చేసుకోనని ఎన్నిసార్లు చెప్పలేదు. మళ్ళీ చెబుతున్నాను. ఇక ఎప్పుడూ ఈ ప్రసంగం నా దగ్గర తేకు. నేను తపస్సు చేసుకుంటాను. నా నిర్ణయానికి తిరుగులేదు. ఇతడెవడో సిగ్గు లేకుండా కళ్ళు అప్పగించి నన్నే చూస్తున్నాడు. వెంటనే వారించు - అంటూ రుసరుసలాడుతూ విసవిసా పదిగజాల దూరంనడిచి అటుతిరిగి నిలబడింది మందోదరి.

సైరంధ్రి సాలోచనగా అడుగులువేస్తూ మెల్లగా మందోదరిని సమీపించింది. బుజ్జగిస్తూ అనునయంగా సంభాషించింది. రాకుమారీ ! మన్మథుడు దుర్జయుడు సుమా ! కాలం అన్ని వేళలా ఒక్కలా సాగదు. అంచేత మరొక్కసారి ప్రశాంతంగా ఆలోచించు. నా మాటను ఆలకించు. పథ్యం (హితవు) చెబుతున్నాను. చెవినిపెట్టు. ఇలాగే భీష్మించుకు కూర్చుంటే, ఆనక కష్టాలపాలవుతావు. తెలుసుకో. ఒంటరిగా ఎంతకాలం ఉంటావు. వయస్సు అయిపోయాక తోడు కావాలన్నా దొరకదు. అవేళ బాధపడతావు. నేను బాగా ఆలోచించి నీ మేలుకోరి చెబుతున్నాను. నీకన్నా పెద్దదానిని. అనుభవం ఉన్నదానిని. లోకం చూసినదానిని. ఎందుకు చెబుతున్నానో ఒక్కసారి ఆలోచించు. ప్రకృతి విరుద్ధంగా ప్రవర్తించకు. అది శ్రేయస్సుకాదు.

ఇంతగా చెప్పినా మందోదరి వినిపించుకోలేదు. అదే తిరస్కారభావం. సైరంధ్రీ ! దైవయోగం ఎలా ఉంటే అలా జరుగుతుంది. జరగనీ. నేనుమాత్రం వివాహం చేసుకోను - అని ఖండితంగా చెప్పింది.

సైరంధ్రి విసిగిపోయింది. ఈ మొండిఘటానికి ఎంత చెప్పీ ప్రయోజనం లేదనుకుంది. ఒక నిట్టూర్పు విడిచి, వీరసేనుడి సమీపానికి వచ్చింది. రాకుమారా ! మన్నించు. నీ దారి నువ్వు చూసుకో. మా రాకుమారి వివాహానికి అంగీకరించడంలేదు - అని చెప్పేసింది.

వీరసేనుడు మౌనంగా నిర్గమించాడు. విమనస్కుడై రాజధానికి చేరుకున్నాడు.

***(అధ్యాయం - 17, శ్లోకాలు - 61)***

కాలం గడుస్తోంది. మందోదరి చెల్లెలు ఇందుమతి యుక్త వయస్కురాలు అయ్యింది. వివాహం జరిపిద్దామని సంకల్పించి చంద్రసేనుడు స్వయంవరం చాటించాడు. దేశదేశాలనుంచి రాజపుత్రులు ఎందరెందరో వచ్చారు. వారిలో బలవంతుడూ కులశీలరూపగుణవంతుడూ అయిన ఒక రాకుమారుణ్ణి ఎంపిక చేసుకుని ఇందుమతి వరించింది. వెంటనే వివాహ సంరంభాలు మొదలయ్యాయి. మందోదరి మనస్సులో తొలిసారిగా మన్మథుడు మెదిలాడు.

ఆ స్వయంవరానికి మద్రదేశాధీశుడు చారుదేష్ణుడు కూడా వచ్చాడు. అతడు గొప్ప అందగాడు. అంతకుమించిన మాటకారి. ఆడవాళ్ళను లొంగదీసుకోవడంలో అతడికున్న చాతుర్యం అనితరసాధ్యం. ఏ మచ్చుచల్లాడో ఏ మందుపెట్టాడోగానీ మందోదరి ఆ విటుణ్ణి ఆ శఠుణ్ణి వరించింది. దైవయోగం అలా ఉంది.



తదా కామాతురా జాతా విటం వీక్ష్య నృపం తు సా ।
చకమే దైవయోగాత్తు శఠం చాతుర్యభూషితమ్ ॥ (18 - 4)

మందోదరి రహస్యంగా తండ్రి చెవిలో చెప్పింది. చంద్రసేనుడు సంతోషించాడు. ఇంతకాలానికి వివాహం చేసుకుంటాననంటోందని సంబరపడ్డాడు. ఇక ఏమీ ఆలోచించకుండా వివాహం జరిపించాడు. కాన్కలతో కన్యాదానం చేశాడు. చారుదేష్ణుడు మందోదరిని తీసుకుని మద్రరాజధానికి వెళ్ళిపోయాడు. కొన్ని రోజులు సుఖంగానే గడిచాయి.

ఒకనాటి రాత్రి చారుదేష్ణుడు తన సేవకుడి భార్యతో రహస్యంగా క్రీడిస్తుండటాన్ని సైరంధ్రి చూసింది. మందోదరికి తెలియజేసింది. ప్రతిఫలంగా తిట్లుతింది. మందోదరి చిరునవ్వుతో చివాట్లు పెట్టింది.

మరికొన్నాళ్ళు గడిచాయి. తన సేవకుడి భార్యతో రహస్యంగా క్రీడిస్తుండటాన్ని సైరంధ్రి చూసింది. మందోదరికి తెలియజేసింది. ప్రతిఫలంగా తిట్లు తింది. మందోదరి చిరునవ్వుతో చివాట్లు పెట్టింది.

మరికొన్నాళ్ళు గడిచాయి. ఒక వేశ్యతో రహస్యంగా క్రీడిస్తూ మందోదరి కంటబడ్డాడు. అయ్యో! మోసపోయానే అని విలపించింది. ఇంతటి నీచుడని తెలియక పరిణయమాడాను. ఎంత పొరపాటు చేశాను ! ఈ సిగ్గుమాలినవాడితో సంసారం ఎలా చేసేది ? ఇతడిమీద నాకింక ప్రీతి ఎలా కలుగుతుంది? నా జీవితం వ్యర్థమైపోయింది. ఇది స్వయంకృతం. ఎవరిని నిందించడానికీ ఏమీ లేదు. చెయ్యకూడని పని చేశాను. నా దుఃఖం నేను అనుభవించవలసిందే. ఆత్మహత్య చేసుకుందామంటే అది మహాపాతకం. పుట్టింటికి పోదామంటే చులకనైపోతాను. అందరూ పరిహసిస్తారు. అందుచేత ఇక్కడే ఇలాగే పడిఉండాల్సిందే. పతిసామీప్యాన్ని పరిహరించి కామసుఖాలకు దూరమై వైరాగ్యభావంతో కాలం గడపడమొక్కటే నాకు మిగిలింది. అంతే, అదే కర్తవ్యం అని నిశ్చయించుకుంది. సంసారసుఖాలను కోల్పోయి అంతఃపురంలో ఏకాంతంగా శేషజీవితం గడిపింది.

మహిషాసురుడు ఈ కథను చెప్పి జగదంబికతో అన్నాడు - అందుచేత, ఓ కల్యాణీ ! నీ బతుకు కూడా ఇలాగే అయిపోతుంది. కోరివచ్చిన మహారాజును నన్ను కాదంటున్నావు. రేపు కామార్తవై ఎవడో ఒక కాపురుషుణ్ణి ఆశ్రయిస్తావు. ఇది తథ్యం. వాడు మోసం చేస్తాడు. అప్పుడు విలపిస్తావు. పశ్చాత్తాపపడతావు. కాబట్టి, ఇప్పుడే నామాట ఆలకించు. స్త్రీలు అందరూ మెచ్చుకునే మాట చెప్పాను. అలా చెయ్యి. నన్ను వివాహమాడు. లేదంటే - విలపిస్తావు.

జగన్మాతకు ఇప్పుడు రవ్వంత కోపం వచ్చింది. తనను ఏదో మామూలు స్త్రీగా భావిస్తున్న వాడి అజ్ఞానానికి జాలి వేసింది. మరొక్కసారి హెచ్చరిక వినిపించింది.

ఓరీ మందమతీ ! అధిక ప్రసంగాలు కట్టిపెట్టు. యుద్ధం చేస్తావో పాతాళానికి పారిపోతావో - తేల్చుకో. నిన్నూ నీ రాక్షసులనూ సంహరించి, హాయిగా తిరిగివెడతాను. సజ్జనులకు కష్టాలు వచ్చినప్పుడల్లా నేను వారి రక్షణకోసం అవతరిస్తూనే ఉంటాను. రూపమేలేని నేను ఒకరూపం ధరించడంగానీ, పుట్టుకే లేని నేను పుట్టడంగానీ కేవలం దేవతల రక్షణకోసమే. ఇది నిశ్చయం.



యదా యదా హి సాధూనాం దుఃఖం భవతి దానవ ।
తదా తేషాం చ రక్షార్థం దేహం సంధారయామ్యహమ్ ॥
అరూపాయాశ్చ మే రూపమజన్మాయాశ్చ జన్మ చ ।
సురాణాం రక్షణార్థాయ విద్ధి దైత్య వినిశ్చయమ్ ॥ (18 - 22, 23)

మూర్ఖుడా ! చివరిసారిగా చెబుతున్నాను. తెలుసుకో. నిన్ను సంహరించమని దేవతలందరూ ప్రార్థిస్తే నేనిక్కడికి ఇలా వచ్చాను. నా అవతరణమే నీ సంహారం కోసం. ఆ పని పూర్తిచేసి నిశ్చింతగా తిరిగి వెడతాను. ఇది సత్యం. ఇక నీకు చెప్పలేను. త్వరగా తేల్చుకో. యుద్ధమే చేస్తావో పాతాళానికి పారిపోతావో నీ ఇష్టం. నిలబడ్డావో నిన్ను చంపితీరతాను.

ఇప్పటికి మహిషాసురుడికి విషయం అర్థమయ్యింది. యుద్ధానికి సన్నద్ధుడై ధనుష్టంకారం చేశాడు. అల్లెత్రాడును చెవిదాకా లాగి శిలానిష్ఠుర శరాలను గుప్పించాడు. అమ్మవారు ఇనుపములుకుల బాణాలతో వాటిని పొడిపొడి చేసింది. క్రమక్రమంగా యుద్ధం తీవ్రరూపం ధరించింది. సకలప్రాణికోటికీ భయప్రదంగా పరిణమించింది. అటు రాక్షసులూ ఇటు దేవతలూ పరస్పరజయైషులై కలియబడ్డారు. భేరీ భాంకారాలూ, గజఘీంకారాలూ. హయహేషితాలూ, గదాఖడ్గ ఘట్టనలూ, హాహాకారాలూ, జయజయధ్వానాలూ, రణరంగమంతా కోలాహలంగా ఉంది. భీషణంగా ఉంది.

దుర్ధరుడు ఎటువైపునుంచో రథంమీద దూసుకువచ్చాడు. వందల సంఖ్యలో బాణాలు ప్రయోగించాడు. అమ్మవారు రక్తాక్షి అయ్యింది. చూపులు కాదు, నిప్పులు రాలాయి. ఒకే ఒక్క అర్ధచంద్రాకార బాణంతో దుర్ధరుడి శిరస్సును ఎగరగొట్టింది. వాడు గిలగిలా తన్నుకుంటూ రథంనుంచి ఏగిరిపడ్డాడు. అసువులు అనంతవాయువుల్లో కలిసిపోయాయి.

త్రినేత్రుడు విజృంభించాడు. సుదీర్ఘమైన మహాగదను వలయాకారంగా రివ్వు రివ్వున తిప్పుకుంటూ సింహవాహనవైపు వచ్చాడు. వీడు దివ్యశస్త్రాస్త్రవేత్త. వాటిని ప్రయోగించే అవకాశమే ఇవ్వకుండా త్రిశూలం విసిరి గుండెల్లో పొడిచింది. వాడి నోటినుంచి ఏ పదం రాబోయిందో కానీ మొదటి అక్షరంతోనే ఆగిపోయింది. నోరు వెళ్ళబెట్టి కన్నుమూశాడు.

ఈసారి మరో దండనాయకుడు అంధకాసురుడు వీరంగం వేసుకుంటూ వచ్చాడు. త్రినేత్రుడి మరణాన్ని కళ్ళారా చూశాడేమో వొళ్ళు తెలియని వీరావేశంతో పరుగు పరుగున వచ్చాడు. వస్తూనే తన లోహ నిర్మితమైన గదతో సింహాన్ని శిరస్సుమీద కొట్టాడు. అది ఒక్కసారిగా గర్జించింది. జూలు దులిపి పంజా విసిరింది. గ్రద్దగోళ్ళలో చిక్కుకున్న కోడిపిల్లలా అంధకుడు విలవిలలాడాడు. సింహం నోరుతెరిచి ఒకే ముద్దగా వాడిని భక్షించింది.



## ◆ మహిషాసుర మర్దనం ◆

మహిషాసురుడికి మతి చలించింది. చూస్తూండగానే ముగ్గురు మహావీరులూ అయిపోయారు. పిచ్చికోపంలో మళ్ళీ శరవృష్టి కురిపించాడు. ఒకవైపు ఆ బాణాలను బాణాలతో మార్గమధ్యంలోనే త్రుంచివేస్తూ మరొక చేతితో గదను విసిరింది. అది సరాసరి వెళ్ళి మహిషుడి గుండెలకు అతివేగంగా తాకింది. అసురనాయకుడు అరనిముషం మూర్ఛపోయాడు. వెంటనే తేరుకున్నాడు. తానూ గదను విసిరాడు. అది సింహానికి మెడక్రింద తగిలింది. క్రోధమూ బాధ కసి - ముప్పేటలుగా మృగరాజు గర్జించాడు. అయిదు తలల కోడెత్రాచు పడగలాంటి పంజాను విసిరాడు. అసురుడు తల తప్పించుకున్నాడు కానీ వొళ్ళంతా గీరుకుపోయింది. రక్తం ప్రవాహాలు కట్టింది. క్రోధమూర్ఛితుడయ్యాడు. పురుషాకారం విడిచిపెట్టి తానూ సింహరూపం ధరించాడు. దేవీ సింహంమీదకు లంఘించాడు. జగదంబిక వజ్రాతికఠోర శిలీముఖాలను ఎడతెరిపి లేకుండా గుప్పించింది. తాళలేక మహిషుడు సింహరూపం విడిచిపెట్టి మత్తేభరూపం ధరించాడు. స్రవిస్తున్నది మదమో రక్తమో తెలియడం లేదు. ఘీంకరిస్తూ తొండం విదిలిస్తూ దేవదానవ సైనికులను విచక్షణా రహితంగా మట్టగిస్తూ రణరంగమంతా కలియదిరిగాడు. చిందులు తొక్కాడు. ఒక పర్వత శిఖరాన్ని తొండంతో పెళ్ళగించి చండికమీదకి విసిరాడు. క్రోధం పట్టలేక మహాదేవి అవే - వజ్రాయుధాలకు సాటివచ్చే తీవ్రాశుగాలను పుంఖానుపుంఖంగా గుప్పించింది. అంతటి పర్వత శిఖరమూ నుగ్గునుగ్గై నువ్వులరాసిలా కుప్పకూలిపోయింది. మహాదేవి విజయగర్వంతో వికటాట్టహాసం చేసింది. ధూళి తెరలు తెరలుగా వ్యాపించి రణరంగమంతటా దట్టంగా చీకట్లు క్రమ్ముకున్నాయి. అదను గమనించిన దేవీ మృగేంద్రం ఆ మదమత్తగజేంద్రుడి కుంభస్థలంమీదకి లంఘించి గోరులతో కోరలతో చీల్చివేసింది. వాడు మహామాయావి కనక అదృశ్యుడై గజరూపం విడిచిపెట్టి శరభరూపం ధరించి వచ్చాడు.

ఎనిమిది కాళ్ళతో మహాపర్వతంలా, ఊడలు పెకలించుకు వస్తున్న వటవృక్షంలా శరభరూపం కదిలివస్తోంది. అన్ని దిక్కులకూ సమానంగా సంచరిస్తోంది. చరాచరజగత్తు అంతా నివ్వెరపోయి నిశ్చేష్టమై చూస్తోంది. దేవతలు భయకంపితులై శిలాప్రతిమల్లా నిలబడిపోయారు. దానవసైన్యంలో ఉత్సాహం మిన్నుముట్టింది. అశ్శరభ శరభ అంటూ ఆకాశం చిల్లులు పడేట్టు అరుస్తున్నారు.

శరభరూపధారి మహిషాసురుడు మహాదేవికి చేతివేటు దూరంలోకి వచ్చాడు. పదునెక్కి తళతళలాడిపోతున్న చేపాటి కత్తిని దూసి శిరస్సుపై బలంగా మోదింది. వాడు చెక్కుచెదరలేదు. అయ్యో అనలేదు. అమ్మా అనలేదు. మీదమీదకి వస్తూనే ఉన్నాడు. చండికాదేవి క్రోధంతో రక్తారుణనేత్ర అయ్యింది. అర్ధచంద్రాకారబాణాలను ఎనిమిదింటిని సంధించి ఒకేసారి ఎనిమిదికాళ్ళనూ ఖండించింది. మహాశరభం చతికిలబడిరిది. పరశు పరశ్వధ ఖడ్గధారలతో చీల్చి చెండాడింది. అన్ని చేతులకూ అన్ని



ఆయుధాలకూ ఒకేసారి పని కల్పించింది. చరాచర జగత్తు మరింత నివ్వెరపోయింది. రాక్షసవీరులు భయకంపితులై శిలాప్రతిమలయ్యారు. పారిపోలేక నిలబడలేక ప్రాణాలు వదిలారు. దేవతాసైన్యంలో ఉత్సాహం మిన్నుముట్టింది. జగదంబికే జయోఽస్తు - మహాచండికే విజయోస్తు అంటూ ఆకాశం చిల్లులు పడేట్టు కీర్తించారు.

దనుజవల్లభుడు శరభరూపం పరిత్యజించి తనకు సహజసిద్ధమైన మహిషరూపంలోకి మారిపోయాడు. తోక ఝాడిస్తున్నాడు. దేవతలకు అది కమిచీలా తగులుతోంది. గిట్టలతో మట్టగిస్తున్నాడు. నాతిదీర్ఘంగా మహాదృఢంగా ఉన్న కొమ్ములతో కుమ్ముతున్నాడు. ముందరి కాళ్ళతో నేలను తవ్వుతున్నాడు. తోక రిక్కించి రంకెలు వేస్తున్నాడు. మహాపన్నగంలా నురుగులు కక్కుతూ బుసలుకొడుతున్నాడు. ముకుపుటాలనుంచి సుడిగాలులు చెలరేగుతున్నాయి. ముట్టెమీది స్వేదబిందువులు తుంపురులై ఎగిసి పడుతున్నాయి. ఉన్నట్టుండి భీకరంగా అరుస్తున్నాడు. వెనక్కి వెనక్కి నడిచివెళ్ళి క్షణం ఆగాడు.

ముట్టెను కిందికి దించి, చూపులను ముందుకుసాచి, కొమ్ములే భల్లాలుగా మహాదేవిని పొడవడానికి దూసుకువస్తున్నాడు. కాలిగిట్టల తాకిడికి ఎగసిపడుతున్న దుమ్ము అతడివేగాన్ని అందకోలేక వెనకతట్టున మేఘమండలంలాగా చిక్కబడుతోంది.

చండికా ! ఈ క్షణంతో నీపని అయిపోయింది.ఎంతటి మూర్ఖురాలివో నాతో యుద్ధానికి దిగావు. పద్దెనిమిది బాహువులు ఉన్నాయి కదా అని అహంకరించావు. నిన్ను సంహరించి, దేవతలను మట్టికరిపిస్తాను. ఒక ఆడదానిని ముందుపెట్టుకుని నన్ను జయిద్దామనుకున్నారు ఆ శఠులు. కపటపండితులు. ఈ రోజుతో ఈ జగత్తు దేవీదేవతా శూన్యమైపోతుంది. కాసుకో. నిలు నిలు - అని గర్జిస్తూ దూసుకువస్తున్నాడు.

ఓరీ మందమతీ ! ప్రేలాపనలు కట్టిపెట్టు. ఇప్పటికి ఎన్ని రూపాలు ఎత్తేవో ! ఇక ఇదే నీ చివరి రూపం. రా. శృంగభంగం చేస్తాను. నిన్ను సంహరించి దేవతలను నిష్కంటకులను చేస్తాను. జగత్తును దానవశూన్యం చేస్తాను. నీ మాయలు నా దగ్గరకాదు. రా. ప్రతాపం చూపించు. ఇదిగో నాకు ఇష్టమైన మధువును సేవిస్తున్నాను. నిన్ను సంహరిస్తున్నాను. దేవతా పీడకుడూ మునిభయానకుడూ సాధుసజ్జన హింసకుడూ మహిషాసురుడు ఇక లేడు - అంటూ మహాదేవి సువర్ణపాత్రికను ఎత్తి ద్రాక్షాసవాన్ని గడగడా సేవించింది. కళ్ళు విప్పార్చి చూసింది. చూపులా, అగ్నికణాలు జలజలా రాలుతున్నాయా అనిపించింది. త్రిశూలాన్ని దృఢంగా రెండుచేతులతోనూ వాటంగా పట్టుకుని మహిషుడికి ఎదురు వెళ్ళింది. కొమ్ములు విరిగేట్టు ఒక్కపోటు పొడిచింది. దెబ్బతో వాడికి తలతిరిగింది. వెనుదిరిగి పరుగులంకించుకున్నాడు. అమ్మవారు వెంబడించి తరుముతోంది.

దేవదుందుభులు నినదించాయి. ఆకాశం నుంచి పూలవాన కురిసింది. మహర్షులు వేదమంత్రాలతో స్తుతించారు. దేవతలు జయజయ ధ్వానాలు చేశారు. అంబకు పరాకులు పలికారు.



మహిషుడు పారిపోతూ ఎన్నెన్నో రూపాలు మార్చాడు. తన మాయలూ గారడీలూ అన్నీ ప్రదర్శించాడు. పరమచండిక వెన్నంటి తరుముతూనే ఉంది. త్రిశూలానికి అందకుండా ఎలాగోల తప్పించుకుంటున్నాడు. కట్టకడపటికి మహాదేవి ఒక్కసారిగా సింహంనుంచి లంఘించి గుండెల పొడిచింది. మహిషుడు కళ్ళు తేలవేసి వెల్లకిలాపడ్డాడు. పడుతూ కాళ్ళతో మహాదేవిని బలంగా తన్నేడు విజయం సాధించినవాడిలా విరగబడి నవ్వేడు. ఎప్పుడూ ఎవ్వరూ కనీవినీ ఎరగని రీతిలో దారుణంగా భీషణంగా అరిచాడు. అరుస్తూనే లేచి నిలబడ్డాడు.

రాక్షసాధమా ! ఇదిగో నూరంచుల చక్రాయుధం. రెప్పపాటుకాలంలో నీ తల ఎగిరిపోతుంది కళ్ళు తెరిచేసరికి యమలోకంలో ఉంటావు - అంటూ నిప్పులు చెరుగుతున్న చండిక సుదర్శన చక్రాన్ని విసిరింది. త్రుటిలో మహిషాసురుడి తల రివ్వున ఎగిరి తాటిపండులా అల్లంతదూరాన రాలి పడింది కంఠనాళాలనుంచి వేడి వేడి క్రొన్నెత్తురు చిమ్మనగ్రోవిలా చిమ్మింది. ప్రవాహాలు కట్టింది. గైరికాది శిలల కరిగి ఎరుపెక్కిన సెలయేరులతో మహాపర్వతంలాగా ఉంది వాడి మహాకళేబరం. చక్రవేగానికా అన్నట్టు క్షణకాలం బొంగరంలా గిరగిరా తిరిగి క్రమంగా నేలకు ఒరిగిపోయింది.

హతశేషులై మిగిలిన రాక్షసులు హాహాకారాలు చేస్తూ ఎటువారు అటు పారిపోతున్నారు చండికా చండసింహం అన్ని వైపులా ప్రత్యక్షమై అందరినీ భక్షించింది. ఆకలి తీర్చుకుంది.

దేవతలు జయజయధ్వానాలు చేశారు. ఆనందతాండవం చేశారు. మునులూ మానవులూ మహేశ్వరిని కీర్తించారు. రణరంగం విడిచివచ్చి మహాదేవి ఒక పరిశుభ్రస్థలంలో నిలబడింది. తన మృగేంద్రవాహనంమీద మునుపటిలా కూర్చుంది. అలసట లేదు. అలక లేదు. ప్రసన్నవదనంతో ప్రశాంతచిత్తంతో చిరునవ్వులు చిందిస్తూ కూర్చుంది. సింహం కూడా ఏమీ జరగనట్టూ ఏమీ ఎరగనట్టూ నిలబడింది.

*(అధ్యాయం - 18 , శ్లోకాలు - 70)*

## ◆ బ్రహ్మాది దేవతలు చేసిన మహిషాసురమర్దనీ స్తుతి ◆

బ్రహ్మాది దేవతలు సంతుష్టాంతరంగులై వినయవినమిత గాత్రులై సమీపించి భక్తిప్రపత్తులతో ఆ మహాదేవిని మహిషాసురమర్దనిని స్తుతించారు.

జగదీశ్వరీ ! సర్గ స్థితిలయాలను త్రిమూర్తులు నిర్వహించగలుగుతున్నారంటే అది కేవలం నీ శక్తి మాత్రమే. కీర్తి, మతి, స్మృతి, గతి, కరుణ, శ్రద్ధ, ధృతి, వసుధ, కమల, పుష్టి, కళ, విజయ, గిరిజ, జయ, తుష్టి, ప్రమ, బుద్ధి, ఉమ, రమ, విద్య, క్షమ, కాంతి, ఈహ, మేధ ఇవన్నీ నువ్వే. ఇవన్నీ నీ శక్తులు. ఇవి లేకండా ఈ జగుత్తులో ఏపనీ జరగదు. భూగోళాన్ని ధరించే శక్తిని ఆదిశేషుడికీ అష్టదిగ్గజాలకూ అందిస్తున్నది నువ్వే.



జగన్మాతా ! నిన్ను కాక ఇంక ఏ దేవతలను ఎవరు స్తుతించినా ఉపాసించినా వాళ్ళు వట్టి వెర్రివాళ్లు. అఖిలదేవతలకూ నువ్వే ఆదిపరాశక్తివి. మూలశక్తివి. దేవతలను సంతృప్తి చెందించడానికి యజ్ఞాలు చేసేవారుకూడా విమూఢులే. చేస్తే దేవీయజ్ఞమే చెయ్యాలి. సకలమంత్రాధిష్ఠాన దేవతవు నువ్వు.

అమ్మా ! నీ హృదయం దయాసముద్రం. దేవతలను ఎలా పోషిస్తున్నావో ఇతరులనూ అలాగే పోషిస్తున్నావు. సకల చరాచరసృష్టిజాతమూ నీ అంశయేకదా ! నీ సృజనయేకదా ! పెంచిన వనంలో అన్ని చెట్లూఉంటాయి. చేదు విషంలాంటి వృక్షాలుంటాయి. ఎందుకూ పనికిరానివి ఉంటాయి. అయితేమాత్రం వాటిని నరికిపారేస్తామా ? అలాగే నువ్వూ దైత్యులను సైతం కాపాడుతున్నావు.

మాత: స్వయం విరచితాన్విపినే వినోదాత్
వంధ్యాత్వలాశరహితాంశ్చ కటూంశ్చ వృక్షాన్ ।
నోచ్ఛేదయంతి పురుషా: నిపుణా: కథంచిత్
తస్మాత్త్వమప్యతితరాం పరిపాసి దైత్యాన్ ॥ (19 - 9)

రణరంగంలో రాక్షసులను కొందరినైనా నువ్వు సంహరిస్తున్నావంటే, వారికి స్వర్గనివాసం ప్రసాదించి, అప్సరసలపై వారికున్న కోరికను అలా తీర్చుకునే అవకాశం కల్పించడం కోసమే అని భావిస్తున్నాము. అదీ కాక - నువ్వు తలుచుకుంటే చాలు దనుజులు సర్వనాశనమైపోతారు. వారిని సంహరించడం కోసమని నువ్వు ఇలా రూపం ధరించడం, రావడం - ఇదంతా కేవలం క్రీడావినోదం.

జగజ్జననీ ! ఇదెంత విచిత్రమో చూశావా ? కలికాలం వచ్చేసింది. అయినా ఈ మూఢమానవులు తెలుసుకోవడంలేదు. నిన్ను ఉపాసించడంలేదు. నువ్వు సృష్టించి నిలబెట్టిన హరిశంకరులను సేవిస్తున్నారు. ఎంతటి పురాణ చతురులోకదా ! హరిహరులతోసహా దేవతలం మేమంతా నీ వశవర్తులం. రాక్షసుల చేతుల్లో ఏదో ఒక సమయంలో అందరమూ అవమానాలు పొందిన వాళ్ళమే. తన్నులు తిన్నవాళ్ళమే. ఓడిపోయిన వాళ్ళమే. మమ్మల్ని మళ్ళీ నిలబెట్టినదానవు నువ్వు. అలాంటి నిన్ను వదిలేసి మానవులు మమ్మల్ని కొలవడమంటే అది ఎంత అజ్ఞానం ! చేతిలో కాగడా పెట్టుకుని (నీళ్ళులేని) గోతిలో పడ్డట్టు ఉంది.

జ్ఞాత్వా సురాంస్తవ వశానసురార్దితాంశ్చ ।
యే వై భజంతి భువి భావయుతా విభగ్నాన్ ।
ధృత్వా కరే సువిమలం ఖలు దీపకం తే
కూపే పతంతి మనుజా విజలేఽతిఘోరే ॥ (19 - 13)



ఆదిశక్తీ ! విద్య - అవిద్య, సుఖమూ - దుఃఖమూ ఇత్యాదులు అన్నీ నువ్వే. భోగదాత్రివీ నువ్వే. మోక్షదాత్రివీ నువ్వే. మోక్షం కోసమే నిన్ను ఉపాసించాలి. లౌకిక భోగాలకోసమైతే ఇతర దేవతలను ఆరాధించాలి అనుకొవడాన్ని మించిన అజ్ఞానం లేదు. భుక్తిముక్తి ప్రదవు. భోగయోగప్రదవు. ఐహికాముష్మిక సుఖాలన్నీ నీ అధీనాలే.

అందుకనే హరిహరాదులు సైతం నిన్ను అర్చిస్తున్నారు. ఈపాటి తెలుసుకోలేని అల్పమతులు సంసారసాగరంలో పడి "ములగానాం తేలానాం" అవుతున్నారు.

చండికా ! నీ పాద సరోజాలనుంచి రవ్వంత ధూళి కణాన్ని ప్రసాదంగా స్వీకరించి ఈ విరించి జగత్తులను సృష్టిస్తున్నాడు, శౌరి పరిపాలిస్తున్నాడు, శివుడు సంహరిస్తున్నాడు. అలాంటి నిన్ను సేవించని మానవుడు ఎంత దురదృష్టవంతుడోకదా !

వాగ్దేవతవు నువ్వే. నీ అనుగ్రహం లేకపోతే అమరులైనా నోరువిప్పి పలకలేరు. ఇక మానవులమాట చెప్పాలా ?

భృగుమహర్షి శాపంవల్ల నానావతారాలూ ఎత్తుతున్న విష్ణుమూర్తి ఒకడు, లింగపతనం పొందిన శంకరుడు ఒకడు. వీరిని సేవించే మనుషులు ఏమంత తెలివైనవారో తెలుస్తూనే ఉంది. తమని తాము కాపాడుకోలేకపోయిన ఈ హరిహరులు ఇతరులను కాపాడతారా ? మృత్యుభయం తొలగించి సుఖాలను ఇవ్వగలుగుతారా ? ఎంత అజ్ఞానం ! వీరిని ఆరాధించేవారి పరిస్థితే ఇదయితే, ఇంక గజాననషడాననాదుల్ని అర్చించేవారు మరింకెంత తెలివితక్కువవారో ! సకలార్థఫలదాత్రివీ, విశ్వజననివీ, సుఖ సేవనీయవూ అయిన నిన్ను ఆరాధించడం తెలియనివారు ఎవరిని ఆరాధిస్తే ఏమిగాక, మేముమాత్రం నిన్నే అర్చిస్తాం. నిన్నే సేవిస్తాం.

నువ్వు దయార్ద్ర హృదయవు కనక రణరంగంలో దుష్టులను సంహరించి స్వర్గానికి పంపుతున్నావు. లేకపోతే వారు చేసిన మహాపాపాలకు నరకానికి పోయుండేవారు. హరిహరవిరించులకే నీ ప్రభావం తెలియదంటే ఇక సామాన్యులమాట చెప్పాలా ! మునీశ్వరులు కూడా తెలుసుకోలేకపోతున్నారు. కనకనే తపస్సులనీ వ్రతాలనీ యజ్ఞయాగాలనీ సూర్యాగ్నిసముపాసనలనీ తమని తాము కృశింపజేసుకుంటున్నారు, శ్రమ పెట్టుకుంటున్నారు. నీ పాదపద్మాలను సేవించడం ఈ పనులన్నింటికన్నా సులువైనది కాదూ ! వేదాలు వల్లించి శాస్త్రాలు దొర్లించి ఏమి లాభం, ఈ మాత్రం తెలుసుకోలేకపోయాక ! అమ్మా ! ఇదికూడా నీ దయాగుణమే అని మేము భావిస్తున్నాం. లోకుల్ని హరిహరాదులకు భక్తుల్ని చెయ్యడం, హరిహరాదులను దైవతాలుగా చెప్పే శాస్త్రాలను క్షమించడం - ఇవన్నీ నీ దయాగుణానికి నిదర్శనాలుకాక మరేమిటి ? వారిమీద కోపించకపోవడమే కాదు, వారిని రక్షిస్తున్నావుకూడా. అహా ! ఎంతటి దయామయివి. దేవీ ! వాల్గవ యుగంలో వాల్గవ (పురుషార్థానికి ) గుణానికి బలం చేకూరుతుంది. అప్పుడు అసచ్ఛాస్త్రాలన్నీ అంతరిస్తాయి. నిపుణులైన కవులు నిన్ను రక్షిస్తారు. నువ్వు కల్పించిన ఇతర దేవతలను కూడా స్తుతిస్తారు.



తుర్యే యుగే భవతి చాతిబలం గుణస్య
తుర్యస్య తేన మథితాన్యసదాగమాని ।
త్వాం గోపయంతి నిపుణాః కవయః కలౌ వై
త్వత్కల్పితాన్ సురగణానపి సంస్తువంతి ॥ (19 - 26)

మహామునీశ్వరులు విశుద్ధాంతరంగులై ముక్తిఫలదవూ యోగవిద్యవూ పరాదేవతవూ అయిన నిన్ను ధ్యానించి గర్భవాసదుఃఖాన్ని తొలగించుకుంటున్నారు. జన్మరాహిత్యాన్ని పొందుతున్నారు. నీలో విలీనం కాగలుగుతున్న ఆ మునులూ మానవులూ ఎంత ధన్యులోకదా !

పరాదేవతా ! నీకు పతిస్థానీయుడైన పరమాత్మలో చిచ్ఛక్తి ఉంది. కనక అతడు జగత్తులలో అభివ్యక్తం అవుతున్నాడు. భవకృత్య కర్త కాగలుగుతున్నాడు. అతడుకాక మరింకెవడైనా, నువ్వులేకుండా స్వశక్తితో కదలడానికిగానీ మెదలడానికిగానీ సమర్థుడున్నాడా ?

తత్త్వాలు ఉన్నాయి. కానీ అవ్వి చిద్విరహితాలైతే ఈ జగన్నిర్మితికి సమర్థాలు కాగలుగుతాయా? నువ్వు లేకపోతే అవ్వి వట్టి జడపదార్థాలు కదమ్మా ! అలాగే ఈ ఇంద్రియాలు, నీ శక్తి లేనిదే గుణకర్మయుతాలు కాగలవా ! అసంభవం.

మునీశ్వరులు యజ్ఞయాగాలలో సమర్పించే పురోడాశాలను, ఆయా దేవతలు జగడాలాడుకోకండా తమతమ భాగాలను యథావిధిగా స్వీకరిస్తున్నారంటే, స్వాహాదేవిగా నువ్వు ఉన్నావు కాబట్టే.

మహాదేవీ ! ఈ అఖిల విశ్వమూ ఆవిర్భావానికి ముందు నీలోనే దాగిఉంది. హరిహరాదులు నిమిత్తమాత్రులు. అందరినీ నువ్వే పాలిస్తున్నావు. నువ్వు లానివి. నువ్వు విశ్వానివి. ఈ రహస్యం తెలుసుకోలేనివారు నిజంగా మందభాగ్యులు.

ఇప్పుడు - మహోగ్రుడైన ఈ మహిషాసురుణ్ణి సంహరించి సకలదేవతలనూ సకలలోకాలనూ రక్షించావు. ఇంతటి మహోప రం చేసిన నిన్ను ఏమని స్తుతించగలం, ఎలా స్తుతించగలం ? నీ తత్త్వాన్ని వేదాలే గ్రహించలేవంటే, మే ూ గ్రహించి స్తుతించగల్గడం !

ఓ అమేయప్రభావా ! లోకకంటకుడైన దురాత్ముణ్ణి సంహరించి అమేయకీర్తిని సంపాదించుకున్నావు. అమేయకృపాన్వితవని నిరూపించుకున్నావు. ఇలాగే ఎప్పుడూ మమ్మల్ని కాపాడుతూ ఉండమని సవినయంగా ప్రార్థిస్తున్నాం.

దేవతలు చేసిన ఈ స్తుతిప్రబంధానికి జగన్మాత ఎంతగానో ఆనందించింది. మృదుమధురంగా వాత్సల్యబంధురంగా పలికింది.



సురసత్తములారా ! ఇంతకన్నా దుస్సాధ్యమైన కార్యం ఏదైనా ఉంటే చెప్పండి. నిర్వహించి మీకు ఆనందం కలిగిస్తాను. దేవతలకోసం ఎంతటి కష్టసాధ్యాలనైనా సాధించిపెడతాను. ఎప్పుడు అవసరమనిపిస్తే అప్పుడు నన్ను స్మరించండి. వెంటనే వస్తాను. ఆపదలు తొలగిస్తాను.

యదా యదా హి దేవానాం కార్యం స్యాదతిదుర్ఘటమ్ ।
స్మర్తవ్యాహం తదా శీఘ్రం నాశయిష్యామి చాపదమ్ ॥ (19 - 35)

ఈ అనుగ్రహానికి దేవతలు ముగ్ధులయ్యారు. అమ్మా ! ఆపదలు వచ్చినప్పుడేకాదు నిరంతరం నీ పాదపద్మాలను స్మరించే అచంచలభక్తిని మాకు అనుగ్రహించు. తల్లివి కనక మా అపరాధాలను నువ్వే క్షమించగలవు. ఇది తెలుసుకున్నవాడు నీ పాదపద్మాలను వీడడు. ప్రాణికోటికంతటికీ హితంకోరుకునే వేస్తానివి నువ్వు. నిన్ను కాదన్నవాడు మానవుడైనా దేవజాతివాడైనా వట్టి మందభాగ్యుడు. అత్యంత దుర్లభమైన మానుషజన్మ ఎత్తి, నిన్ను స్మరించని నరాధముడు ఎంతటి పాపాత్ముడో ! జగన్మాతా ! త్రికరణశుద్ధిగా ప్రతిజ్ఞచేసి చెబుతున్నాము - మరీ మరీ చెబుతున్నాము. సుఖంలో కానీ దుఃఖంలో కానీ నువ్వే మాకు దిక్కు. ఇది సత్యం. మమ్మల్ని అందరినీ ఎల్లవేళలా కాపాడుతూ ఉండు. నీ వరాయుధాలతో రక్షిస్తూ ఉండు. నీ చరణపద్మ రజోరేణువే మాకు శరణం.

మనసా కర్మణా వాచా బ్రూమః సత్యం పునఃపునః ।
సుఖే వా యదివా దుఃఖే త్వం నః శరణమద్భుతమ్ ॥
పాహి నః సతతం దేవి సర్వైస్తవ వరాయుధైః ।
అన్యథా శరణం నాస్తి త్వత్పదాంబుజరేణుతః ॥ (19 - 42)

జగన్మాత సంతుష్టాంతరంగ అయ్యింది. అందరినీ ఒకసారి పలకరింపుగా చూసింది. చెదిరిపోని చిరునవ్వుతో వీడ్కోలు పలికింది. అంతర్ధానం చెందింది. దేవతలు నివ్వెరపోయారు. ఏదో వెలితిగా కాసేపు నిశ్చేష్టులై నిలబడ్డారు. *(అధ్యాయం - 19, శ్లోకాలు - 44)*

శౌనకాది మహామునులారా ! వ్యాసభగవానుడు చెప్పిన ఈ వృత్తాంతాన్ని శ్రద్ధగా ఆలకించిన జనమేజయుడు ఆనందంతో పరవశించిపోయాడు.

వ్యాసమహర్షీ ! నీ ముఖపద్మం నుంచి జాలువారుతున్న దేవీ మాహాత్మ్యామృతాన్ని ఎంత గ్రోలినా ఎవరికీ తనివితీరదు. ఇంకా ఇంకా ఆస్వాదించాలనిపిస్తోంది. జగన్మాత అదృశ్యమయ్యాక దేవతలు ఏమి చేశారో తెలుసుకోవాలని ఉంది. సజ్జన సంరక్షణకోసం కంకణం కట్టుకున్న మహాదేవిని అర్చించకపోవడంకన్నా కృతఘ్నత ఉండదు. ఈ జన్మలో రాజ్యాలు ఏలుతున్న మహారాజులంతా



పూర్వజన్మలో జగన్మాతను అర్చించినవారే అయ్యుంటారు. లేకపోతే వారికి ఈ భోగాలు దక్కవు. మానుషజన్మ ఎత్తి అమ్మవారిని అర్చించకపోతే రోగాలూ రొష్టులతో ఈ లోకంలోనే నరకయాతనలు అనుభవిస్తారు. అందుచేత ఓ సాత్యవతేయా ! అంబికా చరిత్రను నాకు ఇంకా తెలియజెయ్యి. మహిషాసురుణ్ణి సంహరించి, దేవతల స్తుతులను అందుకొన్నాక మహాదేవి ఎక్కడికి వెళ్ళింది ? అంతర్ధానం చెందింది అన్నావు. అంటే స్వర్గలోకానికి వెళ్ళిందా ? మృత్యులోకానికి వెళ్ళిందా ? వైకుంఠానికి వెళ్ళిందా ? హిమాలయాలకు వెళ్ళిందా ? ఏమయ్యింది ? దేవతలు అటుపైని ఏమి చేశారు ? - ఈ విశేషాలన్నీ దయచేసి తెలియజెయ్యి.

జనమేజయుడి సందేహాలు సమంజసమైనవే అనిపించి వ్యాసుడు సమాధానాలు చెప్పాడు. జనమేజయా ! ఆరంభంలోనే నీకు చెప్పాను. మణిద్వీపం అని ఒక మనోహరస్థావరం గురించి. అది మహాదేవికి ప్రియమైన క్రీడాస్థానం. ఎప్పుడూ అక్కడే విహరిస్తూ ఉంటుంది. బ్రహ్మరుద్రమహావిష్ణువులు అక్కడికి వెళ్ళి స్త్రీరూపాలు పొందిన కథ చెప్పానుగదా ! మళ్ళీ పురుషరూపాలనుపొంది తమతమ వెలవులకు వచ్చి తమ తమకు విధించిన పనులను నిర్వర్తిస్తున్నారనికూడా చెప్పాను. అదిగో ఆ సుధాసముద్రమధ్యంలో ఉన్న మణిద్వీపంలో వివిధరూపాలలో జగదంబిక విహరిస్తూ ఉంటుంది. అక్కడికే తిరిగి వెళ్ళిపోయింది.

## ◆ శత్రుఘ్నుడి పరిపాలన ◆

అటుపైని దేవతలు సూర్యవంశోద్భవుడైన శత్రుఘ్నుణ్ణి భూగోళానికి అధిపతిని చేశారు. అతడు సర్వలక్షణ సంపన్నుడు. అతడిని మహిషుడి సింహాసనంమీద కూర్చోబెట్టి భూగోళాన్ని పరిపాలించే బాధ్యతలు అప్పగించి దేవతలందరూ తమతమ వాహనాలు అధిరోహించి తమ తమ లోకాలకు వెళ్ళిపోయారు.

శత్రుఘ్నుడు ధర్మబద్ధంగా పరిపాలన సాగించాడు. ప్రజలందరూ సుఖసంతోషాలతో వర్ధిల్లుతున్నారు. సకాలంలో వర్షాలు కురుస్తున్నాయి. భూదేవి పంటలు సమృద్ధిగా అందిస్తోంది. చెట్లూ చేమలూ ఫలపుష్పాలతో కళకళలాడుతున్నాయి. గోవులు కుండోధ్నులై పుష్కలంగా క్షీరరాశుల్ని అందిస్తున్నాయి. నదులు వరదలతో దారితప్పి గ్రామాలను ముంచివెయ్యకుండా స్వచ్ఛ శీతోదకాలతో జలవిహంగాల కలకలారావాలతో ప్రశాంతంగా ప్రవహిస్తున్నాయి. బ్రాహ్మణులు వేదతత్త్వజ్ఞులై లోకకల్యాణంకోసం యజ్ఞయాగాదులు నిర్విఘ్నంగా నిర్వహిస్తున్నారు. క్షత్రియులు శస్త్రవిద్యాప్రవీణులై దానదయాతత్పరులై ప్రజారక్షణ బాధ్యతలు సక్రమంగా నిర్వహిస్తున్నారు. సామంతరాజులందరూ న్యాయం తప్పకుండా నిగ్రహంతో పరిపాలన సాగిస్తున్నారు. ఆగ్రహించకుండా పంచభూతాలూ అన్యోన్య



భావంతో సహకరిస్తున్నాయి. కోశాలు ధనసమృద్ధితో, గోష్ఠాలు ఆలమందలతో కుశలంగా ఉన్నాయి. ప్రజలందరూ దేవీభక్తితత్పరులై పరస్పర గౌరవాదరాలతో ధర్మతత్పరులై వర్ధిల్లుతున్నారు. ఏ ప్రాంతంలో చూసినా ఏ గ్రామంలో చూసినా యజ్ఞయూపాలూ మండపాలూ మనోహరంగా దర్శనమిస్తున్నాయి.

స్త్రీలు శీలవతులై సత్యవతులై పతివ్రతలై అందరి మన్ననలూ పొందుతున్నారు. బిడ్డలు విద్యావినయ వివేక సంపన్నులై పితృభక్తి పరాయణులై ధర్మమార్గాన ప్రయాణిస్తున్నారు.

భూగోళంలో ఎక్కడా అన్యాయంగానీ, అధర్మంగానీ, అక్రమంగానీ మచ్చుకైనా కనిపించడం లేదు. వేదశాస్త్ర చర్చలు తప్ప వృధావాదాలు వినిపించడం లేదు. దైన్యమూ కలహమూ అశుభమూ అకాలమరణమూ లాంటివి ప్రజలకు తామెరగని విషయాలయ్యాయి. అందరూ హాయిగా సుఖసంతోషాలతో జీవిస్తున్నారు. మిత్రులు విడిపోవడంకానీ ఆపదలపాలు కావడంగానీ లేనేలేదు. అనావృష్టి లేదు. దుర్భిక్షం లేదు. అంటువ్యాధులూ అనారోగ్యాలూ లేవు. పరస్పర మాత్సర్యాలు లేవు. విరోధాలు లేవు. స్త్రీ పురుషులు సమాన గౌరవంతో నీతితప్పని ప్రవర్తనతో స్వర్గంలో దేవతల్లా సుఖంగా ఆరోగ్యంగా జీవిస్తున్నారు.

చోరులు, వంచకులు, పాషండులు, దంభకారులు, పిశునులు (లోభులు) లంపటులు, స్తబ్ధులు, వేదద్వేషులు, పాపాచారులు లేనేలేరు. అందరూ ధర్మరతులు. అందరూ సత్యసంధులు. అందరూ సత్ప్రవర్తనులు.

సత్త్వరజస్తమో గుణాలనుబట్టి బ్రాహ్మణులలో మూడు శ్రేణులు ఏర్పడ్డాయి. అందరూ వేదవేత్తలే. కానీ, అప్రతిగ్రహం నియమంగా (ఎవరినుంచీ ఏదీ దానంగా స్వీకరించకపోవడం) శాంతచిత్తులై దయామయులై జీవిస్తూ, పశుహింస లేని పురోడాశవిధానంతో సాత్త్వికయజ్ఞాలను నిర్వహిస్తూ, అధ్యయనమూ యజనమూ దానమూ అనేవి మూడే తమకు పనులుగా కాలాన్ని సద్వినియోగం చేసుకునేవారు సాత్త్వికులు. ఇక రాజసులున్నారు. వీరు క్షత్రియులకు పురోహితులై, షట్కర్మనిరతులై, విధివిధానంగా మాంసభక్షకులై జీవిక సాగిస్తూ ఉంటారు. వేదాధ్యయనం, అధ్యాపనం, యజనం, యాజనం, దానం, ప్రతిగ్రహం - ఇవి వీరి షట్కర్మలు. తామసులది మూడవకోవ. రాగద్వేషాలూ క్రోధలోభాలూ వీరి గుణాలు. ఏదో కొద్దిగా వేదం చెప్పుకుని రాజాస్థానంలో ఉద్యోగులై జీవిక సాగిస్తుంటారు.

కృషి వాణిజ్యం పశుపాలన - ఇత్యాదులను అద్భుతంగా నిర్వహిస్తూ వైశ్యులు రాజకోశాలను నింపుతున్నారు. ధనం సమృద్ధిగా చేకూరుతోందిగదా అని ప్రజలలో ఏ ఒక్కరూ మిడిసిపడటంలేదు. (అనుద్వేగః ప్రజానాం వై సంబభూవ ధరాగమః 20 - 48). ధర్మతత్పరులై దేవీ చరణ సరసిజసేవా పరాయణులై వర్ధిల్లుతున్నారు. ***(అధ్యాయం - 20, శ్లోకాలు - 50)***



## ◆ శుంభనిశుంభుల వృత్తాంతం ◆

జనమేజయా ! శత్రుఘ్నుడి పరిపాలన ఇలా సాగుతోంది. మహిషాసురుడి పాలనలో పడిన కష్టాలను అన్నింటినీ ప్రజలు మర్చిపోయారు. అమ్మవారిని ఆరాధించడంలో అందరూ అపారంగా మనశ్శాంతిని పొందుతున్నారు. సర్వపాప వినాశకమూ శాంతిసౌఖ్యప్రదమూ అయిన దేవీ మాహాత్మ్యాన్ని మరింతగా ఆస్వాదించాలని కోరుకుంటున్నావుకదా ! ఆలకించు చెబుతున్నాను.

శుంభనిశుంభులని ఇద్దరు రాక్షస సోదరులు ఉండేవారు. బలాఢ్యులు. పురుషులకు అవధ్యులు. దేవపీడకులు. దురాచారులు. మదోన్మత్తులు. లోకకంటకులు. అపారదానవసేనాసమేతులు. వీరినిద్దరినీ మహాఘోర సంగ్రామంలో జగన్మాత సంహరించింది. చండముండులూ, రక్తబీజధూమ్రాక్షులూ అనే మహాక్రూర రాక్షసులను కూడా అదే యుద్ధంలో మట్టుబెట్టింది. లోకాలను రక్షించింది. సకల దేవతలతోనూ సకల మానవులతోనూ సంస్తుతులు అందుకొంది.

వ్యాసమహర్షీ ! నువ్వు ఇలా సంగ్రహంగా చెప్పేస్తే నాకు తృప్తి కలగదు. ఎవరు ఈ శుంభనిశుంభులు? మహాబలవంతులు ఎలా అయ్యారు ? మహిషాసురుడికిలాగానే వీరికీ స్త్రీవధ్యత్వం ఎలా ప్రాప్తించింది? ఏమి తపస్సు చేశారు ? ఎవరైనా వరాలు ఇచ్చారా ? కట్టకడపటికి ఎలా మరణించారు? - ఇవన్నీ సవిస్తరంగా చెప్పి నా కుతూహలానికి సంతృప్తిని కల్గించు.

జనమేజయా ! నువ్వు ఇలా అడుగుతావని తెలుసు. అందుకే సవిస్తరంగా చెప్పడానికి సిద్ధంగా ఉన్నాను. ఇది ఒక దివ్యకథ. సర్వపాప ప్రణాశిని. దేవీచరిత్రం. సర్వార్థఫలప్రదం. శుభప్రదం. చెబుతున్నాను. ఆలకించు.

పూర్వకాలంలో శుంభనిశుంభులు అని ఈ భూగోళంమీద ఇద్దరు రాక్షసులు ఉండేవారు. పాతాళం నుంచి భూగోళానికి వచ్చారు. ఇద్దరూ శుభదర్శనులే. యౌవనంలో ఉన్నారు. కానీ సాంసారిక సుఖాలవైపు వెళ్ళక ఇంద్రియాలను నిగ్రహించుకుని గొప్పతపస్సు చేశారు. అన్నోదకాలను పరిత్యజించి పరమపావనమైన పుష్కరక్షేత్రంలో యోగవిద్యా ప్రభావంతో వేలసంవత్సరాలు తీవ్రతపస్సు చేశారు. స్థిరంగా ఒకే యోగాసనంతో చేసిన ఆ తపస్సుకి బ్రహ్మదేవుడు సంతుష్టి చెందాడు. హంసవాహనంపై బయలుదేరి వారి దగ్గరికి వచ్చాడు. వాళ్ళు కళ్ళు మూసుకుని తపస్సు చేసుకుంటూనే ఉన్నారు. బ్రహ్మదేవుడే పలకరించాడు -

శుంభనిశుంభులారా ! ఇక లేవండి. మీ తపస్సులకి సంతృప్తి చెందాను. ఏ వరం కావాలో కోరుకోండి, ఇస్తాను - అన్నాడు.



యోగసమాధినుంచి దిగి శుంభనిశుంభులు లేచి నిలబడ్డారు. బ్రహ్మకు ప్రదక్షిణం చేశారు. సాష్టాంగపడ్డారు. నిరాహారంవల్ల నీరసించిన కంఠస్వరంతో బ్రహ్మదేవుణ్ణి స్తుతించారు. చతుర్వదనా! మా తపస్సులకి నువ్వు సంతృప్తి చెందితే మాకు అమరత్వాన్ని వరంగా ప్రసాదించు. ఈ లోకంలో ఏ జీవికైనా మరణాన్ని మించిన భయం ఏముంది ? ఆ భయాన్ని తొలగించుకోవడం కోసం ఈ వరాన్ని అడుగుతున్నాం. వెంటనే మా కోరిక తీర్చి మరణభయాన్ని తొలగించు.

ఈ అభ్యర్థనకు చతుర్ముఖుడు ఆశ్చర్యపోయాడు. శుంభనిశుంభులారా ! ఇదెక్కడి వైపరీత్యం. మీరు అడగదగినదేనా ఇది ? నాకుమాత్రం ఇవ్వదగినది కాదు. పుట్టినవాడు గిట్టక తప్పదు. గిట్టినవాడు పుట్టక తప్పదు. ఇది విశ్వకర్త చేసిన నియమం. సృష్టి ఆదినుంచీ అమలులో ఉన్న నియమం. దీన్ని తప్పించడం నావల్ల కాదు. పుట్టిన ప్రతిప్రాణీ ఎప్పటికో అప్పటికి గిట్టవలసిందే. అంచేత మరొకటి ఏదైనా కోరుకోండి - అన్నాడు.

శుంభనిశుంభులు ఆలోచనలో పడ్డారు. పరస్పరం చర్చించుకున్నారు. ఒక నిశ్చయానికి వచ్చి బ్రహ్మదేవుడి పాదాలపై పడ్డారు. సృష్టికర్తా ! సరే నువ్వన్నట్టే మరొకటి అడుగుతున్నాం. ప్రసాదించు. అమరుల చేతిలోగానీ, మానవుల చేతిలోగానీ జంతువుల చేతిలోగానీ పక్షుల చేతిలోగానీ - ఏ పురుషజాతి చేతిలోనూ మేము మరణించకుండా వరం ప్రసాదించు. ఆడజాతికి మేము భయపడం. అబలలు. మాముందు నిలవలేరు. అందుచేత పురుషజాతివల్ల మాకు ప్రాణాపాయం లేకుండా అనుగ్రహించు. చాలు - అన్నారు.

బ్రహ్మదేవుడు సరే అన్నాడు. హంసపై ఎక్కి తుర్రుమన్నాడు. శుంభనిశుంభలు తమ పాతాళానికి తిరిగివెళ్ళారు. పురోహితుడు భృగుమహర్షికి విషయం విన్నవించారు. అతడు ఒక శుభముహూర్తాన బంగారు సింహాసనం చేయించి వీరిలో జ్యేష్ఠుడు కనక శుంభుడికి పట్టాభిషేకం జరిపించాడు. సర్వదానవ సామ్రాజ్యానికీ శుంభుడు ప్రభువయ్యాడు. అభినందించి సేవించడానికి ఎందరెందరో దానవమహావీరులు వచ్చారు. సమైక్యాన్ని ప్రకటించారు. వీరాధివీరులూ అపూర్వ సహోదరులూ అయిన చండముండులూ. ధూమ్రలోచనుడూ రక్తబీజుడూ మహాసైన్య సమేతులై తరలివచ్చి దానవచక్రవర్తి శుంభుడికి తమ మద్దతు ప్రకటించారు. అతడి పక్షాన నిలబడి శత్రువులతో యుద్ధాలు చెయ్యడానికి ప్రతిజ్ఞలు వహించారు.

జనమేజయా ! వీరిలో రక్తబీజుడిది ఒక విచిత్రమైన జన్మ. రణరంగంలో ఆయుధం తగిలి అతడి శరీరంనుంచి నేలకు రాలిపడిన ప్రతి నెత్తుటిబొట్టు నుంచీ వందలూ వేలుగా రక్తబీజులు ఆవిర్భవిస్తారు. ఆదే రూపం, అదే బలం, అదే ఆయుధంతో ఆవిర్భవిస్తారు. అదే పరాక్రమంతో అంతమందీ శత్రువులతో యుద్ధం చేస్తారు. అంచేత సంగ్రామంలో ఈ రక్తబీజుడు అత్యంతదుర్జయుడు.



ఇంకా ఇలాంటి దానవవీరులు కోటానుకోట్లుగా వచ్చి శుంభుడికి సేవకులయ్యారు. శుంభనిశుంభులకు భూగోళమంతా స్వాధీనం అయ్యింది. ఇక స్వర్గమే స్వాధీనం కావాలి. నిశుంభుడు సేనానాయకుడై వెళ్ళి ఇంద్రుడిమీద యుద్ధం ప్రకటించాడు. దిక్పాలకులను వెంటనడుపుకుంటూ వజ్రపాణి దీటుగా ఎదిరించి నిలబడ్డాడు. ఘోరసంగ్రామం జరిగింది. ఇంద్రుడు తన శతకోటిని (వజ్రాయుధం) గురిచూసి విసిరాడు. అది సరాసరి వెళ్ళి నిశుంభుడి గుండెలకు బలంగా తగిలింది. వాడు ఆ దెబ్బకు మూర్ఛపోయాడు. రథంనుంచి నేలకు ఒరిగిపోయాడు. రాక్షససైన్యం కకావికలయ్యింది.

ఈ దుర్వార్త తెలియగానే అతిక్రుద్ధుడై శుంభుడు స్వయంగా రణరంగానికి పరుగు పరుగున వచ్చాడు. వస్తూనే చండప్రచండంగా శరవర్షం కురిపించాడు. అమరసైనికులు దూదిపింజల్లా ఎగిరిపోయారు. ఇంద్రుడితో సహా దిక్పాలకులంతా ఓడిపోయారు. శుంభుడు విజయగర్వంతో వికటాట్టహాసం చేస్తూ వెళ్ళి ఇంద్ర సింహాసనం అధిష్ఠించాడు. కల్పవృక్షాలూ నందనవనమూ కామధేనువుతో సహా సమస్త దేవలోకాన్నీ స్వాధీనం చేసుకున్నాడు. మహర్షులు చేసే యజ్ఞాలలో హవిర్భాగాలను కైవసం చేసుకున్నాడు. సుధాపానం చేసి సుఖపారవశ్యంలో మునిగి తేలాడు. దిక్పాలకుల నందరినీ పారద్రోలాడు. హతశేషులై మిగిలిన దేవతలూ అడవులకు పారిపోయి తలదాచుకున్నారు. నిరాధారులూ నిరాయుధులూ నిస్తేజస్కులూ అయిపోయారు. కొండగుహలలో బిక్కుబిక్కుమంటూ కాలం గడుపుతున్నారు. ఒకప్పుడు మహాభోగాలు అనుభవించి ఇప్పుడు ఇలా కాందిశీకులయ్యారు. లోకపాలకులని ఖ్యాతిగడించి అమరసుఖాలనుభవించినవారు ఇప్పుడు కొండల్లో కోనల్లో నదీతీరాల్లో కష్టాలు చవిచూస్తున్నారు. జనమేజయా ! సుఖాలు దైవాధీనాలుగదా ! ఎప్పుడు ఎవరిని వరిస్తాయో ఎవరిని త్యజిస్తాయో ఊహించడం కష్టం సుమా! అమరులు బలవంతులు, ధనవంతులు, జ్ఞానవంతులు. అయితేనేమి ఇవ్వేళ దైన్యాన్ని అనుభవిస్తున్నారు. కాలమహిమ అటువంటిది.

**బలవంతో మహాభాగా బహుజ్ఞా ధనసంయుతాః ।**
**కాలే దుఃఖం తథా దైన్యమాప్నువంతి నరాధిప ॥**
**చిత్రమేతన్మహారాజ కాలస్యైవ విచేష్టితమ్ ।**
**యః కరోతి నరం తావద్రాజానం భిక్షుకం తతః ॥**
**దాతారం యాచకం చైవ బలవంతం తథాబలమ్ ।**
**పండితం వికలం కామం శూరం చాతీవ కాతరమ్ ॥ (21-55, 56, 57)**



జనమేజయా ! ఈ కాలమహిమ చిత్రాతివిచిత్రంగా ఉంటుంది. ఒకడిని ఒకప్పుడు మహారాజును చేస్తుంది. అంతలోనే అతడినే భిక్షుకుడుగా మార్చేస్తుంది. రాజు బంటు అవుతాడు. బంటు రాజు అవుతాడు. దాత యాచకుడవుతాడు. బలవంతుడు బలహీనుడవుతాడు. పండితుడు అజ్ఞాని అవుతాడు. (వికలః = కళారహితః). మహాశూరుడు మహాభీరువు అవుతాడు. నూరు యజ్ఞాలు చేసి సంపాదించుకున్న ఇంద్రపదవిని ఈనాడు కోల్పోయి శచీపతి అడవులపాలయ్యాడు. కాలమే ధర్మిష్ఠుణ్ణి చేస్తుంది. జ్ఞానిని చేస్తుంది. మళ్ళీ అదే కాలం అదే మనిషిని పాపిష్ఠుణ్ణీ అజ్ఞానినీ చేస్తుంది. ఇందులో ఆశ్చర్యపోవలసింది ఏమీలేదు. కాలమహిమ అటువంటిది. బ్రహ్మ విష్ణు మహేశ్వరులకే ఇటువంటి కష్టాలు తప్పలేదు. విష్ణుమూర్తి సూకరజన్మ ఎత్తేడు. మహాశివుడు పుర్రె చేతబట్టి భిక్షాటనం చేస్తున్నాడు. కాలమే అన్నివేళలా అందరికన్నా బలీయం. ***(అధ్యాయం - 21, శ్లోకాలు - 61)***

విష్ణుర్భవమాప్నోతి సూకరాదిషు యోనిషు ।
హరః కపాలీ సంజాతః కాలేనైవ బలీయసా ॥ (21 - 61)

## ◆ దేవతలకు దేవీప్రసన్నత ◆

జనమేజయా ! శుంభుడు స్వర్గ సామ్రాజ్యాన్ని ఆక్రమించి వెయ్యేళ్ళు గడిచింది. అడవుల్లో జీవిస్తున్న దేవతలంతా క్రమక్రమంగా సంఘటితులయ్యారు. బృహస్పతిని సలహా అడిగారు. మన రాజ్యాన్నీ మన భోగాలనూ తిరిగి పొందటానికి ఏదైనా ఉపాయం చెప్పమన్నారు. వేదమంత్రాలను సరిగ్గా పఠిస్తే వాంఛితాలు నెరవేరతాయంటారుగదా ! కోరికలను తీర్చే యజ్ఞాలూ యాగాలూ ఉన్నాయి అంటారుగదా! అవన్నీ నీకు తెలుసు. నీకుమాత్రమే తెలుసు. కనక గురూత్తమా ! మాకోసం అవన్నీ జరిపించు. శత్రువినాశనానికి ఏమేమి చెప్పబడ్డాయో అవన్నీ చెయ్యి. విధివిధానంగా చెయ్యి. దానవవినాశనానికి అవసరమైన అభిచారాలు (చేతబడులవంటివి) అన్నీ నిర్వర్తించు.

ఇంద్రాదుల నోటినుంచి ఇటువంటి మాటలు వింటూంటే బృహస్పతికి నవ్వు వచ్చింది. జాలి వేసింది. మృదువుగా పలికాడు. దేవతలారా ! వేదమంత్రాలు స్వతంత్రాలు కావు. తమంత తాము ఫలాలను ఇవ్వవు. ఫలాలు ఎప్పుడూ దైవాధీనాలే. మంత్రాలకు అధిదేవతలు మీరు. మీరే కష్టాలపాలయ్యారు. ఇది కాలమహిమ. దీనికి విరుగుడు నేనేమి చెయ్యగలను ?

సర్వే మంత్రాశ్చ వేదోక్తా దైవాధీనఫలాశ్చ తే ।
న స్వతంత్రాః సురాధీశ తథైకాంతఫలప్రదాః ॥



మంత్రాణాం దేవతా యూయం తే తు దుఃఖైకభాజనమ్ ।
జాతాః స్మ కాలయోగేన కిం కరోమి ప్రసాధనమ్ ॥ (22 - 8, 9)

యజనయాజనాలలో అతి ముఖ్యులైన ఇంద్రాగ్ని వరుణులే కడగండ్లపాలైతే ఇక మీరు ఏ యజ్ఞాలు చేస్తారూ, నేనేమి చేయిస్తాను ? ప్రతిక్రియ ఏదీ నాకు తోచడంలేదు. జరగవలసింది జరగడమే. మనం అనుభవించడమే. ప్రతికష్టానికీ ఏదో ఒక తరణోపాయం ఉంటుందని శిష్టులు చెబుతున్నారు. దైవమే బలీయమని మరికొందరు అంటున్నారు. ఈ ఉపాయవాదులు దైవాన్ని నిరర్థకమని నిరసిస్తారు. ఇవి రెండూ కలిసినప్పుడే కార్యసిద్ధి కలుగుతుందని నా అభిప్రాయం. కేవలం దైవాన్ని నమ్మి ఊరుకోకూడదు. స్వబుద్ధితో ఉపాయమూ ఆలోచించాలి.

కేవలం దైవమాశ్రిత్య న స్థాతవ్యం కదాచన ।
ఉపాయః సర్వథా కార్యః విచార్య స్వధియా పునః ॥ (22 - 14)

అందుచేత బాగా ఆలోచించి ఒకమాట చెబుతున్నాను. శ్రద్ధగా ఆలకించండి. మీకు తెలిసిందేకానీ, ఇంతకాలమూ భోగాలలో మునిగితేలుతూ మరిచిపోయినట్టున్నారు. పూర్వకాలంలో ఒకప్పుడు ఆదిపరాశక్తి మహిషాసురుణ్ణి సంహరించింది. గుర్తుందా ? అప్పుడు మీరంతా ఆ మహాలక్ష్మిని బహువిధాల స్తుతించారు. ఆవిడ సంతోషించి మీకు ఒక వరం ఇచ్చింది. మీరు తెములుచ్చుకోలేని మహాపదలు మిమ్మల్ని చుట్టుముట్టినప్పుడు నన్ను ఒకసారి స్మరించండి, నేను వచ్చి మీ కష్టాలు తీరుస్తాను అని అభయం ఇచ్చింది. గుర్తుకు వచ్చిందా ? అందుచేత మీరంతా వెంటనే బయలుదేరి హిమాలయ శిఖరానికి వెళ్ళండి. ప్రశాంత సుందర ప్రదేశంలో ప్రేమపూర్వకంగా భక్తిమహితంగా చండికను ఆరాధించండి. మీలో మాయాబీజమంత్రజ్ఞులు ఉన్నారు. ఆ మంత్రాలను పునశ్చరణ చెయ్యండి. యోగశాస్త్రం తెలిసినవారున్నారు. యోగబలంతో ఉపాసించండి. పరాశక్తి ప్రసన్నురాలవుతుంది. మీ దుఃఖాలు తొలగిపోతాయి. సందేహం లేదు. ఆ జగన్మాత హిమశైలశిఖరంమీదనే ఉంటుందని విన్నాను. స్తుతించినా పూజించినా సద్యఃఫలంగా వాంఛితాలను నెరవేరుస్తుంది. కరుణా స్వరూపిణి. దృఢంగా సంకల్పించుకుని హిమాలయాలకు వెళ్ళండి. దేవతలారా ! వెంటనే బయలుదేరండి. మనోవాంఛాఫలసిద్ధిరస్తు !!

బృహస్పతి - దేవగురువు ఆశీర్వదించి పంపించాడు. దేవతలందరూ హిమశిఖరం చేరుకున్నారు. దేవీధ్యాన పరాయణులయ్యారు. మాయాబీజాక్షరమంత్రాన్ని హృదయంలో జపిస్తూ జగన్మాతకు నమస్కరిస్తున్నారు. స్తోత్రాలు పఠిస్తున్నారు.

విశ్వేశ్వరీ ! మహాదేవీ ! ఆనందరూపిణీ ! అమరజనసుఖంకరీ! దానవనాశంకరీ ! మానవక్షేమంకరీ! చరాచరజగత్శుభంకరీ ! భక్తిగమ్యస్వరూపిణీ ! నీ రూపం - ఇది అని నిశ్చయించలేం. నీ నామధేయాల



సంఖ్య ఇంత అని నిర్ణయించలేం. వేదాలకు కూడా అందని ఆదిరూపానివి నువ్వు. సర్వశస్త్ర స్వరూపవు. సర్వాస్త్రస్వరూపవు. సృష్టిస్థితిలయకారిణివి. స్మృతి ధృతి బుద్ధి జరా పుష్టి తుష్టి కాంతి శాంతి విద్యా లక్ష్మీ గతి కీర్తి మేధా స్వరూపాలు అన్నీ నువ్వే. ఈ విశ్వానికి పురాణబీజానివి. దేవతలకు మేలుచెయ్యడానికి నువ్వు ఎప్పుడు ఏ రూపంలో అవతరిస్తావో, ఏ పనిని ఎలా నెరవేరుస్తావో ఎవరికీ తెలీదు. క్షమ యోగనిద్ర దయ వివక్ష అన్నీ నువ్వే. అలనాడు మహిషాసురుణ్ణి సంహరించి దేవతలనందరినీ రక్షించావు. ఇప్పుడు మళ్ళీ అవసరం వచ్చింది. దేవతలపట్ల నీకున్న ప్రేమ అపారమని వేదపురాణశాస్త్రాలు పదే పదే కీర్తిస్తున్నాయి. ఇందులో ఆశ్చర్యం ఏముంది తల్లీ ! నువ్వు మా జనయిత్రివి. కనక మా ఆలనాపాలనా నీ బాధ్యతలు. నువ్వు కాదంటే మేం తల్లిలేని బిడ్డలమై తల్లడిల్లిపోతాం. నీ గుణాలకూ నీ రూపాలకూ నీ నామాలకూ అవధిలేదు. అలాగే సాధుసజ్జనులపట్ల నీ ప్రేమకూ అవధిలేదు. పరిమితి లేదు. అందుకే రక్షించమని అభ్యర్థిస్తున్నాం. భక్తిప్రపత్తులతో ప్రార్థిస్తున్నాం. బాణపాతం లేకుండా, ముష్టిఘాతం లేకుండా శూల ఖడ్గ శక్తి దండాద్యాయుధాలు ఏమీ లేకుండా నువ్వు శత్రువులను చిటికెలో సంహరించగలవు. అయినా లోకోపకారంకోసం ఒక లీలావిలాసంగా రూపాన్ని ధరిస్తావు, ఆయుధాలు ప్రయోగిస్తావు.

> వినా బాణపాతై ర్వినా ముష్టిఘాతైః
> వినా శూలఖడ్గైః వినా శక్తి దండైః
> రిపూన్ హంతుమేవాపి శక్తా వినోదాత్
> తథాపీహ లోకోపకారాయ లీలా ॥ (22 - 32)

కారణం లేకుండా కార్యోత్పత్తి జరగదనేది శాశ్వత సత్యం. అనుమానాది ప్రమాణాలతో మేమంతా తర్కించుకుంటూ ఉంటాం. ఈ విశ్వానికి నువ్వే కర్తవని. బ్రహ్మ విష్ణు మహేశ్వరులు సృష్టిస్థితిలయకర్తలని పురాణాలు చెబుతున్నా ఆ ముగ్గురినీ యుగాదిలో సృష్టించినది నువ్వే కనక చరాచర జగన్మాతవు నువ్వే. ఆ త్రిమూర్తులు అలనాడు నిన్ను ఆరాధిస్తే సంతోషించి ముగ్గురికీ మూడు శక్తులు ప్రసాదించావు. ఆ శక్తులు నీ రూపాలే. వాటి సాయంతోనే ఈ ముగ్గురూ తమ విధులను నిర్వహించగలుగుతున్నారు.

మహాయతీశ్వరులమని చెప్పుకుంటూ లోకులచేత పాదపూజలు అందుకుంటున్నవారు నిజంగా నిన్ను ఉపాసించకపోతే వారు యతులు కాదు, వట్టి మందమతులు. నువ్వు విశ్వజననివి. పరావిద్యవు. సకలవాంఛాప్రదవు. ముక్తి ప్రదవు. విబుధవందిత పాదారవిందవు.



తే కిం న మందమతయో యతయో విమూఢా:
త్వాం యే న విశ్వజననీం సముపాశ్రయంతి ।
విద్యాం పరాం సకలకామఫలప్రదాం తాం
ముక్తిప్రదాం విబుధబృంద సువందితాంఘ్రిమ్ ॥ (22 - 36)

హరిహరాదులే నిన్ను సేవిస్తున్నారు. దేవదానవులూ నిన్ను అర్చిస్తున్నారు. అటువంటి నీ దివ్యచరణారవిందాలను ధ్యానించని అల్పబుద్ధులను ఏమనాలి! విధివంచితులంటే వీరుగాక వేరెవరు? నీ అంశావతారమైన లక్ష్మీదేవి పాదపంకజాలకు శ్రీమహావిష్ణువు స్వయంగా పారాణి దిద్దుతూ ఉంటాడు. త్రినేత్రుడైన శంకరుడు పార్వతీ పాదాంబుజపరాగరేణువులను శిరసా వహిస్తాడు. అటువంటిది నీ పాదాలను భజించని మానవమాత్రుడి గురించి ఏమి చెప్పమంటావు? విరాగులై సంసారాలను విడిచిపెట్టి తపస్సులు చేపట్టిన మునీశ్వరులు సైతం నీ పాదపద్మాలను ఆరాధిస్తున్నారు.

జలధిజా పదపంకజ రంజనం జతు రసేన కరోతి హరి: స్వయమ్ ।
త్రినయనోఽపి ధరాధరజాంఘ్రిపంకజ పరాగ నిషేవణతత్పర: ॥
(22 - 39)

జగన్మాతా! ఒకటిమాత్రం ఖాయం - సంసారకూపపతితులై నిన్ను అర్చించనివారు నిజంగా పతితులు. వారికి రోగాలూ రొష్టులూ తప్ప సుఖాలు ఉండవు. ఈ జన్మలో కట్టెలు అమ్ముకుంటూనో గడ్డిగాదమూ అమ్ముకుంటూనో మహాదరిద్రం అనుభవిస్తున్నవారంతా క్రిందటి జన్మలో జగన్మాతను అర్చించనివారని నిర్ధారణగా చెప్పవచ్చు.

యే కాష్ఠభారవహనే యవసావహారే
కార్యే భవంతి నిపుణా ధనదారహీనా: ।
జానీమహేఽల్పమతిభిర్భవదంఘ్రిసేవా
పూర్వే భవే జనని తైర్న కృతా కదాపి ॥ (22 - 42)

జనమేజయా! సకలదేవతలూ సామూహిక దీక్షగా ఇలా స్తుతిస్తే కరుణామయి హృదయం కరగకుండా ఉంటుందా! రూపయౌవన సంపన్నగా ప్రత్యక్షమయ్యింది. దివ్యసుందరవస్త్రాలు ధరించింది. దివ్యసుందరభూషణాలు అలంకరించుకొంది. దివ్యసుందరమాలికలు ముడుచుకుంది. దివ్య చందనచర్చ జరుపుకుంది. జగన్మోహన లావణ్యంతో సర్వలక్షణలక్షిత రూపవైభవంతో ఆ అద్వితీయ స్వరూపిణి దేవతలకు దర్శనం అనుగ్రహించింది. గంగానదిలో స్నానానికని హిమగిరిగహ్వరంనుంచి వెలువడి వచ్చింది. వచ్చి ఆ విశ్వమోహనమోహిని తన మేఘగంభీరకంఠధ్వనితో కోకిలలా దేవతలను పలకరించింది.



దివ్యాంబరధరా దేవీ దివ్యభూషణభూషితా ।
దివ్యమాల్యసమాయుక్తా దివ్యచందనచర్చితా ॥
జగన్మోహనలావణ్యా సర్వలక్షణలక్షితా ।
అద్వితీయస్వరూపా సా దేవానాం దర్శనం గతా ।
జాహ్నవ్యాం స్నాతుకామా సా నిర్గతా గిరిగహ్వరాత్ ।
దివ్యరూపధరా దేవీ విశ్వమోహనమోహినీ ॥ (22 - 44, 45, 46)

భో ! భో ! దేవతాః ! ఏమిటి ఇంతగా స్తుతిస్తున్నారు ? మళ్ళీ ఏమి ప్రమాదం వచ్చింది ? అందరూ చింతావిష్టులై కనపడుతున్నారు. కారణం ఏమిటి ? నేనేమి చెయ్యాలి ? చెప్పండి.

ఆ దివ్యరూప సౌందర్యానికి సమ్మోహితులైన దేవతలు ఈ పలకరింపుతో తేరుకున్నారు. ఓ విశ్వేశీ! కరుణారాశీ ! కాపాడు తల్లీ ! కాపాడు. రాక్షసులు పెట్టే బాధలు పడలేక నిన్ను శరణువేడుతున్నాం. పూర్వం ఒకప్పుడు నువ్వు మహిషాసురుణ్ణి సంహరించి మాకు ఒక వరం ఇచ్చావు. మహాపదలు చుట్టుముట్టినప్పుడు నన్ను స్మరించండి, వెంటనే వచ్చి రక్షిస్తాను - అన్నావు. ఆ ధైర్యంతో నిన్ను ఇప్పుడు స్మరించాం. ఎందుకంటే - మునుపటికన్నా పెద్ద ఆపద వచ్చిపడింది మాకు. శుంభనిశుంభులని ఇద్దరు మహారాక్షసులు తయారయ్యారు. ఘోరాతిఘోరులు. యజ్ఞవిఘ్నకారులు. మమ్మల్ని తరిమేసి స్వర్గం ఆక్రమించుకున్నారు. వీరుకూడా పురుషులకు అవధ్యులుగా వరం పొందినవారే. అలా వరం ఇచ్చినది మళ్ళీ బ్రహ్మదేవుడే. వీళ్ళకి సైదోడులు రక్తబీజ చండముండాది మహావీరులు. ఇంకా చాలామంది ఉన్నారు. అందరూ కలిసి మమ్మల్ని ఏడిపించుకు తింటున్నారు. వీళ్ళ ధాటి తట్టుకోలేక మేమంతా చెట్టుకొకరూ పుట్టకొకరుగా పారిపోయాం. అడవుల్లో ఆకులూ అలములూ తింటూ కాలం గడుపుతున్నాం. కంటినిండా నిద్రపోయి ఎంతకాలమయ్యిందో ! నందనవనంలో కల్పవృక్షచ్ఛాయలలో క్రీడించే మేము ఘోరారణ్యాలలో తలదాచుకోవలసి వచ్చింది. రత్నఖచిత సువర్ణదివ్యహర్మ్యాలలో నివసించిన మేము చీకటి గుయ్యారాలవంటి కొండగుహలలో బితుకు బితుకుమంటూ కాలం వెళ్ళమారుస్తున్నాము. అమ్మా ! మా బాధలు ఎన్నని చెప్పుకోము, ఎంతని చెప్పుకోము ? అన్నీ ఎరిగినదానవు. మాకు నువ్వు తప్ప మరొక దిక్కులేదు. కాస్తంత ఉపకారం చేసిపెట్టు. మేమంతా నీ పాదదాసులం. సేవకులం. మాకేకాదు ఈ జగత్తులో దుఃఖార్తులకందరికీ నువ్వేకదా శరణ్యం. మరోసారి ముల్లోకాలనూ రక్షించవలసిన అవసరం ఏర్పడింది. ఇది నీ సృష్టి. ఇది నీ బిడ్డ. కాపాడుకోవలసిన అవసరం తల్లిగా నీకు ఉంది. జగత్పీడకులూ లోకకంటకులూ అయిన ఆ దానవులను సంహరించి మా ప్రాణాలు నిలబెట్టుతల్లీ ! *(అధ్యాయం - 22, శ్లోకాలు - 57)*



## ◆ కౌశికీ కాళికల ఆవిర్భావం ◆

దేవతల దీనాలాపాలనూ అభ్యర్థనలనూ ఆలకించిన జగదంబిక అభయం ఇచ్చింది. దానవ సంహారం చేస్తాను, మిమ్మల్ని రక్షిస్తాను అంది. అంటూనే ఆ హిమగిరితనయ - తన శరీరంనుంచి మరొక స్త్రీమూర్తిని ఆవిర్భవింపజేసింది. ఆ అంబికను కౌశికి అని ముల్లోకాలూ కీర్తించాయి. కౌశికీ ఆవిర్భావం అయ్యాక పార్వతీదేవి (గౌరి = పసుపురంగు) తన శరీరం రంగును మార్చింది. నల్లని కాటుక రంగులోకి మారిపోయింది. కాళిక అని సకలదేవతలూ స్తుతించారు. కదిలితే మసి రాలుతుందన్నంత మహాఘోరరూపంలో ఉంది. రాక్షసులను కూడా హడలెత్తించే కారు నలుపు. కాళరాత్రి లాంటి రూపం. కౌశికీ రూపంలో అంబికమాత్రం సౌందర్య పరసీమగానే ఉంది. సర్వభూషణ సంయుక్త. లావణ్యరాశి.

**ఏవం స్తుతా తదా దేవీ దైవతైః శత్రుతాపితైః ।**
**స్వశరీరాత్పరం రూపం ప్రాదుర్భూతం చకార హ ॥**
**పార్వత్యాస్తు శరీరాద్వై నిస్సృతాచాంబికా యదా ।**
**కౌశికీతి సమస్తేషు తతో లోకేషు పఠ్యతే ॥**
**నిస్సృతాయాం తు తస్యాం ; సా పార్వతీ తనువ్యత్యయాత్ ।**
**కృష్ణరూపాథ సంజాతా కాళికా సా ప్రకీర్తితా ॥**
**మషీవర్ణా మహాఘోరా దైత్యానాం భయవర్ధినీ ।**
**కాళరాత్రీతి సా ప్రోక్తా సర్వకామఫలప్రదా ॥**
**అంబికాయాః పరం రూపం విరరాజ మనోహరమ్ ।**
**సర్వభూషణ సంయుక్తం లావణ్యగుణ సంయుతమ్ ॥**

**(23 - 1 నుంచి 5)**

అంబికాదేవి చిరునవ్వులు చిందిస్తూ నిలబడింది. నివ్వెరపోయి చూస్తున్న దేవతలను మరోసారి పలకరించింది. దేవతలారా ! నిర్భయంగా ఉండండి. మీ శత్రువులను సంహరిస్తాను. కర్తవ్యం కర్తవ్యమే. ఇక చూడండి రణరంగంలో వీరవిహారం చేస్తాను. శుంభనిశుంభాదులను మట్టుబెట్టి మీకు ఆనందం కలిగిస్తాను - అంటూనే తన మృగేంద్రవాహనాన్ని అధిరోహించింది. కాళికాదేవిని పార్శ్వభాగంలో కూర్చోబెట్టుకుంది. శుంభుడి రాజధానికి చేరుకుంది.



రాజధానికి సమీపంలో ఉన్న ఉద్యానవనంలో దిగింది. కాళికను ఎట్టయెదుట శ్రోతగా కూర్చోబెట్టుకుని తాను అత్యద్భుతమైన సంగీతాన్ని పాడనారంభించింది. ఆ జగన్మోహన సంగీతానికి చరాచర జగత్తు పరవశించింది. కోకిలలు సిగ్గుతో తలవంచుకున్నాయి. లేడికూనలు మేత మాని చెవులు రిక్కించి నిలిచిపోయాయి. పుట్టలలోనుంచి పాములు పడగలు బైటకి పెట్టి, శిరఃకంపాలు చేస్తున్నాయి. ఆకాశంలో అదృశ్యరూపాలతో ఉన్న దేవతలు అచ్చమైన నాదానందాన్ని తొలిసారిగా చవిచూస్తున్నారు.

ఆ సమయానికి చండముండాసురులిద్దరూ వాహ్యాళిగా అటువైపు వచ్చారు. గానానికి ఆకృష్టులై అప్రయత్నంగా అక్కడికి వచ్చి గానం చేస్తున్న అంబికామూర్తిని చూశారు. ఎదుటకూర్చున్న కాళికాదేవిని చూశారు. ఆ దివ్యగాన సౌందర్యానికీ గాత్రసౌందర్యానికీ ముగ్ధులయ్యారు. ఆశ్చర్యచకితులయ్యారు. పరుగుపరుగున వెళ్ళి తమ ప్రభువు శుంభుడి సన్నిధిలో వాలేరు. శిరసువంచి నమస్కరించి మధురాతిమధురంగా పలికారు -

దానవరాజా ! దివ్యతేజా ! హిమాలయాలనుంచి ఒక సుందరాంగి వచ్చింది. కామమోహిని అంటే అతిశయోక్తి కాదు. సింహవాహనాన్ని అధిరోహించి కూర్చుంది. దేవగంధర్వలోకాలన్నీ తిరిగినవాళ్ళమే కదా! ఎక్కడా ఇంతవరకూ ఇలాంటి సౌందర్యరాశిని చూడలేదంటే నమ్ము. కనీసం వినలేదు కూడా. అందానికి తగినట్టే జగన్మోహనంగా సంగీతం పాడుతోంది. లేడికూనలు ఆ మధురస్వరానికి సమ్మోహితాలై ఆమె చుట్టూ చేరి నిశ్చేష్టంగా నిలబడి వింటున్నాయి. ఈవిడ ఎవరో, ఎవరి అమ్మాయో, ఎందుకోసం ఇక్కడికి వచ్చిందో ఏమిటో తెలుసుకో. నువ్వు పరిగ్రహించడానికి అన్ని విధాలా తగిన కామినీమణి అని మాకు అనిపించి పరుగుపరుగున వచ్చి నీకు విన్నవిస్తున్నాం. ఆ కల్యాణలోచన ఎవరో తెలుసుకొని ఇంటికి ఆహ్వానించి ఇల్లాలిని చేసుకో. ఇలాంటి నారీమణి మరి దొరుకుతుందని మేము అనుకోము. దేవతల రత్నరాశులన్నీ కొల్లగొట్టేవు. ఈ నారీరత్నం కూడా నీకు దక్కితే శోభాయమానంగా ఉంటుంది. ఐరావతం, ఉచ్చైఃశ్రవం, పుష్పకం, కుబేరుడి నిధులు, వరుణుడి సితచ్ఛత్రం, పారిజాతం, కామధేనువు, వరుణపాశం, యమదండం ఇత్యాదులన్నీ బలాత్కారంగా కైవసం చేసుకున్నావు. నీకు హడిలిపోయి సముద్రుడు అనంతరత్నరాశులను బహూకరించాడు. వాడిపోని పుష్పమాలికను కానుకపెట్టాడు. సరే - మేనకాద్యప్సరసలు నీకు పరిచారికలై ఊడిగమే చేస్తున్నారు. ఇలా సృష్టిలో ఉత్తమోత్తమమైనది ప్రతిదీ బలాత్కారంగానే అయినా నీ అధీనంలోకి వచ్చింది. మరింక ఈ కాంతారత్నంకూడా నీకు చేరితే నీ ఐశ్వర్యానికీ శౌర్యానికీ పరిపూర్ణత సిద్ధిస్తుంది. ఇన్నింటిని దక్కించుకున్నవాడెవడూ ఈమెను విడిచిపెట్టడు. ఇప్పటివరకూ నీ ఇంటిలో ఉన్న రత్నాలకన్నింటికీ ఈమె రాకతో సార్థక్యం చేకూరుతుంది. లేదంటే అవి రత్నాలవంటివి అయిపోతాయి. అంతటి కన్యారత్నం ఈవిడ. కనీ వినీ ఎరగని సౌందర్యం. గట్టిగా ప్రయత్నించి సొంతం చేసుకో.

సర్వాణి తే గృహస్థాని రత్నాని విశదాన్యథ ।
అనయా సంభవిష్యంతి రత్నభూతాని భూపతే ॥ (23 - 29)



## ◆ సుగ్రీవాసుర దౌత్యం - అంబికా సందేశం ◆

మధురంగా మధురాక్షరంగా చండముండులు చెప్పిన వార్తావిశేషాన్ని కులాసాగా ఆలకించాడు శుంభుడు. ముఖం వికసించింది. సన్నిధిలో ఉన్న సుగ్రీవుణ్ణి ఆజ్ఞాపించాడు. నర్మసచివా ! సుగ్రీవదానవా! దౌత్యం నిర్వహించవయ్యా ! నువ్వు విచక్షణుడివి. నిపుణుడివి. కార్యం సాధించుకురా. అక్కడికి వెళ్ళి ఏది చెప్పాలో ఎలా చెప్పాలో అలా చెప్పి ఆ కృశోదరి తనంతతానుగా ఇక్కడికి వచ్చేట్టు చెయ్యి. నీకు తెలుసుగా, అబలామణులదగ్గర భేదదండోపాయాలు పనికిరావని. కేవలం సామదానాలే ఉపయోగించాలని శృంగార కోవిదులు చెబుతున్నారు. భేదోపాయంవల్ల రసాభాసం, దండోపాయంవల్ల రసభంగమూను. అంచేత అవ్వి సుతరామూ పనికిరావు. నీవంటి నేర్పరులు పూనుకుని సామదానాలను మధురవాక్యాలతో మిళాయిస్తే, వశం కాని కామినీమణి ఉంటుందా ? జయోస్తు. వెళ్ళిరా - అని చెప్పి పంపించాడు.

దానవసుగ్రీవుడు ఆ ఉద్యానవనం చేరుకున్నాడు. సింహవాహనం మీద మూర్తీభవించిన సౌందర్యరాశిని చూశాడు. సరాసరి వెళ్ళి సాష్టాంగపడ్డాడు. సుకుమారంగా మధురాతిమధురంగా సంభాషించాడు -

సుందరవదనారవిందా ! శుంభుడనే దానవచక్రవర్తిని గురించి ఎప్పుడైనా విన్నావా ? సర్వాంగసుందరుడు. ముల్లోకాలకూ అధిపతి. ఇంద్రాది దిక్పాలకులనందరినీ జయించిన శూరుడూ వీరుడూను. ఆ మహారాజు పంపితే నేనిలా నీ దగ్గిరికి వచ్చాను. నీ రూపసౌందర్యం గురించి ఆ మహాత్ముడు ఇప్పుడే విన్నాడు. విన్నప్పటి నుంచి మనస్సంతా నీకే అర్పించి మథనపడిపోతున్నాడు. ప్రేమపూర్వకంగా మా దానవచక్రవర్తి చెప్పమన్న ఒకే ఒక్కమాట చెబుతున్నాను. ఆ ౹కించు. నీకు సాష్టాంగపడి మరీ చెబుతున్నాడు సుమా ! గ్రహించుకో -

"సుందరీ ! నేను త్రిలోకాధిపతిని. యజ్ఞభాగాలను నేనే స్వీకరిస్తున్నాను. స్వర్గలోక సారాన్నంతటినీ ఇక్కడ ఈ పాతాళంలో కూర్చునే హరించాను. రత్నవిహీనను చేసేశాను. దేవతల దగ్గరున్న విలువైన వస్తువుల నన్నింటినీ బలాత్కారంగా అపహరించి తెచ్చాను. ముల్లోకాలలోనూ సర్వరత్నాలకూ నేనే అధిపతిని. దేవదానవమానవజాతులన్నీ నా చెప్పుచేతల్లో ఉన్నాయి. ఇంతటి మహావీరుణ్ణి అయినా, నీ సౌందర్యాది గుణాలను విని ఆకర్షితుడనై నీకు దాసుణ్ణి అయ్యాను. ఏమి చెయ్యమంటావు చెప్పు, నా మనస్సు నీ అధీనమైపోయింది. రంభోరూ !. ఆజ్ఞాపించు. నీ సేవకుణ్ణి నేను. నువ్వు ఏది చెయ్యమంటే అది చేస్తాను. అందాలరాసీ ! మన్మథుడి బాణాలనుంచి నన్ను కాపాడు. వాలుచూపుల చిన్నదానా ! ఈ మన్మథార్తుడిమీద కాసింత దయచూపించు. నన్ను వరించి నీ ఇచ్ఛవచ్చినట్లు క్రీడించు. సదా సౌభాగ్యవతివై వర్ధిల్లు."



ఓ మదమంథరా ! ఇదీ మా ప్రభువు సందేశం. విన్నావుగా. జాగ్రత్తగా ఆలోచించి ప్రేమగా మధురంగా ఏమి చెబుతావో చెప్పు. అది యథాతథంగా తీసుకువెళ్ళి విన్నవిస్తాను - అని ప్రసంగం ముగించాడు సుగ్రీవుడు.

అంబిక ముఖంమీద ఒక లేతచిరునవ్వు విరిసింది. సౌమ్యంగా బదులు పలికింది. దానవదూతా! శుంభుడినే కాదు నిశుంభుడిని కూడా నేనెరుగుదును. మహాబలశాలులుకదా ! నీ ప్రభువు సకలదేవతలనూ జయించాడు. సకల శత్రువులనూ హరించాడు. సర్వసద్గుణాలకూ రాశి. సర్వ సంపదలకూ భోక్త. మహాదాత. శూరాధినేత. ఇక రూపంలో అచ్చం మన్మథుడేనట. ఇరవైమూడు లక్షణాలూ ఉన్నాయిట. పైగా దేవమానవ పురుషజాతులకు అవధ్యుడు కూడానట. అవునా ? ఇవన్నీ తెలిసే అంతటి మహాసురుణ్ణి ఒకసారి కళ్ళారా చూద్దామనిపించి ఇలా వచ్చాను. నా అంతట నేనైవచ్చాను. రావద్దా ! రత్నం తన శోభను పెంచుకోవడానికి బంగారాన్ని వెతుక్కుంటూ వస్తుందికదా !

జ్ఞాత్వా సమాగతాస్మ్యత్ర ద్రష్టుకామా మహాసురమ్ ।
రత్నం కనకమాయాతి స్వశోభాధికవృద్ధయే ॥ (23 - 54)

సుగ్రీవా ! నేను వరాన్వేషణలో బయలుదేరాను. చాలా దూరంనుంచి వచ్చాను. స్వర్గంలో దేవతలనందరినీ చూశాను. భూలోకంలో మానవమహావీరులనూ చూశాను. గంధర్వ యక్ష రాక్షసజాతుల వారినందరినీ అవలోకించాను. అందగాళ్ళు చాలామందే కనిపించారుగానీ, అదేమిటో అందరూ భయపడిపోతున్నారు. గజగజా వొణికిపోతున్నారు. ఏమిటా అని ఆరాతీస్తే మీ ప్రభువు శుంభుడికి భయపడుతున్నారని తెలిసింది. అదిగో అక్కడ మొదటిసారిగా శుంభుడి గుణగణాలను గురించి విన్నాను. దర్శించాలనిపించింది. హుటాహుటిని వచ్చాను. దూతా ! మహానుభావా ! వెళ్ళు. మీ ప్రభువుకు చెప్పు. ఎవరూ లేనప్పుడు ఏకాంతంగా మృదుమధురంగా నా సందేశం వినిపించు. ఇదిగో జాగ్రత్తగా విను. యథాతథంగా చెప్పాలిసుమా !

"వీరతాగుణసమారంభా ! శుంభా !! బలవంతులలోకెల్లా బలవంతుడవనీ, సుందరులలోకెల్లా సుందరుడవనీ విన్నాను. దాతవనీ, సకలదేవ విజేతవనీ తెలుసుకున్నాను. సర్వవిద్యాపారగుడవనీ సకల సద్గుణ విశారదుడవనీ గ్రహించాను. ఉన్నత వంశంలో జన్మించావనీ దక్షతతో రాజ్యం నిర్మించావనీ ఆలకించాను. రత్నరాశులను స్వాధీనపరుచుకుని భోగభాగ్యాలను అపారంగా అనుభవిస్తున్నావని పరికించాను. అందుకే కోరి కోరి నీ నగరానికి వచ్చాను. నేను వరుణ్ణి వెతుక్కుంటున్నాను. ఇంతకాలానికి యోగ్యుడవు దొరికావు. నేనే నీకు తగిన దానను. ఇది నిజం. కాకపోతే నాకో చిన్న నియమం ఉంది. ఇక్కడిదాకా వచ్చి చెప్పకపోవడమేమి ! చెప్పేస్తున్నాను.



చిన్నప్పుడు బాల్యచాపల్యం కొద్దీ నేనొక ప్రతిజ్ఞ చేశాను. చెలికత్తెలందరూ నన్నూ నా బలాన్నీ ప్రశంసిస్తూంటే ఉబలాటం ఉండబట్టలేక రహస్యంగా ప్రతిజ్ఞ చేశాను. ఏమిటంటే అది - నాతో బలపరాక్రమాలలో సాటివచ్చేవాడై, రణరంగంలో నన్ను జయించిన వాడినే నేను పెళ్ళాడతాను అని. ఆడపిల్లనుగదా అదొక చాపల్యం. ఈ ప్రతిజ్ఞకు నా చెలికత్తెలంతా పరిహసించారు. ఆటపట్టించారు. దానితో నాకు పట్టుదల పెరిగి ప్రతిజ్ఞకు మరింతగా కట్టుబడిపోయాను. వరాన్వేషణలో ఆ దేశమూ ఆ దేశమూ తిరుగుతూ ఇక్కడికి వచ్చాను. నువ్వు మహావీరుడివి. మహాశూరుడివి. మహాబలశాలివి. నా బలమంటావా ఇదిగో ఈపాటిది. తెలుసుకునే ఉంటావు. అంచేత ఇలా వచ్చి స్వబలంతో నన్ను జయించి నా కోరిక తీర్చు. నువ్వు ఒక్కడివే వచ్చినాసరే. తమ్ముడు నిశుంభుడితో కలిసివచ్చినా సరే. సమరంలో జయించి సుందరా ! నన్ను వివాహం చేసుకో" - ***(అధ్యాయం - 23, శ్లోకాలు - 67)***

అంబికా సందేశాన్ని ఆలకించిన సుగ్రీవుడు ఆశ్చర్యపోయాడు. ఎంత తెలివితక్కువదానివే అన్నట్టు ఒక నవ్వు నవ్వేడు. అమ్మాయీ ! ఏమి మాట్లాడుతున్నావో తెలిసే మాట్లాడుతున్నావా ? ఏమిటి ఈ సాహసం. ఆడదానిని అనిపించుకున్నావు. ఇంద్రాది దేవతలను ఓడించిన చండశాసనుడితో నీకు సమరమా ? తలపడతావా ? అతణ్ణి జయించగలిగినవాడు ఈ ముల్లోకాలలోనే లేడు. ఇక నువ్వా ? సుందరీ ! బలాబలాలు తెలుసుకోకుండా ఇలా ఎవరుపడితే వారితో కయ్యానికి కాలుదువ్వకూడదు. సమరాలూ గిమరాలూ నీకెందుకుగానీ, మా ప్రభువు ఏదో నీ మీద మనసుపడ్డాడు. అంగీకరించి వివాహం చేసుకో. సుఖపడు. మూర్ఖంగా పంతాలకి పోవద్దు. నా మాట విను. శుంభుణ్ణి వరించు. లేదా నిశుంభుణ్ణి వరించు. శృంగారం సర్వప్రాణికోటికీ ఆనందదాయకమే. అందునా నీలాంటి అందగత్తెలకూ యువతులకూ ఇంకాను. ఇప్పుడు నువ్వు నా వెంట రాకపోతే మా ప్రభువుకి కోపం వస్తుంది. సేవకులను పంపించి నిన్ను బలాత్కారంగా తీసుకుపోతాడు. జుట్టుపట్టుకుని లాక్కుపోతారు. అసలే రాక్షసులు. శుంభుడి సన్నిధిలో పడేస్తారు. అదెంత అవమానమో ఆలోచించు. సిగ్గుని కాపాడుకో. తన్వంగీ ! సాహసాలు చెయ్యకు. గౌరవంగా అడిగాడు, గౌరవంగా పద. గౌరవం దక్కించుకో. యుద్ధం ఎక్కడ, రతిసౌఖ్యం ఎక్కడ ? సారాసారవివేకం ఉండవద్దూ ! నువ్వు ఎంతో అదృష్టం చేసుకున్నావు కనక ఇలాంటి సువర్ణావకాశం లభించింది. శుభప్రదంగా ఉంటుంది. నా మాట విని, శుంభుణ్ణో నిశుంభుణ్ణో వివాహం చేసుకో.

దూతా ! నువ్వు చెబుతున్నది అంతా వాస్తవమే. అంగీకరిస్తున్నాను. శుంభనిశుంభులు మహాశూరులనీ మహాక్రూరులనీ బాగా ఎరుగుదును. కానీ యేం చెయ్యను ? చిన్నప్పటి నా ప్రతిజ్ఞ తీరాలికదా ! లేకపోతే చెలికత్తెలలో నాకు నగుబాటుకాదూ ! అవమానం కాదూ ! సిగ్గుచేటు కాదూ ! అంచేత, శుంభుడుగానీ నిశుంభుడుగానీ ఎవడు బలవత్తరుడైతే వాడే నా భర్త. రమ్మను. నన్ను జయించమను. పాణిగ్రహణం చెయ్యమను. నేనేదో ఆ దేశమూ ఆ దేశమూ పర్యటిస్తూ యథాలాపంగా



ఇలా వచ్చాను. ఒంటరిదాన్ని. పైగా అబలను. వీరధర్మం ఒకసారి గుర్తుచేసుకుని నాకు యుద్ధం అనుగ్రహించమని మీ ప్రభువుకు విన్నవించు. నా చేతిలో శూలం ఉంది. అది చూసి భయపడేట్టయితే పాతాళంలోనే ఉండిపొమ్మను. మరింక బయటికి రావద్దును. స్వర్గాన్నీ భూలోకాన్నీ వదులుకోమను. సుగ్రీవా ! నేను ఏమైపోతానో అనే బెంగ నీకెందుకుగానీ. నువ్వు వెంటనే వెళ్ళి, నేను చెప్పింది చెప్పినట్టు చెప్పు మీ ప్రభువుకి. అతడే ఆలోచించుకుంటాడు. ఏది యుక్తమనిపిస్తే అది చేస్తాడు. ఉన్నది ఉన్నట్టు చెప్పడమేకదా దూతగా నీ ధర్మం. అది చెయ్యి చాలు. మిగతా విషయాలు నీకు అనవసరం. వెళ్ళు. త్వరగా వెళ్ళు.

సుగ్రీవుడు మరింక నోరుమెదపలేదు. హుటాహుటిని శుంభుడిని చేరుకున్నాడు. సాష్టాంగపడి లేచాడు. ఎలా చెబితే ఏమి కోపం వస్తుందోనని సంశయిస్తూ ఉపోద్ఘాతంతో ప్రారంభించాడు.

మహాప్రభూ ! సత్యమూ ప్రియకరమూ అయిన మాట చెప్పాలని పెద్దలంటారు. అందుకని ఆలోచిస్తున్నా. నిజానికి ఆ రెండు లక్షణాలూ కలిసున్న మాట దుర్లభంసుమా ! అప్రియం చెబితే - అది సత్యమే అయినా - ప్రభువులకి కోపం వస్తుంది. పోనీ ప్రియమే చెబుదామంటే అది అసత్యమై ఆ తరవాత పీకలమీదకి తెస్తుంది. ఈ అబల ఎవరో ! ఎక్కడినుంచి వచ్చిందో ! మరి ఆవిడగారి బలం ఏమిటో - నాకు ఏ మాత్రమూ గోచరం కావడం లేదు. అంతా గందరగోళంగా ఉంది. వెళ్ళి చూశానా. యుద్ధమో యుద్ధమో అంటోంది. మహాగర్వంగా ఉంది. చాలా కటువుగా మాట్లాడుతోంది. అయినా నాకెందుకుబాబూ, ఆవిడ చెప్పమన్నది చెప్పమన్నట్టు చెబుతున్నాను. మహాప్రభూ ! ఆలకించు -

నేను బాల్యంలో చెలికత్తెలముందు వినోదంకోసం నా వివాహ విషయమై ఒక ప్రతిజ్ఞ చేశాను. ఎవడు నన్ను యుద్ధంలో జయించి నా గర్వాన్ని వదిలిస్తాడో ఆ సమబలుడినే నేను వివాహం చేసుకుంటానని. కాబట్టి నా ప్రతిన వృథాకాకుండా యుద్ధం చేసి నన్ను జయించి వివాహం చేసుకో - అని నీకు విన్నవించమంది ప్రభూ ! ఆ సుందరాంగి.

చెప్పేశాను. ఆ తరవాత నీ ఇష్టం. ఆవిడమాత్రం కయ్యానికి కాలుదువ్వుతోంది. త్రిశూలం ధరించి సింహవాహనంమీద సిద్ధంగా ఉంది. బాగా ఆలోచించి ఏది యోగ్యమో అది చెయ్యి.

సుగ్రీవుడు జంకుతూ జంకుతూనే విషయం విన్నవించాడు. శుంభుడు శ్రద్ధగా విన్నాడు. ప్రక్కనే కూర్చున్న నిశుంభుడికేసి చూశాడు. సోదరా ! కర్తవ్యం ఏమిటో ఆలోచించు. ఒక ఆడది కయ్యానికి రమ్మని కవ్విస్తోంది. నేను వెళ్ళనా, నువ్వు వెడతావా ?

అగ్రజా ! నువ్వూ వద్దు. నేనూ వద్దు. ఈ మాత్రం ఆడదానితో యుద్ధానికి మనం కావాలా ? ధూమ్రలోచనుడిని పంపించు. జయించి తీసుకువస్తాడు. వివాహం జరిపిస్తాడు - అన్నాడు నిశుంభుడు.



శుంభుడికి ఈ ఆలోచన నచ్చింది. మహాసైన్యంతో వెళ్ళమని ధూమ్రలోచనుడిని ఆజ్ఞాపించాడు. ఆ సుందరాంగిని సంహరించకుండా పట్టి తెమ్మని మరీమరీ చెప్పాడు. ఆవిడకు సహాయంగా ఏ దేవతలు వచ్చినా ఏ మానవులు వచ్చినా సంహరించు. కూడా ఉన్న కాళికనూ మర్దించు. ఆవిడను మాత్రం సంహరించకు. బంధించి తీసుకురా. ఆ సాధ్వి సుకుమారి. కృశోదరి. ప్రయత్నపూర్వకంగా రక్షణీయ. ఇదిమాత్రం గుర్తుంచుకో - అని చెప్పి పంపించాడు.

## ◆ అంబికా ధూమ్రలోచన సంవాదం ◆

ధూమ్రలోచనుడు ప్రభువుకు ప్రదక్షిణం చేసి పాదాలకు నమస్కరించాడు. అరవైవేలమంది అసాధురాక్షస సైన్యంతో బయలుదేరాడు. అందమైన ఉద్యానవనంలో విడిదిచేసి సంగీతం పాడుకుంటున్న అంబికాదేవిని దర్శించాడు. ఆ మృగశాబాక్షిని చూస్తూనే వినయంగా నమస్కరించాడు.

దేవీ ! శుంభుడు నీ విరహంతో పరితపిస్తున్నాడు. నీతి తెలిసినవాడు కనక ముందుగా దూతను పంపించాడు. రసభంగం పనికిరాదని సామోపాయం ప్రయోగించాడు. ఆ దూత నీనుంచి తిరిగివచ్చి ఏదేదో చెప్పాడు. మా ప్రభువు ఆశించినదానికి భిన్నంగా ఉంది నీ సందేశం. అది విన్నాక మరీ చింతాకులుడయ్యాడు. నువ్వు రసమార్గం తెలిసినదానవే, కనక చెబుతున్నాను. శుంభుడు కామమోహితుడై నిన్నే కలవరిస్తున్నాడు. బహుశ నువ్వు నర్మగర్భంగా చెప్పినదానిని ఆ దూతగాడు సరిగ్గా అర్థం చేసుకోలేదేమో అనుకుంటున్నాను. ఎవడు నన్ను సంగ్రామంలో జయిస్తాడో ఆ సమబలుడినే - అంటూ నువ్వు కఠినంగా పలికావుటగదా ! రెండు రకాల సంగ్రామాలుంటాయని వాడికి తెలీదు పాపం. అమాయకుడు. శరసంగ్రామం ఒకటీ, స్మరసంగ్రామం ఒకటీ. ఈ రెండోది నీవంటి వామోరులతోనూ, ఆ మొదటిది శత్రువీరులతోనూ సముదాత్త సుందరంగా ఉంటాయి. ఒకటి సుఖప్రదమూ, ఒకటి దుఃఖప్రదమూను.

వరారోహా ! నీలాంటి అందగత్తెల మనస్సును తెలుసుకోడం అందరికీ సాధ్యమవుతుందా ? మా ప్రభువువంటి రసికులకే చెల్లు. అందుకే మహాసైన్యంతో నన్ను పంపించాడు. సగౌరవంగా తీసుకురమ్మన్నాడు. నీ స్మరసంగ్రామవాంఛ తీరుస్తాడు. త్రిలోకాధిపతియైన శుంభుడికి పట్టమహిషివై మహాభోగాలను అనుభవించు. నువ్వు కోరుకున్న సంగ్రామంలో అతడు నిన్ను జయిస్తాడు. బాణవిద్యలోనే కాదు, పుష్పబాణవిద్యలోనూ మంచి నేర్పరి. నువ్వు చిత్రవిచిత్రంగా హావాలను ప్రదర్శిస్తే అతడూ సమస్థాయిలో భావాలను ప్రకటిస్తాడు. ఆ సంగ్రామంలో ఈ కాళిక మీకు నర్మసాక్షిణి అవుతుంది. శయనమందిరంలో సుఖశయ్యామీద నీతో సంగ్రామం చేసి నిన్ను ఓడిస్తాడు. నఖక్షతాలతో నీ శరీరం నిండా, దంతక్షతాలతో నీ అధరం మీదా రక్తం చిందిస్తాడు. చెమటలు పట్టిస్తాడు. నిన్ను చిందరవందర చేస్తాడు. నీ వాంఛితం నెరవేరుతుంది. ఆ రూపంలో నిన్ను చూసి మా ప్రభువు పరవశుడు అవుతాడు. ఇంకా ఇంకా నీకు వివశుడవుతాడు.



మానినీమణీ ! మృదువుగా చెప్పాను. హితవుగా చెప్పాను. మా దానవగణాధ్యక్షుడి అభ్యర్థనను మన్నించు. అస్త్రశస్త్రాలతో యుద్ధం కోరుకునేవారు వట్టి మందభాగ్యశిఖామణులు. దానికి నువ్వు తగవు. అది నీకు వద్దు. నువ్వు సురతవల్లభవు. నీ మృదువైన పాదతాడనంతో పులకింపజేసి మా ప్రభువుకు అశోకత (శోకరహితత్వం) కలిగించు. మద్యం పుక్కిటబట్టి చిలకరించి వకుళత్వం కురవకత్వం ప్రసాదించు.

*(అధ్యాయం - 24, శ్లోకాలు - 59)*

అశోకం కురు రాజానం పాదాఘాతవికాసితమ్ ।
వకుళం సీధుసేకేవ తథా కురవకం కురు ॥ (24 - 59)

(పద్మినీజాతి వనిత పారాణి దిద్దుకున్న పాదంతో తాకితే అశోకవృక్షం పుష్పిస్తుందనీ, మద్యం పుక్కిటబట్టి సీధువుగా చిలకరిస్తే పొగడచెట్టూ గోరింటచెట్టూ కుసుమిస్తాయనీ - దోహదక్రియలు ప్రసిద్ధాలు).

ధూమ్రలోచనుడి ప్రసంగానికి అంబికాదేవి సమాధానం చెప్పలేదు. మౌనంగా ఉండిపోయింది. కాళికాదేవి కల్పించుకుంది. ఘాటుగా బదులు పలికింది.

జాల్ముడా ! విదూషకుడిలా నటుడిలా మాట్లాడుతున్నావు. మధురంగా మాట్లాడుతూ వృథా మనోరథాలు నెమరువేస్తున్నావు. సేనాసహితుడవై వచ్చావు. ఆ దుర్మార్గుడు పంపితే వచ్చావు. యుద్ధం చెయ్యి. వ్యర్థాలాపాలు చాలించు. శరాఘాతాలతో శుంభనిశుంభులను సంహరించి, ఇంకా నీలాంటి నీచులనందరినీ మట్టుబెట్టి అంబికాదేవి తన నిలయానికి తిరిగివెడుతుంది. ఈ జగన్మోహినితో మీ మందమతికి వివాహమా ? సింహిక ఎంత కామార్త అయితేమాత్రం నక్కను వరిస్తుందా ? ఆడ ఏనుగు గాడిదను కోరుతుందా ? ధూర్తుడా ! వెళ్ళు. శుంభనిశుంభులకు నామాటగా చెప్పు. యుద్ధానికి రమ్మను. లేదంటే శరణువేడుకోమను. పాతాళంలో దాక్కోమను.

ఈ మాటలు ధూమ్రలోచనుడిలో కోపాగ్నిని రగిల్చాయి. కురూపీ ! ముందు నిన్ను సంహరించి, తరవాత ఈ అంబికను బంధించి మా ప్రభువు సన్నిధికి తీసుకువెడతాను. కానీ రసభంగం అవుతుందని భయపడుతున్నాను. లేదంటే ఈపాటికే ఈ పని చేసుండేవాణ్ణి - అని గర్జించాడు.

మందమతీ ! ధనుష్మంతుడెవడూ ఇలా సంశయించడు. అశక్తుడవై నిన్ను నువ్వు పొగడుకుంటున్నావు. సామర్థ్యమే ఉంటే ధనుస్సు ఎక్కుపెట్టు. శరం సంధించు. సరాసరి యమలోకానికి పోదువుగాని.



కాళికాదేవి ఆగ్రహోదగ్రంగా మాట్లాడేసరికి ధూమ్రలోచనుడు ధనుస్సు ఎక్కుపెట్టాడు. శరవర్షం కురిపించాడు. ఆకాశంలో అదృశ్యరూపులై విమానాలలో కూర్చుని తిలకిస్తున్న దేవతలు కాళికను జయజయధ్వానాలతో స్తుతించారు. కాళిక ధూమ్రలోచనుడిపై దీటుగా బాణాలు కురిపించింది. వివిధాయుధాలతో ఘోరంగా యుద్ధం జరిగింది.

ధూమ్రలోచనుడి రథానికి పూన్చిన గాడిదలను కాళిక ముందుగా సంహరించి తీవ్రబాణాలతో రథాన్ని భగ్నం చేసింది. విజయగర్వంతో వికటాట్టహాసం చేసింది. ఇంతలోకీ వాడు మరో రథాన్ని అధిరోహించి క్రోధంతో భగభగలాడుతూ చురకత్తులు విసిరాడు. కాళికాదేవి వాటినన్నింటినీ మధ్యలోనే ఖండించి అతడి రథానికి ఇరువైపులా రక్షకులుగా ఉన్న రాక్షసులను సంహరించింది. సూతుడినీ గాడిదలనూ మట్టుబెట్టింది. వాడి ధనుస్సును విరిచేసింది. దిక్కులు పిక్కటిల్లేలాగా శంఖనాదం చేసింది. ధూమ్రలోచనుడు సర్వలోహమయమైన పరిఘను స్వీకరించి కాలయముడిలా కాళికాదేవిపైకి లంఘించాడు. కురూపీ ! కలహప్రియా ! ఇప్పుడే నీ అంతు చూస్తానంటూ దూసుకువచ్చాడు. కాళికాదేవి క్రోధతామ్రాక్షియై హుంకరించింది. ధూమ్రలోచనుడు భస్మమైపోయాడు. రాక్షస సైనికులు భయవిహ్వలులై పలాయనం చిత్తగించారు. దేవతలు ఆనందం పట్టలేక కాళికాదేవిపై పుష్పవర్షం కురిపించారు.

ఆ క్షణంలో రణరంగం భీకరంగా ఉంది. రాక్షసుల కళేబరాలు. గాడిదల శవాలు. తెగిపడిన అవయవాలు. మాంసం ముద్దలు. రక్తప్రవాహాలు. కాకులూ గ్రద్దలూ డేగలూ రాబందులూ నక్కలూ కలహించుకుంటున్న కోలాహలం. కాళికాంబికలు ఆ ప్రదేశం నుంచి వైదొలగి అల్లంతదూరాన మరొక సమతలంలో విడిది చేసి, విజయసూచకంగా శంఖనాదం చేశారు. అది శుంభుడి నివాసమందిరంలో ప్రతిధ్వనించింది. సోదరులిద్దరూ ఈవలికి వచ్చి చూశారు. క్షతగాత్రులై తిరిగివస్తున్న దానవసైనికులు కనిపించారు. కొందరు కొందరిని మంచాలపై మోసుకువస్తున్నారు. ధూమ్రలోచనుడు కనపడలేదు. ఏమయ్యాడు ? అంబికను తీసుకురాలేదా ఇంకా ? అని సేవకులను ప్రశ్నించారు.

సేవకులు భయపడుతూ భయపడుతూ, జరిగిన సంగతి వివరించారు. వినిపిస్తున్నది అంబికా శంఖనాదం. కాళికాదేవి ధూమ్రలోచనుడిని కడతేర్చింది. మిగిలినవారిని సింహం పొట్టనపెట్టుకుంది. దేవతలు పుష్పవృష్టి కురిపిస్తున్నారు. ఇదంతా చూస్తుంటే మనకేదో మహోపద్రవమే వచ్చినట్టు కనపడుతోంది. జయించడం కష్టమనిపిస్తోంది. ప్రభూ ! మంత్రులతో చర్చించు. ఒంటరిగా వచ్చిన ఆడది ఇంత చేసిందంటే ఆశ్చర్యంగా ఉంది. ఏ సైన్యమూ లేదు. ఏ సహాయమూ లేదు. నిర్భయంగా నిలబడి యుద్ధం చేస్తోంది. మిమ్మల్ని కయ్యానికి రమ్మని కవ్విస్తోంది. సింహంమీద కూర్చోవడమేమిటో - విడ్డూరంగా ఉంది. దానవనాథా ! సంధి చేసుకోవడమా, యుద్ధానికి దిగడమా ? తేల్చుకోవలసిన సమయం



ఆసన్నమయ్యింది. బాగా ఆలోచించి మీ నిర్ణయం చెప్పండి. దానిప్రకారం మా రాక్షసవీరులమందరమూ నడుచుకుంటాం. ఆవిడ దగ్గర సైన్యం లేదు. కానీ దేవతలంతా అటువైపు ఉన్నట్టే. సమయం వస్తే బయటపడతారు. హరిహరులుకూడా రంగంలోకి దిగుతారు. దిక్పాలకులు సేనాసమేతులై ఆకాశంలో అదృశ్యరూపాలతో సర్వసన్నద్ధంగా ఉన్నారని తెలిసింది. గంధర్వ కిన్నర మానవజాతులంతా అవసరాన్నిబట్టి నడుం బిగిస్తారు. మా బుద్ధికే ఇవన్నీ తెలుస్తున్నాయి. కాళికాదేవిని చూస్తుంటే ఆవిడకి అసలు ఎవరి సహాయమూ అవసరం లేదనిపిస్తోంది. కేవలహుంకారంతో ధూమ్రలోచనుడిని భస్మం చేసింది. ఈ చరాచరజగత్తునంతటినీ చిటికెలో భస్మం చెయ్యగలదు. మన దానవసమూహం ఏపాటి? మహాప్రభూ! నీకు కోపం వస్తే రావచ్చుగానీ, నీ అనుయాయులుగా ఇది మా కర్తవ్యం. హితాన్నీ సత్యాన్నీ మితంగానైనా చెప్పడం మా ధర్మం. కనక సాహసించి మనవి చేశాం. మీకు ఏది రుచిస్తే అది చెయ్యండి. ఆజ్ఞాపించండి.

సేవకుల మాటలు శాంతంగానే ఆలకించాడు శుంభుడు. సోదరుణ్ణి తీసుకుని రహస్య మందిరంలోకి ప్రవేశించాడు. "తమ్ముడూ! ధూమ్రలోచనుడు మహావీరుడు. క్షణంలో బూడిదైపోయాడు. సైనికులు బుగ్గిఅయి పోయారు. మదగర్వంతో ఆ మహాతల్లి శంఖనాదం చేస్తోంది. కాలగతి ఏ నిమిషానికి ఎలా మారుతుందో జ్ఞానులకైనా తెలియదు. గడ్డిపోచ ఒక వజ్రాయుధం కావచ్చు. ఒక వజ్రాయుధం గడ్డిపరకైనా కావచ్చు. దైవం అనుకూలించకపోతే బలవంతుడే బలహీనుడవుతాడు. కాలగతి - దైవగతి అటువంటివి. సోదరా! అందుకే నిన్ను సలహా అడుగుతున్నాను. ఏం చేద్దాం ? అంబికాదేవి మనకు దక్కుతుందనేమాట కల్ల. అది వదిలెయ్. యుద్ధానికి దిగడమా, పారిపోవడమా - ఇదీ ప్రశ్న. త్వరగా తేల్చి చెప్పు. నువ్వు వయస్సులో నాకంటే చిన్నవాడివే అయినా, సంకట పరిస్థితులలో నీ బుద్ధి చురుకుగా పనిచేస్తుంది. సలహా చెప్పడంలో పెద్దవాడివే. నువ్వు ఎలా అంటే అలా చేద్దాం."

అగ్రజా! పలాయనం మనకు యుక్తంకాదు. దుర్గాలలో తలదాచుకోవడమూ సమంజసం కాదు. యుద్ధమే శ్రేయస్కరం. అదే కర్తవ్యం. సేనా సమేతుడనై వెడతాను. నేనే వెడతాను. ఆ అబలలను సంహరించివస్తాను. దైవం ప్రతికూలించి జరగరానిదే జరిగితే అప్పుడు నువ్వు మరోసారి బాగా ఆలోచించి ఏదో ఒక నిర్ణయం తీసుకుందువుగాని.

అయితే, తమ్ముడూ! నువ్వుండు. చండముండులు ఉన్నారుగదా, వాళ్ళను పంపిద్దాం. కుందేలును పట్టుకోడానికి ఏనుగును పంపకూడదుగదా! చండముండులు మహావీరులు. కాళికాంబికలకు వీళ్ళు సరిపోతారు.

శశకగ్రహణాయాత్ర న యుక్తం గజమోచనమ్ ।
చండముండౌ మహావీరౌ తాం హంతుం సర్వథా క్షమౌ ॥(25 - 56)



సంభాషణ ముగించి శుంభనిశుంభులు రహస్య మందిరంనుంచి ఇవతలికి వచ్చారు. వస్తూనే చండముండులను యుద్ధానికి వెళ్ళమని ఆజ్ఞాపించారు. సర్వసేనాసమేతులై సర్వాయుధ సన్నద్ధులై తరలి వెళ్ళండి. మదగర్వితలైన ఆ సిగ్గులేని ఆడవాళ్ళనిద్దరినీ సంహరించి రండి. ఎవరినీ ప్రాణాలతో పట్టి బంధించి తీసుకురావలసిన అవసరం లేదు. అలాంటి ప్రయత్నం ఏమీ చెయ్యకండి. నిర్దాక్షిణ్యంగా మట్టుబెట్టి రండి. ***(అధ్యాయం - 25, శ్లోకాలు -60)***

## ◆ చండముండ సంహారం ◆

శుంభుడి ఆజ్ఞను శిరసావహించి చండముండులు బయలుదేరారు. భూమి కంపించేట్టు మహాదానవసైన్యం వారివెంట నడిచింది. సింహవాహనారూఢను దర్శించారు. పార్శ్వంలోనే కాళికాదేవి కనిపించింది. అమాయకుల్లా ముఖాలు పెట్టి సాత్త్వికంగా పలకరించారు.

మహిళామణులారా! శుంభనిశుంభులను గురించి మీకు అట్టే తెలియదనుకుంటాను. దేవేంద్రుణ్ణి మట్టి కరిపించిన మహావీరులు. మీరేమో ఏకాకులు. సింహం ఉందిగదా అని విర్రవీగుతున్నారేమో! ఇలాంటి సింహాలు కోటివచ్చినా శుంభనిశుంభులను ఏమీ చెయ్యలేవు. వారు అజేయులు. ఈ మాత్రం బుద్ధి చెప్పేందుకు మీకు ఆడా మగా ఎవరూ లేరా? దేవతలేమైనా ప్రేరేపిస్తున్నారేమో! కడపటికి నిరాశ మిగులుతుంది. వినాశనమైపోతారుసుమా!

జేతుమిచ్ఛసి దుర్బుద్ధే! శుంభం సర్వబలాన్వితమ్ ।
మతిదః కోఽపి తే నాస్తి నారీ వాపి నరోఽపి వా ॥ (26 - 5)

బలాబలాలను బాగా ఆలోచించుకుని ఒక నిర్ణయం తీసుకోండి. తన్వంగీ! పద్దెనిమిది బాహువులున్నాయికదా అని గర్వించకు. అదంతా వ్యర్థం. పనికిరాని భుజాలూ, పనికిరాని ఆయుధాలూ. శ్రమ తప్ప ఏమిటి ప్రయోజనం? ఐరావతకుంభస్థలాన్ని పిడిగ్రుద్దులతో పగులగొట్టిన బాహుబలశాలి శుంభుడు. అతడు కోరినట్టు నడుచుకుని సుఖపడు. అనవసరంగా ఆయాసపడకు. హితం చెబుతున్నాం. మామాట విను. విశాలాక్షీ! దుఃఖాలు కొని తెచ్చుకోకు. శాస్త్ర విశారదులైన పెద్దలు ఇదే చెబుతున్నారు. కష్టాలనూ కడగండ్లనూ కలిగించే పనుల్ని దూరంగా వదిలెయ్యమనీ, సుఖాలనూ సంతోషాలనూ కలిగించే పనులను వెంటనే చేపట్టమనీను.

దుఃఖదాని చ కార్యాణి త్యాజ్యాని దూరతో బుధైః ।
సుఖదాని చ సేవ్యాని శాస్త్రతత్త్వవిశారదైః ॥ (26 -10)



ఓ కోకిలా! నువ్వు తెలివైనదానివిలాగానే కనపడుతున్నావు. శుంభనిశుంభుల సేనాబలాన్ని అంచనా వెయ్యి. ప్రత్యక్షంగానే చూస్తున్నావుగదా! ఊహలు అనవసరం. విజయం సంశయాస్పదమైనప్పుడు ఎవరైనా యుద్ధానికి సాహసిస్తారా? మిమ్మల్ని అడ్డంపెట్టుకుని దేవతలు కసితీర్చుకోవాలనుకుంటే వారి నయవంచనలకూ నంగనాచికబురులకూ మీరు మోసపోకండి. వాళ్ళ స్వార్థం తీరకపోగా మీకు దుఃఖం మిగులుతుంది. పనికోసం జతకట్టే కార్యమిత్రుణ్ణి పరిత్యజించి ధర్మమిత్రుడిని విశ్వసించమన్నారు. దేవతలు ఎప్పుడూ స్వార్థపరులే. కార్యమిత్రులే. ఇది సత్యం.

కార్యమిత్రం పరిత్యజ్య ధర్మమిత్రం సమాశ్రయేత్ ।
దేవాః స్వార్థపరాః కామం త్వామహం సత్యమబ్రువమ్ ॥ (26 - 15)

శుచిస్మితా! సారాంశంగా చెబుతున్నాను. భువనేశ్వరుడూ చతురుడూ సుందరుడూ శూరుడూ కామశాస్త్రవిశారదుడూ అయిన శుంభుడిని భర్తగా స్వీకరించు. భువనేశ్వరివి అవుదువుగాని. అంతులేని భోగభాగ్యాలూ అనుభవిద్దువుగాని. అంబికా! బయలుదేరు. శుంభుడి దగ్గరికి వెడదాం. పద.

జగదంబిక ప్రళయకాలమేఘంలా ఒక్కసారి గర్జించింది. కళ్ళనుంచి నిప్పులు కురుస్తున్నాయి. అంధుడా! నీ ప్రేలాపనలు ఇక కట్టిపెట్టు. నయవంచకా! ఎంత మృదువుగా మాట్లాడుతున్నావు! హరిహరాదులను విడిచిపెట్టి మీ శుంభుడిని పతిగా వరించాలా? నేను వరించను. నాకు ఎవడూ భర్త కానవసరం లేదు. నాకు భర్తతో పనిలేదు. నేను సర్వతంత్ర స్వతంత్రురాలిని. సకల చరాచరజగత్తుకు నేనే అధినేత్రిని.

న మే కశ్చిత్పతిః కార్యో న కార్యం పతినా సహ ।
స్వామినీ సర్వభూతానామహమేవ నిశామయ ॥ (26 - 20)

ఈ శుంభనిశుంభులను చాలామందినే చూశాను. చాలామందినే సంహరించాను. ప్రతి యుగంలోనూ మీ దానవులు దేవబృందాలను పొట్టనబెట్టుకుంటూనే ఉన్నారు. కట్టకడపటికి నా చేతిలో అంతమొందుతూనే ఉన్నారు. ఇప్పుడు మాత్రం కాలమే స్వయంగా ఇక్కడికి వచ్చింది. మీ దానవులను అంతమొందించనుంది. ఏదో రక్షించుకుందామని వృథాప్రయత్నం చేస్తున్నట్టున్నావు. కానీ అవి ఏవీ సాగవు. నిజంగా వీరుడివే అయితే కబుర్లు కట్టిపెట్టి యుద్ధం చెయ్యి. ఈపూట నువ్వు మరణించడం తథ్యం. శుంభనిశుంభుల గొడవ నీకు దేనికి? నీ యుద్ధమేదో నువ్వు చెయ్యి. వీరస్వర్గాన్ని అలంకరించు. నీ నాయకులూ మీ బంధువులూ అందరూ వరసగా నీవెంట వస్తారు. మరేమీ భయం లేదు. ఒక్క క్షణం వెనకా ముందూ అంతే. ఇవ్వేళ అందరినీ సంహరించడం తథ్యం. అంచేత పెద్దగా బెంగపెట్టుకోకు.



ముందు నిన్నూ, తరవాత నీ సోదరుణ్ణీ, అటుపైని శుంభనిశుంభులనూ చివరలో రక్తబీజుణ్ణీ - ఇదీ నేను సంహరించే క్రమం. మిగతా దానవవీరుల మాటకేమిగానీ, నాయకులసంగతి చెప్పాను. నిలబడి యుద్ధం చేస్తావో, పారిపోతావో త్వరగా తేల్చుకో. వాగుడు పిరికిపందల లక్షణం.

ఈ ఎకసక్కేలకు చండముండులు రెచ్చిపోయారు. ఇద్దరూ ఒక్కసారిగా ధనుష్టంకారం చేశారు. అంబిక శంఖం పూరించింది. సింహం ఒక్కసారి జూలు దులిపి గర్జించింది. భీకర సంగ్రామం చెలరేగింది.

చండప్రచండంగా యుద్ధం సాగుతోంది. ఆకాశమంతా - కర్షకులను భయపెట్టే మిడతల దండులా బాణాలు ఆవరించాయి. చండుడికితోడు ముండుడుకూడా శరవృష్టి కురిపించాడు. రణరంగాన కృత్రిమంగా కారుచీకట్లు కమ్ముకున్నాయి.

గగనం ఛాదితం తత్ర సంగ్రామే విశిఖైస్తదా ।
శలభైరివ మేఘాంతే కర్షకాణాం భయప్రదైః ॥ (26 - 36)

అంబికాదేవికి క్రోధంతో ముఖం నల్లబడింది. కన్నులు అరటిపువ్వులా ఎర్రబడ్డాయి. నొసట కుటిలభ్రుకుటి ఏర్పడింది. ఆ లలాటఫలకం నుంచి మరొక స్త్రీమూర్తి కాళికగా ఆవిర్భవించింది. పులితోలు చీరగా కట్టుకుని, గజచర్మం పైటగా ధరించింది. పుర్రెలు దండగా గుచ్చి మెడలో వేసుకుంది. రూపం క్రూరాతిక్రూరంగా ఉంది. ఎండిపోయిన దిగుడుబావిలాంటి పొట్ట. ఒక చేతిలో ఖడ్గమూ మరొక చేతిలో పాశమూ ఉన్నాయి. భీషణంగా భీకరంగా రౌద్రంగా కాళరాత్రిలాగా ఉంది. విశాలమైన నోరు. పొడవైన నాలుక. తాచుపాములా అది మాటిమాటికీ కదులుతోంది. విపులమైన కటిప్రదేశం. ఆవిర్భవించడమే తడవుగా రణరంగంలోకి సుడిగాలిలా ప్రవేశించింది. దానవులను గుంపులు గుంపులుగా పిడికిట బట్టి పళ్ళతో కొరికి పీల్చి పిప్పిచేస్తోంది. మదగజాలను జయఘంటికలతోసహా చేతబట్టి నమిలేస్తోంది. గుర్రాలనూ లొట్టిపిట్టలనూ తేలికగా భక్షిస్తోంది. రథాలను రథికసారథులతో సహా పళ్ళమధ్య పటపటలాడిస్తోంది. రెప్పపాటు కాలంలో దానవ మహాసైన్యం సగానికి పైగా తుడిచిపెట్టుకుపోయింది. ఏమి చెయ్యాలో తోచని చండుడు జారిపడిన ఒక రథచక్రాన్ని బలంగా ఎత్తి విసిరాడు. అంబికాదేవి ఒకేఒక్క బాణంతో ఆ చక్రాన్ని నుగ్గునుగ్గు చేసింది. మరిన్ని బాణాలను గుప్పించింది. తాళలేక చండుడు మూర్ఛిల్లాడు. నేలకు ఒరిగిపోయాడు.

ఇది చూసిన ముండుడు క్రోధ సమ్మూర్ఛితుడయ్యాడు. వీరావేశంతో శరాసారం కురిపించాడు. అంబిక ప్రయోగించిన బాణాలతో అవ్వి నువ్వుగింజల్లా రాలిపోయాయి. అర్ధచంద్రాకార బాణంతో ముండుణ్ణి గుండెలమీద కొట్టింది. తట్టుకోలేక నేలకు ఒరిగిపోయాడు. రాక్షస పక్షంలో హాహాకారాలు చెలరేగాయి. ఆ ధ్వనికి చండుడు మూర్ఛదేరాడు. పొడవాటి ఇనపగదను అందుకున్నాడు. అందుకోవడమే



తపవుగా కాళికపైకి విసిరాడు. అది వచ్చి కుడిబుజానికి గట్టిగా గుద్దుకుని నేలకు పడిపోతూంటే ఎడమ చేతితో పట్టుకుంది. సన్నటి తీగను వంచినట్టు ఆ మహాగదను వంచి ఆమడల దూరానికి విసిరేసింది. మంత్రశక్తితో బాణపాశం వేసి చండుణ్ణి బంధించింది. కాలూచెయ్యీ ఆడకుండా చేసింది.

ఇప్పుడు ముండుడు మూర్ఛతేరేడు. శక్తి ఆయుధాన్ని చేపట్టి కాళికవైపు రివ్వున దూసుకువస్తున్నాడు. రానిచ్చి రానిచ్చి, ఒక్కసారిగా బాణపాశంతో బంధించివేసింది. అన్నదమ్ములిద్దరూ వలలో చిక్కిన కుందేలు పిల్లల్లా గిలగిలలాడుతున్నారు. కాళికాదేవి పకపకా నవ్వుకుంటూ అంబికను చేరుకుంది.

హే అంబికే! రణయజ్ఞంకోసం రెండు పశువులను తెచ్చాను. స్వీకరించు - అంది.

హే రణప్రియే! కాళికే! నీ చాతుర్యం అద్భుతం. వాళ్ళని మట్టుబెట్టకు, విడిచిపెట్టకు. దేవకార్యాన్ని త్వరగా నిర్వహించాలి నువ్వు.

అయితే, అంబికే! ఈ యుద్ధయజ్ఞంలో ఖడ్గయూపాన్ని ప్రతిష్ఠించి ఈ జంతువులను బలి ఇస్తాను. ప్రాణిహింసాదోషం అంటదు - అంటూనే కాళికాదేవి ఒక్క అంగలో చండముండులను సమీపించి చర్రున కత్తిదూసి ఒకేవేటుతో ఇద్దరితలలూ తరిగేసింది. కంఠనాళాలనుంచి ఎగిసిపడుతున్న వేడివేడి క్రొన్నెత్తురును నోరు తెరిచి ఆనందంగా త్రాగేసింది.

మళ్ళీ తన చేరువకు వచ్చి నిలిచిన కాళికాదేవిని అంబిక అభినందించింది. చండముండులను సంహరించి దేవకార్యాన్ని నిర్వహించావు కనక కాళికా నీకొక వరం ఇస్తున్నాను. ఈ రోజు నుంచీ చండముండనామంతో జగద్విఖ్యాతిని వహిస్తావు - అంది. ***(అధ్యాయం - 26 , శ్లోకాలు -66)***

హతశేషులైన దానవసైనికులు పలాయనం చిత్తగించారు. శుంభనిశుంభులను చేరుకున్నారు. రక్షించు మహాప్రభూ! కాళికాదేవి ఇవ్వేళ మొత్తం మనల్ని అందరినీ భక్షించేట్టుంది. మేమెలాగో తప్పించుకుని పారిపోయి వచ్చాము. చండముండులు ఇక మనకి లేరు. ఇదేమి యుద్ధమో మేమెప్పుడూ కనీవినీ ఎరగం. ఏనుగుల్నీ గుర్రాల్నీ ఒంటెల్నీ సైనికుల్నీ - గుంపులు గుంపులుగా పట్టుకుని కరకరా నమిలేస్తోంది కాళికాదేవి. ఇవపరథాలుకూడా ఆగడం లేదు. ఆవిడ మీద ఏ ఆయుధమూ పనిజెయ్యడం లేదు. రణరంగమంతా రక్తపుమడుగు అయిపోయింది. మాంసమే బురదగా, పేగులే నాచుతీగలుగా, రథచక్రాలే చక్రవాకాలుగా, తెగిపడిన అవయవాలు జలచరాలుగా - ఈ మడుగు భయంకరంగా ఉంది. మహారాజా! నీ వంశాన్ని రక్షించుకో. కాళికాదేవిని శరణువేడు. లేదంటే పారిపో. అంతేకానీ యుద్ధానికి దిగకు. నాశనం చేసేస్తుంది. ఇది ఖాయం. కాళికా సింహాల ఆకలి నీతోగాని తీరదేమో! వీరికితోడు అంబికాదేవి బాణపరంపర ఒకటి. ప్రత్యక్షంగా చూసి వచ్చాం కనక చెబుతున్నాం. అడది నన్నేం చేస్తుందని



అహంకరించకు. అనవసరంగా కలహించకు. ఆవిడ దక్కకపోతే నీకు వచ్చిన నష్టం లేదు. దక్కించుకోడానికని పంతానికిపోయి యుద్ధానికి దిగేవో నువ్వే దక్కవు. ఒక అల్ప ప్రయోజనం కోసం వంశనాశనంలాంటి మహాదుఃఖాలను కొనితెచ్చుకోవడం తెలివైన పనికాదు. సూచనలన్నీ నీకు ప్రతికూలంగానే ఉన్నాయి. గమనించు. ఒక ఆడది అసహాయంగా నిలబడి ధూమ్రలోచన చండముండాది మహాదానవవీరులను సంహరించింది. చిటికెలో సంహరించింది. కనీసం ఆవిడకు చెక్కిళ్ళుకూడా కందలేదు. అనాయాసంగా మట్టుబెట్టింది. లోకపాలకులనే మట్టికరిపించిన నిన్ను యుద్ధానికి రమ్మని ధైర్యంగా ఆహ్వానిస్తోంది. వీరిని వీరిని ఈ క్రమంలో సంహరిస్తానని పట్టిక చదువుతోంది. ఇదంతా ఏమిటో గ్రహించు.

పుష్కరక్షేత్రంలో మీ అన్నదమ్ములు ఒకప్పుడు తపస్సు చేశారు. బ్రహ్మదేవుడు మెచ్చి వరం ఇచ్చాడు. దాని ప్రకారం పురుషుడిచేతిలో మీకు మరణం లేదు. నిజమే. కానీ స్త్రీ చేతిలో? ఇప్పుడు మిమ్మల్ని చంపడానికే ఈ అంబిక వచ్చింది. సందేహం లేదు. అందుచేత బాగా ఆలోచించండి. యుద్ధం విరమించండి.

తస్మాత్ త్వాం హంతుకామైషా ప్రాప్తా యోషిద్వరా ప్రభో ।
యుద్ధం మా కురు రాజేంద్ర ! విచార్యైవం ధియాధునా ॥ (27 - 18)

ఈ అంబిక సాధారణస్త్రీ కాదు. మీ పాలిటి కాళరాత్రి. మహామాయ. పరాప్రకృతి. కల్పాంతంలో సృష్టిసంహారం చేస్తుందని పెద్దలు చెప్పే మహాదేవి. జగత్సృష్టికారిణి. దేవతలకు ఈశ్వరి. త్రిగుణాత్మిక. కాళికగా తామసస్వరూపిణి. సర్వశక్తి సమన్విత. అజయ్య. అక్షయ. నిత్య. సర్వజ్ఞ. సదోదిత. వేదమాత. గాయత్రి. సంధ్య. సర్వసురాలయ. నిర్గుణ. సగుణ. సిద్ధ. సర్వసిద్ధిప్రద. అవ్యయ. ఆనందస్వరూపిణి. ఆనందప్రదాయిని. గౌరి. దేవతలకు అభయప్రద. ఇందులో ఏ సందేహమూ లేదు. మామాట నమ్ము. దయచేసి వైరం పెట్టుకోకు. శరణువేడుకో. రక్షిస్తుంది. వంశాన్ని బతికించుకో. హతశేషులైన దానవులను చిరాయుష్కులను చెయ్యి.

దానవ వీరులు తమను తాము మరిచిపోయి, ఎవరితో మాట్లాడుతున్నామో మరిచిపోయి, ఏదో పూనకంలో ఉన్నట్టు స్తోత్రాలు చేసేసరికి శుంభనిశుంభులకు క్రోధం నషాళానికి అంటింది. భరించలేని ఆవహ్యంతో, దిక్కులు పగిలేట్టు ఏకకంఠంతో అరిచారు. నేలను దభీమని తన్ని, పిడికిలితో సింహాసనాన్ని గుద్ది శుంభుడు లేచి నిలబడ్డాడు. కళ్ళు జ్యోతుల్లా వెలిగిపోతున్నాయి.

మూర్ఖుల్లారా! రణరంగంనుంచి పారిపోయి వచ్చిన పిరికిపందల్లారా! పొండి. మీ మొహాలు నాకు చూపించకండి. అంతగా బతకాలని ఉంటే పాతాళంలో ఏమూలనో దాక్కోండి. లేదా ఆత్మహత్యలు చేసుకుని చావండి.



జగత్తు అంతా దైవాధీనం. నేను జయిస్తానో లయిస్తానో మీకెందుకు? ఏది జరగాలో అది జరుగుతుంది. జరగనివ్వండి. దానికోసం ఇప్పటినుంచీ దిగులుపడి ఏమి ప్రయోజనం ? దుఃఖించి తప్పించగలమా? మరణానికి భయపడి స్వధర్మాన్ని వదులుకుంటామా? వదులుకున్నంతమాత్రాన శాశ్వతంగా బతికి బట్టకడతామా? చావుపుట్టుకలూ సుఖదుఃఖాలూ ఎవరికి ఎప్పుడు రాసిపెట్టి ఉన్నాయో అప్పుడు వస్తాయి. అందాకా ఎవరు ఎంత దొర్లినా రావు. వద్దు అనుకున్నా ఆగవు. కాలంమూడితే బ్రహ్మాది దేవతలే నశిస్తారు. అలాగే నేనూ కాలవశుణ్ణి. ఇందులో విచారించవలసింది ఏమీలేదు. వంశధర్మాన్నీ వీర ధర్మాన్నీ పాటిస్తాను. జయమే రానీ, పరాజయమే రానీ. ఒక అబల యుద్ధానికి రమ్మని జబ్బచరిచి ఆహ్వానిస్తే, పొలిమేరలో నిలబడి ధనుష్టంకారం చేస్తే, పలాయనం చిత్తగించి పదికాలాలపాటు బతకమంటారా? అదీ ఒక బతుకేనా? అంతకన్నా యుద్ధంలో మరణించడం గౌరవప్రదం కాదూ? యుద్ధమే చేస్తాను. విజయమో వినాశనమో ఏదైనా స్వీకరిస్తాను. పురుషకారానికి పట్టంకట్టే విద్వాంసులు దైవం మిథ్య అంటున్నారు. అదే యుక్తియుక్తమనిపిస్తోంది. ఏ ప్రయత్నమూ చెయ్యకుండా ఎవరికీ ఏ కోరికలూ తీరవు. తలరాతని నమ్ముకుని కూర్చోవడం పిరికిపందల లక్షణం. అదృష్టాన్ని మూఢులు విశ్వసిస్తారు. పండితులు నమ్మరు. దానిపేరే అదృష్టం. అది ఏనాడైనా ఎవరికైనా కంటికి కనపడిందా? కనపడుతుందా? ప్రజలను భయపెట్టడమూ ఏమార్చడమూ తప్ప ఏమిటి ఇదంతా? అలసులకి ఆలంబన ఇది. అసమర్థులకు ఊరడింపు ఇది. చక్రధారి ఉన్నాడు. పిష్టకారిణి ఉంది (పిండిమర). ఏ ప్రయత్నమూ లేకుండా పిష్టం తయారవుతుందా? కాదుగదా!

చక్రీ సమీపే సంవిష్టః సంస్థితా పిష్టికారిణీ ।
ఉద్యమేన వినా పిష్టం న భవత్యేవ సర్వథా ॥ (27 - 40)

పనులు సిద్ధించాలంటే ప్రయత్నం చెయ్యాలి. సిద్ధించలేదంటే ప్రయత్నలోపమే కారణం. దేశకాలాలూ బలాబలాలూ చూసుకుని గట్టిగా పూనుకుంటే జరగని పనులంటూ ఏవీ ఉండవని బృహస్పతి మతం.

దేశం కాలం చ విజ్ఞాయ స్వబలం శత్రుజం బలమ్ ।
కృతం కార్యం భవత్యేవ బృహస్పతివచో యథా ॥ (27 - 42)



## ◆ రక్తబీజ సంహారం ◆

ఇలా తన నిశ్చయాన్ని ప్రకటించి దైత్యేంద్రుడు రక్తబీజుడిని పిలిపించాడు. మహాసైన్యంతో రణరంగానికి వెళ్ళమన్నాడు. ఈమాటకు రక్తబీజుడు సంబరపడ్డాడు. ఇప్పుడే వెడతాను. నా శౌర్యపరాక్రమాలు చూపిస్తాను. కాళికను సంహరించి అంబికను బంధించి తెస్తాను. నీకు పాదదాసిని చేస్తాను - అంటూ రథం అధిరోహించి ఉద్యానవనంవైపు కదిలాడు.

రక్తబీజుడు వస్తున్నాడని గ్రహించిన అంబిక శంఖం మరోసారి భీకరంగా పూరించింది. రక్తబీజుడు వచ్చాడు. చండముండుల్లాగానే గౌరవంగా మృదువుగా మాట్లాడాడు.

హే బాలే! శంఖం అంతగట్టిగా పూరిస్తున్నావు. నేను భయపడి పారిపోతాననుకున్నావా? నేనేమీ పిరికివాణ్ణి కాదు. ధూమ్రలోచనుడుకాదు నా పేరు. రక్తబీజుడు. యుద్ధం చెయ్యాలనుకుంటే సన్నద్ధంకా. ధనువ్వు ఎక్కుపెట్టు. నా పరాక్రమం చూద్దువుగాని. ఇంతవరకూ నిన్ను ఎదిరించినవాళ్ళలాంటివాణ్ణి కాను.

ఇంతకీ అమ్మాయీ! నువ్వు ఏ గురువులను సేవించావు? నీతిశాస్త్రాలు ఏమైనా చదివావా? అర్థశాస్త్రం ఎరుగుదువా? విద్వద్గోష్ఠులలో ఎప్పుడైనా పాల్గొన్నావా? సాహిత్యపరిజ్ఞానం ఏమైనా ఉందా? ఉంటే కనక నేనొక మాట చెబుతాను. విను. తొమ్మిది రసాలలోనూ రెండే ముఖ్యరసాలు. శృంగారమూ శాంతమూను. వీటిలోకూడా శృంగారమే మహారాజు. లక్ష్మీశ్రీహరులు, సరస్వతీచతుర్ముఖులు, శచీదేవేంద్రులు, పార్వతీపరమేశ్వరులు - ఈ రసాన్నే ఉపాసిస్తున్నారు. తరువూ తీగ, మృగమూ మృగి, కపోతమూ కపోతి - ఇలా జగత్తు అంతా జంటలమయం. అంతటా సంయోగ శృంగారమే. ఈ వైభోగాలను పొందలేని పిరికిపందలు వైరాగ్యాలను ఆశ్రయించి యతులూ సన్యాసులూ అవుతున్నారు. మూఢులు. దైవవంచితులు. సంసార రససారం తెలియక వంచితులై ఇతరులనూ వంచిస్తున్నారు. మధురాలాపాలతో విగ్రహమనీ శమమనీ దమమనీ శాంతిఅనీ జ్ఞానమనీ ఏదేదో చెబుతున్నారు. ప్రజలకు ప్రబోధిస్తున్నారు. మన్మథుడు మనస్సులో కదంతొక్కుతూంటే ఎక్కడి జ్ఞానం, ఎక్కడి వైరాగ్యం? అంతా వట్టి వంచన. ఆత్మవంచన, పరవంచన. కల్యాణీ! నువ్వుకూడా ఏదో ఇలాంటి వంచనకు లోనైనట్టు కనిపిస్తున్నావు. త్వరగా ఆ ఉచ్చునుంచి బయటపడు. నీకు తగిన అందగాణ్ణి చూసి వివాహం చేసుకో. త్రిలోకవిజేత శుంభుడివైనాసరే, అతడి తమ్ముడూ మహాబలుడూ నిశుంభుడినైనా సరే వరించు. రసరాజభోగాలు అనుభవించు. ***(అధ్యాయం - 27, శ్లోకాలు - 64)***

చండముండులవంటివాణ్ణి కానంటూనే రక్తబీజుడు అదే బాణీలో చేసిన ప్రసంగానికి అంబికాదేవి పెద్దపెట్టున పరిహసించింది. కాళికాదేవి వికృతంగా వికటాట్టహాసం చేసింది. అంబికాదేవి మృదుమధురంగా బదులు పలికింది.



రక్తబీజా! ఎందుకింత శ్రమపడి ప్రసంగించావు. నేనేమీ వివాహం చేసుకోనని భీష్మించలేదే. మొదటవచ్చిన దూతతో చెప్పానుగదా! నాకు బలంలోనూ రూపంలోనూ సాటివచ్చేవాడు దొరికితే తప్పకుండా వివాహం చేసుకుంటాను. కాకపోతే అది నిరూపణ కావాలి. నిరూపితమవ్వాలంటే నాతో యుద్ధం చేసి నన్ను జయించాలి. అప్పుడు ఆ సదృశబలసంపన్నుడిని పరిణయమాడతాను. ఇది చిననాటి నా ప్రతిజ్ఞ. ఈమాట శుంభనిశుంభులకు చెప్పమని ఆ దూతకు స్పష్టంగా తెలియజేశాను. శుంభుడుగానీ నిశుంభుడగానీ వచ్చి బలం నిరూపించుకుని నన్ను చెట్టపట్టవలసిందిపోయి మిమ్మల్నీ మిమ్మల్నీ ఇలా పంపిస్తున్నాడు. ఇప్పుడు నువ్వు వచ్చావు. సరే యుద్ధం చేస్తావో, పారిపోతావో తేల్చుకో.

ఈ మాటలకు రక్తబీజుడు అసహనంతో కుమిలిపోయాడు. హఠాత్తుగా ధనుస్సు ఎక్కుపెట్టి సింహంమీద శరాసారం కురిపించాడు. అంబిక అలవోకగా వాటినన్నింటినీ తునాతునకలు చేసింది. పిడుగుల్లాంటి బాణాలతో వాడి గుండెలమీద, గాయం చెయ్యని కముకుదెబ్బలు కొట్టింది. వాడు రథంలోనే పడి స్పృహకోల్పోయాడు. దానవసైన్యం లబోదిబోమని గుండెలు బాదుకుంటూ పరుగులు తీసింది.

దానవవీరుల హాహాకారాలు శుంభుడి మందిరంలోకి వినిపించాయి. మండిపడ్డాడు. మూలబలంగా నిలిచిన మహాసైన్యంలో సగభాగాన్ని వెంటనే రణరంగానికి తరలించాడు. కాలకేయ కాంభోజ మహావీరులందరూ కోటానుకోట్లుగా సమరరంగానికి పరుగుపరుగున వచ్చారు.

అంబికాదేవి లోకభీకరంగా ఘంటానినాదం చేసింది. ధనుష్టంకారం చేసింది. విజయశంఖం పూరించింది. ఈ మూడు వాదాల భీషణ ధ్వనికి కాళికలో ఉత్సాహం ఉరకలు వేసింది. ఆననం విప్పారింది. సింహవాహనం ఆవులించి జూలు దులిపి గర్జించింది.

దానవవీరులందరూ అన్నివైపులనుంచీ ఒకేసారి వజ్రకఠోర విశిఖాలను కురిపించారు. కాళికాదేవి వాటి పనిపడుతోంది. సరిగ్గా ఇదే సమయానికి బ్రహ్మాదిదేవతల దివ్యశక్తులన్నీ అంబికలో ప్రవేశించాయి. సరస్వతీదేవి సూత్రకమండలువులు ధరించి హంసవాహనంమీద వచ్చి అంబిక పక్కన నిలిచింది. శంకచక్రగదాధారిణియై లక్ష్మీదేవి గరుడవాహనంమీద వచ్చింది. త్రిశూలం ధరించి అరచందురుణ్ణి కొప్పులో తురుముకొని వృషభవాహనంమీద శాంకరి వచ్చింది. శక్తి హస్త విభూషితగా నెమలి వాహనం మీద కౌమారి (కుమారస్వామి ఇల్లాలు), వజ్రపాణియై ఐరావతంమీద శచీదేవి, సూకరాకారంలో ప్రేతాసనంమీద సూకరి, వారసింహి, యమదండం ధరించి మహిషవాహనంమీద యామ్యాదేవి, వారుణీ కౌబేరీ ప్రముఖ దిక్పాలకాంతలూ తమ తమ అనుచరీగణాలతో వచ్చి నిలిచారు. అంబికాదేవి ఆనందంతో మరోసారి శంఖం పూరించింది.



శంకరుడు స్వయంగా వచ్చి అంబికను స్తుతించాడు. దేవకార్యసిద్ధికోసం, ఇక ఆలస్యం చెయ్యకుండా దానవులను సంహరించమనీ, శుంభనిశుంభులను అతమార్చి లోకాలను కాపాడమనీ, ప్రాణికోటికి ఆనందం పంచమనీ అభ్యర్థించాడు.

అంబికాదేవి చిరునవ్వులు చిందిస్తూ నిలబడింది. ఆ క్షణంలో ఆవిడ శరీరంనుంచి అత్యద్భుతశక్తి ఆవిర్భవించింది. భీషణంగా ప్రచండంగా ఉంది. శివాశతనినాదాలతో ఆవిర్భవించింది. ఘోరరూపంతో ఆవిర్భవించింది. రూపం ఎంత భీకరంగా ఉన్నా ముఖంమీద చిరునవ్వు చిందులాడుతోంది. దేవదేవా! పార్వతీప్రాణవల్లభా! నువ్వొక ఉపకారం చేసిపెట్టాలి. దూతగా శుంభనిశుంభుల దగ్గరికి వెళ్ళు. నా మాటగా చెప్పు. స్వర్గాన్ని దేవతలకు వదిలేసి, భూలోకాన్ని మానవులకు వదిలేసి వాళ్ళని వెళ్ళిపొమ్మను. పాతాళంలో ఉండిపొమ్మను. ఇంద్రుడు స్వర్గసింహాసనం అధిష్ఠించాలి. దేవతలు సుఖశాంతులతో వర్ధిల్లాలి. యజ్ఞభాగాలు దేవతలకే దక్కాలి. జీవితేచ్ఛ ఉంటే ఇలా చెయ్యమను. లేదంటే యుద్ధానికి రమ్మను. నావెంట వచ్చిన అడనక్కలు వారి రక్తంతో విందులు చేసుకుంటాయని చెప్పు.

శివుడు క్షణం ఆలస్యం చెయ్యకుండా బయలుదేరాడు. కొలువుతీరి ఉన్నాడు శుంభుడు. శివుడు ప్రవేశించాడు.

మూఢమతీ! దానవాధిపతీ! నేను శంకరుడను. త్రిపురాంతకుడను. అంబికాదేవి దూతగా వచ్చాను. కడసారిగా నీకు హితవు చెప్పిరమ్మని పంపించింది. స్వర్గలోకాన్నీ భూలోకాన్నీ విడిచిపెట్టి పాతాళానికి పారిపో. ప్రహ్లాదాదులతో కలిసి సుఖంగా జీవించు. లేదంటే మరింక ఆలస్యం చెయ్యకుండా రణరంగానికి తరలిరా. సబంధుమిత్ర పరివారంగా నిన్ను సంహరిస్తాను - అని మీకు హితబోధ చేసిరమ్మంది. అటుపైని మీ ఇష్టం అంటూనే శివుడు వెనుదిరిగి వచ్చేశాడు. ఇప్పటినుంచీ అంబికాదేవికి శివదూతి అనే పేరు స్థిరపడింది.

> **యయాసౌ ప్రేరిత: శంభుర్దూతత్వే దానవాన్ప్రతి ।**
> **శివదూతీతి విఖ్యాతా జాతా త్రిభువనేఽఖిలే ॥** **(28 - 46)**

శంకరుడు ఈమాట చెప్పి వెళ్ళిపోగానే అన్నదమ్ములు ఇద్దరూ కూడబలుక్కున్నారు. ఇంతదాకా వచ్చాక వెనుదిరగడమేమిటి అనుకున్నారు. శత్రుదుర్భేద్యమైన కవచాలు ధరించి శస్త్రాస్త్రాలన్నీ సమకూర్చుకుని సిద్ధంగా ఉన్న క్రూరాతిక్రూర దానవవీరమూలబలాన్ని మొత్తంగా రణరంగానికి తరలించారు. వారు వస్తూనే చండప్రచండంగా శిలావర్షంలా శరాసారం కురిపించారు. అంబికాదేవి దీటుగా సమాధానం చెప్పింది. రకరకాల ఆయుధాలతో యుద్ధం తీవ్రరూపం దాల్చింది.



కాళికాదేవి త్రిశూలంతో వీరవిహారం చేస్తోంది. యథావిధిగా దానవులనూ ఏనుగులను గుర్రాలనూ రథాలనూ ఒంటెలనూ పుంజీలు పుంజీలుగా గుప్పిటపట్టి నోటిలో కుక్కుకుంటోంది పళ్ళకింద పడి ఎముకలు విరుగుతున్న చప్పుడు, ఇనపకవచాలు నలుగుతున్న చప్పుడు, రథాల ముక్కలవుతున్న చప్పుడు ముబ్బడిగా దిగంతాలకు వ్యాపిస్తోంది.

బ్రహ్మాణి హంసవాహనంపై రణరంగంమీద ఎగురుతూ కమండలూదకాలను మంత్రించి జల్లుతోంది. అవి సోకిన దానవులు నిశ్శబ్దంగా మరణిస్తున్నారు. వృషభారూఢయైన శాంకరి త్రిశూలాన్ని కుడిఎడమలకు విసురుతూంటే వందలూ వేలుగా దానవుల శిరస్సులు బంతులై ఎగురుతున్నాయి వైష్ణవీదేవి గరుడవాహనంమీద గిరికీలు కొడుతూ నాలుగుచేతులా నాలుగు ఆయుధాలనూ ప్రయోగిస్తు రాక్షససంహారం చేస్తోంది. ఒక ఎత్తున ఒక వరసలో రివ్వున వెడుతున్న సుదర్శన చక్రం, అందిన తలలను మొండేలనూ తరుక్కుంటూ కడదాకా వెళ్ళి మరోదారిన తిరిగివస్తోంది. వస్తూ అదేపని చేస్తోంది. శచీదేవి వజ్రాయుధానికి తిరుగేలేదు. ఐరావత పాదకరాఘాతాలకు అంతేలేదు. వారాహీ దంష్ట్రాలకు రానురాను పదును పెరిగింది. కోరలకు వందలాదిగా దిగబడిన దానవకళేబరాలను ఏ చెట్టుకో కొండకొమ్ముకో పట్టించి వదిలించుకుంటోంది. మళ్ళీ రణరంగానికి దూసుకువస్తోంది. నారసింహి గజసైన్యంపై విరుచుకుపడుతోంది. కుంభస్థలాలు చీల్చి క్రొన్నెత్తురుతో విందులు చేసుకుంటోంది. కౌమారి ప్రయోగిస్తున్న శక్తి ఆయుధానికి సమాధానం చెప్పలేక దానవయోధులు తమ శిరస్సులను కానుకపెడుతున్నారు వారుణీదేవి పాశం విసిరితే వేలకువేలుగా రాక్షసులు సొమ్మసిల్లి పోతున్నారు. బందీలైపోతున్నారు. చిక్కినవారిని చిక్కినట్టు సింహం భక్షిస్తోంది. ఐరావతం మట్టగిస్తోంది.

చూస్తూండగానే రణరంగం ఖాళీఅయిపోయింది. హతశేషులు బుంబారవాలు చేస్తూ పారిపోయారు. ఆకాశం నుంచి దేవతలు మాతృగణంమీద పుష్పవృష్టి కురిపించారు. జయజయ నినాదాలు చేశారు.

రక్తబీజుడికి ఇప్పుడు మెలకువ వచ్చింది. రథంలో లేచికూర్చున్నాడు. తన రథం రణరంగానికి దూరంగా ఉంది. సారథి నొగలుపై చచ్చిపడి ఉన్నాడు. పరిస్థితి అర్థమయ్యింది. ఒళ్ళు విరుచుకుని దనుష్టంకారం చేశాడు. ***(అధ్యాయం - 28, శ్లోకాలు - 63)***

"జనమేజయా!" అన్నాడు వ్యాసుడు. మహర్షీ! ఆపకు. యుద్ధాన్ని కళ్ళకు కట్టిస్తున్నావు. కొనసాగించు - అన్నాడు జనమేజయుడు. అయితే ఆలకించు అంటూ కొనసాగించాడు సాత్యవతేయుడు.

**రక్తబీజుడికి ఉన్న వరం తెలుసుకదా! వాడి శరీరంనుంచి నేలకు రాలిపడిన ప్రతిరక్తబిందువునుంచీ అసంఖ్యాకంగా రక్తబీజులు ఆవిర్భవిస్తారు. అదే రూపం. అదేబలం. అదే పరాక్రమం. తపస్సుకి సంబరపడి భోళాశంకరుడు ఇచ్చిన అద్భుతవరమిది.**



తస్య దేహా(ద్రక్తబిందుర్యదా పతతి భూతలే ।
సముత్పతంతి దైతేయాస్తద్రూపాస్తత్పరాక్రమాః ॥
అసంఖ్యాతా మహావీర్యా దానవా రక్తసంభవాః ।
ప్రభవంత్వితి రుద్రేణ దత్తోఽస్తద్భుతో వరః ॥ (29 - 2, 3)

వరదాన దర్పితుడు రక్తబీజుడు క్రోధసంరక్తనేత్రుడై రణరంగానికి వచ్చాడు. గరుడవాహనంమీద వైష్ణవీదేవిని చూశాడు. శక్తి ఆయుధాన్ని విసిరాడు. వైష్ణవి తన గదాయుధంతో దాన్ని తుత్తునియలు చేసింది. సుదర్శనచక్రాన్ని ప్రయోగించింది. అది వెళ్ళి వాడి శరీరాన్ని నిలువుకోత కోసింది. చిందిపడిన రక్తబిందువుల నుంచి అసంఖ్యాకంగా రక్తబీజులు ఆవిర్భవించారు. రణరంగం క్రిక్కిరిసిపోయింది. ఎటుచూసినా రక్తబీజులే. అందరూ ఒక్కలాగా ఉన్నారు. వైష్ణవి ఆశ్చర్యపోయింది. బ్రహ్మాణీ మహేశ్వరీ నారసింహీ కౌమారీ శచీప్రభృతులందరూ ఇదేమిటని నివ్వెరపోయారు. తమతమ దివ్యాయుధాలను యథాశక్తిగా ప్రయోగించారు. వైష్ణవీదేవి మరిన్ని బాణాలను ప్రయోగించి రక్తబీజుడిని ఇంకా గాయపరిచింది. మరిన్ని రక్తబిందువులు చిందిపడి కోటానుకోట్లుగా రక్తబీజులు ఆవిర్భవించారు. వికటాట్టహాసాలు చేస్తూ విజృంభించారు.

బ్రహ్మాణీప్రభృతులకు ఏమిచెయ్యాలో తోచలేదు. దేవతలు నిశ్చేష్టులయ్యారు. అందరినీ దుఃఖమూ దైన్యమూ ఆవరించాయి. కాళికాదేవి ఒక్కతే ఉంది. ఇంతమంది రక్తబీజులతో పోరాడుతోంది. వాడి సంఖ్య క్షణక్షణానికీ పెరుగుతోంది. ఇప్పుడు శుంభుడుగానీ నిశుంభుడుగానీ ఇటువైపు వస్తే పరిస్థితి మరీ విషమిస్తుంది. ఎలాగా అని దేవతలంతా దిగులుపడుతున్నారు.

జగదంబిక ఒక్కక్షణం ఆలోచించింది. ఉపాయం ్టింది. వెంటనే కాళికాదేవిని పిలిచింది. హే చండముండే! నీ నోరును పూర్తిగా విస్తరించు. నాలుకను రణరంగమంతటా చాపు. నేను ప్రయోగిస్తున్న ఆయుధాలతో వాడి శరీరంనుంచి చిందే రక్తబిందువు ఒక్కటికూడా నేలమీదకు పడకుండా చప్పరించు. ఈ అసంఖ్యాక రక్తబీజులను అలాగే నెత్తురుచిమ్మకుండా భక్షించు. ఇదొక్కటేమార్గం. ఊఁ విస్తరించు. ఇంకా ఎంతసేపు చేస్తాం పీ తో ఈ యుద్ధం. త్వరగా ముగించి స్వర్గసామ్రాజ్యాన్ని ఇంద్రుడికి అప్పగించి, హాయిగా వెళ్ళిపోదాం - అంటూండగానే కాళికాదేవి కొండగుహలాగా నోటిని తెరిచింది. రక్తసర్పంలాగా నాలుకను చాపింది. అంబికాదేవి ఒక్కపెట్టున అన్ని ఆయుధాలమూ అసంఖ్యాకంగా ప్రయోగించింది. తెగిపడుతున్న మాంసఖండాలను నెత్తురుబొట్టు బీరుపోకుండా కాళికాదేవి భక్షించింది. కృత్రిమ రక్తబీజులు అందరూ, ఆవిర్భవించినంత వేగంగానూ లక్షలసంఖ్యలో భక్షితులయ్యారు. అసలువాడు ఒక్కడూ మిగిలాడు. అంబికాదేవి, అప్పటికి బాగా పదునెక్కి తళతళలాడుతున్న పొడవాటి కత్తిని విసిరింది. వాడి తలా మొండెమూ వేరైపోయాయి. కాళికాదేవి అవలీలగా చప్పరించేసింది.



## ◆ నిశుంభ సంహారం ◆

శుంభనిశుంభులకు వర్తమానం అందింది. బ్రహ్మాణీప్రభృతులు రణరంగానికి దిగారనీ, కాళికాదేవి ఉపాయంగా రక్తబీజుణ్ణి భక్షించిందనీ, ఇక తమకోసమే ఆవురావురుమంటూ ఎదురుచూస్తోందనీ - తెలిసింది.

ఇంతబతుకూ బతికి ఇప్పుడు ఈ ఆడదానికి భయపడి పారిపోవడమా? అవమానం. అంతకన్నా మరణమే వరణీయం - అనుకున్నాడు శుంభుడు. అదే తెగింపుతో పలికాడు -

తమ్ముడూ, నిశుంభా! నేను వెడుతున్నాను రణరంగానికి. అంబికను సంహరించి వస్తాను. ఒకవేళ రాలేదనుకో, నువ్వు ఈ కార్యాన్ని కొనసాగించు.

> హత్వా తామాగమిష్యామి నాగమిష్యామి చాన్యథా ।
> తరసా తాం శరైస్తీక్ష్ణైః నారీం నయ యమాలయమ్ ॥ (29 - 54)

అన్నగారి మాటలకు తమ్ముడు ఉక్రోషపడ్డాడు. నేనే వెడతాను, కాళికను సంహరించి, అంబికను బంధించి తెస్తాను. ఈపాటి ఘనకార్యానికి నువ్వు వెళ్ళాలా? నిశ్చింతగా ఉండు. నేనుండగా నువ్వు వెళ్ళడం సమంజం కాదు - అంటూనే మరి సమాధానంకోసం చూడకుండా నిశుంభుడు సొంతసైన్యంతో బయలుదేరాడు. వందిమాగధులు జయజయధ్వానాలు చేశారు.

*(అధ్యాయం - 29, శ్లోకాలు - 60)*

> నిశుంభో నిశ్చయం కృత్వా మరణాయ జయాయ వా ।
> సోద్యమః సబలః శూరో రణే దేవీముపాయయౌ ॥ (30 - 1)

నిశుంభుడు బయలుదేరగానే ఒంటరిగా మిగిలిన శుంభుడికి ఏమీ తోచలేదు. కొలువులో నిలవలేకపోయాడు. తన మందిరంలోకి వెళ్ళాడు. అక్కడా కూర్చోలేకపోయాడు. తానూ యుద్ధరంగానికి బయలుదేరాడు. రణపండితుడు. అల్లంత దూరాన నిలిచి ప్రేక్షకపాత్ర వహించాడు. ఆకాశంలో అదృశ్యరూపాలతో ఇంద్రాదిదేవతలూ, రణరంగంలో స్వబలంతో దైత్యేంద్రుడు శుంభుడూ ప్రేక్షకులయ్యారు.

శుంభసోదరుడు తన శాంకరధనుస్సును ఎక్కుపెట్టి పుంఖానుపుంఖంగా శిలాకఠినవిశిఖాలను గుప్పించాడు.

అంబికాదేవి తెరలు తెరలుగా పకపకా నవ్వింది. కాళికా! చూశావా వీళ్ళ మూర్ఖత్వం. సోదరులు నాతో యుద్ధానికి తలపడుతున్నారు. రక్తబీజుడు మరణించినా వీరికి బుద్ధిరాలేదు. జయించగలమనే ఆశపడుతున్నారు. ఇది నా మాయాశక్తి. ఆశతో వీరిని సమ్మోహితుల్ని చేశాను. ఈ ఆశ బహుచెడ్డది సుమా!



ఒకపట్టాన విడిచిపెట్టదు. (ఆశా బలవతీ హ్యేషా న జహాతి నరం క్వచిత్ - 30 - 8) సైన్యమంతా నాశనం అయ్యిందా. మహాబలశాలులనుకున్న చండముండులు అయ్యారా. అసంఖ్యాక రక్తబీజులను ఆవిర్భవింపజెయ్యగల అసలుసిసలు రక్తబీజుడు అయ్యాడా. అయినా వీరికి ఆశ చావలేదు. జయించగలమనే అనుకుంటున్నారు. వచ్చారు. వీరిద్దరినీ సంహరిస్తే మనం వచ్చిన పని పూర్తవుతుంది. చావు దగ్గరపడి మాయామోహితులై వచ్చారు. కానీ, మిగిలిన ఆ కాస్తపనీ పూర్తిచేద్దాం- అంటూనే విశిఖవృష్టి కురిపించింది.

క్రమక్రమంగా యుద్ధం భయానకరూపం ధరించింది. అంబికా వాహనసింహం జూలుదులిపి సైన్యసాగరంలో ఈదుతోంది. సరస్సులో దిగిన ఏనుగులా సేనాసముద్రాన్ని అల్లకల్లోలం చేస్తోంది. నిశుంభుడు పళ్ళు పటపట లాడించాడు. దానవయోధులను ఉత్సాహపరుస్తూ వాహనసింహంమీదా, సింహవాహనమీదా అనేకాయుధాలను ప్రయోగించాడు. అన్నివైపులనుంచీ దానవయోధులు చుట్టు ముట్టి ఒక్కసారిగా శస్త్రాస్త్రసమూహం కురిపించారు. అంబికాదేవి శస్త్రానికి శస్త్రమూ, అస్త్రానికి అస్త్రముగా బదులు చెల్లిస్తోంది. అవకాశం దొరికించుకుని అంతమొందిస్తోంది.

అంబికాదేవి యుద్ధ వైశారద్యాన్ని చూస్తూ అల్లంతదూరాన నిలబడ్డ శుంభుడికి ఉత్సాహం ఉరకలు వేసింది. రివ్వున రణరంగానికి వచ్చాడు. కాళికను సంహరిద్దామనీ, అంబికను సంగ్రహిద్దామనీ - అతడికింకా ఆశ చావలేదు. ఎదుటనిలిచి అంబికాదేవిని ముఖాముఖి తిలకించాడు. శృంగారవీరాలు మూర్తీభవించి భయదసుందరంగా ప్రకాశిస్తోంది.

తత్రాగత్య దదర్శాజావంబికాం చ పురః స్థితామ్ ।
రౌద్రరసయుతాం కాంతాం శృంగారరస సంయుతామ్ ॥
తాం వీక్ష్య విపులాపాంగీం
త్రైలోక్యవరసుందరీమ్ ।
సురక్తనయనాం రమ్యాం
క్రోధరక్తేక్షణాం తథా ॥ (30 - 18, 19 )

ఆ శృంగార రౌద్రమూర్తిని అతి సన్నిహితంగా దర్శించాడు. విశాలమైన క్రీగన్నులు. సర్వజగత్సమ్మోహకమైన సుందరరూపం. ఎర్రకలువరేకుల్లా అందంగా ఉన్న కన్నులు. ఇప్పుడు రౌద్రం కారణంగా మరింత ఎరుపెక్కి నిప్పులు చెరుగుతున్న చూపులు.



చూడటంతోనే శుంభుడి మనస్సులోనుంచి పెళ్ళిఆశ వెళ్ళిపోయింది. జయాశ జారిపోయింది. మరణం తప్పదు అనే నిశ్చయం బలపడింది. తెగించి కార్ముకం ధరించి నిలబడ్డాడు.

వివాహేచ్ఛాం పరిత్యజ్య జయాశాం దూరతస్తథా ।
మరణే నిశ్చయం కృత్వా తస్థావాహితకార్ముకః ॥ ( 30 - 20 )

అంబికాదేవి తేరిపారజూసింది. అప్రయత్నంగా ఒక చిరునవ్వు ముఖమండలంమీద విరిసింది. సకలదానవులకూ వినిపించేట్టు, మేఘగంభీర కంఠధ్వనితో పలికింది -

మూర్ఖాగ్రేసర చక్రవర్తులారా! ఇంకా బుద్ధిరాలేదా? ఇప్పటికైనా మించిపోయిందిలేదు. మరొక అవకాశం ఇస్తున్నాను. జీవితేచ్ఛ ఏమాత్రంఉన్నా ఆయుధాలను ఇక్కడే విడిచిపెట్టి పాతాళానికో పారావారానికో (సముద్రం) పారిపొండి. లేదంటే ఈ క్షణంలోనే మిమ్మల్ని స్వర్గస్థుల్ని చేస్తాను. ఆలోచించుకోండి. - అభయం పొందుతారో, అనిలో మ్రందుతారో. వీరత్వం ఏనాడూ పిరికిదనంకాదు, పిరికిదనం ఏనాడూ వీరత్వముకాదు. తెలుసుకోండి - అని ప్రబోధించి కడసారిగా చివరి అవకాశం ఇచ్చింది.

దీనికి సమాధానం చెప్పకపోగా నిశుంభుడు హఠాత్తుగా కత్తిదూసి సింహాన్ని శిరస్సుమీద మోదాడు. అది కళ్ళుతిరిగి, వొళ్ళు తూలి గిర్రున బొంగరంలా తిరిగింది. సారెమీద కుండలా అంబికాదేవీ తిరిగింది. తిరుగుతూనే గండ్రగొడ్డలి విసిరింది. అది వెళ్ళి నిశుంభుడి బాహుమూలాన్ని ఖండించింది. అయినా వాడు చెక్కుచెమర్చలేదు. బాధకానీ, మూలుగుకానీ లేదు. అదే కత్తితో అదే దెబ్బ మళ్ళీ వేశాడు. ఈసారి సింహం తలవిదిల్చి తప్పించుకుంది. అంబికాదేవి సువర్ణపాత్రికను ఎత్తి గటగటా మద్యపానం చేసింది. గదతో తనపైకి లంఘించబోతున్న నిశుంభుణ్ణి చూపులతోనే అదిలించింది. నిశుంభా! ఇదిగో ఈ క్షణంలో ఇక నువ్వు లేవు - అని గర్జించింది. సన్నటి చువ్వలా జవజవలాడుతూ పొడవుగా ఉన్న కృపాణాన్ని మెరుపుతీగలా విసిరింది. మరుక్షణంలో వాడి తల ఎగిరి తాటిపండులా రాలిపడింది. గదను చేతబట్టి వస్తున్న మొండెం రక్తాన్ని దశదిశలకూ ఎగజిమ్ముతూ సకల దేవదానవభీషణంగా గిర్రున ఆత్మప్రదక్షిణలు చేసింది.

స చ్ఛిన్నమస్తకో దేవ్యా కబంధోఽతీవ దారుణః ।
బభ్రామ చ గదాపాణిః త్రాసయన్ దేవతాగణాన్ ॥ ( 30 - 38 )

అంబికాదేవి కోపం చల్లారలేదు. బొంగరంలా తిరుగుతున్న వాడి కళేబరాన్ని బాణాలువేసి కాళ్ళూ చేతులూ ఒకేసారి నరికేసింది. రెక్కలు విరిగిన పర్వతంలా ఆ మొండెం నేలపై ముద్దలా చదికిలబడింది. దానవసైన్యం భయకంపితమై దుఃఖవిహ్వలమై రోదిస్తూ వెత్తివోరూ బాదుకుంటూ పరుగులు లంకించుకుంది. *(అధాయ్యం - 30, శ్లోకాలు - 64)*



## ◆ శుంభసంహారం ◆

తమ్ముడి మరణాన్ని కళ్ళారాచూసిన శుంభుడు నివ్వెరపోయాడు. శిలాకృతిలా బిగిసిపోయాడు. కళ్ళవెంట నీళ్ళు ధారగా బొటబొటా రాలేయి. మరునిమిషంలో నిగ్రహించుకున్నాడు. క్రోధంతో ఉన్మత్తుడై దిక్కులు దద్దరిల్లేలాగా ఒక్కపొలికేకపెట్టేడు. అది తనకే కొత్తగా వినిపించింది. కొండల్లో కోనల్లో మారుమ్రోగి వలయాలు వలయాలుగా తననే చుట్టుముట్టింది.

కాలం కాదు, దైవమే అన్నింటికన్నా గొప్పది అనే ఆలోచన మనస్సులో ఒక మెరుపులా తళుక్కున మెరిసింది. శ్రావణంలో కురవని మేఘాలు ఒక్కొక్కసారి మాఘంలో కురుస్తున్నాయి. సకాలంలో అనావృష్టి, అకాలంలో కుంభవృష్టి. కాలానికి ఒక నియతిలేదు. అది నిమిత్తమాత్రం. దైవమే బలవత్తరం. అది అనుకూలిస్తేనే ఏ పౌరుషాలైనా ఫలిస్తాయి. లేకపోతే అంతా వ్యర్థమే. సకలదేవతలనూ గడగడ లాడించిన నిశుంభుడు ఒక అబలచేతిలో దారుణంగా మరణించాడు. ఇంతకన్నా నిదర్శనం ఏమి కావాలి! మహాశూరుడు రక్తబీజుడు నిహతుడయ్యాడు. ఇంక నేను ఒక్కడిని మిగిలాను. అపకీర్తికి ఒడిగట్టి, జీవితాశను పెంచుకుని మాత్రం ఏమిచెయ్యగలను? ఏమి సాధించగలను? కాలం దాపురిస్తే ఎవడైనా గతించవలసిందే. త్రిమూర్తులకూ అష్టదిక్పాలకులకూ సూర్యచంద్రులకే ఇది తప్పనప్పుడు, నేనా తప్పించుకునేది? మరణం దైవనిర్మితం. దానికి భయపడేవాడు పరమమూఢుడు. పుట్టిన ప్రతిప్రాణీ గిట్టక తప్పదు. గిట్టిన ప్రతిజీవీ పుట్టక తప్పదు. అశాశ్వతమైన ఈ శరీరాన్ని నమ్ముకుని శాశ్వతమైన కీర్తిని వదులుకోవడం అవివేకం.

**జాతస్య హి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మ మృతస్య చ ।**
**అధ్రువేఽస్మిన్ శరీరే తు రక్షణీయం యశః స్థిరమ్ ॥** **(31 - 14)**

విజయమో వీరమరణమో - ఏదైనా దైవస్వరూపమే. ఆహ్వానించదగినదే, ఆస్వాదించదగినదే. రానీ - అంటూ నిశ్చలచిత్తంతో, సూతుడి వెన్నుతట్టి, పోనీ అన్నాడు. రథం కదిలింది. అంబికాదేవి ముందు నిలిచింది. శుంభుడు ఏకాగ్రచిత్తంతో చూశాడు. త్రైలోక్యమోహిని. సింహవాహనారూఢ. సర్వాభరణ విరాజమాన. సర్వలక్షణ సంవృత - కనిపించింది. దేవగంధర్వామరులు స్తుతిస్తున్నారు. పారిజాతపుష్పాలతో అర్చిస్తున్నారు. అంబికాదేవి నిశ్చలంగా శంఖం పూరిస్తోంది. ఘంటానినాదం చేస్తోంది.

శుంభుడు మోహపరవశుడయ్యాడు. కామమోహితుడయ్యాడు. అనూహ్యంగా మన్మథార్తికి లోనయ్యాడు. ఆహా! ఏమి రూపం! ఏమి సౌందర్యం! ఏమి రణచాతుర్యం! పరస్పరవిరోధులైన సౌకుమార్యధైర్యాల కలయిక. ఓహో !!



అహో రూపమిదం సమ్యక్ అహో చాతుర్యమద్భుతమ్ ।
సౌకుమార్యం చ ధైర్యం చ పరస్పరవిరోధి యత్ ॥ (31 - 22)

మెరుపుతీగెలాగా తన్వంగి. మాలతీలతలాగా అత్యంత సుకుమారి. ప్రారంభయౌవనంలో ఉన్న పడుచుపిల్ల. ఈ బాలామణి కామభావాన్ని జయించిందంటే ఆశ్చర్యంగా లేదూ! రూపలక్షణాలన్నింటా సాక్షాత్తూ రతిదేవిలా ఉంది. ఈ అంబిక ఇంతమంది మహావీరాధివీరులను సంహరించడమేమిటి! అసంభవం. ఇదేదో మాయ. ఈ బాలామణిని వశంచేసుకోవాలి. ఉపాయంగా లొంగదీసుకోవాలి. వశీకరణ మంత్రాలేవీ నాకు రావే. అయినా సర్వమంత్రమయి ఈ జగన్మోహిని మంత్రాలకు లొంగుతుందా? పైగా మదగర్విత . అసలు లొంగదు. సామదానోపాయాలు ఫలించలేదు. భేదోపాయానికి అవకాశం లేదు పోనీ దండోపాయం ప్రయోగిద్దామంటే ఇంతటి మహాబలవంతురాలి దగ్గర అది పనిచేస్తుందనే నమ్మకం లేదు. అందుచేత పారిపోవడంకన్నా పోరాడి పోరాడి మరణించడమే శ్రేయస్కరం. విజయమో వీరమరణమో విధివిహితం ఏదో అది ఈపూట జరిగితీరుతుంది.

తస్మాత్తు మరణం శ్రేయో న సంగ్రామే పలాయనమ్ ।
జయో వా మరణం వాద్య భవత్యేవ యథావిధి ॥ (31 - 33)

శుంభుడు ఇలా అన్నివిధాలా ఆలోచించి యుద్ధానికి నడుం బిగించాడు. ధనుష్టంకారం చేసి హుంకరించాడు. రథాన్ని మరింత ముందుకి పోనిచ్చి -

దేవీ! యుద్ధం చెయ్యి. ఇప్పటిదాకా నువ్వు పడినశ్రమ అంతా ఈ క్షణంతో వృథా అయిపోతుంది. నీమూర్ఖత్వం ఏమిటో ఎంతకీ అర్థం కావడంలేదు. ఒక ఆడది ఇలా యుద్ధానికి దిగడం కనీవినీ ఎరగను. ఇది స్త్రీ ధర్మానికే విరుద్ధం. అయితే నీవంటి అందగత్తెలకు చూపులే బాణాలు. కనుబొమ్మలే ధనుస్సులు. హావభావాలే శస్త్రాలు. వాలాంటి పురుషుడే లక్ష్యం. సుగంధద్రవ్యాలే సమరసన్నాహాలు. మనోరథాలే రథాలు. గుసగుసలే భేరీనినాదాలు. ఇంక ఏమీ అవసరంలేదు. ఇతర శస్త్రాలనూ అస్త్రాలనూ ధరించడం కేవలం అభినయం.

నారీణాం లోచనే బాణా భ్రువావేవ శరాసనమ్ ।
హావభావాస్తు శస్త్రాణి పుమాన్ లక్ష్యం విచక్షణః ॥
సన్నాహశ్చాంగరాగోఽత్ర రథశ్చాపి మనోరథః ।
మందప్రజల్పితం భేరీశబ్దో నాన్యః కదాచన ॥ (31 - 37, 38)



చమత్కారాలకేమిగానీ సరసిజాక్షీ! స్త్రీలకు అలంకారం సిగ్గే. ఇలాంటి ధార్ష్ట్యకం కాదు. ధనుస్సు ఎక్కుపెట్టి బాణాలను వదులుతూంటే మాటిమాటికీ బయటపడే ఎత్తైన గుండెలను ఎలా దాచుకుంటావు? గదను చేతబట్టి శత్రువును వెన్నంటి తరుముతూంటే నీ సవిలాసమందగమనం ఏమవుతుంది? అదీగాక, నీవంటి సుకుమారికి ఈ కరాళకాళికాదేవి సలహాదారా? ఏదో మహామాంత్రికురాలిలాగా ఉందే తప్ప చెలికత్తెలాగా లేదు. గొంతు విప్పితే గరగరమంటోంది. పోనీ వాహనం చూద్దామా అంటే సర్వసత్త్వ భయంకరమైన సింహమా? వీనులకు విందుచేసే వీణానాదాన్ని వదిలేసి ఘంటానాదం చేస్తున్నావా? నీ రూపానికీ నీ యౌవనానికీ పూర్తివిరుద్ధంగా ఉంది నీ సంరంభం. బాలామణీ! యుద్ధమే చెయ్యాలి అనుకుంటే దయచేసి ఈ సుందరరూపాన్ని విడిచిపెట్టు. వేలాడే పెదవులూ, పెరిగి పెరిగి మెలికలు తిరిగిన గోళ్ళూ, గిస్తే మసిరాలే కాకినలుపూ, కాకి గొంతూ, కాకి చూపూ, లంబపాదాలూ, కోరల్లాంటి దంతాలూ, పిల్లి కన్నులూ - ఇలాంటి ఒక వికృత రూపం ధరించి వచ్చి నిలబడు. కర్కశంగా మాట్లాడుతూ నవ్వు రెచ్చగొట్టు. అప్పుడు యుద్ధంచేస్తాను. అంతేకానీ ఇంతటి అందగత్తియమీద కత్తిదుయ్యడం ఎలాగ? నాకు చెయ్యాడదు. మన్మథమహాసామ్రాజ్ఞిలాగా ఉన్న ఓ బాలమృగనయనా! క్షమించు, ఈ రూపంలో నిన్ను సంహరించలేను.

> ఈదృశీం సుదతీం దృష్ట్వా న మే పాణిః ప్రసీదతి ।
> హంతుం త్వాం మృగశాబాక్షి ! కామకాంతోపమే మృధే ॥ (31 - 45)

యుద్ధానికని వచ్చి కామార్తుడై నిలిచి ఇలా ప్రసంగిస్తున్న శుంభుణ్ణి చూసి జగదంబిక చిరునవ్వులు చిందించింది. మందమతీ! కామమోహితుడవై పలవరిస్తున్నట్టున్నావు. నామీద కత్తి దుయ్యలేకపోతే పోనీ, ఇదిగో కాళిక ఇక్కడే ఉంది. నువ్వు కోరుకున్న క్రూరకరాళరూపంలో ఉంది. ఈవిడతో యుద్ధం చెయ్యి. నీ ఇష్టంవచ్చిన ఆయుధాలతో ప్రహరించు. నేను ప్రేక్షకురాలినై సాక్షిమాత్రంగా నిలబడతాను. యుద్ధమే చెయ్యను. చెయ్యాలనే ఉత్సాహంకూడా లేదు.

> ప్రేక్షికాహం స్థితా మూఢ! కురు కాళికయా మృధమ్ ।
> ప్రహరస్వ యథాకామం నాహం త్వాం యోద్ధుముత్సహే ॥ (31 - 48)

అని శుంభుణ్ణి గేలిచేసి, కాళికవైపు తిరిగి మృదువుగా - హే కాళికే! ఈ కురూపప్రియుణ్ణి సంహరించు - అంది జగదంబిక. వెంటనే కాళికాదేవి వేయిమణుగుల బరువున్న ఇనపగదను అవలీలగా చేతబట్టుకుని క్రూరంగా వికటంగా విరగబడినవ్వుతూ శుంభుడి ఎట్టఎదుట నిలిచింది. దానవనాయకుడు కూడా గదను ధరించి కలియబడ్డాడు. ఇద్దరికీ భీకరసంగ్రామం జరిగింది. పాదఘాతాలతో భూమి



కంపిస్తోంది. గదాఘాతాలతో ఆకాశం చిల్లులు పడుతోంది. అత్యంతలాఘవంగా శుంభుడి వ్రేటును తప్పించుకుని బలంగా గుండెలపై కొట్టింది. వాడికి కన్నులు బైర్లుకమ్మాయి. తేరుకునేలోగా వాడి రథాన్నీ సారథినీ గాడిదలనూ నుజ్జునుజ్జు చేసింది. భైరవస్వరంతో భీకరంగా నవ్వింది. ఇంతలోకి శుంభుడు తేరుకున్నాడు. విరగబడి నవ్వుతున్న కాళికాదేవి గుండెలకు గురిపెట్టి గదను గిరగిరా తిప్పి విసిరాడు. వెంట్రుకవాసిలో నేర్పుగా తప్పించుకుంది. కత్తిదూసి ముందుకు వచ్చింది. గదను విసిరిన ఊపులో ముందుకి తూలిన శుంభుడి ఎడమ బుజాన్ని లేతకొమ్మను నరికినంత తేలికగా నరికేసింది. శుంభుడు రక్తసిక్తగాత్రుడై తూలిపడ్డాడు. మిగిలిన కుడిచేతితో కత్తిదూశాడు. దూసినంతలోనే కత్తితో సహా కుడిబుజం రాలిపడింది. కాళికా నైపుణ్యానికి దేవతలుకూడా ఆశ్చర్యచకితులయ్యారు. శుంభుడు క్రోధం పట్టలేక ఎగిరి కాళ్ళతో తన్నడానికి ప్రయత్నించాడు. రెండుకాళ్ళనూ ఒకేసారి ఖండించింది. నేలకు దిగబడ్డాడు. నిలునిలు అని అరుస్తున్నాడు. తొడలతోనే చరచరా వస్తున్నాడు. కాళికాదేవి కన్నులు చిట్లించి క్రూరంగా నిశితంగా చూసింది. మరొక్క ప్రహారంతో శిరస్సును ఛేదించింది. రక్తం ఉబికి ఉబికి ప్రవాహాలు కట్టింది. కళేబరం గిరిశిఖరంలా నేలకు ఒరిగిపోయింది. శుంభుడి ప్రాణాలు అనంతవాయువుల్లో కలిసిపోయాయి.

ఇంద్రాదిదేవతలు ప్రత్యక్షమై కాళికనూ అంబికనూ స్తుతించారు. సుగంధ పరిమళాలను వెదజల్లుతూ చల్లని వాయువులు వీతెంచాయి. దిక్కులు తేటపడ్డాయి. హోమాగ్నులు ఆనందంతో ప్రదక్షిణార్చులను ఎగజిమ్మాయి.

హతశేషులైన దానవులు జగదంబికను శరణువేడారు. ఆయుధాలను విసర్జించి పాతాళానికి వెళ్ళిపోయారు.

జనమేజయా! ఇది దేవీచరితంలో ఉత్తమోత్తమఘట్టం. దానవులను శిక్షించింది. దేవతలను రక్షించింది. ఈ ఘట్టాన్ని భక్తితో చదివినవారూ విన్నవారూ సకల జయాలనూ పొందుతారు. కృతార్థులవుతారు. సంతానం లేనివారికి సంతానం కలుగుతుంది. నిర్ధనులు ధనవంతులవుతారు. రోగులకు పరిపూర్ణారోగ్యం చేకూరుతుంది. శత్రుభయం నశిస్తుంది. కోరికలన్నీ తీరతాయి. ఇది జయప్రదమూ విజయప్రదమూ అయిన ఘట్టం. ***(అధ్యాయం - 31 , శ్లోకాలు - 68)***

## ◆ సమాధి - సురథుల వృత్తాంతం ◆

వ్యాసమునీంద్రా! అంబికా మహిమను అద్భుతంగా వర్ణించి చెప్పావు. నా జన్మ ధన్యమయ్యింది. ఈ జగదంబికను పూర్వకాలంలో ఎవరు ఎలా ఆరాధించి ప్రసన్నురాలిని చేసుకున్నారు? ఏయే ఫలాలను పొందారు? ఈ విశేషాలు తెలుసుకోవాలని కుతూహలంగా ఉంది. దయచేసి వివరించు - అని అభ్యర్థించాడు జనమేజయుడు. అప్పుడు వ్యాసుడు మహామాయా పూజావిధానాన్ని తెలియజేశాడు.



జనమేజయా! పూర్వం స్వారోచిషమన్వంతరంలో సురథుడు అనే మహారాజు ఉండేవాడు. ప్రజలను ధర్మబద్ధంగా పరిపాలిస్తూ ఉదారుడై సత్యవాదియై గురుభక్తితత్పరుడై శీలసంపన్నుడై ఏకపత్నీవ్రతుడై దానగుణంలో మేటియై ధనుర్విద్యా విశారదుడై అవిరోధియై జీవితం గడుపుతున్నాడు. ప్రజల మన్ననలను పొందుతున్నాడు.

ఇలా ఉండగా - పర్వతనివాసులైన మ్లేచ్ఛులు అసూయాపరులై శత్రుత్వం పెంచుకుని సురథుడిమీదకి దండెత్తారు. అశ్వ హస్తి రథ పదాతి సైన్యాలతో మదోత్కటులై వచ్చిపడ్డారు. సురథుడు సర్వసేనా సమేతుడై ఎదిరించాడు. మ్లేచ్ఛుల సైన్యంకన్నా తన సేనాబలం చాల అధికంగాఉన్నా దురదృష్టవశాత్తూ సురథుడు ఓడిపోయాడు. రణరంగంనుంచి పారిపోయి బలిష్ఠమైన ఒక దుర్గంలో దాక్కొన్నాడు.

మంత్రులందరూ శత్రుపక్షంలో చేరిపోయారు. మ్లేచ్ఛులు ఆశపెడితే లొంగిపోయారు. ఎంత నీతిమాలిన వాళ్ళు! వీళ్ళు రేపోమాపో శత్రువులకు నన్ను పట్టిఇస్తారు. నీతిలేకపోయాక ఎంతటి పాపానికైనా ఒడికడతారు. వీళ్ళని ఇక విశ్వసించకూడదు. లోభం ఎంతపనైనా చేయిస్తుంది. తల్లిదండ్రులు, తోబుట్టువులు, బంధుమిత్రులు, గురువృద్ధులు - ఏ అనుబంధాలూ పరిగణనకు రావు. అందరినీ ద్వేషిస్తారు. అవకాశం దొరికితే అంతమొందిస్తారు. కాబట్టి వీళ్ళని విశ్వసించనుగాక విశ్వసించను - అని ఆలోచించి సురథుడు గుర్రాన్ని అధిరోహించి ఒంటరిగా అడవుల్లోకి వెళ్ళిపోయాడు.

పోగా పోగా ఒక ఆశ్రమం కనిపించింది. అది సుమేధసుడి ఆశ్రమం. ఎత్తుగా పెరిగిన వృక్షాలతో పచ్చగా కనువిందు చేస్తోంది. మధ్యలో ప్రవహిస్తున్న నది. నదిలో ఇసుకతిన్నెలు. పరస్పరమైత్రితో సహజశత్రుత్వాలు విడిచిపెట్టి క్రీడిస్తున్న మృగపక్షి సంఘాలు. శిష్యుల వేదాధ్యయన ఘోష. నీవారధాన్యంతో చేస్తున్న వంటల ఘుమఘుమలు. హోమధూమసుగంధాలు. నానాపుష్పపరిమళాలు. సర్వప్రాణికోటికీ సుఖప్రదమై స్వర్గాన్ని మరిపిస్తోంది. ఆశ్రమాన్ని చూడగానే సురథుడి మనస్సు తేలికపడింది. భయం పటాపంచలయ్యింది. ఇక్కడ సుఖంగా జీవితం గడపవచ్చు అనే విశ్వాసం ఏర్పడింది. ఒక చెట్టునీడలో గుర్రం దిగి దాన్ని అక్కడ మేతకు వదిలి పాదచారియై ఆశ్రమ ప్రాంగణంలోకి వెళ్ళాడు.

సాలవృక్షచ్ఛాయలో కృష్ణాజినంమీద పద్మాసనం వేసుకుని కూర్చున్న తపోమూర్తిని చూశాడు. మూర్తీభవించిన శాంతం. చుట్టూ కూర్చున్న శిష్యులకు వేదశాస్త్రాలను అధ్యాపనం చేస్తున్నాడు. అరిషడ్వర్గాలకు అతీతుడై ద్వంద్వాలకు అందనివాడై, ఆత్మజ్ఞాన నిరతుడై, ఆకృతిదాల్చిన నిగ్రహంగా భాసిస్తున్న సుమేధసుడిని చూడగానే సురథుడి కళ్ళు చెమ్మగిల్లాయి. బాష్పజలాలు అప్రయత్నంగా ఉబికి ఉబికి ధారలు కట్టాయి. అది దుఃఖమో ఆనందమో ఆత్మప్రక్షాళనమో తెలియలేదు. అల్లంత దూరంలోనే మహర్షికి సాష్టాంగపడ్డాడు.



భద్రమస్తు భద్రమస్తు. ఉత్తిష్ఠ ఉత్తిష్ఠ - అన్నాడు మహర్షి. శిష్యుణ్ణి పిలిచి దగ్గరగా ఆస్తరణం వేయించాడు. దానిమీద కూర్చోమన్నాడు. సురథుడు మౌనంగా వెళ్ళి కూర్చున్నాడు. సుమేధుడు అర్ఘ్యపాద్యాలు ఇచ్చి అతిథి మర్యాదలు జరిపాడు. తమరు ఎవరు? ఇటు ఎందుకు వచ్చారు? చింతాకుల చిత్తులై కనిపిస్తున్నారు. కారణం ఏమిటి? - అని కుశలప్రశ్నలు వేశాడు. సురథుడు ఇంకా తేరుకోలేదు. మౌనంగానే ఉండిపోయాడు. కన్నీటి జడి తెరిపి ఇవ్వడంలేదు. మహర్షి మళ్ళీ పలకరించాడు.

సంశయించకండి. మనస్సులో ఉన్న బాధ ఏమిటో చెప్పండి. ఏదైనా పనిమీద వచ్చి ఉంటే - ఫరవాలేదు. చెప్పండి. అది ఎంతటి అసాధ్యమైనా మీకోరిక తీరుస్తాను. గోప్యం కాకపోతే చెప్పండి - అన్నాడు సుమేధసుడు. అప్పటికి సురథుడు పెదవి కదిపాడు.

మహర్షీ! నన్ను సురథుడు అంటారు. నేనొక సామ్రాజ్యానికి రాజును. శత్రువులచేతిలో ఓడిపోయాను. రాజ్యాన్నీ రాజధానినీ పట్టమహిషినీ వదిలేసి ఇటు వచ్చాను. నిన్ను శరణువేడుతున్నాను. నువ్వే రక్షకుడివి. అన్యథా శరణం నాస్తి. నువ్వు ఏది ఆజ్ఞాపిస్తే అది భక్తితో ఆచరిస్తాను. శత్రువులకు దారుణంగా భయపడి నీ సమీపానికి పారిపోయి వచ్చాను. శరణాగతవత్సలా! రక్షించు. నన్ను రక్షించు - అంటూ మళ్ళీ సాష్టాంగపడ్డాడు.

సుమేధసుడు లేవనెత్తి దగ్గరగా కూర్చోబెట్టుకుని అభయం ఇచ్చాడు. సురథమహారాజా! మీరు ఈ ఆశ్రమంలో నిర్భయంగా నివసించండి. ఇక్కడ ఏ శత్రుభయమూ లేదు. ఉండదు. ఇక్కడికి వచ్చేవారంతా తపోబలసమన్వితులు. హింస అనేది ఈ దరిదాపులకు రాదు. వనవృత్తితో జీవించేవాళ్ళమే అందరమూను. నీవారకందమూలఫలాలతోనే మా జీవనం. మీరూ వాటితోనే గడపాలి మరి - అన్నాడు.

సురథుడు సంబరపడుతూ ఆ నియమానికి అంగీకరించి ఆశ్రమవాసి అయ్యాడు. కందమూల ఫలాలతో శుచిగా జీవిక సాగిస్తున్నాడు. కొంతకాలం గడిచింది. ఒకనాడు ఎందుకనో హఠాత్తుగా సురథుడి మనస్సు పాత జ్ఞాపకాలలోకి వెళ్ళింది. గాలి ఇంటిమీదకు మళ్ళింది. రాజ్యం పాపాత్ములైన మ్లేచ్ఛుల చేతిలోకి వెళ్ళిపోయింది. ఆ సిగ్గులేని దుర్మార్గులు ప్రజల్ని ఏమి పీడిస్తున్నారో ? ఏమో ! నా ఏనుగులూ గుర్రాలూ మేతలేక చిక్కి శల్యమైపోయుంటాయి. నా సేవకులందరూ ఆ మ్లేచ్ఛులకి వశవర్తులైపోయుంటారు. నేనున్నప్పుడు ఎంతో ఆనందంగా ఉల్లాసంగా ఉండేవారు. బహుశా ఇప్పుడు ఏడుస్తూ చాకిరీ చేస్తుంటారు. నేను సంపాదించిపెట్టిన కోశాగారం ఈపాటికి ఖాళీ అయిపోయుంటుంది. ద్యూతక్రీడలకూ మద్యపానాలకూ వ్యసనాలకూ విలాసాలకూ ఖర్చుపెట్టేసి ఉంటారు. ఆ మ్లేచ్ఛులు పాత్రులకి దానంచేసి ఉంటారనుకోను. మంత్రులూ వారికి వంతపాడుతూ అలాగే అయిపోయుంటారు.



ఒక చెట్టునీడలో తీరుబాటుగా కూర్చుని సురథుడు ఇలా ఆలోచిస్తూ ఉండగా ఒక వైశ్యుడు దిగులుగా నడుచుకుంటూ అటువైపు వచ్చాడు. సురథుడిని చూడగానే కాసింత కుదుటపడి చేరువకి వచ్చి మెల్లగా కూర్చున్నాడు.

ఎవరు నువ్వు? ఎందుకు దిగులుపడుతున్నావు? ఇలా వచ్చావేమిటి? భయపడకు. నిజం చెప్పు. నేను నీ మిత్రుణ్ణి. ఏడుమాటలు మాట్లాడితే చాలు మైత్రి ఏర్పడుతుందన్నారుగదా! చెప్పు - అని అడిగాడు సురథుడు. ఈ పలకరింపుతో వైశ్యుడికి ధైర్యం వచ్చింది. ఒక ఆత్మీయత స్ఫురించింది. పలికాడు -

మిత్రమా! నేను వైశ్యజాతీయుణ్ణి. నా పేరు సమాధి. బాగా ధనవంతుణ్ణి. సత్యవాదిని. ధర్మతత్పరుణ్ణి. అయితేనేమి ఇవ్వేళ నా బతుకు ఇలా అయిపోయింది. నా పెళ్ళాంబిడ్డలే నన్ను ఇంటిలోంచి వెళ్ళగొట్టారు. ధనలోభం వారితో ఈ పని చేయించింది. దుర్మార్గులు. నన్ను లోభి అన్నారు, కృపణుడు అన్నారు. అందరూ ఒక్కటై నన్ను తరిమేశారు. ఏమి చెయ్యడానికీ తోచక ఇలా అడివిలోకి వచ్చేశాను. తమరి దర్శనం అయ్యింది. ఇంతకీ తమరు ఎవరో తెలుసుకోవచ్చునా? గొప్ప భాగ్యవంతుల్లా కనబడుతున్నారు.

సురథుడు తన వృత్తాంతం క్లుప్తంగా చెప్పాడు. అదృష్టవశాత్తూ మనమిద్దరం ఇక్కడ ఇలా కలుసుకుని మిత్రులమయ్యాం. ఈ అందమైన శుభప్రదమైన ఆశ్రమంలో ఈ అరణ్యంలో మనం నిర్భయంగా విహరించవచ్చు. అయ్యింది ఏదో అయ్యింది. ఇక దుఃఖించకు. అన్నీ మర్చిపోయి ఇక్కడ నాతోపాటు సుఖంగా జీవించు - అన్నాడు సురథుడు.

నేస్తమా! నా మనస్సు పీకులాడుతోంది. నా కుటుంబం దిక్కులేనిది అయిపోతుందేమో! కష్టాలపాలవుతుందేమో! నా భార్యాపుత్రులకి ఆరోగ్యం ఎలా ఉందో? ముఖ్యంగా నా ఇల్లాలు. మొదటినుంచీ దాని ఆరోగ్యం అంతంతమాత్రమే. సుఖంగా ఉందో లేదో! మిత్రమా! నాకు ఎంతసేపూ ఇవ్వే ఆలోచనలు. నేను వాళ్ళకి అక్కర్లేకపోయానుగానీ నేను మాత్రం వాళ్ళని మరిచిపోలేకపోతున్నాను. చాలా బెంగగా ఉంది. సుఖంగా ఎలా ఉండగలను చెప్పు ? ఎప్పుడు ఇంటికి వెడతానో! ఎప్పటికి నావాళ్ళని చూడగలుగుతానో?

వైశ్యోత్తమా! ఏమిటి నీ వెర్రి! వాళ్ళేమో నిన్ను తరిమేశారా, వాళ్ళకోసం నువ్వు పరితపిస్తున్నావా. ఇంతకన్నా వ్యామోహం ఉంటుందా? ఆ కఠినాత్ముల్ని చూస్తే మనస్సు భగభగలాడిపోదూ! సుఖంగా ఎలా ఉంటుందమకుంటున్నావు? పిచ్చివాడా! దుఃఖాన్ని కలిగించే బంధుమిత్రులకన్నా సుఖాన్ని కలిగించే శత్రువులు చాలా నయం. తెలుసుకో. మనస్సుని గట్టిపరుచుకో. అటు మళ్ళనివ్వకు. ఇక్కడ నాతోపాటు హాయిగా జీవించు.



రాజా! నిజమే నువ్వన్నది. కానీ నా మనస్సు నిలకడగా ఉండటంలేదు. మాటిమాటికీ అక్కే పరిగెడుతోంది. ఎంత ప్రయత్నించినా ఫలితం ఒకటిగానే ఉంది.

మిత్రమా! నాకూ ఆపాటి బెంగ లేకపోలేదు. రాజ్యం గుర్తుకి వచ్చినప్పుడల్లా దుఃఖం పెల్లుబికి వస్తోంది. అయినా నిబ్బరించుకుంటున్నాను. మన ఇద్దరి బెంగలూ దుఃఖాలూ తీరడానికి ఏదైనా ఉపాయం చెబుతాడేమో మన మహర్షి సుమేధుడిని అడుగుదాం. ఆయన శాంతచిత్తుడు. ఏదో ఒక ఔషధం చెప్పకపోడు.

ఇలా ఇద్దరూ ఒక నిశ్చయానికి వచ్చి సుమేధోమహర్షిని దర్శించారు. సాష్టాంగపడ్డారు. ఆయన ఆశీర్వదించి సముచిత స్థలాలలో కూర్చోబెట్టాడు. *(అధ్యాయం - 32, శ్లోకాలు - 63)*

సురథుడు వినయంగా ప్రశ్నించాడు. మహర్షీ! ఈ వైశ్యుడు ఇప్పుడే నాకు మిత్రుడయ్యాడు. భార్యాపుత్రులు వెళ్ళగొడితే అడవులకు వచ్చాడు. అయినా కుటుంబంగురించీ కుటుంబసభ్యులగురించీ తలుచుకుని తలుచుకుని పరితపిస్తున్నాడు. ఎంతగా చెప్పినా శాంతించడంలేదు. అలాగే ఇవ్వేళ ఇదేమిటో నా మనస్సుకూడా చాలా కలతపడుతోంది. రాజ్యమూ ప్రజలూ గుర్తుకివచ్చి కళ్ళు చెమ్మగిల్లుతున్నాయి. ఇది నిష్కారణమైన దుఃఖమే. అయినా మనస్సునుంచి తొలగి పోవడంలేదు. ఏనుగులు చిక్కిపోయాయో, గుర్రాలు చచ్చిపోయాయో, సేవకులు ఎలా ఉన్నారో - ఇవే ఆలోచనలు ఎంతకీ వదలకుండా వేధిస్తున్నాయి. మ్లేచ్ఛులు నా కోశాగారాన్ని నాశనం చేసేస్తున్నారేమోనని మనస్సు కుమిలిపోతోంది. నిద్ర పట్టడంలేదంటే నమ్ము. ఇన్ని రోజులూ నువ్వు చేసిన ఉపదేశాలవల్ల, ఈ జగత్తు మిథ్య అని తెలుసుకున్నాను. ఇది స్వప్నసదృశమని గ్రహించాను. అయినా మనస్సు భ్రాంతిని వదలడం లేదు. స్థిరంగా నిలవడంలేదు. నేనెవడిని? ఈ గుర్రాలూ ఏనుగులూ ఏమిటి? అవేమన్నా నాకు తోబుట్టువులా? కొడుకులా? స్నేహితులా? ఏమీకాదు. తెలుసు. అయినా వాటికోసం ఏడుస్తున్నాను. భ్రమ అని ఎరిగీ విలపిస్తున్నాను. దుఃఖిస్తున్నాను. మనస్సు నిలకడ చిక్కడంలేదు. మోహం వదలడం లేదు. ఎంతగా వదులుకుందామన్నా సాధ్యపడటంలేదు. మహర్షీ ఏమిటి దీనికి కారణం? ఆ అద్భుతమేమిటో నువ్వే చెప్పాలి. నువ్వు సర్వజ్ఞుడివి. మా సంశయాలు తీర్చాలి. నా మోహవిభ్రాంతికి కారణమేమిటో చెప్పు.

సుమేధుడికి సురథుడి ఆవేదన, ఆర్తి అర్థమయ్యాయి. అతడి శోకమోహాలను తొలగించే జ్ఞానోపదేశం చెయ్యాలి అనుకున్నాడు. ప్రేమగా లాలనగా నవ్వుతూ ఆప్యాయంగా పలికాడు.

మహారాజా! మోహమోక్షాలకు కారణమేమిటో తెలియజేస్తున్నాను శ్రద్ధగా ఆలకించు. మహామాయ అని ఒక శక్తి ఉంది. సకల చరాచరవస్తుజాలానికీ ఉత్పత్తిహేతువు ఆ శక్తి. బ్రహ్మాదిదేవతలూ అష్టదిక్పాలకులూ సూర్యచంద్రులూ గంధర్వోరగయక్షకిన్నరదానవమానవజాతులూ వివిధ వృక్ష వల్లీ వితానాలూ పశువులూ



పక్షులూ - ఒకటేమిటి సమస్త ప్రాణికోటీ మాయాధీనమే. మాయాధీనమైన ప్రతిప్రాణికీ బంధమోక్షాలు తప్పవు. ఆ మాయాశక్తి కల్పించినదే మోహజాలం. ఈ వలలో పడేసి ప్రాణికోటి నంతటినీ తన అధీనంలో ఉంచుకుని ఆటఆడిస్తోంది. బ్రహ్మాది దేవతానాయకులే ఈ మాయను ఛేదించుకోలేకపోతున్నారంటే మానవ మాత్రుడవు నువ్వొకడవు ఏపాటి? అందునా క్షత్రియుడవు. రజోగుణప్రధానుడవు.

## ◆ చతుర్ముఖ చతుర్భుజుల మోహవిభ్రాంతి ◆

ఆ మాయాశక్తి జ్ఞానుల మనస్సులనుకూడా సమ్మోహపరుస్తూ ఉంటుంది. బ్రహ్మదేవుడూ శివుడూ వాసుదేవుడూ - వీరికిమించిన జ్ఞానులెవరు? వీరే సమ్మోహితులై అనురాగవిభ్రాంతిలో మునుగుతున్నారు.

పూర్వం సత్యయుగంలో ఒకప్పుడు నారాయణుడు శ్వేతద్వీపానికి వెళ్ళి స్వయంగా మహాతపస్సు చేశాడు. బ్రహ్మవిద్యను తెలుసుకోవాలని అతడి కోరిక. బ్రహ్మదేవుడు కూడా తపస్సు చేశాడు. అనశ్వరమూ శాశ్వతమూ అయిన సుఖాన్ని తెలుసుకోవాలని అతడి వాంఛితం.

కొంతకాలం తపస్సు చేశాక నారాయణుడు స్థలం మార్చాడు. అదే ద్వీపంలో మరొక ప్రదేశంలో కూర్చుని తపస్సు సాగించాడు. బ్రహ్మదేవుడూ అలాగే స్థలం మార్చేడు. ఈ సంరంభంలో మార్గమధ్యంలో ఇద్దరూ తారసపడ్డారు. నువ్వెవరు అంటే నువ్వెవరు అనుకున్నారు. నేను ఈ జగత్తుకి సృష్టికర్తను అన్నాడు చతుర్ముఖుడు. మూర్ఖుడా! నువ్వు సృష్టికర్తవేమిటి! నేనే సృష్టికర్తను అన్నాడు చతుర్భుజుడు. నువ్వెంత నీ శక్తి ఎంత? నీదంతా రజోగుణం, నేను సత్త్వగుణం మూర్తీభవించిన వాసుదేవుణ్ణి తెలుసా? సనాతనుడిని. తెలుసుకో. ఒకప్పుడు మధుకైటభులు నిన్ను చంపబోతే నేనే రక్షించాను గుర్తుతెచ్చుకో. మోహంలో పడిపోయి గర్వించి మాట్లాడకు. అది మంచిది కాదు. ఈ సృష్టిలో నాకంటే గొప్పవాడు లేడు. ఇది సత్యం. గుర్తించు - అని విష్ణుమూర్తి జమాయించి పలికాడు.

ఇలా బ్రహ్మవిష్ణువులకు వివాదం చెలరేగింది. ఇద్దరికీ కోపంతో కళ్ళు ఎరుపెక్కాయి. పెదవులు వణికాయి. నేను గొప్ప అంటే నేనే గొప్ప అని కలహించుకుంటున్నారు. అంతలోకీ ఇద్దరికీ మధ్యలో ఒక లింగాకారం ఆవిర్భవించింది. ఇద్దరూ ఆశ్చర్యపోయి చూస్తూ నిలబడ్డారు. అశరీరవాణి వినిపించింది -

బ్రహ్మన్! విష్ణో! వివాదం చాలించండి. మీ ఇద్దరికీ ఒక పోటీపెడుతున్నాను ఆలకించండి. ఈ లింగానికి అంతం చూసి రావాలి. చూసి ఎవరు ముందుగా వస్తే వారు గెలిచినట్టు. వారు గొప్పవారైనట్టు. ఇద్దరూ చెరొకవైపు ప్రయాణం సాగించండి.



ఈ ఆకాశవాణి మాటలు వినడంతోనే విష్ణుమూర్తి ఆ లింగంవెంట పాతాళానికి ప్రయాణమయ్యాడు. బ్రహ్మదేవుడు పైకొన చూసిరావడానికి ఆకాశంవైపు కదిలాడు. విష్ణుమూర్తి ఎంతదూరం ప్రయాణించినా లింగానికి అంతం కనపడలేదు. అలిసిపోయి విసిగిపోయి తిరిగివచ్చాడు. బ్రహ్మదేవుడికీ అంతే. అగ్రం దొరకలేదు. కానీ శివుడినెత్తినుంచి జారిపడిన ఒక మొగలిరేకు దొరికింది. అది పుచ్చుకుని తిరిగి వచ్చేశాడు. లింగాగ్రభాగం దర్శించివచ్చాను, ఇదిగో ఈ కేతకీదళం అక్కడ దొరికింది. నిదర్శనంగా తీసుకువచ్చాను - అన్నాడు. విష్ణుమూర్తి ఒప్పుకోలేదు. దీనికి సాక్షి ఎవరని గద్దించాడు. ఏదైనా వివాదం చెలరేగినప్పుడు సచ్ఛీలుడూ సర్వసముడూ యథార్థవాదీ అయిన మేధావిని సాక్షిగా అంగీకరించడం అంతటా ఉన్నదేకదా! నువ్వు లింగాగ్రం చూసి వచ్చావనడానికి గానీ ఈ కేతకీదళం అక్కడిదే అనడానికి గానీ సాక్షి ఎవరో చెప్పు - అని నిగ్గదీశాడు నారాయణుడు.

## ◆ మొగలి పువ్వుకు శివుడి శాపం ◆

అంతటి సుదూరప్రదేశంనుంచి నీకోసం సాక్షి ఎవడు వస్తాడు ? నేను చెప్పేది సత్యమే అయినట్టయితే ఇదిగో ఈ మొగలిరేకే సాక్ష్యం పలుకుతుంది - అన్నాడు ధీమాగా చతుర్ముఖుడు.

మొగలిరేకు చాలా స్పష్టంగా సాక్ష్యం చెప్పింది - శివుడి శిరస్సునుంచి నన్ను ఈ బ్రహ్మదేవుడు తీసుకువచ్చాడు. ఇది సత్యం. ఏ సందేహమూ లేదు. శ్రీహరీ! నా మాట నమ్ము. బ్రహ్మదేవుడు లింగాగ్రం దర్శించివచ్చాడు - అంది. అయినా విష్ణుమూర్తి విశ్వసించలేదు. నీమాట నమ్మను. నాకు శివుడే ప్రమాణం. అతడే చెప్పాలి - అని మొండికేశాడు.

ఈ సంభాషణలు అన్నీ వింటున్న శివుడికి మొగలిరేకు మీద కోపం వచ్చింది. కేతకీ! అసత్యాలు చెప్పకు. నా శిరస్సునుంచి జారిపడి సగదూరంలో బ్రహ్మదేవుడికి దొరికావు. ఇది సత్యం. బ్రహ్మకు అనుకూలంగా అసత్యం పలికి కూటసాక్ష్యం చెప్పావు కనక నిన్ను పరిత్యజిస్తున్నాను. ఇకనుంచీ నువ్వు నా పూజకు పనికిరావు - అన్నాడు మహాదేవుడు. చతుర్ముఖుడు సిగ్గుతో తలవంచుకున్నాడు. మధుసూదనుడికి శిరసువంచి నమస్కరించాడు.

సురథా! మాయాశక్తి ఇంతటిది. జ్ఞానులమనుకొన్న పద్మనాభ పద్మగర్భులే ఇలా మోహవిభ్రాంతులవుతున్నారు. ఇక మనబోటి సామాన్యులమాట చెప్పాలా! దేవకార్య సిద్ధికోసం ప్రతియుగంలోనూ శ్రీమన్నారాయణుడు దానవులను వంచిస్తూనే ఉన్నాడు. అది పాపమని భయపడటం లేదు.

దేవానాం కార్యసిద్ధ్యర్థం సర్వదైవ రమాపతిః ।
దైత్యాన్ వంచయతే చాశు త్యక్త్వా పాపభయం హరిః ॥ (33 - 48)



రకరకాల అవతారాలు ఎత్తి, తన సుఖసంతోషాలను వదులుకుని దైత్యులతో యుద్ధాలు చేస్తున్నాడు. ఇదంతా మాయాశక్తియేనని గుర్తించు. ఎంతటి జ్ఞానుల హృదయాలనైనా ఈ మాయాప్రకృతి బలవంతంగా ఆకర్షించి మోహంలో పడదోస్తుంది.

చరాచర ప్రాణికోటిలో అంతటా వ్యాపించి ఉన్న ఆ మాయాశక్తి కేవల మోహదమాత్రమే కాదు, జ్ఞానప్రదకూడా ఆవిడయే. మోహానికీ మోక్షానికీ ఆ మాయాదేవియే కారణం.

జ్ఞానినామపి చేతాంసి పరమా ప్రకృతిః కిల ।
బలాదాకృష్య మోహాయ ప్రయచ్ఛతి మహీపతే ॥
యయా వ్యాప్తమిదం సర్వం భగవత్యా చరాచరమ్ ।
మోహదా జ్ఞానదా సైవ బంధమోక్షప్రదా సదా ॥ (33 - 52, 53)

సుమేధోమహర్షీ ! ఆ మాయాశక్తిని గురించి దయచేసి మరింత విపులీకరించండి. ఆవిడ బలం ఎంతటిది ? ఉత్పత్తికారణం ఏమిటి ? స్థావరం ఏది ? - ఇవన్నీ తెలుసుకోవాలని మనసు ఉవ్విళ్ళూరుతోంది. తెలియపరచండి స్వామీ - అని సురథుడు అభ్యర్థించాడు. సుమేధుడు వివరించాడు -

రాజా ! ఆ మాయాశక్తికి పుట్టుక అంటూ ఏదీలేదు. పూర్తిగా అనాది. అనంతం. నిత్యస్వరూపిణి. కారణాలన్నింటికీ ఆదికారణం. సర్వభూతాలలోనూ సర్వాత్మకంగా ఉంటుంది ఈ శక్తి. ఇదే లేకపోతే ప్రాణి శవమైపోతుంది. ఏ వస్తువుకు ఏ రూపమో, అందులో ఉండే శక్తికీ అదే రూపం. అందుచేత అనంతరూపిణి - ఈ చిత్ శక్తి.

శవవత్ శక్తిహీనస్తు ప్రాణీ భవతి సర్వథా ।
చిచ్ఛక్తిః సర్వభూతేషు రూపం తస్యాస్తదేవ హి ॥ (33 - 56)

అయితే, దేవకార్యసిదికోసం ఈ పరాశక్తి ఒక్కొక్కసారి రూపం ధరించి అవతరిస్తూ ఉంటుంది. ఆ రూపాన్నే దేవతలూ మానవులూ స్తుతిస్తూ ఉంటారు. ఆరాధిస్తూ ఉంటారు. ఆవిర్భావతిరోభావాలు ఆవిడకు స్వాధీనాలు. ఇచ్ఛాధీనాలు. ఎప్పుడు ఏ రూపంలో అవతరించాలనుకుంటే ఆ రూపంలో అవతరిస్తుంది. ధర్మార్థకామమోక్షాలను ప్రవర్తింపజేసే ఈ మహాదేవి కాలానికీ దైవానికీ అతీతురాలు. ఈ జగత్తు అంతా ఒక దృశ్యం. అకర్తయైన పురుషుడు ద్రష్ట. ఈ దృశ్యానికి జనని ఆ మాయాశక్తి. దీన్ని సృష్టించి ఈ బ్రహ్మాండ నాటకాన్ని ఆడిస్తూ పురుషుణ్ణి రంజింపజేస్తోంది. ఇలా రంజింపజేసి చేసి హఠాత్తుగా ఒకేవాడు ఉపసంహరిస్తుంది. ఇది ఆవిడకు ఒక క్రీడావినోదం. బ్రహ్మవిష్ణుమహేశ్వరులు నిమిత్తమాత్రులు. వీరిని పరాశక్తియే కల్పించి ఆయా పనులు చేయిస్తోంది. అదొక లీలావిశేషం. తన అంశనే వారిలో



ప్రవేశపెట్టి శక్తి సంపన్నులను చేసింది. సరస్వతి లక్ష్మి పార్వతి నామధేయాలతో తన అంశలను వారికి జతకూర్చింది. నిరంతరం ఈ త్రిమూర్తులు ఆ పరాశక్తిని ధ్యానిస్తూ అర్చిస్తూ ఉంటారు. ఆనందం పొందుతూ ఉంటారు. ఇది మహేశ్వరీతత్త్వం. ఇది దేవీమాహాత్మ్యం. నాకు తెలిసింది నీకు చెప్పాను. ఇంతకన్నా నాకూ తెలీదు. *(అధ్యాయం - 33, శ్లోకాలు - 66)*

## ◆ సుమేధుడు చెప్పిన దేవీవ్రతం ◆

సుమేధుడు చెప్పింది విన్నాక సురథుడికి ఇంకా విశేషాలు తెలుసుకోవాలి అనిపించింది. ఆరాధనావిధానం ఏమిటి, పూజావిధానం ఏమిటి, మంత్రాలేమిటి, హోమాలు ఏమిటి - ఇవన్నీ తెలుసుకోవాలని కుతూహలం కలిగింది. మహర్షిని అభ్యర్థించాడు.

సురథా ! పూజావిధానం తెలుసు. చెబుతున్నాను - విను. కామదమూ మోక్షదమూ జ్ఞానదమూ అయిన దేవీపూజ సర్వదుఃఖవినాశకం. ఉదయాన్నే స్నానం చేసి శుచిగా తెల్లని వస్త్రాలు కట్టుకుని ఆచమించి పూజలు ప్రారంభించాలి. ఇంటిలో ఒకచోట నేల శుభ్రంచేసి గోమయంతో అలికి ముగ్గులు పెట్టాలి. ఒక ఉత్తమాసనాన్ని అక్కడ నిక్షేపించాలి. శక్త్యనుసారంగా పూజాద్రవ్యాలను సమకూర్చుకోవాలి. ముమ్మారు ఆచమించి ప్రాణాయామం చేసి భూతశుద్ధిని నిర్వహించాలి. పూజాద్రవ్యాలనూ ఉన్నతాసనాన్నీ మంత్రోదకాలతో సంప్రోక్షించాలి. ఆ ఉన్నతాసనం మీద (పీట) తామ్రంతో తయారుచేసిన షట్కోణయంత్రాన్ని ఉంచాలి. (రాగితో చేయించిన శ్రీచక్రం). దానికి అష్టకోణ బహిర్మండలం ఉండాలి. నవాక్షర మంత్రాక్షరాలను దానిమీద ఆయా స్థానాలలో లిఖించాలి. వేదోక్తంగా యంత్రప్రతిష్ఠ చెయ్యాలి. పూజామంత్రాలతో పూజాద్రవ్యాలతో అర్చన సాగాలి. ఏకాగ్రచిత్తంతో భక్తిప్రపత్తులతో ఆగమోక్త ప్రకారంగా పూజను నిర్వహించాలి. నవాక్షరమంత్రాన్ని నిరంతరంగా జపిస్తూ ఉండాలి. దశాంశతః హోమం చేసి దశాంశం తర్పణం చెయ్యాలి. బ్రాహ్మణులకు దశాంశంగా భోజనాలు పెట్టాలి. దేవీచరిత్రను పారాయణ చెయ్యాలి. లేదా చేయించాలి.

రాజా ! దేవీనవరాత్రవ్రతంకూడా ఒకటి ఉంది. అది విశేషం. ఆశ్వయుజమాసంలో కానీ, చైత్రమాసంలోకానీ శుక్లపక్ష ప్రారంభంనుంచి తొమ్మిది రోజులపాటు ఉపవాసదీక్షతో ఈ వ్రతం చెయ్యాలి. పాయసాన్నంతోగానీ, మేకమాంసంతోగానీ (ఛాగమాంసేన) హోమాలు విపులంగా చెయ్యాలి. బిల్వపత్రాలతో ఎర్రని పుష్పాలతో అర్చించాలి. ప్రతిమాసంలోనూ అష్టమి నవమి చతుర్దశి తిథులు దేవీ సమర్చనకు విశేష ఫలప్రదాలు. ఇలా ఆరాధిస్తే నిర్ధనులు ధనవంతులవుతారు. రోగులు ఆరోగ్యం పొందుతారు. అపుత్రులు పుత్రవంతులవుతారు. వాళ్ళు వినయ వివేక సంపన్నులవుతారు. రాజ్యభ్రష్టులు రాజ్యాలను పొందుతారు. శత్రుపీడలు తొలగిపోతాయి. నియతేంద్రియుడై అర్చించిన విద్యార్థి విద్యాసంపన్నుడు అవుతాడు. ఆడా మగా అన్ని వర్ణాలవారూ అన్ని కులాలవారూ ఈ పూజ చేసుకోవచ్చు. సర్వసుఖాలూ శుభాలూ పొందుతారు.



బ్రాహ్మణః క్షత్రియో వైశ్యః శూద్రో వా భక్తిసంయుతః ।
పూజయేజ్జగతాం ధాత్రీం స సర్వసుఖభాగ్భవేత్ ॥ (34 - 20)

నవరాత్ర పూజలో మాత్రం కలశస్థాపన చెయ్యాలి. ఆ కలశంమీద యంత్రాన్ని స్థాపించాలి. చుట్టూ యవాంకురాలు ఉండాలి. పైని పుష్పమాలాలంకృతమైన పందిరి ఉండాలి. దేవీమందిరాన్ని ధూప దీపాలంకృతం చెయ్యాలి. తొమ్మిదిరోజులూ శక్తివంచనలేకుండా త్రికాలార్చన నిర్వహించాలి. చండికాపూజలో ధనానికి లోభించకూడదు. ఫలపుష్పాలతో రకరకాల పిండివంటలతో పుష్కలంగా నైవేద్యాలు పెట్టాలి. వేదమంత్రాలు, పురాణ పఠనాలు, గీతవాద్యాలు నృత్యసాహిత్యాలు - ఇత్యాదులతో తొమ్మిదినాళ్ళూ ఉల్లాసంగా ఉత్సవాలు జరపాలి.

నూతన వస్త్రాలూ భూషణాలూ సుగంధద్రవ్యాలూ పుష్పమాలికలతో కన్యకలను బాలా ప్రతిరూపాలుగా భావించి అర్చించాలి. అష్టమి నవమి దశమి తిథులు అతి ముఖ్యమైనవి. ఈ రోజుల్లో విశేషంగా వేద వేదాంగవేత్తలను గౌరవించాలి. సువర్ణ రజత భూవస్త్రాది దానాలతో సంతృప్తిపరచాలి.

ఇలా భక్తిశ్రద్ధలతో దేనికీ లోభించకుండా ఈ నవరాత్రవ్రతాన్ని చేసినవారికి ఇష్టకామ్యార్థాలు అన్నీ సిద్ధిస్తాయి. ఇహంలో సకలభోగాలూ అనుభవించి పరంలో శాశ్వతస్థానాన్ని పొందుతారు. జన్మాంతరంలో కూడా దేవీభక్తి ఇలాగే కొనసాగుతుంది. ఇది వ్రతాలలోకెల్లా ఉత్తమోత్తమమైన వ్రతం.

సురథమహారాజా ! నువ్వుకూడా ఈ వ్రతాన్ని ఆచరించు. శత్రువులను జయించి నీ రాజ్యం నువ్వు తిరిగిపొందుతావు. నీ భార్యాపుత్రులను కలుసుకుంటావు. రాజమందిరంలో సుఖంగా సంతోషంగా జీవిస్తావు.

వైశ్యోత్తమా ! నువ్వుకూడా ఈ రోజే దేవిని ఆరాధించు. నీవాళ్ళు నిన్ను గౌరవిస్తారు. ప్రేమానుబంధాలు చిగురిస్తాయి. దేవీలోకంలో నీకు చోటుదొరుకుతుంది.

క్రిందటి జన్మలో మీరు దేవిని ఆరాధించలేదు కనక ఈ జన్మలో ఇన్ని కష్టాలు వచ్చాయి. అంబికను ఆరాధించనివారికి ఇంతే గతి. కష్టాలేకాదు రోగాలూ రొష్టులూ కూడా చుట్టుముడతాయి. వారికి నరకం తథ్యం. ఇహపరాలు రెండూ నరకాలే అయిపోతాయి. దేవిని ఆరాధించనివారికి బుద్ధికుశలతకూడా క్షీణిస్తుంది. బిల్వదళాలతో కరవీర శతపత్ర చంపకాది సుగంధిల పుష్పాలతో అమ్మవారిని ఆరాధించినవారు ఇహలోకంలోనే విలాసమయ జీవితాన్ని గడపగలుగుతారు. ఆ శక్తి భక్తిపరాయణులు ధన్యులు, కృతపుణ్యులు. సకలసద్గుణ నిలయులై సమాజంలో ఉన్నతంగా గౌరవమర్యాదలను పొందుతారు. వేద మంత్రాలను పఠిస్తూ అర్చించినవారికి సన్మాన పరంపరలు ఘనంగా జరుగుతాయి. ***(అధ్యాయం - 34, శ్లోకాలు - 44)***



సుమేధుడు చేసిన ఈ ఉపదేశం సురథుడికీ వైశ్యుడికీ ఎంతో సంతృప్తి నిచ్చింది. శాంతిని ప్రసాదించింది. ఇద్దరూ మహర్షికి సాష్టాంగపడ్డారు. కళ్ళలో ఆనందబాష్పాలు తొణికిసలాడాయి. కంఠంలో ఒక అందమైన జీర ధ్వనించింది.

మహాత్మా ! మమ్మల్ని పరిపూతులను చేశావు. మా దుఃఖాన్ని తొలగించి శాంతి ప్రసాదించావు. ప్రసంగగంగాఝరిలో స్నానంచేయించి పవిత్రుల్ని చేశావు. పూర్వపుణ్య విశేషం ఏదో మమ్మల్ని ఈ ఆశ్రమానికీ నీ సన్నిధికీ చేర్చింది. భూలోకంలో ఎక్కువమంది స్వార్థపరాయణులు. పరోపకారంకోసం మహోపదేశాలు చేసే నీవంటి ఉత్తములు ఎక్కడో నూటికీ కోటికీ ఒక్కరుంటారు.

భవంతి మానవా భూమౌ బహవః స్వార్థతత్పరాః ।
పరార్థసాధనే దక్షాః కేచిత్ క్వాపి భవాదృశాః ॥ (35 - 6)

ఈ ఆశ్రమానికి వచ్చి నిన్ను దర్శించినప్పుడే మా దుఃఖాలు తొలగిపోయాయి. ఇప్పుడు నీ ఉపదేశవాక్యాలు మానసికదుఃఖాన్ని మొత్తంగా ఉపశమింపజేశాయి. ఇదే కృపతో ఇదే దయతో ఇదే వాత్సల్యంతో ఇకముందూ ఇలాగే విడవకుండా మా చెయ్యిపట్టుకుని నడిపించు. భవసాగరాన్ని దాటించు. ఇంతకాలం ఈది ఈది అలిసిపోయాం. మంత్రోపదేశం చేసి నువ్వే తరింపజెయ్యి. ఆ మంత్రాన్ని జపిస్తూ మరికొంతకాలం ఇక్కడే ఉండి తపస్సు చేసుకుని అటుపైని మా మా గృహాలకు వెడతాం. మహానుభావా ! నవాక్షర దేవీ మహామంత్రాన్ని ఉపదేశించు. నిరాహారులమై నియమనిష్ఠలతో జపిస్తాం.

## ◆ సమాధి, సురథులకు దేవీదర్శనం ◆

ఈ అభ్యర్థనకు సుమేధుడు సంతోషించాడు. వెంటనే మంత్రాన్ని ఉపదేశించాడు. పాటించవలసిన నియమాలు తెలియజేశాడు. రాజవైశ్యులిద్దరూ మంత్రాన్ని స్వీకరించి మహర్షికి మరోమారు నమస్కరించి నదీతీరానికి వెళ్ళి ఏకాంతప్రదేశాలలో తపస్సులకి ఉపక్రమించారు. ఒక నెల గడిచింది. ఇద్దరికీ మనస్సులు కుదుటపడ్డాయి. సమాధినిష్ఠ అలవాటయ్యింది. దేవీపాదపద్మాలపట్ల ప్రీతి పరిపూర్ణంగా ఏర్పడింది. మధ్యమధ్యలో ఒక్కొక్కసారి వెళ్ళి మహర్షిపాదాలకు నమస్కరించి వస్తున్నారు. వచ్చి యథావిధిగా స్థిరతపస్సులో కూర్చుంటున్నారు. ఇక ఏ పనీ లేదు. నిరంతరం మంత్రజపం. దేవీధ్యానం. సంవత్సరం గడిచింది. ఫలాహారం విడిచిపెట్టి కేవల పర్ణాహారులై మరో ఏడాది తపస్సు చేశారు.

ఇద్దరికీ ఒకేరోజున ఒకే సమయానికి జగన్మాత స్వప్నసాక్షాత్కారం అనుగ్రహించింది. రక్తమాల్యాంబరధారిణిని దర్శించిన దివ్యానుభూతితో పులకించిపోతూ మరొక సంవత్సరంపాటు తపస్సు కొనసాగించారు.



మూడేళ్ళు గడిచాయి. ప్రత్యక్ష దర్శనంకోసం పరితపిస్తున్నారు. దేహత్యాగానికి సిద్ధపడ్డారు. సురథమహారాజు చేతిపాటి లోతుతో త్రికోణరూపంగా ఒక కుండాన్ని సిద్ధం చేశాడు. అందులో అగ్నిని రగిల్చాడు. ఇద్దరూ చెరొకవైపునా కూర్చుని తమ శరీరంలో మాంసఖండాలను కోసి అగ్నికుండలో హోమం చేశారు. రక్తంతో బలిప్రదానం చేశారు.

జగన్మాత ప్రత్యక్షదర్శనం అనుగ్రహించింది. ఇద్దరూ ఆనందంపట్టలేక బోరున విలపించారు. జగజ్జనని మృదువుగా పలకరించింది. రాజా ! వైశ్యా ! మీ భక్తికి సంతోషించాను. మిమ్మల్ని నా భక్తులుగా స్వీకరిస్తున్నాను. ఏమి కావాలో కోరుకోండి. వరం ఇస్తున్నాను - అంది.

శత్రుబలాన్ని ఓడించి తన రాజ్యం తనకు ఇప్పించమని సురథుడు కోరుకున్నాడు. తథాస్తు అంది దేవి. వెంటనే బయలుదేరి నీ రాజ్యానికి వెళ్ళు, శత్రువులు ఇప్పుడు బలహీనులు. తేలికగా జయిస్తావు. నీ రాజ్యం నీకు దక్కుతుంది. ధర్మబద్ధంగా ఏలుకో. నీ మంత్రులు పశ్చాత్తప్త హృదయులై వచ్చి నీ పాదాల మీద పడతారు. నిష్కంటకంగా వేల సంవత్సరాలు పరిపాలించి తనువు చాలించాక నువ్వు సూర్యవంశంలో మనువుగా జన్మిస్తావు. వెళ్ళి రమ్మంది.

వైశ్యుడు వినయవినమితగాత్రుడై నమస్కరించి - అమ్మా ! నాకు ఇక ఇల్లూ వాకిలీ ఇల్లాలూ బిడ్డలూ ధనమూ ధాన్యమూ - ఇవి ఏవీ వద్దు. ఇవన్నీ మోక్షానికి ప్రతిబంధకాలు. కనిపించని గాఢబంధనాలు. స్వప్నాలవంటివి. అతి నశ్వరాలు. ఇవి నాకు వద్దు. బంధనాశకమూ మోక్షప్రదమూ అయిన విశదజ్ఞానాన్ని అనుగ్రహించు. నిస్సారమైన ఈ సంసారంలో మునిగితేలే మూఢత్వం నేను వాంఛించను. తరణోపాయం అర్థిస్తున్నాను - అన్నాడు. వైశ్యవర్యుడి అభ్యర్థనను దేవి ఆమోదించి జ్ఞానం ప్రసాదించి అదృశ్యమయ్యింది.

క్షత్రియ వైశ్యులిద్దరూ ఆనందపరవశులై సుమేధుడిని సమీపించారు. భక్తితో నమస్కరించారు. ఇంతలోకీ సురథమహారాజుగారి మంత్రులు రథాశ్వాలపై వచ్చి పాదాభివందనాలు చేశారు. మ్లేచ్ఛులు అంతరించి పోయారనీ, రాజ్యం ఇప్పుడు నిష్కంటకమయ్యిందనీ విన్నవించి, రాజధానికి వచ్చి సింహాసనం అధిష్ఠించి పరిపాలన సాగించమని అభ్యర్థించారు. సురథుడు మహర్షి దగ్గర ఆశీస్సులూ అనుజ్ఞలూ అందుకుని రాజ్యానికి వెళ్ళిపోయాడు. భార్యా బంధు మిత్ర వర్గాలను కలుసుకుని యథావిధిగా పరిపాలన సాగించాడు.



వైశ్యుడు మహాజ్ఞానియై నిస్సంగుడై అదే ఆశ్రమంలో చాలాకాలం ఉండి, అటుపైని తీర్థయాత్రలు చేస్తూ దేవీమాహాత్మ్యాన్ని బహుధా గానంచేస్తూ కాలం గడిపాడు. కట్టకడపటికి ముక్తి పొందాడు.

జనమేజయా ! దేవీచరిత్రలో ఇదొక అద్భుతమైన కథ. దేవీ ఆరాధనకు ఫలం ఎలా ఉంటుందో తెలియజెప్పే పవిత్రగాథ. దీనిని లిఖించినవారికీ పఠించినవారికీ ప్రచురించినవారికీ వినిపించినవారికీ విన్నవారికీ - అందరికీ ఇహలోకంలో సకల సుఖాలూ సమకూరుతాయి. జ్ఞానమూ కీర్తి ధనమూ భోగమూ భాగ్యమూ పుష్కలంగా లభిస్తాయి. కడపట నిశ్చయంగా మోక్షం లభిస్తుంది. దేవీచరిత్ర - అఖిలార్థప్రదం. సర్వధర్మసమావృతం. ధర్మార్థకామమోక్షాలకు మూలకందం - అని వ్యాసుడు ఆనందపులకితగాత్రుడై క్షణకాలం విశ్రాంతి తీసుకున్నాడు.

శౌనకాది మహామునులారా ! శుంభనిశుంభాది దైత్య సంహారరూపమైన గాథను విన్నారుగదా! సాంధ్యకృత్యాలు ముగించి తరవాత కథలోకి వెడదాం - అన్నాడు సూతమహర్షి.

***(అధ్యాయం - 35, శ్లోకాలు - 54)***

---

**పంచమ స్కంధం - 2090 శ్లోకాలు - తెలుగుసేత : బేతవోలు రామబ్రహ్మం**

---





# షష్ఠ స్కంధము

సూతమహర్షీ ! వ్యాసుడు జనమేజయుడికి చెబితే, నువ్వు మాకు చెబుతున్న ఈ దేవీచరిత్రామృతాన్ని ఎంత గ్రోలినా తనివి తీరడంలేదు. వృత్రాసురుడి వృత్తాంతాన్ని నీ ముఖతః వినాలని కోరికగా ఉంది. అది వేదాలలోకూడా ప్రసక్తమైన గాథ. వృత్రుణ్ణి ఇంద్రుడు సంహరించాడుగదా ! ఎలా సంహరించాడు ? ఎందుకు సంహరించాడు ? వృత్రుడు త్వష్ట కొడుకుగదా ! త్వష్ట మహాతపస్వి. దేవతల పక్షంవాడే. ఇతని కొడుకుని సంహరించవలసిన అవసరం ఎందుకు వచ్చింది ? మహాబలశాలియైన వృత్రుణ్ణి ఇంద్రుడు ఎలా సంహరించగలిగాడు ? ఏదో మోసగించి మట్టుపెట్టాడని అంటారు. అది నిజమేనా ? దేవతలు సాత్త్వికులనీ మానవులు రాజసులనీ పశుపక్ష్యాదులు తామసాలనీ విభజించారుగదా! సాత్త్వికులైన దేవతలకు నాయకుడైన ఇంద్రుడు వృత్రుడితో విరోధించడమేమిటి, మోసగించి సంహరించడమేమిటి, దీనికి విష్ణుమూర్తి ప్రేరకుడు కావడమేమిటి ? ఇదంతా వింతగానూ విడ్డూరంగానూ ఉంది. హరిదేవేంద్రులు ఇంతటి సాహసం ఎందుకు చేయవలసివచ్చింది ? ఇది పాపం కాదా ? మహాత్ములు పాపాలు చెయ్యవచ్చునా ? చేస్తే పాపఫలం వారికి అంటుకోదా ? వృత్రుడు బ్రాహ్మణుడు కనక బ్రహ్మహత్యా మహాపాతకం ఇంద్రుడికి చుట్టుకోలేదా ? దానినుంచి ఎలా బయటపడ్డాడు ? దేవతలే ఇలా అన్యాయాలకు పాల్పడితే ఇక శిష్టత్వానికి గతి ఏమిటి ? ఇవన్నీ మమ్మల్ని పట్టిపీడిస్తున్న సందేహాలు. దేవీ పాదద్రోలుతూ ఈ వృత్తాంతాన్ని సమగ్రంగా వివరించి పుణ్యంకట్టుకో. ఇంతకుముందు ప్రస్తావనవశాత్తూ శ్రీదేవియే వృత్రాసురుణ్ణి సంహరించింది అన్నావు. ఆ ముక్క మమ్మల్ని మరీ మోహపెడుతోంది. ఒకరినే ఇద్దరు సంహరించడమేమిటి ? దయచేసి ఇదంతా వివరించు - అని శౌనకాది మహామునులు ఆవేదనగా అభ్యర్థించారు.

శౌనకాదులారా ! ఇవే సందేహాలు జనమేజయుడికీ కలిగాయి. వ్యాసుణ్ణి అడిగాడు. ఆయన వివరంగా తెలియజేశాడు. అది యథాతథంగా మీకు చెబుతాను ఆలకించండి. శ్రద్ధగా వినే శ్రోతలు దొరికితే వక్తకు మరింత ఉత్సాహంకదా ! వ్యాసులవారు ఆరంభించారు -

## ◆ వృత్రాసుర వృత్తాంతం ◆

జనమేజయా ! వాసవవృత్రాసురుల యుద్ధగాథ వేదాలలో సుప్రసిద్ధం. పురాణాలలోనూ సుప్రసిద్ధమే. ఈ త్వష్టృసుతుడిని సంహరించినందువల్ల ఇంద్రుడికి బ్రహ్మహత్యా మహాపాతకం చుట్టుకుంది. నానా యాతనలు పడ్డాడు. ప్రాయశ్చిత్తాలు చేసుకుని కడపటికి తొలగించుకోగలిగాడు.



ఇంద్రోపేంద్రులు ఇద్దరూ కలిసి కపటోపాయంతోనే వృత్రుణ్ణి సంహరించారు. మాయాబలం అటువంటిది. మహామునీశ్వరులు సైతం మాయామోహితులు అవుతుంటారు. నింద్యమైన పనులు చేస్తూ ఉంటారు. విష్ణుమూర్తి ఎప్పుడు ఏ మహారాక్షసుడిని సంహరించినా కపటోపాయంతోనేకదా సంహరించింది. అతడుకూడా మాయామోహితుడయ్యే ఆ పనులు నిర్వహించాడు. ఆ మాయాశక్తికి లొంగనివాడు లేడు. ఎవరూ జయించలేని మోహనశక్తి అది. యుగయుగాలుగా శ్రీమన్నారాయణుడు మత్స్యాద్యవతారాలు ధరించాడంటే ఆ మాయాశక్తి అలా ధరింపజేసి ఆడించింది కనకనే. గృహస్థుల మమకారాలూ పాపాలూ పుణ్యాలూ అన్నీ మాయాగుణకర్మలే. ఇది తెలుసుకోవడం ఎంతటి జ్ఞానులకూ సాధ్యంకాని విషయం.

మాయామోహితులై విష్ణువాసవులు దేవకార్య సిద్ధికోసం కపటంగా వృత్రాసురుణ్ణి సంహరించిన కథాక్రమం ఏమిటంటే - ఇంద్రుడికి వృత్రుడితో పూర్వవైరం ఉంది. సవిస్తరంగా చెబుతాను. గ్రహించు.

దేవతలలోకెల్లా ఉత్తమోత్తముడై, మహాతపస్వియై, దేవకార్యాలను సాధించడంలో నిపుణుడైన త్వష్ట ప్రజాపతిగా ఉన్నకాలంలో అనురాగంతో తనకు యోగ్యుడైన ఒక పుత్రుణ్ణి సృష్టించుకొన్నాడు. అతడు మూడుతలలతో జన్మించాడు. త్రిశిరస్కుడు. అతడికి విశ్వరూపుడు అని నామకరణం చేశాడు. అతడు పెరిగి పెద్దవాడయ్యాడు. రూపంలో చాలా అందగాడు. మూడు తలలతో ఏకకాలంలో మూడు పనులు చేసేవాడు. ఒక శిరస్సుతో వేదాలను అధ్యయనం చేస్తూ, మరొక శిరస్సుతో సురాపానం చేస్తూ, మరొక శిరస్సుతో లోకాలను చూస్తూండేవాడు. అధ్యయనం ముగిశాక ఈ విశ్వరూపత్రిశిరస్కుడు సకల దేవభోగాలనూ విడిచిపెట్టి శాంతుడై దాంతుడై గొప్పతపస్సు చేశాడు. గ్రీష్మాన పంచాగ్ని మధ్యంలో నిలబడి, హేమంత శిశిరాలలో సరోవరాన మునిగీ నిరాహారుడై జితేంద్రియుడై ఘోరతపస్సు చేశాడు. సామాన్యులకు అసాధ్యమైన తపస్సు అది.

దాన్ని చూసి ఇంద్రుడికి గుబులుపుట్టింది. ఇతడు ఇంద్రుడైపోతాడేమో, తన పదవికి హానికలుగుతుందేమో అని భయపడ్డాడు. ఇతడు ఇలాగే తన తపశ్శక్తిని పెంచుకుంటూపోతే తన ప్రాణాలకే ముప్పు రావచ్చునని శంకించాడు. కాబట్టి ఉపేక్షించకూడదు అనుకున్నాడు. శత్రువు బలం పెంచుకుంటూంటే తెలివైనవాడెవడూ చూస్తూ కూర్చోడు. కూర్చోకూడదు అని నిశ్చయించుకుని అతడి తపస్సును భంగపరచడానికి ఉపాయాలు ఆలోచించసాగాడు.

ఊర్వశీ రంభా మేనకా తిలోత్తమా ఘృతాచీప్రభృతులను పిలిచాడు. సహాయం చెయ్యమని అర్థించాడు. త్రిశిరస్కుడి తపస్సును నాశనం చెయ్యమనీ అతడిని మీ శృంగార విలాసాలతో ప్రలోభపెట్టి భ్రష్టుడిని కావించమనీ ఆజ్ఞాపించాడు. నా జ్వరానికి ఇది చికిత్స అన్నాడు. అందరూ కలిసి ఈ ఉపకారం చేసిపెట్టండి, నా సింహాసనాన్ని కాపాడండి, వెంటనే బయలుదేరి వెళ్ళండి - అని ఇంచుమించు ప్రాధేయపడ్డారు.



అప్సరసలు అంగీకరించారు. మా శక్తి మేరకు గట్టిగా ప్రయత్నిస్తామనీ అతణ్ణి లొంగదీసుకుంటామనీ మాట ఇచ్చి బయలుదేరారు. త్రిశిరస్కుడిని సమీపించారు.

కామశాస్త్రోచితమైన హావభావాలను ప్రదర్శిస్తూ, ఆడుతూ పాడుతూ అతడిముందు నానాప్రయత్నాలూ చేశారు. ఫలితం లేకపోయింది. అతడు కన్నెత్తి చూడలేదు. ఇంద్రియ నిగ్రహం సడలలేదు. మూగ గ్రుడ్డి చెవిటిలాగా స్థిరంగా కూచుని తపస్సు చేసుకుంటున్నాడు.

అప్సరసలు మరికొన్ని రోజులపాటు ఆశ్రమంలోనే ఉన్నారు. ప్రయత్నాల తీవ్రత పెంచారు. అయినా త్రిశిరస్కుడు చలించలేదు. విసిగిపోయి అప్సరసలు ఇంద్రుడి దగ్గరికి తిరిగి వెళ్లిపోయారు. అలసట, దైన్యం, అవమానం - వీటితో అప్సరసల ముఖాలు వాడిపోయాయి. వాళ్ళు చెప్పకుండానే ఇంద్రుడికి విషయం అర్థమయ్యింది.

వాసవా ! మేము ఎంతగానో ప్రయత్నించాం. అయినా ఫలితం దక్కలేదు. అతడి ధీరత్వం చాలా గొప్పది. మరింకేదయినా ఉపాయం ఆలోచించు. ఆ జితేంద్రియుణ్ణి జయించడానికి మేమూ మా శక్తీ చాలదు. అదృష్టం బాగుండి ఏ శాపమూ లేకుండా మేము క్షేమంగా తిరిగి రాగలిగాం. అతడు తపశ్శక్తితో అగ్నిలా వెలిగిపోతున్నాడు. జాగ్రత్తగా ఆలోచించి రంగంలోకి దిగుసుమా - అని మృదువుగా హెచ్చరించి అప్సరసలు సెలవుతీసుకున్నారు.

ఇంద్రుడి అసూయ సోడుముట్టింది. ఉచితానుచిత వివేకం కోల్పోయాడు. సిగ్గూ సెరమూ విడిచి పెట్టేశాడు. లోకం నిందిస్తుందేమో అన్న భయం వదిలేశాడు. పాపబుద్ధి ప్రకోపించింది. ఆ తపస్విని సంహరించడానికి నిశ్చయించుకున్నాడు. ***(అధ్యాయం - 1, శ్లోకాలు - 60)***

**విసృజ్య లోకలజ్జాం స తథా పాపభయం భృశమ్ ।**
**చకార పాపబుద్ధిం తు తద్వధాయ మహీపతే ॥ (1 - 60)**

వాసవుడు వజ్రాయుధం ధరించి స్వయంగా బయలుదేరాడు. తపస్సమాధిలో కూర్చున్న త్రిశిరస్కుడిని చూశాడు. ఇతడు చాలా మంచివాడు. ఏ పాపమూ చెయ్యలేదు. ఎలా చంపడం అని మనస్సు ప్రశ్నించింది. ఇతడు శత్రువు. ఇతడి తపోబలం ఇలాగే ఇంకా ఇంకా పెరిగితే నీ పదవికి నీళ్ళు వదులుకోవలసి వస్తుంది. కాబట్టి వెంటనే సంహరించు అని దుర్బుద్ధి ప్రబోధించింది. వెంటనే వజ్రాయుధాన్ని విసిరాడు. త్రిశిరస్కుడు గిరిశిఖరంలా నేలకు ఒరిగిపోయాడు. ఇంద్రుడు సంబరపడ్డాడు. ఆశ్రమవాసులు హాహాకారాలు చేశారు. నిరపరాధినీ మహాతపస్వినీ సంహరించిన దేవేంద్రుడు మహాపాపి అన్నారు. దురాత్ముడన్నారు. ఈ అకృత్యానికి ఫలం ఇంతకింతా త్వరలో అనుభవిస్తాడన్నారు.



త్రిశిరస్కుడి కళేబరం ఇంకా ప్రాణాలతో ఉన్నట్టే విరాజిల్లుతోంది. తేజోనిధిలాగా ప్రకాశిస్తోంది బ్రతికిఉన్నట్టే ఉంది. ఇంద్రుడు చూసి ఉలిక్కిపడ్డాడు. కొంపదీసి బతికేస్తాడా ఏమిటని భయపడ్డాడు క్షణకాలం ఖిన్నుడయ్యాడు. వెంటనే తేరుకుని తక్షుడనే సన్నిహితుడిని పిలిచాడు. తక్షా ! వీడి శిరస్సుల ఖండించు. ఇంకా బతికున్నట్టే కనపడుతున్నాడు. బతకడానికి వీలులేదు. వెంటనే ఖండించు - అని ఆజ్ఞాపించాడు. తక్షుడు తిరస్కరించాడు. ఇంద్రుణ్ణి అసహ్యించుకున్నాడు.

ఇంద్రా ! ఈ మహాతపస్వి అద్భుతంగా ప్రకాశిస్తున్నాడు. నా గొడ్డలి ఖండించదు. ఈ పని నేను చెయ్యలేను. ఇది కుత్సితం. గర్హణీయం. నువ్వు చేసిన పనియే మహాదారుణం. అత్యంత నింద్యం. నాకు పాపభీతి ఉంది. పైగా చచ్చినవాణ్ణి మళ్ళీ చంపమంటావేమిటి ! శిరస్సులు ఖండించవలసిన అవసరం ఏముంది ? అసలు నీ భయమేమిటో చెప్పు ?

తక్షా ! వీడి శరీరం ఇంకా ప్రాణాలతో ఉన్నట్టు కనపడుతోంది. ముఖాలు చూడు ఎంత విశదంగా ఉన్నాయో. జీవిస్తాడేమో అని నా భయం. వీడు నా శత్రువు. జీవించడానికి వీలులేదు.

వాసవా ! నీకు సిగ్గనిపించడంలేదూ ? ఇంతటి క్రూరకర్మ చేశావు. ఋషి పుత్రుణ్ణి సంహరించావు. ఇంకా బ్రతికున్నాడేమో అని భయపడుతున్నావా ? బ్రహ్మహత్యా మహాపాతకం చుట్టుకుంటుందేమోనని ఆలోచించవేమిటి ? ఆ భయం లేదా నీకు ?

తక్షా ! ప్రాయశ్చిత్తం చేసుకుంటాను. ఆ పాపాన్ని తొలగించుకుంటాను. దానికి భయపడవలసిందీ లేదు, తొందరపడవలసిందీ లేదు. ముందు వీడు పూర్తిగా చావాలి. వీడు నా శత్రువు.

మఘవన్ ! సరే నీ ఇష్టం. నీకు మనస్సులో పదవీలోభం ఏదో ఉంది కనక ఇటువంటి పాపకృత్యం చేశావు. నాకు అలాంటి ప్రయోజనం ఏమీలేదు. అందుచేత నేను చెయ్యలేను. క్షమించు.

తక్షా ! నామాట విను. నీకూ లాభం ఉండేట్టు చేస్తాను. యజ్ఞాలలో నీకు శాశ్వతంగా భాగం కల్పిస్తాను. యజ్ఞపశువుల శిరస్సులు నీకు దక్కేట్టు చేస్తాను. నాకు ఈ ఉపకారం చేసిపెట్టు. వీడి శిరస్సులు ఖండించు. నువ్వు ఈ ప్రియం నాకు చేస్తే, నేను ఆ ప్రియం నీకు చేస్తాను. కాదనకు. గొప్ప అవకాశం జారవిడుచుకోకు.

ఈ ప్రలోభానికి తక్షుడు లొంగిపోయాడు. సంబరపడ్డాడు. గండ్రగొడ్డలి తీసి మూడు శిరస్సులూ ఖండించి మూడు వైపులకూ విసిరేశాడు.

ఆ శిరస్సులు పడిన ప్రదేశాల నుంచి పక్షులు వేలసంఖ్యలో ఆవిర్భవించాయి. ఒక శిరస్సు ముఖం నుంచి కలవింకాలు (పిచ్చుకలు), మరొక తల నోటినుంచి తిత్తిరిపక్షులూ, ఇంకొక శిర



వదనంనుంచి కపింజలాలూ (కముజు పిట్టలు) అసంఖ్యాకంగా పుట్టుకొచ్చాయి. వేదాలను అధ్యయనం చేసిన ముఖం నుంచి కపింజలాలు, దిక్కులను నిరీక్షించిన ముఖంనుంచి తిత్తిరిపక్షులూ, సురాపానం చేసిన ముఖం నుంచి కలవింకాలూ జన్మించాయి.

ఈ దృశ్యాన్ని చూసి త్రిశిరస్కుడు మరణించాడని నిర్ధారించుకుని ఇంద్రుడు గాలిపీల్చుకున్నాడు. యజ్ఞభాగాలు లభించాయికదా అని తక్షుడు సంబరపడ్డాడు. ఆనందంగా ఎవరి ఇళ్ళకు వాళ్ళు వెళ్ళిపోయారు. ఇంద్రుడు బ్రహ్మహత్యా మహాపాతకానికి ప్రాయశ్చిత్తం గురించి ఆలోచిస్తున్నాడు.

## ◆ వృత్ర జననం ◆

పరమధార్మికుడైన పుత్రుడి మరణవార్త తెలిసి త్వష్ట పరమక్రుద్ధుడయ్యాడు. ఏ పాపమూ ఎరుగని నా కుమారుణ్ణి సంహరించావు కాబట్టి, నిన్ను సంహరించే మరొక పుత్రుణ్ణి సృష్టిస్తాను, ఇంద్రా! నా తపశ్శక్తి ఏమిటో చూపిస్తాను, నీ పాపానికి ఫలం అనుభవిద్దువుగాని - అని మనస్సులోనే దృఢంగా సంకల్పించుకున్నాడు.

వెంటనే క్రోధాగ్నితో సమానంగా యాగాగ్నిని రగుల్కొల్పాడు. ఆధర్వణ మంత్రాలతో అష్టరాత్ర హోమం చేశాడు. అగ్నికుండంనుంచి పావకోపముడైన పుత్రుడు ఆవిర్భవించాడు. ఇంద్రశత్రూ ! నా తపశ్శక్తితో వృద్ధిపొందు - అని త్వష్ట ఆశీర్వదించాడు. క్షణాలలో అతడు ఆకాశమంత ఎత్తు ఎదిగాడు. దశదిశలకూ బూరటిల్లి విరాట్ స్వరూపంతో నిలబడ్డాడు. కాలమృత్యువులాగా ఉన్నాడు.

తండ్రీ ! ఏమి చెయ్యమంటావో ఆజ్ఞాపించు. ముందుగా నాకొక నామకరణం చెయ్యి. నువ్వేదో బాధపడుతున్నట్టున్నావు. ఏమిటి కారణం ? నీ దుఃఖాన్ని నశింపజేస్తాను. ఇది నా వ్రతం. నేను జన్మించాక కూడా నా తండ్రి దుఃఖించడమా ! వీలులేదు. నీ దుఃఖం ఇప్పుడే తొలగిస్తాను. కారణం చెప్పు. మహాసముద్రాన్ని ఆపోశనం పట్టగలను. ధరాధరాలను పిండికొట్టగలను. సూర్యబింబాన్ని అరచేతితో అడ్డుకోగలను. దేవతలతో సహా ఇంద్రుణ్ణి తుదముట్టించగలను. యమధర్మరాజును మట్టికరిపించగలను. ఈ భూగోళంలో ప్రజానీకాన్ని పెకలించి సముద్రంలోకి విసిరెయ్యగలను. తండ్రీ ! ఏమి చెయ్యమంటావో చెప్పు.

ఈ మాటలకు త్వష్ట మురిసిపోయాడు. పుత్రకా ! వృజినం నుంచి నన్ను రక్షించడానికి నువ్వు పుట్టావు కనక ఇప్పటినుంచీ నీ పేరు వృత్రుడుగా ప్రఖ్యాతి వహిస్తుంది. (వృజినం = దుఃఖం, త్రాణనం = రక్షణం)



వృజినాత్ త్రాతుమధునా యస్మాత్ శక్తోఽసి పుత్రక ।
తస్మాత్ వృత్ర ఇతి ఖ్యాతం తవ నామ భవిష్యతి ॥ (2 - 44)

నీ అగ్రజుడు త్రిశిరస్కుడు ఉండేవాడు. మహాతపస్వి. వేదవేదాంగవేత్త. సర్వవిద్యా విశారదుడు తపస్సు చేసుకుంటూండగా ఇంద్రుడు అతడిని సంహరించాడు. వజ్రాయుధంతో సంహరించాడు నిరపరాధిని సంహరించాడు. అటుపైని అతడి మూడు శిరస్సులూ ఖండింపజేశాడు. అందుచేత ఓ పురుష శార్దూలమా ! నువ్వు ఆ పాపిష్ఠి ఇంద్రుణ్ణి సంహరించు. వాడికి సిగ్గులేదు. పాపంలేదు. బుద్ధి అంతకన్నా లేదు. బ్రహ్మహత్యామహాపాతకి వాడు. వాడిని నువ్వు సంహరించాలి - అంటూ త్వష్ట పుత్రశోకంతో బోరున విలపించాడు. కంఠం బొంగురుపోయింది. అంతలోనే తేరుకున్నాడు. వివిధరూపాల దివ్యాయుధాలను సృష్టించాడు. వృత్రుడికి అందించాడు. ఖడ్గ శూల గదా శక్తి తోమర పరిఘ పట్టిశ చక్ర ధనురక్షయతూణీరాదులన్నింటినీ సమకూర్చాడు. అతి సుందరమూ అత్యంత దృఢమూ అయిన కవచాన్ని ఇచ్చాడు. మహామేఘంలాంటి రథాన్ని సృష్టించాడు. సమస్త యుద్ధోపకరణాలనూ అందించాడు. క్రోధం కళ్ళల్లో ధగధగలాడింది. ఇంద్రుణ్ణి సంహరించమని ప్రేరేపించాడు.

*(అధ్యాయం - 2, శ్లోకాలు - 53)*

వేదపండితుల ఆశీస్సులు అందుకుని వృత్రుడు ఆ దివ్యరథం అధిరోహించి ఇంద్రవధకు బయలుదేరాడు. ఈ వార్త తెలిసి ఇంద్రపరాజితులైన సకల రాక్షసులూ తమ తమ బలాలతో తరలివచ్చి వృత్రుడివెంట నడిచారు.

చారులద్వారా ఇంద్రుడికి ఈ వృత్ర వృత్తాంతం తెలిసింది. యుద్ధానికి వస్తున్నాడన్న వార్త అందింది.

మహేంద్రా ! నీ మీద క్రోధంతో త్వష్ట అభిచారహోమం చేసి ఈ వృత్రుణ్ణి సృష్టించాడు. సకలాయుధాలూ రథమూ సమకూర్చాడు. మనమీదకి యుద్ధానికి పంపించాడు. అవకాశంకోసం ఎదురుచూస్తున్న రాక్షసులు ఇప్పుడు ఈ వృత్రుడికి బాసటగా బయలుదేరి వస్తున్నారు. నువ్వు త్వరపడాలి. యుద్ధప్రయత్నాలు చెయ్యాలి. మేరుమందరసంకాశుడై ఘోరభీకర విరావాలతో వృత్రుడు వచ్చిపడుతున్నాడు.

చారులు ఇలా తెలియజేస్తూండగానే మరికొందరు దేవతలు పరుగు పరుగున ఇంద్రుడి దగ్గరికి వచ్చారు. వారి ముఖాలలో భయం స్పష్టంగా కనపడుతోంది.

దేవనాయకా ! మన నగరంలో అంతటా అపశకునాలు కనిపిస్తున్నాయి. కాకులూ గ్రద్దలూ డేగలూ అరుస్తూ భవనాలమీద ఎగురుతున్నాయి. వాలుతున్నాయి. పెంపుడు పక్షులు కూడా చీచీ కూచీ



నినాదాలు చేస్తున్నాయి. గజాశ్వాది వాహనాల కన్నుల్లోనుంచి ధారగా నీరుకారుతోంది. ఇటీవల రెండు మూడు రోజులుగా అర్ధరాత్రిపూట రాక్షసాంగనల రోదనధ్వనులు దేవతాభవనాలలో వినిపిస్తున్నాయిట. భవనాగ్రాలమీద ఉన్న పతాకాలూ ధ్వజస్తంభాలూ తమంతతాము నేలకు పడిపోతున్నాయి. నల్లని వస్త్రాలు ధరించిన స్త్రీలెవరో వికృతాకారాలతో ఇంటింటికీ వెళ్ళి, గృహ యజమానులను ఖాళీచేసి త్వరగా పారిపొమ్మని బెదిరిస్తున్నారుట. దేవకాంతలకు రోజూ దుస్స్వప్నాలు వస్తున్నాయిట. రాక్షసస్త్రీలు వచ్చి తమను జుట్టుపట్టుకుని లాగుతున్నట్టు కలలు వస్తున్నాయిట. రాత్రిపూట నక్కల కూతలు భీషణంగా వినిపిస్తున్నాయి. మహేంద్రా ! ఈ దుర్నిమిత్తాలకు కారణం ఏమిటో తెలియక, ఏ ఉపద్రవం రాబోతోందో అని దేవతలందరూ భయపడిపోతున్నారు ప్రభూ !

## ◆ ఇంద్ర పలాయనం ◆

చారులనూ దూతలనూ పంపించివేసి ఇంద్రుడు బృహస్పతిని దర్శించాడు. దుర్నిమిత్తాలను శాంతింపజెయ్యమనీ, దేవతలకూ తనకూ మనశ్శాంతిని ప్రసాదించమనీ, ఏదైనా చక్కటి ఉపాయం చెప్పమనీ అభ్యర్థించాడు.

సహస్రాక్షా ! నేనేం చెయ్యగలను ! ఏ పాపమూ ఎరగని మునికుమారుణ్ణి సంహరించావు. తపస్సులో ఉండగా సంహరించావు. నెత్తిమీదకి తెచ్చుకున్నావు. పుణ్యపాపాలు అత్యుత్కటంగా చేస్తే వాటి ఫలాలుకూడా సత్వరంగానే అందుతాయి. అందుచేత ఏ పనినైనా చెయ్యబోయేముందే బాగా ఆలోచించుకోవాలి. ఎవరినీ సలహా కోరకుండా స్వయంగా వెళ్ళి ఆరోజున ఆ తపస్విని సంహరించివచ్చావు. ఈ రోజున ఇలా సలహా చెప్పమనీ సహకరించమనీ అడిగితే నేను ఏమి చెయ్యను !

> **అత్యుగ్రపుణ్యపాపానాం ఫలం భవతి సత్వరమ్ ।**
> **విచార్య ఖలు కర్తవ్యం కార్యం తద్భూతిమిచ్ఛతా ॥ (3 - 22)**
> **పరోపతాపనం కర్మ న కర్తవ్యం కదాచన ।**
> **న సుఖం విందతే ప్రాణీ పరపీడాపరాయణః ॥ (3 - 23)**

పరుల మనస్సులను నొప్పించే పనులు ఎప్పుడూ చెయ్యకూడదు. పరపీడా పరాయణుడికి ఎప్పుడూ సుఖం ఉండదు. మోహ లోభాలకు లొంగిపోయి బ్రహ్మహత్యా మహాపాతకం తెచ్చిపెట్టుకున్నావు. ఇది స్వయంకృతం. దాని ఫలం వెంటనే కనిపించింది. వృత్రుడు ఆవిర్భవించాడు. ఏ ఆయుధాలూ అతడిని ఏమీ చెయ్యలేవు. నీ వజ్రాయుధంకంటే గొప్ప ఆయుధాలు అతడిదగ్గర ఉన్నాయి. త్వష్ట స్వయంగా సృష్టించి ఇచ్చాడు. కేవలం నిన్ను సంహరించడంకోసమే వస్తున్నాడు.



బృహస్పతి మాట్లాడుతుండగానే పెద్ద కోలాహలం వినిపించింది. యక్షులూ గంధర్వులూ కిన్నరులూ మహర్షులూ దేవలోకం విడిచిపెట్టి పారిపోతున్నారు. ఇంద్రుడు చూసి ఆశ్చర్యపోయాడు. వెంటనే అష్టదిక్పాలకులకూ సకల సేనాపతులకూ కబురుపెట్టాడు. వసువులనూ రుద్రులనూ ఆశ్వినులనూ సూర్యచంద్రులనూ తమ తమ సేనలతో బయలుదేరి రావలసిందిగా ఆజ్ఞలు పంపించాడు. క్షణాల సన్నద్ధులై విమానాలు అధిరోహించి తరలివచ్చారు. ఇంద్రుడు ఐరావతం అధిష్ఠించి వజ్రాయుధం ధరిం సేనాగ్రభాగాన నిలిచాడు. వృత్రుడికి ఎదురు నడిచాడు.

వృత్రుడు సకలదానవ సేనాసహితుడై మానసోత్తరతీరంలో విడిది చేశాడు. ఇంద్రుడు సైన్యం అక్కడికి చేరుకున్నాడు. ఇద్దరికీ భీషణ సంగ్రామం ప్రారంభమయ్యింది. నూరేళ్ళు కొనసాగిం సకలలోకాలకూ మహోపద్రవంగా పరిణమించింది. అష్టదిక్పాలకులు ఒక్కొక్కరూ వీగి పలాయన చిత్తగిస్తున్నారు. ముందుగా వరుణుడు పారిపోయాడు. తరవాత వాయుగణం, అటుపైని యముడు సూర్యుడు, చంద్రుడు - వరసగా పరుగు లంకించుకున్నారు. ఇది చూసి వజ్రపాణి బెంబేలుపడ్డాడు తానూ రణరంగం విడిచి పలాయనం చిత్తగించాడు. వృత్రుడు విజయగర్వంతో ఆశ్రమానికి తిరి వచ్చాడు. తండ్రికి నమస్కరించాడు.

తండ్రీ ! ఇంద్రాదిదేవతలను జయించాను. అందరూ కకావికలై పారిపోయారు. సింహా చూసిన లేడిపిల్లల్లా పారిపోయారు. ఇంద్రుడు కాలికి బుద్ధిచెప్పాడు. అతడి ఐరావతాన్ని బంధిం తీసుకువచ్చాను. ఇదిగో స్వీకరించు. భయపడి పారిపోతున్నవారిని సంహరించకూడదు అనే నీతి కట్టుబడి ఇంద్రాదుల్ని విడిచిపెట్టేను. మరింక ఇప్పుడు ఏమి చెయ్యమని ఆజ్ఞాపిస్తావో చెప్పు. చేస్తాను

కుమారుడి మాటలకు త్వష్ట సంతోషించాడు. చిరంజీవీ ! ఇవ్వేళకి నేను పుత్రవంతుణ్ణి అయ్యాను. నా జీవితం సఫలమయ్యింది. క్రోధం చల్లారి మనస్సు శాంతించింది. నీ శక్తి సామర్థ్యాలు చూశాక ధైర్యం వచ్చింది. కానీ, పుత్రకా ! మరొక్క ఉపకారం నువ్వు నాకు చెయ్యాలి. అదేమిటి అంటే - చెబుతాను, విను. నువ్వు సావధాన చిత్తుడవై దృఢసంకల్పంతో స్థిరాసనం వేసుకుని తీవ్రంగా తపస్సు చెయ్యాలి. బ్రహ్మదేవుణ్ణి ప్రసన్నుణ్ణి చేసుకోవాలి. అవినాశిత్వాన్ని వరంగా పొందాలి. అప్పుడు దురాచారుడైన ఇంద్రుడిని సంహరించాలి. ఇదీ నా కోరిక. నెరవేర్చు. తపస్సు చేసేటప్పుడు జాగ్రత్తగా ఉండు సుమా ! ఇంద్రుడు జిత్తులమారి. తపస్సులను భంగపరిచే విద్యలో అతడికతడే సాటి. ఏనాడూ నమ్మకు. ఇది గుర్తుంచుకుని తపస్సుకు ఉపక్రమించు. తపస్సువల్ల సాధ్యంకానిది ఏదీ లేదు. రాజ్యభోగాలూ సకల సంపదలూ బుద్ధి వైభవాలూ యుద్ధ విజయాలూ అన్నీ తపస్సులకే సాధ్యం. బ్రహ్మను ఆరాధించు. అతడు సంతృప్తి చెందితే ఏ వరమైనా ఇస్తాడు. వరంపొంది పాపిష్ఠి ఇంద్రుణ్ణి సంహరించు. తపస్సు చేసుకుంటున్న నిరపరాధిని సంహరించి నాకు పుత్రశోకం కలిగించిన దుర్మార్గుడు వాడు. వాడు అంతరించేవరకూ నాకు మనశ్శాంతి లేదు. నువ్వే సమర్థుడివి. నా పుత్రశోకం తొలగించు.



## ◆ వృత్ర తపస్సు - బ్రహ్మవరం ◆

తండ్రి ఆజ్ఞను శిరసావహించి వృత్రుడు వెంటనే బయలుదేరాడు. గంధమాదన పర్వతశిఖరం చేరుకున్నాడు. పుణ్యనదిలో స్నానం చేసి కుశలు పరుచుకుని స్థిరాసనం వేసి కూర్చున్నాడు. అన్నోదకాలు పరిత్యజించి, యోగమార్గం ఆశ్రయించి సృష్టికర్తను ఆరాధించాడు.

ఇంద్రుడికి విషయం తెలిసింది. కంగారుపడ్డాడు. తపస్సును భంగపరుద్దామని ప్రయత్నించాడు. గంధర్వ యక్ష కిన్నర పన్నగ సర్ప విద్యాధరజాతులవారిని అందరినీ రకరకాలుగా ప్రయోగించాడు. అప్సరసలను అందరినీ వినియోగించాడు. ఏ ఉపాయమూ పారలేదు. వృత్రుడు నిశ్చలంగా తపస్సు చేసుకుంటున్నాడు. ***(అధ్యాయం - 3, శ్లోకాలు - 60)***

వృత్రుడి తపస్సు నిర్విఘ్నంగా నూరేళ్ళు సాగింది. బ్రహ్మదేవుడు సంతోషించి హంసవాహనారూఢుడై ప్రత్యక్షమయ్యాడు. నీ ఇష్టం వచ్చిన వరం కోరుకోమన్నాడు.

వృత్రుడి కన్నుల్లో ఆనందబాష్పాలు. స్థిరాసనంనుంచి మెల్లగా లేచాడు. బ్రహ్మదేవుడికి సాష్టాంగనమస్కారం చేశాడు. లేచి వినయంగా అంజలిబంధంతో నిలబడి -

బ్రహ్మన్ ! నీ దర్శనంతో నేను దేవతాప్రభువుకన్నా గొప్పవాడిని అయ్యాను. నీ ప్రేమకూ నీ వాత్సల్యానికీ మరొకసారి శిరసువంచి నమస్కరిస్తున్నాను. వేదనిధీ ! నాది ఒకేఒక్క చిన్నికోరిక. ఈపాటికే నా భావం గ్రహించి ఉంటావు. అయినా అడగమన్నావు కనక అడుగుతున్నాను. లోహకాష్ఠాది నిర్మితాలైన ఏఆయుధాలతోనూ నాకు మరణంలేకుండా వరం అనుగ్రహించు. యుద్ధరంగంలో నాబలం క్షణక్షణమూ వృద్ధిపొందాలి. నేను దేవతలకు అజేయుడిని అవ్వాలి.

బ్రహ్మదేవుడు చాలా స్ఫుటంగా నవ్వాడు. వృత్రా ! నీ వాంఛితం నెరవేరుతుంది. ఎండినదిగానీ తడిసినదిగానీ పాషాణ నిర్మితంగానీ దారునిర్మితంగానీ అయిన ఏ ఆయుధంతోనూ నీకు మరణం ఉండదు. సంతోషమేకదా ! ఇక వెళ్ళిరా - అని చెప్పి చతుర్వదనుడు అంతర్ధానం చెందాడు.

న శుష్కేణ న చార్ద్రేణ న పాషాణేన దారుణా ।
భవిష్యతి చ తే మృత్యురితి సత్యం బ్రవీమ్యహమ్ ॥ (4 - 10)

వృత్రుడు సంబరపడుతూ ఇంటికి వెళ్ళాడు. తండ్రికి వరం సంగతి చెప్పాడు. త్వష్ట ఆనందించాడు. కుమారా ! నీకు శుభమగుగాక. మన శత్రువు దేవేంద్రుడు. త్రిశిరస్కుడిని సంహరించిన ఘాతుకుడు. మహాపాపాత్ముడు. వెంటనే అతడిని సంహరించి నాకు నిజమైన ఆనందం కలిగించు. నువ్వు ఇంద్రపదవిని అధిష్ఠించాలి. నేను చూడాలి. అప్పుడు నా మనోవ్యథ తీరాలి. నాయనా ! తండ్రి జీవించి ఉన్నంతకాలమూ



అతడి మాటను జవదాటకపోవడమూ (వృద్ధాప్యంలో పోషించడమూ) గతించిన పిదప అతడి కి అన్నదానాదులు పుష్కలంగా చెయ్యడమూ (?), గయలో పిండప్రదానం చెయ్యడమూ అనేవి మూడ ఉత్తమ పుత్రుడి లక్షణాలు. ఇవి చేస్తేనే కొడుకు - కొడుకనిపించుకుంటాడు.

జీవతో వాక్యకరణాత్ క్షయాహే (?) భూరి భోజనాత్ ।
గయాయాం పిండదానాచ్చ త్రిభిః పుత్రస్య పుత్రతా ॥ (4 - 15

కాబట్టి వెంటనే పూనుకొని నా కోరికతీర్చు. త్రిశిరస్కుడిని నేను ఎంతకీ మరిచిపోలేకపోతున్నా సచ్ఛీలుడు, సత్యవాది, మహాతపస్వి, వేదవేత్త, ఏ అపరాధమూలేకుండా నిహతుడయ్యాడు. ఈ పుత్రశోకానికి ప్రతీకారం చెయ్యాలి. ఇంద్రుణ్ణి నువ్వే సంహరించాలి.

తండ్రిమాటలు వింటూనే వృత్రుడు రథం అధిరోహించాడు. ఇంద్రలోకంమీదకి దండయాత్ర ప్రకటించాడు. రణదుందుభులూ శంఖభేరీ నినాదాలూ ఒక్కపెట్టున దశదిశలకూ మారుమ్రోగాయి ఇంద్రుణ్ణి సంహరించి దేవరాజ్యం ఆక్రమిస్తాను అంటూ ప్రతిజ్ఞచేసి బయలుదేరాడు.

ఇంద్రుడికి సమాచారం తెలిసింది. వెంటనే దిక్పాలకులతో సహా సకలదేవతా సైన్యాలను సన్నద్ధం చేశాడు. గృధ్రవ్యూహం పన్ని యుద్ధానికి సిద్ధంగా ఉన్నాడు.

వృత్రుడు రావడమేమిటీ ఒక్కసారిగా భీషణ సంగ్రామం ప్రారంభమయ్యింది. ఇంద్రుడు సరాసరి వచ్చి వృత్రుణ్ణి ఢీకొన్నాడు. ఇద్దరికీ లోకభీకరంగా ద్వంద్వయుద్ధం సాగింది. హఠాత్తుగా వృత్రుడు ఇంద్రుడిని ముఖంమీద బలంగా కొట్టాడు. తాళలేక ఇంద్రుడు తూలిపడ్డాడు. అతడు తేరుకునేలోగా వృత్రుడు బంధించాడు. త్వష్ట ఆనందంతో కేరింతలు కొట్టాడు. దేవతలు హాహాకారాలు చేశారు.

## ◆ జృంభిక ఆవిర్భావం ◆

వృత్రుడికి కసి తీరలేదు. చేజిక్కిన ఇంద్రుణ్ణి నమిలి మింగెయ్యాలి అనుకున్నాడు. శరీరాన్ని వృద్ధి పొందించాడు. కొండగుహలాగా నోరు తెరిచాడు. శచీపతిని ఎడమచేతి గుప్పిటిలోకి తీసుకుని నోటిలో వేసుకున్నాడు. నమిలి మింగడమే తరువాయి.

దేవతలు భయభ్రాంతులై బృహస్పతిని సలహా అడిగారు. అతడు తన అశక్తతను ప్రకటించాడు. ఇంతలోకీ మెరుపులాగా అందరికీ ఒక ఆలోచన వచ్చింది. అందరూ కలిసి మహాబలశాలినియైన జృంభికను (ఆవులింత) సృష్టించారు. వృత్రుడిమీదికి వదిలిపెట్టారు.



అసృజంత మహాసత్త్వాం జృంభికాం రిపునాశినీమ్ ।
తతో విజృంభమాణః స వ్యావృతాస్యో బభూవ హ ॥ (4 - 36)

అది సోకడంతోనే వృత్రుడు పెద్దగా ఆవులించాడు. నోరు తెరుచుకుంది. ఇంద్రుడు ఇదే అదను అనుకొని తన శరీరాన్ని సంకోచించుకుని నోటినుంచి బయటపడ్డాడు. (ఆనాటినుంచే సృష్టిలో ప్రాణికోటికి ఆవులింతలు ఆరంభమయ్యాయి). ఎలాగోలాగా ఇంద్రుడు బతికిబయటపడ్డాడని దేవతలందరూ సంతోషించారు. అటుపైని కొన్ని వందల సంవత్సరాలపాటు యుద్ధం కొనసాగింది. సకలలోకాలకూ భయంకరంగా రోమహర్షణంగా సాగింది. ఒకవైపు సకలదేవతలూ పాల్గొంటే మరొకవైపు వృత్రుడొక్కడే నిలబడి పోరాడుతున్నాడు.

యుద్ధం జరుగుతున్నకొద్దీ వృత్రుడిబలం పెరుగుతోంది. దినదినాభివృద్ధి చెందుతోంది. ఇది బ్రహ్మ ఇచ్చిన వరం ప్రభావం. పెరుగుతున్న వృత్రుడి తేజస్సుకీ బలపరాక్రమాలకీ భయపడి కట్టకడపటికి ఇంద్రాది దేవతలందరూ నిస్సహాయులై రణరంగం విడిచిపెట్టి పలాయనం చిత్తగించారు. చెట్టుకొకరూ పుట్టకొకరుగా అడవులకు పారిపోయారు.

వృత్రుడు స్వర్గలోకాన్ని స్వాధీనపరుచుకున్నాడు. ఐరావతమూ ఉచ్చైఃశ్రవమూ దివ్యవిమానాలూ నందనాది ఉద్యానవనాలూ కామధేనువూ సకల సురాంగనలూ అతడి సొత్తు.

అమరభోగాలూ యజ్ఞభాగాలూ కోల్పోయి దేవతలు అడవులలో అగచాట్లు పడుతోంటే, వృత్రుడు ఇంద్రభోగాలతో మదగర్వితుడయ్యాడు. త్వష్టకు కోరిక నెరవేరి కళ్ళు చల్లబడ్డాయి. అతడి ఆనందానికి అవధులు లేవు. ఇంద్రుడిమీద పగ, కసి తీరాయి. కాలం గడుస్తోంది.

అడవులలో అమరులు సమావేశాలు జరుపుకున్నారు. ఏమి చెయ్యాలి, వృత్రుడిమీద ప్రతీకారం జరపడం ఎలాగ, మళ్ళీ దేవరాజ్యాన్ని చేజిక్కించుకోవడంమాట ఏమిటి - తలలు పగలగొట్టుకుని సమాలోచనలు జరుపుతున్నారు. ఎంతకూ ఏమీ తోచక శివుడితో సంప్రదిద్దామని కైలాసానికి వెళ్ళారు. జరిగినదంతా చెప్పి, రక్షించమని మొరపెట్టుకున్నారు. అందరం కలిసి బ్రహ్మదేవుణ్ణి ముందుపెట్టుకుని విష్ణుమూర్తిని ఆశ్రయిద్దాం, ఏదో ఒక ఉపాయం చెబుతాడు, పదండి అన్నాడు శివుడు. అలాగే బ్రహ్మను వెంటబెట్టుకుని విష్ణులోకానికి వెళ్ళారు. ముక్తకంఠంగా నారాయణుడిని వేదోక్తమైన పురుషసూక్తంతో స్తుతించారు. జగన్నాథుడు ఆ కమలాపతి ప్రత్యక్షమయ్యాడు. పేరు పేరునా దేవతలందరినీ కుశలం అడిగి యథోచితంగా సమ్మానించాడు. ఏమిటి ఇలా వచ్చారు ? బ్రహ్మేంద్ర మహేశ్వరులు సైతం కలిసివచ్చారంటే ఏదో పెద్దకారణమే ఉండి ఉంటుంది. చెప్పండి అని అడిగాడు. దేవతలకు నోరు పెగలలేదు. దుఃఖంతో అందరి గొంతులూ పూడుకుపోయాయి. ***(అధ్యాయం - 4, శ్లోకాలు - 62)***



## ◆ విష్ణుమూర్తితో దేవతల మంతనాలు ◆

కళ్ళలో నీళ్ళు కుక్కుకుంటున్న దేవతలను చూసి సర్వార్థ తత్త్వవేత్త అయిన విష్ణుమూర్తికి ప్రేమ అంకురించింది (సర్వార్థ తత్త్వవిత్, ప్రేమ భరోద్భ్రాంతః). దేవతలారా! ఏమిటి మౌనంగా ఉండిపోయారు. మంచో చెడో శుభమో అశుభమో - ఏదయితే అది సంశయించకుండా చెప్పండి. మీ దుఃఖాన్ని తొలగించడానికి ప్రయత్నిస్తాను. చెప్పండి అని మళ్ళీ అడిగాడు. అప్పటికి దేవతలు తేరుకుని నోరు మెదిపారు.

ప్రభూ ! ఏమీ తెలియనట్టు అడుగుతున్నావే. ఈ ముల్లోకాలలోనూ నీకు తెలియనిది ఉంటుందా? పూర్వకాలంలో బలిచక్రవర్తిని పాతాళానికి అణిచేసి ఇంద్రుణ్ణి కాపాడావు. వామనావతారం ధరించి త్రిభువనాలూ ఆక్రమించావు. అమృతాన్ని దైత్యులుకు అందకుండాచేసి దేవతలకు పంచిపెట్టావు. దేవతలకు నువ్వే ప్రభువువి. ఆపదలనుంచి కాపాడే సమర్థుడివి. ఇప్పుడు నువ్వే మమ్మల్ని కాపాడాలి మహాప్రభో - అని దేవతలందరూ చేతులెత్తి నమస్కరించారు.

మిత్రులారా ! భయపడకండి. వృత్రుడిని సంహరించడానికి ఒక చక్కని ఉపాయం ఉంది. చెబుతాను. మీరు అందరూ మునుపటిలా హాయిగా సుఖపడుదురుగాని, మీకు హితం చెయ్యడం నాకు అవశ్యకర్తవ్యం. ఇందుకోసం నా బుద్ధినీ నా బలాన్నీ నా సంపదనూ అన్నింటినీ వినియోగిస్తాను. అంతగా అవసరమైతే మోసం చేసైనా శత్రువుని సంహరిస్తాను. మీకు జయం చేకూరుస్తాను.

అవశ్యం కరణీయం మే భవతాం హితమాత్మనా ।
బుద్ధ్యా బలేన చార్థేన యేనకేన చ్ఛలేన వా ॥ (5 - 7)

సామదానభేదదండోపాయాలు నాలుగు ఉన్నాయి. వృత్రుడు బ్రహ్మ ఇచ్చిన వరంవల్లనైతేనేమి, త్వష్ట చేసిన సృష్టివల్లనైతేనేమి ఇప్పటికి అజేయుడు. కనక దండోపాయం పారదు. ఏకైక మహావీరుడూ అసహాయశూరుడూ కనక భేదోపాయం పడవదు. స్వర్గలోక సంపదలనన్నింటినీ స్వాయత్తం చేసుకున్నాడు కనక దానానికి దిగిరాడు. ఇక లొంగదీసుకోడానికి సామోపాయం ఒక్కటి మిగిలింది. ఇది ప్రయోగించి కమ్మగప్పి (ప్రతారణచేసి = మోసగించి), ప్రలోభపెట్టి ముందు అతడిని లొంగదీసుకోవాలి. అటుపైని గుట్టుచప్పుడు కాకుండా మట్టుపెట్టాలి. ఇదీ వ్యూహం. కాబట్టి గంధర్వులారా ! మీరంతా కలిసి మహర్షుల వెంటవెళ్ళి వృత్రుడిని ఆశ్రయించండి. శపథాలుచేసి నమ్మకం కలిగించి అతడి పక్షంలో చేరిపొండి. గాఢంగా మైత్రి నెరపండి. అదను దొరికినప్పుడు నేను ఇంద్రుడి వజ్రాయుధంలో ప్రవేశించి అతడిని సంహరిస్తాను. ఇంతకన్నా మరోమార్గం లేదు. శఠే శాఠ్యం సమాచరేత్ అనేది రాజనీతి. దోషం లేదు. శౌర్యానికి లొంగని అవధ్యుడిని అంతమొందించాలంటే ప్రతారణం ఒక్కటే మార్గం. వామనరూపం ధరించి బలిని వంచించలేదా ! మోహినీ అవతారం ధరించి దైత్యులను కికురించలేదా ! ఇది తప్పదు.



దేవతలారా ! మీరంతా ఈ క్షణంనుంచీ మహాదేవిని ప్రార్థించండి. స్తోత్ర మంత్రాలతో శరణువేడండి. ఆ యోగమాయ మనకు సహాయం చేస్తుంది. మహాదేవి అంటే సాత్త్విక శక్తి. పరాప్రకృతి. సిద్ధిప్రద. కామద. అకృతాత్ములకి అందని చిచ్ఛక్తి. ఇంద్రా ! నువ్వుకూడా పరాశక్తిని ఉపాసించు. ఆరాధించు. ప్రసన్నురాలిని చేసుకో. శత్రువును తేలికగా జయించగలుగుతావు. ఆవిడ జగన్మోహిని. వృత్రుడిని మోహపరచి మట్టుపెడుతుంది. మోహితుడిని జయించడం బహుసులభం. అసలు జగదంబిక ప్రసన్నురాలైతే ఏదైనా సుఖసాధ్యమే. లేదంటే ఏ కోరికా తీరదు. ఏ ప్రయత్నమూ నెరవేరదు. ఆవిడ అంతర్యామి స్వరూప. సర్వ కారణ కారణురాలు.

ప్రసన్నాయాం పరాంబాయాం సర్వం సాధ్యం భవిష్యతి ।
నోచేన్మనోరథావాప్తిర్న కస్యాపి భవిష్యతి ॥ (5 - 25)

అందుచేత ఆ విశ్వజననిని సాత్త్వికభావాలతో సాత్త్వికమార్గంలో ఉపాసించండి. బలవంతుడైన శత్రువును ఎదుర్కోవలసి వచ్చినప్పుడు అమ్మవారిని ఆరాధించడమొక్కటే తక్షణకర్తవ్యం. పూర్వకాలంలో మధుకైటభులతో నేను అయిదువేల సంవత్సరాలు పోరాడి సంహరించగలిగానంటే అదంతా అమ్మవారి కరుణ. అప్పట్లో జగన్మాతను నేను ఎంతగా ఆరాధించానో బ్రహ్మదేవుడికి ఎరుక. ప్రసన్నురాలై మధుకైటభులను సమ్మోహపరచింది కనుక నేను సంహరించగలిగాను. అందుచేత మీరూ శ్రీమాతను ఉపాసించండి. కార్యసిద్ధి అవుతుంది.

## ◆ దేవతలు చేసిన దేవీస్తుతి ◆

శ్రీమహావిష్ణువు చేసిన ఈ ఉపదేశానికి దేవతలు అందరూ సమ్మతించారు. మందారవనశోభితమైన మేరుపర్వతశిఖరం చేరుకున్నారు. ఏకాంతప్రదేశంలో పద్మాసనాలు వేసుకుని కూర్చున్నారు. ధ్యానమూ తపమూ జపమూ చేసి సృష్టి సంహారకారిణి అయిన జగదంబికను స్తుతించారు. భక్తులపాలిటి కామధేనువును ఆరాధించారు. సంసారక్లేశ వినాశినిని ఉపాసించారు.

తల్లీ ! మేమంతా నీ పుత్రులం. కష్టాల కడలిలో కొట్టుమిట్టాడుతున్నాం. వృత్రుడి బాధలు పడలేక అడవులపాలయ్యాం. నువ్వే ఇలా ఉపేక్షించి ఊరుకుంటే ఇక మాకు దిక్కెవ్వరు తల్లీ ! మేము చేసిన అపరాధం ఏమిటి మాతా ! ఎందుకని ఉపేక్షిస్తున్నావు. సకలలోకాలనూ సృష్టించినదానవు నువ్వు. త్రిమూర్తులనూ కల్పించినదానవు నువ్వు. వారు నీ కనుసన్నలలో మెలిగే సేవకులు. ఇక మేమనగా ఎంత! నీ పసిబిడ్డలం. ఒకవేళ మేము తెలియక ఏదైనా తప్పుచేసినా క్షమించి కాపాడవలసిన తల్లివి నువ్వు. ఏ తప్పూ చెయ్యని మమ్మల్ని కాపాడకపోతే ఎలాగ ? నీ పాదాలు శరణువేడుతున్నాం.



విభవ సుఖభోగలుబ్ధులై మీరంతా నన్ను మరిచిపోయారు కాబట్టి కష్టాలు అనుభవించండి అని ఉపేక్షిస్తున్నావేమో అనుకుందామంటే అటువంటిది ఏమీ లేదే. నిన్ను మేమెప్పుడూ మరిచిపోలేదే. నిరంతరం ధ్యానిస్తూనే ఉన్నామాయె. ఒకవేళ మరిచిపోతేమాత్రం బిడ్డలపట్ల కన్నతల్లి చూపించవలసిన కరుణాకటాక్షరీతి ఇదేనా ! నిజంగా మరిచిపోయి భోగభాగ్యాలలో తేలియాడుతూ మోహంలో కూరుకుపోయామంటే అదికూడా నీ కల్పనా విశేషమేకదా! నువ్వు స్వభావకరుణామయివి. దయ చూపించకపోతే ఎలాగ ! ఒకప్పుడు మహిషాసురుడిని సంహరించి మమ్మల్ని రక్షించావు. ఇప్పుడు ఈ లోకభీకరుడైన వృత్రుడిని ఖండించడానికి ఎందుకు సంశయిస్తున్నావో, ఎందుకని ఇంతకాలం ఉపేక్షిస్తున్నావో తెలియడం లేదు. శుంభనిశుంభులను సంహరించినట్టే వృత్రుడినీ సంహరించి మమ్మల్ని కాపాడు. స్వశక్తితో క్లేశాలు తొలగించి దేవతల ఆర్తినీ దుఃఖాన్నీ ఉపశమింపజెయ్యగలిగిన సామర్థ్యం నీకు తప్ప మరెవ్వరికీ లేదు.

అమ్మా ! వృత్రుడిమీద నీకు దయఉండవచ్చు. అతడికి మేలు చెయ్యాలని నువ్వు భావించవచ్చు. నిజానికి ఇప్పుడు వెంటనే సంహరించడమే అతడికి మేలుచెయ్యడం. లేకపోతే ఆ జనదుఃఖకరుడు, ఖలుడు, పాపాత్ముడు, దుష్టబుద్ధి, ఇంకా ఇంకా పాపకూపంలో కూరుకుపోతాడు. అందుచేత ఉద్ధరించు. నీ బాణాలతో పవిత్రుణ్ణి చెయ్యి.

వృత్రే దయా తవ యది ప్రథితా తథాపి
జహ్యేవమాశు జనదుఃఖకరం ఖలం చ ।
పాపాత్మముద్ధర భవాని శరైః పునానా
నోచేత్ప్రయాస్యతి తమో నను దుష్టబుద్ధిః ॥ (5 - 43)

నువ్వు రాక్షసులను సంహరించడమంటే వారిని పరిపూతులను చేసి నందనవనానికి పంపడమే కదా ! ఈ వృత్రుడినికూడా త్వరగా అలా పంపు. ఇతడు నీ సేవకుడనీ, నీ దయకు పాత్రుడనీ మేము విశ్వసించలేకపోతున్నాం. అటువంటివాడే అయితే మమ్మల్ని ఎందుకు హింసిస్తాడు ? మేమూ నీ పాదసేవకులమేకదా ! నీ దయకు పాత్రులమేకదా !

జగజ్జననీ ! అసలు నిన్ను పూజించడం ఎలాగ ! ఈ ఫలపుష్పాదులన్నీ నీ నిర్మాణమే. మంత్రతంత్రాలు నీ సృష్టియే. మేమే నీ సృష్టి. నువ్వు పరాశక్తివి. నీ చరణాలకు శరణంటూ మొక్కడమే మేము చెయ్యగలిగిన పూజావిశేషం. సంసార జలధిని దాటించే నౌకలు నీ పాదపద్మాలు. వాటిని అర్చించగలిగిన మానవులు ధన్యులు. యోగులు మనస్సులో ధ్యానిస్తే, మోక్షార్థులు అరిషడ్వర్గాలమీ జయించి నిన్ను ఉపాసిస్తున్నారు. సకలవేదవేత్తలైన యాజ్ఞికులు హోమకాలంలో నిన్ను స్మరిస్తున్నారు.



దేవతలకు యజ్ఞ భాగాలను పంచి తృప్తిపరిచే స్వాహాదేవివి నువ్వు. పితృదేవతలకు సంతుష్టి కలిగించే స్వధాస్వరూపానివి నువ్వు. మేధ కాంతి శాంతి బుద్ధి అన్నీ నువ్వే. నిన్ను సేవించేవారికి ఇవన్నీ అందించి మహావైభవం ప్రసాదిస్తున్నావు. నువ్వు దయామయివి. కృపాస్వరూపిణివి.

దేవతల స్తుతులకు జగదీశ్వరి సంతృప్తి చెందింది. ప్రత్యక్షమయ్యింది. సౌందర్యరాశి. సర్వాభరణ భూషిత. తన్వి. పాశాంకుశధారిణి. చతుర్భుజ. చిరుగంటల చప్పుడుతో మనోహరంగా ఉన్న మొలనూలు ధరించింది. నూపురాల గలగలలూ కంకణాల గణగణలూ. శిరస్సుమీద రత్నకిరీటం. దానిమీద చంద్రరేఖ. చిరునవ్వులు చిందిస్తున్న సుందరముఖారవిందంలో ముచ్చటగా మూడుకన్నులు. పారిజాత పుష్పకేసరంలాంటి శరీరచ్ఛాయ (పారిజాత ప్రసూనాచ్ఛనాళవర్ణ సమప్రభా). ఎర్రని వస్త్రాలు. రక్తచందన చర్చ. ఒక దయాసముద్రం. ఒక కరుణాసాగరం. ప్రసన్నముఖి. సర్వశృంగారవేషాఢ్య. సర్వ ద్వైతారణి. సర్వజ్ఞ. సర్వకర్త్రి. సర్వాధిష్ఠానరూపిణి. సర్వవేదాంతసంసిద్ధ. సచ్చిదానందరూపిణి.

దేవతలంతా సాష్టాంగనమస్కారాలు చేశారు. ఏమిటి పని, నన్ను ఎందుకు పిలిచారు - అని అడిగింది. దేవతలు వినయంగా అభ్యర్థించారు.

జగన్మాతా ! దేవతలనందరినీ పీడించుకుతింటున్న వృత్రుడిని సమ్మోహపరచు. అతడు దేవతలను విశ్వసించేట్టు విమోహపరచు. అతడిని సంహరించే ఆయుధానికి (వజ్రాయుధానికి) తగిన బలమూ శక్తీ సమకూర్చు. అతడు దానితో సంహరింపబడేలా చూడు.

దేవతల ఈ అభ్యర్థనకు జగన్మాత సరే అంది. వెంటనే అంతర్ధానం చెందింది. దేవతలు సంబరపడి తమ తమ నిలయాలకు బయలుదేరారు. ***(అధ్యాయం - 5, శ్లోకాలు - 59)***

## ◆ ఋషి దేవతల సామోపాయం ◆

దేవతలూ ఋషులూ అందరూ కలిసి వృత్రుడి ఆశ్రమానికి బయలుదేరి వెళ్ళారు. తపోమయతేజస్సుతో అగ్నిలా ప్రజ్వరిల్లుతున్న వృత్రుణ్ణి చూశారు. ముల్లోకాలనూ ఆక్రమిస్తున్నట్టూ, సకలదేవతలనూ స్వాధీన పరుచుకుంటునట్టూ భాసించాడు. ఋషులు మెల్లగా సమీపించి ప్రేమగా పలకరించారు. దేవకార్య సిద్ధిని కాంక్షించి సామోపాయంగా రసాత్మకంగా ప్రసంగించారు.

వృత్ర వృత్ర మహాభాగ సర్వలోకభయంకర ।
వ్యాప్తం త్వయైతత్సకలం బ్రహ్మాండమఖిలం కిల ॥ (6 - 3)



మహాభాగా ! సర్వలోక భయంకరా ! వృత్రా ! నీ తేజస్సు అనంతం. నీ తపస్సు అమోఘం. ఈ బ్రహ్మాండమంతటా నువ్వే వ్యాపించావు. నీకిప్పుడు ఇంద్రుడితో ఇక వైరమేమిటి ! అది అతడికేకాదు నీకు కూడా సౌఖ్యవిఘాతకమే. ఇద్దరికీ దుఃఖప్రదమే. ఇద్దరి ఆలోచనలనూ నిరంతరం అదే మింగేస్తూ ఉంటుంది. మీరిద్దరూ హాయిగా కంటినిండా నిద్రపోయి ఎంతకాలమయ్యిందో ! నువ్వు నిద్రపోవడంలేదు. అతడిని నిద్రపోనివ్వడంలేదు. శత్రుభయంతో చింతార్తుడైనవాడు ఎంత బలశాలి అయినా సుఖంగా నిద్రపోగలడా !

న త్వం స్వపిషి సంతుష్టో న చాపి మఘవా తథా ।
సుఖం స్వపితి చింతార్తో ద్వయోర్వైరజం భయమ్ ॥ (6 - 6)

విలువైన కాలమంతా మీకు యుద్ధాలతోనే గడిచిపోతోంది. దేవతలూ దానవులూ మానవులూ - సకలప్రజలూ ఇబ్బందులు పడుతున్నారు. ఎందరెందరో ప్రాణాలు కోల్పోతున్నారు. ఈ సంసారంలో సుఖాలు గ్రహించాలనీ దుఃఖాలు విడిచిపెట్టాలనీ పెద్దలమాట. దీనికి పూర్తి వ్యతిరేకంగా చేస్తున్నారు మీరు. ఒకడితో వైరం పెట్టుకున్నాడు అంటే ఇక వాడికి సుఖం ఉండదు అనేది కచ్చితమైన నిర్ణయం. దీన్ని సంగ్రామరసికులైన శూరులు అభిలషించి ప్రశంసించవచ్చుగానీ పండితులుమాత్రం హర్షించరు.

న సుఖం కృతవైరస్య భవతీతి వినిర్ణయః ।
సంగ్రామరసికాః శూరాః ప్రశంసంతి న పండితాః ॥ (6 - 8)

పంచేంద్రియ సుఖాలనూ హరిస్తుంది యుద్ధం. శృంగార చతురులు పుష్పాలతోనైనా యుద్ధాలు చెయ్యకూడదంటారు. మీరేమిటో తీవ్రవిశిఖాలతో సంవత్సరాల తరబడి సంగ్రామాలు చేస్తున్నారు. యుద్ధంలో విజయమనేది ఎప్పుడూ సందేహాస్పదమే. కానీ అందరికీ గాయాలు అవ్వడమనేది మాత్రం ఖాయం. జయాపజయాలే కాదు ఈ విశ్వమంతా దైవాధీనం. ఇది తెలిసీ మీరు కలహించుకుంటున్నారంటే ఏమనాలి !

సకాలంలో స్నానం చెయ్యడం, భోజనం చెయ్యడం శయనించడం, భార్యతో పరిచర్యలు పొందడం - ఇవ్వికదా సంసారంలో సుఖాలు. వీటిని మీరు పొంది ఎన్ని వందల సంవత్సరాలయ్యిందో ఒకసారి ఆలోచించు. యుద్ధంలో ఏ సుఖం ఉందని మీరు కత్తులు దూస్తున్నారో మాకైతే ఎంతకీ అర్థం కావడంలేదు. మరణించాక ఏదో స్వర్గసుఖం లభిస్తుందంటారు. దానికోసమేనా జీవితకాలాన్ని వృథా చేసుకోవడం ! ఇది చాలా ప్రలోభపెట్టే వాక్యం. ఇంతకన్నా పనికిమాలినమాట మరొకటి ఈ సృష్టిలో ఉ



వాఙ్మయంలో ఉంటుంది అని మేము అనుకోము. బాధకు ఓర్చుకుని అందమైన దృఢమైన శరీరాన్ని ముక్కలు చేసుకుని, రణరంగంలో కుక్కలకూ నక్కలకూ అప్పగించి, అటుపైని స్వర్గసుఖాలు పొందుతాను అనడంకన్నా మూర్ఖత్వం ఉందా ? ఎంతటి మూర్ఖుడైనా ఇది కోరుకుంటాడా ?

ఛిత్వా దేహం వ్యథాం ప్రాప్య శృగాల కరటాదిభిః ।
పశ్చాత్స్వర్గసుఖావాప్తిం కో వా వాంఛతి మందధీః ॥ (6 - 15)

అందుచేత, ఓ వృత్రా ! మహావీరా ! నీకూ శక్రుడికీ గాఢమైన సఖ్యాన్ని మేము వాంఛిస్తున్నాం. అది నిత్యం కొనసాగాలని అభిలషిస్తున్నాం. మైత్రి కుదుర్చుకుని మీరిద్దరూ నిరంతరం సుఖపడండి ప్రాణికోటిని సుఖపడనివ్వండి. మేమూ సుఖపడతాం. వైరం శాంతించి యుద్ధభయం తొలగిపోతే అది అందరికీ ఆనందదాయకం. రేయింబవళ్ళు మీరు యుద్ధంచేస్తుంటే అది మాకెంత పీడగా ఉండేదో. మేము శాంతికాముకులం. అందరూ సఖ్యంగా కలిసిమెలిసి ఉండాలని కోరుకుంటూ ఉంటాం. మావంటి మునులు అవసరాన్నిబట్టి నిన్నుగానీ ఇంద్రుణ్ణిగానీ సుఖంగా సమీపించాలి అంటే అవకాశం ఉండేదికాదుగదా ఇన్నాళ్ళూను. ఇకనైనా మాకు అది దక్కాలి.

వృత్రా ! మీ ఇద్దరికీ మేము మధ్యవర్తులం. ఒట్టు వేయించి మీ ఇద్దరికీ మైత్రి కుదర్చాలనేది మా సంకల్పం. ఇంద్రుడు ఇక్కడికి వస్తాడు. నీ ఎదుటనే మేము చెప్పినట్టల్లా శపథాలు చేస్తాడు. నీ మనస్సుకి సంతృప్తి సంతోషం కలిగిస్తాడు.

శక్రస్తు శపథాన్ కృత్వా యథోక్తాంశ్చ తవాగ్రతః ।
చిత్తం తే ప్రీతిసంయుక్తం కరిష్యతి తు సాంప్రతమ్ ॥ (6 - 20)

ఈ ధర - సత్యాధార. సూర్యుడు సత్యాధారుడు. సత్యశక్తితోనే అతడు ప్రజ్వరిల్లుతున్నాడు. వాయువు వీస్తున్నది సత్యంవల్లనే. సముద్రుడు మేరమీరడంలేదన్నా సత్యమే కారణం. అందుచేత మీ ఇద్దరికీ ఇవి సాక్షిగా సత్యమైన సఖ్యం ఏర్పడుగాక ! ఇద్దరూ కలిసి ఒక కంచంలో తింటూ ఒక మంచంలో నిద్రిస్తూ సుఖంగా జీవించండి. ఆనందంగా క్రీడించండి. సంతోషంగా విహరించండి.

ఏకత్ర శయనం క్రీడా జలకేళిః సుఖాసనమ్ ।
యువాభ్యాం సర్వథా కార్యం కర్తవ్యం సఖ్యమేత్య చ ॥ (6 - 24)



## ◆ వృత్ర దేవేంద్రుల సంధి ◆

మహర్షుల ప్రసంగానికి వృత్రుడు ప్రసన్నుడయ్యాడు. వినయంగా స్పందించాడు. మహను భావులారా! మీరంతా మహాతపస్వులు. మాననీయులు. మీవంటి మహామునులు మిథ్యావాదాలు చెయ్యరు. సదాచారపరాయణులు. శాంతచిత్తులు. మీరు మోసాలు చెయ్యరు. మీకు అవి తెలియవు. కనక చెబుతున్నాను. శత్రుత్వం పెట్టుకున్నవాడితో, శఠుడితో, స్తబ్ధుడితో, కాముకుడితో, తేజోహీనుడితో బుద్ధిమంతుడు ఎవ్వడూ సఖ్యం చెయ్యడు.

కృతవైరే శఠే స్తబ్ధే కాముకే చ గతత్విషి ।
నిర్లజ్జే నైవ కర్తవ్యం సఖ్యం మతిమతా సదా ॥ (6 - 26)

మీరంటున్న ఇంద్రుడు సిగ్గులేనివాడు. దురాచారుడు. బ్రహ్మహత్యామహాపాతకి. లంపటుడు. శఠుడు. ఇలాంటివాడిని ఎప్పుడూ ఎవ్వడూ విశ్వసించకూడదు. విశ్వసించడు. మీరంతా నిపుణులు. ఏ రకమైన ద్రోహబుద్ధీ లేనివారు. శాంతచిత్తులు. కనక అతివాదుల చిత్తప్రవృత్తులను గురించి మీకు బొత్తిగా తెలియదు.

భవంతో నిపుణాః సర్వే న ద్రోహమతయస్సదా ।
అనభిజ్ఞాస్తు శాంతత్వాత్ చిత్తానామతివాదినామ్ ॥ (6 - 28)

ఈ మాటలకు మునులు నివ్వెరపోయారు. అయినా ప్రయత్నం విడిచిపెట్టలేదు. సంభాషణ కొనసాగించారు. వృత్రా ఎవడు చేసుకున్న కర్మ వాడు అనుభవిస్తాడు. అది శుభమైనా అశుభమైనా అనుభవించక తప్పదు. ఒకడికి ద్రోహంచేసి ఎవడైనా శాంతిగా బతకగలడా ? ఎంతగా మనస్సుని చంపుకుంటేమాత్రం వాడికి శాంతి ఉంటుందా ? విశ్వాసఘాతకుడు నరకానికి పోతాడు. బతికుండగానే మహాదుఃఖం అనుభవిస్తాడు. బ్రహ్మహంతలకు నిష్కృతి ఉంది. సురాపానం చేసినవారికి ప్రాయశ్చిత్తం ఉంది. విశ్వాసఘాతకులకూ మిత్రద్రోహులకూ మాత్రం నిష్కృతి లేనేలేదు.

నిష్కృతిః బ్రహ్మహంతౄణాం సురాపానాం చ నిష్కృతిః ।
విశ్వాసఘాతినాం నైవ మిత్రద్రోహకృతామపి ॥ (6 - 32)

అందుచేత ఓ సర్వజ్ఞుడా ! ఇంద్రుడితో సంధి కుదుర్చుకోవడానికి నీ మనస్సులో ఉన్న నియమం ఏమిటో నువ్వే చెప్పు. దాని ప్రకారమే మీ ఇద్దరికీ ఒడంబడిక కుదురుస్తాం. మైత్రి ఏర్పరుస్తాం.

విప్రులారా ! నాకున్న వరం మీకు తెలునుగదా ! ఎండిన వస్తువుతోగానీ తడిసిన ఆయుధంతోగానీ రాతితోగానీ వజ్రంతోగానీ రాత్రిపూటగానీ పగటిపూటగానీ ఇంద్రుడి చేతిలోగానీ దేవతల చేతిలోగానీ నేను వధ్యుణ్ణి కాను. ఇది బ్రహ్మదేవుడు ఇచ్చిన వరం. దీనికి కట్టుబడి మీరు సంధి కుదర్చగలిగితే కుదర్చండి. అదీ ఒక్క ఇంద్రుడితోనే.



ఈ నియమానికి మునీశ్వరులు వెంటనే అంగీకరించారు. ఇంద్రుణ్ణి పిలిపించారు. అతడి సమక్షంలో నియమం మరొక్కసారి స్పష్టంగా వినిపించారు. ఇంద్రుడు అంగీకరించాడు. చెయ్యమన్న శపథాలన్నీ చేశాడు. వెయ్యమన్న ఒట్లు అన్నీ వేశాడు. అప్పటికి ఇంద్రుడికి భయం వదిలిపోయింది. జ్వరం తగ్గిపోయింది. అగ్నిదేవుడు సాక్షిగా మునీశ్వరుల సన్నిధిలో వృత్ర దేవేంద్రులకు సంధి కుదిరింది. వృత్రుడు ఇంద్రుడి శపథాలు పూర్తిగా విశ్వసించాడు. మిత్రుడయ్యాడు. ఇద్దరూ ఆత్మీయంగా సహచరులయ్యారు. ఒకప్పుడు నందనవనంలో, ఇంకొకప్పుడు గంధమాదనపర్వతంమీద, మరొకప్పుడు సముద్రతీరంలో ఆనందంగా అరమరికలు లేకుండా క్రీడిస్తున్నారు. వృత్రుడు మైమరిచి ఆనందిస్తున్నాడు. ఇంద్రుడు మాత్రం ఎప్పటికప్పుడు ఉపాయాలను ఆలోచిస్తున్నాడు. అతడిని సంహరించే అవకాశంకోసం జాగరుకుడై ఎదురుచూస్తున్నాడు. ఎప్పుడూ ఉద్విగ్నంగానే కనిపిస్తున్నాడు.

**శక్రోఽపి వధకామస్తు తదుపాయానచింతయత్ ।**
**రంధ్రాన్వేషీ సముద్విగ్నస్తదాసీత్ మఘవా భృశమ్ ॥ (6 - 40)**

కాలం గడుస్తోంది. నెలలూ సంవత్సరాలూ గడుస్తున్నాయి. దారుణమైన ఇంద్రుణ్ణి నిజంగానే విశ్వసించాడు కొడుకు అని గ్రహించి ఒకరోజున త్వష్ట స్వయంగా బయలుదేరి వృత్రుడి దగ్గరికి వచ్చాడు. నాయనా ! పుత్రా ! వృత్రా ! హితం చెబుతున్నాను వినరా తండ్రీ ! శత్రుత్వం పెట్టుకున్నవాడిని ఎప్పుడూ నమ్మకూడదు. ఇంద్రుడు నీతో కృతవైరుడు. పైగా అసూయాపరుడు. పరమలోభి. ఐశ్వర్యమదమత్తుడు. ద్వేషపరాయణుడు. పరుల దుఃఖాలకు పండగలు చేసుకునే నీచుడు. పరదారలంపటుడు. పాపి. నయవంచకుడు. నిరంతరం రంధ్రాన్వేషి. ద్రోహబుద్ధి. మాయావి. మదగర్వితుడు. తల్లి గర్భంలోకి ప్రవేశించి గర్భవిచ్ఛేదం చేసిన క్రూరుడు. పాపభీతి ఏమాత్రమూ లేనివాడు. అతడిని నువ్వు విశ్వసిస్తున్నావు. ఇది నీకు తగదు. ఒకసారి మహాపాపం చేసిన వాడికి ఇక సిగ్గేమిటి ఎగ్గేమిటి ? ఎన్ని పాపాలైనా ఎన్నిసార్లైనా చేస్తాడు. పుత్రకా ! ఇంద్రుడిని నమ్మకు - అని ప్రేమగా ఉపదేశించాడు. కానీ వృత్రుడు వినిపించుకోలేదు. పోగాలం దాపురించింది. ఎలా వింటాడు !

## ◆ వృత్ర వధ ◆

ఒకరోజున సముద్రతీరంలో వృత్రుడిని కలుసుకున్నాడు ఇంద్రుడు. అది సంధ్యాసమయం. రాత్రీకాదు, పగలూ కాదు, అదొక దారుణ ముహూర్తం. ఇంద్రుడికి ఆలోచన మెదిలింది. ఇది సంధ్య. రౌద్ర రూపిణి. రాత్రీ పగలూ కాదు. వరదానంలో ఇవి రెండేకదా మినహాయింపులు. వీడిని సంహరించడానికి ఇది తగిన సమయం. ఒంటరిగా ఉన్నాడు. కనుచూపుమేరలో జనసంచారంలేదు. బాగా దొరికాడు - అనుకుని విష్ణుమూర్తిని స్మరించాడు. ప్రణాళిక ప్రకారం నారాయణుడు అదృశ్యరూపంలో వచ్చి



వజ్రాయుధంలో ప్రవేశించాడు. ఇప్పుడు కనక ఇతడిని సంహరించకపోతే ఇక నాకు ఏ శ్రేయస్సూ ఉండదు. శత్రువు బలవంతుడైనప్పుడు వంచనచేసి మట్టుబెట్టమని రాజనీతి చెబుతోంది. కాబట్టి నిస్సందేహంగా వీడిని ఇప్పుడు సంహరించవలసిందే అని మరోసారి దృఢంగా నిశ్చయించుకున్నాడు.

ఆయుధం తడిది కాకూడదు పొడిది కాకూడదు, శిలాదారులోహ నిర్మితం కాకూడదు. ఎలాగ, ఏ ఆయుధంతో వీడిని చంపాలి ? ఒక్క క్షణం ఆలోచించాడు. ఎదురుగా సముద్ర తరంగాలమీద పెద్ద నురుగు కనిపించింది. అవును అది తడీ కాదు, పొడీ కాదు. శిలాదారులోహాలలో ఏదీ కాదు. దానిని ఆయుధంగా ఉపయోగిద్దాం అనుకున్నాడు.

ఒక్కసారి జగన్మాతను ఆదిపరాశక్తిని మనసా ధ్యానించాడు. ఆ పరాశక్తి తన తేజోంశను ఆ ఫేనపుంజంలో (నురుగులో) ప్రవేశపెట్టింది. ఇంద్రుడు తన వజ్రాయుధాన్ని వృత్రుడి కంటబడకుండా ఆ నురుగులో ముంచాడు. ఫేనావృతమైన వజ్రాయుధాన్ని వృత్రుడిపైకి విసిరాడు. అంతే. అది తగిలీ తగలడంతోనే పర్వతశిఖరంలా కూలిపోయాడు వృత్రుడు.

ఫేనావృతం పవిం తత్ర శక్రశ్చిక్షేప తం ప్రతి ।
సహసా నిపపాతాశు వజ్రాహత ఇవాచలః ॥ (6 - 60)

దేవేంద్రుడు ఆనందపరవశుడయ్యాడు. మహర్షులు సంతోషించారు. ఇంద్రుణ్ణి స్తుతించారు. దేవతలు సంబరపడ్డారు. అందరూ కలిసి జగన్మాతను భక్తిప్రపత్తులతో ధ్యానించి స్తోత్రాలు చేశారు. ఆవిడ అనుగ్రహంతోనేకదా వృత్రుడిని సంహరించగలిగామని వినయవిధేయతలతో కృతజ్ఞతలు ప్రకటించుకున్నారు. దేవేంద్రుడు తన నందనోద్యానవనంలో పరాశక్తికి ప్రాసాదం (ఆలయం) కట్టించాడు. పద్మరాగమణి నిర్మితమైన మూర్తిని ప్రతిష్ఠించాడు. దేవతలందరూ ముప్పొద్దులా ఆ మందిరంలోకి చేరి అమ్మవారిని అర్చించడం పరిపాటి అయ్యింది. నిర్జరులందరికీ జగదీశ్వరియే కులదేవత (ఇలువేల్పు) అయ్యింది. వృత్ర హంత్రి అనే నామధేయంతో అప్పటినుంచీ ఆరాధనలు అందుకుంటోంది.

తరవాత దేవేంద్రుడు శ్రీమహావిష్ణువును భక్తితో పూజించి సంతోషపరిచాడు. వాయువు శుభప్రదంగా సుఖప్రదంగా వీతెంచింది. దేవగంధర్వయక్షకిన్నరాదులందరూ వృత్రవధతో సంబరాలు జరుపుతున్నారు. నిజానికి వృత్రుడిని సంహరించింది నురుగులో ప్రవేశించిన పరమేశ్వరీశక్తియే అయినా ఇంద్రుడు పైకి కనిపించే కారణమయ్యాడు కనక వృత్రహంత అనే కీర్తిని తానూ పొంది ఉప్పొంగిపోయాడు.

(అధ్యాయం - 6, శ్లోకాలు - 68)



## ◆ మహర్షుల పశ్చాత్తాపం ◆

వృత్రవధను కన్నులారా చూసి ఇంద్రుడి అర్చనలు అందుకొని విష్ణుమూర్తి వైకుంఠపురం చేరుకున్నాడు. చేరుకున్నాడేగానీ మనస్సు ఆందోళన పడుతోంది. ఇంద్రుడూ మనస్సులో భయపడుతూనే అమరావతికి చేరుకున్నాడు. సంధి కుదిర్చిన మహర్షులూ భయపడ్డారు. ఎంత మహాపాపం చేశాం ! ఇతనిని వంచించాంకదా ! మనం మునులమా ? మనం మహర్షులమా ? ఆ పదాలకు తగముగాక తగం. మన మాటమీద నమ్మకంతోనే కదా వృత్రుడు ఇంద్రుడితో చెలిమిచేశాడు. ఇంద్రుడేమో విశ్వాస ఘాతకుడయ్యాడు. ఇంద్రుడితో సాంగత్యంవల్ల మనమూ విశ్వాసఘాతకులం అయ్యాము. ఏమిటి ఇతడితో మనకు ఈ మమకారం ! ఎంత తప్పు చేశాం ! సర్వానర్థాలకూ సర్వపాపాలకూ మమకారమేకదా మూలకారణం. ఇంద్రుడిపట్ల మమకారంతో శపథాలు చేయించి వృత్రుడిని మోసగించాం. అన్యాయం చేశాం. పాపాత్ములకు ఆలోచన అందించినవాడు, సలహా చెప్పినవాడు, ప్రేరేపించినవాడు, వారి పక్షాన నిలిచినవాడు - ఆ పాపంలో నిశ్చయంగా సమానంగా భాగస్వామి అని పెద్దలు చెబుతున్నారు.

మంత్రకృత్ బుద్ధిదాతా చ ప్రేరకః పాపకారిణామ్ ।
పాపభాక్స భవేన్నూనం పక్షకర్తా తథైవ చ ॥ (7 - 6)

ఇంద్రుడికి సహాయపడ్డాడు కనక ఈ మహాపాపంలో విష్ణుమూర్తికీ భాగం ఉంది. అయ్యో ! స్వార్థం ఎంతటివాడితోనైనా ఎంతటిపాపన్నైనా చేయిస్తుందికదా ! స్వార్థపరుడు భయపడడు. సిగ్గుపడడు. ఇంద్రుడితో చెయ్యి కలిపి విష్ణుమూర్తి కూడా నింద్యుడయ్యాడు.

నూనం స్వార్థపరః ప్రాణీ న పాపాత్ త్రాసమశ్నుతే ।
హరిణా హరిసంగేన సర్వథా దుష్కృతం కృతమ్ ॥ (7 - 8)

పురుషార్థాలు నాల్గింటిలోనూ రెండు అంతరించి, రెండు జీవించినట్టు అయ్యింది. మొదటిదీ చివరిదీ ముల్లోకాలలోనూ బహుదుర్లభాలుకదా ! అర్థకామాలే అందరికీ సమ్మతమైనవీ ప్రశస్తమైనవీను. ధర్మం ధర్మం అంటూ మహానుభావులైనా గొంతుచించుకోవడం వట్టి దంభమేనేమో ! ఆచరణలోకి వచ్చేసరికి వారూ అర్థకామాలకు లొంగిపోతారన్నమాట. ఇంతేకదా మా ప్రవర్తనవల్ల తేలింది.

అర్థకామౌ ప్రశస్తౌ ద్వౌ సర్వేషామ్ సమ్మతౌ ప్రియౌ ।
ధర్మం ధర్మేతి వాగ్వాదః దంభోఽయం మహతామపి ॥ (7 - 10)

మునీశ్వరులు ఈ విధంగా తీవ్రమనస్తాపానికిలోనై నిరుత్సాహంగా విమనస్కంగా తమతమ ఆశ్రమాలకు మెల్లగా చేరుకున్నారు.



ఇంద్రుడిచేతిలో వృత్రుడు అన్యాయంగా మరణించిన దుర్వార్త తెలిసి త్వష్ట దారుణంగా రోదించాడు. దుఃఖించాడు. పరితపించాడు. క్షణంలో ఒక నిర్వేదభావం అలముకుంది. పుత్రుడి ఆశ్రమానికి వెళ్ళాడు. కళేబరాన్ని చూసి బావురుమన్నాడు. కాసేపటికి తేరుకుని తనను తానే ఓదార్చుకుని శాస్త్రీయంగా ఉత్తరక్రియలు జరిపించాడు. నదీజలాలలో స్నానంచేసి పుత్రుడికి నీళ్ళు వదులుకున్నాడు. శోకం పట్టలేక, మిత్ర ఘాతకుడైన దేవేంద్రుడిని ఒక్కపెట్టున శపించాడు. శపథాలతో మోసగించి నా పుత్రుడిని సంహరించినట్టే ఇంద్రుడుకూడా మహాదుఃఖాన్ని పొందుగాక - అని శపించి త్వష్ట అక్కడ నిలవలేక మేరుశిఖరానికి వెళ్ళిపోయాడు. తీవ్రనియమాలతో చండప్రచండంగా తపస్సు చేసుకున్నాడు.

వ్యాసభగవానుడు కథ ఇక్కడిదాకా చెప్పి ఒక్కక్షణం ఆగాడు. వెంటనే జనమేజయుడు ప్రశ్నించాడు - పితామహా ! వృత్రుడిని సంహరించి దేవేంద్రుడు ఏ అవస్థ పొందాడు ? సుఖపడ్డాడా, దుఃఖపడ్డాడా ? ఆ ఒక్క ముక్క నాకు తెలియజెయ్యి - అన్నాడు. వ్యాసుడు అన్నాడు గదా -

జనమేజయా ! ఏమి అలా అడుగుతున్నావు ? అవశ్యమేవ భోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్. ఇది ఎవరికైనా ఎంతటివారికైనా తప్పదు. బలవంతులో బలహీనులో, అల్పమో అధికమో - కర్మఫలం అనుభవించి తీరవలసిందే. దేవతలకైనా మానవులకైనా దానవులకైనా ఇది తప్పదు.

అసలు ఇంద్రుడికి ఇలాంటి ఆలోచన చెప్పినవాడు విష్ణువు. పైగా వజ్రాయుధంలో ప్రవేశించి వృత్రవధకు తానై సహకరించినవాడూ విష్ణువే. కానీ పాపంపండి దేవేంద్రుడు ఆపదల్లో ఇరుక్కునే సరికి విష్ణుమూర్తి కనీసం తొంగి చూడలేదు. ఒంగి వాలలేదు. దైవమే ప్రతికూలిస్తే ఇంక ఎవడు ఆదుకుంటాడు చెప్పు. తల్లి తండ్రి భార్య సోదరుడు సేవకుడు మిత్రుడు పుత్రుడు - ఎవ్వరూ సహకరించరు. సహకరించలేరు. చేసుకున్నవాడికి చేసుకున్నంత మహాదేవా అన్నారు. పాపపుణ్యఫలాలకు ఎప్పుడూ భోక్త - కర్త ఒక్కడే. (భోక్తా పాపస్య పుణ్యస్య కర్తా భవతి సర్వదా).

## ◆ ఇంద్రుడిలో అశాంతి ◆

వృత్రుడిని సంహరించినవాటినుంచీ శచీపతి నిస్తేజస్కుడు అయిపోయాడు. దేవతలుకూడా అతడిని బ్రహ్మహంత అని చాటుమాటున నిందించడం మొదలుపెట్టారు. ఒట్లువేసి శపథాలు చేసి మైత్రి కుదుర్చుకుని గాఢంగా విశ్వసించిన మిత్రుడిని నిర్దాక్షిణ్యంగా సంహరించాడంటే మనవాడు ఎంతటి క్రూరుడోకదా ! ఇతడా మన నాయకుడు, ఇతడా మన పాలకుడు అంటూ దేవగంధర్వయక్ష జాతులవారు - ఇద్దరు కలిసిన ప్రతిచోటా గోష్ఠులలో ఉద్యానవనాలలో విస్తారంగా చర్చించుకుంటున్నారు. వేదాలు చదువుకున్నారు మునీశ్వరులు. ఏమి లాభం ? వాటిపై ప్రమాణబుద్ధి విడిచిపెట్టి వృత్రుడిని మోసం చేశారు. నమ్మించారు. ఎంత దారుణం ! ఇది మునీశ్వరులకు తగునా ? వేదమతం విడిచిపెట్టి



సాగతమతంగాని స్వీకరించారా ? వీరూ విష్ణువూ ఇంద్రుడూ కలిసి కుట్రపన్నకపోతే వృత్రుడు మరణించేవాడా? దేవలోకాలు అన్నింటా ఇవే చర్చలు. రహస్యంగానూ బహిరంగంగానూ తీవ్రంగా సాగుతున్నాయి.

ఇంద్రుడు తన కీర్తికి కళంకాన్ని తెచ్చిపెట్టే ఈ కథలను తెలుసుకున్నాడు. స్వయంగానూ విన్నాడు. కీర్తిపోయాక ప్రాణాలు ఉండి ఏమి లాభం ? వాడి బతుకూ ఒక బతుకేనా ? కుళ్ళు బతుకు.

> శుశ్రావేంద్రోఽపి వివిధాః స్వకీర్తేః హానికారకాః ।
> యస్య కీర్తిర్హతా లోకే ధిక్తస్యైవ కుజీవితమ్ ॥ (7 - 31)

ఒకప్పుడు ఇంద్రద్యుమ్నుడు అనే రాజర్షి ఉండేవాడు. అతడు దారివెంట వెడుతూంటే శత్రువు కూడా చిరునవ్వులు చిందించేవాడు. అంతటివాడు సైతం తాను సంపాదించుకున్న సత్కీర్తి నశించడంతో స్వర్గంనుంచి పతితుడయ్యాడు. ఇంక కేవల పాపాత్ముల పతనం గురించి చెప్పాలా ?

చిన్న అపరాధంతో యయాతి పతితుడయ్యాడు. పద్దెనిమిదియుగాలపాటు పీతగా (ఎండ్రకాయ. కర్కటం) జీవితం గడిపవలసి వచ్చింది (?) భృగుమహర్షి శాపంవల్ల విష్ణుమూర్తి పశుపక్ష్యాది జన్మలు ఎత్తవలసి వచ్చింది. వామనుడై బలిచక్రవర్తిని యాచించవలసి వచ్చింది. రాముడై సీతావిరహంతో అడవులపాలు కావలసి వచ్చింది. అలాగే ఇంద్రుడుకూడా ఈ బ్రహ్మహత్యా మహాపాపంతో మనశ్శాంతిని కోల్పోయాడు. కొలువుతీరడం పూర్తిగా మానేశాడు. ముఖం చెల్లడంలేదు. భయత్రస్తుడై నిఃశ్వసిస్తూ విస్మితుడై నిరంతరం ఏదో పరధ్యానంగా ఉంటున్నాడు. పిలిచినా కుదిపినా పలుకూ ఉలుకూ లేదు. శచీదేవికి ఇదంతా వింతగా కనిపించింది. కంగారుపడింది.

ప్రభూ ! ఎందుకు ఇంతగా భయపడుతున్నావు ? నీ శత్రువు వృత్రుడు మరణించాడుగదా ! నిశ్చింతగా ఉత్సాహంగా ఉండవలసిందిపోయి దిగులుగా బెంగగా ఉంటున్నావేమిటి ? నీ మనస్సులో ఉన్న బాధ ఏమిటో చెప్పు. ఈ నిట్టూర్పులేమిటి, ఈ పరధ్యానం ఏమిటి ? వృత్రుడికన్నా బలవంతుడైన శత్రువు ఇంకెవడైనా మిగిలిపోయాడా ? ఏమిటి కారణం ? - అని చాలా ప్రేమగా లాలనగా అడిగింది.

రాజ్ఞీ ! నాకింక శత్రువులెవరూ లేరు. ఆ భయం లేదు. కాకపోతే శాంతీ సుఖమే కరువయ్యాయి. బ్రహ్మహత్యా మహాపాతకానికి భయపడుతున్నాను. గుమ్మం దాటి వెళ్ళలేకపోతున్నాను. నందనంలో ఆనందం దొరకడంలేదు. అమృతమూ రుచించడంలేదు. ఇంటిలో కూడా సుఖం కనిపించడంలేదు. గంధర్వగానాలూ అప్సరసల నృత్యాలూ మనశ్శాంతిని ఇవ్వలేకపోతున్నాయి. కామధేనువు ఉంది. కల్పవృక్షం ఉంది. అయినా శాంతిలేదు, సౌఖ్యం లేదు, ఏమి చెయ్యను ? ఎక్కడికిపోను ? సుఖమూ శాంతీ లభించే మార్గం ఏది ? ఇది తెలియక పరితపిస్తున్నాను - అంటూ ఆవేదనను వెళ్లబోసుకున్న ఇంద్రుడు ఆ క్షణంలోనే ఇల్లు విడిచి మానససరోవరానికి వెళ్ళిపోయాడు. భయార్తుడై శోకకర్శితుడై ఒక పద్మనాళంలో దూరి దాక్కున్నాడు. సర్పంలాగా నీటిలోనే నివసిస్తున్నాడు.



## ◆ నహుషుడికి ఇంద్ర పదవి ◆

సింహాసనం విడిచిపెట్టి ఇంద్రుడు వెళ్ళిపోయాడనే వార్త వైకుంఠంలో గుప్పుమంది. అరాజకత్వం ఏర్పడిందే అని దేవతలు దిగులుచెందారు. ఋషులూ సిద్ధులూ గంధర్వులూ మరింతగా భయ భ్రాంతులయ్యారు. రకరకాల ఉపద్రవాలు చెలరేగాయి. వర్షాలులేక కరువుకాటకాలు విలయతాండవం చేశాయి. భూగోళమంతా వైభవం కోల్పోయింది. నదులు ఇసుకపర్రలు అయిపోయాయి. చెరువులు ఇర్రింకిపోయాయి. పరిస్థితి చెయ్యిదాటిపోతోందని గ్రహించిన దేవతలూ ఋషులూ సమావేశమై తీవ్రంగా చర్చించి అరాజకత్వాన్ని తొలగించడానికి ఒక నిర్ణయం తీసుకున్నారు. నహుషుడిని ఇంద్రపదవిలో కూర్చోబెట్టారు. దేవేంద్రుడుగా ప్రకటించారు.

నహుషుడు స్వతస్సిద్ధంగా ధర్మాత్ముడే అయినా ఆ పదవిలో కూర్చునేసరికి రజోగుణం ప్రకోపించింది. విషయాసక్తుడయ్యాడు. మన్మథుడికి దాసుడయ్యాడు. ఉద్యానవనాల్లో అప్సరసలతో కామక్రీడలలో మునిగి తేలుతున్నాడు. ఆ గోష్ఠులలో శచీదేవి గుణగణాలను విన్నాడు. మనస్సు ఆమెపైకి మళ్ళింది. ఋషులను పిలిచి అడిగాడు.

శచీదేవి నన్ను సేవించుకోవడంలేదు ఎందుకని ? మీరంతా కలిసి నన్ను ఇంద్రుణ్ణి చేశారుగదా! నేనిప్పుడు మీకూ దేవతలకూ దిక్పాలకులకూ అధినాయకుణ్ణి. నన్ను రంజింపజెయ్యడం మీ కర్తవ్యం. నేను ఇంద్రుణ్ణి. శచిని పంపించండి. ఈరోజే నా మందిరానికి రావాలి. నన్ను సేవించాలి - అని ఆనతిచ్చాడు.

ఋషులందరూ అవాక్కు అయ్యారు. ఎంతగానో ఆలోచించారు. ఏ ఉపాయమూ తట్టలేదు. చేసేదిలేక మెల్లగా శచీదేవిని సమీపించారు. వినయంగా నమస్కరించారు. సిగ్గుపడుతూ జంకుతూ పలికారు.

ఇంద్రపత్నీ ! ఈ నహుషుడు మరీ దురాచారుడయ్యాడు. నిన్నే కోరుతున్నాడు. మామీద చిందులు తొక్కుతున్నాడు. ఏం చెయ్యం ! అతడికి అధీనులం. ఇంద్రుణ్ణి చేశాంగదా !

ఈ మాటలు విని శచీదేవి మనస్సు భగ్గుమంది. భయపడింది. అసహ్యించుకుంది. అన్నీ మనస్సులోనే అణుచుకొని త్వరత్వరగా బృహస్పతి ఇంటికి వెళ్ళింది. నహుషుడినుంచి రక్షించమని శరణువేడింది. దేవగురుడు అభయమిచ్చాడు.

పుత్రీ ! భయపడకు. నహుషుడిబారినిపడకుండా నిన్ను కాపాడుతాను. ఇది సనాతనధర్మం. శరణాగతుల్ని శత్రువులకి అప్పగించేవాడు నరాధముడు. వాడు నరకానికిపోతాడు. శాశ్వతంగా అక్కడే ఉండిపోతాడు. నేను అటువంటి పొరపాటుచెయ్యను. అభయం ఇచ్చానంటే రక్షించానన్నమాటే. ధైర్యంగా ఉండు - అన్నాడు.

(అధ్యాయం - 7, శ్లోకాలు - 63)



శచీదేవికి బృహస్పతి రక్షణ కల్పించాడనే సమాచారం తెలిసి నహుషుడు క్రుద్ధుడయ్యాడు. మదనతాపం మరింత ప్రజ్వరిల్లింది. దేవతలను పిలిచి - ఈ నేరానికి బృహస్పతిని సంహరించాలి అన్నాడు. ఆ మూఢుడు ఇంద్రాణికి తన ఇంట్లో శరణమిస్తాడా ? ఎంత అహంకారం అంటూ విరుచుకుపడ్డాడు. ఋషులూ దేవతలూ విస్తుపోయారు. సౌమ్యంగా నచ్చజెప్పడానికి ప్రయత్నించారు.

రాజేంద్రా ! దయచేసి నీ కోపాన్ని ఉపసంహరించుకో. ఎంతటివారికైనా పాపబుద్ధి పనికిరాదు. పరకాంతలను వాంఛించడం మహాపాపమని శాస్త్రాలు నిందిస్తున్నాయి. అందునా శచీదేవి మహాసాధ్వి. భర్త జీవించి ఉండగా మరొకడిని ఎలా భర్తగా స్వీకరిస్తుంది ? ఇప్పుడు నువ్వు ముల్లోకాలకూ అధిపతివి. ధర్మబద్ధంగా లోకాలను నడిపించాల్సినవాడివి. నువ్వే అధర్మానికి పాల్పడితే ఇక ఏ లోకంలోనైనా ధర్మమనేది నిలుస్తుందా ? శిష్టాచారాలను కాపాడటం ప్రభువులకు కర్తవ్యం. అంచేత ఒక్కసారి ధర్మం గురించి ఆలోచించు.

శచీదేవికన్నా అందగత్తెలు సురవారవనితలు ఎందరో ఉన్నారు. వారితో సేవలు అందుకో. అదీకాక, శృంగారానికి రతి అనేది ముఖ్యం. స్త్రీపురుషులకు పరస్పరం ఉండే అనురాగాన్నే రతి అంటారు. అది ఆ ఇద్దరిలో ఏ ఒక్కరికి లేకపోయినా ఆ కలయిక ఆనందప్రదంకాదు. బలాత్కారం రసభంజకం. అందుచేత పరకాంతను అనుభవించాలి అనే ఆలోచనే తప్పు. విరమించుకో. ఉత్తమోత్తమమైన దేవేంద్ర పదవిని అధిష్ఠించావు. దానికి తగినట్టు సద్భావంతో ఉన్నతంగా ఉదాత్తంగా ప్రవర్తించడం అవసరం. ఆలవరచుకో. పాపాలవల్ల అభివృద్ధులు నశిస్తాయి, పుణ్యాలవల్ల మరింతగా అభివృద్ధి చెందుతాయి. అంచేత పాపచింతనలు విడిచిపెట్టి మంచి ఆలోచనలుచెయ్యి. అది అందరికీ క్షేమదాయకం.

> బుద్ధిక్షయస్తు పాపేన పుణ్యేనాతివివర్ధనమ్ ।
> తస్మాత్పాపం పరిత్యజ్య సన్మతిం కురు పార్థివ ॥ (8 - 11)

ఋషుల ఉపదేశం నహుషుడికి రుచించలేదు. వాదానికి దిగాడు. ఋషులారా ! మంచి ఉపదేశమే చేశారు. కానీ లోగడ మీ దేవేంద్రుడు గౌతముడి భార్యను కికురించి అనుభవించలేదా ? బృహస్పతి ఇల్లాలిని చంద్రుడు భోగించలేదా ? అప్పుడు మీరందరూ ఏమయ్యారు ? ఈ నీతులు చెప్పి ఎందుకు వారించలేకపోయారు? అయినా ఎవరికైనా నీతులు చెప్పడం తేలికే. వినేవాడు ఉండాలేకానీ ఆ విషయంలో అందరూ ఘనపాఠులే. తాము ఆచరించి చూపించే ఉపదేశకులే అరుదు.

> పరోపదేశే కుశలాః ప్రభవంతి నరాః కిల ।
> కర్తా చైవోపదేష్టా చ దుర్లభః పురుషో భవేత్ ॥ (8 - 13)



అందుచేత ఇటువంటి ఉపదేశాలు నాకు చెయ్యకండి. శచీదేవి నాదగ్గరకు వచ్చేట్టు చూడు. అందుకు బహుమతిగా మీకు ఆశ్చర్యపోయే హితం చేస్తాను. దేవతలనూ ఆనందపరుస్తాను. ఇది మీకూ నాకూ దేవతలకూ సుఖప్రదమైన మార్గం. మరింక ఎలా జరిగినా నేను సంతోషించను. ఇది సత్యం. బతిమాలి ఒప్పిస్తారో బలాత్కారం చేసి తెప్పిస్తారో మీ ఇష్టం. ఆవిడ ఇక్కడికి రావలసిందే.

## ◆ శచీరక్షణ - బృహస్పతి మంత్రాంగం ◆

నహుషుడు ఇంత కచ్చితంగా చెప్పేసరికి దేవతలూ మునులూ భయపడిపోయారు. మదనాతురుడై ఉన్నాడు, మొండికేశాడు, ఏమైనా చేస్తాడు అని గ్రహించారు. సామోపాయంతో ఎలాగోలా ఒప్పించి ఇంద్రాణిని తీసుకువస్తాము, తొందరపడకు అని నహుషుడిని ఒప్పించి అందరూ కలిసి బృహస్పతి ఇంటికి వెళ్ళారు.

వెడుతూనే బృహస్పతికి సవినయంగా నమస్కరించారు. ఆంగిరసా ! ఇంద్రాణికి నువ్వు రక్షణ ఇచ్చావనీ మీ ఇంటిలోనే ఉందనీ తెలిసింది. ఆమెను మనం నహుషుడికి అప్పగించాలి. ఎందుకంటే అతడిని మనమే ఇంద్రుణ్ణి చేశాంగదా ! అంచేత శచీదేవి అతడిని పతిగా వరించక తప్పదు.

ఈ దారుణమైన మాటలు విన్న బృహస్పతి అంతకంటే స్థిరంగా సమాధానం చెప్పాడు. మునులారా! ఏమైనా జరగనివ్వండి. నాకు భయంలేదు. నన్ను శరణుజొచ్చిన ఈ పతివ్రతను దిక్కులేనిదానిగా చెయ్యను.

అయితే బృహస్పతీ ! మరొక ఉపాయం ఏదైనా ఆలోచించి చెప్పు. నహుషుడు శాంతించే మార్గం ఆలోచించు. లేకపోతే రేపటినుంచి ఆ కోపిష్టిని తట్టుకోవడం చాలా కష్టమైపోతుంది మనకు.

మునుల మాటలకు బృహస్పతి సమ్మతించాడు. క్షణకాలం ఆలోచించాడు. ఉపాయం మెరుపులా స్ఫురించింది. మహర్షులారా ! ఒక పని చేద్దాం. శచీదేవి నహుషుడిని ప్రలోభపెడుతుంది. ఒక ఒప్పందానికి తెస్తుంది. నా భర్త ఏమయ్యాడో తెలీదు, మరణించాడని నిశ్చయంగా తెలియకుండా నిన్ను ఎలా వరిస్తాను ? అంచేత ముందుగా అతణ్ణి అన్వేషించే ఏర్పాటు చెయ్యి. అది తెలిపోతే ఇబ్బంది ఉండదు. భర్త జీవించి ఉండగా మరొకడిని వరించడం ఏ కాంతకైనా భావ్యం కాదుగదా ! - అని నహుషుడిని ఒప్పిస్తుంది. ప్రస్తుతానికి గండం తప్పుతుంది. ఇలా చేద్దాం, నడవండి అంటూ శచీదేవిని తీసుకుని బృహస్పతి ఆ మునులతో బయలుదేరాడు.

శచీదేవిని వెంటబెట్టుకుని తన దగ్గరకు వస్తున్న బృహస్పతి ప్రభృతులను అల్లంత దూరంలోనే చూసి కృత్రిమ వాసవుడు నహుషుడు ఉల్లాసంగా కేరింతలు కొట్టాడు.



హే పద్మపత్రవిశాలాక్షీ ! ఇప్పుడు నేను నిజంగా వాసవుణ్ణి అయ్యాను. సకలలోకాలకూ నన్ను అధిపతిని చేశారుగానీ ఈ దేవతలు, ఇదిగో ఇప్పుడు నీ రాకతో నా ఇంద్రత్వం పరిపూర్ణతను పొందింది. రా. స్వాగతం. సుస్వాగతం.

పాపం శచీదేవి, పొంగివస్తున్న దుఃఖాన్ని గుండెల్లోనే అదుముకుని, భయంతో వణికిపోతూ, సిగ్గుతో చచ్చిపోతూ హీనస్వరంతో పలికింది. సురేశ్వరా ! అన్యథా భావించకు. ఒక చిన్న వరం అభ్యర్థిస్తున్నాను. నేనొక నిర్ణయానికి రాలేకపోతున్నాను. రవ్వంత ఓర్పువహించు. నా భర్త ఇంద్రుడు ఉన్నాడా లేదా అనేది నాకు తీరని సందేహంగా ఉంది. అది తీరిపోతే నేను నీదాన్ని అవుతాను. అందాకా ఓపికపట్టు. ఇంద్రుడు ఏమయ్యాడో తెలుసుకోకుండా నేనుగానీ నువ్వుగానీ ఒక నిర్ణయానికి రావడం మనకు మంచిదికాదు.

బృహస్పతి ఉపాయం పారింది. శచీదేవి పలుకులకు నహుషుడు సంబరపడ్డాడు. సమ్మతించాడు. శచీదేవిని పంపించేశాడు. బతుకుజీవుడా అని క్షేమంగా ఇంటికి చేరుకుంది. దేవతలను అందరినీ సమావేశపరిచి ఇంద్రుణ్ణి వెదకండి అని ఆజ్ఞాపించింది. దేవతలకు ఏమి చెయ్యాలో ఎక్కడ వెదకాలో తెలియలేదు. అందరూ కలిసి వైకుంఠానికి వెళ్ళి విష్ణుమూర్తిని శరణువేడుకున్నారు.

వాసుదేవా ! ఇంద్రుడు కనపడుటలేదు. బ్రహ్మహత్యాపీడితుడై ఎటు పారిపోయాడో, ఎక్కడ దాక్కున్నాడో తెలియడంలేదు. చాలా రోజులయ్యింది. అయినా మాకు తెలియక అడుగుతున్నాం. దేవాధిదేవా ! నువ్వు చెప్పిన సలహామేరకు, నువ్వు ఇచ్చిన ఉపాయంతో వృత్రుడిని సంహరించిన ఇంద్రుడికి బ్రహ్మహత్యామహాపాతకం ఎలా అంటుకుంటుంది ? ఏమో, ఇంద్రుడికేమిటి మాకేమిటి అందరికీ నువ్వే గతి. కాపాడు మహాప్రభో ! - అంటూ అందరూ సాష్టాంగపడ్డారు.

## ◆ అశ్వమేధం - ఇంద్రుడి పాపవిముక్తి ◆

విష్ణుమూర్తి చిరునవ్వులు చిందిస్తూ మేఘగంభీర కంఠస్వరంతో బదులు పలికాడు. దేవతలారా! భయపడకండి. మరొక ఉపాయం చెబుతాను ఆచరించండి. అందరూ కలిసి అశ్వమేధ యాగం చెయ్యండి. ఆ పుణ్యంతో ఇంద్రుడు పవిత్రుడవుతాడు. బ్రహ్మహత్యామహాపాతకం తొలగిపోతుంది. దానికి ఇది విరుగుడు. అశ్వమేధం చేస్తే జగదంబిక సంతోషిస్తుంది. వాసవుణ్ణి తెచ్చి ఇంద్రపదవిలో కూర్చోబెడుతుంది. రక్షణ కల్పిస్తుంది. మీరంతా నిర్భయంగా ఉండవచ్చు. జగదీశ్వరి కరుణించిందంటే బ్రహ్మహత్య ఏమిటి, సకలపాపాలూ తొలగిపోతాయి. నామస్మరణ చేస్తేనే చాలు, అటువంటిది ఆమెకు ప్రీతికరంగా హయమేధం చేస్తే ఇక చెప్పాలా ! అలాగే శచీదేవితోకూడా దేవీపూజలు చేయించండి.



ఆవిడకు వచ్చిన కష్టాలను తొలగిస్తుంది జగన్మాత. నహుషుడిని సమ్మోహపరిచి వాడిపాపాలతో వాడ్ని నశింపజేస్తుంది. మీరు చేసే అశ్వమేధంతో ఇంద్రుడు పవిత్రుడై వెనకటి వైభవాన్ని తిరిగిపొందుతాడు సింహాసనం అధిష్ఠిస్తాడు. త్వరలోనే మీ కోరిక నెరవేరుతుంది. వెళ్ళండి, వెంటనే యాగం ప్రారంభించం! - అన్నాడు విష్ణుమూర్తి.

దేవతలు సంబరపడ్డారు. పద్మనాళంలో దాక్కున్న ఇంద్రుడి దగ్గరికి వెళ్ళారు. విషయం చెప్పి ఓదార్చారు. వెంటనే ప్రారంభించి అశ్వమేధయాగం చేశారు. ఆ పుణ్యంతో ఇంద్రుడు పవిత్రుడయ్యాడు తనకు చుట్టుకున్న బ్రహ్మహత్యామహాపాతకాన్ని వృక్షాలమీదకీ నదులలోకీ భూమిపైకీ స్త్రీలపైకీ విసిరేశాడు పాపజ్వరం నుంచి పూర్తిగా విముక్తుడయ్యాడు. తగిన సమయం కోసం ఎదురుచూస్తూ అలా అదృశ్యుడుగానే ఆ పద్మనాళంలోనే ఉండిపోయాడు.

దేవతలందరూ స్వర్గానికి తిరిగి చేరుకున్నారు. ఒకనాడు శచీదేవి బృహస్పతిని అడిగింది గురూత్తమా! అశ్వమేధం చేశామన్నారు, ఇంద్రుడి పాపం తొలగించేశామన్నారు, మరి ఏడీ నా భర్త కనిపించడేమి ? ఆయన దర్శనభాగ్యం లభించే ఉపాయం చెప్పండి - అని అభ్యర్థించింది.

పౌలోమీ ! నువ్వు జగదీశ్వరిని ఆరాధించాలి. ఆవిడ అనుగ్రహిస్తే తప్ప నీకు భర్త దర్శనం లభించదు. నహుషుడిని సమ్మోహపరిచి పదవీభ్రష్టుణ్ణి చేసి నీ భర్తను సింహాసనం ఎక్కిస్తుంది జగన్మాతను ఆరాధించు అని చెప్పి దేవగురుడు దేవీమంత్రాన్ని ఉపదేశించాడు.

## ◆ శచీదేవికి జగదీశ్వరి అనుగ్రహం ◆

శచీదేవి సకలభోగాలనూ పరిత్యజించి తాపసీవేషం ధరించి బలిపుష్పప్రదానాలతో భక్తిగా జగన్మాతను ఆరాధించింది. దేవీ మహామంత్రాన్ని ఉపాసించింది. జగదీశ్వరి సంతృప్తిచెంది సౌమ్యరూపంతో దర్శనం అనుగ్రహించింది. హంసవాహనం మీద కోటిసూర్యప్రకాశంతో కోటిచంద్రశీతలంగా కోటి మెరుపులు రూపుదాల్చినట్టు ప్రత్యక్షమయ్యింది. నాలుగు వేదాలనూ ధరించింది. పాశాంకుశవరదాభయ హస్తాలతో కనిపించింది. పాదాలవరకూ వేలాడుతున్న మేలిమిముత్యాల దండ ధరించింది. మూడు కన్నులతో చిరునవ్వులు చిందిస్తోంది. బ్రహ్మాదిపిపీలికా పర్యంతం సకలసృష్టినీ నిర్వహించిన జగన్మాత. కరుణామృతసాగర. అనంతకోటిబ్రహ్మాండనాయిక. పరమేశ్వరి. సౌమ్యానంతరసాంచిత స్తనద్వయ విరాజిత. సర్వేశ్వరి. సర్వజ్ఞ. కూటస్థ. అక్షరరూపిణి. ప్రసన్నురాలయ్యింది.

శక్రవల్లభా ! అనుగ్రహిస్తున్నాను, వరం కోరుకో. కోటిజన్మల పుణ్యం ఉంటే తప్ప ఎవరికీ లభించని దర్శనం నీకు అనుగ్రహించాను. నీ ఉపాసనకు సంతోషించాను. వరం కోరుకో - అంది.



జగన్మాతా ! నహుషభయాన్ని తొలగించి భర్తృ దర్శనాన్ని అనుగ్రహించి తిరిగి ఇంద్రపదవిలో ప్రతిష్ఠించు - అని శచీదేవి అభ్యర్థించింది.

శచీదేవీ ! నువ్వు ఇప్పుడే ఇదిగో ఈ దూతికతో కలిసి శ్రీమానససరోవరానికి వెళ్ళు. అక్కడ నీ భర్త కనిపిస్తాడు. నేను త్వరలోనే నహుషుడిని సమ్మోహపరచి పదవీభ్రష్టుణ్ణి చేస్తాను. నీ భర్తను తిరిగి ఇంద్రపదవిలో ప్రతిష్ఠిస్తాను. నీ కోరిక నెరవేరుస్తాను. నిశ్చింతగా ఉండు - అని అభయం ఇచ్చి అదృశ్యమయ్యింది జగదీశ్వరి.

దేవీదూతిక శచీదేవిని మానససరోవరానికి తీసుకువెళ్ళింది. ఇంద్రుణ్ణి చూపించింది. ఇంద్రాణి ఆనందపరవశ అయ్యింది. ***(అధ్యాయం - 8, శ్లోకాలు - 71)***

ఆనందదుఃఖాల సమ్మర్దంతో ఉక్కిరిబిక్కిరి అవుతున్న శచీదేవిని చూసి ఇంద్రుడు ఆశ్చర్య చకితుడయ్యాడు. దేవీ ! ఇక్కడికి ఎలా రాగలిగావు ? నేను ఇక్కడ ఉన్నట్టు ఎలా తెలిసింది ? ఏ ప్రాణికీ తెలియని చోట రహస్యంగా దాక్కున్నాను. నువ్వు ఎలా తెలుసుకోగలిగావు ?

నాథా ! జగన్మాత అనుగ్రహంతో తెలుసుకోగలిగాను, నిన్ను చేరుకోగలిగాను. దేవతలూ ఋషులూ కలిసి నహుషుడిని నీ పదవిలో కూర్చోబెట్టారు. అతడు నన్ను హింసించసాగాడు. తనను భర్తగా స్వీకరించమని నిర్బంధించాడు. దేవతలుకూడా అతడి మాటను కాదనలేక నన్నే సముదాయించారు. ఆడదానిని. ఒంటరిగా ఉన్నాను. బృహస్పతి ఉన్నాడన్నమాటేగానీ అతడు మాత్రం ఏం చెయ్యగలడు? బ్రాహ్మణుడు. దుర్బలుడు. నన్ను నేను ఎలా రక్షించుకోవాలో తెలియక దినదినగండగా రోజులు వెడుతున్నాను. విభో ! నేను గృహిణిని. కులటను కాను, కాలేను. నా మనస్సు ఎప్పటికీ నీకే అంకితం పాతివ్రత్యాన్ని వదులుకోలేను. అక్కడ నాకు రక్షణలేదు. నహుషుడినుంచి కాపాడగలిగేవారు ఎవరూ కనిపించడంలేదు. దిక్కులేనిదాననయ్యాను. విధి ఎందుకో ఇలాగ నా మీద పగబట్టింది ! అంటూ శచీదేవి దుఃఖం ఆపుకోలేక వలవలా ఏడ్చేసింది.

ఇంద్రుడు మెల్లగా ఓదార్చాడు. ప్రియా ! నాలాగానే నువ్వూ మంచిరోజులకోసం ఎదురుచూడక తప్పదు. మనస్సు చిక్కబట్టుకో. నీ శీలమే నీకు రక్ష. పతివ్రతలకు పరుల రక్షణ అవసరంలేదు. ధైర్యంగా ఉండు. అయినా ఒక ఉపాయం చెబుతాను. ఆచరించు. ఈసారి నహుషుడు నిన్ను నిర్బంధిస్తే ఒక షరతు పెట్టు. దివ్యమైన ఋషివాహనంమీద వస్తే నిన్ను అంగీకరిస్తానని చెప్పు. ఇది నావ్రతం అను. వాడు నీ మీద మహామోహంతో ఉన్నాడు కనక నువ్వు ఏ షరతు పెట్టినా ఒప్పుకుంటాడు. కామాంధుడు. దేవర్షులను వాహనం మొయ్యమంటాడు. వాళ్ళ శాపాగ్నిలో నాశనమవుతాడు. ఇలా చెయ్యి. నీకు జగదంబిక వరం ఇవ్వనే ఇచ్చింది. జగన్మాత పాదపద్మాలను ధ్యానించేవారికి ఏ సంకటాలూ రావు. ఎన్నడూ రావు. ఒకవేళ ఏదైనా సంకటం లాంటిది వచ్చినట్టు కనిపించినా అది నీ శ్రేయస్సుకే అవుతుంది.



జగదంబాపదస్మర్తుః సంకటం న కదాచన ।
యది జాయేత తచ్చాపి జ్ఞేయం తత్స్వస్త్రయే కిల ॥ (9 - 20)

అందుచేత మణిద్వీపనివాసినిని ఎప్పుడూ మరిచిపోకు. బృహస్పతి చెప్పినట్టు నిత్యమూ భువనేశ్వరిని ఉపాసించు. నీకు జయం లభిస్తుంది. శుభం జరుగుతుంది. వెళ్ళిరా - అని పంపించాడు.

## ◆ ఋషివాహనం - నహుషపతనం ◆

శచీదేవి గుండెలు చిక్కబట్టుకుని సరాసరి వెళ్ళి నహుషుడిని దర్శించింది. ఆ కామాంధుడు ఎంతగానో సంబరపడిపోయాడు.

కామినీ ! స్వాగతం, సుస్వాగతం. నిజం చెబుతున్నాను, నామాట నమ్ము. నేను నీ సేవకుణ్ణి. నీకు పరాధీనుణ్ణి. నీ ఆజ్ఞ నాకు శిరోధార్యం. నా కోరిక మన్నించి ఇలా దయచేశావు. అంతేచాలు. ఓ మితభాషిణీ, ఓ శుచిస్మితా ! సిగ్గుపడకు. నేను నీ భక్తుణ్ణి. నన్ను చేపట్టు. నీకు ఏది ఇష్టమో చెప్పు, చేస్తాను. నిన్ను సంతోషపెట్టడంకన్నా నాకు కావలసింది ఏముంది ? - అంటూ నహుషుడు ప్రాధేయపడ్డాడు.

శచీదేవి తన అసహ్యాన్ని మనసులోనే అణచుకొని సిగ్గుల్లో రంగరించి చిరునవ్వులు చిందించింది. కృత్రిమవాసవా ! ఇప్పటికే నువ్వు చెయ్యవలసిందంతా చేశావు. అయినా ఒక చిన్న కోరిక, ఇప్పుడే మొలకెత్తింది. తీరుస్తానంటే చెబుతాను.

శచీ ! సందేహించకు. అడుగు. నీకోసం ఏమైనా చేస్తాను. ఏది తెమ్మన్నా తెస్తాను. అది ఎంత అలభ్యమైనా సరే. ఆజ్ఞాపించు.

ఇంద్రాణి ఆశ్చర్యంగా విలాసంగా కనుబొమలు ఎగరేసింది. చూపులు అల్లార్చింది. రాజేంద్రా! చేస్తానంటున్నావు, సరే. తీరా అడిగాక కాదంటావేమో ! నమ్మకం కుదరకండా ఎలా అడగను ? పైగా మీ పరిపాలకులలో సత్యవాదులు చాలా అరుదని విన్నాను. తరచుగా మాట తప్పుతూ ఉంటారుటగదా ! అంచేత ఏదైనా ప్రతిజ్ఞచేసి ఒట్టువేసి నాకు నమ్మకం కలిగిస్తే తప్ప నేను అడగను బాబూ !

శపథం కురు రాజేంద్ర ! యత్కరోమి ప్రియం తవ ।
రాజానః సత్యవచసో దుర్లభా ఏవ భూతలే ॥ (9 - 30)

సుందరీ ! నీ మాట జవదాటను. నువ్వు అడిగింది చేస్తాను. యజ్ఞాలూ దానాలూ చేసి నేను సంపాదించుకున్న మొత్తం పుణ్యంమీద ఒట్టువేసి చెబుతున్నాను. మాట తప్పను. విప్పంకోచంగా అడుగు. కాదు - ఆజ్ఞాపించు.



అయితే అడుగుతున్నాను. ఇది తీర్చావంటే నీకు వశం అవుతాను. ఇది నా ప్రతిజ్ఞ. విను. ఇంద్రుడికి గుర్రాలూ ఏనుగులూ రథాలూ ఇవ్వి వాహనాలు. వాసుదేవుడికి గరుడుడు వాహనం. యముడికి మహిషం, శంకరుడికి బుషభం, బ్రహ్మదేవుడికి హంస, కుమారస్వామికి నెమలి, వినాయకుడికి ఎలుక - ఇలా ఎవరి వాహనాలు వారికి ఉన్నాయికదా ! మరి నీకు వాహనం ఏది ? నీకు ఒక అపూర్వమైన వాహనం ఉండాలని నా అభిలాష. విష్ణు రుద్ర చతుర్ముఖులకుగానీ దేవదానవమానవాదులలో ఎవరికిగానీ లేని అత్యద్భుతమూ అపూర్వమూ అయిన వాహనంమీద నిన్ను చూడాలని కోరుతున్నాను. మహర్షులు మోస్తుండగా బంగారు పల్లకీమీద నువ్వు దర్జాగా వస్తోంటే చూసి ఆనందించే అవకాశం నాకు కల్పించు. ఇదే నా ముచ్చట. తీరుస్తావుకదూ ! మాట తప్పవుకదూ ! సకలదేవతా సార్వభౌముడిగా అప్పటికిగానీ నిన్ను నేను గుర్తించను. రాజేంద్రా ! ఈ వాహనంవల్ల నీ తేజస్సు తప్పకుండా మిన్నుముట్టుతుంది సుమా !

జ్ఞానదుర్బలుడైన నహుషుడు ఈ మాటలు విని హాయిగా నవ్వాడు. మహాదేవి కల్పించిన వ్యామోహం తలకెక్కింది. శచీదేవిని మెచ్చుకుంటూ బదులు పలికాడు. తన్వీ ! నిజం చెప్పావు. నాకు అపూర్వమైన వాహనం ఉండవలసిందే. నీలనీరదవేణీ ! నీ కోరిక చెల్లిస్తాను. నీ ముచ్చట తీరుస్తాను. మహామునులు పల్లకీ మోశారంటే నా తేజస్సు దిగ్దిగంతాలకు వ్యాపించిందన్నమాటే. అల్ప శక్తిమంతులకు వారు పల్లకీ మొయ్యరుగదా ! అలాగే. బంగారు పల్లకీలోనే నీ దగ్గరకి వస్తాను. సప్తర్షులూ దేవర్షులూ బోయీలవుతారు. ముల్లోకాలలోనూ నన్ను సమర్థుడిగా సర్వాధికుడిగా మహాతపస్విగా గుర్తిద్దువుగాని - అని చెప్పి శచీదేవిని వీడ్కొలిపి మహామునులకు కబురుపెట్టాడు - మళ్ళీ ఏ ప్రమాదం తెచ్చిపెట్టాడో అని మునులంతా బిలబిలా వచ్చారు.

మహర్షులారా! నేను ఇంద్రుణ్ణి. సర్వశక్తి సంపన్నుణ్ణి. మీరు సిగ్గూ లజ్జా విడిచిపెట్టి నా ఆజ్ఞను నెరవేర్చాలి. ఇంద్రాసనం దక్కిందే తప్ప ఇంతవరకూ ఇంద్రాణి నాకు చిక్కలేదు. ఇప్పుడే పిలిచి మాట్లాడాను. మునియానంమీద వస్తే నన్ను అంగీకరిస్తానని ప్రేమగా చెప్పింది. అందుచేత మీరంతా కలిసి నాకు ఈ పని చేసిపెట్టాలి. నా మనస్సు శచీదేవిని వాంఛిస్తోంది. మన్మథతాపం తట్టుకోలేకుండా ఉన్నాను. మీరు దయతలచాలి. మిమ్మల్ని శరణువేడుతున్నాను. ఈ అద్భుతకార్యం నిర్వర్తించి ఉపకారం చేసిపెట్టండి.

నహుషుడు ఇలా బతిమాలుకున్నాడు. అగస్త్యాదిసప్తర్షులు దయతలిచారు. భవిష్యత్తు తెలిసి అంగీకరించారు. నహుషుడు ఆనందం పట్టలేకపోయాడు. శచీదేవి చేజిక్కినట్టే మురిసిపోయాడు. పల్లకీ ఎక్కి కూర్చున్నాడు. మహర్షులు బోయీలై మోస్తున్నారు. కామార్తుడై ఆలస్యాన్ని తట్టుకోలేక సర్ప సర్ప (నడు - నడు) అని అదిలించాడు. ముందువైపు కొమ్ముకాస్తున్న అగస్త్యుణ్ణి త్వరగా నడు అంటూ కాలితో



శిరస్సు మీద తాటించాడు. అతడు అగస్త్యుడు. లోపాముద్రాపతి. వాతాపిని భక్షించినవాడు. సముద్రాన్ని మూడుగుక్కల్లో దిగమింగినవాడు. అతడిని కాలితో తన్నాడు నహుషుడు. కమిచీతో చరిచాడు నహుషుడు. మనసునిండా ఇంద్రాణి మునురుకుంది. మన్మథతాపం భరించలేకపోతున్నాడు. సర్ప సర్ప అంటున్నాడు. కమిచీతో తోలుతున్నాడు. అగస్త్యుడు ఇంక తట్టుకోలేకపోయాడు. ఓర్పూ సహనమూ నశించాయి. ఒక్కసారిగా అతిక్రుద్ధుడయ్యాడు.

దురాచారుడా ! సర్ప - సర్ప అంటున్నావుగదా, సర్పం అయిపో. వేల సంవత్సరాలు అరణ్యాలలో పడిఉండు. క్లేశాలన్నీ అనుభవించు. యుధిష్ఠిరుడిని దర్శించి శాపవిమోచనం పొందుదువుగాని. అతడి నోటినుంచి నీ ప్రశ్నలకు సమాధానాలు పొంది అప్పుడు తిరిగి స్వర్గానికి వద్దువుగాని - అంటూ శాపమూ శాపమోక్షమూ కలిపి అందించాడు అగస్త్యుడు.

నహుషుడికి పట్టిన కామపిశాచి వదిలిపోయింది. అహంకారం దిగిపోయింది. అగస్త్యుడిని నమస్కరించి బహుధా స్తుతించాడు. అయినా సర్పరూపం రానేవచ్చింది. స్వర్గం నుంచి పడిపోయాడు.

బృహస్పతి వెంటనే మానససరోవరానికి వెళ్ళాడు. ఇంద్రుడికి జరిగినదంతా విన్నవించాడు. అతడు సంతోషించాడు. అంతలోకే సకలదేవతలూ మహర్షులూ అక్కడికి చేరుకున్నారు. ఇంద్రుడిని ఓదార్చారు. గౌరవమర్యాదలతో సమ్మానసత్కారాలతో స్వర్గానికి తీసుకువచ్చారు. సింహాసనంలో కూర్చోబెట్టి శాస్త్రీయంగా మళ్ళీ పట్టాభిషేకం జరిపించారు. శచీదేవేంద్రులు ఆనందంగా నందనవనాల్లో మళ్ళీ మునుపటిలా క్రీడించారు.

జనమేజయా ! వృత్రసంహారంవల్ల సంక్రమించిన మహాపాపాన్ని జగదీశ్వరి అనుగ్రహంతో ఇంద్రుడు ఇలా తొలగించుకుని మళ్ళీ తన పదవిని తాను పొందాడు. నీ సందేహాలకు సమాధానాలు లభించాయి కదా ! ఇంద్రుడేకాదు ఏ ప్రాణి అయినా చేసిన పనులకు తగిన ఫలం అనుభవిస్తాడు. అది శుభం కానీ అశుభం కానీ కర్మఫలం అవశ్యం అనుభవించాల్సిందే. ***(అధ్యాయం - 9, శ్లోకాలు - 67)***

**యాదృశం కురుతే కర్మ తాదృశం ఫలమాప్నుయాత్ ।**
**అవశ్యమేవ భోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్ ॥ (9 - 67)**

వ్యాసమహర్షీ ! వృత్రవధతోపాటు దేవీమహిమనుకూడా తెలియజెప్పావు. కృతజ్ఞుడిని. అయితే ఇక్కడ నాకు మరొక సందేహం కలుగుతోంది. ఇంద్రుడు అంటే మహాతపస్వికదా ! నూరు యజ్ఞాలు చేసి ఆ పదవిని అధిష్ఠించినవాడుగదా ! సకలదేవతలకూ అధిపతికదా ! అందరి దుఃఖాలనూ తొలగించగలిగి తాను దుఃఖంలో మునిగాడా ? పదవీభ్రష్టుడయ్యాడా ? ఇది చాలా వింతగాఉంది. దీనికి కారణం



ఏమిటి? నువ్వు సర్వం తెలిసినవాడివి. పురాణ ప్రవర్తకుడివి. శ్రద్ధగా వినే శిష్యుడికి మహాత్ములు చెప్పకూడనిదంటూ ఏమీ లేదంటారు పెద్దలు. అంచేత దయచేసి నా సందేహం తీర్చు - అని జనమేజయుడు మళ్ళీ ప్రార్థించాడు. (నావాచ్యం మహతాం కించిత్ శిష్యే చ శ్రద్ధయాన్వితే । తస్మాత్కురు మహాభాగ మత్సందేహాపనోదనమ్ 10 - 5)

శౌనకాది మహామునులారా ! జనమేజయుడికి వ్యాసుడు చెప్పిన సమాధానం యథాతథంగా తెలియజేస్తున్నాను, మీరూ శ్రద్ధగా ఆలకించండి - అంటూ సూతుడు తన ప్రవచనం కొనసాగించాడు. జనమేజయా ! విను అంటూ వ్యాసుడు ఆరంభించాడు -

## ◆ కర్మగతి ప్రబోధం ◆

సంచితమూ వర్తమానమూ ప్రారబ్ధమూ అని కర్మ - మూడు విధాలు. అనేక పూర్వజన్మలలో సంపాదించుకున్నది - సంచితకర్మ. ఇది మళ్ళీ సాత్త్విక రాజస తమో భేదాలతో మూడు విధాలు. సుకృతం కానీ దుష్కృతంకానీ సంచితకర్మ అవశ్యంగా అనుభోక్తవ్యం.

కోటానుకోట్ల కల్పాలు గతించినా దేవతలకు ఈ సంచితకర్మలు నశించవు. అవి అలా ఉండగా ప్రస్తుత జన్మలో చేస్తున్నవాటిని వర్తమాన కర్మలంటారు. దేహధారులందరూ శుభమో అశుభమో ఏదో ఒక కర్మ చేస్తూనే ఉంటారు. చెయ్యక తప్పదు. సంచితకర్మలనుంచి ఏదో కొంతభాగాన్ని ఇటుతెచ్చి ప్రస్తుత (జన్మారంభంలో) - దేహారంభంలో కాలం వర్తమానకర్మకు ప్రేరణ ఇస్తుందనుకుంటాను.

> సంచితానాం పునర్మధ్యాత్ సమాహృత్య కియాన్కిల ।
> దేహారంభే చ సమయే కాలః ప్రేరయతీవ తత్ ॥ (10 - 13)

ఇలా ప్రారంభింపబడినదే ప్రారబ్ధకర్మ. ఇది భోగానుభవంతో నశిస్తుంది. దేవతలేకాదు ఏ జాతివారికైనా సరే కర్మఫలానుభవం అనివార్యం. ఇది నిశ్చయం. అసలు దేహారంభానికి (జన్మించడానికి) కారణంకూడా కర్మయే. సకల ప్రాణులకూ కర్మక్షయమే జన్మనాశం. బ్రహ్మేంద్రాదులందరూ కర్మవశులు. కానిపక్షంలో వీరికి శరీరాలూ రూపాలూ ఎలా వచ్చాయి ? ఈ దేహమేకదా సుఖ దుఃఖాదికర్మఫలాలకు అనుభవభూమి. అయితే వీటిలో కొన్నింటికి కాలపరిపాకంవల్ల వేగం వస్తుంది. త్వరత్వరగా అనుభవదశ ముగిసి కొన్ని కర్మలు క్షయిస్తాయి. ప్రారబ్ధవశంవల్లనే ప్రాణి పుణ్యకర్మలుగానీ పాపకర్మలుగానీ చేస్తాడు. దేవతలైనా ఇంతే. నరనారాయణులు చూడు కృష్ణార్జునులుగా జన్మించారు. ఇది మునులు చెప్పిన పురాణపీఠిక. అధిక విభవంతో విరాజిల్లేవాడు దైవాంశసంభూతుడన్నమాట. ఋషి కానివాడు కావ్యం రచించలేడు. రుద్రుడు కానివాడు రుద్రుడిని అర్చించలేడు. దేవాంశలేనివాడు అన్నదానం చెయ్యలేడు. విష్ణువు కానివాడు పృథివీపతి కాలేడు.



నావృషిః కురుతే కావ్యం నారుద్రో రుద్రమర్చతే ।
నాదేవాంశో దదాత్యన్నం నావిష్ణుః పృథివీపతిః ॥ (10 - 24)

ఇంద్రాగ్నియమ విష్ణుకుబేరులనుంచి ప్రభుత్వ ప్రభావ కోప పరాక్రమాలను స్వీకరించి పృథివీపతికి శరీరనిర్మాణం జరుగుతోందని తెలుసుకో. లోకంలో మంచి బలవంతుడుగానీ, భాగ్యవంతుడుగానీ, భోగశాలిగానీ, విద్యావంతుడుగానీ, దానశీలిగానీ కనపడితే అతడిని దైవాంశసంభూతుడుగా గుర్తించు. అందుకనే పాండవులు అయిదుగురూ దేవాంశలనడం. శ్రీకృష్ణ వాసుదేవుడు సాక్షాత్తుగా శ్రీమన్నారాయణుడు.

యః కశ్చిద్బలవాన్ లోకే భాగ్యవానథ భోగవాన్ ।
విద్యావాన్ దానవాన్యాపి స దేవాంశః ప్రపత్యతే ॥ (10 - 26)

జీవులకు శరీరమే సుఖదుఃఖభాజనం. అటుపైని అవ్వి శరీరికి అందుతాయి. జనన మరణ సుఖదుఃఖాదులన్నీ దైవాధీనాలు. అవ్వి ఏవీ దేహికి అధీనంలో ఉండవు. అవశంగా వాటిని పొందటమొక్కటే దేహి కర్తవ్యం. పాండవులు అడవుల్లో జన్మించారు. సొంత ఇంటికి చేరుకున్నారు. బాహుబలంతో రాజసూయయాగం చేశారు. మళ్ళీ వనవాస దుఃఖం అనుభవించారు. అర్జునుడు అతిదుష్కరమైన తపస్సు చేశాడు. దేవతలు సంతోషించి వరాలు ఇచ్చారు. ఇంత పుణ్యం చేసుకున్నా వనవాసం తప్పలేదు. అంతకు ముందటి జన్మలో నరుడుగా బదరికాశ్రమంలో గొప్పతపస్సు చేశాడు. కానీ అది అర్జున రూపధారికి ఏ ఫలాన్నీ ఇవ్వలేదు. ఏ దుఃఖాన్నీ తప్పించలేదు. ఈ కర్మగతి అంత్యంత గహనం. దేవతలకే అర్థంకాదంటే ఇక మానవమాత్రులకు అందుతుందా ! పరమదుర్జ్ఞేయం.

వాసుదేవుడు కారాగారంలో జన్మించాడు. నందగోపుడి గోకులానికి చేర్చబడ్డాడు. కేవలం పదకొండేళ్ళు మాత్రమే అక్కడ ఉన్నాడు. మళ్ళీ మధురకు వచ్చి కంసుడిని సంహరించాడు. తల్లిదండ్రులను కారాగారం నుంచి విడిపించాడు. ఉగ్రసేనుడిని తిరిగి మధురకు రాజును చేశాడు. ఒక మ్లేచ్ఛ రాజుకు భయపడి ద్వారవతికి చేరుకున్నాడు. అక్కడ అనేక కార్యక్రమాలు నిర్వహించి ప్రభాసతీర్థంలో దేహం చాలించి సకుటుంబంగా విస్మృమించాడు. అతడి పుత్రపౌత్ర బాంధవమిత్ర సమూహమంతా బ్రాహ్మణశాపంవల్ల నశించిపోయింది. అందుచేత ఓ జనమేజయా ! కర్మగతి ఎవరికీ అర్థంకాదు. అత్యంతగహనం. కట్టకడపటికి వాసుదేవుడు ఒక బోయవాడి బాణం దెబ్బకు దివంగతుడయ్యాడు.

*(అధ్యాయం - 10, శ్లోకాలు - 41)*



వ్యాసుడు చెబుతున్నది వింటున్న జనమేజయుడికి మరొక ఆలోచన వచ్చింది. కృష్ణార్జునులు భూభారాన్ని తొలగించడానికి జన్మించారనికదా చెప్పావు. ద్వాపరాంతంలో భూదేవి భారపీడితయై గోరూపం ధరించి బ్రహ్మదేవుడిని శరణువేడిందిగదా ! అప్పుడు బ్రహ్మదేవుడి అభ్యర్థనమేరకు విష్ణుమూర్తి కృష్ణుడుగా భూలోకానికి అవతరించాడనీ బలరాముడుకూడా ఇందుకే జన్మించాడనీ నువ్వే చెప్పగా విన్నాను. భరతఖండంలో దుష్టశిక్షణ - శిష్టరక్షణ కర్తవ్యంగా అవతరించిన కృష్ణుడు భూగోళానికి ఏపాటి భారం తొలగించాడు ? ఎందరు దురాచారులను తొలగించాడు ? భీష్మ ద్రోణ విరాట ద్రుపద బాహ్లిక సోమదత్త కర్ణ వైకర్తనులనుకూడా తొలగించాడే. కృష్ణపత్నులను దోచుకున్న దొంగలనూ ఇంకా మిగిలి ఉన్న దుష్టులనూ ఎందుకు సంహరించలేదు ? ఆభీర శక మ్లేచ్ఛ నిషాదులు ఇంకా కోట్లసంఖ్యలో మిగిలే ఉన్నారు. మరింక ఈయన తొలగించిన భూభారం ఏమిటి ? అది ఏపాటి ? ఈ సందేహం నన్ను చాలాకాలంగా పట్టిపీడిస్తోంది. దీన్ని తొలగించు. అదీకాక, ఈ కలియుగంలో ప్రజలందరూ బాహాటంగా నిస్సంకోచంగా పాపాలు చేస్తున్నారు. ఇదేమి విచిత్రం ? నువ్వే నన్ను సమాధానపరచాలి - అంటూ జనమేజయుడు మరొకశంక లేవనెత్తాడు. వ్యాసుడు ఆరంభించాడు -

## ◆ యుగధర్మ ప్రబోధం ◆

జనమేజయా ! ఏ యుగంలో ఎటువంటి ప్రజలు పుడతారో కాలం నిర్ణయిస్తుంది. దీన్నే యుగధర్మం అంటారు. దీన్ని ఎవరూ మార్చలేరు.

> **రాజన్ ! యస్మిన్ యుగే యాదృక్ప్రజా భవతి కాలతః ।**
> **నాన్యథా తద్భవేన్నూనం యుగధర్మోఽత్ర కారణమ్ ॥ (11 - 11)**

సత్యయుగంలో కేవల ధర్మరసికులు, త్రేతాయుగంలో ధర్మార్థరసికులు, ద్వాపరంలో ధర్మార్థకామరసికులు, ఈ కలియుగంలో అర్థకామపరాయణులు అవతరిస్తారు. ఇది యుగధర్మం. దీన్నికి మార్పులేదు. ధర్మానికిగానీ అధర్మానికిగానీ కాలమే కర్త.

> **యుగధర్మస్తు రాజేంద్ర ! న యాతి వ్యత్యయం పునః ।**
> **కాలః కర్తాస్తి ధర్మస్య హ్యధర్మస్య చ వై పునః ॥ (11 - 14)**

వ్యాసుడు ఇంకా ఏదో చెప్పబోతూండగా జనమేజయుడు అడ్డుతగిలాడు. పితామహా ! సత్యయుగంలో ఉండే ధర్మపరులూ పుణ్యాత్ములూ ఇప్పుడు ఏమయ్యారు ? త్రేతా ద్వాపరాలలో ఉండే దానవ్రతపరాయణులూ మునీశ్వరులూ ఇప్పుడు ఎక్కడా కనిపించరేమి ? ఇప్పుడు ఈ కలియుగంలో నిర్లజ్జగా దురాచారులై దైవనిందకులైన ఈ పాపాత్ములు మునుపటి యుగాలలో ఏమయ్యారు ? ఎక్కడికి పోయారు ? ఇదంతా నాకు విస్తరంగా తెలియజెప్పమంటూ అభ్యర్థించాడు.



జనమేజయా ! కృతయుగంలో జన్మించి పుణ్యకర్మలు ఆచరించినవారు జన్మపరంపరాబంధం నుంచి విముక్తులై దేవలోకాలకు వెళ్ళిపోయారు. చతుర్వర్ణాలవారూ స్వధర్మనిరతులై సత్కర్మలను ఆచరిస్తే కర్మత్రయాన్ని క్షయింపజేసుకుని ఆయా ఉత్తమలోకాలకు తరలిపోతారు. రజకాది వర్ణాలవారు సత్యమూ, దయ, దానమూ, ఏకపత్నీవ్రతమూ, అద్రోహమూ (ద్రోహచింత లేకపోవడం), సర్వప్రాణి సమానత్వమూ వంటి సాధారణ ధర్మాలను ఆచరిస్తే చాలు స్వర్గలోకం చేరుకుంటారు. ఇది సత్యయుగ లక్షణం. త్రేతా ద్వాపరాలలోకూడా ఇంతే. ఈ కలియుగంలోమాత్రం పాపిష్ఠులు నరకానికి పోతారు. వీరంతా యుగాలు మారేంతవరకూ ఆయాలోకాలలో నిలుస్తారు. మళ్ళీ ఆ యుగం రాగానే మానవలోకంలో జన్మిస్తుంటారు. కలియుగం ముగిసి మరొక్కసారి సత్యయుగం ప్రారంభంకాగానే అప్పటి ఆ ధర్మాత్ములూ పుణ్యాత్ములూ స్వర్గం నుంచి మానవులై భూలోకానికి అవతరిస్తారు. ద్వాపరం ముగిసి కలియుగం మొదలుకాగానే నరకం నుంచి పాపాత్ములంతా మళ్ళీ భూమికి దిగుతారు. ఇది కాలసమాచారం. దీనికి తిరుగులేదు. తెలుసుకో. అందుచేత కలియుగం పాపకూపం. ప్రజలుకూడా అలాగే దానికి తగ్గట్టు ఉంటారు.

ఎప్పుడైనా చాలా అరుదుగా ఒక్కోసారి దైవవశాత్తు కొందరు జీవులకి యుగవ్యత్యయం వస్తుంది. క్రిందటి కలియుగంలో సజ్జనులై జీవయాత్ర సాగించినవారు మరుసటి కల్పాన ద్వాపరంలో జన్మిస్తుంటారు. అలాగే కొందరు త్రేతాయుగంలోకీ మరికొందరు సత్యయుగంలోకీ (కృత) మారుతుంటారు. సత్యయుగంలో జన్మించి దుష్టులుగా మారినవారు అనంతరకల్పాన కలియుగంలోకి దిగిపోతుంటారు. సంచితకర్మ ప్రభావంవల్ల దుఃఖాలు అనుభవిస్తూ ఉంటారు. జీవిస్తున్న యుగం తాలూకు ప్రభావంవల్ల అవే పాపాలు మళ్ళీ ఆచరిస్తుంటారు. అంచేత జనమేజయా ! అప్పటి పుణ్యాత్ములు ఇప్పుడు కనపడరు. ఇప్పటి పాపాత్ములు అప్పుడు వివపడరు. యుగధర్మాల లక్షణం ఇది. తెలిసిందా ?

పితామహా ! చాలావరకూ అర్థమయ్యింది. అయితే ఆ యుగధర్మాలు ఏమిటో మరింత వివరంగా తెలుసుకోవాలని ఉంది. తెలియజెప్పవా !

జనమేజయా ! తప్పకుండా తెలుసుకోవలసిన విశేషాలే అవి. చెబుతున్నాను. విను. యుగధర్మంవల్ల ఒక్కొక్కసారి సాధుసజ్జనుల అంతరంగాలుకూడా భ్రమప్రమాదాలకు లోనవుతూ ఉంటాయి. మీ తండ్రికి చూడు, విప్రుణ్ణి అవమానపరచాలి అనే దుర్బుద్ధి పుట్టింది. సహజంగా ధర్మాత్ముడూ మహాత్ముడే అయినా కలియుగ ప్రభావంతో అలాంటి ఆలోచన వచ్చింది. లేకపోతే యయాతిలాంటి ఉత్తముడు సంభవించిన క్షత్రియవంశంలో పుట్టి ఒక తాపసి మెడలో మృతసర్పాన్ని వేస్తాడా ! అదంతా యుగధర్మ ప్రభావం. అందుచేత ధర్మకర్మలను ప్రయత్నపూర్వకంగా చాలా నిష్ఠతో ఆచరించాలి.



సత్యయుగంలో బ్రాహ్మణులందరూ వేదపారంగతులు. శక్తిపూజాధురంధరులు. దేవీ దర్శనలాలసులు. ఓంకారసహితంగా గాయత్రీమంత్రాన్ని జపిస్తూ, గాయత్రీమాతను ధ్యానిస్తూ మాయాబీజాక్షరమంత్రాలను ఉపాసిస్తూ కాలం గడిపేవారు. ప్రతి గ్రామంలోనూ జగదీశ్వరికి ఆలయం నిర్మించడం వారికి ఒక ఉద్యమం. సత్యమూ శౌచమూ (శుచిత్వం) దయ మొదలైన మంచి గుణాలతో సత్కర్మనిరతులై జీవించేవారు. వేదోక్త కర్మలను యథావిధిగా నిర్వహించేవారు. తత్త్వజ్ఞానవిశారదులై మిగతా సమాజానికి ఆదర్శంగా నిలిచేవారు. క్షత్రియులు నిరంతరం ప్రజారక్షణ తత్పరులై ఉండేవారు. వ్యవసాయం వాణిజ్యం గోసేవలకు అంకితులై వైశ్యులుండేవారు. వీరందరికీ అన్నింటా సహకరిస్తూ శూద్రులు ప్రశంసలు అందుకునేవారు. ఇది సత్యయుగంనాటి పరిస్థితి.

త్రేతాయుగంలో అన్ని వర్ణాలవారూ జగదీశ్వరిని భక్తితో ఆరాధించేవారు. ధర్మసంస్థితి కృతయుగంకన్నా కొంచెం తక్కువస్థాయిలో ఉండేది. ఇది ద్వాపరం వచ్చేసరికి మరింత తగ్గింది. కలియుగంలో పూర్తిగా దిగజారిపోయింది. పూర్వయుగాలలో రాక్షసులుగా పేరెన్నికగన్నవారు ఈ కలియుగంలో బ్రాహ్మణులుగా అవతరించారు. వేదధర్మాలను పూర్తిగా పరిత్యజించి అసత్యవాదులుగా ప్రవంచకులుగా మారిపోయారు. దాంభికమూ గర్వమూ అంతటా రాజ్యమేలుతున్నాయి. వీరిలో కొందరు నానాధర్మాలనూ చేపట్టి, శూద్రులకు సేవలు చేస్తున్నారు. వాదవివాదాలకు కాలుదువ్వుతూ వేద నిందాపరాయణులూ క్రూరులూ అవుతున్నారు. ఈ కలియుగం ముదురుతున్నకొద్దీ సత్యమూలమైన ధర్మం అంతకంతకూ అన్నివిధాలా కృశించి నశించిపోతోంది. క్షత్రియ వైశ్య శూద్రులుకూడా తమ తమ ధర్మాలను విడిచిపెట్టి ఇంతకన్నా భ్రష్టులవుతున్నారు. అసత్యవాదులూ పాపాచారులుగా మారిపోతున్నారు. బ్రాహ్మణులు రకరకాల దానాలు పట్టడానికి ఎగబడుతూ (ప్రతిగ్రహపరాయణులై) శూద్రసేవా తత్పరులవుతున్నారు. జనమేజయా ! ఇంక స్త్రీల సంగతి చెప్పవలసినపనే లేదు. కామలోభమోహసమన్వితలై స్వేచ్ఛా సంచారిణులవుతున్నారు. మిథ్యా వాదినులై క్లేశాలు కొనితెచ్చుకుంటున్నారు. ధర్మాలను గొప్పగా వల్లెవేస్తూ తమ భర్తలనే తాము వంచిస్తున్నారు. ఇదీ ఈ యుగధర్మం.

ఆహారశుద్ధ్యా నృపతే చిత్త శుద్ధిస్తు జాయతే ।
శుద్ధే చిత్తే ప్రకాశః స్యాద్ధర్మస్య నృపసత్తమ ॥ (11 - 50)

జనమేజయా ! ఆహారశుద్ధివల్ల చిత్తశుద్ధి లభిస్తుంది. శుద్ధచిత్తంలో ధర్మం ప్రకాశిస్తుంది. ఆహారవిధికలో సాంకర్యదోషం ఉంటే, ధర్మసాంకర్యం ఏర్పడుతుంది. ధర్మసాంకర్యంవల్ల వర్ణసాంకర్యం - తప్పదు. ఇలా సర్వధర్మ వివర్జితమైన ఈ కలియుగంలో వర్ణాశ్రమ ధర్మాల ఊసే వినిపించదు. ధర్మజ్ఞులైన



మహాత్ములు సైతం అధర్మమే ఆచరిస్తుంటారు. ఇది కలిస్వభావం. దీన్ని తప్పించడం ఎవడివల్లా కాదు. అందుచేత ఈ యుగంలో మొత్తం మీద మనుష్యులందరి స్వభావాలూ పాపపరాయణాలే. దీనికి విరుగుడనేదే లేదు.

వ్యాసమహర్షీ ! వేద వేదాంతవేదాంగాలను ఆపోశనపట్టిన మీరే ఇలా నిరాశానిస్పృహలకు లోనైతే ఎలా ! అధర్మబహుళమైన ఈ కలియుగంలో మానవులకు మరింక గతిలేనేలేదా ? ఏదో ఒక ఉపాయం ఉండే ఉంటుంది. దయచేసి అది తెలియజెప్పి పుణ్యం కట్టుకోండి.

జనమేజయా ! అడిగావు కనక చెబుతున్నాను. ఒకే ఒక్క ఉపాయం ఉంది. మరొకటి లేనేలేదు. సర్వదోషాలనూ తొలగించే ఉపాయం. దేవీపాదపద్మాలను ధ్యానించడం ఒక్కటే తరణోపాయం. జగదీశ్వరి ఉన్నచోట ఏ దోషమూ ఉండదు. జగన్మాత నామం ఒక్కసారి జపిస్తేచాలు సకల పాపాలనూ దహించివేస్తుంది. ఇక భయమేమిటి ? ఉద్దేశపూర్వకంగా కాకపోయినా ఏదోలాగా జగదీశ్వరి నామధేయాన్ని ఉచ్చరిస్తే చాలు, ఏ ఏ ఫలాలు లభిస్తాయో హరిహరాదులుకూడా చెప్పలేరు. సకల పాపాలకూ ఇది ప్రాయశ్చిత్తం. అందుచేత అంబికాలయం ఉన్న ఊళ్ళో నివసిస్తూ నామస్మరణం చేస్తుంటే చాలు కలిభయం పటాపంచలైపోతుంది. సర్వశాస్త్ర సారమైన ఈ రహస్యాన్ని నీకు మాత్రమే తెలియజెబుతున్నాను. జాగ్రత్తగా గ్రహించి దేవీపాదపద్మాలను సేవించు. బ్రాహ్మణులు గాయత్రీ మంత్రాన్ని జపిస్తున్నారే కానీ మాయాశక్తి వైభవాన్నీ మహిమనూ తెలుసుకోలేకపోతున్నారు. సరే - మహారాజా ! నీ సందేహాలకన్నింటికీ సమాధానాలు చెప్పాను. యుగధర్మాలూ వాటి వ్యవస్థలూ వివరించాను. ఇంకా ఏమి వినాలి అనుకుంటున్నావో అడుగు, చెబుతాను - అని వ్యాసుడు ముగించాడు. ***(అధ్యాయం - 11, శ్లోకాలు - 65)***

వ్యాసమహర్షీ ! ఈ భూలోకంలో పుణ్యతీర్థాలగురించి వినాలని ఉంది. మానవులుగానీ దేవతలుగానీ వెళ్ళి సందర్శించవలసిన పుణ్యక్షేత్రాలూ, మునగవలసిన పుణ్యనదులూ వీటి విశేషాలూ, ఫలాలూ తీర్థయాత్రా నియమాలూ - వీటిని తెలుసుకోవాలనుకుంటున్నాను. భూగోళమంతా మీకు కరతలామలకం కనక వివరంగా తెలియజెయ్యి.

## ◆ చిత్తశుద్ధి ప్రబోధం ◆

జనమేజయా ! నదులలోకెల్లా జాహ్నవీనది ఉత్తమోత్తమం. అటుపైని వరసగా యమున సరస్వతి నర్మద గండకి సింధు గోమతి తమస కావేరి చంద్రభాగ వేత్రవతి చర్మణ్వతి సరయు తాపి అభ్రమతి - ఇంకా వందలాదిగా ఉన్నాయి నదులు. వీటిలో సముద్రాన్ని చేరుకునేవి ఉత్తమాలు. అధిక పుణ్యప్రదాలు. చేరుకోనివి అల్పపుణ్యప్రదాలు. సముద్రాన్ని చేరుకునే వాటిలోకూడా నిరంతరం ప్రవహించేవి (జీవనదులు) ఇంకా ఉత్తమోత్తమాలు. శ్రావణభాద్రపదాల్లో ఈ నదులు రజస్వలలు అవుతాయి. వర్షయోగంతో నీరు గ్రామ్యం (కలుషితం) అవుతుంది.



అరణ్యాలలో పుష్కర కురుక్షేత్ర ధర్మారణ్య ప్రభాస ప్రయాగ నైమిశ అర్బుదారణ్యాలు పవిత్రమైనవి. అలాగే శ్రీశైల సుమేరు గంధమాదన పర్వతాలు ప్రశస్తాలు. సరస్సులలో మానస సరస్సు ఉత్తమోత్తమం. అటుపైని బిందుసరస్సు అచ్ఛోదసరస్సు పేర్కొనదగినవి.

మునీశ్వరుల ఆశ్రమాలు అన్నీ పుణ్యప్రదాలే అయినా బదరికాశ్రమం అత్యంత పుణ్యప్రదం. నరనారాయణులు అక్కడే తపస్సు చేశారు. తరవాత చెప్పుకోదగింది శతయూపాశ్రమం. వామనుడు ఇక్కడ తపస్సు చేశాడు. అప్పటినుంచీ అది వామనాశ్రమంగా ప్రఖ్యాతికెక్కింది.

ఇలాగ ఈ భూతలంమీద పుణ్యస్థలాలు అసంఖ్యాకంగా ఉన్నాయి. వీటిగురించి పెద్దలు ఎందరూ ఎన్నో విశేషాలు చెప్పారు. కానీ వీటన్నింటిలోకీ దేవీస్థానాలు ఉత్తమోత్తమాలు. దర్శిస్తే చాలు పాపపంకాలు ఇర్రింకిపోతాయి. వాటిలో కొన్నిటిని గురించైనా ప్రస్తావన వచ్చినప్పుడు చెబుతాను. తీర్థ - దాన - వ్రత - మఖ-తపః పుణ్యకర్మల్లో ద్రవ్యక్రియామనశ్శుద్ధులనుబట్టి స్థాయిభేదాలేర్పడతాయి. వీటిని ఆచరించడంలో ద్రవ్యశుద్ధినీ క్రియాశుద్ధినీ ఎలాగోలాగా సాధించుకోవచ్చుగానీ మనశ్శుద్ధిమాత్రం చాలామందికి చాలాసార్లు చాలాచాలా దుర్లభం.

> కదాచిత్ ద్రవ్యశుద్ధిః స్యాత్ క్రియాశుద్ధిః కదాచన ।
> దుర్లభా మనసః శుద్ధిః సర్వేషాం సర్వదా నృప ॥ (12 - 19)

మనస్సు అనేది వస్తుతః చాలా చంచలం. బహు విషయాసక్తం. రకరకాల భావాలకు అది నిలయం. అరిషడ్వర్గానికి ఆటపట్టు. దీన్ని శుద్ధిపరుచుకోవడం ఇంచుమించు అసంభవమన్నంతటి దుర్లభం. సకల తపస్సులనీ తీర్థయాత్రల్నీ పుణ్యవ్రతాలనీ చెడగొట్టేదీ విఫ్ఫలపరిచేదీ ఈ మనస్సే. దీన్ని కుదుటపరచుకోడానికి తీవ్రంగా నిరంతరంగా ప్రయత్నం చెయ్యాలి.

జనమేజయా ! అహింస సత్యము అస్తేయము (అచౌర్యం) శౌచము ఇంద్రియనిగ్రహము స్వధర్మపాలనము అనేవి తీర్థసేవలకన్నా గొప్పవి. నిత్యకర్మలను విడిచిపెట్టి సహవాసదోషంవల్ల అపమార్గాలలో పయనించి, జీవిత చరమాంకంలో తీర్థయాత్రలుచేస్తే పుణ్యం రాకపోగా పాపం చుట్టుకుంటుంది. తీర్థాలలో గ్రుంకులిడితే శరీరానికి అంటుకున్న దుమ్మూధూళీ ప్రక్షాళితం అవుతాయి తప్ప మనస్సు పరిశుభ్రమవుతుందా ? నిజంగా వాటికి ఆ శక్తే ఉంటే గంగాతీర నివాసులకు ఎంతటి అంతశ్శుద్ధి ఉండాలి ? కానీ అలా లేరే. అక్కడి మునుల్లోకూడా ద్రోహబుద్ధులున్నారే. అంచేత తీర్థోదకాలు మనస్సుని ప్రక్షాళన చెయ్యలేవు. కనక చిత్తశుద్ధిని మించిన తీర్థం ఈ సృష్టిలోనే లేదు. దైవయోగంవల్ల సజ్జన సాంగత్యం లభిస్తే అది జ్ఞానవంతుడి మనస్సును విశేషంగా ప్రక్షాళన చేస్తుంది.



యది స్యాద్దైవయోగేన క్షాళయత్యాంతరం మలమ్ ।
విశేషేణ తు సత్సంగో జ్ఞానవిష్ణుస్య భూపతే ॥ (12 - 27)

అంతేకానీ వేదాలూ శాస్త్రాలూ వ్రతాలూ తపస్సులూ యజ్ఞాలూ దానాలూ - ఇవిఏవీ చిత్తశుద్ధికి కారణాలు కావు, కాలేవు. వసిష్ఠుడున్నాడు, బ్రహ్మమానసపుత్రుడు. వేదవిద్యాపారంగతుడు. మహాతపస్వి. యజ్ఞయాగాలు అనేకం నిర్వహించాడు. గంగాతీరంలోనే నిరంతరం నివసిస్తాడు. అయితేనేమీ రాగద్వేషాలను వదిలించుకోలేకపోయాడు. మనస్సును ప్రక్షాళితం చేసుకోలేకపోయాడు. వసిష్ఠవిశ్వామిత్రులకు నిరర్థకంగా మహాఘోరయుద్ధం జరిగింది. సకలప్రాణికోటినీ ఇబ్బందిపెట్టింది. హరిశ్చంద్రుడు కారణంగా వసిష్ఠుడి శాపానికి గురియై విశ్వామిత్రుడంతటి మహాతాపసి కొంగగా జన్మించాడు. విశ్వామిత్రుడిచ్చిన ప్రతిశాపంతో వసిష్ఠుడేమో ఆడీరూపం ధరించాడు. (ఆటి, ఆడి = ఒక రకం బాతు. ఆడేలు అనికూడా) వీరిద్దరి ఆడీబక యుద్ధం పురాణప్రసిద్ధం. మానససరస్తీరంలో వేలసంవత్సరాలు సాగింది. ఇద్దరు మహర్షులూ రోషాన్ని నియంత్రించుకోలేక మదోన్మత్తులై సింహాల్లా పోరాడారు.

వ్యాసుడు ఈమాట అనడమేమిటి జనమేజయుడు ఆ కథ చెప్పమని అడిగాడు. కలహకారణమేమిటి, ఎందుకు పరస్పరం శపించుకున్నారు? తమకూ లోకాలకూ దుఃఖకారకమైన యుద్ధానికి ఎలా దిగారు - వివరించమన్నాడు. వ్యాసుడు ఆ కథ అందుకున్నాడు.

## ◆ హరిశ్చంద్రుడికి వరుణుడి శాపం ◆

జనమేజయా ! సూర్యవంశంలో శ్రీరామచంద్రుడికంటే ముందు హరిశ్చంద్రుడనే మహారాజు ఉన్నాడు. అతడు త్రిశంకుడి తనయుడు. ఈ హరిశ్చంద్రుడికి సంతానం లేకపోవడంతో పుత్రార్థియై వరుణయాగం చేస్తానని మొక్కుకున్నాడు. అది ఒక నరమేధం. ఆ ప్రతిజ్ఞకు వరుణుడు సంతృప్తి చెందాడు. హరిశ్చంద్రుని ధర్మపత్ని గర్భవతి అయ్యింది. రాజు సంబరపడ్డాడు. గర్భ సంస్కారాలన్నీ యథావిధిగా జరిపించాడు. నెలలు నిండాయి. సర్వలక్షణ సంయుతుడైన సుతుడు జన్మించాడు. హరిశ్చంద్రుడి ఆనందానికి అవధులులేవు. జాతకర్మాది సంస్కారాలన్నీ పెద్దఎత్తున జరిపించాడు. బ్రాహ్మణులకు గో భూ సువర్ణదానాలను భారీగా చేశాడు. ఆ సందర్భంలో వరుణుడు బ్రాహ్మణరూపంలో వచ్చాడు. హరిశ్చంద్రుడు భక్తిప్రపత్తులతో అర్ఘ్యపాద్యాసనాదులు సమర్పించి అర్చించాడు. రాకకు కారణమేమిటని వినయంగా అడిగాడు. నేను వరుణుడిని, నీ కొడుకుని బలిపశువును చేసి వరుణయాగం చెయ్యి. చేస్తానని మొక్కేవుగదా ! మాట నిలబెట్టుకో - అన్నాడు వరుణుడు.



హరిశ్చంద్రుడికి నెత్తిమీద పిడుగుపడ్డట్టు అయ్యింది. మెల్లగా తేరుకున్నాడు. స్వామీ ! మొక్కామ కనక తప్పకుండా చేస్తాను. ఏలోటూ రాకండా యథావిధిగా చేస్తాను. మాట నిలబెట్టుకుంటాను. పురిటిరోజులు గడిచాక శుద్ధి అవుతుంది. ధర్మపత్ని లేకుండా యజ్ఞం సాగదుగదా ! అందాకా ఓపికపట్టక తప్పదు - అన్నాడు. వరుణుడు సంతృప్తిచెందాడు. సరే అని తన లోకానికి వెళ్ళిపోయాడు.

నెల గడిచింది. పురిటిశుద్ధి అయ్యింది. వరుణుడు మళ్ళీ పరీక్షించడంకోసమా అన్నట్టు విప్రవేషంలో వచ్చాడు. యజ్ఞం ఎప్పుడు మొదలుపెడుతున్నావ్ అని అడిగాడు. హరిశ్చంద్రుడు ఈసారి మరొక వంక చెప్పాడు.

స్వామీ ! ఉపనయన సంస్కారం జరపకుండా కొడుకును ఎలా బలిఇవ్వను. క్షత్రియుడే కదాయె. అటువంటి అసంస్కృత బలిప్రదానం పవిత్రమైన వరుణ యజ్ఞానికి కళంకం అవుతుంది. నేను నీ సేవకుణ్ణి. దీనుడినై అభ్యర్థిస్తున్నాను. ఉపనయనం చెయ్యకుండా కొడుకును బలిఇవ్వడానికి ధర్మశాస్త్రాల ప్రకారం తండ్రిగా నాకు అధికారం లేదు. అంచేత అప్పటిదాకా ఓపికపట్టు. మరొక్క అవకాశం అనుగ్రహించు - అని ప్రాధేయపడ్డాడు.

రాజేంద్రా ! నన్ను వంచించాలని చూస్తున్నావు. ముందుకి ముందు బడాయిగా ప్రతిజ్ఞ చేశావు. ఇప్పుడు పుత్రస్నేహబంధాన్ని తెంచుకోలేకపోతున్నావు. నాకు తెలుసు, లేకలేక సంతానం కలిగితే అపుత్రకుల వాత్సల్యబంధం ఎంత గాఢంగా ఉంటుందో. సరే అర్థం చేసుకున్నాను. ప్రస్తుతానికి ఈ ఒక్క అవకాశమూ ఇస్తున్నాను. ఇంటికి వెడుతున్నాను. ఎప్పుడు రమ్మంటావో చెప్పు. అప్పుడే వస్తాను. అప్పుడు ఇంకోటి ఇంకోటి చెప్పి బతిమాలుకున్నా బామాలుకున్నా అంగీకరించను. మాట తప్పేవో - ఊరుకోను. శపిస్తాను. తెలిసిందా ? - అని బెదిరించాడు వరుణుడు.

స్వామీ ! మాట తప్పనుగాక తప్పను. సమావర్తన సంస్కారం జరిపించిన వెంటనే పుత్రుణ్ణి బలిపశువును చేసి నీ యజ్ఞం నిర్వహిస్తాను -. నా మాట నమ్ము - అని చెప్పి హరిశ్చంద్రుడు వరుణుడిని అప్పటికి పంపించేశాడు.

పుత్రుడికి రోహితుడు అని నామకరణం చేశాడు. అతడు దినదినప్రవర్థమానుడై సకలవిద్యలూ అభ్యసించాడు. తాను బలిపశువుగా తన తండ్రిగారు వరుణుడికి నరమేధం బాకీపడ్డాడని సవిస్తరంగా తెలుసుకున్నాడు. తనకు మరణం చేరువలోనే ఉందని గ్రహించి భయభీతుడయ్యాడు. ఒకరోజున ఎవరికీ తెలియకుండా ఇంటిలోంచి పారిపోయాడు. అగమ్యగిరిగహ్వరాలకు చేరుకుని నరమానవుల కంటబడకుండా కాలం గడుపుతున్నాడు.



వరుణుడు సరిగ్గా సంవత్సరాలు లెక్కవేసుకుని హరిశ్చంద్రుడి దగ్గరికి వచ్చాడు. యజ్ఞం ఇంకా మొదలు పెట్టలేదేమని గద్దించాడు. కలత చెందిన మనస్సుతో వడిలిపోయిన ముఖంతో ఎదురువచ్చిన హరిశ్చంద్రుడు - స్వామీ ! ఇంకేమి యజ్ఞం, కొడుకు పారిపోయాడు, ఎక్కడికి పోయాడో ఎంత వెదికించినా జాడ తెలియలేదు. ఏమి చెయ్యమంటావ్ - అన్నాడు.

వరుణుడికి కోపం కట్టలు తెంచుకుంది. అసత్యవాదీ ! నన్నే వంచిస్తావా ? నీకు జలోదరం వచ్చుగాక - అని శపించి విసవిసా నడిచి వెళ్ళిపోయాడు.

హరిశ్చంద్రుడికి జలోదరవ్యాధి ఆ క్షణంలోనే సంక్రమించింది. క్రమేపీ ముదిరింది. శాపంవల్ల వచ్చిన రోగం కనక ఏ వైద్యానికీ లొంగడంలేదు. రాజు మంచం పట్టాడు.

ఒక బాటసారి ద్వారా రోహితుడికి విషయం తెలిసింది. రోహితా ! నీ తండ్రి రోగపీడితుడయ్యాడు. వరుణుడు శపించాడు. నువ్వు పుట్టి నీ తండ్రికి జలోదరం తెచ్చిపెట్టావు. ఏమి పుట్టకరా నాయనా నీది! నువ్వుమాత్రం ఇక్కడ సుఖంగా శరీరం పెంచుతున్నావు. దీనితో ఏమి సాధిద్దామనుకుంటున్నావో గానీ తండ్రిని రోగిష్ఠిని చేసిన నీ జన్మ వ్యర్థం. ముమ్మాటికీ నిష్ఫలం, నిష్ప్రయోజనం. తండ్రికోసం ప్రాణాలు త్యాగం చెయ్యడం ఉత్తమపుత్రుల లక్షణం. నీకోసం కన్న తండ్రి వ్యాధిపీడితుడు కావడం నీ అధమత్వానికి సంకేతం - పుత్రాధమా ! అంటూ ఆ బాటసారి దులిపేశాడు. రోహితుడికి ధర్మం తెలిసివచ్చింది. తండ్రిని చేరుకుందామని నిశ్చయించుకున్నాడు. సరిగ్గా ఆ సమయానికి ఇంద్రుడు బ్రాహ్మణరూపంలో వచ్చాడు. పరమదయాన్వితుడిలాగా రహస్యంగా హితోపదేశం చేశాడు. ***(అధ్యాయం - 12, శ్లోకాలు - 72)***

రాకుమారా ! ఇంటికి పోదామనకుంటున్నావా ? పరమమూర్ఖుడిలా ఉన్నావే. నీ తండ్రి జలోదరంతో చావుబతుకులమీద ఉన్నాడు. బడాయికి పోయి వరుణయజ్ఞం చేస్తానని ప్రతిజ్ఞ చేశాడు. చెయ్యలేక శాపానికి గురిఅయ్యాడు. ఇప్పుడు నువ్వు వెడితే యూపస్తంభానికి కట్టేసి వరుణుడికి బలి ఇస్తాడు. వృథాగా చనిపోవాలనుకుంటే ఇంటికి వెళ్ళు. లేకపోతే హాయిగా ఇక్కడే జీవించు - అని ఆ కపటబ్రాహ్మణుడు ఉపదేశం చేశాడు. రోహితుడు ప్రయాణం విరమించుకున్నాడు. అటుపైని అప్పుడప్పుడూ ఎవరో ఒక బాటసారి అటువైపు రావడం, తండ్రి విషయం చెప్పడం, ఇతడు ఇంటికి వెడదామనుకోవడం. ఇంద్రుడు బ్రాహ్మణవేషంలో వచ్చి వారించడం - జరుగుతూనే ఉన్నాయి. ఇదొక దేవీమాయా విశేషం.

హరిశ్చంద్రుడు ఒకరోజున తన సన్నిధానంలో నిలబడ్డ రాజగురువు వసిష్ఠులవారిని ఏకాంతంగా అడిగాడు. మహాత్మా ! ఏమి చెయ్యమంటారు ? ఈ బాధ భరించలేకుండా ఉన్నాను. మనస్సంతా వ్యథాకులంగా ఉంటోంది. ఏదో తెలియని భయం పట్టిపీడిస్తోంది. ఏదైనా ఉపాయం చెప్పి దారిచూపించి నన్ను కాపాడండి మహానుభావా ! అని ప్రాధేయపడ్డాడు. అప్పుడు వసిష్ఠుడు -



మహారాజా ! ఉపాయం లేకపోవడమేమిటి ఉంది. అడిగావు కనక చెబుతున్నాను. విను. ధర్మశాస్త్రాలలో పదమూడురకాల పుత్రుల్ని చెప్పారు. అందులో క్రీతపుత్రుడు ఒకడు. అందుచేత వృష్యలంగా ధనం ఇచ్చి ఒక బ్రాహ్మణ బాలుడిని కొని అతడిని బలి ఇచ్చి యజ్ఞం పూర్తిచెయ్యి. వరుణుడు సంతృప్తి చెందుతాడు. నీ రోగం శాంతిస్తుంది - అని దారి చూపించాడు.

హరిశ్చంద్రుడికి ఈ ఉపాయం నచ్చింది. వెంటనే మంత్రులను పిలిపించి పురమాయించాడు. గ్రామాలన్నీ గాలించండి. ధనలోభంతో కొడుకుని అమ్ముకునే బీదబాపడు ఎక్కడో ఒకచోట ఎవరో ఒకరు దొరకకపోరు. ఆయన కోరినంత ధనమూ ఇచ్చేసి కొడుకును పట్టుకురండి. ఇది నాకు స్వకార్యం. మీకు స్వామికార్యం. దేనికీ లోభించకండి. వెనకాడకండి. విషయమంతా చెప్పి, బతిమాలో బామాలో ఒప్పించి యజ్ఞపశువుగా ఒక బ్రాహ్మణ బాలుడిని తీసుకురండి. ఆలస్యం చెయ్యకండి. వెంటనే వెళ్ళండి - అని ఆజ్ఞాపించాడు.

## ◆ శునశ్శేపుడి వృత్తాంతం ◆

మంత్రులందరూ మందీమార్బలంతో తలోదిక్కుకూ బయలుదేరారు. ఊరూరా ఇల్లిల్లూ గాలించారు. ఒక ఊళ్ళో ఒక బీదబ్రాహ్మణుడు దొరికాడు. అతడిపేరు అజీగర్తుడు. అతడికి ముగ్గురు కొడుకులు ఉన్నారు. దారిద్ర్యంతో బాధపడుతున్నాడు. వారిని పోషించలేక అల్లాడుతున్నాడు. అజీగర్తుడు తన రెండవ కొడుకు శునశ్శేపుడిని (మధ్యముడు)వీరికి అమ్మడానికి అంగీకరించాడు. కోరినంత ధనం ఇచ్చి ఆ మంత్రిగారు శునశ్శేపుడిని తెచ్చి హరిశ్చంద్రుడికి చూపించాడు. రాజు సంబరపడ్డాడు. యజ్ఞానికి ఏర్పాట్లు చెయ్యమన్నాడు.

యూపస్తంభానికి శునశ్శేపుడిని కట్టివేసి యజ్ఞం ప్రారంభించారు ఋత్విజులు. ఇది విశ్వామిత్రుడికి తెలిసి యజ్ఞశాలకు వచ్చాడు. బంధించి ఉన్న శునశ్శేపుడిని చూశాడు. వెంటనే యజ్ఞం ఆపించాడు.

హరిశ్చంద్రా ! ఇటువంటి సాహసాలు ఎప్పుడూ చెయ్యకు. ఈ బ్రాహ్మణబాలుణ్ణి వెంటనే విడిచిపెట్టు. ఇది నా అభ్యర్థన. మన్నించు - నీకు సుఖశాంతులు లభిస్తాయి. ఈ పసివాడు చూడు ఎలా దుఃఖిస్తున్నాడో. వీడి రోదనధ్వని నా హృదయాన్ని నులిమేస్తోంది. కరుణ దయ - ఇలాంటి వాటికి మనస్సులో రవ్వంత చోటియ్యి. నామాట విను. పరుల శరీరాలను రక్షించడంకోసం దయాపరులై తమ శరీరాలను తృణప్రాయంగా త్యాగం చేసి స్వర్గసుఖాలను కాంక్షించిన ఉత్తమక్షత్రియులు ఉండేవారు పూర్వకాలంలో. నువ్వేమో అటువంటి వంశంలోనే పుట్టి స్వశరీర సంక్షరణకోసం పరుడి శరీరాన్ని బలి ఇస్తున్నావు. ఇది మహాపాపం. క్షత్రియ ధర్మానికి విరుద్ధం. కాబట్టి ఈ బాలకుడిపట్ల దయ చూపించు. వెంటనే బంధనాలు విడిపించు. స్వశరీరంమీద ప్రీతి అందరికీ ఉంటుంది. ఎవడి దేహం వాడికి ముద్దు. నామీదా నామాటమీదా ఏమాత్రం గౌరవం ఉన్నా తక్షణం ఈ శునశ్శేపుణ్ణి విడిపించు.



విశ్వామిత్రుడు ఇంతగా చెప్పినా హరిశ్చంద్రుడు వినిపించుకోలేదు. పెడచెవిని పెట్టాడు. బాలకుణ్ణి విడిచిపెట్టలేదు. విశ్వామిత్రుడికి కోపం వచ్చింది. శునశ్శేపుడి దగ్గరికి వెళ్ళాడు. వరుణమంత్రాన్ని చెవిలో ఉపదేశించాడు. మరణభయంతో గజగజలాడిపోతున్న ఆ బాలుడు ఆ మంత్రాన్ని ప్లుతస్వరంలో మననం చేస్తూ వరుణుణ్ణి ధ్యానించాడు. వరుణుడికి హృదయం ద్రవించింది. స్వయంగా ప్రత్యక్షమయ్యాడు. బాలుణ్ణి బంధవిముక్తుణ్ణి చేశాడు. రాజును రోగవిముక్తుణ్ణి చేశాడు. తన లోకానికి వెళ్ళిపోయాడు. విశ్వామిత్రుడుమాత్రం హరిశ్చంద్రుడు నామాట లక్ష్యపెట్టాడుకాదని మనస్సులో గంటుపెట్టుకుని రుసరుసలాడుతూ నిష్క్రమించాడు.

## ◆ వసిష్ఠ విశ్వామిత్రులు - ఆడీబక యుద్ధం ◆

అటుతరువాత కొంతకాలానికి హరిశ్చంద్రుడు గుర్రమెక్కి అడివిలోకి వేటకు వెళ్ళాడు కౌశికీనదీతీరాన మధ్యాహ్న సమయంలో ఒక అడవిపందిని సంహరించబోతుండగా విశ్వామిత్రుడు వృద్ధబ్రాహ్మణవేషంలో వచ్చి అడ్డుకున్నాడు. వంచన చేసి రాజ్యసర్వస్వాన్ని దానంగా గ్రహించాడు హరిశ్చంద్రుడు రాజధానికి తిరిగి వచ్చి విషయమంతా వసిష్ఠులవారికి విన్నవించాడు. విశ్వామిత్రుడే తన యజమానుణ్ణి వంచనచేసి రాజ్యం కాజేశాడని వసిష్ఠుడు గ్రహించాడు. అయినా ఏమీ ఎరగనట్టే మాట్లాడి రాజును ఓదార్చాడు. దాతృత్వాన్ని అభినందించాడు. కానీ, తగిన సమయం రాకపోతుందా అని ఎదురుచూస్తున్నాడు.

ఒకరోజున వసిష్ఠ విశ్వామిత్రులు ఏదో వనంలో యథాలాపంగా తారసపడ్డారు. ఒకరిని చూసి ఒకరికి కోపం భగ్గుమంది. వసిష్ఠుడే ముందుగా నోరుచేసుకున్నాడు.

క్షత్రియాధమా ! దుర్బుద్ధీ ! బ్రాహ్మణవేషధారీ ! కొంగజపం చేస్తూ దాంభికాలు కొడుతున్నావు అహంకారంతో విర్రవీగుతున్నావు. నా మహారాజు హరిశ్చంద్రుణ్ణి నిరపరాధిని వంచించి రాజ్యం కాజేశావు దుఃఖసముద్రంలో ముంచేశావు. నీ కొంగజపానికి తగినట్టే కొంగవైపో - అని నిష్ఠురంగా శపించాడు.

విశ్వామిత్రుడికి మరింత వొళ్ళు మండింది. పాతకలహాలు జ్ఞాపకం వచ్చాయి. ఈ శాపంతో ఆజ్యం పోసినట్టయ్యింది. భగ్గుమన్నాడు. నువ్వొక బాతువైపో అని ప్రతిశాపం ఇచ్చాడు.

ఇద్దరూ క్షణంలో జలపక్షులుగా మారిపోయారు. ఐనా క్రోధాలు చల్లారలేదు. చాలాసేపు కలహించుకున్నారు. సాయంకాలమయ్యేసరికి ఆ మానససరస్తీరంలో ఇద్దరూ చెరొక గట్టునా చెరొక చెట్టునా గూడులు కట్టుకుని నివాసాలు ఏర్పరుచుకున్నారు. తెల్లవారడం ఆలస్యం ఇద్దరూ కలియబడి గోళ్ళతో ముక్కులతో గీరుకుంటూ పొడుచుకుంటూ యుద్ధం చేస్తున్నారు. రక్తసిక్తులై పూచిన మోదుగుచెట్ల



అవుతున్నారు. వాళ్ళ కూతలూ అరుపులూ సర్వలోకాలకూ చిరాకు పుట్టిస్తున్నాయి. వేలసంవత్సరాలు నిత్యకృత్యంగా పోరాటం సాగించారు. ఎంతకూ దీనికి ఒక అంతం కనిపించలేదు. బ్రహ్మదేవుడు కల్పించుకున్నాడు. సర్వదేవతా పరివృతుడై మానసతీరానికి వచ్చాడు. ఇద్దరినీ విడదీసి వేరువేరుగా ఓదార్చి శాంతింపజేసి మొత్తానికి ఎలాగో యుద్ధాన్ని విరమింపజేశాడు. ఇద్దరి శాపాలనూ తొలగించాడు. ఎవరి ఆశ్రమాలకు వారిని సాగనంపాడు. తానూ తన పరివారమూ నిష్క్రమించారు. అటుపైని బ్రహ్మచేసిన ఒడంబడికకు కట్టుబడి వసిష్ఠవిశ్వామిత్రులు మిత్రులయ్యారు.

ఏమైనప్పటికీ, జనమేజయా ! మైత్రావరుణి విశ్వామిత్రులంతటి బ్రహ్మర్షులే అహంకారాన్ని జయించలేకపోయారంటే ఇక సామాన్యులైన దేవదానవమానవులు జయించగలుగుతారా ! అందుచేత ఇంతకీ చెప్పవచ్చేదేమిటంటే - అంతరంగశుద్ధి అనేది మహాత్ములకుకూడా అత్యంత దుర్లభమని. ఎంతో ప్రయత్నంతో సాధనచేస్తే తప్ప సాధ్యంకాదు. అటువంటి అంతశ్శుద్ధి అణుమాత్రమైనా లేకుండా తీర్థదానతపశ్చర్యలు ఎన్ని చేపట్టినా ఎంతగా చేసినా పూర్తిగా నిరర్థకం.

సత్త్వరజస్తమోగుణాలను బట్టి శ్రద్ధకూడా మూడువిధాలు. పరిపూర్ణ ఫలప్రదమైన సాత్త్విక శ్రద్ధ ఈ లోకంలో దుర్లభం. రాజసశ్రద్ధ సగం ఫలాన్ని ఇస్తుంది (అర్థ ఫలద). తామసశ్రద్ధ పూర్తిగా నిష్ఫలం. అఫల. కనీసం కీర్తికూడా దక్కదు. అరిషడ్వర్గాలకు లొంగిపోయే మానవసమాజంలో సర్వత్రా ఇదే పరిస్థితి.

అందుచేత శ్రవణకీర్తనాదులతో అంతరంగాన్ని వాసనారహితం చేసుకుని, దేవీపూజా తత్పరుడై తీర్థక్షేత్రాలలో నివసించాలి. మాయామహేశ్వరి పాదాలను మనసా ధ్యానిస్తూ, స్తోత్రనామాలను వచసా కీర్తిస్తూ, ఫలపుష్పాలతో కర్మణా అర్చిస్తూ క్రమక్రమంగా అరిషడ్వర్గాలను తొలగించుకుని అంతశ్శుద్ధిని సాధించుకోవాలి. కలియుగంలో ఇదొక్కటే సర్వదోషనివారకం. ఇటువంటివారికి కలిభయమే ఉండదు. ఎంతటి పాపాత్ముడైనా ఈ మార్గంలో ప్రయాణిస్తే ఈ సంసారంనుంచి చాలా తేలికగా - అనాయాసంగా - ముక్తిని పొందుతాడు. ***(అధ్యాయం - 13, శ్లోకాలు - 54)***

ఇక్కడ జనమేజయుడికి మరొక సందేహం వచ్చింది. వ్యాసుడు మాట్లాడుతూ వసిష్ఠుడికి పర్యాయపదంగా మైత్రావరుణి అన్నాడు. ఆ పేరు ఎలా వచ్చిందో తెలుసుకోవాలనిపించింది. చేసిన పనులనుబట్టి వచ్చిందా, గుణాన్నిబట్టి వచ్చిందా ? అడిగాడు. వ్యాసమహర్షి వివరించాడు -

జనమేజయా ! వసిష్ఠుడు బ్రహ్మమానసపుత్రుడు. ఇది తెలుసుగదా నీకు. ఈయన ఒక సందర్భంలో నిమిమహారాజు ఇచ్చిన శాపంవల్ల ఆ శరీరాన్ని విడిచిపెట్టి మిత్రావరుణులకు పుత్రుడుగా పునర్జన్మ పొందాడు. అప్పటినుంచీ మైత్రావరుణి అనే పేరు ప్రసిద్ధికెక్కింది.



## ◆ నిమి - వసిష్ఠుల పరస్పర శాపాలు ◆

మహర్షీ! ఈ కథ చాలా చిత్రంగా ఉంది. ఒక మహారాజు ఒక మహర్షిని - సాక్షాత్తూ బ్రహ్మదేవుని కుమారుణ్ణి శపించడమేమిటి ? ఎందుకు శపించవలసి వచ్చింది ? ఏ తప్పు చేశాడని శపించాడు ? దయచేసి తెలియజెబితే కానీ నా కుతూహలం తీరదు.

జనమేజయా ! కారణం నీకు ఇంతకముందే చెప్పాను. అన్ని శాపాలకూ ఏది కారణమో దీనికీ అదే కారణం. ఈ సంసారం సర్వకాలాలలోనూ ఆ మాయాగుణాలు మూడింటితో ఆవరింపబడి ఉంటుంది. భూపాలురు ధర్మం ఆచరించాలి. విప్రోత్తములు తపస్సులు చెయ్యాలి. ఇలా ఎవరి గుణాలూ కర్తవ్యాలూ వారికి స్పష్టంగా ఉన్నాయి. కాకపోతే అప్పుడప్పుడూ ఇవి తారుమారు అవుతుంటాయి. అప్పుడే చిక్కువస్తుంది. రాజులు కామక్రోధ వివశులవుతున్నారు. మునులు లోభానికీ అహంకారానికీ లోనవుతున్నారు. రజోగుణ ప్రధానంగా క్షత్రియులు యజ్ఞాలు చేస్తుంటే, మునులు అలాగే తపస్సులు చేస్తున్నారు. సత్త్వ గుణం అనేది ఎవరిలోనూ కనిపించడంలేదు.

> యజంతి క్షత్రియా రాజన్ ! రజోగుణసమావృతాః ।
> బ్రాహ్మణాస్తు తథా రాజన్ ! న కోఽపి సత్త్వ సంయుతః ॥ (14 - 10)

ఈ వసిష్ఠుడు నిమిమహారాజును శపిస్తే వారేమో వీరిని శపించారు. ఇద్దరూ కష్టాల పాలయ్యారు. విధి బలీయంకదా ! అందుకే ఈ త్రిగుణాత్మక సంసారంలో ద్రవ్యశుద్ధి క్రియాశుద్ధి మనశ్శుద్ధి అవేవి ఉత్తరోత్తరం బహుదుర్లభాలు. ఇదంతా ఆ మాయాశక్తి ప్రభావం. ఎవడూ తప్పించుకోలేడు. ఆ జగన్మాత అనుగ్రహాన్ని పొందగలిగితే క్షణంలో ముక్తుడవుతాడు. లేకపోతే లేదు. అలా కొట్టుమిట్టాడుతూ ఉండవలసిందే.

ఆ తల్లి అనుగ్రహం ఎవరిమీద ఎప్పుడు ఎలా ప్రసరిస్తుందో అనూహ్యం. హరిహరాదులకే లభించని ఆ కరుణ, ఒక్కొక్కప్పుడు సత్యవ్రతాది సాధారణ నియమాలను పాటించిన సామాన్యుడికి దక్కవచ్చు. ఆవిడ హృదయాన్ని తెలుసుకోగలిగినవాడు ఈ ముల్లోకాలలోనూ లేడు. కానీ ఒకటిమాత్రం నిజం. జగదీశ్వరి ముమ్మాటికీ భక్తులకు వశ్యురాలు.

> తస్యాస్తు హృదయం కోఽపి న వేత్తి భువనత్రయే ।
> తథాపి భక్తవశ్యేయం భవత్యేవ సునిశ్చయమ్ ॥ (14 - 15)

అందుచేత ఏ దోషాన్ని తొలగించుకోవాలన్నా దేవీభక్తి ఒక్కటే మార్గం. అదికూడా దంభభక్తి కాకూడదు.



నిమిమహారాజు ఇక్ష్వాకువంశ సంభూతుడు. పన్నెండవ కొడుకు. రూపగుణసంపన్నుడు. ధర్మజ్ఞుడు. ప్రజారంజకుడు. సత్యవాది. దానశీలి. మహాజ్ఞాని. అనేకయజ్ఞాలు చేశాడు. కేవలం బ్రాహ్మణులకోసమని గౌతమాశ్రమ సమీపంలో ఒక పట్టణాన్ని నిర్మించి దానికి "జయము" అని పేరు పెట్టాడు. బ్రాహ్మణులందరూ అక్కడకు చేరి సుఖంగా నివసిస్తున్నారు.

ఇలా ఉండగా ఒకరోజున ఈ నిమిమహారాజుకు - అట్టహాసంగా భూరిదక్షిణలతో బహుకాలం కొనసాగే ఒక మహాయజ్ఞం చెయ్యాలనే సంకల్పం కలిగింది. రజోగుణ విలాసం అటువంటిదిమరి. ఇక్ష్వాకుడి అనుమతి పొందాడు. మహాత్ములతో సంప్రదించాడు. కావలసిన యజ్ఞసంబారాలన్నీ సమకూర్చాడు. భృగు - అంగిరస - వామదేవ - గౌతమ - వసిష్ఠ - పులస్త్య - ఋచీక - పులహ ప్రభృతి మహర్షులను ఆహ్వానించాడు. యజ్ఞవిద్యా ప్రవీణులైన వేదపండితులను రప్పించాడు. అంతా సిద్ధం చేసుకున్నాడు. కులగురువు వసిష్ఠులవారికి పాదపూజ చేసి వినయంగా నమస్కరించి అభ్యర్థించాడు.

గురూత్తమా ! నువ్వు సర్వజ్ఞుడివి. ఇదిగో యజ్ఞసంబరాలన్నీ సమకూర్చుకున్నాను. దయచేసి నాతో ఈ యజ్ఞం చేయించు. అయిదువేల సంవత్సరాలపాటు సాగాలి ఇది. అటువంటి యజ్ఞదీక్షను స్వీకరించాలని నా కోరిక. ఇప్పించు. యజ్ఞం జరిపించు. ఇది అపూర్వమైన దేవీయజ్ఞం. శ్రీజగదంబికా ప్రీతికోసం చేస్తున్నాను. కాదనక ఆధ్వర్యవం వహించు.

నిమిరాజా ! నీ సంకల్పం చాలా ప్రశస్తంగా ఉంది. కానీ ఇంద్రుడుకూడా ఇదే యజ్ఞాన్ని చేస్తూ నన్ను అధ్వర్యుడుగా వరించాడు. అయిదువేల సంవత్సరాల దీక్షను చేపట్టాడు. నేను అంగీకరించి మాట ఇచ్చాను. అందుచేత ముందు అది పూర్తిచేయించి తరవాత నీతో చేయిస్తాను. అందాకా ఓపికపట్టు. దేవేంద్రుడి పనికి అగ్రస్థానం ఇవ్వాలిగదా ! అది కాగానే క్షణం ఆలస్యం చెయ్యకుండా నీ దగ్గరికి వచ్చేస్తాను - అన్నాడు వసిష్ఠుడు.

గురుదేవా ! నేను యజ్ఞసంబారాలన్నీ సమకూర్చుకున్నాను. ఋత్విక్కులనందరినీ ఆహ్వానించాను. అందరూ వచ్చేశారు. ఇప్పుడు వాయిదా వెయ్యడమంటే, అయిదువేల సంవత్సరాలు ఆగడమంటే ఎలాగ? నువ్వు మా ఇక్ష్వాకువంశానికి కులబ్రాహ్మణుడివి. మా పనిని కాదని వదిలేసి మరొకరి పనిని చేపట్టడానికి వెళ్ళడం నీకు భావ్యమా ? ఇది అయుక్తమనిపించడంలేదూ ? బహుశ ధనలోభానికి లొంగిపోయినట్టున్నావు. మరొక్కసారి ఆలోచించు - అని నిమిరాజు ప్రాధేయపడ్డాడు.

వసిష్ఠుడు ఏమీ సమాధానం చెప్పలేదు. ఇంద్రయజ్ఞం చేయించడానికి వెళ్ళిపోయాడు. నిమిరాజు మనస్సులో కలతచెందాడు. ఏమైనా సరే యజ్ఞం నిర్వహించాలి అనుకున్నాడు. గౌతమ మహర్షిని అభ్యర్థించి అంగీకరింపజేశాడు. హిమాలయాల సన్నిధిలో సముద్రతీరాన యజ్ఞం ప్రారంభించాడు. బ్రాహ్మణులకు భూరిదక్షిణలు సమర్పించి అయిదువేల సంవత్సరాల దీక్షను స్వీకరించాడు. ఋత్విక్కులను ధన గో భూ సువర్ణదానాలతో సంతృప్తుల్ని చేస్తూ యజ్ఞం సాగిస్తున్నాడు.



ఇంద్రుడితో యజ్ఞం పూర్తిచేయించి, వెంటనే బయలుదేరి వసిష్ఠుడు నిమిరాజు దగ్గరికి వచ్చాడు. దర్శనంకోసం వేచి ఉన్నాడు. యజ్ఞకార్యాలలో అలిసిపోయి నిమిమహారాజు విశ్రాంతిగా నిద్రపోతున్నాడు. భృత్యులెవరూ లేపడానికి సాహసించలేదు. చాలాసేపు వేచి చూసిన వసిష్ఠుడికి కోపం వచ్చింది. ఇదొక అవమానం అనిపించింది.

కులగురువును నన్నుకాదని మరొకడిని గురువుగా వరించి యజ్ఞం నిర్వహించడమే నాకు అవమానమనుకుంటే, ఇప్పుడు ఇలా దర్శనం ఇవ్వకుండా మరింత కించపరుస్తావా ? దీనికి తగిన శిక్ష అనుభవించవలసిందే. శరీరం రాలిపోయి విదేహుడివి అవుదువుగాక - అని శపించాడు.

ఇది విన్న సేవకులు కంగారుపడి నిమిరాజును నిద్రలేపారు. జరిగింది అంతా చెప్పారు. విశ్రాంతి మందిరం నుంచి గబగబా ఇవతలికి వచ్చి నిమిరాజు గురువుగారికి నమస్కరించాడు. హేతుబద్ధంగా ప్రసంగించాడు.

గురువర్యా ! ఇందులో నా దోషం ఆవంతకూడా లేదు. నువ్వు ధర్మజ్ఞుడివి. సర్వజ్ఞుడివి. నీకు నేను చెప్పాలా ? ధనలోభంతో ఇంద్రయజ్ఞానికి వెళ్ళావు. నేనెంత ప్రార్థించినా కాదన్నావు. యజమానుడివి వదిలేశావు. ఇటువంటి పని చేసినందుకు సిగ్గుపడవలసిందిపోయి నామీద అలిగి శపిస్తావా ? ఇది నీకు భావ్యమా ? ఎవరైనా అంగీకరిస్తారా ? నువ్వు బ్రాహ్మణోత్తముడవు. బ్రహ్మపుత్రుడవు. వేదవేదాంగవేత్తవు. అయితేనేమి, సూక్ష్మమైన బ్రాహ్మణధర్మాన్ని తెలుసుకోలేకపోయావు. నీ తప్పును కప్పిపుచ్చుకోడానికి నన్ను శపిస్తున్నావు. ఎదురుదాడి చేస్తున్నావు. క్రోధం ఎవరికీ పనికిరాదు. నీవంటి జ్ఞానులకు అసలు పనికిరాదు. విప్రుడవైయుండి క్రోధవివశుడవై నిరపరాధిని నన్ను శపించావంటే, నీకు నేను ప్రతిశాపం ఇవ్వడంలో ఏ దోషమూ ఉండదు. కాబట్టి శపిస్తున్నాను. నీ క్రోధసంయుత శరీరం రాలిపోవుగాక, నువ్వూ అశరీరుడవు అగుదువుగాక ! అని శపించాడు నిమిమహారాజు.

## ◆ మైత్రావరుణులుగా వసిష్ఠాగస్త్యులు ◆

ఇలా గురుశిష్యులు పరస్పరం శపించుకుని దుఃఖం కొనితెచ్చుకున్నారు. వసిష్ఠుడు పశ్చాత్తప్తుడై తన తండ్రి బ్రహ్మదేవుణ్ణి శరణువేడుకున్నాడు. నిమి ఇచ్చిన శాపం చెప్పి, కాపాడమన్నాడు. శరీరం పడిపోకుండా చూడమన్నాడు. అది సాధ్యంకాకపోతే మరొక శరీరం పొందడానికి జనకుడిని చూపించమన్నాడు. మరొక శరీరం పొందినా ఇప్పటి జ్ఞానం నశించిపోకుండా నాతోనే ఉండేట్టు అనుగ్రహించమన్నాడు. పుత్రుడి ఆరాటాన్ని బ్రహ్మదేవుడు అర్థంచేసుకున్నాడు. భయపడవద్దని ఓదార్చాడు. ప్రస్తుతానికి మిత్రావరుణుల తేజస్సులో నువ్వు ప్రవేశించు. తగిన సమయం వచ్చినప్పుడు అయోనిజుడుగా ఆవిర్భవిద్దువుగాని. అప్పుడు ఆ రూపంలో నువ్వు ఇప్పటిలాగే ధర్మజ్ఞుడవై వేదవేత్తవై వేదాంగవిదుడవై సర్వజ్ఞుడవై అందరిచేతా పూజలు అందుకొందువుగాని - అని సలహా చెప్పి పంపించాడు.



తండ్రికి ప్రదక్షిణం చేసి నమస్కరించి వసిష్ఠుడు హుటాహుటిని బయలుదేరి వరుణలోకం చేరుకున్నాడు. అక్కడ తన దేహాన్ని విడిచిపెట్టి మిత్రావరుణల తేజస్సులో (వీర్యంలో) జీవాంశంగా ప్రవేశించాడు.

కాలం గడుస్తోంది. ఒకరోజున ఊర్వశి ఏదో పనిమీద వరుణాలయానికి వచ్చింది. సఖీజన పరివృతయై శృంగారచేష్టా విలాసాలతో ప్రకృతిని పులకరింపజేస్తూ, వరుణలోకంలోకి వసంతంలా ప్రవేశించింది. ఆ రూపయౌవన సంపద చూడటంతోనే మిత్రావరుణలు మన్మథార్తులయ్యారు. మనస్సులు చలించి వివశులయ్యారు.

సౌందర్యరాశీ ! ఓ ఊర్వశీ ! మమ్మల్ని కాసింత కటాక్షించు. పంచబాణుడు పగబట్టి హింసిస్తున్నాడు - మమ్మల్ని రక్షించు. మాతో విహరించు - అని జాలిగా అభ్యర్థించారు. వారి బాధను అర్థం చేసుకుంది. భావం గ్రహించింది. సరేనని అంగీకరించింది. అనురక్తయై క్రీగంటచూస్తూ విలాసంగా వారి ఇంటిలోకి అడుగుపెట్టింది. అంతలోకీ మిత్రావరుణులకు వీర్యస్ఖలనమయ్యింది. తెరిచి ఉన్న కుండలో పడింది. అందులోనుంచి ఇద్దరు మహాతేజస్వులు సద్యోజన్ములై ఆవిర్భవించారు. ఒకడు అగస్త్యుడు. మరొకడు వసిష్ఠుడు. మొదటి బాలుడు తపస్సు చేసుకుంటానంటూ అరణ్యాలకు వెళ్ళిపోయాడు. రెండవ బాలుడు వసిష్ఠుడిని ఇక్ష్వాకు మహారాజు తనకు పురోహితుడుగా వరించి తీసుకువెళ్ళాడు. అతడిని వసిష్ఠుడిగా గుర్తించి విశేషమైన గౌరవమర్యాదలతో పోషించాడు.

జనమేజయా ! వసిష్ఠుడు ఇలా మిత్రావరుణుల తేజస్సునుంచి అయోనిజుడై పునర్జన్మ పొందాడు కనక మైత్రావరుణి అయ్యాడు. సందేహం తీరిందిగదా - అన్నాడు వ్యాసుడు.

***(అధ్యాయం - 14, శ్లోకాలు - 69)***

వ్యాసమహర్షీ ! వసిష్ఠుడి దేహప్రాప్తి చెప్పావు. బాగుంది. నిమి సంగతి ఏమిటి ? అతడూ మళ్ళీ శరీరం పొందాడా ? ఎలా పొందాడు ? ఆ కథ కూడా చెబితే శాపవృత్తాంతం పూర్తి అవుతుంది గదా - అన్నాడు జనమేజయుడు. అయితే వినమంటూ మొదలుపెట్టాడు వ్యాసుడు.

## ◆ నిమిమహారాజుకు జగన్మాత వరం ◆

వసిష్ఠుడు నిమిమహారాజును శపించాడన్న సంగతి యజ్ఞం చేయిస్తున్న ఋత్విజులకూ మునీశ్వరులకూ తెలిసింది. చాలా బాధపడ్డారు. రాజును పరామర్శించారు. ఇంకా యజ్ఞం పూర్తికాలేదు. ముగింపు దశలో ఉంది. దీక్షాధారిగా ఉన్న యజమానుడు పరమధార్మికుడు శాపదగ్ధుడవుతున్నాడంటే మనమంతా చూస్తూ ఊరుకోవడమేనా ? దీనికి ఏదైనా విరుగుడు చెయ్యగలమా ? అని చాలాసేపు సమాలోచనలు జరిపారు. ఏదారీ కనిపించలేదు. వసిష్ఠుడి శాపానికి తిరుగులేదు. అనుభవించవలసినదే అని తేలడంతో అందరూ అవాక్కయ్యారు.



నిమిమహారాజు శరీరంలో నెమ్మదినెమ్మదిగా మార్పురావడం మొదలయ్యింది. అది గమనించిన ఋత్విజులు, దానికి కావలసిన వేదమంత్రాలతో గంధమాల్యాది విలేపనాలతో ఒకవైపు అతడి శరీరాన్ని రక్షిస్తూ, మరొకవైపు త్వరత్వరగా యజ్ఞం ముగించారు. అసమాప్తంగా ఉండిపోయిందనే అపప్రథనూ, దానివల్ల వచ్చే ప్రమాదాన్నీ నివారించారు. యజ్ఞం ముగియగానే అవబృథస్నానం చేయించి ఋత్విగ్విప్రులు యజమానుడిని బహుధా స్తుతించారు. నిమిమహారాజు సంతృప్తిచెంది సంతోషించాడు. దేవతలుకూడా ప్రసన్నులై ప్రత్యక్షమయ్యారు. సకలోపచారాలనూ అందుకున్నారు.

నిమిమహారాజా ! నీ దీక్షకూ నీయజ్ఞానికీ ప్రసన్నులమయ్యాము. నీకు ఏదైనా వరం ఇద్దామని వచ్చాము. కోరుకో. ఈ యజ్ఞంవల్ల నీకు ఉత్తమజన్మ లభిస్తుంది. వసిష్ఠ శాపంవల్ల ఈ శరీరం రాలిపోతే రాలిపోనీ. పునర్జన్మలో నీకు దేవరూపం కావాలో మానవ దేహమే కావాలో కోరుకో. అనుగ్రహిస్తాం - అని దేవతలంతా ముక్తకంఠంతో పలికారు.

అప్పటికే నిమిశరీరం రాలిపోయి ఆత్మమిగిలింది. అదే బదులు పలికింది. దేవతలారా ! యజ్ఞం పూర్తి అయ్యింది. మీరు ప్రసన్నులయ్యారు. అంతేచాలు. నాకిప్పుడు చాలా సంతృప్తిగాఉంది. నాకు ఏ దేహంమీదా వాంఛలేదు. శరీరం ఏదైనా ఎప్పుడో ఒకప్పుడు నశించిపోయేదే. అందుచేత ఏ రూపమూ నాకు వద్దు. సకలప్రాణికోటికీ చూపుల్లో నేనుంటాను. వాయురూపంతో కన్నుల్లో సంచరిస్తాను. ఈ వరం అనుగ్రహించండి అని అడిగింది.

ఇటువంటి వరమివ్వడం తమ శక్తికి మించినదనీ, దీన్ని కేవలం జగదీశ్వరి మాత్రమే ఇవ్వగలదనీ, యజ్ఞంతో సంతృప్తి చెందింది కనక తప్పకుండా ఇస్తుందనీ, జగదీశ్వరిని ప్రార్థించమనీ సలహాచెప్పి దేవతలు నిష్క్రమించారు.

నిమి ఆత్మ వెంటనే జగన్మాతను ప్రార్థించింది. గద్గదకంఠంతో బహువిధస్తోత్రాలతో అభ్యర్థించింది. జగదీశ్వరి ప్రత్యక్షమయ్యింది. కోటిసూర్యప్రకాశంతో రాశీభూత సౌందర్యంగా విరాజిల్లుతున్న జగన్మాతను దర్శించి నిమి ఆత్మ కృతకృత్యమయ్యింది. మోక్షదాయకమైన జ్ఞానాన్ని ఇమ్మనీ, సకలప్రాణికోటికీ కన్నుల్లో కలకాలం కాపురముండేలా వరమిమ్మనీ కోరింది.

జగదీశ్వరి అంగీకరించింది. ప్రారబ్ధకర్మల అవశేషాన్నిబట్టి నీకు విమలమైన జ్ఞానం తప్పక లభిస్తుంది. సకలప్రాణికోటికీ కన్నులలో వాయురూపంతో నీకు నివాసం సిద్ధిస్తుంది. నువ్వు కారణంగానే కన్నులు "నిమిషం" పొందుతాయి. ఇది మానవులకూ జంతువులకూ పక్షులకూ మాత్రమే. దేవతలు అనిమిషులే. వారి కన్నులకు ఈ రెప్పపాటు ఉండదు - అని అనుజ్ఞ ఇచ్చి మహర్షులకు వీడ్కోలు చెప్పి జగన్మాత అంతర్ధానం చెందింది.



అటు తరువాత మహర్షులందరూ మరొకసారి సమాలోచనలు జరిపారు. అతడికి పుత్రుడు కలగాలని సంకల్పించి నిమిశరీరాన్ని చేరువలో ఉంచి మంత్రపూర్వకంగా అరణిని మథించారు. మథిస్తూ ఉండగా పుత్రుడు ఆవిర్భవించాడు. సర్వలక్షణ సంపన్నుడై ముమ్మూర్తులా తండ్రిలాగా ఉన్నాడు. అరణిని మథిస్తుండగా జన్మించాడు కనక కొందరు మిథి అన్నారు. జనకుడి శరీరంనుంచి పుట్టాడు కనక మరికొందరు జనకుడు అన్నారు. విదేహుడైన (దేహం లేని) నిమియే ఇలా ఆవిర్భవించాడు కనక ఇంకొందరు విదేహుడన్నారు. ఇతని వంశంలో ఇటుపైని జన్మించే రాజులందరూ విదేహులు అనే వ్యవహరింపబడతారన్నారు.

ఇలా ఆవిర్భవించిన నిమిసుతుడు జనకుడుగా ప్రసిద్ధికెక్కి గంగాతీరంలో అతిమనోహరమైన ఒక మహానగరాన్ని నిర్మించాడు. దానికి మిథిల అని పేరుపెట్టాడు. మహాసౌధాలతో మహాప్రాకారాలతో ధనధాన్య సమృద్ధులతో హట్టశాలలతో మిథిలానగరం విరాజిల్లింది. అతడి వంశంలో పుట్టిన రాజులందరూ జనకనామంతో ప్రఖ్యాతి గడించారు. తత్త్వజ్ఞానులై విదేహులనిపించుకున్నారు. జనమేజయా ! ఇది నిమికథ - అని వ్యాసుడు ముగించాడు.

వ్యాసమహర్షీ ! అంతా బాగానే ఉందికానీ, ఇక్కడ నాదొక చిన్నసందేహం. వసిష్ఠుడంటే సామాన్యుడు కాదు. బ్రాహ్మణోత్తముడు. సాక్షాత్తు బ్రహ్మదేవుని కొడుకు. వేదవేదాంగవిదుడు. అన్నిటికీమించి తనకు గురువు. తన వంశానికి పురోహితుడు. అతడిమీద నిమిమహారాజు అలా అలగవచ్చునా ? మహాయజ్ఞానికి దీక్షవహించి క్రోధానికి లొంగిపోవచ్చునా ? తానూ ధర్మజ్ఞుడు. జ్ఞాని. ఇక్ష్వాకువంశంలో జన్మించాడు. రవ్వంత ఓరిమి వహించలేకపోయాడా ? ఇది చాలా విడ్డూరంగా ఉంది. దీనికి కారణమేమిటా అని ఆలోచిస్తున్నాను. నాకు అందడంలేదు. నువ్వే చెప్పాలి - అన్నాడు జనమేజయుడు. వ్యాసభగవానుడు అందుకున్నాడు -

## ◆ జ్ఞాన ప్రబోధం ◆

జనమేజయా ! ఓర్పు అనేది చాలా దుర్లభమైన గుణం. ఆత్మను జయించనివారికి క్షమ ఉండదు. అసమర్థుడై ఓరిమి వహించడం సర్వత్రా కనపడుతుంది కానీ, శక్తిసామర్థ్యాలు ఉండీ క్షమాగుణ సంపన్నుడుగా వ్యవహరించే వ్యక్తి ఈ లోకంలో ఒక్కడన్నా కనిపించడంటే అతిశయోక్తి కాదు. (క్షమావాన్ దుర్లభో లోకే సుసమర్థో విశేషతః - 36) సర్వసంగ పరిత్యాగులూ మహామునీశ్వరులూ, మహాతాపసులూ, నిద్రాక్షుత్పిపాసలను యోగాభ్యాసంతో జయించిన మహాయోగీశ్వరులూ ఎందరైనా ఉండవచ్చుగాక, కామక్రోధలోభాహంకారలను నాలిగింటినీ జయించినవారు చాలా అరుదు. ఇవి దుర్జ్ఞేయాలైన అంతశ్శత్రువులు. ఈ శత్రువులను జయించినవాడు భూతకాలంలో లేడు. వర్తమానంలో



లేదు. భవిష్యత్తులో ఉండడు. మూడు కాలాలలోనేకాదు మూడులోకాలలోనూ లేడు. మునులూ తాపసులూ బ్రహ్మమానసపుత్రులూ అందరూ ఈ గుణత్రయానికీ ఈ అంతశ్శత్రువులకూ లొంగిపోయిన వారూ. సాంఖ్యశాస్త్రవేత్త, నిరంతర యోగాభ్యాసరతుడూ అయిన కపిలమహర్షి సగరపుత్రులను క్రోధాగ్నిలో దహించివేశాడు. అందుచేత జనమేజయా ! నువ్వు తెలుసుకోవలసిన రహస్యం ఏమిటంటే - ఈ భువన త్రయ సృష్టి ఉందే ఇది అహంకారం నుంచే ఆవిర్భవించింది. కారణగుణాలు కార్యంలో ఉండితీరతాయి. కనక సృష్టిలో ఏ ప్రాణీ అహంకార వర్జితంగా ఉండదు, ఉండజాలదు. త్రిమూర్తులే గుణత్రయ స్వరూపులు. ఇక మానవమాత్రుల సంగతి చెప్పాలా ? కేవల సత్వగుణ సంపన్నుడు యావత్సృష్టిలోనూ దుర్లభుడు. అంతటా గుణత్రయ సంయోగ స్థితియే కనపడుతుంది. కాకపోతే ఒక్కొక్కప్పుడు ఒక్కొక్క గుణానిది పైచేయి అవుతూ ఉంటుంది.

నిర్గుణుడూ నిర్లేపుడూ కేవలం పరమాత్మ ఒక్కడే. అతడు అవ్యయుడు, అలక్ష్యుడు, అప్రమేయుడు, సనాతనుడు. అలాగే ఆదిపరాశక్తి కూడా కేవల నిర్గుణ. దుర్జ్ఞేయ. బ్రహ్మసంస్థిత. సర్వభూతవ్యవస్థిత. ఈ పరమాత్మ పరాశక్తులది అవిభాజ్యమైన నిత్యసంయోగం. వీరు అభిన్నులు. ఇది తెలుసుకుంటే సర్వదోషాలూ పటాపంచలవుతాయి. ఈ జ్ఞానంతోనే మోక్షమని ఘోషిస్తోంది వేదాంతడిండిమం. ఇది తెలుసుకున్నవాడు త్రిగుణాత్మక సంసారం నుంచి విముక్తుడైనట్టే.

అసలు జ్ఞానమనేది రెండు విధాలుగా ఉంటుంది. శాబ్దికం మొదటిది. వేదశాస్త్ర విజ్ఞానంవల్ల బుద్ధికి కలిగే వికాసం శాబ్దికజ్ఞానం. అందులో మతికల్పితమైన వికల్పాలు చాలా ఆవిర్భవిస్తూ ఉంటాయి. కుతర్కకల్పితాలు కొన్నయితే సుతర్కకల్పితాలు మరికొన్ని. వితర్కంవల్ల విభ్రమం, విభ్రమంవల్ల బుద్ధిభ్రంశం, బుద్ధి భ్రంశతవల్ల జ్ఞాననాశం కలుగుతాయని పెద్దలు చెబుతున్నారు.

ఇక రెండవది అనుభవజన్యమైన జ్ఞానం. రాజా ! ఇది కడుంగడు దుర్లభం. జ్ఞానికీ జ్ఞానికీ సంగం ఏర్పడినప్పుడే ఇది సిద్ధిస్తుంది. కేవల శబ్దజ్ఞానంవల్ల కార్యసిద్ధి జరుగదు. అతిమానుషమైన అనుభవ జ్ఞానం లభించదు. అంతర్గతమైన కారుచీకటిని ఛేదించడానికి ఇది సమర్థంకాదు. దీపం దీపం అని పదిసార్లు ఉచ్చరించినంతమాత్రాన చీకటి తొలగిపోతుందా ! బంధనానికి హేతువుకానిదేదో అది కర్మ ఏది విముక్తికి కారణమో అది విద్య (జ్ఞానం).

**తథా న నశ్యతి తమః కృతయా దీపవార్తయా ।**

**తత్కర్మ యన్న బంధాయ సా విద్యా యా విముక్తయే ॥ (15 - 55)**

శ్రమకు మరోపేరు కర్మ. నైపుణ్యానికి మరోపేరు విద్య. సచ్ఛీలమూ పరహితత్వమూ కోపరహితత్వమూ క్షమాసహితత్వమూ ధృతిమంతత్వమూ ఇవి విద్యాపరిపాకానికి ఫలాలు. ఇటువంటి



విద్యతోగానీ తపస్సుతోగానీ లేదా యోగాభ్యాసంతోగానీ మాత్రమే అంతశ్శత్రువులను జయించగలం. మరొక మార్గం లేదుగాక లేదు. మనస్సు స్వభావతః చంచలం. దాన్ని నిలువరించడం అత్యంత దుష్కరం. త్రిలోకాలలోనూ త్రికాలాలలోనూ త్రిగుణాత్మకుడైన ప్రతిప్రాణీ ఈ మనస్సుకి వివశుడే. కామక్రోధాది భావాలన్నీ దీని పుణ్యాలే. మనస్సులో ఆవిర్భవించేవే. అందుచేత మనస్సును నిగ్రహించగలిగితే వీటిని నిర్జించినట్లే. అప్పుడివి ఆవిర్భవించనే ఆవిర్భవించవు. ఇది మానవమాత్రుడికి సాధ్యమయ్యే పనికాదు. అందునా రజోగుణ ప్రధానుడైన క్షత్రియుడికి మనోనిగ్రహం మరీ దుష్కరం. అందుకే నిమిమహారాజు వశిష్ఠునిపట్ల ఓరిమి (క్షమ) వహించలేకపోయాడు. మరి అదే యయాతిమహారాజు భృగుపుత్రుడికి ప్రతిశాపం ఇవ్వలేదు. ఓరిమివహించి వార్ధక్యాన్ని స్వీకరించాడు. ఒక్కొక్కడు ఇలా సౌమ్యుడుగా ఉంటే ఒక్కొక్కడు అలా క్రూరుడుగా ఉంటాడు. ఇవ్వి స్వభావభేదాలు. ఎవరిది తప్పంటాం ? పూర్వకాలంలో హైహయులు ధనలోభంతో క్రుద్ధులై, బ్రాహ్మణులనికూడా చూడకుండా భార్గవులనందరినీ సమూలంగా నాశనం చేశారు. బ్రహ్మహత్యామహాపాతకాన్ని మూటగట్టుకున్నారు. ***(అధ్యాయం - 15, శ్లోకాలు - 63)***

వ్యాసుడి నోటినుంచి హైహయుల ప్రస్తావన రావడంతోనే తాతగారూ అంటూ జనమేజయుడు పట్టుకున్నాడు. ఈ హైహయులు ఎవరు, ఏ క్షత్రియవంశంలో జన్మించారు ? ఏ భార్గవులను సంహరించారు, ఎందుకు సంహరించారు, ఏదో పెద్ద కారణమే ఉండి ఉంటుంది, లేకపోతే బ్రహ్మహత్యామహాపాతకానికి జంకకుండా అంతపని చేస్తారా ? కాబట్టి వివరంగా చెప్పమని అడిగాడు. వ్యాసుడు ప్రారంభించాడు.

## ◆ హైహయుల కథ ◆

పారిక్షితా ! ఇదొక పురాతనకథ. నిజమే ఆశ్చర్యకరమైన క్షత్రియగాథ. హైహయవంశంలో కార్తవీర్యుడని ఒక మహారాజు ఉన్నాడు. అతడికి వెయ్యి బాహువులు ఉండేవి. మహా శౌర్యసంపన్నుడు. ఇతడినే కార్తవీర్యార్జునుడు అనికూడా అంటారు. ధర్మతత్పరుడు. విష్ణుమూర్తి అవతారమైన దత్తాత్రేయుడికి ఇతడు శిష్యుడు. సర్వార్థప్రదుడు. సమర్థుడు. సిద్ధుడు. ఇతడికి భార్గవులు పురోహితులు. వారి మార్గదర్శకత్వంలో నిరంతర దానపరాయణుడై భూరిదక్షిణలతో అనేక యజ్ఞాలు చేశాడు. యజ్ఞ నిర్వహణల్లో సంభావనలుగా పారితోషికాలుగా దానాలుగా అతడిచ్చిన ధన ధాన్య భూ గో సువర్ణరాశులతో భార్గవులందరూ చాలా సంపన్నులయ్యారు. ఏనుగులూ గుర్రాలూ రత్నాలూ మణులూ మాణిక్యాలూ పుష్కలంగా అందుకున్నారు.

కార్తవీర్యార్జునుడు తనువు చాలించి స్వర్గస్థుడయ్యాక చాలాకాలానికి హైహయ వంశీయులు నిర్ధనులయ్యారు. ఒకసారి ఏదో పనివచ్చి ధనం అవసరమయ్యింది. ఎక్కువ సొమ్మే కావలసివచ్చింది.



క్షత్రియులైనా అహం చంపుకుని సవినయంగా భార్గవులను యాచించారు. ఏ మొగమోటమీ లేకుండా పరమలోభులైన ఆ భార్గవులు లేదు లేదు పొమ్మన్నారు. హైహయులు బలవంతంగా లాక్కుంటారేమోనని భయపడి కొందరు భార్గవులు తమ ధనరాశులను భూమిలో పాతిపెడితే, మరికొందరు బంధుమిత్రుల దగ్గర దాచిపెట్టారు. ఎందుకైనా మంచిదని అందరూ కూడబలుక్కుని ఆశ్రమాలను విడిచిపెట్టి అరణ్యగిరిదుర్గాలకు పారిపోయారు.

అవసరాన్ని తప్పించుకోలేక హైహయులు బాధపడుతూనే, మరొక్కసారి అభ్యర్థించి చూద్దామని పురోహితుల ఆశ్రమాలకు మళ్ళీ వచ్చారు. ఆశ్రమాలన్నీ శూన్యంగా ఉన్నాయని, పారిపోయారని తెలిసింది. ధనరాశులను పాతిపెట్టి ఉంటారని అనుమానించి భార్గవుల ఇళ్ళు తవ్వారు. ఒక ఇంటిలో పెద్ద ధనరాశి దొరికింది. శ్రమ అయితే అయ్యింది మిగతా గృహాలుకూడా సోదాచేద్దామనిపించి ఇరుగుపొరుగు బ్రాహ్మణుల ఇళ్ళుకూడా పనిలోపనిగా తవ్వేశారు. లెక్కలేనన్ని ధనరాశులు దొరికాయి. హైహయులు సంబరపడ్డారుగానీ బ్రాహ్మణులందరూ లబోదిబోమంటూ వచ్చి కాళ్ళమీద పడ్డారు. శరణు వేడుకున్నారు. హైహయులు కోపం పట్టలేక ఆ విప్రులనందరినీ నిర్దాక్షిణ్యంగా ధనుర్బాణాలతో కొట్టి చంపారు.

భార్గవులు ఎటు పారిపోయారో తెలుసుకుని ఆ గిరిదుర్గాలకు వెళ్ళి వెదికి వెదికి, దొరికిన వాళ్ళని దొరికినట్టు, బాలుడా వృద్ధుడా అని చూడకుండా సంహరించారు. భార్యలను హింసించారు. గర్భస్థశిశువులనైనా ఉపేక్షించలేదు. క్రూరంగా గర్భస్రావాలు చేశారు. భృగుపత్నులు దారుణంగా విలపించారు. రోదన ధ్వనులతో అరణ్యగిరిగహ్వరాలు ప్రతిధ్వనించాయి. మొత్తం బ్రాహ్మణజాతి అంతా భయవిహ్వలమై పోయింది. చుట్టుప్రక్కల ఆశ్రమాలనుంచి మునులూ మహర్షులూ తపస్వులూ పరుగుపరుగున వచ్చి అడ్డుపడ్డారు. వారించారు. క్రోధం విడిచిపెట్టమని ఎంతగానో ప్రార్థించారు. గర్భస్రావాలు చెయ్యడం మహాపాపమనీ అతిగర్హితమనీ నిందించారు. పాపపుణ్యాలను అత్యుత్కటంగా చేస్తే వాటి ఫలితాలను ఇక్కడే ఈ జన్మలోనే అనుభవించాల్సి వస్తుంది, శుభాన్ని కోరుకునేవారైతే మీరు ఈ అత్యంత విగర్హితమహాపాపకార్యాన్ని ఇక్కడితో విరమించండి అని గట్టిగా హెచ్చరించారు.

**అత్యుగ్రపుణ్యపాపానామిహైవ ఫలమాప్నుయాత్ ।**
**తస్మాజ్జుగుప్సితం కర్మ త్యక్తవ్యం భూతిమిచ్ఛతా ॥** (16 - 30)

హైహయులు రవ్వంత శాంతించి పెదవివిప్పారు. మునీశ్వరులారా ! మహర్షులారా ! మీరంతా సజ్జనులు. ఈ పాపాత్ముల కథ మీకు తెలియదు. వీళ్ళు మా పూర్వీకుల ధనాన్ని దోచుకున్నారు. మోసాలు చేసి ఆ యజ్ఞాలనీ ఈ యాగాలనీ దోపిడీదొంగల్లా బందిపోటుల్లా మా సొమ్ములన్నీ దండుకున్నారు. దికారుల్ని చేశారు. వీళ్ళు బ్రాహ్మణులు కాదు, వంచకులు. దంభాచారులు. కొంగజపంగాళ్ళు. మాకేదో అవసరం వచ్చి ధనం సర్దుబాటు చెయ్యండని వినయంగా యాచిస్తే లేదుపొమ్మన్నారు. పాపలాభ్యే



ఇస్తామన్నా ఒక్కడైనా కరుణించాడుకాదు. ఇబ్బందులు వచ్చినప్పుడు యజమానుల్ని ఆదుకోవద్దా ? వీళ్ళు చెయ్యవలసిన పనేనా ఇది ? పైగా మేమెక్కడ బలవంతం చేస్తామోనని ధనరాశుల్ని భూముల్లో పాతిపెట్టి ఇళ్ళువిడిచి అడవుల్లోకి పారిపోయి వచ్చారు. ఇది భావ్యమేనా ? చంపుతున్నామంటే చంపమూ మరి. అసలు వీరికి ఈ ధనం ఎక్కడి నుంచి వచ్చింది ? కార్తవీర్యార్జునుడు ఇచ్చాడు. ఎందుకిచ్చాడు ? యజ్ఞాలు చెయ్యమనీ, యాచకులకు పెట్టమనీ, తాము సుఖంగా అనుభవించమనీ. వీళ్ళు ఈ మూడింటిలో ఏ ఒక్కటీ చెయ్యలేదు. లోభులై కూడబెట్టి, భూమిలో పాతిపెట్టారు. విప్రుడు ధనాన్ని కూడబెట్టనే కూడదని గదా శాస్త్రం.

న సంచితవ్యం విప్రైస్తు ధనం క్వాపి కదాచన ।
యష్టవ్యం విధివద్దేయం భోక్తవ్యం చ యథాసుఖమ్ ॥ (16 - 36)

ద్రవ్యానికి చోరభయం రాజభయం అగ్నిభయం ధూర్తభయం. ఇన్ని భయాలున్నాయి. ఎంత రక్షించినా ఇది నిలవదు. ఎలాగూ పోయేదే. పోనీ బతికున్నంతకాలం కాపాడుకున్నామనుకుందాం, మరి చచ్చాక ? కూడా పట్టుకువెడతాడా ? వెళ్ళలేడుగదా ? సృష్టిలో ఇంతవరకూ ఎవడైనా అలా పట్టుకువెళ్ళాడా? అప్పుడైనా పరులపాలు కావలసిందేగదా ? ఈమాత్రం తెలుసుకోలేక పరమలోభులై ధనరాశులు కూడబెట్టిన ఈ నీచుల్ని బ్రాహ్మణులనవచ్చునా ? పావలా వడ్డీ ఇస్తాం, మొత్తం మళ్ళీ చెల్లిస్తాం అని యాచించాం. విన్నారా ? పోనీ మేమేమన్నా పరాయివాళ్ళమా ? పారిపోయే వాళ్ళమా ? వీళ్ళంతా తరతరాలుగా మాకు పురోహితులేగదా ! మేము యజమానులమేకదా . ఆ మాటకొస్తే ఇదంతా మేమూ మా పూర్వీకులూ ఇచ్చిందేకదా ! ఆమాత్రం సహాయం చెయ్యలేకపోయారు. మంచితనం నిలబెట్టుకోలేకపోయారు. ధనానికి మూడే గతులు. దానం - భోగం - నాశం. సజ్జనుల ధనం దానభోగాలకి ఉపయోగపడితే. దుర్జనుల సంపద నిరుపయోగంగా నాశనమవుతుంది. దానం చెయ్యక, తాను హాయిగా అనుభవించక కృపణుడై ధనం కూడబెట్టినవాడు వంచకుడు. దండనార్హుడు. అంచేత మేము ఈ వంచకుల్ని ఈ బ్రాహ్మణాధముల్ని గురువులూ పురోహితులూ అనిఅయినా చూడకుండా దండించాం. రాజులుగా మా కర్తవ్యం నిర్వహించాం. ఇందులో ఏ తప్పులేదని మా అభిప్రాయం. దయచేసి మీరు అలగకండి.

దానం భోగస్తథా నాశో ధనస్య గతిరీదృశీ ।
దానభోగౌ కృతీనాం చ నాశః పాపాత్మనాం కిల ॥
న దాతా న చ యో భోక్తా కృపణో గుప్తితత్పరః ।
రాజ్ఞాసౌ సర్వథా దండ్యో వంచకో దుఃఖభాక్ నరః ॥ (16 - 40, 41)



ఆ మునీశ్వరులు ఇక మారుమాట్లాడలేక మౌనంగా ఉండిపోయారు. హైహయులు భృగుపత్నులను అన్వేషిస్తూ వెళ్ళిపోయారు. ప్రాణాలతో వదిలిపెట్టారు. అంతే చాలనుకుని ఆ స్త్రీలందరూ భయకంపితలై హిమవంతం చేరుకున్నారు.

జనమేజయా ! లోభం ఎంతటి ప్రమాదాలు తెచ్చిపెడుతుందో గ్రహించావా ? మనిషికి ఇది ప్రథమ శత్రువు. సర్వదుఃఖాలకూ ఆదిహేతువు. మానమర్యాదలకేకాదు ప్రాణాలకూ ముప్పు తెచ్చిపెడుతుంది. అది ఆ ఒక్కడితోనూపోదు. మొత్తం కుటుంబ సభ్యులనందరినీ నాశనం చేస్తుంది. పుట్టబోయేవాళ్ళను కూడా పొట్టనపెట్టుకుంటుంది. లోభమంతటి నీచగుణం మరొకటి లేదంటే నమ్ము. ఎంతలేసి మహాపాపాలైనా చేయిస్తుంది. అందరితోనూ విరోధం తెస్తుంది. అన్ని ధర్మాలనూ విడిచిపెట్టిస్తుంది. తల్లిదండ్రుల్నీ తోబుట్టువుల్నీ బంధు గురు మిత్రుల్నీ చంపిస్తుంది. లోభావిష్టుడు చెయ్యని అకృత్యమంటూ ఉండదు. కామక్రోధాహంకారాలకన్నా దారుణమైన శత్రువు ఈ లోభం. అవసరమైతే సొంతప్రాణాలను కూడా విడిచిపెట్టిస్తుంది.

పరీక్షిత్కుమారా ! నీ పూర్వీకులే చూడు - ధర్మజ్ఞులూ సన్మార్గులూ అయిన కౌరవపాండవులు రాజ్యలోభంతో నాశనమయ్యారు. కుటుంబ కలహం కురుక్షేత్ర మహాసంగ్రామంగా మారి భీష్మద్రోణాదులూ కౌరవపాండవులూ పుత్ర మిత్ర బంధు కళత్ర పరివారసహితంగా అందరూ అంతరించిపోయారు. విత్తనంగా మీ తండ్రి ఒక్కడు మిగిలాడు. అంచేత లోభం మహాచెడ్డది సుమా ! అది ఎంతటివాడితోనైనా ఎంతటి అకృత్యమైనా చేయిస్తుంది. దాన్ని ఎప్పుడూ నీ దరిదాపులకి రానివ్వకు.

*(అధ్యాయం - 16, శ్లోకాలు - 55)*

వ్యాసుడు చేసిన హెచ్చరికకు జనమేజయుడు సంబరపడ్డాడు. తాతా ! నువ్వు చెబుతోంటే ఎన్ని కథలు ఎన్నిసాళ్ళు విన్నా ఎవరికీ తనివితీరదంటే నమ్ము. నీ కథనచాతుర్యం అటువంటిది. కథారూపంలో అమృతం పంచిపెడతావు. నిజంగా నేను ధన్యుణ్ణి. అయితే ఇంతకీ తాతా ! ఆ భృగుపత్నులు ఏమయ్యారు ? హిమాలయాలకు వెళ్ళి ఏమిచేశారు ? భృగువంశం ఎలా నిలబడింది ? ఇవన్నీ సందేహాలే. క్రోధవివశులై భార్గవులను వేటాడి సంహరించిన హైహయులు ఆ ధనరాశులతో ఏ ఘనకార్యం చేశారు ? బ్రహ్మహత్యామహాపాతకం చుట్టుకోలేదా ? ఎలా తప్పించుకున్నారు ? ఇవి మరికొన్ని సందేహాలు. నువ్వే తీర్చాలి.

జనమేజయా ! తప్పకుండా తీరుస్తాను. విను. హిమాలయాలకు చేరుకున్న భృగుపత్నులు కొంతకాలానికి ఆ భయంనుంచి నెమ్మదిగా కోలుకున్నారు. నదీతీరంలో మట్టితో గౌరీదేవి ప్రతిమచేసి యథావిధిగా అర్చించి, ఉపవాస దీక్షతో ప్రాయోపవేశానికి సంకల్పించి కూర్చున్నారు. ప్రాణత్యాగానికి



సిద్ధపడిన ఆ సాధ్వీమణులకు మహాదేవి స్వప్నంలో సాక్షాత్కరించింది. మీలో ఒకరికి ఊరువునుంచి నా అంశతో కొడుకు జన్మిస్తాడు. అతడు మీ దుఃఖాలు తొలగిస్తాడు అని పలికి అదృశ్యమయ్యింది. భృగుపత్నులు సంబరపడ్డారు.

జగన్మాత చెప్పినట్టుగానే వారిలో ఒక భృగుపత్నికి తొడలో గర్భం ఏర్పడింది. అది దినదిన ప్రవర్ధమానమయ్యింది. మిగతా భృగపత్నులు దాన్ని శ్రద్ధగా కాపాడుతున్నారు. చాలా ఏళ్ళు గడిచాయి.

భార్గవులను ఇంకా అన్వేషిస్తున్న హైహయులు హఠాత్తుగా ఒకనాడు అటువైపు వచ్చారు. వారిని చూడగానే భృగుపత్నులు భయవిహ్వలలై పరుగులు తీశారు. హైహయులు వెంబడించారు. పట్టుకోండి, చంపండి, అదిగో ఒక్కతె గర్భిణిగా కనపడుతోంది అని అరుస్తూ వెంటబడ్డారు. ఊరు గర్భిణి పరుగెత్తలేక, గర్భం కాపాడుకోలేక, ఖడ్గపాణులై వెంబడిస్తున్న హైహయులను చూసి భయంతో వణికిపోతూ నిశ్చేష్టురాలై నిలిచిపోయింది. చేతులతో ముఖం కప్పుకుని గిరిగుహలు మారుమ్రోగేలా దారుణంగా రోదించింది. విందుచూలాలుగా ఉన్న లేడియిల్లాలు సింహాలకు చిక్కినట్టు దొరికిపోయింది.

ఊరుగర్భంలో ఉన్న బాలకుడు తల్లి దీనావస్థను చూసి క్రుద్ధుడై తొడచీల్చుకుని బయటపడ్డాడు. మధ్యందిన మార్తాండుడిలా కాంతులు విరజిమ్ముతున్నాడు. ఆ వెలుగుల్ని తట్టుకోలేక హైహయులకు కళ్ళు పోయాయి. అందరూ ఒక్కసారిగా అంధులైపోయారు. అంతటా కారుచీకటి. ఏమిటి ఇలా అయిపోయాం, బాలుడిని చూడటంతోనే కళ్ళుపోయాయి ఏమిటి అని ఎవరికివారు ఆలోచన చేసుకుని ఇది పాతివ్రత్యబలమని గ్రహించి ఆర్తులై దీనులై ఆ భృగుపత్ని కాళ్ళమీద పడ్డారు.

తల్లీ ! కరుణించు. మేమంతా నీ దాసులం. క్షమించరాని మహాపరాధం చేశాం. పాపాత్ములం. పాపఫలంగా కళ్ళుపోయాయి. నిన్ను దర్శించలేకపోతున్నాం. పుట్టుగ్రుడ్డివాళ్ళమైపోయాం. నీ తపశ్శక్తి అర్థమయ్యింది. నీ పాతివ్రత్యం తెలిసివచ్చింది. నీది అద్భుతశక్తి. మమ్మల్ని క్షమించు. దయచేసి చూపు ప్రసాదించు. గుడ్డితనం చావుకంటే భయంకరం. మాతృమూర్తివి. రవ్వంత వాత్సల్యం చూపించు. దృష్టి ప్రసాదించు. మా దారిన మేము పోతాం. మళ్ళీ ఎప్పుడూ మీ జోలికి రాం. ఈ ఒక్క తప్పూ కాయి. భార్గవులందరికీ ఇంతకాలమూ మేమూ మా పూర్వీకులూ సేవకులం. అజ్ఞానంతో పెద్దపొరపాటే చేశాం. బుద్ధి వచ్చింది. ఇటుపైని ఏ క్షత్రియుడూ భార్గవులతో వైరంపెట్టుకోడు. ఒట్టు. ఇది మా శపథం. వినయవిధేయతలతో బుద్ధిగా మెసులుకుంటాం. మామాట నమ్ము. మమ్మల్ని క్షమించు. కళ్ళు ప్రసాదించు. నువ్వూ నీ పుత్రుడూ పదికాలాలపాటు క్షేమంగా వర్ధిల్లండి. మా నుంచి ఇక ఏ ఇబ్బందీ మీకు కలగదు.

హైహయుల దీనాలాపాలూ అభ్యర్థనలూ శపథాలూ వింటున్న భృగుపత్నికి ఇదంతా ఆశ్చర్యంగా కనిపించింది. జాలి కలిగింది. ఓదార్చింది. హైహయులారా ! మీరు క్షత్రియులు. మహావీరులు. ఒక బ్రాహ్మణ స్త్రీని ఇంతగా ప్రాధేయపడకూడదు. ఇదంతా నాకూ వింతగానే ఉంది. నిజం చెబుతున్నాను.



నమ్మండి. మీ చూపుల్ని నేను పోగొట్టలేదు. మీపట్ల నాకు ఏ కోపమూ లేదు. ఇడిగో నా ఊరువునుంచి ఇప్పుడే జన్మించిన భార్గవుడు మీమీద క్రుద్ధుడయ్యాడు. ఇతడు మీ చూపుల్ని స్తంభింపజేశాడు. తాతతండ్రులను చంపినందుకూ, గర్భస్రావాలు చేసి తోబుట్టువులను చిదిమినందుకూ, నిరపరాధులను హింసించినందుకూ మీమీద ఇతడికి కోపంగా ఉంది. నా ఊరుగర్భంలో ఇతడు నూరేళ్ళు పెరిగాడు. గర్భస్థ శిశువుగానే వేదవేదాంగాలను అధ్యయనం చేశాడు. ఇప్పుడు మిమ్మల్ని సంహరించి పితృవధకు ప్రతీకారం తీర్చుకోడానికి ఆవిర్భవించాడు. జగదీశ్వరి ప్రసాదంగా నాకు జన్మించాడు. ఇతడి దివ్యతేజస్సులు మీ చూపుల్ని హరించాయి. అందుచేత మీరు యాచించవలసింది ఈ బాలుడినేకానీ నన్నుకాదు.కాళ్ళ మీద పడండి. అభ్యర్థించండి. కరుణిస్తాడు - అని, అప్పటికే నీరసపడిన కంఠంతో ఇక పలకలేక విరమించింది ఆ భృగుపత్ని.

హైహయులు క్షణం ఆలస్యం చెయ్యకుండా ఆ బాలకుడి పాదాలపై పడ్డారు. భక్తి ప్రపత్తులతో స్తుతించారు. నేత్రదానం చెయ్యమని అభ్యర్థించారు. బాలభార్గవుడు సంతోషించాడు. దృష్టి ప్రసాదించాడు. క్రోధలోభాలను విడిచిపెట్టి ధర్మబద్ధంగా పరిపాలన సాగించండి. మీ మీ ఇళ్ళకు పొండి. రాసిపెట్టింది జరగకమానదు. అందుకే ఇది ఇలా జరిగింది. బాధపడకండి అని ఓదార్చి పంపించాడు. హైహయులు సుఖంగా ఇళ్ళకు వెళ్ళారు. భృగుపత్ని ఆ మహాతేజస్వియైన బాలభార్గవుణ్ణి వెంటబెట్టుకుని ఆశ్రమానికి వెళ్ళింది. ప్రేమానురాగాలతో పెంచి పెద్దచేసింది.

జనమేజయా ! లోభం ఎంత చేసిందో చూశావా ? భృగువులు లోభంతో నశించారు, హైహయులూ అదే లోభంతో ఇడుములపాలయ్యారు. అదీ వీరి కథ - అని ముగించాడు.

మహర్షీ! అసలు ఇంతకీ ఈ హైహయులు ఎవరు ? ఈ పేరే వింతగా ఉంది. యదువు సంతతి యాదవులయ్యారు. భరత సంతతి భారతులు అయ్యారు. అలాగే ఈ హైహయుడు ఎవరన్నా ప్రసిద్ధి కెక్కిన మహారాజా ! వీరి వంశానికి మూలపురుషుడా ! అయితే అతడి ప్రసిద్ధి ఏమిటి ? ఏ వంశంవాడు? ఈ విశేషాలు వినాలని కుతూహలంగా ఉంది. తెలియజెయ్యవా - అని ప్రార్థించాడు జనమేజయుడు. వ్యాసుడు అలాగేనని అరంభించాడు.

## ◆ హైహయ జన్మవృత్తాంతం ◆

జనమేజయా! హైహయోత్పత్తి అతిపురాతన పురాణగాథ. పూర్వకాలంలో రేవంతుడని సూర్యపుత్రుడు ఉండేవాడు. గొప్ప అందగాడు. మహాతేజస్వి. ఉచ్చైఃశ్రవాన్ని అధిరోహించి విష్ణుదర్శనంకోసం వైకుంఠానికి వెళ్ళాడు. లక్ష్మీదేవి ఆ హయరత్నాన్ని తిలకించింది. క్షీరసాగరం నుంచి ఆవిర్భవించిన తన తోబుట్టువుని ఇంతకాలానికి మళ్ళీ చూడగలిగింది. ఆశ్చర్యంతో కన్నులు విప్పార్చి అలా చూస్తూ



నిలబడిపోయింది. శ్రీమహావిష్ణువుకూడా హయారూఢుడై విచ్చేస్తున్న ఆ మనోహర మహాతేజస్విని చూసి ప్రేమగా లక్ష్మీదేవిని అడిగాడు. లక్ష్మీ ! ఎవరీ సుందరాకారుడు. మరొక మన్మథుడిలా ఉన్నాడు. ముల్లోకాలనూ సమ్మోహపరుస్తున్నాడు. ఎవరంటావ్ ? - అన్నాడు. హయసౌందర్యాన్ని కన్నార్పకుండా చూస్తున్న రమాదేవి ఉలకలేదు, పలకలేదు. విష్ణుమూర్తి మళ్ళీ మళ్ళీ అడిగాడు. బదులులేదు. దానితో కోపం వచ్చింది. ఉలకవు, పలకవు. గుర్రాన్ని చూసి ఇంత మోహమా ? ప్రతిదానికీ రమిస్తావు కనకనే రమవు. చంచలత్వం సహజసిద్ధం కనక చంచలవు. ఒక సామాన్యస్త్రీలాగా నీకు చాంచల్యం ఎక్కువ. ఏ ఒక్కచోటా స్థిరంగా నిలబడవు. నా ప్రక్కనే ఉండి గుర్రాన్ని చూసి మోహపడ్డావు కనక భూలోకంలో ఆడగుర్రానివై (బడబ) పుట్టు - అని దారుణంగా శపించాడు.

అప్పటికి రమాదేవికి తెలివివచ్చింది. భయపడిపోయి దీనురాలై విలపించింది. భర్త తనను శంకించాడని గ్రహించింది. శిరసా పాదాభివందనం చేసి - దేవదేవా ! జగన్నాథా ! కరుణాకరా ! కేశవా ! గోవిందా ! చిన్ని అపరాధానికే ఇంత కోపమా ? అంత శాపమా ? ఇటువంటి కోపం నీలో నేను ఎప్పుడూ చూసి ఎరగనే. నాపట్ల నీకున్న అనురాగమంతా ఏమయిపోయింది ? అది ఇన్నాళ్ళూ నటనయేనా ? క్షణంలో నశించిపోయిందా ? వజ్రాయుధాన్ని శత్రువుపై ప్రయోగించాలి తప్ప ఇల్లాలిమీద కాదు స్వామి! నీ ప్రేమకు పాత్రురాలనేకానీ నీ శాపాలకు అర్హురాలనుకాను. గోవిందా ! ఇదిగో నీ కళ్ళయెదుటే ప్రాణాలను వదిలేస్తాను. నీకు దూరమై నేను జీవించలేను. శాపాన్ని ఉపసంహరించు. అలాకాక ఇదేమైనా లోకకల్యాణం కోసమైనట్టయితే శాపవిమోచనం ఏమిటో తెలియజెయ్యి - అని నిర్భయంగా అడిగింది లక్ష్మీదేవి.

విష్ణుమూర్తి చిరునవ్వు చిందించాడు. ప్రియా ! భూలోకంలో నీకొక పుత్రుడు కలుగుతాడు. వా అంతటివాడు అవుతాడు. అప్పుడు నీకు శాపవిమోచనం అవుతుంది. మళ్ళీ వైకుంఠానికి వచ్చి నన్ను కలుసుకుంటావు - అని చెప్పి ఊరడించాడు. ***(అధ్యాయం - 17, శ్లోకాలు - 69)***

శౌనకాది మహామునులారా ! జనమేజయుడు వ్యాసమహర్షిని ఊరుకోనివ్వలేదు. మళ్ళీ అడిగాడు. తాతా ! రమాదేవి ఆడగుర్రం ఎలా అయ్యింది ? రేవంతుడు ఏమయ్యాడు ? ఆడగుర్రంగా లక్ష్మీదేవి ఏ ప్రాంతంలో అవతరించింది ? ఏకాంతం ఎలా గడిపింది ? ఎంతకాలం గడిపింది ? ఏమి చేసింది ? వాసుదేవుడితో తిరిగి ఎప్పుడు కలిసింది ? నారాయణుడు లేకుండా పుత్రుణ్ణి ఎలా ప్రసవించింది ? - ఈ సందేహాలు నన్ను తొలిచేస్తున్నాయి. సవిస్తరంగా చెప్పి నా కుతూహలం తీర్చు - అని అభ్యర్థించాడు. వ్యాసుడు గొంతు సవరించాడు. యథాతథంగా మీకు చెబుతున్నాను వినండి అంటూ సూతుడు కథలోకి వెళ్ళిపోయాడు.



జనమేజయా ! విష్ణుమూర్తి అలిగి రమాదేవిని శపించడం కళ్ళారా చూసిన రేవంతుడు భయపడిపోయాడు. దూరం నుంచే ఆ దంపతులకు నమస్కరించి వేగంగా ఇల్లు చేరుకున్నాడు. తన తండ్రి సూర్యభగవానుడికి విషయమంతా వివరించి చెప్పాడు. మనస్సు కాస్త కుదుటపడింది. విశ్రాంతి తీసుకున్నాడు.

రమాదేవికి బడబారూపం వచ్చేసింది. భూలోకానికి అవతరించింది. పూర్వకాలంలో సూర్యపత్ని తపస్సు చేసిన చోటుకి చేరుకుంది. అది కాళిందీ తమసానదీ సంగమ ప్రదేశం. సుపర్ణాక్షానికి ఉత్తరంగా ఉన్న పవిత్రక్షేత్రమది. కామితార్థప్రదం. సుందరారణ్య సంశోభితం. అక్కడ నిలబడి ఏకాగ్రచిత్తంతో మహాశివుణ్ణి ధ్యానించింది.

దధ్యౌ చైకేన మనసా శూలినం చంద్రశేఖరమ్ ।
పంచాననం దశభుజం గౌరీదేహార్ధధారిణమ్ ॥
కర్పూరగౌరదేహాభం నీలకంఠం త్రిలోచనమ్ ।
వ్యాఘ్రాజినధరం దేవం గజచర్మోత్తరీయకమ్ ॥
కపాలమాలాకలితం నాగయజ్ఞోపవీతినమ్ ॥ (18 - 13, 14, 15)

శూలాయుధపాణి, చంద్రశేఖరుడు, పంచాననుడు, దశభుజుడు, అర్ధనారీశ్వరుడు, కర్పూరంలా తెల్లని దేహంకలవాడు. నీలకంఠుడు, ముక్కంటి, పులితోలు పంచెగా గజచర్మం ఉత్తరీయంగా ధరించినవాడు, కపాలమాలికా విరాజితుడు, సర్పాన్ని యజ్ఞోపవీతం చేసుకున్నవాడు అయిన శివుణ్ణి ఉపాసించింది. తీవ్రంగా తపస్సు చేసింది. వెయ్యి దివ్యవత్సరాలు గడిచాయి. మహాదేవుడు కరుణించాడు. పార్వతీసహితుడై వృషభవాహనారూఢుడై ప్రమథగణపరివేష్టితుడై ప్రత్యక్షమయ్యాడు.

కల్యాణీ ! ఈ అశ్వినీరూపమేమిటి, ఈ తపస్సు ఏమిటి ? నువ్వు జగన్మాతవు. నీ భర్త జగన్నాయకుడు. సర్వార్థప్రదుడు. అల్లాంటి హరిని వదిలి నన్ను స్తుతిస్తావేమిటి ? ఇది చాలా వింతగా ఉందే. పైగా ఇల్లాండ్రకు భర్తయే దైవమని వేదాలు ఘోషిస్తున్నాయి. మరెవ్వరినీ ఎప్పుడూ స్మరించకూడదు, ధ్యానించకూడదు అని కట్టడి చేస్తున్నాయి. ఎటువంటివాడైనా పతినే సేవించడం స్త్రీలకు సనాతన ధర్మం. నీ విభుడు నారాయణుడు అందరికీ సేవ్యుడు. సర్వదా - యోగ్యుడు. అతడిని కాదని నన్ను ధ్యానిస్తున్నావేమిటి ? - అని అమాయకంగా అడిగాడు.

మహాశివా ! నువ్వు భోళాశంకరుడివి. త్వరగా సంతోషించి ప్రత్యక్షమయ్యే దైవానివి. నా భర్త నన్ను శపించాడు. దాని ఫలితమే ఈ అశ్వినీరూపం. ఈ శాపంనుంచి నువ్వే ఉద్ధరించాలి. నాకు పుత్రుడు



కలిగితే శాప విమోచనం అవుతుందిట. మళ్ళీ వైకుంఠవాసం లభిస్తుందిట. అందుకని ఇక్కడికి వచ్చి తపస్సు చేశాను. సర్వార్థప్రదాయకుడవు ప్రత్యక్షమయ్యావు. పార్వతీవల్లభా ! భర్త లేకుండా నాకు పుత్రుడు ఎలా కలుగుతాడు ? ఆయనేమో వైకుంఠంలో తిష్ఠవేసుకుని కూర్చున్నాడు. నిరపరాధిని నన్ను శపించి భూలోకానికి తోలేశాడు. నా తపస్సుకి నువ్వు నిజంగా సంతోషించినట్టయితే ఒక వరం ప్రసాదించు. నీకూ విష్ణుమూర్తికీ ద్వైధీభావం లేదు. నువ్వే ఆయన, ఆయనే నువ్వు. ఈ రహస్యం నాకు తెలుసు. మీ ఇద్దరి ఏకత్వాన్నీ ఎరుగుదును కనకనే నిన్ను ధ్యానించాను. నిన్ను స్మరించాను. లేకపోతే నాది పెద్దదోషమయ్యుండేది.

జగన్మాతా ! మహాలక్ష్మీ ! నాకూ హరికీ భేదంలేదని నీకు ఎలా తెలిసింది ? ఎవరు చెప్పారు ? మా ఏకత్వాన్ని మునులూ జ్ఞానులూ వేదవేదాంగవేత్తలూ తెలుసుకోలేకపోయారు. కుతర్కాలతో వాదులాడుకుంటూ నా భక్తులూ హరిభక్తులూ కలహించుకుంటూ ఉంటారు. ఈ కలియుగంలో ఇది మరీ విజృంభిస్తోంది. శివభక్తులు చాలామంది విష్ణువును నిందించడం, విష్ణుభక్తులు చాలామంది శివుణ్ణి తూలనాడటం - ఇవి నేనెరుగుదును. అత్యంత దుర్జ్ఞేయమైన మా ఐక్యభావం నీకెలా తెలిసింది ? నిజం చెప్పు.

చంద్రశేఖరా ! ఒకప్పుడు విష్ణుమూర్తి పద్మాసనంలో కూర్చుని రహస్యంగా ధ్యానం చేసుకుంటున్నాడు. నేను చూసి ఆశ్చర్యపోయాను. ధ్యానం ముగించి కన్నులు తెరిచి ప్రసన్నుడయ్యేవరకూ అలాగే వేచి ఉన్నాను. అప్పుడు వినయంగా నమస్కరించి అడిగాను.

జగన్నాథా ! క్షీరసాగరంనుంచి నేను ప్రభవించినప్పుడు సకలదేవతలనూ పరిశీలించాను వీరిలో నాకు పతి కాదగిన వ్యక్తి ఎవరా అని. అందరిలోనూ నువ్వు శ్రేష్ఠుడవని గ్రహించాను. నిన్ను పతిగా వరించాను. అటువంటి నువ్వు సకలదేవతలకూ అధీశ్వరుడవయ్యుండి ధ్యానంలో కూర్చున్నావంటే ఆశ్చర్యంగా ఉంది. ఎవరిని ధ్యానిస్తున్నావ్ ? నువ్వు నా ప్రియవల్లభుడవు. దాచకుండా నిజం చెప్పు అని రొక్కించి అడిగాను. అప్పుడు నా భర్త నాకు చెప్పిన సమాధానం ఏమిటో తెలుసా -

కాంతామణీ ! ఆశుతోషుడూ గిరిజావల్లభుడూ అయిన మహేశ్వరుణ్ణి ధ్యానిస్తున్నాను. ఇలాగే ఆ మహేశ్వరుడు నన్ను ధ్యానిస్తూ ఉంటాడు. శివుడికి నేను ప్రాణప్రియుణ్ణి. నాకు శివుడు ప్రాణప్రియుడు మా ఇద్దరికీ భేదంలేదు. రూపాలు వేరైనా హృదయాలు ఒక్కటే. ఇది తెలుసుకోలేక శివుణ్ణి నిందించే నా భక్తులు నిశ్చయంగా నరకానికి పోతారు.

శివస్యాహం ప్రియః ప్రాణః శంకరస్తు తథా మమ ।
ఉభయోరంతరం నాస్తి మిథస్సంసక్తచేతసోః ॥



నరకం యాంతి తే నూనం యే ద్విషంతి మహేశ్వరమ్ ।
భక్తా మమ విశాలాక్షి సత్యమేతద్ బ్రవీమ్యహమ్ ॥ (18 - 46, 47)

శైలసుతాప్రియా ! విష్ణుమూర్తి ఆ ఏకాంతంలో నాకు చెప్పిన రహస్యం ఇది. అందుచేత నువ్వు విష్ణువల్లభుడవని గ్రహించి ధ్యానించాను. దయచేసి నాకు నా భర్తతో సమాగమం అయ్యేట్టు వరం అనుగ్రహించు - అని లక్ష్మీదేవి శివుణ్ణి ప్రార్థించింది.

క్షీరసముద్రరాజతనయా ! ఇక దిగులుచెందకు. త్వరలోనే నీ కోరిక నెరవేరుతుంది. జగదీశ్వరుడు హయరూపధారియై ఇక్కడికి వచ్చేట్టు చేస్తాను. మీ ఇద్దరికీ నారాయణ సమానుడైన పుత్రుడు జన్మిస్తాడు. అతడు సర్వలోకనమస్కృతుడవుతాడు. ఏకవీరనామంతో జగద్విఖ్యాతి గడిస్తాడు. అతడివల్ల హైహయవంశం ఆవిర్భవించి విస్తరిస్తుంది. నువ్వు నీ పతితో కలిసి వైకుంఠం చేరుకుందువుగాని. అమ్మా ! మరొక రహస్యం. ఆవేళ నీకు ఉచ్చైః శ్రవంమీద అంతటి మోహం కలగడం కేవలం దేవీమాయ. ఆదిపరాశక్తిని ధ్యానించడం మరిచిపోయావు. అందుకు ఇది శిక్ష. గుర్తుచేస్తున్నాను. ఈ క్షణంనుంచి మరిచిపోకండా మహాదేవిని ధ్యానించు. సర్వాత్మనా శరణువేడు - అని ఉపదేశించి, పార్వతీవిభుడు సగణంగా అంతర్ధానం చెందాడు.

లక్ష్మీదేవి ఆ క్షణంనుంచి - దేవాసుర శిరోరత్నకాంతి పరివేష్టితాలైన శ్రీమన్మహాదేవీ పాదపద్మాలను ధ్యానిస్తూ, ప్రేమగద్గద కంఠస్వరంతో స్తుతిస్తూ, హయరూపధారిగా శ్రీహరి రాకకోసం ఎదురుచూస్తోంది.

*(అధ్యాయం - 18, శ్లోకాలు - 62)*

## ◆ హయరూపంలో శ్రీహరి ◆

వరమిచ్చిన శివుడు త్వరత్వరగా కైలాసశిఖరం చేరుకున్నాడు. ఎంతటి క్లిష్టమైన పనులనైనా ఇట్టే చక్కబెట్టే చాతుర్యం ఉన్న ఒక ప్రమథుణ్ణి పిలిచాడు. అతడి పేరు చిత్రరూపుడు.

చిత్రరూపా ! నువ్వు వెంటనే వైకుంఠానికి వెళ్ళు. వెళ్ళి నా మాటగా విష్ణుమూర్తికి చెప్పు. లక్ష్మీదేవి ఫలానాచోట ఏకాకినిగా దుఃఖిస్తోంది. కాబట్టి త్వరగా వెళ్ళి ఆవిడ దుఃఖాన్ని తొలగించి ఆనందింపజెయ్యమన్నానని చెప్పు - అని పంపించాడు.

చిత్రరూపుడు వైకుంఠం చేరుకున్నాడు. అంతా కన్నులపండువుగా ఉంది. ఎటుచూసినా వైష్ణవ బృందాలు కోలాహలంగా సంచరిస్తున్నాయి. నిండా పుష్పించిన చెట్లు. ఉద్యానవనాలు. దిగుడుబావులు. బావుల్లో హంసకారండవాది జలపక్షులు. పొదరిళ్ళల్లో కలకూజితాలు చేస్తున్న మయూర శుక పిక శారికా సమూహాలు. ఎత్తైన సౌధాలూ ప్రాకారాలూ. సౌధాగ్రాలమీద రంగురంగుల పతాకాలు. ఒకవైపు మందారవనం.



నృత్య గీత కళాతత్పరులైన దేవతలూ దేవకాంతలూ. వకుళ అశోక తిలక చంపక కుసుమాల సుగంధ పరిమళాలు. తుమ్మెదల ఝుంకారాలు. ఆ మందారవనంలో విష్ణుమూర్తి సౌధం. సౌధానికి ఇద్దరు ద్వారపాలకులు. జయవిజయులు. వారికి నమస్కరించి చిత్రరూపుడు - శూలపాణి పంపగా వచ్చిన దూతను నేను, స్వామికి తెలియపరచండి అని అభ్యర్థించాడు. జయుడు వెంటనే లోపలికి వెళ్ళి శ్రీహరికి విన్నవించాడు. కార్యమేమో తెలీదుగానీ శివుడి దూతయట, చిత్రరూపుడట, తమరి దర్శనం కోరుతున్నాడు, ప్రవేశపెట్టమంటారా అని అడిగాడు. శ్రీహరి వెంటనే ప్రవేశపెట్టమన్నాడు. జయుడు తిరిగి గుమ్మంలోకి వచ్చి చిత్రరూపుడిని లోపలికి తీసుకువెళ్ళి విష్ణుమూర్తి సన్నిధిలో ప్రవేశపెట్టాడు.

శ్రీ మహావిష్ణువును చూస్తూనే చిత్రరూపుడు సాష్టాంగనమస్కారం చేశాడు. ఆశ్చర్యాన్ని అణచుకుంటూ స్వామివారు చిరునవ్వులు చిందించారు.

చిత్రరూపా ! శంకరుడు సకుటుంబంగా కుశలమేనా ? ఏమిటి ఇలా వచ్చావు ? ఏ పనిమీద పంపించాడు. దేవకార్యమేదైనా వచ్చిపడిందా ? అని అడిగాడు.

గరుడధ్వజా ! ఈ సృష్టిలో నీకు తెలియనిది ఏమైనా ఉందా ! నువ్వు త్రికాలజ్ఞుడవు. నీకు నేను చెప్పాలా ? అయినా మా ప్రభువు పంపించాడు కనక చెప్పమన్నది చెబుతున్నాను. కాళిందీ తమసా సంగమప్రదేశంలో అశ్వినీ రూపధారిణియై జగన్మాత లక్ష్మీదేవి తపస్సు చేస్తోంది. మానవ దానవ దేవ బృందాలతో నిరంతరం ధ్యానింపబడే తల్లి ఇవ్వేళ తానే ధ్యానం చేస్తోంది. ఆమె అనుగ్రహం లేకుండా భూలోకంలో ఏ మానవుడూ సుఖాలు పొందలేడు. అటువంటి లక్ష్మీదేవిని విడిచిపెట్టి నువ్వు ఏమి సుఖాలు బాముకుంటున్నావో అర్థం కావడంలేదు. ఎంతటి దుర్బలుడైనా ఎంతటి నిర్ధనుడైనా భార్యను కాపాడుకుంటాడేతప్ప దూరం చేసుకోడు. ఏ అపరాధమూ చెయ్యని రమాకాంతను ఎందుకిలా దూరం చేసుకున్నావో ఎంత ఆలోచించినా నాకు అందడంలేదు. మగువను కష్టాలపాలు చేసిన మగడి జీవితం వ్యర్థం. శత్రువులుకూడా నిందిస్తారు. నువ్వు జగద్గురువువి. నీకు నేను చెప్పాలా ? నీకు దూరమై శోకిస్తున్న నీ భార్యను చూసి నీ శత్రువులు తమ కోరిక తీరిందని పండుగలు చేసుకుంటున్నారు. రేయింబవళ్ళు నిన్ను పరిహసిస్తున్నారు. వెంటనే వెళ్ళి లక్ష్మీదేవి కోరిక తీర్చు. సర్వలక్షణ సంపన్న. సుశీల. రూపవతి. గుణవతి. నీ ప్రియవల్లభ. వెంటనే స్వీకరించి ఆనందించు.

దుఃఖం ప్రాప్నోతి సంసారే యస్య భార్యా జగద్గురో !
ధిక్తస్య జీవితం లోకే నిందితం త్వరిమండలే ॥
సకామా రిపవస్తేఽద్య దృష్ట్వా తాం దుఃస్థితాం భృశమ్ ।
త్వాం వియుక్తం చ రమయా హసిష్యంతి దివానిశమ్ ॥ (19-25, 26)



శ్రీపతీ ! భార్యావిరహం ఎంత దుస్సహమో ఎంత దుఃఖహేతువో నేను ఎరుగుదును. దక్షాధ్వరంలో నాభార్య సతీదేవి అసువులు బాసింది. అప్పుడు ఈ దుఃఖం నాకు అనుభవంలోకి వచ్చింది. ఈ సృష్టిలో అటువంటి దుఃఖం మరెవ్వరికీ కలగకూడదు. సతీవిరహం తట్టుకోలేక మనస్సులోపల ఎంతగా విలపించానో నాకే తెలుసు. ఆ తరువాత ఎంతో కాలానికి ఈ గిరిసుత లభించింది. ఆనాడు అధ్వరంలో దగ్ధమై దుస్సాధ్యమైన తపస్సు చేసింది. నేనూ చేశాను. ఒకరి తపస్సులకు ఫలం ఒకరుగా మేమిద్దరమూ జతగూడాము. అందుచేత భార్యను విడిచిపెట్టి నువ్వు ఏకాకిగా కూర్చుని అప్పుడే వెయ్యేళ్ళు దాటింది. ఏమి సుఖపడ్డావో చెప్పు, చూస్తాను. పిచ్చిపిచ్చి ఆలోచనలు కట్టిపెట్టి వెంటనే బయలుదేరు. తురగరూపం ధరించి ఆ అశ్వినీరూపిణితో క్రీడించు. పుత్రుడు జన్మించాక మీరు ఇద్దరూ కలిసి వైకుంఠానికి రండి. సుఖంగా సంసారం చేసుకోండి - అని మా శంకరులు విన్నవించమన్నారు ప్రభూ!

విష్ణుమూర్తి ప్రతిఅక్షరమూ శ్రద్ధగా ఆలకించాడు. సరే అన్నానని చెప్పు అనేసి చిత్రరూపుడికి వీడ్కోలు ఇచ్చాడు. వెంటనే జగన్మనోహరమైన తురగరూపం ధరించి కాళిందీతమసా సంగమప్రదేశానికి హుటాహుటిని వచ్చాడు. అశ్వినీరూపధారిణిగా ధ్యానంలో ఉన్న లక్ష్మీదేవిని చూశాడు. ఆవిడకూడా అలికిడికి కన్నులు తెరిచింది. విష్ణుమూర్తి అని గుర్తించింది. గుండెల్లో దుఃఖం పొంగి కన్నుల్లో నీళ్ళు నిండాయి. శ్రీహరికి గుండె కరిగింది. వెయ్యేళ్ళ విరహం గుండెల్లో పొదులు కదిలి కన్నులకు పాకింది. ఒక్కసారిగా ఇద్దరూ మన్మథార్తులయ్యారు. అనురాగం పరవళ్ళుతొక్కి గాఢంగా కలుసుకున్నారు.

ఆ పావన సంగమస్థలంలో బాలుడిని ప్రసవించింది అశ్వినీరూపిణి శ్రీమహాలక్ష్మి. ఇద్దరూ అశ్వరూపాలు పరిత్యజించారు. విష్ణుమూర్తి చిరునవ్వులు చిందిస్తూ ఇక పద వైకుంఠానికి పోదామన్నాడు. లక్ష్మీదేవి అంగీకరించలేదు. కన్నపేగును విడిచిపెట్టి ఎలా రాగలను అంది. పుత్రప్రేమను అంత తేలికగా తెంపుకోగలమా అంది. ఇంకా కన్నులైనా పూర్తిగా తెరవని ఈ శిశువు గతి ఏంకావాలి అంది. మనస్సుని రాయిచేసుకుని నేను రాలేను అంది.

నారాయణుడు మౌనంగా నిలబడ్డాడు. అంతలోకే ఇద్దరూ దివ్యదేహాలను పొందారు. దివ్య విమానం వచ్చి చెంగట నిలిచింది. అందులో నిలబడ్డ దేవతలు లక్ష్మీనారాయణులను స్తుతిస్తూ ఆహ్వానం పలికారు. శ్రీహరి ఆ విమానం అధిరోహించబోయాడు. లక్ష్మీదేవి సుస్మితంగా వారించింది.

నాథా ! ఈ బిడ్డను విడిచిపెట్టి రావడానికి మనసొప్పడంలేదు. ఇదేమి విడ్డూరమో కానీ ఇంతలోనే నాకు ప్రాణప్రియుడైపోయాడు. కాంతిలో అచ్చం నీలాగే ఉన్నాడు. వీడిని మనతోపాటు వైకుంఠానికి తీసుకుపోదాం - అని బతిమాలుతున్నట్టు పలికింది. అప్పటికి శ్రీహరిలో కదలిక వచ్చింది.



ప్రాణప్రియా ! దిగులు చెందకు. వీడిని ఇక్కడే ఉండనీ. అవసరమైన రక్షణలన్నీ నేను ఏర్పాటు చేశాను. కన్న కొడుకుని ఇక్కడ ఇలా విడిచిపెట్టడంలో ఒక పరమార్థం ఉంది. చెప్పమంటావా ? అయితే విను. ఈ భూలోకంలో యయాతి కొడుకు తుర్వసుడనే మహారాజు ఉన్నాడు. అతడినే హరివర్మ అని కూడా అంటారు. చాలా విఖ్యాతి గడించాడు. అతనికి సంతానం లేదు. ఇక్కడికి దగ్గరలోనే ఒక తీర్థంలో వందసంవత్సరాలనుంచీ తపస్సు చేస్తున్నాడు. అతడి కోసమని ఈ పుత్రుణ్ణి ఇలా సృష్టించాను. ఇప్పుడు వెళ్ళి హరివర్మను ప్రేరేపిస్తాను. అతడు వచ్చి ఈ బాలకుణ్ణి తీసుకువెడతాడు. సలక్షణంగా పెంచి పెద్ద చేస్తాడు. అందుచేత నువ్వు ఇక దిగులుపడక విమానం ఎక్కు అన్నాడు. లక్ష్మీదేవి సంతోషించింది. ఇద్దరూ విమానం అధిరోహించి వైకుంఠానికి తరలివెళ్ళిపోయారు. *(అధ్యాయం - 19, శ్లోకాలు -55)*

## ◆ హరివర్మకు ఏకవీరుడు దక్కడం ◆

వీరిద్దరూ అలా వెళ్ళగానే చంపాఖ్యుడనే ఒక విద్యాధరుడు తన ప్రియభార్య మదనాలసతో విమాన విహారం చేస్తూ అటువైపు వచ్చాడు. దివ్యకాంతులు విరజిమ్ముతూ అడవిలో ఒంటరిగా కేరింతలు కొడుతున్న బాలుణ్ణి చూసి విమానం దిగారు. చంపాఖ్యుడు ఒక పెన్నిధి దొరికినంత సంబరపడి బాలుణ్ణి ఎత్తుకుని గుండెలకు హత్తుకున్నాడు. మదనాలసకు అందించాడు. ఆమె - తనకే పుట్టిన బిడ్డ అన్నంతగా మురిసిపోయింది. తనువు పులకించింది. ముద్దుల్లో ముంచెత్తింది. మార్చి మార్చి ఎత్తుకున్నారు. ఒకరి చేతుల్లో నుంచి ఒకరు లాక్కొన్ని గుండెలకు పొదువుకుంటూ ఆనందపరవశులయ్యారు. ఒడిలో పెట్టుకుని విమానం అధిరోహించి ఇంద్రలోకానికి వెళ్ళారు. ఇతడు ఎవరి బిడ్డడో ? మానవుడా దానవుడా గంధర్వుడా ? తెలుసుకోవాలి. ఇంద్రుడిని అడిగితే సరి. అన్నీ తెలుస్తాయి. అతడి అనుమతి లేకుండా మనం ఏ పనీ చెయ్యకూడదు. కనుక్కుందాం అనుకుంటూ అమరావతి చేరుకున్నారు.

ఇంద్రుడికి బాలుణ్ణి చూపించి తమ సందేహాలు అడిగారు. అనుమతిస్తే పుత్రుడుగా పెంచుకుంటాం అన్నారు. ఇంద్రుడు ఒక చిరునవ్వు విసిరాడు.

చంపాఖ్యా ! ఈ బాలుడు వాజిరూపధారులైన లక్ష్మీనారాయణులకు జన్మించాడు. హరిహయుడు. ఒక అద్భుతకార్యాన్ని నిర్వర్తించడంకోసం ఇతడు ఆవిర్భవించాడు. యయాతి కొడుకుకి ఇతడిని అప్పగించాలని శ్రీహరి సంకల్పం. పరమధార్మికుడైన ఆ హరివర్మ (తుర్వసుడు) హరిప్రేరితుడై కాసేపట్లో ఆ కాళిందీ తమసా సంగమతీర్థానికి వస్తాడు. అందుచేత ఈలోగానే నువ్వు ఈ బాలుణ్ణి తీసుకువెళ్ళి అక్కడ వదిలిపెట్టు. ఆలస్యం చెయ్యకు. ఈ బాలుడు ఏకవీరనామంతో జగద్విఖ్యాతిని ఆర్జిస్తాడు.

ఇంద్రుడి మాటలు వింటూనే ఆ గంధర్వుడు మళ్ళీ విమానం ఎక్కి, ఆ బాలుణ్ణి దొరికినచోటనే విడిచిపెట్టి గంధర్వలోకానికి వెళ్ళిపోయాడు.



అప్పుడు లక్ష్మీసహితుడై శ్రీమన్నారాయణుడు దివ్యవిమానం అధిరోహించి వచ్చి హరివర్మకు దర్శనం అనుగ్రహించాడు. ఆ మహారాజు భక్తిప్రపత్తులతో సాష్టాంగపడ్డాడు. బహువిధాలుగా స్తుతించాడు.

**దేవాధిదేవాఖిలలోకనాథ ! కృపానిధే ! లోకగురో ! రమేశ ।**
**మందస్య మే తే కిల దర్శనం యత్సుదుర్లభం యోగిజనైరలభ్యమ్ ॥ (20 - 30)**

హే లక్ష్మీ వల్లభ ! యోగీశ్వరులకు సయితం అలభ్యమైన నీ దివ్యదర్శనం ఈ మందుడికి అనుగ్రహించావా తండ్రీ ! ఆహా! ఎంతటి కృపానిధివి. విషయవాంఛలను పరిత్యజించి తపస్సు చేసుకునేవారికి నీ దర్శనం లభిస్తుంది అంటారు. నేను వాంఛాపరుణ్ణై నిన్ను ధ్యానించాను. నాకూ దర్శనం అనుగ్రహించావు. ఎంత అదృష్టం - అంటూ ఆశ్చర్యపడ్డాడు. శ్రీ మహావిష్ణువు చిరునవ్వులు చిందిస్తూ - రాజా ! నీ భక్తికి మెచ్చాను. ఇలా వచ్చాను. వరం కోరుకో. ఇస్తాను అన్నాడు.

జగన్నాథా ! కొడుకు కలగాలనికదా నా తపస్సు. ఆ కోరికతీర్చు - అని హరివర్మ అభ్యర్థించాడు. అందుకు శ్రీహరి సమ్మతించాడు. కాళిందీ తమసా సంగమప్రదేశానికి వెళ్ళు. అక్కడ నీకోసం ఒక పుత్రుణ్ణి ఉంచాను. వాడు నాకూ లక్ష్మీదేవికీ సంభవించాడు. స్వీకరించు - అని ఆనతిచ్చి ముకుందుడు అదృశ్యమయ్యాడు.

హరివర్మ పరుగులాంటి నడకతో ఆ ప్రదేశం చేరుకున్నాడు. ఆనందంగా నోట్లో వేలువేసుకుని కేరింతలుకొడుతున్న పసిబాలుణ్ణి చూశాడు. కన్నుల నుంచి ఆనందబాష్పాలు జాలువారాయి. బిడ్డను ప్రేమగా ఎత్తుకొని గుండెలకు హత్తుకున్నాడు. శిరసు మూర్కొన్నాడు. నాయనా ! నువ్వు శ్రీహరి ఇచ్చిన వరప్రసాదానివి. నా నూరేళ్ళ తపస్సుకి ఫలానివి. నా కోసం లక్ష్మీదేవి నిన్ను ఇక్కడ విడిచిపెట్టి వెళ్ళింది. ఆ తల్లికి నా మీద ఎంతటి దయ ! లేకపోతే నీలాంటి బిడ్డను వదలి వెళ్ళగలదా ! నా సంసార సముద్రానికి ఇక నుంచి నువ్వే నౌకవు - ఇలా పారవశ్యంతో ఏదేదో పలికేస్తూ అలాగే పొదివిపట్టుకుని తన ఇంటికి చేరుకున్నాడు. మంత్రులూ పురోహితులూ మిత్రులూ బంధువులూ ఎదురువచ్చి బహుమతులు అందించి హరివర్మకు స్వాగతం పలికారు. వందిమాగధులూ గాయన గాయనీమణులూ స్వాగతగీతాలు ఆలపించారు. దారి అంతటా శుభసూచకంగా పేలాలు చల్లారు. అందరితోనూ కలసి మహారాజు తన ప్రాసాదంలోకి ప్రవేశించాడు. మహారాణికి ఆ పసిగుడ్డును అప్పగించాడు. ఆమె ఆనందానికి అవధులులేవు. ఈ మన్మథాకారుడైన బిడ్డ ఎవరు ? ఎక్కడ ఎలా లభించాడు ? మొదలైన సందేహాలతో కుతూహలంగా అడిగింది. హరివర్మ విషయమంతా చెప్పాడు. మహారాజ్ఞి సంతోషించింది. సామ్రాజ్యమంతటా మహోత్సవం జరిపించారు. కుమారుడికి ఏకవీరుడు అని నామకరణం చేశారు. బాలుడు రూపగుణాలలో అచ్చం శ్రీహరిలాగా ఉన్నాడు. వంశ ఋణం తీరిందికదా అని హరివర్మ సంతృప్తి చెందాడు. హాయిగా సుఖసంతోషాలతో కాలం గడుపుతున్నాడు. (అధ్యాయం - 20, శ్లోకాలు - 54)



బాలుడు దినదినాభివృద్ధి చెందుతున్నాడు. జాతకర్మాది సంస్కారాలన్నీ అయ్యాయి. ఆరవ నెలలో అన్నప్రాశన, మూడవయేట చూడాకరణం, పదకొండవయేట ఉపనయనం మహావైభవంగా జరిపించాడు మహారాజు. ధనుర్వేదమూ రాజనీతీ నేర్పించాడు. అటుపైని పుష్యార్కయోగ సమన్వితమైన శుభముహూర్తాన పట్టాభిషేకం జరిపించాడు. వేదవేదాంగపారంగతులైన పండితులను గో భూ సువర్ణదానాలతో సంతుష్టులను చేసి ఏకవీరుడికి అమోఘాశీస్సులను ఇప్పించాడు. ఉత్తములను సచివులుగా వరించి ఏర్పరిచాడు. భార్యాసమేతుడై వానప్రస్థానికి వెళ్ళిపోయాడు. మైనాకపర్వత శిఖరంమీద కందమూల ఫలాలను భుజిస్తూ ఇంద్రియ నిగ్రహంతో జగన్మాతను ఉపాసించి ఆ దంపతులు కొంతకాలానికి స్వర్గస్థులయ్యారు. దుర్వార్త తెలుసుకున్న ఏకవీరుడు యథావిధిగా ఉత్తరక్రియలు జరిపించాడు. ధర్మబద్ధంగా రాజ్యపరిపాలన సాగించాడు.

## ◆ ఏకావళీ వృత్తాంతం ◆

ఒకరోజున ఏకవీరుడు మంత్రిపుత్రులతో కలిసి హయారూఢుడై జాహ్నవీతీరంలో వినోదవిహారానికి వెళ్ళాడు. తరులతాపుష్పనివహ సౌందర్యాలనూ, కోకిలాది పక్షి కూజితాలనూ, ప్రవాహగాంభీర్యాలనూ, ఆస్వాదిస్తూ సంచరిస్తున్నాడు. వేదధ్వనులు మారుమోగుతున్న ముని ఆశ్రమాలనూ, హోమధూమం ఎగజిమ్ముతున్న అగ్నిహోత్రశాలలనూ తిలకించాడు. వికసించిన పద్మాలతో తుమ్మెదల ఝుంకారాలతో మనోహరంగా ఉన్న సరోవరాలను వీక్షించాడు. అలా వెడుతూ వెడుతూ ఉండగా, గంగ ఒడ్డున నిండుగా వికసించిన నూరురేకుల పద్మం కనిపించింది. దాని సౌందర్యానికీ సౌగంధ్యానికీ ముగ్ధుడై అటు తేరిపారజూచేసరికి దాని కుడిపక్కన ఒక కన్యకామణి కనిపించింది.

ఆమె కన్నులు పద్మాల్లా ఉన్నాయి. శరీరం కనకశలాకలాగా ఉంది. దీర్ఘమైన కేశపాశం. శంఖం లాంటి కంఠం. ఉందా లేదా అనిపించే నడుము. దొండపండులాంటి పెదవి. వచ్చీరానీ కుచములు. సంపెంగ మొగ్గలాంటి ముక్కు. అణువణువునా ప్రతి అవయవంలోనూ రాసిబోసిన సౌందర్యం. ఒంటరిగా ఉంది. సఖీజనం ఎవ్వరూ లేరు. ఆ కారణంగానే కాబోలు దుఃఖిస్తోంది. ఏకవీరుడు గమనించాడు. దగ్గరకు వెళ్ళాడు.

హే సునసే ! (అందమైన ముక్కు కలదానా !) ఎవరివి నువ్వు ? హే శుభాననే ! (అందమైన ముఖం కలదానా ! ) ఎవరి అమ్మాయివి ? హే సుందరి ! గంధర్వ వనితవా ? దేవకన్యవా ? ఎందుకు విలపిస్తున్నావ్? ఏకాంతం ఏమిటి ? నీకు వివాహం అయ్యుంటే నీ భర్త ఎక్కడ ? కాకుంటే నీ తండ్రి ఏడి? నువ్వు దుఃఖించడమేమిటి ! హే అరాళభ్రు ! (వంకదీరిన కనుబొమలున్నదానా ! ) కారణమేమిటో నాకు చెప్పు. చెయ్యగలిగిన ఉపకారం చేస్తాను. నా రాజ్యంలో నీకు ఎవ్వడూ ఏ బాధనూ కలిగించడు.



చోరభయం రాక్షసభయం లేనేలేవు. ధర్మబద్ధంగా పాలిస్తున్నాను కనక ప్రకృతి వైపరీత్యాలు లేవు. క్రూరమృగాల వల్ల అసలే భయంలేదు. మరి నువ్వు విలపిస్తున్నావంటే కారణమేమిటో తెలియక బాధపడుతున్నాను. ఇంత ఏకాకినివి ఎలా అయ్యావు ? ఓ విశాలనయనా ! సంశయించకు. నిజం చెప్పు. నీ అభీష్టం నెరవేరుస్తాను - అన్నాడు. అందుకు ఆ సుందరి మృదుమధురంగా బదులు పలికింది.

మహారాజా ! ఇంతగా అడుగుతున్నావు కనక చెబుతున్నాను, విను. ఏ ఆపదాలేకండా ఎవరైనా దుఃఖిస్తారా ? ఇక్కడికి చేరువలో మరొక రాజ్యం ఉంది. దానికి పరిపాలకుడు రైభ్యుడు. అతడి భార్య రుక్మరేఖ. మహాసౌందర్యవతి. అయితేనేమి ఆ జంటకు సంతానం లేదు. ఆ దిగులును భరించలేక ఒకనాడు తన భర్తతో ఇలా అంది - నాథా ! నా జీవితం వ్యర్థం. సంతాన సౌఖ్యం లేకపోయాక నేను బతికి ఏమి లాభం ? వంధ్యాజీవితమూ ఒక జీవితమేనా ! ఏదైనా యజ్ఞం చెయ్యరాదూ ! ఆ ఒక్క ఆశా మిగిలింది నాకు. ఫలిస్తుందేమో !

రైభ్యుడు వెంటనే యజ్ఞం ప్రారంభించాడు. వేదపండితుల పవిత్రమంత్రోచ్చారణలతో హోమం జరుగుతోంది. ఆ అగ్నికుండం నుంచి సర్వశుభలక్షణ సంపన్న ఆవిర్భవించింది. బింబఫలంవంటి పెదవి. దానిమ్మగింజలవంటి పలువరుస. తీర్చి దిద్దినట్టున్న కనుబొమలు. పూర్ణచంద్రనిభావనం. కనకశలాక వంటి శరీరం. పొడవైన నల్లని జడ. ఎర్రని అరచేతులు. ఎర్రని కన్గవ. ఎర్రని పాదాలు. ఇలా ఆవిర్భవించిన ఆ తన్వంగిని హోత స్వీకరించి -

మహారాజా ! నీ యజ్ఞం ఫలించింది. ఇదిగో పుత్రిక జన్మించింది. రాజపుత్రి. స్వీకరించు. ఏకావళిలాగా సన్నగా ఉంది కనక అదే ఈ అమ్మాయి పేరు. ఈమెనే పుత్రుడిగా భావించి సంతోషించు. ఈవిడ విష్ణుప్రసాదం. గ్రహించు అని అప్పగించాడు. రైభ్యుడు ఆదరంతో స్వీకరించి రుక్మరేఖకు అందించాడు. అందిస్తూ "ఇడిగో పుత్రుడు స్వీకరించు" అన్నాడు. అందుకని ఆమె పుత్రుడుగానే భావించి జాతకర్మాది క్రియాకలాపాలన్నీ జరిపించింది. రైభ్యుడు యజ్ఞం ముగించి దానధర్మాలతో విప్రులను సంతృప్తిపరచి పంపించాడు.

ఏకావళి ఎదుగుతోంది. కొడుకులా పెరుగుతోంది. ఆమెతో నాకు మైత్రి కుదిర్చారు. నా పేరు యశోవతి. నా తండ్రి రైభ్యమహారాజు దగ్గర ఒక మంత్రి. ఏకావళీ నేనూ సవయస్కలం. అంచేత మాకు బాగా స్నేహం కలిసింది. రేయింబవళ్ళు మేమిద్దరం కలిసే ఉంటాం. కలిసే ఉద్యానవనకేళీసరోవర విహారాలన్నీ చేస్తాం. మా ఏకావళికి పద్మాలంటే చాలా ఇష్టం. వాటి సుగంధమూ సౌందర్యమూ తారసపడితే చాలు మైమరిచిపోతుంది. వాటికోసం ఎంత దూరమైనా అన్వేషిస్తూ వెడుతుంది. గంగను దాటడంతో సహా దేనికీ భయపడదు. ఆవిడకు ఇదొక వ్యసనమైపోయింది. ఎప్పుడు ఏ ప్రమాదం



జరుగుతుందో అని భయపడి నేను ఎన్నోసార్లు వారించాను. ప్రయోజనం లేకపోయింది. రౌమ్యమహారాజుకు తెలియజేశాను. ఆయన వెంటనే అంతఃపురానికి చేరువలో పెద్దసరోవరం తవ్వించి దేశవిదేశాల నుంచి రకరకాల పద్మాలు తెప్పించి అందులో వికసింపజేశాడు. అయినా ప్రయోజనం కనపడలేదు. అప్పుడింక మహారాజుగారు రక్షకభటులను ఏర్పాటు చేశారు. సఖీజనంతో కలిసి ఏకావళి బయలుదేరితే, వెనువెంట ఆయుధపాణులై రక్షకభటులు నడుస్తూంటారు. అలా రోజూ ఈ జాహ్నవీతీరానికి మేమూ మా రాకుమారీ వస్తూ ఉంటాము. వెడుతూ ఉంటాము. *(అధ్యాయం - 21, శ్లోకాలు - 62)*

రాకుమారా ! ఈరోజు ఉదయమే లేచి ఏకావళి మా అందరితోనూ కలిసి ఇక్కడికి వచ్చింది. మేము చామరాలు వీస్తూ వెంటవచ్చాము. సాయుధులైన రక్షకభటులు వచ్చారు. అందరూ అల్లంత దూరాన నిలబడితే, నేనూ ఏకావళీ కలిసి ఆడుతూ పాడుతూ ఇదిగో ఈ పద్మం దగ్గరికి వచ్చాము. ఇంతలోకీ - ఎక్కడి నుంచి వచ్చాడో తెలీదుగానీ ఒక మహారాక్షసుడు వచ్చాడు. వాడిపేరు కాలకేతుడట. వాడి వెంట చాలామంది దానవులు ఉన్నారు. భీకరాయుధాలతో వచ్చిపడ్డారు. పద్మాలతో క్రీడిస్తున్న ఏకావళిని చూశాడు. వెంటనే నేను మా ఏకావళిని హెచ్చరించాను. రూపయౌవనాలలో రెండవ రతిదేవిలాగా ఉన్నావు, ఈ దానవుడెవడో క్రూరంగా చూస్తున్నాడు, వీడి కళ్ళల్లో కామం బుసలుకొడుతోంది, ఇక్కడ ఉండటం మనకు క్షేమంకాదు, పద త్వరగా మన రక్షకభటులను చేరుకుందాం అన్నాను. ఇద్దరం పరుగుతీశాం. ఆ కాలకేతుడు గదను చేతపట్టుకుని మమ్మల్ని వెంబడించాడు. రక్షక భటుల నందరినీ తరిమికొట్టాడు. మదనపీడితుడై ఏకావళి చెయ్యిపట్టుకున్నాడు. భయంతో వణికిపోతూ ఏకావళి దీనంగా రోదించింది. కాపాడండి కాపాడండి అంటూ అరిచింది. అయినా వాడు పట్టువదలలేదు. లాక్కొని తీసుకుపోతున్నాడు. నేను వెంటపడ్డాను. మా రాకుమారిని విడిచిపెట్టు, కావాలంటే నన్ను తీసుకుపో అని ప్రార్థించాను. వాడు వినిపించుకోలేదు.

చెల్లాచెదురైన రక్షకభటులు మళ్ళీ గుమికూడి వచ్చి వాడిని ఎదిరించారు. భీకరసంగ్రామం జరిగింది. రాక్షసుల చేతుల్లో రక్షకభటులందరూ నిహతులు అయ్యారు. కాలకేతుడు ఏకావళిని తీసుకుని వెళ్ళిపోతున్నాడు. ఎక్కడికి తీసుకుపోతున్నాడో తెలియదు. అయినా నేను వెంటబడ్డాను. నన్ను చూసి ఏకావళి కొంత ధైర్యం తెచ్చుకుంది. అది గమనించి నేను త్వరత్వరగా నాలుగడుగులు వేసి ఏకావళిని కలుసుకున్నాను. నన్ను కౌగిలించుకుని బోరున విలపించింది. అది చూసి కాలకేతుడు మృదువుగా నాతో ఇల్లా అన్నాడు-

కల్యాణీ ! మీ రాకుమారిని ఊరడించు. భయపడవద్దని చెప్పు. అదిగో రథం. దాన్ని అధిరోహించి మా నగరానికి వెడదాం. ఈమె సౌందర్యానికి నేను ముగ్ధుణ్ణి అయ్యాను. ఈ క్షణం నుంచీ నేను ఈ చంచలలోచనకు దాసానుదాసుణ్ణి. దేవలోక సమానమైన మా లోకంలో అమరసుఖాలు అనుభవిస్తుంది. ధైర్యం చెప్పి ఓదార్చు.



అంటూ రథం చేరుకున్నాడు. నన్నూ ఏకావళినీ అందులో కూర్చోబెట్టాడు. తాను అధిరోహించాక మిగతా రాక్షసులూ సర్దుకున్నారు. కాలకేతుడి ముఖం వికసించింది. రథం బయలుదేరింది. వాయువేగ మనోవేగాలతో వాడి నగరం చేరుకుంది. నన్నూ ఏకావళినీ ఒక తెల్లని సౌధంలో ఉంచి రాక్షసులను కాపలాపెట్టాడు.

మరుసటిరోజు ఉదయమే నా దగ్గరికి వచ్చాడు. ఏకావళిని వివాహానికి ఒప్పించమని రహస్యంగా అభ్యర్థించాడు. నేను తిరస్కరించాను. నువ్వే బతిమాలుకొమ్మని చెప్పాను. ఏకావళిని సమీపించాడు. వినయంగా మృదుమధురంగా సంభాషించాడు.

సుందరీ ! నువ్వేదో మంత్రం వేశావు. నా హృదయాన్ని దోచుకున్నావు. నీ సౌందర్యం అపూర్వం ఎప్పుడూ ఎక్కడా విన్నదికాదు, కన్నదికాదు. మన్మథుడు మరీ దయాదూరుడై నన్ను హింసిస్తున్నాడు తాళలేకపోతున్నాను. ఈ దాసుణ్ణి అనుగ్రహించు. నిన్ను వివాహం చేసుకుంటాను. మహారాజ్ఞిని చేస్తాను అమరసుఖాలు అందిస్తాను. అంగీకరించు. హే రంభోరు ! యౌవనం బహుచంచలం. త్వరత్వరగా గడిచిపోతుంది. తిరిగిపొందడం దుర్లభం. అందుచేత పతిగా నన్ను అంగీకరించి ఒక్కసారి కౌగిలించుకో యౌవనాన్ని సఫలం చేసుకో.

> యౌవనం యాతి రంభోరు చంచలం దుర్లభం తథా ।
> సఫలం కురు కల్యాణి ! పతిం మాం పరిరభ్య చ ॥ (22 - 30)

దీనంగా బతిమాలుకొంటున్న కాలకేతువుని చురచురా చూసింది ఏకావళి. చెండనాడితే వీడు ఎంతకైనా తెగిస్తాడని భావించింది. మృదువుగానే బదులుపలికింది.

కాలకేతూ ! నేను తండ్రి చాటు బిడ్డను. అస్వతంత్రురాలిని. నన్ను మా తండ్రి ఒక రాజకుమారుడికి ఇచ్చి వివాహం చెయ్యడానికి సంకల్పించాడు. హైహయవంశలో పుట్టిన రాకుమారుడు అతడు. అతడి గుణగణాలనూ శౌర్యపరాక్రమాలనూ రూపయౌవనాలనూ నేను విన్నాను. మనస్సు అర్పించాను. కనక మరొకరిని వరించడం సాధ్యంకాదు. అది ధర్మవిరుద్ధంకూడా. తండ్రి ఎవరికిచ్చి చెయ్యాలనుకుంటున్నాడో అతడినే పతిగా వరించడం కన్యా ధర్మం. నీకు తెలియనిదా ?

> యస్మై దద్యాత్పితా కామం కన్యా తం పతిమాప్నుయాత్ ।
> పరతంత్రా సదా కన్యా న స్వాతంత్ర్యం కదాచన ॥ (22 - 33)

ఈ మాటలు కాలకేతువుకి రుచించలేదు. అన్యమనస్కతో నాకేమి పని అని విడిచిపెట్టలేదు. పాతాళగృహంలోకి తీసుకుపోయి బంధించాడు. దానిచుట్టూ లోతైన పరిఖ ఉంది. రాక్షసులు కోటిమంది



కాపలా ఉన్నారు. ఆ పాతాళగృహంలో ఏకాకినిగా మా రాకుమారి రోదిస్తోంది. రక్షకుడి కోసం ఎదురుచూస్తోంది. ఆమె రాకకోసం ఎదురుచూస్తూ నేను ఇక్కడ ఉన్నాను - అని కథ ముగించింది యశోవతి.

ఏకవీరుడికి ఆశ్చర్యం కలిగింది. నువ్వుమాత్రం ఎలా తప్పించుకుని రాగలిగావు ? చాలా వింతగా ఉందే. అదీకాక హైహయుడికి ఏకావళిని ఇవ్వాలని మీ రాజుగారు సంకల్పించారన్నావు. ఈ భూలోకంలో హైహయుడనే రాజును నేనొక్కడినే. నాకే ఇవ్వాలని మీ రాజుగారి సంకల్పమా ? ఈ సందేహాలు తీర్చు. ఇదే నిజమైతే నేను వెళ్ళి ఆ కాలకేతువును సంహరించి మీ రాకుమారిని విడిపించి తెస్తాను. ఆ చోటు నీకు తెలుసుకనక చూపిద్దువుగాని. ఇంతకీ ఈ జరిగిన ఉదంతం మీ రాజుగారికి తెలియపరిచావా ? తన కూతురిని ఎవడో రాక్షసుడు అపహరించుకుపోయాడని వారికి తెలుసా ? తెలిస్తే విడిపించే ప్రయత్నం చెయ్యకుండా కూర్చున్నాడా ? అంతటి అసమర్థుడా మీ రాజు ?

ఏకావళిని గురించి నువ్వు చెబుతోంటే నా మనస్సు పరవశిస్తోంది. ఆమె గుణాలూ అతిమానుష సౌందర్యమూ ఆకర్షిస్తున్నాయి. నన్ను మన్మథుడు లోబరుచుకుంటున్నాడు. ఎప్పుడెప్పుడు చూద్దామా అని కోరికలు ఉరకలు వేస్తున్నాయి. తక్షణం వెళ్ళి రాకుమారి చెరవిడిపిస్తాను. ఆ దారి నీకు తెలుసుకదా చెప్పు. ఎలా రాగలిగావో చెబితే అదే దారిన నేను వెళ్ళి ఏకావళిని విడిపించి తెస్తాను - అన్నాడు హైహయుడు.

హైహయుడైన ఏకవీరుడి మాటలకు సంతోషించింది యశోవతి. అతడి సందేహాలకు సమాధానం చెప్పింది.

రాకుమారా! మా ఏకావళి మనసుపడ్డ హైహయుడివి నువ్వే కావడం ఎంత అదృష్టం. ఇక మా రాకుమారి మాకు దొరికినట్టే. నేనెలా తప్పించుకు రాగలిగానో చెబుతాను. విను. నిజమే. అది చాలా ఆశ్చర్యకరమైన విషయం. నేను చిన్నప్పటినుంచీ ఒక మహా మంత్రాన్ని జపిస్తున్నాను. నా బాల్యంలో ఒక బ్రాహ్మణ సిద్ధుడు బీజాక్షరపూర్వకంగా ఆ మంత్రాన్ని ఉపదేశించాడు. ఆ మంత్రజపంతో చండవిక్రమురాలైన చండికను ఉపాసించాను. ఆమె అనుగ్రహం ఉంటే ఎవరికైనా ఎలాంటి బంధనాలైనా తెగిపోతాయి. భక్తులపట్ల ఆ తల్లికి అపారమైన దయ. సర్వసాధన సమర్థురాలు. ఈ విశ్వాన్ని సృష్టిస్తోంది, పోషిస్తోంది, కల్పాంతంలో ఉపసంహరిస్తోంది. రక్తాంబరధర, రక్తనయన అయిన ఆ జగన్మాతను హృదయంలో రూపుకట్టించుకుని నిరంతరదీక్షతో ఒక నెలపాటు ఆ మహామంత్రాన్ని జపించాను. స్వప్నంలో జగదంబిక సాక్షాత్కరించింది. నన్ను హెచ్చరించింది.

పిచ్చిదానా! ఇంకా ఇక్కడే కూర్చున్నావా? వెళ్ళు, వెంటనే బయలుదేరి గంగాతీరం చేరుకో. అక్కడికి హైహయాన్వయుడు ఏకవీరుడు వస్తాడు. అతడు మహాపరాక్రమశాలి. సర్వశత్రు విమర్దనుడు.



దత్తాత్రేయుడు అతనికి నా మహామంత్రాన్ని ఉపదేశిస్తాడు. అతడు సతతమూ నన్నే ఉపాసిస్తుంటాడు. సకలభూతప్రపంచంలోనూ నన్నే దర్శిస్తుంటాడు. అతడు నీ దుఃఖాన్ని తొలగిస్తాడు. కాలకేతురాక్షసుణ్ణి సంహరించి నీ రాకుమారి ఏకావళిని రక్షిస్తాడు. చెరవిడిపిస్తాడు. అటుపైని ఆమెను అతడికే ఇచ్చి వివాహం జరిపించాలి సుమా! ఆ బాధ్యత నువ్వే వహించాలి. గుర్తుంచుకో.

అని జగన్మాత నన్ను హెచ్చరించి అదృశ్యమయ్యింది. వెంటనే ఈ స్వప్న వృత్తాంతాన్ని మా రాకుమారికి తెలియజేశాను. ఏకావళి ఎంతగానో సంతోషించింది. మహాదేవి అసత్యం చెప్పదుకదా! వాక్కు త్వరలోనే బంధమోక్షం లభిస్తుందన్నమాట. నువ్వు వెంటనే బయలుదేరి గంగాతీరం చేరుకో - అని ప్రోత్సహించింది. నేను బయలుదేరాను. నిజానికి నాకు ఏ దారీ తెలీదు. అన్నీ ఆ పరాశక్తియే చూపించింది. శీఘ్రగతినికూడా ప్రసాదించింది. కళ్ళు మూసి తెరిచేలోగా ఇక్కడ ఉన్నాను. రాజపుత్రా! నా ఏకాంతానికీ నా దుఃఖానికీ ఇదీ కారణం - అని చెప్పి విరమించింది యశోవతి. *(అధ్యాయం - 22, శ్లోకాలు - 69)*

యశోవతి మాటలకు ఏకవీరుడి ముఖపద్మం విప్పారింది. ఒక వైపు ఆనందం మరొక వైపు ఆశ్చర్యం. కర్తవ్యం ఎదురుచూస్తోంది. మెల్లగా పలికాడు -

యశోవతీ! నేను లక్ష్మీనారాయణుల ప్రియపుత్రుణ్ణి. హైహయవంశజుణ్ణి. ఏకవీరుడంటారు నన్ను. ఇప్పుడు నేను ఏమి చెయ్యాలి, ఎక్కడికి వెళ్ళాలి? ఏమీ పాలు పోకండా ఉంది. మొదటగా మీ రాకుమారి రూప సౌందర్యాలను వర్ణించావు. దానితో నా మనస్సు విరహాకులమయ్యింది. అటుపైని ఆమె గుణాలను చెప్పావు. వాటితో నా హృదయం ఆకృష్టమయ్యింది. నన్ను వరించానని ఏకావళి దానవుడికి చెప్పిందన్నావు. అతడిని తప్ప నేనింకెవరినీ పరిణయమాడను అనికూడా ప్రకటించిందన్నావు. దీనితో నేనింక మీ ఏకావళికి భృత్యుడిని అయిపోయాను. ఆమెను విడిపించి తెచ్చుకోవడం నా విధి. అయితే అది ఎలాగో ఏమిటో తెలియడంలేదు. ఆ రాక్షసుడి నివాసం ఎక్కడ? అక్కడికి వెళ్ళే దారిఏమిటి? ఏ వాహనంమీద వెళ్ళగలం? ఇవన్నీ నా సందేహాలు. కానీ, స్నేహితురాలా! నువ్వే సమర్థురాలివి. అక్కడికి నన్ను చేర్చు. చాలు. మిగతా పని నేను చూసుకుంటాను. కాలకేతువుని చంపి, మీ రాకుమారిని విడిపించి, దుఃఖం తొలగించి మీ రాజధానికి చేరుస్తాను. నువ్వు సహకరిస్తే ఇదంతా సంపూర్ణంగా నెరవేరుతుంది. ఆ రాక్షసపురం చూపించు చాలు. నా పరాక్రమం చూద్దువుగాని - అన్నాడు.

రాకుమారా! నువ్వు అక్కడికి చేరుకోవాలంటే ఒక్కటే ఉపాయం. దేవీమంత్రాన్ని స్వీకరించు. అది సకలసిద్ధిప్రదం. ఆ రాక్షసపురం నేను చూపిస్తాను. ప్రయాణానికి సిద్ధంగా ఉండు. మహాసైన్యంతో బయలుదేరాలి. ఆ కాలకేతువు సామాన్యుడుకాదు. మహావీరుడు. రాక్షససేనా పరివృతుడు. భీకరయుద్ధం చెయ్యవలసి ఉంటుంది. అందుకని మహామంత్ర స్వీకారం అత్యవసరం. కాలకేతువును సంహరించి మా రాకుమారిని విడిపించు.



## ◆ ఏకవీర కాలకేతుల యుద్ధం ◆

యశోవతి ఈ మాటలు చెబుతుండగానే ఏకవీరుడికి, మహాజ్ఞానియైన దత్తాత్రేయుడినుంచి యోగేశ్వరీ మహామంత్రం అందింది. దానితో సర్వజ్ఞత్వమూ సర్వాంతశ్చారిత్వమూ లభించాయి. వెంటనే యశోవతితో బయలుదేరి రాక్షసపురం చేరుకున్నాడు. అల్లంత దూరాన వీరిని చూసిన రాక్షసులు భయపడి పరుగుపరుగున కాలకేతుడిని చేరుకున్నారు. ఆ సమయంలో వాడు పాతాళగృహాన ఏకావళిముందు సాష్టాంగపడి ఆమె అనుగ్రహంకోసం పరితపిస్తూ దీనాతిదీనంగా ప్రార్థనలు చేస్తున్నాడు.

కాలకేతుమహారాజా! ఈ కామినీమణితోపాటు ఇక్కడికి వచ్చిన చెలికత్తె యశోవతి ఒక రాజపుత్రుణ్ణి మహాసైన్యంతో వెంటబెట్టుకుని వస్తోంది. ఆ రాకుమారుడు జయంతుడో కార్తికేయుడో అన్నట్టున్నాడు. ఘోరసంగ్రామం తప్పదేమో! త్వరగా సన్నద్ధుడివికా. లేదా ఈ కామినిని విడిచిపెట్టెయ్యి. వాళ్ళు సమీపించేలోగా దుందుభులు మ్రోగించు - అంటూ రాక్షసదూతలు విన్నవించారు.

కాలకేతుడు క్రోధతామ్రాక్షుడయ్యాడు. సేనాపతులను పిలిచి మహాసైన్యంతో తరలివెళ్ళండి అన్నాడు. ఆ రాజుపుత్రుణ్ణీ అతడి సైన్యాన్నీ ఎదిరించండి అన్నాడు. అని, మళ్ళీ ఇటువైపు తిరిగి ప్రణయభావంతో ఏకావళిని అభ్యర్థించాడు.

తన్వంగీ! వస్తున్నది ఎవరు? నీ తండ్రిగారా? మరింకెవరైనానా? నీకోసం సైన్యసమేతంగా వస్తున్నాడంటే ఎవరో కావలసినవాడే అయ్యుంటాడు. ఎవరో ఏమిటో నిజం చెప్పు. నీ తండ్రి అయినట్టయితే సంగ్రామం చెయ్యను. సంహరించను. సాదరంగా ఆహ్వానించి రత్నాంబరాలను బహూకరించి పూజిస్తాను. గొప్ప ఆతిథ్యంతో గౌరవిస్తాను. ఇంకెవడైనా అయితే నిశితబాణ పరంపరతో స్వయంగా సంహరిస్తాను. కాలంమూడి ఇటు వచ్చాడన్నమాటే. త్వరగా చెప్పు - వస్తున్న ఈ బుద్ధిహీనుడు ఎవరో?

మహాభాగా! నిజంగా ఈ వస్తున్నది ఎవరో నాకు తెలీదు. నేనిక్కడ బంధింపబడి ఉన్నానని నేనెవరికీ ఏవిధంగానూ తెలియపరచలేదు. ఇతడు నా తండ్రికాదు. నా సోదరుడు కాదు. ఎవరో పరాయివాడు. నేనెరగను. ఎందుకు వస్తున్నాడోకూడా తెలీదు.

శుభాననా! మరి మా దూతలు ఇలా చెబుతున్నారేమిటి? నీ చెలికత్తె యశోవతి వాళ్ళను వెంటబెట్టుకుని తెస్తోందిట. ఇంతకీ యశోవతి ఏమయ్యింది? ఎక్కడికి వెళ్ళింది? ఎప్పుడు వెళ్ళింది? ఎలా వెళ్ళింది? నీకో నీ యశోవతికో సంబంధించినవాడు కాకపోతే ఆమెతో ఇలా ఎందుకువస్తాడు? నన్ను ఎదిరించగల శత్రువులెవరూ నాకు లేరే!



వీరి సంభాషణ ఇలా సాగుతుండగానే మరికొందరు రాక్షసదూతలు పరుగున వచ్చారు. మహారాజా! ఇంకా ఇక్కడే ఉన్నావా? కులాసాగా కబుర్లు ఆడుతున్నావా? మహాసైన్యం చుట్టుముట్టింది. లే. త్వరగా బయలుదేరు - అన్నారు. కాలకేతుడు వెంటనే బయలుదేరి రథం ఆరోహించి సింహద్వారం చేరుకున్నాడు. అప్పటికి హయారూఢుడైన ఏకవీరుడూ అక్కడికి చేరాడు.

ఇద్దరికీ భీషణసంగ్రామం జరిగింది. శస్త్రాస్త్రఘర్షణలతో రాలిపడుతున్న నిప్పుకణాలు మెరుపుల్లా మిరుమిట్లు గొలుపుతున్నాయి. సమస్కంధులై పోరాడుతున్నారు. ఎంతకీ యుద్ధం తెమలడంలేదు. ఏకావళీ దర్శనోత్సుకుడైన ఏకవీరుడు ఆలస్యాన్ని భరించలేకపోయాడు. ఒక మహాగదను చేబూని రాక్షసుడి శిరస్సుపై బాదేడు. వాడు క్షణంలో ప్రాణాలు వదిలి నేలపై కుప్పకూలేడు. వజ్రాయుధం దెబ్బకు పర్వతం పడ్డట్టు పడ్డాడు. రాక్షససైన్యం కకావికలై పారిపోయింది.

## ◆ ఏకావళీ ఏకవీరుల పరిణయం ◆

యశోవతి పరుగుపరుగున పాతాళగృహానికి వెళ్ళి ఏకావళిని కౌగిలించుకుంది. ఆశ్చర్యపోతున్న రాకుమారికి విషయమంతా మధురంగా తెలియపరిచింది. అలిసిపోయిన ఏకవీరుడు స్కంధావారంలో విశ్రాంతి తీసుకుంటున్నాడు. నీ దర్శనంకోసం ఎదురు చూస్తున్నాడు. ఓ కుటిలాపాంగీ! మన్మథుడి లాంటి ఆ రాజకుమారుణ్ణి చూద్దువుగాని - రా. నీ గురించి అతడికి అంతా చెప్పాను. నీ రూపయౌవన గుణశీలాలను విని అనురక్తుడయ్యాడు. వెంటనే బయలుదేరి వచ్చి రాక్షసుణ్ణి సంహరించాడు. విరహాతురుడై నీకోసం ప్రతీక్షిస్తున్నాడు - రా వెడదామని చెయ్యి పట్టుకుంది.

ఏకావళికి సిగ్గు ముంచుకువచ్చింది. భయంవేసింది. ఎలా కంటబడటం? ఈ మలిన వస్త్రాలతోనా? పైగా కామార్తుడై ఉన్నాడంటోంది - అని తనలోతాను మథనపడుతూ అవునవలేక కాదనలేక, వెళ్ళలేక ఆగలేక మెల్లగా అడుగులో అడుగువేసుకుంటూ స్కంధావారానికి (విడిది గుడారం) చేరుకుంది. చేరువలో గమనించిన ఏకవీరుడు - తన్వంగీ! నా కన్నులు దప్పికగొన్నాయి, దర్శనం అనుగ్రహించు - అంటూ ఎదురువచ్చాడు.

శిష్టాచారాన్నీ నీతిమార్గాన్నీ ఎరిగిన యశోవతి ఇద్దరి పరిస్థితినీ గమనించి పెద్దరికం నిర్వహించింది. రాకుమారా! మా రాజుగారు ఈవిడను నీకు ఇచ్చి వివాహం జరిపించాలనే నిశ్చయంతోనే ఉన్నారు. మీ ఇద్దరికీ మనస్సులు కలిశాయని తెలుస్తూనే ఉంది. కాబట్టి కొంతకాలం పాటు వేచి ఉండటం మంచిది. ముందు ఈ రాకుమారిని తండ్రిదగ్గరకు చేర్చు. అతడు యథావిధిగా వివాహం జరిపించి నీకు సమర్పిస్తాడు. ఇది నిశ్చయం. ఇక పద బయలుదేరదాం - అంది.



ఏకవీరుడు మారుమాట్లాడకుండా బయలుదేరాడు. సైన్యమూ కదిలింది. అందరూ కలిసి రౌప్యమహారాజుగారి రాజధానినగరం చేరుకున్నారు. ఏకావళీ యశోవతుల రాకను చారులద్వారా తెలుసుకున్న రాజదంపతులు రౌప్యరుక్మరేఖలు ఆనందంతో ఎదురువచ్చారు. స్వాగత సత్కారాలు ఏర్పాటు చేశారు. దుఃఖించి దుఃఖించి అలిసిపోయిన ఏకావళిని, మలినాంబరాలలో కృశించిపోయిన కన్నకూతురును చూడ్డంతోనే ఆ తల్లిదండ్రులు ఆనందశోకాలతో ఉక్కిరిబిక్కిరి అయ్యారు. రుక్మరేఖ ఏకావళిని గాఢంగా కౌగిలించుకుంది. అంతగా కృశించిపోయినా ఏకావళి ముఖంలో ఏదో ఆనందరేఖ కనపడటం ఆ తల్లిదండ్రులను ఊరడించింది. యశోవతి కల్పించుకుని జరిగిన వృత్తాంతమంతా సవిస్తరంగా తెలియపరిచింది. వెంటనే రౌప్యమహారాజు ఏకవీరుడికీ అతడి మిత్రబృందానికీ మహాసైన్యానికీ అతిథిమర్యాదలు జరపించాడు. రాకుమారుణ్ణి తన రాజసౌధంలోకి సాదరంగా సగౌరవంగా తీసుకువెళ్ళాడు. విడిది చేయించాడు. ఒక శుభముహూర్తాన ఏకావళిని ఇచ్చి వివాహం జరిపించాడు. పుష్కలంగా బహుమతులు ఇచ్చి యశోవతితో సాగనంపాడు.

ఏకవీరుడు ఏకావళీ సహితుడై తన రాజధానికి చేరుకున్నాడు. ఇష్టోపభోగాలతో క్రీడించాడు. ఆ దంపతులకు కృతవీర్యుడు అనే కొడుకు పుట్టాడు. అటుపైని అతడికి కార్తవీర్యుడు జన్మించాడు. అప్పటినుంచీ వారిది కార్తవీర్యవంశంగా ప్రసిద్ధికెక్కింది. ***(అధ్యాయం 24, శ్లోకాలు 66)***

శౌనకాది మహామునులారా! వ్యాసభగవానుడు చెప్పిన ఈ హైహయ వంశకథను శ్రద్ధగా ఆలకించిన జనమేజయుడికి మరొక సందేహం కలిగింది. దేవదేవుడూ జగన్నాథుడూ అయిన విష్ణుమూర్తి అశ్వరూపం ధరించడమేమిటి? ఆ పురుషోత్తముడు స్వతంత్రుడుకాడా? అంతగా పరతంత్రుడా? అని అడిగాడు. వ్యాసుడు మళ్ళీ అందుకున్నాడు - అంటూ సూతుడు మళ్ళీ కథనానికి ఉపక్రమించాడు.

జనమేజయా! ఇలాంటి సందేహమే నాకూ వచ్చి వెనకటికి నారదుణ్ణి అడిగాను. తెలుసుగా నారదుడంటే ఎవరో! బ్రహ్మమానసపుత్రుడు. సర్వజ్ఞుడు. సర్వగుడు. శాంతచిత్తుడు. సర్వలోకప్రియుడు. స్వయంగా కవీశ్వరుడు. ఆ దేవర్షి ఒకప్పుడు భూలోక సంచారానికి వచ్చాడు. మహతీవీణను స్వరతాన సమన్వితంగా పలికించుకుంటూ, బృహద్రథంతరాది సామవేద భాగాలను శ్రావ్యంగా గానం చేస్తూ నా ఆశ్రమానికి విచ్చేశాడు. నేను ఎదురువెళ్ళి అర్ఘ్యపాద్యాలు సమర్పించి ఆశ్రమంలోకి తీసుకువచ్చాను. అతిథిమర్యాదలు అయ్యాక నేనొక ప్రశ్న వేశాను.



## ◆ వ్యాసుడి మనోవేదన ◆

బ్రహ్మపుత్రా! నిస్సారమైన ఈ సంసారంలో ప్రాణికి ఏమి సుఖం ఉంది? నన్నేచూడు. ఒక ద్వీపంలో జన్మించాను. తల్లిదండ్రులు విడిచిపెట్టి వెళ్ళిపోతే అనాశ్రయుడనై గాలికి పెరిగాను. కర్మానుసారంగా ఎదిగాను. పర్వతశిఖరంమీద చాలా సంవత్సరాలు తపస్సు చేశాను. పుత్రుడు కావాలని శంకరుణ్ణి ప్రార్థించాను. శుకుడు జన్మించాడు. అతడికి వేదవిద్యలన్నీ నేర్పాను. జ్ఞాని అయ్యాడు. నన్ను నిర్దాక్షిణ్యంగా విడిచిపెట్టి వెళ్ళిపోయాడు. పుత్ర విరహంతో పరితపించాను. అప్పుడు నువ్వే వచ్చి నన్ను ఓదార్చావు. అక్కడితో మేరుపర్వతం వదిలేసి మా తల్లిని తలుచుకుంటూ కురుజాంగలానికి వచ్చాను. సంసారం పట్టి మిథ్య అని తెలిసినా పుత్రవిరహాన్ని తట్టుకోలేక క్రుంగిపోయాను. నా తల్లిని ఒక మహారాజు పరిణయమాడాడని తెలిసి సంబరపడ్డాను. ఇదిగో ఈ సరస్వతీతటంలో ఆశ్రమం నిర్మించుకుని కాలం గడుపుతున్నాను. శంతనుడు స్వర్గస్థుడయ్యాక నా తల్లి వైధుర్యం అనుభవించింది. భీష్ముడు సంరక్షకుడుగా ఇద్దరుబిడ్డలనూ పెట్టుకుని కాలక్షేపం చేసింది. గాంగేయుడు చిత్రాంగదుణ్ణి రాజును చేశాడు. కానీ అతడూ ఆట్టే కాలం జీవించనేలేదు. మళ్ళీ నా తల్లికి దుఃఖం తప్పలేదు. నేనుకూడా వెళ్ళి ఎంతగానో ఓదార్చాను. తరవాత విచిత్రవీర్యుడు రాజు అయ్యాడు. భీష్ముడు స్త్రీ - రాజ్య విముఖుడు కావడంతో ఈ పరిస్థితి దాపురించింది. కాశీరాజు కూతుళ్ళను ఇద్దరిని భీష్ముడు బలాత్కారంగా తెచ్చి విచిత్రవీర్యుడికి వివాహం చెయ్యబోయాడు. అదేమో ఒక రకంగా జరిగింది. పోనీలే అని సంతోషించాను. ఆ సంతోషమూ ఆట్టే కాలం నిలవలేదు. విచిత్రవీర్యుడు క్షయరోగపీడుడై కాలం చేశాడు. నిస్సంతుగా మరణించడంతో వంశం నిలిచేదెలాగా అని మా తల్లి విలవిలలాడింది. సహగమనానికి సమాయత్తలైన కోడళ్ళను బలవంతంగా నివారించింది. విచిత్రవీర్యుడికి ఉత్తరక్రియలు జరిపించి నన్ను స్మరించింది. తల్లి అంటే ప్రత్యక్షదైవంకదా! స్మరించినంతనే నేను వెళ్ళాను. ఏమి అజ్ఞ అని అభ్యర్థించాను. భీష్ముడు అక్కడే ఉన్నాడు. మా తల్లి చెప్పింది - వంశవిచ్ఛేదం కాకుండా శంతనువంశాన్ని నిలబెట్టమంది. రూపయౌవనవతులైన తన కోడళ్ళతో (నాకు మరదళ్ళు) సంగమించి పుత్రులను ప్రసాదించమంది. భరతవంశాన్ని నిలబెట్టు, ఇందులో అధర్మం ఏదీ లేదు అని ఆజ్ఞాపించింది.

నేను ఆలోచనలోపడ్డాను. ఆ పని చెయ్యడం సిగ్గు అనిపించింది. సున్నితంగా వారించాను - తల్లీ ! పరభార్యా సంగమం మహాపాపం. ధర్మం తెలిసి నేనెలా చెయ్యగలను ఈ పాపకృత్యం? తమ్ముడి భార్య సోదరితో సమానమంటారు. నిగమాగమాలు అన్నీ చదువుకున్న నేను ఈ వ్యభిచారం చెయ్యలేను. కులాన్ని రక్షించుకోవలసిందే. కాదనను. కానీ అన్యాయంగానూ అధర్మంగానూ రక్షించుకోకూడదు. అలా రక్షించినందువల్ల ప్రయోజనం ఉండదు. పితృదేవతలు తరించకపోగా మహాపాపం చుట్టుకుంటుంది. నేను లోకాలకు ధర్మోపదేశాలు చేస్తున్నవాడిని. పురాణాలను రచిస్తున్నవాడిని. ఈ కుత్సితమూ విగర్హితమూ అయిన పనిని చెయ్యలేను - అని ఖండితంగా చెప్పాను.



అన్యాయేన న కర్తవ్యం సర్వథా కులరక్షణమ్ ।
న తరంతి హి సంసారా త్పితర: పాపకారిణ: ॥
లోకానాముపదేష్టా య: పురాణానాం ప్రవర్తక: ।
స కథం కుత్సితం కర్మ జ్ఞాత్వా కుర్యాన్మహోద్భుతమ్ ॥(24 - 48, 49)

ఇంతగా చెప్పినా నా తల్లి వినిపించుకోలేదు. చాలాసేపు వలవలా విలపించింది. పుత్రకా! కన్నతల్లిగా నేను ఆజ్ఞాపిస్తున్నాను. ఆచరించు. ఏ దోషమూ నిన్ను అంటదు. పెద్దలమాట దుష్టమే అయినా ఆచరించవలసిందే. (గురూణాం వచనం తథ్యం సదోషమపి మానవై: కర్తవ్యమవిచార్యైవ శిష్టాచార ప్రమాణత: ) ఇందులో నీ ఆలోచనకు అవకాశం లేదు. ఇది శిష్టాచారం. కాబట్టి మరదళ్ళకు పుత్రభిక్ష పెట్టి వంశాన్ని నిలబెట్టు. నా దుఃఖాన్ని తొలగించు - అని ఆజ్ఞాపించింది.

అప్పుడు భీష్ముడు కల్పించుకుని నా తల్లికి వంతపలికాడు. ధర్మశాస్త్రాలనూ ధర్మసూక్ష్మాలనూ విశేషంగా ఎరిగినవాడతడు. ధర్మాధర్మవిచారణ చెయ్యకు. మీ తల్లి చెప్పినట్టు చెయ్యి అని ఆజ్ఞాపించినట్టే చెప్పాడు. ఇక నాకు గత్యంతరం లేకపోయింది. జగుప్సితమే అయినా ఆచరించాను. ముందుగా అంబికను కలిశాను. ఆవిడ నా తాపసరూపాన్ని చూసి అసహ్యించుకుంది. సంగమకాలంలో కన్నులు మూసుకొంది. గుడ్డివాడు పుడతాడని శపించాను. మర్నాడు మా అమ్మ అడిగింది రహస్యంగా. సిగ్గుతో ముఖం దించుకుని అంబికకు కొడుకు పుడతాడని చెప్పాను. కానీ వాడు గుడ్డివాడుగా జన్మిస్తాడు. ఇది నా శాపం అన్నాను. దానికి మా అమ్మ నన్ను నిందించింది. కోప్పడింది. ***(అధ్యాయం -24, శ్లోకాలు - 61)***

పుట్టుగుడ్డి పుట్టినా ఒకటే పుట్టకపోయినా ఒకటే. జాతాంధుడికి రాజ్యాధికారం లేదు. సర్వలక్షణ సంపన్నుడైన వంశోద్ధారకుడు కావాలి. అంచేత అంబాలికతో సంగమించు - అని ఆజ్ఞాపించింది. అంబాలిక ఋతుమతి అయ్యేంతవరకూ హస్తిపురంలో ఉండిపోయాను. ఒకనాటి రాత్రి అంబాలిక ఏకాంతంలో నా శయనమందిరానికి వచ్చింది. అత్తగారు పంపించింది. రసవిహీనమైన నా రూపమూ, నా జడలు గట్టిన జుట్టూ చూసి అంబాలిక భయపడింది. చెమటలు పోసాయి. ముఖం పాలిపోయింది. అలాగే వచ్చి నా ప్రక్కన కూర్చుంది. నాకు కోపం వచ్చింది. నన్ను చూసి అసహ్యించుకునీ భయపడీ, సౌందర్యగర్వంతో పాలిపోయావు కనక నీకు పాండురోగి పుడతాడు అని శపించాను. ఆ రాత్రి ఆమెను అనుభవించి ఇవతలికి వచ్చాను. తల్లి అనుమతి తీసుకుని వెళ్ళిపోయాను.

నెలలు నిండి అంబా అంబాలికలు ప్రసవించారు. జాతాంధుడిగా ధృతరాష్ట్రుడూ, పాండురోగిగా పాండురాజు జన్మించారు. అటువంటి మనుమలను చూసి సత్యవతీదేవి మనస్సు కలతచెందింది.



సంవత్సరం గడిచాక మళ్ళీ నన్ను స్మరించింది. వెళ్ళాను. ఇద్దరిలో ఏ ఒక్కరూ రాజ్యానికి యోగ్యులు కారు. మనోహరుడైన మరొక పుత్రుణ్ని ఈ వంశానికి అనుగ్రహించు అని ప్రాధేయపడింది. సరేనన్నాను. అప్పటికి అంబిక ఋతుమతిగా ఉంది. అత్తగారు ఒప్పించింది. రాజ్యార్హుడైన వంశకర్తకోసం ఈసారికి అంగీకరించమని కోరింది. సిగ్గుతో అంబిక ముడుచుకుపోయింది. మౌనంగా నిలబడింది. ఆ రాత్రి అంబికాశయనమందిరంలోకి వెళ్ళాను. రూపయౌవన సంపన్నయైన తన దాసిని ఆభరణాలతో అలంకరించి తనకు బదులుగా నా దగ్గరకు పంపించింది అంబిక. చందనపుష్పసుగంధాలు పరిమళించాయి. హంసలా నడిచివచ్చి హావభావాలతో ఆకర్షించింది. ప్రేమగా వచ్చి సరసన కూర్చుంది. నాకు చాలా ముచ్చటవేసింది. అనురాగరంజితంగా రేయి గడిచింది. ప్రసన్నుడనై ఆమెకు వరం ఇచ్చాను. సుందరీ! నీకు సర్వలక్షణ సంపన్నుడు పుడతాడు. అతడు అందగాడూ ధర్మజ్ఞుడూ సత్యవాదీ శమదమాన్వితుడూ అవుతాడు అన్నాను. అలాగే విదురుడు జన్మించాడు. ఇలా పరక్షేత్రాలలో నాకు ముగ్గురు పుత్రులు జన్మించారు. శుకుడివల్ల కలిగిన పుత్ర విరహాన్ని మరిచిపోయాను. ఇది ఎంతటి మాయయో గ్రహించావా? నారదా! మాయ నిజంగా బలవతి. అకృతాత్ములు దీనినుంచి బయటపడలేరు. దీనికొక రూపంలేదు. ఆలంబనం లేదు. ఎంతటెంతటి జ్ఞానులనైనా ఇది సమ్మోహపరుస్తుంది సుమా!

> మాయా బలవతీ బ్రహ్మన్! దుస్త్యజాహ్యకృతాత్మభిః ।
> అరూపా చ నిరాలంబా జ్ఞానినామపి మోహినీ ॥ **(25 - 24)**

తల్లిమీద ప్రేమతో కాదనలేక అకృత్యం చేసిన నేను పుత్రప్రేమలో తగుల్కున్నాను. అడవులకు వచ్చి ఆశ్రమంలో ఉన్నానన్నమాటే కానీ నాకు శాంతి కరువయ్యింది. మనస్సు డోలాయమానమయ్యింది. హస్తిపురంవైపు పరుగులు తీస్తూ, మళ్ళీ సరస్వతీ తీరానికి చేరుకునేది. ఒక్కొక్కపుడు నన్ను నేనే ప్రశ్నించుకునేవాడిని. ఈ పుత్రు లెవరు? నేనెవరు? ఈ మోహమేమిటి? వీళ్ళేమయినా నాకు శ్రాద్ధాలు పెడతారా? పెడితే చెల్లుతాయా? వీళ్ళకి ఆ అర్హత లేదుగదా. వ్యభిచారంతో పుట్టినవాళ్ళు. వీళ్ళవల్ల ఏ సుఖమూ లేదు. ఏ ప్రయోజనమూ లేదు. వీళ్ళకోసం నేను పరితపించడమేమిటి? ఎంత మూర్ఖత్వం! ఎంత సమ్మోహం!! ఎరిగియెరిగి ఈ మోహాంధకూపంలో పడిపోయాను - అనుకుంటూ ఏకాంతంలో పరితపించేవాడిని.

భీష్ముడి అనుమతితో పాండురాజు పట్టాభిషిక్తుడయ్యాడు. ఈ వార్త తెలిసి నా పిచ్చి మనసు ఎందుకో సంబరపడింది. ప్రసన్నమయ్యింది. కుంతినీ మాద్రినీ పాండురాజు వివాహం చేసుకున్నాడు. బ్రాహ్మణ శాపానికి గురిఅయ్యాడు. రాజ్యం ధృతరాష్ట్రుడికి అప్పగించి భార్యలిద్దరితోనూ కలిపి అరణ్యాలకు వెళ్ళాడని తెలిసినప్పుడు నా మనస్సు విలవిలలాడింది. ఉండబట్టలేక అదే అడివికి నేనూ వెళ్ళి



పాండురాజును ఓదార్చి వస్తూ వస్తూ హస్తిపురానికి వెళ్ళి ధృతరాష్ట్రుడికి ధైర్యం చెప్పి వచ్చాను. ఇదంతా ఏమిటంటావ్? నాదరమునీంద్రా! వ్యభిచారంతో పుట్టిన పుత్రులమీద ఈ వ్యామోహం నాకెందుకంటావ్!

అడవిలో పాండురాజుపత్నులకు అయిదుగురు కుమారులు క్షేత్రజులై జన్మించారు. ధర్మ-వాయు-శక్ర-అశ్వినీదేవతలు కారణంగా యుధిష్ఠిరభీమార్జుననకులసహదేవులు ఆవిర్భవించారు.

ఒకనాడు మాద్రిని కౌగిలించుకున్న పాండురాజు - శాపకారణంగా మరణించాడు. అక్కడి మునీశ్వరులు అతడి దేహానికి అంత్యక్రియలు జరిపారు. మాద్రి సహగమనం చేసింది. అయిదుగురు బిడ్డలినీ కుంతీదేవినీ ఆశ్రమవాసులే ఆదుకున్నారు. హస్తిపురానికి తెచ్చి భీష్ముడికీ విదురుడికీ భద్రంగా అప్పగించారు. వీళ్ళందరి సుఖదుఃఖాలకూ నేనెందుకు స్పందిస్తున్నానో అర్థమయ్యేది కాదు. పాండుకుమారుల్ని భీష్ముడు సంరక్షిస్తాడులే అని మనస్సు ఊరటచెందేది. కానీ దుర్యోధనాదులు క్రూరమానసులై పాండవులతో విరోధించారు.

భీష్ముడు ద్రోణాచార్యుణ్ణి ఆహ్వానించి తెచ్చి కౌరవపాండవులకు విద్యాబుద్ధులు నేర్పించాడు. అస్త్రశస్త్రవిద్యలలో అందరూ ఆరితేరుతున్నారు.

అంతలోకీ కర్ణుడు రంగస్థలం మీదకి వచ్చాడు. చిననాట కుంతీదేవి ఈ కర్ణుణ్ణి ప్రసవించి పసిగుడ్డుగా నదిలో వదిలేసింది. అతడిని ఒక సూతుడు పెంచి పెద్దచేశాడు. ఆ కర్ణుడు దుర్యోధనుడికి ఇష్టుడయ్యాడు. కౌరవపాండవులలో పరస్పర వైరం ముదిరింది. దీన్ని వారించడానికి ధృతరాష్ట్రుడు పాండవులను వారణావతానికి పంపించాడు. అక్కడ దుర్యోధనుడు లక్కఇండ్లలో వీరిని మట్టుబెట్టడానికి పన్నాగం వేశాడు. పురోచనుడిద్వారా అది తెలుసుకున్న పాండవులు తప్పించుకుని అడవులకు పారిపోయారు.

నారదా! ఈ వార్త తెలియకముందు, పాండవులు కుంతీ సహితులై లక్కఇండ్లలో భస్మమైపోయారనే నమ్మి నా మనస్సు ఎంతగా దుఃఖపడిందో, ఇప్పుడు తలుచుకుంటే నవ్వు వస్తుంది. శోకాతురుడనై శూన్యవనంలో అహర్నిశలూ పిచ్చిపట్టినవాడిలా తిరిగాను. ఏకచక్రపురంలో పాండవులను చూశాక గానీ తేరుకోలేకపోయాను. అప్పుడు తెలిసింది వీళ్ళు లక్కఇళ్ళ నుంచి తప్పించుకుని బయటపడ్డారని. అది తెలిసాక ఎంత సంబరపడిందో నా మనస్సు. బ్రాహ్మణవేషధారులై ద్రుపదపట్టణానికి వెళ్ళండి అని వాళ్ళకు సలహా చెప్పి సంతృప్తి చెందాను.

అక్కడ ద్రౌపదిని జయించి కుంతి ఆజ్ఞమేరకు అయిదుగురూ వివాహం చేసుకున్నారు. ఆ వివాహాన్ని చూసి మళ్ళీ నా మనస్సు కేరింతలుకొట్టింది. అందరూ గజపట్టణం చేరుకున్నారు. ధృతరాష్ట్రుడు వీరికోసం ఖాండవప్రస్థం కల్పించి ఇచ్చాడు. అప్పుడే పాండవులకు శ్రీకృష్ణుడితో మైత్రి కుదిరింది. కృష్ణార్జునులు ఇద్దరూ కలిసి ఖాండవంలో అగ్నిదేవుడికి సంతృప్తి కలిగించారు. అటుపైని ధర్మరాజు



రాజసూయం చేశాడు. అప్పుడూ నా మనస్సు పరవశించింది. ఆ యజ్ఞానికి వచ్చి మయసభా సౌందర్యాన్నీ, ధర్మజుని సకలశ్రీసమృద్ధినీ తిలకించిన దుర్యోధనుడు అసూయాగ్రస్తుడయ్యాడు. మాయాద్యూతం కల్పించాడు. చతురుడైన శకుని చేతిలో ధర్మజుడు ఓడిపోయాడు. ఇతడు ద్యూతవ్యసనియే తప్ప ద్యూతచతురుడు కాడు. రాజ్యమూ ధనమూ అన్నీ కోల్పోయాడు. ద్రౌపదికి నిండుసభలో ఘోరపరాభవం జరిగింది. అంతా కలిసి పన్నెండుసంవత్సరాల వనవాసక్లేశం అనుభవించారు. ఆ పన్నెండేళ్ళూ నా మనసు పడ్డ బాధ వర్ణనాతీతం.

బ్రహ్మర్షీ! ఇలా చెప్పుకుంటూపోతే ఇప్పటిలో అవ్వదు. సుఖదుఃఖాత్మకమైన ఈ సంసారంలో నేను తెలిసితెలిసీ నిండా మునిగిపోయాను. సనాతన ధర్మం తెలుసు. ఇదంతా వట్టి భ్రమ అని తెలుసు. అయినా సుఖదుఃఖాలకు లోనయ్యాను. అసలు నేనెవడిని? వారు ఎవరి కొడుకులు? తల్లి ఎవరు? సుఖం ఏమిటి? ఎందుకని నా మనస్సు ఇలా మోహవిభ్రాంతికి లోనవుతోంది? ఏమి చెయ్యను? ఎక్కడికి వెళ్ళను? ఏది చేసినా ఎక్కడికి వెళ్ళినా మనస్సుకి ఈ జంజాటం వదలడంలేదు, సంతోషం కలగడంలేదు, అస్థిరంగా ఊగిసలాడుతూనే ఉంది. దీనికి కారణం ఏమిటి? సర్వజ్ఞుడవైన నువ్వు నా సందేహాలు తీర్చి మనస్సుకి సుఖాన్నీ శాంతినీ ప్రసాదించు - అంటూ ఆనాడు సవినయంగా నారదుణ్ణి ప్రశ్నించాను జనమేజయా! వీలాగే. అప్పుడు నారదు డేమన్నాడో తెలుసా. చెబుతాను శ్రద్ధగా ఆలకించు.

*(అధ్యాయం - 25, శ్లోకాలు -63)*

## ◆ నారదుడి పూర్వజన్మ కథ ◆

మోహకారణం చెప్పమని అడుగుతున్న నన్ను చూసి నారదుడు చిన్నగా నవ్వాడు. బహుపురాణవేత్తవూ, పరాశరాత్మజుడవూ నువ్వు నన్ను అడుగుతున్నావా! అసలు ఈ సంసారంలో మోహం తప్ప మరింకేమైనా ఉన్నదంటావా? బ్రహ్మవిష్ణుమహేశ్వరులూ సనకసనందనాది మహర్షులూ అందరూ ఈ మోహపాశంలో తగులుకుని పరిభ్రమిస్తున్నవారే. ఇంతెందుకు, అందరూ నన్ను మహాజ్ఞాని అనుకుంటూ ఉంటారుకదూ! అలాంటి నేనే మోహానికి లోనయ్యాను. నా పూర్వజన్మ వృత్తాంతం చెబుతాను, విను. ఎంతటి దుఃఖం అనుభవించానో, భార్యకోసమై ఎలా మోహవిభ్రాంతిలో పడ్డానో తెలుసుకుంటే నువ్వు ఆశ్చర్యపోతావు.

ఒకప్పుడు పర్వతుడు అనే మిత్రుడితో కలిసి నేను భూలోకం చూద్దామని దేవలోకం నుంచి బయలుదేరాను. భరతఖండం చూసివద్దామని మా సంకల్పం. బయలుదేరే ముందే మేమిద్దరం ఒక ఒప్పందం చేసుకున్నాం. ఇద్దరిలో ఎప్పుడు ఎవరికి ఏ రకమైన భావాలు కలిగినా మనస్సు చలించినా



భోజనేచ్ఛ, ధనేచ్ఛ, రతీచ్ఛ ఏది కలిగినా అది శుభమైనా అశుభమైనా పరస్పరం తెలియజేసుకోవాలి. ఎవరికీ ఏదాపరికమూ ఉండకూడదు - అని ప్రతిజ్ఞ చేసుకునిమరీ బయలుదేరాం. కామరూపధారులమై భూలోకానికి వచ్చాం. అంతటా సంచరిస్తున్నాం. తిరుగుతూ తిరుగుతూ సంజయమహారాజుగారి పట్టణానికి చేరుకున్నాం. అతడు మమ్మల్ని అర్చించి గౌరవించాడు. సరిగ్గా అది వర్షర్తువు. చాతుర్మాస్యదీక్ష స్వీకరించాం. సంవత్సరంలో ఎనిమిదినెలలపాటు దేశాటనం చెయ్యాలి, వర్షర్తువు నాలుగునెలలూ ఎక్కడికీ కదలకండా ఒకేచోట ఉండాలి అనేది ద్విజుడికి నియమం కదా! అందుకని అక్కడ ఉండిపోయాం. సంజయుడు సంతోషించి మా దీక్షకు కావలసినవన్నీ ఏర్పాటు చేయించాడు.

వార్షికాశ్చతురో మాసా దుర్గమాః పథి సర్వదా ।
తస్మాదేకత్ర విబుధైః స్థాతవ్యమితి నిశ్చయః ॥
అష్టౌ మాసాంస్తు ప్రవసేత్సదా కార్యవశాద్ ద్విజః ।
వర్షాకాలే న గంతవ్యం ప్రవాసే సుఖమిచ్ఛతా ॥ **(26 - 14, 15)**

ఆ మహారాజుకి దమయంతి అని కూతురు ఉంది. సౌందర్యరాశి. ఆ కన్యకామణిని మా పరిచర్యలకు నియోగించాడు. దమయంతి చాలా వివేకవతి. విశాలాక్షి. ఎంతో భక్తిశ్రద్ధలతో మాకు పరిచర్యలు చేస్తోంది. స్నానాలకు నీళ్ళు పెడుతోంది. సకాలంలో భోజనాలు వడ్డిస్తోంది. తాంబూలమో మరొకటో ముఖవాసంగా ఏది కావాలంటే అది అందిస్తోంది. వీవనలు వీస్తోంది. శయనాసనాదులను మా ఇద్దరికీ వేరువేరుగా సుఖప్రదంగా ఏర్పాటు చేస్తోంది, చేయిస్తోంది. ఇలా రోజులు హాయిగా గడుస్తున్నాయి. మేమిద్దరమూ వేదాభ్యాసంలో క్షణం తీరకుండా కాలం గడుపుతున్నాం. నేను వీణను సాధనచేస్తున్నాను. వినేవారికి చెవులపండువుగా సామలు పలికిస్తున్నాను. గానమూ చేస్తున్నాను. ఈ సామగానానికి దమయంతి మనస్సు నాపట్ల గాఢంగా రాగరంజితమయ్యింది. ఆ అనురాగం దినదినాభివృద్ధి చెందింది. ఆ అనురాగాన్ని గమనించిన నాకూ మనస్సులో అభిలాష ఏర్పడింది.

భోజనాదిసేవల విషయంలో దమయంతి నా మిత్రుడికన్నా నాపట్ల కొంచెం విశేషాదరం కనపరిచింది. స్నానానికి అతడికి చన్నీళ్ళు తోడితే నాకు వేడినీళ్ళు ఇచ్చేది. పెరుగు నాకు వడ్డిస్తే మజ్జిగ అతడికి పోసేది. పడకమీద నాకు రోజూ పరిశుభ్రమైన దుప్పటీ పరిచేది. అతడికి అలా ఏర్పరిచేది కాదు. నా వైపు ప్రేమగా చూసేది. పర్వతుణ్ణి అలా చూసేది కాదు. ఇవన్నీ పర్వతుడు గమనించాడు. ఏమిటబ్బా ఇది అని ఆశ్చర్యపోయాడు. రహస్యంగా నన్ను అడిగాడు. ఏమిటి కథ, నిజం చెప్పు, ఈవిడ వ్యవహారం చూస్తూంటే నాకేదో అనుమానంగా ఉంది. నిన్ను ప్రేమిస్తున్నట్టుంది. పతిగా వరిస్తున్నట్టుంది. నీకూ అలాంటి అభిలాషయే ఉన్నట్టు తోస్తోంది. లక్షణాలు అలాగే ఉన్నాయి. అంతా గమనిస్తున్నాను. నీ చూపులూ నీ ముఖవికారాలూ అదే చెబుతున్నాయి. అబద్ధాలాడకు, నిజం చెప్పు. మనం చేసుకున్న ఒప్పందం గుర్తుతెచ్చుకో - అని నిలదీశాడు.



నాకు చచ్చేంత సిగ్గు వచ్చిపడింది. చెప్పక తప్పదుగదా! చెప్పేశాను. పర్వతా! ఈ విశాలాక్షి నన్ను పతిగా వరించింది. నాకూ ఈమెపై అలాంటి భావమే ఏర్పడింది - అన్నాను నసుగుతూ. పర్వతుడికి కోపం వచ్చింది. ధిక్ ధిక్ అన్నాడు. ఆవేళ అలా ప్రతిజ్ఞ చేశావు, ఈవేళ ఇలా వంచించావు. ఇది మిత్రద్రోహం. కనక నీకు వానరముఖం ప్రాప్తించుగాక అని శపించాడు. నాకూ కోపం వచ్చింది. నిగ్రహించుకోలేక పోయాను. మేనల్లుడనే బంధుత్వాన్నికూడా మరిచిపోయాను. శపించాను. స్వల్పాపరాధానికి నన్ను శపించావు కనక నీకింక స్వర్గంలో చోటులేదు. మృత్యులోకంలోనే నీ నివాసం. ఫో - అని ప్రతిశాపం ఇచ్చి రాను. పర్వతుడు విమనస్కుడై వెళ్ళిపోయాడు. నాకు కోతిముఖం వచ్చేసింది. నా వీణానాదానికి సమ్మో హితురాలైన దమయంతి ఈ వానరముఖంతో ఉన్న నన్ను చూసింది. కళవళ పడినట్టు కనిపించింది

జనమేజయా! నారదుడు చెబుతుండగా వింటున్న నాకు కుతూహలం పెరిగింది. తరవాత ఏమి జరిగింది, పర్వతుడూ నువ్వూ శాపవిమోచనం ఎలా పొందారు, దమయంతి సంగతి ఏమిటి? వివరంగా చెప్పమని త్వరపెట్టాను. నారదుడు కొనసాగించాడు.

వ్యాసర్షీ! మాయావిలాసం ఏమి చెప్పమంటావు. అలిగి పర్వతుడు అలా వెళ్ళిపోతే నేనెంతగా దుఃఖించానో ఆ భగవంతుడికి ఎఱుక. రాకుమారి దమయంతి యథాపూర్వంగా నాకు మళ్ళీ సేవలు చేయనారంభించింది. నేను రాజగృహంలోనే ఉండిపోయాను. ఈ శాపమేమిటి, ఈ వానర ముఖమేమిటి అని అనుక్షణమూ దిగులుచెందాను. రేపు ఏమి జరుగుతుందో అని భయపడ్డాను.

సంజయమహారాజుగారు కూతురికి వివాహం సంకల్పించారు. కించిత్ప్రకటితయౌవన అయ్యింది. తగిన వరుణ్ణి అన్వేషించమని మంత్రులకు పురమాయించాడు. కుల-రూప-ఔదార్యాది సద్గుణాలు కలిగిన యువశూరుణ్ణి చూడమన్నాడు. మంత్రులన్నారు కదా - మహారాజా! యోగ్యులైన రాకుమారులు చాలామంది ఉన్నా, వారిలో దమయంతీదేవి ఎవరిని ఇష్టపడుతుందో తెలుసుకోండి, అతడిని పిలిచి హస్త్యశ్వరథసంయుతంగా వివాహం జరిపిద్దాం - అని.

తండ్రి చేస్తున్న వివాహప్రయత్నాలు దమయంతికి తెలిసాయి. రహస్యంగా ధాత్రిని (రాజకన్యలకు పెంపుడు తల్లి) పిలిచి తన అభిప్రాయం తెలియజేసింది. ఆ వృద్ధురాలు వెళ్ళి రాజుగారి చెవిని వేసింది.

మహారాజా! దమయంతి నాతో చెప్పింది. నీకు చెప్పమంది. మహతీవీణావాదన నిపుణుడైన ఈ మేధావి నారదుణ్ణి వరించానంది. అతడికే ఇచ్చి వివాహం జరిపించమంది. మరింకెవరినీ పతిగా అంగీకరించనంది. నక్రతిమింగల రహితమూ, క్షార గుణవిరహితమూ సంపూర్ణమూ రసాత్మకమూ అయిన నారద నాదసింధువులో మునిగిపోయాను. కనక అతడే నా ప్రియుడు, అతడే నా వరుడు అని స్పష్టం చేసింది.

*(అధ్యాయం - 26, శ్లోకాలు - 57)*



మగ్నాహం నారదసింధౌ వై నక్రహీనే రసాత్మకే ।
అక్షారే సుఖసంపూర్ణే తిమింగిల వివర్జితే ॥ (26 - 57)

ధాత్రి చెప్పిన మాటలతో దమయంతి అభిప్రాయాన్ని గ్రహించిన సంజయుడు తన పట్టమహిషి కైకేయితో సంప్రదించాడు. కైకేయీ! ధాత్రిమాటలు విన్నావుగదా! మన అమ్మాయి నారదుణ్ణి వరించిందిట. అతడు ముని. ఇప్పుడు కోతిముఖం. ఎంత అందంగా ఉందో చూడు. దమయంతికి బుద్ధి ఉందంటావా ? ఈ కురూపికి ఈ భిక్షువుకి ఇచ్చి వివాహం చెయ్యనా? అసంభవం. నువ్వు అమ్మాయితో మాట్లాడు. బుద్ధిమరల్చు - అని ఆజ్ఞాపించి వెళ్ళాడు.

కైకేయి దమయంతిని తన మందిరానికి పిలిపించుకుంది. ఏకాంతంలో ప్రబోధించింది. అమ్మాయీ! నీ అందానికి ఈ వానరాస్యుడా భర్త? చూసేవాళ్ళు ఏమనుకుంటారు? పరిహసించరూ. పైగా అతడు నిర్ధనుడు. భిక్షుజీవనం. వారిపంచనూ వీరిపంచనూ జీవితం గడుపుతున్నాడు. నువ్వేదో చాలా తెలివైనదానివి అనుకున్నాను. చదువుకున్నావుకదా అనుకున్నాను. చివరికి ఇదా నీ నిర్ణయం? ఒక భిక్షుకుడిని చూసి మోహపడ్డావా? నువ్వేమో పూలతీగెలా సుకుమారివి. అతడేమో వంటినిండా బూడిద పులుముకునే మొరటు మనిషి. సుగంధద్రవ్యాలు అస్సలు వాడనేకూడని మునివృత్తి. మీ ఇద్దరికీ ఎలా కుదురుతుంది చెప్పు? ఆ కురూపితో సంసారం ఎలా చేస్తావు, ప్రేమ ఎలా పుడుతుంది? అనవసరంగా మొండితనానికి పోవద్దు. చక్కని రాకుమారుణ్ణి చూసి వివాహం జరిపిస్తాం. చేసుకో. ఇప్పటికే మీ నాన్న చాలా బాధపడుతున్నారు. బాధపడరుమరీ. కోమలమైన మాలతీలత తుమ్మచెట్టుకి (బుబూలవృక్షం) అల్లుకుంటే చూసినవాళ్ళ మనస్సు చివుక్కుమనదూ ? ఎంతమూర్ఖుడైనా తాంబూలాన్ని దాసేరకుడికి ఇంద-తిను అని అందిస్తాడా? (దాసేరకుడు = దాసీపుత్రుడు. దాశేరకుడు = పల్లెవాడు). చెయ్యిపట్టుకుని ఆ వానరముఖుడి పక్కన నువ్వు నిలబడితే - అబ్బా! అసలు ఆ దృశ్యాన్ని ఊహించుకోలేకపోతున్నాను - ఎంత అసహ్యంగా ఉంటుందో! కన్నవాళ్ళ గుండెలు మండిపోవూ? పోనీ అంటే ఇదేదో ఒక పూటతోనో ఒక రోజుతోనో తీరిపోయేది కాదాయె. వివాహమంటే నూరేళ్ళ బంధం. ప్రాణాలు గుటుక్కుమనేంతవరకూ కట్టుకున్నవాడితో కాలం గడపాల్సిందే. ఎలా గడుపుతావ్? ఈ సంగతి ఆలోచించావా?

లగ్నాం బబూలవృక్షేణ కోమలాం మాలతీలతామ్ ।
దృష్ట్వా కస్య మనః ఖేదం చతురస్య న గచ్ఛతి ॥
దాసేరకాయ తాంబూలీదళాని కోమలాని కః ।
దదాతి భక్షణార్థాయ మూర్ఖోఽపి ధరణీతలే ॥



కుముఖేన సమం వార్తా న రుచిం జనయత్యతః ।
అమృతేప్సు కథం కాలః క్షపితవ్యస్త్వయామునా ॥ (27 - 10, 11, 13)

తల్లి ఎంత చెప్పినా దమయంతి వినిపించుకోలేదు. తన నిశ్చయం మార్చుకోలేదు. ఇంకా స్పష్టంగా తన అభిప్రాయం చెప్పింది.

అమ్మా! ధనమూ రూపమూ అందమైన ముఖమూ ఇవ్వి ఉండి ఏమి లాభం, మనిషి మూర్ఖుడయ్యాక. రసమార్గం తెలియని మనిషికి రాజ్యం ఉండి ఏమి ప్రయోజనం ? నాదమాధుర్యాన్ని ఆస్వాదిస్తూ అరణ్యాలలో హాయిగా సంచరించే హరిణీబృందాల బ్రతుకు ధన్యం. అవి ఆ మాధుర్యానికి వివశలై మూర్ఖమానవుల చేతికి చిక్కి ప్రాణాలు విడిచిపెడుతున్నాయి. నారదుడు సప్తస్వరాత్మకమైన సంగీతవిద్యకు నిధి. అందులో అతడికి సాటివచ్చేవాడు ముల్లోకాలలోనూ లేడు - ఒక్క శివుడు తప్ప. ఇలాంటి విద్వాంసుడిని వదలుకుని ఒక మూర్ఖుడితో కాపురం చెయ్యడం క్షణం క్షణం -మరణం. ధనమూ రూపమూ ఉన్నా గుణం లేకపోతే అతడిని పరిత్యజించవలసిందే. గర్వగరిష్ఠులైన రాకుమారులతో మైత్రి అంటేనే నాకు అసహ్యం. అంతకంటే గుణగరిష్ఠుడైన భిక్షువుతో చెలిమి నాకు ఇష్టం. ఇతడు సర్వజ్ఞుడు. సంగీతంలో గ్రామమూర్ఛనాభేదాలను  కూలంకషంగా ఎరిగినవాడు. దుర్బలుడైనా ఎనిమిది రసాలూ తెలిసినవాడు. ఇటువంటి వరుడు దొరకడమే ఒక అదృష్టం. గంగా సరస్వతీనదులు ఎలా కైలాసానికి తీసుకువెడతాయో అలాగ స్వరజ్ఞాన విశారదుడైన ఈ నారదుడు నన్ను తీసుకువెడతాడు. స్వరప్రమాణాలు తెలిసినవాడు మానవుడైనా దేవతకింద లెక్క. సప్తస్వరాలు తెలియనివాడు ఇంద్రుడైనా పశువుతో సమానం.

స్వరమానం తు యో వేద స దేవో మానుషోఽపి సన్ ।
సప్తభేదం న యో వేద స పశుః సురరాడపి ॥ (27 - 22)

మూర్ఛనా తానమార్గం తు శ్రుత్వా మోదం న యాతి యః ।
స పశుస్సర్వథా జ్ఞేయో హరిణాః పశవో న హి ॥ (27 - 23)

వరం విషధరః సర్పః శ్రుత్వా నాదం మనోహరమ్ ।
అశ్రోత్రోఽపి ముదం యాతి ధిక్సకర్ణాంశ్చ మానవాన్ ॥ (27 - 24)

బాలోఽపి సుస్వరం గేయం శ్రుత్వా ముదితమానసః ।
జాయతే కింతు యే వృద్ధా న జానంతి ధిగస్తు తాన్ ॥ (27 - 25)



సంగీతంలో మూర్ఛనలనూ తానమార్గాలనూ ఆలకించి ఆనందించనివాడే నిజమైన పశువు. హరిణాలు పశువులు కానేకావు. చెవులు లేకపోయినా నాదాన్ని విని పరవశిస్తున్న సర్పం, చెవులుండీ సంగీతాన్ని ఆస్వాదించలేని మానవులకన్నా ఉత్తమోత్తమం. ఏమీ తెలియకపోయినా పాటలు వింటూ కేరింతలుకొడతాడు పసిబాలుడు. ఏళ్ళువచ్చినవాళ్ళకన్నా వీడు నయం కాదూ! ఎందుకొచ్చిన పెద్దరికాలు?!

అమ్మా! తండ్రిగారికి తెలియదంటావా నారదుడి గొప్పదనం? ముల్లోకాలలోనూ నారదుడికి సాటివచ్చే గాయకుడు లేడంటే లేడు. నేను వరించాను. సేవా సమయాలలో గానానికీ గుణాలకూ ముగ్ధురాలినయ్యాను. మనసిచ్చాను. నిన్న మొన్నటిలో ఏదో శాపం కారణంగా వానరముఖుడయ్యాడే కానీ అంతకుముందంతా అందగాడే. ఇవ్వేళ ముఖం మారితే వచ్చిన నష్టమేమీ లేదు. మనస్సులో రవ్వంత కలతచెందానే తప్ప నా అనురాగంలోనూ నా నిశ్చయంలోనూ మార్పులేదు. ఏమీ, గుఱ్ఱపుముఖాల కిన్నరులు అందరికీ నచ్చడంలేదూ? తమ గానవిద్యా ప్రావీణ్యంతో ఆకర్షిస్తూనే ఉన్నారుగదా! ముఖం ఎలా ఉంటే ఏమిటమ్మా? గుణం ముఖ్యం. విద్య ముఖ్యం. అందుచేత నాన్నగారితో చెప్పు - నారదుడికిచ్చి వివాహం జరిపించమను.

దమయంతి ఇంత కచ్చితంగా తన నిశ్చయాన్ని తెలియజేస్తే మహారాజ్ఞి మారుమాట్లాడలేక యథాతథంగా తన భర్తకు విన్నవించింది. మునిని మనసా వరించింది కనక అతడికే ఇచ్చి వివాహం చెయ్యడం సమంజసమని తన అభిప్రాయాన్ని వెల్లడించింది. సంజయుడు అంగీకరించాడు. ఒక శుభముహూర్తాన నాకూ దమయంతికీ మహావైభవంగా ఉద్వాహం జరిపించాడు.

వ్యాసమహర్షీ! దమయంతి నా వానరముఖాన్ని చూసి ఏనాడూ మథనపడలేదు గానీ, సేవలు చెయ్యడానికి ఆమె సమీపించినప్పుడల్లా నాలో నాకు ఏదో తెలియని దుఃఖం పొంగివచ్చేది. అలాగే రోజులు దొర్లుతున్నాయి.

ఇలా ఉండగా ఒకనాడు ఎక్కడినుంచో పర్వతుడు హఠాత్తుగా ఊడిపడ్డాడు. తీర్థయాత్రలు చేస్తూ నన్ను చూడడానికని వచ్చాడు. నేను ఎంతో ఆదరించి పూజించాను. ఆసనం సమర్పించాను. దానిమీద కూర్చుని నా ముఖం చూస్తూ వలవలా విలపించాడు. కొంతసేపటికి తేరుకుని -

మామయ్యా! ఆవేళ కోపం పట్టలేక నిన్ను శపించాను. దానికి ఇప్పుడు నిష్కృతి చేస్తాను. రాకుమారిని చూస్తుంటే జాలి కలుగుతోంది. తీర్థయాత్రలు చేసి సంపాదించిన పుణ్యంతో శాపప్రక్షాళనం చేస్తున్నాను. నీ ముఖం మళ్ళీ యథాపూర్వకంగా అలరారుగాక - అని శాపవిమోచనం అనుగ్రహించాడు.



మేనల్లుడి సౌజన్యానికి నేనూ ముగ్ధుణ్ణి అయ్యాను. నేనిచ్చిన శాపమూ అలాగే మరలించాను. యథాపూర్వకంగా స్వర్గలోక సంచారం సిద్ధించుగాక అన్నాను.

ఆ క్షణంలోనే నాకు మామూలు ముఖం వచ్చేసింది. రాజదంపతులూ దమయంతీ ఎంతగానో సంతోషించారు. ధనకనకవస్తువాహనాలు పారిబర్హంగా సమర్పించి సంబరపడ్డారు.

సత్యవతీనందనా! ఇన్ని అవస్థలు పడ్డాను నేను. ఇదంతా కేవలం మాయాశక్తి. మాయావృతమైన ఈ అసత్య సంసారంలో సుఖపడుతున్నాను అన్న ప్రాణి నాకింతవరకూ కనిపించలేదు. ఇక ముందు కనిపించే ఆశలేదు.

సంసారేఽస్మిన్ మహాభాగ! మాయా గుణకృతేఽవృతే ।
తమభృత్తు సుఖీ నాస్తి న భూతో న భవిష్యతి ॥ (27 - 48)

కామక్రోధాదులూ అహంకారమూ మహాబలీయమైనవి. వాటిని జయించినవాడు ఈ సృష్టిలోనే లేడు. సత్త్వరజస్తమోగుణాలే జీవుడికి శరీరధారణ కారణాలు. మరొక విడ్డూరం చెబుతాను విను -

ఒకప్పుడు మహావిష్ణువుతో కలిసి అరణ్యాలలో పర్యటిస్తున్నాను. హాస్యవినోదాలతో కాలక్షేపం చేస్తూ చటుక్కున నేను స్త్రీగా మారిపోయాను. రాజపత్నిని అయ్యాను. ఎందరెందరో పుత్రుల్ని ప్రసవించాను. ఈ మాయాబలవిమోహం విన్నావా ఎప్పుడన్నా?

జనమేజయా! ఈ ప్రశ్నకు నేను నిజంగా నివ్వెరపోయాను. ఇదేమిటీ వింత? పురుషుడవు రాజపత్నివి కావడమేమిటి, మగబిడ్డలను కనడం ఏమిటి? చాలా విడ్డూరంగా ఉందే. ఈ మాయాతత్త్వాన్ని సమగ్రంగా తెలియజెప్పమన్నాను. నారదుడు చెప్పాడు. *(అధ్యాయం- 27, శ్లోకాలు -56)*

సాత్యవతేయా! నీకేమిటి, నాకే విడ్డూరమైన సంగతి ఇది. బ్రహ్మాదిస్తంభపర్యంతం ఈ జగత్తు అంతా మాయామోహితమనడానికి ఇదొక దృష్టాంతం. వివరిస్తున్నాను చెవులు ఇటు పడెయ్.

## ◆ నారదుడు స్త్రీగా మారిపోవడం ◆

అతిమనోహరమైన శ్వేతద్వీపంలో ఉంటున్న నారాయణుడిని దర్శించడానికని ఒకప్పుడు నేను వెళ్ళాను. సప్తస్వరాన్వితంగా సామవేదం గానంచేస్తూ మహతి మ్రోగించుకుంటూ వెళ్ళాను. చతుర్భుజుడూ శంఖచక్రగదాన్వితుడూ కౌస్తుభోద్భాసితోరస్కుడూ పీతాంబరపరీధానుడూ ముకుటాంగదవిరాజితుడు శ్రీ మహావిష్ణువు రమాదేవితో విలాసంగా క్రీడిస్తూ కనిపించాడు. నన్ను చూస్తూనే లక్ష్మీదేవి



కంతర్హితురాలయ్యింది. సర్వలక్షణసంపన్న, సర్వభూషణవిరాజిత, రూపయౌవన విలాసగర్వితీ, ప్రతప్తచామీకరప్రభ (బంగారు వన్నె) అయిన ఆ నారీతిలకం నన్ను చూసి చటుక్కున ఇంటిలోకి వెళ్ళిపోయింది. కారణం ఏమిటి చెప్మా అనిపించి వాసుదేవుణ్ణి అడిగేశాను.

పద్మనాభా! నన్నుచూసి లక్ష్మీదేవి అంతర్గృహంలోకి వెళ్ళిపోయింది, ఏమిటి కారణం? నేను విటుణ్ణి కాను. ధూర్తుణ్ణి అంతకన్నా కాను. కేవలం తపస్విని. జితేంద్రియుణ్ణి. జితక్రోధుణ్ణి. జితమాయాగుణుడిని. ఇలాంటి నన్ను చూసి లోపలికి వెళ్ళిపోవలసిన పని ఏమివచ్చింది?

విష్ణుమూర్తి చిద్విలాసంగా నవ్వి - నారదా! ఇది ఇంతేనయ్యా. పతి తప్ప మరింక ఏ మగవాడైనా పత్నికి పరాయివాడే. పరపురుషుడి ఎదుట నిలబడకూడదు అనేది పతివ్రతల నీతి.

> నారదైవం విధా నీతి ర్న స్థాతవ్యం కదాచన ।
> పతిం వినాన్యసాన్నిధ్యే కస్య చిద్యోషయా క్వచిత్ ॥ (28 - 13)

ఎంతటి విద్వాంసులైనా జితేంద్రియులైనా నిరాహారులైనా మహాయోగులైనా మాయను జయించడం అసంభవం. నేను జితేంద్రియుణ్ణి, జితమాయాగుణుడిని అని నువ్వు అన్నావే ఆ మాట దేవతలకైనా అనుకోదగినది కాదు. నువ్వేమిటీ, నీ తండ్రీ, నేనూ, శివుడూ కూడా మాయను జయించలేం. సనకసనందాది మునీంద్రులకే అది సాధ్యం కాలేదు. నువ్వనగా ఎంత! దేవ మానవ తిర్యక్కులలో ఏ రూపాన్నీ ఏ శరీరాన్నీ ధరించినప్పటికీ - అది చాలు మాయను జయించలేం అనడానికి. త్రిగుణాత్మక శరీరంలో ఇమిడిన తరవాత మాయను ఎవరుగానీ ఎలా జయించగలుగుతారు? అసంభవం. కాలమే మాయాస్వరూపం. అది రూపరహితమై రూపాలను ధరింపజేస్తుంది. విద్వాంసుడైనా మూర్ఖుడైనా మధ్యస్థుడైనా శరీరధారి ప్రతివాడూ మాయావివశుడే. అదే ఇతడిని స్వభావాన్నిబట్టో, కర్మను అనుసరించో వికలుడిని చేస్తుంటుంది. దాని చేష్టితాలు పరమదుర్జ్ఞేయాలు. నీకూ నాకూ అందవు.

వ్యాసమహర్షీ! దేవదేవుడూ జగన్నాథుడూ అనిపించుకుంటున్న శ్రీమన్నారాయణుడు ఇలా చెబుతూంటే నేను చాలా విస్మయం చెందాను. మాయావిలసనాన్ని సమగ్రంగా తెలుసుకోవాలి అనుకున్నాను. అడిగాను -

వాసుదేవా! సనాతనా! జగన్నాథా! రమాపతీ! మాయాస్వరూపం ఏమిటి? అది ఎటువంటిది? దాని బలం ఎంతటిది? ఎక్కడ ఉంటుంది? ఆధారమేమిటి? ఇదంతా దయచేసి వివరించు. ఆ మాయామహాదేవిని దర్శించాలనుకుంటున్నాను. దర్శింపజెయ్యి. సమ్యక్ జ్ఞానం ప్రసాదించు.



నారదా! ఏమి చెప్పమంటావు, ఎంతని చెప్పమంటావు? మాయాదేవి త్రిగుణస్వరూప. అఖిలాధార. సర్వజ్ఞ. సర్వసమ్మత. అజేయ. అనేకరూప. సర్వవ్యాపిక. చూడాలనుకుంటున్నావుగదా! పద. గరుత్మంతుణ్ణి అధిరోహించు. ఇద్దరం కలిసివెడదాం. అజితాత్ములకు కనిపించని మాయామహత్త్వాన్ని నీకు చూపిస్తాను. చూసిన తరవాత విషాదానికి లోనవుతావేమో. మనస్సుని దృఢపరచుకోవాలిసుమా!

అని విష్ణుమూర్తి నన్ను హెచ్చరించి, గరుత్మంతుణ్ణి స్మరించాడు. గరుడుడు ప్రత్యక్షమయ్యాడు. ఇద్దరమూ అధిరోహించాం. వాయువేగంతో బయలుదేరాడు. మహారణ్యాలూ దివ్యసరస్సులూ పవిత్ర నదీనదాలూ పర్వతశ్రేణులూ పల్లీపత్తనగ్రామాలూ ఆశ్రమాలూ వాపీతటాకాలూ నానావిధ పక్షిమృగజాతులూ - అన్నింటినీ తిలకిస్తూ దాటుకుంటూ కాన్యకుబ్జ సమీపస్థలం చేరుకున్నాం. అక్కడ ఒక అతిలోక సుందరమైన సరస్సు కనిపించింది. నిండా వికసించిన రంగురంగుల పద్మాలు. హంసకారండవ చక్రవాకాది జలపక్షి సమూహాల కోలాహలం. తుమ్మెదల ఝుంకారాలు. స్వచ్ఛంగా నిర్మలంగా ఉన్న మధురజలం. క్షీరసముద్రోదకంతో పోటీపడుతుందనిపించింది. ఆ దివ్యసరోవరాన్ని చూసి శ్రీ మహావిష్ణువు - ఇందులో స్నానం చేసి కాన్యకుబ్జ పట్టణంలోకి ప్రవేశిద్దామని గరుత్మంతుణ్ణి కిందికి దిగమన్నాడు. గరుడుడు ఆ సరోవర తీరంలో మెల్లిగా వాలేడు. శ్రీహరి ముందుగా దిగి, నా చూపుడువేలు అందుకుని నన్ను దింపాడు. సరోవర సౌందర్యాన్ని ప్రస్తుతిస్తూ ఒడ్డుకు తీసుకువెళ్ళాడు. అక్కడ ఒక చెట్టునీడలో విశ్రమించాడు. నారదా! ముందు నువ్వు స్నానం కానియ్యి, తరవాత నేను చేస్తాను - అన్నాడు. పరేనని నేను సరోవరంవైపు చూపులు నిగుడించాను. సజ్జనుల హృదయాల్లాగా నీళ్ళు నిర్మలంగా ఉన్నాయి. పంకజపరాగాలతో పరిమళిస్తున్నాయి.

> సాధూనామివ చేతాంసి జలాని నిర్మలాని చ ।
> సురభీణి పరాగైస్తు పంకజానాం విశేషతః ॥ (28 - 39)

అని ఆ జలాలను మెచ్చుకుంటూ నా మహతీవీణనూ, మృగాజినాన్నీ తీసి శ్రీహరి సన్నిధిలో ఉంచి క్రొత్త రేవుగదా అని సంశయిస్తూ మెల్లగా సరోవరంలోకి దిగాను. కాళ్ళూ చేతులూ కడుక్కుని, శిఖ విదిల్చి, ఆచమించి ఇంకొంచెం లోతుకి వెళ్ళి స్నానానికి ఉపక్రమించాను. విష్ణుమూర్తి గట్టునకూర్చుని అంతా తిలకిస్తూనే ఉన్నాడు. అలా మునిగానో లేదో నాకు పురుషరూపం పోయి స్త్రీ రూపం వచ్చేసింది. ఆశ్చర్యంతో కళవళపడ్డాను. రవ్వంత తేరుకుని గట్టువైపు చూద్దునుగదా - శ్రీహరి నా వీణనూ కృష్ణాజినాన్నీ తీసుకుని గరుత్మంతుణ్ణి అధిరోహించి తుర్రుమన్నాడు.



## ◆ నారద తాళధ్వజుల పరిణయం ◆

సర్వాలంకారభూషితమైన స్త్రీరూపం రాగానే నాకు పూర్వపు పురుషరూప స్మృతి క్షణంలో మటుమాయమయ్యింది. జగన్నాథుణ్ణీ మర్చిపోయాను, మహతినీ కృష్ణాజినాన్నీ మరిచిపోయాను.

మోహినీరూపంతో సరోవరం నుంచి బయటకి వచ్చాను. గట్టుమీద నిలబడి ఆ సరస్సును మరొక్కసారి పరిశీలనగా చూశాను. స్వచ్ఛంగా నిర్మలంగా ఏమీ ఎరగనట్టే ఉంది. ఈ వింత ఏమిటి చెప్మా అని ఆశ్చర్యపోతూ నిలబడ్డాను. ఏమి చెయ్యాలో ఎటుపోవాలో తోచక దిక్కులు చూస్తున్నాను.

తాళధ్వజ మహారాజు అటువైపు వస్తూ కనిపించాడు. గజాశ్వరథబృందాలు వెంటరాగా తానొక రథంమీద విజయం చేస్తున్నాడు. కోడెవయస్సులో సువర్ణదివ్యాభరణవిభూషితుడై మళ్ళీ పుట్టిన మన్మథుడిలా విరాజిల్లుతున్నాడు.

గజాశ్వరథబృందైశ్చ సంవృతో రథసంస్థితః ।
యువా భూషణసంవీతో దేహవానివ మన్మథః ॥ (28 - 49)

అల్లంత దూరంనుంచే నన్ను చూశాడు. నా సౌందర్యానికి ముగ్ధుడయ్యాడు. ఈ అరణ్యంలో ఒంటరిగా ఎవరీ సౌందర్యరాశి అని ఆశ్చర్యపోయాడు. దగ్గరకు వచ్చి -

కల్యాణీ! ఎవరునువ్వు? దేవతావనితవా? మానవాంగనవా? గంధర్వోరగకాంతామణివా? ఎవరి అమ్మాయివి? రూపయౌవన విభూషితవై ఈ గాఢారణ్యంలో ఏకాంతంగా నిలబడ్డావెందుకు? వివాహితవా? కన్యవా? చంద్రవదనా! నిజం చెప్పు. మధుకరచికురా! పెదవి కదుపు. మృగనయనా! ఈ సరోవరంలో ఏమిటి తిలకిస్తున్నావు? తదేకదీక్షగా అటే చూస్తున్నావు ఏమిటి కారణం? హే కృశోదరి! హే మరాళాక్షి! హే మదనమోహిని! నన్ను పతిగా వరించి మహారాజభోగాలు అనుభవించు.

*(అధ్యాయం -28, శ్లోకాలు - 54)*

తాళధ్వజుడు అనురక్తుడై పలవరించాడు. నేనూ క్షణకాలం ఆలోచించాను. మృదుమధురంగా బదులు పలికాను.

హేరాజన్! నేనెవరి కూతురినో నాకే తెలియదు. తల్లిదండ్రులెవరో ఎక్కడ ఉంటారో తెలియదు. ఎవరు నన్ను ఈ సరోవరతీరంలో విడిచిపెట్టారో అంతకన్నా తెలియదు. ఏమి చెయ్యాలో, ఎక్కడికి వెళ్ళాలో, నా అదృష్టం ఎలాఉందో ఏమీ తోచక ఇలా నిలబడ్డాను. నిరాధారను. ఏమి చెయ్యాలా అని



ఆలోచిస్తున్నాను. దైవమే దిక్కు. ఎటు నడిపిస్తాడో? నువ్వు ధర్మజ్ఞుడివి. నీకు ఎలా అనిపిస్తే అలా చెయ్యి. నువ్వు తప్ప నాకు సంరక్షకులు ఎవరూ లేరు. తండ్రిలేడు, తల్లిలేదు, ఇల్లులేదు, వాకిలిలేదు, బంధువులులేరు, చెలిమికత్తెలులేరు. ఒంటరిదానను, నీదానను.

నా పలుకులకు తాళధ్వజుడు మురిసిపోయాడు. మనస్సులో మన్మథుడు గిలిగింతలు పెట్టాడు. వెంటనే భృత్యులను పిలిచి -

బంగారుపల్లకీ సిద్ధం చెయ్యండి. పట్టువస్త్రాలు తెరలు కట్టండి. మెత్తని పరుపులు పరవండి. బాలీసులు సర్దండి. ఈ విశాలాక్షి అధిరోహిస్తుంది. మనతో రాజధానికి వస్తుంది - అని ఆజ్ఞాపించాడు.

క్షణంలో నేను బంగారుపల్లకిలో ఉన్నాను. కుదుపు తెలియకుండా బోయీలు మోస్తున్నారు. తాళధ్వజ రాజధానికి చేరుకున్నాను. ఒక శుభమూహూర్తాన నన్ను ఆ మహారాజు అగ్నిసాక్షిగా వివాహం చేసుకున్నాడు. ఆ నిమిషంనుంచీ అతడికి ప్రాణాధికంగా ప్రియురాలిని అయ్యాను. సౌభాగ్యసుందరి అని నామకరణం చేశాడు. అనుక్షణమూ అలాగే పిలిచేవాడు. కామశాస్త్రం చెప్పిన రీతిలో నిరంతర భోగవిలాసాలతో తాళధ్వజుడు రేయింబవళ్లు నాతోనే గడిపాడు. రాజకార్యాలన్నీ మంత్రులకు అప్పగించేశాడు. కామకళారతుడై కాలానికి కళ్ళెం వేశాడు. ఉద్యానాలలో సరోవరాలలో వాపీకూపతటాకాలలో గిరికందరాలలో గిరిశిఖరాలలో మహాసౌధాలలో వారుణీమదమత్తుడై నాతో శృంగారకేళీవిలాసాలలో తెలియాడాడు.

వ్యాసమహర్షీ! నిజం చెబుతున్నాను. నేనూ అలాగే తన్మయం చెందాను. క్రీడా రసవశీకృతమయ్యింది నా అంతరంగం. నా పూర్వ శరీరంగానీ పురుషరూపంగానీ మునిజన్మగానీ - ఏమీ జ్ఞాపకం రాలేదు. అతడు నా పతి. నేనతడి పత్నిని. పట్టమహిషిని. విలాసాలు తెలిసిన ప్రియవల్లభను. జీవితం సఫలమయ్యింది. యౌవనవతీత్వం చరితార్థమయ్యింది.

పన్నెండు సంవత్సరాలకాలం క్షణంలా గడిచిపోయింది. నేను గర్భం ధరించాను. రాజుగారి ఆనందం అవధులుదాటింది. వేదవిప్రులను రావించి యథావిధిగా గర్భసంస్కారకర్మలు జరిపించాడు. నా మనస్సు ఎప్పుడూ ఉల్లాసంగా ఉండేందుకు అన్ని జాగ్రత్తలూ తీసుకున్నాడు. గర్భిణులకు రకరకాల కోరికలు పుడతాయిట, దాపరికం లేకండా అడుగు. నీ కోరిక ఏదైనా సరే తీరుస్తాను అంటూ రోజూ ప్రేమగా నిర్బంధించేవాడు తాళధ్వజమహారాజు. కానీ సిగ్గుతో ఏనాడూ ఏదీ నేను అడగనేలేదు. పదివెలలూ నిండాయి. పండంటి కొడుకు పుట్టాడు. గ్రహనక్షత్రతారాలగ్న బలాలు చాలా శుభప్రదంగా ఉన్నాయి. రాజూ నేనూ ఎంతగానో సంతోషించాం. రాజ్యమంతటా ఉత్సవం ప్రకటించాడు. జాత కర్మలు మహావైభవంగా జరిపించాడు. వీరవర్మ అని నామకరణం చేశాడు.



రెండేళ్ళ తరవాత మళ్ళీ గర్భం ధరించాను. సర్వశుభలక్షణ సంయుతుడై మళ్ళీ మగపిల్లవాడే జన్మించాడు. ఇతడికి సుధన్వుడని పేరుపెట్టారు.

ఇలా నాకు మొత్తం పన్నెండుమంది మగపిల్లలు కలిగారు. వాళ్ళ ఆలనాపాలనలతో నేను పూర్తిగా సమ్మోహంలో మునిగిపోయాను. ఆ తరవాత మరో ఎనిమిదిమందిని ప్రసవించాను. నా గార్హస్థ్య జీవితం పరిపూర్ణంగా చరితార్థమయ్యిందని సంబరపడ్డాను. ఎంతగానో మురిసిపోయాను.

యుక్తవయస్సులు రాగానే అందరికీ యథాక్రమంగా వివాహాలు జరిపించాము. కోడళ్ళతో మనుమలూ మనుమరాండ్రతో నిరంతరం కోలాహలంగా జీవితం గడిచింది. ఒక్కొక్కసారి వీళ్ళకి చిన్నచిన్న అనారోగ్యాలు చెయ్యడం దానికి నేను విలవిలలాడిపోవడం, మరొకప్పుడు వీళ్ళలో వీళ్ళు కలహించుకోవడం, నేను బాధపడటం. కోడళ్ళ తగువులు. మనుమళ్ళ గిల్లికజ్జాలు. మనుమరాండ్ర ఆటపాటలూ, సుఖదుఃఖాల సమ్మిశ్రంగా సాగుతున్న సంసారమహార్ణవంలో నిండా మునిగిపోయాను.

పూర్వపు విజ్ఞానమూ శాస్త్రజ్ఞానమూ అంతా మరుగున పడిపోయింది. స్త్రీస్వభావంతో ఇంటి పనుల్లో తలమునిగిపోయాను. నాలో ఒక అహంకారం బయలుదేరింది. నా పుత్రులు మహాబలశాలులు. నా కోడళ్ళు గుణవంతురాండ్రు. నా మనమలూ మనమరాండ్రూ ఆరోగ్యవంతులు. ఈ లోకంలో నాకన్నా ధన్యురాలెవరు? ఇలాంటి ఆలోచనలతో అహంకరించానే తప్ప, అయ్యో! నేను నారదుణ్ణి కదా, భగవంతుడు వంచించాడు, ఇలా ఆడదానినై సంసారకూపంలో పడిపోయానుగదా - అని ఏనాడూ విచారించలేదు. అటువంటి ఆలోచనే రాలేదసలు. కృష్ణద్వైపాయనా! నేను మహారాజ్ఞిని. శుభాచారను. బహుపుత్రవతిని. పతివ్రతను. పరమధన్యురాలనుకదా అనుకుంటూ సంసారసమ్మోహమే పొందాను.

> నారదోఽహం భగవతా వంచితో మాయయా కిల ।
> న కదాచి న్మయాప్యేవం చింతితం మనసా కిల ॥
> రాజపత్నీ శుభాచారా బహుపుత్రా పతివ్రతా ।
> ధన్యాహం కిల సంసారే కృష్ణైవం మోహితస్త్వహమ్ ॥ (29 - 39, 40)

శతాధిక సంవత్సరాలు సంతోషంగానే గడిచాయి. ఒక రోజున మహాబలవంతుడైన ఒక శత్రురాజు మా దేశంమీదకి దండెత్తివచ్చాడు. చతుర్విధ సైన్యాలతో కాన్యకుబ్జాన్ని చుట్టుముట్టేడు. నా పుత్రులూ పౌత్రులూ యుద్ధానికి సన్నద్ధులై రణరంగానికి వెళ్ళారు. ఘోరసంగ్రామం జరిగింది. కాలయోగం కలిసిరాలేదు. రణరంగానికి వెళ్ళినవాళ్ళు తిరిగిరాలేదు. తాళధ్వజమహారాజు ధైర్యం కోల్పోయాడు. దుఃఖిస్తూ అంతఃపురానికి వచ్చాడు. నేనూ దుఃఖం తట్టుకోలేక రణరంగానికి పరుగుతీశాను. పుత్రపౌత్రుల



కళేబరాలను చూసి దిక్కులు పిక్కటిల్లేలాగా బోరున విలపించాను. శత్రురాజు తాను వచ్చినపని అయిపోయిందన్నట్టు వెనుదిరిగి వెళ్ళిపోయాడు. వాడిని ఎంతగా తిట్టిపోశానో నాకే తెలియదు. హా పుత్రా! హా పౌత్రాః! క్వ గతాః అంటూ పిచ్చెక్కినట్టు నోరూనెత్తీ బాదుకుంటూ నేలమీదపడి దొర్లిదొర్లి ఏడ్చాను. దేవుడు ఎంత దుర్మార్గుడు. ఎంతలో ఎంత చేశాడు - అంటూ పలవరిస్తున్నాను.

## ◆ నారదుడు మళ్ళీ పురుషుడుగా మారడం ◆

అదే సమయంలో మధుసూదనుడు ధవళవస్త్రధారియైన ఒక వృద్ధబ్రాహ్మణుడుగా నా దగ్గరికి వచ్చాడు. తన్వంగీ! ఎందుకు ఇంతగా దుఃఖిస్తున్నావ్? ఇప్పుడు ఏమి జరిగింది? ఒకానొక భ్రమ - బట్టబయలయ్యింది అంతేకదా! పతి అనీ పుత్రులనీ పౌత్రులనీ గృహమనీ మోహం పెంచుకున్నావు. నువ్వు ఎవరివి? వీళ్ళు ఎవరు? ఏ తల్లి బిడ్డలు? ఒక్కసారి వాస్తవం ఆలోచించు. కళ్ళు తెరు. దుఃఖం తొలగిపోతుంది. మనస్సు కలతదేరుతుంది. లే. స్నానం చెయ్యి. బిడ్డలకు నీళ్ళు వదిలిపెట్టు. పరలోకగతులకు మర్యాదారక్షణకోసం తిలలు విడిచిపెట్టు. ఇలాంటప్పుడు తీర్థాలలోనే స్నానం చెయ్యాలి. ఇళ్ళల్లోకాదు. ఇది ధర్మశాస్త్ర నిర్ణయం.

> కర్తవ్యం సర్వథా తీర్థే స్నానం తు న గృహే క్వచిత్ ।
> మృతానాం కిల బంధూనాం ధర్మశాస్త్రస్య నిర్ణయః ॥ (29 - 54)

ఆ వృద్ధుడి మాటలు నన్ను ఓదార్చాయి. రణరంగం నుంచి లేచి, భర్తతో బంధువులతో ఇవతలికి వచ్చాను. వృద్ధబ్రాహ్మణుడి వెంట నడిచాను. ఒక దివ్యసరోవరం చేరుకున్నాం. అమ్మాయీ! ఈ సరోవరంలో స్నానం చెయ్యి. ఇది పుంతీర్థం. ఇక దుఃఖించకు. చేసే ఉత్తరక్రియలు వ్యర్థమైపోతాయి. ఇప్పటికి నువ్వు ఎన్ని జన్మలు ఎత్తేవో, ఎందరు పుత్రులను ప్రసవించేవో ఒక్కసారి ఊహించు. అన్నీ లెక్కవేస్తే కోట్ల సంఖ్యలో నీ పుత్రులూ పుత్రికలూ మరణించి ఉంటారు. భర్తలూ తండ్రులూ సోదరులూ మనుమలూ మనుమరాండ్రూ కోడళ్ళూ అల్లుళ్ళూ - వీళ్ళల్లో ఎవరికోసం నువ్వు దుఃఖిస్తున్నట్టు? ఇదంతా ఒక భ్రమ. మనస్సు కల్పించుకున్న మధురమైన భ్రమ. కట్టకడపటికి జీవుడు తట్టుకోలేనంతటి దుఃఖాన్ని మిగిల్చిపోయే సుందరస్వప్నం.

> కేషాం దుఃఖం త్వయా కార్యం భ్రమేఽస్మిన్ మానసోద్భవే ।
> వితథే స్వప్నసదృశే తాపదే దేహినామిహ ॥ (29 - 60)



వృద్ధవిప్రుడి మాటలు వింటూ ఆ పుంతీర్థంలో స్నానానికి దిగేను. మునగడంతోటే పురుషుడుగా మారిపోయాను. గట్టువైపు చూద్దునుగదా శ్రీమహావిష్ణువు నా వీణనూ కృష్ణాజినాన్నీ చేతబట్టుకుని నాకోసం ఎదురు చూస్తున్నట్టు నిలబడి ఉన్నాడు. ఆ క్షణంలో మళ్ళీ నాకు అంతా జ్ఞాపకం వచ్చింది. నేను నారదుడిననీ, శ్రీహరితో కలిసి గరుడిమీద ఇక్కడికి వచ్చాననీ, ఈ సరస్సులోనే మరొక రేవులో మునిగి స్త్రీగా మారిపోయాననీ, శ్రీహరి నన్ను ఇలా విమోహపరిచి మాయాస్వరూపాన్ని తెలియజెప్పాడనీ ప్రత్యభిజ్ఞ కలిగింది.

నారదా! పైకి రా. ఎంతసేపు నీ స్నానం? ఇంకా ఏం చేస్తున్నావ్ ఆ నీళ్ళల్లో నిలబడి? - అంటున్నాడు గట్టుమీద నిలబడ్డ శ్రీహరి. ***(అధ్యాయం - 29 , శ్లోకాలు - 66)***

నారదుడుగా మారిపోయిన నన్ను చూసి తాళధ్వజమహారాజు ఆశ్చర్యచకితుడయ్యాడు. నా భార్య ఏమయ్యింది? ఎటు మాయమయ్యింది? ఈ మునిసత్తముడెవరు? ఎలా ఊడిపడ్డాడు? మమ్మల్ని ఇక్కడికి తెచ్చిన వృద్ధవిప్రుడు ఏడి? హాప్రియా! నన్ను విడిచి ఎక్కడికి వెళ్ళావు? ఎలా వెళ్ళగలిగావు? పుత్రశోకంతో పరితపిస్తున్న నన్ను ఒంటరిగా విడిచివెళ్ళడానికి నీకు మనసెలా ఒప్పింది? నువ్వు లేనిదే నేను జీవించలేను. నా జీవితం వ్యర్థం. నా రాజ్యమూ సంపదలూ వృథా. ఏమి చేసుకోను? ఎలా జీవించను? నీతోపాటే నా ప్రాణాలను కూడా తీసుకుపోకపోయావా? నాకు బ్రతకాలని లేదు. ప్రాణాలపై తీపి చచ్చిపోయింది. ప్రియా! ఎక్కడ ఉన్నావో! దయచేసి ఒక్కసారి పలుకు. ఈ దీనుడికి బదులు చెప్పు. ఎవ్వంత ఓదార్చు. ఇంతలోనే ఇంత కఠినురాలివి ఎలా కాగలిగావు? ఆ ప్రేమా అనురాగమూ ఏమైపోయాయి? ఈ నీళ్ళల్లో మునిగిపోయావా? జలచరాలు భక్షించేశాయా? వరుణదేవుడు అపహరించాడా? ఎంత దురదృష్టవంతుణ్ణి! పుత్రుల్లో కలిసిపోయిన అదృష్టవంతురాలివి నువ్వు. అవును నీ పుత్రప్రేమ అంతటిదే. నేనెరుగుదును. కాకపోతే, నన్నుకూడా తీసుకువెళ్ళుంటే సంతోషించేవాడిని. ఒంటరిని చేసి వెళ్ళిపోయావా? ఇదేమి అన్యాయం చెప్పు. ఇది నీకు భావ్యమా? నేను చేసిన అపరాధం ఏమిటి? ఎందుకు నాకు ఈ శిక్ష విధించావు ? నేను దీన్ని భరించలేను. అటు పుత్రులనూ కోల్పోయాను, ఇటు నిన్ను పొగొట్టుకున్నాను. అయినా ఇంకా బతికే ఉన్నాను. పాడుప్రాణాలు వదిలిపోవు ఇదేమిటి! ఇప్పుడింక నాకు ఏది దారి? ఎక్కడికి పోను? ఏమి చెయ్యను? భార్యావియోగ దుఃఖాన్ని తట్టుకుని నిలబడడానికి నేనేమన్నా రఘురాముడినా ? అనురక్తులూ సమచిత్తులూ అయిన దంపతులకు విడివిడిగా మరణం ప్రాప్తించడం కన్నా భరించరాని దుఃఖం మరొకటి ఉంటుందా ఈ సృష్టిలో! అయినా అలాగే జరుగుతోంది. ఆడవాళ్ళు ఎంత అదృష్టవంతులు, ధర్మశాస్త్రాలు సహగమనం చెప్పాయి. ఇటువంటి దుఃఖాన్ని దిగమింగుకోవలసిన దుస్థితిని స్త్రీలకు తప్పించారుగదా ధర్మశాస్త్రకర్తలయిన మహర్షులు.

**ఉపకారస్తు నారీణాం మునిభిర్విహితః కిల**
**యదుక్తం ధర్మశాస్త్రేషు జ్వలనం పతినా సహ ॥** **(30 - 12)**



## ◆ శ్రీహరి తాళధ్వజుడిని ఓదార్చడం ◆

వరదలా పొంగివస్తున్న దుఃఖాన్ని ఆపుకోలేక బేలగా విలపిస్తున్న తాళధ్వజమహారాజును చూసి శ్రీహరికి హృదయం ద్రవించింది. మెల్లగా చెంతకు చేరాడు. రాజేంద్రా! ఏమిటి దుఃఖిస్తున్నావ్? ఎక్కడికి వెళ్ళింది నీ ప్రియాంగన? నువ్వు శాస్త్రాలు చదవలేదా? ఏ పండితులనూ ఆశ్రయించలేదా? ఆమె ఎవరు? నువ్వు ఎవరు? సంయోగమంటే ఏమిటి? వియోగమంటే ఏమిటి? ఇదంతా ఒక ప్రవాహం. కలుస్తూ ఉంటారు, విడిపోతూ ఉంటారు. ఎవరి నావలో వారు దాటిపోతుంటారు. దుఃఖించి ప్రయోజనం లేదు. ధైర్యం తెచ్చుకో. ఇంటికి వెళ్ళు. సంయోగవియోగాలు దైవాధీనాలు. ఆమెతో నీకు ఇక్కడే ఈ జన్మలోనే సంయోగం కలిగింది. సుఖాలు అనుభవించావు. బాగానే ఉంది. ఆవిడ తల్లిదండ్రులు ఎవరో నీకు తెలుసా? వారిని ఎప్పుడైనా చూశావా? లేదు. కాకతాళీయంగా కలుసుకున్నారు. అలాగే విడిపోయారు. గతం గతః. ఇప్పుడు శోకించి ప్రయోజనం ఏమిటి? ఎందరు ఎంతగాదుఃఖిస్తే మాత్రం పోయినవాళ్ళు వస్తారా? ఎప్పుడైనా వచ్చారా? కాలో హి దురతిక్రమః. అందుచేత, లే, లేచివెళ్ళు. వెళ్ళి రాజభోగాలు అనుభవించు. యథావిధిగా పరిపాలన సాగించు. ఎలా వచ్చిందో అలాగే వెళ్ళిపోయింది ఆవిడ. నువ్వూ అంతే. ఎలా వచ్చావో అలా వెళ్ళిపో. కర్తవ్యం ఆచరించు. యోగమార్గం తెలుసుకో. మనస్సును చిక్కబట్టుకో. ప్రాణికోటి యాతాయాతాలకు సంబంధించి వాస్తవదృష్టిని అలవరుచుకో. భోగాలు కాలవశాన వస్తాయి, కాలవశాన పోతాయి. శోకించడం వ్యర్థం. ఇదొక నిష్ఫలమైన సంసారమార్గం. కేవల సుఖయోగమూ ఉండదు, కేవల దుఃఖయోగమూ ఉండదు. ఘటికాయంత్రంలా రెండూ ఒకదానివెంట ఒకటి తరుముకుంటూ తిరుగుతుంటాయి. మనస్సుకి ధైర్యం చెప్పుకుని రాజ్యపాలన సాగించు, లేదా దాయాదులకు అప్పగించి వానప్రస్థం స్వీకరించు.

> **భోగః కాలవశాదేతి తత్రైవ ప్రతియాతి చ ।**
> **నాత్ర శోకస్తు కర్తవ్యో విఫలే భవవర్త్మని ॥**
> **నైకత్ర సుఖసంయోగో దుఃఖయోగస్తు నైకతః ।**
> **ఘటికాయంత్రవత్కామం భ్రమణం సుఖదుఃఖయోః ॥**

**(30 - 22, 23)**

మహారాజా! క్షణభంగురమే అయినా మానవజన్మ కడుంగడు దుర్లభం. అది లభించినవారికి ఎప్పుడైనా ఏకైక కర్తవ్యం ఆత్మసాధన మాత్రమే. ఇంద్రియాలూ అవయవాలూ అన్నీ పశువులకూ ఉంటాయి. మానవదేహానికి అధికంగా ఉన్నది ఒకే ఒక్కటి - జ్ఞానం. అంచేత జ్ఞానివై ఈ శోకాన్ని త్యజించు.



ఇదంతా ఒక మహామాయ అని గ్రహించు. ఆదిపరాశక్తి ఈ మాయతో అఖిలజగత్తునూ అన్ని కాలాలలోనూ సమ్మోహపరుస్తోందని తెలుసుకో. వెళ్ళు. ఇంటికి వెళ్ళి హాయిగా రాజ్యం ఏలుకో.

శ్రీహరి చేసిన ఉపదేశంతో తాళధ్వజుడు తేరుకున్నాడు. సాష్టాంగనమస్కారం చేశాడు. సరోవరంలో స్నానం చేసి, రణరంగంలో మరణించిన పుత్రపౌత్రమిత్రబంధుగణానికి నువ్వులూ నీళ్ళూ విడిచిపెట్టి రాజధానికి వెళ్ళిపోయాడు. బతికిబట్టగట్టిన ఒక మనుమడికి రాజ్యం అప్పగించేసి తత్త్వజ్ఞానియై తపస్సుకోసం అడవులకు వెళ్ళిపోయాడు.

## ◆ శ్రీహరి చెప్పిన మాయావిలాసం ◆

శ్రీమన్నారాయణుడు నావైపు చూస్తూ చిరునవ్వులు చిందిస్తున్నాడు. రెండు చేతులూ జోడించి నమస్కరించాను. జగన్నాథా! చాలా అందంగా వంచించావు నన్ను. సంతోషం. మాయాబలం ఎంతటిదో దాని మహత్తు ఏమిటో బాగా తెలిసివచ్చేట్టు చేశావు. స్త్రీరూపం పొందినప్పటి నా అనుభవాలన్నీ జ్ఞాపకంలోనే ఉన్నాయి. అవునూ! ఈ సరోవరంలోనేగదా అలనాడు మునిగాను. మునగడంతోనే స్త్రీగా మారిపోయాను. పూర్వవిజ్ఞానమంతా చిటుక్కున మాయమయ్యింది. అదెలా జరిగిందో అంతుబట్టడం లేదు. స్త్రీరూపాన్ని పొంది సంసారసమ్మోహంలో మునిగిపోయాను. అనురూపభర్తను పొందాను. శచీ పురందరుల్లా రాజభోగాలు అనుభవించాము. ఇప్పుడు మళ్ళీ అదే మనస్సు. అదే చిత్తం. అదే పురాతన పురుష శరీరం. స్త్రీగా మారినప్పుడు పురుషజ్ఞానం ఎందుకు పోయింది? పురుషుడిగా మారిన ఇప్పుడు స్త్రీరూప పరిజ్ఞానం ఎలా మిగిలింది? ఇది చాలా వింతగా ఉంది. అప్పటి జ్ఞాననాశానికి కారణం ఏమిటో మహానుభావుడవు నువ్వే చెప్పాలి. స్త్రీరూపంలో రకరకాల భోగాలు అనుభవించాను. సురాపానం చేశాను. అభక్ష్య భక్షణం అకాల భోజనం ఇత్యాదులన్నీ చేశాను. నేను నారదుడిని అనే స్పృహయే లేకపోయింది. జరిగినదంతా ఇప్పటిలా అప్పుడు జ్ఞాపకం లేకపోయింది. కారణమేమిటో రవ్వంత వివరించు మహాప్రభో!

నారదా! ఇదంతా మహామాయా విలాసం. సర్వప్రాణికోటికీ శరీరాల్లో అనేక దశాభేదాలు ఉంటాయి. జాగ్రత్ స్వప్న సుషుప్తులు కాక నాల్గవ దశ ఒకటి ఉంది. అదే మరణానంతరం మరొక శరీరాన్ని పొందడం. ఇందులో సందేహించవలసింది ఏమీ లేదు. నిద్రపోయిన మానవుడు ఏమీ వినలేడు, తెలుసుకోలేడు, చెయ్యలేడు. మెలకువగా ఉన్నప్పుడు అన్నీ చేస్తాడు. అన్నీ తెలుసుకుంటాడు. నిద్రలోకూడా చిత్తానికి కదలికలుంటాయి. అవే స్వప్నచలనాలు. అవన్నీ మనోభేదాలూ, రకరకాల మనోభావాలూను.



నిద్రయా చాల్యతే చిత్తం భవంతి స్వప్నసంభవాః ।
నానావిధా మనోభేదా మనోభావా హ్యనేకశః ॥ (30 - 41)

ఏనుగు నన్ను చంపడానికి స్తోంది. ఎదిరించలేను, ఎటూ పారిపోలేను. ఏమి చెయ్యాలి అంటూ స్వప్నంలో దుఃఖిస్తాడు. అలాగే కొన్ని కలల్లో సుఖాలు అనుభవిస్తాడు. మేల్కొన్నాక అవన్నీ గుర్తు తెచ్చుకుని జనాలకి వివరంగా చెబుతాడు. కలకంటున్నంతసేపూమాత్రం ఇది భ్రమ అని ఎవరూ అనుకోరు. ఇలాంటిదే ఇహజన్మానుభవమూను. సంసారంలో ఉన్నంతకాలమూ ఇది భ్రమ అనిపించదు. (మరొక జన్మ పొందాక, గతజన్మ స్మృతిని నిలుపుకోగలిగితే అప్పుడు తెలుస్తుంది ఈ మాయావిలసనం) అలా అనిపించకపోవడమే మాయావిభవం. అది చాలా దుర్గమం సుమా!

స్వప్నే కోఽపి న జానాతి భ్రమోఽయమితి నిశ్చయః ।
యథా తథైవ విభవో మాయాయా దుర్గమః కిల ॥ (30 - 45)

నారదా! నిజం చెప్పాలంటే ఇది నాకూ పూర్తిగా తెలియదు. తెలుసుకోవడం చాలా దుర్ఘటం. నేనేకాదు ఈ మాయాగుణాలను శివుడూ పద్మసంభవుడూకూడా ఎరగరు. నాకు తెలుసు అని ఎవడైనా అహంకరించి అంటే కచ్చితంగా వాడు పిచ్చివాడే.

ఈ స్థావరజంగమాత్మకమైన జగత్తు అంతా సత్త్వరజస్తమోగుణ నిర్మితం. అవి లేకుండా సంసారం జరగదు. నేను సత్త్వగుణ ప్రధానుడిని. రజ స్తమోగుణాల కలయిక ఎప్పుడూ ఉంటుంది. ఒక్కొక్కప్పుడు ఒక్కొక్క గుణం ప్రధానభూమిక నిర్వహిస్తూ ఉంటుంది. భువనేశ్వరుడనే అయినా గుణత్రయవిహీనుడను మాత్రం ఎప్పుడూ కాను, కాలేను. అలాగే మీ తండ్రి బ్రహ్మదేవుడు రజోగుణ ప్రధానుడు. తమస్సత్త్వాలు కలగలిసి ఉంటాయి. శివుడు తమోగుణప్రధానుడు. సత్త్వరజోగుణాలు కలగలిసి ఉంటాయి. వీరుకూడా ఎప్పుడూ గుణత్రయవిహీనులు కారు, కాలేరు. అటువంటి వ్యక్తి ఉన్నట్టు నేను ఏనాడూ ఏ చోటా వినలేదు, కనలేదు.

అందుచేత ఓ మునీశ్వరా! మాయావినిర్మితమైన ఈ అసార-అపార దుర్ఘట సంసారంలో మోహపడటం పరమ - అజ్ఞానం. నువ్వు అనేక భోగ భాగ్యాలు అనుభవించి ఇప్పుడే ఈవలి ఒడ్డుకు వచ్చి, ఆ అనుభవాలు ఇంకా స్మృతిపథంలో పచ్చిగా పరిమళిస్తూ ఉండి, అద్భుతావహమైన ఆ మాయాచరితం ఏమిటి అని నన్ను అడుగుతున్నావంటే, ఏం చెప్పను నారదా! అన్నాడు శ్రీమహావిష్ణువు.

వ్యాసమహర్షీ ! ఇదయ్యా మాయావిలాసం. ఇదయ్యా నా అనుభవసారం. కౌరవపాండవుల పట్ల సమ్మోహితుడవై సుఖదుఃఖాలు అనుభవిస్తున్నావు. ఇందులో ఆశ్చర్యపడవలసింది ఏమీ లేదు.



త్రిమూర్తులే ఈ మాయామోహానికి అతీతులు కారంటే ఇక నువ్వూ నేనూనా! అందుచేత దుఃఖించకు. తత్త్వజ్ఞానివై ఈ మోహార్ణవాన్ని తరించు. *(అధ్యాయం - 30, శ్లోకాలు - 53)*

జనమేజయా! ఆనాడు నా ఆశ్రమానికి వచ్చి నారదుడు చేసిన ఉపదేశం యథాతథంగా నీకు చెప్పాను. నా మనస్సుకి బాగానాటుకున్న ఉపదేశం ఇది. నా కళ్ళు తెరిపించిన ఉపదేశం ఇది. నా దుఃఖాన్ని చేత్తో తీసివేసినట్టు తొలగించిన దివ్యోపదేశం ఇది. విన్నావుగదా! అటుపైని నారదుణ్ణి నేను ఏమి అడిగానో తెలుసా -

నారదమహర్షీ ! విష్ణుమూర్తి ఇంకా ఏమి చెప్పాడు ? మీరిద్దరూ కలిసి అక్కడి నుంచి ఎటువెళ్లారు ? - అన్నాను.

## ◆ నారద చతుర్ముఖ సంభాషణ ◆

వ్యాసమహర్షీ ! గరుడుడిని అధిరోహించి వైకుంఠానికి ప్రయాణమై శ్రీహరి, నారదా ! నువ్వు ఎటైనా వెళ్ళాలనుకుంటే వెళ్ళు, లేదంటే నాతో వైకుంఠానికి రా అన్నాడు. నేను వీడ్కోలు తీసుకుని బ్రహ్మలోకం చేరుకున్నాను. విష్ణుమూర్తి నన్ను ఆశీర్వదించి వైకుంఠం చేరుకున్నాడు. సుఖదుఃఖాలను నెమరువేసుకుంటూ వెళ్ళి నేను మా తండ్రిగారి దర్శనం చేశాను. మునుపటిలానే నమస్కరించి సన్నిధిలో నిలబడ్డాను.

కుమారా ! ఎక్కడికి వెళ్ళావు ? చింతాకులచిత్తుడివై కనిపిస్తున్నావేమిటి కారణం ? మనస్సు బాగున్నట్టు లేదే ! ఎవరైనా వంచించారా ? అద్భుతమేదైనా తిలకించావా ? ఏమిటి ఇలా ఉన్నావు ? బాగా నలిగిపోయినట్టు కనిపిస్తున్నావు ? అని ఆత్రుతగా అడిగాడు మా తండ్రి. చెయ్యి పట్టుకుని ఒడిలో కూర్చోబెట్టుకున్నాడు.

అవును తండ్రీ ! విష్ణుమూర్తి నన్ను వంచించాడు. స్త్రీరూపం పొంది శతాధికవత్సరాలు సుఖాలు అనుభవించి, కడపటికి పుత్రవినాశరూపమైన మహాదుఃఖాన్ని చవిచూశాను. మళ్ళీ అతడే నా కళ్ళు తెరిపించాడు. మృదువాక్యామృతాలతో దివ్యోపదేశం చేశాడు. మళ్ళీ సరోవరంలో మునిగి నారదుణ్ణి అయ్యాను. తండ్రీ ! అప్పుడు అలా మోహపడటానికీ, పూర్వవిజ్ఞానాన్ని విస్మరించడానికీ కారణమేమిటో తెలియలేదు. ఈ దురత్యయమైన మాయాబలం ఎంతకీ అర్థంకావడం లేదు. అంతా తెలిసిపోయినట్టే ఉంటోంది ఏమీ తెలియడంలేదు. జ్ఞానహానికరమైన ఈ మహామోహానికి మూలం ఏమిటి ? అనుభవించానే తప్ప కారణం తెలుసుకోలేకపోయాను. నువ్వు దీన్ని ఎలా జయించగలిగావు ? ఆ ఉపాయమేదో నాకూ చెప్పు - అని అభ్యర్థించాను.



చతుర్ముఖుడు చిరునవ్వులు నల్దెసలకూ చిందించి - నాయనా ! ఇది దుర్జ్ఞేయం. మహామునీశ్వరులకూ తాపసులకూ యోగేశ్వరులకూ ఎవ్వరికీ అందని విషయం. నాకూ తెలియదు. నాకే కాదు హరిహరులకూ తెలియదు. సృష్టిస్థిత్యంతకారిణి అయిన ఆ మహామాయ దుర్జ్ఞేయ. కాలకర్మ స్వభావాదులైన నిమిత్తకారణాలు కొంతలోకొంత తెలుస్తాయి తప్ప మూలకారణం ఎవరికీ తెలీదు. దాని విషయమై చింత విడిచిపెట్టు. నీవు మేధావివి. నీకు అది మరొక కొత్త మోహం కాకూడదు. మనమందరమూ మాయామోహితులమే. ఆశ్చర్యపడవలసింది ఏమీ లేదు. నేను జయించానని ఎవరు చెప్పారు నీకు ? అంటూ నన్నే ఎదురు ప్రశ్నించాడు.

అక్కడితో తండ్రికి ఒక నమస్కారం పెట్టి తీర్థయాత్రలకు బయలుదేరాను. అలా అలా తిరుగుతూ తిరుగుతూ ఇదిగో ఇలా నీ ఆశ్రమానికి వచ్చాను. నువ్వేమో నీ కథ అంతా చెప్పి దుఃఖం తొలగించమంటూ నన్ను అడిగావు. నాకు తెలిసింది చెప్పాను. కౌరవపాండవుల పట్ల మోహాన్ని విడిచిపెట్టి ఇక్కడే సుఖంగా కాలం గడుపు. చేసిన కర్మ - చెడని పదార్థం. శుభమో అశుభమో అనుభవించక తీరదు. ఈ ఒక్కమాట గుర్తుంచుకో. సుఖంగా జీవించు.

జనమేజయా ! ఇలా ఉపదేశించి నారదుడు వెళ్ళిపోయాడు. ఆ వాక్యాలను మననం చేస్తూ ఆశ్రమంలో ఒంటరిగా మిగిలిపోయాను. ఏదో కాలక్షేపంకోసం ఈ భాగవతం రచించాను. ఇది సర్వ సంశయవినాశకమైన ఉత్తమోత్తమ పురాణం. వేదప్రామాణ్యసంశ్రితం. సందేహం లేదు.

## ◆ మాయాశక్తి మహిమ ◆

పారీక్షితా ! ఇంద్రజాలికుడు ఒక చెక్కబొమ్మను చేతితో పట్టుకుని ఇష్టం వచ్చినట్టల్లా ఎలా ఆడిస్తాడో అలా ఈ స్థావరజంగమాత్మకమైన సకల జగత్తునూ మాయాశక్తి ఆడిస్తోంది.

**యథైంద్రజాలికః కశ్చిత్ పాంచాలీం దారవీం కరే ।**
**కృత్వా నర్తయతే కామం స్వేచ్ఛయా వశవర్తినీమ్ ॥**
**తథా నర్తయతే మాయా జగత్ స్థావరజంగమమ్ ।**
**బ్రహ్మాదిస్తంభపర్యంతం సదేవాసురమానుషమ్ ॥ (31 - 29, 30)**

పంచేంద్రియాలకూ అధిష్ఠానం మనస్సయితే, దాని కదలికలకు కారణం ఈ గుణత్రయం. కారణగుణాలు కార్యాలలో ఉంటాయని వేరే చెప్పనవసరం లేదుగదా ! మాయాపరికల్పితాలైన ఈ



గుణాలు భిన్నభిన్న స్వభావాలకు కారణాలు. శాంతుడు ఘోరుడు మూఢుడు - వీటితోనే ఏర్పడుతున్నారు. ప్రతి మానవుడూ ఎప్పుడూ ఈ గుణత్రయంతో కలిసే ఉంటాడు. వీటికి అతీతుడుగానీ వీటిని వివర్జించినవాడుగానీ ఎవడూ లేడు. ఉండడు. ఉండలేడు. దారాలులేకుండా వస్త్రం ఉంటుందా ? మట్టిలేకుండా కుండ ఉంటుందా ?

తత్సమేత: పుమాన్నిత్యం తద్విహీన: కథం భవేత్ ।
న భవత్యేవ సంసారే రహితస్తంతుభి: పట: ॥
తథా గుణైస్త్రిభిర్హీనో న దేహీతి నిశ్చయ: ।
దేవదేవో మనుష్యో వా తిర్యక్చో వా నరాధిప ॥
గుణైర్విరహితో న స్యాత్ మృద్విహీనో ఘటో యథా
బ్రహ్మా విష్ణుస్తథా రుద్రస్త్రయశ్చామీ గుణాశ్రయా: ॥ (31 - 34, 35, 36)

త్రిమూర్తులుకూడా మనలాగా - ఒక్కొక్కప్పుడు ప్రీతి, మరొకప్పుడు కోపం, ఒకప్పుడు సంతోషం ఇంకొకప్పుడు దుఃఖం ఇలా ప్రకటిస్తూనే ఉంటారు. అనుభవిస్తూనే ఉంటారు. సత్త్వగుణం ఆవరించినప్పుడు బ్రహ్మదేవుడు శాంతుడై ఏకాగ్రతతో తపస్సు చేసుకుంటాడు. సర్వభూతప్రియుడు అవుతాడు. రజోగుణం ఆవరించినప్పుడు ఘోరరూపుడు అవుతాడు. అంతటా అప్రీతి ప్రకటిస్తాడు. తమోగుణం ఆవరించినప్పుడు మూఢుడై విషాదం పొందుతాడు. హరిహరులూ ఇంతే. యుగయుగాలలో సూర్యచంద్రవంశాలలో జన్మించిన మనుప్రభృతులు మొదలుకొని సకలమానవులూ ఇలాగే గుణత్రయాధీనులై స్పందిస్తూ ఉంటారు. ప్రవర్తిస్తూ ఉంటారు. అంచేత మాయాధీనం జగత్సర్వమ్ అనేది తిరుగులేని సత్యం.

అయితే ఆ మహామాయ సంవిద్రూపమైన పరతత్త్వంలో లీనమై ఉంటుంది. ఆ పరతత్త్వమే మాయను ప్రేరేపించి జీవులను ఆడింపజేస్తుంది. మాయావిశిష్టాంతమైన ఆ సంవిత్తుమాత్రమే పరమేశ్వరి. మాయేశ్వరి. భగవతి. సచ్చిదానంద స్వరూపిణి. ధ్యానించినవారికీ ఆరాధించినవారికీ నమస్కరించినవారికీ జపించినవారికీ ఆ తల్లి దయతలిస్తే మోక్షం ఇస్తుంది. సుఖదుఃఖరూప సంసారబంధనాలనుంచి విముక్తి కలిగిస్తుంది. ఆమెపట్ల మనస్సును సంలగ్నం చేసినవాడికి ఈ సాంసారిక బంధనాలూ భయాలూ ఏమీ ఉండవు. అందుచేత మాయను జయించాలంటే మాయేశ్వరినే ఉపాసించాలి. మరొక దిక్కులేదు. మరొక మార్గంలేదు. చీకటిని పారద్రోలాలంటే సూర్యచంద్రాదులే సమర్థులు. మాయను జయించాలంటే స్వయంప్రకాశమానురాలూ సంవిద్రూపిణి అయిన మాయేశ్వరీమాతనే ఉపాసించాలి.



జనమేజయా! నువ్వు అడిగినదల్లా చెప్పాను. ఇంకా ఏమి వినాలనుకుంటున్నావో చెప్పు. ఇక్కడికిది ఈ పురాణంలో పూర్వార్థం. ఇది శ్రీమాతృరహస్యం. భక్తితో పఠించినవారికీ విన్నవారికీ అఖిలైశ్వర్యాలూ పుష్కలంగా సిద్ధిస్తాయి. పారాయణ చేసినవారు జ్ఞానులై తరిస్తారు. దీన్ని బహూకరించిన వారికి దేవీయజ్ఞమహాఫలం లభిస్తుంది. *(అధ్యాయం - 31, శ్లోకాలు-60)*

**షష్ఠ స్కంధం - శ్లోకాలు 1884 - తెలుగుసేత : బేతవోలు రామబ్రహ్మం**

# సప్తమ స్కంధము

శౌనకాది మహామునులారా! మా గురువుగారు వ్యాసమహర్షి తనకూ నారదుడికీ జరిగిన సంభాషణ రూపంగా మాయాశక్తినీ మాయాస్వరూపాన్నీ వివరించి చెబితే శ్రద్ధగా ఆలకించిన జనమేజయుడు మరికొన్ని విశేషాలు అడిగి తెలుసుకున్నాడు. అవికూడా మీకు తెలియజెబుతాను వినండి అంటూ సూతుడు కథను కొనసాగించాడు.

సూర్యచంద్రవంశాల్లో ఎందరెందరో మహామహులు జన్మించారనీ వారందరూ దేవీభక్తి పరాయణులై తరించారనీ విన్నాను. ఆ రెండు వంశాల చరిత్రలనూ సవిస్తరంగా తెలుసుకోవాలని ఉంది, దయచేసి వివరించమని జనమేజయుడు కోరాడు. వ్యాసుడు అలాగేనని ఉపక్రమించాడు.

## ◆ నారదుడికి దక్షుడి శాపం ◆

జనమేజయా! విష్ణుమూర్తికి నాభికమలం నుంచి బ్రహ్మదేవుడు ఆవిర్భవించాడు. గొప్ప తపస్సు చేసి మహాదేవిని ఉపాసించి వరాలు పొంది జగత్తును సృష్టించడానికి ఉద్యుక్తుడయ్యాడు. అన్నింటినీ సృష్టించాడు కానీ మానవుణ్ణి సృష్టి చెయ్యడానికిమాత్రం అతడికి శక్తి చాలిందికాదు. ఎంతగానో ఆలోచించాడు. ఒక ఉపాయం తట్టింది. అశేషప్రజానీకాన్ని ఒక్కసారిగా సృష్టించలేను కనక శక్తి మేరకు కొందరినే సృష్టిద్దామనుకున్నాడు. ఏడుగురిని మానసపుత్రులుగా ఆవిర్భవింపజేశాడు. "ససర్జ మానసాన్ పుత్రాన్ సప్తసంఖ్యాన్ ప్రజాపతిః". మరీచి, అంగిరసుడు, అత్రి, వసిష్ఠుడు, పులహుడు, క్రతుడు, పులస్త్యుడు అని వారి పేర్లు. వీరు కాక రోషసముద్భవుడైన రుద్రుడు, ఒడినుంచి పుట్టిన నారదుడు, బొటనవేలు నుంచి ఆవిర్భవించిన దక్షుడు - బ్రహ్మదేవుని కుమారులే. సనకసనందనాదులు మరికొందరు మానసపుత్రులున్నారు. వీరందరూ పురుషులేకాగా, ఎడమ బొటనవేలునుంచి ఒక స్త్రీ ఆవిర్భవించింది. ఆవిడే దక్షపత్ని. సర్వాంగసుందరి. ఈవిడపేరు వీరిణి. అసిక్రీతి అనికూడా మరొక పేరు. వీరిణీదక్షులకు నారదుడు జన్మించాడు. దేవర్షి అయ్యాడు.

వ్యాసమహర్షీ! ఇది చాలా విచిత్రంగా ఉందే! వీరిణీదక్షులకు నారదుడు జన్మించాడంటున్నావు, ఇంతకు ముందు బ్రహ్మదేవుడి ఒడినుంచి పుట్టాడు అన్నావు. ఏమిటి ఈ వైరుధ్యం? శాపాలేమైనా ఉన్నాయా ?



జనమేజయా! రావలసిన సందేహమే వచ్చింది. దీనికీ జవాబు దొరుకుతుంది. ముందు కథ విను. వీరిణీదక్షులను ప్రజాసృష్టి చెయ్యమని బ్రహ్మదేవుడు ఆజ్ఞాపించాడు. ఆ దంపతులకు అయిదువేలమంది సంతానం కలిగారు. ఈ అధిక సంతానాన్ని చూసి నారదుడు పరిహసించాడు.

వీరిణీదక్షులారా! భూగోళం ఏపాటి ఉందో తెలుసుకోకుండా మీరు ఇలా సంతానాన్ని వృద్ధి పరిస్తే ఎలాగ? చివరికి నవ్వులపాలవుతారు గమనించండి. నా మాటవిని, ముందుగా పృథివీ ప్రమాణాన్ని తెలుసుకోండి. అటుపైని సంతానోత్పత్తి చెయ్యండి. అందరూ హర్షిస్తారు. ఏ ఇబ్బందులూ ఉండవు. లేకపోతే చిక్కునబడతారుసుమా!

భువః ప్రమాణమజ్ఞాత్వా స్రష్టుకామాః ప్రజాః కథమ్ ।
లోకానాం హాస్యతాం యూయం గమిష్యథ న సంశయః ॥
పృథివ్యా వై ప్రమాణం తు జ్ఞాత్వా కార్యస్సముద్యమః ।
కృతోఽసౌ సిద్ధిమాయాతి నావ్యథేతి వినిశ్చయః ॥ (1 - 21, 22)

నారదుడు ఇలా హెచ్చరించేసరికి దక్షసుతులు అవునుసుమా అనుకున్నారు. భూమండలం ఎంత ఉందో తెలుసుకువద్దామని అందరూ తలొకవైపూ బయలుదేరారు. అయిదువేలమందీ వెళ్ళిపోయారు. దక్షప్రజాపతికి బెంగ పట్టుకుంది. ఇల్లు బావురుమంటోంది. ఏమీ తోచడంలేదు. సరేనని మరికొందరు పుత్రుల్ని సృష్టించాడు. వాళ్ళు పెరిగి పెద్దవాళ్ళై తామూ సంతానాన్ని ఉత్పత్తి చెయ్యడం ఆరంభించారు. అదొక ఉద్యమంగా సాగుతోంది.

నారదుడు మళ్ళీ వేళాకోళం చేశాడు. మీరంతా మూర్ఖుల్లాగా ఉన్నారు. చెబుతోంటే వినిపించుకోరేమి? భూగోళం ఎంత ఉందో తెలుసుకోకుండా సంతానాన్ని ఉత్పత్తి చేస్తారేమిటి? - అని విసుక్కున్నాడు. నిజమేకదా అని ఈ దక్ష సుతులుకూడా తమ అన్నయ్యల్లాగానే తలోదిక్కుకీ వెళ్ళారు.

ఈసారి దక్షుడి పుత్రవిరహం కోపంగా పరిణమించింది. నారదుణ్ణి శపించాడు. నా పుత్రుల్ని నాశనం చేశావు కనక నువ్వూ నాశనమైపో. దుర్బుద్ధితో ఇంతటి పాపకార్యం చేశావు కనక గర్భవాస దుఃఖాన్ని అనుభవించు. అదికూడా నాకు పుత్రవిరహాన్ని కలిగించావు కాబట్టి నాకే పుత్రుడుగా ఆవిర్భవించు - అంటూ శాపం విసిరాడు దక్షప్రజాపతి.

బ్రహ్మదేవుడి ఉత్సంగంనుంచి అయోనిజుడై ఆవిర్భవించిన నారదుడు ఈ శాపం కారణంగా గర్భవాసక్లేశాన్ని అనుభవించి వీరిణీదక్షప్రజాపతులకు తనయుడుగా జన్మించాడు.

అటుపైని దక్షుడు పరమదక్షుడై అరవైమంది ఆడ పిల్లలకు తండ్రి అయ్యాడు. వీరిణీదేవి ఈ స్త్రీ సంతానాన్ని చూసి మురిసిపోయింది. అందరూ పెరిగి పెద్దవారయ్యారు. వీరిలో పదమూడు మందిని



కశ్యపుడికి ఇచ్చి వివాహం జరిపించాడు. పదిమందిని ధర్ముడికీ, ఇరవైయేడుమందిని చంద్రుడికీ, ఇద్దరిని భృగువుకీ, నలుగురిని అరిష్టనేమికీ, ఇద్దరిని అంగిరసుడికీ ఇచ్చి వేదోక్తంగా పరిణయోత్సవాలు జరిపించాడు. కొన్నాళ్ళు గడిచాక యుక్తవయస్కలైన చివరి ఇద్దరు కూతళ్ళనీ అంగిరసుడికే ఇచ్చి పాణిగ్రహణం జరిపించాడు. వీళ్ళంతా పుత్రపౌత్రవతులు అయ్యారు. ఆ సంతానమే మహాబలవంతులూ పరస్పర విరోధులూ దేవదానవులు. రాగద్వేషాలకు పెట్టిందిపేరులై మోహావృతులై నిరంతరం కలహించుకున్న సోదరులు వీరు. *(అధ్యాయం - 1, శ్లోకాలు - 38)*

జనమేజయా! నువ్వు అడిగిన సూర్యచంద్రవంశాల చరిత్ర ఇకనుంచి ప్రారంభమవుతుంది. శ్రద్ధగా విను. వినడానికి ఇంపుగా ఉంటుంది. ధర్మజ్ఞానాన్ని కలిగిస్తుంది. తెలుసుకోదగిన విశేషాలు ఎన్నో అందుతాయి. తీర్థయాత్రలు చేస్తూ ఒకప్పుడు నా ఆశ్రమానికి వచ్చిన నారదమహర్షి అనుగ్రహించి చెప్పగా విన్న పావనచరిత్ర ఇది.

## ◆ సూర్యవంశ చరిత్ర ◆

దేవతలూ దానవులూ ఆవిర్భవించారు అన్నానుకదా! ఆ దేవతలలో సుప్రసిద్ధుడు సూర్యుడు. అతడికే వివస్వంతుడనీ పేరు. అతని కుమారుడు వైవస్వతమనువు. ఇతని కొడుకు ఇక్ష్వాకుడు. సూర్యవంశ వివర్ధనుడు ఇతడే. ఇక్ష్వాకుడి తరవాత వైవస్వతమనువుకి మరి తొమ్మిదిమంది పుత్రులు ఆవిర్భవించారు. నాభాగుడు, ధృష్టుడు, శర్యాతి, నరిష్యంతుడు, ప్రాంశువు, నృగుడు, దిష్టుడు, కరూషుడు, పృషధ్రుడు అని వారి పేర్లు.

పెద్దకొడుకైన ఇక్ష్వాకుడికి నూరుమంది పుత్రులు కలిగారు. వారిలో జ్యేష్ఠుడు వికుక్షి. మిగతా తొమ్మండుగురు ఇక్ష్వాకు సోదరులను గురించి సంగ్రహంగా చెబుతాను. నాభాగుడికి అంబరీషుడు జన్మించాడు. ఇతడు ధర్మజ్ఞుడు. సత్యసంధుడు. మహావీరుడు. ప్రజాపాలన తత్పరుడు. ధృష్టుడి కొడుకు ధార్ష్టకుడు. ఇతడిలో క్షాత్రధర్మంకన్నా బ్రాహ్మణధర్మం ఎక్కువ. యుద్ధాలంటేనే భయం. నిరంతరం తపస్సు చేసుకునేవాడు. శర్యాతి కొడుకు ఆనర్తుడు. సుకన్య అనే కూతురుకూడా జన్మించింది. రూపలావణ్యవతి. చ్యవనుడనే రాజుకి - అంధుడైనా ఈ సుందరిని ఇచ్చి వివాహం చేశాడు శర్యాతి. సుకన్యాచ్యవనులకు గుణశీల సంపన్నుడైన కొడుకు పుట్టాడు. అతని పేరు సులోచనుడు. సూర్యపుత్రులైన అశ్వినులతో అన్నింటా సాటివచ్చేవాడని విన్నాను.

వ్యాసమహర్షీ! ఇక్కడ నాదొక సందేహం. సుకన్య చాలా అందగత్తె అంటున్నావు. అలాంటి సుందరీమణిని ఒక అంధుడికి ఇచ్చి వివాహం చెయ్యడమేమిటి పాపం? రూపం లేకపోతేనో గుణం మంచిది కాకపోతేనో ఏదో చేశారంటే అర్థం ఉంది. అసలు ఈ వివాహానికి ఆ అమ్మాయి ఎలా ఒప్పుకుంది? అంటూ జనమేజయుడు అడ్డుతగిలాడు.



## ◆ సుకన్యా చ్యవనుల కథ ◆

వ్యాసుడు చిన్నగా నవ్వి వివరాలు చెప్పాడు. జనమేజయా! నీ సందేహం సమంజసమే. శర్యాతికి నాలుగువందలమంది భార్యలున్నారు. అందరూ అందగత్తెలే. రాజపుత్రికలే. వారందరికీ ఒకేఒక్క గారాల కూతురు ఈ సుకన్య.

ఒకరోజున ఈ అమ్మాయి రాజధానికి చేరువలోనే ఉన్న ఒక సరోవరానికి వెళ్ళింది. అది మానససరోవరానికి అన్నింటా సాటివచ్చే సరోవరం. రేవుల్లోకి దిగేందుకు వీలుగా మెట్లు ఉన్నాయి. స్వచ్ఛమైన నీళ్ళు. నీటిపక్షుల కలకూజితాలు. రకరకాల కమలాలు. తుమ్మెదలు. నాలుగువైపులా గట్లమీద ఎత్తుగా ఒత్తుగా పెరిగిన చెట్లు. వాటికి అల్లుకొని పుష్పించిన లతలు. శుకపికాలాపాలు. ఆ చెట్లమధ్యన ఒక శుభప్రదేశంలో భార్గవుడైన చ్యవనుడు తపస్సు చేసుకుంటున్నాడు. పరమ శాంతుడు. విజనప్రదేశంకదా అని అక్కడికి చేరి తపోదీక్ష స్వీకరించాడు. ఇంద్రియాలను నిగ్రహించుకొని, నిరాహారుడై మంచినీళ్ళయినా ముట్టకుండా, కూచున్న చోటనుంచి కదలకుండా మహాదేవిని ఉపాసిస్తున్నాడు. అతని చుట్టూ తీగెలూ లతలూ పెరిగి పుట్ట ఏర్పడింది. పిపీలికాలు చేరాయి. అందులో ఒక మహర్షి తపస్సు చేసుకుంటున్నాడని ఎవరూ అనుకోరు. పైకి కనిపించడు. అంతా ఒక మట్టిపుట్ట.

ఆ ప్రాంతానికి వెళ్ళింది ఈ సుకన్య. శర్యాతి తన భార్యలతో కలిసి సరోవరంలో జలక్రీడలు ఆడుతున్నాడు. సుకన్యయేమో తన చెలికత్తెలతో వనవిహారం చేస్తోంది. ఆ పువ్వులూ ఈ కాయలూ తుంపుతూ అంతా కోలాహలంగా ఆడుతూ పాడుతూ తిరుగుతున్నారు. వారి అందెల సవ్వడులు అడవిలో సుకుమారంగా మారుమ్రోగుతున్నాయి. సుకన్య రవ్వంత అలిసిపోయి ఆ పుట్టదగ్గర చతికిలబడింది. దాని రంధ్రాలలోకి చూపులు నిగుడించింది. లోపల ఏవో రెండు మిడుగురులు మెరుస్తున్నట్టు కనిపించింది. ఏమిటో తెలుసుకోవాలనిపించింది. ఒక పొడవాటి సన్నని పుల్లను తీసుకుని పొడవబోయింది.

అందులో ఉన్న చ్యవనుడు సుకన్యను చూశాడు. రతిదేవిలా కనిపించింది. ఎండిపోయిన గొంతును పెగల్చుకుని - కల్యాణీ! ఏమిటది? విశాలాక్షీ! దూరం జరుగు. చంద్రవదనా! నేను తపస్విని. కృశోదరీ! ఈ పుట్టను నాశనం చెయ్యకు - అని సన్నగా హెచ్చరించాడు. అయినా సుకన్య ఆగలేదు. ఇదేదో వింత, తెలుసుకుందామని చాపల్యంకొద్దీ ఆ రంధ్రాల్లో పొడిచింది. చ్యవనుడికి కళ్ళు పోయాయి. ఏమి జరిగిందో తెలుసుకోలేని సుకన్య తన చెలికత్తెలతో మళ్ళీ ఆటల్లో పడింది. లోలోపల ఏదో శంకగానే ఉన్నా క్రీడల్లో మునిగిపోయింది.

కళ్ళుపోయిన బాధను తట్టుకోలేక చ్యవనుడు క్రుద్ధుడయ్యాడు. ఆ క్షణంలోనే రాజ పైనికులకూ పరివారానికీ గజాశ్వాలకూ శకృన్మూత్రనిర్బంధం అయిపోయింది. శర్యాతికీ అవి బంధించాయి. భరించలేని



ఇచ్చింది. అలాగే రాజధానికి చేరుకున్నాడు. ఏమి జరిగింది? ఎవరు ఎవరికి ఏమి అపకారం చేశారు? సైనికులను పిలిచి ఆరాతీశాడు. వాళ్ళు చెప్పారు - సరోవరానికి దగ్గరలోనే చ్యవనుడు తపస్సు చేసుకుంటున్నాడు, బహుశ మనవాళ్ళల్లో ఎవరో అతడికి ఏదో అపకారం చెయ్యడమో అవహేళన చెయ్యడమో జరిగి ఉంటుంది. ఆ తపస్వి కోపించి మనందరికీ మలమూత్ర బంధనం చేసి ఉంటాడు - అని.

***(అధ్యాయం -2, శ్లోకాలు - 65)***

శర్యాతి ఇంకా విచారణ కొనసాగిస్తున్నాడు. అందరూ మాకు తెలియదంటే మాకు తెలియదంటున్నారు. సైనికులకూ రాజుగారికీ గజాశ్వాలకూ శకృన్మూత్రాలు అవ్వడం లేదు. ఇదంతా గమనించిన సుకన్య తండ్రి దగ్గరికి వెళ్ళి పుట్టరంధ్రాలలో తాను పొడిచిన సంగతి, పొడిచిన పుల్లకొసకు తేమఅంటిన సంగతి, నీరసంగా హాహాకారాలు వినిపించిన సంగతి చెప్పి, ఆ పుట్టలో ఎవరు ఉన్నారో ఏమి జరిగిందో మాత్రం నాకు తెలియదని అమాయికంగా విన్నవించింది.

రాజుకి విషయం అర్థమయ్యింది. వెంటనే పుట్టను చేరుకున్నాడు. దుఃఖిస్తున్న చ్యవనుడు రంధ్రాలనుంచి కనిపించాడు. మెల్లగా వల్మీకాన్ని పగులగొట్టించాడు శర్యాతి. సాష్టాంగపడ్డాడు. వినయంగా నమస్కరించి నిలిచి స్తుతించాడు. అజ్ఞానంవల్ల మా అమ్మాయి నీకు తీరని అపకారం చేసింది. క్షమించు. మహామునీశ్వరులకు క్రోధం ఉండదని విన్నాను. అమాయికురాలు, చిన్నపిల్ల, మా సుకన్యను క్షమించు అని ప్రాధేయపడ్డాడు.

అక్రోధనా హి మునయః భవంతీతి మయా శ్రుతమ్ ।
తస్మాత్ త్వమపి బాలాయాః క్షంతు మర్హసి సాంప్రతమ్ ॥ (3 - 11)

రాజా! నేనింతవరకూ ఎప్పుడూ ఎవరిమీదా దేనికీ కోప్పడలేదు. ఇప్పుడుకూడా మిమ్మల్ని నేనేమీ శపించలేదు. ఏ పాపమూ ఎరగని నా కళ్ళు పొడిచిన పాపం బహుశ నిన్నూ నీవాళ్ళనూ పట్టిపీడిస్తున్నట్టుంది. దేవీభక్తులకు అపరాధం చేస్తే ఇంతే. హరిహరాదులయినా సరే దుఃఖాలపాలుకావలసిందే. శాస్తి అనుభవించవలసిందే. ఇప్పుడు నేనేమి చెయ్యను, ఎలా జీవించాలి. అసలే వృద్ధుణ్ణి. ఇప్పుడు అంధుణ్ణి. నాకు సేవలు ఎవరు చేస్తారు? ఎలా బతకను?

మహర్షీ! సేవకులను కావలసినంతమందిని నేను నియమిస్తాను. భక్తితాత్పర్యాలతో అహర్నిశలూ నీకు సేవలు చేస్తారు. తపస్వులు అల్పక్రోధులన్నారు. ఇంతటితో మమ్మల్ని క్షమించమని మరొకసారి అర్థిస్తున్నాము.



మహారాజా! గుడ్డివాడినైపోయాను. ఇదా నిర్జనారణ్యం. ఎలా తపస్సు చేసుకోగలను ? నువ్వు సేవకుల్ని నియమిస్తావు, నరే - వాళ్ళు శ్రద్ధగా సేవించొద్దూ! వాళ్ళు నీవాళ్ళు. నన్ను ప్రేమగా చూసుకుంటారా ? క్షమించమని నిజంగా నువ్వు అడుగుతున్నట్టయితే ఒక పని చెయ్యి. నీ కుమార్తెను నా సేవకు నియమించు. అది నాకు హాయిగా ఉంటుంది. నేను సంతృప్తి చెందితే నీకూ నీ సైనికులకూ ఈ మూత్రబంధనం తొలగిపోతుంది. ఆలోచించుకుని కన్యాదానం చెయ్యి. ఇందులో తప్పేమీ లేదు. నేను తపస్విని.

చ్యవనుడు చేసిన ఈ ప్రతిపాదన శర్యాతి గుండెల్లో ప్రకంపనాలు పుట్టించింది. ఇస్తాననీకానీ ఇవ్వననికానీ ఏమి చెప్పలేకపోయాడు. అంధుడు, వృద్ధుడు, కురూపి పైగా తపస్వి ఇతడికి దేవకన్యలాంటి మా అమ్మాయిని ఇస్తే సుఖపడుతుందా? అమ్మాయి సుఖంమాట అలా ఉంచు, నేను సుఖంగా జీవించగలనా? నా అనారోగ్యం కుదుటపడటానికి కూతురి సుఖాలను త్యాగం చెయ్యనా? ఎంత పనికిమాలినవాడైనా చేస్తాడా? మంచీచెడూ తెలిసి నేనెలా చెయ్యను? ఇతడితో సంసారం ఎలా చేస్తుంది? ఏమి సుఖపడుతుంది? యౌవనంలో ఉన్న సుందరాంగి తనకు తగిన భర్త కావాలని కోరుకుంటుందే తప్ప ఇలాంటి వృద్ధుణ్ణీ అంధుణ్ణీ ఇష్టపడుతుందా? అనురూప భర్త దొరికినా ఆ వయస్సులో మన్మథుణ్ణి తృప్తిపరచడం అసంభవమంటారు. ఇంక ఇలాంటి మగడితో సంసారమైతే చెప్పాలా!

> కోవాత్మవః సుఖార్థాయ పుత్ర్యాస్సంసారజం సుఖమ్ ।
> హరతేఽల్పమతిః పాపో జానన్నపి శుభాశుభమ్ ॥ (3 - 25)
> యౌవనే దుర్జయః కామో విశేషేణ సురూపయా ।
> ఆత్మతుల్యం పతింప్రాప్య కిము వృద్ధం విలోచనమ్ ॥ (3 - 27)

రూపయౌవనవతియైన అహల్య తపశ్శీలుడైన గౌతమునికి భార్య అయ్యింది. ఇంద్రుడితో వంచనకు గురి అయ్యింది. భర్త శపించాడు. తన తప్పు తెలుసుకుంది. పశ్చాత్తాపం పొందింది. ఇలాంటి ధర్మ విపర్యయాలు జరుగుతాయి - అననురూప వివాహాలవల్ల. అందుచేత సుకన్యను ఈ చ్యవనుడికి ఇవ్వను. మూత్రబంధన బాధను అనుభవిస్తాను - అని ఒక నిశ్చయానికి వచ్చి, మౌనంగా సాలోచనగా విశ్రమించి ఇంటికి చేరుకున్నాడు. మంత్రులను సమావేశపరిచాడు. ఈ ధర్మసంకట పరిస్థితిలో మీరంతా బాగా ఆలోచించి నాకేదైనా మార్గం చూపించండి. ఏమి చెయ్యమంటారో చెప్పండి - అని పలహా అడిగాడు. అందరూ ముక్తకంఠంగా ఒకేమాట చెప్పారు. ఒక కురూపి వృద్ధతపస్వికి ఇంతటి సుందరాంగి సుకన్యను ఇమ్మని ఎవరుమాత్రం ఎలా చెబుతారు - అన్నారు. శర్యాతి ఏ దారీ దొరకక మథనపడుతున్నాడు.



సుకన్యకు ఈ సంగతి తెలిసింది. చిన్నగా నవ్వుకుంది. సరాసరి తండ్రిని చేరుకుంది. నాన్నగారూ! ఇందులో మీరు ఇంతగా మధనపడవలసింది దిగులుపడవలసింది ఏమీ లేదు. నేనిప్పుడే వెళ్ళి ఆ మహర్షిని ఓదారుస్తాను. ప్రసన్నుణ్ణి చేసుకుంటాను. నన్ను నేను సమర్పించుకుంటాను - అంది.

అమ్మా! ఏమిటి ఈ సాహసం. నువ్వు ఆ వృద్ధుడికి పరిచర్యలు చేస్తావా? అందునా ఆ ఘోరారణ్యంలో ఒంటరిగా? అతడు అసలే క్రోధనుడు. అంధుడు. ఇవ్వి ఆలోచించావా? ఏ తండ్రి అయినా కన్న కూతురిని అందగాడికీ యువకుడికీ ధనవంతుడికీ విద్యావంతుడికీ గుణవంతుడికీ ఇవ్వాలనుకుంటాడేగానీ ఇలాంటి కురూపికీ వృద్ధుడికీ తాపసికీ ఇవ్వాలనుకుంటాడా? కూతురు ఇష్టపడితేమాత్రం తాను ఒప్పుకుంటాడా? నువ్వెక్కడ ఆ చ్యవనుడెక్కడ? ఏ ఒక్క అంశంలోనూ అనురూపత లేదే. ఎలా అంగీకరించను తల్లీ! ఇది అన్యాయం. అంతఃపురసౌధాలలో నివసించిన కూతురికి అడవుల్లో పర్ణశాలల్లో నివాసం కల్పించనా? ఇంతకన్నా నేనూ నా సైనికులూ ఈ అనారోగ్యంతో ఇలా మరణించడమే మంచిది. ఏది జరగాలని రాసిపెట్టిఉందో అది జరుగుతుంది. అంతే. నేను బేంబేలు పడిపోయి చూస్తూ చూస్తూ నీకు అన్యాయం చెయ్యను, చెయ్యలేను. అమ్మా! నువ్వు స్థిరచిత్తంతో ఉండు. ఏ అంధుడికీ నిన్ను ఇవ్వనుగాక ఇవ్వను. ఈ రాజ్యం, ఈ దేహం ఉంటే ఉండనీ, పోతే పోనీ. బాధలేదు. ఇది నా నిర్ణయం. ఇది నా నిశ్చయం.

తండ్రీ! చ్యవనమహర్షిని చేసుకోడానికి నేను ముమ్మాటికీ ఇష్టపడుతున్నాను. ఏమీ బాధపడటంలేదు. నన్ను అతడికి ఇచ్చి వివాహం జరిపించు. నావల్ల నీకూ నీ సైన్యానికీ ఏ కష్టమూ రాకూడదు. మీరంతా సుఖంగా జీవించాలి. అదొక్కటే నా ఆకాంక్ష. సంతోషంగా నాభర్తకు నేను సేవలు చేసుకుంటాను. అతడు పరమ పావనుడు. తపోధనుడు. భక్తితో ప్రీతితో సపర్యలు చేసి తరిస్తాను. వృద్ధుడికి సహాయపడటంలో ఉన్న సంతృప్తిని నన్ను పొందనివ్వండి. నాకు భోగాలపై కోరికలేదు. స్వస్థచిత్తంతోనే ఈ నిర్ణయం తీసుకున్నాను. స్వస్థచిత్తంతోనే ఈ మాట అంటున్నాను. నన్ను అనుమతించు.

సుకన్య ఇంత దృఢంగా తన నిశ్చయాన్ని ప్రకటిస్తే విన్న మంత్రులూ సామంతులూ అంతా ఆశ్చర్యపోయారు. శర్యాతి కాసేపు బాధపడినా, చివరికి సంతోషించాడు. పుత్రికతో వెంటనే బయలుదేరి చ్యవనుడిని దర్శించాడు. సాష్టాంగ నమస్కారం చేశాడు. స్వామీ! ఇదిగో మా అమ్మాయి సుకన్య. నీకు సమర్పిస్తున్నాను. స్వీకరించు. అని అప్పగించాడు. చ్యవనుడు సంబరపడి ముసిముసినవ్వులు చిందించాడు. శర్యాతి తెచ్చిన కానుకల నన్నింటినీ తిరస్కరించి సుకన్యనుమాత్రం స్వీకరించాడు. అతడు ప్రసన్నుడు కావడంతో రాజుకూ సైనికులకూ శకృన్మూత్రబంధనం వదిలిపోయింది.



శర్యాతి మహారాజు గృహోన్ముఖుడై బయలుదేరుతుండగా సుకన్య అంది - తండ్రీ ! నా భూషణాలూ చీనిచీనాంబరాలూ అన్నీ వెనక్కి తీసుకుని వెళ్ళిపో. నారచీరలను కొన్నింటిని ఇప్పించు. చాలు. మునిపత్నినికదా ఈ క్షణంనుంచి. అందుకని అవే వల్కలాలు ధరిస్తాను. భర్తతోపాటు తపస్సు చేసుకుంటాను. నీ కీర్తినీ నీ వంశ గౌరవాన్నీ నిలబెడతాను. ముల్లోకాలలోనూ నిలబెడతాను. పరలోకసుఖంకోసం ఇప్పటినుంచీ జీవిక సాగిస్తాను. అహర్నిశలూ అదే మార్గంలో పయనిస్తాను. కురూపి వృద్ధతాపసికి కన్నబిడ్డను ఇచ్చానే అని నువ్వు ఏమీ దిగులుపెట్టుకోకు. బెంగపడకు. వసిష్ఠుడికి అరుంధతీదేవిలాగా, అత్రిమహర్షికి అనసూయాదేవిలాగా నేను ఈ చ్యవనమహర్షికి ధర్మపత్నినై కీర్తి ప్రతిష్ఠలు పొందుతాను. నీకు పేరూ ప్రఖ్యాతీ తెస్తాను. నేను మరోలా మరోలా ప్రవర్తించి అప్రతిష్ఠ తెస్తానేమోనని భయపడకు. పతివ్రతామార్గం కలలోకూడా విడువను. ఇది నా ప్రతిజ్ఞ.

పరమధర్మజ్ఞుడైన శర్యాతి ఈ మాటలకు కుమిలిపోయాడు. దారుణంగా విలపించాడు. గత్యంతరం లేదన్నట్టు నారచీరలు తెప్పించి అందించాడు. సుకన్య వాటిని సంతోషంగా స్వీకరించి కళ్ళకు అద్దుకుంది. వొంటిమీది నగలన్నీ తీసేసింది. వాలుజడ ముడిచుట్టింది. నారచీరలు ధరించింది. పట్టుపుట్టాలూ రత్నాభరణాలూ తండ్రికి అందించింది. శర్యాతి ముఖం పాలిపోయింది. నోటమాట రాలేదు. అడుగుముందుకి కదలలేదు. శిలాప్రతిమలా అలా నిలబడిపోయాడు.

అంతఃపురకాంతలు ఈ దృశ్యాన్ని చూసి హృదయవిదారకంగా విలపించారు. ఓదార్చేందుకు ఎవరూ ధైర్యం చెయ్యలేకపోయారు. విలపించి విలపించి అలిసిపోయిన రాజునూ రాజకాంతలనూ కడకు మంత్రులు ఓదార్చారు. ఎట్టకేలకు తేరుకుని గుండె చిక్కబట్టుకుని అందరూ రాజధానికి బయలుదేరారు. రాజపుత్రిని ఒక మునిరాజుకు సమర్పించి బరువెక్కిన గుండెలతో మెల్లగా రాజధానికి చేరుకున్నారు.

***(అధ్యాయం -3, శ్లోకాలు - 64)***

**సుకన్యాదేవి** పూర్తిగా పతిసేవలో నిమగ్నురాలయ్యింది. ధర్మతత్పరురాలై అగ్నులను అర్చిస్తోంది. కందమూల ఫలాలను ఏరితెచ్చి భర్తకు అందిస్తోంది. ఉదయమే వేడినీళ్ళతో స్నానం చేయించి, వల్కలాలు ధరింపజేసి శుభ్రప్రదేశంలో ఆసనంపై కూర్చోబెట్టి, దర్భలూ కమండలూదకాలూ మొదలైన పూజా సామగ్రిని అందించి దగ్గర నిలబడి నిత్యకర్మలు చేయిస్తోంది. అడవిలో గాలించి నీవారధాన్యం తెచ్చి ఎండబోసి, దంచి, చెరిగి, రుచిగా వండిపెడుతోంది. పక్వఫలాలను భుజింపజేస్తోంది. భోజనం అయ్యాక ఆచమనానికి నీళ్ళు అందించి, కాళ్ళూ చేతులూ కడిగి, తాంబూలం అందించి, తీసుకువచ్చి శుభ్రాస్తరణంమీద విశ్రమింపజేస్తోంది. వింజామర వీస్తోంది. అటుపైని పతి అనుమతి తీసుకుని తాను వెళ్ళి శరీర సాధనంగా రెండు మెతుకులో రెండు ఫలాలో నోట్లో వేసుకుంటోంది. మళ్ళీ వచ్చి సన్నిధిలో



కూర్చుని ఏమి ఆజ్ఞ నాథా! అని వినయంగా అడుగుతోంది. కాళ్ళు వొత్తనా, మంచినీళ్ళు కావాలా - ఇత్యాదిగా అవసరాలు అడిగి తెలుసుకుంటోంది. సాయంకాల హోమాలకూ పూజలకూ సంబారాలు సమకూరుస్తోంది. నైవేద్యాలకు ఫలాలు సిద్ధం చేస్తోంది. అన్నీ అందిస్తూ పూజలు నిర్వహింపజేస్తోంది. ముగిశాక నివేదితఫలాలను ప్రసాదంగా తినిపిస్తోంది. మెత్తని శయ్య ఏర్పరచి పరుండబెడుతోంది. కాళ్ళు పట్టి భర్తకు సుఖనిద్ర పట్టేటట్టు చేస్తోంది. భర్త అడిగితే, కులస్త్రీ ధర్మాన్ని కాదనకుండా నిర్వహిస్తోంది. అతడి పాదాలచెంత తానూ నడుం వాలుస్తోంది. అర్ధరాత్రీ అపరాత్రీ భర్త నిద్రలేస్తే, అలికిడికి తానూ లేచి వింజామర వీస్తోంది. శీతకాలమైతే పుడకలతో సన్నమంట రగిల్చి వెచ్చదనం కలిగిస్తోంది.

తెల్లవారుజామున పతి నిద్రలేచే సరికే తాను శుచియై భర్తకు కాలకృత్యాల కోసం పాత్రతో నీళ్లూ మట్టిముద్దా సిద్ధంచేసి అందిస్తోంది. తానే కూడాఉండి దూరభూమికి తీసుకువెడుతోంది. అక్కడ కూర్చోబెట్టి తాను చాటున నిలబడుతోంది. ముగించుకున్నాడని తెలిశాక దగ్గరకు వెళ్ళి పాత్రను అందుకుని నడిపించుకుని పర్ణశాలకు తీసుకువస్తోంది. అరుగుమీద కూర్చోబెట్టి కాళ్ళు శుభ్రంగా కడిగి, ఆచమనం అందించి, దంతకాష్ఠంతో ధావనం చేయించి, గోరువెచ్చని శుద్ధోదకంతో స్నానం చేయిస్తోంది. స్నానం చేస్తూ అవసరమైన మంత్రాలను చ్యవనుడు మననం చేసుకుంటున్నాడు. ఇది సంధ్యాసమయం ఇది హోమకాలం అంటూ తెలియపరిచి ఆయావిధులను క్రమం తప్పకుండా నిర్విఘ్నంగా నిర్వహింపజేస్తోంది.

ఇటువంటి దినచర్యతో సుకన్యాదేవి చ్యవనమహర్షిని భక్తిశ్రద్ధలతో సేవిస్తోంది. ఆరాధిస్తోంది. అప్పుడప్పుడు వచ్చివెళ్ళే అతిథి మహర్షులకు ఉచితరీతిని గౌరవమర్యాదలు నెరపుతోంది. ఆనందంగా కాలం గడుస్తోంది.

## ◆ సుకన్యా నాసత్య సంవాదం ◆

ఒకరోజున - రూపయౌవన సంపన్నులూ రవిపుత్రులూ అయిన అశ్వినులు (నాసత్యులు) క్రీడా వినోదపరాయణులై ఆ ఆశ్రమ[ప్రదే]శానికి వచ్చారు. సమీపసరోవరంలో స్నానంచేసి తడిబట్టలతో మడిగా ఆశ్రమానికి నీళ్ళు తీసుకువెడు[తున్న] సుకన్యాదేవిని చూశారు. దేవకన్యలా మెరిసిపోతున్న ఆమె సౌందర్యానికి ముగ్ధులయ్యారు. దగ్గరగావెళ్ళి - గజగామినీ! ఒక్కక్షణం నిలబడు. మేమిద్దరం దేవపుత్రులం. నిజం చెప్పు. నువ్వు ఎవరి అమ్మాయివి? నీ భర్త ఎవడు? ఇక్కడికి ఎందుకు వచ్చావు? ఒంటరిగా స్నానానికి వచ్చావంటే ఏమిటి కథ? పద్మపత్ర విశాలాక్షీ! మరొక లక్ష్మీదేవిలాగా ఉన్నావు. నీ విషయమంతా తెలుసుకోవాలనుకుంటున్నాం. నీ సుకుమారమైన పాదాలు ఈ కఠినమైన నేలమీద నడుస్తోంటే మాకు గుండెలు తరుక్కుపోతున్నాయి. తన్వంగీ! నువ్వు విమానాలలో తిరగవలసినదానివి. ఇలా వట్టికాళ్ళతో నేలమీద సంచరించవలసినదానవు కాదు. అనావిష్కృతవై ఈ అడవిలో ఇలా ఎందుకు ఉంటున్నావు?



ఎక్కడికి వెడుతున్నావు? నూరుమంది దాసీలతో కదలవలసినదానివి. రాకుమారివో? అప్సరసవో? నీ తల్లిదండ్రులు ఎవరోకానీ పరమధన్యులు. నీ పతిదేవుడి అదృష్టాన్ని వర్ణించి చెప్పడం మావల్ల కాదు. నీ కదలాడుతున్న పాదాలు ఈ భూమిని దేవలోకంకన్నా పావనం చేస్తున్నాయి.

దేవలోకాధికా భూమిరియం చైవ సులోచనే ।
ప్రచలంశ్చరణస్తేఽద్య సంపావయతి భూతలమ్ ॥ (4 - 36)
సౌభాగ్యాశ్చ మృగాః కామం యే త్వాం పశ్యంతి వై వనే ।
యే చాన్యే పక్షిణః సర్వే భూరియం చాతిపావనా ॥ (4 - 37)

ఈ అడవిలో రోజూ నిన్ను తనివితీరా చూడగలుగుతున్నాయి ఈ పక్షులూ మృగాలూ. ఎంత అదృష్టం చేసుకున్నాయో! నిరంతరం నీ స్పర్శను అనుభవిస్తున్న ఈ నేల ఎంత పావనమైనదో! హే సులోచనే! పొగడ్తలకేమిగానీ సత్యం చెప్పు. నీ తల్లిదండ్రులెవరు? నీ భర్త ఎవడు? ఎక్కడ ఉన్నాడు? **అతడిని** చూడాలి మేము.

హఠాత్తుగా ఎదురైన ఈ పరిస్థితికి రవ్వంత నివ్వెరపోయింది సుకన్యాదేవి. తడిబట్టలతో పరపురుషుల కంటబడినందుకు సిగ్గుపడింది. అయినా తనని తాను నిబ్బరించుకుని బదులు పలికింది. నేను శర్యాతితనయను. చ్యవనమహర్షి భార్యను. మాతండ్రిగారు నన్ను వారికిచ్చి వివాహం చేశారు. నాభర్త అంధుడు, వృద్ధుడు, మహాతపస్వి. పతివ్రతనై చ్యవనమహర్షికి అహోరాత్రాలూ సేవలు చేస్తూ ఆనందిస్తున్నాను. ఇంతకీ మీరిద్దరూ ఎవరు? ఇక్కడికి ఎందుకు వచ్చినట్టు? దగ్గరలోనే ఉంది మా ఆశ్రమం. నా పతిదేవుణ్ణి దర్శించాలన్నారుగదా! రండి. మా ఆశ్రమానికి వెడదాం. పావనం చేద్దురుగాని. మహర్షిని చూద్దురుగాని - అని ఆదరంగా ఆహ్వానించింది. దస్రులు (అశ్వినులు) తడబడ్డారు. కొంచెం తటపటాయించారు. బింకంగా సంభాషణ సాగించారు.

అయ్యో! మీ నాన్న నిన్ను తపస్వికి ఇచ్చి చేశాడా? ఎంత కఠినాత్ముడు! నువ్వు చూస్తే ఈ అడవిలో నేలమీద నడుస్తున్న మెరుపుతీగలా మెరిసిపోతున్నావు. దేవలోకంలోకూడా నీలాంటి సుందరాంగి లేదంటే నమ్ము. ఈ నారచీరలు కాదు, నువ్వు దివ్యాంబరాలు కట్టుకోవాలి. వాటికే నువ్వు తగుదువు. రత్నాభరణాలు అలంకరించుకుని, తుమ్మెదల్లాంటి ముంగురులు ముఖపద్మంమీద నాట్యంచేస్తుంటే నీరూపం చూడాలి. రంభాద్యప్సరసలు తలదించుకోవాలి. ఆహా! బ్రహ్మదేవుడు ఎంత దుర్మార్గుడు! నీకు ఇలా వట్టడవిలో కాపురం రాశాడా; అదీ ఒక జడధారికి, అంధుడికి, వృద్ధుడికి భార్యవై పడిఉండే అవస్థ కల్పించాడా? దారుణం. భామినీ! ఇది మహాదారుణం. విశాలనయనా! నాట్యశాస్త్ర పండితురాలిలా కనిపిస్తున్నావు. నువ్వు ఆ కన్నులులేని కబోదికి పరిచర్యలు చెయ్యడమా? మరి మన్మథుడి బాణాలు ఎవరిమీద పడుతున్నట్టు, ఏమవుతున్నట్టు?



ఓ నవయౌవనా! జీవితాన్ని ఇక వృధాచేసుకోకు. నీకు తగిన మరొక అందగాడిని పతిగా వరించు. నీకు ఈ వనవాసమూ నారచీరలూ తపోదీక్షలూ ఎంతమాత్రమూ పనికిరావు. ఇది మా కచ్చితమైన అభిప్రాయం. ఇదిగో మేము ఇద్దరం ఉన్నాం. ఎవరినో ఒకరిని వరించు. ఆ ముసలివాడికి ఇంకా ఎంతకాలమని సేవలు చేస్తావు. చేసి ఏమి బావుకుంటావు. ఒక అచ్చటా? ముచ్చటా? సుందరాంగిని భార్యగా పొందగానే సరిపోయిందా? ఆలనాపాలనా చూడొద్దూ! పోషించలేని మగడూ ఒక మగడేనా? నిన్ను సంరక్షించలేని ఆ నిర్భాగ్యుణ్ణి వదిలిపెట్టెయ్. మాలో ఒకడిని వరించు. సర్వసుఖాలూ భోగాలూ అనుభవించు. యౌవనం స్థిరంగా కూచుంటుందనుకుంటున్నావేమో! పిచ్చిదానా! అదొక ప్రవాహం. గడిచి పోయాక విచారిస్తావు. అప్పుడు ఏమీ ప్రయోజనం ఉండదు. తెలుసుకో. మా మాట విను. చైత్రరథంలోనో నందనవనంలోనో విహరించు. నీ శుభలక్షణాలు చెబుతూనే ఉన్నాయి నువ్వు రాజకుమారివని. రాజభోగాలు చవిచూసినదానవు ఈ విజనారణ్యంలో అసలు ఎలా కాలం గడుపుతున్నావో మాకు అర్థం కావడంలేదు.

ఓ పికభాషిణీ! ఓ చారువదనా! ఓ మృగశాబకచంచల నయనా! ఓ రాకుమారీ! దేవలోక భోగభాగ్యాలు నీకోసం ఎదురుచూస్తున్నాయి. అందుకో. ఈ వనవాసమూ ఈ వృద్ధాంధసేవా నీకు దుఃఖమనిపించడంలేదూ? వయస్సునీ మనస్సునీ వంచించుకోకు. ధైర్యంగా బయటపడు. మాలో ఒకరిని అంగీకరించు. ఆలస్యం చెయ్యకు. త్వరపడు. ఓ చంద్రముఖీ! నువ్వు మల్లెపువ్వుకన్నా సుకుమారివి. నీళ్ళు మొయ్యడమూ పళ్ళు తేవడమూ - ఏమిటి ఈ చాకిరీ. సేవలు చేయించుకోవలసినదానవే తప్ప చెయ్యవలసినదానవు కాదుగదా. ***(అధ్యాయం - 4, శ్లోకాలు - 56)***

దస్రుల మాటలకు (అశ్వినులు = నాసత్యులు = దస్రులు) సుకన్యకు భయం వేసింది. వొణికిపోయింది. ఎలాగో ధైర్యం కూడగట్టుకుని మితంగా జవాబు చెప్పింది.

మహానుభావులారా! మీరు దేవతలు. సూర్యభగవానుడి పుత్రులు. సర్వజ్ఞులు. సురసమ్మతులు. నావంటి సౌశీల్యవతిని మీరు ఇలా భాషించడం తగదు. స్వయంగా ఇష్టపడి పెద్దల సమ్మతితో ఒక యోగీశ్వరుణ్ణి పరిణయమాడాను. నేను అపమార్గం తొక్కలేను. సర్వలోకద్రష్ట సర్వకర్మసాక్షి అయిన దివాకరుడికి పుత్రులై జన్మించిన మీరు ఇలా మాట్లాడకూడదు. సమంజసంకాదు. నేను కులస్త్రీని. భర్తను విడిచిపెట్టి పరుణ్ణి వరిస్తానా? ఈమాట అనడానికి మీకు నోరు ఎలావచ్చింది? అసారమైన ఈ సంసారంలో ధర్మం ఏమిటో అధర్మం ఏమిటో ఆమాత్రం తెలుసుకోలేకపోయారా? ఇక చాలు. సంతోషించాను మీ తెలివితేటలకి. మర్యాదగా, వచ్చినదారిని వెళ్ళండి. లేదంటే శపిస్తాను. జాగ్రత్త. నేను సుకన్యను. శర్యాతిమహారాజు కూతురిని. చ్యవనమహర్షి ఇల్లాలిని.



యథేచ్ఛం గచ్ఛతం దేవౌ శాపం దాస్యామి వాంఽఘౌ ।
సుకన్యాహం చ శర్యాతేః పతిభక్తిపరాయణా ॥ (5 - 6)

నాసత్యులు నివ్వెరపోయా: ఈవిడే శపిస్తుందో చ్యవనుడే శపిస్తాడో అని భయపడ్డారు. తెలివిగా ఈవిడను ప్రసన్నురాలిని చేసుకుని తప్పించుకుందామని నిశ్చయించుకున్నారు.

## ◆ దేవీమహిమతో పరీక్షలో నెగ్గిన సుకన్య ◆

సాధ్వీమణీ! విజయం సాధించావు. నీ సౌశీల్యానికి ప్రసన్నులమయ్యాం. నీ శ్రేయస్సు కోరినవాళ్ళం. ఏదైనా వరం కోరుకో. ఇస్తాం. మేము అశ్వినులం. దేవవైద్యులం. తెలుసుగదా! నీ భర్తను రూపయౌవన సంపన్నుడైన యువకుడుగా మార్చేస్తాం. మాతో సమానుణ్ణి చేస్తాం. అప్పుడు మా ముగ్గురిలో నీ భర్తను గుర్తుపట్టి నీ చాతుర్యం చూపించు. సంతోషిస్తాం.

ఇప్పుడు ఆశ్చర్యపోవడం సుకన్యవంతు అయ్యింది. త్వరత్వరగా వెళ్ళి ఈ అద్భుతాన్ని తన భర్తకు విన్నవించింది. నాథా! ఇప్పుడు నా కర్తవ్యం ఏమిటి? దేవమాయ దుర్జ్ఞేయమంటారు. ఇదేమన్నా అశ్వినుల కపటోపాయమా? నాకేమీ తెలియడంలేదు. అంతా అయోమయంగా ఉంది. నువ్వు సర్వజ్ఞుడవు. ఆజ్ఞాపించు. నువ్వు ఏమి చెయ్యమంటే అది చేస్తాను. నీ అభీప్సితమేమిటో తెలియజెయ్యి - అని అభ్యర్థించింది.

కాంతా! వెంటనే వెళ్ళు. ఆ దేవవైద్యులను నా మాటగా ఆహ్వానించు. ఇక్కడికి తీసుకురా. ఇందులో ఆలోచించవలసింది ఏమీలేదు. వారు చెప్పినట్టు చెయ్యి - అని అనుమతించాడు చ్యవనుడు.

సుకన్య త్వరత్వరగా అశ్వినులను సమీపించింది. సూర్యపుత్రులారా! మీ షరతుకి అంగీకరిస్తున్నాను. రండి. మా ఆశ్రమానికి వచ్చి నా భర్తను మీతో సాటివచ్చేవాడుగా మార్చండి - అంది. ఆమెతో అశ్వినులిద్దరూ చ్యవనమహర్షి ఆశ్రమానికి వచ్చారు. అతడిని సమీపసరోవరానికి తీసుకురమ్మని తాము ముందునడిచారు. సరోవరంలో దిగి స్నానం చెయ్యమన్నారు. చ్యవనుడు నీళ్ళల్లోకి దిగాడు. అతడి వెనకగా అశ్వినులు దిగారు. ముగ్గురూ ఒక్కసారిగా మునిగారు. లేచేసరికి - ముగ్గురూ సమానరూప యౌవన సౌందర్యాలతో కనిపించారు సుకన్యాదేవికి. తన కన్నులను తానే నమ్మలేకపోయింది. ఆనంద బాష్పాలు కమ్ముకున్నాయి. బొమ్మలా నిలబడి చూస్తోంది.

వరవర్ణినీ! మా ముగ్గురిలో నీకు నచ్చిన భర్తను వరించు. అత్యంత ప్రీతిపాత్రుడు ఎవరో గుర్తించు - అన్నారు ముగ్గురూ కలిసి ఏకకంఠంతో.



కంఠస్వరాలు కూడా ఒక్కలాగే ఉన్నాయి. సుకన్యాదేవికి ఇది పెద్ద పరీక్ష అయ్యింది. సంశయంలో పడింది. భర్తను గుర్తుపట్టలేక మథనపడింది. ఏమి చెయ్యను? ఈ దేవతలు ఇంద్రజాలం కల్పించారు. ఇది నాకు మరణావస్థలాగా ఉంది. పొరపాటున అశ్వినులలో ఒకరిని వరించానంటే ఎంత ప్రమాదం! ఎలాగ, ఎలాగ? - అనుకుంటోంది. ఎంతకీ తెమలలేదు. దారి దొరకలేదు. విశ్వేశ్వరిని ధ్యానించింది. అమ్మా! నువ్వే దిక్కు. నా పాతివ్రత్యాన్ని కాపాడు. నీ పాదాలకు శిరసునువంచి మొక్కుతున్నాను.

**నమః పద్మోద్భవే దేవి! నమః శంకరవల్లభే ।**
**విష్ణుప్రియే నమో లక్ష్మి ! వేదమాతః సరస్వతి! ॥ (5 - 33)**

బ్రహ్మవిష్ణుమహేశ్వరులను కన్నతల్లివి. జగత్తును సృష్టించి రక్షించే జగన్మాతవు. అజ్ఞానులకు జ్ఞానాన్నీ, జ్ఞానులకు మోక్షాన్నీ ప్రసాదించే సర్వేశ్వరివి. నువ్వు పూర్ణప్రకృతివి. అజ్ఞాస్వరూపానివి. పురుషప్రియదర్శనవు. భుక్తిముక్తి ప్రదాయినివి. యోగీశ్వరులకు సిద్ధిప్రదవు. అజ్ఞానులకు దుఃఖప్రదవు. భక్తులకు జయప్రదవూ కీర్తిప్రదవూను. అమ్మా! నిన్ను శరణువేడుతున్నాను. ప్రపన్నురాలినై ప్రార్థిస్తున్నాను. శోకసాగరంలో మునిగిపోయాను. నా భర్తను నాకు చూపించు. గుర్తించే శక్తిని అనుగ్రహించు. దేవతల చరిత్ర పరమకుటిలం. మోహపడి ఎవరిని వరిస్తానో అని భయంగా ఉంది. నా సతీధర్మం నువ్వు ఎరుగుదువు. సర్వజ్ఞా! నా భర్తను నాకు చూపించు - అని ప్రార్థించింది. అమ్మవారు కరుణించింది. సుకన్యాదేవి హృదయంలో త్రిపురసుందరి నిలిచింది. భర్తను గుర్తుపట్టే జ్ఞానాన్ని అనుగ్రహించింది. వెంటనే ఆ సాధ్వీమణి చ్యవనుణ్ణి వరించింది. అశ్వినులు సంతోషించారు. పాతివ్రత్యాన్ని అభినందించారు. వరాన్ని సఫలం చేసి వీడ్కోలు తీసుకున్నారు. అందమైన రూపూ, స్పష్టమైన చూపూ పొందిన చ్యవనుడు నవయౌవనుడు సంబరపడుతూ -

నాసత్యులారా! ఇంతటి మహోపకారం చేశారు. సంసార సుఖాలను పొందే అవకాశం కల్పించారు. ఇంతకాలమూ అంధుణ్ణి, వృద్ధుణ్ణి, భోగహీనుణ్ణి. ఈ సుందరాంగిని వివాహమాడి హింసపెడుతున్నానే అని గుండెల్లో దిగులుపడేవాణ్ణి. నాలో నేనే దుఃఖించేవాడిని. మీరు చూపు ఇచ్చారు. యౌవనం ఇచ్చారు. అద్భుతమైన రూపం ఇచ్చారు. మీకు ప్రత్యుపకారం చెయ్యాలని ఉంది. ఉపకారం చేసిన మిత్రుడికి ప్రత్యుపకారం చెయ్యనివాడు నీచుడు. వాడి జన్మ వ్యర్థం. ఋణగ్రస్తుడయినట్టే.

**ఉపకారిణి మిత్రే యో నోపకుర్యాత్కథంచన ।**
**తం ధిగస్తు నరం దేవా ! భవేచ్చ ఋణవాన్ భువి ॥ ( 5 - 47)**



అందుచేత, ఓ అశ్వినులారా! మీరు కోరుకున్నది ఏదైనా ఇవ్వాలి అని నా తలంపు. బుజ్జ తీర్చుకోనివ్వండి. సురాసురులకు అలభ్యమైనదీ వినూతన మైనదీ - మీ ఇష్టం ఏదైనా కోరుకోండి - అప చ్యవనుడు నిర్బంధించాడు.

మహర్షీ! మా తండ్రిగారి అనుగ్రహం వల్ల మాకు కావలసినవన్నీ పుష్కలంగా లభిస్తూనే ఉన్నాయి. కోరుకోవలసింది ఏమీ లేదు. అయినా నీ సంతృప్తికోసం ఒకటి అడుగుతున్నాం, నెరవేర్చు. దేవతలతోపాటు సోమపానం చెయ్యాలని మా చిరకాల వాంఛ. దేవవైద్యులం కనక మాకు అది నిషిద్ధవస్తువయ్యింది. మేరు పర్వతంమీద బ్రహ్మదేవుడు యజ్ఞం చేసినప్పుడు దేవేంద్రుడు మా ఇద్దరికీ ఈ నిషేధం విధించాడు. అప్పటినుంచీ మాకు ఇది తీరనికోరిక అయ్యింది. నువ్వేమన్నా తీర్చగలిగితే ఈ చిన్నికోరిక తీర్చు - అన్నారు అశ్వినులు.

అశ్వినులారా! అదెంతటి మహాభాగ్యం. తప్పక తీరుస్తాను. మిమ్మల్ని సోమపాయుల్ని చేస్తాను. ఇంద్రుడికి కోపంవస్తే వచ్చుగాక. అతడి సమక్షంలోనే మాట నిలబెట్టుకుంటాను. మా మామగారు శర్యాతిమహారాజు త్వరలోనే ఒక మహాయజ్ఞం చేస్తాడు. అప్పుడు మీ కోరిక తీరుస్తాను. ఇది నా వాగ్దానం - అన్నాడు చ్యవనుడు. అశ్వినులు సంతోషించి వెళ్ళిపోయారు. సుకన్యాచ్యవనులు ఆశ్రమం చేరుకున్నారు.

*(అధ్యాయం - 5, శ్లోకాలు 59)*

వ్యాసమహర్షి సూర్యచంద్రవంశాల చరిత్రను చెబుతూండగా శర్యాతి విషయంవచ్చి, సుకన్యాచ్యవనుల కథ విస్తరించింది. జనమేజయుడు శ్రద్ధగా ఆలకించాడు. ఈ కథలో మరికొన్ని వివరాలు అడిగాడు.

వ్యాసమహర్షీ ! దేవవైద్యులకు చ్యవనుడు సోమరసం తాగించాడా? మరి ఇంద్రుడు కోపించలేదా? దేవరాజబలంతో మానుషబలం పోటీపడి నెగ్గగలిగిందా? ఇది చాలా కుతూహలాన్ని కలిగిస్తోంది. వివరించవా?

జనమేజయా! తప్పకుండా వివరిస్తాను. విను. ఇది చాలా అద్భుతమైన కథ. దేవకన్యలాంటి సుకన్యతో చ్యవనమహర్షి గృహస్థాశ్రమ ధర్మాలు నిర్వహిస్తున్నాడు. తన అల్లుడు సుందరాకారుడయ్యాడని శర్యాతి దంపతులకు ఇంకా తెలియలేదు.



## ◆ శర్యాతి సుకన్యను శంకించడం ◆

ఒకనాడు శర్యాతి భార్య దుఃఖిస్తూ భర్త దగ్గరికి వచ్చింది. మహారాజా! బంగారం లాంటి అమ్మాయిని ఒక వృద్ధాంధతాపసికి కట్టబెట్టి అడవుల్లో విడిచిపెట్టి వచ్చాం. చాలాకాలమయ్యింది. ఎలా ఉందో! జీవించి ఉందో, మరణించిందో! కుశలవార్తలు ఏమీ అందడంలేదు. ఒకసారి వెళ్ళి చూసి రాకూడదా! కూతురికి ఇలాంటి సంబంధం చేశామే అని నేను ఏడవని రోజంటూ లేదు. పిచ్చితల్లి, మొగుడికి సేవలతో ఆ అడవుల్లో చిక్కిశల్యమైపోయుంటుంది. వెళ్ళి ఒకసారి ఇంటికి తీసుకురండి. బెంగ పెట్టుకున్నాను. చూడాలనిపిస్తోంది. నారచీరలతో కందమూలాలతో ఆ గుడ్డి మొగుడితో ఎలా పడుతోందో ఏమో! - అని కళ్ళనీళ్ళు పెట్టుకుంది.

శర్యాతి వెంటనే అంగీకరించాడు. ఈ రోజే వెడదాం. ఇద్దరం కలిసివెడదాం. అమ్మాయినీ అల్లుణ్ణీ చూసివద్దాం - అని ఓదార్చాడు. వెంటనే రథం అధిరోహించి చ్యవనమహర్షి ఆశ్రమం చేరుకున్నారు. నవయౌవన సంపన్నుడై దేవపుత్రుడిలా వెలిగిపోతూ కళ్ళు మూసుకుని జపం చేసుకుంటున్న మునీశ్వరుణ్ణి చూశారు. ఇద్దరూ క్షణకాలం ఆశ్చర్యపోయారు. ఇదేమిటి? ఈ సుందరాకారుడెవరు? ఛీఛీ! ఎంత మహాపాపం చేస్తోంది మన అమ్మాయి. లోకానికి తెలిస్తే ఎంత అప్రతిష్ఠ! గుడ్డిమగడిని చంపేసి ఈ అందగాడితో కాపురం పెట్టిందన్నమాట. కామపీడితురాలై ఇంతపని చేసిందా? అవును, ఎంతటివారికైనా యౌవనంలో మన్మథుడు అతిదుస్సహుడుగదా! మనువంశానికి పెద్ద కళంకం, మాయని మచ్చ తెచ్చిపెట్టింది.

దుస్సహోఽయం పుష్పధన్వా విశేషణ చ యౌవనే ।
కులే కళంకస్సుమహానవయా మానవే కృతః ॥ (6 - 16)

కన్నకూతురు కళంకిని అయ్యిందంటే ఆ తండ్రి జీవితం పరమకుత్సితం. అన్ని పాపాలూ మూటగట్టుకుని ఏడిపించడానికే పుడుతుంది కూతురు. నేనూ పొరపాటే చేశాను. నా స్వార్థంకోసం వృద్ధాంధతాపసికి కట్టబెట్టాను. అన్నివిధాలా యోగ్యుణ్ణి చూసి కన్యాదానం చెయ్యాలంటారు. నేను చేసినదానికి తగిన ఫలమే దక్కింది.

కన్యా యోగ్యాయ దాతవ్యా పిత్రా సర్వాత్మనా కిల ।
తాదృశం హి ఫలం ప్రాప్తం యాదృశం వై కృతం మయా ॥ (6 - 19)

ఈ దుశ్శీలను ఏం చేసినా పాపం లేదు. నరికిపారెయ్యాలి. కానీ స్త్రీహత్యాపాతకం అంటుకుంటుంది. అందులోనూ కన్నకూతిరిని సంహరించడం మరీపాపం. నిష్కళంకమైన మనువంశానికి నా చేతులతో నేనే కళంకం తెచ్చిపెట్టినవాడినవుతాను. లోకాపవాదానికి భయపడనా, ప్రేమానురాగాలకు కట్టుపడనా ? ఏమి చెయ్యాలో తోచడంలేదు.



శర్యాతి మహారాజు ఇలా మల్లగుల్లాలు పడుతున్నాడు. రాజదంపతులు రథం దిగకుండా ఆశ్రమానికి అల్లంతదూరంలో ఉండిపోయారు. అంతలోకీ అదృష్టవశాత్తు సుకన్యాదేవి పర్ణశాలనుంచి బయటకు వచ్చింది. రథంలోనే నిలబడ్డ తల్లిదండ్రులను చూసింది. ఆనందం ఆపుకోలేక పరుగుపరుగున వచ్చింది. రండి, రండి. అక్కడే ఆగిపోయారేం? తండ్రీ! ఏమిటి అలా ఉన్నావు? ఏదో లోలోపల నలిగిపోతున్నట్టున్నారేమిటి? మునుపటి దుఃఖం ఇంకా మిమ్మల్ని వదలలేదా? ఇంక ఇప్పుడు వదిలిపోతుందిలెండి రండి. అడిగో నా భర్త. నమస్కరించండి.

మండిపోతున్న శర్యాతి - కూతురి మాటలకు అడ్డుతగిలాడు. ఏడీ చ్యవనుడు? వృద్ధుడూ అంధుడూ అయిన తాపసి ఏడీ? ఎక్కడున్నాడు? ఈ మదోన్మత్తుడైన యువకుడు ఎవరు? నాకెంతో సందేహంగా ఉంది. దుష్టురాలా! మహర్షిని చంపేసి కామాంధురాలవై ఈ కొత్తమొగుడితో కులుకుతున్నావా? కులవినాశినీ! ఎంత మహాపాపం చేశావు? కులటలా ప్రవర్తించావు. నువ్వు చేసిన ఈ మహాపాపసముద్రంలో నేనేకాదు ఇక్ష్వాకు వంశమంతా మునిగిపోయింది. ఈ సుందరాకారుడు కనపడుతున్నాడు. చ్యవనముని అలికిడి ఎక్కడాలేదు.

సుకన్యాదేవి ఒక్కసారి పెద్దపెట్టున నవ్వేసింది. తల్లిదండ్రుల కుడిఎడమ చేతుల్ని తన ఎడమ కుడిచేతులతో పట్టుకుంది. నవ్వుతూనే ఆశ్రమంలోపలికి నడిపించుకు వచ్చింది. నాన్నా! ఈయనే మీ అల్లుడు. చ్యవనమహర్షి. అనుమానించవలసింది ఏమీలేదు. ఇది పచ్చి నిజం. అశ్వినీదేవతలు అనుగ్రహించి వీరికి ఈ దివ్యరూపం ప్రసాదించారు. తండ్రీ! నేను నీ కూతుర్నికానా? పాపం చేస్తానని ఎలా అనుకున్నావు? బహుశ వీరి రూపం నిన్ను భ్రమపెట్టి ఉంటుంది. భార్గవ వంశోద్భవుడైన ఈ చ్యవనమహర్షికి నమస్కరించు. అడుగు. జరిగినదంతా వారే చెబుతారు అని అర్ఘ్యపాద్యాలు తేవడంకోసం పర్ణశాలలోకి వెళ్ళింది.

శర్యాతి మనస్సు కుదటబడింది. ఆ దివ్యరూపధారికి నమస్కరించాడు. చేరువలో నిలబడ్డాడు. ఏమి జరిగిందో వివరంగా చెప్పు, సుఖపడతానన్నాడు. చ్యవనుడు చిరునవ్వులు చిందిస్తూ జరిగిన కథ అంతా చెప్పాడు. మహారాజా! నాకు ఇంతటి ఉపకారం చేసిన అశ్వినులకు వరంగా నేను చెయ్యవలసిన ప్రత్యుపకారం ఒకటి ఉంది. నువ్వు చేసే యజ్ఞంలో వారిద్దరిచేతా సోమపానం చేయిస్తానన్నాను. ఇది మనం నెరవేర్చాలి. ఇప్పటికి నీ మనస్సులో అనుమానాలు తొలగిపోయాయనుకుంటాను. ఇంకా అలా నిలబడే ఉన్నారేం? ఇదిగో ఇలావచ్చి ఈ పరిశుభ్రమైన ఆసనాలమీద (అరుగులు) కూర్చోండి - అన్నాడు చ్యవనుడు.

రాజదంపతులు కలతదేరారు. ఊపిరి పీల్చుకున్నారు. సుకన్యాదేవి లోపలినుంచి వచ్చి అతిథిమర్యాదలు జరిపింది. హాయిగా అందరూ సుఖోపవిష్టులయ్యారు. పరస్పరం ఆనందదాయకమైన శుభప్రసంగాలు చేసుకున్నారు. కల్యాణమయగాథలు కలబోసుకున్నారు.



## ◆ అశ్వినీదేవతలకు సోమపానార్హత ◆

శర్యాతిమహారాజా! నీతో ఒక యజ్ఞం చేయిస్తాను. అవసరమైన సంబారాలు సమకూర్చుకో. నేను అశ్వినులకు చేసిన వాగ్దానం చెప్పానుగదా! నీ యజ్ఞంలో అది పూర్తిచెయ్యాలి. ఇంద్రుడికి కోపం వస్తుందేమో అని శంకించకు. నా తపస్తేజోబలంతో అతడిని నేను వారిస్తాను. నాసత్యులకు సోమరసం తాపిస్తాను - అని చ్యవనుడు ప్రతిపాదించి భరోసా ఇవ్వడంతో మహారాజు సంతోషించాడు. రాజదంపతులు గృహోన్ముఖులయ్యారు.

ఒక శుభముహూర్తాన శర్యాతి యజ్ఞశాలను నిర్మింపజేశాడు. వసిష్ఠప్రభృతులైన మహానుభావులను ఆహ్వానించి గౌరవించాడు. చ్యవనుడు భార్యాసమేతంగా వచ్చి ఆధ్వర్యవం వహించాడు. ఆ మహాయజ్ఞానికి ఇంద్రాదిదేవతలు అందరూ ఆహూతులై విచ్చేశారు. సోమపానాకాంక్షతో అశ్వినీదేవతలూ వచ్చారు. నాసత్యుల నిద్దరినీ చూసేసరికి ఇంద్రుడికి అనుమానం వచ్చింది. సాటిదేవతలను అడిగాడు, వీరిద్దరూ ఎందుకు వచ్చినట్టు అని. దేవవైద్యులుగదా, సోమపానానికి అనర్హులాయె, మరి ఈ వితతయజ్ఞానికి రావడంలో కారణమేమిటి అని గుచ్చిగుచ్చి ప్రశ్నించాడు. దేవతలు విని ఊరుకున్నారేకానీ ఎవ్వరూ ఏ సమాధానమూ చెప్పలేదు.

చ్యవనుడు సోమరసాన్ని స్వయంగా తెచ్చి దస్రులకు ఇద్దరికీ అందివ్వబోయాడు. ఇవ్వడానికి వీలులేదని వాసవుడు వారించాడు.

శచీపతీ! వీరూ దేవతలేకదా! సూర్యనందనులు. సోమరసానికి అర్హులు కాకపోవడమేమిటి? సంకరులు కారు. సూర్యుడికి ధర్మపత్నియందు జన్మించినవారే! ఏ తప్పు చేశారని ఈ పంక్తి బహిష్కారం?

ఈ విషయంలో నువ్వూ దేవతలూ అందరూ కలిసి చర్చించి ఒక నిర్ణయం ప్రకటించండి. వీరికి సోమరసం ఇస్తానని నేను మాట ఇచ్చాను. ఇందుకోసమే శర్యాతిని ప్రోత్సహించి ఈ వితతయజ్ఞం జరిపించాను. అంచేత మాట నిలబెట్టుకోవలసిన అవసరం నాకుంది. దేవేంద్రా! ఈ ఇద్దరూ నాకు మహోపకారం చేశారు. ఈ రూపూ ఈ చూపూ ఈ వయసూ అన్నీ వారి వరప్రసాదమే. దానికి ప్రత్యుపకారం చెయ్యడం నా ధర్మం - నా కర్తవ్యం. దయచేసి నువ్వు ఇప్పుడు అడ్డుచెప్పకు. అంగీకరించు - అన్నాడు చ్యవనుడు.

చ్యవనమహర్షీ! వీరు దేవవైద్యులు. సోమరసాన్ని వీరు పుచ్చుకోకూడదు. ఇది దేవతల నిర్ణయం - ఇంద్రుడు కొంచెం కోపంగానే అన్నాడు.



అహల్యాజారా! నిగ్రహించుకో. కోపం నిరర్థకం. వృత్రఘ్నా! దేవవైద్యులైనంతమాత్రాన సోమసురాపానం చెయ్యకూడదని ఎలా అంటావు ? సరియైన కారణం లేకుండా నిషేధించటం సమంజసంకాదుగదా! అని చ్యవనుడు గట్టిగా వాదించాడు. దేవతలలో ఏ ఒక్కరూ ఉలకలేదు పలకలేదు. సూర్యసమతేజస్కుడైన చ్యవనభార్గవుడు తన తపోబలంతో అశ్వినులకు సోమపానం చేయించాడు. **(అధ్యాయం - 6, శ్లోకాలు - 61)**

ఇంద్రుడికి పట్టరానంత కోపం వచ్చింది. ఓరీ బ్రహ్మబంధూ ! చక్కటి మర్యాదయే చేశావు మాకు. నువ్వు మరొక వృత్రాసురుడివి. నిన్ను ఇప్పుడే సంహరిస్తాను - అంటూ రంకెలు వేశాడు.

వజ్రపాణీ! అధికారసంపదలున్నాయికదా అని అవమానకరంగా మాట్లాడకు. నన్ను మరొక దేవతగా మార్చిన అశ్వినులను కించపరిస్తే సహించను. నువ్వు తీసుకోకపోతే మిగతా దేవతలుమాత్రం సోమరసాన్ని ఎలా తీసుకుంటారు? ఈ అశ్వినులుకూడా అన్నివిధాలా దేవతలే. శత్రుసంహారకులే. దయచేసి ఈ విషయం అర్థం చేసుకో.

చ్యవనా! నీతో చర్చ అనవసరం. వీళ్ళు వైద్యులు. యజ్ఞ సోమరసానికి అనర్హులు. అంతే. బుద్ధిహీనుడా! నన్ను కాదని వీళ్ళకి తాపించావో శిరశ్ఛేదమే. ఇది ముందుగా నువ్వు అర్థంచేసుకో.

చ్యవనుడు వాసవుడి మాటలను పట్టించుకోలేదు. పెడచెవినిపెట్టాడు. నిర్లక్ష్యాన్ని ప్రకటిస్తూ అశ్వినులకు సోమరసం అందించబోయాడు.

చ్యవనా! మేర మీరుతున్నావు. వజ్రాయుధం ప్రయోగిస్తాను. వెంటనే ఆ పాత్రలను వెనక్కి తీసుకో - ఉరిమాడు ఇంద్రుడు. చ్యవనుడికీ కోపం వచ్చింది. పట్టుదల పెరిగింది. మొండిగా నిలబడ్డాడు. సోమపాత్రలను అశ్వినులకు అందించాడు.

దేవేంద్రుడు క్రుద్ధుడయ్యాడు. సూర్యకోటి సమప్రభమైన వజ్రాయుధాన్ని విసిరాడు. దేవతలంతా కన్నులప్పగించి చూస్తున్నారు. మహర్షులు మనస్సులలో కళవళపడుతున్నారు.

## ◆ చ్యవనుడి తపశ్శక్తి ◆

తనవైపు దూసుకువస్తున్న వజ్రాయుధాన్ని ఒక్కసారి తీక్షణంగా చూశాడు చ్యవనుడు. తన తపోబలంతో నిలువరించాడు. కృత్యను ఆవిర్భవింపజేసి ఇంద్రుణ్ణి సంహరించాలని సంకల్పించాడు. ఆ మంత్రాలను సస్వరంగా పఠిస్తూ అగ్నిలో ఆహుతులు వేల్చాడు. కృత్య ఆవిర్భవించింది. ప్రబలుడూ మహాక్రూరుడూ మహాకాయుడూ మహారాక్షసుడూ మదోన్మత్తుడూ అయిన పురుషాకారంలో సకల ప్రాణిభయంకరంగా కృత్య ఆవిర్భవించింది. అతడి పేరే మదుడు. పర్వతాకారమైన శరీరం. భయంకరమైన



నాలుగుకోరలు. ఒక్కొక్కటీ యోజనాల పొడవు ఉంది. మిగతా దంతాలుకూడా చాలాపొడవుగా ఉన్నాయి. ఒక్కొక్క బాహువూ ఒక పర్వతశ్రేణిలాగా ఉంది. ఎర్రటి నాలుక. ఆకాశాన్ని చప్పరిస్తోంది. మెడ ఒక పర్వత శిఖరంలాగా ఉంది. గోళ్ళు పెద్దపెద్ద పారల్లాగా ఉన్నాయి. శిరోజాలు గునపాల్లాగా వేలాడుతున్నాయి. శరీరమంతా రాసిబోసిన కాటుక. కళ్ళుమాత్రం దవానలంలాగా ఎర్రగా భగభగలాడుతున్నాయి. అతడు నోరు చప్పరిస్తోంటే కింది దవడ నేలకీ, పైదవడ ఆకాశానికీ తగులుతోంది.

హనురేకా స్థితా తస్య భూమావేకా దివం గతా ।
ఏవం విధస్సముత్పన్నో మదో నామ బృహత్తమః ॥ (7 - 19)

ఈ మహాకాయుణ్ణి చూసి దేవతలే గడగడలాడిపోయారు. ఇంద్రుడూ వణికిపోయాడు. యుద్ధవాంఛను విరమించుకున్నాడు. ఆ రాక్షసుడు గాలిలో ఆగిపోయిన వజ్రాయుధాన్ని పెదవులమధ్య మతారంగా బంధించి నిలబడ్డాడు. ఉన్నట్టుండి - ఇంద్రా! నిన్ను భక్షిస్తానంటూ వెంటబడ్డాడు. దేవతలు హాహాకారాలు చేశారు. ఎటువారు అటు పారిపోయారు. ఇంద్రుడు కాళ్ళూ చేతులూ స్తంభించి ఎటూ కదలలేక బిక్కచచ్చి నిలబడ్డాడు. మెరుపులా ఒక ఆలోచన వచ్చింది. బృహస్పతిని తలుచుకున్నాడు. మహామేధావి దేవగురుడు ప్రత్యక్షమయ్యాడు.

శచీపతీ ! ఈ మహాకాయుడు అసాధ్యుడు. మంత్రాలకూ తంత్రాలకూ లొంగడు. నీ వజ్రాయుధంకూడా వృధా. వీడు చ్యవనుడి తపోబలంతో యజ్ఞకుండం నుంచి ఆవిర్భవించిన మదుడు. అనివార్యుడు. ఒక్కటే మార్గం. చ్యవన మహర్షిని శరణువేడుకో. ఆ మహాత్ముడే కరుణించాలి. మరో దారిలేదు.

బృహస్పతి ఖండితంగా చెప్పాడు. ఇంద్రుడికి బుద్ధి వచ్చింది. మనస్సులోనే చ్యవనుడికి మొక్కుకుంటూ వచ్చి కాళ్ళమీద పడ్డాడు. క్షమించు మహామునీ ! ఈ మహారాక్షసుణ్ణి ఉపసంహరించు. సర్వజ్ఞా ! ప్రసన్నుడివై రక్షించు. ఇకమీదట నీ మాట జవదాటను. ఈ క్షణంనుంచీ అశ్వినులు ముమ్మాటికీ సోమార్హులే. నాకు ఏ అభ్యంతరమూ లేదు. ఇది నిజం. నువ్వు వారికిచ్చిన మాటను నెరవేర్చడం నా విధి. పొరపాటున అహంకరించాను. నీ తపశ్శక్తిని పరీక్షించడానికీ శర్యాతి యజ్ఞకీర్తిని దశదిశలకూ చాటి చెప్పడానికీ ఇలా చేశానంటే నమ్ము. నన్ను విశ్వసించు.

మయా యద్ధి కృతం కర్మ సర్వథా తు మునిసత్తమ ।
పరీక్షార్థం తు విజ్ఞేయం తవ వీర్యప్రకాశనమ్ ॥ ( 7 - 35)



ప్రసన్నచిత్తంతో అనుగ్రహించు. సకలదేవతలనూ ఆహ్లాదపరచు. ఈ మహామదుణ్ణి ఉపసంహరించు - అంటూ బతిమాలుకున్నాడు. పరమార్థవేత్త చ్యవనుడు కోపాగ్ని దిగమింగుకున్నాడు. ఇంద్రుణ్ణి లేవనెత్తి సమాశ్వసించాడు. మదుణ్ణి ఖండఖండాలుగా విభజించి స్త్రీలలో, మద్యాలలో జూదాలలో, మృగయా వినోదాలలో జీర్ణింపజేశాడు. సకల దేవతలకూ ధైర్యం చెప్పి శర్యాతి యజ్ఞాన్ని దిగ్విజయంగా సుసంపన్నం చేశాడు. యజ్ఞ సంస్కృతమైన సోమరసాన్ని ఇంద్రుడికీ, అతడి సమక్షంలోనే అశ్వినులకీ, సకల దేవతలకీ తృప్తిగా పంచిపెట్టాడు.

జనమేజయా ! ఈ రకంగా రవిపుత్రులైన అశ్వినులు చ్యవనుడి తపోబలంతో సోమపాయులు అయ్యారు. అప్పటినుంచీ ఆ మహర్షీ ఆ సరస్సూ, ఆ ఆశ్రమం, ఆ యజ్ఞభూమీ అన్నీ చాలా విఖ్యాతిని పొందాయి.

## ◆ రేవతుడి సత్యలోక యాత్ర ◆

సూర్యవంశంలోపుట్టి ఇంతటి ప్రసిద్ధిని పొందిన శర్యాతికి ఆనర్తుడనే కుమారుడు జన్మించాడు. అతడికి రేవతుడు జన్మించి రాజ్యం పాలించాడు. ఇతడు సముద్రగర్భంలో కుశస్థలి అనే మహానగరం నిర్మింపజేసి అరిందముడై సకలభోగాలూ అనుభవించాడు. ఇతడికి నూర్గురు పుత్రులు ప్రభవించారు. వారిలో కకుద్మి జ్యేష్ఠుడు. కడసారిగా ఆడపిల్ల పుట్టింది. శుభలక్షణ సంపన్న. సుందరాంగి. పేరు రేవతి. యుక్తవయస్కురాలు అయ్యింది. రేవతుడు రైవతాద్రికి వచ్చి అనురూపభర్తకోసం రాజపుత్రుల్లో అన్వేషణ సాగించాడు. ఎవరికి ఇవ్వడమా అనేది ఎంతకూ తేలలేదు. సర్వజ్ఞుడైన సృష్టికర్తనే అడుగుదామనిపించి రేవతిని వెంటబెట్టుకుని బ్రహ్మలోకానికి వెళ్ళాడు. యజ్ఞాలూ ఛందస్సులూ పర్వతాలూ సముద్రాలూ నదులూ దివ్యరూపధారులై ఋషులతో దేవతాజాతులతో కలిసి బ్రహ్మసభలో సమావిష్టులై కనిపించారు. అందరూ ముకుళిత హస్తాలతో ముక్తకంఠంతో బ్రహ్మను స్తుతిస్తున్నారు.

*(అధ్యాయం - 7, శ్లోకాలు - 52)*

వ్యాసమహర్షీ ! ఇక్కడ నాదొక సందేహం. రేవతుడు రేవతితో సహా బ్రహ్మలోకానికి వెళ్ళాడంటున్నావు. నేను లోగడ విన్నదాని ప్రకారం - బ్రహ్మజ్ఞానియై శాంతచిత్తుడైన బ్రాహ్మణుడు మాత్రమే బ్రహ్మలోకానికి వెళ్ళగలడు. కూతురిని తీసుకుని ఒక క్షత్రియుడు ఎలా వెళ్ళగలిగాడు ? మానవుడై పుట్టి మానవదేహంతో స్వర్గలోకానికిగానీ బ్రహ్మలోకానికిగానీ ఎవరైనా వెళ్ళగలరా ? అది దుష్ప్రాపం అంటారు. అలా వెళ్ళిన వారికి మళ్ళీ భూలోకంలోకి ప్రవేశం ఉంటుందా ? ఉంటే యథాతథంగా వస్తారా, ఏమైనా మార్పులుంటాయా ? ఈ సందేహాలు నువ్వే తీర్చాలి.



జనమేజయా ! అన్నిలోకాలూ మేరుపర్వత శిఖరంమీద ఉంటాయి. ఇంద్రలోకం అగ్నిలోకం యమలోకం కైలాసం వైకుంఠం అలాగే సత్యలోకం - అన్నీ అక్కడే ఉన్నాయి. మీ వంశంలో అర్జునుడు ఇంద్రలోకానికి వెళ్ళి అయిదేళ్ళు ఉండి వచ్చాడు. మానుష శరీరంతోనే వెళ్ళాడు. వాసవుడి సన్నిధిలో నివసించాడు. అలాగే కకుత్స్థుడు మొదలైన రాజులు కూడా వెళ్ళగలిగారు. ఆ తరవాత ఇంద్రుణ్ణి జయించి రాక్షసులూ వెళ్ళి వచ్చారు. ఇంద్రసింహాసనం ఆక్రమించి స్వర్లోకంలో స్వేచ్ఛావిహారాలు చేసినవాళ్ళున్నారు.

మహాభిషుడనే రాజు బ్రహ్మలోకానికి వెడుతూండగా దారిలో గంగాదేవి ఎదురయ్యింది. గాలి తాకిడికి ఆమె పయ్యెద జారింది. అర్ధనగ్నంగా నిలబడ్డ ఆ సుందరాంగిని చూసి మహాభిషుడు కామార్తుడై చిరునవ్వులు చిందించాడు. ఆవిడకూడా అలాగే నవ్వింది. అది గమనించిన బ్రహ్మ ఇద్దరినీ శపించాడు. ఆ శాపంతో భూలోకంలో జన్మించారు. ఈ కథ నీకు చెప్పానుగా !

వైకుంఠానికికూడా ఇలా రాకపోకలున్నాయి. దైత్యదానవులు అక్కడికీ వెళ్ళిన సంఘటనలు పురాతనకాలంలో ఉన్నాయి. అయితే క్రమక్రమంగా అది తగ్గింది. దైత్యులందరి దృష్టీ ఎప్పుడూ స్వర్గలోకం మీదనే, ఇంద్రుడిపైనే. రాక్షస పీడితులైన దేవతలుమాత్రం మాటిమాటికీ వైకుంఠానికి పరుగులు తీస్తారు. జగన్నాథుణ్ణి శరణువేడతారు. అందుచేత నీకు ఏ సందేహమూ అవసరంలేదు. మహారాజులు అన్ని లోకాలకూ వెళ్ళవచ్చు. రావచ్చు. తాపసులు ఇలా వెళ్ళి రావడానికి వారి వారి పుణ్యవిశేషాలే కారణం. అలాగే యజ్ఞాలు చేసిన యజమానులకూను.

వ్యాసమహర్షీ ! యజ్ఞాలు చేసిన మహారాజులకు ఈ అవకాశం ఉందన్నమాట. బాగుంది. ఇంతకీ రేవతుడు వెళ్ళి ఏం చేశాడు ? బ్రహ్మను ఏమని అడిగాడు. తరవాత కథ ఏమి జరిగింది - దయచేసి వివరించు.

జనమేజయా ! వీళ్ళు వెళ్ళేసరికి ఎవరో గంధర్వుడు ఏదో విన్నవిస్తున్నాడు బ్రహ్మదేవుడికి. అది ముగిశాక రేవతుడు చతుర్ముఖుడికి నమస్కరించి తన కూతురును చూపించాడు. ఈ అమ్మాయిని ఎవరికిచ్చి వివాహం చెయ్యాలో దయచేసి తెలియజెప్పమని అడిగాడు. చాలామంది రాకుమారులను పరిశీలించాను. కానీ ఏ ఒక్కడూ నా మనస్సుకు పూర్తిగా నచ్చలేదు. ఏ నిర్ణయమూ చెయ్యలేక నిన్ను అడిగి చేద్దామని ఇలా వచ్చాను. యోగ్యుడు, బలశాలి, సర్వలక్షణ సంయుతుడు, దానశీలి, ధర్మశీలి అయిన రాకుమారుణ్ణి వరుడుగా ఆజ్ఞాపించు. ఆ ప్రకారం అతడికి ఇచ్చి వివాహం జరిపిస్తాను అని అభ్యర్థించాడు.



## ◆ రేవతీబలరాముల వివాహం ◆

బ్రహ్మదేవుడు క్షణకాలం చిరునవ్వులు చిందించాడు. జరుగుతున్నదీ జరుగబోయేదీ ఆలోచించాడు. రాజేంద్రా ! నువ్వు చూసిన రాకుమారులందరూ కాలచోదితులై త్వరలోనే అస్తమించబోతున్నారు. దుష్టరాజ సైన్యాలను సంహరించి భూదేవికి భారాన్ని తగ్గించడంకోసం శ్రీమహావిష్ణువు యదువంశంలో కృష్ణుడుగా అవతరించాడు. అవతార లక్ష్యాన్ని అప్పుడే ఆరంభించాడు. ఇప్పుడు ద్వారకలో ఉంటున్నాడు. అతడికి ఒక అన్నగారున్నాడు. అతడిపేరు బలరాముడు. శేషాంశసంభూతుడు. మహావీరుడు. ముసలాయుధధారి. హలాయుధధారి. వెంటనే వెళ్ళి మీ అమ్మాయి రేవతిని అతడికిచ్చి వివాహం జరిపించు. శుభోదర్కంగా ఉంటుంది. అటుపైని నువ్వు బదరికాశ్రమానికి వెళ్ళి తపస్సు చేసుకో - అని చతుర్వదనుడు సలహా చెప్పాడు.

రేవతుడు వెంటనే బయలుదేరాడు. సరాసరి ద్వారకకు వచ్చాడు. బలరాముడికిచ్చి రేవతి కల్యాణం జరిపించాడు. అటునుంచి అలాగే బదరికకు వెళ్ళిపోయి తీవ్రంగా తపస్సు చేసి శరీరం చాలించాడు. స్వర్గలోకం చేరుకున్నాడు.

రేవతుడు కూతురితోపాటు వెళ్ళి బ్రహ్మలోకంలో కొన్ని క్షణాలో నిముషాలో ఉన్నాడు కదా ! అది మానవలోక కాలప్రమాణం ప్రకారం శతమో అష్టోత్తరశతమో యుగాలు అవుతుంది కదా ! మరి వీళ్ళు వృద్ధులు కాలేదా ? వృద్ధురాలైన రేవతిని బలరాముడు వివాహం చేసుకున్నట్టా ? రేవతుడు ఇంకెంతటి ముసలివాడైనట్టు ? అసలు ఇంతకాలంపాటు వాళ్ళకి ఆయుఃప్రమాణం ఎలా నిలిచింది ?

**కన్యా వృద్ధా న సంజాతా రాజా నాతితరాం ను కిమ్ ।**
**ఏతావంతం తథా కాలమాయుః పూర్ణం తయోః కథమ్ ॥ (8 - 48)**

జనమేజయా ! బ్రహ్మలోకంలో ముసలితనం, ఆకలి, దప్పిక, మరణం, భయం, అలసట - ఇటువంటివి అసలు ఉండవు.

**న జరా క్షుత్పిపాసా వా న మృత్యుర్న భయం పునః ।**
**న తు గ్లానిః ప్రభవతి బ్రహ్మలోకే సదానఘ ॥ ( 8 - 49)**

అదినరే శర్యాతి సంతతియైన రేవతుడు బ్రహ్మలోకానికి వెళ్ళిన సందర్భంగా, రాక్షసులు అదునుచూసి కుశస్థలిమీద దండెత్తి అతడి సంతానాన్ని అంతటినీ సంహరించారు. చావగా బతికినవాళ్ళు భయపడి పలాయనం చిత్తగించారు.



## ◆ ఇక్ష్వాకు శశాదుల కథ ◆

ఈ సూర్యవంశంలో మనువు తరవాత అతని పౌత్రుడు ఇక్ష్వాకుడు (క్షువంతుని కొడుకు ?) వంశకర్తగా విఖ్యాతి వహించాడు. ఆదిలో ఇతడికీ సంతానం లేదు. నారదుడు చేసిన ఉపదేశంతో దేవీదీక్షను స్వీకరించి తీవ్రతపస్సు చేశాడు. నూర్గురు పుత్రుల్ని పొందాడు. వారిలో వికుక్షి జ్యేష్ఠుడు. అందరూ బలపరాక్రమసంపన్నులే. గుణవంతులే. ఇక్ష్వాకుమహారాజు అయోధ్యను రాజధానిగా చేసుకుని పరిపాలన సాగించాడు. తన పుత్రుల్లో శకుని ప్రభృతులను యాభైమందిని తన రాజ్యానికి ఉత్తరాపథ ప్రాంతానికి రక్షకులుగా నియమించాడు. మరో నలభై ఎనిమిది మందిని దక్షిణాపథానికి రక్షకులుగా పంపించాడు. మిగిలిన ఇద్దరినీ తనకు అంగరక్షకులుగా నియమించుకున్నాడు.

*(అధ్యాయం - 8, శ్లోకాలు - 56)*

ఒకరోజున ఇక్ష్వాకుడు తన పితృదేవతలకు శ్రాద్ధం పెడుతూ, పెద్దకొడుకు వికుక్షిని పిలిచి అడవికి వెళ్ళి మాంసం తెమ్మని ఆజ్ఞాపించాడు. అతడు ఆయుధం ధరించి అరణ్యంలోకి వెళ్ళి వరాహాలనూ మృగాలనూ కుందేళ్ళనూ వేటాడి బాగా అలిసిపోయాడు. ఆకలి భరించలేక శ్రాద్ధం మాట మరిచిపోయి ఒక కుందేలును (శశము) భుజించాడు. మిగిలిన మాంసాన్ని తెచ్చి తండ్రికి అందించాడు. దానిని సంప్రోక్షించి పితృదేవతలకు నివేదించబోతూ గురువర్యుడు వసిష్ఠుడు ఇది భుక్తశేషమని గుర్తించాడు. కోపం వచ్చింది. ఇది శ్రాద్ధానికి అర్హం కాదని ప్రకటించాడు. భుక్తశేషం తు న శ్రాద్ధే ప్రోక్షణీయమితి స్థితిః అని ఖండితంగా విన్నవించాడు. ఇక్ష్వాకుడు వికుక్షిని పిలిచి ఏమి జరిగిందీ తెలుసుకున్నాడు. విధిలోపం చేశాడు కనక దేశంనుంచి బహిష్కరించాడు. అప్పటినుంచీ వికుక్షికి శశాదుడు అనే పేరు స్థిరపడింది.

శశాదుడు అడవులకు వెళ్ళిపోయాడు. ఆటవికులతో సమంగా జీవించసాగాడు. కొంతకాలానికి ఇక్ష్వాకుడు దివంగతుడయ్యాడు. అప్పుడు శశాదుడు అయోధ్యకు వచ్చి రాజ్యపాలన సాగించాడు. ఇతని కుమారుడే కకుత్స్థుడు. ఇతనికే ఇంద్రవాహుడు పురంజయుడు అని నామభేదాలు. ఇది ఎలా వచ్చిందో తెలియజేస్తాను, విను.

## ◆ కకుత్స్థ వృత్తాంతం ◆

శశాదుడు స్వర్గతుడయ్యాక కకుత్స్థుడు పట్టాభిషిక్తుడై అయోధ్యను ధర్మబద్ధంగా పరిపాలిస్తున్నాడు. ఆ సమయంలో దేవతలు దైత్యుల చేతిలో చిత్తుగా ఓడిపోయి విష్ణుమూర్తిని శరణువేడుకున్నారు. ఆయన దేవతలకు ఒక సలహా చెప్పాడు. శశాదకుమారుడు కకుత్స్థుడున్నాడు.



అతడిని అడగండి. ధనుర్ధారియై వచ్చి మీకు సహకరిస్తాడు. పరాశక్తి అనుగ్రహంవల్ల అతడికి అతులితమైన సామర్థ్యం ఉంది - అని చెప్పాడు.

ఈ మాట పుచ్చుకుని ఇంద్రాది దేవతలంతా అయోధ్యకు వచ్చి కకుత్స్థుణ్ణి దర్శించారు. ఆ మహారాజు వారికి యథోచితంగా గౌరవాలు జరిపి సంబరపడిపోతూ -

ఇంద్రాది దేవతలారా ! మీ రాకతో నేను ధన్యుణ్ణి అయ్యాను. పావనమయ్యాను. నా జన్మ సఫలమయ్యింది. ఇంటికే వచ్చి దేవతలు దర్శనం ఇవ్వడమంటే చాలా అపూర్వమైన సంఘటన. అదృష్టమంటే నాదే. నేను ఏమి చెయ్యాలో ఆజ్ఞాపించండి. మానవమాత్రులకు దుస్సాధ్యమైనా సాధిస్తాను - అన్నాడు ఆనందావేశంతో. దేవతలు మెల్లిగా - వచ్చినపని బయటపెట్టారు.

రాజేంద్రా ! దేవేంద్రుడికి మిత్రుడివై మాకందరికీ ఒక సహాయం చెయ్యాలి. సంగ్రామంలో రాక్షసులు మమ్మల్ని ఓడించారు. నువ్వు మా పక్షాన నిలిచి పోరాడి దైత్యులను జయించాలి. పరాశక్తి అనుగ్రహం పూర్తిగా నీపట్ల ఉంది. నీకు అసాధ్యమంటూ ఏదీ లేదు. విష్ణుమూర్తి సలహామీద నీ దగ్గరికి వచ్చాము. ధర్మజ్ఞుడివీ సమర్థుడివీ. ఈ సహాయం చేసిపెట్టు.

దేవతలారా ! మీ పక్షాన నిలుస్తాను. దైత్యులతో పోరాడతాను. జయం సాధిస్తాను. కాకపోతే సంగ్రామరంగంలో ఇంద్రుడు నాకు వాహనమై సహకరించాలి.

ఇంద్రో మే వాహనం తత్ర భవేద్యది సురాధిపః ।
సంగ్రామం తు కరిష్యామి దైత్యైర్దేవకృతేఽధునా ॥ (9 - 24)

కకుత్స్థుడు పెట్టిన ఈ నియమాన్ని గురించి దేవతలు పరస్పరం చర్చించుకున్నారు. అవసరం మనది కనక సిగ్గుపడకూడదు. కకుత్స్థుడికి వాహనం అవ్వమని అందరూ కలిసి ఇంద్రుణ్ణి ఒత్తిడి చేశారు. చివరికి శ్రీహరివచ్చి అదే సలహా చెప్పాడు. వాసవుడు అంగీకరించాడు. సిగ్గు విడిచిపెట్టి వృషభరూపం ధరించాడు. కకుత్స్థుడు ఆ వృషభవాహనం అధిరోహించి మరొక రుద్రుడో అన్నట్టు రాక్షసులతో సంగ్రామానికి దిగాడు. ఈ రకంగాకూడా కకుత్స్థుడు అనే పేరు చరితార్థమయ్యింది. (కకుది స్థితః = ఎద్దు మూపున కూర్చున్నవాడు)

స్థితః కకుది యేవాస్య కకుత్స్థస్తేన చాభవత్ ।
ఇంద్రో వాహః కృతో యేవ తేన వామ్నేంద్రవాహకః ॥
పురం జితం తు దైత్యానాం తేనాభూచ్చ పురంజయః ।

మొత్తానికి ఆ యుద్ధంలో కకుత్స్థుడు దైత్యులనూ వారి పట్టణాన్నీ జయించి ఇంద్రుడికి విజయలక్ష్మిని అందించాడు. ఇంద్రుడు తనకి వాహనమయ్యాడు కనక ఇంద్రవాహుడనీ, దైత్యపురాన్ని జయించాడు కనక పురంజయుడనీ కకుత్స్థుడికి నామభేదాలు అప్పటినుంచీ ఏర్పడ్డాయి.

ఈ మహారాజుకు పృథుచక్రవర్తి జన్మించాడు. అతడు సాక్షాత్తు విష్ణుమూర్తి అంశ. పరాశక్తికి పరమభక్తుడు. ఇతడి కుమారుడు విశ్వరంధి. ఈ విశ్వరంధి సుతుడు - చంద్రుడు. ఇతడూ వంశకరుడే. చంద్రమహారాజుగారి కొడుకుపేరు యువనాశ్వుడు. మహాతేజస్వి. మహాబలశాలి. ఇతని సుతుడు శావంతుడు. శావంతి అని అమరావతితో సాటివచ్చే మహానగరాన్ని నిర్మింపజేశాడు. ఈయనకు తనయుడు బృహదశ్వుడు. ఇతని ఆత్మజుడు కువలయాశ్వుడు. దుంధుడు అనే మహాదైత్యుణ్ణి సంహరించిన వీరాగ్రణి ఇతడు. అప్పటినుంచీ దుంధుమారుడనే పౌరుషనామంతో విఖ్యాతి గడించాడు. ఇతని ఔరసుడు దృఢాశ్వుడు. సామ్రాజ్యాన్ని దిగంతాలకు విస్తరింపజేసిన మహావీరుడు. హర్యశ్వుడు ఇతని పట్టి. నికుంభుడు హర్యశ్వసంజాతుడు. నికుంభుడికి బర్హణాశ్వుడూ, అతనికి కుశాశ్వుడూ సంతానం. ప్రసేనజిత్తు కుశాశ్వుడికి ఆత్మజుడు. ప్రసేనజిత్తుకి యౌవనాశ్వుడు జన్మించాడు. ఇతడి సంతానమే మాంధాత. ఇతడు అష్టోత్తర సహస్రంగా మహాప్రాసాదాలు (ఆలయాలు) నిర్మింపజేసి పరాశక్తి అనుగ్రహానికి విశేషంగా పాత్రుడయ్యాడు. ఇతడు మాతృగర్భంనుంచి ఆవిర్భవించలేదు. తండ్రి గర్భంనుంచి జన్మించాడు. పొట్ట చీల్చుకుని పుట్టాడు. ఇది చాలా ఆశ్చర్యకరంగా అసంభవంగా ప్రకృతివిరుద్ధంగా కనిపిస్తుంది. కానీ నిజం. అది వివరిస్తాను ఆలకించు.

## ◆ తండ్రికి పుట్టిన తనయుడు - మ ంధాత ◆

యౌవనాశ్వుడికి చాలాకాలం వరకూ సంతానం కలగలేదు. నూరుమందిని వివాహమాడాడు. అయినా ఒక్క కడుపూ పండలేదు. రోజూ అతడిని ఇదే దిగులు కుంగదీసింది. అరణ్యాలకు వెళ్ళి ఋషులను ఆశ్రయించాడు. నిట్టూర్పులు విడుస్తూ విలపించాడు. ఋషులు ఓదార్చి శోకకారణం అడిగి తెలుసుకున్నారు. మాకు చేతనైతే ఉపకారం చేస్తాం, చెప్పు అన్నారు.

మహర్షులారా ! నాకు రాజ్యం ఉంది. సంపద ఉంది. గుర్రాలు ఉన్నాయి. నూర్గురు భార్యలున్నారు. నాకంటే బలశాలి లేడు. శత్రువులు లేరు. మంత్రిసామంతులంతా విధేయులే. అన్నీ బాగావే ఉన్నాయి. కానీ ఒకే ఒక్కలోటు. మాకు సంతానం లేదు. ఒక్క బిడ్డడైనా లేడు. అపుత్రుడికి ఉత్తమగతులు లేవంటారు. స్వర్గం అసలే లేదంటారు. అందుకని దుఃఖిస్తున్నాను. సంతానం కావాలి.



అపుత్రస్య గతిర్నాస్తి స్వర్గో నైవ చ నైవ చ ।
తస్మాత్ శోచామి విప్రేంద్రాః సంతానార్థం భృశం తతః ॥ (9 - 52)

మీరందరూ వేదశాస్త్ర తత్త్వజ్ఞులు. మహాతపస్వులు. సంతానార్థినైన నాకు ఏదైనా ఇష్టి (యజ్ఞం) చెప్పండి. నాతో చేయించండి. మీరు దయాస్వభావులు. కనక అభ్యర్థిస్తున్నాను - అని వేడుకున్నాడు యౌవనాశ్వుడు.

దీనికి ఇంత దుఃఖపడవలసింది ఏముంది ? అలాగే చేయిస్తామంటూ ఇంద్రదేవతాకమైన ఇష్టిని చేయించారు. జలపూర్ణకలశాన్ని వేదోక్తులతో అభిమంత్రించారు. మరుసటి ఉదయం ఆ ఉదకాన్ని రాజపత్నులకు ఇవ్వాలని సంకల్పించారు. కానీ ఆ రోజు అర్ధరాత్రి యౌవనాశ్వుడు దప్పిక తట్టుకోలేక యాగశాలలో ప్రవేశించి, నిద్రపోతున్న విప్రులను లేపడమెందుకులే అని ఆ కలశంలో నిండా ఉన్న ఉదకాన్ని తెలియక తాను పుచ్చేసుకున్నాడు. వెళ్ళి తన గుడారంలో పడుకొన్నాడు.

తెల్లవారుతూనే ఖాళీగా ఉన్న కలశాన్ని చూసి విప్రులు ఆశ్చర్యపోయి ఇందులో జలం ఎవరు త్రాగేరని రాజును ప్రశ్నించారు. నేనే త్రాగేనని యౌవనాశ్వుడు చెబితే దైవయోగం ఇలా ఉంది కాబోలునని విప్రులు సరిపుచ్చుకుని ఇష్టిని సమాప్తం చేశారు. ఎవరి ఆశ్రమాలకు వారు వెళ్ళిపోయారు.

మంత్రోదకం కారణంగా రాజుగారు గర్భం ధరించాడు. నెలలు నిండాయి. పొట్ట కుడివైపు చీల్చుకుని మగబిడ్డ జన్మించాడు. అయితే అదృష్టం బాగుండి రాజుగారు మరణించలేదు.

పుట్టిన బిడ్డడు రోదిస్తున్నాడు. తల్లి ఉంటే చన్ను కుడిపేది. ఇప్పుడు ఏమిటి చెయ్యడమా అని మంత్రులు మల్లగుల్లాలు పడుతున్నారు. అప్పుడు ఇంద్రుడు తన చూపుడు వేలిని (దేశిని) అందించి మామ్ (నన్ను) ధాతా (నా చేతివేలిని చీకును) అన్నాడు. అప్పటినుంచీ అతడికి అదే నామధేయమయ్యింది. అందరూ మాంధాత - మాంధాత అన్నారు. మహాబలిష్ఠుడై చాలాకాలం భూగోళాన్ని పరిపాలించాడు.

*(అధ్యాయం - 9, శ్లోకాలు - 63)*

కం ధాస్యతి కుమారోऽయం మంత్రిణశ్చుక్రుశుర్భృశమ్ ।
తథేంద్రో దేశినీం ప్రాదా న్మాంధాతేత్యవదద్వచః ॥
సోऽభవద్బలవాన్ రాజా మాంధాతా పృథివీపతిః ।
తదుత్పత్తిస్తు భూపాల ! కథితా తవ విస్తరాత్ ॥ (9 - 62, 63)



ఆ మాంధాత సర్వభూగోళాన్నీ జయించి చక్రవర్తి అయ్యాడు. దస్యులు ఇతనికి భయపడి గాఢారణ్యాలలోకి పారిపోయి కొండగుహలలో దాక్కున్నారు. ఈ లోకోపకారానికి సంతోషించి దేవేంద్రుడు త్రసదస్యుడు అనే బిరుదునిచ్చి గౌరవించాడు.

శశబిందు మహారాజుగారి గారాల కూతురు బిందుమతి ఇతనికి పట్టమహిషి - ఈ దంపతులకు ఇద్దరు తనయులు కలిగారు. పురుకుత్సుడు - ముచుకుందుడు. వీరిలో పురుకుత్సుడికి అరణ్యకుడు జన్మించాడు. పరమధార్మికుడు. ఇతని కుమారుడు పితృభక్తి పరాయణుడైన బృహదశ్వుడు. ఇతనికి హర్యశ్వుడు తనయుడు. హర్యశ్వుడి కొడుకు త్రిధన్వుడు. త్రిధన్వుడి సంతానం అరుణుడు.

## ◆ సత్యవ్రతుడు త్రిశంకుడైన తీరు ◆

ఈ అరుణుడి సుపుత్రుడు సత్యవ్రతుడు. మహాపాపాత్ముడు. కామలోలుడు. ఒక విప్రకన్యను పెళ్ళిపీటలమీదనుంచి అపహరించాడు. బ్రాహ్మణులంతా కలిసి హాహాకారాలు చేస్తూ అరుణుడికి మొరపెట్టుకున్నారు. తనయుడు చేసిన దుర్మార్గానికి అరుణుడు మండిపడ్డాడు. దేశబహిష్కారం విధించాడు. శ్వపచులతో కలిసి అడవుల్లో నికృష్టంగా జీవించమని గెంటేశాడు. వాడు అడవుల్లోకి పోయి కవచమూ ధనుర్బాణాలూ ధరించి శ్వపచులతో జీవించసాగాడు.

వెడుతూ వెడుతూ కులగురువులుగదా వసిష్ఠులవారు తండ్రికి చెప్పి కోపం చల్లారుస్తారేమోనని ఆశపడి అభ్యర్థించాడు. వసిష్ఠుడు నిష్కర్షగా తిరస్కరించడమేకాదు అరుణుడి చర్యను సమర్థించాడు. ఈ కఠిన శిక్షకు తండ్రిని ప్రేరేపించింది ఈయనగారేనని గ్రహించి సత్యవ్రతుడు వసిష్ఠులపై అలిగి గత్యంతరంలేక శిక్షను శిరసావహించి అరణ్యాలకు వెళ్ళాడు.

ఆ తరువాత అరుణుడు - వంశోద్ధారకుడు లేకపోయాడే అని విచారించి, రాజ్యం వదిలిపెట్టేసి తపస్సులకు వెళ్ళిపోయాడు. ఆ కాలాన పన్నెండు సంవత్సరాలపాటు ఆ దేశంలో వానలు కురవలేదు. సత్యవ్రతుడు చేసిన అధర్మానికి ఇంద్రుడు విధించిన శిక్ష ఇది.

అదే సమయంలో విశ్వామిత్రుడు (కౌశికుడు) తన భార్యాపుత్రులను ఆశ్రమంలో విడిచిపెట్టి కౌశికీతీరానికి తపస్సుకోసం వెళ్ళాడు. పన్నెండేళ్ళ కరువు రావడంతో కౌశికుడిభార్య బిడ్డలను పోషించలేక చాలా అగచాట్లు పడింది. పిల్లలు ఆకలో అని ఏడుస్తూంటే ఓదార్చలేక సతమతమయ్యింది. తల్లిపేగు తల్లడిల్లింది. పెద్ద పిల్లలు నీవారధాన్యం ముష్టెత్తుతూంటే విలవిలలాడింది. రాజధానిలో రాజులేడు. మగడేమో తపస్సుకి వెళ్ళాడు. తనకా పోషించే శక్తి లేదు. ఎవరిని యాచించాలి, ఏమి చెయ్యాలి ? పిల్లలు



చూస్తే మాడిపోతున్నారు. ఛీ ! ఎందుకువచ్చిన జీవితం ఇది. కౌశికుడు ఇంటిలో ఉంటే ఈ పరిస్థితి వచ్చేది కాదుగదా ! ఎక్కడో ముక్కుమూసుకుని హాయిగా నిశ్చలంగా తపస్సు చేసుకుంటున్న విశ్వామిత్రుడికి నా నిర్ధనత, నా అశక్తత ఎలా తెలుస్తాయి సమర్థుడే. కానీ పరిస్థితి ఇది అని తెలిసేదెలా ?

ఇలా ఆలోచిస్తూ కూచుంటే ప్రయోజనంలేదు. ఏదో ఒకటి చెయ్యాలి. పిల్లల్ని అందరినీ ఆకలితో మాడ్చి చంపుకునేకంటే ఒకడిని అమ్మేసి మిగతావారినైనా బతికించుకోవడం తెలివైనపని. నాకిక మిగిలింది ఇదొక్కటే దారి. ప్రాణాలు నిలుపుకోడానికి, కాలం గడపడానికి మరో మార్గంలేదు - ఇలా ఆలోచించి విశ్వామిత్రుడి భార్య గుండెను రాయిచేసుకుని, దర్భలు తాడుగా పేని నడిమి కొడుకు మెడకు పలుపుతాడులా కట్టి, వాడిని తీసుకుని తమ ఆశ్రమ పర్ణశాలనుంచి బయటకు వచ్చింది. అడవిదారివెంట రాజధానికి నడక సాగించింది.

శ్వపచులతో కలిసి అడవుల్లో జీవిస్తున్న సత్యవ్రతుడు (అరుణుడి కొడుకు) ఎదురయ్యాడు. ఏమిటమ్మా ఇది ? ఎందుకు ఏడుస్తున్నావ్ ? ఈ పిల్లవాడినేమిటి పశువులా తాడుకట్టి లాక్కువెడుతున్నావ్? ఎవరి బిడ్డడు ? ఎక్కి ఎక్కి ఏడుస్తున్నాడు ? నిజం చెప్పు. నేను చెయ్యగలిగిన సహాయం ఏమన్నా ఉంటే చేస్తాను.

అయ్యా ! నువ్వు ఎవరో నాకు తెలియదు. అయినా అడుగుతున్నావు కాబట్టి చెబుతున్నాను. నేను విశ్వామిత్రులవారి భార్యను. వీడు మా అబ్బాయే. విషమపరిస్థితిని తట్టుకోలేక వీడిని అమ్మెయ్యడానికి తీసుకుపోతున్నాను. మాకు చాలా రోజులుగా అన్నం లేదు. నా భర్త తపస్సుకు వెళ్ళాడు. వీడిని అమ్మేసి వచ్చిన ధనంతో తక్కిన సంతానాన్ని బతికించుకుందామని ఆశ.

ఓ పతివ్రతా ! ఈ పుత్రుణ్ణికూడా రక్షించుకో. వెనక్కి వెళ్ళు. నీ భర్త తపస్సునుంచి తిరిగివచ్చే వరకూ మీకందరికీ ఆహారం నేను అందిస్తాను. మీ ఆశ్రమం ఎదుట ఉన్న చెట్టుకి రోజూ ఆహారం కట్టి వెడుతుంటాను. ఇది నా ప్రతిజ్ఞ. నామాట నమ్ము. నేను అరుణపుత్రుణ్ణి. రాకుమారుణ్ణి. నాపేరు సత్యవ్రతుడు.

సరేనని ఆ తల్లి కొడుకు మెడలో బంధనం విప్పేసి ఆశ్రమానికి తిరిగి వెళ్ళింది. గళబంధనం కారణంగా ఆనాటినుంచి ఆ మునికుమారుడు "గాలవుడు" అయ్యాడు. ఆశ్రమం చేరుకుని మిగతా పుత్రులను చేరబిలుచుకుని గాఢంగా కౌగిలించుకుంది. కష్టాలు తీరాయికదా, ఇక ప్రాణాపాయం లేదని సంబరపడింది.

సత్యవ్రతుడు మాట తప్పలేదు. అడవిలో మృగాలను వేటాడి రోజూ ఏదో ఒక సమయంలో మాంసం తెచ్చి ఆశ్రమవృక్షానికి మూటవేలాడగట్టి వెడుతున్నాడు. మునిపత్ని ఆ మూటను తెచ్చి కొడుకులకు పెట్టి తాను తింటోంది. సుఖంగా కాలం గడుస్తోంది.



అరుణమహారాజు పుత్రార్థియై తపస్సుకు వెళ్ళినప్పటినుంచీ రాజ్యాన్నీ రాజధానినీ అంతఃపురాన్నీ వసిష్ఠులవారే రక్షిస్తున్నారు. సత్యవ్రతుడు రాజధానికి దూరంగా అడవుల్లోనే జీవిస్తున్నాడు. అతడికి వసిష్ఠులవారి మీద కోపం తగ్గలేదు. తనను అడవులకు పొమ్మంటున్న తండ్రిని వారించలేదని ఇతడికి ఆ కులగురువుమీద కోపం. పెళ్ళిపీటల మీదనుంచి విప్రభార్యను అపహరించాడని వసిష్ఠుడికి సత్యవ్రతుడిమీద ఆగ్రహం. పెళ్ళి మంత్రాలు నడిచాయే తప్ప, సప్తపది ముగియకుండానే అపహరించాను కనక ఇది విప్రకన్యాపహరణమే కానీ విప్రభార్యాపహరణం కాదనీ అనవసరంగా నాకు పెద్దశిక్ష విధించారనీ ధర్మసూక్ష్మాలు అన్నీ తెలిసిన వసిష్ఠుడే దీనికి ప్రేరకుడనీ సత్యవ్రతుడి అభిప్రాయం.

త్యాజ్యమానం వనే పిత్రా ధర్మిష్ఠం చ ప్రియం సుతమ్ ।
న వారయామాస మునిర్వసిష్ఠః కారణేన హ ॥
పాణిగ్రహణమంత్రాణాం నిష్ఠా స్యాత్సప్తమే పదే ।
జానన్నపి స ధర్మాత్మా విప్రదారపరిగ్రహే ॥ **(10 - 49, 50)**

ఎవరి కోపకారణాలు వారికి ఉన్నాయి. ఎవరిదారినవారు జీవిస్తున్నారు. ఇలా ఉండగా ఒకనాడు సత్యవ్రతుడికి అరణ్యంలో ఒక్క జంతువూ దొరకలేదు. తన ఆకలిమాట ఎలాగున్నా మునిపుత్రులకు ఆహారం అందించాలి. ఎలాగా అని ఆలోచిస్తుండగా అల్లంత దూరాన ఒక ఆవు కనిపించింది. అది పాడి ఆవు. పైగా వసిష్ఠులవారిది. తెలిసీ సత్యవ్రతుడు దాన్ని సంహరించాడు. ఆకలో క్రోధమో మోహమో ! దొంగపని చేశాడు.

వసిష్ఠ స్య చ గాం దోగ్ధ్రీమపశ్యద్వనమధ్యగామ్ ।
తాం జఘాన క్షుధార్తస్తు క్రోధాన్మోహాచ్చ దస్యువత్ ॥ **(10 - 52)**

మాంసం తెచ్చి ఆశ్రమవృక్షానికి వేలాడగట్టాడు. విశ్వామిత్రుడి భార్య ఎప్పటిలాగానే ఆ మాంసాన్ని తెచ్చి పిల్లలకు పెట్టింది. మిగిలినది తాను తింది. తింటూ గుర్తుపట్టింది ఇది మృగమాంసం కాదు, గోమాంసమని. తరవాత విచారిస్తే తెలిసింది. వసిష్ఠులవారి పాడియావును ఎవరో సంహరించారనీ, మాంసం తీసుకుపోయి చర్మమూ ఎముకలూ ఒకచోట వదిలేశారనీ. కౌశికాంగన హృదయం భగ్గుమంది.

జరిగింది తెలుసుకుని వసిష్ఠుడు మండిపడ్డాడు. దురాత్ముడా ! ఎంతటి మహాపాపం చేశావు. పిశాచంలాగా గోవును సంహరించావా ? నీ శరీరంలో మూడు మేకులు (శంకువులు) దిగబడుగాక ! నీకు పిశాచరూపం సంక్రమించుగాక ! ఇప్పటినుంచీ నీపేరు త్రిశంకుడు - అని తీవ్రంగా శపించాడు. సత్యవ్రతుడికి పిశాచరూపం వచ్చేసింది. మూడు మేకులూ దిగబడి త్రిశంకుడు అయ్యాడు. సిగ్గుతో ఎటూ వెళ్ళలేక అదే ఆశ్రమంలో ఉండిపోయి, తపస్సుకి ఉపక్రమించాడు. మునిపుత్రుల్లో ఒకడు మహాదేవీమంత్రం ఉపదేశిస్తే దానినే జపిస్తూ పరాశక్తిని ధ్యానిస్తూ పవిత్రంగా జీవయాత్ర సాగిస్తున్నాడు.

***(అధ్యాయం - 10, శ్లోకాలు - 58)***



## ◆ దేవీ అనుగ్రహంతో త్రిశంకుడి పట్టాభిషేకం ◆

చాలాకాలం గడిచింది. సత్యవ్రతుడు చేస్తున్న దేవీనవాక్షర మహామంత్ర జపం ఒక స్థాయికి వచ్చింది. జపంలో దశాంశంతో హోమం జరిపించాలి. ఇది నియమం. నాతో హోమం చేయించండి అని ఆశ్రమవాసులైన మహర్షులను అభ్యర్థించాడు. అందరూ తిరస్కరించారు.

సత్యవ్రతా ! నువ్వు పితృపరిత్యక్తుడవు. శ్వపచుడవు. గోహత్యా మహాపాతకివి. గురుశాపదగ్ధుడివి. పిశాచరూపివి. హోమం చేసే అధికారం నీకు లేదు. అనర్హుడవు. వేదం అంగీకరించదు. మేము చేయించం. వెళ్ళిపో - అన్నారు.

సత్యవ్రతుడికి తనమీద తనకే అసహ్యంవేసింది. కన్నతండ్రి శపించాడు. రాజ్యం నుంచి వెళ్ళగొట్టాడు. గురువు శపించాడు. పిశాచత్వం సంక్రమించింది. ఛీ ! ఎందుకొచ్చిన బతుకు ! మరణించడమే మేలనుకున్నాడు. త్వరత్వరగా ఎండుకట్టెలు ఏరి తెచ్చి చితిని పేర్చుకున్నాడు. స్నానంచేసివచ్చి చండికాదేవిని మనసారా ఒక్కసారి స్మరించి అగ్నిలో ప్రవేశించబోయాడు. జగన్మాత - కరుణామయి - ప్రత్యక్షమయ్యింది. ఆగు ఆగు అంది.

హే సత్పురుష ! ఏమిటి నువ్వు చేస్తున్న పని. ఆత్మహత్య మహాపాపమని ఎరగవా ? నీ విషాదత్వం పిశాచరూపం ఈ క్షణంలోనే తొలగిపోతాయి. తపోవృద్ధుడైన నీ తండ్రి వచ్చి స్వయంగా నీకు పట్టాభిషేకం జరిపిస్తాడు. రేపే నిన్ను రాజధానికి తీసుకువెళ్ళడానికి మంత్రులూ సామంతులూ వస్తారు. ధర్మబద్ధంగా రాజ్యం పరిపాలించు. మీ తండ్రి తపస్సులు ఫలిస్తాయి. కామాన్ని జయించి బ్రహ్మలోకం పొందుతాడు.

వరాలు ఇచ్చి జగదీశ్వరి అదృశ్యమయ్యింది. మరణప్రయత్నం విరమించి త్రిశంకుడు ఆశ్రమానికి వచ్చాడు. నారదుడు అయోధ్యకు వెళ్ళి ఈ జరిగిన వృత్తాంతాన్ని మంత్రి సామంతులకు తెలియపరిచాడు. అరుణ మహారాజు తపస్సు చేసుకొంటున్న చోటుకి వెళ్ళి అంతా వివరించాడు. తన కుమారుడు అగ్ని ప్రవేశానికి సిద్ధమయ్యాడన్నమాట వినడంతోనే అరుణుడు విలవిలలాడాడు. నారదుడితో కలిసి రాజధానికి తిరిగివచ్చాడు. మంత్రులను సమావేశపరిచి - సత్యవ్రతుడికి తాను దేశబహిష్కరణ విధించడం మొదలుకొని అతడి అగ్నిప్రవేశమూ అమ్మవారి ఆశీర్వాదమూ వరకు అన్నీ వివరించి, మీరంతా త్వరగా వెళ్ళి సత్యవ్రతుడిని సగౌరవంగా, నామాటగా ఆహ్వానించి తీసుకురండి, పట్టాభిషేకం జరిపించి నేను మళ్ళీ తపస్సుకి వెళ్ళిపోతాను అన్నాడు.



మంత్రిసామంతులందరూ సంతోషంగా బయలుదేరారు. సత్యవ్రతుణ్ణి చేరుకున్నారు. సాంత్వన వాక్యాలు పలికి సగౌరవంగా అయోధ్యకు తీసుకువచ్చారు. ఎన్నో ఏళ్ళ తరవాత కొడుకును చూసిన అరుణుడి మనస్సులో ఆనందమూ దుఃఖమూ పెల్లుబికాయి. జడలుకట్టిన జుట్టు. మాసిపోయిన వస్త్రాలు. నీరసపడిన శరీరం. అయ్యో! కన్న బిడ్డడిని ఎంత కఠినంగా శిక్షించాను. రాజ్యార్హుణ్ణి అడవులపాలు చేశానుగదా ! ధర్మం తెలిసీ దారుణంగా శిక్షించానుగదా - అని లోలోపల కుమిలిపోయాడు. ఎదురువెళ్ళి గాఢంగా కౌగిలించుకున్నాడు. బుజంమీద చేయివేసి నడిపించుకుంటూ తీసుకువచ్చి తన ప్రక్కనే కూర్చోబెట్టుకున్నాడు. జీరబోయిన గొంతుతో ప్రేమగా పలకరించాడు. రాజనీతిని ఉపదేశించాడు.

## ◆ అరుణుడు చేసిన నీతిబోధ ◆

నాయనా ! ఏనాడూ ధర్మం తప్పకు. అధర్మాన్ని ఆలోచనల్లోకికూడా రానియ్యకు. ధర్మబద్ధమైన రాజ్యసుఖాలను తనివితీరా అనుభవించు. ప్రజలను రక్షించు. న్యాయమార్గాలలోనే ధనం సంపాదించు. ఎప్పుడూ అసత్యం పలకకు. అపమార్గంలో నడవకు. తపస్వులను గౌరవించు. శిష్టులు ఇచ్చిన సలహాలను పాటించు. క్రూరులైన దస్యులను సంహరించు. ఇంద్రియాలను జయించు. రాజకార్య నిర్వహణలో సచివులతో జరిపిన మంత్రాంగాన్ని పైకి పొక్కనివ్వకు. రహస్యంగా ఉంచు. అల్పుడుగదా అని ఎప్పుడూ ఏ శత్రువునూ ఉపేక్షించకు. పరాసక్తుణ్ణి విశ్వసించకు. మరీ వొంగి వొంగి దండాలుపెట్టే సచివుణ్ణి అస్సలు నమ్మకు. కేవలం శత్రువుల పట్లనేకాదు మిత్రులపట్లకూడా చారులను నియోగించు.

న విశ్వసేత్పరాసక్తం సచివం చ తథాఽఽనతమ్ ।
చారాః సర్వత్ర యోక్తవ్యాః శత్రుమిత్రేషు సర్వథా ॥ (11 - 38)

దానధర్మాలు నిరంతరంగా జరిపించు. ఎవరితోనూ శుష్కవాదాలకు దిగకు. దుష్టసాంగత్యాలు చెయ్యకు. యజ్ఞయాగాదులు చేస్తూ మహర్షులను సత్కరించు. స్త్రీలను విశ్వసించకు. జూదగాళ్ళను నమ్మకు. అత్యాసక్తితో వేటను వ్యసనం చేసుకోకు. ద్యూతము, మద్యము, సంగీతము, వారవనితాజనము - వీటికి నువ్వు దూరంగా ఉండటమేకాదు ప్రజలనుకూడా దూరంగా ఉంచు.

ద్యూతే మద్యే తథా గేయే మానం వారవధూషు చ ।
స్వయం తద్విముఖో భూయాత్ ప్రజాస్తేభ్యశ్చ రక్షయేత్ ॥ (11 -41)



రోజూ బ్రాహ్మీముహూర్తంలో నిద్రలేచి స్నానసంధ్యాదికం ముగించు. దీక్షాదక్షుడివై నిరంతరం పరాశక్తిని అర్చించు. అదే మానవజన్మకు సాఫల్యం. దేవీమహాపూజను చేసి పావనపాదోదకాన్ని జిహ్వతో ఒక్కసారి గ్రోలినా చాలు మరింక ఆ ప్రాణికి గర్భవాసదుఃఖం ఉండదు (పునర్జన్మ ఉండదు).

సకృత్ కృత్వా మహాపూజాం దేవీపాదజలం పిబన్ ।
న జాతు జననీగర్భే గచ్ఛేదితి వినిశ్చయః ॥ **(11 - 44)**

మనం చేసే అన్ని పనులకూ ఆ మహాదేవి సాక్షిభూతురాలు అనే భావాన్ని మనస్సులో నిక్షేపించుకో. అది నిన్ను ధర్మమార్గాన నడిపిస్తుంది. దారి తప్పనివ్వదు. నిర్భయంగా పయనించు. నిత్యవిధిగా బ్రాహ్మణులను దర్శించు. తిథివారనక్షత్రాల మంచిచెడ్డలనూ ధర్మశాస్త్రనిర్ణయాలనూ అడిగి తెలుసుకో. వేదవేదాంగపారంగతులైన విప్రులకు పాత్రత ఎరిగి గో భూ హిరణ్యదానాలను సమృద్ధిగా అందించు. విద్యావంతుడు కాకపోతే బ్రాహ్మణుడైనా పూజార్హుడుకాడు. విద్యాగంధంలేని మూర్ఖులకు ఆకలి తీరేపాటి ఆహారంమాత్రం అందించు. అంతకన్నా ఎక్కువ దానాలు చెయ్యకు.

అవిద్వాన్ బ్రాహ్మణః కోఽపి నైవ పూజ్యః కదాచన ।
ఆహారాదధికం నైవ దేయం మూర్ఖాయ కర్హిచిత్ ॥ **(11 - 48)**

పుత్రకా ! ఏ లోభానికో లాభానికో లొంగిపోయి ధర్మోల్లంఘనం చెయ్యకు. అన్నింటికన్నా ముఖ్యమైనది - విప్రులను ఏనాడూ అవమానించకు. వారు భూదేవులు. ప్రయత్నతః సమ్మాన్యులు. వారి తపశ్శక్తి క్షత్రియులకు రక్షణకవచం. వినయంగా ఉంటే చాలు వారు సంతృప్తి చెందుతారు. దానధర్మాలతో ఆనందపరిచావో ఇక చెప్పేదేముంది !

ధర్మశాస్త్రానుసారంగా దండనీతిని అమలుపరుచు. న్యాయశాస్త్రానుసారంగా కోశాన్ని వృద్ధిపరుచు.

***(అధ్యాయం - 11, శ్లోకాలు - 53)***

తండ్రి చేసిన ఉపదేశాన్ని శ్రద్ధగా ఆలకించాడు త్రిశంకుడు. తూచ తప్పకుండా పాటిస్తానని మాటఇచ్చి పాదాభివందనం చేశాడు. మహారాజు వేదపండితులనూ ఋత్విక్కులనూ ఆహ్వానించి పట్టాభిషేకానికి త్వరత్వరగా ఏర్పాట్లు అన్నీ చేయించాడు. సర్వతీర్థాలనుంచీ పవిత్రోదకాలను రప్పించాడు. ప్రజలను ఆహ్వానించాడు. సామంతులను పిలిపించాడు. మంచిరోజున శుభముహూర్తాన అభిషేకించి త్రిశంకుడికి సింహాసనం అప్పగించాడు. తాను భార్యాసహితుడై వానప్రస్థానికి వెళ్ళిపోయాడు. గంగాతీరంలో చాలాకాలం తీవ్ర తపస్సుచేసి దంపతులిద్దరూ దివంగతులయ్యారు. దేవపూజితులయ్యారు. అరుణుడు స్వర్గంలో ఇంద్రాసనానికి అత్యంత సమీపాన కూర్చుంటూ అరుణుడిలా వెలిగిపోయాడు.



ఆదిపరాశక్తి అనుగ్రహంవల్ల పిశాచత్వం వదిలిపోయి సుందరాకారుడై సత్యవ్రతుడు అయోధ్యకు పట్టాభిషిక్తుడైన ఈ శుభవార్త తెలిసి వసిష్ఠుడూ సంతోషించాడు. తానిచ్చిన శాపాన్ని అమ్మవారు తొలగించింది కదా అని ప్రసన్నుడు అయ్యాడు.

సత్యవ్రతుడు సనాతనధర్మమార్గంలో రాజ్యాన్ని పాలిస్తూ దేవీమహాయజ్ఞాలను అనేకం నిర్వహించాడు. ఇతడికి హరిశ్చంద్రుడనే కుమారుడు జన్మించాడు. సుందరాకారుడు. శుభలక్షణ సమన్వితుడు. అతడిని యువరాజును చేసిన త్రిశంకుడు మానుషశరీరంతో స్వర్గానికి వెళ్ళాలని భావించాడు. వసిష్ఠుని ఆశ్రమానికి వెళ్ళి సాష్టాంగ నమస్కారం చేశాడు.

## ◆ త్రిశంకుడి సశరీర స్వర్గ వాంఛ ◆

బ్రహ్మమానససంభవా ! సర్వమంత్ర విశారదా ! ప్రసన్నచిత్తంతో నా విజ్ఞప్తిని ఆలకించు. స్వర్గలోక సుఖాలపట్ల నాకు కోరిక కలిగింది . ఈ శరీరంతోనే ఆ అమానుష భోగాలను అనుభవించాలని నా ఆకాంక్ష. అప్సరసలతో సాంగత్యం, నందనోద్యాన విహారం, దేవగంధర్వ సంగీత శ్రవణం - చెయ్యాలని నా అభిలాష. అటువంటి అవకాశాన్ని అందించే యజ్ఞమేదైనా ఉంటే దయచేసి నాతో చేయించు. నువ్వే సమర్థుడవు. నన్ను సశరీరంగా స్వర్గానికి పంపించు.

త్రిశంకూ ! మానవదేహంతో స్వర్గానికి వెళ్ళడం చాలా దుర్లభం. పుణ్యకర్మలు చేసి మరణించాక స్వర్గప్రాప్తి నిశ్చయం. అందుచేత జంకుగా ఉంది. నీ మనోరథం దుస్సాధ్యం. బ్రతికున్నవాడికి అప్సరసల సాంగత్యం అసంభవం. ఇంకా యజ్ఞాలు అనేకం నిర్వహించు. మరణానంతరం హాయిగా స్వర్గసుఖాలు అనుభవించు.

వసిష్ఠా ! నువ్వు చేయించకపోతే చేయించేవాణ్ణి వెతుక్కుంటాను. పురోహితుడుగా నియమించు కుంటాను. యజ్ఞం చేస్తాను. సశరీరంగా స్వర్గానికి వెడతాను. నేనే దిక్కు అనుకుంటున్నావేమో ! అంత గర్వావేశం పనికిరాదుసుమా !

న త్వం యాజయసే బ్రహ్మన్ గర్వావేశాచ్చ మాం యది ।<br>
అన్యం పురోహితం కృత్వా యక్ష్యేఽహం కిల సాంప్రతమ్ ॥ (12 -28)

వసిష్ఠుడికి కోపం భగ్గుమంది. ఓరీ దుర్మతీ ! చండాలుడివైపో. ఈ శరీరంతోనే స్వర్గానికి వెళ్ళాలనుకున్నావుకదా ! అందుకని ఈ శరీరంతోనే శ్వపచుడివైపో. స్వర్గకృంతనపాపిష్ఠా ! గోహత్యా మహాపాతకీ ! బ్రాహ్మణవధూచోరకా ! ధర్మమార్గవిదూషకా ! చచ్చాకకూడా (చచ్చినా) నీకు స్వర్గం లభించదు - అని దారుణంగా శపించాడు.



ఆ క్షణంలో త్రిశంకుడు శ్వపచుడుగా మారిపోయాడు. సువర్ణరత్నకుండలాలు - ఇనపరాతి కుండలాలైపోయాయి. చందనచర్చ - దుర్గంధభూయిష్ఠమైపోయింది. దివ్యపీతాంబరం నల్లని మలినవస్త్రంగా మారిపోయింది. శరీరం గజవర్ణంలోకి దిగింది. నైగనిగ్యం సౌకుమార్యం అంతరించి పళ్ళికలు పళ్ళికలుగా బండబారింది. శక్త్యుపాసకుడైన వసిష్ఠుడి రోషానికి తిరుగులేదుకదా ! అందుకనే శ్రీదేవీ ఉపాసకులను ఎప్పుడూ కించపరచకూడదు. వసిష్ఠుడంటే గాయత్రీ జపనిష్ఠుడైన మహామునీశ్వరుడు.

తస్మాత్ శ్రీశక్తి భక్తో హి నావమాన్యః కదాచన ।
గాయత్రీ జపనిష్ఠో హి వసిష్ఠో మునిసత్తమః ॥ (12 - 35)

త్రిశంకుడు తన రూపాన్ని చూసుకుని బోరున విలపించాడు. రాజధానికి తిరిగివెళ్ళేందుకు మనస్కరించలేదు. అడవిలోకే వెళ్ళిపోయాడు. ఎక్కడికి వెళ్ళను ? ఏమి చెయ్యను ? రూపం చూస్తే వెగటుగా, రోతగా ఉంది. ఇంటికి వెడితే భార్య తిరస్కరిస్తుంది. కొడుకు దుఃఖిస్తాడు. సచివులు అసహ్యించుకుంటారు. బంధుమిత్రులు దూరం తొలగుతారు. ఇలా జీవించడంకన్నా మరణించడమే మేలు. విషం తాగనా ? మడుగులో దూకనా ? తాడుపేని ఉరిపోసుకోనా ? చితిపేర్చుకుని అగ్నిలో ప్రవేశించనా ? నిరాహారుడినై ప్రాయోపవేశం చెయ్యనా ? ఒకవేళ ఆత్మహత్య చేసుకుంటే జన్మజన్మలకూ ఇదే వెంటాడుతుందా ? ఈ శాపమూ ఈ శ్వపచత్వమూ తప్పవా ? ఈ ఆలోచన రావడంతోనే త్రిశంకుడి ధోరణి మారిపోయింది. ఎట్టి పరిస్థితుల్లోనూ ఆత్మహత్య చేసుకోనుగాక చేసుకోను. చేసుకున్న కర్మను ఈ జన్మంలోనే ఈ దేహంతోనే అనుభవించాలి. అనుభవించడంతోనే కర్మవిపాకం క్షయమవుతుంది. ప్రారబ్ధకర్మలు క్షయించడానికి అదొక్కటే మార్గమని పెద్దలు చెప్పారు. అందుచేత చేసుకున్న కర్మ శుభమైనా అశుభమైనా అనుభవించక తప్పదు. ఆశ్రమాలను సందర్శిస్తూ తీర్థక్షేత్రాలను సేవిస్తూ అంబికాదేవిని ధ్యానిస్తూ సాధువజ్జనులకు పరిచర్యలు చేస్తూ నా దుష్కర్మను నశింపజేసుకుంటాను. అదృష్టం బాగుంటే ఏ మహానుభావుడో ఏ మహర్షియో ఏ సాధుపుంగవుడో సంగతపడవచ్చు. ఏదైనా ఉపకారం చెయ్యవచ్చు.

ప్రారబ్ధకర్మణాం భోగాదన్యథా న క్షయో భవేత్ ।
తస్మాన్మయాత్ర భోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్ ॥ (12 - 46)

ఇలా ఒక నిశ్చయానికి వచ్చి గంగాతీరం చేరుకున్నాడు. వసిష్ఠులవారు తన తండ్రిని శపించారని హరిశ్చంద్రుడికి తెలిసింది. ఎంతగానో బాధపడ్డాడు. సచివులను పిలిచి గంగాతీరానికి వెళ్ళి త్రిశంకుణ్ణి అన్వేషించి రాజధానికి తీసుకురండి అని పంపించాడు. వారు వెళ్ళి చండాలరూపంలో ఉన్న త్రిశంకుణ్ణి గుర్తుపట్టి నమస్కరించారు.



మహారాజా ! నీ కుమారుడు పంపితే వచ్చాము. అతడి సచివులం మేము. నిన్ను సగౌరవంగా రాజధానికి తీసుకురమ్మని ఆజ్ఞాపించాడు. అందుకే మేము అందరమూ వచ్చాము. దయచేసి మావెంట బయలుదేరి రా. మేమూ ప్రజానీకమూ నీకు సమస్త సేవలూ చేస్తాము. దిగులుపడకు. జరిగింది ఏదో జరిగింది. కోపావిష్టుడై శపించాడే తప్ప వసిష్ఠులవారికి నీతో శత్రుత్వం ఏముంది. మేమంతా గురువుగారిని బతిమాలుకుంటాం. ప్రసన్నుణ్ణి చేస్తాం. ఆయనే ఏదో ఒకదారి చూపిస్తాడు. ఈ దుఃఖాన్ని తొలగిస్తాడు. మహాతేజస్వికదా ! యువరాజు హరిశ్చంద్రుడు నీకు చెప్పమన్న మాటలు ఇవ్వి. అంచేత వెంటనే బయలుదేరు. రాజప్రాసాదం చేరుకుందాం - అని వినయంగా లాలనగా విన్నవించారు.

త్రిశంకుడు క్షణకాలం ఆలోచించి వారి అభ్యర్థనను సున్నితంగా తిరస్కరించాడు. మంత్రులారా! మహానుభావులారా ! మీరు వెళ్ళండి. నాపై మీకున్న గౌరవాదరాలకు ధన్యవాదాలు. నేను రాను. రాజ్యాన్ని జాగరూకతతో పాలించమని మా అబ్బాయికి చెప్పండి. యజ్ఞయాగాదులు చేస్తూ నిరంతరం వేదవిప్రులను సమ్మానించమనండి. ఈ కుత్సితరూపంతో, ఈ శ్వపచాకారంతో అయోధ్యకు రాలేను. ఈ ముఖాన్ని నా ప్రజలకు చూపించలేను. మీరింక ఆలస్యం చెయ్యకుండా బయలుదేరి వెళ్ళండి. హరిశ్చంద్రుణ్ణి సింహాసనం అధిష్ఠింపజేసి మీరంతా రాజకార్యాలు శ్రద్ధగా నిర్వహించండి. ప్రజారంజకంగా పరిపాలన చేయించండి. ఇది నా ఆజ్ఞ. ఇది నా విజ్ఞప్తి. హరిశ్చంద్రుడికి ఈ మాట చెప్పండి - అన్నాడు.

సచివులకు ఉన్నట్టుండి దుఃఖం పొంగివచ్చింది. కన్నులు ఒత్తుకుంటూ మరోసారి నమస్కరించి బయలుదేరారు. అయోధ్యకు తిరిగివచ్చి, ఒక శుభముహూర్తాన హరిశ్చంద్రుడికి యథావిధిగా పట్టాభిషేకం జరిపించారు. హరిశ్చంద్రుడు ధర్మతత్పరుడై తండ్రిని తలుచుకుంటూ ప్రజారంజకంగా పరిపాలన సాగించాడు. ***(అధ్యాయం - 12, శ్లోకాలు - 64)***

వ్యాసమహర్షీ ! హరిశ్చంద్రుడి కథ బాగానే ఉంది. ఇంతకీ త్రిశంకుడి తరవాత కథ ఏమిటి ? శాపం నుంచి విముక్తి పొందాడా ? లేకపోతే ఆ గంగాతీరంలో అలాగే కృశించి అసువులు బాశాడా ? వసిష్ఠులవారేమైనా కరుణించి శాపం ఉపసంహరించారా ? వినాలని చాలా కుతూహలంగా ఉంది. దయచేసి శేషవృత్తాంతాన్ని తెలియజెప్పమంటూ జనమేజయుడు కోరాడు. యథాప్రకారం జనమేజయా! అంటూ వ్యాసుడు మళ్ళీ ఉపక్రమించాడు.

హరిశ్చంద్రుడు పట్టాభిషిక్తుడయ్యాడనే వార్త తెలిసి వసిష్ఠుడు సంతోషించాడు. దేవీధ్యానతత్పరుడై గంగాతీరంలోనే కాలం గడుపుతున్నాడు.



## ◆ విశ్వామిత్ర - శ్వపచుల కథ ◆

కౌశికీనదీతీరంలో దీర్ఘ తపస్సును ముగించుకున్న విశ్వామిత్రుడు తన ఆశ్రమానికి తిరిగి వచ్చాడు. భార్యాపుత్రులు క్షేమంగా ఉన్నందుకు సంతోషించాడు. పన్నెండేళ్ళ దుర్భిక్షం వచ్చిందని విన్నాను. తిండి దొరకక ఎందరెందరో మరణించారట. ఆ కరువు కాలాన్ని నువ్వెలా గడిపావు ? నిన్నూ పిల్లల్నీ అన్నంపెట్టి ఎవరు పోషించారు ? తపస్సులో మునిగిపోయి నేను రాలేకపోయాను. వచ్చినా నిర్ధనుణ్ణి ఏమి చెయ్యగలనులే అని ఆగిపోయాను. చేతిలో చిల్లిగవ్వలేదుగదా ఎలా ఇల్లు గడిపావో చాలా ఆశ్చర్యంగా ఉంది. దుర్భిక్షం గురించి విని మిమ్మల్ని తలుచుకుని బాధపడ్డానేతప్ప ఏ సహాయమూ అందించలేకపోయాను. యజమానుడుగా నా కర్తవ్యం నిర్వహించలేకపోయినందుకు సిగ్గుపడుతున్నాను. ఇలాంటివి తట్టుకుంటేనే తప్ప తపస్సు సాధ్యంకాదాయె. అప్పట్లో అడవిలో ఏమీ దొరక్క నేనూ ఇబ్బంది పడ్డాను.

ఒకనాడు ఆకలి తట్టుకోలేక ఒక శ్వపచుడి గుడిసెలోకి దొంగతనానికి దూరాను. ఆతడు నిద్రపోతున్నాడులే అని సడి చెయ్యకుండా ఉట్టినుంచి కుండదించి మూకుడు తెరిచాను. వండిన కుక్క మాంసం కనిపించింది. ఏదో ఒకటిలే, ముందు ప్రాణాలు నిల్పుకోవాలికదా అని తినబోయాను.

సరిగ్గా అదే సమయానికి ఆ శ్వపచుడుకి మెలకువ వచ్చింది. ఎవరు నువ్వు ? ఈ అర్ధరాత్రివేళ ఇంటిలోకి ఎందుకు ప్రవేశించావు ? కుండ దింపావు కారణం ఏమిటి ? నిజంచెప్పు అంటూ గద్దించాడు. సుందరాంగీ! ఆ క్షణంలో నిజంగా నాకు నోరుపెగలలేదు. తడి ఆరిపోయింది. ఎలాగో తెముల్చుకుని భయంతో వొణికిపోతూన్న గొంతుకతో మెల్లగా అన్నాను - మహాభాగా! నేను బ్రాహ్మణుడిని. తాపసిని. ఆకలి తట్టుకోలేక ఇలా దొంగతనానికి దిగాను. ఈ కుండలో తిండి కనిపించింది. తినబోతున్నంతలో నువ్వు లేచావు. మహానుభావా ! నన్ను అతిథిగా భావించు. అనుమతిస్తే ఈ వండిన మాంసం తింటాను. ప్రాణాలు కడబట్టేట్టున్నాయి. అనుమతించు - అని బిక్కచచ్చిపోయి అభ్యర్థించాను.

అప్పుడు ఆ శ్వపచుడు ఏమన్నాడో తెలుసా ! నువ్వు బ్రాహ్మణుడివి. అగ్రజన్మ నీది. నేను చండాలుడిని. మా ఇంటిలో మాంసం నువ్వు తినడానికి వీలులేదు. మానవజన్మయే దుర్లభమంటారు. అందులోనూ ద్విజత్వం మరీ దుర్లభం. ద్విజుల్లోనూ బ్రాహ్మణత్వం అంతకన్నా దుర్లభంట. నీకు ఈ మాత్రం తెలీదా ? దుష్టాహారం నువ్వు తినకూడదు. కర్మలనుబట్టి ఏడు జాతులను అంత్యజాలుగానూ అగ్రాహ్యాలుగానూ చెప్పాడు ధర్మశాస్త్రకర్త - మనువు. కర్మచేత నేను శ్వపచుణ్ణి కనక త్యాజ్యుడిని. కాబట్టి నువ్వు మా ఇంటిలో ఏమీ తినడానికి వీలులేదు. నీకు ఇంత పెట్టడానికి లోభించి నేను ఇలా నివారిస్తున్నానని భావించకు. వర్ణసంకరదోషం నీకు రాకుండుగాక అనేదే నా ఆకాంక్ష.



నివారయామి భక్ష్యాత్ త్వాం న లోభేనాంజసా ద్విజ ।
వర్ణసంకరదోషోఽయం మాయాతు త్వాం ద్విజోత్తమ ॥(13 - 20)

ఇంత కచ్చితంగా ఇంత ధర్మబద్ధంగా ఇంత మృదువుగా ఆ మహాభాగుడు నన్ను వారిస్తే నిజంగా నాకు సిగ్గువేసింది. ధర్మజ్ఞా ! సత్యం చెప్పావు. నువ్వు అంత్యజుడివైతేనేమి నీ బుద్ధి విశదంగా ఉంది. నువ్వు వారించడం సమంజసమే. తప్పులేదు. కానీ ప్రాణాపాయ పరిస్థితుల్లో ధర్మసూక్ష్మాలు కొన్ని ఉంటాయి. అన్నింటికన్నా ముందు ప్రాణాలను కాపాడుకోవాలి. దేహాన్ని నిలుపుకోవాలి. అందుకోసం అగతికంగా పాపం చేసినా అటు తరువాత విశుద్ధికోసం ప్రాయశ్చిత్తం చేసుకోమని ధర్మసూక్ష్మం. ఏ ఆపదా లేనప్పుడు పాపంచేస్తే అది దుర్గతికి కారణమవుతుందే తప్ప ఆపదల్లో చేస్తే - కాదు.

పాపస్యాంతే పునః కార్యం ప్రాయశ్చిత్తం విశుద్ధయే ।
దుర్గతిస్తు భవేత్పాపాత్ అవాపది న చాపది ॥
మరణాత్ క్షుధితస్యాథ నరకో నాత్ర సంశయః ।
తస్మాత్ క్షుధాపహరణం కర్తవ్యం శుభమిచ్ఛతా ॥ (13 - 23, 24)

ఆకలితో చనిపోతే నరకం తప్పదు కనక ఎలాగోలా ఆకలి తీర్చుకోవడం కర్తవ్యం. అందుకని నేను ఈ దొంగతనానికి పాల్పడ్డాను. ప్రాణాలు నిలుపుకోవాలికదా ! వర్షాలు కురవకపోవడంవల్ల గడ్డుకాలం దాపురించి నేను ఈ చౌర్యానికి దిగవలసి వచ్చింది. దీనివల్లవచ్చే మహాపాపం ఏమైనా ఉంటే అది వానలు కురిపించని పర్జన్యుడికి చెందుతుందే తప్ప నాకు అంటదు.

అవర్షణే చ చౌర్యేణ యత్పాపం కథితం బుధైః ।
యో న వర్షతి పర్జన్యః తత్తు తస్మై భవిష్యతి ॥ (13 - 26)

సాధ్వీమణీ ! నేను ఈ మాట అన్నానో లేదో పర్జన్యుడు హఠాత్తుగా వర్షించాడు. ధారాహస్తాలతో కుండపోతగా వానకురిపించాడు. ఉరుములూ మెరుపులతో వర్షిస్తున్న మేఘాన్ని చూసి నా హృదయం నెమలిలా పురివిప్పి నాట్యం చేసింది. ఆ గుడిసెలోనుంచి ఒక్క అంగలో ఇవతలికి వచ్చాను. పన్నెండేళ్ళ తరవాత పడుతున్న వానలో కేరింతలు కొట్టాను.



## ◆ త్రిశంకుడికి విశ్వామిత్రుని ప్రత్యుపకారం ◆

ప్రియాంగనా ! మరి నువ్వు ఎలా కాలం గడిపావో, ఏమేమి చిత్రవిచిత్ర సంఘటనల జరిగాయో చెప్పాలి. కష్టాలు - గడిచిపోయాక వింతలూ విడ్డూరాలుగానే ఉంటాయి. క్రూరమృగాల సంచరించే ఈ భయంకరారణ్యంలో ఇంతమంది పిల్లల్నివేసుకుని ఒక్కతెవూ ఎలా కాలం గడిపావు ఎలా పోషించావు ఇంతమందినీ ? అని విశ్వామిత్రుడు సానునయంగా ప్రశ్నించాడు.

ఆ ప్రియంవద మృదువుగా పలికింది. ఆకలితో అలమటిస్తున్న పిల్లల్ని బతికించుకోడానికి చాలా తిప్పలు పడ్డాను. గుప్పెడు నీవారధాన్యంకోసం అడవి అంతా గాలించేదాన్ని. వాటితో కాసింత గంజి కాచి తలో గుక్కెడూ పట్టించి కొన్ని నెలలు గడిపాను. రానురాను ఆ గింజలూ కరువయ్యాయి. భిక్ష ఎత్తుదామంటే - వేసేవాళ్ళు ఎవరు ? అందరిదీ అదే అవస్థాయె. కాయలూ దుంపలూకాదు ఆకులు అలములూకూడా దొరకని పరిస్థితి. పెద్ద పెద్ద మహావృక్షాలు నిలువునా ఎండిపోయి మోడులై బికారుల్లా నిలబడ్డాయి. ఒకప్పటి పచ్చదనం తల్చుకుంటే గుండెలు బావురుమనేవి. గంపెడు పిల్లల్ని ఎలా సాకాలో ఎలా బతికించుకోవాలో, నా ప్రాణాలు కడబట్టకుండా ఎలా నిలుపుకోవాలో ఏమీ తోచక రేయింబవళ్ళు విలపించినదాన్ని విలపించినట్టున్నాను. సుదూర ఆశ్రమాలనుంచీ జనపథాలనుంచీ ఆకలిచావుల వార్తలు గుండెను పిండేసేవి. వద్దు - అది తలుచుకుంటేనే భయం వేస్తోంది. ఒక కొడుకును ఎవరికైనా అమ్మేసి మిగిలినవాళ్ళని బతికించుకుందామని కఠోరనిర్ణయానికి వచ్చి సిగ్గువిడిచి బయలుదేరాను. అదృష్టవశాత్తు సత్యవ్రతుడు ఎదురయ్యాడు. ఆ దయార్ద్ర హృదయుడు ప్రతిజ్ఞచేసి రోజూ ఏదోవేళ మాంసం తెచ్చి మన ఆశ్రమవృక్షానికి వేలాడగట్టి వెడుతూ ఉండేవాడు. ఆ మహానుభావుడే ఉపకారం చేసి ఉండకపోతే నాథా ! ఈపాటికి మేమెవ్వళ్ళమూ నీ కంటికి కనిపించి ఉండేవాళ్ళం కాదు. మా అందరి ప్రాణాలూ నిలబెట్టిని దయామయుడు ఆ సత్యవ్రతుడు.

మనవల్లనే అతడికి వసిష్ఠశాపం తగిలింది. ఒకనాడు ఏ జంతువూ దొరకక వసిష్ఠుల వారి పాడి ఆవును సంహరించాడు సత్యవ్రతుడు. దానికి కోపించిన ఆ మహర్షి త్రిశంకుడివైపొమ్మనీ చండాలుడివై మారిపొమ్మనీ శపించాడు. ఇది తెలిసి నేనెంతగానో దుఃఖించాను. నన్నూ నా పిల్లల్నీ పోషించడానికే పాపం ఇతడు నానా అవస్థలూపడి శాపానికి గురిఅయ్యాడు అని లోలోపల నలిగిపోయాను. ప్రత్యుపకారం ఏమీ చెయ్యలేని అశక్తురాలిని. స్వామీ ! నువ్వు తపోబల సంపన్నుడవు. ఏదైనా ఉపాయం ఆలోచించు. ఎలాగోలాగ అతడిని రక్షించు. ప్రత్యుపకారం చేస్తే కొంతలోకొంత ఋణవిముక్తి.



భామినీ ! ఊరడిల్లు. ఎన్ని కష్టాలు పడ్డావు ! ఇదంతా నేను లేకపోవడంవల్ల వచ్చింది. పోనీలే, అయ్యిందేదో అయ్యింది. నువ్వన్నట్టు త్రిశంకుడికి ప్రత్యుపకారం చేస్తాను. నా తపోవిద్యాబలంతో శాపవిమోచనం కలిగిస్తాను - అని మాట ఇచ్చి విశ్వామిత్రుడు తన ధర్మపత్నిని ఓదార్చాడు.

ఏ ఉపకారం చెయ్యాలి, ఎలా చెయ్యాలి - అని ఆలోచిస్తూ విశ్వామిత్రుడు ఆ మర్నాడే అయోధ్యకు బయలుదేరాడు. దారిలో త్రిశంకుడు శ్వపచాకారంలో దీనవదనుడై ఎదురువచ్చి సాష్టాంగపడ్డాడు. విశ్వామిత్రుడు ఆత్రంగా లేవనెత్తి గుచ్చి కౌగిలించుకున్నాడు. సాంత్వనవచనాలు పలికి - రాజేంద్రా ! నాకోసం నువ్వు శాపానికి గురి అయ్యావు. ఏమి కావాలో కోరుకో, ప్రత్యుపకారం చేస్తాను - అన్నాడు. త్రిశంకుడి కన్నుల్లో సన్నటి మెరుపు మిలమిలలాడింది.

కౌశికమహర్షీ ! ఒకానొక యజ్ఞం చేయించమని మా కులగురువు వసిష్ఠుడిని అభ్యర్థించి భంగపడ్డాను. దయచేసి నువ్వు చేయించు. నేను ఈ శరీరంతోనే స్వర్గానికి వెళ్ళాలి. నీ ఇష్టం. ఏ యజ్ఞం చేయిస్తావో, ఎలా చేయిస్తావో, అవసరమైన సంబారాలన్నీ సమకూర్చుకుంటాను. ఇలా కోరినందుకు వసిష్ఠుడు కోపించి తిరస్కరించాడు. పోనీలే, చేయించగలిగిన మరొక పురోహితుణ్ణి వెతుక్కుంటాను అనుమతించమన్నాను. దానికి అలిగి ఈ శ్వపచాకారం త్రిశంకుత్వం ప్రసాదించాడు. ఏమీ దాచకుండా జరిగింది జరిగినట్టు నీకు విన్నవించాను. నా దుఃఖం తీర్చి కోరిక సాధ్యం చెయ్యగల సమర్థుడివి నువ్వే. దయచూపించు. ఇదే నేను కోరుకునే వరం - అని అభ్యర్థించాడు త్రిశంకుడు. శాపాన్ని మరల్చడం ఎలాగా అని ఆలోచనలో పడ్డాడు కౌశికుడు. *(అధ్యాయం - 13, శ్లోకాలు - 62)*

## ◆ త్రిశంకుడికి సశరీర స్వర్గం ◆

విశ్వామిత్రుడు బాగా ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చాడు. యజ్ఞ సంబారాలను సిద్ధం చేయించాడు. మునీశ్వరులకు ఆహ్వానాలు పంపించాడు. ఈ యజ్ఞమూ దీని వెనకాల చరిత్రమూ తెలిసి మునీశ్వరులెవ్వరూ ముందుకి రాలేదు. కొందరినైతే వసిష్ఠుడే వారించాడు. విశ్వామిత్రుడి మనస్సు చివుక్కుమంది. సాటి మునీశ్వరులు తన ఆహ్వానాన్ని తిరస్కరించారే అని బాధపడ్డాడు. అది కోపంగా పరిణమించింది. వసిష్ఠుడు వద్దన్నాడని నా ఆహ్వానాన్నే తిరస్కరిస్తారా ? సరే. చూద్దురుగాని నా తపశ్శక్తి. త్రిశంకూ ! విచారించకు. నా తపస్సిద్ధితో నిన్ను సశరీరంగా స్వర్గానికి పంపుతాను. ఇదిగో ఇప్పుడే పంపుతాను అంటూ కమండలూదకం చేతిలో పోసుకుని గాయత్రీమంత్రజపసిద్ధమైన తన పుణ్యాన్ని త్రిశంకుడికి ధారపోశాడు. రాజా ! స్వేచ్ఛగా స్వర్గానికి వెళ్ళు. బహుసంవత్సరార్జితమైన పుణ్యం నీకు ధారపోశాను. ఇంద్రలోకం చేరుకో. అక్కడ నీకు శుభమగుగాక ! - అని ఆశీర్వదించాడు.



అనడమేమిటి త్రిశంకుడు పక్షిలా ఆకాశంలోకి లేచాడు. అతివేగంగా దూసుకువెళ్ళాడు. శక్రపురం (అమరావతి) చేరుకొంటున్నాడు. దేవతలు చూసి పరుగు పరుగున వెళ్ళి ఇంద్రుడికి విన్నవించారు. ఎవరో క్రూరచండాలుడు గాలిలా దూసుకువస్తున్నాడు మహాప్రభో ! - అన్నారు. ఇంద్రుడు నిలబడి కిందికి చూశాడు. త్రిశంకుడని గ్రహించాడు.

ఓరీ శ్వపచా ! జుగుప్సితా ! ఎక్కడికిరా వస్తున్నావ్ ! ఇది దేవలోకం తెలుసా ? ఫో ! నీ భూలోకానికి వెళ్ళిపో. ఇక్కడ ఉండే అర్హత నీకు లేదు - అని బిగ్గరగా అరిచాడు.

అంతే - క్షీణపుణ్యుడిలా త్రిశంకుడు నేలకు రాలిపోతున్నాడు. విశ్వామిత్రా! మహర్షీ ! పడిపోతున్నాను. వెళ్ళినంత వేగంగానూ పడిపోతున్నాను. రక్షించు రక్షించు అని గావుకేకలు పెట్టాడు.

**పునశ్చుక్రోశ భూపాలో విశ్వామిత్రేతి చాపకృత్ ।**
**పతామి రక్ష దుఃఖార్తం స్వర్గాచ్చలితమాశుగమ్ ॥ (14 - 15)**

విశ్వామిత్రుడికి వినిపించాయి. ఆకాశంలోకి దృష్టి సారించాడు. పడిపోతున్న త్రిశంకుడు కనిపించాడు. చెయ్యి పైకెత్తి "తిష్ఠ" (ఆగు) అని అరిచాడు. అది తపస్విద్ధుడి ఆజ్ఞ. త్రిశంకుడు ఆకాశంలో ఆగిపోయాడు.

కౌశికుడు వెంటనే ఆచమించి యజ్ఞానికి కూర్చున్నాడు. వినూతనంగా మరొక స్వర్గలోకాన్ని సృష్టించడానికి సంకల్పించాడు. అతడి ప్రయత్నాన్ని గమనించి దేవేంద్రుడు ప్రత్యక్షమయ్యాడు.

బ్రహ్మర్షీ ! నువ్వు చేస్తున్న పని ఏమిటి ? నీ కోపం ఎవరిమీద ? దయచేసి ఈ ప్రయత్నం విరమించు. ఇదిగో నేనున్నాను. నీకు ఏమి కావాలో ఆజ్ఞాపించు. వెంటనే చేస్తాను.

చేస్తావా ? అని విశ్వామిత్రుడు రెట్టించి, అయితే మర్యాదగా త్రిశంకుణ్ణి నీతో స్వర్గానికి తీసుకువెళ్ళు - అన్నాడు. దేవేంద్రుడు ఆలోచనలోపడ్డాడు. కౌశికుడి తపోబలం తెలిసినవాడు కనక సరే అని అంగీకరించాడు. త్రిశంకుణ్ణి దివ్యదేహ దివ్యాంబర దివ్యభూషణ విరాజితుణ్ణిచేసి తన దివ్యవిమానంలో సరసన కూర్చోబెట్టుకుని కౌశికుడి దగ్గర సెలవు తీసుకుని స్వర్గానికి తీసుకువెళ్ళాడు. విశ్వామిత్రుడి మనస్సు శాంతించింది. తృప్తిగా నిట్టూర్చాడు.

ఈ విశేషాలు తెలుసుకుని హరిశ్చంద్రుడూ సంబరపడ్డాడు. ప్రసన్నచిత్తంతో రాజ్యం పరిపాలిస్తూ రూపయౌవనచాతుర్యసంయుక్తయైన భార్యతో క్రీడావినోదాలు అనుభవిస్తూ కాలం గడిపాడు. చాలా ఏళ్ళు గడిచాయి. అన్నీ ఆనందదాయకంగానే ఉన్నాయి కానీ ఎంతకూ భార్యకడుపు పండలేదు. ఇదొక పెద్ద దిగులు పట్టుకుంది. ఇక్ష్వాకువంశం తనతో అంతరించిపోతుందేమో అని బెంగపడ్డాడు. ఒక శుభముహూర్తాన వసిష్ఠుల ఆశ్రమానికి వెళ్ళి పాదాభివందనం చేసి తన దిగులు వెల్లడించాడు.



## ◆ హరిశ్చంద్రుడి పుత్రవ్యామోహం ◆

దైవజ్ఞా ! నువ్వు మంత్రవిద్యా విశారదుడవు. మాకు సంతానం కలిగే ఉపాయం ఏదైనా ఆలోచించు. ధర్మజ్ఞుడివి. అపుత్రస్య గతిర్నాస్తి అంటారు. నా దుఃఖం తెలిసి, కులపురోహితుడవైయుండి, శక్తిమంతుడవైయుండి ఇలా ఉపేక్ష చెయ్యడం నీకు భావ్యమేనా ! ఈ పిచుకలు చూడు. ఎంత ధన్యమో వాటి జీవితం ! పిల్లల్ని లాలించి ఆనందిస్తున్నాయి. మేమే మందభాగ్యులం. రేయింబవళ్ళు దిగులు పడుతున్నాం.

కలవింకాస్త్విమే ధన్యా యే శిశుం లాలయంతి హి ।
మందభాగ్యోఽహమనిశం చింతయామి దివానిశమ్ ॥ (14 - 31)

హరిశ్చంద్రుడి అభ్యర్థనలో ధ్వనిస్తున్న నిర్వేదాన్ని అర్థం చేసుకున్నాడు వసిష్ఠుడు. మహారాజా! నువ్వన్నది ముమ్మాటికీ నిజం. ఈ సంసారంలో దంపతులకి పిల్లలు లేకపోవడాన్ని మించిన దుఃఖం లేదు. దీనికి ఒక మార్గంఉంది. వరుణుడిని ఉపాసించు. అతడు సంతానదాయకుడైన దేవత. నీ కోరిక నెరవేరుతుంది. దైవమూ పురుషకారమూ రెండూ సమానప్రతిపత్తి కలవే. ప్రయత్నం లేకుండా ఏ కార్యమూ సిద్ధించదు. నిజానికి తత్త్వదర్శులై మానవులు గట్టి ప్రయత్నమే చెయ్యాలి. అదే కార్యసాధకం. మరోదారి లేదు.

దైవం పురుషకారశ్చ మాననీయావిమౌ నృభిః ।
ఉద్యమేన వినా కార్యసిద్ధిస్సంజాయతే కథమ్ ॥
న్యాయతస్తు నరైః కార్యం ఉద్యమస్తత్త్వదర్శిభిః ।
కృతే తస్మిన్ భవేత్సిద్ధిః నాన్యథా నృపసత్తమ ॥ (14 - 36, 37)

ఈ ఉపాయానికి హరిశ్చంద్రుడు సంతృప్తిచెందాడు. మరోసారి గురువుగారికి నమస్కరించి తపస్సుకి వెళ్ళిపోయాడు. గంగాతీరం చేరుకుని ఒక ప్రశాంత - ఏకాంత ప్రదేశంలో పద్మాసనం వేసుకుని కూర్చుని వరుణుడిని ధ్యానించాడు. చాలా ఏళ్ళకు వరుణుడు కరుణించి ప్రత్యక్షమయ్యాడు. వరం కోరుకోమన్నాడు. ఋణత్రయ విముక్తికోసం సుఖప్రదుడైన పుత్రుణ్ణి అనుగ్రహించమని కోరాడు హరిశ్చంద్రుడు.

హరిశ్చంద్రా ! నువ్వు కోరినట్టు గుణవంతుడైన పుత్రుణ్ణి నీకు అనుగ్రహిస్తాను. కానీ దీనికి ప్రతిఫలంగా నువ్వు నాకు ఏ ప్రియం చేస్తావో చెప్పు. ఆ కొడుకునే బలి ఇచ్చి వరుణ యజ్ఞం నిర్వహిస్తావా?



కరుణావరుణాలయా ! తప్పకుండా నిర్వహిస్తాను. పుత్రుణ్ణి అనుగ్రహించు. ముందు మా వంధ్యత్వం తొలగిపోతే చాలు. అది భరింపరాని దుఃఖం. నువ్వన్నట్టే వరుణయజ్ఞం చేసి నీకు ప్రీతికలిగిస్తాను.

మహారాజా ! సరే. నీకు పుత్రుడు జన్మిస్తాడు. ఇంటికి వెళ్ళు. తరవాత - మాట తప్పకూడదుసుమా! అని వరుణుడు హెచ్చరించి అంతర్ధానం చెందాడు. హరిశ్చంద్రుడు అంతఃపురం చేరుకున్నాడు. తన నూర్గురుభార్యలకూ ఈ విషయం తెలియపరిచాడు. అందరూ సంతోషించారు. కొంతకాలానికి అతడి పట్టమహిషి శైబ్య - మహాసాధ్వి - గర్భం ధరించింది. రాజుకూ రాజధానికీ - కళకళ. నెలలు నిండి మహారాజ్ఞి ప్రసవించింది. మగబిడ్డడు జన్మించాడు. తారాబలచంద్రబలాలు అత్యద్భుతమన్నారు పండితులు. పారితోషికాలు పుష్కలంగా అందుకుని ఆశీర్వదించి వెళ్ళారు. పురిటి సాన్నం అయ్యింది. జాతకర్మలన్నీ జరిపించారు. విశేషంగా దానధర్మాలు చేసి హరిశ్చంద్రుడు మురిసిపోయాడు.

*(అధ్యాయం - 14, శ్లోకాలు - 55)*

పుత్రోత్సవం ముగిసింది. బ్రాహ్మణవేషంలో వరుణుడు వచ్చాడు. యజ్ఞం మాట ఏమిటి అన్నాడు. వంధ్యత్వం తొలగిందికదా, ఇక ఇచ్చినమాట నిలబెట్టుకో అన్నాడు. హరిశ్చంద్రుడు చింతావ్యాకులిత హృదయుడయ్యాడు. కొడుకును అందునా పసిగుడ్డును కానకకన్న వంశోద్ధారకుణ్ణి ఎలా సంహరించను! మాట తప్పితే వరుణుడు ఊరుకుంటాడా ? లోకపాలుడు. మహాబలశాలి. దేవతల్ని మోసగించడం సాధ్యమా ? మోసగించి బతకగలనా ? వీడు పుట్టి ఇంకా నెల నిండలేదు. అప్పుడే నాకు ఎంతటి పుత్రవ్యామోహం ! ప్రాణులకు ఇది తెంచుకోలేని మహాబంధనంకదా ! ఇప్పుడు ఏమిటి కర్తవ్యం ? కొడుకు పుట్టాడన్న ఆనందం - ఉత్సవం జరిపినంతసేపన్నా మిగలదా ? అయ్యో - అనుకున్నాడు. వరుణుడికి ఏదో ఒకటి చెప్పి పంపించాలని ధైర్యం కూడగట్టుకున్నాడు. లేచి వెళ్ళి పాదాభివందనం చేశాడు.

దేవదేవా ! కరుణానిధీ ! నీ ఆజ్ఞ నెరవేరుస్తాను. వేదోక్తప్రకారంగా భూరిదక్షిణలతో వరుణయజ్ఞం చేస్తాను. బిడ్డపుట్టిన పదకొండవనాటికి తండ్రికి శుద్ధి. నెలగడిచాక తల్లికి శుద్ధి. అప్పుడుగదా మేమిద్దరం యజ్ఞానికి అర్హులం అవుతాం ! నువ్వు సర్వజ్ఞుడివి. ధర్మశాస్త్రాలు చదివినవాడివి. అందాకా ఓపికపట్టు అని వినయంగా అభ్యర్థించాడు.

సరే, మహారాజా ! నీకు శుభమగుగాక ! నెల గడిచాక వస్తాను. అప్పుడింక వాయిదా వెయ్యకూడదుసుమా ! అని చెప్పి వరుణుడు నిష్క్రమించాడు. గండం గడిచిందికదా అని హరిశ్చంద్రుడు ఊపిరి పీల్చుకున్నాడు. కొడుకుకి రోహితుడు అని నామకరణమహోత్సవం జరిపించాడు. సరిగ్గా నెల గడిచేసరికి వరుణుడు విప్రవేషంలో ప్రత్యక్షమయ్యాడు. చూస్తూనే హరిశ్చంద్రుడు గడగడలాడిపోయాడు. సాష్టాంగపడి అతిథిమర్యాదలు అత్యద్భుతంగా జరిపాడు.



మహానుభావా ! నీ రాకతో మా గృహం పావనమయ్యింది. యజ్ఞం తప్పకుండా చేస్తాను. అయితే - దంతాలు రాని పిల్లవాడు యజ్ఞపశువుగా పనికిరాడు అంటున్నారు మా విద్వాంసులు. అంచేత పాలపళ్ళు వచ్చేదాకానన్నా ఆగు - అని అప్పటికి దాటవేశాడు హరిశ్చంద్రుడు. సరేనని వెళ్ళిపోయాడు వరుణుడు.

పిల్లవాడికి దంతాలు వచ్చాయి. హరిశ్చంద్రుడికి భయం పట్టుకుంది. వరుణుడు రానేవచ్చాడు. స్వామీ ! బిడ్డడికి ఇంకా పుట్టువెంట్రుకలు తీయించలేదు. ఆ చౌలకర్మ అయ్యేంతవరకూ ఈ గర్భకేశుడు యజ్ఞపశువుగా పనికిరాడుటగదా ! పెద్దలు చెబుతున్నారు. కాబట్టి అప్పటిదాకా మరికాస్త ఓపికపట్టు. యజ్ఞం తప్పకుండా చేస్తాను. ఆడిన మాట తప్పడం మా ఇంటా వంటా లేదు. నీకు తెలుసుగదా - అన్నాడు మహారాజు.

రాజా ! నన్ను వంచించాలని చూస్తున్నావు. ఏదో ఒక వంక చెప్పి వాయిదాలు వేస్తున్నావు. పుత్రస్నేహానికి లొంగిపోతున్నట్టున్నావు. మిగతా యజ్ఞ సంబారాలన్నీ సిద్ధం చేసుకున్నావుగదా ! సరే ఇప్పటికి వెడుతున్నాను. చౌలకర్మ అయ్యినతరవాత యజ్ఞం చెయ్యకపోయావో జాగ్రత్త. శపిస్తానుసుమా! ఇక్ష్వాకువంశంలో పుట్టావు. మాట తప్పకూడదు. గుర్తుంచుకో - అంటూ చరచరా నడిచి వెళ్ళిపోయాడు.

బిడ్డడికి పుట్టువెంట్రుకలు తీయించడమయ్యింది. తల్లి ఒడిలో నుంచి ఇంకా లేవనే లేదు. పాశహస్తుడు రానే వచ్చాడు. అగ్నిలా భగభగలాడుతూ నిలబడ్డాడు. నృపతి గజగజలాడాడు.

యదాంకే సుతమాదాయ రాజ్ఞీ నృపతిసన్నిధౌ ।
ఉపవిష్టా క్రియాకాలే తదైవ వరుణోఽభ్యగాత్ ॥ (15 - 32)

పాశహస్తా ! ఈ రోజే ఇప్పుడే నీ యజ్ఞం చేస్తాను. అన్నీ సిద్ధంగా ఉన్నాయి. దయచేసి కోపం ఉపసంహరించు. నువ్వు మన్నిస్తే చిన్న విజ్ఞప్తి. ముందు - ఆలకించు. నచ్చకపోతే ఆనక తిరస్కరించు. కాదనను. ఏమిటంటే - బ్రాహ్మణక్షత్రియవైశ్యులను ద్విజులు అంటారుగదా ! ఉపనయనం జరగకుండా వీరికి ద్విజత్వం రాదు. అందాకా వీళ్ళు శూద్రులకిందనే లెక్క. శూద్రుడు యజ్ఞపశువుగా పనికిరాడని వేదాలు చెబుతున్నాయి. అంచేత ఈ రోహితుడికి ఉపనయన సంస్కారం జరిపించేదాకా ఆగడం మంచిదేమో ఆలోచించు. రాకుమారులకు పదకొండవ ఏట, బ్రాహ్మణపుత్రులకు ఎనిమిదవ ఏట, వైశ్య తనయులకు పన్నెండవ ఏట ఉపనయనం చెయ్యాలని ధర్మశాస్త్రాల నిర్ణయం. కాబట్టి పదకొండవ ఏట ఉపనయన సంస్కారం జరిపించి వీడిని యజ్ఞపశువుగా చేసి యజ్ఞం నిర్వహిస్తాను. దయచేసి అంగీకరించు. సకలశాస్త్రవేత్తవు నీకు నేను చెప్పాలా ?



హరిశ్చంద్రుడి విజ్ఞప్తిని ఆలకించిన వరుణుడి హృదయం కరిగింది. ముఖం ప్రసన్నమయ్యింది. చిరునవ్వు తొణికిసలాడింది. మౌనంగా నిష్క్రమించాడు.

కనీసం పదేళ్ళ తరవాత మాటగదా, అప్పుడు చూసుకుందాం అని హరిశ్చంద్రుడు తన రాజకార్యాల్లో మునిగిపోయాడు. కాలం గిర్రున తిరిగింది. పదకొండో యేడు రానే వచ్చింది. రోహితుడికి ఉపనయనం జరిగింది. అది ముగుస్తున్నంతలోనే వరుణుడు వచ్చాడు. ఎప్పటిలాగానే విప్రవేషంలో వచ్చాడు. హరిశ్చంద్రుడు ఎప్పటిలాగానే అతిథిమర్యాదలు చేశాడు. నమస్కరించి నిలబడ్డాడు.

పశ్చిమదిక్పాలకా ! వరుణదేవా ! కరుణామూర్తీ ! ఈ రోజుతో మా అబ్బాయికి యజ్ఞపశుయోగ్యత సిద్ధించింది. యజ్ఞం ఇప్పుడే ఆరంభించి చేస్తాను. మా వంధ్యత్వం తొలగించిన మహానుభావుడివి. నిన్ను తృప్తిపరచడం నా విధి. ఇంకా ఇంకా వాయిదాలు వెయ్యడం నాకే సిగ్గుగా ఉంది. ఇదిగో ఇప్పుడేకదా ఉపనయనం ముగింపుకి వచ్చింది. సమావర్తనకర్మకూడా అయిపోతే నాకు అదొక తృప్తి. కాసింత ఓపిక పట్టు. అది కాగానే తక్షణం యజ్ఞం మొదలుపెట్టేస్తాను. మరింక వాయిదా వెయ్యనుగాక వెయ్యను. నా మాట నమ్ము - అన్నాడు ధీమాగా.

మహారాజా ! వచ్చినప్పుడల్లా యుక్తియుక్తంగా ఏదో ఒకటి చెప్పి ఎప్పటికప్పుడు వాయిదా వేస్తున్నావు. యజ్ఞారంభం తప్పిస్తున్నావు. నాకు టోకరా వెయ్యాలని చూస్తున్నట్టున్నావు. జాగ్రత్త. "అతి తెలివి" ప్రదర్శించకు. ఈ రోజుకి వెడుతున్నాను. సమావర్తనకర్మ ముగియగానే వస్తాను. అదే చివరి గడువు. బుద్ధిగా యజ్ఞం చేసి మాట నిలబెట్టుకున్నావో సరేసరి. లేదంటే - నా కోపం, నా శాపం రుచి చూస్తావు - అనేసి వరుణుడు వెళ్ళిపోయాడు. హమ్మయ్య అనుకున్నాడు రాజు.

## ◆ రోహితుడి పలాయనం - హరిశ్చంద్రుడికి జలోదరం ◆

వరుణుడు రావడం, తన తండ్రి ఏకాంతంలో ఏదో బతిమాలడం, కాళ్ళ మీద పడటం, వరుణుడు బెదిరిస్తున్నట్టు చూపుడు వేలు విసరడం- ఇదంతా దూరం నుంచే గమనించాడు రోహితుడు. ఏమిటి చెప్మా కథ - అని ఆరాతీశాడు. విషయమంతా అర్థమయ్యింది. తన తండ్రి పడుతున్న ఆవేదన తెలిసింది. తాను యజ్ఞపశువు కాకతప్పదనీ గ్రహించాడు. తన ఈడు మంత్రిపుత్రులతో చర్చించాడు. ఒక నిశ్చయానికి వచ్చాడు. ఎవరికీ చెప్పకుండా అడవులకు పారిపోయాడు. తెల్లవారుతూనే హరిశ్చంద్రుడికి ఈ వార్త తెలిసింది. దంపతులిద్దరూ దారుణంగా విలపించారు. నెమ్మదిగా తేరు`ని దేశమంతటా గాలించండని దూతలను పంపించాడు.

కొంతకాలం గడిచింది. సమావర్తనకర్మ గడువు దాటిపోయింది. వరుణుడు వచ్చాడు. యజ్ఞం చెయ్యవేమని కఠినంగా ప్రశ్నించాడు. హరిశ్చంద్రుడు బోరుమన్నాడు. ఇంకెక్కడి యజ్ఞం ? భయపడి



హితుడు ఎటో పారిపోయాడు. రాజభటులు అంతటా అన్వేషించారు. ఫలితం లేకపోయింది. ఎక్కడికి యాడో, ఎలా ఉన్నాడో. మహానుభావా ! ఇప్పుడు నన్ను ఏమి చెయ్యమంటావు ? ఇందులో నా తప్పు మీ లేదు. అంతా మా దురదృష్టం - అన్నాడు.

వరుణుడు నమ్మలేదు. వంచన అనుకున్నాడు. క్రోధావిష్టుడు అయ్యాడు. నీకు జలోదరవ్యాధి సంభవించుగాక అని శపించాడు. వరుణ లోకానికి వెళ్ళిపోయాడు. హరిశ్చంద్రుడికి ఆ క్షణంలోనే ఆ వ్యాధి ప్రారంభమయ్యింది. బాధ భరించలేక మెలికలు తిరిగిపోతున్నాడు.

*(అధ్యాయం - 15. శ్లోకాలు - 66)*

కుమారుడు పారిపోయాడని దుఃఖిస్తుంటే ఈ జలోదరం ఒకటి. గోరుచుట్టు మీద రోకలిపోటులాగా. దంపతులు దారుణంగా నలిగిపోయారు. అడవిలో తలదాచుకుంటున్న రోహితుడికి ఈ వార్త తెలిసింది. తాను అడవికి వచ్చేసి అప్పటికే సంవత్సరం దాటిపోయింది. ఏడాది పొడవునా తండ్రి ఎంత బాధపడి ఉంటాడో. తల్లి ఎంతగా బెంగపడి ఉంటుందో. వెంటనే బయలుదేరి రాజధానికి పోదామనుకున్నాడు.

సరిగ్గా అదే సమయానికి ఇంద్రుడు బ్రాహ్మణరూపంలో వచ్చి రోహితుణ్ణి వారించాడు. చిన్నవాడా. రాజనీతి నీకు ఇంకా తెలియనట్టుంది. అందుకే ఇంటికి వెడదామనుకుంటున్నావు. పిచ్చివాడా ! వెళ్ళావో మీ నాన్న యజ్ఞం చేస్తాడు. నిన్ను బలిపశువును చేస్తాడు. ఏ ప్రాణికైనా సరే అత్యంత ప్రీతిపాత్రమైనవి ప్రాణాలే. అటుతరవాతనే పుత్ర దార ధనాదులన్నీ, మీ నాన్నకూ అంతే. తన ప్రాణాలు కాపాడుకోవడం కోసం నిన్ను బలిచేసి హోమగుండంలో వేల్చి రోగవిముక్తుడవుతాడు.

> ఆత్మా హి వల్లభస్తాత సర్వేషాం ప్రాణినాం ఖలు ।
> తదర్థే వల్లభాస్సంతి పుత్రదారధనాదయః ॥
> ఆత్మనో దేహరక్షార్థం హత్వా త్వాం వల్లభం సుతమ్ ।
> హవనం కారయిత్వాసౌ రోగముక్తో భవిష్యతి ॥ (16 - 7, 8)

అంచేత నువ్వు ఇప్పుడు రాజధానికి వెళ్ళకు. మీ తండ్రికి ఎలాగూ వయసు అయిపోయింది. ఇవ్వాళో రేపో హరీ అంటాడు. అప్పుడు వెళ్ళి రాజ్యం ఏలుకుందువుగాని - అని ప్రబోధించాడు. రోహితుడు ఆగిపోయాడు. కానీ మనసు పీకుతూనే ఉంది. రెండు మూడు రోజులు బాగా ఆలోచించాడు. చస్తే చచ్చాను. తల్లిదండ్రుల్ని ఆదుకోని తనయుడూ తనయుడేనా, వెడతాను అని ఒక నిశ్చయానికి వచ్చాడు. బయలుదేరుతున్నంతలో మళ్ళీ ఇంద్రుడు అదే వృద్ధబ్రాహ్మణ రూపంలో వచ్చాడు. ఇంకా యుక్తియుక్తంగా ఉపన్యసించి మళ్ళీ వారించాడు.



## ◆ అజీగర్తుడి ధనలోభం ◆

హరిశ్చంద్రుడు రోగబాధను తట్టుకోలేక వసిష్ఠులవారిని ఉపాయం అడిగాడు. ఎవరైనా ఒక బ్రాహ్మణ బాలుణ్ణి అడిగినంత ధనమిచ్చి కొని బలిపశువును చేసి యజ్ఞం నిర్వహించమని వసిష్ఠుడు సలహా చెప్పాడు. పదిరకాల పుత్రుల్ని చెప్పాయి ధర్మశాస్త్రాలు. అందులో ఇలాంటి క్రయపుత్రుడొకడు. అంచేత ఇలా చేస్తే వరుణుడు ప్రసన్నుడవుతాడు. నీ రోగం కుదురుతుంది. ధనలోభంతో ఎవరైనా కొడుకును నీకు అమ్మవచ్చు - ప్రయత్నించమన్నాడు. రాజు వెంటనే మంత్రులను పురమాయించాడు.

ఒక ఊళ్ళో అజీగర్తుడనే నిరుపేద బ్రాహ్మణుడున్నాడు. అతడికి ముగ్గురు కొడుకులు. సంసారం ఈదలేక నానా అవస్థలూ పడుతున్నాడు. పెద్దవాడి పేరు శునఃపుచ్ఛుడు. రెండవ వాడి పేరు శునఃశేపుడు. మూడోవాడి పేరు - శునోలాంగూలుడు. ఆకలి తట్టుకోలేక వీరిలో ఒకడిని అమ్మెయ్యడానికి సిద్ధపడ్డాడు. అయితే ఎవడిని అమ్మాలి అని మీమాంస వచ్చింది. ఉత్తరక్రియలకు అధికారి కనక జ్యేష్ఠుణ్ణి అమ్మను అన్నాడు. కడుగొట్టుబిడ్డ ఇష్టుడు కనక అమ్మడానికి వీల్లేదు అంది భార్య. ఇద్దరూ కలిసి మధ్యముణ్ణి నూరుగోవులకి అమ్మేశారు. శునశ్శేపుడు బోరుబోరున విలపించాడు. రాజభటులు బలవంతంగా తీసుకువచ్చేశారు. వెంటనే అతడిని యూపానికి బంధించి హరిశ్చంద్రుడు నరమేధయజ్ఞం ఆరంభించాడు. ఋత్విక్కులుగా వచ్చిన మునీశ్వరుల మనస్సులు విలవిలలాడాయి. పసిబాలుణ్ణి బలి ఇవ్వడానికి చేతులు రాలేదు. నరకవలసిన విప్రుడు నేను ఈ ఘాతుకం చెయ్యలేనంటూ కత్తి విసిరేసి వెళ్ళిపోయాడు. హరిశ్చంద్రుడు అవాక్కయ్యాడు. ఏమి చెయ్యడానికీ తోచలేదు. సభాసదులారా ! తరణోపాయం చెప్పండి అని అభ్యర్థించాడు. సభలో కలకలం బయలుదేరింది.

అజీగర్తుడు లేచి, మహారాజా ! నేను చేస్తాను, వేతనం రెట్టింపు ఇప్పించు, నేను నిరుపేదను, నాకు ధనం కావాలి, నీకు పని అవ్వాలి - అన్నాడు. హరిశ్చంద్రుడు సరే అన్నాడు. నూరుగోవులు ఇస్తానన్నాడు. అజీగర్తుడు కత్తి అందుకున్నాడు. కొడుకును చంపడానికి సిద్ధపడిన తండ్రిని చూసి జనాలు ఆశ్చర్యచకితులయ్యారు. హాహాకారాలు చేశారు. వీడు తండ్రి కాదు, పిశాచమంటూ నిందించారు. మహాపాపీ ! క్రూరుడా ! డబ్బుకోసం కక్కుర్తిపడి కన్నకొడుకును అమ్ముకోవడమేకాక, స్వయంగా చంపుకోడానికీ సిద్ధమయ్యావా ? ఏం సుఖపడతావ్ ఈ డబ్బుతో. కొడుకంటే ఎవరు ? ఏమి చెబుతోంది వేదం ? ఆత్మావై జాయతే పుత్రః అంగాద్వై వేదభాషితమ్. ఎంత పాపాత్ముడివిరా - అని నలుగురూ నాలుగుమాటలూ అన్నారు. సభ అంతా కోలాహలమైపోయింది.

అంతలోకీ విశ్వామిత్రుడు అక్కడికి వచ్చాడు. పరిస్థితి అర్థమయ్యింది. హృదయం ఆక్రోశించింది. హరిశ్చంద్రుణ్ణి సమీపించాడు. రాజా ! నీ క్రతువు పూర్తి అవుతుంది. నీ రోగం ఉపశమిస్తుంది. కంగారు పడకు. ఒక్క విషయం తెలుసుకో. దయకు మించిన పుణ్యం లేదు. హింసకు మించిన పాపం లేదు. ఆత్మదేహాన్ని రక్షించుకోవడం కోసం పరదేహాన్ని ఖండించడం ఏ రకంగానూ సమర్థనీయం కాదు.



సర్వభూతాలనూ దయగా చూస్తే జగత్పతి సంతోషిస్తాడు. అంతకు మించిన శాంతి లేదు, సౌఖ్యం లేదు. ఆత్మవత్సర్వభూతాని అనే వేదోక్తిని మరిచిపోకు. అందరికీ ప్రియంగా జీవించాలి. ఒకరిని చంపి మనం సుఖపడదామనుకోవడం వట్టి భ్రమ. ఏ వైరం ఉందని నువ్వు ఈ బాలుణ్ణి సంహరిస్తావు ? చెప్పు. ఇప్పుడు నువ్వు చంపితే పై జన్మలో ఈ ప్రాణి నిన్ను చంపుతుంది. పోనీ మీ ఇద్దరికీ గతజన్మల వైరం ఏమైనా ఉందా? నీకు తెలిసిందా ? అదైనా చెప్పు, వింటాను.

ఈ అజీగర్తుడు పరమదుర్మార్గుడు. కనకనే కొడుకును నీకు విక్రయించాడు. ధనలోభం ఎంత పాపమైనా చేయిస్తుంది. ఎవరైనా ఎక్కువమంది పుత్రులు కలగాలని కోరుకుంటారు. ఒకడైనా గయకు వెళతాడనీ పిండప్రదానం చేస్తాడనీ ఆశ. అశ్వమేధాన్ని చేసినా చెయ్యకపోయినా, నీలవృషభాన్ని విడిచి పెట్టినా విడిచిపెట్టకపోయినా కనీసం ఇదైనా చేస్తాడని కన్న తండ్రి ఆశిస్తాడు. అటువంటిది ఈ అజీగర్తుడు ధనలుబ్ధుడై కొడుకును అమ్ముకోడమేకాక ఖండించడానికీ సిద్ధపడ్డాటంటే ఎంత దారుణం ! ఇటువంటి మహాపాపం నీ రాజ్యంలో, నీ సమక్షంలో నీ కోసం జరగడమా ? దేశంలో జరిగే పాపాలన్నింటా ఆరవవంతు రాజుకు సంక్రమిస్తుంది - తెలుసా ? అందుకనే రాజుగారు పనిబూని తన రాజ్యంలో పాపాలు జరక్కుండా చూసుకోవాలి అనడం. పుత్ర విక్రయాన్ని నువ్వు నిషేధించవలసింది పోయి నీకోసమే ప్రోత్సహిస్తావా ? సూర్యవంశంలో పుట్టావు. త్రిశంకుడికి తనయుడివి. ఇది నీకు తగునా ? ఆర్యుడివై అనార్యుడిగా ప్రవర్తిస్తావా ?

దేశమధ్యే చ యః కశ్చిత్పాపకర్మ సమాచరేత్ ।
షష్ఠాంశస్తస్య పాపస్య రాజా భుంక్తే న సంశయః ॥
నిషేధనీయో రాజ్ఞాసౌ పాపం కర్తుం సముద్యతః ।
న నిషిద్ధస్త్వయా కస్మాత్ పుత్రం విక్రేతుముద్యతః ॥
సూర్యవంశే సముత్పన్నః త్రిశంకుతనయః శుభః ।
ఆర్యస్త్వమనార్యవత్కర్మ కర్తుమిచ్ఛసి పార్థివ ॥ **(16 - 48, 49, 50)**

మహారాజా ! నేను రావడం మంచిదే అయ్యింది. నామాట విను. ఈ విప్రనందనుణ్ణి విడిచిపెట్టించు. నీ ఆరోగ్యం కుదుటపరిచే పూచీ నాది. నీ తండ్రి చండాలత్వం తొలగించి సశరీరంగా స్వర్గానికి పంపించాను. గుర్తుందా ? దానికి నువ్వెంతో పొంగిపోయావు. ఆ సంతోషానికి ఫలంగానైనా నా మాట విను. చూడు, ఈ పసిబాలుడు ఎలా విలపిస్తున్నాడో. ప్రాణభయంతో వణికిపోతున్నాడు. వెంటనే విడిచిపెట్టించు. ఇది నా అభ్యర్థన. నా యాచన. కాదన్నావనుకో అదొక పెద్దదోషమవుతుంది. యజ్ఞ సమయంలో (వేదవేత్తలు) ఎవరు ఏది అడిగినా కాదనకుండా ఇవ్వాలి. లేకపోతే మహాపాపమే. సందేహం లేదు.



ప్రార్థితం సర్వథా దేయం యజ్ఞేఽస్మిన్ నృపసత్తమ ।
అన్యథా పాపమేవ స్యాత్ తవ రాజన్నసంశయః (16 - 55)

విశ్వామిత్రుడు చేసిన సుదీర్ఘ ప్రసంగాన్ని ఆసక్తిగా విన్నాడు హరిశ్చంద్రుడు. జలోదరం బాధతో కడుపు చుమ్మచుట్టుకుపోతోంది. మూలుగుతూనే బదులు పలికాడు. కౌశికా ! నా వ్యాధినీ నేను పడుతున్న బాధనూ కళ్ళారా చూస్తూకూడా నువ్వు ఇలా మాట్లాడటం భావ్యమా ? నాకు ఈ బాధ తొలగడం ముఖ్యం. అటుపైనే మిగతా పాపాలూ పుణ్యాలూను. దయచేసి కోపించకు. నన్ను అర్థం చేసుకో. ఈ బాలుణ్ణి విడిచిపెట్టమని నిర్బంధించకు. మరింక ఏదైనా కోరుకో. చెల్లిస్తాను. ***(అధ్యాయం - 16, శ్లోకాలు - 59)***

## ◆ శునశ్శేపుడికి వరుణకటాక్షం ◆

హరిశ్చంద్రుడి సమాధానానికి విశ్వామిత్రుడికి కోపం వచ్చింది. అయినా నిగ్రహించుకున్నాడు దుఃఖిస్తున్న శునశ్శేపుడి దగ్గరికి వెళ్ళాడు. నాయనా ! వరుణ మంత్రం ఉపదేశిస్తాను. జపించు. నీకు శుభం జరుగుతుంది. ఇది నా ఆజ్ఞ - అంటూ చెవిలో ఉపదేశించాడు. శునశ్శేపుడు స్ఫుటాక్షరంగా దాన్ని జపించాడు. వరుణుడు ప్రసన్నుడై ప్రత్యక్షమయ్యాడు. అందరూ ఆశ్చర్యపోయారు. స్తుతించాడు. హరిశ్చంద్రుడు లేచి వచ్చి పాదాభివందనం చేశాడు.

మహానుభావా ! దయానిధీ ! నేను పాపిష్ఠిని. మూర్ఖుడిని. అపరాధం చేశాను. క్షమించు - అంటూ మరోసారి సాష్టాంగపడ్డాడు. అప్పుడు వరుణదేవుడు చిరునవ్వులు చిందిస్తూ -

మహారాజా ! నువ్వుకాదు అపరాధివి. నేను. పుత్రార్థివైన నీతో ఆడుకున్నాను. యాచకుడికి దోషాలు తెలుస్తాయా ? అపుత్రస్య గతిర్నాస్తి అన్నారుకదా అని నరకానికి భయపడి పుత్రుణ్ణి వదులుకోలేక నన్ను వంచించడానికి ప్రయత్నించావు. అజ్ఞానంతో చేసిన తప్పు, జ్ఞానులకు పెద్దగా దూషించదగింది కాదులే - అన్నాడు.

హరిశ్చంద్రుడు ఆశ్చర్యపోయాడు వరుణుడేనా ఈ మాటలు అంటున్నది అని. తేరుకున్నాడు. దేవదేవా ! నా కుమారుడు నన్ను మోసగించి ఎటో వెళ్ళిపోయాడు. నేను రోగగ్రస్తుణ్ణి అయ్యాను. నీకిచ్చిన మాట నిలబెట్టుకోడంకోసం గత్యంతరంలేక ఈ బాలుణ్ణి కొన్నాను. నీ తృప్తికోసం యజ్ఞం ప్రారంభించాను. దర్శనం అనుగ్రహించావు. చాలా ఆనందంగా ఉంది - అన్నాడు.

మహారాజా ! ఈ శునశ్శేపుడు నన్ను స్తుతించాడు. కనక విడిచిపెట్టు. యజ్ఞం సంపూర్ణమైనట్టే. నీ వ్యాధి ఈ క్షణంతో తొలగిపోతుంది - అనడమేమిటి వరుణుడు, రాజుగారు రోగవిముక్తుడయ్యాడు. శునశ్శేపుడు బంధవిముక్తుడు అయ్యాడు. ప్రజలంతా జయజయధ్వానాలు చేశారు. వరుణుడు వచ్చినట్టే వెళ్ళిపోయాడు.



## ◆ శునశ్శేపుడికి తండ్రి విశ్వామిత్రుడే ◆

అప్పుడు శునశ్శేపుడు - సభ్యులారా ! మీరంతా ధర్మజ్ఞులు. వేదశాస్త్రానుసారంగా యథార్థవాదులు. ప్రశ్ననిర్ణయం చెప్పండి. ఇప్పుడు నేను ఎవరి పుత్రుణ్ణి ? నా తండ్రి ఎవరు ? చెబితే ఆయనగారిని సేవించుకుంటాను - అని అడిగాడు.

అజీగర్తుడి కొడుకుగదా ఇతడు. అందుచేత అతడే తండ్రి. అసలు ఈ సందేహమేమిటి - అన్నారు కొందరు. అలాకాదు. అజీగర్తుడు అమ్మేశాడు. హరిశ్చంద్రుడు కొనుక్కున్నాడు. కాబట్టి హరిశ్చంద్రుడికి ఇతడు క్రయపుత్రుడు. హరిశ్చంద్రుడే తండ్రి - అన్నాడు వామదేవుడు. లేదంటే పాశముక్తుణ్ణి చేశాడు కనక వరుణుడైనా కావాలి అన్నారు ఇంకొందరు.

అన్నదాతా భయత్రాతా తథా విద్యాప్రదశ్చ యః ।
తథా విత్తప్రదశ్చైవ పంచైతే పితరః స్మృతాః ॥ (17 - 27)

వాదోపవాదాలు చెలరేగాయి. ఎవ్వరూ ఒక నిర్ణయానికి రాలేకపోయారు. అంతలోకీ వసిష్ఠులవారు అక్కడికి చేరుకున్నారు. అందరూ నమస్కరించి ధర్మనిర్ణయాధికారం వారికి అప్పగించారు.

మహానుభావులారా ! శ్రుతి స్మృతి సమ్మతమైన నిర్ణయం ప్రకటిస్తున్నాను. వినండి. ప్రేమభావాన్ని చంపుకుని తండ్రి అమ్మేసి ధనం తీసుకున్నాడు కనక ఇతడికి అజీగర్తుడితో సంబంధం ఆ క్షణంతోనే తెగిపోయింది. హరిశ్చంద్రుడు కొనుక్కున్నాడే కానీ బలి ఇవ్వడానికి నిర్దయగా యూపానికి కట్టేశాడు కనక అతడూ తండ్రి కాడు. స్తుతులకు సంతోషించి వరుణుడు విడిపించాడు. అంతేకానీ ప్రేమతోకాదు. మహామంత్రాలతో ఎవరు స్తుతించినా ధన ప్రాణ రాజ్యాలనేకాదు మోక్షాన్నికూడా దేవతలు ఇస్తూనే ఉంటారు. స్తోత్రప్రియులైన మానవులూ ధనధాన్యాదులను ఇవ్వడం, ప్రాణాలు నిలబెట్టడం ఉంది. అంతమాత్రాన వారు తండ్రులు కారు. అతి సంకట పరిస్థితిలో కేవల వాత్సల్యంతో మహామంత్రాన్ని ఉపదేశించి రక్షించాడు కనక కౌశికుడే తండ్రి - అని ప్రకటించాడు. సభాసదులంతా సమ్మతించారు. వెంటనే కౌశికుడు ప్రేమగా శునశ్శేపుడి కుడిచెయ్యి అందుకున్నాడు. పుత్రకా ! ఇంటికివెడదాం, పద అన్నాడు. అందరికీ వీడ్కోలు చెప్పి శునశ్శేపుణ్ణి తీసుకుని నడుచుకుంటూ వెళ్ళిపోయాడు.

ఋత్విక్కులూ సభ్యులూ కథ సుఖాంతమయ్యిందని సంతోషిస్తూ ఎవరి ఇళ్ళకు వారు వెళ్ళిపోయారు. హరిశ్చంద్రుడు రెట్టించిన ఉత్సాహంతో పరిపాలన సాగిస్తున్నాడు.

ఈ వృత్తాంతమంతా తెలుసుకుని రోహితుడు నిర్భయంగా రాజధానికి తిరిగివచ్చాడు. తండ్రికి సాష్టాంగపడ్డాడు. హరిశ్చంద్రుడు లేవనెత్తి గుచ్చి కౌగిలించుకున్నాడు. శిరస్సు మూర్కొన్నాడు. ఒడిలో



కూర్చుండబెట్టుకుని నులివెచ్చని ఆనంద బాష్పజలధారలతో కొడుకు శిరస్సును ముంచెత్తేడు. ఆ రోహితుడికి పట్టాభిషేకమయ్యింది. అప్పటినుంచీ అయోధ్యాసామ్రాజ్యాన్ని యువరాజై పరిపాలించాడు

ఉష్ణనేత్ర జలైః శీర్షణ్యాభిషేకమథాకరోత్ ।
రాజ్యం శశాస తేనాసౌ పుత్రేణాతిప్రియేణ చ ॥ (17 - 44

## ◆ వసిష్ఠ - విశ్వామిత్ర సంవాదం ◆

అటు తరువాత కొంతకాలానికి వసిష్ఠుడు హోతగా హరిశ్చంద్రుడు మహా వైభవంగా రాజసూయం చేశాడు. పరిసమాప్తినాడు వసిష్ఠులవారిని అత్యద్భుతంగా సత్కరించి పూజించాడు. ఈ పూజాబలంతో వసిష్ఠుడు సరాసరి స్వర్గలోకానికి వెళ్ళాడు. అక్కడ ఇంద్రసభలో విశ్వామిత్రుడు కలిసి ఆశ్చర్యం ప్రకటించాడు. ఎవరి పూజలు అందుకున్నావు స్వామీ ! ఇలా ఇక్కడికి రాగలిగావు. నిజం చెప్పు - అని ప్రశ్నించాడు.

కౌశికా ! నా యజమానుడు హరిశ్చంద్రుడు మహావైభంగా రాజసూయం చేశాడు. ఆ యజ్ఞపరిసమాప్తినాడు నన్ను అద్భుతంగా పూజించాడు. అందువల్ల నేనిక్కడికి రాగలిగాను. సందేహం తీరిందా ? మరొక విశేషం చెబుతున్నాను విను. హరిశ్చంద్రుడు మహావీరుడు. మహాదాత. ధర్మశీలుడు సత్యవాది. ప్రజారంజకుడు. అతడితో సాటివచ్చే రాజు - గతంలో లేడు. భవిష్యత్తులో ఉండడు తెలుసుకో.

హరిశ్చంద్రసమో రాజా న భూతో న భవిష్యతి ।
సత్యవాదీ తథా దాతా శూరః పరమధార్మికః ॥ (17 - 53)

వసిష్ఠుడు సగర్వంగా చెప్పిన ఈ సమాధానానికి కౌశికుడి కళ్ళు ఎర్రబడ్డాయి. ఏమి పొగుడుతున్నావయ్యా ! నేనెరగని 'మహారాజా మీ హరిశ్చంద్రుడు ! వట్టి కపటి. అబద్ధాలకోరు. వరమిచ్చిన వరుణుడినే వంచించబోయాడు. నా జన్మజన్మాంతరార్జితమైన మహాపుణ్యాన్ని పణంగా పెడుతున్నాను. నువ్వూ పెట్టు. పందెం వేసుకుందాం. హరిశ్చంద్రుణ్ణి అసత్యవాదిగా ఖలుడిగా నిరూపిస్తాను. నిరూపించలేకపోతే నా పుణ్యం వదులుకుంటాను. నిరూపిస్తే నీ పుణ్యం వదులుకో. పందెం పరమగోప్యం. సరేనా ? అన్నాడు. వసిష్ఠుడు సరే అన్నాడు. ఇద్దరూ ఇలా వివాదపడి, పందెం చరుచుకుని పళ్ళుకొరుక్కుంటూ స్వర్గలోకం నుంచి భూలోకంలో తమతమ ఆశ్రమాలకు తిరిగివచ్చారు.

*(అధ్యాయం - 17, శ్లోకాలు - 58)*



## ◆ హరిశ్చంద్రుడికి పరీక్షలు ◆

ఒకనాడు హరిశ్చంద్రుడు వేటకి వెళ్ళాడు. నట్టడివిలో ఒక సుందరాంగి కనిపించింది. ఎందుకో ఏడుస్తూ నిలబడింది. మహారాజు కరుణాపరుడై ప్రశ్నించాడు.

పద్మపత్రవిశాలాక్షీ ! ఎందుకు విలపిస్తున్నావ్ ? ఎవరు నిన్ను హింసించారు ? నువ్వు ఎవరు? ఈ విజనారణ్యంలో ఒంటరిగా ఎందుకున్నావ్ ? నీ భర్త ఎవరు ? తల్లిదండ్రు లెవరు ? నా రాజ్యంలో రాక్షసుడుకూడా పరాంగనను పీడించడానికి వీలులేదు. నిన్ను బాధిస్తున్నవాడెవడో చెప్పు. వాడిని ఇప్పుడే సంహరిస్తాను. కృశోదరీ ! పెదవి విప్పి మాట్లాడు. ధుఃఖకారణం తెలియజెయ్యి. నా రాజ్యంలో పాపాత్ముడు ఉండటానికి వీలులేదు. శిక్షిస్తాను. దుఃఖం దిగమింగి సమాధానం చెప్పు - అని ప్రశ్నల వర్షం కురిపించాడు.

ఆ సుందరాంగి కళ్ళు తుడుచుకుంది. మెల్లగా ముఖం పైకెత్తింది. బదులు పలికింది. మహారాజా! విశ్వామిత్రుడు నన్ను బాధిస్తున్నాడు. నన్ను కోరి ఘోరతపస్సు చేస్తున్నాడు. ఇది నీ రాజ్యంలోనే జరుగుతోంది.

తన్వీ ! భయపడకు. ఊరడిల్లు. విశ్వామిత్రుణ్ణి వారిస్తాను - అని ఆవిడను ఓదార్చి హరిశ్చంద్రుడు విశ్వామిత్రుడి దగ్గరికి వచ్చాడు. నమస్కరించాడు. స్వామీ ! ఏమిటి ఈ తపస్సు. శరీరాన్ని ఎందుకిలా కృశింపజేసుకుంటున్నారు ? నిజం చెప్పండి. ఏది కోరి ఈ దీక్ష స్వీకరించారు ? మీ కోరిక ఏమిటో చెబితే నేను తీరుస్తాను. ఇప్పటికి చేసిన తపస్సు చాలు, ఇక లేవండి. నా రాజ్యంలో దారుణాలు జరగడానికి వీలు లేదు. లోక పీడాకరమైన తపస్సులు ఎవరూ చెయ్యడానికి అనుమతించను - అని చెప్పి హరిశ్చంద్రుడు విశ్వామిత్రుడి తపస్సును వారించాడు.

## ◆ మాయా సూకరం ◆

కౌశికుడు ఆశ్రమానికి తిరిగి వచ్చాడు. క్రోధతామ్రాయతాక్షుడు అయ్యాడు. వసిష్ఠుడితో వేసిన పందేన్ని స్మరించాడు. ప్రతీకారం చెయ్యాలని బాగాఆలోచించాడు. ఒక ఘోర దానవుణ్ణి సృష్టించాడు. సూకరాకృతిని ధరింపజేశాడు. రాజ్యంలోకి వదిలిపెట్టాడు. వాడు అతికాయుడూ మహాకాయుడూను. మహాకాలుడుకూడా. భీకరనినాదం చేస్తూ రాజుగారి ఉద్యానవనంలో ప్రవేశించాడు. రక్షక భటులు భయపడి పారిపోయారు. సూకరదానవుడు ఆ వనాన్ని ధ్వంసం చేశాడు. కోరలతో మొదళ్ళు తవ్వి మహావృక్షాలను సైతం నేలకూల్చాడు. ఉద్యానవనం ఒక రణరంగాన్ని తలపింపజేసింది.



మాలాకారులు హాహాకారాలు చేస్తూ పరుగులు తీశారు. కొందరు బాణాలు వేశారుకానీ అవి నిష్ప్రయోజనమయ్యాయి. సూకరం అందరినీ తరిమికొట్టింది. భయభ్రాంతులై రాజోద్యోగులు హరిశ్చంద్రుణ్ణి శరణువేడారు. ఒక. భీకరసూకరాకారం మన వనాన్ని ధ్వంసం చేస్తోందని విన్నవించారు. వెంటనే మహారాజు సాయుధుడై అశ్వారూఢుడై సైన్యసమేతుడై ఉద్యానవనం చేరుకున్నాడు. భగ్నమైన సుందరోద్యానవనాన్నీ ఘుర్ఘురధ్వనులు చేస్తున్న భీకరసూకరాన్నీ చూడగానే రాజు కోపావిష్టుడయ్యాడు. బాణం సంధించాడు. అది చూసి ఆ దానవుడు రాజువైపు లంఘించాడు. ముట్టె దించుకుని వేగంగా వచ్చిపడుతున్న వరాహం మీదికి గురిచూసి బాణం వదిలాడు హరిశ్చంద్రుడు. నేర్పుగా తప్పించుకుని రాజును ఢీకొనడానికి వస్తోంది. మహారాజు తన ధనుర్విద్యానైపుణ్యాన్ని అంతటినీ ప్రదరిస్తూ బాణపరంపర కురిపించాడు. సూకరం వెనుదిరిగి పరుగు లంకించుకుంది. క్షణకాలం కనపడుతోంది, క్షణంలో కనుమరుగు అవుతోంది. మహారాజుకు పట్టుదల పెరిగింది. వెంబడించాడు. సైన్యమూ వెంట నడిచింది. రాజుగారి వాయువేగాన్ని అందుకోలేక బాగా వెనకబడింది.

రాజుమాత్రం ధనుస్సు ఎక్కుపెట్టి దాన్ని వెంబడిస్తూ ఘోరారణ్యంలోకి చేరుకున్నాడు. మార్తాండుడు నడినెత్తిమీద నిప్పులు చెరుగుతున్నాడు. గుర్రం అలిసిపోయింది. రాజుగారికీ దాహమయ్యింది. గొంతు ఎండిపోతోంది.

ఉన్నట్టుండి భీకరసూకరం మాయమయ్యింది. మహారాజుకు ఒక్కసారిగా వొళ్ళు జలదరించింది. ఇదేదో మహామాయ అనుకున్నాడు. దారీ తెన్నూలేని కీకారణ్యంలో చిక్కుకున్నాడు. ఒంటరిగా నిలబడ్డాడు. ఏమి చెయ్యాలో తోచలేదు.

అల్లంత దూరంనుంచి జలపక్షుల కలకూజితాలు వినిపించాయి. అటువైపు వెళ్ళాడు. నిర్మలోదకాలతో ప్రవహిస్తున్న చిన్న నది కనిపించింది. హమ్మయ్య అనుకున్నాడు. గుర్రానికి నీళ్ళు తాపి తానిన్ని త్రాగాడు. ముఖం తడుపుకున్నాడు. కాసేపు విశ్రమించాడు. ఇక రాజధానికి పోదామనుకున్నాడు. అంతలోకీ -

వృద్ధబ్రాహ్మణ రూపంలో విశ్వామిత్రుడు అక్కడికి వచ్చాడు. హరిశ్చంద్రుడు సవినయంగా నమస్కరించాడు. విప్రుడు ఆశీర్వదించాడు. మహారాజా ! నీకు స్వస్తి అగుగాక ! ఈ అరణ్యంలో ఒంటరిగా ఎందుకు వచ్చినట్టో ? నిజం చెప్పు అని ప్రశ్నించాడు.

బ్రాహ్మణోత్తమా ! ఒక మహాసూకరం మా రాజధానికి వచ్చి ఉద్యానవనాన్ని ధ్వంసం చేసింది. దాన్ని తరుముకుంటూ వచ్చాను. ఉన్నట్టుండి అది కనుమరుగయ్యింది. అంతా మాయగా ఉంది. నా సైన్యం - వెనక ఎక్కడో చిక్కుపడింది. దాహం వేసి ఈ నది దగ్గరికి వచ్చాను. ఈ అడవిలోంచి బయటపడే



దారి తెలియడం లేదు. ఎటు వెళ్ళాలా అని ఆలోచిస్తూ నిలబడ్డాను. అంతలోకీ భాగ్యవశాత్తూ తమ దర్శనమయ్యింది. రాజధానికి చేరుకునే దారి చెప్పండి. నేను హరిశ్చంద్రుణ్ణి. అయోధ్యాధిపతిని. రాజసూయం చేసినవాడిని. విప్రులకూ విద్వాంసులకూ వాంఛితార్థాలు తీర్చినవాడిని. మీరుకూడా ఏదైనా యజ్ఞం చేసుకోదలుచుకుంటే పుష్కలంగా ధనం ఇస్తాను. ఒకసారి మా అయోధ్యకు దయచేయండి.

*(అధ్యాయం - 18, శ్లోకాలు - 58 )*

హరిశ్చంద్రుడి మాటలకు వృద్ధబ్రాహ్మణుడు పెద్దపెట్టున నవ్వేడు. మహారాజా ! ఈ తీర్థం చాలా పుణ్యప్రదం. పాపనాశకం. ఇందులో స్నానం చేసి పితృదేవతలకు తర్పణాలు విడిచిపెట్టు. ఇది శుభముహూర్తం. అటుతరవాత నీ శక్తి కొద్దీ తృణమో పణమో దానం చేద్దువుగాని. ఈ పుణ్యతీర్థంలో చేసిన స్నానాలూ దానాలూ రెట్టింపు ఫలితాలను ఇస్తాయి. ఇలాంటి ప్రదేశాలకు వచ్చి స్నానం చేయకుండా వెళ్ళడం మహాపాపం. అది ఆత్మహత్యా సదృశమని స్వయంభువు చెప్పాడు. కనక ముందుగా స్నాన తర్పణాలు కానియ్యి. అటుతరువాత నీకు దారి చూపిస్తాను. రాజధానికి వెడుదువుగాని. నువ్విచ్చే దానానికి సంతోషించి నీతోకూడా అందాకా నేనూ వస్తాను.

హరిశ్చంద్రుడు రాజవేషం తొలగించుకుని స్నానోచితంగా నదిలోకి దిగాడు. మూడు మునకలూ వేశాడు. నదిలోనే నిలబడి పితృదేవతలకు తర్పణాలు విడిచిపెట్టాడు. బ్రాహ్మణుడి దగ్గరికివచ్చి స్వామీ! దానం చెయ్యాలనుకుంటున్నాను. నీకు ఏది కావాలో కోరుకో. ఆవులా, నేలా, బంగారమా, ఏనుగులా, రథాలా, అశ్వాలా ? ఏదైనా సరే కోరుకో. కోరుకున్నంతా ఇస్తాను. నా దృష్టిలో - ఇవ్వకూడనిదంటూ ఏదీలేదు. ఇది నా వ్రతం. రాజసూయంలో మునీశ్వరుల సమక్షంలో చేపట్టాను. ఈ పుణ్యతీర్థమూ, మహాత్మ్యా అదృష్టవశాత్తూ ఇక్కడ లభించారు. మొగమోటపడక కావలసింది ఏదో కోరి నన్ను చరితార్థుణ్ణి చెయ్యి- అని అభ్యర్థించాడు.

నాదేయం మే కిమప్యస్తి కృతమేతద్వ్రతం పురా ।
రాజసూయే మఖశ్రేష్ఠే, మునీనాం సన్నిధావపి ॥
తస్మాత్ త్వమిహ సంప్రాప్తః తీర్థేఽస్మిన్ ప్రవరే మునే ।
యత్తేఽస్తి వాంఛితం బ్రూహి దదామి తవ వాంఛితమ్ ॥ (19 - 12)

రాజన్ ! నీ కీర్తినిగురించి చాలాకాలం క్రితమే విన్నాను. నిన్నుమించిన దాత లేడని వసిష్ఠులవారు చెప్పారు. హరిశ్చంద్రో నృపశ్రేష్ఠః సూర్యవంశే మహీపతిః, తాదృశో నృపతిర్దాతా న భూతో న భవిష్యతి - అన్నారాయన.



మహాదాతగా అంతటి కీర్తి ప్రతిష్ఠలు గడించుకొన్న త్రిశంకుతనయుడవు నువ్వు. నేను అడగవలసిందే, నువ్వు ఇవ్వవలసిందే. పైగా కోరుకొమ్మంటున్నావు. సరే అయితే..అడుగుతున్నాను విను. హరిశ్చంద్రా ! నేను పుత్రుడికి వివాహం తలపెట్టాను. అందుకోసం ధనం కావాలి.

విప్రవర్యా ! సంశయించకుండా అడుగు. పుత్రుడి వివాహం చెయ్యి. అందుకు అవసరమైన ధనమంతా నేనే ఇస్తాను. ఇది నా ప్రతిజ్ఞ.

హరిశ్చంద్రుడు ఇలా వాగ్దానం చెయ్యడంతో వృద్ధబ్రాహ్మణరూపంలో ఉన్న విశ్వామిత్రుడు ఠక్కున గాంధర్వమాయా విద్యను స్మరించి ఒక కుమారుణ్ణి - పదేళ్ళ ఒక బాలికనూ అక్కడ ప్రత్యక్షం చేశాడు. రాజా! నేను విశ్వామిత్రుణ్ణి. ఈ ఇద్దరికే నేను వివాహం చెయ్యాలి. పిల్లల వివాహ నిమిత్తం గృహస్థుడికి చేసిన సహాయం రాజసూయంకంటే ఎక్కువగా ఫలాన్ని ఇస్తుంది - అన్నాడు. హరిశ్చంద్రుడు మాయామోహితుడైపోయాడు. అలాగే అని మరొకసారి ప్రతిజ్ఞ చేశాడు. మరింక మాట్లాడలేదు. నిలబడ్డాడు.

## ◆ రాజ్యదానం ◆

మహారాజా ! వివాహవేదిక దగ్గరే నీకు తోచింది దానం చేద్దువుగాని పద-అన్నాడు విశ్వామిత్రుడు. అందరూ కలిసి అడవి దాటి ఆశ్రమం చేరుకున్నారు. అగ్నిహోత్రం ముందు వధూవరులను కూర్చోబెట్టాడు కౌశికుడు. దానం చెయ్యమన్నాడు.

విశ్వామిత్రా ! ఏమి కావాలో కోరుకో. ఇవ్వరానిదీ ఇవ్వకూడనిదీ అయినాసరే ఇచ్చేస్తాను. నాకు యశస్సు కావాలి అంతే. సంపదలు పుష్కలంగా ఉండీ, పరలోక సుఖప్రదమైన శుభ్రయశస్సును గడించుకోలేనివాడి జీవితం ముమ్మాటికీ వ్యర్థం.

> వ్యర్థం హి జీవితం తస్య విభవం ప్రాప్య యేన వై ।
> నోపార్జితం యశః శుద్ధం పరలోకసుఖప్రదమ్ ॥ (19 - 25)

అయితే మహారాజా ! అడుగుతున్నాను. గజాశ్వరథరత్నసమేతమైన నీ రాజ్యాన్ని అగ్నిసాక్షిగా ఈ వరుడికి దానం చెయ్యి - అన్నాడు విశ్వామిత్రుడు. మాయాసమ్మోహితుడైన హరిశ్చంద్రుడు వెనకాముందూ ఆలోచించకుండా "ఇచ్చివేశాను" అన్నాడు. "స్వీకరించాను" అన్నాడు విశ్వామిత్రుడు. దానయోగ్యమైన దక్షిణనుకూడా ఇవ్వాలి. దక్షిణారహితమైన దానం నిష్ఫలమంటారు. అంచేత దానఫలంకోసం దక్షిణకూడా ఇయ్యి అని రెక్కించాడు. ఏ ధనం ఇవ్వాలో, ఎంత ఇవ్వాలో చెప్పమన్నాడు మహారాజు. రెండున్నరబారువులు బంగారం కావాలన్నాడు విశ్వామిత్రుడు. ఇస్తానన్నాడు హరిశ్చంద్రుడు.



అడవిలో ఎక్కడో చిక్కుబడిపోయిన సైన్యం మహారాజును వెతుక్కుంటూ అక్కడికి వచ్చింది. రాజును స్తుతించింది. హరిశ్చంద్రుడిలో ఉలుకూ పలుకూ లేదు. ముఖమంతా చింతావ్యాకులితమై కనిపిస్తోంది. నిశ్శబ్దంగా సైన్యంతో కలిసి రాజధానికి చేరుకున్నాడు. సరాసరి అంతఃపురంలో ప్రవేశించాడు.

ఏమి చేశాను నేను ? ఇటువంటి దానాలు చెయ్యవచ్చునా ? ఎంతమోసపోయాను ! ఆ అడవిలో ఆ బ్రాహ్మణుడు దోపిడీదొంగలా నన్ను దోచుకున్నాడు. సపరిచ్ఛదంగా రాజ్యాన్ని ఇచ్చేశాను. రెండున్నర బారువుల బంగారం దక్షిణగా బాకీపడ్డాను. నా మతి ఏమైపోయింది. ఇంత అజ్ఞానం ఎలా ఆవరించింది ? మునీశ్వరుడు ఎంతటి కపటి ! తపస్వి అయ్యుండీ నన్ను వంచించాడు. సరే, కానీ దైవగతి ఎలా ఉంటే అలా జరుగుతుంది.

చింతాకులుడైన భర్తను చూసి మహారాజ్ఞి మాధవీదేవి కంగారుపడింది. విమనస్కులుగా ఉన్నారు కారణం ఏమిటని అడిగింది. బెంగపెట్టుకుంటే ఆరోగ్యం చెడిపోతుంది. చింత అనేది మరణంతో సమానం. ప్రభూ ! విచక్షణులై చింతను పారద్రోలండి. స్వస్థచిత్తులవ్వండి.

**చింతయా క్షీయతే దేహో నాస్తి చింతాసమా మృతిః ।**
**త్యజ్యతాం నృపశార్దూల స్వస్థో భవ విచక్షణ ॥ (19 - 42)**

అసలు మీకు ఏమి లోటని దిగులుపడాలి. పారిపోయిన పుత్రుడు తిరిగివచ్చాడు. రాజసూయ మహాయజ్ఞం చేశారు. శత్రురాజు అనేవాడు లేడు. వరుణుడూ సంతోషించాడు. ఈ భూలోకంలో మీకు పోటీవచ్చే రాజే లేడాయె. మీరు దిగులుపడటం ఏమిటి ! వింతగా ఉందే - అంది మహారాజ్ఞి.

హరిశ్చంద్రుడు అంటీ ముట్టనట్టు ఏవో రెండుమాటలు పలికాడు. భోజనం చెయ్యలేదు. శయ్యమీద పడి దొర్లుతున్నాడేకానీ నిద్రపట్టడంలేదు. అలాగే తెల్లవారింది. హంసతూలికాతల్పం దిగాడు. ప్రాతస్సంధ్యాదికం పరధ్యానంగానే - అయ్యింది అనిపించాడు.

విశ్వామిత్రుడు వచ్చాడనీ ద్వారం దగ్గర నిలబడ్డాడనీ ప్రతీహారి వచ్చి విన్నవించాడు. అంతలోకే మహర్షి లోపలికి రానే వచ్చాడు. వస్తూనే నా రాజ్యం నాకు ఇయ్యి. బంగారం ఏది ? - అన్నాడు.

స్వామీ ! ఈ రాజ్యం తమరిదే. నేను విడిచిపెట్టి ఈ రోజే వెళ్ళిపోతాను. ఇంతలోకే కంగారుపడకండీ. ధనాగారంతోసహా (సపరిచ్ఛదంగా) దానం చేశాను కనక ఇక్కడి బంగారం నేను ముట్టుకోకూడదు. దక్షిణగా ఇస్తానన్న రెండున్నర బారువుల బంగారాన్నిమాత్రం ప్రస్తుతం ఇవ్వలేను. కాలం కలిసివచ్చి మళ్ళీ నాకు ధనయోగం పడితే అప్పుడు తప్పక చెలిస్తాను. అందాకా ఓపిక పట్టండి. దానసాఫల్యం కోసం ఇవ్వాల్సిన దక్షిణయేకదా ఇది !



దానం దదామి తే తావద్యావన్మే స్యాత్ ధనాగమః ।
పునశ్చేత్కాలయోగేన తదా దాస్యామి దక్షిణామ్ ॥ (19 - 50)

విశ్వామిత్రుడికి ఈమాట చెప్పి హరిశ్చంద్రుడు గబగబా లోపలికి వెళ్ళి భార్య మాధవీదేవినీ పుత్రుడు రోహితుడినీ పిలిచాడు. సకలధనరాశులతో చతుర్విధ సైన్యాలతో తాను మహాసామ్రాజ్యాన్ని విశ్వామిత్రుడికి దానం చేశాననీ, మన ముగ్గురి శరీరాలూతప్ప మనకు ఇంకేమీ లేవనీ, మనం వెంటనే రాజ్యం విడిచి వెళ్ళిపోవాలనీ చెప్పాడు. ముగ్గురూ ఉన్నపళంగా బయలుదేరారు. నిశ్శబ్దంగా కోటదాటి పాదచారులై ఇవతలికి వచ్చారు. ఈ వార్త నగరమంతటా గుప్పుమంది. హాహాకారాలు చేస్తూ ప్రజలు వీథుల్లోకి వచ్చారు.

మహారాజా ! ఇదేమి అన్యాయం ? ఇలా ఎందుకు చేశావు ? వంచనకు గురి అయ్యావా ? విధి ఎంతటి క్రూరమోకదా ! విశ్వామిత్రుడు మహాతపస్వి. కరుణామయుడు. శునశ్శేపుడిని కాపాడినవాడు. నీపట్ల ఇంతటి దారుణంగా ఎలా ప్రవర్తించాడో ? అయ్యో ! ఎంత దురదృష్టం - అంటూ రకరకాలుగా విలపించారు.

విశ్వామిత్రుడు వెనుకవైపునుంచి గబగబా నడుచుకుంటూ వచ్చి రాజు ఎదుట నిలుచున్నాడు. హరిశ్చంద్రా ! దక్షిణగా ఇవ్వవలసిన బంగారం ఇచ్చిమరీ కదులు. లేదా ఇవ్వను అనయినా చెప్పు. అలాగే రాజ్యం మొత్తం వెనక్కితీసేసుకో. పొరపాటున దానం చేశానే అని బాధపడుతున్నట్టున్నావు - అని నిర్బంధించాడు. *(అధ్యాయం - 19, శ్లోకాలు - 63)*

హరిశ్చంద్రుడు దీనుడై నమస్కరించాడు. వినయంగా పలికాడు. మహర్షీ ! నీకు బంగారం ఇవ్వకుండా నేను భోజనమైనా ముట్టను. ఇది నా ప్రతిజ్ఞ. సరేనా ? ఇక నిశ్చింతగా ఉండు.

అదత్వా తే హిరణ్యం వై న కరిష్యామి భోజనమ్ ।
ప్రతిజ్ఞా మే మునిశ్రేష్ఠ విషాదం త్యజ సువ్రత ॥ - (20 - 1)

సూర్యవంశంలో జన్మించినవాణ్ణి. రాజసూయం చేసినవాణ్ణి. క్షత్రియుణ్ణి. వాంఛితప్రదుడు అని ప్రజల్లో ప్రసిద్ధికెక్కినవాణ్ణి. మాట తప్పుతానా ? ఇది నాకు ఋణం లాంటిది. తప్పకుండా చెల్లిస్తాను. కాకపోతే కొంచెం వ్యవధి కావాలి. ధనం సమకూడేదాకా వేచి ఉండమని అడుగుతున్నాను. అంతే.

రాజా ! నీకిప్పుడు ధనం ఎలా వస్తుంది ? ఎక్కడినుంచి వస్తుంది ? రాజ్యం లేదు. కోశం లేదు. సైన్యమన్నా లేదు. ఎలా సంపాదిస్తావ్ ? రెండున్నర బారువుల బంగారమంటే మాటలా ? అసంభవం. అనవసరమూ అసాధ్యమూ అయిన ఆశలు పెట్టుకోకు. లోభంతో నిర్ధనుణ్ణి పీడిస్తున్నాడు అనే అపకీర్తి నాకు కట్టబెట్టకు. అంచేత "ఇవ్వలేను" అని ఒక్కముక్క చెప్పేయ్. ఆశ వదులుకుని వెళ్ళిపోతాను. నిన్ను వల్లెత్తుమాట అంటే ఒట్టు. భార్యాపుత్రులతో స్వేచ్ఛగా జీవిద్దువుగాని.



మహర్షీ ! ధైర్యంగా ఉండు. ఇస్తానన్నది ఇచ్చి తీరతాను. నా శరీరం ఉంది. భార్యాపుత్రులు ఆరోగ్యంగా ఉన్నారు. మమ్మల్ని మేము అమ్మేసుకునైనా నీ ఋణం తీరుస్తాను. అంతగా ఉపకారం చెయ్యాలని నీకుంటే, ఏ వారణాసిలోనో మమ్మల్ని కొనుక్కునేవాణ్ణి ఎవరినైనా చూపించు. అతడికి దాస్యం చేస్తాము. ఆ సొమ్ముతో నీ బంగారం నువ్వు పొందుదువుగాని. సంతృప్తి చెందుదువుగాని - హరిశ్చంద్రుడు ఇలా పలుకుతూనే నడక సాగించాడు. భార్యాపుత్రులు వెంటనడిచారు. కొన్ని రోజులపాటు ప్రయాణం సాగింది.

పార్వతీసహితుడై పరమేశ్వరుడు కాపురముండే వారణాసి చేరుకున్నారు. ఆ నగరాన్ని చూడగానే హరిశ్చంద్రుడి మనస్సు ఊరడిల్లింది. ఆహ్లాదపడింది. కృతార్థుణ్ణి అయ్యాను అనుకున్నాడు. భాగీరథిలో స్నానం చేసి దేవతలకు తర్పణాలిచ్చాడు. విశ్వనాథుడి దర్శనం చేసుకున్నారు. ఇది మానవులకోసం మానవులు నిర్మించిందికాదు. పరమేశ్వరుడి సొత్తు - అనుకుంటూ నగర సౌందర్యాన్ని చూస్తూ పురప్రవేశం చేశాడు.

విశ్వామిత్రుడు ఎదురుపడ్డాడు. దక్షిణమాట ఏమిటి అన్నాడు. హరిశ్చంద్రుడు వినయంగా నమస్కరించాడు. మహానుభావా ! ఇదిగో నేనున్నాను. ఇడిగో నా కుమారుడు. నా భార్య. ఎవరిని కావాలంటే వారిని స్వీకరించు. దాస్యం చేయించుకో. సరిపోదు అనుకుంటే ముగ్గురినీ తీసేసుకో. ఇంతకన్నా ఇప్పటికి నేను చెయ్యగలిగిందీ లేదు, చెప్పగలిగిందీ లేదు - అన్నాడు.

హరిశ్చంద్రా ! అప్పుడే నెల గడిచిపోయింది. అలనాడు నాకిచ్చిన వాగ్దానాన్ని ఒకసారి గుర్తుతెచ్చుకో. నీకు శుభం కలగాలనే నా ఆకాంక్ష.

మహర్షీ ! అప్పుడే నెల అయ్యిందా ? తెలియనేలేదుసుమా ! పోనీలే, మరొక్క నెల ఓపికపట్టు.

సరే. మరొక్క నెల గడువు ఇస్తున్నాను. అప్పుడు వస్తాను. ఇవ్వకపోయావో శపిస్తాను - అనేసి విశ్వామిత్రుడు వెళ్ళిపోయాడు.

హరిశ్చంద్రుడు తీవ్రంగా ఆలోచించాడు. ఎలా ? ఈ అప్పు తీర్చడం ఎలా ? ఏ మార్గమూ కనిపించడం లేదు. పోనీ ఆదుకుంటారంటే అంతటి సంపన్నులైన మిత్రులు ఏరీ ? యాచనకు దిగుదామంటే ప్రతిగ్రహం - పరమనీచం. అదీకాక - ధర్మశాస్త్రాలు క్షత్రియులకు చెప్పిన మూడు వృత్తులలోనూ అది లేదు. ప్రాణాలు వదిలేద్దామా అంటే, అప్పు తీర్చలేదు కనక బ్రాహ్మణుడి సొమ్ము తిన్నవాణ్ణి అవుతాను. అది మహాపాపం. అధమాధమ జన్మ వస్తుంది. ఏ విష్ఠక్రిమిగానో పుడతాను. లేదా భూతమో ప్రేతమో అవుతాను. అంచేత ఏలాగోలా అప్పు చెల్లించిగానీ చావడానికైనా వీలులేదు. నన్ను నేను అమ్మేసుకోవడం ఒక్కటే దారి.



## ◆ భార్యా విక్రయం ◆

వ్యాకులితుడై తలదించుకుని ఏదో ఆలోచిస్తున్న భర్త దీనావస్థను గమనించింది మాధవీదేవి. కళ్ళల్లో నీళ్ళు కమ్ముకున్నాయి. గొంతు బొంగురుపోయింది. నాథా ! దిగులుపడకు. మన ధర్మం మనం నెరవేరుద్దాం. మాట తప్పడంకన్నా మహాపాపం లేదు. దానికి మనం పాల్పడవద్దు. అంతకన్నా ప్రేతత్వం నయం. అందుచేత సత్యవాక్యపరిపాలనమే మన కర్తవ్యం. ఎన్ని కష్టాలన్నా రానీ. ధైర్యంగా ఎదుర్కొందాం. అనుభవిద్దాం. ఇంతకాలమూ చేసిన హోమాలూ, చదివిన శాస్త్రాలూ ఇచ్చిన దానాలూ ఒక్క అసత్యంతో తుడిచిపెట్టుకుపోవడం నాకిష్టం లేదు.

అగ్నిహోత్ర మధీతం చ దానాద్యాః సకలాః క్రియాః ।
భవంతి తస్య వైఫల్యం వాక్యం యస్యానృతం భవేత్ ॥ (20 - 31)

ధర్మశాస్త్రాలు చెబుతున్నాయి - సత్యమే తరణోపాయమనీ, అసత్యమే పతనోపాయమనీ. నూరు యజ్ఞాలు చేసినా, రాజసూయమే నిర్వహించినా ఒక్క అనృతంతో స్వర్గం చేజారిపోతుందిట. మనం అలా పోగొట్టుకోవద్దు - అని కచ్చితంగా తన అభిప్రాయం చెప్పింది.

దేవీ ! నా మనసులో ఉన్నమాట చెప్పావు. సంతోషం. సత్యానికే కట్టుబడి ఉందాం. అయితే ఈ ఋణం తీర్చే ఉపాయమేమిటి? నేను ఉన్నాను. వంశవృద్ధికరుడైన రోహితుడున్నాడు. నువ్వున్నావు. ఏం చేద్దాం ? అది కూడా సలహా చెప్పు.

ప్రభూ ! పురుషుడికి పుత్రుడికోసమే కదా భార్య ! అది నీకు సిద్ధించింది. కనక ఇక నన్ను అమ్మెయ్యి. ఆ ధనంతో కౌశికుడి ఋణం తీర్చు.

హరిశ్చంద్రుడి నెత్తిమీద పిడుగు పడ్డట్టు అయ్యింది. తూలిపోయాడు. దుఃఖం ఆపుకోలేకపోయాడు. ప్రియా ! ఎంత దారుణంగా మాట్లాడావు ? నిన్ను నేను అమ్ముకోనా ? నీ మందహాసాలూ నీ మృదుభాషణలూ అప్పుడే మర్చిపోయాననుకున్నావా ? ఎంత కఠినంగా మాట్లాడావ్ ! నీ నోటినుంచి ఇలాంటి దుర్వాక్యం వినవలసివచ్చినందుకు దుఃఖిస్తున్నాను - అంటూ దుఃఖం ఆపుకోలేక మూర్ఛపోయాడు.

ఇత్యుక్త్వా నృపతిఃశ్రేష్ఠో న ధీరో దారవిక్రయే ।
నిపపాత మహీపృష్ఠే మూర్ఛయాతిపరిప్లుతః ॥ (20-39)

మాధవీదేవి ఘొల్లుమంది. అయ్యో! మహారాజా! ఎంత దుర్దశ వచ్చింది! బ్రాహ్మణులకు కోటానుకోట్లు దానం చేసిన మహీనాథుడవు. వట్టి నేలమీద పొర్లవలసి వచ్చిందా! భగవాన్! నీకు ఏమి అపకారం చేశామని ఇన్ని కష్టాలు తెచ్చిపెట్టావు. ఇంద్రోపేంద్రులకు సాటివచ్చే భూకాంతుణ్ణి ఈ దశకు తెచ్చావా? అయ్యయ్యో! - అంటూ తానూ దుఃఖం తట్టుకోలేక మూర్ఛపోయింది.



ఏమి జరుగుతోందో, ఎందుకు జరుగుతోందో తెలియక రోహితుడు, తల్లిదండ్రుల మీద పడి ఆకలితో కొట్టుకొంటున్న పసిబిడ్డలాగా రోదించాడు. అమ్మా! నాన్నా! అంటూ కుదిపికుదిపి విలపించాడు. అమ్మా! అన్నంపెట్టు. ఆకలివేస్తోంది. నాలుక ఎండిపోతోంది - అంటూ తల్లడిల్లాడు.

*(అధ్యాయం - 20, శ్లోకాలు - 46)*

**తాత తాత ప్రదేహ్యన్నం మాతర్మే దేహి భోజనమ్ ।**
**క్షున్మే బలవతీ జాతా జిహ్వాగ్రో మేఽతి శుష్యతి ॥ (20 - 46)**

అంతలోకీ - యమధర్మరాజులాగా విశ్వామిత్రుడు వచ్చిపడ్డాడు. నీళ్ళు చల్లి హరిశ్చంద్రుణ్ణి మూర్ఛదేర్చాడు. లే.లే. నా దక్షిణ నాకియ్యి. అప్పు తీర్చకపోతే ఇలాగే ఉంటుంది. రోజురోజుకీ దుఃఖం పెరుగుతుంది - అన్నాడు.

**ఉత్తిష్ఠోత్తిష్ఠ రాజేంద్ర ప్వాం దదస్వేష్టదక్షిణామ్ ।**
**ఋణం ధారయతాం దుఃఖమహన్యహని వర్ధతే ॥ (21 - 3)**

హరిశ్చంద్రుడు స్పృహలోకి వచ్చాడు. ముఖంమీద చల్లని నీళ్ళు జల్లిన మహర్షి వైపు అప్యాయంగా చూశాడు. గుర్తుపట్టి హఠాత్తుగా మళ్ళీ మూర్ఛిల్లాడు. విశ్వామిత్రుడికి వొళ్ళు మండింది.

రాజా! ధైర్యంగా బతకాలనుకుంటే ముందు నా అప్పు తీర్చు. సత్యానికి కట్టుబడి ఉండటమంటే మాటలనుకొంటున్నావా ? సత్యంవల్లనే సూర్యుడు ప్రకాశిస్తున్నాడు. సత్యంవల్లనే భూగోళం నిలబడింది. సత్యంలోనే ఉత్తమధర్మం ఉంది. సత్యంలోనే స్వర్గమూ ఉంది. నూరు అశ్వమేధాలనీ ఒక సత్యాన్నీ చెరొకవైపూ వేసి తూచితే సత్యంవైపే మొగ్గు ఉంటుంది.

**సత్యేనార్కః ప్రతపతి సత్యే తిష్ఠతి మేదినీ ।**
**సత్యే ప్రోక్తః పరో ధర్మః స్వర్గస్సత్యే ప్రతిష్ఠితః ॥**
**అశ్వమేధసహస్రం తు సత్యం చ తులయా ధృతమ్ ।**
**అశ్వమేధసహస్రాద్ధి సత్యమేకం విశిష్యతే ॥ (21 - 7, 8)**

అయినా ఈ ప్రసంగాలతో నాకేమి పని. సూర్యుడు అస్తమించేలోగా నా దక్షిణ నాకివ్వకపోయావో శపించానన్నమాటే - అని బెదిరించి వెళ్ళిపోయాడు. హరిశ్చంద్రుడు భయంతో వణికిపోయాడు. బేలగా విలపించాడు.



అంతలోకీ వారాణసీ వేదపండితు డొకడు బ్రాహ్మణబృందంతో తన ఇంటిలోనుంచి వీథిలోకి వచ్చాడు. అతడిని చూసి మాధవీదేవి తన భర్తతో ఇలా అంది -

నాథా ! మూడు వర్ణాలవారికీ బ్రాహ్మణుడు తండ్రిలాంటివాడు అన్నారు. తండ్రి ధనాన్ని కొడుకు నిస్సంకోచంగా తీసుకోవచ్చు. అందుచేత మనం వీరిని ప్రార్థిద్దాం.

దేవీ ! నేను క్షత్రియుణ్ణి. ఒకరి దగ్గర చెయ్యిజాపను. దానం పట్టను. అప్రతిగ్రహం నా నియమం. నీకు తెలుసుగదా ! యాచన అనేది విప్రులకేకానీ మన క్షత్రియులకు కాదు. విప్రుడు సకలవర్ణాలవారికీ గురువు. పూజనీయుడు. అందుచేత గురువును అసలు యాచించకూడదు. అందునా క్షత్రియులకు అది సుతరామూ తగదు. యజన - అధ్యయన - దాన - శరణాగతరక్షణ - ప్రజాపాలనలుమాత్రమే క్షత్రియ ధర్మాలు. దేహి అనే దీనాలాపం మననోట రాకూడదు. దదామి అనేదే మనమాట కావాలి. అదే ఎప్పుడూ నా హృదయంలో ఆడుతూ ఉంటుంది.

న చాప్యేవం తు వక్తవ్యం దేహీతి కృపణం వచః ।
దదామీత్యేవ మే దేవి హృదయే నిహితం వచః ॥ (21 - 17)

ఎక్కడో ఒకచోట సంపాదించి కౌశికుడి ఋణం తీరుస్తాను. ప్రాణాలు పోయినా యాచనకుమాత్రం దిగను.

నాథా ! కాలమనేది శక్తి స్వరూపం. సమస్థితినీ విషమస్థితినీ కలిగిస్తూంటుంది. అవమానాలూ సమ్మానాలూ చేయిస్తూంటుంది. పురుషుణ్ణి మహాదాతను చేసిన కాలమే యాచకుణ్ణి చేస్తూంటుంది. మన జీవితమే చూడరాదూ, క్షణంలో ఎంత తలకిందులయ్యిందో ! ఒక విప్రుడి క్రోధం కారణంగా రాజ్యం పోయింది. సుఖాలూ పోయాయి.

దేవీ ! కత్తి పుచ్చుకుని నా నాలుకను నిలువనా చీరినాసరే, అభిమానం చంపుకుని దేహి-దేహి అనిమాత్రం అననుగాక అనను. నేను క్షత్రియుణ్ణి. ఎవరినీ ఏదీ యాచించను. భుజబలంతో సంపాదించి మరొకరికి ఇంత ఇస్తాను.

విభూ ! యాచనకు నీ మనస్సు అంగీకరించకపోతే పోనీ మరొక పని చెయ్యి. ఇంద్రాదిదేవతలు న్యాయంగా నన్ను నీకు సమర్పించారు. నేను ముమ్మాటికీ నీ సొత్తును. నా రక్షణ పోషణ శాసన భారాలన్నీ నీవే. అందుచేత నన్ను అమ్మేసి ఆ డబ్బుతో ఋణం తీర్చు.

ఈ మాట వింటూనే హరిశ్చంద్రుడు కష్టం కష్టం అంటూ విలపించాడు. అయినా ఈసారి మాధవీదేవి ధైర్యం కోల్పోలేదు. పట్టువదలలేదు. నాథా ! నా మాట విను. కాదనకు. అట్టే వ్యవధిలేదు.



మార్యాప్రమయమే గడువు. విప్రశాపాగ్నిలో దహించుకుపోయి నీచత్వం పొందకు. నన్ను అమ్ముతున్నది వినోదంకోసం కాదు, మద్యంకోసం కాదు, రాజ్యంకోసం కాదు, భోగంకోసం కాదు. గురు ఋణం తీర్చడానికి, సత్యవ్రతం సఫలం చేసుకోడానికి. కాబట్టి కించపడవలసింది లేకపోగా ఇది గర్వించదగిన అంశం. దయచేసి నా మాట ఆలకించు. నన్ను ఎవరికైనా అమ్మేయ్.

*(అధ్యాయం - 21, శ్లోకాలు - 27)*

ఇలా మాధవీదేవి పోరగా పోరగా కట్టకడపటికి గతిలేక హరిశ్చంద్రుడు అంగీకరించాడు. సరే, దేవీ! నిన్ను అమ్మేస్తాను. కఠినాతి కఠినుణ్ణి. నాకు దిగులేమిటి! నీచాతినీచులుకూడా చెయ్యని పనికి సిద్ధం అవుతున్నాను. నాకు సిగ్గేమిటి ! - అంటూనే రెక్కపట్టుకుని భార్యను చరచరా తీసుకువెళ్ళి వీథిమొగలో ఒక అరుగుమీద నిలబడ్డాడు - జీరబోయిన గొంతుతో నలుగురికీ వినిపించేట్టు అరిచాడు -

ఓ నాగరకులారా ! అందరూ వినండి. ఈవిడ నా భార్య. ప్రాణాలకన్నా ప్రీతిపాత్రురాలు. మీలో ఎవరికైనా దాసీ అవసరమైతే చెప్పండి. ఈమెను అమ్మేస్తాను. త్వరపడండి. అత్యవసరంగా నాకు ధనం కావాలి. ఆట్టే వ్యవధిలేదు.

ఈ మాటలకు ఆ పండితులు నిశ్చేష్టులయ్యారు. ఎవడవురా నువ్వు. కట్టుకున్నదాన్ని అమ్ముకుంటున్నావు ? అని నిష్ఠురంగా ప్రశ్నించారు.

ఎవడినా ? ఆ మాట అడగాలా ? నేనొక నీచుణ్ణి. అమానవుణ్ణి. కాదంటే రాక్షసుణ్ణి. కఠినాత్ముణ్ణి. అందుకే ఈ పాపం చేస్తున్నాను. మీకు కావాలంటే కొనుక్కోండి - హరిశ్చంద్రుడు ఇలా పలుకుతూనే ఉన్నాడు, ఏడుస్తూనే ఉన్నాడు.

ఆ బ్రాహ్మణులలో వృద్ధరూపంలో ఉన్న విశ్వామిత్రుడు తక్కినవారిని తోసుకుంటూ ముందుకి వచ్చాడు. అయితే నేను కొంటాను. మా ఇంటిపనికి దాసీ అవసరం. నా ఇల్లాలు సుకుమారి. చేసుకోలేకపోతోంది. నా దగ్గర పుష్కలంగా ధనం ఉంది. ఇస్తాను. ఎంతకి అమ్ముతావో చెప్పు.

హరిశ్చంద్రుడి హృదయం ముక్కలయ్యింది. దుఃఖం పొంగిపొర్లింది. కూలబడి మోకాళ్ళలో తలకూరుకుని నెత్తికొట్టుకుంటూ కుమిలిపోయాడు. బదులు పలకలేకపోయాడు. ధర చెప్పలేకపోయాడు.

అబ్బాయీ ! సంశయించకు ! నీ భార్య - వయోరూపశీలాలకూ మా ఇంటిలో చెయ్యబోయే చాకిరీకీ అనురూపంగా, బాగా ఆలోచించుకుని, కావలసినంత విత్తం అడుగు. బేరమాడకుండా ఇచ్చేస్తాను. తీసుకో. స్త్రీలు పురుషులకి ధనమని ధర్మశాస్త్రాలలో ఉన్నదే. ఇందులో శంకించవలసింది ఏమీ లేదు. ముప్పయిరెండు లక్షణాలు కలిగి సమర్థురాలై శీలగుణాన్వితయైన స్త్రీకి ధర కోటి సువర్ణటంకాలు. అదే పురుషుడయితే అర్బుదం (పదికోట్లు).



వృద్ధబ్రాహ్మణరూపంలో ఉన్న కౌశికుడు ఇలా ఏదేదో మాట్లాడుతూనే ఉన్నాడు. హరిశ్చంద్రుడు బదులు పలకలేక, ధర చెప్పలేక కుమిలిపోతున్నాడు. బ్రాహ్మణుడు సాహసించి అతడి ముందు వల్కలం పరిచాడు. కోటి బంగారునాణేలు రాశిపోశాడు. మాధవీదేవిని కొప్పుపట్టి ఈడ్చుకుపోయాడు.

బ్రాహ్మణోత్తమా ! ఒక్కసారి విడిచిపెట్టు. కన్నబిడ్డడిని కళ్ళారా చూసుకుని వస్తాను. మళ్ళీ ఎన్నాళ్ళకు చూస్తానో. చూడగలనో లేదో. నాయనా ! చూడు. దాసీనై వెళ్ళిపోతున్నాను. వద్దు,వద్దు. నన్ను తాకకు. నేను దాసిని. అస్పృశ్యను.

రోహితుడు 'అమ్మా!' అంటూ వెంటబడ్డాడు. పడుతూ లేస్తూ కూడాకూడా వస్తున్నాడు. వృద్ధుడు కసురుతున్నా ఆగటం లేదు. అమ్మ చెంగు అందితే చెంగు, చీర అంచు అందితే అంచూ పట్టుకుంటున్నాడు వెళ్ళిపో అని తల్లి వారిస్తున్నా వినడంలేదు. బ్రాహ్మణుడు ఒక్కటి చరిచి వెనక్కి నెట్టేశాడు. అప్పుడు మాధవీదేవి దుఃఖం నిలుపుకుంటూ -

విప్రవర్యా ! కాసింత దయచూపించు. వీడినికూడా కొనేసుకో. వీడు లేకుండా నన్ను కొనుక్కున్నా మీ ఇంటిలో మనస్ఫూర్తిగా పని చెయ్యలేను. ఈపాటి అనుగ్రహించు - అని అభ్యర్థించింది.

(విశ్వామిత్రుడు) వృద్ధబ్రాహ్మణుడు అంగీకరించాడు. స్త్రీపురుషులకు ధరను ధర్మశాస్త్రాలు ఏనాడో నిర్ణయించాయి. కొందరు నూరు, కొందరు వెయ్యి, కొందరు లక్ష, కొందరు కోటి - సువర్ణటంకాలు నిశ్చయించారు. ఇది స్త్రీల ధర. అదే పురుషుడయితే అర్బుదం అన్నారు. కనక నీ నిమిత్తం కడపటి ఆశ - కోటి సువర్ణటంకాలు అక్కడ పోశాను. వీడు మగవాడు కనక అర్బుదం సువర్ణనిష్కాలు పోస్తున్నాను - అంటూ హరిశ్చంద్రుడి ముందు మరో వల్కలం పరిచి బంగారునాణేలు పోశాడు. తల్లినీ బిడ్డనూ కలిపి కట్టి ఇక పదండి అన్నాడు. (అర్బుదం - పదికోట్లు).

మాధవీదేవి హరిశ్చంద్రుడికి ప్రదక్షిణం చేసింది. మోకాళ్ళు నేలకు ఆన్చి ఎదురుగా కూర్చుంది -- నమస్కరించి కళ్ళు మూసుకుంది. నేనుచేసిన దానాలూ ధర్మాలూ హోమాలూ బ్రాహ్మణ సంతర్పణలూ ఏమైనా ఉంటే ఆ పుణ్యంవల్ల నాకు మరుసటి జన్మలోనూ హరిశ్చంద్రుడే భర్త అగుగాక - అని సాష్టాంగ పడింది. -

యది దత్తం యది హుతం బ్రాహ్మణాస్తర్పితా యది ।
తేన పుణ్యేన మే భర్తా హరిశ్చంద్రోఽస్తు వై పునః ॥ (22 - 27)

పాదాలకు నమస్కరిస్తున్న తన ప్రాణప్రియను చూసి హరిశ్చంద్రుడు హాహాకారాలు చేశాడు. నన్ను విడిచిపెట్టి వెళ్ళిపోతావా ! నీడయినా చెట్టును విడిచి వెళ్ళదే. ఎలా వెళ్ళిపోతావు దేవీ - అని



వ్వురుమన్నాడు. కొడుకుని దగ్గరకు తీసుకున్నాడు. నాయనా ! నువ్వు వెళ్ళిపోతున్నావా ! ఇక నేను ఏమైపోతానో ! బ్రాహ్మణోత్తమా ! రాజ్యాన్ని కౌశికుడికి ధారపోసినప్పుడుగానీ అడవుల్లో అగచాట్లు పడ్డప్పుడుగానీ ఏమీ బాధ అనిపించలేదు. కానీ ఇప్పుడు ఇదిగో ఇలా పుత్రుణ్ణి వదులుకుంటుంటే - ఈ దుఃఖం భరించలేకపోతున్నాను.

రాజ్యత్యాగే న మే దుఃఖం వనవాసే న మే ద్విజ ।
యత్పుత్రేణ వియోగో మే - ఏవమాహ స భూపతిః ॥ (22 -31)

లోకంలో భర్తలందరూ భార్యలను సంతోషపెడతారు. బంగారు ఆభరణాలు అలంకరిస్తారు. మరి నేనో నిన్ను దుఃఖంలో ముంచేశాను. సువర్ణటంకాలకోసం అమ్మేశాను. మహారాజ్ఞిగా రాజభోగాలు అనుభవించవలసిన దానివి. నిన్ను దాసీని చేశాను. ఎంతటి శిలాహృదయం నాది. నాకన్నా దురదృష్టవంతుడు ఈ సృష్టిలో ఇంకెవరన్నా ఉంటారా ? పురాణగాథల్లోనైనా కనిపిస్తారా ? సూర్యవంశంలో పుట్టిన మహారాజును భర్తగా పొంది కట్టకడపటికి ఇలా దాసీవయ్యావు. దేవీ ! విధివిలాసం ఎంతఘోరమో ఎంతక్రూరమో చూడు.

హరిశ్చంద్రుడు విలపిస్తూనే ఉన్నాడు. వృద్ధబ్రాహ్మణుడు మరింక వినిపించుకోకుండా, కమిచీ తీసి మాధవీరోహితులను చెళ్ళుమని కొట్టాడు. కదలండి ఇంక - అని గదిమాడు. ఆ దెబ్బ హరిశ్చంద్రుడి హృదయానికి తగిలింది. తన అశక్తతకు కుంగిపోయాడు. ముఖం తిప్పేసుకుని కూలబడి కుమిలి కుమిలి ఏడ్చాడు.

ఇంతకుముందు వాయు - సూర్య - చంద్రులు కూడా కన్నెత్తి చూడని మహారాజ్ఞిని ఇవ్వేళ దారివిపోయే జనమంతా కన్నార్పకుండా చూస్తున్నారు. దాసీది - దాసీది అంటున్నారు. సూర్యవంశానికి కొత్తమొలకగా ఆవిర్భవించిన రోహితుడు దాసీపుత్రుడయ్యాడు. అమ్ముడుపోయాడు. భార్యాపుత్రులారా! ఇంతటి దుర్దశకు మిమ్మల్ని తెచ్చిన నా దుర్ణయాన్ని క్షమించండి. దైవదుర్విపాకం ఇలా ఉంది. అయ్యో! నాకు కనీసం మరణమైనా ప్రాప్తించడం లేదే ! - అని విలపిస్తూ భార్యాపుత్రులు వెడుతున్నవైపే చూస్తున్నాడు. అడ్డుపడుతున్న కన్నీటిని తుడుచుకుంటూ రెప్పలల్లార్చి మరీ చూస్తున్నాడు. క్రమక్రమంగా వాళ్ళు కనుమరుగయ్యారు. మహారాజు ముఖం చేతులతో కప్పుకుని కూలబడ్డాడు. వెక్కివెక్కి ఏడుస్తున్నాడు.

విశ్వామిత్రుడు ప్రత్యక్షమయ్యాడు. ఈసారి శిష్యగణంతో సహా విచ్చేశాడు. దక్షిణ - దక్షిణ అన్నాడు. హరిశ్చంద్రుడు తన ముందున్న బంగారు నాణేలరాశిని స్వీకరించమన్నాడు. దీన్ని ఎలా సంపాదించావో ముందు చెప్పు అని నిలదీశాడు కౌశికుడు.



పరమపవిత్రుడా ! విశ్వామిత్రుడా ! అదంతా నీకు చెప్పి ఏమి ప్రయోజనం ? అనవసరంగా నువ్వూ దుఃఖించవలసివస్తుంది.

హరిశ్చంద్రా ! అక్రమంగా ఆర్జించిన అపవిత్రధనమైతే నేను దీన్ని ముట్టను. ప్రశస్తమైతే స్వీకరిస్తాను. అందుకోసం అడుగుతున్నాను. ఎలా సంపాదించావో చెప్పు.

మహర్షీ! నా భార్యను కోటి నిష్కాలకు అమ్మేశాను. పుత్రుణ్ణి అర్బుదనిష్కాలకు విక్రయించాను. ఇవిగో మొత్తం పదకొండుకోట్ల సువర్ణటంకాలు. స్వీకరించు.

హే రాజన్ ! స్వీకరించు, స్వీకరించు - అంటున్నావు. బోడి పదకొండుకోట్ల చిల్లరవాణాలు రెండున్నరబారువు లవుతాయనుకుంటున్నావా ? నువ్వు ఇస్తానన్న దక్షిణ ఎంతో మరిచిపోయావా ? నాకు తూకాలూ కొలతలూ తెలియవనుకుంటున్నావా ? ఇవి సరిపోవుగాక సరిపోవు. మరిన్ని సంపాదించు. మసిబూసి మారేడుకాయ చేద్దామని చూశావో నా తపోబలం రుచిచూస్తావు. నా స్వచ్ఛశీలమూ నా అధ్యయనమూ ఎంతటివో తెలుసుకుంటావు.

మహాత్మా! తక్కినదికూడా తప్పకుండా సంపాదించి ఇస్తాను. కాకపోతే మరికొంతకాలం గడువు పెంచు. పత్నీపుత్రులను అమ్మినది ఇప్పుడేకదా !

హరిశ్చంద్రా ! గడువు పెంచడం కుదరదు. ఈ రోజుకి ఇంకా నాల్గవభాగం మిగిలి ఉంది. అది ముగిసేలోగా నువ్వు సంపాదించడమూ నాకు చెల్లించడమూ అవ్వాలి. అంతకుమించి క్షణం ఆగను. ఇక నువ్వు ఏమీ చెప్పకు. నేను వినను. ***(అధ్యాయం - 22, శ్లోకాలు - 54)***

## ◆ హరిశ్చంద్రుడు అమ్ముడుబోవడం ◆

విశ్వామిత్రుడు ఇంత నిష్ఠురంగానూ పలికి ఆ సువర్ణటంకాలు తీసుకుని వెళ్ళిపోయాడు. హరిశ్చంద్రుడు నిట్టూర్చాడు. తననుతాను అమ్ముకోవడం తప్ప మరొక ఉపాయం కనిపించలేదు. అదే అరుగుమీద నిలబడి, తలదించుకుని బిగ్గరగా అరిచాడు. "సేవకుడుగా నన్ను కొనుక్కొని సుఖపడదలచినవారు ఉంటే త్వరపడండి. సూర్యాస్తమయానికి ఇంక ఒక జాముమాత్రమే వ్యవధి ఉంది" అని ప్రకటించాడు.

విత్తక్రీతేవ యస్యార్తిర్మయా ప్రేతేవ గచ్ఛతి ।
స బ్రవీతు త్వరాయుక్తో యామే తిష్ఠతి భాస్కరః ॥ (23 - 3)



వాక్యం ముగిసే సమయానికి యమధర్మరాజు ఒక చండాలుడుగా అక్కడికి వచ్చాడు. స్కంధం గుప్పుమంటోంది. వక్షఃస్థలం వికృతంగా ఉంది. పెద్దపెద్ద గుబురుమీసాలు. ఎత్తు పళ్ళు. క్రూరత్వం. నల్లని రంగు. పెద్ద బానలాంటి బొజ్జ. నున్నగా నిగనిగలాడుతున్నాడు. భీకరుడు. చేతిలో వెదురువాటి కర్ర. పుర్రెలూ ఎముకలూ దండలుగా మెడలో వేలాడుతున్నాయి. నడుస్తూంటే అవ్వి ఒకదానికొకటి కొట్టుకొని అసహ్యంగా ధ్వనిస్తున్నాయి. అతడి కంఠస్వరమూ అలాగే ఉంది -

ఏమయ్యోవ్ ! నేను చండాలుణ్ణి. నా పేరు ప్రవీరుడు. మనం అందరికీ ఎరికే. కాటి కాపరిని. శవాలని కాల్చడానికి వచ్చినోళ్ళదగ్గర సుంకం వసూలు చెయ్యాల. ఇంకా నేను చెప్పినట్టల్లా చెయ్యాల. వస్తావా ? రా. నాతో రా. నాకాడ బంటుగా ఉందువుగాని. ఇష్టమేనా ?

చండాలోఽహ మిహ ఖ్యాతః ప్రవీరేతి నృపోత్తమ ।
శాసనే సర్వదా తిష్ఠ మృతచైలాపహారకః ॥ (23 - 8)

హరిశ్చంద్రుడు ఇరుకునపడ్డాడు. అవుననలేక, కాదనలేక క్షణకాలం ఆలోచించాడు. ప్రవీరా ! బ్రాహ్మణుడుగానీ క్షత్రియుడుగానీ నన్ను కొనుక్కోవాలని ఆశించాను. ఉత్తమ - మధ్యమ - అధములకు ధర్మాలుకూడా అదే రీతిలో ఉంటాయి అని పెద్దలు చెబుతున్నారు - అన్నాడు ఏదో సంశయంతో.

ఏమయ్యోవ్ ! ఆలోచించకుండా మాట్లాడతున్నావ్. అలాంటోడికి అలాంటిదే జరుగుద్ది. కోరింది దొరకదు. అందరిలాగా ఆలోచిస్తే అందరిలాగే మనమూను. మాటమీద నిలబడాలి. ఎవుడికైనా అమ్ముడుబోతానన్నప్పుడు - అమ్ముడుబోవాల. నిజం మాట్లాడితే - నువ్వు ఇప్పుడు నాకు అమ్ముడయినట్టే.

ప్రవీరా ! ఆడి తప్పినవాడు అధమాధముడు. భయంకరమైన నరకానికి పోతాడు. అంతకన్నా చండాలత్వమే నయం. నేను మాట తప్పను. సత్యానికి నిలబడతాను.

అసత్యాన్నరకే గచ్ఛేత్ సద్యః క్రూరే వరాధమః ।
తతశ్చండాలతా సాధ్వీ న వరా మే హ్యసత్యతా ॥ (23 - 14)

హరిశ్చంద్రుడు ఇంకా ఏదో మాట్లాడబోయేంతలో విశ్వామిత్రుడు ప్రత్యక్షమయ్యాడు. హరిశ్చంద్రా! వీడు చండాలుడయితే అయ్యాడు, కోరినంత ధనమూ ఇచ్చి నిన్ను కొనుక్కోడానికి సిద్ధపడ్డాడు. ఇంకా ఆలోచిస్తావేమిటి ? వెంటనే తీసుకుని నా దక్షిణ నాకు పడెయ్ - అని తొందరపెట్టాడు.

కౌశికా ! సూర్యవంశంలో పుట్టినవాణ్ణి. రాజ్యాలు ఏలినవాణ్ణి. డబ్బుకోసమని ఒక చండాలుడికి దాసుణ్ణి అవ్వనా ? ఇది నీకు న్యాయమేనా ?



సరే, నీ ఇష్టం. నా దక్షిణ నాకు ఇయ్యి. చండాలుడినుంచే తీసుకుంటావో, బ్రాహ్మణుడినుంచే తీసుకుంటావో, నాకు తెలీదు. ఒకటిమాత్రం నిజం. నిన్ను కొనుక్కోడానికి వీడు తప్ప మరింక ఎవ్వరూ ముందుకి రాలేదు. ధనం ఇవ్వకపోతే నేను ఊరుకోను. సూర్యాస్తమయానికి ఇంక అరగంట మాత్రమే ఉంది ఆలోచించుకో. బాకీ చెల్లిస్తావో, శాపాగ్నిలో బూడిద అవుతావో !

హరిశ్చంద్రుడు కుదేలైపోయాడు. జీవచ్ఛవమైపోయాడు. మహర్షీ ! క్షమించు - అంటూ కాళ్ళు పట్టుకున్నాడు. నేను దాసుణ్ణి. ఆర్తుణ్ణి. దీనుణ్ణి. విశేషించి నీ భక్తుణ్ణి. ఈ చండాలుడితో సాంకర్యం సహించలేను. విప్రోత్తమా ! కాసింత అనుగ్రహించు. దయచూపించు. నువ్వే నన్ను సేవకుడిగా స్వీకరించి బాకీకి జమవేసుకో. నీ దగ్గరే పడిఉంటాను. చెప్పిందల్లా చేస్తాను. నీ మనస్సుకి నచ్చేట్టు చేస్తాను.

హరిశ్చంద్రా ! సరే అయితే, ఇంతగా బతిమాలుతున్నావు కనక అంగీకరిస్తున్నాను. నిన్ను కింకరుడిగా స్వీకరిస్తున్నాను. నేను ఏది చెబితే అది చెయ్యాలిసుమా ! ఎప్పుడూ దేనికీ కాదనకూడదు.

హరిశ్చంద్రుడు అంగీకరించాడు. ఆ కాసింతకే ఏదో పెద్దగండం తప్పిపోయినట్టుగా సంతోషించాడు. మరొక జన్మఎత్తానురా భగవంతుడా అనుకొన్నాడు.

మహర్షీ ! నువ్వు గీసినగీటు దాటను. ఏది ఆజ్ఞాపిస్తే అది చేస్తాను. ఆజ్ఞాపించు ఇప్పుడు ఏమి చెయ్యమంటావో - అంటూ లేచి నిలబడ్డాడు.

విశ్వామిత్రుడు చండాలుడివైపు తిరిగాడు. చండాలా ! ఇదిగో వీడు నా దాసుడు. వీణ్ణి అమ్ముతున్నాను. కొనుక్కో. ఇప్పుడు నాకు కింకరుడు అవసరంలేదు. డబ్బు కావాలి. ఎంత ఇవ్వగలవో అంత ఇచ్చి కొనుక్కో. నీకు కావాలంటున్నావుకదూ !

చండాలుడు ముసిముసిగా నవ్వుతూ విశ్వామిత్రుడికి కాసింత దగ్గరగా వచ్చాడు. మహర్షీ ! ప్రయాగమండలంలో నాకు పదియోజనాల పొలం ఉంది. అది రత్నగర్భ. దాన్ని నీకు ఇచ్చేస్తున్నాను. తీసుకో. నీ అవసరం తీర్చుకో. ఇంకా ఇవిగో వెయ్యి రత్నాలు, సువర్ణటంకాలు, మణులూ, ముత్యాలూ - ఇవన్నీ ఇచ్చేస్తున్నాను. వెల సరిపోవచ్చు. స్వీకరించు - అంటూ సంచి గుమ్మరించాడు. కౌశికుడు స్వీకరించాడు.

ఆహా ! ఈ మహర్షి ఎంత టక్కరి ! కళ్ళ ఎదుటే మారుబేరం చేసేశాడు. సరే కానీ. నేను విశ్వామిత్రుడి సొత్తునయ్యాను. కనక ఈయనగారు నన్ను ఏమిచేసినా చేసుకోవచ్చు. కాదనడానికి లేదు - అని హరిశ్చంద్రుడు అనుకొంటున్నంతలో ఆకాశం నుంచి పుష్పవృష్టి కురిసింది. అశరీరవాణి వినిపించింది.



మహారాజా ! ఋణవిముక్తుడివి అయ్యావు. విశ్వామిత్రుడి దక్షిణ పూర్తిఅయ్యింది. మాట నిలబెట్టుకున్నావు. సాధు, సాధు - అంటూ ఇంద్రాదిదేవతలు అభినందించారు. హరిశ్చంద్రుడు సంబరపడ్డాడు.

మహర్షీ ! నువ్వే తల్లివి. తండ్రివి. నువ్వే నా బంధువువి. ఏ ఋణం తీర్చడంకోసం ఇంతకాలమూ పరితపించానో అది ఈ క్షణంతో తీరిపోయింది. మనస్సు తేలికపడింది. ఇప్పుడు ఏమి చెయ్యమంటావో చెప్పు. ఆజ్ఞాపించు. నీ ఆజ్ఞలే నాకు శ్రేయోదాయకాలు - అని నమస్కరించి నిలబడ్డాడు.

హరిశ్చంద్రా ! ఈ క్షణంనుంచి ఈ చండాలుడు ఏది చెబితే అది చెయ్యి. శుభం భవతు -అంటూ ఆ ధనం తీసుకుని వెళ్లిపోయాడు కౌశికుడు. *(అధ్యాయం - 23, శ్లోకాలు - 38)*

## ◆ కాటికాపరిగా హరిశ్చంద్రుడు ◆

విశ్వామిత్రుడు అటువెళ్ళగానే ప్రవీరుడు హరిశ్చంద్రుడి చేతులకి బంధంవేసి తాడు కొస చేత్తో పట్టుకున్నాడు. "మాట తప్పాలని చూస్తావురా" అంటూ చేతికర్రతో ఒకటిచ్చుకున్నాడు. హరిశ్చంద్రుడికి కోపం రాలేదు. బాధా అనిపించలేదు. మౌనంగా కళ్ళప్పగించి చూస్తూ నిలబడ్డాడు. అతడిని ప్రవీరుడు తన పేటలోకి లాక్కుపోయాడు. గుడిసెముందు నిలబెట్టాడు. కాళ్ళకుకూడా బంధం వేశాడు. అలా వదిలేసి తామవెళ్ళి గుడిసెలో దూరి కుక్కిమంచంమీద హాయిగా పడుకుని నిద్రపోయాడు.

హరిశ్చంద్రుడి ఆలోచనలు సుడులు తిరిగాయి. తన జీవిత చిత్రమంతా కళ్ళ ఎదుట కదలాడసాగింది. కట్టకడపటికి ఇలా చండాలత్వం దాపురించిందిగదా అని విలపించాడు. మాధవీదేవి ఎంతగా విలపిస్తోందో ! నాన్నా నాన్నా అని నాకోసం పలవరించే రోహితుణ్ణి సముదాయించలేక ఎలా సతమతమవుతోందో ! ఇదిగో వస్తాడు, అదిగో వస్తాడని బుజ్జగిస్తోందేమో ! పిచ్చిది. నాకు చండాలత్వం వచ్చిందని తెలియదుకదూ ! భగవంతుడా ? ఎంతటి దుర్దశ రాసిపెట్టావయ్యా మా నుదుట !

నిరంతరం ఇవే ఆలోచనలతో దుఃఖిస్తూ మహారాజు రోజులు గడుపుతున్నాడు. అయిదవనాడు చండాలుడికి రవ్వంత దయ కలిగినట్టుంది, బంధాలు విప్పేశాడు.

కింకరా ! ఈ కాశీకి దక్షిణం దిక్కున శ్మశానం ఉంది. అది మనదే. ఈ రోజునుంచీ నువ్వే దానికి కాపలా. వదిలేసి ఎటయినా షికార్లుకొట్టావో జాగర్త. సుంకం సరిగ్గా - ఎక్కువా తక్కువా లేకండా - వసూలు చేయ్యాల. చెయ్యకపొయ్యావో ఇదిగో - కర్ర. వీపు పగిలిపోద్ది ! గుడిసె వెనక్కాల ఇంకో పాతకర్ర ఉంది. అది తీసుకో. వీరబాహుడి కర్ర అని అందరికీ చెప్పుకో. వెళ్ళు. ఇంకా నిలబడ్డావేంటి ! !



ఇమం చ జర్జరం దండం గృహీత్వా యాహి మా చిరమ్ ।
వీరబాహోరయం దండ ఇతి ఘోషస్య పర్వత: ॥ (24 - 14)

హరిశ్చంద్రుడు కాళ్ళీడ్చుకుంటూ శ్మశానం చేరుకున్నాడు. భయానకంగా ఉంది. కం
కొడుతోంది. పుర్రెలూ ఎముకలూ చెల్లాచెదురుగా కాళ్ళకి తగులుతున్నాయి. నాలుగువైపులనుం
పట్టపగలే నక్కకూతలు వినపడుతున్నాయి. గ్రద్దలూ రాబందులూ గుంపులు గుంపులుగా వాలుతున్నాయి
ఈలవేస్తూ ఎగురుతున్నాయి. సగంకాలిన శవాలు పళ్ళు ఇకిలిస్తున్నాయి. జీవితం శాశ్వతమనుకుంటూ
బతుకుతున్న వాళ్ళని పరిహసిస్తున్నట్టున్నాయి. శరీరాలకు కడపటి సమ్మానమిదని బోధిస్తున్నట్టున్నాయి

అర్ధదగ్ధశవాస్యాని వికసద్దంతపంక్తిభి: ।
హసంతీవాగ్నిమధ్యస్థ కాయస్యైవం వ్యవస్థితి: ॥ (24 -20)

చనిపోయిన వారికోసం విలపిస్తున్నవారి ఆక్రందనాలు గుండెలను పిండేస్తున్నాయి. హా పుత్రా
హా మిత్రా, హా బంధూ, హా సోదరా, హా ప్రియా, హా పతీ, హా (మేనల్లుడా) భాగినేయా, హా మాతులా, హా
పితా, హా పితామహా, హా మాతామహా, హా పౌత్రా ; మమ్మల్ని విడిచి ఎక్కడికి వెళ్ళిపోయావ్; తిరిగిరా
ఒక్కసారి కనిపించు - అనే ఆర్తస్వరాలు హృదయాలను తూట్లుపొడుస్తున్నాయి. మండుతున్న చితి
ఉన్నట్టుండి అరుస్తోంది. కొవ్వు కరిగి చుంయ్‌మంటోంది. చిటపటలాడుతోంది. ఇది కల్పాంతమా
అనిపిస్తూ దారుణంగా ఉంది శ్మశానం.

కల్పాంత సదృశాకారం శ్మశానం తత్సుదారుణమ్ ।
స రాజా తత్ర సంప్రాప్తో దు:ఖాదేవమశోచత ॥ (24 - 24)

హరిశ్చంద్రుడికి తనవాళ్ళందరూ జ్ఞాపకం వచ్చారు. భృత్యులారా ! మంత్రులారా ! మీరంతా ఏమయ్యారు ? వంశ పారంపర్యంగా వచ్చిన రాజ్యం ఏమయ్యింది ? హా దేవీ ! హా పుత్రకా ! మీరెక్కడో ! నేనిక్కడ. బ్రాహ్మణుడి కోపం మనల్ని దారుణంగా విడదీసింది. కానీ, ఇంతకన్నా వచ్చిపడే కష్టం ఏముంది కనక. వస్తే రానీ. ధర్మంమాత్రం తప్పను. ఎప్పటికైనా అదే గెలుస్తుంది. అది తప్ప మనుష్యులకు మరొకటి శుభప్రదం లేదు. ప్రయత్నపూర్వకంగా అందరూ దానిని ఆచరించవలసిందే. కష్టాలేరానీ కడగండ్లేరానీ ధర్మం తప్పడానికి వీలులేదు.

వినా ధర్మం మనుష్యాణాం జాయతే న శుభం క్వచిత్ ।
యత్నాతో ధారయేత్తస్మాత్ పురుషో ధర్మమేవ హి ॥ (24 - 27)



హరిశ్చంద్రుడు ఇలా నిశ్చయించుకుంటూ క్షణక్షణం మనస్సును నిబ్బరించుకుంటున్నాడు. ...బాహుడు చేసిన ఏర్పాటూ చెప్పిన పనులూ తలుచుకుంటున్నాడు. శ్మశానం నాలుగు చెరగులకీ ...యదిరుగుతున్నాడు. అవసరమైతే లకుటాకారకల్పుడై పరుగుపరుగున వెడుతున్నాడు. ఇదిగో ఈ ...వానికి నూరురూకలు సుంకం వచ్చింది. ఇందులో ఇది నాది. ఇది రాజుది, ఇది చండాలుడిది - అని ...భజిస్తున్నాడు.

మసిగుడ్డలా మాసిపోయి, నలిగిపోయి, చిరిగిపోయిన ఏకవస్త్రం. బుజంనుంచి కాళ్ళవరకూ ...రాడుతున్న పాతకంబళి. బయటకి కనిపిస్తున్న కాళ్ళూ చేతులూ ముఖం - అంతటా చితాభస్మం. ...వేళ్ళకీ అరచేతులకీ - జిడ్డూ మసీ. అవే చేతులతో ఆకలి తీర్చుకుంటున్నాడు. శవాలకు వేసిన పిండాలు ఆవురావురుమని ఆబగా తింటున్నాడు. శవాలనుంచి తొలగించిన పుష్పమాలికలను తలకు చుట్టుకుంటున్నాడు. రాత్రీ లేదు, పగలూ లేదు. ఒకటే కాపలా. నిద్రను మర్చిపోయి చాలా రోజులయ్యింది. ఇలా పన్నెండు నెలలు - నూరు సంవత్సరాల్లా గడిచాయి. ***(అధ్యాయం - 24, శ్లోకాలు - 33)***

జీర్ణైక పట సుగ్రంథికృతకంథా పరిగ్రహః ।
చితాభస్మరజోలిప్తముఖబాహూదరాంఘ్రికః ॥
నానా మేదో వసా మజ్జాలిప్తపాణ్యంగుళిః శ్వసన్ ।
నానా శవౌదనకృతక్షున్నివృత్తి పరాయణః ॥
తదీయమాల్య సంశ్లేష కృతమస్తకమండలః ।
న రాత్రౌ న దివా శేతే హాహేతి ప్రవదన్ముహుః ॥
ఏవం దాద్వశమాసాస్తు నీతా వర్షశతోపమాః । **(24 - 30, 31, 32, 33)**

## ◆ రోహితుడి మరణం ◆

రోహితుడు ఒకనాడు బ్రాహ్మణబాలురతో కలిసి వారణాసికి దగ్గరలోనే ఉన్న అడవిలోకి ఆటలకి వెళ్ళారు. అందరూ ఆడుకున్నంతసేపు ఆడుకున్నారు. ఇంక ఇళ్లకు వెళ్ళిపోదామనుకున్నారు. వట్టి చేతులతో వెళ్ళడమెందుకు, ఎలాగూ వచ్చాంకదా, కాసిన్ని దర్భలూ సమిధలూ తీసుకువెడదాం హోమాలకు పనికొస్తాయనుకున్నారు. కోమలమైన దర్భలను ఏరిఏరి అగ్రాలు తెగిపోకండా చేతులు చీరుకుపోకండా కోసి మోపుకట్టారు. లక్షణాలు సరిచూసి పొడుగులు ఏరి మోదుగు సమిధలు కట్టకట్టారు. రెండింటినీ రోహితుడి నెత్తికి ఎత్తి నగరంలోకి నడక సాగించారు. బరువుతో రోహితుడు వెనకాటుగా నడుస్తున్నాడు. కొంతదూరం



వచ్చేసరికి చెరువు కనిపించింది. రోహితుడికి దాహం గుర్తువచ్చింది. మోపు దింపేవారులేక, ముందు వెడుతున్న బ్రాహ్మణబాలురిని పిలిచే ధైర్యం చాలక, ఎత్తుగా ఉన్న పుట్టమీదకి మోపులు జారవిడిచాడు. గబగబావెళ్లి చెరువులోదిగి దాహం తీర్చుకుని వచ్చి మోపులు మళ్లీ తలకు ఎత్తుకోబోయాడు.

విశ్వామిత్రుడి ఆజ్ఞమేరకు ఒక కృష్ణసర్పం పుట్టనుంచి బైటకువచ్చి రోహితుణ్ణి కాటువేసింది. అమ్మా ! అని దిక్కులు అదిరేలా అరిచి పిల్లవాడు పడిపోయాడు. ప్రాణాలు వదిలేశాడు. ముందు వెడుతున్న బాలురు ఈ కేకను గుర్తుపట్టి రోహితుడికి ఏమో అయ్యిందని పరుగుపరుగున వచ్చారు. పుట్టలోకిపోతున్న తాచుపామును చూశారు. నురుగులు కక్కుతూ గిలగిలలాడుతున్న రోహితుణ్ణి చూశారు. భయం వేసింది. అందరూ ఒక్క ఉదుటున పరుగు లంకించుకున్నారు. రొప్పుతూ రోజుతూ ఇంటికి వచ్చారు. వస్తూనే -

దాసీ ! దాసీ ! మాతో ఆడుకోడానికి వచ్చాడుకదా రోహితుడు. అడవిలో పాము కరిచింది చనిపోయినట్టున్నాడు - అని చెప్పేసి లోపలికి వెళ్ళిపోయి గదిలో దూరి తలుపులు వేసేసుకున్నారు.

మాధవీదేవి నెత్తిమీద పిడుగుపడ్డట్టు అయ్యింది. మొదలు నరికిన అరటిచెట్టులా ఒరిగిపోయింది. స్పృహకోల్పోయింది. వృద్ధబ్రాహ్మణుడు వచ్చి ముఖం మీద నీళ్ళు జల్లేడు. తెలివి వచ్చింది. వోలువోలున విలపించింది. ఏమి చెయ్యాలో తెలియడం లేదు. అలా ఏడుస్తూ కూర్చుంది.

ఏమిటే దాసీదానా ! సందెవేళ ఈ శోకన్నాలు ? అమంగళం. అశుభం. నింద్యం. ఈమాత్రం తేలీదూ ? పదిమందితో కళకళలాడుతున్న ఇంటిలో ఈవేళప్పుడు శోకాలు పెడుతున్నావ్, సిగ్గు లేదూ ? దుర్మార్గురాలా ! - అని క్రూరంగా కసురుకున్నాడు బ్రాహ్మణుడు.

మాధవీదేవి నోరుమెదపలేకపోయింది. ఏమి జరిగిందో చెప్పాలనికూడా తోచలేదు. నోరు నొక్కుకుంటూ విలపిస్తోంది. తలబాదుకుంటోంది. జుట్టు ముడివీడి చెల్లాచెదురయ్యింది. అసలే మలినవస్త్రాలు. వొళ్ళు తెలియకుండా నేలమీద పడి దొర్లుతోంది. ఏడుపు దెయ్యం పట్టినట్టు విలపిస్తోంది. బ్రాహ్మణుడికి ఇది అసహ్యమనిపించింది. కోపం చుర్రుమంది.

దుష్టురాలా ! కోటి నిష్కాలు నీ మొగుడి మొగానపోసి కొన్నాను. ఇంకా ఏడాది కాలేదు. అప్పుడే నన్ను ముంచేసేట్టున్నావు. ఇంటి పనులు చెయ్యడానికి అంత ఓపిక లేనిదానివైతే నా సొమ్ము ఎందుకు తీసుకున్నారే ? వెళ్ళు, పట్టుకురా నా డబ్బు. నా కోటి టంకాలూ నాకు పడేసి, నీ దారిన నువ్వుపో. కొడుకును కూడా తీసుకుపోయేట్టయితే ఆ ధనంకూడా తెచ్చి ఇచ్చేసేయ్. డబ్బు కావాలి, చాకిరీమాత్రం పనికిరాదు - ఎలా కుదురుతుంది ? అవ్వా బువ్వా కావాలంటే వస్తాయా ?



ఇలా దులిపేస్తున్నాడు. తట్టుకోలేకపోయింది. స్వామీ ! అంటూ అడ్డుపడింది. నేను పనిచెయ్యలేక పోవడంలేదయ్యా ! నా కొడుకుని పాము కరిచిందిట అడివిలో చచ్చిపోయాడుట - వాణ్ణి చూసొస్తానయ్యా ! ఒక్కసారి ఈ పూటకి అనుమతి ఇవ్వు. కాటికి తీసుకుపోయి ఓమూల పూడ్చిపెట్టి వస్తాను. కన్నతల్లినైనందుకు అదైనా చెయ్యాలి గదయ్యా - అని గొల్లున విలపించింది. నెత్తీనోరూ బాదుకుంది. బ్రాహ్మణోత్తముడు ఇదేమీ వినుపించుకోలేదు. ఇంకా కఠినంగా మాట్లాడాడు.

ఓసీ ! నీచురాలా ! దుర్వార్తలు చెప్పకు. కల్లబొల్లి కబుర్లూ ఏడుపులూ నాదగ్గర కాదు. పని ఎగ్గొట్టడానికి మీరు ఎంతలేసి అబద్ధాలన్నా ఆడతారు. ఎన్ని కట్టుకథలన్నా చెబుతారు. మీ అలగాజనం అందరూ అంతే. నాకు తెలీదా ! జీతం తీసుకుని పని ఎగగొట్టడం మహాపాతకం. నరకానికి పోతావు. అది మహారౌరవం. అక్కడ సలసలా కాగుతున్న నూనెలో నిన్ను వొడియంలా వేయిస్తారు యమభటులు. తెలుసా ? ఆపై జన్మంలో కుక్కుటంగా పుడతావు. కూలిడబ్బులు తీసుకుని పని ఎగ్గొడితే ఇదీ శిక్ష. అయినా, నా పిచ్చిగానీ, మీ దగ్గర ఈ ధర్మపన్నాలు పనిజేస్తాయా ? ఊసరక్షేత్రంలో వ్యవసాయం చేసినట్టే. ఇదిగో ఆఖరిసారిగా చెబుతున్నాను. నీ ఇష్టం. పాపమూ పరలోకమూలాంటి భయాలు ఏమైనా ఉంటే వొళ్ళు వొంచి పనిచెయ్యి. లేదంటే దయచెయ్యి.

మహానుభావా ! కాసింత కరుణించు. దయచూపించు. అనుమతించు. పని ఎగ్గొట్టి వెళ్ళిపోను. ఇప్పుడే వచ్చేస్తాను. నా మాట నమ్ము. కొడుకు చచ్చిపోయాడుట. ఆ మిగతాపని పూర్తిచేసి వెంటనే వచ్చేస్తాను. కాదనకు. అనుమతించు - అంటూ కాళ్ళమీద పడింది. కాళ్ళు అందకుండా విప్రుడు రెండడుగులు వెనక్కి వేశాడు. కళ్ళు ఎర్రజేశాడు.

దాసీదానా ! నీ కొడుకు ఏమయితే నాకేమి ? ముందు చేతిలో పని పూర్తిచెయ్యి. పిచ్చివేషాలు వేశావో జాగ్రత్త. నా కోపం తెలుసుగా. కమిచీదెబ్బలు తగులుతాయి - అని హెచ్చరించి లోపలికి వెళ్ళిపోయాడు. తలుపులు వేసేసుకున్నాడు.

మాధవీదేవి కంటికీమంటికీ ఏకధారగా ఏడిచింది, ఏడిచింది, ఏడిచింది. అలసిపోయి సొమ్మసిల్లింది. కాసేపటికి తేరుకుంది. ధైర్యం తెచ్చుకుంది. గబగబా పనులన్నీ పూర్తిచేసేసరికి చీకటి పడిపోయింది - బ్రాహ్మణుడికి పక్క సర్దింది. ఆయన వచ్చి విశ్రమించాడు. నిద్రపట్టేవరకూ కాళ్ళు పట్టాలి. పడుతోంది. అప్పటికి దయ కలిగింది ఆ కపటబ్రాహ్మణుడికి.

ఒసేవ్ ! ఇప్పుడు వెళ్ళు. నీ కొడుకును చూసుకో. చచ్చిపోయాడు అంటున్నావుగా. వెళ్ళు దహనక్రియలూ అవీ పూర్తిచేసి త్వరగా వచ్చెయ్. తెల్లవారుజామున పాచిపనికి అందుకోవాలిసుమా ! ఆలస్యం అయితే ఊరుకునేది లేదు. వెళ్ళిరా - అన్నాడు.



అనడమేమిటి, అడవిలోకి పరుగుతీసింది ఆ పిచ్చి తల్లి. అసలే కారుచీకటి, ఆ పైని కష్టం. దారి తెలియడం లేదు. కాళ్ళు చీరుకుపోతున్నాయి. ఎక్కడికి వెడుతోందో తెలియడంలేదు. అయినా పరుగూ, పరుగులాంటి నడక. పుత్రకా ! రోహితా ! అని ఓపికకొద్దీ అరుస్తోంది. ఎలుగెత్తి పిలుస్తోంది. బ్రాహ్మణ బాలకులు చెప్పిన చెరువు, చెరువు పక్కన పుట్ట - చేరుకుంది. దిక్కూమొక్కూలేని అనాథశవంగా పడిఉన్న కొడుకును చూసింది. నాయనా ! అంటూ కూలబడి, బిడ్డను అక్కునజేర్చుకుని దారుణంగా రోదించింది. వాడి వీపుకి అంటిన దుమ్మునూ ధూళినీ గడ్డిపరకలనూ ఎందుకో దులుపుతోంది. అప్రయత్నంగా దులుపుతోంది. విలపిస్తోంది. తండ్రీ ! ఒక్కసారి పలకరించవూ ? అమ్మా అనవూ ? ముఖంలోకి ముఖం పెట్టి పిచ్చిదానిలా పలకరిస్తోంది. కుదిపేస్తోంది. ఒక్కసారిగా ఒడిలోకి వదిలేసింది. రెండు చేతులతోనూ ముఖం కప్పుకుని బోరుమంది. వాడిమీదకి ఒరిగిపోయింది.

మహారాజా ! ఎక్కడున్నావయ్యా ! చూడు - నీ కొడుకు ఏమయ్యాడో ! నాకు ప్రాణాలకంటే తీపి, ప్రాణాలకంటే తీపి అనేవాడివి. నిన్నూ నన్నూ విడిచిపెట్టి వెళ్ళిపోయాడు - అంటూ మళ్ళీ రోహితుడి ముఖాన్ని తన చేతుల్లోకి తీసుకుంది. కొన ఊపిరి ఉందేమో, బతుకుతాడేమో అని ఆశగా పరిశీలించింది. నోరు విడదియ్యడానికి ప్రయత్నించింది. ముక్కు దగ్గర వేళ్ళు కదిపి చూసింది. కనురెప్పలు విప్పార్చింది. మంచుముద్దలా గడ్డకట్టుకుపోయిన శరీరాన్ని తడిమి తడిమి చూసింది. అరికాళ్లల్లో రుద్ది వేడిపుట్టించడానికి విఫలయత్నం చేసింది. అయ్యో ! నాన్నా ! అంటూ మీదపడి ఏడ్చింది. స్పృహకోల్పోయింది.

> తథా పశ్యన్ముఖం తస్య భూయో జీవితశంకయా ।
> నిర్జీవవదనం జ్ఞాత్వా మూర్ఛితా నిపపాత హ ॥ (25 - 38)

అంతలోకే తేరుకుంది. పిచ్చి ధోరణి పడింది. నాయనా ! రోహితా ! ఇక నిద్రచాలు. లేవయ్యా ఇది అడివి. అర్ధరాత్రి అయ్యింది. నీ మిత్రులందరూ ఇళ్ళకు వెళ్ళిపోయారు. భూతప్రేతపిశాచాలు అరుస్తున్నాయి. భయం వెయ్యడంలేదూ ? లే నాయనా ! మనంకూడా ఇంటికి వెళ్లిపోదాం. ఉలకవూ పలకవూ ఇదేమయ్యా ? నామీద కోపం వచ్చిందా ? నీ కన్నతల్లినిరా నేను. గుర్తుపట్టలేకపోతున్నావా ? రాజ్యంపోయినా, భర్త నన్ను అమ్మేసినా, దాసీత్వం సంక్రమించినా - కేవలం నిన్ను చూసుకుని బతుకుతున్నామురా. ఇలా దగాచేసి వెళ్ళిపోతావనుకోలేదురా.

> దేశత్యాగాత్ రాజ్యనాశాత్ పుత్ర భర్త్రా స్వవిక్రయాత్ ।
> యద్దాసీత్వాచ్చ జీవామి త్వాం దృష్ట్వా పుత్ర కేవలమ్ ॥ (25 - 40)



నీ జాతకం అమోఘమనీ, దీర్ఘాయుష్యమనీ, మహారాజు అవుతావనీ, పుత్రపౌత్రాభివృద్ధిగా వంశం నిలబెడతావనీ, మహావీరుడవై దానధర్మాలు చేసి కీర్తి గడిస్తావనీ, తల్లిదండ్రులను సంతోషపెడతావనీ - దైవజ్ఞులు లెక్కలుకట్టి చెప్పినదంతా అబద్ధమైపోయిందా ? నీ అరచేతులలో అరికాళ్ళలో కనిపించే చక్ర మత్స్య కలశ చామర చిహ్నాలు అన్నీ వ్యర్థమైపోయినట్టేనా ? సాముద్రికశాస్త్రాన్ని పరిహసించినట్టేనా ?

రాకుమారా ! నీ రాజ్యం ఏమయ్యింది ? మంత్రులు ఏరి ? సింహాసనం ఎక్కడ ? ఛత్రచామరాలు ఏవి ? నీ సైన్యం ఏది ? అయోధ్య ఏది ? భవనాలు ఏవి ? రథాశ్వగజాలు ఏవి ? ప్రజలు ఏరి ? వీటిని అన్నింటినీ విడిచిపెట్టి, నన్నూ విడిచిపెట్టి ఎక్కడికి వెళ్ళిపోయావురా ? నాథా ! ఎక్కడ ఉన్నావో - త్వరగా రావయ్యా ! నీ కొడుకును కడసారయినా చూసుకోవయ్యా ! నిన్ను కౌగిలించుకుని తన బొట్టుని నీ గుండెలకు అంటించిన ప్రియపుత్రుడు - నిర్జీవంగా నేలమీద పడిఉన్నాడు. వచ్చి కౌగిలించి ఎత్తుకోవయ్యా ! కస్తూరీచందనాలు పులుముకున్న దేహానికి దుమ్మూధూళీ అంటుతాయని జంకుతున్నావా? ఇది మనకు కొత్తా ? ఇవ్వేళ జంకడానికి. మట్టితింటున్న బిడ్డడిని నోటిలో నోరు పెట్టి ముద్దాడిన వాళ్ళంకామూ? ఇవ్వేళ ఆ ముఖంమీద ఈగలు ముసురుతున్నాయి. ఆ వొంటిమీద పురుగులు పాకుతున్నాయి.

నాథా ! ఏ జన్మలో ఏ మహాపాపం చేశానో ? ఇవ్వేళ ఇలా ఒంటరిగా ఫలం అనుభవిస్తున్నాను. నువ్వు కూడా దగ్గరలేని సమయంలోనే ఈ దారుణం జరగాలా ? స్వామీ ! నువ్వూ పలకవు. తనయా ! నువ్వూ పలకవు. నాకేది దిక్కు ? దైవమా ! ఏమిటి ఈ విషమపరీక్ష ?

## ◆ హరిశ్చంద్రుడి భార్యకు మరణదండన ◆

మాధవీదేవి విలాపాలు అడవిలో మారుమోగి, గింగిరులు తిరిగి నగరపాలకుల చెవికి పోకాయి. వాళ్ళు ఆశ్చర్యపోతూ పరుగుపరుగున వచ్చారు. ఎవరివమ్మా నువ్వు ? ఈ బాలు డెవడు? నీ భర్త ఎవరు ? ఈ అర్ధరాత్రివేళ ఈ అడవిలో ఇలా రోదిస్తున్నావేమిటి ? - ప్రశ్నలు గుచ్చి గుచ్చి అడిగారు. సమాధానం లేదు. ఏడుపూ లేదు. స్పృహకోల్పోయి బిర్రబిగిసిపోయింది. వాళ్ళకు అనుమానం వచ్చింది. శరీరాలు రోమాంచితమయ్యాయి. మరోవైపు భయమూ ఆవరించింది. పరస్పరం గుసగుసలు పోయారు.

ఇది స్త్రీ కాదు. పిశాచి. బాలఘాతిని. లేకపోతే ఇలా అర్ధరాత్రి అడవిలో ఒంటరిగా కూర్చుంటుందా ? భక్షించడంకోసం ఎవడో బాలుణ్ణి ఎత్తుకు వచ్చింది. చంపేసింది. కాసేపట్లో తినేస్తుంది



అందరూ కూడబలుక్కుని ధైర్యం తెచ్చుకుని ఆవిడ జుట్టుపట్టుకున్నారు. ఇద్దరు చేతులు వెనక్కి విరిచి పట్టుకున్నారు. ఒకడు పీక పట్టుకున్నాడు. లాక్కుపోయారు. ఎవరో ఖేచరి నగరప్రాంతాలలో తిరుగుతోందని జనం చెప్పుకుంటుండగా విన్నాం. ఇంతకాలానికి పట్టుకున్నాం- అనుకుంటూ ఆమెను తీసుకుపోయి శ్మశానంలో ఉన్న చండాలుడికి అప్పగించారు.

ఓరీ చండాలుడా ! నగరానికి అటుచివర అడివిలో దీనిని పట్టుకున్నాం. వెంటనే దీన్ని సంహరించు - అన్నారు. చండాలుడు ఆమెను ఎగాదిగా చూశాడు. అబ్బో ! ఈవిడా ? నే నెరుగుదును. మీరెవ్వరూ ఇంతకుముందు చూడలేదా ? ఈవిడ ఇప్పటికి ఎంతమంది పసిబిడ్డల్ని కడుపున బెట్టుకుందో లెక్కలేదు. పోనీలెండి, ఇప్పటికైనా పట్టుకుని మంచిపని చేశారు. పుణ్యమూ కీర్తీ మూటగట్టుకున్నారు. ఇక మీరు వెళ్ళండి. ఈవిడ కథ నేను చూసుకుంటాను - అని చండాలుడు నగరపాలకులను పంపించేశాడు.

బ్రాహ్మణ - స్త్రీ - బాల - గోవధలు చేసినవాడూ, బంగారం దొంగిలించినవాడూ, నిప్పుపెట్టినవాడూ, దారిదోపిడీ చేసినవాడూ, మద్యపానం చేసినవాడూ, గురుపత్నిని అనుభవించినవాడూ, మహాజనంతో విరోధించినవాడూ - వధార్హుడు. ఈ పనులు చేసినది బ్రాహ్మణుడైనా, స్త్రీ - అయినా వధించడంలో పాపం లేదు. ఈవిడను నేను సంహరించవలసిందే - అనుకున్నాడు.

ద్విజ - స్త్రీ - బాల - గోఘాతీ స్వర్ణస్తేయీ చ యో నరః ।
అగ్నిదో వర్త్మఘాతీ చ మద్యపో గురుతల్పగః ॥
మహాజన విరోధీ చ తస్య పుణ్యప్రదో వధః ।
ద్విజస్యాపి స్త్రియో వాపి న దోషో విద్యతే వధే ॥ (25 - 68, 69)

ఆవిడ కాళ్లూ చేతులూ కట్టేసి పలుపుతాడుతో చావబాదాడు. చేతులు లాగాయి. తన సేవకుణ్ణి పిలిచాడు. రే ! దాసా ! ఇటు రా. ! ఈ దుష్టురాలిని సంహరించు. అయ్యో ! ఆడది అని సంశయించకు. వెంటనే సంహరించు - అని ఆజ్ఞాపించాడు. స్త్రీని చంపడమా అని హరిశ్చంద్రుడు భయపడిపోయాడు. స్వామీ ! నేను చంపలేను. మరింకేదైనా పని అజ్ఞాపించు. ఎంతటి దుస్సాధ్యమైనా నిర్వహిస్తాను - అన్నాడు ఖండితంగా.

కింకరా ! భయపడకు. ఈవిడని సంహరించడం పాపం కాకపోగా పుణ్యప్రదం. ఇది పసిబిడ్డలను చంపి భక్షించే పిశాచి. దీన్ని ఇలాగే విడిచిపెడితే నగరంలో ఇక పిల్లలు మిగలరు. రేపటికి జనం మిగలరు. కత్తి అందుకో.



స్వామీ ! స్త్రీలను రక్షించాలే తప్ప సంహరించకూడదు. అది మహాపాపమని మహర్షులు ఎందరో ప్పారు. తెలిసిగానీ తెలియకగానీ స్త్రీని వధించినవాడు మహారౌరవ నరకానికి పోతాడు.

ఓరీ సేవకా ! నాకు నీతులు చెప్పకు. అట్టే మాట్లాడక కత్తి అందుకో. ఒక్కవేటుతో సంహరించు. క మనిషిని చంపడంవల్ల పదిమంది బతికేట్టయితే అది పాపమే కాదు. పుణ్యం కూడా. నోరు మూసుకుని ను చెప్పినట్టు చెయ్యి. ఈ బాలఘాతినిని సంహరించు.

చండాలాధిపతీ ! స్త్రీని వధించను అనేది నా నియమం. ఇది నాకు అజన్మవ్రతం. ఇవ్వేళ దాన్ని ంగపరుచుకోవడం నావల్ల కాదు.

దుష్టుడా ! నీకు నేను అధిపతిని. స్వామికార్యంకన్నా నీకు స్వీయవ్రతం గొప్పదా ? నా దగ్గర తం తీసుకుంటూ నేను చెప్పిన పనినే చెయ్యనంటావా ? స్త్రీవధవల్ల నరకం వస్తుందో చస్తుందో కానీ, స్వామిని ధిక్కరించినందువల్ల నువ్వు నరకానికి పోవడం తథ్యం.

చండాలనాథా ! దయచేసి అలా శపించకు. నేను నిన్ను ధిక్కరించడంలేదు. ఇది తప్ప ఇంక ఏదైనా సరే ఆజ్ఞాపించు చేస్తాను. నీకు శత్రువులు ఎవరైనా ఉంటే చెప్పు వాళ్ళు దేవతలైనా సరే దేవేంద్రుడైనా సరే ఈ క్షణంలో వెళ్ళి సంహరించి వస్తాను.

ఏమిరా ! చండాలుడికి కింకరుడివైయుండి రాజుగారిలా కబుర్లు చెబుతున్నావేమిటి ? దేవతలమాటకూడా ఎత్తుతున్నావ్. సిగ్గులేనివాడా ! అంత పాపభయమే ఉంటే చండాలుడికి దాసుడివి ఎందుకయ్యావ్ ? పెద్ద పెద్ద కబుర్లు చెప్పకు. ఇదిగో ఖడ్గం. అందుకో. దీని శిరస్సుని పద్మంలా తుంచెయ్ - అని కటారి అందించాడు వీరబాహుడు. ***(అధ్యాయం - 25, శ్లోకాలు - 89)***

## ◆ హరిశ్చంద్రుడు భార్యాపుత్రులను గుర్తించడం ◆

హరిశ్చంద్రుడింక తప్పించుకోలేకపోయాడు. కత్తి అందుకున్నాడు. సిగ్గుతో తలదించుకున్నాడు. వనితా ! నేనొక పాపాత్ముణ్ణి. ఇటువచ్చి నాముందు కూర్చో. నీ శిరస్సు ఖండిస్తాను. ఈ చెయ్యి నిన్ను చంపగలుగుతుందేమో చూస్తాను.

> అత్రోపవిశ్యతాం బాలే పాపస్య పురతో మమ ।
> శిరస్తే ఛేదయిష్యామి హంతుం శక్నోతి చేత్కరః ॥ (26 - 2)

ఖడ్గం చేతబట్టుకుని రెండు అడుగులు ముందుకి వేశాడు హరిశ్చంద్రుడు. ఆవిడ తన ధర్మపత్ని అని అతడికి తెలియదు. ఆయన తన భర్త అని ఆవిడకి తెలియదు. అప్పటికి ఏమి జరుగుతోందో గ్రహించిన మాధవీదేవి హీనస్వరంతో పలికింది.



చండాలా ! చనిపోడానికి నేను సిద్ధంగా ఉన్నాను. సంహరించు. అయితే నాదొక చిన్న విజ్ఞప్తి నా కన్న కొడుకు సాయంకాలమనగా చనిపోయాడు. ఇక్కడికి దగ్గరలోనే శవమై పడిఉన్నాడు. పాముకరిచి ప్రాణాలు వదిలేశాడు. వాడిని తీసుకువచ్చి కాటికాపరివి కనక నీకు అప్పగిస్తాను. త్వరగానే వచ్చేస్తాను. ఆలస్యం ఏమీ చెయ్యను. నువ్వు కత్తిపట్టుకుని ఇలాగే నిలబడు. రాగానే శిరస్సు ఖండిద్దువుగాని. దయచేసి ఈ చిన్న అవకాశం నాకు ఇయ్యి. అనుమతించు - అని అభ్యర్థించింది. హరిశ్చంద్రుడు సరే అన్నాడు. హా పుత్ర, హా వత్స, హా శిశూ - అంటూ పరుగుతీసింది. బాలుడి శరీరాన్ని బుజాన మోసుకుని తీసుకువచ్చింది. దించింది. మహారాజా ! ఎక్కడున్నావో ? నీ ప్రియపుత్రుడు చనిపోయాడు. ఇప్పుడు నేనూ చనిపోతున్నాను - అంటూ బోరుమంది.

హరిశ్చంద్రుడు విన్నాడేకానీ బొంగురుపోయిన ఆ కంఠస్వరాన్ని పోల్చుకోలేకపోయాడు. నలిగి చిరిగిపోయిన చీర. చిక్కి శల్యమైన శరీరం. ముఖమంతా ఆవరించిన జుట్టు. అసలే చీకటి. రూపమూ గుర్తుపట్టలేకపోయాడు. బాలుడి శవంమీద కప్పిన వస్త్రాన్ని తొలగించి చూశాడు. రాజచిహ్నాలు ముఖంలో స్పష్టంగా కనిపించాయి. చంద్రబింబంలాంటి ముఖం. కొనదేరిన ముక్కు. అద్దాల్లాంటి చెక్కిళ్ళు. నల్లని ముంగురులు. పొడవైన కేశపాశం. పద్మాల్లాంటి కన్నులు. దొండపండుల్లాంటి పెదవులు. ఎత్తయిన బుజాలు. పొడవైన చేతులు. విశాలమైన వక్షఃస్థలం. పెద్దపెద్ద అరచేతులు. పొడవైన వేళ్లు. బలిష్ఠమైన కంఠసీమ. మృదువైన పాదాలు. లోతయిన బొడ్డు. అయ్యో ! ఎంతటి అందగాడు ఈ పసివాడు. అన్నీ రాజలక్షణాలే. ఏ గొప్పవంశంలో జన్మించాడో. దుర్విధి కాలపాశంతో లాక్కువెళ్ళిపోయింది - అని విచారించాడు. మనస్సులో రోహితుడు మెదిలాడు. అచ్చం నా కుమారుడూ ఇలాగే ఉంటాడుగదా ! ఇదే వయస్సు. ఇదే రూపం. దాసీగా నా భార్య ఏ అవస్థలు పడుతోందో, రోహితుడిని ఎలా పోషిస్తోందో అనుకున్నాడు. స్థాణువై నిలబడ్డాడు.

చండాలా ! వీడు నా బిడ్డడు. కృష్ణసర్పరూపంలో వచ్చి యముడు తన్నుకుపోయాడు. వీడి తండ్రి ఎక్కడ ఉన్నాడో తెలీదు. నాకు ఈ దురవస్థ వచ్చిపడింది - అంటూ శవాన్ని గుండెలకు హత్తుకుని బావురుమంది. దుర్విధీ ! రాజ్యం పోగొట్టావు. భార్యాభర్తల్ని విడగొట్టావు. నన్ను దాసీని చేశావు. భార్యాపుత్రుల్ని అమ్ముకోవలసిన దుర్గతిని కల్పించావు. రోహితుణ్ణి పొట్టనబెట్టుకున్నావు. రాజర్షి హరిశ్చంద్రుడికి ఇంతకన్నా నువ్వు చెయ్యగలిగిన హాని ఏముంది కనక ! ?

ఈ మాట చెవికి సోకగానే హరిశ్చంద్రుడు అదిరిపడ్డాడు. తన భార్యా, తన పుత్రుడూనా ? అయ్యో ! పుత్రకా! అంటూ కూలబడిపోయాడు. ఈ అరుపుతో మాధవీదేవి గుర్తుపట్టింది. హరిశ్చంద్రుడా? అయ్యో అంటూ మూర్ఛపోయింది.



కొంతసేపటికి హరిశ్చంద్రుడు తేరుకున్నాడు. బోరుబోరున విలపించాడు. తనయా ! ఇక నన్ను నాన్నా అని ఎవరు పిలుస్తారురా ? దుమ్ములో ఆడుకొని పరుగుపరుగున వచ్చి నా ఒడిని ఎవరు మలినపరుస్తారురా ? నిన్నొక వస్తువుగా అమ్ముకొన్న దుర్మార్గుణ్ణి. నాకు ఈ శాస్తి జరగవలసిందే - అంటూ బాలుణ్ణి హృదయానికి హత్తుకున్నాడు. నిశ్చేష్టుడై స్పృహకోల్పోయాడు.

మహారాజ్ఞి స్పృహలోకి వచ్చింది. హరిశ్చంద్రుడు కనిపించాడని ఆనందించాలో, కన్నకొడుకు శాశ్వతంగా కనుమరుగయ్యాడని విలపించాలో. దారుణంగా నలిగిపోయింది. కనిపించని దేవుడిమీద పట్టరాని కోపం వచ్చింది.

దుష్టదైవమా ! కరుణారహితుడా ! నిర్మర్యాదుడా ! జుగుప్సితుడా ! ఇంద్రతుల్యుడైన హరిశ్చంద్రుణ్ణి శ్వపచుణ్ణి చేశావా ? రాజ్యం పోగొట్టి, మిత్రుల్ని దూరం చేసి, భార్యాపుత్రుల్ని అమ్ముకునే దుర్దశ కల్పించి, కట్టకడపటికి ఇలా చండాలుణ్ణి చేశావా ? మహారాజులతో సేవలు అందుకొన్న చక్రవర్తికి చండాల దాసత్వమా ? సామంతరాజులు తమ ఉత్తరీయాలతో నేల తుడిచి బహుపరాకులు చెబుతూంటే ఠీవిగా నడిచివెళ్లిన మహానుభావుడు శ్మశానంలో కపాలాలూ కుండపెంకులూ తన్నుకుంటూ తిరగవలసి వచ్చిందా ?

దైవాన్ని కఠోరంగా నిలదీసింది. భర్త కంఠాన్ని గాఢంగా కౌగిలించుకుంది. మహారాజా ! ఇది కలా ? నిజమా ? నమ్మలేకపోతున్నాను. నువ్వు ఏమనుకుంటున్నావ్ ? నా మనస్సు బండవారింది. నిశ్చయంగా తెలుసుకోలేకపోతోంది. ఏమయినా - ధర్మమార్గాన పయనించేవాడికి మానవుడేకాదు దైవంకూడా సహకరించదు. ఇదీ జీవితం. గో బ్రాహ్మణ దేవతా పూజలూ, సత్యవాక్యపరిపాలన ఇవన్నీ వ్యర్థం. ధర్మం అనేదే లేదసలు. ఇక సత్యమూ ఋజువర్తన దయ - ఇత్యాదుల గురించి మాట్లాడాలా? వాటివి పెట్టుకున్నందుకుకదూ నువ్వు రాజ్యం కోల్పోయింది.

నాస్తి ధర్మః కుతస్సత్యం నార్జవం నానృశంసతా ।
యత్ర త్వం ధర్మపరమః స్వరాజ్యాదవరోపితః ॥ (26 - 50)

హరిశ్చంద్రుడు వేడిగా నిట్టూర్చాడు. తాను చండాలత్వం ఎలా పొందిందీ వివరించాడు. రోహితుడు ఎలా మరణించిందీ అడిగి తెలుసుకున్నాడు. ఇద్దరూ కొడుకును ఆలింగనం చేసుకుంటూ పిచ్చిపట్టినవాళ్ళలా ముద్దుల్లో ముంచేశారు. కాసేపటికి తేరుకున్నారు. కర్తవ్యం గుర్తుచేసింది మహారాజ్ఞి.

మహారాజా ! చండాలుడి ఆజ్ఞను నిర్వర్తించు. ఇదిగో నీ యెట్టయెదుట కూర్చున్నాను. నా శిరస్సు ఖండించు. స్వామిద్రోహమూ అసత్యమూ నీకు అంటకుండుగాక ! లే. ఖండించు.



దేవీ ! ఇంత నిష్ఠురవాక్యాలు ఎలా పలకగలిగావు ? పలకడానికే అశక్యమైన పనిని నేను ఎలా చెయ్యను ?

> కథం ప్రియే త్వయా ప్రోక్తం వచనం త్వతినిష్ఠురమ్ ।
> యదశక్యం భవేద్వక్తుం తత్కర్మ క్రియతే కథమ్ ॥ (26 - 57)

మహారాజా ! నిరంతరం నిష్ఠతో గౌరీదేవిని అర్చించాను. దేవబ్రాహ్మణపూజలు నిర్వహించాను. వీటికి ఏదైనా ఫలమంటూ ఉంటే, వచ్చే జన్మలోకూడా నువ్వే నాకు భర్తవు కావాలి.

దేవీ ! ఈ దుఃఖాలు ఇక నేను భరించలేను. ప్రాణాలు తీసుకుందామంటే నామీద నాకే అధికారం లేదు. చండాలుడి అనుమతితో అగ్నిలో దూకుతాను. లేకపోతే పునర్జన్మకూడా ఇదే కావచ్చు నరకం వస్తే రానీ. ఇంతకన్నా అదే నయం. పుత్రుడి చితాగ్నిలోనే నేనూ మరణిస్తాను. నన్ను క్షమించు. దయచేసి అడ్డుచెప్పకు. నువ్వువెంటనే బయలుదేరి బ్రాహ్మణుడి ఇంటికి వెళ్ళిపో. నేనేమైనా దానాలూ ధర్మాలూ చేసి ఉంటే పరలోకంలో మళ్ళీ మనం ముగ్గురం కలుసుకుందాం. మహారాజ్ఞిని అనే అహంభావంతో ఆ బ్రాహ్మణుడిని ధిక్కరించుకుసుమా ! అధికారి అంటే దేవుడితో సమానం. సర్వాత్మనా సేవించి సంతోషపెట్టాలి.

> రాజపత్నీతి గర్వేణ నావజ్ఞేయః స మే ద్విజః ।
> సర్వయత్నేన తోష్యః స్యాత్ స్వామీ దైవవచ్ఛుభే ॥ (26 - 71)

మహారాజర్షీ ! నేనూ నీతోపాటు పుత్రచితాగ్నిలోనే ప్రవేశిస్తాను. కష్టాలు భరించి భరించి అలిసిపోయాను. ఇక నావల్ల కాదు. నీతోపాటు మరణించడమే నాకు శ్రేయోదాయకం. అసలింక మనం ఎవరికోసం బతకాలి. స్వర్గమో నరకమో కలిసే అనుభవిద్దాం. పద, చితిపేర్చుకుందాం - అంది. హరిశ్చంద్రుడు మారు మాట్లాడలేదు. మౌనంగా అంగీకరించాడు. ***(అధ్యాయం - 26, శ్లోకాలు - 74)***

## ◆ హరిశ్చంద్రుడికి బ్రహ్మాదిదేవతలు ప్రత్యక్షమవ్వడం ◆

చీకటికి అలవాటుపడ్డాయి కళ్ళు. శ్మశానంలో సగం కాలి ఆరిపోయిన కట్టెల్ని పోగుచేసి చితిపేర్చారు. హరిశ్చంద్రుడు తనయుణ్ణి ఎత్తుకుని తెచ్చి దానిమీద పడుకోబెట్టాడు. ఇద్దరూ చేరువగా నిలబడ్డారు. చేతులు జోడించి కళ్ళు మూసుకుని పరమేశ్వరిని ధ్యానించారు. శతాక్షీ ! జగదీశ్వరీ ! పంచకోశాంతరగతా ! పుచ్ఛబ్రహ్మస్వరూపిణీ ! రక్తాంబరపరీధానా ! కరుణారససాగరా ! నానాయుధధరా ! అంబా ! జగత్పాలనతత్పరా ! కరుణించు తల్లీ ! తెలిసిగానీ తెలియకగానీ చేసిన అపరాధాలన్నీ క్షమించు మాతా !



ఇలా ప్రార్థిస్తూండగానే ఇంద్రాది సకలదేవతలూ ప్రత్యక్షమయ్యారు. యమధర్మరాజు వారికి అగ్రభాగాన నిలిచాడు. ముందుగా బ్రహ్మదేవుడు పలకరించాడు.

మహారాజా ! హరిశ్చంద్రా ! కళ్ళు తెరు. నేను పితామహుణ్ణి. ఇడిగో యమధర్మరాజు. స్వయంగా వచ్చాడు. సకలదేవతలూ విచ్చేశారు. ధర్మమార్గాన విశ్వత్రయంతో మైత్రి కోరుకునే విశ్వామిత్రుడూ వచ్చాడు. ఒక్కసారి కళ్ళు తెరిచి మమ్మల్ని అందరినీ తిలకించు - అన్నాడు మృదువుగా. రాజదంపతులు కళ్ళుతెరిచి చూశారు. నివ్వెరపోయి నిశ్చేష్టులై నిలబడ్డారు.

భూజానీ ! నేను ధర్మరాజును. నిన్ను దర్శించడానికి వచ్చాను. ఓరిమీ నిగ్రహమూ సాత్త్వికత మొదలైన నీ సద్గుణాలకు సంతోషించాను.

చక్రవర్తీ ! నేను ఇంద్రుణ్ణి. సత్యనిష్ఠతో మీరు త్రిలోకాలనూ జయించారు. మిమ్మల్ని ఈ దివ్యవిమానంమీద త్రిదివానికి తీసుకువెడదామని వచ్చాను. ఎవరికీ అందని స్వర్గాన్ని మీరు సద్గుణాలతో సత్కర్మలతో స్వాధీనం చేసుకున్నారు. అని తన సంతోషాన్ని ప్రకటిస్తూ చితిమీద అమృతవర్షం కురిపించాడు. దానితోనే పారిజాతసుమవృష్టి కురిసింది. దేవదుందుభులు మ్రోగాయి. రోహితుడు సజీవుడై లేచి కూర్చున్నాడు. చితినుంచి దూకి తల్లిదండ్రులను కౌగిలించుకున్నాడు. ముగ్గురూ దివ్యమాల్య దివ్యాభరణ దివ్యవస్త్ర దివ్యరూప విరాజితులయ్యారు.

చక్రవర్తీ ! రండి. విమానం అధిరోహించండి. స్వర్గానికి వెడదాం - అన్నాడు. దేవేంద్రా నాకిప్పుడు ప్రభువు ఒక శ్వపచుడు. నేను అతడికి అమ్ముడుపోయిన దాసుణ్ణి. అతడి అనుమతిలేకండా ఎక్కడికీ రాలేను - అని హరిశ్చంద్రుడు సున్నితంగా తిరస్కరించాడు. అప్పుడు యమధర్మరాజు నవ్వుతూ - మహారాజా ! నేనే ఆ చండాలుడిని. ఇదంతా మాయాకల్పన. చుట్టూ పరిశీలించి చూడు. ఇప్పుడు నువ్వున్నది శ్మశానమే కాదు. ఏదీ ఆ గుడిసె ఎక్కడ ! అంతా నా మాయ. వట్టి కల్పన - అన్నాడు.

చక్రవర్తీ ! విషయం అర్థమయ్యిందికదూ ! ఇంక విమానం అధిరోహిస్తారా ? మీ పుణ్యాలకు ఫలంగా స్వర్గసుఖాలు ఎదురుచూస్తున్నాయి.

దేవేంద్రా ! నీ సౌమనస్యానికి ధన్యవాదాలు. నాది ఒక విన్నపం. నా కోసల ప్రజలు ఎలా ఉన్నారో ? నా కోసం ఎంతగా పరితపిస్తున్నారో ? వాళ్ళని దిక్కులేనివాళ్ళను చేసి నేను స్వర్గానికి రావడం భావ్యమా ? భక్తుల్నీ అనురక్తుల్నీ విడిచిపెట్టడం బ్రహ్మహత్యా సురాపాన గోవధ స్త్రీవధలతో సమానమైన మహాపాపం. అందుచేత వాళ్ళు లేనిది స్వర్గమైనా నాకు వద్దు. వాళ్ళతోనైతే నరకానికైనా వస్తాను.



బ్రహ్మహత్యా సురాపానం గోవధః స్త్రీవధస్తథా ।
తుల్యమేభిర్మహత్పాపం భక్తత్యాగాదుదాహృతమ్ ॥ (27 - 22)
యది తే సహితాః స్వర్గం మయా యాంతి సురేశ్వర ।
తతోఽహమపి యాస్యామి నరకం వాపి త్రైస్పహ ॥ (27 - 24)

హరిశ్చంద్రా ! నీ హృదయం అవగతమయ్యింది. నీ కోరిక తీర్చడానికి అభ్యంతరంలేదు. కాని వాళ్ళవాళ్ళ పుణ్యపాపాలు వేరువేరుగా ఉన్నాయి. ఒక్కొక్కరిదీ ఒక్కొక్క చరిత్ర. అందరూ నీతోపాటే సామూహికంగా స్వర్గసుఖాలు అనుభవించాలి అనడం సమంజసం కాదు. ఎవరికి ఏదో నిర్ణయించడానికి అర్హతలే కొలబద్దలు. అందుచేత అందరికీ స్వర్గమంటే ఎలాగా ? అని సంశయం వెలిబుచ్చాడు ఇంద్రుడు.

దేవేంద్రా ! ప్రజల ప్రభావంవల్లనే రాజు రాజ్యభోగాలు అనుభవిస్తాడు. యజ్ఞయాగాలూ దానధర్మాలూ ఏవి చేసినా వారి సహాయంతోనే వారి ప్రభావంతోనే. నాకు ఇవ్వేళ దక్కుతున్న పుణ్యఫలానికి కారణం ప్రజలు. అందుచేత వారిని విడిచిపెట్టి నేను స్వర్గానికి రాను. రాలేను. నేను చేసుకున్న పుణ్యం తపస్సు ఏది ఏ కొంచెం ఉన్నా దాన్ని వారితో కలిసి అనుభవించడమే నా అభిమతం. నేను చేసిన సత్కార్యాలకు ఫలంగా స్వర్గలోకంలో బహుకాలం నివసించే అవకాశం లభిస్తే దాన్ని ప్రజలతో పంచుకోవడంవల్ల అది ఒకరోజుకు తగ్గిపోయినా నాకు సమ్మతమే. సంతోషమే. దయచేసి నా కోరికను మన్నించు.

భుంక్తే శక్ర నృపో రాజ్యం ప్రభావాత్ప్రకృతేః ధ్రువమ్ ।
యజతే చ మహాయజ్ఞైః కర్మపూర్తం కరోతి చ ॥
తచ్చ తేషాం ప్రభావేణ మయా సర్వమనుష్ఠితమ్ ।
తస్మాద్యన్మమ దేవేశ కించిదస్తి సుచేష్టితమ్
దత్తమిష్టమథో జప్తం సామాన్యం తై స్తదస్తు నః ॥
బహుకాలోపభోజ్యం చ ఫలం యన్మమ కర్మగమ్ ।
తదస్తు దివమప్యేకం త్రైస్సమం త్వత్ప్రసాదతః ॥ (27 - 26, 27, 28, 29)

హరిశ్చంద్రుడి యుక్తిని దేవేంద్రుడు కాదనలేకపోయాడు. సరే అని అంగీకరించాడు. అందరూ కలిపి అయోధ్య చేరుకున్నారు. చాతుర్వర్ణ్యాలూ గుమికూడాయి. హరిశ్చంద్రుణ్ణి చూసి కేరింతలు కొట్టారు.



ప్రజలారా ! స్వర్గలోకానికి తీసుకువెడతాను రండి. అతిదుర్లభమైన లోకం అది. ధర్మాన్ని పాటించినందుకు ఫలంగా లభిస్తోంది. త్వరగా తెమిలి రండి - అన్నాడు ఇంద్రుడు. హరిశ్చంద్రుడు కూడా ప్రజలను అలాగే కోరాడు.

ప్రజలంతా ఆశ్చర్యచకితులూ ఆనందపరవశులూ అయ్యారు. సంసారబంధాలలో కొట్టుకుంటున్న ప్రజానీకం పుత్రమిత్రబాంధవ సహితంగా స్వర్గానికి వెళ్ళడమంటే సంబరపడ్డారు. అనూహ్యమైన ఆనందానికి లోనయ్యారు. అందరూ ఉన్నవాళ్ళు ఉన్నట్టు దివ్యవిమానం అధిరోహించారు. అధిరోహించడంతోనే అందరివీ దివ్యరూపాలు అయిపోయాయి.

హరిశ్చంద్రుడు అయోధ్యాసింహాసనం మీద అభిషేకించి రోహితుణ్ణి కూర్చోబెట్టాడు. ప్రజలనూ మంత్రులనూ సామంతులనూ యథార్హంగా సత్కరించాడు. అందరి దగ్గరా ఆప్యాయంగా సెలవు తీసుకుని దివ్యవిమానం అధిరోహించాడు. ఇంద్రుడి సరసన కూర్చున్నాడు. కామగమనశక్తి కలిగిన ఆ సుందరవిమానం చిరుగంటల చప్పుడు చేస్తూ ఆకాశంలోకి దూసుకువెళ్ళింది.

అప్పుడు సర్వశాస్త్రార్థవేత్త శుక్రాచార్యుడు ఒక శ్లోకమంత్రాన్ని చెప్పాడు. ఆహా ! ఏమి ఓరిమి గొప్పదనం ! ఆహా ! ఏమి దానఫలమాహాత్మ్యం ! హరిశ్చంద్రుడు ఇంద్రలోకానికి వచ్చాడు. సాధు, సాధు - అన్నాడు.

అహో తితిక్షామాహాత్మ్యమ్ అహో దానఫలం మహత్ ।
యదాగతో హరిశ్చంద్రో మహేంద్రస్య సలోకతామ్ ॥ (27 -40)

శౌనకాది మహామునులారా ! వ్యాసభగవానుడు జనమేజయుడికి సూర్యవంశచరిత్రలో భాగంగా చెప్పిన హరిశ్చంద్రుడి కథను మీకు నేను యథాతథంగా విన్నవించాను. దీనిని శ్రద్ధగా విన్నవాళ్ళకు దుఃఖాలూ కష్టాలూ తొలగిపోయి సుఖాలూ ఆనందాలూ లభిస్తాయి. స్వర్గవాంఛతో సహా సకలవాంఛలూ నెరవేరతాయి. సంతానార్థులకు సంతానం కలుగుతుంది. భార్యార్థులకు గుణరూపశీలవతి భార్యగా లభిస్తుంది. రాజ్యార్థులకు రాజ్యం దొరుకుతుంది - అంటూ ఫలశ్రుతి పలికాడు సూతమహర్షి.

*(అధ్యాయం - 27, శ్లోకాలు - 42)*

కథ అంతావిని ఆనందపరవశుడైన జనమేజయుడు కొంతసేపటికి తేరుకున్నాడు. వ్యాసమహర్షీ ! హరిశ్చంద్రుడి కథ అద్భుతావహంగా ఉంది. ఇందులో ఆ మహారాజు జగదీశ్వరీభక్తుడన్నావు. శతాక్షీపాదభక్తుడన్నావు. అమ్మవారు శతాక్షి ఎప్పుడయ్యింది ? ఎలా అయ్యింది ? ఆ వృత్తాంతం చెప్పి నా జన్మను సార్థకం చెయ్యి. అమ్మవారి గుణాలను ఎంతవిన్నా తనివితీరదుకదా ! ఒక్కొక్క పదమూ ఒక్కొక్క అశ్వమేధఫలాన్ని ఇస్తుంది.



కోహి దేవ్యా గుణాన్ శృణ్వన్ తృప్తిం యాస్యతి శుద్ధధీః ।
పదే పదేఽశ్వమేధస్య ఫలమక్షయ్యమశ్నుతే ॥ (28 - 3)

జనమేజయా ! శుభప్రదమైన శతాక్షీసంభవగాథను చెబుతున్నాను. ఆలకించు - అంటూ వ్యాసుడు అరంభించాడు.

## ◆ మహాదేవి - శతాక్షి, శాకంభరి ◆

పూర్వకాలంలో దుర్గముడు అనే మహాదైత్యుడు ఉండేవాడు. హిరణ్యాక్షుడి వంశంలో రురుడనేవాడికి పుత్రుడుగా జన్మించాడు. వీడు అతిదారుణుడు. పరమనీచుడు. ఖలుడు. దేవతల బలమంతా వేదాలపై ఆధారపడి ఉంది. వాటిని గనక నాశనం చెయ్యగలిగితే సురలనందరినీ నాశనం చేసినట్టే అని ఆలోచించి హిమాలయాలకు వెళ్ళి బ్రహ్మదేవుణ్ణి గురించి ఘోరతపస్సు చేశాడు. వెయ్యి సంవత్సరాలు తపస్సు చేశాడు. ఆ తపస్సు తాలూకు తేజస్సుకి లోకాలు గడగడలాడాయి. బ్రహ్మదేవుడు ప్రసన్నుడై హంసవాహనంమీద వచ్చి దర్శనమిచ్చాడు. కావలసిన వరం కోరుకోమన్నాడు. అవకాశం దొరికిందే తడవుగా వాడు - వేదాలనూ, ఈ ముల్లోకాలలోనూ ఉన్న బ్రాహ్మణులకు తెలిసిన సర్వమంత్రాలనూ తనకు స్వాధీనం చెయ్యమనీ, దేవతలను జయించే బలం ఇమ్మనీ కోరాడు. తథాస్తు అని చతుర్ముఖుడు వెళ్ళిపోయాడు.

ఆ క్షణంనుంచీ వేదాలు విప్రులకు దూరమయ్యాయి. ఎవరికీ ఏ మంత్రమూ స్ఫురించడం లేదు. సంధ్యావందనాలూ, నిత్యహోమాలూ యజ్ఞజపాదులూ అన్నీ ఆగిపోయాయి. ఏమిటిది ? ఎందుకిలా జరిగింది ? అని వేదపండితులు పరస్పరం పశ్నించుకోవడమే మిగిలింది. హాహాకారాలు తప్ప స్వాహాకారాలు వినిపించడంలేదు. వేదాలు విస్మృతికి వెళ్ళిపోయాయి, ఇప్పుడు ఏమి చెయ్యాలి ? ఏది దారి ? ఏమీ తెలియని గందరగోళం భూగోళమంతటా అలముకుంది.

యజ్ఞాలు లేకపోవడంతో హవిర్భాగాలు అందక నిర్జరులు ముసలివాళ్ళు అయిపోయారు. నీరసపడ్డారు. ఇదే అదను అనుకొని దుర్గముడు అమరావతిని ముట్టడించాడు. వాడిది వజ్రదేహం. ఇంద్రాదిదేవతలంతా వొడిలివొత్తులై ఉన్నారు. ఎదిరించలేక పలాయనం చిత్తగించారు. కొండలకూ కోనలకూ పారిపోయి తలదాచుకున్నారు. పరాశక్తి జగన్మాతను అర్చించారు.

హోమాలు జరగకపోవడంవల్ల వర్షాలు కురవలేదు. నేల అంతటా ఎండి బీటలు తీసింది. మహాసముద్రాల్లాంటి చెరువులు ఎండిపోయాయి. నూతులలో తడి అన్నది లేదు. నదీనదాలలో నీటిచుక్క లేదు. దిగుడు బావులలో తేమ అయినా లేదు. ఈ అనావృష్టి నూరేళ్ళు కొనసాగింది. జంతువులూ పక్షులే కాదు మనుష్యులుకూడా వేల సంఖ్యలో మరణించారు. ఇంటింటా శవాలు. ఊరూరా కళేబరాల గుట్టలు.



బ్రాహ్మణులకు ఏమి చెయ్యాలో తోచలేదు. అందరూ కూడబలుక్కుని హిమాలయాలకు వెళ్ళారు. పరమేశ్వరిని ఆరాధించారు. నిత్యమూ స్తుతించారు. నిరాహారులై జగన్మాత పాదాలనే శరణువేడారు. మహేశానీ ! పామర జనాన్ని దయచూడు. సర్వాపరాధాలూ చేశారు. అయినా నీ బిడ్డలు. కన్నతల్లివి నీకు ఇంతటి కోపమయితే ఎలా తల్లీ ! ? సర్వాంతర్యామినీ ! కోపం ఉపసంహరించు. నువ్వు ఎలా నడిపిస్తే అలా నడిచే అమాయికులను ఇలా శిక్షించడం న్యాయమా ? నువ్వు తప్ప మరి దిక్కులేని జనం. సర్వసమర్థురాలివి నువ్వు. ఈ సంకటంనుంచి తప్పించు. జీవనం (నీరు) లేకపోతే మాకు జీవితం లేదు. స్థితి లేదు. అనుగ్రహించు జగదంబికా ! అనుగ్రహించు. అనంతకోటి బ్రహ్మాండనాయికా ! నమోనమః . కూటస్వరూపా ! చిద్రూపా ! వేదాంతవేద్యా ! భువనేశీ ! నమోనమః. నేతినేతి వాక్యాలతో సకలాగమాలూ నిన్నే బోధిస్తున్నాయి. నువ్వు సర్వకారణురాలివి. దయ చూపించు అంబికా ! అంటూ ప్రార్థించారు.

బ్రాహ్మణుల ప్రార్థనలకు సంతోషించిన పార్వతీమాత అనంతాక్షిమయంగా తన రూపాన్ని చూపించింది. కాటుక కొండలాంటి శరీరం. కాటుక దిద్దిన కన్నులు. బలిష్ఠమూ ఉన్నతమూ కర్కశమూ అయిన గుండ్రని వక్షఃస్థలం. మహాధనుస్సు మొదలైన ఆయుధాలతోపాటు ఫలపుష్ప వనమూలికాశాకాదులను ధరించిన అనంత హస్తాలు. ఆకలిదప్పులను తీర్చే అమృతహస్తాలు. ఆ రూపం సర్వసౌందర్యసారంగా ఉంది. లావణ్యం తొణికిసలాడుతోంది. కోటిసూర్యసమప్రకాశంగా ఉంది. కరుణారస సముద్రం ఆవిర్భవించినట్టుంది.

అమ్మవారి అనంతనయనాల నుంచి లోకాలన్నింటా ధారలుగా వర్షం కురిసింది. కుంభవృష్టి. నవరాత్రాలు కురిసింది. దుఃఖిస్తున్న ప్రజలను చూసి ఆ తల్లి అనంతనయనాలు ఇలా వర్షించాయి. లోకాలు సంతోషించాయి. ఓషధులు పులకించాయి. నదీనదాలూ వాపీకూపతటాకాలూ గిర్రున నిండాయి.

మోచయామాస లోకేషు వారిధారాః సహస్రశః ।
నవరాత్రం మహావృష్టిరభూన్నేత్రోద్భవైర్జలైః ॥
దుఃఖితాన్ వీక్ష్య సకలాన్నేత్రాశ్రూణి విముంచతీ ।
తర్పితాస్తేన తే లోకా ఓషధ్యస్సకలా అపి ॥ (28 - 38, 39)

కొండల్లో కోనల్లో దాక్కున్న దేవతలందరూ వెలుపలికి వచ్చారు. విప్రులతో గొంతుకలిపి శ్రీమాతను స్తుతించారు.

నమో వేదాంతవేద్యే తే నమో బ్రహ్మస్వరూపిణి ।
స్వమాయయా సర్వజగద్విధాత్ర్యై నమో నమః ॥ (28 - 41)



భక్తకల్పద్రుమే దేవి భక్తార్థం దేహధారిణి ।
నిత్యతృప్తే నిరుపమే భువనేశ్వరి తే నమః ॥
అస్మచ్ఛాంత్యర్థమతులం లోచనానాం సహస్రకమ్ ।
త్వయా యతో ధృతం దేవి శతాక్షీ త్వం తతో భవ ॥
క్షుధయా పీడితా మాతః స్తోతుం శక్తిర్న చాస్తి నః ।
కృపాం కురు మహేశాని వేదానప్యాహరాంబికే ॥ (28 - 41 నుంచి 45)

వేదవేదాంతవేద్యా ! బ్రహ్మస్వరూపిణీ ! నీ మాయతో జగత్త్రయాన్నీ సృష్టించావు. భక్తులపాలిట కల్పవృక్షానివి. భక్తులకోసమే ఏదో ఒక రూపం ధరిస్తూ ఉంటావు. నీది నిత్యతృప్తి. నువ్వు నిరుపమాన్వ భువనేశ్వరివి. మా కష్టాలను శాంతింపజెయ్యడానికి వెయ్యికన్నులతో ఆవిర్భవించావు. కాబట్టి నిన్ను ఈ రోజునుంచీ "శతాక్షి" అని స్తుతించుకుంటాం. తిండిలేక నీరసపడ్డాం. తల్లీ ! నిజానికిప్పుడు నిన్ను స్తుతించే ఓపికకూడా లేదు. దయచూడు తల్లీ ! ఆ దుర్గమరాక్షసుడి నుంచి వేదాలనుకూడా ఆహరించి తెచ్చి రక్షించు మాతా !

జగన్మాత మనస్సు ఆనందపరవశమయ్యింది. చేతులలో ఉన్న కాయలూ పళ్ళూ అందరికీ పంచింది. పశుపక్ష్యాదులకు కావలసిన ఆహారాలను అందించింది. జనమేజయా ! అప్పటినుంచీ శాకంభరి అనే పేరు ఏర్పడింది.

## ◆ దుర్గమాసురనాశిని ◆

సురనరాదిప్రాణికోటి ఆహారం అందుకొంటున్న కోలాహలం దుర్గమరాక్షసుడికి వినిపించింది. ఏమిటో తెలుసుకురమ్మని దూతలను పంపించాడు. వారు తిరిగి వచ్చి చూసిందంతా వివరంగా చెప్పారు. దుర్గముడు సాయుధుడై సైన్యంతో బయలుదేరాడు. త్వరాన్వితుడై వచ్చి శరాలను గుప్పించాడు. దేవసైన్యం ఎదిరించి పోరాడింది. విప్ర సమూహంకూడా యథాశక్తిగా యుద్ధంలో పాల్గొంది. కానీ రాక్షసమహావీరుల ధాటికి దేవమానవ సమూహాలు తట్టుకోలేకపోయాయి. హాహాకారాలు మిన్నుముట్టాయి. త్రాహి త్రాహి అంటున్నారు అందరూ. జగన్మాత గమనించింది. తేజోమయమైన రక్షణ చక్రం దేవమానవులచుట్టూ కల్పించింది. తాను వెలుపల నిలబడింది. రాక్షసులు వేసే బాణాలూ విసిరే ఆయుధాలూ వీరిదాకా వచ్చి, గోడకు తగిలినట్టు రాలిపడిపోతున్నాయి. అప్పుడింక జగన్మాత స్వయంగా యుద్ధానికి దిగింది. దేవీదుర్గములకు ద్వంద్వయుద్ధం తీవ్రస్థాయిలో నడిచింది. సూర్యమండలం శరవర్షంలో కప్పబడిపోయింది. ఆయుధాలు ఢీకొని మెరుపులు లేస్తున్నాయి. నిప్పురవ్వలు రాలుతున్నాయి. కఠోరజ్యావల్లీటణత్కారాలతో దిక్కులు పిక్కటిల్లుతున్నాయి.



అంతలోకీ - దేవీ శరీరంనుంచి ఒకేసారి అనేక శక్తి స్వరూపాలు ఆవిర్భవించాయి. కాళిక, ...రిణి, బాల, త్రిపుర, భైరవి, రమ, బగళ, మాతంగి, త్రిపురసుందరి, కామాక్షి, తులజ, జంభిని, మోహిని, ...న్నమస్త, గుహ్యకాళి, దశసహస్రబాహుక - ఇత్యాదిగా అనంతశక్తులు ఆవిర్భవించాయి. అందరి ...తుల్లోనూ వినూతన భీకరాయుధాలు తళతళలాడుతున్నాయి. మృదంగ శంఖ వీణాది వాద్యవిశేషాల ...ందరనాదాలు రణరంగంలో మారుమ్రోగాయి. ఒక్కసారిగా విజృంభించి ఈ అనంతశక్తి స్వరూపాలు ...క్షససైన్యాన్ని రెప్పపాటుకాలంలో మట్టుబెట్టాయి. దుర్గముడు ఒంటరిగా మిగిలాడు. అందరితోనూ ...నే వీరోచితంగా పోరాడుతున్నాడు. పదిరోజులు సాగిన యుద్ధం పదకొండవరోజుకి చేరుకుంది.

దుర్గముడు రక్తమాల్యాంబరధరుడై రక్తచందనానులేపనం పూసుకుని, మహోత్సవం చేసుకుని ...నూతన రథంమీద రణరంగానికి వచ్చాడు. చండప్రచండంగా యుద్ధం చేశాడు. అనంత శక్తులనూ ...యించాడు. మహాదేవి రథానికి ఎదురుగా తన రథాన్ని నిలబెట్టాడు. ఇద్దరికీ ఘోరయుద్ధం జరిగింది. ...ెండు గంటలపాటు ఎడతెరిపిలేకుండా బాణవర్షం కురిసింది. చూస్తున్నవారికి గుండెలు జారిపోయాయి.

జగదీశ్వరి ఒక్కసారిగా పదిహేను బాణాలను గుప్పించింది. దుర్గముడు కేవలం నాలుగే బాణాలతో వాటిని తుత్తునియలు చేసి తన లాఘవాన్ని నిరూపించుకున్నాడు. మహాదేవి మహోగ్రు రాలయ్యింది. నాలుగు బాణాలతో వాడి రథాశ్వాలను నాలిగింటినీ సంహరించి, ఒక బాణంతో సారిథిని కూల్చి, రెండు శరాలతో దుర్గముడి కన్నులు పొడిచి, మరో రెండింటితో బాహువులు నరికి, ఇంకొక్క బాణంలో రథకేతనాన్ని నేలకు కూల్చింది. వెంటనే అయిదు బాణాలను సంధించి ఆ రాక్షసుడి గుండెను చీల్చివేసింది. ఇదంతా కన్ను మూసి తెరిచేలోగా జరిగిపోయింది. దుర్గముడు నెత్తురు కక్కుకుంటూ రథంలో కూలబడి కిందికి దొర్లిపడ్డాడు. అతడి ప్రాణాలు అనంతవాయువుల్లో కలిసిపోయాయి. అతడి శరీరంనుంచి ఒక తేజస్సు ఈవలికి వచ్చి మహాదేవిలో ప్రవేశించింది.

> తతో వమన్ రుధిరం మమారపుర ఈశితుః ।
> తస్య తేజస్తు నిర్గత్య దేవీరూపే వివేశ హ ॥ (28 - 66)

దుర్గముడి మరణంతో ముల్లోకాలూ శాంతిని పొందాయి. దేవతలు ఆనందనృత్యం చేశారు. బ్రహ్మదేవుణ్ణి అగ్రభాగాన నిలుపుకుని హరిహరులు గద్గదఖిన్నకంఠులై పరమేశ్వరిని స్తుతించారు.

> నమః శాకంభరి శివే నమస్తే శతలోచనే ।
> సర్వోపనిషదుద్ఘుష్టే దుర్గమాసురనాశిని ॥ (28 - 70)



శాకాంభరీ! శివా! శతలోచనా! సకలోపనిషత్ప్రపంచితా! దుర్గమాసురనాశినీ ! మాయేశ్వరీ! పంచకోశాంతరస్థితా! నిర్వికల్పసమాధితో మునీశ్వరులు నిన్ను ధ్యానిస్తారు. నువ్వు ఓంకారానివి. అనంతకోటి బ్రహ్మాండజననివి. దివ్యమంగళవిగ్రహవు. త్రిమూర్తులమైన మాతో సహా సకలదేవతలకూ సృష్టి జనయిత్రివి. అమ్మా! భక్తిప్రపత్తులతో నమస్కరిస్తున్నాం. వర్షాలు లేక ఆహారందొరకక ఆకలితో అలమటిస్తున్న పామరులను చూసి నువ్వుకాక మరింకెవరైనా గుండెకరిగి రోదించారా? నువ్వు దయామయివి. శతాక్షివి. పరమేశ్వరివి. నమోనమః - నమోనమః.

క: కుర్యాత్ పామరాన్ దృష్ట్వా రోదనం సకలేశ్వర: ।
సదయాం పరమేశానీం శతాక్షీం మాతరం వినా ॥ (28-73)

స్తుతించి జగన్మాతను పుష్పరాశులతో పూజించారు. సంతుష్టురాలయ్యింది.ఉగ్రరూపం క్రమక్రమంగా ప్రసన్నతను సంతరించుకుంది. దుర్గముడి నుంచి తనలోకి తేజోరూపంలో ప్రవేశించిన వేదాలను బ్రాహ్మణులకు అందించింది. కోకిలాలాప మధురంగా పలికింది.

దేవబ్రాహ్మణులారా ! ఈ నా రూపం పరమోత్కృష్టమైనది. విశేషశ్రద్ధతో రక్షించండి. ఇది లేకపోతే ఏమవుతుందో చూశారుగదా ! మీరంతా ఇతోఽధిక భక్తిశ్రద్ధలతో నన్ను పూజించండి. నిరంతరం సేవించండి. ఇంతకన్నా నేను చెప్పే శుభప్రసంగం ఏమీ లేదు. నా మాహాత్మ్యాన్ని తెలియజెప్పే గ్రంథాలలోకెల్లా ఇది ఉత్తమోత్తమం. నిత్యం పఠించండి. పారాయణ చెయ్యండి. అది అన్ని పూజలకన్నా హోమాలకన్నా మిన్నగా నన్ను సంతోషపెడుతుంది. ఆ సంతుష్టితో మీ ఆపదలనన్నింటినీ తొలగిస్తాను. దుర్గమాసురుణ్ణి సంహరించాను కనక దుర్గను. సానుభూతితో సహస్రనయనాల నుంచి వర్షధారలు కురిపించాను కాబట్టి శతాక్షిని. ఈ రెండు నామధేయాలలోనూ ఉన్న తత్త్వాన్ని గ్రహించి జపించినవారు మాయావరణాన్ని ఛేదించుకుని ముక్తి పొందుతారు. సారాంశంగా ఒక్కమాట చెబుతున్నాను. ఆలకించండి. సురాసురులకు అన్ని వేళలా సంసేవ్యను నేనుమాత్రమే.

దుర్గమాసురసంహంత్రీత్వాత్ దుర్గేతి మమ నామ య: ।
గృహ్ణాతి చ శతాక్షీతి మాయాం భిత్త్వా వ్రజత్యసౌ ॥
కిముక్తేనాత్ర బహునా సారం వక్ష్యామి తత్త్వత: ।
సంసేవ్యాహం సదా దేవా: సర్వైరపి సురాసురై: ॥ (28 - 80)

అని ప్రకటించి శతాక్షి అంతర్హిత అయ్యింది. ఇలా దేవి దేవతలకూ మానవులకూ కష్టాలు తొలగించి సంతోషాలు కలిగిస్తూ ఉంటుంది. జనమేజయా ! అతిరహస్యమైన పరాశక్తిమహత్త్వాన్ని నీకు ఉపదేశించాను.



కల్యాణకారకమైన ఈ రహస్యతత్త్వాన్ని జాగరూకుడవై కాపాడాలిసుమా ! ఈ కథను విన్నవారూ భక్తితత్పరులై పఠించినవారూ కోరికలు తీరి దేవీలోకంలో విరాజిల్లుతారు. **(అధ్యాయం - 28, శ్లోకాలు - 82).**

జనమేజయా ! ఇది సూర్యవంశపు రాజుల చరిత్ర. చంద్రవంశంలోనూ ఇలాగే దేవీ భక్తితత్పరులైన మహారాజులున్నారు. సృష్టిలో - విభూతిమంతమూ శ్రీమంతమూ ఊర్జితమూ అయిన ప్రతిసత్త్వమూ (ప్రాణి) పరాశక్తి అంశసంభవమే అని తెలుసుకో.

యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జితమేవ చ ।
తత్తదేవావగచ్ఛ త్వం పరాశక్త్యంశ సంభవమ్ ॥ (29 -3)

వీరే కాదు పరాశక్తి ఉపాసకులైన తక్కిన రాజులు అందరూకూడా సంసారతరుమూలానికి కుఠారాలే (గొడ్డళ్ళు). అందుచేత సర్వాత్మనా భువనేశ్వరిని సేవించాలి. శాకాహారి మాంసాన్ని వదిలేసినట్టు తక్కిన దేవతలను పరిత్యజించాలి. వేదశాస్త్రాలు అనే క్షీరసముద్రాన్ని మథిస్తే నాకు దొరికిన ఏకైక రత్నం - పరాశక్తి పాదపద్మం. దీనితో నేను ధన్యుణ్ణి అయ్యాను. ఓతమూ ప్రోతమూ అన్నీ ఆ శక్తియే. ఆ శక్తిని తెలుసుకోకుండా ఎవడూ ముక్తిని పొందలేడు. తెలుసుకున్నవారికి దుఃఖాలన్నీ తొలగిపోతాయి. సిగ్గుతో కానీ, భయంతోకానీ, భక్తితో కానీ, ప్రేమయుక్తితో కానీ - సర్వసంగపరిత్యాగులై మనస్సును నిగ్రహించుకుని ప్రయత్నపూర్వకంగా దేవీధ్యానతత్పరులు కావాలి - ఇది వేదాంతడిండిమం. శ్వేతాశ్వతర వేదశాఖ చెబుతున్న మాట. ఏదో ఒక వంకతో, నిద్రలోనో మెలకువలోనో, నడుస్తున్నప్పుడో కూర్చున్నప్పుడో - ఎల్లవేళలా పరాంబికను ధ్యానించాలి, కీర్తించాలి. సంసారబంధాల నుంచి విముక్తి లభిస్తుంది. అందుకని మహారాజా ! నువ్వుకూడా మహేశ్వరిని ఉపాసించు. ముందుగా విరాడ్రూపను తరవాత సూత్రరూపను ఆటుపైని అంతర్యామి రూపిణిని సోపానక్రమంలో ఉపాసిస్తే అంతశ్శుద్ధి ఏర్పడుతుంది. అది ఏర్పడ్డాక - సచ్చిదానంద లక్ష్యార్థరూపిణి బ్రహ్మస్వరూపిణి ప్రపంచోల్లాసవర్జిత అయిన పరాశక్తిని ఉపాసించాలి. ఆ పరాశక్తిలో చిత్తాన్ని లయంచెయ్యడమే ఆరాధన అంటేను. తెలిసిందా ? ఇప్పుడింకా ఏమేమి వినాలనుకుంటున్నావో చెప్పు - అన్నాడు వ్యాసభగవానుడు. వెంటనే జనమేజయుడు అందుకున్నాడు -

సాత్యవతేయా ! గౌరి లక్ష్మి సరస్వతి అనే ముగ్గురు కన్యకలను జగదంబిక త్రిమూర్తులకు ఇచ్చింది అన్నావు. హిమవంతుడి కూతురిగా గౌరీదేవి కథ తెలుసు. క్షీరసముద్రరాజ తనయగా లక్ష్మీదేవి జగత్ప్రసిద్ధ. నిజానికి వీరిద్దరూ మూలదేవీ సముద్భవలుకదా ! వీరికి కన్యాత్వం ఎలా సంభవించింది ? ఈ సంశయాన్ని నువ్వే ఛేదించాలి - అన్నాడు.

జనమేజయా ! చెబుతున్నాను. ఆలకించు. నిజంగా ఇది మరొక పరమంబైన రహస్యం. అయినా చెబుతున్నాను. దేవీభక్తుడి దగ్గర దాచవలసింది ఏమీ లేదన్నారు. కనక చెబుతున్నాను. విను.



## ◆ హరిహరులకు గర్వభంగం ◆

దేవీత్రయాన్ని దేవత్రయానికి పరాంబిక ఇచ్చింది మొదలు వారు సృష్టికార్యాలను ఆరంభించారు. ఒకానొకప్పుడు హాలాహలులు అనే దైత్యులు మహాబలశాలులు విజృంభించి ముల్లోకాలనూ జయించి స్వాధీనపరుచుకున్నారు. బ్రహ్మదేవుడు ఇచ్చిన వరాలతో దర్పించి అజేయులై కైలాసాన్నీ వైకుంఠాన్నీ ఏకకాలంలో చుట్టుముట్టారు. అటు హరుడూ ఇటు హరీ రణరంగానికి దిగారు. అరవైవేల సంవత్సరాల పాటు ఘోరసంగ్రామం జరిగింది. కట్టకడపటికి ఎట్టకేలకు హరిహరులు జయించారు. హాలాహల రాక్షసులను సంహరించారు. హరుడు కైలాసానికీ, హరి వైకుంఠానికీ క్షేమంగా లాభంగా తిరిగి వచ్చారు. వచ్చి తమ భార్యల ముందు అహంకారం ప్రదర్శించారు - మేమే రాక్షసులను సంహరించామంటూ. నిజానికి వీరి క్షేమంకోరి ఆ రాక్షసులను మట్టుబెట్టింది గౌరీలక్ష్మీదేవులే. అది తెలుసుకోలేక హరిహరులిలా విర్రవీగుతోంటే చూసి వారిద్దరూ అదొక రకంగా - పోదురూ బడాయ్ అన్నట్టు - నవ్వేరు. హరిహరులకు పట్టరానంతకోపం వచ్చింది. ఆదిమాయామోహితులు అయ్యారు. మరింతగా కించపరుస్తూ అవమానిస్తూ ఏవో అనకూడని మాటలు అన్నారు. దురుత్తరం ఇచ్చారు. దానితో అక్కడ గౌరీదేవి, ఇక్కడ లక్ష్మీదేవి - భర్తలను పరిత్యజించి అంతర్హితలయ్యారు. హరిహరులు హాహాకారాలు చేశారు. ఇద్దరూ క్షణంలో నిస్తేజస్కులూ నిశ్శక్తులూ అయిపోయి చైతన్యాన్ని కోల్పోయారు.

> నిస్తేజస్కౌ చ నిశ్శక్తీ విక్షిప్తౌ చ విచేతనౌ ।
> అవమానాత్తయోః శక్త్యోర్జాతౌ హరిహరౌ తదా ॥ (29 - 33)

నిశ్చేతనులై పడిఉన్న హరిహరులను చూసి బ్రహ్మదేవుడు ఇప్పుడు ఏమిటి చెయ్యడమా అని ఆలోచనలో పడ్డాడు. అకారణంగా ఈ దేవతాప్రధానులకు ఇలాంటి దురవస్థ ఎందుకు వచ్చింది ? ఎలా వచ్చింది ? ఏ పాపమూ ఎరగని జగత్తుకి కొంపదీసి ప్రళయం రాదుకదా ! నిమిత్తమేమిటో తెలియకుండా ప్రతిక్రియ ఎలా చెయ్యను ? ఏమిచెయ్యను ? అంతా అగమ్యగోచరంగా ఉందే - అంటూ ఒక్కసారి కళ్ళుమూసుకుని అంతర్దృష్టి సారించాడు. పరాశక్తికి కోపం వచ్చి ఇంత జరిగిందని గ్రహించాడు. హమ్మయ్య, కారణం తెలిసింది అనుకుని స్తిమితపడ్డాడు. హరిహరులు చెయ్యవలసిన ప్రతిక్రియను వారిపక్షాన తాను చెయ్యడానికి సంకల్పించాడు. మను సనక సనందనాదులైన తన పుత్రులను పిలిచాడు.

నాయనలారా ! ఒక పనిమీద మిమ్మల్ని పిలిచాను. తపస్సు చేసి పరాశక్తిని ప్రసన్నురాలిని చేసుకోవలసిన అవసరం ఒకటి ఏర్పడింది. అయితే ప్రస్తుతం నాకు అంతటి ఓపిక లేదు. జగద్భారాన్ని వహిస్తున్నాను కనక తీరికకూడా లేదు. హరిహరులిద్దరూ పరాశక్తి కోపానికి గురి అయ్యారు. అందుచేత పరమభక్తితో మీరంతా అత్యద్భుతమైన తపస్సు చేసి ఆ పరాశక్తిని సంతోషపరచండి. ప్రసన్నురాలిని



చెయ్యండి. హరిహరులను మళ్ళీ మునుపటిలాగా శక్తియుక్తులను చెయ్యండి. మీకు అమోఘమైన యశస్సు లభిస్తుంది. ఆ శక్తిస్వరూపిణులు ఏ వంశంలో జన్మిస్తారో ఆ వంశం మొత్తం జగత్తునే పావనం చేస్తుంది, కృతకృత్యమవుతుంది.

పితామహుడి మాటలు ఆలకించి మను సనక సనందనాదులు తపోదీక్షలు స్వీకరించి ఏకాంత ప్రదేశాలకోసం అడవులకు వెళ్ళిపోయారు. *(అధ్యాయం - 29, శ్లోకాలు 45)*

వారంతా హిమాలయ గిరిశిఖరాలకు చేరుకున్నారు. తలోక ప్రదేశమూ చూసుకున్నారు. మాయాబీజమహామంత్రాన్ని జపిస్తూ తపస్సులకు ఉపక్రమించారు. లక్ష సంవత్సరాలు సాగింది వారి మహాతపస్సు. అప్పటికి దేవి ప్రసన్నురాలై ప్రత్యక్షమయ్యింది. దర్శనం అనుగ్రహించింది. పాశాంకుశవరాభయ హస్తాలతో కరుణారస తరంగితమైన చూపులతో సచ్చిదానందస్వరూపిణి అగుపించింది.

**పాశాంకుశవరాభయచతుర్బాహుస్త్రిలోచనా ।**
**కరుణారససంపూర్ణా సచ్చిదానందరూపిణీ ॥** (30 - 3)

మునీశ్వరులు భక్తిపారవశ్యంతో స్తుతించారు. విశ్వరూపా ! అగ్నిరూపా ! జలరూపా ! సూత్రాత్మశరీరిణీ ! నమోనమః. లింగదేహాలు అన్నీ నీలోనే ఓతప్రోతంగా ఉంటాయి. నువ్వు ప్రజ్ఞాస్వరూపవు. అవ్యాకృతమూర్తివి. ప్రత్యక్స్వరూపవు. బ్రహ్మమూర్తివి. సర్వరూపా ! సర్వలక్షణాత్మమూర్తీ ! నమోనమః - అంటూ స్తుతులు సాగించారు. అందరూ సాష్టాంగపడ్డారు. అమ్మవారు సంతుష్ట అయ్యింది. వీణానాదంలా పలికింది - నేను వరదాయినిని. కోరుకోండి ఏమి కావాలో అంది. హరిహరులను శక్తియుక్తులనూ చైతన్యవంతులనూ చెయ్యమని అందరూ ఏకకంఠంగా అడిగారు.

దక్షుడు ప్రత్యేకంగా ఒకటి కోరాడు. జగదంబికా ! నువ్వు మా ఇంటిలో జన్మించాలి. నా జన్మ చరితార్థం అవ్వాలి. జపమూ ధ్యానమూ పూజ స్థానమూ విధివిధానమూ అన్నీ నీనోటినుంచి విని తెలుసుకోవాలి అనుకుంటున్నాను. దయచేసి అనుగ్రహించు అని అభ్యర్థించాడు.

మునీశ్వరులారా ! హరిహరులు నా శక్తులను (గౌరి - లక్ష్మి) కించపరిచారు. అవమానించారు వారికి ఆ శక్తులను ఇచ్చేటప్పుడే చెప్పాను, అవమానిస్తే ఊరుకోనని. అయినా అవమానించారు అందుకని హరిహరులకు ఈ దురవస్థ వచ్చింది. అటువంటి అపరాధాలు ఇకముందు ఎప్పుడూ ఎవ్వరు చేయకుందురుగాక ! మీరు కోరారు కనక ఈ సారికి హరిహరులను క్షమిస్తున్నాను. స్వస్థత చేకూరుస్తున్నాను లక్ష్మీపార్వతులు ఒకరు క్షీరసాగరంలోనూ ఒకరు దక్షుని ఇంటిలోనూ ఆవిర్భవించి హరిహరులన అందుకుంటారు.



జపమూ ధ్యానమూ గురించి అడిగారు కదూ ! వినండి. మాయాబీజమే మహామంత్రం. అదే నాకు అత్యంత ప్రియకరం. ధ్యానించవలసింది విరాట్ స్వరూపాన్ని. లేదా ఇదిగో మీ ఎదుట ఉన్న ఈ రూపాన్ని. సచ్చిదానందరూపగానైనా ధ్యానించవచ్చు. ఇంక స్థానమంటారా, సర్వజగత్తూ నా స్థానమే. సర్వదా జపించండి. ధ్యానించండి. అర్చించండి - అని ఆజ్ఞాపించి మణిద్వీపాధివాసిని జగదంబిక అంతర్ధానం చెందింది.

మునీశ్వరులు మహోల్లాసంగా చతుర్ముఖుణ్ణి చేరుకున్నారు. జరిగినదంతా వివరంగా చెప్పారు. పితామహుడు సంతోషించాడు.

తరవాత కొంతకాలానికి దక్షప్రజాపతి ఇంటిలో మహాశక్తి జన్మించింది. దేవతలు సంతోషించి పుష్పవృష్టి కురిపించారు. త్రిలోకాలలోనూ మహోత్సవం జరిపించారు. దేవదుందుభులు మ్రోగాయి. సాధుసజ్జనుల మనస్సులు ప్రసన్నమయ్యాయి. సూర్యుడు మునుపటికన్నా కళకళలాడాడు. సర్వమంగళ ఆవిర్భవించడంతో జగత్తంతటా సన్మంగళాలు జరిగాయి. ఆ అమ్మాయికి సతి అని పేరుపెట్టారు. పెరిగి పెద్ద అయ్యాక శివుడికిచ్చి వివాహం జరిపించారు. శక్తియుక్తుడయ్యాడు శివుడు. దురదృష్టవశాత్తు సతీదేవి అగ్నిప్రవేశం చేసింది - అంటూ వ్యాసుడు నిట్టూర్చాడు.

వ్యాసమహర్షీ ! అమంగళం - అనర్థకరం. అది ఎలా జరిగింది ? అంతటి మహాశక్తి అగ్నిలో దగ్ధమవ్వడమా ? ఆ మహాశక్తి నామధేయాన్ని జపిస్తే చాలే మానవులకు సంసారాగ్ని భయాలు తొలగిపోతాయి. ఏ కర్మవిపాకంవల్ల ఇది జరిగిందో ?

## ◆ దక్షుడు చేసిన అపరాధం ◆

జనమేజయా ! నిజమే, కర్మవిపాకమే. చెబుతాను విను. ఒకనాడు దూర్వాసుడు జంబూనదేశ్వరిని దర్శించడానికి వెళ్ళాడు. మాయాబీజమహామంత్రాన్ని జపించి అమ్మవారిని ప్రసన్నురాలిని చేసుకున్నాడు. దర్శనం అనుగ్రహించింది. తన మెడలో ఉన్న పుష్పమాలికను తీసి మహర్షికి ప్రసాదించింది. జాలువారుతున్న మకరందంతో గుంపులుగా ముసురుకుంటున్న తుమ్మెదలతో అపూర్వ గంధపరిమళాలతో విరాజిల్లుతున్న ఆ దివ్యపుష్పమాలికను దూర్వాసుడు భక్తిగా స్వీకరించి కన్నులకు అద్దుకుని శిరసావహించాడు. అమ్మవారి ఆశీస్సూ అనుమతీ స్వీకరించి ఆకాశమార్గాన తిరిగివస్తూ దక్షుడి ఇంటికి వెళ్ళాడు. శక్తిస్వరూపిణి సతీదేవిగా అక్కడ ఉందిగదా దర్శనం చేసుకుని వెడదామని దిగాడు. సతీదేవి పాదపద్మాలకు నమస్కరించాడు. దూర్వాసుడి తలమీద ఉన్న దివ్యపుష్పమాలికను చూసి ఆశ్చర్యపోతూ దక్షుడు -



మహర్షీ! ఈ అలౌకిక పుష్పమాలిక ఎక్కడిది ? ఎలా లభించింది ? భూలోకంలో మానవమాత్రులు ఎవరూ కనీవినీ ఎరగనిది. నీకు ఎవరు బహూకరించారు ? - అని అభిలాషకొద్దీ ప్రశ్నించాడు.

దూర్వాసుడికి కళ్ళల్లో ఆనందబాష్పాలు తొణికిసలాడాయి. అది ఒక భక్తిపారవశ్యం. అలౌకికానందానుభూతికి పునశ్చరణ. జీరవోయిన కంఠంతో - ఇది అతులితదేవీప్రసాదం - అన్నాడు. నాకు ఇస్తావా అని అభ్యర్థించకుండా ఉండలేకపోయాడు దక్షుడు. ముల్లోకాలలోనూ దేవీభక్తుడు ఇతరులకు ఇవ్వరానిదంటూ ఏమీలేదు అన్నారుకదా పెద్దలు అని చెప్పి ఆ దివ్యమాలికను తీసి దక్షుడికి ఇచ్చాడు. అతడు దానిని శిరస్సున దాల్చి మహర్షికి వీడ్కోలు పలికి శయనమందిరంలోకి ప్రవేశించాడు. అక్కడ ఉన్న అతిసుందర శయనతల్పంమీద వేలాడేట్టు వేసి, ఆ రాత్రికి అదే తల్పంమీద నిజభార్యతో దాపంత్య సుఖం అనుభవిస్తూ ఆ దివ్యపుష్పమాలికా పరిమళాన్ని ఆస్వాదించి మునుపటికన్నా ఉత్సాహంగా ఆనందించాడు. ఈ మహాపాపానికి ప్రతిఫలంగా అతడి మనస్సులో శంకరుడిపై ద్వేషం రగిలింది. అల్లుడిమీద కోపం ఆత్మజమీదకు కూడా ప్రసరించింది.

అభవత్స మహీపాలస్తేన పాపేన శంకరే ।
శివే ద్వేషమతిర్జాతో దేవ్యాం సత్యాం తథా నృప ॥ (30 - 36)

తండ్రి చేసిన అపరాధాన్ని భరించలేక అతడినుంచి సంక్రమించిన తన దేహాన్ని యోగాగ్నికి ఆహుతి ఇచ్చింది సతీదేవి. అటుపైని ఆ దివ్యతేజస్సు హిమవంతుని ఇంట ఆవిర్భవించింది. పార్వతీనామధేయంతో పరిఢవిల్లింది - అని చెప్పి ఒక్క క్షణం ఆగేడు వ్యాసహర్షి. వెంటనే జనమేజయుడు-

హే వ్యాసభగవన్ ! సతీదేవి అగ్నికి ఆహుతి అయిపోతూంటే శివుడు ఏమి చేశాడు ? చూస్తూ ఊరుకున్నాడా ? తనకు ప్రాణాధికురాలుకదా సతీదేవి - అని ఉత్కంఠతో అడిగాడు.

## ◆ 108 శక్తిపీఠాలు ◆

జనమేజయా ! ఆ సమయంలో ఏమి జరిగిందో చెప్పడం నావల్లకాదు. శివుడి కోపాగ్ని అవధులు దాటి ముల్లోకాలకూ మహాప్రళయం వచ్చింది. భద్రకాళీ గణాన్వితుడై వీరభద్రుడు ఆవిర్భవించాడు. త్రిలోకాలనూ నాశనం చెయ్యడానికి సముద్యుక్తుడయ్యాడు. బ్రహ్మాదిదేవతలందరూ పరుగులు తీస్తూ వెళ్ళి శివుణ్ణి శరణువేడుకొన్నారు. కరుణాసింధువు కనక శివుడు అందరికీ అభయం ఇచ్చి దక్షుడికి మేకపోతు తల పెట్టి బతికించి, స్వయంగా తాను దక్షవాటికకు ఏతెంచి, అగ్నిలో దహించుకుపోతున్న చిత్కళా శరీరాన్ని వెలుపలికి తీసి తన భుజస్కంధాలపై వేసుకుని, హా ! సతీ ! అని విలపిస్తూ - ప్రచండ వేగంతో గిరగిరా తిరిగాడు. భ్రాంతచిత్తుడై అనేక ప్రదేశాలకు పరుగులు తీశాడు.



బ్రహ్మాదిదేవతలు ఏమిటి ఈ ఉన్మాదమని ఆశ్చర్యపోతూ లోలోపల విలపించారు. విష్ణుమూర్తి వెంటనే తన ధనుస్సును ఎక్కుపెట్టాడు. శివుడు ఏ ప్రదేశానికి వెళ్ళి ఆగితే అక్కడల్లాపడేట్టు సతీ శరీరభాగాలను తన బాణాలతో డుల్లగొట్టాడు. ఆయా చోటుల్లో శివుడుకూడా విభిన్న రూపాలు ధరించి నిలిచాడు.

విష్ణుస్తు త్వరయా తత్ర ధనురుద్యమ్య మార్గణైః ।
చిచ్ఛేదావయవాన్ సత్యాః తత్తత్స్థానేషు తేఽపతన్ ॥
తత్తత్ స్థానేషు తత్రాసీన్నానామూర్తిధరో హరః ॥ (30 - 46, 47)

శంకరు డప్పుడు దేవతలందరికీ ఒక ప్రకటన చేశాడు. దేవతలారా ! ఈయా ప్రదేశాలలో భక్తితత్పరులై దేవిని ఆరాధించినవారికి దుర్లభమంటూ ఏదీ ఉండదు. పరాంబిక ఈ స్థలాలలో నిత్యసన్నిహితురాలై ఉంటుంది. ఇవి దివ్యక్షేత్రాలు. ఇక్కడ పునశ్చరణ చేసినవారికి మంత్రాలన్నీ సిద్ధిస్తాయి. మాయా బీజమహామంత్రం మరీ విశేషంగా సిద్ధిస్తుంది.

అని ప్రకటించి శంకరుడు సతీవిరహాతురుడై ఆయా ప్రదేశాలలోనే సంచరిస్తూ జపధ్యానసమాధి నిష్ఠాపరుడై కాలం గడిపాడు. జనమేజయా ! అవి ఏయే క్షేత్రాలో తెలుసుకోవాలనే ఉత్సుకత నీ ముఖంలో కనిపిస్తోంది. చెబుతాను, తెలుసుకో. వాటిని దేవీపీఠాలు అంటారు. వెళ్ళి దర్శించగలిగితే ఉత్తమం. దర్శించలేనివారు శ్రద్ధగా వింటే చాలు పాపవిముక్తులవుతారు. అవి సిద్ధపీఠాలు.

వారణాసిలో విశాలాక్షి, ముఖనివాసంలో గౌరి, నైమిశంలో లింగధారిణి, ప్రయాగలో లలిత, గంధమాదనంమీద కాముకి, మానసక్షేత్రంలో కుముద, దక్షిణక్షేత్రంలో విశ్వకామ, ఉత్తరక్షేత్రంలో విశ్వకామప్రపూరిణి, గోమంతంలో గోమతి, మందరంలో కామచారిణి, చైత్రరథంలో మదోత్కట, హస్తినాపురంలో జయంతి, కాన్యకుబ్జంలో మళ్ళీ గౌరి, మలయాచలంమీద రంభ, ఏకామ్రపీఠంలో కీర్తిమతి, విశ్వక్షేత్రంలో విశ్వేశ్వరి, పుష్కరక్షేత్రంలో పురుహూతిక, కేదారంలో సన్మార్గదాయిని, హిమాలయంలో మంద, గోకర్ణంలో భద్రకర్ణిక, స్థానేశ్వరంలో భవాని, బిల్వకక్షేత్రంలో బిల్వపత్రిక, శ్రీశైలంలో మాధవి, భద్రేశ్వరంలో భద్ర, వరాహశైలంమీద జయ, కమలాలయంలో కమల, రుద్రకోటిలో రుద్రాణి, కాలంజరక్షేత్రంలో కాళి, శాలగ్రామంలో మహాదేవి, శివలింగక్షేత్రంలో జలప్రియ, మహాలింగంలో కపిల, మాకోటక్షేత్రంలో ముకుటేశ్వరి, మాయాపురిలో కుమారి, సంతానక్షేత్రంలో లలితాంబిక, గయాక్షేత్రంలో మంగళాదేవి, పురుషోత్తమపురంలో విమలాదేవి, సహస్రాక్షంలో ఉత్పలాక్షి, హిరణ్యాక్షంలో మహోత్పల, విశాపాక్షేత్రంలో అమోఘాక్షి, పుండ్రవర్ధనంలో పాడల, సుపార్శ్వంలోనారాయణి, త్రికూటంలో రుద్రసుందరి,



విపులక్షేత్రంలో విపులాదేవి, మలయాచలం మీద కల్యాణి, సహ్యాద్రి మీద ఏకవీర, హరిశ్చంద్రక్షేత్రంలో చంద్రిక, రామతీర్థంలో రమణ, యమునలో మృగావతి, కోట తీర్థంలో కోటవి, మాధవవనంలో సుగంధ, గోదావరిలో త్రిసంధ్య, గంగాతీరంలో రతిప్రియ, శివకుండంలో శుభానంద, దేవికాతటంలో నందినీదేవి, ద్వారవతిలో రుక్మిణి, బృందావనంలో రాధ, మథురలో దేవకి, పాతాళంలో పరమేశ్వరి, చిత్రకూటంలో సీత, వింధ్య పర్వతంమీద వింధ్యవాసిని, కరవీరదేశంలో మహాలక్ష్మి, వినాయకక్షేత్రంలో ఉమాదేవి, వైద్యనాథంలో ఆరోగ్య, మహాకాళక్షేత్రంలో మహేశ్వరి, ఉష్ణతీర్థంలో అభయ, వింధ్యపర్వత సానువుల్లో నితంబ, మాండవ్యంలో మాండవి, మాహేశ్వరపురంలో స్వాహాదేవి, ఛగలండభూమిలో ప్రచండ, అమరకంటకంలో చండిక, సోమేశ్వరంలో వరారోహ, ప్రభాసతీర్థంలో పుష్కరావతి, సరస్వతిలో దేవమాత, తటంలో పారావారాదేవి, మహాలయంలో మహాభాగ, పయోష్ణిలో పింగలేశ్వరి, కృతశౌచంలో సింహిక, కార్తికంలో అతిశాంకరి, ఉత్పలావర్తకంలో లోలాదేవి, శోణ సంగమక్షేత్రంలో సుభద్ర, సిద్ధవనంలో లక్ష్మీమాత, భరతాశ్రమంలో అనంగ, జాలంధరంలో విశ్వముఖి, కిష్కింధ పర్వతం మీద తారాదేవి, దేవదారువనంలో పుష్టి, కాశ్మీరంలో మేధాదేవి, హిమాద్రిలో భీమాదేవి, తుష్టి విశ్వేశ్వరి కూడా ఆ పర్వతాలలోనే, కపాలమోచన క్షేత్రంలో శుద్ధి, కాయావరోహణంలో మాత, శంఖోద్ధారంలో ధరాదేవి, పిండారకంలో ధృతి, చంద్రభాగాతీర్థంలో కళాదేవి, అచ్ఛోదంలో శివధారిణి, వేణా క్షేత్రంలో అమృతాదేవి, బదరీక్షేత్రంలో ఊర్వశి, ఉత్తరకురుక్షేత్రంలో ఔషధి, కుశద్వీపంలో కుశోదక, హేమకూటంలో మన్మథ, కుముదక్షేత్రంలో సత్యవాదిని, అశ్వత్థంలో వందనీయ, వైశ్రవణంలో నిధి, వేదవదనంలో గాయత్రి, శివసన్నిధిలో పార్వతి, దేవలోకంలో ఇంద్రాణి, బ్రహ్మవదనంలో సరస్వతి, సూర్యబింబంలో ప్రభ, మాతలలో వైష్ణవీమాత, సతులలో అరుంధతి, స్త్రీలలో తిలోత్తమ, చిత్తంలో బ్రహ్మకళ, శరీరధారులందరిలోనూ శక్తిరూపిణి - ఇవి నూటయెనిమిది పీఠాలు, సతీదేవి అంగభూతాలు. వీటన్నింటా పరమేశ్వరుడు పరాశక్తితో కలిసి సన్నిధిచేసి ఉంటాడు. వీటిని స్మరించినా వీటిని గురించి విన్నా భక్తులకు పాపాలు అన్నీ తొలగిపోయి ముక్తి లభిస్తుంది.

తీర్థయాత్రగా బయలుదేరి వీటిని సందర్శించి ఆయా క్షేత్రాలలో పితృదేవతలకు తర్పణ శ్రాద్ధవిధులు నిర్వహించడం ఉత్తమోత్తమం. దేవీపూజలు చేసి అమ్మవారికి క్షమాపణలు ఎప్పటికప్పుడు చెప్పుకుంటే సద్గతులు కలుగుతాయి. సువాసినీపూజలూ కుమారీపూజలూ వటుపూజలూ నిర్వహించి అన్న సంతర్పణలు చేస్తే ఇక్కడ విశేష ఫలితాలు లభిస్తాయి. ఈ క్షేత్రాలలో నివసిస్తున్న సర్వప్రాణికోటీ ఉత్తమాధమ భేదాలు లేకుండా అందరూ దేవీస్వరూపాలే. అన్నీ పూజనీయాలే. ఇక్కడ చేస్తే మంత్ర పురశ్చరణ అమోఘంగా ఫలిస్తుంది. దేవీపూజలలో విత్తశాఠ్యం పనికిరాదు. లోభించకూడదు. యథాశక్తి వైభవంగా చెయ్యాలి.



నూటయెనిమిది శక్తిపీఠాలనూ దర్శించి భక్తితత్పరుడై ఆయా విధులను నిర్వహించిన వా పితృదేవతలు సహస్రకల్ప పర్యంతం బ్రహ్మలోకంలో నివసిస్తారు. పూజించిన వారు జ్ఞానులై భవాంబుధి దాటి ముక్తిని పొందుతారు. మణిద్వీపంలో దేవీసన్నిధిని నివసిస్తారు. ఈ అష్టోత్తరశతనామాల జపించినా లిఖించినా, లిఖించిన పుస్తకాన్ని ఇంటిలో ఉంచుకున్నా దుష్టగ్రహపీడలన్నీ తొలగిపోతా పున్నమినాటి సముద్రంలా సౌభాగ్య సంపదలు వర్ధిల్లుతాయి. వారికింక అసాధ్యమంటూ ఏమీ ఉండ వారు సాక్షాత్తు దేవీరూపులే. దేవతలే నమస్కరిస్తారంటే ఇక మానవులమాట చెప్పాలా ?

నమంతి దేవతాస్తం వై దేవీరూపో హి స స్మృతః ।
సర్వథా పూజ్యతే దేవైః కిం పునర్మనుజోత్తమైః ॥ (30 -99)

శ్రాద్ధకాలంలో ఈ అష్టోత్తరశతనామాలను జపిస్తే పితృదేవతలు సంతృప్తి చెందుతారు. ఉత్తమగతు పొందుతారు. జనమేజయా ! ఇవి సాక్షాత్తుగా ముక్తిక్షేత్రాలు. సంవిన్మయాలు. సిద్ధపీఠాలు. మతిమంతులు వీటిని తప్పక సేవించాలి. అతిగుహ్యమైన విషయం నీకు చెప్పాను. ఇంకా ఏమి వినాలనుకుంటున్నా చెప్పు - అన్నాడు వ్యాసుడు. *(అధ్యాయం - 30, శ్లోకాలు - 102)*

వ్యాసమహర్షీ ! హిమవంతుని ఇంటిలో ఆ దివ్యతేజస్సు ఆవిర్భవించింది అన్నావు. అది మరికొంచెం విస్తరంగా చెప్పు. శక్తికథామృతాన్ని గ్రోలడంలో ఎవరైనా ఎంతకైనా తృప్తి చెందుతారా ? ఇంకా ఇంకా వినాలన్నే ఉంటుంది. కనక పార్వతీజననగాథను మరింత వివరించు అని జనమేజయుడు అభ్యర్థించాడు. వ్యాసుడు సంతోషించి చెప్పనారంభించాడు.

జనమేజయా ! నువ్వు ధన్యుడివి. కృతకృత్యుడివి. మహాత్ముల చేతికింద నలిగినవాడివి. మహాదేవిపట్ల నిర్వ్యాజమైన భక్తి నీకు కుదురుకుంది. - అదృష్టవంతుడివి. తరవాత కథ చెబుతున్నాను. ఆలకించు.

## ◆ తారకాసుర విజృంభణ ◆

సతీవియోగంతో భ్రాంతచిత్తుడైన శివుడు దేశమంతటా సంచరించి సంచరించి ఒకానొక దివ్యస్థలంలో తపస్సుకి ఉపక్రమించాడు. ప్రాపంచిక దృష్టిని పూర్తిగా విడనాడి సమాధి వహించి స్థిరచిత్తంతో మహాదేవిని ఉపాసించాడు. ఆమె రూపాన్నే ధ్యానిస్తూ ఆమె నామాన్నే జపిస్తూ కాలం గడిపాడు. సతీదేవి వెళ్ళిపోవడంతో ముల్లోకాలూ సౌభాగ్యరహితాలు అయ్యాయి. చరాచరజగత్తు అంతా శక్తిహీనం అయిపోయింది. ప్రాణికోటికి ఆనందమనేదే లేకండాపోయింది. సర్వలోకులు ఉదాసీనులై చింతాజర్జరితులయ్యారు. అందరినీ దుఃఖం ఆవరించింది. రోగగ్రస్తులు అయ్యారు. గ్రహాలు గ్రహాధిదేవతలూ ఒక నియతిలేకండా వర్తించడం మొదలయ్యింది.



ఇదే తరుణంలో తారకాసురుడు బ్రహ్మదేవుడిచ్చిన వరాలతో గర్వించి ముల్లోకాలకూ నాయకుడయ్యాడు. ప్రజాకంటకుడుగా మారిపోయాడు. శివుడికి ఔరసుడుగా జన్మించిన పుత్రుడు మాత్రమే తారకాసురుణ్ణి సంహరించగలడని దేవతలంతా నిర్ధారించారు. శివుడికి అటువంటి పుత్రుడు లేడు అని తెలుసుకున్న తారకుడు మరీ విజృంభించి దేవతలను హింసించాడు. దిక్కుతోచని దేవతలు చెట్టుకొకరూ పుట్టకొకరుగా పారిపోయారు.

శివుడికి ప్రస్తుతం ఇల్లాలే లేదు, మరింక పుత్రుడేమిటి ? ఈ కష్టాలనుంచి గట్టెక్కేది ఎలాగ ? - అని దేవతలంతా విచారంలో మునిగిపోయారు. మన దురదృష్టం ఇలా ఉంది, శ్రీమహావిష్ణువును ఆశ్రయిద్దాం, ఆయన ఏదైనా ఉపాయం చెబుతాడు - అని దేవతలంతా కూడబలుక్కుని వైకుంఠానికి వెళ్ళారు. మొరపెట్టుకున్నారు. శ్రీహరి వారినందరినీ ఊరడించి -

దేవతలారా ! చింతించకండి. మన కోరికలు తీర్చడానికి కల్పవృక్షం శ్రీమన్మహాదేవి. మణిద్వీపాధివాసిని. జగన్మాత. మనం చేసిన అపరాధాల వల్లనే మహాదేవి ఇలా ఉపేక్షించి ఊరుకుంది. మనకు బుద్ధిరావడం కోసం ఇలా శిక్షించింది. లాలనచేసినా తాడనచేసినా తల్లికే తగును. అయితే ఏ తల్లికీ బిడ్డమీద నిజమైన కోపం ఉండదు. దోషాలను తొలగించడానికి కోపం అభినయిస్తుంది అంతే. మాటిమాటికీ బిడ్డడు అపరాధాలు చేస్తూనే ఉంటాడు. అయినా తల్లి గనక క్షమిస్తుంది. మరింకెవ్వరూ క్షమించరు.

అపరాధో భవత్యేవ తనయస్య పదే పదే ।
కోఽపరః సహతే లోకే కేవలం మాతరం వినా ॥ (31 - 18)

అందుచేత, దేవతలారా ! మీరందరూ ఆ పరాంబికను శరణువేడండి. ఇక ఆలస్యం చెయ్యకండి. నిర్వ్యాజకృపాసింధువు జగదీశ్వరి మిమ్మల్ని కాపాడుతుంది. రాక్షసపీడ తొలగిస్తుంది.

అని ఊరడించి, దేవతల నందరినీ వెంటబెట్టుకుని లక్ష్మీసహితుడై శ్రీహరి హిమవత్పర్వతానికి బయలుదేరాడు. అక్కడ దేవతలు ప్రశాంత ప్రదేశాలను చూసుకుని అంబామంత్రాన్ని పురశ్చరణ చేస్తూ అంబాయజ్ఞాలను దీక్షాదక్షతలతో నిర్వహించారు. కొందరు నామపారాయణ, కొందరు సూక్తపారాయణ, కొందరు మంత్రపారాయణ యథావిధిగా చేశారు. వ్యాసపరాయణులూ అంతర్యాగపరాయణులూ హృల్లేఖాపూజాపరాయణులూ అయ్యారు మరికొందరు. కొన్ని సంవత్సరాలపాటు ఇవి సాగాయి.



## ◆ జగన్మాత ఆవిర్భావం ◆

చైత్రమాసం నవమి భృగువాసరాన దేవతల ఎదుట ఒక మహాతేజస్సు ఆవిర్భవించింది. దాన్ని నాలుగు వైపులా నాలుగు వేదాలూ స్తుతిస్తున్నాయి. కోటిసూర్యప్రతీకాశంగా ఉండి, కోటిచంద్ర ప్రకాశంగా చల్లదనం విరజిమ్ముతోంది. కోటి మెరుపులు ఒక్కసారి మెరిసినట్టుగా అరుణకాంతులను వెదజల్లుతోంది. పైనిగానీ ప్రక్కనకానీ మధ్యలోకానీ పల్చబారలేదు. ఆద్యంతాలు లేవు. కరచరణాద్యవయవాలు లేవు. స్త్రీరూపం కాదు. పురుషరూపం కాదు. ఉభయమూ కాదు. ఆ దీప్తికి దేవతల కన్నులు మసకబారాయి. కళ్ళు నులుముకుని ధైర్యం తెచ్చుకుని తేరిపార చూశారు. అప్పటికి ఆ దివ్యతేజస్సు స్త్రీమూర్తిగా రూపు ధరించింది. రాశీభూత సౌందర్యం. కుమారి. నవయౌవన. తామరమొగ్గలను పరిహసిస్తున్న పీనకుచద్వంద్వం. చిరుమువ్వల సవ్వడి చేస్తున్న మొలనూలు, (మేఖల) మంజీరాలు. బంగారు కేయూరాలు. అంగదాలు. కంఠాభరణాలు. రత్నరాశులు పొదిగిన కంఠపట్టిక. చిన్న మొగలిరేకును ముడుచుకున్న కొప్పు. విశాలమైన కటిప్రదేశం. పొట్టమీద సన్నని నూగారు. కప్పురపు తాంబూలంతో ఎరుపెక్కి, సువాసనలు విరజిమ్ముతున్న నోరు. మెరిసిపోతున్న బంగారు లోలకులతో తళుకులీనుతున్న నున్నని చెక్కిళ్ళు. అష్టమినాటి చంద్రరేఖలాంటి నుదురు. దట్టమైన కనుబొమలు. ఎర్రకలువల్లాంటి నేత్రాలు. కొనదేరిన ఎత్తైన ముక్కు. మధురాధరం. మల్లెమొగ్గల్లాంటి పలువరుస. ముత్యాలదండలు. రత్నకిరీటం. చెవికి అలంకరించుకున్న ఇంద్రనీలాలు. జడలో మల్లికామాలతీ పుష్పాలదండ. నుదట మూడవ కన్నులా ఎర్రని కుంకుమబొట్టు. పాశాంకుశ వరదాభయహస్తాలు. ఎర్రని చీరకట్టుకుని దానిమ్మ పువ్వు రంగులో ధగధగలాడుతున్న జగన్మాత. సర్వశృంగారవేషాఢ్య. సర్వదేవనమస్కృత. సర్వాశాపూరిక. సర్వమాత. సర్వమోహిని. ప్రసన్నురాలై చిరునవ్వులు చిందిస్తోంది. అవ్యాజకరుణామూర్తి.

## ◆ దేవతాకృత దేవీస్తుతి ◆

దేవతలందరూ ఎక్కడివాళ్ళు అక్కడ సాష్టాంగపడ్డారు. ఆనందబాష్పాలు అడ్డుపడి చూడలేక పోతున్నారు, గొంతు విప్పి మాట్లాడలేకపోతున్నారు. కొంతసేపటికి తేరుకుని మళ్ళీ ధైర్యం కూడగట్టుకుని జగదంబికను స్తుతించారు.

**నమో దేవ్యై మహాదేవ్యై శివాయై సతతం నమః ।**
**నమః ప్రకృత్యై భద్రాయై నియతాః ప్రణతాః స్మ తామ్ ॥ (31 - 44)**
**తామగ్నివర్ణాం తపసా జ్వలంతీం వైరోచనీం కర్మఫలేషు జుష్టామ్ ।**
**దుర్గాం దేవీం శరణమహం ప్రపద్యే సుతరసి తరసే నమః (31 - 45)**



దేవీం వాచమజనయంత దేవాస్తాం విశ్వరూపాః పశవో వదంతి ।
సా నో మంద్రేషమూర్జం దుహానాం ధేనుర్వాగస్మానుపసుష్టుతైతు॥
(31 - 46)

కాళరాత్రీ ! బ్రహ్మసుతా ! వైష్ణవీ ! స్కందజననీ ! సరస్వతీ ! అదితీ ! దక్షదుహితా ! పావనా! శివా ! నమోనమః. మహాలక్ష్మీ ! సర్వశక్తి ! నిన్ను తెలుసుకుంటున్నాం. మమ్మల్ని నడిపించు. విరాట్స్వరూపిణీ ! సూత్రాత్మమూర్తీ ! అవ్యాకృతరూపిణీ ! శ్రీబ్రహ్మమూర్తీ ! నమోనమః.

మహాలక్ష్మై చ విద్మహే సర్వశక్త్యై చ ధీమహి ।
తన్నో దేవీ ప్రచోదయాత్ ॥

దేవీ ! నిన్ను తెలుసుకుంటే ఈ జగత్తూ ఈ సంసారం అదృశ్యమైపోతుంది. తెలుసుకోకపోతే రజ్జు సర్పభ్రాంతిలాగా ఏడిపిస్తూ ఉంటుంది. చిదేకరసరూపిణీ ! అఖండానందరూపా ! వేదతాత్పర్య భూమికా! పంచకోశాతిరిక్తా ! అవస్థాత్రయసాక్షిణీ ! త్వంపదలక్ష్యార్థా ! ప్రత్యగాత్మ స్వరూపిణీ ! ప్రణవరూపా! హ్రీంకారమూర్తీ ! నానా మంత్రాత్మికా ! కృపాసింధూ ! నమోనమః.

దేవతలు గద్గదస్వరాలతో చేసిన స్తుతులకు మహాదేవి సంతుష్టి చెందింది. మత్తకోకిల కంఠాన్ని స్వీకరించి పలికింది. నేను భక్తులపాలిటి కల్పవృక్షాన్నికదా ! అడగండి ఏమి కావాలో. నేనుండగా మీకు - నా భక్తులకు - దిగులు ఏమిటి ? దుఃఖ సంసారసాగరంనుంచి నా భక్తులను ఎప్పుడూ ఉద్ధరిస్తూనే ఉంటాను. ఇది నా ప్రతిజ్ఞ. దేవతలారా ! తెలుసుకోండి. ఏమి కావాలో అడగండి.

జగన్మాతా ! ముల్లోకాలలోనూ నీకు తెలియనిదంటూ ఒకటి ఉన్నదా ? నువ్వు సర్వజ్ఞవు. సర్వసాక్షివి. తారకాసురుడు మమ్మల్ని రేయింబవళ్ళు హింసిస్తున్నాడు. శివుడికి ఔరసుడుగా పుట్టిన పుత్రుడొక్కడే తారకుడిని చంపగలడని బ్రహ్మదేవుడు చెప్పాడు. మరి ఇప్పుడు ఆ శివుడికి అసలు ఇల్లాలే లేదు. నీకు తెలుసుగదా ! ఇంతకన్నా మేము చెప్పగలిగింది లేదు. నువ్వే ఏదో ఒకటి ఆలోచించి మాకు దారి చూపించు. నీ పాదపద్మాలను నిరంతరం ధ్యానించే భక్తులం. ప్రాణరక్షణకోసం నిన్ను ప్రార్థిస్తున్నాం. ఇంతకన్నా మాకు కోరదగినది ఇంకొకటి లేదు.

## ◆ పార్వతిగా అవతరణ ◆

దేవతలారా ! భయపడకండి. నా శక్తి త్వరలోనే గౌరిగా హిమవంతుడి ఇంట జన్మించబోతోంది. ఆ గౌరిని శివుడికి ఇచ్చి వివాహం జరిపించండి. హిమగిరీంద్రుడు ఎప్పుడూ మనస్సులో నన్నే ధ్యానిస్తూంటాడు. మీలాగానే నా భక్తుడు. అతడి ఇంటిలో కూతురుగా జన్మించడం నాకు చాలా ఆనందదాయకం.



జగదీశ్వరి మాటలను హిమవంతుడు విన్నాడు. అనుగ్రహానికి మురిసిపోయాడు. కళ్ళ ఆనందబాష్పాలు. గొంతు జీరవోయింది. హే సచ్చిత్స్వరూపిణి ! ధన్యోఽస్మి. అనుగ్రహవిశేషం ఎంతటి మహత్తునైనా కలిగిస్తుంది. లేకపోతే - స్థాణువునూ జడమునూ అయిన నేనేమిటి, నీకు తండ్రి కావడమేమిటి ! మరో నూరుజన్మలు ఎత్తితేమాత్రం ఈ సౌభాగ్యం నాకు లభిస్తుందా ? వేల అశ్వమేధాలు చేసినా వేలసంవత్సరాలు తపస్సు చేసినా ఇంతటి మహావైభవం నాకు దక్కేనా ? ఆహా ! జగన్మాత నాకు కన్నకూతురు అయ్యిందంటే ఈ రోజునుంచీ ఈ ప్రపంచంలో నా కీర్తికి తిరుగులేదు. అహో ! హిమాలయుడా ! ఎంతటి ధన్యుడవు - అంటూ అందరూ ప్రశంసలు కురిపిస్తారు. ఏతల్లి చల్లని కడుపులో బ్రహ్మాండకోటులున్నాయో ఆ తల్లి నీకు చిట్టితల్లిగా జన్మించిందని కీర్తిస్తారు. నా తల్లిదండ్రులెవరో ఈ పర్వతరూపంగా నన్ను ఎందుకు నిర్మించారో తెలియదుగానీ ఇటువంటి దేవతలూ మహాతపస్వులూ నివసించడానికి నేను కారణమవుతున్నాను - ఇది చాలు ఈ జన్మకు అని మురిసిపోతున్న నాకు ఎంతటి గొప్పవరం ఇచ్చావు తల్లీ ! ధన్యుణ్ణి, ధన్యుణ్ణి. ఇది నా అర్హత కాదు. కేవలం నీ కృప. తల్లీ ! నాదొక చిన్నకోరిక. సర్వవేదవేదాంత ప్రతిపాదితమైన నీ రూపాన్ని తెలుసుకోవాలని ఉంది. భక్తి సహితమైన యోగాన్నీ, శ్రుతిసమ్మతమైన జ్ఞానాన్నీ అనుగ్రహించు.

హిమవంతుడి అభ్యర్థనను జగన్మాత సమ్మతించింది. శ్రుతి నిహితమైన రహస్యాన్ని బోధించింది.

***(అధ్యాయం - 31, శ్లోకాలు - 70)***

## ◆ జగన్మాత చేసిన జ్ఞానబోధ (దేవీగీత) ◆

దేవతలారా ! మీరుకూడా వినండి. విన్నవారందరూ నా రూపాన్ని పొందుతారు. హిమాలయా! ఆదిలో నేనే ఉన్నాను. మరొకటి ఏదీ లేదు. అది ఆత్మరూపం. దానికి చిత్తు సంవిత్తు పరబ్రహ్మ అని పేర్లు. అది అప్రతర్క్యం అనిర్దేశ్యం, అనౌపమ్యం, అనామయం. దానికి స్వతస్సిద్ధమైన ఒకానొక శక్తి ఉంది. ఆ శక్తికే మాయ అని పేరు. అది సతికాదు. అసతి కాదు. ఉభయమూ కాదు. అవిరోధంగా అన్నీను. ఇదొక విలక్షణమైన వస్తువువంటిది. అగ్నికి వేడిమిలాగా, సూర్యుడికి వెలుగులాగా, చంద్రుడికి వెన్నెలలాగా ఇది నాకు సహజశక్తి. జీవులూ వారి కర్మలూ కాలమూ అన్నీ అందులోనే సంచరిస్తూ ఉంటాయి. గాఢనిద్రలో స్వాప్నిక వ్యవహారంలాగా ఇవన్నీ అభేదంగా అందులో విలీనమై ఉంటాయి. ఆ స్వశక్తి సమాయోగంవల్ల నేను బీజాత్మతను పొందుతాను. స్వాధారావరణంవల్ల దోషత్వమూ సమాగతమవుతుంది. చైతన్య సమాయోగం వల్ల నిమిత్తత్వమూ చెప్పబడుతుంది. ప్రపంచ పరిణామంవల్ల సమవాయిత్వం సంక్రమిస్తుంది. కొందరు ఈ మాయాశక్తినే తపస్సు అన్నారు. కొందరు తమస్సు అన్నారు. కొందరు జడం అన్నారు. జ్ఞానము, మాయ, ప్రధానము, ప్రకృతి, శక్తి, అజము - ఇవన్నీ పర్యాయపదాలే. దీన్నే శైవశాస్త్ర విశారదులు



ప్రమర్శ అని వ్యవహరిస్తూ ఉంటారు. వేదాంతులు అవిద్య అంటారు. ఇలా మాయాశక్తికి నిగమాగమాదుల్లో చాలా పేర్లు ఉన్నాయి.

దృశ్యత్వం వల్ల జడత్వమూ, జ్ఞాననాశత్వంవల్ల అసత్త్వమూ (అసతీ). చైతన్యానికి దృశ్యత్వం లేదు. దృశ్యత్వం ఉంది అంటే అది జడమే. చైతన్యం ఎప్పుడూ స్వప్రకాశం. పరప్రకాశితత్వం దానికి ఉండదు. అవసరం లేదు. అంతేకాదు అనవస్థాదోషం వస్తుంది కనక దానికి స్వప్రకాశితత్వంకూడా ఉండదు. స్వప్రకాశమే. కర్మకర్తృ విరోధంలేని ప్రకాశం. దీపంలా స్వయం ప్రకాశం.

అనవస్థాదోషసత్త్వాన్న స్వేనాపి ప్రకాశితమ్ ।
కర్మకర్తృవిరోధః స్యాత్తస్మాత్తద్దీపవత్స్వయమ్ ॥ (32 - 13)

అది స్వయంప్రకాశమానం కనక ఇతరాలను అదే ప్రకాశింపజేస్తుంది. అందుకే నా సిద్ధ సంవిత్తనువుకి నిత్యత్వం. నిద్రలో దృశ్యమానమయ్యే కలలకు చలన సంబంధంగా వ్యభిచారం (వ్యర్థత్వం) ఉంది. సంవిత్తుకి అటువంటిది లేదు. ఎవరి అనుభవంలోనూ లేదు. ఒకవేళ అనుభూతమే అయితే అది ఏవరు సాక్షిగా అనుభూతమయ్యిందో అదే శిష్టమూ అదే సంవిద్రూపమూ అని తెలుసుకోండి. అందుకనే ఈ సంవిద్రూపానికి నిత్యత్వం చెప్పారు శాస్త్రకోవిదులు.

అత్యంత ప్రేమాస్పదత్వంవల్ల దీనికి (సంవిత్తుకి) ఆనంద రూపత్వం. ఏతదితరమంతా మిథ్య కనక దీని అసంగత్వం స్పష్టమే. ఇది అపరిచ్ఛిన్నం. కేవలం జ్ఞానం. ఆత్మధర్మం కాదు. అలా అన్నామంటే ఆత్మకు జడత్వం వచ్చిపడుతుంది. జ్ఞానానికి జడశేషత్వం కన్నదికాదు, విన్నది కాదు. అసంభవం. అలాగే చిద్ధర్మం అనడానికీ వీలులేదు. చిత్తు కేవలం అభిన్నం. అందుచేత ఆత్మ అనేది జ్ఞానరూపం. సుఖరూపం. అది సత్యం. పూర్ణం. అసంగం. ద్వైతజాలవివర్జితం. సంస్కార జన్యమైన కామకర్మకాలవిపాకాదులన్నీ మాయవల్ల ఆవిర్భవిస్తూ ఉంటాయి. అవివేకమూ, అవిద్య, అబుద్ధి అనబడే మాయవల్లనే వీటి సృజన జరుగుతూ ఉంటుంది. పర్వతరాజా ! ఇది (సంవిదాత్మ) నా అలౌకికరూపం. అవ్యాకృతం. అవ్యగ్రం. మాయాశబలితం. దీన్నే సర్వకారణకారణంగా శాస్త్రాలు ఉద్ఘోషిస్తున్నాయి. ఇది అన్ని తత్త్వాలకూ ఆదితత్త్వం. సచ్చిదానందరూపం. సర్వకర్మఘనీభూతమూ ఇచ్ఛాజ్ఞానక్రియాశ్రయమూ హ్రీంకార మంత్రవాచ్యమూ అయిన నా ఆదితత్త్వాన్ని నీకు ఉపదేశించాను. దానినుంచే శబ్దతన్మాత్రరూపకమైన ఆకాశం ఆవిర్భవించింది. ఆకాశంనుంచి స్పర్శాత్మకమైన వాయువు, వాయువు నుంచి రూపగుణకమైన అగ్ని, అగ్ని నుంచి రసగుణకమైన జలం, జలం నుంచి గంధగుణకమైన పృథివి ఆవిర్భవించాయి. వీటిలో ఆకాశం కేవలశబ్దగుణకమైతే వాయువు శబ్ద స్పర్శ గుణకం. అగ్ని శబ్ద స్పర్శ రూప గుణాన్వితం. జలమేమో శబ్ద స్పర్శ రూప రసగుణాన్వితం. పృథివికి శబ్ద స్పర్శ రూప రస గంధాలు అయిదూ ఉంటాయి. కనక



దీన్ని పంచగుణాన్వితం అంటారు. ఈ పంచభూతాల కలయికతో ఏర్పడింది సృష్టి. దీన్నే మహత్తు అంటారు. లింగము అనికూడా అంటారు. ఇది సర్వభూతాత్మకం. ఆత్మకు లింగశరీరం కారణశరీరం రెండూ ఉంటాయి. కారణదేహం అవ్యక్తమని లోగడే చెప్పానుగదా ! పంచీకరణ మార్గంలో స్థూలదేహం ఏర్పడుతుంది. పంచభూతాలు తమ తమ గుణాలతోకూడి ఇతర గుణాలతో కలవడంవల్ల ఏర్పడే స్థూలశరీరాన్నే విరాడ్దేహము అని కూడా అంటారు. పంచభూతాలలో ఉండే సత్వాంశలచేత చెవులు మొదలైన ఇంద్రియాలు ఏర్పడతాయి. జ్ఞానేంద్రియాల సమ్మిశ్రణచేత అంతఃకరణం ఏర్పడుతుంది.

ఈ అంతఃకరణం వృత్తిభేదంవల్ల నాలుగు విధాలు. సంకల్పవికల్పాత్మకాన్ని మనస్సు అంటారు. సంశయరహితమైన నిశ్చయజ్ఞానాన్ని బుద్ధి అంటారు. అనుసంధాన శక్తి కలిగినది చిత్తము. అహంకార రూపమైన ఆత్మవృత్తికే అహంకారమని పేరు.

జ్ఞానేంద్రియాణాం రాజేంద్ర ప్రత్యేకం మిళితైస్తు తైః ।
అంతఃకరణమేకం స్యాత్ వృత్తిభేదాచ్చతుర్విధమ్ ।
యదాతు సంకల్ప వికల్పకృత్యం తదా భవేత్తన్మన ఇత్యభిఖ్యమ్ ।
స్యాత్ బుద్ధిసంజ్ఞం చ యదా ప్రవేత్తి సునిశ్చితం సంశయహీన రూపమ్ ॥
అనుసంధానరూపం తచ్చిత్తం చ పరికీర్తితమ్ ॥
అహంకృత్యాత్మవృత్త్యా తు తదహంకారతాం గతమ్ ॥ (32 - 38)

రజోంశలతో రూపొందినవి కర్మేంద్రియాలు. వీటి ప్రత్యేక సమ్మిశ్రణవల్ల ప్రాణమనేది అయిదు విధాలు అవుతోంది. హృదయస్థానంలో ఉండే వాయువును ప్రాణము అంటారు. గుదస్థానంలో అపానం, నాభిస్థానంలో సమానం, కంఠదేశంలో ఉదానం, మిగతా సర్వశరీరంలోనూ వ్యాపించి ఉండే వాయువును వ్యానము అంటారు. అయిదు జ్ఞానేంద్రియాలు, అయిదు కర్మేంద్రియాలు, ప్రాణ పంచకం, బుద్ధి, మనస్సు - ఇవి అన్నీ కలిపి సూక్ష్మశరీరం. దీనినే లింగశరీరమనీ అంటారు.

ఇక ప్రకృతి అనేది రెండు రకాలు. సత్వాత్మక ప్రకృతినే మాయ అంటారు. ఇది అవిద్యాగుణమిశ్రితమై ఉంటుంది. స్వాశ్రయాన్ని కాపాడుకునే గుణంవల్ల దీనికి ఈ పేరు వచ్చింది. దీనిలో ఈశ్వరుడు ప్రతిబింబిస్తాడు. ఇతడు స్వాశ్రయజ్ఞానవంతుడు. సర్వజ్ఞుడు. సర్వకర్త. సర్వానుగ్రహకారకుడు. అవిద్యలో ఉండే ప్రతిబింబమే జీవుడు. ఇతడు సర్వదుఃఖాశ్రయుడు. అవిద్యలో మునిగిన ఈ జీవేశ్వరులకు శరీరత్రయం ఉంది. దేహత్రయాభిమానంవల్ల నామత్రయం ఏర్పడింది. కారణశరీరాత్మకుణ్ణి ప్రాజ్ఞుడు అనీ, సూక్ష్మ (లింగ) శరీరాత్మకుణ్ణి తైజసుడు అనీ, స్థూలశరీరాత్మకుణ్ణి విశ్వుడు అనీ అంటారు.



ప్రాజ్ఞస్తు కారణాత్మా స్యాత్ సూక్ష్మదేహీ తు తైజసః ।
స్థూలదేహీ తు విశ్వాఖ్యస్త్రివిధః పరికీర్తితః ॥ (32 - 48)

ఈశసూత్ర విరాట్పదవాచ్యుడైన జీవుడు వ్యష్టిరూపుడు. ఈశ్వరుడు సమష్టిరూపుడు. ఆ సర్వేశ్వరుడు జీవానుగ్రహకాంక్షతో సర్వభోగాశ్రయంగా విశ్వాన్ని సృష్టిస్తాడు. అతడికి ఆ శక్తిని ఇచ్చేది నేనే. ఆ ప్రేరణ కలిగించేదీ నేనే. *(అధ్యాయం - 32, శ్లోకాలు -50)*

మన్మాయాశక్తి సంక్లుప్తం జగత్సర్వం చరాచరమ్ ।
సాపి మత్తః పృథగ్ మాయా నాస్త్యేవ పరమార్థతః ॥

హిమగిరీంద్రా ! ఈ చరాచరజగత్తు అంతా నా మాయాశక్తికి అధీనమే. పరమార్థతః వాస్తవం చెప్పాలంటే నాకంటే మాయ వేరుగా లేదు. నేనే మాయ. వ్యవహారంలోమాత్రం మాయ అనీ విద్య అనీ వేరువేరుగా చెబుతుంటారు. తత్త్వదృష్టిలో ఈ భేదంలేదు. ఉన్నది కేవలం నా తత్త్వమే. సర్వజగత్తునూ సృష్టించి మాయాకర్మాదిసహితనై అందులోకి నేను ప్రాణపురస్సరంగా ప్రవేశిస్తాను. లోకాంతరగతి మొదలైనవన్నీ నా మాయా భేదాలే. ఘటాకాశాదుల్లాగా నేను ఉపాధిభేదాలకు అతీతంగా ఉంటాను. ఉచ్చనీచాది వస్తువులనన్నింటినీ తన వెలుగులతో సమానంగా ప్రకాశింపజేస్తున్నా సూర్యుడికి ఏదోషాలూ ఎలాగ అంటవో అలాగే నాకూ ఎప్పుడూ ఏ దోషాలూ అంటవు.

ఉచ్చనీచాది వస్తూని భాసయన్ భాస్కరో యథా ।
న దుష్యతి తథైవాహం దోషైర్లిప్తా కదాపివ ॥ (33 - 6)

ప్రాలేయాచలా ! బుద్ధ్యాది కర్తృత్వాన్ని కొందరు నాకు అపాదిస్తారు. మరికొందరు ఆత్మ అనీ, ఇంకొందరు కర్మ అనీ నాకు పేర్లుపెడతారు. ఇదంతా మాయాభేదంవల్ల ఏర్పడిన అజ్ఞానభేదం తప్ప మరింకేమీ కాదు. అసలు జీవేశ్వరవిభాగకల్పనమే మాయ. ఘటాకాశ మహాకాశకల్పనవంటిదే ఇదీను. ఇలాంటిదే జీవాత్మ-పరమాత్మ విభాగంకూడా. జీవబహుత్వం మాయవల్ల ఏర్పడేదే తప్ప స్వతస్సిద్ధం కానేకాదు. ఈశ్వరబహుత్వమూ మాయయే. ఆ మాయ దేహేంద్రియాదిసంఘాతభేదభేదిత.

జీవభేదకల్పనకు అవిద్య - హేతువు. గుణాలు వాసనాభేదభేదితాలు. సారాంశంగా చెబుతున్నాను- ఏ భేదకల్పనకైనా హేతువు కేవలం మాయ. మరొకటి కానేకాదు. సృష్టి అంతా నాలో ఓతప్రోతంగా ఇమిడి ఉంటుంది. ఈశ్వరత్వం నాదే. సూత్రాత్మా విరాడాత్మా నేనే. బ్రహ్మ విష్ణు మహేశ్వరులూ వాణీ లక్ష్మీ పార్వతులూ సూర్యచంద్ర తారకాదులు అన్నీ నేనే. పశుపక్షిరూపాలు నావే. చండాలుడూ నేనే. తస్కరుడూ నేనే. బోయవాడూ నేనే. సత్కర్మలూ, దుష్కర్మలూ, క్రూరకర్మలూ అన్నీ నేనే. స్త్రీ పున్నపుంసకాకారాలు సర్వమూ నేనే. సందేహం లేదు. కన్నదికానీ విన్నదికానీ ఏ వస్తువైనా నేనే. లోపలా బయటా అంతటా వ్యాపించి ఉన్నది నేనే.



యచ్చ కించిత్ క్వచిద్వస్తు దృశ్యతే శ్రూయతేఽపి వా ।
అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్యాహం సర్వదా స్థితా ॥ (33 - 16)
న తదస్తి మయా త్యక్తం వస్తు కించిచ్చరాచరమ్ ।
యద్యస్తి చేత్తచ్ఛూన్యం స్యాద్వంధ్యాపుత్రోపమం హి తత్ ॥ (33 - 17)

చరముకానీ అచరముకానీ నేను లేని వస్తువు లేదు. ఒకవేళ ఉంది అంటే అది శూన్య, గొడ్రాలి బిడ్డలాంటిది. ఒకే రజ్జువు సర్పంలాగా మాలికలాగా ఇంకా రకరకాలుగా ఎలా భ్రాంతి కలిగిస్తుందో అలాగే నేనూ ఈశాదిరూపాలతో భాసిస్తూ ఉంటాను. అధిష్ఠానాతిరేకంగా కల్పితవస్తువు ప్రతి భాసించదు. అందుచేత నా అస్తిత్వంతోనే ఈ సృష్టికి అస్తిత్వం. నా సత్తతోనే ఇది సత్తావంతమవుతోంది.

అధిష్ఠానాతిరేకేణ కల్పితం తన్న భాసతే ।
తస్మాత్ మత్సత్తయైవైతత్ సత్తావాన్నాన్యథా భవేత్ ॥ (33 - 19)

## ◆ జగన్మాత - విరాడ్రూప ప్రదర్శన ◆

అమృతోపమమైన దేవీప్రసంగాన్ని హిమవంతుడు శ్రద్ధాళువై ఆలకించాడు. మహాదేవీ! నీవ సమష్టిస్వరూపానివి. దయచేసి ఆ రూపంలోనే దర్శనం అనుగ్రహించు - అని అభ్యర్థించాడు. ఈ అభ్యర్థనకు దేవతలందరూ సంతోషించారు. భక్తుల కోరికలు తీర్చే కామధేనువుకదా జగదంబిక. వెంటనే - పరాత్పరమైన తన విరాడ్రూపాన్ని దర్శింపజేసింది.

ఆకాశమే శిరస్సుగా, సూర్యచంద్రులు నేత్రాలుగా, దిక్కులే చెవులుగా, వేదాలు వాక్కులుగా, వాయువు ప్రాణంగా, విశ్వమే హృదయంగా, పృథివి జఘనంగా, నభస్తలం నాభిగా, జ్యోతిశ్చక్రం వక్షఃస్థలంగా, మహర్లోకం కంఠంగా, జనుర్లోకం ముఖంగా, సత్యతపోలోకాదులు లలాటంగా, ఇంద్రాది దిక్పాలకులు బాహువులుగా, ( శబ్దమే చెవిగా ) అశ్వినీదేవతలు ముకుపుటాలుగా, గంధమే ఘ్రాణంగా, అగ్నియే ముఖంగా, దివారాత్రాలు కనురెప్పలుగా, భ్రూవిజృంభం బ్రహ్మస్థానంగా, జలమే తాలువులుగా, రసమే జిహ్వగా, యముడు దంష్ట్రలుగా, స్నేహకళలే దంతాలుగా, మాయయే హాసంగా, క్రీగంటి చూపులే సృష్టిగా, సిగ్గు పైపెదవిగా, లోభం క్రిందిపెదవిగా, అధర్మమార్గం పృష్ఠభాగంగా, ప్రజాపతి మేహనంగా, సముద్రాలు కుక్షిగా, పర్వతాలు అస్థికలుగా, నదులు నాడీతంత్రులుగా, వృక్షాలు కేశాలుగా, కౌమారయౌవనవార్ధక్యాదివయస్సులు నడకలుగా, మేఘాలు ముంగురులుగా, చంద్రుడు మనస్సుగా, శ్రీమహావిష్ణువు జ్ఞానశక్తిగా, రుద్రుడు అంతఃకరణంగా, అశ్వజాతులు శ్రోణిదేశంగా, అతల కుతలాదిలోకాలు కటిప్రదేశానికి అధోభాగంగా - విరాజిల్లుతున్న మహారూపాన్ని, శ్రీమన్మహాదేవీ విరాడ్రూపాన్ని హిమవంతుడూ సకలదేవతలూ సందర్శించి ఆశ్చర్యచకితులయ్యారు



జ్వాలమాలాసహస్రాఢ్యం లేలిహానం చ జిహ్వయా ।
దంష్ట్రా కటకటారావం వమంతం వహ్నిమక్షిభిః ॥ (33 - 36)

మంటలు ఎగజిముతున్న ముఖం. చప్పరిస్తున్న నాలిక. పళ్ళు పటపటలాడిస్తున్న నోరు. అగ్నులను వెదజల్లుతున్న కన్నులు. రకరకాల ఆయుధాలను ధరించిన చేతులు. బ్రాహ్మణక్షత్రియ ద్రవ్యాలతో రూపుగొన్న వీరత్వం. సహస్ర శీర్షాలు. సహస్ర నయనాలు. సహస్ర చరణాలు. కోటి సూర్యప్రతీకాశమూ విద్యుత్కోటిసమప్రభమూ అయిన తేజోమయరూపం. కన్నులకేకాదు గుండెలకూ భయంగొలిపే ఘోర భీకరభీషణాకారం. దేవతలు కన్నులప్పగించి చూస్తూనే ఉన్నారు. హాహాకారాలు చేస్తూనే ఉన్నారు. ఆ దివ్యతేజస్సును తట్టుకోలేక అందరూ మూర్ఛపోతున్నారు. నాలుగువేదాలు నాలుగుదిక్కులనుంచీ మంత్రాలు చదివి మళ్ళీ అందరినీ స్పృహలోకి తెచ్చి ఊరడించాయి. అప్పటికి ధైర్యం వచ్చింది. చెమ్మగిల్లిన కన్నులతో జీరవోయిన కంఠాలతో సకలదేవతలూ ఆ విరాడ్రూపిణిని స్తుతించారు.

అపరాధం క్షమస్వాంబ పాహి దీనాన్ త్వదుద్భవాన్ ।
కోపం సంహర దేవేశి సభయా రూపదర్శనాత్ ॥ (33- 42)

జగదంబా! మా అపరాధాన్ని క్షమించు. నీబిడ్డలం. దీనులం. రక్షించు. నీ విరాడ్రూపాన్ని చూసి భయంగా ఉంది. దేవేశ్వరీ ! కోపాన్ని విడిచిపెట్టు. నిన్ను ఏమని స్తుతించగలం. మేము దేవతలమే అయినా నిన్ను స్తుతించడం చేతగాని పామరులం. నీ విక్రమం ఏమిటో ఎంతటిదో మాకేకాదు ఎవరికీ తెలియదు. అది పూర్తిగా అజ్ఞేయం. అప్రమేయం. నీ తరువాత నీకు బిడ్డలుగా పుట్టినవాళ్ళం. మాకా తెలిసేది నీ మాహాత్మ్యం! భువనేశ్వరీ! ప్రణవాత్మికా! సర్వవేదాంతసంసిద్ధా! హ్రీంకారమూర్తీ! నమోనమః. సూర్యచంద్రులూ గ్రహనక్షత్రాలూ అగ్నీ ఓషధులూ అన్నీ నీనుంచి ఆవిర్భవించినవే. నువ్వు సర్వాత్మికవు. దేవ మానవదానవ పశుపక్ష్యాదిజాతులన్నీ నీవల్లనేకదా రూపుదాల్చాయి. ప్రాణాపానవ్యానోదానసమాన వాయువులు నువ్వే. పంటలూ పళ్ళూ ఫలాలూ నువ్వే. తపస్సూ సత్యమూ ధ్యానమూ ధ్యేయమూ సమస్తమూ నువ్వే. బ్రహ్మచర్యాదిదీక్షలన్నీ నువ్వే. జగన్మాతా! నమోనమః . సప్తప్రాణాగ్నులూ సప్తసమిధలూ సప్తహోమాలూ సప్తలోకాలూ నువ్వే. సముద్రాలూ నదులూ గిరులూ సర్వరసరూపగంధాలూ అన్నీ నువ్వే. యజ్ఞాలూ యూపాలూ దక్షిణలూ దీక్షలూ ఋగ్యజుస్సామలూ సర్వస్వమూ నువ్వే. సర్వాత్మకవైన నీకు అన్ని వైపులా నమస్కరిస్తున్నాము. మళ్ళీమళ్ళీ నమస్కరిస్తున్నాము.

నమః పురస్తాత్ పృష్ఠే చ నమస్తే పార్శ్వయోర్ద్వయోః ।
అధ ఊర్ధ్వం చతుర్దిక్షు మాతర్భూయో నమోనమః ॥ (33 - 52)



దేవేశీ ! ఈ అలౌకిక దివ్యరూపాన్ని దయచేసి ఉపసంహరించు. సౌమ్యసుందర రూపాన్నే మళ్ళీ ధరించి దర్శనం అనుగ్రహించు - అంటూ దేవతలు చేసిన అభ్యర్థనను జగదీశ్వరి మన్నించింది. భయపడ్డారని గ్రహించింది. కృపాసింధువు కనుక ఘోరరూపాన్ని వెంటనే ఉపసంహరించి సౌమ్య సుందరాకారంలో చిరునవ్వులు చిందిస్తూ నిలిచింది. పాశాంకుశవరాభయహస్తాలతో సర్వాంగకోమలమూ కరుణాపూర్ణనయనమూ మందస్మితముఖాంబుజమూ అయిన రూపాన్ని దర్శించి బుధులూ హిమవంతుడూ భయంనుంచి తెప్పరిల్లారు. శాంతచిత్తులై స్తుతిస్తూ సాష్టాంగపడ్డారు.

***( అధ్యాయం - 33, శ్లోకాలు - 56 )***

అప్పుడు ప్రసన్నగంభీరస్వరంతో మహాదేవి అందరినీ సంబోధించి ఊరడించింది. దేవతలారా! నా విరాడ్రూపం మీకు అందేదికాదు. మీ పట్ల వాత్సల్యంకొద్దీ నేనుగా దర్శనం అనుగ్రహించానంతే. వేదాలు వల్లించినా యాగాలూ యోగాలూ సాగించినా దానాలు దొర్లించినా ఎవరికీ నా విరాడ్రూప సందర్శన మహాభాగ్యం లభించదు. కేవలం నా అనుగ్రహం ఒక్కటే సాధనం. విరాడ్రూపమేమిటి ఈ రూపమైనా అంతే.

వ వేదాధ్యయనైర్యోగైర్న దానై స్తపసేజ్యయా ।
రూపం ద్రష్టుమిదం శక్యం కేవలం మత్కృపాం వినా ॥ (34 - 2)

## ◆ జగన్మాత - తత్త్వబోధ ◆

హిమగిరీంద్రా ! పరమాత్మయే ఉపాధియోగంతో జీవాత్మతను పొంది ధర్మాధర్మహేతువులైన వివిధ క్రియలను తాను కర్తయై చేస్తాడు. అనేక జన్మలను పొందుతాడు. సుఖదుఃఖాలను అనుభవిస్తాడు. పూర్వజన్మల సంస్కారాన్నిబట్టి మరిన్ని కర్మలను ఆచరిస్తాడు. మరిన్ని జన్మలను ఎత్తుతాడు. ఇది ఒక ఘటీ యంత్రం. దీనికి విరామం లేదు. అజ్ఞానమే మూలం. దానివల్లనే కోరికలు. కోరికలనుంచి క్రియలు (పనులు). అందుచేత అజ్ఞానాన్ని నశింపజేసుకోవడానికి నిరంతరం ప్రయత్నించాలి. అజ్ఞాననాశమే జన్మసాఫల్యం. పురుషార్థసమాప్తి జీవన్ముక్తులు అజ్ఞాననాశనంతోనే సాధ్యమవుతాయి. అయితే ఈ అవిద్య (అజ్ఞానము) అనేది చాలా గట్టిదినుమా ! అవిరుద్ధమైన సత్కర్మలపట్ల ఆశ ఉండదు. అజ్ఞాననాశనంమీద కోరిక పుట్టదు. అనర్థదాయకాలైన కర్మలవైపే మాటిమాటికీ పరుగులు. వాటివల్ల రాగమూ, రాగంవల్ల దోషమూ దానినుంచి అనర్థమూ తప్పవు. అందుచేత చాలా గట్టి ప్రయత్నం చేసి జ్ఞానాన్ని సంపాదించుకోవాలి. అజ్ఞానాన్ని నిర్మూలించుకోవాలి. కర్మలు చెయ్యక తప్పదు. సత్కర్మలు అవశ్య కర్తవ్యాలు. కానీ కైవల్యమనేది కేవలం జ్ఞానంవల్లనే. దాని సిద్ధికి హితకారులై సత్కర్మలు సహాయపడతాయి.



జ్ఞానాదేవ హి కైవల్యమతః స్యాత్తత్సముచ్చయః ।
సహాయతాం వ్రజేత్కర్మ జ్ఞానస్య హితకారి చ ॥ (34 - 12)

నగరాజా ! జ్ఞానంవల్ల హృదయగ్రంథిభేదనం అవుతుంది. దానినుంచి కర్మ సంభవిస్తుంది. ఇవి రెండూ చీకటి వెలుగుల్లాంటి విరుద్ధాంశాలు కనక వీటికి యౌగపద్యం లేదా ఐకమత్యం - అసంభవం. అందుచేత వైదిక సత్కర్మలను వేటినైనా చిత్తశుద్ధి సంపాదనకోసమని తావత్పర్యంతమే సప్రయత్నంగా ఆచరించాలి. శమము దమము తితిక్ష (ఓర్పు) వైరాగ్యము సాత్త్వికత - ఇవి సిద్ధించేవరకే సత్కర్మాచరణం. అటుపైని అవసరం లేదు. సన్యసించాలి. ఆత్మజ్ఞుడై శ్రోత్రియుడూ బ్రహ్మనిష్ఠా గరిష్ఠుడూ అయిన గురువును నిర్వ్యాజభక్తితో సమాశ్రయించాలి. నిరంతరం ఏకాగ్రచిత్తంతో వేదాంతశ్రవణం చెయ్యాలి. తత్త్వమ్ అసి - వంటి మహావాక్యాలను గురించి (విచారణ చెయ్యాలి) లోతుగా ఆలోచించాలి. ఈ వాక్యం జీవబ్రహ్మైక్య బోధకం. ఆ సమైక్యం బోధపడితే అతడు నిర్భయుడై నా రూపాన్ని పొందుతాడు. దీనిలో ముందుగా పదార్థావగతి కలగాలి. అటుపైని వాక్యార్థావగతి. తత్ పదానికి వాచ్యార్థం నేనే. త్వత్పదానికి వాచ్యార్థం - జీవుడు. ఈ రెండింటి ఐక్యాన్నీ అసి పదం బోధిస్తోంది - అంటున్నారు పండితులు. అయితే విరుద్ధమైన ఈ వాచ్యార్థాలకు ఐక్యం ఎలా సంభవం ? అందుకని లక్షణావృత్తిని ఆశ్రయించి తత్ త్వమ్ పదార్థాలకు ఐక్యాన్ని సంఘటపరచాలి.

వాచ్యార్థయోర్విరుద్ధత్వాదైక్యం నైవ ఘటేత హ ।
లక్షణాతః ప్రకర్తవ్యా తత్త్వమోః శ్రుతిసంస్థయోః ॥ (34 - 22)

ఈ రెండు పదాలకూ లక్ష్యార్థం చిన్మాత్రమే కనక ఐక్యం సుసంభవమవుతుంది. ఈ ఐక్యాన్ని తెలుసుకున్న నరుడు స్వాభేదంగా అద్వయుడు అవుతాడు. (స ఏవాయం దేవదత్తః అన్నట్టు ఉంటుంది లక్షణావృత్తి) స్థూలాదిదేహరహితుడై బ్రహ్మత్వం పొందుతాడు. పంచీకృత మహాభూత సంభూతమైన స్థూలదేహం ఒక భోగాలయం. జరావ్యాధిసంయుతం. సర్వకర్మలకూ నిలయం. నిజానికి ఇదొక మిథ్యయే అయినా మాయామయత్వంవల్ల స్ఫుటంగా భాసిస్తుంది. ఇది ఆత్మకు (నాకు) స్థూలోపాధి. జ్ఞానేంద్రియ కర్మేంద్రియ ప్రాణపంచకసమాయుక్తమై మనోబుద్ధులతో కూడినది సూక్ష్మోపాధి. ఇది అపంచీకరణంతో ఆత్మకు ఏర్పడిన సూక్ష్మదేహం. రెండవ ఉపాధి. సుఖదుఃఖానుభవాలకు అవబోధకం. అనాదీ అనిర్వాచ్యమూ అయిన అజ్ఞానం మూడవది. దీనినే కారణదేహమంటారు. ఈ ఉపాధులు నశించిపోతే కేవలాత్మ మిగులుతుంది. ఈ మూడుదేహాలలోనూ పంచకోశాలు అంతస్థితాలై సర్వదాఉంటాయి పంచకోశ పరిత్యాగంతో బ్రహ్మపుచ్ఛం లభిస్తుంది. నేతినేతి వాక్యాలద్వారా చెప్పబడే నా రూపమే అది చావుపుట్టుకలు లేనిది. అజము. నిత్యము. శాశ్వతము. శరీరం (ఉపాధి) మరణించినా అది మరణించదు



చంపదు. చావదు. చంపబడదు. ఇది ఆత్మతత్త్వం. ఇది చిన్నవాటిలోకెల్లా చిన్నది. పెద్దవాటిల్లోకెల్లా పెద్దది. ప్రాణికోటి ఆత్మ - గుహలో భద్రంగా నిక్షిప్తమైన రహస్యం. దీని మహిమను బ్రహ్మానుగ్రహం పొందిన వీతశోకుడే తెలుసుకోగలడు.

అణోరణీయాన్ మహతో మహీయాన్ ఆత్మాస్యజంతోర్నిహితం గుహాయామ్ ।
తమక్రతుః పశ్యతి వీతశోకో ధాతుః ప్రసాదాన్మహిమానమస్య ॥ (34 - 34)

పర్వతరాజా ! స్పష్టప్రతిపత్తికోసం మరొక పోలిక చెబుతున్నాను. ఆత్మను రథికుడుగా గ్రహించు. శరీరమే రథం. బుద్ధి - సారథి. మనస్సు కళ్ళెం. ఇంద్రియాలు గుర్రాలు. ఇంద్రియమనోయుక్తమైన ఆత్మను భోక్త అంటారు. అవిద్వాంసుడూ అమనస్కుడూ అశుచి అయినవాడూ తత్పదా(ర్థా)న్ని తెలుసుకోలేడు. సంసారంలోనే పడి కొట్టుకుంటూ ఉంటాడు. విద్వాంసుడూ సమనస్కుడూ ఎల్లవేళలా శుచి అయినవాడూ తత్పదాన్ని పొందుతాడు. అతడికింక పునర్జన్మ ఉండదు. విజ్ఞానమనే సారథి ఉండి మనస్సు అనే కళ్ళేన్ని చేతబట్టుకుని రథాన్ని నడిపించుకున్నవాడు గమ్యమైన పరమపదాన్ని చేరుకుంటాడు. ఇలా శ్రుతితో మతితో ఆత్మను ఆత్మతో నిశ్చయించుకుని నన్ను ఆత్మరూపంగా భావించినవాడు జీవన్ముక్తుడు.

విజ్ఞానసారథిర్యస్తు మనః ప్రగ్రహవాన్నరః ।
సోఽధ్వనః పరమాప్నోతి మదీయం యత్పరం పదమ్ ॥ (34 - 39)

## ◆ జగన్మాత యోగబోధ ◆

ఇదేకాక నన్ను తెలుసుకోడానికి నిధిధ్యాసాదిరూపమైన యోగమార్గం మరొకటి ఉంది. ఈ మార్గంలో తొట్టతొలిని అక్షరత్రయాత్మకమైన దేవీప్రణవ సంజ్ఞను ధ్యానించాలి. హకారమేమో స్థూలదేహం. రకారం సూక్ష్మదేహం. ఈకారం కారణ శరీరం. కలిసి హ్రీంకారం నా ప్రణవసంజ్ఞ. ఇదేవిధంగా సమష్టిదేహంలోకూడా బీజత్రయాన్ని గుర్తెరిగి సమష్టి వ్యష్టిదేహాలకు ఐక్యాన్ని సంభావించాలి. సమాధ్యవస్థకు ముందు ఇలా భావించి అటుపైని కళ్ళుమూసుకుని ఇంద్రియనిగ్రహంతో జగదీశ్వరినైన మహాదేవిని నన్ను ధ్యానించాలి.

హకారః స్థూలదేహః స్యాద్రకారః సూక్ష్మదేహకః ।
ఈకారః కారణాత్మాసౌ హ్రీంకారోఽహం తురీయకమ్ ॥ (34 - 42)
ఏవం సమష్టిదేహేఽపి జ్ఞాత్వా బీజత్రయం క్రమాత్ ।
సమష్టి వ్యష్ట్యోరేకత్వం భావయేన్మతిమాన్నరః ॥ (34 - 43)



నాసాభ్యంతరచారిణులైన ప్రాణాపానవాయువులను సమాలుచేసి విషయవాంఛా విహీనుడై, దోషరహితుడై, విమత్సరుడై నిర్వ్యాజమైన భక్తితో నిశ్శబ్దనిర్మలమైన ఒక గుహలో పద్మాసనసంస్థితుడై - హకారమైన విశ్వాత్మను రకారంలోనూ, రకారమైన దేవతేజస్సును ఈకారంలోనూ, ఈకారమైన ప్రాజ్ఞాత్మను హ్రీంకారంలోనూ నింపాలి. వాచ్యవాచకతారహితమూ ద్వైతభావవివర్జితమూ అఖండమూ అయిన సచ్చిదానందరూపాన్ని దాని శిఖాగ్రభాగాన భావించాలి. ఇటువంటి ధ్యానంతో నన్ను సాక్షాత్కరింపజేసుకున్న నరోత్తముడు నా రూపాన్ని పొందుతాడు. తక్షణమే అజ్ఞానం నశించి నాతో అభిన్నుడవుతాడు.

***(అధ్యాయం - 34, శ్లోకాలు - 50)***

మహాదేవీ ! యోగవిద్యను సాంగోపాంగంగా వివరించు. నీ తత్త్వాన్ని సంపూర్ణంగా తెలుసుకోవడానికి నాకు యోగ్యత కల్పించు - అని హిమవంతుడు ప్రార్థించాడు. జగదంబిక వివరించింది-

హిమనగేంద్రా ! యోగమంటే ఎక్కడో ఆకాశంలోనో భూమిలోనో పాతాళంలోనో లేదు. జీవాత్మ పరమాత్మల సమైక్యమే యోగం. యోగవిశారదులు ఇదే చెప్పారు. చెబుతున్నారు.

**న యోగో నభసః పృష్ఠే న భూమౌ న రసాతలే ।**
**ఐక్యం జీవాత్మనోరాహుర్యోగం యోగవిశారదాః ॥** **(35 - 2)**

యోగానికి విఘ్నకారులు ఆరున్నాయి. కామక్రోధాలు, లోభమోహాలు, మదమాత్సర్యాలు. యోగాంగాలతోనే వాటిని ఛేదించి యోగులు యోగసిద్ధిని పొందుతున్నారు. యోగాంగాలు ఎనిమిది. యమ - నియమ - ఆసన - ప్రాణాయామ - ప్రత్యాహార - ధారణ - ధ్యాన - సమాధులు. వీటిలో కొన్నింటికి మళ్ళీ ఉపాంగాలు ఉన్నాయి. అహింస, సత్యం, అస్తేయం (దొంగతనం చెయ్యకుండా ఉండటం), బ్రహ్మచర్యం, దయ, ఋజుత్వం, క్షమ, ధృతి, మితాహారం, శౌచం - ఇవి పదీ యమాంగాలు. తపస్సు, సంతోషం, ఆస్తిక్యం (దైవం ఉన్నాడన్న భావన), దానం, దేవపూజ, సిద్ధాంత శ్రవణం, హ్రీ (సిగ్గు), మతి, జపం, హోమం - ఇవి పదీ నియమాంగాలు. పద్మాసనం, స్వస్తికం, భద్రం, వజ్రాసనం, వీరాసనం - ఇవి అయిదూ యోగాసనాలు.

పాదతలాలు కుడియెడమల తొడలమీదకు వచ్చేట్టు కాళ్ళు మడిచి, బొటనవేళ్ళను అలాగే వ్యుత్క్రమంగా (కుడిచేత్తో ఎడమబొటనవేలు, ఎడమచేత్తో కుడిబొటనవేలు) పట్టుకుని నిటారుగా కూర్చుంటే ఇది పద్మాసనం. యోగులకు చాలా హృదయంగమమైన ఆసనం ఇది. పాదతలాలు తొడలకూ పిక్కలకూ మధ్యలోకి వచ్చేట్టు కాళ్ళు మడిచి, నడుం నిలబెట్టి కూర్చుంటే అది స్వస్తికాసనం.



ఊర్వోరుపరి విన్యస్య సమ్యక్పాదతలే శుభే ॥
అంగుష్ఠౌ చ నిబధ్నీయాత్ హస్తాభ్యాం వ్యుత్క్రమాత్తతః ।
పద్మాసనమితి ప్రోక్తం యోగినాం హృదయంగమమ్ ॥
జానూర్వోరంతరే సమ్యక్కృత్వా పాదతలే శుభే ।
ఋజుకాయో విశేద్యోగీ స్వస్తికం తత్ప్రచక్షతే ॥ (35 - 10, 11)

పాదతలాలు పిర్రలకిందకి చేర్చి చేతుల్ని మోకాళ్ళపై ఆన్చి నిటారుగా కూర్చుంటే అది భద్రాసనం. ఊరువుల మీదకి పాదాలు వచ్చేట్టు కూర్చుని మోకాళ్ళపైని చేతులు ఆనించి నడుం నిలబెడితే అది వజ్రాసనం. ఒక పాదతలం ఎదుటి తొడకిందకీ, మరోటి ఎదుటి తొడమీదకీ చేర్చి ఋజుకాయుడై (నిటారుగా శరీరం నిలిపి) కూర్చుంటే అది వీరాసనం.

సీవన్యాః పార్శ్వయోర్న్యస్య గుల్ఫయుగ్మం సునిశ్చితమ్ ।
వృషణాధః పాదపార్ష్ణీ పార్ష్ణిభ్యాం పరిబంధయేత్ ॥
భద్రాసనమితి ప్రోక్తం యోగిభిః పరిపూజితమ్ ।
ఊర్వోః పాదౌ క్రమాన్న్యస్య జాన్వోః ప్రత్యఙ్ముఖాంగులీ ॥
కరౌ విదధ్యాదాఖ్యాతం వజ్రాసనమనుత్తమమ్ ।
ఏకం పాదమధః కృత్వా విన్యస్యోరుం తథోత్తరే ।
ఋజుకాయో విశేద్యోగీ వీరాసనమితీరితమ్ ॥ ( 35 - 12 నుంచి 15 )

ఈ అయిదింటిలో ఏదో ఒక ఆసనం వేసుకుని కూర్చుని ప్రాణాయామం చెయ్యాలి. ఇడ ద్వారా (ముక్కు ఎడమ రంధ్రం) గాలిని పదహారుమాత్రలకాలం లోపలికి పీల్చాలి. అరవైనాలుగుమాత్రల కాలం ఊపిరితిత్తులలో బంధించాలి. అది సుషుమ్నకు మధ్యప్రదేశం. పింగళనాడి ద్వారా (ముక్కు కుడిరంధ్రం) ఆ గాలిని ముప్ఫయిరెండు మాత్రలకాలం మెల్లగా నిశ్వసించాలి. వీటినే పూరక - కుంభక - రేచకాలు అంటారు. ఇది మొత్తం కలిపి ప్రాణాయామం. దీన్ని మళ్ళీమళ్ళీ చేస్తూ అభ్యాసమైనకొద్దీ మాత్రల (కాలాన్ని) సంఖ్యను పెంచుకుంటూ వెళ్ళాలి. (పూరకకుంభకరేచకాల నిడివిని కాలక్రమాన పెంచుకోవాలని). మాత్రకాలమంటే ఒక లిప్త. ఓంకారాన్ని సాధారణంగా ఉచ్చరించడానికి పట్టే సమయం ఒక లిప్త.

జపధ్యానాదులతో కలిపి చేస్తే ఈ ప్రాణాయామాన్ని సగర్భం అంటారు. అవి లేకుండా విడిగా చేస్తే విగర్భం అంటారు. క్రమంగా అభ్యాసవశాన ప్రాణాయామాల సంఖ్యా సమయమూ పెరిగినకొద్దీ శరీరంలో మార్పులు వస్తాయి. ముందుగా చెమటలు పొయ్యటం మొదలవుతుంది. ఇది అధమ స్థితి.



అటుపైని శరీరం వణుకుతుంది. ఇది మధ్యమ దశ. శరీరం నేలను విడిచి పైకి లేస్తుంది - ఇది ఉత్తమ స్థాయి.

క్రమాదభ్యస్యత: పుంసో దేహస్వేదోద్గమోఽధమ: ।
మధ్యమ: కంపసంయుక్తో భూమిత్యాగ: పరో మత: ॥ (35 - 20)

స్వేచ్ఛగా విషయసుఖాలవెంట పరుగులు తీసే ఇంద్రియాలను ప్రయత్నించి వెనక్కు మరల్చడమే ప్రత్యాహారమంటే. ప్రాణవాయువును అంగుష్ఠ - గుల్ఫ - జాను - ఊరు - మూలాధార - లింగ - నాభి - హృదయ - గ్రీవా - కంఠ - లంబికా - నాసికా - భ్రూమధ్య - మస్తక - మూర్ధ - ద్వాదశాంత (విశుద్ధి చక్రం) ప్రదేశాలలో యథావిధిగా ధారణచెయ్యడాన్ని (నిలపడాన్ని) ధారణ అంటారు. చైతన్యాంతరవర్తియైన ఏకాగ్రచిత్తంతో ఆత్మలో ఇష్టదైవాన్ని ధ్యానించడమే ధ్యానమంటే. జీవాత్మపరమాత్మలకు సమత్వభావనను సమాధి అంటారు. ఇది అష్టాంగ లక్షణం.

## ◆ మంత్రయోగ ప్రబోధం ◆

ఇంక ఇప్పుడు మంత్రయోగం గురించి చెబుతున్నాను ఆలకించు. జీవబ్రహ్మైక్యరూపకంగా చంద్రసూర్యాగ్నితేజస్సులతో పంచభూతాత్మకమైన ఈ శరీరం ఉందే దీన్నే విశ్వం అంటారు. విశ్వానికీ శరీరానికీ అభేదం. శరీరంలో ముప్ఫయికోట్ల యాభైలక్షల నాడులు ఉన్నాయి. వాటిలో పది ప్రధానమైనవి. మూడు ఇంకా ముఖ్యమైనవి. (చంద్రసూర్యాగ్నిరూపిణి అయిన) మేరుదండానికి (వెన్నెముక) ఎడమవైపున ఇడానాడి ఉంటుంది. ఇది చంద్రరూపిణి. శక్తి రూపిణి. సాక్షాత్తు అమృతవిగ్రహ. కుడివైపున పింగళానాడి ఉంటుంది. ఇది పురుషరూప. సూర్యవిగ్రహ. ఈ రెండింటికీ నడుమగా సర్వతేజోమయమైన సుషుమ్నానాడి ఉంటుంది. ఇది అగ్నిరూప. దీని మధ్యలో ఇచ్ఛాజ్ఞానక్రియాత్మకమై స్వయంభూలింగం కోటి సూర్యసమప్రభంగా విరాజిల్లుతూ ఉంటుంది. దీనిమీద బిందునాదోపేతమై శివాత్మకమై మాయాబీజం ఉంటుంది. దానిమీద శిఖాకారంలో ఎర్రని రంగులో (రక్త విగ్రహ) నా అంశగా కుండలినీశక్తి ఉంటుంది. దానికి వెలుపల బంగారపు రంగులో నాలుగురేకుల పద్మం ఉంటుంది (ధ్యానించు). వ - శ - ష - స అనే అక్షరాలు వరసగా ఆ దళాలమీద ఉంటాయి. దానిమీద ఆరురేకుల మరోపద్మం ఉంటుంది. వజ్రప్రభలు విరజిమ్ముతూ అగ్నిలా ఉంటుంది. బకారంతో మొదలుపెట్టి లకారంవరకూ ఆరు అక్షరాలూ ఆరురేకులు మీదా ఉంటాయి. దీనినే ఆధారషట్కానికి మూలమైన మూలాధార చక్రం అంటారు. దీనికే స్వాధిష్ఠానమనీ పేరు. ఇక్కడ స్వశబ్దానికి "పరం" అని అర్థం. పరముడికి అధిష్ఠానం కనక స్వాధిష్ఠానం అంటున్నారు.



మూలమాధారషట్కస్య మూలాధారం తతో విదుః ।
స్వశబ్దేన పరం లింగం స్వాధిష్ఠానం తతో విదుః ॥ (35 - 36)

దీనికి పైని నాభిప్రదేశంలో మణిపూరం ఉంటుంది. అది మెరుపులతోకూడిన మేఘంలాగా మహాప్రభలు విరజిమ్ముతూ ఉంటుంది. అక్కడి పద్మం మణిమయకాంతులతో విరాజిల్లుతూంటుంది. అందుకని మణిపద్మం అనికూడా అంటారు. దీనికి పది దళాలుంటాయి. డకారం మొదలు ఫకారం వరకూ వాటిమీద అక్షరాలు ఉంటాయి. దీనికి అధిష్ఠాత విష్ణువు. ఇది విష్ణ్వాలోకన కారణం. దీనిపైని ఉంటుంది - అనాహత చక్రం. ఉదయసూర్యప్రభలు విరజిమ్ముతూ పన్నెండురేకుల పద్మం ఇది. కకారం మొదలు ఠకారం వరకూ అక్షరాలు ఉంటాయి. దీని మధ్యలో కోటిసూర్యప్రభలతో బాణలింగం ఉంటుంది. ఈ చక్రం శబ్దబ్రహ్మమయం. అందుకే శబ్దానాహతమనీ అంటారు మునీశ్వరులు. ఇది ఆనందసదనం. పురుషాధిష్ఠితం. దీనిపైని పదహారురేకుల పద్మం - విశుద్ధచక్రం. పదహారు అచ్చులూ పదహారు రేకులమీద ఉంటాయి. ఇది ధూమ్రవర్ణంలో ఉంటుంది. హంసాలోకనంతో జీవుడికి విశుద్ధిని కలిగిస్తుంది కనక దీనికి ఆ పేరు ఏర్పడింది. దీనినే కొందరు ఆకాశచక్రమనీ అంటారు. దీనిపైది ఆజ్ఞా చక్రం. ఆత్మాధిష్ఠితం. అక్కడ ఆజ్ఞాసంక్రమణం జరుగుతుంది కనక దీనికి ఆ పేరు సార్థకం. ఇక్కడ పద్మానికి రెండే రేకులు. వాటిమీద హకారమూ క్షకారమూ ఉంటాయి. ఇది చాలా మనోహరమైన పద్మం. దీనిపైని కైలాసచక్రం అటుపైని రోధినీచక్రం ఉంటాయి. ఈ ఆధారచక్రాలు దాటిన తరవాత సహస్రారయుతమైన బిందుస్థానం ఉంటుంది.

## ◆ వాయు ధారణ ◆

హిమగిరీంద్రా! ఇది ఉత్తమోత్తమమైన యోగమార్గం. ముందుగా పూరకయోగంతో మనస్సును ఆధారచక్రంలో సంయోజించాలి (నిలపాలి). గుద మేఢ్రాంతరంలో ఉన్న శక్తిని ఆకుంచించి నిద్రలేపాలి. ఆ శక్తిని లింగభేదక్రమంలో (వరసగా ఆయా చక్రాల గుండా) తీసుకువెళ్ళి బిందుచక్రాన్ని పొందించాలి. ఆ పరాశక్తి శంభునితో ఏకీభూతమైనట్టు భావన చెయ్యాలి.

ఆదౌ పూరకయోగేనాప్యాధారే యోజయేన్మనః ।
గుదమేఢ్రాంతరే శక్తిస్తామాకుంచ్య ప్రబోధయేత్ ॥
లింగభేదక్రమేణైవ బిందుచక్రం చ ప్రాపయేత్ ।
శంభునా తాం పరాశక్తిమేకీభూతాం విచింతయేత్ ॥ (35 - 49)



అప్పుడు అక్కడ లాక్షారసోపమమైన (లత్తుకలాంటి) అమృతం ఆవిర్భవిస్తుంది. దానిని యోగసిద్ధిదమూ మాయాఖ్యమూ అయిన ఆ శక్తికి తాపించాలి. షట్చక్రదేవతలకూ ఆ అమృతధారలతో సంతర్పణ చెయ్యాలి. అటుపైని ఆ శక్తిని అదే మార్గంలో తెచ్చి మూలాధారంలో ప్రవేశపెట్టాలి. ఇలా నిశ్చలచిత్తంతో నిత్యమూ అభ్యసించేవారికి సకలమంత్రాలూ సిద్ధిస్తాయి. జరామరణదుఃఖాదులు దరిచేరవు. భవబంధనాలు తెగిపోతాయి. జగన్మాతగా నాకున్న గుణాలన్నీ శక్తులన్నీ యథాతథంగా ఆ సాధకుడికి సంక్రమిస్తాయి.

యే గుణాస్సంతి దేవ్యా మే జగన్మాతుర్యథా తథా ।
తే గుణాస్సాధకవరే భవంత్యేవ న చాన్యథా ॥ (35 - 54)

నాయనా, హిమాలయా! ఉత్తమోత్తమమైన వాయుధారణ విధానాన్ని చెప్పాను. గ్రహించావుకదా! ఇక ఇప్పుడు మంత్రధారణ విధానం చెబుతున్నాను. ఆలకించు.

## ◆ మంత్రధారణ ◆

దిక్కాలాద్యనవచ్ఛిన్నమైన దేవీతత్త్వంలో చిత్తాన్ని లగించి జీవబ్రహ్మైక్యయోజనతో యోగీశ్వరుడు తన్మయుడు (దేవీతత్త్వమయుడు) అవుతాడు. మలినమైన చేతస్సుకి ఇది లభించదు. అటువంటప్పుడు అవయవయోగంతో అభ్యాసం చెయ్యాలి. నా మధురమైన హస్తపాదాద్యవయవాలలో చిత్తాన్ని నిలబెట్టి ధ్యానిస్తూ స్థానస్థానజయం పొందాలి. అలా చిత్తాన్ని విశుద్ధం చేసుకుని అందులో మొత్తం నారూపాన్ని ప్రతిష్ఠించుకోగలగాలి. అలాగ సంవిత్స్వరూపిణినైన నాలో మనస్సు లయమయ్యేంతవరకూ ఇష్టమంత్రాన్ని జపిస్తూ హోమాదికాల అభ్యాసాన్ని కొనసాగించాలి. మంత్రాభ్యాసమూ యోగాభ్యాసమూ ఇవి రెండూ జతగా సాగాలి. సాగితే జ్ఞేయవస్తువును గురించిన జ్ఞానం కలుగుతుంది. యోగం లేని మంత్రంగానీ, మంత్రం లేని యోగంగానీ బ్రహ్మసిద్ధిని కలిగించలేవు.

న యోగేన వినా మంత్రో న మంత్రేణ వినా హి సః ।
ద్వయోరభ్యాసయోగో హి బ్రహ్మసంసిద్ధికారణమ్ ॥ (35 - 60)

చీకటింటిలో దీపంతో కుండ కనిపించినట్టు మంత్రంతో మాయావృతుడైన ఆత్మ (పరమాత్మ) గోచరుడవుతాడు. (మనుః = మంత్రః )

తమః పరివృతే గేహే ఘటో దీపేన దృశ్యతే ।
ఏవం మాయావృతో హ్యాత్మా మనునా గోచరీకృతః ॥ (35 - 61)



సాంగోపాంగంగా యోగమార్గమంతా నీకు విశదపరిచాను. ఇది గురూపదేశంతో తెలుసుకోదగిందే తప్ప శాస్త్రగ్రంథాలతో తెలిసేది కాదు. ఈ మాటను గుర్తించడం చాలా అవసరం.***(అధ్యాయం - 35, శ్లోకాలు - 65)***

శైలాధిరాజా ! యోగాసనసంస్థితుడై నిర్వ్యాజమైన భక్తితో బ్రహ్మరూపిణినైన నన్ను ధ్యానించాలి. బ్రహ్మపదార్థమంటే అది నిత్య సన్నిహితం. గుహాచరం. మహత్పదం. సదసద్వరేణ్యం. విజ్ఞానవరిష్ఠం. అర్చిష్మంతం. అణువులలోకెల్లా అణువు. మహత్తులలోకెల్లా మహత్తు. సమస్తలోకాలూ సకల ప్రాణులూ అందులోనే ఉన్నాయి. అది అక్షరం. అది ప్రాణం. అవాఙ్మానసగోచరం. అది సత్యం. అది అమృతం. సౌమ్యుడా ! ఇది తెలుసుకో.

ఔపనిషదమైన ధనుస్సును స్వీకరించి సునిశితమైన ఉపాసనాశరాన్ని మహాస్త్రంగా సంధించి మనస్సును వొంచి అక్షరపరబ్రహ్మను లక్ష్యంగా నిర్ధారించుకోవాలి. ప్రణవమే ధనుస్సు. ఆత్మయే బాణం. బ్రహ్మ - లక్ష్యం. జాగరూకుడై బాణంలా తన్మయుడై లక్ష్యాన్ని ఛేదించాలి.

ప్రణవో ధనుః శరో హ్యాత్మా బ్రహ్మ తల్లక్ష్యముచ్యతే ।
అప్రమత్తేన వేద్ధవ్యం శరవత్తన్మయో భవేత్ ॥ (36 - 6)

భూమి ఆకాశం అంతరిక్షం సకలప్రాణాలూ అన్నీ ఒక్క ఆత్మగా తెలుసుకో. తక్కిన మాటలన్నీ విడిచిపెట్టేసెయ్యి. ఇదే అమృతోపలబ్ధికి సేతువు. రథచక్రనాభికి (కుండ - అర్థ) కమ్మీలన్నీ అనుసంధానమై ఉన్నట్టు శరీరంలో నాడులన్నీ ఆత్మతో ముడిపడి ఉంటాయి. వాటి మధ్యలో ఆత్మ సంచరిస్తూ ఉంటుంది. ఓమ్ అనే ఏకాక్షర మహాప్రణవాన్ని ధ్యానించు. నీకు శుభమవుతుంది. చీకటి సముద్రాన్ని తరిస్తావు. ఆ దివ్యమైన బ్రహ్మపురంలో ఆకాశాన ఆత్మ సంప్రతిష్ఠితమై ఉంటుంది. అది మనోమయం. ప్రాణశరీరనేత. అన్నమయకోశంలోనూ సన్నిధి చేసి ఉంటుంది. అమృతమూ ఆనందరూపమూ అయిన ఆ బ్రహ్మపదార్థాన్ని ఆత్మతత్త్వాన్ని ధీరులే తెలుసుకోగలరు. తెలుసుకున్నవారికి హృదయగ్రంథి విచ్చుకుంటుంది. సర్వసంశయాలూ పటాపంచలవుతాయి. సకలకర్మలూ క్షీణిస్తాయి.

## ◆ బ్రహ్మవిద్య ◆

హిరణ్మయకోశంలో ఈ బ్రహ్మ విరజంగా నిష్కలంగా భాసిస్తుంది. అది అత్యంత పరిశుభ్రం. వెలుగులకే వెలుగు - అని ఆత్మవేత్తలు చెబుతున్నారు. అక్కడ సూర్యుడు ప్రకాశించడు. చంద్రతారకలు ఉండవు. మెరుపులు ఆనవు. అది ఒక మహాగ్ని. దాని కాంతులతోనే మిగతావి కాంతిమంతాలు అవుతాయి. అది బ్రహ్మ. ముందూ వెనకా అన్నివైపులా కిందాపైనా అంతటా బ్రహ్మ. ఈ విశ్వమే బ్రహ్మ. ఇటువంటి అనుభవం ఏ యోగీశ్వరుడికి కలుగుతుందో అతడు కృతార్థుడు. అతడు నరోత్తముడు. అతడే



బ్రహ్మభూతుడు. ప్రసన్నాత్ముడు. అతడు దేనికీ శోకించడు. దేనినీ కాంక్షించడు. తనకు భిన్నంగా రెండవది ఉన్నప్పుడూ, ఉంది అనుకున్నప్పుడూకదా భయం వేసేది. అటువంటిది లేకపోవడంవల్ల (బ్రహ్మాభిన్నుడు కనక. సర్వత్రా బ్రహ్మనే చూస్తున్నాడు కనక) బ్రహ్మవేత్త దేనికీ భయపడడు. అతడి వియోగం (ఎడబాటు) నాకు లేదు. నా వియోగం అతడికి లేదు. నేనే అతడు. అతడే నేను. ఇది నిశ్చయం. అతడిని దర్శించడమే నన్ను దర్శించడం. (మద్దర్శనం తు తత్రస్యాద్యత్ర జ్ఞానీ స్థితో మమ 36 - 17).

పర్వతరాజా ! నిజానికి నేను తీర్థక్షేత్రాలలోనో కైలాస వైకుంఠాలలోనో మరెక్కడో మరెక్కడో లేను. బ్రహ్మజ్ఞానుల హృదయపద్మాలలో స్థిరంగా నివసిస్తుంటాను. నాకు కోటిపూజలు చేసినందువల్ల వచ్చే ఫలం అటువంటి జ్ఞానులను ఒక్కసారి అర్చిస్తే చాలు దక్కుతుంది. అతడి వంశం అంతా పవిత్రమవుతుంది. అతడిని కన్నతల్లి ధన్యురాలు అవుతుంది. భూదేవి పుణ్యవతి అవుతుంది. మనస్సును చిచ్ఛక్తిలో లయం చెయ్యడమే సారాంశంగా బ్రహ్మజ్ఞానమంటే. అడిగావు కనక చెప్పాను. నువ్వు యోగ్యుడివి కనక చెప్పాను.

> నాహం తీర్థే న కైలాసే వైకుంఠే వా కర్హిచిత్ ।
> వసామి కింతు మద్జ్ఞాని హృదయాంభోజమధ్యమే ॥ (36 - 18)

ఈ బ్రహ్మజ్ఞాన రహస్యాన్ని భక్తియుక్తుడూ శీలసంపన్నుడూ అయిన జ్యేష్ఠపుత్రుడికిగానీ శిష్యుడికిగానీ మీరు ఉపదేశించవచ్చు. దేవుడిపట్లా గురువుపట్లా సమానంగా ప్రగాఢమైన భక్తి కలిగినవాడికే తప్ప ఇతరుడికి ఇది ఉపదేశించకూడదు.ఉపదేశించినందువల్ల ప్రయోజనం ఉండదు. తండ్రివల్ల లభించిన జన్మ నశిస్తుంది. కానీ బ్రహ్మజ్ఞానియైన గురువువల్ల లభించిన పునర్జన్మ (జ్ఞానిగా మారడం) ఎప్పటికీ నశించదు. అందుకనే బ్రహ్మజ్ఞానాన్ని అందించిన గురువే ఉత్తమోత్తమగురువని శాస్త్రాలు ఉద్ఘోషిస్తున్నాయి. శివుడు కోపించినా గురువు కాపాడతాడు, గురువే కోపిస్తే శివుడుకూడా రక్షించలేడు. అందుచేత శిష్యుడు ఎల్లవేళలా అత్యంతజాగరూకుడై గురువును సేవించుకోవాలి. సంతోషపరచాలి. త్రికరణశుద్ధిగా భక్తితాత్పర్యాలతో పరిచర్యలు చెయ్యాలి. లేకపోతే కృతఘ్నత సంక్రమిస్తుంది. కృతఘ్నుడికి నిష్కృతి లేదు.

> శివే రుష్టే గురుస్త్రాతా గురౌ రుష్టే న శంకరః ।
> తస్మాత్సర్వప్రయత్నేన శ్రీగురుం తోషయేన్నగ ॥ (36 - 26)
> కాయేన మనసా వాచా సర్వదా తత్పరో భవేత్ ।
> అన్యథా తు కృతఘ్నః స్యాత్ కృతఘ్నే నాస్తి నిష్కృతిః ॥ (36 - 27)



ఒకప్పుడు ఈ బ్రహ్మవిద్యను దేవేంద్రుడు అథర్వణుడనే శిష్యుడికి ఉపదేశించాడు. అయోగ్యులకు ఉపదశించావో నీ తల నరికేస్తాను, జాగ్రత్త అని హెచ్చరించిమరీ ఉపదేశించాడు. అలాగే అని అంగీకరించి ఉపదేశం పొందిన అథర్వణుడు ఆ తరవాత ఆ విద్యను అశ్వినీదేవతలకు ఉపదేశించాడు. ఇది తెలిసి ఇంద్రుడు ఉగ్రుడై వజ్రాయుధంతో అథర్వణుడి శిరసు ఖండించాడు. అశ్వినీదేవతలు వైద్యులు కనక శిరస్సును మళ్ళీ అతికించగలిగారనుకో, అది వేరే సంగతి. కానీ నగేంద్రా ! అతి సంకటసంపాద్య ఈ బ్రహ్మవిద్య. లభించిందో ధన్యుడైనట్టే. కృతకృత్యుడైనట్టే. ***(అధ్యాయం - 36, శ్లోకాలు - 30)***

బ్రహ్మజ్ఞానం కడుంగడు దుర్లభమని గ్రహించాడు హిమవంతుడు. అందుకని అందరికీ అందుబాటులో ఉండే మరొక ముక్తిమార్గమేదైనా ఉందేమో తెలుసుకోవాలి అనుకున్నాడు. సవినయంగా అభ్యర్థించాడు.

జగదీశ్వరీ ! వైరాగ్యభావనలు లేని నాలాంటి మధ్యమస్థాయి మానవుడికి సుఖంగా ఆట్టే క్లేశాలు లేకండా జ్ఞానం లభించే మార్గం ఏదైనా ఉంటే ఉపదేశించు తల్లీ !

## ◆ భక్తియోగం ◆

నగాధిపా ! మోక్షప్రాప్తికి ప్రసిద్ధమార్గాలు మూడు ఉన్నాయి. కర్మయోగం. జ్ఞానయోగం. భక్తియోగం. వీటిలో భక్తియోగం అందరికీ ఆచరణకు అందే మార్గం. మిగతా రెండింటికన్నా సులభం. ఇది కేవలం మానసికం. శరీరాన్ని శుష్కింపజేసుకోవడం చిత్తాన్ని నిరోధించుకోవడంలాంటి క్లేశాలు ఇందులో ఉండవు.

మనుష్యులలో ఉండే గుణభేదాన్ని బట్టి ఈ భక్తి మరి మూడు విధాలు. పరపీడనలక్ష్యంగా దంభాచారంతో క్రోధమాత్సర్యాలతో సాగేది తామసభక్తి. ఇవిలేకుండా తన కల్యాణమే లక్ష్యంగా సకామమైన హృదయంతో యశోభోగాలను కోరి చేస్తే అది రాజసభక్తి. నేను వేరు, తాను వేరు అనే భేదబుద్ధితో సాగిస్తారు కనక ఇతడూ పామరుడే. స్వార్థచింతన లేకుండా, పరమేశార్పణంగా, పాపప్రక్షాళన లక్ష్యంగా, వేదోక్తం కనక అవశ్యకర్తవ్యం అనే నిశ్చయంతో, నా ప్రీతికోసం చేసే భక్తిని సాత్త్వికభక్తి అంటారు. నేను వేరు, తామువేరు అనే భేదబుద్ధి ఇక్కడా ఉంటుంది. అయితే ఇది పరభక్తికి సోపానమవుతుంది కనక తామస రాజసభక్తులకన్నా ఉత్తమోత్తమం.

ప్రాలేయభూధరా ! ఇప్పుడు ఈ పరభక్తిని గురించి వివరిస్తాను తెలుసుకో. నా గుణగణాలను నిత్యమూ ఆలకించడం, నా దివ్యనామాలను నిరంతరం గానం చెయ్యడం, కల్యాణగుణనీరధినైన నాయందు - ఎడతెరిపిలేని తైలధారగా మనస్సును ఎప్పుడూ వర్తింపజెయ్యడం, హేతువు ఉన్నా



లేకపోయినా నన్ను అర్చించడంకన్నా మించినది లేదని భావించి సేవించడం, మోక్షాన్నికూడా వాంఛించకుండా సేవ్యసేవకతాభావాన్ని విడిచిపెట్టి అర్చించడం, సకలప్రాణికోటిలోనూ సర్వరూపాలలోనూ నన్నే దర్శించడం, తనపట్ల తనకు ఎంతటి అభిమానమూ అనురాగమూ ఉంటాయో అంతగానూ నాపట్ల ప్రీతివహిస్తూ చైతన్యసామాన్యాన్నిబట్టి తనకూ నాకూ అభేదాన్ని గ్రహించడం, సర్వప్రాణికోటినీ నాకు అభిన్నంగా తనకు అభిన్నంగా దర్శించడంవల్ల ఎవరికీ ఎప్పుడూ ద్రోహం తలపెట్టని దశకు చేరుకోవడం, నా కోవెలలనూ నా భక్తులనూ నిరంతరం దర్శించడం, నాగురించి చెప్పే శాస్త్రాలనూ మంత్రతంత్రాలనూ అధ్యయనం చెయ్యడం, నామీద ప్రేమతో నిరంతరం పులకించిపోతూ ఆనందబాష్పాలు రాలుస్తూ గద్గదకంఠంతో నా నామాన్ని జపిస్తూ అనన్యభావంతో నన్ను పూజించడం, ధనవ్యయానికి లోభించకుండా నా నిత్యనైమిత్తిక వ్రతాలనన్నింటినీ ఆచరించడం, నా ఉత్సవాలను దర్శించడమే స్వభావంగా వహించడం, గొంతెత్తి నామగానం చేస్తూ అహంకారదేహతాదాత్మ్యరహితుడై నృత్యం చెయ్యడం, దేహసంరక్షణ దృష్టిని పూర్తిగా విడిచిపెట్టి ఏది ఎలా జరగాలని రాసిపెట్టి ఉందో అది అలా జరుగుతుందని దృఢంగా విశ్వసించి వర్తించడం - ఇవి పరభక్తికి నిదర్శనాలు.

భూధరా ! దేవికి అతిరిక్తంగా, దేవికి భిన్నంగా ఈ సృష్టిలోనేకాదు ఎక్కడా ఏమీ లేదు అని భావించగలిగిన ఈ పరభక్తి సంపన్నుడు ఆ క్షణంలోనే చిన్మాత్రమైన నా రూపంలో విలయం పొందుతాడు. ఈ భక్తికి సంబంధించిన పరాకాష్ఠ స్థితినే జ్ఞానం అంటారు. వైరాగ్యానికి చివరిమెట్టూ అదే. అందుకనే జ్ఞానంలో ఇవిరెండూ కలిసి ఉంటాయి అనడం.

**భక్తేస్తు యా పరా కాష్ఠా సైవ జ్ఞానం ప్రకీర్తితమ్ ।**
**వైరాగ్యస్య చ సీమా సా జ్ఞానే తదుభయం యతః ॥ (37 - 28)**

హిమవన్నగరాజా ! ప్రారబ్ధవశంవల్ల భక్తుడైనవాడికి బ్రహ్మజ్ఞానం కలగదు. కానీ అతడు నా మణిద్వీపనివాసం పొందగలుగుతాడు. అక్కడ సకలభోగాలనూ ఇచ్ఛారహితంగా అనుభవిస్తూ కట్టకడపటికి నా చిద్రూపజ్ఞానాన్ని పొందుతాడు. అప్పుడు ముక్తుడు అవుతాడు. అందుచేత - కేవలం జ్ఞానంవల్లనే ముక్తి. మరొక మార్గం లేదు. ఇహలోకంలోనే ఉండి ప్రత్యగాత్మను హృదయస్థం చేసుకుని సంవిత్పరశరీరుడైన జ్ఞానికి బ్రహ్మత్వమే తప్ప మరణం లేదు. జ్ఞానంవల్ల అజ్ఞానాన్ని నశింపజేసుకుని తనలో ఉన్నదానినే తాను దర్శించడం, తన అధీనంలో ఉన్నదానినే తాను పొందడం - ఇదీ బ్రహ్మజ్ఞానోపలబ్ధి అంటే. మెడలో ఉన్న బంగారు గొలుసును తడిమి తెలుసుకోగలగడమన్నమాట.

**కంఠచామీకరసమమజ్ఞానాత్తు తిరోహితమ్ ।**
**జ్ఞానాదజ్ఞాననాశేవ లబ్ధమేవ హి లభ్యతే ॥ (37 - 33)**



## ◆ నిరంతర సాధన ◆

విదిత అవిదితాలకు అతీతమైనది నా రూపం. అద్దంలోలాగా బ్రహ్మజ్ఞాని ఆత్మలో అది ప్రతిబింబిస్తూ ఉంటుంది. లోకంలో వెలుగునీడలు స్వచ్ఛంగా విడివిడిగా ఎలా ఉంటాయో ద్వైతభావవివర్జితమైన బ్రహ్మజ్ఞానం అలా ఉంటుంది. నీడలా నా రూపం అతడి ఆత్మలో నిలుస్తుంది.

వైరాగ్య భావంమాత్రమే ఉండి బ్రహ్మజ్ఞానం పొందకుండా మరణించినవాడు బ్రహ్మలోకంలో ఆగిపోతాడు. శుచి శ్రీమంతుల గృహంలో అతడికి పునర్జన్మ లభిస్తుంది. అప్పుడు సాధన కొనసాగించి జ్ఞాని కాగలుగుతాడు. బ్రహ్మజ్ఞానమనేది అనేకజన్మల సాధనతో లభిస్తుందే తప్ప ఏదో ఒక జన్మలోనే లభించెయ్యదు. అందుచేత ప్రతిజన్మలోనూ తీవ్రంగా ప్రయత్నం కొనసాగించాలి.

అనేకజన్మభీ రాజన్ ! జ్ఞానం స్యాన్నైకజన్మనా ।
తత: సర్వప్రయత్నేన జ్ఞానార్థం యత్నమాశ్రయేత్ ॥ (37 - 37)

జన్మజన్మలకూ సాధనను కొనసాగించకపోతే వచ్చే నష్టం ఇంతా అంతా కాదు. నరజన్మమే దుర్లభమవుతుంది. ఇంద్రియాల పటుత్వం (నిగ్రహం), సుసంస్కృతమైన మనస్సు, మోక్షకాంక్ష - ఇత్యాదులు మరుసటి జన్మలో ఉంటాయో ఉండవో. ఉండాలి అంటే నిరంతర సాధన ఒక్కటే మార్గం. అతిదుర్లభమైన నరజన్మం లభించినా బ్రహ్మజ్ఞానంకోసం ప్రయత్నించనివాడి జీవితం పూర్తిగా నిరర్థకం. అందుచేత ప్రతి నరుడూ యథాశక్తిగా జ్ఞానసముపార్జనకు ప్రయత్నం చెయ్యాలి. నగాధిపా ! ఈ జ్ఞానమనేది పాలలో వెన్నలాగా సకలసృష్టిలోనూ అభివ్యాప్తమై ఉంది. మనస్సు అనే కవ్వంతో నిర్విరామంగా చిలికి దానిని పొందగలగాలి. అదే జన్మకు చరితార్థత. ఇది వేదాంత డిండిమం.

హిమాచలా ! అడిగావుకనక అతిగుహ్యమే అయినా చాలా విశేషాలు నీకు చెప్పాను. ఇంకా ఏమి వినాలనుకుంటున్నావో అడుగు. చెబుతాను. *(అధ్యాయం - 37, శ్లోకాలు - 45)*

## ◆ అతిముఖ్య దేవీస్థానాలు ◆

పరమేశ్వరి ఇంతటి సదవకాశాన్ని తనకు ఇచ్చినందుకు ఎంతగానో మురిసిపోతున్న హిమవంతుడు - జగన్మాతా ! ఈ భూలోకంలో నీకు అత్యంత ప్రీతిపాత్రాలూ అతిముఖ్యాలూ అయిన దేవీస్థానాలు ఎన్ని ఉన్నాయి ? అవి ఏమిటి ? అలాగే నీకు ప్రీతిని కలిగించే వ్రతాలూ ఉత్సవాలూ ఏమిటి ? తెలియజెప్పి నన్ను కృతార్థుణ్ణి చెయ్యి - అని అభ్యర్థించాడు.

జగన్నాయకి మందస్మితవదనారవిందయై పలికింది. నగేంద్రా ! ఈ సృష్టిలో అణువణువూ నా స్థానమే. అనుక్షణమూ నా ఉత్సవమే, నా వ్రతమే. నేను సర్వరూపిణిని.



సర్వం దృశ్యం మమ స్థానం సర్వే కాలా వ్రతాత్మకాః ।
ఉత్సవాస్సర్వకాలేషు యతోఽహం సర్వరూపిణీ ॥ (38 - 3)

అయినా భక్తవాత్సల్యంకొద్దీ కొన్ని విశేషస్థానాలు తెలియజేస్తున్నాను. శ్రద్ధగా ఆలకించు. కోలాపురంలో లక్ష్మిగా, మాతృపట్టణంలో రేణుకగా, తులజాపురంలో హింగుళాదేవిగా, సప్తశృంగంలో జ్వాలాముఖిగా నేనుంటాను. అలాగే శాకంభరీ - భ్రమరీ - శ్రీరక్తదంతికా - దుర్గా - స్థానాలూ, వింధ్యాచలనివాసినీ స్థానం, అన్నపూర్ణామహాస్థానం, కాంచీపురం, భీమాదేవీ విమలాదేవీ శ్రీచంద్రలా కౌశికీస్థానాలూ, నీలాంబరాదేవికి నిలయమైన నీలపర్వత శిఖరం,జాంబూనదేశ్వరీ విలసితమైన శ్రీనగరం, గుహ్యకాళీనివాసమైన నేపాలం, మీనాక్షీ నిలయమైన చిదంబరం, సుందరీసమధిష్ఠితమైన వేదారణ్యం, పరశక్తి ప్రతిష్ఠితమైన ఏకాంబరం, మదాలసా యోగేశ్వరీస్థానాలూ, చీనదేశంలో ప్రసిద్ధికెక్కిన నీలసరస్వతీస్థానం, భగళాదేవీ నిలయమైన వైద్యనాథం, శ్రీభువనేశ్వరీ నివాసమైన మణిద్వీపం, శ్రీమత్త్రిపురభైరవీ విరాజితమైన కామక్షేత్రమండలం - ఇవన్నీ నా నివాసస్థానాలే. వీటిలో చివరిది క్షేత్రరత్నం. ఇక్కడ ప్రతిమాసమూ రజస్వలారూపంలో దర్శనమిస్తూంటాను. దేవతలు పర్వతరూపధారులై ఉంటారు. మరికొందరు దేవతలు ఆ పర్వతాలమీద నివసిస్తుంటారు. ఇక్కడి నేల అంతా దేవీరూపమే అని పండితులు భావిస్తారు. ఈ కామాఖ్యాయోనిమండలంకన్నా ఉత్తమోత్తమమైన దేవీస్థానం ఈ భూమండలంలో మరొకటి లేదు.

గాయత్రీవిభూషితమైన శ్రీపుష్కరం, చండికానివాసమైన అమరేశం, పుష్కరేక్షణీనిలయమైన ప్రభాసం, లింగధారిణీ నివాసమైన నైమిశారణ్యం, పురుహూతా మందిరమైన పుష్కరాక్షం, రతిస్థానమైన ఆషాఢి, దండినీ నిలయమైన చండముండీమహాస్థానం, భూతిమందిరమైన భారభూతి, నకులేశ్వరీ విభూషితమైన నకులేశ్వరం, చంద్రికా విలసితమైన హరిశ్చంద్రం, శాంకరీ సమలంకృతమైన శ్రీగిరి, త్రిశూలామందిరమైన జప్యేశ్వరం, సూక్ష్మాదేవీ సమధిష్ఠితమైన ఆమ్రాతకేశ్వరం, శాంకరీ భూషితమైన మహాకాలం, శర్వాణీసుందరమైన మధ్యప్రదేశం, మార్గదాయినీ మహితమైన కేదారం, భైరవీనిలయమైన భైరవస్థానం. మంగళానివాసమైన గయ, స్థాణుప్రియారూపిణికి స్థావరమైన కురుక్షేత్రం, స్వాయంభువీమండితమైన నాకులక్షేత్రం, ఉగ్రామందిరమైన కనఖలం, విశ్వేశాలయమైన విమలేశ్వరం, మహానందాధివాసితమైన అట్టహాసం, మహాంతకాలయమైన మహేంద్రం, భీమేశ్వరీనిలయమైన భీమక్షేత్రం, భవానీ శాంకరీ రుద్రాణీ నామ విరాజితకు నిలయమైన అర్ధకోటికం, విశాలాక్షీ నివాసమైన అవిముక్తం, మహాభాగానిధానమైన మహాలయం, భద్రకర్ణీనివాసమైన గోకర్ణం, భద్రాస్యానిలయమైన భద్రకర్ణకం, ఉత్పలాక్షీమందిరమైన సువర్ణాక్షం, స్థాణ్వీశానిలయమైన స్థాణుక్షేత్రం, కమలాలయమైన కమలాలయం, ప్రచండా మందిరమైన ఛగలాండకం, త్రిసంధ్యా నివాసమైన కురండలం, ముకుటేశ్వరీ నిలయమైన మాకోటం, శాండకీస్థానమైన మండలేశం, కాళీ నివాసమైన కాలంజరం, ధ్వనిమందిరమైన శంకుకర్ణం,



స్థూలాస్యా విలసితమైన స్థూలకేశ్వరం, హృల్లేఖారూపిణికి విహారభూమియైన జ్ఞాని హృదయాంభోజం - ఇవన్నీ నాకు అత్యంత ప్రీతిపాత్రాలు. ఆయా రూపాలతో నేను నివసించే దివ్యక్షేత్రాలు.

హిమాలయా ! ఆయా క్షేత్రమాహాత్మ్యాలను గురించి ముందుగా విని తెలుసుకుని అటుపైని వెళ్ళి అక్కడి విధివిధానాలను అనుసరించి నన్ను అర్చించాలి. ఇది సాధ్యం కాదనుకుంటే - సర్వక్షేత్రాలకూ నిలయం కాశీక్షేత్రం. అక్కడికి వెళ్ళి నన్ను ధ్యానిస్తే సకలక్షేత్ర సకలదేవీ సందర్శనఫలం లభిస్తుంది. భవబంధవిముక్తి సిద్ధిస్తుంది.

అథవా సర్వక్షేత్రాణి కాశ్యాం సంతి నగోత్తమ ।
తత్ర నిత్యం వసేన్నిత్యదేవీభక్తిపరాయణః ॥
తాని స్థానాని సంపశ్యన్ జపేద్దేవీం నిరంతరమ్ ।
ధ్యాయన్ తచ్చరణాంభోజం ముక్తో భవతి బంధనాత్ ॥ (38 - 34)

తెల్లవారుజామునే లేచి ఈ దేవీనామాలనూ ఈ దేవీ స్థానాలనూ పఠించినవారికి సకలపాపాలూ భస్మమైపోతాయి. శ్రాద్ధకాలంలో వీటిని పఠించడంవల్ల పితృదేవతలు ముక్తులై ఉత్తమగతులు పొందుతారు.

## ◆ దేవిచెప్పిన దేవీవ్రతాలు, పూజలు ◆

నగోత్తమా ! ఇంక ఇప్పుడు స్త్రీపురుషులు ఆచరించవలసిన దేవీవ్రతాలు వివరిస్తాను, ఆలకించు. అనంతతృతీయం, రసకల్యాణిని, ఆర్ద్రానందకరం అని మూడుప్రధాన వ్రతాలు ఉన్నాయి. శుక్రవారవ్రతం కృష్ణచతుర్దశీవ్రతం భౌమవారవ్రతం ప్రదోషవ్రతం - ఇవికూడా ముఖ్యమైన వ్రతాలే. ప్రదోషవేళలో (సాయంసంధ్య) శివుడు పార్వతితో కలిసి ఆనందనృత్యం చేస్తాడు కనక ఆ సమయంలో దేవీవ్రతం చేస్తే విశేష ఫలితాలు ఉంటాయి. రోజంతా ఉపవాసం ఉండి ఈ వ్రతం చెయ్యాలి. సోమవారవ్రతమొకటి నాకు చాలా ప్రీతికరమైనది. పగలంతా ఉపోషం ఉండి దేవీపూజ చేసి రాత్రిపూట భోజనం చెయ్యాలి. సరే - నవరాత్రద్వయం నాకు అత్యంత ప్రీతికరమైన వ్రతమని వేరే చెప్పాలా ? ఇలా చాలా వ్రతాలు ఉన్నాయి. ఈ నిత్యనైమిత్తిక వ్రతాలను దీక్షతో చేసి నన్ను ఆనందింపజేసినవారికి నా సాయుజ్యం కరతలామలకం.

ఇంకా నాకు ప్రీతికలిగించే రకరకాల ఉత్సవాలున్నాయి. డోలోత్సవం, శయనోత్సవం, జాగరణోత్సవం, రథోత్సవం, దమనోత్సవం, పవిత్రోత్సవం - ఇలా చాలా ఉత్సవాలు ఉన్నాయి. వీటిని భక్తిశ్రద్ధలతో చెయ్యాలి. వీటిలో భాగంగా సువాసినీపూజ, కుమారీపూజ, వటుకార్చనలు నిర్వహించాలి. వారినందరినీ నన్నుగా భావించి అర్చించాలి. విత్తశాఠ్యం సుతరామూ పనికిరాదుసుమా !



ప్రతి సంవత్సరం ఈ ఉత్సవాలను జరిపించేవారు నాకు అత్యంత ప్రీతిపాత్రులు. వారియోగక్షేమాలు నేను చూస్తూ ఉంటాను. నగరాజా ! నాకు ఏవేవి ఇష్టమో ఎలా నన్ను ప్రసన్నురాలిని చేసుకోవచ్చునో నీకు తెలియజెప్పాను. ఈ రహస్యాన్ని నువ్వు ఎవరికిపడితే వారికి చెప్పకు. శిష్యుడుకానివాడికీ భక్తుడు కానివాడికీ అస్సలు చెప్పకు. ***(అధ్యాయం - 38, శ్లోకాలు - 49)***

హిమగిరీంద్రా ! పూజావిధానం విను. బాహ్య - ఆంతరభేదాలతో నా పూజ రెండు విధాలు. ఇందులో బాహ్యపూజ మళ్ళీ రెండు విధాలు. వైదికీపూజ. తాంత్రికీపూజ. వైదికీపూజలో మూర్తిభేదంతో మరి రెండు విభాగాలున్నాయి. వేదపారగులైనవారే వేదదీక్షాసమన్వితులై వైదికీపూజ చెయ్యాలి. వేదాధ్యయనం చెయ్యనివారు వేదంలో చెప్పబడిన దీక్షను స్వీకరించి తాంత్రికమార్గంలో పూజచెయ్యాలి. ఇది తాంత్రికీపూజ. ఈ పూజారహస్యం తెలుసుకోకుండా తారుమారు చేస్తే పతనం తప్పదు.

ప్రథమగణ్యమైన వైదికీపూజను మరింత వివరిస్తాను. తెలుసుకో. ఇంతకుముందే నా విరాడ్రూపాన్ని చూశావుకదా నువ్వు.అనంతశీర్షం. అనంతనయనం. అనంతచరణం. సర్వశక్తిసమాయుక్తం. పరాత్పరప్రేరకం. ఆ రూపాన్నే పూజించాలి. నమస్కరించాలి. ధ్యానించాలి, స్మరించాలి. ఇదీ వైదికీపూజా స్వరూపం. శాంతస్వభావుడవై సమాహితమనస్కుడవై దంభాహంకారరహితుడవై వైదికీపూజనూ దాని నిర్వాహకులనూ శరణువేడుకో. ఆ విరాడ్రూపాన్నే మనస్సులో దర్శించు. జపించు. ధ్యానించు. అనన్యభక్తితో నన్ను ఆశ్రయించు. యజ్ఞాలు చెయ్యి. తపస్సు చెయ్యి. దానధర్మాలు చెయ్యి. వీటితో నన్ను ఆనందింపజేసి నా అనుగ్రహాన్ని పొంది భవబంధ విముక్తుడవై మోక్షం పొందు. నా భక్తులను నేను గుర్తుపట్టగలను. వారిని ఉద్ధరించడంలో జాగుచెయ్యను.

**మత్పరా యే మదాసక్తచిత్తా భక్తవరా మతాః ।**
**ప్రతిజానే భవాదస్మాదుద్ధరా మ్యచిరేణ తు ॥ (39 - 12)**

కర్మయుక్తమైన ధ్యానానికీ భక్తియుక్తమైన జ్ఞానానికీ నేను తేలికగా దొరుకుతాను. అంతేగానీ కేవల కర్మానుష్ఠానానికి లొంగను. ధర్మంవల్ల భక్తి ఆవిర్భవిస్తే, భక్తివల్ల పరం లభిస్తుంది. శ్రుతిస్మృతులు చెప్పినదే ధర్మం. ఇతరశాస్త్రాలూ గ్రంథాలూ చెప్పేది ధర్మాభాసం మాత్రమే.

**శ్రుతిస్మృతిభ్యాముదితం యత్స ధర్మః ప్రకీర్తితః ।**
**అన్యశాస్త్రేణ యః ప్రోక్తః ధర్మాభాసః స ఉచ్యతే ॥ (39 - 15)**



సర్వజ్ఞత్వమూ సర్వశక్తిమత్త్వమూ కలిగిన నానుంచే వేదం ఆవిర్భవించింది. నాకు అజ్ఞానంలేదు కనక నా నుంచి ఆవిర్భవించిన వేదానికి ఏ విషయంలోనూ అప్రమాణత్వం ఉండనే ఉండదు. అన్నింటికీ అదే ప్రమాణం.

సర్వజ్ఞాత్సర్వశక్తేశ్చ మత్తో వేదస్సముత్థితః ।
అజ్ఞానస్య మమాభావాదప్రమాణా న చ శ్రుతిః ॥ (39 - 16)

వేదప్రతిపాదితాలైన అర్థాలనే గ్రహించి మనుప్రభృతులు స్మృతులు రచించారు కనక అవీ ప్రమాణాలే. అయితే కొందరు కొన్నికొన్ని సందర్భాలలో తంత్రగ్రంథాలు చెప్పిన ధర్మాలను ప్రమాణాలుగా ఉగ్గడిస్తుంటారు. కానీ వేదవేత్తలు వాటిని పరిగణించవలసిన అవసరంలేదు. తంత్రాది శాస్త్రకర్తలకు సర్వజ్ఞత్వం లేదు కనక వారు చేసే ధర్మనిర్ణయాలు అజ్ఞానదోషజుష్టాలు, అప్రామాణికాలు. అందుచేత ముముక్షు ధర్మం తెలియాలి అంటే వేదమొక్కటే ఆశ్రయణీయం. అది రాజాజ్ఞవంటిది. దానికి ఎన్నటికీ తిరుగులేదు.

అన్యేషాం శాస్త్రకర్తౄణా మజ్ఞాన ప్రభవత్వతః ।
అజ్ఞానదోషజుష్టత్వాత్ తదుక్తేర్న ప్రమాణతా ॥
తస్మాన్ముముక్షు ధర్మార్థం సర్వథా వేదమాశ్రయేత్ ।
రాజాజ్ఞా చ యథా లోకే హన్యతే న కదాచన ॥ (39 - 20)

నేను సర్వేశ్వరిని. నా ఆజ్ఞ - వేదం. దానిని రక్షించడానికీ అమలుపరచడానికీ బ్రాహ్మణ క్షత్రియజాతులను సృష్టించాను. అందుచేత వేదరూపమైన నా ఆజ్ఞను మానవులెవ్వరూ తిరస్కరించడానికి వీలులేదు, అతిక్రమించడానికి వీలులేదు. ఇది రహస్యం. ధర్మానికి గ్లాని కలిగి అధర్మానిది పైచేయి అయినప్పుడల్లా నేను ఆయా అవతారాలు ధరించి ఆవిర్భవిస్తూ ఉంటాను.

యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భూధర ।
అభ్యుత్థాన మధర్మస్య తదా వేషాన్ బిభర్మ్యహమ్ ॥ (39 -23)

దేవ దైత్యవిభాగంకూడా ఇందుకోసమే. వేదధర్మాన్ని అనుష్ఠించనివారినీ అవమానించినవారినీ శిక్షించడానికే అతిభయంకరమైన నరకాలను సృష్టించాను. వాటి పేరు వింటేనే చాలు భయం కలిగేట్టు సృష్టించాను. వేదధర్మాన్ని కాదని అన్యధర్మాలను ఆశ్రయించినవారిని పరిపాలకుడు శిక్షించాలి. దేశబహిష్కారం విధించాలి. బ్రాహ్మణులు అటువంటివారితో సంభాషించకూడదు. పంక్తి బాహ్యులను చేసి వెలివెయ్యాలి.



## ◆ తామసాగమాలు, ఆంతరతాంత్రిక పూజలు ◆

శ్రుతిస్మృతివిరుద్ధాలైన శాస్త్రాలు లోకంలో చాలానే ఉన్నాయి. అవన్నీ తామసవిద్యలు. వామాచారం, కాపాలకం, కౌలకం, భైరవాగమం మొదలైనవాటిని కారణాంతరాలవల్ల ఒకానొక ప్రయోజనం ఉద్దేశించి కొందరిని సమ్మోహపరచడానికి శివుడు సృష్టించాడు. దక్ష భృగు దధీచి శాపాలకు గురియై వేదమార్గ బహిష్కృతులైన బ్రాహ్మణులను ఆకర్షించి సోపానక్రమంలో వేదమార్గానికి మళ్ళించి ఉద్ధరించడంకోసం ఈ తామసాగమాలు ఆవిర్భవించాయి. శైవ వైష్ణవ సౌర శాక్త గాణపత్యాది తామసాగమాలను శంకరుడు సంతరించిన ప్రయోజనం ఇది. అయితే వీటిలోవి అన్నీ వేదవిరుద్ధాలే అనడానికి వీలులేదు. అక్కడక్కడా కొన్ని వేదసమ్మతాలైన ధర్మాలూ ఉన్నాయి. వాటిని వైదికులు గ్రహించవచ్చు. వేదవిరుద్ధాంశాలను గ్రహించే అధికారంమాత్రం ద్విజులకు లేదు. అవి వేదాధికారంలేనివారికోసం - ఉద్దేశించినవి. అందుచేత వైదికుడు సర్వాత్మనా వేదమార్గాన్నే ఆశ్రయించాలి. ఆచరించాలి. వేదధర్మ సహితమైన జ్ఞానమే పరబ్రహ్మను సాక్షాత్కరింపజేస్తుంది.

ఈషణలను (కోరికలు) విడిచిపెట్టండి. నన్నే శరణువేడండి. సర్వభూతదయను పాటించండి. అహంకారాన్ని వర్జించండి. త్రికరణశుద్ధిగా నన్ను ధ్యానించండి. నాకు అర్పణంగా జీవించండి. నా దివ్యక్షేత్రాల కథలను ఆసక్తితో ఆలకించండి. సన్యాసులుకానీ వానప్రస్థులుకానీ గృహస్థులుకానీ బ్రహ్మచారులుకానీ ఇలా భక్తియోగంతో నన్ను ఉపాసిస్తే వారి అజ్ఞానాంధకారాలను జ్ఞానసూర్యప్రకాశంతో నశింపజేసి ముక్తిపథంలో నడిపిస్తాను.

గిరిరాజా ! ఇది అగ్రగణ్యమైన వైదికపూజా విధానం. ఇక రెండవది తాంత్రికపూజ. తంత్రదీక్షను స్వీకరించినవారుమాత్రమే చెయ్యవలసిన పూజ ఇది. సంగ్రహంగా చెబుతాను. తెలుసుకో. ఒక విగ్రహంలోకానీ, నేలమీదకానీ, ఆకాశంలోకానీ, సూర్యబింబంలోకానీ, జలంలోకానీ, బాణలింగంలోకానీ, యంత్రంలోకానీ, మహాపటంలోకానీ, హృదయాంభోజంలోకానీ దేవీసగుణాకారాన్ని ధ్యానించాలి. దర్శించాలి. కరుణాపూర్ణ. తరుణి. అరుణారుణ. సౌందర్యసారసీమ. సర్వావయవసుందర. శృంగారరసపూర్ణ. భక్తార్తికాతర. ప్రసాదసుముఖి. చంద్రఖండశిఖండిని. పాశాంకుశవరాభయహస్త. ఆనందరూపిణి. జగన్మాతను ఈ రూపంగా భావించి యథాశక్తిగా ఉపచార విధులతో పూజించాలి. ఆంతరపూజకు అధికారం సిద్ధించనంతవరకూ ఈ బాహ్యపూజను చెయ్యవలసిందే. సిద్ధించిన తరవాత దీనిని విడిచిపెట్టి ఆంతరపూజనే ఆచరించాలి.

యావదాంతరపూజాయా మధికారో భవేన్న హి ।
తావద్బాహ్యామిమాం పూజాం శ్రయేజ్జాతే తు తాం త్యజేత్ ॥ (39 - 43)



ఆభ్యంతరపూజ అంటే అది సంవిల్లయరూపం. ఉపాధిరహితమైన సంవిత్తునే పరరూపం అంటారు. అంచేత ఆ సంవిద్రూపంలో మనస్సు సంలగ్నం చెయ్యాలి. సంవిద్రూపాతిరిక్తంగా ఉన్నది అంతా మిథ్య. అదే మాయామయ జగత్తు. దాని వినాశానికి సాక్షిణి అయిన ఆత్మరూపిణిని, నిర్మనస్కమూ యోగయుక్తమూ ఐన చేతస్సుతో భావించాలి. ఇది అభ్యాసైక సాధ్యం. అందుచేత అందరికీ అందుబాటులో ఉండే బాహ్యపూజావిధానాన్ని మరింతగా వివరిస్తాను తెలుసుకోండి. *(అధ్యాయం - 39, శ్లోకాలు - 47)*

## ◆ బాహ్యపూజా విధానం ◆

తెల్లవారుజామునే లేచి శిరస్సీమలో ఉజ్జ్వల పద్మాన్ని స్మరించాలి. కర్పూరకాంతులు వెదజల్లే ఆ పద్మంలో సుప్రసన్నుడూ లసద్భూషణ భూషితుడూ శక్తిసంయుతుడూ అయిన శ్రీగురుమూర్తిని ధ్యానించాలి. అటుపైని కుండలినీదేవిని స్మరించాలి. ఈ శ్లోకంతో ధ్యానించాలి.

ప్రకాశమానాం ప్రథమే ప్రయాణే
ప్రతిప్రయాణేఽప్యమృతాయమానామ్ -
అంతఃపదవ్యా మనుసంచరంతీమ్
ఆనందరూపామబలాం ప్రపద్యే ॥ (40 - 3)

అటుపైని శౌచాదిక్రియలు ముగించుకుని అగ్నిహోత్రం చెయ్యాలి. హోమం అయ్యాక ఆసనం వేసుకుని కూర్చుని పూజకు సంకల్పించాలి. భూతశుద్ధి చేసి హృల్లేఖామాతృకాన్యాసం కావించాలి. ఇది నిత్యమూ చెయ్యాలి. మూలాధారంలో హకారం, హృదయంలో రకారం, భ్రూమధ్యంలో ఈకారం, మస్తకంలో హ్రీంకారం - ఇది హృల్లేఖామాతృకాన్యాసం.

మూలాధారే హకారం చ హృదయే చ రకారకం
భ్రూమధ్యే తద్వదీకారం హ్రీంకారం మస్తకే న్యసేత్ ॥ (40 - 7)

ఇంకా ఆయామంత్రాలు చెప్పిన ఇతరన్యాసాలనుకూడా శ్రద్ధగా ఆచరించాలి. స్వాత్మదేహంలో పీఠం కల్పించి ప్రాణాయామంతో విజృంభించిన హృదయాంభోజంలో మహాదేవిని ధ్యానించాలి. ఆ హృదంభోజమే నా స్థానం. పంచప్రేతాసనవిరాజితం. బ్రహ్మవిష్ణు రుద్ర ఈశ్వర సదాశివులు అయిదుగురూ పంచప్రేతాలై నాపాదమూలంలో ఉంటారు. వీరే పంచభూతాత్మకులు, పంచావస్థాత్మకులు. నేను అవ్యక్తచిద్రూపను. వీరికి అతీతురాలిని. అందుచేత శక్తితంత్రాలలో ఇలా వీరు నాకు (పాదతల) ఆసనాలు అయ్యారు.



బ్రహ్మ విష్ణుశ్చ రుద్రశ్చ ఈశ్వరశ్చ సదాశివః ।
ఏతే పంచమహాప్రేతాః పాదమూలే మమ స్థితాః ॥ (40 - 10)

ప్రాణాయామవికసితమైన హృదంభోజంలో ఇలా నన్ను ధ్యానించి మానసభోగాలతో పూజించి జపించాలి. ఆ జపాన్ని నాకు సమర్పించి అర్ఘ్యస్థాపన చెయ్యాలి. పాత్రలనూ పూజాసామాగ్రినీ మంత్రోదకాలతో శుద్ధి చెయ్యాలి. అస్త్రమంత్రంతో దిగ్బంధనం చేసి, మంత్రోపదేశకుడైన గురువును స్మరించి నమస్కరించి అనుమతి పొంది, బాహ్యపీఠం మీదకు హృదయాంభోజంనుంచి నా దివ్యమనోహరరూపాన్ని ప్రాణస్థాపన విద్యతో ఆవాహన చెయ్యాలి.

హృదిస్థాం భావితాం మూర్తిం మమ దివ్యాం మనోహరామ్ ।
ఆవాహయేత్తతః పీఠే ప్రాణస్థాపనవిద్యయా ॥ (40 - 12)

అటుపైని అర్ఘ్యపాద్యాచమనాదులు నిర్వర్తించాలి. స్నానమూ వాసోద్వయమూ భూషణాలూ గంధపుష్పాదులూ యథాశక్తిగా నాకు సమర్పించాలి. యంత్రస్థావృతీపూజ శ్రద్ధగా నిర్వహించాలి. ఇలా ప్రతిదినమూ చెయ్యాలి. అంత ఓపిక లేకపోతే శుక్రవారం ఉత్తమోత్తమం.

మూలదేవికి ప్రభారూపాలైన అంగదేవతలను స్మరించాలి. ముల్లోకాలూ ఆ ప్రభాపటలంతో వ్యాప్తమై ఉన్న సంగతిని గుర్తించాలి. పునరావృత్తి సహితయైన మూలదేవిని నైవేద్యతర్పణ తాంబూల దక్షిణలతోనూ సహస్రనామ కవచ సూక్తాది పారాయణలతోనూ మహావిద్యామహామంత్ర పునశ్చరణలతోనూ నిరంతరం సంతోషపరచాలి. ప్రేమార్ద్రహృదయుడై క్షమాపణలు చెప్పుకోవాలి. పులకితగాత్రుడై బాష్పసంరుద్ధ గద్గద కంఠుడై నృత్యగీతాదులతో నన్ను ఆనందింపజెయ్యాలి. వేదపారాయణలూ పురాణపఠనలూ నన్ను అలరిస్తాయి. శరీరంతో సహా తన సర్వస్వాన్నీ నాకు అర్పణచేసిన భక్తుడంటే నాకు ఇష్టం.

ఆపైని నిత్యహోమం చేసి బ్రాహ్మణులకూ సువాసినులకూ బ్రహ్మచారులకూ పామరులకూ అన్ని వర్ణాలవారికీ దేవీబుద్ధితో విందుచెయ్యాలి. తరువాత మళ్ళీ హృదయంలో నన్ను ధ్యానించి నమస్కరించి వ్యుత్క్రమంలో ఉద్వాసన (విసర్జన) చెప్పాలి. ఈ పూజావిధానమంతా హృల్లేఖతోనే (మంత్రం) జరగాలి. హృల్లేఖ అంటే సర్వమంత్రాలకూ నాయిక. మంత్రమహారాజ్ఞి. ఆ మంత్రం అనే దర్పణంలో నేను నిత్యం ప్రతిబింబించి ఉంటాను. అందుచేత హృల్లేఖామంత్రంతో నాకు సమర్పించినది సకలమంత్రాలతోనూ సమర్పించినది అవుతుంది.

హృల్లేఖాదర్పణే నిత్య మహం తత్ప్రతిబింబితా ।
తస్మాత్ హృల్లేఖయా దత్తం సర్వమంత్రైః సమర్పితమ్ ॥ (40 - 29)



పూజావిధానమంతా పూర్తి అయ్యాక భూషణ నూతనవస్త్రాదులతో గురువును సత్కరించాలి. అప్పటికి కృతకృత్యత.

ఇలా నిత్యమూ భువనసుందరీదేవిని నన్ను అర్చించినవారికి దుర్లభమంటూ ఏదీ ఎక్కడా ఎప్పుడూ ఉండదు. దేహాంతంలో నా నివాసమైన మణిద్వీపానికి చేరుకుంటారు. దేవీస్వరూపులుగా మారిపోయి దేవతల నమస్కృతులు అందుకుంటారు.

హిమగిరీంద్రా ! దేవీపూజా విధానమంతా నీకు వివరించాను. బాగా ఆలోచించి అధికారానురూపంగా నిరంతరం నన్ను పూజించి కృతార్థుడివి కావాలి. దీనిని దేవీగీతాశాస్త్రం అంటారు. అభక్తుడికీ అశిష్యుడికీ అనర్హుడికీ దీనిని ఉపదేశించకూడదు. ఇది రహస్యవిద్య. తల్లి పాలిండ్లవంటిది. అందుచేత ఎప్పుడూ బట్టబయలు చెయ్యకూడదు. గుట్టుగానే ఉంచాలి.

ఏతత్ప్రకాశనం మాతురుద్ఘాటనమురోజయోః ।
తస్మాదవశ్యం యత్నేన గోపనీయమిదం సదా ॥ (40 - 35)

ఈ దేవీగీతను శీలసంపన్నుడైన శిష్యుడికీ అర్హుడైన జ్యేష్ఠుడికీ ఉపదేశించవచ్చు. శ్రాద్ధకాలంలో బ్రాహ్మణుల సన్నిధిలో దీన్ని పఠిస్తే పితృదేవతలు చాలా సంతోషిస్తారు. పరమపదం పొందుతారు.

శ్రీమన్మహాదేవి - హిమవంతుడు ప్రధానశ్రోతగా సకలదేవతలకూ దేవీగీతను ఉపదేశించి అదృశ్య అయ్యింది. అందరూ సమార్ద్రచిత్తులై ఎవరి నిలయాలకువారు బరువుగా నిష్క్రమించారు.

జనమేజయా ! హిమవంతుడికి హైమవతిగా జన్మించిన మహాదేవి గౌరిగా ప్రసిద్ధురాలయ్యింది. శంకరుడితో వివాహం జరిగింది. గౌరీశంకరులకు జన్మించిన స్కంధుడు సర్వసేనానియై తారకాసురుణ్ణి సంహరించాడు. దేవతలకు వాడి పీడ వదిలించాడు.

క్షీరసముద్రమథన సమయంలో ఈ మహాదేవి లక్ష్మీరూపంగా ఆవిర్భవించి రమాదేవిగా ప్రసిద్ధురాలై విష్ణుమూర్తిని చెట్టపట్టింది. ఈ ప్రకారంగా హరిహరుల అహంకారం అణిగి తాపం ఉపశమించింది. లక్ష్మీపార్వతుల ఆవిర్భావగాథతోపాటు అతిగుహ్యమైన దేవీగీతనుకూడా నీకు వినిపించాను. ఇది సకలవాంఛాసిద్ధిప్రదం. సకలశుభంకరం. ఇది రహస్యం కనక ఎవరికిబడితే వారికి చెప్పకు. రహస్యంగానే ఉంచి సంరక్షించు. ఇంకా ఏమి వినాలి అనుకుంటున్నావో అడుగు. నాకు తెలిసినమటుకు చెబుతాను - అని వ్యాసుడు ముగించాడు.

సూతుడు చెప్పిన ఈ వృత్తాంతాన్ని శ్రద్ధగా ఆలకించిన శౌనకాదిమహర్షులు హర్షపులకితగాత్రులు అయ్యారు. *(అధ్యాయం - 40, శ్లోకాలు - 44)*

**సప్తమ స్కంధం - 2350 శ్లోకాలు - తెలుగుసేత : బేతవోలు రామబ్రహ్మం**



శ్రీదేవీభాగవతము

# అష్టమ స్కంధము

శౌనకాది మహామునులారా ! అప్పుడు జనమేజయుడు అడిగినదీ వ్యాసుడు చెప్పినదీ వివరిస్తున్నాను శ్రద్ధగా ఆలకించండి - అంటూ సూతుడు చెప్పడం ప్రారంభించాడు.

వ్యాసమహర్షీ ! సూర్యచంద్రవంశాల చరిత్రనూ దేవీగీతనూ వినిపించావు. అమృతప్రాయంగా ఆస్వాదించాను. మన్వంతరాలలో మహాదేవిని ఏయే స్థానాలలో ఏయే రూపాలలో ఏయే పూజలతో ఏయే బీజాక్షరాలతో ఎలాయెలా అర్చించాలో తెలుసుకోవాలని కుతూహలంగా ఉంది. తెలియజెప్పవా - అని అభ్యర్థించాడు జనమేజయుడు. వ్యాసుడు ఆరంభించాడు -

జనమేజయా ! విను. దేవీ ఆరాధనవిధానమంతా చెబుతాను. అది చేసినా చెయ్యకపోయినా చెవులారా వింటే చాలు శ్రేయోదాయకమే. వెనకటికి నారదుడు అడిగితే యోగమార్గప్రవర్తకుడైన నారాయణుడు చెప్పిన విశేషాలివి.

## ◆ నారద - నారాయణ సంవాదం ◆

లోకపర్యటన చేస్తూ నారదుడు ఒకనాడు నారాయణుడి ఆశ్రమానికి వచ్చాడు. అతిథిమర్యాదలై అలసట తీరి కూర్చున్నాక నారదుడు అడిగాడు. నారాయణ మహర్షీ ! పురాణ పురుషోత్తమా ! దేవదేవా! జగదాధారా ! సర్వజ్ఞా ! శ్లాఘనీయసద్గుణా ! దయచేసి జగత్తత్త్వాన్ని నాకు తెలియపరుచు. ఈ జగత్తు ఎక్కడినుంచి పుడుతోంది ? ఎలా నిలుస్తోంది ? ఎక్కడ లయమవుతుంది ? ఫలోదయం ఎలా అవుతోంది? ఈ మాయ ఏమిటో అర్థం కావడంలేదు. దీన్ని తెలియజెప్పి నా మోహాన్ని తొలగించు. దేనిని అర్చిస్తే, దేనిని జపిస్తే, దేనిని ధ్యానిస్తే నా హృదయంలో సూర్యోదయమై వెలుగులు నిండుతాయో దానిని ఉపదేశించి పుణ్యం కట్టుకో. ఈ గాఢాంధకారంనుంచి నేనేకాదు ఈ లోకమంతా తరించాలి. దయచేసి సవిస్తరంగా తెలియజెయ్యి - అని నారదుడు అభ్యర్థిస్తే నారాయణుడు సంతోషించి అభినందించి బదులు పలికాడు.

దేవర్షివర్యా ! మంచి ప్రశ్న వేశావు. జగత్తత్త్వాన్ని తెలుసుకుంటే మరింక మానవుడు ఈ పుట్టుకల సుడిగుండాలలో కొట్టుకుపోడు. ఋషులందరూ సారాంశంగా చెప్పింది ఏమిటంటే జగత్తత్త్వమే దేవీతత్త్వమని. ఈ జగత్తును సృష్టించిందీ పాలిస్తున్నదీ లయం చెయ్యబోతున్నదీ మహాదేవియే. గుణత్రయనిలయ. సిద్ధర్షిపూజితమైన దేవీస్వరూపం స్మరణమాత్రంచేతనే సర్వపాపాలనూ పోగొడుతుంది. సకలవాంఛలనూ తీరుస్తుంది. మోక్షం లభిస్తుంది.



బ్రహ్మమానసపుత్రుడైన స్వాయంభువమనువు తొట్టతొలతటివాడు. సర్వమన్వంతరాలకూ అతడే అధిపతి. శతరూపావిభుడు. తన తండ్రి ప్రజాపతికి భక్తితో సపర్యలు చేస్తూ సంతోషపరుస్తున్నాడు. ఒకనాడు బ్రహ్మదేవుడు -

నాయనా, మనూ! మహాదేవిని ఆరాధించు. ప్రజలను సృష్టించే శక్తి నీకు సిద్ధిస్తుంది - అన్నాడు. ఈ ఆజ్ఞను శిరసావహించి మనస్సును ఏకాగ్రపరుచుకుని మనువు తపస్సు చేశాడు. సర్వకారణకారణమూ జగద్యోనీ అయిన మాయాశక్తిని స్తుతించాడు.

నమో నమస్తే దేవేశి జగత్కారణకారణే ।
శంఖచక్రగదాహస్తే నారాయణహృదాశ్రితే ॥ (1 - 24)
వేదమూర్తే జగన్మాతః కారణస్థానరూపిణి ।
వేదత్రయప్రమాణజ్ఞే సర్వదేవ నుతే శివే ॥ (1 - 25)
మహేశ్వరి మహాభాగే మహామాయే మహోదయే ।
మహాదేవ ప్రియావాసే మహాదేవప్రియంకరి ॥ (1 - 26)
గోపేంద్రస్య ప్రియే జ్యేష్ఠే మహానందే మహోత్సవే ।
మహామారీభయహరే నమో దేవాదిపూజితే ॥ (1 - 27)
సర్వమంగళమాంగళ్యే శివే సర్వార్థసాధికే ।
శరణ్యే త్ర్యంబకే దేవి నారాయణి నమోస్తు తే ॥ (1 - 28)

ఈ జగత్తు నీనుంచి ఓతప్రోతంగా ఆవిర్భవించింది. నువ్వు ఆద్యంతరహితమైన తేజస్సువు. చైతన్యానివి. నీ కడగంటిచూపుల శక్తితో బ్రహ్మదేవుడు జీవలోకసృష్టిని చెయ్యగలుగుతున్నాడు. విష్ణుమూర్తి పాలిస్తున్నాడు. నీ అనుగ్రహంవల్లనే శివుడు కల్పాంతంలో సృష్టిని సంహరించగలుగుతున్నాడు. మధుకైటభులకు భయపడిన శ్రీమహావిష్ణువు నిన్ను స్తుతించి కష్టాల కడలిని తరించగలిగాడు. హ్రీ - కీర్తి - కాంతి - స్మృతి - కమల - గిరిజ - సతి - దాక్షాయణి - వేదగర్భ - బుద్ధిదాత్రి - అభయ ఇత్యాదులన్నీ నీ నామధేయాలే. నీ రూపధేయాలే. నిన్నే జపిస్తాను. నిన్నే నుతిస్తాను. నిన్నే నతిస్తాను. నిన్నే ధ్యానిస్తాను. నిన్నే భావిస్తాను. నిన్నే వింటాను. నిన్నే కంటాను. మహాదేవీ ! అనుగ్రహించు. త్రిమూర్తులే కాదు అష్టదిక్పాలకులూ సూర్యచంద్రులూ నవగ్రహాలూ పర్వతాలూ నదులూ సముద్రాలూ జీవరాశులూ - ఒకటేమిటి సమస్తమూ నీ సృష్టియే.



త్రిలోకవంద్యే లోకేశి మహామాంగళ్యరూపిణి ।
నమస్తేఽస్తు పునర్భూయో జగన్మాతర్నమో నమః ॥ (1 - 36)

నారదా ! మనువు చేసిన ఈ స్తుతికి సంతోషించింది జగన్మాత. ప్రత్యక్షమయ్యింది. వరం కోరుకోమంది. ప్రజాసృష్టిని నిర్విఘ్నంగా చేసే శక్తిని అనుగ్రహించమని అడిగాడు. అమ్మవారు అంగీకరించింది. ఉత్తరోత్తరప్రజాభివృద్ధి కలుగుగాక అని ఆశీర్వదించింది. నువ్వు చేసిన ఈ స్తోత్రాన్ని విన్నవారూ పఠించినవారూ సంతానవంతులవుతారు. విద్యావంతులు అవుతారు. కీర్తికాంతిమంతులవుతారు. ధనధాన్యసమృద్ధి పొందుతారు. అప్రతిహతశక్తిసంపన్నులై శత్రువులను జయిస్తారు. ఇది నా అనుగ్రహం - అని చెప్పి అంతర్ధానం చెందింది.

దేవీవరప్రసాదం పొంది మనువు బ్రహ్మదేవుణ్ణి సమీపించి జరిగినదంతా వివరించాడు. సమాధినిష్ఠుడనై పుష్కలంగా ప్రజలను సృష్టిస్తాను. దేవీయజ్ఞాలు నిర్వహిస్తాను. నాకు తగిన స్థానం చూపించు అని అభ్యర్థించాడు. చతుర్ముఖుడు ఆలోచనలో పడ్డాడు. భూగోళమంతా జలపూర్ణమై ఉంది. ఎక్కడ ఇతడికి చోటు ఇవ్వగలనా అని ఆలోచించాడు. ఏమీ తోచలేదు. విష్ణుమూర్తిని సలహా అడుగుదాం, అతడేకదా మరి నాకు గురువు - అనుకున్నాడు. *(అధ్యాయం - 1, శ్లోకాలు - 48)*

## ◆ ఆదివరాహమూర్తి ◆

పద్మసంభవుడు ఇలా ఆలోచిస్తున్నాడు. మనుమరీచిప్రభృతులు స్తుతిస్తూ నిలబడ్డారు. అంతలోకీ బ్రహ్మదేవుడి నాసికారంధ్రం నుంచి అంగుళం పందిపిల్ల ఊడిపడింది. పడటమే తడవుగా ఏనుగంత ఎదిగింది. అందరూ ఆశ్చర్యపోయారు. ఇదేమి వింత ! ముక్కునుంచి ఎలా ఆవిర్భవించింది ? అంగుష్ఠమాత్రంగా ఉన్నది క్షణంలో మహాపర్వతంగా ఎలా మారింది ? అని కటకట పడుతున్నాడు బ్రహ్మదేవుడు. వరాహరూపంలో ఉన్న శ్రీహరి ఒక్కసారిగా గర్జించాడు. బ్రహ్మాది సకలదేవతలకూ మన్వాది మహర్షులకూ సత్యలోకవాసులందరికీ విషయం అర్థమయ్యింది. ఒక్కసారిగా ఋగ్యజుస్సామాథర్వణ మంత్రాలతో అందరూ పెద్దపెట్టున స్తుతించారు. దానికి సంబరపడిన ఆదివరాహం అందరిమీదకీ కృపావలోకనాలు వెదజల్లి మహాజలనిధిలో ప్రవేశించింది. అలా ప్రవేశిస్తోంటే గునపాల్లాగా నిక్క బొడుచుకున్న దాని వెంట్రుకలు గుచ్చుకుని తనువంతా చీరుకుపోయి సముద్రుడు రక్షించు రక్షించు అని గోలపెట్టాడు.



తస్యాంతర్విశత: క్రూరసటాఘాతప్రపీడిత: ।
సముద్రోఽథాబ్రవీద్దేవ రక్ష మాం శరణార్తిహన్ ॥ (2 - 12)

ఆ మాటలు ఆలకిస్తూనే ఆదివరాహం జలచరాలను చీల్చుకుంటూ ఇంకా లోతులకి వెళ్ళిపోయింది. నీళ్ళల్లో అన్ని వైపులకూ కలయదిరుగుతూ వెదికివెదికి భూగోళాన్ని పట్టుకుంది. దాన్ని తన దంష్ట్రమీద నిలబెట్టుకుని రివ్వున పైకి వచ్చింది. ఒక పద్మాన్ని కోరమీద నిలబెట్టిన దిగ్గజంలాగా భాసించాడు ఆదివరాహమూర్తియైన ఆ యజ్ఞేశుడూ యజ్ఞపూరుషుడూ.

తాం సముద్ధృత్య దంష్ట్రాగ్రే యజ్ఞేశో యజ్ఞపూరుష: ।
శుశుభే దిగ్గజో యద్వత్ ఉద్ధృత్యాథ సుపద్మినీమ్ ॥ (2 - 16)

ఈ అద్భుతరూపాన్ని దర్శించి బ్రహ్మదేవుడు సంభ్రమాశ్చర్యాలతో స్తుతించాడు. జయ జయ పుండరీకాక్షా ! భక్తార్తి వినాశకా ! నీ కోరమీద ఈ భూగోళం ఏనుగు తొండంమీద వికసితాంభోజంలాగా విరాజిల్లుతోంది. నీ రూపం - పద్మాన్ని తొండంమీద ధరించిన వెల్ల ఏనుగులాగా ఉంది. దేవేశా ! సృష్టిసంహారకారకా ! నమోనమః. దానవులను సంహరించడానికి అనేకరూపాలు ధరించినవాడా ! నీకు సర్వపార్శ్వాలనుంచీ నమస్కరిస్తున్నాను. సర్వదేవతా సమర్చితా ! బృహద్ధామా ! కావలసిన శక్తియుక్తులను ఇచ్చి ప్రజాసృష్టికి నన్ను వియోగించావు. నీ ఆజ్ఞల ప్రకారం నేను ఆ పని చేస్తున్నాను. నీ సహాయంతోనే దేవతలు సుధాపానం చెయ్యగలిగారు. ఇంద్రుడు త్రిలోకీసామ్రాజ్యాధిపతి కాగలిగాడు. అమరభోగాలు అనుభవించగలుగుతున్నాడు. అగ్నిదేవుడు పావకత్వాన్ని పొంది జాఠరాది భేదాలతో మానవులకు ఆప్యాయనం చేస్తున్నాడు. పితృదేవతలకు అధిపతియై యమధర్మరాజు నీ కృపవల్లనే ప్రాణికోటికి పాపపుణ్యఫలాలను నిష్పాక్షికంగా అందించగలుగుతున్నాడు. రాక్షసజాతికి అధీశుడైన నిర్‌ృతుడు నీ దయవల్లనే కర్మసాక్షి కాగలిగాడు. వరుణుడికి దిక్పాలకత్వమూ జలాధిదేవత్వమూ నీ కృపావిశేషమే. సకలజీవులలోనూ ప్రాణరూపంలో సంచరిస్తూ వాయుదేవుడు గంధవహుడయ్యాడంటే నీ అనుజ్ఞయే. కుబేరుడు యక్షకిన్నరజాతులకు అధిపతియై నీ కనుసన్నలలో మెలుగుతున్నాడు. సర్వ రుద్రగణాలకూ ఏలికయైన ఈశానుడు నీ అనుగ్రహంవల్లనే లోకవంద్యుడయ్యాడు. నీ అంశభాగాలే వేలకొద్దీ దేవతారూపాలు ధరించాయి.

బ్రహ్మదేవుడి స్తుతులకు ఆదివరాహమూర్తి సంతోషించి తన ఆనందాన్ని కరుణాకటాక్షవీక్షణాలలో చూపించాడు. అంతలోకే ఎక్కడనుంచి వచ్చిపడ్డాడో కానీ హిరణ్యాక్షుడు ఆదివరాహమూర్తిని ఢీకొనబోయాడు. భయంకర గదాఘాతంతో వాడిని సంహరించాడు శ్రీహరి. వాడి శరీరం నుంచి ఎగజిమ్మిన రక్తంతో శ్వేతవరాహం అరుణవరాహమయ్యింది. భూగోళాన్ని కోరనుంచి దింపి యథాస్థానంలో ఉంచి ఆదివరాహమూర్తి తన వైకుంఠానికి వెళ్ళిపోయాడు.



శ్రీమహావిష్ణువు వరాహావతారం ధరించి భూగోళాన్ని ఉద్ధరించిన ఈ వృత్తాంతాన్ని విన్నవారూ చదివినవారూ సర్వపాపవినిర్ముక్తులై వైష్ణవీగతిని పొందుతారు. ***(అధ్యాయం - 2, శ్లోకాలు - 38)***

నారదమహర్షీ ! విష్ణుమూర్తి అలా భూదేవిని యథాస్థానంలో నిలబెట్టి తన వైకుంఠానికి వెళ్ళిపోయాక బ్రహ్మదేవుడు మనువును చూసి - నాయనా ! ఇదిగో ఈ భూగోళమంతా నీ ప్రదేశమే. యథోచితంగా ప్రజలను సృష్టించు. దేశకాలవిభాగజ్ఞుడవై యజ్ఞాలు చేస్తూ యజ్ఞ పురుషుణ్ణి సంతృప్తిపరచు. వర్ణాశ్రమ ధర్మాలను శాస్త్రోక్తంగా నిలబెట్టు. అప్పుడు నియమానుసారం క్రమసంబంధాలతో ప్రజావృద్ధి జరుగుతుంది. గుణాల్లో కీర్తిలో తేజస్సులో నీకుసాటివచ్చే పుత్రులను పొంది అనురూపవతులైన కన్యలకు ఇచ్చి వివాహాలు జరిపించు. విద్యా వినయసంపన్నులై నీ సంతతి అభివృద్ధి చెందుతారు. పరాత్పరునియందు మనస్సు నిలుపు. భక్తితో భగవత్పరిచర్యలు చెయ్యి. యోగమార్గంలో ప్రయాణం సాగించు - అని ఆశీర్వదించి తన సత్యలోకానికి వెళ్ళిపోయాడు.

## ◆ స్వాయంభువమను సృష్టి ◆

స్వాయంభువమనువు తండ్రి ఆజ్ఞను శిరసావహించి ప్రజలను సృష్టించాడు. ప్రియవ్రతుడు ఉత్తానపాదుడు అనే పుత్రులు ఆవిర్భవించారు. ఆకూతి, దేవహూతిక, ప్రసూతి అని ముగ్గురు పుత్రికలు జన్మించారు. ఆకూతిని రుచిమహర్షికీ, దేవహూతికను కర్దముడికీ, ప్రసూతికను దక్షుడికీ ఇచ్చి వివాహాలు జరిపించాడు. ఆకూతికారుచికులకు యజ్ఞుడు అనే ఆదిపురుషుడు జన్మించాడు. దేవహూతికాకర్దములకు కపిలుడు పుట్టాడు. ఇతడు సాంఖ్యాచార్యుడై సకలలోకవిఖ్యాతుడు అయ్యాడు. ప్రసూతికాదక్షులకు ఆడపిల్లలు చాలామంది కలిగారు. వారి సంతతిగా దేవతిర్యగ్నరాదిజాతులన్నీ ఆవిర్భవించాయి. అందరూ ప్రజాసృజనకార్యంలో ప్రధాన భూమికను నిర్వహించారు.

వీరిలో యజ్ఞుడు స్వాయంభువమన్వంతరంలో రాక్షసులబారినుండి మనువును కాపాడి లోకవిశ్రుతి వహించాడు. కపిలుడు మహాయోగి. తనకు ఒక ఆశ్రమం నిర్మించుకుని సాంఖ్యయోగమార్గాలలో విశేషమైన కృషిచేశాడు. తన తల్లి దేవహూతికకు అవిద్యానివర్తకమైన జ్ఞానాన్నీ ధ్యానయోగాన్నీ ప్రబోధించాడు. సకల జీవరాశులకూ అజ్ఞాన వినాశకమైన శాస్త్రాన్ని రచించాడు. అదే కాపిలం. అటు తరువాత కొంతకాలానికి పులహాశ్రమం చేరుకుని తన కృషిని కొనసాగించాడు. ఇప్పటికీ అతడే సాంఖ్యాచార్యుడు. అతడి పేరు తలుచుకుంటే చాలు సాంఖ్యయోగం సిద్ధిస్తుంది. యోగాచార్యుడైన ఆ కపిలుడికి శిరసువంచి నమస్కరిస్తున్నాను.



ఇది మనువుకి పుట్టిన ఆడపిల్లల కథ. కన్యావంశవర్ణన. ఇక మనుపుత్రుల వంశ విస్తృతి చెబుతాను. ద్వీప వర్ష సముద్రాది వ్యవస్థ అంతా వారే చేశారు. సర్వభూతసుఖమూ వ్యవహారప్రసిద్ధి ఫలాలుగా సాగిన ఆ వ్యవస్థను వివరిస్తాను. ఈ విశేషాలు విన్నా చదివినా పాపాలు నశించి పుణ్యఫలాలు దక్కుతాయి. *(అధ్యాయం - 3, శ్లోకాలు - 23)*

నారదా! మనువుకి జ్యేష్ఠపుత్రుడు ప్రియవ్రతుడు అని చెప్పానుకదూ ! అతడు పేరుకి తగ్గ కొడుకు. తండ్రిని సేవించుకుంటూ సత్యధర్మపరాయణుడై బాల్యం గడిపాడు. యౌవనం రాగానే విశ్వకర్మ కూతురు బర్హిష్మతిని పరిణయమాడాడు. ఆ దంపతులకు పదిమంది కొడుకులూ చివరిగా ఊర్జస్వతి అనే ఒక కూతురూ జన్మించారు. అగ్నీధ్రుడు, ఊర్ధ్వజిహ్వుడు, యజ్ఞబాహువు, మహావీరుడు, రుక్మశుక్రకుడు, ఘృతపృష్ఠుడు, సవనుడు, మేధాతిథి, వీతిహోత్రుడు, కవి - అని వారి పేర్లు. అందరూ అగ్ని సమానులు. వీరిలో మహావీరుడూ సవనుడూ కవీ - ఈ ముగ్గురూ విరాగులై ఆత్మవిద్యావేత్తలై నిస్పృహులై ఊర్ధ్వరేతస్కులై పరమహంసాశ్రమవాసులయ్యారు. ఆధ్యాత్మికానందాన్ని చూరగొన్నారు. ఈ ప్రియవ్రతుడికి అపాస్య అని మరొక ఇల్లాలు ఉంది. ఆమెకు ఉత్తమ - తామస - రైవతులని ముగ్గురు పుత్రులు జన్మించారు. వీరు మహౌజసులై తరవాతకాలంలో మన్వంతరాధిపతులు అయ్యారు.

ప్రియవ్రతుడు తిరుగులేని బలపరాక్రమాలతో పదకొండు అర్బుదాలపాటు భూగోళాన్ని పరిపాలించాడు. సూర్యుడు ఒకవైపున ప్రకాశిస్తోంటే, భూగోళానికి మరొకవైపున చీకట్లు ముసురుకోవడాన్ని గమనించాడు. నా పరిపాలనలో చీకటి ఉండటమా, దీన్ని తొలగించడం ఎలాగా అని ఛాలాకాలం ఆలోచించాడు.

యదా సూర్యః పృథివ్యాశ్చ విభాగే ప్రథమేఽతపత్ ।
భాగే ద్వితీయే తత్రాసీత్ అంధకారోదయః కిల ॥
ఏవం వ్యతికరం రాజా విలోక్య మనసా చిరమ్ ।
ప్రశాస్తి మయి భూమ్యాం చ తమః ప్రాదుర్భవేత్కథమ్ ॥
ఏవం విచారయిష్యామి భూమౌ యోగబలేన చ ॥ (4 - 12)

యోగబలంతో చీకటిని తొలగిస్తాను అని నిర్ణయించుకున్నాడు. ఆదిత్యసమతేజస్కమైన రథం అధిరోహించి భూగోళానికి రెండవవైపున వెలుగులు నింపుతూ పర్యటించాడు. అతడి రథనేమి ఏడుచోట్ల భూగోళాన్ని చీల్చివేసింది. అవి సప్తసముద్రాలయ్యాయి. భూభాగం సప్తద్వీపాలుగా విభజించబడింది. సప్తసింధువులూ ఆ భూభాగాలకు పరిఖలు అయ్యాయి. అప్పటినుంచీ "సప్తద్వీపా వసుంధరా" అనే



మాట స్థిరపడింది. జంబూద్వీపం, ప్లక్షద్వీపం. శాల్మలీద్వీపం, కుశద్వీపం, క్రౌంచద్వీపం, శాకద్వీపం, పుష్కరద్వీపం - అని వాటికి పేర్లు ఏర్పడ్డాయి. ఇవి ఉత్తరోత్తరం ఒకదానికంటే ఒకటి రెట్టింపు పరిమాణంలో ఉంటాయి. క్షారసముద్రం, ఇక్షురససముద్రం, సురాసముద్రం, ఘృతసముద్రం, క్షీరసముద్రం, దధిమండసముద్రం, శుద్ధోదక సముద్రం - అని సప్త సింధువులు. (మండం = వెన్న).

వీటిలో జంబూద్వీపం క్షారసముద్ర పరివేష్టితం. దీనికి ప్రియవ్రతుడు తన కుమారుడైన అగ్నీ ధ్రుడిని అధిపతిగా నియమించాడు. ప్లక్షద్వీపం చుట్టూ ఉన్నది ఇక్షురససముద్రం. దీనికి రెండవ కొడుకు ఊర్ధ్వజిహ్వుడు పరిపాలకుడు. సురాజలధి పరివేష్టితమైన శాల్మలీద్వీపానికి యజ్ఞబాహువు పాలకుడయ్యాడు. ఘృతసముద్ర సంప్లుతమైన కుశద్వీపానికి హిరణ్యరేతసుడు(రుక్మశుక్రకుడు) అధిపతి. క్షీరసముద్ర సంపృక్తమైన క్రౌంచద్వీపానికి ఘృతపృష్ఠుడు, దధిమండసముద్ర వేష్టితమైన శాకద్వీపానికి మేధాతిథి, శుద్ధోదకసముద్ర వేష్టితమైన పుష్కరద్వీపానికి వీతిహోత్రుడు అధిపతులుగా నియుక్తులయ్యారు.

ప్రియవ్రతుడి కడగొట్టు బిడ్డ ఊర్జస్వతిని భృగువంశజుడైన ఉశనసుడికి ఇచ్చి వివాహం జరిపించారు. ఈ ఉశనసుడు రాక్షసగురువై శుక్రాచార్యుడుగా (కావ్యుడు) ప్రసిద్ధికెక్కాడు. వీరికి ఒక కూతురు జన్మించింది. దేవయాని. పేరు వినే ఉంటావుగా. ప్రసిద్ధురాలు.

కన్యామూర్జస్వతీనామ్నీం దదావుశనసే విభుః ।
ఆసీత్తస్యాం దేవయానీ కన్యా కావ్యస్య విశ్రుతా ॥ (4 - 27)

ప్రియవ్రతుడు ఇలా భూగోళాన్ని సప్తద్వీపాలుగా విభజించి తన పుత్రులకు అప్పగించి తాను వివేకసంపన్నుడై యోగమార్గాన్ని పూర్తిగా అవలంబించాడు. ***(అధ్యాయం - 4, శ్లోకాలు - 28)***

## ◆ జంబూద్వీపవర్ణన ◆

నారదమహర్షీ ! ద్వీప వర్ష విభేదాలూ విస్తారాలూ సంగ్రహంగా చెబుతాను ఆలకించు అంటూ నారాయణమహర్షి కొనసాగించాడు. (వర్షము = దేశము)

జంబూద్వీపం మొట్టమొదటిది. అది లక్షయోజనవిస్తారం. తామరపువ్వు దుద్దులాగా వర్తులాకారంలో ఉంటుంది. ఇందులో నవవర్షాలు ఉన్నాయి. ఒక్కొక్కటీ తొమ్మిదివేల యోజనాల ఆయామంతో విలసిల్లుతోంది. ఎనిమిది సుదీర్ఘపర్వతశ్రేణులు పరివేష్టించి ఉన్నాయి. దక్షిణోత్తర విభాగంతో ధనురాకృతిలో విరాజిల్లే నవవర్షాలలోనూ ఇలావృతవర్షం మధ్యభాగాన భాసిస్తుంది. దీనికి నాభికేంద్రంగా మేరుపర్వతం ఉంది. ఇది లక్షయోజనాల ఎత్తు. మొత్తం భూగోళకమలానికి ఆ సువర్ణాద్రి



ఒక కర్ణికలాగా కనిపిస్తుంది. దీని శిఖరం ముప్ఫయిరెండువేల యోజనాలు. మూలభాగం పదహారువేల యోజనాలు. లోతుకూడా అంతే. ఇలావృతవర్షానికి ఉత్తరంలో నీలము శ్వేతము శృంగవంతము అనే పర్వతాలు ఎల్లలుగా ఉన్నాయి. రమ్యక - కురు వర్షాలను స్ఫుటీకరించేవి ఇవే. వాటికి ఈ పర్వతాలు దక్షిణపు సరిహద్దులు. ఈ పర్వతశ్రేణులు మూడూ తూర్పు వైపునకు పొడవుసాగి క్షారోదధిని తాకుతుంటాయి. ఒక్కొక్కటీ ద్విసహస్రపృథుతరాలు. ఉత్తరోత్తరం ఒకదానికంటే ఒకటి దశాంశాధికాలు. (పదవవంతు ఎక్కువ విస్తీర్ణం కలవి). ఇవి నానానదనదీయుతాలై తరు లతా విరాజితాలై ప్రకాశిస్తుంటాయి.

ఇలావృతవర్షానికి దక్షిణదిక్కున నిషధ - హేమకూట - హిమాలయ పర్వతశ్రేణులు ఉన్నాయి. ఇవీ ప్రాగ్విస్తారాలే. ఒక్కొక్కటీ అయుతయోజన విస్తీర్ణాలు. ఇవి సరిహద్దులుగా హరివర్ష - కింపురుషవర్ష - భారతవర్షాలు రూపుగడుతున్నాయి. (వర్షము = దేశము)

ఇలావృతానికి పశ్చిమదిశలో మాల్యవంతమనే పర్వతం ఉంది. తూర్పుదిక్కున గంధమాదనం ఉంది. రెండేసివేల యోజనాల విస్తీర్ణంతో ఈ గిరులు నీల - నిషధవర్షాలవరకూ వ్యాపించి వాటికి ఎల్లలుగా నిలుస్తున్నాయి. కేతుమాల - భద్రాశ్వ వర్షాలకుకూడా ఇవే సరిహద్దు కొండగుర్తులు.

మందర - మేరుమందర - సుపార్శ్వక - కుముద పర్వతాలు మేరుపర్వతానికి ప్రత్యంతగిరులు (పాద పర్వతాలు). ఇవి ఒక్కొక్కటీ అయుతయోజన విస్తారంతో మేరువుకి నల్దిక్కులా మూలానికి తన్నిపెట్టుకుని దాన్ని నిలబెడుతున్నట్టుంటాయి. వీటిమీద చూత జంబూ కదంబ న్యగ్రోధ వృక్షాలు పదకొండువందల యోజనాల ఎత్తుకు ఎదిగి కేతనాల్లాగా కనిపిస్తుంటాయి. అంతే విస్తీర్ణం కలిగి నాల్గింటి మీదా నాలుగు సరస్సులున్నాయి. ఒకటి క్షీరసరస్సు. మరొకటి మధుసరస్సు. ఇంకొకటి ఇక్షుసరస్సు. నాల్గవది మంచినీటికొలను. వీటిని ఉపస్పృశిస్తే చాలు దేవతలుకూడా యోగైశ్వర్యాలను పొందుతారు. తమ కాంతలతో కలిసి దేవతలు ఈ గిరిశిఖరాలమీద ఈ సరోవర ప్రాంతాలలో క్రీడావినోదంగా విహరిస్తూ ఉంటారు. నందన - చైత్రరథక - వైభ్రాజక - సర్వభద్రక నామధేయాలతో నాలుగు ఉద్యానవనాలు ఉన్నాయి. వీటిలోనూ గీతవాద్యనర్తనకుశలురై అప్సరోంగనలూ అమరనాయకులూ ఉపదేవగణాలతో కలిసి స్వేచ్ఛగా ఆనందంగా స్వతంత్రులై సుఖాలు అనుభవిస్తూ ఉంటారు.

మందర పర్వతశిఖరంమీద పదకొండువందల యోజనాల ఎత్తు ఎదిగిన దేవచూతవృక్షానికి పర్వతశిఖరాలంతటి ఫలాలు వేలాడుతుంటాయి. వాటి రుచి వర్ణనాతీతం. వాటి రసం అమృతోపమం. అవి పగిలి ప్రవహించిన రసం అరుణ వర్ణంలో వాకలు కట్టి "అరుణోద" అనే నదిలో కలిసి దానిపేరును సార్థకం చేస్తోంది. ఎఱ్ఱని రంగులో ప్రవహించే ఈ అరుణోద నది సకలపాపహారిణి. దీనికి చేరువలోనే అరుణ అనే పేరుతో ఆదిపరాశక్తి విరాజిల్లుతోంది. ఆ తల్లిని దేవతలందరూ అర్చించి వాంఛితార్థాలను



పొందుతున్నారు. కల్మషఘ్నిగా, కాంతిదాయినిగా, అభయప్రదాత్రిగా భావించి సేవించి ఆయురారోగ్యాలను పొందుతున్నారు. ఆవిడ ఆద్య, మాయ, అతుల, అనంత, పుష్టి, ఈశ్వరమాలిని, దుష్టనాశకి, కాంతి దాయిని. ***(అధ్యాయం - 5, శ్లోకాలు - 30)***

మందరశిఖరంనుంచి తూర్పుదిశగా ప్రవహిస్తున్న ఈ అరుణోద నదీజలాలలో దేవతావనితలతో పాటు అరుణాదేవి అనుచరీగణంకూడా పుణ్యస్నానాలు చేస్తూంటారు. వారి శరీరసుగంధపరిమళాలు పరీవాహక ప్రదేశమంతటినీ సుగంధబంధురం చేస్తున్నాయి.

మేరుమందర పర్వతశిఖరం మీద ఉన్న నేరేడు చెట్టునుంచి ఏనుగుతలలంతటి జంబూఫలాలు రాలిపడి పగిలి వాటి రసంతో జంబూనది ఏర్పడింది. ఇది ఇలావృతవర్షంలో దక్షిణదిశగా ప్రవహించే నది. దీని ఒడ్డున వెలిసిన అమ్మవారిని జంబ్వాదిని అంటారు. జంబూఫలాలను ఇష్టంగా భుజిస్తుంది. దేవ నాగ ఋషి రాక్షసగణ సేవిత. సర్వభూతదయాకరి, కఠోరవిగ్రహ, కామపూజిత, ధన్య, నాకిమాన్య (నాకి = దేవత), గభస్తిని అనీ కీర్తింపబడుతోంది. కీర్తించినవారి పాపాలనూ రోగాలనూ నశింపజేస్తోంది. కోకిలాక్షి, కామకళ, కరుణ అనేవి కూడా ఆ దేవికి పర్యాయపదాలు. ఆ ప్రాంతంలో మట్టి జంబూఫలరసంలో నాని గాలికీ ఎండకూ ఆరి దేవతల హస్తవాసితో బంగారం అవుతోంది. అందుకే బంగారానికి జాంబూనదం అనే పేరు ఏర్పడింది. ఆ సువర్ణాన్ని కిరీటాలుగా కటిసూత్రాలుగా కేయూరాది విభూషణాలుగా స్త్రీ పురుషులు ధరిస్తున్నారు.

సుపార్శ్వగిరి శిఖరంమీద మహాకదంబవృక్షం ఉంది. దాని తొర్రలనుంచి అయిదు పాయలుగా నదులు బయలుదేరి ఇలావృతవర్షానికి పశ్చిమదిశగా ప్రవహిస్తున్నాయి. వీటిలో నీరు మధురమే కాదు సుగంధబంధురంకూడా. ఇది సేవించినప్పటి అమరుల ముఖమారుతాలు నూరుయోజనాల ప్రాంతాన్ని పరిమళింపజేస్తుంటాయి. ఇక్కడ వెలిసిన మహాదేవికి ధారేశ్వరి అని పేరు. దేవపూజ్య, మహోత్సాహ,కాలరూప, మహానన, కాంతారగ్రహణేశ్వరి, కర్మఫలద, కరాళదేహ, కాలాంగి, కామకోటి ప్రవాతని - అని స్తుతింపబడుతూంటుంది.

నాల్గవది కుముదపర్వతశిఖరం. దీనిమీద మహాన్యగ్రోధ తరువు (ఊడల మర్రి) ఉంది. శతబలమని పేరు. దీని స్కంధభాగాలనుంచి ఆవిర్భవించి కొన్ని నదములు ఇలావృతవర్షానికి ఉత్తరదిగ్భాగాన ప్రవహిస్తున్నాయి. తీరప్రాంతవాసులకు పాడిపంటలను అన్నవస్త్రాలనూ శయనాసనాభరణాదులనూ పుష్కలంగా అందిస్తున్నాయి. ఇక్కడి మహాదేవికి మీనాక్షి అని పేరు. ఈవిడ నీలాంబరధారిణి. రౌద్రముఖి. నీలాలకయుత. దేవమానవ సంసేవిత. వరద. అతిమాన్య, అతిపూజ్య. ఈ తల్లిని మత్తమాతంగగామిని, మదనోన్మాదిని, మానప్రియ, మానప్రియాంతర, మారవేగధర, మారపూజిత, మారమాదిని, మయూరవర



శోభాఢ్య, శిఖివాహనగర్భ భూమి - ఇత్యాది నామధేయాలతో కీర్తిస్తుంటారు. జపించినవారినీ స్మరించిన వారినీ ఈ జనని కాపాడుతూంటుంది. ఈ నదాలలో నీళ్ళు తాగినవారికి ముసలితనం రాదు. అలసట, చెమట, దుర్గంధం, జుట్టునెరవడం, అనారోగ్యం, అకాలమరణం, శీతోష్ణ వాతవైవర్ణ్యాలు, ముఖోపప్లవాలు (ముఖంమీద ముడతలు, పెదవులు పగలడం, పళ్ళు ఊడటం వగైరాలు) మొదలైన ఆపదలు ఏవీ రావు. నిండు ఆరోగ్యంతో నిండా నూరేళ్ళూ జీవిస్తారు.

అటుపైని సుమేరుపర్వతం. దానికి ఇరవై శిఖరాలున్నాయి. వీటిలో పంధొమ్మిది ప్రత్యంత పర్వత శిఖరాలు చుట్టూ పరివేష్టించి ఉంటాయి. కురంగ - కురగ - కుశుంభ - వికంకత - త్రికూట - శిశిర - పతంగ - రుచక - నిషధ - శితివాస - కపిల - శంఖ - వైదూర్య - చారుధి - హంస - ఋషభ - నాగ - కాలంజర - నారద - శిఖరాలతో కలిపి సుమేరువుకి ఇరవై శిఖరాలు. ***(అధ్యాయం - 6, శ్లోకాలు - 32)***

మేరుపర్వతానికి తూర్పుదిక్కున పద్దెనిమిదివేల యోజనాల వైశాల్యమూ, రెండువేల యోజనాల ఎత్తూ కలిగి జఠర - దేవకూట పర్వతాలున్నాయి. పశ్చిమదిశలో పవమాన - పారియాత్ర పర్వతాలున్నాయి. దక్షిణదిక్కున కైలాస - కరవీరకాలు విరాజిల్లుతున్నాయి. ఇలాగే ఉత్తరదిక్కున త్రిశృంగ - మకర గిరులున్నాయి. ఈ ఎనిమిది పర్వతాలు పరివేష్టించి ఉండగా కాంచనశిఖరంతో మేరుపర్వతం సూర్యుడిలా ప్రకాశిస్తోంది. ఆ శిఖరానికి మధ్యభాగాన చతురస్రాకారంలో పదివేల యోజనాల వైశాల్యంతో బ్రహ్మదేవుడి నగరం ఉంది. ఆ నగరంలో సౌధాగ్రాలమీద బంగారు కలశాలు ఉంటాయి. ఈ బ్రహ్మనగరానికి చుట్టూ ఎనిమిది దిక్కులలోనూ అష్టదిక్పాలకుల నగరాలున్నాయి. అవన్నీ బంగారు భవనాలతో తళతళలాడుతూ ఉంటాయి. మొత్తం ఇవి తొమ్మిది నగరాలు. మనోవతి, అమరావతి, తేజోవతి, సంయమని, కృష్ణాంగన, శ్రద్ధావతి, గంధవతి, మహోదయ, యశోవతి అని వీటి పేర్లు. వరసగా బ్రహ్మ - ఇంద్ర - అగ్ని ప్రభృతుల పట్టణాలు ఇవ్వి.

**మేరోర్నవ పురాణి స్యుర్మనోవత్యమరావతీ ।**
**తేజోవతీ సంయమనీ, యథా కృష్ణాంగనా పరా ॥**
**శ్రద్ధావతీ గంధవతీ తథా చాన్యా మహోదయా ।**
**యశోవతీ చ బ్రహ్మేంద్రవహ్న్యాదీనాం యథాక్రమమ్ ॥ (7 - 11)**

నారదా ! శ్రీమన్నారాయణుని ఎడమకాలి బొటనవేలు నుంచి ఆవిర్భవించిన గంగానది ఊర్ధ్వభాగ రంధ్రంనుంచి కిందకు ప్రవహించి ఆ మేరుపర్వతశిఖరంమీద కాలూనింది. సకలపాపహారిణి. సాక్షాద్భగవతి - తాను జన్మించిన రెండువేల సంవత్సరాల తరవాత మేరుపర్వతం మీదకు అవతరించింది. ఈ దేవీదేవనదీశ్వరి అవతరించిన ప్రదేశానికి విష్ణుపదం అనేపేరు చరితార్థమయ్యింది.



ఉత్తానపాదుని కుమారుడు ధ్రువుడు గొప్ప విష్ణుభక్తుడు. విష్ణుదేవుని పాదపద్మాల పుష్పాడిని శిరస్సున ధరించి ఇప్పటికీ మేరుపర్వత శిఖరంమీద శాశ్వతుడై వెలుగొందుతున్నాడు. అతడి ప్రభావం ఎరిగిన సప్తర్షులు సర్వలోకహితం కోరి నిత్యమూ అతడికి ప్రదక్షిణలు చేస్తుంటారు.

ఈ గంగానది తపస్వులకు సిద్ధిప్రదాయిని. ఆకాశరంధ్రం నుంచి కిందికి దుముకుతున్న ఈ నదిని కైలాసనిలయుడు తన జటాజూటంలో బంధించి వేగం తగ్గించాడు. అటునుంచి కోటిపాయలై ఆకాశాన పయనించి మేరుశిఖరం మీద బ్రహ్మదేవుని నగరంలో (మనోవతి) మెల్లగా కాలూనింది. కోటిపాయలూ కలిసి నాలుగు ప్రధాననదులై మేరుపర్వతానికి నాలుగువైపులా ప్రవహించాయి. కట్టకడపటికి నదీవల్లభుడైన సముద్రుణ్ణి కలిశాయి. సీత - అలకనంద - చక్షువు - భద్ర అని వీటి పేర్లు.

**సరితాం చ నదీనాం చ పతిమేవాన్వపద్యత ।**
**సీతా చాలకనందా చ చక్షుర్భద్రేతి నామభిః ॥ (7 - 22)**

వీటిలో సీతానది బ్రహ్మనగరంనుంచి తూర్పుగా బయలుదేరి గంధమాదన పర్వతంమీదకు దిగి భద్రాశ్వవర్షాన్ని పరిపూతం చేసి క్షారసముద్రాన్ని చేరుకుంది. రెండవది చక్షుర్నది పడమరగా పయనించి మాల్యవంతంమీదకు దిగి వేగవతియై కేతుమాల వర్షాన్ని సుసంపన్నం చేసి సముద్రంలో కలుస్తోంది. మూడవది అలకనంద దక్షిణదిశగా బయలుదేరి హేమకూటాద్రిమీదకు దిగి అతివేగవతిగా భరతవర్షంలో ప్రవహించి దక్షిణ సముద్రంలో కలుస్తోంది. ఈ నదిలో స్నానం చేసిన మానవులకు రాజసూయ - అశ్వమేధ యజ్ఞాలు చేసిన ఫలం ఇట్టే లభిస్తుంది. ఇక నాల్గవది భద్రానది ఉత్తరదిశగా శృంగవత్పర్వతంమీదకు దిగి కురువర్షాన (కురుభూములు) పాడిపంటలు వెలార్చి సముద్రంలో కలుస్తోంది. ఇవేకాక ఈయీ దేశాలలో (వర్షాలలో) నదీనదాలు చాలా ప్రవహిస్తున్నాయి. వాటిలో ఎక్కువభాగం మేరుపర్వతం నుంచి ఆవిర్భవించినవే.

నారదా ! మొత్తం తొమ్మిది వర్షాలు చెప్పానుగదా ! వీటిలో భరతవర్షం ఒక్కటే కర్మక్షేత్రం అంటున్నారు. తక్కిన ఎనిమిది దేశాలూ భోగభూములట. స్వర్లోకవాసులు తమ పుణ్యశేషఫలాలను అక్కడ అనుభవిస్తారుట. అయుత సంవత్సరాయుష్కులై (అయుతం = పదివేలు) దేవసన్నిభులై వజ్రసమానశరీరులై నాగసహస్రబలాఢ్యులై (వెయ్యి ఏనుగుల బలం), భార్యలతో కలిసి సురత సంతుష్టులై సుఖాలు అనుభవిస్తుంటారు.

**ఏకవర్షోనకే చాయుష్యాప్తగర్భాః స్త్రియోఽత్ర హి ।**
**త్రేతాయుగసమః కాలో వర్తతే సర్వదైవ హి ॥ (7 - 37)**



అలాగే - అక్కడ స్త్రీలు. మరొక సంవత్సరంలో ఆయుర్దాయం తీరుతుందనగా గర్భం ధరిస్తుంటారు. అక్కడ కాలం ఎప్పుడూ త్రేతాయుగంతో సమానమై నడుస్తూ ఉంటుంది.

*(అధ్యాయం - 7, శ్లోకాలు - 37)*

దేవర్షీ! ఆ దేశాలలో నివసించేవారు నిరంతరం జపధ్యాన సమాధితత్పరులై దేవీస్తోత్రాలు చేస్తూ వివిధ ఋతువులలో లభించే రకరకాల పువ్వులతో అమ్మవారిని అర్చిస్తుంటారు. ఫలపుష్పపల్లవాలశోభ ఆ ప్రాంతాలలో చాలా పుష్కలంగా కనిపిస్తూంటుంది. అక్కడి కొండలూ కొండచెరియలు గుహలు అడవులు సమతల ప్రదేశాలు - అన్నీ తరులతా సమూహంతో కళకళలాడుతుంటాయి. కొండవాగులూ నదులూ నిర్మలోదకాలతో నిండుగా ప్రవహిస్తూ ఉంటాయి. వికసించిన పద్మాలతో హంససారసజలపక్షులతో సరోవరాలు చూడముచ్చట గొల్పుతాయి. శుకపికాలాపాలు ఉద్యానవనాలలో చెవులపండుగ చేస్తాయి. అందమైన కనుబొమ్మలతో విలాసాలకు పుట్టిళ్ళు అనిపించే సుందరీమణులతో కలిసి యువకులు ఈ ఉద్యానవనాలలో స్వేచ్ఛగా క్రీడిస్తుంటారు.

మొత్తం ఈ తొమ్మిది భూభాగాలలోనూ (నవవర్షాలు) ఆది పురుషుడైన శ్రీమన్నారాయణుడు లోకానుగ్రహకాంక్షతో మహాదేవిని ఆరాధిస్తూ, తానూ పూజలు అందుకుంటూ నివసిస్తున్నాడు. ఏకాగ్రచిత్తుడై ఆత్మవ్యూహంతో సన్నిధి చేస్తున్నాడు.

ఇలావృతంలో భవుడొక్కడే దేవుడు. మరింకెవరికీ ప్రవేశం లేదు. అతడు బ్రహ్మదేవుని అక్షిగోళంనుంచి ఆవిర్భవించినవాడు. భార్యాసహితుడై పూజలు అందుకుంటూ ఉంటాడు. ఆ భవానీశాపంవల్ల అక్కడ పురుషుడు స్త్రీగా మారిపోతుంటాడు. అందుచేత అందరూ స్త్రీలే. అందరూ భవానీనాథకులే. వారందరూ గుమికూడి పూజలు చేస్తూంటే భవుడు తాను ఆత్మలో సంకర్షణుడిని ధ్యానిస్తూ ఉంటాడు.

**ఓం నమో భగవతే మహాపురుషాయ, సర్వగుణసంఖ్యానాయ**
**అనంతాయ అవ్యక్తాయ నమ ఇతి ॥**
**భజే భజన్యారణ పాదపంకజం భగస్య కృత్స్నస్య పరం పరాయణమ్।**
**భక్తేష్వలం భావితభూతభావనం భవాపహం త్వాం భవభావమీశ్వరమ్॥**

**(8 -13)**

హే భగవన్ ! నీ మాయాగుణం చాలా విచిత్రం. కన్నులుండీ ఎవరూ కానలేరు. ఆత్మను జయించాలి అనుకున్నవారు నిన్ను శరణువేడక తప్పదు. నువ్వు అసదృశుడవు. నిరాకారుడవు. కానీ



మధ్వాసవతామ్రలోచనుడవై సాకారదృఢమూర్తివై కనపడుతూ ఉంటావు. ఇది మరొక మాయ. నిజానికి నువ్వు స్థితి జన్మసంయమ విహీనుడవు. అనంతుడవు. మహర్షులు ఇలాగే నిన్ను స్తుతించారు. నీ సహస్రశీర్షాలపై ఈ భూమండలం నిలబడింది. నువ్వు ఆదిపురుషుడవు. ఆద్యగుణ విగ్రహుడవు. భగవంతుడవు. అజుడవు. నీ అనుగ్రహంతోనే నేను తామస - ఇంద్రియ వికారాలను సృష్టించగలుగుతున్నాను. నీ చేతిలో మేము కీలుబొమ్మలం. తాడుకట్టి ఆడిస్తున్న పెంపుడు పిట్టలం.

ఏతే వయం యస్య వశే మహాత్మనః
స్థితాః శకుంతా ఇవ సూత్రయంత్రితాః ।
మహానహం వైకృతతామసేంద్రియాః
సృజామ సర్వే యదనుగ్రహాదిదమ్ ॥ (8 - 18)

యన్నిర్మితాం కర్హ్యపి కర్మపర్వణీం
మాయాం జనోఽయం గురుసర్గమోహితః
న వేద నిస్తారణయోగమంజసా
తస్మై నమస్తే విలయోదయాత్మనే ॥ (8 - 19)

కర్మపర్వణిగా నువ్వు సృష్టించిన ఈ మాయను సృష్టిసమ్మోహితుడెవ్వడూ తెలుసుకోలేకపోతున్నాడు. దీనిని దాటే ఉపాయమూ తెలియడంలేదు. ఓ విలయోదయస్వరూపా ! నీకివే నమస్కృతులు.

నారదా ! రుద్రుడు ఇలా సంకర్షణుడిని స్తుతిస్తూ దేవీగణ సమాహితుడై ఇలావృతంలో నివసిస్తున్నాడు. ఇలాగే భద్రాశ్వదేశంలో హయగ్రీవుడై వాసుదేవుడు సన్నిధిచేసి ఉంటున్నాడు. భద్రశ్రవుడు ఆ దేశానికి అధిపతి. అతని వంశంలో పుట్టినవారు భద్రసేవకులు. అందరూ హయగ్రీవమూర్తిని ఉపాసించేవారే. ఓం నమో భగవతే ధర్మాయాత్మవిశోధనాయ నమః అంటూ ప్రత్యేకమంత్రాలతో భద్రశ్రవసులు హయగ్రీవుణ్ణి స్తుతిస్తూ ఉంటారు.

హయగ్రీవా ! ఈ విశ్వాన్ని నశ్వరమని కవీశ్వరులూ యోగీశ్వరులూ గుర్తించారు. అయినా మళ్ళీ వారే సమ్మోహితులవుతూ ఉంటారు. ఇదొక ఆశ్చర్యకమైన నీ లీలావిలాసం. వేదాంతుల పరిభాషలో నీవు అకర్తవు. అయినా సృష్టిస్థితిలయాలకు నువ్వే కర్తవు. ఇది మరొక విచిత్రం. యుగాంతంలో తమోగుణతిరస్కృతాలైన వేదాలను రసాతలంనుంచి ఉద్ధరించి తెచ్చి బ్రహ్మకు అప్పగించే నీ అకారణ హితకారితకు నమస్కరిస్తున్నాను.



నారదా ! ఈ ప్రకారంగా భద్రశ్రవసులు అందరూ హయగ్రీవమూర్తిని స్తుతించి ఆరాధించి గుణ సంకీర్తన చేసి తరిస్తూ ఉంటారు. ఈ చరిత్రను విన్నవారూ చదివినవారూ పాపకంచుక నిర్ముక్తులై దేవీలోక నివాసం పొందుతారు. *(అధ్యాయం - 8, శ్లోకాలు - 29)*

దేవర్షీ ! నారదా ! హరివర్షంలో భగవంతుడు నృసింహరూపుడై భక్తులను అనుగ్రహిస్తున్నాడు యోగనరసింహుడు. భక్తానుగ్రహకారకుడు. ఆ రూపాన్ని మొదట దర్శించినవాడు ప్రహ్లాదుడు. ఓం నమో భగవతే నరసింహాయ. నమస్తేజస్తేజసే ఆవిర్భవ వజ్రదంష్ట్ర కర్మాశయాన్ రంధయ రంధయ తమో గ్రస గ్రస ఓం స్వాహా . అభయం మమాత్మని భూయిష్ఠాః . ఓం క్ష్రౌం - అనే మంత్రాలతో అలనాడు ప్రహ్లాదుడు స్తుతించాడు. అవే నేటికీ హరివర్షవాసులకు వేదమంత్రాలు.

ఈ విశ్వానికి శుభమగుగాక ! దుష్టులు నశింతురుగాక ! సకలభూతములూ పరస్పరం శుభములను ఆకాంక్షించుగాక! మనస్సు భద్రంగా ఉండుగాక ! అధోక్షజునియందు నిరంతరం నిర్హేతుకంగా సంలగ్నమగుగాక. సంతానమూ, సంపదలూ, సంబంధులూ మొదలైన తగులాటాలు తొలగిపోవుగాక ! ఇంద్రియ ప్రియులము కాకుందుముగాక ! నృసింహా ! ముకుందా ! నిన్ను సేవించని నరుడు నరుడేనా? నీపట్ల భక్తి ఉన్నవాడికి సకలదేవతలూ సంరక్షకులే. భక్తి లేనివాడికి ఏ రక్షణమూ లేదు. ఏ కోరికలూ తీరవు. చేపలకు నీరులాగా మానవులకు నీ భక్తి ప్రాణాధారం. దానినుంచి తొలగితే జీవితం దుర్లభం, దుర్భరం. అంచేత ఈ సంసార చక్రవాళాన్ని విడిచిపెట్టి నీ పాదపద్మాలను ఆశ్రయించినవారికి ఏనాడూ ఏ భయమూ ఉండదు.

ఈ విధంగా ప్రహ్లాదుడు నిత్యమూ నృసింహస్వామిని సుత్తించేవాడు. నృసింహుడంటే పాపమదగజాలకు సాక్షాత్తు సింహమే. అతడిని హృదయపద్మంలో నెలకొల్పుకొని హరివర్షవాసులు ఉపాసిస్తున్నారు.

నారదా ! కేతుమాలదేశంలో భగవంతుడు స్మరరూపంలో నివసిస్తున్నాడు. అక్కడివారికి ఇలువేల్పు. క్షీరాబ్ధిరాజకన్యక లక్ష్మీదేవి ఈ కేతుమాలాదేశానికి అధినాయిక. ఆ తల్లి ముందుగా ఈ స్మరరూపధారియైన శ్రీమహావిష్ణువును స్తుతించింది. ఓం హ్రాం హ్రీం హ్రూం ఓం నమో భగవతే హృషీకేశాయ సర్వగుణవిశేషైర్విలక్షితాత్మనే, ఆకూతీనాం చిత్తానాం చేతసాం విశేషాణాం చాధిపతయే షోడశకళాయ, ఛందోమయాయ, అన్నమయాయ, అమృతమయాయ సహసే ఓజసే బలాయ కాంతాయ కామాయ నమస్తే ఉభయత్ర భూయాత్ - ఇత్యాదిమంత్రాలతో స్తుతించింది. అవే నేటికీ అక్కడ మంత్రాలు. స్త్రీలు హృషీకేశ్వరుణ్ణి ఉపాసిస్తూ మరొక పురుషుడిని భర్తగా చెట్టపడితే వారికి ఆయురారోగ్యభోగభాగ్యాలు



లభించవు. హృషీకేశ్వరుడినే స్వతస్సిద్ధంగా పతిగా భావించినవారికి అన్నీ సమకూడుతాయి. అతడే సర్వజగత్పతి. అతడే సకలలోకాలకూ సకలజీవకోటికీ కరావలంబనం. మరొక ప్రభువు ఊహలకుకూడా లేడు - అని కేతుమాలావర్షవాసులు విశ్వసించి కామరూపధారిని నారాయణుడిని పలువిధాల స్తుతిస్తూ ఉంటారు.

రమ్యకవర్షంలో భగవంతుడు మాత్స్యరూపధారి. ఆ దేశాధిపతి మనువు ఇలా స్తుతించాడు - ఓం నమో ముఖ్యతమాయ నమః సత్త్వాయ ప్రాణాయౌజసే బలాయ మహామత్స్యాయ నమః . మత్స్యరూపధారీ! లోకపాలకులకైనా కనిపించని రూపంతో నిఖిలలోకాలలోనూ లోపలా వెలుపలా నువ్వే సంచరిస్తున్నావు. అందుకే ఈశ్వరుడవయ్యావు. ఈ జగత్తును నడిపిస్తున్నావు. లోకపాలకులు ఒక్కరొక్కరుకానీ సమష్టిగాకానీ చెయ్యలేని సృష్టిసంరక్షణకార్యాన్ని నువ్వు అవలీలగా చేస్తున్నావు. యుగాంతంలో ప్రళయజలధిలో నువ్వు ఒక్కడివే ఈదులాడుతుంటావు. పునః సృష్టికి దారిచూపుతుంటావు. నువ్వు జగత్ప్రాణగణాత్ముడవు. నీకివే నమస్కృతులు అని మత్స్యరూపధారిని రమ్యకవర్షవాసులు స్తుతిస్తుంటారు. ఈ మత్స్యావతారుడు సకల సంశయచ్ఛేదకారణుడు. ధ్యానించినవారి సకలకల్మషాలనూ దులిపివేస్తుంటాడు.

***(అధ్యాయం - 9, శ్లోకాలు - 23)***

నారదా ! హిరణ్మయ వర్షంలో భగవంతుడు కూర్మరూపధారి. యోగపతి. అర్యముడు ముమ్మొదట స్తుతించాడు. ఓం నమో భగవతే అకూపారాయ సర్వసత్త్వగుణవిశేషణాయ నోపలక్షితస్థానాయ నమో వర్ష్మణే నమో భూమ్నే నమోఽవస్థానాయ నమస్తే. ఓ అవ్యపదేశరూపా ! నీ రూపాలను పరిగణించడం ఎవరితరమూ కాదు. స్వేదజ - అండజ - ఉద్భిద (మొలక) రూపాలతో ఉన్న ఈ చరాచరజగత్తు దేవ - ఋషి - పితృ జాతులు, భూమి - ఆకాశ - శైల - సరిత్ - సముద్ర - ద్వీప - గ్రహ - నక్షత్రాదులు అన్నీ నీ ఏకైకరూపం. అయితే కవులు వీటికి అసంఖ్యేయ నామరూప - ఆకృతులు కల్పించి స్తుతిస్తున్నారు. తత్త్వం తెలిసిన వారికి అంతా ఒక్కటే రూపంగా భాసిస్తుంది. సంఖ్యానిదర్శనుడవు నువ్వు. నీకిదే నమస్కృతి - అని అర్యముడు హిరణ్మయవర్షనివాసులతో కలిసి కూర్మరూపధారిని స్తుతించాడు.

ఉత్తర కురుదేశాలలో భగవంతుడు ఆదివరాహమూర్తి. భూదేవి ఎల్లవేళలా స్తుతిస్తూ ఉంటుంది. ఓం నమో భగవతే మంత్రతత్త్వలింగాయ యజ్ఞక్రతవే మహాధ్వరావయవాయ మహావరాహాయ నమః కర్మశుక్లాయ త్రియుగాయ నమస్తే. ఓ యజ్ఞవరాహమూర్తీ! కవులూ పండితులూ నీరూపాన్ని దర్శించాలనే కోరికతో హృదయాన్ని మథిస్తూ ఉంటారు. నిగూఢంగా యోగక్రియలు అనుష్ఠిస్తూ ఉంటారు. వేదశాస్త్రయోగ విద్యలను అభ్యసించి ఆ బలంతో మాయను జయించి నిన్ను దర్శించి కృతకృత్యులవుతూ ఉంటారు.



మాయలు తొలగిపోవడం నీ దయావిశేషమే. నువ్వు గుణకర్మ సాక్షివి. అలనాడు ఆదిసూకరమూర్తివై నః దంష్ట్రాగ్రభాగాన నిలబెట్టి ప్రళయ సముద్రం నుంచి ఉద్ధరించావు - అంటూ భూదేవి కురువర్షనివాసుల కలిసి యజ్ఞవరాహమూర్తిని స్తుతించింది.

కింపురుషదేశంలో భగవంతుడు సీతారామరూపంలో ఉంటాడు. హనుమంతుడు - ఓం నమో భగవతే ఉత్తమశ్లోకాయ అని స్తుతిస్తూ ఉంటాడు. ఆర్యలక్షణాలూ ఉత్తమశీలమూ కలిగి దుష్టశిక్షణ అవతరించిన దాశరథీ ! నమో నమః. బ్రహ్మణ్యదేవా ! మహాపురుషా ! మహాభాగా ! సాధువాదనికషణ నువ్వు మానవులను మహితాత్ములుగా దిద్ది తీర్చడానికి మానవుడుగా జన్మించావు. రాక్షసవధ అవతారానికి ప్రథమ లక్ష్యం. లేకపోతే సీతావియోగాది దుఃఖాలను నువ్వు అనుభవించవలసి అవసరంలేదు. లక్ష్మణుడితో కలసి వచ్చి వానరులతో వనచరులతో సఖ్యం చెయ్యవలసిన అవసర అంతకన్నా లేదు. దేవతలుగానీ దానవులుగానీ నరులుగానీ వానరులుగానీ కృతజ్ఞతామూర్తి మానవరూపంలో ఉన్న నిన్ను సర్వాత్మనా సేవిస్తే చాలు సంసారజలధిని తేలికగా దాటేస్తారు. ఇలా సత్యసంధుడూ దృఢవ్రతుడూ రాజీవనేత్రుడూ అయిన రాముణ్ణి హనుమంతుడు స్తుతించాడు. నుతించాడు కీర్తించాడు. సేవించాడు. కింపురుషదేశస్థులందరూ ఇప్పటికీ అదే మార్గాన పయనిస్తున్నారు.

నారదా ! ఈ రామచంద్ర కథానకాన్ని విన్నవారూ పఠించినవారూ సర్వపాపవిశుద్ధులై సీతారామసలోకతను పొందుతారు. *(అధ్యాయం - 10, శ్లోకాలు - 20)*

## ◆ భారతవర్షం విశిష్టత ◆

భారతవర్షంలో నేనే ఆదిపురుషుణ్ణి. నువ్వే నా భక్తుడివి. నారదా ! నువ్వు అలనాడు - ఓం నమో భగవతే ఉపశమశీలాయ ఉపరతానాత్మ్యాయ నమోఽ కించనవిత్తాయ ఋషిఋషభాయ నరనారాయణాయ పరమహంస పరమగురవే ఆత్మారామాధిపతయే నమో నమః అని స్తుతించావు. ఓ నరనారాయణ రూపా! ఈ సృష్టిస్థితిలయాలకు కర్తవైయుండీ వాటిలో బంధింపబడవు. దేహధారివైనా దేహాంతం లేనివాడవు. అసక్తవివిక్తసాక్షివి. ఇది యోగేశ్వరుడవైన నీ యోగనైపుణ్యం. మా తండ్రి హిరణ్యగర్భుడు చెప్పినట్టు నిర్గుణుడవైన నీయందు అంతిమకాలంలో మనస్సును లగ్నంచేసిన భక్తుడు దుష్కళేబరాన్ని విడిచి భవబంధవిమోచనం పొందుతాడు. ఐహికాముష్మికకామలంపటుడై సంతానమనీ సంసారమనీ సంపదలనీ వ్యామోహపడితే అతడు ఎంతటి విద్వాంసుడైనా ఎంతటి యోగసాధకుడైనా నిష్ఫలం. అది అంతా కేవలం శ్రమమాత్రమే అవుతుంది. అందుచేత ఓ ప్రభూ ! కుత్సితమైన ఈ దేహం మీదా దీని బంధుత్వాలమీదా



నేని సంపదలమీదా మాకు ఏర్పడే అహంకారమమకారాలను నువ్వే యోగశక్తితో ఛేదించి స్వభావసిద్ధమైన భక్తినీ ముక్తినీ అనుగ్రహించు - అని నారదా ! నువ్వు ఈ నారాయణుడిని స్తుతించావు.

దేవర్షీ ! ఈ భారతవర్షంలో ఉన్న శైల నదీనదాలను వివరిస్తాను తెలుసుకో. మలయ - మంగళప్రస్థ - మైనాక - చిత్రకూట - ఋషభ - కుటక - కోల్ల - సహ్య - దేవగిరి - ఋష్యమూక - శ్రీశైల - వ్యంకటాద్రి - మహేంద్ర - వారిధార - వింధ్య - భుక్తిమత్ - ఋక్ష - పారియాత్ర - ద్రోణ - గోవర్ధన - రైవతక - కకుభ - నీల - గౌరముఖ - ఇంద్రకీల - కామగిరులు ప్రధానమైనవి. ఇంకా పుణ్యప్రదాలైన పర్వతాలు చాలా ఉన్నాయి. వీటినుంచి అవిర్భవించిన నదులు వందలాదిగా ఉన్నాయి. స్నాన పాన అవగాహన దర్శన స్పర్శన కీర్తనాదులతో మానవుల త్రివిధపాపాలనూ పారద్రోలుతున్నాయి. తామ్రపర్ణి - చంద్రవశ - కృతమాల - వటోదక - వైహాయసి - కావేరి - వేణ - పయస్విని - తుంగభద్ర - కృష్ణవేణి - శర్కరావర్తక - గోదావరి - భీమరథి - నిర్వింధ్య - పయోష్ణిక - తాపి - రేవ - సురస - నర్మద - సరస్వతి - చర్మణ్వతి - సింధు - అంధశోణ - మహానది - ఋషికుల్య - అత్రిసమ - వేదస్మృతి - కౌశికి - యమున - మందాకిని - దృషద్వతి - గోమతి - సరయు - రోధవతి - సప్తవతి - సుషోమ - శతద్రు - చంద్రభాగ - మరుద్వృధ - వితస్త - అసిక్రి - విశ్వ మొదలైనవి వాటిలో కొన్ని.

ఈ భారతవర్షంలో జన్మించినవారు శుక్ల - లోహిత - కృష్ణ వర్ణాలలో ఉండే తమ తమ కర్మలకు అనుగుణంగా దివ్య - మానుష - నారక ఫలాలను పొందుతూ ఉంటారు. ఇక్కడివారికి అందరికీ వర్ణ విధానంలో వివిధ భోగాలు అనుభవంలోకి వస్తుంటాయి. వర్ణవిధానంలోనే అపవర్గం (ముక్తి) అభిస్తుంది. ఇదే ఇక్కడి విశేషం అని మునులూ దేవతలూ కీర్తిస్తుంటారు.

భవంతి వివిధా భోగాః సర్వేషాం చ నివాసినామ్ ।
యథావర్ణ విధానేన అపవర్గో భవతి స్ఫుటమ్ ॥
ఏతదేవ చ వర్షస్య ప్రాధాన్యం కార్యసిద్ధితః ।
వదంతి మునయో వేదవాదినః స్వర్గవాసినః ॥ (11 - 21)

నారదా! ఈ భరతవర్షవాసుల అదృష్టమే అదృష్టం. శ్రీహరి స్వయంగా ప్రసన్నుడై వీరికి తనపట్ల భక్తి స్పృహ కలిగిస్తూ ఉంటాడు. దుష్కరమైన తపస్సులూ యజ్ఞాలూ వ్రతాలూ ఇవ్వేమీ అవసరం లేకుండా శ్రీమన్నారాయణుడు వీరికి పిలిస్తే చాలు పలుకుతాడు. భక్తితో ఒక్కసారి స్మరిస్తే చాలు క్షణంలో అభయం అందిస్తాడు. ఎక్కడెక్కడో పుట్టి ఏమి లాభం ! భారతవర్షంలో జన్మించడమే ఒక గొప్ప వరం.



కల్పాయుషాం స్థానజయాత్పునర్భవాత్
క్షణాయుషాం భారతభూజయో వరమ్ ।
క్షణేన మర్త్యేన కృతం మనస్వినః
సంన్యస్య సంయాత్యభయం పదం హరేః ॥ (11 - 24)

వైకుంఠకథాసుధాపగ లేని దేశం (అపగ = నది), సాధు సజ్జనులైన భాగవోత్తములు లేని దేశం, యజ్ఞయాగాదులు జరగని దేశం - అది ఇంద్రలోకమైనా వాసయోగ్యం కాదు. తమ జ్ఞాన క్రియా ద్రవ్య కలాపాలనన్నింటినీ వెచ్చించి భారతవర్షంలో జన్మించినవారు అదేమి చిత్రమో జన్మరాహిత్యం కోసం ప్రయత్నించరు. మళ్ళీ భరతవర్షంలోనే కనీసం తరులతారూపంలోనైనా జన్మించడంకోసమే యత్నిస్తుంటారు. ఈ నేలతో ఏర్పడే బంధమూ అనుబంధమూ అటువంటిది.

ప్రాప్తా నృజాతిం త్విహ యే చ జంతవో
జ్ఞానక్రియాద్రవ్యకలాప సంభృతామ్ ।
న వై యతేరన్నపునర్భవాయ తే
భూయో వనౌకా ఇవ యాంతి బంధనమ్ ॥ (11 - 26)

భారతవర్షీయులు యజ్ఞకుండాలలో మంత్రపూర్వకంగా శ్రద్ధగా సమర్పించే హవిస్సులను ఆయా దేవతలు సంతోషంగా స్వీకరిస్తూ ఉంటారు. యజ్ఞపురుషుడు శ్రీమన్నారాయణుడు ఆనందంగా ఆశీర్వదిస్తూ ఉంటాడు. కోరినవారికి కోరుకున్నవి అందించడమేకాదు ఏమీ కోరనివారికికూడా కావలసిన శుభపరంపరలను అన్నింటినీ స్వయంగా కురిపిస్తూ ఉంటాడు. అందుకనే స్వర్గసుఖావశేషం ఉన్నవారు భరతవర్షంలో జన్మనిమ్మని కోరుతూ ఉంటారుట. ఈ రకంగా భారతవర్ష మాహాత్మ్యాన్ని దేవతలూ ఋషులూ సిద్ధులూ చెప్పగా నేను విన్నాను.

నారదర్షీ! ఈ జంబూద్వీపానికి స్వర్ణప్రస్థ - చంద్రశుక్ల - ఆవర్తన - రమమాణ - మందర - హరిణ - పాంచజన్య - సింహళ నామాలతో ఎనిమిది ఉపద్వీపాలున్నాయి. ఈ సింహళ ద్వీపాన్నే లంక అనికూడా అంటారు. ఇంక మిగతా ప్లక్షాది ద్వీపషట్కాన్ని వివరిస్తాను. *(అధ్యాయం - 11, శ్లోకాలు - 32)*



## ◆ ప్లక్షాది ద్వీపషట్కవర్ణన ◆

నారదమహర్షీ ! ప్లక్షద్వీపంకూడా వైశాల్యంలో పరిమాణంలో జంబూద్వీపంతో సమానంగానే ఉంటుంది. అక్కడ అగ్ని హిరణ్మయుడు. దాని పరిపాలకుడు ప్రియవ్రత తనూజుడు సప్తజిహ్వుడు. (ఇధ్మజిహ్వుడు). ఇతడు తన ఏడుగురు కుమారులకూ ద్వీపాన్ని విభజించి ఇచ్చి తాను యోగమార్గంలో భగవంతుడిని ఆరాధించి ముక్తిపొందాడు. శివుడు - యవసుడు - భద్రుడు - శాంతుడు - క్షేముడు - అమృతుడు - అభయుడు అని అతని కొడుకుల పేర్లు. వీరు సప్తవర్షాలకూ అధిపతులు. ఈ ప్లక్షద్వీపంలో అరుణ - నృమ్ణ - ఆంగిరసి - సావిత్రి - సుప్రభాతిక - ఋతంభర - సత్యంభర అని ఏడు నదులున్నాయి. మణికూట - వజ్రకూట - ఇంద్రసేన - జ్యోతిష్మత్ - సుపర్ణ - హిరణ్యష్ఠీవ - మేఘమాల అని ఏడు పర్వతాలున్నాయి.

ఇక్కడి నదులలో నీళ్ళను దర్శించినా స్పృశించినా సకల పాపాలూ తొలగిపోతాయి. హంస - పతంగ - ఊర్ధ్వాయన - సత్యాంగసంజ్ఞలతో ఈ ప్లక్షద్వీపంలో చతుర్వర్ణాలు ఉన్నాయి. వీరి ఆయుఃప్రమాణం వెయ్యి సంవత్సరాలు. వీరంతా వేదవిహితమార్గంలో సూర్యోపాసన చేస్తుంటారు. సూర్యుడు సకలదేవతా స్వరూపుడు. నారదా ! ఈ ప్లక్షాది పంచద్వీపాలలోనూ నివసించేవారికి ఆయుష్షూ ఓజస్సూ ఇంద్రియబలమూ బుద్ధిబలమూ సర్వాధికంగా ఉంటాయి. ఇక్షుసముద్రం ఈ ప్లక్షద్వీపాన్ని పరివేష్టించి ఉంటుంది.

శాల్మలద్వీపం ఈ ప్లక్షద్వీపానికి రెండింతలు పెద్దది. ఇది సురాసముద్ర పరివేష్టితం. ఇక్కడి శాల్మలీవృక్షంమీదనే గరుత్మంతుడు గూడుకట్టుకుని నివసిస్తున్నాడు. ప్రియవ్రతపుత్రుడు యజ్ఞబాహుడు ఈ ద్వీపానికి అధిపతి. ఇతడుకూడా ధరామండలాన్ని ఏడు భాగాలుగా విభజించి తన పుత్రులకు అప్పగించాడు. సురోచనం - సౌమనస్యం - రమణం - దేవవర్షకం - పారిభద్రం - ఆప్యాయనం - విజ్ఞాతం అని వాటి పేర్లు. శతశృంగం - వామదేవం - కందకం - కుముదం - పుష్పవర్షం - సహస్రశ్రుతి అనేవి ఏడూ పర్వతాలు. అనుమతి - సినీవాలీ - సరస్వతి - కుహూవు - రజని - నంద - రాక అనే పేర్లతో ఏడు నదులు ఈ ద్వీపంలో ప్రవహిస్తున్నాయి. శ్రుతధర - వీర్యధర - వసుంధర - ఇషుంధర నామధేయాలతో చాతుర్వర్ణ్యవిభాగం విరాజిల్లుతోంది. వీరంతా వేదమయుడైన సోమేశ్వరుణ్ణి ఉపాసిస్తారు. కృష్ణశుక్ల కిరణాలతో విరాజిల్లే సోముడు ఇక్కడి సర్వప్రజలకూ అధినాయకుడు. సురాసముద్ర పరివేష్టితమైన ఈ శాల్మలీద్వీపానికి సమీపంలో ఉంటుంది కుశద్వీపం. కుశద్వీపం చుట్టూ ఘృతసముద్రం ఉంది. ఇది సురాసముద్రంకన్నా రెండింతలు పెద్దది. ఈ ద్వీపంలో కుశస్తంభం దశదిశలకూ వెలుగులు విరజిమ్ముతూ ప్రకాశిస్తూ ఉంటుంది. అందుకనే ఈ ద్వీపానికి ఆ పేరు ఏర్పడింది. ప్రియవ్రతతనూజుడు హిరణ్యరేతసుడు దీనికి అధిపతి. ఇతడుకూడా ఈ ద్వీపాన్ని ఏడు విభాగాలు చేసి తన ఏడుగురు తనయులకూ



అప్పగించాడు. తనయుల పేరుమీదనే సప్తవర్షాలూ ప్రసిద్ధికెక్కాయి. వసు - వసుదాన - దృఢరుచి - నాభిగుప్త - స్తుత్యవ్రత - వివిక్త - (నామ) దేవక నామధేయాలతో ఇవి ప్రసిద్ధాలు. ఈ ద్వీపంలోనూ ఏడు పర్వతాలూ ఏడు నదులూ ఉన్నాయి. చక్ర - చతుశ్శృంగ - కపిల - చిత్రకూటక - దేవానీక - ఊర్ధ్వరోమ - ద్రవిణ పర్వతాలున్నాయి. రసకుల్య - మధుకుల్య - మిత్రవింద - శ్రుతవింద - దేవగర్భ - ఘృతచ్యుత్ - మందమాలిక అనేవి ఇక్కడి నదుల పేర్లు. కుశద్వీపవాసులకు ఈ నదీజలాలు సకల సంపదలూ ప్రసాదిస్తున్నాయి. ఇక్కడి ప్రజలలో కుశల - కోవిద - అభియుక్త - కులక నామధేయాలతో చాతుర్వర్ణ్య విభాగం ఉంది. వీరంతా అగ్ని ఉపాసకులు. యజ్ఞయాగాదులతో అగ్నిని ఆరాధిస్తూ ఉంటారు.

***(అధ్యాయం - 12, శ్లోకాలు - 38)***

నారాయణ మహర్షి చెబుతున్న ద్వీపవిశేషాలను శ్రద్ధగా వింటున్న నారదుడు మిగతా ద్వీపాల గురించికూడా చెప్పమని అభ్యర్థించాడు. మహర్షి కొనసాగించాడు.

నారదా ! ఈ కుశద్వీపానికి అనతిదూరంలో రెండింతలు పెద్దదిగా క్రౌంచద్వీపం ఉంది. దీని చుట్టూ క్షీరసముద్రం. క్రౌంచపర్వతంవల్ల ఈ ద్వీపానికి ఈ పేరు ఏర్పడింది. పూర్వకాలంలో కుమారస్వామి తన శక్తి ఆయుధంతో భేదించినది ఈ క్రౌంచపర్వతాన్నే. ప్రియవ్రత కుమారుడు ఘృతపృష్ఠుడు దీనికి అధిపతి. ఇతడుకూడా దీన్ని ఏడు విభాగాలు చేసి తన ఏడుగురు కొడుకులకూ అప్పగించి తాను భగవంతుడి సన్నిధికి వెళ్ళిపోయాడు. ఆ ఏడుగురి పేర్లతోనే ఏడు దేశాలూ ప్రసిద్ధికెక్కాయి. ఆమ - మధురరుహ - మేఘపృష్ఠ - సుధామక - భ్రాజిష్ఠ - లోహితార్ణ - వనస్పతి దేశాలు అవి. శుక్ల - వర్ధమాన - భోజన - ఉపబర్హణ - నంద - నందన - సర్వతోభద్ర పర్వతాలూ, అభయ - అమృతౌఘ - ఆర్యక - తీర్థవతి - వృత్తిరూపవతి - శుక్ల - పవిత్రవతిక అనే ఏడు నదులూ ఈ ద్వీపంలో ఉన్నాయి. చాతుర్వర్ణ్యాలవారూ ఈ నదీజలాలను సేవిస్తూ భోగభాగ్యాలతో జీవిస్తుంటారు. పురుష - ఋషభ - ద్రవిణ - దేవక నామధేయాలతో చతుర్వర్ణ విభజన జరిగింది. వీరందరూ ఆపోమయుడూ అపాంపతి అయిన వరుణదేవుణ్ణి ఉపాసిస్తారు.

**ఆపః పురుషవీర్యాః స్థ పునంతీర్భూర్భువః స్వః ।**
**తా నః పునీతాఽమీ వఘ్నీః స్పృశతా మాత్మనా భువః ॥ (13 - 14)**

ఇత్యాదిమంత్రాలతో స్తోత్రాలతో వరుణుడిని అర్చిస్తారు. ఈ ద్వీపానికి ఆవలగా శాకద్వీపం ఉంది. దాని విస్తీర్ణం ముప్పయిరెండు లక్షల యోజనాలు. దీని చుట్టూ దధి(మండ)సముద్రం. శాకవృక్షం కారణంగా దీనికి ఈ పేరు స్థిరపడింది. ప్రియవ్రతుడి కొడుకు మేధాతిథి దీని పరిపాలకుడు. తన ఏడుగురు కొడుకులకూ ఏడు భాగాలుగా ఈ ద్వీపాన్ని పంచి అప్పగించి అతడు యోగమార్గంలో ముక్తిని



పొందాడు. కొడుకుల పేర్లతోనే రాజ్యాలకూ ప్రసిద్ధి వచ్చింది. పురోజవుడు, మనోజవుడు, పవమానకుడు, ధూమ్రానీకుడు, చిత్రరేఫుడు, బహురూపుడు, విశ్వధృక్కుడు అనేవి వారి పేర్లు. ఈ ఏడుగురి రాజ్యాలకూ సరిహద్దులుగా ఏడు పర్వతాలున్నాయి. అలాగే ఏడు నదులూ ఉన్నాయి. ఈశాన - ఊరుశృంగ - బలభద్ర - శతకేశర - సహస్రస్రోతక - దేవపాల - మహాశన పర్వతాలు ప్రసిద్ధాలు. అనఘ - ఆయుర్ద - ఉభయవృష్టి - అపరాజిత - పంచపది - సహస్రశ్రుతి - నిజధృతి అనేవి నదుల పేర్లు. సత్యవ్రత - క్రతువ్రత - దానవ్రత - అనువ్రత భేదాలతో చాతుర్వర్ణ్యాలవారున్నారు. వీరందరికీ సర్వాంతర్యామి ఈశ్వరుడు ఉపాస్యదేవత.

ఈ శాకద్వీపానికి రెండురెట్లు పెద్దది పుష్కరద్వీపం. ఇది శుద్ధోదక సముద్ర పరివేష్టితం. అగ్నిజ్వాలల్లాగా ప్రకాశించే లక్ష బంగారురేకులతో ఒక పుష్కరం (పద్మం) ఉండటం వల్ల ఈ ద్వీపానికి ఈ పేరు వచ్చింది. ఈ పద్మమే బ్రహ్మదేవుడి ఆసనం. మహర్షులు దీనిని మానసోత్తరం అని పిలుస్తారు. కనక ఈ ద్వీపానికి మానసోత్తర ద్వీపమనే పేరుకూడా ఏర్పడింది. ప్రియవ్రత తనూజుడు వీతహోత్రుడు దీనికి అధిపతి. ఇతడికి రమణుడు ఘాతకి అని ఇద్దరే కుమారులు. అందుకని ఈ ద్వీపాన్ని రెండు భాగాలుగా ఆ ఇద్దరికీ అప్పగించి తాను తన పూర్వజుల్లాగానే భగవద్భక్తిపరుడై ముక్తి పొందాడు. రమణ ఘాతకి నామాలతోనే ప్రసిద్ధికెక్కిన ఈ రెండు దేశాలకూ సరిహద్దుగా ఒక మహాపర్వతం ఉంది. దాన్ని అవధిగిరి అంటారు. దాని ఎత్తు లక్షయోజనాలు. దాని శిఖరంమీద నాలుగు దిక్కులా నాలుగు పట్టణాలున్నాయి. అవి ఇంద్రాది దిక్పాలకులకు నివాసాలు. మేరువుకి ప్రదక్షిణం చేసే సూర్యుడు ఈ పర్వతంమీదనుంచే ఉదయిస్తాడు. సూర్యుడంటే సంవత్సరాత్మకంగా కాలచక్రాన్ని తిప్పే భగవానుడు. మానవులకు సంవత్సరకాలమంటే దేవతలకు ఒకరేయీ పగలూ. నారదా ! ఈ పుష్కరద్వీపవాసులందరూ పరబ్రహ్మోపాసకులు. సకర్మకయోగంతో బ్రహ్మతత్త్వాన్ని ఉపాసిస్తూ ఉంటారు. ఏకాంత మద్వయం శాంతం తస్మై భగవతే నమః అని అర్చిస్తూ ఉంటారు. ***(అధ్యాయం - 13, శ్లోకాలు - 36)***

## ◆ లోకాలోక పర్వతం ◆

నారదా ! అటుపైని లోకాలోక పర్వతం ఉంది. లోకాలోకాలకు అంతరాళంలో ఉండటంవల్ల దానికి ఆపేరు వచ్చింది. మానసోత్తరం నుంచి సుమేరువు వరకూ మధ్యభాగంలో బంగారుభూమి ఉంది. అది అద్దంలా మెరిసిపోతూ ఉంటుంది. అక్కడ ప్రాణి అనేదే ఉండదు. అందులోకి ప్రవేశించిన ఏ పదార్థమూ మరింక తిరిగి కనిపించదు. అందుచేతనే అక్కడ జీవరాశి లేదనడం. అందుచేతనే దానిని



లోకాలోకం అనడం. (లోక + అలోకం). ముల్లోకాలకూ కట్టకడపటి కొండగా పరమేశ్వరుడు దీనిని కల్పించాడు. సూర్యుడు మొదలుకొని ధ్రువనక్షత్రం వరకూ ఉన్న గ్రహాల కాంతులు ఏవైనాసరే దానికి అర్వాచీనాలుగానే ముల్లోకాలకూ ప్రసరిస్తూ ఉంటాయి. పరాచీనాలు కానేరవు. అంత ఎత్తయినదీ అంత విశాలమైనదీ ఆ పర్వతం.

యావదస్తి చ దేవర్షే హ్యంతరం మానసోత్తరాత్ ।
సుమేరోస్తావతీ శుద్ధా కాంచనీ భూమిరస్తి హి ॥
దర్పణోదరతుల్యా సా సర్వప్రాణి వివర్జితా ।
యస్యాం పదార్థః ప్రహితో న కించిత్ప్రత్యుదీయతే ॥
అతః సర్వప్రాణి సంఘరహితా సా చ నారద ।
లోకాలోక ఇతి వ్యాఖ్యా యదత్ర పరికల్పితా ॥
లోకాలోకాంతరే చాప్య వర్తతే సర్వదా స్థితిః ।
ఈశ్వరేణ సలోకానాం త్రయాణా మంతగః కృతః ॥
సూర్యాదీనాం ధ్రువాంతానాం రశ్మయో యద్వశాదిహ ।
అర్వాచీనశ్చ త్రీన్ లోకానాతన్వానాః కదాపి హి ॥
పరాచీనత్వభాజో హి న భవంతి చ నారద ।
తావదున్నహనాయామః పర్వతేంద్రో మహోదయ ॥ (14 - 2 నుంచి 7)

నారదా ! పంచాశత్కోటి యోజన విస్తీర్ణమైన ఈ భూగోళంలో లోకాలోక పర్వతం నాల్గవ వంతు. ఆ పర్వతంమీద నాలుగు దిక్కులా నాలుగు దిగ్గజాలను నిలబెట్టాడు బ్రహ్మదేవుడు. ఋషభం, పుష్పచూడం, వామనం, అపరాజితం అని వాటిపేర్లు. ఇవే సమస్తలోకాలకూ స్థితిహేతువులని పెద్దలు చెబుతున్నారు. వీటికీ తక్కిన తన విభూతులకూ శక్తి సామర్థ్యాలనూ సత్త్వ - ఐశ్వర్యాలనూ అందిస్తూ అష్టసిద్ధి సమేతుడై విష్వక్సేనాదిపరివృతుడై భగవంతుడు శ్రీహరి విరాజిల్లుతూ ఉంటాడు. సకలలోకాలకూ శుభం కలిగించడంకోసం నాలుగు చేతులలోనూ నాలుగు ఆయుధాలు ధరించి ఉంటాడు. కల్పాంతం వరకూ అదే వేషంతో ఉండే సనాతనుడతడు. స్వమాయావిరచితమైన ఈ విశ్వం అతడికి వెలుపలా లోపలాకూడా ఉంటుంది. వెలుపల ఉండేది లోకం. లోపల ఉండేది అలోకం.



## ◆ సూర్యచంద్రాది గ్రహాలు - గతిభేదాలు ◆

అటుపైని అంతా శుద్ధాకాశం. ఈ బ్రహ్మాండానికి మధ్యలో సూర్యుడు. సూర్యాండానికీ భూగోళానికీ మధ్య పాతికకోట్ల యోజనాల దూరం ఉంది. మృతమైన అండంనుంచి జన్మించాడు కనక సూర్యుణ్ణి మార్తాండుడంటారు. హిరణ్యాండం నుంచి (బంగారు గ్రుడ్డు) ఆవిర్భవించాడు కనక హిరణ్యగర్భుడనీ అంటారు. సూర్యుడివల్లనే ఈ బ్రహ్మాండంలో ఆకాశమనీ దిక్కులనీ భూమి అనీ స్వర్గమనీ నరకమనీ పాతాళమనీ విభజనలు ఏర్పడుతున్నాయి. ఆయా చోట్ల ఉండే దేవ తిర్యగ్ మనుష్య సరీసృప తరులతాదికమైన సకల జీవకోటికీ సూర్యుడే ఆత్మ. సూర్యుడే చూపు. సూర్యుడే వెలుగు. సూర్యుడే ఈశ్వరుడు.

నారదా ! ఇదంతా భూమండల సన్నివేశం. దీనికి ఊర్ధ్వభాగాన ఉన్న దానిని దివము అంటారు. ఇది రెండు దళాల చిగురు. రెండు చేటలజంట. శూన్యమే అనుసంధానం. రెండింటికీ నడిమి భాగాన శూన్యాంతరాళంలో సూర్యభగవానుడు. తన వెలుగులతో ముల్లోకాలనూ ప్రకాశింపజేస్తున్నాడు.

ఏతేన హి దివో మానం వర్ణయంతి చ తద్ధియః ।
ద్విపలానాం చ నిష్పావాదీనాం దళయోర్యథా ॥
తయోరంత అంతరేణ రిక్షం తదుభయ సంధితమ్ ।
యన్మధ్యగశ్చ భగవాన్ భానుర్వై తపతాం వరః ॥ (14 - 22)

ఉత్తరాయణంలో సూర్యుడు గతిమాంద్యం పొందుతాడు. అది ఆరోహణ స్థానం. అందుకని పగటిపూటలు దీర్ఘంగా ఉంటాయి. దక్షిణాయనంలో సూర్యుడి గమనం వేగంగా సాగుతుంది. ఇది అవరోహణస్థానం. అందుకని పగటిపూటలు నిడివి తగ్గుతాయి. విషువత్తులోమాత్రం సమగతిలో ఉంటాడు. అప్పుడు పగలూ రేయీ సమానంగా ఉంటాయి.

విషువత్సంజ్ఞమాసాద్య గతిసామ్యం వితన్వతే ।
సమస్థానమాసాద్య దినసామ్యం కరోతి చ ॥ (14 - 25)

దీనిని రాశిక్రమంలో చెప్పాలంటే - మేషతులారాశుల్లో సూర్యుడు చరిస్తున్నప్పుడు (విషువత్తు) అహోరాత్రాలు సమానంగా ఉంటాయి. వృషభం మొదలుకొని కన్యారాశి వరకూ అయిదురాశుల్లోనూ సంచరిస్తున్నప్పుడు పగళ్ళు దీర్ఘంగా రాత్రులు హ్రస్వంగా ఉంటాయి. వృశ్చికాది పంచరాశులలో (మీనరాశి వరకూ) ఉన్నప్పుడు పగళ్ళు హ్రస్వంగా రాత్రులు దీర్ఘంగా ఉంటాయి.

*(అధ్యాయం - 14, శ్లోకాలు - 29)*



నారదా ! ఇలా సూర్యుడికి శీఘ్ర మంద సమగతులు మూడూ ఉన్నాయి. గ్రహాలకు అన్నింటికీ త్రివిధస్థానాలు (మార్గాలు) ఉన్నాయి. జరద్గవం మధ్యమ స్థానం. ఐరావతం ఉత్తరస్థానం. వైశ్వానరం దక్షిణస్థానం. ఒక్కొక్కస్థానంలోనూ మూడేసి వీథులున్నాయి. ఋషభవీథి - గోవీథి - జారద్గవవీథి అనేవి మూడూ జరద్గవస్థానానికీ, నాగ - గజ - ఐరావత వీథులు ఉత్తర స్థానానికీ, అజ - మార్గి - వైశ్వానరి అనే వీథులు దక్షిణ స్థానానికీ ఉన్నాయి. అశ్వనీ భరణీ (యామ్య) కృత్తికలు నాగవీథి. రోహిణీ మృగశిర ఆర్ద్రలు గజవీథి. పునర్వసు పుష్యమి ఆశ్లేషలు ఐరావత వీథి. పుబ్బ ఉత్తర మఖలు ఋషభవీథి. హస్త చిత్త స్వాతి ఇవి గోవీథి. జ్యేష్ఠ విశాఖ అనూరాధలు జారద్గవీ వీథి. మూల ఉత్తరాషాఢ పూర్వాషాఢలు అజవీథి. శ్రవణ ధనిష్ఠ శతభిషలు మృగవీథి (మార్గి). పూర్వాభాద్ర ఉత్తరాభాద్ర రేవతులు వైశ్వానరీ వీథి.

ఉత్తరాయణంలో యుగాక్షాంతర్నిబద్ధాలూ వాయురూపాలూ అయిన పాశాలను లాగిపట్టుకోవడం వల్ల సూర్య (మండలానికి) రథానికి గతి మందగిస్తుంది. దీన్ని ఆరోహణం అంటారు. అందుకని పగళ్ళు నిడివిగా రాత్రిళ్ళు కురచగా ఉంటాయి. దక్షిణాయనంలో బహిర్మండలగతి కాబట్టి పగ్గాలను (వాయు పాశాలు) వదిలిపెట్టడంతో శీఘ్రగతి ఏర్పడుతుంది. దీన్ని అవరోహణం అంటారు. అందుకని పగళ్ళు నిడివి తగ్గి రాత్రిళ్ళు నిడివి పెరుగుతాయి. వైషువంలో పాశాలు సమంగా ఉండటంవల్ల రేయింబవళ్ళు సమానంగా ఉంటాయి. ఇది మధ్యమండలగతి. ఈ గమన విశేషాలకు ధ్రువస్థానం కీలకం (?).

మేరువుమీద తూర్పుదిక్కున ఇంద్రపట్టణం ఉంది. దానికి ఐంద్రి అని పేరు. దక్షిణంలో యమాధిష్ఠితమై సంయమనీపురం, పశ్చిమాన వరుణదేవుడి నిమ్లోచనీపురం, ఉత్తరాన కుబేరాధిష్ఠితమై విభావరీపురం ఉంటాయి. సూర్యుడు ఐంద్రీపురంలో ఉదయించి, మధ్యాహ్నానికి సంయమనీపురం చేరి, నిమ్లోచనీపురంలో నిమీలనం చెందుతాడు. విభావరీపురంలో రాత్రి గడుపుతాడు. ఇలా ఈ నాలుగు పట్టణాలూ సూర్యుడి గమనానికి నిమిత్తాలు. మేరుపర్వతంమీద ఉన్నవారికి సూర్యుడు ఎప్పుడూ ఆకాశమధ్యగతుడయ్యే కనపడుతూ ఉంటాడు. (తూర్పున ఇంద్రపురంలో ఉదయిస్తున్నప్పుడు తక్కిన మూడు పురాలనూ ఈశానాగ్నేయ కోణాలనూ స్పృశిస్తాడు. కోణంలో ఉన్నప్పుడు రెండు పురాలనూ మూడు కోణాలనూ స్పృశిస్తాడు ?).

నారదమహర్షీ ! ఎవరికి ఎటువైపున సూర్యుడు మొదటిసారిగా కనిపిస్తాడో వారికి అది తూర్పు (ఉదయదిశ). ఎటువైపున తిరోధానం చెందుతాడో అది పడమర (అస్తమయదిశ).

**యైర్యత్ర దృశ్యతే భాస్వాన్స తేషాముదయః స్మృతః ।**
**తిరోభావం చ యత్రైతి తత్రైవాస్తమనం రవేః ॥ (15 - 23)**



నిజానికి సూర్యుడికి ఉదయాస్తమయాలు లేవు. దర్శన అదర్శనాలను బట్టి వీటిని మనం కల్పించుకున్నాం. అతడు నిత్యుడు.

నైవాస్తమనమర్కస్య నోదయః సర్వదా సతః ।
ఉదయాస్తమనాఖ్యం హి దర్శనాదర్శనం రవేః ॥ (15 - 24)

అన్ని ద్వీపాలవారికీ మేరువు ఉత్తరదిశలోనే ఉంటుంది. సూర్యుడి దర్శనాదర్శనాలనుబట్టి తూర్పుపడమరలు ఏర్పడితే, సూర్యుడికి వామభాగాన మేరుపర్వతం ఉంది అని పెద్దల నిర్ణయం. అందుచేత రవిబింబానికి ఎడమవైపు ఉత్తరదిక్కు, కుడివైపు దక్షిణదిక్కు.

సూర్యుడు తూర్పున ఐంద్రిలో ఆవిర్భవించి దక్షిణ దిశకు వచ్చేసరికి పదిహేను ఘడియల కాలం పడుతుంది. రెండుకోట్ల ముప్పయ్యేడు లక్షల డెబ్భయ్యయిదువేల యోజనాల దూరం గడుస్తుంది. అక్కడినుంచి పడమటికి అంతే దూరాన్ని అంతే సమయంలో చేరుకుంటాడు. సూర్యరథం ఒక ముహూర్తకాలంలో (సమయంలో) ముప్పయి నాలుగు లక్షల ఎనిమిది వందల యోజనాలు ప్రయాణిస్తుంది. ఒక్క దివారాత్రంలో తొమ్మిదికోట్ల యోజనాలు ప్రయాణిస్తుంది. "ప్రవహము" అనే వాయువుతో నిండి ఈ సూర్యుడు తన నక్షత్ర గ్రహ పంక్తులతో కలిసి కదులుతూ ఉంటాడు. ఇతడు కాలమార్గ ప్రదర్శకుడు. ఋతుకర్త. దివాకరుడు. ద్యుమణి. చంద్రాది గ్రహాలూ నక్షత్రాలూ ఇతడితోనే ఉదయిస్తూంటాయి. ఇతడితోనే అస్తమిస్తూంటాయి.

ఏవం ముహూర్తేన రథో భావోరష్టశతాధికమ్ ।
యోజనానాం చతుస్త్రింశల్లక్షాణి భ్రమతి ప్రభుః ॥ (15 - 32)

ఈ సూర్యుడి రథానికి ఒకే ఒక్క చక్రం ఉంది. దానికి పన్నెండు ఆకులు, మూడు అడ్డలు, ఆరు పూటీలు ఉంటాయి. దీన్నే కవులు సంవత్సరాత్మకం అంటారు.

యస్య చక్రం రథస్యైకం ద్వాదశారం త్రినాభికమ్ ।
షణ్ణేమి కవయస్తం చ వత్సరాత్మక మూచిరే ॥ (15 - 33)

అది తిరిగే అక్షం మానసోత్తరతీరంలో మేరు శిఖరంమీద ఉంటుంది. రెండవ అక్షం ధ్రువనక్షత్రంమీద. ఈ రథం ఆ అక్షంలో గానుగులాగా తిరుగుతూంటుంది. (తైలకారక యంత్రేణ చక్రసామ్యం పరిభ్రమన్). దీనికి సప్తచ్ఛందస్సులే సప్తాశ్వాలు. గరుత్మంతుని అన్నగారైన అరుణుడు ఈ రథానికి సారథి. దీని నొగ (కాడికీ రథానికీ మధ్యలో ఉండే భాగం) ముప్పయ్యారు లక్షల యోజనాల పొడుగుంటుం(



బొటనవేలి కణుపంతటి ఆకారాలు కలిగిన వాలఖిల్యులు అరవైవేలమంది ఈ రథంలో ఉండి నిరంతరం సూర్యుణ్ణి వేదమంత్రాలతో స్తుతిస్తుంటారు. ఇంకా తక్కిన మునులూ గంధర్వులూ అప్సరసలూ నాగజాతివారూ దైత్యులూ నెలకు ఏడుగురి చొప్పున సూర్యుణ్ణి స్తుతిస్తూంటారు.

***(అధ్యాయం - 15, శ్లోకాలు - 45)***

నారదా ! ఇంక చంద్రాదిగ్రహాల గమనం గురించి చెబుతాను ఆలకించు. ఇది చాలా చిత్రంగా ఉంటుంది. వీటి గతులను బట్టి మానవులకు శుభాశుభనిదర్శనాలు లభిస్తూ ఉంటాయి.

కుమ్మరి చక్రం తిరుగుతూ ఉంటే దానిమీద వాలిన కీటకాలు కూడా తిరిగినట్టు సూర్యుడితో కలిసి ఈ కాలచక్రంలో గ్రహరాశులన్నీ తిరుగుతూ ఉంటాయి. మేరువుకి ప్రదక్షిణం చేస్తూ ఉంటాయి. స్వకీయమూ పరరాశి సంచారమూ అని గ్రహాలకు అన్నింటికీ రెండు గతులు ఉన్నాయి. ఆదిపురుషుడూ భగవానుడూ లోకభావనుడూ నారాయణుడూ అఖిలాధారుడూ అయిన సూర్యుడు లోకాలకు శుభం కలిగించడంకోసం కర్మ విశుద్ధి నిమిత్తం త్రయీమయుడై తనంతతాను ఇలా సంచరిస్తూ ఉంటాడు. వసంతాది ఋతువులకు ఆయా లక్షణాలను ప్రసాదిస్తూ ఉంటాడు. శ్రద్ధాభక్తులతో అర్చించేవారూ యజ్ఞ యాగాదులు చేసేవారూ శ్రేయస్సులు పొందుతున్నారు. కాలచక్రగతుడై పన్నెండు రాశులలోనూ సంచరిస్తూ పన్నెండు నెలలను కల్పిస్తున్నాడు. ప్రతి మాసానికీ శుక్ల కృష్ణ పక్షద్వయం ఉంది. దివారాత్రాలు ఉన్నాయి. ఇరవైయేడు నక్షత్రాలలో సపాదనక్షత్ర ద్వయానికి ఒకరాశి అనిపేరు. (ఒక్కొక్క నక్షత్రానికీ నాలుగు పాదాలు. అంటే తొమ్మిదేసి పాదాలు ఒక్కొక్క రాశి. అశ్వని, భరణి, కృత్తిక మొదటి పాదం = మేషరాశి మొ॥వి.) సంవత్సరంలో ఆరవ అంశానికి ఒక ఋతువు అని పేరు. (రెండు నెలలు). మూడు ఋతువులు ఒక అయనం. ఉత్తరాయనం, దక్షిణాయనం అని సంవత్సరానికి రెండు భాగాలు.

సూర్యుడి మంద శీఘ్ర సమగతులనుబట్టి సంవత్సరాల్లో అయిదు రకాల భేదాలు ఉన్నాయి. సంవత్సరం, పరివత్సరం, ఇడావత్సరం, అనువత్సరం, ఇద్వత్సరం అని వాటి పేర్లు.

సంవత్సరం పరివత్సర మిడావత్సరమేవ చ ।
అనువత్సర మిద్వత్సర మితి పంచకమీరితమ్ ॥
భానోర్మాంద్య శైఘ్ర్య సమగతిభిః కాలవిత్తమైః ।
ఏవం భానోర్గతిః ప్రోక్తా చంద్రాదీనాం విబోధత ॥ (16 - 16)

చంద్రుడు సూర్యరశ్మికి లక్షయోజనాల దూరంలో ఊర్ధ్వంగా ఉన్నాడు. ఇతడు ఓషధీనాథుడు. పక్షద్వయంతో మాసకాలాన్ని భుజిస్తాడు. ఇతడు సూర్యుడికన్నా శీఘ్రగతి. ఇతడు ఆయా నక్షత్రాలతో



కూడి ఉండటం కారణంగా పన్నెండు మాసాలకూ పేర్లు ఏర్పడుతున్నాయి. పెరుగుతున్న కళలతో దేవతలకూ, క్షీణిస్తున్న కళలతో పితృదేవతలకూ ఇతడు ప్రీతి కలిగిస్తూ ఉంటాడు. సూర్యుడు అహస్కరుడైనట్టే చంద్రుడు రాత్రి కారకుడు. సర్వజీవకోటికీ ఇతడే ప్రాణము, ఇతడే జీవము. ఇతడు ఒక్కొక్క నక్షత్రంతోనూ అరువై గడియలకాలం ఉంటాడు. రెండు రోజుల ఒక్కపూటలో రాశి గడుస్తాడు. సూర్యుడికి సంవత్సరం పట్టే కాలచక్రాన్ని ఇతడు నెలరోజుల్లో పరిభ్రమిస్తాడు. ఇతడు అమృతధాముడు. మనోమయుడు. అన్నమయుడు. దేవ పితృ మనుష్య సరీసృప తరులతాది సర్వప్రాణికోటికీ ప్రాణప్రదుడూ ఆప్యాయనశీలుడూ కనక ఇతడిని సర్వమయుడు అంటారు.

ఈ చంద్రుడికి మూడు లక్షల యోజనాల దూరంలో మేరువుకి ప్రదక్షిణంగా భచక్రం తిరుగుతూ ఉంటుంది. నక్షత్రాలన్నీ ఈ భచక్రంలోనే సంచరిస్తూ ఉంటాయి. అభిజిత్తు కూడా అక్కడే ఉంటుంది. దీనితో కలిపి నక్షత్రాల సంఖ్య ఇరవై యెనిమిది.

ఈ భచక్రానికి పైన రెండు లక్షల యోజనాల దూరంలో శుక్రుడు ఉన్నాడు. ఇతడు సూర్యుడికి ముందూ వెనకా తిరుగుతుంటాడు. శీఘ్ర మంద సమగతులు ఇతడికీ ఉన్నాయి. ఇతడు లోకులకు సాధారణంగా శుభప్రదుడు. వృష్టివిష్టంభశమనుడు. ఇతడికి రెండు లక్షల యోజనాల దూరంలో బుధగ్రహం ఉంది. శుక్రుడితో సమంగా సంచరిస్తుంటాడు. సౌమ్యుడు. అతివాత - అభ్రపాత - అనావృష్ట్యాది భయాలకు సూచకం ఈ గ్రహం. ఇతడికి రెండు లక్షల యోజనాల ఎత్తున అంగారకుడు ఉన్నాడు. ఇతడు మూడేసి పక్షాలకు ఒకరాశిని అనుభవిస్తుంటాడు. ఇతడు వక్రుడు కాకపోతే శుభంకరుడే. ఇతడికి రెండు లక్షల యోజనాల దూరంలో బృహస్పతి (గురువు) ఉన్నాడు. ఒక్కొక్కరాశిలో ఏడాదిపాటు ఉంటాడు. వక్రుడు కానంతవరకూ ఇతడూ అనుకూలుడే. అటుపైని రెండు లక్షల యోజనాల దూరంలో శనిగ్రహం ఉంటుంది. ఇతడు శనైశ్చరుడు - మందగతి. సూర్యపుత్రుడు. ముప్పై నెలలకు కదులుతాడు. అంటే ఒక్కొక్క రాశిలోనూ రెండున్నర సంవత్సరాలు ఉంటాడు. ఇతడు సహజంగా అశుభదాయి. ఇతడికి పదకొండు లక్షల యోజనాల దూరంలో సప్తర్షి మండలం ఉంది. వీరు లోకాలకు ఎల్లవేళలా శుభం కోరుతూ ఆకాశంలో దక్షిణంగా తిరుగుతూ ఉంటారు. లోకానాం శం భావయంతో మునయః సప్త తే మునే। యత్తద్విష్ణుపదం స్థానం దక్షిణం క్రమతే చ తే ॥ ***(అధ్యాయం - 16, శ్లోకాలు - 37.)***

ఈ సప్తర్షిమండలానికి పైన పదమూడు లక్షల యోజనాల దూరంలో మహాభాగవతోత్తముడూ లోకవందితుడూ అయిన ధ్రువుడు ఉంటాడు. ఇంద్రాది దిక్పాలకులతో సమానంగా సమకక్ష్యలో ఉంటాడు. ఆకాశంలో దక్షిణ దిక్కున కనపడుతూంటాడు. ఇతడికి చలనం లేదు. సర్వదేవపూజితుడు. తన తేజస్సుతో తక్కిన గ్రహాలను ప్రకాశింపజేస్తుంటాడు. మేడిస్తంభానికి పొడవైన తాడుతో కట్టివేయబడిన పశువు(లు) మండలాకారంగా తిరిగినట్టు గ్రహరాశులన్నీ ధ్రువుడిచుట్టూ తిరుగుతూ ఉంటాయి.



మేఢిస్తంభే యథా యుక్తాః పశవః కర్షణార్థకాః ।
మండలాని చరంతీమే సవనత్రితయేన చ ॥ (17 - 6)

కాలచక్రనియోజితాలైన గ్రహరాశులు అంతర్బహిర్విభాగంతో ధ్రువుడు కేంద్రబిందువుగా వాయుప్రేరితాలై కదలాడుతూ ఉంటాయి. ఈ గ్రహాలన్నీ జీవకోటికి కర్మసారథులు. ఆకాశంలో డేగల్లాగా (పక్షుల్లాగా) ఆకల్పాంతం కదలాడుతుంటాయి.

ఆకల్పాంతం చ క్రమంతి ఖే శ్యేనాద్యాః ఖగా ఇవ ।
కర్మసారథయో వాయువశగాః సర్వ ఏవ తే ॥ (17 - 9)

నారదా ! ఇలా ఈ జ్యోతిర్గణాలు ప్రకృతికీ పురుషుడికీ యోగాయోగాలను సమకూరుస్తూ నింగిలో విహరిస్తూంటాయే తప్ప ఎన్నటికీ నేలకు రాలిపోవు. యోగధారణ విద్యలో ఆరితేరినవారు కొందరు ఈ జ్యోతిశ్చక్రాన్ని శింశుమారస్వరూపంగా అనుసంధానం చేస్తుంటారు. తలక్రిందులుగా కుండలీభూత శరీరులై పుచ్ఛాగ్రంలో ధ్రువుణ్ణి సంభావన చేస్తారు.

యస్యార్వాక్ శిరసః కుండలీభూతవపుషో మునే ।
పుచ్ఛాగ్రే కల్పితో యోఽయం ధ్రువ ఉత్తానపాదజః ॥ (17 - 12)

## ◆ అంతరజ్యోతిశ్చక్రం ◆

కల్మషరహితుడైన ప్రజాపతి లాంగూలంలోను, అగ్ని - ఇంద్ర - యమ - ధాతృ - విధాతృ దేవతలు పుచ్ఛాంతంలోను, కటిప్రదేశంలో సప్తర్షులు, కుడివైపున ఉత్తరాయన గ్రహాలు, ఎడమవైపున దక్షిణాయన గ్రహాలు స్థాపింపబడతాయి. కుండలాభోగానికి ఇరువైపులా సమసంఖ్యలో అవయవాలూ గ్రహాలూ భావింపబడతాయి. అజవీథిని పృష్ఠభాగంలో, ఆకాశాన్ని ఉదరభాగంలో, పునర్వసు పుష్యనక్షత్రాలను కుడి ఎడమ తొడలలో, ఆర్ద్రాశ్లేషలను కుడి ఎడమ పాదాలలో, అభిజిత్తు ఉత్తరాషాఢలను కుడి ఎడమ ముకుపుటాలలో, శ్రుతి జలభాలను కుడి ఎడమ కన్నులలో, ధనిష్ఠా మూలానక్షత్రాలను కుడి ఎడమ చెవులలో, మఘా మొదలైన ఎనిమిది దక్షిణాయన నక్షత్రాలను ప్రాతిలోమ్యంగా వామపార్శ్వ భాగంలోను, మృగశీర్షాదులైన ఎనిమిది ఉత్తరాయన నక్షత్రాలను ప్రాతిలోమ్యంగా దక్షిణ పార్శ్వ భాగంలోను, శతతారా జ్యేష్ఠానక్షత్రాలను కుడి ఎడమ బుజాలలోను, అగస్తిని పై దవడలోను, యముడిని కింది దవడలోను, అంగారకుడిని ముఖభాగంలోను, శనిని గుదభాగంలోను, బృహస్పతిని మూపులోను, అర్కుడిని వక్షఃస్థలంలోను, నారాయణుడిని హృదయంలోను, చంద్రుణ్ణి మనస్సులోను, అశ్వినులను



స్తనాలలోను, ఉశనసుణ్ణి (శుక్రుడు) నాభిలోను, బుధుడిని ప్రాణాపానాలలోను, రాహు కేతువులను కంఠంలోను, (కేతువులను సర్వాంగాలలోను?), తక్కిన తారాగణాలను రోమకూపాలలోను - ప్రతిష్ఠించుకోవాలి. ఈ విధంగా శరీరం విష్ణుమయం అవుతుంది. సర్వదేవమయం అవుతుంది. ప్రతిరోజూ సంధ్యాసమయంలో ఇలా ప్రతిష్ఠించుకొని మౌనంగా కన్నులు మూసుకుని ధ్యానతత్పరుడు అవ్వాలి.

నమో జ్యోతిర్లోకాయ కాలాయానిమిషాం పతయే మహాపురుషాయాభిధీమహి। అనే మంత్రాన్ని జపించాలి. ఇలా ముప్పొద్దులా చేసే వారికి గ్రహనక్షత్రతారా సంబంధమైన దోషాలూ ఆధిదైవికమైన పాపాలూ నశిస్తాయి. తత్కాల సంభవాలైన పీడలుకూడా తొలగిపోతాయి.

***(అధ్యాయం - 17, శ్లోకాలు - 29)***

నారదమహర్షీ! సూర్యమండలానికి అయుతయోజనాల క్రిందుగా రాహుమండలం ఉంటుంది. అది ఒక నక్షత్రంలాగా సంచరిస్తూ ఉంటుంది. సూర్యచంద్ర గ్రహణాలకు ఈ రాహువే కారణం. ఇతడు సింహికాసుతుడు. విష్ణుమూర్తి అనుగ్రహంతో అమరత్వాన్నీ ఖేటత్వాన్నీ పొందాడు. సూర్యుణ్ణి ఆచ్ఛాదించేటప్పుడు రవిబింబంకన్నా వెయ్యిరెట్లు విస్తరిస్తాడు. చంద్రుణ్ణి కబళించేటప్పుడు త్రయోదశ సహస్రంగా విస్తరిస్తాడు. పూర్ణిమనాడే ఇతడికి చంద్రుడితో వైరం. సూర్యచంద్రులకి దూరంగా ఉండి కబళిస్తుంటాడు. అప్పుడు విష్ణుమూర్తి తన చక్రాన్ని ప్రయోగిస్తాడు. ఆశ్చర్యచకితుడై ముహూర్తకాలంలో రాహువు తొలగిపోతాడు. దీన్నే విడుపు (ఉపరాగం) అంటారు.

ఈ గ్రహరాశులకు కిందిభాగాన లోకాలు ఉన్నాయి. సిద్ధ చారణ విద్యాధరలోకాలు యోజనాయుత విఖ్యాతాలు. పుణ్యనిషేవితాలు. వీటికి క్రిందుగా యక్ష రాక్షస పిశాచ ప్రేత భూత విహారలోకాలూ ఉన్నాయి. వాయు సంచారం ఉన్నంతమేరకు అంతరిక్షం అంటారు. మేఘాలు పుట్టి సంచరిస్తున్న మేరకూడా ఇదే.

**అంతరిక్షం చ తత్ప్రోక్తం యావద్వాయుః ప్రవాతి హి।**
**యావన్మేఘాస్తతో ద్యంతి తత్ప్రోక్తం జ్ఞావకోవిదైః॥ (18 - 11)**

వీటికి నూరుయోజనాల కిందిభాగంలో భూగోళం ఉంది. సుపర్ణ శ్యేన సారస హంసాది పక్షి నివహం భూమిమీద జన్మించి పైకి ఎగురుతున్నాయి. తక్కిన జీవరాశి భూమిమీద పుట్టి భూమిమీదనే నివసిస్తోంది.



## ◆ అధోలోకాల వర్ణన ◆

ఈ భోగోళానికి క్రిందుగా ఏడు మహారంధ్రాలు ఉన్నాయి. ఒక్కొక్కటీ అయుత యోజనాల విస్తీర్ణం. ఈ ప్రదేశాలు సర్వర్తు సుఖదాయకాలు. అతల - వితల - సుతల - తలాతల - మహాతల - రసాతల - పాతాళాలు అని వీటిపేర్లు. వీటినే బిలస్వర్గాలు అంటారు. వీటిలో ఆకాశభాగంకూడా అధికమే. ఇవి కామభోగైశ్వర్య సుఖసమృద్ధులకు నిలయాలు. నిత్యోద్యాన విహారాలకూ సుఖాస్వాదాలకూ ఆకరాలు.

మహాబలశాలులైన దైత్యులూ కాద్రవేయులూ దానవులూ భార్యా పుత్ర మిత్ర సేవకబంధువర్గంతో కలిసి అనురక్తులై నిత్య ప్రముదితులై ఈ లోకాలలో నివసిస్తూ ఉంటారు. వీరంతా ఈశ్వర భక్తులు. వరగర్వితులు. మహామాయావులు. నిత్య సంతుష్టులు. మాయాశక్తి సంపన్నుడైన మయుడు వీరికి పట్టణాలు నిర్మించాడు. మణి రత్న విభూషిత విచిత్రభవన సమూహంతో వీథులతో విపణివీథులతో గోపురాలతో సభామండపాలతో చత్వరాలతో సకల సౌందర్యాలకూ శోభలకూ నిలయాలు ఈ పట్టణాలు. పరులకు దుర్లభాలు, దుష్ప్రవేశ్యాలు. నాగ - అసురజాతులవారు జంటలు జంటలుగా విహరిస్తుంటారు. పావురాలు, చిలకలు, గోరింకలు కోలాహలంగా ఎగురుతుంటాయి. కృత్రిమ వేదికలు అనేకం. రకరకాల పక్షుల బొమ్మలు యథార్థ స్ఫూర్తిని కలిగిస్తుంటాయి. ఉద్యానవనాలు సర్వఋతు సౌందర్యనిలయాలు. క్రీడాగృహాలూ లతాగృహాలూ ధారాగృహాలూ అనేకం. లలనామణుల విలాసాలకు ఇవి నిలయాలు. ఫలపుష్ప శోభలతో మనస్సులకు ప్రసన్నతను కలిగిస్తాయి. సరోవరాలలో నీరు స్వచ్ఛంగా నిర్మలంగా ఉంటుంది. రకరకాల చేపలు కనువిందు చేస్తాయి. హంససారసకారండవాది జలపక్షి సమూహాలు కలకూజితాలతో హృదయాలను రంజింపజేస్తాయి. ఈ సరస్సులలో ఉన్న పద్మాలు ఎన్ని రకాలో చెప్పలేం. కుముదాలు, ఉత్పలాలు, కల్హారాలు, నీలోత్పలాలు, రక్తోత్పలాలు నిండుగా వికసించి పరిమళాలను పంచిపెడుతూ ఉంటాయి. జలచరాలు వాటిని తాకి కదుపుతూంటే, వాటిమీద వాలిన తుమ్మెదలూ జలపక్షులూ కోలాహలంగా ఎగురుతూ ఉంటే సర్వేంద్రియ తర్పకంగా ఆకట్టుకుంటాయి. అమరలోకపు శోభను ధిక్కరించే సౌందర్యం ఈ పట్టణాలలో కనిపిస్తూ ఉంటుంది. ఇక్కడ రేయింబవళ్ళ తేడాలేదు. రాత్రిపూట చీకటి భయం లేదు. సర్ప శిరస్సులమీద ఉండే అనర్ఘమణులు తమ కాంతులతో చీకటులను పారద్రోలుతుంటాయి. అంతటా అన్నివేళలా వేడిలేని వెలుగే.

అమరాణాం చ పరమాం శ్రియం చాతిశయంతి చ ।
యత్ర నైవ భయం క్వాపి కాలాంగైర్దినరాత్రిభిః ॥
యత్రా హి ప్రవరాణాం చ శిరఃస్థమణిరశ్మిభిః ।
నిత్యం తమః ప్రబాధ్యేత సదా స్ఫుటకాంతిభిః ॥ (18 - 30)



ఈ లోకాల వారు ఆధివ్యాధులు ఎరగరు. ఔషధాలతో పనిలేదు. ముసలితనం జుట్టు నెరిసిపోవడం శరీరం ముడతలుపడటం రంగుమారడం చెమటలుపట్టడం కంపుకొట్టడం ఉత్సాహం తగ్గడం వగైరాలూ వయోఽవస్థల మార్పులూ ఎప్పుడూ వీరిని బాధించవు. మృత్యుభయం లేదు. నిత్యకల్యాణం పచ్చతోరణంగా వీరి జీవితాలు సాగుతుంటాయి. కాకపోతే వీరికి ఉన్నదల్లా సుదర్శన చక్రభయం ఒక్కటే. అది ఇక్కడి దైతేయాంగనలకు గర్భస్రావాలు కలిగిస్తోంటుంది.

***(అధ్యాయం - 18, శ్లోకాలు - 34)***

బ్రహ్మపుత్రా ! అతలము అనే మొదటి బిలంలో మయపుత్రుడు బలుడు అనేవాడు ఉంటున్నాడు. అతడు అఖర్వగర్వసమన్వితుడు. సర్వార్థ సాధకాలైన తొంభయ్యారు మాయావిద్యలను ఇతడు సృష్టించాడు. ఇతడు ఆవులిస్తే చాలు ముల్లోకాలనూ సమ్మోహపరచగలిగిన కామినీమణులు ఆవిర్భవిస్తారు. వారంతా స్వేచ్ఛా విహారిణులై, అక్కడికి వచ్చే పురుషులనందరినీ లోబరుచుకుంటూ ఉంటారు. హాటకరసంతోనూ విలాసవిభ్రమాలతోనూ చిరునవ్వుల పలకరింతలతోనూ కౌగిటి పులకరింతలతోనూ రమింపజేస్తూ ఉంటారు. వీరంతా తల్లిదండ్రులు లేని స్వతంత్రురాండ్రు. వీరు కలిగించే ఆనందపారవశ్యంతో అక్కడికి చేరిన ప్రతివాడూ నేనే మహానుభావుణ్ణి, నేనే మహేశ్వరుణ్ణి, నేనే సిద్ధుడిని, నేనే గజకోటి బలశాలిని అని తనకుతాను మురిసిపోతుంటాడు. మదాంధుడైపోతాడు.

సంలాపవిభ్రమాద్యైశ్చ రమయంత్యపితా స్త్రియః ।
యస్మిన్నుపయుక్తే జనో మనుతే బహుధా స్వయమ్ ॥
ఈశ్వరోఽహమహం సిద్ధో నాగాయుతబలో మహాన్ ।
ఆత్మానం మన్యమానః సమ్మదాంధ ఇవ కథ్యతే ॥ (19 - 7)

ఇది అతలంలో పరిస్థితి. ఇక రెండవది వితలం. ఇందులో శివుడు హాటకేశ్వర నామధేయంతో ప్రమథగణపరివేష్టితుడై విరాజిల్లుతుంటాడు. బ్రహ్మదేవుడి సృష్టిని విజృంభింపజేయడంకోసమని భవానీ సహితుడై విహరిస్తూ ఉంటాడు. సకలదేవతలతోనూ పూజలు అందుకుంటుంటాడు.

ఈ వితలంలో హాటకీనది ప్రవహిస్తూ ఉంటుంది. అది శివుడి వీర్యంతో ఏర్పడిన నది. గాలికి కదులుతున్న మంటలాగా కనిపిస్తుంది ఈ ప్రవాహం. దీనినుంచి హాటకం అనే పేరుగలిగిన బంగారం లభిస్తుంది. దీనితో భూషణాలు చేయించుకుని దైత్యాంగనలు ధరిస్తుంటారు.

అతలానికి కింద వితలమైతే, వితలానికి కింద మరో మహాబిలం ఉంది. అది సుతలం. దీనికి అధిపతి విరోచనసుతుడైన బలిచక్రవర్తి. దేవేంద్రుడికి ప్రియం చెయ్యడంకోసమని త్రివిక్రముడు బలిని



ఈ సుతలానికి అణగదొక్కాడు. త్రైలోక్యాధిపత్యాన్ని ఊడగొట్టి ఇంద్రుడికి కట్టబెట్టాడు. కానీ రాజ్యలక్ష్మి ఇంద్రుడిని వరించలేదు. బలిచక్రవర్తిని త్యజించలేదు. ఆ శోభ అతనితోపాటు ఈ సుతలంలోనే ఉంటోంది. నిర్భయంగా నివసిస్తున్నాడు. పాత్రుడైన శ్రీహరికి భూదానం చెయ్యడంవల్ల (మూడు అడుగులు) లభించిన ఫలంగా దీన్ని మహాత్ములు వర్ణిస్తున్నారు. కానీ నారదా ! ఇది సమంజసంకాదు. సాక్షాత్తు వాసుదేవుడూ సకల పురుషార్థ ప్రదాయకుడూ అయిన శ్రీహరికి భూదానం చేస్తే లభించే ఫలం ఇదేనా ? ఇంతేనా ? తెలిసో తెలియకో ఒక్కసారి శ్రీహరినామాన్ని స్మరిస్తేనే చాలు స్వీయకర్మ బంధాలన్నీ తొలగిపోతున్నాయే. ఈ బంధవిమోచనంకోసమనేకదా యతీశ్వరులూ సాంఖ్యయోగనిపుణులూ నిరంతరం సాధన చేసేది. భగవంతుడు అనుగ్రహించాడంటే కర్మబంధ విమోచనం కలిగిస్తాడే తప్ప మరింతగా మాయామోహంలో కూరుకుపోయేట్టు ఐశ్వర్యభోగాలను కల్పిస్తాడా ? ఇవి సర్వక్లేశాలకూ కారణభూతాలు గదా! అన్ని ఉపాయాలూ తెలిసిన శ్రీహరి వామనరూపంలో యాచకుడుగా వచ్చి బలిచక్రవర్తి నుంచి సంపదలు సమస్తమూ అపహరించి శరీరమాత్రుడుగా మిగిల్చాడు.

ఇంద్రుడు ఎంతటి మూఢుడు ! బృహస్పతి మంత్రిగా ఉండిమాత్రం ఏమి లాభం ? ప్రసన్నుడైన శ్రీహరిని ఏమి కోరుకున్నాడు ఇంద్రుడు ? ముల్లోకాల ఐశ్వర్యాన్నీ తనకు సమకూర్చమని అభ్యర్థించాడు. ఇది ఏపాటిది ? ఎంత తుచ్ఛమైనది ? ఇలా కోరిన ఇంద్రుడు తెలివైనవాడేనా ?

బలిచక్రవర్తికి పితామహుడైన ప్రహ్లాదుడు శ్రీహరిని ఏమి కోరాడు ? దాస్యం చేసే అవకాశం ఇమ్మని అడిగాడు. సంపదలు కోరలేదే ! హిరణ్యకశిపుడి ఐశ్వర్యాన్నంతా ఇవ్వజూపినా తీసుకోలేదే. అంతటి భక్తుడు మరొకడు ఉంటాడా ? అంతటి మహానుభావత్వం మరెక్కడైనా కన్నామా ? విన్నామా ? పరిపక్వం చెందినవారు ఇలా ఉంటారు. చెందనివారు అలా అడుగుతారు.

ఇటువంటి అభిప్రాయాలూ ఆలోచనలూ ఉన్నాయికనుకనే బలిచక్రవర్తి సుతలంలో అందరి పూజలూ అందుకుంటున్నాడు. శ్రీహరి స్వయంగా అతడి గుమ్మానికి కావలి కాస్తున్నాడు. రావణాసురుడు తన దిగ్విజయయాత్రలో భాగంగా సుతలానికి వస్తే అక్కడ ద్వారపాలకుడుగా ఉన్న శ్రీహరి తన భక్తుడైన బలిని రక్షించుకోవడంకోసమని తన కాలిబొటనవేలితో ఆ సర్వలోకరావణుడిని వేలయోజనాల దూరం తన్ని తరిమేశాడు.

నారదా ! ఇటువంటి వ్యక్తిత్వం కలిగిన బలిచక్రవర్తి సర్వసుఖాలూ అనుభవిస్తూ అనుభవింపజేస్తూ సుతలరాజ్యాన్ని పరిపాలిస్తున్నాడు. ఇది దేవదేవుడి అనుగ్రహ విశేషం.

***(అధ్యాయం - 19, శ్లోకాలు - 32)***



ఈ సుతలానికి క్రిందుగా తలాతలమనే మహాబిలం ఉంది. దీనికి అధిపతి సాక్షాత్తు మయుడు అనే దానవేంద్రుడు. త్రిపురాసురసంహారం చేసిన శివుడు ఇతడిని అనుగ్రహించి ఈ రాజ్యాన్ని అప్పగించాడు. మాయావులు అందరికీ ఇతడే గురువు. సకలమాయా విశారదుడు. సర్వరాక్షస పూజితుడు.

దీనికి ఇంకా కింద మహాతలం ఉంది. ఇది నిరంతర క్రోధవివశులైన కాద్రవేయ సర్పజాతులకు నిలయం. అనేక శిరస్సులు కలిగిన మహాసర్ప నాయకులు ఎందరో ఉన్నారు. కుహక - తక్షక - సుషేణ - కాళియాదులందరూ ఇక్కడివారే. గరుత్మంతుడికి భయపడి భార్యాపుత్రులతో ఈ మహాతలంలో తల దాచుకుంటున్నారు. నానాక్రీడా విశారదులై ప్రమత్తులై విహరిస్తున్నారు.

ఇంకా కింద ఉన్నది రసాతలమనే మహాబిలం. ఇక్కడ దైత్య దానవ నాగజాతులూ నివాతకవచులూ సహవాసం చేస్తుంటారు. కాళీయులూ ఉన్నారు. వీరు హవిర్భోక్తలు. ఓజస్వంతులు. మహాసాహసులు. అయితేనేమి శ్రీహరి వీరి విక్రమాటోపాలను అదుపు చేశాడు. అణిచి ఉంచాడు. అందుకని కలుగుల్లో పురుగుల్లా బతుకుతున్నారు. పైగా ఇంద్రుడి దూతిక సరమ మంత్రాక్షరాలతో వీరిని కట్టి పడేసిందికూడా.

## ◆ పాతాళం - అనంతుడు ◆

దీనికి కిందిభాగంలో ఉన్నది పాతాళం. అది నాగలోకం. వాసుకి - శంఖ - కులిక - శ్వేత - ధనంజయ - మహాశంఖ - ధృతరాష్ట్ర - శంఖచూడ - కంబళ - అశ్వతర - దేవోపదత్తక ప్రముఖులందరూ ఇక్కడే నివసిస్తున్నారు. వీరంతా క్రోధామర్షలు మూర్తీభవించినట్టుంటారు. పెద్ద పెద్ద పడగలు. నిలువెల్లా విషమే. అయిదు పడగలకి తక్కువ వారెవరూ లేరు. వెయ్యి పడగలవారు కూడా ఉన్నారు. అందరికీ పడగలమీద ధగధగలాడే మణులు ఉంటాయి. వాటి కాంతితో పాతాళంలో చీకటి పటాపంచలు అవుతూ ఉంటుంది.

ఈ పాతాళంలో ముప్ఫయివేల యోజనాల అట్టడుగున మూలప్రదేశంలో తామసీరూపంతో ఒకానొక భగవత్కళ వేంచేసి ఉంటుంది. పేరు "అనంత". సర్వదేవప్రపూజిత.

> అస్య మూలప్రదేశే హి త్రింశత్సాహస్రకేఽంతరే ॥
> యోజనైః పరిసంఖ్యాతే తామసీ భగవత్కళా ।
> అనంతాఖ్యా సమాఖ్యాతా హి సర్వదేవప్రపూజితా ॥ (20 - 18)

వేయి తలల ఆదిశేషుడు ఇక్కడే ఉండి భూగోళాన్ని మోస్తూ ఉంటాడు. అతని శక్తి అపారం. అనంతం. అందుకే అనంతుడు అంటారు. అహమ్ అనే అభిమానానికి లక్షణంగా సంకర్షణుడు అనే పేరుతో ద్రష్టృదృశ్యాలను సంకర్షిస్తూ ఉంటాడు. ఒకప్పుడు ఇతడి భ్రూమధ్యభాగం నుంచి సాంకర్షణుడు



అనే రుద్రుడు ఆవిర్భవించాడు. ఏకాదశవ్యూహాలతో ఉదయించాడు. అతడు త్రిలోచనుడు. మహోగ్రమూర్తి. త్రిశూలం ధరించి నిలబడ్డాడు. సాత్త్వతపుంగవులతో కలిసి సర్పనాయకులందరూ నిత్యం మోకరిల్లి ఏకాంతభక్తియోగంతో అతడి పాదపద్మాలకు తమ పడగలమీది మణికాంతులతో కొంగ్రొత్త ఎర్రందనాలను సంతరిస్తారు. మణికాంతులూ పాదపద్మనఖకాంతులూ పోటీ పడతాయి. నాగకన్యలు తమ విలాస విభ్రమాలను ప్రదర్శిస్తూ సుగంధద్రవ్యాలను పులుముకొని చిరునవ్వులు చిందిస్తూ సిగ్గులు సింగారిస్తూ అనురాగ పరవశులై అతడిని ఆరాధనాపూర్వకంగా తిలకిస్తూ ఉంటారు. అనురాగమదోన్మత్తుడై విఘూర్ణారుణనేత్రుడై కరుణావలోకలోచనాలతో ఆశీస్సులు అందిస్తాడని ఎదురుచూస్తూ ఉంటారు.

సో నంతో భగవాన్ దేవోఽనంతసత్త్వో మహాశయః ।
అనంతగుణవార్ధిశ్చ ఆదిదేవో మహాద్యుతిః ॥ (20 - 31)
సంహృతామర్ష రోషాదివేగో లోకశుభాయ చ ।
ఆస్తే మహాతత్త్వనిధిః సర్వదేవప్రపూజితః ॥ (20 - 32)

నారదా ! భూభారాన్ని వహించే ఆ అనంతుడు సాక్షాత్తుగా భగవంతుడు. అనంతబలశాలి. మహాశయుడు. అనంతగుణసముద్రుడు. ఆదిదేవుడు. మహాద్యుతిమంతుడు. అమర్ష రోషమూ, వేగమూ ఇత్యాదులను జయించి తానొక మహాతత్త్వానికి నిధిగా లోకశుభంకోసమని బరువు మోస్తున్నాడు. అందుకే సర్వ దేవ - సర్వజీవ ప్రపూజితుడు అవుతున్నాడు. సురాసుర సిద్ధోరగ విద్యాధర గంధర్వ ముని సంఘాలు నిరంతరం ఇతడిని ధ్యానిస్తుంటాయి. అనారతంగా మదోన్మత్తంగా కదలాడుతున్న చూపులతో అమృతాయమానమైన వాక్కులతో అందరినీ ఆప్యాయంగా పలకరిస్తూ ఉంటాడు. వాడని వైజయంతీ మాలికను ధరించి ఉంటాడు. అది ఏనాడూ వడిలిపోని తులసిదళాలతో కూర్చిన దండ. తుమ్మెదలు దాని చుట్టూ పరిభ్రమిస్తుంటాయి. నీలాంబరధరుడు. ఏక కుండల విభూషితుడు. నాగలిమీద బుజం ఆన్చి నిలబడి ఉంటాడు. ఉదారలీలావిలాసుడు - అని సాత్త్వతర్షులు అనంతుణ్ణి వర్ణించారు.

*(అధ్యాయం - 20, శ్లోకాలు - 38)*

నారదమహర్షీ! సాక్షాద్భగవంతుడైన ఈ అనంతుడి అనుభావాలను సనాతనులైన బ్రహ్మపుత్రులు సనకసనందనాదులు బ్రహ్మదేవుడి సభలో గానంచేస్తూ ఉపాసిస్తుంటారు. మహాకల్పాలూ, ఉత్పత్తి స్థితిలయాలకు హేతువులైన సత్త్వరజస్తమోగుణాలూ అనంతుడి చూపులనుంచి ఆవిర్భవిస్తున్నాయి. ఇతడి రూపం ధ్రువం. అది అకృతం. ఏకనాముడు. అనేక నామధారి. ఇతడి దారి ఏమిటో తెలిసినవారు లేరు. కేవల కృపతో శుద్ధసత్త్వగుణ విభూషితుడై భారాన్ని వహిస్తున్నాడు. ఇతడి నామాన్ని ఆలకించినా ఆకస్మాత్తుగా ఆలపించినా ఆర్తులూ పతితులూ ఉద్ధరింపబడతారు. ఈ ఆదిశేషుడికంటే మరొక



భగవంతుడు లేడు. వేయి పడగల ఈ అనంతుడు తన శిరస్సుమీద భూగోళాన్ని సముద్ర పర్వత గాథారణ్య సహితంగా ఒక అణువులాగా ధరిస్తున్నాడు. ఇతడి శక్తి అనంతం. ఇతడి విక్రమం అమితం, అనమితం (మొక్కవోనిది). దాని సమృద్ధిలో ఇతడు ఎవరినీ లెక్కచేయడు. స్వాత్మతంత్రుడై భూగోళాన్ని లీలగా భరిస్తున్నాడు.

మూర్ధన్యర్పిత మణువత్సహస్రమూర్ధ్నో భూగోళం సగిరిసరిత్సముద్రసత్త్వమ్ ।
ఆనంత్యాదనమిత విక్రమస్య భూమ్నః కో వీర్యాణ్యధిగణయేత్ సహస్రజిహ్వః ॥
(21 - 5)

అనంతుడి ప్రభావాన్ని ఉన్నది ఉన్నట్టుగా వివరించి చెప్పాలంటే వెయ్యి నాల్కలున్నా సరిపోవు. నారదా ! జీవకోటి గతులన్నీ యథాకర్మనిర్మితాలే. మృగ పక్షి మనుష్యజాతులన్నీ కర్మబద్ధాలే. కర్మాను గుణంగానే కోరికలు కలుగుతూ ఉంటాయి. వాటిని ధర్మబద్ధంగా ఉపదేశానుగుణంగా తీర్చుకున్నవారు పరిపక్వతను పొందుతారు.

నారాయణ మహర్షి ఇంతవరకూ చెప్పి క్షణకాలం విరమించాడు. అప్పుడు నారదుడు సవినయంగా మరొక ప్రశ్న వేశాడు. మహర్షీ ! కర్మలు సమానమైనప్పుడు లోకానికి ఇంతటి కర్మవైవిధ్యం ఎలావచ్చింది? ఇది తెలుసుకోవాలని ఉంది - అని అడిగాడు. నారాయణుడు వివరించాడు.

నారదమునీ ! కర్మను ఆచరించే కర్తకు ఉన్న శ్రద్ధనుబట్టి గతి వైవిధ్యం ఏర్పడుతూ ఉంటుంది. గుణత్రయ ప్రభావంవల్ల వాటి ఫలాలలో భేదం ఏర్పడుతుంది.

కర్తుః శ్రద్ధావశాదేవ గతయోఽపి పృథగ్విధాః ।
త్రిగుణత్వాత్సదా తాసాం ఫలం విసదృశం త్విహ ॥ (21 - 11)

కర్మాచరణంలో సాత్త్వికశ్రద్ధను వహించినట్టయితే కర్త ఎప్పుడూ సుఖపడతాడు. రాజసశ్రద్ధకు ఫలితం దుఃఖమే. తామస శ్రద్ధకు దుఃఖిత్వంతోపాటు మూఢత్వంకూడా ఫలితమవుతుంటుంది. ఇలా శ్రద్ధలో ఉండే తారతమ్యాలనుబట్టి వాటి ఫలాలలో వైచిత్ర్యం ఏర్పడుతూ ఉంటుంది.

సాత్త్వికా శ్రద్ధయా కర్తుః సుఖిత్వం జాయతే సదా ।
దుఃఖిత్వం చ తథా కర్తుః రాజస్యా శ్రద్ధయా భవేత్ ॥
దుఃఖిత్వం చైవ మూఢత్వం తామస్యా శ్రద్ధయోదితమ్ ।
తారతమ్యాత్తు శ్రద్ధానాం ఫలవైచిత్ర్యమీరితమ్ ॥ (21 - 13)



## ◆ పితృ - నరకలోకాలు ◆

అనాదియైన అవిద్యకారణంగా కర్మలను ఆచరించినవారికి పరిణామఫలాలుగా సహస్రగతులు లభిస్తూ ఉంటాయి. ప్రాచుర్యక్రమంలో వాటిని కొంత వివరిస్తాను తెలుసుకో. ఈ త్రిజగదంతరాళంలో దక్షిణ దిక్కున భూగోళానికి కింది భాగాన, అతలానికి పైభాగాన అగ్నిష్వాత్తులైన పితృగణాలు నివసించే లోకం ఉంది. పితృదేవతలు అక్కడ నివసిస్తుంటారు.

భూమే రధస్తా దుపరి త్వతలస్య చ నారద ।
అగ్నిష్వాత్తాః పితృగణా వర్తంతే పితరశ్చ హ ॥ (21 - 16)

స్వీయగోత్రికులకు ఆయుర్దాయాన్ని పెంచే ఆశీస్సులను వీరు అందిస్తుంటారు. యమధర్మరాజు ఈ లోకానికి అధిపతి. కర్మానుసారంగా దోషానుసారంగా ఎవరికి ఏది విధించాలో నిర్ణయించడానికి ఇతడి అధీనంలో ఆజ్ఞాకరులైన పురుషులు చాలామంది ఉంటారు. ఇతడి ఆదేశాలతో ఆయా దేశాలలో వీరు నిత్యం సంచరిస్తూ ఉంటారు. ఈ పితృపతి అధీనంలో ఇరవైయొక్క నరకాలు ఉంటాయని కొందరు అంటున్నారు. ఇరవై యెనిమిది అని మరికొందరు అన్నారు. తామిస్ర, అంధతామిస్ర, రౌరవ, మహారౌరవ, కుంభీపాక, కాలసూత్ర, అసిపత్రారణ్య, సూకరముఖ, అంధకూప, క్రిమిభోజన, (సందంశ) తప్తమూర్తి, వజ్రకంటక, శాల్మలి, వైతరణి, పూయోద, (ప్రాణరోధ) విశసన, లాలాభక్ష, సారమేయాదన, అవీచి, అయఃపాన, క్షారకర్దమ, రక్షోగణ, సంభోజ, (రక్షోగణ సంభోజ) శూలప్రోత, దందశూక, వటారోధ, పర్యావర్తనక, సూచీముఖ నామధేయాలతో అవి ప్రసిద్ధికెక్కాయి. ఇవి యాతనాభూములు. కర్మానుసారంగా ప్రాణికోటికి వీటిలో ప్రవేశార్హత లభిస్తుంది. *(అధ్యాయం - 21, శ్లోకాలు - 28)*

## ◆ దుష్కర్మలు - నరకయాతనలు ◆

నారాయణ మహర్షీ ! కర్మభేదాలు ఎన్ని విధాలు ? ఏ కర్మలకు ఏ నరకం లభిస్తుంది ? ఇవి కూడా దయచేసి తెలియజెప్పు.

నారదా ! ఇవి తెలుసుకోవడం అందరికీ అన్ని విధాలా మంచిది. ఆలకించు. పరధన - పరదారాపహరణం చేసినవారు తామిస్రనరకంలో యాతనపడతారు. అక్కడ యమభటులు దండ తాడన సంతర్జనాదులను బహూకరిస్తారు. మూర్ఛావివశుడైనా విడిచిపెట్టరు. భర్తలను వంచించిన స్త్రీలు అంధతామిస్రానికి పోతారు. అక్కడి యాతన వర్ణనాతీతం. కన్ను పొడుచుకున్నా ఏమీ కనిపించదు. మతిపోతుంది. మొదలు నరికిన చెట్టుల్లా కూలబడిపోతారు. నేనూ నా కుటుంబం నాది అంటూ కేవలం



స్వీయకుటుంబ పోషణ కార్యలంపటులై భూతద్రోహం చేసేవాళ్ళు రౌరవ నరకానికి పోతారు. భూలోకంలో తాను ఏయే ప్రాణుల్ని హింసించాడో ఆ ప్రాణులు అన్నీ రురువులుగా మారి ఈ నరకంలో దారుణంగా హింసిస్తాయి.

> రౌరవే నామ నరకే సర్వసత్త్వ భయావహే ।
> ఇహ లోకేఽమునా యే తు హింసితా జంతవః పురా॥
> త ఏవ రురవో భూత్వా పరత్ర పీడయంతి తమ్ ।
> తస్మాద్రౌరవమిత్యాహుః పురాణజ్ఞా మనీషిణః ॥ (22 - 11)

రురువు సర్పంకంటే క్రూరమైన జంతువని పెద్దలు చెబుతున్నారు. వీటిలో పచ్చి మాంసాన్ని తినే రురువులు కూడా ఉన్నాయి. అవి మహారౌరవంలో ఉంటాయి. పశుపక్షి గణాలను హింసించిన క్రూరులు కుంభీపాక నరకంలో పడతారు. అక్కడ సలసలలాడుతున్న నూనె తొట్టెల్లో ఈ పాపాత్ములు నివసించవలసి వస్తుంది. తాను హింసించిన జంతువుకి శరీరంమీద ఎన్ని రోమాలున్నాయో అన్ని వేల సంవత్సరాలు ఇతడు ఆ నూనె తొట్టెల్లో వేగవలసి వస్తుంది.

పితృ విప్ర బ్రాహ్మణ ధిక్కారం చేసి ధర్మం తప్పి సంచరించినవాడు అగ్ని సూర్యతేజస్సులతో మహాగ్నికుండంలాగా భగభగలాడే కాలసూత్ర నరకంలో పడతాడు. తీవ్రమైన ఆకలి దప్పికలతో లోపలా బయటా దహింపబడతాడు. తనకు నిర్దిష్టమైన వేదమార్గాన్ని అనారోగ్యాది కారణాలు ఏమీ లేకుండానే విడిచిపెట్టేసి పాషండులలో కలిసిపోయినవారిని యమభటులు అసిపత్రవనం అనే నరకంలో పడేస్తారు. కొరడాలతో బాదుతారు. లబోదిబోమని అటూ ఇటూ పరుగులు తీస్తుంటే అన్నివైపులనుంచీ అసిపత్రాలు (కత్తుల అంచులు) శరీరాన్ని చీరేస్తూ ఉంటాయి. అప్పటికి పాషండఫలం బాగా అనుభవంలోకి వస్తుంది.

అన్యాయంగా అక్రమంగా పరులను శిక్షించిన పరిపాలకుడూ ద్విజులను శారీరకంగా శిక్షించిన ప్రభువూ సూకరముఖమనే నరకంలో పడతాడు. అక్కడ అతడి శరీరాన్ని చెరకుగడలా పిప్పి చేసేస్తూంటే ఆర్తనాదాలు చేస్తూ మాంసపు ముద్ద అయిపోతాడు.

పరమేశ్వరాంకితంగా జీవితాన్ని గడిపేవారికి వ్యథను కలిగించినవాడు అంధకూపనరకంలో పడతాడు. అక్కడ క్రూరమృగ పశు పక్షి సరీసృప మశక యూకా మత్కుణ మక్షికా దందశూకాలతో కటికచీకటిలో హింసలపాలవుతాడు. కుళ్ళిపోయిన శరీరంతో జంతువులా నేలమీద పాకుతాడు. పొర్లాడతాడు.

పంచయజ్ఞాలు చేసి బలిప్రదానం చెయ్యక, అతిథులకు పెట్టక అంతా తానే భుజించేవాడు కృమిభోజన నరకంలో పడతాడు. లక్షయోజన విస్తీర్ణమైన కృమికుండంలో తానూ ఒక క్రిమిగా మారి మలభక్షకుడవుతాడు. అప్రత్తాప్రహుతాదుడుకూడా ఈ నరకానికే చేరుతాడు.



ఏ ఆపదా లేకపోయినా ఇతరుల బంగారాన్నీ రత్నాలనూ అపహరించేవాడు అగ్నిపిండాల్లాంటి ఇనుప స్తంభాలకు కట్టివేయబడతారు. ఇది తప్తమూర్తి నరకం. పరకాంతలను బలాత్కరించిన పురుషుడూ, పరపుషుడికి వలవేసిన వనిత - ఇద్దరూ నరకానికి పోతారు. అక్కడ యమభటులు కమిచీదెబ్బలు వేస్తూ వజ్రకంటక సంయుక్తమైన ఇనుపస్తంభాలను కౌగిలించుకునేట్టు చేస్తారు. వావివరసలు తప్పి సంచరించే పాపాత్ముడితో ఇలాగే వజ్రకంటక సంయుక్తమైన శాల్మలీతరువును బలవంతంగా అధిరోహింప చేస్తారు. రాజులూ రాజోద్యోగులూ పాషండులై ధర్మసేతువును భంగపరిస్తే వైతరణిలో పడతారు. అది యమలోకమనే దుర్గానికి పరిఖ (అగడ్త). మలమూత్రాలూ, చీమూ నెత్తురులతో నిండిఉంటుంది. అందులో ఈ పాపాత్ములు చేపల్లాగా పీతలాల్లగా ఈదులాడుతుంటారు. తక్కిన జలజంతువులు వీరిని నంజుకుంటాయి. ప్రాణాలు పోవు. ఆత్మజ్ఞానం నశించదు. చేసిన పాపాలకు ఫలం అనుభవిస్తుంటారు. ఆచారమూ నియమమూ శౌచమూ సిగ్గూ విడిచిపెట్టేసి పశువుల్లా ప్రవర్తించేవాళ్ళందరూ ఈ నదిలోనేపడి కొట్టుమిట్టాడుతుంటారు. అదే తింటూ అదే తాగుతూ మునకలు వేస్తుంటారు.

కుక్కలనూ గాడిదలనూ పెంచుతూ జంతువులను వేటాడటానికి వెంపరలాడే ద్విజులను యమభటులు బాణాలతో కొట్టి వేటాడతారు. దంభాచారులై దంభయజ్ఞాలు చేస్తూ పశువిశసనం చేసే దొంగలు వైశస నరకానికి పోతారు. అక్కడ యమభటుల కశాఘాతాలను దండిగా చవిచూస్తారు. మదమోహితుడై ధర్మపత్నితో రేతఃపానం చేయించిన ద్విజమూర్ఖుణ్ణి యమకింకరులు వీర్యకుండంలో పడదోసి రేతఃపానం చేయిస్తారు.

**యో భార్యాం చ సవర్ణాం వై ద్విజో మదమోహితః ।**
**రేతః పాయయతే మూఢోఽముత్ర తం యమకింకరాః ।**
**రేతఃకుండే పాతయంతి రేతః సంపాయయంతి చ ॥ (22 - 48)**

దొంగలనూ, ఇళ్ళకూ పొలాలకూ నిప్పుపెట్టేవాళ్ళనూ, మనుషులకూ జంతువులకూ విషంపెట్టే వాళ్ళనీ, గ్రామాలనూ బాటసారులనూ దోచుకునేవాళ్ళనీ, ప్రజలను దోచుకునే రాజులనూ రాజోద్యోగులనూ యమభటులు శ్వానకాదనమనే నరకానికి తీసుకుపోతారు. అక్కడ ఇరవైకి పైగా మహాద్భుతమైన సారమేయాలు (కుక్కలు) ఉంటాయి. వాటికి వీరిని ఆహారంగా పడవేస్తారు. ఇది మరొక మహాదారుణమైన నరకం. ఇంకా అవీచి మొదలైన నరకాలున్నాయి. వాటిని గురించి కూడా చెబుతాను ఆలకించు.

*(అధ్యాయం - 22, శ్లోకాలు - 52)*

నారదా! కూటసాక్ష్యాలు చెప్పేవారూ గుడిగోపురాదులకు దాతలనుంచి లభించిన ధన కనక భూవస్తువాహనాదులను దుర్వినియోగం చేసేవారూ అవీచి నరకానికి పోతారు. నూరుయోజనాల ఎత్తున్న గిరి శిఖరం మీదనుంచి వీరిని తలకిందులుగా ఆ నరకంలోకి తోసేస్తారు యమభటులు. అక్కడ



నేలంతా కెరటాలు కెరటాలుగా ఉంటుంది. కానీ అవి నీటికెరటాలు కావు. అందుకే దీనికి అవీచి అని పేరు. అందులో పడిన ఈ పాపాత్ములు నువ్వు గింజలపాటిగా తుత్తునియలు అవుతారు. బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులలో స్త్రీలుగానీ పురుషులుగానీ, తెలిసిగానీ తెలియకగానీ సురాపానం చేస్తే వారు నిరయానికి పోతారు. అక్కడ యమభటులు ఇనుమును సలసల కరిగించి బలవంతంగా తాగిస్తారు. వర్ణాశ్రమధర్మాలను పాటించేవారిని గౌరవించని అధములు క్షారకర్దమ నరకానికి పోతారు. నరమేధాది ఘోరయజ్ఞాలను చేసినవారు యమలోకంలో పడే యాతనలు వర్ణనాతీతం. తళతళలాడే కత్తులతో యమభటులు వీరిని నిలువునా చీలుస్తారు. రక్తం తాగిస్తారు. నృత్యం చేయిస్తారు. చిన్నచిన్న పురుగులనూ తూనీగలనూ పిట్టలనూ దారాలుకట్టి ఆడించి హింసించేవారిని యమభటులు శూలాలకు గుచ్చి వేధిస్తారు. ఇనపముక్కుల గ్రద్దలతో పొడిపిస్తారు. ఏరకంగా ఎవరు ఏ జీవహింస చేసినా దానికి తగినరీతిలో దందశూక నరకంలో శిక్ష అనుభవిస్తారు. జంతువులనూ పక్షులనూ పట్టి బంధించేవారిని యమభటులు అలాగే చీకటికొట్టుల్లో వేసి పొగపెట్టి శిక్షిస్తారు. ఇంటికి వచ్చిన అతిథుల్ని పాపదృష్టులతో చూసే బ్రాహ్మణగృహస్థుల కన్నులను నరకంలో యమభటులు కాకులతో గ్రద్దలతో పొడిపిస్తారు. ధనవంతులయ్యుండీ అన్నింటికీ లెక్కలు చూసుకునే లోభులు సూచీముఖ నరకంలో అనుభవించే వేదనలు చాలా దారుణంగా ఉంటాయి. సర్వాంగాలలోనూ సూదులు గుచ్చి యమభటులు వేధిస్తారు. ఇటువంటి విత్తనరకాలు యమలోకంలో శతాధికంగా ఉన్నాయి. పాపాలు చేయించేది ధనమే కనుక ధనవంతుల నరకాలే అధికం. నేను చెప్పినవే కాదు చెప్పని యాతనాభూములు ఇంకా చాలా ఉన్నాయి.

నారదా! పాపాత్ములు నరకాలకు పోయినట్టే ధర్మాతులు సుఖప్రదాలయిన లోకాలకు వెడతారు. మహామునీ! సారాంశంగా ఒక్కమాట చెబుతాను, ఆలకించు. దేవీపూజనం దేవీ ఆరాధనం - ఇదొక్కటే అందరికీ సర్వపాప పరిహారకమైన ఉత్తమోత్తమ ధర్మం. దీనిని అనుష్ఠించిన ప్రాణికి మరింక చింతలేదు. నరకం దరిదాపులకైనా పోవలసిన అవసరం ఉండదు. సంసార సాగరంనుంచి ఉద్ధరించగలిగినది శ్రీమన్మహాదేవి మాత్రమే. ***(అధ్యాయం - 23, శ్లోకాలు 31 )***

**యేనానుష్ఠితమాత్రేణ నరో న నరకం వ్రజేత్ ।**
**సా దేవీ భవపాథోధేః ఉద్ధర్త్రీ పూజితా నృణామ్ ॥ (23 - 31)**

నారాయణ మహర్షీ! సారాంశం గ్రహించాను. ఇంతకీ నువ్వన్న దేవ్యారాధన రూపమైన ఆ ధర్మం ఎటువంటిది? ఎలా ఆరాధిస్తే ప్రసన్నురాలు అవుతుంది? ఆరాధన విధానం ఏమిటి? లోగడ ఎవరు ఎపుడు ఎలా ఆరాధించి తరించారు? ఏయే కష్టాలను అతిగమించారు? విశేషాలు తెలియజేయవలసిందిగా అభ్యర్థిస్తున్నాను.



## ◆ దేవీపూజ - తిథివారాలు, నైవేద్యాలు, ఫలాలు ◆

నారదా! విద్యావిశారదా! చాలా సమంజసమైన ప్రశ్నలు వేశావు. చెబుతాను. ఏకాగ్రచిత్తంతో ఆలకించు. పాడ్యమినాడు ఆజ్యంతో దేవిని అర్చించి బ్రాహ్మణులకు నెయ్యి దానంచేస్తే దాతకు రోగపీడలు తొలగిపోతాయి. విదియ రోజున చక్కరతో పూజించాలి. విప్రులకు శర్కర దానం చెయ్యాలి. దాత దీర్ఘాయుష్మంతుడు అవుతాడు. తదియనాడు పాలతో అభిషేకించి బ్రాహ్మణులకు క్షీరదానం చేస్తే దాతలకు సర్వదుఃఖాలూ తొలగిపోతాయి. చవితినాడు పిండివంటలతో దేవిని ఉపాసించి ద్విజులకు వాటిని దానం చేస్తే దాతల కార్యక్రమాలు నిర్విఘ్నంగా జయప్రదమవుతాయి. పంచమిరోజున అరటిపండ్లు నివేదించి అవే విద్వాంసులకు దానం చెయ్యాలి. దాతకు మేధావికసనం కలుగుతుంది. షష్ఠి తిథినాడు తేనెను అమ్మవారికి నివేదన చేసి వేదవిదులకు దానం చేస్తే దాత అంతటి కాంతిమంతుడు అవుతాడు. సప్తమినాడు బెల్లం నైవేద్యం పెట్టి బ్రాహ్మణులకు దానం చేస్తే దాత శోకవిముక్తుడవుతాడు. అష్టమినాడు కొబ్బరికాయలు కొట్టి నివేదించాలి. బ్రాహ్మణులకు దానం చెయ్యాలి. దాతలకు తాపాలు నశిస్తాయి. నవమినాడు పేలాలు నైవేద్యం పెట్టి విప్రులకు ఇస్తే దాతలు ఇహంలోనూ పరంలోనూ సుఖసంపన్నులవుతారు. దశమినాడు నల్లటి నువ్వులను జగదంబికకు నివేదన చేసి బ్రాహ్మణులకు దానం ఇస్తే దాతలకు ఇక యమలోకభయమే ఉండదు. ఏకాదశినాడు పెరుగు నివేదించి దానంచేస్తే అతడు అమ్మవారికి అత్యంతాప్తుడు అవుతాడు. ద్వాదశినాడు అటుకులు నివేదించి వాటిని బ్రాహ్మణులకు సమర్పించినవారుకూడా దేవికి ప్రేమపాత్రులు అవుతారు. త్రయోదశి రోజున సెనగపప్పు నివేదనచేసి దానంగా ఇచ్చినవారికి దుష్టగ్రహపీడలు తొలగిపోతాయి. చతుర్దశినాడు పెరుగులో పేలపిండి కలిపి నివేదన దానాలు చేసినవారు శివుడికి ఆప్తులు అవుతారు. పున్నమినాడు పాయసం వండి అమ్మవారికి నైవేద్యం పెట్టి బ్రాహ్మణులకు సమర్పించినవారు తమ పితృదేవతలను ఉద్ధరించినవారు అవుతారు. అదేరోజున దేవీప్రీతికోసం హవనం చెయ్యాలి.

నారదా! వారాలకుకూడా కొన్ని విశేషాలున్నాయి. ఆదివారంనాడు పాయసం, సోమవారంనాడు పాలు, మంగళవారంనాడు అరటిపండ్లు, బుధవారంనాడు వెన్న, గురువారంనాడు కలకండ, శుక్రవారం నాడు చక్కెర, శనివారంనాడు ఆవునెయ్యి అమ్మవారికి నివేదనచేస్తే విశేషంగా ఫలప్రదాలు అవుతాయి. అరిష్టాలు తొలగిపోతాయి. ఇరవైయేడు నక్షత్రాలకు కూడా ఇలాగే విశేషార్చనలున్నాయి. పాలు, పెరుగు, చక్కెర, పటికబెల్లం, నెయ్యి, నూలు మొదలైనవి ఆయా నక్షత్రాలలో అమ్మవారికి నివేదనచేసి విప్రులకు దానం చెయ్యాలి. విష్కంభాదియోగాలకూ ఇలాగే బెల్లం నెయ్యి తేనె పాలు పెరుగు చల్లబూరెలు ఉండ్రాళ్ళు కజ్జికాయలు వెన్న దోస గుమ్మడి పనస అరటి నేరేడు మామిడి నారింజ దానిమ్మ రేగు ఉసిరిక కొబ్బరి సెనగలు అటుకులు పాయసం - ఇత్యాదులు నివేదన చెయ్యాలి. లడ్డూలు ఉండ్రాళ్ళు నెయ్యి మొదలైనవి కరణాలలో యోగాలలో నైవేద్యం పెట్టాలి.



మదూకపూజ అని మరొక విధానం ఉంది. చైత్రశుద్ధ తృతీయ మొదలుకొని అన్ని నెలల్లోనూ తదియనాడు శుచిగా మధూకవృక్షం క్రింద (ఇప్పచెట్టు) మహాదేవికి షోడశోపచారపూజలు ఆచరించాలి. చైత్రశుద్ధ తృతీయనాడు పంచఖాద్యాలు నివేదన చెయ్యాలి. వైశాఖశుద్ధతృతీయనాడు గుడయుక్తంగా నైవేద్యం పెట్టాలి. తరవాత నెలల్లో వరసగా తేనె, వెన్న, పెరుగు, చక్కెర, పాయసం, పాలు, ఫేణి, దధికూర్చిక, ఆవునెయ్యి, కొబ్బరికాయలతో కూడిన నివేదనలు పెట్టాలి. పన్నెండునెలలకూ అమ్మవారికి పన్నెండు విశిష్టరూపాలూ నామాలూ ఉన్నాయి. మంగళ - వైష్ణవి - మాయ - కాళరాత్రి - దురత్యయ - మహామాయ - మాతంగి - కాళి - కమలవాసిని - శివ - సహస్రచరణ - సర్వమంగళ అనే పేర్లతో మధూకవృక్షం క్రింద అర్చించాలి. ఇలా చేసినవారికి అన్నికోరికలూ తీరుతాయి. అమ్మవారు భక్తులపాలిటి కల్పవృక్షంకదా ! ఇలా అర్చించి మొక్కినవారికి కొంగుబంగారం అవుతుంది.

మంగళా వైష్ణవీ మాయా కాళరాత్రిర్దురత్యయా ।
మహామాయా మాతంగీ చ కాళీ కమలవాసినీ ॥
శివా సహస్రచరణా సర్వమంగళరూపిణీ ।
ఏభిర్నామపదైర్దేవీం మధూకే పరిపూజయేత్ ॥ (24 - 44)

అటుపైని మధూకస్థమైన మహేశ్వరిని సర్వకామసమృద్ధికోసం వ్రతపూర్ణత్వ సిద్ధికోసం భక్తిప్రపత్తులతో నమస్కరించి ఇలా స్తుతించాలి.

నమః పుష్కరనేత్రాయై జగద్ధాత్రే నమోఽస్తు తే ।
మహేశ్వర్యై మహాదేవ్యై మహామంగళమూర్తయే ॥ (24 - 46)

ఓ పరమా ! పాపహంత్రీ ! పరమార్గప్రదాయినీ ! పరమేశ్వరీ ! ప్రజోత్పత్తీ ! పరబ్రహ్మస్వరూపిణీ! మదదాత్రీ ! మదోన్మత్తా ! మానగమ్యా ! మహోన్నతా ! మనస్వినీ ! మునిధ్యేయా ! మార్తాండసహచారిణీ! లోకేశ్వరీ ! ప్రాజ్ఞా ! ప్రళయాంబుద సన్నిభా ! జగన్మాతా ! మహామోహవినాశం కోరి నిన్ను సురాసురులు అర్చిస్తున్నారు. నువ్వు యమలోకాభావకారిణివి. యమపూజ్యవు. యమాగ్రజవు. యమనిగ్రహరూపవు యజనీయవు. జగజ్జననీ ! నమోనమః.

యమలోకాభావకర్త్రీ యమపూజ్యా యమాగ్రజా ।
యమనిగ్రహరూపా చ యజనీయే నమోనమః ॥ (24 - 50)

ఓ సమస్వభావా ! సర్వేశీ ! సర్వసంగవివర్జితా ! సంగనాశకరీ ! కామ్యరూపా ! కారుణ్యవిగ్రహ కంకాళక్రూరా ! కామాక్షీ ! మీనాక్షీ ! మర్మభేదినీ ! మాధుర్యరూపశీలా ! మధురస్వరపూజితా



మహామంత్రవతీ ! మంత్రగమ్యా ! మంత్రప్రియంకరీ ! మనుష్యమానసగమా ! మన్మథారిప్రియంకరీ ! అశ్వత్థ వట నింబామ్రకపిత్థబదరీ గతా ! పనసార్కకరీరాది క్షీరవృక్ష స్వరూపిణీ ! దుగ్ధవల్లీనివాసార్హా ! దయనీయా ! దయాధికా ! దాక్షిణ్యకరుణారూపా ! సర్వజ్ఞ వల్లభా ! నమోనమః.

ఇలా స్తుతించిన వారికి వ్రతసాఫల్యం వెంటనే సిద్ధిస్తుంది. ఈ స్తోత్రాన్ని నిరంతరం పఠించినవారికి ఆధివ్యాధి శత్రుభయాలు ఉండవు. చతుర్విధపురుషార్థాలలోనూ ఏది కోరినవారికి అది సిద్ధిస్తుంది. చతుర్వర్ణాలవారికీ అనుకూలమైన స్తోత్రమిది.

సమస్వభావా సర్వేశీ సర్వసంగవివర్జితా ।
సంగనాశకరీ కామ్యరూపా కారుణ్యావిగ్రహా ॥
కంకాళక్రూరా కామాక్షీ మీనాక్షీ మర్మభేదినీ ।
మాధుర్యరూపశీలా చ మధురస్వరపూజితా ॥
మహామంత్రవతీ మంత్రగమ్యా మంత్రప్రియంకరీ ।
మనుష్యమానసగమా మన్మథారిప్రియంకరీ ॥
అశ్వత్థ వట నింబామ్ర కపిత్థ బదరీగతే ।
పనసార్క కరీరాది క్షీరవృక్ష స్వరూపిణీ ॥
దుగ్ధవల్లీనివాసార్హే దయనీయే దయాధికే ।
దాక్షిణ్యకరుణారూపే జయ సర్వజ్ఞవల్లభే ॥ (24 - 51 నుంచి 55)

ఇలా అర్చించి స్తుతించినవారు సర్వపాపవిముక్తులవుతారు. మానధనులవుతారు. సర్వత్రా మన్ననలు పొందుతారు. కలలోకూడా యమలోకభయం ఉండదు. మహామాయాప్రసాదంవల్ల పుత్రపౌత్రాదికంగా వృద్ధి చెందుతారు. నారదా ! ఇదంతా నరకోద్ధారలక్షణమైన దేవీపూజా విధానం. సర్వమంగళకారకం. మధూకపూజ చేసినవారికి రోగబాధలు ఉండవు. నరకయాతనలు ఉండవు. అమ్మవారి అనుగ్రహంవల్ల ఇహపరాలలో సకలసుఖాలూ అనుభవించి ముక్తి పొందుతారు. బ్రహ్మనందనా! ప్రకృతిస్వరూపిణిగా అమ్మవారికి అయిదు రూపాలున్నాయి. నామ రూప ఉత్పత్తులలో అవి జగదానందదాయకాలు. వాటి మాహాత్మ్యాలనూ వాటి అర్చావిధానాలనూ వివరిస్తాను తెలుసుకో. ముక్తిప్రదమే కాదు చాలా కుతూహలంగానూ ఉంటుంది - అంటూ నారాయణమహర్షి రవ్వంత విశ్రాంతి తీసుకున్నాడు. *(అధ్యాయం - 24, శ్లోకాలు - 69)*

**అష్టమ స్కంధం - 839 శ్లోకాలు - తెలుగుసేత : బేతవోలు రామబ్రహ్మం**





# నవమ స్కంధము

శౌనకాది మహామునులారా! వ్యాసభగవానుడు నాకు చెప్పిన నారద-నారాయణ సంవాదరూపమైన దేవీప్రకృతిస్వరూపారాధనను వివరిస్తున్నాను. శ్రద్ధగా ఆలకించండి. అంటూ సూతుడు మళ్లీ ఉపక్రమించాడు.

నారాయణుడు నారదుడితో చెబుతున్నాడు - విరించితనయా! గణేశజననియైన దుర్గ, రాధ, లక్ష్మి, సరస్వతి, సావిత్రి - అని ప్రకృతిస్వరూపిణికి అయిదు రూప నామధేయాలున్నాయి.

> గణేశజననీ దుర్గా రాధా లక్ష్మీః సరస్వతీ ।
> సావిత్రీ చ సృష్టి విధౌ ప్రకృతిః పంచధా స్మృతా ॥ (1 - 1)

నారాయణుడు ఇలా ప్రారంభించగానే నారదుడికి చాలా సందేహాలు కలిగాయి. వినయంగా అడిగాడు. నారాయణ మహర్షీ! ఆదిపరాశక్తి ఆ రూపాలను ఎందుకు ధరించింది ? ఎలా ధరించింది ? వాటి లక్షణాలు ఏమిటి ? చరిత్ర ఏమిటి ? గుణగణాలు ఏమిటి ? పూజావిధానాలు ఏమిటి ? ఆయా అవతారాలు ఎక్కడ ధరించింది ? ఈ విశేషాలు అన్నీ వ్యాఖ్యానసహితంగా తెలియజెయ్యి అని ప్రార్థించాడు. నారాయణమహర్షి వివరంగా తెలియజేశాడు.

## ◆ ప్రకృతి నిర్వచనం ◆

వత్సా ! నారదా ! ప్రకృతి లక్షణాన్ని వివరించి చెప్పగల సామర్థ్యం ఎవరికైనా ఉందని నేను అనుకోను. అయినా అడిగావు కనక నేను విన్నంత, తెలుసుకున్నంత నీకు తెలియజెప్పతాను. ఆలకించు. ప్రకృతి అనే పదంలో ప్ర అనేది ఉపసర్గ. ప్రకృష్టవాచకం. కృతి అనేది సృష్టివాచకం. ఈ సృష్టిలో ప్రకృష్టమైనది కనక ఆ దేవి ప్రకృతి అని కీర్తింపబడుతోంది.

> ప్రకృష్టవాచకః ప్రశ్చ కృతిశ్చ సృష్టివాచకః ।
> సృష్టౌ ప్రకృష్టా యా దేవీ ప్రకృతిః సా ప్రకీర్తితా ॥ (1 - 5)

గుణాలలోకెల్లా ఉత్తమోత్తమమైనది సత్త్వగుణం. దానికి సూచకం ప్రశబ్దం. మధ్యమ రజోగుణానికి కృశబ్దం, చివరి తమోగుణానికి తిశబ్దమూ వాచకాలు. త్రిగుణాత్మకస్వరూపిణి కనక, సృష్టికి ప్రధానకారణం కనుక ఆదిపరాశక్తిని ప్రకృతి అంటున్నారు. కృతిశబ్దం సృష్టివాచకం. దానికి ప్రథమ భాగంలో ఉన్నది ప్రశబ్దం. అంటే సృష్టికి ఆదిలో ఉండే దేవి కనక ప్రకృతి అని స్తుతింపబడుతోంది.



గుణే సత్త్వే ప్రకృష్టే చ ప్రశబ్దో వర్తతే శ్రుతః ।
మధ్యమే రజసి కృశ్చ తిశబ్దస్తమసి స్మృతః ॥
త్రిగుణాత్మకస్వరూపా యా సా చ శక్తిసమన్వితా ।
ప్రధానా సృష్టికరణే ప్రకృతిస్తేన కథ్యతే ।
ప్రథమే వర్తతే ప్రశ్చ కృతిశ్చ సృష్టివాచకః ॥
సృష్టేరాదౌ చ యా దేవీ ప్రకృతిః సా ప్రకీర్తితా ॥ (1 - 8)

ఆ ప్రకృతిస్వరూపిణి సృష్టికి ఆరంభంలో యోగశక్తితో తనను తాను (ఆత్మ) రెండుగా విభజించుకుంటుంది. కుడిభాగం పురుషుడుగా. ఎడమభాగం స్త్రీగా (ప్రకృతిగా) రూపు ధరిస్తుంది. అందుకనే యోగీంద్రుల దృష్టిలో స్త్రీపురుషభేదం ఉండదు. అంతా బ్రహ్మమయమే. ఆ పరాశక్తి కేవలం బ్రహ్మస్వరూప. నిత్య. సనాతని. ఆత్మ అన్నా శక్తి అన్నా రెండింటికీ భేదం లేదు. అగ్నినీ వేడిమినీ ఎలా విడదీయలేమో అలాగే ఆత్మశక్తుల్ని విడదీయలేము.

## ◆ దుర్గాది పంచరూప వివరణ ◆

శ్రీకృష్ణుణ్ణి అవతరింపజెయ్యడంకోసం లోకజనని అయిదు రూపాలు ధరించింది. ఒక్కొక్క రూపానికీ మళ్ళీ అనేకభేదాలు ఉన్నాయి. భక్తుల్ని అనుగ్రహించడంకోసం వారి అభ్యర్థనలమేరకు ఎన్నెన్నో అవతారాలు ధరించింది. వాటిలో మొదటి రూపం శివప్రియ. గణేశమాత, దుర్గ, శివరూప, విష్ణుమాయ, నారాయణి, పూర్ణబ్రహ్మ స్వరూపిణి, సర్వాధిష్ఠాత్రి, శర్వరూప, సనాతని, ధర్మసత్య, పుణ్యకీర్తి, యశోమంగళదాయిని, సుఖమోక్ష హర్షదాత్రి, శోకార్తిదుఃఖనాశిని, శరణాగతదీనార్తపరిత్రాణపరాయణ, తేజఃస్వరూప, సర్వశక్తిస్వరూప, సిద్ధేశ్వరి, సిద్ధిరూప, సిద్ధిద, బుద్ధి, నిద్ర, క్షుత్తు, పిపాస, ఛాయ, తంద్ర, దయ, స్మృతి, జాతి, క్షాంతి, భ్రాంతి, శాంతి, కాంతి, చేతన, తుష్టి, పుష్టి, లక్ష్మి, ధృతి, మాయ - ఇత్యాది రూప నామభేదాలతో కీర్తింపబడుతోంది.

ఇక రెండవది శుద్ధసత్త్వస్వరూప. మహాలక్ష్మి. సర్వసంపత్స్వరూప. సంపదధిష్ఠాత్రి. పద్మ, కాంత, దాంత, శాంత, సుశీల, సర్వమంగళ, లోభమోహకామరోషమదాహంకార వివర్జిత. భక్తానురక్త. పతివ్రత. భగవత్ప్రాణతుల్య. భగవత్ప్రేమపాత్ర. ప్రియంవద. సర్వాత్మిక. జీవనోపాయరూపిణి. వైకుంఠంలో ఈ మహాలక్ష్మి పతిసేవాతత్పరయై నివసిస్తూ ఉంటుంది. సర్వప్రాణికోటిలోనూ శోభారూపంగా ఉంటుంది. స్వర్గంలో స్వర్గలక్ష్మిగా, రాజుల్లో రాజలక్ష్మిగా, గృహాలలో గృహలక్ష్మిగా విరాజిల్లుతూంటుంది. పుణ్యాత్ములకు కీర్తిరూప. నరేంద్రులకు ప్రభారూప. వైశ్యులకు వాణిజ్యరూప. పాపాత్ములకు కలహాంకురరూప. వేదాలలో హయరూపగా వర్ణింపబడింది. సర్వపూజ్య. సర్వవంద్య.



ఇక మూడవది వాగ్బుద్ధి విద్యాజ్ఞానాదిష్ఠాత్రియైన సరస్వతి. సర్వవిద్యాస్వరూప. బుద్ధి. కవిత. మేధ, ప్రతిభ, స్మృతి - ఇత్యాదులన్నీ మానవులకు ఈవిడ దయవల్లనే కలుగుతున్నాయి. సిద్ధాంత భేదాలూ. అర్థభేదాలూ కలిగించేది ఈ తల్లియే. వ్యాఖ్యాస్వరూపిణి. బోధస్వరూపిణి. సర్వసందేహభంజని. విచారకారిణి. గ్రంథకారిణి. శక్తిరూపిణి. సర్వసంగీత సంధాన తాళకారణరూపిణి. విషయజ్ఞానవాగ్రూప ప్రతివిశ్వోపజీవని. వ్యాఖ్యావాదకరి. శాంత. వీణా పుస్తకధారిణి. శుద్ధసత్త్వస్వరూప. సుశీల. శ్రీహరిప్రియ. హిమ - చందన - కుంద - ఇందు - కుముద - అంబోజ సన్నిభ. రత్నజపమాలికతో శ్రీకృష్ణుణ్ణి ధ్యానించే తపఃస్వరూపిణి. తపఃఫలప్రద. సిద్ధివిద్యాస్వరూప. సర్వసిద్ధిప్రద. ఈ సరస్వతి లేకపోతే ప్రజలు మూగవారవుతారు. మృతప్రాయులవుతారు.

ఇక నాల్గవది చతుర్వర్ణాలకూ చతుర్వేదాలకూ వేదాంగాలకూ అధిష్ఠానదేవత. సంధ్యావందన మంత్రతంత్రస్వరూపిణి. ద్విజాతిజాతిరూప. తపస్విని. జపరూప. బ్రహ్మణ్యతేజోరూప. సర్వసంస్కారరూపిణి. సావిత్రి. గాయత్రి. బ్రహ్మప్రియ. ఆత్మశుద్ధికోసం సకలతీర్థాలూ ఈ తల్లి సంస్పర్శను కోరుకుంటూ ఉంటాయి. శుద్ధస్ఫటికవర్ణ. శుద్ధసర్వస్వరూపిణి. పరమానందరూప. పరమ. సనాతని.

పవిత్రరూపా సావిత్రీ గాయత్రీ బ్రహ్మణః ప్రియా ।
తీర్థాని యస్యాః సంస్పర్శం వాంఛంతి హ్యాత్మశుద్ధయే ॥
శుద్ధస్ఫటికసంకాశా శుద్ధసర్వస్వరూపిణీ ।
పరమానందరూపా చ పరమా చ సనాతనీ ॥ (1 - 41)

పరబ్రహ్మస్వరూపిణి. నిర్వాణప్రదాయిని. బ్రహ్మతేజోమయి. ఈ తల్లి పాదధూళి సోకి జగత్తు పరిపూతమవుతోంది. ఇక అయిదవ రూపాన్ని వర్ణిస్తున్నాను నారదా ! ఆలకించు.

అయిదవది - పంచప్రాణాలకూ అధిష్ఠానదేవత. పంచప్రాణస్వరూపిణి. ప్రాణాధికప్రియతమ. అందరికన్నా అందగత్తె. సౌభాగ్యమానిని. గౌరవాన్విత. వామాంగార్ధస్వరూప. తేజోగుణసమన్విత. పరావర. సారభూత. పరమ. ఆద్య. సనాతని. పరమానందరూప. ధన్య. మాన్య. పూజ్య. శ్రీకృష్ణుడికి రాసక్రీడాధిదేవి. రాసమండల సంభూత. రాసమండలమండిత. రాసేశ్వరి. సురసిక. రాసావాస నివాసిని. గోలోకవాసిని. గోపీవేషవిధాయిక. పరమాహ్లాదరూప. సంతోషహర్షరూపిణి. నిర్గుణ. నిరాకార. నిర్లిప్త. ఆత్మస్వరూపిణి. నిరీహ. నిరహంకార. భక్తానుగ్రహవిగ్రహ. విచక్షణులు వేదానుసారిజ్ఞానంతో ఈవిడను తెలుసుకుంటారు. సురేంద్రమునీంద్రాదులయినా ఈవిడను చర్మచక్షువులతో చూడలేరు. వహ్నిలాంటి అంశుకాన్ని ధరించి ఉంటుంది. నానాలంకారవిభూషిత. కోటిచంద్రప్రభ. పుష్టసర్వశ్రీయుక్తవిగ్రహ. శ్రీకృష్ణుడిపట్ల భక్తితో



దాస్యం చేస్తూ ఉంటుంది. వరాహావతారంలో ఈవిడ వృషభానుడి కూతురుగా జన్మించింది. ఈవిడ పాదస్పర్శతో వసుంధర అంతా పావనమయ్యింది. శ్రీకృష్ణుడి వక్షఃస్థలంలో స్త్రీరత్నమై విరాజిల్లి, నీలమేఘావృతమైన ఆకాశంలో మెరుపుతీగలా భాసించింది.

స్త్రీరత్నసారసంభూతా కృష్ణవక్షఃస్థలే స్థితా ।
యథాంబరే నవఘనే లోలా సౌదామనీ మునే ॥ (1 - 55)

ఒకప్పుడు బ్రహ్మదేవుడు ఈవిడ కాలిగోటిని సందర్శించి తనను తాను శుద్ధిచేసుకుందామని ఆశించి అరవైవేల సంవత్సరాలు తపస్సు చేశాడు. కానీ ఫలితం దక్కలేదు. కనీసం కలలోనైనా దర్శనం కాలేదు. బ్రహ్మలోకంలో అతడికి దొరకని సందర్శనభాగ్యం భూలోకంలో లభించింది. బృందావనంలో రాధగా దర్శనమిచ్చింది. ఈ రాధ - దేవీపంచమరూపం.

నారదా ! సృష్టిలో కనిపించే ప్రతిస్త్రీలోనూ దేవీరూపం కళారూపంగానో కాలరూపంగానో అంశరూపంగానో కళాంశాంశాంశరూపంగానో ఉంటూనే ఉంటుంది. స్త్రీలందరూ దేవీస్వరూపాలే. పరిపూర్ణస్వరూపాలు మాత్రం ఈ అయిదే. ప్రధానాంశ రూపిణులు కొందరున్నారు. వారి గురించి కూడా చెబుతాను, తెలుసుకో.

అంశరూపాః కాలరూపాః కళాంశాంశాంశసంభవాః ।
ప్రకృతేః ప్రతి-విశ్వేషు దేవ్యశ్చ సర్వయోషితః ॥ (1 - 58)

## ◆ గంగాది ప్రధానాంశస్వరూపిణులు ◆

లోకపావనియైన గంగ ప్రధానాంశస్వరూప. విష్ణుపాదోద్భవ. ద్రవరూపిణి. సనాతని. పాపాత్ముల పాపాలు అనే ఎండుకర్రలను కాల్చివేయడానికి అగ్నిలాంటిది. సుఖస్పర్శ. స్నానపానాలతో నిర్వాణపదవిని అందించే శక్తి కలది. గోలోకాన్ని చేరుకోవాలి అంటే గంగానది సుఖంగా సోపానస్వరూపిణి. సర్వనదీ నదతీర్థాలలోకీ ఉత్తమోత్తమైనది. పరమపావని. శివుడి జటాభారానికి కొసను వేలాడేట్టు అలంకరించిన ముత్యాలదండ. తపస్సులను శీఘ్రంగా సిద్ధింపజేసే పవిత్రురాలు. వెన్నెలలాగా పాలలాగా పద్మంలాగా స్వచ్ఛమైన నీళ్ళతో శుద్ధసత్త్వస్వరూపిణి. నిర్మల. నిరహంకార. సాధ్వి. నారాయణప్రియ.

గోలోకస్థాన ప్రస్థాన సుఖసోపానరూపిణీ ।
పవిత్రరూపా తీర్థానాం సరితాం చ పరావరా ॥ (1 - 62)



శంభుమౌళిజటామేరు ముక్తాపంక్తి స్వరూపిణీ ।
తపస్సంపాదినీ సద్యో భారతేషు తపస్వినామ్ ॥ (1 - 63)
చంద్రపద్మక్షీరనిభా శుద్ధసత్త్వస్వరూపిణీ ।
నిర్మలా నిరహంకారా సాధ్వీ నారాయణప్రియా ॥ (1 - 64)

మరొక ప్రధానాంశస్వరూపిణి - తులసి. విష్ణుకామిని. విష్ణుభూషణరూప. విష్ణుపాదస్థలనివాసిని. తపస్సంకల్పపూజాదులను సిద్ధింపజేసే శక్తి కలది. పత్రపుష్పాలలోకెల్లా ఉత్తమోత్తమైనది. దర్శన స్పర్శనలతో నిర్వాణపదవిని ప్రసాదిస్తుంది. కలియుగంలో కలుషాలను దహించే అగ్ని. సకలతీర్థాలనూ పవిత్రీకరించే పరమపావని. ఆత్మశుద్ధికోసం తులసీ దర్శనస్పర్శనాలను సకలసృష్టి ఆకాంక్షిస్తూ ఉంటుంది. తులసి లేకపోతే సత్కర్మలుకూడా నిష్ఫలమవుతాయి. తులసి మోక్షప్రద. సర్వకామద. భారత భూమిలో అవతరించిన కల్పవృక్షం.

మరొక్క ప్రధానాంశస్వరూప- మనసాదేవి కశ్యప ప్రజాపతి కూతురు. శంకరుడికి ప్రియశిష్యురాలు. జ్ఞానవిశారద. అనంతుడికి సోదరి. నాగపూజిత. నాగేశ్వరి. నాగమాత. సుందరి. నాగవాహిని. నాగేంద్రగణ సంయుక్త. నాగభూషణభూషిత. నాగేంద్రవందిత నాగశాయిని. సిద్ధయోగిని. విష్ణురూప. విష్ణుభక్త. విష్ణుపూజాపరాయణ. తపఃస్వరూప. తపస్విని. తపఃఫలప్రదాయిని. మూడు లక్షల దివ్య సంవత్సరాలు తపస్సు చేసి హరిని మెప్పించి తపస్వినులలోకెల్లా అగ్రగణ్యురాలు అయ్యింది. సర్వమంత్రాధిదేవతయై బ్రహ్మతేజస్సుతో ప్రకాశిస్తూ బ్రహ్మస్వరూపగా బ్రహ్మభావనతత్పరగా విరాజిల్లుతోంది. కృష్ణాంశ సంభవుడైన జరత్కారుమునీశ్వరుడికి ఇల్లాలై ఆస్తీకుడికి జన్మనిచ్చింది. ఆస్తీకుడు మునిప్రవరుడయ్యాడు.

నారదా ! మరొక ప్రధానాంశసంభూత దేవసేన. మాతృకలలోకెల్లా పూజ్యురాలు. ప్రకృతిలో ఆరవకళ. అందుకని షష్ఠి అని కీర్తింపబడుతోంది. త్రిజగద్ధాత్రి. పుత్రపౌత్రాదివృద్ధిప్రదాత్రి.

ప్రధానాంశస్వరూపా యా దేవసేనా చ నారద ।
మాతృకాసు పూజ్యతమా సా షష్ఠీ చ ప్రకీర్తితా ॥
పుత్రపౌత్రాదిదాత్రీ చ ధాత్రీ త్రిజగతాం సతీ ।
షష్ఠాంశరూపా ప్రకృతేస్తేన షష్ఠీ ప్రకీర్తితా ॥ (1 - 79)

ఈవిడ వృద్ధరూపిణి. యోగిని. శిశుగణ సంరక్షక. పురిటింటిలో ఆరవరోజున ఇరవైయొకటవరోజున అర్చించాలి. అటుపైని ఏడాది దాటేవరకూ నెలనెలా పూజించాలి. శిశువుల క్షేమానికి ఇది అవసరం. ఈ దేవసేన దయారూపిణి. మునివందిత. స్థల జల అంతరిక్షాలలో శిశువులకు రక్షణకారిణి.



మరొక ప్రధానాంశస్వరూపిణి - మంగళచండిక. ఈవిడ ప్రకృతి ముఖంనుంచి ఆవిర్భవించింది. సర్వమంగళప్రద. సృష్టివిధానంలో మంగళరూప. సంహారసమయంలో కోపస్వరూప. అందుకే పండితులు ఈమెను మంగళచండిక అన్నారు.

స్పృష్టౌ మంగళరూపా చ సంహారే కోపరూపిణీ ।
తేన మంగళచండీ సా పండితైః పరికీర్తితా ॥ (1 - 83)

ప్రతి మంగళవారంనాడూ ఈ చండికను పూజించాలి. పుత్ర పౌత్ర ధన మంగళ ఐశ్వర్య యశఃప్రదాయిని అవుతుంది. ఈవిడను సంతృప్తిపరిచినవారికి - ప్రధానంగా స్త్రీలకు - సకలవాంఛలూ తీరుతాయి. ఈవిడకు కోపం వచ్చిందంటే క్షణంలో సకలసృష్టినీ నాశనం చేస్తుంది. అంతటి మహేశ్వరి ఈ మంగళ చండిక.

ఇంకొక ప్రధానాంశస్వరూప - కాళిక. కమలలోచన. ఆదిపరాశక్తికి (ప్రకృతికి) నుదుటినుంచి ఈవిడ అవతరించింది. శుంభనిశుంభులతో భీషణసంగ్రామం చేస్తున్న సమయంలో ఆవిర్భవించింది. తేజస్సులో గుణంలో శక్తిలో ఈ కాళిక ఆ దుర్గాదేవిలో అర్ధాంశానికి సమానురాలు. ఈవిడ రూపం కోటిసూర్యసమంగా జాజ్వల్యమానంగా ప్రకాశిస్తూ ఉంటుంది. అంశసంభవలైన శక్తి స్వరూపిణులందరిలోకీ ఈ కాళిక ప్రధానురాలు. అందరికన్నా బలవంతురాలు. సర్వసిద్ధిప్రద. యోగరూపిణి. కృష్ణభక్త. తేజోవిక్రమగుణాలలో కృష్ణతుల్య. కృష్ణభావనకారణంగా ఈవిడ కృష్ణవర్ణంలోనే ఉంటుంది. ఒక నిట్టూర్పుతో సర్వబ్రహ్మాండాలనూ సంహరించగలదు. మహారాక్షసులతో యుద్ధమంటే ఈ కాళికకు ఒక వినోదక్రీడ. ధర్మార్థకామమోక్షప్రదాయిని. బ్రహ్మాదిదేవతలూ మునులూ ఋషులూ ఈవిడను నిరంతరం స్తుతులతో పూజలతో సంతృప్తిపరుస్తుంటారు.

ప్రకృతికి ఇంకొక ప్రధానాంశస్వరూప - వసుంధర. సకల ప్రాణికోటికీ ఆధారం. పాడిపంటలకు నిలయం. రత్నాకర - రత్నగర్భ - రత్నాకరాశ్రయ అని ప్రజలు ఈ వసుంధరను కీర్తిస్తారు. సర్వోపజీవ్య. సర్వసంపద్విధాయిని. ఈ వసుంధర లేకపోతే చరాచరజగత్తు నిరాధారమైపోతుంది.

నారదా ! ప్రధానాంశసంభవలైన ప్రకృతి కళారూపిణులను గురించి చెప్పాను. ఇంక ఏయే శక్తులు ఎవరెవరికి భార్యలో చెబుతాను. అదికూడా తెలుసుకో.

స్వాహాదేవి అగ్నికి ఇల్లాలు. ఆవిడలేకుండా దేవతలు సైతం హవిర్దానాన్ని స్వీకరించరు. దక్షిణాదేవి యజ్ఞపత్ని. స్వధాదేవి పితృదేవతాపత్ని. ఈవిడను పూజించకుండా చేసిన పితృదానాలు



నిష్ఫలమవుతాయి. స్వస్తిదేవి వాయుపత్ని. ఆదానప్రదానాలను సఫలం చేస్తుంది. పుష్టిదేవి గణపతికి పత్ని. ఈవిడను అర్చించకపోతె స్త్రీ పురుషులు క్షీణించిపోతారు. తుష్టిదేవి అనంతపత్ని. సకలదేవతలూ సకలలోకాలూ సంతుష్టిచెందేది ఈవిడ అనుగ్రహంతోనే. సంపత్తిదేవి ఈశానపత్ని. ఈవిడ అనుగ్రహం లేకపోతే లోకాలన్నీ దారిద్ర్యంతో అలమటిస్తాయి. ధృతిదేవి కపిలపత్ని. ఈవిడను అర్చించకపోతే అధైర్యంతో వొణికిపోవాల్సి వస్తుంది. సతీదేవి సత్యపత్ని. ముక్తులు ఈవిడను అర్చిస్తారు. ఈవిడ ఆగ్రహిస్తే లోకం బంధుత్వరహితమైపోతుంది. దయాదేవి మోహపత్ని. ప్రతిష్ఠాదేవి పుణ్యపత్ని. వీరి అనుగ్రహం లేకపోతె జగత్తు జీవన్మృతమైపోతుంది. కీర్తిదేవి సుకర్మపత్ని. ఈవిడ కటాక్షం లేకపోతే జగత్తు యశోహీనమైపోతుంది. క్రియాదేవి ఉద్యోగపత్ని (ఉద్యోగం = ప్రయత్నం). ఈవిడ అనుగ్రహం లేకపోతే లోకాలన్నీ విధిహీనాలైపోతాయి. మిథ్యాదేవి అధర్మపత్ని. ధూర్తులు ఈవిడను పూజిస్తారు. ఈవిడ అనుగ్రహిస్తే (ఆగ్రహిస్తే) విధి నిర్మితమైన సృష్టి అంతా విచ్ఛిన్నమవుతుంది. సత్యయుగంలో ఈవిడ కనిపించదు. త్రేతాయుగంలో సూక్ష్మరూపిణిగా ఉంటుంది. ద్వాపరంలో సగం శరీరంతో దాగి ఉంటుంది. కలియుగంలో మాత్రం మహాప్రగల్భురాలై బలవంతురాలై స్పష్టంగా సర్వత్ర వ్యాపించి ఉంటుంది. ఇంటింటా కపటరూపంతో సోదరులతో సమానంగా సంచరిస్తూ ఉంటుంది.

> సత్యేత్వదర్శనా యా చ త్రేతాయాం సూక్ష్మరూపిణీ ।
> అర్ధావయవరూపా చ ద్వాపరే చైవ పంవృతా ॥
> కలౌ మహాప్రగల్భా చ సర్వత్ర వ్యాపికా బలాత్ ।
> కపటేన పమం భ్రాత్రా భ్రమతే చ గృహే గృహే ॥ (1 - 112)

నారదా ! శాంతదేవి లజ్జాదేవు లిద్దరూ సుశీలపత్నులు. వీరు లేకపోతే జగత్తు ఉన్మత్తమైపోతుంది. బుద్ధి మేధా ధృతిదేవులు ముగ్గురూ జ్ఞానపత్నులు. వీరి అనుగ్రహం లేకపోతే జగత్తు మూఢమవుతుంది. మూర్తిదేవి ధర్మపత్ని. కాంతిస్వరూప. మనోహర. ఈవిడలేకపోతే విశ్వాత్మకుడైన పరమాత్మ కూడా నిరాధారుడైపోతాడు. ఈవిడ శోభారూప. లక్ష్మీకళారూప. శ్రీరూప. మూర్తిరూప. మాన్య. ధన్య. ఇక నిద్రాదేవి కాలాగ్నిరుద్రపత్ని. రాత్రిపూట యోగశక్తితో లోకాలను ఈవిడ ఆశ్రయిస్తుంది.

కాలానికి రేయి పగలు సంధ్య అని ముగ్గురు భార్యలు. వీరు లేకపోతే బ్రహ్మదేవుడుకూడా కాలాన్ని లెక్కించలేడు. క్షుత్పిపాసలు లోభపత్నులు. వీరివల్లనే లోకం చింతాతురమవుతోంది. తేజస్సుకి ప్రభా - దాహికలిద్దరూ భార్యలు. కాలకన్యలైన మృత్యుజరాదేవులిద్దరూ ప్రజ్వరపత్నులు. వీరివల్లనే జగత్తు క్షీణిస్తోంది. నిద్రా తంద్రా ప్రీతిదేవులు ముగ్గురూ సుఖపత్నులు. సకలప్రాణికోటినీ అలసటనుంచి తేర్చి ఉత్తేజపరుస్తారు. శ్రద్ధాభక్తులు వైరాగ్యభార్యలు. వీరు కారణంగానే లోకం జీవన్ముక్తమవుతోంది.



దేవతాజననిగా అదితి, గోవులకు తల్లిగా సురభి (కామధేనువు), దైత్యజననిగా దితి, నాగమాతగా కద్రువ, పక్షిజననిగా వినతాదేవి - ప్రకృతికి కళాంశసంభవలుగా సృష్టివిధానంలో ఉపయోగపడి కీర్తింపబడ్డారు. ఇంకా ఇటువంటి కళాంశాలు చాలా ఉన్నాయి. వాటిలో కొన్ని చెబుతాను, తెలుసుకో. చంద్రపత్నిగా రోహిణీదేవి, సూర్యపత్నిగా సంజ్ఞాదేవి, మనుపత్నిగా శతరూపాదేవి, ఇంద్రపత్నిగా శచీదేవి, బృహస్పతి భార్యగా తారాదేవి, వసిష్ఠుడి ఇల్లాలుగా అరుంధతీదేవి, గౌతమస్త్రీగా అహల్యాదేవి, అత్రి భార్యగా అనసూయాదేవి, కర్దమ జననిగా దక్షపత్నిగా దేవహూతీదేవి. ఇంకా ఇలాగే మానసి - మేనక - వింధ్యావళి (బలిభార్య) - లోపాముద్ర - కుంతి - కుబేరకామిని - వరుణాని - దమయంతి - యశోద - దేవకి - గాంధారి - ద్రౌపది - శైబ్య - సత్త్వవతి - వృషభానుప్రియ - రాధామాత - మందోదరి - కౌసల్య - సుభద్ర - కౌరవి - రేవతి - సత్యభామ - కాళింది - లక్ష్మణ - జాంబవతి - నాగ్నజితి - మిత్రవింద - రుక్మిణి - సీత - యోజనగంధ (వ్యాసమాత) - బాణపుత్రి - (ఉషాదేవి) - చిత్రలేఖ (ఉషాదేవికి సఖి)- ప్రభావతి - భానుమతి (దుర్యోధన పత్ని) - మాయావతి - రేణుక (భృగుజనని) - రోహిణి - ఏకనంద (కృష్ణసోదరి) - వీరంతా ఆదిపరాశక్తి దుర్గకు అంశసంభవలే. ఇంకా లోకంలో ఉన్న గ్రామదేవతలంతా కళాంశాంశ సంభూతలే. లోకాలకు ప్రియం కలిగించే తల్లులే.

**యా యాశ్చ గ్రామదేవ్యః స్యుస్తాః సర్వాః ప్రకృతేః కళాః ।**
**కళాంశాంశసముద్భూతాః ప్రతివిశ్వేషు యోషితః ॥ (1 - 137)**
**యోషితామవమానేన ప్రకృతేశ్చ పరాభవః ।**
**బ్రాహ్మణీ పూజితా యేన పతిపుత్రవతీ సతీ ॥ (1 - 138)**

నారదా ! లోకంలో స్త్రీలంతా అమ్మవారికి అంశావతారాలే కనక స్త్రీలను అవమానిస్తే ప్రకృతిని పరాభవించినట్టే. వారిని అర్చించిన వనితలు పతిపుత్రవతులై సుఖసంతోషాలు పొందుతారు. వస్త్రాలంకారచందనాదులతో కుమారీపూజ చేసినా (ఎనిమిదేళ్ళలోపు ఆడపిల్ల) ముత్తైదువులను అర్చించినా అది ప్రకృతిమాతకు చేసిన ఆరాధనగా మంగళప్రదమవుతుంది.

నారదా ! ఈ ప్రకృతి కళాంశసంభూతలైన స్త్రీమూర్తులలో ఉత్తమ - మధ్యమ - అధమ భేదాలున్నాయి. సత్త్వగుణ ప్రధానలై సౌశీల్యంగల పతివ్రతలు ఉత్తమశ్రేణికి చెందుతారు. రజోగుణప్రధానలై సుఖసంభోగవివశలై స్వకార్యతత్పరలైన స్త్రీలు మధ్యమశ్రేణి. తమోగుణప్రధానలై అజ్ఞాతకుల సంభవలై దుర్ముఖలై కలహప్రియలై ధూర్తలై స్వతంత్రలై కులగౌరవవినాశకలైనవారు అధమశ్రేణికి చెందుతారు. భూలోకంలో వేశ్యలూ స్వర్లోకంలో అప్సరసలూ ఈ కోవలోకి వస్తారు.



సర్వాః ప్రకృతిసంభూతా ఉత్తమాధమమధ్యమాః ।
సత్త్వాంశాశ్చోత్తమా జ్ఞేయాః సుశీలాశ్చ పతివ్రతాః ॥
మధ్యమా రజసశ్చాంశాస్తాశ్చ భోగ్యాః ప్రకీర్తితాః ।
సుఖసంభోగవశ్యాశ్చ స్వకార్యతత్పరాస్సదా ।
అధమాస్తమసశ్చాంశా అజ్ఞాతకుల సంభవాః ॥
దుర్ముఖాః కులహా ధూర్తాః స్వతంత్రాః కలహప్రియాః ।
పృథివ్యాం కులటా యాశ్చ స్వర్గే చాప్సరసాం గణాః ॥
ప్రకృతేస్తమసశ్చాంశాః పుంశ్చల్యః పరికీర్తితాః ।
ఏవం నిగదితం సర్వం ప్రకృతే రూపవర్ణనమ్ ॥ (1 - 144)

వీరిలో దుర్గాదేవిని ప్రప్రథమంగా సురథుడు అర్చించాడు. అటుపైని రావణవధ సమయంలో రాముడు ఉపాసించాడు. ఈ దుర్గ దక్షుడికి కూతురుగా జన్మించి దానవ సంహారం చేసింది. శివనింద వినలేక, తండ్రి ఇంటిలో జరిగిన అవమానాన్ని తాళలేక దేహం చాలించింది. హిమవంతుడికి పార్వతిగా జన్మించింది. తపస్సు చేసి శివుణ్ణి భర్తగా పొందింది. కృష్ణస్వరూపుడైన వినాయకుడికీ, విష్ణుకళాసంభవుడైన కుమారస్వామికీ జన్మనిచ్చింది.

మరొక కాలంలో సావిత్రీ రూపిణిగా అశ్వపతిపూజలూ లక్ష్మీస్వరూపిణిగా మంగళభూపాలుడి పూజలూ మున్ముందుగా అందుకొంది. ఆపైని సర్వదేవతలూ సకలమునీశ్వరులూ అర్చించారు. అలాగే సరస్వతీరూపంగా బ్రహ్మదేవుడి సేవలు అందుకొంది. దేవదైత్యమానవజాతులతో సేవింపబడింది. అటుపైని ఆదిపరాశక్తి రాధాదేవిగా గోలోకంలో రాసమండల పూజలు గైకొంది. కార్తికపూర్ణిమనాడు శ్రీకృష్ణుడు గోగోపీగోపక బృందంతో ప్రథమార్చన చేశాడు. ఆపైని నారాయణుడి ఆజ్ఞమేరకు బ్రహ్మాదిదేవతలు ధూపదీపనైవేద్యాది, సకలోపచారాలూ చేశారు. భూలోకంలో సుయజ్ఞుడు అర్చించాడు. పుణ్యక్షేత్రమైన భారతదేశంలో గ్రామగ్రామానా నగరనగరానా శంకరుడి ఆజ్ఞ ప్రకారం పరాశక్తి పూజలు నేటికీ సాగుతున్నాయి. నారదా ! ఇదీ దేవీకళారూపాల మహిమ. ఇంకా ఏమి తెలుసుకోవాలనుకుంటున్నావో అడుగు. నాకు తెలిసినమటుకు చెబుతాను - అన్నాడు నారాయణమహర్షి. *(అధ్యాయం - 1, శ్లోకాలు - 158)*



## ◆ శ్రీకృష్ణుడు - శక్తి స్వరూపాలు ◆

నారాయణమహర్షీ ! సంగ్రహంగా దేవీచరితాన్ని తెలియజెప్పావు. కానీ విస్తృతంగా వినాలని నా కోరిక. సృష్టికి ఆదిలో ఉండే పరాప్రకృతి, సృష్టి విధానమప్పుడు ఏ రూపంతో ఎలా ఆవిర్భవించింది ? అయిదుగా ఎలా విభజన పొందింది ? త్రిగుణాలూ అంశకళలుగా ఎలా రూపుదాల్చాయి ? వీటన్నింటి గురించి జన్మకథనం పూజావిధానం స్తోత్రం కవచం ఇత్యాదులన్నీ మంగళప్రదంగా సమగ్రంగా నాకు వివరించి చెప్పు. నువ్వు వేదవేదాంగవేత్తవు. ఈ చరాచర సృష్టిలో నీకు తెలియనిదంటూ ఏమీ లేదు. దయచేసి అనుగ్రహించు.

నారదా ! ఆత్మ నిత్యం. ఆకాశం నిత్యం. కాలం నిత్యం. దిక్కులు నిత్యం. అలాగే ఈ విశ్వంలో గోలోకం నిత్యం. అందులో ఒక ప్రదేశమే వైకుంఠం. అలాగే ప్రకృతి - నిత్యం. అది బ్రహ్మలీల. సనాతనం. అగ్నికి వేడిమి, చంద్రుడికి వెన్నెల, పద్మానికి శోభ, సూర్యుడికి ప్రకాశం - ఎలా అవిభాజ్యాలూ అవిభక్తాలూ అభిన్నాలో అలాగే (పరమ) ఆత్మ - ప్రకృతి ఇవి రెండూ అభిన్నాలు.

యథాగ్నౌ దాహికా చంద్రే పద్మే శోభా, ప్రభా రవౌ ।
శశ్వద్యుక్తా న భిన్నా సా తథా ప్రకృతిరాత్మని ॥ (2 - 7)

బంగారం లేనిదే కమసాలి ఆభరణాలు చెయ్యలేడు. మట్టి లేనిదే కుమ్మరి కుండలు చెయ్యలేడు. అలాగే ప్రకృతి లేనిదే (పరమ) ఆత్మ ఈ జగత్తును సృష్టించలేడు. ప్రకృతి అంటే సర్వశక్తి స్వరూప. దాని కలయికవల్లనే (పరమ) ఆత్మ శక్తిమంతుడు అవుతున్నాడు. "శక్తి" పదంలో 'శ' అనేది ఐశ్వర్యానికీ (ఈశ్వరత్వం) 'క్తి' అనేది పరాక్రమానికీ (విస్తరణ) సంకేతాలు. ఆ రెండింటినీ ఇచ్చేదీ ఆ రెండింటి స్వరూపమూ కనకనే ప్రకృతి - శక్తి అయ్యింది.

ఐశ్వర్యవచనః శశ్చ క్తిః పరాక్రమ ఏవ చ ।
తత్స్వరూపా తయోర్దాత్రీ సా శక్తిః పరికీర్తితా ॥ (2 - 10)

జ్ఞానమూ సమృద్ధీ సంపత్తీ యశస్సూ - వీటికి "భగమ్" అని పేరు. అవి కలిగినదికనుకా, వాటి స్వరూపముకనుకా శక్తికి భగవతి అనీ భగరూప అనీ పేర్లు ఏర్పడ్డాయి. దానితో కూడిన (పరమ) ఆత్మకు భగవంతుడని పేరు. ఆ స్వేచ్ఛామయుడైన భగవంతుడు సాకారుడూ నిరాకారుడూను. నిరాకారుడు తేజోరూపం. దానిని యోగీశ్వరులు ధ్యానిస్తూ ఉంటారు. పరబ్రహ్మమనీ పరమానందమనీ కీర్తిస్తుంటారు. అది అదృశ్యరూపం. కానీ సర్వద్రష్ట. (తాను కనపడదు కానీ తాను అన్నింటినీ చూడగలదు). అది సర్వజ్ఞం. సర్వకారణం. సర్వదం. సర్వరూపం.



అయితే వైష్ణవులు దీనిని అంగీకరించరు. తేజస్వి లేనిదే తేజస్సు ఎక్కడ అని ప్రశ్నిస్తుంటారు. అందుచేత తేజోమండలమధ్యస్థుడైన బ్రహ్మతేజస్విని వారు పరమాత్మ అంటారు. అది స్వేచ్ఛామయం. సర్వరూపం. సర్వకారణకారణం. మనోహరమైన అత్యంతసుందరరూపం. ఆ తేజస్విది కిశోరవయస్సు. శాంతుడూ సర్వకాంతుడూ. పరాత్పరుడు. నీలనీరదశరీరుడు. శరత్కాలంలో మధ్యాహ్నవేళకు పూర్తిగా వికసించిన పద్మాల శోభను అపహరిస్తాయి అతడి కన్నులు. పేర్చిన ముత్యాలవంటి పలువరుస. శిరస్సుమీద నెమలిపింఛం. మాలతీపుష్పమాలికలు. కొనదేలిన ముక్కు. నవ్వురాజిల్లెడు మోమువాడు. భక్తానుగ్రహకారణుడు. అగ్నిజ్వాలలాగా పరిశుభ్రమైన పీతాంబరం ధరించినవాడు. మురళీధారి. రత్నభూషణ భూషితుడు. సర్వాధారుడు. సర్వేశుడు. సర్వశక్తియుతుడు. విభువు. సర్వైశ్వర్యప్రదుడు. స్వతంత్రుడు. సర్వమంగళప్రదుడు. పరిపూర్ణతముడు. సిద్ధుడు. సిద్ధేశుడు. సిద్ధికారకుడు. ఈ సనాతనుడైన దేవదేవుణ్ణి వైష్ణవులు ధ్యానిస్తుంటారు. ఉపాసిస్తారు.

నారదా ! జన్మ మృత్యు జరా వ్యాధి శోక భీతి హరుడైన పరాత్పరుడికి బ్రహ్మాయుష్షు ఒక నిమేషమాత్రమవుతుంది. ఆ పరబ్రహ్మనే కృష్ణుడు అంటారు. ఇందులో "కృష్" అనేది భక్తివాచకం. 'న' అనేది దాస్యవాచకం. భక్తి - దాస్య ప్రదాత కనక కృష్ణుడయ్యాడు. అలాగే కృష్ శబ్దం సర్వవాచకం. నకారం బీజవాచకం. స్రష్ట తానే. సృష్టిబీజమూ తానే. కనకనే కృష్ణుడు.

స చాత్మా స పరంబ్రహ్మ కృష్ణ ఇత్యభిధీయతే ।
కృషిస్తద్భక్తివచనో నశ్చ తద్దాస్యవాచకః ॥
భక్తిదాస్యప్రదాతా యః స చ కృష్ణః ప్రకీర్తితః ।
కృషిశ్చ సర్వవచనో నకారో బీజమేవ చ ॥
స కృష్ణః సర్వస్రష్టాదౌ సిసృక్షన్నేక ఏవ చ । (2 - 25)

ఆ స్వేచ్ఛామయుడు తన ఇచ్ఛానుసారం రెండు రూపాలుగా అయ్యాడు. వామభాగం స్త్రీరూపంగా, దక్షిణభాగం పురుషరూపంగా. మహాకామి అయిన ఈ సనాతన పురుషుడు కామాధారయైన ఆ స్త్రీమూర్తిని చూశాడు. అప్పుడే వికసించిన పద్మంలాగా కమనీయంగా ఉంది. చంద్ర బింబంలాగా ఉంది. రంభోరు. నితంబ భారాంచిత. శ్రీఫలాలవంటి వక్షోజాలు. సన్నని నడుము. పుష్పమాలికాలంకృత. శాంతస్వరూప. స్మేరవదన. వక్రలోచన. అగ్నిజ్వాలలా పరిశుభ్రమైన చీర. రత్నభూషణభూషిత. తన నయనచకోరాలతో శ్రీకృష్ణుడి ముఖమనే చంద్రబింబంలోని వెన్నెలల్ని తదేకదీక్షగా గ్రోలుతోంది. తన్మయం చెందుతోంది.



శశ్వచ్చక్షుశ్చకోరాభ్యాం పిబంతీ సతతం ముదా ।
కృష్ణస్య ముఖచంద్రం చ చంద్రకోటి వినిందితమ్ ॥ (2 - 32)

ఆ స్త్రీమూర్తి నెన్నొసట కస్తూరిబిందువు. దానికి కింద చందన బిందువు. వాటితో సమానంగా సిందూరబిందువు. వాలుకొప్పులో తురిమిన మాలతీ పుష్పమాలికలు.

కస్తూరీబిందునా సార్థమధశ్చందన బిందునా ।
సమం సిందూరబిందుం చ ఫాలమధ్యే చ బిభ్రతీమ్ ॥ (2 - 33)

కోటిచంద్రులు ఒక్కసారిగా ఉదయించినట్టుంది ఆ స్త్రీమూర్తి. తన నడకలతో రాజహంసలనూ గజరాజాలనూ పరిహసిస్తోంది. తన కాంతుడిపట్ల కాముకి.

ఆ సౌందర్యరాశిని చూసి రాసేశ్వరుడు రాసోల్లాసమైన రాసమండలంలో రసికుడై ఆమెతో రాసక్రీడను జరిపాడు. శృంగారం మూర్తీభవించినట్టు సుఖసంభోగం సాగించాడు. బ్రహ్మమానంలో ఒకరోజుపాటు అది సాగింది. అప్పటికి ఆ జగత్పిత అలిసిపోయాడు. నిత్యానందదాయకమైన ఆ శుభక్షణంలో ఆ స్త్రీమూర్తి యోనిలో వీర్యాధానం చేశాడు. సురతాంతంలో అలిసిపోయిన ఆమె శరీరం నుంచి హరితేజస్సువల్ల స్వేదజలం వరదలు కట్టింది. నిట్టూర్పులు నిగిడాయి. ఆ గాలి తాకిడికి స్వేదజలాలు విశ్వగోళమంతటా (సముద్రాలుగా) వ్యాపించాయి. ఆ వాయువే జీవరాశికి ప్రాణాధారమయ్యింది. ఆ వాయువుకి ఒక రూపం ఏర్పడింది. అతడి వామభాగం నుంచి మరొక స్త్రీమూర్తి ఆవిర్భవించింది. అతడికి ప్రాణవల్లభ అయ్యింది. వారిద్దరికీ అయిదుగురు పుత్రులు జన్మించారు. అవే పంచప్రాణవాయువులు. ప్రాణ - అపాన - సమాన - ఉదాన - వ్యాన వాయువులు.

ఆ స్వేదజలానికి అధిదేవతగా వరుణుడు ఆవిర్భవించాడు. అతడికీ వామభాగంనుంచి స్త్రీమూర్తి అవతరించింది. వరుణవల్లభ - వరుణాని.

ఆ చిచ్ఛక్తి కృష్ణాదేవి కృష్ణగర్భాన్ని ధరించింది. శతమన్వంతరాలు బ్రహ్మతేజస్సుతో ప్రకాశించింది. ఆవిడ కృష్ణుడికి ప్రాణాధిదేవి. ప్రాణాధికప్రియ. నిరంతరకృష్ణసంగిని. ఎప్పుడూ కృష్ణుడి వక్షఃస్థలంమీదనే ఉండేది. శతమన్వంతరాలు గడిచాక కృష్ణాదేవి ఒక మగబిడ్డను ప్రసవించింది. ఆ శిశువు బంగారుపు రంగులో ఉన్నాడు. అతడే విశ్వాధారాలయుడు.

ఆ బిడ్డను చూస్తూనే కృష్ణాదేవికి హృదయం భగభగలాడింది. బ్రహ్మాండగోళమంతటా నిండి ఉన్న మహాజలంలోకి విసిరేసింది - కృష్ణుడు హాహాకారాలు చేశాడు. వెంటనే శపించాడు. ఓసి కోపవా!



ఓసి నిష్ఠురా ! బిడ్డను నీళ్ళల్లోకి విసిరేశావా ! ఈ పాపానికి ఫలం అనుభవించు. ఇంక నీకు బిడ్డలు పుట్టరు. ఇది నిశ్చయం. ఇంతేకాదు నీ అంశరూపాలుగా జన్మించిన అప్సరసలుకూడా నిత్యయౌవనలుగా ఉండిపోతారే తప్ప వారికీ కడుపుపండదు - అని కఠినంగా శపించాడు.

అదే క్షణంలో కృష్ణాదేవి జిహ్వాగ్రభాగంనుంచి హఠాత్తుగా ఒక కన్య ఆవిర్భవించింది. తెల్లని రంగులో మనోహరంగా ఉంది. తెల్లని వస్త్రాలు ధరించింది. వీణాపుస్తకధారిణి. రత్నభూషణభూషాఢ్య. సర్వశాస్త్రాధిదేవత.

అటుపైని కొంతకాలానికి ఆవిడ రెండు రూపాలు ధరించింది. వామభాగం నుంచి లక్ష్మీదేవి, దక్షిణభాగం నుంచి రాధాదేవి ఆవిర్భవించారు. అదిచూసి పరాత్పరుడు కృష్ణుడు ద్విధారూపాలు ధరించాడు. వామభాగం నుంచి చతుర్భుజుడు, దక్షిణభాగం నుంచి ద్విభుజుడు అవతరించారు.

వాణిని ద్విభుజుడికి కామినిగా, రాధను ఆమెకు తోడుగా నియమించి వారిని అక్కడే ఉండమని ఆశీర్వదించి చతుర్భుజుడికి - నారాయణుడికి - లక్ష్మీదేవిని జతపరిచి కృష్ణుడు వారితో కలిసి వైకుంఠానికి వెళ్ళిపోయాడు.

ఉవాచ వాణీం కృష్ణస్తాం త్వమస్య కామినీ భవ ।
అత్రైవ మానినీ రాధా తవ భద్రం భవిష్యతి ॥
ఏవం లక్ష్మీం చ ప్రదదౌ తుష్టో నారాయణాయ చ ।
స జగామ చ వైకుంఠం తాభ్యాం సార్ధం జగత్పతిః ॥ (2 - 57)

అక్కడ వాణి, ఇక్కడ లక్ష్మి ఇద్దరికీ సంతానం కలగలేదు. అప్పుడు చతుర్భుజనారాయణుడి శరీరంనుంచి చతుర్భుజులైన పార్షదులు చాలామంది ఆవిర్భవించారు. అందరూ రూపంలో తేజస్సులో వయస్సులో నారాయణుడికి ముమ్మూర్తులా ప్రతిబింబాలు. అలాగే లక్ష్మీదేవి శరీరంనుంచి దాసీజనం కోటిసంఖ్యలో అవతరించారు.

అక్కడ గోలోకంలో ఆ గోలోకనాథుడి రోమకూపాలనుంచి అసంఖ్యాకంగా గోపకులు ఆవిర్భవించారు. అందరూ ముమ్మూర్తులా ఆ ద్విభుజుడైన గోలోకనాథుడిలాగానే ఉన్నారు. ఆ పార్షదులందరూ అతడికి ప్రాణప్రియులయ్యారు. అలాగే రాధాదేవి శరీరంలో రోమకూపాలనుంచి గోపకన్యకలు ఆవిర్భవించారు. అందరూ రాధాదేవిలాగానే ఉన్నారు. అదే రూపం. అదే వయస్సు. అదే ఆభరణాదికం.



నారదా ! అలనాటి కృష్ణశాపం కారణంగా వైకుంఠంలోగానీ గోలోకంలోగానీ ఏ వనితకూ కడుపు పండలేదు. అంతలోకీ కృష్ణప్రియ, విష్ణుమాయ, సనాతని ఆ దుర్గాదేవి హఠాత్తుగా ప్రత్యక్షమయ్యింది. ఆదిపరాశక్తి. నారాయణప్రియ. సర్వశక్తిస్వరూపిణి. బుద్ధికి అధిష్ఠానదేవత. దేవీస్వరూపాలకు అన్నింటికీ బీజరూప. మూలప్రకృతి. ఈశ్వరి. పరిపూర్ణతమ. తేజస్స్వరూపిణి. త్రిగుణాత్మిక. తప్తకాంచనవర్ణ. కోటిసూర్యసమప్రభ. ఈషత్ హాస్య ప్రసన్నవదన. సహస్రభుజసంయుత. త్రిలోచన. నానాశస్త్రాస్త్రధారిణి. రత్నభూషణభూషిత. అగ్నిజ్వాలలా విశుద్ధవస్త్రాలంకృత. సకల స్త్రీలూ ఆమె కళాంశాంశరూపాలు. ఆవిడ మాయకు సమస్తలోకాలూ సమ్మోహితమవుతాయి. సర్వైశ్వర్యప్రదాత్రి. కృష్ణభక్తిప్రద. వైష్ణవులకు వైష్ణవి. ముముక్షువులకు మోక్షప్రదాయిని. భోగులకు సుఖప్రదాయిని. స్వర్గంలో స్వర్గలక్ష్మిగా, గృహంలో గృహలక్ష్మిగా కీర్తింపబడుతుంది. తపస్వులకు తపస్యాస్వరూప. రాజులలో శ్రీరూప. అగ్నిలో దాహకశక్తి. భాస్కరుడిలో ప్రభారూప. చంద్రుడిలో శోభారూప. పద్మాలలో శోభనరూప. పరమాత్మయైన శ్రీకృష్ణుడిలో సర్వశక్తిస్వరూప. ఆ పరమాత్మ ఆమెవల్లనే శక్తిమంతుడవుతున్నాడు. ఈ జగత్తు ఆమెవల్లనే శక్తిమంతమవుతోంది. ఆమెయే లేకపోతే జగత్తు మృతప్రాయమే. ఈ సంసారమహావృక్షానికి (సృష్టితరువు) ఆ సనాతని బీజరూప. స్థితిరూప. (ఋ) వృద్ధిరూప. ఫలరూప.

యా చ సంసారవృక్షస్య బీజరూపా సనాతనీ ।
స్థితిరూపా (ఋ) వృద్ధిరూపా ఫలరూపా చ నారద ॥ (2 - 75)

ఆ క్షుత్పిపాసాదయారూపిణి ఆ నిద్రా తంద్రా క్షమామతి స్వరూపిణి, ఆ శాంతిలజ్జాతుష్టిపుష్టి భ్రాంతికాంత్యాదిరూపిణి, ఆదిపరాశక్తి సర్వేశ్వరుడైన కృష్ణపరమాత్మను స్తుతించి ఎట్టఎదుట నిలబడింది. రాధికేశ్వరుడు రత్నసింహాసనం సమర్పించాడు.

అదే సమయానికి నారాయణుడి నాభికమలంనుంచి వనితాసమేతుడై చతుర్ముఖుడు ఆవిర్భవించాడు. కమండలువు ధరించి ఉన్నాడు. మహాతపస్వి. మహాజ్ఞాని. బ్రహ్మతేజస్సుతో విరాజిల్లు తున్నాడు. నాలుగు ముఖాలతోనూ నారాయణుడిని స్తుతించాడు.

అంతలోకే కృష్ణుడు ద్విధారూపుడయ్యాడు. వామార్ధం నుంచి మహాదేవుడూ దక్షిణార్ధంనుంచి గోపికాపతి ఆవిర్భవించారు. మహాదేవుడు శుద్ధస్ఫటికంలాగా ఉన్నాడు. శతకోటి సూర్యప్రభాసమన్వితుడై వెలిగిపోతున్నాడు. త్రిశూలాన్నీ పట్టిశాన్నీ ధరించాడు. పులితోలును వస్త్రంగా కట్టుకున్నాడు. రాగితీగల్లాగా ఉన్న జుట్టు గుబురుగా జడలు కట్టింది. శరీరమంతటా భస్మం. స్మేరవదనారవిందుడు. చంద్రశేఖరుడు. త్రినేత్రుడు. దిగంబరుడు. నీలకంఠుడు. సర్పభూషణుడు. కుడిచేతిలో రత్నమాలిక. పంచవక్త్రుడై కృష్ణపరమాత్మను స్తుతిస్తున్నాడు. సముచిత రత్నసింహాసనంమీద కూర్చున్నాడు. (అధ్యాయం - 2, శ్లోకాలు - 88)



## ◆ విరాట్ స్వరూపుడు ◆

నారదా ! కృష్ణాదేవి విసిరివేసిన ఆ మగ శిశువు ఒక బ్రహ్మకల్ప పర్యంతం మహాజలార్ణవంలో ఏకాకిగా అలా తేలుతున్నాడు. అటుపైని రెండుగా అయ్యాడు. ఆకలితో అలమటించాడు. రోదించాడు. పాలుతాపే తల్లి లేదు. తండ్రి లేడు. నిరాశ్రయుడై అనాథబాలుడుగా పరితపించాడు. ఆకాశంవైపు చూస్తున్నాడు. ఆ శిశువు అణోరణీయాన్, మహతో మహీయాన్. తేజస్సులో కృష్ణపరమాత్మకు ఇతడు పదహారవ అంశ. సర్వవిశ్వానికీ అతడే ఆధారం. ప్రాకృత రూపంలో ఉన్న మహావిష్ణువు. మహావిరాట్ స్వరూపుడు.

స్థూలాత్ స్థూలతమస్సోఽపి నామ్నా దేవో మహావిరాట్ ।
పరమాణుర్యథా సూక్ష్మాత్పరః స్థూలాత్తథాప్యసౌ ॥
తేజసా షోడశాంశోఽయం కృష్ణస్య పరమాత్మనః ।
ఆధారస్సర్వవిశ్వానాం మహావిష్ణుశ్చ ప్రాకృతః ॥ (3 - 5)

ఇతడి రోమకూపాలలో ఎన్ని విశ్వాలు ఉన్నాయో లెక్కపెట్టి చెప్పడం కృష్ణుడికికూడా సాధ్యం కాదు. అలాగే బ్రహ్మవిష్ణుశివాదుల సంఖ్యకూడా అనంతం. ప్రతి విశ్వంలోనూ వీరున్నారు. పాతాళం నుంచి బ్రహ్మలోకాంతంవరకూ దాన్ని బ్రహ్మాండం అంటారు. దానికి పైని ఉన్నది వైకుంఠం. అది బ్రహ్మాండానికి ఆవల ఉంది. దానికి పైని పంచాశత్కోటియోజనదూరంలో గోలోకం ఉంది. కృష్ణుడు ఎలా నిత్యసత్యస్వరూపుడో అలాగా ఈ గోలోకమూ నిత్యసత్యస్వరూపం.

ఇంక భూగోళం సప్తద్వీప పరిమితం. సప్తసాగరపరివృతం. ఒకటి తక్కువగా యాభై ఉపద్వీపాలున్నాయి. పర్వతాలు అసంఖ్యాకంగా ఉన్నాయి. ఈ భూగోళానికి పైని బ్రహ్మలోకంవరకూ ఏడు స్వర్గలోకాలున్నాయి. కింది భాగాన సప్తపాతాళాలున్నాయి. ఇదంతా కలిపి బ్రహ్మాండం. భూర్లోక భువర్లోక స్వర్లోక జనలోక తపోలోక సత్యలోకాలకుపైని తప్తకాంచన సన్నిభమై బ్రహ్మలోకం ఉంది. ఇదంతా కృత్రిమం. బాహ్యాభ్యంతర వినాశంతో సర్వమూ నశిస్తుంది. ఈ విశ్వసమూహం జలబుద్బుదం లాంటిది. అనిత్యం. మొత్తం అన్నిలోకాలలోకీ నిత్యమైనవి రెండే రెండు - గోలోకమూ వైకుంఠమూ. ఇవి రెండూ అకృత్రిమాలు.

రోమరూపాలనుంచి ఆవిర్భవించిన అసంఖ్యాక బ్రహ్మాండాలలో అసంఖ్యాక త్రిమూర్తులుంటారనీ అసంఖ్యాకంగా దేవతలుంటారనీ (ఒక్కొక్క బ్రహ్మాండంలోనూ ముక్కోటి చొప్పున) దిక్పాల నక్షత్ర గ్రహాదులుకూడా అసంఖ్యమనీ చెప్పాను గుర్తుందికదా ! అది అలా ఉండనీ. ఈ భూలోకంలో చతుర్వర్ణాలవారూ అసంఖ్యాకంగా ఉన్నారు. అధోలోకాలలో నాగజాతివారుంటారు.



నారదా ! ఆకలిగొన్న ఆ శిశువు జలార్ణవంలో ఏకాకిగా తేలుతూ ఆకాశంవైపు చూస్తున్నాడు. తాను తప్ప ఎక్కడా ఏమీ కనిపించడం లేదు. దిగులు పడ్డాడు. రోదించాడు. కొంతకాలానికి జ్ఞానోదయమయ్యింది. పరమ పురుషుడైన కృష్ణుణ్ణి ధ్యానించాడు. సనాతన బ్రహ్మజ్యోతి ప్రత్యక్షమయ్యింది. అది తొలకరిమబ్బులాగా నీలంగా ఉంది. పీతాంబరం ధరించి చిరునవ్వులు చిందిస్తోంది. ఒక చేతిలో మురళి. మరొకటి అభయహస్తం. ఆ తేజస్సును చూడటంతోనే బాలకుడు సంతృప్తి చెందాడు. ఆ పరమేశ్వరుడూ ఆనందించాడు. సమయోచితంగా ఒక వరం ప్రసాదించాడు.

వత్సా ! జ్ఞానయుక్తుడవై నాతో సమానుడవవుతావు. ఆకలి దప్పికలు ఉండవు. ఈ అసంఖ్యాక బ్రహ్మాండాలు నీ నిలయాలు. లయపర్యంతం ఇది నీకు వరం. నిష్కాముడవూ నిర్భయుడవూ. అందరికీ వరదుడవు. జరా మృత్యు రోగ శోక పీడా వివర్జితుడవు - అని ఆశీర్వదించి ఆ శిశువు చెవిలో షడక్షరమహామంత్రాన్ని ముమ్మారు ఉపదేశించాడు. అది సర్వవిఘ్నహరమైన మహామంత్రం. ప్రణవాది. చతుర్థ్యంతమైన కృష్ణ శబ్దం. స్వాహాంతం. ఓం కృష్ణాయ (నమః) స్వాహా -

ఇత్యుక్త్వా తస్య కర్ణే స మహామంత్రం షడక్షరమ్ ।
త్రిః కృత్వశ్చ ప్రజజాప వేదాంగప్రవరం పరమ్ ॥
ప్రణవాది చతుర్థ్యంతం కృష్ణ ఇత్యక్షరద్వయమ్ । (3 - 27)
వహ్నిజాయాంత మిష్టం చ సర్వవిఘ్నహరం పరమ్ ॥

మంత్రాన్ని ఉపదేశించాక ఆ శిశువుకి ఆహారాన్ని కల్పించాడు పరమాత్మ. ఆ విశేషమూ చెబుతాను తెలుసుకో. ఈ లోకంలో విష్ణుభక్తుడు నైవేద్యంగా సమర్పించినదాంట్లో పదహారవవంతుమాత్రమే వైకుంఠ నాథస్వామికి చెందుతుంది. తక్కిన పదిహేనువంతులూ విరాడ్రూపుడైన ఆ శిశువుకే చెందుతుంది అని కృష్ణపరమాత్మ నియమం చేశాడు. నిర్గుణుడూ పరిపూర్ణతముడూ కేవలం ఆత్మస్వరూపుడూ అయిన కృష్ణపరమాత్మకు నైవేద్యాలతో పనిలేదు. ఎవరు ఏ నైవేద్యాలు సమర్పించినా అటు లక్ష్మీనాథుడైన వైకుంఠుడూ ఇటు విరాడ్రూపుడైన శిశువూ - ఇద్దరే ఆస్వాదిస్తారు.

ఇలా మంత్రం ఇచ్చి, వరం ఇచ్చి, ఆహారం ఏర్పరచి కృష్ణపరమాత్మ ఆ బాలకుణ్ణి ఇంకా ఏమైనా కావాలా, అడుగు - అన్నాడు. అప్పుడు ఆ డింభకుడు వినయంగా పలికాడు.

పరమాత్మా ! నీ పాదపద్మాలపట్ల నాకు నిశ్చలమైన భక్తిని ప్రసాదించు. నా జీవితం క్షణమో శాశ్వతమో. అంతవరకూ నీ భక్తుడుగానే నేనుండాలి. ఈ లోకంలో నీ భక్తుడు జీవన్ముక్తుడు. నీపట్ల భక్తిలేని మూర్ఖుడు జీవచ్ఛవం.



త్వద్భక్తియుక్తో లోకేఽస్మిన్ జీవన్ముక్తశ్చ సంతతమ్ ।
త్వద్భక్తిహీనో మూర్ఖశ్చ జీవన్నపి మృతో హి సః ॥ (3 - 35)

కృష్ణభక్తి లేనివాడు తపస్సు చేసినా యజ్ఞాలు చేసినా పూజలు చేసినా వ్రతాలు చేసినా ఉపవాసాలు చేసినా తీర్థయాత్రలు చేసినా అంతా వ్యర్థం. అతడొక మూర్ఖుడు. అతడి జీవితం వ్యర్థం. అతడి ఆత్మ అతడిని నిందిస్తుంది. అతడి శరీరంలో ఆత్మ ఉన్నంతకాలం అతడు శక్తియుతుడుగా కన్పిస్తాడు. ఆత్మ వెళ్ళిపోయాక సర్వశక్తులూ నిష్క్రమిస్తాయి. అవ్వి సర్వతంత్ర స్వతంత్రాలు. కృష్ణపరమాత్మా! ఆ ఆత్మవు నువ్వే. సర్వాత్మవు. ప్రకృతికన్నా పరుడవు. స్వేచ్ఛామయుడవు. సర్వాద్యుడవు. బ్రహ్మజ్యోతివి. సనాతనుడవు.

బాలకుడి మాటలకు కృష్ణపరమాత్మ మురిసిపోయాడు. మధురంగా బదులు పలికాడు. బాలకా ! నాలాగే నువ్వూ చిరకాలం సుస్థిరంగా ఉండు. ఎందరు బ్రహ్మలు నశించినా నీకుమాత్రం నాశనం లేదు. ప్రతిబ్రహ్మాండంలోనూ నువ్వు అంశమాత్రుడుగా లఘువిరాడ్రూపంలో ఉండు. నీ నాభికమలంనుంచి విశ్వస్రష్ట అయిన బ్రహ్మ అవతరిస్తాడు. ఆ బ్రహ్మకు ఫాలభాగం నుంచి ఏకాదశ రుద్రులు ఆవిర్భవిస్తారు. వారంతా శివాంశలు. సృష్టిసంహారకారణులు. వారిలో ఒకడైన కాలాగ్నిరుద్రుడు విశ్వసంహారకారకుడు. విశ్వసంరక్షకుడుమాత్రం విష్ణువే. అతడూ రుద్రాంశమే. బాలకా ! నాపట్ల నీకు భక్తి నిశ్చలంగా ఉండేట్టు వరమిస్తున్నాను. ధ్యానంలో నిత్యమూ నన్నూ నావక్షః స్థలనివాసినినీ చూడగలుగుతావు. వత్సా ! నా లోకానికి నేను వెడుతున్నాను. ఇక నువ్వు ఉండు - అని కృష్ణపరమాత్మ అంతర్ధానం చెందాడు.

తన లోకానికి వెళ్ళీవెళ్ళడంతోనే బ్రహ్మనూ శంకరుణ్ణీ పిలిచాడు. వత్సా ! చతుర్ముఖా ! సృష్టిని ఆరంభించు. శిశువు నాభికమలంనుంచి అవిర్భవించు. నాయనా ! మహాదేవా ! బ్రహ్మకు ఫాలభాగంనుంచి నువ్వు అవతరించు. చిరకాలం తపస్సు చెయ్యి - అని ఆజ్ఞాపించాడు. ఇద్దరూ కృష్ణపరమాత్మకు నమస్కరించి బయలుదేరారు.

బ్రహ్మాండగోళంలో మహాజలార్ణవంలో శిశురూపంలో ఉన్న విరాడంశమూర్తిని దర్శించారు. నీరదశ్యాముడు. యువ. పీతవాససుడు. జలతల్పం మీద శయనించి ఉన్నాడు. ప్రసన్నవదనుడు. చిరునవ్వులు చిందుతున్నాడు. అతడు విశ్వవ్యాపి - జనార్దనుడు. అతడి నాభికమలంనుంచి బ్రహ్మ అవతరించాడు. పద్మనాళంలోకి దిగాడు. సృష్టి లక్షణమేమిటో తెలుసుకుందామని అన్వేషించాడు. ఎంతదిగినా ఆ పద్మనాళానికి అంతం కనిపించలేదు. మళ్ళీ పద్మంలోకి వచ్చాడు. ఏమి చెయ్యాలి, ఎలా చెయ్యాలి ? చింతాపరవశుడయ్యాడు. కృష్ణపాదపద్మాలు ధ్యానించాడు. దివ్యచక్షువులకి - జలతల్పంమీద శయనించి ఉన్న బాలుడే కనిపించాడు. **అతడి రోమకూపంలో** బ్రహ్మాండం కనిపించింది. అటుపైని కృష్ణపరమాత్మ కనిపించాడు. గోలోకంలో గోపగోపీసమన్వితుడై కనిపించాడు. అతడిని స్తుతించి వరం పొంది సృష్టి ఆరంభించాడు చతుర్ముఖుడు.



బ్రహ్మదేవుడికి సనకసనందనాదులు మానసపుత్రులుగా జన్మించారు. ఏకాదశరుద్ర కళలు ఫాలభాగంనుంచి ఆవిర్భవించాయి. వామభాగంనుంచి విష్ణువు రక్షకుడుగా అవతరించాడు. అతడు చతుర్భుజుడు. శ్వేతద్వీపంలో నివాసం ఏర్పరుచుకున్నాడు.

అటుపైని విరించి విశ్వాన్ని సృష్టించాడు. స్వర్గమూ మర్త్యలోకమూ పాతాళమూ చరాచరజగత్తునీ కల్పించాడు. ఇలా ప్రతిరోమకూపంలోనూ ఒక్కొక్క విశ్వాన్ని ఒకొక్క బ్రహ్మ సృష్టించాడు. ప్రతి విశ్వంలోనూ త్రిమూర్తులున్నారు.

నారదా ! ఇది కృష్ణపరమాత్ముని గుణకీర్తనం. ఇది శుభప్రదం. మోక్షప్రదం. ఇంకా ఏమి వినాలనుకుంటున్నావో అడుగు అన్నాడు నారాయణమహర్షి. ***(అధ్యాయం - 3, శ్లోకాలు - 62)***

శౌనకాది మహామునులారా ! నారదనారాయణ సంవాదం శ్రద్ధగా వింటున్నారుకదా ! అని సూతుడు హెచ్చరించాడు. నారదుడు మళ్ళీ నారాయణమహర్షిని అడుగుతున్నాడు. వినండి -

## ◆ సరస్వతీ పూజ ◆

నారాయణమహర్షీ ! నా జన్మ ధన్యమయ్యింది. వినవలసింది అంతా విన్నాను. ఒక్క సందేహంమాత్రం ఉండిపోయింది. పరాప్రకృతి అయిదురూపాలు ధరించిందికదా ! వారిలో ఏ రూపానికి ఏ పూజ ఎలా చెయ్యాలి ? లోగడ ఎవరు చేశారు ? ఏ వరాలు పొందారు ? స్తోత్రం ధ్యానం ప్రభావం - ఇత్యాదులన్నీ తెలుసుకోవాలని ఉంది. అనుగ్రహించు - అని నారదుడు అభ్యర్థించాడు. నారాయణమహర్షి ఆరంభించాడు.

> గణేశజననీ దుర్గా రాధా లక్ష్మీః సరస్వతీ ।
> సావిత్రీ చ సృష్టివిధౌ ప్రకృతిః పంచధా స్మృతా ॥ (4 - 4)

నారదా ! దుర్గ - రాధ - లక్ష్మి - సరస్వతి - సావిత్రి అని సృష్టికి ఆదిలో పరాప్రకృతి అయిదు రూపాలు ధరించింది. వీరి పూజావిధానం సుప్రసిద్ధం. వీరి ప్రభావం పరమాద్భుతం. వీరి చరితం అమృతప్రాయం - సర్వమంగళప్రదం. వీరు ప్రకృతికి అంశకళలు. సవిస్తరంగా చెబుతాను సావధానుడవై ఆలకించు. వీరితోపాటు కాళి - వసుంధర - గంగ - షష్ఠి - మంగళచండిక - తులసి - మానస - నిద్ర - స్వధా - స్వాహా - దక్షిణాదేవుల చరితలూ చెబుతాను. సంగ్రహంగా కొందరివీ విస్తరంగా కొందరివీ తెలియజేస్తాను. దుర్గా రాధలది విస్తీర్ణమైన చరిత.



బ్రహ్మనందనా ! తొట్టతొలిగా శ్రీకృష్ణుడే సరస్వతీపూజను రూపొందించాడు. ఆ తల్లి అనుగ్రహం ఉన్నట్టయితే మూర్ఖుడుసైతం పండితుడవుతాడు.

ఆదౌ సరస్వతీపూజా శ్రీకృష్ణేన వినిర్మితా ।
యత్ప్రసాదాన్మునిశ్రేష్ఠ ! మూర్ఖో భవతి పండితః ॥ (4 - 10)

కృష్ణదేవి ముఖంనుంచి ఆవిర్భవించిన వెంటనే సరస్వతీదేవి కామపరవశయై కృష్ణుణ్ణి సమీపించింది. ఆవిడ భావాన్ని గ్రహించిన శ్రీకృష్ణుడు పరిణామంలో సుఖావహమైన హితాన్నీ సత్యాన్నీ మృదువుగా ఉపదేశించాడు.

సాధ్వీ ! దేవీ ! సరస్వతీ ! నా అంశతో అవతరించిన ఈ చతుర్భుజనారాయణుడిని సేవించు. అతడు యువకుడు. సుందరుడు. సర్వసద్గుణ సంపన్నుడు. అన్నింటా నాకు తుల్యుడు. కామినీమణుల కామాన్ని గుర్తించగలిగినవాడు, తీర్చగలిగినవాడు. శతకోటి మన్మథాకారుడు. అతడిని సేవించు. అలాకాక నన్నే కాంతుడుగా వరించి ఇక్కడ ఉండదలిస్తే కొన్ని ఇబ్బందులు ఉన్నాయి. నీకన్నా బలవంతురాలూ శక్తిమంతురాలూ రాధ ఉంది. నీకు క్షేమం కాదు. నేనూ కాపాడలేను. ఇతరులకన్నా బలవంతుడుకదా మరొకరిని కాపాడగలడు. నేను అశక్తుడిని. అనీశ్వరుడిని. పరులను ఎలా కాపాడగలను ? లోకం దృష్టిలో నేను సర్వేశ్వరుడినే. సర్వశాసకుడినే. కానీ రాధను బాధించడానికి మాత్రం నేను చాలను. తేజస్సులో ఆ రాధ నాకు సమానురాలు. నా ప్రాణాధిష్ఠానదేవత. అందుచేత రాధను హింసించడమంటే నేను ప్రాణాలను విడిచిపెట్టడమే. ఆ పని చెయ్యలేను. ప్రాణాలకన్నా తీపి మరొకటి ఉంటుందా ! కాబట్టి ఓ కల్యాణీ ! నువ్వు వెంటనే వైకుంఠానికి వెళ్ళు. చతుర్భుజుడిని సేవించు. నీకూ నాకూ క్షేమం. అతడిని పతిగా స్వీకరించి చిరకాలం సుఖాలు అనుభవించు. అక్కడ అరిషడ్వర్గవిరహిత లక్ష్మీదేవి ఉంటుంది. తేజోరూపగుణాలలో నీకు సరిసమానురాలు. ఆమెతో నీకు కాలం హాయిగా గడుస్తుంది. లోభమోహాలు లేవిది కనక నిన్ను బాధించదు. ఆ చతుర్భుజనారాయణుడు కూడా మీ ఇద్దరిపట్లా సమానమైన గౌరవాదరాలను చూపిస్తాడు.

సరస్వతీ ! నీకు మరొక వరం ఇస్తున్నాను. ప్రతి విశ్వంలోనూ ప్రతి యుగంలోనూ దేవమానవజాతులవారందరూ నిన్ను పూజిస్తారు. మాఘమాసంలో శుక్లపంచమినాడూ, విద్యారంభంలోనూ ( అక్షరాభ్యాసం నాడు) భక్తిప్రపత్తులతో నిన్ను అర్చిస్తారు. మహాప్రళయంతో సృష్టి అంతమయ్యేదాకా నీ పూజలు నిరంతరాయంగా సాగుతాయి. షోడశోపచారాలతో కణ్వశాఖోక్త పద్ధతిలో ధ్యానావాహనస్తవాలతో జితేంద్రియులై నిన్ను కొలుస్తారు. నీ రూపంతో సువర్ణ గుటికను (ప్రతిమ) తయారుచేసి కుండలోగానీ



(కలశం) పుస్తకంలోగానీ నిక్షేపించి గంధచందనాదులతో అర్చించి అటుపైని దానిని కవచంగా కంఠసీమలోనో కుడిబుజానికో ధరించినవారు నీ అనుగ్రహానికి పాత్రులవుతారు.

నారదా ! ఇలా నియమించి శ్రీకృష్ణుడు ముందుగా తానే ఆ పూజను చేశాడు. అటుపైని బ్రహ్మవిష్ణుశివాదులూ అనంతుడూ ధర్ముడూ సనకాదిమునీంద్రులూ సకలదేవతలూ రాజులూ మానవులూ అందరూ చేశారు. ఈనాటికీ సకలలోకాలలోనూ సరస్వతీదేవి అర్చింపబడుతోంది - అని క్లుప్తంగా ముగించాడు నారాయణమహర్షి. నారదుడికి సంతృప్తి కలగలేదు. కణ్వశాఖోక్త పద్ధతి ఏమిటో వివరించమని అడిగాడు. పూజాద్రవ్యాలూ నైవేద్యాలూ ధ్యానకవచాదులూ తెలియజెయ్యమని కుతూహలం ప్రకటించాడు. మహర్షి వివరంగా తెలియజేశాడు.

విరించిసుతా ! మాఘశుక్లపంచమినాడుగానీ అక్షరాభ్యాసంనాడుగానీ తెల్లవారుజామునే లేచి శుచియై సంయతుడై నిత్యక్రియలు పూర్తి చేసుకుని కలశాన్ని స్థాపించాలి. ముందుగా వినాయకపూజ జరపాలి. అటుపైని సరస్వతిని ధ్యానించి కలశంలోకి ఆవాహన చెయ్యాలి. మళ్ళీ ధ్యానించాలి. షోడశోపచారపూజలు చెయ్యాలి. పాలు పెరుగు వెన్న పేలాలు చిమ్మిలి చెరకు పటికబెల్లం తేనె - ఇత్యాదులు నైవేద్యం పెట్టాలి. తెల్లని బియ్యంతో అక్షతలు తయారుచెయ్యాలి. అటుకులు, వరి అన్నం, ఘృత సైంధవ సమ్మిశ్రితమైన హవిష్యాన్నం, యవగోధూమచూర్ణంలో నెయ్యి పాలూ పంచదారా కలిపి చేసిన ప్రసాదం, అరటిపండ్లు, క్షీరాన్నం, నారికేళం, కొబ్బరినీళ్ళు, బదరీఫలం - ఏవైనాసరే ఆయా ఋతువుల్లో ఆయా దేశాలలో దొరికే పళ్ళూ ఫలాలూ నైవేద్యానికి పనికివస్తాయి. అలాగే పువ్వులన్నీ పూజకు పనికివస్తాయి. సుగంధభరితమైన చందనంతో పూజించాలి. తెల్లని నూతనవస్త్రం కావాలి. అందమైన శంఖం కావాలి. తెల్లని పూవులతో దండకట్టి సమర్పించాలి. వేదసమ్మతమైన సరస్వతీధ్యానం తెలియజేస్తున్నాను. ఇది సకలభ్రమభంజకం. శ్రద్ధగా గ్రహించు -

సరస్వతీం శుక్లవర్ణాం సస్మితాం సుమనోహరామ్ ।
కోటిచంద్రప్రభాముష్ట పుష్టశ్రీయుక్త విగ్రహామ్ ॥
వహ్నిశుద్ధాంశుకాధానాం వీణాపుస్తకధారిణీమ్ ।
రత్నసారేంద్ర నిర్మాణ నవభూషణ భూషితామ్ ॥
సుపూజితాం సురగణైః బ్రహ్మవిష్ణుశివాదిభిః ।
వందే భక్త్యా వందితాం చ మునీంద్రమనుమానవైః ॥ (4 - 48)



ఇలా ధ్యానించి, సమస్తమూ అర్పణచేసి, స్తుతించి, కవచం ధరించి సాష్టాంగనమస్కారం చెయ్యాలి. చేసినవారికి సరస్వతీదేవి కులదైవమై సకలశుభాలూ కలిగిస్తుంది. విద్యారంభంలోగానీ, సంవత్సరాదినాడుగానీ, ఏ పంచమిరోజునగానీ ఈ పూజ చెయ్యవచ్చు. ఓం - ఐం - హ్రీం - క్లీం - శ్రీం అనే బీజాక్షరాలతో రెండేసితో కలిసి సరస్వత్యై స్వాహా అనేది వైదికాష్టాక్షరీ మూలమంత్రం. ఇది కల్పవృక్షం లాంటి మంత్రం.

సరస్వతీచతుర్థ్యంతం వహ్నిజాయాంతమేవ చ ।
లక్ష్మీమాయాదికం చైవ మంత్రోఽయం కల్పపాదపః ॥ (4 - 52)

(ఐం హ్రీం క్లీం = బీజత్రయం = తారత్రయం = సరస్వతీ లక్ష్మీ మాయా బీజాక్షరాలు)

ఈ సరస్వతీ మూలమంత్రాన్ని ఆదిలో నారాయణుడు గంగాతీరాన వాల్మీకి మహర్షికి ఉపదేశించాడు. పుష్కరక్షేత్రంలో సూర్యగ్రహణంనాడు భృగుమహర్షి శుక్రుడికి ఉపదేశించాడు. చంద్రగ్రహణంరోజున మరీచిమహర్షి వాక్పతికి (బృహస్పతి) అనుగ్రహించాడు. బదరికాశ్రమంలో బ్రహ్మదేవుడు భృగువుకి ఉపదేశించాడు. క్షీరసముద్రతీరంలో ఆస్తీకుడికి జరత్కారువూ, మేరుశిఖరంమీద విభాండకుడు ఋష్యశృంగుడికీ, శివుడు కణాదగౌతములకూ, సూర్యుడు కాత్యాయన యాజ్ఞవల్క్యులకూ, ఆదిశేషుడు పాతాళంలో పాణినికీ భారద్వాజుడికీ శాకటాయనుడికీ ఉపదేశించారు. నారదా ! మూలమంత్రాన్ని నాలుగులక్షలు నిష్ఠతో జపించినట్టయితే మంత్రసిద్ధి కలుగుతుంది. మంత్రసిద్ధి కలిగిందంటే అతడు బృహస్పతి సమానుడయినట్టే.

చతుర్లక్షజపేనైవ మంత్రస్సిద్ధో భవేన్నృణామ్ ।
యది స్యాన్మంత్రసిద్ధో హి బృహస్పతిసమో భవేత్ ॥ (4 - 58)

నారదా ! గంధమాదన పర్వతంమీద బ్రహ్మదేవుడు భృగుమహర్షికి విశ్వజయ సంపాదకమైన సరస్వతీకవచాన్ని అనుగ్రహించాడు. ఆ సందర్భంగా జరిగిన వారిద్దరి సంభాషణనూ యథాతథంగా చెబుతున్నాను - ఆలకించు. భృగుమహర్షి అడిగాడు -

హే బ్రహ్మన్ ! బ్రహ్మవిదాంశ్రేష్ఠ ! బ్రహ్మజ్ఞానవిశారదా ! సర్వజ్ఞా ! సర్వజనకా ! సర్వేశా ! సర్వపూజితా ! విశ్వజయావహమైన సరస్వతీకవచాన్ని అనుగ్రహించు.

వత్సా ! భృగూ ! సర్వవాంఛాప్రదమైన సరస్వతీకవచాన్ని ఉపదేశిస్తున్నాను. గ్రహించు. ఇది శ్రుతిసారం. శ్రుతిసుఖం. శ్రుత్యుక్తం. శ్రుతిపూజితం. గోలోకబృందావనంలో రాసక్రీడారతుడైన రాసేశ్వరుడు



శ్రీకృష్ణుడు నాకు ఉపదేశించాడు. ఇది కల్పవృక్షసమం. అత్యంతగోపనీయం. కనీవినీ ఎరుగని మంత్రాక్షరాలున్నాయి ఇందులో. ఈ కవచాన్ని ధరించిన శుక్రాచార్యుడు సర్వదైత్యగురువయ్యాడు. బృహస్పతి బుద్ధిమంతుడయ్యాడు. దేవగురువు అయ్యాడు. వాల్మీకి కవీంద్రుడయ్యాడు. స్వాయంభువ మనువు సర్వపూజితుడు అయ్యాడు. దీన్ని పఠించినందువల్లా ధరించినందువల్లా విశేషఫలితాలు లభిస్తాయి. కణాద గౌతమ కణ్వ పాణిని శాకటాయన కాత్యాయన ప్రభృతులు దక్షులైన శాస్త్రకర్తలయ్యారు. వ్యాసుడు వేదాలను విభజించగలిగాడు. పురాణాలు రచించగలిగాడు. శాతాతప - సంవర్త - వసిష్ఠ - పరాశర - యాజ్ఞవల్క్య - ఋష్యశృంగ - భరద్వాజ - ఆస్తీక - దేవల - జైగీషవ్య - యయాతి ప్రముఖులు సర్వదా సర్వథా గౌరవమర్యాదలు అందుకున్నారంటే దీని మహిమవల్లనే. ఈ కవచానికి ప్రజాపతియే స్వయంగా ఋషి. బృహతీ ఛందస్సు. శారదాంబికయే దేవత. సర్వ తత్త్వపరిజ్ఞాన - సర్వార్థసాధన - కవితారచనలయందు దీని వినియోగం. బీజాక్షరాలతో సహా ఉపదేశిస్తున్నాను, గ్రహించు.

శ్రీం హ్రీం సరస్వత్యై స్వాహా - శిరో మే పాతు సర్వతః ।
శ్రీం వాగ్దేవతాయై స్వాహా - ఫాలం మే సర్వదాఽవతు ॥
ఓం హ్రీం సరస్వత్యై స్వాహా - ఇతి శ్రోత్రే పాతు నిరంతరమ్ ।
ఓం హ్రీం భగవత్యై స్వాహా - నేత్రయుగ్మం సదావతు ॥
ఐం హ్రీం వాగ్వాదిన్యై స్వాహా - నాసాం మే సర్వదావతు ।
హ్రీం విద్యాధిష్ఠాతృదేవ్యై స్వాహా - చోష్ఠం సదావతు ॥
ఓం శ్రీం హ్రీం బ్రాహ్మ్యై స్వాహేతి - దంతపంక్తిం సదావతు ।
ఐమిత్యేకాక్షరో మంత్రో మమ కంఠం సదావతు ॥
ఓం శ్రీం హ్రీం పాతు మే గ్రీవాం స్కంధౌ మే శ్రీం సదావతు ।
ఓం హ్రీం విద్యాధిష్ఠాతృదేవ్యై స్వాహా - వక్షస్సదావతు ॥
ఓం హ్రీం విద్యాధిస్వరూపాయై స్వాహా - మే పాతు నాభికామ్ ।
ఓం హ్రీం క్లీం వాణ్యై స్వాహేతి - మమ హస్తౌ సదావతు ॥
ఓం సర్వవర్ణాత్మికాయై పాదయుగ్మం సదావతు ।
ఓం హ్రీం వాగధిష్ఠాతృదేవ్యై స్వాహా - మాం సర్వదావతు ॥



ఓం సర్వకంఠవాసిన్యై స్వాహా - ప్రాచ్యాం సదావతు ।
ఓం సర్వజిహ్వాగ్రవాసిన్యై స్వాహా - అగ్నిదిశి రక్షతు ॥
ఓం ఐం హ్రీం క్లీం సరస్వత్యై బుధజనన్యై స్వాహా ।
సతతం మంత్రరాజోఽయం దక్షిణే మాం సదావతు ।
ఐం హ్రీం శ్రీం త్ర్యక్షరో మంత్రో నైరృత్యాం సర్వదావతు ॥
ఓం ఐం జిహ్వాగ్రవాసిన్యై స్వాహా మాం - వారుణోఽవతు ॥
ఓం సర్వాంబికాయై స్వాహా వాయవ్యే మాం సదావతు ।
ఓం ఐం శ్రీం క్లీం గద్యవాసిన్యై స్వాహా మాముత్తరేఽవతు ॥
ఐం సర్వశాస్త్రవాసిన్యై స్వాహా - ఐశాన్యాం సదావతు ।
ఓం హ్రీం సర్వపూజితాయై స్వాహా చోర్ధ్వం సదావతు ॥
హ్రీం పుస్తకావాసిన్యై స్వాహా - అధో మాం సదావతు ।
ఓం గ్రంథబీజస్వరూపాయై స్వాహా సర్వతోఽవతు ॥ (4 - 85)

భృగుమహర్షీ ! ఇది బ్రహ్మ మంత్రౌఘరూపం. బ్రహ్మరూపకం. ఈ సరస్వతీకవచానికే "విశ్వజయము" అని మరొక పేరు. ఒకప్పుడు గంధమాదన పర్వతంమీద సూర్యుడి ముఖతః నేనిది విన్నాను. ఇప్పుడు నీమీద ప్రేమతో ఉపదేశించాను. ఇది అత్యంత గోప్యం. ఎవరికిబడితేవారికి ఉపదేశించకూడదుసుమా!

దీన్ని ఉపదేశించిన గురువును శాస్త్రీయంగా వస్త్రాలంకార చందనాదులతో అర్చించి సాష్టాంగపడి లేచి కవచధారణ చెయ్యాలి. అయిదులక్షలు జపిస్తే ఈ కవచం సిద్ధిస్తుంది. సిద్ధకవచుడు బృహస్పతి సమానుడవుతాడు. మహావాగ్మి మహాకవి త్రైలోక్యవిజయి అవుతాడు. అతడికి అంతటా జయమే. కణ్వశాఖోక్తమైన కవచమిది. ఇంక స్తోత్రమూ పూజావిధానమూ ధ్యానమూ ఇత్యాదులున్నాయి. వాటినికూడా తెలుసుకోవడం మంచిది. చెబుతాను. ఆలకించు. *(అధ్యాయం - 4, శ్లోకాలు - 91)*

నారదా ! బ్రహ్మదేవుడు భృగుమహర్షికి ఇలా సరస్వతీకవచాన్ని మూలమంత్ర సహితంగా ఉపదేశించి స్తోత్రాన్ని అనుగ్రహించాడు. అదికూడా నీకు తెలియజేస్తాను. తెలుసుకో.



వాగ్దేవీస్తుతి సర్వకామప్రదం. ఒకప్పుడు యాజ్ఞవల్క్యుడు ఈ స్తుతి చేశాడు. శాపవిముక్తి పొందాడు. గురుశాపంవల్ల ఆ మహాముని అవిద్యుడు అయ్యాడు. (నేర్చిన విద్యలన్నీ మరిచిపోయాడు). దుఃఖార్తుడై సూర్యుడి దగ్గరికి వెళ్ళాడు. అతడిని స్తుతించాడు. తన గోడు వెళ్ళబోసుకుని విలపించాడు. సూర్యుడు అనుగ్రహించి వేదవేదాంగాలను చదివించాడు. వాగ్దేవిని స్తుతిస్తే పూర్వస్మృతి కలుగుతుందని సలహాచెప్పాడు. ఆమాటమీద యాజ్ఞవల్క్యుడు నదిలో స్నానం చేసి శుచియై భక్తితో శిరసువంచి సరస్వతిని స్తుతించాడు.

కృపాం కురు జగన్మాతః మామేవం హతతేజసమ్ ।
గురుశాపాత్ స్మృతిభ్రష్టం విద్యాహీనం చ దుఃఖితమ్ ॥ (5 - 6)

ఓ వాగ్దేవీ ! జగన్మాతా ! నన్ను దయజూడు. నా తెలివీ నా చదువూ గురుశాపంవల్ల నశించాయి. చదువులన్నీ మరుపున పడ్డాయి. ఇప్పుడు విద్యావిహీనుడిని అయ్యాను. నాకు జ్ఞానాన్ని ప్రసాదించు. స్మృతిని అనుగ్రహించు. విద్యనూ శక్తినీ కలిగించు. గ్రంథరచనాశక్తిని దయచెయ్యి. ఉత్తమశిష్యుడిని సమకూర్చు. ప్రతిభనూ సభాసత్కారాన్నీ అనుగ్రహించు. గురుశాపంవల్ల కోల్పోయిన విద్యలనన్నింటినీ తిరిగి వినూతనంగా ప్రసాదించు. కాలిపోయిన విత్తనాన్ని మొలకెత్తించే శక్తి దేవతలకు మాత్రమే ఉంటుందిట. నువ్వు బ్రహ్మస్వరూపవు. జ్యోతిస్స్వరూపవు. సనాతనివి. సర్వవిద్యాధిదేవివి. హే వాణి ! నమోనమః నన్ను మళ్ళీ మొలకెత్తించు. విసర్గ బిందు మాత్రలకు అధిష్ఠాత్రివి నువ్వు. నీతివి నువ్వు. వ్యాఖ్యారూపవు. వ్యాఖ్యాధిష్ఠాత్రివి. నీ దయలేనిదే ఎంతటి పండితుడైనా నోరుమెదపలేడు. కాలసంఖ్యా స్వరూపిణీ ! నమోనమః. భ్రమసిద్ధాంతరూపవు. స్మృతిశక్తి - జ్ఞానశక్తి - బుద్ధిశక్తి నువ్వే. ప్రతిభాకల్పనా శక్తులుకూడా నువ్వే.

స్మృతిశక్తి జ్ఞానశక్తి బుద్ధిశక్తి స్వరూపిణీ ।
ప్రతిభా కల్పనాశక్తిర్యా చ తస్యై నమోనమః ॥ (5 - 14)

ఒకప్పుడు సనత్కుమారుడు బ్రహ్మదేవుణ్ణి జ్ఞానోపదేశం చెయ్యమని అడిగాడు. అంతటి బ్రహ్మదేవుడూ సిద్ధాంతం చెయ్యలేక మూగవోయాడు. అప్పుడు అక్కడికి శ్రీకృష్ణపరమాత్మ వచ్చాడు. వాణిని స్తుతించమని బ్రహ్మకు సలహా చెప్పాడు. అతడు అలా స్తుతించి నీ అనుగ్రహంతో ఉత్తమోత్తమ సిద్ధాంతం చేసి సనత్కుమారుడికి జ్ఞానం ఉపదేశించాడు.

ఇలాగే ఒకప్పుడు వసుంధరాదేవి జ్ఞానోపదేశం చెయ్యమని అనంతుణ్ణి అభ్యర్థించింది. అతడు నోరు మెదపలేకపోయాడు. ఇదేమిటి విచిత్రమని బెంబేలుపడ్డాడు. అంతలోకీ కశ్యపుడు వచ్చి ధైర్య



చెప్పి సరస్వతిని ప్రార్థించమన్నాడు. అనంతుడు అలాగే స్తుతించాడు. సరస్వతీ ! నువ్వు కరుణించావు. అప్పుడు అతడు గొప్ప సిద్ధాంతాలు చేసి వసుంధరకు జ్ఞానభిక్ష పెట్టాడు. ఆమెకు మనస్సులో ఉన్న భ్రమప్రమాదాలను తొలగించాడు.

వ్యాసుడు ఒకనాడు పురాణసూత్రం తెలియజెప్పమని వాల్మీకిని అడిగాడు. ఆదికవి మౌనిగా మారి క్షణకాలం వాగ్దేవిని నిన్ను స్మరించాడు. నీ అనుగ్రహంతో వ్యాసుడికి జ్ఞానోపదేశం చేశాడు. భ్రమాంధకారాన్ని పారద్రోలే దీపంలాంటి నిర్మలజ్ఞానాన్నీ పురాణసూత్రాన్నీ వాల్మీకి వ్యాసుడికి తెలియజెప్పగలిగాడు. అటుపైని వ్యాసుడు పుష్కరక్షేత్రంలో నూరేళ్ళు సరస్వతీ మంత్రజపం చేసి నీ అనుగ్రహానికి పాత్రుడై వరం పొంది మహాకవీశ్వరుడయ్యాడు. వేదాలను విభజించగలిగాడు. మహాపురాణాలనూ ఉపపురాణాలనూ రచించగలిగాడు.

వాణీ ! తత్త్వజ్ఞానం ఉపదేశించమని ఇంద్రుడు శివుణ్ణి అడిగినప్పుడుకూడా శివుడు నిన్నే ధ్యానించాడు. ఉపదేశించగలిగాడు. అలాగే బృహస్పతి దగ్గరికి వెళ్ళి శబ్దశాస్త్రం బోధించమని ఇంద్రుడు అడిగినప్పుడు ఆ దేవగురువు వాఙ్మాతా ! నిన్నే తలుచుకున్నాడు. నీ అనుగ్రహంతోనే బోధించగలిగాడు. ఇంద్రుడితోపాటు మరికొందరు శిష్యులుకూడా అప్పుడు శబ్దశాస్త్రం నేర్చుకున్నారు. అప్పటి నుంచీ వారంతా వాగ్దేవిని నిన్నే ఉపాసిస్తూ ఆ శాస్త్రాన్ని ప్రబోధిస్తున్నారు.

పలుకులతల్లీ ! నీ గుణగణాలను కొనియాడటానికి సహస్రముఖ - పంచముఖ - చతుర్ముఖులే (ఆదిశేషుడు, శివుడు, బ్రహ్మ) చాలరంటే ఏకముఖుణ్ణి మానవమాత్రుణ్ణి నేను ఎలా స్తుతించగలను ?

**జడీభూతః సహస్రాస్యః పంచవక్త్ర శ్చతుర్ముఖః ।**
**యాం స్తోతుం కిమహం స్తౌమి తామేకాస్యేన మానవః ॥** **(5 - 28)**

యాజ్ఞవల్క్యుడు భక్తిభావనమ్రుడై శిరసువంచి సరస్వతీదేవిని ఇలా స్తుతించాడు. సాష్టాంగపడ్డాడు. దుఃఖభారంతో రోదించాడు. జ్యోతిస్స్వరూపిణి మహామాయ ఆ సరస్వతీదేవి కటాక్షించింది. "సుకవీంద్రుడవు కమ్ము" అని ఆశీర్వదించి వైకుంఠానికి వెళ్ళిపోయింది.

నారదా ! యాజ్ఞవల్క్యుడు చేసిన ఈ వాణీస్తోత్రాన్ని పఠించినవారు కవీంద్రులవుతారు. సంభాషణచతురులవుతారు. బృహస్పతి సమానులవుతారు. మూర్ఖుడుకానీ బుద్ధిహీనుడుకానీ ఒక సంవత్సరంపాటు ఈ స్తోత్రాన్ని పారాయణచేస్తే అతడు పండితుడవుతాడు. కవీంద్రుడవుతాడు. మేధావి అవుతాడు. ఇది ముమ్మాటికీ నిశ్చయం. ***(అధ్యాయం - 5, శ్లోకాలు - 33)***



నారదమహర్షీ! వైకుంఠంలో నారాయణుడి చేరికలో ఉంటున్న సరస్వతికి ఒకనాడు గంగాదేవితో కలహమయ్యింది. గంగ ఇచ్చిన శాపంవల్ల భారతదేశంలో సరస్వతీ కళ ఒక నదిగా అవతరించింది. పుణ్యరూప. పుణ్యతీర్థ స్వరూపిణి. పుణ్యాత్ములతో సేవలందుకొన్న తపోరూపిణి. తపఃఫలస్వరూపిణి. పాపాలు అనే ఎండుకట్టెలను తగులబెట్టడానికి జలరూపంలో ఉన్న జ్వాలదగ్ని స్వరూపిణి. సరస్వతీనదిలో మునిగి మరణించినవారికి వైకుంఠంలో స్థిరనివాసమే. ఎంతటి పాపాత్ముడైనా ఏ రోజునగానీ ఏ సమయానగానీ తెలిసిగానీ తెలియకగానీ విలాసంగాగానీ ఆ నదిలో స్నానం చేస్తే చాలు అతడి పాపాలు అన్నీ పటాపంచలై విష్ణులోకంలో హరిసన్నిధిలో నివాసం పొందుతాడు. హరితో సారూప్యం పొందుతాడు. సరస్వతీమంత్రాన్ని ఈ నదీతీరంలో ఒకనెలపాటు జపించినవాడు మహామూర్ఖుడైనా కవీంద్రుడవుతాడు. నిరంతరం ఈ నదిలో స్నానం చేసినవారికి మరింక పునర్జన్మ ఉండదు. గర్భవాసదుఃఖం ఉండదు.

నిత్యం సరస్వతీతోయే స్నాయాన్ముండయన్నరః ।
న గర్భవాసం కురుతే పునరేవ స మానవః ॥ (6 - 9)

నారదా ! నాకు తెలిసినంతమటుకు సరస్వతీగుణకీర్తన చేశాను. ఇంకా ఏమి తెలుసుకోవాలను కుంటున్నావో అడుగు - అని ముగించాడు నారాయణమహర్షి. అప్పుడు మళ్ళీ నారదుడు అడిగాడు.

### ◆ గంగా సరస్వతుల కలహం ◆

నారాయణమహర్షీ ! సరస్వతీదేవి గంగాశాపంవల్ల భారతదేశంలో నదిగా అవతరించింది అన్నావు. వారిద్దరికీ కలహమేమిటి ? ఎలా వచ్చింది ? తెలుసుకోవాలని కుతూహలంగా ఉంది. వేదసారాలైన కథల్ని వినడం ఎవరికైనా కుతూహలాన్ని కలిగిస్తుందిగదా ! కథామృతాస్వాదన ఎంత చేసినా నాకు తృప్తి కలగడం లేదు. ఇక చాలు అనిపించడం లేదు. శ్రేయస్సులవిషయంలో ఎవరైనా అసలు తృప్తిచెందుతారా ! అది అంతే. ఆ శాపవృత్తాంతం తెలియజెయ్యి - అని అభ్యర్థించాడు. నారాయణుడూ సరే అని ఆరంభించాడు.

బ్రహ్మకుమారా ! అతిపురాతనమూ అత్యంత పుణ్యప్రదమూ గంగా సరస్వతీ కలహగాథను వివరిస్తున్నాను. శ్రద్ధగా ఆలకించు. లక్ష్మి - సరస్వతి - గంగ ఈ ముగ్గురూ శ్రీమహావిష్ణువుకి ఇల్లాండ్రు. ముగ్గురినీ సమానంగా అతడు చూసుకుంటున్నాడు. ముగ్గురూ సమానంగా అతడిని ప్రేమించి సేవిస్తున్నారు.

లక్ష్మీః సరస్వతీ గంగా తిస్రో భార్యా హరేరపి ।
ప్రేమ్ణా సమాస్తాస్తిష్ఠంతి సతతం హరిసన్నిధౌ ॥ (6 - 17)



ఒకరోజున చల్లబాటువేళ గంగాదేవి విష్ణుమూర్తి ముఖంలోకి పదేపదే ఒయ్యారంగా సాకూతంగా క్రీగంటిచూపులు విసురుతోంది. ప్రభువు గమనించాడు. స్పందించాడు. తానూ చూపులు కలిపాడు.

వీరిద్దరి వ్యవహారాన్నీ లక్ష్మీ సరస్వతులు గమనించారు. లక్ష్మీదేవి మనకెందుకులే అని ఓరిమితో మిన్నకుంది. సరస్వతి అలా ఉండలేకపోయింది. అదేదో అవమానమని గుంజుకుంది. సత్త్వస్వరూపిణి లక్ష్మీదేవి చిరునవ్వులు చిందిస్తూ ఓదార్చింది. ఓరిమి వహించమని సర్ది చెప్పింది. అయినా సరస్వతి వినలేదు. ఊరుకోలేదు. కళ్లూ ముఖమూ ఎర్రబడ్డాయి. పెదవులు వొణికాయి. కోపంతో ఊగిపోయింది. నోరు చేసుకుంది.

మగడు ధర్మాత్ముడూ ఉత్తమోత్తముడూ అయితే భార్యలందరి పట్లా సమతాబుద్ధి ఉంటుంది. ఖలుడిది అంతా పక్షపాతబుద్ధి. తెలిసిందిలే. నాథా ! నీకు గంగాదేవిపట్ల సౌభాగ్యం అధికం. లక్ష్మీదేవి అన్నా నీకు ప్రేమ అధికమే. నేనంటేనే అలుసు. నీకు బొత్తిగా పనికిరానిదాన్ని నేనే. అందుకే లక్ష్మీదేవికి నీపట్ల విపరీతమైన ఓరిమి. ఎన్ని నాటకాలాడినా నువ్వు తనవాడివేనని ఆవిడ ధీమా. అందుకే నన్ను ఊరుకో ఊరుకో అని ఓదారుస్తోంది. ఎందుకులే ఈ ఓదార్పులూ అవసరం లేదు, నీ అవమానాలూ అవసరం లేదు. నా దౌర్భాగ్యం ఇలా ఉంటే ఎవరిని అని ఏమి ప్రయోజనం ! అనురాగంలో భర్తృవంచిత జీవితం విఫలం. నిన్ను అందరూ సత్త్వస్వరూపుడవని కీర్తిస్తుంటారు. వాళ్ళు ఎంత మూర్ఖులు ! ఎంత అజ్ఞానులు ! వాళ్ళకి శ్రుతీ తెలియదు, నీ మతీ తెలియదు - అంటూ దులిపేసింది.

ఇప్పుడు ఏమి మాట్లాడినా విపరీతార్థాలు వస్తాయనీ సరస్వతి మరింతగా రెచ్చిపోతుందనీ భావించిన శ్రీమన్నారాయణుడు మౌనంగా అక్కడినుంచి నిష్క్రమించాడు. అతడు వెళ్ళగా చూసి మరింత నిర్భయంగా సరస్వతీదేవి విజృంభించింది. కర్ణకఠోరంగా మాట్లాడింది.

**హే నిర్లజ్జే ! హే సకామే ! స్వామిగర్వం కరోషి కిమ్ ।**
**అధికం స్వామి సౌభాగ్యం విజ్ఞాపయితు మిచ్ఛసి ॥ (6 - 29)**

సిగ్గులేనిదానా ! కామం కళ్ళకెక్కినదానా ! మాకన్నా ఎక్కువగా భర్తను లొంగదీసుకున్నానని గర్వపడుతున్నట్టున్నావ్ ! విర్రవీగుతున్నట్టున్నావ్ ! అధిక సౌభాగ్యవతిని నేను అని పెద్ద ప్రదర్శన చేస్తున్నావా ? నీ గర్వాన్ని అణుస్తాను. నీ మగడు చూస్తుండగానే కొమ్ములు విరుస్తాను. ఏం చేస్తాడో చూస్తాను.



మానం చూర్ణం కరిష్యామి తవాద్య హరిసన్నిధౌ ।
కిం కరిష్యతి తే కాంతో మమైవం కాంతవల్లభే ॥ (6 - 30)

ఇలా నోరుపారేసుకుంటూ గబగబావచ్చి గంగాదేవిని జుట్టు పట్టుకోబోయింది. లక్ష్మీదేవి మధ్యలో నిలబడి గట్టిగా మందలించి వారించింది. సరస్వతికి అప్పుడు లక్ష్మీదేవిమీదకూడా కోపం వచ్చింది.

లక్ష్మీ ! ఇది దారుణం. కళ్ళ ఎదుట విపరీతం జరుగుతూంటే నోరుమెదపకపోగా నన్ను వారిస్తున్నావా ! ఒక చెట్టులాగా ఒక నదిలాగా అడ్డునిలుస్తున్నావా ? సరే - ఒక చెట్టువీ ఒక నదివీ అయిపో. ఇది నా శాపం - అనేసింది.

లక్ష్మీదేవికి కోపమూ దుఃఖమూ పొంగివచ్చాయి. అయినా నిభాయించుకుంది. ప్రతి శాపం ఇవ్వలేదు. తన చేతిలో ఉన్న సరస్వతి చెయ్యిని వదలనైనా వదలలేదు. మృదువుగా నొక్కుతూ అలాగే నిలబడింది.

శాపం శ్రుత్వా తు సా దేవీ న శశాప చుకోప హ ।
తత్రైవ దుఃఖితా తస్థౌ వాణీం ధృత్వా కరేణ చ ॥ (6 - 34)

ఎరుపెక్కిన కన్నులతో వొణుకుతున్న పెదవులతో దుఃఖిస్తూ నిలబడిన లక్ష్మీదేవి గంగాదేవి కన్నులకి మహోన్నతంగా కనపడింది. పద్మా ! సరస్వతిని వారించకు. విడిచిపెట్టు. రానీ. ఏమి చేస్తుందో చూద్దాం. చెయ్యనీ. పరమదుఃశ్శీల. అందరిమీదా నోరుపారేసుకోవడం ఆవిడ నైజం. వాగధిష్ఠాత్రికదా ! ఆవిడ ఇష్టం. ఏది పడితే అది ఎలా పడితే అలా మాట్లాడగలదు, కనక మాట్లాడుతుంది. కలహప్రియ. వాదవివాదాలు లేనిదే రోజు గడవదు. ఎవరికి తెలియదు ఈవిడ సంగతి ! యోగ్యత ఉన్నమేరకు శక్తి ఉన్న మేరకు వాదులాడనీ . తనబలాన్నీ నా బలాన్నీకూడా లోకానికి తెలియజెబుదామనుకుంటోందేమో. అలాగే చెయ్యనీ. మా ఇద్దరి ప్రభావాన్నీ ప్రతాపాన్నీ లోకం తెలుసుకుంటుంది. తెలుసుకోనీ. మంచిదే - అంటూ గంభీరంగా మాట్లాడుతున్న గంగాదేవి హఠాత్తుగా కోపావిష్టురాలై సరస్వతిని శపించింది.

సరిత్స్వరూపా భవతు సా యా త్వాం చ శశాప హ ।
అధో మర్త్యే సా ప్రయాతు సంతి యత్రైవ పాపినః ॥ (6 - 40)

సరస్వతీ ! లక్ష్మీదేవిని శపించావు కనక నువ్వు నదీరూపం పొంది భూలోకంలో పాపాత్ములమధ్యన ప్రవహించు. వారి అందరి పాపాలూ కలియుగంలో నువ్వే గ్రహించు - అనేసింది. సరస్వతికి ఇది అగ్నిలో ఆజ్యం పోసినట్టయ్యింది. వెంటనే తడుముకోకుండా ప్రతిశాపం ఇచ్చింది - నువ్వే భూలోకానికి పోతావ్. నదిగా ప్రవహిస్తావ్. పాపాలు గ్రహిస్తావ్ ! పాపాత్మురాలా ! - అనేసింది.



అంతలోకీ చతుర్భుజ నారాయణుడు మరో నలుగురు చతుర్భుజ పార్షదులతో లోపలికి చ్చాడు. వస్తూనే సరస్వతిని చేతుల్లోకి తీసుకున్నాడు. గుండెలకు హత్తుకున్నాడు. మెల్లగా పురాతనజ్ఞానాన్ని పదేశించాడు. కలహానికీ శాపానికీగల రహస్య కారణాన్ని వివరించాడు.

సరస్వతీం కరే ధృత్వా వాసయామాస వక్షసి ।
బోధయామాస సర్వజ్ఞః సర్వజ్ఞానం పురాతనమ్ ॥ (6 - 44)

లక్ష్మీ! నువ్వు భూలోకంలో ధర్మధ్వజుడి గృహంలో కళాంశరూపంతో అయోనిజగా అవతరించు. తడికి కూతురుగా ఉండు. అక్కడే నీకు దైవదోషంవల్ల వృక్షత్వం ప్రాప్తిస్తుంది. నా అంశతో అవతరించే ంఖచూడుడు అనే అసురుడికి భార్యవై అటుపైని కొంత కాలానికి మళ్ళీ నన్ను చేరుకుందువుగాని. లాగే తులసి పేరుతో పరమపావనమూర్తివై మరొక కళాంశరూపాన భారతదేశంలో అవతరించు. హే గంగే ! నువ్వు సరస్వతి శాపం కారణంగా భారతదేశంలో నదిగా అవతరించు. అది నీ అంశావతారం. పాపాత్ములను పవిత్రీకరించు. భగీరథుడు తపస్సు చేసి నిన్ను తనవెంట తీసుకువెడతాడు. అప్పటినుంచి భాగీరథి అనే పేరుతో విఖ్యాతి వహిస్తావు. నా అంశమైన సముద్రుడికి భార్యవవుతావు. అలాగే నా అంశతో అవతరించే శంతనుడికీ ఇల్లాలివవుతావు.

సరస్వతీ! గంగాశాపం వల్ల నువ్వుకూడా కళాంశగా భారతభూమిలో నదిగా అవతరించు. నవతులతో కలహాలను అనుభవించు. సత్యలోకంలో బ్రహ్మకు ఇల్లాలివై ఆనందించు.

గంగా ! నువ్వు ఈ వైకుంఠంలో పద్మగానూ, శివస్థానమైన కైలాసంలో గంగగానూ కీర్తింప బడతావు. క్రోధరహితవై శాంత సత్త్వస్వరూపిణివై మహాసాధ్వివై ధర్మచారిణివై సుశీలవై పరమపావనివై అందరి ప్రశంసలూ అందుకుంటావు. పూజలు అందుకుంటావు. మీరు ముగ్గురూ ఇలాగే ప్రతి విశ్వంలోనూ ప్రతి కల్పంలోనూ కీర్తింపబడతారు. స్తుతింపబడతారు. పూజింపబడతారు. మీరు మంగళప్రదలు. పనిలో పనిగా లోకంలో అందరికీ పనికివచ్చే ఒక ఉపదేశం చేస్తున్నాను, మీరు ఆలకించండి -

ఏ ఇంటిలో ఇల్లాలు మగరాయుడిలా ప్రవర్తిస్తుందో ఆ ఇంటిలో అన్నీ అశుభాలే. ఆ పురుషుడి జన్మ నిష్ఫలం. జగడాలమారి భార్యతో కాపురం చేసేకన్నా అడవులకు పోవడం ఉత్తమం. కడుపునిండా తినడానికీ తాగడానికీ పళ్ళూ నీళ్ళూ దొరుకుతాయి. మనశ్శాంతిగా బతకవచ్చు. గయ్యాళి భార్యతో వేగడంకన్నా నిప్పుల్లో దూకడం నయం. పులులూ సింహాలమధ్య బతకడం తేలిక. వ్యాధిజ్వాలకన్నా విషజ్వాలకన్నా దుష్టస్త్రీల ముఖజ్వాల మరణాంతకం. ఆ పురుషుడి బతుకు నవ్వులపాలవుతుంది. ఇహపరాలకు చెడతాడు. జీవన్మృతుడికింద లెక్క. ఒక పురుషుడికి ఒక ఇల్లాలు ఉండటం ఉత్తమోత్తమం.



ఆవిడ గుణవతి శీలవతి అయితే చాలు ఆ పురుషుడి జన్మ ధన్యమైనట్టే. అంతటి సుఖి మరొకడు ఉండడు. బహుభార్యలు ఉండటం ఎంతటివాడికైనా నరకమే. అది ధర్మవిరుద్ధమూ వేదవిరుద్ధమూ కూడా. అందులోనూ సవతులు ఒకేచోట ఉండటం మరింత నరకం. నేనే ఉదాహరణ. అందుచేత గంగా ! నువ్వు శివస్థానానికి వెళ్ళు. సరస్వతీ ! నువ్వు బ్రహ్మస్థానానికి వెళ్ళు. లక్ష్మీదేవి ఒక్కతే ఇక్కడ ఉంటుంది. అందరికీ సుఖంగా ఉండేందుకు ఈ ఏర్పాటు చేస్తున్నాను. ***(అధ్యాయం - 6, శ్లోకాలు - 68)***

ఏకభార్యస్సుఖీ - నైవ బహుభార్యః కదాచన ।
గచ్ఛ గంగే శివస్థానం బ్రహ్మస్థానం సరస్వతీ ॥
సుసాధ్వా యస్య పత్నీ చ సుశీలా చ పతివ్రతా ।
ఇహ స్వర్గే సుఖం తస్య ధర్మో మోక్షః పరత్ర చ ॥
పతివ్రతా యస్య పత్నీ స చ ముక్తః శుచిస్సుఖీ ।
జీవన్మృతోఽశుచిర్దుఃఖీ దుశ్శీలాపతిరేవ చ ॥ (6 - 68)

శ్రీహరి మాటలు విని ముగ్గురూ పశ్చాత్తాపంతో కుమిలిపోయారు. ఒకరినొకరు కౌగిలించుకుని విలపించారు. శాపాలూ భూలోకనివాసమూ నదీరూపాలూ తలుచుకుని గజగజలాడిపోయారు. క్రమంగా తేరుకుని జగన్నాథుణ్ణి బతిమిలాడుకున్నారు. ముందుగా సరస్వతీదేవి నోరు విప్పింది.

నాథా ! నాకు శాపవిమోచనం అనుగ్రహించు. నిన్ను విడిచిపెట్టి నేను వెళ్ళలేను. నీలాంటి ఉన్నతులే శాపాన్ని మళ్ళించడానికి సమర్థులు. నువ్వు కాదంటే నిప్పుల్లో దూకి ప్రాణాలు వదులుతాను - అంది.

వెంటనే గంగాదేవి అందుకుంది. జగన్నాథా ! నేను ఏమి తప్పు చేశానని నన్ను వదిలిపెడుతున్నావు ? నేనూ ప్రాణత్యాగం చేస్తాను. నిర్దోషను సంహరించిన పాపం కట్టుకుందువుగాని. ఏ తప్పూ చెయ్యని ఇల్లాలిని వెళ్ళగొట్టిన పురుషుడు సర్వేశ్వరుడైనా సరే నరకానికి పోతాడు.

నిర్దోషకామినీత్యాగం కరోతి యో నరో భువి ।
స యాతి నరకం ఘోరం కింతు సర్వేశ్వరోఽపి వా ॥ (7 - 6)

అటుపైని లక్ష్మీదేవి ప్రసంగించింది. హృదయేశ్వరా ! నువ్వు సత్త్వస్వరూపుడివి. నీకు కోపమా? చాలా ఆశ్చర్యంగా ఉందే ! దయచేసి ప్రసన్నుడివికా. ఈ ఇద్దరిపట్లా దయచూపించు. చాలు. మంచి మగడికి ఓర్పేకదా గొప్పగుణం.



నాథ ! సత్త్వస్వరూపస్త్వం కోపః కథమహో తవ ।
ప్రసాదం కురు భార్యే ద్వే సదీశస్య క్షమా వరా ॥ (7 - 7)

భారతీశాపంవల్లా నీ నిర్ణయంవల్లా నేను భారతదేశంలో అవతరించబోతున్నాను. సరే. అవతరిస్తాను. అయితే ఎంతకాలం ఉండాలి అక్కడ నేను. మళ్ళీ నీ సన్నిధిని నేను ఎప్పటికి నోచుకుంటాను. నదీరూపం ధరించానంటే మహాపాపులు అందరూ వచ్చి మునకలు వేస్తుంటారు. వారి పాపమంతా నాకు చుట్టుకుంటుంది. మరి ఆ మహాపాపాలనుంచి నాకు విముక్తి ఎలాగ ? నీ సన్నిధికి తిరిగి చేరుకోవ డమెలాగ ? అలాగే ధర్మధ్వజుడి ఇంట కూతురిగా తులసీరూపాన్ని ధరించమన్నావు. ధరిస్తాను. ఆ జన్మనూ అనుభవిస్తాను. అచ్యుతా ! మళ్ళీ నీ పాదపద్మాల చెంతకు చేరుకునేదెప్పుడు ?

కళయా తులసీరూపం ధర్మధ్వజసుతా సతీ ।
భుక్త్వా కదా లభిష్యామి త్వత్పాదాంబుజమచ్యుత ॥ (7 - 10)

ప్రభూ ! నువ్వు అధిష్ఠానదేవతగా తులసీ వృక్షరూపాన్ని ధరిస్తాను. ఎప్పుడు నన్ను ఉద్ధరిస్తావో దయచేసి ఆ ఒక్కముక్కా చెప్పు. నువ్వు కృపానిధివి. కనక నాకూ గంగా సరస్వతులకూ శాపవిమోచనం ఎప్పుడో నీ సన్నిధికి తిరిగి రావడం ఎప్పుడో చెప్పి మమ్మల్ని అనుగ్రహించు. సరస్వతిని బ్రహ్మ సదనానికీ గంగను శివమందిరానికీ పొమ్మన్నావు. ఈ ఒక్కమాటనూ ఉపసంహరించుకో - అంటూ లక్ష్మీదేవి శ్రీహరి పాదాలమీద పడి ఓలుఓలున విలపించింది. తన జడతో పాదాలను చుట్టి పట్టుకుంది.

భక్తానుగ్రహకాతరుడైన అచ్యుతుడు ప్రసన్నుడయ్యాడు. మందహాససుందరవదనారవిందుడై లక్ష్మీదేవిని బుజాలుపట్టి పైకి ఎత్తి గుచ్చి కౌగిలించుకున్నాడు. మృదువుగా బదులు పలికాడు.

సురేశ్వరీ ! నా హృదయేశ్వరీ ! నీ అభ్యర్థనను మన్నిస్తున్నాను. నా మాటకూ నీ కోరికకూ ఒక సమత కూరుస్తున్నాను. సరస్వతీదేవి కేవలం కళాంశరూపంతో భారతదేశాన నదిగా అవతరిస్తుంది. అర్ధభాగంతో బ్రహ్మ సదనంలో నివసిస్తుంది. స్వయంగా ఇక్కడే మన ఇంటిలోనే ఉంటుంది. అలాగే గంగాదేవి భగీరథుడివెంట కళాంశరూపంతో నదిగా భారతదేశానికి వెడుతుంది. ముల్లోకాలనూ పవిత్రీకరించడానికి స్వయంగా తానూ ఇక్కడే ఉంటుంది. భూలోకానికి వెళ్ళే దారిలోనే కైలాసంలో అన్యదుర్లభమైన శివుడి జటాజూటాన్ని అలంకరిస్తుంది. నువ్వుకూడా ఇలాగే కళాంశాంశరూపంలో పద్మావతీనదిగా తులసీవృక్షంగా భారతభూభాగంలో అవతరిస్తావు. కలియుగంలో అయిదువేల సంవత్సరాలు గడిచాక మీరు ముగ్గురూ తిరిగి పరిపూర్ణ రూపాలతో నా ఈ వైకుంఠానికి చేరుకుంటారు. చింతించకండి. సంపదలు వచ్చినప్పుడే ఆపదలూ వస్తాయి. నిజానికి సంపదలకు ఆపదలే హేతువులు. ఆపదలు వచ్చినప్పుడే కదా ఎవరి మహిమ అయినా బయటపడేది.



సంపదో హేతుభూతా చ విపత్తిస్సర్వదేహినామ్ ।
వినా విపత్తేర్మహిమా కేషాం పద్మభవే భవేత్ ॥ (7 - 22)

అంచేత మీ మహిమలు లోకానికి తెలియడంకోసమే ఈ ఆపదలు వచ్చాయనుకోండి. నారాయణ మంత్రోపాసకులైన సజ్జనుల దర్శన స్పర్శన స్నానావగాహనలతో మీరు పాపవిముక్తలు అవుతారు. ఎందరు పాపాత్ములు మీలో స్నానాలు చేసినా ఒక సజ్జనుడు స్నానమాడితే చాలు ఆ కిల్బిషాలన్నీ పటాపంచలయిపోతాయి. మీ పవిత్రత మీకు మిగులుతుంది. నా భక్తుల దర్శన స్పర్శనాలతో మీరే కాదు భూలోకంలో ఉన్న అసంఖ్యాక నదీతీర్థాలన్నీ పరిపూతాలు అవుతున్నాయి.

మన్మంత్రోపాసకానాం చ సతాం స్నానావగాహనాత్ ।
యుష్మాకం మోక్షణం పాపాత్ దర్శనాత్స్పర్శనాత్తథా ॥
పృథివ్యాం యాని తీర్థాని సంత్యసంఖ్యాని సుందరి ।
భవిష్యంతి చ పూతాని మద్భక్తస్పర్శదర్శనాత్ ॥ (7 - 24)

అసలు నా భక్తులు భారతదేశంలో సంచరించేదే ఇందుకోసం. భూమినీ నదులనూ పవిత్రీక రించడానికే. వారు ఎక్కడ కాళ్ళు కడిగితే అక్కడ అదొక మహాతీర్థమవుతుంది. పంచమహాపాతకాలు చేసినవాడైనా సరే (స్త్రీ హత్య - గో హత్య - బ్రాహ్మణ హత్య - కృతఘ్నత - గురుపత్నీ సంభోగం - ఇవి పంచమహాపాతకాలు) నా భక్తులను దర్శించినా స్పృశించినా పవిత్రుడై జీవన్ముక్తుడవుతాడు. మిగతా పాపులను గురించి చెప్పాలా ! అందుచేత లక్ష్మీదేవీ ! నదీరూపాలు ధరిస్తున్నామనీ పాపాత్ములు వచ్చి మునుగుతారనీ భయపడకండి. నా భక్తుల దర్శన స్పర్శనాలు మిమ్మల్ని పావనం చేస్తాయి - అని శ్రీహరి ఊరడించాడు.

ఈ మాటలకు లక్ష్మీదేవి కలతదేరింది. అయితే నాథా ! హరిభక్తుల లక్షణాలూ గుణగణాలూ చెప్పు. ఎవరు నిజమైన హరిభక్తులో ఎవరు కాదో గుర్తించడం మాకూ ప్రజలకూ సులువవుతుంది - అని అడిగింది. శ్రీహరి ఆరంభించాడు.

లక్ష్మీ ! హరిభక్తుల లక్షణం అతి నిగూఢమైనది. వేధపురాణాలలో నిక్షిప్తమై ఉంది. అది తెలుసుకోవడమే పుణ్యప్రదం. మీకు చెబుతాను. విని మనస్సులో దాచుకోండి. ఖలులకు చెప్పకండి. నువ్వు నాకు ప్రాణతుల్యవు. పవిత్రురాలివి. కనక చెబుతున్నాను విను. గురువు ముఖంనుంచి విష్ణుమంత్రం చెవిలో పడగానే మానవుడు పవిత్రుడవుతున్నాడు, సర్వోత్తముడు అవుతున్నాడు అని వేదాలు చెబుతున్నాయి. అటువంటి పురుషుడి వంశంలో నూరు తరాలు తక్షణం విముక్తి పొందుతాయి. ఏ రూపంలో పుట్టినవారైనా పరిపూతులు అవుతారు. నా భక్తుడు నా గుణాలను పొంది కడపటికి



ముక్తుడవుతాడు. నా గుణాలను ఉపాసిస్తూ నా కథలను ఆలకిస్తూ విన్నంతమాత్రాననే పులకితగాత్రుడై ఆనందపరవశుడై బాష్పవారి పరిపూర్ణలోచనుడై గద్గదకంఠుడై మైమరిచిపోతాడు. నా భక్తుడు నన్ను సేవించడంకన్నా సుఖాన్నిగానీ ముక్తినిగానీ సాలోక్యాది చతుష్టయాన్నిగానీ బ్రహ్మత్వామరత్వాలనుగానీ ఏమీ కోరుకోడు. ఇంద్రత్వ బ్రహ్మత్వ మనుత్వాలూ స్వర్గరాజ్యాలూ అతడికి తృణపాయాలు. నన్ను సేవించడమే కోరుకుంటాడు తప్ప వీటిని కలలోకూడా వాంఛించడు. ఇటువంటి నా భక్తులు భారతదేశంలో సంచరిస్తున్నారు. శ్రావ్యంగా నా గుణగణాలను గానంచేస్తూ ఆనందంగా జీవయాత్ర సాగిస్తున్నారు. మెట్టిన ప్రతిచోటునీ పావనంచేస్తూ మహీమండలాన్ని ఒక తీర్థంగా నా ఆలయంగా మారుస్తున్నారు.

***(అధ్యాయం - 7, శ్లోకాలు - 55)***

నారదా ! శ్రీహరి ఇలా వివరించి చెప్పేసరికి గంగా లక్ష్మీ సరస్వతులు కుదుటపడ్డారు. ముందుగా భారతీదేవి కళాంశరూపంతో భూభాగానికి వచ్చింది. నదిగా అవతరించి నేలలో ఇంకిపోయింది. వాపీకూపతటాకాలన్నింటా తన అంశంతో ప్రకాశించింది. అందుకనే సరస్వతి (సరస్సు) అయ్యింది. శ్రీహరి సరస్వతుడు అయ్యాడు. మరొక కళాంశరూపంతో సత్యలోకానికి వెళ్ళి బ్రహ్మదేవుడికి ప్రియురాలు అయ్యింది. బ్రాహ్మి అనే పేరు పొందింది. వాగధిష్ఠానదేవతయై వాణిగా కీర్తింపబడింది. స్వయంగా తాను విష్ణుసన్నిధిలోనే మిగిలింది.

అటుపైని భగీరథుని వెంట గంగానది కళాంశరూపంతో భారతభూమికి అవతరించింది. అలా అవతరిస్తున్న సమయంలోనే ఆ వేగాన్ని భరించలేనని భూదేవి ప్రార్థిస్తే శివుడు తన జటాభారాన్ని విస్తరించి బంధించాడు. శిరసా ధరించాడు. పాయగా విడిచిపెట్టాడు. ఇలా గంగాకళాంశకు శివస్థానం లభించింది. స్వయంగా తానూ విష్ణు సన్నిధిలోనే మిగిలింది.

లక్ష్మీదేవి (పద్మ) ఒక కళాంశరూపంతో పద్మావతీనదిగా భారత భూమికి దిగింది. స్వయంగా హరిసన్నిధిలోనే నిలిచింది. మరొక కళాంశరూపంతో ధర్మధ్వజుడి కూతురుగా జన్మించింది. తులసీ నామధేయంతో విఖ్యాతి వహించింది. మొదట సరస్వతి శాపంవల్లా తరవాత హరిశాపంవల్లా వృక్షరూపాన్ని పొందింది. కలియుగంలో అయిదువేల సంవత్సరాలు ఇలా వీరు ముగ్గురూ ఈ నదీరూపాలతో ఉండి తిరిగి విష్ణులోకానికి వెళ్ళిపోతారు. కాశీ బృందావనాలు తప్ప తక్కిన సకల తీర్థాలూ పుణ్యక్షేత్రాలూ వారితోపాటు వైకుంఠానికి వెళ్ళిపోతాయి. ఇది హరి ఆజ్ఞ.

**యాని సర్వాణి తీర్థాని కాశీం బృందావనం వినా ।**
**యాస్యంతి సార్థం తాభిశ్చ వైకుంఠమాజ్ఞయా హరేః ॥** (8 - 11)



## ◆ కలియుగం లక్షణాలు ◆

సాలగ్రామాలూ శివశక్తులూ జగన్నాథుడూ కలియుగంలో పదివేల సంవత్సరాల తరవాత భారతభూమిని విడిచిపెట్టి స్వస్థలం చేరుకుంటారు. సాధువులు పురాణాలు శంఖాలు శ్రాద్ధతర్పణాలు వేదోక్తకర్మలు దేవపూజలు దేవనామధేయాలు గుణకీర్తనలు వేదాంగాలు సకలశాస్త్రాలు సత్యధర్మాలు వేదాలు గ్రామదేవతలు వ్రతాలు తపస్సులు ఉపవాసాలు - ఇత్యాదులన్నీ వారితోపాటే తరలివెళ్ళిపోతాయి. అటుపైని భూగోళంనిండా వామాచారులు మిగులుతారు. కపటులూ మిథ్యావాదులూ మిగులుతారు. తులసి కలికానికైనా కనిపించదు. ఏ పూజలూ ఉండవు - పొట్టపూజ తప్ప. అందరూ శఠులూ క్రూరులూ దాంభికులూ అహంకారులూ చోరులూ హింసకులూ అయిపోతారు. స్త్రీ పురుష భేదం తప్ప తక్కిన వావివరసలు అంతరిస్తాయి. నిర్భయంగా జరిగే వివాహాలు ఉండవు. వస్తువులకు భద్రత ఉండదు. ఎక్కడ చూసినా ఇంటింటా ఆడపెత్తనమే సాగుతుంది. తర్జనభర్జనలతో భార్యలు భర్తలను కొడుతూ ఉంటారు.

> సర్వే స్త్రీవశగాః పుంసః పుంశ్చల్యశ్చ గృహే గృహే ।
> తర్జనైః భర్త్సనైః శశ్వత్ స్వామినం తాడయంతి చ ॥
> గృహేశ్వరీ చ గృహిణీ గృహీ భృత్యాధికోఽధమః ।
> చేటీదాససమౌ వధ్వాః శ్వశ్రూశ్చ శ్వశురస్తథా ॥ (8 - 20)

ఇల్లాలే ఇంటికి అధిపతి. మొగడు సేవకుడికన్నా అధముడు. అత్తమామలు దాసీదాససమానులు. ఇళ్ళల్లో రక్తసంబంధులే తప్ప విద్యాసంబంధులు ఎవ్వరూ కనపడరు. విద్యా సంబంధులతో మాటలే ఉండవు. మనుషులంతా అపరిచితుల్లాగా మెలుగుతుంటారు. ఆడవాళ్ళ ఆజ్ఞలేనిదే ఎవ్వరూ ఏ పనీ చెయ్యలేని దుర్బలులైపోతారు.

> యథాఽపరిచితా లోకా స్తథా పుంసశ్చ బాంధవాః ।
> సర్వకర్మాక్షమాః పుంసో యోషితామాజ్ఞయా వినా ॥ (8 - 22)

కలియుగంలో వర్ణాశ్రమధర్మాలు అన్నీ అంతరిస్తాయి. సంధ్యావందన యజ్ఞ సూత్రాది కర్మలు కనిపించవు. చతుర్వర్ణాలవారూ మ్లేచ్ఛాచారులైపోతారు. మ్లేచ్ఛ విద్యలే నేర్చుకుంటారు. మ్లేచ్ఛ శాస్త్రాలే పఠిస్తారు. అగ్రవర్ణాలవారు అట్టడుగువారికి సేవకులు అవుతారు. ప్రజలందరూ సత్యహీనులవుతారు. మేదినీ మండలంలో సత్యానికి తావే ఉండదు. తరువులు ఫలహీనాలవుతాయి. తరుణులు సంతానహీనలు



అవుతారు. గోవులు క్షీరహీనమవుతాయి. క్షీరంలో వెన్న ఉండదు. దంపతులు ప్రీతిహీనులవుతారు. గృహస్థులు సత్యహీనులవుతారు. రాజులు ప్రతాపహీనులవుతారు. ప్రజలు కరపీడితులు (పన్నుల బెడద) అవుతారు. నదీనద వాపీకూపతటాకాదులు జలహీనాలు అవుతాయి. చతుర్వర్ణాలవారూ ధర్మహీనులూ పుణ్యహీనులూ అవుతారు. కోటికొక్కడైనా పుణ్యాత్ముడు కనిపించడు. బాలబాలికలు కుత్సిత వికృతాకారులవుతారు. అంతటా కుత్సిత కువార్తలే వినిపిస్తాయి.

కొన్ని నగరాలూ గ్రామాలూ నరశూన్యాలైపోతాయి. భయానకంగా మారిపోతాయి. కొన్నిచోట్ల ఒక కుటీరంలో ఒక మనిషి మిగులుతాడు. నగరాలలో గ్రామాలలో అరణ్యాలు పెరుగుతాయి. అరణ్యవాసులు కూడా కరపీడితులు (పన్నుల బెడద) అవుతారు. తటాక నదీతీరాలలో మాత్రమే పంటలు పండుతాయి. ఉన్నత వంశాలవారు నీచపడతారు. అసత్యవాదులూ ధూర్తులూ అవుతారు. సారవంతమైన భూములు నిస్సారమైపోతాయి. పంటలు పండవు. నీచులు ధనవంతులవుతారు. దైవభక్తులు నాస్తికులవుతారు. పౌరులు దయావిహీనులూ హింసకులూ నరఘాతకులూ అవుతారు. సాలప్రాంశులు కనిపించరు. స్త్రీ పురుషులందరూ వామనులూ వ్యాధి పీడితులుగానే ఉంటారు. అల్పాయుష్కులూ గదాపీడితులూ (గదా = అనేక రోగం). యౌవనమే కనిపించదు. ఇరవై ఏళ్ళకే వృద్ధులైపోతారు. ఎనిమిదేళ్ళకే యువతులు రజస్వలలై గర్భిణులవుతారు. సంవత్సరానికి ప్రసవించి పదహారేళ్ళకే ముసలమ్మలవుతారు. పతివ్రతలు అరుదుగా కనిపిస్తారు. ఎక్కువమంది గొడ్రాళ్ళుగానే మిగిలిపోతారు. చతుర్వర్ణాలవారూ నిస్సంకోచంగా కన్యావిక్రయం చేస్తారు. కుటుంబంలో మగవారు జారులపై ఆధారపడి జీవనం సాగిస్తారు. వారు అందించే సొమ్ముతో పొట్టపోసుకుంటారు. కలియుగంలో ఇంకా దారుణమేమంటే - శ్రీహరి నామంకూడా ఒక వ్యాపారవస్తువు అవుతుంది. (హరేర్నామ్నాం విక్రయిణో భవిష్యంతి కలౌయుగే).

ధనవంతులు కీర్తికోసమనీ ప్రచారంకోసమనీ దానాలు చేస్తారు. అటు తరువాత తామిచ్చిన దానాలను తామే ఆక్రమించుకుంటారు. దాన నియమాలను ఉల్లంఘిస్తారు. దేవవృత్తి బ్రహ్మవృత్తి గురువృత్తి (కులవృత్తి) - అన్ని భూములనూ ఆక్రమించుకోవడమే. స్వదత్తమా పరదత్తమా అనే విచక్షణ కూడా ఉండదు.

స్వయముత్సృజ్య దానం చ కీర్తి వర్ధనహేతవే ।
తతః పశ్చాత్స్వదానం చ స్వయముల్లంఘయిష్యతి ॥
దేవవృత్తిం బ్రహ్మవృత్తిం వృత్తిం గురుకులస్య చ ।
స్వదత్తాం పరదత్తాం వా సర్వముల్లంఘయిష్యతి ॥ (8 - 42)



అత్తగారు వదినగారు సవతితల్లి మరదలు రక్త సంబంధీకురాలు - ఇలాంటి వావివరసలు అంతరిస్తాయి. తల్లిని తప్పించి అందరితోనూ అక్రమ సంబంధాలు పెచ్చరిల్లుతాయి. ఎవరు ఎవరికి ఇల్లాలో నిర్ణయించడం కష్టమవుతుంది

అగమ్యా గమనం చైవ కరిష్యంతి గృహే గృహే ।
మాతృయోనిం పరిత్యజ్య విహరిష్యంతి సర్వత: ॥
పత్నీనాం నిర్ణయో నాస్తి భ్రాతౄణాం చ కలౌ యుగే । (8 - 45)

నారదా ! కలియుగంలో లాక్షాలోహ రసాలతోనే కాదు ఉప్పుతోకూడా వ్యాపారం చేస్తారు. విప్రులు వృషవాహకులూ అన్యశవదాహకులూ అవుతారు. చెయ్యకూడనిచోట భోజనాలు చేయడం పరస్త్రీలతో సంగమించడంలాంటి దోషాలకు వెనుకాడరు. పంచయజ్ఞాలు అంతరిస్తాయి. యజ్ఞోపవీతాలు ఉండవు. సంధ్యాశౌచాలు వదిలేస్తారు. డబ్బుల్ని వడ్డీకి తిప్పే వనితలూ, తార్పుడు గత్తెలూ, జారిణులూ, ముట్టుతలూ విప్రుల ఇళ్ళల్లో వంటగత్తెలవుతారు.

పుంశ్చలీ వార్ధుషాజీవా కుట్టనీ చ రజస్వలా ।
విప్రాణాం రంధనాగారే భవిష్యతి చ పాచికా ॥ (8 - 51)

సారాంశంగా ఒక్కమాట చెబుతాను - కలియుగంలో ఆహార నియమంకానీ, విహార నియమంకానీ ఆశ్రమ నియమంకానీ ఏమీ ఉండదు. సమస్తమూ మ్లేచ్ఛమయమైపోతుంది. హస్తప్రమాణ వృక్షాలూ అంగుష్ఠప్రమాణ మానవులూ తయారవుతారు. (హస్తప్రమాణే వృక్షే చ అంగుష్ఠే చైవ మానవే) ఈ స్థితి వచ్చేసరికి విష్ణుయశస్కుడు అనే విప్రుడికి పుత్రుడుగా కల్కి నామధేయంతో నారాయణుడు కళాంశగా అవతరిస్తాడు. మహాబలిష్ఠుడై సుదీర్ఘ కరవాలంతో ఎత్తయిన గుర్రంమీద భూగోళమంతటా వీరవిహారం చేస్తూ మ్లేచ్ఛుల్ని సంహరిస్తాడు. మూడు రాత్రులలో పృథివిని మ్లేచ్ఛశూన్యం చేస్తాడు. వెంటనే అంతర్ధానం చెందుతాడు.

విప్రస్య విష్ణుయశస: పుత్ర: కల్కిర్భవిష్యతి ।
నారాయణకళాంశశ్చ భగవాన్ బలినాం వర: ॥
దీర్ఘేణ కరవాలేన దీర్ఘఘోటకవాహన: ।
మ్లేచ్ఛశూన్యాం చ పృథివీం త్రిరాత్రేణ కరిష్యతి ॥ (8 - 55)



## ◆ పునస్సృష్టి ◆

అప్పుడు జగత్తు అంతా అరాచకమవుతుంది. అరు రేయింబవళ్ళు కుండపోతగా స్థూలధారలతో ర్షం కురుస్తుంది. భూగోళం జలమయమైపోతుంది. వృక్షాలుకానీ గృహాలుకానీ దేశాలుగానీ ఏమీ ఉండవు. అటుపైని ద్వాదశాదిత్యులు ఉదయిస్తారు. నీరంతా ఆవిరైపోతుంది. నేల ఎండుతుంది. కృతయుగం ప్రారంభమవుతుంది. సత్త్వగుణ సంపన్నుడూ తపోనిరతుడూ ధర్ముడు అవతరిస్తాడు. ధర్మ నిరతులూ వేదవేత్తలూ మహర్షులు ఆవిర్భవిస్తారు. ఇంటింటా పతివ్రతలు వెలుస్తారు. రాజులు మనస్వులై తేజస్వులై ధర్మిష్ఠులై పుణ్యకర్మరతులై జనరంజకంగా పరిపాలన సాగిస్తారు. వైశ్యాది జాతులవారంతా పెద్దలను గౌరవిస్తూ తమ తమ వృత్తులలో ధార్మికులై ప్రజాసేవ చేస్తారు. చతుర్వర్ణాలవారూ దేవీభక్తి పరాయణులవుతారు. అందరూ దేవీమంత్ర జప పరాయణులూ ధ్యానపరాయణులూ అవుతారు. శ్రుతి స్మృతి పురాణజ్ఞులై తదనుగుణంగా జీవయాత్ర సాగిస్తారు. కృతయుగంలో ధర్మం నాలుగు పాదాలా నడుస్తుంది. అధర్మం కలికానికైనా కనిపించదు. సత్సంతానంకోసం ఋతుకాల సంపర్కాలే తప్ప దంపతులమధ్య విపరీత కామోపభోగాలు ఉండవు. త్రేతాయుగంలో మూడు పాదాలు, ద్వాపరంలో రెండు పాదాలు, కలియుగారంభంలో ఒక పాదమూగా నడిచిన ధర్మం చిట్టచివరికి పూర్తిగా లోపిస్తుంది. కృతయుగంలో పునరుజ్జీవించి నాలుగుపాదాలా నడుస్తుంది.

ధర్మస్త్రిపాచ్చ త్రేతాయాం ద్విపాచ్చ ద్వాపరే తతః ।
కలౌ వృత్తే చైకపాచ్చ సర్వలుప్తస్తతః పరమ్ ॥ (8 - 65)

నారదా ! కృతయుగంలో కాలవిభజన స్పష్టంగా ఉంటుంది. నాలుగు జాములకాలం (మూడు గంటలు = జాము) ఒక పగలు. అలాగే ఒక రాత్రి. రేయీ పగలూ కలిసి ఒక వాసరం (రోజు). ఏడు రోజులు ఒకవారం. పదహారు తిథులు ఉంటాయి. పదిహేను రోజులు ఒకపక్షం. రెండు పక్షాలు కలిసి ఒక మాసం. అంటే ముప్పయి రోజులు. రెండు నెలలు ఒక ఋతువు. ఆరు నెలలు ఒక అయనం. పన్నెండు నెలలు (రెండు అయనాలు) ఒక సంవత్సరం. ఈ సంవత్సరాలు అయిదు విధాలు.

మానవులకు ఒక సంవత్సరమైతే దేవతలకు అది ఒక పగలూ రేయీని. అంటే ఒకరోజు. ఇది దేవమానం. మానవులకు మూడువందల అరవై యుగాలు గడిస్తే దేవతలకు అది ఒక యుగమవుతుంది దేవతలకు డెబ్భయ్యొక్క (71) యుగాలు ఒక మన్వంతరం. ఇంద్రుడి వయస్సు ఒక మన్వతరం. ఇర్వై యెనిమిదిమంది ఇంద్రులు గడిస్తే అది బ్రహ్మదేవుడికి ఒక అహోరాత్రం. అటువంటి రోజులతో నూటెన్మిది సంవత్సరాలు బ్రహ్మదేవుడి ఆయుర్దాయం. అది నిండితే ప్రాకృతప్రళయం సంభవిస్తుంది. అంత జలమయమైపోతుంది. భూగోళం కనిపించదు. బ్రహ్మ విష్ణు శివాదులు ఉండరు. ఇలాంటి ప్రాకృతి



ప్రళయం జరిగేవరకూ ఉన్న కాలమంతా కలిపి శ్రీదేవికి ఒక్క నిమేషమాత్రంగా లెక్క. మహాదేవి కాలప్రమాణం అంతటిది. బ్రహ్మాయుష్షు శ్రీమాతకు నిమేషమాత్రం.

లయే ప్రాకృతికే జాతే యాతే చ బ్రహ్మణో మునే ।
నిమేషమాత్రం కాలశ్చ శ్రీదేవ్యాః ప్రోచ్యతే మునే ॥ (8 - 74)

నారదా ! అమ్మవారికి రెప్పపాటు కాలంలో బ్రహ్మాండాలు సృష్టింపబడుతున్నాయి, నశిస్తున్నాయి, మళ్ళీ సృష్టింపబడుతున్నాయి. ఇలా ఇప్పటికి ఎన్ని సృష్టిలయాలు అయ్యాయో, ఎన్ని కల్పాలు వెళ్ళాయో వచ్చాయో, ఎందరు బ్రహ్మలు అవతరించారో అంతరించారో, ఎన్ని బ్రహ్మాండాలు ఏర్పడ్డాయో నశించాయో లెక్క తేల్చి చెప్పడం మానవమాత్రుడికి అయ్యే పనేనా !? అలా చెప్పగలిగినవాడు ఒక్కడే ఒక్కడు - అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడు. సర్వేశ్వరుడు. సచ్చిదానంద రూపధారి. బ్రహ్మాదిదేవతలంతా అతడి అంశావతారాలు. మహా విరాట్ స్వరూపంకూడా అతడి అంశమే. అందులో ఒక అంశం విరాట్ స్వరూపం. అదే (పరా) ప్రకృతి. ఆ ప్రకృతినుంచే అర్ధనారీశ్వరుడు ఆవిర్భవిస్తున్నాడు. అతడే కృష్ణుడు. ద్విభుజ - చతుర్భుజ రూపాలతో ద్విధాభూతుడవుతున్నాడు. చతుర్భుజుడు వైకుంఠంలో ఉంటే ద్విభుజుడు స్వయంగా గోలోకంలో ఉంటున్నాడు. నారదా ! బ్రహ్మాది తృణపర్యంతం సమస్తమూ ప్రాకృతికమే (ప్రకృతి సంభవమే). ప్రాకృతికమైన సృష్టి సర్వస్వమూ నశ్వరమైనదే. కాలాంతరాన ప్రళయంలో నశించిపోయేదే.

బ్రహ్మాది తృణపర్యంతం సర్వం ప్రాకృతికం భవేత్ ।
యద్యత్ప్రాకృతికం సృష్టం సర్వం నశ్వరమేవ చ ॥ (8 - 82)

ఇటువంటి సృష్టికి హేతుభూతమైనది పరబ్రహ్మతత్త్వం. అది సత్యం, నిత్యం, సనాతనం, స్వేచ్ఛామయం, నిర్గుణం, ప్రకృతికి ఆవలిది, ఉపాధిరహితం, ఆకారరహితం, భక్తానుగ్రహకాతరం. దానిని తెలుసుకున్నందువల్లనే బ్రహ్మదేవుడు ఈ బ్రహ్మాండాలను సృష్టించగలుగుతున్నాడు, శివుడు మృత్యుంజయుడై ఉపసంహరించగలుగుతున్నాడు, విష్ణుమూర్తి మహామహిమాన్వితుడై కాపాడగలుగుతున్నాడు. ఈ ముగ్గురికీ ఈ మూడు శక్తులూ ఆ పరబ్రహ్మ తత్త్వోపాసనవల్లనే లభిస్తున్నాయి. అదే మహామాయ. అదే పరాప్రకృతి. సర్వశక్తిమయి. ఈశ్వరి. భగవతి. సచ్చిదానందరూపిణి. ఆ తత్త్వాన్ని సేవించడంవల్లనే సావిత్రి వేదమాతయై వేదాధిష్ఠాన దేవత కాగలిగింది. వేదవేత్తల పూజలు అందుకుంటోంది. సర్వవిద్యాధిదేవతగా విశ్వమానవకోటితో ఆరాధింపబడుతోంది. ఆ మహామాయయే సర్వగ్రామాధిదేవత.



సర్వసంపత్ప్రదాయిని. సర్వేశ్వరి. సర్వవంద్య. సర్వులకూ పుత్రదాయిని. సర్వస్తుత. సర్వజ్ఞ. సర్వదుర్గార్తినాశిని. కృష్ణవామాంశ సంభూత. కృష్ణ ప్రాణాధిదేవత. కృష్ణ ప్రాణాధిక - రాధిక. పత్నిగా కృష్ణుడి వక్షఃస్థలంలో శాశ్వతంగా స్థానం సంపాదించుకొంది.

ఆ మహాదేవి ఒకప్పుడు శతశృంగపర్వతంమీద దివ్య వర్ష సహస్రాలు తపస్సు చేసింది. కృష్ణుడు ఆమెను వక్షఃస్థలంమీద నిక్షేపించుకున్నాడు. కృపాన్వితుడై విలపించాడు. అతిదుర్లభమైన వరాన్ని ఆమెకు అనుగ్రహించాడు.

ప్రాణప్రియా ! నువ్వు శాశ్వతంగా నా వక్షఃస్థలంమీదనే ఉండు. నాకు భక్తురాలివై ఉండు. సౌభాగ్యంలో గౌరవంలో ప్రేమలో నువ్వే శ్రేష్ఠవు, నువ్వే జ్యేష్ఠవు. నాకు అత్యంత ప్రేయసివి. వరిష్ఠవు. గరిష్ఠవు. నేను నిన్ను స్తుతిస్తాను. పూజిస్తాను. నేనెప్పుడూ నీకు వశుడను, నీకు సాధ్యుడను - అని శ్రీకృష్ణ వరమాత్మ ఆ లలనకు వరమిచ్చి సపత్నీరహితయైన ప్రాణవల్లభగా స్వీకరించాడు. మిగతా దేవీమూర్తులందరూ ఈ మహాశక్తిని సేవించినందువల్లనే ఆయా శక్తులను పొంది లోకారాధ్యలు అవుతున్నారు. ఎవరు ఎటువంటి తపస్సు చేస్తే వారికి అటువంటి శక్తులు లభించాయి. హిమాలయాలలో వెయ్యి దివ్య వత్సరాలు తపస్సు చేసి దుర్గాదేవి శివుడికి ఇల్లాలై జగదారాధ్య అయ్యింది. సరస్వతీదేవి గంధమాదన పర్వతంమీద లక్ష దివ్యవసంతాలు తపస్సు చేసి బ్రహ్మదేవుని ఇల్లాలై సకలవిద్యాధిదేవతయై పూజలు అందుకుంటోంది. పుష్కరక్షేత్రంలో లక్ష్మీదేవి నూరు దివ్య యుగాలు తపస్సు చేసి మహాశక్తి అనుగ్రహానికి పాత్రురాలై శ్రీమన్నారాయణుడికి ఇల్లాలై సకలసంపదధిష్ఠానదేవత కాగలిగింది. సావిత్రీదేవి కూడా ఇలాగే అరవైవేల దివ్యశరత్తులు ధ్యానించి వేదాధిష్ఠాన దేవత అయ్యింది. బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ఒక్కొక్కరూ శతమన్వంతరాలు తపస్సుచేసి ఆదిపరాశక్తి అనుగ్రహానికి పాత్రులై సృష్టి స్థితిలయ శక్తులను పొందగలిగారు. ఆయా పదవులను అందగలిగారు. శ్రీకృష్ణుడు స్వయంగా ఆ పరాశక్తిని దశమన్వంతరాలు ఆరాధించి గోలోకాధిపత్యం పొందగలిగాడు. ఇప్పటికీ అక్కడ ఆనందిస్తున్నాడు. ధర్ముడు కూడా దశమన్వంతరాలు ఉపాసించి సర్వప్రాణుడూ సర్వపూజ్యుడూ సర్వాధారుడూ కాగలిగాడు. ఇలాగ దేవిని ఆరాధించినవారంతా లోకారాధ్యులు అయ్యారు. మునులూ మనువులూ రాజులూ బ్రాహ్మణులూ దేవిని ఆరాధించి శక్తిసంపన్నులై ప్రజలకు ఆరాధ్యులయ్యారు.

నారదా ! గురుముఖతః నేను విన్న పురాణగాథను సమగ్రంగా నీకు వివరించాను. ఇంకా ఏమి వినాలనుకుంటున్నావో చెప్పు - అని ముగించాడు నారాయణ మహర్షి.

***(అధ్యాయం - 8, శ్లోకాలు - 110)***



## ◆ భూదేవికి వరాహస్వామి వరాలు ◆

శౌనకాది మహామునులారా ! శ్రద్ధగా వింటున్నారా ? అని హెచ్చరించి నారద నారాయణ సంవాదాన్ని సూతుడు కొనసాగించాడు. నారదుడు నారాయణమహర్షిని మళ్ళీ ఇలా అడిగాడు -

మహర్షీ ! మహాదేవికి రెప్పపాటు కాలంలో బ్రహ్మదేవుడు అంతరిస్తాడు అన్నావు. ప్రాకృతిక ప్రళయం వస్తుంది అన్నావు. సృష్టి అంతా జలమయమై భూగోళం అదృశ్యమవుతుంది అన్నావు. అప్పుడు మరి ఆ మహాదేవి ఎక్కడ ఉంటుంది ? పునస్సృష్టికి ఆవిడ ఎలా ఆవిర్భవిస్తుంది ? ఏ రూపాన్ని ధరిస్తుంది? మంగళప్రదమైన దేవీ జన్మకథను వినిపించి నన్ను అనుగ్రహించు - అని నారదుడు వేడుకొన్నాడు. నారాయణ మహర్షి సంతోషించి కథనం ఆరంభించాడు.

నారదా ! సర్వసృష్టికీ ఆదియందు మహాదేవి ఉంటుంది అని వేదం చెబుతోంది. ఆరంభంలో ఆవిర్భావమూ ప్రళయాంతంలో తిరోభావమూ సహజం. ఇంక వసుధ ఎలా ఆవిర్భవించిందో చెబుతాను తెలుసుకో. మధుకైటభుల మేదస్సుతో ఏర్పడిందనీ అందుకే మేదిని అనే పేరు వచ్చిందనీ కొందరన్నారు. పుష్కరక్షేత్రంలో ధర్ముడు చెప్పగా విన్న మరొక వృత్తాంతం ఉంది. అదేమిటంటే జలమయమైన సృష్టిలో మునిగి ఉన్న మహావిరాట్ స్వరూపుడి శరీరంలోకి రోమరంధ్రాలద్వారా ఈ భూమి ప్రవేశించి అదృశ్యమవుతుందట. పునస్సృష్టికి అతడి మనస్సు సంకల్పించినప్పుడు మళ్ళీ అవే రోమరంధ్రాల నుంచి భూమి ఆవిర్భవించి గట్టిపడి నీటిలో తేలుతుందట. ఇది ప్రతిప్రళయంలోనూ జరుగుతూనే ఉంటుంది.

**ప్రత్యేకం ప్రతిలోమ్నాం చ కూపేషు సంస్థితా సదా ।**
**ఆవిర్భూతా తిరోభూతా సజలా చ పునః పునః ॥**
**ఆవిర్భూతా సృష్టికాలే తజ్జలోపర్యుపస్థితా ।**
**ప్రళయే చ తిరోభూతా జలస్యాభ్యంతరే స్థితా ॥** **(9- 15)**

ప్రతి విశ్వంలోనూ ఇలా వసుంధర శైల కానన సాగర ద్వీప గ్రహచంద్రార్క సంయుతంగా ఆవిర్భవిస్తూ ఉంటుంది. త్రిమూర్తులూ దిక్పాలకులూ దేవతలూ యథాతథంగా అవతరిస్తుంటారు. ఇదంతా మహావిరాట్ స్వరూపుని సంకల్పమూ ఆజ్ఞను. పుణ్యతీర్థాలూ, పుణ్యభారతమూ బంగారు నేలలూ సప్తస్వర్గాలూ సప్త పాతాళాలూ బ్రహ్మలోకమూ ధ్రువలోకమూ అంతా పునస్సృష్టి జరుగుతుంది. ఇలా నిర్మింపబడే సమస్త విశ్వాలూ కృత్రిమాలు. కనక నశ్వరాలు. ప్రళయంలో అంతరిస్తాయి. సృష్టి - లయాలు మాత్రమే నిత్యాలు. ఇవి రెండూ శ్రీకృష్ణుని ఆత్మ సంకల్పాలు. మహావిరాట్ స్వరూపుడికన్నా పురాతనాలు.



ఈ వసుంధరను వరాహస్వరూపుడైన విష్ణుమూర్తికి భార్యగా మునులూ మనువులూ స్తుతించారు. వీరి కుమారుడు మంగళుడు. ఇతని తనయుడు కుంభసంభవుడు. పంచీకరణమార్గంలో మూలప్రకృతి నుంచి ఆవిర్భవించిన ఈ వసుంధర వరాహావతారకాలంలో వారాహిగా అర్చింపబడింది. ఆ పూజావిధానం బహుమంగళ ప్రదం. అదికూడా తెలియజేస్తాను, విను. వరాహావతారాన్ని మున్ముందుగా బ్రహ్మదేవుడు స్తుతించాడు. హిరణ్యాక్షుడనే రాక్షసుణ్ణి సంహరించి భూగోళాన్ని ప్రళయజలధినుంచి ఉద్ధరించడంకోసం శ్రీహరి వరాహావతారం ధరించాడు. తన బంగారు కోరతో భూమిని పైకి లేవనెత్తి నీటిమీద పద్మపత్రంలాగా నిలబెట్టాడు. అప్పుడు ఆ భూగోళంమీద సర్వమనోహరమైన విశ్వాన్ని బ్రహ్మదేవుడు నిర్మించాడు.

ఆ సమయంలో భూగోళాధిదేవతను వసుంధరను చూసి శ్రీహరి సమ్మోహితుడయ్యాడు. సుందరాకారుడై భూదేవితో ఒక దివ్య సంవత్సరకాలం రహస్యంగా కామక్రీడలు సాగించాడు. ఆ సంభోగ సంస్పర్శల సుఖాతిశయానికి పరవశించిన భూదేవి ఆనందసమ్మూర్ఛిత అయ్యింది. నెరజాణల సంగమం పరస్పరం అత్యంత సుఖప్రదంకదా !

సుఖ సంభోగ సంస్పర్శాత్ మూర్ఛాం సంప్రాప సుందరీ ।
విదగ్ధాయా విదగ్ధేన సంగమోऽతిసుఖప్రదః ॥ (9 - 31)

విష్ణుమూర్తికి భూదేవి కౌగిలింతలో అహోరాత్రాలు క్షణాల్లాగా గడిచిపోయాయి. దివ్య సంవత్సరం గడిచేదాకా స్పృహ రానేలేదు. అప్పటికి తేరుకుని స్పృహలోకి వచ్చి ఆ కాముకుడు ఆ కాముకిని విడిచిపెట్టాడు. లీలావిలాసంగా మళ్ళీ వరాహరూపం ధరించాడు. ధరణీదేవిని ధ్యానించి ధూపదీప నైవేద్యాలతో సిందూరానులేపనాలతో వస్త్ర పుష్ప బలిప్రదానాలతో అర్చించి కృతజ్ఞతా సూచకంగా దివ్యవరాలు ప్రసాదించాడు.

సర్వాధారా ! శుభస్వరూపిణీ ! వసుంధరా ! ఈ రోజునుంచీ నువ్వు దేవదానవ మానవకోటులందరిచేతా పూజింపబడతావు. శంకుస్థాపనలు చెయ్యాలన్నా గృహప్రవేశాలు జరగాలన్నా వాపీకూపతటాకాదుల్ని నిర్మించాలన్నా వ్యవసాయం మొదలుపెట్టాలన్నా - మానవులందరూ ముందుగా నిన్ను అర్చిస్తారు. అంబువాచీత్యాగదినాన తప్పక పూజలు అందుకుంటావు. ఇది నా వరం. అర్చించని మూఢులు నరకానికి పోతారు. ఇది నా శాపం.

(ప్రతి నెలా ఆర్ద్రానక్షత్రం నుంచి మూడురోజులు భూదేవి రజస్వలగా ఉంటుంది. అప్పుడు ఆమెకు అంబువాచి అని పేరు. ఆ మూనాళ్ళూ భూమిని దున్నరాదని నియమం.)



అంబువాచీత్యాగదినే గృహారంభే ప్రవేశనే ।
వాపీతటాకారంభే చ గృహే చ కృషికర్మణి ॥
తవ పూజాం కరిష్యంతి మద్వరేణ సురాదయః ।
మూఢా యే న కరిష్యంతి యాస్యంతి నరకం చ తే ॥ (9 - 37)

ఈ వరానికి సంతోషించిన వసుధాదేవి వరాహస్వామిని మరొక్కవరం అడిగింది. నాథా ! నీ ఆజ్ఞను శిరసావహించి ఈ చరాచరజగత్తును అంతటినీ నేను భరిస్తాను. కానీ ముత్యము, ఆల్చిప్ప, హరిపూజాద్రవ్యాలు, శివలింగము, శివామూర్తి, శంఖము, దీపము, యంత్రము, మాణిక్యము, రత్నము, యజ్ఞసూత్రము, పుష్పము, పుస్తకము, తులసీదళము, జపమాల, పుష్పమాల, కర్పూరము, బంగారము, గోరోచనము, చందనము, సాలగ్రామశిల - వీటినిమాత్రం భరించలేను. కాబట్టి వీటిని ఎవ్వరూ సాక్షాత్తుగా నామీద ఉంచకుండా నాకు సమర్పించకుండా కట్టడి చెయ్యమని అభ్యర్థించింది. శ్రీహరి సమ్మతించాడు. ఈ ద్రవ్యాలను నీకు సమర్పించినవారూ నీమీద సాక్షాత్తుగా ఉంచినవారూ నరకానికి పోతారని శాసించాడు. అదృశ్యమయ్యాడు. అటుపైని వసుంధర గర్భిణియై మంగళుడిని ప్రసవించింది.

నారదా ! అప్పటినుంచీ అందరూ శ్రీహరి ఆజ్ఞమేరకు కాణ్వశాఖోక్త ప్రకారంగా భూమిపూజ చేస్తున్నారు. మూలమంత్రాన్ని జపిస్తున్నారు. పృథ్వీరూపాన్ని ధ్యానిస్తున్నారు. స్తుతులూ నైవేద్యాలూ సుప్రసిద్ధాలు. మంగళప్రదమైన ఆ మూలమంత్రాన్నీ ధ్యాన స్తవనవిధానాలనీ తెలియజేస్తాను. శ్రద్ధగా ఆలకించి ఆచరించు.

మొట్టమొదటగా పృథివీదేవిని వరాహమూర్తి శ్రీహరి పూజించాడు. అటుపైని బ్రహ్మదేవుడు అర్చించాడు. ఆ తరువాత మునులూ మనువులూ మానవులూ ఉపాసించారు. ధ్యాన స్తవన మంత్రాలు ఏమిటంటే - ఓం హ్రీం శ్రీం క్లీం వసుధాయై స్వాహా అనే మంత్రంతో విష్ణువు అర్చించాడు. భూదేవి తెల్లకలువ రంగులో ఉంటుంది. శరత్పూర్ణిమనాటి చంద్రబింబంలాంటి ముఖం. శరీరమంతటా చందనం పులుముకొని రత్నభూషణభూషితయై విరాజిల్లుతూ ఉంటుంది. ఆవిడ రత్నాధార. రత్నగర్భ. రత్నాకరసమన్విత. (రత్నాకరం = సముద్రం). అగ్నిజ్వాలవంటి పరిశుభ్రమైన వస్త్రంతో చిరునవ్వులు చిందిస్తూ ఉంటుంది. అటువంటి భూదేవికి నమస్కరిస్తున్నాను అనేది స్తోత్రం.

శ్వేతపంకజవర్ణాభాం శరచ్చంద్రనిభాననామ్ ।
చందనోక్షితసర్వాంగీం రత్నభూషణభూషితామ్ ॥
రత్నాధారాం రత్నగర్భాం రత్నాకరసమన్వితామ్ ।
వహ్నిశుద్ధాంశుకాధానాం సస్మితాం వందితాం భజే ॥ (9- 51)



కాణ్వ శాఖోక్తమైన స్తవనం కూడా ఒకటి ఉంది. అది కూడా శ్రీహరి ప్రోక్తమే. దానినే అటు తరువాత బ్రహ్మాదిదేవతలూ మునులూ అందరూ వినియోగించారు. యథాతథంగా చెబుతున్నాను విని ధారణ చెయ్యి.

జయ జయే జలాధారే జయశీలే జలప్రదే ।
యజ్ఞసూకరజాయే త్వం జయం దేహి జయావహే ॥
మంగళే మంగళాధారే మాంగళ్యే మంగళప్రదే ।
మంగళార్థం మంగళేశే మంగళం దేహి మే భవే ॥
సర్వాధారే చ సర్వజ్ఞే సర్వశక్తి సమన్వితే ।
సర్వకామప్రదే దేవి సర్వేష్టం దేహి మే భవే ॥
పుణ్యస్వరూపే పుణ్యానాం బీజరూపే సనాతని ।
పుణ్యాశ్రయే పుణ్యవతామాలయే పుణ్యదే భవే ॥
సర్వసస్యాలయే సర్వసస్యాఢ్యే సర్వసస్యదే ।
సర్వసస్యహరే కాలే సర్వసస్యాత్మికే భవే ॥
భూమే భూమిపసర్వస్వే భూమిపాలపరాయణే ।
భూమిపానాం సుఖకరే భూమిం దేహి చ భూమిదే ॥
ఇదం స్తోత్రం మహాపుణ్యం ప్రాతరుత్థాయ యః పఠేత్ ।
కోటిజన్మసు స భవేద్బలవాన్ భూమిపేశ్వరః ॥ (9 - 59)

నారదా ! ఈ స్తోత్రాన్ని పఠించినవారికి భూదాన ఫలం లభిస్తుంది. భూమిదానహరణపాపం నశిస్తుంది. అంబువాచీభూఖనన పాపమూ అంతరిస్తుంది. ఇతరుల నూతిలో నుయ్యి తవ్వడం, పరభూమిని అపహరించడం, నేలమీద వీర్యాన్ని చిందించడం, దీపాన్ని వెలిగించడం మొదలైన మహాపాపాలు పటాపంచలవుతాయి. అశ్వమేధాలు నూరు చేసిన పుణ్యఫలం లభిస్తుంది. ఇది సర్వకల్యాణ కారకమైన భూదేవీస్తవం. *(అధ్యాయం - 9, శ్లోకాలు - 63)*



## ◆ భూదాన ఫలాలు ◆

నారాయణ మహర్షీ ! భూదాన హరణాది మహాపాపాలు ఏవేవో చెప్పావు. అవి ఏమిటి ? ఏ రకంగా పాపాలయ్యాయి ? వాటి ఫలితాలేమిటి ? ఇంకా ఏమైనా పాపాలున్నాయా ? వాటి ప్రతీకారం ఏమిటి ? విస్తరంగా తెలియజేస్తే నాబోంట్లు జాగ్రత్తపడతారు - అని నారదుడు అభ్యర్థించాడు. నారాయణుడు అందుకున్నాడు -

బ్రహ్మనందనా ! నిరంతరం సంధ్యావందనం చేసుకునే విప్రుడికి ఒక జానెడు నేల దానం చేసినవాడు జన్మాంతంలో కైలాసం చేరుకుంటాడు. శివమందిరంలో నివసిస్తాడు. సస్యలక్ష్మితో విరాజిల్లే భూమిని దానం చేసినవాడు ఆ భూమిలో రేణువులు ఎన్ని ఉన్నాయో అన్ని సంవత్సరాలపాటు వైకుంఠంలో నివసిస్తాడు. అగ్రహారాన్నిగానీ భూమినిగానీ ధాన్యాన్నిగానీ నైష్ఠికుడైన బ్రాహ్మణుడికి దానం చేస్తే సకల పాపాలనుంచీ ఆ క్షణంలోనే విముక్తి లభిస్తుంది. దాతృప్రతిగ్రహీతలిద్దరూ తరిస్తారు. దేవీ సాన్నిధ్యం పొందుతారు. భూదానానికి సాక్షిగా ఉండి ఆమోదించిన సజ్జనుడు పుత్రమిత్ర సమన్వితంగా వైకుంఠం చేరుకుంటాడు. తాను ఇచ్చినదిగానీ పరులు ఇచ్చినదిగానీ భూదానాన్ని అపహరించినవాడు సూర్యచంద్రులున్నంతకాలం నరకంలోనే హింసలు అనుభవిస్తుంటాడు. వాడి వంశం గర్భదరిద్రులై అంతరిస్తుంది. గోవులు తిరిగే దారినీ తటాకాలనూ భూదానంగా సమర్పించేవాళ్ళు కుంభీపాక-అసిపత్రనరకాలలో నూరు దివ్యవత్సరాలపాటు లేదా పద్నాల్గురు ఇంద్రులు గతించేదాకా యమయాతనలు అనుభవిస్తారు. పంచపిండాలను ఉద్ధరించకుండా వెళ్ళి పరుల నూతిలో స్నానం చేసేవాడు రౌరవానికి పోతాడు. కాముకుడై రాత్రిపూట రహస్యంగా నేలమీద వీర్యస్ఖలనం చేసుకునేవాడు రేణువుకి ఒక్క సంవత్సరంగా రౌరవంలో నరకయాతన అనుభవిస్తాడు. అంబువాచిగా ఉన్నప్పుడు భూమిని దున్నినవాడు కృమిదంశ నరకానికి పోయి నాలుగు యుగాలపాటు పరితపిస్తాడు. పూడుకుపోయిన ఇతరుల నూతిలో మయ్యి తవ్వించి నాది అన్నవాడు, పూడుకుపోయిన చెరువులో చెరువు తవ్వించి నాదన్నవాడు తప్తకుండంలో పడతాడు. పుణ్యఫలంమాత్రం ఆ మొదటి దాతలకే దక్కుతుంది. ఇతరుల చెరువుల్లో నుంచి మట్టిని తొలగించి వాటిని ఉపయోగంలోకి తెచ్చేవాడు రేణుప్రమాణ సంవత్సరాల పాటు బ్రహ్మలోకంలో నివసిస్తాడు.

తండ్రికీ రాజుకీ పిండప్రదానం చెయ్యకుండా శ్రాద్ధకర్మలు ముగించినవాడు నరకానికి పోతాడు. వట్టినేలమీద దీపం వెలిగించినవాడు ఏడుజన్మల దాకాగుడ్డివాడవుతాడు. ఏ ఆచ్ఛాదనాలేని వట్టి నేలమీద శంఖాన్ని పెడితే వాడికి జన్మాంతరంలో కుష్ఠరోగం వస్తుంది. అలాగే ముత్యం, మాణిక్యం, రత్నం, బంగారం, మణులూ వీటినికూడా వట్టి నేలమీద ఉంచకూడదు. అలా ఉంచినవాళ్ళు ఏడు జన్మలకీ అంధులవుతారు. శివలింగాన్నిగానీ శివామూర్తినిగానీ పూజాద్రవ్యాలనుగానీ కనీసం ఆకునైనా



ర్థంవేసి ఉంచాలే తప్ప వట్టినేలమీద ఉంచినవాళ్ళు శతమన్వంతరాలు కృమిభక్షకులు అవుతారు. ఇలాగే యంత్రాలనూ పువ్వులనూ తులసీదళాలనూ నేలమీద ఉంచకూడదు. ఉంచితే నరకానికి పోతారు. జపమాల, కర్పూరము, గోరోచనము, గంధపు చెక్క, రుద్రాక్ష, దర్భలు, పుస్తకం, యజ్ఞోపవీతం - వీటిని వట్టి నేలమీద ఉంచడమూ నరకహేతువే. యజ్ఞం చేసి ఆ నేలను పాలతో అలకనివాడు ఏడేడు జన్మలకీ నరకంలోనే ఉండిపోతాడు. భూకంపం వచ్చిన రోజునగానీ గ్రహణంనాడుగానీ భూమిని తవ్వినవాడు జన్మాంతరంలో అంగవికలుడవుతాడు.

నారదా ! భూమి అంటే సమస్త ప్రాణికోటికీ పుట్టిల్లు. మహాభవనం. ఇది కశ్యపుడి సొత్తు. కనక కాశ్యపి అనే పేరు. ఇది అచల. ఇది స్థిర. చరాచర జీవజాలాన్ని భరిస్తోంది అనంతకాలంగా. అందుచేత విశ్వంభర. పృథుకన్య కాబట్టి పృథివి అయ్యింది. విశాలంగా పృథురూపంలో ఉంటుంది కనకనూ ఆ పేరు ఏర్పడింది. ***(అధ్యాయం - 10, శ్లోకాలు - 30)***

నారాయణమహర్షీ ! పృథివీ వృత్తాంతాన్ని మనోహరంగా వినిపించావు. ధన్యుణ్ణి చేశావు. ఇంక గంగావతరణ గాథను వినాలని ఉంది. సరస్వతి శాపంవల్ల గంగాదేవి భారతభూమికి అవతరించింది కదా! స్వయంగా విష్ణుపది అయిన ఆ పరమపావన స్వరూప ఎలా ఎప్పుడు ఎక్కడ అవతరించిందో ఆ క్రమమంతా తెలుసుకోవాలని ఉంది. అది పుణ్యప్రదమూ పాపఘ్నమూను. కనక అనుగ్రహించు - అని నారదుడు కోరాడు. నారాయణుడు యథావిధిగా ఆరంభించాడు.

## ◆ గంగావతరణ గాథ ◆

హిరణ్యగర్భతనయా ! సూర్యవంశంలో సగరుడు అనే మహారాజు ఉన్నాడు. అతడికి వైదర్భి శైబ్య అని ఇద్దరు భార్యలు. శైబ్యకు అసమంజుడు అనే కుమారుడు జన్మించాడు. వైదర్భి సంతానంకోసం శివుణ్ణి ఆరాధించింది. శివుడి అనుగ్రహంతో గర్భిణి అయ్యింది. నూరేళ్ళు మోసి ఒక మాంసపిండాన్ని ప్రసవించింది. ఆ పిండాన్ని చూసి వైదర్భి చలించిపోయింది. దారుణంగా విలపిస్తూ శివుణ్ణి ధ్యానించింది. శివుడు బ్రాహ్మణరూపంలో వచ్చి ఆ పిండాన్ని అరవైవేల తునకలు చేసి ప్రాణాలు పోశాడు. అందరూ మహాబలపరాక్రమసంపన్నులైన పుత్రులు అయ్యారు. ఒక్కొక్కడూ గ్రీష్మమార్తాండుడిలా ప్రజ్వరిల్లుతున్నారు. ఒకనాడు కపిలమహర్షి శాపంవల్ల అందరూ భస్మమైపోయారు. సగరుడు దుఃఖం పట్టలేక రాజ్యం వదిలిపెట్టి అరణ్యాలకు వెళ్ళిపోయాడు. గంగానదిని ఆ భస్మరాశులపై ప్రవహింపజేస్తే తన సోదరులు సజీవులవుతారని తెలుసుకున్న అసమంజుడు గంగాదేవికోసం తపస్సు ప్రారంభించాడు. లక్షసంవత్సరాలు తపస్సు చేసి కాలధర్మం చెందాడు. అతడి కొడుకు అంశుమంతుడు అదే దీక్షతో తపస్సు కొనసాగించాడు.



అతడూ ఒక లక్ష సంవత్సరాలు తపస్సు చేసి గతించాడు. అటుపైని అతడి పుత్రుడు భగీరథుడు తపస్సు చేశాడు. ఇతడికి శ్రీకృష్ణుడు కోటిసూర్యప్రభలతో దర్శనమిచ్చాడు. ద్విభుజుడై మురళీధరుడై కిశోరగోపవేషంలో త్రిమూర్తి సంస్తుతుడై దర్శనమిచ్చిన ఆ స్వేచ్ఛామయపరబ్రహ్మను పరిపూర్ణతమ ప్రభువును చిరునవ్వులు చిందిస్తున్న ఆ నిర్లిప్త నిర్గుణ పరప్రకృతిని చూస్తూనే భగీరథుడు మోకరిల్లి భక్తి ప్రపత్తులతో స్తుతించాడు. తన వాంఛితాన్ని విన్నవించాడు. సగరపుత్రులను ఉద్ధరించి వంశాన్ని తరింపజెయ్యమని ప్రార్థించాడు.

అప్పుడు శ్రీకృష్ణపరమాత్మ గంగాదేవిని ఆజ్ఞాపించాడు. హే గంగే ! సరస్వతీశాపం ఉందికదా! వెంటనే బయలుదేరి భారతభూమికి అవతరించు. సగరపుత్రులను ఉద్ధరించు. ఇది నా ఆజ్ఞ. నీ నీరు సోకినా నీ గాలి తాకినా అందరూ పరిపూతులవుతారు. కోటిజన్మార్జితాలైన పాపాలు నశిస్తాయి. నా రూపాలు పొంది నాలోకంలో విహరిస్తారు. మౌసలస్నానం చేస్తే చాలు బ్రహ్మహత్యాది మహాపాతకాలుకూడా అంతరిస్తాయి. పుణ్యాహస్నానానికి ఉన్న ఫలమెంతో వేదాలుకాదు త్రిమూర్తులైనా చెప్పలేరు. సామాన్య దివసస్నానంకన్నా మౌసలస్నానం వల్ల పుణ్యం పదింతలు ఎక్కువ లభిస్తుంది. సూర్యసంక్రమణం నాడు గంగాస్నానం చేస్తే ముప్ఫయిరెట్లు అధికంగా పుణ్యం వస్తుంది. అమావాస్యనాడైనా అంతే. దక్షిణాయన పుణ్యదినాన చేస్తే ద్విగుణంగా పుణ్యం చేకూరుతుంది. ఉత్తరాయణకాలంలో అయితే పదిరెట్లు అధికపుణ్యం. చాతుర్మాస్యదీక్షలో పున్నమినాడయితే అనంతంగా లభిస్తుంది. అక్షయ పుణ్యదినాన అక్షయపుణ్యమే. ఉగాది మాఘసప్తమి భీష్మాష్టమి అశోకాష్టమి హరినవమి సూర్యచంద్రగ్రహణాల రోజున పట్టు విడుపుల సమయాలలోనూ చేసే గంగాస్నానాలు అశేష పుణ్యప్రదాలు. గంగా ! ఇవి నీకు నేను ఇస్తున్న వరాలు - అని చెప్పి శ్రీకృష్ణుడు విరమించాడు.

ఈ మాటలు విన్న గంగాదేవి సవినయంగా తన సందేహాన్ని వెలిబుచ్చింది. నాథా ! సరస్వతీశాపంవల్లనైతేనేమి ఈ రాజేంద్రుల తపస్సువల్లనైతేనేమి నీ ఆజ్ఞమేరకు నేను భరతభూమికి వెడతాను. బాగానే ఉంది. అయితే నేను అక్కడ ఎంతకాలం ఉండాలి ? మళ్ళీ నీ సన్నిధికి రావడం ఎప్పుడు ? పాపాత్ములందరూ వచ్చి నాలో మునిగి పాపాలు సమర్పిస్తూంటే నాకు వాటినుంచి విముక్తి ఎలాగ ? ఇంకా నా మనస్సులో ఉన్న సంశయాలేమిటో అన్నీ ఎరిగినవాడవు. నువ్వే తగిన ఉపాయం ఉపదేశించు - అంది.

గంగాదేవీ ! నీ వాంఛితమేమిటో నాకు తెలుసు. ద్రవరూపంలో భూమికి అవతరిస్తున్న నీకు అక్కడ సముద్రుడు భర్త అవుతాడు. సముద్రుడు నా అంశావతారమే. నువ్వు లక్ష్మీస్వరూపిణివే. వెరజాణకు వెరజాణ దొరకడం ఆనందదాయకమేకదా ! భారతభూభాగాన సరస్వతీప్రభృతి నదులు ఎంతకాలం ఉంటాయో అంతకాలమూ నువ్వూ వారితోపాటు సౌభాగ్యసంపదలతో ఉంటావు. దేవీ !



ఈనాటినుంచి కలియుగంలో అయిదువేల సంవత్సరాలు గడిచేవరకూ నువ్వు భారతావనిలో ఉండక తప్పదు. నిత్యమూ నీకు సముద్రుడితో రహస్య సంగమం జరుగుతూనే ఉంటుంది. అతడు రసికుడు, నువ్వు రసికవు.

నిత్యం త్వమబ్ధినా సార్థం కరిష్యసి రహో రతిమ్ ।
త్వమేవ రసికా దేవీ రసికేంద్రేణ సంయుతా ॥ (11 - 47)

భారతీయులందరూ నిన్ను భాగీరథిగా స్తుతిస్తారు. అర్చిస్తారు. కణ్వశాఖోక్తపద్ధతిలో ధ్యానిస్తారు, పూజిస్తారు. నిన్ను స్తుతించిన వారికి అశ్వమేథఫలం లభిస్తుంది. స్తుతించలేక దర్శించలేక యోజనాల దూరంనుంచే గంగా ! గంగా ! అంటే చాలు అతడు పాపవిముక్తుడై వైకుంఠం చేరుకుంటాడు.

గంగా గంగేతి యో బ్రూయాత్ యోజనానాం శతైరపి ।
ముచ్యతే సర్వపాపేభ్యో విష్ణులోకం స గచ్ఛతి ॥ (11 - 50)

వెయ్యిమంది పాపాత్ములు నీలో మునగనీ. ఒక్క విష్ణుభక్తుడు మునిగితే చాలు నువ్వు మళ్ళీ పరిపూతవు అవుతావు. ఎన్ని శవాలు నీలో తేలినా విష్ణు మంత్రోపాసకుడి స్నానంతో పాపప్రక్షాళన అవుతుంది. దోషాలన్నీ తొలగిపోతాయి. నువ్వు అఘమోచనకు అధిష్ఠాత్రివి. నిన్ను తలుచుకుంటూ ఏ నదిలో ఏ రేవులో మునిగినా అది గంగాతీర్థమే అవుతుంది. నీ రేణువు సోకితే చాలు మహాపాతకికూడా పరిపూతుడవుతాడు. జ్ఞానులు నా నామాన్ని జపిస్తూ నీలో మునిగి ప్రాణాలు వదిలితే సరాసరి నా సాయుజ్యం పొందుతారు. నాకు శాశ్వతంగా పార్షదులవుతారు. ఎంతో పుణ్యం చేసుకున్నవాడి శవమే నీలో కలుస్తుంది. అతడు సరాసరి వైకుంఠం చేరుకుంటాడు. అతడికి సారూప్యం ఇచ్చి పార్షదుణ్ణి చేసుకుంటాను. తెలియక అజ్ఞానంతో నీలో మునిగినా నీలో ప్రాణాలు విడిచినా అతడికీ సాలోక్యం ఇస్తాను. పార్షదుణ్ణి చేస్తాను. నీపేరు జపిస్తూ ఎక్కడ ప్రాణాలు విడిచినా వారికికూడా శాశ్వతంగా సాలోక్యం అనుగ్రహిస్తాను. రత్నాల పల్లకీలో గోలోకానికి తోడ్కొని వెడతాను. నా మంత్రాన్ని ఉపాసించేవారూ నాకు నివేదన చేసి భుజించేవారూ ముల్లోకాలనూ పవిత్రం చెయ్యగల సమర్థులు. వారినీ ఇలాగే రత్నాలపల్లకిలో గోలోకానికి తీసుకువెడతాను. వారి బంధువులూ వారి పెంపుడు జంతువులూ వారి సేవకులూ అందరికీ ఇదే మన్నన జరుగుతుంది.

మద్భక్తా బాంధవా యేషాం తేఽపి పశ్వాదయోఽపి హి ।
ప్రయాంతి రత్నయానేవ గోలోకం చాతిదుర్లభమ్ ॥ (11 - 66)



ఇలా శ్రీకృష్ణుడు గంగాదేవిని ఊరడించి భగీరథా ! ఈ గంగాదేవిని భక్తితో స్తుతించు. శ్రద్ధతో అర్చించు అన్నాడు. భగీరథుడు భక్తిశ్రద్ధలతో స్తుతిపూజనలు నిర్వహించాడు. కౌథుమశాఖోక్తంగా సామవేద మంత్రాలతో మళ్ళీ మళ్ళీ స్తుతించాడు. శ్రీకృష్ణపరమాత్మనూ స్తుతింతి ప్రణమిల్లాడు. గంగాదేవీ స్తుతించి నమస్కరించింది. శ్రీకృష్ణుడు అంతర్ధానం చెందాడు - అని నారాయణమహర్షి చెప్పగానే, భగీరథుడు చేసిన పూజావిధానాన్నీ స్తుతినీ తెలియజెప్పమని నారదుడు అభ్యర్థించాడు.

నారదా ! భగీరథుడు స్నానంచేసి ధౌతవస్త్రాలు ధరించి శుచిగా నిత్యక్రియలు అనుష్ఠించి ఏకాగ్రచిత్తంతో భక్తితో దేవషట్కాన్ని ఆరాధించి అప్పుడు గంగాదేవిని స్తుతించాడు. విఘ్నవినాశంకోసం గణేశ్వరుణ్ణీ, ఆరోగ్యంకోసం సూర్యుణ్ణీ, శౌచంకోసం అగ్నినీ, లక్ష్మికోసం విష్ణువునూ, జ్ఞానంకోసం శివుణ్ణీ, ముక్తికోసం శివానినీ పూజించాలి. ఈ ఆరుగురు దేవతలనూ ముందుగా పూజించినవాడికే ఏ పూజ చెయ్యడానికైనా అధికారం లభిస్తుంది. లేకపోతే విషమఫలితాలు తప్పవు.

*(అధ్యాయం -11, శ్లోకాలు - 75)*

గణేశం చ దినేశం చ వహ్నిం విష్ణుం శివం శివామ్ ।
సంపూజ్య దేవషట్కం చ సోఽధికారీ చ పూజనే ॥
గణేశం విఘ్ననాశాయ ఆరోగ్యాయ దివాకరమ్ ।
వహ్నిం శౌచాయ విష్ణుం చ లక్ష్మ్యర్థం పూజయేన్నరః ॥
శివం జ్ఞానాయ జ్ఞానేశం శివాం చ ముక్తి సిద్ధయే ।
సంపూజ్యైతాన్ లభేత్ ప్రాజ్ఞో విపరీతమతోఽన్యథా ॥ (11 - 75)

కణ్వశాఖోక్తమైన గంగాధ్యానం పాపప్రణాశకం. గంగాదేవి తెల్లకలువలాగా ఉంటుంది. కృష్ణమూర్తినుంచి ఆవిర్భవించింది. కృష్ణతుల్య. అగ్నిజ్వాలలాంటి అంశుకాన్ని ధరిస్తుంది. రత్నభూషణాలు అలంకరించుకొంటుంది. ఒక్కసారిగా శరత్పూర్ణిమా చంద్రబింబాలు నూరు ఉదయించినంత ఆహ్లాదకరంగా ఉంటుంది. చిరునవ్వులు పండిస్తూ ఉంటుంది. ఎప్పుడూ యౌవనంలోనే ఉంటుంది. నారాయణప్రియ. శాంతస్వరూప. సౌభాగ్యసమన్విత. విశాలమైన కబరీభారం. అందులో మాలతీపుష్పమాలికలు. చెక్కిళ్ళమీద సిందూర చందన కస్తూరీ బిందువులతో మకరికా పత్రాలంకరణ. దొండపండుల్లాంటి పెదవులు. ముత్యాలకోవలాంటి పలువరుస. అందమైన ముఖం. అందమైన బొట్టు. అందమైన కన్నులు. క్రీగంటి వాలుచూపులతో మరింత మనోహరంగా ఉంటుంది. ఉన్నతమైన వక్షఃస్థలం. విశాలమైన జఘనభాగం.



మెట్టతామరలవంటి పాదాలు. వాటికి రత్నపాదుకలు. లత్తుకతో పారాణి దిద్దిన పాదాలు. దేవేంద్రుడి శిరస్సుమీద ఉన్న మందారపుష్పం నుంచి జారిపడిన ఎర్రని మకరంద బిందువుతో పారాణి దిద్దుకున్నట్టుంటుంది.

రత్నపాదుక సంయుక్తం కుంకుమాక్తం పయావకమ్ ।
దేవేంద్రమౌళిమందారమకరందకణారుణమ్ ॥ (12 - 9)

సురసిద్ధమునీంద్రగణాలు సమర్పించిన అర్ఘ్యాలతో ఆర్ద్రంగా ఉండే పాదపద్మాలు. తపస్వుల శిరస్సులు అనే తుమ్మెదలు బారులుతీరి మూగే పాదపద్మాలు. ముముక్షువులకు ముక్తిప్రదాలు. బుభుక్షువులకు భోగప్రదాలు. వరేణ్య. వరద. భక్తానుగ్రహకారిణి. శ్రీవిష్ణుపదదాత్రి. విష్ణుపది. అటువంటి గంగాదేవికి నమస్కరిస్తున్నాను - అనే ధ్యానశ్లోకాలతో ఆ త్రిపథగను ధ్యానించాలి. షోడశోపచారాలు చెయ్యాలి. ఆసన - పాద్య - అర్ఘ్య - స్నాన - అనులేపన - ధూప - దీప - నైవేద్య - తాంబూల - శీతోదక - వసన - భూషణ - మాల్య - గంధ - ఆచమనీయ - తల్ప సమర్పణలు షోడశోపచారాలు.

ఆసనం పాద్యమర్ఘ్యం చ స్నానీయం చానులేపనమ్ ।
ధూపం దీపం చ నైవేద్యం తాంబూలం శీతలం జలమ్ ॥
వసనం భూషణం మాల్యం గంధ మాచమనీయకమ్ ।
మనోహరం సుతల్పం చ దేయాన్యేతాని షోడశ ॥ (12 - 15)

వీటిని చేసి భక్తితో సాష్టాంగనమస్కారం చెయ్యాలి. ఇలా పూజ చేస్తే అది అశ్వమేధ ఫలాన్ని ఇస్తుంది. నారదా ! ఇరవైయొక్క శ్లోకాలలో విష్ణుమూర్తి చేసిన గంగాస్తవం మరింత పుణ్యప్రదం. ఆలకించు -

శివుడి సంగీతానికి పరవశించిన విష్ణుమూర్తి శరీరంనుంచి ఆవిర్భవించింది. రాధాశరీరంనుంచి జాలువారిన జలంతో వరదగట్టింది. సృష్టికన్నా ముందు గోలోకంలో రాసమండలంలో శంకరుడి సన్నిధానంలో జన్మించింది. గోపగోపీజనంతో కోలాహలంగా జరుగుతున్న రాధామహోత్సవంలో కార్తిక పూర్ణిమ రోజున అవతరించింది. కోటియోజన విస్తీర్ణమూ అంతకన్నా లక్షరెట్లు పొడుగూ ఉండి గోలోకమంతటా వ్యాపించిన గంగమ్మకు వందనాలు.

శివసంగీత సమ్ముగ్ధ శ్రీకృష్ణాంగ సముద్భవామ్ ।
రాధాంగద్రవ సంయుక్తాం తాం గంగాం ప్రణమామ్యహమ్ ॥



యజ్జన్మ సృష్టిరాదౌ చ గోలోకే రాసమండలే ।
సన్నిధానే శంకరస్య తాం గంగాం ప్రణమామ్యహమ్ ॥
గోపైర్గోపీభిరాకీర్ణే శుభే రాధామహోత్సవే ।
కార్తికీ పూర్ణిమాయాం చ తాం గంగాం ప్రణమామ్యహమ్ ॥

(12 -20)

అరవైలక్షల యోజనాల విస్తీర్ణమూ అంతకు నాలుగురెట్లు పొడవూగా వైకుంఠంలో వ్యాపించిన గంగమ్మకు దండాలు. ముప్ఫయి లక్షల యోజనాల విస్తీర్ణమూ అంతకు అయిదు రెట్లు పొడవుగా బ్రహ్మలోకంలో ప్రవహించే గంగమ్మకు ఏటికోళ్ళు. అంతే విస్తీర్ణమూ అంతకు నాలుగురెట్లు పొడవుతో శివలోకంలో సంచరించే గంగమ్మకు నమస్సులు. ఇలాగే ధ్రువలోక - చంద్రలోక - సూర్యలోక - తపోలోక - జనలోక - మహర్లోక - కైలాస - ఇంద్రలోక - పాతాళలోకాలలో ప్రవహించే గంగాదేవికి నమోవాకాలు. ఇంద్రలోకంలో మందాకినిగా పాతాళంలో భోగవతిగా కీర్తింపబడే గంగాభవానికి నమస్కారాలు. ఒక క్రోశమాత్ర విస్తీర్ణంతో అక్కడక్కడా ఇంకా క్షీణించి అలకనందగా భూలోకంలో ప్రవహించే గంగమ్మకు డింగిడీలు.

క్రోశైకమాత్ర విస్తీర్ణా తతః క్షీణా కుత్రచిత్ ।
క్షితౌ చాలకనందా యా తాం గంగాం ప్రణమామ్యహమ్ ॥ (12-34)
సత్యే యా క్షీరవర్ణా చ త్రేతాయామిందు సన్నిభా ।
ద్వాపరే చందనాభా యా తాం గంగాం ప్రణమామ్యహమ్ ॥(12-35)

సత్యయుగంలో పాలనురువులాగా, త్రేతాయుగంలో వెన్నెలలాగా, ద్వాపరయుగంలో మంచిగంధంలాగా, కలియుగంలో నీళ్ళలాగా, స్వర్గంలోమాత్రం అన్నియుగాల్లోనూ పాలలాగా ప్రవహించే గంగమ్మకు నతులు. గంగా జలకణాన్ని రవ్వంత స్పృశిస్తే చాలు పాపాత్ములకుకూడా జ్ఞానోదయమవుతుంది. కోటి జన్మల పాపాలు నశిస్తాయి, బ్రహ్మహత్యామహాపాతకంకూడా అంతరిస్తుంది.

జలప్రభా కలౌ యా చ వాన్యత్ర పృథివీతలే ।
స్వర్గే చ నిత్యం క్షీరాభా తాం గంగాం ప్రణమామ్యహమ్ ॥
యత్తోయకణికాస్పర్శే పాపినాం జ్ఞానసంభవః ।
బ్రహ్మహత్యాదికం పాపం కోటిజన్మార్జితం దహేత్ ॥ (12 - 37)



నారదా ! ఈ గంగాలహరిని (లహరి = స్తోత్రం) నిత్యం భక్తితో పఠించి గంగమ్మను అర్చించినవారికి అశ్వమేధయాగఫలం దక్కుతుంది అనడంలో ఎటువంటి సందేహమూ లేదు. సంతానం లేనివారికి సంతానం కలుగుతుంది. అవివాహితులకు వివాహమవుతుంది. రోగులకు ఉపశమనం రోగవిముక్తి లభిస్తాయి. మూర్ఖుడుకూడా పండితుడవుతాడు. యశస్వి అవుతాడు. ప్రాతఃకాలంలో పఠిస్తే దుఃస్వప్నదోషాలు నశిస్తాయి. గంగాస్నానఫలం దక్కుతుంది.

శ్రీకృష్ణుడి ఆజ్ఞ ప్రకారం భగీరథుడు ఇదే స్తోత్రాన్ని చేసి గంగానదిని తన వెంట తీసుకువెళ్ళాడు. సగరపుత్రుల చితాభస్మాలమీద ప్రవహింపజేశాడు. వెంటనే వారందరూ వైకుంఠానికి చేరుకున్నారు. భగీరథుడు తెచ్చాడు కనక అప్పటినుంచీ ఈ నదికి భాగీరథి అనే పేరు ఏర్పడింది. బ్రహ్మానందనా ! ఇది గంగావతరణ గాథ. పుణ్యప్రదం, మోక్షప్రదం. ఇంకా ఏమేమి కథాసారాలు తెలుసుకోవాలనుకుంటున్నావో అడుగు, చెబుతాను - అని ముగించాడు నారాయణ మహర్షి.

## ◆ రాధాదేవియే గంగాదేవి ◆

మహర్షీ ! గంగానదికి "త్రిపథగ" అనేపేరు ఉంది అన్నావు. అది ఎలా ఏర్పడింది ? ఎలా ఎక్కడెక్కడ ఆ నది మూడు మార్గాలలో ప్రవహించింది ? అక్కడి ప్రజలు ఎవరు ? ఈ విశేషాలు తెలుసుకోవాలని ఉంది - అన్నాడు నారదుడు. వెంటనే నారాయణమహర్షి ఆరంభించాడు-

గోలోకంలో ఒక కార్తికపూర్ణిమనాడు రాధామహోత్సవం జరిగింది. రాసమండలంలో రాధాదేవిని పూజించి శ్రీకృష్ణుడు ఆమె సన్నిధిలో మహోల్లాసంగా ఉన్నాడు. రాధాదేవికూడా పూజలు అందుకొన్న ఆనందంలో ఉత్సాహంగా ఉంది. బ్రహ్మాదిదేవతలూ సనకసనందనాది మహర్షులూ రాధాకృష్ణులను పరివేష్టించి కొలువుతీరి కూర్చున్నారు. అంతలోకీ సరస్వతీదేవి తన వీణను శ్రుతిచేసి కృష్ణస్తుతిరూపమైన సంగీతాన్ని అత్యద్భుతంగా వినిపించింది. అందరూ సంతోషించారు. కానుకలు కురిపించారు. బ్రహ్మ దేవుడు రత్నహారాన్నీ, శివుడు మణిహారాన్నీ, కృష్ణుడు కౌస్తుభహారాన్నీ, రాధాదేవి మాణిక్యహారాన్నీ, నారాయణుడు మరో మనోహరమాలికనూ, లక్ష్మి కనకకుండలాలనూ, దుర్గాదేవి బ్రహ్మభక్తినీ, ధర్ముడు ధర్మబుద్ధినీ, అగ్నిదేవుడు పరిశుభ్రవస్త్రాన్నీ, వాయుదేవుడు మణినూపురాలనూ కానుకలుగా మెచ్చి సమర్పించారు.

బ్రహ్మదేవుడు శివుణ్ణి ప్రేరేపించి నువ్వుకూడా కృష్ణసంగీతం వినిపించు అని కోరాడు. శివుడు విజృంభించి గానం చేశాడు. శ్రోతలందరూ పరవశించి మైమరిచిపోయారు. శిలాప్రతిమలైపోయారు. ఆ పారవశ్యంనుంచి నెమ్మదిగా తేరుకుని కళ్ళు తెరిచి చూసేసరికి గోలోకమంతా జలమయమై కనిపించింది. రాధాకృష్ణులు ఏమైపోయారో కనపడలేదు. అందరూ అంతటా వెదికి వేసారారు. దుఃఖం పట్టలే



గోపగోపీజనమూ దేవతలూ పెద్దపెట్టున విలపించారు. ఏమి జరిగిందో తెలుసుకుందామని బ్రహ్మదేవుడు ధ్యానంలో కూర్చుని అంతర్దృష్టిని సారించాడు. శివుడి సంగీతానికి కరిగిపోయి రాధాకృష్ణులు ద్రవరూపం చెందారని గ్రహించాడు.

ధ్యానేన బ్రహ్మ బుబుధే సర్వం తీర్థమభీప్సితమ్ ।
గతశ్చ రాధయా సార్ధం శ్రీకృష్ణో ద్రవతామితి ॥ (12 - 58)

ఆ విషయాన్ని విష్ణు మహేశ్వరులకు తెలియజెప్పాడు. అందరూ కలిసి రాధాకృష్ణుల సందర్శనం కోసమని పరాత్పరుణ్ణి స్తుతించారు. అంతలోకీ అశరీరవాణి వినిపించింది. అది శ్రీకృష్ణుడి కంఠమే.

బ్రహ్మాది దేవతలారా ! ఈ జలమంతా మా స్వరూపమే. దీన్ని మీరు ఉపాసించండి. ఆరాధించండి. పూర్వరూపాలలో మమ్మల్ని చూడాలనుకుంటే శివుడు నా ఆజ్ఞను పాటించాలి. వేదశాస్త్రాలను అవలోడించి అపూర్వ మంత్రాలను సేకరించి స్తోత్రాలను నిర్మించి ధ్యానమంత్రస్తోత్ర కవచయుతంగా పూజావిధానం ఏర్పరిచి నన్ను పూజించాలి. అది నా మంత్రం కావాలి. ఆ మంత్రాన్నీ ఆ పూజావిధానాన్నీ గోప్యంగా ఉంచాలి. లక్షకు ఒకడుమాత్రమే మన్మంత్రోపాసకుడు కావాలి. అతడు గోలోకవాసి అవుతాడు. కొందరు భూలోకవాసులూ కొందరు స్వర్గలోకవాసులూగా ఏర్పాటు ఉండాలి. లేకపోతే సృష్టి అంతా నిష్ఫలమవుతుంది. ప్రతిజ్ఞాపూర్వకంగా శివుడు ఈ పూజను ఆచరిస్తే మేము మీకు దర్శనం ఇస్తాం. లేకపోతే లేదు.

అశరీరవాణిగా శ్రీకృష్ణుడు వినిపించిన ఆజ్ఞను శివుడు శిరసావహించాడు. అతడు జ్ఞానానికి అధిదేవత. వెంటనే అక్కడి జలాన్ని దోసిటిలోకి తీసుకుని విష్ణుమాయామహామంత్రాలను జపించి స్తోత్రాలను సమకూర్చి అర్చించాడు. ఈ నీటిని స్పృశించి అసత్యం పలికినవాళ్ళు శాశ్వతంగా కాలసూత్రమనే నరకానికి పోతారు అని ప్రతిజ్ఞ చేశాడు.

గంగాతోయముపస్పృశ్య మిథ్యా యది వదేజ్జనః ।
స యాతి కాలసూత్రం చ యావద్వై బ్రహ్మణో వయః ॥ (12-75)

శంకరుడు ఇలా పలకగానే రాధాకృష్ణులు ప్రత్యక్షమయ్యారు. గోపగోపీసురబృందాలు ఆనందంతో కేరింతలు కొట్టారు. మళ్ళీ మహోత్సవం జరిపారు. అటుపైని శివుడు ముక్తిదీపాన్ని వెలిగించాడు.

నారదా ! ద్రవరూపం చెందిన రాధాదేవియే ఈ గంగానది. రాధాకృష్ణుల సంయుక్తరూపంగా గోలోకంలో ఆ నది అర్చింపబడుతోంది. భుక్తిముక్తి ప్రద. శ్రీకృష్ణుడు లోకానుగ్రహకాంక్షతో ఈ గంగానదిని ముల్లోకాలకూ ప్రవహింపజేసి అక్కడక్కడ నిలువరించాడు. కృష్ణస్వరూపగా సర్వబ్రహ్మాండపూజిత అయ్యింది ఈ పవిత్ర నదీమతల్లి. *(అధ్యాయం - 12, శ్లోకాలు - 80)*



నారాయణ మహర్షీ ! కలియుగంలో అయిదువేల సంవత్సరాలు గడిచాక మరి ఈ గంగానది ఎక్కడికి వెళ్ళింది ?

నారదా ! సరస్వతి శాపంవల్లకదా గంగాదేవి భారతభూభాగానికి వచ్చింది. అయిదువేల సంవత్సరాల తరవాత శాపవిమోచనమై మళ్ళీ వైకుంఠానికే వెళ్ళిపోయింది. అలాగే సరస్వతీ పద్మావతీనదులూ లక్ష్మీదేవి తులసి వీరంతా హరిసన్నిధికే చేరుకున్నారు. గంగా లక్ష్మీ సరస్వతులతోపాటు నాల్గవదిగా తులసి కూడా నారాయణప్రియ అయ్యింది.

మహర్షీ ! నాది మరొక చిన్న సందేహం. గంగాదేవిని విష్ణుపాదోద్భవ అంటారుకదా ! ఒకసారి ఎప్పుడో బ్రహ్మదేవుడి కమండలువులో బందీ అయ్యిందిట. ఎవరో చెప్పగా విన్నాను. ఆ వృత్తాంతం సమగ్రంగా తెలుసుకోవాలని ఉంది. తెలియజెప్పవూ !

## ◆ గంగాదేవి విష్ణుపాదోద్భవ ◆

నారదా ! నువ్వు అడగడమూ నేను చెప్పకపోవడమూనా ? తప్పకుండా చెబుతాను, విను. గోలోకంలో రాధాకృష్ణుల శరీరాలనుంచి గంగాదేవి ద్రవరూపిణిగా ఆవిర్భవించింది అని చెప్పానుకదా ! అప్పటినుంచీ ఆవిడ జలాధిష్ఠానదేవత అయ్యింది. అద్వితీయ సౌందర్యంతో సర్వాభరణభూషితయై నిత్య యౌవనవిలాసంతో చిరునవ్వులు చిందిస్తూ ఆ పద్మముఖి విరాజిల్లింది. బంగారురంగు మేనిఛాయ. శరచ్చంద్రబింబంలాంటి ముఖం. నిగనిగలాడే శరీరకాంతి. విశాలమైన కటిప్రదేశం. పీనోన్నత వక్షఃస్థలం. విశాలమైన కన్నులు. చంచలమైన వాలుచూపులు. మాలతీపుష్పమాలలతో ఘుమఘుమలాడే కబరీభరం. చెక్కిళ్ళమీద మకరికాపత్రాలు. మంకెన పువ్వుల్లాంటి పెదవులు. దానిమ్మగింజల్లాంటి దంతపంక్తి. తళతళలాడే పరిశుభ్రవస్త్రాలు. ఈ సుందరాంగి ఒకనాడు శ్రీకృష్ణుడి సరసన సిగ్గులు మూటగడుతూ విలాసంగా నిలబడింది. మేలిముసుగులో ముఖం దాచుకుని ఒయ్యారంగా శ్రీకృష్ణుడిమీదకి వాలుచూపులు నిగుడించింది. రెప్పవెయ్యకుండా కృష్ణుడి సౌందర్యాన్ని ఆస్వాదిస్తోంది. కామోద్రేకంతో ముఖం వికసించింది. తనువంతా పులకించింది. సంభోగవాంఛ బలంగా పొటమరించింది. పరవశించిపోతోంది.

ఈ దశలో రాధాదేవి హఠాత్తుగా వచ్చింది. చూసింది. పట్టరానంత కోపం వచ్చింది. ఒక్కసారిగా ముఖమూ కన్నులూ ఎర్రకలువలైపోయాయి. విమానంనుంచి దిగింది. శ్రీకృష్ణుడిచ్చిన అర్ఘ్యపాద్యాలతో తడితడిగా ఉన్నాయి ఆవిడ పాదపద్మాలు. విస విసా నడుచుకుంటూ వెళ్ళి రత్నసింహాసనం అధిష్ఠించి కూర్చుంది. ఆమె వెంట గోపగోపీజన సహస్రమూ మహర్షిబృందమూ వెల్లగొడుగులు పడుతూ వింజామరలు వీస్తూ వచ్చారు. వారంతా రత్న సింహాసనానికి ఇరువైపులా బారులుతీరి నిలబడ్డారు.



సింహాసనంమీద కూర్చున్న రాధాదేవికి కోపంతో చెమటలు పోశాయి. సిందూరం చెమ్మగిల్లింది. నుదుటిబొట్టు జారింది. పెదవులు అదురుతున్నాయి. నిట్టూర్పులతో తారహారాలు ఎగురుతున్నాయి. కొప్పులో తురుముకున్న పారిజాత పుష్పమాలికలు కదులుతున్నాయి.

శ్రీకృష్ణుడు సాదరంగా ఎదురువెళ్ళాడు. బెదురుతున్న గుండెలను చిక్కబట్టుకుని చిరునవ్వులు చిందిస్తూ మధురంగా పలకరించాడు. కుశలప్రశ్నలు వేశాడు. గోపగోపీజనం కృష్ణుడికి నమస్కరించింది. స్తుతించింది. వెంటనే శ్రీకృష్ణుడు రాధాదేవిని స్తుతించాడు. గంగాదేవికూడా భయపడుతూనే చేరవచ్చి కుశలప్రశ్నలు వేసి అద్భుతంగా స్తుతించింది. ఎండిపోతున్న గొంతునీ పెదవులనూ తడుపుకుంటూ భయం భయంగా తలవంచుకుని నిలుచుంది. శ్రీకృష్ణుడి పాదపద్మాలనే ధ్యానించుకుంటూ ధైర్యం చెప్పుకుంటోంది. శ్రీకృష్ణుడు అది గమనించి రహస్యంగా గంగాదేవికి అభయమిచ్చాడు. దానితో ధైర్యం తెచ్చుకున్న గంగమ్మ తల ఎత్తి సింహాసనంమీద ఉన్న రాధాదేవిని తేరిపార చూసింది.

తళతళలాడుతున్న కాంతిపుంజంలాగా ఉంది రాధాదేవి. చూపులకు హాయిగా ఉంది. బ్రహ్మ తేజస్సుతో ప్రకాశిస్తోంది. అసంఖ్యాక బ్రహ్మలకు ఆవిడ సృష్టికారిణి. సృష్టికే ఆది సృష్టి. సనాతని. ఎప్పుడూ పన్నెండేళ్ళ ప్రాయంలోనే ఉండే ప్రారంభయౌవన. నిత్యకన్య. రూపగుణాలలో ఈ విశ్వంలో సాటిలేనిది. శాంతస్వరూప. సౌందర్యరాశి. ఆద్యంతరహిత. స్వామి సౌభాగ్యసంయుత. శుభప్రద. సుభద్ర. కృష్ణుడి అర్ధాంగి. వయస్సులో తేజస్సులో కాంతిలో అన్నింటా కృష్ణుడికి సమానురాలు. లక్ష్మీ శ్రీహరులతో అర్చింపబడే మహాలక్ష్మి. తన కాంతితో గోలోక సభామంటపాన్ని ప్రకాశవంతం చేస్తోంది. చెలికత్తె అందించిన తాంబూలాన్ని విలాసంగా ఆస్వాదిస్తోంది. పుట్టుక లేనిది. కానీ సర్వసృష్టికీ తానే జనని. కృష్ణప్రాణాధిదేవత. ప్రాణప్రియ. రాసేశ్వరి సురేశ్వరి అయిన ఆ రాధాదేవిని గంగాదేవి రెప్పవెయ్యకుండా తదేకదీక్షతో చూస్తోంది. కన్నులే దోసిళ్ళుగా ఆ సౌందర్యరాశిని గ్రోలుతోంది. ఎంతకీ తనివితీరడం లేదు.

దృష్ట్వా రాసేశ్వరీం తృప్తిం న జగామ సురేశ్వరీమ్ ।
నిమేషరహితాభ్యాం చ లోచనాభ్యాం పపౌ చ తామ్ ॥ (13-39)

రాధాదేవి ముఖంలో కోపం శాంతించింది. చిరునవ్వు వెల్లివిరిసింది. మధురంగా శ్రీకృష్ణుడిని అడిగింది - ప్రాణేశ్వరా ! ఈ కల్యాణి ఎవరు ? ఇందాక నీ పక్కనే నిలబడి కాముకదృష్టితో నీ ముఖపద్మ సౌందర్యాన్ని ఆస్వాదిస్తోంది. వాలుచూపులు నిగుడిస్తూ పులకించి పరవశించిపోతోంది. మేలిముసుగులో ముఖం కప్పుకుని రెప్పవాల్చకుండా చూస్తోంది. నువ్వుకూడా అలాగే కామివై చూస్తూ పరవశించిపోతున్నావు. చిరునవ్వులు చిందిస్తున్నావు. ఏమిటి ఇదంతా ? నేను బతికి ఉండగానే ఈ గోలోకంలో ఇలాంటి దుర్మార్గం జరగడమా ? నువ్వే మాటిమాటికీ ఇలాంటి చెడ్డపనులు చేస్తున్నావు. నేనేమో ఆడదాన్ని కనక



మనస్సు మెత్తన కనక నీ మీద ప్రేమతో ఓరిమి వహిస్తున్నాను. ఇక భరించలేను. పద, నువ్వూ నేనూ ఈ గోలోకంనుంచి వెళ్ళిపోదాం. లేకపోతే నువ్వు నాకు దక్కేట్టులేవు. నీకు ఇక్కడ భద్రతలేదు. పద, నన్ను తీసుకుపో. నువ్వు లంపటుడివి.

ఒకప్పుడు చందనారణ్యంలో విరజతో కనిపించావు. చెలికత్తెలు చెప్పారని ఊరుకున్నాను. నా అలికిడి విని నువ్వు అప్పుడు అదృశ్యమయ్యావు. పాపం ఆ విరజాదేవి శరీరం విడిచిపెట్టి నదిగా మారిపోయింది. ఇప్పటికీ నీ సత్కీర్తికి చిహ్నమై ప్రవహిస్తూనే ఉంది. నేను ఇంటికి వెళ్ళిపోయాక నువ్వు మళ్ళీ ఆ చందనారణ్యానికి వెళ్ళి విరజా ! విరజా ! అంటూ పరితపించావు. నీ వేదన చూడలేక యోగశక్తితో ప్రవాహం నుంచి బయటికి వచ్చి విరజాదేవి సాలంకృతమూర్తియై నీకు దర్శనమిచ్చింది. ఆమెను కౌగిలించుకుని సుఖించావు. నీ కలయికతో ఆవిడ గర్భం ధరించింది. సప్త సముద్రాలను ప్రసవించింది.

మరొకసారి చంపకారణ్యంలో శోభ అనే గోపికతో కనిపించావు. అప్పుడూ అంతే నా అలికిడి విని కంటికి కనిపించకుండా పారిపోయావు. ఆ గోపిక శరీరం విడిచిపెట్టి చంద్రమండలంలోకి శోభగా వెళ్ళిపోయింది. నువ్వు గుండెను రాయిచేసుకుని ఆవిడ తేజస్సుని విభజించి కొంత రత్నానికీ, కొంత బంగారానికీ, కొంత స్త్రీల ముఖాలకీ, కొంత రాజులకీ, కొంత చిగురాకులకీ, కొంత పువ్వులకీ, కొంత పక్వఫలాలకీ, కొంత పంటలకీ, కొంత రాజదేవమందిరాలకీ, కొంత శిశువులకీ, కొంత క్షీరానికీ పంచిపెట్టావు.

ఇంకొకసారి నువ్వు ప్రభ అనే గోపికతో బృందావనంలో పాదపాదలోనూ కనిపించావు. అప్పుడూ అలాగే నా అలికిడికి మాయమయ్యావు. పాపం ఆ ప్రభ శరీరం విడిచిపెట్టింది. సూర్యమండలానికి వెళ్ళిపోయింది. నువ్వేమో విలపించి విలపించి సిగ్గుతోనూ నా భయంతోనూ ఆ ప్రభను కొంత నీ కన్నుల్లో దాచుకున్నావు. కొంత అగ్నికీ, కొంత యక్షులకీ, కొంత పురుషసింహాలకీ, కొంత దేవతలకీ, కొంత విష్ణుజనులకూ, కొంత నాగజాతికీ, కొంత బ్రాహ్మణులకూ, కొంత మునులకీ, కొంత తపస్వులకూ కొంత సౌభాగ్యవతులకూ, కొంత యశస్వంతులకూ విభజించి ఇచ్చావు.

ఒక వసంత ఋతువులో రాసమండలాన నువ్వు శాంతి అనే గోపికతో పుష్పశయ్యమీద కనిపించావు. రత్నదీపాలంకృతమైన మందిరాలలో కనిపించావు. ఆవిడ ఇచ్చిన తాంబూలాన్ని ఆస్వాదిస్తూ పుష్పమాలికలతో చందనచర్చలతో ఆనందించావు. నా అలికిడి విని కనుమరుగయ్యావు. శాంతి శరీరం విడిచిపెట్టి నీలో లీనమయ్యింది. నువ్వు ఎంతగానో రోదించావు. అప్పుడూ అలాగే ఆ శాంతిని విభజించి కొంత బ్రహ్మకూ, కొంత నాకూ, కొంత లక్ష్మీదేవికీ, కొంత నీ మంత్రోపాసకులకూ, కొంత శాక్తేయులకూ, కొంత తపస్వులకూ, కొంత ధర్ముడికీ పంచిపెట్టావు.



మరొకసారి క్షమ అనే మరో గోపికతో ఆనందించి ఆవిడ కౌగిటిలో పరవశించి అలాగే పుష్పశయ్యమీద నిద్రించావు. ఆమెకూడా అలాగే మైమరిచి నిద్రించింది. నేను వచ్చి మీ ఇద్దరినీ నిద్ర లేపాను. గుర్తు తెచ్చుకో. నీ పట్టువస్త్రాన్నీ మురళినీ వనమాలనూ కౌస్తుభహారాన్నీ రత్నకుండలాలను ఊడలాక్కున్నాను. తరవాత నా సఖీజనం గోలపెడితే పోనీలే అని నీమీద ప్రేమతో తిరిగి ఇచ్చేశాను. గుర్తుందా ? నువ్వు ఆ సిగ్గుతోనో ఆ పాపంతోనో మరీ కృష్ణవర్ణుడివైపోయావు ఆ క్షణంలో.

పశ్చాత్త్వద్దత్తం ప్రేమ్ణా చ సఖీనాం వచనాదహో ।
లజ్జయా కృష్ణవర్ణోఽభూత్ భవాన్ పాపేన వా ప్రభో ॥ (13-74)

క్షమాదేవి సిగ్గుతో ప్రాణాలు విడిచి భూమిలో కలిసిపోయింది. మునుపటి సంఘటనల్లోలాగానే ఆవిడ శరీరం గుణశ్రేష్ఠమయ్యింది. నువ్వు ఆవిడమీద ప్రేమతో విలపించి విలపించి ఆ క్షమను కొంత విష్ణువుకీ, కొంత వైష్ణవులకూ, కొంత ధార్మికులకూ, కొంత ధర్ముడికీ, కొంత దుర్బలులకీ, కొంత తపస్వులకూ, కొంత వేదపండితులకూ పంచి ఇచ్చావు.

మహాప్రభూ ! ఇవ్వి నీ కథలు. ఇంకా ఉన్నాయి, వినాలనుకుంటే చెప్పు ఒక్కొటొక్కటీ గుర్తు చేస్తాను. నీ కథలు అన్నీ తెలిశాయి కానీ నీ గుణంమాత్రం అంతుబట్టడం లేదు.

ఇలా రాధాదేవి సున్నితంగా శ్రీకృష్ణుణ్ణి దెప్పిపొడుస్తూంటే గంగాదేవి సిగ్గుతో ముడుచుకుపోయి తలవంచుకుని నేలగీరుతూ నిల్చుంది. రాధమ్మ గంగవైపు తిరిగింది. ఏదో మాట్లాడబోయింది. అది గమనించిన గంగమ్మ తన యోగశక్తితో మాయమై జలప్రవేశం చేసింది. సిద్ధయోగినియైన రాధాదేవి అది గుర్తించి సృష్టిలో ఎక్కడెక్కడ ఉన్న జలాన్నీ త్రాగివెయ్యడానికి ఉపక్రమించింది. ఈ రహస్యాన్ని గుర్తించిన గంగమ్మ అదృశ్యరూపంతో వచ్చి శ్రీకృష్ణుడి పాదపద్మంలో ప్రవేశించి శరణువేడింది.

రాధాదేవి విజృంభించి గోలోక వైకుంఠలోక బ్రహ్మలోకాల్లో ఉన్న గంగాజలాన్ని అంతటినీ త్రాగేసింది. గంగాదేవి కనిపించలేదు. లోకాలన్నీ జలశూన్యమైపోయాయి. భూగోళం ఎండిపోయిన తామర పువ్వు అయ్యింది. ఎక్కడ చూసినా జలజంతు మృతదేహాలే. బ్రహ్మవిష్ణుమహేశ్వరాది దేవతలూ మునులూ మనువులూ ఎండిపోతున్న గొంతుకలతో దాహార్తులై గోలోకానికి వచ్చి పడ్డారు. కనిపించని గోలోక గోవిందుడికి సాష్టాంగ పడ్డారు. గోవిందా ! సర్వేశా ! పరప్రకృతీ ! వరేణ్యా ! వరదా !వరిష్ఠా ! వరకారణా ! గోపికావల్లభా ! గోపనాయకా ! ప్రభూ ! నిరీహ ! నిరాకారా ! నిర్లిప్తా ! నిరాశ్రయా ! నిర్గుణా ! నిరుత్సాహ ! నిర్వికారా ! నిరంజనా ! స్వేచ్ఛామయా ! సాకారా ! సత్త్వస్వరూపా ! సత్యంశా! సాక్షిరూపా ! సనాతనా ! పరమాత్మా ! పరమా ! పాహి, పాహి అంటూ వేడుకున్నారు. దర్శనం ఇమ్మని



ప్రార్థించారు. వారి ప్రార్థనలకు సంతోషించిన శ్రీకృష్ణుడు - గోపగోపీజన సంసేవ్యమానుడై రాధికా వక్షఃస్థలంమీద పరుండి ఆమె అందిస్తున్న తాంబూలాన్ని ఆస్వాదిస్తూ ప్రత్యక్షమయ్యాడు.

బ్రహ్మాదిదేవతలంతా సంతోషించారు. ఎవరు చెప్పాలి, ఏమి చెప్పాలి అని ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు. అందరూ కలిసి బ్రహ్మను ముందుకు నెట్టారు. విష్ణుమూర్తినీ వామదేవుణ్ణీ కుడి ఎడమల తోడుగా నిలుపుకుని బ్రహ్మదేవుడు శ్రీకృష్ణుడి సన్నిధికి వెళ్ళాడు. ఆ రాసమండలంలో బ్రహ్మదేవుడికి అంతా కృష్ణమయంగా కనిపించింది. అందరిదీ ఒకే వేషం, ఒకే రూపం, ఒకే అలంకరణ, ఒకే వయస్సు, ఒకే ఆసనం. అందరూ ద్విభుజులే. మురళీహస్తులే. వనమాలాధారులే. మయూరపింఛాలంకృతులే. కౌస్తుభభూషితులే. అందరూ శ్రీకృష్ణపరమాత్మలే. ఎవరు సేవ్యులో ఎవరు సేవకులో తెలియలేదు. ఎవరికి చెప్పాలో ఏమి చెప్పాలో తోచలేదు. క్షణకాలం తేజస్స్వరూపం కనపడుతోంది. మరుక్షణంలో రూపం కనపడుతోంది. ఇంకో క్షణంలో నిరాకారం, మరో క్షణంలో సాకారం. ఇంకొక క్షణంలో నిరాకార సాకార సంయుతం. ఒక క్షణంలో శ్రీకృష్ణుడు ఒంటరిగా కనపడుతున్నాడు. మరుక్షణంలో రాధాసమేతుడై కనపడుతున్నాడు. రాధారూపంలో కృష్ణుడూ, కృష్ణరూపంలో రాధ కనపడుతున్నారు. ఏది స్త్రీ రూపం ? ఏది పురుషరూపం ? బ్రహ్మదేవుడే పోల్చుకోలేకపోయాడు. ఇక ఇదికాదు పద్ధతి అనుకొని కళ్ళుమూసుకుని హృదయపద్మంలో ఉన్న శ్రీకృష్ణపరమాత్మను ధ్యానించాడు. భక్తితో స్తుతించాడు. అతడి ఆజ్ఞతో కన్నులు తెరిచి ఎట్టయెదుట రాధావక్షఃస్థలస్థితుడైన శ్రీకృష్ణుణ్ణి దర్శించాడు. మళ్ళీ నమస్కరించి స్తుతించాడు.

బ్రహ్మాదిదేవతలు ఎందుకు వచ్చారో వారు చెప్పకుండానే గ్రహించిన శ్రీకృష్ణుడు చిద్విలాసంగా- అప్యాయంగా పలకరించాడు. విరించీ ! కుశలమా ? దా. కమలాపతీ ? క్షేమమా ? పైకిరా. మహాదేవా! బాగున్నావా ? ఇటు రా. మహాభాగులు మీరంతా వచ్చారు గంగకోసమని. కదూ ! రాధాదేవికి భయపడి గంగమ్మ నన్ను శరణువేడింది. నా పాదపద్మంలో దాక్కొంది. మీకు ఇస్తాను. కానీ ఆవిడ భయాన్ని తొలగించండి - అన్నాడు.

ఈ మాటలకు బ్రహ్మదేవుడి ముఖంలో అప్రయత్నంగా చిరునవ్వు విరిసింది. వెంటనే చతుర్వదనాలతో చతుర్వేదాలతో రాధాదేవిని స్తుతించాడు. అమ్మా ! రాధికా ! ఈ గంగ రాసమండలంలో నీ శరీరంనుంచి జన్మించింది. శంకరుడి సంగీతానికి కరిగిపోయిన మీ దంపతులే ఈ రూపం. కృష్ణాంశతోనూ నీ అంశతోనూ అవతరించింది. మీకు అత్యంత ప్రీతిపాత్రయైన కన్యక. నీ మంత్రాన్ని స్వీకరించి భక్తితో నిన్ను పూజిస్తుంది. వైకుంఠేశ్వరుడైన చతుర్భుజుడు ఈమెకు భర్త అవుతాడు. భూలోకంలో ప్రవహించే ఈవిడ కళకు సముద్రుడు వల్లభుడవుతాడు. గోలోకంలో ఉన్న గంగమ్మయే సర్వలోకాలలోనూ ఉంటుంది. అవన్నీ కళాంశరూపాలు. నువ్వు సాక్షాత్తూ కన్నతల్లివి. దేవేశివి. ఈ గంగ నీకు కూతురులాంటిది.



బ్రహ్మదేవుడి ప్రసంగానికి రాధాదేవి సంతోషించింది. కోపం విడిచిపెట్టి చిరునవ్వులతో ప్రసన్నురాలయ్యింది. అప్పుడు గంగాదేవి శ్రీకృష్ణుడి పాదాంగుష్ఠం నుంచి బయలువెడలింది. అందరూ ఆమెను సత్కరించి గౌరవించారు. ఆ జలాధిష్ఠానదేవత ఆ సభాస్థలంలో మౌనంగా నిలచింది. మెల్లగా జలరూపాన నదిగా మారింది. ఆ నీటిని కొంచెం తన కమండలువులోకి తీసుకున్నాడు బ్రహ్మ. చంద్రశేఖరుడు కొంచెం శిరస్సుమీద నిల్పుకున్నాడు.

అటుపైని చతుర్ముఖుడు గంగాదేవికి రాధామంత్రాన్ని స్తోత్ర కవచ ధ్యాన పూజావిధానాలతో సహా ఉపదేశించాడు. అది అంతా సామవేదోక్తం. మంత్రోపదేశం పొంది గంగాదేవి రాధికను పూజించి వైకుంఠానికి వెళ్ళిపోయింది. లక్ష్మి - తులసి - గంగ - సరస్వతి - వీరు నలుగురూ నారాయణుడికి ప్రియాంగనలు.

లక్ష్మీ సరస్వతీ గంగా తులసీ లోకపావనీ ।
ఏతా నారాయణస్యైవ చతస్రో యోషితో మునే ॥ (13 - 24)

అప్పుడు శ్రీకృష్ణపరమాత్మ మేఘగంభీరస్వరంతో ప్రసంగించాడు. బ్రహ్మ విష్ణుమహేశ్వరులారా! దేవతలారా ! మునులారా ! మనువులారా ! అందరూ వినండి. ఇప్పుడు ఇక్కడికి వచ్చిన మీరంతా అదృష్టవంతులు. భాగ్యశాలులు. మీరంతా కాలచక్రంతో నిమిత్తంలేకుండా ఈ గోలోకంలో శాశ్వతంగా నివసిస్తారు. ఇప్పుడు కల్పాంతమయ్యింది. సృష్టి అంతా జలమయమయ్యింది. ఇతర విశ్వాలూ ఆ విశ్వాలలో ఉన్న బ్రహ్మాదులూ అందరూ జలమగ్నులయ్యారు. వైకుంఠం తప్ప అన్నీ జలమయమైపోయాయి. చతుర్వదనా! నువ్వు వెంటనే వెళ్ళి పునస్సృష్టి చెయ్యి. బ్రహ్మలోకంతో మొదలుపెట్టి సర్వలోకాలనూ సృష్టించు. అటుపైని గంగాదేవి వస్తుంది. ఇలాగే ఇతర విశ్వాలనూ అక్కడ బ్రహ్మాదులనూ నేను సృష్టిచేస్తాను. నువ్వు ఈ దేవతలతో కలిసి వెంటనే వెళ్ళు. ఇప్పటికి చాలాకాలం గడిచింది. చాలామంది చతుర్ముఖులు అంతరించారు. మళ్ళీ ఆవిర్భవించారు. ఇది కాలరహస్యం. నాకుమాత్రమే తెలుసు - అని చెప్పి రాధాసహితుడై అంతఃపురంలోకి నిష్క్రమించాడు.

బ్రహ్మాది దేవతలు పునస్సృష్టికి ఉద్యుక్తులై బయలుదేరారు. గోలోకంలో ఉన్న గంగ, బ్రహ్మదేవుడు సృష్టించిన ప్రతిలోకానికీ క్రమక్రమంగా వెళ్ళింది. ముందుగా వైకుంఠానికి అటుపైని శివలోకానికీ ఆపైని బ్రహ్మలోకానికీ అటుతరువాత భూమ్యాదిలోకాలకూ ప్రవహించింది.

నారదా! విష్ణుపాదంలోనుంచి ఆవిర్భవించి విష్ణుపదిగా కీర్తింపబడిన గంగాదేవి పుణ్యగాథ ఇది. మరింక ఏ మంగళప్రదమైన వృత్తాంతాన్ని వినాలనుకుంటున్నావో చెప్పు. తెలియజేస్తాను. - అని ముగించాడు నారాయణ మహర్షి. *(అధ్యాయం - 13 , శ్లోకాలు - 136)*



## ◆ గంగా - వైకుంఠుల పరిణయం ◆

శౌనకాదిమహామునులారా! శ్రద్ధగా వింటున్నారుకదా అని మరొకసారి హెచ్చరించి సూతుడు తరవాత కథను కొనసాగించాడు. అప్పుడు నారదుడు మళ్ళీ నారాయణమహర్షిని అడిగాడు -

మహర్షీ ! గంగాదేవి వైకుంఠానికి వెళ్ళింది అన్నావేతప్ప అక్కడ చతుర్భుజుడికి ఎలా ఇల్లాలయ్యిందో చెప్పలేదు. ఆ పుణ్యకథ వినాలని ఉంది. చెప్పవూ - అని నారదుడు అభ్యర్థించాడు. నారాయణ మహర్షి సరే అని ప్రారంభించాడు.

నారదా! గంగాదేవి వైకుంఠానికి బయలుదేరిందికదా! ఆవిడవెంట బ్రహ్మదేవుడు వెళ్ళాడు. వెళ్ళి వైకుంఠంలో ఉన్న చతుర్భుజ నారాయణుడికి విషయమంతా వివరించి చెప్పాడు. రాధాకృష్ణుల శరీరాలనుంచి ద్రవరూపంగా గంగాదేవి ఆవిర్భవించడమూ రాధమ్మకు భయపడి శ్రీకృష్ణుడి పాదపద్మంలో దాక్కోవడమూ రాధాదేవి అలిగి జలపానం చెయ్యడమూ తామందరూ గోలోకానికి వెళ్ళి శ్రీకృష్ణపరమాత్మను శరణువేడటమూ ఆయన దయతలిచి గంగను తన పాదంనుంచి విడిచిపెట్టడమూ అప్పుడు ఆ గంగాదేవిని వైకుంఠానికి వెళ్ళమనడమూ, అక్కడ చతుర్భుజనారాయణుడికి ఇల్లాలివి కమ్మనడమూ - మొత్తం జరిగిన వృత్తాంతాన్ని వివరంగా చెప్పాడు.

చతుర్భుజనారాయణా! వైకుంఠాధిపా! ఈవిడ పరమపావని. రాధాకృష్ణాంగసంభూత. జలాధిష్ఠాన దేవత. నవయౌవన సంపన్న. సుశీల. సుందరాంగి. శుద్ధసత్త్వస్వరూప. క్రోధాహంకార వివర్జిత. నిన్ను తప్ప ఈ వైకుంఠంలో మరెవ్వరినీ వరించదు. ఈవిడకు రాధికామంత్రాన్ని ఉపదేశించి ఇక్కడకి తీసుకువచ్చాను. గాంధర్వవివాహ పద్ధతిలో నువ్వు ఈమెను స్వీకరించు. నువ్వు సురేశ్వరుడవు. రసికుడవు. ఈమె సురేశ్వరి. రసిక. అందుచేత మీ ఇద్దరి సమాగమమూ పరస్పరం ఆనందదాయకంగా అనురూపంగా ఉంటుంది. నువ్వు పురుషులలో రత్నానివి. ఈవిడ స్త్రీరత్నం. నెరజాణకు నెరజాణతో సంగమం గుణోన్నతంగా ఉంటుంది. పైగా - స్వయంగా వరించి వచ్చిన కన్యను తిరస్కరించినవాడిమీద లక్ష్మీదేవి అలుగుతుంది. విడిచి వెళ్ళిపోతుంది. ఇది నిశ్చయం. పామరుడేకాదు పండితుడైనా ప్రకృతిని అవమానించడు. స్త్రీ అంటే ప్రకృతి కళాస్వరూపిణి. పురుషుడంటే ప్రాకృతికుడు.

ఉపస్థితాం స్వయం కన్యాం న గృహ్ణాతీహ యః పుమాన్ ।
తే విహాయ మహాలక్ష్మీ రుష్టా యాతి న సంశయః ॥ (14 - 13)

యో భవేత్పండితస్సోఽపి ప్రకృతిం నావమన్యతే ।
సర్వే ప్రాకృతికాః పుంసః కామిన్యః ప్రకృతేః కళాః ॥ (14 - 14)



నువ్వేమో జగన్నాథుడివి. నిర్గుణుడివి. ప్రకృతికి అతీతుడివి. శ్రీకృష్ణపరమాత్మ ద్విభుజుడైతే అతనిలో సగభాగమైన నువ్వు చతుర్భుజుడివి. కృష్ణుడి వామాంగంనుంచి ఆవిర్భవించిన మహాలక్ష్మి స్వరూపిణి రాధాదేవి. అందులో దక్షిణాంశ రాధాదేవికాగా వామాంశ లక్ష్మీదేవి. అంతా కలిపిచూస్తే ఈ గంగాదేవి నీ శరీరంనుంచి పుట్టినదే. అందుకే నిన్ను వరిస్తోంది. స్త్రీ పురుషులు అంటే ప్రకృతిపురుషులు అంతా ఏకాంగమే. కాబట్టి స్వీకరించు.

తేనేయం త్వాం వృణోత్యేవ యత్త్వద్దేహ సంభవా ।
ఏకాంగం చైవ స్త్రీపుంసోర్యథా ప్రకృతిపూరుషౌ ॥ (14 - 17)

అని బ్రహ్మదేవుడు వైకుంఠనాథుణ్ణి ఒడబరిచి గంగాదేవిని అప్పగించి వెళ్ళిపోయాడు. వైకుంఠనాథుడు గాంధర్వపద్ధతిలో గంగను వివాహం చేసుకున్నాడు. చందనచర్చలతో పుష్పమాలికలతో ఇద్దరూ శృంగారక్రీడల్లో మునిగితేలారు. నవసంగమసౌఖ్యానికి పరవశించిన గంగాదేవి మూర్ఛపోయింది. రసికేశ్వరుడి సమాగమం రసికురాలికి అంతటి పారవశ్యాన్ని కలిగించడం సహజమేకదా!

నారదా! ఇలా ఆనందిస్తున్న గంగాదేవిని చూసి నిత్యమూ సరస్వతీదేవి ఈర్ష్యపడుతూ ఉండేది. గంగ - లక్ష్మి - సరస్వతి - తులసి - నలుగురూ శ్రీహరికి భార్యలుగదా! సరస్వతిని చూసి గంగమ్మమాత్రం ఈర్ష్యపడేదికాదు. చివరికి భరించలేక ఒకనాడు గంగాదేవి సరస్వతిని శపించింది. భూలోకానికి పొమ్మంది. ఈ కథ అంతా నీకు తెలిసిందే. *(అధ్యాయం - 14, శ్లోకాలు - 23)*

నిత్యమీర్ష్యతి తాం వాణీ న చ గంగా సరస్వతీమ్ ।
గంగా శశాప కోపేన భారతే చ హరిప్రియా ॥ (14 - 22)

నారాయణ మహర్షి ఇక్కడకి ఆగి రవ్వంత ఊపిరి పీల్చుకున్నాడు. ఈసారి నారదుడికి తులసీకథ వినాలి అనిపించింది. ఆవిడ ఎక్కడ పుట్టింది? పూర్వజన్మ ఏమిటి? ఎవరి అమ్మాయి? ఏ తపస్సులు చేసి శ్రీహరిని భర్తగా పొందింది? వృక్షత్వం ఎలా వచ్చింది? ఇలాంటి సందేహాల్నీ ఏకరువుపెట్టాడు. నారాయణమహర్షి ఓపికగా బదులు పలికాడు.

## ◆ వేదవతిగా లక్ష్మీదేవి ◆

నారదా! దక్షసావర్ణి అని ఒక మనువు ఉన్నాడు. చాలా పుణ్యాత్ముడు. వైష్ణవుడు. శుచిశీలి. యశస్వి. విష్ణుమూర్తి అంశతో అవతరించాడు. ఆయనగారికి ఒక కుమారుడున్నాడు. బ్రహ్మసావర్ణి అని పేరు. అతడూ ధర్మాత్ముడే. విష్ణుభక్తి పరాయణుడే. అతని కుమారుడు ధర్మసావర్ణి . ఇతడూ వైష్ణవుడే. జితేంద్రియుడే. ఇతనికి రుద్రసావర్ణి, అతనికి దేవసావర్ణి, అతనికి ఇంద్రసావర్ణి పుత్రులుగా జన్మించారు.



అందరూ వైష్ణవులు. అందరూ ధర్మాత్ములు. అందరూ జితేంద్రియులు. అందరూ మహాతపస్వులు. వీరిలో ఇంద్రసావర్ణి కుమారుని పేరు వృషధ్వజుడు. పేరుకి తగ్గట్టే ఇతడు శివభక్తుడు. పరమ మాహేశ్వరుడు. ఇతడి ఆశ్రమంలో సాక్షాత్తు శివుడు మూడు దేవయుగాలపాటు ఉన్నాడంటే ఇక ఇతని శివభక్తిని గూర్చి వేరేచెప్పాలా! శివుడికికూడా వృషధ్వజుడంటే పుత్రాధిక వాత్సల్యం. స్నేహం. ప్రేమ. దానికి లొంగిపోయిన వృషధ్వజుడు నారాయణాది దేవతాపూజలనూ యజ్ఞయాగాదులనూ పరిత్యజించాగు. వాణీ లక్ష్మీపూజలను కూడా దూరం చేశాడు. అంతే కాదు వాటిని నిందించనారంభించాడు. ఇది భరించలేకపోయాడు సూర్యభగవానుడు. సర్వసంపదలూ తొలగి భ్రష్టుడివైపొమ్మని శపించాడు. ఇది విన్న శివుడు త్రిశూలం పుచ్చుకుని సూర్యుడి వెంటబడ్డాడు. సూర్యుడూ అతడి తండ్రీ బయపడి పరుగు లంకించుకున్నారు. బ్రహ్మదేవుణ్ణి శరణువేడారు. శివుడు అలాగే వెంబడించి బ్రహ్మలోకానికి వెళ్ళాడు. దానితో బ్రహ్మదేవుడికీ హడలెత్తింది. సూర్యుడితో సహా వైకుంఠానికి పరుగెత్తాడు. బ్రహ్మ - కశ్యప - మార్తాండులు ముగ్గురికీ భయంతో నోళ్ళు ఎండిపోయాయి. మాట పెగలలేదు. శ్రీమన్నారాయణుడి పాదాలమీద పడ్డారు. శరణు శరణు అన్నారు. బహుధాస్తుతించారు. జరిగినదంతా చెప్పారు. నారాయణుడు దయతలచి అభయమిచ్చాడు. నేనున్నాను భయపడకండి అన్నాడు. భయార్తులై ఎవరు నన్ను స్మరించినా నేను చక్రధారినై అక్కడ ప్రత్యక్షమవుతాను. రక్షిస్తాను. ఇది నా వ్రతం. ఈ జగత్తులకు రక్షకుణ్ణి నేను. బ్రహ్మరూపంలో సృష్టిచేసేది నేను. శివరూపంతో సంహరించేది నేను. నువ్వూ శివుడూ సూర్యుడూ అన్నీ నేనే. త్రిగుణాత్మకుణ్ణి. అనేక రూపాలూ అవతారాలూ ధరిస్తూ ఈ సృష్టిని కాపాడుతూ ఉంటాను.

**స్మరంతి యే యత్ర తత్ర మాం విపత్తౌ భయాన్వితాః ।**
**తాంస్తత్ర గత్వా రక్షామి చక్రహస్తస్త్వరాన్వితః ॥ (15 - 21)**

అందుచేత మీరు నిర్భయంగా జీవించండి. వెళ్ళండి. శివుడివల్ల మీకు ఈరోజు నుంచీ ఏ భయమూలేకుండా వరం ఇస్తున్నాను. శంకరుడు సజ్జనుడు. సర్వేశ్వరుడు. భక్తపరాధీనుడు. భక్తవత్సలుడు. సుదర్శనమన్నా శివుడన్నా నాకు ప్రాణాధికప్రియం. సుదర్శన శివులకన్నా తేజస్వి ఈ బ్రహ్మాండంలో నాస్తి.

**సుదర్శనః శివశ్చైవ మమ ప్రాణాధికః ప్రియః ।**
**బ్రహ్మాండేషు న తేజస్వీ హే బ్రహ్మన్ననయోః పరః ॥ (15 - 26)**

చతుర్ముఖా ! మరో రహస్యం నీకు తెలుసా ? శివుడు తలుచుకుంటే చిటికెలో కోటి సూర్యుల్ని సృష్టించగలడు. నీలాంటి బ్రహ్మదేవుళ్ళను కోటిమందిని కల్పించగలడు. అతడికి అసాధ్యమంటూ ఏదీ లేదు. అతడు రేయింబవళ్ళు నన్నే ధ్యానిస్తూ ఉంటాడు. నా మంత్రాన్నీ నా గుణగణాలనూ భక్తితో అయిదుముఖాల గానం చేస్తూ ఉంటాడు. అతడు జ్ఞాని. జ్ఞానాధిదేవత. నేనుకూడా నిరంతరం అతడి



మేలునే ఆకాంక్షిస్తూ ఉంటాను. ఎవరు ఎలా నన్ను ధ్యానిస్తే వారిని అలా నేను సేవిస్తుంటాను, రక్షిస్తుంటాను. (యథా చ మాం ప్రపద్యంతే తాంస్తథైవ భజామ్యహమ్) సకల శుభాలూ అతడి అధీనంలో ఉంటాయి. శివం కలిగించేవాడు కనకనే శివుడన్నారు. శుభస్వరూపమే అతడు.

శివస్వరూపో భగవాన్ శివాధిష్ఠాతృదేవతా ।
శివం భవతి తస్మాచ్చ శివం తేన విదుర్బుధాః ॥ (15 - 30)

శ్రీహరి ఇలా ప్రసంగిస్తుండగానే త్రిశూలధారియై శివుడు కోపంతో ఊగిపోతూ ఎరుపెక్కిన కన్నులతో వృషభ వాహనం మీద అక్కడికి వచ్చాడు. వస్తూనే వాహనం దిగాడు. చక్రికి శిరసువంచి భక్తిగా నమ్కరించాడు. ఒక్కసారి తలెత్తి తేరిపారజూశాడు.

రత్నసింహాసనంమీద రత్నాలంకార భూషితుడై కిరీట కుండలాలంకృతుడై వనమాలికాధారియై చక్రహస్తుడై చతుర్భుజుడై నవనీరదశ్యాముడై చందనచర్చిత సర్వాంగుడై పీతాంబరుడై లక్ష్మీప్రదత్త తాంబూలచర్వణపరాయణుడై అప్సరశ్చామరగ్రాహిణీ సంసేవితుడై విద్యాధరీ నృత్యగీతాస్వాదనరసికుడై విరాజిల్లుతున్న శ్రీమన్నారాయణుడు ఎట్టయెదుట కనువిందుచేశాడు.

ఈశ్వరుడు మరొక్కసారి నమస్కరించాడు. బ్రహ్మదేవుడు నిర్భయంగా నిలబడి భక్తితో శిరసువంచాడు. సూర్యుడూ కశ్యపుడూ అంజలిఘటించారు.

శ్రీ హరి చిరునవ్వులతో శివుణ్ణి ఆహ్వానించి సమున్నత సుఖాసనం చూపించాడు. శివుడు దానిమీద కూర్చున్నాడు. విష్ణుపార్షదులు వచ్చి ఇరువైపులా నిలిచి వింజామరలు వీచారు. మకరందంకన్నా మధురంగా మధుసూదనుడు పలకరించాడు.

మహాదేవా ! కుశలమా ? చాలాకాలమయ్యింది నిన్ను చూసీ, నీతో సంభాషించీ. పోనీలే ఇప్పటికైనా తీరుబాటుచేసుకుని వచ్చావు. కాసేపు హాయిగా గడుపుదాం. ఏదైనా పనిమీద వచ్చి ఉంటే చెప్పు. ముందు అది చూసి తరవాత కబుర్లకి దిగుదాం. అవునూ, నీ ముఖం ఏమిటి కొత్తగా ఉంది. ఎక్కడో కాసింత కోపరేఖ కనపడుతున్నట్టుంది - అంటూ మందహాసం విసిరాడు.

శివుడుకూడా ప్రతిగా చిరునవ్వులు చిందించాడు. శ్రీహరీ ! నువ్వన్నది నిజమే. నా కోపానికి కారణం ఉంది. వృషధ్వజుడని నా భక్తుడున్నాడు. భక్తుడే కాదు నాకు ప్రాణాధికప్రియుడు. అతడిని సూర్యుడు శపించాడు. అందుకని నాకు సూర్యుడిమీద కోపం వచ్చింది. త్రిశూలంతో తరుముకుంటూ వచ్చాను. నా పుత్రవాత్సల్యం దెబ్బతింది. సూర్యుణ్ణి సంహరించాలనుకున్నాను. అతడు వెళ్ళి బ్రహ్మను శరణువేడాడు. బ్రహ్మదేవుడు వచ్చి నిన్ను శరణుజొచ్చాడు. మనస్సుతోకానీ మాటతోకానీ నిన్ను శరణు



అన్నవాడికి ఇక ఏ ఆపదలూ ఉండవుకదా ! జరామృత్యుభయాలుకూడా దరిజేరవాయె. వాడు నిర్భయంగా నిశ్శంకగా సంచరించవచ్చు. అటువంటిది ప్రత్యక్షంగా వచ్చి నిన్ను శరణువేడుకొన్న విరించి సూర్యకశ్యపులను నేనే కాదు ఎవడుమాత్రం ఏమి చెయ్యగలడు? హరినామస్మరణ సర్వకాల సర్వావస్థలలోనూ అభయప్రదమూ మంగళప్రదమూను. నువ్వు జగన్నాథుడవు. అన్నీ తెలిసినవాడవవు. ధర్మ స్వరూపుడవు. నా భక్తుడి సంగతి ఏమిటో చెప్పు. వృషధ్వజుడు నాకు పుత్రనిర్విశేషుడు. ఈ సూర్యుడి శాపంవల్ల శ్రీవిహీనుడయ్యాడు. అతడిని ఎలా ఉద్ధరిస్తావో ఏమి చేస్తావో ఏమి చెయ్యమంటావో - అంతా నీ ఇష్టం అని ముగించాడు శివుడు.

శంభూ ! నువ్వు గమనించలేదుగానీ సూర్యుడు శపించిన నాటినుంచి ఇప్పటికి ఇరవైయొక్క యుగాల కాలం గతించింది. వైకుంఠంలో గంటన్నర కాలమంటే భూలోకంలో కొన్ని యుగాలు. నువ్వు వెంటనే నీ కైలాసానికి వెళ్ళు. వృషధ్వజుడు కాలధర్మం చెందాడు. కాలమనేది అతి దారుణమూ అని వార్యమూకదా ! అతడి కొడుకు రథధ్వజుడూ అస్తమించాడు. ఇతడి కొడుకులు ధర్మధ్వజ - కుశధ్వజులిద్దరూ ప్రస్తుతం జీవించి ఉన్నారు. సూర్యుడి శాపం కారణంగా అప్పటినుంచీ వీరందరూ ధనసంపద్విరహితులై గర్భదారిద్ర్యం అనుభవిస్తున్నారు. అయితే ధర్మధ్వజ కుశధ్వజులిద్దరూ పరమవైష్ణవులు. ప్రస్తుతం రాజ్యభ్రష్టులు. శ్రీవిరహితులు. ఇద్దరూ లక్ష్మీదేవిని ఉపాసిస్తున్నారు. కనక త్వరలోనే వారిద్దరి భార్యలకూ లక్ష్మీదేవి తన అంశనూ తన కళనూ అందిస్తుంది. పుత్రికగా జన్మిస్తుంది. అప్పుడు సంపన్నులవుతారు. రాజ్యం పొందుతారు. రాజశ్రేష్ఠులవుతారు. శివా ! ఇక నువ్వు వెళ్ళు. నీ సేవకుడు మరణించి చాలా కాలమయ్యింది - అని ఆజ్ఞాపించి శ్రీహరి కొలువు చాలించాడు. అభ్యంతరమందిరానికి వెళ్ళిపోయాడు. శివుడు తపస్సుకోసమని తన లోకానికి వెళ్ళిపోయాడు. బ్రహ్మదేవుడూ నిష్క్రమించాడు. సూర్యకశ్యపులూ సెలవుతీసుకున్నారు. ***(అధ్యాయం - 15, శ్లోకాలు - 52)***

నారదా ! ధర్మధ్వజ కుశధ్వజులు లక్ష్మీదేవిని ఆరాధిస్తూ చాలాకాలం తపస్సు చేశారు. ఆ తల్లి అనుగ్రహానికి పాత్రులయ్యారు. పోయిన రాజ్యాలనూ సంపదలనూ తిరిగి పొందారు. పుత్రవంతులూ అయ్యారు. వారిలో కుశధ్వజమహారాజుగారి ఇల్లాలు మాలావతి మళ్ళీ నీళ్ళుపోసుకుంది. పదినెలలూ మోసి ఆడపిల్లను ప్రసవించింది. ఆ బిడ్డ పుడుతూనే వేదధ్వని చేసింది. సద్యోయౌవనవతియై పురిటిమంచం నుంచి లేచి వచ్చింది. పుట్టగానే వేదాలు వల్లించింది కనక ఆ కన్యకకు వేదవతి అని నామకరణం చేశారు.

వేదధ్వనిం సా చకార జాతమాత్రేణ కన్యకా ।
తస్మాత్తాం వేదవతీం ప్రవదంతి మనీషిణః ॥ (16 - 5)



పురిటి గదినుంచి ఈవలికి వచ్చి స్నానం చేసి తపస్సు చేసుకుంటానంటూ అడవుల బయలుదేరింది. తల్లిదండ్రులూ పెద్దలూ ఎంత వారించినా వినిపించుకోలేదు. నిమిషం ఆగలే పుష్కరక్షేత్రానికి వెళ్ళి ఒక మన్వంతరకాలం తీవ్ర తపస్సు చేసింది. అయినా ఆమె శరీరం బడలిపోలే వాడిలి పోలేదు. నవయౌవనం అలాగే నిలిచింది. అప్పుడొక అశరీరవాక్కు వినిపించింది-

వేదవతీ ! పై జన్మలో నీ తపస్సు ఫలిస్తుంది. నీ కోరిక నెరవేరుతుంది. బ్రహ్మాదులకే అంద శ్రీహరిని పతిగా వాంఛిస్తున్నావు. వచ్చే జన్మలో శ్రీహరి నీకు భర్త అవుతాడు.

ఈ మాటలకు వేదవతి సంతోషించింది. అక్కడి నుంచి బయలుదేరి గంధమాదనపర్వతశిఖ మీద అత్యంత నిర్జన ప్రదేశంలో మళ్ళీ తపస్సు కొనసాగించింది.

ఒకనాడు అక్కడికి రావణాసురుడు వచ్చాడు. వేదవతి యథావిధిగా అతిథిమర్యాదలు చేసిం పళ్ళూ ఫలాలూ అర్ఘ్యపాద్యాలూ శీతలోదకాలూ భక్తితో సమర్పించింది. అన్నింటినీ స్వీకరించి పాపాత్ముడు మరింత చేరువకి వెళ్ళి వెకిలిగా కుశలప్రశ్నలు వేశాడు. ఆమె సౌందర్యానికి చలిం కామబాణ పీడితుడయ్యాడు. చటుక్కున చెయ్యిపట్టుకుని కౌగిలించుకోబోయాడు. వేదవతి కోపం బుసకొట్టింది. కళ్ళల్లో నిప్పులు రాల్చింది. అతడిని శిలాప్రతిమలా నిశ్చేష్టుణ్ణి చేసింది. రావణుడ రాతిబొమ్మ అయిపోయాడు. కాలూ చేయీ ఆడలేదు. నోటమాటలేదు. జడీభూతుడయ్యాడు.

సతీ చుకోప దృష్ట్వా తం స్తంభితం చకార హ ।
సజడో హస్తపాదైశ్చ కించిద్వక్తుం న చ క్షమః ॥ (16 - 16)

వేదవతి కన్నులు మూసుకుని మనస్సులో మహాదేవిని స్మరించింది. స్తుతించింది. కళ్ళ తెరిచింది. రావణుణ్ణి శపించింది. రావణా ! నా కారణంగానే నువ్వు నశిస్తావు. సపుత్రబాంధవంగ అంతరిస్తావు. నువ్వు కాముకుడవై నన్ను స్పృశించావు. కౌగిటిలోకి లాక్కోబోయావు. నీ బలం ఏమిట ఎంతో చూపించు - అంటూ యోగశక్తితో దేహం చాలించి వెళ్ళిపోయింది. నిశ్చేష్టుడై చూస్తూ నిలబడ్డ రావణాసురుడు కొంతసేపటికి తెప్పరిల్లాడు. ఆమె శరీరాన్ని గంగానదిలో విడిచిపెట్టి ఇంటికి వెళ్ళిపోయాడు. ఆశ్చర్యం నుంచి తేరుకోలేక వేదవతీరూపాన్నీ సాహసాన్నీ మరిచిపోలేక చాలాకాలం విలపించాడు.

అహో కిమద్భుతం దృష్టం కిం కృతం వావయాధునా ।
ఇతి సంచిత్య సంచిత్య విలలాప పునః పునః ॥ (16 - 20)



## ◆ సీత - ఛాయాసీత - ద్రౌపది ◆

కాలం గడిచింది. కృతయుగం వెళ్ళి త్రేతాయుగం వచ్చింది. వేదవతి జనకమహారాజు ఇంట సీతాదేవిగా అవతరించింది. పూర్వజన్మ తపఃఫలంగా శ్రీరాముణ్ణి పరిణయమాడింది. సీతారాములిద్దరూ చాలాకాలం వివిధ కామోపభోగాలతో ఆనందించారు. గతజన్మ తపఃక్లేశాలకు విరుగుడుగా సీతమ్మ సుఖసంతోషాలు అనుభవించింది.

తండ్రి మాటను నిలబెట్టడంకోసం సత్యసంధుడైన రాముడు అరణ్యవాసం చేశాడు. కాలం బలీయంకదా! సీతాలక్ష్మణ సహితుడై దాశరథి సముద్ర తీరారణ్యంలో నివసిస్తుండగా ఒకనాడు అగ్నిదేవుడు విప్రవేషంలో వచ్చాడు. అడవుల్లో కష్టాలు పడుతున్న రాముణ్ణి చూసి ఎంతగానో దుఃఖించాడు. ఏకాంతంలో కలుసుకున్నాడు.

రామా ! ఒక నిజం నీకు చెప్పి వెడదామని వచ్చాను. దైవం ఎవరికైనా దుర్నివార్యం. దైవం కన్నా బలీయమేదీ లేదు. కనక నేను చెప్పేది శ్రద్ధగా ఆలకించు. ఇది సీతాపహరణకాలం కాబట్టి ఈ జగన్మాతను నాకు అప్పగించు. ఛాయా సీతను నువ్వు కాపాడుకో. పరీక్షాసమయం వస్తుంది. అప్పుడు తిరిగి నీ సీతను నీకు అప్పగిస్తాను. దేవతలు పంపితే వచ్చాను నేను. కేవలం విప్రుణ్ణి కాదు. హుతాశనుణ్ణి.

దైవం చ దుర్నివార్యం చ న చ దేవాత్పరో బలీ ।
జగత్ప్రసూం మయి న్యస్య ఛాయాం రక్షాంతికేఽధునా ॥
దాస్యామి సీతాం తుభ్యం చ పరీక్షాసమయే పునః ।
దేవైః ప్రస్థాపితోఽహం చ న చ విప్రో హుతాశనః ॥ (16 - 32)

రాముడు ఆలకించాడు. శ్రద్ధగా ఆలకించాడు. ఏ మార్పూ ముఖంలో కనపడనివ్వలేదు. హృదయంలో మాత్రం కుమిలిపోయాడు. అగ్నిదేవుడు చెప్పినదానికి అంగీకరించాడు. హుతాశనుడు తన యోగశక్తితో ఛాయాసీతను సృష్టించి రాముడికి అప్పగించాడు. అసలు సీతను తీసుకుని వెళ్ళిపోయాడు. ఇది అత్యంతగోప్యంసుమా అని హెచ్చరిక చేసి మరీ వెళ్ళాడు. నారదా ! ఈ రహస్యం లక్ష్మణుడికికూడా తెలియదంటే రాముడు ఎంత గోప్యంగా ఉంచాడో గ్రహించు.

సీతాం గృహీత్వా స యయౌ గోప్యం వక్తుం నిషిధ్య చ ।
లక్ష్మణో నైవ బుబుధే గోప్యమన్యస్య కా కథా ॥ (16 - 35)

అగ్నిదేవుడు అటు వెళ్ళాడో లేదో బంగారులేడి రాముడి కంటపడింది. దాన్ని పట్టి తెమ్మని సీతాదేవి రాముణ్ణి కోరింది. లక్ష్మణుడిని సీతకు కాపలాఉంచి రాముడు బయలుదేరాడు. బంగారులేడిని వెంబడించి చివరికి బాణం వేశాడు. అది "హా లక్ష్మణా !" అని రామకంఠంతో అరిచి ప్రాణాలు వదిలింది



ప్రాణాలు వదిలే సమయంలో రాముణ్ణి దర్శించింది కనక దివ్యరూపంతో రత్నవిమానంలో వైకుంఠానికి చేరుకున్నాడు ఆ మాయామృగరూపధారి మారీచుడు. వైకుంఠ ద్వారపాలకులకు కింకరుడై అటుపైని వారి అనుమతితో లోపలికి ప్రవేశించాడు.

హా ! లక్ష్మణా ! అని వినిపించిన రామకంఠధ్వనిని విని సీతాదేవి భయపడింది. రాముడికి ఏదో ఆపద వచ్చింది సహాయపడమని లక్ష్మణుడిని పంపించింది. అతడు అలా వెళ్ళగా చూసి రాముడు వచ్చి సీతను లంకకు అపహరించుకుపోయాడు.

రామలక్ష్మణులు అడవిలో కలుసుకున్నారు. లక్ష్మణుడిని చూసి రాముడు ఆశ్చర్యపోయాడు. ఇద్దరూ కలిసి ఆశ్రమానికి వచ్చారు. పర్ణశాల బోసిపోయింది. సీతమ్మ లేదు. రాముడు దుఃఖించి దుఃఖించి మూర్ఛపోయాడు. తేరుకున్నాడు. ఇద్దరూ అడవులన్నీ గాలించారు.

రావణుడు అపహరించుకుపోయాడనే వార్త గోదావరీతీరాన తెలిసింది. అటుపైని వానరులతో సఖ్యంచేసి సముద్రానికి వారధి కట్టి లంకలో ప్రవేశించిన రాముడు స్వయంగా బాణం సంధించి రావణుడిని సంహరించాడు.

సీతకు అగ్నిపరీక్ష పెట్టాడు. అప్పుడు అగ్నిదేవుడు అసలు సీతను పవిత్రంగా రాముడికి అందించాడు. ఛాయాసీత అగ్నిదేవుడికీ రామచంద్రుడికీ సవినయంగా నమస్కరించి నా కర్తవ్యమేమిటో ఉపదేశించండి అని అభ్యర్థించింది. పుష్కరక్షేత్రానికి వెళ్ళి తపస్సు చేసుకోమనీ అక్కడే స్వర్గలక్ష్మివి అవుతావు అనీ చెప్పి పంపించారు.

ఛాయాసీత పుష్కరక్షేత్రంలో మూడులక్షల దివ్యసంవత్సరాలు తపస్సుచేసి స్వర్గలక్ష్మి అయ్యింది. ఆమెయే అటుతరవాత ద్వాపరయుగంలో ద్రుపదుడి ఇంట యజ్ఞకుండంనుంచి ఆవిర్భవించి ద్రౌపది అయ్యింది. ఇలా మూడు యుగాలలోనూ ఉంది కనక ఈమెకు త్రిహాయణి అనే పేరు ఏర్పడింది.

తచ్ఛాయా ద్రౌపదీ దేవీ ద్వాపరే ద్రుపదాత్మజా ।
త్రిహాయణీ చ సా ప్రోక్తా విద్యమానా యుగత్రయే ॥ (16 - 53)

పుష్కరక్షేత్రంలో ఛాయాసీత తపస్సు చేస్తున్నప్పుడు శంకరుడు ప్రత్యక్షమై వరం కోరుకోమన్నాడు. ఆమె కామాతురయై పతిని ఇయ్యి పతిని ఇయ్యి అని ఆవేశంగా అయిదుసార్లు అంది. రసికేశ్వరుడైన శివుడు పగలబడి నవ్వి "ప్రియా ! నీకు అయిదుగురు భర్తలుంటా"రని వరమిచ్చి అదృశ్యుడయ్యాడు.

నారదా ! అందుచేతనే ద్రౌపదికి పాండవులు అయిదుగురూ భర్తలయ్యారు. ప్రస్తావనలో వచ్చింది కనక ఈ విషయమూ చెప్పాను. అదిసరే.



అసలు సీతను స్వీకరించి, లంకారాజ్యానికి విభీషణుడిని పట్టాభిషిక్తుణ్ణి చేసి రాముడు అయోధ్యకు తిరిగివచ్చాడు. పదకొండువేల సంవత్సరాలపాటు రాజ్యం పరిపాలించాడు. అటుపైని సర్వలోకాలతోపాటూ తానూ వైకుంఠానికి వెళ్ళిపోయాడు. లక్ష్మీదేవి అంశయైన వేదవతి లక్ష్మీదేవిలో ప్రవేశించింది. చతుర్వేదాలూ మూర్తిమంతాలై వేదవతి నాల్కమీద నాట్యమాడుతూ ఉండేవిట ! అతి పవిత్రమూ పాపనాశకమూ పుణ్యప్రదమూ అయిన వేదవతీ వృత్తాంతం చెప్పాను. తరువాత కథ ఆలకించు.

*(అధ్యాయం - 16, శ్లోకాలు - 63)*

## ◆ తులసీ వృత్తాంతం ◆

నారదా ! నువ్వడిగిన తులసీ వృత్తాంతం ఇప్పుడు చెబుతున్నాను. విను. కుశధ్వజుడి సోదరుడున్నాడే ధర్మధ్వజుడు మాధవీదేవిని వివాహం చేసుకున్నాడు. గంధమాదనపర్వతగుహలలో అరణ్యాలలో పొదరిళ్ళలో సరస్సులలో ఆ దంపతులు కామకేళీపరవశులై విహరించారు. రేయింబవళ్ళు తేడాలేకుండా నూరు దివ్యసంవత్సరాలు శృంగారం లోతులు చూశారు. అప్పటికి రాజుగారికి తెలివి వచ్చింది. రాజ్యమూ పాలనమూ స్పృహలోకి వచ్చాయి. శృంగారక్రీడ చాలించి రాజధానికి వచ్చాడు. మాధవీదేవికి మాత్రం తనివి తీరలేదు. అయినా రాకతప్పిందికాదు. గర్భిణి అయ్యింది. నెలలు నిండాయి. కార్తికపూర్ణిమా శుక్రవారంనాడు శుభముహూర్తాన ఆడపిల్లను ప్రసవించింది. సాక్షాత్తు లక్ష్మీదేవి అవతరించింది. ఆ కనుముక్కు తీరూ ఆ వర్చస్సూ ఆ సౌందర్యమూ ఎర్రని చేతులూ కాళ్ళూ బంగారు శరీరకాంతీ - సుందరీమణులలోకెల్లా సుందరీమణిగా ఉన్న ఆ బాలికను చూసినవారంతా ఆశ్చర్యపోతున్నారు. ముగ్ధులవుతున్నారు. ఈమెకు సాటి ఇంకెవ్వరూ లేరంటే లేరు అని నిశ్చయించుకుంటున్నారు. అలా ఆ బిడ్డకు తుల (సాటి)లేనిది కనక తులసి అనే పేరు స్థిరపడింది. అందరూ ఆలాగే పిలవనారంభించారు.

> నరా నార్యశ్చ తాం దృష్ట్వా తులనాం దాతుమక్షమాః ।
> తేన నామ్నా చ తులసీం తాం వదంతి మనీషిణః ॥ (17 - 13)

తులసికూడా వేదవతిలాగే సద్యోయౌవనవతియై తపస్సు కోసమని బదరికావనానికి వెళ్ళింది. లక్ష దివ్యవత్సరాలు తపస్సు చేసింది. నారాయణుడే తనకు భర్తకావాలి అనే దృఢసంకల్పంతో తీవ్ర తపస్సు సాగించింది. గ్రీష్మంలో పంచాగ్నిమధ్యంలో నిలిచి, శీతర్తువులో తడిబట్టలు ధరించి, వర్షర్తువులో ఆరుబయట వానలో కూర్చుని, రేయింబవళ్ళు తపస్సు చేసింది. నీళ్ళూ పళ్ళూ తప్ప మరింక ఏ ఆహారమూ లేదు. ఒక ముప్ఫయివేల ఏళ్ళు కేవలం ఆకులు తిని, మరో నలభైవేల సంవత్సరాలు కేవలం వాయుభక్షణతోను, మరొక పదివేల వసంతాలు నిరాహారంగాను ఘోరతపస్సు చేసింది. శరీరాన్ని పూర్తిగా నిర్లక్ష్యంచేసి ఒంటికాలి బొటనవేలిమీద నిలబడి నిష్ఠగా తపస్సు చేస్తూంటే ఒకనాడు హఠాత్తుగా బ్రహ్మదేవుడు ప్రత్యక్షమయ్యాడు. తులసీదేవి సవినయంగా ఆ హంసవాహనుడికి నమస్కరించింది.



తులసీ ! నీ తపస్సుకి మెచ్చాను. వరం ఇస్తాను. నీ ఇష్టం ఏదైనా కోరుకో. హరిభక్తి కావాలా ? హరిదాస్యం కావాలా ? అజరామరత్వం కావాలా ? ఏది కావాలంటే అది ఇస్తాను. అడుగు - అన్నాడు చతుర్ముఖుడు.

తాతా ! నా మనసులో ఉన్నమాట చెబుతున్నాను విను. నువ్వు సర్వజ్ఞుడివి. నీముందు దాపరికమేమిటి, సిగ్గు ఏమిటి ? నేను తులసిని. ఒకప్పుడు గోలోకవాసినిని. గోపికను. గోవిందుడితో శృంగారక్రీడలో నేను పరవశించి ఉండగా రాసేశ్వరి రాధికాదేవి వచ్చి చూసింది. కోపావేశంతో గోవిందుణ్ణి బెదిరించింది. తనతో లాక్కుపోయింది. పోతూ నన్ను శపించింది. భూలోకంలో మానవకాంతగా పుట్టమంది. అప్పుడు గోవిందుడు నన్ను ఓదార్చుడు. నా అంశావతారమైన చతుర్భుజ నారాయణుడిని భర్తగా పొందుతావు. బ్రహ్మదేవుడు వరమిస్తాడు. భారతభూభాగాన తపస్సు చెయ్యి - అన్నాడు. అంతర్ధానం చెందాడు. నేను రాధాదేవికి భయపడి తనువు చాలించాను. భూలోకాన మానవకాంతగా జన్మించాను. హే సృష్టికర్తా ! శాంతసుందర విగ్రహుడైన శ్రీమన్నారాయణుడు నాకు భర్తగా లభించాలి. అదే నేను నిన్ను కోరుతున్న వరం. దయచేసి అనుగ్రహించు.

తులసీదేవీ ! తప్పకుండా నీ కోరిక నెరవేరుతుంది. శ్రీకృష్ణాంగ సముద్భవుడైన గోపకుడు సుదాముడు గోలోకంలో ఉండేవాడు. గుర్తుందా? అతడిప్పుడు రాధికాశాపంవల్ల భూలోకంలో దనువంశంలో జన్మించాడు. మహాతేజస్వి. కృష్ణుడి అంశతో ఆవిర్భవించిన సుందరుడు. శంఖచూడుడు అనే పేరుతో ముల్లోకాలలోనూ విఖ్యాతి గడించాడు. గోలోకంలో ఉన్నప్పుడు ఇతడు (సుదాముడు) నిన్ను చూసి కామపరవశుడవుతూండేవాడు. రాధికాదేవికి భయపడి అప్పట్లో ఏ సాహసమూచెయ్యలేకపోయాడు. ప్రస్తుతం అతడు భూలోకాన జాతిస్మరుడు. నువ్వూ అలాగే జాతిస్మరవే. నిన్ను చూడగానే తప్పకుండా గుర్తుపడతాడు. కనక వెళ్ళు. ఇప్పటికి అతణ్ణి భర్తగా స్వీకరించు. తరవాత సాక్షాత్తు నారాయణుడినే వరిద్దువుగాని.

గోపికా ! మరొక విశేషం. నారాయణుడి శాపంవల్లా దైవయోగంవల్లా నువ్వు ఒక పవిత్రమైన వృక్షరూపాన్ని పొందుతావు. విశ్వపావనివి అవుతావు. నీ పువ్వులు విష్ణుమూర్తికి ప్రాణాధిక ప్రియాలు అవుతాయి. నువ్వులేవి పూజలన్నీ నిష్ఫలమవుతాయి. బృందావనంలో నీపేరు బృందావని. నీ దళాలతోనే గోపగోపీజనం మాధవుణ్ణి అర్చిస్తారు. నువ్వు వృక్షాధిదేవతవు అవుతావు. ఆ రూపంతో నిరంతరం స్వేచ్ఛగా శ్రీకృష్ణుడితో విహరిస్తావు. ఇది నా వరం. ఇక ఈ ఘోరతపస్సు చాలించు.

బ్రహ్మదేవుడి వరానికి సంతోషించి తులసీదేవి చిరునవ్వులు చిందించింది. మరొక్కసారి శిరసువంచి నమస్కరించింది. మెల్లగా తన అంతరంగం బయటపెట్టింది.

పరమేష్ఠీ ! నిజం చెబుతున్నాను. ద్విభుజుడూ శ్యామసుందరుడూ అయిన గోలోక కృష్ణుడిమీదనే ఉంది నా మనస్సు. అంతగా చతుర్భుజుడిమీద లేదు. అలనాడు శృంగారభంగమయ్యింది. అప్పటినుంచీ



అసంతృప్తిగానే ఉంది. అయినా ఆ గోవిందుడే ఆజ్ఞాపించాడు అంటున్నావు కనక అంగీకరిస్తున్నాను. అదీకాక నీ వరానుగ్రహంవల్ల, సుదుర్లభుడైన ఆ గోలోక గోవిందుణ్ణి మళ్ళీ పొందగలుగుతాను కనక సమ్మతిస్తున్నాను. కానీ నా హృదయంలో నాటుకుపోయిన రాధాభయం ఇప్పటికీ వేధిస్తూనే ఉంది. దాన్ని తొలగించుకునే ఉపాయం చెప్పు.

తులసీ ! దానికి ఒక దివ్యమైన ఉపాయం ఉంది. షోడశాక్షరమైన రాధికామంత్రాన్ని ఉపదేశిస్తాను స్వీకరించు. ఈ మంత్రాన్ని జపిస్తే నువ్వు రాధికాదేవికి ప్రాణప్రియవు అవుతావు. రాధికా సమానురాలివై గోవిందుడికి ప్రీతిపాత్రవు అవుతావు. మీ ఇద్దరి రహస్య శృంగారాన్ని రాధిక తెలుసుకోలేదు - అని చెప్పి మంత్రాన్ని ఉపదేశించి స్తోత్రమూ కవచమూ పూజావిధానమూ వివరించి అంతర్ధానం చెందాడు.

తులసీదేవి ఆ మంత్రాన్ని ఉపాసించి మహాలక్ష్మీ సమానురాలయ్యింది. మహాభోగాలన్నీ అందుబాటులోకి వచ్చాయి. తపఃక్లేశాన్ని మరచిపోయింది. ఫలం సిద్ధిస్తే దుఃఖంకూడా సుఖం అనిపిస్తుంది కదా ! *(అధ్యాయం - 17, శ్లోకాలు - 48)*

ప్రసన్నమనసా దేవీ తత్యాజ తపసః క్లమమ్ ।
సిద్ధే ఫలే వరాణాంచ దుఃఖం చ సుఖముత్తమమ్ ॥ (17 - 47)

ధర్మధ్వజ మహారాజుగారి కూతురు తులసీదేవి తపోవనంలోనే రాజభోగాలు అనుభవిస్తోంది. నిత్యమూ చెలికత్తెలతో విందులూ వినోదాలే. ఒకరోజు రాత్రి విందులు ఆరగించి పుష్పచందన చర్చితమైన మనోహరశయనంమీద మేను వాల్చింది.

భుక్త్వా పీత్వా చ సంతుష్టా శయనం చ చకార సా ।
తల్పే మనోరమే తత్ర పుష్పచందన చర్చితే ॥ (17 - 48)

నవయౌవనంలో ఒంటరిగా ఉన్న ఆ సుందరాంగిమీదకి మన్మథుడు నిర్దాక్షిణ్యంగా తన అయిదుబాణాలు గురిపెట్టాడు. ఆ దాడికి తట్టుకోలేక తులసీదేవి విలవిలలాడింది. శరీరం పులకించగా కన్నులు ఎరుపెక్కాయి. క్షణంలో మేను వాడిపోయింది. మూర్ఛపోయింది. క్షణంలో తేరుకుంది. క్షణం నిద్రపోయింది. మరుక్షణంలో మేలుకొంది. క్షణం ఉద్విగ్న అయ్యింది. క్షణంలో దహించుకొనిపోయింది. క్షణంలో ప్రసన్నురాలయ్యింది. క్షణకాలం చేతనత్వం, క్షణకాలం విషణ్ణత. క్షణం కూర్చోవడం, క్షణం లేచి నిలబడటం. క్షణం మేను వాల్చడం, క్షణం లేచి తిరగడం. క్షణం పరుగులు తియ్యడం, క్షణం స్థాణువు కావడం. ఏమి చేస్తోందో ఏమి జరుగుతోందో ఆమెకే తెలియడంలేదు. పుష్పచందనతల్పం కంటకశయనమయ్యింది. (కంటకం = ముల్లు). ఫలాలూ జలాలూ విషతుల్యమయ్యాయి. రాజమందిరం



కొండగుహ అనిపించింది. సన్ననివస్త్రం అగ్నికీల అయ్యింది. చెక్కిలిమీద చిత్రించుకున్న సిందూరమకరికాపత్రం పుండులా బాధించింది.

నిలయం చ బిలాకారం సూక్ష్మవస్త్రం హుతాశనః ।
సిందూరపత్రకం చైవ వ్రణతుల్యం చ దుఃఖదమ్ ॥ (18 - 8)

ఒక సుందరాంగుడు రసికేశ్వరుడు యువకుడు చందనచర్చితుడు రత్నభూషణభూషితుడు పుష్పమాలికాసమలంకృతుడు ఎదురు వస్తున్నట్టూ తన ముఖపద్మాన్ని కన్నులతో ఆస్వాదిస్తున్నట్టూ చెవిలో రహస్యంగా మధురంగా రతికథాలాపాలు చేస్తున్నట్టూ తల్పంపైని తనను కౌగిలించుకొని అలరిస్తున్నట్టూ అంతలోనే లేచి వెళ్ళిపోతున్నట్టూ, నిలు నిలు ప్రాణేశా ! ఎక్కడికి ఈ పయనం అంటూ తాను వెంటపడుతున్నట్టూ అతడు వెనుదిరిగి మళ్ళీ తన దగ్గరికి వస్తున్నట్టూ - భ్రాంతిలోనే అయినా ఏవేవో మధురానుభవాలు కలుగుతున్నాయి. ఇది అంతా వట్టి భ్రాంతి అని మరుక్షణంలో తెలిసివస్తోంది. ఆ తెలివిడి రాగానే ఆపుకోలేని దుఃఖంతో విలపిస్తోంది. ఇలా నవయౌవనం ఏడిపిస్తూంటే తులసీదేవికి ఆ రాత్రి గడవటం కష్టమయ్యింది. అలాగే విలపిస్తూ కూర్చుంది.

పునశ్చ చేతనాం ప్రాప్య విలలాప పునఃపునః ।
ఏవం సా యౌవనం ప్రాప్య తస్థౌ తత్రైవ నారద ॥ (18 - 13)

## ◆ తులసీ - శంఖచూడుల సంవాదం ◆

అంతలోకీ శంఖచూడుడు అనే తరుణవయస్కుడు అటువైపు వచ్చాడు. పుష్కరక్షేత్రంలో జైగీషవ్యుని ఉపదేశంపై నిష్ఠగా తపస్సుచేసి శ్రీకృష్ణ మహామంత్రంవల్ల సిద్ధుడైన యోగీశ్వరుడతడు. సర్వమంగళ ప్రదమైన కవచాన్ని కంఠసీమలో హారంగా ధరించి బ్రహ్మదేవుడి ఆజ్ఞమేరకు అక్కడికి వచ్చాడు. మనోవాంఛాసిద్ధిరస్తు - అని విరించి వరమిచ్చి ఆశీర్వదించి మరీ పంపించాడు.

తనవైపు నడిచివస్తున్న శంఖచూడుణ్ణి చూసింది తులసీదేవి. నవయౌవన సంపన్నుడు. సాక్షాత్కరించిన మన్మథుడు. సంపెంగ పువ్వులాగా ఉన్నాడు. రత్నభూషణభూషితుడు. శరత్పూర్ణిమనాటి చంద్రబింబంలాంటి ముఖం. శరత్పంకజాల్లాంటి కన్నులు. దివ్యరత్నవిమానం నుంచి దిగివస్తున్నాడు. కదలాడుతున్న రత్నకుండలాల కాంతులు చెక్కిళ్ళపై లాస్యం చేస్తున్నాయి. అలంకరించుకున్న పారిజాత పుష్పమాలికల పరిమళాలు బహుపరాకులు పలుకుతున్నాయి. చిరునవ్వులు చిందిస్తున్నాడు. నొసటనున్న బొట్టు కస్తూరీచందనగంధాలను వెదజల్లుతోంది. మదగజగమనంతో ఆ మనోహరుడు చేరువకి వచ్చి నిలబడ్డాడు.



తులసీదేవి తానెప్పుడు లేచి నిలబడిందో తనకే తెలియలేదు. మేలిముసుగులో ముఖం దాచుకుని తలవంచి చిరునవ్వులు చిందిస్తూ కాలికొనగోట నేలను గీరుతూ క్రీగంట పులుకుపులుకున తిలకిస్తూ పులకించిపోతోంది.

సా దృష్ట్వా సన్నిధావేవం ముఖమాచ్ఛాద్య వాససా ।
సస్మితా తం నిరీక్షంతీ సకటాక్షం పునఃపునః ॥
బభూవాతినమ్రముఖీ నవసంగమలజ్జితా ॥ (18 - 21)

శంఖచూడుడు తులసీదేవిని సన్నిహితంగా చూశాడు. శరచ్చంద్రుణ్ణి నిందించే ఆమె ముఖం. మాలతీపుష్పమాలికలు అలంకరించిన కబరీభారం. రత్నాలు పొదిగిన అమూల్య విచిత్ర కుండలాలు. ఆ కాంతులలో బుగ్గలు మరీ మెరిసిపోతున్నాయి. రత్నతారహారాలు పీనోన్నతవక్షఃస్థలంమీద నిట్టూర్పులకు కదలాడుతున్నాయి. రత్నకంకణాలు. రత్నకేయూరాలు. చిన్ని చిన్ని సంకులు కూర్చి కట్టిన దండ. (సంకువు = శంఖం). అన్నివేళ్ళకూ రత్నాంగుళీయకాలు. పాదాలకు మణిమయమంజీరాలు. కాలు కదుపుతూంటే మనోహరంగా సవ్వడి చేస్తున్నాయి. లాక్షాలంకృత పాదపద్మాలు. రాసిబోసిన సౌందర్యంలాగా ఉన్న ఆ లలితసుందరమూర్తిని ఆపాదమస్తకం తిలకించాడు. కామభావపరవశుడయ్యాడు. మధురంగా పలకరించాడు.

కల్యాణీ ! ఎవరి అమ్మాయివి ? నీపేరేమిటి ? కన్యకామణులలోకెల్లా ధన్యురాలివి, మాన్యురాలివి. సర్వకల్యాణదాయినివిగా కనిపిస్తున్నావు. నేను నీ సేవకుణ్ణి. సుందరీ ! దయచేసి సంభాషించి నన్ను అనుగ్రహించు.

కా త్వం మానిని కల్యాణి సర్వకల్యాణదాయినీ ।
మౌనీభూతే కింకరే మాం సంభాషాం కురు సుందరి ॥ (18 - 28)

కామవాంఛాపరిప్లుతుడై శంఖచూడుడు ఇలా పలకరించేసరికి ఆ వామలోచన తానూ అదే పరిస్థితిలో అదే ఉద్దేశంతో ఉంది కనక తలవంచుకునే బదులు పలికింది.

నేను ధర్మధ్వజుడి కన్నకూతిరిని. ఈ తపోవనంలో చాలాకాలం నుంచీ తపస్సుచేస్తూ తపస్వినిగానే ఉంటున్నాను. నువ్వు ఎవరివో ! ఇటు ఎందుకు వచ్చావో ! నీ దారిన నువ్వు సుఖంగా వెళ్ళు. ఉత్తమ వంశంలో పుట్టిన శీలవతులను ఏకాంతంలో ఇలా పలకరించడం నీవంటి సజ్జనులకు తగదు. ఇది శాస్త్ర విరుద్ధంకూడా.

వేదం తెలియనివాడూ లంపటుడూ ధర్మశాస్త్రాన్ని తిరస్కరించినవాడూ అసత్కులంలో పుట్టినవాడూ మాత్రమే ఇలా ఏకాంతంలో కాముకుడై కామినీమణులతో సంభాషణకు దిగుతాడు. అటువంటి పురుషులు మెచ్చుకునేదీ ఇష్టపడేదీ అటువంటి కాంతలనే.



నీకు తెలుసో తెలీదో, అసలు స్త్రీలు అంటేనే పయోముఖ విషకుంభాలు. ఆపాతమధురంగా మాట్లాడతారు. హృదయంలోమాత్రం మదమత్తలై ఉంటారు. వాళ్ళ మనస్సు మంగలికత్తిలా ఉంటుంది. వచస్సు పూలగుత్తిలా ఉంటుంది. తమ కోరికలు తీర్చుకోవడం తప్ప వారికి మరొక ధ్యాస ఉండదు.

హృదయే క్షురధారాభాం శశ్వన్మధురభాషిణీమ్ ।
స్వకార్యపరినిష్పత్త్యై తత్పరాం సతతం చ తామ్ ॥ (18 - 34)

పని ఉంది అంటే స్వామికి వశవర్తినులై ఉంటారు. పని తీరిపోయిందంటే తల ఎగరేస్తారు. హృదయంలో మాలిన్యమూ ముఖంలో మాటల్లో ప్రసన్నత వీరి లక్షణం. పురాణగాథలు చూడు. స్త్రీల చరిత్రలు ఎంత దూషితాలో తెలుస్తాయి. అటువంటి స్త్రీలను తెలివైనవాడు ఎవడూ నమ్మడు. నమ్మాడు అంటే వాడు మూర్ఖుడైనా అయ్యుండాలి, దుష్టుడైనా అయ్యుండాలి.

ఆడవారికి హితులూ అహితులూ అని రెండు విభాగాలు ఏమీ ఉండవు. ఎప్పటికప్పుడు కొత్తవాడు కావాలి. అందగాడూ యువకుడూ అయితే చాలు. శత్రువా మిత్రుడా అనే తేడా ఏమీ లేదు.

వీళ్ళు ప్రదర్శించే పాతివ్రత్యమంతా కేవలం బాహ్యాడంబరమే. ప్రయత్నపూర్వకంగా ఆ ప్రదర్శన చేస్తారు. మనసుల్లో నిరంతరం కామవాంఛలే. బాహ్యశరీరాన్ని లోకం కన్నుగప్పడానికి పాతివ్రత్యంతో ఖేదపరుచుకుంటూ అంతరంగంలో మదనక్రీడలు సాగిస్తుంటారు. రహస్యంగా ప్రియుడిమీదకి నవ్వులు రువ్వుతూ బహిరంగంలో సిగ్గరితనం నటిస్తుంటారు.

బాహ్యే ఛలాత్ ఖేదయంతీ స్వాంతర్మైథునమానసా ।
కాంతం హసంతీ రహసి బాహ్యేఽతీవ సులజ్జితా ॥ (18 - 39)

మైథునం లేనివేళ వీళ్ళకోపానికి అవధులుండవు. సివంగులై కయ్యాలకు దిగుతారు. సుదీర్ఘ సంభోగానికి సంతసిస్తారు. స్వల్పసంభోగానికి దుఃఖిస్తారు. మృష్టాన్నపానీయాదులకన్నా వీరు తహతహలాడేదీ ఆరాటపడేదీ సుందరుడూ రసికుడూ గుణవంతుడూ అయిన యువకుడికోసమే.

సుమిష్టాన్నాత్ శీతతోయా దాకాంక్షంతీ చ మానసే ।
సుందరం రసికం కాంతం యువానం గుణినం సదా ॥ (18 - 41)
సుతాత్పరమభిస్నేహం కుర్వంతీ రసికోపరి ।
ప్రాణాధికం ప్రియతమం సంభోగకుశలం ప్రియమ్ ॥ (18 - 42)

రసికుడంటే వీళ్ళకి కొడుకుమీదకన్నా ప్రేమ. సంభోగ కుశలుడైన ప్రియుడు వీళ్ళకి ప్రాణాధికుడు. మగడు ముసలివాడైనా సంభోగచతురుడు కాకపోయినా అతడే వీళ్ళకి ప్రథమశత్రువు. అనుక్షణమూ



అతడిని తిట్టిపోస్తూ జగడాలాడుతుంటారు. పెనుసర్పం ఎలకపిల్లను తిన్నట్టు సూటిపోటిమాటలతో దెప్పరాలతో కొరుక్కుతినేస్తుంటారు. స్త్రీ అంటే దుస్సాహసస్వరూప. సర్వదోషాలకూ నిలయం. బ్రహ్మాది దేవతలకుకూడా దుస్సాధ్య. కేవలం మోహస్వరూపిణి. మోక్షద్వారానికి తలుపుచెక్క. తపస్సులకి అడ్డగడియ. విష్ణుభక్తికి అడ్డుపుల్ల. సమస్తమాయలకూ దాపుడుకుండ. సంసారకారాగారంలో ఇనపసంకెల. ఇంతి అంటే అదొక ఇంద్రజాలం. అదొక మిథ్య. అదొక స్వప్నం. పైకి కనిపించే అవయవాలన్నీ అందంగానే ఉంటాయి. లోపల అంతటా కుళ్ళే. మలమూత్రసంకులమై దుర్గంధభూయిష్ఠమై నెలకు మూడునాళ్ళు రక్తసిక్తమై సంస్కారవిరహితమై ఆ రహస్యాంగం కుత్సితంగా ఉంటుంది.

బ్రహ్మదేవుడు మాయావులకోసమని ఈ మాయారూపాన్ని సృష్టించాడు. అందుకే ముముక్షువులు ఈ స్త్రీని విషరూపంగా తిరస్కరిస్తారు. భోగలాలసులు మాత్రం కామవాంఛలతో ఎగబడి అందుకోలేక తృప్తిపొందలేక బోరగిలబడతారు.

నారదా ! తులసీదేవి తాను స్త్రీ అయినా ఇంత సుదీర్ఘంగా స్త్రీనింద చేసింది. మనస్సులో అనురాగం ఉన్నా మాటల్లో కాఠిన్యాన్ని ప్రదర్శించింది. శంఖచూడుడు నిబ్బరంగా బదులు పలికాడు.

దేవీ ! నువ్వు అన్నది పూర్తిగా అసత్యమూ కాదు, అలాగని పూర్తిగా సత్యమూ కాదు. సగం అదీ, సగం ఇదీ. కనక నేను చెప్పేదికూడా కొంచం విను.

త్వయా యత్కథితం దేవి న చ సర్వమలీకకమ్ ।
కించిత్సత్యమలీకం చ కించిన్మత్తో నిశామయ ॥ (18 - 51)

బ్రహ్మదేవుడు స్త్రీలను రెండు రకాలుగా సృష్టించాడు. కొందరు సుగుణవతులు. కొందరు దుర్గుణవతులు. సృష్టి అన్నాక అన్ని రకాలూ ఉంటాయి. లక్ష్మి - సరస్వతి - దుర్గ - సావిత్రి - రాధిక వీరంతా స్త్రీరూప సృష్టికి ప్రథమావతారాలు. సృష్టిసూత్రస్వరూపిణులు. కాబట్టి నిజానికి సృష్టిలో స్త్రీరూపం వీరి అంశమే. స్త్రీలందరూ వీరి అంశావతారాలే. కనక స్త్రీమూర్తి సర్వమంగళకారకం. శతరూప, దేవహూతి, స్వధాదేవి, స్వాహాదేవి, దక్షిణాదేవి, ఛాయావతి, రోహిణి, వరుణాని, శచి, కుబేరపత్ని, దితి, అదితి, లోపాముద్ర, అనసూయ, తులసి, అహల్య, అరుంధతి, మేనాదేవి, తార, మందోదరి, దమయంతి, వేదవతి, గంగ, మనసాదేవి, పుష్టి తుష్టి స్మృతి మేధా దేవతలు, కాళిక, వసుంధర, షష్ఠీదేవి, మంగళచండిక, ధర్మకామిని, స్వస్తి శ్రద్ధా శాంతి కాంతి క్షాంతి దేవతలు, నిద్రా క్షుత్ పిపాసా సంధ్యా రాత్రి దేవతలు, సంపత్తి ధృతి కీర్తి క్రియా శోభా శివామూర్తులు - వీరంతా ఉత్తమాంగనలు. పతివ్రతలు. శక్తి స్వరూపిణులు. యుగయుగాలుగా వీరు స్త్రీమూర్తులై అవతరిస్తూనే ఉన్నారు. పవిత్రంగా జీవితాలు గడుపుతూనే ఉన్నారు. కానీ నువ్వన్నట్టు కొందరు పుంశ్చలీరూపిణులూ ఉన్నారు. వారిని నిందించడం తగునుగానీ



సత్త్వగుణ ప్రధానలైన సాధ్వీమణులనుకూడా వారితో సమంగా జమచేసి మొత్తం స్త్రీజాతినే నిందించడం తగదుగాక తగదు.

స్త్రీలలోగానీ పురుషులలోగానీ గుణాధిక్యాన్ని బట్టి ఉత్తమ మధ్యమ అధమ భేదాలు ఏర్పడతాయి. సత్త్వగుణ ప్రధానులది ఉత్తమశ్రేణి. రజోగుణులది మధ్యమశ్రేణి. తమోగుణులది అధమశ్రేణి. పండితుడై ఉత్తమవంశంలో పుట్టి సత్త్వగుణ ప్రధానుడైన వాడెవడూ ఎంతటి అవకాశం లభించినా పరస్త్రీని వాంఛించడు.

న స్పృశ్యతి కులే జాతః పండితశ్చ పరస్త్రియమ్ ।
నిర్జనే నిర్జలే వాపి రహస్యపి పరస్త్రియమ్ ॥ (18 - 67)

అయితే అధముడివా, ఇక్కడికి ఇలా ఎందుకు వచ్చావు ? అని నువ్వు అడగవచ్చు. నా రాకకు తగినంత కారణం ఉంది. బ్రహ్మదేవుడి ఆజ్ఞమేరకు నేను వచ్చాను. నిన్ను గాంధర్వవివాహం చేసుకుంటాను. నేనే శంఖచూడుణ్ణి. ప్రస్తుతం దానవుణ్ణి. దేవతలకు శత్రువుని. పూర్వజన్మలో గోలోకాన హరిసాన్నిధ్యాన్ని అనుభవించిన సుదాముణ్ణి. శ్రీకృష్ణుడికి అత్యంతాప్తులైన ఎనమండుగురు పార్షద గోపకులలో ఒకణ్ణి. రాధికాదేవి శాపంవల్ల ఇప్పుడిలా రాక్షసుణ్ణి అయ్యాను. కృష్ణమంత్రప్రభావంవల్ల జాతిస్మరుణ్ణి. నువ్వూ జాతిస్మరవే. తులసివి. పూర్వజన్మలో శ్రీకృష్ణుని సాహచర్యాన్ని అనుభవించినదానవు. రాధికా శాపంవల్ల భూలోకంలో అవతరించావు.

గోలోకంలో ఉన్నప్పుడు నిన్ను చూసి ఎంతగానో అనురక్తుణ్ణి అయ్యాను. నీ దర్శనంకోసం నీ స్పర్శనంకోసం ఉవ్విళ్ళూరే మనస్సుతో అనుక్షణం పరితపించేవాడిని. అయితే రాధికాదేవికి భయపడి నా అనురాగాన్ని నాలోనే అణచుకునేవాణ్ణి. దేవీ ! నేనెవరో నువ్వెవరో రాధాశాపమేమిటో శ్రీకృష్ణుడి వరమేమిటో బ్రహ్మదేవుడి ఆజ్ఞ ఏమిటో అంతా వివరించాను. ఇక నీ ఇష్టం. నీదయ, నా ప్రాప్తం - అని ముగించాడు శంఖచూడుడు.

తులసీదేవికి సందేహాలు తీరి సంతృప్తి కలిగింది. మరింత విలాసంగా నవ్వుతూ - దానవేంద్రా ! నీవంటి సజ్జనుడు ఎంతటి ప్రశంసకైనా అర్హుడు. ఇటువంటి అందగాడినే ఏ కాంతామణి అయినా కోరుకుంటుంది. ఇష్టపడుతుంది. నిజానికి ఇప్పుడు నువ్వు బుద్ధికుశలతతో నన్ను ఓడించావు. ఇది సత్యం అందుచేత సర్వాత్మనా అభినంద్యుడివి. ఇలాకాక - రూపవిలాసాలకు సమ్మోహితుడై స్త్రీ చేతిలో ఓడిపోయి దాసుడుగా మారినవాడు పరమ నింద్యుడు. మిత్ర బంధు దేవగణాలందరూ అతడిని నిందిస్తారు. తల్లీ తండ్రీ సోదరులూ అంతా మనస్సులో అసహ్యించుకుంటారు. దూషిస్తారు.



నిందంతి పితరో దేవా బాంధవాః స్త్రీజితమ్ వరమ్ ।
స్త్రీజితం మనసా మాతా పితా భ్రాతా చ నిందతి ॥ (18 - 76)

పురుడు మైలలాంటి ఏ అశౌచాలు వచ్చినా బ్రాహ్మణుడు పదిరోజులకీ క్షత్రియుడు పన్నెండు రోజులకీ వైశ్యుడు పదిహేనురోజులకీ శూద్రుడు నెలనాళ్ళకీ శుద్ధిపొందుతారని ధర్మశాస్త్రాలు చెబుతున్నాయి. స్త్రీజితుడు మాత్రం శ్మశానంలో కట్టెల్లో కాలేదాకా శుద్ధిపొందడు. అంతటిది సుమా ఆ అశౌచం. వాడుపెట్టిన పిండాలను పితృదేవతలు ముట్టరు. అతడిచ్చే పాద్యాలనూ నైవేద్యాలనూ దేవతలు స్వీకరించరు. పరస్త్రీ లంపటుడు ఎంత జ్ఞాని అయితేనేమీ ఎంత తపస్వి అయితేనేమీ ! అతడి జపమూ తపమూ పూజలూ హోమాలూ చదువులూ పేరూ ప్రఖ్యాతీ అన్నీ వ్యర్థం.

కిం వా జ్ఞానేన తపసా జపహోమ ప్రపూజనైః ।
కిం విద్యయా చ యశసా స్త్రీభిర్యస్య మనో హృతమ్ ॥ (18 - 80)

ఈ తెలివిడి ఉన్నదానను కనక నిన్ను పరీక్షిద్దామని స్త్రీనింద చేశాను. నిన్నూ నిష్ఠురాలు ఆడాను. పరీక్షించకుండా ఏ కామినీ ఎవ్వరినీ వరించదుగదా ! కన్యకలేకాదు కన్యాదాతలుకూడా వరుణ్ణి పరీక్షించకుండా పిల్లనిచ్చి పెళ్ళిచేస్తారా ? గుణహీనుడు వృద్ధుడు అజ్ఞాని దరిద్రుడు మూర్ఖుడు రోగిష్టి కుత్సితుడు కోపిష్టి దుర్ముఖుడు అంగవికలుడు కుంటివాడు అంధుడు బధిరుడు (చెవిటి) జడుడు (చైతన్యం లేనివాడు) మూగవాడు నపుంసకతుల్యుడు పాపాత్ముడు - ఇలాంటి వరుడికి కూతురు నిచ్చినవాడు బ్రహ్మహత్యా మహాపాతకి అవుతాడు. అందుచేత బాగా వాకబుచేసి పరీక్షించి శాంతస్వభావుడూ గుణవంతుడూ యువకుడూ పండితుడూ సజ్జనుడూ అయిన వరుడికే పిల్లను ఇవ్వాలి. అలా ఇచ్చి వివాహం జరిపించిన కన్యాదాత పది మహాయజ్ఞాలు చేసిన ఫలాన్ని పొందుతాడు.

శాంతాయ గుణినే చైవ యూనే చ విదుషేఽపి చ ।
సాధవే చ సుతాం దత్త్వా దశయజ్ఞఫలం లభేత్ ॥ (18 - 85)

కూతురిని పెంచి పెద్దచేసి ధనలోభంతో అమ్ముకునేవాడు కుంభీపాకనరకానికి పోతాడు. అక్కడ కన్యామూత్ర పురీషాలు తింటూ పురుగుకాట్లు భరిస్తూ కాకిపోట్లు చవిచూస్తూ - ఇంద్రులు పధ్నాలుగుమంది మారేటంతకాలం నరకయాతన అనుభవిస్తాడు. అటుపైని రోగిష్ఠిగా జన్మించి మాంసం అమ్ముకుంటూ నీచంగా జీవయాత్ర సాగిస్తాడు.



## ◆ తులసీ - శంఖచూడుల పరిణయం ◆

తులసీదేవి ఇక్కడికి ప్రసంగం చాలించింది. ఇద్దరూ క్షణకాలం మౌనంగా ఉండిపోయారు. అప్పుడు బ్రహ్మదేవుడు వచ్చి శంఖచూడా ! ఏం చేస్తున్నావ్ ? కబుర్లు చెబుతూ కూర్చున్నావా ? గాంధర్వ పద్ధతిలో తులసీదేవి పాణిగ్రహణం చెయ్యి. నువ్వు పురుషరత్నానివి, ఈవిడ స్త్రీరత్నం. నెరజాణకు నెరజాణతో కలయిక ఆనందప్రదమేకదా ! నిర్విరోధంగా లభించే ఉత్తమ సుఖాన్ని ఎవరయినా వదులుకుంటారా ? అలా వదులుకునేవాడు శుద్ధపశువు.

నిర్విరోధసుఖం రాజన్ ! కో వా త్యజతి దుర్లభమ్ !
యోఽవిరోధసుఖత్యాగీ స పశుర్నాత్ర సంశయః ॥ (18 - 91)

కాంతామణీ ! ఇంకా ఎన్ని పరీక్షలు పెడతావు. ఎంతసేపు పరీక్షిస్తావు ? ఇటువంటి గుణవంతుడు కోటికొక్కడుకూడా ఉండడు. దేవ దానవులను జయించిన మహావీరుడు. లక్ష్మీశ్రీహరులలాగా రాధాకృష్ణులలాగా నేనూసరస్వతిలాగా భవుడూభవానీలాగా ధరాదేవీవరాహమూర్తుల్లాగా అనసూయ అత్రిమహర్షుల్లాగా నలదమయంతులలాగా రోహిణీచంద్రుల్లాగా రతిమన్మథుల్లాగా దితికశ్యపుల్లాగా వసిష్ఠారుంధతుల్లాగా అహల్యాగౌతముల్లాగా కర్దమదేవహూతుల్లాగా తారాబృహస్పతుల్లాగా శతరూపామనువుల్లాగా దక్షిణాయజ్ఞదేవతల్లాగా స్వాహాహుతాశనుల్లాగా శచీదేవేంద్రుల్లాగా పుష్టిదేవీ గణపతుల్లాగా దేవసేనాషణ్ముఖుల్లాగా తులసీశంఖచూడులు మీరిద్దరూ దంపతులై సౌభాగ్యసందపదలతో వర్ధిల్లండి. సుఖసంతోషాలను యథేచ్ఛగా అనుభవించండి. అటుపైని గోలోకం చేరుకుందురుగాని. తులసీ ! నువ్వు అప్పుడు కృష్ణపరమాత్మను కలుసుకుందువుగాని అన్నాడు.

*(అధ్యాయం - 18 , శ్లోకాలు 100)*

నారాయణమహర్షి ఇంతవరకూ చెప్పి కాసింత విశ్రాంతి తీసుకున్నాడు. నారదుడు మళ్ళీ మొదలుపెట్టాడు. మహర్షీ ! నాకన్నీ సందేహాలే ! అన్నీ సంశయాలే. నీవంటి జ్ఞాని దొరికినప్పుడే అన్నీ తీర్చేసుకోవాలి. విసిగిస్తున్నాను అనుకోవద్దు. చాలా విచిత్రమైన ఉపాఖ్యానం చెప్పావు. ఇలాంటివి ఇప్పటికి చాలా చెప్పావు. అయినా నాకు తృప్తి కలగడంలేదు. తులసీ శంఖచూడుల కథ అటుపైని ఏమయ్యింది, ఆ విశేషాలు వినాలని ఉంది అని అడిగాడు. నారాయణుడు గొంతు సవరించుకుని మిగతా కథ చెప్పనారంభించాడు.

నారదా ! బ్రహ్మదేవుడు అలా ఇద్దరినీ ఆశీర్వదించి తన లోకానికి వెళ్ళిపోయాడు. తులసీ శంఖచూడులు గాంధర్వవివాహం చేసుకున్నారు. దేవలోకంలో దుందుభులు మ్రోగాయి. పారిజాతపుష్పవృష్టి కురిసింది. వివిధ శృంగారక్రీడల్లో తేలియాడారు. తులసీదేవి నవసంగమ సమ్మూర్ఛిత అయ్యింది.



నీరులేని సుఖసాగరంలో మునిగితేలింది. కామశాస్త్రంలో చెప్పిన చతుష్షష్టిబంధవిశేషాలతో ఆ రసికదంపతుల కలయిక నిత్యనూతనంగా అనుక్షణమధురంగా సాగింది. అంగప్రత్యంగ సంశ్లేషాలతో సర్వాంగచుంబనలతో ప్రణయకలహాలతో పరస్పర సాంత్వనాలతో పుష్పోద్యాననదీతీరాలలో పొదరిళ్ళలో చందనచర్చలతో నిర్విరామంగా వారి సంభోగ శృంగారలతిక చిగురులు తొడిగింది. లీలావిలాసాలతో తులసీదేవి, రాసిక్యవైభవంతో శంఖచూడుడూ పరస్పరం మనస్సులు దోచుకున్నారు. కౌగిలింతలకు చందనచర్చలు పేటులెత్తాయి. స్వేదజలానికి సిందూరతిలకాలు చెమ్మగిల్లాయి. నఖక్షతాలతో దంతక్షతాలతో తులసీదేవి సర్వాంగీణంగా చిగురించిన తీగలాగా ఉంది. శంఖచూడుడి గుండెలమీద బుజాలమీద క్షతాలతోపాటు తులసీదేవి ధరించిన కంకణాద్యాభరణాలు ఒత్తుకుని గుర్తులేర్పడ్డాయి. ఆలింగన చుంబన జంఘాదిమర్దనలతో కవ్వింపులతో కొసరింతలతో బెదిరింపులతో చిరునవ్వులతో నిట్టూర్పులతో తాంబూలసేవనలతో పల్లటీ కూతలతో (మణిత ధ్వనులు) సంస్కారసంపన్నమైన శృంగారానుభవంతో రేయింబవళ్ళు సంతృప్తి చెందుతున్నారు. ఏపూటకాపూట విలువైన వస్త్రాలూ ఆభరణాలూ సుగంధానులేపనాలూ పుష్పాలంకరణలతో పరస్పరం కన్నులపండువు చేసుకుంటున్నారు.

జరారోగహరమైన పారిజాతకుసుమాన్నీ అమూల్య రత్నాంగుళీయకాన్నీ త్రిలోకదుర్లభమైన అనర్ఘమణినీ తులసీదేవి శంఖచూడుడికి బహూకరించిది. నీ దాసిని నేనని మాటిమాటికీ పలవరిస్తూ భక్తిగా పాదాభివందనం చేసింది. శంఖచూడుడు లేవనెత్తి గుచ్చి కౌగిలించుకున్నాడు. నేనే నీ దాసుణ్ణి అన్నాడు. వరుణదేవుడినుంచి జయించి తెచ్చిన అమూల్యవస్త్రాలనూ త్రిలోకదుర్లభమైన రత్నమాలికనూ మంజీరాలనూ కేయూర కుండలాలనూ కంకణాంగుళీయకాలనూ విశ్వకర్మ ఇచ్చిన అపూర్వశంఖాన్నీ పద్మపత్ర నిర్మితమైన శయ్యనూ తులసికి బహూకరించి ఆమె చిబుకం పట్టుకుని ముఖం పైకెత్తి కళ్ళల్లోకి చూస్తూ చిరునవ్వులు కురిపించాడు. ముద్దులతో నింపాడు. కబరీభరంలో మాంగళ్యభూషణాన్ని అలంకరించాడు. చందనకుంకుమబిందు నిర్మితమైన మకరికాపత్రాలను చెక్కిళ్ళపై చిత్రించాడు. సిందూర తిలకం దిద్దాడు. నల్లని జుట్టుమధ్య అది దీపంలా వెలిగిపోయింది.

పరీతం పరితశ్చిత్రైః సార్ధం కుంకుమబిందుభిః ।
జ్వలత్ప్రదీపాకారం చ సిందూర తిలకం దదౌ ॥ (19 - 28)

పాదపద్మాలకు లత్తుక, గోళ్ళకు రంగు తీర్చిదిద్ది ఆ పాదాలను తన గుండెలకు హత్తుకుని దేవీ ! నీ దాసుణ్ణి అంటూ మైమరిచి పలవరించాడు. మెల్లగా కౌగిలించుకున్నాడు. గుండెలపై పరుండబెట్టుకున్నాడు.

ఇలా ఎంతకాలం గడిచిందో వారికే తెలీదు. ఒకనాడు ఎందుకనో ఇద్దరూ కలిసి ఆ తపోవనాన్ని విడిచిపెట్టేసి మలయపర్వత సీమలకు వెళ్ళిపోయారు. అక్కడ ప్రతిశిఖరంమీద ప్రతి సానువులోనూ ప్రతి



వనంలోనూ ప్రతి పొదరింటా ప్రతిగుహలోనూ ప్రతి సరస్సులోనూ ప్రతి నదీతీరంలోనూ ప్రతి పులినతలంమీదా తామే అయి క్రీడించారు. పుష్పభద్రానదిలో జలక్రీడలు సాగించారు. అటునుంచి గంధమాదనంమీద మరికొంతకాలం వినోదించి నందనంలో విహరించారు. చంపక కేతకీ మాలతీ కుంద కుముద వనాలలో ఆనందించారు. ప్రతి కల్పవృక్షచ్ఛాయలోనూ నిర్జన కాంచన శిఖరాలమీదా వలపులు పండించుకున్నారు. పుంస్కోకిలల కలకూజితాలతో గండుతుమ్మెదల ఝుంకారాలతో కోరికలు తీర్చుకున్నారు. అయినా కామం చల్లారలేదు. ఆజ్యంపోసినట్టు కామాగ్ని మరింతగా ప్రజ్వరిల్లింది.

న హి తృప్తో దానవేంద్రస్తృప్తిం నైవ జగామ సా ।
హవిషా కృష్ణవర్త్మేవ వవృధే మదనస్తయోః ॥ (19 - 40)

దానవేంద్రుడు శంఖచూడుడు తులసీదేవితో తన రాజధానిలోకి ప్రవేశించాడు. మనోహరకేళీమందిరం కల్పించి అందులో ఇద్దరూ ఆనందించారు. అక్కడినుండే ఆ ప్రతాపశాలి సాధారణ పరిపాలన సాగించాడు. ఇలా ఒక మన్వంతరం గడిచింది. ఇంతకాలమూ దేవదానవ సంగ్రామాలు లేవు. అందరూ హాయిగా ఊపిరి పీల్చుకున్నారు. దానవవీరులూ తమ తమ ఇల్లాండ్రతో ఆనందాలనుభవించారు.

దానవుల చేతిలో పరాజితులై స్వర్గలోకాన్నీ అధికార భోగభాగ్యాలనూ కోల్పోయిన దేవతలు భిక్షుకులై సంచరిస్తున్నారు. వారంతా గుమికూడి బ్రహ్మదేవుడి సన్నిధికి వెళ్ళారు. తమ దుస్థితి విన్నవించి గొల్లుమన్నారు. బ్రహ్మతో కలిసి కైలాసానికి వెళ్ళి శివుణ్ణి తీసుకుని వైకుంఠానికి వెళ్ళారు.

అది వైకుంఠం. అత్యంతదుర్లభం. పరమపదం. జరామృత్యుహరం. దానిద్వారం దగ్గర ఇరువైపులా ద్వారపాలకులున్నారు. రత్న సింహాసనాలమీద కూర్చుని ఉన్నారు. రత్నాభరణాలతో పీతవస్త్రాలతో వనమాలికాలంకృతులై సాక్షాత్తు విష్ణుమూర్తుల్లాగా శ్యామసుందర విగ్రహులై చతుర్భుజులై గదాశంఖచక్ర పద్మధారులై పద్మనేత్రులై హసన్ముఖులై కావలికాస్తున్నారు. బ్రహ్మదేవుడు తమ రాకనూ కారణాలనూ వారికి విన్నవించాడు. వారు అనుజ్ఞ ఇచ్చారు. ఆమీదట అందరూ లోపలికి ప్రవేశించారు. ఇలాంటి ద్వారాలు వరుసగా పదహారున్నాయి. అంతటా ఇదే పరిస్థితి, ఇదే అవస్థ. అన్నీ గడిచి ప్రధాన సభామంటపం చేరుకున్నారు. అక్కడ శ్రీమన్నారాయణుడు దేవర్షి పరివృతుడై కొలువుతీరి ఉన్నాడు. చతుర్భుజులూ నారాయణ స్వరూపులూ కౌస్తుభాలంకృతులూ అయిన పార్షదులు పరివేష్టించి ఉన్నారు.

ఆ సభామంటపం చతురస్రాకారంలో ఉంది. చంద్రమండలంలాగా వెన్నెలలు వెదజల్లుతోంది. మణిమయహారాలు తోరణాలుగా వేలాడుతున్నాయి. అంతటా రత్నాలు పొదిగారు. శ్రీహరి కేవలం ఇచ్ఛామాత్రంతో సృష్టించినట్టుంది. ఎటుచూసినా మేలిమిముత్యాల అలంకరణలు. నేలంతా మణికుట్టిమం. జలభ్రాంతిని కలిగిస్తోంది. నాలుగువైపులా గోడలకు మండలాకార మణిదర్పణాలు. మధ్యమధ్య అపూర్వంగా చిత్రరేఖలు. పద్మరాగమణులతో శిల్పం చెక్కిన పద్మాలు. వాటిమీద ఎగురుతున్నట్టు



ఇంద్రనీలమణులతో తుమ్మెదలు. చుట్టూ లోపలితట్టునే శ్యమంతక మణులతో నిర్మించిన విశాల సోపాన నిశ్రేణి. (గ్యాలరీ ?). ఇంద్రనీలమణి స్తంభాలు. ప్రతిస్తంభం దగ్గరా రత్నమయపూర్ణకుంభాలు. వాటినుంచి పట్టుదారాలతో పాకిస్తున్న చందన లతలు - వాటికి చిగుళ్ళు.

సభామంటపానికి వెలుపల పారిజాతవృక్షాలు. వాటి పరిమళం చల్లగా మెల్లగా అంతటా వ్యాపిస్తోంది. లోపల కస్తూరీ కుంకుమ చందనాగురు సుగంధాలు వీటితో పోటీపడుతున్నాయి.

సహస్రయోజన విస్తీర్ణమైన ఆ మహామంటపంలో ఒకవైపున విద్యాధరస్త్రీలు మనోహరంగా నృత్యాలు చేస్తున్నారు. మంద్రస్వరంతో విద్యాధరులు నేపథ్యగానం అందిస్తున్నారు. భవనానికి లోపలా వెలుపలా ఆయుధపాణులై హరికింకరులు కావలి తిరుగుతున్నారు.

ఆ సభామంటపానికి మధ్యభాగంలో శ్రీహరి చుక్కల్లో చంద్రుడులాగా వెలిగిపోతున్నాడు. అదొక సింహాసనం. అమూల్యరత్నసింహాసనం. దానిమీద శ్రీహరి. కిరీటి. కుండలి. వనమాలి. చందనచర్చిత నీల శరీరుడు. చేతిలో కేళీపద్మం. ఎట్టయెదుట నృత్యగీతాలను ఆస్వాదిస్తున్నాడు. చిరునవ్వులు ఆరబోస్తున్నాడు. శాంతస్వరూపుడై ఉన్నాడు. లక్ష్మీసరస్వతులు పాదాలు ఒత్తుతున్నారు. తాంబూలం సేవిస్తున్నాడు. ఆ పరిమళాలు వ్యాపిస్తున్నాయి. గంగాదేవి తెల్లని వింజామర వీస్తోంది.

సభాసదులందరూ భక్తివినమ్రులై స్తోత్రపాఠాలు చేస్తున్నారు. పరిపూర్ణతముడైన ఆ ప్రభువును దర్శించి బ్రహ్మేశానదేవతలందరూ శిరసువంచి నమస్కరించారు. బహుధా స్తుతించారు. అందరి తనువులూ పులకాంకురితాలే. అందరి గొంతులూ భక్తిగద్గదాలే. అందరి కన్నులూ అశ్రుజలపూర్ణాలే.

జగద్విధాత బ్రహ్మదేవుడు మరింత చేరువకి వెళ్ళి శిరస్సున అంజలిబంధంతో వినయంగా వంగి నిలబడి మెల్లగా యావద్వృత్తాంతమూ విన్నవించాడు. అంతా విన్న శ్రీహరి ఒక్క మందహాసం చేసి రహస్యంగా పలికాడు.

## ◆ శంఖచూడుడి పూర్వజన్మ ◆

పద్మసంభవా ! శంఖచూడుడు దానవేంద్రుడే కావచ్చు. దేవతలనందరినీ పారద్రోలి ఉండవచ్చు. కానీ అతడి వృత్తాంతం అంతా నాకు తెలుసు. అతడు పూర్వజన్మలో గోలోకవాసి. గోపకుడు. మహాతేజస్వి. అతడిపేరు సుదాముడు. నాకు పార్షదుడు. రాధాదేవి శాపంవల్ల దానవుడయ్యాడు.

ఒకనాడు నేను నా మందిరంనుంచి రాసమండలానికి వెళ్ళాను. నాతోపాటు ప్రాణాధికప్రియ విరజనుకూడా తీసుకు వెళ్ళాను. అక్కడ విరజతో నేను క్రీడిస్తున్న సంగతి దూతికద్వారా రాధకు తెలిసింది. కోపంగా వచ్చింది. నేను తిరోధానం చెందాను. విరజనుమాత్రం నదివైపొమ్మని శపించింది. తన మందిరానికి వెళ్ళిపోయింది. అక్కడ సుదాముడితో సరససంభాషణచేస్తూ నేనున్నాను. రాధికను చూస్తూనే నేను మౌనం వహించాను. అయినా కోపం ఆపుకోలేని రాధ నన్ను నిష్ఠురంగా నిందించింది. చేసేవన్నీ



చేస్తావు, ఏమీ ఎరగనట్టు కూచుంటావు. నిన్ను ఏమి చేసినా తప్పులేదని దెప్పి పొడిచింది. కానీ ఎన్నిసార్లు తప్పించుకుంటావో చూస్తాను, చిక్కకపోతావా ? అప్పుడు చెబుతాను నీపని అంటూ పళ్ళుబిగించి చూపుడువేలుతో బెదిరించింది.

ఇదంతా చూస్తున్న సుదాముడు రాధికాదౌష్ట్యాన్ని భరించలేకపోయాడు. అతడికి నామీద భక్తి గౌరవం ప్రేమ ఎక్కువాయె. దానితో చర్రునలేచి రాధికను అదే స్థాయిలో అదే చూపుడు వేలుతో అలాగే బెదిరించాడు. రాధాదేవి కోపానికి ఆజ్యం పోసినట్టయ్యింది. కళ్ళు చింతనిప్పులయ్యాయి. నా సన్నిధిలో నా సేవకుడు తనను కించపరచడం అవమానించడం బెదిరించడం అస్సలు భరించలేకపోయింది. వీడిని బయటకు నెట్టివెయ్యండి అని ఆజ్ఞాపించింది. రాధిక వెంట ఉన్న వేనవేల చెలికత్తెలు చుట్టుముట్టి, ఏదేదో ఇంకా వాగుతున్న ఆ తేజస్విని బైటకు లాక్కుపోయారు. ఉక్రోషం ఆపుకోలేక ఆ బలశాలి సుదాముడు చెలికత్తెల్లో చాలామందిని అందినమటుకు అందినట్టు చావబాదాడు. ఇది తెలిసి రాధాదేవి కోపం మరింత భగ్గుమంది. దానవజన్మ ఎత్తరా - అని దారుణంగా శపించింది.

> సా చ తత్తాడనం తాసాం శ్రుత్వా రుష్టా శశాప చ ।
> యాహి రే దానవీం యోనిమిత్యేవం దారుణం వచః ॥ (19 - 81)

ఆ సుదాముడు శప్తుడై, విలపిస్తూ, వెళ్ళిపోతూ, ఆగి ఆగి వెనక్కి చూస్తూ మాకు నమస్కరిస్తూంటే రాధికాదేవికి గుండె కరిగిపోయింది. కోపం రాలి వాత్సల్యం చిగురించింది. కళ్ళల్లో నీళ్ళు కమ్ముకున్నాయి.

వత్సా ! ఆగు. ఆగు. ఎక్కడికి వెడతావంటూ తానూ వెంటబడింది. గోపికలు విలపిస్తూ అనుసరించారు. అప్పుడు నేను కల్పించుకుని అందరినీ నిలువరించి, అరక్షణంలో నీ శాపాన్ని అనుభవించి సుదాముడు హాయిగా తిరిగి ఇక్కడికి వస్తాడు. ఇంతలోకే బెంబేలుపడకు అని చెప్పి రాధికను ఓదార్చాను. వెనక్కి తీసుకువచ్చాను. అందరినీ సముదాయించాను. విరించీ ! గోలోకంలో అరక్షణమంటే భూలోకంలో ఒక మన్వంతరం. నీకు తెలుసుగదా !

> గోలోకస్య క్షణార్ధేన చైకం మన్వంతరం భవేత్ ।
> పృథివ్యా జగతాం ధాతరిత్యేవ వచనం ధ్రువమ్॥ (19 - 86)

ఈ రకంగా సుదాముడు శంఖచూడుడై దానవవంశంలో జన్మించి మన్వంతరం గడిచింది. అతడి అవతారం త్వరలోనే ముగియనుంది. అతడు యోగవిద్యా విశారదుడు. మహాబలిష్ఠుడు. సర్వమాయా విశారదుడు. కనక - శివా ! నీకొక శూలం ఇస్తాను. దానితో రాక్షస సంహారం చెయ్యి. శంఖచూడుడి మెడలో సర్వమంగళ కారకమైన నా కవచం ఉంటుంది. నిరంతరం ధరించే ఉంటాడు. అది ఉన్నంతవరకూ



తడిని ఎవరూ ఏమీ చెయ్యలేరు. విజయం ఎప్పుడూ అతనిదే. అంచేత నేను విప్రరూపంలో వెళ్ళి ఆ వచాన్ని యాచించి స్వీకరిస్తాను.

చతుర్వదనా ! మరొక విషయం. శంఖచూడుడికి నువ్వొక విచిత్రమైన వరం ఇచ్చావు. గుర్తుందా ? అతడి భార్యకు శీలభంగం అయితే తప్ప శంఖచూడుడు మరణించడు. అది జరిగినప్పుడే ఇది జరుగుతుందనికదా నీ వరం !

పతీత్వహావిష్టత్వత్న్యా య యత్ర కాలం భవిష్యతి ।
తత్రైవ కాలే తన్మృత్యురితి దత్తో వరస్త్వయా ॥ (19 - 91)

అంచేత నేను వెళ్ళి రహస్యంగా తులసీగర్భంలో వీర్యనిక్షేపణం చేస్తాను. శంఖచూడుడు మరణిస్తాడు. అటుపైని తులసి దేహత్యాగం చేస్తుంది. గోలోకానికి విచ్చేసి మళ్ళీ నాప్రియ గోపిక అవుతుంది.

ఇంతగా వివరించి చెప్పి జగన్నాథుడు శివుణ్ణి పిలిచి శూలం అందించి తన అభ్యంతరమందిరంలోకి నిష్క్రమించాడు. బ్రహ్మ రుద్రాది దేవతలందరూ భారతభూమికి పయనమయ్యారు.

*(అధ్యాయం - 19, శ్లోకాలు - 94)*

## ◆ శివదూత రాయబారం ◆

అటుపైని బ్రహ్మదేవుడు శంఖచూడుణ్ణి సంహరించడానికి శివుణ్ణి నియోగించి తన లోకానికి తాను వెళ్ళిపోయాడు. దేవతలూ తమ తమ నెలవులకు నిష్క్రమించారు.

శివుడు బాధ్యత భుజాన వేసుకుని చిత్రరథుడు అనే గంధర్వ ప్రియమిత్రుణ్ణి వెంటబెట్టుకుని భారతభూమికి దిగాడు. చంద్రభాగా నదీతీరాన ఒక పెద్ద మర్రిచెట్టు నీడలో విశ్రమించాడు. శంఖచూడుడి దగ్గరికి చిత్రరథుణ్ణి దూతగా పంపించాడు. అతడు ఆ దానవేంద్రుడి రాజధానిలోకి ప్రవేశించాడు.

అది అయిదు యోజనాల వెడల్పూ పదియోజనాల పొడవూ ఉన్న మహానగరం. మహేంద్రుడి అమరావతికన్నా అన్నివిధాలా అత్యుత్తమంగా ఉంది. ఎటుచూసినా కుబేరభవనాలే. వీథులు తీర్చిదిద్దినట్టున్నాయి. నగరానికి చుట్టూ ఏడు కందకాలున్నాయి. రథాశ్వాలు అనుక్షణం ప్రయోగానికి సన్నద్ధంగా ఉన్నాయి. ప్రతిభవనంమీదా రత్నకోటులు ధగధగలాడుతున్నాయి. నూరు వీథులు. చత్వరాలలో వీథిమొగలలో మణివేదికలు. వివిధ వస్తు సంపన్నమై వణిజుల వీథి ప్రత్యేకం. తరులతావిరాజితమైన ఉద్యానవనాలు. వాటిలో ఆశ్రమాలు.



నగరసౌందర్యాన్ని తిలకిస్తూ వెళ్ళి చిత్రరథుడు రాజప్రాసాదం చేరుకున్నాడు. అది వలయాకారంలో పూర్ణచంద్రబింబంలా ఉంది. చుట్టూ నాలుగు అగడ్తలున్నాయి. అవి అగ్నిజ్వాలలతో భగభగలాడుతున్నాయి. అది శత్రువులకు దుర్గమం. మిత్రులకు సుగమం.

జ్వలదగ్నిశిఖాక్తాభిః పరిఖాభిశ్చతసృభిః ।
తద్దుర్గమం చ శత్రూణా మన్యేషాం సుగమం సుఖమ్ ॥ (20 - 10)

మణిమయ ప్రాసాద శిఖరాలు (కోటబురుజులు) ఆకాశాన్ని ముద్దాడుతున్నాయి. చుట్టూ పన్నెండ కక్ష్యలున్నాయి. పన్నెండు రజతద్వారాలున్నాయి. ప్రతిద్వారం దగ్గరా దానవవీరులు జాగరూకులై కావలి కాస్తున్నారు. కక్ష్యాంతరాలలో ఉన్న వాటితో కలిపి మొత్తం లక్ష భవనాలున్నాయి. అన్నీ మణిమయాలే అన్నింటా రత్నస్తంభాలూ రత్నసోపానాలూ.

చిత్రరథుడు (పుష్పదంతుడు) పన్నెండవ కక్ష్యదాటి రాజమందిర సింహద్వారం చేరుకున్నాడు అక్కడ శూలం ధరించి చిరునవ్వులు చిందిస్తూ పింగళాక్షుడూ తామ్రవర్ణుడూ అతిభయంకరుడూ ఒక ద్వారపాలకుడు ఉన్నాడు. అతడికి వృత్తాంతమంతా చెప్పి అనుజ్ఞ తీసుకుని లోపలికి ప్రవేశించాడు దూతరూపంలో వచ్చాడు కనుక ఎవరూ పెద్దగా అడ్డుకోలేదు. అభ్యంతరమందిర ద్వారం చేరుకున్నాడు అక్కడి ద్వారపాలకుడికి తాను వచ్చిన పనినీ రణవృత్తాంతాన్నీ తెలియపరిచి మీ ప్రభువుకి నివేదించి రమ్మని పంపించాడు. అతడు లోపలికి వెళ్ళి తిరిగివచ్చి చిత్రరథుణ్ణి వెంటతీసుకువెళ్ళి శంఖచూడుని ముందు హాజరు పరిచాడు.

రాజమండల పరివృతుడై సమున్నత స్వర్ణసింహాసనంమీద ఠీవిగా దర్పంగా విరాజిల్లుతున్న శంఖచూడుడి మనోహరరూపాన్ని చూడటంతోనే చిత్రరథుడి కన్నులు జిగేలుమన్నాయి. దివ్యమందిరం మణీంద్ర నిర్మితం. రత్నదండసమన్వితం. రత్నమయ కృత్రిమపుష్ప విభూషితం. బంగారు సింహాసనం వెనక నిలబడి ఒక భృత్యుడు బంగారుగొడుగు పట్టుకున్నాడు. ఇరువైపులా పార్షదులు వింజామరలు వీస్తున్నారు. సముచిత వస్త్రాభరణాలతో సుందరమాల్యానులేపనాలతో త్రికోటి దానవవీర సంవేష్టితుడై శంఖచూడుడు కన్నులవిందై కనిపించాడు. శతకోటి దానవవీరులు ఆయుధపాణులై కావలి తిరుగుతున్నారు. ఆశ్చర్యంనుంచీ ఆనందంనుంచీ తేరుకుని చిత్రరథుడు (పుష్పదంతుడు) మెల్లగా పెదవి విప్పాడు.

దానవేంద్రా ! నేను శివుడి భృత్యుడిని. నాపేరు పుష్పదంతుడంటారు. ప్రభూ ! శంకరుడు నీతో చెప్పమన్నది యథాతథంగా చెబుతాను, సౌమ్యంగా ఆలకించు - "దేవతల రాజ్యాన్ని విడిచిపెట్టు. వారి అధికారాలను వారికి తిరిగి అప్పగించు. దేవతలంతా వెళ్ళి శ్రీహరిని శరణువేడారు. శ్రీహరి స్వయంగా శూలాన్ని అందించి నన్ను పంపించాడు. నేను వచ్చి చంద్రభాగా (పుష్పభద్రా) నదీతీరంలో వటవృక్షం క్రింద



విడిది చేశాను. రాజ్యమైనా అప్పగించు లేదా యుద్ధమైనా చెయ్యి" - ఇదీ త్రిలోచనుడు నీకు వినిపించి రమ్మన్న సందేశం. నేను దూతను నువ్వు ఏది చెప్పమంటే అది వెళ్ళి మహేశ్వరుడికి చెబుతాను.

గంధర్వుడి మాటలు వింటూనే శంఖచూడుడు పెద్దపెట్టున నవ్వాడు. రేపు ఉదయాన్నే నేను వస్తున్నాను. నువ్వు వెళ్ళు - అన్నాడు. గంధర్వుడు చిత్తం అని వెంటనే పరుగుపరుగున వెళ్ళి వటమూలంలో కూర్చున్న శివుడికి ఆ రెండుముక్కలూ చెప్పాడు.

అంతలోకే సేనాపరివృతుడై కుమారస్వామి అక్కడికి వచ్చాడు. వీరభద్రుడు నంది మహాకాలుడు సుభద్రకుడు విశాలాక్షుడు బాణుడు పింగలాక్షుడు వికంపనుడు విరూపుడు వికృతి మణిభద్రుడు బాష్కలుడు కపిలుడు దీర్ఘదంష్ట్రుడు వికటుడు తామ్రలోచనుడు కాలకంఠుడు బలిభద్రుడు కాలజిహ్వుడు కుటీచరుడు బలోన్మత్తుడు రణశ్లాఘి దుర్జయుడు దుర్గముడు అష్టభైరవులు ఏకాదశరుద్రులు అష్టవసువులు దేవేంద్రుడు ద్వాదశాదిత్యులు చంద్రుడు అగ్నిదేవుడు విశ్వకర్మ అశ్వినీదేవతలు కుబేరుడు యముడు జయంతుడు నలకూబరుడు వాయువు వరుణుడు బుధుడు మంగళుడు ధర్ముడు శని ఈశానుడు కామదేవుడు ఉగ్రదంష్ట్ర ఉగ్రదండ కోటర కోటభి - ఇత్యాదులందరూ వచ్చారు. అష్టభుజావిరాజమానయై స్వయంగా భద్రకాళీదేవి అరివీరభయంకరంగా వచ్చింది. ఇంద్రనీలమణి నిర్మితమైన విమానం అధిరోహించి వచ్చింది. రక్తవస్త్రాలూ రక్తమాల్యానులేపనలతో నృత్యం చేస్తూ గానం చేస్తూ వికటాట్టహాసాలు చేస్తూ వచ్చి నిలబడింది. యోజనం పొడవున్న అగ్నిజ్వాలలాంటి నాల్కను భీకరంగా కదలాడిస్తోంది. శంఖచక్ర గదాఖడ్గధనుర్బాణాది భీషణాయుధాలను ధరించింది. వర్తులాకారమూ యోజన విస్తీర్ణమూ అయిన ఖర్పరం ఉంది. చేతిలో మిన్ను తాకుతున్న త్రిశూలం. యోజనాయతమైన శక్త్యాయుధం. ముద్గరముసల వజ్రఖేట ఫలకాలతో విచ్చేసింది. వైష్ణవ - వారుణ - వాహ్నేయ - నాగపాశ - నారాయణ - గాంధర్వ - గారుడ - పర్జన్య - పాశుపత - జృంభణ - పార్వత - మాహేశ్వర - వాయవ్య - సమ్మోహన - బహ్మాద్యస్త్రాలు సన్నిధి చేసుకుంది. యోగినీ ఢాకినీ భూత ప్రేత పిశాచ కూష్మాండ బ్రహ్మరాక్షస బేతాళరాక్షస యక్ష కిన్నర సమూహాలతో వచ్చింది. ఇందరితో కలిసి కుమారస్వామి తన తండ్రికి బాసటగా నిలిచాడు.

దూతగా వచ్చిన గంధర్వుణ్ణి సాగనంపి శంఖచూడుడు కొలువు చాలించి అంతఃపురంలోకి నిర్గమించాడు. అక్కడ తులసికి ఈ రణవార్తను చెప్పాడు. వింటూనే నోరు ఎండిపోయింది. పెదవులు తడి ఆరాయి. క్షణకాలం అవాక్కుగా నిలిచిపోయింది.

ప్రాణబంధూ ! క్షణకాలం నా గుండెలపై విశ్రమించు. ప్రాణాధిష్ఠానదేవతా ! క్షణకాలం నా ప్రాణాలు కాపాడు. నామాట మన్నించు. క్షణకాలం సాదరంగా ఈ కన్నులతో నిన్ను ఇలా చూడనీ. గుండెలు దహించుకుపోతున్నాయి. ప్రాణాలు ఆందోళన పడుతున్నాయి. ఈరోజు తెల్లవారుజాములోనే నాకొక దుస్స్వప్నం కూడా వచ్చింది.



తులసి మాటలు విని శంఖచూడుడు మందహాసం చేశాడు. మదిర సేవించి విందు ఆరగించాడు. మెల్లగా హితవచనాలు పలికాడు. ప్రాణప్రియా ! ఈ జగత్తులో సమస్తమూ కాలాధీనమే. సుఖమూ దుఃఖమూ భోగాలూ ఆనందాలూ మంగళాలూ అమంగళాలూ అన్నింటికీ కాలమే కర్త. వృక్షాలు చూడు కాలవశాన కొమ్మలు తొడుగుతున్నాయి. పువ్వులు పూస్తున్నాయి. అవి కాయలవుతున్నాయి. పండ్లవుతున్నాయి. కాలవశాన రాలిపడుతున్నాయి. విశ్వాలు ఏర్పడేదీ నశించేదీ కాలప్రభావంతోనే. సృష్టి స్థితిలయాలు కాలంవల్లనే జరుగుతున్నాయి. త్రిమూర్తులకూ పైని మరొక పరమాత్మ ఉన్నాడు. అతడు కాలనర్తకుడు. అతడు వీరిని ఆడిస్తుంటాడు. తన ఇచ్ఛప్రకారం తనకు అభిన్నంగా ఈ ప్రకృతిని కల్పించి విశ్వాలనూ చరాచరజీవజాలాన్నీ సృష్టించి కాలవశంగా క్రీడిస్తుంటాడు. వినోదిస్తుంటాడు. అతడు సర్వాత్మ. సర్వరూపధారి. పరమేశ్వరుడు. జనంతో జనాన్ని సృష్టింపజేసి, జనంతో జనాన్ని రక్షింపజేసి, జనంతో జనాన్ని సంహరింపచేస్తుంటాడు.

**జనం జనేన జనితా జనం పాతి జనేన యః ।**
**జనం జనేన హరతే తం దేవం భజ సాంప్రతమ్ ॥ (20 - 60)**

ప్రియా! ఇప్పుడింక అతడిని సేవించు. ఈ సృష్టిలో గాలివీచినా, సూర్యుడు ప్రకాశించినా, ఇంద్రుడు వర్షించినా, మృత్యువు కబళించినా, అగ్ని దహించినా, చంద్రుడు వెలుగొందినా అంతా అతడి ఆజ్ఞప్రకారమే. అతడు మృత్యువుకి మృత్యువు. కాలానికి కాలం. యముడికి యముడు. సృష్టికర్తకు సృష్టికర్త. మాతకు మాత. సంహర్తకు సంహర్త. ఆ దేవాదిదేవుణ్ణి శరణువేడుకో. అతడే అందరికీ నిజమైన బంధువు. ఆత్మబంధువు.

నిజానికి నేనెవరో, నువ్వెవరో ! విధి మనల్ని ఇలా కలిపింది. అలాగే విడదీస్తోంది. ఈ రహస్యం తెలిసిన పండితుడు ఆపదలు వచ్చినప్పుడు అజ్ఞానిలా భయపడిపోడు. సుఖదుఃఖాలను రెండింటినీ సమానంగా భావించి కాలనేమిక్రమంలో మునుగుతూ తేలుతూ ఉంటాడు.

**అజ్ఞానీ కాతరః శోకే విపత్తౌ న చ పండితః ।**
**సుఖే దుఃఖే భ్రమత్యేవ కాలనేమిక్రమేణ చ ॥ (20 -66)**

తులసీ ! ఈ జన్మ ముగియడంతోనే నువ్వు నిశ్చయంగా నారాయణుడిని చేరుకుంటావు. బదరికావనంలో తీవ్రంగా తపస్సు చేశావుగదా! నేనూ చేశాను. ఆ తపస్సుకి ఫలంగానే నువ్వు దక్కావు. బ్రహ్మదేవుడిచ్చిన వరం ఉండనే ఉంది. కానీ నీ తపస్సు శ్రీహరికోసం కనక అతడిని నువ్వు పొందితీరతావు. గోలోక బృందావనంలో గోవిందుణ్ణి త్వరలోనే కలుసుకుంటావు. ఈ దానవదేహం విడిచి నేనూ గోలోకానికే వస్తాను. మళ్ళీ అక్కడ నన్ను చూద్దువుగాని. నేనూ నిన్ను చూస్తాను. రాధాదేవి ఇచ్చిన శాపంవల్ల ఈ భారతభూమిలో ఈ జన్మ ఎత్తవలసి వచ్చింది. ఈ తనువు రాలిపోగానే మళ్ళీ తిరిగి గోలోకానికేగదా



వెళ్ళవలసింది. ఇక ఇందులో నువ్వుగానీ నేనుగానీ దుఃఖించవలసింది ఏమీ లేదు. త్వరగా గోలోకానికి వెళ్ళి శ్రీహరిని కలుసుకుందాం. బాధపడకు.

శంఖచూడుడు ఇలా ఓదార్చి తులసికి ధైర్యం చెప్పాడు. రత్నమందిరంలో హంసతూలికా తల్పంమీద తులసీదేవిని గాఢంగా ఆలింగనం చేసుకుని పడుకున్నాడు. క్రీడా కౌతుక మంగళవాక్యాలు ఎన్నెన్నో పలికాడు. తులసీదేవిని ఉత్సాహపరిచి ఉల్లాసంగా ఉంచడానికి శతవిధాల ప్రయత్నించాడు. కానీ ఆ కృశోదరి అలా దుఃఖిస్తూనే ఉంది. ఆహారం ముట్టలేదు. రెప్పవాల్చలేదు. కన్నీరు ఆగలేదు. అతడి వక్షస్థలంమీద తల ఆన్చి శోకిస్తూనే ఉంది. ఒకప్పుడు శ్రీకృష్ణుడు భాండీరంలో తనకు ఉపదేశించిన దివ్యజ్ఞానాన్ని అంతటినీ మెల్లమెల్లగా తులసికి మళ్ళీ నూరిపోశాడు శంఖచూడుడు. సర్వశోకహరమైన తెలివిని కలిగించాడు. దానితో తులసి తేరుకుంది. ముఖమూ చూపులూ తేటపడ్డాయి. ప్రసన్నత చిగురించింది. సమస్తమూ నశ్వరమే అనే ఎరుక కలిగింది. దుఃఖం తొలగిపోయింది. అప్పుడు శంఖచూడుడితో చెయ్యి కలిపింది. క్రీడాపరవశులై దంపతులు సుఖసాగరంలో ఈదులాడారు. అర్ధనారీశ్వరుడన్నట్టు బిగియార కౌగిలించుకున్నారు.

అంగప్రత్యంగసంయుక్తౌ సుప్రీతౌ సురతోత్సుకౌ ।
ఏకాంగౌ చ తథా తౌ ద్వౌ చార్ధనారీశ్వరౌ యథా ॥ (20 - 79)

ఇద్దరూ ఒకరికొకరు ప్రాణాధికప్రియులు. ఇద్దరూ సమానరూపయౌవన సంపన్నులు. క్షణకాలం అవ్యక్తమధురంగా మాట్లాడుకుంటున్నారు. క్షణంలో రతిక్రీడా పరాయణులవుతున్నారు. క్షణకాలం మైమరచి యౌవన గర్వంతో విలాసంగా నవ్వుతున్నారు. ఆ శృంగారపండితుల రతికి విరతి లేదు. ఎవరికి ఎవరూ తీసిపోవడం లేదు. ఓడిపోవడం లేదు. *(అధ్యాయం - 20, శ్లోకాలు - 84)*

## ◆ శివ - శంఖచూడ సంవాదం ◆

బ్రాహ్మీముహూర్తంలో శంఖచూడుడు తల్పంమీద లేచి కూర్చున్నాడు. శ్రీకృష్ణపరమాత్మను మనస్సులో ధ్యానించాడు. శయ్యదిగాడు. రాత్రి కట్టుకున్న వస్త్రాలను విడిచిపెట్టాడు. శుద్ధోదకాలతో స్నానం చేశాడు. ధౌతవస్త్రాలు ధరించాడు. తిలకం దిద్దుకున్నాడు. ప్రాతఃకాలపూజలు అన్నీ నిర్వహించాడు. పెరుగు నెయ్యి తేనె పేలాలు వంటి మంగళవస్తువుల్ని దర్శించాడు. మణులూ రత్నాలూ వస్త్రాలూ బంగారమూ రోజూలాగానే భక్తిగా బ్రాహ్మణులకు దానం చేశాడు. రాజగురువును దర్శించి అమూల్యరత్నహారం సమర్పించి యుద్ధయాత్రకు మంగళాశీస్సులు పొందాడు. గజాశ్వధనరత్నరాశుల్ని బీదబ్రాహ్మణులకు కామకలుగా పంచిపెట్టాడు. వెయ్యి భాండారాలూ లక్ష నగరాలూ శతకోటి గ్రామాలూ పండితులకు



సర్వాధికారాలతో సమర్పించాడు. దానవరాజ్యానికి తన పుత్రుణ్ణి రాజును చేశాడు. తల్లినీ రాజ్యాన్నీ భాండాగారాలనూ వస్తువాహనాదులనూ తన అనుచరులనూ రక్షించే బాధ్యత అప్పగించాడు. తూణీరాలు కట్టుకుని కవచం ధరించి ధనుష్పాణియై యుద్ధానికి సన్నద్ధుడయ్యాడు. లక్ష గజసైన్యం, మూడు లక్షల అశ్వసైన్యం, అయుతరథసైన్యం సిద్ధమయ్యింది. మూడుకోట్ల ధానుష్కులు బారులుతీరి నిలబడ్డారు. వర్మధారులు మరో మూడుకోట్లూ శూలధారులు మరో మూడుకోట్లూ యుద్ధోత్సాహంతో కేరింతలు కొడుతున్నారు. ఒక్కొక్క సైన్యానికీ ఒక్కొక్కడిని అధిపతినిచేసి సర్వసన్నద్ధంగా ఉంచాడు. మనస్సులో శ్రీహరిని స్మరించుకుంటూ రత్నమణిమయ విమానం అధిరోహించాడు. ప్రధాన గురు మంత్రులను తనతో తీసుకుని శంకరుడి సమీపానికి బయలుదేరాడు. చంద్రభాగా నదీతీరాన (పుష్పభద్రావది) శుభప్రదమైన అక్షయవటవృక్షం కనిపించింది. (చంద్రభాగ = పుష్పభద్ర = పుణ్యభద్ర).

అది సిద్ధాశ్రమం. సిద్ధులకు సిద్ధిక్షేత్రం. కపిలుడు తపస్సు చేసినచోటు. భారతదేశంలో పరమపవిత్రమైన పుణ్యక్షేత్రం. మలయపర్వతానికి పశ్చిమంగా శ్రీశైలానికి ఉత్తరంగా గంధమాదనానికి దక్షిణంగా అయిదుయోజనాల వెడల్పూ అయిదువందల యోజనాల పొడవూ ఉన్న సువిశాల సమతల ప్రదేశమది. శుద్ధస్ఫాటికంలాగా మెరిసిపోతోంది. ప్రక్కనే జలపూర్ణంగా పుష్పభద్రానది ప్రవహిస్తోంది. శరావతితో కలసి హిమాలయాలనుంచి ప్రవహిస్తూ వస్తోంది. సముద్రుడికి ప్రియభార్య. సౌభాగ్యసంయుక్త. గోమతీనదిని ఎడమవైపున నిలుపుకుంటూ వెళ్ళి పశ్చిమసముద్రంలో కలుస్తోంది.

వటమూలంలో సమాసీనుడై ఉన్న చంద్రశేఖరుణ్ణి శంఖచూడుడు దర్శించాడు. యోగాసనంలో సూర్యకోటిసముడై విరాజిల్లుతున్నాడు. ముఖమంటపాన చిరునవ్వు తళుకులీనుతోంది. శుద్ధస్ఫటిక వర్ణంలో బ్రహ్మతేజస్సుతో వెలిగిపోతున్నాడు. వ్యాఘ్రచర్మాంబరధారి. త్రిశూల పట్టిశధారి. శాంతుడు. గౌరీకాంతుడు. మనోహరుడు. భక్తమృత్యుహరుడు. తపఃఫలదాత. సర్వసంపత్ప్రదాత. ఆశుతోషుడు (ఉబ్బులింగడు). ప్రసన్నవదనుడు. భక్తానుగ్రహకాతరుడు. విశ్వనాథుడు. విశ్వబీజుడు. విశ్వరూపుడు. విశ్వజుడు. విశ్వంభరుడు. విశ్వవరుడు. విశ్వసంహారకరుడు. కారణకారణుడు. నరకార్ణవతారణుడు. జ్ఞానప్రదుడు. జ్ఞానబీజుడు. జ్ఞానానందుడు. సనాతనుడు.

శంఖచూడుడు విమానం దిగాడు. గురుబృందంతో కలిసి భక్తినమ్రుడై శిరసా నమస్కరించాడు. శివుడికి వామమవైపున భద్రకాళి. ముందుభాగాన స్కందుడు - వీరికీ నమస్కరించాడు. కాళీస్కందశంకరులు ముగ్గురూ అతడికి ఆశీస్సులు అందించారు. అతడి రాకను చూసి నందీశ్వరాదులందరూ లేచి నిలబడ్డారు.

**ఆశిషం చ దదౌ తస్మై కాళీ స్కందశ్చ శంకరః ।**
**ఉత్తస్థురాగతం దృష్ట్వా సర్వే నందీశ్వరాదయః ॥ (21 - 29)**



పరస్పరం కుశలప్రశ్నలు వేసుకున్నారు. పరస్పరం సంభాషించుకున్నారు. శంఖచూడుడు శివుడి సన్నిధిలో కూర్చున్నాడు. మహాదేవుడు ప్రసన్నుడై -

శంఖచూడా ! బ్రహ్మదేవుడికి ధర్ముడు, ధర్ముడికి మరీచి, మరీచికి కశ్యపుడు జన్మించారు. దక్షప్రజాపతి ఈ కశ్యపుడికి తన పదముగ్గురు కూతుళ్ళను ఇచ్చి వివాహం చేశాడు. వారిలో ఒక సాధ్విపేరు దనువు. ఈమెకు సౌభాగ్యాతిశయంవల్ల ఇరవైనలుగురు పుత్రులు కలిగారు. అందరూ తేజోబలశాలులే. ఆ దానవులలో ఒకడు విప్రచిత్తి. అతడి పుత్రుడు దంభుడు. పరమధార్మికుడు. విష్ణుభక్తుడు. జితేంద్రియుడు. పుష్కరక్షేత్రంలో శ్రీకృష్ణమహామంత్రాన్ని జపిస్తూ లక్షసంవత్సరాలు తపస్సుచేశాడు. (శుక్రాచార్యుడు ఇతడి గురువు). ఆ తపఃఫలంగా నువ్వు జన్మించావు. పూర్వజన్మలో గోపకుడవు. గోలోకంలో శ్రీకృష్ణుడికి పార్షదుడివి. రాధికాశాపంవల్ల ఈ దానవవంశంలో ఆవిర్భవించావు. నువ్వు వైష్ణవోత్తముడవు. పరమ ధార్మికుడవు. నీవంటి విష్ణుభక్తులు హరిసేవను తప్ప తక్కినవాటిని నీచాలుగా తుచ్ఛాలుగా పరిగణిస్తారు. హరిసేవ తప్ప మరింకేదీ కోరుకోరు. బ్రహ్మత్వమూ అమరత్వమూకూడా వారికి తుచ్ఛాలే. ఎవరి దగ్గరా దానం పట్టరు. ఎవరినుంచీ ఏదీ ఆశించరు. తీసుకోరు. అటువంటిది కృష్ణభక్తుడవయ్యుండి నువ్వు దేవతలనుంచి రాజ్యం కొల్లగొడతావా ! తప్పుకాదూ ! వారి రాజ్యం వారికి ఇచ్చేసెయ్యి. నేను సంతోషిస్తాను. శ్రీహరి ఆనందిస్తాడు. నీ రాజ్యం నువ్వు ఏలుకో. ఎవరి పదవుల్లో వారు సుఖంగా ఉండండి. కశ్యపుడి వంశంలో పుట్టావు. భూతవిరోధం దేనికీ ! ఇక చాలించు. మహాపాపాలు అన్నీ ఒక ఎత్తయితే జ్ఞాతిద్రోహం ఒక్కటీ ఒక ఎత్తు అన్నారు. ఇది బ్రహ్మహత్యా మహాపాతకంకన్నా పదహారురెట్లు మహాపాపం. దీనివల్ల సర్వసంపదలూ నశిస్తాయి. అంచేత దాయాదులతో వైరం పెట్టుకోకు. దేవతలతో సఖ్యంగా ఉండు. నీజోలికి వారు రారు. వారి జోలికి నువ్వు పోవద్దు. మీరంతా కశ్యపవంశజులేకదా !

అదీగాక - అందరికీ అన్నిరోజులూ ఒక్కలాగా గడవవు. బ్రహ్మదేవుడంతటివాడికే ప్రళయంలో వినాశం తప్పడంలేదు. ఈశ్వరేచ్ఛతో మళ్ళీ ఆవిర్భవిస్తున్నాడు. తపస్సుతో జ్ఞానం సంపాదిస్తున్నాడు. దానితో పునస్సృష్టి చేస్తున్నాడు. అంతదాకా ఎందుకు, ధర్మంమాట చూడు. కృతయుగంలో పరిపూర్ణంగా ఉంటోంది. త్రేతాయుగంలో మూడువంతులు నిలుస్తోంది. ద్వాపరం వచ్చేసరికి రెండువంతులకు క్షీణిస్తోంది. కలియుగారంభంలో ఒక వంతుకి చిక్కిపోయి రానురాను కళామాత్రంగా దృశ్యాదృశ్యంగా మిగులుతోంది. ప్రత్యక్షంగా కనిపించే మరొక దృష్టాంతం చెబుతాను. విను. సూర్యుడున్నాడు. గ్రీష్మంలో ఉన్నట్టు శిశిరంలో ఉంటున్నాడా ? మధ్యాహ్నవేళలో ఉన్నట్టు ప్రాతస్సాయం సంధ్యల్లో ఉండగలుగుతున్నాడా ? ఉదయం బాలుడిగా ఉండి మధ్యాహ్నానికి క్రమంగా వృద్ధిపొంది సాయంకాలానికి వృద్ధుడై అస్తమిస్తున్నాడు. ఒక్కొక్కసారి మబ్బులు కమ్మితే మధ్యాహ్నసమయాల్లోకూడా అదృశ్యమవుతున్నాడు. గ్రహణం రోజున



ఎంతటి దీనావస్థకి గురిఅవుతున్నాడో చూస్తూనే ఉన్నాంకదా ! అలాగే చంద్రుడూను. పదిహేనురోజులు వృద్ధి, పదిహేనురోజులు క్షయమూను. దుర్దినాలూ గ్రహణాలూ సరేసరి.

ఒకనాడు ముల్లోకాలూ నావేనని ఎగబడ్డ బలిచక్రవర్తి ఇవ్వేళ పాతాళానికి దిగబడ్డాడు. కాలప్రభావం అటువంటిది. కలిసివచ్చినవేళ భూగోళం సస్యసంపన్నం అవుతుంది. కానివేళ ప్రళయజలధిలో మునిగిపోతుంది. కాలప్రభావంతోనే విశ్వాలు పుడుతున్నాయి. కాలప్రభావంతోనే గిడుతున్నాయి. చరాచర జీవజాలమంతా ఇంతే. ఒక్క పరాత్పరుడైన పరమాత్మమాత్రమే ఈ కాలప్రభావానికి అతీతుడు. తక్కిన సమస్తమూ బ్రహ్మాదిస్తంభపర్యంతమూ వృద్ధిక్షయాలకు లోనయ్యేదే. కాలప్రభావానికి లొంగినడిచేదే.

పరమాత్మ ఒక్కడే మహాపురుషుడనీ ప్రకృతి స్వరూపుడనీ నానారూపధారిఅనీ త్రిమూర్తులను నియమించి సృష్టి స్థితి లయాలు లీలావినోదంగా జరిపిస్తున్నాడనీ గ్రహించి నామ గుణ సంకీర్తన చేసే జ్ఞాని సాధనతో క్రమక్రమంగా జన్మ రోగ జరా మృత్యు భయాలను జయిస్తాడు. నేను అలాగే జపిస్తూ ఉంటాను. ఆ జ్ఞానంతో నిర్భయత్వం వచ్చింది. మృత్యుంజయుణ్ణి అయ్యాను. మృత్యుభయం పోతే మృత్యువు పారిపోతుంది - గరుడుణ్ణి చూసిన పాములాగా.

> అహం కరోమి సతతం తన్నామగుణకీర్తనమ్ ।
> తేన మృత్యుంజయోఽహం చ జ్ఞానేనానేన నిర్భయః ॥
> మృత్యుర్మృత్యుభయాద్యాతి వైనతేయాదివోరగాః ॥ (21 - 62)

శంకరుడు ఇంతగా ఉపదేశించి శంఖచూడిడి ముఖంలోకి చూశాడు. అతడు ప్రశంసాపూర్వకంగా శిరఃకంపం చేశాడు. సవినయంగా మధురంగా మనసులోనిమాట బయటపెట్టాడు.

పరమేశ్వరా ! నువ్వు చెప్పింది చాలా సమంజసంగా ఉంది. కాదనడానికి ఏమీ కనిపించడం లేదు. అయినా నాదొక మనవి. వాస్తవం చెబుతున్నాను. చిత్తగించు. జ్ఞాతిద్రోహం మహాపాపమన్నావుకదా ! మరి - సంపదలన్నీ ఊడగొట్టి బలిచక్రవర్తిని పాతాళానికి ఎందుకు తొక్కినట్టు ? అతడి ఐశ్వర్యాలనన్నింటినీ నేను శత్రువులనుంచి ఉద్ధరించి తేగలిగాను గానీ అతడినిమాత్రం పాతాళంనుంచి ఉద్ధరించలేకపోయాను. నాశక్తి సరిపోలేదు. ఇది ఒక్కటే కాదు - సోదరసహితంగా హిరణ్యాక్షుణ్ణి హింసించారు దేవతలు. శుంభనిశుంభాది దానవులను నిర్దాక్షిణ్యంగా మట్టుబెట్టారు. ఇంకా తరచుకుంటూ వెనక్కి వెడితే - సముద్రమథనానికి శ్రమపడింది మేమైతే అమృతం మ్రింగింది దేవతలు. చాకిరీమాది, సౌఖ్యం వారిది. సరే - ఈ పాతపురాణాలకేమిగానీ ఒకటిమాత్రం నిజం. ఈ విశ్వమంతా ప్రకృతిస్వరూపుడైన ఆ పరమాత్మకు ఒక క్రీడాభాండం. ఎవడికి ఎక్కడ ఎప్పుడు ఏది ఇవ్వాలనుకుంటే అది ఇస్తాడు. వాడు అలా ఐశ్వర్యవంతుడవుతాడు.



క్రీడాభాండమిదం విశ్వం ప్రకృతేః పరమాత్మనః ।
యస్మై యత్ర స దదాతి తస్యైశ్వర్యం భవేత్తదా ॥ (21 - 70)

దేవతలనీ దానవులనీ కయ్యాలనీ నెయ్యాలనీ - ఇదంతా వట్టి బూటకం. కేవలం నిమిత్తమాత్రం. పరమాత్మని ఇచ్ఛయే అన్నింటికీ కారణకారణం. జయమో పరాజయమో కాలక్రమంలో మాకో వారికో లభిస్తూ ఉంటుంది. కాలమే కర్త. విరోధాలూ యుద్ధయాత్రలూ అన్నీ నిష్ఫలాలూ నిష్ప్రయోజనాలూను. కానీ - సమసంబంధులమూ బంధువులమూ అయిన మాతో యద్ధం చెయ్యడానికి ఇవ్వేళ నువ్వే స్వయంగా వచ్చావు. సిగ్గనిపించడంలేదూ ? జయం వరిస్తే మంచిదే. గొప్పకీర్తి లభిస్తుంది. పరాజయం వచ్చిపడితేనో ! అపకీర్తి చుట్టుకోదూ ? ఇది ఆలోచించావా ?

సమసంబంధినో బంధోరీశ్వరస్య మహాత్మనః ।
ఇయం తే మహతీ లజ్జా యుద్ధోఽస్మాభిస్సహాధువా ॥
జయే తతోఽధికా కీర్తిః హానిశ్చైవ పరాజయే ॥ (21 - 74)

శంఖచూడుడు సూటిగా ప్రశ్నించాడు. త్రిలోచనుడు పెద్దగా నవ్వి యథోచితంగా బదులు పలికాడు. దానవేంద్రా ! బ్రహ్మవంశసంభూతులైన మీతో యుద్ధం చెయ్యడానికి నాకు సిగ్గెందుకు ? పరాజయం వచ్చిపడితేమాత్రం నాకు చుట్టుకునే అపకీర్తి ఏమిటి ? అసలు ఆదిలో మధుకైటభులతో కలహించి దేవదానవ సంగ్రామాలకు శ్రీకారంచుట్టింది శ్రీమన్నారాయణుడేకదా ! బలి హిరణ్యాక్ష హిరణ్యకశిపులతోనూ జబ్బచరిపించింది అతడే. ఒక్క త్రిపురాసురులతోమాత్రం నేను తలపడ్డాను. అదెప్పుడో చాలా కాలంక్రితం. ఇక శుంభనిశుంభాదులతోనంటావా జగన్మాత పరమేశ్వరి కలహించింది. ఇలా అందరూ మీతో యుద్ధాలు చెయ్యగాలేనిది నేను నీతో చెయ్యడానికి సిగ్గుపడాల్సింది ఏముంది ? అదీకాక - నువ్వు సాధారణ దానవుడవా ! గోలోకవాసి గోపకుడివి. శ్రీహరికి పార్షదుడివి. ఇప్పటికి సంహరింపబడిన ఏ దానవుడూ నీకు సాటిరాడు. అందుచేత నేను సిగ్గుపడవలసింది ఏమీ లేదు. ఒకవేళ పరాజయమే సంభవించినా అపకీర్తి కానేకాదు. పైగా సకలదేవతాశరణ్యుడైన శ్రీహరి స్వయంగా శూలం అందించి నీమీదకి పంపించాడు. కాబట్టి ఇక మాటలు కట్టిపెట్టు. నేను చెప్పినట్టు దేవతలకు రాజ్యం ఇచ్చేసెయ్యి. లేదంటే నాతో యుద్ధానికి దిగు - అని స్పష్టంగా తేల్చిచెప్పాడు.

*(అధ్యాయం - 21, శ్లోకాలు - 82)*

శంఖచూడుడు మరింక మాట్లాడలేదు. లేచి నిలబడ్డాడు. మంత్రులూ గురువులూ లేచారు. శివుడికీ పరివారానికీ వినయంగా శిరసువంచి నమస్కరించాడు. త్వరత్వరగా వెళ్ళి విమానం అధిరోహించాడు. రాజధానికి చేరుకున్నాడు. వెంటనే యుద్ధానికి సైన్యాన్ని కదిలించాడు.



## ◆ చంద్రచూడ - శంఖచూడుల సంగ్రామం ◆

శివుడు తన సేననూ సేనాధిపతులనూ ఉత్సాహపరిచాడు. దేవదానవ మహాసైన్యాలకు సంగ్రామం మొదలయ్యింది. మహేంద్రుడు వృషపర్వుడితో భాస్కరుడు విప్రచిత్తితో చంద్రుడు దంభుడితో కాలుడు కాలస్వరుడితో హుతాశనుడు గోకర్ణుడితో కుబేరుడు కాలకేయుడితో విశ్వకర్మ యముడితో మృత్యువు భయంకరుడితో యముడు సంహారుడితో వరుణుడు వికంకణుడితో వాయువు చంచలుడితో బుధుడు ఘృతపృష్ఠునితో శనైశ్చరుడు (శని) రక్తాక్షుడితో జయంతుడు రత్నసారుడితో అశ్వినులు దీప్తిమంతుడితో వసువుడు వర్చసుడితో నలకూబరుడు ధూమ్రుడితో ధర్ముడు ధురంధరుడితో మంగళుడు ఉషాక్షుడితో భానుడు శోభాకరుడితో మన్మథుడు పిఠరుడితో ఇంకా ఇలాగే గోధాముఖ - చూర్ణ - ఖడ్గ - ధ్వజ - కాంచీముఖ - పింఢ - ధూమ్ర - నంది - విశ్వ - పలాశాది దానవులతో ద్వాదశాదిత్యులూ, ఏకాదశభయంకరులతో ఏకాదశరుద్రులూ, ఉగ్రచండాదులతో మహామారీ నందీశ్వరాదులూ ముఖాముఖి తలపడి ఘోరంగా యుద్ధం చేశారు. ప్రళయంకన్నా భీషణంగా జరుగుతోంది. శివుడుమాత్రం అదే వటమూలంలో అదే యోగాసనంలో కాళీసుతుడు తోడుగా కూర్చున్నాడు.

శంఖచూడుడుకూడా సంగ్రామోచితవేషధారియై సభామంటపంలో కోటిదానవపరివృతుడై రత్నసింహాసనంమీద కూర్చున్నాడు. ఎప్పటికప్పుడు యుద్ధవార్తలు వింటున్నాడు. శంకరుడి సైన్యంలో ఏ యోధుడు ఏ దానవుడి చేతిలో ఓడిపోయాడో తెలుసుకుంటున్నాడు.

దానవుల ధాటికి తట్టుకోలేక దేవసైన్యాలు పలాయనం చిత్తగిస్తున్నాయి. సేనాపతి కుమారస్వామి గమనించి తానే స్వయంగా అగ్రభాగాన నిలిచి సేనలను ఉత్సాహపరిచాడు. తన తేజశ్శక్తితో సేనాబలాన్ని వృద్ధిపొందించాడు. ఒంటిచేతితో నూరు అక్షౌహిణుల దానవసైన్యాన్ని క్షణంలో సంహరించాడు. కాళికాదేవి మూర్తీభవించిన క్రోధంగా సమరాంగణాన స్వేచ్ఛగా తిరుగుతూ దానవవీరుల రక్తం తాగుతోంది. లక్షలాదిగా ఏనుగులనూ గుర్రాలనూ చేతజిక్కించుకుని అవలీలగా నోట్లో కుక్కుకుంటోంది. శిరస్సులు తెగిపడిన మొండేలు కరాళనృత్యం చేస్తున్నాయి. హతశేషులైన దానవ మహావీరులకు గుండెలు జారిపోయాయి. ఎవరికి వారుగా పలాయనం చిత్తగించారు. కానీ వృషపర్వ - విప్రచిత్తి - దంభ - వికకంకణులుమాత్రం నలుగురూ ఒకటై కుమారస్వామితో పోరాడుతున్నారు. రణరంగంలో ప్రవేశించింది మొదలు మరింక వెనుదిరిగి చూడకుండా మహామారి దానవులను చంపుకుంటూ పోతోంది.

కట్టకడపటికి స్కందుడు తన శక్తి ఆయుధాన్ని ప్రయోగించాడు. వృషపర్వాదులు నలుగురూ దానిని అడ్డుకోలేక సంక్షుబ్ధులై నిలబడ్డారు. అంతేకానీ భయార్తులై పారిపోలేదు. ఆకాశంనుంచి పుష్పవృష్టి కురిసింది.



స్కందుడి మహావిజృంభణం విన్న శంఖచూడుడు తక్షణం తన దివ్యవిమానం అధిరోహించాడు. తిన్నగా రణరంగానికి వచ్చాడు. వస్తూనే మేఘంలా శరవర్షం కురిపించాడు. సంగ్రామస్థలి అంధకారబంధురమయ్యింది. మరుక్షణంలో అగ్నిజ్వాలలు వ్యాపించాయి. నేల మండుతోంది. భయవిహ్వాలులై దేవసైనికులు దశదిశలకూ పారిపోయారు. మంటలను చల్లార్చలేక నందీశ్వరాదులు సైతం వెనుదిరిగారు. కార్తికేయుడొక్కడే మండుతున్న సమరభూమిలో ధైర్యంగా విలబడ్డాడు.

దేవాః ప్రదుద్రువుస్సర్వేఽప్యన్యే నందీశ్వరాదయః ।
ఏక ఏవ కార్తికేయస్తస్థౌ సమరమూర్ధని ॥ (22 - 26)

శంఖచూడుని ఉత్సాహం ఉప్పొంగింది. స్కందుడిచుట్టూ శిలావర్షం కురిపించాడు. అవి పర్వతవలయమయ్యాయి. వృక్షశ్రేణితో ఆచ్ఛాదించాడు. సర్పాలను కుంభవృష్టిగా కురిపించాడు. కార్తికేయుడి చేతిలో ఉన్న ధనుస్సును నడిమికి రెండుగా విరగ్గొట్టాడు. దివ్యరథాన్నీ రథపీఠాన్నీ నుగ్గునుగ్గు చేశాడు. మయూరవాహనాన్ని తూట్లు పొడిచాడు. శక్తి ఆయుధాన్ని గుండెలకు గురిపెట్టి విసిరాడు. ఆ దెబ్బ తట్టుకోలేక షణ్ముఖుడు క్షణకాలం మూర్ఛపోయాడు. వెంటనే తేరుకుని విష్ణుదత్తమైన దివ్యధనుస్సు అందుకొని వజ్రనిర్మితమైన రథం అధిరోహించి దిక్కులు పిక్కటిల్లేలాగా ధనుష్టంకారం చేశాడు. మహోల్బణుడై శస్త్రాస్త్రాలను ప్రయోగించి తన చుట్టూఉన్న పర్వతాలనూ వృక్షాలనూ సర్పాలనూ ధ్వంసం చేశాడు. కమ్ముకున్న మంచుతెరలనుంచి బయటపడ్డ భాస్కరుడిలా ప్రకాశించాడు. పర్జన్యాస్త్రం ప్రయోగించి దవానలంలాగా వ్యాపిస్తున్న మంటలను ఆర్పివేశాడు. శంఖచూడుడి రథాన్నీ ధనుస్సునూ తుత్తునియలు చేశాడు. సారథిని సంహరించాడు. రథాశ్వాలను చీల్చిచెండాడాడు. కిరీటాన్ని పడగొట్టాడు. శక్తి ఆయుధాన్ని మంత్రించి ప్రయోగించాడు. అది సరాసరివెళ్ళి దానవేంద్రుడి వక్షఃస్థలాన్ని బలంగా ఢీకొట్టింది. క్షణకాలం మూర్ఛపోయి వెంటనే తెప్పరిల్లాడు. మరోరథాన్ని అధిరోహించి మరోధనుస్సు ధరించి మాయా శరజాలం కురిపించి గుహుణ్ణి కప్పివేశాడు. ఇదంతా నిమేషమాత్రంలో జరిగింది. విష్ణుతేజోవృతమై శతసూర్యసంకాశమై ప్రళయాగ్నిశిఖాసదృశమై ధగధ్ధగలాడుతున్న శక్తి శరాన్ని సంధించి వదిలాడు. తిరుగులేని దానిదెబ్బకు షాణ్మాతురుడు మూర్ఛపోయాడు. కాళికాదేవి వెంటనే వచ్చి అతడిని చేతుల్లోకి ఎత్తుకుని శివుడిదగ్గరదించి తాను మళ్ళీ రణరంగానికి దూసుకువెళ్ళింది.

శివుడు తన దివ్యశక్తితో కుమారస్వామిని పునరుజ్జీవితుడిని చేశాడు. అనంతంగా బలాన్ని ప్రసాదించాడు. స్కందుడు ప్రతాపవంతుడై లేచికూర్చున్నాడు.

రణరంగానికి దూసుకువెడుతున్న కాళికాదేవి వెంట మధుభాండాలతో గంధర్వయక్షకిన్నర వీరులు తరలివెళ్ళారు. కాళికాదేవి సింహనాదం చేసింది. వికటాట్టహాసం చేసింది. మధుభాండాలు సేవించి కరాళనృత్యం చేసింది. దానవవీరులు భయకంపితులై మూర్ఛపోయారు. ఉగ్రదంష్ట్రా - ఉగ్రదండా -



కోటకీ - యోగినీ - డాకినీ గణాలు మధుభాండాలు సేవిస్తూ వికృతంగా అరుస్తూ వికటాట్టహాసాలు చేస్తూ భీషణంగా గంతులు వేస్తున్నాయి. శంఖచూడుడు ఇటువైపు దృష్టిసారించాడు. దానవులకు అభయం ఇచ్చి కాళికాదేవితో కయ్యానికి కాలుదువ్వేడు. కాళిక అగ్నులు కురిపించింది. దానవరాజు పర్జన్యాస్త్రంతో చటుక్కున చల్లార్చాడు. వారుణాస్త్రాన్ని గాంధర్వంతో అణిచివేశాడు. మాహేశ్వరాన్ని వైష్ణవంతో మట్టికరిపించాడు. కోపం పట్టలేక కాళికాదేవి నారాయణాస్త్రం ప్రయోగించింది. దానవప్రభువు వినయంగా రథందిగి భక్తితో శిరసు వంచి నమస్కరించాడు. ప్రళయాగ్నిశిఖలాగా వస్తున్న ఆ అస్త్రం దారిమళ్ళి ఆకాశంలో కలిసిపోయింది. ఆశ్చర్యచకితయైన కాళిక ఈసారి బ్రహ్మాస్త్రం విడిచిపెట్టింది. బదులుగా బ్రహ్మాస్త్రాన్నే ప్రయోగించి విజయదరహాసం చేశాడు దానవేశ్వరుడు. దివ్యాస్త్రాలన్నీ అయిపోయాయి. యోజనాయతమైన శక్తి ఆయుధాన్ని విసిరింది. శంఖచూడుడు దాన్ని దివ్యాస్త్రాలతో శతఖండాలు చేశాడు. ఉక్రోషం ఆపుకోలేక కాళికాదేవి పాశుపతాస్త్రాన్ని ప్రయోగించబోయింది. అంతలోకీ అశరీరవాణి వినిపించింది -

కాళీ ! ఎందుకు ఈ వృథాప్రయాస. శంఖచూడుడి మృత్యువు ఏ అస్త్రంలోనూ లేదు. ఏ శస్త్రంలోనూ లేదు. అతడి మెడలో ఆ నారాయణ కవచం ఉన్నంతవరకూ, అతడి భార్య శీలానికి భంగం కలగనంతవరకూ అతడిని ఎవరూ ఏమీ చెయ్యలేరు. అజయ్యుడు. జరామృత్యువులకు అతీతుడు. ఇది బ్రహ్మ ఇచ్చిన వరం.

కాళికాదేవి పాశుపతాన్ని ఉపసంహరించుకొంది. ఆకలిగొన్న పులిలాగా చెలరేగి దానవవీరులను పదిలక్షలమందిని దోసిటబట్టి నోట్లో వేసుకుంది. శంఖచూడుణ్ణికూడా అలాగే పట్టుకుని మింగేద్దామనుకుంటూ ముందుకు వచ్చింది. దానవచక్రవర్తి అగ్నిశిఖలవంటి విశిఖాలతో నిలవరించాడు. గ్రీష్మసూర్యకాంతిలా తళతళలాడుతున్న ఖడ్గాన్ని విసిరింది. దాన్ని నూరుముక్కలు చేశాడు. ఈసారైనా పట్టుకుని మింగేద్దామని మళ్ళీ ప్రయత్నించింది. కానీ ఆ యోగసిద్ధుడు అందకుండా తప్పించుకున్నాడు. ఆ కోపాన్ని రథంమీద చూపించింది. పిడిగుద్దుతో తునాతునకలు చేసింది. సారథిని పిడికిటబట్టి పిసికి ముద్దచేసింది. దానవరాజుకు గురిచూసి శూలం విసిరింది. అతడు దాన్ని లీలావిలాసంగా ఎడంచేత్తో పట్టుకొన్నాడు. కాళిక మరింతగా రెచ్చిపోయి ముష్టిఘాతం తగిలించింది. పిడుగుపడ్డంత పనిఅయ్యింది. విలవిలలాడాడు. తూలిపోయాడు. మూర్ఛిల్లాడు. క్షణంలో తేరుకుని లేచి నిలబడ్డాడు. కాళికాదేవి బాహాబాహికి దిగింది. శంఖచూడుడు నమస్కరించాడు. ఆవిడ చేతుల్లో ఉన్న శస్త్రాస్త్రాలనన్నింటినీ ఊడలాక్కున్నాడు. విరిచిపారేశాడు. కానీ తానై ఆ దేవిమీదికి ఏ ఆయుధాన్నీ ప్రయోగించలేదు. భక్తుడు. వైష్ణవుడు. మాతృభక్తి పరాయణుడుకదా శంఖచూడుడు.

దేవ్యాశ్చాస్త్రం స చిచ్ఛేద జగ్రాహ చ స్వతేజసా ।
నాస్త్రం చిక్షేప తాం భక్తో మాతృభక్త్యా తు వైష్ణవః ॥ (22 - 67)



కాళికాంబ చేతులు సాచి దానవప్రభువును పట్టుకుంది. ఆకాశానికి ఎత్తింది. గిరగిరా తిప్పి విసిరేసింది. అంత ఎత్తునుంచి నేలకుపడ్డా శంఖచూడుడు చెక్కుచెదరలేదు. వెంటనే లేచి నిలబడ్డాడు. భద్రకాళికకు శిరసువంచి నమస్కరించాడు. తన దివ్యవిమానం అధిరోహించి యుద్ధం కొనసాగించాడు. భద్రకాళి దానవవీరులను పిండి కడుపునిండా రక్తంతాగి నేలను మట్టుకుంటూ శివుడి దగ్గిరికి వెళ్ళింది. రణవృత్తాంతాన్ని యథాక్రమంగా వివరించి చెప్పింది. శంభూ ! నేను పాశుపతం ప్రయోగించబోతే అశరీరవాణి వినిపించింది. దానితో ఉపసంహరించుకున్నాను. శంఖచూడుడు మహాబలశాలి. మహాపరాక్రమశీలి. నా బాణాలనూ అస్త్రాలనూ ఖండించాడే తప్ప తనంత తానుగా నామీదకి ఏ ఆయుధమూ ప్రయోగించలేదు. పైగా భక్తితత్పరుడై నమస్కరించాడు. నిజంగా అతడు మహాజ్ఞాని. జితేంద్రియుడు - వింటున్న శంకరుడు మృదువుగా నవ్వాడు. ***(అధ్యాయం - 22, శ్లోకాలు - 75)***

తత్త్వజ్ఞాన విశారదుడైన శివుడు ఈసారి స్వయంగా రణరంగంలోకి దిగాడు. అతనివెంట ప్రమథగణాలు నడిచాయి. అల్లంత దూరాన చూసి దానవప్రభువు విమానం దిగి శిరసువంచి నమస్కరించి సాష్టాంగపడ్డాడు. తిరిగి విమానం అధిరోహించి ధనుస్సు ఎక్కుపెట్టాడు.

నారదా ! చంద్రచూడ శంఖచూడుల యుద్ధం పూర్తిగా వందసంవత్సరాలు సాగింది. జయమూ లేదు పరాజయమూ లేదు. శస్త్రాలకి శస్త్రాలూ అస్త్రాలకి అస్త్రాలుగా నడిచింది. రథంమీద శంఖచూడుడు, వృషభం మీద చంద్రచూడుడు. హెచ్చుతగ్గులు లేని ద్వంద్వయుద్ధం నూరేళ్ళు సాగింది.

## ◆ శ్రీహరి చేసిన వంచన ◆

ఒకనాడు ఒక వృద్ధబ్రాహ్మణుడు రణరంగానికి వచ్చాడు. దానవేంద్రుడి దగ్గరికి వెళ్ళాడు. దానవరాజేంద్రా ! నేను విప్రుణ్ణి. నువ్వు ప్రభువువు. సర్వసంపదలకూ దాతవు. నాకు పెద్దగా కోరికలు లేవు. నిరీహుడను. పైగా వృద్ధుడను. చాలా దప్పికగా ఉంది. ఆట్టే మాట్లాడలేను. నువ్వు ఊఁ అంటే అడుగుతాను - చిన్నకోరిక తీర్చు - అన్నాడు. శంఖచూడుడు ప్రసన్నుడై ఊఁ, అడగండి తీరుస్తాను అన్నాడు. అయితే నీ మెడలో ఉన్న నారాయణ కవచం కావాలి, ఇయ్యి. అడగడమే తడవుగా దానవేంద్రుడు తీసి ఇచ్చేశాడు. అది పుచ్చుకుని ఆ వృద్ధబ్రాహ్మణుడు శ్రీహరి అంతలోనే అంతర్ధానం చెందాడు. నారాయణ కవచధారియై శంఖచూడుని రూపంలో తులసీదేవిముందు ప్రత్యక్షమయ్యాడు. మాయోపాయంతో ఆమె గర్భంలో వీర్యాధానం చేశాడు.

సరిగ్గా అదే సమయానికి రణరంగంలో శివుడు తనకు శ్రీహరి అందించిన శూలాన్ని తీశాడు. అది గ్రీష్మమధ్యాహ్న మార్తాండమండలంలాగా ప్రళయకాలాగ్నిశిఖలాగా దుర్నిరీక్ష్యంగా దుర్నివార్యంగా



ప్రజ్వరిల్లుతోంది. సుదర్శన చక్రంలాగా సర్వశస్త్రాస్త్రసారంలాగా తేజరిల్లుతోంది. వేయి ధనుస్సుల పొడుగుంది. నూరుబారల వెడల్పుంది. సర్వబ్రహ్మాండమండలాన్నీ సంహరించడానికి సమర్థమనిపిస్తోంది. ఆ శూలాన్ని ఒకసారి గిర్రున త్రిప్పి శంఖచూడుడి మీదికి విసిరాడు. దాన్ని చూస్తూనే దానవేంద్రుడు ధనుస్సు వదిలేశాడు. మనస్సులో శ్రీకృష్ణుడి పాదపద్మాలను ధ్యానించాడు. యోగాసనాసీనుడు అయ్యాడు. శూలం గిరికీలు కొట్టుకుంటూ వచ్చి అతడిమీద పడింది. పడటమేమిటి రథంతోసహా భస్మమైపోయాడు.

ఆ భస్మరాశినుంచి కిశోరగోపవేషంలో సుదాముడు ఆవిర్భవించాడు. ద్విభుజుడు. మురళీహస్తుడు రత్నభూషణభూషితుడు. గోపకోటీపరివేష్టితుడు. బాలసూర్యప్రభలతో వెలిగిపోతున్నాడు. అంతలోకి గోలోకంనుంచి దివ్యవిమానం వచ్చింది. అతడూ గోపకులూ అందులోకి అధిరోహించారు. అది ఆకాశమార్గాన గోలోకానికి సాగిపోయింది. అక్కడ బృందావనంలో రాసమండలంలో రాధాకృష్ణులకు సవినయంగా సభక్తికంగా నమస్కరించాడు. సాష్టాంగ పడ్డాడు. రాధాకృష్ణులు ప్రసన్నవదనారవిందులై బాలసుదాముణ్ణి తిలకించి ప్రేమగా చేరదీసి ఒడిలో కూర్చోబెట్టుకున్నారు.

శివుడు ప్రయోగించిన శూలం శంఖచూడుడి అస్థికలతో కలిసి శంఖజాతిగా మారిపోయింది. అప్పటినుంచీ శంఖం దేవతార్చనలకు యోగ్యమయ్యింది. శంఖంలో పోసిన తీర్థం చాలా ప్రశస్తం. దేవతలకు ప్రీతిపాత్రం. పవిత్ర తీర్థోదకాల్లాగా పరమపవిత్రం. శంఖశబ్దం వినిపించినచోట లక్ష్మీదేవి ఉంటుంది. శంఖజలంతో స్నానంచేస్తే సకల తీర్థాలలోనూ స్నానంచేసినట్టే. శంఖం శ్రీహరికి అధిష్ఠానం. అది ఉన్నచోట విష్ణుమూర్తి ఉన్నట్టే. అక్కడే లక్ష్మీదేవీ ఉంటుంది. అమంగళాలు అన్నీ పటాపంచలవుతాయి.

దానవసంహారంతో శివుడు సంతుష్టి చెందాడు. వృషభారూఢుడై తన లోకానికి వెళ్ళిపోయాడు. దేవతలు తమ రాజ్యాన్నీ తమ అధికారాలనూ తిరిగిపొంది విజయోత్సవం చేసుకున్నారు. దేవదుందుభులు మిన్నంటి మ్రోగాయి. గంధర్వ కిన్నరులు గొంతెత్తి పాడారు. పుష్పవృష్టి ధారాళంగా కురిసింది. మహర్షులూ మునీంద్రులూ శివుడినీ ప్రమథులనూ దేవవీరులనూ కాళికామాతనూ ప్రశంసించారు.

***(అధ్యాయం -23, శ్లోకాలు- 30)***

నారదా ! తులసీగర్భంలో శ్రీహరి వీర్యాధానం ఎలా చేశాడు అనేదేకదా నీ శంక. చెబుతున్నాను. విను. తులసీదేవి పాతివ్రత్యాన్ని భంగపరిస్తేనేకానీ శంఖచూడుడు మరణించడు. అందుకని శ్రీహరి దానవప్రభువు రూపంలో తులసీమందిరానికి వెళ్ళాడు. మందిరద్వారం దగ్గర దుందుభి ఉంది. దాన్ని మోగించాడు. అది జయశబ్దం చేసింది. ఆ ధ్వని విని పరమానందభరితురాలై ఆ సాధ్వీమణి మందిరకవాటం తెరిచి ఈవలికి వచ్చింది. ఎట్టయెదుట తన మనోహరుణ్ణి చూసింది. సంతోషం పట్టలేక ఉక్కిరిబిక్కిరి అయ్యింది. బ్రాహ్మణులకూ వందిమాగధులకూ స్వస్తివాచకులకూ ధన కనక మణి మాణిక్యాలను దోసిళ్ళకొద్దీ దానం చేసింది. అర్ఘ్యపాద్యాలను తెచ్చి మనోహరుడి పాదాలను కడిగింది. నమస్కరించి



ముద్దాడింది. ఎందుకో ఏదో తెలియని దుఃఖం కట్టలు తెంచుకుంది. వలవలా విలపించింది. సాదరంగా తీసుకువచ్చి ఏకాంతమందిరంలో రత్నసింహాసనంమీద కూర్చోబెట్టింది. చందనచర్చలు చేసింది. కస్తూరికా తాంబూలమిచ్చింది.

నాథా ! ఇప్పటికి నా ప్రాణాలు కుదుటబడ్డాయి. రణరంగానికి వెళ్ళి క్షేమంగా తిరిగివచ్చావు. ఇంతేచాలు. నా తపస్సు ఫలించింది. నా జన్మ చరితార్థమయ్యింది నా జీవితం సఫలమయ్యింది. ఇలా పలవరిస్తూ కామభావపరిప్లుతయై సవిలాసంగా వాలుచూపులు విసిరింది. స్పర్శసుఖాన్ని అనుభవిస్తూ పులకించింది. గుండెలు నిమురుతూ -

స్వామీ! అసంఖ్య విశ్వసంహర్తతో యుద్ధంకదా! ఎలా జరిగింది ? విజయం ఎలా లభించింది ? దయచేసి వివరించవూ ! అని గోముగా అడిగింది.

శంఖచూడ రూపంలో ఉన్న శ్రీహరి మందహాసం చిందించి మృదువుగా అమృతప్రాయంగా పలికాడు. కాంతామణీ! మా ఇద్దరికీ యుద్ధం నిండా నూరేళ్ళు జరిగింది. మన దానవవీరులందరూ మరణించారు. నేనుమాత్రం పోరాడుతూనే ఉన్నాను. అంతలోనే బ్రహ్మదేవుడు వచ్చాడు. మా ఇద్దరికీ ప్రీతికరంగా సయోధ్య కుదిర్చాడు. దేవతలకు వారి రాజ్యం వారికి ఇచ్చేశాను. సంతృప్తులై వెళ్ళిపోయారు. మన రాజ్యం మనకు మిగిలింది. ఆ తృప్తితో ఇంటికి తిరిగివచ్చాను. శివుడు తనలోకానికి వెళ్ళిపోయాడు. క్లుప్తంగా జరిగింది ఇది - అంటూనే తులసిని శయనంమీదకు వాల్చాడు.

ఆ ఆకర్షణకూ ఆ సంభోగసుఖాధిక్యానికీ అనుమానించిన తులసి రకరకాలుగా వితర్కించుకుంది. శంఖచూడుడు కాదని నిర్ధారించుకుంది. చివాలున లేచింది. మాయావీ ! నువ్వు ఎవడివో చెప్పు. నా పాతివ్రత్యాన్ని నాశనం చేశావు. నన్ను అనుభవించావు. నిజం చెప్పకపోయావో శపిస్తాను - అంటూ గాండ్రించింది.

శపిస్తుందేమోనని భయపడి శ్రీహరి తన రూపాన్ని చూపించాడు. దేవదేవుడు. సనాతనుడు. నవీన నీరదశ్యాముడు. శరత్పంకజలోచనుడు. కోటికందర్పసుందరాకారుడు. నవ్వులు చిందిస్తున్నాడు. పీతాంబరం గాలికి రెపరెపలాడుతోంది. శ్రీహరిని చూడగానే తులసీదేవి క్షణకాలం మూర్ఛిల్లింది. వెంటనే తేరుకుంది.

జగన్నాథా ! నీకు దయలేదు. పాషాణసదృశుడివి. మోసగించి ధర్మభంగం చేశావు. నా పాతివ్రత్యాన్ని ధ్వంసం చేశావు. నాభర్తను సంహరించావు. ప్రభూ ! ఇంతటి దయాదూరుడివి ఎలా అయ్యావు ? ఈ ఘోరానికి నిన్ను శపించవలసిందే. ఇకనుంచీ నువ్వు పాషాణరూపుడివి అయిపోతావు. నువ్వు సత్పురుషుడివనీ కృపానిధివనీ పొగిడేవారు వట్టి అమాయకులు. భ్రాంతచిత్తులు. నీది గుండెకాదు. బండరాయి. ఏ అపరాధమూ చెయ్యని నీ భక్తుణ్ణి పరులకోసమని పొట్టబెట్టుకోడానికి నీకు మనసు ఎలా ఒప్పింది ?



పూనకం వచ్చినట్టు మాట్లాడుతూ దారుణంగా రోదించింది. గుండెలు బాదుకుంటూ విలపించింది. పడీపడీ దుఃఖించింది. చాలాసేపు అలా చూస్తూ మౌనంగా నిలుచుండిపోయాడు శ్రీహరి. మెల్లగా పెదవి విప్పాడు.

## ◆ తులసికి శ్రీహరి వరాలు ◆

కల్యాణీ ! నా కోసమేకదా నువ్వు చిరకాలం తపస్సు చేశావు. నీకోసమేకదా శంఖచూడుడు తపస్సు చేసింది. అతడి తపస్సుకి ఫలితంగా నువ్వు లభించావు. నీతో ఇంతకాలమూ ఆనందాలు అనుభవించాడు. మరి నీ తపస్సుకి ఫలితం మాట ఏమిటి ? నేనే దక్కాలికదా నీకు ! అందుకే వచ్చాను. నీ తపస్సులు పండించాను. ఈ శరీరం విడిచిపెట్టి ఇక దివ్యదేహం ధరించు. గోలోకానికి వచ్చి రమాసదృశవై నాతో విహరించు. ఇప్పటి నీ శరీరం నదీరూపాన్ని పొందుతుంది. గండకీనామంతో విఖ్యాతి వహిస్తుంది. శాశ్వతమై పుణ్యప్రదగా కీర్తిగడిస్తుంది. నీ సుదీర్ఘమూ మనోహరమూ అయిన కేశపాశం పావన వృక్షరూపాన్ని ధరిస్తుంది. తులసిగా ప్రఖ్యాతమవుతుంది. దాని పువ్వులూ ఆకులూ ముల్లోకాలలోనూ పూజాద్రవ్యాలు అవుతాయి. అదే ప్రధానతరువు అవుతుంది. సకల పుణ్యస్థలాలలోనూ నదీనద తీరాలలోనూ విస్తరించి పరమపావనమూర్తిగా మన్ననలు పొందుతుంది. తీర్థాధిష్ఠానంగా పరిగణన పొందుతుంది. నువ్వున్నచోట సకలదేవతలూ ఉంటారు. తులసీ పత్రంకోసం నేనుకూడా ఆశగా ఎదురుచూస్తూ ఉంటాను. తులసితీర్థంతో స్నానం చేసినవాడు సకలతీర్థాలలోనూ స్నానంచేసినట్టే. సర్వయజ్ఞాలూ నిర్వర్తించినట్టే. నాకు వెయ్యి అమృతభాండాలు నైవేద్యం పెడితే కలగని తృప్తి ఒక్క తులసీపత్రం సమర్పిస్తే కలుగుతుంది. కార్తికమాసంలో నాకు తులసీపత్రం సమర్పిస్తే వేనవేల గోవులను దానంచేసిన ఫలం దక్కుతుంది. ప్రాణావసాన సమయంలో తులసితీర్థం పుచ్చుకున్నవాడు సర్వపాపవిముక్తుడై విష్ణులోకంలో విరాజిల్లుతాడు.

తులసీపత్రతోయం చ మృత్యుకాలే చ యో లభేత్ ।
ముచ్యతే సర్వపాపేభ్యో విష్ణులోకే మహీయతే ॥
నిత్యం యస్తులసీతోయం భుంక్తే భక్త్యా చ మానవః ।
లక్షాశ్వమేధజం పుణ్యం సంప్రాప్నోతి స మానవః ॥ (24 - 43)

భక్తితో రోజూ తులసితీర్థం సేవించేవారికి లక్ష అశ్వమేధయాగాలు చేసిన పుణ్యం లభిస్తుంది. తులసిని చేతిలో పట్టుకునిగానీ శరీరంమీద ధరించికానీ మరణించినవాడు వైకుంఠానికి వెడతాడు. తులసీకాష్ఠంతో చేసిన పూసలపేరును అలంకరించుకుంటే అశ్వమేధఫలం అడుగడుగునా లభిస్తుంది.



తులసి సాక్షిగా మిథ్యాశపథాలు చేసేవాడు కుంభీపాక నరకానికి పోతాడు. మరణసమయంలో తులసీతీర్థం ఒక్కబిందువు దక్కితే అతడికి దివ్యరత్నవిమానం లభిస్తుంది. వైకుంఠానికి చేరుస్తుంది. పూర్ణిమ అమావాస్య ద్వాదశి సంక్రాంతి రోజుల్లోనూ తైలాభ్యంగనస్నానం చేసిననాడూ సంధ్యా - మధ్యాహ్న - రాత్రివేళల్లోనూ మైలరోజులలోనూ రాత్రి కట్టుకున్న బట్టలతోనూ తులసిదళాలను తుంపితే శ్రీహరి శిరస్సును తుంచినంతటి మహాపాపం.

పూర్ణిమాయామమావాస్యాం చ ద్వాదశ్యాం రవిసంక్రమే ।
తైలాభ్యంగం చ కృత్వా చ మధ్యాహ్నే నిశి సంధ్యయోః ॥
అశౌచేఽశుచికాలే యే రాత్రివాసోఽన్వితా నరాః ।
తులసీం యే విచిన్వంతి తే ఛిందంతి హరేః శిరః ॥ **(24 - 50)**

తులసిదళం మూడురాత్రులదాకా పవిత్రమే. నిద్రచేసిన దళం మరింత మంచిది. వ్రతాలలోనూ దానధర్మాలలోనూ విగ్రహప్రతిష్ఠలలోనూ సురార్చనలలోనూ దీని వినియోగం శ్రేయోదాయకం. నేలమీద పడినా నీళ్ళల్లో పడినా తులసిదళానికి అపవిత్రత లేదు. క్షాళనచేసి పూజలకు ఉపయోగించుకోవచ్చు. పూజ చేస్తుండగా చెయ్యిజారి నేలపైపడితే నారాయణార్పణం అంటే సరిపోతుంది.

తులసీ ! ఈనాటినుంచి నువ్వు వృక్షాధిష్ఠానదేవతవు. గోలోకంలో నిరామయంగా నిరంతరాయంగా నాతో క్రీడించు. గండకీనదిగా సకలనదీనదాధిష్ఠానదేవతవై మన్ననలు పొందు. నా అంశావతారమైన సముద్రుడితో ఆనందించు. నువ్వు స్వయంగా మహాసాధ్వివై వైకుంఠంలో నా సన్నిధిలో నివసించు.

## ◆ సాలగ్రామ మహిమలు ◆

శిలారూపివి కమ్మని నన్ను శపించావుకదా ! అలాగే. గండకీతీరంలో సాలగ్రామశిలగా మారి నీ సాన్నిధ్యాన్నీ నీ స్పర్శనూ నిరంతరం అనుభవిస్తాను. ఆ తీరపర్వతగుహల్లో కోటిసంఖ్యల్లో కీటకాలు చేరి దంష్ట్రలతో శిలలను తొలిచి సుదర్శన చక్రాలూ ద్వారాలూ ఏర్పరుస్తాయి. వాటినిబట్టి సాలగ్రామాలలో భేదాలు ఏర్పడతాయి. ఒక ద్వారమూ నాలుగు చక్రాలూ ఒక వనమాల ఉండి నీలమేఘశ్యామంగా ఉంటే అది లక్ష్మీనారాయణమనే సాలగ్రామం. వనమాల లేకపోతే లక్ష్మీజనార్దనం. రెండు ద్వారాలూ నాలుగు చక్రాలూ ఒక ఆవుడెక్కగుర్తు ఉండి వనమాలా రహితమైతే అది రఘునాథం. రూపంలో చిన్నదై రెండు చక్రాలే ఉండి వనమాల లేకుండా నీలనీరదంలాగా ఉండేది వామనాభిదం. ఆకారంలో చిన్నదై ద్విచక్ర - వనమాలాసహితం శ్రీధరం. ఇది గృహస్థులకు లక్ష్మీప్రదం. పెద్దదిగా గుండ్రంగా ఉండి వనమాలా రహితమై ద్విచక్రయుతమైతే దానిపేరు దామోదరం. అంత చిన్నదీకాక పెద్దదీకాక మధ్యస్థంగా ఉండి



గుండ్రంగానూ ద్విచక్ర - బాణతూణ చిహ్నితమై ఉంటే దాన్ని రణరామం అంటారు. ఆకారంలో ఇలాగే ఉండి సప్తచక్ర - ఛత్ర చామర భూషణ చిహ్నితమైతే అది రాజరాజేశ్వరం. రాజులకూ ప్రజలకూ సంపత్ప్రదం. మరీ పెద్దదిగా ఉండి పధ్నాలుగు చక్రాలతో నీలమేఘం రంగులో ఉంటే దాన్ని అనంతం అంటారు. ఇది ధర్మార్థకామమోక్షాలను ఇస్తుంది. చక్రాకారంలోనే ఉండి ద్విచక్రాంకితమై శ్రీచిహ్నితమై ఆవుడెక్క ముద్రతో మేఘవర్ణంలో ఉండేదాన్ని మధుసూదనం అంటారు. ఏకచక్ర విరాజితానికి సుదర్శనమనీ, గుప్తంగా చక్రచిహ్నం ఉంటే గదాధరమనీ, గుర్రపు తల ఆకారంలో ఉండి ద్విచక్రాన్వితమైతే హయగ్రీవమనీ, అగ్రభాగం విశాలంగా ఉండి ద్విచక్రాంచితమై చూపులకి వికటంగా ఉంటే వైరాగ్యప్రదమైన నారసింహమనీ, విస్తృతాగ్రమై ద్విచక్ర వనమాలా విరాజితమై ఇలాగే వికటంగా ఉంటే గృహస్థులకు సుఖప్రదమైన లక్ష్మీనరసింహమనీ, (అగ్రభాగాన) ద్వారదేశంలో ద్విచక్రాంకితమై స్ఫుటంగా కనిపించే శ్రీగుర్తుతో ఉంటే సర్వవాంఛాప్రదమైన వాసుదేవమనీ, చిల్లులు ఎక్కువగా ఉండి సూక్ష్మచక్రాంచితమై మేఘం రంగులో ఉంటే ప్రద్యుమ్నమనీ, రెండు చక్రాలు ఒకదానితో ఒకటి కలిసి ఉండి పృష్ఠభాగం వెడల్పుగా ఉంటే సంకర్షణమనీ, వర్తులాకారంలో ఉండి పీతవర్ణంలో శోభలీనుతూ ఉంటే అనిరుద్ధమనీ పేర్లు. ఏదైనా సాలగ్రామశిల అంటే సాక్షాత్తూ నారాయణ స్వరూపం. అది ఎక్కడ ఉంటే అక్కడ లక్ష్మీదేవి నివసిస్తుంది. సకలతీర్థాలూ వేంచేసి ఉంటాయి. సాలగ్రామార్చన సర్వపాపప్రణాశకం. బ్రహ్మహత్యాది దోషాలుకూడా తొలగిపోతాయి.

శాలగ్రామశిలా యత్ర తత్ర సన్నిహితో హరిః ।
తత్రైవ లక్ష్మీర్వసతి సర్వతీర్థసమన్వితా ॥
యాని కాని చ పాపాని బ్రహ్మహత్యాదికాని చ ।
తాని సర్వాణి నశ్యంతి శాలగ్రామ శిలార్చనాత్ ॥ (24 - 76)

ఈ శిలలు రూపంలో ఛత్రాకారంలో ఉంటే రాజ్యప్రదాలు, వర్తులంగా ఉంటే మహాసంపత్ప్రదాలు, శకటరూపంలో ఉంటే దుఃఖదాయకాలు, శూలాగ్రరూపంలో ఉంటే మృత్యుప్రదం, ముఖభాగం వికృతంగా ఉంటే దారిద్ర్యప్రదం, పింగళవర్ణంలో ఉంటే హానికరం, చక్రం చిదికి ఉంటే వ్యాధికారకం, విరిగి ఉంటే మరణదాయకం. తులసీ ! సాలగ్రామాన్ని సన్నిధిలో ఉంచుకొని చేసే వ్రతం దానం ప్రతిష్ఠ శ్రాద్ధం దేవపూజ ఇవన్నీ ప్రశస్తాలూ అధిక ఫలదాయకాలూ అవుతాయి. సాలగ్రామ శిలార్చనతో సర్వవేద పఠనఫలం సర్వయజ్ఞవ్రతఫలం సర్వతీర్థస్నాన దాన ఫలం సర్వతపఃఫలం నిశ్చయంగా లభిస్తాయి. సాలగ్రామ శిలోదకాన్ని నిత్యం సేవిస్తే సకలదేవతానుగ్రహం లభిస్తుంది. మహాపవిత్రుడవుతాడు. అతడి



స్పర్శను సకలతీర్థాలూ కోరుకుంటాయి. జీవన్ముక్తుడవుతాడు. హరిసన్నిధికి చేరుకుని హరిదాసుడవుతాడు. అతడి పాదధూళి సోకి వసుంధర పవిత్రురాలవుతుంది. అతడి వంశంలో పుట్టి గతించినవారూ పుట్టబోయే వారూ అందరూ తరిస్తారు. కర్మబంధాలనుంచి విముక్తి పొందుతారు. విష్ణుపదంలో లీనమవుతారు.

సాలగ్రామశిలను ధరించి అసత్యాలు పలికితే వాడు కుంభీపాక నరకానికి పోతాడు. నియమాలను ఉల్లంఘిస్తే అసిపత్ర నరకంలో పడతాడు. సాలగ్రామపూజలో తులసీవిచ్ఛేదం చేస్తే (తులసి రహితంగా పూజచేస్తే) భార్యా వియోగమూ స్త్రీహత్యామహాపాతకమూ చుట్టుకుంటాయి. శంఖపూజలో చేసినా ఇదే దుష్ఫలితం. సాలగ్రామ తులసీ శంఖాలను ఒకేచోట ఉంచి అర్చిస్తూ కాపాడేవాడు మహాజ్ఞానియై శ్రీహరిసన్నిధికి చేరుకుంటాడు. శ్రీహరికి ఇష్టుడవుతాడు.

**శాలగ్రామం చ తులసీం శంఖం చైకత్ర ఏవ చ ।**
**యో రక్షతి మహాజ్ఞానీ స భవేత్ శ్రీహరేః ప్రియః ॥ (24 - 93)**

తులసీ ! ఇప్పటికి నీకోపం చల్లారిందనుకుంటాను. శంఖచూడునితో నీ కలయికకు కేవలం ఒక మన్వంతరమే అవధి. అది ముగిసిపోయింది. మీ ఇద్దరి శాపాలూ ముగిశాయి. కనక ఇద్దరూ ఇప్పుడు గోలోకవాసులూ నాకు అత్యంతాప్తులూ అయ్యారు. బృందావనంలో రాసమండలంలో ఇక మనం విహరిద్దాం - అని శ్రీహరి ఆప్యాయంగా ఊరడించాడు.

తులసి మౌనంగా ఉండిపోయింది. క్షణంలో దేహం రాలిపోయింది. దివ్యతేజోమయమైన లక్ష్మీస్వరూపం ఆవిర్భవించింది. శ్రీమన్నారాయణుడితో కలిసి దివ్యవిమానం అధిరోహించి వైకుంఠానికి తరలిపోయింది.

నేలపై పడిఉన్న తులసీదేహం గండకీనదిగా మారింది. శ్రీహరి దాని తీరాన పర్వతంగా మారాడు. అక్కడ కీటకాలు శిలలను వివిధ రూపాలలో తొలిచి నదిలోకి దొర్లిస్తాయి. అవే సాలగ్రామ శిలలు. నదీజలంలో పడినవి అత్యధిక ఫలప్రదాలు. గట్టున ఉండిపోయినవి సూర్యుడి వేడిమితో పింగళవర్ణంలోకి మారతాయి.

**జలే పతంతి యా యాశ్చ ఫలదాస్తాశ్చ నిశ్చితమ్ ।**
**స్థలస్థాః పింగళా జ్ఞేయాశ్చోపతాపాత్ రవేరితి ॥ (24 -100)**

నారదా ! నీ సందేహాలన్నీ తీరాయికదా ! ఇంకా ఏమైనా మిగిలిఉన్నాయా ? సంశయించకుండా అడుగు. చెబుతాను - అన్నాడు నారాయణమహర్షి. ***(అధ్యాయం - 24, శ్లోకాలు -100)***



## ◆ తులసీ పూజ ◆

నారాయణమహర్షీ ! తులసి శ్రీహరికి అత్యంత ప్రీతిపాత్రంకదా ! మరి ఆ తులసీ పూజావిధానం ఏమిటి ? స్తోత్రం ఏమిటి ? లోగడ ఎవరెవరు అర్చించి ఏమేమి ఫలాలు పొందారు ? మొట్టమొదటిసారిగా అర్చించింది ఎవరు ? అంటూ నారదుడు ప్రశ్నలవర్షం కురిపించాడు.

శౌనకాది మహామునులారా ! నారదుడి ప్రశ్నలకి అంతులేదు. నారాయణుడికి విసుగూ విరామం లేదు. ఆయన అలా అడుగుతూనే ఉన్నాడు. ఈయన ఇలా చెబుతూనే ఉన్నాడు. సరే - నారాయణమహర్షి ఒక మందహాసం చిందించి కథ మొదలుపెట్టాడు. చెబుతున్నాడు. శ్రద్ధగా ఆలకించండి అంటూ సూతుడు కొనసాగించాడు.

నారదా ! తులసీదేవి వైకుంఠానికి చేరుకున్నాక రమా గంగా సరస్వతులతో సమానంగా సౌభాగ్య సంపదలనూ గౌరవాదరాలనూ అనుభవిస్తోంది. నవసంగమలోలుడై శ్రీహరి తులసితోనే గడుపుతున్నాడు. దీన్ని గమనించినా రమాగంగలు ఓరిమి వహించారు. సరస్వతిమాత్రం ఈర్ష్యను తట్టుకోలేక ఒకనాడు శ్రీహరి సమక్షంలోనే కలహానికి దిగి జుట్టుపట్టుకుని కొట్టింది. అవమానాన్ని భరించలేక తులసి ఆ క్షణంలోనే అక్కడే అంతర్ధానం చెందింది. సర్వసిద్ధేశ్వరి, సిద్ధయోగిని తులసి ఎక్కడికి మాయమయ్యిందో ఎవరికీ తెలియలేదు. శ్రీహరికూడా ఆవిడజాడ కనుక్కోలేకపోయాడు. సరస్వతీదేవికి చెయ్యవలసిన బోధలు అన్నీ చేసి అనుజ్ఞ తీసుకుని తులసీవనానికి వెళ్ళాడు. సుస్నాతుడై మడికట్టుకుని తులసీ తరుపూజ చేశాడు. భక్తితో ధ్యానమూ స్తోత్రమూ చేశాడు.

లక్ష్మీ మాయా కామ వాణీ బీజపూర్వం దశాక్షరమ్ ।
బృందావనీతి ఙేఽంతం చ వహ్నిజాయాంతమేవ చ ॥ (25 - 10)

ఐం క్లీం హ్రీం శ్రీం ఓం అనే బీజాక్షరాలను అయిదింటిని ముందుచేర్చి "బృందావన్యై స్వాహా" అనే అయిదింటితో కలిపి దశాక్షర మహామంత్రాన్ని అసంఖ్యాకంగా జపించాడు. నారదా ! ఇది మంత్రరాజం. కామితాలను ప్రసాదించడంలో కల్పతరువు. దీనితో విధివిధానంగా తులసీపూజ చేస్తే సర్వసిద్ధులూ కలుగుతాయి. ఇలా అర్చించి ధూపదీపనైవేద్యాలతో షోడశోపచారాలూ చేశాడు. తులసి సంతుష్టురాలై తరువునుంచి ఆవిర్భవించింది. శ్రీహరి పాదాలకు సాష్టాంగపడింది.

తులసీ ! ఈ నాటినుంచీ నువ్వు సర్వజన సమర్చితవు అవుతావు. నేను నిన్ను శిరస్సుమీదా వక్షఃస్థలంలోనూ ధరిస్తాను. సకలదేవతలూ మానవకోటులూ నిన్ను శిరసావహిస్తారు - ఇది నా వరం - అని బుజ్జగించి ఆవిడను తీసుకుని మందిరంలోకి ప్రవేశించాడు.



నారాయణమహర్షి ఇంత క్లుప్తంగా చెబితే నారదుడికి తృప్తి కలుగుతుందా ! ధ్యానమూ స్తవమూ పూజావిధానమూ సవివరంగా చెప్పమన్నాడు. అప్పుడు ఆ మహర్షి శ్రీహరిచేసిన తులసీస్తవాన్ని యథాతథంగా వినిపించాడు.

బృందారూపాశ్చ వృక్షాశ్చ యదైకత్ర భవంతి చ ।
విదుర్బుధాస్తేన బృందాం మత్ప్రియాం తాం భజామ్యహమ్ ॥ (25 - 18)

పురా బభూవ యా దేవీ త్వాదౌ బృందావనే వనే ।
తేన బృందావనీ ఖ్యాతా సౌభాగ్యాం తాం భజామ్యహమ్ ॥ (25 - 19)

తులసి మొక్క గుబురుగా ఎదుగుతుంది. కనక బృంద అనిపేరు. గుంపుగా ఉంటాయి కనక బృందావనం. నాకు అత్యంత ప్రియమైన బృందను సేవిస్తున్నాను. ఒకప్పుడు నాదేవి నివసించడం వల్ల ఈ వనానికి బృందావనమనే ఖ్యాతి లభించింది. ఆ సౌభాగ్య స్వరూపిణిని సేవిస్తున్నాను. అసంఖ్యామైన విశ్వాలలో పూజలు అందుకుంటోంది కనక విశ్వపూజిత అనే కీర్తి పొందింది. ఆ తులసిని సేవిస్తున్నాను. విశ్వాలను అన్నింటినీ పావనం చేస్తూ విశ్వపావని అనే యశస్సు గడించిన తులసిని విరహాతురుడనై స్మరిస్తున్నాను. ఎన్ని పుష్పాలున్నా తులసీపుష్పం లేకపోతే దేవతలు ఆనందించరు. పుష్పసారమైన తులసి నాకు దర్శనం అనుగ్రహించుగాక ! భక్తులకు ఆనందాన్ని కలిగించడంవల్ల నందినీ నామధేయాన్ని సంపాదించుకున్నతులసి నాపట్ల సంప్రీత అగుగాక ! జగత్తులో తనకు తులలేని కారణంగా (సాటి) తులసి అనే పేరు దక్కించుకున్న ఆ హృదయేశ్వరిని శరణువేడుతున్నాను. కృష్ణుడికి ప్రాణస్వరూపిణియై కృష్ణజీవని అనిపించుకొన్న ఆ తులసి నా ప్రాణాలను కాపాడుగాక !

శ్రీహరి ఇలా స్తుతించేసరికి తులసీవృక్షం నుంచి దేవి ప్రత్యక్షమై పాదాభివందనం చేసింది. కన్నుల్లో నీళ్ళు కుక్కుకుంటూ తలవంచుకుని నిలబడింది. శ్రీహరి లాలనగా కౌగిలించుకున్నాడు. మందిరంలోకి తీసుకువెళ్ళాడు. సరస్వతీదేవితో చెయ్యికలిపించి చెలిమి చేయించి ఇద్దరినీ ఆనందపరిచాడు. సర్వపూజ్యత్వమూ సర్వవంద్యత్వమూ సర్వశిరోధార్యత్వమూ తులసికి వరాలుగా ఇచ్చి ఆదరించాడు. తులసీదేవికి సంతృప్తి కలిగింది. అవమానభారం తొలగిపోయింది. సరస్వతి స్వయంగా ఆహ్వానించి తన మందిరంలో సన్నిధిలో తనతో సమంగా వసతి కల్పించి గౌరవించింది. లక్ష్మీగంగలు కూడా చిరునవ్వులు చిందిస్తూ ప్రేమగా పలకరించి ఆదరంగా ఆహ్వానించి తమ తమ గృహాలలో నిలుపుకున్నారు.

బృందా బృందావనీ విశ్వపూజితా విశ్వపావనీ ।
పుష్పసారా నందినీ చ తులసీ కృష్ణజీవనీ ॥ (25 - 32)



బృంద - బృందావని - విశ్వపూజిత - విశ్వపావని - పుష్పసార - నందిని - తులసి - కృష్ణజీవని అనే సార్థకనామాష్టకాన్ని నిరంతరం భక్తితో పఠించేవారికి అశ్వమేధఫలం కచ్చితంగా దక్కుతుంది. ఏమీ సందేహం లేదు.

బ్రహ్మనందనా ! తులసి చెట్టునుంచి తులసీదేవి ఆవిర్భవించినదీ శ్రీకృష్ణుడి పూజలు అందుకొన్నదీ కార్తికపూర్ణిమనాడు. కనక ఆరోజున విశ్వపావనిని అర్చించినవారికల్లా మోక్షమూ వైకుంఠనివాసమూ లభిస్తాయి. కార్తికమాసంలో తులసీపత్రాన్ని విష్ణుమూర్తికిగానీ విష్ణుభక్తుడికిగానీ సమర్పిస్తే వేనవేల గోవులను దానంచేసినంత పుణ్యం. సంతానం లేనివారికి సంతానం కలుగుతుంది. అవివాహితులకు వివాహాలు అవుతాయి. బంధుహీనులకు బంధువులు దొరకుతారు. తులసీస్తోత్రాన్ని పఠించలేకపోయినా వింటే చాలు రోగబంధవిముక్తి కలుగుతుంది. భయాలూ పీడలూ పాపాలూ తొలగిపోతాయి.

నారదా ! ఇదీ తులసీ పూజావిధానం. కణ్వశాఖోక్తం. తులసి చెట్టుని ఏ ఆవాహనమూ లేకుండానే పూజించవచ్చు. ఎందుకంటే తులసీదేవి ఆ చెట్టులో నిరంతరం విడిదిచేసే ఉంటుంది. ధ్యానమూ షోడశోపచారాలూ చాలు సర్వపాపసంహరణాలు. తులసీపుష్పం పుష్పజాతిలోకే రత్నం. పాపకాష్ఠాలను దహించివెయ్యడానికి అది అగ్నిశిఖ. వేదాలుకూడా తులసీపుష్పానికి సాటివచ్చేది ఈ సృష్టిలోనే లేదని చెబుతున్నాయి. సర్వాత్మనా పవిత్రరూప. అందరికీ శిరోధార్యం. సర్వజనేప్సితం. జీవన్ముక్త. ముక్తిప్రద. హరిభక్తి ప్రదాయిని తులసికి వందనాలు. ఇలా ధ్యానించి నమస్కరిస్తే చాలు అనుగ్రహం చూపిస్తుంది. నారదా ! ఇది తులసి ఉపాఖ్యానం. ఇంకా ఏమి కావాలో అడుగు.

***(అధ్యాయం - 25, శ్లోకాలు - 44)***

నారాయణమహర్షీ ! లక్ష్మి సరస్వతి గంగ తులసి - ఇలా అందరి ఉపాఖ్యానాలూ చెప్పావు అతిమధురంగా అమృతంకన్నా రుచిగా ఉన్నాయి. సావిత్రీ వృత్తాంతంకూడా నీ ముఖతః విని ఆస్వాదించాలని ఉంది. దయచేసి అనుగ్రహించు.

## ◆ సావిత్రీ పూజ ◆

నారదా ! అలాగే చెబుతాను. ఆలకించు. వేదజనని సావిత్రిని మున్ముందుగా బ్రహ్మదేవుడు ఆరాధించాడు. తరవాత వేదాలు ఉపాసించాయి. ఆపైని పండితబృందాలు అర్చించాయి. అటుపైని భారతభూభాగంలో అశ్వపతి అనే మహారాజు పూజలు చేశాడు. అక్కడినుంచి చతుర్వర్ణాలవారు యథాశక్తిగా పూజిస్తూనే ఉన్నారు.

మద్రదేశానికి మహారాజు అశ్వపతి. శత్రుసంహారకుడు. మిత్రసమ్మోదకుడు. మాలతీదేవి అతని పట్టమహిషి. ధర్మచారిణి. సాధ్వి. ఇద్దరూ లక్ష్మీనారాయణుల్లాగా కాపురం చేస్తున్నారు. ఎంతకాలానికి



సంతానం కలగలేదు. వసిష్ఠుడి ఉపదేశంమీద భక్తిప్రపత్తులతో సావిత్రిని ఆరాధించింది. అయినా ఫలితం లేకపోయింది. సావిత్రి అనుగ్రహించలేదు. దర్శనం ఇవ్వలేదు. మాలతీదేవి ఎంతగానో దుఃఖించింది. రాజుగారి ఓదార్పులూ నయోపదేశాలూ ఊరట కలిగించలేకపోయాయి. అప్పుడింక అశ్వపతిమహారాజే స్వయంగా సావిత్రీ తపస్సుకోసం పుష్కరక్షేత్రానికి వెళ్ళాడు. జితేంద్రియుడై ఏకాగ్రచిత్తంతో నూరేళ్ళు తపస్సు చేశాడు. అయినా సావిత్రీమాత ప్రత్యక్షంకాలేదు. తిరస్కారమే మిగిలింది. అయ్యో అని అశ్వపతి కుమిలిపోయాడు. అప్పుడు ఆకాశంనుంచి అశరీరవాణి వినిపించింది. దశలక్ష గాయత్రీ మంత్రజపం చెయ్యమంది.

సరిగ్గా అదే సమయానికి పరాశరమహర్షి అక్కడికి వచ్చాడు. అశ్వపతి సాష్టాంగ నమస్కారం చేశాడు. మహర్షి సంతోషించి నాయనా ! అశ్వపతీ ! గాయత్రీమంత్రాన్ని ఒక్కసారి జపిస్తే చాలు పగలంతా చేసిన పాపాలన్నీ హరిస్తాయి. పదిసార్లు జపిస్తే రేయింబవళ్ళు చేసిన కిల్బిషాలు అంతరిస్తాయి. నూరుమార్లు జపిస్తే మాసార్జిత పాపమూ, వెయ్యిసార్లు జపిస్తే సంవత్సరార్జిత పాపమూ, లక్షసార్లు జపిస్తే ఇహ జన్మార్జిత పాపమూ, పదిలక్షలసార్లయితే పూర్వజన్మార్జితపాపమూ, నూరులక్షలు జపిస్తే సర్వజన్మార్జిత పాపమూ నిశ్చయంగా నశిస్తుంది. ఇంతకు పదిరెట్లు జపిస్తే ముక్తి లభిస్తుంది. తూర్పుముఖంగా కూర్చుని వెన్నుపూస నిలబెట్టి అరచేతుల్ని పాముపడగల్లా విప్పార్చి రంధ్రముద్రతో నిశ్చలంగా జపించాలి. అనామిక (చిటికెన వేలుకి ప్రక్కది) నడిమి కణుపునుంచి అధోవక్రక్రమంగా తర్జనీ మూలందాకా (చూపుడువేలులో క్రింది కణుపు) లెక్కించుకుంటూ చెయ్యాలి. దశగాయత్రి అవుతుంది. తెల్లతామర విత్తనాలతోగానీ స్ఫటికాలతోగానీ జపమాలను తయారుచేసుకుని దేవాలయాల్లోనూ తీర్థప్రదేశాల్లోనూ గృహాల్లోనూ గాయత్రీజపం చేసుకోవచ్చు. ముందుగా ఆ జపమాలను అశ్వత్థపత్రంలోగానీ పద్మంలోగానీ ఉంచి గోరోచనం చల్లి గాయత్రీమంత్రోదకంతో స్నానం చేయించాలి. శతగాయత్రిని పఠించాలి. పంచగవ్యంతోగానీ గంగోదకంతోగానీ స్నపనం చేయించినా జపమాలను సంస్కరించినట్టవుతుంది. అలా సంస్కరించిన జపమాల స్వీకరించి దశలక్ష గాయత్రీజపం చెయ్యి. మూడు జన్మల మహాపాపాలు నశిస్తాయి. గాయత్రీదేవి దర్శనం అనుగ్రహిస్తుంది. రోజూ మూడు సంజలలోనూ సంధ్యావందనం చేస్తున్నావుగదా ! అది చెయ్యనివాడు ఏ పూజలు చేసినా ఎన్ని యజ్ఞయాగాలు చేసినా వ్యర్థం. అతడు అశుచి. కనక శుభకర్మలకి అయోగ్యుడు. అనర్హుడు. బ్రాహ్మణకర్మలకు మతరామూ పనికిరాడు. యావజ్జీవితమూ ముప్పొద్దులా సంధ్యవార్చిన విప్రుడు తపస్తేజస్సుతో సూర్యసమానుడవుతాడు.

యావజ్జీవవపర్యంతం త్రిసంధ్యాం యః కరోతి చ ।
స చ సూర్యసమో విప్రస్తేజసా తపసా సదా ॥ (26 - 27)

సంధ్యావందన పరిపూతుడైన బ్రాహ్మణుడి పాదధూళితో భూదేవి పవిత్రురాలవుతుంది. అతని స్పర్శతో నదీజలాలు పావనమవుతాయి. గరుత్మంతుణ్ణి చూసిన పాముల్లాగా పాపాలు పారిపోతాయి.



సంధ్యావందనం చెయ్యనివాడు అందించే పిండతర్పణాలను పితృదేవతలు స్వీకరించరు. పూజా నైవేద్యాలను దేవతలు అంగీకరించరు. అటువంటి విప్రుడు విషంలేదన్నమాటేగానీ పాములాంటివాడు. విష్ణుమంత్ర విహీనుడూ, త్రిసంధ్యారహితుడూ, శ్రీహరి ప్రసాదం తిరస్కరించినవాడూ, వృషవాహకుడూ, కన్యావిక్రయి, భగవన్నామవిక్రయి, ఋతుస్నాతాన్నభోజి, భగజీవి, వార్ధుషికుడూ (వడ్డీవ్యాపారి), విద్యావిక్రయి, సూర్యోదయ సమయంలో నిద్రపోయేవాడూ, చేపలు తినేవాడూ - ఈ విప్రులందరూ మానవరూపంలో ఉన్న విషహీనసర్పాలే.

అందుచేత ఓ అశ్వపతీ ! ముందుగా నువ్వు గాయత్రిని ఉపాసించు. ఆ తరువాత సావిత్రిని ధ్యానించు. ఫలిస్తుంది - అని ఉపదేశించి పరాశరుడు సెలవుతీసుకున్నాడు. పరాశరుడు చెప్పిన సావిత్రీపూజా విధానమేమిటంటే -

జ్యేష్ఠమాసంలో కృష్ణపక్షం త్రయోదశినాడు శుభముహూర్తాన తలంటుపోసుకుని సావిత్రీవ్రతారంభం చెయ్యాలి. చతుర్దశినాడు వ్రతం ముగించాలి. ఇలా పధ్నాలుగు సంవత్సరాలు చెయ్యాలి. పధ్నాలుగు రకాల ఫలాలూ పధ్నాలుగు నైవేద్యాలూ సమర్పించాలి. ధూపదీపాలూ నూతనవస్త్ర యజ్ఞోపవీతాలూ యథావిధిగా షోడశోపచారాలూ నిర్వహించాలి. ఫలశాఖాసమన్వితంగా మంగళకలశం స్థాపించాలి. గణేశ దినేశ వహ్ని విష్ణు శివ శివాదేవతలను ఆరాధించాలి. అందరినీ మంగళకలశంలోకి ఆవాహన చెయ్యాలి. మధ్యాహ్నకాలంలో చెయ్యవలసిన సావిత్రీధ్యానమూ స్తోత్రమూ యథాతథంగా ఉపదేశిస్తున్నాను గ్రహించు.

బ్రహ్మతేజస్సుతో తప్తకాంచన వర్ణంలో గ్రీష్మమధ్యాహ్న మార్తాండ సహస్ర సన్నిభంగా ప్రకాశించే సావిత్రీమాతకు నమస్కారం. చిరునవ్వులు చిందించే ముఖంతో ప్రసన్నంగా కనిపించే భక్తానుగ్రహ కాతరకు వందనాలు. రత్నభూషణభూషితయై వహ్నిశుద్ధాంశుక ధారిణియైన బ్రహ్మపత్నికి నతులు. ముక్తిప్రద, సుఖప్రద, శాంతస్వరూప, సర్వసంపత్స్వరూప, సర్వసంపత్ప్రదాయిని, వేదశాస్త్రరూపిణి, వేదాధిష్ఠానదేవత, వేదబీజస్వరూప అయిన వేదమాతకు సాష్టాంగాలు.

ఇలా ధ్యానించి నైవేద్యం సమర్పించి నెత్తిమీద చెయ్యి ఆనించుకుని మళ్ళీ ధ్యానించాలి. మంగళకలశంలోకి భక్తిగా సావిత్రిని ఆవాహన చెయ్యాలి. వేదోక్త మంత్రపూర్వకంగా షోడశోపచారాలూ అందించి సాష్టాంగపడాలి.

దారునిర్మితంగానీ హేమనిర్మితంగానీ ఆసనం సమర్పించాలి. పూజాంగంగా పరిశుభ్రమైన తీర్థోదకాన్ని పాద్యమివ్వాలి. గరికపోచలతో కలిపి శంఖజలాన్ని అర్ఘ్యంగా అందించాలి. సుగంధ జలాలతో స్నానోపచారం చెయ్యాలి. సర్వమంగళప్రదమూ పరిమళబంధురమూ అయిన ధూపాన్నీ, అంధకారనాశకమూ జగద్దర్శకమూ అయిన దీపాన్ని చూపించాలి. రుచికరమూ ప్రీతికరమూ తుష్టి పుష్టి వర్ధకమూ క్షున్నివారకమూ నైవేద్యం



పెట్టాలి. కస్తూరీ కర్పూర సమ్మిశ్రితంగా తాంబూలం ఇవ్వాలి. దాహం తీరేందుకు జగజ్జీవన కారణమైన శీతోదకాన్ని అందించాలి. అందాన్ని పెంచేదీ సభలో శోభను చేకూర్చేదీ పట్టువస్త్రాన్ని సమర్పించాలి. రత్నాలు పొదిగిన సువర్ణాభరణాన్ని కానుకపెట్టాలి. వివిధ వృక్షాలనుంచి ఏరి ఏరి కోసితెచ్చిన ఫలాలను నివేదన చెయ్యాలి. సమస్త మంగళప్రదమూ సమస్త పుష్పసమన్వితమూ శోభాకరమూ ప్రీతికరమూ మాలికను మెడలో వెయ్యాలి. గంధాన్ని తనువుపై చిలకరించాలి. అలంకరణల్లోకెల్లా అత్యుత్తమమైన సిందూరాన్ని నొసట దిద్దాలి. విశుద్ధగ్రంధిసంయుక్తమూ వేదమంత్రపరిపూతమూ అయిన యజ్ఞోపవీతాన్ని సమర్పించాలి. ఇలా షోడశోపచారాలూ చేసి సావిత్రీమాతను స్తుతించాలి. అటుపైని సద్బ్రాహ్మణుడికి దక్షిణ ఇచ్చి సంతృప్తి పరచాలి.

లక్ష్మీ - మాయా - కామ బీజాక్షరాలు మూడింటితో కలిపి (శ్రీం హ్రీం క్లీం ఓం) సావిత్ర్యై స్వాహా అనే అష్టాక్షర మహామంత్రాన్ని నిష్ఠగా జపించాలి.

సావిత్రీతి చతుర్థ్యంతం వహ్నిజాయాంతమేవ చ ।
లక్ష్మీ మాయా కామపూర్వం మంత్రమష్టాక్షరం విదుః ॥ (26 - 75)

ఒకప్పుడు గోలోకంలో గోవిందుడు సావిత్రీదేవిని బ్రహ్మకు సమర్పించాడు. అయితే ఆవిడ గోలోకం విడిచిపెట్టి బ్రహ్మదేవునివెంట బ్రహ్మలోకానికి రావడానికి నిరాకరించింది. అప్పుడు శ్రీకృష్ణుడి ఆజ్ఞప్రకారం చతుర్ముఖుడు ఆ వేదమాతను బహువిధాల స్తుతించాడు. అప్పుడు ప్రసన్నురాలై బ్రహ్మను వరించింది. బ్రహ్మలోకానికి వెంట వచ్చింది. బ్రహ్మచేసిన అలనాటి మాధ్యందిన సావిత్రీస్తుతిని యథాక్షరంగా చెబుతున్నాను విని ధారణ చెయ్యి.

సచ్చిదానందరూపే త్వం మూలప్రకృతిరూపిణీ !
హిరణ్యగర్భరూపే త్వం ప్రసన్నా భవ సుందరీ ॥ (26 - 79)

సచ్చిదానందరూపిణీ ! మూలప్రకృతీ ! హిరణ్యగర్భరూపా ! సుందరీ ! ప్రసన్నురాలివి కమ్ము. తేజస్స్వరూపా ! పరమానందరూపా ! ద్విజాతిస్వరూపా ! నిత్యా ! నిత్యప్రియా ! దేవీ ! నిత్యానంద స్వరూపిణీ ! సర్వమంగళరూపా ! ప్రసన్నురాలివి కమ్ము. సర్వస్వరూపా ! మంత్రస్వరూపా ! పరాత్పరా ! సుఖదా ! మోక్షదా ! దేవీ ప్రసన్నవు కమ్ము. పాపకాష్ఠాలను దహించడానికి అగ్నిశిఖవంటిదానా ! బ్రహ్మతేజఃప్రదా ! దేవీ ! ప్రసన్నవు కమ్ము. మనోవాక్కాయకర్మలతో మానవుడు చేసే సమస్త దురితాలూ నీ నామస్మరణమాత్రంచేత భస్మమైపోతాయి.

కాయేన మనసా వాచా యత్పాపం కురుతే నరః ।
తత్ త్వత్స్మరణమాత్రేణ భస్మీభూతం భవిష్యతి ॥ (26 - 85)



ఇలా స్తుతించి బ్రహ్మదేవుడు ఆ సభామంటపంలో నిశ్చలంగా నిలబడ్డాడు. సావిత్రీదేవి ప్రసన్నవదనంతో తనంతతానుగా చెంతకువచ్చి బ్రహ్మను వరించింది. బ్రహ్మలోకానికి తరలివెళ్ళింది.

నారదా ! పరాశరు డుపదేశించిన పూజావిధానాన్ని ఆచరించి ఈ బ్రహ్మకృత సావిత్రీ స్తోత్రాన్ని అక్షరశః ధారణచేసి అశ్వపతి ఆ వేదమాత అనుగ్రహానికి పాత్రుడయ్యాడు. సావిత్రీదేవి ప్రత్యక్షమై కోరకనే వరం ప్రసాదించింది. ఈ స్తవరాజాన్ని సంధ్యావందనం తరువాత నిత్యమూ పఠించే విప్రుడు చతుర్వేదాధ్యయన ఫలాన్ని పొందుతాడు. *(అధ్యాయం - 26, శ్లోకాలు - 88)*

## ◆ సావిత్రీ - యమ సంవాదం ◆

మందహాస సుందరవదనారవిందంతో ప్రసన్నురాలై దశదిశలకూ కాంతులు నింపుతూ ప్రత్యక్షమైన సావిత్రీదేవి మాతృవాత్సల్యం తొణికిసలాడగా పలకరించింది.

అశ్వపతీ ! నీ మనసులో ఉన్నది ఏమిటో నాకు తెలుసు. నీ ధర్మపత్ని కోరిక ఏమిటో అదీ తెలుసు. నీది పుత్రవాంఛ. ఆమెది పుత్రికావాంఛ. క్రమంగా రెండూ తీరతాయి. అని వరమిచ్చి బ్రహ్మలోకానికి వెళ్ళిపోయింది.

అశ్వపతి సంతోషంతో రాజధానికి చేరుకున్నాడు. కాలక్రమాన ఆదంపతులకు ఆడపిల్ల పుట్టింది. సావిత్రి అని నామకరణం చేశారు. శుక్లపక్ష చంద్రరేఖలాగా దినదిన ప్రవర్ధమానయై యౌవనవతి అయ్యింది. ద్యుమత్సేనాపతి కుమారుడు సత్యవంతుడికిచ్చి వివాహం జరిపించారు. దంపతులు అన్యోన్యప్రేమతో ఆనందిస్తున్నారు. ఏడాది గడిచింది.

ఒకనాడు సత్యవంతుడు సమిధలూ ఫలాలూ పుష్పాలూ తెచ్చుకోవడానికి అడవిలోకి వెళ్ళాడు. మామగారి అనుజ్ఞ తీసుకుని సావిత్రికూడా అతని వెంటవెళ్ళింది.

సత్యవంతుడు చెట్టుమీదనుంచి పడి ప్రాణాలు కోల్పోయాడు. యమధర్మరాజు వచ్చి అతడి ప్రాణాలు తీసుకొని వెళ్ళిపోతున్నాడు. సావిత్రి వెంటపడింది. యముడు ఆశ్చర్యచకితుడయ్యాడు.

సాధ్వీ ! ఎక్కడికి వస్తున్నావు ? మానవశరీరంతో నావెంట రావడానికి వీలులేదు. ఒకవేళ నువ్వు నీ భర్తతో రావాలనుకుంటే నీదేహం విడిచిపెట్టి రా. నీ భర్తకు ఈ భూలోకంలో ఆయుష్షు చెల్లింది. కర్మఫలం అనుభవించాలి కనక నాలోకం తీసుకుపోతున్నాను. మానవుడు కర్మానుసారం జన్మించి కర్మానుసారమే మరణిస్తాడు. సుఖదుఃఖాదులన్నీ కర్మఫలాలే. కర్మబంధం ఎవరికైనా తప్పదు. బ్రహ్మాదిదేవతలే కర్మబద్ధులు. అమరత్వాది సర్వసిద్ధులూ కర్మఫలాలే. విష్ణుసాలోక్యాది చతుష్టయంగానీ సురత్వ మానవత్వ



రాజేంద్రత్వాదులుగానీ శివత్వ గణేశత్వ మునీంద్రత్వ తపస్విత్వ బ్రహ్మక్షత్రియాదిత్వ మ్లేచ్ఛత్వ జంగమత్వ శైలత్వ రాక్షసత్వ కిన్నరత్వ వృక్షత్వ పశుత్వ వనజీవిత్వ క్షుద్రజంతుత్వ కృమిత్వ దైత్యత్వ దానవత్వాదులన్నీ కర్మానుసారమే లభిస్తాయి. (అధ్యాయం - 27, శ్లోకాలు - 25)

యముడి మాటలు విన్న సావిత్రి భక్తి ప్రపత్తులతో స్తుతించి ప్రశ్నలవర్షం కురిపించింది. యమధర్మరాజా ! కర్మకు హేతువేమిటి ? ఏ కర్మ చేస్తే ఏ జన్మ లభిస్తుంది ? జ్ఞానమంటే ఏమిటి ? బుద్ధి అంటే ఏమిటి ? ప్రాణమంటే ఏమిటి ? ఇంద్రియాలూ వాటి లక్షణాలూ ఏమిటి ? దేవతలంటే ఎవరు ? భోగమంటే ఏమిటి ? భోక్త ఎవరు ? భోజయిత ఎవరు ? నిష్కృతి ఏమిటి ? జీవుడెవరు ? పరమాత్మ ఎవరు ? దయచేసి ఈ సందేహాలన్నీ తీర్చు - అని అభ్యర్థించింది.

సావిత్రీ ! వేదం ఏది చెబితే అది ధర్మం. ఏది ఆచరించమంటే అది కర్మ. అది మంగళప్రదం. వేదోక్తాలు కాని కర్మలన్నీ అమంగళాలు. నిష్కామంగా సత్కర్మలను (దైవకార్యాలను) అనుష్ఠించడమే కర్మ నిర్మూలనోపాయం. అదే ఉత్తమభక్తి. నిర్లిప్తంగా కర్మఫలాలను అనుభవించేవాడు బ్రహ్మజ్ఞాని. అతడే ముక్తుడని వేదం చెబుతోంది. అతడికి జన్మ మృత్యు జరా వ్యాధి శోక భయాలు ఉండవు.

సాధ్వీ ! భక్తి రెండు విధాలు. ఒకటి నిర్వాణప్రదం. రెండవది హరిరూపప్రదం. బ్రహ్మజ్ఞానులైన యోగీశ్వరులు మొదటిది కోరుకుంటారు. వైష్ణవులు రెండవది అభిలషిస్తారు.

భగవంతుడు అంటే కర్మస్వరూపుడు. పరమాత్మ పరాప్రకృతి. అతడే కర్మబీజం. అతడే కర్మహేతువు. కర్మఫలప్రదుడు. దేహధారి నశ్వరం.

> కర్మణో బీజరూపశ్చ సతతం తత్ఫలప్రదః ।
> కర్మరూపశ్చ భగవాన్ పరాత్మా ప్రకృతిః పరా ।
> సోఽపి తద్ధేతురూపశ్చ దేహీ నశ్వర ఏవ చ ॥ (28 - 11)

జగత్సృష్టికి పంచభూతాలు సూత్రప్రాయాలు. దేహం పంచభూతాత్మకం. కర్మలను ఆచరించేది (కర్త) దేహి. అతడే భోక్త. ఆత్మ - భోజయిత (అనుభవింపజేసేది). భోగమంటే విభవభేదం. నిష్కృతియే ముక్తి. సదసద్భేదబీజం జ్ఞానం. వివేచనాశక్తియే బుద్ధి. అది జ్ఞానానికి బీజం. ప్రాణాలంటే వాయుభేదాలు. దేహధారులకు బలప్రదాలు. ఇంద్రియాలకు ప్రభువై ఈశ్వరాంశమై కర్మలకు ప్రేరకమై దుర్నివార్యమై అనూహకమై అనిరూప్యమై అదృశ్యంగా ఉండే జ్ఞానభేదాన్నే మనస్సు అంటారు.

> ఇంద్రియాణాం చ ప్రవరమీశ్వరాంశమనూహకమ్ ।
> ప్రేరకం కర్మణాం చైవ దుర్నివార్యం చ దేహినామ్ ॥
> అనిరూప్యమదృశ్యం చ జ్ఞానభేదో మనః స్మృతమ్ ॥ (28 - 16)



లోచనాది జ్ఞానేంద్రియాలు అయిదూ శరీరులకు అంగరూపాలై కర్మప్రేరకాలు అవుతున్నాయి. అవ్వే మిత్రులూ అవ్వే శత్రువులు. అవే సుఖప్రదాలు. అవే దుఃఖప్రదాలు.

సూర్యుడు వాయువు పృథివి బ్రహ్మాదులు - వీరిని అధిదేవతలు అంటారు. ప్రాణ - దేహధారిని జీవుడంటారు. పరమమూ వ్యాపకశీలమూ నిర్గుణమూ ప్రకృతికి అతీతమూ కారణకారణమూ అయినది బ్రహ్మ. అదే పరమాత్మ.

వత్సా ! అడిగావుకదా అని బ్రహ్మజ్ఞానం ఉపదేశించాను. సంతృప్తి చెంది సుఖంగా తిరిగివెళ్ళు - అంటూ యముడు ముందుకి నడిచాడు.

మహానుభావా ! ఎక్కడికి వెడతాను ? ఎలా వెడతాను ? నా భర్తనూ జ్ఞానసముద్రుడవైన నిన్నూ విడిచిపెట్టి వెళ్ళగలనా ? నేను వేసే ప్రశ్నలకన్నింటికీ నువ్వు సమాధానం చెప్పవలసిందే. ఏ కర్మలు ఆచరిస్తే ఏ జన్మలు వస్తాయి ? స్వర్గనరక హేతువులైన కర్మలు ఏమిటి ? ముక్తిప్రదాలు ఏవి ? భక్తిప్రదాలు ఏవి ? ఏ కర్మాచరణంవల్ల యోగి అవుతున్నాడు ? రోగి అవుతున్నాడు ? దీర్ఘజీవి అవుతున్నాడు ? అల్పాయుష్కుడవుతున్నాడు ? సుఖి కాగలుగుతున్నాడు ? దుఃఖి అవుతున్నాడు ? అంగవిహీనుడు బధిరుడు అంధుడు పంగువు (కుంటి) ప్రమత్తుడు దాత అతిలుబ్ధుడు చోరుడు - ఇత్యాదులందరూ ఏ కర్మలకు ఫలరూపాలు ? సాలోక్యాది చతుష్టయాన్ని కలిగించే కర్మ ఏది ? బ్రాహ్మణత్వ తపస్విత్వాదులు ఏ కర్మల ఫలాలు ? స్వర్గభోగమూ వైకుంఠమూ లభించాలంటే ఏ కర్మలు చెయ్యాలి ? సర్వోత్కృష్టమూ నిరామయమూ అయిన గోలోకం లభించేది ఎలాగ ? నరకలోకాలు ఎన్ని ? వాటి పేర్లు ఏమిటి ? ఎవడు నరకానికి పోతాడు ? ఎంతకాలం ఉంటాడు ? ఏ పాపకర్మకు ఏ వ్యాధిఫలం ? ఇవన్నీ నాకు తెలియజెప్పు - అని అభ్యర్థించింది సావిత్రి. *(అధ్యాయం - 28, శ్లోకాలు -30)*

ఇన్ని ప్రశ్నలు ఎలా వేస్తోంది ఈ సాధ్వి అని క్షణకాలం ఆశ్చర్యపోయాడు యమధర్మరాజు. చిన్నగా నవ్వి బదులు పలికాడు. సావిత్రీ ! ఇంతాజేస్తే నీకు పన్నెండేళ్ళు లేవు. కానీ యోగులకూ జ్ఞానులకూ మించిన జ్ఞానం కనపడుతోంది నీ ప్రశ్నల్లో. మీ తండ్రి అశ్వపతి సావిత్రిని ఉపాసించినందువల్ల నువ్వు జన్మించావు. అందుకే ఆపేరు పెట్టారు. అన్నింటా నువ్వు సావిత్రీ సమానవు. శ్రీహరికి లక్ష్మీదేవిలాగా, చతుర్ముఖుడికి సరస్వతిలాగా, శివుడికి పార్వతిలాగా - సత్యవంతుడికి నువ్వు సౌభాగ్యదేవతవు. సుప్రియవు. కశ్యపుడికి అదితిలాగా, గౌతముడికి అహల్యలాగా, ఇంద్రుడికి శచీదేవిలాగా, చంద్రుడికి రోహిణిలాగా, మదనుడికి రతిదేవిలాగా, అగ్నికి స్వాహాదేవి లాగా, పితృదేవతలకు స్వధాదేవిలాగా, సూర్యుడికి సంజ్ఞాదేవిలాగా వరుణుడికి వారుణిలాగా, యజ్ఞపురుషుడికి దక్షిణాదేవిలాగా, వరాహమూర్తికి భూదేవిలాగా, కార్తికేయుడికి దేవసేనలాగా నువ్వు సత్యవంతుడికి సౌభాగ్యదేవతవు. హృదయేశ్వరివి. నీ జ్ఞానానికీ నీ జిజ్ఞాసకూ ఆనందించాను. వరం ఇస్తున్నాను. ఏమి కావాలో కోరుకో - అన్నాడు.



మహాభాగా ! సత్యవంతుడికి ఔరసులైన పుత్రులు నూర్గురు నాకు కలిగేటట్టు వరమియ్యి. నా తండ్రికి నూర్గురు పుత్రుల్నీ మామగారికి చూపునీ రాజ్యలాభాన్నీ అనుగ్రహించు. లక్ష సంవత్సరాల తర్వాత జన్మాంతంలో భర్తతో కలిసి వైకుంఠానికి వెళ్ళే వరం ప్రసాదించు. జీవుల కర్మవిపాకంగురించీ విశ్వవిస్తారబీజం గురించీ తెలుసుకోవాలి అనుకుంటున్నాను. నువ్వు సమర్థుడివి. కనక తెలియజెప్పు - అని సవినయంగా అభ్యర్థించింది సావిత్రి. యముడు సంబరపడ్డాడు.

పతివ్రతాశిరోమణీ ! అలాగే. నీవు కోరిన వరాలన్నీ ఇస్తున్నాను. జీవకర్మవిపాకం అడిగావుకదూ ! ఆలకించు. భారతదేశం పుణ్యక్షేత్రం. శుభాశుభకర్మలన్నింటికీ అనుభవక్షేత్రం. జీవకోటి తమతమ కర్మానుసారం ఆయా రూపాల్లో ఇక్కడ జన్మించి కర్మఫలాలను అనుభవిస్తుంటారు. మిగతా లోకాలలో కర్మఫలానుభవం ఉంటుంది తప్ప కర్మానుసారం జన్మించడం ఉండదు. ఇది ఈ భూమి విశిష్టత.

## ◆ జీవకర్మవిపాకం ◆

దేవతలు దానవులు రాక్షసులు గంధర్వులు కిన్నరులు మానవులు - వీరు మాత్రమే కర్మజనకులూ కర్మఫలభోక్తలూ. మిగతా ప్రాణికోటికి ఇది లేదు. అయితే విశిష్టజీవులు కొందరు విభిన్న జీవరాశులలో (పశుపక్ష్యాదిజాతులలో) గర్భవాసాన జన్మించి కర్మఫలాలను అనుభవిస్తూ ఉంటారు. ఫలానుభవం ద్వారానే కర్మలు అంతరిస్తాయి. మరొక మార్గం లేదు. కనక పూర్వార్జిత శుభాశుభకర్మలను అనుభవిస్తూ విభిన్నలోకాలలో విభిన్నరూపాలలో పరిభ్రమించడమే జీవుడు చేసేపని. శుభకర్మలు చేసినవారు స్వర్గాదిలోకాలలోనూ అశుభకర్మలు చేసినవారు నరకాదిలోకాలలోనూ పరిభ్రమిస్తారు.

శుభేవ కర్మణా యాతి స్వర్లోకాదికమేవ చ ।
కర్మణా చాశుభేనైవ భ్రమంతి నరకేషు చ ॥ (29 - 18)

(సాయుజ్య - సారూప్యప్రదంగా) ద్వివిధమైన భక్తి ఒక్కటే కర్మనిర్మూలకం. దుష్కర్మాచరణంవల్ల రోగిష్ఠులవుతారు. సత్కర్మాచరణంవల్ల ఆరోగ్యవంతులవుతారు. దీర్ఘాయుష్కుడు అల్పాయుష్కుడు సుఖి దుఃఖి అంగవిహీనుడు ఇత్యాదులందరూ సదసత్కర్మఫలస్వరూపులే. ఉత్కృష్టమైన కర్మలు చేస్తే ఉత్కృష్టమైన సిద్ధులు కలుగుతాయి. సాధ్వీ ! సామాన్యమాత్రంగా ఈ మాటలు చెప్పాను. అత్యంత గోప్యమైన శ్రుతి స్మృతి పురాణ రహస్యం చెబుతున్నాను శ్రద్ధగా చెవిపెట్టు.

భారతదేశంలో ఏరూపంలోనైనా జన్మ పొందడమే దుర్లభం. అందునా మానవజన్మ మరీ దుర్లభం. మానవులలోకెల్ల బ్రాహ్మణుడు ఉత్తముడు. అతడు బ్రహ్మనిష్ఠుడైతే బ్రాహ్మణోత్తముడు మరీ గరిష్ఠుడు. నిష్కాముడు సకాముడు అని బ్రాహ్మణుడు రెండు విధాలు. సకాముడికన్నా నిష్కాముడు గొప్పవాడు. ఇతడు ముక్తుడు. అతడు భక్తుడు. సకాముడు కర్మభోగి. నిష్కాముడు నిరుపద్రవుడు. ఈ నిష్కాముడు



తనువు చాలించాక పునరాగమనరహితమూ నిరామయమూ అయిన స్థానాన్ని పొందుతాడు. గోలోకంలో గోపరూపధారియై ద్విభుజ శ్రీకృష్ణపరమాత్మను సేవించుకుంటూ ఉంటాడు.

స యాతి దేహం త్యక్త్వా చ పదం యత్తన్నిరామయమ్ ।
పునరాగమనం నాస్తి తేషాం నిష్కామినాం సతి ॥ (29 - 26)
సేవంతే ద్విభుజం కృష్ణం పరమాత్మానమీశ్వరమ్ ।
గోలోకం ప్రతి తే భక్తాః దివ్యరూప విధారిణః ॥ (29 - 27)

సకాములైన వైష్ణవభక్తులు చతుర్భుజనారాయణుడుండే వైకుంఠానికి వెళ్ళి సత్కర్మఫలానుభవం పూర్తికావడంతోనే మళ్ళీ భారతభూమిలో బ్రాహ్మణులుగా జన్మిస్తుంటారు. కాలక్రమంలో వీరు నిష్కామభక్తులవుతారు. నిర్మలమూ నిశ్చలమూ అయిన భక్తి కుదురుకోకపోతే ఎన్ని జన్మలకైనా వీరు సకామవైష్ణవులుగానే ఉండిపోతారు.

తీర్థక్షేత్రాలలో తపోనిరతులైన ద్విజులు జన్మాంతంలో బ్రహ్మలోకానికి వెడతారు. ఇతర ప్రదేశాలలో నివసిస్తూ స్వధర్మనిరతులై జీవనం సాగించే భక్తులు సత్యలోకానికి వెడతారు. సూర్యభక్తులు సూర్యలోకానికి వెడతారు. వీరంతా భోగానుభవం ముగియగానే భారతభూమిలో విప్రులుగా పునర్జన్మ ఎత్తుతారు.

నిష్కాములై ధర్మచారులై మూలప్రకృతిని (మహాశక్తి) ఉపాసించే భక్తులు పునరావృత్తి రహితమైన మణిద్వీపం చేరుకుంటారు. శైవ - శాక్త - గాణపులు (గణపతి ఆరాధకులు) శివలోకం చేరుకుని మళ్ళీ భారతభూమిలో బ్రాహ్మణులై జన్మిస్తుంటారు. స్వధర్మనిరతులై ఏదో ఒక దేవతను ఆరాధించే విప్రులు స్వర్గలోకానికి వెళ్ళి పుణ్యఫలానుభవం పూర్తికాగానే భారతభూమిలో విప్రులై జన్మిస్తారు. ఇలాగే హరిభక్తులు తమ భక్తిబలంతో హరిలోకం చేరుకుంటారు.

ఏ భక్తీలేక ఏ ధర్మమూ లేక భ్రష్టాచారులూ కాముకులూ అయిన విప్రులు నరకానికి పోతారు. ఏ వర్ణంలో పుట్టినా స్వధర్మనిరతుడూ భక్తుడూ అయితే చాలు శుభకర్మ ఫలభోగాలను ఆయా లోకాలలో అనుభవిస్తాడు. కేవల కర్మఫలభోగులు భారతదేశంలో జన్మించరు.

స్వధర్మనిరతుడైన విప్రుడు స్వధర్మనిరతుడైన విప్రునికి కన్యాదానం చేస్తే చంద్రలోకం చేరుకుంటాడు. పధ్నాల్గురు ఇంద్రులు గడిచేదాకా అక్కడ ఉంటాడు. సాలంకృతకన్యాదానం చేస్తే ఫలితం ద్విగుణంగా (రెట్టింపు) ఉంటుంది. సకాములే చంద్రలోకానికి వెళ్ళేది. నిష్కాములు వెళ్ళరు. వారు ఫలసంఘాతవర్జితులై విష్ణులోకానికి వెడతారు. పాలు పెరుగు వెన్న వెండి బంగారం నెయ్యి వస్త్రం పండు నీరు - వీటిని విప్రులకు దానం చేసినవారు చంద్రలోకం చేరుకొంటారు. మన్వంతరకాలం అక్కడ నివసిస్తారు. సద్బ్రాహ్మణుడికి గోవులనుగానీ రాగిపాత్రలనుగానీ బంగారు ఆభరణాలనుగానీ దానం చేసినవారు సూర్యలోకం చేరుకుని అయుతవత్సరాలు పుణ్యఫలాలు అనుభవిస్తారు. భూలోకంలో బతికున్నంతకాలం



నూరేళ్ళూ ఆరోగ్యవంతులై సుఖిస్తారు. భూమినిగానీ ధనంగానీ దానంచేస్తే వైకుంఠంలో శాశ్వతంగా శ్వేతద్వీపనివాసం లభిస్తుంది. భూలోకంలో దీర్ఘాయుష్షూ భోగభాగ్యాలూ లభిస్తాయి. ఏ దేవతకైనా గృహం దానంచేస్తే అతడు ఆ దేవలోకంలో రేణువుకి ఒక్క సంవత్సరంగా నివసిస్తాడు. సౌధం కట్టించి ఇస్తే ఫలం నాలుగురెట్లు. దేశం దానం చేస్తే ఫలం పదిరెట్లు అధికంగా లభిస్తుంది. ఆ ఇచ్చినది ప్రకృష్టమైతే అంతకు రెండింతలు పుణ్యఫలం దక్కుతుంది. తటాకం తవ్వించినవాడు సర్వపాప విముక్తుడై వరుణలోకంలో రేణువుకి ఒక్కసంవత్సరంగా నివసిస్తాడు. వాపి అయితే పదిరెట్లు అధికఫలం. నాలుగువేల ధనుస్సుల పొడుగూ అంతకన్నా కొంచెం తక్కువ వెడల్పూ ఉంటే దాన్ని వాపి అంటారు. వాపి తవ్వించినవారికి తటాకదానఫలమూ లభిస్తుంది. పాత్రుడికి కన్యాదానం చేస్తే దశవాపీ సమానంగా పుణ్యం దక్కుతుంది. అదే సాలంకృతంగా అయితే రెట్టింపు ఫలం.

వాపీతటాకాలను తవ్విస్తే ఏ ఫలమో పూడుకుపోయిన వాటిని ఉద్ధరించినా అదేఫలం. రావిచెట్టును వాటి ప్రతిష్ఠచేస్తే అయుతవర్షాలు తపోలోకనివాసం కలుగుతుంది. నానావిధప్రాణికోటికి జీవనాధారంగా పుష్పోద్యానవనం ఏర్పరిస్తే అతడు ధ్రువలోకంలో అయుతసంవత్సరాలు నివసిస్తాడు. విష్ణుమూర్తికి విమానదానం చేస్తే విష్ణులోకనివాసం మన్వంతరాల తరబడి దక్కుతుంది. అది చిత్రసహితమైతే ఫలం చతుర్గుణంగా లభిస్తుంది. పల్లకీ ఉయ్యాలమంచం సమర్పించినవారు విష్ణులోకంలో శతమన్వంతరాలు నివసిస్తారు. సౌధాలు తీర్చిదిద్దించి రాజమార్గం నిర్మించినవారికి అయుత సంవత్సరాలు ఇంద్రలోక నివాసం ఫలం. ఏదైనాకానీ బ్రాహ్మణులకిచ్చినా దేవతలకిచ్చినా పుణ్యఫలం సమానం.

సావిత్రీ ! ఎవరికైనా దానం చేసిందే కడపటికి మానవులకు మిగిలేది. దానం చెయ్యనిది నశించిపోయినట్టే. దానఫలాలుగా స్వర్గాది సౌఖ్యాలను అనుభవించి తిరిగి భారతభూమిలో క్రమక్రమంగా ఉత్తమవంశాలలో జన్మిస్తాడు. కాబట్టి దానధర్మాది శుభకర్మలను నిష్కామంగా ఆచరించి సద్గతులు పొందాలి.

శతకోటి కల్పాలు గడిచినా అనుభవించనిదే కర్మ క్షయించదు. చేసిన శుభాశుభకర్మలు ఫలరూపంలో అవశ్యభోక్తవ్యాలు. కాకపోతే దేవతాపూజలతో తీర్థక్షేత్ర సందర్శనలతో కాయవ్యూహంతో (యోగమార్గం) కర్మలను శుద్ధిచేసుకోవచ్చు.

> నాభుక్తం క్షీయతే కర్మ కల్పకోటిశతైరపి ।
> అవశ్యమేవ భోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్ ॥
> దైవతీర్థ సహాయేన కాయవ్యూహేవ శుద్ధ్యతి । (29 - 70)

సాధ్వీమణీ ! నువ్వు అడిగినదంతా వివరించి చెప్పాను. ఇంకా ఏమి వినాలనుకుంటున్నావో అడుగు అన్నాడు యమధర్మరాజు.

*(అధ్యాయం - 29, శ్లోకాలు - 71)*



## ◆ సత్కర్మఫల నిరూపణ ◆

ధర్మరాజా ! ఏ సత్కర్మలను ఆచరిస్తే స్వర్గలోకం లభిస్తుందో తెలుసుకోవాలని ఉంది. వివరించి పుణ్యం కట్టుకో అని సావిత్రి మళ్ళీ అడిగింది. సమవర్తి సమాధానం చెప్పాడు.

సావిత్రీ ! విప్రుడికి అన్నదానం చేసినవాడు మెతుకులన్ని సంవత్సరాలు శివలోకంలో నివసిస్తాడు. అదే ఇతరులకు చేస్తే అన్నదాన ప్రమాణంగా శివలోకంలో నివసిస్తాడు. అన్నదానంకంటే గొప్పదానం ఏ కాలంలోనూ మరొకటి లేదు. దీనివిషయంలో పాత్రతాపాత్రత పరీక్షగానీ కాలాకాలవిచారణగానీ లేవు. ఇది అందరూ అందరికీ అన్నివేళలా చెయ్యదగిన ఉత్తమోత్తమదానం.

అన్నదానాత్పరం దానం న భూతం న భవిష్యతి ।
నాత్ర పాత్రపరీక్షా స్యాన్న కాలనియమః క్వచిత్ ॥ (30 - 4)

దేవతలకుగానీ బ్రాహ్మణులకుగానీ ఉచితాసనం దానం చేసినవాడు విష్ణులోకంలో అయుతవత్సరాలు నివసిస్తాడు. పాడి ఆవును విప్రుడికి ఇస్తే దాని రోమాలన్ని సంవత్సరాలు దాతకు విష్ణులోక నివాసం లభిస్తుంది. పుణ్యప్రదమైన రోజునచేస్తే నాలుగురెట్లు తీర్థప్రదేశంలోచేస్తే పదిరెట్లు అధికంగా పుణ్యం వస్తుంది. నారాయణక్షేత్రంలో చెయ్యగలిగితేనా ఫలం కోటిరెట్లు లభిస్తుంది. గోదానం చంద్రలోక ప్రాప్తిదాయకం. ఉభయముఖీ గోదానం విష్ణులోకప్రాప్తికి సోపానం. శ్వేతచ్ఛత్రప్రదాతకు అయుతవత్సరాలు వరుణలోక నివాసం కలుగుతుంది. కప్పుకునేందుకు గుడ్డలేక బాధపడుతున్న విప్రుడికి వస్త్రయుగ్మం సమర్పిస్తే వాయులోకనివాసం ఫలం. నూతనవస్త్రాలు పెట్టి సాలగ్రామం దానంచేస్తే వైకుంఠంలో శాశ్వతనివాసమే. శయ్యాదానం చంద్రలోక ప్రాపకం. దీపదానం వహ్నిలోకదాయకం. గజదానం చేస్తే ఇంద్రుడితో అర్ధాసనం పంచుకోవచ్చు. అశ్వదానం వారుణలోకప్రదాయి. శిబికాదానమూ అంతే. వ్యజనవాటికాదానాలు వాయులోక నివాసహేతువులు. ధాన్యరత్నాలు దాతృప్రతిగ్రహీత లిద్దరికీ వైకుంఠలోకావాసప్రదాలు. శ్రీహరి నామస్మరణ నిరంతరం చేసేవాడు చిరంజీవి అవుతాడు. మృత్యువు పారిపోతుంది. పున్నమివేళ శ్రీహరికి ఉయ్యాలసేవ చేసినవారు ఇహలోకంలో భోగభాగ్యాలు పుష్కలంగా అనుభవించి విష్ణుమందిరం చేరుకొంటారు. అక్కడ శతమన్వంతరాలు నివసిస్తారు. ఉత్తర ఫల్గుణిలో ఈ పనిచేస్తే రెట్టింపు పుణ్యం వస్తుంది. అతడు కల్పాంతజీవి అవుతాడు. తిలదానం శివలోకప్రదం. అటుపైని ఉత్తమజన్మ ఎత్తి సుఖపడతాడు. తామ్రపాత్రను దానంచేస్తే రెట్టింపుఫలం. సాలంకృత కన్యాదాత చంద్రలోకంలో పదునల్గురు ఇంద్రులు గడిచేదాకా అప్సరసలతో వినోదిస్తాడు. అటుపైని గంధర్వలోకానికి వెళ్ళి ఊర్వశితో క్రీడిస్తాడు. అటుపైని భూమికి అవతరించి అనుకూలవతిని భార్యగా పొంది సుఖిస్తాడు.



ఫలదానానికి శక్రలోకనివాసం ఫలం. ఆ తరువాత జన్మలో పండంటిబిడ్డ కలుగుతాడు. ఫలభారంతో వంగిన వెయ్యి చెట్లు లభిస్తాయి.

ధనధాన్య సమృద్ధితో గృహదానం చేస్తే శాశ్వతస్వర్గలోక నివాసమే. అటుపైని ధనధాన్యాలకు లోటులేని ఉత్తమజన్మ. పంటతోపాటు పొలం దానంచేస్తే వైకుంఠలోక నివాసం ఫలం. తరవాత జన్మలో భూపాలుడవుతాడు. నూరు జన్మలవరకూ పరిపాలకుడవుతాడు. శ్రీమంతుడూ ధనవంతుడూ పుత్రవంతుడూ అవుతాడు. వజ్రదానం గ్రామదానాలకు లక్షమన్వంతరాలు వైకుంఠవాసం ప్రతిఫలం. పునర్జన్మల్లో లక్షగ్రామాలకు అధిపతి అవుతాడు. ఉద్యానాలతో తటాకాలతో సత్ప్రజానీకంతో విరాజిల్లే అందమైన నగరాన్ని దానంచేస్తే దశలక్షేంద్రకాలపర్యంతం కైలాసంలో నివసిస్తాడు. పునర్జన్మలో రాజేంద్రుడై అటువంటి దశలక్షనగరాలకు ఏలిక అవుతాడు. నూరు నగరాలతోకూడిన దేశాన్ని దానంచేస్తే కోటిమన్వంతరాలు వైకుంఠంలో విరాజిల్లుతాడు. పునర్జన్మలో జంబూద్వీపానికి అధినాయకుడు అవుతాడు. భూలోక దేవేంద్రుడుగా కీర్తి గడిస్తాడు. కోటి జన్మలదాకా ఈ భోగం ఉంటుంది. రాజరాజేశ్వరుడై కల్పాంతజీవి అవుతాడు. అతడు సాధికారంగా జంబూద్వీపాన్నే దానంచేస్తే ఈ పుణ్యఫలం నూరురెట్లు అధికంగా లభిస్తుంది.

పతివ్రతాశిరోమణీ ! ఎంతెంత దానాలన్నా చేయనీ, జంబూద్వీపమే దానం చెయ్యనీ, ఈ దాతలందరికీ పునర్జన్మ తప్పదు. జన్మరాహిత్యరూపమైన ముక్తి కలగదు. ఒక్క దేవీ భక్తుడికిమాత్రమే అది సాధ్యం. అసంఖ్యాకంగా బ్రహ్మలు పుట్టడం గిట్టడం చూస్తూ శ్రీదేవీ సన్నిధిలో మణిద్వీపంలో ఆ భక్తుడు శాశ్వతంగా నివసిస్తాడు. పునర్జన్మ అంటూ అతడికి ఉండదు.

దేవీ మంత్రోపాసకులు శరీరాన్ని విడిచిపెట్టాక దేవీసారూప్యాన్ని పొంది జన్మ మృత్యు జరారహితులై మణిద్వీపంలో విరాజిల్లుతుంటారు. దేవీసేవ చేసుకుంటూ ఉంటారు. మిగతా **లోకాలూ లోకేశ్వరులూ** దేవతలూ దేవేశ్వరులూ నశించడం పునరావిర్భవించడం కళ్ళారా చూస్తూ సాక్షిమాత్రులుగా నిలుస్తారు. అంతేకానీ వీరు నశించరు. పునరావిర్భవించరు. మణిద్వీపం శాశ్వతం. మణిద్వీపవాసులు శాశ్వతం.

> నశ్యంతి దేవాస్సిద్ధాశ్చ విశ్వాని నిఖిలాని చ ।
> దేవీభక్తా న నశ్యంతి జన్మమృత్యుజరాహరాః ॥ (30 - 56)

కార్తికమాసంలో శ్రీహరికి తులసీదళం సమర్పించినవాడు యుగత్రయపర్యంతం హరిసన్నిధిలో నివసిస్తాడు. పునర్జన్మలో హరిభక్తుడు అవుతాడు. జితేంద్రియుడవుతాడు. అరుణోదయకాలంలో గంగాస్నానం చేస్తే ఆరువేలయుగాలపాటు హరిసన్నిధిలో ఆనందంగా గడిపి పునర్జన్మలో విష్ణుమంత్రాన్ని పొంది తిరిగి మళ్ళీ హరిసన్నిధికి చేరుకుంటాడు. మరింక అతడికి పునర్జన్మ లేదు. వైకుంఠంలో హరిదాస్యం చేస్తూ సారూప్యసిద్ధి పొందుతాడు. నిరంతరం గంగాస్నానం చేస్తే భూలోకంలో సూర్యుడిలా ప్రకాశిస్తూ అనంత



అశ్వమేధఫలాలను పొందుతాడు. అతడి పాదధూళితో వసుంధర పావనమవుతుంది. జన్మ చాలించాక వైకుంఠంలో ఆచంద్రతారార్కంగా నివసిస్తాడు. పునర్జన్మలో హరిభక్తుడై జీవన్ముక్తి పొందుతాడు. అటుపైని సూర్యుడై వెలుగొందుతాడు.

స్వాదువూ సుగంధభరితమూ అయిన జలాన్ని దానం చేసినవాడు కైలాస నివాసి అవుతాడు. పునర్జన్మలో వేదవేదాంగవేత్త అవుతాడు. వైశాఖమాసంలో సక్తుదానం చేస్తే శివసాయుజ్యమే ఫలం. కృష్ణాష్టమీవ్రతం ఆచరించినవారు శతజన్మ పాపవిముక్తులై వైకుంఠంలో ఆనందిస్తారు. పునర్జన్మలో కృష్ణభక్తులవుతారు. శివరాత్రివ్రతం పాటించినవారు కైలాసంలో శివుడి సన్నిధిలో సప్తమన్వంతరాలు వినోదిస్తారు. ఆరోజున శివుడికి బిల్వపత్రం భక్తితో సమర్పిస్తే శివసాయుజ్యం లభిస్తుంది. పునర్జన్మలో శివభక్తులవుతారు. సకలవిధ సంపదలతో తులతూగుతారు. పుత్రపౌత్రాభివృద్ధి పొందుతారు. చైత్రంలో కానీ మాఘంలో కానీ శంకరుణ్ణి అర్చిస్తే కైలాసాన వేత్రపాణియై ప్రమథశేఖరుడై నర్తిస్తాడు. శ్రీరామనవమిని యథావిధిగా నిర్వహించినవారు సప్తమన్వంతరాలు విష్ణుసన్నిధిలో విరాజిల్లుతారు. పునర్జన్మలో ధనవంతులూ సజ్జనులూ అవుతారు.

శరదృతువులో మహాదేవుణ్ణి మాంసనైవేద్యాలతో షోడశోపచారాలతో అర్చించినవారు సప్తమన్వంతరాలపాటు కైలాసంలో ఉంటారు. పునర్జన్మలో పుత్రపౌత్ర ధనధాన్య సమృద్ధులతో రాజరాజేశ్వరులవుతారు. శుక్లాష్టమినాడు మహాలక్ష్మిని భక్తిప్రపత్తులతో అర్చించి ఉత్తమోత్తమంగా షోడశోపచారాలూ చేస్తే గోలోకనివాసం లభిస్తుంది. పునర్జన్మలో రాజేశ్వరులవుతారు. కార్తిక పూర్ణిమ రోజున రాసమండలంచేసి గోపీగోపశతాన్నీ రాధాకృష్ణులనూ శిలాప్రతిమలుగా శిల్పించి భక్తితో ఆరాధించినవారికి గోలోకం కరతలామలకం. పునర్జన్మలో కృష్ణభక్తులై మళ్ళీ గోలోకం చేరుకుంటారు. కృష్ణసారూప్యం పొంది పార్షదులవుతారు. మరింకవారికి పతనం లేదు. శుక్లపక్షంలోగానీ కృష్ణపక్షంలోగానీ ఏకాదశీవ్రతం చేస్తే బ్రహ్మపర్యంతం వైకుంఠవాసం లభిస్తుంది. పునర్జన్మలో కృష్ణభక్తులై అటుపైని గోలోకం చేరుకుంటారు. మరింక తిరిగిరారు.

భాద్రపద ద్వాదశి రోజున ఇంద్రుణ్ణి పూజిస్తే అరవైవేల సంవత్సరాలు ఇంద్రలోకంలో భోగాలు అనుభవిస్తారు. ఆదివారంనాడుగానీ సంక్రాంతినాడుగానీ శుక్లపక్ష సప్తమినాడుగానీ సూర్యదేవుణ్ణి అర్చిస్తే అతడు సూర్యలోకనివాసి అవుతాడు. ఆరోగ్యవంతుడూ శ్రీయుతుడూ జ్ఞానిగా భారతభూమిలో పునర్జన్మ ఎత్తుతాడు. మాఘ శుక్లపంచమినాడు సరస్వతిని ఉపాసిస్తే షోడశోపచారాలూ భక్తితో సమర్పిస్తే మణిద్వీపనివాసి అవుతాడు. పునర్జన్మలో పండితకవి అవుతాడు.

గో భూ సువర్ణ దానఫలాలు లోగడ చెప్పానుగదా ! హరినామాలను ఉచ్చరించినవాడు నామానికి ఒక యుగంగా విష్ణులోకంలో సుఖిస్తాడు. అదే నారాయణ క్షేత్రంలో చేస్తే కోటిరెట్లు అధికఫలం లభిస్తుంది. జీవన్ముక్తుడై పునర్జన్మలేని స్థితికి చేరుకొంటాడు. పార్థివలింగంగా నిరంతరం శివోపాసన



చేసినవారు రేణువుకి సంవత్సరంగా కైలాసంలో నివసిస్తారు. పునర్జన్మలో భూమిపాలకులై కీర్తి గడిస్తారు. సాలగ్రామ శిలను అర్చించి ఆ జలాన్ని పుచ్చుకునేవారు వైకుంఠంలో శతబ్రహ్మపర్యంతకాలం ఉండి పునర్జన్మలో హరిభక్తులై తిరిగి వైకుంఠం చేరుకుంటారు. వారికింక జన్మలేదు. సకల తపస్సులూ సకలదానాలూ సకలవ్రతాలూ చేసినవారు చాలాకాలం వైకుంఠంలో భోగాలు అనుభవించి పునర్జన్మలో రాజేంద్రులై అటుపైని ముక్తులు అవుతారు. వీరికింక మరి జన్మ ఉండదు. సకల తీర్థాల్లోనూ మునిగి భూప్రదక్షిణం చేసినవారికి జన్మరాహిత్యరూపమైన ముక్తి లభిస్తుంది. పుణ్యక్షేత్రంలో అశ్వమేధం చేస్తే అశ్వరోమ పర్యంత సంవత్సరాలు ఇంద్రుడితో అర్ధాసనం అలంకరిస్తారు. రాజసూయానికి నాలుగింతల అధిక పుణ్యఫలం. ఈ యజ్ఞాలన్నింటిలోకీ దేవీయజ్ఞం శిరోరత్నం. తొలినాళ్ళలో త్రిమూర్తులూ దేవీయజ్ఞాలు చేశారు. దీనికి సాటివచ్చే యజ్ఞం ముల్లోకాలలోనూ లేదు. దక్షుడు ధర్ముడు కశ్యపుడు శేషుడు కర్దముడు మనువు ప్రియవ్రతుడు శివుడు సనత్కుమారుడు కపిలుడు ధ్రువుడు - వీరంతా దేవీయజ్ఞం చేసినవారే. ఇది సహస్రరాజసూయాలకంటే అధికంగా పుణ్యప్రదం. దీనికన్నా గొప్ప యజ్ఞం మరొకటి లేనేలేదు.

రాజసూయ సహస్రాణాం ఫలమాప్నోతి నిశ్చయమ్ ।
దేవీయజ్ఞాత్పరో యజ్ఞో నాస్తి వేదే ఫలప్రదః ॥ (30 - 125)

ఇది చేసినవాడు శతాయుష్కుడవుతాడు. జీవన్ముక్తుడవుతాడు. జ్ఞాని తేజస్వి అవుతాడు. విష్ణుభృత్యుడవుతాడు. దేవతలలో విష్ణుమూర్తిలా, వైష్ణవులలో నారదుడిలా, శాస్త్రాలలో వేదంలా, మానవులలో బ్రాహ్మణుడిలా తీర్థాలలో గంగలా పవిత్రులలో శివుడిలా వ్రతాలలో ఏకాదశిలా పువ్వులలో తులసిలా తారలలో చంద్రుడిలా పక్షులలో గరుత్మంతుడిలా స్త్రీలలో ప్రకృతిలా రాధలా వాణిలా వసుంధరలా ఇంద్రియాలలో మనస్సులా ప్రజాపతులలో బ్రహ్మలా ప్రజలలో ప్రజాపతిలా వనాలలో బృందావనంలా దేశాలలో భారతదేశంలా ధనవంతులలో లక్ష్మిలా పండితులలో సరస్వతిలా పతివ్రతలలో దుర్గలా సౌభాగ్యవతులలో రాధికలా - యజ్ఞాలలో దేవీయజ్ఞం ఉత్తమోత్తమం. సర్వయజ్ఞ సర్వతీర్థస్నాన సర్వవ్రతాచరణ సర్వవేదపఠన భూప్రదక్షిణ సర్వదానకరణ ఫలంకన్నా దేవీయజ్ఞఫలం అత్యధికం. సాక్షాత్తు ముక్తిప్రదం. ఇది వేదశాస్త్ర పురాణాదులలో నిస్సంశయంగా నిరూపించబడిన అంశం. దేవీవర్ణన, దేవీధ్యాన దేవీస్మరణ దేవీస్తవన దేవీవందన దేవీమంత్రపఠన దేవీపాదోదకసేవన దేవీనైవేద్య భక్షణలు నిరంతరం చెయ్యాలి. అది సర్వవాంఛాప్రదం. అందుచేత ఓ సావిత్రీ ! నిత్యమూ ఆ నిర్గుణ పరాప్రకృతిని ఆరాధించు. ఉపాసించు. నీ భర్తను తీసుకుని ఇంటికివెళ్ళి సుఖసంతోషాలతో జీవించు. తత్త్వజ్ఞానప్రదమైన కర్మవిపాకాన్ని బోధించాను. నీ సంశయాలు తీర్చాను. శుభమగుగాక ! వెళ్ళిరా - అని ముగించాడు యమధర్మరాజు.

*(అధ్యాయం - 30, శ్లోకాలు - 140)*



నారదా ! యమధర్మరాజు నోట ఇలా శక్తిసంకీర్తన విన్న సావిత్రీదేవి కన్నుల్లో ఆనందబాష్పాలు గుడుసుళ్ళు తిరిగాయి. తనువంతా పులకించింది. ధర్మరాజా ! శ్రోతలకూ వక్తలకూ జన్మమృత్యుజరాహర్మమై సకలోద్ధారకారణమైన శక్తి సంకీర్తనం వినిపించావు. సకల ప్రాణికోటికీ ముక్తిప్రదమనీ సిద్ధిప్రదమనీ తెలియజెప్పావు. మిగతావి ఏవీ శ్రీశక్తి ఉపాసకుడిలో పదహారవ కళకైనా సాటిరావని గ్రహించాను. నువ్వు చెప్పిన ప్రకారం నేను ఆ దేవిని ఆరాధిస్తాను. దీనితోపాటు జీవుల శుభకర్మవిపాకం వివరించావు. మరి అశుభకర్మలవిపాకం మాట ఏమిటి ? ఏ అసత్కర్మకు ఏ అసత్ఫలితం వస్తుందో నువ్వే తెలియజెయ్యాలి. నువ్వు వేదవిదాంవరుడవు. జ్ఞానివి. సకలప్రాణికోటిపట్ల సమవర్తివి. రాగద్వేషాలకు అతీతుడవు. అరిషడ్వర్గాన్ని జయించిన జితేంద్రియుడవు. నీ జన్మవృత్తాంతం నాకు తెలుసు.

## ◆ యమాష్టకం ◆

పూర్వకాలంలో సూర్యభగవానుడు పుష్కరక్షేత్రంలో తీవ్రతపస్సుతో బ్రహ్మమానసపుత్రుడైన ధర్ముణ్ణి ఆరాధించి నిన్ను పుత్రుడుగా పొందాడు. నువ్వు ధర్మరాజువి. సర్వసాక్షివి. సర్వభూత సమవర్తివి. సర్వభూత సంహారకుడవు. అందుకే నిన్ను శమనుడు అంటారు. కాలం చెల్లగానే ప్రతిజీవినీ అంతమొందిస్తూ కృతాంతుడనే పేరు సంపాదించుకున్నావు. పాపాత్ములను దండించి శుద్ధిచెయ్యడానికి దండం ధరించావు. దండధారి వయ్యావు. సర్వవిశ్వాలలోనూ నిరంతరం ప్రాణికోటిని వెన్నంటి సంచరిస్తూ సకలజీవులనూ శాసిస్తున్నావు. ఎవరైనా ఏదైనా తప్పించుకోవచ్చుగానీ నిన్నుమాత్రం తప్పించుకోలేరు. అందుకే కాలుడన్నారు నిన్ను. నువ్వు తపస్వివి. బ్రహ్మనిష్ఠుడివి. సంయమివి. జితేంద్రియుడివి. జీవులకు కర్మఫలాలను నిష్పాక్షికంగా పంచిపెట్టేవాడివి. నువ్వు స్వాత్మారాముడివి. సర్వజ్ఞుడివి. పుణ్యాత్ములకు మిత్రుడివి. పాపాత్ములకు శత్రువువి. నీకిదే శిరసువంచి నమస్కరిస్తున్నాను. బ్రహ్మ అంశతో పుట్టావు. బ్రహ్మతేజస్సుతో ప్రకాశిస్తున్నావు. పరబ్రహ్మను నిరంతరం ధ్యానిస్తుంటావు. నువ్వు ఈశుడవు. నీకిదే వందనం - అని సావిత్రీదేవి స్తుతించి యముడికి శిరసువంచి నమస్కరించింది.

తపసా ధర్మమారాధ్య పుష్కరే భాస్కరః పురా ।
ధర్మం సూర్యస్సుతం ప్రాప ధర్మరాజం నమామ్యహమ్ ॥
సమతా సర్వభూతేషు యస్య సర్వస్య సాక్షిణః ।
అతో యన్నామ శమన ఇతి తం ప్రణమామ్యహమ్ ॥
యేనాంతశ్చ కృతో విశ్వే సర్వేషాం జీవినాం పరమ్ ।



కామామరూపం కాలేన తం కృతాంతం నమామ్యహమ్ ॥
బిభర్తి దండం దండాయ పాపినాం శుద్ధిహేతవే ।
నమామి తం దండధరం యః శాస్తా సర్వజీవినామ్ ॥
విశ్వం చ కలయత్యేవ యస్సర్వేషు చ సంతతమ్ ।
అతీవ దుర్నివార్యం చ తం కాలం చ ప్రణమామ్యహమ్ ॥
తపస్వీ బ్రహ్మనిష్ఠో యస్సంయమీ సంజితేంద్రియః ।
జీవానాం కర్మఫలదస్తం యమం ప్రణమామ్యహమ్ ॥
స్వాత్మారామశ్చ సర్వజ్ఞో మిత్రం పుణ్యకృతాం భవేత్ ।
పాపినాం క్లేశదో యస్తం పుణ్యమిత్రం నమామ్యహమ్ ॥
యజ్జన్మ బ్రహ్మణోఽంశేన జ్వలంతం బ్రహ్మతేజసా ।
యో ధ్యాయతి పరం బ్రహ్మ తమీశం ప్రణమామ్యహమ్ ॥ (31 - 15)

నారదా ! ఇది యమాష్టకం. దీన్ని తెల్లవారుజామున నిద్రలేచిన వెంటనే రోజూ పఠించేవారికి మృత్యుభయం ఉండదు. సమస్త పాపాలూ తొలగిపోతాయి. యముడి అనుగ్రహంతో త్రికరణశుద్ధి ఏర్పడుతుంది - అని చెప్పి నారాయణమహర్షి సావిత్రీ యమసంవాదాన్ని కొనసాగించాడు.

*(అధ్యాయం - 31, శ్లోకాలు - 18)*

శౌనకాది మహామునులారా! శ్రద్ధగా వింటున్నారుగదా! నారాయణమహర్షి నారదుడికి వివరిస్తున్న సావిత్ర్యుపాఖ్యానంలో అశుభకర్మవిపాకం ఆలకించండి - అని ఒకసారి హెచ్చరించి సూతుడు కొనసాగించాడు.

నారదా ! సావిత్రి చేసిన స్తోత్రానికి యముడు సంబరపడ్డాడు. మాయాబీజసహితంగా శ్రీదేవీమహామంత్రాన్ని ఉపదేశించి పూజావిధానం తెలియచెప్పాడు. అటుపైని అశుభకర్మవిపాకం వివరించాడు.

## ◆ దుష్కర్మఫల నిరూపణ ◆

సావిత్రీ ! శుభకర్మలు చేసుకున్నవారు రకరకాల స్వర్గాలకు వెళ్ళి పుణ్యఫలాలను అనుభవిస్తారు. అవి చెల్లిపోగానే భూలోకంలో సజ్జనులై జన్మిస్తారు. వీరు ఏనాడూ నరకానికి పోరు. అలాగే దుష్కర్మలు చేసినవారు నానావిధ నరకాలకి పోతారు. ఆ నరకాలలో రకరకాల కుండాలు ఉంటాయి. లోతైన కూపాలు. ఏ దుష్కర్మకు ఏ కూపమో, దాన్ని వైశాల్యమూ లోతూ ఎంతో, అందులో ఎంతకాలం క్లేశాలు



అనుభవించాలో అంతా శాస్త్రప్రమాణంగా నిర్ధారణ అయ్యిఉంది. అవ్వి అతిభయంకర కుండాలు. అమ్మా! ఆ గుంటలు పరమకుత్సితంగా ఉంటాయి. చూడక్కర్లేదు వింటేనే చాలు వొళ్ళు జలదరిస్తుంది. పెద్దవి ఎనభయ్యారుకి పైగా ఉన్నాయి. చిన్నవి ఇంకా చాలా ఉన్నాయి. వాటిలో ప్రసిద్ధమైన పేర్లు కొన్ని చెబుతాను. ఆలకించు. వహ్నికుండం తప్తకుండం క్షారకుండం విట్కుండం (మలం) మూత్రకుండం శ్లేష్మకుండం గరకుండం దూషికుండం (పుసి) వసాకుండం శుక్రకుండం (10) అసృక్కుండం అశ్రుకుండం గాత్రమలకుండం కర్ణమలకుండం మజ్జాకుండం మాంసకుండం నఖకుండం రోమకుండం కేశకుండం అస్థికుండం (20) తామ్రకుండం లోహకుండం చర్మకుండం తప్తసురాకుండం కంటకకుండం విషకుండం తప్తతైలకుండం కుంతకుండం కృమికుండి (పురుగులు) పూయకుండం (30) సర్పకుండం మశక కుండం దంశకుండం గరళకుండం వజ్రదంష్ట్రాకుండం వృశ్చికకుండం శరకుండం శూలకుండం పరశుకుండం ఖడ్గకుండం (40) గోళకుండం నక్రకుండం కాకకుండం మంథానకుండం బీజకుండం వజ్రకుండం తప్తపాషాణకుండం తీక్ష్ణపాషాణకుండం లాలాకుండం మసీకుండం (50) చూర్ణకుండం చక్రకుండం వక్రకుండం కూర్మకుండం జ్వాలాకుండం భస్మకుండం దగ్ధకుండం ఇంకా ఇలాగే తప్తసూచీ - అసిపత్ర - క్షురధారా (60) - సూచీముఖ - గోకాముఖ - నక్రముఖ - గజదంశ - గోముఖ - కుంభీపాక - కాలసూత్ర - మత్స్యోద - కృమికందుక - పాంసుభోజ్య (70) - పాశవేష్ట - శూలప్రోత - ప్రకంపన - ఉల్కాముఖ - అంధకూప - వేధన - తాడన - జాలరంధ్ర - దేహచూర్ణ - దేహదళన (80) - దేహశోషణ - దేహకషణ - శూర్ప - జ్వాలాముఖ - ధూమాంధ - నాగవేష్టనకుండాలున్నాయి. (86)

ఇవ్వే కాదు పాపాత్ముల్ని హింసించడానికి చిన్నవీ పెద్దవీ ఇంకా చాలా కుండాలున్నాయి. కింకరులు జాగరూకులై వీటిని నిరంతరం రక్షిస్తుంటారు. వీరినే యమభటులు అంటారు. వీళ్ళందరూ దండహస్తులు. పాశహస్తులు. మదమత్తులు. అత్యంత భయంకరులు. శక్తిహస్తులు. గదాహస్తులు. అసిహస్తులు. అతిదారుణులు. తమోయుక్తులు. దయాహీనులు. అనివార్యులు. తేజస్వంతులు. శంకారహితులు. రక్తపింగళనేత్రులు. మృత్యువు ఆసన్నమైన పాపాత్ములకుమాత్రమే కనిపిస్తారు. పుణ్యాత్ములకూ యోగీశ్వరులకూ స్వధర్మనిరతులకూ వీరి దర్శనభాగ్యం లభించదు. ఇప్పటికి యమకుండాలగురించి చెప్పడమయ్యింది. ఇక ఏ పాపాత్ముడు ఏ కుండంలో పడతాడో చెబుతాను భయపడకుండా విను.

***(అధ్యాయం - 32, శ్లోకాలు - 28)***

సాధ్వీలలామా ! హరిసేవారతుడూ అంతశ్శుద్ధీ బహిశ్శుద్ధీ ఉన్నవాడూ యోగసిద్ధుడూ వ్రతాచరణతత్పరుడూ తపశ్శీలీ బ్రహ్మచారీ - వీరు నరకం దరిదాపులకుకూడా వెళ్ళరు. ఇక మిగతావారి సంగతి చెబుతాను. బలగర్వంతో బంధువుల్ని కటువాక్కులతో హింసించేవాడు అగ్నికుండంలో పడతాడు.



తన శరీరంమీద ఎన్ని వెంట్రుకలున్నాయో అన్నేళ్ళు అందులో మాడతాడు. అటుపైని మూడు పశుజన్మలు ఎత్తుతాడు. ఆకలి దప్పులతో గుమ్మమెక్కిన బ్రాహ్మణుడికి భోజనం పెట్టకుండా పంపించిన మూఢుడు తప్తతుండకుండంలో పడతాడు. రోమప్రమాణాబ్దాలపాటు అందులో నరకయాతన అనుభవిస్తాడు. అటుపైని ఏడు జన్మలవరకూ వాడిది పక్షిబతుకే. రవివారంనాడుగానీ సంక్రాంతిరోజునగానీ అమావాస్యనాడుగానీ శ్రాద్ధసమయంలోగానీ వస్త్రాలకు క్షారసంయోగం చేస్తే (మురికి వదల్చడానికి సబ్బుసోడాలు పెట్టడం) క్షారకుండంలో పడి దారాలన్ని సంవత్సరాలపాటు దుఃఖాలు అనుభవించి మరుసటి ఏడు జన్మల్లోనూ రజకుడవుతాడు. వేద శాస్త్ర పురాణనింద చేసినా త్రిమూర్తుల్ని నిందించినా గౌరీవాణీలక్ష్ములను తూలనాడినా దేవీదూషణ చేసినా ఆ పాపాత్ముడు నిరయానికి వెళ్ళి ఎనభయ్యారింటిలోనూ అత్యంత భయానకమైన కుండంలో పడతాడు. అంతకన్నా దుఃఖప్రదమైన కుండం ఏ నరకంలోనూ ఉండదు. అనేక కల్పాలదాకా అందులో మగ్గి మగ్గి అటుపైని సర్పజాతిలో పుడతాడు. దేవతాదూషణలకు ఏవేవో ప్రాయశ్చిత్తాలున్నాయిగానీ దేవీనిందకు మాత్రం ఏ ప్రాయశ్చిత్తమూ లేదు. దేవీనిందాపరాధస్య ప్రాయశ్చిత్తం న విద్యతే.

స్వదత్తంగానీ పరదత్తంగానీ విప్రుడి సొత్తును అపహరించినవాడు అరవైవేల సంవత్సరాలు విట్కుండంలో పడి ఉంటాడు. అన్ని ఏళ్ళూ విడ్భోజనమే చేస్తాడు. అటుపైని విట్కృమిగా జన్మిస్తాడు. ఇతరుల చెరువులో తాను చెరువు తవ్విస్తే మూత్రకుండనివాసం ఫలం. రేణువులన్ని సంవత్సరాలు అదే తాగుతూ అదే తింటూ పడిఉంటాడు. పునర్జన్మలో నిండా నూరేళ్ళు వృషభమై భారతభూమిలో ఎవరికో ఒకరికి చాకిరీ చేస్తాడు. ఎవరికీ పెట్టకుండా మృష్టాన్నాన్ని ఒక్కడే తిన్నవాడు శ్లేష్మకూపంలో పడి కొట్టుకుంటాడు. నూరేళ్ళు అదే తింటూ అందులోనే పడి చస్తాడు. అటుపైని శ్లేష్మమలమూత్రాలు తినే కాకిగా జన్మించి నూరేళ్ళు బదికి పాపం వదిలించుకుని శుచి అవుతాడు.

తల్లిని తండ్రిని గురువును భార్యను సంతానాన్నీ పోషించకుండా అనాథలుగా వదిలేసినవాడు గరకుండంలో నూరేళ్ళు అదేతింటూ దుఃఖిస్తాడు. అటుపైన భూతజన్మఎత్తి మరో నూరేళ్ళు గడిపి పాప విశుద్ధుడవుతాడు. ఇంటికి వస్తున్న అతిథిని చూసి ఏవగించుకుంటూ కన్నులు చిట్లించుకున్నవాడు విడిచిపెట్టే తర్పణాలను పితృదేవతలు స్వీకరించరు సరిగదా వాడు నరకానికి పోతాడు. ఇంకా బ్రహ్మహత్యాది మహాపాతకాలు ఎవడు ఏది చేసినా దూషికాకుండంలో నూరేళ్ళు హింసలపాలై అటుపైని భూతజాతిలో జన్మించి మరో నూరేళ్ళు శోకించి కడపటికి పాపంనుంచి శుచి అవుతాడు. ఎరికైనాగానీ ద్రవ్యం దానంగా ఇచ్చి మళ్ళీ వెనక్కి తీసుకున్నవాడు వసాకుండంలో శతాబ్దంపాటు అదే తింటూ కుళ్ళిపోతాడు. అటుపైని కృకలాసంగా (తొండ) ఏడుజన్మలెత్తుతాడు. తరవాత అతిరౌద్రుడూ అతి దరిద్రుడుగా అల్పాయుష్కుడై



బతుకుతాడు. స్త్రీని పురుషుడుగానీ పురుషుణ్ణి స్త్రీగానీ శుక్లపానం చేయిస్తే శుక్లకుండపతనమే ఫలం. నూరేళ్ళ తరవాత ఏడు వ్యాఘ్రజన్మలు ఎత్తుతారు. అప్పటికి పాపశుద్ధిపొంది మానవులుగా పుడతారు.

శ్రీకృష్ణుడిమీద పాటలుకట్టి తన్మయత్వంతో పాడుకుంటున్నవాణ్ణి చూసి కళ్ళల్లో నీళ్ళు తిరిగేలాగా పరిహసించిన పాపాత్ముడు అశ్రుకుండనరకంలో శతసంవత్సరాలు పడిఉంటాడు. మరుజన్మలో చండాలవంశాన పుడతాడు. మిత్రద్రోహి గాత్రమలకూపంలో నూరేళ్ళు శిక్ష అనుభవించి అటుపైని గాడిదగా మూడు జన్మలెత్తి పాపశుద్ధి పొందుతాడు. చెవిటివారిని నిందించిన కఠినాత్ముడు కర్ణవిట్ కూపంలో (గులుగు) పడి అదే తింటూ నూరేళ్ళు రోదిస్తాడు. బధిరుడూ దరిద్రుడుగా ఏడు జన్మలెత్తుతాడు. మరో ఏడు జన్మలకూ అంగవిహీనుడై ఆపైని శుచి అవుతాడు. లోభంతోగానీ స్వలాభంకోసంగానీ జీవహింస చేసినవాడు మజ్జాకూపంలో లక్షసంవత్సరాలు మగ్గుతాడు. ఆపైని ఏడుజన్మలు శశకంగా, ఏడు జన్మలు మీనంగా పుడతాడు. మూడు జన్మలు వరాహంగా ఏడుజన్మలు కోడిగా ఏడుజన్మలు లేడిగా ఎత్తి ఎత్తి కడకు పాతకశుద్ధి పొందుతాడు. కూతురిని పెంచి పెద్దచేసి ధనలోభంతో అమ్ముకునేవాడు మాంసకుండంలో కన్యారోమాలన్ని ఏళ్ళు పడిఉంటాడు. యమభటులు నిత్యమూ దండతాడనం చేస్తుంటారు. మాంసభారాన్ని నెత్తిమీద పెట్టి మోయిస్తారు. అందులోంచి కారే రక్తాన్ని నాకిస్తారు. అటుపైని అరవైవేల సంవత్సరాలు కన్యావిట్క్రిమిగా జన్మలెత్తుతాడు. ఆపైని వ్యాధుడుగా (బోయ) ఏడు జన్మలెత్తుతాడు. వరాహంగా మూడుజన్మలు కోడిగా ఏడుజన్మలు కప్పగా జలగగా కాకిగా ఏడేసి జన్మలూ ఎత్తి శుద్ధుడవుతాడు.

వ్రతాలూ ఉపవాసాలూ శ్రాద్ధకర్మలూ జరిపేరోజుల్లో క్షురకర్మ చేయించుకున్నవాడు నఖాదికుండాలలో ఆయా వ్రతాధిదేవతల ఆయుష్కాల పర్యంతం పడిఉండి యమకింకరుల దండతాడనాలు అనుభవిస్తాడు. కేశదూషితంగా పార్థివలింగం తయారుచేసి అర్చించినవాడు రేణువులన్ని సంవత్సరాలు కేశకుండంలో తల్లడిల్లి తరువాత యవనజాతిలో పుడతాడు. హరుడికోపం తేలిగ్గా చల్లారదు. శతాబ్దం తరవాత రాక్షసజన్మఎత్తిస్తాడు. పితృదేవతలకు పిండం పెట్టనివాడు తన వెంట్రుకలన్ని యేళ్ళు అస్థికుండంలో శిక్ష అనుభవిస్తాడు. ఆపైని కుత్సితుడుగా కుంటివాడుగా (కుఖంజః) ఏడు జన్మలెత్తుతాడు. మహా దారిద్ర్యం అనుభవించి శుద్ధి పొందుతాడు.

గర్భిణిగా ఉన్న భార్యను కలిసినవాడు తామ్రకుండంలో నూరేళ్ళు దుఃఖాలు అనుభవిస్తాడు. అవీర (మగడూ బిడ్డలూ లేనిది) కానీ ఋతుస్నాత కానీ వండిపెట్టిన భోజనం తిన్న శ్రోత్రియుడు తప్తలోహకుండంలో శతాబ్దంపాటు ఇడుములు పడతాడు. ఏడుజన్మలు కాకిగా ఏడుజన్మలు చాకిగా (రజక) గడిపి మహావ్రణపీడితుడై దరిద్రుడై అటుపైని పాపశుద్ధి పొందుతాడు. చర్మంతో చేసిన తొడుగులు తగిలించుకున్న



చేతులతో దేవద్రవ్యాలను స్పృశించినవాడు శతవర్షాలపాటు చర్మకుండంలో శిక్షలు అనుభవిస్తాడు. భుజించరానివి భుజించిన నైష్ఠికుడు తప్తసురాకూపంలో శతాబ్దికాలపర్యంతం పడిఉండి ఆపైని ఏడుక్షుద్ర జన్మలు ఎత్తుతాడు. అటుపైని శుద్ధి పొందుతాడు. ప్రభువును కొట్టినవాడికీ కటువుగా మాట్లాడినవాడికీ కంటకకూపనివాసమే శిక్ష. దెబ్బకు నాలుగు దెబ్బలుగా యమకింకరులు దండిస్తారు. ఆపైని గుర్రంగా ఏడు జన్మలెత్తి శుచి అవుతాడు. విషంపెట్టి జీవహింస చేసిన పాతకి విషకూపంలో వెయ్యేళ్ళు పొర్లుతాడు. అటుపైని మహావ్రణపీడితుడుగా రాజద్రోహిగా నూరుజన్మలు ఎత్తుతాడు. మరో ఏడు జన్మలు కుష్ఠురోగం అనుభవించి శుద్ధుడవుతాడు.

ఆవునుగానీ ఎద్దునుగానీ కర్రతో బాదిన వాడూ లేక బాదించినవాడూ తప్త తైలకుండంలో నాలుగు యుగాలపాటు మలమలావేగుతాడు. అటుపైని దాని శరీరంమీద ఉన్న వెంట్రుకలన్ని సంవత్సరాలపాటు భారతభూమిలో వృషభజన్మలు ఎత్తి ఎత్తి కడకు శుద్ధి పొందుతాడు. కుంతం అనే ఆయుధంతోగానీ వహ్నిలోహంతోగానీ జీవహింస చేసిన పాపాత్ములు కుంతకుండంలో అయుతవత్సరాలు నివసిస్తారు. అటుపైని వ్యాధిపీడితుడుగా ఒక జన్మగడిపి పాపం నుంచి శుద్ధిపొందుతాడు.

ద్విజుడైపుట్టి లోభంతో మాంసభక్షణ చేసినవాడూ హరికి నివేదన చెయ్యకుండా పదార్థాలను భుజించినవాడూ కృమికుండంలో స్వరోమ సమవత్సరాలు శిక్ష అనుభవించి మరు జన్మలో మ్లేచ్ఛుడవుతాడు. బ్రాహ్మణుడైపుట్టి చేయరాని పనులు చేస్తే పూయకుండనరకంలో యమదండన అనుభవిస్తాడు. అటుపైని శూద్రుడుగా ఏడు జన్మలు ఎత్తుతాడు. మహారోగి దరిద్రుడూ బధిరుడూ అవుతాడు.

కృష్ణపాదపద్మ చిహ్నాలను పడగమీద ధరించిన జాతిపామును సంహరించిన పాపాత్ముడు స్వరోమసమవత్సరాలు సర్పకుండంలో కుందుతాడు. సర్పభక్షితుడూ యమకింకర తాడితుడూ అవుతాడు. అటుపైని సర్పజన్మ ఎత్తుతాడు. ఆ తరవాత అల్పాయుష్కమానవుడై దద్రురోగపీడ అనుభవిస్తాడు. సర్పదష్టుడై మరణిస్తాడు. అప్పటికి పాపశుద్ధి అవుతుంది.

అల్పప్రాణుల్ని పట్టుకుని హింసిస్తూ వినోదించేవారు దంశకూపంలోనూ మశీకూపంలోనూ శిక్షింపబడతారు. నిరాహారులై హాహాకారాలు చేస్తూ దంశబాధలు అనుభవిస్తారు. కాళ్ళూచేతులూ కట్టేసి యమకింకరులు దండతాడనం చేస్తారు. అటుపైని క్షుద్రజంతువులై పుడతారు. ఆపైన అంగవికల మానవజన్మ ఎత్తి పాపప్రక్షాళన పొందుతారు.

తేనెటీగలను చంపి అవి దాచుకున్న తేనెను భుజించేవాడు గరళకుండంలో గరళభక్షితుడవుతాడు. ఆపైని మక్షికాజాతిలో జన్మించి పాపకర్మ విముక్తి పొందుతాడు. నిరపరాధిని దండించివా బ్రాహ్మణుడిని హింసించివా ఆ పాపానికి ఫలం వజ్రదంష్ట్రాకూపనివాసం. యమకింకరుల దెబ్బలకు హాహాకారాలు చేస్తూ



రోదిస్తూ రోమసంఖ్యాసమసంవత్సరాలు గడిపి. పందిగా ఏడు జన్మలు కాకిగా మూడు జన్మలూ ఎత్తి పాప ప్రక్షాళన చేసుకుంటాడు. ధనసంపాదనకోసం అమాయక ప్రజలను పీడించినవాడు వృశ్చికాకూపంలో పడతాడు. వృశ్చికంగా ఏడు జన్మలు ఎత్తుతాడు. అటుపైన అంగహీనుడై వ్యాధిపీడితుడై పాపశుద్ధి పొందుతాడు.

విప్రుడు శస్త్రజీవి అయినా సంధ్యావందన హరిభక్తి విహీనుడైనా స్వరోమాబ్దంగా అతడు శరకూపాదుల్లో ఘోరశిక్షలు అనుభవిస్తాడు. కారాగారంలో బంధించి ప్రజలను ప్రమత్తుడై హింసించేవాడు గోళకుండ నరకానికి పోతాడు. అది సలసలకాగే నీటితో కుతకుతలాడే బురదతో భయంకరంగా ఉంటుంది. వాడికోరలతో పెద్దపెద్ద పురుగులు ఎగురుతూ ఉంటాయి. అవి కుడుతూంటే ఆ కుండంలో ఉడుకుతాడు. హింసించిన ప్రజల శరీరాలమీద ఉన్న వెంట్రుకలన్ని సంవత్సరాలు ఈ శిక్ష అనుభవిస్తాడు. అటుపైని ప్రజలకు సేవకుడుగా జన్మించి పాపప్రక్షాళన చేసుకుంటాడు.

చెరువుల్లోనుంచి గాలికోసం ఒడ్డుకువచ్చిన మొసళ్ళనూ తాబేళ్ళనూ పట్టి హింసించేవాడు నక్రకంటక సమానాబ్దంగా నక్రకుండ మహానరకంలో హింసలు అనుభవిస్తాడు. అటుపైని తాను హింసించిన జంతువుల జాతిలో జన్మిస్తాడు.

పుణ్యక్షేత్రాలలోగానీ తీర్థస్నానసమయాలలోగానీ పరస్త్రీల గోప్యాంగాలను కాముకదృష్టితో చూసినవాడు కాకతుండకూపంలో పడి తన వెంట్రుకలన్ని సంవత్సరాలు హింసపడతాడు. కాకులు వాడి కళ్ళు పీక్కుతింటాయి. అంధుడుగా మూడుజన్మలెత్తుతాడు. బంగారాన్ని దొంగిలించినవారు మంధానకూపంలో మథింపబడతారు. యమకింకరులు కళ్ళకు గంతలుకట్టి చావబాదుతారు. తన మలమూత్రాలను తానే తింటూ స్వరోమాబ్దకాలం గడిపి అటుపైని మూడుజన్మలూ అంధుడవుతాడు. ఏడు జన్మలు మహాదారిద్ర్యం అనుభవించి స్వర్ణకారుడుగానో స్వర్ణవ్యాపారిగానో జన్మించి బంగారానికి సేవకుడవుతాడు. తామ్రచౌర్యం లోహచౌర్యం చేసినవారు ఇలాగే బీజకుండంలో శిక్ష అనుభవిస్తారు. దేవతావిగ్రహాలను దొంగిలించినా దేవద్రవ్యాన్ని అపహరించినా స్వరోమాబ్దంగా వజ్రకుండ నరకంలో వజ్రాఘాతాలు తింటూ హాహాకారాలు చేస్తూ నిరాహారులై కింకరతాడితులై కడపటికి పాపకర్మ విముక్తులవుతారు. వెండినీ గోవులనూ వస్త్రాలనూ దొంగిలించేవారు తప్తపాషాణకుండంలో శిక్షింపబడతారు. మూడు జన్మలు బొల్లిరోగంతో పీడింపబడతారు. అటుపైని శ్వేతపక్షిగా జన్మిస్తారు. కాంస్యపాత్రలను అపహరించినవాడు తీక్ష్ణపాషాణ నరకంలో హింసలు అనుభవించి గుర్రంగా ఏడు జన్మలు ఎత్తి ఆపైని పాదరోగపీడితుడై పాతకవిముక్తి పొందుతాడు.



గతిలేక వాళ్ళు అమ్ముకుని జీవించే పుంశ్చలిని దోచుకునేవాడు స్వరోమాబ్దంగా లాలకుండంలో మునుగుతాడు. అటుపైని కంటిరోగంతోనూ శూలరోగంతోనూ పీడింపబడతాడు. ఎప్పటికో పాపవిశుద్ధి పొందుతాడు. మసీజీవనం సాగించే విప్రుడు మసీకుండనరకంలో దుఃఖిస్తాడు. అటుపైని నల్లని పశువుగా మూడుజన్మలు ఎత్తుతాడు. మూడు జన్మలు నల్లగొర్రె అవుతాడు. ఆపైని తాడిచెట్టుగా పుడతాడు. కడపటికి విశుద్ధుడవుతాడు. ధాన్యాది సస్యాలనూ తాంబూలాన్నీ ఆసన తల్పాలను అపహరించేవాళ్ళు చూర్ణకుండ నరకకూపంలో యమబాధలు అనుభవిస్తారు. మేషజాతిలోనూ కుక్కుటజాతిలోనూ మూడేసి జన్మలు ఎత్తుతారు. ఆపైని వానరజన్మ. కాసవ్యాధిపీడ. దారిద్ర్యం. అల్పాయుర్దాయం. వంశహాని. చివరికి పాపవిశుద్ధి. విప్రుల సొమ్ము హరించి (గానుగ) చక్రం చేయించుకున్నవాడు చక్రకుండనరకంలో శతాబ్దకాలం హింసలు అనుభవిస్తాడు. అటుపైని తైలకారుడుగా మూడు జన్మలు ఎత్తుతాడు. వ్యాధిపీడితుడూ వంశహీనుడూ అయ్యి పాపవిమోచనం పొందుతాడు. విప్రుల గో ధనాల విషయంలో వంకరగా వ్యవహరిస్తే వక్రకుండ నరకానికి పోతారు. ఆపైని వంకరటింకర అవయవాలతో పుడతారు. ఇలా ఏడు జన్మలయ్యాక గ్రద్దగా పందిగా పిల్లిగా నెమలిగా మూడు జన్మలు ఎత్తుతారు. అప్పటికి గానీ పాపభారం తరగదు. బ్రాహ్మణుడై పుట్టి కూర్మమాంసం తింటే కూర్మకుండంలో శతాబ్దంపాటు కూర్మాలతో భక్షింపబడతాడు. మూడు కూర్మజన్మలెత్తుతాడు. పందిగా బిడాలంగా నెమలిగా మూడేసి జన్మలు ఎత్తి క్రమంగా పాపపంకిలం వదిలించుకుంటాడు. నెయ్యిగానీ నూనెగానీ అపహరించినవాళ్ళు జ్వాలాకుండంలోనూ భస్మకుండంలోనూ నరకయాతన అనుభవిస్తారు. మత్స్యమూషక జన్మలు ఏడేసి ఎత్తి పాపభారం తొలగించుకుంటారు. సుగంధ ద్రవ్యాపహర్తలు దగ్ధకుండనరకంలో దివారాత్రాలు దగ్ధులవుతారు. అటుపైని దుర్గంధికులుగా ఏడు జన్మలెత్తుతారు. మృగనాభిగా (కస్తూరి) మూడు జన్మలు తప్పవు. ఏడు మంథాన జన్మలూ తప్పవు. అప్పటికి పాపఫలానుభవం పూర్తి అవుతుంది. బలప్రయోగంతోగానీ మోసం చేసిగానీ ఇతరుల పిత్రార్జితభూమిని కాజేసినవాళ్ళు తప్తసూచీకూపంలో పడిదగ్ధులవుతారు. ఏడు మన్వంతరాలు ఈ నరకం అనుభవించి అరవైవేల సంవత్సరాలు కృమికీటకమై తిరిగి స్వజాతిలో జన్మిస్తారు. పాపకర్మల ఫలంగా నరకయాతనలు అనుభవించి పరిశుద్ధులై స్వీయజాతిలో జన్మించాక శుభకర్మలు ఆచరించాలి. శుభఫలాలు దక్కుతాయి. మళ్ళీ పాపాలే చేస్తే ఇలాగే నరకయాతనలు తప్పవు.

*(అధ్యాయం - 33, శ్లోకాలు - 126)*



సావిత్రీ ! ధనలోభంతో ఎదుటివాడి శిరస్సును కత్తితో నరికిన హంతకుడు అసిపత్రనరకంలో యాతనపడతాడు. పధ్నాలుగుమంది ఇంద్రులు మారేటంతకాలం అందులో కత్తికోత అనుభవిస్తాడు. బ్రాహ్మణుడిని చంపినవాడు శతమన్వంతరాలు అదే నరకంలో శిక్షింపబడతాడు. అటుపైని శతసూకరజన్మలూ సప్తకుక్కుట జన్మలూ సప్తసృగాల జన్మలూ సప్తవ్యాఘ్రజన్మలూ మూడు వృకజన్మలూ సప్తమండూక జన్మలూ ఎత్తుతాడు. అటుపైని ఒక మహిష జన్మఎత్తి పాపవిముక్తి పొందుతాడు. పల్లెలూ పట్టణాలూ తగులబెట్టేవారు క్షురధారానరకకూపంలో మూడు యుగాలపాటు యమబాధలు పడతారు. తరవాత ప్రేతాకారంలో మరిన్ని సంవత్సరాలు తిరుగుతారు. ఆపైని ఏడు జన్మలు మలభక్షకులై ఏడు జన్మలు కపోతాలై ఏడు జన్మలు శూలవ్యాధిపీడితులై ఏడు జన్మలు కుష్ఠవ్యాధి అనుభవించి శుద్ధిపొందుతారు. పరనిందాపరుడూ పరదోష ప్రచారకుడూ దేవబ్రాహ్మణ నిందకుడూ సూచీముఖ నరకంలో యుగత్రయకాలం వేదనలు అనుభవిస్తారు. వృశ్చిక వజ్రకీట భస్మకీటజన్మలు ఏడేసి ఎత్తి మానవుడై మహావ్యాధి పీడితుడై మరణించి శుద్ధిపొందుతాడు. గోడలకు కన్నంవేసి తలుపులు బద్దలు చేసి ఇళ్ళల్లో చొరబడి వస్తువుల్ని దొంగిలించేవారు గోకాముఖనరకంలో మూడుయుగాలు యమకింకర బాధలు అనుభవిస్తారు. గిత్తలూ గొర్రెపొటేళ్ళూ మేకపోతులూ కొమ్ములతో కుమ్ముతోంటే గిట్టలతో మట్టగిస్తోంటే హాహాకారాలు చేస్తారు. ఆపైని వ్యాధిగ్రస్తమైన ఎద్దుగా ఏడుజన్మలూ మేషజాతిలో మూడుజన్మలూ ఛాగజాతిలో మూడు జన్మలూ ఎత్తి మానవుడుగా దారిద్ర్యం నిత్యరోగం భార్యావియోగం బంధువియోగం అన్నీ అనుభవించి పాపకర్మ విముక్తుడవుతాడు. ఏ రకమైన ద్రవ్యాన్ని ఎవరినుంచి కాజేసినా చోరుడు నక్రముఖ కుండంలో నలిగిపోవలసిందే. మూడు శతాబ్దాలపాటు యమభటుల దండతాడనలు తినవలసిందే. ఆపైని రోగిష్ఠి ఎద్దుగా ఏడు జన్మలు దుఃఖించి మానవుడై మహారోగిగా అందరితోనూ ఏవగింపబడి కడపటికి పరిశుద్ధి పొందుతాడు. ఏనుగుల్నీ గుర్రాల్నీ పశువుల్నీ చంపినవాడు గజదంశకూపంలో మూడుయుగాలపాటు యాతనలు అనుభవిస్తాడు. వాగదంతాలతో యమకింకరులు కుళ్ళబొడుస్తుంటే కుయ్యోం మొర్రోమని పెడబొబ్బలు పెడతాడు. అటుపైని అయా జంతువులుగా మూడేసి జన్మలు ఎత్తుతాడు. నరుడై శుచి అవుతాడు.

దప్పికతో వచ్చి నీళ్ళు తాగుతున్న గోవును తరిమివేసిన మానవుడు గోముఖనరకంలోపడి పురుగులతో కాగుతున్న నీళ్ళల్లో మగ్గుతాడు. మన్వంతరకాలం ఈ శిక్ష అనుభవిస్తాడు. నరజన్మ ఎత్తి మహారోగపీడతో మరణించి పాపప్రక్షాళన పొందుతాడు. గోహత్య బ్రాహ్మణహత్య స్త్రీహత్య భిక్షుహత్య భ్రూణహత్య (గర్భస్రావం) చేసినవారూ పొందుకోరరాని స్త్రీని పొందినవారూ కుంభీపాకనరకంలో చతుర్దశేంద్రసమకాలం హింసలు అనుభవిస్తారు. యమదూతలు నలిపేస్తారు. నిప్పుల్లో తోస్తారు. ఇనపముళ్ళ పొదల్లోకి విసురుతారు. కాగుతున్న నూనెలో ముంచుతారు. సలసలలాడుతున్న తామ్ర లోహద్రవంలో వేపుతారు. ఇన్నీ అనుభవించి నూరు గృధ్రజన్మలూ నూరు పందిజన్మలూ ఏడు కాకిజన్మలూ ఏడు సర్పజన్మలూ ఎత్తి అరవైవేల సంవత్సరాలపాటు విట్క్రిమిగా జీవించి ఆపైని ఎద్దుగా ఏడుజన్మలు ఎత్తి మనిషైపుట్టి దరిద్రుడై కుష్ఠరోగపీడితుడై అప్పటికి పాపభారం తొలగించుకుంటాడు.



## ◆ బ్రహ్మహత్యా సమానాలు ◆

మానినీమణీ ! ఇక్కడ మరొక విశేషం నువ్వు తెలుసుకోవాలి. బ్రహ్మహత్య అంటే బ్రాహ్మణుడిని చంపడం అనేకాదు ఇంకా చాలా రకాలున్నాయి. శ్రీకృష్ణాది దేవతలపట్ల భేదబుద్ధిని పాటించి ఆదరానాదరాలు చూపిస్తే అది బ్రహ్మహత్యా సదృశం. అలాగే ఇష్టదైవమూ గురువూ తల్లిదండ్రులు - వీరిపట్ల హెచ్చుతగ్గులు పాటించినా దైవభక్తులపట్ల భేదబుద్ధిని చూపించినా విప్రపాదోదక సాలగ్రామ శిలోదకాలమధ్య భేదం పాటించినా హరిహర నైవేద్యాల మధ్య తారతమ్యం పరిగణించినా హరిహరులమధ్య భేదబుద్ధి పాటించినా శక్తిభక్తులనూ శక్తి శాస్త్రాలనూ ద్వేషించినా పితృదేవతార్చనను పరిత్యజించినా హరినీ హరిభక్తులనీ నిందించినా అర్చించకపోయినా సర్వశక్తిస్వరూప మహాదేవిని నిందించినా కృష్ణాష్టమి శ్రీరామనవమి శివరాత్రి ఏకాదశి (ముక్కోటి) రవివారవ్రతం - ఈ అయిదు పర్వదినాలనూ జరపకపోయినా అంబువాచీ భూఖననం చేసినా (ప్రతినెలా ఆర్ద్రానక్షత్రంలో ప్రథమపాదంనుంచి మూడురోజులపాటు భూదేవి రజస్వలగా ఉంటుంది. అంబువాచి అంటారు. ఆ సమయంలో భూమిని దున్నకూడదని ధర్మశాస్త్రం.) గురు మాతాపితృభార్యాపుత్రుల్ని పోషించకపోయినా అవివాహితుడుగా సంతానం పొందినా బ్రహ్మహత్య చేసినట్టే. ఇదే ఆతిదేశిక బ్రహ్మహత్య.

గోవును కొట్టినా కొడుతున్నవారిని అడ్డుకోకపోయినా రక్షించకపోయినా గోబ్రాహ్మణులకు మధ్యనుంచి నడిచినా గోవులకు ఉచ్ఛిష్టం పెట్టినా వృషవాహకుడి ఆహారం కాజేసినా అగ్నినీ గోవునూ కాలితో తన్నినా కాళ్ళుకడుక్కోకుండా ఇంటిలోకి వచ్చినా తడికాళ్ళతో భోజనం చేసినా నిద్రించినా సూర్యోదయకాలంలో భుజించినా అవీరాన్న వేశ్యాన్నాలను తిన్నా యోనిజీవ్యుడైనా (తార్పుడుగాడు) సంధ్యావందనం ఎగ్గొట్టినా భర్తకూ దేవుడికీ మధ్య ఇల్లాలు భేదం పాటించినా మగడు ఇల్లాలిని కొట్టినా దేవతాప్రసాదాలను పంచిపెట్టకపోయినా అన్నింటికీ నాస్తినాస్తి అన్నా దేవగురు మిత్రద్రోహాలు చేసినా దేవ - గురు - పితృవందనం చేయకపోయినా, నమస్కరించినవాడికి ఆశీస్సు విద్యార్థికి చదువూ అందించకపోయినా అన్నపుష్పాది పవిత్ర వస్తువులను దాటినా గోహత్య చేసినట్టే. దీన్నే ఆతిదేశిక గోహత్య అంటారు.

పురుషుడికి పరిణయమాడిన స్త్రీమాత్రమే గమ్య. తక్కిన వనితలందరూ అగమ్యలు. అంటే పొందుకోరరానివారు. అగమ్యాగమనం నూరు బ్రహ్మహత్యలతో సమానం. కుంభీపాక నరకమే శిక్ష. అపరిశుద్ధుడుగా సంధ్యవార్చినా అసలు సంధ్యావందనమే చెయ్యకపోయినా అతడు సంధ్యాహీనుడు అవుతాడు. నరకానికి పోతాడు. వైష్ణవ శైవ శాక్త సౌర గాణప మహామంత్రాలలో ఏదో ఒకటి ఉపదేశంగా పొంది ఉపాసించాలి. అహంకరించి ఏ మంత్రోపదేశమూ పొందనివాడు అదీక్షితుడు. ఇతడికీ నరకం తప్పదు. పుణ్యక్షేత్రాలలో తీర్థాలలో అడిగి దానాలు పట్టేవాడు తీర్థప్రతిగ్రాహి. దేవుడిపేరు చెప్పి



పొట్టపోసుకునేవాడు దేవలుడు. సంధ్యాపూజాహీనుడిని ప్రమత్తుడు పతితుడు అంటారు. వీరూ వీరితోపాటు గ్రామయాజీ సూపకారుడూ (విప్రుడై ఇతరుల ఇంట భుజించేవాడు) కుంభీపాక నరకంలో పడతారు. ఇంకా ఎవరెవరు ఏయే కుండాలలో వెళ్ళిపడతారో చెబుతాను - సాధ్వీ ! ఆలకించు.

*(అధ్యాయం - 34, శ్లోకాలు - 92)*

సావిత్రీ ! దేవతలను సేవించనిదే కర్మవినాశం కానేకాదు. సత్కర్మలు స్వర్గసుఖాలకూ జీవశుద్ధికీ దుష్కర్మలు నరకయాతనలకూ దేహశుద్ధికీ హేతువులు.

దేవసేవాం వినా సాధ్వి న భవేత్కర్మకృంతనమ్ ।
శుద్ధకర్మ శుద్ధబీజం నరకశ్చ కుకర్మణా ॥ (35 - 1)

వేశ్యాధనం అనుభవించేవాడూ వేశ్యాగమనం చేసిన బ్రాహ్మణుడూ కాలసూత్ర నరకకూపంలో శతవర్షాలు కష్టాలు అనుభవించి పై జన్మలో రోగపీడితుడై అటుపైని శుచి అవుతాడు. ప్రస్తావన వచ్చింది కనక స్త్రీలలో భేదాలు చెబుతాను. విను. ఒకడిని అగ్నిసాక్షిగా పరిణయమాడి త్రికరణశుద్ధిగా అతడితో జీవించేది పతివ్రత. రెండవ వాడితో సంపర్కం పెట్టుకుంటే కులట. ముగ్గురితోనైతే ధర్షిణి. నలుగురితో పుంశ్చలి. అయిదుగురితో వేశ్య. ఆర్గురితో పుంగి. ఏడుగురూ ఎనమండుగురూ ఇంకా ఆపైని పురుషులతో సంపర్కం చేస్తే మహావేశ్య. సర్వజాతుల్లోనూ ఇది అస్పృశ్య.

పతివ్రతా చైకపతౌ ద్వితీయే కులటా స్మృతా ।
తృతీయే ధర్షిణీ జ్ఞేయా చతుర్థే పుంశ్చలీత్యపి ॥
వేశ్యా చ పంచమే షష్ఠే పుంగీ చ సప్తమేఽష్టమే ।
తత ఊర్ధ్వం మహావేశ్యా సాऽస్పృశ్యా సర్వజాతిషు ॥ (35 - 5)

కులట నుంచి మహావేశ్యవరకూ ఎవరిని పొందినా ద్విజుడు కాలసూత్ర నరకానికి పోవడం తథ్యం. అటుపైని చేప కడుపున పుడతాడు. కులటాగామి ఒక శతాబ్దమూ ధర్షిణీగామి నాలుగు శతాబ్దాలూ పుంశ్చలీగామి ఆరుశతాబ్దాలూ వేశ్యాగామి ఎనిమిది శతాబ్దాలూ పుంగీగామి పది శతాబ్దాలూ ఆ నరకంలో ఉంటాడు. మహావేశ్యాగామి నూరుశతాబ్దాలు నరకయాతన అనుభవిస్తాడు. అలాగే వీరు వరసగా - తిత్తిరి - వాయస - కోకిల - వృక - సూకర - శాల్మలీతరు జన్మలు ఏడేసి ఎత్తుతారు.

సూర్యచంద్రగ్రహణాల రోజున జ్ఞానహీనుడై భోజనం చేసినవాడు అరుంతుదనరకంలో మెతుక్కి ఏడాదిగా దుఃఖాలు అనుభవిస్తాడు. అటుపైని ఉదరరోగపీడితుడుగా జన్మిస్తాడు. తనువంతా గుల్మాలతో (పుండ్లు) గుడ్డివాడుగా దంతహీనుడుగా దురపిల్లుతాడు. కడకు కర్మఫలం పూర్తయ్యి శుచి అవుతాడు.



నిశ్చయతాంబూలాలు పుచ్చుకుని మరొకడికి కన్యాదానం చేసినవాడు పాంశుకుండనరకానికి పోతాడు. పాంశువులే తింటూ నూరేళ్ళు తల్లడిల్లుతాడు. వీడిని యమదూతలు శరతల్పంమీద పార్లిస్తారు. పార్థివలింగం చేసి భక్తితో అర్చించని విప్రుడు శివుడి కోపానికి గురిఅవుతాడు. శూలప్రోతనరకంలో శతాబ్దంపాటు క్లేశాలు కుడిచి శ్వాపదంగా ఏడు జన్మలెత్తుతాడు. అటుపైని దేవలుడుగా ఏడుజన్మలు ఎత్తి కర్మఫలానుభవం పూర్తిచేసుకుంటాడు. విప్రుణ్ణి భయపెట్టినవాడూ అతడి దేవతార్చనాది సత్కర్మలకు అడ్డుతగిలినవాడూ ప్రకంపననరకంలో విప్రరోమాబ్ద పర్యంతం విలపిస్తాడు. అధికారివైపు ధిక్కారంగా కోపంగా చూసినవాడూ కటువుగా ఎదిరించి పలికినవాడూ సోల్ముకనరకంలో పడతాడు. అక్కడ నా కింకరులు రోజూ అతడి నోటిలో ఉల్కలను పడవేస్తుంటారు. వాడి శరీరంమీద వెంట్రుకలన్ని సంవత్సరాలపాటు రోజూ దండతాడనలు రుచిచూస్తూ యాతనలు పడతాడు. అటుపైని ఏడు జన్మలు ఆడదిగా పుట్టి వితంతువు అవుతాడు. అప్పటికి గానీ కర్మఫలానుభవం పూర్తికాదు.

ఇతరుడితో సంపర్కం పెట్టుకున్న బ్రాహ్మణి అంధకూపనరకానికి పోతుంది. పధ్నాలుగుమంది ఇంద్రులు మారేదాకా యమకింకరుల బాధలు అనుభవిస్తుంది. అటుపైని కాకిగా వెయ్యి జన్మలు ఎత్తుతుంది. పందిగా నూరుజన్మలు సృగాలిగా కుక్కుటిగా పారావతిగా వానరిగా నూరేసీ ఏడేసీ జన్మలు ఎత్తి కడపటికి మళ్ళీ మానవిగా రజక గృహంలో పుట్టి క్షయరోగ పీడితురాలై పుంశ్చలిగా మారి కుష్ఠవ్యాధికిలోనై మరణిస్తుంది. అప్పటికి దుష్కర్మఫలం పూర్తి అవుతుంది. వేశ్యలకు వేధననరకం పుంగికి దండతాడననరకం ధర్షిణికి జలరంధ్రనరకం కులటకు దేహచూర్ణికానరకం స్వైరిణికి (మహావేశ్య) దళనకూపం ధృష్టకు (పతివంచక) శోషణనరకం తప్పవు. శతాబ్దాలపాటు ఈ నరకకుండాల్లో వారు యమయాతనలు పడతారు. మన్వంతరకాలం విణ్మూత్రభక్షణ చేస్తారు. ఆపైని విట్క్రిమిగా (మలక్రిమి) లక్షసంవత్సరాలు జన్మలెత్తితేగానీ కర్మవిశుద్ధి లభించదు. సవర్ణపారదారికులు (ఏకులంవాడు ఆ కులం పరకాంతతో) కషాయనరకకుండంలో పొర్లుతారు. కషాయ తప్తోదకం తాగుతూ నూరేళ్ళు యాతనపడతారు. అనులోమ విలోమ పారదారికులు (అగ్రవర్ణ నిమ్నవర్ణ పరకాంతా సంగమం) స్త్రీపురుషులిద్దరూ శూర్పకూపంలో శూర్పకారకృమి దష్టులవుతారు. యమదూతలు కాగిన మూత్రం తాగిస్తారు. దండతాడనలు సరేసరి. అటుపైని వరాహంగా ఛాగలంగా ఏడేసి జన్మలు ఎత్తి కర్మ విశుద్ధి పొందాలి.

తులసీదళాన్ని చేతితో పట్టుకుని ప్రతిజ్ఞచేసి మాట తప్పినవాడు జ్వాలాముఖ నరకకూపంలోనూ గంగాజలం గోవు విప్రుడు సాక్షిగా ఆడితప్పినవాడూ దేవప్రతిమ ఎదుట శపథంచేసి జారిపోయినవాడూ కుడిచేతిలో కుడిచెయ్యివేసి ఆడితప్పినవాడూ దేవాలయంలో మాటతప్పినవాడూ - వీళ్ళంతా అదే నరకకూపంలో మటమటలాడతారు. మిత్రద్రోహి కృతఘ్నుడు విశ్వాసఘాతకుడూ కూటసాక్ష్యం చెప్పేవాడూ వీళ్ళందరికీ జ్వాలాముఖ నరకకూపమే గతి. చతుర్దశేంద్రకాల పర్యంతం శిక్ష అనుభవించి మ్లేచ్ఛ



విట్కృమి బ్రహ్మకృమి సర్ప దేవల వ్యాఘ్ర నకుల గండక మండూక జన్మలు ఒక్కొక్కరూ ఏడేసిఎత్తి ఎప్పటికో పరిశుద్ధులవుతారు.

మిత్రద్రోహీ కృతఘ్నశ్చ యశ్చ విశ్వాసఘాతకః ।
మిథ్యాసాక్ష్యప్రదశ్చైవ స చ జ్వాలాముఖం వ్రజేత్ ॥ (35 - 40)
ఏతే తత్ర వసంత్యేవ యావదింద్రాశ్చతుర్దశ ॥

నిత్యనైమిత్తిక క్రియలకు ఎగనామంపెట్టి వేదవాక్యాలను పరిహసించి వ్రతోపవాసాలను పరిహరించి పెద్దలమాటలను పెడచెవినిబెట్టి చెడు తిరుగుళ్ళు మరిగిన విప్రుడు ధూమ్రాంధకూపంలో శతాబ్దంపాటు యాతనపడి అటూ ఇటూ ఏడుతరాలుచెడి జలజంతువుగా నూరు జన్మలెత్తి కడపటికి శుచి కాగలుగుతాడు. దేవబ్రాహ్మణ పరిహాసకుడుకూడా ఇలాగే అదే నరకయాతన అనుభవిస్తాడు. వీడివంశంలో అటు పదితరాలకూ ఇటు పదితరాలకూ వీడిపాపం అంటుకుంటుంది. అటుపైని మూషకజాతిలో ఏడు జన్మలు ఎత్తుతాడు. పక్షిగా క్రిమిగా చెట్టుగా పశువుగా అనేక జన్మలెత్తి మనిషి అవుతాడు.

బ్రాహ్మణుడు దైవజ్ఞజీవి వైద్యజీవి చికిత్సకుడు లాక్షాలోహాది వ్యాపారి రసాదివిక్రయి అయినట్టయితే నాగవేష్టనరకంలో పడి సర్పవేష్టితుడవుతాడు. అటుపైని నానావిధ పక్షిజాతుల్లో పుట్టి కడపటికి నరజన్మ పొందుతాడు. అప్పుడు గణకుడుగా వైద్యుడుగా గోపాలుడుగా కర్మకారుడుగా రంగకారుడుగా ఏడేసి జన్మలూ ఎత్తి శుచి అవుతాడు.

సాధ్వీ ! ప్రసిద్ధ నరకకుండాలగురించీ వాటిలో పడేవారి గురించీ యాతనల గురించీ పునర్జన్మల గురించీ వివరంగా చెప్పాను. ఇవి కాక ఇంకా అప్రసిద్ధ నరకకూపాలు అనేకం ఉన్నాయి. అవి చిన్నచిన్నవి. వాటిలో పడే పాతకులూ ఉన్నారు. దుష్కర్మఫలాలు అనుభవించి అనేకజన్మలు దురవస్థలనుభవించి పరిశుద్ధులవుతారు. నేను ప్రత్యక్షంగా ఎరుగుదును కనక వాటికి అధిపతిని కనక స్పష్టంగా తెలియపరిచాను. ఇంకా ఏమి తెలుసుకోవాలనుకుంటున్నావ్ - అని ముగించాడు యమధర్మరాజు.

*(అధ్యాయం - 35, శ్లోకాలు - 60)*

## ◆ నరక నివారణ ◆

పరేతరాజా ! మహాభాగా ! వేదవేదాంగపారగా ! వేదశాస్త్ర పురాణేతిహాససారమూ సకలప్రియమూ సర్వసమ్మతమూ కర్మబంధ విచ్ఛేదకమూ ప్రశస్తమూ సుఖప్రదమూ సర్వసిద్ధిదాయకమూ సర్వమంగళ కారకమూ దుఃఖ భయ నిరాసకమూ యమకుండ దర్శన పతన నివారకమూ అయిన సత్కర్మ ఏదైనా ఉంటే అదేమిటో తెలియజెయ్యి. ఆచరించి అందరూ ముక్తులవుతారు.



నరకకుండాలగురించి చెప్పావు. వాటి ఆకృతులు ఏమిటి ? వేటితో నిర్మిస్తారు ? ఏ పాపాత్ములు ఏ రూపాలతో వాటిలో ఉంటారు ? భూలోకంలో మరణించాక దేహం భస్మమైపోతుంది. మట్టిలో కలిసిపోతుంది. ఆపైని ఏ రూపంతో లోకాంతరాలకు వెళ్ళి శుభాశుభకర్మలను అనుభవించడం జరుగుతుంది ? అంతంతకాలం నరకయాతనలు అనుభవిస్తొంటే దేహం నశించకుండా ఎలా ఉంటుంది ? అసలు ఆ దేహం ఏమిటి ? ఇవన్నీ నాలో కలుగుతున్న సందేహాలు. దయచేసి సమాధానాలు చెప్పు.

నారదా ! సావిత్రీదేవి ఇలా అడిగేసరికి యముడు ఒక్కసారి మనస్సులో మళ్ళీ హరిని స్మరించి కర్మబంధవిమోచకమైన రహస్యాన్ని వివరించనారంభించాడు - అంటూ నారాయణమహర్షి కొనసాగించాడు.

పతివ్రతా తిలకమా ! నీ మొదటి ప్రశ్నకు సమాధానం చెప్పడం చాలా తేలిక. అటువంటి తరణోపాయం ఒక్కటే ఒక్కటి - పంచదేవార్చన. పంచదేవార్చకులకు నరకకుండాలు కలలోకికూడా రావు. దేవీభక్తులు నరకం దరిదాపులకైనా రారు. శ్రీహరిని నిత్యం అర్చించేవారు యమలోకంవైపు చూడరు. ముప్పొద్దులా సంధ్యవారుస్తూ శుద్ధాచారులై దేవిని ఆరాధించేవారు యమదూతలకు భయపడవలసిన అవసరంలేదు. మా కింకరులు పొరపాటునకూడా వారి దరిదాపులకైనా వెళ్ళరు. ఒకవేళ తెలియక వెళ్ళబోతే నేను వెంటనే వారిస్తాను. శివభక్తులను చూస్తే మావాళ్ళు భయపడతారు. గరుడుణ్ణి చూసిన పాముల్లాగా పారిపోతారు. దేవీమంత్రోపాసకుల పేర్లను చిత్రగుప్తుడు చిట్టాలోంచి నఖలేఖినితో తొలగిస్తాడు. కొట్టివేస్తాడు.

దేవీమంత్రోపాసకానాం నామ్నాంచైవ నికృంతనమ్ ।
కరోతి నఖలేఖిన్యా చిత్రగుప్తశ్చ భీతవత్ ॥ (36 - 21)

అంతేకాదు వారు ఊర్ధ్వలోకానికి వస్తున్నప్పుడు ఎదురు వెళ్ళి మధుపర్కాలు అందిస్తాడు. వారంతా యమలోకంపైనుంచి లంఘించి బ్రహ్మలోకం చేరుకుంటారు. దేవీభక్తుల స్పర్శతో దురితాలు నశిస్తాయి. వారి వంశాలలో అటూ ఇటూ వెయ్యి తరాలు భాగ్యవంతులవుతారు. అరిషడ్వర్గాలు భయపడి పారిపోతాయి. జరామృత్యురోగశోకభయాదులు దరిదాపులకి రావు. పంచదేవార్చకులకి సకలకర్మలూ సకలకాలాలూ హర్షభోగ ప్రీతిదాయకాలుగానే ఉంటాయి. ఇక దేహస్వరూపం వివరిస్తున్నాను తెలుసుకో-

స్థూలశరీరం పంచభూతాత్మకం. అది కృత్రిమదేహం. కనక నశ్వరం - బూడిద అయిపోతుంది. మట్టిలో కలిసిపోతుంది. పంచభూతాలూ పంచభూతాలలో కలిసిపోతాయి. అటుపైని అంగుష్ఠప్రమాణంలో జీవుడు మిగులుతాడు. ఇది సూక్ష్మదేహం. దీనితోనే శుభాశుభకర్మఫలాలు అనుభవిస్తాడు. ఇది నశించదు. శిథిలంకాదు. అగ్నిదగ్ధంకాదు. శస్త్రాస్త్రాలకు లొంగదు. తప్తద్రవ తప్తతైల తప్తపాషాణాది కూపాల్లో ఎంతకాలం ఎన్ని శిక్షలు వేసినా చెక్కుచెదరదు. దుఃఖాలనుమాత్రం అనుభవిస్తూంటుంది.

*(అధ్యాయం - 36, శ్లోకాలు - 33)*



## ◆ నరకకూప వర్ణన ◆

నరకకూపాలగురించి అడిగావుకదూ ! విను. ప్రతికుండమూ వర్తులాకారంలో పూర్ణచంద్రమండలంలాగా ఉంటుంది. లోతుగా ఉంటుంది. రకరకాల కఠినశిలలు గోడలకు తాపడం చేసి ఉంటాయి. ప్రళయందాకా శిథిలంకావు. ఈశ్వరుడు ఇచ్ఛామాత్రంగా వీటిని సృష్టించాడు. పాతకులను క్లేశపెట్టడానికే ఇవి ఆవిర్భవించాయి. మండుతున్న అగ్నిగోళంలాగా పదిబారల మంటలతో క్రోశవిస్తీర్ణంగా ఉంటుంది వహ్నికుండం. పాపాత్ముల హాహాకారాలు వినిపిస్తుంటాయి. కానీ కంటికి మంటలు తప్ప ఏమీ కనిపించదు. యమదూతలు కావలి తిరుగుతూ మధ్యమధ్య పాపులను పొడుస్తూ విధినిర్వహణ చేస్తుంటారు. మరుగుతున్న నీళ్ళతో క్రూరజల జంతువులతో భీకర కాకారవాలతో క్రోశార్ధ విస్తీర్ణమై తప్తక్షారోదకకుండం పాపిజన సంకులమై ఉంటుంది. త్రాహి త్రాహి అనే రోదనలూ మారుమోగుతుంటాయి. యమకింకరులు నిర్దాక్షిణ్యంగా దండాలతో శూలాలతో పొడుస్తుంటారు. పైకి తేలినవాడినల్లా లోపలికి కుక్కుతుంటారు. క్రోశ వైశాల్యంగా రకరకాల విట్కుండాలు ఉన్నాయి. అన్నీ మలపిచ్ఛిలాలు. పురుగులు లుకలుకలాడుతుంటాయి. మహాపాతకులు వాటిలో పొర్లుతూ మలభక్షణ చేస్తూ క్రిమిదష్టులై హాహాకారాలు చేస్తుంటారు. తపతపా కొట్టుకుంటుంటారు. రక్ష మాం - రక్ష మాం అనే అరుపులు గుండెలు పిండేస్తుంటాయి. కానీ మా దూతలకు జాలి అనేదే తెలియదు. అరిచినకొద్దీ పొడుస్తుంటారు.

శ్లేష్మకుండాలు శ్లేష్మ - శ్లేష్మకీటక పరిపుష్టాలు. క్రోశార్ధ వైశాల్యంతో గరకుండం. గరకీటాలు కిటకిటలాడుతుంటాయి. వాటికోరలు వజ్రకఠినాలు. వాటి కన్నులు మలపూరితాలు. అవి కుడుతూంటే పాపాత్ములకు దుష్కర్మల ఫలం తెలిసివస్తుంది. ఇటువంటివే వసాకుండాలు. శుక్లకుండం వీటన్నింటికన్నా లోతులో కైవారంలో పెద్దది. శుక్ల - శుక్ల కీటక పరిపూర్ణం. రక్తవర్ణంలో ఉంటుంది. దుర్గంధభూయిష్ఠం. దీనికి పాపాత్ముల రద్దీ ఎక్కువ. వలవలా ఏడుస్తూ భరించలేక భగవంతుణ్ణి తలుచుకుంటూ ఉంటారు. దుష్కర్మఫలభోగం పూర్తి అయ్యేదాకా మా దూతలు ఊరుకోరు. బాదుతూనే ఉంటారు. గాత్రమలకూపం నాల్గింతలు పెద్దది. నిత్యం పాతకిసంకులంగా ఉంటుంది. మజ్జాకుండం ఇలాంటిదే. వీటిలో కన్యావిక్రయ మహాపాపిష్టులు పాహి పాహి నినాదాలు చేస్తుంటారు. పరుషభాషణులూ నిందాపరాయణులూ చాడీలకోర్లూ శిక్షలు అనుభవించే కర్ణవిట్కూపాలు ఇంకా పెద్దవి. నఖాదికూపాలలో చీరుకుపోతున్న శరీరాలతో నెత్తురులోడుతూ హాహాకారాలు చేస్తూ పాపాత్ములు కనపడుతుంటారు. దీనంగా కన్నీరుకారుస్తూ రక్ష - రక్ష అని పెడబొబ్బలు పెడుతుంటారు. ప్రతప్త లోహకూపాలన్నీ గవ్యూతివిస్తీర్ణాలు. వాటిలో ప్రతప్తలోహప్రతిమలుంటాయి. పాపాత్ములు వాటిని కౌగిలించుకోవాలి. యమదూతలు తన్ని ఆ పని చేయిస్తుంటారు. చుర్రున కాలుతూంటే మలమల మాడిపోతారు. ఆయాలోహాలు కరిగి ద్రవరూపంలో ఎర్రగా జాలువారుతుంటాయి. ఆ చుక్కలు మీదపడుతుంటే హాహాకారాలు మిన్నుముడతాయి.



ధ్వాంతకుండం ద్విగవ్యూతి విస్తృతం. చర్మకుండ తప్తసురాకుండాలు కైవారంలో కొంచెం చిన్నవి. శాల్మలీకుండంనిండా వృక్షకంటకాలే. యమభటులు పాపులను పట్టి వీటిలోకి విసురుతుంటారు. ముళ్ళు గుచ్చుకుని ఆర్తనాదాలు ముల్లోకాలకీ వినిపిస్తాయి. దాహం దాహం అనే అరుపులు మంట మంట అనే అరుపులు అయ్యో అమ్మో కుయ్యో మొర్రోలు ఎటుచూసినా ఇవే మారుమ్రోగుతుంటాయి. కీటకాల ఆనందనృత్యాలూ కాకుల కోలాహలాలూ సర్పజాతుల హిస్సాకారాలు క్రూరజంతువుల భీషణ ధ్వనులూ - యమలోకం అతిభయంకరం సుమా ! ఒకవైపున శస్త్రతల్పాలు. మరోవైపున శరతల్పాలు. వాటిమధ్య పూయకుండాలు. తాడిచెట్టంత పొడుగుండే సర్పాలతో నిండిన సర్పకుండాలు. ఆపైని మశాదికుండత్రయం. ఇవన్నీ క్రోశార్ధవిస్తీర్ణాలే. కాళ్ళూ చేతులూ బంధింపబడి సర్పదష్టులై వృశ్చిక కుండంలో వృశ్చికదష్టులై శరకుండంలో శరక్షతగాత్రులై గోళకుండంలో కీటకభక్షితులై దారుణంగా విలపించి గిలగిలా తన్నుకుంటున్న మహాపాపులు కాపాడండి కాపాడండి అని అరుస్తుంటారు. నక్రకుండ మూత్రకుండ మంథానకుండాలు అర్ధక్రోశ విస్తృతాలు. బీజకుండం నూరుధనుస్సుల లోతు. ధ్వాంత కుండమూ అంతే లోతు. పాషాణకుండం లోతు రెండింతలు ఎక్కువ. వైశాల్యమూ ఎక్కువే. చూర్ణకుండం క్రోశమాత్ర విస్తీర్ణం. ధనుశ్శతం లోతు. చక్రకుండంలో అన్నివైపులా పళ్ళచక్రాలు పదహారు పూటిలతో వేగంగా నిరంతరాయంగా తిరుగుతుంటాయి. వాటిమధ్య పడి చెరుకుగడల్లాగా నలిగి పిప్పి పిప్పి అయిపోతున్న జీవుల సూక్ష్మదేహాలు చేసే హాహాకారాలకు సకలవిశ్వాలూ కంపిస్తాయి.

అసిపత్ర సూచీకుండాలు విస్తీర్ణంలో సమానాలు. ధగధగలాడే కత్తులతో వాడిగా మొనదేలి ఉన్న లోహకంటకాలతో ఇవి నిండిఉంటాయి. చూసేవారికి ఇవి రక్తకుండాలుగా కనిపిస్తాయి. పాపులరక్తం గట్టులకి ఎగజిందుతుంటుంది. ఇవి పంచాశద్ధనురాయామాలు. గోకము అనే ఒక జంతువు ఉంది. దాని ముఖాకృతిలో ఉండే కూపాన్ని గోకకుండం అంటారు. ఇది ఇరవై ధనుస్సుల లోతూ వెడల్పూను. దీనినిండా ఆ భయంకర జంతువులే తెల్లుతుంటాయి. పాతకుల్ని కుళ్ళబొడుస్తుంటాయి. కొంచెంకొంచెంగా భక్షిస్తుంటాయి. ఇవి ఎప్పుడూ తలలు పైకి ఎత్తవు.

ఈ కుండాలన్నింటిలోనూ కలిపి ఎంతమంది ఉంటారో దానికి నాలుగురెట్లు ఎక్కువమంది పాపాత్ములుంటారు కుంభీపాకనరకంలో. ఇది సర్వకుండప్రధానం. ఇక్కడ శిక్షలూ అంతే - అన్నింటికన్నా తీవ్రంగా ఉంటాయి. అకస్మాత్తుగా వచ్చి పడుతున్న పాతకులతో అన్ని కుండాలూ రేయింబవళ్ళు దభీదభీమని మోగుతుంటాయి. తప్తపాంసుకుండంలో కాలిన ఇసపరజనులాంటి ధూళి సుడిగుండాలు తిరుగుతుంటుంది. కమిచీదెబ్బల్లా పాపుల దేహాలకు వాతలు పడుతుంటాయి. కాలిన ఇటుకలతో జ్వాలాముఖకుండం. తప్తవాలుకాకుండం. వీటిలో పడటమేమిటి పాపాత్ములు మూర్ఛిల్లుతారు. ధనుశ్శత విస్తీర్ణమైన నాగకుండం, అశ్వకుండం - ఇత్యాదుల్లో ఆయా జంతువులు పాపులతో హింసాక్రీడలు జరుపుతాయి. ఎనభయ్యారు కుండాలూ ఒకదానికన్న ఒకటి భయంకరంగా ఉంటాయి. పాపాత్ములతో



కిటకిటలాడుతుంటాయి. అంతటా భరించరాని దుర్గంధం. అంతటా భరించరాని హాహాకారాలూ ఆర్తనాదాలూ. సావిత్రీ ! ఇదీ నరకకూప లక్షణం. ఇంకా ఏమి తెలుసుకోదలిచావో, అడుగు.

*(అధ్యాయం - 37, శ్లోకాలు - 118)*

యమధర్మరాజా ! నరకకూపాల భయానకచరిత్ర తెలిసింది. వాటినుంచి తప్పించుకునేందుకు ఏకైకమార్గం దేవీమంత్రోపాసన. కనక దయచేసి దేవీభక్తిని నాకు ప్రబోధించు. స్త్రీజాతి తత్త్వజ్ఞానవిహీనం కదా ! అందుచేత తత్త్వజ్ఞానసారమైన దేవీభక్తిని ఉపదేశించి పుణ్యంకట్టుకో.

**తత్త్వజ్ఞాన విహీనా చ స్త్రీజాతిర్విధినిర్మితా ।**
**కించిత్జ్ఞానం సారభూతం వద వేదవిదాంవర ॥**
**సర్వం దానం చ యజ్ఞశ్చ తీర్థస్నానం వ్రతం తపః ।**
**అజ్ఞానిజ్ఞానదానస్య కళాం నార్హంతి షోడశీమ్ ॥** (38 - 5)

యజ్ఞ దాన తీర్థస్నాన తపోవ్రతాచరణల వల్ల లభించేపుణ్యం, ఒకరికి జ్ఞానాన్ని ఉపదేశించడంవల్ల కలిగే పుణ్యంలో పదహారవవంతుకి సాటిరాదని పెద్దలు చెబుతుంటారు. గౌరవార్హతలో తండ్రికన్నా తల్లి నూరురెట్లు గొప్పది. జ్ఞానదాత గురువు - తల్లికన్నా నూరురెట్లు ఎక్కువ గౌరవార్హుడు.

**పితుఃశతగుణా మాతా గౌరవే చేతి నిశ్చితమ్ ।**
**మాతుః శతగుణః పూజ్యో జ్ఞానదాతా గురుః ప్రభో ॥** (38 - 6)

సావిత్రి అభ్యర్థనకు యమధర్మరాజు సంబరపడ్డాడు. పుత్రీ ! ఇంతకుముందే నువ్వు కోరిన వరాలు ఇచ్చాను. ఇప్పుడు దేవీభక్తిని వరంగా ప్రసాదిస్తున్నాను. ఇది నేనై ఇస్తున్నవరం. దేవీగుణకీర్తనం అడిగినవారికీ చెప్పినవారికీ విన్నవారికీ అందరికీ శుభప్రదం. తారణకారణం.

## ◆ యముడు చెప్పిన దేవీమహిమ ◆

వెయ్యి వదనాలున్న ఆదిశేషుడు, అయిదు ముఖాలున్న పరమేశ్వరుడు, నాలుగు ముఖాలున్న బ్రహ్మదేవుడు, అన్నీ తెలిసిన విష్ణుమూర్తి, ఆరు ముఖాలున్న కార్తికేయుడు, యోగీంద్రులకు గురువైన గణేశుడు - వీరే దేవీగుణకీర్తన సమగ్రంగా చెయ్యలేరంటే ఇక నేనా ! సకలశాస్త్రాలూ, చతుర్వేదాలూ అమ్మవారి అనంతగుణ సందోహంలో ఒక్క అంశాన్ని కళామాత్రంగా తెలుసుకున్నాయేమో. సరస్వతీదేవి అయినా పూర్తిగా తెలుసుకోగలిగిందనీ చెప్పగలుగుతుందనీ నేననుకోను. ధర్మ సనకసనందన సనత్కుమార కపిల సూర్యాది బ్రహ్మమానస పుత్రులే దేవీగుణ సమగ్రవర్ణనకు సమర్థులు కారంటే ఇంక మిగతా జడబుద్ధుల గురించి చెప్పాలా ! సిద్ధులకూ సాధ్యులకూ మునీంద్రులకూ యోగీంద్రులకూ సాధ్యంకానిది



నావల్లమాత్రం అవుతుందా ? బ్రహ్మ విష్ణు మహేశ్వరులే దేవీపాదపద్మాలను నిరంతరం ధ్యానిస్తూ ఉంటారంటే ఇక వేరే చెప్పవలసింది ఏముంది ! దేవీభక్తులకుమాత్రమే ఆ తల్లి మహిమ తెలుస్తుంది. వారే ఏ కొంచెమో తద్గుణకీర్తనం చెయ్యగలరు. అదికూడా ఆమె కరుణయే. వీరికన్నా కొంచెం ఎక్కువ తెలుసుకున్నవాడు బ్రహ్మ. అతడికన్నా ఇంకొంచెం ఎక్కువ తెలిసినవాడు జ్ఞానిగురువు గణేశుడు. అందరికన్నా ఎక్కువ తెలిసినవాడు సర్వజ్ఞుడైన శంకరుడు. పూర్వం ఒకప్పుడు శ్రీకృష్ణపరమాత్మ గోలోకంలో నిర్జనారణ్యంలో రాసమండలంలో ఈ శివుడికి దేవీమాహాత్మ్యాన్ని గుట్టుగా ఉపదేశించాడు. శివుడేమో తనలోకంలో ధర్ముడికి చెప్పాడు. ధర్ముడు సూర్యుడికి తెలియచేశాడు. తపఃఫలంగా దేవీమహిమను తెలుసుకున్న నా తండ్రి సూర్యభగవానుడు నేను తపస్సులకు వెళ్ళబోతున్నవేళ ప్రేమగా పిలిచి నాకు ఉపదేశించాడు. ఇది నా గురుపరంపర. నాకు తెలిసిందే తక్కువ. అయినా నువ్వు అడిగావు కనక చెబుతున్నాను. నిజానికి ఆ తల్లి గుణగణాలు ఆవిడకే పూర్తిగా తెలియవు. ఇంక ఇతరులకు ఎలా తెలుస్తాయి ? ఆకాశం ఎంత ఉన్నదో ఆకాశానికి తెలుసా ?

తద్గుణం సా న జానాతి తదన్యస్య చ కా కథా ।
యథాకాశో న జానాతి స్వాంతమేవ వరాననే ॥ (38 - 24)

సర్వకారణకారణుడు సర్వాత్మకుడు సర్వభగవంతుడు సర్వేశ్వరుడు సర్వాద్యుడు సర్వవేత్త సర్వపరిపాలకుడు నిత్యరూపి నిత్యదేహి నిత్యానందుడు నిరాకృతి నిరంకుశుడు నిరాశంకుడు నిర్గుణుడు నిరామయుడు నిర్లిప్తుడు సర్వసాక్షి సర్వాధారుడూ అయిన పరాత్పరుడు (ప్రకృతి) మాయావిశిష్టుడై ప్రకృతిశబ్దవాచ్యుడు అవుతున్నాడు. ఈ ప్రకృతి పురుషులు పరస్పరం అభిన్నులు. అగ్ని - దాని దాహకశక్తిలాగా అవిభాజ్యులు. వీరి వికారాలే సర్వప్రాకృత రూపాలూను. ఆ ప్రకృతి శక్తినే మహామాయ అంటారు. సచ్చిదానంద రూపిణి. తాను రూపరహిత అయినా భక్తులను అనుగ్రహించడంకోసం రూపం ధరిస్తూ ఉంటుంది. మొట్టమొదటగా గోపాలసుందరీరూపాన్ని సృష్టించింది. వెంటనే అత్యంత మనోహరుడైన గోపసుందరుణ్ణి సృష్టించింది. ఆమె రాధాదేవి. అతడు శ్రీకృష్ణపరమాత్మ.

ఆ గోపకిశోరుడు నీలమేఘశ్యాముడు. కందర్పకోటి సుందరుడు. లీలాధాముడు, మనోహరుడు. వికసిత పుండరీకాక్షుడు. శరచ్చంద్రవదనుడు. రత్నభూషణవిరాజితుడు. నవ్వు రాజిల్లెడు మోమువాడు. పీతాంబరధారి. బ్రహ్మతేజోబంధురుడు. పరబ్రహ్మస్వరూపుడు. కంటికి హాయిగా ఉంటాడు. శాంతాకారుడు. రాధాకాంతుడు. రాసమండలంలో రత్నసింహాసనంమీద ఇతడు కూర్చుని ఉంటే గోపికాగణం చూపులన్నీ ఇతడివైపే. చిరునవ్వులన్నీ ఇతడిమీదనే. మురళిని నిరంతరం మోగిస్తుంటాడు. ద్విభుజ నారాయణుడు. వనమాలికా విభూషితుడు. కౌస్తుభాలంకృతోరస్కుడు. మహోజ్జ్వలుడు.



వంశీం క్వణంతం ద్విభుజం వనమాలావిభూషితమ్ ।
కౌస్తుభేంద్రమణీంద్రేణ శశ్వద్వక్షఃస్థలోజ్జ్వలమ్ ॥ (38 - 36)

కుంకుమాగురు కస్తూరీ చందనచర్చిత శరీరుడు. చంపకమాలతీపుష్పమాలికాలంకృతుడు. నెమలిపింఛం ధరించినవాడు. భక్తులు ఈ రూపంలో కృష్ణపరమాత్మను ధ్యానిస్తూ ఉంటారు.

ఈ కృష్ణపరబ్రహ్మ ఆజ్ఞకు భయపడి - బ్రహ్మదేవుడు సకల జీవరాశినీ తత్తత్కర్మానుసారం సృష్టిస్తుంటాడు. తపస్వులకు తపఃఫలాలను ఇస్తుంటాడు. చతుర్భుజ నారాయణుడు విష్ణుమూర్తి జగత్తులను పాలిస్తుంటాడు. కాలాగ్నిరూపుడై రుద్రుడు సంహరిస్తుంటాడు. ఈ శివుడు జ్ఞాని అయినదీ జ్ఞానదాత అయినదీ జ్ఞానులకు గురువైనదీ యోగీశ్వరుడైనదీ భక్తివైరాగ్య సంయుతుడైనదీ పరమానందసంయుక్తుడైనదీ ఆ కృష్ణపరమాత్మ అనుగ్రహంవల్లనే. ఇలా త్రిమూర్తులేకాదు పంచభూతాలూ అష్టదిక్పాలకులూ సూర్యచంద్రులూ నవగ్రహాలూ - సమస్తమూ తమ తమ విధులను నిర్వర్తించేది ఈ కృష్ణపరమాత్ముని ఆజ్ఞకు భయపడియే. సకాలంలో వృక్షాలు ఫలించేదీ లతలు పుష్పించేదీ జల - స్థల జంతుజాలం జీవించేదీ కాలం చెల్లగానే మరణించేదీ అంతా అతడి ఆజ్ఞప్రకారమే. విషమరంగంలో పోరాడుతున్నా అతడి ఆజ్ఞలేనిదే ఏ ప్రాణీ మరణించదు.

వాయువు సముద్రాన్ని మోసినా, సముద్రం కూర్మాన్ని మోసినా, కూర్మం అనంతుణ్ణి మోసినా, అనంతుడు ధరణిని మోసినా, ధరణి రత్నరాశులనూ సముద్రాలనూ పర్వతాలనూ సకల చరాచర ప్రాణికోటినీ ఓర్పుతో భరిస్తున్నా - ఇదంతా పరమాత్ముని ఆజ్ఞయే.

డెబ్బైయొక్క దివ్యయుగాలు ఇంద్రుడి ఆయుర్దాయం. ఇరవై ఎనిమిదిమంది ఇంద్రులు గతిస్తే బ్రహ్మదేవుడికి ఒక పగలూ రేయీ, ఇలా ముప్పయి రోజులతో మాసం, రెండు మాసాలతో ఋతువు, ఆరు ఋతువులతో సంవత్సరం ఏర్పడుతుంది.

బ్రహ్మాయుష్షు పూర్తి అయితే అది శ్రీకృష్ణుడికి ఒక రెప్పపాటుకాలం. ఆయన చక్షుర్నిమీలనం చేస్తే అది ప్రాకృతప్రళయం. అప్పుడు సర్వదేవతలూ చరాచరజంతువస్తుజాలమూ సృష్టికర్త అందరూ శ్రీకృష్ణుడి నాభిపంకజంలోకి ఉపసంహారం పొందుతారు. లీనమవుతారు.

ప్రళయే ప్రాకృతే సర్వే దేవాద్యాశ్చ చరాచరాః ।
లీనా ధాతా విధాతా చ శ్రీకృష్ణనాభిపంకజే ॥ (38 - 53)

వైకుంఠంలో క్షీరసముద్రమధ్యాన శేషతల్పంమీద శయనించే చతుర్భుజ నారాయణుడు సైతం శ్రీకృష్ణపరమాత్ముని వామపార్శ్వంలో లీనమవుతాడు. జ్ఞానాధిదేవత శివుడు శ్రీకృష్ణుడి జ్ఞానంలో లీనమవుతాడు. సృష్టిలోని సర్వశక్తిస్వరూపిణులూ కృష్ణమాయా స్వరూపిణి దుర్గలో కలిసిపోతారు. ఆవిడ బుద్ధికి అధిష్ఠాత్రి



ఏక అతడి బుద్ధిలో లీనమవుతుంది. నారాయణుడి అంశ కుమారస్వామి ఆ శ్రీకృష్ణుడి వక్షఃస్థలంలో, కృష్ణుడి అంశ గణేశుడు అతడి బాహువుల్లో కలిసిపోతారు. లక్ష్మీదేవి అంశలన్నీ లక్ష్మిలోకీ, లక్ష్మీదేవి ాధాదేవిలోకీ అంతరిస్తారు. సకల గోపికలూ దేవకాంతలూ రాధలోనే లీనమవుతారు. రాధాదేవి అంటే కృష్ణుడి ప్రాణాధిదేవత. అతడి ప్రాణాల్లోనే ప్రాణంగా ఉంటుంది. వేదశాస్త్రాలు సావిత్రిలోకీ, సావిత్రి రస్వతిలోకీ, సరస్వతి శ్రీకృష్ణుడి జిహ్వాభాగంలోకీ అంతర్భవిస్తారు. గోలోక గోపకులు అతడి రోమాలలోకీ ారి ప్రాణాలు అతడి ప్రాణాలలోకీ, అగ్నిదేవుడు జఠరాగ్నిలోకీ సకలజలాలూ రసనాగ్రభాగంలోకీ ష్ణవులు అతడి పాదపద్మాలలోకీ - ఇలా విరాడంశలన్నీ శ్రీకృష్ణమహావిరాడ్రూపంలో లీనమైపోతాయి. కలవిద్యలూ అతడి రోమకూపాలలో దాక్కుంటాయి. అతడికి రెప్పపాటు కాలమంటే మిగతా సృష్టికి హాప్రళయం. ఇదే ప్రాకృతప్రళయం.

శ్రీకృష్ణపరమాత్మ రెప్పవాలిస్తే ప్రాకృతప్రళయం. రెప్పతెరిస్తే పునస్సృష్టి. బ్రహ్మాదిదేవతలు ఆవిర్భవించి తమ విధులు నిర్వర్తిస్తారు. సృష్టి అంతా మళ్ళీ కళకళలాడుతుంది. ఇలా ఎన్నిసార్లు సృష్టిలయాలు జరిగాయో ఎవరూ లెక్కించి చెప్పలేరు. భూగోళంలో ఎన్ని మట్టిరేణువులున్నాయంటే ఎవరైనా చెప్పగలరా ? శ్రీకృష్ణపరమాత్మ ఎన్నిసార్లు రెప్పవాల్చాడో తెరిచాడో ఎవరు చెబుతారు ? ఎప్పుడు వాలుస్తాడో ఎప్పుడు తెరుస్తాడోమాత్రం ఎవరు చెప్పగలరు ? అంతా అతడి ఇష్టం. ఈశ్వరేచ్ఛ. సృష్టిలయాలు తదనుగుణంగా జరుగుతూనే ఉంటాయి.

(శ్రీకృష్ణుడు రెప్పవేస్తే ప్రాకృతప్రళయమన్నారా, బ్రహ్మదేవుడికి నూరేళ్ళు నిండితే (దేవమానం ప్రకారం శతాబ్దం గడవాలి) అది సూత్రప్రళయం. దాన్నే బ్రహ్మప్రళయమంటారు. ఇప్పటికి ఎందరు బ్రహ్మలు లయించి పునరుద్భవించారో ఎవరూ చెప్పలేరు).

బ్రహ్మణశ్చ శతాబ్దే చ సృష్టేః సూత్రలయః పునః ।
బ్రహ్మసృష్టి లయానాం చ సంఖ్యా నాస్త్యేవ సువ్రతే ॥ (38 - 65)

ఇలా ప్రళయం సంభవించినప్పుడు సమస్తమూ శ్రీకృష్ణుడిలో లీనమైతే శ్రీకృష్ణుడు ప్రకృతిలో లీనమవుతాడు. ఒక్కటే పరాశక్తి. ఒక్కడే పరాత్పరుడు నిర్గుణుడు. ఆగ్ర ఆసీత్ అని వేదాలు చెప్పేది ఇదే. అవ్యక్తమూలప్రకృతి. అవ్యాకృతపదవాచ్య. చిదభిన్న. ప్రళయంలో తానే మిగులుతుంది. ఆ పరాశక్తి గుణాలను కీర్తించడం ఈ బ్రహ్మాండంలో ఎవరివల్లా కాదు.

సావిత్రీ ! వేదాలు నిర్వచించిన ముక్తులు నాలుగువిధాలు. సాలోక్య - సారూప్య - సామీప్య - నిర్వాణాలు. దేవీభక్తి వీటన్నింటికన్నా గొప్పది. అందుకే దేవీ మంత్రోపాసకులు ఈ ముక్తుల్ని కోరుకోరు. దేవీసేవనే కోరుకుంటారు. శివత్వ - అమరత్వ - బ్రహ్మత్వసిద్ధులూ జన్మ మృత్యు జరా వ్యాధి భయ శోకాది రాహిత్యం దివ్యరూపధారణం - వీటిని నిర్వాణమనీ మోక్షమనీ అంటుంటారు. ముక్తి అంటే సేవారహిత



స్థితి. భక్తి అంటే సేవావివర్ధని. భక్తిముక్తులకు ఇదీ తేడా. చేసిన శుభాశుభకర్మల ఫలాలను అనుభవించడమే నిషేకమంటే. దాన్ని ఖండించగలిగినది శ్రీకృష్ణభక్తిమాత్రమే. కనక సృష్టిలయాలకూ జన్మమృత్యువులకూ అతీతంగాని శివత్వాదిసిద్ధి రూపమైన ఆ ముక్తికన్నా కర్మఫలానుభవత్యాగరూపమూ (నిషేకఖండనం) శ్రీవిభుసేవారూపమూ అయిన భక్తినే జ్ఞానులు కోరుకుంటారు. వేదాలు చెప్పే స్థిరమైన తత్త్వజ్ఞానం ఇదే. శుభప్రదమైన తత్త్వజ్ఞానాన్ని నిర్విఘ్నంగా నీకు ఉపదేశించాను. నీ భర్తను పునరుజ్జీవితుణ్ణి చేశాను. ఇక వెళ్ళిరా. నీకు శుభమగుగాక - అని ఆశీర్వదించి యమధర్మరాజు తన లోకానికి బయలుదేరబోయాడు. కానీ సావిత్రి కదలనివ్వలేదు. పాదాలు పట్టుకుని విలపించడొడగింది. ఎందుకో ఏమిటో చెప్పకుండా మౌనంగా రోదించింది. యముడికే జాలి కలిగింది. సంతృప్తి కలిగింది. కళ్ళు చెమ్మగిల్లాయి.

సావిత్రీరోదనం శ్రుత్వా యమశ్చైవ కృపానిధిః ।
తామిత్యువాచ సంతుష్టః స్వయం చైవ రురోద హ ॥ (38 - 80)

వత్సా ! లక్షసంవత్సరాలు నీ భర్తతో సుఖసంతోషాలు అనుభవించి పుణ్యక్షేత్రంలో తనువుచాలించి దేవీలోకం చేరుకుందువుగాని. ఇప్పటికి ఇక ఇంటికి వెళ్ళు. వెళ్ళి సావిత్రీవ్రతం ఆరంభించు. అది పద్నాలుగేళ్ళ వ్రతం. స్త్రీలకు మోక్షదాయకం. జ్యేష్ఠ శుక్లచతుర్దశినాడు ఆరంభించడం శుభప్రదం. భాద్రపద శుక్లాష్టమినాడు మహాలక్ష్మీవ్రతం ప్రారంభించు. ఇది పదహారేళ్ళ నోము. సౌభాగ్యసంపత్ప్రదం. ప్రతి మంగళవారంనాడూ మంగళప్రదాయి శ్రీదేవిని ఉపాసించు. ప్రతి మాసంలోనూ శుక్లషష్ఠినాడు షష్ఠీదేవిని, ఆషాఢ సంక్రాంతినాడు మనసాదేవిని, కార్తికమాసంలో రాసాధిదేవత రాధను, ప్రతినెలా శుక్లాష్టమినాడు ఉపవాసపూర్వకంగా విష్ణుమాయా స్వరూపిణి దుర్గతినాశిని అయిన దుర్గాదేవిని ఆరాధించు. ఈవిడ పరప్రకృతి. పతిపుత్రవతులైన పతివ్రతలలో యంత్రాలలో ప్రతిమలలో ఈ దుర్గామాతను సందర్శించి ఆరాధించేవారికి సకల సంపదలూ సుఖసంతోషాలూ సిద్ధిస్తాయి. వైకుంఠం కరతలామలకంలాగా లభిస్తుంది. దేవీవిభూతిని గుర్తించి పూజించడం సాధకుల ప్రథమకర్తవ్యం. సర్వరూప అయిన పరమేశ్వరిని సర్వకాల సర్వావస్థలలోనూ ఉపాసించాలి. ఇంతకన్నా మానవజన్మకు సార్థక్యం లేదు. కృతకృత్యత్వం లేదు - అని చెప్పేసి యముడు ఇక క్షణం ఆగకుండా వెనక్కి తిరిగి చూడకుండా వెళ్ళిపోయాడు.

సావిత్రీ సత్యవంతులు ఇంటికి తిరిగివచ్చారు. జరిగిన విచిత్రాలు చెప్పారు. సావిత్రి తండ్రి కాలక్రమాన పుత్రవంతుడయ్యాడు. మామగారికి చూపు వచ్చింది. రాజ్యం దక్కింది. సావిత్రి సంతానవతి అయ్యింది. లక్ష సంవత్సరాలు భోగభాగ్యాలు అనుభవిస్తూ, యమధర్మరాజు ఉపదేశించిన నోములన్నీ చేస్తూ, దేవీపాదపద్మార్చనను ఏమరకుండా చేస్తూ కాలం గడిపింది. కట్టకడపట ఒక పుణ్యక్షేత్రంలో తనువు చాలించి దేవీలోకం చేరుకుంది.



నారదా ! సావిత్రి అంటే సూర్యాధిదేవత. సూర్యమంత్రాధిష్ఠానదేవత. వేదమాత. వేదసవిత్రి. కనకనే సావిత్రి అయ్యింది.

సవితుశ్చాధిదేవీ యా మంత్రాధిష్ఠాతృదేవతా ।
సవిత్రీ హ్యపి వేదానాం సావిత్రీ తేన కీర్తితా ॥ (38 - 95)

జీవకర్మవిపాకాన్ని గురించి ప్రధానంగా తెలియజేసే సావిత్రి ఉపాఖ్యానం సవిస్తరంగా వినిపించాను. ఇంకా ఏమి కావాలో అడుగు - అని ముగించాడు నారాయణమహర్షి.

*(అధ్యాయం - 38, శ్లోకాలు - 96)*

## ◆ మహాలక్ష్మీ ఉపాఖ్యానం ◆

నారదుడు ఆనంద భరితుడై మరొక ప్రశ్నవేశాడు. సావిత్రీయమసంవాదం మిషగా గాయత్రి ఉపాఖ్యానం విన్నాను. జన్మ ధన్యమయ్యింది. ఇప్పుడు లక్ష్మీ ఉపాఖ్యానం వినాలని కుతూహలంగా ఉంది. దయచేసి వివరించు - అని అడిగాడు. నారాయణమహర్షి ప్రారంభించాడు -

నారదా ! సృష్టికి ఆదిలో శ్రీకృష్ణపరమాత్మకు వామాంగంనుంచి రాసమండలంలో మహాదేవి ఆవిర్భవించింది. అత్యంత సుందరాకారం. శ్యామ. న్యగ్రోధపరిమండిత. పన్నెండేళ్ళ నవయౌవనవతి. శ్వేతచంపకవర్ణంలో చూపులకి హాయిగా ఉంది. మనోహారిణి. శరత్పూర్ణచంద్రబింబానన. శరత్పద్మపత్ర విశాలాక్షి. ఆవిర్భవించిన ఆదేవి ఈశ్వరేచ్ఛతో హఠాత్తుగా రెండురూపాలు ధరించింది. రూపం రంగు తేజస్సు వయస్సు కాంతి యశస్సు వస్త్రధారణ భూషణధారణ చిరునవ్వు గుణగణాలు వీక్షణాలు ప్రేమ అనునయం అన్నింటా అచ్చం ఒకేలాగా ఉన్న రెండు స్త్రీమూర్తులు. వామభాగం మహాలక్ష్మిగా దక్షిణభాగం రాధాదేవిగా రూపుదాల్చింది.

వీరిలో ముందుగా రాధాదేవి ద్విభుజ శ్రీకృష్ణపరమాత్మను వరించింది. తరవాత మహాలక్ష్మి వరించింది. అప్పుడు వారిపట్ల గౌరవాదరాలతో పరమాత్మ తానుకూడా రెండు రూపాలు ధరించాడు. దక్షిణభాగం నుంచి ద్విభుజుడు, వామభాగం నుంచి చతుర్భుజుడూ అవతరించారు. ద్విభుజుడు రాధాకాంతుడు. చతుర్భుజుడు లక్ష్మీకాంతుడు. శుద్ధసత్త్వస్వరూపుడై గోపగోపీగణ పరివృతుడై చతుర్భుజ నారాయణుడు లక్ష్మీసహితంగా వైకుంఠానికి తరలివెళ్ళాడు. అన్నింటా సమానులైన ఆ పురుషులిద్దరూ కృష్ణనారాయణులు.

స్నిగ్ధదృష్టులతో సమస్త విశ్వాన్నీ లక్షిస్తుంది కనక ఈ మహాదేవిని మహాలక్ష్మి అన్నారు. యోగశక్తి సంపన్న ఈ లక్ష్మీదేవి చాలా అంశావతారాలు ధరించింది. వైకుంఠంలో ఉండే మహాలక్ష్మి పరిపూర్ణతమ.



సాత్త్వికురాలు. శుద్ధసత్త్వస్వరూప. సర్వసౌభాగ్యసంయుత. నారాయణుడికి అత్యంత ప్రేమాస్పద. సర్వాంగనా ప్రధాన. ఇంద్రలోకంలో ఇంద్రుడికి సర్వసంపత్స్వరూపిణిగా స్వర్గలక్ష్మి పేరుతో ఈవిడ అంశావతారం వెలుగొందుతోంది. పాతాళంలో నాగలక్ష్మిగా, రాజులలో రాజలక్ష్మిగా, గృహాలలో గృహలక్ష్మిగా, గోవులలో కామధేనువుగా, యజ్ఞాలలో దక్షిణాదేవిగా పద్మినులలో క్షీరసముద్రరాజతనయగా, చంద్రుడిలో శోభాలక్ష్మిగా, సూర్యుడిలో తేజోలక్ష్మిగా ఇలా రత్నాలలో ఫలాలలో జలాలలో రాజులలో రాజపత్నులలో దివ్యస్త్రీలలో గృహాలలో సర్వసస్యాలలో వస్త్రాలలో స్థలాలలో దేవతాప్రతిమలలో మంగళఘటాలలో మాణిక్యాలలో ముత్యాలలో పుష్పమాలికలలో మణులలో హీరాలలో క్షీరాలలో చందనాలలో వృక్షాలలో నవమేఘాలలో - అంతటా శోభాదాయకంగా లక్ష్మీదేవి అంశలు విరాజిల్లుతున్నాయి.

ఈ మహాలక్ష్మిని మొట్టమొదట వైకుంఠంలో చతుర్భుజనారాయణుడు అర్చించాడు. తరవాత బ్రహ్మదేవుడూ శంకరుడూ అర్చించారు. క్షీరసముద్రంలో విష్ణుమూర్తి పూజించాడు. స్వాయంభువమనువు అటుపైని మహారాజులూ ఉపాసించారు. ఋషీంద్రులూ మునీంద్రులూ మానవులూ అర్చించారు. పాతాళంలో నాగులు ఉపాసించారు.

భాద్రపద శుక్లాష్టమినాడు ప్రారంభించి పక్షం రోజులపాటు బ్రహ్మదేవుడు మహాలక్ష్మీవ్రతం చేశాడు. చైత్ర భాద్రపద పుష్యమాసాలలో ప్రతి మంగళవారంనాడూ విష్ణుమూర్తి అర్చించాడు. పుష్యసంక్రాంతి నాడూ మాఘమంగళవారాలలోనూ వర్షాంతంలోనూ భువనత్రయాలలో స్వాయంభువమనువు లక్ష్మీపూజలు చేశాడు. ఇంద్రుడూ మంగళవారాలే అర్చించాడు. కేదార - నీల - సుబల - నల - ధ్రువ - ఉత్తానపాద - బలి - కశ్యప - దక్ష - కర్దమ - వివస్వత్ - ప్రియవ్రత - చంద్ర - కుబేర - వాయు - యమ - వహ్ని - వరుణాది దేవతలందరూ సర్వత్ర భక్తితో పూజలు చేశారు. మహాలక్ష్మి అంటే ఐశ్వర్యాధిదేవత. సర్వసంపత్స్వరూపిణి. ***(అధ్యాయం - 39 , శ్లోకాలు - 34)***

నారాయణప్రియ వైకుంఠవాసిని వైకుంఠాధిష్ఠానదేవత సనాతని అయిన మహాలక్ష్మి భూలోకంలో సింధుకన్యకగా ఎలా జన్మించింది ? ఎవరు ఎలా స్తుతించారు ? ఎలా అర్చించారు ? అంటూ నారదుడు ప్రశ్నలు గుప్పించాడు. మహర్షి అందుకున్నాడు -

నారదా ! పూర్వకాలంలో దుర్వాసుడి శాపానికి గురియై ఇంద్రుడూ దేవతలూ పదవీసంపద్భ్రష్టులై భూలోకానికి పోవలసివచ్చింది. అప్పుడు స్వర్గలక్ష్మి దుఃఖంతో కోపంతో స్వర్గలోకం విడిచిపెట్టి వైకుంఠానికి వెళ్ళి మహాలక్ష్మిలో లీనమయ్యింది.

ఆ తరవాత దేవతలు గుమికూడి బ్రహ్మను శరణు వేడారు. అతడు శంకరుణ్ణి సంప్రదించాడు. అందరూ కలిసి వైకుంఠం వెళ్ళి చతుర్భుజ నారాయణుడిని శరణువేడుకొన్నారు. అప్పుడు ఆయన ఒక



ఉపాయం ఆలోచించి లక్ష్మీదేవిని కళాంశతో క్షీరసముద్రుడి ఇంట కన్యగా అవతరించమని ఆజ్ఞాపించాడు. అలా సింధురాజకన్య అయ్యింది.

దేవదానవులు క్షీరసముద్రాన్ని మథించినవేళ దర్శనమిచ్చింది. స్తుతించిన దేవతలకు వరాలిచ్చింది. విష్ణుమూర్తికి దివ్యవనమాల ఇచ్చింది. ఇలా దేవతలు తిరిగి తమ రాజ్యసంపదలను పొందగలిగారు.

క్లుప్తంగా ముగించాడు నారాయణమహర్షి. వింటున్న నారదుడికి సంతృప్తి కలగలేదు. దుర్వాసుడు ఎందుకు శపించాడు ? ఏమని శపించాడు ? ఇంద్రుడు ఏ తప్పుచేశాడు ? లేకపోతే బ్రహ్మర్షుడు ఉత్తినే శపిస్తాడా ! దేవదానవులు క్షీరసముద్రాన్ని ఎలా మథించారు ? మహాలక్ష్మి దర్శన మిచ్చినప్పుడు ఇంద్రుడు ఎలా స్తుతించాడు ? వారిద్దరికీమధ్య నడిచిన సంవాద స్వరూపం ఏమిటి ? - ఇవన్నీ చెప్పకపోతే నాకు తృప్తి కలగదు అంటూ నారదుడు మారాముచేశాడు. సరే నారాయణమహర్షి ఆరంభించాడు.

## ◆ ఇంద్రుడికి దూర్వాసుడి శాపం ◆

నారదా ! మధుపానప్రమత్తుడై దేవేంద్రుడు - త్రిలోకాధిపతి - రంభతో రహఃక్రీడాపరవశుడై ఒక మహారణ్యంలో విహరిస్తున్నాడు. వైకుంఠంనుంచి కైలాసానికి వెడుతూ దుర్వాసుడు వీరి కంటబడ్డాడు. బ్రహ్మతేజస్సుతో గ్రీష్మమార్తాండుడిలాగా వెలిగిపోతున్నాడు మహర్షి. కరిగిపోసిన బంగారు రంగులో ఉన్నాడు. జడలుగట్టిన జుట్టు తలచుట్టూ వేలాడుతూ ఊగుతోంది. తెల్లని యజ్ఞోపవీతం. దండకమండలువులు. నొసట బాలచంద్ర బింబంలాంటి కుంకుమబొట్టు. లక్షల శిష్యులు వేదాలు వల్లిస్తూ వెంటనడుస్తున్నారు.

చూడగా దేవేంద్రుడు ఎదురువెళ్ళి భక్తిగా నమస్కరించాడు. శిష్యవర్గం ఇంద్రుణ్ణి అభినుతించారు. అందరూ అతడికి ఆశీస్సులు అందించారు. విష్ణుమూర్తి ఇచ్చిన పారిజాత పుష్పాన్ని దుర్వాసుడు ప్రేమగా అతడికి కానుక చేశాడు. అది జరామృత్యుహరమూ శోకవినాశకమూ మోక్షకారకమూ అయిన పవిత్ర పారిజాత పుష్పం. పైగా విష్ణుదత్తం. దాన్ని స్వీకరించి దేవేంద్రుడు కళ్ళకు అద్దుకుని శిరస్సుమీద పెట్టుకోవలసింది పోయి నిర్లక్ష్యంగా మదమత్తంగా తన ఐరావతం శిరస్సుమీదకు విసిరాడు. ఆ పుష్పస్పర్శతో అది రూపగుణతేజోవయస్సులలో విష్ణుతుల్యమై ఘోరారణ్యంలోకి వెళ్ళిపోయింది. ఆ ఏనుగును ఎంత ప్రయత్నించినా ఇంద్రుడు ఆపలేకపోయాడు.

ఈ సంఘటనతో దుర్వాసుడికి మహాకోపం వచ్చింది. ఆరే ఇంద్రా ! కన్నూ మిన్నూ కానకండా ఉన్నావు. సంపన్మదమత్తుడివై ఇలా నన్ను అవమానిస్తావా ? నేనిచ్చిన పారిజాతాన్ని ఏనుగుమీదకు విసిరేస్తావా ? విష్ణుమూర్తికి నివేదన చేసి ప్రసాదంగా పొందిన పువ్వూ పండూ నీరూ దేనినైనా చేతికందినంతనే కన్నులకి అద్దుకుని స్వీకరించాలి. అలా స్వీకరించకపోతే బ్రహ్మహత్యా మహాపాతకం చుట్టుకుంటుంది.



శ్రీభ్రష్టుడూ బుద్ధిభ్రష్టుడూ రాజ్యభ్రష్టుడూ అవుతాడు. పూర్వజన్మ సుకృతవిశేషంవల్ల మహాభాగ్యంగా లభించిందని వెంటనే స్వీకరించినవాడు మాత్రమే విష్ణుభక్తుడు. అతడు స్వయంగా జీవన్ముక్తుడవుతాడు. నైవేద్యం స్వీకరించి నిరంతరం విష్ణుమూర్తికి నుతులూ నతులూ చేస్తే సాక్షాద్విష్ణుతుల్యుడవుతాడు. అతడి స్పర్శతోగానీ అతడి గాలిసోకినాగానీ సకలతీర్థాలూ పరిపూతాలవుతాయి. అతడి పాదరజస్సుతో వసుంధర అంతా పావనమవుతుంది. పుంశ్చల్యన్న - అవీరాన్న భోజనాదిక దోషాలన్నీ తొలగిపోతాయి. సర్వవిధ అభక్ష్యభక్షణ దోషాలు నశిస్తాయి.

విష్ణోర్నివేదితం చైవ నైవేద్యం వా ఫలం జలమ్ ।
ప్రాప్తిమాత్రేణ భోక్తవ్యం త్యాగేన బ్రహ్మహా భవేత్ ॥ (40 - 26)

ఇంద్రా ! శ్వపచుడైనా (కుక్కమాంసం తినేవాడు) విష్ణుసేవి అయితే తనవంశంలో కోటితరాలను ఉద్ధరించినవాడవుతాడు. హరిభక్తి లేనివాడు తనను తానే రక్షించుకోలేడు. ఇది విష్ణుప్రసాదము అనేమాట తెలియకుండానే స్వీకరించినప్పటికీ ఏడుజన్మల పాపాలు తొలగిపోతాయి. తెలిసి స్వీకరిస్తే కోటిజన్మల కిల్బిషాలు అంతరిస్తాయి. ఇది నిశ్చయం.

అజ్ఞానాద్యతి గృహ్ణాతి విష్ణోర్నిర్మాల్యమేవ చ ।
సప్తజన్మార్జితాత్పాపాత్ ముచ్యతే నాత్ర సంశయః ॥
జ్ఞాత్వా భక్త్యా గృహ్ణాతి విష్ణోర్నైవేద్యమేవ చ ।
కోటిజన్మార్జితాత్పాపాత్ ముచ్యతే నిశ్చితం హరే ॥ (40 - 40)

శక్రా ! అటువంటి పరమపావనమైన విష్ణుప్రసాదాన్ని గర్వంతో కరిమస్తకంమీదకి విసిరేశావు కనక స్వర్గలక్ష్మి నిన్ను విడిచిపెట్టి హరిసన్నిధికి వెళ్ళిపోవుగాక ! నేను హరిభక్తుణ్ణి. బ్రహ్మదేవుడే కాదు యమధర్మరాజునైనా లక్ష్యపెట్టను. నువ్వొక లెక్కా ? నీ తాతముత్తాతలే నన్ను పూజిస్తారు. నువ్వు అవమానిస్తావా ? నీకంటే ఆ ఏనుగు నయం - పారిజాతాన్ని శిరసున ధరించింది కనక - అంటూ దుర్వాసుడు చిందులుతొక్కాడు.

దేవేంద్రుడు గజగజలాడాడు. దుర్వాసుడి పాదాలమీద పడ్డాడు. సిగ్గువిడిచి బిగ్గరగా రోదించాడు. మునీశ్వరా ! నా అపరాధానికి తగిన శాపమే ఇచ్చావు. ఇది నాకు తగిన శిక్షయే. కళ్ళకు కమ్మిన మాయ తొలగిపోయింది. రాజసంపదని తిరిగి ఇవ్వమని కోరను. దయచేసి కొంచెం జ్ఞానం ప్రసాదించు. ఐశ్వర్యమనేది ఆపదలకు బీజం. అది జ్ఞానాన్ని కప్పివేస్తుంది. ముక్తిమార్గాన్ని ఛేదిస్తుంది. భక్తిని ఆటంక పరుస్తుంది. అంచేత ఐశ్వర్యం వద్దు. జ్ఞానం కలిగించు.



ఐశ్వర్యం విపదాం బీజం జ్ఞానప్రచ్ఛన్నకారణమ్ ।
ముక్తిమార్గకుఠారశ్చ భక్తేశ్చ వ్యవధాయకమ్ ॥ (40 - 46)

ఇంద్రుడు ఇలా ప్రాధేయపడేసరికి మునీంద్రుడు కాస్త మెత్తబడ్డాడు. ఇంద్రా ! సంపత్తిమిరాంధుడికి ముక్తిమార్గం కనపడదు. అది జన్మమృత్యుజరాశోకరాగాలకు బీజాంకురం. సంపన్మత్తుడికన్నా మూఢుడూ సురామత్తుడూ ఉండడు. బంధుగణం అతడిని చుట్టుముడతారుగానీ బంధుత్వాలూ ఆప్యాయతలూ ఉండవు. విషయాంధుడూ విహ్వలుడూ మహాకాముకుడూ రాజసికుడూ అవుతాడే తప్ప ఐశ్వర్యమదమత్తుడికి సాత్త్వికమార్గం కనిపించదు. విషయాంధులు రెండు రకాలుగా ఉంటారు. రాజసుడూ తామసుడూ. శాస్త్రజ్ఞానంలేని ధనవంతుడు తామసుడు. శాస్త్రజ్ఞానం ఉన్న ధనవంతుడు రాజసుడు. శాస్త్రంకూడా రెండురకాల మార్గాలు చూపిస్తుంది. ప్రవృత్తిమార్గం ఒకటి, నివృత్తిమార్గం ఒకటి. జీవులందరూ మున్ముందుగా ప్రవృత్తిమార్గంలోనే ప్రయాణిస్తారు. దుఃఖాలనే సుఖాలనుకుంటూ పరిణామంలో వినాశదాయకమై జన్మ మృత్యుజరాకరమైన ఈ మార్గంలో అనేకజన్మల పర్యంతం పరిభ్రమిస్తారు. ఆనందిస్తున్నాం అనుకుంటూ గడుపుతారు. కర్మానుసారం పశుపక్ష్యాది జన్మలు ఎత్తి ఎత్తి కట్టకడపటికి ఎవరో ఒక సాధుపురుషుడు తత్త్వదీపంతో ముక్తిమార్గం చూపిస్తే అప్పుడు భవబంధవిచ్ఛేదనానికి ప్రయత్నం చేస్తారు. తపస్సులు చేసీ నిరాహారంగా వ్రతదీక్షలు పూనీ అనేక జన్మల్లో ప్రయత్నించి నిర్విఘ్నమూ సుఖప్రదమూ అయిన ముక్తిపథాన్ని చేరుకుంటారు.

నారదా ! దుర్వాసుడు చేసిన ఈ ఉపదేశం శ్రద్ధగా ఆలకించిన దేవేంద్రుడికి వైరాగ్యం అంకురించింది. క్రమక్రమంగా స్థిరపడింది. కొంతకాలంపాటు దుర్వాసుడి ఆశ్రమంలోనే గడిపి, తనరాజధాని అమరావతికి బయలుదేరాడు.

## ◆ ఇంద్రుడికి బృహస్పతి ఉపదేశం ◆

స్వర్గలోకమంతా దైత్యదానవరాక్షస సంఘాల ఆక్రమణలో ఉంది. దేవతలందరూ పలాయనం చిత్తగించారు. ఎవ్వరూ కనపడలేదు. అయ్యో అనుకున్నాడు. మందాకినీతీరంలో బృహస్పతి కనిపించాడు. నీటిలో నిలబడి ధ్యానం చేసుకుంటున్నాడు. తూర్పుముఖంగా నిలబడి ఉన్నాడు. పరమానందంతో పులకిస్తున్నాడు. ఆనందబాష్పాలు రాలుస్తున్నాడు. వరిష్ఠుడు. గరిష్ఠుడు. ధర్మిష్ఠుడు. బంధువర్గానికి ఇష్టుడు. జ్ఞానుల్లో శ్రేష్ఠుడు. భ్రాతృవర్గంలో జ్యేష్ఠుడు. రాక్షసులకు అనిష్టుడు. బృహస్పతి ఒక జాముసేపటికి ధ్యానం ముగించి కళ్ళుతెరిచాడు. గట్టుకి వచ్చాడు. ఇంద్రుడు ఎదురువెళ్ళి సవినయంగా నమస్కరించాడు. పాదాలపైపడి బిగ్గరగా విలపించాడు. దుర్వాసో మునిపుంగవుడి శాపమూ జ్ఞానప్రాప్తీ దానవ దురాక్రమణమూ అన్నీ విన్నవించాడు. బృహస్పతికి కోపంతో కన్నులు ఎర్రబడ్డాయి.



శిష్యా ! దేవేంద్రా ! విన్నాను. అంతా విన్నాను. ఎందుకూ రోదిస్తావ్ ? ఏడ్చి సాధించేది ఏమీ లేదు. గుండెలు చిక్కబట్టుకో. నీతిజ్ఞుడు ఎవడూ ఆపదల్లో బెంబేలుపడడు. సంపత్తికానీ విపత్తికానీ ఏదీ శాశ్వతం కాదు. అన్నీ నశించిపోయేవే. శ్రమనుమాత్రం మిగులుస్తాయి.

న కాతరో హి నీతిజ్ఞో విపత్తౌ చ కదాచన ।
సంపత్తిర్వా విపత్తిర్వా నశ్వరా శ్రమరూపిణీ ॥ (40 - 70)

పూర్వజన్మల్లో చేసుకున్న సుకృతదుష్కృతాల ఫలాలు జన్మజన్మలకీ అనుభవించాల్సిందే. ఇది ఎవరికీ తప్పదు. చక్రనేమిక్రమంలో సుఖదుఃఖాలూ సంపద్విపత్తులూ వస్తుంటాయి. పోతుంటాయి. దుఃఖించాల్సింది ఏముంది ? అనుభవించడమే. అనుభవించకుండా ఏకర్మమూ క్షయించదు. కల్పకోటి శతజన్మలెత్తినా నశించదు. శుభాశుభకర్మఫలాలు అవశ్యానుభోక్తవ్యాలని వేదమూ చెబుతోంది. కృష్ణపరమాత్ముడూ చెప్పాడు. కర్మఫలానుభవం పూర్తిఅయితే ముక్తి లభిస్తుంది. అణుమాత్రంగా మిగిలిఉన్నా పునర్జన్మ తప్పదు. పూర్వజన్మల కర్మఫలాలను అనుభవిస్తూ ఇహజన్మలో నిష్కామంగా దేవపూజాది శుభకర్మలను చేస్తూ వెళ్ళగా వెళ్ళగా ఎప్పటికో ముక్తి. కర్మఫలానుభవపూర్తి. అలాకాక ఇహజన్మలో మళ్ళీ సకామ - దుష్కర్మలు చేస్తే ముక్తి అసంభవం. జన్మపరంపరలో రకరకాల అవతారాలతో కొట్టుమిట్టాడుతుండవలసిందే.

అందుచేత దేవరాజా ! ఒకరి శాపంగానీ ఒకరి ఆశీస్సుగానీ మన కర్మఫలాలే. మహాలక్ష్మి వరించినా మహాదైన్యం లభించినా కర్మఫలమే. కోటి జన్మలనుంచి ముక్కోటి జన్మలకైనా కర్మఫలం నీడలా వెన్నంటి వస్తూనే ఉంటుంది. అనుభవించనిదే వదలదు.

కోటిజన్మార్జితం కర్మ జీవినా మనుగచ్ఛతి ।
న హి త్యజేద్వినా భోగం తచ్ఛాయేవ పురందర ॥
కాలభేదే దేశభేదే పాత్రభేదే చ కర్మణామ్ ।
న్యూనతాధికభావోఽపి భవేదేవ హి కర్మణామ్ ॥ (40 - 79)

దేశ - కాల - పాత్ర భేదాలవల్ల కర్మఫలాల్లో హెచ్చుతగ్గులుంటాయి. వస్తువులను దానం చేస్తున్నపుడు ఏ రోజున చేసినా ఫలం సమానమేకానీ పుణ్యదినాల్లో పుణ్యప్రదేశాల్లో పుణ్యాత్ములకు (పాత్రత) ఇస్తే ఫలం కోటిరెట్లు అధికంగా లభిస్తుంది. రైతులు అందరూ వ్యవసాయంలో కృషి సమానంగానే చేసినా క్షేత్రభేదాన్నిబట్టి (నేల సారవంతము - నిస్సారమూ) పంట దిగుబడిలో హెచ్చుతగ్గులున్నట్లే పాత్రభేదాన్నిబట్టి పుణ్యఫలంలోనూ ఆధిక్యన్యూనత్వాలుంటాయి.



యథా ఫలంతి సస్యాని న్యూనాన్యప్యధికాని చ ।
కర్షకాణాం క్షేత్రభేదే పాత్రభేదే ఫలం తథా ॥ (40 - ౬3)

మామూలురోజుల్లో విప్రుడికి దానం చేసినదానికంటే అమావాస్య - రవిసంక్రమణ దినాల్లో దానాలు చేస్తే నూరురెట్లు ఎక్కువగా పుణ్యఫలం లభిస్తుంది. చాతుర్మాస్యంలోగానీ పున్నమినాడుగానీ అయితే అనంతంగా లభిస్తుంది. చంద్రగ్రహణంనాడు కోటిగుణంగానూ సూర్యగ్రహణంనాడు శతకోటిగుణంగానూ దక్కుతుంది. అక్షయతిథినాడైతే అక్షయఫలమే. ఇలాగే ఇంకా పుణ్యదినాల్లో చేసిన దానాలు అధికంగా ఫలాలిస్తూ ఉంటాయి. ఒక్క దానానికేకాదు జపమూ తీర్థస్నానమూ దేవతారాధనమూ మొదలైన సత్కర్మలన్నింటికీ ఇది వర్తిస్తుంది. కుమ్మరి కర్రతో చక్రం తిప్పుతూ మట్టితో కుండలు ఎలా తయారు చేస్తుంటాడో అలాగే బ్రహ్మదేవుడు కర్మసూత్రంతో ఫలాలు అందిస్తుంటాడు. కర్మఫల పరతంత్రుడై జన్మలనూ రూపాలనూ సమకూరుస్తుంటాడు.

ఈ బ్రహ్మదేవుడుకూడా నారాయణుడి ఆజ్ఞమేరకే ఇవన్నీ చేస్తుంటాడు. నారాయణుడు విధాతకు విధాత. రక్షకుడికి రక్షకుడు. సంహర్తకు సంహర్త. కాలానికి కాలం. అతడిని స్మరించుకుంటే ఆపదలు తొలగిపోతాయి. మహావిపత్తిలోనైనా మధుసూదనుడిని తలచుకుంటే అంతటి విపత్తిలోనూ మహాసంపత్తి కలుగుతుందని శంకరు డంతటివాడు ప్రవచించాడు.

మహావిపత్తౌ సంసారే యః స్మరేన్మధుసూదనమ్ ।
విపత్తౌ తస్య సంపత్తిర్భవేదిత్యాహ శంకరః ॥ (40 - 91)

బృహస్పతి ఇలా ధైర్యవచనాలు పలికి శిష్యుణ్ణి కౌగిలించుకొని శుభాశీస్సులు అందించాడు.

*(అధ్యాయం - 40 , శ్లోకాలు - 92)*

నారదా ! దేవేంద్రుడు మనసారా శ్రీహరిని స్మరించాడు. బృహస్పతిని వెంటబెట్టుకుని దేవగణంతో బ్రహ్మదేవుడి దగ్గరికి వెళ్ళాడు. దూర్వాసుడి శాపాన్నీ తన దురవస్థనూ దేవతల స్థితిగతులనూ విన్నవించాడు. అందరూ శిరసా నమస్కరించారు. రక్ష - రక్ష అన్నారు. చతుర్ముఖుడు మందహాసం చేసి -

బిడ్డా ! నా వంశంలో జన్మించావు. నాకు మునిమనుమడివి. ఉచితానుచితాలు తెలిసినవాడివి. విచక్షణుడివి. పైగా బృహస్పతికి శిష్యుడివి. దేవతలకు అధిపతివి. నీ మాతామహుడు దక్షప్రజాపతి స్వయంగా విష్ణుభక్తుడు. ప్రతాపవంతుడు. ఇలా కులత్రయంలోనూ పవిత్రుడైనవాడు ఎలా అహంకరించగలుగుతాడు ? నీ తల్లి పతివ్రత. తండ్రి పరిశుద్ధుడు. మాతామహుడూ మాతులుడూ (మేనమామ) జితేంద్రియులు. మరి అటువంటివాడు ఎలా అహంకృతుడవుతాడు ? అవలెలా అహంకరించగలిగావు ? దుర్వాసుడిచ్చిన పారిజాతాన్ని - విష్ణుప్రసాదాన్ని - ఏనుగుమీదకి ఎలా



విసిరెయ్యగలిగావు ? పైతృక - మాతామహ - గురుదోషాలవల్ల మూడింటివల్లా సాధారణంగా మానవుడు హరిదోషి అవుతాడు.

కులత్రయం యస్య శుద్ధం కథం సోఽహంకృతో భవేత్ ।
మాతా పతివ్రతా యస్య పితా శుద్ధో జితేంద్రియః ॥
మాతామహో మాతులశ్చ కథం సోఽహంకృతో భవేత్ ।
జనః పైతృకదోషేణ దోషాన్మాతామహస్య చ ॥
గురుదోషాత్ త్రిభిర్దోషైః హరిదోషీ భవేత్ ధ్రువమ్ ॥ (41 - 7)

భగవంతుడు శ్రీహరి సర్వాంతర్యామి. సర్వదేహాలలోనూ (ఆత్మగా) ఉంటాడు. అతడు దేహం విడిచి వెళ్ళిపోతే అది ఆక్షణంలోనే శవమైపోతుంది. ప్రాణికోటిలో నేనే ఇంద్రియాధిపత్యం వహించే మనస్సును. శంకరుడు జ్ఞానస్వరూపుడు. విష్ణుమూర్తి ప్రాణం. ప్రకృతిదేవి - బుద్ధి స్వరూప. నిద్రాదిశక్తులన్నీ ఆ ప్రకృతిమాత కళలే. జీవుడంటే భోగశరీరధారి. పరమాత్మకు ప్రతిబింబం. ఆత్మస్వరూపుడైన ఈశ్వరుడు శరీరంనుంచి వెళ్ళిపోతే హడావిడిగా అందరూ వెళ్ళిపోతారు. మహారాజు ముందుకి కదిలితే పరివారమూ కదులుతుంది.

మనోఽహమింద్రియేశశ్చ జ్ఞానరూపో హి శంకరః ।
విష్ణుఃప్రాణాశ్చ ప్రకృతిర్బుద్ధిర్భగవతీ సతీ ॥
నిద్రాదయః శక్తయశ్చ తాః సర్వాః ప్రకృతేః కళాః ।
ఆత్మనః ప్రతిబింబశ్చ జీవో భోగశరీరభృత్ ॥
ఆత్మనీశే గతే దేహాత్ సర్వే యాంతి ససంభ్రమాః ।
యథా వర్త్మని గచ్ఛంతం నరదేవ మివానుగాః ॥ (41 -11)

శివుడూ ఆదిశేషుడూ విష్ణువూ ధర్ముడూ మహావిరాట్స్వరూపుడూ నువ్వూ నేనూ అందరమూ ఆ శ్రీకృష్ణపరమాత్మ అంశలమే. భక్తులమే. అటువంటి పరాత్పరుడి ప్రసాదంగా నీచేతికి వచ్చిన పుష్పాన్ని ధిక్కరించావా ? ఆ పుష్పంతోనేకదా శివుడు నిరంతరం శ్రీకృష్ణుడి పాదపద్మాలను పూజించేది. అది దుర్వాసుడి చేతులమీదుగా నీకు అందితే తిరస్కరించావా ? అయ్యయ్యో ! ఎంత అపరాధం ! ఎంత దురదృష్టం!! శ్రీకృష్ణుడి పాదపద్మాలనుంచి నేరుగా జారివచ్చిన ఆ పారిజాతాన్ని శిరసావహించినది ఏనుగైతే మాత్రమేమి అదే పరమపూజ్యం. దేవతలమందరమూ ముందుగా దాన్ని పూజించాలి. నువ్వు నిజంగా దైవవంచితుడివి. దైవమేకదా అన్నింటికన్నా బలీయం. నీలాంటి దురదృష్టవంతుణ్ణి ఎవరూ రక్షించలేరు.



నువ్వు చేసిన పిచ్చిపనికి అలిగి స్వర్గలక్ష్మి ఇప్పుడు వైకుంఠానికి వెళ్ళిపోయింది. నీ రాజ్యం రాక్షసుల పాలయ్యింది. పద, అందరమూ ఆ వైకుంఠానికే వెడదాం. శ్రీహరిని ప్రార్థిద్దాం. సేవిద్దాం. అతడు కరుణిస్తే నీ అదృష్టం బాగుంటే మళ్ళీ నీ స్వర్గలక్ష్మి నీకు దక్కుతుంది - అని అందరినీ వెంటబెట్టుకుని చతుర్ముఖుడు వైకుంఠానికి వెళ్ళాడు.

భగవంతుడూ, సనాతనుడూ తేజస్స్వరూపుడూ అయిన శ్రీకృష్ణపరబ్రహ్మను దర్శించారు. కోటి గ్రీష్మాదిత్యమండలాల్లాగా ప్రకాశిస్తున్నాడు. శాంతస్వరూపుడు. ఆదిమధ్యాంతరహితుడు. లక్ష్మీకాంతుడు. చతుర్భుజులైన పార్షదులూ సరస్వతీదేవీ సేవిస్తున్నారు. చతుర్వేదాలూ భక్తితో కీర్తిస్తున్నాయి. గంగాదేవి పరిచర్యలు చేస్తోంది. బ్రహ్మాదిదేవతలు అందరూ సాష్టాంగనమస్కారాలు చేశారు. అందరికీ కన్నులు చెమర్చాయి. మైమరిచి స్తుతించారు. బ్రహ్మదేవుడు వృత్తాంతమంతా విన్నవించాడు. దేవతలు ఒక్కపెట్టున బిగ్గరగా దుఃఖించారు. శ్రీమన్నారాయణుడు తేరిపారజూశాడు. దేవతల ముఖాల్లో భయమూ దైన్యమూ తాండవిస్తున్నాయి. కళాకాంతులు లేవు. పదవీచ్యుతులై వాహనాది వివర్జితులై శూన్యదేహాలతో బోసిపోతున్నారు.

## ◆ శ్రీహరి చేసిన లక్ష్మీప్రశంస ◆

హే బ్రహ్మన్! భయపడకు. దేవతలారా ! ధైర్యంగా ఉండండి. నేనుండగా భయమెందుకు ! మీ లక్ష్మిని మళ్ళీ మీకు సమకూరుస్తాను. అయితే నా మాట కాస్త వినండి. హితమూ సత్యమూ సారభూతమూ పరిణామంలో సుఖావహమూ చెబుతున్నాను. అసంఖ్యాక విశ్వాలూ ఆ విశ్వాల్లో ఉన్న జనాలూ నాకు అధీనులయినట్టే నేనూ నా భక్తులకు పరాధీనుడిని. అస్వతంత్రుణ్ణి. నా భక్తుడు ఎవరిమీదనైనా అలిగితే నేనింక వారి గృహాల్లో ఉండను. నా లక్ష్మితో సహా వచ్చేస్తాను. దీనికి తిరుగులేదు. దూర్వాసుడు శంకరాంశ సముద్భవుడు. నాకు అత్యంతాప్తభక్తుడు. వైష్ణవుడు. మత్పరాయణుడు. అతడిచ్చిన శాపం కారణంగా నేనూ లక్ష్మీదేవీ మీ గృహాలు విడిచి వచ్చేశాం. శంఖధ్వని, తులసి, శివారాధన, బ్రాహ్మణదేవతార్చన లేనిచోట లక్ష్మీదేవి క్షణకాలమైనా నిలవదు.

యత్ర శంఖధ్వనిర్నాస్తి తులసీ న శివార్చనమ్ ।
న భోజనం చ విప్రాణాం న పద్మా తత్ర తిష్ఠతి ॥ (41 - 30)

నా భక్తులను నిందించినా నన్ను నిందించినా రమాదేవికి భరించరాని కోపంవస్తుంది. తనకే పరాభవంగా భావిస్తుంది. హరివాసరానగానీ నా జన్మతిథినాడుగానీ ఉపవాసం ఉండక భుజించిన మూఢుని ఇంటిలో నిముషం ఉండదు. నా దివ్యనామాలను అమ్ముకునేవాడూ కన్యావిక్రయం చేసేవాడూ అతిథిని సత్కరించనివాడూ లక్ష్మీదేవి ఆగ్రహానికి గురి అవుతాడు. అతడి గుమ్మమైనా తొక్కదు. పాపాత్ముల ఇళ్ళకు వెళ్ళదు సరే. పాపాత్ముల ఇళ్ళకు వెళ్ళేవారి ఇళ్ళకుకూడా తాను వెళ్ళదు ఆచారభ్రష్టులూ



ధర్మభ్రష్టులూ అయితే వారి గృహాలనుంచి తక్షణం నిర్గమిస్తుంది. సూపకారులుగా వృషవాహకులుగా అశుద్ధ హృదయులుగా పరదూషకులుగా మారిపోయిన బ్రాహ్మణులంటే భయపడుతుంది. వారి చేతినీళ్ళు తాకవలసి వస్తుందని పారిపోతుంది. అభక్ష్యభక్షకులన్నా అగమ్యాగాములన్నా ఎంత అసహ్యమో చెప్పలేను.

గోటితో గడ్డిపరకలు తుంపుతూ నేలపైరాస్తూ నిరాశా నిస్పృహలకు లోనైనవారి ఇంట లక్ష్మి నిలవదు. సూర్యోదయ సమయాన భుజించడం, పగటిపూట నిద్రించడం, దివామైథునం - ఇలాంటి అపరాధాలు చేసే బ్రాహ్మణుడి ఇంట అస్సలు ఉండదు.

తృణం ఛినత్తి నఖరైస్తైర్వా యో విలిఖేన్మహీమ్ ।
నిరాశో బ్రాహ్మణో యత్ర తద్గృహాద్యాతి మత్ప్రియా ॥
సూర్యోదయే ద్విజో భుంక్తే దివాశాయిం చ బ్రాహ్మణః ।
దివామైథునకారీ చ యస్తస్మాద్యాతి మత్ప్రియా ॥ **(41 - 40)**

సంధ్యావిహీనుడూ అదీక్షితుడూ ఆచారవర్జితుడూ అయిన విప్రుడు లక్ష్మికి ప్రథమశత్రువు. తడికాళ్ళతోగానీ నగ్నంగాగానీ నిద్రించేవారి ఇంటినుంచి వెంటనే వెళ్ళిపోతుంది. వాచాలుడి ఇంటిలో కాలుమోపదు. అభ్యంగనస్నానం చేసి అపరిశుద్ధుణ్ణి తాకినా తొడలపై మద్దెలవాయించుకున్నా లక్ష్మికి కోపం వస్తుంది.

శిరః స్నాతస్తు తైలేన యోఽన్యాంగం సముపస్పృశేత్ ।
స్వాంగే చ వాదయేద్వాద్యం రుష్టా సా యాతి తద్గృహాత్ ॥ **(41 - 43)**

వ్రతోపవాసహీనుడూ విష్ణుభక్తివర్జితుడూ అశుచీ అయితే విప్రుడైనా అతడి ఇంట పద్మ ఉండదు. బ్రాహ్మణుల్ని ద్వేషించినా నిందించినా దయాహీనుడై జీవహింస చేసినా అటువంటివారి లోగిళ్ళనుంచి జగన్మాత లక్ష్మి కోపంతో పారిపోయివచ్చేస్తుంది.

బ్రాహ్మణం నిందయేద్యో హి తం చ యో ద్వేష్టి సంతతమ్ ।
జీవహింసో దయాహీనో యాతి సర్వప్రసూస్తతః ॥ **(41 - 45)**

హరిభక్తి హరిసేవ హరిగుణకీర్తన ఉన్నచోటల్లా తాను సర్వమంగళ ప్రదాయినిగా ఉంటుంది. శ్రీకృష్ణ ప్రశంసగానీ కృష్ణభక్తుల ప్రశస్తులుగానీ వినిపించేచోట స్థిరంగా నిలుస్తుంది. శంఖధ్వని సాలగ్రామ శిల తులసి ఉన్నచోటా వాటికి ధ్యానవందనాది సేవలు జరిగేచోటా తానై వెళ్ళి నిలుస్తుంది. శివలింగార్చన శివగుణస్తోత్రం దుర్గార్చన దుర్గాస్తుతి జరిగేతావుల్లో విప్రార్చన విప్రసేవ దేవతాపూజాదికం జరిగే గృహాలలో ఆలయాలలో స్థిరనివాసం ఏర్పరుచుకుంటుంది.



దేవతలకు వాస్తవాలను ఇలా ప్రబోధించి శ్రీమన్నారాయణుడు రమాదేవివైపు చూశాడు. చిరునవ్వులు ఏందించాడు. ప్రియా ! నువ్వు కళాంశరూపంతో క్షీరసాగరంలో జన్మించు - అని ఆజ్ఞాపించాడు. మళ్ళీ బ్రహ్మవైపు చూపులు త్రిప్పి - చతుర్వదనా ! క్షీరసాగరాన్ని మథించి లక్ష్మీదేవిని దేవతలకు ఇప్పించు - అని చెప్పేసి చటుక్కున లేచి అంతఃపురంలోకి వెళ్ళిపోయాడు.

కొంతకాలానికి దేవతలు క్షీరసముద్రతీరం చేరుకున్నారు. మందరపర్వతాన్ని కవ్వంగా చేసి శేషుణ్ణి తాడుగా పూన్చి కూర్మాన్ని మట్టుచుట్టుగా నిలిపి దేవదానవులు ఇరువైపులా నిలిచి క్షీరసాగరమథనం చేశారు. ధన్వంతరి అమృతం ఉచ్చైఃశ్రవం చింతామణి ఐరావతం సుదర్శనం లక్ష్మీదేవి ఆవిర్భవించాయి. లక్ష్మీదేవి స్వయంగా వనమాలను తెచ్చి విష్ణుమూర్తికి అలంకరించింది.

బ్రహ్మేశానాది సకలదేవతలూ లక్ష్మీదేవిని స్తుతించారు. సంతుష్టాంతరంగయై వారివైపు వారి గృహాలవైపూ క్రీగంటి చూపులు ప్రసరింపజేసింది. అందరూ మునుపటి శోభతో తేజస్సుతో ఆభరణాలతో వాహనాదులతో కళకళలాడారు. వారి గృహాలలో కళాకాంతులు మళ్ళీ వెల్లివిరిసాయి. ఇంద్రుడు తన అమరావతినీ స్వర్గలోకాన్నీ స్వాధీనం చేసుకున్నాడు. ***(అధ్యాయం - 41 , శ్లోకాలు - 59)***

## ◆ ఇంద్రుడు చేసిన లక్ష్మీపూజ లక్ష్మీస్తవం ◆

నారదా ! ఆ సమయంలో ఇంద్రుడు చేసిన లక్ష్మీపూజ ధ్యానం స్తోత్రం సవివరంగా చెబుతాను. తెలుసుకో - అని నారాయణమహర్షి కథను కొనసాగించాడు.

ఇంద్రుడు శుద్ధోదకాలలో స్నానంచేసి ధౌతవస్త్రాలు ధరించి కలశం స్థాపించి ఆ క్షీరసముద్రతీరాన లక్ష్మీదేవిని అర్చించాడు. ముందుగా గణేశ దినేశ వహ్ని విష్ణు శివ పార్వతులను ఆవాహన చేసి పుష్పగంధాదులతో పూజించాడు. పరమైశ్వర్య స్వరూపిణి మహాలక్ష్మిని ఆవాహన చేశాడు. బ్రహ్మదేవుడు పురోహితుడై వేదమంత్రాలు చదువుతుండగా వినయవినమితగాత్రుడై భక్తిప్రవత్తులతో అర్చించాడు. మునీంద్రులూ దేవతలూ బ్రాహ్మణులూ బృహస్పతి హరి హరుడు అందరూ ఎట్టఎదుట నిలిచి ఆనందిస్తున్నారు. పారిజాతపుష్పం తెచ్చి దానిమీద చందనం జల్లి ధ్యానించి మహాలక్ష్మి పాదపద్మాలకు సమర్పించాడు. సామవేదోక్తమైన ధ్యానం అది.

సహస్రదళపద్మస్థకర్ణికావాసినీం పరామ్ ।
శరత్పార్వణ కోటీందు ప్రభాముష్టికరాం పరామ్ ॥ (42 - 8)

వెయ్యిరేకుల తామరపువ్వు దుద్దుమీద కూర్చునే తల్లిని, కోటి శరత్పూర్ణిమలనాటి చంద్రబింబాల కాంతిని అపహరించే పరాదేవతను ధ్యానిస్తున్నాను. తేజస్సుతో ప్రజ్వరిల్లుతూ చూపులకు హాయిగొల్పుతూ కాగిన బంగారపు రంగులో రూపం ధరించి ఉన్న లక్ష్మీదేవిని ఉపాసిస్తున్నాను. పీతాంబరం ధరించి



రత్నభూషణాలు అలంకరించుకొని చిరునవ్వులు చిందిస్తూ ప్రసన్నవదనంతో ప్రత్యక్షమైన సుస్థిరయౌవతిని శ్రీహరి సతిని స్తుతిస్తున్నాను. శుభంకరియై సర్వసంపదలనూ ఇచ్చే మహాలక్ష్మిని సేవిస్తున్నాను.

ఇలా స్తుతించి షోడశోపచారాలూ మంత్రపూర్వకంగా చేశాడు. విశ్వకర్మ ప్రత్యేకంగా నిర్మించి తెచ్చిన దివ్యసింహాసనం సమర్పించి, పుష్పచందనదూర్వాది సంయుతంగా గంగోదకాలనూ శంఖతీర్థాలనూ అర్ఘ్యపాద్యాలుగా ఇచ్చి, ఆమలకీఫలయుక్తంగా సుగంధి పుష్పతైలాన్ని దేహసౌందర్యవర్ధకంగా సమర్పించి, విలువైన పట్టుచీరలు పెట్టి, రత్నాభరణాలు ఇచ్చి, పరిమళ భరితమైన ధూపాన్ని ఆఘ్రాణింపజేసి, జగచ్చక్షూరూపమూ తిమిరాపహమూ దీపాన్ని చూపించి, ఘుమఘుమలాడే చందనాన్ని జల్లి, షడ్రసోపేతమూ అత్యంతరుచికరమూ నైవేద్యాన్ని సమర్పించాడు. అన్నమూ పాయసమూ స్వస్తికమూ పక్వఫలాలూ కామధేనువిచ్చిన పాలూ పెరుగూ వెన్న నెయ్యి, చెరకు బెల్లం, గోధుమరవ్వతో బెల్లమూ పాలూ నెయ్యీ కలిపి వండిన (మిష్టాన్నం) ప్రసాదం - నివేదన చేశాడు.

యవగోధుమసస్యానాం చూర్ణరేణు సముద్భవమ్ ।
సుపక్వం గుడగవ్యాక్తం మిష్టాన్నం దేవి గృహ్యతామ్ ॥ (42 - 28)

శీతల వాయువులను విరజిమ్మే విసినకర్రనూ, కర్పూర సువాసితమై జిహ్వాజాడ్యాన్ని వదిలించే తాంబూలాన్నీ, సువాసితమూ సుశీతమూ పానీయాన్నీ, ఆచమనీయాన్నీ మరో పట్టువస్త్రయుగ్మాన్నీ, మరో రత్నభూషణాన్నీ, అన్ని ఋతువులలోనూ వాడిపోకండా నవనవలాడుతూ సువాసనలు నింపే దివ్యపుష్పమాలికనూ, గంధాన్నీ శుద్ధోదకాన్నీ, రత్ననిర్మిత - పుష్పచందనచర్చిత - వస్త్రభూషిత మనోహర తల్పాన్నీ, భక్తితో సమర్పించాడు. ఓ పరాదేవతా ! ఈ భూగోళంలో ఈ స్వర్లోకంలో అపూర్వమూ దుర్లభమూ దేవభూషార్హమూ భోగార్హమూ అయిన ప్రతిద్రవ్యాన్నీ నీకు కానుకగా పూజావస్తువుగా నైవేద్యంగా సమర్పిస్తున్నాను, దయతో స్వీకరించు.

యద్యత్ ద్రవ్యమపూర్వం చ పృథివ్యామపి దుర్లభమ్ ।
దేవభూషార్హభోగ్యం చ తత్ద్రవ్యం దేవి గృహ్యతామ్ ॥ (42 - 40)

ఇలా షోడశోపచారాలూ చేసి మహాలక్ష్మీమూలమంత్రాన్ని పదిలక్షలు జపించాడు. దానితో మంత్రసిద్ధి కలిగింది. ఈ మంత్రం కల్పవృక్షంలాంటిది. బ్రహ్మదేవుడు ఉపదేశించాడు. లక్ష్మీమాయా కామవాణీ బీజాక్షరపూర్వకంగా కమలావాసిన్యై స్వాహా. ఇది వేదోక్త మంత్రరాజం. కుబేరుడు దక్షుడు సావర్ణి మనువు మంగళుడు సప్తద్వీపాధిపతులు ప్రియవ్రతుడు ఉత్తానపాదుడు కేదారనృపతి ఇత్యాదులందరూ ఈ మహామంత్రాన్ని ఉపాసించి అనుగ్రహసిద్ధులు పొందారు.



మంత్రం సిద్ధించడంతోనే మహాలక్ష్మి నిజస్వరూపంతో ఇంద్రుడికి దర్శనమిచ్చింది. దివ్యవిమానం మీద వరదాభయహస్తాలతో కనిపించింది. శరీరకాంతులు సప్తద్వీపాలకూ వ్యాపిస్తున్నాయి. రత్న భూషణాల ధగధగలలో తెల్ల సంపంగిలాగా ఉంది. ప్రసన్నవదనంతో దరహాసం చేస్తోంది. భక్తానుగ్రహకాతర. మెడలో రత్నమాల కోటిచంద్రసమప్రభంగా మెరుస్తోంది.

పురందురుడి కళ్ళు చెమ్మగిల్లాయి. తనువు పులకించింది. బ్రహ్మదేవు డుపదేశించిన వేదోక్త స్తోత్రరత్నాన్ని అనర్గళంగా పఠించాడు. కమలవాసినికి నారాయణికి కృష్ణప్రియకు మహాలక్ష్మికి నమస్కారం. పద్మపత్రేక్షణకు పద్మాస్యకు పద్మాసనకు పద్మినికి వందనం. వైష్ణవికి సర్వసంపత్స్వరూపిణికి సర్వారాధ్యకు ఏటికోళ్ళు. హరిభక్తి ప్రదాత్రికి హర్షదాత్రికి కృష్ణవక్షఃస్థితకు కృష్ణేశకు నతులు. అందమైన రత్నపద్మంలో చంద్రశోభాస్వరూపకు సంపదధిష్ఠానదేవతకు మహాదేవికి ప్రణతులు. బుద్ధిస్వరూపకు బుద్ధిదాయికి శిరసువంచి అయిదు పదిచేస్తున్నాను.

నమః కమలవాసిన్యై నారాయణ్యై నమోనమః ।
కృష్ణప్రియాయై సతతం మహాలక్ష్మ్యై నమోనమః ॥
పద్మపత్రేక్షణాయై చ పద్మాస్యాయై నమోనమః ।
పద్మాసనాయై పద్మిన్యై వైష్ణవ్యై చ నమోనమః ॥
సర్వసంపత్స్వరూపిణ్యై సర్వారాధ్యాయై నమోనమః ।
హరిభక్తి ప్రదాత్ర్యై చ హర్షదాత్ర్యై నమోనమః ॥
కృష్ణవక్షఃస్థితాయై చ కృష్ణేశాయై నమోనమః ।
చంద్రశోభా స్వరూపాయై రత్నపద్మే చ శోభనే ॥
సంపత్త్యధిష్ఠాతృదేవ్యై మహాదేవ్యై నమోనమః ।
నమో బుద్ధిస్వరూపాయై బుద్ధిదాయ్యై నమోనమః ॥ (42 - 55)

వైకుంఠంలో మహాలక్ష్మివి. క్షీరసాగరంలో మాయాలక్ష్మివి. అమరావతిలో స్వర్గలక్ష్మివి. మహారాజులకు రాజ్యలక్ష్మివి. ఇంటింటా గృహలక్ష్మివి. సాగరంలో సురభిగా (కామధేనువు) అవతరించావు. యజ్ఞకర్మల్లో నువ్వు దక్షిణాదేవివి. దేవమాత అదితివి నువ్వే. కమలవు. కమలాలయవు. హవిర్దానసమయంలో నువ్వు స్వాహాదేవివి. కవ్యదానంలో స్వధాదేవివి. నువ్వు విష్ణురూపవు. సర్వాధార వసుంధరవు. శుద్ధసత్త్వస్వరూపవు. నారాయణపరాయణవు. క్రోధహింసా వివర్జితవు. వరదవు. శారదవు. పరమార్థప్రదవు. హరిదాస్యప్రదాయినివి. పరాదేవతవు. నువ్వు లేకపోతే జగత్తు నిస్సారమూ భస్మప్రాయమూ అయిపోతుంది. విశ్వమంతా జీవన్మృతమవుతుంది. నువ్వు అందరికీ మాతృమూర్తివి. సర్వబాంధవ స్వరూపిణివి. ధర్మార్థకామమోక్షాలకు



కారణరూపిణివి. శిశువులుగా ఉన్నంతవరకే కన్నతల్లులు పాలుకుడిపి బిడ్డలను సంరక్షిస్తారు. నువ్వుమాత్రం అందరికీ అన్నివేళలా అన్ని రూపాలలోనూ కన్నతల్లివై సాకుతుంటావు.

**యథా మాతా స్తనాంధానాం శిశూనాం శైశవే సదా ।**
**తథా త్వం సర్వదా మాతా సర్వేషాం సర్వరూపతః ॥** **(42 - 63)**

తల్లిలేని శిశువుల్ని కాపాడటానికి మానవులో దేవతలో ఉన్నారు. నువ్వులేని వాడిని కాపాడేందుకు ఇంక ఎవ్వరూ లేరు. నువ్వు నిరంతరం సుప్రసన్నవు. నాపట్లకూడా రవ్వంత ప్రసన్నవై అనుగ్రహించు. నా రాజ్యాన్ని శత్రువులు ఆక్రమించుకున్నారు. చెయ్యిజారిపోయింది. ఓ సనాతనీ ! దాన్ని మళ్ళీ నాకు ఇప్పించు. నువ్వూ నీ అనుగ్రహమూ నావెంట లేనంతవరకూ నేను బంధుహీనుణ్ణి. భిక్షుమాత్రుణ్ణి. సర్వసంపద్విరహితుణ్ణి. దరిద్రుణ్ణి. సర్వసౌభాగ్యప్రదమైన ధర్మాన్నీ జ్ఞానాన్నీ నాకు ఉపదేశించు. నా ప్రతాపాన్నీ ప్రభావాన్నీ రాజ్యాధికారాన్నీ పరాక్రమాన్నీ ఐశ్వర్యాన్నీ జయాన్నీ మళ్ళీ నాకు అందించు.

దేవేంద్రుడు ఆర్తితో అభ్యర్థించాడు. దేవతాగణాలతో సహా సాష్టాంగపడ్డాడు. వలవలా విలపించాడు. బ్రహ్మేశాన శేషధర్మ కేశవులు కూడా ఇంద్రుడి పక్షానా దేవతల పక్షానా లక్ష్మీదేవి అనుగ్రహాన్ని అభ్యర్థించారు.

మహాలక్ష్మి ప్రసన్నురాలయ్యింది. దేవతలకు అభీప్సితవరాలు అన్నీ ఇచ్చింది. కేశవుడికి పుష్పమాలిక బహూకరించింది. దేవతలు సంతోషించి తమ లోకానికి వెళ్ళిపోయారు. మహాలక్ష్మీదేవి శ్రీహరి సన్నిధికి చేరుకుంది. బ్రహ్మేశానాదులూ ఇంద్రాదిదేవతలను మనసారా ఆశీర్వదించి సంతృప్తులై తమతమ లోకాలకు వెళ్ళారు.

నారదా ! పుణ్యప్రదమైన ఈ లక్ష్మీస్తవాన్ని త్రిసంధ్యలలోనూ పఠించేవారు కుబేరులవుతారు. రాజరాజేశ్వరులవుతారు. లక్ష్మీదేవి వారింటిలో స్థిరంగా నివసిస్తుంది. అయిదు లక్షలసార్లు భక్తితో పఠిస్తే స్తోత్రసిద్ధి కలుగుతుంది. అటుపైని మరొక్కనెల సిద్ధస్తోత్ర పఠనం చేస్తే అతడు నిస్సంశయంగా మహారాజేంద్రుడూ మహాసుఖి అవుతాడు. *(అధ్యాయం - 42 , శ్లోకాలు - 75)*

శౌనకాది మహామునులారా ! మహాలక్ష్మి ఉపాఖ్యానంతో నారదుడు ఆనందపరవశుడయ్యాడు. శరీరం పులకించింది. కళ్ళల్లో ఆనందబాష్పాలు జాలువారాయి. నారాయణమహర్షిని వేనోళ్ళ కొనియాడాడు.

నారాయణమహర్షీ ! నువ్వు సాక్షాత్తూ నారాయణుడివి. రూప గుణ తేజో యశః కాంతులలో సమానుడివి. జ్ఞానులలో యోగులలో సిద్ధులలో ఉత్తముడివి. వేదవేత్తలలో తపస్వులలో మునీశ్వరులలో ప్రథముడివి. మహాలక్ష్మి ఉపాఖ్యానాన్ని అద్భుతంగా వినిపించావు. ధన్యుణ్ణి. ఇక నీ ఇష్టం. నువ్వు ఏది వినిపించాలి అనుకుంటే అది వినిపించు. వేదపురాణాలలో అత్యంత నిగూఢంగా ఉన్న విషయాలన్నీ నీకు కరతలామలకాలు. అటువంటి సారభూతమైన ఉపాఖ్యానం ఏదో నిశ్చయించి ఉపదేశించు.



నారదా ! అటువంటివి చాలా ఉన్నాయి. ఏదని చెప్పను. అందుకని నువ్వే ఏమి వినాలనుకుంటున్నావో అడుగు. అదే చెబుతాను.

మహర్షీ ! హవిర్దాన సమయంలో స్వాహాదేవి, పితృదాన కర్మల్లో స్వధాదేవి, తక్కిన క్రతువుల్లో దక్షిణాదేవి వినిపిస్తుంటారుగదా ! వారి చరిత ఇంతవరకూ నేను వినలేదు. నీనోటినుంచి వినాలని ఉంది.

## ◆ స్వాహా వృత్తాంతం ◆

నారదా ! సృష్టి ఆరంభంలో దేవతలు ఆహారంకోసం అలమటించి బ్రహ్మదేవుణ్ణి శరణువేడారు. బ్రాహ్మణక్షత్రియులు యజ్ఞాలలో సమర్పించే హవిర్దానాల్లు వీరికి అందడంలేదు. రాక్షసులు బలవంతంగా లాగేసుకుంటున్నారు. దేవతలు నిరాహారులయ్యారు. తాళలేక బ్రహ్మను శరణు అన్నారు. ఆయన ధ్యానమగ్నుడై శ్రీకృష్ణపరమాత్మను శరణు శరణు అన్నాడు. ఆ యజ్ఞస్వరూపుడు ప్రకృతిరూప మహాదేవిని ఉపాసించమన్నాడు. బ్రహ్మ ఉపాసించాడు. దేవి ప్రసన్నురాలై ప్రత్యక్షమయ్యింది. వరం కోరుకోమంది.

జగన్మాతా ! దయచేసి నువ్వు అగ్నికి దాహకశక్తిగా అవతరించు. నువ్వులేనిదే అగ్ని దేనినీ దహించలేనివాడు అవ్వాలి. అగ్నిలో హవిస్సులు వేల్చేటప్పుడు ప్రతిమంత్రానికీ చివర నీపేరు ఉచ్చరించాలి. అప్పుడే అది నీశక్తితో అగ్నిదగ్ధమవుతుంది. దాన్ని దేవతలు ఆనందంగా స్వీకరించి సంతృప్తులవుతారు. ఇది దేవకార్యం. దేవతల ఆకలి తీర్చడానికి సహకరించు. నువ్వు కన్నతల్లివి. అగ్నికి ఇల్లాలివై శోభ - శక్తి కలిగించు.

చతుర్వదనా ! నేను శ్రీకృష్ణపరమాత్మను కోరి తపస్సు చేస్తున్నమాట నీకు తెలుసుగదా ! మరి ఈ అభ్యర్థన ఏమిటి ? నువ్వూ నేనూ శివుడూ ఆదిశేషుడూ ధర్ముడూ గణేశుడూ అందరం మన విధులను నిర్వర్తించగలుగుతున్నామంటే అది అంతా ఆ పరాత్పరుడి ఆజ్ఞయేకదా ! అంతటివాడికి ఇల్లాలిని కాదలిచి ఇప్పుడు దేవతలకోసమని అగ్నికి పరిచర్యలు చెయ్యనా ! ఎలాగ ? ఆ కృష్ణపరమాత్మనే ధ్యానిస్తాను. ఆయన ఆజ్ఞ ఎలాఉంటే అలా చేస్తాను - అని చెప్పి ప్రకృతిదేవి ధ్యానంలో మునిగిపోయింది. తన తపస్సు కొనసాగించింది. ఒంటికాలిమీద నిలిచి లక్షసంవత్సరాలు చేసింది. శ్రీకృష్ణపరమాత్మ దర్శనమిచ్చాడు. ఆ మనోహరరూపాన్ని చూస్తూనే ప్రకృతి కామపరవశయై మూర్ఛపోయింది. ఆవిడ అభిప్రాయాన్ని గ్రహించిన ఆ సర్వజ్ఞుడు మెల్లగా లేవనెత్తి తపస్సుతో అలిసిపోయిన ఆ కృశాంగిని తన ఒడిలో కూర్చోబెట్టుకున్నాడు.

ప్రకృతీ ! నగ్నజిత్తు కూతురుగా నాగ్నజితి పేరుతో నువ్వు నాకు ఇల్లాలివవుతావు. అప్పుడు నీ కోరిక తీరుతుంది. నా వరాహావతారంలో కళాంశగా వారాహివవుదువుగాని. అప్పుడూ నీ కోరిక తీరుతుంది. ఇప్పుడు అగ్నికి దాహికశక్తివై స్వాహావధువుగా దేవతలకు ఉపకారం చెయ్యి. నా ప్రసాదంగా నీకు మంత్రరూప పూజ లభిస్తుంది. అగ్నిదేవుడు ఇల్లాలిని నిన్ను భక్తిభావంతో పూజిస్తాడు. నీతో ఆనందిస్తాడు - అని చెప్పేసి అంతర్ధానం చెందాడు.



అంతలోకీ వహ్నిదేవుడు బ్రహ్మ ఆజ్ఞప్రకారం భయభక్తులతో అక్కడికి వచ్చాడు. సామవేదోక్తంగా జగదంబికను ఆ ప్రకృతిదేవిని ధ్యానించాడు. పూజించాడు. స్తుతించాడు. మంత్రపూర్వకంగా పాణిగ్రహణం చేశాడు.

ఆ దంపతులు నిర్జన ప్రదేశాలలో నూరేళ్ళపాటు కామక్రీడల్లో తేలియాడారు. స్వాహాదేవి గర్భం ధరించింది. పన్నెండు దివ్యసంవత్సరాలు మోసి దక్షిణాగ్ని గార్హపత్యాగ్ని ఆహవనీయాగ్ని అని ముగ్గురు పుత్రులను ప్రసవించింది.

ఋషులూ మునులూ బ్రాహ్మణులూ క్షత్రియులూ స్వాహాంతంగా మంత్రాలు ఉచ్చరించి హవిర్దానాలు చేశారు. స్వాహా శబ్దాంతమైన మంత్రాన్ని ఉచ్చరిస్తే చాలు పాపాలు తొలగిపోతాయి. విషహీనమైన సర్పం వేదహీనుడైన విప్రుడు పతిసేవా విహీనయైన స్త్రీ విద్యావిహీనుడైన పురుషుడు ఫలశాఖా విహీనమైన వృక్షం ఎలా నింద్యాలూ నిష్ప్రయోజనాలో అలాగ స్వాహాశబ్ద విహీనమైన మంత్రం నిష్ఫలం. ఇలా స్వాహాంతమైన మంత్రాలతో చేసిన ఆహుతులు అందుకుంటూ దేవతలు ఆనందించారు. ఇది భుక్తి ముక్తిప్రదమైన స్వాహాదేవి ఉపాఖ్యానం. నారదా ! ఇంకా ఏమి కావాలో అడుగు. అని నారాయణమహర్షి విరమించాడు.

మహర్షీ ! అగ్నిదేవుడు భయభక్తులతో స్వాహాదేవిని సామవేదోక్తంగా ధ్యానించాడు, స్తుతించాడు, పూజించాడు అన్నావుకదా ! వాటిని మరికాస్త వివరంగా తెలియజేసి పుణ్యంకట్టుకో - అన్నాడు నారదుడు.

బ్రహ్మపుత్రా ! సావధానంగా ఆలకించు. ఏ యజ్ఞం చెయ్యాలన్నా మున్ముందుగా స్వాహాదేవిని సాలగ్రామంలోగానీ కలశంలోగానీ ఆవాహనచేసి అర్చించాలి. ఆవిడ యజ్ఞమంత్రాలకు ప్రధానాంగం మంత్రసిద్ధిస్వరూపిణి. ఆవిడను అర్చించకపోతే యజ్ఞం సాగదు. సఫలం కాదు.

స్వాహాం మంత్రాంగయుక్తాం చ మంత్రసిద్ధి స్వరూపిణీమ్ ।
సిద్ధాం చ సిద్ధిదాం నౄణాం కర్మణాం ఫలదామ్ శుభామ్ ॥ (43 - 47)

ఇలా ధ్యానించి ఆవాహన చేసి షోడశోపచారాలూ చెయ్యాలి. ఓం హ్రీం శ్రీం వహ్నిజాయాయై దేవ్యై స్వాహా అనేది మూలమంత్రం. దీనితో పూజలు చేస్తే అనుగ్రహిస్తుంది. అభీష్టాలు తీరుస్తుంది.

స్వాహా వహ్నిప్రియా వహ్నిజాయా సంతోషకారిణీ ।
శక్తిః క్రియా కాలదాత్రీ పరిపాకకరీ ధ్రువా ॥
గతిస్సదా నరాణాం చ దాహికా దహనక్షమా ।
సంసారసారరూపా చ ఘోరసంసారతారిణీ ॥
దేవజీవనరూపా దేవపోషణకారిణీ ।
షోడశైతాని నామాని యః పఠేద్భక్తి సంయుతః ॥
సర్వసిద్ధిర్భవేత్తస్య ఇహ లోకే పరత్ర చ ॥ (43 - 53)



నారదా ! ఇది అలనాడు అగ్నిదేవుడు స్తుతించిన షోడశనామావళి. దీన్ని భక్తితో పఠిస్తే అంగహీనుడికి కూడా క్రియాకౌశలం అబ్బుతుంది. అపుత్రులు పుత్రవంతులవుతారు. భార్యాదూరుడు భార్యా సహితుడవుతాడు. దంపతులు సుఖసంతోషాలతో వర్ధిల్లుతారు. *(అధ్యాయం - 43, శ్లోకాలు - 55)*

## ◆ స్వధా వృత్తాంతం ◆

నారదా ! ఇక స్వధాదేవి ఉపాఖ్యానం చెబుతాను విను. ఇది పితృదేవతలకు తృప్తి కలిగిస్తుంది. శ్రాద్ధాన్నఫలాన్ని వృద్ధిపొందిస్తుంది. సృష్టికి ఆదిలో బ్రహ్మదేవుడు పితృగణాలను ఏడింటిని సృష్టించాడు. అందరూ తేజస్స్వరూపులు. మనోహరులు. సుఖస్వరూపులు. వారికి తర్పణాలూ శ్రాద్ధాన్నమూ ఆహారంగా కల్పించాడు. బ్రాహ్మణులకు తర్పణపర్యంతమైన స్నానమూ, దేవపూజనపర్యంతమైన శ్రాద్ధమూ త్రిసంధ్యాంతమైన ఆహ్నికమూ వేదవిహిత కర్మలు. ముప్పొద్దులా శ్రాద్ధతర్పణాలు చెయ్యాలి. బలిప్రదానం చెయ్యాలి. బ్రహ్మయజ్ఞ (వేదపఠన) చెయ్యాలి. ఇవి చెయ్యకపోతే మైలపడ్డట్టే. ఏ కర్మాచరణకూ అర్హుడు కాడు.

బ్రహ్మ ఇలా నియమాలు ఏర్పరిచి పితృదేవతలకు ఆకలి దప్పికలు లేకుండా బ్రాహ్మణులు నిత్యమూ తర్పణాలు విడిచిపెట్టేలా చూశాడు. బ్రాహ్మణులు అలా మంత్రపూర్వకంగా ఇస్తూనే ఉన్నారుగానీ ఎక్కడ ఏలోపం జరుగుతోందో అవి పితృదేవతలకు అందడంలేదు. వాళ్ళు హాహాకారాలు చేస్తూ బ్రహ్మదేవుడికి విన్నవించుకున్నారు.

చతుర్ముఖుడు ఒక మానసపుత్రికను సృష్టించాడు. రూపయౌవన సంపన్న. చంద్రవదన. విద్యావతి. గుణవతి. రూపవతి. శ్వేతచంపకంలాగా నిగనిగలాడుతోంది. రత్నభూషలు ధగధగలాడుతున్నాయి. ఆవిడ పరాప్రకృతిశక్తిలో ఒక అంశం. శుభప్రదంగా చిరునవ్వులు చిందిస్తోంది. పలువరుస తీర్చిదిద్దినట్టుంది. లక్ష్మీకళ ఉట్టిపడుతోంది. ఆవిడకు స్వధాదేవి అని నామకరణం చేసి పితృదేవతలకు భార్యగా సమర్పించాడు. ఆవిడ పద్మాస్య. పద్మలోచన. పద్మజ. పద్మపాద. తుష్టిరూపిణి. ఆవిడను స్వీకరించి పితృదేవతలు సంతోషించారు. తృప్తి చెందారు.

అటుపైని బ్రాహ్మణులకు రహస్యంగా ఒక ఉపదేశం చేశాడు. పితృదేవతలకు మీరు ఇచ్చే తర్పణ శ్రాద్ధాన్నాలను స్వధాంతంగా మంత్రాలు ఉచ్చరిస్తూ సమర్పించండి. అప్పుడే అవి పితృదేవతలకు అందుతాయి అని చెప్పాడు. అప్పటినుంచీ విప్రులందరూ అలాగే చెయ్యనారంభించారు. అవి పితృదేవతలకు అందనారంభించాయి. వారు ఆకలిదప్పులు తీరి ఆనందించారు.

దేవతలకు హవిర్దానాలు చేసేటప్పుడు మంత్రాలు స్వాహాంతంగా ఉండాలి. పితృదానాల్లో స్వధాంతంగా ఉండాలి. ఈ దేవ పితృయజ్ఞాలు అన్నింటా దక్షిణాదేవి తప్పదు. అదక్షిణగా చేసే యజ్ఞం నిష్ఫలం. మృతప్రాయం.



స్వాహా శస్తా దేవదానే పితృదానే స్వధా స్మృతా ।
సర్వత్ర దక్షిణా శస్తా హతం యజ్ఞమదక్షిణమ్ ॥ (44 - 15)

శరదృతువులో కృష్ణత్రయోదశినాడుగానీ మాఘమాసంలోగానీ శ్రాద్ధసమయాలలోగానీ ముందుగా స్వధాదేవిని పూజించి అటుపైని పితృయజ్ఞాలు జరపాలి. అలా చేయకుండా అహంకరించి తర్పణాలు విడిచినా శ్రాద్ధాన్నం (పిండం) పెట్టినా అది పితృదేవతలకు అందదు. కర్తకు ఫలం దక్కదు.

బ్రహ్మణో మానసీం కన్యాం శశ్వత్ సుస్థితయౌవనామ్ ।
పూజ్యాం వై పితృదేవానాం శ్రాద్ధానాం ఫలదాం భజే ॥ (44 - 23)

ఇది స్వధాధ్యానశ్లోకం. దీన్ని పఠించి సాలగ్రామ శిలలోగానీ మంగళకలశంలోగానీ స్వధాదేవిని ఆవాహన చెయ్యాలి. అర్ఘ్యపాద్యాదులు ఇవ్వాలి. మూలమంత్రం జపించాలి. ఓం హ్రీం శ్రీం క్లీం స్వధాదేవ్యై స్వాహా - అనే మూలమంత్రంతో పూజచేసి స్తుతించి నమస్కరించాలి. తొట్టతొలిగా బ్రహ్మదేవుడే స్వధాస్తుతి చేశాడు.

పితౄణాం ప్రాణతుల్యా త్వం ద్విజజీవనరూపిణీ ।
శ్రాద్ధాధిష్ఠాతృదేవీ చ శ్రాద్ధాదీనాం ఫలప్రదా ॥
నిత్యా త్వం సత్యరూపాసి పుణ్యరూపాసి సువ్రతే ।
ఆవిర్భావ తిరోభావౌ సృష్టౌ చ ప్రళయే తవ ॥
ఓం స్వస్తిశ్చ నమః స్వాహా స్వధా త్వం దక్షిణా తథా ।
నిరూపితాశ్చతుర్వేదైః ప్రశస్తాః కర్మిణాం పునః ॥
కర్మపూర్త్యర్థమేవైతా ఈశ్వరేణ వినిర్మితాః ॥ (44 - 34)

స్వధాదేవీ ! నువ్వు పితృదేవతలకు ప్రాణసమానవు. బ్రాహ్మణులకు జీవనప్రదవు. శ్రాద్ధాధిష్ఠాన దేవతవు. శ్రాద్ధతర్పణ ఫలప్రదవు. నిత్యవు. సత్యవు. పుణ్యరూపవు. ఓ సువ్రతా ! సృష్టివేళ నువ్వు ఆవిర్భవించి ప్రళయవేళ తిరోధానం చెందుతావు. కర్మిష్ఠులకోసం నువ్వూ స్వాహాదక్షిణలూ ఆవిర్భవించారని వేదాలు నిరూపించి ప్రశంసించాయి. కర్మకాండకు పరిపూర్ణత సిద్ధించడంకోసమే ఈశ్వరుడు మిమ్మల్ని నిర్మించాడు.

ఇది బ్రహ్మదేవుడు తన కొలువులో చేసిన స్వధాస్తుతి. దీన్ని పఠించినవారికి సర్వవాంఛలూ నెరవేరతాయి. స్వధా అని ఉచ్చరిస్తే చాలు తీర్థస్నానఫలం దక్కుతుంది. సర్వపాపాలూ తొలగిపోతాయి. వాజపేయఫలం లభిస్తుంది. స్వధా స్వధా స్వధా అని ముమ్మార్లు ఉచ్చరిస్తే శ్రాద్ధ - బలి - తర్పణ ఫలాలు అందుతాయి. శ్రాద్ధకాలంలో స్వధాస్తోత్రాన్ని ఏకాగ్రచిత్తంతో వింటే శ్రాద్ధఫలం దక్కుతుంది. ముప్పొద్దులా



స్వధా స్వధా స్వధా అని మూడేసిసార్లు ధ్యానిస్తే ప్రియాసంగమ పుత్రప్రాప్తులు ఫలాలుగా చెబుతున్నారు. స్వధా స్తోత్రపఠనంవల్ల సకల తీర్థాలలోనూ స్నానంచేసిన పుణ్యం తప్పక లభిస్తుంది - అని చెప్పి బ్రహ్మదేవుడు ఆ సౌందర్యరాశి స్వధాదేవిని పితృదేవతలకు అప్పగించాడు. వారు స్వీకరించి ఆనందించారు.

*(అధ్యాయం - 44, శ్లోకాలు - 36)*

## ◆ దక్షిణాదేవి వృత్తాంతం ◆

నారదా ! ఇప్పుడింక దక్షిణాదేవి వృత్తాంతం చెబుతాను. అదికూడా శ్రద్ధగా వినేసెయ్. గోలోకంలో సుశీల అని ఒక గోపిక ఉండేది. శ్రీహరికి ప్రేయసి. రూపయౌవన సౌందర్యాదులన్నింటా రాధాదేవిలాగానే ఉంటుంది. విద్యావతి. గుణవతి. కళావతి. కోమలాంగి. చక్కని పలువరుస కలిగిన సుందరీమణి (సుదతి). కమలలోచన. అవయవాల పొందికలో అద్వితీయ. నగుమోము. రత్నాలంకారాలు. దొండపండులాంటి పెదవి. యౌవనమధ్యస్థ (శ్యామ). లేడిచూపులు. హంసగమనం. కామశాస్త్రంలో ప్రవీణ. తెల్ల సంపంగి రంగు. కృష్ణుడి అంతరంగాన్ని ఎరిగి అలరించగల నెరజాణ. రసజ్ఞ. రసిక. రాసేశ్వరసోత్సుక. కృష్ణప్రియభామిని.

ఒకనాడు ఈ సుశీల ఒక పొదరింట్లో శ్రీకృష్ణుడితో క్రీడించి అలిసిపోయి అతడి ఒడిలో పడుకుని నిద్రపోయింది. అదే సమయానికి రాధాదేవి అటువైపు వచ్చింది. వీరిద్దరినీ చూసింది. కోపంతో భగ్గుమంది. కళ్ళు ఎర్రబడ్డాయి. ముఖం కందగడ్డలా మారింది. అధరం వణుకుతోంది. శరీరం కోపం పట్టలేక ఊగిపోతోంది. తిట్టలేదు. కొట్టలేదు. చుర్రున చూసి గిర్రున తిరిగి విసవిసా నడుచుకుంటూ వెళ్ళిపోయింది.

శ్రీకృష్ణుడు ముఖం దించుకున్నాడు. రాబోయే కలహాన్ని తలచుకుని భయపడ్డాడు. సుశీలను నిద్రలేపి చటుక్కున లేచి పారిపోయాడు. సుశీల వెంటబడింది. గోపగోపీజనం మూడులక్షల కోట్లమంది శ్రీకృష్ణుడిని అనుసరించారు. తమ పతి. తమ నాథుడు. తమను విడిచి వెళ్ళిపోతున్నాడు. అందరూ బోరుబోరున విలపిస్తూ వెంటబడ్డారు.

పారిపోతున్న కృష్ణుడినీ వెంటబడిన సుశీలనూ చూసింది రాధిక. కోపం ఆపుకోలేక సుశీలను శపించింది. ఈరోజునుంచీ సుశీల ఈ గోలోకంలో అడుగుపెట్టిందంటే భస్మమైపోతుంది - అనేసింది.

ఎంత బతిమాలినా ఆగకుండా కృష్ణుడు పారిపోయాడు. ఎటు వెళ్ళాడో ఎక్కడ దాక్కున్నాడో ఎవరికీ ఎంతకీ అంతుబట్టలేదు. ఉస్సురంటూ అందరూ తిరిగి వచ్చారు. రాధమ్మను శరణువేడారు. కృష్ణుణ్ణి రప్పించమనీ కోపం ఉపసంహరించుకోమనీ పాదాలుపట్టి ప్రార్థించారు.

రాసేశ్వరి రాధాదేవి రాసమండలంలో నిలబడి శ్రీకృష్ణుడిని ఆవాహన చేసింది. కానీ కృష్ణుడు ప్రత్యక్షం కాలేదు. రాధాదేవి ఆ విరహం తట్టుకోలేకపోయింది. క్షణం ఒక్కొక్కటీ కోటియుగాలై బరువుగా సాగుతోంది.



'హేకృష్ణ ! ప్రాణనాథా ! ప్రాణేశా ! చేరరావయ్యా ! ప్రాణాధిక ప్రియా ! ప్రాణాధిష్ఠానదేవతా ! దర్శనం అనుగ్రహించు. నువ్వు కనిపించకపోతే సన్నిధిలో లేకపోతే ప్రాణాలు పోతున్నాయి. పతి సౌభాగ్యంవల్లనే కదా స్త్రీలకు గౌరవమూ గర్వమూ పెరిగేది ! అందుకని సుఖంగా నిరంతరం ధర్మబద్ధంగా పతిని సేవించాలి. కులస్త్రీలకు మగడే బంధువు. ప్రాణాధిదేవత. సకలసంపత్స్వరూపుడు. మూర్తీభవించిన భోగం. సుఖప్రదుడు. ధర్మప్రదుడు. ప్రీతికరుడు. శాంతిదాయకుడు. సమ్మానించి ఆదరించి అందరిలోనూ మన్నన కలిగించేవాడు మగడే. కోపాన్నీ అవమానాన్నీ తొలగించేవాడూ మగడే. సంసారంలో సారం మగడే. స్వామి మగడే. బంధువుల్లోకెల్లా ఆత్మబంధువు మగడే. భర్తకు సాటివచ్చే బంధువు మరొకడు ఏ బంధువర్గంలోనూ దొరకడు. భరిస్తాడు కనక భర్త. పాలిస్తాడు కనక పతి. శరీరానికి అధిపతి కనక స్వామి. కోరికలు తీరుస్తాడు కనక కాంతుడు. సుఖాలు సమృద్ధిగా అందిస్తాడు కనక బంధువు. ప్రీతి కలిగిస్తాడు కనక ప్రియుడు. ఐశ్వర్యం కలిగిస్తాడు కనక ఈశ్వరుడు. ప్రాణాలకు ప్రభువు కనక ప్రాణేశ్వరుడు. రతి సుఖం పంచుతాడు కనక రమణుడు. మగడిని మించిన ప్రియుడు మగువుకు మరొకడు లేడు. ఉండడు. మగడి శుక్లంవల్ల జన్మిస్తాడు కనక పుత్రుడు ఇష్టుడవుతున్నాడు. కానీ మగనాండ్రకు వందమంది బిడ్డలకన్నా మగడే ప్రియుడు. అతడిమీద ప్రేమ అంత అధికం.

పుత్రస్తు స్వామినః శుక్లాత్ జాయతే తేన సఃప్రియః ।
శతపుత్రాత్ పరః స్వామీ కులజానాం ప్రియస్సదా ॥
అసత్యకులప్రసూతా కాంతం విజ్ఞాతుమక్షమా । (45 - 27)

అసత్కాంతలు మగడి ప్రాధాన్యాన్ని తెలుసుకోలేరు. సకలతీర్థాలలోనూ స్నానాలు చేసినఫలం, భూరి దక్షిణలతో యజ్ఞాలు చేసిన ఫలం, భూమికి ప్రదక్షిణలు చేసిన ఫలం, సర్వతపస్సులూ వ్రతాలూ దానాలూ ఉపవాసాలూ గురు విప్ర వేదసేవలూ చేసిన ఫలం, ఇంకా ఏమేమి సత్కర్మలున్నాయో అవన్నీ చేసినందువల్ల వచ్చే ఫలం - ఇవన్నీ కలిపినా పతిపాదసేవా ఫలంలో పదహారవవంతుకి సరితూగవు. గురువుకన్నా విప్రుడికన్నా ఇంద్రుడికన్నా దేవుడికన్నా మగడే గొప్పవాడు. ఆరాధనీయుడు. పురుషులకు విద్యాదాత ఎంతటివాడో మగనాండ్రకు మగడు అంతటివాడు. లక్షల కోట్ల గోపగోపీజనాలకూ అసంఖ్యాక బ్రహ్మాండాలకూ వాటిలో ఉన్న జీవరాశులకూ విశ్వాది సమస్తగోళాలకూ అధినాయికను కాగలిగానంటే ఇదంతా శ్రీకృష్ణపరమాత్ముని ప్రసాదమే. అహంకారంతో నా కాంతుణ్ణి నేను తెలుసుకోలేకపోయాను. స్త్రీస్వభావం అటువంటిది. ఎంతటివారికైనా దురతిక్రమంకదా !

గోపీనాం లక్షకోటీనాం గోపానాం తథైవ చ ।
బ్రహ్మాండానామసంఖ్యానాం తత్రస్థానాం తథైవ చ ॥
విశ్వాదిగోళకాంతానా మీశ్వరీ యత్ప్రసాదతః ।
అహం న జానే తం కాంతం స్త్రీ స్వభావో దురత్యయః ॥ (45 - 33)



రాధాదేవి పశ్చాత్తాపంతో కుమిలిపోయింది. కంటికీ మంటికీ ఏకధారగా విలపించింది. నాథా ! నాథా ! అంటూ దిక్కులు పగిలేలాగా ఎలుగెత్తి అరిచి పిలిచింది. దర్శనం దేహి అంటూ యాచించింది. అయినా ఫలితం లేకపోయింది. స్వామి కనిపించలేదు. రాధాదేవి విలపిస్తూనే ఉంది. కృష్ణుణ్ణి ధ్యానిస్తూనే ఉంది.

అథ సా దక్షిణాదేవీ ధ్వస్తా గోలోకతో మునే ।
సుచిరం చ తపస్తప్త్వా వివేశ కమలాతనౌ ॥ (45 - 35)

ఇది ఇలా ఉండగా శాపగ్రస్తురాలైన ఆ సుశీల గోలోకంనుంచి వెళ్ళిపోయి చిరకాలం తపస్సుచేసి మహాలక్ష్మి శరీరంలో లీనమయ్యింది.

ఆ సమయంలోనే దేవతలందరూ కలిసి ఒక మహాయజ్ఞాన్ని నియమనిష్ఠలతో నిర్వహించారు. యజ్ఞం పూర్తి అయ్యిందిగానీ ఫలం దక్కలేదు. విషణ్ణులయ్యారు. ఎందుకిలా జరిగిందో తెలియక బ్రహ్మదేవుడి దగ్గరికి వెళ్ళారు. ఆయన శ్రీహరిని ధ్యానించి సమాధానం పొందాడు. శ్రీమన్నారాయణుడు మహాలక్ష్మి శరీరంలో దక్షిణాంశంనుంచి సుశీలను తీసి దక్షిణాదేవి అని పేరుపెట్టి బ్రహ్మకు అప్పగించాడు. బ్రహ్మ యజ్ఞపురుషుడికి ఇచ్చాడు. యజ్ఞుడు యథావిధిగా దక్షిణాదేవికి పూజలుచేసి స్తుతించాడు.

కాగిన బంగారపు రంగులో ఉంది దక్షిణాదేవి. కోటిచంద్రులకాంతిని ప్రసవిస్తోంది. అత్యంత కమనీయంగా సుందరంగా ఉంది. మనోహరంగా ఉంది. కమలాస్య. కోమలాంగి. కమలాయతలోచన. కమలాంగసముద్భవ. కమలాసన పూజిత. (బ్రహ్మార్చిత). వహ్నిశిఖలాంటి వస్త్రం ధరించింది. దొండపండుల్లాంటి పెదవులు. తీరిన పలువరుస. మాలతీపుష్పమాలికలు జడలో తురుముకుంది. చిరునవ్వులతో ముఖం ప్రసన్నంగా ఉంది. రత్నభూషణాలు దాల్చింది. సముచిత సుందరవేషం. సుస్నాత. (తలంటుపోసుకుంది). మునీశ్వరుల మనస్సులకే సమ్మోహకంగా ఉంది. నొసట కస్తూరిబొట్టు. చందనపు చుక్క. పాపట సిందూరం. ఉజ్జ్వలంగా ఉంది. కటి జఘన భాగాలు బంధురంగా ఉన్నాయి. ఎత్తయిన వక్షఃస్థలం. కామదేవుడికి ఆధారదేవతలాగా ఉంది. కామబాణపీడిత.

ఈ దక్షిణాదేవిని దగ్గరగా చూసి యజ్ఞపురుషుడు సమ్మోహితుడై మూర్ఛిల్లాడు. బ్రహ్మదేవుడి ప్రబోధంతో తేరుకున్నాడు. పాణిగ్రహణం చేశాడు. నూరేళ్ళు నిర్జన ప్రదేశాలలో కామక్రీడలు సాగించారు. దక్షిణాదేవి గర్భవతి అయ్యింది. పన్నెండేళ్ళు మోసింది. సర్వయజ్ఞకర్మలకూ ఫలస్వరూపుడైన పుత్రుణ్ణి ప్రసవించింది. యజ్ఞయాగాది క్రతువులు పరిపూర్ణం కాగానే ఆయా ఫలాలను ఈ పుత్రుడు యజమానులకు అందిస్తాడు. దక్షిణాదేవితోనూ ఫలరూపుడైన పుత్రుడితోనూ కలిసి యజ్ఞుడు యజమాన యాజకాదులకు యజ్ఞకర్మఫలాలను అందిస్తుంటాడని వేదాలూ వేదవేత్తలూ చెప్పేమాట. ఆ ప్రకారం దేవతలకు యజ్ఞఫలాన్ని పంచిపెట్టాడు. అందరూ సంతృప్తి చెందారు. ఎవరి లోకాలకూ నెలవులకూ వారు వెళ్ళారు.



## ◆ దక్షిణ లేని దానధర్మాలా ? ◆

నారదా ! దానధర్మాలుగానీ యజ్ఞయాగాదులుగానీ ఎవరు ఏ సత్కర్మ ఆచరించినా వెంటనే దక్షిణ ఇవ్వాలి. తక్షణం ఫలం లభిస్తుంది. అని వేదం చెబుతోంది. అజ్ఞానంవల్లగానీ ఆటంకంవల్లగానీ బ్రాహ్మణులకు దక్షిణ ఇవ్వడంలో ఆలస్యమైతే అది పెరుగుతూ ఉంటుంది. ముహూర్తంసేపు ఆలస్యమైతే రెండురెట్లు, ఒక రాత్రి గడిస్తే మూడుకోట్ల రెట్లూ, మూడు రాత్రులు గడిస్తే శతకోటిరెట్లూ, ఏడురోజులు గడిస్తే దానికి రెండు రెట్లూ, నెల గడిస్తే లక్షరెట్లూ, సంవత్సరం ఆలస్యమైతే మూడుకోట్లరెట్లూ అధికంగా దక్షిణ చెల్లించవలసి ఉంటుంది. ఇలా ఇవ్వకపోతే ఆ సత్కర్మ అంతా నిష్ఫలమవుతుంది. బ్రాహ్మణుల సొమ్మును అపహరించిన పాపం చుట్టుకుంటుంది. మరింక జీవితంలో ఏ సత్కర్మకూ అతడు అర్హుడు కాడు. దరిద్రుడూ వ్యాధిగ్రస్తుడూ అవుతాడు. లక్ష్మీదేవి దారుణంగా శపించి అతడి ఇంటినుంచి వెళ్ళిపోతుంది. పితృదేవతలు శ్రాద్ధతర్పణాలను ముట్టరు. దేవతలు అతడి పూజలు స్వీకరించరు. అగ్నిదేవుడు అతడు వేల్చిన ఆహుతులు అంటుకోడు.

దానం చేసిన వస్తువును ప్రతిగ్రహీతకు వెంటనే స్వాధీనం చెయ్యనివాడూ, ప్రతిగ్రహీతనుంచి తిరిగి యాచించి తీసేసుకున్నవాడూ ఇద్దరూ తాడు తెగిన తప్పేలాల్లాగా నరకకూపంలో పడిపోతారు.

దత్తం న దీయతే దానం గ్రహీత్రానవయాచతే ।
ఉభౌ తే నరకే యాతశ్ఛిన్నరజ్జో ఘటో యథా ॥ (45 - 60)

బ్రాహ్మణుడు అడిగినా దక్షిణను ఇవ్వని యజమానుడు కుంభీపాకనరకానికి పోతాడు. లక్ష సంవత్సరాలు యమదూతల చేతుల్లో నానా హింసలూ అనుభవిస్తాడు. అటుపైని దరిద్రుడుగా వ్యాధిగ్రస్తుడుగా జన్మిస్తాడు. అతడి వంశంలో ఇటూ అటూ ఏడుతరాలవారికి ఆ మహాపాపం చుట్టుకుంటుంది.

నారదా ! విన్నావుకదా దక్షిణాదేవి వృత్తాంతం. ఇంకా ఏవైనా సందేహాలూ సత్కథలూ కావాలంటే అడుగు. చెబుతాను అని ముగించాడు నారాయణమహర్షి. నారదుడు వెంటనే అందుకున్నాడు.

మహర్షీ ! దక్షిణతో ప్రసక్తిలేని సత్కర్మలు లేవా ? ఉంటే వాటి ఫలం ఏమిటి ? ఆ ఫలాన్ని ఎవరు అనుభవిస్తారు ? ఇదొక చిలిపి సందేహమే అయినా నువ్వు తీర్చాల్సిందే.

నారదా ! దక్షిణలేని కర్మకు ఫలమే ఉండదు. ఇక దానికి భోక్త ఏమిటి ? దక్షిణ ఉంటేనే ఏ కర్మకైనా ఫలమూ ఫలితమూను. దక్షిణారహితమైన కర్మను బలిచక్రవర్తి అనుభవిస్తాడు. పూర్వకాలంలో వామనుడు ఈ ఏర్పాటు చేశాడు. అశ్రోత్రియంగా పెట్టిన శ్రాద్ధం, అశ్రద్ధగా ఇచ్చినదానం, అపరిశుద్ధుడు చేసిన యజ్ఞం, అశుచి చేసిన పూజ, అభక్తుడి అర్చన - ఇలాంటి కర్మలనన్నింటినీ బలి అనుభవిస్తాడు.



## ◆ దక్షిణాదేవి పూజ ◆

మహర్షీ ! దక్షిణాదేవి కథ చెప్పావు. ధ్యాన స్తోత్ర మంత్ర పూజావిధానాలు చెప్పలేదు. అవికూడా వినిపించు.

బ్రహ్మతనయా ! ఆలకించు. అది అంతా కాణ్వశాఖోక్తం. అలనాడు యజ్ఞుడు చేసిన దక్షిణాస్తోత్రమేమిటంటే -

కార్తికపూర్ణిమనాడు మహాలక్ష్మి శరీరంలో దక్షిణాంసంనుంచి ఆవిర్భవించావు కనక నువ్వు దక్షిణాదేవివయ్యావు. అంతకుముందు గోలోకంలో నువ్వు సుశీలవు. శ్రీకృష్ణుడి ప్రేయసివి. రాధాసమానవు. రాధాదేవి శాపంవల్ల గోలోకం విడిచిపెట్టి తపస్సుచేసి మహాలక్ష్మిలో లీనమయ్యావు. ఇప్పుడు భాగ్యవశాన నాకు లభించావు. దక్షిణాదేవీ ! దయచూపించు. నన్ను భర్తగా స్వీకరించు. కర్మిష్ఠులకు కర్మఫలాన్ని అందించే దేవివి నువ్వే. నువ్వు లేకపోతే అందరి సత్కర్మలూ నిష్ఫలమవుతాయి. నువ్వు తప్ప మరింకెవ్వరూ - బ్రహ్మ విష్ణు మహేశ్వరులుగానీ దిక్పాలాది దేవతలుగానీ కర్మఫలాన్ని ఇవ్వలేరు. బ్రహ్మదేవుడు స్వయంగా కర్మరూపి. ఫలరూపి మహేశ్వరుడు. యజ్ఞరూపి విష్ణుమూర్తిని నేను. మా అందరికీ సారరూపిణివి నువ్వు.

కర్మరూపీ స్వయం బ్రహ్మా ఫలరూపీ మహేశ్వరః ।
యజ్ఞరూపీ విష్ణురహం త్వమేషాం సారరూపిణీ ॥ (45 - 78)

నువ్వు నిర్గుణవు. పరాప్రకృతివి. శక్తివి. నీవల్లనే శ్రీకృష్ణపరమాత్మ శక్తుడయ్యాడు. జన్మజన్మలకూ నువ్వు నాతో ఉండి నన్ను శక్తుణ్ణి చెయ్యి - అని స్తుతించి ఎదుట నిలబడ్డాడు. దేవి సంతుష్టయై వరించింది.

ఇది యజ్ఞుడు చేసిన దక్షిణాస్తోత్రం. యజ్ఞకాలంలో పఠిస్తే యజ్ఞాలు విశేషఫలితాలను ఇస్తాయి. రాజసూయ - వాజపేయ - గోమేధ - నరమేధ - అశ్వమేధ - లాంగలయజ్ఞ - విష్ణుయజ్ఞ - కుబేరయజ్ఞ - ధనదాన - భూమిదాన - ఇష్టాపూర్తనిర్మాణ - ఫలదాన - గజదాన - గోమేధకదాన - లోహదాన - స్వర్ణదాన - రత్నదాన - తామ్రదాన - శివయజ్ఞ - రుద్రయజ్ఞ - శక్రయజ్ఞ - వరుణయాగ - వైరిమర్దన కండకయజ్ఞ - శుచియజ్ఞ - ధర్మయజ్ఞ - పాపమోచన యజ్ఞ - యోనియాగ - వాణీయాగాది సమయాలలో దీన్ని తప్పక పఠించాలి. నిర్విఘ్నంగా శీఘ్రంగా అత్యధిక ఫలదాయకాలు అవుతాయి. ఇక ధ్యానపూజావిధులు ఏమిటంటే -

సాలగ్రామంలోగానీ మంగళ కలశంలోగానీ దక్షిణాదేవిని ఆరాధించాలి. రెండు ధ్యానశ్లోకాలున్నాయి. మూలమంత్రమూ ఉంది.



లక్ష్మీ దక్షాంససంభూతాం దక్షిణాం కమలాకళామ్ ।
సర్వకర్మసు దక్షాం చ ఫలదాం సర్వకర్మణామ్ ॥
విష్ణోః శక్తిస్వరూపాం చ పూజితాం వందితాం శుభామ్ ।
శుద్ధిదాం శుద్ధిరూపాం చ సుశీలాం శుభదాం భజే ॥ (45 - 90)

ఓం శ్రీం క్లీం హ్రీం దక్షిణాయై స్వాహా అనే మూలమంత్రం జపిస్తూ పూజలు చెయ్యాలి. అర్ఘ్యపాద్యాదులతో షోడశోపచారాలూ శ్రద్ధగా నిర్వహించాలి. ఇలాచేస్తే దక్షిణాదేవి అనుగ్రహం లభిస్తుంది. అన్నిపనులూ ఫలవంతమవుతాయి. పుత్రార్థులకు పుత్రులూ ధనార్థులకు ధనాలూ విద్యార్థులకు విద్యలూ వివాహార్థులకు వివాహాలూ - ఏది కోరుకున్నవారికి అది లభిస్తుంది. కష్టాలు వచ్చినప్పుడూ బంధువియోగం జరిగినప్పుడూ ఆపదలు వచ్చినప్పుడూ బంధనాలలో ఇరుక్కున్నప్పుడూ ఒక నెలపాటు ఈ దక్షిణాదేవి ఉపాఖ్యానాన్ని పారాయణ చేసినా పురాణంగా విన్నా ఇబ్బంధులన్నీ తొలగిపోయి శాంతిసౌఖ్యాలు వెల్లివిరుస్తాయి. *(అధ్యాయం - 45, శ్లోకాలు - 97)*

నారాయణమహర్షీ! నీ దయవల్ల దేవీస్వరూపాల కథలూ గాథలూ చాలామటుకు తెలుసుకోగలిగాను. తక్కినవారి చరితలుకూడా తెలుసుకోవాలని కుతూహలంగా ఉంది. అనుగ్రహించు.

నారదా ! దేవీచరితలన్నీ వేదపురాణాలలో దేనికదే ప్రత్యేకంగా ఉన్నాయి. దేవీప్రధాన రూపాలు ఏమిటో కళాంశావతారాలు ఏమిటో తొట్టతొలిగానే నీకు తెలియజెప్పాను. వాటిలో ఇంకా ఏమైనా మిగిలిపోయి ఉన్నాయేమో గుర్తుతెచ్చుకో. అవికూడా చెబుతాను విందువుగాని.

మహర్షీ ! షష్ఠీ - మంగళచండీ - మానసాదేవి - వీరు ఆదిపరాశక్తి కళాంశరూపాలన్నావు. వీరి చరితలు చెప్పావుగావు.

## ◆ షష్ఠీదేవి చరితం ◆

నారదా ! అయితే చెబుతున్నాను. ఆలకించు. ప్రకృతిమాతలో ఆరవ అంశగా అవతరించింది కనక షష్ఠీదేవి అన్నారు. ఈవిడ శిశువులకూ బాలబాలికలకూ అధిష్ఠాత్రి. బలవర్ధని. విష్ణుమాయాస్వరూపిణి. మాతృకలలో దేవసేనగా సుప్రసిద్ధ. స్కందుడి భార్య. ఆయుఃప్రద. బాలబాలికలకు పెంపుడుతల్లి. రక్షణకారిణి. యోగమాయారూపంలో పురిటింట శిశువుల పజ్జ ఉంటుంది. ఆవిడ పూజావిధానం తెలుసుకోదగింది.

స్వాయంభువ మనువుకి ప్రియవ్రతుడు అనే కొడుకు ఉన్నాడు. యోగీంద్రుడు. చాలాకాలం వివాహం చేసుకోలేదు. తపస్సులకే అంకితమయ్యాడు. చివరికి బ్రహ్మప్రయత్నంమీద మాలినీదేవిని



వాహం చేసుకున్నాడు. ఎంతకీ సంతానం కలగలేదు. కశ్యపుడు వచ్చి పుత్రకామేష్టి జరిపించాడు. ంపతులకు ఇష్టిఫలంగా చరువును ఇచ్చాడు. అది భుజించాక మాలినీదేవి గర్భం ధరించింది. న్నెండేళ్ళు మోసింది. బంగారంలాంటి బిడ్డను ప్రసవించింది. అందంగానే ఉన్నాడుగానీ మృతశిశువు. ళ్ళు తేలవేశాడు. దంపతులూ బంధుగణమూ రోదించారు. పుత్రశోకం భరించలేక మాలినీదేవి మూర్ఛిల్లింది. ృతశిశువుని తీసుకుని ప్రియవ్రతుడు శ్మశానానికి వెళ్ళాడు. బిడ్డను ఒడిలో పెట్టుకుని ఆ అడవిలో ారుణంగా విలపించాడు. ప్రాణాలను పరిత్యజించడానికైనా సిద్ధపడ్డాడు తప్ప మృతశిశువును ఖననం ెయ్యడానికి ఇచ్ఛగించలేదు. చెయ్యలేకపోయాడు. తన జ్ఞానయోగమంతా ఎటుపోయిందో. ోకాతురుడైపోయాడు.

అంతలోకీ ఒక దివ్యవిమానం కోటిసూర్యకాంతులతో కనిపించింది. అందులో తెల్లని వస్త్రాలలో పుష్పమాలికలతో తేజోమండలంలాగా వెలిగిపోతున్న దేవసేనాదేవి దర్శనమిచ్చింది. రాజు శిశువును దించి లేచి నమస్కరించాడు. స్తుతించాడు. పూజలు జరిపాడు.

మహాదేవీ ! నువ్వు ఎవరు ? ఎవరి ఇల్లాలివి ? ఎవరి అమ్మాయివి ? స్త్రీరత్నంలాగా భాసిస్తున్నావు.

ప్రియవ్రతా ! నేను దేవసేనను. దేవదానవ సంగ్రామాలలో నేను దేవసేనకు జయం సమకూరుస్తాను. అందుకని నాకు ఆపేరు ఏర్పడింది. నేను బ్రహ్మదేవుడి మానసపుత్రికను. స్కందుడికిచ్చి వివాహం చేశాడు. మాతృకలలో సుప్రసిద్ధను. ఆదిపరాశక్తిలో ఆరవ అంశగా అవతరించాను. కనక షష్ఠిదేవి అని కూడా పిలుస్తారు. అపుత్రులకు పుత్రులను ప్రసాదిస్తాను. ప్రియులకు ప్రియురాండ్రను అందిస్తాను. దరిద్రులకు ధనం కర్మిష్ఠులకు కర్మఫలం ఇస్తాను. సుఖదుఃఖాలూ భయశోకాలూ శుభాశుభాలూ సంపద్విపత్తులూ అన్నీ ఎవరికైనా కర్మఫలంగానే లభిస్తాయి. ఒకరు బహుపుత్రలయ్యేదీ ఒకరు వంశహీనులయ్యేదీ కర్మఫలమే. కొందరికి మృతశిశువులు లభించినా కొందరికి చిరంజీవులు కలిగినా కర్మవిపాకమే. గుణవంతులూ గుణహీనులూ రూపవంతులూ కురూపులూ అంగవికలులూ బహుభార్యావంతులూ భార్యావిహీనులూ ఆరోగ్యవంతులూ రోగపీడితులూ - అందరూ కర్మఫలస్వరూపులే. అంచేత కర్మ అన్నింటికన్నా గొప్పది. అన్నింటికన్నా బలీయం. ఇది వేదాలు చెప్పినమాట - అంటూనే మృతశిశువును చేతుల్లోకి తీసుకుని లీలగా పునరుజ్జీవితుణ్ణి చేసింది. బాలుడి ముఖంలో చిరునవ్వులు బంగారు కాంతుల్ని వెదజల్లాయి. ప్రియవ్రతుడు ఆశ్చర్యంనుంచీ ఆనందంనుంచీ తేరుకోలేకపోతున్నాడు దేవసేన ఆ బాలకుడితోసహా విమానం అధిరోహించింది. బయలుదేరబోయింది. రాజు తేరుకుని మరొక్కసారి ఆ మహాదేవిని స్తుతించాడు. ఆవిడ ముఖం విప్పారింది.

ప్రియవ్రతా! నువ్వు ముల్లోకాలకీ రాజువు.స్వాయంభువమనువు పుత్రుడవు. కనక సకల లోకాలలోను నా పూజలు జరిపించు. నువ్వూచెయ్యి. అలా అయితేనే నీకు ఈ కులవర్ధనుడైన పుత్రుణ్ణి ఇస్తాను. ఇతడ సువ్రతుడు అనే పేరుతో గుణవంతుడూ పండితుడూ అవుతాడు. ఇతడు నారాయణకళ. జాతిస్మరుడు



యోగీంద్రుడూ అవుతాడు. నూరు యజ్ఞాలు చేస్తాడు. క్షత్రియులందరి నమస్కారాలూ అందుకొంటాడు. లక్షమదపుటేనుగుల బలం పొందుతాడు. పండితులకు ఆప్తుడవుతాడు. యోగులకూ జ్ఞానులకూ తపస్వులకూ సిద్ధిప్రదుడై కీర్తి గడిస్తాడు. లోకంలో సర్వసంత్ప్రదుడుగా వెలుగొందుతాడు.

పూజలు జరుపుతాననీ జరిపిస్తాననీ దేవసేనాదేవికి మాటఇచ్చి ప్రియవ్రతుడు తన పుత్రుణ్ణి స్వీకరించాడు. దేవి ఆశీర్వదించి వెళ్ళిపోయింది. రాజు ఆనందంతో బిడ్డను ముద్దాడుతూ ఇంటికి తిరిగివచ్చాడు. మాలతీదేవికీ బంధువర్గానికీ అమాత్యులకూ పరివారానికీ ప్రజానీకానికీ - జరిగిన వృత్తాంతమంతా పూసగుచ్చినట్టు చెప్పాడు. అందరూ సంతోషించారు. పండగ జరిపారు.

అప్పటినుంచీ ప్రతినెలా శుక్లషష్ఠినాడు ఇంటింటా షష్ఠిదేవీ మహోత్సవాలు జరిపించాడు. పురిటిళ్ళల్లో ఆరవరోజున పదకొండవరోజున అన్నప్రాశనరోజునా ప్రతిశుభకార్యమప్పుడూ షష్ఠిదేవీ పూజలు జరుగుతున్నాయి. రాజు తాను స్వయంగా చేస్తున్నాడు.

కౌథుమశాఖోక్తంగా ధ్యాన పూజావిధాన స్తోత్రమంత్రాలు ఏర్పడ్డాయి. ధర్ముడు నాకు ఉపదేశించాడు. నేను నీకు చెబుతున్నాను. నారదా ! వింటున్నావా ?

సాలగ్రామంలోనో మంగళకలశంలోనో వటవృక్షం మూలనో గోడమీద బొమ్మగీసిగానీ బొమ్మ చేసిగానీ షష్ఠీదేవిని ఆవాహన చెయ్యాలి. ధ్యానించాలి.

సుపుత్రదాం చ శుభదాం దయారూపాం జగత్ప్రసూమ్ ।
శ్వేతచంపకవర్ణాభాం రత్నభూషణభూషితామ్ ॥
పవిత్రరూపాం పరమాం దేవసేనాం పరాం భజే ॥ **(46 - 52)**

పుష్పాలతో పూజించాలి. షోడశోపచారాలూ శ్రద్ధగా చెయ్యాలి. నైవేద్యాలు పెట్టాలి. ఓం హ్రీం షష్ఠీదేవ్యై స్వాహా అనేది మూలమంత్రం. ఈ అష్టాక్షరిని యథాశక్తిగా జరిపించాలి. లక్షసార్లు జపిస్తే అపుత్రకులు పుత్రవంతులవుతారు. ఇది బ్రహ్మదేవుడి వరం. ఇంక స్తోత్ర మేమిటంటే -

నమో దేవ్యై మహాదేవ్యై సిద్ధ్యై శాంత్యై నమోనమః ।
శుభాయై దేవసేనాయై షష్ఠ్యై దేవ్యైనమోనమః ॥
వరదాయై పుత్రదాయై ధనదాయై నమోనమః ।
సుఖదాయై మోక్షదాయై షష్ఠ్యై దేవ్యై నమోనమః ॥
షష్ఠ్యై షష్ఠాంశరూపాయై సిద్ధాయై నమోనమః ।
మాయాయై సిద్ధయోగిన్యై షష్ఠీదేవ్యై నమోనమః ॥
సారాయై శారదాయై చ పరాదేవ్యై నమోనమః ।



బాలాధిష్ఠాతృదేవ్యై చ షష్ఠీదేవ్యై నమోనమః ॥
కల్యాణదాయై కల్యాణ్యై ఫలదాయై చ కర్మణామ్ ।
ప్రత్యక్షాయై స్వభక్తానాం షష్ఠ్యై దేవ్యై నమోనమః ॥
పూజ్యాయై స్కందకాంతాయై సర్వేషాం సర్వకర్మసు ।
దేవరక్షణకారిణ్యై షష్ఠీదేవ్యై నమోనమః ॥
శుద్ధసత్త్వస్వరూపాయై వందితాయై నృణాం సదా ।
హింసాక్రోధవర్జితాయై షష్ఠీదేవ్యై నమోనమః ॥
ధనం దేహి ప్రియం దేహి పుత్రం దేహి సురేశ్వరి ।
మానం దేహి జయం దేహి ద్విషో జహి మహేశ్వరి ॥
ధర్మం దేహి యశో దేహి షష్ఠీదేవ్యై నమోనమః ।
దేహి భూమిం ప్రజాం దేహి విద్యాం దేహి సుపూజితే ॥
కల్యాణం చ జయం దేహి షష్ఠీదేవ్యై నమోనమః । (46 - 67)

నారదా ! ఈ స్తోత్రాన్ని పఠించి ప్రియవ్రతుడు షష్ఠీదేవి అనుగ్రహానికి పాత్రుడయ్యాడు. యశస్వి అయ్యాడు. అతని పుత్రుడు ఆయుష్మంతుడూ బలవంతుడూ యశస్వంతుడూ పరిపాలనాదక్షుడూ కాగలిగాడు.

ఈ స్తోత్రాన్ని ఒక సంవత్సరంపాటు పఠించినా విన్నా అపుత్రకులకు ఆయుష్మంతుడు కలుగుతాడు. ఏడాదిపాటు ఈపూజ చేసి ఈ కథాభాగం పురాణంగా విన్నవారికి పాపాలు తొలగిపోతాయి. గొడ్రాలికైనా బిడ్డలు కలుగుతారు. బిడ్డలు అనారోగ్యంతో బాధపడుతున్న తల్లిదండ్రులు వింటే నెలనాళ్ళల్లో ఆరోగ్యం చేకూరుతుంది. *(అధ్యాయం - 46, శ్లోకాలు - 73)*

## ◆ మంగళచండీ వృత్తాంతం ◆

నారదా ! ఇక మంగళచండీ వృత్తాంతం విను. కల్యాణాలూ మంగళాలూ కలిగించడంలో అత్యంత సమర్థ. కనక మంగళచండి అనేపేరు ఏర్పడిందిట. మంగళుడు అర్చించి అభీష్టాలు పొందాడు. అప్పటినుంచీ ఈపేరు వచ్చిందని మరికొందరు. మనువంశంలో పుట్టిన మంగళమహారాజు ఆరాధించి సప్తద్వీపధరాధిపతి అయ్యాడనీ అందుచేత మంగళచండి అయ్యిందనీ ఇంకొందరి కథనం. ఎవరు ఏమి చెప్పినా ఒకటిమాత్ర నిజం - ఆవిడ దుర్గ. మూలప్రకృతి. మూర్తిభేదంతో ఇలా వెలిసింది. కృపారూపిణి. స్త్రీలకు ఇష్టదేవత.



ఆదిలో శంకరుడు ఈమెను ఉపాసించాడు. త్రిపురాసుర సంహారం చెయ్యబోతూ బ్రహ్మదేవుడి ఉపదేశం మేరకు మంగళచండీపూజ నిర్వర్తించాడు. రణరంగంలో ఆ రాక్షసుడు వేసిన శస్త్రాస్త్రాల ధాటికి నిలబడలేక శివుడి రథం ఆకాశంనుంచి నేలకు కూలిపోబోతోంటే - మంగళచండి ప్రత్యక్షమై అభయమిచ్చింది. నువ్వు వృషవాహనుడివి. సర్వేశుడవు. నేను యుద్ధశక్తి స్వరూపను. నీవెంట ఉన్నాను. అధైర్యపడకు. శత్రువును సంహరించు - అని ప్రోత్సహించి అంతర్ధానం చెందింది. శంకరుడు పుంజుకున్నాడు. విష్ణుమూర్తి అందించిన బాణంతో త్రిపురాసుర సంహారం దిగ్విజయంగా నిర్వహించాడు. దేవతలు పుష్పవృష్టి కురిపించారు. మనువులూ మానవులూ ఋషులూ మునులూ స్తుతించారు. శంకరుడు భక్తినమ్రుడయ్యాడు. బ్రహ్మవిష్ణువులు ఆశీర్వదించి వెళ్ళారు. అప్పుడు వెంటనే శంభుడు సుస్నాతుడై ధౌతవస్త్రాలు ధరించి వచ్చి మంగళచండీపూజను శ్రద్ధాభక్తులతో నిర్వహించాడు. మంగళకలశం పెట్టి అమ్మవారిని ఆవాహన చేశాడు. వివిధ పూజాద్రవ్యాలతో నైవేద్యాలతో జంతుబలులతో షోడశోపచారాలతో నృత్యగీతాదులతో మంత్ర ధ్యాన స్తోత్రాలతో మహోత్సవంగా మహోన్నతంగా మహోద్ధృతంగా పూజలు చేశాడు.

"ఓం హ్రీం శ్రీం క్లీం సర్వపూజ్యే దేవి మంగళచండికే హూం హూం ఫట్ స్వాహా" అనేది ఏకవింశాక్షర మహామూలమంత్రం. ఇది భక్త కల్పద్రుమం. పదిలక్షలు జపిస్తే మంత్రసిద్ధి అవుతుంది. ఇక ధ్యానశ్లోకాలు-

దేవీం షోడశవర్షీయాం శశ్వత్ సుస్థిరయౌవనామ్ ।
బింబోష్ఠీం సుదతీం శుద్ధాం శరత్పద్మనిభాననామ్ ॥
శ్వేతచంపకవర్ణాభాం సునీలోత్పలలోచనామ్ ।
జగద్ధాత్రీం చ దాత్రీం చ సర్వేభ్యస్సర్వసంపదామ్ ॥
సంసారసాగరే ఘోరే జ్యోతీరూపాం సదా భజే । (47 - 25)

ఇవి పఠించి మూలమంత్రంతో పూజచెయ్యాలి. శంకరుడు చేసిన స్తోత్రం - సర్వవేద సమ్మతం. యథాతథంగా గ్రహించు.

రక్ష రక్ష జగన్మాతర్దేవి మంగళచండికే ।
హారికే విపదాం రాశేః హర్షమంగళకారికే ॥
హర్షమంగళదక్షే చ హర్షమంగళదాయికే ।
శుభే మంగళదక్షే చ శుభే మంగళచండికే ॥
మంగళే మంగళార్హే చ సర్వమంగళమంగళే ।
సతాం మంగళే దేవి సర్వేషాం మంగళాలయే ॥



పూజ్యే మంగళవారే చ మంగళాభీష్టదేవతే ।
పూజ్యే మంగళభూపస్య మనువంశస్య సంతతమ్ ॥
మంగళాధిష్ఠాతృదేవి మంగళానాం చ మంగళే ।
సంసార మంగళాధారే మోక్షమంగళదాయిని ॥
సారే చ మంగళాధారే పారే చ సర్వకర్మణామ్ ।
ప్రతిమంగళవారే చ పూజ్యే మంగళసుఖప్రదే ॥ (47 - 31)

అటుపైని ప్రతి మంగళవారంనాడూ ఈ మంగళచండికా పూజ చేస్తూ శంకరుడు తన భక్తి ప్రపత్తులను చాటుకుంటున్నాడు. మొదటిపూజ శివుడు చేశాడు. రెండవపూజ మంగళుడు (అంగారకగ్రహం). మూడవపూజ మంగళమహారాజు. నాల్గవ పూజ ప్రతిమంగళవారమూ దేవతాస్త్రీలు అందిస్తున్నారు. అటుపైని మానవకాంతలందరూ చేస్తున్నారు.

ఈ మంగళచండికా స్తోత్రాన్ని విన్నా చదివినా సకల శుభాలూ కలుగుతాయి. పుత్రపౌత్రాభివృద్ధిగా కుటుంబం మంగళప్రదంగా కళకళలాడుతుంది.

## ◆ మానసాదేవి పూజ ◆

నారదా ! షష్ఠీదేవి - మంగళచండికల ఉపాఖ్యానాలు అయ్యాయి. మానసాదేవి వృత్తాంతం ఇక చెబుతున్నాను. ఆలకించు. ఆవిడ కశ్యపప్రజాపతి కూతురు. మానసపుత్రిక. అందుకే మానసాదేవి అన్నారు. మహాయోగీశ్వరి. పరాత్పరుణ్ణి నిరంతరం తన మనస్సులో నిలుపుకుంటుంది. అలాకూడా సార్థకనామధేయ. ఆత్మారామ. వైష్ణవి. సిద్ధయోగిని.

మూడు యుగాలపాటు శ్రీకృష్ణుడికోసం తపస్సు చేసింది. తపోనియమనిష్ఠలు కారణంగా ఆవిడ శరీరంలో శైథిల్యం వర్ణవైక్లబ్యం సంభవించాయి. అది గమనించి శ్రీకృష్ణుడు చమత్కారంగా "జరత్కారు" అని పేరుపెట్టాడు.

జరత్కారు శరీరం చ దృష్ట్వా యత్క్షీణమీశ్వరః ।
గోపీపతిర్నామ చక్రే జరత్కారురితి ప్రభుః ॥ (47 - 43)

కృపానిధి శ్రీహరి మానసాదేవి అభీష్టం తీర్చాడు. తాను స్వయంగా పూజచేసి తక్కినవారితో చేయించాడు. స్వర్గాదిలోకాలన్నింటా పూజలు జరిగాయి. ఆ సుందరీమణిని అందరూ గౌరిగా (గౌరవర్ణంలో ఉంటుంది కనక) ఆరాధించారు. జగద్గౌరి అనే పేరు స్థిరపడింది. కొంతకాలానికి శివుడికి శిష్యురాలయ్యింది. అప్పటినుంచి శైవి అనేపేరు వచ్చింది. మొదటినుంచీ విష్ణుభక్తురాలు కనక వైష్ణవి అయ్యింది. పరీక్షిన్మహారాజు



కొడుకు జనమేజయుడు సర్పయాగం చేసినప్పుడు పాముల ప్రాణాలను కాపాడింది కనక నాగేశ్వరి నాగభగిని అనేపేర్లు సిద్ధించాయి. ఎంతటి విషాన్నయినా విరిచివెయ్యగలిగిన సామర్థ్యం ఉంది కనక విషహర అనే బిరుదును పొందింది. హరుడినుంచి సిద్ధయోగం పొందింది కనక సిద్ధయోగిని. మరణించినవారిని బతికించకలదు కనక మృతసంజీవని. ఆస్తీకుడనే మునీంద్రుణ్ణి కన్నతల్లి. ఆస్తీకమాత. మహాతపస్విని. మహాజ్ఞాని. జరత్కారుడనే మహామునీంద్రుడికి ఇల్లాలయ్యింది కనక జరత్కారుప్రియ. ఇలా మొత్తం పన్నెండు పేర్లున్నాయి ఈ మానసాదేవికి.

జరత్కారుర్జగద్గౌరీ మానసా సిద్ధయోగినీ ।
వైష్ణవీ నాగభగినీ శైవీ నాగేశ్వరీ తథా ॥
జరత్కారుప్రియాస్తీకమాతా విషహరేతి చ ।
మహాజ్ఞానయుతా చైవ సా దేవీ విశ్వపూజితా ॥ (47 - 52)

ఈ పన్నెండు నామాలనూ పూజాకాలంలో పఠించినవారికీ వారి వంశోద్భవులకూ పాములపుట్టమీద పడుకున్నా సర్పభయం ఉండదు. పదిలక్షలసార్లు పఠిస్తే స్తోత్ర సిద్ధి కలుగుతుంది. అది కలిగిందంటే అతడు మహావిషాన్ని తిని జీర్ణించుకోగలడు. పాములను అలంకరించుకోగలడు. నాగేంద్రుడిమీద నడుంవాల్చగలడు. నాగవాహనుడూ నాగాసనుడూ నాగతల్పుడూ కాగలడు. జన్మ ముగిసిన తరవాత సరాసరి వైకుంఠానికి వెళ్ళి విష్ణువుతో రేయింబవళ్ళు విందువినోదాలతో క్రీడించగలడు. ***(అధ్యాయం - 47 , శ్లోకాలు - 58)***

ఈ మనసాదేవి ధ్యానశ్లోకాలు సామవేదోక్తాలు. పూజావిధానమూ మూలమంత్రమూ ఉన్నాయి.

శ్వేతచంపకవర్ణాభాం రత్నభూషణభూషితామ్ ।
వహ్నిశుద్ధాంశుకాధానాం నాగయజ్ఞోపవీతినీమ్ ॥
మహాజ్ఞానయుతాం తాం చ ప్రవరజ్ఞానినాం వరామ్ ।
సిద్ధాధిష్ఠాతృదేవీం చ సిద్ధాం సిద్ధిప్రదాం భజే ॥ (48 - 3)

ఇలా ధ్యానించి పుష్పచందనాదులతో పూజించాలి. ఓం హ్రీం శ్రీం క్లీం ఐం మానసాదేవ్యై స్వాహా అనే మూలమంత్రాన్ని ఏకాగ్రచిత్తంతో జపించాలి. అయిదులక్షలు జపంచేస్తే మంత్రసిద్ధి కలుగుతుంది. కలిగిందంటే అతడు సిద్ధుడయినట్టే. అతడికి మహావిషంకూడా అమృతప్రాయమే. సాక్షాత్తు ధన్వంతరిగా లెక్క. సంక్రమణం రోజునగానీ ప్రతినెలా పంచమినాడుగానీ గూఢమందిరాల్లో కూర్చుని ధ్యానావాహనషోడశోపచార పూర్వకంగా మనసాదేవిని అర్చించి ఈ మూలమహామంత్రం జపించాలి. అటుపైని బలిప్రదానం జరగాలి. అలా చేసినవారికి ధనధాన్యపుత్రపౌత్రాభివృద్ధి కలుగుతుంది. సత్కీర్తి లభిస్తుంది.



## ◆ మానసాదేవి కథ ◆

నారదా ! ఇప్పుడింక ఆవిడ కథ చెబుతాను విను. పూర్వం ఒకప్పుడు భూలోకంలో మానవులంతా సర్పభయాక్రాంతులయ్యారు. మహామునీశ్వరుడు కశ్యపుణ్ణి శరణువేడారు. ఆయన తన తండ్రి బ్రహ్మదేవుడి సహాయంతో వేదాలనుంచి బీజాక్షరాలను ఏరి మంత్రాలు సృష్టించాడు. వాటికి అధిష్ఠానదేవతగా చతుర్ముఖుడు మనసాదేవిని సృష్టించాడు. ఆవిడ సద్యోయౌవనం పొంది శివుడి మందిరానికి వెళ్ళింది. భక్తితో పూజించి శంకరుణ్ణి స్తుతించింది. వెయ్యి దివ్యవత్సరాలు సేవలు చేసింది. శివుడు అసలే ఆశుతోషుడుకదా ! (వెంటనే సంతోషించే భోళాశంకరుడు) మనసకు మహాజ్ఞానం ఉపదేశించి సామవేదం అభ్యసింపచేశాడు. లక్ష్మీ మాయా కామబీజాక్షరాలతో కృష్ణాయస్వాహా అనే మంత్రరాజాన్ని ఉపదేశించాడు. పూజా పునశ్చర్యాదుల్ని చెప్పాడు. పుష్కరక్షేత్రానికి వెళ్ళి తపస్సు చెయ్యమని ఆజ్ఞాపించాడు.

మనసాదేవి మూడుయుగాలు నిష్ఠగా తపస్సు చేసింది. శ్రీకృష్ణుడు ప్రత్యక్షమయ్యాడు. సకలజన పూజితవు అవుతావని వరం ఇచ్చాడు. ప్రథమపూజ తానే చేశాడు. రెండవపూజ శంకరుడు చేశాడు. అటుపైని కశ్యపుడూ దేవతలూ మునులూ మనువులూ నాగజాతివారూ మానవజాతివారూ అందరూ పూజించారు. త్రిలోకవందిత అయ్యింది.

కశ్యపప్రజాపతి జరత్కారు మునీంద్రుడికి ఈ మనసాదేవిని కన్యాదానం చేశాడు. అయాచితంగా లభించిందనీ బ్రాహ్మణుడి ఆజ్ఞ అనీ ఆ మునీంద్రుడు కాదనకుండా స్వీకరించాడు. ఇద్దరికీ వివాహం జరిపించి కశ్యపుడు తపస్సులకి వెళ్ళిపోయాడు.

ఒకనాడు పుష్కరక్షేత్రంలో మర్రిచెట్టు నీడలో పరమనైష్ఠికుడు జరత్కారువు తన మనసాదేవి ఒడిలో తల ఆన్చి నిద్రాదేవిని ఆవాహన చేసుకుని గాఢంగా నిద్రపోయాడు. కొంతసేపటికి సూర్యుడు అస్తమించబోయాడు. సాయంసంధ్యాసమయం సమీపించింది. ఇప్పుడు లేచి సంధ్యావందనం చెయ్యకపోతే తన భర్తకు ధర్మలోపం వస్తుందే, ఎలాగా - అని మనసాదేవి కళవళపడింది.

అకృత్వా పశ్చిమాం సంధ్యాం నిత్యాం చైవ ద్విజన్మనామ్ ।
బ్రహ్మహత్యాదికం పాపం లభిష్యతి పతిర్మమ ॥
నోపతిష్ఠతి యః పూర్వాం నోపాస్తే యస్తు పశ్చిమామ్ ।
స సర్వత్రాశుచిర్నిత్యం బ్రహ్మహత్యాదికం లభేత్ ॥ (48 - 30)

బ్రాహ్మణుడికి ప్రాతస్సాయం సంధ్యావందనాలు నిత్యవిధులు. ఇవ్వి చెయ్యకపోతే బ్రహ్మహత్యా మహాపాతకం చుట్టుకుంటుంది. ఇక కర్మాచరణకూ పనికిరాడు. అశుచి అయిపోతాడు అని వేదం చెబుతోంది.



మనసాదేవికి ఇవన్నీ జ్ఞాపకం వచ్చాయి. భర్తను బ్రహ్మహత్యామహాపాతకిని చెయ్యడంకన్నా నిద్రాభంగం కలిగించిన పాపానికి తాను ఒడిగట్టడమే మేలు అనుకుంది. అనుకోవడమేమిటి జరత్కారువును నిద్రలేపింది. ఆ మహానుభావుడు తాడిచెట్టంత ఎత్తున అలిగాడు.

సాధ్వీ ! ఆదమరిచి సుఖంగా నిద్రపోతున్నాను. ఎందుకని నిద్రాభంగం కలిగించావు ? భర్తకు అపకారంచేస్తే నోములూ వ్రతాలూ దానధర్మాలూ అన్నీ నిష్ఫలమవుతాయని తెలియదా ? భర్తను పూజిస్తే శ్రీకృష్ణపరమాత్మను పూజించినట్టే అన్నారు పెద్దలు. పతివ్రతావ్రతంకోసమే స్త్రీలకు భర్తరూపంలో శ్రీహరి స్వయంగా లభించేది. స్త్రీలు చేసే దాన - ధర్మ - యజ్ఞ - తీర్థస్నాన - వ్రత - తపో - దేవపూజా - సత్య - ఉపవాసాదికాలు అన్నీ కలిపినా పతిసేవాఫలంలో పదహారవవంతుకి సాటిరావు. భారతదేశంలో పతిసేవా పరాయణగా జన్మగడిపిన ఇల్లాలు భర్తతోసహా వైకుంఠానికీ బ్రహ్మలోకానికీ చేరుకుంటుంది. అప్రియం చేసినా పలికినా కుంభీపాకంలో ఆచంద్రార్కం నరకయాతనలు పడుతుంది. మరుజన్మలో పతిపుత్రరహితగా నీచపడుతుంది.

జరత్కారుడి కోపంచూసి మనసాదేవి గడగడలాడింది. మాటపెగలలేదు. స్వామీ ! సంధ్యాలోపభయంతో నిద్రలేపాను. దుష్టురాలిని క్షమించు. శృంగార - ఆహార - నిద్రాభంగాలు చేసినవారు కాలసూత్ర నరకానికి పోతారని తెలుసు. అయినా సాహసించాను. శాంతించు - అని వేడుకొంది. పాదాలపై పడి వలవలా విలపించింది. అయినా జరత్కారుడు శాంతించలేదు. శపిస్తాను అంటూ కమండలూదకం చేతిలో పోసుకోబోయాడు.

సూర్యభగవానుడు సంధ్యాదేవీ సహితుడై ప్రత్యక్షమయ్యాడు. వినయంగానూ భయంభయంగానూ పలికాడు - మునీంద్రా ! సూర్యాస్తమయం చూసి ధర్మలోపభయంతో నిన్ను నిద్రలేపింది ఈ సాధ్వి. నీ సుఖాన్ని పాడుచేద్దామనే ఉద్దేశంతో కాదు. కనక క్షమించు. శపించకు. ఆమె పక్షాన నేను శరణువేడుతున్నాను. బ్రాహ్మణుల హృదయం వెన్నలాగా ఉంటుందిట. వారికోపం క్షణికమట. ఆ క్షణంలోనే జగత్తును భస్మం చేసెయ్యగలరట. మళ్ళీ సృష్టించనూగలరట. బ్రాహ్మణుడికన్నా తేజస్వి లేడంటారు. నువ్వు బ్రహ్మదేవుడి వంశంలో పుట్టిన బ్రాహ్మణుడివి. బ్రహ్మతేజస్సుతో ప్రకాశిస్తున్నవాడివి. నువ్వే క్రోధవివశుడవైతే ఎలాగ ? శాంతించు. శాంతించి శ్రీకృష్ణపరమాత్మను ఉపాసించు.

సూర్యుడి ప్రబోధంతో జరత్కారువు కోపం చల్లారింది. శాంతించాడు. సంధ్యాసూర్యులను ఆశీర్వదించి పంపించాడు.

మనసా ! శపిస్తాను అన్నానుకదా ! శపించలేను. ప్రతిజ్ఞాభంగమూ చేసుకోలేను. కనక నిన్ను పరిత్యజిస్తున్నాను. ఈ క్షణంనుంచీ నీకూ నాకూ ఏ సంబంధమూ లేదు. వెళ్ళిపో - అన్నాడు.

మనసాదేవికి నెత్తిమీద పిడుగుపడినంతపని అయ్యింది. ఏమి చెయ్యడానికీ తోచలేదు. వెంటనే తన గురువు శంకరుడినీ తన దేవుడు శ్రీహరినీ తన తండ్రి కశ్యపుడినీ సృష్టకర్తనూ స్మరించింది. వెంటనే



ముగ్గురూ ప్రత్యక్షమయ్యారు. జరత్కారుడు ఆశ్చర్యపోయాడు. అందరినీ స్తుతించి పాదాభివందనాలు చేశాడు. ఒక్కసారిగా అందరూ ఇలా అనుగ్రహించారు. ఏమిటి ఆజ్ఞ - అన్నాడు.

బ్రహ్మదేవుడు శ్రీహరికి పాదాభివందనంచేసి సమయోచితంగా పలికాడు. యోగీంద్రా ! మనసాదేవి పతివ్రత. నీ ధర్మపత్ని. ఈవిడకు పుత్రభిక్ష పెట్టకుండా పరిత్యజించడం ధర్మమేనా ? అన్నీ తెలిసినవాడవు. ధర్మపాలన చెయ్యి. ముందు పుత్రవతిని చెయ్యి. ఆ తరువాత నీ ఇష్టం. విడిచిపెట్టాలనుకుంటే విడిచిపెట్టు. అపుత్రకుడై వైరాగ్యంతో ధర్మపత్నిని పరిత్యజించినవాడి పుణ్యాలు జల్లెడలో నీళ్ళల్లాగా జారిపోతాయి.

అకృత్వా తు సుతోత్పత్తిం విరాగీ యస్త్యజేత్ప్రియామ్ ।
స్రవతే తస్య పుణ్యం చ చాలన్యాం చ యథా జలమ్ ॥ (48 - 58)

బ్రహ్మోపదేశం పనిచేసింది. జరత్కారువు క్షణకాలం ఆలోచించాడు. ఇల్లాలికి దగ్గరగా వెళ్ళాడు. మంత్రపూర్వకంగా నాభిసంస్పర్శనం చేశాడు. మనసా ! నువ్విప్పుడు గర్భవతివయ్యావు. పుత్రుడు జన్మిస్తాడు. జితేంద్రియుడు, ధార్మికుడు, బ్రహ్మవాది, తేజస్వి, తపస్వి, యశస్వి, గుణవంతుడు, వేదవేత్త, జ్ఞాని, యోగి, విష్ణుభక్తుడూ అవుతాడు. నూర్గురు కొడుకులకి తండ్రి అవుతాడు. వంశాన్ని ఉద్ధరిస్తాడు. పితృదేవతలు ఆనందంతో నృత్యంచేస్తారు.

ప్రియా ! నువ్వు పతివ్రతవు. సుశీలవు. నాకు ప్రియవాదినివి. ప్రియకారిణివి. ధర్మిష్ఠవు. కులస్త్రీవి. కులపాలితవు. ఇప్పుడిక సత్పుత్రజనయిత్రివి. ఇంతకన్నా జీవితానికి ఏమికావాలి ! సంతృప్తి చెందావుకదా!

మనోహారిణీ ! మరొక రహస్యం చెబుతాను, శ్రద్ధగా విను. జీవితంలో మనకి నిజమైన బంధువు ఎవరంటే - హరిభక్తిని ప్రబోధించేవాడే. అంతేగానీ అభీష్టసుఖాలను ఇచ్చేవాడు కాదు. హరిభక్తి మార్గాన్ని చూపించేవాడే అసలైన తండ్రి. గర్భవాసవిమోచన కలిగించేదే అసలైన తల్లి. యమభీతిని తొలగించే దయామయియే అసలైన సోదరి. విష్ణుమంత్రాన్ని ఉపదేశించి విష్ణుభక్తిని ప్రసాదించినవాడే సిసలైన గురువు. కృష్ణభావనరూపమైనదే నిజమైన జ్ఞానం. దాన్ని కలిగిస్తేనే గురువు. బ్రహ్మాది స్తంబపర్యంతం ఈ చరాచరజగత్తు అంతా ఆ శ్రీకృష్ణపరమాత్మనుంచే ఆవిర్భవిస్తోంది. అతనిలోనే లీనమవుతోంది. ఇది తెలుసుకోవడంకన్నా జ్ఞానం వేరే లేదు. వేదాలు చెప్పనీ, యజ్ఞాలు ఇవ్వనీ అన్నింటి సారమూ హరిసేవనమే. తత్త్వాలన్నింటికీ సారభూతుడు శ్రీహరి. తక్కినవన్నీ వట్టి విడంబనలు. ఈ జ్ఞానాన్ని నీకు ఉపదేశిస్తున్నాను నీ స్వామిని కనక. జ్ఞానంవల్ల బంధనాలు తెగిపోతాయి. కనక అదే మన మిత్రం. బంధాలను కలిగించేది ఏదైనా ఎవరైనా శత్రుసమానమే. విష్ణు భక్తియుతమైన జ్ఞానాన్ని ఇవ్వలేనివాడు గురువుకాదు - రిపువు. బంధనాలు తెంచలేడు కనక శిష్యఘాతకుడు. అటువంటివాడు గురువూ కాదు, తండ్రీకాదు, బంధువూ కాదు. పరమానందరూపమూ అనశ్వరమూ అయిన కృష్ణభక్తిమార్గాన్ని చూపించలేనివాడు ఏమి బంధువు !



పరమానందరూపం చ కృష్ణమార్గమనశ్వరమ్ ।
న దర్శయేద్యస్సతతం కీదృశో బాంధవో నృణామ్ ॥ (48 - 72)

సాధ్వీ ! శ్రీకృష్ణుడు అచ్యుతుడు. నిర్గుణుడు. పరబ్రహ్మ. అతడిని సేవిస్తే కర్మబంధనాలు పటాపంచలవుతాయి. హృదయేశ్వరీ ! ఏదో వంకపెట్టి నిన్ను పరిత్యజిస్తున్నాను. దీన్ని క్షమించు. నీవంటి పతివ్రతలు ఓర్పు సహనాలకు పెట్టిందిపేరు. సత్త్వగుణానికి పుట్టిళ్ళు. అంచేత క్రోధాన్ని ఇట్టే జయించగలరు.

మయా ఛలేన త్వం త్యక్తా క్షమస్వైతన్మమ ప్రియే ।
క్షమాయుతానాం సాధ్వీనాం సత్త్వాత్క్రోధో న విద్యతే ॥
పుష్కరే తపసే యామి గచ్ఛదేవి యథాసుఖమ్ ।
శ్రీకృష్ణచరణాంభోజే నిస్స్పృహాణాం మనోరథాః ॥ (48 - 75)

మనసాదేవీ ! పుష్కరక్షేత్రంలో తపస్సుకి వెడుతున్నాను. మరింక నీ ఇష్టం. ఎక్కడికైనా వెళ్ళు. నీకు సుఖమగుగాక ! నావంటి నిస్పృహుల కోరికలు శ్రీకృష్ణుడి పాదపద్మాలపైనేకదా !

జరత్కారుడి ఉపదేశం మనసాదేవి మనస్సుకు ఎక్కింది. అయినా దుఃఖం ఉపశమించలేదు. కన్నీరు జాలువారుతూనే ఉంది. మెల్లగా కూడదీసుకుని -

ప్రాణవల్లభా ! పరిత్యజించవలసినంతటి నేరం నేనేమీ చెయ్యలేదు. నిద్రాభంగం చేశానంటే నీ మంచికోసమే. అయినా పరిత్యజిస్తున్నావు. నీ ఇష్టం. సరే. నాకొక వరం ఇయ్యి. నేను స్మరించినప్పుడల్లా నువ్వు దర్శనం ఇవ్వాలి. బంధువియోగం కన్నా పుత్రవియోగం బాధాకరం. భర్తృవియోగం అన్నింటికన్నా ప్రాణాంతకం. పతివ్రతలకు భర్త అంటే శతపుత్రాధికంగా ప్రీతిపాత్రుడు. స్త్రీలకు మగడికన్నా ప్రీతిపాత్రం ఈ సృష్టిలోనే లేదంటారు అందుకే.

వైష్ణవులకు విష్ణుమూర్తిమీద ఒకే పుత్రుడున్న వారికి ఏకైకపుత్రుడిమీద, ఒంటికన్నువారికి ఆ కన్నుమీద దప్పికగొన్నవారికి నీటిమీద, ఆకొన్నవారికి అన్నంమీద, కాముకులకు మైథునంమీద, దొంగలకు పరాయిసొత్తుమీద, కులటలకు జారుడిమీద, పండితులకు శాస్త్రంమీద, వణిజులకు వ్యాపారంమీద ఎంతమోజు ఉంటుందో సాధ్వీమణులకు భర్తమీద అంత మనసుంటుంది. కాబట్టి కనీసం ఈ వరమైనా అనుగ్రహించు - అని కాళ్ళమీద వ్రాలి ప్రాధేయపడింది.

జరత్కారుడు మనసాదేవిని చటుక్కున గుండెలకు హత్తుకున్నాడు. ఆపుకోలేని కన్నీటితో తడిపి ముద్దచేశాడు. వియోగభీతితో మనసాదేవీ అలాగే అతడి గుండెల్ని బాష్పధారలతో తడిపేసింది. క్షణకాలం విలపించి తేరుకున్నారు. జ్ఞానశక్తితో శోకాన్ని తొలగించుకున్నారు. ఎవరికివారే ఊరడించుకున్నారు.



క్షణం చకార క్రోడే తాం కృపయా కృపానిధి : ।
నేత్రోదకేన మనసాం స్నపయామాస తాం మునిః ॥
సాశ్రునేత్రా మునేః క్రోడం సిషేచ భేదకాతరా ।
తదా జ్ఞానేన తౌ ద్వౌ చ విశోకౌ సంబభూవతుః ॥ (48 - 85)

మెల్లగా విడిచిపెట్టి మనసకు ధైర్యంచెప్పి, శ్రీకృష్ణుడి పాదపద్మాలను తలుచుకుంటూ జరత్కారుడు వెళ్ళిపోయాడు. మనసాదేవి గుండెదిటవు చేసుకుని తన గురువు శంకరుడి మందిరానికి వెళ్ళిపోయింది.

## ◆ ఆస్తీక వృత్తాంతం ◆

వెళ్ళిందే కానీ అనుక్షణమూ అక్కడ దుఃఖిస్తూనే ఉంది. పార్వతీదేవి ధైర్యవచనాలు చెబుతూ ఊరడించింది. క్రమంగా నెలలునిండి సుముహూర్తాన పుత్రుణ్ణి ప్రసవించింది. తల్లి గర్భంలో ఉండి శంకరుడి నోటినుంచి వెలువడే జ్ఞానోపదేశాలను రోజూ విన్న ఆ శిశువు కాలక్రమాన యోగీంద్రుడూ జ్ఞానీంద్రుడూ అయ్యాడు. నారాయణాంశ సంభూతుడు.

శంకరుడే స్వయంగా జాతకర్మాదులు చేయించి ఉపనయనం జరిపించి వేదాలు నేర్పించాడు. పార్వతీ పరమేశ్వరులు బ్రాహ్మణులకు సువర్ణరత్నవస్త్రరాశులు పంచిపెట్టారు. వేదశాస్త్రాభ్యాసం అయ్యాక మృత్యుంజయమైన పరతత్త్వాన్నీ బ్రహ్మజ్ఞానాన్నీ ఉపదేశించాడు. కుర్రవాడికి గురువుపట్లా ఇష్టదేవత హరిపట్లా భక్తి అత్యధికంగా ఉండటాన్ని గుర్తించిన వారందరూ ఆస్తికుడు ఆస్తికుడు అన్నారు.

భక్తిరస్త్యధికా కాంతేఽభీష్టదేవే గురౌ తథా ।
యస్మాత్తేవ చ తత్పుత్రో బభూవాస్తీక ఏవ చ ॥ (48 - 94)

శంకరుడి ఆజ్ఞమీదట ఆస్తీకుడు తపస్సుకోసం పుష్కరక్షేత్రానికి వెళ్ళాడు. మూడులక్షల సంవత్సరాలు మహామంత్రాన్ని జపించి తపోధనుడై మహాయోగియై గురువు శంకరుణ్ణి నమస్కరించడానికి తిరిగివచ్చాడు. నమస్కరించి అక్కడే కొంతకాలం ఉండి తల్లితో బయలుదేరి తాతగారు కశ్యపుడి ఆశ్రమానికి చేరుకున్నారు. కశ్యపప్రజాపతి కూతురినీ మనుమడినీ చూసి ఆనందాశ్రువులు రాల్చాడు. బ్రాహ్మణులకు విందులు చేశాడు. నూరులక్షల రత్నాలు పంచిపెట్టాడు. కశ్యపుడి భార్యలు దితి - అదితి సంబరపడ్డారు. ఆశీర్వదించారు. తల్లీకొడుకులిద్దరూ చాలాకాలం అక్కడే నివసించారు.

ఆ కాలంలోనే అభిమన్యుడి కుమారుడు పరీక్షిత్తు శృంగి అనే బ్రాహ్మణుడి శాపానికి గురి అయ్యాడు. ఇప్పటినుంచి ఏడు రోజుల్లోగా తక్షకుడనే సర్పరాజు నిన్ను కాటువేస్తాడని శృంగి శాపం. పరీక్షిత్తు భయపడిపోయి గాలీవెలుతురూ చొరని భవనంలో దూరి అన్ని రక్షణలూ ఏర్పాటు చేసుకుని రోజులు గడుపుతున్నాడు. ఆరురోజులు గడిచాయి. ఏడవరోజు వచ్చింది.



పాతాళం నుంచి తక్షకుడు బయలుదేరాడు. రాజమందిరం దరిదాపుల్లో ధన్వంతరి కనిపించాడు. ఇద్దరికీ సంవాదం జరిగింది. ఇద్దరూ పరస్పరం సుప్రీతులయ్యారు. తక్షకుడిచ్చిన మణిని తీసుకుని ధన్వంతరి వెళ్ళిపోయాడు. తక్షకుడు రాజగృహంలోకి చొరబడ్డాడు. మంచంమీద పడుకున్న పరీక్షిత్తుని కాటువేశాడు. అతడు మరణించాడు. పరీక్షిత్తు కుమారుడు జనమేజయుడు దారుణంగా దుఃఖించాడు. తండ్రికి అంతిమక్రియలు నిర్వహించాడు.

జనమేజయుడు సర్పజాతిమీద పగబట్టాడు. విప్రులతో చర్చించి సర్పయాగం ఆరంభించాడు. సృష్టిలో ఉన్న పాములన్నీ మంత్రశక్తిని తట్టుకోలేక గుంపులు గుంపులుగా హోమకుండంలో వచ్చిపడి మరణిస్తున్నాయి. తక్షకుడు భయాకులుడయ్యాడు. పరుగుపరుగున వెళ్ళి ఇంద్రుణ్ణి శరణువేడాడు. దేవేంద్రుడు అభయమిచ్చాడు. ఇది తెలిసిన జనమేజయుడి విప్రవర్గం ఇంద్రుడితో సహా తక్షకుణ్ణి హోమం చెయ్యడానికి ప్రయత్నాలు ప్రారంభించారు. దానితో ఇంద్రాదిదేవతలు గడగడలాడారు. బృహస్పతి సలహాపై మనసాదేవిని ఉపాసించారు. ఆ తల్లి అనుగ్రహించి తన కుమారుడు ఆస్తీకుణ్ణి జనమేజయుడి సన్నిధికి పంపించింది.

ఆస్తీకుడంతటివాడు తన యజ్ఞానికి వచ్చాడని జనమేజయుడు సంబరపడ్డాడు. అతిథి మర్యాదలు చేశాడు. ఏమికావాలో కోరుకోమన్నాడు. ఇంద్ర తక్షకుల ప్రాణాలను కాపాడమని ఆస్తీకుడు అడిగాడు. విప్రులతో సంప్రదించి జనమేజయుడు అంగీకరించాడు. సర్పయాగాన్ని ముగించాడు. బ్రాహ్మణులందరికీ భూరిదక్షిణలిచ్చి కృతజ్ఞతలు చెల్లించి సాదరంగా సాగనంపాడు.

విప్రులూ మునీశ్వరులూ దేవతలూ వెళ్ళి మనసాదేవిని దర్శించారు. పూజలు చేశారు. ఎవరిమటుకు వారు స్తుతించారు. ఇంద్రుడు పూజాసంభారంతో వచ్చి శుచిగా భక్తిశ్రద్ధలతో అర్చించాడు. షోడశోపచారాలూ చేశాడు. బ్రహ్మాదిదేవతలు ఆనందించారు.

నారదా ! ఇదీ మనసాదేవి ఆఖ్యానం. ఏమన్నా సందేహాలున్నాయా ? ఇంకా ఏదయినా వినాలనుకుంటున్నావా ? అని కాసింత విశ్రాంతి తీసుకున్నాడు నారాయణమహర్షి.

## ◆ ఇంద్రుడు చేసిన మానసా స్తోత్రం ◆

మహర్షీ అంటూ మళ్ళీ అందుకున్నాడు నారదుడు. ఇంద్రుడు చేసిన మానసా స్తోత్రం పూజాక్రమం తెలియజెప్పమన్నాడు. నారాయణమహర్షి అలాగే అని చెప్పనారంభించాడు.

ఇంద్రుడు సుస్నాతుడై ధౌతవస్త్రాలు ధరించి శుచిగా నానావిధ పూజాద్రవ్యాలతో వచ్చాడు. వస్తూనే మనసాదేవికి సాష్టాంగ నమస్కారం చేశాడు. రత్నసింహాసనంమీద కూర్చుండబెట్టాడు. రత్నకుంభాలతో తెచ్చిన గంగాజలంతో వేదమంత్రపూర్వకంగా స్నానం చేయించాడు. అగ్నిజ్వాలల్లాంటి వస్త్రాలను



సమర్పించాడు. చందనం అందించాడు. అర్ఘ్యపాద్యాలు ఇచ్చాడు. గణేశ దినేశ వహ్ని విష్ణు పార్వతీ పరమేశ్వరులను (దేవషట్కం) ముందుగా అర్చించాడు.

ఓం హ్రీం శ్రీం మనసాదేవ్యై స్వాహా అనే మూలమంత్రాన్ని జపిస్తూ పారిజాతపుష్పాలతో పాదపూజ చేశాడు. ఇతరులకు ఎవ్వరికీ అందనంతటి విలువైన వస్తువులతో శ్రద్ధగా షోడశోపచారాలూ జరిపాడు. నృత్యవాద్యసంగీతాలతో ఆనందపరిచాడు. ఈ పూజను చూడటానికి త్రిమూర్తులూ సతీసమేతులై వచ్చారు. పులకాంకితగాత్రుడై సాశ్రునేత్రుడై మనసాదేవిని స్తుతించాడు.

దేవీ ! పతివ్రతా శిరోమణీ ! నిన్ను స్తుతించాలి అనుకొంటున్నానుగానీ నాకు శక్తి సరిపోవడం లేదు. స్వభావాన్ని వర్ణించడమే స్తోత్రలక్షణమని వేదం చెబుతోంది. (స్తోత్రాణాం లక్షణం వేదే స్వభావాఖ్యానతత్పరమ్) నువ్వు పరాత్పరవు. ప్రకృతి స్వరూపిణివి. నీ గుణగణాలను వర్ణించడం నా తరమా ! శుద్ధసత్త్వస్వరూపవు. కోపక్రోధవివర్జితవు. శంకర ప్రియశిష్యవు. నాకు సోదరివి. నిన్ను విడిచిపెట్టి వెళ్ళడానికి అశక్తుడై మా బావగారు జరత్కారుడంతటివాడు నీ అనుమతినే యాచించాడు. అదితిలాగా నువ్వు నా తల్లివి. సోదరివిగా దయారూపవు. కన్నతల్లిలాగా క్షమారూపవు. నా ప్రాణాలను కాపాడావు. కుటుంబాన్ని రక్షించావు. బంధుమిత్ర పరివారాన్ని ఆపదలో ఆదుకున్నావు. నువ్వు సురేశ్వరివి. జగదంబికవు. నిన్ను నిత్యమూ పూజించాలి. ఇప్పుడు చేస్తున్న ఈ పూజతో ఆనందించి ఇంకా మాపట్ల దయామయివి అవుతావని ఆకాంక్షిస్తున్నాను.

ఆషాఢంలో సంక్రమణంనాడుగానీ నెలనెలా పంచమీనవముల్లోగానీ మాసాంతంలోగానీ (పూర్ణిమ - అమావాస్య) ఇంతెందుకు నిత్యమూ నిన్ను అర్చించినవారికి పుత్రపౌత్రాభివృద్ధిగా ధనధాన్యసమృద్ధి కలుగుతుంది. కీర్తిమంతులూ విద్యావంతులూ గుణవంతులూ అవుతారు. అజ్ఞానంతో నిన్ను నిందించినవారికి సర్పభయం తప్పదు. దరిద్రులవుతారు. నువ్వు స్వయంగా సర్వలక్ష్మివి. వైకుంఠంలో మహాలక్ష్మివి. జరత్కారుడు నారాయణాంశ సంభూతుడు కనక నిన్ను చెట్టపట్టాడు. బ్రహ్మదేవుడు నిన్ను తన తేజస్సునంతా ఉపయోగించి మనస్సుతో సృష్టించాడు. కనకనే మనసాదేవివయ్యావు. పరమపావనమూర్తివి. మమ్మల్ని రక్షించడానికే నువ్వు అవతరించావు. నీ అంతట నువ్వు సిద్ధయోగినివి. సత్యస్వరూపవు. సత్యాన్ని ఉపాసిస్తే నిన్ను ఉపాసించినట్టే. నేటినుంచీ దేవతలూ త్రిలోకవాసులూ భక్తితో నిన్ను అర్చిస్తారు. అభీష్టవరాలు పొందుతారు.

దేవేంద్రుడు మనసాదేవిని మనసారా స్తుతించి భగినీపతి జరత్కారువును వెంటదీసుకుని స్వర్గలోకానికి వెళ్ళిపోయాడు. సుతుడు ఆస్తీకుడితో మనసాదేవి కశ్యపుడి ఆశ్రమంలో సుఖంగా నివసించింది. సోదరుల పూజలు అందుకుంటోంది. అందరూ అర్చనలు చేస్తున్నారు.

గోలోకంనుంచి (కామధేనువు) సురభివచ్చి మనసాదేవికి క్షీరాభిషేకం జరిపింది. అత్యంత గోప్యమూ సర్వజన దుర్లభమూ అయిన జ్ఞానాన్ని ఉపదేశించింది. ఇంద్రలోకానికి తిరిగివెళ్ళింది.

ఇంద్రుడు చేసిన మనసాస్తోత్రాన్ని పఠించినవారికి నాగభయం ఉండదు. విషంకూడా అమృతోపమం అవుతుంది. వంశవృద్ధి జరుగుతుంది. అయిదులక్షలసార్లు పఠిస్తే స్తోత్రసిద్ధి కలుగుతుంది. అతడు సర్పాలపై సవారీ చెయ్యగలడు. సర్పాలపై విశ్రమించగలడు. *(అధ్యాయం - 48 , శ్లోకాలు - 145)*

## ◆ సురభి చరితం ◆

నారాయణమహర్షీ ! ఇంతకీ ఈ సురభి ఎవరు ? గోలోకంనుంచి వచ్చిందన్నావుగదా ! ఆ గోవు చరిత్రను తెలియజెప్పమన్నాడు నారదుడు.

నారదా ! సురభి అంటే గోమాత. గోవులకు అధిష్ఠానదేవత. గోవులకు కన్నతల్లి. సృష్టిలో మొట్టమొదటి గోవు. గోలోకంలో ఆవిర్భవించింది.

సృష్టి తొలినాళ్ళల్లో శ్రీకృష్ణుడు గోలోకంలో రాధికాసహితుడై గోపాంగనా పరివృతుడై బృందావనానికి వెళ్ళాడు. రహఃక్రీడలతో వినోదించసాగాడు. అలసిపోయాడు. పాలుతాగాలి అనిపించింది. అనిపించడమేమిటీ వెంటనే తన శరీరంలో ఎడమభాగం నుంచి లీలావిలాసంగా దూడతోసహా ఒక పాడిఆవును సృష్టించాడు. కొత్త కుండలోకి పాలు పితికాడు. అమృతంకన్నా రుచికరమైన పాలు. జన్మ మృత్యు జరా వ్యాధి నివారకమైన క్షీరం. కడుపునిండా పుచ్చుకున్నాడు. మిగిలిన పాలతో కుండను ఒక చదునైన ప్రదేశంలో విడిచిపెట్టాడు. అక్కడ శతయోజన విస్తీర్ణమైన క్షీరసరోవరం ఏర్పడింది. చుట్టూ రత్నాలు తాపించిన గట్లు. బంగారుమెట్లు. రాధాదేవికీ గోపికా బృందానికీ అది క్రీడా సరోవరమయ్యింది.

ఆ గోవే కామధేనువు. సురభి. దాని రోమకూపాలనుంచి కోట్ల సంఖ్యలో కామధేనువులు ఆవిర్భవించాయి. ఒక్కొక్క గోపకుడికీ ఒక్కొక్క సురభిగా అవతరించాయి. కాలక్రమాన దూడలు పుట్టి పెరిగి అసంఖ్యాకంగా అభివృద్ధి చెందాయి.

శ్రీకృష్ణుడే మొట్టమొదటిసారిగా సురభిని పూజించాడు. అటుపైని ముల్లోకాలలోనూ గోపూజ ఆచారంగా స్థిరపడింది. ధ్యానమూ స్తోత్రమూ మూలమంత్రమూ పూజావిధానమూ - ఇత్యాదులన్నీ వేదోక్తంగా ఉన్నాయి. చెబుతాను గ్రహించు.

ఓం సురభ్యై నమః అనేది షడక్షరమూలమంత్రం. లక్షసార్లు జపిస్తే సిద్ధి కలుగుతుంది. బుద్ధి వృద్ధులను కలిగించే ధ్యానశ్లోకాలున్నాయి.

లక్ష్మీస్వరూపాం పరమాం రాధాసహచరీం పరామ్ ।
గవామధిష్ఠాతృదేవీం గవామాద్యాం గవాం ప్రసూమ్ ॥
పవిత్రరూపాం పూతాం చ భక్తానాం సర్వకామదామ్ ।
యయా పూతం సర్వవిశ్వం తాం దేవీం సురభిం భజే ॥ (49 - 19)



ఘటంలోగానీ ధేనుశిరస్సునగానీ కట్టుగొయ్యనుగానీ (బంధస్తంభం) సాలగ్రామంలోగానీ సురభిని ఆవాహనచేసి పూజించాలి. ప్రాతస్సాయంసంధ్యల్లో ఈ పూజ నిర్వహించాలి.

వరాహావతారకాలంలో విష్ణుమాయవల్ల సురభులు ఒక్కసారిగా అన్నీ వట్టిపోయాయి. పాలచుక్క దొరక్క దేవతలు కటకటలాడారు. నెయ్యిలేక యజ్ఞాలు ఆగిపోయాయి. అందరూ వెళ్ళి బ్రహ్మతో మొరపెట్టుకున్నారు. ఆయన చెప్పిన ఉపాయం ప్రకారం దేవేంద్రుడు సురభిని స్తుతించాడు.

నమో దేవ్యై మహాదేవ్యై సురభ్యై చ నమో నమః ।
గవాం బీజస్వరూపాయై నమస్తే జగదంబికే ॥
నమో రాధాప్రియాయై చ పద్మాంశాయై నమో నమః ।
నమః కృష్ణప్రియాయై చ గవాం మాత్రే నమో నమః ॥
కల్పవృక్ష స్వరూపాయై సర్వేషాం సతతం పరే ।
క్షీరదాయై ధనదాయై బుద్ధిదాయై నమో నమః ॥
శుభాయై చ సుభద్రాయై గోపప్రదాయై నమో నమః ।
యశోదాయై కీర్తిదాయై ధర్మదాయై నమో నమః ॥ (49 - 27)

ఈ స్తోత్రానికి సురభి సంతుష్టి చెందింది. ప్రత్యక్షమై ఇంద్రుడికి వాంఛితార్థసిద్ధిగా వరమిచ్చి గోలోకానికి వెళ్ళిపోయింది. దేవతలు తమ లోకానికి వచ్చేశారు. సురభులన్నీ మళ్ళీ పాడిఆవులై క్షీరధారలు కురిపించాయి. దేవతల యజ్ఞయాగాదులు హాయిగా సాగాయి.

ఈ స్తోత్రాన్ని భక్తితో పఠించిన వారికి గో ధన ధాన్య సమృద్ధి లభిస్తుంది. కీర్తి లభిస్తుంది. పుత్రపౌత్రాభివృద్ధిగా వంశం పరిఢవిల్లుతుంది. పరలోకంలో కృష్ణమందిరంలో నివాసమూ కృష్ణసేవాభాగ్యమూ దొరుకుతాయి. *(అధ్యాయం - 49 , శ్లోకాలు - 33)*

## ◆ రాధికారాధన ◆

నారాయణమహర్షీ! ప్రకృతిశక్తుల ఉపాఖ్యానాలన్నీ చెప్పావు. భుక్తిముక్తిప్రదాలు. విని ఆనందించాను. వేదాలలో నిగూఢంగా ఉన్న రెండు ఉపాఖ్యానాలు మిగిలిపోయాయి. వాటినికూడా నీ ముఖతః వినాలని ఉంది. రాధాదేవి - దుర్గాదేవి. వీరి మహిమలు ఇప్పటికే చాలా చెప్పావు. చరాచరజగత్తు అంతా వారి అంశయే - అని తెలుసుకున్నాను. కానీ వారిని పూజించే విధానమేమిటో తెలియజెప్పలేదు. అదొక్కటి చెబితే విని తరిస్తాను.



నారదా ! ఈ ఉపాఖ్యానం ఇంతవరకూ ఎవరూ నన్ను అడగలేదు. ఎవరికీ నేను చెప్పలేదు. నువ్వే అడిగావు. నీకే చెబుతున్నాను. ఇది పరమరహస్యం. సారాత్ సారం. పరాత్ పరం. గోప్యంగా ఉంచాలి. ఎవరికిబడితే వారికి చెప్పెయ్యకూడదుసుమా !

జగత్సృష్టికి మూలస్వరూపిణులు ఇద్దరు. ఒకరు ప్రాణశక్తి. ఒకరు బుద్ధిశక్తి. విరాడాది చరాచర జగత్తు అంతా ఈ రెండుశక్తులకూ అధీనమై ఉంటుంది. వీరి అనుగ్రహం కలగనంతవరకూ ఏ జీవికీ మోక్షం లేదు. అంచేత అందరూ ఈ ఇద్దరినీ సేవించవలసిందే. ముందుగా రాధికామంత్రం విను.

శ్రీరాధాయై స్వాహా అనేది షడక్షరీ మూలమంత్రం. దీనికి ఆదిలో మాయాది మహాబీజాక్షరాలను వాంఛితాలకు అనుగుణంగా చేర్చుకోవచ్చు. అది చతుర్విధ పురుషార్థాలనూ కోరికలనూ తీర్చడంలో చింతామణి. కోటిముఖాలున్నా శతకోటి నాలుకలున్నా ఈ మంత్రం శక్తిని ఎవ్వరూ వర్ణించలేరు. గోలోకంలో రాసమండలంలో శ్రీకృష్ణపరమాత్మ మూలమహాదేవి నుంచి మున్ముందుగా ఈ మహామంత్రాన్ని ఉపదేశంగా స్వీకరించాడు. ఆయన విష్ణువుకీ ఆయన బ్రహ్మకూ ఆయన విరాట్పురుషుడికీ ఆయన ధర్ముడికీ చెప్పారు. ధర్ముడు నాకు అనుగ్రహించాడు. ఇప్పటికీ నేను అదేమంత్రాన్ని జపిస్తున్నాను. అందుకే ఋషిని కాగలిగాను. బ్రహ్మాదిదేవతలుకూడా నిత్యమూ ఈ మంత్రాన్నీ ఈ మంత్రాధిదేవతనూ ఆరాధిస్తుంటారు. రాధాదేవిని అర్చించకుండా కృష్ణపరమాత్మను అర్చించడానికి ఎవ్వరికీ అధికారం లేదు. రాదు. అంచేత వైష్ణవులు విధిగా రాధార్చన చెయ్యాలి.

కృష్ణార్చాయాం నాధికారో యతో రాధార్చనం వినా ।
వైష్ణవైః సకలైస్తస్మాత్ కర్తవ్యం రాధికార్చనమ్ ॥ (50 - 16)

రాధాదేవి శ్రీకృష్ణుడికి ప్రాణాధిదేవి. కనక అతడు రాధికాధీనుడు. అతడికి రాధ నిత్యం రాసేశ్వరి. ఆవిడ లేకుండా అతడు ఉండడు. సకలకామాలనూ రాధిస్తుంది (తొలగిస్తుంది) కనక రాధ.

రాధా మంత్రానికి ఋషిని నేనే. ఛందస్సు గాయత్రి. దేవత - రాధిక. తారమే బీజం. శక్తిబీజం. మూలావృత్తితో షడంగాలు చెయ్యాలి. సామవేదంలో చెప్పబడినట్టు ధ్యానం చెయ్యాలి.

శ్వేతచంపకవర్ణాభాం శరదిందుసమాననామ్ ।
కోటిచంద్రప్రతీకాశాం శరదంభోజలోచనామ్ ॥
బింబాధరాం పృథుశ్రోణీం కాంచీయుతనితంబినీమ్ ।
కుందపంక్తిసమానాభ దంతపంక్తి విరాజితామ్ ॥
క్షౌమాంబరపరీధానాం వహ్నిశుద్ధాంశుకాన్వితామ్ ।
ఈషద్ధాస్యప్రసన్నాస్యాం కరికుంభయుగస్తనీమ్ ॥



సదా ద్వాదశవర్షీయాం రత్నభూషణభూషితామ్ ।
శృంగారసింధులహరీం భక్తానుగ్రహకాతరామ్ ॥
మల్లికామాలతీమాలా కేశపాశవిరాజితామ్ ।
సుకుమారాంగలతికాం రాసమండలమధ్యగామ్ ॥
వరాభయకరాం శాంతాం శశ్వత్ సుస్థిరయౌవనామ్ ।
రత్నసింహాసనాసీనాం గోపీమండలనాయికామ్ ॥
కృష్ణప్రాణాధికాం వేదబోధితాం పరమేశ్వరీమ్ ।                    (50 - 27)

రాధాదేవి శ్వేతచంపకవర్ణంలో ఉంటుంది. ఆవిడ వదనం శరచ్చంద్ర సమానం. కోటిచంద్రుల కాంతిని వెదజల్లుతూంటుంది. కన్నులు శరత్కాలంలో వికసించిన పద్మాల్లాగా ఉంటాయి. అధరం దొండపండే. శ్రోణీభారం విశాలం. కటిసీమలో బంగారు మొలనూలు. చిరుమువ్వల సవ్వడి. తీర్చిదిద్దినట్టున్న పలువరుస మల్లెమొగ్గలు ఏరి పేర్చినట్టుంటుంది. తెల్లని చీర. అగ్నిజ్వాలలాంటి అంచుతో పైటచెంగు. ప్రసన్నవదనం. చిరునవ్వులు చిందిస్తూంటుంది. ఎత్తయిన వక్షఃస్థలం. ఎప్పుడూ పన్నెండేళ్ళవయస్సే. రత్నాభరణాలు. శృంగారసింధువులో ఎగసిపడే కెరటం. భక్తులను అనుగ్రహించడానికి ఎల్లవేళలా ఆరాటపడుతూ ఉంటుంది. మల్లికామాలతీమాలికలు తురిమిన కేశపాశం. పూలతీగలాంటి సుకుమారశరీరం. ఎప్పుడూ రాసమండలాన మధ్యలో ఉంటుంది. వరదహస్తమూ అభయహస్తమూ. శాంతస్వరూప. ఎప్పుడూ తరిగిపోని యౌవనం. రత్నసింహాసనంమీద కూర్చుంటుంది. గోపీమండలానికి నాయిక. కృష్ణుడికి ప్రాణాలకన్నా ఎక్కువ. వేదాలు చెప్పిన పరమేశ్వరి రాధికాదేవియే.

ఇలా ధ్యానించి సాలగ్రామంలోగానీ కలశంలోగానీ అష్టదళయంత్రంలోగానీ దేవిని స్థాపించి పూజించాలి. అటుపైని దేవతలను ఆవాహనచేసి ఆసనాదులను సమర్పించాలి. అన్నీ మూలమంత్రోచ్చారణతోనే చెయ్యాలి. పాదాలకు పాద్యం శిరస్సుపై అర్ఘ్యం ముఖానికి ఆచమనీయం రెండేసిసార్లు మంత్రపూర్వకంగా సమర్పించాలి. మధుపర్కం ఇవ్వాలి. పాడి ఆవును ఇవ్వాలి. అటుపైని స్నానశాలకు తీసుకువెళ్ళాలి. అభ్యంగనస్నానం చేయించాలి. నూతనవస్త్రాలు ఇవ్వాలి. అలంకారపూర్వకంగా చందనచర్చ జరపాలి. తులసీదళాలు పొదిగిన పుష్పమాల అలంకరించాలి. అందులో పారిజాతాలూ పద్మాలూ ఉండాలి. ఈ అర్చన అయ్యాక పరివార దేవతలను అర్చించాలి. నాలుగు విదిక్కుల నడుమ అంగపూజ చెయ్యాలి. అష్టదళ పద్మంలో దక్షిణావర్తంగా పరివారదేవతలను నిలపాలి. తూర్పు దళంలో మాలావతిని, ఆగ్నేయదళంలో మాధవిని, దక్షిణదళంలో రత్నమాలను, నైఋతికోణంలో సుశీలను, పశ్చిమదళంలో శశికళను, వాయవ్యకోణంలో పారిజాతను, ఉత్తరదళంలో పరావతినీ ఈశాన్యకోణంలో సుందరిని ఆవాహన చెయ్యాలి. వీరికి వెనకతట్టున దిక్పాలకులను నిలపాలి. వారివారి ఆయుధాలనూ



ఆవాహన చెయ్యాలి. అప్పుడు ఆవరణసహిత రాధాదేవిని గంధాదులతో దేవోపచార రాజోపచారాలతో అర్చించాలి.

తతో దేవీం సావరణాం గంధాద్యైరుపచారకైః ।
రాజోపచారసహితైః పూజయేన్మతిమాన్నరః ॥ (50 - 39)

ఇది అయ్యాక సహస్రనామార్చన చెయ్యాలి. ఇలా చేసిన భక్తుడు సాక్షాత్తూ విష్ణుతుల్యుడు అవుతాడు. గోలోకనివాసం పొందుతాడు. కార్తికపూర్ణిమనాడు రాధాజన్మోత్సవం చేస్తే రాసేశ్వరి సాన్నిధ్యాన్ని అనుగ్రహిస్తుంది. మంత్రాలను వర్ణసంఖ్యా విధానంగా పునశ్చరణ చెయ్యాలి. దశాంశం తిలాహోమం చెయ్యాలి. ఇంక రాధాస్తోత్రమేమిటంటే -

నమస్తే పరమేశాని రాసమండలవాసిని ।
రాసేశ్వరి నమస్తేఽస్తు కృష్ణప్రాణాధిక ప్రియే ॥
నమస్త్రైలోక్యజనని ప్రసీద కరుణార్ణవే ।
బ్రహ్మవిష్ణ్వాదిభిర్దేవైః వంద్యమానపదాంబుజే ॥
నమః సరస్వతీరూపే నమస్సావిత్రి శంకరి ।
గంగాపద్మావతీరూపే షష్ఠిమంగళచండికే ॥
నమస్తే తులసీరూపే నమో లక్ష్మీస్వరూపిణి ।
నమో దుర్గే భగవతి నమస్తే సర్వరూపిణి ॥
మూలప్రకృతిరూపాం త్వాం భజామః కరుణార్ణవామ్ ।
సంసారసాగరాదస్మాత్ ఉద్ధరాంబ దయాం కురు ॥ (50 - 50)

ఈ స్తోత్రాన్ని ముప్పొద్దులా పఠించేవారికి దుర్లభమన్నదే లేదు. జన్మాంతంలో గోలోక రాసమండలనివాసం తప్పదు.

## ◆ దుర్గారాధన ◆

నారదా ! ఇప్పుడింక దుర్గాదేవీ ఆరాధన విను. దుర్గను స్మరిస్తే చాలు ఆపదలు పారిపోతాయి. అందరూ హాయిగా ఉపాసించవచ్చు. జగన్మాత. శైవి. శక్తి. మహాద్భుతశక్తి. సర్వబుద్ధి అధిదేవి. సర్వాంతర్యామిస్వరూపిణి. కఠిన సంకట విమోచని. అందుకే దుర్గ అయ్యింది. వైష్ణవులూ శైవులూ ఉపాసించదగిన పరాదేవత. మూలప్రకృతిరూప. సృష్టిస్థితిలయకారిణి. నవాక్షరమంత్రం చెప్పనా !



వాగ్భవం శంభువనితా కామబీజం తతఃపరమ్ ।
చాముండాయై పదం పశ్చాద్విచ్చే ఇత్యక్షరద్వయమ్ ॥ (50 - 58)

ఐం హ్రీం క్లీం చాముండాయై విచ్చే - అనే నవాక్షరమంత్రం భక్తులపాలిటి కల్పవృక్షం. దీనికి బ్రహ్మవిష్ణుమహేశ్వరులు ఋషులు. గాయత్రి ఉష్ణిక్కు అనుష్టుప్పులు ఛందస్సులు. మహాకాళీ మహాలక్ష్మీ మహాసరస్వతులు దేవతలు. భ్రామరీ దుర్గా రక్తదంతికలు బీజాలు. నందా శాకంభరీ భీమాదేవీత్రయం శక్తులు. ధర్మార్థకామమోక్షాలలో వినియోగం.

ఋషులను మౌళియందు, ఛందస్సులను వదనంలోనూ దైవతాలను హృదయంలోనూ శక్తిబీజాలను స్తనాలలోనూ - ఇత్యాదిగా అంగన్యాస కరన్యాసాలతో మంత్రశాస్త్రంలో చెప్పబడిన విధానాలను అక్షరాలా పాటిస్తూ దుర్గాదేవిని అర్చించాలి. ఇలా ధ్యానించాలి -

ఖడ్గ చక్ర గదా బాణచాపాని పరిఘం తథా ।
శూలం భుశుండీం చ శిరః శంఖం సందధతీం కరైః ॥
మహాకాళీం త్రినయనాం నానాభూషణభూషితాం ।
నీలాంజన సమప్రఖ్యాం దశపాదాననాం భజే ॥
మధుకైటభనాశార్థం యాం తుష్టావాంబుజాసనః ।
ఏవం ధ్యాయేన్మహాకాళీం కామబీజస్వరూపిణీమ్ ॥

అక్షమాలాం చ పరశుం గదేషు కులిశాని చ ॥
పద్మం ధనుష్కుండికాం చ దండం శక్తిమసిం తథా ॥
చర్మాంబుజం తథా ఘంటా సురాపాత్రం చ శూలకమ్ ।
పాశం సుదర్శనం చైవ దధతీమరుణప్రభామ్ ॥
రక్తాంబుజాసనగతాం మాయాబీజస్వరూపిణీమ్ ।
మహాలక్ష్మీం భజేదేవం మహిషాసురమర్దినీమ్ ॥

ఘంటా శూలే హలం శంఖం ముసలం చ సుదర్శనమ్ ।
ధనుర్బాణాన్ హస్తపద్మైర్దధానాం కుందసన్నిభామ్ ॥
శుంభాది దైత్యసంహర్త్రీం వాణీబీజస్వరూపిణీమ్ ।
మహాసరస్వతీం ధ్యాయేత్ సచ్చిదానందవిగ్రహామ్ ॥ (50 - 72)



కామబీజస్వరూపిణిగా మహాకాళి, మాయాబీజస్వరూపిణిగా మహాలక్ష్మి, వాణీబీజస్వరూపిణిగా మహాసరస్వతి అయిన దుర్గాదేవిని ఇలా ధ్యానించి షట్కోణసంయుక్త - అష్టదళపద్మ - చతుర్వింశతి పత్రక - భూగృహసమాయుక్త - యంత్ర విచింతన చెయ్యాలి.

సాలగ్రామంలోగానీ మంగళకలశంలోగానీ యంత్రంలోగానీ ప్రతిమలలోగానీ బాణచిహ్నంలోగానీ సూర్యడిలోగానీ ఏకాగ్రచిత్తంతో దేవిని ఆవాహనచేసి ఉపాసించాలి. జయాదిశక్తియుతమైన పీఠంలో నిలిపి పూజించాలి. తూర్పుకోణంలో సరస్వతీసహితుడైన బ్రహ్మను, నైఋతికోణంలో శ్రీసహితుడైన హరినీ, వాయుకోణంలో పార్వతీపరమేశ్వరులనూ, దేవికి ఉత్తరంగా సింహాన్నీ, వామభాగంలో మహిషాసురుణ్ణీ నిలిపి అర్చించాలి. నందజ - రక్తదంత - శాకంభరి - దుర్గ - భీమ - భ్రామరి - శక్తులను షట్కోణాలలో కొలవాలి. బ్రాహ్మి - మాహేశ్వరి - కౌమారి - వైష్ణవి - వారాహి - నారసింహి - ఐంద్రి - చాముండక - రూపాలను అష్టదళాలలో యజించాలి. అటుపైని చతుర్వింశతి తత్త్వపత్రాలలో విష్ణుమాయ - చేతన - బుద్ధి - నిద్ర - క్షుధ - ఛాయ - తృష్ణ - శాంతి - జాతి - లజ్జ - క్రాంతి - శ్రద్ధ - కీర్తి - లక్ష్మి - ధృతి - వృత్తి - శ్రుతి - స్మృతి - దయ - తుష్టి - పుష్టి - మాతృ - భ్రాంతి - పరలను అర్చించాలి. ఆ తరవాత భూపురకోణాలలో గణేశ క్షేత్రపాలక వటుక యోగినులను పూజించాలి. ఇంద్రాదిదేవతలనూ వజ్రాద్యాయుధాలనూ ఇలాగే వెలుపల ఆవాహనచేసి అర్చించాలి. సావరణంగా ఇలా అర్చించి రాజోపచారాలు చెయ్యాలి. నవార్ణమంత్రాన్ని జపించాలి. సప్తశతీస్తోత్రం పఠించాలి. ఇటువంటి స్తోత్రం ముల్లోకాలలోనూ లేదు. ఇలా నిత్యం చేసిన భక్తుడు చతుర్విధపురుషార్థాలకూ ఆలయమవుతాడు.

నారదా ! శ్రీదుర్గాపూజావిధానం సమగ్రంగా వివరించాను. చెప్పినందుకు నేనూ విన్నందుకు నువ్వూ కృతార్థులమయ్యాము. సకలదేవతలూ త్రిమూర్తులూ మనువులూ మునులూ జ్ఞానులూ యోగులూ ఆశ్రమవాసులూ లక్ష్మీసరస్వతులూ అందరూ దుర్గాదేవిని ధ్యానిస్తారు. అది కారణంగానే వారందరూ ఆయా పదవులలో నిలిచి కర్తవ్యాలు నిర్వహించడానికి సమర్థులు అవుతున్నారు. పంచప్రకృతులూ తదంశమూర్తుల గురించి రహస్యాతిరహస్యమైన ఆఖ్యానాలను నీకు వివరంగా తెలియజెప్పాను. దీన్ని విన్నవారికి చతుర్విధపురుషార్థాలూ సిద్ధిస్తాయి అనడంలో సందేహం లేదు. ఇది ముమ్మాటికీ సత్యం. తొమ్మిదిరాత్రులపాటు దేవీసన్నిధిలో ఈ ఆఖ్యానాలను పఠించినవారికి తీరనికోరికలంటూ ఉండవు. రోజుకి ఒక అధ్యాయంగా పారాయణచేస్తే దుర్గాదేవి వశవర్తిని అవుతుంది. అతడు దేవీ ప్రియకరుడవుతాడు. మనోరథాన్ని సంకల్పించుకొని దేవీభాగవత గ్రంథపూజచేసి కుమారి చేతికిచ్చి లేదా వటువు చేతికిచ్చి తెరవమని - వచ్చిన అధ్యాయాన్ని చదివితే శభాశుభ శకునాలూ ఫలాలూ తెలిసిపోతాయి. ఉదాసీనుడికి ఉదాసీనంగానే ఉంటుందినుమా ! అని చెప్పి నారాయణమహర్షి ముగించాడు.

*(అధ్యాయం - 50 , శ్లోకాలు - 100)*

**నవమ స్కంధం - శ్లోకాలు : 3625 - తెలుగుసేత : బేతవోలు రామబ్రహ్మం**





# దశమ స్కంధము

శౌనకాది మహామునులారా ! శ్రద్ధగా వింటున్నారుగదా ! నారదుడు మరికొన్ని ప్రశ్నలు వేశాడు అంటూ సూతుడు తన కథనం నడిపించాడు.

నారాయణమహర్షీ! దుర్గాదేవి మహిమలూ పూజాక్రమమూ తెలుసుకున్నాను. మన్వంతరాలన్నింటా ఆ మహాదేవి ఉంటుంది అన్నావు. ఏయే రూపాలతో ఉంటుంది ? ఎలా ప్రాదుర్భవిస్తుంది ? ఎలా పూజిస్తే ఏ కోరికలు తీరుస్తుంది ? తెలియజెప్పి నావంటి భక్తులను అనుగ్రహించు - అని నారదుడు అభ్యర్థించాడు. నారాయణమహర్షి మునుపటిలాగానే మందహాసం చిందించి -

నారదా ! సకలపాపాలనూ తొలగించి సర్వసంపదలూ కలిగించే దేవీచరితం ఎంత చెప్పినా తరగదు. ఎంత విన్నా తృప్తి కలగదు. మంచి ప్రశ్నలు వేశావు. వివరిస్తున్నాను ఆలకించు - అంటూ కొనసాగించాడు.

## ◆ వింధ్యవాసిని ◆

శ్రీహరి నాభిపద్మం నుంచి బ్రహ్మదేవుడు ఆవిర్భవించాడు. ఆయన జగన్నిర్మాత. సృష్టికర్త. లోకపితామహుడు. చతుర్ముఖుడు. ఆ పరమేష్ఠినుంచి స్వాయంభువమనువు మానసపుత్రుడుగా అవతరించాడు. ఆ మనువుకి ధర్మపత్నిగా ధర్మస్వరూపిణి శతరూప ఆవిర్భవించింది. కొంతకాలం గడిచాక క్షీరసముద్రతీరంలో పరమపావన ప్రదేశంలో తపస్సు చేయనారంభించాడు. మహాభాగ్యప్రద దేవిని ఆరాధించాడు. మట్టితో దేవీమూర్తిని తయారుచేసి ఉపాసించాడు. వాణీబీజసహితంగా మహామంత్రాన్ని మనస్సులో జపించసాగాడు. నిరాహారుడై శ్వాసను బంధించి ఒంటికాలిమీద వర్షంలో నిలిచి నూరేళ్ళు తపస్సు చేశాడు. కామక్రోధాలను జయించాడు. నిరంతరం దేవీపాదపద్మాలనే హృదయంలో ధ్యానిస్తూ స్థావరమైపోయాడు. అమ్మవారికి అనుగ్రహం కలిగింది. దర్శనమిచ్చింది. వరంకోరుకోమంది. ఆ మహారాజు ఆనందపరవశుడు అయ్యాడు. అమరులకైనా అందని వరాలు అడిగాడు.

**జయదేవి విశాలాక్షి జయ సర్వాంతరస్థితే ।**
**మాన్యే పూజ్యే జగద్ధాత్రి సర్వమంగళమంగళే ॥** **(1 - 15)**



దేవీ ! జయము జయము. విశాలాక్షీ ! సర్వాంతర్యామీ ! మాన్యా ! పూజ్యా ! జగన్మాతా ! సర్వమంగళా ! జయము - జయము. బ్రహ్మదేవుడు లోకాలను సృష్టించగలుగుతున్నాడన్నా శ్రీహరి పరిపాలిస్తున్నాడన్నా హరుడు సంహరించగలుగుతున్నాడన్నా ఇంద్రుడు ముల్లోకాలనూ శాసిస్తున్నాడన్నా - అంతా నీ కృపాకటాక్షమే. దిక్పాలకులతోసహా అందరూ నీ అంశలే. నీ వల్లనే వారంతా శక్తిమంతులవుతున్నారు. అటువంటి నువ్వు నాకు వరమిస్తానంటే నాజన్మ ధన్యమయ్యింది. నాదొక్కటే వరం. బ్రహ్మమానసపుత్రుడుగా నేను చెయ్యబోయే సృష్టి నిర్విఘ్నంగా కొనసాగుగాక! నేను జపించిన నీ మంత్రాన్ని ఎవరు ఉపాసించినా వారికి సత్వరంగా సకలసిద్ధులూ కలుగుగాక ! ఈసంవాదాన్ని విన్నా చదివినా భుక్తిముక్తులు లభించుగాక ! జాతి స్మరత్వం వక్తృత్వం సౌష్ఠవం జ్ఞానసిద్ధి కర్మమార్గసంసిద్ధి కలుగుగాక ! పుత్రపౌత్రాదులతో వంశాభివృద్ధి జరుగుగాక ! ***(అధ్యాయం - 1 , శ్లోకాలు - 24)***

మహాదేవి ఈ వరాల నన్నింటినీ అనుగ్రహించింది. నీ రాజ్యం నిష్కంటకమగుగాక, నీ పుత్రులు వంశకరులగుదురుగాక. నీ భక్తి నిశ్చలంగా నిలిచి ముక్తినిచ్చుగాక అని ఆశీర్వదించి స్వాయంభువ మనువు చూస్తుండగానే వింధ్యపర్వతాలకు వెళ్ళిపోయింది.

నారదా ! వింధ్యాద్రిని నువ్వు ఎరుగుదువుగదా ! ఒకప్పుడు ఆకాశానికి ఎదిగి సూర్యుడి రథాన్ని అడ్డుకొని గమనాన్ని నిరోధించిన మహాపర్వతం. ఆ పర్వతంమీద అమ్మవారు నివసిస్తుంది. కనకనే వింధ్యవాసినీదేవి అనేపేరు ఏర్పడింది.

నారాయణమహర్షి మాటలుగా సూతుడు ఈ విషయాన్ని చెప్పేసరికి వింటున్న శౌనకాది మహామునులకు వింధ్యపర్వతం కథ తెలుసుకోవాలి అనిపించింది.

సూతమహర్షీ ! వింధ్యాచలం ఏమిటీ, ఆకాశానికి ఎదగడమేమిటీ, సూర్యరథాన్ని ఆపడమేమిటీ, ఎందుకు ఆపినట్టూ ఇవన్నీ చాలా వింతగా ఉన్నాయి. అలా ఎదిగిపోయిన పర్వతాన్ని మళ్ళీ ఎవరు కుదించారు ? అంతా వివరంగా చెప్పు. నీ ముఖచంద్రమండలంనుంచి జాలువారుతున్న ఈ దేవీచరితమనే అమృతాన్ని ఎంతగ్రోలినా తృప్తి తీరడంలేదు. సవిస్తరంగా తెలియజెయ్యి అని అభ్యర్థించారు.

## ◆ వింధ్యాచల వృత్తాంతం ◆

మహామునులారా ! పర్వతాలలోకెల్లా గౌరవాస్పదమైనది వింధ్యపర్వతం. దట్టంగా అడవులు. మహావృక్షాలు. ఫలపుష్పభరితంగా లతలూ పొదలూ. వరాహ మహిష వ్యాఘ్ర శార్దూల వానర శశక ఋక్ష (ఎలుగుబంటి) శృగాలాది (నక్క) జంతువులు. శుకశారికాది పక్షులు. అన్ని ప్రాణులకు తుష్టినీ పుష్టినీ కలిగించే మహాపర్వతం. నదీనదజలాలతో ఇసుకతిన్నెలతో దేవగంధర్వకిన్నరకింపురుషాప్సరోజాతులను ఆకర్షించే గిరిరాజం.



లీలావినోదంగా లోకాలన్నీ పర్యటించే నారదుడు ఒకనాడు వింధ్యాద్రికి వచ్చాడు. వింధ్యుడు ఎదురేగి అర్ఘ్యపాద్యాది అతిథిసత్కారాలు జరిపి సముచితాసనంమీద కూర్చోబెట్టి కుశల ప్రశ్నలు వేశాడు.

దేవర్షీ ! ఎక్కడినుంచి ఎక్కడికి వెడుతూ ఇక్కడికి వచ్చావు ? నీ రాకతో నా మందిరం పావనమయ్యింది. సూర్యుడిలా నిరంతరం నువ్వు సంచరిస్తూనే ఉంటావు. నీ సంచారం ప్రాణికోటికి అభయప్రదం. మహానుభావా ! సృష్టిలో నీకు తెలియని వింతలూ విడ్డూరాలూ ఉండవు. అటువంటి అపూర్వమూ అద్భుతావహమూ వృత్తాంతమేదైనా ఒకటి చెప్పి చెవులకు విందుచెయ్యి.

వింధ్యాద్రీ ! నేనిప్పుడు బంగారుకొండ మేరుపర్వతంనుంచి వస్తున్నాను. ఆ శిఖరంమీద ఇంద్రాగ్నియమవరుణలోకాలున్నాయి. అష్టదిక్పాలకులకూ భవనాలున్నాయి. అవ్వి భవనాలంటే భవనాలా? సకల భోగాలకూ భువనాలు - అని చెప్పి నారదుడు గట్టిగా నిట్టూర్చి ఊరుకున్నాడు.

అదేమిటి దేవర్షీ ! అలా నిట్టూర్చావు. కారణం ఏమిటి ? అని సంభ్రమంగా అడిగాడు వింధ్యాద్రి.

నారదుడికి ముఖం విప్పారింది. అద్రిరాజా ! ఏమి చెప్పమంటావ్ ! హిమవంతుడున్నాడా, పార్వతీదేవికి తండ్రి, శివుడంతటివాడికి మామగారూను. కదా ! ఆ శివుడి సంబంధంతో హిమవంతుడు పరమ పూజ్యుడయ్యాడు. అలాగే కైలాసమూను. అది శివుడికి సాక్షాత్తు నివాసభవనమాయె. పూజ్యుడయ్యాడు. పాపవినాశకుడనే కీర్తి పొందాడు. ఇలాగే నిషధ - నీల - గంధమాదనాదులూ ఏవేవో ప్రత్యేకతలతో మన్ననలు అందుకుంటున్నాయి. ఎవరి గౌరవం వారికి దక్కుతోంది. బాగానే ఉంది. కానీ ఆ మేరుపర్వతం ఏమిటో మరీ విర్రవీగుతోంది. విశ్వాత్మకుడు సూర్యుడు గ్రహబృందాలతో నక్షత్రగణాలతో సహా తనచుట్టూ తిరుగుతూ ఉంటాడట. తానేమో కనకపర్వతంట. అన్ని పర్వతాలలోకీ తానే ఉత్తమోత్తమమంట. శ్రేష్ఠంట. వరిష్ఠంట. తనకు సాటివచ్చే పర్వతం మరొకటి ఈ సృష్టిలోనే లేదుట. ఏమిటో ఇలాగ తనకుతాను భావించేసుకుని తెగవిర్రవీగిపోతున్నాడు ఆ మేరుపర్వతరాజు. జ్ఞాపకంవచ్చి నిట్టూర్చాను. అంతకన్నా ఏమీ లేదులే వింధ్యపర్వతరాజా ! అయినా నాలాంటి తపస్వులకు ఇలాంటి గొడవలతో పనేమిటి చెప్పు ? ఏదో ప్రసంగవశాత్తూ వచ్చింది కాబట్టీ, అదయినా నువ్వు అడిగావు కాబట్టీ ఈ మాటన్నా చెప్పాను. వెళ్ళొస్తా. *(అధ్యాయం - 2 , శ్లోకాలు - 28)*

అస్తు నైతావతా కృత్యం తపోబలవతాం నగ ।
ప్రసంగతో మయోక్తం తే గమిష్యామి నిజం గృహమ్ ॥ (2 - 28)

ఈ మాటకాస్తా చెప్పేసి స్వైరచారి దేవర్షి బ్రహ్మలోకానికి వెళ్ళిపోయాడు. వింధ్యుడికి మనస్సు కుతకుతలాడిపోయింది. లోపల లోపల చిచ్చు రగుల్కుంటోంది. శాంతి లేదు. ఏమి చెయ్యాలి ? ఎలా చెయ్యాలి ? మేరువుని జయించడం ఎలాగ ? అందాకా శాంతిలేదు. సౌఖ్యం లేదు. ఓడించకపోతే నా



ఉత్సాహం ఎందుకు, నా మానాభిమానాలు ఎందుకు, నా కీర్తి ఎందుకు, నా కులం ఎందుకు, నా బలం ఎందుకు, నా పౌరుషం ఎందుకు, నా జ్ఞానం ఎందుకు, నా వంశం ఎందుకు ? ఇలా మథనపడుతుండగా అతడి మనస్సులో ఒక ఆలోచన తళుక్కున మెరిసింది. దోషకారిణి బుద్ధిపుట్టింది.

రోజూ సూర్యుడు గ్రహనక్షత్ర బృందాలతో ప్రదక్షిణం చేస్తాడుటగదా ఆ మేరువుకి. సరే. ఆ సూర్యుడి మార్గానికి అడ్డం నిలుస్తాను. ఎలా ప్రదక్షిణం చేస్తాడో చూస్తాను. మేరువుకి గర్వభంగం చేస్తాను.

ఈ బుద్ధి పుట్టడమేమిటి. వెంటనే వింధ్యాద్రి ఆకాశానికి ఎదిగింది. కొండకొమ్ములతో ఆవరించింది. సూర్యుడు ఉదయించనీ. ఎటు కదులుతాడో చూస్తాను - అని ఆకాశాన్ని తన్నిపెట్టుకు నిలబడింది.

రాత్రి గడిచింది. నిర్మలంగా తెలవారింది. దిక్కులు తేటపడ్డాయి. తూర్పుకొండనుంచి సూర్యరథం కదిలింది. కిరణాలు దశదిశలకూ పరుచుకున్నాయి. పద్మాలు వికసించాయి. కలువలు ముకుళించాయి. లోకులు తమతమ పనులకు ఉపక్రమించారు.

పూర్వాహ్ణ అపరాహ్ణ మధ్యాహ్న విభాగం కల్పించి హవ్య కవ్య భూతబలులను దేవతలకు వృద్ధిపరిచే సూర్యుడు తూర్పునుంచి కదిలి ఆగ్నేయానికి సాగి అక్కడినుంచి దక్షిణదిశగా ప్రయాణం సాగించాడు. అతడు వచ్చి వెడుతూంటే దిక్కాంతలు విరహవేదనకు లోనవుతున్నారు. దక్షిణదిశగా వెడుతున్న రథం హఠాత్తుగా ఆగిపోయింది. సారథి అనూరుడు ఒక్కపెట్టున అరిచాడు.

సూర్యదేవా ! వింధ్యపర్వతం ఎదిగి ఆకాశమార్గాన అదిగో అడ్డంగా నిలిచింది. నీ ప్రదక్షిణం కోరి మేరువుతో పోటీపడుతున్నట్టుంది.

సూర్యుడు ఆశ్చర్యపోయాడు. ఆకాశమార్గంలోకూడా అడ్డంకులా ! అవునుమరి అభివృద్ధిచెందుతున్న శూరుడు ఏదైనా సాధిస్తాడు. అతడికి అసాధ్యం ఏదీ ఉండదు. రథం ఆగిపోయింది. దేవుడే కాపాడాలి. దైవమే బలీయం. రాహువు బాహువులు సాచి కబళించినా క్షణకాలమైనా ఆగని నేను ఇప్పుడిలా అడ్డగింపబడ్డానంటే విధి బలీయం కాక మరింకేమిటనుకోను !

సూర్యుడు ఆగిపోయాడు. ఏ లోకానికీ దిక్కుతోచలేదు. ఎవరిని శరణువేడాలి ? కర్తవ్యం ఏమిటి? ఏమీ తోచలేదు. మానవులేకాదు చిత్రగుప్తాదులుకూడా సూర్యుణ్ణిబట్టే కాలాన్ని గణిస్తారు. ఇప్పుడు ఏమి చెయ్యాలో వారికి పాలుపోలేదు. ఒక పర్వతం సూర్యభగవానుడిని అడ్డుకోవడమా ! అహా ! దైవవిపర్యయం !

జగత్తు స్తంభించిపోయింది. స్వాహా స్వధాకారాలు లేవు. ఇది పశ్చిమ దిక్కువారి అవస్థ. ఇక దాక్షిణాత్యుల పరిస్థితి ఏమిటంటే - రాత్రి తరగడం లేదు. మెలకువ వచ్చినా వేకువ కావడం లేదు. తూర్పు ఉత్తర దిక్కులవారు నిలబడిపోయిన సూర్యుడి తాపాన్ని తట్టుకోలేక అల్లాడుతున్నారు. ఏ రకంగానైనా



మొత్తం ప్రజానీకమంతా మృతమూ నష్టమూ భగ్నమూ వినాశమూ అయిపోతోంది. అంతటా హాహాకారాలే వినవస్తున్నాయి. సంధ్యావందన హోమాదిక్రతువులు ఆగిపోయాయి. దానితో ఇంద్రుడితోసహా దేవతలంతా ఏమి చెయ్యాలోతోచక మడమలు తొక్కుకున్నారు. *(అధ్యాయం - 3, శ్లోకాలు - 25)*

శౌనకాది మహామునులారా ! పరిస్థితి ఇలా విషమించడంతో ఇంద్రాది దేవతలందరూ కలిసి సృష్టికర్తను ముందు నిలుపుకుని రుద్రుణ్ణి శరణువేడారు.

ఉమాలలిత పంకజా ! గణాధ్యక్షా ! అష్టసిద్ధి విభూతిదాతా ! మహామాయావిలాసస్థానమా ! పరమాత్మా ! వృషాంకా ! అమరేశా ! కైలాసవాసా ! అహిర్బుధ్నా ! మాన్యా ! మనూ ! మానదా ! అజా ! స్వాత్మారామా ! శంభూ ! గణనాథా ! దేవా ! గిరీశా ! మహావిష్ణుస్తుతా ! విష్ణుహృదయపద్మనివాసా ! మహాయోగరతా ! యోగగమ్యా ! యోగివిభూ ! యోగీశా ! యోగఫలప్రదా ! దీనరక్షాపరా ! దయాసాగరా ! అర్తిప్రశమనా ! ఉగ్రవీర్యా ! గుణమూర్తీ ! వృషధ్వజా ! కాలస్వరూపా ! కాలకాలా ! నమో నమః. నమో నమః - అంటూ అందరూ సాగిలపడ్డారు.

ఉబ్బులింగడు పరవశించాడు. చిరునవ్వులు చిందించాడు. దేవతలారా ! మీ స్తోత్రం నన్ను అలరించింది. ప్రసన్నుడిని అయ్యాను. మీ మనోరథాలు ఏమిటో చెప్పండి. తీరుస్తాను - అన్నాడు గంభీరంగా.

సర్వదేవేశా ! గిరీశా ! శశిమౌళీ ! ఆర్తులకు సుఖసంతోషాలు (శమ్) కలిగిస్తావు కనక శంకరుడవయ్యావు. ఇప్పుడు మేమంతా ఆర్తులము. నిన్ను శరణు అంటున్నాం. మాకు శమ్ కలిగించు. వింధ్యపర్వతమని ఒకటి ఉంది. మేరువుతో దానికి పంతమూ పోటీ. అదిప్పుడు శరీరం పెంచి సూర్యగమనాన్ని నిరోధించింది. లోకాలన్నీ అల్లల్లాడిపోతున్నాయి. దాని విజృంభణాన్ని నిలువరించు. లోకాలకు మేలు చెయ్యి. సూర్యుడే ఆగిపోతే ఇక కాలజ్ఞానం ఎలాగ ? యజ్ఞయాగాలులేక స్వాహా స్వధాకారాలులేక మేమంతా జీవించేది ఎలాగ ? ఎవరిని శరణువేడాలి అని ఆలోచిస్తే మాకందరికీ నువ్వే స్ఫురించావు. ఈ ఆపద తొలగించడానికి నువ్వే సమర్థుడవు. మాకు మరొక దిక్కులేదు. కాపాడు.

దేవతలారా ! మీకు నామీద ఉన్న నమ్మకానికి సంతోషమే కానీ నాకు అంతటి శక్తిలేదు. ఏ పర్వతాన్నయినా అణిచివెయ్యగల సమర్థుడు రమాకాంతుడొక్కడే. అతడే మనకందరికీ ప్రభువు. సర్వకారణకారణుడు. నేనూ వస్తాను. పదండి. వైకుంఠానికి వెడదాం. శ్రీహరితో విన్నవించుకుందాం. కష్టాలు కడతేరుస్తాడు - అనడమేమిటి శివుడివెంట దేవతలందరూ బయలుదేరి వేగంగా వైకుంఠం చేరుకున్నారు. *(అధ్యాయం - 4, శ్లోకాలు - 19)*



విష్ణుమూర్తీ ! జయము. జయము. రమావల్లభా ! శరణు. శరణు. మహాపురుషా ! దైత్యారీ ! కామజనకా ! సర్వకామఫలప్రదా ! మహావరాహా ! గోవిందా ! మహాయజ్ఞస్వరూపకా ! మహావిష్ణూ ! ధ్రువేశా ! జగదుత్పత్తి కారణా ! మత్స్యావతారం ధరించి వేదాలను ఉద్ధరించావు. సత్యవ్రతా ! ధరాధీశా ! సురకార్యసాధకా ! అమృతాప్తికరా ! ఈశానా ! నమో నమః. ఆదిదైత్యుడిని సంహరించడానికి ఆదిసూకరరూపం ధరించినవాడా ! భూమీ భారవాహా ! కూర్మరూపా ! హిరణ్యకశిపుడిని మట్టుబెట్టడానికి నరసింహావతారం ఎత్తినవాడా ! బలిచక్రవర్తిని కికురించడానికి వామనమూర్తివైనవాడా ! దుర్మార్గులైన క్షత్రియుల్ని అంతమొందించడానికి రేణుకాజమదగ్నులకు పుత్రుడవైన పరశురామా ! దశకంధర సంహారంకోసం భూలోకాన అవతరించిన దాశరథీ ! కంసదుర్యోధనాది రాక్షసాంశలను తునిమి భూభారం తొలగించడానికీ ధర్మసంస్థాపనకూ కృష్ణావతారం ధరించినవాడా ! పశుహింసను వారించి దుష్టయజ్ఞాలను నిషేధించిన బుద్ధావతారా ! దుష్టుల పాలనలో మగ్గిపోతున్న లోకాన్ని కాపాడటంకోసం కల్కిరూపం ధరించినవాడా ! శిష్టరక్షణకూ దుష్టశిక్షణకూ దశావతారాలు ఎత్తి సర్వదుఃఖహరుడవయ్యావు. భక్తుల ఆర్తిని తొలగించడంకోసం స్త్రీజన్మలేకాదు జలజంతువుల రూపాలనుకూడా ధరించావంటే నీకంటే దయానిధులుంటారా ? భక్తార్తిహరా ! నమో నమః. నమో నమః - దేవతలు భక్తిప్రపత్తులతో స్తుతించి సాష్టాంగపడ్డారు.

గదాధరుడు ప్రసన్నుడయ్యాడు. మందహాసం చిందించాడు. దేవతలారా ! నేను ప్రసన్నుడిని అయ్యాను. మీకింక భయంలేదు. వేదనలన్నీ మరిచిపొండి. భరింపరాని మీ దుఃఖాన్ని తొలగిస్తాను. ఎంతటి దుర్లభమైన వరమయినా సరే - ఇస్తాను. కోరుకోండి. మీ స్తోత్రము ఇంతగా నన్ను ఆనందింపజేసింది. వరువాత లేచి శుచియై ఈ స్తవాన్ని పఠించినవారికి ఏ దుఃఖాలూ రావు. అనారోగ్యంకానీ దారిద్ర్యంకానీ వారి ఇళ్ళ దరిదాపులకైనా రావు. దుష్టగ్రహ భూతప్రేత పీడలు ఉండవు. మంచి సంతానంతో భోగభాగ్యాలతో సుఖాలనుభవిస్తూ చిరకాలం జీవిస్తారు. వెయ్యేల, ఈ స్తోత్రం సర్వార్థసాధకం. భుక్తిముక్తి ప్రదాయకం. విబుధులారా ! మీ మనస్సులో బాధ ఏమిటో చెప్పండి. తప్పకుండా తొలగిస్తాను. అణుమాత్రం కూడా సందేహించకండి.

శ్రీహరి ప్రసంగంతో ఇంద్ర రుద్ర బ్రహ్మాదిదేవతలకు ఉత్సాహం కలిగింది. వింధ్య వృత్తాంతం విన్నవించారు.

***(అధ్యాయం - 5 , శ్లోకాలు - 27)***

దేవదేవా ! మహావిష్ణూ ! సృష్టిస్థితిలయకారణా ! వింధ్యపర్వతం సూర్యభగవానుడిని అడ్డుకుంది. మేమంతా భోగభాగ్యరహితులమైపోయాం. ఏమి చెయ్యాలో ఎక్కడికి పోవాలో దిక్కుతోచక నీ సన్నిధికి వచ్చాం. నువ్వే కాపాడాలి - అని మొరపెట్టుకున్నారు.



దేవతలారా ! చరాచరజగత్తుకంతటికీ కన్నతల్లి శ్రీమన్మహామాత. ఆ దేవిని నిరంతరం అర్చించే అగస్త్యమహర్షి వారణాసిలో ఉన్నాడు. మహాతేజస్వి. అతడు వింధ్యగర్వాన్ని అణగ్గొడతాడు. ముక్తిధామమైన ఆ కాశీకి వెళ్ళి అగస్త్యుణ్ణి అభ్యర్థించండి.

విష్ణుమూర్తి చెప్పిన ప్రకారం దేవతలందరూ కాశీకి వెళ్ళారు. భక్తియుక్తులై మణికర్ణికలో సచేలస్నానాలు చేశారు. దేవపితృతర్పణాలు విడిచిపెట్టారు. దానధర్మాలు చేశారు. అగస్త్యుడి ఆశ్రమం చేరుకున్నారు. ప్రశాంతమైన వాతావరణం. గుబురుగా ఎదిగిన చెట్లు. మయూర సారస హంస చక్రవాకాలు గుంపులు గుంపులుగా సంచరిస్తున్నాయి. వ్యాఘ్ర శార్దూలాది క్రూరమృగాలు సైతం నిశ్శబ్దంగా ప్రసన్నంగా తపస్వుల్లాగా ఉన్నాయి. కుటీరంలో మహర్షి ధ్యానంలో కూర్చుని ఉన్నాడు. దేవతలు ఆట్టే అలికిడి చెయ్యకుండా వెళ్ళి సాష్టాంగపడ్డారు.

బ్రాహ్మణోత్తమా ! పరమపూజ్యా ! వాతాపి బలనాశకా ! కుంభసంభవా ! లోపాముద్రాపతీ ! మిత్రావరుణనందనా ! సర్వవిద్యానిధీ ! శాస్త్రనిధీ ! నువ్వు ఉదయిస్తే జలప్రవాహాలు తేరుకుంటాయి. రెల్లు దుబ్బులు వికసిస్తాయి. రావణుడంతటివాడు నీ భక్తుడు. జటామండలధారీ ! శిష్యబృందవిహారీ ! నమో నమః. దేవతాస్తుత్యగుణరాశీ ! ఆపోశితవారాశీ ! (సముద్రాలను ఆపోశనం పట్టినవాడా) శరణు. శరణు. స్వామీ ! శరణు. శరణు. వింధ్యపర్వతానికి గర్వభంగం చేసి లోకాలను కాపాడు.

దేవతల స్తుతినీ అభ్యర్థననూ ఆలకించిన అగస్త్యుడు ప్రసన్నుడై మెల్లగా కన్నులు విప్పాడు. మీరంతా ఉత్తమోత్తములు. దేవతలు. త్రిభువనేశ్వరులు. లోకపాలకులు. మహాత్ములు. నిగ్రహానుగ్రహ సమర్థులు. తిరుగులేని వజ్రాయుధం చేతబట్టిన ఇంద్రుడున్నాడు. హవ్యకవ్య వాహకుడు అగ్ని ఉన్నాడు. దేవతలకు అతడేకదా ముఖస్థానీయుడు. రాక్షసగణాలను గడగడలాడించగలిగిన వరుణుడున్నాడు. యముడున్నాడు. వీరిలో ఏ ఒక్కరు తలచుకున్నా వింధ్యపర్వతానికి శృంగభంగమైపోతుందే. అలాంటిది అందరూవచ్చి నన్ను కోరుతున్నారంటే వింతగా ఉందే !

మహర్షీ ! వింత ఏమీలేదు. ఇది మాకెవ్వరికీ సాధ్యంకాదు. విష్ణుమూర్తి సూచనపై నిన్ను అభ్యర్థిస్తున్నాం. నువ్వే సమర్థుడివి. నిశ్చేష్టమైపోయిన ముల్లోకాలనూ కాపాడే శక్తి నీకే ఉంది. సూర్యుడికి గతి కల్పించు. వింధ్యుడికి సన్మతి పుట్టించు. నీ తేజస్సుకి లొంగుతాడు. నమ్రుడవుతాడు. కేవలం ఈ పనిమీదనే వచ్చాం. ఉపకారం చేసిపెట్టు. చెయ్యాలి. తప్పదు - దేవతల విజ్ఞప్తిని అగస్త్యుడు అంగీకరించాడు. సరే అన్నాడు. విబుధుల అంతరంగాలు తేలికపడ్డాయి. తృప్తిగా ఊపిరి పీల్చుకుని తిరిగి వెళ్ళారు.

*(అధ్యాయం - 6, శ్లోకాలు - 28)*



## ◆ అగస్త్యుడి దక్షిణాపథయాత్ర ◆

దేవతలు వెళ్ళాక అగస్త్యుడు ధర్మపత్ని లోపాముద్రను పిలిచాడు. రాకుమారీ ! మన కాశీనివాసానికి విఘ్నం రానే వచ్చింది. వింధ్యపర్వతం సూర్యుడి దారికి అవరోధం కలిగించిందిట. దానిని తొలగించమని దేవతల ఆజ్ఞ. మనం వెళ్ళక తప్పదు. కాశీ గురించి పూర్వీకులు చెప్పినమాట వాస్తవం. కాశీలో నివసించేవారికి విఘ్నాలు చాలా వస్తాయి. అయినా ముముక్షువులు అవిముక్తాన్ని (కాశీని) విడిచిపెట్టకూడదు - అన్నారు.

అవిముక్తం న మోక్తవ్యం సర్వథైవ ముముక్షుభిః ।
కిన్తు విఘ్నా భవిష్యంతి కాశ్యాం నివసతాం సతామ్ ॥ (7 - 6)

అన్నట్టుగానే అంతరాయం రానే వచ్చింది. సరే పద, దక్షిణాపథానికి బయలుదేరదాం - అన్నాడు. ఇద్దరూ కలిసి మణికర్ణికలో స్నానంచేసి విశ్వేశ్వరుణ్ణి దర్శించారు. అటుపైని దండపాణిని అర్చించారు. కాలభైరవమూర్తిని సందర్శించారు.

కాలరాజా ! మహాబాహూ ! భయనాశకా ! కాశీ పట్టణానికి నువ్వు ప్రభువువు. కాశీవాసులకు కలిగే విఘ్నాలను అన్నింటినీ తొలగించేవాడవు. భక్తులను రక్షించేవాడవు. నన్నెందుకు దూరం చేస్తున్నావు స్వామీ! నేను చేసిన అపరాధం ఏమిటి ? ఎవరిమీదనైనా అపవాదులు వేశానా ? అసత్యాలు పలికానా ? లోభగుణానికి లొంగిపోయానా ? ఏ పాపం చేశానని నాకు ఈ శిక్ష విధిస్తున్నావు ? ఎందుకు వెళ్ళగొడుతున్నావు ?

సాక్షిగణపతీ ! విఘ్ననివారణా ! నీకూ కోపమే వచ్చిందా ? కాశీని విడిచివెళ్ళవలసిన అవసరాన్ని ఎందుకు కల్పించావు ?

ఆ మునిదంపతులు ఇలా కాశీదేవతలనందరినీ దర్శించి ప్రార్థించి విన్నపాలు చేసుకుని దక్షిణదిక్కుకు బయలుదేరారు. కాశీని విడిచిపెట్టవలసి వస్తోందే అన్న బాధ అనుక్షణం వారిని పీడించింది. గుండె దిటవు పరుచుకుని ప్రయాణం సాగించారు. అడుగడుగునా కాశీని తలచుకుంటూనే నడిచారు. కొంతదూరం వెళ్ళాక నడక చాలించి తపశ్శక్తినే విమానం చేసుకుని ఆకాశమార్గాన దక్షిణాపథం వైపు వచ్చారు.

నిముషన్నరలో ఎట్టయెదుట వింధ్యపర్వతం కనిపించింది. ఆకాశానికి తన్నుకుని నిలబడి ఉంది. మునిదంపతులు ఆశ్చర్యచకితులై చూస్తూ నిలబడ్డారు.

అగస్త్యుడిని అల్లంతదూరంలోనే చూసిన వింధ్యుడు వొణికిపోయాడు. మహర్షికి మర్యాదలు చెయ్యాలి. స్వాగతం పలకాలి. ఎలాగ ? ఎలాగ ? అని కంగారుపడ్డాడు. తనను తాను కుంచించుకుని వినయంగా భక్తిగా సాష్టాంగపడ్డాడు. అగస్త్యుడి మనస్సు ప్రసన్నమయ్యింది. ముఖం విప్పారింది.



వత్సా ! దక్షిణాపథానికి వెళ్ళి నేను తిరిగి వచ్చేవరకూ నువ్వు ఇలాగే ఉండు. ఆకాశానికి అడ్డంగా ఎదిగి ఎత్తుగా నువ్వుంటే నీ శిఖరాలను అధిరోహించి దాటివెళ్ళగలిగిన ఓపిక నాకులేదయ్యా. అందుకని పుత్రకా ! నేను వెళ్ళివచ్చేవరకూ నువ్వు ఇలాగే ఉండు - అని చెప్పేసి లోపాముద్రాగస్త్యులు వింధ్యను దాటి దక్షిణదిశకు వచ్చేశారు. శ్రీశైలాన్ని దర్శించి మలయాద్రిమీద ఆశ్రమం నిర్మించుకుని కాపురం ఉన్నారు.

అగస్త్యుడి అభ్యర్థనమేరకు శ్రీమన్మహాదేవి వింధ్యపర్వతాన విడిది చేసింది. భక్తాగ్రేసరుడి అర్చనలకు తానై అందుబాటులో నిలిచింది. వింధ్యవాసినిగా ప్రసిద్ధికెక్కింది.

స్వాయంభువమనువు ఈ వింధ్యవాసినినే ఉపాసించాడని నారాయణమహర్షి నారదుడికి చెప్పిన వృత్తాంతాన్ని సూతుడు శౌనకాది మహర్షులకు వినిపించాడు. ఈ ఉపాఖ్యానం పుణ్యప్రదం. పాపనాశకం. రాజులకు విజయాన్నీ ద్విజులకు జ్ఞానాన్నీ వైశ్యులకు ధనధాన్యసమృద్ధినీ మిగిలినవారికి సుఖసంతోషాలనూ కలిగిస్తుంది. ఒక్కసారి చదివినా విన్నా చాలు - అని ఫలశ్రుతికూడా చెప్పాడు.

*(అధ్యాయం - 7, శ్లోకాలు - 27)*

## ◆ మన్వంతరాలలో మహాదేవి ◆

శౌనకాది మహామునులారా ! మొదటి మన్వంతరంలో జగన్మాత - వింధ్యవాసినిగా ఆరాధనలు అందుకుంది. మిగతా మన్వంతరాలలో ఏయే రూపాలతో ఎవరెవరి అర్చనలు అందుకున్నదో తెలియజెప్పమని నారదుడు అడిగాడు. నారాయణమహర్షి ఇలా వివరించాడు -

నారదా ! స్వాయంభువుడు మొదటి మనువు. ఆయన వింధ్యవాసినిని ఆరాధించి అకంటకంగా రాజ్యపాలన సాగించాడు. ప్రియవ్రత - ఉత్తానపాదులు ఇద్దరూ అతడి కుమారులు. మహా తేజస్వులు. పరిపాలకులుగా సుప్రసిద్ధులు. ఈ స్వాయంభువుడి తరవాత స్వారోచిషుడు రెండవ మనువు. ఇతడు ప్రియవ్రతుడి కుమారుడు. అప్రమేయ బలపరాక్రమసంపన్నుడు. కాళిందీ తీరంలో ఆశ్రమం కట్టుకుని మట్టితో దేవీవిగ్రహం చేసి దాని ఎదుటే కూర్చుని తపస్సు చేశాడు. పన్నెండు సంవత్సరాలకి అమ్మవారు అనుగ్రహించింది. కోటిసూర్యప్రభలు విరజిమ్ముతూ ప్రత్యక్షమయ్యింది. స్వారోచిషుడికి సర్వమన్వంతరాలకూ ఆధిపత్యం ప్రసాదించింది. తారిణి అనే పేరుతో ప్రసిద్ధికెక్కింది. తరవాత ఉత్తముడు అనే మూడవ మనువు (ప్రియవ్రతసుతుడు) గంగాతీరంలో మూడేళ్ళు తీవ్రంగా తపస్సుచేసి అమ్మవారి అనుగ్రహానికి పాత్రుడయ్యాడు. నిష్కంటకంగా రాజ్యం పరిపాలించి ఉత్తమ సంతానం పొంది భోగభాగ్యాలు అనుభవించి ధర్మకార్యాలు ఆచరించి రాజర్షి పదవిని పొందాడు. ప్రియవ్రతుడి నాల్గవ కుమారుడు తామసుడు



మనువు అయ్యాడు. నర్మదానది దక్షిణతీరంలో దేవీ సమర్చన చేశాడు. వసంతశరదృతువుల్లో నవరాత్రి సపర్యలు చేశాడు. స్తోత్రాలతో అనుగ్రహం సంపాదించాడు. జలజాక్షిగా అవతరించి జగన్మాత వరాలు ప్రసాదించింది. అకంటకంగా రాజ్యమేలి పదిమంది మహావీరుల్ని పుత్రులుగా పొంది ఉత్తమ లోకాలకు చేరుకున్నాడు. తామసుడి తమ్ముడు రైవతుడు అయిదవ మనువయ్యాడు. కాళిందీతీరంలోనే తపస్సు చేశాడు. సరస్వతీ బీజాక్షరంతో కలిపి అమ్మవారి మహామంత్రాన్ని రహస్యంగా జపించాడు. జగజ్జనని అనుగ్రహానికిపాత్రుడై రాజ్యాన్ని శత్రుపీడారహితంగా పాలించి సత్పుత్రుల్ని పొంది ఇంద్రలోకం చేరుకున్నాడు.

*(అధ్యాయం - 8 , శ్లోకాలు - 24)*

అంగపుత్రుడు చాక్షుషుడు ఆరవ మనువయ్యాడు. సుపులహుడు అనే బ్రహ్మర్షిని శరణువేడాడు. సిరిసంపదలు కలిగే ఉపాయం చెప్పమనీ సమస్తమేదినీమండలానికీ ఆధిపత్యం లభించే తెరువు చూపమనీ అవ్యాహతభుజబలం శస్త్రాస్త్రనైపుణ్యం కావాలనీ ఉత్తమసంతానం అఖండయౌవనం జన్మాంతంలో మోక్షం - ఇవి నా అభిలాషలనీ అభ్యర్థించాడు. ఆ బ్రహ్మర్షి - వాగ్భవబీజయుక్తంగా మహాదేవీ మూలమంత్రాన్ని జపించమనీ త్రిమూర్తులకూ ఆయా శక్తులు అందువల్లనే లభించాయనీ నీకూ అలాగే కోరికలన్నీ తీరతాయనీ ఉపదేశించాడు. చాక్షుషుడు విరజానదీతీరానికి వెళ్ళి దీక్షతో తీవ్రతపస్సు చేశాడు. కేవలం రాలిపడిన ఆకులూ అలములూ తింటూ ప్రాణాలు నిలుపుకుని జపం సాగించాడు. మొదటి సంవత్సరం గడిచింది. రెండవ సంవత్సరమంతా కేవలం నీరు తాగి, మూడవ యేడు అదికూడా మానేసి గాలినిమాత్రమే పీలుస్తూ స్థాణువులా నిలబడి తపస్సు చేశాడు. ఇలా పన్నెండేళ్ళు గడిచాయి. అప్పుడు శ్రీపరమేశ్వరి సాక్షాత్కరించింది. వరం కోరుకోమంది.

మహాదేవీ ! నువ్వు సర్వాంతర్యామివి. నా కోరికలు ఏమిటో తెలుసు. అయినా అడగమన్నావు కనక అడుగుతున్నాను. మన్వంతరరాజ్యం కావాలి. సద్గుణసంపన్నులూ మహావీరులూ దేవీభక్తి తత్పరులూ అయిన పుత్రులు కావాలి. భోగభాగ్యాలు అనుభవిస్తూ శత్రుపీడారహితంగా రాజ్యాన్ని పరిపాలించాలి. జన్మాంతంలో ముక్తి కలగాలి. దేవేశీ ! అనుగ్రహించు - అని అభ్యర్థించాడు చాక్షుషుడు. అమ్మవారు అన్ని వరాలూ ఇచ్చి అంతర్ధానం చెందింది. చాక్షుషుడు మనువుల్లోకెల్లా మాన్యుడయ్యాడు. అతడి కొడుకులు సమర్థులనిపించుకున్నారు. మన్వంతరకాలం రాజ్యంచేసి చాక్షుషుడు దేవీప్రసాదంవల్ల ముక్తిపొందాడు.

*(అధ్యాయం - 9 , శ్లోకాలు - 29)*

నారదా ! వైవస్వతుడు ఏడవ మనువు. సావర్ణి ఎనిమిదవ మనువు. వీరిద్దరూ దేవీ సమర్చనతోనే మన్వంతరాలకు అధిపతులయ్యారు. వీరిలో సావర్ణిది జన్మాంతరారాధన. అందుకని పుట్టుకతోనే మన్వంతరపతి అయ్యాడు. ఈ కథ ఏమిటంటే -



## ◆ మనుసావర్ణి (సురథుడు) - దేవీమాహాత్మ్యం ◆

స్వారోచిష మన్వంతరకాలంలో చైత్రవంశంలో సురథుడు అనే మహారాజు ఉండేవాడు. సుప్రసిద్ధుడు. బలపరాక్రమశాలి. గుణగ్రాహి. ధనుర్ధారి. స్వయంగా కవి. ధనం సంపాదించడం, సంపాదించినదాన్ని యాచకులకు పంచిపెట్టడం రెండూ తెలిసినవాడు. సర్వశస్త్రాస్త్ర కుశలుడు.

ఒకనాడు శత్రువులంతా కూడబలుక్కుని దండెత్తి వచ్చి ఇతడి రాజధానిని చుట్టుముట్టారు. అభిమానధనుడు సురథుడు సైన్యసమేతుడై ప్రాకారం దాటివచ్చి యుద్ధానికి తలపడ్డాడు. భీషణంగా జరిగిన యుద్ధంలో కట్టకడపటికి సురథుడు ఓడిపోయాడు. సకలసంపదలూ మిత్రులకూ శత్రువులకూ హస్తగతమైపోయాయి. దిక్కుతోచని సురథుడు ఒక గుర్రాన్ని అధిరోహించి రహస్యమార్గాన అడవులకు వెళ్ళిపోయాడు. వికలమైన మనస్సుతో అడవిలో ఒంటరిగా తిరుగుతూంటే ఒక మునీశ్వరుడు చూసి ఓదార్చి ఆశ్రమానికి తీసుకువెళ్ళాడు. ఆ ప్రశాంత వాతావరణంలో మునిశిష్యులతో చాలాకాలం గడిపాడు. ఒకరోజున ఆ మునీశ్వరుడు పూజ ముగించే సమయానికి సురథుడు వెళ్ళి నమస్కరించాడు.

మునీశ్వరా ! ఎంతకీ దుఃఖం వదలడంలేదు. మనస్సుని బాధిస్తూనే ఉంది. తత్త్వం తెలిసినా దుఃఖాన్ని జయించే ప్రజ్ఞ కరువయ్యింది. శత్రువులు ఓడించారు. రాజ్యం అపహరించారు. ఐనా ఎందుకనో వాళ్ళపట్ల ద్వేషం కలగడంలేదు. కోపం రావడంలేదు. స్ఫుటంగా మమకారమే కలుగుతోంది. అలాగని దుఃఖం తొలిగిపోతోందా అంటే అదీ లేదు. ఇదంతా విచిత్రంగా ఉంది. ఏమి చెయ్యను ? ఎక్కడికి వెళ్ళను ? మనశ్శాంతి లభించే మార్గం ఏమిటి ? నువ్వు వేదవేదాంగవేత్తవు. అనుగ్రహించి ఏదైనా దారిచూపించు.

సురథా ! దేవీమాహాత్మ్యం చాలా ఆశ్చర్యకరంసుమా ! ప్రాణికోటి మనస్సులను బలవంతంగా మోహానికి గురిచేస్తూ ఉంటుంది. ఈ జగత్తును సృష్టించేదీ పాలించేదీమాత్రమేకాదు నాశనం చేసేదికూడా ఆ మహాదేవియే. కామదాత్రి. మహామాయ. కాళరాత్రి. దురత్యయ. విశ్వసంహారిణి. కాళి. కమల. కమలాలయ. జగత్తు అంతా ఆవిడలోనే లీనమై ఉంటుంది. ఆవిడ నుంచే ఆవిర్భవిస్తుంది. ఆవిడలోనే లయమవుతుంది. అందుకే పరాత్పర అన్నారు. ఆ తల్లి అనుగ్రహం ఉంటేనేగానీ ఎవ్వరూ మోహాన్ని జయంచలేరు. మోహాన్ని జయిస్తేనేగానీ మనశ్శాంతి ఉండదు. ***(అధ్యాయం - 10, శ్లోకాలు - 25)***

మునివరా ! ఆ దేవి ఎవరు ? ఎలా ఉంటుంది ? ఎక్కడ ఉంటుంది ? ఎందుకని జీవకోటిని సమ్మోహపరుస్తోంది ? ఆవిడ దయకు పాత్రుడనవ్వాలంటే ఏమి చెయ్యాలి ? సురథుడు ఆత్రంగా ప్రశ్నలవర్షం కురిపించాడు. మునీశ్వరుడు స్థిమితంగా బదులు పలికాడు.



సురథా ! అంతా చెబుతాను. విను. కల్పాంతంలో శ్రీమన్నారాయణుడు సృష్టిని ఉపసంహరించి ఆదిశేషుడిమీద యోగనిద్రకు ఉపక్రమించాడు. అతడి చెవులనుంచి గులుగు జారిపడింది. ఆ కర్ణమలంనుంచి మధు-కైటభులనే దానవులు ఆవిర్భవించారు. భీకరభీషణాకారులు. మహాకాయులు. క్రూరాతిక్రూరులు. పుడుతూనే బ్రహ్మదేవుడిని సంహరించబోయారు. బ్రహ్మ భయపడిపోయాడు. శ్రీమన్నారాయణుడు నిద్రపోతున్నాడు. ఇప్పుడు ఎవరిని శరణువేడాలి - అని బాగా ఆలోచించాడు. బుద్ధిలో మెరుపు మెరిసింది. నారాయణుడిని వశపరుచుకున్న నిద్రాదేవిని శరణువేడదామనుకున్నాడు.

నిద్రాదేవీ ! నువ్వు ఆనందస్వరూపిణివి. సర్వజంతు సమ్మోహకశక్తివి. కాళరాత్రివి. మహారాత్రివి. మోహరాత్రివి. వ్యాపినివి. మహనీయవు. మహారాధ్యవు. మహామాయవు. లజ్జ, పుష్టి, క్షమ, కీర్తి, కాంతి అన్నీ నువ్వే. కారుణ్యస్వరూపిణివి. జగద్వంద్యవు. నువ్వే జాగ్రత్స్వరూపిణివి.

ఏకాత్మవు. ఏకరూపవు. జీవాత్మపరమాత్మలు ప్రకృతిపురుషులూ నువ్వే కనక ద్వయాత్మవు. త్రివర్గ నిలయవు. తురీయ మోక్షస్వరూపవు. పంచభూతేశ్వరివి. షష్ఠేశ్వరివి. సప్తవారాధినేత్రివి. అష్టవసువులకు అధినాయికవు. నవగ్రహమయివి. నవరాగకళారూపవు. దశదిక్పూజ్యవు. ఏకాదశరుద్ర నిషేవితవు. ఏకాదశీతిథిప్రియవు. ద్వాదశభుజవు. ద్వాదశాదిత్యులకు కన్నతల్లివి. త్రయోదశగణప్రియవు. విశ్వేదేవులకు అగ్రణివి. చతుర్దశేంద్రులకు వరప్రదవు. చతుర్దశమనువులకు జనయిత్రివి. పంచాధికదశీవేద్యవు. షోడశభుజవు. షోడశేందుకళామయివి. షోడశాత్మక చంద్రాంశువ్యాప్త దివ్యశరీరవు. పాడ్యమి మొదలు పూర్ణిమవరకూ అన్ని తిథులూ నువ్వే. గుణత్రయస్వరూపిణీ ! నారాయణుడిని ఇప్పుడు వశపరుచుకున్నావు. ఈ రాక్షసులిద్దరూ నన్ను సంహరించబోతున్నారు. అమ్మా ! నిద్రాదేవీ ! కరుణించు. శ్రీమన్నారాయణుడిని విడిచిపెట్టు. మెలకువ రప్పించు.

బ్రహ్మదేవుడి ప్రార్థనను ఆలకించిన నిద్రాదేవి శ్రీమన్నారాయణుడిని విడిచిపెట్టి మధుకైటభులను ఆవహించింది. విష్ణుమూర్తి నిద్రలేచాడు. మధుకైటభులను చూశాడు. అయిదువేల సంవత్సరాలు యుద్ధం చేశాడు. అయినా జయించలేకపోయాడు. అప్పుడు నిద్రాదేవి వారిని సమ్మోహపరిచింది. వారు ఆ మోహంలోపడి శ్రీహరిని వరం కోరుకోమన్నారు. శ్రీహరి వెంటనే వారి వధను వరంగా కోరాడు. నీళ్ళు లేనిచోట మమ్మల్ని సంహరించగలవు అన్నారు. శ్రీహరి తొడలు విస్తరించి చక్రం ధరించి సంహరించాడు. వారి మేదస్సుతో (కొవ్వు) కలిసింది కనక భూమికి మేదిని అనే పేరు వచ్చింది. ***(అధ్యాయం - 11 , శ్లోకాలు - 34)***

సురథా ! మధుకైటభ సంహారంకోసం బ్రహ్మదేవుడు స్తుతిస్తే శ్రీమన్మహాదేవి ఇలా స్పందించి సహకరించింది. ఇంక ఆ దేవి సముత్పత్తి గురించి చెబుతాను. విను.



పూర్వకాలంలో మహిషుడనే మహారాక్షసుడున్నాడు. మహాబలశాలి. మహిషరూపుడు. దేవతలనూ లోకపాలకులనూ నానాహింసలూ పెట్టేవాడు. ఇంద్రాదులు రాజ్యభ్రష్టులై పారిపోయారు. బ్రహ్మదేవుణ్ణి అగ్రభాగాన నిలుపుకుని శంకరుడినీ విష్ణుమూర్తినీ శరణువేడారు. మహిషాసురుడి దురాగతాలు వింటున్న శ్రీహరికి పట్టరాని కోపం వచ్చింది. ఆ క్షణంలో అతడి నోటినుంచి ఒక మహాతేజస్సు ఆవిర్భవించింది. అలాగే బ్రహ్మరుద్రమహేంద్రాది సకలదేవతల శరీరాలనుంచీ తేజఃపుంజాలు వెలువడ్డాయి. అన్నీ వెళ్ళి ఆ మహాతేజస్సులో కలిసి ఒక ఆకారం రూపుగట్టింది. శంభుతేజస్సు ముఖంగా, యముడి తేజస్సు జుట్టుగా, శ్రీహరితేజస్సు బాహువులుగా, చంద్రతేజస్సు కుచాలుగా, ఇంద్రతేజస్సు నడుముగా, వరుణతేజస్సు తొడలుగా, భూదేవి తేజస్సు నితంబంగా (కటిప్రదేశం), బ్రహ్మతేజస్సు పాదాలుగా వాసవతేజస్సు వేళ్ళుగా, కుబేరుడి తేజస్సు నాసికగా, ప్రజాపతి తేజస్సు దంతాలుగా, పావకతేజస్సు మూడు కన్నులుగా, సాధ్యుల తేజస్సు కన్బొమలుగా, వాయవ్య తేజస్సు చెవులుగా - ఒక స్త్రీమూర్తి సర్వతేజస్స్వరూపిణి అవతరించింది. శివుడు శూలాన్నీ, విష్ణువు చక్రాన్నీ, వరుణుడు శంఖాన్నీ, అగ్నిదేవుడు శక్తినీ, వాయువు ధనుర్బాణాలనూ, ఇంద్రుడు వజ్రాయుధాన్నీ, ఐరావతం ఘంటనూ, యముడు కాలదండాన్నీ, బ్రహ్మదేవుడు అక్షమాలాకమండలువులనూ, సూర్యుడు రశ్మిమాలనూ, కాలుడు కవచఖడ్గాలనూ, సముద్రుడు వస్త్రహారాలనూ చూడామణి కుండల కటక భుజాంగ నూపుర గ్రైవేయకాది ఆభరణాలనూ, విశ్వకర్మ ఉంగరాలనూ, హిమవంతుడు సింహవాహనాన్నీ, కుబేరుడు సురాభాండాన్నీ పానపాత్రనూ, ఆదిశేషుడు నాగహారాన్నీ - భక్తితో సమర్పించారు. ఇంకా అశేష దేవతలు అశేషాయుధాలనూ ఆభరణాలనూ బహూకరించారు. రకరకాల స్తుతులతో స్తోత్రాలతో పొగడ్తలతో ఆ మహాదేవిని ఉత్తేజపరిచారు. ఉత్సాహపరిచారు.

మహిషాసురవధను సంకల్పించి మహాదేవి భీషణనినాదం చేసింది. మహిషుడు ఆశ్చర్యచకితుడై యుద్ధానికి వచ్చాడు. శస్త్రాస్త్రాలతో ఆకాశం నింపేశాడు. చిక్షురుడు సేనాపతి. ఇంకా దుర్ధర - దుర్ముఖ - బాష్కల - తామ్రక - బిడాలవదన ప్రభృతులు అసంఖ్యాకరాక్షస మహావీరులు రణరంగానికి దుమికారు. అందరినీ అవలీలగా సంహరించి మహాదేవి మహిషాసురుడిని ఎదుర్కొంది. వాడు మహామాయావి. రకరకాల రూపాలతో వచ్చి యుద్ధం చేస్తోంటే ఒక్కొక్క రూపాన్నీ తునుమాడుతూ వచ్చింది. చిట్టచివరికి మహిషరూపంలో వచ్చాడు. వెంటనే పాశంతో బంధించి ఖడ్గంతో శిరస్సు నరికేసింది. మహిషాసురమర్దిని అయ్యింది. సింహనాదం చేసింది. బతికున్న రాక్షససైనికులు హాహాకారాలు చేస్తూ పలాయనం చిత్తగించారు. దేవతలు జయజయధ్వానాలు చేశారు. శ్రీమన్మహాదేవిని బహుధా స్తుతించారు. సురథా! మహిషమర్దినిగా ఇది మహాలక్ష్మి అవతారం. ఇక మహాసరస్వతి అవతారగాథ ఏమిటంటే -



ఒకప్పుడు శుంభనిశుంభులనే రాక్షససోదరులు ఉండేవారు. మహాబలపరాక్రమ సంపన్నులు. మాయావులు. దేవతలను పారద్రోలి స్వర్గాన్ని ఆక్రమించుకున్నారు. ఇంద్రాదులు జగన్మాతను శరణువేడారు. స్తుతించారు. ప్రసన్నురాలయ్యింది. వరం కోరుకోమంది. శుంభనిశుంభులను సంహరించి మా భోగభాగ్యాలను మాకు అందించమన్నారు దేవతలు. మహాదేవి అంగీకరించింది.

శుంభనిశుంభులకు చండముండులని ఇద్దరు భృత్యులున్నారు. వారు మేరుపర్వతగుహలో దాక్కొని ఈ దృశ్యాన్ని చూశారు. దేవీ సౌందర్యానికి ఆశ్చర్యచకితులయ్యారు. పరుగుపరుగున వెళ్ళి శుంభుడికి వర్ణించి చెప్పారు. మహాప్రభూ ! అత్యద్భుత సౌందర్యరాశిని చూసి వచ్చాం. సురాసురగంధర్వ నాగయక్షమానవ జాతులలో అటువంటి అందగత్తె లేదు. ఇకముందు ఉండదు. ఆవిడను అనుభవించడానికి నువ్వు ఒక్కడివే యోగ్యుడివి. అర్హుడివి. ఆవిడను తెచ్చుకో. ఏలుకో - అని ప్రబోధించారు.

శుంభుడికి మనసయ్యింది. మహాదేవి సన్నిధికి దూతను పంపించాడు. వాడు తన ప్రభువు గుణగణాలనూ శక్తిసామర్థ్యాలనూ భోగభాగ్యాలనూ వర్ణించి చెప్పి శుంభుడిని చేపట్టి సుఖించమని ఉపదేశించాడు. అప్పుడు అమ్మవారు అందికదా -

దూతా ! నువ్వు చెప్పినది అంతా బాగుంది. కానీ నాకు ఒక ప్రతిజ్ఞ ఉంది. నా బలాన్ని అపహరించి నా దర్పాన్ని ఎగరగొట్టగలిగినవాడినే నేను పెళ్ళాడతాను. అల్పుల్ని నేను అంగీకరించను. ఇది నా ప్రతిజ్ఞ. మీ ప్రభువుతో చెప్పు. ఇది నెరవేర్చి నన్ను స్వీకరించమను. వెళ్ళు.

దూతవెళ్ళి శుంభుడికి యథాతథంగా నివేదించాడు. దానవప్రభువుకు కోపం వచ్చింది. ఆ దుష్టురాలిని జుట్టుపట్టుకుని లాక్కురా - అని గర్జించి ధూమ్రాశనుడిని పంపించాడు. అరవైవేల సైన్యంతో వాడు వెళ్ళి భస్మమైపోయాడు. వర్తమానం అందింది. శుంభుడు మండిపడ్డాడు. చండ - ముండ - రక్తబీజులను వరుసగా పంపించాడు. మహాదేవి చేతిలోని త్రిశూలానికి వాళ్ళు ముగ్గురూ బలిఅయిపోయారు. ఈసారి శుంభ నిశుంభలే స్వయంగా రణరంగానికి దిగారు. భయంకరంగా పోరాడి నిహతులయ్యారు. విబుధులు సంతోషంతో మహాదేవిని వాగీశ్వరిగా కొనియాడారు.

సురథా ! సృష్టిస్థితిలయకారిణి ఆ పరమేశ్వరిని నువ్వుకూడా ఆరాధించు. అంతర్బహిశ్శత్రువులు అంతరిస్తారు. మనశ్శాంతీ భోగభాగ్యాలూ లభిస్తాయి - అని మునీశ్వరుడు ఉపదేశించాడు.

నారదా ! సురథుడు అప్పటినుంచీ దేవీభక్తి తత్పరుడు అయ్యాడు. జితేంద్రియుడై నిరాహారుడై ఏకాగ్రచిత్తంతో దేవేశిని ఉపాసించాడు. మృణ్మయమూర్తిని ఎట్టయెదుట నిలుపుకొని భక్తిప్రపత్తులతో పూజలు చేశాడు. తన శరీరంలోని రక్తమాంసాలను నైవేద్యం పెట్టాడు. జగన్మాతకు దయ కలిగింది.



ప్రసన్నురాలై సాక్షాత్కరించింది. నీ రాజ్యం నీకు లభిస్తుందనీ నిష్కంటకంగా ఏలుకొమ్మనీ మోహం నశించి జ్ఞానం కలుగుతుందనీ వరాలు కురిపించింది. వచ్చే జన్మలో మనుసావర్ణివవుతావు. ఒక మన్వంతరానికి అధిపతి వవుతావు. మంచి సంతానం కలుగుతుంది - అనికూడా ఆశీర్వదించి అంతర్ధానం చెందింది.

అమ్మవారు ఆదేశించినట్టే సురథుడు సావర్ణిగా జన్మించాడు. ఎనిమిదవ మన్వంతరానికి అధిపతి అయ్యాడు. ఈ ఉపాఖ్యానం చదివినవారూ విన్నవారూ దేవి అనుగ్రహానికి పాత్రులవుతారు.

*(అధ్యాయం - 12 , శ్లోకాలు - 93)*

## ◆ వైవస్వతమనుసంతతి ◆

నారదా ! మిగిలిన మనువుల కథలుకూడా చెబుతాను. శ్రద్ధగా ఆలకించు. వీరిని స్మరిస్తే చాలు దేవీభక్తి కుదురుకొంటుంది. వైవస్వతమనువుకి ఆరుగురు కొడుకులున్నారు. కరూషుడు, వృషధ్రథుడు, నాభాగుడు, దిష్టుడు, శర్యాతి, త్రిశంకుడు. ఆరుగురూ మహాబలశాలులే. కాళిందీ తీరంలో నిరాహారులై తీవ్రంగా తపస్సు చేశారు. కొంతకాలానికి అంతశ్శుద్ధి లభించింది. జగత్తు అంతా ఆత్మలోనే కనపడింది. ఈ దర్శనానికి వారు ఆశ్చర్యచకితులయ్యారు. మరింత నిష్ఠగా తపస్సు కొనసాగించారు. పన్నెండేళ్ళు గడిచాయి. జగదీశ్వరి సాక్షాత్కరించింది. భక్తివినమ్రులై సాగిలి మ్రొక్కారు.

**మహేశ్వరి జయేశాని పరమే కరుణాలయే ।**
**వాగ్భవారాధనప్రీతే వాగ్భవప్రతిపాదితే ॥**
**క్లీంకారవహే దేవి క్లీంకారప్రీతిదాయిని ।**
**కామరాజమహామోదదాయినీశ్వరతోషిణి ॥**
**మహామాయే మోదపరే మహాసామ్రాజ్యదాయిని ।**
**విష్ణ్వర్కహరశక్రాదిస్వరూపే భోగవర్ధిని ॥** **(13 - 13)**

ఆరుగురు రాకుమారులూ ముక్తకంఠంతో ఆ మహేశ్వరిని స్తుతించారు.ప్రసన్నురాలయ్యింది. రాజపుత్రులారా ! మీరు మహాత్ములు. తపస్వులు. నిష్కల్మషులు. అంతశ్శుద్ధిని సాధించినవారు. నన్ను ఉపాసించారు. మనస్సుల్లో ఉన్న కోరికలన్నీ అడగండి. నేను ప్రసన్ననయ్యాను. తీరుస్తాను - అంది.

మహాదేవీ ! నిష్కంటకరాజ్యాన్ని ఇయ్యి. సత్పుత్రులను ప్రసాదించు. దీర్ఘాయుష్మంతుల్ని చెయ్యి. అవ్యాహతంగా భోగభాగ్యాలు అనుభవించేటట్టు యశస్సూ తేజస్సూ సన్మతీ కలిగేట్టు మా ఆరుగురికీ వరం ప్రసాదించు.



జగన్మాత తథాస్తు అంది. మీరు ఆరుగురూ క్రమంగా ఆరు మన్వంతరాలకు అధిపతులవుతారని అదనంగా వరమిచ్చి ఆశీర్వదించి వెళ్ళింది. అలాగే జరిగింది. ఆరుగురూ మహారాజులై భోగభాగ్యాలు అనుభవించి సత్సంతానాన్ని పొంది జన్మాంతరంలో మనువులయ్యారు. మొదటివాడు దక్షసావర్ణిగా తొమ్మిదవ మనువు అయ్యాడు. రెండవవాడు మేరుసావర్ణిగా పదవ మన్వంతరానికీ, మూడవవాడు సూర్యసావర్ణిగా పదకొండవ మన్వంతరానికీ, నాల్గవవాడు చంద్రసావర్ణిగా పన్నెండవ మన్వంతరానికీ, అయిదవవాడు రుద్రసావర్ణిగా పదమూడవ మన్వంతరానికీ, ఆరవవాడు విష్ణుసావర్ణిగా పధ్నాల్గవ మన్వంతరానికీ అధిపతులయ్యారు.

ఈ పదునల్గురు మనువులూ దేవీపాదచింతకులు. పరమపూజ్యులు. లోకవంద్యులు. మహాప్రతాపశాలులు. భ్రామరీదేవి అనుగ్రహానికి నోచుకున్నవారు.

నారాయణమహర్షి నోటినుంచి భ్రామరీదేవి అనే పదం రావడమేమిటి నారదుడు పట్టుకున్నాడు. మహర్షీ ! ఎవరు ఈ భ్రామరీదేవి ? అవతారగాథ ఏమిటి ? దయచేసి వివరించు. అమృతమైనా మొహం మొత్తుతుందేమోగానీ దేవీకథామృతం ఎంతగ్రోలినా తనివితీరడంలేదు. వినిపించు - అని ప్రార్థించాడు. నారాయణ మహర్షి నారదా అంటూ ప్రారంభించాడు.

## ◆ భ్రామరీదేవి వృత్తాంతం ◆

జగజ్జనని చేష్టలు చిత్రవిచిత్రంగా ఉంటాయి. అచింత్య అవ్యక్తరూపకదా ! అన్నీ జగత్కల్యాణకారకాలే. లోకమంటే నిర్వ్యాజమైన ప్రేమ. కన్నతల్లిగదా ! బిడ్డలమీద ప్రేమకాక ఏముంటుంది !

**యద్యచ్చరితం శ్రీదేవ్యాస్తత్సర్వం లోకహేతవే ।**
**నిర్వ్యాజయా కరుణయా పుత్రే మాతుర్యథా తథా ॥ (13 - 36)**

పూర్వకాలాన పాతాళంలో అరుణుడు అని ఒక మహాదైత్యుడు ఉండేవాడు. దేవద్వేషి. మహాబలుడు. మహాఖలుడు. దేవతలను జయించాలనే కోరికతో వాడు హిమవత్పర్వతానికి వెళ్ళి బ్రహ్మదేవుణ్ణి ఉద్దేశించి తీవ్రతపస్సుచేశాడు. గంగాతీరంలో పండుటాకులు తింటూ యోగమార్గాన గాయత్రీ మహామంత్రాన్ని జపిస్తూ తపస్సు చేశాడు. వాడి శరీరంనుంచి బయల్వెడలిన తపోగ్ని జగత్తుని దహించివేయనారంభించింది. అది ఏమిటో తెలియక దేవతలూ మానవులూ గగ్గోలు పెట్టారు. బ్రహ్మను శరణువేడారు. ఆయన గాయత్రీసహితుడై హంసను అధిరోహించి హిమాలయానికి వచ్చాడు.. ప్రాణమాత్రావశిష్టుడై రెండవ అగ్నిదేవుడిలా వెలిగిపోతున్న అరుణదైత్యుణ్ణి చూశాడు. వత్సా ! వరం కోరుకో అన్నాడు. ఈ మాటలు



వినపడటంతోనే అమృతం చిలికినట్టయ్యింది. అరుణుడికి ప్రాణాలు లేచివచ్చాయి. కళ్ళు తెరిచాడు. ఎట్టయెదుట గాయత్రీసహితుడై చతుర్ముఖుడు. అరుణుడు సాష్టాంగపడ్డాడు. ఇద్దరినీ భక్తిప్రపత్తులతో స్తుతించాడు. మరణం లేకుండా వరం ఇమ్మన్నాడు.

అరుణా ! హరిహరాదిదేవనాయకులు సైతం మృత్యువుకి అతీతులు కారు. నాకూ మరణం ఉంది. ఇక ఇతరులమాట చెప్పాలా ! కనక, దానవోత్తమా ! యోగ్యమైన వరం కోరుకో. ఇస్తాను. ఇవ్వడానికి శక్యమైనది అడుగు. అంతేగానీ అలవిగానివి అడిగి పంతానికి పోకు. అది బుద్ధిమంతుల లక్షణం కాదు.

అయితే చతుర్ముఖా ! యుద్ధంలోగానీ మరొకచోటగానీ శస్త్రాస్త్రాలతోగానీ పురుషులతోగానీ స్త్రీలతోగానీ ద్విపాత్తులతోగానీ చతుష్పాత్తులతోగానీ రెండూ కలిసిన వాటితోగానీ నాకు మృత్యువులేకుండా వరం అనుగ్రహించు. దేవతలను జయించడానికి కావలసిన బలం ఇయ్యి.

బ్రహ్మదేవుడు తథాస్తు అన్నాడు. హంసవాహనం కదిలింది. వెళ్ళిపోయాడు. అరుణుడు పాతాళం చేరుకున్నాడు. దైత్యులనందరినీ సమావేశపరిచాడు. బ్రహ్మదేవుడిచ్చిన వరంగురించి చెప్పాడు. వెంటనే అమరావతిమీదకి దండువెళ్ళాలి అన్నాడు. యుద్ధవార్తను తెలియపరిచిరమ్మని ఇంద్రుడి దగ్గరికి దూతను పంపాడు. దేవేంద్రుడు గడగడలాడాడు. దేవతలను తీసుకుని బ్రహ్మదేవుడి సన్నిధికి పరుగుతీశాడు. విష్ణుమూర్తిని కలుపుకుని అందరూ శివుడి మందిరానికి వెళ్ళారు. అరుణాదిదైత్యులను సంహరించడమెలాగా అని విచారణ చేశారు.

అంతలోనే అరుణుడు స్వర్గలోకాన్ని ఆక్రమించాడు. సూర్యచంద్రులనూ దిక్పాలకులనూ తోసిరాజన్నాడు. తానే అన్ని రూపాలూ ధరించి ఆయా పదవులు అధిష్ఠించాడు. దిక్కుతోచని దిక్పాలకులు శివుడి సన్నిధికి చేరుకున్నారు. పరిస్థితి విషమించిందని మొరపెట్టుకున్నారు.

దేవనాయకులందరూ తలలు పట్టుకున్నారు. బ్రహ్మదేవుడిచ్చిన వరం ఇంతచేసిందని లోపల లోపల పిసుక్కున్నారు. ఏమి చెయ్యడానికీ తోచలేదు. అరుణుడి విజృంభణకు అడ్డుకట్ట వేసితీరాలి. ఎలాగ ? ఎలాగ ?

సరిగ్గా అదే సమయానికి అశరీరవాణి వినిపించింది. జగన్మాతను ఆశ్రయించండి. మీపని నెరవేరుతుంది. అరుణుడు గాయత్రీ జపతత్పరుడు. ఆ మంత్రజపాన్ని వాడు విడిచిపెడితే చాలు మృత్యుయోగ్యుడవుతాడు. ఈ మాటలతో దేవతలకు ఒకదారి దొరికినట్టనిపించింది. వెంటనే ఇంద్రుడు బృహస్పతిని ఆహ్వానించాడు. అరుణుడి దగ్గరికి వెళ్ళమన్నాడు. వాడు గాయత్రిని విడిచిపెట్టేట్టు



ఎలాగోలాగా చెయ్యమన్నాడు. ఇది దేవకార్యం. నీకు తప్పదన్నాడు. ఈలోగా మేమందరమూ భువనేశ్వరిని ఉపాసిస్తాం. అనుగ్రహం సంపాదిస్తాం. నీ కర్తవ్యం తేలిక అవుతుంది - అని చెప్పి దేవగురువును పంపించాడు. ఆయన అటువెళ్ళగానే దేవతలందరూ సుస్నాతులై జాంబూనదేశ్వరిని ఉపాసించారు. మాయాబీజాక్షర సహితంగా మహామంత్రాన్ని జపిస్తూ దేవీయజ్ఞాలు నిర్వహించారు.

బృహస్పతి అరుణుడి దగ్గరికి వెళ్ళాడు. అతడు గద్దించి ప్రశ్నించాడు. బృహస్పతీ ! ఎక్కడినుంచి రాక ! ఇక్కడికి ఎందుకు వచ్చావు ? నేను మీవాణ్ణి కాదు. పైగా శత్రువును.

దైత్యనాయకా ! ఇదేమిటి ఇలా మాట్లాడుతున్నావ్ ? నువ్వు మావాడివి కాకపోవడమేమిటి ? మేము ఉపాసించే దేవినే నువ్వూ నిత్యం ఉపాసిస్తున్నావు. మరి పరాయివాడవెలా అవుతావు ? దేవపక్షపాతివే. సందేహం లేదు.

బృహస్పతి మాటలకు అరుణుడు హుంకరించాడు. దేవతలు ఉపాసించే దేవిని నేను ఆరాధించడమేమిటి. దేవద్వేషినికదా ! కూడదుగాక కూడదు అనుకున్నాడు. దురభిమానానికిపోయాడు. ఆ క్షణంలోనే గాయత్రీమంత్రాన్ని విడిచిపెట్టేశాడు. అంతే - నిస్తేజస్కుడైపోయాడు. బృహస్పతి గమనించాడు. పని జరిగిపోయిందని సంబరపడుతూ నిర్గమించాడు. ఇంద్రుడికి సమాచారం అందించాడు. దేవతలంతా సంతోషించారు. పరమేశ్వరిని మరింత దీక్షగా ఉపాసించారు. ఎట్టకేలకు జగన్మాత సాక్షాత్కరించింది.

జగన్మంగళకారిణి. కోటిసూర్యప్రతీకాశ. కోటికందర్పసుందర. చిత్రానులేపన. విచిత్రవస్త్రద్వయ విభూషిత. విచిత్ర మాల్యాభరణ. చిత్రభ్రమరముష్టిక. వరాభయకర. శాంత. కరుణామృతసాగర. నానాభ్రమర సంయుక్త పుష్పమాలావిరాజిత. చిత్రవిచిత్రమైన అసంఖ్యాక భ్రమరీగణంతో (ఆడుతుమ్మెదల గుంపు) పరివృత. వాటి ఝుంకారాలు హ్రీం బీజాక్షరధ్వనులుగా నిరంతరం వినిపిస్తున్నాయి. కోటానుకోట్లుగా తుమ్మెదలు తిరుగాడుతున్నాయి.

భ్రమరీభిర్విచిత్రాభిరసంఖ్యాభిస్సమావృతా ।
భ్రమరైర్గాయమానైశ్చ హ్రీంకారమనుమన్వహమ్ ॥ (13 - 83)

సర్వశృంగారవేషాఢ్య. సర్వవేదప్రశంసిత. సర్వాత్మిక. సర్వమయి. సర్వమంగళరూపిణి. సర్వజ్ఞ. సర్వజనని. సర్వేశ్వరి. శివ. ఈ జగదంబికను చూడటంతోనే బ్రహ్మాదిదేవతలు సాష్టాంగదండప్రణామాలు చేశారు. అత్యద్భుతంగా స్తుతించారు.



ఎలాగోలాగా చెయ్యమన్నాడు. ఇది దేవకార్యం. నీకు తప్పదన్నాడు. ఈలోగా మేమందరమూ భువనేశ్వరిని ఉపాసిస్తాం. అనుగ్రహం సంపాదిస్తాం. నీ కర్తవ్యం తేలిక అవుతుంది - అని చెప్పి దేవగురువును పంపించాడు. ఆయన అటువెళ్ళగానే దేవతలందరూ సుస్నాతులై జాంబూనదేశ్వరిని ఉపాసించారు. మాయాబీజాక్షర సహితంగా మహామంత్రాన్ని జపిస్తూ దేవీయజ్ఞాలు నిర్వహించారు.

బృహస్పతి అరుణుడి దగ్గరికి వెళ్ళాడు. అతడు గద్దించి ప్రశ్నించాడు. బృహస్పతీ ! ఎక్కడినుంచి రాక ! ఇక్కడికి ఎందుకు వచ్చావు ? నేను మీవాణ్ణి కాదు. పైగా శత్రువును.

దైత్యనాయకా ! ఇదేమిటి ఇలా మాట్లాడుతున్నావ్ ? నువ్వు మావాడివి కాకపోవడమేమిటి ? మేము ఉపాసించే దేవినే నువ్వూ నిత్యం ఉపాసిస్తున్నావు. మరి పరాయివాడవెలా అవుతావు ? దేవపక్షపాతివే. సందేహం లేదు.

బృహస్పతి మాటలకు అరుణుడు హుంకరించాడు. దేవతలు ఉపాసించే దేవిని నేను ఆరాధించడమేమిటి. దేవద్వేషినికదా ! కూడదుగాక కూడదు అనుకున్నాడు. దురభిమానానికిపోయాడు. ఆ క్షణంలోనే గాయత్రీమంత్రాన్ని విడిచిపెట్టేశాడు. అంతే - నిస్తేజస్కుడైపోయాడు. బృహస్పతి గమనించాడు. పని జరిగిపోయిందని సంబరపడుతూ నిర్గమించాడు. ఇంద్రుడికి సమాచారం అందించాడు. దేవతలంతా సంతోషించారు. పరమేశ్వరిని మరింత దీక్షగా ఉపాసించారు. ఎట్టకేలకు జగన్మాత సాక్షాత్కరించింది.

జగన్మంగళకారిణి. కోటిసూర్యప్రతీకాశ. కోటికందర్పసుందర. చిత్రానులేపన. విచిత్రవస్త్రద్వయ విభూషిత. విచిత్ర మాల్యాభరణ. చిత్రభ్రమరముష్టిక. వరాభయకర. శాంత. కరుణామృతసాగర. నానాభ్రమర సంయుక్త పుష్పమాలావిరాజిత. చిత్రవిచిత్రమైన అసంఖ్యాక భ్రమరీగణంతో (ఆడుతుమ్మెదల గుంపు) పరివృత. వాటి ఝుంకారాలు హ్రీం బీజాక్షరధ్వనులుగా నిరంతరం వినిపిస్తున్నాయి. కోటానుకోట్లుగా తుమ్మెదలు తిరుగాడుతున్నాయి.

భ్రమరీభిర్విచిత్రాభిరసంఖ్యాభిస్సమావృతా ।
భ్రమరైర్గాయమానైశ్చ హ్రీంకారమనుమన్వహమ్ ॥ (13 - 83)

సర్వశృంగారవేషాఢ్య. సర్వవేదప్రశంసిత. సర్వాత్మిక. సర్వమయి. సర్వమంగళరూపిణి. సర్వజ్ఞ. సర్వజనని. సర్వేశ్వరి. శివ. ఈ జగదంబికను చూడటంతోనే బ్రహ్మాదిదేవతలు సాష్టాంగదండప్రణామాలు చేశారు. అత్యద్భుతంగా స్తుతించారు.



అప్పటివరకూ అమ్మవారి ఒక గుప్పిడ మూసిఉంది. అందులో గండుతుమ్మెదలున్నాయి (విచిత్రభ్రమరముష్టిక). ఇప్పుడు ఆ గుప్పిడ విప్పింది. చుట్టూ గుంపులుగా తిరుగుతున్న చిత్రవిచిత్ర భ్రమరకోటులను కోటానుకోట్ల రెట్లుగా వృద్ధిపొందించింది. ముల్లోకాలూ తుమ్మెదలే. ఎక్కడచూసినా తుమ్మెదలే. రంగురంగుల తుమ్మెదలు. రకరకాల తుమ్మెదలు. రాగాల తుమ్మెదలు. నాట్యాల తుమ్మెదలు. తుమ్మెదలు. తుమ్మెదలు. అంతటా తుమ్మెదలు. ఆకాశాన్ని ఆవరించిన తుమ్మెదలు. భూగోళాన్ని చీకట్లలో ముంచిన తుమ్మెదలు. గిరిశిఖరాలమీద చెట్టుకొమ్మలమీద అంతటా తుమ్మెదలే.

తుమ్మెదలన్నీ ఒక్కపెట్టున ఎగురుకుంటూ వెళ్ళి దైత్యులను ఏరికోరి పీక్కుతిన్నాయి. తేనెతుట్టను కదిలించినవాడిని తేనెటీగలు ముంచెత్తినట్టు. దైత్యుల శస్త్రాలూ అస్త్రాలూ ఎందుకూ కొరగాలేదు. ఒక యుద్ధం లేదు. ఒక వాగ్వాదం లేదు. కేవలం మరణమే. ఎక్కడెక్కడ దాగినా వెంటాడి వెంటాడి కుట్టి చంపాయి. ఎవరు ఏమయ్యారో ఎవరికీ తెలియకుండా మరణించారు. అరుణిడితో సహా అసురులందరూ ఉసురులు కోల్పోయారు. తుమ్మెదలన్నీ తిరిగి వచ్చి జగదంబికను చేరుకున్నాయి. దేవతలు ఆశ్చర్యం ఆశ్చర్యం అని గుండెలు బాదుకున్నారు. ఆశ్యర్యమేముంది, అమ్మవారి మాయ అన్నారు అందరూ చివరికి.

బ్రహ్మాదిదేవతలు ఆనందించారు. పరమేశ్వరిని పునఃపునః స్తుతించారు. షోడశోపచారాలతో అర్చించారు. విలువైన కానుకలు సమర్పించారు. జయజయధ్వనులు చేశారు. దేవలోకంలో దుందుభులు మ్రోగాయి. మునీశ్వరులు వేదనపఠనం చేశారు. అప్సరసలు నృత్యం చేశారు. గంధర్వులు ఆనందగీతికలు ఆలపించారు. మంగళవాద్యాలు మిన్నుముట్టాయి. దేవతలు శిరస్సులు వంచి అంజలి ఘటించారు. జగదీశ్వరి సంతోషించింది. అందరికీ వరాలు కురిపించింది. దేవీభక్తిని అనుగ్రహించింది. అంతర్ధానం చెందింది.

నారదా ! ఇదీ భ్రామరీవృత్తాంతం. సర్వపాపవినాశకం. సర్వవాంఛాప్రదం. సంసారార్ణవతారకం. దేవీసాయుజ్యదాయకం - అని నారాయణమహర్షి ముగించాడు. ***(అధ్యాయం - 13 , శ్లోకాలు - 127)***

---

**దశమ స్కంధం - శ్లోకాలు : 511 - తెలుగుసేత : బేతవోలు రామబ్రహ్మం**

---





# ఏకాదశ స్కంధము

నారాయణమహర్షీ ! ఆశ్చర్యకరమైన దేవీమాహాత్మ్యాన్ని అత్యద్భుతంగా వర్ణించి చెప్పావు. నన్ను ధన్యుణ్ణి చేశావు. ఇప్పుడింక దేవిని ఆనందింపజేసే ఆచారం గురించి తెలుసుకోవాలి అనుకుంటున్నాను. ఏయే సదాచారాలను పాటిస్తే అమ్మవారు సంతోషించి కృపావృష్టి కురిపిస్తుందో తెలియజెయ్యి.

## ◆ సదాచార నిరూపణ ◆

నారదా ! అడగవలసింది అడిగావు. సదాచారాన్ని అనుష్ఠిస్తే చాలు దేవి సంతోషిస్తుంది. తెల్లవారి లేచింది మొదలుకొని పడుకునే వరకూ సజ్జనులు చెయ్యవలసిన దినచర్య ఏమిటో చెబుతాను. విను. సూర్యోదయంనుంచి సూర్యాస్తమయంవరకూ పుట్టింది మొదలు గిట్టేవరకూ సత్కర్మలే ఆచరించాలి. నిత్యకర్మలూ నైమిత్తిక కర్మలూ కామ్యకర్మలూ ఉంటాయి. వీటిని శ్రద్ధగా చెయ్యాలి. నింద్యకర్మల జోలికి పోకూడదు. జీవికి కడదాకా సహాయంగా నిలిచేది ధర్మమొక్కటే. తల్లిదండ్రులుగానీ భార్యాపుత్రులుగానీ జ్ఞాతిమిత్రులుగానీ ఎవ్వరూ నిలవరు. తాను ఆచరించిన ధర్మమే తనకు సహాయకారి.

ఆత్మైవ న సహాయార్థం పితా మాతా చ తిష్ఠతి ।
న పుత్రదారా న జ్ఞాతిర్ధర్మస్తిష్ఠతి కేవలమ్ ॥ (1 - 7)

అందుచేత సాధనాలన్నింటినీ ఉపయోగించుకుని ధర్మాన్ని సమకూర్చుకోవాలి. అదే చీకటినుంచి వెలుగులోకి నడిపిస్తుంది. ఆచారమే ఉత్తమోత్తమ ధర్మం. అది ఆయుర్వర్ధకం. వంశవర్ధకం. సంపద్వర్ధకం. పాపనాశకం. శుభప్రదం. ఆచారాన్ని మించిన ధర్మం లేదు. ఇహపరాలలో సుఖప్రదం. అజ్ఞానులై సంసారసాగరంలో కొట్టుమిట్టాడేవారికి ఇది ధర్మద్వీపం. ముక్తిమార్గప్రదర్శకం. ఆచారంవల్ల శ్రేష్ఠత లభిస్తుంది. ఆచారంవల్ల కర్మఫలిస్తుంది. దానివల్ల జ్ఞానం లభిస్తుంది. ఇది మనువు చెప్పిన వాక్యం. ఆచారమంటే ధర్మాలలోకెల్లా ఉత్తమోత్తమం. పరమతపస్సు. జ్ఞానాదిసర్వవిషయాలకూ అదే సాధకం.

శాస్త్రీయమనీ లౌకికమనీ ఈ ఆచారం రెండు విధాలు. రెండూ అనుష్ఠింపదగినవే. దేనినీ పరిత్యజించడానికి వీలులేదు. గ్రామ జాతి దేశ కులధర్మాలుంటాయి. వాటిని పాటించాలి ఉల్లంఘించకూడదు. దురాచారుణ్ణి లోకం నిందిస్తుంది. వాడు దుఃఖభాజనుడవుతాడు. వ్యాధి



పీడితుడవుతాడు. ధర్మవిరుద్ధమైన అర్థకామాలను పరిత్యజించాలి. అలాగే లోకవిరుద్ధమైన ధర్మాన్నీ పరిత్యజించాలి. అది సుఖప్రదం కాదు కనక.

పరిత్యజేదర్థకామౌ యౌ స్యాతాం ధర్మవర్జితౌ ।
ధర్మమప్యసుఖోదర్కం లోకవిద్విష్టమేవ చ ॥ (1 - 19)

నారాయణమహర్షీ ! మనకు శాస్త్రాలు అనేకం ఉన్నాయి. ధర్మమార్గాన్ని నిర్ణయించడంలో దేన్ని ప్రమాణంగా తీసుకోవాలి అనేది పెద్ద సందేహం.

నారదా ! సందేహం ఏమీ లేదు. శ్రుతి స్మృతులు రెండూ రెండు కళ్ళు. పురాణమే హృదయం. ఇవి మూడూ చెప్పినదే ధర్మం. మరోటి కాదు. ఈ మూడింటిలోనూ పరస్పరవిరోధం కనిపిస్తే అక్కడ వేదానిదే తుది తీర్పు. స్మృతి పురాణాలకన్నా వేదం చెప్పినదే ప్రమాణం. వేదంలోనే ద్వైధీభావం కనిపిస్తే అప్పుడు అవి రెండూ ధర్మాలుగానే పరిగణించాలి. స్మృతులలో ద్వైధీభావం కనిపించినా ఇంతే. వేదంతో సరిచూసుకోవాలి. కొన్నిచోట్ల పురాణాలలోనూ తంత్ర గ్రంథాలలోనూ కనిపించేవాటినికూడా యథాతథంగా ధర్మాలుగా స్వీకరించాలని కొందరు అంటున్నారు. కానీ అది సరికాదు. వేదవిరుద్ధం కానంతవరకే పురాణాలుగానీ తంత్రగ్రంథాలుగానీ ప్రామాణికాలు. ప్రత్యక్షంగా శ్రుతివిరుద్ధమైన ధర్మం ఎవరు చెప్పినా అప్రామాణికమే. ధర్మమార్గ నిర్ణయంలో సర్వదా సర్వథా వేదమొక్కటే పరమప్రమాణం. దానికి అవిరుద్ధంగా ఉంటే స్మృతులూ పురాణాలూ తంత్రగ్రంథాలూ చెప్పినవికూడా కొండొకచో ప్రామాణికాలు అవుతాయి. మరింకేదీ ప్రామాణికం కానేకాదు.

సర్వథా వేద ఏవాసౌ ధర్మమార్గ ప్రమాణకః ।
తేనావిరుద్ధం యత్కించిత్తత్ప్రమాణం, న చాన్యథా ॥ (1 - 26)

వేదధర్మాన్ని కాదని ఇతర ప్రమాణాలను పట్టుకుని ఆ మార్గాల్లో నడిచేవారికోసం యమలోకంలో నరకకుండాలు సిద్ధంగా ఉన్నాయి. అందుచేత వేదోక్తమే ధర్మం. దానినే ప్రయత్నపూర్వకంగా ఆచరించాలి. స్మృతులూ పురాణాలూ తంత్రాలూ శాస్త్రాలూ ఏది చెప్పినా వేదమూలమైనంతవరకే ప్రామాణికం. కొందరు ఏవేవో కుశాస్త్రాలను ప్రమాణాలుగా చూపించి ప్రజలను తప్పుదారి పట్టిస్తుంటారు. అటువంటివారు నరకానికి పోతారు. అక్కడ తలక్రిందులుగా వేలాడతారు. వేదవిరుద్ధమైన ధర్మాలను ఆచరించే వామాచారులూ పాశుపతులూ లింగధారులూ తప్తముద్రాంకితులైన వైఖానసులూ వగైరా అందరూ నరకలోకానికే పోతారు. అందుచేత వేదం ఒప్పుకున్నదే సద్ధర్మం. దానినే ఆచరించాలి. మరింక దేనిని అనుసరించినా నరకమే.



నారదా ! మానవుడు పడుకోబోయేముందు ఆ రోజంతా తాను చేసినదీ చేయించినదీ, అన్నదీ అనిపించినదీ, ఇచ్చినదీ ఇప్పించినదీ ఒక్కసారి సమీక్షించుకోవాలి. ధర్మబద్ధంగా ఉన్నాయా లేదా పరీక్షించుకోవాలి. ధర్మబద్ధం కాని పనుల్ని మరుసటిరోజునుంచే పరిత్యజించాలి. నిద్రఅయ్యాక తెల్లవారు జామునే లేచి బ్రహ్మధ్యానం చెయ్యాలి. తొడల మీదకి కుడిఎడమలుగా అరికాళ్ళు పైకి వచ్చేట్టు బాసింపీట వేసుకుని కొంచెం ఎత్తయినచోట కూర్చోవాలి. నడుం నిటారుగా నిలబెట్టి వక్షస్సును నిగిడించాలి. కన్నులు మూసుకోవాలి. మనస్సును నిర్మలంగా ఉంచుకోవాలి. దంతాలను తాటించకూడదు. నాలుకను ఆడించకూడదు. ఇంద్రియాలను నిరోధించాలి. ఇలా కూర్చుని రెండుమూడుసార్లు ప్రాణాయామం చెయ్యాలి. హృదయంలో దీపంలాగా ఇష్టదైవాన్ని ధ్యానించాలి.

## ◆ ప్రాణాయామం ◆

ఈ ప్రాణాయామం సధూమ - విధూమ, సగర్భ - అగర్భ, సలక్ష్య - అలక్ష్య భేదాలతో ఆరువిధాలు. ప్రాణాయామంతో సమానమైన యోగం ప్రాణాయామమే తప్ప మరొకటి లేదు. రేచక పూరక కుంభకాలు కలిపి ఒక ప్రాణాయామం.

సధూమశ్చ విధూమశ్చ సగర్భశ్చాప్యగర్భకః ।
సలక్ష్యశ్చాప్యలక్ష్యశ్చ ప్రాణాయామస్తు షడ్విధః ॥
ప్రాణాయామసమో యోగ : ప్రాణాయామ ఇతీరితః ।
ప్రాణాయామ ఇతి ప్రోక్తో రేచ పూరక కుంభకైః ॥ (1 - 39)

రేచక పూరక కుంభకాలు వర్ణత్రయాత్మకాలు. ఇవ్వికలిస్తే ప్రణవాక్షరం ఏర్పడుతుంది. (అ + ఉ + మ్) కాబట్టి ప్రాణాయామం ప్రణవమయం. ఇడానాడిద్వారా వాయువును పీల్చాలి. ఇది రేచకం. దాన్ని ఉదరంలో (ఊపిరి తిత్తులలో) నిలపాలి. ఇది పూరకం. పింగళానాడి ద్వారా మెల్లగా షోడశమాత్రాకాలంలో నిశ్వసించాలి. ఇది కుంభకం. ఇది సధూమ ప్రాణాయామం.

ఇడయా వాయుమారోప్య పూరయిత్వోదరే స్థితమ్ ।
శనైః షోడశమాత్రాభిరన్యయా తం విరేచయేత్ ॥ (1 - 41)

ఆధారం - లింగం - నాభి - హృదయం - తాలుమూలం - ఫాలభాగం - వీటిలో వరసగా రెండూ పదహారూ ఇరవై పదీ ఆరూ నాలుగూ దళాలున్న పద్మాలను లిఖించాలి. నాసాంతంలోనూ ఫాలమధ్యంలోనూ డ - ఫ - క - ఠ వర్ణాలను రచించాలి. అచ్చులను కంఠప్రదేశంలో పొందుపరచాలి. హం - క్షం అనే తత్త్వార్థయుక్త వర్ణాలను సర్వత్రా ఉంచాలి. ఇలాగ వర్ణమూర్తిని భావించి నమస్కరించాలి. వర్ణస్వరూపిణిని



ధ్యానించాలి. ఆ దేవి అరుణకమలవాసిని. పుష్పాడిలాంటి రంగు. హరుడిచే నియమింపబడిన చిహ్నాలు ధరించి ఉంటుంది. ఆవిడ రూపం - బిసతంతు తనీయసి - తామరతూడులోపలి దారంలాగా సన్నగా ఉంటుంది. సూర్యుడా అగ్నిదేవుడా పున్నమిచంద్రుడా అనిపించే ముఖం. ఉన్నతమైన వక్షోజాలు. ఈ దేవీరూపం హృదయంలో ఒక్కసారి నిలిస్తే చాలు - అతడు ముక్తుడే.

అరుణకమలసంస్థా తద్రజఃపుంజవర్ణా ।
హరనియమిత చిహ్నా పద్మతంతుస్వరూపా ॥
రవి హుతవహ రాకానాయకాస్యా స్తనాఢ్యా ।
సకృదపి యది చిత్తే సంవసేత్ స్యాత్స ముక్తః ॥ (1 - 44)

ఓదేవీ ! నా పనులన్నీ నీ అర్చనలే. నా స్థితి - నీ స్థితి. నాగతి - తీర్థయాత్ర. నా మతి - నీ చింతన. నా వాక్కు - నీ స్తుతి. నేను సర్వాత్మకుడను. దేవుడను. నా దినచర్య అంతా నీ సమర్చనమే. దేవీ ! నేను నువ్వే. ఇతరుడను కాను. నేనే బ్రహ్మను. శోకవిదూరుడను. సచ్చిదానందరూపుడను - అని ఆత్మానుసంధానం చేసుకోవాలి. (బ్రహ్మైక్యానుసంధానం). ప్రథమ ప్రయాణంలో ప్రకాశమానయై, ప్రతిప్రయాణంలో అమృతాయమానయై అంతఃపదవిలో అనుసంచరించే ఆనందరూపిణి అబలను శరణువేడుతున్నాను - అని ప్రార్థించాలి. అటుపైని బ్రహ్మరంధ్రంలో గురువును ధ్యానించాలి.

గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః ।
గురురేవ పరం బ్రహ్మ తస్మై శ్రీగురవే నమః ॥ (1 - 49)

సకలోపచారాలతోనూ యథావిధిగా మానసపూజ చెయ్యాలి. నియతాత్ముడై సాధకుడు ప్రాతఃకాలంలో బ్రాహ్మీముహూర్తాన చెయ్యవలసిన ప్రాణాయామ ధ్యాన మానసిక పూజావిధానమిది.

*(అధ్యాయం - 1, శ్లోకాలు - 49)*

## ◆ శౌచక్రియ ◆

నారదా ! వేదాలూ వేదాంగాలూ వల్లించినా ఆచారహీనుడైతే అతడిని అవి ఏవీ కాపాడవు. మృత్యుకాలంలో వదిలేస్తాయి. రెక్కలు వచ్చిన పక్షులు గూడును విడిచినట్టు వెళ్ళిపోతాయి. కనక ఎంతటి పండితుడైనా సరే బ్రాహ్మీముహూర్తంలో (రాత్రి చివరిజాములో) లేవాలి. వేదాధ్యయనం చెయ్యాలి. కొంతసేపు ఇష్టదేవతను ధ్యానించాలి. యోగి అయినట్టయితే ప్రాణాయామాదికం నిర్వహించాలి. జీవబ్రహ్మైకతను సాధించాలి. ఆ క్షణంలోనే జీవన్ముక్తుడవుతాడు.



పంచ పంచ ఉషఃకాలః సప్తపంచారుణోదయః ।
అష్టపంచాశద్భవేత్ప్రాతః శేషస్సూర్యోదయః స్మృతః ॥ (2 - 5)

రాత్రివేళలో చివరి యాభై అయిదు ఘటికలు ఉషఃకాలం. యాభై ఏడు ఘటికలు అరుణోదయం. యాభై ఎనిమిది ఘటికలు ప్రాతఃకాలం. అటుపైని అరవై ఘటికలకు సూర్యోదయం. (సూర్యోదయం నుంచి సూర్యోదయానికి అరవై ఘటికలు). ప్రాతఃకాలంలో బ్రాహ్మణుడు కాలకృత్యాలు తీర్చుకోవాలి. అందుకోసం నైఋతిదిశగా అమ్ముమేటు దూరం వెళ్ళాలి. (బాణం వేసినంత దూరం). బ్రహ్మచారి అయితే ఆ సమయంలో యజ్ఞోపవీతాన్ని చెవికి తగిలించుకోవాలి. గృహస్థుగానీ వానప్రస్థుడుగానీ అయితే నివీతంగా వెనక్కి వేసుకోవాలి. (వీపుమీద దండలా వేలాడేసుకోవాలి). నేలమీద గడ్డిపరకలు ఒత్తుగా కప్పి నెత్తిమీద అంగవస్త్రం వేసుకుని మౌనం పాటిస్తూ ఉమ్ములు వెయ్యకుండా శ్వాసను నియంత్రించి (ముక్కకుండా) మల మూత్ర విసర్జన చెయ్యాలి. దున్నిననేలమీదగానీ నీళ్ళల్లోగానీ చితిలోగానీ పర్వతాలమీదగానీ పాడుపడిన గుడులలోగానీ పుట్టల మీదగానీ పచ్చికబయళ్ళలోగానీ ఈ విసర్జనలు చెయ్యకూడదు. అలాగే ప్రాణులమీదా గుంటలలోనూ నడదారులలోనూ చెయ్యరాదు. నిలబడి విసర్జించకూడదు.

నారదా ! సంధ్యావందన సమయాల్లోనూ భోజన సమయంలోనూ పళ్ళుతోముకుంటున్నప్పుడూ పితృకార్యం చేస్తున్నప్పుడూ దైవకార్యం చేస్తున్నప్పుడూ మలమూత్ర విసర్జనల్లోనూ సంభోగసమయంలోనూ గరుసన్నిధిలోనూ యజ్ఞయాగాదుల్లోనూ దానాలు చేస్తున్నవేళల్లోనూ బ్రాహ్మణుడు మాట్లాడకూడదు. మౌనంగా ఆ పనుల్ని నిర్వహించాలి.

బహిర్భూమికి కూర్చోబోయేముందు - దేవతలారా ! ఋషులారా ! పిశాచోరగరాక్షసులారా ! కంటికి కనిపించని ప్రాణులారా ! ఇక్కడనుంచి తొలగిపొండి. నేను మలమూత్రవిసర్జన చేస్తున్నాను - అని ప్రకటించాలి. తొలగిపొమ్మని ప్రార్థించాలి.

వాయువు అగ్ని విప్రుడు సూర్యుడు జలాశయం గోవులు - వీటిని చూస్తూగానీ వీటి ఎదుటగానీ విసర్జన చెయ్యకూడదు. పగటి వేళలో అయితే ఉత్తరముఖంగానూ రాత్రివేళలో అయితే దక్షిణముఖంగానూ కూర్చుని విసర్జించాలి. విసర్జించాక వాటిమీద మట్టిగానీ ఎండుటాకులుగానీ గడ్డీగాదమూగానీ కప్పాలి. మూత్రం చుక్కలు దారిపొడుగునా పడకుండా తగిన జాగ్రత్త తీసుకుని (ఎత్తిపట్టుకొని) నీళ్ళ దగ్గరకు వెళ్ళాలి. చెంబుతో నీళ్ళు ముంచి తీసుకుని వేరేచోటుకి వెళ్ళి కడుక్కోవాలి. మట్టిరాసుకుని కడుక్కోవాలి. గట్టున ఉండే శ్వేత - రక్త - కృష్ణ - పీతవర్ణ మృత్తికలు పనికివస్తాయి. బ్రాహ్మణుడు తెల్లమట్టినే ఉపయోగించాలి. మిగతా వారికి ఏదైనా ఫరవాలేదు. తెల్లమన్ను దొరకనప్పుడు దొరికిన మట్టినే



బ్రాహ్మణుడూ ఉపయోగించాలి. మట్టితో రుద్దుకోనిదే శుద్ధికాదు. అయితే నీళ్ళల్లోనుంచిగానీ గుడినుంచిగానీ పుట్టనుంచి గానీ ఎలకల కలుగుల్నించిగానీ శౌచవిధికోసం మట్టిని తియ్యరాదు. ఒకరు ఉపయోగించగా మిగిలిన మట్టి సుతరామూ పనికిరాదు.

మూత్ర విసర్జనకన్నా రెండురెట్లు మలవిసర్జనకూ, మూడురెట్లు మైథునానికీ మృత్తికా శౌచం చేసుకోవాలి. లింగానికి ఒకటీ చేతికి మూడూ కాళ్ళు రెండింటికీ రెండూ మట్టిముద్దలు పులుముకోవాలి. ఇది మూత్రశౌచం. మలవిసర్జన శౌచానికి రెట్టింపు. లింగదేశంలో రెండూ గుదప్రదేశంలో అయిదూ చేతికి పదీ కాళ్ళు రెండింటికీ కలిపి ఏడూ మట్టిముద్దలు అవసరమవుతాయి. ముందుగా ఎడమపాదానికీ తరవాత కుడిపాదానికీ మృత్తికను పులుముకోవాలి. శౌచక్రమం ఇది. గృహస్థులకన్నా రెట్టింపు బ్రహ్మచారులకూ మూడురెట్లు వానప్రస్థులకూ నాలుగురెట్లు యతీశ్వరులకూ ఈ శౌచం అధికంగా అవసరం. ఒక్కొక్క మట్టిముద్దా కనీసం రాచ ఉసిరికాయంత ఉండాలి. ఎప్పటికప్పుడు ఒక్కొక్క ముద్దగానే తీసుకోవాలి. (ఒకేసారి పెద్దమట్టిముద్దను తీసేసుకుని చిన్నఉండలు చేసి పులుముకోకూడదని)

ఆర్ద్రామలకమానా తు మృత్తికా శౌచకర్మణి ।
ప్రత్యేకం తు సదా గ్రాహ్యా నాతో న్యూనా కదాచన ॥ (2 - 25)

పగటిపూట అయితే ఇంత శౌచమూ చేసుకోవాలి. రాత్రిపూట ఇందులో సగం, ఆతురుడైతే ఇంతకన్నా సగం, మార్గమధ్యంలో అయితే అంతకన్నా సగమూ శౌచం పాటిస్తే సరిపోతుంది. అశక్తులూ బాలబాలికల విషయంలో మరింత మినహాయింపు ఉంది. మలమూత్రాల దుర్వాసన తొలగిపోయేట్టుగా మట్టి పులుముకుని ప్రక్షాళన చేసుకుంటే చాలు. ఇది అన్ని వర్ణాలవారికీ వర్తించే శౌచవిధి అని మనువు చెప్పాడు.

శౌచక్రియ ఎప్పుడూ ఎడమచేతితోనే చెయ్యాలి. కుడిచెయ్యిని ఉపయోగించకూడదు. శరీరంలో బొడ్డుకి క్రిందిభాగాన శుద్ధిచెయ్యవలసివచ్చినప్పుడు ఎడమచేతినీ, బొడ్డుకి పై భాగాన్నయితే కుడిచేతినీ ఉపయోగించాలని నియమం.

వామహస్తేన శౌచం తు కుర్యాద్వై దక్షిణేన న ।
నాభేరధో వామహస్తో నాభేరూర్ధ్వం తు దక్షిణః ॥ (2 - 29)

మలమూత్ర విసర్జన చేసే చోటుకి జలపూర్ణపాత్రను తీసుకువెళ్ళకూడదు. తెలియక అలా తీసుకువెడితే ప్రాయశ్చిత్తం చేసుకోవాలి. కేవలం నీళ్ళుతాగి మూడురాత్రులు పస్తులుండి తరువాత జపం చెయ్యాలి. అలాగని శౌచకర్మకు అలసత్వం చెయ్యకూడదు. దేశం కాలం ద్రవ్యం శక్తి ఉపపత్తి - వీటిని చూసుకుంటూ శౌచం జరుపుకోవాలి.



మలవిసర్జనకు పన్నెండుసార్లూ మూత్రవిసర్జనకు నాలుగుసార్లూ తగ్గకుండా నీటిని గండూషించాలి. పుక్కిలించిన నీటిని తలవంచి ఎడమవైపుకి ఉమియాలి. అటుపైని ఆచమించి శ్రద్ధగా దంతధావనం చేసుకోవాలి. ముళ్ళుండి పాలుగారే చెట్టునుంచి పన్నెండు అంగుళాలు పొడుగుండేట్టు చూసి పుల్లను విరుచుకోవాలి. చిటికెన వ్రేలంత లావుండాలి. ఒక కొసని కుచ్చులాగా నలగగొట్టిగానీ నమిలిగానీ పళ్ళు శుభ్రంగా తోముకోవాలి. కడిమి - బర్రింక - మామిడి - మేడి - బొడ్డుగ - వేప - రేగు పుల్లలు ప్రశస్తం. పుల్లను విరుచుకునేటప్పుడు చెట్టును అన్నాద్యాయ మంత్రంతో ఇలా ప్రార్థించాలి - నా అదృష్ట విశేషంవల్ల ఓషధీపతి చంద్రుడు వచ్చాడు. నా ముఖం కడుగుతున్నాడు. ఓ వనస్పతీ ! ఆయుర్దాయం బలం యశస్సు వర్చస్సు సంతానం పశుసంపద ధనసంపద బ్రహ్మజ్ఞానం మేధాశక్తి నాకు కలిగించు.

అన్నాద్యాయ వ్యూహధ్వంపే సోమో రాజాయమాగమత్ ।
స మే ముఖం ప్రక్షాళ్యతే యశసా చ భగేవ చ ॥
ఆయుర్బలం యశో వర్చః ప్రజాః పశువసూని చ ।
బ్రహ్మప్రజ్ఞాం చ మేధాం చ త్వం నో దేహి వనస్పతే ॥ (2 - 38)

దంతకాష్ఠం దొరకనప్పుడుగానీ, దంతధావనం చేసుకోరాని రోజుల్లోగానీ నీటిని పన్నెండుసార్లు గండూషించాలి. బాగా పుక్కిలించి ఉమియాలి. పాడ్యమి అమావాస్య (దర్శ) షష్ఠి నవమి ఏకాదశి రవి వారాల్లో దంతాలకు పుల్ల తగిలించకూడదు. ఏడుతరాలు నశిస్తాయి.

ప్రతిపద్దర్శషష్ఠీషు నవమ్యేకాదశీ రవౌ ।
దంతానాం కాష్ఠసంయోగాద్దహత్యాసప్తమం కులమ్ ॥ (2 - 41)

దంతధావనమయ్యాక నోరు పుక్కిలించి కాళ్ళు కడుక్కుని పరిశుభ్రజలాన్ని ముమ్మారు ఆచమించాలి. తడి బొటనవేలూ చూపుడువేళ్ళతో రెండుసార్లు నాసికాపుటాలను తుడుచుకోవాలి. అంగుష్ఠానామికలతో కళ్ళూ చెవులూ తుడుచుకోవాలి. అంగుష్ఠకనిష్ఠికలతో బొడ్డు తుడుచుకోవాలి. తడి అరచేతితో గుండెమీదా తడివేళ్ళతో శిరస్సుమీదా మార్జనం చేసుకోవాలి. *(అధ్యాయం - 2, శ్లోకాలు - 42)*

## ◆ ఆచమనాదికం ◆

నారదా ! శుద్ధమూ స్మార్తమూ పౌరాణమూ వైదికమూ తాంత్రికమూ శ్రౌతమూ అని ఆచమనం ఆరువిధాలు. మలమూత్రశౌచం తరవాత చెయ్యవలసినది శుద్ధాచమనం. ఆచాంతంలో (వైదికవిధుల్లో) స్మార్త పౌరాణికాచమనాలూ బ్రహ్మయజ్ఞాదుల్లో శ్రౌతవైదికాచమనాలూ అస్త్రవిద్యాదిసమయాల్లో తాంత్రికాచమనమూ చెయ్యాలి.



ఆచమించిన తరవాత ఓంకార గాయత్రిని జపిస్తూ శిఖను ముడివేసుకోవాలి. పునరాచమనం చేసి గుండెలనూ చేతులనూ బుజాలనూ మార్జించుకోవాలి. తుమ్మడం ఉమ్మడం పళ్ళుకుట్టుకోవడం అసత్యమాడటం పతితులతో సంభాషించడం - ఇలాంటివి చేసినప్పుడు కుడిచెవ్విని స్పృశించుకోవాలి. అగ్ని జల వాయుదేవతలూ సూర్యచంద్రులూ చతుర్వేదాలూ బ్రాహ్మణుడి కుడిచెవిలో ఉంటాయి.

అగ్నిరాపశ్చ వేదాశ్చ సోమస్సూర్యోఽనిలస్తథా ।
సర్వే నారద విప్రస్య కర్ణే తిష్ఠంతి దక్షిణే ॥ **(3 - 3)**

అటుపైని నదికో నూతికో చెరువుకో వెళ్ళి ప్రాతఃస్నానం చెయ్యాలి. శరీరాన్ని పరిశుభ్రపరచుకోవాలి. నవద్వారాల్లోనూ మలినం ఉంటుంది. తోముకుని కడిగి శుభ్రపరచాలి. అగమ్యాగమన - ప్రతిగ్రహ - రహస్యాచరిత పాపాలన్నీ స్నానంతో ప్రక్షాళితమవుతాయి. స్నానం చెయ్యకుండా ఆచరించే సత్కర్మలన్నీ నిష్ఫలమవుతాయి. కనక నిత్యమూ ప్రాతఃస్నానం చెయ్యాలి. అదీ దర్భలు చేతబట్టుకునే చెయ్యాలి. హోమకాలం దాటిపోకుండా ప్రాతఃస్నానం ముగించుకోవాలి. స్నానంకాగానే సంధ్యావందనమాచరించాలి. ఏడురోజులపాటు ప్రాతఃస్నానం చెయ్యకపోయినా, మూడురోజులు సంధ్యవార్చకపోయినా, పన్నెండు రోజులు అగ్నికార్యం ఎగ్గొట్టినా ద్విజుడు కులభ్రష్టుడవుతాడు.

అల్పత్వాత్ హోమకాలస్య బహుత్వాత్ స్నానకర్మణః ।
ప్రాతర్నతు తథా స్నాయాత్ హోమకాలే విగర్హితః ॥ **(3 - 9)**

నారదా! గాయత్రికన్నా గొప్పమంత్రం ఇహపరాలలో ఎక్కడా లేదు. గానం చేసేవాడిని (జపించేవాడిని) కాపాడుతుంది. కనక గాయత్రి - అన్నారు.

గాయత్ర్యాస్తు పరం నాస్తి ఇహలోకే పరత్ర చ ।
గాయంతం త్రాయతే యస్మాద్గాయత్రీ త్యభిధీయతే ॥ **(3 - 10)**

ముమ్మారు ప్రాణాయామం చేసి ప్రణవాక్షర సహితంగా వ్యాహృతిత్రయ సమన్వితంగా (భూర్భువస్సుః) గాయత్రీమంత్రాన్ని జపించాలి. స్వధర్మనిరతుడూ శ్రుతిసంపన్నుడూ అయిన బ్రాహ్మణుడు వైదికగాయత్రినే జపించాలి తప్ప లౌకికమంత్రాన్ని (వ్యాహృతిరహితం) జపించకూడదు. మంత్రజపంతో కలిపి ప్రాణాయామంచేస్తే అది సగర్భమవుతుంది. అమంత్రకంగా ధ్యానమాత్రంగా చేస్తే అగర్భమంటారు. స్నానాంగంగానే దేవ ఋషి పితృతర్పణాలు పూర్తిచేసి గట్టుకి వచ్చి శుభ్రవస్త్రాలు ధరించాలి. అప్పుడూ - విభూతి ధారణ, రుద్రాక్షధారణ. ఇదే వరసలో చెయ్యాలి.



## ◆ రుద్రాక్షధారణ ◆

మెడలో ముప్పయిరెండు రుద్రాక్షలూ, శిరస్సున నలభై, చెవులకి ఆరు ఆరూ, చేతులకు పదిపదీ, భుజాలకి పదహారు పదహారూ, కన్నులకి ఒక్కొక్కటీ, శిఖమీద ఒకటి, వక్షఃస్థలాన ఎనిమిదీ - ధరించాలి. అలా నూటికి పైగా రుద్రాక్షలు ధరించిన మానవుడు సాక్షాత్తూ రుద్రుడే. బంగారం లేదా వెండి తీగచుట్టించి రుద్రాక్షను శిరస్సునగానీ మెడలోగానీ చెవినిగానీ ధరించితే చాలామంచిది. యజ్ఞోపవీతానికి ధరించవచ్చు. చేతులకి కట్టుకోవచ్చు. ఎక్కడ ధరించినా నిర్వ్యాజమైన భక్తితోమాత్రమే ధరించాలి. ఆనందంగా ధరించాలి. రుద్రాక్షధారణం శివజ్ఞానసాధనం. శిఖమీద ధరించేటప్పుడు తారతత్త్వాన్ని స్మరించాలి. చెవులకు తగిలించుకునేటప్పుడు శివపార్వతులను భావించాలి. యజ్ఞోపవీతానికయితే వేదాలను ధ్యానించాలి. చేతులకు కట్టుకునేటప్పుడు దశదిశలనూ భావించాలి. మెడలో వేసుకునేవేళ సరస్వతినీ అగ్నినీ స్మరించాలి. అన్ని ఆశ్రమాలవారూ అన్ని వర్ణాలవారూ ఈ రుద్రాక్షల్ని ధరించవచ్చు. విప్రుడుమాత్రం మంత్రపూర్వకంగానే ధరించాలి.

రుద్రాక్షలు ధరించినవాడు సాక్షాత్తూ రుద్రుడే అనడంలో సందేహం లేదు. చూడకూడనివి చూసినా వినకూడనివి విన్నా అనకూడనివి అన్నా చెయ్యకూడనివి చేసినా - అన్నిపాపాలూ రుద్రాక్షధారణతో తొలగిపోతాయి. ఇతడు ఏది తింటే అది దేవుడు తిన్నట్టే. ఏది తాగితే అది శివుడు తాగినట్టే. ఏది వాసనచూస్తే అది శివుడు వాసన చూసినట్టే. ఇంత పవిత్రమైన రుద్రాక్షలు ధరించడానికి సిగ్గుపడితే కోటిజన్మలకైనా మోక్షం కలగదు.

రుద్రాక్షలు ధరించినవారిని చూసి పరిహసించేవాడిది సంకరజన్మ అనడంలో సందేహం లేదు. రుద్రాక్షలు ధరించడంవల్లనే రుద్రుడికి రుద్రత్వం బ్రహ్మకు బ్రహ్మత్వం మునులకు సత్యసంకల్పత్వం సిద్ధిస్తున్నాయి. రుద్రాక్షధారణకన్నా పవిత్రకార్యం మరొకటిలేదు. కనక ఇవి ధరించినవారికి భక్తితో ఏది దానం చేసినా దాత సర్వపాపవిముక్తుడై శివసాయుజ్యం పొందుతాడు. శ్రాద్ధకాలంలో రుద్రాక్షధారిని భోక్తగా పెట్టుకుంటే పితృదేవతలు సంతోషిస్తారు. రుద్రాక్షధారుల కాళ్ళు కడిగి శిరమున జల్లుకున్నా లోపలికి పుచ్చుకున్నా పాపవిముక్తీ శివలోకసంప్రాప్తీ ఖాయం. రుద్రాక్షను పొదిగిన ఏ ఆభరణాన్ని ధరించినా చాలు. సిగ్గుపడుతూ పైకి కనిపించనీయకుండా ధరించినా ఫరవాలేదు. సమంత్రకంగానో అమంత్రకంగానో ఎలాగో ఒకలాగా ధరిస్తే చాలు. పాపవిముక్తీ జ్ఞానప్రాప్తి నిశ్చయంగా కలుగుతాయి. రుద్రాక్షల మహిమను వర్ణించి చెప్పడం ఎవరివల్లా కాదు. ధరించవలసిందే, అనుభవంతో తెలుసుకోవలసిందే.

*(అధ్యాయం -3 ,శ్లోకాలు - 37)*



## ◆ రుద్రాక్షలు - భేదాలు ◆

నారాయణమహర్షీ ! రుద్రాక్ష మహిమ గురించి చాలా గొప్పగా చెబుతున్నావు. కారణం తెలుసుకోవచ్చా ?

నారదా ! ఒకప్పుడు కుమారస్వామి ఇలాగే అడిగితే శంకరుడు చెప్పింది నీకు తెలియపరుస్తున్నాను. విను. వెనకటికి త్రిపురుడు అని ఒక దైత్యుడున్నాడు. సర్వదుర్జయుడు. బ్రహ్మాదిదేవతల నందరినీ పీడించుకుతినేవాడు. అందరూ వెళ్ళి శంకరుడితో మొరపెట్టుకున్నారు. అప్పుడు శంకరుడు అఘోరము అనే మహాశస్త్రాన్ని ధ్యానించాడు. అది సర్వదేవమయమూ ఘోరాతిఘోరమూను. ఒక వెయ్యి దివ్య సంవత్సరాలు దాన్ని ధ్యానించి కన్నులు మూడూ తెరిచాడు. బాష్పజలబిందువులు రాలిపడ్డాయి. ఆ నీటి బిందువులనుంచి మహారుద్రాక్షలు అనే వృక్షాలు ఆవిర్భవించాయి. సూర్యనేత్రంనుంచి రాలిపడిన జలబిందువులతో కపిలవర్ణంలో పన్నెండూ, సోమనేత్రం నుంచి శ్వేతవర్ణంలో పదహారూ, వహ్నినేత్రంనుంచి కృష్ణవర్ణంలో పదిరకాలూ రుద్రాక్షలు మొలిచాయి. శ్వేత - రక్త - మిశ్ర - కృష్ణ రుద్రాక్షలు నాలుగు వర్ణాలకూ ప్రతీకలు.

ఏకముఖ రుద్రాక్ష సాక్షాత్తూ శంకరుడే. బ్రహ్మహత్యాది మహాపాతకాలను సైతం తొలగిస్తుంది. ద్విముఖరుద్రాక్ష పార్వతీపరమేశ్వరులు. సకలపాప విమోచకం. త్రిముఖ రుద్రాక్ష సాక్షాత్తు అగ్నిదేవుడు. స్త్రీహత్యాది పాపాలను సైతం దహించివేస్తుంది. చతుర్ముఖరుద్రాక్ష అంటే బ్రహ్మదేవుడే. నరహత్యాది ఘోరపాపాలనుకూడా తొలగిస్తుంది. పంచముఖీ రుద్రాక్షనే కాలాగ్ని అంటారు. అదే రుద్రుడు. అభక్ష్యభక్షణ అగమ్యాగమనాది దోషాలను అంతరింపజేస్తుంది. షణ్ముఖరుద్రాక్షమంటే కుమారస్వామియే. దీన్ని కుడిచేతికి ధరించాలి. బ్రహ్మహత్యాదిక పాపాలుకూడా పోతాయి. సప్తముఖ రుద్రాక్షను మన్మథుడంటారు. స్వర్ణస్తేయాదిపాతకాలు నశిస్తాయి. అష్టవక్త్ర రుద్రాక్షమంటే వినాయకుడు. దీన్ని ధరిస్తే అన్ని పనులూ నిర్విఘ్నంగా సాగుతాయి. గురుపత్నీగమనాది దోషాలు నశిస్తాయి. నవముఖీ రుద్రాక్షమంటే కాలభైరవుడు. దీన్ని ఎడమచేతికే ధరించాలి. భుక్తిముక్తిప్రదం. మహాబలవర్ధకం. భ్రూణహత్యాదిదోష నాశకం. సద్యఃఫలదాయకం. దశముఖీరుద్రాక్ష సాక్షాత్తూ జనార్ధనుడు. దీన్ని ధరిస్తే దుష్టగ్రహ భూతప్రేతపిశాచోరగభయాలు అంతరిస్తాయి. ఏకాదశముఖీ రుద్రాక్షమంటే ఏకాదశరుద్రులతో సమానం. దీన్ని శిఖలో ధరించినవాడు వెయ్యి అశ్వమేధాలూ నూరువాజపేయాలూ పదివేల గోదానాలూ చేసిన పుణ్యఫలం పొందుతాడు. ద్వాదశాస్య రుద్రాక్ష దొరికితే ద్వాదశాదిత్యులూ చేతికి అందినట్టే. దీన్ని చెవికి ధరించాలి. అశ్వమేధ గోమేధ యజ్ఞఫలం లభిస్తుంది. క్రూరజంతు క్రూరపురుష భయాలు తొలగిపోతాయి. ఆధివ్యాధులు దరికి చేరవు. పదమూడు ముఖాలున్న రుద్రాక్షను ధరించినవాడు సాక్షాత్తూ కార్తికేయుడే



అవుతాడు. ఇది సర్వవాంఛాప్రదం. పట్టిందల్లా బంగారమే అవుతుంది. మాతృహత్యాది పాపాలు సైతం తొలగిపోతాయి. పధ్నాలుగు ముఖాలున్న రుద్రాక్ష లభించిందంటే పుణ్యం ఫలించిందన్నమాటే. దాన్ని శిరస్సున ధరించాలి. శివుడితో సమానుడవుతాడు. నారదా ! వెయ్యేల ! రుద్రాక్షకు సాటివచ్చే పవిత్రవస్తువు ఈ సృష్టిలో లేదు. దేవతలుకూడా పూజిస్తారు. ధరిస్తారు. ఏదో ఒక రుద్రాక్షను నిత్యమూ ధరిస్తే చాలు ఇహపరాలు శుభాస్పదాలవుతాయి.

ఇరవైయారు రుద్రాక్షలతో శిరోమాలనూ యాభైతో కంఠమాలనూ పదహారుతో బాహుమాలికనూ పన్నెండుతో మణిబంధమాలికనూ తయారుచేసుకుని ధరించాలి. ఇరవైయేడుగానీ యాభైగానీ నూటెనిమిదిగానీ రుద్రాక్షలతో జపమాలను చేసుకోవాలి. వీటిలో అష్టోత్తర శతరుద్రాక్ష జపమాల ఉత్తమోత్తమం. ఈ జపమాలలను ధరించవచ్చు కూడా. క్షణక్షణమూ అశ్వమేధం చేసినంతటి పుణ్యఫలం చేకూరుతుంది - అని సాక్షాత్తూ శివుడు షణ్ముఖుడికి తెలియజేశాడు. ***(అధ్యాయం - 4, శ్లోకాలు - 40)***

అష్టోత్తరశతైర్మాలా రుద్రాక్షైర్ధార్యతే యది ।
క్షణే క్షణేఽశ్వమేధస్య ఫలం ప్రాప్నోతి షణ్ముఖ ॥ **(4 - 40)**

## ◆ రుద్రాక్ష జపమాల ◆

నారదా ! జపమాలికాలక్షణం చెబుతాను. గ్రహించు. ప్రతిరుద్రాక్షలోనూ ముఖభాగం బ్రహ్మదేవుడు. బిందుభాగం (ముళ్ళు) రుద్రుడు. పుచ్ఛభాగం శ్రీమహావిష్ణువు. పంచముఖీ రుద్రాక్షలు పాతికతో జపమాల చేసుకోవడం మంచిది. అవ్వి కంటకాలతో గరుకుగా ఉండాలి. ఎరుపు - తెలుపు - లేదా మిశ్రవర్ణంలో ఉండాలి. రంధ్రాలు చెయ్యాలి. ముఖభాగం ముఖభాగంతో పుచ్ఛభాగం పుచ్ఛభాగంతో కలిసేట్టు రుద్రాక్షలు గ్రుచ్చాలి. ఆవుతోకను చుట్టినట్టుండాలి. మేరువును అన్నింటికీ పైని గ్రుచ్చాలి. ఇలాంటి అక్షమాలను నాగపాశమంటారు. ఇది మంత్రసిద్ధిప్రదాయిని. దీన్ని ముందుగా సుగంధజలాలలో శుభ్రంగా కడగాలి. అటుపైని పంచగవ్యాలు జల్లాలి. మళ్ళీ పవిత్రోదకస్నానం చేయించాలి. అప్పుడు మంత్రాలను న్యాసం చెయ్యాలి. శివాస్త్రమంత్రం జపిస్తూ ప్రతిరుద్రాక్షనూ స్పృశించాలి. కవచంతో అవకుంఠన చెయ్యాలి. మూలమంత్రాన్ని న్యసించి మళ్ళీ శుద్ధోదకస్నానాదులు చేయించాలి. సద్యోజాతాది సంప్రోక్షణలతో నూటయెనిమిది పర్యాయాలు మూలమంత్రాన్ని పఠించి రుద్రాక్షమాలను పరిశుభ్ర పీఠంమీద ఉంచాలి. అప్పుడు పార్వతీపరమేశ్వరులను ఆవాహన చెయ్యాలి. అప్పటికి అది ప్రతిష్ఠితమాల అవుతుంది. సర్వవాంఛా ప్రదమవుతుంది. ఈ జపమాలతో ఏ దేవతామంత్రాన్నయినా జపించుకోవచ్చు.



శిరస్సునగానీ మెడలోగానీ కర్ణాభరణంగా గానీ ధరించవచ్చు. జపం ఏదైనా ఎప్పుడూ రుద్రాక్షమాలతోనే చెయ్యాలి. జపం కాగానే కన్నులకద్దుకుని యథావిధిగా ధరించాలి. స్నాన - దాన - జప - హోమ - వైశ్వదేవ - సురార్చనా - ప్రాయశ్చిత్త - శ్రాద్ధ - దీక్షాకాలాలలో రుద్రాక్షధారణ విశేషఫలితాలను ఇస్తుంది. ఇది లేకుండా వైదికకర్మలు చేసిన విప్రుడు నరకానికి పోతాడు. మరొకరు ధరించిన రుద్రాక్షమాలను తానెప్పుడూ ధరించకూడదు. అశౌచసమయాలలో ధరించకూడదు.

రుద్రాక్షతరువునుంచి వచ్చిన గాలిసోకితే చాలు గడ్డి పరకలు సైతం పుణ్యలోకాలకు చేరుకుంటాయి. మానవులకు ఇది సర్వపాపవిమోచకమనడంలో సందేహం లేదు. రుద్రాక్షను ధరిస్తే పశువులుకూడా రుద్రత్వం పొందుతాయి. ఇక మానవుల మాట చెప్పాలా - అంటోంది జాబాలశ్రుతి. అందుచేత కనీసం ఒక్క రుద్రాక్షనైనా ధరించడం అవసరం. దీన్ని ధరించి శివనామాలను జపించేవారే నిజమైన భాగవతోత్తములు. శ్రేయస్కాములు తప్పక ధరిస్తారు. జపిస్తారు. తరిస్తారు. బ్రహ్మవిష్ణు మహేశ్వరులూ వారి అంశావతారాలూ సకలదేవతలూ రుద్రాక్షధారులే. ఋషులూ మునులూ యోగులూ సరేసరి. మహాతపస్వులకు ఎన్నో జన్మలకుగానీ లభించని ముక్తి, రుద్రాక్షధారులకు చటుక్కున లభిస్తుంది. రుద్రాక్షలు ధరిస్తే శ్రద్ధపెరుగుతుంది. మోక్షమునందిచ్ఛ పొడముతుంది. శివుడి అనుగ్రహం ఉంటేనే రుద్రాక్షధారణం మీద కోరిక కలుగుతుంది. ధరించాడూ అంటే శివానుగ్రహానికి పాత్రుడు అయ్యాడన్నమాటే. అందుకే దీని మాహాత్మ్యాన్ని జాబాలేయులూ మునులూ నిరంతరం పఠిస్తూ ఉంటారు. రుద్రాక్షలను కంటితో చూస్తే చాలు పుణ్యం వస్తుంది. స్పృశిస్తే కోటిరెట్లూ ధరిస్తే నూరుకోట్ల రెట్లూ పుణ్యం దక్కుతుంది.

ఫలస్య దర్శనే పుణ్యం స్పర్శాత్కోటిగుణం భవేత్ ।
శతకోటిగుణం పుణ్యం ధారణాల్లభతే నరః ॥ (5 - 28)

రుద్రాక్షమాలతో జపం చేస్తే లక్షకోటిశతాలూ లక్షకోటిసహస్రాలుగా పుణ్యం లభిస్తుంది అనడంలో ఏ సందేహమూ లేదు. చేతులకూ గుండెలకూ మెడకూ చెవులకూ శిరస్సుకూ రుద్రాక్షలను ధరించినవాడు సాక్షాత్తూ రుద్రుడవుతాడనడమూ నిశ్చయమే. రుద్రుడిలా అవధ్యుడై శివుడిలా సురాసురులకు సైతం వందనీయుడవుతాడు. రుద్రాక్షధారికి నమస్కరిస్తే శివుడికి నమస్కరించినట్టే. సర్వపాపవిముక్తి ఉభయులకూ దక్కేఫలం. రుద్రాక్షను ధరించి మరణిస్తే కుక్క సైతం ముక్తిపొందుతుందంటే ఇక నరులమాట చెప్పాలా! జపధ్యాన విహీనుడైనాసరే రుద్రాక్షను ధరిస్తేచాలు. సర్వపాపాలనుంచీ విముక్తి పొందుతాడు. సద్గతులకు అర్హుడవుతాడు. అందుచేత విశ్వప్రయత్నం చేసయినాసరే కనీసం ఒక్కరుద్రాక్షను సంపాదించి ధరించాలి. ఇరవైయొక్కటి సంపాదించి ధరించగలిగితే చాలు శివలోకం ఖాయం. *(అధ్యాయం - 5, శ్లోకాలు - 36)*



## ◆ రుద్రాక్షమహిమలు - గార్దభగాథ ◆

నారదా ! శివుడు కుమారస్వామికి చెప్పిన రుద్రాక్షమహిమలు ఇంకా ఏమిటంటే - అంటూ నారాయణమహర్షి కొనసాగించాడు.

దేవతలుసైతం రుద్రాక్షమహిమలో పదహారవకళకయినా సాటిరారు. పురుషులలో విష్ణుమూర్తి, గ్రహాలలో సూర్యుడు, నదులలో గంగ, మునులలో కశ్యపుడు, గుర్రాలలో ఉచ్చైఃశ్రవమూ, దేవుళ్ళలో ఈశ్వరుడు, దేవీమూర్తులలో గౌరి ఎలాంటివారో సమస్తవస్తువుల్లోనూ రుద్రాక్ష అటువంటిది. రుద్రాక్షధారణను మించిన తపస్సు లేదు. స్తోత్రం లేదు. వ్రతం లేదు. అక్షయ్యదానాలలో రుద్రాక్షదానం బహువిధాల విశిష్టం. శాంతచిత్తుడైన శివభక్తుడికి రుద్రాక్షను దానం చేస్తే లభించే పుణ్యఫలం ఎంతటిదో ఈశ్వరుడు కూడా చెప్పలేకపోయాడు. రుద్రాక్షధారికి అన్నదానం చేసినవారు ఇటూ అటూ ఏడేసి తరాలు తరించి శివలోకం చేరుకుంటారు. నొసట విభూతి, తనువున రుద్రాక్ష, శివాలయంలో పూజ - వీటికి నోచుకోని విప్రుడు శ్వపచుడితో సమానం. మద్యపాన - మాంసభక్షణ - వేశ్యాసంగమాది మహాపాతకాలు రుద్రాక్ష శిరోధారణతో పటాపంచలవుతాయి. యజ్ఞయాగాలు చెయ్యకపోయినా వేదాలు చదవకపోయినా ఏ దానాలూ చెయ్యకపోయినా అన్నీ చేసిన ఫలం లభిస్తుంది. పురాణపఠన తీర్థసేవన శాస్త్రాభ్యసన పుణ్యఫలాలు దీనికి సాటిరావు. రుద్రాక్షను ధరించి ప్రయాణమధ్యంలో దిక్కులేని చావు చచ్చినా అతడు శివత్వం పొందుతాడు. అతడి వంశంలో ఇరవైయొక్క తరాలు తరిస్తాయి. రుద్రలోకంలో నివసిస్తాయి. ఏ కులంలో పుట్టినా ఎలాంటి దురభ్యాసాలకు లోనైనా నిర్గుణుడైనా సగుణుడైనా రుద్రాక్షధారి రుద్రుడితో సమానుడే. శిరస్సున ధరిస్తే కోటిరెట్లు, చెవులకు ధరిస్తే దశకోట్లు, మెడలో ధరిస్తే శతకోట్లు, మూర్ధమున ధరిస్తే సహస్రకోట్లు, జంధ్యానికి ధరిస్తే అయుతకోట్లు, బుజాలకో మణికట్టుకో దాలిస్తే లక్షకోట్లు అధికంగా ఫలాన్ని ఇస్తుంది. రుద్రాక్షను మించిన మోక్షసాధనం మరొకటి లేదంటే అతిశయోక్తి కాదు. రుద్రాక్షను ధరిస్తే చాలు భక్తి ఉన్నా లేకపోయినా వైదికకర్మలను చేసినా చెయ్యకపోయినా ముక్తి లభించడం తథ్యం. రుద్రాక్షను ధరించాలి అనే కోరిక గాఢంగా ఉంటే చాలు, ఒకవేళ ధరించలేకపోయినా శివలింగంలాగా వందనీయుడే, అవిద్యుడా సవిద్యుడా అనే విచారణతో పనిలేదు. రుద్రాక్షధారి రుద్రత్వం పొంది తీరుతాడు. రుద్రలోకం చేరి తీరుతాడు. వెనకటికి ఒక గాడిద ఇలాగే రుద్రత్వం పొందింది.

నారదా ! షణ్ముఖుడు వెంటనే ఆ గాడిద కథ చెప్పమన్నాడు. శివుడు చెప్పాడు. అదేమిటంటే -

వింధ్యారణ్యంలో ఒక గాడిద ఉండేది. ఒకనాడు ఒక పథికుడు దానిమీద అది మొయ్యలేనన్ని రుద్రాక్షలు బస్తాలు కట్టి వేశాడు. ఓపిక తెచ్చుకుని చాలాదూరం మోసింది. ఇక మొయ్యలేక నేలకు ఒరిగిపోయింది. ప్రాణాలు విడిచింది. శివుడి అనుగ్రహానికి పాత్రమై శివలోకం చేరుకుంది. మోసిన రుద్రాక్షలు ఎన్నో ఒక్కొక్క దానికీ ఎన్ని ముఖాలున్నాయో అన్ని వేల సంవత్సరాలు శివలోకంలో నివసించింది.



బ్రహ్మనందనా ! ఈ రుద్రాక్ష మహిమను ఎవరికిబడితే వారికి చెప్పకూడదు. అశిష్యులకూ అభక్తులకూ మూర్ఖులకూ అస్సలు చెప్పకూడదు. అయితే - రుద్రాక్షను ధరించాలి అనుకునేవాడికి ఎవడికైనాసరే చెప్పవచ్చు.

రుద్రాక్ష మహిమలను వర్ణించిచెప్పడం, రుద్రాక్షలను ధరింపజెయ్యడం - ఇదొక వ్రతంగా ఆచరించినవారు సమకూర్చుకునే పుణ్యరాశికి కొలతలేదు. వెయ్యి రుద్రాక్షలను ధరింపజేస్తే అతడికి దేతలు కూడా నమస్కరిస్తారు. వెయ్యి సాధ్యం కాకపోతే బుజానికి పదహారు, శిఖకు ఒకటి, చేతికి పన్నెండు, మెడలో ముప్పయిరెండు, శిరస్సున ఇరవైనాలుగు, చెవికి ఒకటి, మరోపన్నెండు వక్షఃస్థలాన - ఇలాగ నూటయెనిమిది ధరింపజేసినా అతడు రుద్రుడిలా దేవమానవ పూజ్యుడవుతాడు. ముత్యాలతో పగడాలతో స్ఫటికాలతో వైడూర్యాలతో కలిపి రుద్రాక్షలను వెండితీగకుగానీ బంగారుతీగకుగానీ చుట్టి ధరిస్తే అతడు సాక్షాత్కరించిన శివుడే. రుద్రాక్షలకు వెండి లేదా బంగారు తొడుగులను చేయించి ధరించినా అధికపుణ్యప్రదమే. ఏ కోరికా లేకపోయినా, ఏ భక్తీ లేకపోయినా యథాలాపంగా ధరించినా అతడిని ఏ పాపాలు సోకవు. సూర్యుడికి చీకట్లు సోకుతాయా !

## ◆ గుణనిధి కథ ◆

రుద్రాక్షమాలతో మంత్రజపం చేస్తే కోటిరెట్లు అధికంగా వేగంగా ఫలం సిద్ధిస్తుంది. శరీరంమీద ఒక్కరుద్రాక్ష అయినా లేని నరుడి జన్మ వ్యర్థమంటే వ్యర్థం. రుద్రాక్షను శిరస్సున పెట్టుకుని స్నానం చేస్తే గంగాస్నానఫలం దక్కితీరుతుంది. ఏకముఖ - పంచముఖ - ఏకాదశముఖ - చతుర్దశముఖ రుద్రాక్షలు లోకపూజితాలు. రుద్రాక్షను నిత్యమూ భక్తితో పూజిస్తే శంకరుణ్ణి పూజించినట్టే. రుద్రుడికీ రుద్రాక్షకూ రుద్రాక్షధారికీ భేదంలేదు. దరిద్రుణ్ణి ధనవంతుణ్ణి చేసే శక్తి ఒక్క రుద్రాక్షకే ఉంది. దీనికి నిదర్శనంగా ఒక పురాణకథ చెబుతాను - విను.

కోసలదేశంలో గిరినాథుడు అనే బ్రాహ్మణుడు ఉన్నాడు. వేదవేదాంగపారంగతుడు. మహాధనవంతుడు. ధర్మాత్ముడు. యజ్ఞయాగాలు అన్నీ చేసినవాడు. అతనికి గుణనిధి అని ఒక పుత్రుడున్నాడు. మన్మథుడిలా బహుసుందరుడు. సుధిషణుడు అనే గురువు దగ్గర చదువుకుంటున్నాడు. కోడెవయసు కూతలు పెట్టింది. గురుపత్ని ముక్తావళికి వలవిసిరాడు. రూపయౌవనాలకు సమ్మోహితురాలయ్యింది. కొంతకాలం కథ రహస్యంగా సాగింది. ఎప్పటికయినా గురువుగారికి తెలియకమానదు. శపిస్తాడు అని భయపడ్డాడు గుణనిధి. దానితో గురువుకి విషంపెట్టి అడ్డు తొలగించుకొన్నాడు. ఇక స్వేచ్ఛగా నిర్భయంగా ముక్తావళితో కాపురం సాగించాడు. ఆనోటా ఆనోటా



వ్యాపించి గిరినాథునికి తెలిసింది. ఎంతగానో నొచ్చుకున్నాడు. గుణనిధిని పిలిపించి తల్లిదండ్రులిద్దరూ గట్టిగా మందలించారు. దానితో ఆ దుష్టుడు అలిగి వారికే విషంపెట్టాడు. తండ్రికూడబెట్టిన ధనసంపదలతో ముక్తావళిని భోగభాగ్యాలలో ముంచితేల్చాడు. సురాపాన మాంసభక్షణలకు అలవాటు పడ్డాడు. కాలం గడిచింది. సంపదలు తరిగిపోయాయి. ఆస్తులు కరిగిపోయాయి. ధనంకోసం దొంగతనాలకు దిగాడు. గ్రామస్థులంతా మేల్కొన్నారు. సంఘ బహిష్కారం విధించారు. ఇక చేసేది లేక ముక్తావళీ గుణనిధులు అడవులకు పోయారు. దారిదోపిడీలు చేశాడు. అడవిగుండా వెళ్ళే ప్రతిమనిషినీ చంపి సొమ్ములు దోచుకున్నాడు. ముక్తావళితో మురిపాలు తీర్చుకున్నాడు. చాలాకాలం సాగింది.

ఒకనాడు హఠాత్తుగా గుణనిధి మరణించాడు. యమదూతలు వేలసంఖ్యలో వచ్చిపడ్డారు. శివలోకంనుంచి శివగణాలూ వచ్చాయి. రెండు వర్గాలకూ వాదం జరిగింది. ఇతడు చేసిన పుణ్యకార్యం ఒక్కటయినా ఉందా ? అని యమదూతలు ప్రశ్నించారు. ఇతడిని తీసుకువెళ్ళటానికి శివదూతలుగదా మీరు రావడమేమిటని పరిహసించారు. దానికి శివదూతలు చెప్పిన సమాధానం ఏమిటంటే -

యమదూతలారా ! ఈ గుణనిధి మరణించినచోట నేలలో పదిమూరల లోతున రుద్రాక్ష ఉంది. దాని ప్రభావంవల్ల ఇతడి పాపాలన్నీ అంతరించాయి. శివసన్నిధికి యోగ్యుడయ్యాడు. అందుకని తీసుకువెళ్ళడానికి వచ్చాం - అన్నారు. యమదూతలు కిమ్మనకుండా తిరుగుముఖం పట్టారు.

గుణనిధి దివ్యవిమానం అధిరోహించాడు. దివ్యరూపధరుడు అయ్యాడు. శివదూతలతో కలిసి శంకరుడి సన్నిధికి చేరుకున్నాడు.

రుద్రాక్ష మహిమ ఇంతటిది. వర్ణనాతీతం - అని శివుడు షణ్ముఖుడికి వివరించాడు. షణ్ముఖుడు కృతార్థుడనయ్యానని సంబరపడ్డాడు. నారదా ! సదాచార ప్రసంగంలో రుద్రాక్షను గురించి నేనింత గొప్పగా చెప్పడానికి ఇదే కారణం. అది సర్వపాపక్షయకరం. సర్వపుణ్యప్రదం. ***(అధ్యాయం - 6, శ్లోకాలు - 54)***

## ◆ రుద్రాక్షలు - అధిదేవతలు ◆

నారదా ! ఈ రుద్రాక్షల్లోకూడా చాలా భేదాలున్నాయి. ధాత్రీఫలమంత (ఉసిరిక) ఉండేవి ఉత్తమోత్తమాలు. వీటిని భద్రాక్షలు అంటారు. రేగుపండంత ఉండేవి మధ్యమాలు. సెనగగింజల్లాగా ఉండేవి అధమాలు. రుద్రాక్షల్లో బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర జాతులున్నాయి. శ్వేతవర్ణంలో ఉండేవి బ్రాహ్మణజాతివి. రక్తవర్ణంలో ఉండేవి క్షత్రియజాతివి. పీతవర్ణంలోఉండేవి వైశ్యజాతివి. కృష్ణవర్ణంలో ఉండేవి శూద్రజాతివి. ఏజాతివాటిని ఆ జాతివారే ధరించాలి. ఆకారంలో సమానంగా ఉండి కంటకాలతో దృఢంగా నిగనిగలాడేవి శుభప్రదాలు. పురుగులు కొరికినవీ పగిలినవీ (ముళ్ళులేనివీ) కంటకాలు లేనివీ కుదపలు కట్టినవీ బాగా తెరుచుకున్నవీ పనికిరావు. స్వయంగా రంధ్రవహితమైన రుద్రాక్ష ఉత్తమం.



మానవులు రంధ్రం చేసినది మధ్యమం. నికషంమీద రాస్తే బంగారుగీటు పడేది ఉత్తమోత్తమం. దీన్ని శివపూజా దురంధరులు ధరించాలి.

రుద్రాక్షలను రెండుపేటలుగాగానీ మూడుపేటలుగాగానీ ధరించవచ్చు. కుండలాలలో కిరీటాలలో కర్ణాభరణాలలో హారాలలో కేయూరాలలో కటకాలలో - ఇలా ఏ ఆభరణంలోనైనా పొదిగి ధరించవచ్చు. నిద్రపోతున్నా తింటున్నా తాగుతున్నా రుద్రాక్షమాలను తీసివెయ్యవలసిన అవసరంలేదు. శుచిగా ఉన్న అన్నివేళలా ధరించవచ్చు. మూడు వందలైతే అధమమనీ అయిదు వందలైతే మధ్యమమనీ వెయ్యి రుద్రాక్షలు ధరిస్తే ఉత్తమమనీ కొందరు చెప్పారు. ఎన్ని ఎక్కువ ధరించగలిగితే అంత మంచిది. కనీసం ఒక్కటైనా ధరించడం అవసరం.

శిరస్సున ధరించేటప్పుడు ఈశానమంత్రం, చెవులకు తత్పురుషమంత్రం, నొసటా గుండెలమీదా ధరించేటప్పుడు అఘోరమంత్రం, చేతులకు అఘోరబీజమంత్రం పఠించాలి. ఉదరాన ధరించేటప్పుడు వామదేవ మంత్రం జపించాలి. మూలమంత్రంతో సంప్రోక్షించిన రుద్రాక్షలనే ధరించాలి.

ఏకముఖీ రుద్రాక్షలు పరతత్త్వప్రకాశకాలు. ద్విముఖిని అర్ధనారీశ్వరమంటారు. త్రిముఖం అగ్నిదేవుడు. సర్వపాపవిదాహకం. ఇదే అగ్నిత్రయస్వరూపం. చతుర్ముఖరుద్రాక్షమంటే బ్రహ్మదేవుడే. దీన్ని ధరించిన వారికి ఆయురారోగ్యభోగభాగ్యాలూ జ్ఞానసంపత్తీ కలుగుతాయి. పంచముఖీ రుద్రాక్ష సాక్షాత్తుగా పంచబ్రహ్మాత్మకం. దీన్ని ధరిస్తే శివప్రీతికరం. షడ్వక్త్ర రుద్రాక్షలో కార్తికేయుడే ఉంటాడు. వినాయకుడుంటాడని మరి కొందరన్నారు. సప్తముఖీరుద్రాక్షకు సప్తమాతృకలు అధిదేవతలు. ఇది సప్తాశ్వ - సప్తముని రూపకం. ఆరోగ్య - ఐశ్వర్యవర్ధకం. జ్ఞానప్రదం. అష్టముఖీరుద్రాక్షకు అష్టమాతృకలు అధిదేవతలు. దీన్ని ధరించినవారిని అష్టవసువులూ గంగాదేవీ ఆశీర్వదిస్తారు. నవముఖీరుద్రాక్షమంటే యమధర్మరాజు. దీన్ని ధరిస్తే యమభయం ఉండదు. దశముఖరుద్రాక్షకు దశదిశలూ అధిదేవతలు. దశదిశా ప్రీతికరం. ఏకాదశముఖీ రుద్రాక్షకు ఏకాదశరుద్రులూ అధిదేవతలు. దీనినే ఇంద్రదైవతమని కూడా అంటారు. అత్యంత సౌఖ్యప్రదం. ద్వాదశముఖ రుద్రాక్ష, సాక్షాత్తూ మహావిష్ణుస్వరూపం. దీనికి ద్వాదశాదిత్యులు అధిదేవతలు. సర్వరోగనివారిణి. ఆరోగ్యప్రదాయిని. త్రయోదశముఖీ రుద్రాక్షకు మన్మథుడు అధిదేవత. దీన్ని ధరిస్తే తీరని కోరికలే ఉండవు. కామదేవుడు సర్వాత్మనా అనుగ్రహిస్తాడు. చతుర్దశముఖీ రుద్రాక్ష సాక్షాత్తూ రుద్రనేత్రంనుంచి ఆవిర్భవిస్తుంది. దీన్ని ధరిస్తే ఆధివ్యాధులు దరిచేరవు.

నారదా ! రుద్రాక్షలు ధరించినవారు మద్య మాంస లశున (వెల్లుల్లి) పలాండు (నీరుల్లి) శిగ్రు (మునగ) శ్లేష్మాతక (విరిగి) విడ్వరాహ భక్షణం చెయ్యకూడదు. గ్రహణకాలంలో, విషువత్తున (రేయింబవళ్ళు సమంగా ఉండేరోజు) సంక్రమణ సమయంలో అయనకాలంలో అమావాస్య (దర్శ) పౌర్ణిమలలో ఇంకా ఇలాంటి పుణ్యదినాలలో పర్వాలలో రుద్రాక్షలను ధరిస్తేవిశేషఫలితం ఉంటుంది. వెంటనే పాపవిమోచనం కలుగుతుంది. *(అధ్యాయం - 7 , శ్లోకాలు - 42)*



## ◆ భూతశుద్ధి ◆

నారదా ! సదాచారంలో భాగంగా ఇప్పుడు భూతశుద్ధి గురించి చెబుతున్నాను. శ్రద్ధగా ఆలకించు. మూలాధారచక్రం నుంచి మేల్కొని సుషుమ్నామార్గంద్వారా బ్రహ్మరంధ్రానికి చేరుకునే కుండలినీ పరదేవతను ఒక్కసారి స్మరించు. సాధకుడు హంసమంత్రంతో జీవుణ్ణి బ్రహ్మలో అనుసంధిస్తాడు. శరీరంలో పాదాది జానుపర్యంతం - భూమండలం. అది చతుష్కోణం. సవజ్రకం. లం బీజాఢ్యం. స్వర్ణవర్ణం. జాన్వాది నాభిపర్యంతం - జలమండలం. అది చంద్రార్ధనిభం. పద్మద్వయాంకితం. వం బీజయుక్తం. శ్వేతవర్ణం. నాభిమొదలు హృదయపర్యంతం - అగ్నిమండలం. అది త్రికోణం. స్వస్తికాన్వితం. రం బీజయుక్తం. రక్తవర్ణం. హృదయం నుంచి భ్రూమధ్యపర్యంతం - వాయు మండలం. అది వృత్తాకారం. షడ్బిందులాంఛితం. యం బీజయుతం. ధూమ్రవర్ణం. భ్రూమధ్యనుంచి బ్రహ్మరంధ్రపర్యంతం - ఆకాశమండలం. అదీ వృత్తాకారం. స్వచ్ఛం. మనోహరం. హం బీజయుక్తం. ఇలా ఒక్కొక్కమండలాన్నీ ప్రత్యేకంగా భావించి ఒకదానిలో ఒకటి నింపాలి. భూమిలో జలం, జలంలో అగ్ని, అగ్నిలో వాయువు, వాయువులో ఆకాశం నింపి, ఆకాశాన్ని అహంకారంలో, అహంకృతిని మహత్తత్త్వంలో, మహత్తత్త్వాన్ని ప్రకృతిలో, ప్రకృతిని మాయలో, మాయను ఆత్మలో అంతర్భవింపజెయ్యాలి. అప్పుడు సాధకుడు శుద్ధ సంవిన్మయుడవుతాడు. అయ్యాక - వామకుక్షిలో ఉండే పాపపురుషుణ్ణి స్మరించాలి. నల్లగా అంగుష్ఠపరిమాణంలో ఉంటాడు. బ్రహ్మహత్య శిరస్సుగా, సువర్ణస్తేయం బాహువులుగా, మదిరాపానమే హృదయంగా, గురుపత్నీ సంగమమే కటి ప్రదేశంగా, పాతకి స్నేహాలు పాదద్వయంగా, ఉపపాతకాలు మస్తకంగా ఖడ్గచర్మధరుడై అధోముఖుడై దుస్సహంగా ఉంటాడు పాపపురుషుడు. వాయుబీజ స్మరణతో మహావాయువును సృష్టించి ఈ పాపపురుషుణ్ణి ఎండగట్టాలి. వహ్నిబీజాన్ని స్మరించి మంటల్లో దహించివెయ్యాలి. ఆ బూడిదను కుంభకం ద్వారా స్వశరీరంనుంచి వెలుపలికి నెట్టి, వాయుబీజ రేచనతో పోగుపెట్టి, సుధాబీజ స్మరణతో తడిపి భూబీజస్మరణతో ముద్దచేసి, ఆకాశబీజస్మరణతో ఆ బంగారుముద్దను అద్దంలా విశుద్ధిపరచి మూర్ధాదిపాదపర్యంతం అన్ని అవయవాలకూ పులుముకోవాలి.

అటుపైని ఆ భస్మం నుంచి ఆకాశాది పంచభూతాలనూ పునరుత్పాదన చేసి సోఽహం మంత్రోచ్చారణతో ఆత్మను హృదయాంబుజంలోకి తీసుకురావాలి. పరషంగంనుంచి సుధామయమైన కుండలినీ జీవాన్ని తెచ్చి హృదయాంభోజంలో సంస్థాపించి, మూలాధారంలో ఉండే శక్తిని ధ్యానించాలి. ఎర్రసముద్రంలో తెప్పలాగా (తెప్పమీద) ఉన్న అరుణ సరోజంమీద కూర్చుని, హస్తపద్మాలలో శూలమూ, తుమ్మెదలే అల్లెత్రాడుగాగల చెరకువిల్లూ, అంకుశమూ అయిదుబాణాలూ ఒక రక్తకపాలమూ ధరించినదీ, మూడు కన్నులుకలదీ, బలిష్ఠమైన వక్షోజాలు కలదీ, ఉదయిస్తున్న సూర్యబింబపు రంగులో ప్రకాశించేదీ ఆ మహాదేవి ఆ పరాంబిక ఆ ప్రాణశక్తి మాకు సుఖప్రద అగుగాక !



రక్తాంభోధిస్థపోతోల్లసదరుణసరోజాధిరూఢా కరాబ్జైః
శూలం కోదండమిక్షూద్భవ మళిగుణమప్యంకుశం పంచబాణాన్ ।
బిభ్రాణాసృక్కపాలం త్రినయనలసితా పీనవక్షోరుహాఢ్యా
దేవీ బాలార్కవర్ణా భవతు సుఖకరీ ప్రాణశక్తిః పరా నః ॥ (8 - 19)

పరమాత్మ స్వరూపిణి ఆ ప్రాణశక్తిని ఇలా ధ్యానించి విభూతిని ధరించాలి. విభూతిని ధరిస్తేనే వైదిక సత్కర్మాచరణకు అర్హత అధికారం సిద్ధిస్తుంది. శ్రుతి స్మృతి పురాణాలు చెప్పిన ప్రకారం విభూతిని ఎలా ధరించాలో ఏ మహాఫలాలు లభిస్తాయో అదికూడా తెలియజేస్తాను. తెలుసుకో.

*(అధ్యాయం - 8 , శ్లోకాలు - 21)*

## ◆ భస్మధారణ - శిరోవ్రతం ◆

నారదా ! భస్మధారణకే శిరోవ్రతమని పేరు. దీన్ని ఆచరించినవారికే పరావిద్యకు అధికారం. విధివిధానంలో శ్రద్ధగా ఈ శిరోవ్రతాన్ని ఆచరించాలి. దీన్ని ఆచరించకుండా శ్రౌతస్మార్త సమాచారం ఎంత తెలుసుకున్నా అనుపకారకమే. శిరోవ్రతాచరణం వల్లనే బ్రహ్మాదులు దేవతలు కాగలిగారు. దీని మాహాత్మ్యాన్ని త్రిమూర్తులుకూడా పూర్తిగా వర్ణించి చెప్పలేరు. అధర్వణవేదంలో శిఖరాయమాణంగా చెప్పబడ్డ గొప్ప వ్రతమిది. ఇంతకన్నా గొప్ప వ్రతం మరొకటి లేదంటే లేదు. శాఖాభేదాలనుబట్టి ఈ వ్రతానికి చాలా పేర్లున్నాయి. పేరులూ దారులూ వేరైనా వస్తువు ఒక్కటే. శివాఖ్యం. సత్యచిద్ఘనం. కనక దీన్ని అందరూ ఆచరించాలి. ఎన్ని శాస్త్రాలూ ఎన్ని విద్యలూ నేర్చినా శిరోవ్రత విహీనుడైనట్టయితే అతడు సర్వధర్మ విహీనుడికిందే లెక్క. ఇది పాపకాంతారదాహకం. సర్వవిద్యాసాధకం. నిత్యమూ ఆచరించాలని అధర్వణశ్రుతి స్పష్టంగా చెబుతోంది.

అగ్నిరిత్యాది మంత్రాలు ఆరింటితో శుద్ధిచేసిన భస్మాన్ని శరీరంలో సర్వాంగాలకూ నిండా పులుముకోవాలి. సంగ్రహంగా శిరోవ్రతమంటే ఇదే.

అగ్నిరిత్యాదిభిర్మంత్రైః షడ్భిః శుద్ధేన భస్మనా ।
సర్వాంగోద్ధూళనం కుర్యాత్ శిరోవ్రతసమాహ్వయమ్ ॥ (9 - 12)

సంధ్యాసమయాల్లో విద్యారంభాల్లో తప్పకుండా చెయ్యాలి. పన్నెండు రోజులనుంచి పన్నెండేళ్ళవరకూ ఎంతకాలమైనా ఈ వ్రతాన్ని సంకల్పించుకోవచ్చు. కనిష్ఠ - గరిష్ఠ పరిమితులుమాత్రం అవ్వి. శిరోవ్రతస్నాతుడికి విద్యలనుగానీ మంత్రాలనుగానీ ఉపదేశించనివాడు ఆ విద్యల్ని కోల్పోతాడు. గురుశబ్దానికి అనర్హుడవుతాడు.



బ్రహ్మవిద్యాగురువంటే సాక్షాత్తూ పరమేశ్వరుడు. మునీశ్వరుడు. పరమదయామయుడై ఉండాలి గదా ! వేనవేల జన్మల్లో ధర్మాచరణం చేసినవారికిగానీ బ్రహ్మవిద్యపట్ల శ్రద్ధకలగదు. కోరిక పుట్టదు. అందుచేత శిరోవ్రతం అనుష్ఠించి బ్రహ్మవిద్యను అభ్యర్థించినవారిని ఏ గురువూ తిరస్కరించకూడదు. ద్వేషించకూడదు. ద్వేషం ఎప్పుడూ అజ్ఞానసంభవమే. అతడికి ఆత్మజ్ఞానం లేదని అర్థం. ఇది గురుశిష్యులిద్దరికీ వర్తించేమాట.

ప్రత్యుతాజ్ఞానబాహుళ్యాత్ ద్వేష ఏవ విజాయతే ।
అతః ప్రద్వేషయుక్తస్య న భవేదాత్మవేదనమ్ ॥ (9 - 18)

శిరోవ్రతస్నాతులే బ్రహ్మవిద్యోపదేశానికి సాక్షాదధికారులు. మరింకెవ్వరూ కారు. ఈ వ్రతంతో అంతర్గతమైన పశుత్వాన్ని వదిలించుకోవాలి. పాశుపతుడు కావాలి. అటువంటివారికే బ్రహ్మవిద్యను ఉపదేశించాలని వేదానుశాసనం.

సతారమైన త్రియంబకమంత్రాన్ని జపిస్తూ త్రిపుండ్రాలుగా భస్మధారణ చేస్తే సరిపోతుందని జాబాలుల మతం. గృహస్థులు ఇలా చేస్తే చాలుననీ ఓంకారయుక్తంగా హంసమంత్రాన్ని ముమ్మారు ఉచ్చరిస్తూ త్రిపుండ్రాలను నిత్యమూ ధరించడం భిక్షుకులకు కర్తవ్యమనీ జాబాలికీశ్రుతి చెబుతోంది. సప్రణవమూ సశివమూ అయిన త్రియంబకమంత్రంతోనే గృహస్థులేకాదు వానప్రస్థులూ త్రిపుండ్రాలుగా భస్మధారణ చెయ్యాలి. మేధావీత్యాది మంత్రంతోకూడా బ్రహ్మచారి తడిపిన భస్మాన్ని త్రిపుండ్రాలుగా ధరించవచ్చు. ఏమైనా బ్రాహ్మణుడికి నొసట నిత్యమూ భస్మావగుంఠనం ఉండాలి. అప్పుడే బ్రాహ్మణుడనిపించుకుంటాడు.

సన్యాసాశ్రమం స్వీకరించినవారు సతారమైన త్రియంబకమంత్రంతోగానీ పంచాక్షరితోగానీ ప్రణవంతోగానీ నొసటా హృదయంమీదా బాహువులపైనా విభూతిని త్రిపుండ్రాలుగా ధరించాలి. బ్రహ్మచారులు మేధావీత్యాది మంత్రంతోగానీ త్రియాయుష మంత్రంతోగానీ ధరించాలి. గౌణభస్మమైనా ధరించవచ్చు. శూద్రులు శివాయనమః అనే మంత్రంతో త్రిపుండ్రాలను ధరించాలి. మిగిలినవారికి ఏ మంత్రమూ అవసరంలేదు. భక్తితో భస్మోద్ధూళనం చేసుకుంటే చాలు. విభూతిధారణచేస్తే సమస్తవిభూతులూ (ఐశ్వర్యాలూ) కలుగుతాయి. ఇది సర్వధర్మాలలోకీ వరేణ్యం. కనక నిత్యమూ ఆచరించాలి.

అగ్నిహోత్రంనుంచిగానీ విరజామంత్రహోమాగ్నినుంచిగానీ ఆవిర్భవించిన భస్మాన్ని ఒక శుభ్రమైన పాత్రలోకి తీసుకోవాలి. కాళ్ళూ చేతులూ కడుక్కొని రెండుసార్లు ఆచమించి సమాహితచిత్తంతో పంచబ్రహ్మ మంత్రాలను చదువుతూ భస్మాన్ని మెల్లమెల్లగా కలపాలి. (ఈ మంత్రాలతోనే భస్మాన్ని పాత్రలోకి తియ్యాలని కొందరు) ముమ్మారు ప్రాణాయామంచేసి అగ్నిరిత్యాది మంత్రాలు ఏడింటితో మూడుసార్లు అభిమంత్రించాలి. ఓమాపోజ్యోతిరిత్యాది మంత్రాలను పఠిస్తూ ఆ తెల్లని విభూతిని శరీరంమీద శీర్షాదిపాదపర్యంతం జల్లుకోవాలి. ఇలా చేసినవాడు విపాపుడూ విరజుడూ అవుతాడనడంలో ఏ



సందేహమూ లేదు. అటుపైని జలాధిపుడైన జగన్నాథుణ్ణి శ్రీమహావిష్ణువును ధ్యానించి విభూతిలో నీటిచుక్కలు వేసి అగ్నిరిత్యాది మంత్రాలను మళ్ళీ పఠిస్తూ తడపాలి. అప్పుడు పార్వతీపరమేశ్వరులను ధ్యానిస్తూ బ్రహ్మచర్యాది ఆశ్రమాలకు నిర్దిష్టమైన ఆయా మంత్రాలను పఠిస్తూ ముందు శిరస్సున ధరించి, నొసటా హృదయానా బాహువులపైనా త్రిపుండ్రరేఖలుగా ధరించాలి. మధ్యమానామికాంగుష్ఠాలతో అనులోమ విలోమ మార్గాల్లో - త్రిసంధ్యల్లోనూ నిత్యమూ - భస్మత్రిపుండ్ర ధారణ చెయ్యాలి.

*(అధ్యాయం - 9, శ్లోకాలు - 43)*

**మధ్యమానామికాంగుష్ఠై రనులోమ విలోమతః ।**
**త్రిపుండ్రం ధారయేన్నిత్యం త్రికాలేష్వపి భక్తితః ॥ (9 - 43)**

నారదా ! అజ్ఞానధ్వంసకమూ జ్ఞానసాధకమూ అయిన ఈ విభూతి ఆగ్నేయమనీ గౌణమనీ రెండువిధాలు. ఇందులో మళ్ళీ గౌణం చాలా రకాలు. అగ్నిహోత్రభస్మం, విరజానలభస్మం, ఔపాసనభస్మం, సమిదగ్నిభస్మం, పచవాగ్నిభస్మం, దావానలభస్మం - ఇవన్నీ గౌణాలు. బ్రాహ్మణ క్షత్రియవైశ్యులకు అగ్నిహోత్ర భస్మంగానీ విరజానలభస్మంగానీ ధరించదగినవి. ఔపాసనాగ్నిభస్మాన్ని గృహస్థులకు విశేషంగా చెప్పారు. బ్రహ్మచారులు సమిదగ్నిభస్మం ధరించాలి. శూద్రులు శ్రోత్రియుల ఇళ్ళనుంచి పచనాగ్నిభస్మం తెచ్చుకుని ధరించాలి. తక్కినవారందరూ దావానలభస్మాన్ని ధరించాలి.

ఇంక శిరోవ్రతదీక్షావిధానమేమంటే - పూర్ణిమాతిథి మంచిది. స్వగృహంలోగానీ ఆరామంలోగానీ అరణ్యంలోగానీ దీక్ష తీసుకోవచ్చు. ఇవి ప్రశస్తాలు. శుభప్రదాలు. పూర్ణిమకు ముందటి త్రయోదశినాడు సుస్నాతుడై అగ్నికార్యం నిర్వర్తించి గురువును పూజించి పాదాభివందనం చేసి అనుమతి పొందాలి. అటుపైని వైశేషికపూజ నిర్వహించి పరిశుభ్రమైన తెల్లని వస్త్రాలు ధరించాలి. కొత్త యజ్ఞోపవీతం వేసుకోవాలి. తెల్లనిపూలు దండగుచ్చి ధరించాలి. మంచిగంధం అలంకరించుకోవాలి. దర్భాసనంమీద దర్భలు చేతబట్టి కూర్చోవాలి. తూర్పుముఖంగాగానీ ఉత్తరముఖంగాగానీ కూర్చుని ముమ్మారు ప్రాణాయామం చెయ్యాలి. పార్వతీపరమేశ్వరులను ధ్యానించి వారికి విన్నపం చేసుకోవాలి. నేను ఈ వ్రతం చేస్తున్నాను అని సంకల్పం చెప్పుకోవాలి. అప్పటికి వ్రతదీక్షితుడైనట్టు లెక్క. ఈ శిరోవ్రతం జన్మాంతంవరకూగానీ, పన్నెండేళ్ళపాటుగానీ ఆరేళ్ళపాటుగానీ మూడేళ్ళపాటు గానీ ఏణ్ణర్థంగానీ ఏడాదిగానీ ఆరునెలలుగానీ మూడునెలలుగానీ నెలనాళ్ళేగానీ పన్నెండురోజులేగానీ ఆరురోజులేగానీ మూడునాళ్ళేగానీ అధమపక్షం ఒకరోజుగానీ చెయ్యవచ్చు. ఓపికను బట్టీ వీలునిబట్టీ సంకల్పావధిని నియమించుకోవచ్చు. విరజాహోమం చేసే అగ్నిని తెచ్చి ఆజ్యంతో సమిధలతో చరువుతో యథావిధిగా మంత్రయుక్తంగా హోమం చెయ్యాలి.



దీక్ష తీసుకునే రోజుకి ముందుగానే (పూతాహాత్పురత: 10-15) భూతశుద్ధిని ఆకాంక్షించి మళ్ళీ సమిధలతో ఆజ్యంతో మంత్రాలతో హోమం చెయ్యాలి. నా దేహంలో ఈ తత్త్వాలు శుద్ధిపొందుగాక అని స్మరిస్తూ హోమక్రియ సాగించాలి. పంచభూతాలూ పంచతన్మాత్రలూ పంచకర్మేంద్రియాలూ పంచజ్ఞానేంద్రియాలూ పంచప్రాణవాయువులూ సప్తధాతువులూ సత్త్వరజస్తమోగుణాలూ మనోబుద్ధ్యహంకారాలూ ప్రకృతిపురుషులూ రాగమూ విద్య కళ నియతి కాలమూ మాయ శుద్ధవిద్య మహేశ్వరసదాశివులూ శక్తి శివతత్త్వమూ - వీటిని తత్త్వాలు అంటారు. వీటి శుద్ధిని ఆకాంక్షించి విరజామంత్రాలతో హోమంచేస్తే మానవుడు శుద్ధిపొంది విరజుడు అవుతాడు.

అటుపైని ఆవుపేడ తెచ్చి ముద్దలు చేసి అభిమంత్రించాలి. హోమాగ్నికుండంలో వేల్చి రోజంతా సంరక్షించాలి. హవిష్యంమాత్రమే భుజించి అగ్నికుండాన్ని చూసుకుంటూ ఉండాలి. చతుర్దశీ సుప్రభాతాన హోమక్రియలన్నీ యథావిధిగా నడిపి ఆ రోజంతా ఉపవాసం ఉండాలి. నిరాహారుడుగా గడపాలి. పూర్ణిమనాడు ప్రాతఃకాలంలో మళ్ళీ యథావిధిగా హోమం చెయ్యాలి. హోమాంతంలో రుద్రాగ్నిని ఉపసంహరించాలి. హోమకుండంనుంచి శ్రద్ధగా పద్ధతిగా భస్మం తీసుకోవాలి. అప్పుడు ముండితుడో జటిలుడో శిఖావంతుడో అయ్యి స్నానం చెయ్యాలి. సిగ్గుపడనివాడైతే దిగంబరంగానూ, సిగ్గుపడేవాడైతే కాషాయాంబర చర్మాంబర వల్కలాలలో ఏదో ఒకటి కట్టుకోవాలి. ఏకాంబరుడే కావాలి. మొలనూలు చుట్టుకోవాలి. దండం పట్టుకోవాలి. కాళ్ళు కడుక్కుని రెండుసార్లు ఆచమించి ఆత్మనూ శరీరాన్నీ సంకలీకరించి విరజానలసంభవమైన ఆ భస్మాన్ని అగ్నిరిత్యాదికమైన అథర్వణమంత్రాలను ఆరింటినీ చదువుతూ మూర్ధాదిచరణాంతంగా అన్ని అవయవాలకూ పులుముకోవాలి. అదే క్రమంలో భస్మంతో సముద్ధూళనం చేసుకోవాలి. ప్రణవాన్నీ శివనామాన్నీ జపిస్తూ ఈ పని చెయ్యాలి. ఆ తరవాత త్రియాయుషమంత్రంతో త్రిపుండ్రాలు ధరించాలి. శివభావాన్ని పొంది శివభావాన్ని ఆచరించాలి. అనునిత్యమూ ముప్పొద్దులా ఇలా చేస్తే అది పాశుపతవ్రతమవుతుంది. ఇది పశుత్వాన్ని తొలగించడంతోపాటు భుక్తిముక్తిప్రదమవుతుంది. ఇలా పాశుపతవ్రతంచేసి పశుత్వాన్ని తొలగించుకున్న మహానుభావుడు సాక్షాత్తూ మహాదేవుడూ లింగమూర్తి సదాశివుడుగా పూజనీయుడు అవుతాడు.

తత్పశుత్వం పరిత్యజ్య కృత్వా పాశుపతం వ్రతమ్ ।
పూజనీయో మహాదేవో లింగమూర్తి స్సదాశివః ॥ (10 - 30)

నారదా ! భస్మస్నానంవల్ల కలిగే మహాపుణ్యం సర్వసౌఖ్యకరం. ఆయురారోగ్యభోగభాగ్యబల పుష్టివర్ధనం. రక్షణకోసం మంగళార్థం సర్వసంపత్సమృద్ధికోసం మృత్యుభయ మహామారీభయ నివారణకోసం మనుష్యులు ఈ భస్మస్నానం చెయ్యాలి. *(అధ్యాయం - 10, శ్లోకాలు - 33)*



## ◆ భస్మ భేదాలు ◆

విరించిపుత్రా ! శాంతిక పౌష్టిక కామదభేదాలతో ఈ భస్మం మూడు విధాలు. ఇది నీకు కుతూహలం కలిగించే విషయం. కనక వివరంగా చెబుతాను, ఆలకించు.

గోమయమంటే పరమపావనంకదా ! మహాపాపక్షయకరమూ మహాకీర్తికరమూకదా! ఆ గోమయాన్ని - ఆవుతోక కిందభాగం నుంచి ఇవతలికి వచ్చీరాకుండానే - చేతితోనే స్వీకరించి యథావిధిగా బ్రాహ్మమంత్రాలతో (వేదమంత్రాలతో) హోమం చెయ్యగా సిద్ధించిన భస్మాన్ని శాంతికం అంటారు. గోమయాన్ని సావధానచిత్తుడై గ్రహించాలి. కిందపడకుండా మధ్యలోనే పట్టుకుని షడక్షరీమంత్రంతో హోమంచేస్తే సిద్ధించే విభూతిని పౌష్టికమంటారు. దాన్నే ప్రాసాదజపంతో (బీజాక్షరాలతో) హోమంచేస్తే వచ్చే భస్మాన్ని కామదమంటారు.

భస్మవ్రతపరుడు తెల్లవారుజామునే లేచి శుచియై గోశాలకు వెళ్ళి ఆవులకు నమస్కరించాలి. బ్రాహ్మణుడైతే తెల్ల ఆవుదీ, క్షత్రియుడైతే ఎర్ర ఆవుదీ, వైశ్యుడు పసుపురంగులో ఉన్న ఆవుదీ, శూద్రుడైతే కర్రిఆవుదీ పేడను తెచ్చుకోవాలి. పూర్ణిమనాడుగానీ అమావాస్యనాడుగానీ అష్టమినాడుగానీ చిత్తశుద్ధితో ఈ పని చెయ్యాలి. తెచ్చాక ఆయా నిర్దిష్ట మంత్రాలు చదువుతూ చిట్టుగానీ పొట్టుగానీ (తుషేణ వా బుసైర్వాపి) కలుపుతూ ముద్దలు చేసి (చరిచి) శుచిప్రదేశంలో ఎండబెట్టాలి. అరణిని మథించి చేసిన అగ్నిగానీ శ్రోత్రియుల ఇంటినుంచి తెచ్చిన అగ్నిగానీ మంత్రపూర్వకంగా హోమకుండంలో వేసి ఈ పిడకలను పూర్వోక్త విధివిధానంగా హోమం చెయ్యాలి. అటుపైని కొత్తపాత్రను తెచ్చి ప్రాసాదమంత్ర పూర్వకంగా అందులోకి నింపాలి. చందన కాశ్మీరాది సుగంధద్రవ్యాలను కలపాలి. ఆ పాత్రను భద్రపరచుకోవాలి.

నిత్యమూ ముందుగా జలస్నానం చేసి తరవాత భస్మస్నానం చెయ్యాలి. జలస్నానానికి అశక్తుడైతే హస్తపాద ప్రక్షాళనం చేసుకుని ఈశానమంత్రంతో శిరస్సున చిలకరించుకోవాలి. తత్పురుషమంత్రంతో ముఖాన, అఘోరమంత్రంతో హృదయభాగాన, వామమంత్రంతో నాభిదేశాన, సద్యోమంత్రంతో సర్వాంగాలకూ విభూతి పెట్టుకోవాలి. దీన్ని భస్మస్నానం అంటారు. తరవాత పూర్వవస్త్రాన్ని విడిచి శుద్ధవస్త్రాన్ని ధరించాలి. హస్తపాదాలను మళ్ళీ కడుక్కొని ఆచమనం చెయ్యాలి. ఈ భస్మస్నానం కూడా చెయ్యలేనివారు త్రిపుండ్రధారణ చేస్తే చాలు. మధ్యాహ్నానికి ముందయితే విభూతిని తడిపి ధరించాలి. అటుపైని ఎవరైనాగానీ పొడిదే అలదుకోవాలి. తర్జన్యనామికామధ్యాంగుళులతో (బొటనవేలూ చిటికెనవేలూ కాక మిగిలిన మూడు వేళ్ళతో) త్రిపుండ్రంగా విభూతిని పెట్టుకోవాలి.



మధ్యాహ్నాత్ ప్రాక్ జలైర్యుక్తం పరతో జలవర్జితమ్ ।
తర్జన్యనామికామధ్యైః త్రిపుండ్రం చ సమాచరేత్ ॥ (11 - 19)

శిరస్సు లలాటం చెవులు కంఠం హృదయం బాహువులు - ఇవ్వి భస్మన్యాసానికి తావులని చెబుతారు. ప్రాసాదమంత్రం జపిస్తూ అయిదువేళ్ళతోనూ శిరస్సున జల్లుకోవాలి. శిరోమంత్రం పఠిస్తూ మూడువేళ్ళతో ఫాలభాగాన దిద్దుకోవాలి. సద్యోమంత్రంతో కుడిచెవికీ వామదేవమంత్రంతో ఎడమచెవికీ భస్మం అద్దాలి. అఘోరమంత్రం ధ్యానిస్తూ మధ్యవేలుతో కంఠంమీద, హృదయమంత్రాన్నే జపిస్తూ మూడువేళ్ళతోనూ హృదయంమీద, అలాగే మూడువేళ్ళతోనే శిఖామంత్రంతో దక్షిణబాహువుకీ, కవచ పఠనంతో వామబాహువుకీ విభూతిని అలంకరించాలి. ఈశానమంత్రం అంటూ మధ్యవేలితో నాభికి విభూతిని సోకించాలి. ఇదంతా తనకు తాను చేసుకోవచ్చు. లేదా గురువు శిష్యుడికి చెయ్యవచ్చు.

నొసట ధరించే త్రిపుండ్రాలు త్రిమూర్తులకు ప్రతీకలు. మొదటిరేఖ బ్రహ్మ. మధ్యలోది విష్ణువు. ఆపైది మహేశ్వరుడు. ఒక్కవేలుతోనే పెట్టుకున్న విభూతి చుక్కకు ఈశ్వరుడే అధిదేవత.

బ్రహ్మవిష్ణు మహేశానస్తిస్రో రేఖా ఇతి స్మృతాః ।
ఆద్యో బ్రహ్మ తతో విష్ణుస్తదూర్ధ్వంతు మహేశ్వరః ॥ (11 - 25)
ఏకాంగుళేన వ్యస్తం యదీశ్వరస్తత్ర దేవతా ।

నారదా ! శిరోమధ్యంలో బ్రహ్మదేవుడూ, లలాటంలో శివుడూ చెవులకు అశ్వినీదేవతలూ కంఠస్థానంలో గణేశుడూ విభూతికి అధిష్ఠానదేవతలు. క్షత్రియ వైశ్య శూద్రులకు భస్మధారణమే తప్ప భస్మోద్ధూళనం పనికిరాదు. తక్కిన జాతులవారు అందరూ అమంత్రకంగా విభూతి పెట్టుకోవచ్చు.

*(అధ్యాయం - 11, శ్లోకాలు - 27)*

బ్రహ్మనందనా ! అతిగోప్యమయినప్పటికీ సర్వకామఫలప్రదం కనక భస్మోద్ధూళనఫలం ఏమిటో నీకు ఉపదేశిస్తున్నాను, శ్రద్ధగా గ్రహించు.

## ◆ భస్మోద్ధూళనం ◆

కపిలగోవు పేడను నేలమీద పడకముందే పట్టుకోవాలి. ఒకవేళ నేలమీద పడిపోతే కడికి పైపేడనూ కిందపేడనూ వదిలేసి మధ్యలోది స్వీకరించాలి. అది దుర్గంధంతో ఉన్నా పుర్రుగా ఉన్నా మరీ గట్టిగా ఉన్నా పనికిరాదు. పట్టినపేడను ఇంటికి తెచ్చి చిట్టో పొట్టో కలిపి ముద్దలు చేసి ఎండబెట్టాలి. ఇదంతా



ఆయా మంత్రాలతోనే చెయ్యాలి. హోమం చేసేటప్పుడూ భస్మం తీసేటప్పుడూ నియత మంత్రాలు పఠించాలి. నియమాలు శ్రద్ధగా పాటించాలి. కడిగి శుద్ధి చేసి తడిఆర్చిన గట్టిపాత్రలోకి కచికలు తీసి పరిశుభ్రవస్త్రం కప్పాలి. సమంత్రకంగా పరిమళద్రవ్యాలు కలపాలి. మంత్రయుక్తంగా పరిశుభ్రస్థలంలో భద్రపరచుకోవాలి. వెండి బంగారు కర్ర మట్టిపాత్రలు ఏవైనా పనికివస్తాయి. అందంగా శుభ్రంగా దృఢంగా ఉంటే చాలు. ధనవంతులైతే బంగారు పాత్రల్లోనే ఉంచుకోవచ్చు.

ప్రయాణాలకు వెళ్ళేటప్పుడు విభూతిని స్వయంగా తీసుకువెళ్ళాలి. అనుచరులతోనైనా తెప్పించుకోవచ్చు. కానీ అశుచి చేతికి భస్మపాత్రను ఇవ్వకూడదు. అశుచి స్థలంలో ఉంచకూడదు. శరీరంలో నీచాంగాలకు తాకించకూడదు. పాత్రను విసరడం ఎగరవెయ్యడం దాటడం - ఇలాంటివి చెయ్యకూడదు. భక్తిశ్రద్ధలతో సమంత్రకంగా విభూతిని తయారుచేసుకోవాలి, రక్షించుకోవాలి, ధరించుకోవాలి. ఇది స్మృతులు చెప్పిన విభూతిధారణ విధానం. యథాతథంగా ఆచరించినవాడు శివుడితో సమానమవుతాడు.

శైవులు శివాలయాలలో సిద్ధం చేసుకున్న విభూతిని వైదికులు అడిగి తెచ్చుకోవచ్చు. భస్మాన్నేకాదు ఇచ్చిన వారినీ గౌరవించి పూజించాలి. తాంత్రికులు తంత్రమార్గంలో విభూతిని తయారుచేసుకొంటారు. ఒక వేళ ఎప్పుడైనా ఎక్కడైనా వాళ్ళు దాన్ని ఇవ్వజూపితే వైదికులు స్వీకరించకూడదు.

తంత్రోక్తవర్త్మనా సిద్ధం భస్మ తాంత్రికపూర్వకైః ।
యత్ర కుత్రాపి దత్తం చేత్ గ్రాహ్యం నైవ వైదికైః ॥ (12 - 11)

కానీ శూద్ర కాపాలిక పాషండాదులు ఇస్తే తీసుకోవచ్చు. ధరించవచ్చు. విభూతిని ఏనాడూ ఎవ్వరూ ఎట్టిపరిస్థితుల్లోనూ తిరస్కరించకూడదు. కించపరచకూడదు. అసలు అటువంటి ఊహలే రాకూడదు. కించపరిచినా విభూతిధారణను విడిచిపుచ్చినా పతితుడవుతాడు. త్రిపుండ్రధారణమూ దేహావగుంఠనమూ భక్తిశ్రద్ధలతో మంత్రపూర్వకంగా రోజూ ముప్పొద్దులా చేసుకోవాలి. లేకపోతే మోక్షం లేదు. కోటిజన్మలెత్తినా భవబంధ విమోచనం కలగదు. విభూతి ధరించనివాడి జన్మ నిష్ఫలం. మరుసటి జన్మలో పందిగా పుడతాడు. త్రిపుండ్రాలంకరణ లేని మానవ శరీరం శ్మశానసదృశం. పుణ్యాత్ములు వాడిని చూడనేకూడదు. విభూతి లేని ఫాలమూ, శివాలయం లేని గ్రామమూ, ఈశ్వరార్చన లేని జన్మమూ, శివాశ్రయం కాని చదువూ (విద్య) పరమనింద్యాలు.

యేషాం వపుర్మనుష్యాణాం త్రిపుండ్రేణ వినాస్థితమ్ ।
శ్మశానసదృశం తస్మాన్న ప్రేక్ష్యం పుణ్యకృజ్జనైః ॥



ధిగ్ భస్మరహితం ఫాలం ధిగ్గ్రామమశివాలయమ్ ।
ధిగనీశార్చనం జన్మ ధిగ్విద్యామశివాశ్రయామ్ ॥ (12 - 18)

విభూతిని నిందిస్తున్నాడంటే శివుణ్ణి నిందిస్తున్నట్టే. ధరిస్తున్నాడంటే శివుణ్ణి ధరిస్తున్నట్టే. వస్తు సామగ్రి ఎంత పుష్కలంగా ఉన్నా సాధనసంపత్తి ఎంత అధికంగా ఉన్నా విభూతిలేని శివార్చన (అగ్ని లేని పర్వతంలా ?) శోభించదుగాక శోభించదు. ఉద్ధూళన త్రిపుండ్రధారణలు శ్రద్ధగా ఆచరించనివారికి పూర్వజన్మ సంచితపుణ్యాలన్నీ నశిస్తాయి. స్మార్తులు వేదోచితాచారాలను పాటిస్తూ వేదమంత్రాలతోనే త్రిపుండ్రధారణ చెయ్యాలి. లేనినాడు అనర్థదాయకమవుతుంది. విభూతి పెట్టుకోనివాడు ఏ మంచిపని చేసినా అది చెయ్యనట్టే, ఏ పవిత్ర విషయం విన్నా అది విననట్టే, ఏ గొప్పవిద్య నేర్చినా అది నేర్వనట్టే. అతడి వేదాలూ యజ్ఞాలూ దానాలూ తపస్సులూ వ్రతాలూ పూజలూ ఉపవాసాలూ అన్నీ వృథా వృథా - భస్మధారణ చెయ్యకుండా ముక్తి కావాలని కోరుకోవడం విషం తాగినా బ్రతకాలనుకోవడం.

భస్మధారణకం త్యక్త్వా ముక్తిమిచ్ఛతి యః పుమాన్ ।
విషపానేన నిత్యత్వం కురుతేహ్యాత్మనో హి సః ॥ (12 - 25)

అసలు, సృష్టికర్త నొసలును సృష్టించడమే త్రిపుండ్రధారణకోసం. అందుకే అడ్డంగా విశాలంగా సృష్టించాడు. లేకపోతే గుండ్రంగానే సృష్టించి ఉండేవాడు. అదీగాక సహజసిద్ధంగానే నొసట అడ్డగీతలు ఉంటాయి. ఆవంకన నిత్యమూ జ్ఞాపకం చేస్తున్నాడు. అయినా విభూతి పెట్టుకోకపోతే పరమమూర్ఖులు గాక మరేమిటి !

స్రష్టా సృష్టిచ్ఛలేనాహ త్రిపుండ్రస్య చ ధారణమ్ ।
ససర్జ స లలాటం హి తిర్యగూర్ధ్వం న వర్తులమ్ ॥
తిర్యగ్రేఖాః ప్రదృశ్యంతే లలాటే సర్వదేహినామ్ ।
తథాపి మానవా మూర్ఖా న కుర్వంతి త్రిపుండ్రకమ్ ॥ (12 - 28)

నొసట తిర్యగ్రేఖలుగా విభూతి పెట్టుకోని విప్రుడు చేసే ధ్యానం ధ్యానమే కాదు, జ్ఞానం జ్ఞానమే కాదు, మోక్షం మోక్షమేకాదు, తపస్సు తపస్సేకాదు. వేదాధ్యయనానికి శూద్రుడు అధికారి కానట్టే త్రిపుండ్రధారణలేని విప్రుడు శివార్చనకు పనికిరాడు.

తూర్పుదిక్కుకి అభిముఖంగా నిలిచి కాళ్ళూ చేతులూ కడుక్కుని ఆచమించి ప్రాణాయామంచేసి సంకల్పం చెప్పుకుని భస్మస్నానం చెయ్యాలి. అగ్నిహోత్రంనుంచి పరిశుభ్రమైన విభూతిని తీసుకుని ఈశాన మంత్రంతో నెత్తిమీద జల్లుకోవాలి. పురుషమంత్రంతో నొసట దిద్దుకోవాలి. అఘోరమంత్రంతో హృదయం



మీదా వామ మంత్రంతో గుహ్యప్రదేశంలోనూ సద్యోజాతమంత్రంతో కాళ్ళమీదా ప్రణవోచ్చారణతో సర్వాంగాలకూ అలంకరించుకోవాలి. అటుపైని ఉద్ధూళనం చేసుకోవాలి. దీన్ని ఆగ్నేయక భస్మస్నానమంటారు. ఏ వైదికకర్మను ఆచరించాలన్నా ప్రారంభంలో ఇది చెయ్యాలి. తరవాత మళ్ళీ కాళ్ళూచేతులూ కడుక్కుని యథావిధిగా ఆచమించి లలాట హృదయ కంఠ ప్రదేశాలలో పంచబ్రహ్మమంత్రాలతో త్రిపుండ్రాలు ధరించాలి. అప్పటికి కర్మానుష్ఠానానికి కావలసిన పవిత్రత సిద్ధిస్తుంది. సత్కర్మలు ఫలిస్తాయి. లేకపోతే ఫలించవు. సత్య శౌచ జప హోమ తీర్థ దేవపూజాదులన్నీ వ్యర్థమే అవుతాయి. రుద్రాక్షలూ త్రిపుండ్రాలూ ధరించిన విప్రుడు దురిత - రోగ - దుర్భిక్ష - తస్కరభయాదుల్ని తొలగించగలుగుతాడు. అపునర్భవంగా బ్రహ్మత్వం పొందుతాడు. పంక్తి పావనుడు అవుతాడు. దేవవిప్ర పూజ్యుడవుతాడు. శ్రాద్ధ - యజ్ఞ - జప - హోమ - వైశ్వదేవ - సురార్చనల్లో విభూతిని ధరించినవాడు పూతాత్ముడు. మృత్యుంజయుడు. ***(అధ్యాయం - 12 , శ్లోకాలు - 42)***

## ◆ భస్మధారణ మహిమ ◆

నారదా ! ఈ భస్మధారణ మాహాత్మ్యం ఎంత చెప్పినా తరగదు. ఇంకా ఉంది. విను. ఇప్పటికి జాబితాలోకెక్కిన పాతకాలేకాక ఇంకా మహాపాపాలు ఏమైనా ఉంటే అవ్వికూడా నశిస్తాయి భస్మోద్ధూళన భస్మధారణలతో అనడం ముమ్మాటికీ సత్యం. ఇది యతీశ్వరులకు జ్ఞానాన్నీ, వానప్రస్థులకు విరక్తినీ, గృహస్థులకు ధర్మవృద్ధినీ, బ్రహ్మచారులకు స్వాధ్యాయశక్తినీ, శూద్రులకు పుణ్యాన్నీ, ఇతరులకు పాపక్షయాన్నీ అపారంగా కలిగిస్తుంది. సర్వభూతరక్షణకోసం విభూతిని ధరించాలనీ ఉద్ధూళన చేసుకోవాలనీ వేదం చెబుతోంది. ఇది యజ్ఞంతో అన్నివిధాలా సరిసమానమంటోంది. మాహేశ్వరులకు ఇది చిహ్నం, సర్వులకూ విజ్ఞానప్రదం అని పేర్కొంటోంది. బ్రహ్మవిష్ణుమహేశ్వరులూ వారి అంశావతారాలూ ఇంద్రాది దేవతలూ వరుణాది దిక్పాలకులూ సరస్వతీ లక్ష్మీ పార్వతులూ వారి అంశదేవీమూర్తులూ శచీప్రముఖ సకలదేవకాంతలూ యక్ష రాక్షస గంధర్వ సిద్ధ సాధ్య విద్యాధరాది సమస్తజాతులవారూ మునులూ ఋషులూ యోగులూ తపస్వులూ చతుర్వర్ణాలవారూ సంకరజాతులవారూ అపభ్రంశులూ - వారూ వీరూ అని తేడా లేకుండా అందరూ భస్మోద్ధూళన భస్మధారణలు చేసినవారే. చేస్తున్నవారే. చెయ్యవలసినవారే. శిష్టులు అంటే వీరే. ఇంకెవరూ కారు. ఒక్కమాటలో దీని మాహాత్మ్యం చెప్పాలంటే శివలింగంలాగా చింతామణిలాగా పంచాక్షరీ మంత్రంలాగా ఈ విభూతి అనేది మోక్షలక్ష్మిని వశీకరించుకునే దివ్యౌషధం.

విభూతిని ధరించివస్తే మూర్ఖుడా పండితుడా అనే ప్రశ్న లేదు. అతడికి భోజనం పెట్టాలి. అతడు భుజిస్తే పార్వతీపరమేశ్వరులు వచ్చి భుజించినట్టే.



భునక్తి యత్ర భస్మాంగో మూర్ఖో వా పండితోఽపి వా ।
తత్ర భుంక్తే మహాదేవః సపత్నీకో వృషధ్వజః ॥ (13 - 16)

భస్మధారిని అనుసరించినా స్తుతించినా శ్రద్ధగా సేవించినా పాపాలు తొలగిపోతాయి. పూజనీయుడవుతాడు. త్రిపుండ్రధారికి భిక్షవేస్తే సర్వవేదాలూ చదివినంత, సకలసత్కర్మలూ అనుష్ఠించినంత పుణ్యం వస్తుంది. నిత్యమూ శిరస్సున విభూతిని ధరించేవాడు అడవుల్లో ఉన్నా అరణ్యాల్లో ఉన్నా అది కాశీక్షేత్రమే. భస్మధారిలో మిగతా యోగ్యతలు పరిశీలనీయాలు కానేకాదు. అవగుణాలు ఎన్ని ఉన్నా పరిగణనీయాలు కానేకాదు. శివసంతతితో సమానుడు. పూజనీయుడు. ఒకవేళ దుశ్శీలుడయ్యుండి ఎదుటివారిని మోసగించడంకోసమనే విభూతి పెట్టుకున్నా ఒళ్ళంతా పులుముకున్నా అతడు ధన్యుడే. పావనుడే. నూరు యజ్ఞాలు చేసినవారు వెళ్ళే లోకాలకు తానూ వెడతాడు. అనుకోకుండా విభూతి వొంటికి తగిలినా క్రీడావినోదంగా ధరించినా భయపడి పెట్టుకున్నా అతడు శివుడితో సమానుడే. పూజనీయుడే. విభూతిధారణ ఏ కారణంగా ఎవరు ఎలా చేసినా ముగ్గురమ్మలకూ ముగ్గురయ్యలకూ తృప్తినీ ఆనందాన్నీ కలిగిస్తుంది. దాన యజ్ఞ తప స్తీర్థయాత్రలకు అందని పుణ్యం విభూతిధారణతో వచ్చి వొడిలో పడుతుంది. నిజం. అవి అందించే పుణ్యాలు ఈ పుణ్యంలో పదహారవవంతుకికూడా సాటిరావు. తన చిహ్నాలను ధరించిన ప్రజలను రాజుగారు ఎలా తనవాళ్ళని గుర్తిస్తాడో అలా శివుడు త్రిపుండ్రధారులను తనవాళ్ళుగా భావిస్తాడు. నిర్మలహృదయంతో విభూతిని ధరిస్తే సాక్షాత్తూ రుద్రుణ్ణి వశీకరించుకొన్నట్టే. మిగతా ఆచారాలూ అనుష్ఠానాలూ ఏమీ లేకపోయినా సరే నెన్నొసట విభూతితో అడ్డబొట్టు ఉంటేచాలు అతడు ముక్తిని పొందడం తథ్యం. కులమూ గోత్రమూ వ్రతమూ జ్ఞానమూ ఇత్యాదులతో పనిలేదు, పరీక్షా లేదు. నారదా ! శివమంత్రంకన్నా గొప్ప మంత్రం లేదు. శివుడికన్నా గొప్ప దైవం లేదు. శివార్చనకన్నా గొప్ప పుణ్యం లేదు. విభూతి కన్నా గొప్ప తీర్థం లేదు. రుద్రనేత్రాగ్నికన్నా గొప్ప తీర్థం ఈ విభూతి. సర్వదుఃఖవిధ్వంసకం. సర్వపాప విమోచకం. విభూతిధారి - ఎవడైనా అగుగాక - ఎక్కడ ఉంటే అక్కడ సర్వభూతగణ - సర్వతీర్థగణ పరివృతులై పార్వతీపరమేశ్వరులుంటారు. పంచాక్షరీ శివమంత్ర పరిపూతమైన ఈ విభూతిని, శివుడుకోరి అలంకరించుకునే ఈ భస్మాన్ని నెన్నుదుట త్రిపుండ్రాలుగా ధరిస్తే చాలు - అక్కడ బ్రహ్మదేవుడు రాసిన చెడురాతలన్నీ చెరిగిపోతాయి. *(అధ్యాయం - 13, శ్లోకాలు - 35)*

నారదా ! విభూతిని సర్వాంగాలకూ అలదుకొన్నవాడికి ధనం దానం చేస్తే ఆ దాత చేసుకున్న పాపాలన్నీ నశించిపోతాయి. శ్రుతులూ స్మృతులూ అఖిలపురాణాలూ విభూతి మహిమను ఎంతగానో కొనియాడుతున్నాయి. అంచేత అందరూ దీన్ని అలంకరించుకోవడం శ్రేయస్కరం. తెల్లని విభూతిని నుదట పెండెకట్టులుగా పెట్టుకుని మూడుపూటలా సంధ్యావార్చిన విప్రుడు శివలోకంలో శాశ్వతంగా



నివసిస్తాడు. యోగీశ్వరుడు ఆపాదతలమస్తకంగా త్రిసంధ్యల్లోనూ భస్మస్నానం చేస్తే చాలు అతడికి యోగసిద్ధి కల్గుతుంది. ఇది జలస్నానంకన్నా ఎన్నోరెట్లు గొప్పది. గృహస్థులకు వంశవర్ధకం. సర్వతీర్థాలలోనూ క్రుంకులాడిన పుణ్యఫలం ఒక భస్మస్నానంతో లభిస్తుంది. మహాపాతకాలూ ఉపపాతకాలూ అన్నీ మండుతున్న అగ్నిలో ఎండుకట్టెల్లాగా దహించుకుపోతాయి. భస్మస్నానానికి సాటివచ్చే స్నానమే లేదు. ఇలాగని శివుడే సాక్షాత్తుగా ప్రశంసించి తానూ స్వయంగా నిత్యమూ భస్మస్నానాన్ని చేస్తున్నాడు. అప్పటినుంచీ బ్రహ్మాదిదేవతలూ ఋషి ముని గణాలూ సకలసత్కర్మాచరణలకూ ఆరంభంలో పనిబూని భస్మస్నానం చేస్తున్నారు. అందుచేత ఈ ఆగ్నేయమైన భస్మస్నానాన్ని చేసినవారందరూ ఈ శరీరాలతోనే రుద్రులుగా పరిగణింపబడుతున్నారు. భస్మస్నాతులనూ భస్మధారులనూ సందర్శించినవారు సైతం దేవాసురమునీంద్రులచేత వంద్యులవుతున్నారు. దర్శించి గౌరవసూచకంగా లేచి నిలబడినవారికి దేవేంద్రుడంతటివాడు సాష్టాంగపడతాడు. భస్మధారులకు అభక్ష్యభక్షణాది దోషాలు ఏమీ అంటవు. అన్నీ హాయిగా ఆరగించవచ్చు. జలస్నానం చేసినా భస్మస్నానం కూడా చేస్తేనే బ్రహ్మచారులూ గృహస్థులూ వానప్రస్థులూ సర్వపాపవినిర్ముక్తులవుతారు. సద్గతి (ముక్తి) పొందుతారు. యతీశ్వరులకు ఈ ఆగ్నేయభస్మస్నానం మరీ విశేషంగా ఫలప్రదమవుతుంది.

## ◆ భస్మస్నానం ◆

ఆర్ద్రస్నానం కన్నా భస్మస్నానమే ఉత్తమోత్తమం. ఎందుకంటే ఆర్ద్రత ఆరిపోతుంది. అదీగాక ఆర్ద్రస్నానం ప్రకృతిసిద్ధం. ప్రకృతి అంటే బంధనమేనని పెద్దలంటారు. కనక ప్రకృతిబంధవిమోచనంకోసం భస్మస్నానం చెయ్యాలి. సారాంశమేమంటే - ఆగ్నేయస్నానానికి సాటివచ్చేది ఈ ముల్లోకాలలోనూ మరొకటి లేదు. అందుచేతనే సకలదేవతలూ రక్షణకోరి పవిత్రతకోరి మంగళంకోరి ఈ విభూతిని ఆదిపరాశక్తికి ప్రేమతో కానుకగా అందించారు. అంతటి పవిత్రమైన ఈ ఆగ్నేయస్నానం అశీతివాత రోగాలనూ చతుష్షష్టిపిత్తరోగాలనూ సప్తత్రిపంచక శ్లేష్మరోగాలనూ వ్యాఘ్ర చోర దుష్టగ్రహ భయాలనూ తక్షణం తొలగిస్తుంది. సందేహం లేదు. సింహం చేతిలో ఏనుగుల్లాగా ఇవి మడిసిపోతాయి.

శీతలోదకాలతో స్నానంచేసి విభూతిని నెన్నొసట త్రిరేఖలుగా ధరించినవాడు పరబ్రహ్మను చేరుకుంటాడనడంలో సందేహం లేదు. భస్మస్నానంకూడా చేస్తే బ్రహ్మలోకంలో శాశ్వతంగా ఉండిపోతాడు అనడంలో అంతకన్నా సందేహం లేదు. లలాటలిఖితమైన బ్రహ్మరాతలలో పనికిరానివాటినీ హానికరమైనవాటినీ తుడిచివేసే శక్తి త్రిపుండ్రాలకుమాత్రమే ఉంది. ఆ బ్రహ్మకుకూడా లేని శక్తి ఇది. ఏ అవయవాన విభూతి పెట్టుకుంటే ఆ అవయవం చేసిన పాపాలన్నీ తొలగిపోతాయి. గుండెలపై దాలిస్తే మనస్సు చేసే పాపాలు బొడ్డున ధరిస్తే మర్మాంగం చేసిన పాపాలూ అంతరిస్తాయి. కుడియెడమ



పార్శ్వభాగాలలో ధరిస్తే పరకాంతాలింగనాది దోషాలు నశిస్తాయి. అందుచేత శరీరంలో ఎక్కడ దాల్చినా శ్రేయస్కరమే. మూడురేఖలుగా ధరిస్తే త్రిమూర్తులనూ ధరించినట్టే. త్రిగుణాలనూ ధరించినట్టే. త్రిలోకాలనూ ధరించినట్టే. ఒళ్ళంతా బూడిద పులుముకున్నవాడు సర్వపాపవిముక్తుడై సరాసరి మోక్షం పొందుతాడు. ఇతడినే ఆత్మనిష్ఠుడంటారు. భస్మదిగ్ధసర్వాంగుడూ భస్మదీప్త త్రిపుండ్రకుడూ భస్మశాయి అయిన పురుషుణ్ణి భస్మనిష్ఠుడు అంటారు. భూత ప్రేత పిశాచోరగాదులూ దుస్సహరోగాలూ భస్మనిష్ఠుణ్ణి చూస్తే పదిఆమడల దూరం పారిపోతాయి.

భాసిస్తుందికనక భసితమనీ, కల్మషాలను భక్షిస్తుంది కనక భస్మమనీ, విభూతిని (ఐశ్వర్యం) కలిగిస్తుంది కనక భూతి అనీ, రక్షిస్తుంది కనక రక్ష అనీ దీనికి పేర్లు ఏర్పడ్డాయి.

భాసనాద్భసితం ప్రోక్తం భస్మ కల్మషభక్షణాత్ ।
భూతిర్భూతికరీ పుంసాం రక్షా రక్షాకరీ పురా ॥ (14 -33)

రుద్రుణ్ణి స్మరిస్తే పాపాలు నశించినట్టే త్రిపుండ్రాలను చూస్తే చాలు భూత ప్రేత పిశాచాలు పలాయనం చిత్తగిస్తాయి. అంతరిస్తాయి. అకృత్యాలు వెయ్యి చేసినా భస్మస్నానం చేస్తే అవన్నీ అగ్నిలో అడవిలా మాడిపోతాయి. కనీసం ప్రాణావసానదశలో అగ్నిస్నానం చేసినా పాపాలు తొలగి పుణ్యలోకాలు చేరుకుంటాడు. నిత్యమూ చేసేవాడు జితక్రోధుడై జితేంద్రియుడై శివసన్నిధికి వెడతాడు. అతడికింక పునర్జన్మ ఉండదు. పున్నమినాడు భస్మోద్ధూళితశరీరుడై శంకరార్చన చేసినా చూసినా ముక్తీ పాపవిముక్తీ తప్పవు. ఆయుర్దాయం కావాలన్నా విద్య కావలన్నా కడకు మోక్షమే కావాలన్నా భస్మధారణమొక్కటే శరణ్యం.

కేవలజలస్నానం శరీరంపైని ఉండే మలినాన్ని ప్రక్షాళన చేస్తుంది. విభూతిస్నానమో బాహ్యాభ్యన్తరమలినాలను తొలగిస్తుంది. అంతశ్శుద్ధీ బహిశ్శుద్ధీ రెండూ సిద్ధిస్తాయి. కనక జలస్నానం చెయ్యకపోయినా ఫరవాలేదుగానీ భస్మస్నానం చేసితీరాలి. ఇది లేనిదే పవిత్రత లేదు. కాబట్టి వైదికకర్మలకన్నింటికీ ముందు విధిగా ఇది చేసితీరాలి. మలమూత్ర విసర్జనలు చేసినప్పుడు శౌచవిధులన్నీ నిర్వర్తించాక భస్మస్నానం చేస్తేనే పరిపూర్ణశౌచం లభిస్తుంది. అపానవాయువు విడిచినప్పుడూ ఆవులించినప్పుడూ దగ్గినప్పుడూ తుమ్మినప్పుడూ శ్లేష్మాన్ని ఉమ్మినప్పుడు శుద్ధికోసం భస్మస్నానం చెయ్యాలి. ***(అధ్యాయం - 14, శ్లోకాలు - 57)***

నారదా ! భస్మస్నానమాహాత్మ్యం గురించి ఇప్పటికి ఒకవంతు మాత్రమే చెప్పాను. ఇంకా చాలా ఉంది. విను. బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకు ఉపనయనం ఉంది కనక వీరినే ద్విజులు అంటారు. ద్విజులందరూ తప్పకుండా శ్రౌతపద్ధతిలో విభూతి త్రిపుండ్రధారణ చెయ్యాలి. ఇది లేకుండా గాయత్రీమంత్రాన్ని ఉపదేశించడానికిగానీ స్వీకరించడానికిగానీ వీలులేదు. అధికారం లేదు. కనక



మరిచిపోకుండా విభూతిపెట్టుకునే గాయత్రీజపం చెయ్యాలి. విభూతి రేఖలే ద్విజత్వానికి చిహ్నాలు. రత్నాలూ మణులూ అలంకరించుకోవడంమీద ఎంత ప్రీతి సహజంగా ఉంటుందో, విభూతిని పెట్టుకోవడం మీదకూడా అంత ఆదరమూ అంత సహజంగానూ ఉండాలి. నొసట విభూతిలేకుండా ఏది తిన్నా నరకానికి పోతారు. ఇక శూన్య లలాటంతో శివపూజ చేసినా వ్యర్థం. అతడు శివద్వేషితో సమానం. నరకానికి పోవడం ఖాయం. విభూతి పెట్టుకోకుండా శివుడికి బంగారు తులాభారం చేసినా నిష్ఫలం. నరకం తప్పదు. విభూతి లేని సంధ్యావందనం యజ్ఞోపవీతమే లేని సంధ్యావందనంతో సమానం. నిరర్థకం. యజ్ఞోపవీతం పోతే ప్రత్యామ్నాయాలున్నాయి. జపాలూ ఉపవాసాలూ ఏవో ప్రాయశ్చిత్తాలున్నాయి. కానీ విభూతి ధారణను మరిచిపోతే ఏ ప్రత్యామ్నాయమూ లేదు. ఏ ప్రాయశ్చిత్తమూ లేదు. సరాసరి నరకలోకానికి పోవడమే.

అందుచేత ద్విజుడు తప్పనిసరిగా శ్రౌతభస్మను సంపాదించి పెట్టుకోవాలి. అది దొరక్కపోతే స్మార్తమూ అదీ దొరకకపోతే లౌకికమూ - ఏదో ఒక భస్మం ధరించితీరాలి. అది పవిత్ర భస్మమైతే చాలు. కుడిచేతి మధ్యాంగుళిత్రయంతో (బొటనవేలూ చిటికెనవేలూ కాక) నుదుట కనీసం ఆరంగుళాల పొడవు ఉండేట్టు ఈ కంటి కొననుంచి ఆ కంటి కొనదాకా ఉండేట్టు త్రిరేఖలుగా విభూతి పెట్టుకోవాలి. వీటిలో అనామికను (చిటికెనవేలుకి ప్రక్కనున్నది) అకారమనీ, మధ్యమాంగుళిని (నడిమివేలు) ఉకారమనీ, తర్జనిని (చూపుడువేలు) మకారమనీ అంటారు. ఈ మూడింటి సంయోజనతో ఏర్పడిన త్రిపుండ్రం త్రిగుణాత్మకం, ప్రణవాత్మకం, (అ + ఉ + మ్ = ఓమ్). అట్టడుగు అనామికారేఖ బ్రహ్మతత్త్వం. కనక రజోగుణం. నట్టనడిమి మధ్యమాంగుళీరేఖ విష్ణుతత్త్వం. కనక సత్త్వగుణం. తుట్టతుది తర్జనీరేఖ శివతత్త్వం. కనక తమోగుణం. ఇలా త్రిపుండ్రం త్రిగుణాత్మకం, త్రిమూర్తి స్వరూపం.

అకారోఽనామికాప్రోక్తా ప్రోక్త ఉకారో మధ్యమాంగుళిః ।
మకారస్తర్జనీ తస్మాత్ త్రిపుండ్రం త్రిగుణాత్మకమ్ ॥ (15 - 25)

## ◆ త్రిపుండ్ర విభూతి మహిమ - దూర్వాసుడి కథ ◆

నారదా ! ఇక్క డొక ఇతిహాసం నీకు చెప్పాలి. ఒకప్పుడు దూర్వాసుడు శరీరంనిండా విభూతి అలంకరించుకుని రుద్రాక్షమాలికలు ధరించి పితృలోకానికి వెళ్ళాడు. శివా ! శంకరా ! సర్వాత్మకా ! జగన్మాతా ! జగదంబికా ! అంటూ పార్వతీపరమేశ్వరుల నామధేయాలను బిగ్గరగా జపిస్తూ వెళ్ళాడు. కవ్యవాలాదులైన పితృదేవతలు గౌరవపురస్సరంగా ఎదురువచ్చి నమస్కరించి తీసుకువెళ్ళి అతిథిమర్యాదలు జరిపి సముచితాసనంమీద కూర్చోబెట్టారు. కుశలప్రశ్నలతో కథలూ కబుర్లతో చాలాసేపు గడిపారు. అంతలోకే - సమీపంలో ఉన్న కుంభీపాక నరకకూపంనుంచి ఆర్తనాదాలూ హాహాకారాలూ హృదయవిదారకంగా వినిపించాయి. దూర్వాసుడికి మనస్సు కలతపడింది. ఎవరివి ఈ అరుపులు ? ఎక్కడినుంచి ? అని ఆత్రంగా ప్రశ్నించాడు.



మునీశ్వరా ! ఇక్కడికి చేరువలోనే సంయమినీపురం (యమలోకం) ఉంది. అక్కడ పాపాత్ములను శిక్షించడానికి యముడున్నాడు. అతని అధీనంలో వేలమంది యమదూతలున్నారు. నల్లగా బలిష్ఠంగా భయంకరంగా ఉంటారు. ఆ యమలోకంలో ఎనభయ్యారు నరకకూపాలు ఉన్నాయి. వాటిలోకెల్లా కుంభీపాకమనే కూపం అత్యంత భయంకరం. మహాపాపుల్ని తెచ్చి అందులో పడద్రోసి యమదూతలు ఘోరంగా శిక్షిస్తారు. ఆ యాతన వర్ణనాతీతం. నూరేళ్ళు వర్ణించినా తరగదు. శివద్రోహులూ దేవీనిందకులూ విష్ణుద్రోహులూ వేదనిందకులూ సూర్యగణేశాదిదేవనిందకులూ కామాచారులూ మాతృ పితృ గురు జ్యేష్ఠ భ్రాతృ - పురాణ స్మృతి నిందకులూ ఇంకా ఇలాంటి పాపాలు చేసినవారూ ధర్మం తప్పినవారూ కుంభీపాక కుండంలో పడి యమదూతలు పెట్టే బాధలు భరించలేక కుయ్యో మొఱ్ఱోమని దిక్కులు పగిలేలాగా అరిచి రోదిస్తుంటారు. శ్రవణ దారుణమైన ఈ హాహాకారాలు మేము రోజూ వినేవే. వీటిని ఒక్కసారి వింటేచాలు ఎవరికైనా వైరాగ్యం పుడుతుంది - అని పితృదేవతలు వివరించారు.

వింటూనే దూర్వాసుడు చటుక్కున లేచాడు. గబగబా నడుచుకుంటూ - అదేమిటో చూద్దామనిపించి - ఆ నరకకూపం దగ్గరికి వెళ్ళాడు. గట్టున నిలిచి తలవంచి కూపంలోకి చూశాడు. అంతే - హాహాకారాలు మాయమయ్యాయి. వహ్వాకారాలు మిన్నుముట్టాయి. ఆ కూపంలో ఉన్నవారు కేరింతలు కొడుతున్నారు. ఆడుతున్నారు. పాడుతున్నారు. పట్టరాని సుఖమేదో అనుభవిస్తున్నట్టు పరస్పరం ఆనందపరచుకుంటున్నారు. మృదంగ వీణా మురజ ఢక్కా దుందుభులు మోగిస్తూ చిందులు తొక్కుతున్నారు. స్వర్గాధికసుఖమంటే ఇదే కాబోలు అనిపించింది. వసంతవల్లీ పుష్పగంధాలూ శుకశారికాపికాలాపాలూ విజృంభించాయి. మునీశ్వరుడు విన్నది వేరు, ఇప్పుడిక్కడ కన్నది వేరు. ఆశ్చర్యంలో మునిగిపోయాడు.

యమదూతలకు ఇదంతా చాలా వింతగా విడ్డూరంగా కనిపించింది. జరగరానిదేదో జరిగిపోయిందని కలవరపడ్డారు. పరుగు పరుగున వెళ్ళి అధినాయకుడు యమధర్మరాజుకి విన్నవించారు. మహారాజా ! ఇదేదో విడ్డూరంగా ఉంది. కుంభీపాకంలో మహాపాపులు స్వర్గసౌఖ్యాలు అనుభవిస్తున్నారు. కారణం ఏమిటో అంతుపట్టడంలేదు. ఆశ్చర్యం పట్టలేక నీకు విన్నవించుకుంటున్నాం - అన్నారు.

యమధర్మరాజు ఉలిక్కిపడి లేచాడు. మహిషం అధిరోహించి చకచకా వచ్చాడు. బయలుదేరబోతూ ఈ వార్తను దేవేంద్రుడికి దూతద్వారా పంపించాడు. ఇంద్రుడు దిక్పాలకులకూ బ్రహ్మదేవుడికీ, బ్రహ్మదేవుడు విష్ణుమూర్తికీ తెలియపరిచారు. అందరూ వెంటవెంటనే బయలుదేరి తమ తమ దివ్య వాహనాలమీద క్షణాలలో అక్కడికి చేరుకున్నారు. కుంభీపాకం చుట్టూ చేరారు. అందులో జీవులు ఆనందపరవశులై కేరింతలు కొట్టడం కళ్ళారా చూశారు. అహో ! ఇది నరకకూపం కానేకాదు. పాపాత్ములకోసం నిర్మించిన భోగకూపంలా ఉందని విస్తుపోయారు. కారణం ఏమిటో ఎవరికీ స్ఫురించలేదు. ఇక సృష్టిలో పాపానికి



భయపడేదెవడు ? అందరూ పాపాలే చేసి ఇక్కడికి వచ్చిపడతారు. అక్కడా సుఖపడతారు. ఇక్కడా సుఖపడతారు. వేదమర్యాదలూ ధర్మమార్గాలూ ధ్వంసమైపోతాయి. ఏమిటి ఈ విపరీతం ? తన సంకల్పాన్ని తానే వృథాపరచుకుంటున్నాడా ఆ భగవంతుడు ! చాలా ఆశ్చర్యంగా ఉందే ! - ఇలా తర్కించుకుంటున్నారు. కొందరు కారణమేమిటో తెలియక ఏమి మాట్లాడటానికీ తోచక తటస్థులై మౌనంగా నిలుచుండిపోయారు.

విష్ణుమూర్తి చతుర్ముఖ దేవేంద్ర యమధర్మరాజులతో చర్చించాడు. కారణం అంతుబట్టలేదు. క్షణంలో ఇంత మార్పు ఎలా జరిగిందో తెలియలేదు. సరే. శివుణ్ణి అడుగుదామని మరికొందరు దిక్పాలకులనూ దేవముఖ్యులనూ వెంటబెట్టుకుని కైలాసానికి వెళ్ళాడు.

కోటిమన్మథసుందరాకారుడు. సదా షోడశవర్షీయసుడు. లావణ్య నిధి. నానాలంకారభూషితుడు. పార్వతీదేవిని లాలిస్తూ చంద్రమౌళి దర్శనమిచ్చాడు. హరి విరించి ప్రముఖులు నమస్కరించారు. కాలయాపన చెయ్యకుండా యమలోకపు వింత విన్నవించారు. కారణం తెలియక కొట్టుకుంటున్నాం. నువ్వు సర్వజ్ఞుడివి. కనక హేతువేమిటో చెప్పు - అని విష్ణుమూర్తి అభ్యర్థించాడు.

శివుడి ముఖపద్మం వికసించింది. చతుర్భుజా ! ఇందులో వింత ఏముంది ? విడ్డూరం ఏముంది? అంతా విభూతి మహిమ. దానికి సాధ్యం కానిదేదీ లేదు. దూర్వాసుడు వచ్చాడుగదా! అతడు పరమమాహేశ్వరుడు. కుంభీపాకం గట్టున నిలబడి కిందికి తలవంచి చూశాడుగదా ! మరింకేమి ! అతడి నుదుటనున్న విభూతి రేణువులు దైవికంగా ఆ కుండంలో పడ్డాయి. అంతే. విభూతి మహిమ. నరకకూపం స్వర్గలోకంగా మారిపోయింది. ఇప్పటినుంచీ అది పితృలోకవాసులకు తీర్థమవుతుంది. అందులో స్నానం చేసి పితృదేవతలు సుఖపడతారు. పితృతీర్థంగా విఖ్యాతి వహిస్తుంది. అక్కడ ఆలయం కట్టి మా దంపతుల్ని ప్రతిష్ఠించండి. పితృశ్వరీ పితృశ్వరులుగా విడిదిచేస్తాం. పితృలోకనివాసుల పూజలు అందుకుంటాం. ముల్లోకాలలోనూ ఉన్న తీర్థాలన్నింటిలోకీ ఇది ఉత్తమోత్తమమవుతుంది - అని శంకరుడు స్వయంగా ప్రకటించాడు.

విష్ణుమూర్తీ అతడి అనుచరులూ సంతోషించి శివుడికి నమస్కరించి యమలోకానికి తిరిగివచ్చి అక్కడున్న మిగతా దేవతలకందరికీ ఈ విషయం చెప్పారు. అందరూ శిరసులూపి బాగుబాగని కొనియాడారు. విభూతి మహిమ ఇంతటిదా అని ఎంతగానో ప్రశంసించారు. తీర్థం లభించిందని పితృదేవతలు మరింతగా సంబరపడ్డారు. దాని చెంత శివపార్వతుల మూర్తులను ప్రతిష్ఠించారు. నిత్యమూ పూజలు చేయనారంభించారు. అప్పటిదాకా ఆ కుంభీపాక కూపంలో పడి ఉన్న ప్రాణికోటి అంతా దివ్యవిమానాలు అధిరోహించి కైలాసం చేరుకున్నారు. భద్రగణాలు అనే పేరుతో ఇప్పటికీ అక్కడే హాయిగా నివసిస్తున్నారు.



యముడూ యమదూతలూ ఇక చేసేదిలేక ఆ తీర్థానికి సుదూరంగా మరొక కుంభీపాక కుండం కొత్తగా నిర్మించుకున్నారు. ఇక నేటినుంచీ శైవులెవ్వరూ దీని దరిదాపులకు రాకూడదని గట్టి నిషేధం విధించారు.

## ◆ ఊర్ధ్వపుండ్ర ధారణ ◆

నారదా ! ఇదీ భస్మత్రిపుండ్రాల మహిమ. ఇప్పటికి సమగ్రంగా చెప్పడమయ్యింది. ఇక వైష్ణవాగమాలు చెప్పే ఊర్ధ్వత్రిపుండ్రాల గురించి చెబుతాను. ఆలకించు. దాని వర్ణాలూ మంత్రాలూ దేవతలూ ఫలాలూ అన్నీ సమగ్రంగా చెబుతాను. తెలుసుకో.

పర్వతాగ్రం నదీతీరం విశేషించి శివక్షేత్రం సముద్రతీరం పుట్ట తులసికోట - వీటిలో ఎక్కడినుంచైనా మృత్తికను స్వీకరించవచ్చు. మరింక ఏ మృత్తికగానీ పనికిరాదు. నల్లమట్టి శాంతికరం. ఎర్రమట్టి వశ్యకరం. పసుపుమట్టి శ్రీకరం. తెల్లమన్ను ధర్మప్రదం. ఈ మట్టిని బొటనవేలుతో ఊర్ధ్వపుండ్రంగా పెట్టుకుంటే పుష్టికరం. నడిమివేలుతో ఆయుష్కరం. అనామికతో భుక్తిదాయకం. చూపుడువేలుతో పెట్టుకుంటే ముక్తిదాయకం. ఈ నాలుగువేళ్ళే ఉపయోగించాలి. గోళ్ళు తాకనివ్వకూడదు.

ఈ నిలువుబొట్టు దీపం వొత్తిలాగానీ వేణుపత్రంలాగానీ (వెదురు ఆకు) తామరమొగ్గలాగానీ తీర్చిదిద్దుకోవాలి. మత్స్య కూర్మ శంఖాకారాల్లోనైనా పెట్టుకోవచ్చు. పది అంగుళాల పొడవుంటే ఉత్తమోత్తమం. తొమ్మిదంగుళాలుంటే మధ్యమం. అయిదు అంగుళాలవరకూ మధ్యమంగానే పరిగణన. నాలుగునుంచి రెండంగుళాలవరకూ కనిష్ఠం.

నొసట ఈ బొట్టు పెట్టుకునేటప్పుడు కేశవనామాన్నీ, పొట్టమీద నారాయణనామాన్నీ, గుండెలమీద మాధవనామాన్నీ, గొంతుముడిక్రింద పెట్టుకునేటప్పుడు (కంఠకూపం) గోవిందనామాన్నీ, పొట్టకి కుడివైపున విష్ణునామాన్నీ, కుడి బాహువుమీద మధుసూదన నామాన్నీ, కుడిచెవికి పెట్టుకునేటప్పుడు త్రివిక్రమనామాన్నీ, పొట్ట ఎడమవైపున వామననామాన్నీ, ఎడమ బాహువుమీద శ్రీధరనామాన్నీ, ఎడమ చెవిమీద హృషీకేశనామాన్నీ, వీపుమీద పెట్టుకునేటప్పుడు పద్మనాభనామాన్నీ, మూపుమీద పెట్టుకునేటప్పుడు దామోదరనామాన్నీ స్మరించాలి. ఇలా పన్నెండు నామాలూ స్మరిస్తూ ఇదే క్రమంలో బొట్టులు పెట్టుకోవాలి. పూజాకాలంలో హోమసమయంలో సాయంప్రాతః సంధ్యాసమయాల్లో ఏకాగ్రచిత్తంతో కేశవాదినామాలు పలుకుతూ బొట్టులు ధరించాలి. శుచిత్వం సిద్ధిస్తుంది. వీటిని ధరిస్తే చాలు అతడు శ్వమాంసభక్షకుడైనా సరే మరణానంతరం దివ్యవిమానంలో విష్ణులోకం చేరుకుంటాడు.

కొందరు ఐకాంతిక వైష్ణవులు ఈ బొట్టును విష్ణుపాదాకారంలో సాంతరాళంగా (మధ్యన ఖాళీగా) ధరిస్తే మరికొందరు పరమైకాంతిక వైష్ణవులు మధ్యలో తిరుచూర్ణంతోగానీ పసుపుతోగానీ నిలువుబొట్టు కలిపి (నిరంతరాళంగా) త్రిశూలాకారంలో ధరిస్తున్నారు. మరికొందరు వైష్ణవులు అచ్ఛిద్రంగా దీపశిఖా -



పద్మముకుళ - వేణుపత్రాకృతుల్లో ధరిస్తున్నారు. ఇంకొందరు కేవల వైష్ణవులు అచ్ఛిద్రమో సచ్ఛిద్రమో - ఎలాగైనా ఏ ప్రత్యవాయవమూ లేదనీ, ఏదోఒక బొట్టు వైష్ణవుడు పెట్టుకోవడం ముఖ్యమనీ అంటున్నారు. ఏ బొట్టూ పెట్టుకోకపోతే ఏకాంతులకైనా ప్రసన్నులకైనా పరమైకాంతికులకైనా ప్రత్యవాయం తప్పదు. కేశవాయ నమః ఇత్యాదిగా ద్వాదశనామాలనూ జపిస్తూ దండాకారంగా అచ్ఛిద్రంగా ఊర్ధ్వపుండ్రాలను ధరిస్తే చాలా శోభాయమానంగా ఉంటుంది. సాంతరాళంగా పెట్టుకుంటే ఆ మధ్యఖాళీలో రమాసహితుడై విష్ణుమూర్తి క్రీడిస్తాడు. నిరంతరాళంగా పెట్టుకుంటే లక్ష్మీశ్రీహరులను అక్కడినుంచి తరిమివేసినట్టే.

నిరంతరాళం యః కుర్యాదూర్ధ్వపుండ్రం ద్విజాధమః ।
స హి తత్ర స్థితం విష్ణుం శ్రియం చైవ వ్యపోహతి ॥ (15 - 102)

కొందరేమో - అచ్ఛిద్రంగా ఊర్ధ్వపుండ్రాలను పెట్టుకోవడంకూడా అంత ప్రశస్తంకాదు, ఏకవింశతి నరకాలకి పోతాడంటున్నారు. అంచేత ఊర్ధ్వపుండ్రాలను సాంతరాళంగా ధరించడమే ఉత్తమం. దండాకార - దీపశిఖాకార - పద్మముకుళాకార - మత్స్యాకారాల్లో ధరించడమూ ప్రశస్తమే. శిఖలాగా యజ్ఞోపవీతంలాగా వైష్ణవుడికి ఈ ఊర్ధ్వపుండ్ర ధారణం నిరంతరంగా అనివార్యంగా ఉండవలసిందే. లేనిపక్షంలో ఏ సత్కర్మలూ ఫలించవు. నైష్ఠికులైన వైష్ణవులు త్రిశూల - వర్తుల - చతురస్రక - అర్ధచంద్ర - శివలింగాకారాల్లో ధరించరుగాక ధరించరు. జన్మతః వైష్ణవుడై వేదమార్గాన్ని అనుసరించేవాడు మరింక ఏ ఇతరాకారాల్లోనూ పుండ్రధారణ చెయ్యడు. చెయ్యకూడదు. ఒకవేళ వైష్ణవాగమాలలో ఖ్యాతికోసమో కాంతికోసమో కామ్యసిద్ధికోసమో ఇంకేవైనా ఆకారభేదాలు ప్రసక్తమైనా వాటిని వైదికవైష్ణవులు ధరించరాదు.

వీటిలో వైదిక శ్రౌత స్మార్తాదిభేదాలు చాలా ఉన్నాయి. దేని ఆకృతి దానిదే. కనక ఏ మార్గానికి చెందినవారు ఆ మార్గానికి చిహ్నంగా నిర్దిష్టమైన ఆకృతిలో ఉన్న బొట్టునే ధరించాలి. వేరే ఆకృతుల్లో ధరించకూడదు. ఏదియేమైనా - వైదిక మార్గానుయాయులు భస్మంతో తిర్యక్త్రిపుండ్రాలను, నారాయణ ప్రపన్నులు గంధజలంతోనో మృత్తికతోనో శూలాకారంలో ఊర్ధ్వపుండ్రాలను ధరించి తీరవలసిందే. ఏ బొట్టూలేని శూన్యలలాటం ఎవరికీ ఎప్పుడూ తగదుగాక తగదు. *(అధ్యాయం - 15, శ్లోకాలు - 119)*

వేదమార్గైకనిష్ఠానాం వేదోక్తేనైవ వర్త్మనా ।
లలాటే భస్మనా తిర్యక్ త్రిపుండ్రం ధార్యమేవ హి ॥
యస్తు నారాయణం దేవం ప్రపన్నః పరమం పదమ్ ।
ధారయేత్సర్వదా శూలం లలాటే గంధవారిణా ॥ (15 - 119)



## ◆ సంధ్యోపాసన ◆

నారదా ! బొట్టు పెట్టుకోవడమయ్యాక చెయ్యవలసింది సంధ్యోపాసన. ఇక దాన్నిగురించి చెబుతాను. ఆలకించు. నక్షత్రాలు ఉండగానే ప్రాతస్సంధ్యనూ, సూర్యుడు ఆకాశంలో నట్టనడిమికి చేరుకోగానే మధ్యాహ్న సంధ్యనూ, సూర్యుడు అస్తమించబోతూ ఉండగానే సాయంసంధ్యనూ ఉపాసించాలి.

ప్రాతస్సంధ్యాం సనక్షత్రాం మధ్యాహ్నే మధ్యభాస్కరమ్ ।
ససూర్యాం పశ్చిమాం సంధ్యాం తిస్రంధ్యా ఉపాసతే ॥ (16 - 2)

మళ్ళీ వీటిలో అంతర్భేదాలున్నాయి. నక్షత్రాలు ఉండగానే చేసిన ప్రాతస్సంధ్య ఉత్తమం. నక్షత్రాలు మాయమయ్యాక చేసేది మధ్యమం. సూర్యుడు ఉదయించేశాక చేసే ప్రాతస్సంధ్య అధమం. ఇలాగే - సూర్యుడు అస్తమించబోతూ ఉండగా చేసే సాయంసంధ్య - ఉత్తమం. అస్తమించాక చేసేది మధ్యమం. చుక్కలు పొడిచాక చేసే సాయంసంధ్య - అధమం. విప్రుడనే వృక్షానికి సంధ్యోపాసన తల్లివేరు. వేదాలే శాఖలు. ధర్మకార్యాలు ఆకులు. కనక మూలాన్ని శ్రద్ధగా కాపాడుకోవాలి. మూలమే తెగిపోతే ఇక శాఖలూ లేవు, ఆకులూ లేవు. అసలు వృక్షమే ఉండదు. సంధ్యావందనం చెయ్యనివాడు జీవచ్ఛవం. మరుజన్మలో కుక్కగా పుడతాడు. అందుచేత నిత్యమూ సంధ్యోపాసన చెయ్యాలి. ఏమరకూడదు. ఇది లేనిదే మిగతా సత్కర్మలకు అధికారం సిద్ధించదు. సూర్యోదయానికీ అస్తమయానికీ ముందుండే మూడు ఘటికలూ సంధ్యాకాలం. ఆ సమయంలోనే సంధ్యను ఉపాసించాలి. దాటిపోతే ప్రాయశ్చిత్తం తప్పదు. అనివార్య పరిస్థితుల్లో కాలాతిక్రమణం జరిగితే అదనంగా చతుర్థార్ఘ్యం ఇవ్వాలి. లేదా ముందే నూటయెనిమిదిసార్లు గాయత్రిని జపించి సంధ్యవార్చాలి.

కాలాతిక్రమణే జాతే చతుర్థార్ఘ్యం ప్రదాపయేత్ ।
అథవాష్టశతం దేవీం జప్త్వాదౌ తం సమాచరేత్ ॥ (16 - 11)

ఏ సంధ్యను అతిక్రమించామో ఆ సంధ్యను ముందు ఉపాసించి తరవాత తత్కాలీన సంధ్యావందనం చెయ్యాలి. ఇంటిలో చేసుకుంటే అది సాధారణసంధ్య. గోశాలలో చేస్తే అది మధ్యమం. నదీతీరానగానీ దేవాలయంలోగానీ చేసుకుంటే అది ఉత్తమ సంధ్య. సంధ్యావందనమంటే దేవీ ఉపాసన కనక దేవీ సన్నిధిలోనే ముప్పొద్దులా చెయ్యాలి. అనంతఫలం ఇస్తుంది. బ్రాహ్మణులకు సంధ్యోపాసనను మించిన దైవం లేదు. హరహరి ఉపాసనలు నిత్యవిధులు కావు. సంధ్య ఒక్కటే నిత్యోపాసన. కాబట్టి దీన్ని మానకూడదు. ఇది శ్రుతిచోదితం. సర్వవేదసారం. బ్రహ్మాదిదేవతలు కూడా సంధ్యాసమయంలో వేదస్వరూపిణి గాయత్రిని ధ్యానిస్తారు. జపిస్తారు. వేదాలు కూడా నిత్యం జపిస్తాయి. కనక గాయత్రీదేవి అంటే వేదోపాస్య అని తెలుసుకో. అందుచేత శాక్తులా శైవులా వైష్ణవులా అనే భేదం లేదు. విప్రులందరూ వేదమాత ఆదిశక్తి గాయత్రిని ఉపాసించవలసిందే.



ముందుగా కేశవాదినామాలతో ఆచమించి ప్రాణాయామం చెయ్యాలి. కేశవ - నారాయణ - మాధవ - గోవింద - విష్ణు - మధుసూదన - త్రివిక్రమ - వామన - శ్రీధర - హృషీకేశ - పద్మనాభ - దామోదర - సంకర్షణ - వాసుదేవ - ప్రద్యుమ్న - అనిరుద్ధ - పురుషోత్తమ - అధోక్షజ - నారసింహ - అచ్యుత - జనార్దన - ఉపేంద్ర - హరి - శ్రీకృష్ణ అనేవి చతుర్వింశతి నామాలు. వీటికి ప్రతినామానికి ఆదిలో ఓంకారం చేర్చాలి. చివరిలో నమః చేర్చాలి. స్వాహాంతంగా మొదటి మూడు నామాలతోనూ జలం ముమ్మారు పుచ్చుకోవాలి. (ఓం కేశవాయ స్వాహా. ఓం నారాయణాయ స్వాహా. ఓం మాధవాయ స్వాహా.) అటుపైని ఓం గోవిందాయనమః ఓం విష్ణవే నమః - ఇత్యాదిగా ఉచ్చరిస్తూ ఈ రెండింటితో చేతులు కడుక్కోవాలి. తరవాత రెండింటితో పాదాలు కడుక్కోవాలి. ఆపైని రెండింటితో శిరస్సున జల్లుకోవాలి (మార్జనం). అటు తరువాత మూడింటితో పాణి - పాద - శిరస్సంప్రోక్షణలు చేసుకోవాలి. తక్కిన సంకర్షణాది ద్వాదశనామాలను ఉచ్చరిస్తూ ద్వాదశాంగాలనూ స్పృశించాలి. కుడిచేత్తో త్రాగాలి. ఎడమచేత్తో తాకాలి - స్పృశించాలి. అప్పటికిగానీ నీళ్ళు పరిశుద్ధి పొందినట్టు కాదు. అటుపైనే ఆచమనం.

దక్షిణేనోదకం పీత్వా వామేన సంస్పృశేద్బుధః ।
తావన్న శుద్ధ్యతే తోయం యావద్వామేన న స్పృశేత్ ॥
గోకర్ణాకృతి హస్తేన మాషమాత్రం జలం పిబేత్ ।
తతో న్యూనాధికం పీత్వా సురాపాసీ భవేద్ద్విజః ॥ (16 - 26)

కుడి అరచేతిని గోకర్ణాకారంలో మడిచి, మినప గింజంత నీరు చొప్పున ముమ్మారు (విడివిడిగా పోసుకుని) పుచ్చుకోవాలి. అంటే త్రాగాలి. అంతకన్నా తక్కువైనా ఎక్కువైనా సురాపానంతో సమానం. అంగుష్ఠ కనిష్ఠికలను సాచి, నడిమి మూడువేళ్ళనూ పాముపడగలాగా ముందుకి తెచ్చి, అరచేతిలో గుంట ఏర్పడేట్టు చేసుకోవాలి. ఆ గుంటలోకి (అప్పటికే నీటిని స్పృశించి పరిశుద్ధిపొందిన) ఎడమచేతితో నీళ్ళు పోసుకుని ఓం కేశవాయ స్వాహా అని పుచ్చుకోవాలి. అలాగే తక్కిన రెండు నామాలతోనూ మరో రెండుసార్లు విడివిడిగా పుచ్చుకోవాలి. మిగతాదంతా యథావిధిగా నడిపితే ఆచమనం పూర్తిఅయినట్టు.

ఆచమించాక ప్రాణాయామం చెయ్యాలి. ప్రణవ సహితంగా గాయత్రీమంత్రాన్ని జపిస్తూ చెయ్యాలి. ఇందులో రేచక పూరక కుంభకాలని మూడు అంశాలున్నాయి. దక్షిణ నాసారంధ్రంనుంచి రేచకం, వామనాసారంధ్రం నుంచి పూరకం చెయ్యాలి. పూరకమంటే గాలిని లోపలికి పీల్చుకోవడం. కుంభకమంటే పీల్చిన గాలిని ఊపిరి తిత్తుల్లో నిలుపుకోవడం. రేచకమంటే ఆ గాలిని విడవడం. (ఇవి మూడూ సమానకాల వ్యవధానంతో జరగాలి. పీల్చినంతసేపు నిలపాలి. నిలిపినంతసేపు విడవాలి. అంతసేపు ఆగాలి. మళ్ళీ అలాగే అంతసేపు పీల్చాలి. ఇలా సాగాలి అంటారు. దీన్ని తజ్ఞుల దగ్గర తర్ఫీదు పొందడం



అవసరం) పూరక సమయంలో కుడిముక్కు పుటాన్ని బొటనవేలితో నొక్కి మయ్యాలి. ఎడమ ముక్కునుంచి గాలి పీల్చాలి. రేచక సమయంలో నడిమివేలూ చూపుడు వేలూ వదిలేసి మిగిలిన చిటికెనవేలూ దాని ప్రక్కనే ఉండే అనామికతో (ఉంగరంవేలు) ఎడమ ముక్కుపుటాన్ని ఒత్తి ముయ్యాలి. కుడిముక్కు నుంచి గాలి వదలాలి.

పూరక - కుంభక - రేచకాలు మూడు కలిసి ఒక ప్రాణాయామమని యోగులూ యోగశాస్త్రాలూ చెబుతున్నమాట. పూరక సమయంలో నీలోత్పలదళశ్యాముడూ చతుర్భుజమహాత్ముడూ అయిన శ్రీహరిని నాభిమధ్యంలో ప్రతిష్ఠించుకోవాలి. కుంభక సమయంలో కమలాసనుడూ ప్రజాపతీ జగన్నాథుడూ చతుర్వదనుడూ అయిన పితామహుణ్ణి హృదయస్థానంలో ధ్యానించాలి. రేచక సమయంలో శుద్ధస్ఫటిక సంకాశుడూ పాపనాశకుడూ నిర్మలుడూ శంకరుడూ అయిన మహేశ్వరుణ్ణి ఫాలభాగంలో స్మరించుకోవాలి. పూరకంలో విష్ణుసాయుజ్యం. కుంభకంలో బ్రహ్మగతి. రేచకంలో ఈశ్వరప్రాప్తి.

నీలోత్పలదళశ్యామం నాభిమధ్యే ప్రతిష్ఠితమ్ ।
చతుర్భుజమహాత్మానం పూరకే చింతయేద్ధరిమ్ ॥
కుంభకే తు హృది స్థానే ధ్యాయేత్తు కమలాసనమ్ ।
ప్రజాపతిం జగన్నాథం చతుర్వక్త్రం పితామహమ్ ॥
రేచకే శంకరం ధ్యాయేత్ లలాటస్థం మహేశ్వరమ్ ।
శుద్ధస్ఫటిక సంకాశం నిర్మలం పాపనాశనమ్ ॥
పూరకే విష్ణుసాయుజ్యం కుంభకే బ్రహ్మణో గతిమ్ ।
రేచకే శంకరం సాక్షాత్ ప్రాప్నుయాదీశ్వరమ్ పరమ్ ॥ (16 - 36)

నారదా ! పౌరాణాచమనాద్యమూ శ్రౌతాచమనాద్యమూ అంటూ కొన్ని విధులను చెబుతూ ఉంటారు. అవేమిటో అని కంగారుపడకు. కేశవనామాలతో ఆచమిస్తే అది పౌరాణికాచమనం. గాయత్రీ మంత్రంతో ఆచమిస్తే అది శ్రౌతాచమనం. ప్రణవసహితంగా వ్యాహృతిత్రయాత్మకంగా గాయత్రిని ఉచ్చరించాలి.

ప్రాణాయామసమయంలో గృహస్థులూ వానప్రస్థులూ నాసాగ్రాన్ని అయిదు వేళ్ళతోనూ ముయ్యాలనీ, బ్రహ్మచారులూ సన్యాసులూ అంగుష్ఠ కనిష్ఠికానామికలతో ముయ్యాలనీ ఒక నియమం. ఆపోహిష్ఠాదిక మంత్రాన్ని చదువుతూ ముమ్మారు కుశోదకం సంప్రోక్షించుకోవాలి. ఋగంతంలోగాని పాదాంతంలోగానీ ఈ సంప్రోక్షణలు (మార్జనలు) చేసుకోవచ్చు. దీనివల్ల సంవత్సరపాపం నశించిపోతుంది. అటుపైని మళ్ళీ ఆచమించి సూర్యశ్చేత్యాది మంత్రాన్ని చదివి జలప్రాశన చెయ్యాలి. దీనితో అంతరంగపాపాలన్నీ



అంతరిస్తాయి. ఇప్పుడు దక్షిణహస్తంలోకి మళ్ళీ జలం తీసుకుని ముక్కుకి దగ్గరగా తెచ్చుకుని వామకుక్షిలో పాపపురుషుణ్ణి స్మరించి, ఋతమిత్యాది మంత్రంగానీ ద్రుపదా ఇత్యాదిమంత్రంగానీ పఠిస్తూ దక్షిణశ్వాసమార్గం గుండా (కుడిముక్కు) ఆ పాపపురుషుణ్ణి చేతినీటిలోకి తీసుకురావాలి. ఇక ఆ నీళ్ళను చూడకుండా ఎడమవైపు రాతిమీదకు విసిరికొట్టాలి. నా శరీరం నిష్పాపమయ్యింది అని భావించాలి. అప్పుడు లేచినిలబడి, కాళ్ళు దగ్గరగా పెట్టుకుని దోసిటిలోకి నీళ్ళు తీసుకుని సూర్యుణ్ణి చూస్తూ గాయత్రిజపిస్తూ ముమ్మారు అర్ఘ్యప్రదానం చెయ్యాలి. ప్రాతస్సాయం సంధ్యలో ఇలా మూడుసార్లూ, మధ్యాహ్న సంధ్యలో ఒక్కసారి అర్ఘ్యప్రదానం చేస్తే చాలు. ప్రాతస్సంధ్యలో కొంచెం ముందుకి వొంగి, మధ్యాహ్నసంధ్యలో నిట్టనిటారుగా నిల్చునీ, సాయం సంధ్యలో కూర్చునీ ఇవ్వాలి. ఇది అయ్యాక అసావాదిత్య మంత్రంతో ప్రదక్షిణం చెయ్యాలి. ఈ అర్ఘ్య ప్రదానానికి కారణమేమిటంటే -

మందేహాలని మహారాక్షసులున్నారు. మూడుకోట్ల మంది. మహావీరులూ మహాఘోరులూ కృతఘ్నులూ దారుణులూ. వీళ్ళంతా కలిసి సూర్యుణ్ణి తినివెయ్యాలని చూస్తుంటారు. కనక దేవతలూ ఋషులూ తపోధనులూ మహాసంధ్యను ఉపాసించి సూర్యుడికి అర్ఘ్యం విడిచిపెడతారు. ఆ మంత్రజలాలు వజ్రాలై ఆ రాక్షసుల్ని దహించివేస్తాయి. అందుకనే ద్విజులు నిత్యమూ సంధ్యను ఉపాసించాలి. సూర్యభగవానుడికి అర్ఘ్యాలు ఇవ్వాలి. ఇది మహాపుణ్యప్రదమైన పవిత్రకర్తవ్యం. ఉచ్చారణమాత్రం చేతనే సంధ్యావందనాన్ని సాంగంగా సఫలం చేసే అర్ఘ్యాంగమంత్ర సారమేమిటంటే - నేను సూర్యుణ్ణి. నేను జ్యోతిని. నేను ఆత్మను. నేను ఆత్మజ్యోతిని. నేను శివుడను. నేను శుక్లుడను. నేను సర్వజ్యోతిని. నేను రసమును. ఓ వరదాయినీ ! గాయత్రీదేవీ ! బ్రహ్మరూపిణీ ! రమ్ము. రారమ్ము. జపానుష్ఠాన సిద్ధికోసం నా హృదయంలో ప్రవేశించు - అని ప్రార్థించి శుభ్రప్రదేశంలో శుభ్రపీఠంమీద కూర్చుని గాయత్రీమహామంత్రాన్ని జపించాలి. జపం ముగిశాక మళ్ళీ ధ్యానించి "పునరాగమనంకోసం సుఖంగా వెళ్ళిరా" అని వీడ్కోలు పలకాలి.

## ◆ ఖేచరీ ముద్ర ◆

ఈ ప్రాతస్సంధ్యా విధానంలో ప్రాణాయామం తర్వాత ఖేచరీముద్రను మునిపుంగవులు చెప్పారు. దీనికి ఈ పేరు ఎలా వచ్చిందంటే - ఈ ముద్ర పట్టినప్పుడు చిత్తమూ జిహ్వా ఆకాశంలో (ఖే) సంచరిస్తూ ఉంటాయి. దృష్టి భ్రూమధ్యభాగంలో స్థిరంగా నిలుస్తుంది. కనక దీన్ని ఖేచరీముద్ర అన్నారు. నారదా ! సిద్ధసమానమైన ఆసనం లేదు, కుంభక సమానమైన వాయువు లేదు, ఖేచరీ సమానమైన ముద్రలేదు. ఇది ముమ్మాటికీ సత్యం.

> న చాసనం సిద్ధసమం న కుంభసదృశోఽనిలః ।
> న ఖేచరీ సమా ముద్రా సత్యం సత్యం చ నారద ॥ (16 - 65)



అంఘ్రిమూలాలతో యోనిముద్ర చేసి దానిమీద నిశ్చలంగా కూర్చోవాలి. ఇంద్రియాలను కట్టుబాటులో ఉంచాలి. మనస్సును కదలనివ్వకూడదు. నడుం నిలబెట్టి సమంగా స్థాణువులా కూర్చోవాలి. భ్రూమధ్యభాగంలో దృష్టిని కేంద్రీకరించాలి. ఇది యోగులకు అత్యంత సుఖప్రదమైన సిద్ధాసనం. ఇలా కూర్చుని ఆయాతు వరదా దేవీత్యాది శ్లోకాలతో గాయత్రీమాతను ఆహ్వానించి సర్వదేవి నమోస్తుతే అని నమస్కరించాలి. తేజోఽసీత్యాది మంత్రాలతో ఆవాహన చెయ్యాలి. నేను చేసిన ఈ నీ అనుష్ఠానం సంపూర్ణమగుగాక అని ఆకాంక్షించాలి. అభ్యర్థించాలి. అటుపైని శాపవిమోచన విధానాన్ని శ్రద్ధగా ఆచరించాలి. బ్రహ్మ - వసిష్ఠ - విశ్వామిత్ర శాపాలు వారి స్మరణలతో అంతరిస్తాయి. ఇది అయ్యాక సత్యాత్మకుడూ సర్వజగత్స్వరూపుడూ చిద్రూపుడూ వాచామగోచరుడూ అద్వితీయుడూ అయిన ఆ పరమాత్మను హృదయపద్మంలో ధ్యానించాలి. అటుపైని సంధ్యావందనానికి అంగభూతాలైన అంగన్యాస కరన్యాసాలు చెయ్యాలి. ప్రతీమంత్రానికీ ముందు ఓంకారం పలకాలి. ఓం భూః పాదాభ్యాం నమః ఓం భువః జానుభ్యాం నమః. ఓం స్వః కటిభ్యాం నమః. ఓం మహః నాభ్యై నమః. ఓం జనః హృదయాయ నమః. ఓం తపః కంఠాయనమః. ఓం సత్యం లలాటాయ నమః. ఓం తత్సవితుః అంగుష్ఠాభ్యాం నమః. ఓం వరేణ్యం తర్జనీభ్యాం నమః. ఓం భర్గోదేవస్య మధ్యమాభ్యాం నమః. ఓం ధీమహి అనామికాభ్యాం నమః. ఓం ధియో యోనః కనిష్ఠికాభ్యాం నమః. ఓం ప్రచోదయాత్ కరతలకరపృష్ఠాభ్యాం నమః.

ఓం తత్సవితుర్బ్రహ్మాత్మనే హృదయాయ నమః. ఓం వరేణ్యం విష్ణ్వాత్మనే శిరసే స్వాహా. ఓం భర్గో దేవస్య రుద్రాత్మనే శిఖాయై వౌషట్. ఓం ధీమహి శక్త్యాత్మనే కవచాయ హుమ్. ఓం ధియో యోనః కళాత్మనే నేత్రత్రయాయ నమః. ఓం ప్రచోదయాత్ సర్వాత్మనే అస్త్రాయ ఫట్.

## ◆ అక్షరన్యాసమూ ముద్రలూ ◆

నారదా ! గాయత్రీవర్ణాలతో చేసే అక్షరన్యాసంకూడా ఉంది. అది సర్వపాపహరం. కనక చెబుతాను, గ్రహించు. ముందుగా ఓంకారాన్ని ఉచ్చరించి తత్కారాన్ని పాదాంగుష్ఠాల్లో న్యాసం చెయ్యాలి. సకారం గుల్ఫాలలో, వికారం జంఘలలో, తుకారం జానువులలో, వకారం ఊరువులలో, రేకారం గుదప్రదేశంలో, ణికారం లింగదేశంలో, యకారం కటిలో, భకారం నాభిమండలంలో, గోకారం హృదయంలో, దేకారం స్తనద్వయంలో, వకారం హృదయంలో, స్యకారం కంఠకూపంలో, ధీకారం ముఖదేశంలో, మకారం తాలువులలో, హికారం నాసికాగ్రంలో, ధికారం నేత్రమండలంలో, యోకారం భ్రూమధ్యంలో, యోకారం లలాటదేశంలో, నకారం పూర్వముఖంలో, ప్రకారం దక్షిణముఖంలో, చోకారం పశ్చిమముఖంలో, దకారం ఉత్తరముఖంలో, యాకారం మూర్ధభాగంలో విన్యసించి తకారాన్ని వ్యాపకంగా న్యాసం చెయ్యాలి. ఈ న్యాసవిధానాన్ని కొందరు జపతత్పరులు ఇష్టపడరు. అటుపైని జగదంబిక గాయత్రిని ధ్యానించాలి.



భాస్వజ్జపా ప్రసూనాభాం కుమారీం పరమేశ్వరీమ్ ।
రక్తాంబుజాసనారూఢాం రక్తగంధానులేపనామ్ ॥
రక్తమాల్యాంబరధరాం చతురాస్యాం చతుర్భుజామ్ ।
ద్వినేత్రాం స్రుక్ స్రువౌ మాలాం కుండికాం చైవ బిభ్రతీమ్ ॥
సర్వాభరణ సందీప్తాం ఋగ్వేదాధ్యాయినీం పరామ్ ।
హంసపత్రామాహవనీయమధ్యస్థాం బ్రహ్మదేవతామ్ ॥
చతుష్పదామష్టకుక్షిం సప్తశీర్షాం మహేశ్వరీమ్ ।
అగ్నివక్త్రాం రుద్రశిఖాం విష్ణుచిత్తాం తు భావయేత్ ॥ (16 - 96)

బ్రహ్మకవచ, సాంఖ్యాయనగోత్రసంభవ, ఆదిత్యమండల మధ్యవర్తిని గాయత్రీ మహేశ్వరిని ఇలా ధ్యానించాలి. (ముక్తా విద్రుమ హేమనీల ధవళచ్ఛాయైః - ఇత్యాది ధ్యానశ్లోకమే సుప్రసిద్ధం) ధ్యానమయ్యాక దేవికి ప్రీతికరమైన సమ్ముఖ - సంపుట - వితత - విస్తృత - ద్విముఖ - త్రిముఖ - చతుష్క - పంచక - షణ్ముఖ - అధోముఖ - వ్యాపకాంజలిక - శకట - యమపాశ - గ్రథిత - సమ్ముఖోన్ముఖ - విలంబ - ముష్టిక - మత్స్య - కూర్మ - వరాహక - సింహాక్రాంత - మహాక్రాంత - ముద్గర - పల్లవ - చతుర్వింశతి ముద్రలను పట్టాలి. గాయత్రీమంత్రంలో ఇరవైనాలుగు అక్షరాలున్నాయి కనక ఇరవైనాలుగు ముద్రలు. జాతవేదసమంత్రాన్ని పఠించాలి. త్ర్యంబకఋక్కును ఆవర్తించాలి. అలా శతాక్షర గాయత్రిని జపించాలి. అటుపైని ఓంకారపూర్వకంగా భూర్భువస్స్వః అనే వ్యాహృతిత్రయంతో చతుర్వింశతి గాయత్రిని ఉచ్చరించాలి. విప్రులందరూ నిత్యమూ ఇలా గాయత్రీజపం చేస్తే సంధ్యాదేవి ఆనందించి సమగ్రపుణ్యఫలాలను అనుగ్రహిస్తుంది. *(అధ్యాయం - 16 , శ్లోకాలు - 106)*

బ్రహ్మనందనా ! భిన్నపాదంగా గాయత్రీమంత్రాన్ని ఉచ్చరించాలి. బ్రహ్మహత్యాది దోషాలుకూడా తొలగిపోతాయి. అభిన్న పాదంగా (పాదాలు కలిపేస్తూ) ఉచ్చరిస్తే అంతటిదోషమూ సంక్రమిస్తుంది. కోటి కల్పాలు అధోముఖులుగా ఉండిపోతారు. సంపుటైకషడోంకారాది భేదాలు చాలా ఉన్నాయనీ పంచప్రణవ సంయుక్తమైన గాయత్రినే జపించాలనీ జపసంఖ్యలో ఎనిమిదవభాగం చివర తురీయపాదాన్ని జపించాలనీ, సంపుటైక షడోంకార గాయత్రులు ఊర్ధ్వరేతస్కులకనీ, బ్రహ్మచారులకూ గృహస్థులకూ మోక్షార్థులకూ తురీయగాయత్రి అనీ ఇత్యాదిగా అభిప్రాయాలు శాస్త్రపురాణేతిహాసాల్లో కనపడుతున్నాయి. ఇక్కడ చెప్పుకోవలసిన మరొక ధ్యానశ్లోకముంది -



హృది వికసితపద్మం సార్కసోమాగ్నిబింబం
ప్రణవమయమచింత్యం యస్య పీఠం ప్రకల్ప్యమ్ ।
అచల పరమసూక్ష్మం జ్యోతిరాకాశసారమ్
భవతు మమ ముదేఽసౌ సచ్చిదానందరూపః ॥ (17 - 8)

త్రిశూల - యోని - సురభి - అక్షమాల - లింగ - అంబుజ - మహాముద్రలు ఏడింటినీ ప్రదర్శించాలి. సంధ్యాదేవియే గాయత్రీదేవి. కనక భక్తి శ్రద్ధలతో ఉపాసించాలి. అటుపైని పంచోపచారపూజ చెయ్యాలి. లం పృథివ్యాత్మనే నమోనమః గంధమర్పయామి. హం ఆకాశాత్మనే నమోనమః పుష్పమర్పయామి. యం వాయ్వాత్మనే నమోనమః ధూపమాఘ్రాపయామి. రం వహ్న్యాత్మనే నమోనమః దీపం దర్శయామి. వమ్ అమృతాత్మనే నమోనమః నైవేద్యం సమర్పయామి. యం - రం - లం - వం - హం - పుష్పాంజలిం సమర్పయామి. ఈ పూజ అయ్యాక మళ్ళీ ముద్రలు ప్రదర్శించాలి. మనస్సులో దేవిని ధ్యానించాలి. మంత్రం ఉచ్చరించేటప్పుడుగానీ ధ్యానించేటప్పుడుగానీ శిరస్సు కదలకూడదు. మెడ వంగకూడదు. దంతాలు కనిపించకూడదు. అష్టోత్తరశతంగానీ అష్టవింశతి (28)గానీ, మరీ అశక్తుడైతే కనీసం పదిసార్లుగానీ గాయత్రిని జపించాలి. ఇంతకు తక్కువగా ఎప్పుడూ చెయ్యకూడదు. అంతా అయ్యాక ఉత్తమే శిఖరే జాతే అనే శ్లోకాన్ని పఠిస్తూ గాయత్రీమాతకు ఉద్వాసన చెప్పాలి. నారదా ! గాయత్రీదేవి అగ్నిముఖి కనక జలమధ్యంలో నిలిచి జపించకూడదని కొందరు మహర్షులు అంటున్నారు.

న గాయత్రీం జపేద్విద్వాన్ జలమధ్యే కథంచన ।
యతస్సాగ్నిముఖీ ప్రోక్తేత్యాహుః కేచిన్మహర్షయః ॥ (17 - 17)

సురభి - జ్ఞాన - శూర్ప - కూర్మ - యోని - పద్మ - లింగ - నిర్వాణకాలనే అష్టముద్రలను జపాంతంలో ప్రదర్శించాలి. ధ్యానమంత్ర పూజావిధుల్లో ఉచ్చారణదోషాలు ఏమైనా దొర్లితే క్షమించమని ప్రార్థిస్తూ గాయత్రీతర్పణం విడిచిపెట్టాలి. ఈ మంత్రానికి ఛందస్సు గాయత్రి. విశ్వామిత్రుడు ఋషి. సూర్యుడు దేవత. తర్పణే వినియోగః. భూః అని ఉచ్చరించి ఋగ్వేదపురుషుణ్ణీ, భువశ్శబ్దంతో యజుర్వేదపురుషుణ్ణీ, స్వః అనే వ్యాహృతితో సామవేద పురుషుణ్ణీ, మహశ్శబ్దంతో అథర్వణవేద పురుషుణ్ణీ, స్మరిస్తూ తర్పణాలు విడిచిపెట్టాలి. అటుపైని జనః పదంతో ఇతిహాసపురాణాలనూ, తపశ్శబ్దంతో సర్వాగమాలనూ, సత్యం శబ్దంతో సత్యలోకపురుషుణ్ణీ, ఓం భూః - భూలోకపురుషం తర్పయామి తర్పయామి అంటూ నీళ్ళు వదిలిపెట్టాలి. భువశ్చేతి భువర్లోకపురుషం తర్పయామి. స్వః స్వర్లోకపురుషం తర్పయామి. ఇలాగే గాయత్రీతర్పణాలు. ఓం భూరేకపదాం గాయత్రీం తర్పయామి. ఓం భువః ద్విపదాం ............ ఓం స్వః త్రిపదాం గాయత్రీం .........



ఓం భూర్భువః స్వశ్చేతి చతుష్పదాం గాయత్రీం తర్పయామి. ఉషసీ గాయత్రీ సావిత్రీ సరస్వతీ వేదజననీ పృథ్వీ అజాకౌశికీ సాంకృతి సార్వజితి భేదాలతో గాయత్రికి తర్పణలు ఇవ్వాలి. ఇలా వేదపురుష - లోకపురుష - గాయత్రీ తర్పణాలు అయ్యాక శాంతికరంగా జాతవేదసమంత్రం పఠించాలి. మానస్తోకమంత్రంకూడా జపించాలి. త్ర్యంబకమంత్రం మరింత శాంతికరంగా ప్రసిద్ధం. తచ్ఛంయోరిత్యాది మంత్రమూ ఇటువంటిదే. శాంతికరమంత్ర పఠనమయ్యాక అతోదేవా మంత్రద్వయంతో సర్వాంగ స్పర్శనం చేసుకోవాలి. స్యోనాపృథివి మంత్రంతో భూమికి మ్రొక్కాలి. యథావిధిగా గోత్రనామాలు చెప్పుకోవాలి.

## ◆ పంచాయతన పూజ ◆

సంధ్యావిధానం సమగ్రంగా తెలియజేశాను. ద్విజులందరూ ప్రాతఃకాలంలో తప్పనిసరిగా ఆచరించాలి. ఇది అయ్యాక స్వయంగా అగ్నిహోత్రం (అగ్నికార్యం) చేసుకోవాలి. అటుపైని పంచాయతన పూజ. శివ శివా గణపతి సూర్య విష్ణు పూజలు. (పురుషకృత) శ్లోకాలతోగానీ అపౌరుషేయ మంత్రాలతోగానీ (వ్యాహృతులు) ఈ పంచాయతనపూజ చేసుకోవచ్చు. హ్రీశ్చతే ఇత్యాదికమైన మూలమంత్రాలు ఉన్నాయి. వాటితోనూ చెయ్యవచ్చు. ఎవరి ఆచారాన్నిబట్టివారు చేసుకోవాలి. పార్వతీదేవిని మధ్యలోఉంచి, ఈశాన్యంలో శ్రీమహావిష్ణువునుంచి, ఆగ్నేయంలో శివుణ్ణి ఉంచి, నైరృతిదిశలో గణపతిని నిల్పి, వాయవ్యంలో సూర్యుణ్ణి నిల్పి - పంచాయతన పూజ చెయ్యాలి. ముందుగా పార్వతీదేవిని అర్చించి తరవాత తక్కిన దేవతలకు పూజలు చెయ్యాలనేది క్రమం. షోడశమంత్రాలతో షోడశోపచారాలు అందరికీ చెయ్యాలి. విష్ణుమూర్తిని అక్షతలతోనూ, గణేశ్వరుణ్ణి తులసితోనూ, దుర్గామాతను గరికపోచలతోనూ (దూర్వా) శివుణ్ణి మొగలి పువ్వులతోనూ అర్చించకూడదంటారు.

వాక్షతైరర్చయేద్విష్ణుం న తులస్యా గణేశ్వరమ్ ।
దూర్వాభిర్నార్చయేద్దుర్గాం కేతకైర్న మహేశ్వరమ్ ॥ (17 - 40)

మల్లికా - జాతి - కుటజ - పనస - కింశుక - వకుళ - కుంద - లోధ్ర - కరవీరక - శింశుపా - అపరాజిత - బంధూక - అగస్త్య - మదంత - సింధువార - పలాశ - దూర్వాంకుర - బిల్వదళ - కుశమంజరికా - శల్లకీ - మాధవి - అర్క - మందార - కేతకి - కర్ణికార - కదంబ - పున్నాగ - చంపక - యూథికా - తగర ప్రముఖ పత్రపుష్పాలు జగదీశ్వరికి అత్యంతప్రీతికరాలు. గుగ్గులంతో ధూపమూ నువ్వులనూనెతో దీపమూ అమ్మవారికి ఇష్టం. వీటితో పూజించి మూలమంత్రం జపించి అటుపైని విప్రుడు వేదాభ్యాసం చెయ్యాలి. ఇక అప్పటినుంచీ కుటుంబ పోషణకు అవసరమైన పనులు చేసుకోవాలి. తృతీయ దినభాగాన్నంతటినీ వీటికి ఉపయోగించుకోవచ్చు. *(అధ్యాయం - 17, శ్లోకాలు - 47)*



## ◆ మహాదేవీ సమర్చన ◆

దేవీపూజావిధానం సమగ్రంగా మరొక్కసారి వినాలనుకుంటున్నాను చెప్పమని నారదుడు అడిగాడు. నారాయణమహర్షి ఆరంభించాడు. శ్రీమాతృపూజ భుక్తిముక్తిప్రదం. సమస్త ఆపదలనూ తొలగిస్తుంది. సకల భోగభాగ్యాలనూ కలిగిస్తుంది. నారదా ! మౌనంగా ఆచమించి సంకల్పం చెప్పుకుని భూతశుద్ధ్యాదికమంతా నిర్వహించాలి. మాతృకాన్యాసపూర్వకంగా షడంగన్యాసం చెయ్యాలి. సామాన్యార్ఘ్య ప్రదానాదికంతో శంఖస్థాపన చెయ్యాలి. పూజాద్రవ్యాలను మంత్రోదకాలతో సంప్రోక్షించాలి. గురువు అనుమతిపొంది పూజకు ఉపక్రమించాలి. పీఠపూజ చేసి దేవిని ధ్యానించాలి. ఆవాహన చేసి ఆసనాద్యుపచారాలు సమర్పించి పంచామృతరసాదులతో స్నానం చేయించాలి. పౌంఢ్రేక్షురసపూర్ణాలైన శతకుంభాలతో స్నానం చేయించినవాడికి పునర్జన్మ ఉండదు. వేదమంత్ర పారాయణంచేస్తూ చూతఫల రసంతోగానీ చెఱకు పానకంతోగానీ (ఇక్షురసం) అమ్మవారిని స్నానం చేయించినవారి ఇంటిలో సరస్వతీదేవి స్థిరంగా నివసిస్తుంది. ద్రాక్షాఫలరస స్నానం చేయించినవారు రసబిందువులన్ని సంవత్సరాలు దేవీలోకంలో నివసిస్తారు. కర్పూర అగురు కాశ్మీర కస్తూరీ సమ్మిశ్రితమైన జలాలతో వేదమంత్రపూర్వకంగా జగదీశ్వరిని స్నానం చేయించినవారికి నూరు జన్మలపాపాలు భస్మీపటలమైపోతాయి. క్షీరాభిషేకం చేయిస్తే ఆ భక్తుడు కల్పాంతంవరకూ క్షీరసాగరమధ్యంలో అమ్మవారి సాన్నిధ్యాన్ని చూరగొంటాడు. పెరుగుతో తేనెతో నెయ్యితో పంచదార పానకంతో అభిషేకించినవారు ఆయా ద్రవ్యాలకూ ద్రవ్యప్రవాహాలకూ అధిపతులవుతారు. భక్తితో సహస్ర కలశాభిషేకం చేస్తే ఇహపరలోక సుఖాలన్నీ ఆ భక్తుడివే. అటుపైని కాశ్మీర చందనం ఇచ్చి, కస్తూరి బొట్టు దిద్ది, సీమంతంలో సిందూరం సింగారించి, పాదాలకు లత్తుకను అలంకరించినవాడు ఇంద్రపదవిని అధిష్ఠిస్తాడు. రకరకాల పుష్పాలను ఈ పూజకు ఉపయోగించవచ్చు. పుష్పార్చన చేసినవాడు కైలాసం చేరుకుంటాడు.

బిల్వపత్రాలతో పూజచేస్తే అతడికి ఎప్పుడూ ఎక్కడా ఏ దుఃఖమూ ఉండదు. బిల్వపత్ర దళాలమీద రక్తచందనంతో మాయాబీజాక్షర త్రయాన్ని సుస్పష్టంగా సుందరంగా లిఖించాలి. ఆ బీజాక్షరాలతో కలిపి అమ్మవారి నామాన్ని చతుర్థ్యంతంగా పలికి నమః అంటూ (ఓం మహాదేవ్యైనమః. హ్రీం జగదీశ్వర్యై నమః - ఇత్యాదిగా) బిల్వపత్రాలను అమ్మవారి పాదాలచెంత ఉంచాలి. ఇలా బిల్వపత్రార్చన చేసినవారికి మనుత్వం లభిస్తుంది. లేతదళాలను కోసి తెచ్చి కోటి బిల్వార్చన చేసినవాడు బ్రహ్మాండాధిపతి అవుతాడు. కోటి కుందపుష్పార్చన చేస్తే ప్రాజాపత్యం దక్కుతుంది. కోటిసంఖ్యలో మల్లికా మాలతీపుష్పాలను సుగంధ ద్రవ్యాలతో కలిపి అమ్మవారికి పూజచేస్తే బ్రహ్మత్వం, దశకోటి చేస్తే విష్ణుత్వం, శతకోటి చేస్తే సూత్రాత్మత్వం లభిస్తాయి. ఇప్పుడు ఆయా పదవుల్లో ఉన్నవారందరూ ఇలా అర్చించినవారే. జపా - బంధూక - దాడిమీ కుసుమాలుకూడా ఇలాగే అనంతపుణ్య ఫలాలను ఇస్తాయి. ఆయా ఋతువుల్లో దొరికే పువ్వులతో సంవత్సరం పొడుపునా అమ్మవారికి సహస్రనామార్చన చేస్తే సర్వమహాపాతక - ఉప



పాతకాలు అన్నీ నశించి ముక్తి లభిస్తుంది. దేహాంతంలో శ్రీదేవీపదసన్నిధికి చేరుకుంటాడు. ఇది దేవతానాయకులకుకూడా దుర్లభమైన పదవి. కృష్ణాగురు కర్పూర చందన సిల్హిక ఆజ్య గుగ్గులు సమన్వితంగా ధూపంవేస్తే దేవి ప్రసన్నురాలై ముల్లోకాలనూ తెచ్చి ముంగిట నిలుపుతుంది. కర్పూరఖండాలతో నీరాజనమిస్తే సూర్యలోకనివాసం సిద్ధిస్తుంది. శతదీపార్చన సహస్రదీపార్చన కోటి దీపార్చనలు చేసినవారికీ ఇదే పుణ్యఫలం దక్కుతుంది. అమ్మవారి ఎట్టయెదుట పర్వతాకారంలో నైవేద్యం నిలపాలి. షడ్రసోపేతమైన లేహ్యచోష్య పేయాలతో రకరకాల పిండివంటలతో రుచికరమైన ఫలాలతో బంగారు పాత్రల్లో అన్నరాశిని నివేదన చెయ్యాలి. అమ్మవారు తృప్తి చెందితే జగత్త్రయం తృప్తి చెందుతుంది. ఎందుకంటే రజ్జువునందు సర్పత్వంలాగా జగత్త్రయమూ అమ్మవారే కనక.

> తృప్తాయాం శ్రీమహాదేవ్యాం భవేత్తృప్తం జగత్త్రయమ్ ।
> యతస్తదాత్మకం సర్వం రజ్జౌ సర్పో యథా తథా ॥ (18 - 40)

నైవేద్యం పెట్టాక సుగంధభరితమైన చల్లని గంగాజలాన్ని కలశాలలో పానీయంగా సమర్పించాలి. తర్వాత కర్పూరతాంబూలం ఇవ్వాలి. ఏలకులూ లవంగాలూ వక్కపొడి ఇత్యాదులతో లేతతములపాకులు మడిచి ముఖసౌగంధ్యవర్ధకంగా అందివ్వాలి. అటుపైని మృదంగ వీణాది వాద్యాలతో మనోహరగానాలతో వేదపారాయణలతో పురాణపఠనలతో స్తోత్రపాఠాలతో జగన్మాతను అలరించాలి. రెండేసి ఛత్రచామరాలు సమర్పించాలి. రాజోపచారాలు అన్నీ చెయ్యాలి. ప్రదక్షిణ నమస్కారాలు చెయ్యాలి. లెంపలు వేసుకుంటూ క్షమాపణలు చెప్పాలి. ఒక్కసారి ఒక్క ఉపచారం చేస్తేనే అమ్మవారు అనుగ్రహిస్తుంది. అలాంటిది అన్ని ఉపచారాలూ నిత్యమూ భక్తితో చేస్తే అమ్మవారి ఆనందానికీ అనుగ్రహానికీ అవధులు ఉంటాయా! ఆవిడ జగన్మాత కనక పుత్రులపట్ల సహజంగానే ప్రేమ దయ ఉంటాయి. భక్తితో అర్చనచేసే పుత్రుడంటే అవి ఎంత విశేషంగా ప్రవహిస్తాయో వేరే చెప్పాలా !

> స్వభావతో భవేన్మాతా పుత్రేఽతికరుణావతీ ।
> తేన భక్త్యా కృతాయాం తు వక్తవ్యం కిం తతఃపరమ్ ॥ (18 - 48)

## ◆ దేవీమహిమ - బృహద్రథుడి పూర్వజన్మ స్మృతి ◆

నారదా ! ఇక్కడ నీకొక కథ చెప్పాలి. విను. పూర్వం హిమాలయపర్వతాల్లో ఒక చక్రవాకపక్షి ఉండేది. అది ఆకాశమార్గాన ఆయాదేశాలపై ఎగురుతూ వచ్చి వచ్చి కాశీపట్టణం చేరుకుంది. ప్రారబ్ధం బాగుండి అన్నపూర్ణాదేవి మందిరం దగ్గరికి వెళ్ళింది. అక్కడ ఏవో పడిఉన్న మెతుకుల్ని ఏరుకు తినే మిషతో తనకు తెలియకుండానే ఆ మందిరానికి ప్రదక్షిణ చేసింది. ఆ తరవాత అక్కడినుంచి ఎగిరి ఎటో



వెళ్ళిపోయింది. కాలాంతరాన మరణించింది. సరాసరి స్వర్గం చేరుకుంది. దివ్యరూపం ధరించి రెండు కల్పాలపాటు దివ్యభోగాలు అనుభవించింది. భూలోకంలో క్షత్రియవంశాన మగబిడ్డగా పునర్జన్మ పొందింది. బృహద్రథుడు అనే పేరుతో ఆ మగబిడ్డ ఎదిగి యువకుడై పట్టాభిషిక్తుడయ్యాడు. అతడికి త్రికాలజ్ఞత సహజంగానే సిద్ధించింది. యజ్ఞయాగాదులు చేస్తూ సత్యవాదిగా జితేంద్రియుడుగా ధార్మికుడుగా ప్రజల ప్రశంసలు అందుకున్నాడు. అతి దుర్లభమైన పూర్వజన్మస్మృతి అతడికి ఉన్న విషయం ఎలాగో ప్రజలకు తెలిసి బాగా ప్రచారంలోకి వచ్చింది. మునీశ్వరులకు తెలిసింది. వారు ఆశ్చర్యచకితులై దర్శనార్థం వచ్చారు. బృహద్రథుడు భక్తిశ్రద్ధలతో అతిథిమర్యాదలు జరిపాడు. కుశలప్రశ్నలు అయ్యాక మునీశ్వరులు తాము వచ్చిన పని ఏమిటో చెప్పారు.

మహారాజా ! నీకు పూర్వజన్మస్మృతి ఉంది. త్రికాలజ్ఞత ఉంది. ఏ పుణ్యవిశేషంతో నీకు ఈ శక్తులు లభించాయి ? తెలుసుకుందామని వచ్చాం. రహస్యం కాకపోతే, చెప్పదగినదే అయితే తెలియపరిచి మమ్మల్ని ఆనందింపజెయ్యి.

మునీంద్రులారా ! ఇందులో రహస్యమేమీలేదు. అంతా అమ్మవారి దయ. పూర్వజన్మలో నేను ఒక చక్రవాకపక్షిని. అల్పజీవిని. కాశీలో అన్నపూర్ణ మందిరానికి ప్రదక్షిణం చేశాను. తెలిసి చేసింది కాదు. అయినా అమోఘఫలం దక్కింది. ఆ పుణ్యవిశేషం వల్ల స్వర్గసుఖాలు రెండు కల్పాలపాటు అనుభవించాను. ఈ జన్మలో మహారాజునూ సార్వభౌముడనూ అయ్యాను. పూర్వజన్మ స్మృతితోపాటు భూత భవిష్యద్వర్తమానాలను తెలుసుకునే శక్తి అబ్బింది. జగదంబిక పాదాలను స్మరిస్తే ఎంత పుణ్యం లభిస్తుందో దానికి ఎంత ఫలం దక్కుతుందో ఎవరూ చెప్పలేరు. ఊహించలేరు. ఆ తల్లి మహిమను తలుచుకుంటే చాలు నాకు కళ్ళు చెమ్మగిల్లి ఆనందబాష్పాలు జాలువారతాయి. జగన్మాతను ఉపాసించనివారి జన్మలు వ్యర్థం. వారు తల్లిని మరిచిపోయిన కృతఘ్నులు. పాపాత్ములు. హరిహరోపాసనలు నిత్యవిధులు కావు. పరాదేవతోపాసన ఒక్కటే నిత్యమనీ సత్యమనీ శ్రుతి చెబుతోంది. మీవంటి జ్ఞానులకు నేను చెప్పేదేమిటి ? భగవతి పాదాంభోజాలను నిరంతరం సేవించవలసిందే. ఇంతకన్నా ఈ జగత్తులో సేవించదగిన మరొక వస్తువు నిర్గుణంగానీ సగుణంగానీ ఏదీ లేదు.

బృహద్రథుడి సమాధానం మునీశ్వరుల సంశయాలను తీర్చింది. సంతృప్తులై ఆనందబాష్పాలు ఒత్తుకొంటూ తమతమ ఆశ్రమాలకు తిరిగివెళ్ళారు.

నారదా ! ఇంతటి ప్రభావం కలది దేవీపూజ. దాని ఫలం ఎంత అని ఎవరైనా అడగగలరా ? ఎవరైనా చెప్పగలరా ? ఎవరి జన్మ సఫలమో వారికి ఈ పూజపట్ల శ్రద్ధ కలుగుతుంది. ఎవరి జన్మ వంకరమో నిష్ఫలమో వారికి శ్రద్ధ కలగదు. శ్రద్ధ కలగడానికైనా నోచుకుని ఉండాలి.

*(అధ్యాయం - 18 , శ్లోకాలు - 71)*



## ◆ మధ్యాహ్న సంధ్య ◆

ప్రాతస్సంధ్యోపాస్తి, అది అయ్యాక దేవీపూజ - చెప్పానుగదా ! ఇప్పుడింక మధ్యాహ్న సంధ్యావందనం గురించి చెబుతాను ఆలకించు. ఇది అపూర్వమూ అత్యుత్తమమూ అయిన ఫలాలను ఇస్తుంది. మధ్యాహ్న సమయాన సంధ్యాదేవత సావిత్రి. యువతి. శ్వేతవర్ణ. త్రిలోచన. వరద. అక్షమాలాధారిణి. త్రిశూలధారిణి. అభయహస్త ముద్రాంచిత. వృషారూఢ. యజుర్వేద సంహితారూప. రుద్రదేవత. గుణయుత. భువర్లోక వ్యవస్థిత. ఆదిత్యమార్గ సంచారకర్త్రి. మాయామయి. ఇటువంటి ఆదిదేవికి నమస్కరిస్తున్నాను అని ధ్యానశ్లోకం పఠించాలి. ప్రాతస్సంధ్యలో లాగానే ఆచమనాదికం చెయ్యాలి. అటుపైని అర్ఘ్యప్రదానం పువ్వులతో చెయ్యాలి. పువ్వులు లేకపోతే బిల్వపత్రాన్ని నీళ్ళల్లో ముంచి ఆ నీటిని సూర్యుడికి అభిముఖంగా ఆకాశంలోకి జల్లుతూ అర్ఘ్యాన్ని ప్రతిపాదించాలి. మిగతా కార్యక్రమమంతా ప్రాతస్సంధ్యలాగానే. కొందరిక్కడ తదిత్యాది మంత్రంతో సావిత్రిని ధ్యానించాలి అంటున్నారుగానీ అది సంప్రదాయంకాదు. అసంప్రదాయం హానికరం. కనక ఉభయ సంధ్యల్లోనూ ఓంకారసహితమైన గాయత్రీమంత్రంతోనే నీరు జల్లాలి. ఆకృష్ణేన - ఇత్యాది మంత్రంతో పుష్పమిశ్రితమైన జలం లేదా బిల్వదుర్వాది పత్రాలతో పూర్వోక్త పద్ధతిలో జల్లి అర్ఘ్యం ఇవ్వాలి. ఇది సంధ్యాసాఫల్యదాయకం. మందేహరాక్షస వినాశకం. ఆ తరవాత గాయత్రీమంత్రంతోనే యజుర్వేదపురుష హిరణ్యగర్భాదులకు తర్పణాలు విడిచిపెట్టాలి. ఉదుత్యమిత్యాది మంత్రాలతో సూర్యోపస్థానం చెయ్యాలి. అటుపైని గాయత్రీమంత్రజపం. దీనికీ మూడుపూటలకూ మూడు పద్ధతులున్నాయి. ప్రాతఃకాలంలో చేతులు పైకి త్రిప్పి, సాయంకాలంలో క్రిందికి త్రిప్పి మధ్యాహ్నసమయంలో గుండెలపై ఆన్చి గాయత్రిని జపించాలి.

> కృత్వోత్తానౌ కరౌ ప్రాతః సాయంచాధః కరౌ తథా ।
> మధ్యాహ్నే హృదయస్థౌ తు కృత్వా జపముదీరయేత్ ॥ (19 - 18)

గాయత్రీమంత్ర జప పరిగణనకుకూడా ఒక విధానం ఉంది. అనామిక మధ్య గణుపుతో మొదలుపెట్టి చిటికెనవేలు గణుపులుమీదుగా చూపుడు వేలు మూలంవరకూ పదిగణుపులవుతాయి. వీటిని లెక్కించుకుంటూ గాయత్రిని జపిస్తే దశగాయత్రి అవుతుంది. దీన్ని కరమాల అంటారు.

> పర్వద్వయమనామిక్యాః కనిష్ఠాదిక్రమేణ తు ।
> తర్జనీమూలపర్యంతం కరమాలా ప్రకీర్తితా ॥ (19 - 19)

ఇలా పదిసార్లు చేస్తే శతగాయత్రి. తర్జని మొదటి కణుపుదగ్గర (పైనుండే కణుపు) ఆపేస్తే ఎనిమిది. మొత్తం అష్టోత్తరశతగాయత్రి. రోజూ సహస్రగాయత్రి చేస్తే విశేషఫలితాలుంటాయి. గోహత్య పితృహత్య మాతృహత్య భ్రూణహత్య గురుపత్నీసంగమం బ్రహ్మహత్య సురాపానం ఇత్యాది మహాపాతకాలన్నీ



అంతరిస్తాయి. పవిత్రుడవుతాడు. మానసిక వాచిక కాయిక దుష్కర్మలన్నీ తొలగిపోతాయి. గాయత్రీమంత్రం తెలియని విప్రుడి జన్మ వ్యర్థం. నాలుగువేదాలూ చదివినా ఒక్కసారైనా గాయత్రిని జపించకపోతే ఆ చదువంతా కేవలం శ్రమమాత్రమే అవుతుంది. వేదావృత్తికన్నా గాయత్రీజపం ఉత్తమోత్తమం.

*(అధ్యాయం - 19 , శ్లోకాలు - 24)*

## ◆ బ్రహ్మయజ్ఞం ◆

నారదా ! ఇక బ్రహ్మయజ్ఞం గురించి చెబుతాను తెలుసుకో. (మూడు) రెండుసార్లు ఆచమించి రెండుసార్లు మార్జన చేసుకోవాలి. సవ్యపాణితో నీటిని స్పృశించాలి. పాదాలు శిరస్సు నేత్రాలు నాసిక చెవులు హృదయం మౌళి సంప్రోక్షించుకోవాలి. దేశకాలాలు చెబుతూ బ్రహ్మయజ్ఞం సంకల్పించాలి. రెండు దర్భలు కుడిచేత మూడు ఎడమచేత కొన్ని పీటకింద కొన్ని శిఖమీద కొన్ని పాదమూలాలలోనూ ఉంచుకోవాలి. ఇవి సర్వపాపక్షయకరాలు. సూత్రోక్త దేవతాప్రీత్యై బ్రహ్మయజ్ఞం కరోమ్యహమ్ అని ఉదకం స్పృశించాలి. ముందుగా ముమ్మారు గాయత్రిని జపించాలి. అగ్నిమీళే పురోహితమ్, యదంగ, అగ్నిర్వై ఇత్యాదిమంత్రాలు పఠించాలి. మహావ్రతం చైష పంథా అని పలకాలి. మఘవత్, ఇషేత్వోర్జ, అగ్న ఆయాహి, శంనో దేవీః, వృద్ధిరాదైచ్, పంచసంవత్సర, యమరస తజభన, అథాతో ధర్మజిజ్ఞాసా, అథాతో బ్రహ్మజిజ్ఞాసా, తచ్ఛంయో, బ్రహ్మణేనమః - ఇత్యాదికంగా పఠిస్తూ ఆయా విధులు నిర్వహించాలి. అనంతరం తర్పణలు చెయ్యాలి. ప్రజాపతి, బ్రహ్మ, దేవతలు, వేదాలు, ఋషులు, ఛందస్సులు, ఓంకారం, వషట్కారం, వ్యాహృతులు, సావిత్రి, గాయత్రి, యజ్ఞాలు, ఆకాశం, భూమి, అంతరిక్షం, అహోరాత్రాలు, త్రిసంధ్యలు, సిద్ధులు, సప్తసముద్రాలు, నదులు, సప్తకులపర్వతాలు, పుణ్యక్షేత్రాలు, ఓషధులు, వనస్పతులు, గంధర్వాప్సరోనాగయక్షాదులు, పక్షులు, గోవులు, సాధ్యులు, రాక్షసులు, మంత్రాలు, విప్రులు - వీరికి తర్పణాలు స్వీకరించే అర్హత ఉంది. కనక తర్పణాలు వదలాలి. ఇది భూతతర్పణం. ఆ తరవాత నివీతం చేసుకుని ఋషితర్పణం. శతర్చి - మాధ్యమ - గృత్సమదులకూ, విశ్వామిత్ర వామదేవ అత్రి భరద్వాజ వసిష్ఠ ప్రగాథ పావమాన్యులకూ అలాగే క్షుద్రసూక్త మహాసూక్తాలకూ సనక సనందన - సనాతన - సనత్కుమార - కపిల - ఆసురి - వోహలి - పంచశిర్షకులకూ తర్పణాలు ఇవ్వాలి. తరవాత ప్రాచీనావీతిగా సుమంత జైమిని వైశంపాయన పైల మహాభాష్య మహాభారత ధర్మాచార్యులకూ జాహవి గార్గ్య గౌతమ శాకల బాభ్రవ్య మాండవ్య మాండూకేయ గార్గీ వాచక్రవీ బడబా ప్రాతిథేయికా సులభా మైత్రేయీ, కహోళ కౌశీతక మహాకౌశీతక భారద్వాజ పైంగ్య మహాపైంగ్య సుయజ్ఞ-సాంఖ్యాయన ఐతరేయ మహైతరేయ బాష్కల శాకల సుజాతవక్త్ర ఔదవాహి సౌజామి శౌనక ఆశ్వలాయన తర్పణలు చెయ్యాలి. ఇంకా తక్కిన ఆచార్యులందరికీ పేరుపేరునా ఇవ్వాలి. నా వంశంలో పుట్టి సగోత్రికులై అపుత్రకులై మరణించినవారికందరికీ చెందుగాక, స్వీకరింతురుగాక అని వస్త్రనిపీడనోదకం విడిచిపెట్టాలి.



యే కే చాస్మత్కులే జాతా అపుత్రా గోత్రిణో మృతాః ।
తే గృహ్ణంతు మయాదత్తం వస్త్రనిపీడనోదకమ్॥ (20 - 27)

ఇలాగ విధ్యుక్తంగా బ్రహ్మయజ్ఞం నిర్వహించాలి. సర్వవేదవేదాంగపఠనఫలం దక్కుతుంది. అటుపైని వైశ్వదేవం నిత్యశ్రాద్ధం చెయ్యాలి. అతిథులకు అన్నదానంకూడా నిత్యమూ చెయ్యాలి. గోవులకు గడ్డివేసి వచ్చి బ్రాహ్మణులతో కలిసి దినపంచమభాగంలో హాయిగా సుష్ఠుగా భోజనం చెయ్యాలి. ఇతిహాస పురాణాలతో షష్ఠ సప్తమ భాగాలను గడపాలి. అష్టమ ఘటికాకాలంలో లోకయాత్ర. బహిస్సంధ్య. అటుపైని సాయంసంధ్య వార్చాలి.

## ◆ సాయం సంధ్య ◆

సాయంసంధ్యవల్ల మహామాయ అనుగ్రహం లభిస్తుంది. ఆచమించి ప్రాణాయామం చేసి పద్మాసనం వేసుకుని కూర్చోవాలి. శ్రౌతస్మార్తకర్మలకు సగర్భప్రాణాయామం, ధ్యానమాత్రానికి అగర్భ ప్రాణాయామం చెప్పబడ్డాయి. భూతశుద్ధి చేసుకోవాలి. సంధ్యాదేవిని ధ్యానించాలి. ఈమె వృద్ధ సరస్వతి. కృష్ణాంగి. కృష్ణాంబరధారిణి. శంఖ చక్ర గదా పద్మహస్త. గరుడవాహన రత్నవిభూషిత. క్వణన్మంజీరమేఖలాలంకృత. రత్నకిరీటధారిణి. తారహారావళీయుత. తాటంకధారిణి. వాటి కాంతులతో చెక్కిళ్ళు మెరుస్తూ ఉంటాయి. పీతాంబరధరకూడా. సచ్చిదానందరూపిణి. సామవేదస్వరూపిణి. ఆదిత్యపథగామిని. స్వర్లోకనివాసిని. సూర్యమండలంనుంచి వస్తున్న మహాదేవిని ఆవాహన చేస్తున్నాను. ఇలా ధ్యానించి సంధ్యాసంకల్పం చెప్పుకోవాలి. ఆపోహిష్ఠా - అగ్నిశ్చేత్యాది మంత్రాలు పఠించాలి. సంప్రోక్షించుకోవాలి. ఆచమించాలి. మిగతాది అంతా ప్రాతస్సంధ్యలాగానే.

గాయత్రీమంత్రాన్ని ఉచ్చరిస్తూ నారాయణప్రీతికోసమని సూర్యుడికి అర్ఘ్యం ఇవ్వాలి. రెండుకాళ్లూ సరిగా దగ్గరకు పెట్టుకుని నిలబడి సూర్య భగవానుడిని ధ్యానిస్తూ తదభిముఖంగా జలాంజలి విడిచిపెట్టాలి. ఈ అర్ఘ్యం నీళ్ళల్లో విడవకూడదు. అలా విడిస్తే ప్రాయశ్చిత్తం చేసుకోవాలి. అసావాదిత్యేత్యాది మంత్రంతో సూర్యోపస్థానం చెయ్యాలి. పీటమీద కూర్చుని గాయత్రిని జపించాలి. సహస్రమో దానిలో సగమో. ఉపస్థాన తర్పణలన్నీ ప్రాతస్సంధ్యలాగానే. వసిష్ఠుడు ఋషి. విష్ణురూప సరస్వతి దేవత. ఛందస్సు సరస్వతి. సాయంకాలీన సంధ్యాతర్పణే వినియోగః . సామవేదపురుష హిరణ్యగర్భ సరస్వతీ సంకృతి వృద్ధసంధ్యా ఉషసి నిమ్రుజి - ప్రభృతులకు గాయత్రీమంత్రంతో తర్పణలు ఇవ్వాలి. ఈ సాయం సంధ్యోపాసన సర్వదుఃఖహరం. వ్యాధినాశకం. మోక్షప్రదం. సదాచారాలలో సంధ్యావందనానికున్నంత ప్రాధాన్యం దేనికీ లేదు. గాయత్రీమాత సంతోషించి భక్తులకు అభీష్టాలు అన్నీ ఇస్తుంది.

*(అధ్యాయం- 20 , శ్లోకాలు - 55)*



## ◆ మంత్ర పురశ్చరణ ◆

నారదా ! గాయత్రీ పురశ్చరణమని మరొక కార్యక్రమం ఉంది. అత్యంత పుణ్యప్రదం. అభీష్టదాయకం. పర్వతాగ్రం నదీతీరం బిల్వమూలం జలాశయం గోశాల దేవాలయం అశ్వత్థవృక్షం ఉద్యానవనం తులసితోట పుణ్యక్షేత్రం గురుసన్నిధి - ఇలా ఎక్కడైనాగానీ మనస్సు ఏకాగ్రంగా ఉండేచోట కూర్చుని ఈ పురశ్చరణ చేస్తే మంత్రఫలసిద్ధి కలుగుతుంది. ఏ మంత్రాన్నైనా పురశ్చరణ చేసుకోవచ్చు. వ్యాహృతి త్రయసహితంగా గాయత్రిని అయుతసంఖ్యలో జపించాలి. దీంట్లో తాంత్రిక వైదికమార్గాలు రెండూ ఉన్నాయి. రెండూ అనుష్ఠించవలసినవే. నారదా ! గాయత్రీదేవి అంటే వేదమాత. ఆదిపరాశక్తి. సంధ్యావందనరూపంగా ద్విజులన్న వారందరూ శైవులూ వైష్ణవులూ అనే తేడాలు లేకుండా ఉపాసిస్తున్నారు. కనక అందరూ శాక్తేయుల క్రిందే లెక్క.

> సర్వే శాక్తా ద్విజాః ప్రోక్తా న శైవా న చ వైష్ణవాః ।
> ఆదిశక్తిముపాసంతే గాయత్రీం వేదమాతరమ్ ॥ (21 - 6)

ఆత్మశోధన లేని మంత్రశోధన నిష్ఫలం కనక ముందుగా ఆత్మశోధనకోసం మంత్రాన్ని మూడు లక్షలు జపించాలి. కనీసం ఒక లక్షసార్లయినా జపించాలి. ఇది వేదం చెప్పిన పద్ధతిలో జరగాలి. ఆత్మశుద్ధి చేసుకోనిదే ఏ జపహోమాలు చేసినా వ్యర్థం. కనక ముందుగా దాన్ని సాధించాలి. తపస్సుతో శరీరాన్ని తపింపజెయ్యాలి. దేవతలనూ పితృదేవతలనూ తనియించాలి. తపస్సే స్వర్గసాధకం. మహత్త్వసంపాదకం. క్షత్రియుడు బాహుశక్తితో వైశ్య శూద్రులు ధనంతో బ్రాహ్మణుడు జపహోమాదులతో ఆపదలనుంచి గట్టెక్కుతారు.

> క్షత్రియో బాహువీర్యేణ తరేదాపద ఆత్మనః ।
> ధనేన వైశ్యః శూద్రశ్చ జపహోమైర్ద్విజోత్తమః ॥ (21 - 11)

అందుచేత బ్రాహ్మణుడు తపస్సే చెయ్యాలి. చాంద్రాయణాది నియమ నిష్ఠలతో వ్రతాలతో శరీరాన్ని శోషింపజెయ్యాలి. అంతశ్శుద్ధిని సాధించాలి. అదే తపస్సు అంటే. నారదా ! ఇక అన్నశుద్ధి గురించి చెబుతాను. విను. ఆయాచితాన్నం. ఉంఛాన్నం. శుక్లాన్నం. భిక్షాన్నమని నాలుగువిధాలు. శుద్ధమైన భిక్షాన్నం తెచ్చి నాలుగు భాగాలు చెయ్యాలి. ఒకభాగం బ్రాహ్మణులకూ ఒకభాగం గోవులకూ ఒకభాగం అతిథులకూ మిగిలిన భాగాన్ని ఆలుమగలు భుజించాలి. కోడిగ్రుడ్డంత ముద్దలు ఎనిమిది గృహస్థ - వానప్రస్థులకు గ్రాసప్రమాణం. బ్రహ్మచారులు యథేష్టంగా భుజించవచ్చు. గోమూత్ర సమ్మార్జనం అందరికీ తప్పదు. తొమ్మిదిసార్లు ఆరుసార్లు మూడుసార్లుగా ఈ సంప్రోక్షణలు చేసుకోవాలి. చెయ్యి శుభ్రంగా కడుక్కుని తదిత్యాది ఋక్కుతో గాయత్రిని ఉచ్చరిస్తూ ఇవి చేసుకోవాలి. చౌర్యాది దుష్కర్మలు ఆచరించేవారి ఇళ్ళనుంచి భిక్ష తెచ్చుకోకూడదు. అది అథమాన్నం. నరకహేతువు. సరే -



గాయత్రీ ఛందస్సులో అక్షరానికి లక్షచొప్పున ఇరవైనాల్గు లక్షలు మంత్రాన్ని పురశ్చరణ చెయ్యాలి. ఇరవైమూడు లక్షలైతే సరిపోతుందని విశ్వామిత్ర మతం. ప్రాణం లేని దేహంలాంటిది పురశ్చరణ లేని మంత్రం. ఎందుకూ పనికిరాదు.

జీవహీనో యథా దేహస్సర్వకర్మసు న క్షమః ।
పురశ్చరణ హీనస్తు తథా మంత్రః ప్రకీర్తితః ॥ (21 - 24)

కొన్ని రాశులూ కొన్ని నక్షత్రాలూ కొన్ని మాసాలూ కొన్ని తిథులూ కొన్ని వారాలూ పురశ్చరణకు పనికిరావు. వర్జనీయాలు. వాటిని తెలుసుకుని చంద్రతారానుకూలంగా శుక్లపక్షంలో మంచిరోజున మంచి ముహూర్తాన ప్రారంభించి పురశ్చరణ చేస్తే విశేషంగా మంత్రసిద్ధి కలుగుతుంది. ముగిశాక స్వస్తివాచన నాందీశ్రాద్ధాలు యథావిధిగా చెయ్యాలి. విప్రులకు సంతర్పణ చెయ్యాలి. బట్టలు పెట్టాలి. అటుపైని గురువుల అనుమతితో ప్రత్యఙ్ముఖుడై శివస్థానంలో తపస్సు ఆరంభించాలి. తపస్సుకి ప్రసిద్ధిపొందిన పవిత్ర శివస్థానాలు కొన్ని ఉన్నాయి. కాశి, కేదారం, మహాకాళం, నాసికం, త్ర్యంబక మహాక్షేత్రం - ఇవి భూలోకంలో పంచదీపాలు. కూర్మాసనం సర్వత్ర దీపమే. ప్రారంభించిన రోజునుంచి ముగించే రోజుదాకా ప్రతిరోజూ హెచ్చు తగ్గులు లేకుండా మంత్రజపం చెయ్యాలి. మునీశ్వరులైతే నిరంతరాయంగా చెయ్యాలిగానీ తక్కినవారు ఉదయంనుంచి మధ్యాహ్నం వరకూ చేసి తక్కిన సమయాన్ని ధ్యాన మంత్రార్థచింతనలతో గడపవచ్చు. అక్షరలక్షలుగా చేసే ఈ మంత్రపురశ్చరణలో దశాంశాన్ని హోమం చెయ్యాలి. పాలూ నెయ్యీ అన్నమూ తిలలూ పత్రపుష్పాలూ యవలూ హోమద్రవ్యాలు. దశాంశహోమం చేస్తేనేగానీ మంత్రసిద్ధి కలగదు.

చతుర్విధ పురుషార్థాలూ సిద్ధించాలంటే నిత్య నైమిత్తిక కామ్యకర్మలు మూడింటా గాయత్రిని నిష్ఠగా జపించవలసిందే. గాయత్రితో సమానమైన మంత్రం ఇహపరాలలో ఎక్కడా లేదుగాక లేదు. మధ్యాహ్న సమయాన మితంగా భుజిస్తూ మౌనం పాటిస్తూ త్రిస్నానతత్పరుడై జలమధ్యంలో నిలిచి మూడు లక్షలు జపించాలి. కామ్యకర్మగా చేసేట్టయితే కార్యం సిద్ధించేవరకూ మంత్రజపం సాగించాలి. సామాన్య కామ్యకర్మల విషయంలో యథావకాశంగా జపించవచ్చు. ప్రాతస్సంధ్యలో ప్రతిరోజూ సహస్రగాయత్రీజపం చెయ్యడం ఉత్తమోత్తమం. ఆయురారోగ్య ఐశ్వర్యభోగభాగ్యాలు పుష్కలంగా లభిస్తాయి. ఆరునెలలుగానీ మూడునెలలుగానీ చేస్తే సంవత్సరాంతానికి ఫలితం కనపడితీరుతుంది. నేతితో లక్షపద్మాలు హోమం చేస్తే మోక్షం కరతలామలకమే. మంత్రసిద్ధి కలగకపోయాక ఏ జపాలు చేసినా ఎన్ని హోమాలు చేసినా ఫలితం శూన్యం. దధిక్షీరాలతో పాతికలక్షలు హోమం చేస్తే దానిఫలం అమోఘమనీ వర్ణనాతీతమనీ అష్టాంగయోగసిద్ధికి సరిసమానమనీ మహర్షుల అభిప్రాయం. శక్తుడో అశక్తుడో నియతాహారులై ఆరునెలలు జపిస్తే చాలు గురుభక్తిపరులకు మంత్రసిద్ధి కలుగుతుంది. ఒకరోజు పంచగవ్యంతో, ఒకరోజు గాలి భుజించి, ఒకరోజు బ్రాహ్మణాన్నంతో గడిపేవాడు గాయత్రీజపానికి అర్హుడు. గంగాది పవిత్రనదీజలాలలో మునిగి శతమూ ఆ పవిత్రోదకాలను ఆచమించి శతమూ జపిస్తే సర్వపాప విముక్తి కలుగుతుంది. చాంద్రాయణ వ్రతఫలం దక్కుతుంది.



బ్రాహ్మణులూ క్షత్రియులూ సొంత ఇంటిలోనే తపస్సు చేసుకోవచ్చు. గృహస్థులకూ బ్రహ్మచారులకూ వానప్రస్థులకూ ఇది వర్తిస్తుంది. మోక్షకాంక్షులు శ్రౌతస్మార్తక్రియలన్నీ నిర్వహిస్తారు. వీటిని అన్నింటినీ విద్వాంసుల దగ్గర సమగ్రంగా శిక్షణపొంది నిర్వహించాలి. (వినీ చదివీ చేసెయ్యకూడదు). భిక్షాన్నాన్నిమాత్రం ఎనిమిది ముద్దలు స్వయంగా భుజించవచ్చు. *(అధ్యాయం - 21 , శ్లోకాలు - 55)*

## ◆ వైశ్వదేవం ◆

నారదా ! పురశ్చర్యాప్రసంగంతో జ్ఞాపకం వచ్చింది. వైశ్వదేవం గురించికూడా చెబుతాను విను. దేవయజ్ఞ - బ్రహ్మయజ్ఞ - భూతయజ్ఞ - పితృయజ్ఞ - మనుష్యయజ్ఞాలని పంచయజ్ఞాలు. అలాగే ఛుల్లి (పొయ్యి), పేషణి, ఉపస్కరం, కండణి, ఉదకుంభం - అని పంచసూనాలు. పొయ్యిలోగానీ ఇనపపాత్రలోగానీ భూమిమీదగానీ కుండపెంకులో (మూకుడు వగైరా) గానీ వైశ్వదేవం చెయ్యరాదు. కుండంలో లేదా స్థండిలంలో (పాత్ర) చెయ్యాలి. చేతితోగానీ చేటతోగానీ చర్మనిర్మితులతోగానీ అగ్నిని విసరకూడదు. విప్రముఖంనుంచి అగ్నిపుట్టింది కనక నోటితో ఊదిమాత్రమే ప్రజ్వలింపజెయ్యాలి. చర్మపటకంతో విసిరితే వ్యాధిగ్రస్తుడవుతాడు. చేటతో విసిరినవాడు ధనం నష్టపోతాడు. చేతితో విసిరినవాడు మృత్యువువాత బడతాడు. కనక నోటితో ఊదటమే కర్మసిద్ధికి ఉపకారకం.

న పాణినా న శూర్పేణ న చ మేధ్యాజినాదిభిః ।
ముఖేనోపధమే దగ్నిం ముఖాదేష వ్యజాయత ॥ (22 - 5)

పళ్ళూ పాలూ పెరుగూ దుంపలూ కూరగాయలూ ఇత్యాదులతో వైశ్వదేవహోమం చెయ్యాలి. ఇవ్వి ఏవీ దొరక్కపోతే పుడకలూ ఆకులూ గడ్డీ - వీటితో చెయ్యవచ్చు. నేతిలో ముంచి హోమం చెయ్యాలి. నూనెగానీ ఉప్పుగానీ తగలకూడదు. పెరుగూ (పాయసాలు) పాలల్లోనైనా ముంచి చెయ్యవచ్చు. ఇవీ దొరక్కపోతే ఆయామంత్రాలతో రవ్వంత నీరు చిలకరించి ఆ వస్తువుల్ని (దుంపలూ కూరలూ) హోమం చెయ్యాలి. ఎండిపోయినవీ నిలవున్నవీ (పర్యుషితం - చద్ది) చేస్తే కుష్ఠవ్యాధి వస్తుంది. ఎంగిలివి హోమం చేస్తే (ఉచ్ఛిష్టం) శత్రువులకు లొంగిపోవలసి వస్తుంది. గిడచబారి గట్టిగా తయారైన వాటితో (రూక్షాలు) హోమం చేస్తే దారిద్ర్యం దాపురిస్తుంది. ఉప్పుగానీ నూనెగానీ తగిలిందో మహాపాపం చుట్టుకుంటుంది.

నిప్పుల్ని బూడిదదులిపి మంటచేసి అగ్నికి ఉత్తర దిగ్భాగంలో మంత్రపూర్వకంగా హోమం చెయ్యాలి. ఇలా వైశ్వదేవం చెయ్యకుండా భోజనం చేసిన బ్రాహ్మణ గృహస్థు కాలసూత్ర నరకకూపంలో తలకిందుల్లా పడతాడు. కూరగాయ, ఆకుకూర, దుంప, పండు ఏదో ఒకటి - తన ఆహారం ఏదైతే దాన్ని



అగ్నిలో వేల్చాలి. ఈ వైశ్వదేవం కాకముందే భిక్షుకుడెవరైనా భిక్షార్థియై గుమ్మంలోకి వస్తే వైశ్వదేవంకోసమని కొన్నితీసి ప్రక్కనపెట్టి, భిక్షవేసి పంపించవచ్చు. వైశ్వదేవీకృతదోషాన్ని భిక్షుకుడు తొలగిస్తాడు తప్ప భిక్షుకృతదోషాన్ని వైశ్వదేవం తొలగించలేదు.

వైశ్వదేవకృతం దోషం శక్తో భిక్షుర్వ్యపోహితుమ్ ।
న తు భిక్షు కృతం దోషం వైశ్వదేవో వ్యపోహతి ॥
యతిశ్చ బ్రహ్మచారీ చ పక్వాన్నస్వామినావుభౌ ।
తయోరన్నమదత్త్వాతు భుక్త్వా చాంద్రాయణం చరేత్ ॥ (22 - 15)

పక్వాన్నానికి యతి - బ్రహ్మచారులు అధిపతులు. వారికి పెట్టకుండా గృహస్థు భుజిస్తే చాంద్రాయణవ్రతం ప్రాయశ్చిత్తంగా చేసుకోవాలి. వైశ్వదేవం ముగించాక గోగ్రాసం వెయ్యాలి. ఎలాగంటే - ఓ సురభీ ! వైష్ణవీ ! మాతా ! విష్ణుపదస్థితా ! నేనిస్తున్న గ్రాసాన్ని స్వీకరించు అని అభ్యర్థిస్తూ గోభ్యశ్చ నమః అంటూ పూజించి సమర్పించాలి. ఇలా చేస్తే కామధేనువు (సురభి) అనుగ్రహిస్తుంది. గోశాలనుంచి తిరిగివచ్చి ఇంటివాకిట్లో కొంచెంసేపు - పాలు పితికినంతసేపు (గోదోహనకాలం) - నిలబడాలి. అతిథుల కోసం ఎదురుచూడటం. ఇంటికి వచ్చి అతిథి వట్టినే తిరిగి వెళ్ళే పరిస్థితి రాకూడదు. అలా తిరిగివెళ్ళే అతిథి తన పాపాన్ని మనకు అంటగట్టి మన పుణ్యమంతా మూటగట్టుకుపోతాడు.

అతిథిర్యత్ర భగ్నాశో గృహాత్ ప్రతినివర్తతే ।
స తస్మై దుష్కృతం దత్త్వా పుణ్యమాదాయ గచ్ఛతి ॥ (22 - 20)

తల్లిదండ్రులూ సోదరులూ గురువూ బిడ్డలూ సేవకుడూ ఆశ్రితులూ అతిథులూ అభ్యాగతులూ అగ్నిదేవుడూ - వీరంతా గృహస్థుకి పోష్యులు (తాను పోషించవలసినవారు).

మాతా పితా గురుర్భ్రాతా ప్రజా దాసః సమాశ్రితః ।
అభ్యాగతోఽతిథిశ్చాగ్నిరేతే పోష్యా ఉదాహృతాః ॥ (22 - 21)

ఈ గృహస్థాశ్రమ ధర్మాలను తెలుసుకుని మోహవిభ్రాంతి విడిచి జీవయాత్ర సాగించాలి. వీడు నావాడు, వీడు పరాయివాడు అనే భేదబుద్ధి ఉండకూడదు. ధర్మం తప్పకుండా ఇలా నడుచుకుంటే సోమయాగఫలం లభిస్తుంది. పంచమహాయజ్ఞాలనూ చక్కగా నిర్వహిస్తే ఎంతటి దరిద్రుడైనా ధనవంతుడవుతాడు.



## ◆ పంచప్రాణాగ్నిహోత్రం ◆

నారదా ! భోజనానికి ముందు ప్రాణాగ్నిహోత్రమని ఒకటి ఉంది. అదికూడా పనిలోపని చెప్పేస్తాను. లుసుకో. దీన్ని తెలుసుకున్నా ఆచరించినా పాపవిమోచనం తథ్యం. ఋణత్రయ విముక్తి కలుగుతుంది. ర్వయజ్ఞ ఫలం దక్కుతుంది. ఇరవైయొక్క తరాలు తరిస్తాయి. ఈ పంచప్రాణాగ్నిహోత్రానికి హృదయపద్మమే రణి. మనస్సు మంథానం. వాయువు అనే రజ్జువుతో అగ్నిని మథించాలి. దీనికి నేత్రాలు అధ్వర్యువు. తర్జనీ ుధ్యమాంగుష్ఠాలతో ప్రాణాగ్నికి మధ్యమానామికాంగుష్ఠాలతో అపానాగ్నికి, కనిష్ఠికానామికాంగుష్ఠాలతో వ్యానాగ్నికి, నిష్ఠికా తర్జన్యంగుష్ఠాలతో ఉదానాగ్నికి, అయిదువేళ్ళతోనూ తీసుకుని సమానాగ్నికి అన్నం మెతుకులు హుతులుగా లోపలికి వెయ్యాలి. ప్రణవాద్యాలూ స్వాహాంతాలుగా నామమంత్రాలు జపించాలి. (ఓం ాణాయ స్వాహా. ఓం ఉదానాయ స్వాహా - ఇత్యాదిగా). ముఖంలో ఆహవనీయాగ్ని, హృదయంలో ార్హపత్యాగ్ని, నాభిలో దక్షిణాగ్ని స్మర్తవ్యాలు. అధోభాగంలో అనథ్యకులిద్దరూ సభ్యులు. ఈ హోమానికి వాక్కు హోత. ప్రాణమేమో ఉద్గాత. చక్షువు సరే అధ్వర్యుడు. మనస్సు బ్రహ్మ. శ్రోత్రమేమో అగ్నీధ్రుడు. అహంకారమే ఁశువు. ప్రణవమే పయస్సు. బుద్ధియే పత్ని. గృహస్థాశ్రమవాసి దీనికి అధీనుడు. వక్షఃస్థలమే యజ్ఞవేదిక. రోమాలే వర్భలు. చేతులే స్రుక్స్రువాలు (హోమాగ్నిలోకి నెయ్యి పోసే కర్రగరిటెలు).

బంగారపు రంగులో ఉండే (రుక్మవర్ణం) క్షుధాగ్నియే ప్రాణమంత్రానికి ఋషి. ఆదిత్యుడు దేవత. గాయత్రియే ఛందస్సు. "ఓం ప్రాణాయ స్వాహా" అనీ "ఇదమాదిత్యాయ న మమ" అనీ మంత్రం. ఇక అపానమంత్రానికి ఆవుపాలలాగా తెల్లగా ఉండే శ్రద్ధాగ్నియే ఋషి. సోముడు దేవత. ఉష్ణిక్కు ఛందస్సు. ఓం అపానాయ స్వాహా. సోమాయేదం న మమ - అనేది మంత్రం. వ్యానమనబడే ప్రాణవాయు మంత్రానికి పద్మవర్ణంలో ఉండే అగ్నియే ఋషి. అగ్నియే దేవత. అనుష్టుప్పు ఛందస్సు. ఓం వ్యానాయ స్వాహా. అగ్నయ ఇదం న మమ - అనేది మంత్రం. ఉదాన ప్రాణవాయు మంత్రానికి ఇంద్రగోపవు రంగులో ఉండే అగ్నియే ఋషి. వాయువే దేవత. బృహతీఛందస్సు. ఓమ్ ఉదానాయ స్వాహా. వాయవ ఇదం న మమ - అనేది మంత్రం. సమాన ప్రాణవాయుమంత్రానికి మెరుపురంగులో విరూపుడుగా ఉండే అగ్నియే ఋషి. పర్జన్యుడు దేవత. పంక్తి - ఛందస్సు. ఓం సమానాయ స్వాహా. పర్జన్యాయేదం న మమ అనేది మంత్రం. ఇవి పంచప్రాణాహుతులు. ఇవి చెబుతూ అయిదుసార్లు కాసిని కాసిని మెతుకులు తిన్నాక ఆరవ ఆహుతి ఇవ్వాలి. దానికి వైశ్వానరాగ్ని దేవత. గాయత్రి ఛందస్సు. ఆత్మయే దేవత. ఓం పరమాత్మనే స్వాహా. పరమాత్మన ఇదం న మమ - అనేది మంత్రం. ఇవి ఆరూ అయ్యాక అన్నాన్ని పరబ్రహ్మస్వరూపంగా భావిస్తూ ఆరగించాలి. ***(అధ్యాయం - 22, శ్లోకాలు - 45)***

భోజనం ముగించాక అమృతాపిధానమిత్యాది మంత్రాన్ని చదువుతూ కొన్ని మెతుకులు ఉచ్ఛిష్టాన్ని విస్తరి చివర నేలమీదకు తొయ్యాలి. నా వంశంలో పుట్టి అన్నకాంక్షులైనవారందరూ దీనితో తృప్తి పొందుదురుగాక అనే మంత్రం పఠించాలి. అలాగే - రౌరవ పుణ్యనిలయ పద్మార్బుదనివాసులై దాహార్తులైన మా పూర్వీకులందరికీ ఈ ఉదకం అక్షయ్యమై అందుగాక అని ఆకాంక్షిస్తూ నీళ్ళు వదిలిపెట్టి పవిత్రగ్రంథిని (దర్భముడి) విప్పి నేలమీద



(మండలంలో) పడవెయ్యాలి. భోజన పాత్రలోమాత్రం (విస్తరి) వెయ్యకూడదు. పొరపాటున అలా వేసినవాడు పంక్తిదూషకుడవుతాడు. అలాగే ఉచ్ఛిష్టాన్ని కుక్క తాకినా ప్రాయశ్చిత్తం చేసుకోవాలి. రాత్రి అంతా ఉపోష్యం ఉండి మర్నాడు మంచగవ్యంతో శుద్ధిచేసుకోవాలి. (అనుచ్ఛిష్ట సంస్పర్శకు స్నానంతో శుద్ధి)

నారదా ! ఏకాహుతిప్రదానమే కోటియజ్ఞఫలం ఇస్తుంది. పంచాహుతులూ చేస్తే ఫలం అనంతం. ప్రాణాగ్నిహోత్ర విధానంలో భోక్తకూ దాతకూ పుణ్యఫలం సమానం. ఇద్దరికీ స్వర్గప్రాప్తి తప్పదు. పవిత్రం ధరించి భోజనం చేసే బ్రాహ్మణుడు ముద్దముద్దకూ పుణ్యాన్ని సముపార్జించుకుంటాడు. ఇలాగ నిత్యమూ త్రిసంధ్యల్లోనూ జపతర్పణ హోమాదులు చేసి బ్రాహ్మణులతో కలిసి భుజించడాన్నే పురశ్చరణమంటారు.

పూజాకాలత్రయే నిత్యం జపస్తర్పణమేవ చ ।
హోమో బ్రాహ్మణభుక్తిశ్చ పురశ్చరణముచ్యతే ॥ (23 - 10)

## ◆ బ్రహ్మచర్యం ◆

అధఃశయానుడూ (నేలమీద పడుకునేవాడు). ధర్మాత్ముడూ జితేంద్రియుడూ మితాహారీ వినయవంతుడూ శాంతచిత్తుడూ నిత్య త్రిషవణస్నాయీ నిత్యశుభభాషణుడూ పాపిష్ఠస్నేహదూరుడూ - ఉత్తమోత్తముడు. జపహోమాది సమయాల్లో మౌనంగా ఉండాలి. ఏ సంభాషణమూ చెయ్యకూడదు. మైథునాలాపాలు (బూతులు) అస్సలు చెయ్యకూడదు. మనోవాక్కాయకర్మలలో సర్వకాలసర్వావస్థలలో మైథునప్రసక్తిని పరిత్యజించడమే బ్రహ్మచర్యమంటేను.

కర్మణా మనసా వాచా సర్వావస్థాసు సర్వదా ।
సర్వత్ర మైథునత్యాగో బ్రహ్మచర్యం ప్రచక్షతే ॥ (23 - 13)

బ్రాహ్మణక్షత్రియులు గృహస్థాశ్రమంలోకూడా బ్రహ్మచర్యం పాటించవచ్చు. సంస్కారవంతురాలైన సవర్ణస్త్రీని వివాహం చేసుకుని నిషిద్ధ సమయాలలో కలయికను పూర్తిగా పరిత్యజించి, అనుమతించిన దివాలలో రాత్రిపూటమాత్రమే సంగమిస్తూ సంసారం సాగిస్తే అది బ్రహ్మచర్యమే. దేవ పితృ ఋషి ఋణాలను తీర్చుకునే ప్రయత్నం చెయ్యనివాడికి ముక్తి లభించదు. అతడి జన్మ అజాగళస్తనంలాగా వ్యర్థమే. యజ్ఞయాగాదులతో దేవఋణం, తిలోదకాలతో పితౄణం, బ్రహ్మచర్యంతో ఋషిఋణం తీరుతుంది. అలా తీర్చేందుకే ఆశ్రమధర్మాలను పాటించడం. క్షీరాహారిగానీ ఫలాహారిగానీ శాకాహారిగానీ హవిష్యాహారిగానీ భిక్షాహారిగానీ చాంద్రాయణ వ్రతధారిగానీ అవుతూ మంత్రజపం చెయ్యాలి. క్షార లవణ ఆమ్ల తాంబూలాదులూ రాత్రిభోజనమూ దుష్టసహవాసమూ మద్యసేవనమూ శ్రౌతస్మార్తవిధులకు మతరామూ పనికిరావు. అలాగే రాత్రిపూట మంత్రజపం చెయ్యకూడదు. (జపం రాత్రౌ వివర్జయేత్).



ద్యూతక్రీడలతో స్త్రీగోష్ఠులతో నిద్రతో వాదవివాదాలతో వృథాకాలయాపన చెయ్యకూడదు. దేవతా పూజలూ స్తోత్రపఠనలూ ఆగమశాస్త్ర గ్రంథ పరిశీలనలూ - వీటితో కాలాన్ని సద్వినియోగం చేసుకోవాలి. భూశయనం బ్రహ్మచర్యం మౌనదీక్ష నిత్యమూ త్రిషవణస్నానం శూద్రకర్మవివర్జన నిత్యపూజ నిత్యదానం ఆనందం స్తుతికీర్తనం నైమిత్తికార్చనం దేవతలపట్ల విశ్వాసం గురువులపట్ల విశ్వాసం ఇవి పన్నెండూ జపనిష్ఠుడి ధర్మాలు. సిద్ధిదాయకాలు.

భూశయ్యా బ్రహ్మచారిత్వం మౌనచర్యా తథైవ చ ।
నిత్యం త్రిషవణస్నానం శూద్రకర్మ వివర్జనమ్ ॥
నిత్యపూజా నిత్యదానమానందః స్తుతికీర్తనమ్ ।
నైమిత్తికార్చనం చైవ విశ్వాసో గురు - దేవయోః ॥
జపనిష్ఠస్య ధర్మా యే ద్వాదశైతే సుసిద్ధిదాః ॥ (23 - 26)

నిత్యమూ సూర్యుడికి అభిముఖంగా సూర్యోపస్థానం చేసి గాయత్రిని జపించాలి. దేవతా ప్రతిమల ముందుగానీ అర్చించిన అగ్నిముందుగానీ చెయ్యవచ్చు. బ్రాహ్మణుడు స్నాన పూజా జప ధ్యాన హోమతర్పణ తత్పరుడై నిష్కామంగా సత్కర్మలనన్నింటినీ ఆచరించి బ్రహ్మార్పణం చేస్తూ నియమం తప్పకుండా ఆయా పురశ్చరణలు చేస్తూ కాలం గడపాలి. ఆత్మకు ప్రసన్నత సిద్ధిస్తుంది. జపహోమాలపట్ల ఏకాగ్రత కుదురుతుంది. తపస్సుకీ అధ్యయనానికీ అంకితమైనవారికి భూతదయ సహజంగా ఉదయిస్తుంది. ఈ తపస్సే స్వర్గసంపాదకం. ఈ తపస్సే మహత్త్వసాధకం. తపస్వికి సాధ్యం కానిది ఏదీ లేదు. ఏయే దేవతలు ఏయే ఫలాలను ఇస్తారని ఋషులు చెప్పారో ఆదేవతలను ఆ రీతిలో ఉపాసిస్తే ఆ కోరికలు నెరవేరతాయి. పురశ్చరణమనేది సర్వకర్మలకూ సిద్ధికారకం. కనక ఆరంభంలో చెయ్యాలి.

## ◆ ప్రాజాపత్యం ◆

వేదాధ్యయనానికి ముందు ప్రాజాపత్యం చెయ్యాలి. గుండు కొట్టించుకుని మీసాలు తీయించుకుని గోళ్ళు తొలగించుకుని శుచి అవ్వాలి. ఒక పగలూ రేయీ మౌనంగా ఉండాలి. వ్యాహృతులు జపించాలి. ఆపోహిష్ఠాది మంత్రాలతో సంప్రోక్షించుకోవాలి. ఆద్యంతాలలో పునంతీ, స్వస్తిమతీ, పావమానేత్యాది మంత్రాలతో ఆయావిధులు నిర్వర్తించాలి. సహస్రగాయత్రి చెయ్యాలి. కనీసం నూరు - లేదా వంద చెయ్యాలి. తర్పణలు విడిచిపెట్టాలి. అవంభాష్యులతో భాషించకూడదు. సత్యవాక్నియమం పాటించాలి. ప్రాజాపత్య సాంతపన పరాక చాంద్రాయణాదులకు ఈ నియమాలు సమానం. ఇలా చేస్తే పంచమహాపాతక విముక్తి కలుగుతుంది. మూడు చాంద్రాయణాలతో బ్రహ్మలోకం లభిస్తుంది. ఎనిమిదింటితో దేవతాసాక్షాత్కారం. పదింటితో సర్వచ్ఛందఃపరిజ్ఞానం, సర్వకామ సముపలబ్ధి.



మూడునాళ్ళు ప్రాతఃకాలంలోనూ మూడునాళ్ళు సాయంకాలంలోనూ అయాచితాన్నం తింటూ మరిమూడునాళ్ళు ఉపోష్యం ఉండి ప్రాజాపత్యం చెయ్యాలి. గోమూత్రం గోమయం గోక్షీరం గోదధి ఆవునెయ్యి వీటితో ఉపవాసం ఉండి ఏకరాత్రం గడిపితే అది సాంతపనం. రోజుకి ఒక్కముద్దమాత్రమే తింటూ మూడునాళ్ళు ఉపవాసం చేస్తే అది మహాసాంతపనం. జలక్షీర ఘృతానిలాలను ప్రతిమూడునాళ్ళకూ ఒక్కసారి గ్రహిస్తూ జలాహారిగా ద్వాదశాహాలు ఉపవాసం చేస్తే అది పరాకవ్రతం. శుక్లపక్షంలో రోజుకి ఒకముద్ద చొప్పున పెంచుకొంటూ వెళ్ళి కృష్ణపక్షంలో (అలా తగ్గించుకుంటూ వచ్చి) ఒక్కొక్కటీ తింటూ అమావాస్యనాడు అస్సలు ఏమీ తినకండా ఉపోష్యం ఉంటే అది చాంద్రాయణవ్రతం.

ఏకైకం తు గ్రసేత్పిండం కృష్ణే, శుక్లం చ వర్ధయేత్ ।
అమావాస్యాం న భుంజీత ఏవం చాంద్రాయణే విధిః ॥ (23 - 52)

ప్రాతఃకాలాన ఆహ్నికక్రియలు నిర్వర్తించి నాలుగుముద్దలూ, సాయంకాలాన విధులు నిర్వర్తించి సూర్యాస్తమయం అయ్యాక నాలుగు ముద్దలూ తింటూ నెలగడపడం శిశుచాంద్రాయణ వ్రతం. మధ్యాహ్నంపూట ఎనిమిదేసి హవిష్యపిండాలను తిని ఉపవాసాలుండటం యతిచాంద్రాయణం. ఈ వ్రతాలు ఒక్కొక్కటీ సప్తరాత్రకాల వ్యవధిలో త్వక్ - అసృక్ - పిశిత - అస్థి - మేదో - మజ్జా - వసాభాగాలను శుద్ధి చేస్తాయి. ఇలా శరీరాన్నీ ఆత్మనూ శుద్ధి పరచుకుని పురశ్చరణ స్వాధ్యాయాది కర్మలు ఆరంభించాలి. నియతాత్ముడై ఆచరించాలి. అప్పుడు ఇష్టకామ్యాలు అన్నీ సిద్ధిస్తాయి. నారదా ! శ్రుతిసారమైన పురశ్చర్యావిధానం సవిస్తరంగా నీకు తెలియజేశాను. ఇది అత్యంత గోప్యంసుమా !

*(అధ్యాయం - 23, శ్లోకాలు - 63)*

నారాయణమహర్షీ! పురశ్చర్యావిధానం తెలిసింది. దానితోపాటు ప్రాజాపత్యాదివ్రతాలూ తెలిసాయి. మరి శాంతిప్రయోగాలుకూడా తెలియజేస్తే ధన్యుణ్ణి అవుతాను - అన్నాడు నారదుడు. సరే అని నారాయణుడు ఆరంభించాడు.

## ◆ శాంతి హోమాలు ◆

నారదా ! శమీసమిధలతో భూత రోగ గ్రహాదుల ఉపశమనంకోసం శాంతిహోమం చెయ్యాలి. పాలుగారే చెట్టునుంచి పచ్చి పేళ్ళు తెచ్చి హోమం చేస్తే ఇంకా మంచిది. శలలతో ( ? ) చేసినా భూతరోగశాంతి కలుగుతుంది. సూర్యుడికి ముందుగా జలతర్పణం చెయ్యాలి. మోకాలిబంటి నీటిలో నిలిచి చేస్తే దోషాలన్నీ అంతరిస్తాయి. మెడబంటి లోతులో నిలబడి చేస్తే ప్రాణాంతకభయాలు తొలగిపోతాయి. శాంతికర్మలన్నింటికీ నీటిలో నిలిచి జపం చెయ్యడమే ఉత్తమం.



బంగారం వెండి రాగి మట్టి పాత్రల్లోగానీ బొడిపెలులేని కొయ్యపాత్రలోగానీ పంచగవ్యాన్ని నింపుకొని క్షీర వృక్షకాష్ఠాలతో జ్వలితాగ్నిలో సమంత్రకంగా హోమం చెయ్యాలి. సహస్రాహుతులు చెయ్యాలి. మిగిలిన పంచగవ్యంలో దర్భలు ముంచి ప్రదేశమంతా సంప్రోక్షించాలి. బలిప్రదానం చెయ్యాలి. పరదేవతను ధ్యానించాలి. అభిచారాలూ పాపాలూ నశిస్తాయి. దేవ భూత పిశాచాదులు వశమవుతాయి. గృహ గ్రామ రాష్ట్రాలను విడిచి దుష్టగ్రహ పిశాచాదులు పారిపోతాయి.

మండలంలో శూలముద్ర లిఖించి అభిమంత్రించి ఇలాగే సహస్రహోమం చేసి నిఖనం చేస్తే సర్వశాంతులూ సిద్ధిస్తాయి. పూర్వోక్తమైన పాత్రకు సూత్రవేష్టనం చేసి నేలలోగానీ ఇసుకలోగానీ పాతిపెట్టి మంత్రజలాలు నింపి నాలుగు దిక్కులనుంచీ తీర్థజలాలను ఆవాహనచేసి వివిధపుష్పాలూ బిల్వపత్రాలూ బియ్యమూ నువ్వులూ ఆవాలూ పాలుగారే చెట్ల చిగురాకులూ అందులో వెయ్యాలి. కుశకూర్చంతో (దర్భలతో చేసిన పొడవుపాటి ముడి) మంత్రాలు చదువుతూ కలియద్రిప్పాలి. అటుపైని ఆనీరు జల్లుకోవాలి. బ్రాహ్మణులపై జల్లాలి. అందరూ పవిత్రులవుతారు. భూతరోగాదులూ చేతబడులూ (అభిచారాలు) తొలగిపోతాయి. ఈ అభిషేకంతో విప్రుడు మృత్యువు నోటినుంచికూడా బయటపడగలడు. దీర్ఘాయుర్దాయం కోరుకునేవారందరూ ఈ అభిషేకం జరిపించుకోవాలి. ఇది చేసిన విప్రులకి నూరుగోవులూ సంతృప్తికరంగా దక్షిణలూ ఇవ్వాలి.

శనివారంనాడు రావిచెట్టు దగ్గర మంత్రజపం చెయ్యడం, భూతరోగాభిచారాది శాంతికరం. పాలుగారే గుడూచీ సమిధలతో (తిప్పతీగ) హోమం చేస్తే సర్వరోగాలూ ఉపశమిస్తాయి. దీన్ని మృత్యుంజయహోమమంటారు. ఇలాగే జ్వరశాంతికి చూతహోమం క్షయరోగోపశమనానికి వచాహోమం. రాచపుండు (రాజయక్ష్మ) తగ్గడానికి మధుత్రితయహోమం - చెప్పబడ్డాయి. అన్నంతో పాయసం వండి సూర్యుడికి నివేదించి హోమంచేసి మిగిలినదాన్ని భుజిస్తే రాజయక్ష్మ (రాచపుండు) తగ్గుతుంది. తిప్పతీగ కణుపులతో సోమదేవతాకంగా హోమంచేస్తే క్షయరోగం ఉపశమిస్తుంది. శంఖవృక్షపుష్పాలతో హోమం కుష్ఠురోగనివారిణి. అపామార్గ పుష్పాలను బియ్యంతోకలిపి చేసే హోమం అపస్మారరోగానికి ఉపశమనం. క్షీరవృక్ష సమిధలతో హోమం ఉన్మాదరోగ నివారకం. ఔదుంబర సమిధలతో చేసే హోమం అతిమేహరోగాన్ని నయం చేస్తుంది. ఇక్షుమధుహోమంతో ప్రమేహరోగశాంతి. మధుత్రితయహోమం మసూరికా నివారకం. కపిలాహోమంకూడా ఇంతే. ఇంటిలో చీమలూ దోమలూ వగైరా క్రిమి క్రీటకాలు నశించాలంటే శమీసమిధలు హోమం చెయ్యాలి. వనవేతసహోమం (అడవి పుబ్బలి) వారంరోజులు చేస్తే పిడుగుపాటుల నుంచీ భూకంపాలనుంచీ నివారణ లభిస్తుంది. శతమంత్రజపం చేసి లోష్టాన్ని తాకిస్తూ ఏ దిక్కున ఎంతదూరం వెడితే ఆ మార్గంలోని ప్రదేశాలన్నీ అగ్ని - మారుత - శత్రుభయ రహితాలవుతాయి. మనస్సులోనే ఈ జపం చేస్తే బంధవిమోచన కలుగుతుంది. అభిమంత్రితజలపానం భూతపిశాచవిమోచకం. అలాగే అభిమంత్రించి విభూతి పెట్టినా శిరమున జల్లినా సర్వవ్యాధులూ సర్వభయాలూ తొలగిపోతాయి. నూరేళ్ళు సుఖంగా జీవిస్తాడు.



ఈ హోమాలన్నీ ఎవరికివారే చేసుకోవడం ఉత్తమం. అశక్తులు భూరిదక్షిణలిచ్చి బ్రాహ్మణులతో చేయించుకోవచ్చు. పుష్పాలతో చేసే హోమాలు కొన్ని ఉన్నాయి. అవి పుష్టికరాలు. లక్ష్మీప్రదాలు. ఎర్రకలువలతో హోమం చేస్తే సంపదలు పెరుగుతాయి. బంగారం దొరుకుతుంది. బిల్వపత్ర, బిల్వపుష్ప, బిల్వఫల, బిల్వ సమిధలతో చేసే హోమాలు ఏవైనా సంపత్ప్రదాలే. వీటిని నేతితో అభిమంత్రించి నూరుచొప్పున సప్తాహహోమం చేస్తే లక్ష్మీదేవి స్వయంగా వచ్చి ఇంటిలో తిష్ఠవేస్తుంది. త్రిమధులాజహోమం (పేలాలు) కన్యాలాభం కలిగిస్తుంది. ఇదే స్త్రీలు చేస్తే కోరిన వరుడు లభిస్తాడు. సూర్యదేవతాకంగా జలహోమం చేస్తే నీటిలో పడిపోయిన బంగారం చేతికందుతుంది. అన్నహోమం అన్నవర్ధకం. వ్రీహిహోమం (బియ్యం) వ్రీహివర్ధకం. పిడకలతో చేసే హోమాలు పశుసంపదను పెంచుతాయి. ప్రియంగు - పాయస - ఆజ్యహోమాలు సంతానప్రాప్తికరాలు. భాస్కరుడికి హోమంచేసి మిగిలిన పాయసాన్నం ఋతుస్నాతలు భుజిస్తే గర్భధారణ జరుగుతుంది. పుత్రసంతానం కలుగుతుంది. మొలకలు వచ్చిన తడిగింజలతో హోమం ఆయుర్వర్ధకం. ఇటువంటి ఎర్రగింజలూ మధుత్రయమూ వ్రీహి - కలిపి శతహోమం చేస్తే పట్టిందల్లా బంగారమవుతుంది. ఆయుర్దాయం పెరుగుతుంది.

సువర్ణకుట్మలాలు (సంపంగి మొగ్గలు) హోమం చేసినా కర్తకు ఆయుర్దాయం పెరుగుతుంది. గరిక పాలు తేనె నెయ్యి - సప్తాహహోమం చేస్తే అపమృత్యువు తొలగిపోతుంది. అన్నమూ పాలూ నెయ్యి వీటితో చేసిన హోమానికీ ఇదే ఫలం. న్యగ్రోధసమిధలూ (మర్రి) పాయసమూ రోజుకి నూరుగా ఏడురోజులు హోమం చేసి ఆ ఏడురోజులూ పాలుత్రాగి గడిపి మంత్రజపం చేస్తే మృత్యువును జయిస్తాడు. నిరాహారుడై మౌనియై మూడురేయింబవళ్ళు జపించినా యముడు దరిదాపులకి రాడు. నీటిలోదిగి జపించినా బిల్వవృక్ష సన్నిధిలో జపించినా విశేషఫలితాలుంటాయి. ఒక్క నెలపాటు ఇలా జపిస్తే చాలు వాడు రాజ్యాధికారి అవుతాడు. సమూలఫల పల్లవంగా బిల్వవృక్షాన్ని హోమంచేసినా రాజ్యం దక్కుతుంది. నూరు పద్మాల చొప్పున నెలనాళ్ళు చేసినా ఈ ఫలం లభిస్తుంది. గంజితోహోమం చేస్తే పంటలు పండే గ్రామం దక్కుతుంది. యుద్ధాలకు వెళ్ళబోయేముందు రావి సమిధలతో హోమం నిర్వహిస్తే విజయం వరించి వస్తుంది. పాలతో కలిపి వేతసపత్రపుష్పహోమం సప్తాహదీక్షగా చేస్తే వానలు కురుస్తాయి. బొడ్డులోతు నీళ్ళల్లో నిలిచి మంత్రజపం ఏడురోజులు చేస్తే వానలు పడతాయి. నీటితో విభూతి శతహోమం చేసి అతివృష్టిని నివారించవచ్చు. మోదుగు సమిధలతో చేసే హోమం బ్రహ్మవర్చస్సును అందిస్తుంది. పలాశకుసుమాలతో హోమం సర్వాభీష్టప్రదాయకం. పాలతో హోమం మేధాశక్తినీ నేతితో హోమం బుద్ధిశక్తినీ పెంపొందిస్తాయి. ఉప్పూ తేనె కలిపి హోమం చేస్తే కోరిన వస్తువునల్లా వశపరుచుకోవచ్చు. ఇలాగా కోరికలు తీర్చే హోమాలు చాలా ఉన్నాయి. ఆయా నియమాలను పాటిస్తూ మంత్రాలను ఉచ్చరిస్తూ నిర్వహించాలి. బ్రాహ్మణుడు తనకోసంగానీ ఇతరులకోసంగానీ వీటిని చెయ్యవచ్చు. అన్యులకోసం చేసినా ఇవి విప్రుడికీ పుష్టిదాయకాలేకావడం మరీ విశేషం. రోజుకి వెయ్యిగా నెలనాళ్ళు



మంత్రజపం చేస్తే ఆయుష్కాముడి కోరిక నెరవేరుతుంది. ఆయురారోగ్యాలు రెండూ కావాలనుకుంటే రెండు నెలలు జపం చెయ్యాలి. సంపదలుకూడా కావలిస్తే మూడునెలలు, దారపుత్రులుకూడా కావలిస్తే నాలుగునెలలూ, వారికీ ఆరోగ్యం కావాలంటే అయిదునెలలు, వారికీ సంపదలు కావాలంటే ఆరునెలలు, వారికీ విద్యలు కావాలంటే ఏడునెలలు - ఇలాగ కోరికలు పెరుగుతున్నకొద్దీ మంత్రజపం చెయ్యాల్సిన నెలలూ పెరుగుతుంటాయి. ఒంటికాలుమీద నిలబడి చేతులుపైకెత్తి నిరాశ్రయుడుగా నిలిచి మూడునెలలు రోజుకి మూడువందలు చొప్పున మహామంత్రం జపిస్తే ఆ విప్రుడికింక తీరని కోరికలంటూ ఉండవు. అలాగే శతోత్తర సహస్రం చొప్పున (పదకొండువందలు) జపించగలిగితే సిద్ధించనిదంటూ ఉండదు. నీటిలో మునిగి నూరుచొప్పున నెలనాళ్ళు జపిస్తే ఇష్టఫలావాప్తి. మూడువందల చొప్పున జపిస్తే సర్వవాంఛిత సిద్ధి. రాత్రిపూట భోజనం చేస్తూ ఇదే పద్ధతిలో ఏడాదిపాటు మంత్రం జపిస్తే ఋషి అవుతాడు. రెండేళ్ళు జపిస్తే అమోఘవాక్కు అవుతాడు. మూడేళ్ళు జపిస్తే త్రికాలవేత్త అవుతాడు. నాలుగేళ్ళు జపిస్తే భగవంతుడు తోడై నిలుస్తాడు. అయిదేళ్ళకి అణిమాది శక్తులు సిద్ధిస్తాయి. ఆరేళ్ళకి కామరూపధారణశక్తి వస్తుంది. ఏడేళ్ళకి అమరత్వం లభిస్తుంది. తొమ్మిదేళ్ళకి మనుత్వం, పదేళ్ళకి ఇంద్రత్వం, పదకొండేళ్ళకి ప్రజాపతిత్వం, పన్నెండేళ్ళకి బ్రహ్మత్వం సిద్ధిస్తాయి. ఈ తపస్సుతోనే నీవంటివారు లోకాలను జయిస్తున్నారు. కొందరు శాకాలు తిని, కొందరు కందమూలాలు తిని, కొందరు ఫలాలు తిని, కొందరు పయస్సులుగ్రోలి, కొందరు నెయ్యిత్రాగి, కొందరు సోమరసం పుచ్చుకుని, కొందరు చరువు (హవిష్యం) ఆరగించి, కొందరు పదిహేను రోజులకు ఒక్కసారి మాత్రమే భుజించి, కొందరు భిక్షాన్నం తిని - ఇలాగ కఠోర నియమాలతో తపస్సులు చేస్తున్నారు. మహర్షు లనిపించుకుంటున్నారు.

ఇటువంటి దీక్షతో మంత్రజపం మూడువేలు చేస్తే రహస్యంగా చేసిన పాపాలు తొలగిపోతాయి. వెయ్యిచొప్పున నెలనాళ్ళు చేస్తే బంగారం దొంగిలించిన పాపమైనా అంతరిస్తుంది. మూడువేలు చొప్పున నెలనాళ్ళు చేస్తే సురాపానదోషం నశిస్తుంది. గురుపత్నీ సంగమదోషమైనా తొలగిపోతుంది. అడవిలో పర్ణశాల వేసుకుని ఇలా జపం చేస్తే బ్రహ్మహత్యాపాతకమూ అంతరిస్తుంది. నీళ్ళల్లో మునిగి రోజుకి వెయ్యి చొప్పున పన్నెండురోజులు జపిస్తే సర్వమహాపాతకాలూ తొలగిపోయి విప్రుడు విశుద్ధుడవుతాడు.

ప్రాణాయామానికికూడా ఇంతటి శక్తి ఉంది. అది సర్వపాప వినాశకం. నూరు ప్రాణాయామాలు చేస్తే అన్ని పాపాలూ తొలగి శుచి అవుతాడు. పర్ణశాలలో ఉంటూ రోజుకి వెయ్యిచొప్పున నెలనాళ్ళు ఉపవాసం ఉండి మంత్రజపం చేసినవాడిని నిత్యజాపి అంటారు. అతడు పవిత్రుడు. ఇరవైనాలుగు వేలు చేస్తే అది కృచ్ఛసంజ్ఞితం. అరవైనాలుగువేలు చేస్తే చాంద్రాయణసమానం. ఉభయ సంధ్యల్లోనూ ప్రాణాయామం చేసి కనీసం నూరుసార్లు (గాయత్రి) మంత్రజపం చెయ్యాలి. ఇది గృహస్థుకి కర్తవ్యం తదిత్యాదిఋక్కు సర్వపాపహరం. నీటిలోమునిగి ఈ ఋక్కును రోజుకి నూరుసార్లు జపించాలి. జపిస్తూ సూర్యరూప గాయత్రీదేవిని ధ్యానిస్తే సర్వపాప విముక్తి కలుగుతుంది.



నారదా ! శాంతి శుద్ధ్యాది కల్పాలన్నీ రహస్యాతిరహస్యాలైనా నీకు సవిస్తరంగా సవ్యాఖ్యానంగా తెలియజేశాను. ఇది సదాచార సంగ్రహం. క్లుప్తంగా చెప్పాను. ఈ పద్ధతిలో జీవిక సాగించినవారిని మాయాదుర్గ అనుగ్రహిస్తుంది. నిత్య - నైమిత్తిక - కామ్యకర్మలన్నింటినీ యథావిధిగా ఆచరించినవారికి భుక్తిముక్తిఫలాలు కొంగుబంగారాలు. ఆచారమే మొట్టమొదటి ధర్మం. ధర్మానికి ప్రభువు (రక్షణ) జగదీశ్వరి అని సర్వశాస్త్రాలూ ఆచార ఫలాన్నీ మహత్తునూ శతధా కొనియాడుతున్నాయి. ఆచారవంతుడు ఎప్పుడూ పరిపూతుడే. అతడే సుఖి. అతడే ధన్యుడు. ఇది సత్యం. సత్యం. సదాచారం పాటించడంకన్నా దేవీ అనుగ్రహసంపాదనకు మరొక సులభమార్గం లేదు. దీన్ని వినడంకూడా సంపత్తి సౌఖ్యదాయకమే. సదాచారంవల్ల ఐహికాముష్మిక సుఖాలు అన్నీ చేకూరుతాయనడం సారాంశం. అదే నీకు చెప్పాను. మరింకేమి వినాలనుకుంటున్నావో చెప్పు అని నారాయణమహర్షి ముగించాడు.

*(అధ్యాయం - 24, శ్లోకాలు - 100)*

ఆచారః ప్రథమో ధర్మో ధర్మస్య ప్రభురీశ్వరీ ।
ఇత్యుక్తం సర్వశాస్త్రేషు సదాచారఫలం మహత్ ॥
ఆచారవాన్సదా పూతస్సదైవాచారవాన్ సుఖీ ।
ఆచారవాన్సదా ధన్యః సత్యం సత్యం చ నారద ॥
దేవీప్రసాదజనకం సదాచారవిధానకమ్ ।
యద్యపి శృణుయాన్మర్త్యో మహాసంపత్తి సౌఖ్యభాక్ ॥
సదాచారేణ సిద్ధేచ్ఛ ఐహికాముష్మికం సుఖమ్ ।
తదేవ తే మయోక్తం కిమన్యత్ శ్రోతుమిచ్ఛసి ॥ (24 - 100)

**ఏకాదశ స్కంధం - శ్లోకాలు : 1243 - తెలుగుసేత : బేతవోలు రామబ్రహ్మం**





# ద్వాదశ స్కంధము

శౌనకాది మహామునులారా ! నారాయణమహర్షి ఇంతవరకూ చెప్పిన సదాచారాన్ని శ్రద్ధగా విన్న నారదుడు మరొక ప్రశ్న వేశాడు. వారిద్దరి సంభాషణగానే దాన్ని వినడం అందంగా ఉంటుంది. కనక అలాగే చెబుతాను వినండి - అంటూ సూతుడు కొనసాగించాడు.

నారాయణమహర్షీ! సదాచారం గురించి సవివరంగా తెలియజేశావు. చాంద్రాయణాది వ్రతాలగురించీ చెప్పావు. కానీ అవన్నీ ఆచరణకు కష్టసాధ్యాలు. మాలాంటివారికి దేవి అనుగ్రహం లభించేట్టు, సుఖంగా తేలికగా అనుష్ఠించడానికి తగినట్టు ఏమైనా వ్రత విధానాలుంటే తెలియజెయ్యి. గాయత్రీవిధి చెప్పావు. అనుష్ఠానం చాలా ఉంది. వాటిల్లో ముఖ్యాతిముఖ్యం అత్యధిక పుణ్యప్రదం ఏమిటి ? గాయత్రీమంత్రానికి ఇరవైనాలుగక్షరాలన్నావు. వాటికి ఋషులు ఎవరు ? ఛందస్సు లేమిటి ? దేవతలెవరు ? ఇవన్నీ సమగ్రంగా తెలియజేసి నావంటి అలనుల్ని తరింపజెయ్యి - అని నారదుడు ప్రార్థించాడు. నారాయణ మహర్షి చిరునవ్వులు చిందిస్తూ ఆరంభించాడు.

## ◆ గాయత్రీ మంత్రాక్షర మహిమ ◆

నారదా ! తక్కిన అనుష్ఠానాలను వేటిని చేసినా చెయ్యకపోయినా గాయత్రిని చేస్తే చాలు ద్విజుడు కృతకృత్యుడైనట్టే. మూడు సంధ్యల్లోనూ అర్ఘ్యమిచ్చి మూడువేలు గాయత్రీజపం చేస్తే అదే పదివేలు. దేవతలకుకూడా పూజ్యుడవుతాడు. అంగన్యాస కరన్యాసాదులు చెయ్యనీ మాననీ. సచ్చిదానందరూపిణి గాయత్రిని నిర్వ్యాజంగా ధ్యానించడం ముఖ్యం.

కుర్యాదన్యన్న వా కుర్యాదనుష్ఠానాదికం తథా ।
గాయత్రీమాత్రనిష్ఠస్తు కృతకృత్యో భవేత్ ద్విజః ॥
సంధ్యాసు చార్ఘ్యదానం చ గాయత్రీ జపమేవ చ ।
సహస్రత్రితయం కుర్వన్ సురైః పూజ్యో భవేన్మునే ॥ (1 - 9)



గాయత్రీమంత్రంలో ఒక్క అక్షరాన్ని సిద్ధింపజేసుకుంటే చాలు ఆ సాధకుడు హరిహర హిరణ్యగర్భ సూర్యచంద్రాగ్నులతో పోటీపడతాడు. ఒక్కొక్క అక్షరమూ అంతంత ప్రభావం కలిగినవి. అందుకని ఆ అక్షరాల ఋషిచ్ఛందోదేవతలను అదేక్రమంలో అక్షరాలా చెబుతాను శ్రద్ధగా గ్రహించు. వామదేవుడు - అత్రి - వసిష్ఠుడు - శుక్రుడు - కణ్వుడు - పరాశరుడు - విశ్వామిత్రుడు - కపిలుడు - శౌనకుడు - యాజ్ఞవల్క్యుడు - భరద్వాజుడు - జమదగ్ని - గౌతముడు - ముద్గలుడు - వేదవ్యాసుడు - లోమశుడు - అగస్త్యుడు - కౌశికుడు - వత్సుడు - పులస్త్యుడు - మాండూకుడు - దూర్వాసుడు - నారదుడు - కశ్యపుడు - ఈ ఇరవైనాలుగు మందీ వరసగా ఆ ఇరవైనాలుగు వర్ణాలకూ ఋషులు. గాయత్రి - ఉష్ణిక్కు - అనుష్టుప్పు - బృహతి - పంక్తి - త్రిష్టుప్పు - జగతి - అతిజగతి - శక్వరి - అతిశక్వరి - ధృతి - అతిధృతి - విరాట్ - ప్రస్తారపంక్తి - కృతి - అతికృతి (ప్రకృతి) - ఆకృతి - వికృతి - సంకృతి - అక్షరపంక్తి - భూః - భువః - స్వః - జ్యోతిష్మతి - ఇవి ఇరవైనాలుగూ ఛందస్సులు. అదేక్రమంలో దేవతలనూ చెబుతాను. మొదటి అక్షరం అగ్నిదేవతాకం. రెండవది ప్రజాపతిదేవతాకం. మూడు సోమదేవతాకం. నాలుగు ఈశాన దేవతాకం. అయిదు సవితృదేవతాకం. ఆరు ఆదిత్యదేవతాకం. ఏడవది బృహస్పతి దేవతాకం. ఎనిమిదవది మిత్రావరుణ దేవతాకం. తొమ్మిది భగదేవతాకం. పదవది అర్యమదేవతాకం. పదకొండు గణేశదేవతాకం. పన్నెండు త్వష్టృదేవతాకం. పదమూడవది పౌష్ణదేవతాకం. పధ్నాల్గు ఇంద్రాగ్ని దేవతాకం. పదిహేనవది వాయవ్య దేవతాకం. పదహారవది వామదేవ దేవతాకం. పదిహేడవది మైత్రావరుణిదేవతాకం. పద్దెనిమిదవది వైశ్వదేవం. పంధ్తొమ్మిదవది మాతృదేవతాకం. ఇరవై విష్ణుదేవతాకం. ఇరవైయొకటి వసుదేవతాకం. ఇరవై రెండవది రుద్రదేవతాకం. ఇరవైమూడవది కుబేరదేవతాకం. ఇరవైనాల్గవది అశ్వినీదేవతాకం.

నారదా ! ఇవీ గాయత్రీమంత్రంలో ఇరవైనాలుగక్షరాలకూ ఋషులూ ఛందస్సులూ దేవతలూ సంగ్రహంగా తెలియజేశాను. దీన్ని వింటేచాలు జపించినంత ఫలితమూ దక్కుతుంది.

***(అధ్యాయం - 1 , శ్లోకాలు - 27)***

ఈ వర్ణాలకు అధిదేవతలేకాదు అధిదేవీశక్తులూ ఉన్నాయి. మంత్రాక్షరాల క్రమంలో ఆ శక్తుల పేర్లు చెబుతాను. విను. వామదేవి - ప్రియ - సత్య - విశ్వ - భద్రవిలాసినీ - ప్రభావతి - జయ - శాంత - కాంత - దుర్గ - సరస్వతి - విద్రుమ - విశాలేశ - వ్యాపిని - విమల - తమోపహారిణి - సూక్ష్మ - విశ్వయోని - నిరయ - వశ - పద్మాలయ - పరశోభ - భద్ర - ద్రుపద - అనే ఇరవైనాలుగు శక్తులు ఆ అక్షరాలకు అధిదేవీమూర్తులు. ఇంక ఈ వర్ణాల వర్ణాలు (రంగులు) ఏమిటంటే -



మొదటిది సంపంగిపువ్వురంగు. రెండవది అతసీవర్ణం. మూడవది పగడం రంగు. నాల్గవది స్ఫటికవర్ణం. అయిదవది పద్మం రంగు. ఆరవది తరుణాదిత్యసన్నిభం. ఏడవది శంఖచంద్రసమప్రభం. ఎనిమిదవది చిగురాకురంగు (ప్రవాళపద్మపత్రాభం) తొమ్మిదవది పద్మరాగపు రంగు. పదవది ఇంద్రనీలపు రంగు. పదకొండవది ముత్తెపురంగు. పన్నెండవది కుంకుమరంగు. పదమూడవది కాటుకరంగు. పధ్నాల్గవది రక్తవర్ణం. పదిహేనవది వైఢూర్య వర్ణం. పదహారవది క్షౌద్రవర్ణం. పదిహేడవది పసపురంగు. పద్దెనిమ్మిదవది మొల్లపువ్వు రంగు (కుంద దుగ్ధాభం). పంథొమ్మిదవది సూర్యకాంతి రంగు. ఇరవై చిలకతోక రంగు (శుకపుచ్ఛనిభం). ఇరవై యొకటి శతపత్రనిభం. ఇరవైరెండు కేతకీపుష్ప సంకాశం (మొగలిపువ్వు రంగు). ఇరవైమూడవది మల్లికాకుసుమం. ఇరవైనాల్గవ అక్షరానిది కరవీరవర్ణం.

ఈ వర్ణాలు ఇరవైనాల్గింటికీ ఇరవైనాలుగు తత్వాలున్నాయి. పృథివి - ఆపస్సు (జలం) - తేజస్సు - వాయువు - ఆకాశం - గంధం - రసం - రూపం - శబ్దం - స్పర్శ - ఉపస్థం - పాయువు - పాదం - పాణి - వాక్కు - ఘ్రాణం - జిహ్వ - చక్షుస్సు - త్వక్కు - శ్రోత్రం - ప్రాణం - అపానం - వ్యానం - సమానం - అనేవి వీటి తత్వాలు. ఇలాగే ఒక్కొక్క వర్ణానికీ ముద్రలున్నాయి. సుముఖం - సంపుటం - వితతం - విస్తృతం - ద్విముఖం - త్రిముఖం - చతుర్ముఖం - పంచముఖం - షణ్ముఖం - అధోముఖం - వ్యాపకాంజలికం - శకటం - యమపాశం - గ్రథితం - సన్ముఖోన్ముఖం - విలంబం - ముష్టికం - మత్స్యం - కూర్మం - వరాహం - సింహాక్రాంతం - మహాక్రాంతం - ముద్గరం - పల్లవం ఇవి ఇరవైనాలుగు ముద్రలు. త్రిశూలం - యోని - సురభి - అక్షమాల - లింగం - అంబుజం అనేవి ఆరూ మహాముద్రలు. తుర్యరూపాలు. ఇవన్నీ మహాపాపక్షయకరాలు. కీర్తి ప్రదాలు. కాంతి ప్రదాలు.

***(అధ్యాయం - 2, శ్లోకాలు - 18)***

నారాయణమహర్షీ ! స్వామీ ! సర్వజగన్నాథా ! చతుష్షష్టి కళాభిజ్ఞా ! యోగవిద్యారహస్యవేత్తా ! నాకొక్క సందేహం మిగిలిపోయింది. ఏ పుణ్యకార్యం చేస్తే మోక్షం వస్తుంది ? బ్రహ్మరూపత్వం సిద్ధిస్తుంది? దేహం దేవతారూపాన్నీ మంత్రరూపాన్నీ పొందుతుంది ? ఆ సత్కర్మ ఏమిటో దాని ఆచరణవిధానమేమిటో మంత్ర - ఋషి - చ్ఛందో - అధిదైవత - ధ్యానాలు ఏమిటో తెలుసుకోవాలని కుతూహలంగా ఉంది. ప్రభూ ! దయచేసి తెలియపరచవూ !

నారదమహర్షీ ! తప్పకుండా తెలియపరుస్తాను. నువ్వు అడగడమూ నేను చెప్పకపోవడమూనా !! గాయత్రీకవచమని అత్యంత గుహ్యం ఒకటి ఉంది. దాన్ని పఠించినా ధరించినా సర్వపాపాలూ నశిస్తాయి. కోరికలన్నీ తీరతాయి. అంతేకాదు - దేవీరూపుడవుతాడు.



## ◆ గాయత్రీ కవచం ◆

గాయత్రీ కవచానికి బ్రహ్మవిష్ణుమహేశ్వరులే ఋషులు. ఋగ్యజుస్సామాథర్వణాలే ఛందస్సులు. బ్రహ్మరూపిణి గాయత్రీదేవియే అధిదేవత. కవచమిది తద్బీజకం. భర్గశక్తికం. ధీకీలకం. (ధియ ఇతి కీలకమ్). మోక్షార్థే వినియోగః. దీనిలో నాలుగు వర్ణాలు హృదయం. మూడు వర్ణాలు శిరస్సు. నాల్గింటితో శిఖ. తర్వాత మూడింటితో కవచం. అటుపైని నాల్గింటితో నేత్రం. తక్కిన నాల్గూ అస్త్రకం. ఇక దీని ధ్యానశ్లోకమేమిటంటే -

ముక్తావిద్రుమహేమనీల ధవళచ్ఛాయైర్ముఖైస్త్రీక్షణై
ర్యుక్తా మిందు నిబద్ధ రత్నమకుటాం తత్త్వార్థవర్ణాత్మికామ్ ।
గాయత్రీం వరదాభయాంకుశకశాః శుభ్రం కపాలం గదామ్
శంఖం చక్రమధారవిందయుగళం హస్తైర్వహంతీం భజే ॥ (3 - 10)

గాయత్రీదేవి తూర్పుదిక్కున రక్షించుగాక. సావిత్రి దక్షిణదిక్కునా, (బ్రహ్మ) సంధ్యాదేవి పశ్చిమదిక్కునా సరస్వతీదేవి ఉత్తరదిక్కునా పార్వతి ఆగ్నేయదిక్కునా జలశాయిని నైరృతిదిక్కునా పవమానవిలాసిని వాయవ్యదిక్కునా రుద్రాణి ఈశాన్యదిక్కునా బ్రహ్మాణి ఊర్ధ్వదిక్కునా వైష్ణవి అధోదిక్కునా - ఇలా దశదిశలా ఆ భువనేశ్వరి నన్ను రక్షించుగాక.

తత్పదం నా పాదాలనూ, సవితుః పదం జంఘలనూ, వరేణ్యం పదం కటిప్రదేశాన్నీ, భర్గః పదం నాభినీ, దేవస్య పదం హృదయాన్నీ, ధీమహి పదం చెక్కిళ్ళనూ, ధియఃపదం నేత్రాలనూ, యఃపదం లలాటాన్నీ, నః పదం శిరస్సునూ, ప్రచోదయాత్ పదం శిఖాభాగాన్నీ - రక్షించును గాక ! ఇలాగే తత్‌వర్ణం శిరస్సునూ, సకారం ఫాలాన్నీ, 'వి' వర్ణం నేత్రాలనూ, తుకారం కపోలాలనూ, వకారం నాసాపుటాలనూ, రేకారం ముఖాన్నీ, ణికారం పై పెదవిని, యమ్‌కారం కింది పెదవినీ, భకారం ఆస్య మధ్యభాగాన్నీ, ర్గోవర్ణం చిబుకాన్నీ, దేకారం కంఠప్రదేశాన్నీ, వకారం భుజస్కంధాలనూ, స్యకారం కుడి చేతినీ, ధీకారం ఎడమ చేతినీ, మకారం హృదయాన్నీ, హికారం ఉదరభాగాన్నీ, ధికారం నాభినీ, యోకారం కటి ప్రదేశాన్నీ, మరొక యోకారం మర్మాంగాన్నీ, నః వర్ణం రెండు తొడలనూ, ప్రకారం జానువులనూ, చోకారం జంఘలనూ, దకారం గుల్ఫాలనూ, యాకారం పాదాలనూ, తకారపు పొల్లు సర్వాంగాలనూ రక్షించుగాక !

నారదా ! ఇది గాయత్రీ కవచం. దీన్ని ఇట్లా అనుసంధానం చేసుకున్నవారూ (ధరించినవారూ) విన్నవారూ అనంతకోటి బాధలనుంచి విముక్తి పొందుతారు. చతుష్షష్టి కళావేత్తలవుతారు. సర్వపాపవిముక్తులవుతారు. పరబ్రహ్మస్వరూపాన్ని అందుకుంటారు. సందేహంలేదు.

*(అధ్యాయం - 3, శ్లోకాలు - 25)*



## ◆ గాయత్రీ హృదయం ◆

బ్రహ్మనందనా ! ఇక ఇప్పుడు అత్యంత ప్రధానమైన గాయత్రీహృదయం చెబుతాను తెలుసుకో. సాధుకుడెవరైనాగానీ ఇష్టదేవతతో అభిన్నుడయ్యే అర్చించాలి. నాదేవో దేవమర్చయేత్ అని వేదం చెబుతోంది. కనక పిండబ్రహ్మాండాల సమైక్యాన్ని (అభిన్నతను) భావన చేస్తూ తన శరీరంలో దేవీరూపాన్ని ప్రతిష్ఠించుకోవాలి. గాయత్రీదేవి అంటే విరాడ్రూపిణి. మహాదేవి. వేదజనని. ఆ మూర్తిని సాధకుడు స్వశరీరంలో భావనామయంగా ప్రతిష్ఠించుకోవడమే గాయత్రీ హృదయమంటే.

పిండబ్రహ్మాండయోరైక్యాద్భావయేత్ స్వతనౌ తథా ।
దేవీరూపం నిజే దేహే తన్మయత్వాయ సాధకః ॥
నాఽదేవోఽభ్యర్చయేద్దేవమితి వేదవిదో విదుః ।
తతోఽభేదాయ కాయే స్వే భావయేద్దేవతా ఇమాః ॥ (4 - 6)

ఈ గాయత్రీహృదయానికి నారాయణుడు (అహమేవ) ఋషి. ఛందస్సు గాయత్రి. దేవత - పరమేశ్వరి. అంగషట్కం పూర్వోక్తమే. ఏకాంతంలో ఆసనబద్ధుడై ముందుగా ఏకాగ్రచిత్తంతో గాయత్రీదేవిని ధ్యానించాలి. అటుపైని అర్థన్యాసం - నా శిరస్సున ద్యులోకం, దంతపంక్తిలో అశ్వినులు, పెదవులలో ప్రాతస్సాయంసంధ్యలు, ముఖంలో అగ్ని, జిహ్వలో సరస్వతి, కంఠప్రదేశంలో బృహస్పతి, స్తనభాగంలో అష్టవసువులు, బాహువులలో మరుత్తులు (వాయువులు), హృదయంలో పర్జన్యుడు, ఉదరంలో ఆకాశం, నాభిలో అంతరిక్షం, కటిప్రదేశంలో ఇంద్రాగ్నులు, జఘనంలో విజ్ఞానఘనుడైన ప్రజాపతి, ఊరువులలో కైలాసమలయపర్వతాలు, జానువులలో విశ్వేదేవులు, జంఘలలో కౌశికుడు, గుహ్యంలో అయనాలు, ఊరువులలో పితృదేవతలు, పాదాలలో పృథివి, అంగుళులలో వనస్పతులు, రోమాలలో ఋషులు, గోళ్ళలో ముహూర్తాలు, ఎముకలలో గ్రహాలు,రక్తమాంసాలలో ఋతువులు, రెప్ప(పాటు)లలో సంవత్సరాహోరాత్రసూర్యచంద్రులు ప్రతిష్ఠింపబడుగాక - అని భావించాలి. సహస్రనేత్ర గాయత్రిని శరణువేడాలి.

ఓం తత్సవితుర్వరేణ్యాయ నమః. ఓం తత్పూర్వా జయాయ నమః. ఓం తత్ప్రాతరాదిత్యాయ నమః. ఓం తత్ప్రాతరాదిత్యప్రతిష్ఠాయ నమః - ఇలాగ నమస్కరించాలి. ప్రాతస్సంధ్యతో రాత్రిపాపమూ, సాయంసంధ్యతో పగటి పాపమూ నశించి సాయంప్రాతస్సంధ్యావందనాలు చేసినవాడు పాపరహితుడవుతాడు. సర్వతీర్థాలలోనూ స్నానంచేసిన పుణ్యాత్ముడవుతాడు. సకలదేవతలకూ పరిచితుడవుతాడు. అవాచ్యవచన అభక్ష్యభక్షణ అభోజ్యభోజన అచోష్యచోషణ అసాధ్యసాధన అగ్రాహ్యగ్రహణాది మహాపాపాలనుంచి విముక్తుడవుతాడు. దానప్రతిగ్రహదోషాలు తొలగిపోతాయి. పంక్తిదూషణ దోషం అంటదు.అనృతవచన దోషమూ అంతరిస్తుంది. అబ్రహ్మచారి బ్రహ్మచారి అవుతాడు. (అంతటి పవిత్రుడవుతాడని).



ఈ గాయత్రీ హృదయాన్ని అనుష్ఠించినవారేకాదు అధ్యయనం చేసినవారూ వెయ్యి యజ్ఞాలు చేసిన ఫలాన్నీ అరవైవేల మంత్రజపం చేసినపుణ్యాన్నీ చిటికెలో అనాయాసంగా పొందుతారు. ఎనమండుగురు బ్రాహ్మణులను చక్కగా పోషించిన ఫలం దక్కుతుంది. దీన్ని నిత్యమూ అధ్యయనం చేసిన బ్రాహ్మణుడు, బ్రహ్మలోకం చేరుకుంటాడు. *(అధ్యాయం - 4, శ్లోకాలు - 8)*

## ◆ గాయత్రీ స్తోత్రం ◆

నారదా ! గాయత్రీ హృదయం చెప్పానుగదా, ఇక గాయత్రీస్తోత్రం చెబుతున్నాను - విను. ఆదిశక్తీ ! జగన్మాతా ! భక్తానుగ్రహకారిణీ ! సర్వవ్యాపికా ! అనంతా ! శ్రీసంధ్యా ! నమోనమః. నువ్వే సంధ్యవు, గాయత్రివి, సావిత్రివి, సరస్వతివి, వైష్ణవివి, రౌద్రివి, రక్తవు, శ్వేతవు, కాళికవు. ప్రాతఃకాలంలో బాలాస్వరూపిణివి. మధ్యాహ్నంలో యువతివి. సాయంకాలంలో వృద్ధవు. మునిపూజితవు. హంసవాహనవు. గరుడారూఢవు. వృషభవాహినివి. ఋగ్వేదం పఠిస్తూ తపస్వులకు దర్శనమిస్తావు. యజుర్వేదం పఠిస్తూ అంతరిక్షంలో విరాజిల్లుతావు. సామగానం చేస్తూ భూమండలమంతటా సంచరిస్తుంటావు. రుద్రలోక విష్ణులోక బ్రహ్మలోకాలు నీ నివాసభూములు. మానవులను అనుగ్రహించడమే నీ శీలం, నీ స్వభావం. ఓ మాయాదేవీ ! సప్తర్షిప్రీతికారిణీ ! బహువరప్రదా ! పార్వతీపరమేశ్వరులకు నువ్వు చేతుల్లో కన్నుల్లో అశ్రుబిందువుల్లో స్వేదంలో జన్మించావు. నువ్వు ఆనందజననివి. దుర్గవు. ఓ వరేణ్యా ! వరదా ! వరిష్ఠా ! వరవర్ణినీ ! గరిష్ఠా ! వరార్హా ! వరారోహా ! సప్తమీ ! నీలగంగా ! సంధ్యా ! సర్వదా ! భోగమోక్షప్రదా ! స్వర్గంలో మందాకినివి. భూలోకంలో భాగీరథివి. పాతాళంలో భోగవతివి. నువ్వు త్రిలోకవాహినివి. త్రిలోకనివాసినివి. భూలోకంలో ధరిత్రివి - శోకధారిణివి. భువర్లోకంలో వాయుశక్తివి. స్వర్లోకంలో తేజోనిధివి. మహర్లోకంలో మహాసిద్ధివి. జనలోకంలో జననివి. తపోలోకంలో తపస్వినివి. సత్యలోకంలో సత్యవాక్కువు. విష్ణులోకంలో లక్ష్మీదేవివి. బ్రహ్మలోకంలో గాయత్రివి. రుద్రలోకంలో గౌరివి. హరుడికి అర్ధాంగనివాసినివి. తల్లీ ! మహదహంకారాలకు (సంధాన) ప్రకృతివి నువ్వు. సామ్యావస్థారూపిణివి. శబల బ్రహ్మరూపిణివి. పరా - పరమా - పరాశక్తులు నువ్వే. ఇచ్ఛాక్రియా జ్ఞానశక్తులను ఇచ్చేదానవు నువ్వే. గంగా యమునా విపాశా సరస్వతీ సింధు నర్మదా గోదావరీ కావేరీ కౌశికీ చంద్రభాగా గండకీ గోమతీ వేత్రవతీ శతద్రూ సరయూ దేవికా ఇరావతీ వితస్తా తాపీపీ ప్రముఖనదీనదాలన్నీ నువ్వే.

మానవశరీరంలో ఉండే ఇడా పింగళా సుషుమ్నా గాంధారీ హస్తిజిహ్వా పూషా అలంబుసా కుహూ శంఖినీ ప్రాణవాహినీ ప్రభృతి నాడీమండలం నువ్వే. హృదయపద్మంలో ప్రాణశక్తివి. కంఠంలో స్వప్ననాయికవు. తాలువులలో సదాధారవు. బిందుప్రదేశంలో బిందుమాలినివి. మూలాధారంలో కుండలినివి. కేశమూలాల్లో వ్యాపినివి. శిఖామధ్యాసనవు. శిఖాగ్రభాగంలో మనోన్మనివి. అమ్మా ! వెయ్యేల. ఈ జగత్త్రయంలో సమస్తమూ సర్వస్వమూ నువ్వే. మహాదేవీ ! శ్రీదేవీ ! సంధ్యాదేవీ ! నమో నమః. నమో నమః. నమో నమః.



నారదా ! ఈ గాయత్రీ స్తోత్రాన్ని సంజవేళల్లో పఠిస్తే సమస్తశక్తులూ సిద్ధిస్తాయి. అపుత్రకులు పుత్రవంతులూ దరిద్రులు ధనవంతులూ అవుతారు. సర్వతీర్థ తపోదాన యజ్ఞఫలం లభిస్తుంది. భూలోకంలో శతాయుష్కుడై భోగాలు అనుభవించి ఆరోగ్యవంతుడుగా జీవించి కట్టకడపట అపునర్భవంగా ముక్తిపొందుతాడు. ఏ సమయంలో ఎక్కడ పఠించినా పుణ్యప్రదమే. ఎవరైనా పఠిస్తుండగా విన్నా పుణ్యమే. పీయూషధారవంటి స్తోత్రమిది. *(అధ్యాయం -5, శ్లోకాలు - 29)*

నారాయణమహర్షీ ! సర్వధర్మజ్ఞా ! సర్వశాస్త్ర విశారదా ! శ్రుతి స్మృతి పురాణ రహస్యాలెన్నెన్నో నీనోటినుంచి విన్నాను. అయినా ఇంకా తృప్తి కలగడంలేదు. అవిద్యను తొలగించి విద్యను కలిగించేది ఏది ? బ్రహ్మజ్ఞానం పొందాలంటే ఏది దారి ? ఐహికాముష్మిక సుఖాలతోపాటు మోక్షం కూడా కావాలంటోంది అంతరంగం. దీనికి సాధనమేమిటి ? సారాంశంగా తెలియజేస్తివా నీ పుణ్యమా అని తరిస్తాను.

## ◆ గాయత్రీ అష్టోత్తర సహస్రం ◆

నారదా ! మహర్షీ ! సాధు సాధు. అడగవలసింది అడిగావు. నువ్వు మహాప్రాజ్ఞుడివి. సందేహంలేదు. కనకనే చెబుతున్నాను. ఆలకించు. నీ సందేహాలు మూడింటికీ ఒక్కటే సమాధానం. ఒక్కటే సాధనం. అదే శ్రీగాయత్రీ అష్టోత్తర సహస్రనామమాల. సృష్టికి ఆదిలో భగవంతు డుపదేశించిన సహస్రనామాలను నీకు ఉపదేశిస్తున్నాను. వీటిని జపించడం విద్యాప్రదం. బ్రహ్మజ్ఞానదాయకం. భుక్తిముక్తిప్రదం. దీనికి ఋషి సాక్షాత్తూ చతుర్ముఖుడు. గాయత్రియే అధిదేవత. ఛందస్సు అనుష్టుప్పు. హల్లులన్నీ బీజాక్షరాలు. స్వరాలన్నీ (అచ్చులు) శక్తులు. మాతృకాక్షరాలతో అంగన్యాసకరన్యాసాలు. సాధకుల హితం కోరి ముందుగా ధ్యానశ్లోకం చెప్పి, తరవాత సహస్రనామమాల చెబుతాను.

రక్తశ్వేతహిరణ్యనీలధవళైర్యుక్తాం త్రినేత్రోజ్జ్వలామ్
రక్తాం రక్తనవస్రజం మణిగణైర్యుక్తాం కుమారీమిమామ్ ।
గాయత్రీం కమలాసనాం కరతలవ్యానద్ధకుండాంబుజామ్
పద్మాక్షీం చ వరస్రజం చ దధతీం హంసాధిరూఢాం భజే ॥ (6 - 9)

అచింత్యలక్షణా అవ్యక్తా అర్థమాతృమహేశ్వరీ అమృతార్ణవమధ్యస్థా అజితా అపరాజితా అణిమాదిగుణాధారా అర్కమండలసంస్థితా అజరాజా అపరాధర్మా అక్షసూత్రధరా అధరా అకారాది క్షకారాంతా అరిషడ్వర్గభేదినీ అంజనాద్రిప్రతీకాశా అంజనాద్రి నివాసినీ అదితిః అజపా అవిద్యా అరవిందనిభేక్షణా అంతర్బహిస్స్థితా అవిద్యాధ్వంసినీ అంతరాత్మికా అజా అజముఖావాసా అరవిందనిభాననా అర్ధమాత్రా అర్థదా అనఘా అరిమండలమర్దినీ అసురఘ్నీ అమావాస్యా అలక్ష్మీఘ్నీ అంత్యజార్చితా



ఆదిలక్ష్మీః ఆదిశక్తిః ఆకృతిః ఆయతాననా (అయుతాననా) ఆదిత్యపదవీచారా ఆదిత్యపరిసేవితా ఆచార్యావర్తనా ఆచారా ఆదిమూర్తివాసినీ ఆగ్నేయీ ఆమరీ ఆద్యా ఆరాధ్యా ఆసనస్థితా ఆధారనిలయా 50) ఆధారా ఆకాశాంతనివాసినీ ఆద్యాక్షరసమాయుక్తా ఆంతరాకాశరూపిణీ ఆదిత్యమండలగతా ఆంతరధ్వాంతనాశినీ

ఇందిరా ఇష్టదా ఇష్టా ఇందీవరనిభేక్షణా ఇరావతీ ఇంద్రపదా ఇంద్రాణీ ఇంద్రరూపిణీ ఇక్షుకోదండసంయుక్తా ఇషుసంధానకారిణీ ఇంద్రనీలసమాకారా ఇడాపింగళరూపిణీ ఇంద్రాక్షీ ఈశ్వరీ ఈహాత్రయవివర్జితా

ఉమా ఉషా ఉడునిభా ఉర్వారుకఫలాననా ఉడుప్రభా ఉడుమతీ ఉడుపా ఉడుమధ్యగా ఊర్ధ్వా ఊర్ధ్వకేశీ ఊర్ధ్వాధోగతిభేదినీ ఊర్ధ్వబాహు(క్రి)ప్రియా ఊర్మిమాలావాగ్గ్రంథదాయినీ

ఋతం ఋషిః ఋతుమతీ ఋషిదేవనమస్కృతా ఋగ్వేదా ఋణహర్త్రీ ఋషిమండలచారిణీ ఋద్ధిదా ఋజుమార్గస్థా ఋజుధర్మా ఋతుప్రదా ఋగ్వేదనిలయా ఋజ్వీ ఌప్తధర్మప్రవర్తినీ ఌతారివరసంభూతా ఌతాదివిషహారిణీ (100)

ఏకాక్షరా ఏకమాత్రా ఏకా ఏకైకనిష్ఠితా ఐంద్రీ ఐరావతారూఢా ఐహికాముష్మికప్రదా

ఓంకారా ఓతా ఓతప్రోతనివాసినీ ఔర్వా ఔషధసంపన్నా ఔపాసనఫలప్రదా, అండమధ్యస్థితా అఃకారమనురూపిణీ

కాత్యాయనీ కాళరాత్రిః కామాక్షీ కామసుందరీ కమలా కామినీ కాంతా కామదా కలకంఠినీ కరికుంభస్తనభరా కరవీరసువాసినీ కల్యాణీ కుండలవతీ కురుక్షేత్రనివాసినీ కురువిందదళాకారా కుండలీ కుముదాలయా కాలజిహ్వా కరాళాస్యా కాళికా కాలరూపిణీ కమనీయగుణా కాంతిః కాలధారా కుముద్వతీ కౌశికీ కమలాకారా కామచారప్రభంజినీ కౌమారీ కరుణాపాంగీ కకుబంతా కరిప్రియా కేసరీ కేశవనుతా కదంబ కుసుమప్రియా (150) కాళిందీ కాళికా కాంచీ కలశోద్భవసంస్తుతా కామమాతా క్రతుమతీ కామరూపా కృపావతీ కుమారీ కుండనిలయా కిరాతీ కీరవాహనా కైకేయీ కోకిలాలాపా కేతకీకుసుమప్రియా కమండలుధరా కాళీ కర్మనిర్మూలకారిణీ కలహంసగతిః కక్షా కృతకౌతుకమంగళా కస్తూరీతిలకా కమ్రా కరీంద్రగమనా కుహూః కర్పూరలేపనా కృష్ణా కపిలా కుహరాశ్రయా కూటస్థా కుధరా (కమ్రా) కుక్షిస్థాఖిలవిష్టపా

ఖడ్గఖేటకరా ఖర్వా ఖేచరీ ఖగవాహనా ఖట్వాంగధారిణీ ఖ్యాతా ఖగరాజోపరిస్థితా ఖలఘ్నీ ఖండితజరా ఖండాఖ్యానప్రదాయినీ ఖండేందుతిలకా

గంగా గణేశగుహపూజితా గాయత్రీ గోమతీ గీతా గాంధారీ గానలోలుపా (200) గౌతమీ గామినీ గాథా గంధర్వాప్సరసేవితా గోవిందచరణాక్రాంతా గుణత్రయవిభావితా గంధర్వీ గహ్వరీ గోత్రా గిరీశా



గహనా గమీ గుహావాసా గుణవతీ గురుపాపప్రణాశినీ గుర్వీ గుణవతీ గుహ్యా గోప్తవ్యా గుణదాయినీ గిరిజా గుహ్యామాతంగీ గరుడధ్వజవల్లభా గర్వాపహారిణీ గోదా గోకులస్థా గదాధరా గోకర్ణనిలయాసక్తా గుహ్యామండలవర్తినీ ఘర్మదా ఘనదా ఘంటా ఘోరదానవమర్దినీ ఘృణిమంత్రమయీ ఘోషా ఘనసంపాతదాయినీ ఘంటారవప్రియా ఘ్రాణా ఘృణిసంతుష్టకారిణీ ఘనారిమండలా ఘూర్ణా ఘృతాచీ ఘనవేగినీ జ్ఞానధాతుమయీ

చర్చా చర్చితా చారుహాసినీ చటులా చండికా చిత్రా (250) చిత్రమాల్యవిభూషితా చతుర్భుజా చారుదంతా చాతురీ చరితప్రదా చూళికా చిత్రవస్త్రాంతా చంద్రమఃకర్ణకుండలా చంద్రహాసా చారుదాత్రీ చకోరీ చంద్రహాసినీ చంద్రికా చంద్రధాత్రీ చౌరీ చౌరా చండికా చంచద్వాగ్వాదినీ చంద్రచూడా చోరవినాశినీ చారుచందనలిప్తాంగీ చంచచ్చామరవీజితా చారుమధ్యా చారుగతిః చండిలా చంద్రరూపిణీ చారుహోమప్రియా చార్వాచరితా చక్రబాహుకా చంద్రమండలమధ్యస్థా చంద్రమండలదర్పణా చక్రవాకస్తనీ చేష్టా చిత్రా చారువిలాసినీ చిత్స్వరూపా చంద్రవతీ చంద్రమాః చందనప్రియా చోదయిత్రీ చిరప్రజ్ఞా చాతకా చారుహేతుకీ ఛత్రయాతా ఛత్రధరా ఛాయా ఛందఃపరిచ్ఛదా ఛాయాదేవీ ఛిద్రనఖా ఛన్నేంద్రియవిసర్పిణీ (300) ఛందోఽనుష్టుప్రతిష్ఠాంతా ఛిద్రోపద్రవభేదినీ ఛేదా ఛత్రేశ్వరీ ఛిన్నా ఛురికా ఛేదనప్రియా

జననీ జన్మరహితా జాతవేదా జగన్మయీ జాహ్నవీ జటిలా జేత్రీ జరామరణవర్జితా జంబూద్వీపవతీ జ్వాలా జయంతీ జలశాలినీ జితేంద్రియా జితక్రోధా జితామిత్రా జగత్ప్రియా జాతరూపమయీ జిహ్వా జానకీ జగతీ జరా జనిత్రీ జహ్నుతనయా జగత్త్రయహితైషిణీ జ్వాలాముఖీ జపవతీ జ్వరఘ్నీ జితవిష్టపా జితాక్రాంతమయీ జ్వాలా జాగ్రతీ జ్వరదేవతా జ్వలంతీ జలదా జ్యేష్ఠా జ్యాఘోషాస్ఫోటదిఙ్ముఖీ జంభినీ జృంభణా జృంభా జ్వలన్మాణిక్యకుండలా ఝింఝికా ఝణనిర్ఘోషా ఝంఝామారుతవేగినీ (350) ఝల్లరీవాద్యకుశలా ఞరూపా ఞభుజా

టంకబాణసమాయుక్తా టంకినీ టంకభేదినీ టంకీగుణకృతాఘోషా టంకనీయమహోరసా టంకారకారిణీ ఠఠశబ్దనినాదినీ డామరీ డాకినీ డింభా డుండుమారైకనిర్జితా డామరీతంత్రమార్గస్థా డమడ్డమరువాదినీ డిండీఖనహా డింభలసత్క్రీడాపరాయణా ఢుంఠివిఘ్నేశజననీ ఢక్కహస్తా ఢిలివ్రజా నిత్యజ్ఞానా నిరుపమా నిర్గుణా నర్మదా నదీ

త్రిగుణా త్రిపదా తంత్రీ తులసీ తరుణా తరుః త్రివిక్రమపదాక్రాంతా తురీయపదగామినీ తరుణాదిత్యసంకాశా తామసీ తుహినాతురా త్రికాలజ్ఞానసంపన్నా త్రివళీ త్రిలోచనా త్రిశక్తిః త్రిపురా తుంగా తురంగవదనా తిమింగిలగిలా తీవ్రా త్రిస్రోతా తామసాదనీ తంత్రమంత్రవిశేషజ్ఞా (400) తనుమధ్యా త్రివిష్టపా త్రిసంధ్యా త్రిస్తనీ తోషాసంస్థా తాళప్రతాపినీ తాటంకినీ తుషారాభా తుహినాచలవాసినీ తంతుజాలసమాయుక్తా తారహారావళిప్రియా తిలహోమప్రియా తీర్థా తమాలకుసుమాకృతిః తారకా



త్రియుతా తన్వీ త్రిశంకుపరివారితా తలోదరీ తిరోభూ(భా)షా తాటంకప్రియవాదినీ త్రిజటా తిత్తిరీ తృష్ణా త్రివిధా తరుణాకృతిః తప్తకాంచనసంకాశా తప్తకాంచనభూషణా త్రైయంబకా త్రివర్గా త్రికాలజ్ఞానదాయినీ తర్పణా తృప్తిదా తృప్తా తామసీ తుంబురుస్తుతా తార్క్ష్యస్థా త్రిగుణాకారా త్రిభంగీ తనువల్లరిః థాత్కారీ థారవా థాంతా

దోహినీ దీనవత్సలా దానవాంతకరీ దుర్గా దుర్గాసురనిబర్హిణీ దేవరీతిః దివారాత్రిః ద్రౌపదీ (450) దుందుభిస్వనా దేవయానీ దురావాసా దారిద్ర్యోద్భేదినీ దివా దామోదరప్రియా దీప్తా దిగ్వాసా దిగ్విమోహినీ దండకారణ్యనిలయా దండినీ దేవపూజితా దేవవంద్యా దివిషదా ద్వేషిణీ దానవాకృతిః దీనానాథస్తుతా దీక్షా దైవతాదిస్వరూపిణీ ధాత్రీ ధనుర్ధరా ధేనుః ధారిణీ ధర్మచారిణీ ధరంధరా ధరాధారా ధనదా ధాన్యదోహినీ ధర్మశీలా ధనాధ్యక్షా ధర్మవేదవిశారదా ధృతిః ధన్యా ధృతపదా ధర్మరాజప్రియా ధ్రువా ధూమావతీ ధూమకేశీ ధర్మశాస్త్రప్రకాశినీ

నందా నందప్రియా నిద్రా నృనుతా నందనాత్మికా నర్మదా నళినీ నీలా నీలకంఠసమాశ్రయా నారాయణప్రియా నిత్యా (500) నిర్మలా నిర్గుణా నిధిః నిరాధారా నిరుపమా నిత్యశుద్ధా నిరంజనా నాదబిందుకళాతీతా నాదబిందుకళాత్మికా నృసింహినీ నగధరా నృపనాగవిభూషితా నరకక్లేశశమనీ నారాయణపదోద్భవా నిరవద్యా నిరాకారా నారదప్రియకారిణీ నానాజ్యోతిస్సమాఖ్యాతా నిధిదా నిర్మలాత్మికా నవసూత్రధరా నీతిః నిరుపద్రవకారిణీ నందజా నవరత్నాఢ్యా నైమిశారణ్యవాసినీ నవనీతప్రియా నారీ, నీలజీమూతనిస్వనా, నిమేషిణీ నదీరూపా నీలగ్రీవా నిశీశ్వరీ నామావళిః నిశుంభఘ్నీ నాగలోకనివాసినీ తప్తజాంబూనదప్రఖ్యా నాగలోకాధిదేవతా నూపురాక్రాంతచరణా నరచిత్తప్రమోదినీ నిమగ్నారక్తనయనా నిర్ఘాతసమనిస్వనా నందనోద్యాననిలయా నిర్వ్యూహోపరిచారిణీ

పార్వతీ పరమోదారా పరబ్రహ్మాత్మికా పరా పంచకోశవినిర్ముక్తా (550) పంచపాతకనాశినీ పరచిత్తవిధానజ్ఞా పంచికా పంచరూపిణీ పూర్ణిమా పరమా ప్రీతిః పరతేజఃప్రకాశినీ పురాణీ పౌరుషీ పుణ్యా పుండరీకనిభేక్షణా పాతాళతలనిర్మగ్నా ప్రీతా, ప్రీతివివర్ధినీ, పావనీ పాదసహితా పేశలా పవనాశినీ ప్రజాపతిః పరిశ్రాంతా పర్వతస్తనమండలా పద్మప్రియా పద్మసంస్థా పద్మాక్షీ పద్మసంభవా పద్మపత్రా పద్మపదా పద్మినీ ప్రియభాషిణీ, పశుపాశ వినిర్ముక్తా, పురంధ్రీ పురవాసినీ పుష్కలా పురుషా పర్వా, పారిజాత సుమప్రియా, పతివ్రతా పవిత్రాంగీ పుష్పహాసపరాయణా, ప్రజ్ఞావతీ - సుతా, పౌత్రీ పుత్రపూజ్యా పయస్వినీ పట్టిపాశధరా పంక్తిః పితృలోకప్రదాయినీ పురాణీ పుణ్యశీలా ప్రణతార్తివినాశినీ (600) ప్రద్యుమ్నజననీ పుష్టా పితామహపరిగ్రహా పుండరీకపురావాసా పుండరీకసమాననా పృథుజంఘా పృథుభుజా పృథుపాదా పృథూదరీ ప్రవాళశోభా పింగాక్షీ పీతావాసాః ప్రచాపలా ప్రసవా పుష్టిదా పుణ్యా ప్రతిష్ఠా ప్రణవాగతిః పంచవర్ణా పంచవాణీ పంచికా పంజరస్థితా పరమాయా పరజ్యోతిః పరప్రీతిః పరాగతిః



పరాకాష్ఠా పరేశానీ పావినీ పావకద్యుతిః పుణ్యభద్రా పరిచ్ఛేదా పుష్పహాసా (పృథూదరీ) పీతాంగీ పీతవసనా పీతశయ్యా పిశాచినీ పీతక్రియా పిశాచఘ్నీ పాటలాక్షీ పటుక్రియా పంచభక్షప్రియాచారా పూతనాప్రాణఘాతినీ పున్నాగవనమధ్యస్థా పుణ్యతీర్థనిషేవితా పంచాంగీ పరాశక్తిః పరమాహ్లాదకారిణీ పుష్పకాండ స్థితా పూషా (650) పోషితాఖిలవిష్టపా పానప్రియా పంచశిఖా పన్నగోపరిశాయినీ పంచమాత్రాత్మికా పృథ్వీ పథికా పృథుదోహనీ పురాణన్యాయమీమాంసా పాటలీపుష్పగంధినీ పుణ్యప్రజా పారదాత్రీ పరమార్గైకగోచరా ప్రవాళశోభా పూర్ణాశా ప్రణవా పల్లవోదరీ ఫలినీ ఫలదా ఫల్గుః ఫూత్కారీ ఫలకాకృతిః ఫణీంద్రభోగశయనా ఫణిమండలమండితా

బాలబాలా బహుమతా బాలాతపనిభాంశుకా బలభద్రప్రియా వంద్యా బడబా బుద్ధిసంస్తుతా బందీ బిలవతీ బడిశఘ్నీ బలిప్రియా బాంధవీ బోధితా బుద్ధిః బంధూక కుసుమప్రియా బాలభానుప్రభాకారా బ్రాహ్మీ బ్రాహ్మణదేవతా బృహస్పతిస్తుతా బృందా బృందావనవిహారిణీ బలాకినీ బిలాహారా బిలవాసా బహూదకా బహునేత్రా (700) బహుపదా బహుకర్ణావతంసికా బహుబాహుయుతా బీజరూపిణీ బహురూపిణీ బిందునాదకళాతీతా బిందునాదస్వరూపిణీ బద్ధగోధాంగుళిత్రాణా బదర్యాశ్రమవాసినీ బృందారకా బృహత్స్కంధా బృహతీ బాణపాతినీ బృందాధ్యక్షా బహునుతా బనితా బహువిక్రమా బద్ధపద్మాసనాసీనా బిల్వపత్రతలస్థితా బోధిద్రుమనిజావాసా బడిస్థా బిందుదర్పణా బాలా బాణాసనవతీ బడబానలవేగినీ బ్రహ్మాండబహిరంతఃస్థా బ్రహ్మకంకణ సూత్రిణీ

భవానీ భీషణవతీ భావినీ భయహారిణీ భద్రకాళీ భుజంగాక్షీ భారతీ భారతాశయా భైరవీ భీషణాకారా భూతిదా భూతిమాలినీ భామినీ భోగనిరతా భద్రదా భూరివిక్రమా భూతవాసా భృగులతా భార్గవీ భూసురార్చితా భాగీరథీ భోగవతీ భవనస్థా (750) భిషగ్వరా (భామినీ) భోగినీ భాషా భవానీ భూరిదక్షిణా భర్గాత్మికా భీమవతీ భవబంధనమోచనీ భయనీయా భూతధాత్రీ (రంజితా) భువనేశ్వరీ భుజంగవలయా భీమా భేరుండా భాగధేయినీ

మాతా మాయా మధుమతీ మధుజిహ్వా మధుప్రియా మహాదేవీ మహాభాగా మాలినీ మీనలోచనా మాయాతీతా మధుమతీ మధుమాంసా మధుద్రువా మానవీ మధుసంభూతా మిథిలాపురవాసినీ మధుకైటభసంహర్త్రీ మేదినీ మేఘమాలినీ మందోదరీ మహామాయా మైథిలీ మసృణప్రియా మహాలక్ష్మీః మహాకాళీ మహాకన్యా మహేశ్వరీ మాహేంద్రీ మేరుతనయా మందారకుసుమార్చితా మంజుమంజీరచరణా మోక్షదా మంజుభాషిణీ మధురద్రావిణీ ముద్రా (800) మలయా మలయాన్వితా మేధా మరకతశ్యామా మాగధీ మేనకాత్మజా మహామారీ మహావీరా మహాశ్యామా మనుస్తుతా మాతృకా మిహిరాభాసా ముకుందపదవిక్రమా మూలాధారస్థితా ముగ్ధా మణిపూరకవాసినీ మృగాక్షీ మహిషారూఢా మహిషాసురమర్దినీ



యోగాసనా యోగగమ్యా యోగా యౌవనకాశ్రయా యౌవనీ యుద్ధమధ్యస్థా యమునా యుగధారిణీ యక్షిణీ యోగయుక్తా యక్షరాజప్రసూతినీ యాత్రా యానవిధానజ్ఞా యదువంశసముద్భవా యకారాదిహకారాంతా యాజుషీ యజ్ఞరూపిణీ యామినీ యోగనిరతా యాతుధానభయంకరీ

రుక్మిణీ రమణీ రామా రేవతీ రేణుకా రతిః రౌద్రీ రౌద్రప్రియాకారా రామమాతా రతిప్రియా రోహిణీ (850) రాజ్యదా రేవా రమా రాజీవలోచనా రాకేశీ రూపసంపన్నా రత్నసింహాసనస్థితా రక్తమాల్యాంబరధరా రక్తగంధానులేపనా రాజహంససమారూఢా రంభా రక్తబలిప్రియా రమణీయయుగాధారా రాజితాఖిలభూతలా రురుచర్మపరీధానా రథినీ రత్నమాలికా రోగేశీ రోగశమనీ రావిణీ రోమహర్షిణీ రామచంద్రపదాక్రాంతా రావణచ్ఛేదకారిణీ రక్తవస్త్రపరిచ్ఛిన్నా రథస్థా రుక్మభూషణా

లజ్జాధిదేవతా లోలా లలితా లింగధారిణీ లక్ష్మీః (లోలా) లుప్తవిషా లోకినీ లోకవిశ్రుతా లజ్జా లంబోదరీ (దేవీ) లలనా లోకధారిణీ

వరదా వందితా విద్యా వైష్ణవీ విమలాకృతిః వారాహీ విరజా వర్షా వరలక్ష్మీః విలాసినీ వినతా వ్యోమమధ్యస్థా (900) వారిజాసనసంస్థితా వారుణీ వేణుసంభూతా వీతిహోత్రా విరూపిణీ వాయుమండలమధ్యస్థా విష్ణురూపా విధిప్రియా విష్ణుపత్నీ విష్ణుమతీ విశాలాక్షీ వసుంధరా వామదేవప్రియా వేలా వజ్రిణీ వసుదోహినీ వేదాక్షరపరీతాంగీ వాజపేయఫలప్రదా వాసవీ వామజననీ వైకుంఠనిలయా వరా వ్యాసప్రియా వర్మధరా వాల్మీకిపరిసేవితా

శాకంభరీ శివా శాంతా శారదా శరణాగతిః శాతోదరీ శుభాచారా శుంభాసురవిమర్దినీ శోభావతీ శివాకారా శంకరార్ధశరీరిణీ శోణా శుభాశయా శుభ్రా శిరస్సంధానకారిణీ శరావతీ శరానందా శరత్జ్యోత్స్నా శుభాననా శరభా శూలినీ శుద్ధశబరీ శుకవాహనా శ్రీమతీ శ్రీధరానందా (950) శ్రవణానందదాయినీ శర్వాణీ శర్వరీవంద్యా షడ్భాషా షడృతుప్రియా షడాధారస్థితా షణ్ముఖప్రియకారిణీ షడంగరూపా

సుమతిః సురాసురనమస్కృతా సరస్వతీ సదాధారా సర్వమంగళకారిణీ సామగానప్రియా సూక్ష్మా సావిత్రీ సామసంభవా సర్వవాసా సదానందా సుస్తనీ సాగరాంబరా సర్వైశ్వర్యప్రియా సిద్ధిః సాధుబంధుపరాక్రమా సప్తర్షిమండలగతా సోమమండలవాసినీ సర్వజ్ఞా సాంద్రకరుణా సమానాధికవర్జితా సర్వోత్తుంగా సంగహీనా సద్గుణా సకలేష్టదా సరఘా సూర్యతనయా సుకేశీ సోమసంహతిః

హిరణ్యవర్ణా హరిణీ హ్రీంకారీ హంసవాహినీ క్షౌమవస్త్రపరీతాంగీ క్షీరాబ్ధితనయా క్షమా

గాయత్రీ సావిత్రీ పార్వతీ సరస్వతీ వేదగర్భా వరారోహా (1000) శ్రీగాయత్రీ పరాంబికా

**ఇతి సాహస్రకం నామ్నాం గాయత్ర్యాశ్చైవ నారద ।**
**పుణ్యదం సర్వపాపఘ్నం మహాసంపత్తిదాయకమ్ ॥** **(6 - 56)**



నారదా ! ఇది గాయత్రీదేవి నామసహస్రం. అత్యంత పుణ్యప్రదం. సర్వపాప నివారకం. మహాసంపత్ప్రదాయకం. వీటిని జపిస్తే గాయత్రీదేవి ఎంతగానో ఆనందిస్తుంది. అనుగ్రహించి అభీష్ట వరాలు కురిపిస్తుంది. అష్టమి తిథినాడు పఠిస్తే విశేషంగా ఫలిస్తుంది. జపం చేసుకుని పూజలూ హోమాలూ ధ్యానాలూ ముగించి ఈ వెయ్యి నామాలనూ పఠిస్తే చాలు భుక్తీ ముక్తీ లభిస్తాయి. ఇది అత్యంత గుహ్యమైన నామసహస్రం. ఎవరికిబడితే వారికి చెప్పెయ్యకూడదు. మంచి భక్తుడవునా కాదా, మంచి శిష్యుడవునా కాదా పరిశీలించి పరీక్షించి అప్పుడు ఉపదేశించాలి. భ్రష్టులైన సాధకులకూ బంధువులకూ అస్సలు చెప్పకూడదు. ఈ లిఖితప్రతి ఎవరి ఇంటిలో ఉంటే వారికింక భయమనేదే లేదు. అతిచంచల అనిపించుకునే లక్ష్మీదేవి వారి ఇంటిలో స్థిరనివాసం ఏర్పరుచుకుంటుంది. దరిద్రులకు ఇది నిధి వంటిది. ముముక్షువులకు ముక్తిరూపం. రోగార్తులకు దివ్యౌషధం. బంధితులకు బంధవిమోచకం. బ్రహ్మహత్యాది మహాపాపాలను సైతం నశింపజేస్తుంది. అంతేకాదు బ్రహ్మసాయుజ్యాన్ని అందిస్తుంది. ఇది సత్యం. సత్యం. తిరుగులేని సత్యం. *(అధ్యాయం - 6, శ్లోకాలు -165)*

## ◆ దీక్షా ప్రదానం ◆

నారాయణమహర్షీ ! రకరకాల పూజలూ ధ్యానాలూ అనుష్ఠానాలూ వివరంగా తెలియజేశావు. కానీ వాటికి సంబంధించిన దీక్షావిధానం ఏమిటి ? అది కొంచెం వివరించు.

నారదా ! ఏ వ్రతానికైనా దీక్షముఖ్యం. అది లేనిదే పూజచేసే అధికారమే సిద్ధించదు. దీక్ష దివ్యజ్ఞానాన్ని ఇస్తుందనీ పాపాలను క్షయింపజేస్తుందనీ వేదతంత్రవిశారదులు నిర్వచించారు.

దివ్యం జ్ఞానం హి యా దద్యాత్ కుర్యాత్పాపక్షయం తు యా ।
సైవ దీక్షేతి సంప్రోక్తా వేదతంత్రవిశారదైః ॥ (7 - 5)

కనక దేవ గురు వహ్నిపూజాదులన్నింటికీ దీక్షాస్వీకారం తప్పనిసరి. దీక్షను ఇచ్చినవారూ పుచ్చుకున్నవారూ కూడా విశుద్ధులవుతారు. దీక్షనిచ్చే గురువు ప్రాతఃకాలంలో స్నానసంధ్యాధికమంతా యథావిధిగా ముగించుకుని కమండలువులో జలం నింపుకుని మౌనిగా నదీతీరంనుంచి ఇంటికి రావాలి. సరాసరి యాగమంటపం దగ్గరలో సముచితాసనంమీద కూర్చోవాలి. ఆచమించాలి. ప్రాణాయామం చెయ్యాలి. కమండలుజలంలో గంధపుష్పాలు కలుపుతూ అస్త్రమంత్రాన్ని ఏడుసార్లు జపించాలి. అదే మంత్రాన్ని పఠిస్తూ ఆ నీళ్ళతో యాగమంటపాన్ని సంప్రోక్షించాలి. ఊర్ధ్వోదుంబరంలో గణపతిపూజ చెయ్యాలి. లక్ష్మీసరస్వతులను పుష్పాలతో అర్చించాలి. ద్వార దక్షిణభాగాన గంగా గణపతులనూ వామభాగాన యమునా - క్షేత్రపాలకులనూ నిక్షేపించి అర్చించాలి. గుమ్మంలో అస్త్రమంత్రంతో అస్త్రదేవతను



పూజించాలి. మంటపమంతా దేవీమయమైనట్టు భావించాలి. అదే మంత్రం చదువుతూ అంతరిక్షగత - భూమిగత విఘ్నాలను పారద్రోలాలి. అప్పుడు గుమ్మం ఎడమ భాగాన్ని తాకుతూ కుడికాలు మెట్టి లోపలికి ప్రవేశించాలి.

కలశం స్థాపించాలి. సామాన్యార్ఘ్యం నిర్వహించాలి. ఆ జలంతో నైరృతిదిశలో వాస్తునాథుడినీ బ్రహ్మదేవుణ్ణీ గంధపుష్పాక్షతలతో అర్చించాలి. అదే జలంతోనూ పంచగవ్యంతోనూ తోరణస్తంభం వరకూ మండపంలోపల సంప్రోక్షించాలి. అంతా దేవీమయమైనట్టు హృదయంలో భావించాలి. భక్తితో మూలమంత్రం జపిస్తూ దర్భలతో అంతటా నీళ్ళు చిలకరించాలి. శరమంత్రం పఠిస్తూ మంటపంలోపలి నేలను చరవాలి (తాటించాలి). హుంమంత్రం పఠిస్తూ అభ్యుక్షణం చెయ్యాలి. ధూపంవేసి వికారాలను పారద్రోలాలి. దర్భలతో మార్జని చేసి అంతటా అన్నింటినీ సమ్మార్జించాలి. ఈశాన్యదిక్కున మార్జించి "తత్పుంజం" స్థాపించి పుణ్యాహవాచనంచేసి దీనానాథులను తృప్తిపరచాలి.

అటుపైని మెత్తని ఆసనంమీద తూర్పుముఖంగా కూర్చుని తన గురువునూ దేయమంత్రదేవతనూ ధ్యానించి నమస్కరించాలి. భూతశుద్ధి చేసుకుని దేయమంత్రానికి ఋష్యాదిన్యాసం చెయ్యాలి. ఋషిని శిరోభాగాన, ఛందస్సును ముఖభాగాన, అధిదేవతను హృదయపద్మాన, బీజాక్షరాన్ని గుహ్యభాగాన, శక్తిని పాదద్వయాన విన్యసించాలి. మూడుసార్లు చప్పట్లు కొట్టి దిగ్బంధం చెయ్యాలి. ఛోటికాత్రయ పూర్వకంగా (చిటికెలు) ప్రాణాయామం చేసి మూలమంత్రంతో స్వశరీరంలో మాతృకాన్యాసం చెయ్యాలి. ఓం అం శిరసే నమః ఇత్యాదిగా క్రమపద్ధతిలో ఈ న్యాసం జరగాలి. ఇలాగే మూలమంత్రాన్ని షడంగంగా కరాంగుళీ హృదయాదుల్లో న్యసించాలి. ప్రణవాక్షరపూర్వకాలూ నమః - స్వాహా - వషట్ - హుం - వౌషట్ - ఫట్ పదాంతాలూ అయిన ఆరుమంత్రాలతో చేసే న్యాసాన్ని షడంగకం అంటారు.

నమః స్వాహా వషడ్యుక్తైః హుం వౌషట్ ఫట్ పదాన్వితైః ।
ప్రణవాదియుతైర్మంత్రైః షడ్భిరేవం షడంగకమ్ ॥ (7 - 29)

అటుపైని మూలమంత్ర వర్ణన్యాసంకూడా తత్తత్ కల్పోక్తప్రకారంగా చెయ్యాలి. అయ్యాక స్వశరీరంలో శుభాసనాన్ని సంభావించాలి. అందులో దక్షిణభుజాన ధర్మాన్ని వామభుజాన జ్ఞానాన్ని ఎడమతొడలో వైరాగ్యాన్ని కుడితొడలో ఐశ్వర్యాన్ని ముఖంలో అధర్మాన్ని - ఇలాగే ఆయా భాగాలలో ఆయా అంశాలను నియమానుసారం విన్యసించాలి. ఈ సింహాసనానికి ధర్మార్థ కామమోక్షాలు నాలుగు కోళ్ళు. అధర్మాదులు శరీరం.

పాదా ధర్మాదయః ప్రోక్తాః పీఠస్య మునిసత్తమ ।
అధర్మాద్యాస్తు గాత్రాణి స్మృతాని మునిపుంగవైః ॥ (7 - 34)



ఈ సింహాసనంలో మధ్యభాగం హృదయం. అది మృదువు. కనక అక్కడ అనంతరూపమైన ప్రపంచపద్మాన్ని విన్యసించాలి. (అనంతుణ్ణీ ప్రపంచపద్మాన్నీ అనిగానీ). ఆ నిర్మల పద్మంలో సూర్య - చంద్ర - పావకులను కళలతోసహా సమంత్రకంగా న్యసించాలి. సూర్యుడికి పన్నెండు చంద్రుడికి పదహారు అగ్నికి పది కళలుంటాయని పెద్దలు చెప్పారు. వాటితోసహా వారిని ధ్యానించాలి.

సూర్యస్య ద్వాదశ కళాస్తా ఇందోః షోడశ స్మృతాః ।
దశ వహ్నేః కళాః ప్రోక్తాస్తాభిర్యుక్తాంస్తు తాన్ స్మరేత్ ॥ (7 - 36)

ఈ ముగ్గురికీ పైని సత్త్వరజస్తమోగుణాలను సంభావించాలి. ఆత్మ - అంతరాత్మ - పరమాత్మ - జ్ఞానాత్మలను న్యసించాలి. ఇది పీఠకల్పన. అముకాసనాయ నమః ఇత్యాది మంత్రంతో ఆసనపూజచేసి దానిమీదకు పరాంబికను ధ్యానించి ఆవాహన చెయ్యాలి. దేయమంత్ర అధిదేవతనుకూడా ఇలాగే కల్పోక్త ప్రకారంగా ఆవాహనచేసి మానసోపచారాలతో అర్చించాలి. ముద్రలు ప్రదర్శించాలి. అవి దేవికి ఆనందకారకాలు.

అటుపైన (శరీర - మండప) వామభాగాగ్రంలో షట్కోణమండలాన్నీ దానిలో వర్తుల మండలాన్నీ దాని మధ్యలో చతురస్ర మండలాన్నీ దాని నడుమ త్రికోణమండలాన్నీ (భావనారూపంగా) లిఖించాలి. అందులో శంఖముద్రను ప్రదర్శించాలి. షట్కోణాలలో షడంగాలను పూలతో పూజించాలి. ఆగ్నేయాది కోణాలలో ఈ షడంగకార్చన చెయ్యాలి. శంఖానికున్న ఆధారపాత్రను తీసి అస్త్రమంత్రోదకంతో ప్రోక్షించి ఆ మండలంలో స్థాపించాలి. మం వహ్నిమండలాయ అనే మంత్రంతో దశకళాత్మకుడైన అగ్నిని అర్చించాలి. (శంఖ) ఆధారపత్ర స్థాపనలో అముకదేవ్యా అర్ఘ్యపాత్రస్థానాయ నమః అంటూ ఆ మంత్రాన్ని పఠించాలి. ఈ ఆధారపాత్రకు తూర్పునుంచి ఆరంభించి ప్రదక్షిణక్రమంలో అగ్నికళలు పదింటికీ పూజచెయ్యాలి. అటుపైని మూలమంత్రంతో శంఖాన్ని ప్రోక్షించి ఆధారపాత్రలో ఉంచాలి. అప్పుడూ మూలమంత్రమే పఠించాలి. అం సూర్యమండలాయ అనే మంత్రంతో ద్వాదశకళలూ అర్చించాలి. అముకదేవ్యర్ఘ్యపాత్రాయ నమః అవాలి. శం శంఖాయ నమః అంటూ శంఖాన్ని ప్రోక్షించి అందులో సూర్యుడి పన్నెండు కళలకూ కుసుమార్చన చెయ్యాలి. విలోమమాతృకను విలోమ మూలమంత్రంతో ధ్యానించాలి. శంఖంలో నీళ్ళు నింపి చంద్రకళాన్యాసం చెయ్యాలి. ఉం సోమమండలాయ నమః అనే దానితో మొదలుపెట్టి అముకార్ఘ్యామృతాయ .... అనే హృన్మంత్రంవరకూ ఆయా మంత్రాలను ఉచ్చరిస్తూ షోడశకళాత్మకుడిని అర్చించాలి. అదే మంత్రంతో సృణిముద్రతో జలార్చన చెయ్యాలి. సకల తీర్థాలనూ శంఖజలంలోకి ఆవాహనచేసి ఎనిమిదిసార్లు మంత్రోచ్చారణ జరపాలి. షడంగాలనూ ఆ జలంలో



విన్యసించి హృదయస్థానంలో ఈ జలార్చన చెయ్యాలి. మత్స్యముద్రతో శంఖంపైన అచ్ఛాదన పట్టి మూలమంత్రాన్ని ఎనిమిదిసార్లు జపించాలి. ఆపైని దక్షిణదిగ్భాగంలో శంఖప్రోక్షణిని ఉంచాలి. శంఖంలోని నీళ్ళు కొంచెంగా ప్రోక్షణిలో పోసి అంతటా జల్లాలి. ఈ సంప్రోక్షణతో ప్రదేశమూ తానూ పూజాద్రవ్యాలూ విశుద్ధి పొందినట్టు భావించాలి.

అటుపైని గురువుగారు తన ఎట్టయెదుట ఉన్న వేదికపై సర్వతోభద్రమండలాన్ని లిఖించాలి. కర్ణికామధ్యం లిఖించి అందులో తెల్లటి బియ్యం నింపాలి. వాటిమీద దర్భలు పరిచి సలక్షణమైన కూర్చను ఉంచాలి. ఆధారశక్తితో ఆరంభించి పీఠమంత్రాంతంగా అర్చన చెయ్యాలి. చిల్లులూ బొడిపెలూలేని కొత్త కుంభం తెచ్చి అస్త్రజలంతో క్షాళన చెయ్యాలి. మూడుపేటల ఎరుపుదారంతో తంతువేష్టనం చేసి తారమంత్రం ఉచ్చరిస్తూ నవరత్న కూర్చ గంధపుష్పాదుల్ని ఆ కుండంలో వెయ్యాలి. పీఠానికీ కుంభానికీ ఐక్యాన్ని భావించాలి. ప్రతిలోమమంత్రోచ్చారణ చేస్తూ ఆ తీర్థోదకాలతో మాతృకాపూజ చెయ్యాలి. మూలమంత్రం జపిస్తూ ఆ కుంభాన్ని దేవతగా అర్చించాలి. రావి - పనస - మామిడి చిగుళ్ళతో కుంభవదనాన్ని  ఆచ్ఛాదించాలి. చషకంలో (చిన్నపాత్ర) పళ్ళూ అక్షతలూ ఉంచి వస్త్రయుగ్మం చుట్టి ప్రాణస్థాపనమంత్రంతో ప్రాణస్థాపన చెయ్యాలి. ఆవాహనాది ముద్రలు పట్టి ఆ పరాంబికను ఆనందపరచాలి. అటుపైని కల్పోక్త ప్రకారంగా పరమేశానిని ధ్యానించాలి. ముందుగా స్వాగతం పలికి కుశలప్రశ్నలు వెయ్యాలి. పాద్యం అర్ఘ్యం ఆచమనం మధుపర్కం అభ్యంగనస్నానం రక్తక్షౌమ వస్త్రయుగ్మం మణిభూషలు - ఇత్యాదిగా  షోడశోపచారాలూ చెయ్యాలి. మాతృకార్చనా విధానంలో సంపుటిత వర్ణమంత్రాలతో ఈ ఉపచారాలు శ్రద్ధగా జరపాలి. ఇది అయ్యాక నైవేద్యం సమర్పించాలి. ప్రతిద్రవ్యాన్నీ కేవలం ప్రోక్షణీజలంతోనే సంప్రోక్షించి నివేదించాలి. మరింక ఏ పాత్రలో నీరూ వాడకూడదు. ఆ తరవాత నవావరణ సాంగదేవీపూజ నిర్వర్తించి వైశ్వదేవం చెయ్యాలి. దక్షిణ దిగ్భాగాన స్థండిలం ఏర్పాటుచేసి అగ్నిని నిక్షేపించాలి. మూర్తిలో ఉన్నదేవతను అక్కడకు ఆవాహన చెయ్యాలి. పూజించాలి. ఆహృతులతో మూలమంత్రంతో హోమం చెయ్యాలి. నేతిపాయసాన్ని పాతికసార్లు హోమంచేసి కొసరుగా వ్యాహృతులతో పునర్హోమం చెయ్యాలి. గంధాదులతో అర్చించి దేవిని మళ్ళీ పీఠంమీద పెట్టాలి. అగ్నికి విసర్జన చెప్పి దశదిశలకూ బలి చల్లాలి. దేవీపార్షదులకు పంచోపచారాలు చేసి తాంబూలం ఛత్రం చామరం దేవికి సమర్పించాలి. మూలమంత్రాన్ని వెయ్యిసార్లు జపించాలి. ఆ జపాన్ని అమ్మవారికి సమర్పించాలి. అటుపైని ఈశాన్యకోణంలో వికిరం చెయ్యాలి. కర్కరిని స్థాపించి దుర్గను ఆవాహనచేసి పూజించాలి. రక్ష రక్ష అనాలి. అస్త్రమంత్రమే జపిస్తూ ప్రదక్షిణగా మంత్రోదకం జల్లి అక్కడ కర్కరిని ఉంచి అస్త్రదేవతను ఆరాధించాలి. అంతా అయ్యాక గురుశిష్యులిద్దరూ మౌనంగా భోజనం చెయ్యాలి. ఆరాత్రికి ఆ యాగశాలలో వేదికపై నిద్రించాలి.



## ◆ స్థండిల కుండ సంస్కారాలు ◆

నారదా ! ఇక్కడ చెయ్యవలసిన స్థండిల కుండసంస్కారాలు చెబుతాను. తెలుసుకో. మూలమంత్రంతో వీక్షించి అస్త్రమంత్రంతో ప్రోక్షించి తాడన చెయ్యాలి. కవచంతో అభ్యుక్షణం జరిపి ముమ్మారు స్తవం చెయ్యాలి. పాగగ్రాలుగానూ ఉదగగ్రాలుగానూ చుట్టూ రేఖలు గియ్యాలి. దేవీపీఠాన్ని ప్రణవోచ్చారణతో అభ్యుక్షణచేసి అర్చించాలి. ఆధారశక్తితో ఆరంభించి పీఠమంత్రాంతంగా ఇది జరగాలి. ఆ పీఠంలో పార్వతీపరమేశ్వరులను ఆవాహన చెయ్యాలి. గంధాదులతో ఉపచారాలతో శ్రద్ధగా అర్చించాలి. ఋతుస్నానం చేసి కామాతురయై శంకరుడితో సంగమిస్తున్నట్టు దేవిని ధ్యానించాలి. ఆ దంపతుల క్రీడా విశేషాన్ని కొంచెంసేపు భావించాలి. అటుపైని ఒక పాత్రతో అగ్నిని తెచ్చి ముందుంచుకోవాలి. రాక్షసాంశను విడిచిపెట్టి పూర్వోక్తంగా వీక్షణాదులతో వహ్నిని సంస్కరించాలి. రం బీజముచ్చరించాలి. అటుపైని చైతన్యయోజన చేసి ప్రణవంతో అభిమంత్రించాలి. ఏడుసార్లు గురువు ధేనుముద్రను ప్రదర్శించాలి. దర్భతో రక్షణ చేసి తనుత్రాణం కప్పాలి. ముమ్మారు ప్రదక్షిణం చేసి జానువులు నేలపై ఆన్చి కూర్చోవాలి. అగ్నికుండం మీద (చెయ్యిసాచి) తారమంత్రం జపించాలి. శివబీజబుద్ధితో అగ్నిని దేవీయోనిలో ఉంచాలి. ఆపైని పార్వతీపరమేశ్వరులను ఆచమింపచెయ్యాలి. చిత్పింగళ హన దహ పదయుగ్మమూ సర్వజ్ఞాజ్ఞాపయ స్వాహా మంత్రమూ జపిస్తూ వహ్నిదీపనం చెయ్యాలి. స్తుతించాలి.

> అగ్నిం ప్రజ్వలితం వందే జాతవేదం హుతాశనమ్ ।
> సువర్ణవర్ణమమలం సమిద్ధం విశ్వతోముఖమ్ ॥ (7 - 94)

ఇలా స్తుతించాక వహ్నిమంత్రానికి షడంగార్చన జరపాలి. సహస్రార్చిః స్వస్తిపూర్ణః ఉత్తిష్ఠపురుషః ధూమవ్యాపీ సప్తజిహ్వః ధనుర్ధరః ఈ క్రమంలో షడంగన్యాసం చెయ్యాలి. హేమవర్ణుడూ త్రినేత్రుడూ పద్మసంస్థితుడూ ఇష్టశక్తి స్వస్తికధరుడూ మంగళప్రదుడూ పరముడూ అయిన వహ్నిని ధ్యానించాలి. కుండమేఖలోపరిభాగాన మంత్రపరిషేచన చెయ్యాలి. ఆ తరుపరి దర్భలు పరచాలి. పరిధులు ఉంచాలి. త్రికోణ - వృత్త - షట్కోణ - సాష్టదళంగా సభూపురంగా వహ్నియంత్రం లిఖించాలి. భావన చెయ్యాలి. దాని మధ్యభాగాన వహ్నిదేవుణ్ణి వైశ్వానరప్రభృతి మంత్రాలతో అర్చించాలి. షట్కోణాలలో హిరణ్య - గగన - రక్త - కృష్ణ - సుప్రభ - బహురూప - అతిరక్తిక అనే సప్తజిహ్వలనూ పూజించాలి. కేసరాలలో అంగపూజ చేసి, దళాలలో శక్తిధరుడు స్వస్తికధరుడు జాతవేదుడు సప్తజిహ్వుడు హవ్యవాహనుడు అశ్వోదరజుడు వైశ్వానరుడు కౌమారతేజుడు విశ్వముఖుడు దేవముఖుడు తారాగ్ని అనే మూర్తులను అర్చించాలి. సాయుధులుగా దిక్పాలకులను నాలుగు దిక్కులా నిక్షేపించి పూజించాలి.



ఆ తరవాత స్రుక్ స్రువాలనూ (కర్రతెడ్లు) ఘృతాన్నీ సంస్కరించి హోమక్రియ సాగించాలి. ఆజ్యంలో దక్షిణభాగాన్ని స్రువంతో తీసుకుని అగ్నిదేవుడి కుడికంటిలో వేస్తూ అగ్నయే స్వాహా అంటూ హోమం చెయ్యాలి. అలాగే నెయ్యిలో ఎడమభాగం తీసుకుని సోమాయ స్వాహా అనీ, మధ్యభాగం తీసుకుని అగ్నీషోమాభ్యాం స్వాహా అనీ వామ - మధ్యమ నేత్రాలలో హోమం చెయ్యాలి. మళ్ళీ దక్షిణభాగం తీసుకుని అగ్నయే స్విష్టకృత్ స్వాహా అంటూ ముఖసీమలో హోమం చెయ్యాలి. తరవాత సతారమైన వ్యాహృతులతో చేసి అగ్నిమంత్రాలతో ముమ్మారు హోమం చెయ్యాలి. అయ్యాక ప్రణవంతో ఎనిమిదేసి చొప్పున రెండుసార్లు ఘృతాహుతులు చెయ్యాలి. ఇవ్వి గర్భాధానాది సంస్కారాల నిమిత్తంగా చేసే ఆహుతులు.

నారదా ! గర్భాధానం - పుంసవనం - సీమంతోన్నయనం - జాతకర్మ - నామకరణం - ఉపనిష్క్రమణం - అన్నప్రాశనం - చూడాకర్మ - మౌంజీబంధం - మహావ్రతం - ఔపనిషదీవ్రతం - గోదానం - ఉద్వాహం - అని వేదం కొన్ని సంస్కారాలు చెప్పింది.

ఆపైని పార్వతీపరమేశ్వరులను మళ్ళీ పూజించి విసర్జన పలకాలి. అయిదు సమిధలతో అగ్నినే ఉద్దేశించి హోమం చెయ్యాలి. ఆవరణకు ఒకటి చొప్పున ఆహుతులివ్వాలి. అయ్యాక స్రువంతో నెయ్యిని స్రుక్కులోకి నాలుగుసార్లుగా తీసుకుని స్రువంతోనే ఆచ్ఛాదించి పట్టుకుని గురువుగారు లేచి నిలబడి వౌషడంతమంత్రంతో అగ్నికి ఆహుతి ఇవ్వాలి. తరవాత మహాగణేశ మంత్రంతో పది ఆహుతులు చెయ్యాలి. దేయమంత్రాధిదేవతను ధ్యానించి మూలమంత్రంతో ఇరవైఅయిదు ఆహుతులను ఉభయ ముఖైకీకరణంకోసమని వహ్నిముఖభాగంలో ఇవ్వాలి. ఇచ్చి వహ్ని - మంత్రాధిదేవతల ఐక్యాన్ని భావించాలి. అంగదేవతలకు విడివిడిగా ఆరు ఆహుతులివ్వాలి. వహ్ని - మంత్రాధిదేవతలకు నాడీ సంధానం సంకల్పించి పదకొండుసార్లు ఘృతహోమం చెయ్యాలి. తదనంతరం కల్పోక్తద్రవ్యాలతోగానీ తిలలతోగానీ దేవతామూలమంత్రోచ్చారణ పూర్వకంగా గజాంతక సహస్రకం హోమం చెయ్యాలి.

**తతః కల్పోక్తద్రవ్యైస్తు జుహుయాదథవా తిలైః ।**
**దేవతామూలమంత్రేణ గజాంతక సహస్రకమ్ ॥** **(7 - 124)**

ఈ హోమవిధానంతో మహాదేవినీ పరివార దేవీబృందాలను (ఆవృతిదేవీః) అగ్నిదేవుణ్ణీ సంతృప్తి పరిచినట్టూ వారు సంతృప్తి చెందినట్టూ భావించాలి.



## ◆ దీక్షా స్వీకారం ◆

అటుపైని గురువుగారు శిష్యుణ్ణి అగ్నికుండం దగ్గరకి పిలవాలి. అప్పటికే శిష్యుడు స్నానం చేసి సంధ్యావార్చి వస్త్రద్వయం ధరించి బంగారు ఆభరణం దాల్చి కొత్త కమండలువు చేతబట్టి సిద్ధంగా ఉండాలి. గురుసన్నిధికి వచ్చి నమస్కరించాలి. సభాసదులకూ కులదేవతకూ నమస్కరించాలి. పీటమీద కూర్చోవాలి. అప్పుడు అతణ్ణి గురువుగారు కృపాదృష్టులతో చూడాలి. తన చైతన్యం అతని శరీరంలోకి ప్రవేశించినట్టు భావించాలి. హోమం చెయ్యడంవల్ల లభించిన దివ్యదృష్టితో అధ్వసంశోధన చెయ్యాలి. ఇతడు శుద్ధాత్ముడవుతాడా కాడా ? దేవతానుగ్రహానికి యోగ్యుడా కాదా ? పరిశీలించాలి. శిష్యుడి శరీరంలో షడధ్వ పరిశీలన చెయ్యాలి. పాదాలలో కళాధ్వాన్నీ సంధిబంధాల్లో తత్త్వాధ్వాన్నీ నాభిలో భువనాధ్వాన్నీ హృదయంలో వర్ణాధ్వాన్నీ ఫాలభాగంలో పదాధ్వాన్నీ మూర్ధంలో మంత్రాధ్వాన్నీ విశోధించాలి.

ఒక్కొక్క అధ్వాన్నీ పరిశోధిస్తున్నప్పుడు శిష్యుణ్ణి దర్భకూర్చతో తాకుతూ, శోధయామ్యముమధ్వానం స్వాహా అంటూ - నేతితో తడిపిన తిలలు తారాధ్యంగా ఎనిమిదేసిసార్లు హోమం చెయ్యాలి. ఇలా ఆరింటికీ చేశాక ఆ షడధ్వాలూ బ్రహ్మలో లీనమైనట్టు భావించాలి. మళ్ళీ వాటిని సృష్టిమార్గాన పునరుత్పాదన చెయ్యాలి. అప్పుడు మళ్ళీ తన చైతన్యాన్ని శిష్యుడిలో లీనం చెయ్యాలి. పూర్ణాహుతి ఇచ్చి మంత్రాధిష్ఠాన దేవతను కలశంలోకి ఆవాహన చెయ్యాలి. మళ్ళీ వ్యాహృతులతో హోమం చేసి అగ్నికి అంగాహుతులిచ్చి అగ్నిని ఆత్మయందు విసర్జించాలి.

శిష్యుడి కళ్ళకు గుడ్డకట్టాలి. నేత్రమంత్రం జపిస్తూ అగ్నికుండంనుంచి శిష్యుణ్ణి మండలంలోకి తీసుకువెళ్ళాలి. ముఖ్యదేవికి అతడి చేతులతో పుష్పాంజలి సమర్పింపజెయ్యాలి. కళ్ళకు కట్టిన గుడ్డ విప్పాలి. దర్భాసనం మీద కూర్చోబెట్టాలి. కల్పోక్తవిధంగా శిష్యదేహంలో భూతశుద్ధి చెయ్యాలి. న్యాసాలు జరపాలి. అప్పుడు వేరొక మండలంలో కూర్చోబెట్టాలి. కుంభంలో ఉన్న చిగురాకుల్ని శిష్యుడి శిరస్సున ఉంచి మాతృకను జపించాలి. దేవతాత్మకాలైన ఆ కుంభోదకాలతో స్నానం చేయించాలి. వెంటనే రక్షార్థంగా వర్ధనీజలం చిలకరించాలి. అప్పుడు శిష్యుడు లేచి బట్టలు మార్చుకోవాలి. భస్మావలేపనం చేసుకోవాలి. గురుసన్నిధికి రావాలి. అప్పుడు దయామయుడై గురువుగారు తన హృదయంనుంచి మహాదేవి నిర్గమించి శిష్యుడి హృదయంలో ప్రవేశించినట్టు భావించాలి. ఆ ఉభయదేవీ మూర్తులకూ ఐక్యాన్ని భావిస్తూ గంధపుష్పాదులతో పూజచెయ్యాలి. తన కుడిచేతిని శిష్యుడి శిరస్సుపై ఉంచి కుడిచెవిలో మహాదేవీ మహామంత్రాన్ని ముమ్మారు ఉపదేశించాలి. వెంటనే ఆరంభించి శిష్యుడు ఆ మంత్రాన్ని నూటయెనిమిదిసార్లు జపించాలి. దేవతారూపుడైన గురువుగారికి సాష్టాంగనమస్కారం చెయ్యాలి. తన సర్వస్వమూ సమర్పించాలి. యావజ్జీవితమూ అనన్యబుద్ధిగా మెలగాలి. ఋత్విక్కులకు దక్షిణలిచ్చి



బ్రాహ్మణులకు భోజనాలు పెట్టాలి. సువాసినులకూ కుమారీమణులకూ వటువులకూ దీన అనాథ దరిద్రులకూ లోభించకుండా బట్టలూ భోజనాలూ పెట్టాలి. ధనసువర్ణాదులుకూడా యథాశక్తిగా ఇవ్వవచ్చు. తన కృతార్థతను గుర్తించి ఆ మహామంత్రాన్ని నిత్యమూ ఉపాసించాలి.

నారదా ! ఉత్తమోత్తమమైన దీక్షావిధి సవిస్తరంగా నీకు తెలియజేశాను. ఇదంతా బాగా భావన చేసి దేవీపాదపద్మాలను సమాశ్రయించు. ఇంతకన్నా బ్రాహ్మణుడికి ఉత్తమ ధర్మంలేదు. వేదమార్గానుయాయులు వారివారి గుహ్యోక్త పద్ధతుల్లో మంత్రోపదేశాలు చెయ్యవచ్చు, పొందవచ్చు. ఇప్పుడు నేను చెప్పింది సనాతనమైన తాంత్రికరీతి. గురువులు చెప్పిన మార్గంలో ప్రయాణించడమే ఎప్పటికీ శ్రేయస్కరం. నువ్వు అడిగావు నేను చెప్పాను. పరాంబికను సేవించు. త్రికరణశుద్ధిగా ఉపాసించు. నిత్యమూ నేను అలా ఆరాధించి ఇలా పరనిర్వృతిని (అత్యంత మనశ్శాంతి) పొందుతున్నాను - అని నారాయణమహర్షి సంభాషణ ముగించాడు. కన్నులు మూసుకుని దేవీపాదపద్మాలను ధ్యానిస్తూ సమాధిలో మునిగిపోయాడు. నారదుడు వినయవినమితగాత్రుడై ఆ మునిశిఖామణికి ఆ జ్ఞానస్వరూపునికి ఆ కృపాజలనిధికి ఆ అమృతాంతరంగునికి ఆ శిష్యవత్సలునికి ఆ నిష్ఠానిధికి సాష్టాంగనమస్కారం చేసి, దేవీ దర్శనలాలసుడై వెంటనే తపస్సుకి వెళ్ళిపోయాడు. ***(అధ్యాయం - 7, శ్లోకాలు - 155)***

శౌనకాది మహామునులారా ! నారదనారాయణ సంవాద రూపంగా ఈ విశేషాలన్నీ మా గురువుగారు వ్యాసభగవానుడు జనమేజయమహారాజుకు ఉపదేశించారు. వాటినే యథాతథంగా మీకు నేను చెబుతున్నాను. ఇంతకుమించి ఇందులో నా ప్రయోజకత్వం ఏమీ లేదు - అన్నాడు సూతమహర్షి.

సూతమహర్షీ ! వినయశీలివి కనక నువ్విలాగే అంటావు. ఎన్నెన్ని విశేషాలు చెప్పావు ! ఎంతెంత సందేహాలు తీర్చావు ! నీ జ్ఞానం నీ పరిజ్ఞానం అమోఘం. అనన్యం. ఇంతా విన్నాక జనమేజయు డేమన్నాడు ? వ్యాసుడు ఇంకా ఏమి చెప్పాడు ? అది కూడా తెలియజెయ్యి. వినాలని మాకందరికీ కుతూహలంగా ఉంది - అన్నారు శౌనకాది మహామునులు. సూతు డిప్పుడింక వ్యాసజనమేజయ సంభాషణగా కథను కొనసాగించాడు.

హే భగవన్ ! వ్యాస ! సర్వధర్మజ్ఞా ! సర్వశాస్త్ర విదాంవరా ! ద్విజులందరూ శక్తిని ఆరాధించాలనే కదా వేదం చెప్పింది. సంధ్యాకాలాల్లో నేమిటి ఇతర సమయాల్లో నేమిటి జగన్మాతనే నిత్యమూ ఉపాసించాలి. మరి అలాంటప్పుడు కొందరు ద్విజులు దేవీ వరివస్యను (సేవ) విడిచిపెట్టి ఇతరదేవతలను ఆరాధిస్తున్నారెందుకని ? కొందరు వైష్ణవులు కొందరు గాణపత్యులు కొందరు కాపాలికులు కొందరు బౌద్ధులు కొందరు దిగంబరులు - ఇలా రకరకాలవారు కనిపిస్తున్నారు. వేదవాక్కుపట్ల వీరికి శ్రద్ధలేనట్టేనా? ఈ సందేహం నువ్వే తీర్చాలి. బుద్ధిమంతులూ పండితులూ నానాతర్కవిచక్షణులూ అయ్యుండీ



వేదాలపట్ల శ్రద్ధలేకపోతే ఎలాగ ? స్వీయశుభపరంపరను ఎంతటి బుద్ధిహీనుడైనా కోరి భంగపరచుకోడే. అటువంటిది వీరంతా దేవీసేవను విడిచిపెట్టేశారంటే కారణమేమిటో ఊహించలేకపోతున్నాను. దయచేసి ఈ సందేహం తెముల్చు. అలాగే నీ ప్రసంగంలో మణిద్వీపమహిమను గురించి వాచవిగా చెప్పావు. దేవీ నివాసమన్నావు. దాన్ని సవిస్తరంగా కన్నులకు కట్టించు. నేను భక్తుణ్ణి. శ్రద్ధగా వింటున్నవాణ్ణి. నాలాంటివారికి గురువులు ప్రసన్నులై గుహ్యాతి గుహ్యాలను సైతం ప్రకటం చేస్తారుగదా ! (ప్రసన్నాస్తు వదంత్యేవ గురవో గుహ్యమప్యుత 8 - 8)

జనమేజయమహారాజా ! అడగవలసింది అడగవలసిన సమయంలో అడిగావు. బుద్ధిమంతుడవు. వేదాలపట్ల శ్రద్ధ కలవాడవు. కనక నీకు దాచకుండా అన్నీ చెప్పవలసిందే. నీ సందేహాలు తీరుస్తాను. విను.

## ◆ ఇంద్రాది దేవతలకు దేవి గుణపాఠం ◆

పూర్వకాలంలో మదోద్ధతులై దైత్యులు దేవతలతో యుద్ధం చేశారు. అది నూరేళ్ళు సాగిన మహాయుద్ధం. మహావిస్మయ కారకం. నానాశస్త్ర ప్రహరణాన్వితం. నానామాయా విచిత్రితం. జగద్వినాశకరం. ఎట్టకేలకు పరాశక్తి కృపావిశేషంవల్ల దేవతలు జయించారు. దైత్యులు స్వర్గాన్నీ భూగోళాన్నీ విడిచి పాతాళానికి పారిపోయి తలదాచుకున్నారు. అప్పుడు దేవతలు అది అంతా తమ ప్రయోజకత్వమే అనుకుని పరాక్రమాలను పరస్పరం ప్రశంసించుకొన్నారు. మోహవిభ్రాంతిలోపడి చంకలు కొట్టుకుంటూ తమనుతాము తెగ పొగుడుకున్నారు.

మనకు జయం కలగక చస్తుందా ! మన మహిమ అటువంటిది. మనం సర్వోత్తరులం. మహావీరులం. మనముందు దైత్యులు ఎక్కడ నిలుస్తారు. పామరులు. పిరికి పందలు. పరాక్రమహీనులు. మనమో - మహాయశస్విలం. తేజస్విలం. సృష్టిస్థితిలయకారకులం. దైత్యులు మనకొక లెఖ్ఖా !

ఇలా మోహం తలకెక్కి పరాశక్తి మహిమను పూర్తిగా మరిచిపోయి చిందులు తొక్కుతున్న దేవతలను చూసి జగదంబిక జాలిపడింది. కరుణిద్దామనిపించి యక్షరూపంలో అవతరించింది. ఆ రూపం - కోటిసూర్యప్రతీకాశం. చంద్రకోటిసుశీతలం. విద్యుత్కోటి సమానాభం. హస్తపాదాదివర్జితం. ఎప్పుడూ ఎక్కడా విన్నది కాదు, కన్నదికాదు. ఆ రూపం ఆ తేజస్సు పరమసుందరంగా అద్భుతావహంగా ఉంది.

ఏమిటిది ? ఏమిటిది ? దైత్యుల దుశ్చేష్టకాదుగదా ! ఏదో తెలియని మహామాయ కాదుగదా ! దేవతలం - మనకే ఇంత విస్మయాన్ని కలిగిస్తున్నదే దీన్ని ఎవరు నిర్మించి ఇటు పంపి ఉంటారు చెప్మా !



దేవతలంతా గుమికూడి చర్చలు జరిపారు. ఆ రూపం దగ్గరికి వెళ్ళి ఎవరు నువ్వని అడగాలి. పుట్టు పూర్వోత్తరాలు తెలుసుకోవాలి. బలాబలాలు తేల్చుకోవాలి. అప్పుడు ప్రతిక్రియ చెయ్యాలి - అని ఒక వ్యూహం నిర్ణయించారు.

వెంటనే ఇంద్రుడు అగ్నిదేవుణ్ణి పిలిచాడు. వహ్నీ ! దేవతలకు నువ్వేకదా ముఖస్థానీయుడివి అంచేత నువ్వే వెళ్ళు. అదేమిటో తెలుసుకో - అని ఆజ్ఞాపించాడు. అగ్నిదేవుడు త్వరత్వరగా వెళ్ళాడు.

ముందుగా ఆ యక్షరూపమే - నువ్వెవడవు అని అగ్నిని ప్రశ్నించింది. నీ శక్తి ఎంతో చెప్పమంది. నేను అగ్నిని. జాతవేదసుడను. అన్నింటినీ దహించివెయ్యగల శక్తి నన్ను నమ్మి నాలో ఉంది - అని అగ్నిదేవుడు బదులు పలికాడు. ఓహో ! అలాగా ! అయితే ఈ గడ్డిపరకను దహించు. నువ్వు ఉంది అని చెప్పుకుంటున్న శక్తి నీలో ఉందో లేదో చూస్తాను - అంటూ ఆ యక్షతేజోరూపం ఒక గడ్డిపరకను అగ్నిదేవుడి ముందుకి విసిరింది. వహ్నిదేవుడు ఎంతగానో ప్రయత్నించాడు. తన బలం అంతా కూడగట్టుకుని మరీ ప్రయత్నించాడు. కానీ ఎంతకీ ఆ గడ్డిపరకను ఏమీ చెయ్యలేకపోయాడు. సిగ్గుపడిపోయాడు. తనకేమయ్యింది ఇవ్వేళ ? అంతుబట్టలేదు. దేవతల దగ్గరికి పరుగుపెట్టాడు. దేవతలంతా ఒక్కసారిగా మీదపడ్డారు. ఎవరో ఏమిటో తెలుసుకువచ్చావా ? అగ్నిదేవుడు సిగ్గుతో ముఖం దించుకున్నాడు. జరిగినదంతా చెప్పాడు. మన బతుకులు వట్టి బూటకాలు. వృథాభిమానంతో విర్రవీగుతున్నాం. ఛీ - ఛీ అని ముగించి తొలగిపోయాడు.

ఇంద్రుడికి పట్టుదల వచ్చింది. వాయుదేవుణ్ణి పిలిచాడు. జగత్తులో అంతటా నువ్వే నిండి ఉన్నావు. నీ కదలికలతోనే అన్నీ కదిలేది. నువ్వు ప్రాణరూపివి. ప్రాణికోటికి సర్వశక్తి విధాయకుడివి. నువ్వు వెళ్ళి తెలుసుకునిరా. నీకన్నా సమర్థుడెవడు ? - అని గాలిదేవుడికి కాస్త గాలికొట్టి పంపించాడు. వాయుదేవుడు ఉబ్బిపోయాడు. మహావేగంగా వెళ్ళాడు. యక్షరూపం మళ్ళీ అదే ప్రశ్నవేసింది. నేను వాయువును. సర్వశక్తి సంపన్నుడను. దేనినైనా ఎగురగొట్టగలను. నావల్లనే ఈ జగత్తు బతుకుతోంది - అంటూ సగర్వంగా పలికాడు. అయితే ఈ గడ్డిపరక కదుపు - అంది యక్షరూపం. లేకపోతే తలదించుకుని నోరుమూసుకుని వచ్చినదారినే వచ్చినచోటుకే ఫో - అనికూడా అనేసింది. వాయుదేవుడికి అభిమానం పొడుచుకు వచ్చింది. గట్టిగా ప్రయత్నించాడు. గడ్డిపరకను కదిలించలేకపోయాడు. శృంగభంగమయ్యింది. తలదించుకుని నోరుమూసుకుని పరుగుతీశాడు. ఇంద్రాదులకు వృత్తాంతం చెప్పాడు. ఇదేమిటో అస్సలు తెలియడం లేదు. మనం అసమర్థులం. మిథ్యాభిమానులం. అదేదో అలౌకిక యక్షతేజస్సు. పరమదారుణ తేజస్సు - అనేసి తానూ జారుకున్నాడు.

ఈసారి దేవతలంతా కలిసి ఇంద్రుణ్ణి ఎగద్రోశారు. నువ్వు దేవనాయకుడవు. యక్షుల్ని బాగా ఎరుగుదువు. కనక నువ్వే వెళ్ళు అంటే వెళ్ళు అన్నారు. సరే, తెలుసుకుని వస్తాను - అంటూ దేవేంద్రుడు



సగర్వంగా బయలుదేరాడు. యక్షరూపాన్ని తరిమాడు. ఆ తేజోరూపం ఇంద్రుణ్ణే తరిమింది. చాలాదూరం తరుముకుంటూ వెళ్ళి చటుక్కున మాయమయ్యింది. మాటా మంతీ వినపడటం లేదు. ఇంద్రుడికి దిక్కుతోచలేదు. దారుణమైన అవమానమనిపించింది. తననే మాయ చేసిందా ? కనుగప్పి పారిపోయిందా? దేవసభకు ఏ ముఖంపెట్టుకుని వెళ్ళను ! ఏమి చెప్పను ! దేవతలముందు ఎంత అవమానం ! మహాత్ములకు అభిమానమే ధనమన్నారు. అది పోయాక బతికి ఏమి లాభం ? చావుతో సమానం. కనక నాకిక మరణమే శరణం - అని నిశ్చయించుకుని ఆ పని చెయ్యబోయాడు.

సరిగ్గా అదే సమయానికి అశరీరవాణి వినిపించింది. సహస్రాక్షా ! మాయాబీజాక్షరం జపించు. సుఖపడతావు - అంది. వెంటనే అక్కడే తపస్సుకి కూర్చున్నాడు. కన్నులన్నీ మూసుకుని మాయాబీజాక్షరాన్ని లక్షసంవత్సరాలు నిరాహారుడై జపించాడు.

ఒక చైత్ర నవమినాడు సూర్యుడు నడినెత్తికి వచ్చినవేళ మళ్ళీ అదే యక్షరూపం అదే తేజఃపుంజం అదే ప్రదేశంలో అకస్మాత్తుగా ప్రత్యక్షమయ్యింది. అయితే ఈసారి ఆ తేజోమండలానికి మధ్యలో నవయౌవనంలో ఉన్న కుమారీ రూపం కనిపించింది.

## ◆ మహాదేవి ఆత్మావిష్కారం ◆

భాస్వజ్జపాకుసుమాభ. బాలకోటిరవిప్రభ. బాలశీతాంశుమకుట. వస్త్రాంతర్వ్యంజితస్తని. వర - పాశ - అంకుశ - అభయ హస్తాలు నాలుగు. రమణీయాంగి. కోమలాంగలతిక. శివ. భక్తకల్పద్రుమం. అంబిక. నానాభూషణ భూషిత. త్రినేత్ర. మల్లికామాలికా కబరీజూట విరాజిత. ఆమెకు నాల్గువైపులా నాలుగువేదాలూ రూపుదాల్చి నిలబడి స్తుతిస్తున్నాయి. ఆమె పెదవుల కాంతులు వ్యాపించినంతమేరా నేల పద్మరాగాలు తాపించినట్టు అవుతోంది. ప్రసన్న స్మేరవదన. కోటి కందర్పసుందర. రక్తాంబరపరీధాన. రక్తచందన చర్చిత. ఉమాదేవి. హైమవతి. నిర్వ్యాజకరుణామూర్తి. సర్వకారణకారణ - మహేంద్రుడు దర్శించాడు. భక్తినిర్భరులు గుండెల్లో పొంగులెత్తాయి. కన్నులు చెమ్మగిల్లాయి. గొంతు గద్గదమయ్యింది. తనువు పులకించింది. ఉక్కిరిబిక్కిరి అవుతూ సాష్టాంగపడ్డాడు. స్తుతులూ నుతులూ జాలువారాయి. అమ్మా ! ఆ యక్ష రూపం ఏమిటి ? ఎందుకు అలా అవతరించావు ? ఇప్పటికీ అర్థం కావడంలేదు. అనుగ్రహించు తల్లీ ! - అని అభ్యర్థించాడు. కరుణాసముద్రం పలికింది -

ఇంద్రా ! నా రూపమే పరబ్రహ్మం. సర్వకారణకారణం. మాయాధిష్ఠానం. సర్వసాక్షి. నిరామయం. సర్వవేదాలూ ఏ పదాన్ని శిరసావహిస్తున్నాయో, సర్వతపస్సులూ సారాంశంగా ఏ పదాన్ని చెబుతున్నాయో, సర్వతపస్వులూ దేన్ని కోరి బ్రహ్మచర్యం పాటిస్తున్నారో - ఆ పదాన్ని ఒక్కముక్కలో నీకు చెబుతున్నాను. గ్రహించు -



ఓమిత్యేకాక్షరం బ్రహ్మ తదేవాహుశ్చ హ్రీమ్మయమ్ ।
ద్వే బీజే మమ మంత్రే స్తో ముఖ్యత్వేన సురోత్తమ ॥ (8 - 64)

సురనాయకా ! ఓమ్ అనే ఒక్క అక్షరమే పరం బ్రహ్మ. దాన్నే హ్రీమ్ మయంగానూ పలుకుతున్నారు. ఇవి రెండే నా మంత్రంలో ముఖ్యమైన బీజాక్షరాలు. నన్ను నేను భాగద్వయం చేసుకుని జగత్తులు సృష్టిస్తున్నాను. అందులో ఒక భాగం (ఓమ్) సచ్చిదానందనామకం. రెండవది మాయాప్రకృతి సంజ్ఞితం. ఆ మాయయే (హ్రీమ్) పరాశక్తి. నేను శక్తిమతిని. ఈశ్వరిని. జాబిల్లీ వెన్నెలల్లాగా నేనూ మాయా అవిభాజ్యలం. అభిన్నలం. ఈ మాయ నాదే. సామ్యావస్థాత్మిక. ప్రళయంలో సకలజగత్తులూ నాలో లీనమై అభిన్నంగా ఉంటాయి. కర్మపరిపాకవశాన ప్రాణికోటికి పునస్సృష్టిలో పునర్జన్మలూ పునారూపాలూ నానుంచి అభివ్యక్తమవుతుంటాయి. అంతర్ముఖమైన అవస్థను 'మాయ' అంటారు. బహిర్ముఖమైన అవస్థను తమస్సు అంటారు. దానినుంచే ప్రాణికోటి సంభవిస్తుంది. సృష్టి సమయంలో అదే రజోగుణమవుతుంది. అందుకే బ్రహ్మ విష్ణు మహేశ్వరులు గుణత్రయాత్మకులయ్యారు.

అంతర్ముఖా తు యావస్థా సా మాయేత్యభిధీయతే ।
బహిర్ముఖా తు యా మాయా తమశ్శబ్దేన సోచ్యతే ॥
బహిర్ముఖాత్తమోరూపాత్ జాయతే సత్త్వసంభవః ।
రజోగుణస్తదేవ స్యాత్ సృష్ట్యాదౌ సురసత్తమ ॥ (8 - 70)

త్రిమూర్తులలో రజోగుణాధికుడు బ్రహ్మ. సత్త్వగుణాధికుడు విష్ణువు. తమోగుణాధికుడు రుద్రుడు. స్థూలదేహం - బ్రహ్మ. లింగదేహం (సూక్ష్మదేహం) శ్రీహరి. కారణదేహం రుద్రుడు. తురీయావస్థను నేనే.

స్థూలదేహో భవేత్ బ్రహ్మ లింగదేహో హరిః స్మృతః ।
రుద్రస్తు కారణో దేహ స్తురీయా త్వహమేవ హి ॥ (8 - 73)

సామ్యావస్థ అన్నానే అది సర్వాంతర్యామిరూపిణి. అటుపైని పరంబ్రహ్మమైన నా రూపం - రూపవర్జితం. అందుకనే నారూపం నిర్గుణమూ సగుణమూ అని రెండు విధాలు. వీటిలో నిర్గుణరూపం మాయారహితం. సగుణరూపం మాయాసహితం. నేను జగత్తును సృష్టించి అందులో ప్రవేశించి జీవుల్ని వారి కర్మానుసారంగా ప్రేరేపిస్తూ ఉంటాను. సృష్టి స్థితి తిరోధానాలకు నేనే ప్రేరణ. బ్రహ్మ - విష్ణు - మహేశ్వరులను కారణాత్మకులుగా చేసేది నేనే. నాకు భయపడి నా ఆజ్ఞగా గాలివీస్తున్నాడు. సూర్యుడు వెలుగుతున్నాడు. మీరంతా చేసే పనులు నా ఆజ్ఞలే. కనక నేను సర్వోత్తమను. నా అనుగ్రహం వల్లనే రాక్షసయుద్ధాల్లో మిమ్మల్ని జయం వరిస్తోంది. మిమ్మల్ని కీలుబొమ్మలుగా (కొయ్యబొమ్మలుగా - కాష్ఠపుత్తలికోపమాన్) ఆడిస్తున్నది నేనే. ఒక్కొక్కప్పుడు మీకూ ఒక్కొక్కప్పుడు దైత్యులకూ విజయం అందిస్తుంటాను. నేను స్వతంత్రను. నా ఇచ్ఛయే నాది. కర్మానురోధంగా అన్నీ చేస్తుంటాను.



సురోత్తమా ! సర్వాత్మికను నన్ను విస్మరించి మీరు విజయగర్వంతో విర్రవీగారు. అది అంతా మీ ప్రయోజకత్వమే అని అహంకరించారు. మోహంలో పడ్డారు. మీ కళ్ళు తెరిపించాలనే అనుగ్రహబుద్ధితో మీ శరీరాల్లో ఉన్న నా శక్తుల్ని బయటకు తీసి తేజోమండలంగా యక్షరూపంగా అవతరింపజేశాను. మీ అహంకారాలను అణిచివేశాను. మీ శక్తిహీనత మీకు తెలిసివచ్చేట్టు చేశాను. కనక ఇకనుంచీ నిరహంకారులై సచ్చిదానంద రూపిణిని నన్ను శరణువేడండి - అని చెప్పి అంతర్ధానం చెందింది.

జనమేజయా ! అప్పటినుంచీ ఇంద్రాదిదేవతలందరూ అహంకారం విడిచిపెట్టి పరమేశ్వరీ పాదపద్మాలను ఉపాసించ నారంభించారు. త్రిసంధ్యల్లోనూ గాయత్రిని జపించడం, యజ్ఞభాగాలను మహాదేవికి నివేదన చెయ్యడం - ఇత్యాది కార్యక్రమాలు అనుష్ఠించారు. ఈ రకంగా అందరూ సత్యయుగంలో గాయత్రీ జపతత్పరులూ తారహృల్లేఖా జపనిష్ఠాతులూ అయ్యారు. తక్కిన హరి - హరోపాసనలు ఏవీ నిత్యకర్మలు కాదు. గాయత్రీ ఉపాసన ఒక్కటే నిత్యవిధిగా వేదాలు అన్నీ ముక్తకంఠంతో చెబుతున్నాయి. ఇది ఒక్కటి చేస్తే చాలు ద్విజులకు కృతకృత్యత్వమే. తక్కిన సత్కర్మలు ఏవి చేసినా చెయ్యకపోయినా గాయత్రీమాత్రనిష్ఠాతుడైతే చాలు ద్విజుడు ముక్తి పొందుతాడని మనువే స్వయంగా చెప్పాడు.

గాయత్రీమాత్రనిష్ణాతో ద్విజో మోక్షమవాప్నుయాత్ ।
కుర్యాదన్యన్న వా కుర్యాదితి ప్రాహ మనుః స్వయమ్ ॥ (8 - 90)

అంతటి శక్తి సంపన్నమూ వేదత్రయప్రతిపాదితమూ అయిన గాయత్రీ ఉపాసనను విడిచిపెట్టి హరి - హరాదులను ఉపాసించిన విప్రుడు నరకానికి పోవడం నిశ్చయం. అందుకని తొట్టతొలి కృతయుగంతో ద్విజోత్తములందరూ గాయత్రీ రూపాన దేవీ పాదపద్మాలను ఉపాసించారు. *(అధ్యాయం - 8, శ్లోకాలు - 92)*

## ◆ గాయత్రీ మహిమ - గౌతముడి కథ ◆

జనమేజయా ! ఒకప్పుడు ప్రాణికోటి కర్మవశాన పదిహేను సంవత్సరాల కరువు వచ్చింది. వానలు లేక అంతటా దుర్భిక్షం విలయతాండవం చేసింది. ఇంటింటా మృతదేహాలే. లెక్కపెట్టటం ఎవరితరమూ కాలేదు. ఆకలి తట్టుకోలేక చనిపోయినవారు చనిపోగా మిగిలినవారు పందుల్నీ కుక్కల్నీ గుర్రాల్నీ ఏ జంతువు దొరికితే ఆ జంతువుని చంపుకుని తిన్నారు. కొందరు మానవశవాలనే భక్షించారు. తల్లి కొడుకునీ, మగడు భార్యనీ భక్షించే భయంకర దుర్భిక్షమది. ఈ దశలో బ్రాహ్మణులకు ఒక ఆలోచన వచ్చింది. గాయత్రీ జపమహిమ కారణంగా గౌతముడి ఆశ్రమంలో దుర్భిక్షం లేదని సుభిక్షంగా ఉందనీ వింటున్నాం. ఇప్పటికే చాలా ప్రాణికోటి అక్కడికి చేరుకుందనీ సుఖంగా జీవిస్తోందనీ తెలిసింది. కనక మనంకూడా వెళ్ళి ఆ మహర్షినే ఆశ్రయిద్దాం - అని నిశ్చయించుకుని అగ్నిహోత్రాలతో కుటుంబాలతో గోవులతో దానదాసీజనంతో



అందరూ బయలుదేరి వెళ్ళారు. అన్ని దిక్కులనుంచీ ఒక్కసారిగా తరలివెళ్ళారు. అంతమంది బ్రాహ్మణులను చూసి గౌతముడు సగౌరవంగా నమస్కరించాడు. ఆహ్వానించి అతిథి సత్కారాలు చేశాడు. కుశలప్రశ్నలు వేశాడు. ఆగమనకారణం తెలుసుకున్నాడు. అందరికీ అభయమిచ్చాడు.

ఇది మీ ఇల్లే అనుకోండి. నేను మీ దాసుణ్ణే అనుకోండి. ఈ దాసుడు ఉండగా మీకు చింత ఏమిటి! మీవంటి తపోధనుల రాకతో నేను నిజంగా ధన్యుణ్ణి అయ్యాను. మీ దర్శనభాగ్యం చేతనే ఎవరికైనా దుష్కృతాలన్నీ సుకృతాలైపోతాయి. మీరంతా ఇలా వచ్చి పాదధూళితో నా గృహాన్ని పావనం చేస్తున్నారు. నాకంటే ధన్యుడెవడు ! ఇక్కడే అందరూ హాయిగా ఉండండి. మీ మీ సంధ్యావందన జపాదికాలు నిర్విఘ్నంగా జరుపుకోండి - అని అందరినీ ఊరడించి ధైర్యం చెప్పి విడిది చేయించాడు. తరవాత తాను లోపలికి వెళ్ళి గాయత్రిని ప్రార్థించాడు.

నమో దేవి మహావిద్యే వేదమాతః పరాత్పరే ।
వ్యాహృత్యాది మహామంత్రరూపే ప్రణవరూపిణి ॥ (9 - 16)

మహావిద్యా ! వేదమాతా ! పరాత్పరా ! వ్యాహృతి త్రయంతో (భూర్భువః స్వః) మహామంత్రస్వరూపా! ఓంకార రూపిణీ ! సామ్యావస్థాత్మికా ! హ్రీంకారరూపిణీ ! స్వాహా - స్వధా స్వరూపా ! సకలార్థప్రదాయినీ! నమో నమః. నమో నమః. భక్తకల్పలతా ! అవస్థాత్రయ సాక్షిణీ ! తుర్యాతీతస్వరూపా ! సచ్చిదానంద రూపిణీ ! సర్వవేదాంతసంవేద్యా ! సూర్యమండలవాసినీ ! ప్రాతఃకాలంలో రక్తవర్ణంలో బాలారూపిణివై, మధ్యాహ్న సమయంలో యువతివై, సాయంవేళలో కృష్ణవర్ణంలో వృద్ధవై అలరారే జగన్మాతా ! నమో నమః. సర్వభూతసృష్టికీ అరణివంటిదానా ! పరమేశ్వరీ ! అనుగ్రహించు.

గౌతముని ప్రార్థనకు సంతోషించి గాయత్రీమాత ప్రత్యక్షమయ్యింది. అందరినీ అన్నపానాలతో పోషించడానికి వీలుగా పూర్ణపాత్రను ప్రసాదించింది. మహర్షీ ! నువ్వు ఏది కోరుకుంటే అది ఇస్తుంది ఈ పాత్ర. స్వీకరించు - అని అందించి అంతర్ధానం చెందింది.

అన్నరాశులు పర్వతాకారంగా ఆవిర్భవించాయి. షడ్రసోపేతంగా వంటకాలు ఆవిర్భవించాయి. కోరుకున్న భూషణాలూ వస్త్రాలూ యజ్ఞసామగ్రి పాత్రసామగ్రి సంబారాలూ - గౌతముడు ఏక్షణాన ఏది కావాలనుకుంటే అది సమృద్ధిగా అందించింది ఆ గాయత్రి పూర్ణపాత్ర. విప్రులకు ఆయా వస్తువుల్ని పుష్కలంగా పంచిపెట్టాడు. గోమహిషాది పశువులుకూడా ఆవిర్భవించాయి. వాటినీ విప్రులకు బహూకరించాడు. వాటికి కావలసిన ఆహారమూ అందింది. గౌతముడి సూచనప్రకారం అందరూ కలిసి అక్కడ అనేక యజ్ఞాలు నిర్వర్తించారు. ఆశ్రమప్రాంతం స్వర్గసీమను తలపించింది. సమస్త సమృద్ధులతో కళకళలాడింది. ముల్లోకాలలోనూ ఏ సుందర వస్తువు ఉన్నా అదల్లా అక్కడ ఆవిర్భవించింది. వస్త్ర చందన



భూషలతో విప్రులందరూ దేవపురుషుల్లాగా ఉంటే వారి స్త్రీలందరూ దేవతాస్త్రీలే అనిపించారు. ఆ దివ్యవస్త్రాలుగానీ ఆ దివ్యభూషణాలుగానీ అలా ఉన్నాయి. ఆశ్రమ మండలంలో నిత్యోత్సవంగా కాలం గడుస్తోంది. రోగ - రాక్షస - చోర భయాలు లేవు. శతయోజన విస్తీర్ణమైన ఆశ్రమమండలం ఇంకా రకరకాల ప్రాణికోటిని ఆకర్షించింది. ఎవరు వచ్చినా ఏది వచ్చినా అందరికీ స్వాగతం పలికాడు గౌతముడు. ఆదరించి పోషించాడు.

యజ్ఞయాగాలు నిరంతరంగా పుష్కలంగా జరుగుతూండటంతో దేవతలూ సంతోషించారు. మహర్షిని కీర్తించారు. ఇంద్రుడైతే మరీ మరీ కొనియాడాడు. ఆశ్రమంలో కల్పవృక్షం ఏదో ఉండి కోరికలు తీరుస్తున్నట్టుంది. లేకపోతే భూమండలం కరువుతో కటకటలాడుతోంటే వీరికి ఈ సమృద్ధి ఎలా సాధ్యం అనుకున్నాడు.

పన్నెండేళ్ళు గడిచాయి. గౌతముడు అందరినీ పోషిస్తూనే ఉన్నాడు. అలాగని ఏ కొంచెమూ గర్వపడలేదు. గాయత్రీదేవికి ఒక దివ్యమందిరం కట్టించాడు. మునివిప్రులంతా అక్కడచేరి భక్తిశ్రద్ధలతో ముప్పొద్దులా అర్చించారు. మంత్ర పురశ్చరణలు సాగించారు. జనమేజయా ! ఇప్పటికీ ఆ మందిరం అక్కడ ఉంది. గాయత్రీమాత బాలగా యువతిగా వృద్ధురాలిగా త్రిసంధ్యల్లోనూ దర్శనమిస్తోంది.

## ◆ బ్రాహ్మణుల కుట్ర - గౌతముడి శాపం ◆

ఇలా ఉండగా నారదుడు ఒకనాడు అక్కడికి వచ్చాడు. మహతిని మోగించుకుంటూ గాయత్రీ గుణగణాలను పాడుకుంటూ వచ్చాడు. మునులంతా ఆనందంతో ఎదురువెళ్ళి ఆహ్వానించి తెచ్చి అతిథి మర్యాదలు జరిపి సభామధ్యభాగంలో సముచితాసనంమీద కూర్చుండబెట్టారు. నారదుడు శాంతచిత్తుడై సంతోషం ప్రకటించాడు. గౌతముని కీర్తిప్రతిష్ఠలను ముల్లోకాలలోనూ వింటున్నానని ప్రశంసించాడు. ఇంద్రలోకంలో శచీపతినోట ప్రత్యేకంగా విని నిన్ను చూడాలనిపించి వచ్చానన్నాడు. గాయత్రీదేవి అనుగ్రహానికి పాత్రుడవై ధన్యుడవయ్యావన్నాడు. మందిరానికి వెళ్ళి గాయత్రీదేవిని దర్శించాడు. కన్నులు వికసించాయి. దివ్యానుభూతితో పరవశించి కీర్తనలు ఆలపించాడు. మరికొంతసేపు గౌతముడితో మునులతో విప్రులతో గడిపి దేవలోకానికి తిరిగి వెళ్ళిపోయాడు.

నారదుడంతటివాడు రావడమూ గౌతముణ్ణి ప్రశంసించడమూ ఇంద్రాది దేవతలుకూడా మెచ్చుకుంటున్నారని చెప్పడమూ - ఇదంతా అక్కడి బ్రాహ్మణులకు కంటకింపుగా మారింది. రోజూ ఎవరో ఒకరు రావడమే. గౌతముణ్ణి ఓహో ఓహో అనడమే. తట్టుకోలేకపోయారు. ఆమాయ బయలుదేరింది. అందరూ చెవులు కొరుక్కుని ఒకనాడు ఒకచోట గుమికూడారు. తగిన సమయం చూసి వాతపెట్టాలి. ఇతడి యశస్సుకి అడ్డుకట్ట వెయ్యాలి - అని నిశ్చయించుకున్నారు.



పదిహేనేళ్ళు గడిచాయి. వానలు పడ్డాయి. నేలపచ్చబడింది. పంటలు పండాయి. కరువు తీరింది. దేశం సుభిక్షంగా ఉంది. నాలుగువైపులనుంచీ వార్తలు చేరాయి. బ్రాహ్మణులు మళ్ళీ రహస్యసమావేశం జరుపుకున్నారు. ఏదోఒక వంకతో గౌతముణ్ణి శపించి మనమన ప్రాంతాలకు హాయిగా వెళ్ళిపోదామని నిర్ణయించుకున్నారు. ఆహా ! ఎంత అందంగా ఉందో చూశావా జనమేజయా ! ఇలాంటి వాళ్ళని కన్న తల్లిదండ్రుల జన్మ నిజంగా ధన్యం అనాలి కదూ !! కాలమహిమ అటువంటిది. దాన్ని తెలుసుకోవడం ఎవడితరం !

సరే - అందరూ కూడబలుక్కుని ఒక మాయ ఆవును సృష్టించారు. అది కూర్చుంటే లేవలేదు. లేస్తే నడవలేదు. అంతటి ముసలిది. ఇవ్వేళో రేపో అన్నట్టుంది దాని పరిస్థితి. అలాంటి ఆవును సృష్టించి గౌతముడి పర్ణశాలదగ్గర వదిలిపెట్టారు. లోపల మహర్షి అగ్నిహోత్రం చేసుకుంటున్నాడు. ఇది గుమ్మంనుంచి లోపలికి రాబోయింది. మహర్షి చూశాడు. హుం హుం అంటూ మెల్లగా అదిలించాడు. లేచి బయటికి తోలడం అగ్నిహోత్రానికి విఘ్నమవుతుందని కూర్చున్నచోటునుంచి కదలకుండానే హుంకారంతో అదిలించాడు. ఆ మాత్రానికే ఆ ముసలి ఆవు ప్రాణాలు వదిలేసింది. నేలకు ఒరిగిపోయింది.

ఇంకేముంది - బ్రాహ్మణులు అరుపులూ కేకలూ మొదలుపెట్టారు. అయ్యో ! అయ్యో ! ఆవును చంపేశాడు గౌతమమహర్షి. గోహత్యామహాపాతకి - అంటూ గుండెలు బాదుకున్నారు. గౌతముడికి ఇదంతా వింతగా అనిపించింది. అలాగే హోమం పూర్తి చేసుకుని ఇవతలికి వచ్చాడు. అసలు సంగతి ఏమిటా అని ఒక్కసారి దివ్యదృష్టి సారించాడు. విషయం అర్థమయ్యింది. బ్రాహ్మణుల పన్నాగమని తెలిసిపోయింది. అసూయాగ్రస్తులై ఇంతకు తెగిస్తారా ! కుట్రలు పన్నుతారా ! కోపం భగభగలాడింది. ప్రళయకాల ప్రచండ రుద్రుడైపోయాడు. కన్నులు నిప్పులు కురిసాయి. కుంభవృష్టిగా శాపాలు కురిపించాడు.

బ్రాహ్మణాధములారా ! వేదమాతపట్ల గాయత్రీధ్యానంపట్ల తన్మంత్రజపంపట్ల మీకు సర్వదా వైముఖ్యం ఏర్పడుగాక ! వేదంపట్ల వేదోక్తయజ్ఞాలపట్ల తద్వార్తలపట్ల మీకు సర్వదా వైముఖ్యం ఏర్పడుగాక ! శివుడిపట్ల శివమంత్రంపట్ల శివశాస్త్రంపట్ల మీకు సర్వదా వైముఖ్యం ఏర్పడుగాక ! మూలప్రకృతి శ్రీదేవిపట్ల తన్మంత్రధ్యానాలపట్ల తత్కథలపట్ల మీకు సర్వదా వైముఖ్యం ఏర్పడు గాక ! దేవీమహోత్సవ దిదృక్షపట్ల దేవీనామానుకీర్తనపట్ల మీకు సర్వదా వైముఖ్యం ఏర్పడుగాక ! దేవీభక్తుల సాన్నిధ్యంపట్ల దేవీభక్తులను అర్చించడంపట్ల మీకు సర్వదా వైముఖ్యం ఏర్పడుగాక ! శివోత్సవ దిదృక్షపట్ల శివభక్తార్చనపట్ల మీకు సర్వదా వైముఖ్యం ఏర్పడుగాక ! రుద్రాక్ష బిల్వపత్రాలపట్ల పరిశుభ్ర విభూతిపట్ల మీకు సర్వదా వైముఖ్యం ఏర్పడుగాక ! శ్రౌతస్మార్త సదాచార జ్ఞానమార్గాలపట్ల బ్రాహ్మణాధములారా ! మీకు సర్వదా వైముఖ్యం ఏర్పడుగాక ! అద్వైతజ్ఞాననిష్ఠపట్ల శాంతిదాంత్యాది సాధనపట్ల బ్రాహ్మణాధములారా!



మీకు సర్వదా వైముఖ్యం ఏర్పడుగాక ! నిత్యకర్మానుష్ఠానంపట్ల అగ్నిహోత్రంపట్ల బ్రాహ్మణాధములారా! మీకు సర్వదా వైముఖ్యం ఏర్పడుగాక ! స్వాధ్యాయప్రవచనలపట్ల గోదానాది సత్కర్మలపట్ల పిత్శ్రాద్ధాలపట్ల కృచ్ఛచాంద్రాయణాది వ్రతాలపట్ల ప్రాయశ్చిత్తాలపట్ల బ్రాహ్మణాధములారా ! మీకు సర్వదా వైముఖ్యం ఏర్పడుగాక ! శ్రీదేవిపట్ల కాక ఇతరదేవతలపై శ్రద్ధాసక్తులు పుట్టి శంఖచక్రాది చిహ్నాంకితులై బ్రాహ్మణాధములారా ! మీరు ధర్మభ్రష్టులగుదురుగాక ! కాపాలిక మతాసక్తులై బౌద్ధశాస్త్రరతులై పాషండాచార నిరతులై పితృమాతృ సుతాభ్రాతృకన్యాభార్యా విక్రయణ తత్పరులై వేద తీర్థ ధర్మవిక్రయులై బ్రాహ్మణాధములారా ! మీరు సర్వదా పతితులగుదురుగాక ! పాంచరాత్ర కామశాస్త్ర కాపాలికమత బౌద్ధమతాలపై శ్రద్ధకలిగిన వారగుదురుగాక ! మాతృకన్యాగాములూ భగినీగాములూ పరస్త్రీలంపటులూ అయి సదాచారభ్రష్టులగుదురుగాక ! ఓ బ్రాహ్మణాధములారా ! మీరూ మీ వంశాల్లో పుట్టే స్త్రీపురుషులందరూ మద్దత్తశాపాగ్ని దగ్ధులగుదురుగాక ! ఇన్ని శాపాలతో పని ఏముంది ! గాయత్రీదేవి మూలప్రకృతి పరమేశ్వరి - మీమీద కోపాగ్నులు సర్వదా కురిపించుగాక ! ఇక అంధకూపాది నరకకుండాలలోనే మీ అందరి ఉనికి అని తెలుసుకోండి. పొండి - అని బ్రాహ్మణులమీద వాగ్దండం ప్రయోగించి నీళ్ళు స్పృశించి దేవీదర్శనం కోసమని గాయత్రీమందిరానికి వెళ్ళాడు. సాష్టాంగ నమస్కారం చేశాడు. దేవికూడా ఆ బ్రాహ్మణుల దుశ్చేష్టితానికి ఆశ్చర్యపోయింది. జనమేజయా ! అందుకే ఇప్పటికీ ఆ దేవి ముఖం స్మయయుక్తంగానే - ఆశ్చర్యపోతున్నట్టే - ఉంటుంది.

తన సన్నిధికి వచ్చి కుమిలిపోతున్న గౌతముణ్ణి ఆ స్మయమానముఖాంబుజ గాయత్రీమాత ఓదార్చింది. వత్సా ! పాముకి పాలుపోసినట్టయ్యింది. విషంగానే మారుతుంది. అది సహజం. వాళ్ళ కర్మ అలా కాలింది. నువ్వేం చేస్తావ్. మహాభాగా ! శాంతించు.

భుజంగాయార్పితం దుగ్ధం విషాయైవోపజాయతే ।
శాంతిం కురు మహాభాగ కర్మణో గతిరీదృశీ ॥ (9 - 83)

ఈ మాటలతో గౌతముడు తేరుకున్నాడు. ఆశ్రమం చేరుకున్నాడు. యథాపూర్వకంగా తపస్సు సాగించాడు.

## ◆ విప్రుల పశ్చాత్తాపం ◆

గౌతముడి శాపానికి గురియైన ఆ విప్రులందరికీ వేదాలు మరుగునపడ్డాయి. సంధ్యవారుద్దామంటే అక్షరం పెగలడంలేదు. గాయత్రీమంత్రం గుర్తుకి రావడంలేదు. ఆశ్చర్యమనిపించింది. మళ్ళీ అందరూ గుమికూడారు. గౌతముడి శాపం పనిచేస్తోందని గుర్తించారు. చేసిన దుర్మార్గానికి పశ్చాత్తాపం చెందారు.



పరుగుపరుగున వచ్చి మహర్షి కాళ్ళమీద పడ్డారు. సిగ్గుతో తలలు దించుకుని నిలబడ్డారు. వెక్కి వెక్కి విలపించారు. ఏమి మాట్లాడడానికీ ముఖం చెల్లక క్షమించు క్షమించు క్షమించు అంటూ లెంపలు వేసుకున్నారు. చుట్టూ చేరారు. మాటిమాటికీ ఇదేమాట. మరొక మాటలేదు. కరుణాపూర్ణ హృదయుడు మునీశ్వరుడు మెల్లగా పెదవి కదిపాడు.

విప్రులారా ! నా శాపానికి తిరుగులేదు. కృష్ణావతారపర్యంతం మీ అందరి ఉనికీ మనికీ కుంభీపాకనరకంలోనే. అటుపైని కలియుగం వస్తుంది అప్పుడు ఆ నరకంనుంచి బయటపడి భూలోకంలో బ్రాహ్మణులుగా జన్మిస్తారు. వేదమార్గవిముఖులై పతితులవుతారు. ఇది తప్పదు. నిజంగా తప్పించుకోవాలనే కోరిక మీకు ఉంటే ఆ జన్మలోనైనా గాయత్రీపాదపద్మాలను భక్తితో సేవించండి. వెళ్ళిరండి - అని నిష్కర్షగా చెప్పి సాగనంపాడు. ఇదంతా ఒక ప్రారబ్ధంగా భావించి మనశ్శాంతితో మౌనంగా తపస్సు చేసుకున్నాడు.

జనమేజయా ! గౌతముడి శాపం కారణంగా ఆ విప్రులందరూ ద్వాపరాంతం వరకూ కుంభీపాకనరకం అనుభవించారు. కలియుగం ప్రారంభంకాగానే ఆ నరకంనుంచి బయటపడి భూలోకంలో జన్మించారు. ఆ విప్రులూ వారి సంతతి వారే ఇప్పటికీ సంధ్యాత్రయ విహీనులై గాయత్రీవివర్జితులై వేదవిదూరులై పాషండమతాలను అనుసరిస్తున్నారు. అగ్నిహోత్రాది సత్కర్మలనూ స్వాహా స్వధాదులనూ విముఖులై నిరసిస్తున్నారు. అవ్యక్త మూలప్రకృతి గురించి వారికి ఏమీ తెలియదు. కొందరు తప్తముద్రాంకితులై కొందరు కామాచారులై కొందరు కాపాలికులై కొందరు కౌలికులై (వామాచారులు) బౌద్ధజైనాది అవైదికమతానుయాయులై దురాచార ప్రవర్తకులు అవుతున్నారు. ఉద్దండపండితులే అయినప్పటికీ ఉండవలసిన బుద్ధిమాత్రం ఉండటంలేదు. పరకాంతాలంపటులై సకల దుశ్చేష్టాపరాయణులై భ్రష్టుపడుతున్నారు. మళ్ళీ మళ్ళీ కుంభీపాకానికే వెదుక్కుటూ వెడుతున్నారు.

అందుచేత, ఓ రాజా ! పరమేశ్వరిని సర్వాత్మనా సేవించాలి. హరి - హరాదుల ఉపాసనలు నిత్యాలు కావు. శక్తి ఉపాసన ఒక్కటే నిత్యోపాసన. ఇది చెయ్యనివారికి అధఃపతనం తప్పదు.

న విష్ణూపాసనా నిత్యా న శివోపాసనా తథా ।
నిత్యా చోపాసనా శక్తేర్యాం వినా తు పతత్యధః ॥ (9 - 99)

ఇక అత్యంత సుందరమూ మహాదేవికి స్థిరనివాసమూ హరిహర హిరణ్యగర్భాదులకుకూడా అత్యంత దుర్లభమూ - మణిద్వీపవర్ణన వినిపిస్తాను. శ్రద్ధగా విను. భవారణి భువనేశ్వరిని హృదయంలో లుపుకుని మరీ ఆలకించు - అని ఆరంభించాడు వ్యాసుడు. *(అధ్యాయం - 9, శ్లోకాలు - 100)*



## ◆ మణిద్వీప వర్ణన ◆

జనమేజయా ! బ్రహ్మలోకానికి ఊర్ధ్వభాగాన సర్వలోకం ఉందని విన్నావుగదా ! అదే మణిద్వీపం. మహాదేవీ నివాసం. సర్వలోకాలకన్నా సర్వవిధాలా అధికం కనక దీన్ని సర్వలోకం అన్నారు. పరాంబికయే స్వయంగా ఈ లోకాన్ని తన ఇచ్ఛానుసారం మనస్సుతో కల్పించుకొంది. అన్ని లోకాలకన్నా ముందు తనకోసం తన నివాసార్థం నిర్మించుకున్న లోకం ఇది.

సర్వస్మాదధికో యస్మాత్సర్వలోకస్తతః స్మృతః ।
పురా పరాంబయైవాయం కల్పితో మనసేచ్ఛయా ॥ (10 - 2)

ఇదికైలాసంకన్నా వైకుంఠంకన్నా గోలోకంకన్నా అత్యధికం. దీనికన్నా సుందరమైనది ముల్లోకాలలోనూ మరెక్కడా లేదు. ఇది ముజ్జగానికీ గొడుగువంటిది. దీని నీడలోనే బ్రహ్మాండాలన్నీ చల్లగా మన్నుతున్నాయి. ఇది భవసంతాపనాశకం.

ఛత్రీభూతం త్రిజగతో భవసంతాపనాశకమ్ ।
ఛాయాభూతం తదేవాస్తి బ్రహ్మాండానాం తు సత్తమ ॥ (10 - 5)

ఈ మణిద్వీపానికి చుట్టూ సుధాసముద్రముంది. అది బహుయోజన విస్తీర్ణం. అత్యంత గంభీరం. గాలితాకిడికి ఎగసిపడే తరంగాలు. రత్నాలు దొరికే ఇసుకతిన్నెలు. శంఖాలకూ మత్స్యజాతులకూ లెక్కలేదు. సంఘర్షించుకొంటున్న తరంగాలనుంచి గాలిలో తేలివస్తున్న నీటితుంపురులతో మణిద్వీపమంతా ఎప్పుడూ సుఖశీతలంగా ఉంటుంది. రెపరెపలాడుతున్న రంగురంగుల జెండాలతో అటూ ఇటూ ప్రయాణం చేస్తున్న నావలు, కనువిందు చేస్తాయి. దాని ఒడ్డున ఒక మహావృక్షం ఉంది. రత్నద్రుమం. దానిమీదుగా చూస్తే ఉన్నతంగా ఆకాశంలో కనిపిస్తుంది ఒక మహాప్రాకారం. (కోటగోడ). అది అయోధాతునిర్మితం. ఇనుముతో ధాతుశిలలతో దృఢంగా నిర్మించిన ప్రాకారం. దాని ఎత్తు సప్తయోజనాలు. నానావిధ శస్త్రప్రహరణాలు ధరించి నానావిధ యుద్ధ విశారదులైన రక్షకభటులు ఆ ప్రాకారంమీద అంతటా కావలి తిరుగుతుంటారు. విధి నిర్వహణలో ఆనందిస్తుంటారు.

ఆ మహాప్రాకారానికి నాలుగు దిక్కులా నాలుగు ద్వారాలున్నాయి. నూరుమంది ద్వారపాలకులున్నారు. ఒక్కొక్కరి అధీనంలోనూ అనేక గణాలున్నాయి. అందరూ దేవీభక్తులే.

దేవీదర్శనంకోసం దేవతలు వస్తూ ఉంటారు. వారివెంటవచ్చే గణాలూ వారి వారి వాహనాలూ ప్రతిద్వారం దగ్గరా కనపడుతుంటాయి. శతాధిక విమానాలు. వాటి ఘంటాఘోషలు. అసంఖ్యాక హయహేషలు. ఖురాఘాతాలు. దిక్కుల చెవులు చిల్లులుపడతాయి. గణాల కిలకిలారావాలు. వేత్రహస్తుల



తాడనాలు. దేవీసేవక - దేవసేవక బృందాలతో క్రిక్కిరిసిపోయిన ఆ ప్రాంతాల్లో ఎవరిమాటా ఎవరికీ వినిపించదు. అంతటా హోరెత్తే కోలాహలమే. నానాధ్వని సమాకులమే.

ప్రాకార ద్వారం దాటి లోపలికి వెడితే అడుగడుగునా సరస్సులు స్వాదుజలపూర్ణాలు. వివిధ రత్నద్రుమవాటికలు. వాటిని గడిచాక కాంస్య నిర్మిత ప్రాకారం ఎదురవుతుంది. తేజస్సులో దీని శీర్షం శతగుణాధికం. దీనిమీద ఉన్న గోపురాలు ఆకాశాన్ని తాకుతుంటాయి. ఈ రెంటినడుమా ఉన్న వృక్షజాతులకు లెక్కలేదు. సృష్టిలో ఉన్న జాతులన్నీ అక్కడ ఉన్నాయి. నిరంతరం చిగురులు తొడుగుతాయి. పుష్పిస్తాయి. ఫలిస్తాయి. ఆ పరిమళాలు ఉక్కిరిబిక్కిరి చేస్తుంటాయి. పనస - వకుళ - లోధ్ర - కర్ణికార- శింశుప - దేవదారు - కాంచన - ఆమ్ర - సుమేరు - లికుచ - హింగుళ - ఏలా - లవంగ - కటుఫల - పాటల - ముచుకుంద - ఫలినీ - జఘనేఫల - తాళ - తమాల - సాల - కంకోల - నాగ - భద్రక - పున్నాగ- పీలవ - సాల్వక - కర్పూర - అశ్వకర్ణ - హస్తికర్ణ - తాళపర్ణ - దాడిమ - గణికా - బంధుజీవ - జంబీర - కురండక - చాంపేయ - కనకద్రుమ - కాలాగురుద్రుమ - చందన - ఖర్జూర - యూథికా - ఇక్షు - క్షీరవృక్ష- ఖదిర - చించ - భల్లాతక - రుచక - కుటజావృక్ష - బిల్వవృక్ష - తులసీవన - మల్లికావన - ఇత్యాదిగా తరులతావనాలున్నాయి. ఉపవనాలున్నాయి. రకరకాల బావులూ దిగుడుబావులూ మిలమిలలాడుతుంటాయి. కోకిలారావాలూ భ్రమరనినాదాలూ మారుమోగుతుంటాయి. ప్రతితరువునుంచీ పుష్పమకరందమో పరిపక్వఫలరసమో ఓడికలుకడుతూ ఉంటుంది. దట్టంగా నీడ అలుముకుని ఉంటుంది. ఎటుచూసినా ఫలరసాల ప్రవాహాలు. ఎటువిన్నా శకుంతగానాలు.

పావురాలూ చిలుకలూ గోరువంకలూ హంసలూ గుంపులుకట్టి ఎగురుతూంటే వాటి రెక్కలగాలికి చెట్ల చిటారుకొమ్మలూ రెమ్మలూ ఊగిసలాగుతుంటాయి. వనమంతటా సుగంధపరిమళమే. లేడికూనలు కదుపులు కదుపులుగా చెంగనాలు పోతుంటాయి. నాట్యం చేస్తున్న నెమళుల క్రేంకారాలు - నేత్రాలకూ శ్రోత్రాలకూ హాయిగొల్పుతాయి.

మొదటిది అయోమయ ధాతుశిలానిర్మిత ప్రాకారం. అటుపైని కేవల కాంస్యప్రాకారం. ఆ తరవాత తామ్రసాల. తామ్రప్రాకారం చతురస్రాకారం. ఎత్తు కాంస్యప్రాకారం**లాగానే** సప్తయోజనాలు. ఈ రెండుసాలలకూ నడుమ కల్పవృక్షవాటిక. వాటి పువ్వులు బంగారు**కాంతులీనుతు**ంటాయి. పత్రాలూ అంతే. ఫలాలలో గింజలు రత్నాలు. వాటి సుగంధం పదియోజనాలవరకూ వ్యాపిస్తుంది. ఆ వనాన్ని ఎల్లకాలమూ వసంతుడే సంరక్షిస్తుంటాడు. అతడే వనపాలకుడు. పుష్పసింహాసనంమీద కూర్చుంటాడు. పుష్పకిరీటం ధరిస్తాడు. పుష్పచ్ఛత్రం ఉంటుంది. పుష్పభూషణ భూషితుడు. పుష్పాసవప్రియుడు. కళ్ళు ఎర్రగా మత్తుగా విఘూర్ణిస్తుంటాయి. మధుశ్రీ - మాధవశ్రీ అని అతడికి ఇద్దరు భార్యలు. చిరునవ్వులు చిందిస్తూ పూలగుత్తులతో బంతులాడుకుంటుంటారు.



తద్వనం రక్షితం రాజన్ వసంతేనర్తునాపిశమ్ ।
పుష్పసింహాసనాసీన: పుష్పచ్ఛత్రవిరాజిత: ॥
పుష్పభూషా భూషితశ్చ పుష్పాసవవిఘూర్ణిత: ।
మధుశ్రీర్మాధవశ్రీశ్చ ద్వే భార్యే తస్య సమ్మతే ॥
క్రీడత: స్మేరవదనే సుమస్తబక కందుకై: ।
అతీవరమ్యం విపినం మధుస్రావి సమంతత: ॥ (10 - 39)

అన్నివైపులా మకరందం జాలువారే ఆ సుందరవనంలో దేవతలూ గంధర్వులూ తమ తమ వనితలతో జంటలు జంటలుగా గానలోలుపులై విహరిస్తూ కనపడతారు. పదియోజనాలదూరం వ్యాపించే ఆ సుమగంధమన్నా ఆ వనమన్నా వారికి వల్లమాలిన ప్రేమ. వసంతలక్ష్మికి అది ఆటపట్టు. కాముకులకు కామప్రవర్ధకం. (వసంతకుసుమాకరం).

తామ్రసాల దాటాక సీసనిర్మిత ప్రాకారం కనిపిస్తుంది. ఇదీ ఏడుయోజనాల ఎత్తే. తామ్ర - సీససాలలకు నడుమ సంతానవనవాటిక. దాని పువ్వులూ దశయోజనగంధులే. బంగారు పువ్వులు. ఎప్పుడూ వికసించే ఉంటాయి. ఆ చెట్ల మొదళ్ళల్లో అమృతరసపూర్ణ ఫలాలుంటాయి. గ్రీష్మర్తువు ఇక్కడ తోటమాలి. అతడికి శుక్రశ్రీ - శుచిశ్రీ అని ఇద్దరు భార్యలు. ఎండ వేడిమి తట్టుకోలేని ప్రాణులు ఆ వనంలో సంతానకవృక్షాల నీడకు చేరుతుంటాయి. దేవతలూ సిద్ధులూ విలాసినీమణులతో కలిసి చందన చర్చలు జరుపుకుని ఆ వనంలో విశ్రమిస్తుంటారు. పుష్పమాలికలు దండిగా అలంకరించుకుని తాళవృంతాలు విసురుకుంటూ శీతలపానీయాలు సేవిస్తూ సేదదీరుతుంటారు.

సీససాల తరవాత అరకూట ప్రాకారం (ఇత్తడి). ఇదీ ఏడుయోజనాల ఎత్తే. ఈ రెండు సాలలకూ మధ్య హరిచందన వృక్షవాటిక. వర్షర్తువు ఇక్కడ వనపాలకుడు. ఇతడి కన్నులు మెరుపుల్లా పింగళవర్ణంలో తళతళలాడుతుంటాయి. జీమూతకవచం (మేఘకవచం) ధరించి ఉంటాడు. ఇతడు మాట్లాడితే పిడుగులు పడ్డట్టే ఉంటుంది. సహస్రముఖాలుగా వారిధారలు కురిపిస్తూ సస్యాన్ని పెంచిపోషిస్తుంటాడు. ఇతడు నభఃశ్రీ - నభస్యశ్రీ - స్వరస్యా - రస్యమాలినీ - అంబా - (అ)తులా - నిరత్ని - అభ్రమంతీ - మేఘయంతికా - వర్షయన్తీ - చిపుణికా - వారిధారా - అనే పన్నెండుమంది మదవిహ్వలశక్తులతో వినోదిస్తుంటాడు. ఈ హరిచందనవనంలో తరువులన్నీ ఎప్పుడూ చిగురుతొడిగే ఉంటాయి. కొత్త తీగెలు అల్లుకుంటుంటాయి. నేలంతా చిప్పగడ్డితో పచ్చగా ఉంటుంది. నదీనదాలు పొంగిపొర్లుతుంటాయి. కాముకహృదయాల్లా సరస్సులలో కలుషితజలాలు. దేవతలూ సిద్ధులూ దేవీపూజాతత్పరులూ ఈ వనంలో ధర్మపత్నులతో కలిసి నివసిస్తుంటారు.



అరకూటసాల గడిచాక పంచలోహప్రాకారం. ఇదీ అంతేఎత్తు. ఈ రెండింటికీ నడుమ మందారతరువాటిక. నానా పుష్పలతాకీర్ణ. నానా పల్లవశోభిత. శరదృతువు దీని అధిష్ఠాత. ఇష్టలక్ష్మి ఊర్జలక్ష్మి అని ఇద్దరు భార్యలు. ఈ వనంలో సిద్ధదంపతులు నివసిస్తుంటారు.

పంచలోహసాల దాటాక రజత నిర్మిత ప్రాకారం దర్శనమిస్తుంది. ఇదీ ఏడుయోజనాల ఎత్తే. దీని శృంగాలు (బురుజులు) మిలమిలలాడుతుంటాయి. ఈ రెండు ప్రాకారాలకూ మధ్యన పారిజాత వనవాటిక. దాని పువ్వులు దశయోజనగంధులు. దేవీపరిచారికలు ఈ వనంలో విహరిస్తుంటారు. హేమంతర్తువు తోటమాలి. ఇతడికి సహశ్రీ సహస్యశ్రీ అని ఇద్దరు ఇల్లాండ్రు. ఈ తోటలో సిద్ధులూ దేవీవ్రతులూ సంచరిస్తుంటారు.

రజతసాల తరవాతది సౌవర్ణప్రాకారం. బంగారం కరిగించి ప్రాకారంగా పోశారు. ఎత్తు ఏడుయోజనాలే. ఈరెండింటి నడుమా కదంబవనవాటిక. పుష్పపల్లవ సంశోభిత. కదంబమదిరాధారలు ప్రవాహాలు కడుతుంటాయి. ఆ మకరందాన్ని గ్రోలితే ఆత్మానందం అనుభూతికి అందుతుంది. శిశిరర్తువు దీనికి అధినేత. తపఃశ్రీ - తపస్యశ్రీ అని ఇద్దరు భార్యలు. వీరితో ఆనందిస్తుంటాడు. ఈ వనంలో మహాసిద్ధులూ దేవీదానాలు చేసినవారూ ధర్మపత్నీ సమేతులై పరివార సహితులై మహానందాన్ని అనుభవిస్తూ ఉంటారు.

స్వర్ణసాల గడిచాక పుష్పరాగప్రాకారం కుంకుమారుణ కాంతులు విరజిమ్ముతూ కనపడుతుంది. రెంటికీ నడుమ నేల అంతా పుష్యరాగమయమే. వనాలూ ఉపవనాలూ వృక్షాలూ వృక్షాలవాలాలూ ఎగిరే పక్షులూ కదిలే జంతువులూ పారే నీళ్ళూ అన్నీ పుష్యరాగమయాలే. మండపాలూ మండపస్తంభాలూ సరస్సులూ కమలాలు ఒక్కటేమిటి ఈ ప్రాకారంలో సమస్తమూ పుష్యరాగమయమే. సువర్ణసాలకన్నా ఇది తేజస్సులో లక్షరెట్లు అధికం. జనమేజయా ! ఇటుపైని చెప్పబోయే రత్నప్రాకారాలకు అన్నింటికీ ఇదే పద్ధతి.

## ◆ దిక్పాలక నగరాలు ◆

ఈ పుష్యరాగ ప్రాకారంలో దిక్పాలకులుంటారు. ప్రతి బ్రహ్మాండంలోనూ ఉండే దిక్పాలకులకు వీరు సమష్టిరూపాలు. తూర్పుదిక్కున ఉన్నత సౌధశిఖరాలతో అమరావతి ఉంటుంది. మహేంద్రుడు ఇక్కడ కొలువుతీరి ఉంటాడు. స్వర్గలోకంలో ఉండే భోగంకన్నా ఇక్కడ భోగం వెయ్యిరెట్లు ఎక్కువ. ఇతడు సమష్టి శతనేత్రుడుగదా ! ఐరావతం అధిరోహించి వజ్రాయుధం ధరించి దేవసైన్యపరివృతుడై విరాజిల్లుతుంటాడు. దేవాంగనా సేవ్యమానయై శచీదేవి విరాజిల్లుతూ ఉంటుంది.

ఆగ్నేయకోణంలో వహ్నిపట్టణం. అందులో స్వాహా స్వధాయుక్తుడై అగ్నిదేవుడు (సమష్టిరూపం) ప్రకాశిస్తుంటాడు. నిజవాహనభూషాఢ్యుడై నిజసైన్యగణ పరివృతుడై దర్శనమిస్తాడు.



దక్షిణ దిక్కున యమపురి. అక్కడ దండధరుడు, యమభటులు, చిత్రగుప్తుడు, యముని మహిషం - అన్నీ సాక్షాత్కరిస్తాయి.

నైరృతి కోణంలో రాక్షసగణ పరివృతుడై నిజవాహన నిజశక్తి నిజభూషణ విరాజితుడై నిరృతి నివసిస్తుంటాడు. ఇతడు ఖడ్గధారి.

పశ్చిమదిక్కున పాశధారి వరుణుడు మహాఝష వాహనారూఢుడై వారుణీమధువిహ్వాలుడై నిజశక్తి సమాయుక్తుడై నిజయాదోగణ పరివృతుడై వరుణానీరతాకులుడై విహరిస్తుంటాడు.

వాయవ్యకోణంలో వాయులోకం. వాయుదేవుడుంటాడు. వాయుసాధన సంసిద్ధులైన యోగులు ఇతడి పరివారం. ధ్వజహస్తుడు. విశాలాక్షుడు. మృగవాహనుడు. మరుద్గణ నిజశక్తి పరివృతుడై కదలాడుతుంటాడు.

ఉత్తరదిక్కున యక్షలోకం ఉంది. వృద్ధి - బుద్ధి శక్తులతో యక్షరాజు కుబేరుడిక్కడ అధినాయకుడు. నవనిధులకు అధిపతి. ఇతడు తుందిలుడు (పొట్ట పెద్దది). ధనాధిపతి. మణిభద్ర - పూర్ణభద్ర - మణిమాన్ - మణికంధర - మణిభూషణ - మణిస్రగ్వీ - మణికార్ముకధరాది యక్షసేనానులు ఇతడిని పరివేష్టించి ఉంటారు. నిజశక్తిధరుడై వెలుగొందుతుంటాడు.

ఈశానకోణాన రుద్రలోకం ఉంది. మహత్తరం. అనర్ఘరత్నఖచితం. మహారుద్రుడు దీని అధినేత. ఇతడు కోపిష్ఠి. దీప్తనయనుడు. వీపున ఎప్పుడూ అమ్ములపొదులు. ఎడమ చేతిలో వారి ఎక్కుపెట్టిన ధనుస్సు. శతకోటి ధానుష్కులు పరివేష్టించి ఉంటారు. తనతో సమాన బలసంపన్నులై శూలాయుధ పాణులై అసంఖ్యాక రుద్రులతో సన్నద్ధుడై ఉంటాడు. వాళ్ళంతా వికృతాస్యులు. కరాళాస్యులు. నిప్పులు కక్కుతుంటారు. కొందరు దశహస్తులు. కొందరు శతకరులు. కొందరు సహస్రభుజులు. దశపాద - దశగ్రీవ - త్రినేత్రోగ్రమూర్తులు మరికొందరు. అంతరిక్షచరులు. భూమిచరులు. రుద్రాధ్యాయంలో చెప్పబడ్డ రుద్రులందరూ ఇక్కడే ఉంటారు. ఇది రుద్రలోకం. భద్రకాళీ ప్రముఖ మాతృకలతో పరివృతయై రుద్రాణీకోటి ఈ రుద్రులకు సన్నిధిలో ఉంటుంది. డామర్యాది గణాలూ వీరభద్రాది సేనానులూ - వీరితో మహారుద్రుడు విరాజిల్లుతుంటాడు. రుండమాలాధరుడై సర్పభూషా విభూషిత కర - కంధరుడై వ్యాఘ్ర చర్మపరీధానుడై గజచర్మం ఉత్తరీయంగా చితాభస్మవిలిప్త సర్వశరీరుడై ప్రమథగణ సంస్తూయమానుడై ఢమరుధ్వనులతో దిక్కులను బధిరీకరిస్తూ (చెవిటిపరుస్తూ), అట్టహాస - ఆస్ఫోటిత (జబ్బచరుపులు) ధ్వనులతో ఆకాశాన్ని దద్దరిల్లజేస్తూ భూతసంఘంతో కొలువుతీరిన - భూతావాసుడు మహేశుడు ఈ ఈశాన దిక్పతి. పేరుకూడా ఈశానుడే. *(అధ్యాయం - 10, శ్లోకాలు - 101)*



ఈ పుష్యరాగప్రాకారం దాటాక పద్మరాగప్రాకారం. అదీ కుంకుమకాంతులే వెదజల్లుతుంటుంది. ఇదీ పదియోజనాల ఎత్తే. ఈరెండింటి నడుమాఉన్న నేలా చెట్లూ చేమలూ సమస్తమూ - ఇందాకటిలాగానే - పద్మరాగమయం. ఈ ప్రాకారంలో నానాయుధ ధారిణులూ రత్నభూషావిభూషితలూ చతుష్షష్టి వీరవనితలుంటారు. వీరిలో ఎవరిలోకం వారికి ఉంది. ఎవరి నాయకుడు వారికున్నాడు. కానీ అందరూ ఎప్పుడూ ఇక్కడే స్వస్వవాహన - స్వస్వలోక జనసహితలై గుమికూడి ఉంటారు. వీరంతా మహాశక్తికి కళాంశరూపాలు. వారిపేర్లు చెబుతాను - జనమేజయా ! గ్రహించు.

## ◆ దేవీ శక్తులు ◆

పింగలాక్షి విశాలాక్షి సమృద్ధి వృద్ధి శ్రద్ధా స్వాహా స్వధా మాయా వసుంధరా త్రిలోకధాత్రీ సావిత్రీ గాయత్రీ త్రిదశేశ్వరీ సురూపా బహురూపా స్కందమాతా అచ్యుతప్రియా విమలా అమలా అరుణీ (20) ఆరుణీ ప్రకృతి వికృతి సృష్టి స్థితి సంహృతి సంధ్యామాతా సతీ హంసీ మర్దికా వజ్రికాపూరా దేవమాతా భగవతీ దేవకీ కమలాసనా త్రిముఖీ సప్తముఖీ సురాసురవిమర్దినీ లంబోష్ఠీ (40) ఊర్ధ్వకేశీ బహుశీర్షా వృకోదరీ రథరేఖా శశిరేఖా అపరా గగనవేగా పవనవేగా భువనపాలా మదనాతురా అనంగా అనంగమథనా అనంగమేఖలా అనంగకుసుమా విశ్వరూపా సురాదికా క్షయంకరీ శక్తిః అక్షోభ్యా సత్యవాదినీ (60) బహురూపా శుచివ్రతా ఉదారా వాగీశ్వరీ నామాలతో మహాశక్తి కళారూపాలు చతుష్షష్టి.

వీరందరూ జ్వాలామాలికల్లాంటి నాలికలు చప్పరిస్తూ అగ్నులు వెళ్ళగక్కుతుంటారు. సప్తసముద్రాలనూ తాగేస్తాం. సృష్టినంతటినీ సంహరిస్తాం. అగ్నిదేవుణ్ణి చప్పరిస్తాం. వాయువును స్తంభింపజేస్తాం. అఖిలజగత్తునూ భక్షిస్తాం - అని అరుస్తూ అగ్నిగోళాల్లాంటి కళ్ళు మిటకరిస్తూ, ధనుర్బాణాలు ధరించి ఎల్లవేళలా యుద్ధం యుద్ధమంటూ ఉరకలు వేస్తుంటారు. వీళ్ళు దంష్ట్రల్ని పటపటలాడిస్తుంటే దిక్కులు చిల్లులు పడతాయి. వీళ్ళది పూర్తిగా రాగిజుట్టు. రాగితీగల్లాగా నిక్కబొడుచుకుని ఉంటుంది. వీరిలో ఒక్కొక్కరికీ శతాక్షౌహిణుల సైన్యం ఉంది. ఒక్కొక్కశక్తీ లక్ష బ్రహ్మాండాలను నాశనం చెయ్యగలదు. వీళ్ళ సైన్యంకూడా అంతటిదే. ఈ జగత్తులో వీళ్ళు చెయ్యలేనిదంటూ ఏమీలేదు. యుద్ధసామగ్రి అంతా ఈ కక్ష్యలో నిలవ ఉంటుంది. గజాశ్వరథాలకు లెక్కలేదు.

పద్మరాగప్రాకారం దాటగానే గోమేధికప్రాకారం కనపడుతుంది. అదీ పదియోజనాల ఎత్తే, జపాకుసుమకాంతుల్ని విరజిమ్ముతుంటుంది. ఈ కక్ష్యలో నేలానింగీ చెట్టూపుట్టా సమస్త వస్తుసామగ్రి - అంతా గోమేధికమయం. భవనాలూ స్తంభాలూ చెరువులూ నూతులూ అన్నీ గోమేధిక నిర్మితాలే. ఈ కక్ష్యలో ముప్పయిరెండు మంది మహాదేవీశక్తులు నివసిస్తుంటారు. వారి చేతుల్లో గోమేధికాలు పొదిగిన



భీషణాయుధాలు ఉంటాయి. వారి భూషణాలూ గోమేధిక నిర్మితాలే. వీరికీ ప్రత్యేకలోకాలున్నాయి. కానీ అందరూ ఎప్పుడూ ఇక్కడనే ఉంటారు. ఎల్లవేళలా కయ్యానికి కాలుదువ్వుతుంటారు. పిశాచవదనలు. స్వర్లోకవాసులు వీరిని పూజిస్తుంటారు. ఆయుధాలు ధరించి తాండవంచేస్తూ కొట్టు కొట్టు - తన్ను తన్ను - చింపు చింపు - కాల్చు కాల్చు అని అరుస్తూ ఉంటారు. రణప్రియలు. ఒక్కొక్క శక్తిదగ్గరా దశాక్షౌహిణుల సైన్యం ఉంది. ఒక్కొక్క శక్తీ లక్షబ్రహ్మాండాలను మట్టుపెట్టగలదు. సేనాశక్తిని వర్ణించి చెప్పడం కష్టం. రథగజాశ్వశస్త్రాస్త్రాలకు లెక్కలేదు. సర్వయుద్ధ సమారంభాలూ ఇక్కడినుంచే. వీరి పేర్లుకూడా చెబుతాను. వినేసెయ్యి. పాపాలు నశిస్తాయి.

విద్యా - హ్రీ - పుష్టిః - ప్రజ్ఞా - సినీవాలీ - కుహూః - రుద్రా - వీర్యా - ప్రభా - నందా (10) - పోషిణీ - ఋద్ధిదా - శుభా - కాళరాత్రిః - మహారాత్రిః - భద్రకాళి - కపర్దినీ - వికృతిదండి - ముండినీ - సేందుఖండా (20) - శిఖండినీ - నిశుంభశుంభ మథినీ - మహిషాసురమర్దినీ - ఇంద్రాణీ - రుద్రాణీ - శంకరార్ధశరీరిణీ - నారీ - నారాయణీ - త్రిశూలినీ - పాలినీ - అంబికా - హ్లాదినీ (32) నామధేయలు. వీరిలో ఎవరికి కోపం వచ్చినా మరిక బ్రహ్మాండం లేనట్టే. ఎప్పుడూ ఎక్కడా పరాజయమంటూ ఎరగరు.

## ◆ దేవీ పరిచారికలు ◆

గోమేధిక ప్రాకారం గడిచాక వజ్రమయసాల. ఇదీ అంతే ఎత్తు. గోపురాలూ ద్వారాలూ యథాతథం. కవాటాలూ వాటి గొలుసులూ గడియలూ వజ్రనిర్మితాలే. ఈ కక్ష్యలో ఉన్న సమస్త వస్తుజాలమూ మందిరాలూ జంతుపక్షి బృందమూ వాపీ కూపతటాకాదికమూ - అంతా వజ్రమయం. ఇక్కడ శ్రీభువనేశ్వరి పరిచారికలు నివసిస్తుంటారు. ఒక్కొక్క పరిచారిక చేతికిందా లక్షమంది దాసీజనం ఉన్నారు. అందరూ మదగర్వితలు. తాళవృంతధరలు. కొందరి చేతుల్లో చషకాలు (పానపాత్రలు) ఉంటాయి. కొందరి చేతుల్లో తాంబూలపాత్రలు. కొందరు ఛత్రధారిణులు. చామర ధారిణులు. వస్త్ర ధారిణులు. పుష్పమాలికా ధారిణులు. ఆదర్శ ధారిణులు (అద్దాలు). కుంకుమ లేపన ధారిణులు. కజ్జల ధారిణులు. సిందూరచషక ధారిణులు. మహాదేవికి కావలసిన అలంకరణసామగ్రిని సర్వసన్నద్ధంచేసి పట్టుకుని పిలుపుకోసం ఎదురుచూస్తూ ఉంటారు. వీరిలో కొందరు మకరికాపత్ర నిర్మాణంలో నేర్పరులు. కొందరు పాదసంవాహనలో కొందరు భూషాకరణంలో కొందరు పుష్పమాలికాకరణంలో కొందరు పుష్పాలంకరణలో - ఇలా ఒక్కొక్క విద్యలోనూ కొందరు కొందరు నేర్పరులు. అందరూ బహువిలాస చతురలే. అందరూ యువతులే. చీరలు కట్టుకుని కొంగుబిగించి కళకళలాడుతుంటారు. దేవీకృపాలేశానికి నోచుకుని జగత్త్రయాన్నీ తుచ్ఛీకరించిన గర్వం తీవి వీరి ముఖాల్లో కదలికల్లో కనపడుతుంటుంది.



నిబద్ధపరిధానీయా యువత్యస్సకలా అపి ।
దేవీకృపాలేశవశాత్ తుచ్ఛీకృతజగత్త్రయాః ॥ (11 - 46)

వీరే అమ్మవారికి దూతికలు. శృంగారమదగర్వితలు. వీరిపేర్లు చెబుతాను. విని ఆనందించు. అనంగరూపా - అనంగమదనా - మదనాతురా - భువనవేగా - భువనపాలికా - సర్వశిశిరా - అనంగవేదనా - అనంగమేఖలా నామధారిణులు. మెరుపుతీగల్లాంటి సుందరీమణులు. కాంచీకంకణకింకిణీగణ ఝణత్కారాలతో మంజు మంజీర శింజానాలతో ఇటూ అటూ పరుగులు తీస్తుంటారు. సర్వకార్య నిపుణలు. వేత్రహస్తలు. వీరి నివాస సదనాలు ఈ ప్రాకారంలో మనోహరంగా ఉంటాయి. కన్నులున్నందుకు ఒక్కసారైనా చూసి తీరవలసిందే. ఆ సదనాల ముందు ఎన్నెన్ని వాహనాలు ! అడుగడుగునా ఖడ్గధారిణుల కావలి.

## ◆ అష్టమాతృకలు ◆

వజ్రప్రాకారం గడిచివెళ్ళాక వైదూర్యప్రాకారం. ఎత్తు పదియోజనాలు. గోపురద్వారాలు యథాపూర్వంగానే. వైదూర్యభూమి. వైదూర్యమందిరాలు. వైదూర్యవీథులు. వైదూర్యరథ్యలు. వాపీకూప తటాక స్రవంతుల గట్టులూ ఒడ్డులూ వైదూర్యమయాలు. వాటిలో ఇసుకకూడా వైదూర్యమయమే. వృక్ష వితర్దికలు వైదూర్యనిర్మితాలు. ఈ కక్ష్యలో ఎనిమిదిదిక్కులా అష్టమాతృకల మహాసౌధాలుంటాయి. వీరు ప్రతి బ్రహ్మాండమాతృకల సమష్టిరూపాలు. బ్రాహ్మి - మాహేశ్వరి - కౌమారి - వైష్ణవి - వారాహి - ఇంద్రాణి - చాముండ - వీరు సప్తమాతృకలు. ఎనిమిదవ మాతృకపేరు మహాలక్ష్మి. బ్రహ్మరుద్రాది దేవతలకు వీరు సమాకారలు. జగత్కల్యాణకారిణులు. సేనాసమావృతలై పరిచారికాగణసేవితలై విరాజిల్లుతుంటారు. ఈ ప్రాకారం నాలుగు ద్వారాలదగ్గరా సాలంకృతాలై మహేశ్వరీవాహనాలు సన్నద్ధంగా ఉంటాయి. కోటి ఏనుగులు, కోటి గుఱ్ఱాలు, కోటి పల్లకీలు, హంస - సింహ - మయూర - గరుడ - వృషభాదులూ - వీటిని పూన్చిన రథాలూ కోటికోటిసంఖ్యలో జెండాల రెపరెపలతో ఎప్పుడూ సిద్ధంగా ఉంటాయి. పార్ష్ణిగ్రాహులు సిద్ధం. వివిధ చిహ్నాలతో వాద్యవిశేషాలతో కోటి విమానాలు వేచిఉంటాయి.

## ◆ షోడశదళ పద్మం ◆

వైదూర్యప్రాకారం గడిస్తే ఇంద్రనీలప్రాకారం. ఇదీ దశయోజనోత్తుంగమే. కక్ష్యలో మధ్యభాగమంతా ఇంద్రనీలమణిమయమే. ఇక్కడ తటాకంలో ఒక పద్మం ఉంటుంది. అది బహుయోజన విస్తృతం. షోడశారం. (పదహారు రేకలుంటాయి). షోడశకోణాలతో ఇది సుదర్శన చక్రంలా ప్రకాశిస్తూంటుంది.



ఇందులో పదహారు శక్తులకూ పదహారు సౌధాలున్నాయి. అన్ని సౌకర్యాలతో అన్ని సౌందర్యాలతో అన్ని సమృద్ధులతో తులతూగుతుంటాయి. ఈ షోడశశక్తుల పేర్లు ఏమిటంటే - కరాళి, వికరాళి, ఉమ, సరస్వతి, శ్రీ, దుర్గ, ఉష, లక్ష్మి, శ్రుతి, స్మృతి, ధృతి, శ్రద్ధ, మేధ, మతి, కాంతి, ఆర్య. వీరంతా నీలమేఘాల్లాగా ఉంటారు. కరవాలాలు ధరించి ఉంటారు. ఆఖేటక ధారిణులు (కూడా వేటకుక్కలుంటాయని). యుద్ధప్రియలు. వీరు జగన్మాతకు సేనానులు. ప్రతిబ్రహ్మాండశక్తులకు నాయికలు. దేవీశక్తిని ఆవహింపజేసుకుని బ్రహ్మాండాలను క్షోభపెడుతుంటారు. నానా రథసమారూఢలు. నానాశక్తి సమన్వితలు. వీరి పరాక్రమం వర్ణించాలంటే ఆదిశేషుడైనా చాలడు.

## ◆ అష్టమంత్రిణులు ◆

ఇంద్రనీలప్రాకారాన్ని గడిచివెడితే ముక్తామయప్రాకారం. ఎత్తు దశయోజనాలు. కక్ష్యలో సమస్తమూ ముక్తామయం. ఇక్కడ అష్టదళపద్మం ఉంటుంది. ముక్తామణిగణాకీర్ణం. అతివిస్తృతం. సకేసరం. దీనిలో అష్టమంత్రిణులుంటారు. మహాదేవీ సమానాకారాలలో ఆ తల్లి ఆయుధాలు ఎనిమిదింటినీ ధరించి సిద్ధంగా ఉంటారు. దేవితో సమానంగా భోగాలు అనుభవిస్తుంటారు. దేవికి ఇంగితజ్ఞలు. పండితలు. సర్వకార్యనిర్వహణ దక్షలు. స్వామికార్యపరాయణలు. దేవి అభిప్రాయాన్ని తెలుసుకోవడంలో నేర్పరులు. అతి సుందరలు. నానాశక్తి సమన్వితలు. ప్రతీ బ్రహ్మాండంలోనూ ఉన్న ప్రతీప్రాణికి సంబంధించిన ప్రతీసమాచారాన్నీ జ్ఞానశక్తితో ప్రతీక్షణమూ తెలుసుకుంటూ ఉంటారు.

నానాశక్తి సమాయుక్తాః ప్రతిబ్రహ్మాండవర్తినామ్ ।
ప్రాణినాం తాన్సమాచారం జ్ఞానశక్త్యా విదంతి చ ॥ (11 - 78)

మహాదేవికి మంత్రిణులైన ఈ ఎనమండుగురి పేర్లూ ఏమిటంటే - అనంగకుసుమ, అనంగకుసుమాతుర, అనంగమదన, అనంగమదనాతుర, భువనపాల, గగనవేగ, శశిరేఖ, గగనరేఖ. వీరు అరుణవర్ణంలో ఉంటారు. పాశ - అంకుశ - వర - అభయహస్తలు. విశ్వవార్తలను ఎప్పటికప్పుడు మహేశ్వరికి తెలియపరుస్తుంటారు.

పాశాంకుశవరాభీతిధరా అరుణవిగ్రహాః ।
విశ్వసంబంధినీం వార్తాం బోధయంతి ప్రతిక్షణమ్ ॥ (11 - 81)



## ◆ షట్కోణ పద్మం ◆

ముక్తాప్రాకారం దాటాక మరకతప్రాకారం. ఈ సాలమూ దశయోజనోన్నతమే. నానా సౌభాగ్యసంయుక్తం. నానాభోగసమన్వితం. కక్ష్యలో మధ్యభూమీ సదనాలూ సమస్తమూ మరకతమయమే. ఇక్కడ షట్కోణపద్మం ఉంది. పూర్వకోణంలో గాయత్రీసహితుడై చతుర్ముఖుడు కుండికా - అక్షమాలా - అభయహస్త - దండాయుధధరుడై నివసిస్తుంటాడు. గాయత్రీదేవికూడా అలాగే ధరించి ఉంటుంది. గాయత్రీచతుర్ముఖుల సర్వరూపాలూ ఇక్కడే ఉంటాయి. నాలుగు వేదాలూ సకలశాస్త్రాలూ వ్యాహృతులూ స్మృతులూ పురాణాలూ మూర్తిధరించి సేవిస్తుంటాయి. నైరృతికోణంలో శంఖ చక్ర గదా పద్మాలు ధరించి సావిత్రీవిష్ణుమూర్తులుంటారు. వీరి సకలరూపాలూ ఇక్కడే ఉంటాయి. వాయుకోణంలో పరశు - అక్షమాలా - వరదాభయదహస్తాలతో సరస్వతీమహారుద్రులుంటారు. వీరి రూపభేదాలూ ఇక్కడే ఉంటాయి. అరవైనాలుగు ఆగమాలు అన్నీ రూపుదాల్చి సేవిస్తుంటాయి. ఆగ్నేయకోణంలో రత్నకుంభ - మణికరండాలు ధరించి మహాలక్ష్మీకుబేరులుంటారు. వారుణ మహాకోణంలో (పశ్చిమం) పాశ - అంకుశ - ధనుర్బాణధరులై రతిమన్మథులుంటారు. వివిధ శృంగారభేదాలు మూర్తిధరించి సేవిస్తుంటాయి. ఈశాన్యకోణంలో పాశాంకుశధరులై పుష్టివిఘ్నేశ్వరులుంటారు. గణేశవిభూతులన్నీ ఇక్కడే ఉంటాయి.

జనమేజయా ! ప్రతిబ్రహ్మాండంలోనూ ఉండే బ్రహ్మాదులకు సమష్టిరూపాలు వీరందరూ. జగదీశ్వరిని సేవిస్తూ ఉంటారు.

## ◆ పంచభూత, ఆమ్నాయ దేవీబృందం ◆

మరకతసాలం దాటాక ప్రవాళప్రాకారం. దశయోజన సమున్నతం. కుంకుమారుణవర్ణం. కక్ష్యలో అన్నీ ఇలాగే ప్రవాళమయాలు. ఇక్కడ పంచభూతాల స్వామినులుంటారు. హృల్లేఖ - గగన - రక్త - కరాళిక - మహోచ్ఛుష్మ అని వీరి పేర్లు. పంచభూతసమప్రభలు. పాశాంకుశవరదాభయహస్తలు. అమితభూషణలు. దేవీసమానవేషాఢ్యలు. నవయౌవనగర్వితలు.

ప్రవాళసాలం గడిచాక నవరత్నప్రాకారం. ఇది మహాప్రాకారం. బహుయోజనోన్నతం. కక్ష్యలో అంతా అన్నీ నవరత్నమయాలే. ఇక్కడ ఆమ్నాయదేవీబృందం ఉంటుంది. మహాదేవి అవతారాలన్నీ ఉండేది ఇక్కడే. మహావిద్యామహాభేదాలూ ఉంటాయి. నిజావరణదేవీబృందంతో నిజభూషణవాహన సహితలై సర్వదేవీ సమూహమూ కోటిసూర్యప్రభలు విరజిమ్ముతూంటుంది. సప్తకోటిమహామంత్రాల అధిష్ఠాన దేవతానీకమూ ఉండేది ఇక్కడే.



నవరత్నసాలం దాటివెడితే చింతామణిగృహం దర్శనమిస్తుంది. అందులో ఉండే వస్తువులు మాత్రమే చింతామణిమయాలు. స్తంభాలు వేలసంఖ్యలో ఉంటాయి. అవి సూర్యకాంత - చంద్రకాంత - విద్యుత్కాంతమణి నిర్మితాలు. వీటికాంతుల తళత్తళలలో మునిగిపోయి లోపల ఉన్న ఏ వస్తువూ ఒకపట్టాన కంటికి కనిపించదు.

*(అధ్యాయం - 11 , శ్లోకాలు - 110)*

## ◆ చింతామణి గృహం - శ్రీమాత ◆

జనమేజయా ! అదే దేవీసదనం. వేయిస్తంభాల మండపాలు నాలుగు ఉంటాయి. శృంగారమండపం - ముక్తిమండపం - జ్ఞానమండపం - ఏకాంతమండపం అని వరసగా వాటిపేర్లు. అనేక వితాన సంయుక్తాలు (మేల్కట్టులు). అనేక ధూప పరిధూపితాలు. కాంతిలో కోటిసూర్యసమానాలు. ఆ శుభమండపాలకు చుట్టూ కాశ్మీరవనం. మల్లికావనం. కుందవనం. వాటిలో అసంఖ్యాక కస్తూరిమృగాలు. మృగమదాన్ని స్రవిస్తూ ఉంటాయి. అక్కడే ఒక పెద్ద సరోవరం ఉంది. అది సుధారసపూర్ణం. దానికి రత్ననిర్మిత సోపానపంక్తి. అందులో మహాపద్మవనం. పద్మాలపై ముసురుకొనే గండుతుమ్మెదలు. వాటి ఝుంకారాలు. హంసకారండవాది జలపక్షి బృందాలు. వాటి కలకూజితాలు. దిక్తటాలకు వ్యాపించే సుమధుర పద్మపరిమళం. ఈ వనాల పరిమళంలో మణిద్వీపమంతా ఘుమఘుమలాడుతూ ఉంటుంది.

శృంగారమండపంలో జగదంబిక వివిధ సంగీత గానాలు ఆలకిస్తూంటుంది. ముక్తిమండపంలో తపస్వులకూ దేవీ ఆరాధన తత్పరులకూ యోగులకూ ముక్తి ప్రసాదిస్తూంటుంది. మూడవ మండపంలో జ్ఞానోపదేశాలు చేస్తుంటుంది. నాల్గవ ఏకాంత మండపంలో మంత్రిణులతో కలిసి నిత్యమూ జగద్రక్షణ గురించి సమాలోచనలు జరుపుతూంటుంది.

జనమేజయా ! చింతామణి గృహంలో పది సోపానాలతో ఒక మంచకం ఉంది. శక్తితత్త్వాలు పదీ - పది సోపానాలు. బ్రహ్మ విష్ణు రుద్ర ఈశ్వరులు నల్గురూ దానికి ఖురాలు (కోళ్ళు). ఫలకమేమో సదాశివుడు. దానిమీద భువనేశ్వరుడు మహాదేవుడు విరాజిల్లుతుంటాడు. మహాదేవియే విలాసార్థం ద్విధాభూత (రెండుగా) అయ్యిందని తెలుసుగదా ! సృష్టికి ఆదిలో ఇతడే తదర్ధాంగ మహేశ్వరుడు. కందర్ప దర్పనాశకుడు. కోటి కందర్ప సుందరుడు. పంచవక్త్రుడు. త్రినేత్రుడు. మణిభూషణ భూషితుడు. పరశు - హరిణ - వరద - అభయహస్తుడు. పదహారేళ్ళ పడుచువాడు. మహాసర్వేశ్వరుడు. కోటి సూర్యప్రతీకాశుడు. కోటిచంద్ర సుశీతలుడు. శుద్ధస్ఫటిక సంకాశుడు. ఈ భువనేశ్వరుడి వామాంకంలో కూర్చుని ఉంటుంది శ్రీ భువనేశ్వరి.



నవరత్నగణాకీర్ణ కాంచీదామ విరాజితా ।
తప్తకాంచనసన్నద్ధ వైదూర్యాంగదభూషణా ॥ (12 - 18)

నవవిధ రత్నాలు పొదిగిన కాంచీదామం (వడ్డాణం). మేలిమిబంగారంలో వైదూర్యాలు తాపించిన అంగదాలు. శ్రీచక్రరూపంలో ఉండే తాటంకాలు. వాటి తళతళలతో మెరిసిపోతున్న ముఖపద్మం. అర్ధచంద్రరేఖను జయించే నెన్నొసలు. దొండపండుల్లాంటి పెదవులు. కస్తూరీకుంకుమతిలకాలు దిద్దుకున్న ఫాలభాగం. శిరస్సున సూర్యచంద్రుల్ని తనలో ఇముడ్చుకునే దివ్య చూడామణి. ఉదయభానుబింబంలాంటి నాసాభరణం (ముక్కుపుడక). మేలిముత్యాలు వేలాడుతున్న చింతాకపతకం. చందనం కర్పూరం కుంకుమలు కలిపి ఒత్తుగా అద్దుకున్న స్తనమండలం.

చింతాకాలంబితస్వచ్ఛముక్తాగుచ్ఛవిరాజితా ।
పాటీరపంకకర్పూరకుంకుమాలంకృతస్తనీ ॥ (12 - 22)

విచిత్ర వివిధ భూషణాలు ఎన్నో ధరించి విరాజిల్లుతూంటుంది. శంఖంలాంటి మెడ. దానిమ్మగింజల్లాంటి పలువరుస. అనర్ఘమణులు పొదిగిన కిరీటం ధరించిన శిరస్సు. మదించిన తుమ్మెదలు (వంటి) కదలాడుతున్న ముంగురులతో మురువైన ముఖపద్మం. ఏనాడూ క్షీణించని - మచ్చలేని చందమామలాంటి ముఖం. జాహ్నవీజలావర్తం (నీటిసుడి) వంటి పొక్కిలి. మాణిక్య శకలాలు పొదిగిన ఉంగరాలు అన్నివేళ్ళకూ. పద్మపత్రాలలాగా ముచ్చటైన మూడుకన్నులు. పద్మరాగమణులకు మరింత మహారాగాన్ని కల్పిస్తే జగదీశ్వరీశరీర కాంతికి సాటిరావచ్చు. చేతులకు రత్నకంకణాలు. వాటికి రత్నకింకిణులు (చిరుమువ్వలు). మెడలో ముత్యాలదండలు. మణిహారాలు. వాటికి అందాల పతకాలు. రత్నాంగుళీయకాల కాంతులతో రత్నకంకణాల ప్రభలతో ధగధగలాడుతున్న చేతులు. అమ్మవారు ధరించిన కంచెలకు (రవిక) రత్నాల బుటాలు. మల్లికా పరిమళాలను సహజంగానే గుబాళించే కేశపాశం. అందులో తురిమిన మల్లెచెండ్లు. వాటికోసం మూగుతున్న తేటిపిండ్లు (తుమ్మెదగుంపులు).

సువృత్త నిబిడోత్తుంగ కుచభారాలస - ఆ శివ. పాశాంకుశవరదాభయ హస్తచతుష్టయవిరాజిత - ఆ సురపూజిత. సర్వశృంగారవేషాఢ్య. సుకుమారాంగవల్లరి. సౌందర్యధారాసర్వస్వ. అనిర్వ్యాజ కరుణామయి. నిజసల్లాపమాధుర్య తిరస్కృతకచ్ఛపి. కోటీందు కోటీనకాంతిమయి. సఖీజన - దాసీజన - దేవాంగనా - దేవతాబృంద పరివేష్టిత. ఇచ్ఛా జ్ఞానక్రియా శక్తిత్రయ సమన్విత. లజ్జ - తుష్టి - పుష్టి - కీర్తి - కాంతి - క్షమ - దయ - బుద్ధి - మేధ - స్మృతి - లక్ష్మి - వీరు అక్కడుండే దేవాంగనలు. జయ - విజయ - అజిత - అపరాజిత - నిత్య - విలాసిని - దోగ్ధ్రి - అఘోర - మంగళ - ఈ తొమ్మిదిమంది పీఠశక్తులూ పరాంబికను సేవిస్తుంటారు.



పరమేశ్వరికి పార్శ్వభాగంలో శంఖ - పద్మనిధులు రెండు ఉంటాయి. వాటినుంచి నవరత్నవాహిని కాంచనవాహిని సప్తధాతువాహిని అనే నదులు వెలువడుతుంటాయి. ఇవి సుధాసముద్రంవరకూ ప్రవహించి అందులో లీనమవుతాయి.

భువనేశ్వరీదేవి తన వామాంకభాగాన విరాజిల్లుతోంది. కాబట్టే మహేశుడికి సర్వేశత్వం సిద్ధిస్తోంది. జనమేజయా ! ఆ చింతామణిగృహం సహస్రయోజన విస్తీర్ణం. దీనికి ఉత్తరంగా ఉన్న శాలలు ఒకదానికంటే ఒకటి రెట్టింపు. ఇది నిరాధారంగా అంతరిక్షంలో వెలుగొందుతూంటుంది. మహాప్రళయంలోగానీ పునస్సృష్టిలోగానీ అవసరాన్నిబట్టి ఇది సంకోచ - వికాసాలు (పటవత్) నిత్యం పొందుతూ ఉంటుంది. మహోమయి మహాదేవి నివసిస్తోంది కనక శాలలన్నింటిలోకీ ఈ చింతామణి గృహమే కాంతిపరమావధి. ప్రతి బ్రహ్మాండంలోనూ ఉండే దేవ - నాగ - మనుష్యజాతుల దేవీ ఉపాసకులందరూ చేరేది ఇక్కడికే. దేవక్షేత్రంలో ప్రాణాలు విడిచిన వారికీ దేవీ నిరంతరార్చన తత్పరులకూ గమ్యం ఇదే. ఇక్కడ దేవి మహోత్సవస్వరూపిణి. ఘృత - దుగ్ధ - దధి - మధుకుల్యలేకాక ద్రాక్షారస - జంబూరస - ఆమ్రరస - ఇక్షురస జీవనదులు వేలసంఖ్యలో ప్రవహిస్తుంటాయక్కడ. కోరుకున్న ఫలాలను ఇచ్చే (కోరికలను ఫలింపజేసే) వృక్షాలూ వాపీకూపతటాకాలూ కోకొల్లలు. అన్నీ ఇష్టపాన ఫలప్రదాలే. ఏదీ తక్కువది కాదు. అక్కడ నివసించేవారికి రోగాలుగానీ జుట్టునెరిసే ముసలితనంగానీ ఏనాటికీ రావు. చింతలులేని కామక్రోధమాత్సర్యాలు లేని జీవితాలు. అందరూ యౌవనులే. స్త్రీ సహితులే. సహస్రాదిత్య వర్చసులే. శ్రీభువనేశ్వరిని సతతమూ భజిస్తూ ఉంటారు. వారిలో కొందరు సాలోక్యం పొందితే, కొందరు సామీప్యాన్నీ, కొందరు సారూప్యాన్నీ, కొందరు సాన్నిధ్యాన్నీ పొందుతున్నారు. ప్రతిబ్రహ్మాండంలోనూ ఉండే దేవతలందరూ సమష్టిరూపాలలో వచ్చి అమ్మవారికి సేవలు చేస్తుంటారు. సప్తకోటి మహామంత్రాలూ సకలమహావిద్యలూ రూపుదాల్చి వచ్చి ఆ సామ్యావస్థాత్మికను ఆ శివను ఆ కారణబ్రహ్మరూపను ఆ మాయాశబల విగ్రహను నిరంతరం ఉపాసిస్తూ ఉంటాయి.

మహారాజా ! మహత్తరమైన మణిద్వీపాన్ని వర్ణించి చెప్పాను. అది కాంతిమయం. కోటి సూర్యచంద్రులుగానీ కోటి మెరుపులుగానీ, కోటి అగ్నులుగానీ దాని కాంతిలో కోట్యంశంలో కోట్యంశానికైనా సాటిరావు. ఒక్కొక్కసారి అది విద్రుమ సంకాశం. ఒక్కొక్కసారి మరకతచ్ఛవిమంతం. ఒక్కొక్కసారి విద్యుద్భాను సమచ్ఛాయం. ఒక్కొక్కసారి మధ్యందిన మార్తాండనిభం. ఒక్కొక్కసారి విద్యుత్కోటి మహాధారాసారకాంతితతం. ఒక్కొక్కసారి సిందూరనీలేంద్రం. ఒక్కొక్కసారి మాణిక్య సదృశచ్ఛవి. హీరసార మహాగర్భ ధగద్ధగితదిక్తటం. దావానలసమం. తప్తకాంచనసన్నిభం. చంద్రకాంతమణి కాంతితుల్యం. సూర్యోద్గారసమం. దాని శృంగాలూ ప్రాకారగోపురాలూ (బురుజులు) రత్నమయాలు. అక్కడి చెట్లకు



రత్నపత్రాలు, రత్నఫలాలు. నర్తించే మయూరాలు. మణితధ్వనులు చేసే పావురాలు. కాకలీస్వరాలు వినిపించే కోకిలలు. శుకాలాపాలు - మారుమ్రోగుతుంటాయి. తేటనీటితో నిండిన సరోవరాలు. వాటిలో వికసించే రత్నపంకజాలు. శతయోజనాలకు వ్యాపించే సుగంధాలు. మందమారుతానికి కదలాడుతున్న చెట్లు - ఇవన్నీ ఆ మణిద్వీపంలో పంచేంద్రియతర్పణం చేస్తాయి. చింతామణి గృహకాంతులు నిండిన ఆకాశం. రత్నకాంతులతో ధగధగలాడుతున్న దిగంతాలు. వృక్షలతాకుసుమగంధ పరిపూరితం. ధూపధూపితం. రాజా ! ఇదీ మహోజ్జ్వలమణిద్వీపం. అక్కడున్న మందిరాలలోని నిలువుటద్దాలలో పరావర్తనం చెంది కిటికీలనుంచి (సోరణగండ్లు) వెలువడుతున్న కాంతిపుంజాలతో దశదిశలనూ సమ్మోహపరుస్తూంటుంది.

మణిజాలక సచ్ఛిద్రతరళోదరకాంతిభిః ।
దిఙ్మోహజనకం చైతద్దర్పణోదర సంయుతమ్ ॥ (12 - 66)

అది ఐశ్వర్యానికి పరకోటి. శృంగారానికి పరాకాష్ఠ. సర్వజ్ఞతకు పరమావధి. తేజస్సుకి పరసీమ. పరాక్రమానికి చివరిమాట. సర్వోత్తమగుణానికి తుదిపలుకు. దయాగుణానికి చివరిపలుకు. బ్రహ్మలోకాంతంవరకూ ఉండే ఆనందాలన్నీ ఇక్కడే అంతర్భవిస్తూంటాయి. అది ఆనందానుభవానికి చివరిమెట్టు.

జనమేజయా ! ఇది మహత్తరమైన మణిద్వీప వర్ణన. మహాదేవికి పరంస్థానం. సర్వలోకోత్తమోత్తమం. దీన్ని స్మరిస్తేచాలు పాపాలు నశిస్తాయి. అవసాన సమయంలో గుర్తు చేసుకోగలిగినవారు అక్కడికే చేరుకుంటారు. ఈ అయిదు అధ్యాయాలనూ సమాహిత చిత్తంతో నిత్యమూ పఠించేవారికి భూతప్రేతపిశాచాదిబాధలు ఉండనే ఉండవు. నూతన గృహనిర్మాణ సమయంలో వాస్తుయజ్ఞంలో దీన్ని తప్పక పారాయణ చెయ్యాలి. సకల శుభాలూ కలుగుతాయి. *(అధ్యాయం - 12 , శ్లోకాలు - 73)*

## ◆ జనమేజయుడికి మనశ్శాంతి ◆

జనమేజయా ! నారదుడికి నారాయణమహర్షి చెప్పినదంతా నీకు నేను చెప్పాను. నువ్వు అడిగినదంతా వివరించాను. మహాద్భుతమైన ఈ మహాదేవీ పురాణాన్ని విన్నవారందరూ కృతకృత్యులవుతారు. దేవికి అత్యంతప్రియతములవుతారు. కనక నువ్వుకూడా దేవీయజ్ఞం చెయ్యి. నీ పూర్వీకులను ఉద్ధరించు. నీ తండ్రిపొందిన దుర్గతికి అసలే ఖిన్నుడవై ఉన్నావు కనక దేవీయజ్ఞం నిర్వహించి పరీక్షిత్తుకు ఉత్తమగతులు కల్పించు. మహాదేవీమంత్రం నీకు ఉపదేశిస్తాను. గ్రహించు. విధివిధానంగా జపిస్తే జన్మ సఫలమవుతుంది. - అన్నాడు వ్యాసభగవానుడు.



శౌనకాది మహామునులారా ! ఈ మాటవిన్న జనమేజయుడు సంబరపడి పరిశుద్ధుడై ఆ మునీశ్వరుణ్ణి ప్రార్థించి దేవీప్రణవసంజ్ఞకమైన మహామంత్రాన్ని దీక్షావిధితో ఉపదేశం పొందాడు. నవరాత్రి సమయంలో ధౌమ్యాదిమహర్షులను ఆహ్వానించి దేనికీ లోభించకుండా మహాదేవీ యజ్ఞం నిర్వహించాడు. బ్రాహ్మణులను రావించి ఈ దేవీభాగవత పురాణ పారాయణ జరిపించాడు. సువాసినీ పూజలూ కుమారీపూజలూ బ్రహ్మచారిపూజలూ అసంఖ్యాకంగా చేశాడు. బ్రాహ్మణులకు అన్నసంతర్పణ జరిపాడు. దీనులకూ అనాథులకూ పుష్కలంగా ధన కనక వస్త్రాదులను కానుకలుగా సమర్పించాడు. యజ్ఞం ముగిసింది. జనమేజయుడు సంస్థానంలో కొలువుతీరాడు. ఆకాశంనుంచి నారదుడు అవతరించాడు. మహతి మోగించుకుంటూ వచ్చాడు. ప్రకాశిస్తున్న అగ్నిశిఖలాగా ఉన్నాడు. వారదుణ్ణి చూడటంతోనే మహారాజు హడావిడిగా అభ్యుత్థానం చేశాడు. స్వాగతంపలికి అర్ఘ్యపాద్యాలిచ్చి సముచితాసనం మీద కూర్చోబెట్టాడు. కుశలప్రశ్నలు అయ్యాయి.

మహర్షీ! నీ రాకతో ధన్యుణ్ణి అయ్యాను. సనాథుణ్ణి అయ్యాను. ఆజ్ఞాపించు - ఏమి చెయ్యమంటావో!

మహారాజా ! ఇవ్వేళ దేవలోకంలో ఒక వింత చూశాను. ఆశ్చర్యంనుంచి ఇంకా తేరుకోలేదంటే నమ్ము. ఆ విశేషం నీకు చెప్పి వెడదామనిపించి వచ్చాను. దుర్గతిని పొందిన నీతండ్రి ఇవ్వేళ దివ్యరూపం ధరించి స్వర్గంలో కనిపించాడు. దేవతలూ అప్సరసలూ అతణ్ణి స్తుతిస్తున్నారు. దివ్యవిమానం అధిరోహించాడు. మణిద్వీపానికి తరలివెళ్ళాడు. ఇదంతా దేవీభాగవతశ్రవణంవల్ల కలిగిన పుణ్యఫలం. నువ్వు నిర్వహించిన మహాదేవీయజ్ఞానికి వెంటనే దక్కిన పుణ్యం. నీతండ్రి దుర్గతినుంచి విముక్తుడై సుగతిని పొందాడు. ఇలా కన్నతండ్రికి సద్గతి కల్పించి కృతకృత్యుడవయ్యావు. నువ్వు ధన్యుడవు. నిజంగా నీ జీవితం సఫలం. తండ్రిని నరకంనుంచి ఉద్ధరించావంటే నువ్వు కులభూషణుడివి. ఇవ్వేళ దేవలోకంలో నీకీర్తి మారుమ్రోగిపోతోంది. సంతోషం పట్టలేక ఈ శుభవార్త నీకు చెబుదామనీ, నువ్వూ ఆనందిస్తావనీ వచ్చాను.

నారదుడి మాటలు వింటూంటే జనమేజయుడికి తనువు పులకించింది. కన్నుల్లో ఆనందబాష్పాలు తాండవించాయి. ఆపుకోలేక వ్యాసభగవానుడి పాదాలమీద సాష్టాంగపడ్డాడు. మహానుభావా ! ఇది అంతా నీ అనుగ్రహమే. నన్ను కృతార్థుణ్ణి చేశావు. నమస్కరించడం తప్ప నేను చెయ్యగలిగిన ప్రత్యుపకారం ఏదీ లేదు. ఇలాగే ఎల్లవేళలా నన్ను అనుగ్రహించు.

జీరవోయిన గొంతుతో ఇలా పరవశించి పలుకుతున్న జనమేజయుణ్ణి మనసారా ఆశీర్వదించి తల నిమిరాడు వ్యాసుడు. రాజా! అన్ని బంధనాలనూ తెగతెంపులు చేసుకుని దేవీపాదపద్మాలను నిరంతరం సేవించు. ధ్యానించు. ఉపాసించు. దేవీభాగవతాన్ని రోజూ పారాయణగా పఠించు. అంబాయజ్ఞాన్ని భక్తిశ్రద్ధలతో చెయ్యి. చేయించు. నీకు మోక్షం అనాయాసంగా లభిస్తుంది. భవబంధనాలు తమంతట తామే తెగిపోతాయి. హరి-హరుల పురాణాలు చాలా ఉన్నాయి. కానీ అవన్నీ కలిపినా ఈ దేవీ భాగవత మహిమలో పదహారవవంతుకైనా సాటిరావు. ఇది నిజం. ఇది అఖిలపురాణసారం. అఖిలవేదసారం.



మూలప్రకృతిని ప్రతిపాదించేది కనక ఇదొక్కటే నిజమైన పురాణం. మిగిలినవన్నీ నామమాత్రపురాణాలు. దీన్ని చదివితే వేదపఠనఫలం దక్కుతుంది. కనక ఇదొక్కటే పండితులకూ పామరులకూ జ్ఞానులకూ యోగులకూ ముముక్షువులకూ - అందరకూ అవశ్యపఠనీయం. మరచిపోకుసుమా ! ఇక మరి నేను వెళ్ళివస్తా. నీకు శుభమగుగాక ! - అని పలికి వ్యాసుడు నిర్గమంగా నిష్క్రమించాడు. నారదుడూ దీవించి వెళ్ళిపోయాడు. ధౌమ్యాది మహర్షులు సెలవు తీసుకున్నారు.

అందరూ తమ తమ ప్రదేశాల్లో ప్రాంతాల్లో దేవీభాగవత ప్రశంసలు చేశారు. పారాయణలు జరిపారు. జనమేజయుడు రోజూ పఠిస్తూ పఠింపజేసి వింటూ సంతుష్టుడై రాజ్యపరిపాలన ధర్మబద్ధంగా సాగించాడు. *(అధ్యాయం - 13, శ్లోకాలు - 30)*

## ◆ శ్రీదేవీభాగవతం - ఫలశ్రుతి ◆

శౌనకాది మహామునులారా ! మీరు గ్రహించవలసిన రహస్యం మరొకటి ఉంది. ఆదిలో ఈ దేవీభాగవతం సాక్షాత్తూ జగదంబికా ముఖపద్మంనుంచి అర్ధశ్లోకాత్మకంగా ఆవిర్భవించింది. వేదసారంగా వటపత్రశాయికి ఉపదేశించింది. అటుపైని దాన్ని శతకోటి గ్రంథంగా విస్తరించాడు బ్రహ్మదేవుడు. దాని సారమంతా ఒకచోటికి చేర్చి పద్ధెనిమిదివేల శ్లోకాలూ పన్నెండు స్కంధాలుగా సంగ్రహపరచి శుకుడికోసమని వ్యాసుడు ఉపదేశించాడు. ఇదీ దీని చరిత్ర. అలనాటి ఆ శతకోటి విస్తర దేవీమహాభాగవతం నేటికీ దేవలోకాన బహుళప్రచారంలో ఉంది.

మహామునులారా ! ఈ దేవీభాగవతంతో సాటివచ్చే మరొక పవిత్రగ్రంథం ఈ సృష్టిలోనే లేదు. ఇది సర్వపాపవినాశకం. ఏ పదాన్ని ఉచ్చరించినా అశ్వమేధఫలం దక్కుతుందంటే అది స్తవం కాని వాస్తవం. పౌరాణికుణ్ణి ఆహ్వానించి వస్త్రాద్యాభరణాలతో అర్చించి సంతుష్టిపరచి వ్యాసుడిగా సంభావించి అతడి నోటినుంచి ఏకాగ్రచిత్తంతో ఉపవాస దీక్షతో దీన్ని విన్నవారూ నిజహస్తాలతో లిఖించినవారూ పఠించినవారూ లిఖింపజేసినవారూ సర్వకిల్బిషవిముక్తులై సుఖశాంతులతో భోగభాగ్యాలతో సకలసమృద్ధులతో నిండు నూరేళ్ళు జీవించి కట్టకడపట మణిద్వీపం చేరుకుంటారు. తరతరాలనూ తరింపజేస్తారు. పురాణ శ్రవణం పూర్తయ్యాక ప్రోష్ఠపదీ పూర్ణిమనాడు పౌరాణికుణ్ణి సత్కరించాలి. బంగారంతో సింహప్రతిమ తయారుచేయించి ఇవ్వాలి. దక్షిణగా కపిలగోవును (పాడిఆవును) దూడతోసహా సమర్పించాలి. బంగారు గొలుసుతో అలంకరించి మరీ ఇవ్వాలి. అధ్యాయసంఖ్యకు సమానంగా బ్రాహ్మణులకు సంతర్పణ చెయ్యాలి. అంతే సంఖ్యలో సువాసినుల్నీ కుమారీమణుల్నీ వటువుల్నీ అర్చించాలి. దేవీబుద్ధితో వీరిని వస్త్రాభరణ పుష్పమాలికలతో పూజించాలి. పాయసాన్నాలు పెట్టాలి. ఈ పురాణగ్రంథాన్ని ఎవరికి దానం చేసినా భూదానఫలం దక్కుతుంది. ఇహలోకంలో సుఖంగా జీవించి అంతంలో దేవీపట్టణం చేరుకుంటారు. నిత్యమూ దేవీభాగవతాన్ని పఠించేవారికీ వినేవారికీ ఎప్పుడూ ఎక్కడా అసాధ్యమంటూ ఏదీ ఉండదు.



పరాజయం అనే మాటకూడా వినిపించదు. అపుత్రకులకు సంతానప్రాప్తి, నిర్ధనులకు ధనలాభం, విద్యార్థులకు విద్యాలబ్ధితోపాటు కీర్తి - కలుగుతాయి. వంధ్యగానీ కాకవంధ్యగానీ మృతవంధ్యగానీ వింటే ఆ దోషాలు తొలగిపోతాయి. ఇంటిలో నిత్యమూ ఈ గ్రంథాన్ని పూజిస్తే చాలు లక్ష్మీదేవి ఇక ఆ ఇంటిని విడిచిపెట్టదు. బేతాళ డాకినీ రాక్షసాదులు అటువైపు తొంగిచూడటానికి సైతం భయపడతారు. జ్వరంతో బాధపడేవారిని స్పృశించి ఈ పురాణాన్ని మండలంరోజులు పఠిస్తే జ్వరముపశమిస్తుంది. నూరుసార్లు పఠిస్తే క్షయరోగం నశిస్తుంది. ఒక్కొక్క అధ్యాయంగా సంధ్యాసమయంలో పారాయణచేసిన వారికి బ్రహ్మజ్ఞానం లభిస్తుంది. శరన్నవరాత్రుల్లో పఠిస్తే జగదంబిక సంతోషించి కోరినదానికన్నా వెయ్యి రెట్లుగా వరాలు కురిపిస్తుంది. శైవులు పఠిస్తే పార్వతి, వైష్ణవులు పారాయణచేస్తే లక్ష్మీదేవి సంతోషిస్తారు. సౌరమతంవారూ గాణపత్యులూ ఎవరు పఠించినా వారి ఇష్టదేవత ఆనందిస్తుంది. వైదికులు గాయత్రీదేవి ప్రీతికోసం తప్పకుండా దీన్ని పఠించాలి. ఎవరు ఏ ఉపాసన చేసినా అది శక్తి ఉపాసనమే అవుతుంది. కనక ఆ శక్తి సంతుష్టికోసం ఈ భాగవతాన్ని పారాయణ చెయ్యవలసిందే. చదువురానివారూ చదవలేనివారూ చదవరానివారూ పురాణశ్రవణం చేస్తే చాలు. వారికీ అంతపుణ్యమూ లభిస్తుంది. ఇది నిర్ణయం. ఇది నిశ్చయం. ఇది నిస్సందేహం. శౌనకాది మహామునులారా ! ఊరికే వెయ్యిమాటలు ఎందుకుగానీ సారాంశమేమిటంటే - ఇది వేదసారం. వేదపఠన సదృశం. వేదశ్రవణ సమానం. సచ్చిదానందరూప గాయత్రీప్రతిపాదిత హ్రీమయి ఆ మహాదేవి మనకు సద్బుద్ధివైభవాన్ని ప్రసాదించుగాక !

సచ్చిదానంద రూపాం తాం గాయత్రీ ప్రతిపాదితామ్ ।
నమామి హ్రీమ్మయీం దేవీం ధియో యో నః ప్రచోదయాత్ ॥ (14 - 27)

సూతమహర్షి కన్నులు ముకుళించి దేవిని ధ్యానిస్తూ నమస్కరించాడు. నైమిశారణ్యవాసులు శౌనకాది మహామునులు ఆనంద పారవశ్యంనుంచి మెల్లగా తేరుకున్నారు. సూతమహర్షిని శ్రద్ధాభక్తులతో ఘనంగా సత్కరించారు. అందరూ ప్రసన్న హృదయులయ్యారు. దేవీపాదాంబుజార్చకులయ్యారు. ఈ పురాణ శ్రవణ ప్రభావంతో అందరూ పరనిర్వృతిని (బ్రహ్మానందాన్ని) పొందారు. అడ్డదిడ్డంగా ఏవేవో ప్రశ్నలు వేసి ఇబ్బంది పెట్టామో శ్రమపెట్టామో క్షమించమంటూ సూతుణ్ణి బ్రతిమాలుకున్నారు. లెంపలు వేసుకుంటూ మళ్ళీమళ్ళీ నమస్కరించారు. సంసారసముద్రాన్ని దాటించేందుకు మాపాలిటి నావవు నువ్వేనని మ్రొక్కారు.

అంబాచరణకమలభృంగాయమాణుడు సూతుడు సంతోషించి అందరినీ ఆశీర్వదించి పునరాగమనాయ చ అని వీడ్కోలు తీసుకుని బయలుదేరాడు. *(అధ్యాయం - 14 , శ్లోకాలు - 31)*

**ద్వాదశ స్కంధం - 963 - శ్లోకాలు - తెలుగుసేత : బేతవోలు రామబ్రహ్మం**





# శ్రీమద్దేవీభాగవతము

సృష్టౌ యా సర్గరూపా జగదవనవిధౌ పాలనీ యా చ రౌద్రీ
సంహారేచాపి యస్యా జగదిదమఖిలం క్రీడనం యా పరాఖ్యా ।
పశ్యన్తీ మధ్యమాథో తదను భగవతీ వైఖరీ వర్ణరూపా
సాస్మద్వాచం ప్రసన్నా విధిహరిగిరిశారాధితాలంకరోతు ॥ (1-1-1)

నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమమ్ ।
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయముదీరయేత్ ॥ (1-1-2)

మహాకాళీ మహాలక్ష్మీ ర్మహాసారస్వతీప్రభా ।
ఇష్టకామేశ్వరీ కుర్యాద్విశ్వశ్రీర్విశ్వమంగళమ్ ॥

షోడశీపూర్ణచంద్రాభా మల్లికార్జునగేహినీ ।
ఇష్టకామేశ్వరీ కుర్యాజ్జగన్నీరోగశోభనమ్ ॥

జగద్ధాత్రీ లోకనేత్రీ సుధానిష్యందిసుస్మితా ।
ఇష్టకామేశ్వరీ కుర్యాల్లోకం సద్బుద్ధిసుందరమ్ ॥

పరమేశ్వరవాల్లభ్య దివ్యసౌభాగ్యసుప్రభా ।
ఇష్టకామేశ్వరీ దద్యాన్మాంగల్యానందజీవనమ్ ॥

